## మొదటి సంపుటము

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## (రెండవ ముద్రణము)

సంపుటము వెల రూ. ౧౦-౦-౦. ప్రవేశరుసుము రూ. ౧-౦-౦. మొ. రూ. ౧౧-౦-౦.

ప్రతి సంపుటమున ౬౦౦ పుట లుండును. సంపుటము వెల పదిరూపాయలు.

విజ్ఞాన విజిగీషాయత్తమైన వర్తమానసమయమునందు సకలజాతులును విజ్ఞానోపార్జనవ్యాపనమునం దహమహమికను జూపుచు పురోవృద్ధిని బడయుచున్నవి. ప్రపంచమునందలి ప్రధానభాషలందు విశ్వకోశములు, జ్ఞానకోశములు, విజ్ఞానసర్వస్వములు వెలువడి జాతీయాభ్యుదయమునకును, విశ్వవికాసమునకును సకలవిధములను వినియోగపడుచున్నవి.

భగవదనుగ్రహమువలనను, ఆంధ్రలోకాదరణ సాహాయ్యములవలనను ఆంధ్రవిజ్ఞానసర్వస్వము యొక్క మొదటిసంపుటము ప్రచురింపబడినది. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును నీమహాకార్యనిర్వహణమునకుఁ దోడ్పడుటకు ఆంధ్రాభ్యుదయాభిలాషులును, విజ్ఞానసంపన్నులును, విజ్ఞానప్రియులును, విజ్ఞానపోషకులునునైన తమసాహాయ్యాదరణములను సకలవిధములను నపేక్షించుచున్నది. తాము శాశ్వతచందాదారులుగను చేరియును, ఇతరులను చేర్చియును నితరవిధములను పోషణసాహాయ్యములఁ జేసియును మా యీ యుద్యమమును సఫలముచేయుటకు నిర్వాహకులపక్షమునను విన్నవించుచున్నాను.

విధేయుఁడు:

కా. నాగేశ్వరరావు.

డెమ్మి నాలుగుపుటలసైజున ౬౦౦ పుటలు, మేలైనకాగితము, బంగారురేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు కాలికోబైండు.

ఇందు 'అ' నుండి 'అధ్వర్యము' వఱకు గల నాలుగువందల పదములకు సంబంధించిన విషయములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితములయిన రంగుల బొమ్మలు ఎనిమిది, సాదాబొమ్మలు ౧౦౫ ఉన్నవి.

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయ. రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి ఎచ్చును, తగ్గనువచ్చును. ౧౧-౮-౦ మణిఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజిస్టరు తపాలుద్వారా పంపబడును. వి. పి. గా పంపఁగోరువారు అయిదు రూపాయలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపఁగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

మేనేజరు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెంబరు 7, తంబుశెట్టివీథి, మదరాసు.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. భాగము ౨.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩

# భారతి — దశమ సంపుటము — భా. శ్రీ.

## వ్యాసముల అకారాది సూచి


| | సం. | పుట |
|---|---|---|
| అణ్ణామలై విశ్వవిద్యాలయము—ఒంగోలు పద్మరాజు ... ... | ౧౧ | ౭౨౪–౭౩౦ |
| అనంతపంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షము—విశ్వనాథ నరసింహం ... | ౯ | ౩౬౫–౩౬౮ |
| అరవమునకు ప్రోత్సాహము (మ. మా) ... ... ... | ౮ | ౩౩౧ |
| అర్ధరాత్రి—పిలకా గణపతి (గే) ... ... ... | ౧౦ | ౫౨౨ |
| అశ్రుతర్పణము: కీ. శే. ఆ. వేం. సాంఖ్యాయనశర్మగారు (మ. మా.) ... | ౮ | ౩౩౦–౩౩౧ |
| అశ్లీలప్రకటనములు (మ. మా.) ... ... ... | ౮ | ౩౩౩ |
| అసమానదాంపత్యం—'చౌదరి' (క) ... ... ... | ౭ | ౪౭–౫౪ |
| అహింసయొక్క విజయము (కల) ... ... ... | ౧౦ | ౬౪౫ |
| ఆంగ్లప్రధానోపాధ్యాయుని నేటికాలపు విద్యార్థులవర్ణనము (కల) ... | ౮ | ౩౧౨ |
| ఆంధ్రకవుల ఛాయాచిత్రప్రదర్శనము (మ. మా.) ... ... | ౧౧ | ౮౩౦ |
| ఆంధ్రగ్రంథములపట్టిక ... ... ... ... | ౭ | ౧౨౭–౧౩౧ |
| ,, ... ... ... ... | ౮ | ౨౯౦–౨౯౩ |
| ,, ... ... ... ... | ౯ | ౪౨౨–౪౨౫ |
| ,, ... ... ... ... | ౧౧ | ౭౭౦–౭౮౦ |
| ఆంధ్రచిత్రకళాపరిషత్తు—ఏలూరు (మ. మా) ... | ౭ | ౧౬౬–౨౬౮ |
| ఆంధ్రదేశము-పరిశ్రమలు (మ. మా.) ... ... ... | ౧౨ | ౯౯౬–౯౯౮ |
| ఆంధ్రనాటకకళాపరిషత్తు (౧౯౩౩) (మ. మా) ... ... | ౮ | ౩౨౫–౩౨౭ |
| ఆంధ్రపత్రిక రజతోత్సవము (మ. మా) ... ... ... | ౧౦ | ౬౫౮–౬౬౧ |
| ఆంధ్రభాషాప్రవీణ—ఉన్నవ. లక్ష్మీనారాయణ(మీ. త) ... | ౯ | ౪౫౮–౪౫౯ |
| ఆంధ్రవాఙ్మయచరిత్రము: యుగవిభజనము—కోరాడ రామకృష్ణయ్య ... | ౧౨ | ౮౬౦–౮౬౫ |
| ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రాచ్యవిద్యాపరీక్షలు (మ. మా) ... ... | ౮ | ౩౨౨–౩౨౫ |
| ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి దేశభాషాపరీక్షలు—తు. వేంకటరామయ్య (మీ. త) | ౧౧ | ౮౧౫–౮౧౬ |
| ఆంధ్రునిస్వదేశీ—శాస్త్రి (మీ. త) ... ... | ౧౦ | ౬౩౯–౬౪౦ |
| ఆగడపలు—సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి (ప) ... | ౯ | ౪౮౨ |
| ఆత్మహత్య—'ప్రసాద్' ... ... | ౭ | ౧౧౪–౧౧౫ |
| ఆధునికచిత్రకళయందలి లోప మేమి ? ... ... | ౮ | ౨౫౫–౨౫౯ |
| ఆధునికప్రపంచమున బానిసతనము (కల) ... ... | ౯ | ౪౭౧–౪౭౨ |
| ఆధునికాంధ్రవాఙ్మయము—శాస్త్రి (మీ. త) ... ... | ౯ | ౪౫౬–౪౫౮ |
| "ఈసంఘమే మమ్మల్ని పాకీవాళ్లనిచేసింది"—మద్దూరి హనుమంతరావు (క) | ౧౦ | ౫౭౯–౫౯౦ |
| 'ఉచ్చారణసంజ్ఞలకు' జవాబు—టే. కామేశ్వరరావు (పు. వి) ... | ౯ | ౪౯౭–౪౯౮ |
| ఉపేక్షితము—కొంపెల్ల జనార్దనరావు (ప) ... ... | ౧౧ | ౮౦౬ |
| ఉరిశిక్ష—తంగిరాల రాధాకృష్ణయ్య (క) ... ... | ౮ | ౨౩౯–౨౪౨ |

# త


| | సం. | పుట |
|---|---|---|
| ఉరుస్వతీ విజ్ఞానమందిరము ... ... ... ... | ౯ | ౪౫౧–౪౫౫ |
| ఎత్తయిన గోపురము (కల) ... ... ... ... | ౯ | ౪౭౯–౪౮౦ |
| ఒట్టు—కనుపర్తివరలక్ష్మమ్మ (క) ... ... ... | ౧౨ | ౯౬౮–౯౮౦ |
| ఒహారకం—'గిరి' (క) ... ... ... ... | ౭ | ౫౫–౬౦ |
| కన్యాశుల్క నాటక విమర్శనము—శ్రీపాద కామేశ్వరరావు ... ... | ౮ | ౧౯౧–౧౯౪ |
| ,, ,, ... ... | ౯ | ౩౪౧–౩౫౫ |
| ,, ,, ... ... | ౧౦ | ౫౧౦–౫౨౧ |
| కప్పతల్లి పెళ్లి—చావలిబంగారమ్మ (గే) ... ... | ౯ | ౪౧౬ |
| కవికొండలవారి కవిత—ఆచంట వేంకటరావు ... ... | ౧౦ | ౫౨౩–౫౨౫ |
| కాగితముల తోరణములు!—కొ. నరసింహాచారి (వి. శి.) ... ... | ౧౧ | ౭౩౧–౭౩౭ |
| కావ్యపఠనము—శ్రీపాదగోపాలకృష్ణమూర్తి ... ... | ౮ | ౧౮౫–౧౯౦ |
| కీ. శే. అనీబిసెంటు ... ... | ౧౦ | ౬౧౭–౬౧౮ |
| కీ. శే. పిల్లలమర్రి సుందరరామయ్య—ఎ. వి. సీతారామయ్య (నా. క) ... | ౮ | ౩౦౬–౩౦౭ |
| కీ. శే. బసవరాజు వెంకటప్పారావు, అశ్రుబిందువులు (మ. మా) ... | ౭ | ౧౬౯–౧౭౦ |
| కుట్టుపని—కొ. నరసింహాచారి (వి. శి) ... ... | ౮ | ౨౪౫–౨౪౬ |
| కేళి—శ్రీరంగం శ్రీనివాసరావు (గే) ... ... | ౯ | ౪౮౨ |
| కోహినూరువజ్రము (కల) ... ... | ౯ | ౪౭౩–౪౭౫ |
| కోహినూరు రత్నము—పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి (కల) ... | ౧౦ | ౬౪౯–౬౫౧ |
| ౣగరమథనము—బాలాంత్రపు వేంకటరావు (ప) ... ... | ౯ | ౪౨౭–౮౩౪ |
| ఖాన్ఖానా అబ్దుల్ రహీమ్ఖాన్—రామమోహనరాయ్ ... | ౮ | ౨౦౭–౨౧౦ |
| గణపతి (కల) ... ... ... ... | ౯ | ౪౭౮–౪౭౯ |
| గన్నేరుపూలు—'గిరి' (క) ... ... ... ... | ౧౦ | ౫౫౧–౫౬౦ |
| గర్వభంగము—కీ. శే. కొడాలి వేంకటసుబ్బరావు (ప) ... ... | ౧౨ | ౯౨౨ |
| గ్రంథపఠనము—'భాషాభిమాని' ... ... ... | ౮ | ౨౫౩–౨౫౪ |
| చందన వృక్షము—క్రమధాటి వేంకటగిరి ... ... | ౭ | ౯౯–౧౦౪ |
| చంద్రునిమచ్చ—జి. జాషువ (ప) ... ... ... | ౭ | ౧౯ |
| చేతిపనులు—దశిక సూర్యప్రకాశరావు ... ... ... | ౮ | ౨౭౭–౨౮౦ |
| ఛందోలంకారములు: దోషప్రకరణము—దువ్వూరి సూర్యనారాయణమూర్తి | ౭ | ౩–౧౦ |
| జమీందారుల ఆదాయము (కల) ... ... ... | ౯ | ౪౭౮ |
| జర్మనీయందు స్వయంసహాయము (కల) ... ... ... | ౯ | ౪౭౩–౪౭౪ |
| జర్మనువిద్యాలయములలో వార్తాపత్రికలు (కల) ... ... | ౮ | ౩౧౧ |
| జాతకరాజీయము—మల్లాది సూర్యనారాయణశాస్త్రి ... ... | ౭ | ౨౦–౨౧ |
| జాతీయత్వము–అంతర్జాతీయత్వము—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ... | ౧౨ | ౯౩౧–౯౩౪ |
| జీవితరహస్యము—కీ. శే. జనమంచి వేంకటరామయ్య (ప) ... ... | ౯ | ౪౨౬ |
| "తప్పంతా నాదేనా ?"—బుర్రా అప్పారావు (క) ... ... | ౧౨ | ౮౯౭–౯౧౩ |
| తక్షశిల (కల) ... | ౯ | ౪౭౭–౪౭౮ |

| | సం. | పుట |
|---|---|---|
| తాజ్ మహల్—క్రమనాటి జానకీగిరి | ౮ | ౨౪౭-౨౫౨ |
| తెనుగున తెనుగుదనము (మ. మా) | ౧౨ | ౯౯౨-౯౯౩ |
| తెరచాపలు—కొ. నరసింహాచారి (వి. శి) | ౧౨ | ౯౧౫-౯౧౬ |
| తెరువపసు వంతెన—కొ. నరసింహాచారి (వి. శి) | ౧౦ | ౬౩౧-౬౩౨ |
| తెలుసుటాకీలు : ఆంధ్రులపరిశ్రమ—ఏ. వి. సీతారామయ్య | ౧౨ | ౯౨౩-౯౨౪ |
| తోటమాలి—కృత్తివెంటి వేంకటసుబ్బారావు (ప) | ౯ | ౩౮౫-౩౮౭ |
| దయ్యము—కొ. శశిశేఖరరావు (క) | ౭ | ౪౧-౪౬ |
| దస్తూరీ—ఏలేశ్వరపు కృష్ణమూర్తి | ౭ | ౨౩-౨౭ |
| దాంపత్యసౌఖ్యము (మ. మా.) | ౮ | ౩౩౨-౩౪౩ |
| దేవుడితో ముగ్గురం, ఇకేమి ?—అక్కిరాజు ఆంజనేయులు (క) | ౧౧ | ౭౧౧-౭౨౩ |
| దేవుడు-మనుజుడు-కోతి—విశ్వనాథ సత్యనారాయణ (ప) | ౭ | ౧౦ |
| దేవునిపై విశ్వాససాహిత్య తీర్మానము—నందివాడ చిదంబరం | ౧౧ | ౭౩౩-౭౪౩ |
| దొంగపెండ్లి—కీ. శే. జనమంచి వేంకటరామయ్య (ప) | ౭ | ౯౦ |
| దౌర్జన్యం—ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి (క) | ౧౨ | ౮౯౧-౮౯౬ |
| ధన్యవాదము (మ. మా.) | ౧౦ | ౬౬౧ |
| నక్షత్రమండలము (ఆషాఢమాసము)—గొబ్బూరి వేంకటానందరాఘవరావు | ౭ | ౧౩౯-౧౪౩ |
| ,, (శ్రావణమాసము) ,, | ౭ | ౨౯౫-౨౯౯ |
| ,, (భాద్రపదమాసము) ,, | ౯ | ౪౮౨-౪౮౯ |
| ,, (ఆశ్వయుజము-కార్తికము) ,, | ౧౦ | ౬౦౭-౬౧౦ |
| ,, (కార్తికము-మార్గశిరము) ,, | ౧౧ | ౮౦౯-౮౧౧ |
| ,, (మార్గశిరము-పుష్యము) ,, | ౧౨ | ౯౩౯-౯౪౨ |
| నాగార్జునకొండ—బౌద్ధ స్తూపము—కపిలకాశీపతిరావు | ౧౧ | ౮౧౭-౮౨౩ |
| నానాజాతి సమితిఅనగానేమి ? అది చేయునదేమి?—సి. యన్. లక్ష్మి | ౭ | ౮౪-౮౯ |
| నాలాటరీమోటారు—పెద్దాడ రాజలింగమూర్తి (క) | ౯ | ౪౪౩-౪౪౮ |
| నిశ—చావలి బంగారమ్మ (గే) | ౭ | ౧౧౫ |
| నూతనాదర్శము (కల) | ౧౦ | ౬౪౩ |
| నేటిరష్యా—నార్ల వేంకటేశ్వరరావు | ౭ | ౭౬-౮౩ |
| ,, ,, | ౮ | ౨౭౧-౨౭౫ |
| ,, ,, | ౯ | ౪౦౧-౪౦౬ |
| ,, ,, | ౧౦ | ౫౬౫-౬౦౦ |
| ,, ,, | ౧౨ | ౯౫౧-౯౫౩ |
| నేను—మండపాక పార్వతీశ్వరశాస్త్రి (ప) | ౧౨ | ౮౩౭-౮౩౮ |
| పంప—కందుర్తి నరసింహరావు (ప) | ౮ | ౧౮౧-౧౮౩ |
| పద్మావతీ చరణచారణచక్రవర్తి—శివశంకరశాస్త్రి (ప) | ౯ | ౩౩౭-౩౪౦ |
| ,, ,, | ౧౨ | ౫౦౫-౫౦౯ |
| ,, ,, | ౧౧ | ౬౬౭-౬౭౪ |

| | సం. | పుట |
|---|---|---|
| పిచ్చితలపులు—హనుమదింద్రకంటి (గే) ... ... | ౯ | ౪౧౩ |
| పిపాసువు—దివాకర్ల వేంకటావధాని (ప) ... ... | ౯ | ౪౪౧-౪౪౨ |
| పిరదౌసి—చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు ... ... | ౧౧ | ౬౮౫-౬౭౩ |
| పిల్లలగండములు (కల) ... ... ... | ౯ | ౪౭౦-౪౭౧ |
| పేరు—ఏలేశ్వరపు కృష్ణమూర్తి ... ... ... | ౯ | ౩౫౬-౩౬౨ |
| ప్రపంచ-ఆర్థికమహాసభ—కపిలకాశీపతిరావు ... ... ... | ౧౦ | ౫౬౩-౫౮౧ |
| ప్రభుత్వవ్యాపార పరిమితి—శ్రీపాద గణపతిరావు ... ... | ౧౧ | ౮౪౬-౮౪౭ |
| ప్రస్థానభేరి—డి. రాజశేఖర శతావధాని (ప) ... ... ... | ౧౧ | ౮౪౪-౮౪౫ |
| ప్రాచ్యవిద్యాపరిశోధనాలయము, చెన్నపురి. సహాయాంధ్రపరిశోధకనియామకము (మ. మా.) | ౭ | ౩౨౮-౩౨౭ |
| ప్రేమపాశం—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (నా) ... ... | ౮ | ౨౯-౩౯ |
| ,, ,, ,, ... ... | ౭ | ౨౧౧-౨౨౩ |
| ,, ,, ,, ... ... | ౯ | ౩౮౫-౩౭౪ |
| ,, ,, ,, ... ... | ౧౦ | ౫౩౯-౫౫౦ |
| ,, ,, ,, ... ... | ౧౧ | ౬౯౫-౮౧౨ |
| ,, ,, ,, ... ... | ౧౨ | ౭౮౧-౭౯౦ |
| బసవరాజు అప్పారాయనికత—మున్నంగి—శర్మ ... | ౮ | ౧౨౫-౧౨౬ |
| బాలక్రీడలు—మంగిపూడి వేంకటశర్మ | ౮ | ౧౩౩-౧౩౭ |
| ,, ,, ,, ... ... | ౭ | ౩౦౦-౩౦౪ |
| ,, ,, ,, ... ... | ౯ | ౪౬౦-౪౬౪ |
| ,, ,, ,, ... ... | ౧౦ | ౬౦౧-౬౦౫ |
| ,, ,, ,, ... ... | ౧౧ | ౭౦౧-౭౦౪ |
| ,, ,, ,, ... ... | ౧౨ | ౯౪౩-౯౫౦ |
| బిచ్చము—ఏలేశ్వరపు కృష్ణమూర్తి ... ... ... | ౧౨ | ౯౧౮-౯౨౨ |
| బిల్హణకథ—డి. ఏ. నరసింహము ... ... ... | ౮ | ౧౧-౧౯ |
| ,, ,, ... ... ... | ౭ | ౧౯౯-౨౦౬ |
| బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు—వేటూరి ప్రభాకరశాస్త్రి ... | ౧౦ | ౬౧౧-౬౧౫ |
| బ్రాహ్మణముల ప్రశంస—మల్లాది సూర్యనారాయణశాస్త్రి ... ... | ౧౨ | ౭౫౦-౭౫౧ |
| బ్రాహ్మణుడు—కే. శే. కొడాలి వేంకటసుబ్బారావు (ప) ... | ౧౦ | ౬౨౫ |
| భక్తిగీతము—కూచి రామలక్ష్మమ్మ (ప) ... ... ... | ౭ | ౮౫ |
| భవానుభవము—బాలాంత్రపు వేంకటరావు (ప) ... ... | ౮ | ౧-౨ |
| భారతదేశగ్రామములయందు బ్రాడు కాస్టింగు (కల) ... ... | ౯ | ౪౮౬ |
| భారతదేశపు తొలిచిత్తరువులు—తలిశెట్టి రామారావు ... ... | ౮ | ౧౧౬-౧౨౪ |
| భారతదేశము : నానాజాతిసమితి—లంకసత్యం ... ... | ౧౨ | ౯౨౮-౯౩౦ |
| భారతమహిళాసంఘము (మ. మా.) ... ... ... | ౧౨ | ౯౯౭ |
| భారతము—పరమార్థప్రదర్శనము—నందూరి బంగారయ్య ... | ౯ | ౪౩౫-౪౪౦ |
| | ౧౦ | ౬౩౩-౬౩౭ |

| | సం. | పుట |
|---|---|---|
| భారతము-పరమార్థ ప్రదర్శనము-నండూరి బంగారయ్య ... ... | ౧౧ | ౭౯౭–౮౦౦ |
| ,, ,, ... ... | ౧౨ | ౯౫౪–౯౫౮ |
| భారతి—తలిశెట్టి రామారావు ... ... ... | ౧౧ | ౭౬౫–౭౭౧ |
| భారతీయ విద్యాచరిత్రము—నారేమండ రామారావు ... ... | ౭ | ౬౩–౭౫ |
| ,, ,, ... ... | ౮ | ౨౬౦–౨౭౦ |
| ,, ,, ... ... | ౯ | ౩౯౫–౪౦౦ |
| ,, ,, ... ... | ౧౦ | ౬౧౯–౬౨౪ |
| ,, ,, ... ... | ౧౧ | ౭౮౯–౨౯౬ |
| ,, ,, ... ... | ౧౨ | ౯౮౯–౯౯౬ |
| భోజునిశృంగారప్రకాశము—మా. రాధాకాంతయ్య ... ... | ౧౦ | ౫౨౬–౫౩౨ |
| ,, ,, ,, ... ... | ౧౨ | ౮౩౯–౮౪౯ |
| మంచి వ్యవసాయము—దువ్వూరి బాలకృష్ణమూర్తి ... ... | ౭ | ౧౦౫–౧౦౭ |
| ముద్దుకత-ప్రశంసా లేశము—బులుసు వేంకటరమణయ్య ... ... | ౧౧ | ౬౯౦–౬౯౪ |
| మధువ్రత—పాటిబండ మాధవశర్మ (ప) ... ... | ౯ | ౩౯౩–౩౯౪ |
| మహమ్మదుదారాషి కూ రాక్షామరుడు—ఆకుండి వేంకటశాస్త్రి ... | ౧౦ | ౫౬౧–౫౯౪ |
| మాయజగత్తు—లంకలపల్లి గోపాలరావు ... ... ... | ౧౦ | ౫౩౩–౫౩౮ |
| మాలతి—కనకదండి గోపాలకృష్ణశాస్త్రి (గే) ... ... | ౧౦ | ౫౭౭ |
| మాసంసారాలు—టేకుమళ్ల కామేశ్వరరావు (క) ... ... | ౮ | ౨౨౫–౨౨౯ |
| 'మిస్ లైలా'—గొల్లపూడి జోగారావు (క) ... ... | ౮ | ౨౩౦–౨౩౫ |
| మెత్తనివారినిచూస్తే...—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి (కల) ... | ౯ | ౪౬౯–౪౭౦ |
| మేఘుడు—జి. జాషువ (ప) ... ... | ౮ | ౨౨౪ |
| మొహెంజోదారో: ప్రాచీననిర్మాణావిష్కరణము (కల) ... ... | ౮ | ౩౧౫–౩౧౬ |
| యశోమూర్తి అనీబెసంటు—అశ్వత్థనారాయణరావు ... ... | ౧౧ | ౮౦౭–౮౦౮ |
| యుగలక్షణసమన్వయము—బులుసు వేంకటరమణయ్య ... ... | ౯ | ౪౧౪–౪౧౬ |
| రంధ్రములఅట్టపై కుట్టుట—కొ. నరసింహాచారి (వి. శి.) ... ... | ౭ | ౬౧–౬౨ |
| రాజకీయవిధేయత—శ్రీపాద గణపతిరావు ... ... | ౮ | ౨౮౭–౨౮౯ |
| రాజారామమోహనస్మృతి—వోలేటి పార్వతీశం ... ... | ౧౧ | ౬౮౪ |
| రాబోవుయుగమునకు ఫోర్డుగారిఉపాయము (కల) ... ... | ౧౦ | ౬౪౬–౬౪౭ |
| రొమ్మునకు బలముకూర్చుట (కల) ... ... ... | ౧౦ | ౬౪౮–౬౪౯ |
| రోగవారసత్వము-వడ్డాది సీతారామరావు ... ... ... | ౧౧ | ౮౦౫–౮౦౬ |
| రౌండుటేబిల్ సభల సంస్కరణవిధానము—చా. వెం. హనుమంతరావు | ౯ | ౪౦౭–౪౧౨ |
| లక్ష్మీకల్యాణము (మ. మా.) ... ... ... | ౭ | ౧౬౩–౧౬౪ |
| లాంఛనములు—మల్లాది రామకృష్ణశాస్త్రి (వి. త.) ... ... | ౮ | ౩౦౮–౩౧౦ |
| వచనవాఙ్మయము—శాస్త్రి (వి. త.) ... ... | ౧౨ | ౯౩౭–౯౩౮ |
| వర్షాశ్రీముఖము—వోలేటి పార్వతీశము (ప) ... ... | ౧౦ | ౫౬౧–౫౬౨ |
| వావిళ్లవారికి సమ్మానము (వి. త) ... ... ... | ౧౨ | ౯౯౩–౯౯౬ |

| | సం. | పుట |
|---|---|---|
| విఠలభాయి పటేలు నిర్యాణము (మ. మా.) ... ... | ౧౧ | ౨౩౦–౨౩౧ |
| విద్యాప్రమాణము—సి. పి. రామచంద్రరావు ... ... | ౯ | ౩౨౨–౩౯౭ |
| విద్యాలయములలో ఆటలు (కల) ... ... ... | ౨ | ౩౧౩–౩౧౪ |
| విద్యావిధానమున నూతనాభిప్రాయములు (కల) ... ... | ౧౦ | ౬౪౨ |
| వినాయకచవితి—కర్లపాలెము కుటుంబశాస్త్రి (ప) ... | ౯ | ౪౨౬ |
| వీరభద్రవిజయములు—కట్టి సాంబమూర్తిశాస్త్రి ... ... | ౧౧ | ౮౪౯–౮౫౮ |
| వేణీసంహారము—ద్రౌపది—కపిస్థలం కృష్ణమాచార్యులు ... ... | ౧౧ | ౬౨౫–౬౨౯ |
| వైరాగ్యం—'వనవాసి' (ప) ... ... ... | ౮ | ౭౨ |
| వోటు—సోమంచి యజ్ఞన్నశాస్త్రి ... ... ... | ౯ | ౪౧౮–౪౭౧ |
| వ్యవసాయ పరిశోధనాలయముల ఆవశ్యకత—దువ్వూరి బాలకృష్ణమూర్తి | ౧౧ | ౮౨౧–౮౨౮ |
| వ్రజనిగూఢరసము—యలమంచిలి శ్రీరాములు ... ... | ౮ | ౧౧౧–౧౧౩ |
| శరదృతువు—వడ్డాది సుబ్బారాయడు (ప) ... ... | ౧౭ | ౯౭౫–౯౭౬ |
| శర్వరి—పెమ్మరాజులక్ష్మీపతి (ప) ... ... ... | ౯ | ౪౪౯–౪౫౦ |
| శిక్షణమువలని ప్రయోజనము (కల) ... ... ... | ౯ | ౪౮౫–౪౬౬ |
| శిఖండి—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ... ... | ౧౧ | ౮౮౩–౮౮౬ |
| శృంగారము—మల్లాది రామకృష్ణశాస్త్రి ... ... | ౧౦ | ౫౮౭–౫౮౮ |
| శైలి—కాంచనపల్లి కనకాంబ (ప) ... ... ... | ౧౦ | ౬౩౧ |
| శ్మశానవాటి—జి. జాషువ (ప) ... ... ... | ౧౭ | ౯౨౧–౯౨౭ |
| శ్రీకృష్ణనవరత్నగీతులు—శ్రీ విక్రమదేవవర్మ (ప) ... ... | ౧౭ | ౯౧౪ |
| శ్రీ గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారికి సమ్మానము (మ. మా.) ... | ౮ | ౧౬౨–౧౬౯ |
| శ్రీమంతుడా?—మం. వేంకటశర్మ (ప) ... ... ... | ౮ | ౧౬౦–౧౬౭ |
| శ్రీయుత చంద్రుపట్లరామారావు—మారెళ్లపూడి పుత్రసత్యశర్మ (అం. అ) | ౧౧ | ౨౭౫–౨౭౬ |
| షష్టిపూర్తి—శాస్త్రి (మి. త) ... ... ... | ౧౧ | ౨౧౩–౨౧౪ |
| సంస్కృతము దేశభాషగనుండినదా?—వంగోలు వేంకటరంగయ్య ... | ౯ | ౩౬౯–౩౮౪ |
| సనాతనధర్మమననేమి? (కల) ... ... ... | ౨ | ౩౧౭ |
| సహకారమహాసభ ౧౯౩౩—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి (కల) ... | ౨ | ౩౧౪–౩౧౫ |
| సాంప్రదాయికవిజ్ఞానం—శేషుమల్ల కామేశ్వరరావు ... ... | ౧౭ | ౨౫౭–౨౫౯ |
| సారంగధరచరిత్ర—బులుసు పాపయ్యశాస్త్రి ... ... | ౯ | ౩౬౩–౩౬౪ |
| సారస్వతము—సర్కారు—కర్లపాలెం కృష్ణారావు (మి.త) ... | ౧౭ | ౯౩౬–౯౩౮ |
| సింహావలోకనం—కొల్లూరు ధర్మారాయకవి ... ... ... | ౧౭ | ౨౬౬–౨౮౦ |
| సూరన—అయినంపూడి గురునాథరావు (ప) ... ... | ౨ | ౭౩౮ |
| సూర్యగ్రహణము—చివుకుల వేంకటరమణశాస్త్రి ... ... | ౧౦ | ౬౭౮–౬౭౯ |
| సెలవు—మండపాక పార్వతీశ్వరశాస్త్రి (ప) ... ... | ౮ | ౯౬–౯౮ |
| సౌందర్యమంజరీ కృతిసమర్పణము (మ. మా.) ... ... | ౮ | ౧౬౫–౧౬౬ |
| స్త్రీవిద్య (కల) ... ... ... | ౧౦ | ౬౪౩–౬౪౫ |
| స్వర్గీయ జతీంద్రమోహనుడు (మ. మా.) ... ... ... | ౨ | ౩౭౨–౩౩౦ |

| | | సం. | పుట |
|---|---|---|---|
| స్వాతంత్ర్యపరిచయము (కల) | ... ... ... | ౮ | ౩౧౨–౩౧౩ |
| స్వాభావికాసౌకర్యములు—శాస్త్రి (వి. త.) | ... ... | ౯ | ౧౦౮–౧౧౦ |
| హిందూదేశమ – రిజర్వుబ్యాంకు—చా. వెం. హనుమంతరావు | ... | ౯ | ౯౦–౯౫ |
| హిందూమతాచారములు : ప్రభుత్వపు అధికారబాధ్యతలు—కొమాండూరి శఠగోపాచార్యులు | ... ... ... ... | ౮ | ౨౮౧–౨౮౫ |
| హిట్లరు–జరుగుమిల్లి సాంబశివరావు | ... ... ... | ౧౧ | ౭౫౯–౭౬౪ |


---

# భారతి — దశమ సంపుటము — భా. తి.

## త్రివర్ణచిత్రముల అకారాదిసూచి


| | సంచిక |
|---|---|
| ఇంటికి—వరదా వెంకటరత్నం ... ... ... ... | ౧౦ |
| ఊర్వశి—గుఱ్ఱం మల్లయ్య ... ... ... ... | ౧౨ |
| కన్నప్ప—టి. జి. గుప్త ... ... ... ... ... | ౮ |
| గణపతి—యస్. వి. యస్. రామారావు ... ... ... ... | ౯ |
| చాకలి—మద్దాలి సూర్యప్రకాశరావు ... ... ... ... | ౮ |
| తీయనితలపులు—డి. బుచ్చికృష్ణమ్మ ... ... ... ... | ౧౧ |
| దీపావళి—మాధవపెద్ది గోపాలకృష్ణగోఖలే ... ... ... ... | ౧౦ |
| పకీరు—వై. సుబ్బరావు ... ... ... ... ... | ౧౧ |
| మేరాబూ—సి. యస్. వెంకటరావు ... ... ... ... | ౯ |
| రాణాప్రతాపసింహ—సుండిమెడ వెంకటసుబ్బారావు ... ... ... | ౭ |
| వడిసెల—సుసర్ల వెంకటరామయ్య ... ... ... ... | ౧౨ |
| శుక్లప్రతిపత్తు—(కాశీనాథరావుగారి ప్రాచీనచిత్ర సంచయమునుండి) ... ... | ౭ |
| శుక్లద్వితీయ— ,, ,, ,, ... ... | ౭ |


---

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౭.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩





భవానుభవము—బాలాంత్రపు వెంకటరావుగారు ... ... ౧–౨

ఛందోలంకారములు-దోషప్రకరణము—దువ్వూరి సూర్యనారాయణ మూర్తిగారు ... ... ... ... ౩–౧౦

దేవుడు-మనుజుడు-కోతి—విశ్వనాథ సత్యనారాయణగారు ... ౧౦

బిల్హణకథ—డి. ఎ. నరసింహంగారు ... ... ... ౧౧–౧౯

చంద్రునిమచ్చ—జి. జాషువగారు ... ... ... ౧౯

జాతకరాజీయము—మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ... ౨౦–౨౧

దస్తూరీ—ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు ... ... ... ౨౩–౨౭

వైరాగ్యము—'వనవాసి' ... ... ... ... ౨౮

ప్రేమపాశం—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు... ... ... ౨౯–౩౯

దయ్యము—కొ. శశిశేఖరరావుగారు ... ... ... ౪౧–౪౬

అసమానదాంపత్యం—'చౌదరి' ... ... ... ౪౭–౫౪

ఒహారకం—'గిరి' ... ... ... ... ... ౫౫–౬౦

వినోదశిల్పము : రంధ్రముల అట్టపై కుట్టుట—కొ. నరసింహాచారిగారు ౬౧–౬౨

భారతీయవిద్యాచరిత్రము—మారేమండ రామారావుగారు ... ౬౩–౭౫

భక్తిగీతము—కూచి రామలక్ష్మమ్మగారు ... ... ... ౭౫

నేటిరష్యా—నార్ల వెంకటేశ్వరరావుగారు ... ... ... ౭౬–౮౩

నానాజాతిసమితి అనగా నేమి? అది చేయునదేమి?—సి. యస్. లక్ష్మిగారు ౮౪–౮౯

దొంగపెండ్లి—కీ. శే. జనమంచి వెంకటరామయ్యగారు ... ... ౯౦

హిందూదేశము : రిజర్వుబ్యాంకు—చా. వెం. హనుమంతరావుగారు ౯౧–౯౫

సెలవు—మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు ... ... ... ౯౬–౯౮

చందనవృక్షము—క్రమధాటి వెంకటగిరిగారు ... ... ... ౯౯–౧౦౪

మంచివ్యవసాయము—దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు ... ... ౧౦౫–౧౦౭

[illegible]అకలు : స్వాభావికాసాకర్యములు—శాస్త్రి ... ... ౧౦౮–౧౧౦

ప్రజనిగూఢరసము—యలమంచిలి శ్రీరాములుగారు ... ... ౧౧౧–౧౧౩

ఆత్మహత్య—"ప్రసాద్" ... ... ... ... ౧౧౪–౧౧౫

నిశ—చావలి బంగారమ్మగారు ... ... ... ... ౧౧౫

చిత్రకళ : భారతదేశపు తొలిచిత్తరువులు—తలిశెట్టి రామారావుగారు ౧౧౬–౧౨౪

బసవరాజు అప్పరాయని కత !—మున్నంగి...శర్మ ... ... ౧౨౫–౧౨౬

ఆంధ్రగ్రంథములపట్టిక ... ... ... ... ౧౨౭–౧౩౧

బాలక్రీడలు—మంగిపూడి వేంకటశర్మగారు ... ... ... ౧౩౩–౧౩౮

నక్షత్రమండలము (ఆషాఢమాసము)—గొబ్బూరు వేంకటానందరాఘవ
రావుగారు ... ... ... ... ౧౩౯–౧౪౩

భారతీయమహిళామండలి : శ్రీమతి సోరాజి ఆనందరావు సతిగారు ;
శ్రీమతి సుందరమ్మగారు ... ... ... ౧౪౪

కలగూరగంప : విశ్వవిద్యాలయములన్నియు తొలగిపోవలయును; ఇంగ్లాండు, రష్యా,
ఇండియా ; అశ్వారు నిష్క్రమణము-ఎంతకాలమువరకు? ; భారతీయ
రాజకీయఖయిదీల యిడుములు; 'స్వదేశీ'మతము; శృంగారనాయికలు ;
గాంధిమహాత్ముడు ... ... ... ... ౧౪౫–౧౫౨

విమర్శనము ... ... ... ... ౧౫౩–౧౫౯

శ్రీమంతుడా ?—మం. వేంకటశర్మగారు ... ... ... ౧౬౦–౧౬౨

మనవిమాటలు ... ... ... ... ... ౧౬౩–౧౭౦


# చిత్రములు

త్రివర్ణచిత్రములు :—రాణా ప్రతాపసింహ ; శుక్లప్రతిపత్తు ; శుక్లద్వితీయ.

సాధారణ చిత్రములు :— శృంగారనాయికలు (ప్రాచీనచిత్రములు) ౧౬ ; వ్యంగ్య చిత్రములు ౨ ; అలప్పి-ఎర్నాకులం మార్గమందలి లంక ; ప్రతిబింబము (ప్రకృతిచిత్రము); కాశీ-పడమటివైపు ; గంగానదిలో పడవలు ; పంచగంగాఘట్టము-కాశీ ; చంద్రభాగానది-పండరిపురము ; దశాశ్వమేధఘట్టము-కాశీ ; కాశీ-ఉత్తరపువైపు ; సింధియాఘట్టము - కాశీ ; తిరుచూరు దేవాలయము ; కన్యాకుమారి మొన (సముద్రములోనుండి) ; కన్యాకుమారి దేవాలయము ; కన్యాకుమారి స్నానఘట్టము ; ఇతర చిత్రములును.

---




సంపు. ౧౦ శ్రీముఖ సంవత్సరము, ఆషాఢమాసము (జూలై ౧౯33) సంఖ్య ౭

## భవానుభవము

కవిరాజహంస, బాలాంత్రపు వెంకటరావు

స్వానుభవము, గుణగణ సహి-తానుభవము విశ్వదర్శనానుభవము, జ్ఞా
నానుభవము, నిత్యబ్ర-హ్మానుభవముఁ గాంతు గురుభవానుభవమతిన్.

వఱవని మిన్నువంకఁ దలవాల్చి తపించెద వంతరాత్మ నే
చలిమలపట్టి నీ దలఁచి సామయి మేను కృశింపఁజేయఁగాఁ
దెలియవు, మన్మథార్తులకుఁ దియ్యము నెయ్యము నేల? నిన్ను నేఁ
గొలిచెద విభ్రమాత్ముఁ డనుకోక క్షమింపు భుజంగభూషణా!

తలతిక్క-గాకున్నఁ జిలువఁ జుట్టుదురయా సవతుల నోదార్పఁజాలకున్న,
కొసవెఱ్ఱిగాకున్న కొండ లెక్కుదురయా కొడుకుల సవరింపఁగూడకున్న,
వేఁదురు గాకున్న విషము మెక్కుదురయా ప్రకృతులఁ బోషింపఁ బడయకున్న,
మతిపోక కాకున్న మ్రాను వట్టుదురయా లోకముల్ భరియింప రాకయున్న,
జ్ఞానఖనివయ్యుఁ బ్రాకృత జనునిఁబోలి - యేల విపరీతకార్యంబు లిట్లు జేసి
తభవ, యిదినీకు సహజమో యనుకరణమొ-నిజ మెఱిఁగించి నన్ను మన్నింపుమయ్య!

బొమ్మకపాల మేమిటికి భోజనపాత్రగఁ జేసికొంటివో?
యెమ్ములనేల నేమిటికి నిష్టగృహమ్ముగఁ జూచికొంటివో?
నెమ్మది లేక యేమిటికి నిత్యతపంబును జేయుచుంటివో?
సమ్మతిఁ దెల్పి నామది విచారముఁ బాపవె విశ్వనాయకా!

నెలవంకదరి మించుతలఁవంక నృపతిపా ల్సేసి, భాగీరథిఁ జేసినావు,
సామేనుదాల్చినసతి యజ్ఞవాటిపా ల్సేసి, యహార్యజఁ జేసినావు,
తన్ను మించినయాత్మతనయుని సురలపా ల్సేసి, సేనానిఁ జేసినావు,
భక్తి నర్చించునబ్బలిఁ ద్రివిక్రమునిపా ల్సేసి, విశ్వత్యాగిఁ జేసినావు,
పరులు తనవా రనెడిభేదభావ మేది - యింతయభిమానశూన్యుఁడ వేటికైతి
వభవ, నీచేయుకార్యంబు లడుగవలెనె? - నీకు నీవె పరుండవు నిశ్చయముగ.

హిమవంతునకు రత్నహేమభాగ్యం బిచ్చి పునుకపేరులు మెడఁ బూనినావు,
అలకాధినాథున కైశ్వర్య మందించి జోగివై భిక్షుల కేఁగినావు,
హరిపదంబున కున్నయంబరం బర్పించి గజచర్మమును గటిఁ గట్టినావు,
విబుధుల కమృతంబు విందుసేయఁగ నిచ్చి హాలాహలంబును గ్రోలినావు,
భోగివా విరాగివో నిన్నుఁ బోల్పరాదు - త్యాగివా వియోగివో నిన్నుఁ దలఁపరాదు,
నీచరిత లవాఙ్మానసగోచరములు - విశ్వకల్యాణగుణగణవిభవ! అభవ!

కల్లరి గావు, కర్మఫల కాంక్షలు లేవు, స్వయంభువుండ వై
తల్లియుఁ దండ్రివై, విభవదక్షుఁడవై, జగమేలుకోక, నీ
యెల్లధనంబు లిట్లొసఁగు టీశ్వర, నీకు వినోదమాత్రమై
చెల్లె, నెఱింగి నిర్గొలువఁ జెల్లవె జీవుల కర్మబంధముల్?

పరుఁడవు నినుఁజేరి భజియించుకొను టెట్టు లభిమానహీనుండ నైనఁదాఁక,
గుణశూన్యుఁడవు నిన్ను గణుతించుకొను టెట్లు నేను నీయంతవాఁ డైనఁదాఁక,
అణువునుగావు ని న్నర్చించుకొను టెట్టు లంతట నే నుండునంతదాఁక,
రూపంబుఁ గనవు నీదాఁపుఁ జేరుట యెట్లు నేను నీ వొక్కటి యైనదాఁక,
వాదుసేయ నాతోడ నీవల్లఁ గాదు, - చెలిమిసేయ నీతోడ నాచేతఁగాదు,
శ్రుతుల వినఁబడ్డమాటలే చూచియిట్టు - లన్వయించుకొన్నాఁడ భవానుభవము.

---

# ఛందోలంకారములు – దోషప్రకరణము

దువ్వూరి సూర్యనారాయణమూర్తి

"ముఖ్యార్థనిహతి ర్దోషః"

"దోషః కావ్యాపకర్షస్య హేతు శ్శబ్దార్థ గోచరః."

ఈరీతిని దోషస్వరూపమును బూర్వులు నిరూపించియున్నారు. సామాన్యముగా గుణదోషము లనునవి సర్వకవిసామాన్యములు, సర్వగ్రంథసామాన్యములు నని యనవచ్చును. వాఙ్మయమున దోషములేని గ్రంథము లుంట యసంభవము. అట్లని కావ్యము రచించు కవి తన యిష్టానుసారము పోరాదనియు, మం దట్టివాఁడు దోషగుణముల బాగుగఁ దెలిసి దోషముల త్యజింపవలెననియు, తన కావ్య ముత్కర్షవహించి చిరస్థాయి కావలెనన్న నయ్యది నిర్దుష్టముగా నుండవలెనని యూహించి యీదోషముల పూర్వులు నిరూపించియున్నారు. ఈదోషము లనునవి కావ్యాశ్రయములగుటచే తన్నిరూపణమువిషయమున ఛందోలంకార కర్తలకు సమానముగు హక్కుండుట నీదోషములవిషయము గూడ నిరువురకు నిరూపింపవలసివచ్చినది. ఇట్టి కావ్యాపకర్షకు హేతువులైన కొన్ని దోషములు దెలిసియు, కవులు తమ గ్రంథముల నిశ్శంకముగాఁ బ్రయోగించియుంటను, కొన్నిదోషములవిషయమున లక్షణకర్తలలో మతభేదము లుండుటను, శాసించిన లక్షణకర్తలే యీదోషముల వాడుటను, మూర్తికవి చెప్పిన దోషములలోఁ గొన్ని యనవసరములగుటను ప్రకృతమున నావ్యాసము తన్నిరూపణమే ఫలముగా వ్రాయఁబడుచున్నది.

వీనిలో దోషములు పదియే యని దండి చెప్పియున్నాఁడు. విద్యానాథుఁడు "శబ్దగతత్వే నార్థగతత్వేన ద్వైవిధ్యం, శబ్దగతానామపి పదవాక్యగతత్వేన ద్వైవిధ్యమ్" అని విభాగించి ౨౬ దోషములవఱకు నిరూపించియున్నాఁడు. కవిజనాశ్రయకర్త దండిమతమునే యంగీకరించి దశవిధదోషముల నిరూపించియున్నాఁడు. మూర్తికవి తన కావ్యాలంకారసంగ్రహమున ప్రతాపరుద్రీయానుసారముగాఁ జెప్పియున్నాఁడు. ఇందు దండిభీమనమతములఁ గొన్నిదోషములు గుణములగు. నరసభూపాలీయమతమున నది లేదు. మఱియు విరోధమనెడి దోషమును దండ్యాదు లనేకభేదములఁ జేసియున్నారు. ఈతఁడొక రెండుభేదములుగానే విభాగించెను.

౧. నరసభూపాలీయకర్త నేయార్థమనియు, నసమర్థమనియు, రెండు దోషములఁ జెప్పియున్నాఁడు. "ఇల తన సంకేతంబున నిలిపిన పద మెంచిచూడ నేయార్థం బౌ", "ధర నప్రసిద్ధయోగం బరసి ప్రయోగించు పదమ యసమర్థంబౌ." అని వాని లక్షణములు గూడఁ జెప్పఁబడినవి. ఈరెంటిని నొక్కటిగా పరిగణింపవచ్చును. ఏమందురా, తనకుఁదప్ప మఱియొకరి కర్థముగానిరీతి స్వసంకేతప్రసిద్ధార్థముగా కవి యొక పదము నెప్పుడు ప్రయోగించెనో యయ్యది యప్రసిద్ధమే యగునుగాని పదుగురకు సుబోధముగాదు. తన సంకేతమున నిలిపిన పదమైన దన కర్థము దెలియును. అప్రసిద్ధయోగపదమున కర్థము కవికే తెలియదన వీలు లేదు. తన కర్థము తెలియనిపదమును కవి ప్రయోగించు ననుట యనుభవవిరుద్ధము. కాఁగాఁ బై రెండుదోషములలో నెద్దియే నొక్కదాని నంగీకరించినఁ జాలును.

౨. నిరర్థకమనఁగా:—"ఇలఁ బదపూరణమాత్రం బలవడిన పదంబు కృతి నిరర్థక మయ్యెన్" అని లక్షణము నెప్పియున్నాఁడు. ఈదోషము ముఖ్యముగాఁ జెప్పఁదగినదైనను మహాకవిప్రయోగానుసారముఁ శాస్త్రమనురీతినిఁ జూడ నియ్యది యనవసరమే. సంస్కృతమున నియ్యది నాతివిస్తరముగా నున్నది. "తుహిచస్మహవై పాదపూరణే" ఇత్యాదులవలన నేకైకాక్షర

రూపముననే దాన నిరర్థకపదము లున్నవి. అట్టియక్షరముల రెంటిమూటినిఁ గలిపి యొక్కచోఁ బ్రయోగించుట యసంభవముగావుటను, నట్టిప్రయోగములు సంస్కృతవాఙ్మయమున మృగ్యములగుటను నేకాక్షరనియమ మట్టిపట్టులఁ బ్రయోగింపఁబడినను బెద్దలోటుగా నుండదు. మన యాంధ్రవాఙ్మయమందుననో యతిప్రాసనియమములవలన లేనిపోని పడికట్టురాళ్లనేకములు పాదపూర్తియతిప్రాసల స్థానముల వాడుచుండుదురు. అట్టితఱి నొక్కపదముగాదుగదా, రెండుమూఁడు పదము లేయప్రసిద్ధప్రాస నిలిపినప్పుడో వేసి నిర్వహింపక తప్పదు. కాఁగా నీదోష ముండవలసినదే. కాని కవిత్రయమువారి కబ్బములసైత మీదోష మున్నదని యంగీకరింపకతప్పదు.

౩. గ్రామ్యము:—"పామరుల భాష గ్రామ్యము భామినికటిగల్లములు విభాసిల్లు ననన్, కోమలికన్నులు చన్నులు" ఇత్యాదిపదప్రయోగములను నీదోషమని లక్షణము చెప్పఁబడినది. ఇయ్యదిగూడఁ బైరీతి ననవసరమే యనఁదగును. ఏమనఁ, బ్రయోగములే ప్రమాణములు. పైపదముల వీడి మన కవు లొక్కనిముషమైన నిలువలేరు. మన ప్రబంధవాఙ్మయమంతయు పైపదములమీఁదనే నిలిచియున్నది. లక్షణగ్రంథముల వ్రాయునపుడు నిరర్థకదోషము లున్నను దోషముగాదుగాని గ్రామ్యపదప్రయోగము దోషమని యొకమూలఁ జెప్పుచు మూర్తికవియే యీపదము లచ్చటచ్చట వాడియున్నాఁడు. చూడుఁడు:—"బింకపుం జన్నులమీఁదఁ జేర్చుకొని" (౩ ఆ. ౪౫ ప.), "చనువున నేపుఁ జూపఁగల చన్నులు చన్నులు" (౪ ఆ. ౭౦ ప.). మఱియు ౫ ఆ. ౧౧౩-వ పద్యము స్వభావోక్త్యలంకారముగా వర్ణింపఁబడినదఁట. కొసకు "వలుద వలిగుబ్బచన్నులోవలపులాడి" అని తన యసభ్యత వెలిఁబుచ్చియున్నాఁడు. ఇట్టి వింకను బ్రబంధములఁ జూపవలెనన్న నయుతము లున్నవి. కవిత్రయగ్రంథములలోమాత్రము గానరావు. మన ప్రబంధకర్త లీమాత్రపు గుహ్యాంగములేగాక ఇంకను రహస్యాంగవర్ణనము, తన్నామోచ్చారణముగూడ జేసియుంట నీదోషము నంతగా పాటించిరనుట కల్ల. దండి యీదోషము కేవలపదాశ్రయమేగాక యర్థాశ్రయముగఁగూడఁ జూపియున్నాఁడు. "కన్యే కామయమానం మాం న త్వం కామయసే కథం" ఇత్యాదులలో నట్లు భాషించుటయే దోషమని చెప్పియున్నాఁడు. పదవిషయమునఁగూడ యభిన, నిష్ఠ్యూత, ఉద్గీర్ణ, వాంత-ఇత్యాదులయం దీదోష మున్నదనియు, వీనికి గౌణవృత్త్యాశ్రయమువలన దోష ముండదనియుఁ జెప్పి,

"ఉష్ణరశ్మి మయూఖంబు లుమియుచుండె
నిప్పుతుంపురులను దావినీరజములు,
రక్తరేణువుల్ గ్రక్క వక్త్రములనుండి
మరల వెడలంగఁ గ్రక్కెడు మాడ్కి" (తె. కా.)

ఇత్యాదులు జూపియున్నాఁడు. శృంగారనైషధాదిప్రబంధములసైతము "గల్లపాళీలసత్కామముద్రాంకురా" అని గల్లశబ్దప్రయోగ మున్నది. మఱియు నీగ్రామ్యమున కన్నిపట్టులను దోషము లేదు. పాత్రముఖభాషణములలో నీచపాత్రయైన తక్కుపభాషలోనే మాట్లాడింపవలెను. అట్లుగాక యేగొడ్డుగ్రాంథికమో మాట్లాడించిన నయ్యది పరిహాసాస్పదముగా నుండి స్వభావసిద్ధముగా నుండదు. కాఁబట్టియే "గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనములం బ్రయోగార్హంబు" అని "మొక్కముసామి" (రామా) "ఇతని సూసినా పేఁలుబాగాము నేసినాము" (యయాతిచరిత్ర) అనియు ప్రౌఢవ్యాకరణకర్త సాధించియున్నాఁడు. రానురాను నేఁటియుగమున గ్రామ్యమునకే ప్రాధాన్యము వచ్చుట తటస్థించినది. కాఁగా పైపదప్రయోగములమాత్రమే దోషమని చెప్పిన నిది యనవసరము.

౪ చ్యుతసంస్కారము:—అనఁగా వ్యాకరణదుష్టమగు భాషయే యాపేరుగలది. ఈదోషమును సామాన్యముగ నందఱు పాటించియే యున్నారు. ఈ దోషము ముఖ్యముగా సంస్కృతభాషకుసంబంధించినది. ఏలయన నయ్యది వ్యవహారభ్రష్టత నంది నిలిచిపోయిన భాషగాన నద్దానిని వైయాకరణులు శాసించినరీతిఁ బ్రయోగింపనిచో నప్పు డీదోషముండుట యుక్తము.

కావుననే కాళిదాసాదిమహాకవులలోఁగూడ నీచ్యుతసంస్కారము లుండుట మన మెఱుఁగుదుము. తెనుఁగు భాషగతి యిట్టిదిగాదు. దినదినము నూతనాంకురములతో వేఁదలెత్తి పెరుఁగు భాషాలతికకు సంస్కారమొక్కపరి చేసి యీపందిరిగలుగు మేఱలోనే నీవు ప్రాకులాడవలెనుగాని దీనిని దాఁటరాదనిన నం దెట్లిమిడియుండును? కాన నొక్కకాలమున సంస్కరించిన భాష కొన్నివత్సరములకు నశింపవచ్చును. అప్పటికిఁ గొన్ని క్రొత్తపదములు, క్రొత్తప్రయోగములు నాఁటి జనుల రుచిభేదము ననుసరించి మారనగును. అప్పుడు పూర్వవ్యాకరణానుసార మీప్రయోగము లన్నియు దోషయుక్తము లనుట యసంభవము. భారతకాలము నాఁటి భాషలోని పదములు చాలవఱకు నేఁడు నశింపలేదా? ఆ ప్రయోగములప్రకారము నేఁడున్న నర్థమగుటగూడ దుర్ఘటము. కాఁగా జీవద్భాషయగుట మనవాఙ్మయమున కీదోషసంపర్కము లేదు. కాని యొక వ్యాకరణముచే నియమింపఁబడినవెనుక కొంత కాలమువఱకును మారని భాషాసంప్రదాయముల వీడి నాఁటివారు తద్వ్యతిరేకముగాఁ బ్రయోగింపనప్పు డీ దోషమునకు స్థానము దొరకును. ప్రకృతమున దోషమని శాసించిన తత్తదలంకారచ్ఛందోగ్రంథములలోనే యీ సంస్కారచ్యుతు లున్నవి. చూడుఁడు—"దేహి యనంగనీక మనుచుం బ్రజలన్" (కావ్యాలం. సం.). ఇచ్చట 'దేహి'యనునది సంస్కృతధాతువు. ఇయ్యది యనుకరణాదులేమియు లేక నాంధ్రమునఁ బ్రవేశించుట యెట్లు? ఇది వాడుక ననుసరించి యద్దానియం దంద మున్నదని వ్యాకృతుల నొకచో నుంచి కవి ప్రయోగించియున్నాఁడు. "దివిజేంద్రతటినియో యన"—ఇచ్చట 'ఓ' యను నూహార్థకశబ్దము త్వేత్థావాచిగాని యుపమావాచి గానేరదు. ఐన నుపమావాచిగా కవి ప్రయోగించియున్నాఁడు. ఇటీవలి వ్యాకృతు లీనియమమును జెప్పినవి. ఇట్లే చ్యుతసంస్కృతులు తీసిన ప్రతిప్రబంధమునందును కొల్లలుగా నున్నవి. మఱియు నీ చ్యుతసంస్కృతి సరియగు నర్థముతో గ్రహించి లక్షణము చెప్పిన ఛందోభంగ, యతిభంగ, శబ్దహీన, విరస, అస్థానసమాస, గ్రామ్యాదు లనేకము లిం దంతర్భవించును. వీని విషయమున వ్యాకరణఛందోలంకారగ్రంథములే సంస్కరించి నియమించినపు డానియమము నుల్లంఘింప నవన్నియు చ్యుతసంస్కారములే యగునుగాని యన్యములు గావు. అయినను కక్ష్యావిభాగమున భిన్నభిన్న నామములఁ బెట్టి గ్రంథవిస్తృతిఁ జేయ లక్షణకర్తలు పూనుకొనిరి. కొందఱు లాక్షణికులు "విరోధ" మనెడి దోషమును జెప్పి యయ్యది దేశ, కాల, కలా, న్యాయ, ఆగమ, శాస్త్రాది విరోధములుగా విభాగించి యింక నెన్ని గలవో యవన్నియు విరోధ మొక్కటిచే గతార్థము చేయలేదా? అట్లే యీచ్యుతసంస్కృతి విషయమునఁగూడఁ జేసిన యుక్తముగా నుండెడిది. లేనిచో ననేకవిధము లింకను జెప్పి క్రొత్తపేరులు బెట్టవలసివచ్చును.

౫. అశ్లీలము:—"వ్రీడజుగుప్సామంగళ, శీలములగు పదము లొకటఁ జేర్చిన నది యశ్లీలము" అని లక్షణము చెప్పఁబడినది. ఇట్టి దోషముల ముఖ్యముగా కవులు పాటింపవలసినదే? దీనివలన నొకొక్కస్థలమున విపరీతార్థస్ఫూర్తి కలిగి సామాజికుల కసహ్యము గలిగించును. ఇట్టిదోషము లరుదుగ వాఙ్మయమున నున్నవి. "వారలలో లక్కాంబ కుమారుఁడు"—ఇయ్యది కందపద్యపాదము. ఇందు, కుమారుఁడనెడి పదమందలి యాదిమవర్ణము మొదటిపాదమున మిగులుటచే లక్కాంబకు మారుఁడు—లక్కాంబకు మన్మథుఁడై అనఁగా మన్మథునివంటివాఁడై, భర్తయై అను నశ్లీలార్థము గలుగుచున్నది. "పండునెన్నెలఁ జిమ్మ పైరులఁ బండించి ధరణి కన్నముపెట్టు ధర్మరాజు" ఇచ్చట భూప్రజకు నన్నదానము చేయువాఁ డనునర్థము చెడి "భూమికే కన్నముత్రవ్వు మహాత్ముఁ" డను నశ్లీలార్థము వచ్చుచున్నది. మఱియు "ఈకలహంసయాన నను నెక్కడి కెక్కడినుండి తెచ్చె" ఇత్యాదులలో వివరింప నవసరములేకయే యేకపదాభాసమువలనఁ గలుగు నశ్లీలార్థము సర్వవేద్యము. మఱియు, "కుడువన్ కుడుఇన్", "ప్రాంచద్భూషణబాహుమూలరుచితో", "గుట్టసియాడ","మూడువలపుల్ వలచెన్...కన్యకన్"—

ఇత్యాదులలో నపారమగు దురర్థము స్ఫురించుచున్న యది. ఇట్టిదోషముగూడ సర్వసామాన్యముగనే యున్నది. ఈయవి తత్తత్కాలములఁ గల కవుల రుచి భేదముఁబట్టి నిర్దోషము లగుచున్నవి. మఱియు నర్థ దోషములలోని పరుషమను దోషముగూడ నిద్దానియం దంతర్భవించును. "ఈరాజు సౌందర్యము మంటబడ్డ మదనుని సౌందర్యమువంటిది" అని దాని లక్ష్యము. ఇట్లనినతోడన నమంగళప్రదమగు నర్థము స్ఫురించుట నిదియు నొకవిధమగు నశ్లీలమేయగునుగాన నియ్యది యనవసరము.

౬. అప్రతీతము:—శాస్త్రపురాణ ప్రసిద్ధపద మప్రతీతము. "వృషాకపి", "అజావృతము" ఇత్యాదులు. పురాణమాత్రప్రసిద్ధత యిట్టివాని కెప్పుడు గలిగెనో యప్పుడే కవిప్రయోగములనుండి విశీర్ణమైనవని తేలు చున్నది. లేనిచో నాయాపదములకు వాఙ్మయమున స్థాన ముండెడిదే. ఇట్టితఱి "కవులు ప్రయోగింపని పద మవనిం దగ నప్రయుక్తమగు" అని మరల శాస్త్ర పురాణప్రసిద్ధములు గొన్ని, కవిప్రయోగసిద్ధములు గానివి కొన్ని యని విభాగింప నవసరములేదు. ఈగణ మంతయు నొకటిగాఁ జేర్పవచ్చును. శాస్త్రమాత్ర ప్రసిద్ధములగు ౫౦ సకారములతోఁ గూడిన "సంస్కర్తా" యనునదియు, "పుపుక్షిత్రీయియిషివతి", "రామాత్ త్" "రామాద్ ద్" ఇత్యాదులు ప్రథమమున నప్రతీతములై యట్టివి కవులు ప్రయోగింపమి నప్రయుక్తములు కావు టలో సందేహమా? కాన నీరెంటిని భేదింప ననవసరము.

౭. అప్రయోజనము:—ఒకపదము విశేషవిధా యిగాక యనవసరముగా కదిసిన నది యప్రయోజనము. "భూతి విభాధవళిత హరసుతుఁ గొలుతును"—ఇచ్చట హరసుతు సేవనమునకు భూతివిభాధవళితత్వ మున్నను, లేకున్నను నొక్కటియే. వ్యర్థదోషముగూడ నిట్టిదియే. దీని లక్షణముననే నీరెంటికి నైక్య మున్నట్లు విదితము. చూడుఁడు: "అప్రయోజనంబు వ్యర్థమా" అని చెప్పి యున్నాఁడు. ఇచ్చటఁగూడఁ బ్రయోజనము లేని విశేష ణమే వ్యర్థము. "ఫేనిలంబైన జలధి దాఁటె యనిలతనయుఁడు" అని దీని లక్ష్యము. ఇచ్చట అనిల తనయ జలనిధితరణమునకు ఫేనిలత్వ విశేషణ మున్న, లేకున్న నొక్కటియే. ప్రకృతమున కావిశేషణము వలన పరిపోషాతిశయ మేమియు లేదుగాన నిదిగూడ పైయప్రయోజనమువంటిదే యగును. కాఁగా నిందొకటి యనవసరము. ఈ వ్యర్థదోషమువిషయమున కవిజనా శ్రయకర్తమతము వేరుగ నున్నది.

"మొదలఁ గ్రియతో నమర్పక
విదితవిరుద్ధార్థయుక్తి విపరీతంబై
తుదఁ గ్రియ రాఁ జెప్పిన, వ్య
ర్థదోషము............"

అని చెప్పెను. అనఁగా ప్రథమమున నేవాక్యమును ప్రారంభించెనో ఆవాక్యమును గ్రియతో సమాప్తినందిం పక నడుమను ప్రారంభవాక్యార్థవిరుద్ధముగా మఱియొక వాక్యమును జొనిపి మొదటివాక్యమును దదనంతరము సరిపుచ్చుట యని దాని యర్థము. చూడుఁడు—

"పొడిచి యొడుపంగఁ బగరను
గడుఁ గరుణాపరుఁడ వీవు గావున నీక
గ్గెడువారు లేరు పగరె
క్కడ........"

అని లక్ష్యము. ఇందు ప్రారంభవాక్యము "శత్రువులను బొడిచి యోడింపఁగా నీకగ్గెడి పగ రెక్క డెనను లేరు" అనెడిది. దీని నిట్లు కొనసాగుఁ జెప్పక నడు మను "కడుకరుణాపరుఁడ వీవు గావున" అనెడి వాక్య మును జొనిపియున్నాఁడు. దయాపరత యున్న శత్రు హననక్రియోపయోగి యగుట యసంభవము గాన నీ వాక్యము విరుద్ధార్థయుక్తము. ఇట్టిద వ్యర్థమని యాతని మతము. ఇయ్యది విరోధము లేనిచో నరసభూపాలీయ మతమున వాక్యగర్భితమగును. ఇయ్యది విరహిణీవాక్య ములలో గుణత్వ మందుననిగూడఁ జెప్పియున్నాఁడు. దండిగూడ గుణత్వవిషయమున నేకీభవించినను లక్షణ మును భేదముగాఁ జెప్పియున్నాఁడు. చూడుఁడు—

"ఒక ప్రబంధంబునందైన నొక్కవాక్య
మందునైనను బూర్వాపరార్థములు ప
రాహతిం గాంచినను విరుద్ధార్థము లయి
వ్యర్థమనుచు దోషంబుల పల్కఁబడియె"

ఇందు విరుద్ధములైన యర్థములు గలుగుటయే వ్యర్థమని చెప్పఁబడినది. ఈ విషయమున మతభేదము లిట్లున్నవి.

ఇఁక వాక్యదోషములు—

౮ విసంధి:—

"అపగతలక్షణమును గ్రా
మ్యపు సంధియుఁ దగ విసంధి యనఁదగు"

అని లక్షణముఁ జెప్పి "అరిగె న్నపరగిరి కినుఁడు" అని లక్ష్య మిచ్చియున్నాఁడు. ఇది యీతఁడు సెప్పుట యనవసరము. ఇయ్యది వ్యాకృతులే చెప్పెడిని. అట్టి వ్యాకృతినియమము దాఁటెనా, చ్యుతసంస్కృతాఖ్య దోషమే సిద్ధమగును. మఱియు నీలక్ష్యము సరిగ లేదు. ఇచ్చట పాదాంతము గాన "అరిగెన్" "అపరగిరి కినుఁ డనంగా" అని కందపద్యపాదారంభ మనుకొనిన నీ దోషము వారించును. కాని పైదోషము ద్రుతద్విత్వస్థలములనని కవిదృష్టి గలదు. అట్లయ్యు నట్టి ద్రుతద్విత్వము నంగీకరించి వ్యాకరణకర్తలు ప్రమాణత నిచ్చి యుండుట నీదోషమును దీసివేయనగును. ఈవిషయమున దండి,

"సంహితావివక్ష జనునంచుఁ బాదవా
క్యముల మధ్యభాగమందు సంధి
పదములకు నొనర్పఁబడకుండుటను విసంధి."

అని చెప్పియున్నాఁడు. అనఁగా నియ్యది తెనుఁగున "అలసగతులఁ దిరుగు–అనిలంబుచేతను" అని యుండరా దనియే యాతనిమతమని ప్రామాణికులు చెప్పియున్నారు. ఇట్టివే న్యాయమైన విసంధిలక్ష్యములు. మూర్తికవి లక్ష్యము వ్యాకృతిసమ్మతిగానినాఁడు దుస్సంధి యగును గాని విసంధి గానేరదు. పాదాంతవిసంధివిషయము వ్యాకృతు లొప్పుకొన్నదే.

౯. పునరుక్తి:—"ఎనయఁగ శబ్దార్థంబులు పునరుక్తములయిన నదియె పునరుక్తి", "చక్రాంచలమునఁ జక్రధరుఁడు శత్రుల ద్రుంచె" అని లక్షణలక్ష్యములు జూపెను. ఇది సరిపడదు. ఏమన చక్రధరశబ్దము కేవలవ్యక్తిగతమై, యావ్యక్తి చక్రాంచలమున శత్రువుల ద్రుంచెనను నర్థము వచ్చుచున్నది. అంతియెగాని యిందు పునరుక్తి లేదు. దీనికి భీమన "దినకరుఁడని మఱి దినకరుఁ డనఁగా శబ్దపునరుక్తి, దినకరుఁడని యాదిత్యుండన నర్థపునరుక్తి" యని స్పష్టముగాఁ జూపెను. మూర్తికవిమతమున నర్థపునరుక్తిలక్ష్యము లేదు. దీనిని దండి ఏకార్థ మనునామమున వాడియున్నాఁడు. గుణత్వకల్పనమందు వీరిరువురకు భేద మున్నది. దండి,

"అక్కటికమాదిగాఁగల యట్టివారి
యతిశయమ్ము వివక్షిత మైనయెడల
.........దోసమ్ముగాదు
ఆరయగ నీదృశం బలంకార మగును"

అని చెప్పి కనికరముగలవా రీపునరుక్తిగ మాట్లాడిన దోషము లేదని చెప్పెను. ఇఁక భీమన "వీప్సాభీక్ష్ణ క్రియాసమభిహారమైన క్రియలన్ గృతులన్" అని చెప్పి,

"వినువసతివసతిదప్పక
వనమనఁగా వీప్సవచ్చి వచ్చిచనుందా
ననఁగను నభీక్ష్ణ మిమ్మి
మ్మనఁగాఁ గృతులఁ క్రియాసమభిహార మగున్."

అని చూపియున్నాఁడు. ఈగుణత్వకల్పనము స్వభావసిద్ధముగా నున్నది. మూర్తికవి యీదోషమునకు గుణత్వకల్పన చేయనే లేదు.

౧౦ అధికపదము:—

"తలఁపఁగ మిక్కుటి పదములు
గలిసిన నది యధికపదము కమలారికలా
కలితవిలాసముల్లస
దలఘుయశోవిభవశాలి........"

అని లక్ష్యలక్షణములఁ జూపియున్నాఁడు. ఇచ్చటఁ గమలారికలాకలితుఁడనఁగా తేజశ్శాలి యనునర్థము వెంటనే స్ఫురించుచున్నది. మిగిలినపదము లధికముగా నుండి యా యర్థమునే చెప్పుచున్నవి. కాన నధికపదయుక్తమగుట నీదోషము సార్థకము. ఇయ్యది వ్యర్థముకన్న భిన్నముగాదు. ఆయధికపదమువలన ప్రకృతార్థమున

కాధిక్యము లేదు గానఁ దక్కిన పదములు వ్యర్థములు. కాఁగా నధికపదవ్యర్థాప్రయోజనములలో నొక్కదాని నంగీకరించినఁ జాలును. ఇట్టి యధికపదములు చాల చోటుల ప్రయుక్తములై యున్నవి. "నళినాళీకమృణాలనాలలతికానవ్యప్రణాళీమిలల్లలనాలాపకథాసుధానురసలీలాలోలచేతస్కులై"—దీన నెన్ని వ్యర్థపదములున్నవో స్పష్టమే.

౧౧ అస్థానసమాసము:—"అపదస్థసమాసం తత్సమాసో యత్ర నోచితః" అని లక్షణము. ఎచ్చట సమాస మనుచితమో యచ్చో నీదోష ముండును. అనఁగా నట్టిపట్టుల కవి సమాసవచనముగాఁ జెప్ప రాదు.

"ఇతో వైముఖ్య మస్మాసు బ్రహ్మణః పరమాత్మనః,
ఇత్యుదగ్రతరభ్రామ్యద్భ్రుకుటీకుటిలాననాః"

ఇచ్చట దైన్యభావము జూపుటకుబదులుగా రౌద్ర రసమున నుపయోగించు ఖరసమాసము నుపయోగించి యున్నాఁడు. దీనికి నరసభూపాలీయకర్త చూపిన లక్ష్యము సరిపడియుండలేదు. "రిపుల నని దునిమెద నే నపు డని వికటభ్రుకుటీవిపులక్రోధాంధుఁ డయ్యె వీరుండు" అని యిచ్చినాఁడు. యుద్ధసన్నద్ధుఁడను వీరుని లక్షణము వర్ణ్యము. అట్టిసమయమున వైరీతి యవస్థ సంభవమే యగును. ఎట్లన "ఈమాత్రపు శత్రుసేనల మీరు సమయఁజేయలేకపోయితిరా?" అని తనసైన్యముపై కోపపడుచు "నేనే పోయెదను లెం"డని తాదృశ కోపాదిభావములఁ జూపించుట సంభవించును గాన నయ్యది సమంజసముగా లేదు. మఱియు నీదోషమును జెప్పునపుడు అస్థానవృత్తకల్పన అనెడి దోషముగూడ జెప్పవలసినదే. ఈదోషముగూడ నచ్చటచ్చట నున్నది. చూడుఁడు శృం. నై. ద్వి. ఆ. ౪౩ పద్యము. ఇచ్చట పురవర్ణన సందర్భమున మహాస్రగ్ధరావృత్తమును వాడి యున్నాఁడు. నన్నయ యిట్టివృత్తముల వీరరససమయముల నుపయోగించును. మఱియు నందే ద్వి. ఆ. ౩౭ పద్యమున నీయస్థానసమాసదోషము పట్టును.

౧౨. యతిచ్ఛందోభంగములు:—ఈనియమము నతిజాగరూకతతో కవు లందఱు పాటించియున్నారు. పొరపాటున నేగ్రంథమునందైనను పొసగిన నయ్యది దోషమున వీలులేదు. అట్టివి మూర్తికవిప్రయోగములనే గానుపించెడిని. "అస్థానపటుసమాసంబు రిపుల నని దునిమెద"—ఇందు తా నంగీకరింపని యఖండయతి నిలుపఁబడినది. ఇయ్యది యతిభంగమే. పూర్వలాక్షణికుల మతమే యంగీకరించిన, నీతని గ్రంథములయం దెచ్చటనైన నీయతు లుండకుండునా? కాన నాతని కసమ్మతయతిగాన నియ్యది యతిభంగమే యగును. "పాలుపుగ మితి లేని మాడ్కి మొలబంధై"—ఇవి లక్షణ విరుద్ధముగాన యతిభంగము. "అవఘరింపుము దోషంబులను వచింతు"—ఇచ్చటఁగూడ యతిభంగమే. కాని కొందఱు "అనువదింతు" అనెడి దంతయు సోపసర్గధాతువని యందురు. వదింతునను దానికి "అను" అనెడి యుపసర్గతో ప్రయోగము లెచ్చటను గానరావు. అట్టి వున్నను ప్రచురప్రయోగములు లేమి మఱి యే యప్రసిద్ధదోషమునకో గుఱియగును. కాన సవరించుట కన్న ప్రమాదమనుట యుక్తము. ఇట్టిదోషములు ప్రాచీన గ్రంథములలో దిద్దని ప్రతులలోఁ గాననగును. చూడుఁడు:

"మొదల సంఘటియించిన బొందికార్యము"
"బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి"
"చర్లాటఁకును శలవులు మధురాపురిచెంతన్"
"డీకొనివచ్చు......... దిక్పవమానము"
"తగవుగాదిందులోన నేకతర గర్వ"
"రాయంచకాళ్లు దొలకయమున్న"
"రోలంబాలక యోర్తు...బిసవల్లుల్ దున్మి"
"ఎండకు వాన కోర్చి తనయిల్లు......నా
కొంటి నలంగితిన్" (ఇచ్చట ప్రాస చింత్యము)

ఇట్టి వనేకములు ప్రమణగ్రంథముల యతిప్రాస భంగరూపమున విరుద్ధము లున్నవి. మఱియు రేఫ, శకట రేఫల విషయమై చెప్పనక్కరనే లేదు. ఇవన్నియు దోషము లనవచ్చు. వారి మతములు వాని నంగీకరింపమి దోషములని గ్రహించునది. ఛందోభంగదోషముమాత్ర

మెచ్చుటను గానరాదు. మూర్తికవి ఛందోయతిభంగములనియె జెప్పెనుగాని ప్రాసభంగముగూడ జెప్పవలసిదే; మఱచిపోయినాఁడు. ఈవిషయము కవిజనాశ్రయుఁడు గూడ మఱచిపోయినాఁడు.

౧౩ అశరీరము:—"క్రియాపదేన రహిత మశరీరం ప్రకీర్త్యతే" అనఁగా క్రియాపదములేని వాక్య మశరీరమని యర్థము. ఇట్టిక్రియ యధ్యాహారమనుకొన్న నీదోషము చెప్పుట యనవసరము. ఈవిషయము వ్యాకరణకర్తలు చెప్పియున్నారు. "కొన్నియెడల కర్తృకర్మక్రియ లధ్యాహార్యంబులగు" (ప్రౌఢ. వాక్య. ౧౪ సూ.) ఇట్టి యధ్యాహారప్రక్రియ మన వాఙ్మయమునకుఁ గూడ స్వభావమగుట నీదోషమును జెప్పనక్కఱలేదు.

౧౪ వాక్యగర్భితము:—"త ద్వాక్యగర్భితం యస్య మధ్యే వాక్యాంతరం భవేత్" అనఁగా వాక్యము వాక్యాంతరగర్భిత మగుట యని భావము. ఇదిగూడ దోషముగా నంగీకరింప నవసరములేదు. ప్రామాణిక ప్రయోగము లుంట వ్యాకృతికర్తలే వీనిని సాధించియున్నారు. "కొన్నియెడల వాక్యము వాక్యాంతరగర్భితంబై యుండు" (ప్రౌఢ. వాక్య. ౨౧ సూ.) "ఇందుల కెంత కాలం బయ్యె రానికారణం బేమి" అని లక్ష్యము. ఈ వాక్యమున 'ఎంతకాలంబయ్యె' ననెడి వాక్యాంతరముతో "ఇందులకు రానికారణం బేమి" అనెడి వాక్యము గర్భితమయ్యెను. కాన నీదోష మనావశ్యకము.

మఱి యర్థదోషములు:—ఇందు నరసభూపాలీయమున హీన, అధిక, అసమ, అఖ్యాత- అనెడి యుపమలును మరల వాక్యదోషములలోఁగూడ న్యూనాధికోపమలును మొత్తము ౬ విభాగములుగా నుపమాదోషముల విభాగించియున్నాఁడు. ఇందాదోషములు వాక్య, అర్థ గతములగుట నిన్నిపేరులు వచ్చెఁగాని వాక్యగతములలోఁ జెప్పి యవ్వియే మరల నర్థగతములలోఁ జెప్పుట యనవసరము. కాఁగా న్యూనాధికోపమ లెచ్చటనో యొక్కచోట నుండిన చాలును. కాన రెండు తగ్గింపనగును. ఇంక నసమోపమయన వర్ణ్యముకన్న నుపమాన మెక్కుడో, తక్కువయో యగును. అప్పు డధికమైన నధికోపమయు, హీనమైన హీనోపమయు నగుచుండ మరల నసమోపమాదోషకల్పన మనవసరము. మిగిలిన, హీన, అధిక, అఖ్యాతోపమలలోఁ జివరిదానిని గూడఁ జెప్ప నక్కఱలేదు. "నీమోము కలువవలె నున్నది" అని ఖ్యాతముగాని యుపమానము చెప్పిన ప్రాకరణికమునకు ప్రకర్ష తగ్గినది. కాఁగా పతత్ప్రకర్షమనెడి దోషమం దిది యంతర్భవించును. హీనాధికోపమలును నరసభూపాలీయవాక్యగతములలోని భిన్నలింగవచనములును దండి యుపమాదోషములే యనియు, నీనాల్గును ప్రయోగనైపుణిచే గుణత్వముగూడ నందవచ్చుననియు చెప్పియున్నాఁడు. చూడుఁడు:

"షండుఁ డీతఁడు స్త్రీవలెఁ జనుచునుండె
ఈయమ పురుషువలె వచియించుచుండె

—భిన్నలింగోపమలు

ఇతఁడు ప్రాణములవలె నాకిష్టుఁ డగును
విద్య లార్జింపఁ బడియెను విత్తము బలె

—భిన్నవచనోపమలు

దేవతాసార్వభౌముండు తేజరిల్లు
నీవలెన్ ధరణీరమణీకళత్ర

—హీనోపమ

ఉర్వీనేత తేజంబున నుష్ణభాను
కక్ష్య నారోహణముచేయఁ గలిగియుండె

—అధికోపమ

ఇట్టి పట్టుల నాయాదోషంబులు రమ్యముగా నుండునని చెప్పి దోషస్థానములఁగూడఁ జూపియున్నాఁడు. విస్తరదృష్టి నుదాహరింపమానితి. ఇట్టి యధికోపమను శ్రీనాథుఁడు వాడియున్నాఁడుగాని యది దండి నిర్దుష్టతాధికోపమవలె లేదు.

"మనము గారానఁ బోషించి కనకపంజ
రమున నిడ్డ కేళీచకోరవ్రజంబు
వీనివెన్నెల తెగఁగ్రోలుఁగాని విడువుఁ
డొక్కగ్రుక్కను కుంభజుఁ డుదధివోలె"

ఇచ్చట కుంభజుఁ డుదధి నెట్లు త్రావెనో యట్లే చకోరము వెన్నెలఁ దినివేయునని యన్వయము. ఉపమేయభూతచకోరమునకును నుపమానభూతుఁడగు నగస్త్యునకును నుపమానోపమేయభావముగాన నధికోపమాదోషమే యనవలెను.

ఇట్లు నరసభూపాలీయమున మూర్తికవి చెప్పిన దోషములలో ౧౩ వఱకు గతార్థములు, ననవసరములు గూడ నయ్యెను.

కావ్యకన్యకకు జీవితము రసము; గుణములు సౌశీల్యాదిగుణములవంటివి; శబ్దార్థము లుజ్జ్వలశరీరము వంటివి; అలంకారములు సువర్ణమయాలంకారములు. ఇట్టి సౌందర్యఖనియగు కావ్యకన్యను సృజించిన కవిబ్రహ్మ దోషములనెడి శ్విత్రకాణతలనిడిన నాకన్య నిర్భాగ్యయై, అయోగ్య యగునుగాని సర్వాంగసుందరియై సర్వజనాహ్లాదిని కానేరదు. కాన సాధ్యమైనంతలో నిట్టి దోషములఁ జొరనీకుంట యుచితము. అట్లయ్యు "ప్రమాదో ధీమతామపి" అన్నరీతి నెవ్వరికైన పొరపాటు సహజము. కాళిదాసాదిమహాకవులకే యీప్రమాదములు తప్పినవి గాదు. సామాన్యముగా నీదోషములలో నెద్దియే నొక దోషము జొరని గ్రంథమొకటి యున్నదనుట సాహసము. అట్లయ్యు దండిభీమనాదులు చెప్పిన రీతిని కొన్ని దోషములు గుణము లగుచున్నవి. ఈగుణత్వవిషయము ధ్వనికావ్యము, సాహిత్యదర్పణము మొదలగునవి చెప్పియున్నవి. లేనిచో నీదోషము లెల్లపుడు దోషములే యైన వాఙ్మయమంతయు దోషదూషితమే యగును. ప్రకృతమున నరసభూపాలీయదోషముల విషయమునఁ గలుగు నాయూహ తేటపఱచితి. మఱియు శ్లేషాదికావ్యములందును, రెండుమూఁడర్థములు జోడించి చెప్పు కావ్యములందును ననేకదోషము లుండవచ్చును. అట్టివన్నియు దోషము లనఁగూడదని "స్యాతామదోషౌ శ్లేషాదౌ–నిహతార్థాప్రయుక్తతే" ఇత్యాదివాక్యములవలన తేలుచున్నది. ఇట్టివానిని సోదాహరణముగాఁ జూపిన విపుల మగునను నూహతో విరమించితిని.

---

## దేవుఁడు–మనుజుఁడు–కోఁతి

విశ్వనాథ సత్యనారాయణ

అర్థహీనమ్ము సర్వవేదాంతపరిష
  దుగ్రవిజ్ఞానధూత నిజోల్బణమ్ము
ఈప్రపంచంబు సృజియించి యేమొలీల
యంచు మురిసెను భగవంతుఁ డన్నవాఁడు.
సర్వథాసర్వతోవినష్టమ్మ యయిన
యట్టి మాయానుగతసృష్టి ననుగమించి
వ్యర్థమైనదానిని మఱీవ్యర్థపరచి
తనకుఁదా బొమ్మువిరిచెను మనుజవరుఁడు.

ఈవృథాసృష్టిసర్జన నింతకన్న
చెడి వృథాయైన మనుజుని సృజనఁ గొక్కి
రింపుపట్టి సజీవపు దృష్టిబొమ్మ
విధి నిరంతమ్ముగాఁ గోఁతి వెక్కిరించు.

---

# బిల్హణకథ

డి. ఎ. నరసింహం, యమ్. ఏ., యల్. టి.,

I

మన భారతదేశమున పురాణగాథలతో తుల్య ప్రఖ్యాతిగాంచిన మనోహరములగు చరిత్రాత్మకకథలలో ముఖ్యమైనవి రెండు: మొదటిది వత్సరాజ వాసవదత్తల ప్రేమకథ. రెండవది శశికలాబిల్హణుల ప్రేమకథ. వీనిలో మన ఆంధ్రదేశమున ఎక్కువ ప్రచారముగలది యీ రెండవది. ఇందలి రాజకన్యా సౌందర్యవర్ణనము సంస్కృతమునను, ఆంధ్రమునను మన నర్మప్రసంగములలో తరుచుగా వినబడుచుండును.

"కిమిందుః కింపద్మం కిముముకురబింబం కిము ముఖం
కిమబ్జే కింమీనౌ కిము మదనబాణౌ కిము దృశౌ,
ఖగౌ వా గుచ్ఛౌ వా కనకకలశౌ వా కిము కుచౌ
తటి ద్వా తారా వా కనకలతికా వా కిమబలా"

"రాకేందుబింబమో రాజీవమో మించు
టద్దమో లేక నెమ్మోము మొగమొ
చెలువొందు కల్వలో చేపలో మరుని నా
రాచంబులో లేక లోచనములో
కోకంబులో విరిగుత్తులో బంగారు
కుండలో లేక వక్షోరుహములో
సౌదామినియొ నక్షత్రమో నునుపైడి
తీగయో లేక సతీతిలకమొ.

యవుర యీకళ యీతావి యీరమణత
యీవిధంబును ఈబెళుకు ఈకుళలత
యీసువృత్తత యీసొంపు ఈమెఱుంగు
ఈతళుకునిగ్గు ఈచాయ యెందుగలదు?"

తక్కినపద్యము లంతగా వ్యాప్తినొందకపోవుటకు కారణము ఈపాటి లాలిత్యము లేకపోవుట గాదు. అశ్లీలవర్ణనలు మినహాయింపబడినను సంస్కృతమునను, ఆంధ్రమునను కూడ కవికృతచంద్రవర్ణనము, ఆంధ్రప్రబంధమున పురవర్ణనము, ఉద్యానవర్ణనము మొదలగు మిక్కిలి మనోహరములగు వర్ణనలు గలవు.

ఈకథకు నాయకుడు సుప్రసిద్ధుడగు బిల్హణకవి. ఈతడు తనదేశము విడిచి ఇంకొకదేశమున రాజసన్మానమును బడసి ఆ రాజకుమార్తెకు సాహిత్యాలంకార శాస్త్రములను నేర్పుటకు నియమింపబడి, అన్యోన్యానురాగ ప్రేరణవలన ఆమెను గాంధర్వవిధిని రహస్యముగా పెండ్లియాడి, సంగతులు బయలుపడగా రాజుచే మరణదండన విధింపబడి తనయొక్క నిశ్చల నిర్మలానురాగము "చోరపంచాశిక" యను ఏబది వసంత తిలకావృత్తములుగల ప్రణయినీస్మృతి గీతరూపమున వెలువరచి పౌరుల మనములను,వారిద్వారా రాజుయొక్క మనస్సును కరగించినందున విడుదలయైనాడు; రాజుచే మెప్పుబడసి రాజకన్యను పరిణయమాడి సుఖంబున నుండినాడు. కథ సుఖాంతమైనది.

ఈ కథ నాయెదుట నిప్పుడు నాల్గురీతుల కనపడు చున్నది:

## ౧. బిల్హణకావ్యము

ఇది సంస్కృతగ్రంథము; ౧౬౮ శ్లోకములు గలది. ఇది కాశ్మీరగ్రంథ మని ఏ. బి. కీత్ (A. B. Keith) పండితుని యభిప్రాయము. కావ్యాంత గద్య యిది బిల్హణకవిరచిత మని చెప్పుచున్నది. కావ్యమాలాగ్రంథములలో త్రయోదశగుచ్ఛమున నున్నది. ఒక వ్రాతప్రతిలో నీకావ్యము బిల్హణకవిచే స్వకథా సంకలితమై వ్రాయబడిన నవ్యకావ్యమనియు, మొదటి ౭౮ శ్లోకములు నొకభాగమును, తక్కిన శ్లోకము లన్నియు రెండవభాగముగను ఉన్నట్లు చెప్పబడి యున్నదని సంపాదకుడు తెలిపియున్నాడు. ఈరెండవ భాగము "చోరపంచాశికతో" నారంభమైనది. ఈకావ్యమును వ్రాసిన కవి మొదటిపద్యములో,

"ధ్యాత్వా గణేశ మఖిలాగమసారభూతం
శ్రీశారదాం సురనమస్కృతపాదపద్మాం,
కించి త్స్వకీయమతిసంస్ఫురితేన నవ్యం
కావ్యం కరోమి విదుషాం సుఖబోధనార్థమ్."

గణేశుని, శారదను ధ్యానించి తన మతిస్ఫురణచే నూతనకావ్య మల్లినట్లు చెప్పుకొనుచున్నాడు.

ఇందు కవి కాశ్మీరదేశములో శారదావిషయము నుండి వచ్చినట్లు చెప్పబడియున్నది. శారదాపీఠ మున్నచోటునుండి యని అభినవభట్టబాణ R. V. కృష్ణమాచారిగారి అభిప్రాయము. కవియొక్క కులదేవత యును, రాజుయొక్క కులదేవతయును శారదయే అని కూడ ఊహించవచ్చును. రాజు

"పృష్ట్వా సమస్తకుశలం కులదేవతాయాః
ఆదిష్టవా న్నిజపురోహిత మస్య తృప్త్యై."

కులదేవతయొక్కయు, అందరియొక్కయు క్షేమమడిగి, యీతనికి తృప్తియగు నేర్పాటులను చేయించుమని పురోహితుని నియమించెను.

రాజు వీరసింహుడు. రాజధాని మహిలపత్తనము. దీనినే "కర్ణసుందరీ" నాటకపీఠికయందు అనహిల పట్టణమని సంపాదకుడు వ్రాసినాడు. ఇది సుందరులగు గుర్జరులచే సేవింపబడుచుండెనట.

"స్వర్గావనీ విమలమంగల ఖండతుల్యే
భూమండలే మహిలపత్తననామధేయే,
వారాంగగుర్జరజనైః పరిసేవ్యమానే
భోగీ బభూవ నృపతిః కిల వీరసింహః."

ఈరాజు భోగి, వీరుడు, విద్యావినోది, సద్గుణ సంపన్నుడు, రాజధర్మపరుడు అని వర్ణింపబడినాడు. ఈతని ముఖ్యరాజ్ఞి అవంతిరాజకుమారి "సుతారా" యను పేరు గలది. వీరి కుమార్తెపేరు 'శశికలా'; కావ్యములో చంద్రకల, చంద్రలేఖ, శశాంకకల యని కూడ పిలువబడును. తాతగారింట జననమై కొలదిదినముల తరువాత తండ్రియింటికి తీసుకురాబడినది. మంచిగుణములు, సౌందర్యము కలిగి, గానమందు సహజకౌశలము, మధురమైన స్వరము కలిగియున్నందున తండ్రికి ఆనంద మాయెను. మంచివిద్య చెప్పించవలెనని తగిన గురువు కొరకు వెదకుచుండెను. ఇంతలో కాశ్మీరదేశమునుండి బిల్హణకవి గుణవంతుడగు రాజును చూచుటకు వచ్చెను. పురోహితునిచే రాజున కెరిగింపబడెను. రాజుచే విద్య యందు, కవితయందు పరీక్షింపబడి ప్రశంసింపబడి కుమారీవిద్యకొరకు నియమింపబడెను. వీరిరువురియొక్క రహస్యప్రణయవృత్తాంతమును రాజు విని తొందరపడక పురోహితునిద్వారా కవిని మందలించెను. మందలింపులను లక్ష్యపెట్టనందున తనకు ప్రియుడైనను కవిని చోరునకు తగిన శూలారోపణమను శిక్షకు పంపెను. కాని జనుల విజ్ఞప్తిని, తన పట్టపురాణిమాటలను, అమాత్యపురోహితుల హితమును విని బ్రహ్మహత్యా స్త్రీహత్యాదోషముల కొడిగట్టుట మాని, కవిని శిక్షింపక గౌరవించి, కూతునిచ్చి పెండ్లిచేసెను. నూరుకన్న నెక్కువపురములుగల నొక మంచి రమ్యదేశమును అరణముగా నిచ్చి అక్కడ సుఖముగా నుండుమని పంపెను. కవియును రాజసన్మానితుడై, తన మందిరమునుచేరి అతిథిసత్కారములను చేయుచు శశికలతో ఆనందముగా నుండెను. కవిరాజునుచేరి ఆమెయును ప్రమోదము నొందెను.

ఇందులో నొక వ్రాతప్రతిలో కవి "శశికలా, ఇక జవనిక (తెర) ఎందులకు? తీసివేయుము. లేదా, ఇదియే మనకు ద్వారముగా నుండును గాక" అని చెప్పగా, రాజకన్య తెరనుతీసెను అని యున్నది. ఆప్రతిలోనే రాజు ప్రశ్నింపగా రాజకన్య గద్గదస్వరముతో "నాగురువు విద్యాధికుడు. గుణవంతులలో ప్రశంసింపబడుచున్నాడు. అట్టివానిని చూచుటకు గుణవంతులు కూడ కుతూహలపడుచుందురు." అన్నట్లున్నది. దీనినే ఇకముందు విమర్శింపబడబోవు బిల్హణచరిత్ర మను సంస్కృతకావ్యము రాజు కట్టించిన కపటోపాయపు కాండపటముగా మార్చినదని నమ్మెదను. జవనికా ప్రశంస ముఖ్యమని యెంచి కావ్యమాలలో ముద్రింపబడిన "బిల్హణకావ్య" ప్రతిలో లేదు.

## ౨. బిల్హణ చరిత్రము

ఇది దక్షిణదేశమందలి గ్రంథము; ౧౫౪ శ్లోకములు గలది. ఇందులోకూడ చోరపంచాశిక యిమిడి యున్నది. తాను చూచిన ప్రతులలో ౩౭ చోరపంచాశికశ్లోకములుమాత్రము ఈ ఉత్తరదక్షిణ గ్రంథములలో సరిగా ఋజువుపడుచున్నట్లు కీతు (Keith) పండితుడు చెప్పుచున్నాడు. దక్షిణగ్రంథములో "అద్యాపి" యను ప్రారంభపదము గలశ్లోకములు ౫౭ గలవు. నేను సరిచూడగా ఇందులో పాఠభేదము లున్నను ౫౦ శ్లోకములు సరిపడుచున్నవి.

ఈ చరిత్రయందు దేశము పాంచాలము; మేరువున కుత్తరముగా నున్నదట. పట్టణము లక్ష్మీమందిరమని పేరుగలది. రాజు మదనాభిరాముడు. రాణి మందారమాల. రాజకన్య యామినీపూర్ణతిలక. నాయకుడు బిల్హణకవి, ఆయూరివాడే యని యీ శ్లోకమువలన తెలియనగును.

"సదృష్టపూర్వో నాఽస్మాభిః కుత్రాస్తే ఽత్రైవ తిష్ఠతి" (వానిని మేము చూచియుండలేదు. ఎక్కడనున్నాడు? ఇక్కడనే యున్నాడు.) కాని ఆయూరనే యుండి అంతప్రఖ్యాతి గలిగినట్లు చెప్పబడిన కవి పండితసభగల రాజునకుగాని, మంత్రికి గాని తెలియబడకుండుట చిత్రము. చరిత్రలో నిది యొక లోపముగా తోచుచున్నది. అతడు నిజముగా అన్యదేశీయుడై యుండును. తక్కిన కథయంతయు నీవిదికావ్యములోనిదే. ఈ బిల్హణచరిత్రకర్త ఎవరో తెలియదు.

## ౩. బిల్హణీయము

అను మూడాశ్వాసములుగల ఆంధ్రప్రబంధము, పండిపెద్ది కృష్ణస్వామి ప్రణీతము. ప్రథమాశ్వాసము చివరనున్న చక్రబంధమునుపరిశీలించి దీనిని క్రొత్తపల్లి సింగరార్యకవి చెన్నభూపాలుని కంకితముగా మొదట రచించియుండెననియు, అతని కుమారుడు నరసింహార్యకవి ధనకాంక్షచేత రామాంకితముగా పండిపెద్ది కృష్ణస్వామి రచించినట్లు మార్చె ననియు వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ జ్యోతిష్మతీ ముద్రణమందు నిర్ణయించినారు. దీని నిజమయినకర్త శిష్టు కృష్ణమూర్తి కవియని నేను ఒకచర్చలో వినియున్నట్లు జ్ఞాపకము. పై నుదాహరింపబడిన సంస్కృత బిల్హణచరితము దీనికి మూలము. పేర్లన్నియు అందులోనివే. వర్ణనలు పెంపు జేయబడుటయేగాక, కథలో మూడుముఖ్యములైన మార్పులుగూడా చేయబడినవి:—

౧. నాయికానాయకుల సమాగమమునకు నాయికగన్న కల ప్రేరేపకముగా కల్పింపబడియున్నది.

౨. కవిని రాజు మన్నించుటకు కారణము శాపగర్భితమను సంత్యసందేశమని కల్పింపబడియున్నది.

౩. నాయికానాయకులకు వివాహానంతరము ప్రభాకరుడను పుత్రుడు కలిగి రాజుచే దన వంశకర్తగా గ్రహింపబడినట్లు కల్పింపబడియున్నది.

ఈ కల్పన లన్నియు ప్రబంధనియమముల ననుసరించుటకు. అందుకే పురవర్ణనము, ఋతుకాలాదివర్ణనము, పుష్పోద్యానవిహారవర్ణనము చేర్పబడియున్నవి.

## ౪. బిల్హణీయము

అను నాటకము మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిచే ౧౯౧౦-వ సంవత్సరములో విశాఖపట్టణమున "కలాభిలాషకావ్యమాలిక" లో మూడవదిగా ప్రచురింపబడియున్నది. గ్రాంథికగ్రామ్యభాషావివాదములో రాజీసూచకముగా విసంధిపదముల నుపయోగించినారు. నాయికానాయకుల సమాగమమునకు వారిద్దరును అన్యోన్యసందర్శనస్వప్నములను గనుటయును, పూర్వజన్మసంబంధమును, భవానీదేవివరమును ప్రేరేపకములుగా నున్నట్లు కల్పించినారు. కథ నీతిబాహ్యము కాదని పీఠికలో వాదించిరి. ఈమార్పులను చేయుట కథలోని అవినీతిని సర్దుబాటుచేయుటకే యనియు, శిష్యురాలిని వివాహమాడుట స్వయం కృతమైతే తప్పే, దైవకృతమైతే తప్పులేదు అనియు వారి యభిప్రాయము. కవితాలాలిత్య మంతగా లేకపోయినను శృంగార రసమునకు అద్భుతరసమును జోడించు

రచన పెంపును, బోధింపదలచిన నీతి కనువగు పాత్ర పోషణమునుకలిగి ఆకర్షకముగనే యున్న దీనాటకము.

II

బిల్హణకవి రచించిన గ్రంథములు మూడు: విక్రమాంకదేవచరితము, కర్ణసుందరియనునాటిక, చోరపంచాశిక. శైలి సరసమృదులముగాను, సులభముగాను ఒకేరీతిని ఉండుటవల్ల చోరపంచాశిక విక్రమాంకదేవచరితమును వ్రాసిన కవి బిల్హణునిదే యని కీత్ పండితుడు అభిప్రాయపడుచున్నాడు. కర్ణసుందరీ నాటికయొక్క నాందీశ్లోకము జినదేవుని స్తుతించుట వలన దీనిని వ్రాసిన బిల్హణుడును తక్కిన రెండిటిని వ్రాసిన బిల్హణుడును వేరుపురుషులా యని నాకు సందేహము కలుగుచున్నది. శైలిమట్టుకు ఈ మూడు గ్రంథములలోను ఒకేరీతిని ఉన్నదని తోచుచున్నది. విక్రమాంకదేవచరితమున బిల్హణకవి తన కెక్కడను రాజకుటుంబములతో సంబంధ మున్నట్లు సూచనగానైనను చెప్పలేదుగనుక చోరపంచాశికలోని నాయకుడు ఈ కవి గాదని కీత్ పండితునికి తోచెనుగనుక ఒక చోరముఖ్యునకును ఏదో ఒకరాజకన్యకును గలిగిన రహస్యలాంపట్యమునుగురించి యీచోరపంచాశిక (చౌరీసురతపంచాశిక) వ్రాయబడియుండునని అభిప్రాయపడుచున్నాడు. ౧౭౯౦ ప్రాంతమున ఈచోరపంచాశికకు వ్యాఖ్యానము వ్రాసిన రామతర్కవాగీశుని అభిప్రాయమింకొకరీతి నున్నది: "దీని నొక "చోర" యను కవి వ్రాసినాడు. అందుచే చోరపంచాశిక యని పేరు కలిగెను. ఇందలి కథ చౌరపల్లిపాలకుడగు సుందరుడనురాజకుమారుడు "విద్యా" యనుపేరుగల రాజకుమార్తెతో తనకు గల రహస్యప్రణయసంబంధమును గురించి కాళికాదేవికి చేసిన ప్రార్థనను ఆశ్రయించుకొని యున్నది." కాని నేను విమర్శించుచున్న బిల్హణకావ్యమందును, బిల్హణచరితయందును విద్యకును, విద్యను బోధించుటకును ప్రాధాన్య మివ్వబడియున్నది. చోరపంచాశికలోని ప్రణయమునకు విద్యాభిమానమే కారణముగా నిరూపింపబడియున్నది. ఇందులోని నాయకుడు తన ప్రియురాలిని స్మరించుటలో ఆమెను ఒకచోట "ప్రమాదముచే మరచిన విద్య" కను, ఇంకొకచోట పవిత్రమైన "గురూపదేశము" నకును పోల్చుటవల్ల స్మరించు నాయకుడు పండితుడనియు, రసికతను మాత్రమేగాక అత్యుత్తమజాతిప్రేమనుగూడ గలిగియున్నాడనియు తోచుచున్నది. ఈ చోరపంచాశిక యిముడ్చబడియున్న రెండు సంస్కృతకావ్యములును బిల్హణకవియే నాయకుడనియును, విద్యాసంబంధమే రాజకన్యతో రహస్యప్రణయమునకు కారణమనియు విశదపరుచుచున్నవి. బిల్హణకావ్యము బిల్హణకవివిరచితమనియే చెప్పుకొనుచున్నది. అందులో నొకప్రతి "చౌరపంచాశిక" శ్లోకములకు ముందున్న ౭౮ శ్లోకములను "పూర్వచతుస్సప్తతి" యను రెండవపేరు గల బిల్హణకవిచేత తన అనుభవమును ఆశ్రయించి రచించిన లఘుకావ్యము" అని చెప్పుచున్నది. ఇందులో ౭౮-వ శ్లోకము చోరపంచాశికాశ్లోకముల కుపోద్ఘాతమువలె కనుపించుచున్నది. దానిలో నాలవపాదము "అద్యాపి" యను శబ్దముతో ఆరంభించుట చూడగా చోరపంచాశికయను ప్రణయస్మృతిగీతమునకు ఎత్తుబడిని సూచించుచున్నదని నాకు తోచుచున్నది:—

లోకోక్తిషు స్థితవతీషు జనేషు సత్సు
తామేవ పశ్యతి పురోఽపిచ పృష్ఠతోఽపి,
చిత్తే స్థితా మమ నరేశసుతాం విచింత్య
హ్యద్యాపి తా మిహహి వేద్మి న దేవ మాద్యమ్.

(లోకుల మాటలు, లోకులు అట్లుండగా వధ్యస్థానముననున్న ఆకవి ముందును వెనుకను ఆమెను మాత్రమే చూచుచున్నాడు. చిత్తముననున్న రాజపుత్రిని ధ్యానించి "ఆమెనుమాత్రమే నేనిక్కడ చూచుచున్నానుగాని ఆదిదేవునిగాదు" అన్నాడు.)

ఈ బిల్హణకావ్యములో చాలచోట్ల ఛందోవ్యాకరణలోపములును, అన్వయలోపములును కనబడుచున్నవి. ఇది ఘనపండితులచే పరిష్కరింపబడవలసియున్నది. ఈ ప్రణయస్మృతిగల చోరపంచాశికాభాగముగాక తక్కినకావ్యము ప్రథమపురుషలో చెప్ప

బడియుండుట చేతను, "శ్రీబిల్హణ స్సత్కవిః", "కవి శేఖరః" అని కవినిగురించి పొగడ్తగా వ్రాయుటవల్లను ఇది అన్యకవిరచితమై యుండవచ్చును. చివరశ్లోకములో బిల్హణుడు చనిపోయినట్లు చెప్పబడియున్నదని కీత్ పండితుడు చెప్పియున్నాడు. ఆయన చదివిన ప్రతి ఏదో? కావ్యమాలలోని బిల్హణకావ్యమం దట్లేమియు లేదు. ప్రారంభశ్లోకములో "స్వమతిస్ఫురితేన నవ్యం కావ్యం కరోమి విదుషాం సుఖబోధనార్థమ్" అనుటనుబట్టి ఇది అన్యకవిచే స్వకపోలకల్పితముగా వ్రాయబడి యుండవచ్చునని తెలియును. విద్వాంసులకు సుఖబోధనచేయుటకొరకు వ్రాసితినంటాడు. కామశాస్త్రము చదువుకొను ఆరితేరిన విద్వాంసులకు పాఠపుస్తకమనియా? ఉద్దేశము సరిగా బోధపడలేదు.

అయినను ఇదంతయు బిల్హణుని రచనయే కావచ్చును. పూర్వచతుస్సప్తతియందును, చౌరపంచాశికాభాగమందును శైలి ఒకేరీతి పదములను, సమాససరళిని, రసపుష్టిని గలిగియున్నది. "ఉన్నిద్ర" యను విశేషణ మీకవికి ప్రియముగా నున్నట్లు తోచుచున్నది:

ఉన్నిద్రబుద్ధికుసుమః కవిశేఖరో ఒయమ్
—(పూర్వభాగము)

ఉన్నిద్రచంపకవిశుద్ధ సమానవర్ణామ్
—(పూ. భా.)

ఉన్నిద్రతామరసపత్రవిశాలనేత్రామ్
—(చౌరపంచాశిక)

అందుచే మొదటిశ్లోకమున "స్వమతిస్ఫురితేన" అనుటకు బదులుగా "స్వగతి" అనిగాని, "స్వరతి" అనిగానియుండినచో నిస్సంశయముగా బిల్హణ కవియే యీకావ్యమును వ్రాసెనని యనుకొనవచ్చును. కాని యిట్టి పాఠాంతరములు కావ్యమాలలో సూచింపబడలేదు. కనుక ఎవరైనా పండితకవి అలంకారశాస్త్రాధ్యాపనకై తనవద్ద చదువుకొను విద్వాంసులకొరకు వ్రాసియుండెనేమో? తన చరిత్రో దంతమునే ఆధారముగా గైకొన్నట్లు కావ్యములో చెప్పకొనలేదుగాని కావ్యాంతగద్యలో అట్లున్నది. ఇది ప్రతిని చూచి వ్రాసిన పండితుని యభిప్రాయము కావచ్చును. లేక నిజమే కావచ్చును.

ఇక దక్షిణదేశబిల్హణచరితము నేకవి రచించెనో తెలియదు. బిల్హణకవిని మిక్కిలిగా పొగడుచున్న దీకావ్యము. కాని బిల్హణకృతమని చెప్పకోలేదు. ఇందులోని చంద్రవర్ణనలయందు కొన్ని ఉత్ప్రేక్షలు అన్యత్ర చాటువులుగా వినబడుచున్నవి. చంద్రునిలోని మచ్చను గురించిన "ఈ చందురునిలోని నీలచ్ఛాయగల అంకము సముద్రపు బురదయా, లేడియా, భూచ్ఛాయయా, లేక మ్రింగబడిన చీకటి బొజ్జలోనుండి కనుపడుటయా?" అను నుత్ప్రేక్షలు గల శ్లోకము భోజచరిత్రలో కాళిదాసున కతకబడియున్నది. శైలి ఉత్ప్రేక్షాతిశయోక్తిభూయిష్ఠమై భోజచరిత్రలోని శ్లోకముల ననుకరించుచున్నది. బహుశా ఆభోజచరిత్రను సమకూర్చినవారి పరంపరలోని కవి యీ బిల్హణచరిత్రనుగూడా రచించియుండవచ్చునని నాకు తోచుచున్నది. సమర్థులు విమర్శింతురుగాక.

మొత్తముమీద కథానాయకుడగు బిల్హణకవి కాశ్మీరదేశీయుడనియు, యౌవనముననే దేశాటనము జేసియుండుననియు, పాంచాలదేశముననో, గుర్జరదేశముననో ఈకథలోని అనుభవ మాతనికి గలిగియుండుననియు తేలుచున్నది. విక్రమాంకదేవచరిత్రమున తన యింటిలోని సొత్తునంతను కుంతలాధిపతి తీసుకొనినట్లొకచోటను, గుర్జరదేశములో తాను శ్రమలుపడినట్లింకొకచోటను కవి చెప్పకొనినాడు. చౌరపంచాశికకు ముందలిశ్లోకములో "దేవతాస్త్రీల చూపుల వలలయందు దగుల్కొనిన బిల్హణుడు తిరిగి యెటుల వచ్చును?" అని తనవైపు చూచుచున్న ప్రియురాలితో ననినట్లున్నది. కవి బిల్హణు డనుభవించిన రాజదండనము ఈచౌరపంచాశికకు ప్రేరేపకమై యుండవచ్చును. విక్రమాంకదేవచరితమును వ్రాసిన బిల్హణుడు పశ్చిమ చాళుక్యరాజగు విక్రమునివద్ద క్రీస్తు పదునొకండవ శతాబ్దమున నుండె నని నిర్ధారణచేయబడియున్నది.

అప్పుడు అనహిలపట్టణమును కర్ణరాజు పాలించుచుండెను. ఈతడు చాళుక్య భీమసేనుని తనయుడు; వైరిసింహుడనురాజు క్రీ. శ. ౯౭౦ ప్రాంతమున అనహిలపట్టణమును పాలించుచుండెను. కనుక వైరిసింహుని (వీరసింహుని) వద్ద బిల్హణు డుండుట ఎట్లు పొసగును? ప్రసిద్ధపురుషులకు ఎన్నికథలైనను పుక్కిడిపురాణము అతుకుచునేయుండునుగదా? ఈకథయును మన సారంగధరుని కథవలె నిజమైన చారిత్రికమూలము లేనిదై యుండునా? బిల్హణకవిమాత్రము మిథ్యాపురుషుడు గాడు. కథ నిజమో కల్లయో, మానవప్రకృతి కనువుగాను, మనోహరముగాను ఉన్నది. ఇట్టిఘటన అసంభావ్యమని తలచుటకు వీలులేదు. వైరిసింహు డను పేరు కర్ణసుందరీ నాటికలో సేనానాయకునికి గలదు. ఇంకెందరు భూపతులకు, సామంతభూపతులకు ఇట్టిపే రుండెనో?

III

కథకు నాయకుడు ప్రసిద్ధకవి, రసికుడు. కథాంశము రహస్యప్రణయము. అదియును రాజకుమార్తెతో, మీదు మిక్కిలి తన శిష్యురాలితో. శృంగారోపాసకులకికేమి కావలయును? మృత్యుముఖమునుండి వెలువడుటయేకాక, రాజసన్మానమును బడసి తన ప్రియురాలిని వివాహ మాడగల్గుట. అద్భుతరసపిపాసువుల కింతకన్న ఎక్కువ ఏది? తప్పో, ఒప్పో ప్రణయ మేర్పడినది. రాజువెరపింపుకు, మృత్యువునకు, జననిందలకు వెరువ లేదుగదా—ఈప్రణయలంపటులు! ఏకాగ్రచిత్తములతో ప్రణయమహామంత్రజపము చేయుచు వీరు మృత్యువును లెక్కింప లేదుగదా! అన్యోన్యానురాగమును వీరు వీడలేదు గదా! "ముక్తిప్రదుడగు దేవుని ధ్యానింపుము. నీవు చంపబడుదువు" అను తలవరిమాటలకు "ఇప్పటికిని ఆమెను మాత్రమే ఇచ్చట చూచుచున్నాను. అదిదేవునిగాదు."

'అద్యాపి తా మిహహి వేద్మి న దేవ మాద్యమ్'.

అని బదులుచెప్పినాడు, నాయకుడు. గురూపదేశమును స్మరించునట్లు పవిత్రప్రేమతో స్మరించుచున్నాడు, నాయికను. తన హృదంతస్థితయై, తన మనస్సుకు సుఖము నిచ్చుచున్న వీరసింహరాజసుతారూపధారియైన ప్రణయదేవతను చిద్రూపిణి, సర్వవ్యాపినిగా స్మరించుచున్నాడు:

"ప్రాసాదే సా పథిపథిచ సా పృష్ఠతః సా పురః సా
పర్యంకే సా దిశి విదిశి సా చోర్ధ్వతః సా హ్యధః సా,
హృద్యంతః సాబహిరపిచ సా నాస్తిదృశ్యంద్వితీయం
సాసాసాసా త్రిభువనగతా తన్మయం విశ్వమేతత్."

(మేడమీదను, మార్గమందును, ముందును, వెనుకను, మంచముమీదను, దిక్కులయందును, విదిక్కులయందును, మీదను, క్రిందను, హృదయమధ్యమునను, వెలుపలను ఆమెయే. వేరువస్తువు కనుపడలేదు. త్రిభువనములందు నామెయే. విశ్వమంతయు తన్మయము)

ఇట్టి ప్రణయైకాగ్రతను పరిషియాదేశపు "లైలా మజ్నూన్" అను ప్రణయగాథ సినీమాద్వారా మన కందరకు పరిచితముచేసియున్నది. ఇది శృంగారరసమును దాటి ఉపనిషదుద్దిష్టనిర్మలానందరసములోనికి గొంపోవును. "ఇట్టి అపాయప్రసంగమును విడిచిపెట్టు" మని జనులు చెప్పగా

"అద్యాపి నోజ్ఝతి హరః కిల కాలకూటం
కూర్మో బిభర్తి ధరణీం ఖలు పృష్ఠభాగే,
అంభోనిధి ర్వహతి దుస్సహబాడబాగ్ని
మంగీకృతం సుకృతినః పరిపాలయంతి."

తన మనస్సు పూర్ణముగా అంగీకరించిన ప్రణయమును విడుచుట సుజనునకు పాడిగాదని పౌరాణికప్రమాణములతో నిశ్చయించుకున్నాడు. అటు నాయికయగు శశికలయును కవి రాజానుచరులచే పాశబద్ధుడగుట చూచి విలపించి ఇట్లు వితర్కించుకొనినది:

"విద్యుత్ప్రగచ్ఛతి సమం సహ సాంబుదేన
చంద్రం యథా కుముదినీ వరకౌముదీచ,
ప్రాణేశ్వరం సమనుగచ్ఛతి వంశజా స్త్రీ
వేదా వదంతి ఇతి మే దృఢనిశ్చయోఽస్తి"

(మెరుపు మేఘముతో వెంటనే పోవును. వెన్నెలయు, కలువలును చంద్రుని అనుగమించును. మంచి వంశమున జనించిన స్త్రీ తన ప్రాణేశ్వరుని వెంట బోవును.

వేదము లిట్లు చెప్పుమన్నవని నాకు దృఢనిశ్చయము.) అని నిశ్చయించుకొని, సప్తావనియను తన మేడలోని పులు లోన బిగించి, వస్త్రమును గట్టిగా గట్టికొని, మేడమీదనుండి క్రిందకు దుమికి ప్రాణత్యాగముచేసి పతి ననుగమించుట కుద్యుక్తురాలై సమయమును నిరీక్షించుచున్నది. బిల్హణుని ఏకాగ్రతను జూచి పురజనులు, విలాసవంతులును, గుణవంతులును "రాజా, ఇట్టి ప్రణయమును ద్రెంపకుము. బ్రహ్మహత్య గావింపకుము" అని విజ్ఞాపనచేసిరి. కవియొక్క ధీరతను, నిశ్చలప్రేమను చూచిన స్త్రీ లోకవంకను, శశికలయొక్క అచంచల సతీత్వమును, మరణదీక్షను చూచిన స్త్రీ లింకొకవంకను రాణి కిట్లనిరి:

"బ్రహ్మహత్యవలన స్త్రీహత్యకూడా కలుగును. వలదు, వలదని రాజునకు చెప్పుము."

రాణి సుతార మూర్ఛిల్లి కుమార్తెచరిత్రకును, స్థితికిని ఖిన్నతనొంది మెల్లమెల్లగా రాజువద్దకు పోయి సమాచారమును తెలిపి వలదని విన్నవించెను. ఇవంతయును చూచి అమాత్యపురోహితులు "మన్నించుటయే శ్రేయస్కరము. అదియే రాజనీతి" యని బోధింప సాహసించిరి. రసికుడు, ధర్మజ్ఞుడు నగు రాజు తనకు ప్రియుడగు కవిని విడిపించి, సన్మానించి కూతు నిచ్చెను. ఇది బిల్హణకావ్యములోని సంగతి. బిల్హణచరిత్రలో కవియొక్క ప్రణయస్మరణగీతమును విని పురజనులు రాజుతో చెప్పగా రాజు విని కవిని మన్నించెనని యున్నది. ఆంధ్రప్రబంధములో రాజుకు మూర్ఖత చేర్పబడినది. ఈగుణము రాణికిన్ని అంటినది. అందుచే యామినీపూర్ణతిలక

"తండ్రి నాపయి నింత దయ నింపకాయెగా
        డాయగా బోయి నే దండ మిడిన
తల్లి యడ్డుపడి తా దప్పింపదాయెగా
        దాయగా దలచెనో తనయయనక"

అని విలపించి కవిని వెదకికొనుచు రాజమార్గమున బోయెనని యున్నది. ఈ రాజుయొక్క మూర్ఖత కవిచే పంపబడిన శాపగర్భితమగు ఆఖరుసందేశమువలన వీడెనని ప్రబంధకల్పన. ఇక నాటకములో ఈ మూర్ఖత మరింత ఎక్కువగా వర్ణింపబడియున్నది. భవానీదేవి ప్రత్యక్షముగా వచ్చి వారించువరకు వదలలేదు. ఇదియంతయు పూర్వజన్మకర్మమువలన గలిగినది గనుక ఎవరివలనను తప్పులేదని భవానీముఖమున నాటకకర్త తీర్మానించి అందరిని సుఖముగా నుండుడని ఆదేశించి ముగించినాడు.

ఇన్నికల్పనలలోను కాశ్మీరబిల్హణకావ్యమందలి కల్పనయే స్వాభావికముగాను, రసవంతముగాను, ఉత్తమనీతిబోధకముగాను, ఉన్నత ప్రణయాదర్శకముగాను ఉన్నదని నేను తలచుచున్నాను.

దక్షిణదేశబిల్హణచరిత్ర రాజుచే కవి జాత్యంధుడనియు, రాజకన్య కుష్ఠాంగియనియు అబద్ధమాడించినది. ఇట్టివారలను చూడమని వారలకు వ్రతములను కల్పించినది. గురువునకు శిష్యురాలికిని మధ్య గట్టితెర కట్టించినది. బిల్హణకావ్యములో నిట్టికల్పన లేనేలేదు. ఏదో ఒకప్రతిలో నాయకుడు "మన కిక జవనిక ఎందుకు?" అని అన్నందున రాజకన్య తెరను తీసినట్లుగను చెప్పబడియున్నది. సహజముగా రాజకన్యలు తెరచాటున చదువుకొనునట్లు మన మూహింపవచ్చును. సాహిత్యపఠనానంతరము రాజకన్యలు కామశాస్త్రమును కూడ పఠించుట ఆకాలములో నుండెనని యిద్దరు ఘనపండితులవలన నేను తెలుసుకొంటిని. అట్టి పఠనములో శశికల బుద్ధిసూక్ష్మతచే అన్నియును గ్రహించి, సుందరుడును, చతురుడును, యౌవనవంతుడును అగు గురువునెడ విలాసానురాగములను గనుపరచి వానిని వశపరచుకొనియెనని కావ్యమున నున్నది. వారిరువురకు భావగర్భితములగు మాటలు నడచినవి:

"నిరర్థకం జన్మ గతం నలిన్యాః
        యయా నదృష్టం తుహినాంశు బింబమ్,
ఉత్పత్తి రిందోరపి నిష్ఫలైవ
        దృష్టా ప్రఫుల్లా నలినీ న యేన."

(చంద్రబింబమును చూడని పద్మసరస్సుయొక్క జన్మము నిరర్థకము – అని కవివాక్యము. హర్షపూరితమగు పద్మ

సరస్సుశోభను చూడని చంద్రుని యొక్క జన్మయు నిష్ఫలము - అని శశికలావాక్యము).

ఇట్టి మాటలు తెరచాటున చదువుచుండుటవలననే కలుగును. తెర రాజాంతఃపురమున సామాన్యమే. కాని కవిని చూడనేకూడదను ఏర్పాటు కాశ్మీరకావ్యమున గానరాదు. చోరపంచాశికలోనైనను సూచింపబడలేదు. ఏనుగు నెక్కబోవుచు మార్గమున పోవుచున్న తనను చూచినదనియు, వసంతోత్సవ సందర్భమున అందరి మధ్యను తనను చూచినదనియు కవి స్మరించినాడు.

దక్షిణదేశబిల్హణచరిత్ర రాజుచే బొంకులాడించినది. తెలుగుప్రబంధము రాజకన్యచేతకూడ బొంకులాడించినది. తండ్రి యడుగగా మొదట తానేమియు ఎరుగనని చెప్పినది. ఎవరికైన ఇచ్చి పెండ్లిచేసెదనని రా జనగా తప్పొప్పుకొని గురువునకు తాను ఆత్మార్పణ చేసియున్నందున పెళ్లి జీవములేని కట్టెకుగాని తనకుగాదన్నది. నాటక మిట్టి పొరబాటు పడలేదు. నాయికా పాత్రను హీనపరచలేదు. కాని కాశ్మీరకావ్యమునందలి ధీరతను నాయికయందు కనుపరచలేదు.

కథ పెంపులో బిల్హణచరిత్ర తలారికి కొంచెము ప్రాముఖ్యము నిచ్చినది. రాజాజ్ఞను పొందియు తిరిగి ఆలోచించుట రాజునకు యుక్తమని విజ్ఞాపింప సాహసించినాడు, తలారి. రాజు కోపింపగా నూరకున్నాడు. తెలుగు ప్రబంధములో ఈసూచన విపులముచేయబడినది. తలారి దండనను నిలుపసాహసించి, కవిని ప్రేరేపించి కవిచెప్పినపద్యము లన్నిటిని రాజునకు పంపును. రాజు కోపించినను మరలమరల నట్లు చేయును. తలారినిర్బంధమువలన కవి తుదకు శాపగర్భితమగు పద్యమును వ్రాసి పంపును:

"రవిజుడు భాగుణింప విధు
రంబుగ భట్టి నశించె భారవి
ప్రవరు డడంగె దీర్ఘమున
ప్రాణముబాసె గుడియ్యా భిక్షు డీ
యవనికి దప్పె భీముడు త
దంతగతిన్ మరికొమ్మువెట్ట ని
ష్కవముగ నే భుకుండుడను
కొమ్మువ దీర్ఘము పెట్టకుండుడీ
భువి నత డెన్న నిర్దయుడు
భూపతి నీవు దలంప భూవరా."

ఇది సంస్కృతమున చాటువుగా కానబడుచున్న యీ దిగువశ్లోకమునకు విపులాంధ్రీకరణము:

"భట్టి ర్నష్టో భారవీయోఽపి నష్టః
భిక్షు ర్నష్టో భీమసేనోఽపి నష్టః,
భుక్కుండోఽహం భూపతి స్త్వం హి రాజన్
బభ్భావళ్యా మంతకః సన్నివిష్టః."

సంస్కృతమాతృకలలో నిది గానరాదు. భుక్కుండు డనుపేరు బిల్హణకవి కెట్లు వచ్చినది? ఈతని ఊరు కాశ్మీరములో ప్రవరపురమునకు దగ్గరగా నున్న ఖోణముఖమను గ్రామము. ఈయన తండ్రి పేరు జ్యేష్ఠకలశుడు. తాతపేరు రాజకలశుడు. అని విక్రమాంకదేవచరిత్రవలన తెలియుచున్నది. వంశమును బట్టిగాని, ఊరినిబట్టిగాని యీపేరు రాలేదు. వేరే ఆధారము తెలియలేదు.

"ప్రభురత్నహారి యనుటను కవిని "చోరు" డని ప్రజ లనిరి." అని బిల్హణకావ్యమందు గలదు:

"చోరః కిమేష. సుకవిః ప్రభురత్నహారీ."

ప్రబంధమునందు

"చోరు డనునామ మీకవి
కారయగా నేటికిని యథార్థం బయ్యెన్,
జారుడనియు; రెండుం దగె
నూరులు సైపుదురె జారచోరత్వంబుల్."

బిల్హణచరిత్రలో లేని యీ 'చోర' శబ్దప్రయోగము ప్రబంధకవి కెట్లు లభించెను? బిల్హణకవి కిట్టి యుపనామ ముండెనా? 'చోరపంచాశిక' వ్రాసినందుననే ఇట్టి బిరుదము వచ్చెనని ప్రబంధకవి యూహించి యుండునా? సమర్థులు నిర్ణయింతురుగాక.

ఈ శాపకల్పన మదనాభిరామభూపాలుని ధీరతకును, బుద్ధికిని కొరత తెచ్చిపెట్టినదే కాని కథలో సరిగా యతుకుకొనలేదని నా అభిప్రాయము.

బిల్హణకావ్యము కవి రాజుచే సన్మానింపబడి "నూటికి మించిన పురములను గల రమ్యమగు దేశమును", దాసదాసీజనంబులను, పరివారంబును, ధనములను అరణముగా గైకొని రాజాజ్ఞచే తన కివ్వబడిన దేశములోని తన మందిరమును పంచవిధములగు శుభనాదములతో ప్రవేశించి మార్గమందు తనను చూచుటకు వచ్చిన యతిగులను పూజించెననియును, శశికలయు కవి రాజును పొంది ప్రమోద మందెననియు చెప్పి, ఈకథ వినువారలకు, చదువువారలకు రాజసన్మానమును, ముక్తియును కలుగునను ఫలశ్రుతితో ముగింపబడియున్నది. ఇట్టి ముగింపు పురాణపువాడుక ననుసరించుచున్నది. ఆఖ్యాయికలకు న్యాయమే ఇది.

బిల్హణచరిత్ర వివాహము జరిగినట్లు చెప్పి కొంచెము మతిశృంగారముతో రసికులకు వేడుక జూపి, రాజు, రాజకుమార్తె, కవి - అందరును సుఖముగా రాజ్యమును పాలించుచుండిరని ముగించినది.

ఆంధ్రప్రబంధము వివాహమును తృప్తితీర రసవంతముగా వర్ణించినపిమ్మట నాయిక మగబిడ్డను సూర్యోదయవేళయందు కనెననియు, అందుచే వానికి ప్రభాకరుడను పేరుపెట్టబడెననియు, నాడు తాతగారిచే రాజ్యమునకు వారసుగా స్వీకరింపబడెననియు చెప్పి కథను ముగించెను. ఇది ప్రబంధనియమము కాబోలు.

నాటకకర్త నాయికానాయకులకు వివాహము చేయవలసినదని రాజునకు భవానీదేవి ఆజ్ఞ యిచ్చి, వారికి వరము లిచ్చి వారి నకులు గైకొనుటతో ముగించినాడు. నాటకము అద్భుతాంతముగా నుండుటకు వా రిట్లు చేసియుందురని తలచెదను.

కవుల అభిరుచులు కాలానుగుణముగా మారుచుండును. ఫలశ్రుతి వదలినచో బిల్హణకావ్యముయొక్క సమాప్తియే శాగున్నట్లు నాకు తోచినది. చదువరులు విమర్శింతురుగాక.　　　　[సశేషము]

---

# చంద్రునిమచ్చ

జి. జాషువ.

ఆసనదంబునఁ జంద్రమండలమునం దాసీనవై, యన్నమున్
బానీయంబును మాని, రాట్నమున జ్యోత్స్నాసూత్రముల్ దీయు న
వ్వా! నీ కెవ్వరుఁ జుట్టపక్కములు లేరా? సంశయంబయ్యె నా
కాసీరేజవిరోధిలో నలుపు, నీవా? మట్టియా? యుట్టియా?

---



7-　3

# జాతక రాజీయము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

ఇది యొక జ్యౌతిషగ్రంథము. జాతకఫలబోధకమగు నిది జైమినిసూత్రభాష్యమనుపేర సంస్కృత పద్యాత్మకవ్యాఖ్యగా నున్నది. ఇది జైమినిసూత్రములకు సరియైన వ్యాఖ్యానమనఁదగి లేదుగాని, యందలి భావమును మాత్ర మిందలి శ్లోకముల స్ఫురించుచుండును. దీని వ్రాఁతప్రతి యొకటి నాయొద్దఁ గలదు.* కాని గ్రంథము సంపూర్ణముకాదు. మొదటినుండి మూఁడవ యధ్యాయములోఁ గొంతవఱకుమాత్రమే యున్నది. ఉన్నంత వఱకైనను గ్రంథము నిర్దుష్టముకాదు. పైగా నందందు కొన్ని పదములు, వాక్యములుగూడ లోపించినవి. అయినను, ఈకృతి జాతకభాగమున నుత్తమముగాఁ గనవచ్చుటంజేసి పూర్వోత్తరసందర్భములనుబట్టియు, గ్రంథాంతరసాహాయ్యమున్నుబట్టియుఁ గొన్ని దోషములను సవరించి, కొన్నిలోపములను బూరించితినిగాని సంపూర్ణగ్రంథము లభింపమి నట్టివి చాలవఱకు మిగిలియున్నవి. †

"శ్రీకాశ్యపకులీనేన సింగరార్యేణ ధీమతా,
నామ్నా జాతకరాజీయం బాలబోధాయ తన్యతే"

"ఇత్యనఘసింగరార్యకృతౌ"

అనువాక్యములనుబట్టి, అనఘ(అళఘః)సింగరార్యుఁ డాంధ్రుఁడని తెలియవచ్చెనుగాని యితఁ డెక్కడివాఁడో, యెప్పటివాఁడో విచారణీయము.

### గ్రంథవిషయము

జాతకఫలవివరణవిషయమునందు పరాశరమతమువలెనే జైమినిమతమును సుప్రసిద్ధమై యున్నది. ప్రాచీనమునియగు జైమిని జ్యోతిశ్శాస్త్రనిష్ణాతుఁడై జాతకభాగమును నాలుగధ్యాయములుగా సూత్రములు నిర్మించెనని ప్రతీతి కలదుగాని, రెండధ్యాయములు మాత్రమే లభించినట్లు ముద్రితగ్రంథముల వలనఁ దెలియును. పూర్వమీమాంసాసూత్రకర్తయగు జైమినియు, నితఁడు నొకఁడే యని పెక్కండ్రు తలంచుచున్నారు.

ఈజైమినిసూత్రములకుఁ బూర్వులు కొందఱు వ్యాఖ్యానములు, వృత్తులు, కారికలు రచియించినట్లు కొందఱి వ్రాఁతలవలనఁ దెలియవచ్చునుగాని యవియన్నియు లభ్యములుగా లేవు. జయపురమహారాజాశ్రితులు, మహామహోపాధ్యాయబిరుదాంకితులు నగు దుర్గాప్రసాద ద్వివేదపండితులు జైమినిపద్యామృతమనుపేర శ్లోకరూపవ్యాఖ్య వ్రాసి, దానికి మూలకందళియనుపేర వృత్తి వ్రాసిరి. ఇట్టి

* ఇది, అమలాపురముతాలూకా భట్నవిల్లిలోనున్న యొక ప్రాఁతవ్రాఁతపుస్తకమునకు నకలు.

† ఈగ్రంథము సంపూర్ణప్రతి యెవరియొద్దనైన నున్నయెడల దయచేసి దానిని బంపినచో శిష్టభాగము వ్రాసికొని వారి పుస్తకము వారికిఁ బంపెదను.

వ్యాఖ్యావృత్తులతోఁడి సూత్రములుబొంబాయి నిర్ణయసాగరముద్రాలయమున ముద్రితము లైనవి.

మన యుద్దిష్టమైన యీ జాతకరాజీయ మనెడి జైమిని సూత్రశ్లోకరూప వ్యాఖ్య పూర్వోక్తజైమినిపద్యామృతముకంటె మిక్కిలి పూర్వమైనదనుట నిరాక్షేపము. అంతేకాదు, దానికంటె నిది సుఖబోధకముకూడ నగును. ఆంధ్ర దేశదైవజ్ఞశిఖామణియగు సింగరార్యుఁడు రచియించిన యీజాతకరాజీయము ముద్రిత మైనట్లు కనఁబడదు.

ఇందు మొదటి యధ్యాయమునఁ బెక్కు విశేషవిషయములు తెలుపఁబడినవి. అందు దృష్టిఫలములలో—

"శనే ర్దశమదృష్టేశ్చ తృతీయా ప్రబలా మతా,
నవమ్యాః పంచమీ దృష్టి ర్గురోః ప్రబలతాం గతా."

గ్రహస్థితిఫలములలో—

"ఆషాఢతత్పంచమయో రవిశుక్రౌ స్థితౌ యది,
నాటకాలంకృతిప్రాజ్ఞో వాచాలః కావ్యవిద్భవేత్.
గురుణా తత్రసంబంధేసర్వవిద్గ్రాంథికోభవేత్"
"కారకాంశస్య దశమే ససూర్యే గురువీక్షితే,
స భవే ద్ధరణీపాలో నాత్ర కార్యా విచారణా"

ఇట్లు దారపదాంతము ఫలములను దెలుపుచున్న యీప్రథమాధ్యాయమున 33౭ శ్లోకము లున్నవి. ద్వితీయాధ్యాయము మిక్కిలి చిన్నది. ఇందు సుమారు ౭౫ శ్లోకములు మాత్రమే యున్నవి. ఇందు, ఆయుర్విషయము విచారింపఁబడినది. మూఁడవదానిలో భాగ్యాదివ్యయాంతస్థానముల ఫలములు కనవచ్చునుగాని యొకదానినిగూర్చియు సవిస్తరముగాఁ గనరాదు. కడపటిశ్లోక మకస్మాత్తుగా ఆఁగినట్లుండుటచే మఱికొంతగ్రంథ ముండి యుండవలెనని తోఁచుచున్నదిగాని, యెట్లయిన నిదియే కడపటియధ్యాయ మనిమాత్రము చెప్పవచ్చును. మూఁడవదానిలో ౪౮ శ్లోకములుమాత్ర మున్నవి. శిష్టగ్రంథ మెంత యుండునో! ఇపు డచ్చుపడియున్న జాతకఫలబోధకగ్రంథములలో లేని కొన్నిఫలము లిందు కనవచ్చుననుటయే యీవ్యాసము నుద్దేశము. ఈగ్రంథము ముద్రణభాగ్యము గాంచుఁగాక.

---

# ఒ క స వ ర ణ

జ్యేష్ఠమాసపు 'భారతి'యందలి 'రలయతి'అను నావ్యాసమున ౮౭3-వ పేజీ ౨-వ కాలము ౫-వ పంక్తి నీవిధముగ సవరించుకొన పాఠకులు ప్రార్థితులు :

"అట్లు రేఫలకారము లేకస్థానజములుగాకున్నను పరస్పర-ఆదేశాదులఁబట్టి యతి పొసఁగవచ్చును."

సూ. రా.


మోటారువారిని నిందించవచ్చును కాని పాపము వారికి
బొంయి! బొంయి! బోఁ! బోఁ!!!
తలగొట్ల తమ్మయ్యలును.
పోకిరి పాటయ్యలును,
బోఁ! బోఁ!
పోలీస్
మెడత్రిప్పుల మల్లయ్యలును, పరధ్యానము పాపయ్యలును, పోట్లాడు పోలయ్యలును,
గుడ్డి చెవిటి గున్నయ్యలును, మన రోడ్లను పెట్టుబాధలను మరువరాదు.
తలిశెట్టి రామారావు.

# దస్తూరీ

ఏలేశ్వరపు కృష్ణమూర్తి, బి. ఏ., బి.యల్.

దస్తూరీ వ్రాతరూపం, నుదుటి వ్రాతరూపం కాదు. మనం గుళ్లో విగ్రహం దేవుడి రూపం అనం! అల్లాగు. భావప్రకటనకోసం ఉపయోగింపబడే అక్షరాలు, సంఖ్యలు, సంజ్ఞలు, గుర్తులు, అన్నీ వ్రాసేటపుడు ధరించేరూపం దస్తూరి అంటారు. వ్రాసాక గాని దస్తూరీ కనబడదు; మనిషి ఫైసలైతేగాని కీర్తి శేషించనట్టుగా. దిగాకగాని లోతు తెలియదు లెండి. వ్రాత ఎందుకు అంటే భావప్రకటనకే. కవిత్వం అందుకే. నాట్యం అందుకే. కళా అందుకే. దస్తూరీ ముఖం చూస్తే భావములున్న ముఖమా, లేని ముఖమా అని సందేహం ఒక్కొక్కప్పుడు తోస్తుంది. సాముద్రిక శాస్త్రంలో, హస్తరేఖలు విమర్శిస్తారు గదా. దస్తూరీ పరీక్షించేటపుడు హస్తలేఖనం చూస్తారు. కాని నేర్పు లేందే ఎక్కడా పని జరుగదు. దస్తూరీకి రూపం ఉంటే కాళ్లు చేతులు ఉంటాయా? తలా తోకా ఉంటాయా? అంటే కొందరి దస్తూరీలల్లో ఉంటాయి. భాష ఎందుకంటే భావాల్ని ఒకరికొకరు తెలియజేసుకోడానికి. ఒక్క వ్యక్తికోసం కాదు భాష. కాజాలదుకూడాను. మనఅందరికోసం — రాజ్యాంగంలాగు, చట్టశాసనముల లాగు. భాషకు ప్రధానంగా ప్రాణం పోసేవి మాటలు, వ్రాతలు. మాటలు ఎంత గ్రామ్యమైనా మన దినచర్య జీవంయిస్తుంది. ఇక వ్రాతనుగూర్చి ఆలోచిద్దాం. సంపూర్ణంగా బుర్రని తెగేసి కాగితంమీద భావాలని తేల్చడం, పరచడం, పేర్చడం, ఇదిగో చూడండి, మేము అనుకుంటూన్నది ఇది అని నిరూపించడం అరుదే. కాని ఆమాటకి వస్తే కాగితాలు లేకుండా వున్న కాలంలో నే భావాలు బాగుండేవేమో! చెప్పలేం. మూగవాడు కూడ చేయూపి, తలూపి, సంజ్ఞలు చేసి భావాలని కొంచెం కొంచెంగా ప్రకటిస్తాడు. వాడిసంజ్ఞలు కొట్టలు వింటాయి. లేఖరి కూడా కాగితంమీద వ్రాస్తాడను కోండి. అయినా మూగవానికంటె కొంత మేలు.

గుడ్డిలో మెల్ల. ఇక విద్యార్థులు చమత్కారంగా భావాలకి మంచి చక్కదనాల తొడుగు తొడుగుతారు; ఉత్సవాల్లో దేవుడికి తొడిగినట్టు. మెరుపులు, తళుక్కులు, చాలా ఉంటాయి. ఇక కవులు భావముతో భాషను పోటీపందెమునకు దింపుతారు. అదేమిటో వారికి కలము, బుర్ర ఒకేమాటు ఆడుతాయి. ఒకటే తీసిపోవు. ఈ పోటీపందెములో గుర్రపుపందేల్లోలాగు చాలామందికి నష్టం ఉంటుంది. పేరుపోతుంది. వైరిపరుగులు ఎత్తితే కాళ్లు విరిగిపోతాయి. ఒకరో యిద్దరో బాగా కొడతారు, లాభం. కాని లాభం వచ్చునని వారికే తెలియదు. కాని వారిది కేవలం గుడ్డిపరువుకాదు. ఇప్పటి భావకవులనిగూర్చి యిక్కడ వ్రాయలేం. కాని ఒకరు లోగడ,

> "భావము భావయు నవినా
> భావం బగు మైత్రి నుంట భావను వినుచో
> భావము స్ఫురింపవలెఁ ద
> ద్భావంబును దెలుప నుచిత భావయు వలయున్"

అని ఆదర్శాన్ని నిర్దేశించారు. అంతతో ఊరుకోక పేరుపడ్డ భావకవి వ్రాతను చూపి, చిరునవ్వు నవ్వి,

> " నీకు పద్యభాష నే నెంత గనినను
> భావ మొక్కఁడేని జయలుపడదు "

అని విమర్శించారు. ఇంకోరైతే ఏంచేసేవారో చెప్పలేం. కలం లాక్కుందురేమో! ఇన్ని విధాలగ వున్నా వ్రాత భావములను వెల్లడించడానికి గొప్ప రాజబాట. ఇది దండోరాలాంటిది. సాధారణంగా మనం చూస్తున్నాం. భాషలనేకము లున్నాయి. భాషలతో ఈడుజోడుగా లిపులున్నాయి. లిపిలేని భాష లేదుకద! లిపిలో అక్షరాలు ఆరంభం, అంత్యంకూడాను. సంక్షిప్త లేఖనంలో అక్షరాలు అడుగంటి, చుక్కలు, సున్నలు, కొక్కెములు, గీతలు, సంజ్ఞలు ఉన్నాయి. చిత్రలేఖ

నంలో ఓనమాలు, పిబిటిడిలు లేవు; కచటతపలూ లేవు. కాని కన్నులముందు బ్రహ్మాండమైన భావప్రపంచం ఉంటుంది. ఇంతకు ప్రపంచంలో మానవప్రకృతి ఒకటి; దైవం ఒక టన్నట్టు. భావాలు ఒకటి. భాషమాత్రం ఒకటి కాదు. లిపి, దస్తూరీ వేరని వేరే చెప్పనక్కరలేదు. ఏభాషలో దస్తూరీ ఆ భాషదే. ఏమనిషి కర్మం వాడిదే అన్నట్టు.

ఒకరు వ్రాసినట్లు మరొకరు వ్రాయరు. పులిని చూచి నక్క వాత పెట్టుకొంటే లాభం ఏముంది? ఎవరివ్రాత వారిదే. దస్తూరీలో మార్పు లుండును. జీవితంలో ఉన్నట్టు. వ్రాతలో కూర్పు, లిపివిశేషములు, అసాధారణములు, వ్యక్తిని ప్రకటిస్తాయి. సంక్షిప్తలిపిలోకూడా ఒకరిలిపివలెనే వేరొకరు వ్రాసినా, దస్తూరీలు వేరు. ప్రతివ్యక్తి దస్తూరీ ఎల్లప్పుడు ఒక్కలాగుఉండదు, ఎక్కడోగాని. రసము, స్థితిగతులు, మనోవృత్తి—వీటినిబట్టి వ్రాత మారును. రౌద్రరసంలో వ్రాతలో ఉద్రేకం; శాంతంగా ఉన్నప్పుడు అక్షరాల నిదానం; ప్రేమజాబులలో ఒక పొందిక, మరుపు, హాయి; హాస్యరసంలో వ్రాతలో వెక్కిరింపు, కొక్కిరిగీతలు; భీతి కలిగినవ్రాతలో వణుకు. ఇల్లా దస్తూరీలో మార్పు లుంటాయి. కోపం, ధైర్యం, సాహసం, సంతోషం, ఆందోళన, ఆవేశం, ఉద్రేకం, ఉన్మాదం వ్రాతలో దస్తూరీమూలంగా తెలుస్తాయి.

దస్తూరీరూపం అంటే ఏదో బాగుందిగాని మనిషిని పగలుచూస్తే రాత్రి కలలోకి వస్తాడు సుమండి అని ఒకాయన అన్నాడు. దానికి తగినట్టు ఆ వ్రాసిన మనిషిని నేను తొంగిచూస్తే మాఊళ్లో చెట్టుమీద తిరిగే కొండముచ్చేమో అనిపించింది. లోకంలో చెడ్డదస్తూరీ గలవారు కేవలం కురూపులుగా కనబడడం లేదు. దస్తూరీ రూపంచూచి మనిషిరూపం నిర్దేశించేవా రున్నారు. వారు ఎంతో కృషిచేసి ఉంటారు. మన పరిచితుడు వ్రాసిన దస్తూరీ చూడగానే మనకు వెంటనే స్ఫురణకు వస్తుంది. అతడే మాట్లాడాడా అనిపిస్తుంది. రెండు రూపాల్ని బాగా సరిపోల్చి చూస్తే దస్తూరీ ఒకే మనిషిది అవునో కాదో తేల్తుంది. అక్షరాలు తాటికాయలంత ఉన్నదీ, చీమలబారులా సన్నదీ, నిడివిగా ఉన్నదీ, బలిసి అడ్డంగా ఉన్నదీ, తేలికగా వున్నదీ, నీరసంగా ఉన్నదీ, నిటారుగాఉన్నదీ, చతికిలబడి లేవకుండాఉన్నదీ చూడాలి. పరిమాణం కొలవాలి. మనిషి ఎత్తు ఛాతీ దర్జీకొలిచినట్టు. లేఖన తీరు మారిందేమో కనుక్కోవాలి. వ్రాతలో వ్యక్తిత్వం అలవాట్లు దృగ్గోచరం అవుతాయి. మారువేషం యిట్టే పోల్చేవారున్నారు. నాగరికం ఎక్కువైనకొద్దీ దగాకోరులకి నిజంమీద మనసుపోయింది. దగా ఎక్కువైందని వారు తత్త్వబోధ చేస్తున్నారు. దగాతోబాటు దస్తూరీని తీవ్రంగా పరీక్షిస్తున్నారు. కోర్టుల్లో అన్నీ చూస్తున్నారు. రాజు దగా నొల్లడు; దైవమైన నొల్లును. స్త్రీలు పురుషులవలె స్వతంత్రించి వ్రాయ వీలుంది. దస్తూరీకి లింగం ఉంది; పోలికను చూచి మోసపోవడం సులభం. చూచే చూడడంలో ఈ వ్యక్తి దని నిరూపించడం గొప్ప పొరబాటు. విచారణ లేందే వీడే నేరస్థుడు అన్నట్టు; కామమ్మమొగుడు కామమ్మ మొగుడంటే కాబో లనుకున్నట్టు. ఓర్పు, అభ్యాసం, దస్తూరీపరిశీలనలో ముఖ్యంగా కావాలి.

వ్రాత ఎప్పటినుంచి ప్రారంభింపబడినదో మనకు తెలియరాదు. వ్రాయడం మనకు తెలుసును. కాని జ్ఞానోదయం అయినప్పటినుంచి అని ఒకాయన వాదం. కాదుకాదు, అంతకు పూర్వంనుంచి అని ఒక యోగి అన్నాడు. బ్రహ్మవ్రాత అని మనం అంటూంటాం. బ్రహ్మ మనకు, మనతాతలకి, వ్రాత నేర్పాడని ఒకరు. ఛీ ఛీ! బ్రహ్మపేరెత్తడం ఎందుకు, సరస్వతుండగాను అని మరోరు. ఎంతసేపూ ముక్కుపట్టుకు కూర్చుంటే రాజుకి కోపంరాదా, రాజపోషణతోనే వ్రాత బయల్దేరిందని ఇంకోరు. శిలాశాసనములే వ్రాతకు మొదలు అని ఒకరు. అక్షరాభ్యాసం మొట్టమొదట ఎల్లా వచ్చిందో? చెప్పలేం. ఎల్లాగైనా, ఎప్పుడైనా, లేఖకుడు, వ్రాసేవిషయం, వ్రాయుభాష, వ్రాయడానికి పత్రం, కలం, ద్రవ్యం ముఖ్యం. ద్రవ్యంలో కరక్కాయసిరానుంచి సీమసిరావరకు ముందుకు జరిగిపోయాం. రుచిచూచాం. ఇప్పుడిప్పుడు మళ్లీ దేశవాళి

సిరాలో పడ్డాం, నల్లబడ్డాం కూడాను. కంపులు రకరకాలవీ ఉపయోగించాం. కరక్కాయసిరాయుగంలో బాతుకలం ఉపయోగించేవారని వాడుక. ఇప్పుడూ ఈ యుగంలో బాతు లున్నాయి; బాతుకథ లున్నాయి. కాని బాతుకలం యింటికెళ్ళింది. కథ కంచికెళ్ళింది. మరీ పూర్వం తాళపత్రం, ఘంటం ఉపయోగింపబడేవి. వెనుక కాగితం, ఊటకలాలు సామాన్యం అయినవి. అవీ మోటు అవుతున్నాయి, అయినాయి. కొన్నిమూలల్లో నాజూకుగా దోశెడోసాకవేళ్లు కొంకరోయే టైప్‌రైటింగ్ బయాలుదేరింది. అందులో రెండు చేతులు ఉపయోగించాలి. ఉన్నా, బుర్ర ఆట్టే వుపయోగించక్కరలేదు. లేకపోతే చిక్కులేనేలేదు. మరీ కృషిచేసినవాళ్లు కళ్లుమూసుకొని టకటక చెవులు గుయ్యిమనేట్టు, కాగితాలు కన్నంపడేట్టు కొట్టగలరు. దీనితో వ్రాతే మూలపడింది. కొందరు చిత్రంగా పాలతోను, నిమ్మరసంతోను, సబ్బుతోను కాకితాలపై వ్రాస్తారు. మరికొందరు గుడ్డలపై వ్రాస్తారు. తిరుపతికొండమెట్లమీద వ్రాతలు కనబడతాయి. యాత్రికులభక్తిశ్రద్ధలు ఇతరులు స్మరించుకునేలాగు శాశ్వతంగా పడివున్నాయి. చెట్లమీద వ్రాయడం ఉంది. పూర్వం శకుంతల దుష్యంతునికి ఆకుమీద వ్రాసిందిట. మరోవిషయం. భోజరాజు అరణ్యంలో కత్తి దూసి, తన నడిమివేలు నిరర్థకం అని పరపర కోసి ఆ రక్తంతో ఒక మట్టిఆకుమీద ఈక్రిందిశ్లోకం వ్రాసి వత్సరాజునకు ఇచ్చి ముంజునకు ఇమ్మన్నట్టు చరిత్రలో ఉంది:

మాంధాతాచ మహీపతిః కృతయుగా
లఙ్కారభూతో గతః
సేతుర్యేన మహోదధౌ విరచితః
క్వాసౌ దశాస్యాన్తకః,
అన్యేచాపి యుధిష్ఠిర ప్రభృతయో
యాతా దివం భూపతే
నైకేనాపి సమం గతా వసుమతీ
నూనం త్వయా యాస్యతి.

ఈ కాలంలో నేరము చేసే గుంపులవాళ్ల చరిత్రలు పెరిగిపోతున్నాయి; నేరాలు పెరిగిపోతున్నాయి; నేరస్థుల తెలివి కొండంత అవుతోంది; నేరములవిచారణ కొండెక్కుతోంది. ఇట్టి సమయాల్లో దస్తూరీ చాల ఉపయోగకరంగా ఉంది. వారి దస్తూరీ దొంకదొంగదారి. విశేషంగా విమర్శించాలి. నేరస్థులు నడివీథుల లోను, గోడలమీదను, రాళ్లగుట్టలలోను గుర్తులు వ్రాసుకోడం మామూలు.

దస్తూరీతీరు కొంచెం ఆలోచిద్దాం. అచ్చా ఏమిటి అని భ్రమ కలుగజేసే దస్తూరీలు కొన్ని. కంఠమాలా అనిపించే ముత్యాల కోవలు కొన్ని. నయనోత్సవంగా ఉండే నిసింద్యావ్రాతలు కొన్ని. కళ్లల్లో సూది లాడిచినట్టు ముళ్లగుత్తులు కొన్ని. అనేకములు: పొందికవ్రాతలు, పొగరుబోతు వ్రాతలు, ఎగుడుదిగుడు వ్రాతలు, అడ్డదిడ్డపు వ్రాతలు, పిచ్చిగీతలు, సాక్షీ వ్రాతలు ఎన్నోఉన్నాయి. కొందరి దస్తూరీ తెగ మెలికలు తిరిగి చంపుతుంది. కొందరిది నీటిప్రవాహంలా పారుదల. గోదావరి ఉప్పెనలాగు పొంగి ప్రవహిస్తాయి కొన్ని. కొందరిది ఒకే హంసపాదు. గొలుసులిపి, శీఘ్రలిపి, మిశ్రమలిపి, బ్రహ్మలిపి ఉన్నాయి. వ్రాతలో బలుపు అలుపు. ఇల్లా ఎన్నోరకాలు. వ్రాసిన దెవరో ఏమిటో అని లడిగించుకునే పెద్దలు కొందరు. వ్రాయడానికి ఏమీ తోచకుండా ఉన్నప్పుడు పిన్నలు వ్రాసే లిపి ఒకటి. పెద్దలు పిన్నలకు వ్రాసే వ్రాతోటి; పిన్నలు పెద్దలకువ్రాసే వ్రాతోటి. పరీక్షల్లో ప్రశ్నలకు జవాబు తెలియనప్పుడు ఓ వింత లిపి; ఉద్యోగాలకి మొరపెట్టేటప్పు డో దస్తూరీ; డాక్టరుగారి మందు చీటీలో ఒకలిపి; సంజాయిషీలలో వినయం, ఒక్కొక్కప్పుడు అతివినయం అభినయిస్తూ వ్రాసే దో దస్తూరీ. ఇక సంతకములలో వింతవింత తమాషాలు ఉన్నాయి. సంతకంమాత్రం నేర్చుకొన్నవారి జంకు: ఉద్యోగస్థుల దర్జా నిదర్శనం. సంతకం రానివారికి నిశానీ. చేతివ్రాతనుబట్టి వయసు, వృత్తి, మనసు, దేశభాష, చిత్తస్వభావం, స్థితిగతులు, నడత, ఆశయములు చెప్పగలవా రున్నారు. పండితుల చేతి నగిషీపని; పామ

రుని గుండె చెదురు; బడిపంతులు ఒరవడిఫక్కీ; పత్రికా సంపాదకుని ఖండన; గుమాస్తాలచేతి గొణుగుడు; విద్యార్థుల వ్రాతవడి; ఆడవారి వ్రాతనిరుకు; న్యాయాధిపతి వ్రాతవాడి; వర్తకుని వ్రాతలో లాభం; ధనవంతునివ్రాతలో ధైర్యం; బీదవానివ్రాతలో బింకం; వకీలువ్రాతలో వక్రం; యుద్ధభటునివ్రాతలోని కరుకు; కవుల కత్తిపోటు; రోగినీరసం; హాస్యగాని వ్రాతలో ఎత్తిపొడుపు; ముసలివాని మాధుర్యం; పడుచువాని పగ; లోభి బిగింపు; విటుని మైమరుపు; వేదాంతి వాగుడు; దైవజ్ఞుని ధోరణి; దేశభక్తుని శీలం; దేశోద్ధారకుని త్యాగం; మహాత్ముని సత్యవ్రతం; రాజకీయుని అధికారం; వ్రాతలో ఎంత వద్దన్నా తొంగి చూస్తుంది. కాని దస్తూరీ కడుజాగ్రత్తగా పరీక్షించాలి.

దస్తూరీని బట్టి నేరస్థులు పట్టుపడడంలో వింత లేదు. న్యాయస్థానాల్లో దస్తూరీ రుజువునకు సామాన్యంగా వచ్చును. ధనాగారాలలో "చెక్" లపై దస్తూరీ కంటో కన్నెట్టుకొని పరిశీలిస్తే గాని డబ్బు చేతికి అందనివ్వరు, మరీ మోట చచ్చినాళ్లు ఉంటారేమో అని. పూర్వం బళ్లల్లో దస్తూరీ పరీక్షలు కొన్ని ప్రజ్వరిల్లేవి. ఆపరీక్షల్లో ప్రయోజకత్వం లేదని ఆ పరీక్షతో చిర పరిచితుడై బాధపడ్డ ఆత్మజ్ఞాని సెలవిచ్చాడు. ఈరోజుల్లో ఉద్యోగములకు అర్జీలు స్వదస్తూరీలో ఉండాలి. మారుచేతులు పనికిరావని ప్రకటనలు అగుపడుతాయి. ఆళ్వార్‌రాజుగారుమాత్రం ఫోటోలు పంపమంటారు. వారికి వ్రాతతో పనిలేదుట. రాజకార్యములలో సంతకం ఉద్యోగే చేయవలయును గదా! కొన్ని పత్రాల్లో దస్తూరీ స్వహస్తం అని చివర కనబడుతుంది. టైప్‌రైటింగ్ ఎంత ప్రాముఖ్యం వహించినా, న్యాయస్థానాలలో వ్రాతకీ, దస్తూరీకీ ఇంకా విశాలమైన చోటుంది. క్రీ. శ. ౧౮-వ శతాబ్దంలో గోథ్, లెడెడర్, జిమ్మర్లీ, మెంటియస్, మేక్‌మర్ మొదలగువారు అంతా నేరములు పరిశీలించుటకు వ్రాత ఎంతో ఉపయోగకారి అన్నారు. మన వ్రాత మనకు ఉపకారి; అపకారికూడాను. వాక్కు, వ్రాత — ఈ రెంటికీ ఒకటే సూత్రం; జారితే కూడతీసుకోడం అంటూ లేదు. అది వ్రాత. అందుచేత ఆలోచిస్తేగాని వ్రాయకూడ దని వాడుక.

నేరస్థులు అసాధారణ మనిపించే పనులను చేస్తారు; చేయడానికి ప్రయత్నిస్తారు. చేసినది, ఉద్దేశించినది, ఫలించవచ్చును, ఫలించకపోవచ్చును. సాధారణమైన పనులనే అసాధారణంగా చేస్తారు. పట్టుబడకుండా ఉండడం వారి ఆశయం; ఇతరులకు నష్టం కలుగచేయడం వారి వుద్దేశం! కొత్తతోవ తొక్కడం వారిమతం, తెగువ సాహసం వారికి ఆధారం; న్యాయతిరస్కారం వారికి అభిలాష; దండింపబడమని గాంభీర్యం; పట్టుపడిన శిక్షితుల మనసు మని మనసులో కొరత; తెలివితేటలు మనకు లోటేమి అని అహం; పట్టుబడితే రాజదండన నిశ్చయం అని పిరికితనం; గెలుస్తే లాభం అని ఆనందం; ఇన్నీ మనసును ఆవరిస్తే మనిషిలో జడి కలుగుతుంది. మతి స్తిమితము పోగొడ్తాయి; తుపాను బయలుదేరుతుంది. నేరస్థుడు పట్టాలు తప్పిన రైలులా దారి తప్పుతాడు. బోల్తా కొట్టాడు. చేతిని మార్చి వ్రాస్తాడు. కలము మార్చి వ్రాస్తాడు. చేతివీలు మారుస్తాడు. సిరాను వేరే ఉపయోగిస్తాడు. బుర్రను మార్చి ఆలోచిస్తాడు. కాని నేరస్థుడు మనిషే కదా! నిదానముగ కలము చేతబూనినను, లోపలి ఆందోళనమూ, కలవరం చేతిని వణికించడంలో ఆశ్చర్యం లేదు. ఎంతజాగ్రత్తగా వ్రాసినా దస్తూరీ నేను నేను అంటుంది. త్రాగుబోతులాగు దస్తూరీ వదరుబో తగుతుంది. అలవాటుపడ్డవ్రాతను మార్చుకోడం ఎంతకష్టం! ఈ విషయం ప్రతి అపరాధపరిశోధకుడు బాగా గమనించి నేరస్థులను పట్టుకుంటాడు. అది అపరాధి తెలివితక్కువా? పరిశోధకుని ప్రజ్ఞా? రెండూను.

వ్రాతనుబట్టి నేరస్థుడు ఏ పరిస్థితులలో వ్రాసింది, నానుపుడుగా నీళ్లు నములుతూ వ్రాసినది, పరపర మెయిల్‌స్పీడుతో గీకినది తెలియును. లిపినిబట్టి కలం ఏలా పట్టినదీ తెలుసుకోవాలి. వ్రాతవాలు, ఏటవాలు గ్రహించాలి. వేర్వేరువ్రాతలు సన్నని పుల్లముక్కతో దిద్దుతే లిపిలో తేడాలు, చేతివీల్లు, వదులు బాగా పట్టుపడవచ్చును. నెపోలియన్ జీవితం



కన్యాకుమారి స్నానఘట్టము

అత్యద్భుతం కదా! ప్రతినిమిషం వింతమార్పులను చెందెను కదా! అందులో అయిదారు సంవత్సరములలో ఎనిమిదిరీతులుగా అతడు వ్రాసిన దస్తూరీ ప్రదర్శన శాలలలో ఇప్పటికి గలదు.

కవుల్లూ కదపాలు; దొంగసంతకాలు; ఫోర్జరీలు; తప్పుడువ్రాతలు; పత్రములలో మార్పులు; పత్రముల పునఃసృష్టి; ప్రేమ జాబులు; విల్లులు — ఇట్టివి న్యాయవాదులకు దస్తూరీతో కొంత జోక్యం కలదని చెప్పగలవు. పదముల వర్ణక్రమం, పదములవాడుక, ఉపయోగించు కాగితం, అద్దుకాగితం, వ్రాసిన వ్రాత, సిరా, అక్షరముల పరిమాణం, వాలు, ఇతరపరికరాలు, సందర్భాలు, వాటికీ ముద్దాయికీ గల సంబంధం తరుచు రుజువునకు వచ్చును. దొంగసంతకములు చేయడానికి ఉల్లిపొరకాగితాలు ఉపయోగించుట ఒకవాడుక. కొన్ని కేసులలో పెన్సిలుతో కావలసిన సంతకం చేసి దానిని సిరాచేయడం కలదు. కొన్నిచోట్ల రబ్బరు ఉపయోగించినట్లు గుర్తు లుంటాయి. వ్రాసేటప్పుడు వ్రాతలో మధ్య కలయిక లేకపోవడంకూడా కలదు. ఈ విషయాల్ని సూక్ష్మదర్శిని యంత్రంతో చూచి దస్తూరీని, లేఖరిని నిర్ణయించుట యుక్తం. దస్తూరీని పరిశీలించి, విమర్శించుటకు కేంద్రస్థానములు అమెరికా బోలు దేశములలో లెక్కలేనన్ని కలవు. అది నాగరిక చిహ్నము కావచ్చును, కాకపోవచ్చును. దగాలు, నేరాలు విశేషము పరిశీలించుటకు సహాయం కావచ్చును, కాకపోవచ్చును. కాని దస్తూరీ నేరాలని గుర్తించడంలో ఉపయోగకారి అని న్యాయవాదుల అభిప్రాయం. తగు ప్రయత్నములు మనదేశమున శాస్త్రోక్తముగ ఇంకా మొదలిడలేదు. వెంటనే మొదలిడుదురు గాక!

---

అలప్పి - ఎర్నాకులం మార్గమందలి లంక



(విస్తీర్ణమయిన యీకాలువలో యిట్టి లంక లనేకములుగలవు. అందు నివసించు జనులొక లంకనుండి యింకొక లంకకు చిన్నదోనెలలో ప్రయాణము చేయుదురు.)

చిత్రకారుడు: ఎ. వి. యస్. సుబ్బారావు.

## వైరాగ్యము

'వనవాసి'

పూలవయసుగుబ్బెతల కప్పురపు టెదల
ముమ్మరపు వలపుల్ భారముగ తలంచి,
ఈ వసంతోదయముల రాగిల్లు మనసు
కేమి వైరాగ్యమాధుర్య మిది కుమార?

ఏ వసంతవిలాసిని హృదయమధువు
పూలపొత్తిళ్లలో వడపోసికొనెనో,
సరళసుమపుటంజలుల విషాదరేఖ
లవధరింపవో ఆర్ద్రదృగంచలముల?

తెలుగుతోటల సాంధ్యరక్తిమ, వసంత
మాడియాడి చల్లని గాలిమేడలందు,
చైత్రలక్ష్మీకటాక్షపాశముల జిక్కి,
నవపరీమళశయ్యల నవసినావొ!

పాలమబ్బుల కోనలోపలను బెళికి,
మోహవివశ యేయచ్చరముద్దులాడి,
మేలిమును గెడలించెనో సోలి; తూర్పు
మధురపూర్ణిమాసుషమాసమగ్రమయ్యె.

దివ్యతేజస్సు ప్రణయవతీప్రసన్న
హృదయరుచిమై, పలుకరించునదిమె ప్రాచి!
విరహపాండురవదనేందుబింబ శోభ
నీరసమని నిషేధింతువా రసికుడ?

ఇప్డు డాశాపథాల పాలించు కిరణ
బాలికలను ప్రేమింతువా పడుచువాడ?
విరియు కడలినవ్వుల పాలవెల్లి దేలు
ప్రౌఢకల్లోలడోలికాపంక్తి నూగి.

దివిజనందన పుష్పవతీ సురభిళ
హృదయపాటచ్చరముల, తాళెదవా లేదొ!
నాలిగాలిదూతికల; నుద్వేలదీప్తి
తరళసందేశముల దడితడిగ తారు.

అమరఋషివాటికలు ప్రజ్వలముగ వలయు
తపసికన్యల లావణ్యతరళితములు,
గాంగసంగీతముల జొక్కి కరుగవలతొ!
సుధ లుపాసించు పున్నమచుక్కవోలె!

---

# ప్రేమపాశం

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## మొదటి అంకం

### మొదటి రంగం

[ రాజమహేంద్రవరం, ఇన్నిసుపేటలో స్వగృహమున, వీధి అరుగుమీద మెట్లమీదకి కాళ్లు వుంచుకొని వెంకటశాస్త్రి వొకపక్కనీ, కాంతమ్మ వొకపక్కనీ కూచుని వుంటారు. బంగారమ్మ తండ్రి వొడిలో వుంటుంది. ]

బంగారమ్మ —చదువు మరిచిపోలేదు నాన్నా! మేస్టారు అప్పుడే పాఠం చెప్పేసి వెళ్లిపోయారు. వెంకమ్మత్తగారు పిలవగా మాఅమ్మ అప్పుడే పని ముగించుకొని యివతలికి వచ్చింది. ముగ్గురమూ గవ్వలాడుకుందామని కూచున్నాం.

వెంకటశాస్త్రి — ఎవరు పురమాయించారు తల్లీ గవ్వలాటా?

బంగారమ్మ — అత్తగారే. ఉండు నాన్నా! చెప్పేదంతా విను.

వెంకటశాస్త్రి — చెప్పుచెప్పు.

బంగారమ్మ—మా అమ్మ పచ్చీసుగళ్లు గీస్తోంది. అత్తగారు చిన్నగవ్వలూ తనవని యేరుకుంటున్నారు. నేను గువ్వలు తీసుకుంటున్నాను. అంతట్లో వాళ్ల సూరమ్మ వచ్చి "మాయింటో సంగీతం పాడుతున్నారు, రా" అంటూ అమాంతంగా చెయ్యి పట్టుకొని లాక్కుపోయింది.

వెంకటశాస్త్రి — ఆపళంగా వెళ్లావు. కదూ?

బంగారమ్మ — వెళ్లక తప్పిందికాదు. పోనీ, వెళ్లకుండా వుండలేకపోయా ననుకో.

కాంతమ్మ—అమ్మాయికి సంగీతం అంటే సరదాగదా అని నేను వెళ్లమన్నానుకూడాను.

బంగారమ్మ — అవును. అన్నట్లు మరిచిపోయాను. అమ్మకూడా వెళ్లమంది నాన్నోయి!

వెంకటశాస్త్రి — మీఅమ్మ వెళ్లమందూ మరీ?

కాంతమ్మ — ఎంచేతో?

వెంకటశాస్త్రి — ఆశమ్మా, బోశమ్మా అంటూ లోకంలో వుండీ మొగుడూ పెళ్లాలనందర్నీ పేరువరసలని యెక్కిరిపిస్తూ కూచోడానికి.

కాంతమ్మ — అమ్మాయి వుంటే ఆపని కేమి అడ్డండీ?

వెంకటశాస్త్రి — కొన్ని తెలిసీ, కొన్ని తెలవకా యేవో అడ్డదిడ్డంగా ప్రశ్నలువేసి—

కాంతమ్మ — వులకం. అలాంటి భయం మీకుందేమో గాని మాకు లేదు సుమండీ!

వెంకటశాస్త్రి — ఉంటే లోకంలోవాళ్లనందర్నీ అలా యెందు కాడిపోసుకుంటారూ?

బంగారమ్మ — అబ్బా! నన్ను చెప్పనిస్తు నాన్నా!

వెంకటశాస్త్రి — సరే వెళ్లావు. ఎవరో పాడారు. నువ్వు విన్నావు. కొంతసేపు ఆపాటతోకూడా నీ మనస్సు నృత్యం చేసింది. ఇంటికి వచ్చి కూనిరాగాలు తీస్తూ కొంతసేపు నువ్వు సొంతంగా పాడుకున్నావు. అవునా అమ్మా?

బంగారమ్మ — ఇంకా వుంది నాన్నా!

వెంకటశాస్త్రి — ఉంటే అదేమిటో చెప్పూ.

కాంతమ్మ — ఊకొడుతూ వూరుకోరాదూ, అంతా చెప్పేదాకానూ?

వెంకటశాస్త్రి — నువ్వెందు కూరుకున్నావు కాదూ?

కాంతమ్మ — మీరు బిడ్డ వుత్సాహాన్ని చెడ కొడుతూ వుంటే—

బంగారమ్మ — అబ్బా, ఉండు నాన్నా! నువ్వు మాట్లాడకే అమ్మా! నే నంతా చెప్పేదాకా నువ్వుకూడా మాట్లాడకు నాన్నా!

వెంకటశాస్త్రి — అలా అయితే మరికానియ్యి.

బంగారమ్మ — హాలంతా కిటకిటలాడుతూ కూచున్నారు మొగాళ్లు. ఆడాళ్లు వసారాలో కూచున్నారు. పిల్లలంతా ఆడాళ్ల లోనూ, మొగాళ్ల లోనూ యెక్కడ వీలుంటే అక్కడ కూచున్నారు. నేనూ, వాళ్ల సూరమ్మా ముందే కూచున్నాం నాన్నోయి.

వెంకటశాస్త్రి — (వినీ, చూసీ వూరుకొంటాడు)

బంగారమ్మ — ఊరుకుంటావేం నాన్నా?

వెంకటశాస్త్రి — నువ్వు మాట్లాడవద్దన్నావు కాదూ మరీ?

బంగారమ్మ — సరే. అదా యేమిటి?

కాంతమ్మ — మీగుణం పోనిచ్చుకున్నారు కారు.

వెంకటశాస్త్రి — ఊరుకో మన్నప్పుడు మాట్లాడితే అప్పుడేమంటావో నువ్వు?

బంగారమ్మ — ఊ కొట్టవద్దన్నానా?

వెంకటశాస్త్రి — మాట్లాడవ ద్దన్నావు; గాని వూకొట్టమన్నావా మరీ?

బంగారమ్మ — అన్నీ చెప్పడం యెలాగ నాన్నా? ఊహించుకోవద్దూ?

కాంతమ్మ — మీ నాన్న యెప్పుడూ ఇంతేనే అమ్మాయీ!

బంగారమ్మ — నువ్వుండవే అమ్మా! ఏం నాన్నా? "ఊ" అనూ.

వెంకటశాస్త్రి — ఊ.

బంగారమ్మ — పాడీవా రెవరో అనుకున్నాను. మన పేరుభట్లు బావే నాన్నోయి!

వెంకటశాస్త్రి — ఊ.

బంగారమ్మ — ఇప్పుడు "ఊ" అంటే చాలదు నాన్నా! మధ్యమధ్య మాట్లాడుతూవుండాలి. పిడుక్కీ బియ్యానికీ ఒకటేమంత్రమా యేమిటి?

వెంకటశాస్త్రి — మాట్లాడితే "అదిగో మాట్లాడతా" వంటావు. లేకపోతే లే దంటావు. నీవుద్దేశం ప్రకారం యెప్పు డేంచెయ్యాలో నా కెలా తెలుస్తుందమ్మా?

బంగారమ్మ — వుద్దారాలు చెబుతా వేమిటి నాన్నా? కథ మామూలుగా వెళ్లి పోతూవుంటే "ఊ" అంటే చాలు. ఏదేనా విశేషం వచ్చినప్పుడు తోచిన మాట అనాలి. అసలు తోచకుండా వుండనే వుండదూ.

కాంతమ్మ — నిజంగా మీ నాన్న కిప్పు డేమీ తోచనే లేదనుకున్నావుటే బంగారం?

వెంకటశాస్త్రి — అమ్మాయిని నువ్వు చెప్పనియ్యవా యేమిటి?

కాంతమ్మ — మీరు దాని సరదా తీరనివ్వరా యేమిటి?

బంగారమ్మ — మధ్యమధ్య మీతగువేమిట్రా రామాయణంలో పిడకల వేట్లాట లాగా?

వెంకటశాస్త్రి — మా బాగా అడిగావమ్మా!

కాంతమ్మ — ఆమాట యెవరికి తగులుతుందో?

బంగారమ్మ — ఎవరికో వొకరికి. ఆపళంగా వూరుకోండి, కజ్జా పెంచుకోక. అమ్మా, నాన్న యేమన్నా ను వ్వూరుకో. నాన్నా, నువ్వు కొంటెతనం లేకుండా విను.

కాంతమ్మ — మీ నాన్న గిల్లి కజ్జా పెడతారు.

వెంకటశాస్త్రి — మాశావా తల్లీ?

బంగారమ్మ — ఉ: మీకు చెప్పడం నాదే తప్పు. నేను లేచిపోతాను బాబూ. (లేవబోతుంది).

వెంకటశాస్త్రి — (ఆమెని గట్టిగా పొదివి పట్టుకుని) ఇక సరిగ్గా వింటానులే. ఈమాటు చెప్పు.

బంగారమ్మ — ఎందు కేమిటి పూరికేను?

వెంకటశాస్త్రి — మా అమ్మవు కాదూ? ఇక బాగా —

బంగారమ్మ — ఒక్కక్షణం బాగావింటావు. తరవాత మళ్లీ మొదలూ.

వెంకటశాస్త్రి — ఇక అలా చెయ్యనులే.

కాంతమ్మ — అంత నిలకడ వుంటేనా?

వెంకటశాస్త్రి—మీయమ్మని నేనిప్పు డేమేనా అన్నానా ఏంతల్లీ?

కాంతమ్మ — నే నేంతప్పుమాట అన్నానూ? ఊరుకోండి అమ్మాయికి విసువెత్తించిక.

వెంకటశాస్త్రి — చెప్పవే తల్లీ!

బంగారమ్మ — ఆపళంగా బావ వచ్చి ముందు కూచున్నాడు.

వెంకటశాస్త్రి — ఇప్పు డేమేనా అనాలా యేమిటమ్మా?

కాంతమ్మ — మొదలూ —

బంగారమ్మ — అయితే లేదే అమ్మా! ఒక్క క్షణం కూచుని, తరవాత కంఠం సవరించుకొని బావ పాట మొదలుపెట్టాడు. ఒక అర గంటదాకా గొంతుకు వొకమోస్తరుగా వుంది. తరవాత కమ్మెచ్చువ తీసి నట్లుంది నాన్నా!

వెంకటశాస్త్రి — అంత బాగుండిటమ్మా?

బంగారమ్మ — కోయిల కూసినట్టుంది. కంఠం సాఫయినకొద్దీ బావకి సంతోషం యెక్కువయింది. సంతోషం యెక్కువయిన కొద్దీ తల చమత్కారంగా వూపుకుంటూ, యించక్క కళ్లు తేలవేసుకుంటూ, మధ్యమధ్య తొడమీద తాళం వేసుకుంటూ — ఎంత అందంగా పాడా డనుకున్నావు బావా!

వెంకటశాస్త్రి — ఎప్పుడూ వినలేదుసుమా నేనూ.

బంగారమ్మ — ఆపాట హాలంతా పాకి పోయింది నాన్నా!

కాంతమ్మ — అంత బాగుందిటే?

బంగారమ్మ — గోదావరి కెరటాలమీద మన రేవులో వున్న చిన్న స్టీమ రెలా ఆడిపోతుందో, పెద్ద గాలివేస్తే గులాబీచెట్టుమీద పువ్వు ఎలా వూగి పోతుందో ఆపాటతో నామనస్సు ఆలా ఆడిపోయింది.

వెంకటశాస్త్రి — ఆ?

బంగారమ్మ — ఆపళంగా వెళ్లి బావ వొళ్లో కూచుందా మన్నంత సరదా అయింది నాకు.

వెంకటశాస్త్రి — అం తేగదా?

కాంతమ్మ — లేకపోతే యే మనుకున్నారు? మొగపిల్లల్లాగ ఆడపిల్లలు తొందరపడరు.

వెంకటశాస్త్రి — మీయమ్మతో మాట్లాడవద్ద న్నావు, కదూ తల్లీ?

కాంతమ్మ — అక్కరేలేదూ.

బంగారమ్మ—మళ్లీ మీరు కజ్జా పెంచుకుంటా రేమిట్రా? ఏం నాన్నా! బావచేత నాకు ఫిడేలు నేర్పించవూ? వెధవహార్మనీ నాకు వద్దు బాబూ!

కాంతమ్మ — అంత అదృష్టమా అమ్మా నీకూ?

బంగారమ్మ — ఏమే? ఏం నాన్నా?

వెంకటశాస్త్రి — బావ మనయింటికి రాడమ్మా.

బంగారమ్మ — అయితే నేను బావబసకే వెడ తాను.

కాంతమ్మ — మనతో మాట్టాడ్డమ్మా.

బంగారమ్మ — ఏం?

కాంతమ్మ — వాళ్లవాళ్లు ఏమేనా అంటారనీ.

బంగారమ్మ — చూడవచ్చారా యేమిటి ఇక్క డికి?

వెంకటశాస్త్రి — నీ వుబలాటమేగాని అక్క డికి వెళ్లినా బావ నీతో మాట్టాడ్డమ్మా.

బంగారమ్మ — నేను పలకరిస్తే మాట్లాడ కుండా వుండగలడా?

వెంకటశాస్త్రి — అంతధైర్యమే నీకు ?

బంగారమ్మ — ఓ ! చూసుకో యీమాటు.

కాంతమ్మ — సాహసించకమ్మా ! అతను మాట్లాడకపోతే మనస్సు చివుక్కుమంటుంది నీకు.

బంగారమ్మ — చూస్తాను గామా !

వెంకటశాస్త్రి — ( ముందుకు చూసి ) ఆ వచ్చేవారు— పేరుభట్టేనా ?

బంగారమ్మ — ఆ ! రానీ. (చిటికెలువేస్తూ) నిమిషంలో రప్పించేస్తాను చూసుకోండి బావని.

కాంతమ్మ—వద్దు సుమా.

వెంకటశాస్త్రి — నామాట వినుసుమా.

( పేరుభట్టు బసకు పోతూ ఆదారినే వస్తాడు. చేతిలో గుప్పెడు తమలపాకు లుంటాయి).

పేరుభట్టు — ముగ్గురూ వీధిలోనే కూచున్నారు. ఏంచెయ్యను ? మాట్లాడ్డమా ? మానడమా ?

బంగారమ్మ — ( తల్లినీ, తండ్రినీ చూసి, కనుసన్న చేసి కంఠం నొక్కుకొని ) బావోయి !

పేరుభట్టు — ( స్వగతము ) అనుకున్నంతా అయింది. అస లిందాకా సభలోనే పలకరిస్తుం దనుకున్నాను. సమయానికి అత్తా, మామాగూడా దగ్గిరే వున్నారుకూడానూ.

బంగారమ్మ — ఏమి తక్కుతావు, రావోయి బావా.

పేరుభట్టు — (స్వగతము) ఏమయితే కానీ. (గుమ్మంలోకి వెడతాడు.)

వెంకటశాస్త్రి – ఇంకేంమరూ? వచ్చికూచో రా.

కాంతమ్మ — బావకి కాళ్లు కడుక్కోడానికి నీళ్లియ్యి తల్లీ !

బంగారమ్మ — అవునవును. మరిచిపోయాను. ( ఇంట్లోకి వెళుతుంది. )

కాంతమ్మ — మీవాళ్లకి మేము పగవాళ్లమైపోయాము. నువ్విక్కడికి వచ్చినట్లు తెలిస్తే యేమంటుందో మీయమ్మ.

వెంకటశాస్త్రి — దాని మొఘం. ఏముంది అనడానికి ? అయినా వీడలాంటి బెదిరింపులికి జడిసేవాడు కాడు. ఏమిరా పేరుభట్టూ ?

పేరుభట్టు — జడవడాని కేంవుంది మామా ? సంసారంలో వున్నతరవాత యేవో తవ్వాయిలు వస్తానూ వుంటాయి, పోతూనూ వుంటాయి.

కాంతమ్మ — ఇంతకీ : మీయమ్మకి మేమేమీ లోటు చెయ్యలేదు. ఏటా విజయదశమికి, సంకురాత్రికీ, సంవత్సరాదికీ తీసుకువచ్చి, యేదో, మాతాహతుకి లోపం లేకుండా పచ్చంచుల బట్టలు పెడుతూనే వచ్చాము. మీచిన్నయ్య పెళ్లికి మూడువందలు అప్పివ్వలేదని ఆవిడికి మామీద కోపం. అక్కడ గడవక యిక్కడికి వచ్చి యేదో ముక్తసరుగా కాలం గడుపుకొంటున్నాం ; గాని మాదగ్గిర యేంవుందోయి ?

పేరుభట్టు — ఉన్నంత వుంది, లేనంత లేదు. ఉన్నా యివ్వడాని కిష్టం వుండాలి. పైగా వీలుకూడా వుండాలి. ఇవ్వకపోడాని కనేక కారణా లుండవచ్చు. దానిక్కోసం యింత రగడ పెంచుకోవలసిన పనేమీ లేదు. అయినా, అదంతా యిప్పు డెందుకూ ? ఈ తగువులతో నాకేమీ సమ్మంధం లేదు. నామీద యెవళ్లకి ప్రేమ ఉంటే వాళ్లు నాకుదేవుళ్లు. తక్కిన గొడవలు నా కక్కర్లేదు. కాకపోయినా, ఏవో నాలుగు ముక్కలూ వస్తే చాలు, నాకంతకంటే వేరే ధ్యానం లేదు.

వెంకటశాస్త్రి — అవునురా. నీ సంగతి నాకు తెలుసు. మొదణ్ణుంచీ నువ్వనవసర ప్రసంగాలంటే దూరంగానే ఉంటావు. ఈ తగువుల కన్నింటికీ మూలం మీ చిన్నన్నయ్యా. ఎక్కడచూసినా ప్రతీ వాళ్ళ కొడుకుల్లోనూ రెండోవాళ్లింతే. పెద్దాడప్పటి కప్పుడే యేదో సంసారంలో పడతాడు, ఇక రెండోవాడు — తనకి చేతగాదూ, ఊరుకోలేడూ. నింపాదిగా తల్లిదగ్గిర తాసికలు మొదలుపెడతాడు. క్రమక్రమంగా తండ్రిని కూడా లోపు చేసుకుంటాడు. ఇక చెప్పే దేమిటి ? ఆడిస్తా డాట.

(అప్పుడు బంగారమ్మ నీళ్లు తెచ్చి అక్కడ పెడుతుంది. పేరుభట్టు చెంబు తాకి ఊరుకుంటాడు.)

బంగారమ్మ — కాళ్లు కడుక్కో బావా!

పేరుభట్టు — కడుక్కున్నట్టే లే. కూచో నువ్వు.

బంగారమ్మ — ఎక్కడ కూచోమంటావు బావా?

పేరుభట్టు — నీయిష్టం వచ్చిన చోట. నీమన సయినచోట. నీ కడ్డేమిటి?

బంగారమ్మ — అయితే నామనసు వచ్చిన చోటిదీ. (అతని వొడిలో కూచుంటుంది.)

పేరుభట్టు — (ఆమెని పొదివి పట్టుకుని) దయ వుందన్నమాటే.

కాంతమ్మ — తప్పుకాదుతల్లీ? చనువిస్తే నెత్తెక్కడమా?

వెంకటశాస్త్రి — పెంకిపిల్ల వనుకోడుటమ్మా బావ?

పేరుభట్టు — తప్పేమిటి మామా? నాకు నచ్చిన పని చేశావు బంగారం నువ్వు.

బంగారమ్మ — మరే, మానాన్నా, మా అమ్మా మరీనీ.

కాంతమ్మ— పేరుభట్టుకి భేషజాలు లేవుసుమండీ.

వెంకటశాస్త్రి — వాడి మనస్సు నవనీతం లాంటిది. మంచియోగ్యత సంపాదించాడు. సంగీతంలో యీచుట్టుపట్ల యింతటివాడు లేడుట.

బంగారమ్మ — నాకు సంగీతం చెప్పవూ బావా?

పేరుభట్టు — ఓ! ఇంతకంటేనా?

బంగారమ్మ — నాకు ఫిడేలు నేర్పాలి బాబూ! బొయ్యిమంటూ — హార్మనీ యేమందమేమిటి?

పేరుభట్టు — మంచిమాట అన్నావు. నీకు తప్పకుండా ఫిడేలే నేర్పుతాను.

కాంతమ్మ — ఇందాకా నీపాట వింటిట. తన మనస్సు నీపాటతో సరిగ్గా ఆడిపోయిందిట. సున్నితంగా తల ఆడించుకుంటూ, కళ్లు తేలవేసుకుంటూ పాడేవుట నువ్వు.

పేరుభట్టు — (ఆనందంతో బంగారమ్మ ముంగురులు సవరిస్తాడు.)

బంగారమ్మ — సిగ్గులేదూ బావా నీకూ?

వెంకటశాస్త్రి — ఆపళంగా నీవొళ్లోకి వచ్చి కూచోవా లనుకుందిట, మాచిట్టితల్లి. ఏమమ్మా కదూ?

బంగారమ్మ — (పేరుభట్టుబుగ్గ గిల్లుతుంది.)

పేరుభట్టు — కూచున్నావు కాదేమేమరీ?

బంగారమ్మ — నువ్వు పిలిచావు కాదేం?

పేరుభట్టు — సెబాస్!

కాంతమ్మ — వెఱ్ఱిపిల్ల, ఉబలాటంతప్ప యేమీ యెరగదు.

పేరుభట్టు — నోట్లో వేలుపెట్టినా కొరక లేనిదీ పాపం నీ కూతురు!

బంగారమ్మ — ఏదీ బావా చూస్తాను. (కొరకబోయినట్లు పేరుభట్టుచెయ్యి నోటితో అందుకోబోతుంది).

పేరుభట్టు — ఓహోయి! అసాధ్యురాలవే నువ్వు? (చెయ్యి వెనక్కి తీసేసుకుంటాడు.)

వెంకటశాస్త్రి — అది మోటుతనం అనిపించుకోదూ తల్లీ?

కాంతమ్మ — తప్పు కాదుటే?

పేరుభట్టు — కరవ్వేమరీ. (చెయ్యియిస్తాడు.)

బంగారమ్మ — ఇప్పటికి ధైర్యం వచ్చింది బావకి. అయితేలే. కరిపించుకున్నంత పనిచేశావు. అంతే చాలులే.

కాంతమ్మ — భోజనం యెక్కడ అల్లుడా?

పేరుభట్టు — వారాలు చేసుకుంటున్నానత్తా.

వెంకటశాస్త్రి — పోనీ, మాయింట్లో భోజనం చెయ్యరాదుట్రా?

బంగారమ్మ — అవును. ఏం బావా! మాయింటో భోంచేస్తావుండు. ఏమే అమ్మా?

పేరుభట్టు — మహాపెట్టేదానిలాగే అడుగుతున్నావూ?

బంగారమ్మ — ఏమమ్మా? నాకు వంట చేతగాదనుకున్నావా యేమిటి? బంగాళాదుంపలకూర నేను వండినట్లు మా అమ్మకూడా వండలేదు. మల్లెపువ్వుల్లా వుంటుంది నేను వండితేను, అన్నం.

కాంతమ్మ — ఊరికే అలా వూరిస్తాడు; కాని మనయింటికి వస్తాడుటే అతను?

పేరుభట్టు — మీయమ్మ యేమంటోందో విన్నావా బంగారం?

కాంతమ్మ — రాకూడ దనుకొనేవాళ్లకి అన్నీ వంకలే.

బంగారమ్మ—నువ్వీవాళ మాయింటోనే భోంచెయ్యాలి. ఎక్కడికీ వెళ్లడానికి వల్లకాదు. లేవ్వే అమ్మా! ఆ రవుతోంది. పెందరాళే వంటచెయ్యి.

పేరుభట్టు — నువ్వు చేస్తా నన్నావు కాదుటే వంటా?

బంగారమ్మ — అవునవును. నేనే వండుతాను. నువ్వు నిప్పుచెయ్యవే అమ్మా! మాఅమ్మ నిప్పుచేసి, కూరతరిగి, బియ్యంకడిగీలోపున నేను తమలపాకులికి సున్నంరాసి, చిలకలు చుట్టి అట్టేపెడతాను. ఏం బావా?

పేరుభట్టు — నీ కన్నీ తెలుసును. మహామంచి దానవు నువ్వు. (గుచ్చి కవుగిలించుకొంటాడు.)

కాంతమ్మ — అల్లుడికి విందూ. బజారుకి వెళ్లి రండి మీరూ.

వెంకటశాస్త్రి — ఏం తెమ్మంటావమ్మా?

బంగారమ్మ—బంగాళా దుంపలు వీసెడూ—

వెంకటశాస్త్రి — అన్ని కావాలిటే బావకి?

బంగారమ్మ — తెస్తూ, మిగిలితే వుండవూ?

పేరుభట్టు — అదీయెత్తు, రవ్వారట్టూ గంగానమ్మదీ, అట్టూ, పిట్టూ ఆసాదాడిదీనీ.

బంగారమ్మ — సంగీతం పాడీవాళ్లకి యెంతయినా చాలదూ. ఏం? సరిపోయిందా?... ఇలా విను నాన్నా! పాతిక బంగినపిల్లిపళ్లూ, మునక్కాడలూ, వంకాయలూ, పనసపెచ్చూ, పచ్చిమిరపకాయలూ, కొత్తిమిరీ, గుమ్మడిబద్దా, అరిటాకులూ—

పేరుభట్టు — పులుసులోకే?

బంగారమ్మ — నేను వంటచేశానంటే ఆవంట కాలతో పాటు విస్తరాకుకూడా తినేస్తావు నువ్వు.

పేరుభట్టు — విస్తరాకు తింటేగాని కడుపు నిండినంత చక్కగా వండుతా వన్నమాట నువ్వు.

బంగారమ్మ — వేళాకోళం చేస్తున్నావు. నాకు తెలుసునోయి, బావా, నీచమత్కారాలు.

వెంకటశాస్త్రి — లేవరా యింటోకి వెడదామూ.

పేరుభట్టు — బసకివెళ్లి, డ్రెస్సు తీసేసి, గోదావరిలో స్నానంచేసి, పట్టుపంచె తెచ్చుకుంటాను మామా!

కాంతమ్మ — మీమామ తాపితా యిస్తారు లేవోయి!

బంగారమ్మ — అవునుబావా! నేను వేన్నీళ్లు పెడతాను కూడానూ.

పేరుభట్టు—వేసవిలో వేన్నీళ్లూ, శీతాకాలంలో చన్నీళ్లూ యిస్తావుకామోసు నువ్వు.

బంగారమ్మ — అయితే కావలసినన్ని నీళ్లు తోడేస్తాను, నూతికిరా.

పేరుభట్టు — నువ్వు నీళ్లేతోడతావా, వంటే చేస్తావా?

వెంకటశాస్త్రి — అయితే గోదావరికే వెళ్లిరారా. ఇదిగో అంగాస్త్రం. (ఇస్తాడు)

పేరుభట్టు — (పుచ్చుకొని చొక్కాతీస్తాడు.)

బంగారమ్మ — ఇలా తే బావా! (పుచ్చుకొని) నిమిషంలో వంటచేసేస్తాను లేవ్వే అమ్మా!

(అందరూ నిష్క్రమిస్తారు.)

రెండోరంగం.

[రాత్రి భోజనానంతరం తాంబూలం వేసుకొంటూ వెంకటశాస్త్రి, పేరుభట్టూ వీధిఅరుగుమీద నుంచుని వుంటారు.]

పేరుభట్టు — బసకి వెడతాను మామా.

వెంకటశాస్త్రి — అప్పుడే వెళ్లాలా?

పేరుభట్టు — కళావంతుల కుర్రాడొకడు పాఠానికి వస్తాడు. నెలకి పదిరూపాయలిస్తాడు. ఒకరోజున పాఠంలేకపోతే యేమీ అనుకోడుగానీ — అయినా యెందుకూ మానెయ్యడం?

వెంకటశాస్త్రి — సరే మరీ. ఎప్పుడేనా వచ్చి కనపడుతూ వుంటావుకానూ?

పేరుభట్టు — తప్పకుండానూ.

వెంకటశాస్త్రి — చూడూ, బంగారం నీదగ్గిర సంగీతం చెప్పుకుంటానంటోందిరా. వీలయితే—

పేరుభట్టు— వీలయితేయేమిటి? వీలుచేసుకోవాలన్నమాట. నువ్వు చెప్పాలా? ఇందాకా బంగారం అడిగినప్పుడే నిశ్చయించుకున్నాను. కాని పదిహేను రోజులు కొంచెం తొందరపనులున్నాయి. అమావాస్య వెళ్లనియ్యి.

వెంకటశాస్త్రి — సరే.

పేరుభట్టు — బంగారం చూస్తే వెళ్లనివ్వదు. దాంతో నేను వెళ్లానని చెప్పు. అత్తతో చెప్పే వచ్చానులే.

వెంకటశాస్త్రి — పద.

(పేరుభట్టు వెళ్లిపోతాడు.)

వెంకటశాస్త్రి — (స్వగతం) కాలగతి యెంత చమత్కారంగా వుంటుందీ! ఎప్పుడేం జరుగుతుందో యెవరికీ తెలవదుకదా? నాలుగేళ్లయింది, వీడుమాట్లాడీ నాతోటి. నాటికి మళ్లీ నేమా. ఎంతవింతా? మాట్లాడ్డమే కాకుండా భోజనం చెయ్యడంకూడానూ...... వీడిగుణం యెప్పుడూ మంచిదే. ఇదంతా నూరన్న చేస్తున్నాడు. వాడంత విషప్పుచ్చాలు లోకంలో మరి లేరు. కానయితే వీడు మాట్లాడ్డం మంచిదే. ఏం శాశ్వతమూ? ఇంతకీ: యెటొచ్చి యెటుపోయినా, నాలుగురాళ్లు సంపాదించుకొనేవాడూ, పేరు తెచ్చుకొనేవాడూ, సుఖపడేవాడూ వాళ్లలో కల్లా వీడొక్కడే.

(తెరలో.)

శాస్త్రులుగారూ!

వెంకటశాస్త్రి — ప్రకాశం బావగారా? దయచెయ్యాలి.

(తెరలో)

భోజనా లయినాయా?

వెంకటశాస్త్రి — ఇప్పుడే చేతులుకడుక్కున్నాం. వచ్చారుకారు.

(ప్రకాశం వస్తాడు)

ప్రకాశం — మాయింటోనూ యిప్పుడే భోజనా లయినాయి ... ఎవరో చుట్టాలు వచ్చారని తెలిసిందీ?

వెంకటశాస్త్రి — మామేనల్లుడండీ. మాచిన్నక్క కొడుకు. నాలుగు నెల్లనుంచి యీవూళ్లోనే వుంటున్నాడు వాడు.

ప్రకాశం — ఎందుకూ?

వెంకటశాస్త్రి— మేఘసందేశం చదువుతున్నాడిక్కడ. విజయనగరంలో యేడెనిమిదేళ్లుండి సంగీతంలో చాలా పనిచేశాడు. సంగీతానికి సాయం సాహిత్యంకూడావుంటే బాగుంటుందని కావ్యాలు ప్రారంభించాడు. రఘువంశం విజయనగరంలోనే అయిపోయింది. కుమారసంభవం తునిలో పూర్తిచేశాడు. ఈవూళ్లో స్థిరంగా మకాంపెట్టదలచి, చదువుపూర్తి అయీలోపున కొందరు గృహస్థుల్ని పరిచయం చేసుకోవచ్చుగదా అనీ, గొప్పసాహిత్యగాళ్లకి మొనగాడని పేరుపడిన రామదీక్షితులుగారి వుపదేశం పొందాలనే వుబలాటంతోటీ యీవూళ్లో ప్రవేశించాడుట.

ప్రకాశం — గాత్రపాటా, లేక—

వెంకటశాస్త్రి — గాత్రపాట అభిమానవిష యం. ఫిడేలు వాయించడంలో మంచినాజూకుతనం అబ్బిందట. ఇందాకా మల్లాదివారి యింటో పాడేడుట. మీరువెళ్లి వినలేదూ?

ప్రకాశం — ఆయనేనా ? మంచి పాట గాడండీ. చాలారోజులయింది ఆమాత్ర ప్పాటవినీ. ఒక వెలుగు వెలిగించగల పద్దే.

వెంకటశాస్త్రి — కాసైతే, వాడిపాట నేనె ప్పుడూ వినలేదు; కానీ అలాగే చెప్పారు, విన్నవాళ్లు చాలామంది.

ప్రకాశం — నాలుగు నెల్లనుంచి యిక్కడే వుంటున్నారంటిరి. పైగా మేనల్లుడుకూడానూ. అలా చెబుతున్నారేం?

వెంకటశాస్త్రి—మాకూ వాళ్లకీ నాలుగేళ్లనుంచి రాకపోకలూ, ఉత్తర ప్రత్యుత్తరాలూ — చివరికి ముఖావలోకనాలూకూడా లేవు. ఇవాళే కలిసింది వాడికీ మాకూనూ. మల్లాదివారి యింటిదగ్గిరనుంచే కాబోలు, యీదారినే వెడుతున్నాడిందాకాను. వాడి పాట మాటే చెబుతోంది అప్పుడు బంగారం. వాణ్ణి చూసి, సాహసించి పిలిచింది. ఒక్కక్షణం నుంచుని అనుమానించాడు; గాని మళ్లీ పిలిచాటప్పటికి సుమ్మం లోకి వచ్చాడు. ఏమి శాశ్వతం అని నేను పలకరించాను. కత్తు కలిసిపోయింది.

ప్రకాశం — మంచిపని చేశారు.

వెంకటశాస్త్రి — వాళ్లల్లోకల్లా చాలా మంచి వాడండీ వీడూ.

ప్రకాశం— అసలు పట్టింపు లెందుకువచ్చాయీ వారికీ మీకూనూ ?

వెంకటశాస్త్రి—వాళ్లమ్మకి—అంటే మాచిన్న క్కట్టిల్లు గోకెయ్యాలని దురాశ. రెండోకొడుకు మాఅక్క ఆశకి పడునుపట్టాడు. వాడి పెళ్లి వచ్చింది. మాబావసంపాదనవల్ల సంసారం దిగదీసిందిగాని చిగి రించలేదు. అప్పు చెయ్యవలసివచ్చింది. బదులని మాఅక్క నన్ను మూడువందలరూపాయ లడిగింది. నాసంగతి మీకు తెలిసిందేగా? పాలకొల్లులో కొన్నతోటకి నాకప్పటి కింకా మూడువందల అప్పేవుంది. కాకపోయినా మా అక్కకి మూడువందలూయిస్తే వాట్లకోసం నీళ్లువదులు కోవలసిందే. పోతే పోయాయని యెలాగేనా యివ్వ డానికి నాయింటో ధనం మూలగడం లేదు.

ప్రకాశం — మూలుగుతున్నా, అప్పనియిచ్చాక వొదులుకోడం కష్టమే. ఇంతకీ: సాయం చెయ్యమని అడక్క ఆలౌక్యం యేమిటీ?

వెంకటశాస్త్రి — చివరికి లౌక్యంచెయ్య డానికే.

ప్రకాశం — బాగాచెప్పారు. అయితే మీ రివ్వనన్నారు.

వెంకటశాస్త్రి — నాదగ్గిర దాపరికాలు లేవు. మీకే యెరుగుదు రాసంగతి. అప్పుడు నాదగ్గిర రూపా యలూ లేవూ. ఉన్నా యివ్వడమూ యిష్టంలేదూ. ఆమాటే చెప్పేశాను.

ప్రకాశం — పచ్చిగడ్డిలో అగ్నిహోత్రం పడిం దన్నమాట.

వెంకటశాస్త్రి — అక్షరాలానూ. అయితే, నేను వేశానా, వాళ్లువేశారా? ఇది తీరని ధర్మ సూక్ష్మం. నిప్పు పడితే వూరుకుంటుందీ? రవిలింది; భగ్గుమంది. అదిమొదలు వాళ్లు సరిగ్గా మాట్టాడ్డం మానే శారు. తరవాత మాబావ పోయినప్పుడు వెడితే మా అక్క దుర్భాష లాడింది. అయినా లోకానికి జడిసి, పదిరోజు లట్టే పెట్టుకుని వొకబట్ట పెడదామని మాయింటికి రమ్మని యెంతచెప్పినా గిజాఅంది; గాని వచ్చిందికాదు.

ప్రకాశం — అంతదాకా వెళ్లిందీ?

వెంకటశాస్త్రి — అదలా ముదురుతూనే వుం డగా యిప్పుడు వీడు రాకపోకలు మొదలుపెట్టాడు. దీనివల్ల వీడికిచిక్కులు — అంటే కుటుంబకలహాలు

రావచ్చు ... యింకోటికూడా వుంది. వీణ్ణి విడతీశానని మా అక్కా, రెండోవాడూ ఇక గోలచేస్తారు.

ప్రకాశం — కాని మీరు చేసినపనిలో తప్పేమీ లేదు. అయితే: యితగాడికి పెళ్లి —

వెంకటశాస్త్రి — ఇంకా లేవండీ.

ప్రకాశం — అయితే యిక యితణ్ణి విడిచి పెట్టవద్దు.

వెంకటశాస్త్రి — అలా అన్నారా ?

ప్రకాశం — తప్పకుండానూ.

వెంకటశాస్త్రి — మీ రన్నమాట ఆలోచించ తగ్గదే.

( అప్పుడు 'బావోయి' అనిపిలుస్తూ బంగారమ్మ వస్తుంది.)

బంగారమ్మ — బావేడి నాన్నా ?

వెంకటశాస్త్రి — బసకి వెళ్లిపోయాడు తల్లీ ! నీతో చెప్పమన్నాడు కూడానూ.

బంగారమ్మ — చూశావా ? నాతో చెప్ప కుండా వెళ్లిపోవడమూ, పైగా నిన్ను చెప్ప మనడ మూనా ? నాకక్కర్లే దీరూపాయలు. ఈమాటు కన బడితే బావ కిచ్చెయ్యి నాన్నా ! ( ఇవ్వబోతుంది. )

వెంకటశాస్త్రి — తప్పుకాదుటమ్మా !

బంగారమ్మ — నాతో చెప్పకుండా వెళ్ల డమేం మరీ ? ఈరాత్రి యిక్కడ పడుకోకపోతే పోయింది. నేను వచ్చేదాకా నేనా వుండగూడదూ ?

ప్రకాశం—మొగాళ్లకి అనేక పను లుంటాయి. నువ్వు వచ్చేదాకా కూచోమంటే యేలాగా బంగారం ?

బంగారమ్మ — అది కాదండీమామయ్య గారూ ! నేను బోంచేసి వచ్చేలోగా వేసుకుంటూ వుంటాడని తమలపాకుల చిలకలు సొంతంగా చుట్టేయిచ్చాను. అసలు నేను వచ్చి యివ్వవలిసింది.

ప్రకాశం — మీ బావ నువ్విచ్చిన తాంబూలం పుచ్చుకుని వేసుకున్నాడు. గనక అతనిచ్చిన రూపా యలు నువ్వు పుచ్చుకోవాలి. వద్దనగూడదు.

బంగారమ్మ — పుచ్చుకున్నాను కాదూ మరీ, మాబావ చిన్నపుచ్చుకుంటాడనీ. నేను వచ్చేదాకా వుండకపోడమేం ?

వెంకటశాస్త్రి— మళ్లీవస్తాడు కాదూ ?అప్పుడు గట్టిగా అడుగుదువుగానిలే.

ప్రకాశం — నీరూపాయలు నాకు బదులిస్తావా కోడలా ?

బంగారమ్మ — పుచ్చుకోండి మామయ్యగారూ! (ఇవ్వబోతుంది.)

ప్రకాశం — వడ్డీ యెలాగా ?

బంగారమ్మ — మీకు గనక రూపాయికి అణా.

ప్రకాశం — సెబాస్ ! చాలాచాలాదయ వుం దన్నమాటే.

వెంకటశాస్త్రి— మల్లాదివారు పాడించి యాభై రూపాయ లిచ్చారుట. పరికిణీ, చొక్కా కుట్టించుకో మని అంపులోవి పదిరూపాయ లిచ్చాడు, వద్దంటూం టేనూ బంగారానికి.

ప్రకాశం — వద్దనడం యేమీ ? అందచందాలు తెలిసినవాడులా వున్నాడు.

వెంకటశాస్త్రి — మంచి ఆరిందామనిషండీ. ఏమాత్రమో నిలవకూడా చేశాట్ట పెళ్లికోసం.

ప్రకాశం — అదీ తెలివంటే.

వెంకటశాస్త్రి — మొదణ్ణుంచీ వాడి పద్ధతే వేరండీ. పెద్దాడు అత్తారిచ్చిన బట్టలేగాని కట్టడు. రెండోవాడు యింటో తడుము ళ్లాడతాడు. వీడు స్వయంగా కొనుక్కుంటాడు. పట్టంచుల చాపులేగాని కట్టడు. శుచీ, శుభ్రమూ యెక్కువ. దర్జాగా వుం టాడు.

ప్రకాశం — సంపాదించేవాడికి లోటేమిటీ ?

వెంకటశాస్త్రి — చదువుకో తల్లీ నువ్వువెళ్లి లేకపోతే మీయమ్మకి కొంచెం సాయం చెయ్యరాదూ ?

బంగారమ్మ — మా బావబస యెరుగుదురా మామయ్యగారూ ?

ప్రకాశం — నెడతావా యేమిటి ?

బంగారమ్మ — దగ్గిరయితే.

వెంకటశాస్త్రి — రేపు తీసుకువస్తాను లేవమ్మా!

బంగారమ్మ — ఈరాత్రి నిద్రపట్టడం యెలాగా? సంగీతం పాడమందా మనుకున్నాను. బావ మంచిపని చేశాడు కాదు. రానియ్యి రేపు, బుగ్గలుచిదిమి చేతిలో పెడతాను. ( వెళ్లిపోతుంది. )

ప్రకాశం — మరి సెలవూ, మామరదలు వచ్చింది రాకరాక యివాళ. మాఘురికి సమ్మంధం చూడమంటుంది. మా తోడల్లు జ్ఞాపకున్నురు కామా? భోంచేస్తాడు, చీట్లాటలో కూచుంటాడు.

వెంకటశాస్త్రి — మంచిప్రయోజకుడు.

ప్రకాశం — విస్తరాకుగూడా మామరదలే కుట్టాలండీ.

వెంకటశాస్త్రి — పుట్టుభోగి అన్నమాట.

ప్రకాశం — అడగక్కర్లేదు.

వెంకటశాస్త్రి — మరి వెళ్లి అదేదో చూడండి.

ప్రకాశం — సెలవూ.

వెంకటశాస్త్రి — సెలవూ.

(ఇద్దరూ వెళ్లిపోతారు.)

మూడో రంగం

[పేరుభట్టుబస. అరుగుమీద అతను పచారు చేస్తూవుంటాడు]

పేరుభట్టు — (తాదాత్మ్యంతో) రాత్రంతా వోకటేకల. బంగారం వంశీ నడ్డించడమూ, నేను భోంచెయ్యడమూనూ. అది తమలపాకులు చుట్టియివ్వడమూ, నేనువేసుకోడమూనూ. అది నావొళ్లో కూచోడమూ, నేను ముంగుర్లు సవరిస్తూ దాన్ని ముద్దుపెట్టుకోడమూనూ. ఎంత మధురమైన స్వప్నమూ! కాని యిలా వచ్చిందేమీ యీ కలా? నాలుగేళ్లయింది బంగారాన్నీ, అత్తనీ, మామనీ చూసీ — అంటే వాళ్లతో మాట్లాడీ. అప్పటికిప్పుడు మళ్లీ సమావేశమూ, సల్లాపమూనూ. అప్పటికి బంగారం యెనిమిదేళ్లపిల్ల. ఇప్పుడు పన్నెండో యేడూ. ఎంత చురుకైనపిల్లా! ఎంత నాజూకైనబాలికా! ఎంతనాగరికతగల మరదలూ!

సెబాస్! అమాంతంగా వచ్చి వొళ్లో కూచుంది బంగారం గుంపల సూరతో మల్లెపువ్వల్లాంటి అన్నం పెడుతుందిట. ఆమాటలో అమృతం తొణికిసలాడిపోవడం లేదూ? నాజీవితానికంతా ప్రేమనిండిన యీఆదరం చాలదూ?

కాళిదాసు శృంగారం వర్ణించడంలో నాజూకైనవాడే; కాని అతని కవిత్వంలో యిలాంటి సన్నివేశం యేదీ? బంగారం మూడ్డానికి పన్నెండేళ్ల చిన్నపిల్లే. కవిత్వంఅంటే యేమిటో యెరగని ముద్దరాలే. కాని నాలుగు చినచిన్నమాటలతో ప్రణయమాధుర్యాన్ని విరజిమ్మివేసింది. నా ప్రారంభజీవితానికి నూతన సంస్కారం కలిగించింది. నాహృదయ కుహరంలో రసమయజగత్తు నంకితంచేసేసింది.

బళా! బంగారం! ఎంతప్రతిభావంతురాలవూ నువ్వూ? నీహృదయంలో యెంత మధురోన్నతభావాలు పరిమళిస్తున్నాయీ? పన్నెండేళ్ల ప్రాయంలో భారతరమణీత్వాన్ని కూలంకషంగా ప్రకటించివేశావే?

నాబంగారం! నీపరోక్షంలో — నీతల్లిదండ్రులికి తెలవకుండా నిన్ను నాదాన్నిగా భావించుకోనియ్యి. అంతే. అంతేచాలు యీ దురదృష్టవంతుడికి. నీకూనాకూ మధ్య గభీరపరిఘ వున్నది. దాన్ని దాటడానికి నాకు శక్తిలేదు. సాధనాలు తొలగించివెయ్యబడ్డాయి. ఆశ లేదు ...... లేకపోవడమేనా? ఉరకలు వేసుకువచ్చే యీవుత్సాహాన్నీ, మొలతలుతిరిగిపోయే యీమమతనీ తెంచేసుకోవలిసిందేనా? ...... కాని... ఫలంలేదు. నిజంగా యీజీవితానికి మంచి వినియోగమే లేదేమో?

గుణగ్రహణశక్తి లేనివాడు నల్లరాయే. అందుకు సందేహంలేదు. అయితే: ఆశక్తివుండిన్నీ అనుభవించ

దానికి పెట్టిపుట్టనివాడికంటే యీవిశాలజగత్తులో అధమాధమవస్తువు యేంవుందీ? వాడికంటే కష్టజీవి— వాడికంటే యీశ్వరవంచితు డింకెవడున్నాడు?

(అప్పుడు తాటాకుగొడుగువేసుకొని,
శాలువ కప్పుకొని, వెంకటశాస్త్రి వస్తాడు.)

వెంకటశాస్త్రి — ఒరే పేరుభట్టూ!

పేరుభట్టు — (ఉలిక్కిపడి) ఏంమామా?

వెంకటశాస్త్రి — (అరుగెక్కి) గట్టిచిక్కు వచ్చిందే!

పేరుభట్టు — ఏమిటి మామా?

వెంకటశాస్త్రి — నిన్నరాత్రి నువ్వు బంగారంతో చెప్పకుండా —

పేరుభట్టు — అది అపరాధమే. కోపం వచ్చిందన్నమాట.

వెంకటశాస్త్రి — నేను తగ్గించలేకపోయానుగా అ —

పేరుభట్టు — అనుకుంటూనే వున్నాను నేను.

వెంకటశాస్త్రి — నువ్వు దానితో చెప్పకుండా వచ్చినందుకు నువ్విచ్చినరూపాయలు అక్కర్లేదుట.

పేరుభట్టు — అపరాధానికి తగిన ఆగ్రహమే. ఉచితంగానే వుంది.

వెంకటశాస్త్రి — మందొకమాటు నువ్వు మా యింటికి వెళ్లాలి. ఒకగంటదాకా చూస్తుంది. తరవాత ప్రకాశంగారిని తీసుకొని అదే వచ్చేస్తుం దిక్కడికి.

పేరుభట్టు — అంతయెందుకూ? రెక్కలుకట్టుకొని నేనే అక్కడ వాలి క్షమాపణ చెప్పుకుంటాను.

వెంకటశాస్త్రి —అది యిలా అందని మరోలాగ అనుకో కుసుమా. ఏమిటో గారంగా పెరిగింది, వొక్కపిల్లకనకా. కోపం వచ్చినా, పట్టుదలవచ్చినా సరసం తప్పదు. నలుగురుపిల్లల్లాంటిది కాదు.

పేరుభట్టు-అవంతా నాకు తెలుసును మామయ్యా. నువ్వువద. నేను నిమిషాలమీద వెడతానులే.

వెంకటశాస్త్రి — తాలూకా కచేరీకేసి వెళ్లాలి నేను. కానయితే నిన్ను దగ్గిరుండే తీసుకురమ్మని చెప్పిందిగాని బంగారం — నువ్వు వెంటనే బయలుదేరితే నేను ముందుకి వెడతాను. లేకపోతే —

పేరుభట్టు — తప్పకుండా — తాళంవెయ్యడం తరవాయి. నువ్వు ముందుకే వెళ్లవచ్చు.

(వెంకటశాస్త్రి వెళ్లిపోతాడు. గదికి తాళంవేసి పేరుభట్టు బయలు దేరతాడు.)

పేరుభట్టు — "ప్రథమకబళే మక్షికాపాతః" ఇలా అయింది మనపని. అయితే ప్రేమకి యింతకంటే యేంవుదాహరణ కావాలీ? ......... "రిక్తహస్తేన నోపేయా" త్తన్నాడు. ఇది ఆగ్రహసమయం కూడానూ. బజారునుంచే వెడదాం.

(వెళ్లిపోతాడు.)

(సశేషం)

---



ప్రతిబింబము

(ప్రకృతిచిత్రము) చిత్రకారుడు: కె. వెంకటరమణరావు.

# దయ్యము

కొ. శశిశేఖరరావు

౧

ఎప్పుడో ఇరవయిసంవత్సరాలనాటి మాట. అప్పటి కింకా యెనిమిదోయేడు గడచిందో లేదో. క్రొత్తసంగతు లేవయినా తెలిస్తే మనస్సులో కదలకుండా నాటుకొనిపొయ్యేయాడు.

నాకు అయిదోసంవత్సరము వెళ్లగానే అక్షరాభ్యాసము చేసినదిమొదలు సీలమండలన్నీ కాయలుకాచేట్లు మహాదీక్షతో అస్తమానమూ బడిలో కూర్చోవటము అలవాటు గావటముచేత స్వేచ్ఛావృత్తి తప్పిపోయింది. ఎంతసేపటికీ పాఠాలన్నీ గబగబా అప్పజెప్పి అందరికన్నా తెలివిగలవాడనని అనిపించుకొనట మెట్లాగా అనే ఆలోచనతప్ప మరేమీ వుండేదిగాదు. అసలు వేరేఆలోచనకు విరామమే వుండేదిగాదు. ఇంతలో మానాయనగారు నా కింగ్లీషుచదువు చెప్పించాలని పక్కబస్తీనుంచి రామయ్యపంతులుగారిని తీసుకు వచ్చారు. కొత్తపంతులుధర్మమా అంటూ ఆ రెండుమూడునెలలనుంచీ మధ్యాహ్నము పూట రెండుగంటలు ఊపిరిపీల్చటానికి కాస్త ఖాళీ దొరికేది. ప్రొద్దుగూకులూ బడిలోనే కూర్చోవటము అలవాటయిన నా కావిశ్రాంతి కాలములో ఏమీ తోచేదికాదు. ఇంటిదగ్గరే కూచుని ఏదో కాలక్షేపము చేసేవాణ్ణి. అవి మామిడిపళ్లరోజులు కావటముచేత కాబోలు, నాకు బళ్లోపిల్లలంతా స్నేహమయినారు; మధ్యాహ్నముపూట ప్రతిరోజూ మాయింటికి వచ్చేవాళ్లు. దక్షిణపుపొలాన మామిడితోపు నుంచి తెచ్చి పడమటింట్లో భద్రముగా వరిగడ్డికుమ్ములో ముగ్గవేసిన పీచుమామిడికాయలు నాతోపాటు పిల్లలందరకూ తలాఒకటి పంచిపెట్టేది మాఅమ్మ. తినమరిగిన కొత్త అల్లుళ్లకుమల్లే పిల్లలు రోజూ రావటము సాగించారు. మామిడికాయలన్నీ వారము రోజులలో ఎగిరిపోయినయి. చివరిరోజు ఒకరిద్దరకు తక్కువయినవని మాఅమ్మ దిగులు పడటము చూసికూడా మర్నాడు అందరూ మామూలువేళకన్నా కాస్త ముందలే ముసురుకున్నారు. మాఅమ్మ జాలిపడి, "నాయనా, ఇవ్వాళ మామిడికాయలు లేవురా. దక్షిణపు పొలాన వీళ్ల నాన్న ఉన్నారుగాని అబ్బాయిని గూడా అక్కడికి తీసుకొనిపోయి నాలుగు కాయలు తినిరండమ్మా!" అని మమ్మందరినీ ప్రయాణముచేసింది. పిల్లలందరూ కొండఎక్కినంత సంతోషపడి 'సరే'నని బయలుదేరారు. వీధిలోదాక పోయామో లేదో, ఇంతలో మా అమ్మ తరుముకునివచ్చి, "అబ్బాయి, చెప్పులు తొడుక్కొని పోరా. ఎండలో కాళ్లు మాడిపోతవి" అని పిలిచి నాకు చెప్పులు తొడిగి, మాలోకల్లా కాస్త పెద్దవాడయిన సూరయ్య

తో, "ఒరే అబ్బాయి, తమ్ముడు ఎన్నడూ బయటికి పోయినవాడు కాదుగాని దారిలో భయపడతాడేమో జాగర్తగా తీసుకుపో అమ్మా. దక్షిణపువేపు గమళ్లపాలెములో కుక్కలవీ ఉంటయిగాని జాగర్త బాబూ" అనిభద్రము చెప్పి పంపి, కాస్తదూరము సాగేవరకల్లా వెనకనుంచి, "ఒరేయి, అబ్బాయి బుడిగితోట్లో దడుచుకుంటాడేమో జాగర్తమ్మా. నిమ్మలభావివేపు పోబోకండీ!" అని కేకవేసి చెప్పింది.

బుడిగితోటసంగతి వినగానే పిల్లలందరితో కలిసి కులాసాగా బయలుదేరిన నా గుండెలు 'డక్కు' మన్నయి. మాపొలము పోయే దోవలోనే ఉంది బుడిగితోట. మా నాయనగారితో కలిసి రెండు మూడు సార్లు ఆదోవనే పోయానుగాని, ఆయనప్రక్కన ఉండటముచేతగాబోలు, అప్పుడు అంతభయమనిపించలేదు. ఇప్పు డెందుకో ఊరికే కలవరపడిపోయాను. బుడిగితోటను గురించీ, అందులో ఉండే దయ్యాలనుగురించీ మాచిన్నజీతగాడు నా కొకరోజు చెప్పినదంతా తలలో గిఱ్ఱున తిరిగింది. కొద్దిరోజులక్రిందటే ఒక అబ్బాయి అక్కడే దడిసికొని మంచాన బడి మశూచికము పోసి చనిపోవటము నేను బాగా ఎరిగినసంగతే. పిల్లలతో కలిసి నవ్వుతున్నానన్నమాటేగాని మనస్సు మనస్సులో లేదు. కీకారణ్యముగా ఒకటినొకటి ఒరసికొని పట్టపగలుకూడా చీకట్లు క్రమ్మే ఆ మామిడిచెట్లక్రింద కుక్కిమంచంలో గూర్చుని ముసలిరాట మొకటి త్రిప్పుతూ ఉండే బుడిగమ్మే దయ్యాలతల్లి అని మాబుడ్డజీతగాడు చెప్పిన మాటలు తలపుకు వచ్చి నాచిన్ని గుండెలు తటతటా కొట్టుకొన్నయి

ఇంతలో గమళ్లపాలెము వచ్చింది. అదివరకటిదాకా ఒకమాదిరిగా ఉన్న నా భయ మెక్కువయింది. అక్కడి కుక్క లేమి చేస్తవోనని వణికిపోతున్నాను. నాబోటిగాళ్లే కొంతమంది పిల్లలుకూడా భయపడటమూ, అదివరకంతా వెనకా ముందూ పోయేవాళ్లం దరూ ఒకగుంపుగా చేరి, మాటలు తగ్గించి గబగబా నడవటమూ చూసినకొద్దీ, నాకు మరింత భయమయి సూరయ్యవెనకాలనే చేరాను. అతగాడు ఇదే సందనుకొని, "అబ్బాయి, బసివిగాడి కుక్కను చూశావా ఎప్పుడన్నా? అదిగో, అదిగో, ఆపక్కన డొంకలో పరుగెత్తుతుందే అదే. అదిగనక మనుషులిని చూసిందంటే పీకేస్తుంది" అన్నాడు. నే నేమీ మాట్లాడలేకపోయాను. ఇంతలో ఎక్కడిదో ఒకపాడుకుక్కపిల్ల 'ఖైం'మని అరిచింది. సూరయ్య ఒకగడ్డ తీసుకుని కొట్టేవరకు అది పారిపోయింది. మేమంతా నిట్టూర్పువంటి నవ్వు నవ్వాము. "చూశావా, ఏంజేశానో. నీమీద కేకుక్క వచ్చినాసరే ఇట్లాగే కొడ్తాను" అని అంటూ సూరయ్య నాదగ్గరకు వచ్చాడు. ఆకుక్కపిల్ల నామీదకే వచ్చినట్లు, నాకోసమయి ప్రత్యేకముగా సూరయ్య దానితో యుద్ధముచేసి ఓడించినట్లు, ప్రస్తుతము సూరయ్యన్నయ్యే సర్వశరణ్యమయినట్లు తోచింది

నాకు. అతనివెంటనే నక్కినక్కి నడవటము మొదలుపెట్టాను. అతగాడు అది కనిపెట్టి మెల్లగా నాతో, "కుక్కలిని కరవకుండా జేస్తాగాని నాకు నాలుగు మామిడికాయ లిస్తావా మరి" అన్నాడు. నేను 'సరే' నని తల ఎగరవేశాను. అతనికి ఉత్సాహ మెక్కువయి అందరికీ వినబడేట్లు పేద్దగా, "ఒరేయి, ఈకుక్కలు మన నేం జేస్తయిరా? చూసుకోండి నాదెబ్బ మరి. బసివిగాడి కుక్క యిందాక నన్ను చూసిగాదూ పారిపోయింది! ఈతడవ కనబడనీ, దాని డొక్క చీల్చేస్తానో లేదో మరి." అని అంటూఉండగానే గమల్ల పాలెము దాటివచ్చాము.

ఒకగండము తప్పిందిగాని అసలుగండమే ముందున్నది. సూరయ్యగాంభీర్యము చూసి కాస్త తేరుకున్న మనస్సు బుడిగితోట జ్ఞాపకమువచ్చి కలిగిపోయింది. ఇకను బుడిగితోట ఎంతోదూరము లేదు. పదిగజాలలోకి వచ్చాము. తోటను సమీపించినకొద్దీ వెనక్కు తిరిగిపోవా లనిపించింది. కాని వాళ్లంతా నవ్వుతారేమోనన్న సిగ్గు, వెనకకు బోతే బసివిగాడి కుక్క ఎదురవుతుందేమోనన్న భయము ముందుకే నడిపించినయి. ఇంతలో సూరయ్య, "ఒరేయి, నిమ్మలభావిలో పాములేమన్నా ఉంటే చంపుదాము పదండిరా" అని మలుపుతిరిగి, కాలిబాట త్రొక్కగానే పిల్లలంతా అనుసరించారు. నాకయితే నిమ్మల భావంటే భయమేగాని బుడిగిని తప్పించుకోవచ్చునుగదాఅని, మాఅమ్మమాట జ్ఞాపకమున్నా, మరచిపోయినట్లే వారివెంబడే పోయాను. అందరూ భావిలో రెండు నీళ్లకొయ్యలుంటే వాటిని మట్టిగడ్డలతో చంపాలనే ప్రయత్నముమీద ఉన్నారు. నేను దూరంగా నిలిచి వినోదముచూస్తున్నట్లు నటించినా, లోపల 'బిక్కుబిక్కు' మంటూనే ఉంది. ఇంతలోనే ఎక్కడనుంచో 'భాం' మని అరుపు వినబడింది. మాలోకల్లా చిన్నవాడయిన సాంబయ్య కెవ్వున కేకవేసి, "అమ్మో! బసివిగాడి కుక్కరో!" అని అరుచుకొంటూ బుడిగితోటవేపు పరుగెత్తాడు. ఇంతలో బసివిగాడి కుక్క రానేవచ్చింది. వెనక్కి తిరిగిచూడకుండా సూరయ్యతోసహా అందరము బుడిగితోట్లోకి ఉడాయించాము. ఈ గోలంతా విని పిల్లలెవరో మామిడిపళ్లు కెగబడుతున్నారని బొబ్బలుపెడుతూ, ఆదయ్యాల తల్లి బుడిగెమ్మ, మంచంలోనుంచి లేవలేక, మామీద కఱ్ఱవిసిరింది. అప్పుడు బుడిగెమ్మను చూస్తే, నేనేమిటి, ఎవరయినా గుండెలుపగిలి చస్తారు. ఆకన్నులలో దయ్యా లాడినయి. ఆ చింపిరి జుట్టులో భూతాలు నాట్యము చేసినయి. ఆ ముసలి ముడతల్లో పిశాచాలు నవ్వినయి. నాకళ్లు తిరిగినయి. మతి చలించింది. బుడిగెమ్మకఱ్ఱను తప్పించుకోబోయి మామిడివేరు తగిలి క్రిందబడ్డాను.

అంతే, మళ్లా మర్నాటిదాకా నాకు స్పృహలేదు. చావునోట్లోనుంచి తప్పించుకొన్నానుగాని మళ్లా ఆరునెలలదాకా మామూలుమనిషిని కాలేదు. అప్పటినుంచి

దయ్యాలంటే నాకు చెడ్డభయము. దయ్యాలు లేవనే నాస్తికుల వాదాలు నాకు నచ్చవు. ఇక ఈజన్మ కింతే ననుకుంటా.

౨

మా వూరిలోకల్లా స్కూలుఫయినలు దాకా వెళ్లగబెట్టింది నేనే. అటు పైచదువులకు పనికి రాకుండా, ఇటు వ్యవసాయానికి పనికిరాకుండా, మధ్యస్తంగా వ్రేలాడుతూ, పొలము బుట్రా పాలెకిచ్చి, ఉదయ సాయం సంధ్యలందు తూరుపుబజారులో రావిచెట్టు నీడనున్న భావిబొడ్డుమీదను, మధ్యందినాతప వేళలందు రావిచెట్టు నంటియున్న రచ్చ చావడిలోను, శక్తులు ఉడిగిపోయి, పండి ముగ్గబారిన ముసలివారితో కలసి, ఎలుక మీద పిల్లిఅని, పిల్లిమీద ఎలుకఅని కబుర్లు చెప్పకొంటూ కాలము వెళ్లబుచ్చటము ఈ పదిసంవత్సరాలనుంచి పరిపాటి అయింది.

ఒకరోజు ఏదో పనుండి పగలంతా బస్తీలో తిరిగి సాయంకాలమయ్యేవరకు ఇల్లు చేరుకున్నాను. త్వరగా మజ్జనభోజనాదులయినవనిపించి, దేహమంతా విరగగొట్టినట్లున్నా, అట్లాగే ఓపికచేసుకొని భావిబొడ్డు మీదికి చేరుకొన్నాను. ఎట్లా మొదలయిందో తెలియదుగాని సాంబయ్యా, సూరయ్యా పెద్దగా కేకలు వేసుకొంటూ దయ్యాలనుగురించి పూర్వ పక్షసిద్ధాంతములు చేస్తున్నారు. దయ్యాలున్న వనేదానికి తార్కాణగా సాంబయ్య, "అదిగో, అమావాస్యనాటి రాత్రి, ఆమఱ్ఱిక్రింద పండుకుంటే తెలుస్తుంది ఏసంగతీని" అని, అంతటితో ఊరుకోక ఎప్పుడో కాలమునాడు బుడిగితోటలో నేను భయపడి, జబ్బుపడి, ఆరునెలలదాకా బాగుపడకపోవటము చెప్పాడు. అదివరకంతా ఏదో యాదాలాపముగా వింటూ పడుకున్న నాగుండెలు ఒక్కమారు 'ఝల్లు'మన్నయి. "చల్లనివేళ యీపాడుఆలోచన లేమిటోయ్?" అని సాంబయ్యను కసురుకోగానే వా డూరకున్నాడు. సూరయ్యా మరింత రెచ్చిపోతున్నాడు. కొంతసేపటికి సంభాషణక్రమము మారి ఏదోతోటలు, దొడ్లు మాటలు వచ్చినయి. నేను ఊరుకోమనగానే సాంబయ్యా దయ్యాలసంగతి మాట్లాడటము మానివేశాడనే ఉడుకు పట్టలేక, సూరయ్యా, "ఈయేడు బుడిగితోట ఎవరూ తీసుకోరేమో, దయ్యాలకు భయపడి. ఏం సాంబయ్యా?"అని కుళ్లగించాడు. అంతటితో నాఆలోచనలన్నీ వెనక బుడిగితోటలో నేను పడిపోయిన సందర్భాల వెంబడే పరుగెత్తినయి.

* * * *

అట్లా యెంతసేపు ఆలోచిస్తున్నానో నాకు తెలియకుండానే ఆదమరచి నిద్రపోయాను. ఒకరాత్రివేళ ఎందుకో మెలకువ వచ్చింది. ఊరికి ఉత్తరపువైపున స్మశానము ప్రక్కగా పోయే రాస్తామీద దూరపుఊళ్లు పోతున్న రెండెడ్లబండ్ల గంటలమ్రోతలు ఆకాశమును భేదించుకొనివచ్చి నాచెవులలో గింగురుమన్నయి. ఎక్కడా మనిషి అన్నమాట కనపడలేదు. రెండుఝాములు కావచ్చుననుస

కున్నాను. భూతాలు తిరిగేవేళ ఇక్కడ ఎందు కు ఉన్నానా అని జ్ఞప్తికి తెచ్చుకోగా సాంబయ్యా సూరయ్యల వాదము స్మృతిపథములో తో చింది. నెమ్మదిగా ఇంటికి చేరుకుందామని లేవబోతూఉండగానే ఆమూల పశువులచావడి మొత్తమీద ఉన్న దయ్యాలమఱ్ఱినీడలో పేడ కుప్పవద్ద ఏదో కదలిన ట్లయింది. నానవనాడు లూ క్రుంగిపోయినయి. ఎరగనట్లుగా కన్నులు మూసుకున్నాను. కాసేపుండి కనురెప్పల సందునుంచి దృష్టి సారించి చూశాను. బయ టంతా వెన్నెలయినా, చెట్టుక్రింద నీడగావ టముచేత, ఆనీడలో ఉన్న ఆకారము నాకు స్పష్టముగా కనుపించలేదు. మోకాళ్లపైదాకా ఏదో చీర, చింపిరితలమాత్రము కనబడినయి. మళ్లా కళ్లు మూసుకున్నాను. ఇంతలో ఏదో 'తప, తప' మని శబ్దమయింది. ఉలికి పడి కళ్లుదెరచి చూశాను. నీడలో వంగి యేదో దేవులాడుతున్నట్లు కనిపించింది. కళ్లు మూయటానికికూడా శక్తిలేక అట్లనే చూస్తూ పండుకున్నాను. మొత్త దాటి ఏదో చంకన బెట్టుకొని నావేపుకే నడుస్తూఉంది ఆపిశాచి. నాగొంతు ఎండిపోయింది. పొత్తికడుపులో ఏదో 'దడ' మొదలుపెట్టింది. (గుండెకాయ ఏమయిందో నే నెరగను.) పండుకొని ఉన్నా కాళ్లలో నీరసత్వము తోచింది. దేహ మంతా చెమటలు క్రమ్మినయి. ప్రాణాలు అయినారు అయిపోయినయి. వస్తూ వస్తూ ఉన్న పిశాచము నిలబడిపోయి, అటూ, ఇటూ దిక్కులుచూస్తూ ఉంది. అదివరకటి దాకా నన్ను చూడలేదుగాబోలు. ఇప్పుడు చూసి ఏంజేస్తుందోనని మరింత భయమయిం ది. మా యిలవేలుపుభూతనాయకుడు తల పుకు వచ్చాడు. "మహాప్రభో! ఈపిశాచం బారినుంచి యివ్వాళ నన్ను తప్పించితే యీ సంవత్సరము నీకల్యాణమహోత్సవము నే నొ క్కడనే కావించుతాను. 'రావే యీశ్వర, కావవే వరద సంరక్షించు భద్రాత్మకా'" అని మ్రొక్కుకొన్నాను.

ఇంతలో ఆ పిశాచము నెమ్మదిగా చావడి గుమ్మముదగ్గరకు పోతూఉన్నట్లు కనిపించింది. లోకనాథుడు నా ఆర్తనాదము విన్నాడు. నా గౌరీపతి నన్ను కరుణించాడు. తలుపుగొళ్లెము కదిలింది. తలుపులు కిఱ్ఱుమన్నయి. పిశా చము లోనికి పోయింది, నాకు ఊపిరాడింది.

వెంటనే వేయిఆలోచనలు తగిలినయి. "అస లది భూతమేనా? కాకపోతే అర్ధరాత్రి వేళ ఎందుకు తిరుగుతుంది? అయితే గొడ్ల చావడిలో ఏమిపని? "..."చెట్టుక్రింద పేడ దిబ్బదగ్గర ఏమిటి వెతికింది?"..."ఆఁ..." గొబ్బున నా కొక ఆలోచన తట్టింది. ధైర్య ముగా లేచి కూర్చున్నాను. కాసేపటిలో పిశాచము బయటికి వచ్చి చంకలోనుంచి ఏదో దించి తలుపు గొళ్లెముపెడుతుంది. బాగా తేరిపారజూశాను. పిశాచాలకుమల్లే పాదాలు వెనకకు తిరిగిలేవు. బాగా ధైర్యము చిక్కింది.

"ఎవ రామనిషి ?"

ఆవ్యక్తి చప్పున వెనక్కి తిరిగిచూశింది. పోలికలు తెలియవచ్చినయి. ధైర్యము చిక్కబడ్డది.

"ఏమది మాట్లాడవు?" అంటూ తొందరగా లేచి దగ్గరకుపోయాను. ఆమనిషి తల వంచుకుంది.

"ఏం సుబ్బమ్మా? ఏంపొయ్యేకాలము వచ్చింది? దొంగప్రొద్దున ఎందు కిట్లా వచ్చావు ?"

"................"

"పగలంతా బజారునపోయే గొడ్ల పేడం తా చాలక దొంగవేషాలు మొదలుబెట్టావు! ఇట్లా అయితే ఆసామీ యేమికాను ? బలే పనేలే, పదపద. ఆపేడ అక్కడ వేసి మరి కదులు. సుబ్బమ్మ సుబ్బమ్మ అంటే ఏమో ననుకున్నా, బలే సుబ్బమ్మవే!"

"కాదన్నయ్యా, ఆవైపు......"

"ఛా, అన్నయ్యాఅంటావు ! ఏభయ్యేళ్ల తొక్కావు, నీకు అన్నయ్యనా నేను ?"

"......కాదండీ. పడమటిబజారున బల్లు విడిస్తే అక్కడ తుక్కూ దూలూ కాస్త పోగు జేసి, ఈబజారున ఒకకడి దొరుకుతుందేమో నని యిట్లా వచ్చాను."

"వచ్చినదానివి దారిని పోక దొడ్లోకి పోయిన దెందుకు ? నీవు ఏరుకువచ్చిన పేడ అందులో వేద్దామనా ? వీలయితే లోకుల సొమ్ము వేసుకుపోదామనా ? చాల్లే పద."అని నే నివతలికి వచ్చేశాను.

"మఱ్ఱిచెట్టులో దయ్యమంటే యిదే కామను. దయ్యము దయ్యమంటే భయమే పెద్దదయ్యము. వెనకటికి శాస్త్రము చెప్పి నట్లు అనుమానమే పెనుభూతము." అని అనుకొంటూ నెమ్మదిగా ఇంటికి పోయి పండుకున్నాను. పండుకున్నానేగాని నిద్ర రావటము లేదు. సుందరమ్మమాత్రము విసుకుకుంటూ వచ్చి తలుపుతీసి ఒకప్రక్కన మంచం పట్టెను కరచుకుని నిద్రపోతున్నది.

"రోజూ, సుందరమ్మదగ్గర అంత ధైర్యముగా మాట్లాడేవాణ్ణి. ఇవ్వాళ ఎంతపని అయిందీ" అని నవ్వుకొని సిగ్గుపడ్డాను.

మళ్లా(సిగ్గుపడటమువలనగాబోలు) నన్ను నేనే సమర్థించుకున్నాను.

"ఇవ్వాళ నాఅదృష్టము మంచిదయి అది సుబ్బమ్మ అయిపోయిందిగాని, అసలే దయ్యాలు లేవనటాని కెట్లా వీలు ? దయ్యాలే లేకపోతే ఉన్నవని చెప్పటానికి ఇంగ్లండులో Conon Doyle వాళ్లూ, నమ్మటానికి కడమవాళ్లందరూ పిచ్చివాళ్లా?......" అని అనుకునేవరకు కొంచెము మతి చలించింది. పట్టెను ఒత్తుకొని పండుకున్న సుందరమ్మను దగ్గరకు తీసుకున్నాను. "ఇప్పుడు దయ్యా లుంటేమాత్రము న న్నేం జేస్తవిలే" అనుకొంటూ........నిద్రపోయాను కామన్ను, కళ్లుతెరచి చూసేవరకు అప్పటి కప్పుడే తెల్లవారిపోయింది.

---

# అసమాన దాంపత్యం

'చౌదరి'

చౌదరయ్యగారు సామాన్యస్థితిపరులు. పూర్వులు సంపాదించిన మాగాణి పదిఎకరాలు, పెంకుటిల్లు ఉన్నాయి. ఋణపణాలు లేవు. సంసారపక్షంగా జరుపుకుంటే భుక్తికి లోటు లేదు. తాను తినావచ్చు, ఇతరుల కింత పెట్టావచ్చు. ఆయన పెద్ద కుమారుడు రామారాయుడు వీధిబళ్లోనే కొంత డొక్కశుద్ధి అయినతరువాత చదువు చాలించి వ్యవసాయపుపనుల్లో తండ్రికి చేదోడుగా ఉంటున్నాడు. రెండో పిల్లవాడు వెంకటరావు చదువువిషయంలోనే కొంతచిక్కు వచ్చింది. వెంకటరావుకు రెండు ఇంగ్లీషుముక్కలు చెప్పిస్తే చీటికిమాటికి బ్రాహ్మలచుట్టూ తిరగడం తప్పుతుందని చౌదరయ్యగారు కుఱ్ఱవాణ్ణి ఇంగ్లీషుబళ్లో ప్రవేశపెట్టాడు. వెంకటరావు చాల చురుకైనవాడు. ఒకటిరెండుసంవత్సరాల్లోనే 3-వ ఫారము పూర్తి చేశాడు. ఆ ఊళ్లో ఇంగ్లీషుచదువు అంతవరకే. ఇంకా చదువుకోవాలంటే ఏ బందరులాంటి బస్తీకో పోవాలి. బస్తీచదువుకు కావలసిన ఖర్చు భరించడానికి చౌదరయ్యగారి స్థితి చాలదు. చదువుచాలించి వ్యవసాయము చూచుకోమని తండ్రి కొడుకుతో అన్నాడు. స్కూలుఫైనలువరకైనా చదవాలని వెంకటరావు పట్టుదల. కుఱ్ఱవాడి మాట కాదనలేక చౌదరయ్యగారు వెంకటరావును బందరు హిందూ హైస్కూలులో ప్రవేశపెట్టాడు. వెంకటరావు స్కూలుఫయినలు ప్యాసు అయ్యేసరికి చౌదరయ్యగారి కుటుంబము కొంత ఋణములో పడ్డది. చదువు చాలించి యేదైనా నౌకరి సంపాదించుకుంటే ఋణము తీరుతుం దని చౌదరయ్యగారి ఆశ. బి. ఏ. ప్యాసు అయితేనేగాని ఉద్యోగం దొరకదనీ, అందుచేత బి. ఏ. చదవా లనీ వెంకటరావు పట్టుపట్టాడు. తండ్రికి ఇష్టము లేక పోయినా వెంకటరావు బందరుకాలేజీలో ప్రవేశించాడు. చౌదరయ్యగారు కొంత భూమిని సాహుకారు రామయ్యగారికి తాకట్టుపెట్టి అబ్బాయికి కావలసిన డబ్బు పంపిస్తున్నాడు. వెంకటరావు యఫ్. ఏ. క్లాసులో ఉండగా వెయ్యిన్నూటపదహార్లు కట్నము ఇచ్చి బి ఏ. కు కావలసిన ఖర్చు భరించుతామంటూ సంబంధాలు వచ్చినవి. బి. ఏ. ప్యాసు అయితేగాని పెండ్లి చేసుకో నని వెంకటరావు భీష్మించడంచేత సంబంధాలు తిరిగిపోతూవచ్చినవి. అసలు వెంకటరావు ఉద్దేశ్యం యేమంటే బి. ఏ. ప్యాసు అయి, స్త్రీపునర్వివాహమో, వర్ణాంతర వివాహమో చేసుకొని సంఘానికి మార్గదర్శకుడై దేశసేవ చెయ్యాలని. వెంకటరావు బి. ఏ. ప్యాసుఅయ్యేసరికి వారి కుటుంబానికి ఉండుకున్న పదియకరాల మాగాణి ఋణాలక్రింద పోయింది. ఇల్లు మిగిలింది. వెంకటరావు పట్టభద్రుడై ఇంటివద్దనే ఉంటున్నాడు. ఎంతప్రయత్నించినా తగిన ఉద్యోగం దొరకలేదు. చిన్నచిన్నఉద్యోగాలుచేయడం వెంకటరావుకు ఇష్టంలేదు. ఉద్యోగం దొరక్కపోవడంచేత బి. యల్. చదివి చెక్క కట్టాలనుకున్నాడు, వెంకటరావు. అయితే డబ్బేదీ?

ఆరోజుల్లో కమ్మవారిలో ఇంగ్లీషు చదువుకున్నవాళ్లు బహు కొద్దిమంది. బి. ఏ. ప్యాసుఅయినవాళ్లు ఎక్కడనోగాని లేరు. స్థితిపరులై, ఆడపిల్లలు గల తండ్రులు బి. ఏ. లు తమకు అల్లుళ్లు కావాలని ఆశించేవారు. ఎంత రొక్కమయినాయిచ్చి అల్లుళ్లను కొంటూ ఉండేవారు.

వెంకటసుబ్బయ్యగారు కోడూరు కల్లా పెద్ద రయితు. సుక్షేత్రమయిన మాగాణి రెండువందల యకరాలు ఉంది. యాభైవేలకుపైగా కవెలఉంది. ఆయనకు వరలక్ష్మి ఒక్కతేకుమార్తె. ఇద్దరు కుమాళ్లు. ప్రథమ సంతానమే వరలక్ష్మి. వెంకటసుబ్బయ్యగారిది చాలా గౌరవముగల కుటుంబము. గ్రామపెత్తనం మొదటి నుంచీ వీరికుటుంబములోనే ఉంటూంది. కుటుంబ గౌరవం కాపాడుకుంటూ వెంకటసుబ్బయ్యగారు గ్రామంలో పెత్తనం చలాయిస్తున్నాడు. ఆయన

రెడ్డిగం వేసుకొని, రచ్చ బండదగ్గర కూర్చుని చిల్లర తగువులు విచారించి తీర్పుచెపుతూంటే రాజుగారు కొలువుతీర్చినట్లే ఉంటుంది. ఆయనమాటలధోరణిని బట్టి, ముఖవైఖరినిబట్టిచూస్తే విద్యాగంధం కలవాడుగా కనబడుతాడు. ఆయన తెనుగుచదువు చదువుకున్నవాడే. రామాయణభాగవతాలు స్వయంగా చదువుకొని అర్థం చేసుకోగలడు. తన తల్లిదండ్రులు తనకు ఇంగ్లీషు చెప్పించనందుకు చాలావిచారపడుతూఉంటాడు. తహశ్శీలుదార్లు వగైరా ఉద్యోగస్థులతో మాట్లాడుటకు తనకు ఇంగ్లీషురానందుకు సిగ్గుపడుతూ ఉంటాడు. తనపిల్లవాళ్లకి ఇంగ్లీషుచెప్పించాలని, తనకు ఇంగ్లీషు వచ్చిన అల్లుడు రావాలని ఆయనకోరిక.

వరలక్ష్మి చక్కనిచుక్క. తల్లిదండ్రులు ఆమెను అల్లారుముద్దుగా పెంచారు. ఆమెతల్లి వెంకమ్మగారు ఆమెకు కావలసినన్నినగలు చేయించి ఆమెను బంగారు బొమ్మగా తయారుచేసింది. వెంకమ్మ వరలక్ష్మిఒంటి నిండా నగలు పెట్టి, చక్కగా శృంగారించి ఆడుకోవడానికి పంపేది. ఒళ్ళు మట్టిచేసుకోవద్దనీ, ఆడుకునే పిల్లలని అంటుకోవద్దనీ చెప్పిపంపేది. వరలక్ష్మి ఆటలయందు అభిలాషకలది అయినా తల్లి కోప్పడుతుందనే భయముతో దూరముగా కూర్చుని తోడిపిల్లలు ఆడుకుంటూంటేచూచి ఇంటికి తిరిగివచ్చేది. తోడిపిల్లలు ఆమెనగలవంక ఆశ్చర్యముతో చూస్తుండేవారు. ఆమె సగర్వముగా వారివంకచూస్తుండేది. అలంకారప్రియత్వము ఆమెకోమలహృదయములో అంకురించి, వేరు పారింది.

వరలక్ష్మికి పన్నెండేండ్లురాగానే ఆమెకు వివాహముచేయవలెనని వెంకటసుబ్బయ్యగారు సంకల్పించారు. బి. ఏ. చదివిన కుఱ్ఱవాళ్లకొరకు దేశమంతా గాలించారు. వాకబుచేయగా చేయగా వెంకటరావు సంగతి తెలిసింది. ఆస్తి యేమీలేకపోయినా వెంకటరావు బుద్ధిమంతుడనీ, రూపవంతుడనీ వెంకటసుబ్బయ్యగారు విని అన్నివిధాలా వెంకటరావే తనకు తగిన అల్లుడని ఆయన నిశ్చయించుకున్నాడు. ఈసంగతి తన భార్య వెంకమ్మతో చెప్పాడు. ఆస్తిలేనివాడికి కిస్తే నలుగురిలో తలవంపుగా ఉంటుందని మొదట వెంకమ్మగారు ఇష్టపడలేదు. కాని కుమార్తె వరలక్ష్మిని మూడవ కుమారుడుగా భావించి తనఆస్తిలో 3 వ వాటాను పసుపూకుంకుమక్రింద వరలక్ష్మికి ఇస్తాననీ, అమ్మాయికి యేలోటూ జరుగనివ్వననీ వెంకటసుబ్బయ్యగారు నచ్చజెప్పినమీదట వెంకమ్మగారు సంబంధానికి ఒప్పుకున్నది. వెంకటసుబ్బయ్యగారు చౌదరయ్యగారికి కబురుచేశారు. చౌదరయ్యగారి ఆనందానికి మేరలేదు. కాని వెంకటరావుమాత్రము దిగులుపడ్డాడు. సంస్కరణ వివాహము చేసుకునే అవకాశము పోతుందన్నభయము ఒకవైపు, బి. యల్. చదవడానికి డబ్బు దొరుకుతుందన్న ఆశ రెండవవైపు ఆతని హృదయాన్ని కలవరపెట్టినవి. ఆశ గెలుపొందగా అతడు ఈ సంబంధానికి సమ్మతించాడు. ప్రధానం జరిగింది. సుముహూర్తము నిశ్చయించారు.

వెంకటసుబ్బయ్యగారు బ్రహ్మాండముగా పెండ్లి ప్రయత్నాలు చేయిస్తున్నారు. స్వంతజీతగాండ్లు, గ్రామస్థులు వచ్చి పందిళ్లు వేస్తున్నారు. వెంకటసుబ్బయ్యగారు డాబా అరుగుమీద తివాసీ వేసుకొని కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు. "మీఅల్లుడుగారు మీతో సమానమైన చెయ్యేనటే" అన్నాడు రామిరెడ్డి, వెంకటసుబ్బయ్యగారితో. వెంకటసుబ్బయ్యగారు చిరునవ్వు నవ్వాడు. వెంకటసుబ్బయ్యగారి భార్య వెంకమ్మ దర్వాజాలు కడిగి బొట్లు పెడుతూండగా ఇరుగుపొరుగు అమ్మలంతా వచ్చి "ఏమోనమ్మా, రత్నంలాటిపిల్లను బొత్తిగా లేనివాడికి ఇస్తున్నారు. చదువేమి బువ్వ పెడుతుందా? అందం కొరుక్కుతింటామా? మగవాళ్ల కేమి గాని కన్నతల్లివి నీవెలా యిష్టపడ్డావమ్మా?" అన్నారు. వెంకమ్మమనస్సు చివుక్కుమంది. ఏమి సమాధానము చెప్పడానికి ఆమెకు తోచలేదు. ఆక్షణంనుంచీ ఆమె మనస్సు కలతజెందింది. పెండ్లిపనులయందు ఆమెకు మనస్సు పోవడంలేదు. కళకళలాడే ఆమెముఖాన కారుమబ్బులు కనబడున్నాయి. ఆమె వరలక్ష్మిని చూచి కంట తడిపెట్టడం మొదలుపెట్టింది.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావు?" అన్నది వరలక్ష్మి. "మీ నాన్నకు పిచ్చిపట్టుదలమ్మా. నే నెంత చెప్పినా వినరు. నిన్ను నిరుపేదకు ఇచ్చి పెండ్లిచేస్తున్నారు. నలుగురు నాలుగుమాటలు నన్నంటున్నారు. నేను పదిమందిలో తల యెత్తుకోవడానికి వీలులేకుండా ఉంది." అని తల్లి వెంకమ్మ దుఃఖము ఆపుకోలేక యేడ్చింది. వరలక్ష్మిముఖము చిన్నబోయింది. కళ్లవెంట నీళ్లు గిర్రున తిరిగినవి. కళ్లనీళ్లు కళ్ల గ్రుక్కుకుంది. వరలక్ష్మిమనస్సు చెయ్యిపెట్టి కెలచినట్లయింది. ఇంతకలవారిఇంట్లో పుట్టి, బొత్తుగా లేనివానిని చేపట్టడం ఆమెకు న్యూనతగా తోచింది. సహజగర్వము ఒక్కసారిగా పైకి ఉబికింది. "నాన్నా, నేను నీకంత బరువయ్యానా" అన్నది వరలక్ష్మి. వెంకటసుబ్బయ్యగారు వెనక్కి తిరిగిచూశాడు. వరలక్ష్మి తలుపునానుకొని తల వంచుకు నిలబడిఉంది. ఈమాట వరలక్ష్మిచేత ఎవరు అనిపించింది వెంకటసుబ్బయ్యగారికి తెలుసు. ఆయన నవ్వి, కుమార్తెను దగ్గరకుతీసుకొని ముద్దుపెట్టుకున్నాడు. "నేనుండగా నీ కేలోటూ జరుగదమ్మా" అన్నాడు, ఆయన నవ్వుముఖముతో. వరలక్ష్మి నవ్వుతూ లోపలికి పోయింది.

వరలక్ష్మివెంకటరావుల వివాహము సుముహూర్తాన అతివైభవంగా జరిగింది. అల్లుడు లేనివాడని తెలిసి ఉభయఖర్చులు వెంకటసుబ్బయ్యగారే భరించాడు. 30 యకరాలభూమి, వెయ్యిన్నూటపదహార్లరొఖ్ఖం వెంకటసుబ్బయ్యగారు అల్లుడుకట్నం చదివించాడు.

వరలక్ష్మినగలకుగాను చౌదరయ్యగారు నాలుగు వందలరూపాయలు — అప్పుతెచ్చినబాపతు — చదివించాడు. పెండ్లికివచ్చిన వెంకటసుబ్బయ్యగారి బంధువర్గమంతా వెంకటసుబ్బయ్యగారిని చూచి మూతులు విరిచారు. నగలుక్రిందయిచ్చిన నాలుగువందలు చూచి ఆడంగులంతా చప్పరించారు. ఎవరేమనుకున్నా వెంకటసుబ్బయ్యగారుమాత్రము అల్లుణ్ణి చూచుకొని ఆనంద పారవశ్యంచెందాడు. చదువుకున్న తన మిత్రులకు తన అల్లుణ్ణి చూపుకొని ఆయన గర్వించాడు. ఈ ఆనందమును అనుభవించడానికి వెంకటసుబ్బయ్యగారు నోచుకోలేదు. పెండ్లిఅయిన కొద్దిరోజులకే వెంకటసుబ్బయ్యగారు అకాలమృత్యువువాత బడ్డాడు. మామగారి మరణకాలమందు వెంకటరావు దగ్గరనేయుండి సర్వోపచారములు చేశాడు. మామగారి అకాలమరణానికి వెంకటరావు చాలా దుఃఖించాడు. అవివేకులైన లోకులంతా వెంకటరావును నిందించారు. "అల్లునిరాకడ, మామపోకడ" అని పదంకట్టారు. వెంకటరావు చాలా చికాకుపడ్డాడు.

వెంకటరావు అత్తవారియింటివద్దనే ఉంటున్నాడు. బి. యల్. చదువవలెనన్న అభిలాష అతనిని వీడలేదు. కాని డబ్బుదారికే మార్గమేదీ? తనను కోరి తెచ్చిన మామగారులేరు. బావమరదులు చిన్నవాళ్లు. ఒకనాడు వెంకటరావు అత్తగారింటి పడమటింటిలో భోజనము చేస్తున్నాడు. ఓరగిలవేసియున్న తలుపు చాటున అత్త వెంకమ్మగారు నిలబడియున్నట్లు వెంకటరావు కనిపెట్టాడు.

"మాగోల మాకుకొట్టించి" అన్నది అత్త వెంకమ్మగారు మెల్లగా. "ఏమి" అన్నాడు వెంకటరావు. "మా అమ్మాయిని మీకు ఇవ్వడం మాకెవ్వరికీ ఇష్టము లేదు. మీ మామగారి పట్టుదలమూలాన పెండ్లిఅయ్యింది. లేకుంటే —" అని యేమోచెప్పబోయి వెంకమ్మ యేడ్చింది. వెంకటరావుకు ఇది కొత్తసంగతే. అతని మనస్సు కలచినట్లయింది. అభిమానము ఒకసారిగా హృదయాన్ని ఆవహించింది. "మీ కెవ్వరికీ యిష్టము లేదా యేమి?" అన్నాడు వెంకటరావు తెచ్చిపెట్టుకున్న నవ్వుతో. "ఇష్టము లేకుంటే మాత్రము తప్పింది గనుకనా" అన్నది వెంకమ్మ, గద్గదస్వరముతో. "మీకు మా అమ్మాయిని యివ్వడంవిషయంలో మమ్ములను లోకమంతా చీవాట్లు పెట్టినవాళ్లే. ఎవరేమన్నా చేసేదేముంది? పడవలసిన రోజులు గదా అని నోరు మూసుకుంటున్నాము" అన్నది వెంకమ్మగారు, కొంచెము ధైర్యము తెచ్చుకొని. వెంకటరావుహృదయానికి ఈ మాటలు ములుకులులాగా తగిలినవి. అతనికి దుఃఖము పొర్లివచ్చింది. మగవాడనుటచేతను, క్రొత్తస్థల

మగుటచేతను దుఃఖముఆపుకొని తెచ్చుకున్న నవ్వుతో భోజనం పూర్తి చేసి లేచాడు. ఏమి తిన్నాడో అతనికి ఏమీ తెలియదు.

ఒకనాడు వెంకటరావు భోజనముచేసి తాంబూలము వేసుకుంటూ డాబా అరుగుమీద కూర్చున్నాడు. "బావమరదులు చూస్తే చిన్నవాళ్లు. మాకు బోలెడంత ఉంది. చదువుకున్నా పొట్టకూటికేగదా! మీరు మా యింటివద్దనే ఉండి వ్యవసాయం చేయించండి. ఏదో మీకు ఇంత ముట్టచెప్పుతాము" అన్నది వెంకమ్మ మెల్లగా. వెంకటరావు నిర్విణ్ణుడై పోయాడు. కొంతసేపటికి తెలివి తెచ్చుకొని "అల్లాగే లెండి" అన్నాడు. మరునాడు ఉదయము లేచి వెంకటరావు స్వగ్రామానికి వెళ్లిపోయాడు. సంతోషంగానే వెళ్లినట్లు అతడు కనబడ్డాడు. దుఃఖపూరిత హృదయముతో అతడు వెళ్లుచున్నట్లు అనుమానపడడానికి ఎవ్వరికి అతడు అవకాశము ఇవ్వలేదు.

వెంకటరావు స్వగ్రామమువెళ్లి తండ్రికి తెలియకుండానే, స్వంతపూచీమీద రెండువేలరూపాయలు అప్పు తీసుకొని మద్రాసువెళ్లి లాకాలేజీలో ప్రవేశించాడు. రెండుసంవత్సరాలు కష్టపడిచదివి, బి. యల్. పూర్తి చేసి బందరులో ప్రాక్టీసు పెట్టాడు. మద్రాసులో ఉండగా అప్పుడప్పుడూ శలవులలో అత్తగారింటికి వచ్చి వెంటనే పోతూఉండేవాడు.

బందరులో ఇల్లు అద్దెకుతీసుకొని, ప్రాక్టీసు పెట్టి, భార్యను పంపవలసినదిగా వెంకటరావు అత్తగారికి కబురుచేశాడు. పంపడానికి అత్తగారు అన్నిప్రయత్నాలుచేసి బయలుదేరడానికి సిద్ధపడింది. "అద్దెయింటికి కాపురానికి పంపడం ఏమిటమ్మా" అన్నారు ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా. వెంకమ్మగారి మనస్సు చెదరిపోయింది. ఆమెకు దుఃఖము పొర్లివచ్చింది. కాని పైకిమాత్రము ఉబకనివ్వకుండా ఆపుకొని కుమార్తెను ప్రయాణముచేయించి, వెంటబెట్టుకొనిపోయి బందరులో ప్రవేశపెట్టి పదిరోజులుండి తిరిగివచ్చింది. వెంకటరావుప్రాక్టీసు ఒకమోస్తరుగా ఉంది. మితముగా వాడుకుంటే కాపురం జరగడం అంతకష్టం కాదు. వెంకటరావు తానుసంపాదించిన రూపాయో, అర్ధో పెట్టెలోవేసి తాళముచెవి పెట్టెమీదనే ఉంచుతాడు. ఎవరికికావలసినంత వారు వాడుకోవచ్చును. వెంకటరావుకు ఎట్టిఆక్షేపణ లేదు. కాని జమాఖర్చు వ్రాసుకునేందుకుమాత్రము ఎవరు ఎంతతీసుకుందీ ఆరా యివ్వాలి.

"ఇరవై రూపాయలు లెఖ్ఖకురాలేదు. నీవేమైనా తీశావా?" అన్నాడు వెంకటరావు భార్యతో ఒకనాడు. వరలక్ష్మి మాట్లాడలేదు. "జమాఖర్చు వ్రాయాలి. తీస్తే చెప్పు" అన్నాడు. "చీరలు తెప్పించుకోడానికి తీశాను. ఇదిగో తీసికోండి" అంటూ వరలక్ష్మి చెంగునఉన్న ఇరవై రూపాయలు విప్పి వెంకటరావుముందు పారవేసింది. వెంకటరావు తెల్లపోయి, కొంతసేపటికి తెలివితెచ్చుకొని, ఆరూపాయలు అక్కడనే విడిచిపెట్టి ఆఫీసులోకి వెళ్లి కూర్చున్నాడు. పార్టీలతో మాట్లాడుతున్నాడుకాని యేమి మాట్లాడుచున్నదీ అతనికే తెలియడంలేదు. అతని మనస్సు ఎక్కడనో ఉంది. కోర్టుకు తొందరగా పోవాలె. పది అయ్యింది. పదకొండు అయ్యింది. భోజనానికి పిలుపు రాలేదు. పిలుపుకొరకు కూర్చుంటే వేళ మించిపోతుందేమోనని వెంకటరావు లోపలికివెళ్లి కాళ్లుకడుక్కొని పీటమీద కూర్చున్నాడు. వరలక్ష్మి మాట్లాడకుండా వడ్డించింది. మామూలుగా నేతిగిన్నె దగ్గర పెడుతుంది. ఆరోజున నేతిగిన్నె దగ్గర లేదు. నేయి స్వయముగా వేసిపోతుందేమోనని వెంకటరావు అన్నము కలుపుకొని తినడం ప్రారంభించాడు. నేయి రాలేదు. ఒకవేళ నేయి వేయడం మరచిపోయిందేమోనని "నేయి తీసుకురా" అన్నాడు. "మీరు తెచ్చిన నేయి అయిపోయింది" అన్నది వరలక్ష్మి. "పోనీ, నీవు తెచ్చిందే తీసుకురా" అన్నాడు వెంకటరావు. వరలక్ష్మి మాట్లాడలేదు. నేయిలేకుండానే వెంకటరావు భోజనం పూర్తిచేసి కోర్టుకు పోయాడు. కోర్టులో స్నేహితులంతా అతన్ని చూచి "ఏమిరో వెంకటరావు, సుస్తీగా ఉన్నావేమి?" అన్నారు.

"ఎబ్బే లేదే" అన్నాడు వెంకటరావు.

లక్ష్మమ్మ వరలక్ష్మి పెదతల్లికుమార్తె. ఆమె అత్తవారు లక్షాధికారులు. వందయకరాల పొలము, మేడా ఉన్నాయి వారికి. లక్ష్మమ్మ అంత అందమైనది కాదు. ఆమె భర్తకు ఆమెకు అంత అనుకూలము లేదు. కాపురానికి వెళ్లిన కొద్దిరోజులకే ఆమెభర్త ఆమె యందు విముఖుడు అయ్యాడు. ఆమెను విడిచిపెట్టా డని చెప్పడానికి వీలులేదు కాని, ఆమెభర్త సంవత్సరానికి యే పదిరోజులోమాత్రము ఇంటిదగ్గర ఉంటాడు. బస్తీలలో తిరుగుతూఉంటాడు. బస్తీలలో అతనికి ఏమి పనో ఎవ్వరికీ తెలియదు.

"ఇంట్లో నలుగురు జీతగాండ్లు, దొడ్లో పది గొడ్లు ఉంటే అందం కాని, ఇవేమికాపురాలమ్మా, మజ్జిగతోసహా కొనుక్కు తాగడం!" అన్నది లక్ష్మమ్మ వరలక్ష్మితో.

"బ్రహ్మవ్రాత తప్పుతుందా?" అంది వరలక్ష్మి.

వరలక్ష్మికి లక్ష్మమ్మ జడవేస్తూంది. "నాయన చేయించిన నగలేనా, మీఆయన యేమైనా చేయించారా?" అన్నది లక్ష్మమ్మ వరలక్ష్మితో.

"నగలు కూడానా, గుడ్డలకు గతిలేకుండా ఉంటే? ఉప్పుతో సహా కోడూరునుంచి రావాలె. లేకపోతే పొయ్యిలో పిల్లి లేవదు" అన్నది వరలక్ష్మి.

"అన్నీ అక్కడనుంచి తెచ్చుకొని ఇక్కడ తినకపోతే, అక్కడే పడిఉంటే వేరేకాపురము, ఖర్చు తప్పుతుందిగా" అన్నది లక్ష్మమ్మ. అక్కగారి సలహా వరలక్ష్మిచెవులకు ఇంపుగానే ఉంది.

వెంకటరావు భోజనముచేస్తున్నాడు. లక్ష్మమ్మ వడ్డనచేస్తూంది. "నేనున్నాను కాబట్టి సరిపోయింది. నౌకరు లేకపోతే జరగడము ఎల్లాగ? అమ్మాయికి చిన్నతనము. ఎన్నడూ పనిముట్టుకొని యెరుగదు" అన్నది లక్ష్మమ్మ, వెంకటరావుతో. "నౌకరును ఉంచవద్దన్నానా" అన్నాడు వెంకటరావు. "మనకు తోడు నౌకర్లుకూడా యెందుకులెండి" అన్నది వరలక్ష్మి. అసలుసంగతి ఏమిటంటే, వరలక్ష్మి కష్టపడి పోగుందేమో నని వెంకటరావు నౌకరును పెట్టాడు. వరలక్ష్మి నౌకరుతో పోట్లాడి వెళ్లగొట్టింది. మరియొక నౌకరుకొఱకు వెంకటరావు ప్రయత్నము చేస్తున్నాడు. నౌకరుదొరకడం కొంత ఆలస్యము అయింది. నౌకరు చేస్తూండే పనుల్లో వీలైనవి కొన్ని వెంకటరావే చేస్తున్నాడు. లక్ష్మమ్మ పదిరోజులుండి అత్తగారింటికి వెళ్లిపోయింది. వరలక్ష్మికాపురం తనకు నచ్చలేదనీ, ఆమె చాలాయిబ్బందిపడుతూందనీ, తీసుకొచ్చి యింట్లోనే ఉంచుకోమనీ లక్ష్మమ్మ పినతల్లివెంకమ్మకు కబురు చేసింది. వెంకమ్మమనస్సులో ఆందోళనకలిగింది.

ఒకనాడు వెంకటరావు జమాఖర్చు వ్రాసుకుంటూ పెట్టెదగ్గర కూర్చున్నాడు. రు ౨౫ లు ఖర్చు తేలలేదు. అడిగితే భార్యకు కోపమువస్తుందేమోనని కలంకొన పంటికి కొట్టుకుంటూ, నొసలు పైకెత్తి దీర్ఘముగా ఆలోచిస్తున్నాడు. వరలక్ష్మి వెంకటరావు ఆందోళన గ్రహించింది. కాని అడుగనిదే చెప్పడ మెందుకన్న అభిమానము ఆమెను మాట్లాడనివ్వలేదు. వెంకటరావు పుస్తకము అక్కడపెట్టి వెళ్లిపొయ్యాడు. మర్నాడు జమాఖర్చు వ్రాసుకుందామని పుస్తకము తీస్తే "కోడూరునుంచి వచ్చిన నేతిక్రిందఖర్చు" అని రు ౨౫ లు ఖర్చుపద్దు అతనికి కనబడ్డది. అతనిహృదయ భారం కొంత తగ్గినట్లయింది. అతను ఒకవిధమయిన శాంతి, ఆనందం అనుభవించాడు.

ఒకసారి ఇస్త్రీ చాకలివాడు గుడ్డలు తేవడం కొంత ఆలస్యమయింది. వెంకటరావు కోర్టుకు పోవడానికి తలగుడ్డ లేకపోయింది. పెండ్లినాడు మామగారు చదివించిన పట్టుతలగుడ్డ ఒకటి తన భార్యపెట్టెలో నున్నట్లు వెంకటరావుకు జ్ఞాపకమువచ్చింది. "పట్టుతలగుడ్డ ఉండాలి నీవద్ద, ఇస్తావా" అన్నాడు వెంకటరావు. "పట్టుతలగుడ్డలు చుట్టారా ఇదివరకు" అన్నది వరలక్ష్మి చులకనగా. వెంకటరావు ఖద్దరుఉత్తరీయం తలకు చుట్టుకొని కోర్టుకు పోయాడు.

పిల్లలు లేకపోవడం వెంకటరావుకు కొంత దిగులుగానేఉంది. సంతానం భార్యాభర్తలను బంధించే సూత్రమనీ, తల్లిదండ్రుల హృదయకాఠిన్యాన్ని తొలగించి, వారి పరస్పర ప్రేమలను పవిత్రంచేయు సాధనమనీ ఆయన అభిప్రాయము. సంతానంకొఱకు వెంకటరావుహృదయము పరితపించుచున్నట్లు వరలక్ష్మి కనిపెట్టింది. "ఉన్నవాళ్లకే తిండిలేకపోతే, పైగా పిల్లలుకూడా ఎందుకులెండి" అన్నది ఆమె భర్తతో. "తిండిలేక చచ్చిపోతున్నామా" అన్నాడు వెంకటరావు. "పిల్లలను కని యేమిపంచిపెడతారు"అన్నది ఆమె. "మానాయన నాకేమిపంచిపెట్టాడు" అన్నాడు వెంకటరావు. "అందరూ మీవలెనే ఉండవలెననా మీకోరిక" అన్నది వరలక్ష్మి. వెంకటరావు వెఱ్ఱినవ్వుతో "నేనేమి తక్కువగా ఉన్నానా" అన్నాడు. "ఎక్కువగానే ఉన్నారు లెండి, లోకుల పిల్లలను ఏడ్పించడానికి" అన్నది వరలక్ష్మి. వెంకటరావు నివ్వెరపోయాడు. నోట మాటరాలేదు. ముఖాన చిరుచెమ్మటలుపట్టాయి.

వరలక్ష్మి ఒకనాడు ప్రొద్దున్నే లేచి, ఇంటిపనులు తొందరగా ముగించుకొని ఇంటిలో నిత్యకృత్యమునకు కావలసిన సామానుతప్ప తక్కినదంతా ఒక గదిలో సర్దించి స్నానముజేసి, తలదువ్వి, బొట్టుపెట్టుకొని ముస్తాబుఅయింది. వెంకటరావు అంతా చూస్తూనేయున్నాడు. కాని ఆమెను ఏమీ ప్రశ్నించలేదు. ౧౦ గంటలవేళ వెంకటరావు తలవంచుకొని భోజనంచేస్తున్నాడు. వరలక్ష్మి ముఖము ప్రక్కకుపెట్టుకొని క్రిందవంక చూస్తూ తలుపునానుకొని నిలబడిఉంది.

"నేను కోడూరువెళ్లుచున్నాను" అన్నది.

"ఎందుకు?"

"పనిఉంది."

"ఏమిపని?"

"ఊరకనే."

కొంచెముసేపు ఊరుకొని "ఎప్పుడు?" అన్నాడు వెంకటరావు.

"ఇప్పుడే" అన్నది వరలక్ష్మి.

"ఇప్పుడు బండిలేదు. నేను కోర్టునుంచి వచ్చి సాయంత్రము బండిలో పంపుతాను. వీలైతే నేనే వస్తాను" అన్నాడు వెంకటరావు. వరలక్ష్మి మాట్లాడలేదు. వెంకటరావు భోజనంచేసి కోర్టుకు వెళ్లిపోయాడు. సాయంత్రము ఇంటికి వచ్చేసరికి వరలక్ష్మి మోటారులో కోడూరు వెళ్లినట్లు వెంకటరావుకు తెలిసింది. అతని హృదయంలో ఏయేభావములు పుట్టిగిట్టినవో మనకు తెలియదు.

వెంకటరావు హోటలునుంచి భోజనము తెప్పించుకుంటున్నాడు. వారము రోజులయింది. పది రోజులయింది. వరలక్ష్మి రాలేదు. తాను హోటలులో తింటున్నాననీ, పనులకు ఇబ్బంది కలుగుతూందనీ, భార్యను పంపమనీ,వెంకటరావు అత్తగారికి కబురు చేశాడు."మీరే వచ్చి తీసుకుపొండి" అని అత్తగారు జవాబు పంపించింది. తీరుబడి చూచుకొని వెంకటరావు కోడూరువెళ్లాడు. అద్దెకొంపలో కాపురముచేయడం తనకు న్యూనతగా ఉందనీ, వెంకటరావేవచ్చి తమయింటిలో ఉండవలసిందనీ అత్తవెంకమ్మగారు చల్లగా అందించింది. వరలక్ష్మి తల్లిప్రక్కనే నిలుచునిఉంది. వెంకటరావు మాట్లాడలేదు.

వెంకటరావు మర్నాడు పెందలాడే లేచి, భార్యఉన్న గదిలోకి వెళ్లి, కంఠము సవరించుకుంటూ, హీనస్వరంతో "వెళ్లుచున్నాను" అన్నాడు. వరలక్ష్మి మాట్లాడలేదు. "పొమ్మన్నావా?" అన్నాడు—

"మీయిష్టము" అన్నది వరలక్ష్మి.

వెంకటరావు తొట్రుపాటుతో బయటికి వచ్చి, అత్తగారితో చెప్పకుండానే బయలుదేరి బందరు చేరాడు. హోటలులో భోజనంచేస్తూ వెంకటరావు ఖులాసాగా కాలము వెళ్లబుచ్చుచున్నాడు. ప్రాక్టీసుకూడా కొంచెము ఎక్కింది. అతనిస్నేహితులు సాయంత్రము అతని ఇంటివద్ద చేరుతారు. సాంఘిక రాజకీయవిషయాలు చర్చించుతూ, స్నేహితులతో వెంకటరావు కాలము ఖులాసాగా గడుపుతున్నాడు. చదువుకునేరోజుల్లో అతనిముఖాన తాండ

వించిన చిఱునగవుదొంతరలు, నేత్రాల్లో కాంతులు మరల ఇప్పుడు కనబడుతున్నాయి. భార్యాభర్తలకు కొంతవైషమ్యము కలిగిందని అతని స్నేహితులు వారిలోవారు అనుకుంటూ ఉండేవారు. కాని ఆవిషయమై వెంకటరావును ప్రశ్నించడానికి ఒక్కరైనా సాహసించలేదు. అట్లా ప్రశ్నించడానికి వెంకటరావున్నూ అవకాశము ఇవ్వలేదు.

రెండుసంవత్సరాలు గడచినవి. వరలక్ష్మి బందరు రాలేదు. వెంకటరావు కోనూరుపోలేదు. ఒకనాడు వెంకటరావు ఆఫీసులో కూర్చుని పనిమాచుకుంటూ ఉండగా పోష్టువాడువచ్చి కవరుఒకటి యిచ్చాడు. చించిచూడగా అందులో వెంకటరావు పెద్దబావమరది నాగయ్య వివాహమహోత్సవాహ్వానపత్రిక ఉంది. మర్నాడే పెండ్లి. వెంకటరావు ఆలోచనలో పడ్డాడు. పెండ్లికివెళ్ళడమా, వెళ్ళకపోవడమా? ఇది సమస్య. తాను పెండ్లికి రావలెనని అత్తగారి కోర్కె అయితే ఉత్తరము వ్రాస్తారా? అందులోను పోస్టుద్వారా పంపుతారా? వెళ్లకపోతే లోకమేమంటుందో అన్నభయము అతన్ని బాధించడం మొదలుపెట్టింది. పోయిరావడమే మంచిదని నిశ్చయించుకొని, బావమరదికి చదివించడానికి కొన్నిపుస్తకాలు, అతనిభార్యకు చదివించడానికి పొందూరుఖద్దరుచీర తీసుకొని లగ్నసమయానికి కోనూరువెళ్లాడు. అక్కడ అతనిని పలుకరించినవాళ్లు లేరు. లగ్నంకాసేపు అక్కడఉండి చదివింపులకొఱకు తీసుకొనిపోయినవి అక్కడనే విడిచిపెట్టి వెంటనే బందరుచేరాడు. వెంకటరావు బందరుచేరిన కొంచెంసేపటికి పుస్తకాలు, చీరాకూడా తిరిగివచ్చినవి. వెంకటరావుకు దుఃఖంపొర్లివచ్చింది. తనలో తానే యేడ్చుకొని, తన్నుతానే ఓదార్చుకున్నాడు. భోజనంచేసి కోర్టుకు వెళ్లాడు. అతనిముఖము కళకళలాడుతుంది. ఆరోజున కోర్టులో బహుహుషారుగా పనిచేశాడు. ఇద్దరుముగ్గురు స్నేహితులకు టిఫినుకూడాయిప్పించాడు.

తరువాత రెండుమాసములకు, "బందరులో అంతశ్శాఖావివాహము" అను శీర్షికతో వెంకటరావు యశోదాబాయిగార్ల వివాహము కృష్ణాపత్రికలోపడ్డది. యశోదాబాయి తెలగ వెంకటస్వామి నాయుడుగారి కుమార్తె. ఆమెకు బాల్యంలో వైధవ్యం సంభవించింది. తండ్రి వెంకటస్వామినాయుడుగారు కష్టపడి ఆమెకు బి. ఏ. వరకు చదువు చెప్పించాడు. సంఘసంస్కరణప్రియులగుటచే తన కుమార్తెను వెంకటరావుకు ఇచ్చి తన సంస్కరణాభిలాషను కార్యరూపంగా చూపించాడు.

వెంకటరావు పెండ్లివార్త వరలక్ష్మిచెవినిబడ్డది. తన తల్లిదండ్రులకంటె తెలివి తక్కువవారు లోకములో ఎవ్వరూ లేరని ఆమెఊహ. అందుచేత ఆమె వెంకటరావు వివాహవార్త నిజమని నమ్మలేదు. క్రమముగా నిజమని తెలిసినతరువాత ఉదాసీనభావంతో ఆమె ఊరుకుంది.

వరలక్ష్మి సర్వదా అలంకరించుకొని పూచిన తంగేడులాగా ఉంటూంది. ఏనవలో, స్త్రీల వ్రతకథలో చదువుకుంటూ కాలము గడుపుతూంది. రెండుసంవత్సరాలు గడచినవి. కాపురముచేస్తూ కనీ పెంచవలసిన రోజుల్లో, కూతురు యెప్పుడూ తనకండ్లయెదుట ఉండడం వెంకమ్మకు కొంచెము భారంగా కనుపించడం మొదలుపెట్టింది. కాని కుమార్తెమనస్సు నొచ్చుతుందేమోనని ఆమె తనహృదయంలోనున్న భావాన్ని కప్పిపుచ్చేది.

ఒకనాడు వరలక్ష్మి చక్కగా శృంగారించుకొని రామిరెడ్డిగారి యింటికి పేరంటానికి వెళ్లింది. సాహుకారు వెంకటసుబ్బయ్యగారి కుమార్తెఅని వరలక్ష్మిని రామిరెడ్డిగారి ఆడంగులు ఎక్కువగా ఆదరించారు. కాని ఆమెను చూడగానే అక్కడనున్నవారిలో గుసగుసలు బయలుదేరినవి. "మొగుడు విడిచిపెట్టా"డని తనను చూచిన వారంతా అనుకుంటున్నట్లుగా ఆమె అలంకుపడ్డది.

పేరంటాండ్రలో చాలమంది పొరుగూళ్లవాళ్లు. అరవైసంవత్సరాల ముత్తైదువ గంగమ్మ వరలక్ష్మి మెడలో

నున్న జుటకాసులదండ చేతితో లాగి పట్టుకొని చూస్తూ "మీఅత్తవారు లేరూవమ్మా?" అంది. వరలక్ష్మి సిగ్గుతో తలవంచుకుంది. "పిల్లలెంతమందమ్మా?" అన్నది మరొకఆవిడ. వరలక్ష్మిముఖము వివర్ణము జెందింది. ఆమె మాట్లాడలేదు.

వరలక్ష్మి ప్రశ్నపరంపరలకు గురిగావడం, సమాధానము చెప్పలేక బాధపడడం రామిరెడ్డిభార్య గ్రహించి, తెలివిగలది గనుక వరలక్ష్మిని దూరంగా తీసుకొనిపోయి తనకుమార్తెతో జతచేసింది. రామిరెడ్డి కుమార్తె నాగమ్మ, వరలక్ష్మి ఒక్కయీడువారే. ఒక బళ్లోనే చదువుకున్నారు. నాగమ్మ అత్తవారు సామాన్యస్థితిపరులే. ఆమె పండువంటి నలుగురు బిడ్డలతోను, భర్తతోను తండ్రిగారియింట్లో శుభకార్యమని వచ్చింది. నాగమ్మచంటిపిల్లవాడు నాగమ్మ ఒళ్లో కూర్చుని ఆడుకుంటున్నాడు. ఆ పిల్లవాణ్ణి వరలక్ష్మి తనదగ్గరకు లాగుకొని, ముద్దుపెట్టుకొని తన ఒడిలో కూర్చోబెట్టుకుంది. చంటిపిల్లవాని స్పర్శచే ఆమెఒళ్లు పులకరించింది. ఆమె హృదయతంతువు ఒకటి కదిలింది. అంతపనితొందరలోను నాగమ్మ తనభర్తసౌఖ్యాలను విచారించడం వరలక్ష్మికి ఆశ్చర్యముగా కనబడ్డది. ఆమె నాగమ్మను చూచి సిగ్గుపడ్డది. నాగమ్మ, వరలక్ష్మి గదిలో కూర్చుని యుండగా నాగమ్మభర్త కోటిరెడ్డి లోపలికివచ్చాడు. కోటిరెడ్డి కురూపి అంటానికి వీలులేదుకాని నాగమ్మకు తగినభర్తకాడు. వెంకటరావుకు కోటిరెడ్డికి యెక్కడా పోలికలేదు. నాగమ్మకు కోటిరెడ్డియందు గల భక్తిశ్రద్ధలు వరలక్ష్మికి విపరీతంగా తోచింది. వారి అన్యోన్యము వరలక్ష్మికి అర్థంకాలేదు.

వరలక్ష్మి చిన్నబోయిన ముఖముతో ఇంటికి వచ్చింది. ఆమెఒంటిమీద ఇప్పుడు నగలులేవు. ఆమె పూర్వమువలె అలంకరించుకోవడం మానివేసింది. ఆమెకు అలంకారములయందు ఆసక్తితో పాటు శరీరంకూడా క్షీణించడం ప్రారంభించింది. అజీర్ణవ్యాధి ప్రవేశించింది. ఎన్నిమందులు ఇప్పించినా రోగము కుదిరేటట్టు కనబడలేదు. ఆమెరోగస్వభావమును చక్కగా గ్రహించింది ఆమెతల్లి వెంకమ్మ ఒక్కతే. తమ తప్పిదములను మన్నించి, తనకుమార్తెను పరిగ్రహించవలసిం దని పెద్దమనుష్యులద్వారా వెంకటరావుకు ఆమె కబురుచేసింది. వరలక్ష్మిని తాను విడిచిపెట్టలేదనీ, తననే వరలక్ష్మి విడిచిపెట్టిందనీ, అయినను వరలక్ష్మియందు తన కెట్టిద్వేషము లేదనీ, కాని తన హృదయంలో వరలక్ష్మికి తావులేదనీ వెంకటరావు అన్నాడు. వచ్చినపెద్దలు వెంకటరావుకు సమాధానము చెప్పలేక వెళ్లిపోయారు.

వెంకటరావు పాలిటిక్సులో ప్రవేశించి శాసనసభాసభ్యుడు అయ్యాడు. యశోదాబాయిని గవర్నమెంటువారు స్త్రీలతరఫున శాసనసభకు నామినేటు చేశారు. వెంకటరావు, యశోదాబాయిగార్లు కలిసి ఇప్పుడు విడియాకులచట్టముకొఱకు కృషిచేస్తున్నారు.



# ఒ హా ర క ం

'గిరి'

"త్వమసి మమ భూషణాం,
త్వమసి మమ జీవనం...... "

౧

నాకిదం తేమీ తెలీదు నిజంగా. ఎప్పుడూ నాపూలూ, నాపాటలూ, నాగొడవే నాకు గాని యితర్లు యెక్కడేం చేస్తోన్నారో కనిపెడ్తోండడం నా స్వభావం కాదు. నాది అట్లాంటి స్వభావమే అయితే మావారు గోపాలకృష్ణుడి అవతారమైనందుకు ఈ కళ్ళతో యింకా యెన్ని దృశ్యాల చూసేదాన్నో, యీ చెవులతో యెన్ని విషయాల వినేదాన్నో!

డాక్టరుగారి కాంపౌండులో ఆపడమరవేపు మూల కున్న పొగడచెట్టంటే బలేసరదా నాకు. మధ్యాహ్నంపూట దానినీడలో మట్టసంగా కత్తిరించిన గరకమీద చల్లగా అడ్డమొరిగి చదువుతోనో, పాడుతోనో వుంటే నా కమితానందం కలిగేది. ఆవాళ మధ్యాహ్నంకూడా అక్కడే ఉన్నా. వాళ్ళ బుజ్జి ఆటతో ఆటతో అట్లాగే నాపక్కన గరకమీద నిండుగా పూసిన తెల్లగులాబిమొక్కపక్కన నిదరపోయింది. బోర్లగా ఆచల్లనిగరకమీద పడుకొని గరకపోచ నోహదాన్ని పళ్లమధ్య కొరుకుతో యేదో ఆలోచిస్తోన్నా. నిశ్శబ్దం అంతటా. ఊరబిచ్చుకలు కొన్ని 'కిట్, కిట్' మంటో యేరుకోతింటోన్నాయి అక్కడక్కడ. అకస్మాత్తుగా కుడివేపుకి మళ్లా. దట్టంగా అల్లుకున్న మల్లెతీగెల్లోంచి వాళ్ల పడకగది, పెద్దకిటికీ, దానికి దెగ్గిరగా వున్న పెద్ద మంచంపరుపూ అవుపడుతోన్నాయి. నేనట్లా చూస్తోండగనే జారిపోయే పైటని సైతం లెక్కపెట్టకుండా పద్మావతి రోజుతో వొచ్చి మంచంమీద కూలబడి దిండులో తలదాచుకొని యేడుస్తోంది. వెనకాలే మాఆయనగూడా వొచ్చి ఆమె పక్కన కూచున్నాడు. ఆమెభుజంమీద చెయ్యేసి తన వేపు తిప్పుకుంటో, "యాడవకమ్మా పద్మావతీ!" అంటోన్నాడు. ఏడుపుమానటంలే దామె. చివరకి బలవంతంగా ఆమెని లాగి తనపై వొరిగించుకొని తన కుడిచేత్తో కళ్లని తుడుస్తో మెల్లగా నాలుగుమాట లేవో అన్నాడు. అవి వినపళ్లా నాకు గుండె ఝల్లుమంది. వాళ్లు నన్ను చూస్తారేమో నని యీవేపు మళ్లా. ఏం చూశానా అని విచారించా. నిజంగా అట్లా చూశానా, లేక భ్రమా? ఆముహూర్తాన నా హృదయం పొందిన అవస్థని వర్ణించడం నాతరంకాదు. ఒక్కనిమిషం తరువాత మళ్లీ ఆవేపు చూశా. వాళ్లిద్దరూ.....కళ్లు మూసుకున్నాయి. ఎడమవేపు తిరిగి ముఖాన్ని గరకలో దాచి యేడ్చా. ఎందు కేడ్చానా అంటే నాకే తెలీదు. రెండు నిమిషాలు గావును అట్లా వున్నా. తిరిగి ఆకిటికీవేపు చూశా. వట్టి మంచమే వుంది. వాళ్లు లేచిపోయారు.

మాఆయన్ని గురించి యెన్నోసార్లు యెంతరో చెప్తే అంతా అబద్ధ మని తోసేసా. సానివాళ్లకు గూడా డబ్బు తగలేస్తా డని విన్నా. కాని యేవీకూడా నమ్మలేదు. నన్నొక దేవతలా ఆరాధిస్తో పువ్వులా చూసుకుంటో తిరిగే ఆయన్ని గురించి యిట్లాంటివి నమ్మటమే! నన్నమాంతం తన రెండుచేతుల్లో యెత్తుకొని తన హృదయానికి అదుముకుంటో, "నువ్వు నా దానివవటం పూర్వజన్మ సుకృతం కాదూ, నాది" అంటోంటే యితర్లు చెప్పుకునే విషయాలు నిజమేనా అనికూడా అనుమానపడటానికి గుండె లొస్తాయా? ఆయన నన్ను సంతోష పెట్టడాని కట్లా ప్రేమప్రకటన గావిస్తాడా, లేక నిజంగా హృదయపూర్వకంగానా అని పరీక్షించాకూడా యెన్నోసార్లు. ఒక్క నువ్వగింజంత కపటమైనా ఆహృదయంలో అవుపడదు. అలాంటాయన యితరస్త్రీలకోసం ఆశపడ్తాడంటే యేమాత్రం నమ్మలేదు. మరిప్పుడో? నాకళ్లని నమ్మకుండా తోసే

యటంకూడా సులభంకాదు. ఒకసారి కాదు, రెండు తడవలా చూశా.

ఎంతసే పక్కడున్నానో తెలీదు. "అరే బుజ్జి యిక్కడే నిద్రపోయిందే" అనే డాక్టరుమాటలు విన పడ్డాయి. చప్పున లేచా. ఆయన నాపక్కనే నుంచు న్నాడు, బుజ్జివేపు చూస్తో.

"ఇప్పుడే వొస్తోన్నారా హాస్పిటాలునుంచి?

"అవును."

నావేపు తిరిగి నాపక్కన పడున్న గులాబి రెక్కలకేసి చూసి నిర్ఘాంతపోయాడు. ఒకటి రెండు రెక్కల్ని చేత్తో యెత్తి, "ఎక్కడి వివి?" "ఏం, ఆ మొక్కవి." చేతిమారంలో వున్న ఆమొక్కని చూ పించా. ఉగ్రుడై తన చేతుల్లోని రెక్కల్ని నేలకికొట్టి, "నా ఆర్నెల్ల కృషిని గంగలో కలిపారు. వందరూపా యిల మందుల్తో నిన్నపొద్దున్నే ఇంజెక్షన్ ఇచ్చా యీ మొక్కకి. గంటగంటకి పూలల్లో కలుగుతోండే మార్పుని రికార్డు చేస్తోన్నాను."

"క్షమించండి, నాకు తెలీ దివంతా."

"ఇదేమిటి పెద్దపెద్ద అక్షరాల్తో చీటీగూడా తగిలేశాగా" అంటో ఒక్కఅడు గావేపేసి మొక్కకు వేళ్లాడుతోన్న చీటీని లాగి నాముందు పడేశాడు. 'ఈచెట్టుని ముట్టుకోగూడదు' అని వుంది దాంట్లో.

"ఏదో ఆలోచన్లో వుండి ఆచీటీని చూశ్లేదండీ" అన్నా. నిజంగా చూశ్లేదు. ఆపూలని నాచేతులు తెం పిందికూడా నాకు తెలీదు. ఇంతల్లోకి ఆయనమాటల వల్ల బుజ్జి లేచింది. తోటమాలి వొచ్చి, "మీకోస మెవరో వొచ్చారు" అన్నాడు. తనకి తెలీనట్టే మెల్ల గా వెళ్లిపోయినాడు డాక్టరు. రోగి, గులాబి యీ రెండే యీ ప్రపంచంలో ఆయన గణించేది.

"ఎందు కత్తయ్యా, నాన్నకు కోపమొచ్చింది?" అంది బుజ్జి.

ఏమని చెప్పను దాంతో? "మీ అమ్మేదో చెడ్డపని చేసిందట, అందుకని కోప్పడుతోన్నాడు."

తల కిందికీ, మీదికీ ఆడిస్తో, "పుస్తకంలోని బొమ్మల్ని చింపిందా?"

"అవును, మీనాన్న బొమ్మని చింపేసింది."

౨

"నాలుగైదు రోజు లుంటా మని వొచ్చాంకదా, యీవాళే తిరిగివెళ్ళట మెందుకు?" అన్నా డాయన బుజ్జిని తన కాళ్లపై వుయ్యాలూగిస్తో.

"ఏమో నాకు బాగనిపించటం లే దిక్కడ."

బుజ్జిని వొదిలి, "అసలు కారణమేమిటో చెప్పు, కామూ. నాతో చెప్పటాని కేం?"

ఆ 'కామూ' అనేముక్క ఆ కంఠంలోంచి బైటపడటంతోటే నాహృదయం కరిగిపోయింది. నాప క్కన వొచ్చి కూచొని నాముఖాన్ని తనవేపు తిప్పు కుంటూ, "ఎందుకుకామూ, యేడవటం? నాకు తెలుసు, నిజంగా నిన్నేదో బాధిస్తోంది. నాతో చెబ్తావు గదూ!" చప్పున ఆదృశ్యం మళ్లీ జ్ఞాపకమొచ్చింది. పద్మావతినికూడా యిట్లానే తనపై వొరిగించుకొని బుజ్జగించాడు. ఆయనదేహం, చేతులు మళ్లీ కంపలా అని పించాయి. చప్పున ఆయన్ని వొదిలించుకొని కిటికీదగ్గిర కెళ్లి బైటికి చూస్తో నుంచున్నా. బైట పద్మావతి మల్లె పొదదగ్గిర నుంచొని పూలని తెంపుతో, "సత్యాపతి ఆన మీరగలడా..." అనే పాటని, దాంట్లోని భావాన్ని, ప్రాణాన్ని బొత్తిగా చంపేసి తబలామ్రోగు డికి అనుకూలించేట్టు కూనరాగంతో పాడుతోంది.

"ఉండు పద్మావతీ నేనొస్తోన్నా" అంటో ఆకిటికీలోంచి దూకి పద్మావతిని చేరుకున్నా. ఏమే మిటో మాట్లాడుతో పూలు తెంపుతోన్నాం, అర్థం లేకండా నవ్వుతో, పాడుతో. ఆధోరణిలో పద్మావ తంది: "ఇలా మీ రిక్కడి కొచ్చివున్న మూడునాలుగు రోజులు స్వర్గంలా వుంటుంది నాకు. లేకపోతే ఖైదే ఒకవిధంగా."

"అవును, నేను రాక మాఆయన వొకడే వొచ్చి వుంటే మహాస్వర్గం" అనుకున్నా మనసులో. పై

కన్నా: "అవును మనకి కావాల్సినవాళ్లు లేక యెంద రుంటే నేం?"

"డాక్టర్‌గారు పొద్దునా, సాయంత్రం హాస్పిటాలుకి వెడ్తారా; మధ్యాహ్నం తీరుబడి వున్నప్పుడంతా ఆగులాబిమొక్కలూ, ఇంజెక్షన్లు అవీను. ఇహ యెవర్తో మాట్లాడను నేను?"

"ఆయనప్రపంచమే వేరు."

నిజంగా అట్లాంటి మహానుభావుడు ఇట్లాంటి వాళ్లని ముడిపెట్టుకోడమే తప్పు!

మాఆయన వొచ్చి పద్మావతి వేపు చూస్తో అన్నాడు: "ఏమండీ డాక్టరుగా రెక్కడ?"

ఆమె వెనక్కి తిరిగి "స్నానం చేస్తోన్నారు."

"మే మెనిమిదిగంటల బండిలో వెడ్తోన్నాం."

చెట్టుమల్లే నిలిచిపోయింది పద్మావతి. నేను కూడా నిర్ఘాంతపోయి ఆవేపు చూశా. "ఏం?" అంది.

"రేపు చాలాముఖ్యమైన పనుంది మా కక్కడ. ఇక్కడి కొచ్చేప్పుడు మరిచా ఆవిషయం."

"నాలుగురోజు లుంటా మన్నారుకదూ?"

"చెప్పాగా ఆవిషయం ముందు జ్ఞాపకంలేదని."

"కిన్నెరగుట్టల్లో రేపటిరోజంతా గడుపుదా మనుకున్నాం" అంది దీనంగా. ఆశాభంగం కలిగిన ఆముఖం చూస్తే యెంతటి కఠినహృదయులకైనా దయ కలుగుతుంది; పాప మనిపిస్తుంది.

కిన్నెరగుట్టలు వాళ్ల వూరికి దాదాపు పదిమైళ్ల దూరంలో పెద్ద అడవిమధ్య వుంటాయి. చాలా అంద మైనవి నిజంగా అవి. అన్నిటికన్నా పెద్దవి రెండు గుట్టలు ఒహదానిపక్క నుంకొహ టున్నాయి. వాటి రెండిటి మధ్య విశాలమైన అల్లనేరేడిచెట్లు, వెలగచెట్లు, పారిజాతపుచెట్లు, రకరకాల పూలపొదలు, వాని గాఢ మైన నీడల్లోంచి మెత్తని యిసుకపరుపుల్లో వంకర టింకరగా పారే స్వచ్ఛమైన ఊటకాలువలూ తలుచుకుంటే హృదయం అనుభవంకోసం తల్లడిల్లుతుంది. ఉడతలు, కుందేళ్లు, లేడిపిల్లలు, కోతులు ఆకాలవల్లో నీళ్లు తాగటాని కొచ్చి మనల్ని ఒక్కచూపు చూసి వెనక్కి మళ్లి పరుగెత్తుతో మనం వాట్ని వెంబడిస్తోన్నా మేమోనని మెడల్ని మెలేసి వెనక్కి తిరిగి చూస్తో పరుగెత్తుతోంటే యెంతో బాగుంటుంది. నెమిళ్లు, జంటలుగా తిరిగే అడవిపావురాలు, అడవికోళ్లు, యింకా అనేకరకాల పక్షులు తమదే ప్రపంచం అన్నట్టు విహరిస్తో మనల్ని చూసి బెదిరిపోతోంటాయి. ఒక రోజంతా అట్లాంటి ఆగుట్టలమధ్య గడపాలనీ, ఆనీడల్లో వూటకాలవలపక్కనే వండుకోతినాలనీ ఎన్నాళ్లనుంచో ఉవ్విళ్లూరించుకుంటో ఆనాడు ఏర్పాటుచేసుకున్నాం. అట్లాంటి అమూల్యతరుణం నామూలాన్నే జారిపోతోందని నాకు తెలుసు. అదట్లా జారిపోవడం మాఆయనకిగూడా విచారంగానే వుంది. అందుచేతే పద్మావతిమాటకి జవాబుచెప్పక మల్లెపొదవేపు చూస్తోన్నాడు.

"క్యాంపుకి వెళ్లొచ్చి రేపుసాయంత్రం వెళ్లొచ్చు" అన్నా.

ఆయన నావేపు చూసాడు. అతని ఆచూపులు నాకళ్లగుండా నా హృదయాన్ని చూశాయి. పద్మావతికూడా నా కేసి చూసింది, ఆశీర్వంతా నాచేతుల్లోనే వున్నట్టు. అట్లాగే సూటిగా నాలోకి చూస్తో అన్నాడాయన: "వీల్లేదు, చాలా ముఖ్య మైనప నది."

డాక్టరు, చంకలో నవ్వుతో బుజ్జి వొచ్చారు. వచ్చే రావటంతోనే బుజ్జి మాఆయనవేపు చేతులు కొడ్తో, "నువ్వు అమ్మని యెత్తుకో మామయ్యా" అంది, పద్మావతి బుజ్జిని పొడిచేసేట్టు ఒక్క వాడిచూపు చూసింది. కాని బుజ్జి ఆవేపు చూస్తేనా! "అమ్మోం బుచ్చి పిల్లా నీమల్లే" అన్నాడు అమాయకపు డాక్టరు. "మరి పొద్దునె..." మాటలొచ్చే పసిపిల్లల్తో చాలా కష్టం. వాళ్లముందు చాలా జాగ్రతగా వుండాలి. పద్మావతి అమితంగా తెలివి కల్ది. ఆమెకి తెలుసు, బుజ్జి యేమనబోతోందో. అందుకనే బుజ్జిని మాట్లాడనివ్వకుండా గట్టిగా "వీళ్లీపూట వెళ్లిపోతారట" అంది డాక్టర్తో.

ఆయన నావేపు చూసి "ఏం ?" అన్నాడు.

"రేపు చాలా ముఖ్యమైన పనుంది" అన్నాను. నాకడుపులో వుడుకుతోం దసలు.

"ఇక్కడి కొచ్చేటప్పుడు జ్ఞాపకం లేదు. ఈపూట వెళ్లితీరాలి" అన్నాడు మాఆయన.

నన్ను లొంగదీసేపద్ధతి పద్మావతికి బాగా తెలుసు. "రేపటిదినమంతా ఆ తేటనీటికాల్వల యిసుకల్లో చిన్నిఉడతలమై విహరిద్దా మనుకున్నా" అంది. అయినా ఆమెకన్నా మొండిదాన్ని నేను మరి. ఆదీ ఆబుజ్జిమాట విన్నాకనా లొంగిపోవటం నేను ! "ఏంచేస్తాం మరి వీలుపడనప్పుడు !" అన్నా.

"పోనీ, మళ్లీ యెప్పుడైనా వెడ్దాం. పర్షియా నుంచి తెప్పించిన గులాబివిత్తుల్ని పరీక్షించాల్సుంది రేపు నాకుగూడా." అని డాక్టరన్నాడు.

ఆయన్ని చంపిపారేయా లన్నంతకోపమొచ్చింది పద్మావతికి.

రైల్లో కొంతదూరం వెళ్లాక ఆయన్తో అన్నా: "నిజంగా యేంపనండీ రేపు ?"

"నాకేం తెలుసు, నీకే తెలియాలి."

"అంటే ?"

"నువ్వు వెళ్లొద్దా మన్నావు గాబట్టి వొచ్చాం."

"ఎన్నాళ్లనుంచో తలపెట్టుకున్న క్యాంపింగుని నిజంగా నాకోసమేనా మానుకుంది మీరు ?"

నారెండుచేతుల్ని తన చేతుల్లో పట్టుకొని, "నిన్ను ప్రసన్నురాలిని జేయటంతప్ప వేరేం కావాలి నాకు కామూ !"

ఆతన్ని వొదిలించుకొని నా రెండుచేతులూ ఆయనమెడచుట్టూ అల్లుకున్నాయి.

## 3

ఎందుచేతోకాని ఆవాళ సాయంత్రం చాలా అలిసిపోయా. చేతులు, కాళ్లు కదల్చడం కష్టంగా తోచింది. చల్లగా స్నానంచేసేసరికి దేహాన్ని వూగిం చేట్టు నిద్ర కమ్ముకుంది. అలాగే నాలుగు మెతుకులు గొంతులో పడేసుకొని గదిలో కెళ్లా. ఆయన టేబిల్ ముందు కుర్చీలో కూచున్నాడు. దీపం పెద్దగా వెలుగుతోంది. ముందరేదో లావాంటి పుస్తకం తెరిచుంది. కాని దానివేపుగూడా చూట్టంలేదు. ఆ సగం మూతబడ్డ కళ్లు యెటో చూస్తోన్నాయి. మంచి సారాయిత్రాగిన వాడి ముఖంమల్లే వుంది ఆయనముఖం. నా చప్పుడు వినటంతోటే బరువుగా నాలుగడుగులేసి నాముందు నుంచున్నాడు. నారెండురెట్టలూ పట్టుకొని యింకా మూసుకోపోయే కళ్లగుండా ఎగాదిగా చూసాడు పెద్దపులిలాగ. భయమేసింది. మెల్లిగా చేతుల్ని వొదిలించుకోపోయా. చప్పున మహోద్రేకంతో నిరాకరిస్తోన్నా వినిపించుకోకుండా నన్నంతా తనకి అదుముకొని నలుపుతో ముద్దెట్టుకున్నాడు. వొళ్లంతా నొప్పెట్టింది. అమాంతం మంచంలో పడిపోయా. మళ్లీ దగ్గరకి రాబోతోంటే కాలితో తన్నేసా. నిజంగా ఆవొక్కక్షణం శ్వాస ఆగిపోయింది. వొళ్లంతా ప్రెస్సులో వొత్తినట్టయింది. "ఛీయేమి టీపశుత్వం ? ఈపందిబలం వున్నందుకేనా మొగాడి ఆధిక్యత ?" ఇంకా యేమేమో అనేశా గబాగబా. అట్లాగే వుండిపోయాడు. పెద్దమార్పు. ఆ మత్తు, ఉద్రేకం అన్నీపోయి దయాపూరితదృక్కుల్తో చూస్తోన్నాడు. పశ్చాత్తాపం ఆ ముఖాన్ని ఆవరించింది. మెల్లిగా దగ్గిరి కొచ్చి, "క్షమించు కామూ, ఏదో పిచ్చిప్రపంచంలో వుండి నువ్వొహ దేవతివని మరిచి అలా ప్రవర్తించా." అన్నాడు. నే నావలివేపు ముఖం తిప్పుకున్నా. లేకపోతే స్త్రీలలో పట్టుదల వుండదనరు మరి !

అట్లాగే స్టూలుమీద కూచున్నాడు.

కాస్త మెలకు వొచ్చేప్పటికి పక్కగదిలోని గడియారం పన్నెండు కొట్టింది. ఆవేపు చూస్తే స్టూలుపైన అట్లాగే కూచున్నాడు ఆలోచిస్తో. కనికర మనిపించింది. "పడుకుంటే ? మళ్లీ పొద్దున్నే లేవాలి."

పెద్ద తప్పుచేసిన కుఱ్ఱాడిలాగా లేచొచ్చి నా పక్కన నన్ను తగలకండా దూరంగా ముదుర్కొ పడుకున్నాడు.

రెండు గంటలకి మెలకువొచ్చింది. ఆయన లేదు. నా కఠినప్రవర్తనకి విసుగెత్తి యేదైనా అగాయిత్యం చేసాడేమో నని భయమేసింది. లేచి గదిబైటి కొచ్చా. తోట్లోని బావివేపు వెళ్లా. తలుపు తెరుచుంది. కాళ్లు వొణికాయి. ఏడ్పు కుత్తుకలో కొచ్చింది. సరాసరి బావివేపు పరుగెత్తా. మూలవేపు తిరగటంతోనే బావిదెగ్గిర గచ్చుమీద తోట్లో పనిచేసే మాల లచ్చి, ఆయన.........

*   *   *   *

ఏమిటో అసహ్యమేసింది. మాటకూడా మాట్లాట్టం మానుకున్నా. కాని ఆయనప్రవర్తనలోమాత్రం భేదం రాలేదు. ఇంకా తన జీవితమంతా నాకోసమే అన్నట్టు మెదిలేవాడు. మొదటిరోజుల్లో నేననుకున్నా యిట్లా నాప్రవర్తనన్నిమార్చడంవల్ల పశ్చాత్తాపపడతాడేమో, బాధపడతాడేమోనని. నాదెగ్గిరి కొచ్చి క్షమించమని ఏడుస్తాడేమోననికూడా అనుకున్నా. కాని తనకూడా విచిత్రంగా మెదలడం ఆరంభించాడు. సాధ్యమైనంతవరకు నన్ను చూట్టంగాని నాతో మాట్లాట్టంగాని అవసరంకాకుండానే ప్రవర్తించేవాడు. విధిలేక ఎప్పుడైనా వొకటిరెండు ముక్కలేవో మాట్లాడాల్సొస్తే తీయగా హృదయం కరిగిపొయ్యేట్టు మాట్లాడేవాడు. తన చిన్నమంచం లైబ్రరీలో వేయించుకొని పడకకూడా అక్కడనే ఆరంభించాడు. "లోపలెందుకు పడుకో" రని నేనూ అడగలా. వంట అయిందంటే రావటం, పెట్టిందేదో తిని వెళ్లటం. మా కారుని, డ్రైవరుని నాకోసం వొదిలేసి తను నడిచో, లేక స్నేహితుల కార్లోనో వెళ్లేవాడు. ఇదంతా యెందుకు, ఆ యిల్లూ సంసారం అంతా నాదై తను నా నౌకరైనట్టు మెదలటం మొదలెట్టాడు.

నెలరోజులు గడిచా యిట్లా. ఆయేడు యెండలు విపరీతం. టైఫాయిడు వొచ్చింది నాకు. పెద్దపెద్ద డాక్టర్లని తీసుకొచ్చాడు. ఉపచారం చేయటానికి నర్సొకామెని ఏర్పాటు చేసాడు. కాని మాఆయన్ని ఈమధ్య కొంత అర్థం చేసుకున్నప్పటినుంచి ఏ పరస్త్రీ మా యింటి కొచ్చినా నాసవతిమల్లే అవుపడేది నాకళ్ళకి. దాంట్లో ఇంగ్లీషు చదివి టిప్‌టాప్‌గా ఉండే నర్సునా నేను మాయింట్లో భరించడం ! నర్సు వొద్దని చెప్పేసా మాఆయన్తో. తక్షణమే ఆమెని చాలించి ఆఫీసుకి సెలవుకోసం రాసి ఆ నర్సుచార్జి తను పుచ్చుకున్నాడు. ట్రేనైన ఆ నర్సుకన్న యెన్నోరెట్లు శ్రద్ధగా, వోపికగా అన్ని ఉపచారాలు చేయటం ఆరంభించాడు. రాత్రంతా నిద్ర లేకుండా కాచుకో కూచోడంచేత రోజురోజుకీ తీసిపోతోన్న ఆయనముఖం చూస్తే ఆయన చేసిన పనులన్నీ మరచి హృదయం తరుక్కోపోతుంది. కాని యేమిటి చేయడం ?

ఆనాడు పొద్దున ఆరుగంటలై వుంటుంది బహుశా. చల్లగా గాలి వీస్తోంది. కళ్లువిప్పి చూసేప్పటికి నాకాళ్ల దెగ్గిర కుర్చీలో కూచుని ముందుకు వొంగి తలని రెండుచేతుల్లో పట్టుకున్నాడు. పక్కన చిన్న గుండ్రని టేబిల్ మీద మందు సీసాలు, టైంపీసు, థర్మామెటరు యింకా యేమేమో వున్నాయి. నేను కాస్త కదిలాను గావును, నాముఖంవేపు చూసాడు. జాజుమల్లె యెఱ్ఱబారిన కళ్లల్లోంచి నీటిచుక్కలు కారుతోన్నాయి. చప్పున లేచి షర్టుకప్పుతో కళ్లు తుడుచుకొని నాతలకి దెగ్గిరగా నేలమీద కూచొని ఒకచేత్తో నొసలు ముట్టుకొని నవ్వుముఖంతో, "ఎలా వుంది కామూ ?" అన్నాడు. నేను పెదిమలు కదల్చకముందే డాక్టరు మెకన్జీ గదిలోకి రావటంవల్ల ఆయన లేచి నుంచున్నాడు. గదికుమ్మంలో నౌకర్లు నుంచొని నావేపు తొంగి చూస్తోన్నారు. డాక్టరు నన్నొకపదినిముషాలు పరీక్షించి "చాలా నయంగా వుంది. నాడి సక్రమంగా నడుస్తోంది" అని చెప్పి ఆయన్తోకూడా బైటికెళ్లాడు. ఒక ఐదు నిముషాల తరువాత ఆయన తిరిగొచ్చి ముందటిమల్లే తలదెగ్గిర కూచొని ముఖానికి దెగ్గిరగా "నయంగా వుందిగదూ కామూ ?" అని అడిగాడు మెల్లిగా. ఆయనఆదీనమైన ముఖాన్ని చూస్తే ఏమిటో అనిపించింది. నావొళ్లు వశంలో వుంటే ఆబుచ్చిముఖాన్ని వత్తొని కదుముకొని కంటి నీ రాతలపై బడేటట్టు ఏడ్చేదాన్ని. కాని చేతివేలినికూడా కదల్పలేకపోయా. "ఏడ్పెందుకు ?"

అన్నా, గొప్ప ప్రయత్నంచేత. తనచేతిని నా మీదేసి మెల్లిగా "ఏమిపు గాదు, సంతోషాతిశయం" అన్నాడు.

చిన్నస్పూన్‌తో పాలు తాగిస్తోంటే గదిలో మూలనున్న మురికిగుడ్డల కుప్పమీది కెళ్లింది దృష్టి. ఎంతో ప్రేమతో బొంబాయినుండి తెచ్చుకొన్న ఆయన పట్టుకండువాలు దాంట్లో అవుపడ్డాయి. ఆయన వాటిని నాకోసమే పాడుచేసుకున్నాడన్న జ్ఞానమే నాహృదయాన్ని వూపేసింది. ఆయనకోసం యిన్నాళ్లు నాలో దాగుండిన ప్రేమంతా వొక్కసారికే బైటికి పొంగొచ్చిన ట్టయింది. ఆతని కళ్లకేసి చూస్తో "మీరు నిజంగా నన్నిట్లా ప్రేమిస్తా రనుకోలే" అన్నా. స్పూన్ని కప్పులో వుంచి మెల్లగా నాచెంపమీది తడిని తుడుస్తో, "ఈపాలల్లో కలిపిన మందువల్ల నిద్ర వొస్తుంది. ఒకగంటసేపు నిద్రపోయావంటే చాలా నయమవుతుంది" అన్నాడు మృదువుగా. ఆ విషయమే మరిచిపోవా లనుకున్నా. కాని రెండునిమిషాలతరువాత, "అప్పుడప్పుడు నేను మాసిందంతా అబద్ధమనేయండీ, నమ్మతా."

"నిజాన్ని అబద్ధమని ఎలా అనను కామూ?"

"మరి?"

నావీపుమీద చేయేసి దెగ్గిరగా జరిగి "కోకిలకు వసంతమాసంమల్లే నాబ్రతుకంతటికీ నువ్వే ఆధారం కామూ. నువ్వే నాసర్వస్వం. నాకు తెలుసు నువ్వు కేవలం మానవస్త్రీవి కావని. ఈరూపంలో దాగున్న నాయిష్టదేవతవి. నేను పూర్వజన్మాన చేసుకున్న ఆమహాపుణ్యానికి ఫలితంగా ఆదేవుడే నీరూపాన యీప్రపంచానికొచ్చాడు నాకోసం."

అవి కేవలం నాటకాల్లో అనే మాటలు గావు. ఆతని హృదయాన్ని చీల్చి బైటపడ్డ వాక్కు లవి. "మరి ఆ పన్లేమిటి?" అని అడిగా.

"నేను దుర్బలుడిని కామూ. నాలోని పశుత్వం నన్ను అప్పుడప్పుడు పూర్తిగా దాసుణ్ణి చేసుకొని ఎన్నో దుష్కార్యాలని చేయిస్తుంది. ఎంతప్రయత్నించినా దాన్ని జయించడం నాతరంకాదు."

మరీ దెగ్గిరగా జరిగి దీనంగా చూసాడు. నీళ్లు కారే ఆతని కళ్లనుండా చూస్తే ఏమిటో అనిపించింది. మెల్లిగా వినీ వినపడనట్లు మళ్లీ అన్నాడు: "నాకు తెలుసు. నీహృదయం అమితంగా విశాలమైంది; మహాసముద్రంలాంటిది; మురికినదుల్లో బురదతో కొట్టుకొచ్చిన తామరలని కడిగి తనలో లీనం చేసుకుంటుంది."

మెల్లిగా నాచేతిని లేపి ఆతని చెంపని తాకా. ఆచేతిని అట్లానే పెదిమల కదుముకొని, "దేవతవి. దేవతని నువ్వు, కామూ." అన్నాడు, కృతజ్ఞత ఆ కళ్ల నుండి వొలికిపోతోండగా.

అయిపోయింది.

---




# రంధ్రముల అట్టపై కుట్టుట

కో. నరసింహాచారి

రంధ్రముల అట్ట ( Perforated card ) లనేకవిధములు కలవు (చిత్రములు A,B,C). రంధ్రములు క్రిక్కిరిసిగాని, దూరదూరముగ గాని యుండుటనుబట్టి ఈభేదములు కలుగుచున్నవి. దూరదూరముగ రంధ్రములుగల అట్టపై (చిత్రము A) ఉల్లుతో కుట్టుట చిన్న బిడ్డల కభ్యాసమునకు తగియుండును. రంధ్రములు చిన్నవిగా నుండినయెడల ఉల్లుదారము నందలి పురి విప్పగా వచ్చెడి సన్నని పోగులతో కుట్టదగియుండును. మిక్కిలి దగ్గరగా నుండు రంధ్రముల అట్టపై పట్టుదారముతోకూడ కుట్టవచ్చును.

కుట్లు రెండువిధములు : (1) క్రాసుకుట్టు, (2) ఒంటిమూలకుట్టు. క్రాసుకుట్టునందు ఒక మూలకుట్టుపై ఇంకొక మూలకుట్టు అడ్డముగా వచ్చును. ఈకుట్టునందు చిత్రములు దట్టముగా కానబడును. ఎప్పుడును కుట్టుప్రారంభమునందు సూదిని అట్టఅడుగునుండి పైకి తేవలెను. అపుడు దారపుకొన అడుగువైపున నుండును. కుట్టెడువిధ మెట్లనగా (చిత్రము D— a, b, c) చిత్రము a యందు వలె 1 వద్ద దారమును వెలికి లాగి, 2 వద్ద సూదిని గ్రుచ్చి, చిత్రము b యందలి విధముగ 8 వద్ద వెలికి లాగి, 4 వద్ద గ్రుచ్చవలెను. ఇట్లు చిత్రము c యందలి విధముగ సంఖ్యల వరుసను కుట్టుచు వచ్చిన క్రాసుకుట్లు ఏర్పడును. ఇట్లు కుట్టుటలో 1 ఈలె గుర్తుగల మూలకుట్టు ఎల్లప్పుడును ముందుగాను, తర్వాత దాని కడ్డముగా 2 ఈలె గుర్తుగల మూలకుట్టును వేయుచువచ్చినయెడల కుట్టు అందముగా నుండును. ఒంటిమూలకుట్టు చిత్రము E యందు అంకెలవరుసను కుట్టుచువచ్చినయెడల ఏర్పడును. చుక్కగీతలు అట్ట కడుగున ఉల్లు పడెడిరీతిని చూపును.

చిత్రము F నందు 1, 2, 3 అంచుల (Borders) కు దృష్టాంతములు. 4 అక్షరములను కుట్టుటకు దృష్టాంతము. ఈరీతిగ పేరులను అందముగా కుట్టవచ్చును. 5 ఒక బాతుయొక్క చిత్రము. ఇంతవరకును క్రాసుకుట్టు చిత్రములుగా నున్నవి. 6 ఒంటిమూల కుట్టున కుట్టబడిన యొక కూజాచిత్రము. ఈ దృష్టాంతములవలె ఎన్నియైన అందములగు




రూపములను కుట్టవచ్చును. గొప్ప కట్టడములనుగాని, భూమిదృశ్యములు (Landscapes) గాని కుట్టవలెనన్న ముందుగా చిత్రమును పెనసలుతో అట్టపై గుర్తించుకొని, తర్వాత ఆయాభాగములను వాటికి తగిన రంగుదారములతో కుట్టవచ్చును. కుట్టబడిన అట్టలను అద్దపు చట్టములందు బిగించవచ్చును.

# భారతీయ విద్యాచరిత్రము

మారేమండ రామారావు, బి. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

## మొదటి అధ్యాయము

[ఆధారములు:—

Macdonell - History of Sanskrit Literature.

Rapson - Cambridge History of India, Vol. I.

Smith - Early History of India.

Kaey - Ancient Indian Education.

Venkateswar - Indian Culture through ages.

Ray Chowdary - Political History of Ancient India.]

### హిందూవిద్య

ఆధునిక ప్రపంచమునందలి విశేషభాగ మాదిమస్థితియందుండి యనాగరికముగ నుండినసమయమున సకలవిద్యానిదానమనియు, సర్వవైభవోపేతమనియు, నుత్కృష్టమగు నాగరకత కాలవాలమనియు పేరెన్నికగాంచినది భారతదేశము. ఈదేశమునందు పెక్కువేలసంవత్సరములనుండి మానవసాధ్యములగు విద్యలెన్నియో పెంపొందింపబడుచుండినవి. నేటికిని విదేశీయు లనేకు లీదేశమున కేతెంచి తమ విద్యాపిపాసను బాపుకొని కృతార్థు లగుచున్నారు. ఇట్టి భారతీయ విద్యావైదుష్యముల చరిత్రము విశేషముగ దేశచరిత్రపై నాధారపడియుండును. కాన నీచరిత్రమునందును దేశచరిత్రమునందువలెనే హిందూ, బౌద్ధ, మధ్య, మహమ్మదీయ, బ్రిటిష్‌యుగములను గుర్తింపవలసియున్నది.

భారతదేశచరిత్రమునకు బ్రారంభస్థాన మాధునిక పరిశోధనలమూలమున నానాటికిని మార్పుజెందుచున్నది. ప్రాచీనార్యు లీదేశమున బ్రవేశించిననాటినుండియు నీదేశపు చరిత్ర మారంభమగుననియు నంతకుబూర్వపుస్థితి వేదవాఙ్మయమునుండియు, బూర్వ చారిత్రక (Pre-historic) శిథిలములనుండియు నే దెలియదగినదనియు నింతవరకును జరిత్రకారు లభిప్రాయ పడియుండిరి. కాని యిటీవల పంజాబుప్రాంతమున మొహన్‌జుడారో, హరప్పా మున్నగుస్థలముల బయలుపడిన ప్రాచీనశిథిలములనుండి యార్యు లీదేశమునకు వచ్చుటకుబూర్వమే యిచ్చట మహోన్నతమగు నాగరికత ప్రబలియుండెననియు, నయ్యది క్రీ.పూ. నాలుగైదువేల సంవత్సరములకు బూర్వపుదైన నయియుండుననియు స్పష్టమగుచున్నది. చరిత్రమున కీనూతనపరిశోధనలు ముఖ్యములేయైనను వానినిగూర్చి సునిశ్చితములగు విశేషాంశములు దెలియువరకును భారతీయవిద్యాచరిత్రమున కార్యులప్రవేశమునే బ్రారంభస్థానముగ గైకొనవలసియున్నది. ఈ విషయమునుగూర్చియు జరిత్రకారులలో నభిప్రాయభేదము లున్నవి. అయినను క్రీ. పూ. ౨౦౦౦ ప్రాంతమునం దార్యు లీదేశమునకు వచ్చియుందురనుటను సామాన్యముగ నెల్లరు నంగీకరించుచున్నారు.

నాటినుండి సుమారు క్రీ. పూ. ౨౦౦ వరకు, ననగా నశోకచక్రవర్తి రాజ్యారంభమువరకును గల కాలము హిందూమహాయుగముగ గుర్తింపవచ్చును. ఈకాలమున వేదములును, వైదికవాఙ్మయమును నిర్మింపబడి, దత్సంబంధమగు విద్యయు, హిందూమతమును బ్రబలినవి. అశోకునికాలమునుండి శ్రీహర్షుని రాజ్యాంతమువరకును (క్రీ. శ. ౬౪౭) గల కాలమున హిందూబౌద్ధమతము లీదేశమున ప్రబలినవి. దానజేసి రెండుప్రత్యేక

విద్యావిధానములు బయల్వెడలినవి. మొత్తముమీద నీ కాలమున బౌద్ధమతము విశేషప్రఖ్యాతి నందియుండుటచే నీకాలమునకు బౌద్ధయుగ మనునామము నొసంగ వచ్చును. దీనినుండి క్రీ. పూ. ౧౦౦౦ నుండి క్రీ. శ. ౬౪౭ వరకునుగూడ నీదేశమున హిందూవిద్యావిధాన మవిచ్ఛిన్నముగ సాగినదని స్పష్ట మగుచున్నది. ఇటుపై నీవిద్యావిధానమును బైయుగవిభాగము ననుసరించి బరిశీలింపవలసి యున్నది.

## I. క్రీ. పూ. ౨౦౦౦-౨౦౦

పరిస్థితులు:— తమ యాదిమనివాసస్థానములను వీడిన యార్యులు కేవల కుక్షింభరులై దేశముల ద్రిమ్మరుచు బాహుబలముచే నచ్చటివారల నదిమి వారిదేశమునందు వసించుచుండిరి. ఎచ్చటనైనను సస్యశ్యామలమును, సుభిక్షమును నగు దేశము గన్పడినచో నీయాగంతుకులలో గొందర చ్చట స్థిరపడుచుండిరి. మిగిలినవారలు యథాపూర్వముగ శస్త్రోపజీవులై దేశాంతరముల కేగుచుండిరి. ఇట్టి వారిలో నొకశాఖ ప్రకృత పర్షియాదేశమునకు వలస వచ్చి యచ్చట స్థిరపడినది. కొంతకాలమునకు బిమ్మట దీనినుండి యొక యుపశాఖ బయల్వెడలి భారతదేశమునకు బశ్చిమోత్తరముననున్న బర్వతపంక్తుల నతిక్రమించి పంజాబున ప్రవేశించినది. విశ్వవిఖ్యాతము లగు భారతీయ నాగరికతాధినివేశములను నిర్మించిన దీ యార్యశాఖయే. సింధునదీతీరమున కేతెంచిన కొంతకాలము వరకు నీ యార్యులు సుఖమనుదాని నెరుంగక నంతకు బూర్వమే యచ్చట బ్రబలులుగ నుండిన దేశీయులతో నిరంతరమును బోరుచుండిరి. అందువలన వారలు దమ బలశౌర్యములను బెంపొందించుకొని మహాశూరులుగ బ్రఖ్యాతి నందియుండిరి. వేదములనుండి యాకాలమున ఋషులు సహితము ఖడ్గమును, గలమునుగూడ నద్వితీయ సామర్థ్యముతో నుపయోగించుచు, నొకవంక వేదమంత్రములను, మరియొకవంక శత్రుబలముల దెగటార్చుచు,నిర్మించుచు జయించిన భూభాగముల సేద్యము జేయుచు జీవించుచుండిరని తెలియుచున్నది. కొలదికాలమునకే యార్యుల యదృష్టము బయల్వెడ వారిదాడి కోర్వజాలక దేశీయులు పలాయితులు కాజొచ్చిరి. దానజేసి యీ యాగంతుకులకు సస్యశ్యామలమును, సువిస్తృతమును నగు నొకభూభాగము లభ్యమయ్యెను. అంతటినుండియు వారికి విశేష మగు క్షాత్రవృత్తి యనవసరమయ్యెను. పంజాబునందలి శీతోష్ణస్థితి సమముగ నుండుటచేతను, భూమి సారవంత మగుటజేసి సునాయాసముగనే సర్వ వస్తువులును సమకూడుటచేతను ఆర్యులు కాయకష్టమునుమరచి సౌఖ్యమున కలవడజొచ్చిరి. అందువలన వారలమానసిక ప్రవృత్తి యనేకవిధముల బయల్వెడలినది. తినుటకు వలసినంత యన్నమును, వసించుటకు జాలినంత దేశమును, శాంతిసౌఖ్యములు నొనగూడుటచే నార్యులు దమ పరిసరములనుండు వస్తువులనుగూర్చియు, దత్రస్థము లగు ప్రకృతి వైచిత్ర్యములను గూర్చియు తాత్త్వికవిమర్శనము నారంభించిరి. ఈ యాదృచ్ఛిక కౌతూహలమే వైదికవాఙ్మయమునకు మూలము. వారలాకాలమున గృష్యైకజీవనులుగ నుండుటవలనను, వాసేద్యము కేవలము బ్రకృతిపై నాధారపడియుండుట చేతను ఆర్యులు ప్రథమమున బ్రకృతి నారాధించుచుండిరి. ప్రకృతిని ప్రసన్నను జేసికొని యందలి వైచిత్ర్యములను గనుగొనుటకే వారి బుద్ధికౌశల ముపయోగింపబడుచుండెడిది. ఈ ప్రకృత్యారాధనమే ప్రాచీనార్యుల మతనిర్మాణమునందలి ప్రథమసోపానము. వేదములలో ప్రాచీనతమ మగు ఋగ్వేదమునందలి మంత్రములన్నియు నీవిషయమునే స్పష్టీకరించుచున్నవి. ఈ యుపాసన మభివృద్ధినందుటచే తదంగములుగ యజుస్సామాథర్వములను మరిమూడువేదములు నిర్మింపబడినవి.

పై వైదికయుగ మంతమగునాటికి దేశమునందనేకములగు మార్పు లొదవినవి. ఆర్యులు సింధుమైదానము నతిక్రమించి మధ్యదేశము నాక్రమింప దొడగిరి. క్రమముగ వారికి గంగానదీతీరమునకును, దక్షిణమున వింధ్యపర్వతములవరకును గల భూభాగ మంతయు స్వాధీన మయ్యెను. ఇం దనేకరాజ్యము లుత్పన్నము లైనవి. జీవితసౌకర్యార్థమై తమతమ యిచ్ఛాప్రకృతులనుబట్టి యొక్కొక్క రొక్కొక్కకార్యమును నిర్వహించున ట్లేర్పరుపబడినది. యజ్ఞయాగాదికముల నొనర్చి దైవానుహాల్య

మును బడయుటయు, పరిలబ్ధము లగు భూభాగములలో శాంతిని నెలకొల్పి యింకను క్రొత్తభూములను జయించుటయు, భూమినిదున్ని పంటలను పండించుటయు నాకాలమునం దార్యులకు ముఖ్యకర్తవ్యములుగ గన్పించినవి. వానిని సాధించుటకై యప్పటిసంఘము నాల్గువిభాగములుగ నొనర్పబడినది. ఇవియే చతుర్వర్ణములు. ఈ విభజనము కేవలము వారువారొనర్చు పనులనుబట్టియే జేయబడి యుండినది. ప్రకృతమున ప్రతివారికిని దమ యిచ్చవచ్చినవృత్తుల ననుగమించుట కెటుల స్వాతంత్ర్యము గలదో యటులే యాకాలమునం దీవర్ణవిభజనము వృత్తిభేదమునే సూచించునదిగ నుండెను. అందుచే నేవ్యక్తికిని, నేకార్యమును జేయుటకైనను విధినిషేధములు లేకుండెడివి. ఈకాలమున బ్రత్యేకముగ గొందరు దేవతారాధనమునకై నియోగింపబడి యుండుటచే వీరి నిరంతర కృషివలన వైదికవాఙ్మయము సర్వతోముఖముగ నభివృద్ధి నందినది. వేదములందలి మంత్రములను, కర్మకాండను వివరించి వానిని సుగమముల నొనర్చుటకై వేదాంగములు నిర్మింపబడినవి. ఈకాలమునం దార్య లెక్కుడభివృద్ధిని గాంచిరి. జాతివైషమ్యము లాకాలమున లేకుండినవి. బుద్ధికుశలతయును, మేధాసంపదయు గలవా రందరును జీవితపరమావధిని గూర్చియు జీవితతత్త్వమును గూర్చియు జర్చించుచుండిరి. క్షత్రియు డగు జనకరాజు నొద్దకు బ్రహ్మనిష్ఠాగరిష్ఠు లగు ఋషు లనేకు లేగి పరమార్థ రహస్యములను దెలిసికొనుచుండిరి. వేదాంగము లగు నుపనిషత్తులనుండి యాకాలపు టార్యుల పారమార్థిక జిజ్ఞాసనుగూర్చి విశేషాంశములు దెలియుచున్నవి. స్త్రీలయెడ నాకాలమున విశేషగౌరవము జూపబడుచుండెడిది. వారిలో విద్యావతు లనేకు లుండిరి. గార్గి, మైత్రేయి మున్నగువారలు తత్త్వజిజ్ఞాసలలో బాల్గొనుచుండిరి.

హిందూయుగమునందలి మూడవ యుపవిభాగము సూత్రయుగము. ఈకాలమునం దార్యులలో వర్ణభేదములు ప్రబలి శాశ్వతసాంఘికవిభాగములుగ నేర్పడినవి. ఈవర్ణముల కర్తవ్యములను వివరించుటకును, సంఘమును సంస్కరించుటకును శ్రౌత, ధర్మ, గృహ్యాది సూత్రములు నిర్మింపబడినవి. రాజకీయముగగూడ నీ సమయమునం దనేకపరిణామము లొదవినవి. ఆర్యావర్తమునం దేర్పడిన వివిధరాజ్యము లొండొంటితో గలహించుచుండుటచేతను, విదేశీయులగు పర్షియనుల దండయాత్రలమూలమునను దేశమునం దధికమగు సంక్షోభ మొదవెను. కాలక్రమమున కాశి, కోసలము, మగధ యను మూడురాజ్యములు ప్రబలినవి. అనంతరము మగధరాజ్య మితరప్రత్యర్థులనోడించి యేకచ్ఛత్రాధిపత్యమును వహించెను. క్రీ. పూ. ౬-వ శతాబ్దమున గౌతమబుద్ధు డుదయించెను. ఇప్పటికే వైదికవాఙ్మయమును, వైదికమతమును అతివిస్తృతములు, బహుళములునై ప్రజాసామాన్యమునకగమ్యములుగ నుండినవి. దానజేసి బుద్ధుడు ప్రజాసామాన్యము తమజీవితమును సౌఖ్యముగ సాగించి యిహమున శాంతి ననుభవించుట కుపకరింప గల మార్గము నన్వేషించి యహింసాసౌభ్రాత్రమూలక మగు నూతన సిద్ధాంతమును బోధించెను. ఈ మతమును అజాతశత్రుడు మున్నగు మగధరాజు లాదరించిరి. ఇంతటినుండియు బౌద్ధమత మీదేశమున బ్రబలజొచ్చినది. ఇదేసమయమున వర్ధమానుడను మరియొక క్షత్రియవీరుడు బయల్వెడలి, యిచ్ఛారాగములే సర్వదుఃఖములకును మూల మనియు, వానిని ద్యజించి, కష్టసహనమూలకముగ మనస్సును నిగ్రహించుటవలననే సౌఖ్య మొనగూడు నని మరియొక సిద్ధాంతమును బోధించెను. ఇదియే జైనమతము. ఉత్తరాపథమునం దిటులు మతసంఘర్షణము జరుగుచుండినకాలమున గ్రీకులు విఖ్యాతవిజేతయగు నలెగ్జాండరు నాయకత్వమున భారతదేశముపై దండెత్తివచ్చిరి. తత్ఫలితముగ నీదేశమునందలి పశ్చిమోత్తరప్రాంతమున యవనరాజ్యములు స్థాపింపబడినవి. హిందూమతమును, హైందవస్వాతంత్ర్యమునుగూడ బ్రమాదమునకు లోనైయుండిన యీక్లిష్టసమయమున గౌటిల్యుని సాహాయ్యమున జంద్రగుప్తమౌర్యుడు మగధసింహాసనము నధిష్ఠించెను. ఈతని బాహుబలమువలనను, గౌటిల్యుని రాజనీతివలనను యవనులవలని ప్రమాదము తొలగింపబడి దేశమున శాంతి

సౌఖ్యములు నెలకొల్పబడినవి. చంద్రగుప్తుడు హిందూ మతమునుగూడ నుద్ధరించెను. ఆతని పౌత్రుడగు నశోక చక్రవర్తి బౌద్ధమతమునం దాసక్తిగలిగి యామతము ననేకవిధముల నాదరించెను. ఇదియే హిందూమతక్షైణ్య మునకును బౌద్ధమతప్రాబల్యమునకును ప్రారంభము.

విద్యాచరిత్రము:—ఇంతవరకును క్రీ. పూ. ౨౦౦౦-౨౦౦ నడుమగల భారతదేశచరిత్రమును సంగ్రహముగ జెప్పియుంటిమి. ఇటుపై నీకాలమునందలి విద్యావిధానమును వర్ణింపవలసియున్నది. జాతీయచరిత్ర మునకును, దదీయవిద్యావైదుష్యములకును సన్నిహిత సంబంధము గలవని ప్రపంచచరిత్రము దెల్పుచున్నది. ఆకాలపు సాంఘికనియమములనుబట్టి యొక్కొకవర్ణము వారల కొక్కొకవిధమగు విద్య విధింపబడియున్నది. ప్రథమమున వైదికవిద్యయే సర్వగమ్యముగ నుండినను, పిమ్మట నేతెంచిన జాతిభేదములనుబట్టి యీవిద్య యందును భేదములు కల్పింపబడినవి.

బ్రాహ్మణవిద్య:—ప్రాచీనార్యులు మొదటిలో ప్రకృత్యారాధకులుగ నుండి యందలి వైచిత్ర్యముల నభి వర్ణించుచు ప్రకృతిలక్షణములను ప్రత్యేకవ్యక్తులుగ భావించి వానిని గీర్తించుచుండిరి. ఈ సందర్భమునం దనేకములగు మంత్రములు రచింపబడినవి. అటుపై నీ వైయక్తికదేవతల నారాధించుటకై యజ్ఞయాగాది కములు నిర్ణయింపబడినవి. ఇందు నడుపవలసిన కర్మ కాండనుగూడ మంత్రములలోనే చేర్చొనిరి. అందుచే ఋగ్యజుస్సామాథర్వము లను నాల్గువేదములును ప్రాచీన హైందవవాఙ్మయసౌధమునకు బునాదులుగ నుండినవి. ఆకాలపుటార్యులకు దమ వైదుష్యమును లిఖించి జాగ్రత పరచుకొను నాచారము లేకుండెడిది. కాన నీ వేద విద్య మౌఖికముగనే వ్యాపించుచుండెను. తండ్రినుండి పుత్రుడును, గురువునుండి శిష్యుడును దానిని గ్రహించు చుండిరి. కాలక్రమమున వాఙ్మయ మభివృద్ధి నంది కర్మకాండ పెరుగుటచే నెంత మేధావంతునకైనను దాత్కాలిక వైదుష్యమునంతటిని యవధరించుట కష్ట సాధ్యముగ నుండెను. అందుచే నీవిద్యాభ్యాసమున ప్రత్యేకపరిశ్రమ మొనర్చు టవసరమయ్యెను. తదను

సారముగ యాగములలో హోతృవృత్తిని నెరవేర్చువా రలు ఋగ్వేదమును, అధ్వర్యులు యజుర్వేదమును, ఉద్గాతలు సామవేదమును బఠించుచుండిరి. వివిధవేద పారగులగు బ్రాహ్మణులు సుప్రశాంతములగు నరణ్య ముల నివసించుచు యజన యాజనాదిక మొనర్చు చుండిరి. బ్రాహ్మణయువకు లీవేదపారగులవద్దకు బోయి యా విద్యను గ్రహించుచుండిరి. సుస్నాతులయి నిశ్చల మనస్కులయి గురుశిష్యులొక ప్రశాంతస్థలమునం దాసీ నులగుచుండిరి. పిమ్మట గురువు వేదమంత్రము నొక దానిని బఠింప శిష్యు లాతని ననుసరించుచుండిరి. దీనికి "విధి" యని పేరు. ఇటులు నాలుగైదుపర్యా యములు పాఠప్రవచనము లయినపిమ్మట నాచార్యుడు మంత్రార్థమును బోధించుచుండెను. దాని "కర్థవాద" మని పేరు. ఈ వాక్యప్రవచనములనుండియే శిక్షా వ్యాకరణాదివేదాంగములు బయల్వెడలినవి. ఆకాల మున భాండాగారములును, లేఖనసాధనములును ఉప యోగింపబడకుండుటచే విద్యయంతయు గంఠస్థముగనే యుండెడిది. ఇటులు విషయములను మనోగతముల నొనర్చుకొను నెడ నుపకరించుటకై యనేకములగు బునశ్చరణపద్ధతు లాకాలమునం దుండెడివి. ప్రత్యృణ, నిర్భుజ, ఉభయమంతరేణ, సంహిత, పద, క్రమ, ఘన, జట—అనున విట్టివే. ఇంతియగాక శబ్దములన్నియు బాహుళ్యమునుబట్టియు, వత్తు (Accent) ను బట్టియు, నక్షరసంబంధమునుబట్టియు "మాత్ర, బలము, సామము, సంతానము" విధముల విభజింపబడినవి. వేదము లందలి యారణ్యకభాగములనుండి ప్రాచీనార్యవిద్యా వికాసమునుగూర్చి తెలియనగున దింతియే.

ఆరణ్యకములకుబిమ్మట నిర్మింపబడినబ్రాహ్మణ ములనుండియు, నుపనిషత్తులనుండియు గొన్ని విశేషాం శములు తెలియుచున్నవి. ఉపనయనసంస్కారము జరగినపిమ్మటగాని బ్రాహ్మణునికైనను వేదాధ్యయ నాధికారము లేకుండెడిది. ఈయుపనిషత్కాలమునకు వైదికవాఙ్మయ మెక్కుడుగ నభివృద్ధినందినది. నాల్గు వేదములు, ఇతిహాసపురాణములు, రాశి యను గణితము, ఏకాయతనమను నీతిశాస్త్రము, దేవవిద్యయను శబ్ద

శాస్త్రము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము కల్పము, నిరుక్తము నను వేదాంగములు-ఇవియన్నియు నాకాలమున బఠనీయములుగ నుండెడివి. తలిదండ్రులు బాలున కుపనయనమునొనర్చి వానిని యోగ్యుడగు నొక గురునిగృహమునకు గొనిపోయి యచ్చట విడచుచుండిరి. ఆత డచ్చట నుండి గురుశుశ్రూషను జేయుచు బ్రహ్మచర్యమునూని పండ్రెండుసంవత్సరములవరకును విద్యను నేర్చి యటుపిమ్మట గురునిచే ననుజ్ఞాతుడై స్వగృహమునకు మరలుచుండెను.

సాధారణముగ విద్యాభ్యాసము శ్రావణ శుద్ధ పూర్ణిమనాడు ప్రారంభింపబడుచుండెడిది. ఉషః కాలముననే లేచి స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించుకొని బాలురందరును గురువునొద్దకు జేరుచుండిరి. అచ్చట వీరలు కొన్నినియమములను బాటింపవలసియుండెను. గురునకు భక్తిపూర్వకముగ నమస్కరించి,యాతనిచే ననుజ్ఞాతులై యాత డాసీనుడైనపిమ్మట శిష్యులు దాము గూర్చొనుచుండిరి. అప్పుడు తమపాదములను గురునివైపున కుండకుండునటుల జాగరూకతతో నుండవలసియుండెను. పిమ్మట నాచార్యు డుచ్చరించిన మంత్రాదికములను బాలురు జాగరూకతతో ననువదించుచుండిరి. అటుపై నాత డొనర్చు వాక్యార్థములను శ్రద్ధగ నాలకించి దానిని మనోగతముగ జేసికొనుచుండిరి. ఈవిధమున ప్రాతఃకాలమున విద్యాభ్యాసము ముగియుచుండెడిది. సాయంసమయమునందు బాలు రుదయమున నేర్చినదానిని పునశ్చరణచేసి గట్టిపరచుకొనుచుండిరి.

ప్రాచీనార్యులు, విద్యాభ్యాసమువలన విద్యార్థికి కేవలము మనోవికాసమేగాక చక్కని శీలము గూడ నేర్పడవలెనని నిశ్చయించియుండిరి. అందువలననే బ్రహ్మచర్యవ్రతమునకును విద్యాభ్యాసమునకును అవినాభావసంబంధము నేర్పరచిరి. ఇంతియగాక నీకాలమున బయల్వెడలు తామసరాజసప్రవృత్తుల నణచి విద్యార్థియొక్క మానసమును సాత్త్వికమార్గముననే కేంద్రీకరించుటకై యనేకములగు నేర్పాటులు గావింపబడినవి. ధర్మసూత్రములలో గాంచనగు నిట్టి విధులలో నీక్రిందివి ముఖ్యములు:—

౧. మధురపదార్థములు, సుగంధ ద్రవ్యములు, దివానిద్ర, పాదరక్షలు, వాహనములు మున్నగు రాజసములను వర్జించుట,

౨. ప్రణయమును, కోపమును దరికి రానీయకుండుట,

౩. వాక్కును, హస్తములను, క్షుధను సాధించి స్వనియామకత్వమునం దుంచుకొనుట,

౪. సత్యముసే పల్కుట, పరుషవాక్యముల నాడకుండుట,

౫. నిష్కళంకమగు బ్రహ్మచర్యమును బూనుట,

౬. వినయవిధేయతలతో బ్రవర్తించుట,

౭. గురువును, గురునికుటుంబమును భక్తిగౌరవములతో జూచుట,

౮. అనన్యమనస్కుడై విద్య నేర్చుట.

గురుశిష్యులకు గల సంబంధమును బలపరచి వారి సౌమనస్యము నభివృద్ధిపరచుటకుగూడ ప్రాచీనులచే కొన్నినియమము లేర్పరుపబడినవి. విద్యార్థి తన విద్యాభ్యాసము పూర్తియగువరకు నాచార్యుని విడువరాదు. గురుని గృహము నూడ్చియు, నాతని దేవతారాధనకై పుష్పములను, సమిధలను, జలమును దెచ్చియు సపర్యల నొనర్పవలెను. భిక్షాటన మొనర్చి యన్నమును సంపాదింపవలెను. అటులనే గురువులును శిష్యులను దమబిడ్డలవలె ప్రేమాభిమానములతో జూచుకొని, మృదుమధురభాషణములచే వారి మానసములను రంజింపజేసి, పరిపూర్ణమగు శ్రద్ధనువహించి వారికి విద్యను నేర్పుచుండిరి. గురుకులమునందుండి బాలుగు నేర్చెడి విద్య యుచితముగనే చెప్పబడుచుండెడిది.

క్షత్రియవిద్య :— విద్యావిధాన మంతయు బ్రాహ్మణుల యధీనమునందే యుండిన వైదికయుగమున సహిత మితరజాతులవారలలో ననేకులగు విద్వాంసు

లుండిరి. కాని కాలక్రమమున సంభవించిన సాంఘిక రాజకీయాదిపరిణామములచే బ్రాహ్మణుల పలుకుబడి హెచ్చి క్షత్రియ వైశ్య శూద్రుల విద్యాభ్యాసముకూడ వారి యధీనమునందే యుండెను. ఇంతవరకును బ్రాహ్మణబాలకుల విద్యావిధానమును వర్ణించియుంటిమి. ఇటుపై నితరజాతుల కెట్టివిద్య నేర్పబడుచుండెడివో పరిశీలింపవలసియున్నది.

గౌతముడు క్షత్రియులకు వేదత్రయమును, తర్కము, ధర్మశాస్త్రము, పురాణములు, నీతిశాస్త్రము మున్నగువానిని నేర్పవలె నని చెప్పియున్నాడు. ఇంతియగాక వారలకు యుద్ధవిద్యయందుగూడ శిక్షణ మొసంగబడుచుండెడిది. క్రీ. పూ. ౫౦౦-౩౦౦ నడుమ నీదేశమున రాజనీతినిగూర్చి యనేకగ్రంథములు రచింపబడినవి. వానిలో నగ్రగణ్యమగు గౌటిల్యుని యర్థశాస్త్రమునం దీక్రింది క్షత్రియవిద్యాప్రణాళిక యొసంగబడియున్నది:

౧. శైశవమున దలిదండ్రులు లొసగు శిక్షణము.

౨. అక్షరాభ్యాసము - ప్రారంభవిద్య.

౩. ఉపనయనము.

౪. సాంఖ్య, యోగ, లోకాయతనములు గల "ఆన్వీక్షికీ" విద్య. దీనిని దగు నాచార్యులయొద్ద నేర్వవలసియుండెను.

౫. వార్త - కృషి, గోరక్షణ, వాణిజ్యములు గలది. రాజపుత్రులు వీనిని రాజకీయోద్యోగులవద్ద నేర్చుచుండిరి.

౬. దండనీతి - సుప్రసిద్ధులగు రాజ్యాంగవేత్తలు దీనిని నేర్పుచుండిరి.

సాధారణముగ యువకులు ప్రాతఃకాలమున దేహపరిశ్రమను జేయుచు నాయుధవిద్య నభ్యసించుచుండిరి. సాయంసమయములందు వారలు గురువులవద్ద కేగి విద్యను నేర్చుచుండిరి. అట్టి సమయములందు వీరి కితిహాసపురాణములును, ఇతివృత్తమును, నీతిని బోధించు కథలు, ధర్మశాస్త్రము, అర్థశాస్త్రమును బోధింపబడుచుండెడివి. (cf. విష్ణుశర్మ సుదర్శన రాజపుత్రులకు నేర్పినవిద్య). ఆకాలమున కౌటిల్యుని యర్థశాస్త్రమును, కామందకుని నీతిసారమును, హితోపదేశ పంచతంత్ర కథాసరిత్సాగరములును, భారత రామాయణములును బఠనీయగ్రంథములుగ నుండెడివి.

వైశ్యవిద్య: — బ్రాహ్మణబాలురకు బోధింపబడు వైదికవాఙ్మయమున గొంతమాత్రమే క్షత్రియులకు నేర్పబడి వారల విద్యాప్రణాళికయందు విశేషముగ జాతీయవృత్తి కనుగుణము లగు విషయములే చేర్పబడినవి. వైశ్యులకు నేర్పబడు విద్యలో నేమాత్రమైనను వైదికవాఙ్మయము లేకుండెడిది. వారివృత్తి కనుగుణము లగు వాణిజ్యము, కృషి, భూగోళశాస్త్రము, గణితము, భాషలు మున్నగునవిమాత్ర మీజాతియువకులకు బోధింపబడవలె నని శుక్రుడు, మనువు మున్నగువారలు వ్రాసియున్నారు. వారి నైతికజీవితమును పెంపొందించుటకై పురాణేతిహాసములును, నీతిదాయకములగు కథలునుగూడ వారలకు బోధింపబడుచుండెడివి. తండ్రులును, పెద్దలును వాణిజ్యమును జేయుచుండ వారి వద్దనే యుండి యువకులు యథార్థజ్ఞానమును సంపాదించుచుండిరి.

ప్రాచీనకాలమున వైశ్యులకు సంఘమునం దెక్కుడు ప్రాముఖ్య ముండెడిది. ఆకాలమున వర్తకసంఘము లనేకము లుండినటుల ప్రాచీన వాఙ్మయమునుండి తెలియుచున్నది. ఈ సంఘముల కనేకనామము లుండెడివి. మనుస్మృతిలోని 'శ్రేణి' యను పదమునకు మేధాతిథి, గోవిందరాజ, నందన మున్నగు వ్యాఖ్యాతలు, వర్తకసంఘ మని యర్థముచెప్పిరి. మహాభారతముగూడ నీ యర్థమునే దెలుపుచున్నది. కాశికావృత్తి, వీరమిత్రోదయము, వివాదరత్నాకరము మున్నగువానిలో 'పూగ' యను పద మీయర్థమునం దుపయోగింపబడినది. బౌద్ధవాఙ్మయమునగూడ పదునెనిమిది వర్తకసంఘములు పేర్కొనబడినవి. ఈసంఘము లుత్తమపద్ధతులపై నిర్మింపబడి నేటి నిధులు (Banks) నిర్వర్తించు కార్యముల నన్ని

టిని జేయుచుండెడివి. వీనికి బాలురను వివిధవ్యాపారములలో శిక్షితుల నొనర్చు టొకకర్తవ్యముగ నుండెడిది.

వృత్తివిద్య :—పరిశ్రమోపజీవులగు తురీయవర్ణపు బాలురకు వాఙ్మయ మనవసర మని తలచి ప్రాచీనులు వారలకు పారంపర్యముగ వచ్చు వృత్తివిద్యనే యేర్పరచిరి. వర్తకసంఘములవలెనే మనదేశమున బూర్వము వృత్తిసంఘము లనేకము లుండెడివి. ధర్మశాస్త్రాదులును, శాసనములును వీనినిగూర్చి విశేషాంశములను దెలుపుచున్నవి. కర్షకులు, నర్తకులు, మణికారులు, స్వర్ణకారులు, లోహకారులు, వడ్రంగులు, శిల్పులు, చర్మకారులు, సాలెవారు, తిలఘాతకులు, కుమ్మరులు, మేదరులు, దంతపుపనివారు, పశులకాపరులు మున్నగువారెల్లరకును ప్రత్యేకసంఘను లుండెడివి. కొన్ని కొన్ని గ్రామములు కొన్నికొన్ని పరిశ్రమల నభిమానించుటయు, నగరములలో నొక్కొక్క భాగమునం దొక్కొక్క వృత్తియు, పరిశ్రమయు పోషింపబడుటయు గూడ నుండెడివి మానసారము మున్నగు వాస్తుశాస్త్రము లీవిషయమును తెల్పుచున్నవి. ఈవృత్తిసంఘములు వర్తకసంఘములకంటె పాటవము గల్గియుండినవి. వీనికిగూడ సభ్యుల బాలురకు దగినవృత్తిశిక్షణము నొసంగుట ముఖ్యకర్తవ్యముగ నుండెడిది. దీనిని గూర్చి పెక్కు నిబంధనలు గలవు. తనజాతియొక్క వృత్తిని నేర్చుకొనగోరు యువకుడు బంధువుల యనుమతిని గైకొని, విద్య నభ్యసింపవలసినకాలము నేర్పరచుకొని యొకగురువువద్ద కేగి విద్యాభ్యాసాంతతమువరకు నచ్చట నుండవలెనని నారదుడు వ్రాసియున్నాడు. గురువు శిష్యుని తన పుత్రునివలె జూడవలెను. అతని నితరకార్యముల నియోగింపరాదు. నిర్దిష్టకాలమగుటకుపూర్వమే యువకుడు గురువును విడువగూడదు. అటుల జేసినచో నాతడు శిక్షకుపాత్రుడు. ఆతనిబంధువు లాతనిని రప్పించుకొనినయెడల గురువు వారిపై చర్య తీసికొనవచ్చును. నిర్దిష్టకాలములో బాలునికి విద్యరానిచో నాతడు మరికొంతకాల ముండవలెను. అంతకు బూర్వమే యాతడు త్తీర్ణుడైనను గురువునాజ్ఞ లేక యింటికి మరలరాదు. ఈ శిక్షణకాలమున శిష్యుని పరిశ్రమచే లభ్యములగు వస్తువులపై గురువునకు సర్వస్వామ్య ముండెడిది. ఈవిద్య కేవలము మౌఖికమేగాక వాస్తవముగూడ నైయుండెడిది. గురువు దా నేదేనొక పనిని జేయుచు శిష్యునిచే గూడ జేయించుచు, ప్రమాదములను సరిచేయుచు నాతని కావృత్తిని నేర్పుచుండెను. శిష్యుడు గురువునెడ వినయవిధేయతలను గలిగి యప్రమత్తుడై విద్యను నేర్వవలసియుండెను.

బౌద్ధవాఙ్మయమునుండి యొక్కొక రనేకవృత్తులను నేర్చుచుండిరని తెలియుచున్నది. హేయములును, క్రౌర్యముతో గూడినవియు దక్క నితరవృత్తులన్నియు సగౌరవములుగనే బరిగణింపబడుచుండెడివి.

విద్యాసంస్థలు :— ఇంతవరకును క్రీ. పూ. ౮౦౦౦ - ౨౦౦ ల నడుమ గల ప్రాచీనార్యవిద్యావిధానమును సంగ్రహముగ బేర్కొనియుంటిమి. ఈ విధ్యావిధానమునకు గొన్ని సంస్థలు ముఖ్యాధారములుగ నుండినవి. దైవోపాసనాంగములను యజ్ఞయాగాది క్రతువులను నిర్వహించుటకై యార్యులు నిర్జనములు, ప్రశాంతములు నగు నరణ్యములలో నేర్పరచిన యాశ్రమములే యీ దేశమునందలి ప్రథమవిద్యాసంస్థలు. ఒక్కొక యాశ్రమమున కొక్కొకఋషి కులపతిగ నుండెను. ఈతనియొద్ద కనేకులగు శిష్యులు జేరి వేదవిద్య నభ్యసించుచుండిరి. అప్పుడపు డీ ఋషులు సంచారము జేయుచు నొకరొకరిని గలసికొనుచు వేదార్థమును గూర్చియు, నితరాధ్యాత్మికవిషయములను గూర్చియు వాక్యార్థములను జేయుచుండిరి. ఈసమయములలో శిష్యులు వారి ననుగమించుచుండుటచే వారలకు విశేషాంశములను దెలిసికొన నవకాశము లొదవుచుండెడివి. ఈ యాశ్రమవాసులకు గల్గు బాధలను నివారించి వారివలన రాజులు ధర్మోపదేశము నందుచుండిరి.

కాలక్రమమున వైదికవాఙ్మయ మభివృద్ధి నందుటచే విద్వాంసు లొక్కొకవేదముననో, వేదాంగముననో ప్రత్యేకముగ గృషిచేయుచుండిరి. ఇట్టివారలు

గ్రామములలో నివసించుచు, విద్యనభ్యర్థించుచు దమ వద్ద కేతెంచిన యువకులకు విద్యను నేర్పుచుండిరి. ఇట్టి పండితుల గృహములు గురుకులము లనుపేరిట వాసికెక్కి ముఖ్యములగు విద్యాసంస్థలుగ నుండినవి. ఇచ్చట విద్యార్థులకు విద్యయు, భోజనము నుచితముగనే లభించుచుండెడివి. గురువునకు శుశ్రూష జేయుచు ననన్యమనస్కులై యిచ్చట బండ్రెండు సంవత్సరములను గడపి బాలురు విద్యను నేర్చుచుండిరి. అటుపై నాచార్యుడు వీరినెల్లరను జేరదీసి వారలు ముందు, గృహముల కేగి గృహస్థాశ్రమమున బ్రవేశించినపిమ్మట బ్రవర్తింపవలసిన రీతులను వారలకు బోధించి యాశీర్వచనపూర్వకముగ వీడుకొలుపుచుండెను. ఇట్టి యుపదేశమే తైత్తిరీయోపనిషత్తునందలి "వేదమనూచ్యాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి" యను భాగమున జేర్కొనబడియున్నది. ఉపనయనానంతరము వటువులుగ గురుకులమున కేతెంచిన బాలురు స్నాతకులుగ వాని నుండి నురలుచుండిరి. ఈ యాచారము ప్రస్తుతము విశ్వవిద్యాలయములలో నేటేటను యువకులకు పట్టముల నిచ్చుచో జేయబడు సమావేశోపదేశములకు సరియగును.

ఆశ్రమములకును గురుకులములకును బిమ్మట జేర్కొనవలసిన విద్యాసంస్థలు పరిషత్తులు. ఇందనేక శాస్త్రవేత్త లగు పండితులు జేరి విద్యావిషయకములను, మతవిషయకములను నగు సమస్యలను నిర్ధారించుచు సామాన్యముగ విజ్ఞానమును వ్యాపింపజేయుచుండిరి. ఈ పరిషత్తులలో తత్త్వసిద్ధాంతధర్మశాస్త్రవేత్తలగు నిరువదియొక్క బ్రాహ్మణపండితులు సభ్యులుగ నుండిరి. వేదాంతపారగులు నల్వురును, ధర్మశాస్త్రజ్ఞులు మువ్వురును, మరిమువ్వురును ఇందుండవలెనని గౌతముని యభిప్రాయము. వసిష్ఠ బోధాయను లీ సమావేశములలో నొకమీమాంసకుడును, ఒక వేదపారగుడును, గృహస్థ వానప్రస్థ సన్యాసాశ్రమముల నుండు వారలు మరిమువ్వురు నుండవలెనని వ్రాసియుండిరి. ఇతర ధర్మశాస్త్రకారులు భిన్నాభిప్రాయముల నొసంగియుండిరి. ఇందలి సభ్యులందరును బండితులు, నధ్యాపకులునై యుండిరి. వార లీ పరిషత్తుల కేగునపుడు శిష్యులు కూడ నేగి యాసమావేశములం దొదవు వాదోపవాదములనుండి విశేషాంశముల ననేకములను గ్రహించుచుండిరి. ఈసమావేశములు గ్రామములలోనో, లేక నగరములందో జరగుచుండెడివి. రాజులును, శ్రీమంతులును వీనికి దానధర్మముల నొనర్చుటేకాక, నితరవిధముల ననేకము లగు సౌకర్యముల నొనగూర్చుచుండిరి.

విద్యాపీఠములు :— కాలక్రమమున నీదేశమున గొన్ని ప్రత్యేక విద్యాస్థానములు బయల్వెడలినవి. అట్టివానిలో బదరికాశ్రమ మగ్రగణ్యము. ఇయ్యది హిమాలయముపై హరిద్వారమునకు ౨౬౮ మైళ్ళ దూరమునందున్నది. వేదాంతవిద్య కీస్థలము పెట్టినది పేరుగ నుండెను. వేదాంతసారము లగు బ్రహ్మసూత్రములను, పంచమవేదమగు భారతమును వ్యాసమహర్షి యిచ్చటినుండియే బ్రచారముచేసె నని హిందువుల నమ్మకము. గంగోత్పత్తిస్థాన మగుటచే నీస్థలము హిందూ పుణ్యక్షేత్రములలో నగ్రగణ్యము. వేదములకును, బ్రస్థానత్రయమునకును బ్రత్యేకవ్యాఖ్యానములను రచించి బ్రత్యేక సిద్ధాంతములను స్థాపించిన శంకరరామానుజ మధ్వాభిధులగు నాచార్యులు మువ్వురు నిచ్చటి కేతెంచి తమ వ్యాఖ్యానముల నిచ్చట వేదవ్యాసునకు వినిపించి యాతని యనుజ్ఞ నందియే జనులకు బోధించిరి.

వేదాంతమునకు బదరికవలెనే నైమిశారణ్యము బురాణేతిహాసముల కుత్పత్తిస్థానము. యజ్ఞయాగాది సమయములందును, పర్వకాలములందును ఇచ్చట వాని ప్రచారము జరగుచుండెడివి. జను లెల్లరు నిచ్చట జేరి యిచ్చటి ఋషిపుంగవులవలన దమ సందియములను బాపుకొనుచు తత్త్వమును దెలిసికొనుచుండిరి.

చరిత్రకాలమునకు కాశీక్షేత్రమును, బశ్చిమోత్తరమున దక్షశిలానగరమును ప్రఖ్యాత విద్యాపీఠములుగ నున్నవి. గౌతమబుద్ధుని కాలమునకే తక్షశిలానగరము పేరెన్నిక గాంచియుండెనని చెప్పబడియుండుటచే దీనియుత్పత్తి క్రీ. పూ. ౬-వ శతాబ్దికి బూర్వమైయుండవలెనని స్పష్టమగుచున్నది. మహాపురుషు లనేకు లీ విద్యాపీఠమును పవిత్రమొనర్చిరి. రామాయణ మహా

భారతములలో నీనగరము ప్రశంసింపబడియున్నది. ఇచ్చట వైద్యశాస్త్ర మభిమానవిద్యగ నుండెడిది. నగరము చుట్టును పదునేసుమైళ్ళదూరమున మాలికావనము లుండెడివి. జీవకు డనునాత డిచ్చట నేడుసంవత్సరములు గృషిసల్పి యాయుర్వేదమునందలి రహస్యముల నెల్ల గ్రహించెను. ఈతడు మగధరాజ్యాధీశుడగు బింబిసారునకును, బుద్ధునకునుగూడ చికిత్సజేసె నని చరిత్రము దెల్పుచున్నది. ఆకాలమునం దాత్రేయు డిచ్చట నాచార్యుడుగ నుండెను. ఆతనికి బిమ్మట చరకు డాచార్యపదవిని వహించి వైద్యవిద్యను పెంపొందించెను. కాయచికిత్సామూలక మగు నష్టాంగ వైద్య మీతనిచే వ్యాప్తి నందింపబడెను. మౌర్యరాజ్యస్థాపకుడగు చంద్రగుప్తునికి గురుడు, మంత్రియునై, రాజ్యాంగవేత్తలలో నగ్రగణ్యుడుగ నుండిన యాచార్య చాణక్యు డీ తక్షశిలానగరముననే విద్య నభ్యసించెను. అశోకునికాలమునం దీ విద్యాలయము విశేషవిఖ్యాతిని బడసియుండె ననుటకు యవనచరిత్రకారులవ్రాతలును, విదేశీయు లనేకు లిచ్చట విద్యార్థులుగ నుండుటయునే ప్రబల నిదర్శనములు. సంస్కృత వ్యాకరణమును రచించిన పాణిన్యాచార్యుడుగూడ నిచ్చట జదివియుండెను. బుద్ధు డవతరించి తనసిద్ధాంతములను బోధించిన పిమ్మట నీ తక్షశిలావిద్యాలయము బౌద్ధవిద్యనుగూడ బోధించుచుండె నని ఫాహియాన్ వ్రాసియున్నాడు. ఈ విశ్వవిద్యాలయము క్రీ. శ. ౪-వ శతాబ్దమువరకును నిలచియుండి యటుపై క్షీణించెను. చరిత్రకాలమునకు పూర్వమే బయల్వెడలి యనేక పరిణామములను గాంచి, నేటికిని సజీవముగ నున్నది కాశీవిద్యాపీఠము. ఇచ్చట గంగానది యుత్తరవాహినియగుటచే నీస్థలము విశేష ఫలప్రదముగ నెంచబడుచున్నది. అనాదినుండియు నీ వారణాశిక్షేత్రము హిందూపుణ్యక్షేత్రములలో నగ్రగణ్యముగ నుండినది. వివిధప్రాంతములనుండియు జను లిచ్చటి కేతెంచుచుండిరి. సాధారణముగ నాధ్యాత్మికచింతకులును, పండితులు నిట్టి పుణ్యక్షేత్రములనే వసించుచుండిరి. బుద్ధునికాలమున కీ నగరము వేదశాస్త్రాదుల కాలవాలమై ప్రాచీన హిందూ వైదుష్యమునకు కేంద్రముగ నుండినది. గౌతము డిచ్చటి కనతిదూరమున గల సారనాథ్ వద్దనే తన ప్రథమమతబోధలను గావించెను. పుణ్యక్షేత్రము, పండితనివాసము నగుటచే నిచ్చటి కనేకులగు విద్యార్థు లేతెంచుచుండిరి. విద్వత్పోషణము నొక ముఖ్యకర్తవ్యముగ నెంచుచుండిన రాజు లీ విద్వాంసుల కనేకసౌకర్యములను గల్పించుచుండిరి. అప్పటినుండి నేటివరకు నీ కాశీక్షేత్రము వైదుష్యమున కగ్రస్థానముగ నున్నది. నేటికిని పండ్రెండు సంవత్సరములకాలము నిరంతర కృషిజేసినగాని యొకశాస్త్రమున సరియగు నభినివేశము లభింపదని యిచ్చట విద్యాభ్యాస మొనర్చిన పండితులు చెప్పుచున్నారు.

## II. క్రీ. పూ. ౨౦౦ నుండి క్రీ. శ. ౬౪౭ వరకు

ఇంతవరకును క్రీ. పూ. ౫౦౦౦-౨౦౦ నడుమ నీదేశమునం దభివృద్ధినందిన విద్యావిధానమును, తదంగములగు విద్యాపీఠములును వర్ణితములయినవి. క్రీ. పూ. ౨౦౦ సంవత్సరప్రాంతమునుండి క్రీ. శ. ౬౪౭ వరకును గలకాలము భారతీయవిద్యాచరిత్రమునందలి రెండవ విభాగము. విషయప్రాముఖ్యమునుబట్టి యీ విభాగమును బౌద్ధయుగమని పేర్కొనదగును. ఈకాలమున రెండు విద్యావిధానము లీదేశమున బ్రబలినవి. కొన్ని సమయములందును, గొన్ని స్థలములందును బౌద్ధమతముతోబాటుగ బౌద్ధవిద్యయు, మరి కొన్నిట హిందూ విద్యయు నభివృద్ధినందినవి. ఈ హిందూవైదుష్యము పూర్వోక్తమగు వైదికవిద్యయొక్క పరిణామమేయగుట వలనను, విషయము సులభముగ బోధపడుట కనుకూలముగ నుండుటవలనను ఇటుపై బౌద్ధయుగమునందలి హిందూవిద్యాచరిత్రము పేర్కొనబడుచున్నది. రాబోవు నధ్యాయమున బౌద్ధవిద్యాచరిత్ర మభివర్ణింపబడును.

పరిస్థితులు:—ఈయుగమునందలి హిందూవిద్యాచరిత్రమును దెలిసికొనుట కీకాలమునందలి హిందూమతముయొక్క చరిత్రమును, సాంఘికరాజకీయాదిపరి

స్థితులను సంక్షేపముగ గమనింపవలసియున్నది. ఈయుగారంభమున పాటలీపుత్రమునుండి మౌర్యవంశీయులుత్తరదేశముపైనను, దక్షిణాపథమునందలి విశేషభాగముపైనను ఏకచ్ఛత్రాధిపత్యమును వహించియుండిరి. కడపటిమౌర్యుల కాలమున బశ్చిమోత్తరమునుండి విదేశీయు లనేకు లీదేశమున బ్రవేశించి, జాతిభేదములను బాటింపక మానవకల్యాణమును జేకూర్ప యత్నించుచుండిన బౌద్ధమతము వీరల నాకర్షించుటవలనను, మౌర్యుల యాదరమును బడయుటవలనను బౌద్ధమతము ప్రబలి తాత్కాలికహిందూమతము క్షీణించెను. మౌర్యచక్రవర్తులకు బిమ్మట మగధరాజ్యము నేలిన సుంగకణ్వవంశజులు హిందూమతమును పునరుద్ధరించి యవనులను నిర్జించిరి. యవనసంపర్కమువలన హిందువుల శిల్పనాటకాదికళలును, గణితజ్యోతిషాదిశాస్త్రములు నభివృద్ధి జెందినవి. క్రీస్తు శకారంభమున యవనశకపహ్లావు లీదేశమున బశ్చిమోత్తరభాగము నెల్ల ఆక్రమించి పాలింపసాగిరి. పిమ్మట కుషాను లీదేశముపై దండెత్తి వీరినెల్లరను, దేశీయపాలకులనుగూడ నిర్జించి తమ సామ్రాజ్యమును నెలకొల్పిరి. వీరిలో నగ్రగణ్యుడగు కనిష్కచక్రవర్తి బౌద్ధమతము నుద్ధరించెను. ఈకాలమున దక్షిణాపథమున రాజ్యమేలుచుండిన శాతవాహనవంశజులలో నగ్రగణ్యుడగు గౌతమీపుత్రశాతకర్ణి బ్రాహ్మణమతమును పునరుద్ధరించెను. పిమ్మట మగధరాజ్యము గుప్తవంశీయుల పాలనమునకు లోనయ్యెను. వీరికాలమున హిందూమత మపూర్వమగు నభ్యుదయమును గాంచెను. పురాణేతిహాసాదులును, చక్కని ప్రబంధములును, శాస్త్రము లనేకములు నీకాలమున రచింపబడినవి. హిందూమతమును, సంస్కృతభాషను గుప్తచక్రవర్తులు విశేషముగ నాదరించి వానికి నూతనతేజమును గల్గించిరి. పిమ్మట హూణు లీదేశముపై దండెత్తివచ్చి క్రీ. శ. ౬-వ శతాబ్దమున గుప్తసామ్రాజ్యము నంతమొందించిరి. అటుపై ౬౦౭-౬౪౭ నడుమ శ్రీహర్షు డుత్తరదేశమును పాలించి హిందూ బౌద్ధమతముల రెండిటిని, సంస్కృతభాషనుగూడ విశేషముగ నభివృద్ధికి దెచ్చెను. ఈకాలమునం దేతెంచిన విదేశీయు లందరు నిచ్చటనే స్థిరపడి దేశీయులతో గలసి వారి మతాచారవ్యవహారముల నవలంబించి భారతదేశమునే దమ మాతృభూమిగ జేసికొనిరి. అందుచే నీకాలమున హిందూదేశమునకు విదేశపాలన దౌర్భాగ్యము లేకుండినది. మతాచారవ్యవహారముల సంఘర్షణమువలనను, మహాకవుల వాఙ్మయసేవనమువలనను, శాంతిసౌఖ్యము లెల్లెడలను ప్రబలుటచేతను జాతీయజీవితము నూతనోత్సాహముతో నూతనమార్గముల సాగుచుండెను. ఇప్పటి సాంఘికజీవితము నిర్దుష్టముగ నుండినది. వర్ణభేదములు వైషమ్యకారకములుగ నుండక వృత్తిభేదమునే జూపుచుండెడివి. స్త్రీలలో బాల్యవివాహములు లేవు. వారిలో ననేకులు విద్యావతులుగ నుండిరి. ఇప్పటికే హిందూమత తత్త్వము పరమగహనమగుటచే జనసామాన్యము యొక్క యుపయోగార్థమై విగ్రహారాధన మాచరణలోనికి వచ్చెను.

విద్యాచరిత్రము :— క్రీ. పూ. ౨౦౦ – క్రీ. శ. ౬౪౭ నడుమ హిందూవిజ్ఞాన మనేకవిధముల నభివృద్ధి నందినది. అదియంతయు విద్య లనియు, కళలనియు రెండుగ విభజింపబడెను. నాల్గువేదములు, షడంగములు, మీమాంస, న్యాయము, ధర్మశాస్త్రము, పురాణము, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము ననునవి అష్టాదశవిద్యలు. స్మృతి, నాస్తికవాదము, కామశాస్త్రము, శిల్పము, అలంకారశాస్త్రము, కావ్యము, యవనసిద్ధాంతము, తంత్రము మున్నగునవి కళలు. కాళిదాసాది మహాకవు లీ విద్యలను, కళలను పేర్కొనియున్నారు. అప్పటి హిందువులు మహోన్నతమగు నాగరికత ననుభవించుచుంటిమని తలంచు నాధునికులకు సహిత మాశ్చర్యమును గల్గించు విశేషములను గన్గొనియుండిరి. ఆధునిక వైద్యవిజ్ఞానమునందలి Anatomy, Physiology అను భాగములు "ఆహుతి" యను పేరిటను, Theraputics, Medicine అనునవి "భేది" యను పేరిటను ప్రాచీన వైద్యశాస్త్రమున గాంచనగుచున్నవి. చరకుడు, సుశ్రుతుడు ననువార లీ శాస్త్రము నభివృద్ధిపరచిరి. మన ప్రాచీనులు ధ్వనులను స్వర (Voice), కాల (Time), స్థాన (Vocal position),

ప్రయత్న (Muscular effort) ము లనువానినిబట్టి విభజించి శబ్దశాస్త్రమును నిర్మించియుండిరి. సాంఘిక నైతికజీవితమును చక్కజేయుటకై ధర్మశాస్త్రము లాకాలమున నిర్మింపబడినవి. కాళిదాసభవభూత్యాది మహాకవులు నాటకముల నభివృద్ధిపరచిరి. ఇటీవల ల్యూడర్స్ అను పండితుడు కనిష్కునికాలమున రచింపబడిన రెండు నాటకములను గన్గొనినటుల దెలియుచున్నది. నాటకకళ యాకాలమున రాజాదరమును బడసెను. చరిత్రమును దెల్పుటకును, ప్రజాసామాన్యమునకు ప్రబోధమును గల్గించుటకునుగూడ నీ కళ యెక్కుడుగ నుపయోగించుచుండెడిది. (cf. మాళవికాగ్నిమిత్రము, ముద్రారాక్షసము etc.) ఇటుల విద్యలును, కళలునేకాక ఈయుగమున పరిశ్రమలుగూడ విశేషముగ నభివృద్ధి జెందినవి.

హిందూవిజ్ఞాన మీవిధమున సర్వతోముఖాభివృద్ధిని బడయుటకు ప్రత్యేకపరిశ్రమ యొక ముఖ్యకారణము. ఒక్కొకచో నొక్కొకశాస్త్రమున గృషిసేయబడుచుండెడిది. ఇయ్యది సారస్వతమునగూడ గాంచనగును. ఉత్తరదిశ శ్లేషకావ్యములకును, పశ్చిమ మర్థగౌరవమునకును, దాక్షిణాత్యు లుత్ప్రేక్షకును, గౌడులు అక్షరడంబరమునకును ప్రసిద్ధులుగ నుండిరని దండిమహాకవి చెప్పియున్నాడు. ఉత్తరదేశమున వాఙ్మయమును, దక్షిణమున కావ్య, శిల్ప, చిత్రలేఖన, సంగీతములును వ్యాప్తి నందినవి. పల్లవమహేంద్రవర్మ శిల్పకళాపోషణము దక్షిణదేశమున బేరెన్నికగాంచినది. మొత్తమమీద నీకాలమున వైదుష్యము సర్వసామాన్యముగ నుండెను. సంగీతసాహిత్యకళావిహీనులు ద్విపాద పశువు లని యాకాలపు కవి యొకడు వ్రాసియున్నాడు.

ఈకాలపు కవులయొక్కయు, వారి రచనముల యొక్కయు ప్రశంసలేనిదే యాకాలపు హిందూవిద్యా వైదుష్యముల చరిత్రము సమగ్రము కానేరదు. ఇప్పటికవులలో కాళిదాసమహాకవి కగ్రస్థానము నొసంగవలసియున్నది. కవితామాధురియందును, పదప్రయోగము నందును, ప్రకృతిసిద్ధములగు వర్ణనలయందును, భావనాశక్తికి నీతనికి సరియగు కవి నేటివరకు నీదేశమున బుట్టలేదు. ప్రపంచమునందలి కవికుంజరులలో నీతని కగ్రస్థానమొసగబడియున్నది. ఈతడు రచించిన కుమారసంభవ, మేఘదూత, రఘువంశాదికావ్యములును, శాకుంతల, మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ నాటకములును సంస్కృతసారస్వత ముండునంతకాలము నుండగలవు. కిరాతార్జునీయరచయితయగు భారవియును, దశకుమార చరితమును రచించిన దండియు, కాదంబరీహర్షచరితములను నిర్మించిన బాణకవియునుగూడ నీకాలమునందే యుండిరి. నీతిబోధకములగు కథలలో నగ్రగణ్యమైయనేకభాషలలోనికి బరివర్తింపబడిన పంచతంత్రమును, హైందవసాంఘికనైతికజీవితములకు బట్టుకొమ్మయనదగు మనుధర్మశాస్త్రము నీకాలపు రచనములే. సంస్కృతసారస్వతముతో బాటుగ జ్యోతిశ్శాస్త్రముగూడ నీకాలమునం దభివృద్ధినందినది. ప్రఖ్యాతజ్యోతిషికులగు గర్గ పరాశరు లీకాలముననే యుండిరి. క్రీ. శ. ౬-వ శతాబ్దినాటివాడగు వరాహమిహిరుడు తనకు బూర్వ మీదేశమున బ్రహ్మ, వైశ్య, సూర్య, వాసిష్ఠ, అత్రి, కాశ్యప, నారద, మరీచి, మను, ఆంగీరస, రోమక, పులిశ, చ్యవన, యవన, భృగు, శౌనకులపేరిట వేరువేరు సిద్ధాంతము లుండినవని వ్రాసియున్నాడు. ఆతనికి బూర్వముండిన ఆర్యభటుడు మిగుల ప్రజ్ఞాశాలి. భూమియే సూర్యునిచుట్టును దిరుగుచుండుననియు, సూర్యచంద్రగ్రహణములకు జంద్రుడును, భూచ్ఛాయయునే గారణములనియు నీతడు కనిపెట్టెను. వరాహమిహిరుని బృహత్సంహిత, పంచసిద్ధాంతము ఖ్యాతివహించిన జ్యోతిష గ్రంథములు. గణితశాస్త్రమునగూడ నీదేశమున విశేష పరిశ్రమ జరిగినది. బీజగణితమునను, ఖగోళశాస్త్రమునను, రేఖాగణితమునను దాని నుపయోగించువిధము నీదేశముననే గన్గొనబడినది. భారతవర్షము వైద్యశాస్త్రమున కాచార్యత్వమును వహించినది. వేదములలోగూడ దీని ప్రశంస గలదు. అథర్వవేదమునం దాయుర్వేదము శల్య తంత్ర, శాలాక్యతంత్ర, కాయచికిత్సా, భూతవిద్యా, కౌమారభృత్యా, అగద, రసాయన, వాజీకరణములను నెనిమిదిభాగములుగ విభజింపబడినది. తరువాతి కాల

మునం దగ్నివేశల, భేల, జతుకర్ణ, పరాశర, హారిత, క్షారపాణులనువారలు వైద్యగ్రంథములను రచించిరి. కుషాన్ చక్రవర్తియగు కనిష్కుని యాస్థానవైద్యుడుగ నుండిన చరకుడు తనపేరిట నొకసంహితను రచించెను. ఇందు వ్యాధులును, వానిని వారించు నౌషధక్రియలును వర్ణింపబడియున్నవి. పిమ్మట సుశ్రుతునిచే రచింపబడిన సుశ్రుతసంహిత వైద్యప్రపంచమున మిగుల ప్రఖ్యాతమగు గ్రంథము. శస్త్రచికిత్సను వివరించు నీగ్రంథము శస్త్రసాధనములనుగూర్చియు, వాని యుపయోగమునుగూర్చియు విశేషాంశములను దెల్పుచున్నది. ఇంతవరకు నీబౌద్ధయుగమునందలి విద్వాంసులను గూర్చి సంక్షేపముగ వ్రాసియుంటిమి. ఇంక ననేకు లాకాలమున జీవించియుండి యెన్నియో యుద్గ్రంథములను రచించిరి.

ఈ వైదుష్యప్రాదుర్భావమునకు విద్వాంసులు, రసజ్ఞులు నగు రాజు లొసంగిన యాదరణమే కారణము. ఈకాలమున పుష్యమిత్ర, హాల, గౌతమీపుత్ర, సముద్రగుప్త, చంద్రగుప్త, విక్రమాదిత్య, శ్రీహర్ష, మహేంద్రవర్మాది విద్వద్రాజన్యులు విద్వాంసుల ననేకవిధముల గౌరవించి వారిచే ననేకగ్రంథములను వ్రాయించుచుండిరి. ఇట్టి విద్వత్సమ్మాన మానాటి రాజాస్థానములకు ముఖ్యకర్తవ్యముగ నుండెడిది. పండిత, కవి, గాయకులు రాజసభలకు ముఖ్యాంగములుగ నుండెడివారు. పాండితీ ప్రదర్శనములును, శాస్త్రవాదములును ఆకాలమునం దాయాస్థానములందు జరుగుచుండెడికార్యక్రమమున ముఖ్యభాగములుగ నుండెడివి. సర్వవిధముల నీ రాజాస్థానములు విద్యాస్థానములుగ నుండినవి.

విద్యాపీఠములు:—బౌద్ధయుగమునందలి హిందూ విద్యాచరిత్రమును ముగించుటకుబూర్వ మీకాలపు విద్యాపీఠములనుగూర్చి ప్రశంసించు టవసరము. ఈ కాలమునం దార్యావర్తమున బౌద్ధ విశ్వవిద్యాలయములు విఖ్యాతి నందుచుండ దక్షిణాపథమున ఘటికలును, ద్రవిడదేశమున సంగములును విద్యావ్యాపనము నొనర్చుచుండినవి.

ఘటికలు:—వీని ప్రశంస విశేషముగ దక్షిణాపథమునందలి శాసనములలో గన్పడుచున్నది. వేంగీనగరమునుండి యాంధ్రదేశమును బాలించిన తూర్పుచాళుక్యరాజగు మొదటిజయసింహవల్లభుని (క్రీ. శ. ౬౩౩-౬౬౬) కాలమునాటి నిడమఱ్ఱుశాసనమునుండి అసనపురమనుస్థలమున నొకఘటిక యుండెడివనియు, నందు పై జయసింహునినుండి నిడమఱ్ఱుగ్రామమును దానముగ బొందిన కాటిశర్మతాతయగు మండశర్మ "ఘటికాసామాన్యుడు"గ నుండెననియు దెలియుచున్నది. దక్షిణమున కాంచీపురముగూడ నొకఘటికాస్థానముగ నుండెనని మరికొన్ని శాసనములనుండి తెలియుచున్నది. కదంబవంశనిర్మాతయగు మయూరశర్మ తానొక సుప్రసిద్ధతార్కికుడు గావలెనను నుద్దేశ్యముతో ననేకఘటికాస్థానముల కేగెనని యొక కదంబశాసనము దెల్పుచున్నది. కాంచీనగరమున రాజ్యముచేసిన రెండవనరసింహవర్మయను పల్లవరాజు కంచిలో నొక బ్రాహ్మణఘటికను నిర్మించెను. పై యాధారములనుండి యీఘటికాస్థానములు విద్యలకు, విద్వాంసులకు నాలవాలములై యుండెడివనియు, వీనిని రాజు లనేకవిధముల బోషించి ప్రోత్సహించుచుండిరనియు స్పష్టమగుచున్నది. ఈఘటికలలో జరిగెడి వాదప్రతివాదములలో జయమునందినవారికి "ఘటికాసాహసు" లను బిరుద మొసంగబడుచుండెడిదట.

సంగము:—'సంగము' అనునది 'సంఘ' మను సంస్కృతశబ్దమునకు ద్రవిడరూపము. ప్రాచీనకాలమునుండియు ద్రవిడదేశము ప్రత్యేకముగనుండి, యుత్తరాపథమునను, బిమ్మట దక్షిణాపథమునను జరగిన సాంఘిక, రాజకీయ పరిణామములతో సంబంధము లేకుండినది. ద్రవిడవాఙ్మయము ప్రత్యేకముగ నభివృద్ధి నందినది. భక్తులు, కవులు ననేకులు ద్రవిడమునందుత్కృష్టములగు గ్రంథములను రచించిరి. ప్రాచీన ద్రవిడరాజవంశములలో పాండ్యవంశము మిగుల ముఖ్యమైనది. ఈవంశమువారికి మధుర ముఖ్యపట్టణము. ఈరాజు లనేకులు విద్వాంసులుగను, విద్యాభిమానులుగను నుండిరి. వీరి ప్రోత్సాహముచే విద్వత్సంఘములు

దేశమున బయల్వెడలినవి. ఇవియే సంగములు. ద్రవిడ వాఙ్మయమునుండి యిట్టివి మూడుసంగము లుండెడివని తెలియుచున్నది. ఇందు సుప్రసిద్ధులగు కవులు, నితర పండితులు సభ్యులుగ నుండిరి. ద్రవిడమున రచింపబడిన ప్రతికావ్యము నీసంగములయెదుట బ్రచురింపబడు చుండెడిది. అందలి విద్వాంసు లీగ్రంథములను విమర్శించి యవి నిర్దుష్టములుగ నుండినచో బ్రకటనార్హములుగ నిర్ణయించుచుండిరి. అంతియగాక కావ్యపురాణాదులను రచింపవలసిన పద్ధతులనుగూడ నీవిద్వత్సంఘములు సూచించుచుండెడివి. పెరియపురాణము, మణిమేఖలై మున్నగు సుప్రసిద్ధద్రవిడగ్రంథము లీసంగములచే బ్రవర్తింపబడినవే.

(సశేషము)

---

# భక్తిగీతము

కూచి రామలక్ష్మమ్మ

భక్తిగీతాల నెన్నెన్నో పాడుకొనెడు  
కవిముఖంబున, నెల్లజగంబులందు,  
లలితగంగాతరంగిణీసలిలమందు,  
శ్రావ్యసుమనోజ్ఞసంగీతరవమునందు,  
పారమే లేని నీదయాభావమెకడ  
వింతమహిమముతో బ్రభవించుచుండు?—

మబ్బుటుయ్యెలలూగగ మనసుపుట్టి  
మాయమేఘాలచాటున మాయమగుచు  
నాశలూరెడు నీలిమాకాశసాధ  
నీమ వెలుగొందు హిమకరు సేమ మరయ  
నీమహోన్నతశాసననియతిగాదె?—

దుఃఖరాసులు కొండలై దొరలుగాక  
శోకవార్ధులు మిన్నంటె లోకములను  
ముంచి యుప్పొంగి పైపైని పొరలుగాక  
మధురమధురంపు భవదీయకథలె స్వామి!  
హృదయమును మోదవార్ధిలో నెపుడు దేల్చు;

దేవ, నీసుధామధురంపు దివ్యమూర్తి  
పరమభక్తిని నాహృదబ్జమున నిలిపి  
పతితపావన, నీకయి పవలు రేలు  
వేచియుండెద నీజాడ జూచుకొరకు.

---

 7- 19 2%

# నే టి ర ష్యా

నార్ల వెంకటేశ్వరరావు

[ఆధారములు

1. New Russia by A. De Monzie.
2. The Economic Organisation of the Soviet Union by Scott Nearing & Jack Herdy.
3. Soviet Russia and her Neighbours by R. Page Armot.
4. Village Life under the Soviets by Karl Borders.
5. Liberty under the Soviets by Roger N. Baldwin.
6. Soviet Trade Unions by Robert W. Dunn.
7. Health Work in Soviet Russia by Anna J. Haines.
8. How the Soviets Work by H. N. Brailsford.
9. Religion under the Soviets by Julius F. Hecker.
10. New Schools in New Russia by Lucy L. W. Wilson.
11. Soviet Russia by Jawharlal Nehru.
12. The Mind & Face of Bolshevism by Rene Fulop-Miller.
13. Modern Review.
14. Indian Review.
15. People.
16. Free Press Journal.
17. Bombay Chronicle.
18. Indian Express.
19. Advance.
20. Liberty.
21. Swarajya.]

## తొ లి ప లు కు

రష్యానుగూర్చి వివిధవ్యక్తులు వివిధవిధములు వక్కాణించుచున్నారు. కొందరు దానిని భూతలస్వర్గ మనుచున్నారు. మరికొందరు దానినే నరకకూప మనుచున్నారు. అసలు సత్యమేమన, రష్యా పైరెంటిలో నేదియును కాదు. నేడు రష్యా ప్రపంచచరిత్రలో నింతవర కెన్నడును ప్రయత్నింపబడియుండని యొక బ్రహ్మాండమైన ప్రయోగమును గావించుచున్నది. అందుచే నాప్రయోగము నామోదించువారు దానిని కొండపై నెక్కింపజూచుటయు, తద్వ్యతిరేకులు పడద్రొట్టుటయు సంభవించుచున్నది. ఈ పరిస్థితులలో రష్యావిషయమై సంపూర్ణ సత్యము నెరుగగోరువారు అది ప్రస్తుతముగావించుచున్న వినూత్న ప్రయోగమునుగూర్చి స్వకీయాభిప్రాయములను దాత్కాలికముగనైనను విస్మరించి, దాని నైసర్గిక, రాజకీయ, సాంఘిక, ఆర్థికాదిస్థితిగతులను సమగ్రముగ పరిశీలింపవలసియున్నది. ఇట్టి సమగ్రపరిశీలన గావించుటయే యీవ్యాసముముఖ్యోద్దేశము.

## వి స్తీ ర్ణ ము

సోవియటురష్యా విస్తీర్ణము సుమారు ౮౦ లక్షల చదరపుమైళ్లు. అనగా, అది భూతలములో నారవవంతును, అమెరికాసంయుక్తరాష్ట్రములకు మూడురెట్లును, భారతదేశమునకు నాలుగున్నర రెట్లును కలదు. బ్రిటిషుసామ్రాజ్యముతర్వాత సోవియటురష్యాయే విస్తీర్ణమైన రాజ్యమని చెప్పవచ్చును. ఇట్లు రష్యా కడువిస్తీర్ణముగ నుండుటయేగాక ఆసియా, యూరపుఖండములమధ్య నున్నది. అందుచేత దాని సభ్యతలో ప్రాచ్య, పాశ్చాత్య సభ్యతాసమ్మేళన చిహ్నములు కానుపించును.

## జ న సం ఖ్య

౧౯౨౬-వ సం. ము డిసెంబరునెలలో సైకొన బడిన జనాభాలెక్కలప్రకారము సోవియటురష్యా జనసంఖ్య సుమారు ౧౪౭ కోట్లు. ఈ జనసంఖ్య సగటున సంవత్సరమునకు ౩౫ లక్షల చొప్పున పెరుగుచున్నది. ఇట్లు ౧౯౩౦-వ సం. ము వచ్చుసరికది ౧౬ కోట్లకుపైగా పెరిగెను. ఇప్పటికిది మరింతవృద్ధి నందియుండవలెను.

మొత్తము ప్రజలలో నూటికి ౧౬ మంది పట్టణములలోను, తక్కినవారు గ్రామములలోను నివసించుచున్నారు. ఈవిషయములో రష్యాకును, భారతదేశమునకును చాలదగ్గరపోలిక కలదు. భారతదేశములో కూడ నూటికి సుమారు ౧౦ మందిమాత్రమే పట్టణములలోను, తక్కినవారందరును గ్రామములలోను నివసించుచున్నారు.

రష్యాయొక్క ప్రాచ్యభాగమునందు సగటున చదరపుమైలునకు ౫ గురు చొప్పునను, పాశ్చాత్యభాగమున ౬౫ మంది చొప్పునను, దేశముమొత్తముమీద ౧౮ మంది చొప్పునను నివసించుచున్నారు. ఈయంకెలను క్రిందిపట్టికలోని వానితో సరిపోల్చి చూచినప్పుడు రష్యాలో ప్రజాసాంద్రత (density of population) చాలతక్కువగ నున్నదని తెలియగలను:—

| | చదరపుమైలునకు గల జనసంఖ్య |
|---|---|
| బెల్జియము | ౬౫౪ |
| ఇంగ్లాండు, వేల్సు | ౬౪౯ |
| నెదరులాండ్సు | ౫౪౪ |
| జర్మనీ | ౩౩౨ |
| జపాను | ౨౧౫ |
| ఆస్ట్రియా | ౧౯౯ |
| ఫ్రాంసు | ౧౮౪ |
| ఇండియా (౧౯౨౧) | ౧౭౭ |
| స్పెయిను | ౧౦౭ |
| అమెరికాసంయుక్త రాష్ట్రములు | ౩౨ |

ఇట్లు రష్యాలో ప్రస్తుతము విస్తీర్ణతకు తగిన జనసంఖ్య లేదు. కనుక దానిలో ప్రజాభివృద్ధి జరుగుటకు చాలనవకాశము కలదు.

## స హ జ సం ప ద

సోవియటురష్యా కడుసారవంతమైన రాష్ట్రము. సాగుబడి కుపయుక్తమైన భూమి దానిలోనున్నంత మరెచ్చటనులేదు. దీనిని క్రిందిపట్టికవలన గ్రహింపవచ్చును:—

| | సాగుబడి కుపయుక్తమగు భూమి (లక్షలయెకరములలో) |
|---|---|
| రష్యా | ౧౪౧,౪౭ |
| అమెరికాసంయుక్త రాష్ట్రములు | ౮౭,౮౮ |
| ఆర్జెంటైను | ౫౩,౭౮ |
| ఇండియా | ౪౬,౫౭ |

సారవంతమగు భూమితోబాటు రష్యాలో సాంద్రారణ్యములుకూడ కలవు. దానిలో మొత్తము ౧౩౦ కోట్ల యెకరములకుపైగా విస్తీర్ణముగల అడవులు కలవు. వీనిలో వెంటనే కలపకొట్టుటకు తగినవాని విస్తీర్ణము ౩ కోట్ల ౯౦ లక్షల యెకరము లున్నవి. వానినుండి యేటేట ౨ కోట్ల ౧౧ లక్షల ఘనపుటడుగుల కలపను కొట్టవచ్చును. ఇట్టియడవులు వివిధప్రాంతములలో నెంతెంత విస్తీర్ణములో నున్నదియు, వానిలో నేటేట నెంతెంత కలప కొట్టవచ్చునదియు క్రిందిపట్టికలో చూపబడినది:—

| | ఎకరములు, | ఘనపుటడుగులు |
|---|---|---|
| | (లక్షలసంఖ్యలో) | |
| ఉత్తరప్రాంతము | ౨,౫౨౦ | ౧౨౭ |
| మధ్యప్రాంతము | ౫౩౦ | ౬౭ |
| దక్షిణప్రాంతము | ౧౪౦ | ౧౭ |
| | ౩,౧౯౦ | ౨౧౧ |

కెనడా, అమెరికా సంయుక్తరాష్ట్రముల రెంటియందును కలసి యెంత అడవి కలదో ఒక్కరష్యాయం

దంత కలదు. ఈ విశాలాటవినుండి సర్వప్రపంచమునకు వలయు కలపను కడుసులభముగ నెగుమతి గావింప వచ్చును.

ఇంతేగాక, రష్యాలో బొగ్గు, ఇనుము, రాగి, వెండి, బంగారము, ప్లాటినము మున్నగు ఖనిజములు కూడ విరివిగ లభించును. ఆధునిక పరిశ్రమకును, దైనందిన జీవితమునకును ముఖ్యావసరమైన పెట్రోలు, కిరసనాయిలు వగైరా సహితము దానిలో సమృద్ధిగ దొరకును. ఇట్లు రష్యాకు నిరుపమానమైన సహజ సంపత్తి కలదు. తదితరములైన కొన్ని పాశ్చాత్య దేశములవలె రష్యా ముడివస్తువులనిమిత్త మన్యదేశ ములపై నాధారపడనక్కర లేదు. కాని పూర్వదినము లలో దాని సహజసంపత్తి సదుపయోగ మొనర్చబడ లేదు. అందువలననే రష్యాదేశ మార్థికముగ చాల వెనుక బడియున్నది. ప్రస్తుతము సోవియటురష్యా తన యధీన ములో నున్న సహజసంపత్తినంతయు నెట్లుపయో గించుచున్నదియు మున్ముందు పేర్కొనబడును.

## రా జ్యాం గ వి ధా న ము

నేడు సోవియటురష్యాలో నారు స్వతంత్ర రాష్ట్రము లున్నవి. అవేవన:—

౧. రష్యను సోషియలిస్టు ఫెడలు సోవియటు రిపబ్లికు,

౨. యూక్రేనియన్ సోషియలిస్టు సోవియటు రిపబ్లికు,

3. ట్రాన్సుకాకేషియను సోషియలిస్టు ఫెడలు సోవియటు రిపబ్లికు,

౪. వైటురష్యను సోషియలిస్టు సోవియటు రిపబ్లికు,

౫. యూజ్‌బెక్ సోషియలిస్టు సోవియటు రిపబ్లికు,

౬. టర్కోమనియన్ సోషియలిస్టు సోవియటు రిపబ్లికు.

ఈ ఆరు స్వతంత్రరాష్ట్రములలోను తిరిగి అంత ర్భాగము లున్నవి. ట్రాన్సుకాకేషియను సోషియలిస్టు ఫెడలుసోవియటు రిపబ్లికునందు మూడు స్వతంత్ర రాష్ట్రము లున్నవి. అట్లే రష్యను సోషియలిస్టు సోవియటు ఫెడలురిపబ్లికునందు పదకొండు స్వతంత్ర రాష్ట్రము లున్నవి.

ఈవివిధ స్వతంత్రరాష్ట్రముల సమాఖ్యయే సోవియటురష్యా. సమాఖ్యలో నేరాష్ట్రమైన నిచ్ఛాను సారముగ జేరవచ్చును, లేదా విడిపోవచ్చును. *

సోవియటురష్యాలో జాతి, మత, వర్ణాదుల విచక్షణ లేకుండ మైనారిటీదాటిన ప్రతి కర్షకునికి, సైనికునికి, నావికునికి, వేయేల, కాయకష్టముపై జీవించు ప్రతివానికిని ఎన్నిక హక్కు కలదు. ఎన్నిక హక్కుగల ప్రతివ్యక్తికిని అభ్యర్థిగ నుండుటకుకూడ హక్కుకలదు. అన్యుల కష్టముపై బ్రతుకువారికిని, వర్తకులకును, సన్న్యాసులకును, పూజారులకును పిచ్చి వారికిని మాత్రము ఎన్నికహక్కు లేదు.

సోవియటు ప్రభుత్వపుపునాది గ్రామమని చెప్ప వచ్చును. గ్రామస్థులందరును కలసి నూర్గురి కొక ప్రతి నిధిచొప్పున గ్రామసంఘము ( Village Soviet) నకు సభ్యుల నెన్నుకొందురు. ఈగ్రామసంఘములన్నియు కలసి 300 మంది కొక ప్రతినిధిచొప్పున తాలూకా సంఘము (Cantonal Soviets ) లకు సభ్యుల నెన్ను కొందురు. అయితే, తాలూకాసంఘ సభ్యుల సంఖ్య యెప్పుడును ౫౦ కి మించరాదు. తిరిగి తాలూకాసంఘ ములు జిల్లాసంఘము ( District Soviets ) లకు సభ్యుల నెన్నుకొనును.

గ్రామములలో సంఘము లున్నట్లే పట్టణము లలోకూడ కలవు. సాధారణముగ కార్మికులు పట్టణ

* ఇది కడు గమనార్హమైన విషయము. బ్రిటిషువారు మనకు ప్రసాదింపనున్న రాజ్యాంగవిధానమునందు సమాఖ్యలో నొకసారి చేరినపిదప విడిపోవుటకు వీలులేదు. ఇది చాల సంకుచితమైన నిబంధన. సమాఖ్యలో చేర కుండునట్లు బర్మాను బెదరించునిమిత్త మిది ముఖ్యముగ గావింపబడినదని పెక్కుమంది రాజనీతిజ్ఞుల అభిప్రాయము.

సంఘము (Town Soviets) లకు సభ్యుల నెన్నుకొందురు. పట్టణపు జనసంఖ్య ౧౦ వేలకు మించనప్పుడు ప్రతి ౧౫ మంది ఎన్నికదారుల కొక ప్రతినిధి యుండును. కాని మాస్కో, లెనిన్‌గ్రాడ్‌లోవలె జనసంఖ్య ౧౦ వేలకు మించినప్పుడు ప్రతి ౪౦౦ మంది ఎన్నికదారుల కొక ప్రతినిధిచొప్పున నుండును.

జిల్లాసంఘములలో తాలూకాసంఘ ప్రతినిధులు, పట్టణసంఘప్రతినిధులు కలసియుందురు. తాలూకా సంఘములు ౧౦౦౦ మంది కొకనిచొప్పునను, పట్టణ సంఘములు ౨౦౦ మంది కొకనిచొప్పునను ప్రతినిధులను జిల్లాసంఘములకు పంపుచుండును. సోవియటు ప్రభుత్వము గ్రామములకన్న పట్టణములకును, కర్షకులకన్న కార్మికులకును ప్రాధాన్య మొసగుచుండును.* ఇది పైన పేర్కొనబడిన యెన్నికపద్ధతియందు స్పష్టముగ గోచరించుచున్నది.

జిల్లాసంఘములు రాష్ట్రీయసభ (Provincial Soviets) లకు ప్రతినిధుల నంపును. రాష్ట్రీయసభయందు జిల్లా, పట్టణసంఘముల ప్రతినిధు లుందురు. జిల్లాసంఘములు ప్రతి ౧౦ వేల ఎన్నికదారుల కొక ప్రతినిధిచొప్పునను, పట్టణసంఘములు ప్రతి ౨ వేల మంది ఎన్నికదారుల కొక ప్రతినిధిచొప్పునను రాష్ట్రీయ సభకు పంపుచుండును. ఇక్కడకూడ పట్టణముల కొసగబడిన ప్రాధాన్యము తేటతెల్లముగ కానుపించుచున్నది. పట్టణములు కొందరు ప్రతినిధులను సరాసరి యెన్నిక (Direct election) వలనను, మరికొందరిని తాలూకా సంఘముల (Indirect election) ద్వారాను రాష్ట్రీయ సభలకు పంపవచ్చును. గ్రామముల కిట్టిసౌకర్యము లేదు.

రాష్ట్రీయసభలు సోవియటు యూనియను కాంగ్రెసునకు ప్రతినిధుల నంపును. ఈ కాంగ్రెసునందు ౧౫౦౦ మంది సభ్యులుందురు. దీనికి సర్వాధికారము కలదు. శాసనముల గావించుట, శాసనముల నమలు నందుంచుట దీని కర్తవ్యములు. సోవియటు రాజ్యాంగ విధానమును మార్చుటకు దీనికి మాత్రమే అధికారము కలదు. కాని సాధారణముగ నిది శాసనముల గావించుట, వాని నమలునందుంచుట మున్నగు కార్యముల నొనర్పదు. సంవత్సరమున కొకసారి సమావేశమై రాజకీయ, సాంఘిక, ఆర్థికనీతిని మాత్ర మిది నిర్ణయించుచుండును.

శాసనము లొనర్చుట, అమలునందుంచుట మున్నగు కార్యకలాపము లన్నియు సోవియటు యూనియను కాంగ్రెసుచే నియమింపబడు కేంద్రకార్యనిర్వాహకవర్గము (Central Executive Committee) హస్తములలో నుండును. ఈకేంద్రకార్యనిర్వాహకవర్గము రెండుభాగముల (Chambers) క్రింద నుండును. మొదటిదానిలో ౩౭౧ మంది ప్రతినిధు లుందురు. రెండవదానిలో సమాఖ్య సభ్యులను వివిధరాష్ట్రములచే నొక్కొకదానికి ౫ గురుచొప్పున నెన్నుకొనబడిన ప్రతినిధు లుందురు. కాని పైరెంటిలోను మొదటిదానికే అధికార మధికముగ నుండును.

కేంద్రకార్యనిర్వాహకవర్గపు సమావేశముల మధ్యకాలములో నధికారమంతయు కార్యనిర్వాహకవర్గపు అధ్యక్షమండలి (Presidium of the Executive Committee) హస్తములలోను, ప్రజాప్రతినిధిసభ (Council of the People's Commissars) హస్తములలోను ఉండును. మొదటిదానిలో ౨౧ మంది సభ్యులుందురు. రెండవదానిలో నొకయధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును, పదిమంది సభ్యులును ఉందురు. ఈరెంటిని కూడ కేంద్రకార్యనిర్వాహకవర్గమే యెన్నుకొనును.

కార్యనిర్వాహకవర్గపు అధ్యక్షమండలి శాసనముల గావించుచుండును. అది ప్రధానన్యాయస్థానముగ కూడ వర్తించుచుండును. వివిధరాష్ట్రములలోని న్యాయస్థానముల తీర్పులపై దానికే "అప్పీలు" చేసుకొన

---

* సోవియటురష్యా ప్రస్తుత మొనర్చుచున్న సామ్యవాద ప్రయోగము (Communistic Experiment) జయప్రదముగ జరుగవలెనన్న పారిశ్రామికముగ దేశము కడు వృద్ధి నందవలెను. అందువలన సహజముగ కార్మికుల కెక్కుడు ప్రాధాన్య మొసగబడును.

వలెను. ఇక ప్రజాప్రతినిధిసభ శాసనముల గావించుట తోబాటు పరిపాలనను కూడ కొనసాగించుచుండును. ప్రతి ప్రజాప్రతినిధి (Commissar)కి సహాయ మొనర్చుట కొక సలహాసంఘ ముండును. వీరే విదేశ వ్యవహారములు, యుద్ధకార్యాలయము, వ్యాపారము, తంతి - తపాలు మున్నగు ముఖ్యమైన ప్రభుత్వశాఖల నన్నిటిని పరిపాలించుచుందురు.

ఈవిధముగ నధికారము పెక్కు సంస్థలమధ్య విభజింపబడియున్నప్పుడు ప్రభుత్వమెట్లు సక్రమముగ సాగునని కొందరికి సహజముగనే సందేహము కలుగ వచ్చును. ఇట్టివారి సందేహనివృత్తికొరకు విషయ విస్తరమును పాటింపక నాలుగైదువాక్యములను వ్రాయ వలసియున్నది. రష్యాలో సామ్యవాదపక్ష(Communistic party) మొకటికలదు. ఇది ప్రభుత్వములో నొకభాగము కాదు. ఐనను దీనికి ప్రభుత్వముపై ప్రబల మగు నధికారము కలదు. ఆవిరియంత్రపు సాదృశ్య మును తెచ్చినచో సామ్యవాదపక్షము ఆవిరియనియు, ప్రభుత్వము యంత్రమనియు చెప్పవచ్చును. ఇందుచే నధికారము వివిధప్రభుత్వసంస్థలయందు చిక్కురొక్కు రుగ విభజింపబడియున్నను పరిపాలన సక్రమముగను, నిర్విఘ్నముగను జరిగిపోవుచుండును.

రష్యారాజ్యాంగవిధానమునందు కొన్ని చక్కని విషయములు గన్పట్టును. సమాఖ్యలో సభ్యత్వముగల వివిధరాష్ట్రములును ఆంతరంగికపరిపాలనము నందు సంపూర్ణ స్వాతంత్ర్యమును కలిగియుండును. రాష్ట్ర విభజన కేవలము పరిపాలనసౌకర్యములనుబట్టిగాక నైసర్గిక, ఆర్థికస్థితిగతుల ననుసరించియుండును. తది తరదేశములందువలెగాక ప్రతినిధియైన నతడు ప్రజా విశ్వాసమును గోల్పోయినవెంటనే సభ్యత్వమునుండి తొలగించుటకు వీలుండును. మొత్తముమీద భారత దేశపు కాంగ్రెసు మహాసభా నిర్మాణమునకును, రష్యా రాజ్యాంగ విధానమునకును పెక్కువిషయములలో పోలికలున్నట్లు కానుపించును.

## వ్యవసాయము

సోవియటురష్యాలో వ్యవసాయమే ప్రధాన వృత్తి. రష్యాప్రజలలో నూటికి ౮౦ మంది కర్షకులే. అందుచే రష్యాదేశసౌభాగ్యమునకు వ్యవసాయాభివృద్ధి ముఖ్యావసరమని వేరుగ చెప్పనక్కరలేదు.

గత జర్మనుసంగ్రామమునకు పూర్వము వివిధము లైన ధాన్యములను క్రిందపేర్కొనిన ప్రమాణములో పండించుచుండెడిది:—

| | ప్రపంచపు మొత్తములో (నూటికి) | |
|---|---|---|
| గోధుమలు | .౨౭.౬ | వంతులు |
| వడ్లు | ౨౮.౦ | ,, |
| ఓట్సు (Oats) | ౧౮.౦ | ,, |
| రై (Rye) | ౧౩.౮ | ,, |
| యవలు (Barley) | ౭.౯ | ,, |

అప్పుడది క్రిందివిధముగ ధాన్యాదుల నెగుమతి చేయుచుండెడిది:—

| | ప్రపంచపు మొత్తపు నెగుమతులలో (నూటికి) | |
|---|---|---|
| వడ్లు, గోధుమలువగైరా | ౨౮.౦ | వంతులు |
| వెన్న | ౨౧.౦ | ,, |
| కోడిగ్రుడ్లు | ౩౪.౦ | ,, |
| ఎల్లగిసెనార (Flax) | ౭౭.౦ | ,, |

ఈ యంకెలను గాంచి రష్యాలో నప్పుడు వ్యవసాయము చాల నుచ్చదశలోనున్నదని దురభి ప్రాయము పడుట కవకాశము కలదు. కాని రష్యా దేశమునకు గల సహజసంపత్తితో సరిపోల్చిచూచి నప్పుడు పైన పేర్కొనబడినపంట చాలతక్కువయని తెలియగలదు. యూరపుఖండమంతటిలోను రష్యా భూములే కడుసారవంతమైనవి. ఐనను వానియందొక యెకరములో పండినపంటకంటె ఆస్ట్రియా, ఫ్రాంసు దేశములందొకయెకరములో ౨ రెట్లును, ఇంగ్లండు

జర్మనీదేశములలో ౩ రెట్లును, డెన్మార్కులో ౪ రెట్లును పండుచుండెడిది. యుద్ధమునకు పూర్వము అమెరికాలో సగటున యెకరమునకు రు. ౬౦౦ లు సాలీనాఆదాయము వచ్చెడిది. కాని రష్యాలో రు. ౯౦ లకుమించి వచ్చెడిదికాదు.

ఇట్లు రష్యా వ్యావసాయికముగ వెనుకబడి యుండుటకు పెక్కుకారణము లుండెడివి. వానిలో ముఖ్యమైనది సరియైన నీటివసతి లేకుండుట. జారు ప్రభుత్వకాలమున దేశమందంతటను కేవలము ౫౫౦ మైళ్ల నిడివిగల కాల్వ లుండెడివి! దీనినిబట్టియే తక్కిన శోచనీయమగు పరిస్థితులనుకూడ మనము కడుసులభముగ నూహించుకొనవచ్చును.

జర్మనుయుద్ధకాలమున పరిస్థితులు మరింత అధ్వాన్న మయ్యెను. భూములను వదలి కోటిమంది రైతులు యుద్ధరంగమున కేగవలసివచ్చెను. అందువలన సాగుబడిలోనున్న భూమివిస్తీర్ణము కొన్నికొన్ని ప్రదేశములలో నూటికి ౩౦ వంతులుకూడ తగ్గిపోయెను. పోగా మిగిలిన భూమినైనను సవ్యముగ సాగు చేయుటకు వీలులేకపోయెను. ఆదినములలో రష్యా వ్యవసాయపరికరములను విదేశములనుండి తెప్పించుకొనుచుండెడిది. యుద్ధమువలన వానిని తెప్పించుకొనుట దుస్సాధ్యమయ్యెను. ౧౯౧౭-వ సం. ము సెప్టెంబరు నెలలో ౫౦ లక్షల కొడవళ్లు అత్యవసరముగ కావలసి వచ్చెను. కాని ౨౦ వేలకుమించి సప్లయి కాలేదు. ఈ కారణము లన్నిటిచేతను వ్యవసాయ మడుగంటెను. పూర్వమువలె విదేశములకు ధాన్యాదుల నెగుమతి చేయు టట్లుండ, ప్రజల క్షుద్బాధ తీరుటయే కష్ట మయ్యెను.

పరిస్థితు లిట్లు కడువిషమముగ నున్నప్పుడు సోవియటుప్రభుత్వ మధికారములోనికి వచ్చెను. అధికారము చేజిక్కినంతనే అంతనుక జమీందారులు, పెద్ద రైతులు మున్నగువారి స్వాధీనములో నున్న భూమి నంతయు ప్రజ లాక్రమించుకొనవచ్చు నని నూత్న ప్రభుత్వ మొకప్రకటన గావించెను. తదుపరి ౧౯౧౮-వ సంవత్సరము ఫిబ్రవరి ౧౮-వ తేదీని రైతుల హక్కులను నిర్వచించునట్టి చట్టమొకటి గావింపబడెను. దానిలో రైతులందరును స్వయముగ కష్టించి సేద్య మొనర్పవలెనే గాని భూమిని కట్టుబడికిచ్చుట, కూలిచే సాగుచేయించుట మున్నగునవి కావింపగూడ దనియు, అట్లు గావింపలేక పోయినచో భూమిని వదలుకొనవలెనేగాని, దాని నమ్ముకొనుట, అన్యాక్రాంత మొనర్చుటవగైరా చేయ గూడదనియు విధింపబడెను. ఈ నియమముల నమలులోనికి తెచ్చుబాధ్యత గ్రామసంఘముల (Village Soviets) పై నుంచబడెను.

కాని సోవియటుప్రభుత్వమిట్లు వ్యవసాయమును పునరుద్ధరించుటకు గావించిన ప్రయత్నములు సఫలము కాలేదు. విదేశప్రభుత్వములతో ౧౯౧౮ - ౧౯౧౯ సం. ములలో జరిగినయుద్ధములవలనను, తదుపరి చెలరేగిన అంతఃకలహములవలనను వ్యవసాయమునకు మరింత దెబ్బ తగిలెను. తుదకు ౧౯౨౧-వ సం.మున రష్యా చరిత్రలో నదివర కెన్నడును కానుపింపనంతటి ఘోరమైన కరవువచ్చెను. ఆదినములలో సోవియటుప్రభుత్వము రణరంగమందున్న తన సైనికుల పోషణనిమిత్తము ప్రతికర్షకునివద్దనుండియు నిర్బంధముగ నిర్ణీతప్రమాణములో ధాన్యాదులను ప్రోగుజేయ వలసివచ్చెనుకూడ!

ఈక్రింద పేర్కొనబడిన యంకెలవలన రష్యాలో నప్పుడు ప్రబలిన విపరీతపరిస్థితులను కడుసులభముగ నూహింపవచ్చును:—

| | ఏయే సం. ముల మధ్య | తగ్గుదల (నూటికి) |
|---|---|---|
| సాగుబడిలో నున్న భూమి | ౧౯౧౬-౨౧ | ౪౦ వంతులు |
| గోధుములు | ౧౯౧౩-౨౧ | ౭౫ ,, |
| ప్రత్తి | ౧౯౧౩-౨౨ | ౯౭ ,, |
| గుఱ్ఱములు | ౧౯౧౬-౨౨ | ౪౦ ,, |
| ఎడ్లు, ఆవులు | ,, | ౩౪ ,, |
| మేకలు, గొఱ్ఱెలు | ,, | ౫౧ ,, |
| పందులు | ,, | ౫౦ ,, |

ఇట్లే తక్కినపంటలు, పశువులు వగైరాలసంఖ్య తగ్గిపోయెను. దశదిశలును క్షుద్బాధాపీడితుల ఆక్రంద నములతో ప్రతిధ్వనింపసాగెను!!

ఇంతలో నదృష్టవశమున విదేశప్రభుత్వములతో యుద్ధములును, అంతఃకలహములును సమసిపోయి, దేశ మున శాంతినెలకొనెను. అప్పుడు సోవియటుప్రభుత్వము వ్యవసాయాభివృద్ధికై కొన్ని సంస్కరణములను గావిం చెను. వానిలో ముఖ్యమైనదేవన, రైతులు కూలినాలి పెట్టికూడ సేద్యము గావించుకొనవచ్చుట. ఈ సంస్క రణములవలనకూడ భూమిని కట్టుబడి కిచ్చుట, తాకట్టు పెట్టుట, అమ్మకొనుట, అన్యాక్రాంత మొనర్చుట వగైరా కూడదను నియమములుమాత్రము యథాతథ ముగ నమలునం దుండెను.

ఈ సంస్కరణములను ప్రవేశపెట్టకముందు రైతునకు కుటుంబపోషణ నిమిత్తము కావలసిన ధాన్య మును వదలి తక్కినదాని నంతయును ప్రభుత్వము గైకొనుచుండెడిది. కాని సంస్కరణములు ప్రవేశపెట్ట బడినవెనుక పంటతో నిమిత్తములేకుండ కొంతశిస్తు వేయబడెను. ఈశిస్తులో నూటికి ౯౩ వంతులు ప్రభు త్వమునకును, తక్కిన ౭ వంతులును స్థానికసంస్థలకును చేరవలెననికూడ నియమింపబడెను.

తదుపరి సోవియటుప్రభుత్వము వ్యవసాయాభి వృద్ధికి క్రిందివిధముల ప్రయత్నింపసాగెను:—

౧. వ్యవసాయపద్ధతుల నభివృద్ధి గావించుట,

౨. పశుపోషణ శాస్త్రానుగుణముగ నొనర్చుట,

౩. మరనాగళ్లు వగైరాలను వాడుకలోనికి తెచ్చుట,

౪. సాగుబడిలో సహకారపద్ధతుల నవలంబించుట,

౫. వ్యవసాయప్రయోగశాలలను నెలకొల్పుట.

పై పద్ధతుల నవలంబించుటవలన దేశమునకు చాల లాభము కలిగెను. యుద్ధమునకు పూర్వము రష్యాలో ౫౦౦ మరనాగళ్లుమాత్రమే యుండెడివి. కాని ౧౯౨౫-వ సంవత్సరమునకు వానిసంఖ్య ౧౨,౫౦౦ వరకును, ౧౯౨౬-వ సం. మునకు ౩౨,౫౦౦ వరకును హెచ్చెను. ౧౯౧౩-వ సం. ములో దేశము మొత్తము మీద ౧,౭౪౦ వ్యవసాయప్రయోగస్థానము లుండెడివి. కాని ౧౯౨౫-వ సం. మునకు వానిసంఖ్య ౨,౫౧౫ వర కును, ౧౯౨౬-వ సం. మునకు ౩,౧౪౭ వరకును పెరి గెను.

ఇట్లే సహకారవ్యవసాయసంస్థలు ( Collective farms ) కూడ వృద్ధినందెను. సోవియటుప్రభుత్వమే ప్రప్రథమమున సహకారపద్ధతిపై సాగుబడి చేయుటను ప్రవేశపెట్టెను. దేశము మొత్తముమీదనున్న ౨ కోట్ల ౬౦ లక్షలమంది రైతులలోను ౧౯౨౭-వ సం. మునకు ౭౦ లక్షలమంది సహకారసంఘములందు సభ్యులక్రింద చేరిరి. దీనివలన రైతులకును, ప్రభుత్వమునకునుకూడ విశేషలాభము కలిగెను.

తదుపరి ౧౯౨౮-వ సం. ములో "పంచవర్ష పద్ధతి" (Five year plan) యొకటి ప్రవేశపెట్టబడెను. వ్యవసాయమునకు సంబంధించినంతవర కీపద్ధతియొక్క ముఖ్యోద్దేశములు క్రింద నుల్లేఖింపబడినవి:—

౧. సహకార వ్యవసాయ సంఘములను విరివిగ నేర్పరుచుట. వానికై ఆధునిక వ్యవసాయపరికరముల నన్నిటిని సేకరించుట.

౨. ఆదర్శప్రాయముగ నుండునట్లు ప్రభుత్వము తరఫున కొన్ని వ్యవసాయసంస్థలను నెలకొల్పుట.

౩. కూలినాలిపెట్టి వ్యవసాయము చేయించుచు, విపరీతముగ లాభమును బడయు మోతుబరు రైతుల హత మార్చుట.

ప్రబల ప్రయత్నమువలన పై యుద్దేశములు చాల వరకు నెరవేరినవి. పంచవర్ష పద్ధతి ప్రవేశపెట్టబడిన మూడుసంవత్సరములలోనే దేశమునందు మొత్తము ౨ లక్షల సహకార వ్యవసాయసంఘములు నెలకొల్ప బడెను. ప్రభుత్వముతరఫున ౫౦ వేల వ్యవసాయ సంస్థలు ప్రారంభింపబడెను. ఈ కాలములోనే మొత్త ముమీద సాగుబడిక్రింద నున్న భూమి విస్తీర్ణము ౫ లక్షల

౨౦ వేల యెకరములకుపైగా పెరిగెను. మోతుపరు రైతుల ప్రాబల్యముకూడ పూర్తిగ నశించిపోయెను.

ఈ ప్రథమ పంచవర్ష పద్ధతివలన అంచనావేయ బడినదానికంటె మూడురెట్లు అధికముగ ఫలితము కలిగెను. అందుచే ద్వితీయపంచవర్ష పద్ధతి త్వరలో ప్రవేశపెట్టబడనున్నది.

మొత్తముమీద రష్యాదేశము నేడు ధాన్య లక్ష్మితో నేత్రానందకరముగ నొప్పారుచున్నది.

(సశేషము)

---



కాశీ - పడమటివైపు

(గంగగట్టుననున్న ఔరంగజేబు మసీదునుండి)

—సి. జి. జగన్నాథదాసు.

# నానాజాతిసమితి అనగానేమి? అది చేయునదేమి?

సి. యస్. లక్ష్మి

## నిర్మాణము

ప్రపంచయుద్ధము ముగిసినతరువాత జర్మనీకిని మిత్రజాతులకును జరిగిన పారిసు(రాజా) సంధిపత్రమున సంతకములు జరిగిన ౧౦-౧-౨౦ తేదినే "జాతుల సమితి" కూడ నిర్మింపబడినది. జర్మనీ, ఆస్ట్రియా హంగరీ, బల్గేరియా దేశములతో జరిగిన సంధిపత్రము లన్నియు సమితిప్రణాళికతో ప్రారంభమై సమర మొనరించిన జాతులప్రతినిధుల సంతకములతో ముగియు చున్నవి. అట్లు సంతకములు చేసినవారిలో కనడా, ఆస్ట్రేలియా, న్యూజిలండు, దక్షిణాఫ్రికా, ఇండియా దేశముల ప్రతినిధులుకూడ నున్నారు. ఆవిధమున సమితినిర్మాణమున బ్రిటిషుసామ్రాజ్యమునకు ఆంతల బాధ్యత యున్నది. స్వతంత్ర-హక్కులతో, సామ్రాజ్యాంతర్గత భాగములు సంతకములుచేసిన యానాటి నుండియు బ్రిటిషుసామ్రాజ్యమున నవీనయుగము ప్రారంభమైనది.

సమితియొక్క విధానమును నిర్ణయించుచు నిర్మింపబడిన 'సూత్రప్రణాళిక' ౧౯౧౯-వసంవత్సరమున పారిస్ నగరమున జరిగిన శాంతిసమావేశమునందలి మిత్రజాతుల ప్రతినిధుల సంఘముచే తయారుచేయబడినవి. దానియం దిరువదియారు సూత్రము లున్నవి. వాటిలో నొకభాగము వివాదముల నిరోధించుటకును, పరిష్కరించుటకును ఉద్దేశింపబడినది. సమితిసూత్ర ప్రణాళికలో వ్రాయబడినప్రకారము యుద్ధేతరములైన అన్ని విధానములును, విఫలములైననేగాని యుద్ధమునకు దొరకొనమనియును, సమితితీర్పులకు—కొలదివిషయములుదక్క—మారుమాటాడక బద్ధులమగుదుమనియు సమితిసభ్యు లంగీకరించియున్నారు. సమితితీర్పులకు వ్యతికరించు సభ్యజాతిని వాణిజ్య ధనవ్యవహారసంబంధము మాని ఆర్థిక ధనబహిష్కరణవలనను, అవసరమైనచో సైనిక నౌకాదళముల మార్గముననను, కట్టకడపట సమితిలోనుండి వెడలగొట్టబడుట మూలముననను శిక్షింపవచ్చును. సమితిసభ్యులందరును తమసంధిపత్రములను సమితికార్యస్థానమున ప్రచురణ నిమిత్తము రిజిష్టరు చేయవలయుననియు, లేనిచో నవి రహస్య సంధిపత్రములై, ఎవరినిగూడ బాధించవనియు నొక ముఖ్యమైన సూత్రమున్నది. ఆసూత్రము ననుసరించి యిప్పటికి సుమారు ౨౫౦౦ సంధిపత్రములు రిజిష్టరు కాబడియున్నవి. సమితి యార్థిక జనహిత వ్యాపారములనుసరించిన సూత్రములుకూడ కొన్నియున్నవి.

## సభ్యత

సమితిలో నిప్పుడు ౫౮ రాజ్యములు సభ్యులుగ నున్నవి. బ్రిటిషుసామ్రాజ్యాంతర్గతాధినివేశరాజ్యములును, భారతదేశమునుకూడ నందు స్వతంత్రసభ్యులై వోటునిచ్చుటకు హక్కుగలిగియున్నవి. సమితియందు సభ్యతగన్న రాజ్యములందలి ప్రజలసంఖ్య ప్రపంచమందలి జనాభాలో మూడవవంతు. ప్రపంచమందలి ముఖ్యదేశములలో రష్యా, అమెరికా సంయుక్త రాష్ట్రములు సమితియందు సభ్యులుగ చేరకయున్నవి. కాని, సమితివారిచే నాహూతములై లోకసంగ్రహము కొరకు ప్రయత్నించు ఆయుధవిసర్జన, ఆర్థిక, సాంఘిక, పురోవృద్ధి విషయక సమావేశములలో నారాజ్యములును పాల్గొనుట తమమంచికే యని యెరుగ గలిగినవి. జాతులసమితి ప్రారంభించిన కార్యము చాల బాగుగ నిర్వహింపబడుచుండుటచే ఏరాజ్యముగాని సమితితో నెంతమాత్రమును సంబంధములేకయుండుట సాధ్యముకాదు. అయినను పైనుదాహరించిన రాచకార్యములును, సమితిలో సభ్యులుగజేరి, బాధ్యత వహింపకపోవుటచేత సమితియొక్క కార్యనిర్వాహక సామర్థ్యమును, సమితిపరిష్కారముల గౌరవమును కొంత కుంటువడినదని యొప్పుకొనక తప్పినదికాదు.

## సమితి నిర్వహించిన విషయములు

జాతులసమితి ఏమిచేయును ?

ఎల్లరకును శాంతిని నిలుపుటకును, ఆర్థికధన సహకారము నభివృద్ధిపరచుటకును, మానవారోగ్య మును, యోగక్షేమములను నభివృద్ధి నొందించుటకును చేసిన పనులు కొన్ని చూతము :

I రాజకీయము :

సమితి చేయవలసినదానిలో ముఖ్యమైనది యుద్ధేతరమార్గముల వివాదపరిష్కారము. చాలవర కైరోపా ఖండమునందే ౧౮౬ పర్యాయము లది నిర్వహింపబడినది. స్థానిక కారణములచే ప్రపంచయుద్ధము జరుగవచ్చు ననుమాట మనతరమువారికి వేరెచెప్పనక్కరలేదు. రుముకుచున్నదేశము తన కెంతదూరమున నున్నను ఏమాత్రమాలోచనగల మనుష్యుడైనను, తనసంబంధము కాదని నిశ్చింతగ నుండజాలడు.

౧౯౨౦-వ సంవత్సరములో స్వీడను, ఫిన్లాండు రాజ్యము ఆలండ్ ద్వీపముల భుక్తమును గురించి విరోధపడుచుండగా బ్రిటిషురాజ్యము సమితి కావిషయమును తెలిపి పరిష్కరింపుమని కోరెను. సమితి ఇరుతెగలవారి హక్కుభుక్తములను, చట్టమును న్యాయముగ, సంపూర్ణముగ, నిష్పక్షపాతముగ విచారించి ఆద్వీపములను ఫిన్లాండున కిప్పించి 'స్వీడ్' మాతృభాషగాగల ప్రజలకు ప్రత్యేకహక్కుల నిర్ణయించినది. ఈతీర్పును రెండు రాజ్యములు నంగీకరించినవి. చిలికి చిలికి గాలివానగాకుండనే గోటద్రుంచవలసినదానికి గొడ్డలి యవసరములేకుండనే వ్యవహారము శాంతముగ పరిష్కరింపబడినది.

౧౯౧౨-వ సంవత్సరములో జుగోస్లావియా ఆల్బేనియారాజ్యములు యుయుత్సువులై (యుద్ధసన్నద్ధములై) యుండగా సమితి యుద్ధమును నిరోధించితీరుదునని బెదరించినంతనే క్రోధములు చల్లారినవి.

ఈ మధ్య అక్టోబరునెలలో, అంతకంటె గొప్ప అపాయము సమితి కలుగజేసికొనుటచేత ఆగిపోయినది. గ్రీసు, బల్గేరియాదేశముల సరిహద్దువిషయమై వివాదములు సంభవించి, ప్రజ్వరిల్లుటకు సిద్ధమైనవి. రెండురాజ్యముల సైన్యములును, ఒండొరుల రాజ్యములలో ప్రవేశించినవి. గ్రీసుదేశము బల్గేరియాదేశమునకు యుద్ధప్రకటనము పంపినది. బల్గేరియా రాజ్యము సమితికి ఆసంగతి తెలిపి, వ్యవహారము పరిష్కరించుమని కోరినది. వెంటనే యుద్ధమాపివేయవలసినదని అవసరసమావేశపులీగ్ సభవారు ఉత్తర్వులు పంపించగా యుద్ధమాగిపోయినది. తరువాత నిరుపక్షములకు నచ్చునట్టుగా పరిష్కారమైనది. మరల ౧౯౨౫ లోకూడ కొంచెమించుమించుగ నిటులనే జరిగినది.

ఇంకను అనేకవివాదములు పరిష్కరింపబడినవి. టర్కీ-ఇరాక్ దేశముల మోసుల్ సరిహద్దు వివాదము ౧౯౨౪-వ సంవత్సరములో సమితినిధానముమూలమున శాంతిమార్గమున పరిష్కరింపబడినది. ఈసందర్భమున ఒకఉపసంఘము నేర్పరచి, సరిహద్దును, అంతర్జాతీయ శాశ్వతన్యాయస్థానమువారి సలహాయభిప్రాయముతో పరిష్కరింపబడినది.

II న్యాయస్థానము :

ఉపసంఘములద్వారా పరిష్కరించుటకు అంతగా వీలు లేక న్యాయస్థానమున, న్యాయాధిపతులచే పరిష్కరింప బడవలసిన రకముల వివాదములు కొన్ని యున్నవి. వాటిలో చాలవరకు అంతర్జాతీయ శాశ్వత న్యాయస్థానమునకు పంపబడినవి. ఈన్యాయస్థానము ౧౯౨౧-వ సంవత్సరమున స్థాపింపబడినది.

దీనియందు ౧౫ గురు న్యాయాధిపతు లున్నారు. వారందరును తమతమదేశములలో అంతర్జాతీయముగ చాల కీర్తిని గడించినారు. వీరియుద్యోగము ౯ సంవత్సరములవరకు నుండును. సామాన్యముగ న్యాయస్థానమున క్రమముగ పనిజరుగుచునే యుండును. అవసరమయినచో అవ్యవధిగ న్యాయాధిపతులను సమావేశపరచి పనిజరిపించవచ్చును.

సామ్రాజ్యాధిపతులయిన ఆంగ్లేయపరాసురాజ్యములనడుమ ౧౯౨౩-వసంవత్సరములో ఒక్కవివాదము

సంభవించినది. ఆవివాదము పరాసుసామ్రాజ్యసంరక్షణములోనున్న మొరాక్కో ట్యూనిస్ రాజ్యములందలి యాంగ్లేయప్రజలు సైన్యమునజేరి పనిచేయవలయునా, లేదా యను సమస్యవిషయమైనది. మొట్టమొదట పరాసుసామ్రాజ్యము వివాదము, మధ్యవర్తులద్వారా పరిష్కారమునకు ఒప్పుకొనలేదు. కాని జాతుల సమితివారి సమక్షమున నీవిషయము ప్రస్తావింపబడినప్పుడు అంతర్జాతీయ శాశ్వతన్యాయస్థానమువారు సలహానొసంగుటకును ఈ విషయము ఒక పరాసు సామ్రాజ్యమునకే సంబంధించినది మాత్రమే కాదనియు, అందువలన నాన్యాయస్థానమువారి తీర్పునకు తాము కూడ బద్ధులమగుదుమనియు పరాసుసామ్రాజ్యము ఒప్పుకొనినది. న్యాయస్థానము తీర్పునొసంగినది. వ్యవహారమంతయు శాంతియుతముగ న్యాయస్థానమున బరిష్కరింపబడినది.

"ఇచ్ఛావిధి" కి సంతకముచేయుటచే తమలో తమకు సంభవించిన ప్రతివివాదమును అంతర్జాతీయ శాశ్వతన్యాయస్థానమునకు పంపుదుమనియు, వారి తీర్పులకు బద్ధులమగుదుమనియు రాజ్యములు అంగీకరించుచున్నవి. బ్రిటిషుసామ్రాజ్యముతోపాటు ౩౫ రాజ్యములు ఇచ్ఛావిధికి సంతకము చేసినవి. ఇంతవరకును ఈన్యాయస్థానము ౧౬ తీర్పులను, ౧౭ సలహాలను ఒసంగియున్నది. అట్టి కొన్ని సలహాలమూలమున అల్పసంఖ్యాకుల విరోధభావము పోయినది.

III ఆయుధవిసర్జనము:

అనేకశతాబ్దములనుండి ప్రపంచమునందలి మేధావులకు సాధ్యముకాని యీ ఆయుధవిసర్జనసమస్యపై ౧౦ సంవత్సరములకుపైగా "జాతులసమితి" తనదృష్టిని ప్రసరించుచున్నది. ౧౯౨౩-వ సంవత్సరమున ఏదేశమైనను దండెత్తబడినచో నాదేశమునకు తక్కిన యన్ని దేశములును సహాయము చేయుదుమని "పరస్పరసహాయసంధి" జరిగినది. అందువలన నిర్భయముగా గొంతవరకు ఆయుధవిసర్జన జరుగునని యూహింపబడినది. కాని కొన్నిరాజ్యములకవి చాలినదికాదు. అందువలన ౧౯౨౪-వ సంవత్సరములో అంతకంటె విశాలమైన విధానము "ప్రోటోకోల్" సమితి సూచించినది. దానిప్రకారము ఏదేశము మధ్యవర్తిత్వముద్వారా రాజీగా పరిష్కరించుకొనుట కొప్పుకొనినదో, ఆదేశము దండెత్తినట్లు ఎంచుకొనవలయునని స్థిరపరుపబడినది. ఈమారు ఇందులోని షరతులవలన తమపై విధింపబడిన ధర్మవిధులు చాలఎక్కువ అని కొన్నిరాజ్యములు అభిప్రాయపడినవి. కాబట్టి ౧౯౨౫-వ సంవత్సరములో ఆరవమహాసభ మధ్యవర్తిత్వము, పరస్పరసాహాయ్యము, ఆయుధవిసర్జనము- ఈమూడే ప్రధానసూత్రములని నిర్ణయించినది. ప్రపంచ-ఆయుధవిసర్జనసమావేశమునకు గావలసిన సమాచారములను సమకూర్చుటకును, ముందుగా జరుగవలసినపనిని చేయుటకును ఆవిషయమున పండితులతో నొక "తయారు ఉపసంఘమును" సమితి స్థాపించినది. ఒకప్రత్యేక ప్రదేశమున సమితి నిర్వహింపగల విషయమును బాగుగా చూపుటకు, వీలైన "లోకార్నో" సంధులు ౧౯౨౧-వ సంవత్సరమున జరిగినవి. దండెత్తబడిన సమయమున పరస్పరసహాయ మొనరించుటకును జర్మనీకిని, ఇరుగుపొరుగువారికిని సంభవించెడి ప్రతివివాదమును మధ్యవర్తిత్వముమూలముననను, ఇతరశాంతిమార్గముననను పరిష్కరించుకొనుటకును, సమితి ఆయుధవిసర్జనమువిషయమున చేయు ప్రయత్నములకు సహాయ మొనరించుటకును ఆసంధుల ప్రకారము బద్ధులయియున్నారు. జర్మనీ ఫ్రాన్సు బెల్జియము దేశముల నడుమ యుద్ధమును "వెలివేసిరి." ఈసంధులే ౧౯౨౮-వ సంవత్సరమున జరిగిన, కెల్లాగ్ సంధికి బీజము. ఆసంధి ప్రకారము యుద్ధముగాని, మరియేఅశాంతికరమార్గముగాని అంతర్జాతీయ వివాదములను పరిష్కరించుకొనుటకు సాధనము కాదనియు, శాంతిమార్గముల మధ్యవర్తిత్వముద్వారా పరిష్కరించుటయే నిజమగు సాధనమనియు నందు స్థిరపరుపబడినది. ౧౯౩౦-వ సంవత్సరాంతమునకు ౬౧ రాజ్యము లాసంధియందు సంతకము జేసినవి. ౧౯౨౫-వ సంవత్సరము మొదలు ౧౯౩౦ వరకును అమెరికా రష్యారాజ్యములలో కలిసి, సమితి విశ్వప్రయత్నములు

చేసి ఆయుధవిసర్జన సమావేశమునకు నొక చిత్తుకార్య క్రమమును విషయనిర్ధారణమును తయారుగావించిరి. ౧౯౩౨-వ సంవత్సరము ఫిబ్రవరిలో ఆయుధవిసర్జన సమావేశము ప్రారంభమైనది. ఇంకను చర్చలు జరుగుచునే యున్నవి. ౯ రాజ్యములమధ్య "జనరల్ ఆక్టు" అని యొకసంధి జరిగినది. ఆసంధిప్రకారము ఆయా రాజ్యముల వివాదములు పరిష్కరించుటకు మార్గములు ఆదర్శముగా చూపబడినవి. అందువల్ల మరికొంత సంరక్షణకూడా నారాజ్యములకు గలిగినది.

IV జనహిత కార్యములు:

ఒక్కొక్క రాజ్యమే తనంతటతాను, నిర్వహించలేని, అంతర్జాతీయ, జనహితకార్యములకు సహాయమొనరించియు, ప్రారంభించియు సమితి నిర్వహించుచున్నది. దేశదేశముల చట్టములను నిర్మించి వ్యభిచారస్త్రీ వ్యాపారమును, నల్లమందువ్యాపారమును, బాలయువజనుల సంరక్షణమును జరుపుచున్నది. మనిషికి ౧౫ రూపాయలు ఖర్చుపెట్టి సుమారు నాలుగులక్షల యాభైవేలమంది యుద్ధమున బందీలుగానున్నవారు రష్యా దేశమునుండి వారివారి దేశములకు పంపివేయబడిరి. అంతర్జాతీయ కార్మిక సంఘమువారి సహాయముతో రష్యావిప్లవమునకు జడిసి పారిపోయివచ్చినవారికి తగిన పనులు సమితి చూపినది. అనటోలియా దేశమునందలి గ్రీకుప్రజలను కాపాడినది.

అనేకపర్యాయములు ఈమధ్య యూరపున అంటువ్యాధులు సర్వజనభయంకరముగ వ్యాపించినవి. ౧౯౨౧-వ సంవత్సరములో కరువులో బాధపడుచున్న రష్యాలో "టైఫాయిడ్" తుడిచిపెట్టినది. అచటి పరిస్థితులతిభయంకరముగాగ గుములుగుములుగా రష్యా దేశస్థులు పశ్చిమయూరోపాఖండమున ప్రవేశించి ఆచట గూడ నీవ్యాధిని వ్యాపింపజేసిరి. అందువలన ప్రపంచమందలి ప్రతిదేశమునగూడ నీవ్యాధి వ్యాపించునని భయముగలిగినది. సమితిసహాయముతో పోలండుదేశము వార్సానగరమున సమావేశము నాహ్వానించినది. రాజకీయాభిప్రాయభేదముల మరచి జర్మనీ రష్యా దేశములు ప్రతినిధులను పంపినవి. సమితి యీవ్యవహారమునంతను తానే పైనవేసికొని నిర్వహించినది. జినీవా సింగపూర్ నగరములలో సక్రమముగ ఆరోగ్యసంరక్షణసమాచారములను పంపుటకుగాను ఒక చారశాఖ స్థాపింపబడినది. అది వెనుకబడిన రాజ్యములకు సలహాలనిచ్చుచు, చలిజ్వరము, రాచ కురుపు మొదలయిన భయంకర వ్యాధులనుగురించి పరిశోధనలను జరుపుచున్నది.

V సంరక్షణములు:

పూర్వపు జర్మన్ అధినివేశరాష్ట్రములును, తురుష్కసామ్రాజ్యమునందలి-టర్కీ-తప్ప-భాగములును నేడు బ్రిటిష్, ఫ్రెంచి, బెల్జియమ్, జపానురాజ్యముల సంరక్షణలో నున్నవి. స్వరాజ్యార్హతనుబట్టి అవి మూడు రకములుగా భాగింపబడినవి. సంరక్షణపద్ధతి రాజ్యమును కలుపుకొనుటకాదు. తమసంరక్షణలోనున్న రాజ్యములను సంరక్షించువారు "నాగరికతకొరకు ధర్మాదాయము"గా సమితితరపున భావింతుమని వాగ్దానముగావించియున్నారు. అన్ని సంరక్షకరాష్ట్రములందును సామాన్యవిషయము తమధర్మాదాయము నెట్లు పరిపాలించుచున్నారో సమితి మహాసభవారికి పాలకులు నివేదికను ప్రతిసంవత్సరమును సమర్పించుచుండవలెను. సాధారణముగ పరిపాలనము పాలితుల స్వదేశీయాభివృద్ధికై యుండవలెను. ఈమధ్యను మరియొక అంగీకారపత్రము బానిసవ్యాపారవిషయమై ౪౪ రాజ్యముల వారు సంతకముచేసిరి. కాని అది సక్రమముగ నమలులోనున్నదా యని సందేహముగనున్నది. లైబీరియా దేశమునందు తప్పనిసరిగ కూలిచేయువిషయమై చాల చెడ్డగా సమితివారి ౧౯౩౦-వ సం.పు నివేదిక తెలుపుచున్నది. నల్లమందు, నిషాద్రవ్యములు, మారణయంత్రములు మొదలగువాని వ్యాపారము మితిమీరియుండరాదు. స్వదేశసంరక్షణార్థము మాత్రమే సిపాయీలను తయారుచేయవలయును కాని పాలితులను సైనికులుగ యుద్ధమునకు పాలకులు తయారుచేయరాదు. ఈవిధముగ నంతర్జాతీయ కార్మికసంఘమువారితో కలిసి సమితి పనిచేయుచు ప్రతిసంగతిని ప్రచురించుచున్నందునను సమితికిని పరిపాలకులకు సంబంధముండుటవలనను, సంరక్షణ

రాష్ట్రములలోని పరిపాలనము అధినివేశరాష్ట్రముల పరిపాలనతో సరిసమానముగనున్నది.

VI పునర్నిర్మాణవిధానము:

సమితి నిర్వహించుచున్న కార్యములలో ముఖ్యమైనది ధనసంస్కరణము; అందువలన నార్థికసంస్కరణము. ఆర్థికసంఘమువారు ౨౩-వ సూత్రముప్రకారము పరిశోధన గావించుచు క్రమముగ పురోభివృద్ధికి తోడ్పడుచున్నారు.

ఆస్ట్రియా దేశమునందు దేశీయసహాయముతో ఆర్థికపునర్నిర్మాణమును సమితి జరిపినది. ఇటువంటిగొప్ప విషయములలో నిదియే మొదటిది. ౧౯౨౨-వ సం.ములో ఆస్ట్రియాదేశము దివాలాతీయుటకు సిద్ధముగనుండెను. వారి చలామణి పూర్తిగ పడిపోయెను. వారి పరిశ్రమలను నడపుటకు కావలసిన ముడిపదార్థములను కొనుటకు వారికి ధనము లేకపోయెను. ఉద్యోగస్థులకు జీతములు లేవు. అందువలన దేశమున నశాంతియు, నల్లకల్లోలమును ప్రబలుచుండెను. అందువలన విదేశ దండయాత్రలు వచ్చితీరెడివి. వారి యార్థికమంత్రి తనదేశపు చట్టనిర్మాణ సభకు నివేదించెను. కాని లాభము లేకపోయెను. అంతట "నానాజాతిసమితి" నామంత్రి యర్థించెను. రెండునెలలైన కాకముందే సమితి ఆస్ట్రియాస్వాతంత్ర్యమునకు భంగము రాకుండునట్లును, అప్పిచ్చినవారికి జోక్యముండునటులను ఒక విధానమును తయారుచేసి విదేశములవా రప్పిచ్చునట్లుచేసెను. ఆవిధముగ నాదాయవ్యయములు సరిపుచ్చబడెను. ౧౯౨౬-వ సం.ములో సమితి జోక్యము వదలిపోయెను. ప్రస్తుత మాదేశము ఇతర రాజ్యములవలెనే యున్నది.

హంగేరీదేశమున కూడ సమితి యీవిధానమునే ౧౯౨౪-వసం.మున అనుష్ఠించెను. ఒకసంవత్సరములో దేశపరిస్థితులు బాగుపడెను. సమితి జోక్యము వదలుకొనెను.

టర్కీ రాజ్యమునందలి ౧౦ లక్షల గ్రీకుప్రజలు తిరిగిరాగా వారికొరకు సమితి సుమారు ౨౦ కోట్ల రూపాయలు అప్పుయిప్పించి వారికి చక్కని పరిస్థితులను సమకూర్చెను. ఇపుడు గ్రీసువారే ఆవ్యవహారమును నిర్వహించుకొనుచున్నారు. బల్గేరియా విషయమునగూడ నిదేవిధమున జరిగినది. వార్తావహనము ప్రయాణ విషయమున పరిపూర్ణస్వాతంత్ర్యము సమకూర్చుటకుగాను ఒక శాశ్వతసంఘము పనిచేయుచున్నది. వాణిజ్య వ్యాపారవివాదములు మధ్యవర్తిత్వమున పరిష్కరించుటకును, అక్రమపోటీని, సుంకముల తీసివేయించుట అంతర్జాతీయ కార్మికసంఘమువారి సహకారముతో వ్యాపారమును, నిరుద్యోగమును న్యాయముగ పరిష్కరించుటకును సమితివారి యుపసంఘములు పనిచేయుచున్నవి. అంతర్జాతీయ వాణిజ్యమునకు భంగకరములైన పరిస్థితులను సంస్కరించుటకు జినీవానగరమున రెండుసమావేశములు జరిగినవి. ౧౯౨౭-వ సం. ములో జరిగిన సమావేశములో నన్నిదేశములవారును-అమెరికాకూడ-పాల్గొనిరి. కొన్నిచర్చలు జరిపి తీర్మానములు గావించిరి. విదేశీవస్తువులపై విధింపబడు సుంకముల తగ్గించుట మొదలయిన విషయముల తీర్మానములును, పండితుల యభిప్రాయములును అంగీకరింపబడినవి. పండితుల సంఘములు స్థిరముగ స్థాపింపబడినవి. సమితి ఆర్థికసమస్యా పరిష్కారవిషయమై యొక విధానమునొసగుచున్నది. అభివృద్ధిమాత్రము అనుకొనినంత లేదు. అంతర్జాతీయ సహకారవిషయమున సమితి యొక మార్గమును త్రొక్కుచున్నది.

అంతర్జాతీయ కార్మికసంస్థ:

ఇది నానాజాతిసమితిలో నొక ముఖ్యాంతర్భాగము. సంధిపత్రములో దీనినిర్మాణవిధానము కార్మిక ప్రణాళిక అని ౧౩-వ భాగముగ నున్నది. సమితిలోని సభ్యరాజ్యములు కార్మికశాంతి లేకున్న జగచ్ఛాంతి లేదని గ్రహించి కార్మికులకు న్యాయమైనదియు, దయాపూర్వకమైనదియునగు విధమున చూచెదమనియు, అందుకుగాను న్యాయమైన జీతములనిత్తుమనియు, వారమునకు ౪౮ గంటలే పనిచేయింతుమనియు, చిన్నపిల్లలను పనిచేయనీయమనియు, కర్మాగారములను తనిఖీ చేయింతుమనియు సభ్యరాజ్యములు వాగ్దానముచేసినవి. ఈ కార్మికసంస్థ సాధ్యమైనంతవరకు—దేశముయొక్క

శీతోష్ణపరిస్థితులు, ఆచారవ్యవహారముల కనుగుణముగా-కార్మికచట్టములనన్నింటిని అన్ని దేశములందును, ఏకోన్ముఖమునకు దెచ్చుటకు ప్రయత్నించుచున్నది. ఆవిధమున ఒక దేశము మరియొకదేశముకన్న ఎక్కువ పని చేసి పోటీపడకుండుట తటస్థించును. ప్రతిసాంవత్సరిక సమావేశమునను ప్రభుత్వకార్మిక యజమానుల ప్రతినిధులు కొన్నితీర్మానముల గావించి అవి తమతమ దేశములందు చట్టములుగా శాసనసభలచే నామోదింప జేయుటకు పూనుకొందురు. ఆవిషయమై ఏమిచేసిన నది ప్రతిసంవత్సరమును నివేదింపవలయును. ఇంతవరకు జరిగిన తీర్మానముల ప్రకారము రోజునకు ౮ గం. పనిచేయుట, నిరుద్యోగవిషయము, కార్మిక, వ్యవసాయపు కూలిస్త్రీలయు బాలురయు సంరక్షణ, నావికుల పరిస్థితుల చక్కబరచుట, కార్మికులకు ఇచ్చుఅధీనము, తెల్లసీసముతో రంగువేయకుండుట మొదలగునవి పరిష్కరింపబడినవి. ఇంకను నిరుద్యోగసమస్య, వలస, కార్మిక రోగములు, నావిక వ్యవసాయపరిస్థితుల విషయమై సలహా లీయబడినవి. వీనిని సుమారు ౪౦౦ సంస్థ లంగీకరించినవి. సంధివలన కొత్తగా నిర్మింపబడిన రాజ్యములుకూడ నీనిధానము నంగీకరించినవి. ఇండియా దేశములో పనికాలము గం. ౭౦-౭౨ నుండి ౬౧ కు తగ్గించబడినది. ఇంతవరకును ౯ సం. లు దాటినసే కర్మాగారమున కూలిగనుండవచ్చును. గాని యిపుడు ౧౨ సం. దాటిననేగాని వీలులేదు. ఇంకను చట్టములు నిర్మింపబడుచున్నవి.

## నానాజాతిసమితి విధానము

౧. మహాసభ: సభ్యరాజ్యముల ప్రతినిధులు ప్రతి సంవత్సరమును సమావేశమగుచుందురు. ఒక్కొక్క రాజ్యమున కొకవోటున్నది.

౨. సభ: ఇది సం. మునకు మూడుమార్లు సమావేశమగును. గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ, జపాన్, జర్మనీలు శాశ్వతసభ్యులు. ఇంకను ౯ మంది ఎన్నుకొనబడుదురు.

౩. కార్యనిర్వాహకవర్గము: సమితి యుద్యోగులన్ని జాతులవా రున్నారు. జినీవానగరము కార్యస్థానము.

౪. పండితుల సంఘములు: సభకును మహాసభకును అన్నివిషయములలోను సలహానొసంగుచుందురు.

౫. అంతర్జాతీయ శాశ్వతన్యాయస్థానము: హేగ్ నగరమున ౧౫ మంది న్యాయాధిపతులతో నున్నది. అందరును అంతర్జాతీయముగ సుప్రసిద్ధులు.

౬. అంతర్జాతీయ కార్మికసంస్థ: సాధారణముగ ప్రతిసంవత్సరమును సమావేశమగును. సభ్యరాజ్యముల నుండి ౨ ప్రభుత్వప్రతినిధులు, ఒక యజమాని, ఒక కార్మికప్రతినిధి. ఎవరివోటు వారిది. పరిపాలకవర్గము సాధారణముగ సం. మునకు ౪ పర్యాయములు సమావేశమగును. ఇండియావంటి ముఖ్యకార్మికజాతులు ౮ స్థిర సభ్యులు. ౧౬ గురిని ౩ ఏండ్లకొకమారు ఎన్నుకొందురు.

అంతర్జాతీయ కార్మికస్థానము, కార్యదర్శివర్గము, కమిషన్లు, పండితుల సభలు.

## నానాజాతిసమితికి సహాయమొనరించుటెట్లు?

నిజముగ శాంతి స్థిరముగ స్థాపింప బడవలెనన్నచో సమితియనిన పూర్తిగా తెలిసిన అత్యుత్సాహ సమన్వితమైన సహాయముండవలెను కావున ప్రతిచోటను League of Nation Unions స్థాపించి ప్రజాభిప్రాయమును సమితివైపునకు త్రిప్పుకొనవలయును.

# దొంగపెండ్లి

కీ. శే. జనమంచి వెంకటరామయ్య

దొంగఁబట్టెద ననుచుఁ బోయి దొంగనే పెండ్లాడితే?

౧

ముంగిలాగునఁ బాలుద్రావిన మూతియెంగిలితో నిటుల్
దొంగపెండిలి కూఁతురా, మముఁ దొంగిచూడఁగ వచ్చితే?
దొంగఁబట్టెద ననుచుఁ బోయి దొంగనే పెండ్లాడితే?

౨

వెడలఁబెట్టుటొ జిహ్వాత్రృప్తిసి, వెక్కిరించుటొ మమ్ములన్
తడవికొనుటొ మోవికెంపుల నడఁచిపుచ్చు తలంపుతో?

౩

ఏమి సొమ్ములు పెట్టెనే నీ కేమికోకలు సుట్టెనే
ఏమి అవికెలు తెచ్చెనే యే మిచ్చి నిన్నెద గ్రుచ్చెనే?

౪

ఒడలునిండను నగలుకావే యూరుపల్లెలు దోచిపెట్టెడి
గడనకానిని జెట్టపట్టిన గడుసుదానికి కొదవయే?

౫

కోకకొంగున దుడిచికొన్నను క్రొత్తరంగులు మాసెడున్
నాకు సొమ్మొనరింపనిండును, నీకుఁ గడుపు ఫలించెడున్

౬

పాయసాన్నము దశరథేశ్వరు పత్ని లొకమెతుకేనియుం
బాయవిడిచిరె కరవుగొంటులపగిదిఁ దినిరేగా కిఁకన్.

---

# శృంగార నాయికలు

(ప్రాచీన చిత్రములు)



౧. విప్రలబ్ధ



౮. స్వాధీనపతిక



3. వాసకసజ్జిక ౧



౪. అభిసారిక ౧

# హిందూదేశము: రిజర్వుబ్యాంకు

చా. వెం. హనుమంతరావు, యమ్.ఏ., బి.ఇడి.,

మన దేశమందు రిజర్వుబ్యాంకుసంస్థ నేర్పాటు చేయుటనుగురించి చర్చించుటకును, దానికి అవసరమగు విధానము నేర్పాటుచేయుటకును ప్రస్తుతము గట్టిప్రయత్నములు జరుగుచున్నవి. ఈవిషయముల నాలోచించుటకు మన దేశస్థులను కొంతమందిని ప్రభుత్వమువారు లండనునగరమున కాహ్వానించి యున్నారు. కాన రిజర్వు బ్యాంకును గురించిన కొన్ని ముఖ్యవిషయములు ప్రజలందరును తెలిసికొనవలసిన ఆవశ్యకత గలదు.

మొట్టమొదట రిజర్వుబ్యాంకు అననేమి యను ప్రశ్నను గురించి చర్చింతము. ప్రస్తుతము మనదేశమందు ఆర్థికసంబంధమగు విషయములన్నియు—అనగా రూపాయమారకమెట్లు నిర్ణయించుట, వాటిని నిలుపబెట్టుట, కరెన్సీనోట్లు అచ్చువేయుట, ప్రభుత్వపు అప్పువ్యవహారములు నిర్వహించుట మొదలగునవి—ప్రభుత్వమువారి ఆర్థికశాఖవారిచే చేయబడుచున్నవి. ఇవన్నియు చాలముఖ్యములగు పనులు. ప్రత్యేకనిపుణత్వముగల వారిచే మాత్రమే ఇవి జయప్రదముగ కొనసాగింపబడగలవు. ప్రభుత్వమువారిచేతనైన సరే, ఆపనులు చేయబడుటవలన దేశమునకు చాలనష్టము కల్గుటకవకాశములు కలవు. అందునను విదేశస్థులచే నడుపబడు ప్రభుత్వముచే ఈ పనులు మనదేశమందు చేయబడుట హిందూదేశమునకు మరింతనష్టము. ఎందువల్లనన ఆ ప్రభుత్వమువారు సాధారణముగ ప్రతివిషయమునందును వారి దేశక్షేమమునుమాత్రము ముందిడుకొని ఆర్థికవిధానము నేర్పాటు చేయుచుందురు. కాని మనదేశక్షేమమును గమనించి చేయరు. మనదేశక్షేమమునే వారు పెంపొందింపవలెననినను, ఆ ప్రయత్నములో వారి దేశక్షేమమునకేమైన నష్టమువచ్చునట్లు తోచినయెడల దానిని విరమించుకొనవలసిన ఆవశ్యకత కలుగుచుండును. ప్రభుత్వము విదేశప్రభుత్వమనుమాట యటుంచినను మనము వేరొకసంగతికూడ గమనింపవలసియున్నది. ప్రభుత్వవిషయములు సర్వసాధారణముగ ప్రజాప్రతినిధులగు మంత్రులచే నడుపబడుచుండును. వీరిలో కొంతమందికి పైన సూచింపబడిన అతిక్లిష్టములగు విషయములలో కొంతప్రవేశ ముండినప్పటికిని చాలమందికి ఆర్థికవిషయముల నిర్వహించుటలో తగు సమర్థతకాని, తెలివితేటలుకాని లేకుండ యుండవచ్చును. మనదేశమునందు కొలదికాలములో ఇట్టి ప్రజాప్రభుత్వపద్ధతి ఏర్పాటు కాబడనున్నదికాన ఈ సూచన మనదేశపు పరిస్థితులకు కూడ అన్వయించును. అట్టిసందర్భములలో ఆర్థికవిషయములను నిర్ణయించుటకును, వాటినిగురించి క్షేమకరమగు విధానము నేర్పాటుచేసి దానిని సమర్థతతో నిర్వహించుటకును, ఆ విషయములను బాగుగ పరిశీలించి, వాటియం దెక్కువ యనుభవము కలవారిచే నడుపబడు సంస్థ యొకటి యుండుట అవసరము. వారు ప్రజాప్రతినిధియగు ఆర్థికమంత్రికి ఏయే సమయములం దెట్టి ఆర్థికవిధానము నేర్పాటుచేయవలెనో, ఎట్లు దానిని ఆచరణయం దుంచవలెనో మొదలగువిషయములనుగూర్చి సలహా నిచ్చుచుందురు. అదియు కాక ఇంకొకవిషయముకూడ జ్ఞాపకముంచుకోవలసియున్నది. ప్రజాప్రతినిధిప్రభుత్వమనిన అర్థము పక్షప్రభుత్వము; అనగా ఏ రాజకీయపక్షమువారు తాత్కాలికముగ శాసనసభయందు హెచ్చుబలము కలిగియుందురో, ఆ పక్షమువారు ప్రభుత్వమును నడపుచుందురు. పక్షపుపట్టుదలలలో, పోట్లాటలలో ఆర్థికవిధాననిర్ణయముకూడ సాధారణముగ పక్షపద్ధతుల ననుసరించియు, పక్షలాభముల ననుసరించియు నుండును గాని ప్రజలకందరకనుకూలముగ నుండునట్లు, దేశక్షేమమునకు సహాయభూతముగ నుండునట్లు ఉండకపోవచ్చును. కాన ఏ దృక్పథమునుండి చూచినను రిజర్వుబ్యాంకుసంస్థ ప్రభుత్వాధీనముగాక స్వతంత్రముగ వ్యవహరింపగల సమర్థులగు వారిచే నడపబడవలె ననువిషయము చాలముఖ్యముగ కాన్పించుచున్నది.

యుద్ధానంతరము బయల్వెడలిన ప్రపంచ-ఆర్థిక కష్టములలో రిజర్వుబ్యాంకుసంస్థవంటి సంస్థయొక్క-ప్రాముఖ్యము ప్రతిదేశమందును అంగీకరింపబడినది. ఆర్థికదుస్థితి ప్రపంచమునందు ప్రబలుటతో ప్రతిదేశమందును ప్రభుత్వములు తమతమ జాతీయ-ఆర్థికవిధానములను సరియగు కట్టుదిట్టమైన పద్ధతులపై ఏర్పాటుచేసి కొనలేకపోవుటతో, రిజర్వుబ్యాంకులు పైన సూచింపబడిన అధికారములతో నెలకొల్పుటయే, ఆ దుస్థితిని బాపుటకు తగుమార్గమని గ్రహించుట ప్రతివారికిని కల్గినది. మనదేశములో సంగతి చూచిన రిజర్వుబ్యాంకు ఏర్పాటునుగురించి 1918-వ సంవత్సరమువరకు తీవ్రమైన ఆలోచన లేదనియే చెప్పవచ్చును. ఆసంవత్సరములో మనదేశపు ఆర్థికవిధానమును గురించి ఆలోచించుట కేర్పరుపబడిన ఛాంబర్లేనుకమీషనువారు, వారిలో నొక సభ్యుడగు కేన్సుగారిచే ప్రతిపాదింపబడిన, అప్పటికున్న మూడుప్రెసిడెన్సీబ్యాంకులను కలిపి ఒకకేంద్రప్రభుత్వ-బ్యాంకును ఏర్పాటుచేయవలెనను విధానమునుగురించి కొంతచర్చ జరిపిరి. ఆ కమీషనువారు కేంద్ర-బ్యాంకింగుసంస్థ నేర్పాటు చేయుటను గురించి ఇదమిత్థమను సూచనలుచేయకపోయినప్పటికిని 1920 లో ఏర్పాటుచేయబడిన ఇంపీరియల్ బ్యాంకు సంస్థ వారి ప్రతిపాదనయొక్క ఫలితమేయని తలంపవచ్చును. అప్పటినుండియు ఆ ఇంపీరియల్ బ్యాంకే హిందూదేశపు కేంద్ర-బ్యాంకింగుసంస్థగా పనిచేయుచున్న దనుటలో తప్పేమియు లేదు. కాని 1927 లో మనదేశమునకు వచ్చిన హిల్టను యంగుకమీషనువారు మరల రిజర్వుబ్యాంకువిషయమును ముందునకు తీసుకొనివచ్చిరి. వారు ఇంగ్లండునందు తీసికొనిన సాక్ష్యములో స్వతంత్రముగ నిర్వహింపబడునట్టి కేంద్రరిజర్వుబ్యాంకు ఇండియాలో ఏర్పాటుకాబడవలెనను విషయము చాలమంది నొక్కిచెప్పిరి. అట్లు ఆప్రతిపాదనను సమర్థించినవారిలో బ్యాంకుఆఫ్ ఇంగ్లండు మేనేజింగు గవర్నరగు మాంటేగూనార్మనుగా రొకరైయుండిరి. అంతకుపూర్వమే ఇండియాప్రభుత్వమువారు తనుకుగల కర్రెన్సీనోట్లను అచ్చువేయు అధికారము ఇంపీరియల్ బ్యాంకువారికి మార్చుట కభిప్రాయపడుచుండిరి. కాని హిల్టన్‌యంగుకమీషనువారి రిపోర్టులో రిజర్వుబ్యాంకు అనుపేరుతో ఒకసంస్థను తప్పక ఏర్పాటుచేయవలెనను సూచనవలన ఏ సంస్థ కాయధికార మీయవలెనను విషయమునుగూర్చి క్రొత్తగ ఆలోచింపవలసివచ్చుటచే ఆ అభిప్రాయము కొనసాగింపబడలేదు.

హిల్టన్‌యంగుకమీషనువారి రిపోర్టు అనంతరము రిజర్వుబ్యాంకునుగురించిన వ్యవహారములు తీవ్రగతిని దాల్చుటతో 1927 లో అప్పటి ఆర్థికసభ్యుడగు సర్. బాసిల్ బ్లాకెట్‌గారు రిజర్వుబ్యాంకుబిల్లు నొకదానిని తయారుచేసి శాసనసభయందు ప్రవేశపెట్టిరి. "ఆర్థికసంబంధమగు విశాలహృదయమున కిది నిదర్శన"మని బిల్లును గురించి బ్లాకెట్‌గారు చెప్పిన వాక్యమును అసెంబ్లీయందన్నిపార్టీలవారు నామోదించిరి. కాని బ్యాంకు ఏ పద్ధతులపై ఏర్పాటు కాబడవలెననువిషయమును గురించి ప్రభుత్వప్రజాపక్షములకు తీవ్రభేదాభిప్రాయము లుండుటచే, భారతశాసనసభ సెలెక్టుకమిటీవారు బిల్లునందలి సూత్రములను ప్రభుత్వమువారి కెంతమాత్రము ఇష్టములేనివిధముగ మార్చివేసిరి. ప్రభుత్వమువారు వాటాదార్ల యాజమాన్యముక్రింద నుండునట్టి బ్యాంకు ఏర్పాటుకాబడవలెనను అభిప్రాయముతో నుండగా ప్రజాపక్షమువారు పూర్తిగ ప్రభుత్వయాజమాన్యముక్రింద నుండునట్టి సంస్థ కావలెనని పట్టుపట్టిరి. ప్రభుత్వమువారు డైరెక్టర్ల సంఘము ఏవిధముగ రాజకీయసంబంధము లేకుండ యుండునట్లు చేయవలెనని చెప్పగా ప్రజాపక్షమువారు శాసనసభాప్రతినిధులకు డైరెక్టర్ల సంఘములో స్థాన ముండవలెనని తీర్మానించిరి. ప్రభుత్వమువారి అభిప్రాయములు కొనసాగకపోవుటచే వారు రిజర్వుబ్యాంకు బిల్లును తాత్కాలికముగ నుపసంహరించుకొని తరువాత సమావేశములో వేరొకబిల్లు నుపపాదించుటకు ప్రయత్నించిరి. కాని శాసనసభాధ్యక్షుడు అట్లుచేయుట కంగీకరించకపోవుటచే వారి ప్రయత్నము విఫలమయ్యెను.

పైన చెప్పబడిన విషయములు జరిగినకొంతకాలము వరకు రిజర్వుబ్యాంకువిషయము వెనుకబడెను. తరువాత రౌండుటేబిల్ సమావేశములందు ఆర్థికపుకట్టుబాట్లనుగురించిన చర్చలలో రిజర్వుబ్యాంకు మొట్టమొదట ఏర్పడినకాని ఆర్థికస్వాతంత్ర్యము నిచ్చుటకు వీలులేదని ఫెడరల్‌స్ట్రక్చరుకమిటీవారు తీర్మానముచేయుటచే మరల ఆసమస్య ప్రాముఖ్యమును వహించెను. ఆకమిటీవారీక్రిందవిధముగ తమ రిపోర్టునందు తెల్పియుండిరి:—

"హిందూదేశపు ఆర్థిక, కరెన్సీవిధానములు సరియగు పద్ధతులపై నడుపబడుచున్న వనునమ్మకము కల్గుటకు, రాజకీయసంబంధ మెంతమాత్రమును లేక స్వాతంత్ర్య పద్ధతులపై నడుపబడునట్టియు, గట్టి పునాది కల్గియుండు నట్టియు రిజర్వుబ్యాంకు ఎంతత్వరలో వీలైన అంత త్వరలో ఏర్పాటుచేయబడవలెనని ఈ సంఘమువారు సూచించుచున్నారు. ఆబ్యాంకునకు ఆర్థికవిధానము, మారకపువిధానము స్థిరపరచు అధికార ముండవలెను. మరియు వెంటనే సరిపోవునట్టి నిల్వబంగారము మూలధనముగల బ్యాంకును ఏర్పాటుచేయుట కష్టమని ఈకమిటీవారు అభిప్రాయపడుచున్నారు. అందువలన అట్టి పరిస్థితు లేర్పడువరకును ఈవిషయములనుగురించి సరియగు విధానము నేర్పరచి దానిని పరిపాలించుటకు గవర్నరుజనరలుకు కొన్ని ప్రత్యేకాధికారము లిచ్చుట అవసరము."

రెండవరౌండుటేబిల్ సమావేశమునందు సర్. పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాసుగారి పట్టుదలపై రిజర్వుబ్యాంకుస్థాపన భారతీయశాసనసభవారి చట్టప్రకారము జరుపబడవలెనను సిద్ధాంత మంగీకరింపబడెను. ఆయనసూచనపైననే రిజర్వుబ్యాంకు స్థాపింపబడునంతవరకు గవర్నరుజనరలుకు ఆర్థికవిషయములలో ప్రత్యేకాధికారము లుండవలసిన అవసరములేదు, మామూలుగ నున్న అధికారములు చాలునను సిద్ధాంతముకూడ అంగీకరింపబడెను. ఇంకొక్కవిషయముకూడ ఇచ్చట చెప్పవలసియున్నది. మొదటి రెండురౌండు టేబిల్ సమావేశములందునుకూడ 'ఫెడరేషన్' స్థాపింపబడుటకుముందుగానే రిజర్వుబ్యాంకు స్థాపింపబడి పనిచేయుచుండవలె ననువిషయ మెవ్వరును నొక్కి కోరియుండలేదు. కాని మూడవరౌండుటేబిల్ సమావేశమునందు ఆర్థికపుకట్టుబాట్ల సంఘమువారు ఈ విధమగు క్రొత్తషరతునుకూడ ఒకదానిని ప్రవేశపెట్టిరి. పైన ఉదాహరింపబడిన షరతుల నన్నిటిని వారంగీకరించుటయే కాక, "ఫెడరేషన్‌విషయమై బ్రిటిష్‌గవర్నమెంటువారు పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టుటకుపూర్వమే హిందూదేశములో రిజర్వుబ్యాంకు ఏర్పాటుకాబడి పనిచేయుచుండవలె" ననియు, "ఆరిజర్వుబ్యాంకు స్థాపనవిషయమై వీలైనంతత్వరలో భారతశాసనసభలో చట్టము ప్రవేశపెట్టబడవలె" ననియు తమరిపోర్టునందు వ్రాసియుండిరి. ఈ సూచనల యర్థము భారతదేశప్రతినిధులకు గ్రాహ్యముకాకపోలేదు. సర్ తేజ్ బహదూర్ సప్రూ, జయకర్‌గార్లప్పుడే వాటినిగురించి తీవ్రముగనసమ్మతిని తెల్పియుండిరి. తరువాత బ్రిటిష్ గవర్నమెంటువారి శ్వేతపత్రము వెలువడి దానియందు కూడ పై షరతులే మరింత గట్టిగ వక్కాణింపబడెను. శ్వేతపత్ర సూచనప్రకారము, "ఆర్థికవిషయములందు బాధ్యత హిందూదేశస్థులకు మార్చుటకుముందు షరతుగా మొదటి ఫెడరల్‌మంత్రివర్గము వా రధికారములోనికి వచ్చునప్పటికే రాజకీయసంబంధ మేమియు లేనట్టి రిజర్వుబ్యాంకు హైందవశాసనసభవారి చట్టప్రకారము ఏర్పాటు కాబడియుండవలె" నని యుండెను.

పైన చెప్పబడినదానినిబట్టి మూడవరౌండుటేబిల్ సమావేశము ఫలితముగ రిజర్వుబ్యాంకుసందర్భములలో ఒక ముఖ్యమైనమార్పు ఏర్పడిన దని తేలుచున్నది. మొదటిసమావేశములో రిజర్వుబ్యాంకు ఏర్పాటుకాబడని సందర్భములో కొన్ని ప్రత్యేకాధికారములు గవర్నరుజనరలున కిచ్చుటకు ఆలోచన జరిగెను. రెండవసమావేశములో గవర్నరుజనరలు ప్రత్యేకాధికారములకు బదులు ఒక "ఆలోచనసంఘము" నేర్పాటుచేయుట బాగుండునని ఆలోచింపబడెను. రెండవ సమావేశము సమయమున ఆర్థికపరిస్థితులు చాల క్లిష్టముగ నుండుటవలన రౌండుటేబిల్ ప్రతినిధులు రిజర్వుబ్యాంకుఏర్పాటు

తొందరగ జరుగునదికాదని తలంచుటలో ఆశ్చర్య మేమియు లేదు. మూడవసమావేశమునాటికి ఆర్థికస్థితి ఇంగ్లండు ఇండియాదేశములలో చాలవరకు బాగుపడి నప్పటికిని రిజర్వుబ్యాంకుఏర్పాటు కాబడకపూర్వము "ఫెడరేషను" రాజ్యాంగవిధానము నేర్పాటుచేయుటకు వీలులేదని ఎందులకు తలంపబడెనో గ్రహించుట కష్టము. దీనికి ఒక్కకారణముమాత్రము మన మూహింపవచ్చును. ప్రస్తుతపు భారతశాసనసభవారే రిజర్వుబ్యాంకుచట్టము నేర్పాటుచేయవలెనని షరతు నేర్పాటు చేసిన వారిచే తమ కనుకూలముగ నుండిన పద్ధతులపై బ్యాంకుఏర్పాటు చేయించవచ్చునని బ్రిటిష్ప్రభుత్వము వారు తలంచియుండవచ్చును. అదియుకాక ఫెడరేషను విధానమును, దానితో కేంద్రబాధ్యతయు వెంటనే ప్రవేశపెట్టకుండ ఆలస్యముచేయుట కిది యొక మిషకూడ అయి యుండవచ్చును.

మన హిందూదేశమునందు రిజర్వుబ్యాంకును పెట్టుటలో బ్రిటిష్ గవర్నమెంటువారు నియమించుచున్న షరతులు నానాజాతిసమితివారు యుద్ధానంతరము ఆర్థిక-చిక్కులలో నున్న దేశములకు సహాయము చేయుటకుముందు నియమించిన షరతులపోలిక నున్నవి. ఆషరతులు యుద్ధమునందోడిపోయిన దేశముల యాత్మగౌరవమునకు భంగకరములుగ నున్నవనిన వాటి నిజస్థితి తెలిసికొనవచ్చును. కాని హిందూదేశవిషయములో నియమింపబడిన షరతులు కొన్నివిషయములలో అంతకన్న అధ్వాన్నముగ నున్నవనియే చెప్పవలసియున్నది. ఎందువల్లనన యూరపియన్ దేశముల విషయములో సెంట్రల్ బ్యాంకులు ఆయాదేశముల ఆర్థికస్థిరత్వము నేర్పాటుచేయుటకును, దేశముల ఆదాయవ్యయభేదములను సరిచేయుటకును తోడ్పడునట్టి సంస్థలుగా ఏర్పాటుకాబడిన మనదేశమందీపరిస్థితులు మున్ముందుండినగాని రిజర్వుబ్యాంకు ఏర్పాటు కాగూడదని ప్రభుత్వమువారు చెప్పుచున్నారు. ఆముందుషరతులను మూడవ రౌండుటేబిల్ సమావేశపు ఆర్థికరక్షణల సంఘమువారీక్రిందివిధమున సంక్షిప్తముగ వ్రాసియున్నారు:—"రిజర్వుబ్యాంకు ఏర్పాటుకాబడకముందు హిందూదేశపు ఆదాయవ్యయములు సరిపడియుండవలెను; లండనులోను, ఇండియాలోను కొద్దికాలములకు చేసిన జాతీయఋణము చాలవరకు తగ్గింపబడవలెను; మూలధనము హెచ్చుగ నేకరింపబడియుండవలెను; హిందూదేశపు వర్తకము బాగుపడి మామూలు విధముగ దేశపు ఎగుమతుల ఖరీదు దిగుమతుల ఖరీదుకన్న హెచ్చుగ నుండవలెను." రిజర్వుబ్యాంకులు ఏర్పాటుచేసికొనిన ఎన్నిదేశములలో ఈవిధమగు షరతులు పూర్తిగ ఆచరణయందేర్పడినవని చూచిన, చాల కొద్దిదేశములందే అట్లు జరిగినదని చెప్పకతీరదు. ఎందువల్లనన, పైన చెప్పినట్లుగా, చాలదేశములలో రిజర్వుబ్యాంకులు ఆయాదేశముల ఆర్థికపునరుద్ధారణ, పునర్నిర్మాణములకు మార్గములుగ ఏర్పాటుకాబడినవిగా నున్నవి. ఇట్టి స్థితిగతులలో, ఆర్థికముగ యూరపియన్ దేశములలో చాలవాటికన్న స్థిరత్వమును, బలమును ఎక్కువగ కల్గియున్నట్టి మనదేశమువిషయములో ఇట్టి షరతులు కోరబడుట చాలదుర్భరవిషయము.

1929 లో హిందూదేశపు ఆర్థికసభ్యుడగు సర్ జార్జి షూస్టర్ గారు లెజిస్లేటివ్ అసెంబ్లీలో రిజర్వుబ్యాంకువిషయమై ప్రసంగించుచు కొన్నిసంగతులను చెప్పినట్లు కేంద్రపుబ్యాంకింగు విచారణసంఘము వారు తెల్పియుండిరి. ఆయన చెప్పిన దేమన:—"ఆధునిక-ఆర్థికానుభవము ననుసరించి కరెన్సీ, ఆర్థికవిధానములను నడపుటకై హిందూదేశములో కేంద్రపుబ్యాంకు నేర్పాటుచేయుట చాలముఖ్యమగు సంస్కరణయై యున్నది. కాని ఈ విషయములో ప్రభుత్వమువారు ముందడుగువైచుటకుముందు రెండుషరతులు చాల ముఖ్యములని తలంచుచున్నారు: ఒకటి, ఆబ్యాంకు బలమైన పునాదులపై ఏర్పాటుకాబడవలెను; రెండు, ప్రభుత్వమువారు చేయు ఏర్పాట్లకు ప్రజలలో అధిక సంఖ్యాకులు సమ్మతించినట్లు నిదర్శనము లుండవలెను."

ప్రస్తుతమున్న లెజిస్లేటివ్అసెంబ్లీవారు ప్రభుత్వమువారి అభిప్రాయములకు వ్యతిరేకముగ నుందురను భయమునకు కారణము లేనందునను, సంయుక్తరాజ్య

విధానపు ఏర్పాటు రిజర్వుబ్యాంకుస్థాపనపై ఆధారపడియుండుటవలనను, స్కూస్టర్‌గారి షరతులు పరిపూర్తినొందినవి. అదియుకాక 1933-34 సంవత్సరపు ఆదాయవ్యయపట్టికను అసెంబ్లీలో ప్రవేశపెట్టుచు స్కూస్టర్‌గారు హిందూదేశపు ఆర్థికపరిస్థితులు అన్నివిధముల అనుకూలముగ నున్నవనియు, చాల ఇతరదేశములకన్న హిందూదేశపు స్థితి వేయిమడుంగులు బాగుగ నున్నదనియు చాలసార్లు చెప్పియుండుటచే వెంటనే రిజర్వుబ్యాంకుస్థాపనకు అవసరమగు చర్య తీసికొనుటకెట్టి యభ్యంతర ముండరాదు. దానికి సంబంధించిన విషయము లిదివరలోనే కొంతవరకు చర్చింపబడి వాటిపై చర్య తీసికోబడినవి. సెంట్రల్ బ్యాంకింగు విచారణసంఘమువారు "ప్రభుత్వమువారిచే పెట్టుబడి పెట్టబడినట్టియు, స్వతంత్రులగు భారతీయులు డైరెక్టర్లుగా కల్గినట్టియు బ్యాంకు ఏర్పాటుచేయుట మంచి"దని వ్రాసియుండిరి. ఆసంఘపు అధికసంఖ్యాకుల రిపోర్టునందు ఈసమస్యనుగురించి ఇంకను అనేకములగు ఇతరసూచనలును, సలహాలునుకూడ నున్నవి. 1928లో ప్రతిపాదింపబడి ఉపసంహరించుకోబడిన బిల్లును ఈసలహాలనుబట్టి మార్చి వేరొక క్రొత్తబిల్లును తయారుచేసిన దానిని ప్రతివారు నామోదింతురనుటలో సందేహము లేదు. పూర్వపుబిల్లు సందర్భములో వచ్చిన డైరెక్టర్ల ఎన్నికపద్ధతులనుగూర్చి వచ్చిన ప్రతిఘటన, సంఘర్షణ ఇప్పుడు వచ్చునని తలంచుట కవసరములేదు. ఎందువల్లనన, ప్రజాపరిపాలన, కేంద్రబాధ్యతాయుత ప్రభుత్వసూత్రములు కొంతవరకైన రాబోవు సంస్కరణముల వలన వచ్చుటతో, శాసనసభవారు డైరెక్టర్లలో కొంతమందిని ఎన్నుకొనుట కధికార ముండవలెనను విషయమున కంతప్రాముఖ్య ముండదు. *

ఈ వ్యాసము ముగింపక పూర్వము ఒక్క విషయము చెప్పవలసియున్నది. హిందూదేశమునకు రిజర్వు బ్యాంకు కావలెననియు, అది వెంటనే స్థాపింపబడవలెననియు ఏకగ్రీవముగ అంగీకరింపబడిన విషయమే. కాని దానినిబట్టి హైందవులకు ఆర్థికస్వాతంత్ర్యమీయబడిన, వారు తమదేశమునకు నష్టముగనుండు ఆర్థిక విధానమును ఏర్పాటుచేయుదురనియు, దానివలన హిందూదేశమునకు అప్పిచ్చినవారికి తీరనినష్టము కల్గచేయుదురనియుతలంచుట చాలపొరపాటు. ఎంతపాడుగ, తెలివితక్కువగ మనదేశీయులు మన ఆర్థికవ్యవహారములు నిర్వహించినను, ఇంతవరకును బ్రిటిష్ఆర్థిక మంత్రులు వ్యవహరించినదానికన్న అరిష్టదాయకమగు విధానమును వారాచరింతురనుటకు కెట్టి అవకాశము లేదు. కాని ఇప్పుడుకూడ బ్రిటిష్ మంత్రివర్గమువారు మనదేశస్థుల శక్తిసామర్థ్యములయందు నమ్మకములేకుండ అనవసరములగు షరతుల నియమించుట వారి అహంభావమును, భారతీయుల మంచితనమును గురించి అపనమ్మకమును తెల్పునుగాని వేరుకాదు. ఈ సందర్భములలో భారతీయులు ఈషరతులను నియమించుటలో బ్రిటిష్ ప్రభుత్వమువారి అభిప్రాయములు పూర్తిగ ఆర్థికసంబంధమగునవే కాక రాజకీయములుకూడ-వాటిని పురికొల్పుటలో కొంత పాల్గొన్నవని తలంచుటలో తప్పేమియు లేదు. కేంద్రపుబ్యాంకింగు సమస్యలు ఇప్పటి కాలములో పూర్తిగ చర్చింపబడినవగుటచే ఏదేశమైనను ఆచర్చల సారాంశముల నాధారముచేసికొని తమ తమ పరిస్థితులకు సరిపోవునట్టి సంస్థలను చాలతేలికగ తెలిసికొని ఏర్పాటుచేసికోవచ్చును. హిందూదేశపరిస్థితులు, హిందూదేశపు బ్యాంకుసమస్యలుకూడ ఇదివరకే క్షుణ్ణముగ చర్చింపబడియుండుటచే ఇంక మిగిలిపోయినది ఆచర్చలనుబట్టి హిందూదేశపు రాజకీయ పరిస్థితులను ఎట్టిబ్యాంకు మన కవసరమో నిర్ణయించి, దానిని త్వరితముగ ఏర్పాటుచేయుటయే యైయున్నది.

---

* 1928 బిల్లు ఉపసంహరింపబడుటకైనను ఇది కారణము కాదనియు, దానికి వేరుకారణములు కలవనియు మొదటి రౌండుటేబిల్ సమావేశమునందు జిన్నాగారు గట్టిగ చెప్పిరి.

## సెలవు

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

ఏడుగురు నేకమై ముదముగొల్పుచును,
ననుఁగూడి చరియించు నామిత్రులార,
దయతప్పెనొక్కొ నాపయి నేడు మీకు ?
కనుట కింపగుదానిఁ గనుచున్న వేళ,
వినుట కింపగుదాని వినుచున్న వేళ,
నాకుఁ దోడయి నిల్చి ననుఁ బ్రోచినారు;
నాతోడునీడలై ననుఁ గూడినారు.
కష్టంబులగు పనుల్ గావించువేళ
నాయందుఁ దయఁజూపి ననుఁ గాచినారు;
కాలమెల్లపు డొక్కగతి నుండఁబోదు;
కష్టముల్ గల్గెడు కాలంబునందు
మిత్రులు శత్రులై మెలఁగుచుండెదరు.
ధైర్యసాహసము లుత్సాహంబుఁగూడి
నాతోడఁబుట్టులై ననిచిన వేళ,
మీరందఱును నాకు మిత్రులే-కాని,
కాలంబు మాఱె, కష్టాలు చేకూఱె;
ధైర్యసాహసములు తగ్గుచునుండె;
నుత్సాహశక్తియు నుడిగిపోసాగె;
మీమైత్రి యేమయ్యె? మీపని యేమి?
కనువేళ, వినువేళఁ, జనువేళ మీరు
దవ్వుదవ్వుల నిల్చి తాఱుచున్నారు.
మీరు నామిత్రులు కారంచు నిపుడు
నిశ్చయంబుగఁ జెప్ప నేరనుగాని,
నెయ్యంబు క్రమముగా నీరసమౌట
కనుపట్టుచున్నది—

కాలంపు మహిమ!—

మీమైత్రి యూఁతగా మేటికార్యములు
సలుపఁజాలితిఁ దొల్లి—

జయము నొందితిని,

ఆజయం బుత్సాహ మమరించె నాకు;
తలకుమించినపనుల్ తలపెట్టినాను,
చేతవాతినుగాక చెడిపోయినాను,
కారణం బేమి ?—

మీకారుణ్య మకట
యించుకించుక తగ్గి యిట్లు కావించె.
అహహ, యాదినముల మహిమ యేమందు?—
నామాటయే మాటమై మేటియయ్యె !
చనుట కంతములేదు, చనుచునేయుంటి,
వినుట కంతములేదు, వినుచునేయుంటి,
కలమెత్తి వ్రాయంగ గమకించునపుడు
చేమెత్తి పనిసేయ సిద్ధమౌనపుడు;
ఆయాస మింతైన నపుడు లేకుండె,
మీరు నామిత్రులై మెలఁగినా రపుడు.
కలమెత్తి వ్రాయంగఁ గష్టమౌ నిపుడు
చేమెత్తి పనిసేయఁ జీకాకు నేడు;
వినుటకుఁ గనుటకుఁ జనుటకు శక్తి
యుత్సాహమును దగ్గుచున్నవి—మీకు
నెయ్యంబు నాపైని నీరసించినది.

* * *

ఆడినయాటయే యాటమైనపుడు,
పాడినపాటయే పాటమైనపుడు,
మాట నూరువరాల మూట మైనపుడు,
మూట వేయివరాలపాటి మైనపుడు,
మీరందఱును నాకు మిత్రులే—నాఁడు—

వినఁగఁ గష్టంబైన వింతను వింటి;
పాడఁ గష్టంబైన పాటపాడితిని;
చేయఁ గష్టంబైన చేఁత చేసితిని;
చూడఁ గష్టంబైన చోటు చూచితిని;
నాపాటివారు కన్పట్ట రట్టికీర్తి
గడియించినాను మీకరుణ నానాఁడు—
ఆనాఁటికరుణ యేమయ్యె మీకిపుడు?

వినఁగోరెదనుగాని, విన శక్తి తగ్గె;
కనఁగోరెదనుగాని, కన శక్తి తగ్గె;
వ్రాయంగఁ జేయంగ బలమును దగ్గె;
శక్తితోఁ దగ్గె నుత్సాహధైర్యములు;
బలముతోఁ దగ్గెను గలిమియంతయును—

బలిమి, యుత్సాహంబు, కలిమి, ధైర్యంబు,
తరలుచునున్నవి—దయ మీకుఁ దప్పె—
బ్రతికియున్నాను జీవచ్ఛవంబట్లు
బ్రతికియుండక చేయవలసిన దేమి?

పోయినదినము లెప్పుడు మఱిరావు,
మఱిరాదు మీతోంటి మైత్రి నాపైని;
ఇంచుకించుక మీరు నేనునుగూడ
దవ్వుదవ్వుగ వీడి తరలిపోయెదము—

నను వీడి దవ్వుగాఁ జనెదరుకాని,
ననుఁ దలంతురె, యెందుఁ జనినను మీరు?
తలఁతురో మీరు నన్ దలఁపరో కాని,
నే మిమ్ముఁ దలఁపక నిలువఁగాలేను.

మీమైత్రిఁ జేసిన మేటికార్యములు,
మీమైత్రిఁ జూఁచిన మేటిదృశ్యములు
మరణమౌదాఁక నే మఱచిపోలేను;
మిముఁ దలంపక నేను మెలఁగంగలేను.

మీసహాయములేక మెలఁగినవేళ
మీసహాయపు శక్తి వాసి కన్పట్టు.

అయినది యేమైన నైనదేకాని,
మీరు నొక్కొక్కప్డు మిత్రులే—నిజము—
కనుముక్కుఁజెవులును, దనువు నాలుకయు,
నగుచు నా కుత్సాహ మమరించినారు;
కాలుసేయాదియై కరుణ చూపించి,
యేవేళ నాచెంత నే నిల్చినారు.

మఱచిపోలేను మీమైత్రిని, మిమ్ము—
నను వీడిపో మీకు మనసయ్యెఁ గాన
మిము నిల్పుకొనలేను; మీకేల వంత—
ఇచ్చకువచ్చినయెడ కేగుఁ డింక—
పదుగురు మీరు—మీపైనున్న ప్రేమ
యొక్కచోటికిఁ దెచ్చి, యొక్కెడ నుంచి,
యొక్కండఁ గూర్చుండి, యొక్కనిఁ జూచి,
చింతసేయుదు; వేఱెచింత నాకేల?
అతఁడె నామిత్రుఁడౌ నన్నివేళలను;
కనుగొంటిరో మీరు కనలేదొ కాని,
ప్రేమతో మీరు నన్ వీక్షించు వేళఁ
బ్రక్కనే యాతండు నక్కి కంచుండె;
నను మీరు దయతోడఁ గనుచున్న వేళ
నాతఁ డాప్రక్కనే యరయుచునుండె.

నేఁడు మీదయ యిట్లు నీరసంబైన,
నాతండు చేరువ కరుదెంచినాఁడు.

ఈ క్రేవ నీక్షింపుఁ డిదిగో, యీ క్రేవ—
నాసుఖంబులయందు ననుఁ గూడినారు,
నాకష్టములయందు నను వీడినారు
మీరందఱును; గాని, మిత్రుఁ డీతండు
కష్టంబులందు, సుఖంబులయందు
నను విడనాడక, నాముందు నిల్చి,
నామేలు కోరి, న న్గాపాడుచుండు;
మీరు నాతో మైత్రి మెలఁగినవేళఁ
దలఁపలేనైతి నాతని ప్రేమమహిమ ;
మిమ్ము నమ్మితి—వానినెమ్మి క్రుమ్మితిని.
కడచె నాదినములు—కడచె మీమైత్రి.

సెలవుగైకొనుఁడు ; మీచిత్తమైనపుడు—
సెలవొసంగుఁడు నాకు—

చేతనారీతి

నీయేకమిత్రుని నీక్షించుచుండు ;
ఇతనితోఁ గాలంబు నేగించుచుండు ;
ఇతనితో నేకమై యెలమిమై నుండు ;
ఇతనిలోఁ గరఁగి నే నేమొ యై యుండు ;
సెలవుగైకొనుఁడు, నే నిటఁ నొక్కఁడనె—
తలఁచుచుండుఁడు నన్ను—

సెలవిందు—

సెలవు—

(తేనెపట్టునుండి)



గంగానదిలో పడవలు

—సి. జి. జగన్నాథదాసు.

# చందనవృక్షము

క్రమధాటి వెంకటగిరి

(Santalum, album)

చందనవృక్షము హిందూదేశములో అమూల్యమైన వృక్షములలో నొకటి. ఈ చెట్టు నిలువు నిలువెల్ల వాసనావిలసితము; నిలువునిలువెల్ల ఉపయోగకారి. పూర్వమునుండి హిందూదేశమునందును, చైనాదేశమునందును ఇది చాలగా కొనియాడబడుచున్నది. టేకు, దేవదారు మొదలైనవృక్షములకంటె ఇది దీర్ఘకాల ముండును. దీనిని విగ్రహాదులు, దేవస్థానములు, రాజనగరులు మొదలైనవాటి కవాటములు చేయుటకు అమితముగ వాడుచున్నారు. ఇదిగాక హిందూ, చైనాదేశములందు మృతదేహములకు సంస్కారమొనర్చుటకు ఈచందనపు చెక్కలను కొందరు ఉపయోగించుచున్నారు. దీనినుండి తీసిన నూనె పలువిధముల అన్నిదేశములందును వాడబడుచున్నది.

సదా పచ్చనిఆకులతో గూడి రమ్యముగానుండు ఈ చందనవృక్షము సాధారణముగా 40 అడుగుల ఎత్తుపెరుగును. మరియు భూమి సారవంతమైనచో ఈ చెట్టు 100 అడుగులు ఎత్తును, 6 అడుగుల చుట్టుకొలతయు గలిగి చాలత్వరలో పెరుగును. ఇట్లు శీఘ్రకాలములో పెరిగిన వృక్షములందు సువాసనాయుతమైన చెక్క చాలకొద్దిగా నుండునని తెలియుచున్నది.

మనదేశమున ఈ చందనవృక్షములు నీలగిరి కొండలనుండి ప్రారంభమై, మైసూరుదేశపు పశ్చిమోత్తరదిక్కులవరకు 240మైళ్ల నిడివియు, 16 మైళ్ల వెడల్పును గల విశాలావరణమును దట్టముగా నలముకొనియున్నవి. ఈ ప్రదేశమందు సముద్రమట్టమునుండి 4000 అడుగుల ఎత్తుప్రాంతములందు ఈ చెట్టు చాల సొంపై, ఉన్నతముగ పెరుగుచున్నది. ఈ వృక్షముల ఆవరణపు మొత్తమువిస్తీర్ణము 6000 చదరపుమైళ్లు. ఇందులో మూడువంతుల ప్రదేశము మైసూరుదేశమునందును, తక్కినది (Coorg)లోను కొడగు బొంబాయి రాజధానిలో కొంత, మదరాసునందు కొంతభాగము ఉన్నది. ఉత్తమమైనమ్రాను మైసూరు, కొడగుదేశములందు దొరకును.

ఈ చందనవృక్షముల మూలమున మైసూరురాష్ట్రమునకు చాలఆదాయము కలుగుచున్నది. కొన్నిసంవత్సరముల క్రింద వేలమునందు ఈ చెట్లన్నియు అమ్మబడి, యూరోపు, అమెరికాదేశములకు ఎగుమతిచేయబడుచుండెడిది. చందనపునూనె ఆదేశములందలి బట్టీలలోనె తయారు చేయబడుచుండెను. ప్రస్తుతము మైసూరు, బెంగుళూరులందు కర్మాగారము లేర్పరచి, మైసూరు ప్రభుత్వమువారే చందనపునూనెను తయారుచేయుచున్నారు.

## చెట్లను పెంచెడివిధము

ఈ చెట్లను వృద్ధిచేయుటకు, చెట్లయందు బాగుగ పండి, తాజాగానున్న పండ్లను కోసి వర్షాకాలము వరకు భద్రపరచియుంచి, తదనంతరము విత్తులను వేరుచేయవలెను. గంధపుచెట్లు పరాన్నభుక్కులగుటచే, విత్తులను పోషకవృక్షముల విత్తులతోగూడ నాటవలెను. ఇవి చక్కగా యెదుగుటకు దాదాపు 100 లేక 120 సంవత్సరములకాలము పట్టును. ఈ అవధిలోపుగా మ్రానుయొక్క ఉపరిభాగమునకు రెండుఅంగుళములలోనుండు మధ్యచెక్క (Heart wood) యేర్పడును.

ఈ మధ్యచెక్క పసుపుతోగూడిన బూడిదరంగు కలిగి, చాల ఘాటుగా పరిమళించుచుండును. ఈ స్థితికి వచ్చినపిమ్మట మ్రానును కోసి, చెట్టుయొక్క పట్టను, పసరుభాగములను తీసివేసి, మధ్యచెక్కను ముక్క

లుగా కోయుదురు. తర్వాత చెక్కముక్కలనుండి నూనె తయారుచేయుదురు.



౧. బెంగుళూరునందలి చందనపునూనెను తయారుచేయు కార్ఖానా.

## చందనతైలము

చందనతైలమును తయారు చేయు పరిశ్రమము హిందూదేశమున, మిక్కిలి అభివృద్ధి గాంచుచున్న దేశీయపరిశ్రమలలో నొకటైయున్నది. 1916-వ సంవత్సరమున మైసూరుప్రభుత్వమువారు శాస్త్రీయములైన నూత్నమార్గములతో ఈ పరిశ్రమను ప్రారంభించిరి. చందనతైలమును తయారుచేయుటకు, మైసూరుప్రభుత్వావారొక కర్మాగారమును బెంగుళూరులో ఏర్పరచిరి. ఆ మరుసంవత్సరమే మైసూరునందు కూడ నట్టిదొకటి యేర్పరుపబడెను. ప్రస్తుతము ఈ రెండు కార్ఖానాలయందు సంవత్సరమునకు 1,500 టన్నుల చెక్కనుండి తైలము తీయుచున్నారు. ఇదిగాక ప్రభుత్వమువారు అమెరికా మొదలగు ఇతరదేశములందును తైలము తయారుచేయుటకు ఏర్పాట్లు చేసినారు. సంవత్సరమునకు 200000 పౌనులనూనె తయారు అగుచున్నది. 1927-28-వ సంవత్సరమున 22¼ లక్షల రూపాయల విలువగల చందనతైలము, జపాను,

ఈ చందనవృక్షము ఇతరవృక్షములపై ఆధారపడి పెరిగెడు స్వభావముకలది. మొలకవచ్చిన కొద్ది మాసములకే దీనివేర్లు సమీపమున పెరిగియుండు గడ్డి మొదలైన చిన్నిచిన్ని మొక్కల వేర్లలో చొచ్చి ఆహారమును గైకొనును. ఇట్టిగుణము కలిగియుండుట వలన ఈ చెట్లను పెంచునపుడు, ఇతర పోషక వృక్షములయొక్క మొక్కలనుగూడ సమీపమున నాటి పెంచవలెను. ఇట్లు ఈ చందన వృక్షమునకు ఆధారముగనుండు వృక్షములు సుమారు 140 కలవని తెలియుచున్నది. వీటిలో ముఖ్యమైన పోషక వృక్షములు - తంగేడు చెట్టు (Cassia Auriculata), ప్రత్తి చెట్టు (Gossypiam Herbeceum), వేపచెట్టు (Melia Azadirachta), వావిలిచెట్టు (Vitex Negundo), రేగుచెట్టు (Zizyphus Jujuba Plum tree), జమ్మిచెట్టు (Acacia Suma), నూగు తుమ్మచెట్టు (Acacia Farnesiana).



౨. మైసూరునందలి చందనపునూనెను తయారుచేయు కార్ఖానా.

ఫ్రాన్సు, అమెరికా మొదలగు దేశములకు ఎగుమతిచేయ బడెను. మైసూరుదేశమం దుత్పత్తియగు చెక్క అంతయు, ఈ రెండు కార్ఖానాలలోను, అథవా న్యూయార్కు (NewYork) నందుండు వీరి ఏజెంట్ల మూలముగాను బట్టీచేయబడు చున్నది.

చందనతైలము, దుంగలను స్వేదనము (Distillation) చేసి తీయబడును. మొదట మ్రానంతయు పొడిచేసి నీటిలో నానబెట్టుదురు. అటుపిమ్మట ఆ నానినపొడిని తామ్రపుబట్టీలో నుంచుదురు. కొద్దిరోజు



౩. బెంగుళూరు కార్ఖానాలో
తైలమును తీయు యంత్రములు.

లయినపిమ్మట ఆ నూనెను వడియగట్టి, దానియందలి మడ్డియంతయు అడుగునచేరుటకై ఒకసంవత్సరకాలము అట్టే కదలింపక ఉంచుదురు. ఇట్లు తయారుచేసిన నూనె మిక్కిలి స్వచ్ఛమై, పసుపురంగుతో మంచి సువాసన కలిగియుండును.

## రోగము

స్పైక్ అను ఒకవిధమైన రోగము(Spike Disease) గంధపుచెట్లకు వచ్చును. 1900-వ సం. నుండి ఈ భయంకరమైన రోగము ఈ మహోపయోగకరమయిన వృక్షమును నాశపరుప మొదలిడెను. ఉపయోగించక పోవుటయే కాక ఉపయోగించువస్తువులను సర్వనాశము చేయు స్వభావము ప్రకృతివస్తువులకు సహజముకాబోలు!

ఈ రోగము ప్రప్రథమమున ఆకులకు, కొమ్మలకు వచ్చి తర్వాత సర్వత్ర వ్యాపించును. ఈ రోగమువలన నందనవృక్షములు నాశనమయి మైసూరు గవర్నమెంటువారికి ప్రతిసంవత్సరము ౕ, 6 లక్షల రూపాయల నష్టము కలుగుచున్నది.

## రోగలక్షణములు

ఈ రోగవ్యాపనమువలన క్రొత్తగాచిగిరించు ఆకులు, కొమ్మలు వాని సహజమయిన ఆకారమును, మృదుత్వమును వీడి బిరుసుబిరుసై చిన్నగా కొయ్యలవలె పెరుగును. ఈ బిరుసుస్వభావమును, ఈ ఆకృతిని అనుసరించియే ఈ రోగమునకు ఆంగ్లమున స్పైక్ (Spike) రోగము అను పేరు వచ్చెను. ఈ రోగము వ్యాపించినకొలది, రానురాను ఆకులు, కొమ్మలు అన్నియు ఇట్లే బిరుసెక్కి మేకులవలె చిన్నచిన్నవిగా, మారి చెట్టు నానాటికి కృశించి నశించిపోవును. ఈ రోగము వచ్చినచో కుదురుట దుష్కరము.

ఈ రోగము వచ్చిన చందనవృక్షములు పూవులను పూయవు; కాయలను కాయవు. ఈ రోగము లేని వృక్షము ఎంతగుబురుగా పెరిగి మూడసొంపుగానున్నదో, రోగము తగిలిన వృక్షము ఎంతఎండి, వాడి వక్కలయి పోయినదో చిత్రములలో చూడవచ్చును. రోగమువచ్చిన చెట్లవేళ్లు శిథిలములై మ్రగ్గి పండిపోవును.




౮. స్పైక్ రోగము తగిలిన చందనవృక్షముయొక్క మొదటిసిద్ధిని చూపు చిత్రము.

A. రోగము తగిలిన కొమ్మ.

B. పోషకవృక్షము : నూగు తుమ్మచెట్టు.

ఈ రోగము ఒకచెట్టునుండి ఇంకొక చెట్టునకు అంటుకొని క్రమముగా తోటఅంతయు వ్యాపించును. రోగమునకు కారణము ఇదమిత్థమని ఏశాస్త్రవేత్త నిరూపించలేదు. ఇదివరలో మైసూరు గవర్నమెంటు వారు, ఈ దుష్టరోగమునకు కారణమును సహేతుకముగా కనిపెట్టినవారికి బహుమాన మొసగఒడు నని ప్రకటింప అనేకపరిశోధనలను శాస్త్రవిదులు సలిపిరి. కాని ఆపరిశోధనలన్నియు బూడిదలోపోసిన పన్నీరాయెను.

## రోగవ్యాపనముపై పరిశోధనలు

సి. టి. మెకార్తిమహాశయుడు ఈ రోగలక్షణములను, దాని వ్యాపనమును విశదీకరించుచు పత్రికయందు ప్రకటించెను. ఈ రోగవ్యాప్తి మిక్కిలి చిత్రము. వేరుల మూలమున ఒకచెట్టునుండి ఇంకొకచెట్టునకు రోగము వ్యాపించుచున్న దని కొందరు సిద్ధాంతీకరించిరి. కాని రోగమువచ్చిన దగ్గరి చెట్లకేకాక దూరమున నున్న చెట్లకుకూడ ఈరోగము సంక్రమించుచున్నది. దీనికి కారణము తెలియరాలేదు. రోగపు విచిత్ర వ్యాప్తికి కారణములు నిరూపించుటకు ఎన్నియోవిధముల వృక్షశాస్త్రజ్ఞులు పరిశీలనము చేసినారు. కొందరు శాస్త్రజ్ఞులు, ఈ రోగము అంటురోగమయి యుండ వచ్చునని అభిప్రాయపడి, రోగపుచెట్ల యాకుల రసమును దీసి ఆరోగ్యముగా నున్న చెట్లలోనికి యా రసమును సూది మూలమున ప్రవేశింపచేసి పరిశోధించిరి. కాని ఈ యుపాయములో రోగమును ప్రేరేపించుటకు వీలులేకపోవుటచే ఈ రోగము అంటురోగము కా దని దృఢపడెను.

## లంటానా

(Lantana)

దీనిని నూరువరహాలచెట్టు అని అందురు. ఈ చెట్లు పెరిగియుండు స్థలములందుండు గంధపుచెట్లకు ఈ రోగము విశేషముగా వచ్చుచుండును. అందుచేత లంటానాచెట్లను ఆ తావులనుండి తొలగించిన ఈ రోగవ్యాప్తికి నిరోధము కలుగునని కొందరు పరి

శోధకులు పరిశోధించి సూచించినారు. కాని గంధపు చెట్లు పరాన్నభుక్కు లగుటచే స్వయంవర్ధనములు కావు. తమ ఆహారమును లంటానా చెట్లనుండి తీసికొనుచుండును గనుక ఆచెట్లను తీసివేయవలెనన్నచో లంటానాచెట్లవలె ఉపయోగించు మరియొకరకపు చెట్లను ఆస్థలమున పెంపొందింపవలెను.




౫. A. రోగము తీవ్రముగా తగిలిన చందనవృక్షము.
B. ఆరోగ్యముననుండు చందనవృక్షము.
C. పోషకవృక్షము : నూగు తుమ్మచెట్టు.

1917-వ సం. ములో డాక్టరు కోల్మనుగారు (Dr. Coleman) మైసూరురాజధానిలో కొన్ని ముఖ్యమయిన పరిశోధనలను గావించినారు. వారి పరిశోధనల సారాంశము, రోగమువచ్చిన చెట్టుయొక్క చిన్న కొమ్మ నొకదానిని ఆరోగ్యముగానున్న చెట్టుకొమ్మకు అంటకట్టినయెడల దానికి ఈ రోగము అంటుకొనును. ఇట్లు అంటకట్టిన చెట్లకు రోగము మొదట అంటకట్టిన కొమ్మకు వచ్చి నెమ్మదినెమ్మదిగా ఆచెట్టునంతయు వ్యాపించిపోవును. వీరి పరిశోధనలవలన ఈరోగము వేరులగుండా వ్యాపించునది కాదని తేటతెల్లమగుచున్నది. ఇంతియేగాక డాక్టరు కోల్మనుగారు, ఈ రోగము శిలీంధ్రములవలనగాని, పురుగులవలనగాని వచ్చుటకు నిదర్శనములు ఏమియు లేవని నిశ్చయించి బహుశః ఈ రోగము ఒకవిధమయిన విషపునీటివలన పుట్టుచున్నదని యుద్దేశించినారు. ఈ యుద్దేశ్యము ననుసరించి వీరు రోగమువచ్చిన యాకులను, కొమ్మలను మర్దించి రసమును తీసి యారసమును సూదిమూలమున రోగము లేని వృక్షములోనికి ఎక్కించి, రోగమును కల్పింప యత్నించిరి. ఆ యత్నములుకూడ వృథాయాయెను. ఇన్ని పరిశోధనలు చేసినను ఈరోగ వ్యాప్తికి కారణములు తేటతెల్లము కాలేదు.

## రోగనిరోధకములు

౧. గంధపుచెట్లను పోషించు చెట్లను జాగ్రత్తగ వృద్ధిపరచవలయును.

౨. గంధపుచెట్ల సమీపమున నున్న ఎండి, కుళ్లి పోయిన చెట్లను నాశముచేయవలయును.

3. గంధపుచెట్లు తగినంత నీడగల ప్రదేశములలో పెరుగునట్లు చేయవలయును. ఇట్లు చేసినచో ఎండ వేడిమివలన కలుగునష్టములు తొలగిపోవును.

౪. గడ్డి మొదలగు మొక్కలను ఆప్రదేశమునందు పెరుగకుండ చేయవలయును.

డాక్టరు కోల్మన్ మొదలగు శాస్త్రవేత్తల శాస్త్రానుసారముగ ఇంకను పరిశోధనలు గావించి రోగముయొక్క మూలకారణములను కనిపెట్టుట అత్యావశ్యకము. ఈ రోగమును నివారించు నుపాయములను కనుగొనవలయును. ఇందువిషయమయి శ్రద్ధవహించి మహారాసుగవర్నమెంటువారు బెంగుళూరు నందలి భారతవిజ్ఞాన కళాశాలయందు ఈ రోగమునకు సంబంధించిన విషయములపై పరిశోధనలు గావింప ఆశాస్త్రములలో ప్రావీణ్యమును కాంచినవారిని నియమించినారు. వారు ౕ, 6 వత్సరములనుండి యీ విషయమై శ్రద్ధావిశేషముతో, కుశాగ్రబుద్ధితో పరిశోధనలు

గావించి యీ రోగమును నివారించు నుపాయములను వెదకుచున్నారు.

## నూతన పరిశోధనలు

బెంగుళూరు భారతవిజ్ఞాన శాస్త్రాలయందు కనుగొన్న నవీన పరిశోధనలలో గంధపుచెట్లు పెరుగు ప్రదేశములలో సున్నమును జల్లినయెడల ఈ రోగమునుండి విముక్తి కలుగునని నిరూపించినారు. మరియు గంధపుచెట్లకు పోషణముగా ఉపయోగపడు చెట్లయొక్క ప్రకృతులను పరిపూర్ణముగా పరిశీలించి, పోషణవృక్షములు రెండు విధములని తెలిసికొన్నారు. ఇందులో ఒకజాతిచెట్లు గంధపుచెట్లకు రోగమువచ్చునట్లు చేయును. మరియొకజాతిపోషకవృక్షములు రోగమును కలిగింపక పెరుగుదలకు, పుష్టికి మూలకందములగును. ఇంకను ఈ రోగము వ్యాపింపకుండునట్లు యత్నములు సలుపుచున్నారు. ఈ పరిశోధనలేకాక రోగమును తెలిసికొను పద్ధతులను కనిపెట్టినారు. ఈ యుపకరణములవలన రోగము పైకి తేలకుండగనే ఆరోగ్యముగల వృక్షములనుండి రోగవృక్షములను వేరు చేయుటకు సాధ్యమగుచున్నది. శీఘ్రకాలములోనే పరిశోధకుల పరిశ్రమలవలన ఈ రోగమును సమూలముగ నాశము చేయుటకు మరికొన్ని ఉపాయములు, చికిత్సలు వెలువడును.

---



పంచగంగాఘట్టము, కాశీ

—సి. జి. జగన్నాథదాసు.

# మంచివ్యవసాయము

రావుబహద్దర్ దువ్వూరి బాలకృష్ణమూర్తి

(Improved Agriculture)

మంచివ్యవసాయమునకు ముఖ్యమార్గములు మూడే:

### ౧. మంచివిత్తముల నెంచుట

మంచివిత్తనముల విశేషము:—తల్లినిబట్టి పిల్ల విత్తును బట్టి పంట. కులమెరిగి పిల్లను తెచ్చుకొనునట్లు మంచి విత్తనములనే చల్లవలయును. రైతులు విత్తనముల విషయమై తగుశ్రద్ధ తీసుకొనుట లేదు. కోతలకు ముందు వారి చేలను చూచితిమేని మూడు ముఖ్య లోపము లగుపడును: (i) కల్తీపైర్లు, (ii) తెగుళ్ల వల్ల పైర్లు చెడుచుండుట, (iii) జబ్బు మొలకవలన నష్టము.

(i) ఒకేచేలో ఒకేపైరులో అనేకరకము లుండి వేరువేరుకాలములలో పండును. కొన్ని త్వరలో పండునవి, కొన్ని ఆలస్యముగా పండునవి. ఈ రకము లన్నీ చేనంతా చెదరియుండుటచే ఒకేకాలములో పండువాటిని ఏరికోయుట దుర్లభము. వ్యయప్రయాస లెక్కువ. ముందుగా పండినవాటితో చేనంతా కోసినయెడల ఆలస్యముగా పండే మొక్కలగింజలు ముదరక చెడిపోవును. ఆలస్యముగా పండే మొక్కలు తయారగువరకు నుంచినయెడల ముందు పండినవాటి గింజలు రాలిపోయి నష్టము గలుగును. పైరు చాలా కాలము చేలో నిలవయుండినయెడల కాపలాకూలి హెచ్చగును. పక్షులు, ఎలుకలు విశేషనష్టమును కలుగ జేయును. కనుక అనేకరకములతో గూడిన పైరు సరాసరిగా పండక ఒకేకాలమందు కోతకురాదు. కల్తీ గింజలకు సరియైన ధరకూడ రానేరదు.

(ii) విత్తనము మంచిది కానప్పుడు తెగుళ్ల వల్ల పైరుచెడి పంటకు చాలానష్టము కలుగును. ఈ తెగుళ్లు చుట్టుప్రక్కల నుండు ఇతరుల చేలలోనికి ప్రాకి వాటికికూడ నష్టమును కలుగజేయును. "కాలుజారినగాని గంగానమ్మకూడ కొట్టదు" అను సామెత నిజమగును.

(iii) సరియైన మంచివిత్తనముల నేరక కళ్లములలో రాశిలోని గింజలను విత్తనముగా నుపయోగించి నప్పుడు అవి సరిగా మొలవక చేలో పూర్తిఅయిన పైరు పుట్టకపోవుటవల్ల పంట తగ్గుటయేగాక ఖాళీ స్థలములలో విశేషముగా కలుపు పెరిగి నష్టముకలుగ జేయును.

ఈ లోపములను నివారణచేయు మార్గము:
"మంచినూడల కాశపడితే మంచిఆబోతుండవలెను;నట్లె మంచిపంటల కాశపడితే మంచివిత్తన మెంచికట్టుడి."

మంచివిత్తనము మంచిపంట నిచ్చును. రహితులు తమవిత్తనములు కల్తీవి అయినయెడల మంచి రకపు విత్తనములను శ్రద్ధతో జాగ్రతజేయు ఇతరరైతులవద్ద తీసుకొనవలయును. లేదా, వ్యవసాయపు డిపార్టుమెంటువారి వద్దనుండి ప్రశస్తమైన విత్తనములను తెచ్చుకొనుచుండుట మేలు. తరువాత తగుశ్రద్ధతో తమతమ పంటలలోనుండి మంచివిత్తనములను ఏరుకొనుచుండవలెను. ఎన్నడును కళ్లములో రాశిలోని గింజలను ఎంతమాత్రము విత్తనము కట్టకూడదు.

తమచేలు పండినప్పుడు చేనంతా జాగ్రతతో పరీక్షించి, బాగా పండినచోట్లను, తెగులులేని ప్రదేశములందును, బాగుగ పెరిగి చక్కగ దుబ్బుచేసిన మంచి మొక్కలనుండి భారీగా నుండునట్టియు, బాగా గింజలు పట్టినట్టిన్ని గట్టిగానుండి పొల్లులేని గింజలుగల మంచివెన్నులు మాత్రమే యేరి చక్కగ ఎండనిచ్చి, కుండలోగాని, యితరవిధముగాగాని తిరిగి విత్తేసమయమువరకు పొడిగా నుండుచోట్ల భద్రపరచి చల్లే

కాలములోనే వెన్నులను నలిపి పాల్లుచెరిగి మంచి గట్టిగింజలనుమాత్రమే చల్లుచుండవలెను.

తనకు కావలసినదానికన్న ఎక్కువగానే విత్తనములను జాగ్రత చేసుకొనవలయును. ఏ కారణము చేతనైనను మొదటవిత్తిన విత్తనము చెడిపోయిన అదునుపదును దాటిపోకుండ తిరిగి చల్లుకొనుటకు వలయునంత విత్తనము చేతిలో నుండవలయును.

చల్లేకాలమునకు ముందుగానే తమవిత్తనముల మంచిచెడ్డలను కనిపెట్టుటకు కొద్దిగింజలను చిన్నమడిలోగాని, మూకుళ్లలోగాని మొలకకట్టి చూచుకొనుట మేలు. ఈ మహాదర్థము ప్రజలకు బోధపడునిమిత్తము మనపూర్వులు ప్రతిశుభశోభనాదులలోను నవధాన్యములయొక్క అంకురార్పణ యేర్పరచి యుండిరి. రానురాను దాని యాథార్థ్యమును గ్రహింపలేక యీ అంకురార్పణపద్ధతి నామమాత్రముగ ఆచరణలో నుండి నిరుపయోగమైనదిగా పరిణమించినది.

ఈ రీతిగా మంచివిత్తనములను భద్రపరచుకొనినయెడల గింజలు సరిగా మొలచి తెగుళ్లులేక మంచిపంట నెక్కువగా నిచ్చును.

"అగ్రేవాపీ సాంద్రవాపీ గోపోషీ బీజసంగ్రహీ'
సాయం ప్రాత స్వస్యదర్శీ ప్రళయేపి న నశ్యతి"

అను వరాహమిహిరుని హితబోధ ననుసరించి ప్రతిరైతు మంచివిత్తనముల ప్రాముఖ్యమును చక్కగ గ్రహించి బాగుపడవలెను.

"విత్తనములోలేనిది విశ్వములో లేదు."

## ౨. కలుపుతీసి నేలను శుభ్రపరచుట

మంచిపంటలు పండుటకు కలుపుతీయుట అగత్యము. దొంగలున్నారు జాగ్రత!

కలుపుమొక్కలే చేలలోని దొంగలు.

"రహితు బీద-పొలము బీద."

చేలలోని కలుపే చెడువ్యవసాయపు లక్షణము. రైతుఅశ్రద్ధను అతనిపైరే మరుగుపరచక, అడుగకనే చెప్పును.

నేలఖామందులు స్వయముగా వ్యవసాయము చేయక ఇతరత్ర కాపురముండుటవల్లను శ్రద్ధతో, వ్యవసాయము చేయని రైతులకు కవుల్లిచ్చుట వల్లను, పెద్ద వ్యవసాయదారులు సేద్యమును సరిగా గమనించక విద్యాగంధములేని అజ్ఞానులైన బీదలచేతిలో విడిచిపెట్టుటచేతను, అగ్రవర్ణములవారు వ్యవసాయమును నిరసించుటచేతను మనదేశపు నేలలలో కలుపు హెచ్చుగా నుండుట తటస్థమగుచున్నది.

"కలవు మానుప పంట, మిడుతల మానుప మంట." పంటలను బాగుచేసి కలవును బాపవలయును. కలుపు సరిగా తీయకపోవుటవలన మనదేశములో పండుపంటలలో నాల్గవవంతుకు పైగా పంట తగ్గిపోవుచున్నది. "పాటేగౌరవహేతువు" అను పాఠమును బాగుగ నేర్చుకొనవలయును. శుభ్రముగా సేద్యముచేసి కలుపును నిర్మూలముచేయవచ్చును.

దైవముతరువాతిది పరిశుభ్రతయే.
(Cleanliness is next to Godliness)

కలుపుతీయక పోవుటవలన పైర్లకు నాలుగువిధముల నష్టము:

(i) ఆదాయమునిచ్చు పైరుమొక్కలు పెరుగవలసినచోటును కలుపుమొక్కలాక్రమించుకొని నష్టము కలుగజేయును.

(ii) పైర్లకువలెనే కలుపుమొక్కలకు కూడ ఆహార మవసరము. చేలోని సస్యాహారమును, వేసిన యెరువును కలుపుమొక్కలు హరించి పైర్ల కందనీయక అవి సహజముగా బలవత్తరములగుటచే ముందుగా పెరిగి నీరసముగా నుండువాటిని అణచివేయును.

(iii) పచ్చిమొక్కలన్నిటికి పదును కావలయును కదా! ముఖ్యముగా వర్షములు తక్కువగా కురియుచోట్ల నేలలోని పదునునంతను కలుపుమొక్కలే ఉపయోగపరచుకొని పైర్లకు లేకుండ జేయును. పదును తక్కువైనప్పుడు నేల బిగిసి పైర్లు సరిగా పెరుగజాలవు. ఆహార సంగ్రామములో ఉపయోగరహితమైన కలుపుమొక్కలే గెలిచి పైర్లను అణగద్రొక్కును.

(iv) అన్ని జీవరాసులకు వలెనే మొక్కలకుగూడ వెలుతురు, గాలి అవసరము. కలుపుమొక్కలు చురుకుగాను, ఎత్తుగాను పెరుగుటచే పైరుమొక్కలు నీడను పడి బలహీనములై సరిగా పెరుగజాలవు. కనుక పైరుమొక్కలకు బదులుగా కలుపుమొక్కలను పెరుగనిచ్చుట తెలివితక్కువ. రైతులు ముందుగ సమయోచితముగ కలుపుతీసి పైర్లకు కొంత చేయూత యొసగినయెడల తరువాత పైరుమొక్కలు వారికి సహకారులై కలుపును అణచివేయ గలవు. పైర్లను వత్తుగా, నేలను త్వరలో మూసివేయునట్లు చల్లి ఉపద్రవము తగ్గింపవచ్చును.

కలుపుమొక్కలు ముఖ్యముగా రెండురకములు: విత్తులవలన మొలచునవి, నేలలోని దుంపలవలన, కాడలవలన పెరుగునవి. వాటి స్వభావములను సరిగా తెలుసుకొని తగుసాధనములవలన నివారణ చేయవలయును. మొదటిరకమును మొక్కలుపూచి గింజలు కట్టకమునుపే కలుపుతీసినయెడల తిరిగి పెరుగజాలవు. కలుపుమొక్కలను లేతప్పుడే తీయుటవలన వ్యయప్రయాసలుకూడ తగ్గును. రెండవరకమును లోతుగా దుక్కిదున్నిగాని, నేలను త్రవ్విగాని వేళ్లను ప్రోగుచేసి యెండనిచ్చి తగులబెట్టవలెను. చేను కోసినవెంటనే యెండకాలములో లోతుదుక్కివల్లను, బెల్లువిరుచుటవల్లను లోతుగ వేళ్లుప్రాకు కలుపుమొక్కలను నశింపచేయవలెను. ఖర్చుకు లోభించి చేలలోని కలుపుతీయక సకాలములో శుభ్రపరచనియెడల కలుపు వృద్ధియై తరువాత వాటి నణచుట కష్టసాధ్యమగును. ఒకకలుపుమొక్కను చేలో విడిచినయెడల దానినుండి చాలగింజలు రాలి కలుపు హెచ్చుట వలన విశేషనష్టము వాటిల్లును. కొన్ని చేలలో కలుపు చాల హెచ్చుగా నుండి పైరు తక్కువగా నున్నప్పుడు కలుపుతీయుటవలన ప్రయోజనముండదు. నేలను శుభ్రపరచుటకుగాను కలుపుమొక్కలసహితముగా పూర్తిగా దున్నివేయుటవలన తరువాత పైర్లకు విశేషలాభము కలుగును. ముందు కొంతనష్టమున్నను తరువాత లాభముకలుగుట నిశ్చయము.

## 3. పశువుల యెరువును భద్రపరచుట

(i) గోష్ఠము లక్ష్మీస్థానము. గోమయము, మూత్రము పవిత్రములు. కనుకనే "పంట పశువుల ముడ్డిలో నున్నది" అనుసామెత.

(ii) చంటిపిల్లలకు తల్లిపాలవలె అన్ని నేలలకు వివిధములైన పైర్లకు పశువులయెరువు సంజీవి.

(iii) పశువుల యెరువుతో పండిన ధాన్యాదులలో ఎక్కువ సత్తువ కలదు. ఆగింజలు చక్కగ మొలచి మంచిపంట నిచ్చును.

(iv) పంటపండిననేల ప్రసవించిన స్త్రీవలె నుండును. తిరిగి ఫలవంతమగుటకు తగిన ఎరువు వేయవలెను.

(v) పేడకన్న మూత్ర మెక్కువసారము కలది. దానిని పీల్చుటకు చెత్తచెదారములు చేర్చి ఎరువును వృద్ధిచేయవలెను. అవి దొరకనిచోట్ల పొడిమన్ను వేసిమూత్రముతో ఊరినదానిని పేడతో కలిపి పెంటగోతిలో వేయవలెను.

(vi) పశువులఎరువును ఎండకుఎండి వర్షపునీటితో సారము కొట్టుకొనిపోకుండునట్లు కాపాడవలెను.

(vii) ఒకజతపశువులవలన ఒకసంవత్సరములో ఒక యకరమునకు సరిపోవు పదిబండ్ల మంచియెరువు తయారగును. శ్రద్ధలేనిచో సారహీనమైన ఎరువు ఇందులో సగముకూడ దొరకదు.

(viii) పశువులమేతనుబట్టి ఎరువుసత్తువ మారును. పశువులను బాగుగ పోషించిన ఎరువుకూడ సారము కలదిగ నుండును.

(xi) మననేలలో అంగసంబంధమైన వస్తువులు చాలతక్కువ. పశువుల యెరువుతో ఆలోపముతగ్గి నేల గుల్లపారి పదును చక్కగనిల్చి సరియైనబలము కలుగును.

మంచిపద్ధతులపై పశువుల యెరువును భద్రపరచి పంటలు హెచ్చుచేసి దేశైశ్వర్యమునకు తోడ్పడుడు.

వివరమును వ్యవసాయశాఖవారి వలన తెలిసికొనుడు.



## స్వాభావికాసౌకర్యములు !!!

ఆంధ్రోద్యమము ప్రారంభమై యిరువదియేండ్లాయినది; గాని ఆంధ్రరాష్ట్రము ఏర్పడలేదు.

తక్కినఆశలును ఫలింపలేదు.

తుదకు ఆంధ్రోద్యమమే సన్నగిల్లి పోయినది.

కారణము...?

మనము భావోద్రిక్తులము. మనకు వర్తమానమే సజీవము. గతము గతమే. మరి భవిష్యత్తు అయోమయము.

మనకు ఆలసత మెండు. ఉద్బుద్ధుల మైతిమా— ఆరంభశూరులము!

మనకు స్వయంనిర్ణయశక్తి లేదు. ఏప్రాంతము నుండియైన ఒక నవీనోద్యమము వచ్చినదా—ప్రవృత్తిలో నున్నకార్యక్రమ మెక్కడిదక్కడ విడిచి ఆక్రొత్తదానిని స్వీకరింతుము.

మరల కొన్నిదినములు అందు మునిగిపోదుము.

మనమేయుద్యమమును సొంతముగా ప్రారంభించ లేదు. ప్రారంభించి సొంతముగా పరమావధినిచేర్చ లేదు.

అయితే: జాతియంతయు నిట్టిదగుట సంభవమా?

ఇది గొప్పప్రశ్న. నిజమే; గాని తత్వవిచారము నట్లుంచిన మన కగుపడునది అట్టిదే.

మనజాతియంతయు నొక్కతీరుననే యున్నది.

అటు బరంపురముమొదలు ఇటు బెంగుళూరి వరకును, మరియు నిటు మదరాసువరకును ఈనిర్వచనమును పూర్వపక్షము చేయగల సన్నివేశము లేదు.

"ఇది అపసిద్ధాంత" మని శంఖము పూరింప జాలిన పురుషుడు కనపడడు.

మన జాతియెడల నెవరికిని లక్ష్యము లేదు. "అయ్యో, మనల నెవ్వరును పాటిసేయరే" యని మనకు ఆవేదనయు లేదు.

ఇది ఈశ్వరనిర్ణయమా ?

ఇట్టి యాకాంక్ష చేసికొనుటకు మనకు అధికారము లేదు. ఏమంటే? మనము ఎప్పుడును పురుషకారమును పూర్తిగా వెల్లడించ లేదు.

ఇది మనకుమనమే విమర్శించుకొనవలసిన విషయము; మనకుమనమే సిగ్గుపడవలసిన పరిణామము.

కాని వాస్తవముగా మనజాతి పునరున్నతిని పడయజాలకుండుటకు స్వాభావికములగు కొన్ని అసౌకర్యము లున్నవి.

ఇరుగుపొరుగుజాతుల ప్రవృత్తిని పరిశీలించిన మనకు అవి విశదములగును.

మహారాష్ట్రులను చూతము:

వారి సామ్రాజ్యము అస్తమించి యెంతోకాలము కాలేదు.

శివాజీపదాంకములు వారి కింకను స్ఫుటముగనే కన్పించుచున్నవి.

పీష్వాల యాస్థానమున రాజకార్యములు సవరించిన ముస్సద్దీలు వారి కిప్పటికిని అక్షరాభ్యాసము కావించుచునే యున్నారు.

ప్రతికుటుంబము వారును "మానాయన, మాతాత ఫలానాయుద్ధమున అంత పరాక్రమముచూపినా" డని

చెప్పుకొని ఉప్పొంగు అదృష్టము వారి కింకను దారము కాలేదు.

ఇట్లు "నేను, నాది" అను మమత విస్మృతిను కాక పూర్వమే ఆదేశమున తిలకు ఆవిర్భవించి ఆజాతికి నవశక్తి సంఘటించినాడు.

గుజరాతీలను చూడుడు:

తురకలతోడి సంఘర్షణము వారికిని మాంద్యము రాకుండజేసినది.

పార్సీలతోడి సాహచర్యము వారిని జాగ్రదవస్థలో నుంచినది.

కరాచీ బొంబాయిరేవులు ఆంగ్లేయులతో ముందు వారికే పరిచయము కలిగించినవి.

సహజముగ వారు ధనవంతులు.

వారు సోమరులు కారు; సంపాదనా చతురులు.

ఇట్టి స్థితిలో నారోజీ, పటేలు, గాంధిగారు వారికి తత్త్వదర్శనము గావించినారు.

బంగాళీలసంగతి:

తురకలకు వారికి, తురకలకు ఆంగ్లేయులకు అక్కడ జరిగినంత సంఘర్షణము మరియెక్కడను జరుగలేదు.

వారి ముఖ్యపట్టణము భారతదేశమున కంతకును ప్రధాన నగరముగా నుండినది.

బ్రిటిషిండియా కంపెనీకును పెద్దయుద్యోగి వారి నగరము కొలువు తీర్చినాడు.

కోట్లకొలది పెట్టుబడులతో వ్యాపారముసాగించు విదేశీయవర్తకు లక్కడ అంగడులు తెరచినారు.

ఆంగ్లేయ పండితులు అక్కడ తమ విజ్ఞానమును వెదచల్లినారు.

వివేకానందుడు, సురేంద్రనాథుడు, విపినచంద్రుడు, అశుతోషు, చిత్తరంజనుడు వారికి వెన్నెముకగా నిలిచినారు.

అన్నిటికిని జీవగఱ్ఱగా కర్జనప్రభువుకశాఘాతము వారిని ఉద్బుద్ధులను గావించినది.

నేడు బంగాళము భారతదేశమునకు జ్యోతివలె నున్నది.

అరవల సంగతియు చూడదగినదే:

మొన్నటివరకును నాయకరాజులు వారిని దిద్దినారు.

అత్యద్భుత శిల్పచాతుర్యముగల అసంఖ్యదేవాలయములు, ప్రమోదులను చిగిరింపజేయు త్యాగరాయలవారి గానలహరి వారిని కార్యవాదులను గావించినవి.

తురకలకు ఫ్రెంచివారికి, ఫ్రెంచివారికి ఆంగ్లేయులకు అక్కడ సంకులసమరములు సాగినవి.

సహజమగు ప్రగమనశీలత ఆంగ్లేయులతో వారికెక్కువ పరిచయము కలిగించినది.

ఇన్నికారణములవలన, ఇంతవరకు వారిలోనొక్క మహాపురుషుడైన నవతరింపక పోయినను జాతియంతయు తనమేలు తాను గుర్తెరిగి, సాధింపుకొనగల స్థితిలో నున్నది.

ఇట్లు ఆత్మవిజ్ఞానముగల నాలుగుజాతుల అభ్యున్నతికి గల కారణములను తెలిసికొనినపిదప ఇక మన సంగతి.

మన భూతపూర్వచరిత్ర చాల గంభీరమైనదే; గాని దాని ప్రభావము ఇంతవరకును ప్రసరింప జాలదు.

మన విజయనగరసామ్రాజ్య మస్తమించి అనేక శతాబ్దము లైనది.

మనపేరుగా నొక్క స్వతంత్రసంస్థానమున్ను లేదు.

మనదేశమున లక్షజనసంఖ్యగలదైన నొక్క నగరము లేదు.

మహమ్మదీయుల కాలమున ప్రభువు మన నడుమ నివసింపలేదు.

ఆంగ్లేయప్రభువుగూడ మనకు దూరమునందే ఉండిపోయెను.

దక్షులగు యురపియనులతో మనకు పరిచయము లేదు.

రాజధానిలో నివసించుటకు మనకు సాహసము లేదు.

ఇప్పటికిగూడ రాజధానిలో మన కేవిషయము నందును పలుకుబడిలేదు.

మనలను ఎంతసేపును గుడుగుడుగుంచము లాడు కొనవలసిన పరిస్థితులే ఆవరించియున్నవి.

వీటి కన్నిటికిని సాయము మనకు అలసత మెండు; నుంద్యము హెచ్చు.

అయితే: మనకు గొప్పఆశయములు, పెద్దఆశలు గలవు; గాని వాని నాచరణమున పెట్టుటకు అవకాశ ములు లేవు.

ఇక మనకు నవీనోన్నతి యెట్లు కలుగును?

చూచినకొలది కన్నులు అశ్రుపూరితము లగు చున్నవి. తలచినకొలది హృదయము విదారితమైపోవు చున్నది.

స్వాభావికములగు నిట్టి అసౌకర్యములను సరి పుచ్చుకొనలేని మనము అరవల ప్రతిఘటనములను, ఉత్కళుల దురాక్రమణములను జయింపగలమా?

అయితే: మనగతి యిక ఇంతేనా?

—శాస్త్రి



చంద్రభాగానది, పండరిపురము

—వి. యస్. గోపాలదేశికాచారి.

# వ్రజనిగూఢరసము

యలమంచిలి శ్రీరాములు

ఈచిన్న వ్యాసమున వంగీయ వైష్ణవులకు వ్రజనిగూఢరసమునెడల గల భక్తి విశ్వాసములను వివరింప బూనుకొంటిని, గోపికలు నందనందనుని గూర్చి చేసిన భజనకు వ్రజభజనయని పేరు. గోపికల ననుసరించి భక్తులు భగవంతుని నారాధింప వచ్చును. అందు రాధాభావమున భగవంతుని సేవించుట సర్వోత్తమమైనదని వైష్ణవుల విశ్వాసము. రాధాభావమున సాధ్యము కాక పోయినను ఆమె చెలికత్తెయనుభావమున భగవంతుని సేవింపవచ్చుననియు, యశోదాభావమున శక్యముకాకపోయినను ఆమె చెలికత్తె యను భావమున భగవంతుని కైంకర్యము చేయవచ్చుననియు, నావిధముగ నందనందనునితో వ్రజవాసులు నెఱపిన లీలల ననుభవింప నవకాశము గలదనియు వారి దృఢవిశ్వాసము. తానె రాధననుకొని శ్రీకృష్ణుని గాఢాలింగనము జేసికొనుటగాని, యశోదననుకొని యాతని వదనమున వెన్నముద్ద నుంచుటగాని సామాన్య మానవునకు ప్రారంభదశలో సాధ్యముకాకపోవచ్చుననియు, రాధచే శ్రీకృష్ణుని గ్రాగిలింపజేసిరో, యశోదచే నాతనికి వెన్న పెట్టించిరో వ్రజవాసు లనుభవించిన మహానందములో గొంతభాగ మనుభవింపవచ్చుననియు, నా కొంతభాగముచేతనే మానవులు ప్రేమవాహినిలో దేలియాడ నవకాశ ముండుననియు వా రందురు.

రాధాకృష్ణలీలలు రూపకవర్ణనముకాదనియు, నవి యథార్థములనియు నొకశ్రేణి వైష్ణవుల విశ్వాసము. మఱొకశ్రేణివా రీలీలల యొక్క సత్యాసత్య విచారణతో ప్రయోజనమంతగా లేదనియు, వ్రజనిగూఢరసము ననుభవించుటకు చరిత్రవిచారణ మవసరములేదనియు, నెవరు గాఢముగ భగవంతుని ప్రేమింతురో వారి హృదయములలో లీలాస్ఫూర్తి యగుననియు, నాహృదయములే బృందావన క్షేత్రము లగుననియు నందురు.

తాను స్త్రీనని భక్తుడు భావించుకొని భగవంతుని భర్తృభావమున తనయెదుట నిలుపుకొని భజింపవలెనేగాని నిరాకారభగవంతుని ప్రాణనాథా యని పిలుచుట నిర్జీవకవిత్వమువంటిదని వైష్ణవులుచెప్పెదరు. నిష్కామ ప్రేమభక్తితో సాకారపూజ యెటులచేయవలెనో యాదర్శస్వరూపిణియై రాధ, లోకమునకు బోధించెను. వ్రజనిగూఢరసము రసాస్వాదనపరులగు భక్తుల కమృతతుల్యమైనది. వ్రజనిగూఢరసమ్ము ననువించ నవకాశమొసగు భగవల్లీలలు బుద్ధునివద్దగాని, మహమ్మదువద్ద గాని, క్రీస్తువద్దగాని లేకపోయెనని వైష్ణవులు సగర్వముగ బలుకవచ్చును.

వ్రజరసస్ఫూర్తికై నిభృతనికుంజవనము లు, మురళీగానము, నవ్యానురాగము, పుష్ప శయ్య, అభిసరణము, మేలనము, మానము, విరహము. రాసప్రభృతులు శ్రీ నందనంద నుని కవసరము లయ్యెను.

వ్రజలీలలు విశ్వసింప జాలకపోయినను ప్రయత్నముతోనయినను భగవంతుని భజింప బూనుకొన్నయెడల క్రమముగా నవిశ్వాసము తొలగిపోయి వ్రజలీలాచిత్రము మనస్సులో నిండిపోవునని వైష్ణవులు చెప్పెదరు. భాగవత గ్రంథమునకు ప్రాణప్రతిష్ఠయొనర్చిన శ్రీ చైతన్యదేవుని బోధకూడ నిదియే.

భగవత్ప్రేమపద్ధతులలోగూడ భేదములు గలవు. దాస్యప్రేమకంటె సఖ్యప్రేమయు, దానికంటె వాత్సల్యప్రేమయు, దానికంటె కాంతాప్రేమయు నున్నతమైనదని వైష్ణవుల విశ్వాసము. కాంతాప్రేమకే మఱొకనామము మధురభావము. మధురభావములో దాస్య సఖ్యవాత్సల్య కాంతాభావములు నాల్గు నిమి డియున్నవి. ఆకారణముచేతనే యిది సర్వో త్తమమైనది. కాంత తన కాంతునకు దాసు రాలివలెను, మిత్రునివలెను, మాతవలెను, విలాసవతివలెను నుపయోగపడునుగదా.

యశోదాభావమున ననగా వాత్సల్యరస మున వల్లభాచార్యమతస్థులు బాలగోపాలుని బూజింతురు. ఆంధ్రుడగు శ్రీ వల్లభాచా ర్యుడే యీమతప్రబోధకుడు. ఈయన భారత వర్షమంతట పర్యటనముచేసి శిష్యబృందమును సంపాదించెను. ఆయన తన తుదిరోజులలో వాత్సల్యప్రేమ కాధిక్య మొసగి రచించిన భాగవతవ్యాఖ్యానమున కామోదమును శ్రీ చైతన్య స్వాములనుండి సంపాదింపబూని నీలా చలము వచ్చెను. అక్కడ శ్రీ చైతన్యునితో చర్చించి శ్రీ వల్లభుడు తన పూర్వాభిప్రాయ ములను మార్చుకొని కాంతాప్రేమ సర్వోత్తమ మైనదని యంగీకరించెను. ఆయన తన శిష్యులతో తన యభిప్రాయములలో గల్గిన మార్పును జెప్పకపూర్వమే నందనందనుని సాన్నిధ్యమును జేరుటచేత వల్లభాచార్యమత ములో మార్పు కలిగినది కాదు. అంతమంది గోపికలు శ్రీ నందనందనుని భజించినను, ఆయనతో రాసలీలలు నెఱపినను భగవంతుని సంపూర్ణముగ సంతృప్తి పఱచ నేరక పోయిరి గాని రాధ యాయన ప్రేమపిపాసను శాంతిం పజేయగలిగెననియు, నందుల కామెయొక్క పరాకాష్ఠను బొందిన నిష్కామప్రేమయే కారణమనియు వైష్ణవుల విశ్వాసము. నిష్కామ ప్రేమకే పరకీయప్రేమయని కూడ పేరు గలదు. భార్యాభర్తలొండొరులు ప్రేమించు కొందురు. అయినను పరస్పరలాభముల నాశించి వారు ప్రేమించుకొనుచున్నారు. అట్టి ప్రేమ సహేతుకప్రేమ, లేక స్వకయప్రేమయని చెప్పబడును. రాధకు స్వార్థమనునది లేదు. ఆమె స్త్రీపురుషభేదము నెఱుగకుండ, శ్రీ నందనందనునినుండి యేమియు నపేక్షింపకుండ నాయనను ప్రేమించినది. భర్తనుండి భార్య యపేక్షించు సౌఖ్యము లేమియు రాధ యపే క్షించియుండలేదు.

వైష్ణవులలో బహుళవ్యాప్తి నొందిన గీత మొకటి గలదు. శ్రీకృష్ణుని గొనితెండని చెలికత్తెల బంపు సందర్భమున వారితో నా గీతమును రాధ చెప్పినది. దానిభావ మిది: "ఒండొరులను చూచుకొన్నంత నే ప్రేమగలిగినది. ఆప్రేమ నానాట వర్ధిల్లుచున్నది; తుది సీమ గానవగుటలేదు. స్త్రీపురుషులు పరస్పరము ప్రేమించుకొందురని జనులందురు. నేనందుకు భిన్నమైనదానిని. ఆయన పురుషుడని గాని, నేను స్త్రీననిగాని జ్ఞానమే నాకు లేకుండెను. సృష్టిలో స్త్రీపురుష భేద మున్నదనియే నే నెఱుగను. నాకు కృష్ణునియందు గలప్రేమ కేమని పేరిడవలెనో తెలియకున్నది."

శ్రీకృష్ణుని సౌఖ్యమేగదా రాధకు గావలసినది. ఆమెకు స్వార్థమనునది లేదు గదా! ఆయననుండి ప్రతిఫల మామె యపేక్షించినది లేదు. అయినను ఆమెమనము ఆయనను నిమిషమైనను విడిచియుండెడిది కాదు. సేవకు లొకసారి శ్రీ కృష్ణుని మధుర నుండి బృందావనము కొనితెత్తుమనినప్పుడు రాధ యిట్లన్నది: "ఆయనమెడ బాటు నాకు దుస్సహముగ నున్న విషయము యథార్థమే గాని స్వర్ణసింహాసనమున నుండి మహారాజ భోగముల ననుభవించుచుండిన యాయనను నీయడవికి గొనివచ్చుట స్వార్థపరత్వ మగును గనుక వలదు."

చెలికత్తెలు శ్రీకృష్ణుని బంధించితెత్తుమన్నపు డొకసారి రాధ విస్మయముతో నిట్లన్నది: "బంధించి తెచ్చుటలో విశేషమేమున్నది? నే నాయనను బంధించుదాననుగాను; నాకై వినియోగించుకొనుదాననుగాను. స్వార్థపరుల మధ్య నాయనకు సౌఖ్యము లభింపనేరదు. ఆయనను స్వార్థరహితప్రేమ, అనగా నిష్కామప్రేమ రంజింపజేయును. నిష్కామప్రేమపరుల నన్వేషించుకొనుచు విచ్చేసి ఆయన వారిమధ్య సుఖించును." నిష్కామప్రేమకు రాధ యాదర్శస్వరూపిణికాదని యెవ్వరనగలరు?

భగవంతుడనగా పురుషప్రకృతుల సమ్మేళన మనియు, నందు రాధ ప్రకృత్యంశ మనియు వైష్ణవులు చెప్పెదరు. భగవంతుడగు శ్రీకృష్ణుని భక్తులు నిష్కామప్రేమభక్తితో రాధాభావమున భజించు టుత్తమమని వైష్ణవులు చెప్పెదరు. రాధ ప్రేమవంటిది జీవులకు గల్గుట మహాభాగ్యమనియు, నెల్లరు బడయ సాధ్యమైనది కాదనియు వైష్ణవు లొప్పుకొందురు. ఐనను సర్వజీవులు రాధాకృష్ణ లీలా రసమును గ్రోలి ప్రేమరూప పంచమ పురుషార్థమును బొంద సాధ్యమని వైష్ణవుల విశ్వాసము.

---

# ఆత్మహత్య

"ప్రసాద్"

కడచిన రెండు సంవత్సరములందు జరిగినన్ని ఆత్మహత్యలు ఈమధ్యకాలమున భారతదేశమునందు, మరేదేశమందుగాని జరిగియుండలేదు. కాని కొందరు ఆత్మహత్య చేసికొనుటయందు కృతకృత్యులు కాలేదు. దీనికి అనేక కారణము లుండును. ఆత్మహత్య చేసికొనెడి సందర్భమున కొందరికి మనోదౌర్బల్యము గలుగును. ఏబండకత్తిపీట పెట్టియో గొంతుకకోసికొనబోవ అది తెగకపోవుట సాధారణముగా తటస్థించును. మందు మ్రింగిన అది సరిగా పనిచేయకపోవచ్చును. ఇట్టివే మరి అనేక కారణము లుండును. ఏది యెట్లున్నను ఈ సంవత్సరముమాత్రము ఆత్మహత్యలు విరివిగా జరుగుచున్నవి.

సాధారణముగా ఆత్మహత్యకు మూడు కారణములుండును: బీదతనము, మనశ్శాంతి లేకపోవుట, మనోవైకల్యము. ఈ మూడింటి యందు ఏదో ఒకటి సర్వసాధారణముగా ఆత్మహత్యకు కారణ మగుచున్నది. కాని ఎక్కువగా బీదతనమువలననే. ఆత్మహత్యలు భాగ్యవంతులయందుకన్న బీదవారియందే ఎక్కువ జరుగుచున్నవి. ముఖ్యముగా భారత దేశమునందు ఆత్మహత్య ఒనరించుకొనెడి వారియందు ఎక్కువమంది బీదవారు.

కాని వ్యక్తికి ఆత్మహత్య చేసికొనుటకు హక్కులేదు. సర్వసాధారణముగా "నాప్రాణములమీద ఒకరిపెత్తన మేమిటి నేనాత్మహత్య చేసికొనిన ఒరుల కేమి హాని?" అని అనుట సహజము. కాని చట్టము దాని నొప్పుకొనదు. ఎవరయినను ఆత్మహత్య చేసికొన ప్రయత్నించినట్లు తెలిసిన ప్రభుత్వము వారిని శిక్షించును. దానికి కారణము వ్యక్తి సంఘమునందు ఒకభాగ మగుట. కొందరు వ్యక్తులు గలిసిన గాని ఒకసంఘము కాదు. వ్యక్తి జన్మించినతోడనే సంఘమునకు చెంది సంఘచట్టములకు బద్ధుడై యుండవలెను. స్వవిషయమునందు గాని, పరులవిషయమందు గాని తన ఇచ్చవచ్చినట్లు ప్రవర్తింపగూడదు. సంఘజీవన మనుటతోడనే వ్యక్తియొక్క స్వాతంత్ర్యము కుదింపబడును. అదియునుగాక ప్రతివ్యక్తియు ఆత్మహత్య గావించుకొనిన సంఘము కృశించిపోవును. సంఘము వ్యక్తుల అన్యోన్యతమీద ఆధారపడియున్నది. అందువలన ఆత్మహత్య నేరముగా పరిగణింపబడుచున్నది.

ఇది బాగుగనే యున్నది. ఒక విషయము గమనింపవలయును. ఒకవ్యక్తి బీదవాడు; తినుటకేమియు దొరకదు. వానికి జీవితము దుర్భరముగాదోచును.ఆత్మహత్యకు ప్రయ

# శృంగారనాయికలు

(ప్రాచీన చిత్రములు)



౬. విరహోత్కంఠిత ౨



౫. విరహోత్కంఠిత ౧

త్నింపవచ్చును. అటువంటిసమయమున అతని శిక్షించుటయం దర్థము లేదు. శిక్ష అతని జీవితమును ఏమాత్రము సంతోషకరముగా జేయదు. శిక్ష అతనికి ఉద్యోగము నివ్వదు.

ఆర్థికదారిద్ర్యము తగ్గిన ఆత్మహత్యలు చాలవరకు తగ్గును. కాబట్టి బీదతనమువలన ఆత్మహత్య కావించుకొన ప్రయత్నించెడి వారిని శిక్షింపక వారికి జీవనోపాధి కల్పించుట ప్రభుత్వపు విధియై ఉన్నది.

ఇది బీదవానివిషయమున. మనశ్శాంతి లేకను కూడ ఆత్మహత్య గావించుకొనెడి వారు గలరు. కొద్దికాలముక్రిందట లాహోరు నందు ఒక పంటవాడు జీవితమునందు ఆనందము లేదని ఆత్మహత్య గావించుకొనెను. ఒకవేళ కృతకృత్యుడు కానియెడల అతనిని శిక్షించినను లాభముండదు. వానికి జీవించిన కొలది జీవితము దుర్భరముగా నుండునే గాని శిక్షమూలమున అతనికి జీవితమునందు ఆనందముండదు. భార్యబిడ్డ లున్నవారి గతి యేమి కావలయును? అని ప్రశ్నించుట సహజము. మానవుడు స్వభావసిద్ధముగా స్వార్థపరుడు. తనకు ఉపయోగములేనిదానియందు జోక్యము కల్గించుకొనడు. భార్యబిడ్డలు తనవారయినను తనక్షేమము తరువాతనే వారి క్షేమము. వారివలన సుఖము, ఆనందము లేనపుడు వారివిషయమైకూడ బాధ్యత వహింపజాలడు.

---

## నిశ

చావలి బంగారమ్మ

నిన్ను బోలిన దాన నంచును
నివ్వెరపడిపోయినావ?
చివ్వునను తెల్లారురోజులు
రివ్వునర్క రావ?

ఏది యోచన చేయుచుంటివె
ఎవరి నారాధించుచుంటివె
ఏదె నీలక్ష్యంబు జెప్పుము
సాదరంబుగను?

ఎంతసే పిటు వేచియుండెదె?
వింతదోచెను నిన్ను జూడగ
చింతతోడనె నాకు తోడై
చెంత నీ వుంటన్.

---








# భారతదేశపు తొలిచిత్తరువులు

తలిశెట్టి రామారావు, బి. ఏ., బి. యల్.,

భారతీయ చిత్రకళ యేనాడు ప్రారంభమయ్యెనో, తన ప్రత్యేకరచనావిధానము నెప్పుడు పొందెనో చెప్పుట కింకను ప్రమాణములు లభించలేదు. కాని, యిది చాలా ప్రాచీనమైనదనియు, తక్కిన దేశముల రచనతోనో, లేక యంతకుపూర్వమో ప్రారంభమైనదనియు చెప్పుట కనేకములగు నిదర్శనములు కలవు. ఇటుల చెప్పుట కిదివరకు వాఙ్మయముపైని, యూహలపైని యాధారపడవలసివచ్చెనుకాని యిటీవల భారతదేశమునందు చాలచోట్ల అతిప్రాచీనములైన చిత్రములు కానవచ్చుటచే ఈ విషయమై సంశయములు చాలవరకు నివృత్తియైనవి.

ఇప్పటికి లభించినట్టి చిత్రములు వ్రాయబడిన కాలమున మానవులు గృహములను నిర్మించుకొనుచుండిరో లేదో తెలియదు. చిత్రములను వ్రాయజాలినంతటి నాగరికులు గృహములను నిర్మించుకొని యలంకరించుకొనుచుండిరని చెప్పవచ్చును. గృహము లుండినను వాటితో వాటియందలి చిత్తరువులన్నియు నశించినవి. గుహలలోపల వ్రాయబడినవియు, రాళ్లపైన చెక్కబడినవియు మాత్ర మిప్పటికిని నిలిచియుండి సనాతనమానవుల రచనాదివిషయములను తెలిసికొనుటకు కొంత యాధారము లైనవి.

చిత్రరచన మొదట ప్రవీణతాఫలితము కాదనియు, మతము, హక్కులు, బహుశాభాష యనుభావములు పుట్టకపూర్వపుదనియు, విజ్ఞానము, మానవుని జీవయాత్ర లీః శతో ప్రారంభమైనవనియు పురాతనచిత్రముల ననేకములను బరిశీలించిన హెర్బెర్టుకున్హా (Herbert Kunhu) గారు వ్రాసియున్నారు. ఇది సత్యము.

తొలియుగములందు వ్రాయబడిన చిత్రములెట్టివి? వాటియుద్దేశము లేవి? అను ప్రశ్నలకు సమాధానము చెప్పుట దుర్లభము. ఈ చిత్రములలో ననేకములు పూర్వుల పూజలకు సంబంధించినవి కావచ్చును. అటుల కానియెడల ఆరచనయొక్క యర్థము సన్యముగ సమర్థింపజాలము. కొన్ని స్థలములందు స్త్రీలను, పురుషులను అర్ధవలయాకారముగను, జంతువులను పూర్ణవలయాకారముగను, త్రోవలను చుక్కలతోను సూచనామాత్రముగ వ్రాయుచుండిరి. సింగన్పూరుచిత్రములందు కొందరు మనుష్యులు నిచ్చెనలరూపమున వ్రాయబడిరి. చాలచోట్లగల చిత్రముల కర్థము చెప్పుటయే కష్టము. వారి మంత్ర, పూజాదివిధానములగూర్చి మనకు తెలిసినయెడల వీటి యుద్దేశములును, తద్ద్వారా యా యాదిమవాసులగూర్చి యనేకములగు నూతనవిషయములును తెలియగలవు. వ్రేళ్లులేని చేతులు పూజను, బల్లెములతో గొట్టబడిన జంతువులు వేటయొక్కయు, అస్త్రములయొక్కయు ఆరాధనమును, సంగమించు స్త్రీలును, రహస్యాంగములును జనాౢద్యంగములను సూచించుచున్నవని యనుకొనవచ్చును. ఇట్టివ్యక్తీకరణ మనాదినుండియు మానవుల కలవడినటుల కానవగును.

ఇట్టిచిత్రములేకాక ప్రకృతియందు గనబడునటుల జంతువులను, మనుష్యులను వ్రాయుటయు నాకాలమున గలదు. ఈచిత్రములన్నియు నెంతయో సహజములుగ సుందరములుగ నున్నవి. ఆకాలమున క్రూరమృగముల మధ్యను, అడవులలోను మనుష్యులు నివసించుచుండిరి. కనుక వారికి జంతువులయొక్క రూపములను, నైజగుణములను బాగుగ దెలిసికొనియుండుట మిగుల యవసరమై యుండెను. ఇందు నిపుణులుకానియెడల రాత్రులందు బహిరంగముగను, పగలు తుప్పలచాటునను, దూరమునను తిరుగాడు వన్యమృగముల జాడలను కనిపెట్టి, చూచి, పోల్చుకొనుటయు, ప్రాణసంరక్షణము చేసుకొనుటయు నలవికాని పనులగును. ఈకారణములవలన నాటిచిత్రములందు జంతువుల యాకారములు చాలచక్కగ వ్రాయబడియున్నవి. ఈవిషయమును హిందూదేశముననేకాక స్పెయినుదేశమునను కానవచ్చిన సనాతన చిత్రములు స్పష్టము చేయుచున్నవి.



చిత్రము ౧

మానవులు పొట్టపోసుకొనుటకు వేటపై ఆధారపడి యుండిరి. కాన నాటిచిత్రములందనేకములు వేటకును, దానికి సంబంధించిన పూజలకును చెందినవై యున్నవి. వేటకు సన్నాహమగునటుల, జంతువులను వెంబడించుచున్నటుల, క్రూరమృగములను జూచి పలాయితులగునటుల, చచ్చిన మృగముచుట్టును మనుష్యులు నిలువబడియున్నటుల నీచిత్రములు కలవు. చిత్రరచన యెటులున్నను వీటియందు భావప్రదర్శనము, జీవరాసుల "కదలిక" బాగుగ కానవచ్చును.



చిత్రము ౨

మనుష్యులు సంఘములుగ జేరి, గ్రామముల నేర్పరచుకొని, క్రూరమృగముల భయమునుండి తప్పించుకొని, సేద్యమువలన జీవనము గడపునంతటి నాగరికులైనప్పటికి వీరి జంతుపరిచయముయొక్క సూక్ష్మత తగ్గియుండవచ్చును. చిత్రరచనయందుకూడ క్రొత్త భావము లుదయించి, వ్రాయువిషయములును పెరిగియుండును. ఈ రెండవయుగపు చిత్రములందు నూతన విషయము లనేకములు కానవచ్చుచున్నను తొలిచిత్తరువులందు కల రచనయొక్క సొగసు లేదు.

కానవచ్చిన సనాతనచిత్రము లేనాటివో నిర్ణయముచేయుట కష్టమైన విషయము. ఐరోపాదేశమునందలి పురాతనపాషాణయుగము (Paleolithic Age) నాటి చిత్తరువులనుగూర్చి వ్రాయుచు బర్కిట్టు (Burkitt) గారిటుల నిర్ణయముచేయుటకు కొన్ని మార్గములను సూచించిరి:

౧. ఏకాలము నాటివో యని మనము నిర్ణయింపగల పురాతనమానవుని పాషాణపరికరములు లభించు భూమిపొరలక్రింద భూస్థాపితములైన చిత్తరువులు, శిల్పములు కానవచ్చినయెడల నవి యాపాషాణపరికరములకు పూర్వపువని నిర్ణయము చేయవచ్చును.

౨. చిత్రములుకల గుహల ద్వారములు చిరకాలముక్రిందట కప్పబడి పోయినయెడల నందు లభించు పాషాణపరికరములనుబట్టి యాచిత్తరువు లేనాటివో కనుగొనవచ్చును.



చిత్రము 3

3. చిత్తరువులుకల స్థలములం దిప్పుడు కానరానట్టియు, వాతావరణమునందు మార్పులు కలుగుటచే నాస్థలములందు నివసింపజాలనట్టియు మృగముల యెముకలు లభించినయెడల నట్టివి ఏయుగమున నచ్చట నుండుట సంభవమో కనుగొని తద్ద్వారా యాచిత్తరువుల కాలమును నిర్ణయింపవచ్చును.

౪. ఎముకలు మొదలగువాటిపై చెక్కబడిన చిత్తరువులు లభించినయెడల నట్టివి ఏకాలమునందు వాడుకయందుండెనో, యని లభించు భూమిపొరలేకలమునాటివో కనుగొని యాచిత్రముల కాలమును నిర్ణయింపవచ్చును.

ఈ పరిస్థితులన్నియు భారతదేశమునందున్నను, కానవచ్చిన చిత్తరువులచెంత విశేషముగ నిట్టిచిహ్నములు కానరాకపోవుటచే భూతత్త్వజ్ఞులు ఊహలపై నాధారపడవలసివచ్చెను. ఈ శాస్త్రపరిశోధనయు మన దేశమున నింకను ప్రారంభదశ నుండుటవలన ఇది నిజ, మిది కల్లయని చెప్పుట కలవికాకున్నది.

కాని వైఖరినిబట్టియు, శైలినిబట్టియు లభించిన చిత్తరువులు బహుపురాతనములనిమాత్రము చెప్పగలము. ఇప్పటివరకు మనదేశమున కానవచ్చిన సనాతనచిత్రములలో సింగన్పూరువద్ద నున్నవి ముఖ్యమైనవి.

*సింగన్పూరుగ్రామము మధ్యపరగణాలలో రాయఘరు సంస్థానమున బెంగాలునాగపురము రైల్వేవారి నహారుపాలీయను స్టేషనుదగ్గర కలదు. చిత్తరువులు కల గుహ యీగ్రామముదగ్గర నున్నది. కనుక వీటికి సింగన్పూరుచిత్తరువులని పేరుకలిగెను.

బెంగాలు నాగపురము రైల్వేయుద్యోగియగు సి. డబల్యూ. ఏండర్సనుగారీచిత్రములను మొదట ౧౯౧౦-వ సంవత్సరమున జూచి, పండితులు కనుక వాటి విలువను గ్రహించిరి. మరియొకమారు వీ రాగుహలకు బోయి, చిత్రములను బరిశీలించి, విపులముగ వర్ణించి ఇండియా మ్యూజియమువారికి తెలియజేసిరి. ౧౯౧౩-వ సంవత్సరమున నవి యేనాటివో కనుగొనుటకు ప్రయత్నములు జరిగెనుకాని యప్పటి కాకందరములు తేనె



చిత్రము ౪

* See "Prehistoric India" by Panchanan Mitra, Calcutta University Publication. Most of the material and all the Illustrations are taken from this work.

టీగలకు నివాసమయ్యెను. అచ్చటికి పోయిన పండితులను, వారి యనుచరులను నాయీగలు వెంటదరుమగా కొండపైనుండి యెటులో సమప్రదేశమును జేరుకొని, సుమారు రెండుమైళ్లదూరమున నున్న స్టేషనును చేరువరకు తిరిగిచూడక, తమ పిక్కబలమునంతను జూపి, డాక్టర్లు వచ్చేవరకు ప్లాటుఫారముమీద మూలుగుచు ఉష్ణముతోను, బాధతోను దొర్లవలసివచ్చెను. తరువాత ఏండర్సనుగారును, సుప్రసిద్ధహైందవచిత్రకళావిమర్శకులును, చిత్రకారులును అను పెర్సీ,బ్రౌనుగారును కలసి యాగుహలకు పోయి, పరిశీలించి బెంగాలుఏషియాటికు సొసయిటీవారికి రిపోర్టు నర్పించిరి. పిమ్మట కలకత్తా విశ్వవిద్యాలయమువారిచే నియమితులైే పాట్నా మ్యూజియము అధికారులగు రాయసాహెబ్ ఘోషుగారును, పంచాననమిత్రాగారును వెళ్లి, చిత్రములను పరిశీలించి, కొన్ని క్రొత్తవిషయములను సంగ్రహించిరి.



చిత్రము ౫

సింగన్పూరుప్రాంతములందనేకములగు గుహలు కలవు. దగ్గరనే చక్కని జలము లభించుచున్నది కను కను, మరికొన్ని కారణములవలనను ఇవి యొకానొకప్పుడు జనవాసములై యుండినటుల కానవచ్చును. పూర్వమీకందరములు "మందిరము"లుగ నుండెననియు, మనుష్యులచ్చట నివసించుచుండిరనియు, నొకవ్యక్తి యశ్వారూఢుడై నేలవడి యాప్రాంతమున నున్న వనమునందు మాయమగుచుండుననియు నచ్చటి ప్రజలు చెప్పుకొనుచుందురు. అజంతకందరమువలె నివియు నైౠతిన (౬౦౦ అడుగులు) ప్రదేశమున గలవు.

చిత్రములు కల గుహ పూర్వము పెద్దదిగ నుండెను. ఏకాలముననో ముందుభాగమంతయు పడిపోవుటచే లోని కెవరును చొరుటకు వీలులేనందున లోపలి యమూల్యములైన చిత్తరువులు చెడక మనకు లభించుట కలిగెను. ఈమధ్య మరికొంతభాగము శిథిలమగుటచే చిత్తరువులు పైకి కనబడుచున్నవి.

†ఈ చిత్తరువులు రెండువిధములుగ నున్నవి: కొన్ని కుంచెలతోను, చక్కనిరంగులతోను దృఢముగ వ్రాయబడినవి. ఇవి తొలుత వ్రాయబడినటుల కానవచ్చును. పిమ్మట వ్రాయబడినవి రచనయందు మోటుగ నున్నవి.

కొన్నిచిత్తరువు లెత్తయినట్టియు, వ్రాయుటకు సాధారణముగ నలవికానట్టియు స్థలమునందు గలవు. వీటి నిచ్చట, యెటుల, నెందులకువ్రాసిరో తెలియదు. పురాతనచిత్రములలో ననేకము లిట్టి చోట్లనే వ్రాయబడియుండుటచే దీని కేదో యర్థము, నుపయోగము నుండవలెను. రచనయంతయు చాలినంత వెలుతురులేనిస్థలమున జరిగెను ఆచిత్రకారులు నూనెదీపములను వాడియుందురు.

చిత్రములను వ్రాయుటకు ముందు రాతిపై మన్నునుకాని, సున్నమునుకాని పూసినటుల కానరాదు. రాయి నునుపుగ నున్నచోట్ల చిత్రములు విశేషముగ కలవు. అచ్చటచ్చట ఛాయారచన యున్నటుల కలదు కాని యది స్ఫుటముగ కానవచ్చుటలేదు. చిత్తరువుల యొక్క యంచులందు రంగు తేలికగ నున్నదికాని యటుల చిత్రకారుడే రచించెనో, లేక యచ్చటి రంగు పలుచగనుండుటచే రాతిలోని కింకెనో తెలియుటలేదు.

† Notes on the Prehistoric Cave Paintings at Raigarh by Mr. Percy Brown, A. R. C. A.

రెండవయూహ నిజముకావచ్చును. ఏ రెట్టికుంచెలను వాడిరో తెలియుటలేదు. వర్ణలేపనవిధానమును బరిశీలించి చూచినయెడల నేనో మోటుకుంచె యాధారమైనటుల కనబడును.



చిత్రము ౨

ఈ చిత్తరువులను (౧) వేటచిత్తరువులు, (౨) మనుష్యచిత్రములు, (౩) భాషాచిత్రములు, (౪) జంతువుల చిత్రములు అని నాలుగువిధముల భాగింపవచ్చును.

(౧) ఈవేట చిత్రములందు మనుష్యులు కొండపోతులు, ఏనుగులు మొదలగు జంతువులను వెంబడించునటుల కలవు. ఒక చిత్తరువునందు (౧-వ చిత్రము) ఎనుపోతొక మనుష్యుని తన కొమ్ములతో విసరునటుల చక్కగ కలదు. తక్కిన మనుష్యు లాజంతువును కొట్టుచున్నటులను, ఆశ్చర్యవిషాదములను జూపునటులను కలదు. ఈ చిత్తరువుచెంతనే మరియొక చిత్తరువు పంది వేటను తెలియజేయుచున్నది. దూరమున నిచ్చెనవలెనున్న వ్యక్తి యొకకఱ్ఱనో, బల్లెమునో పట్టుకొని యున్నటుల కలదు. (౨-వ చిత్రము). దీనియర్థమేమియో తెలియుటలేదు. బహుశా వేటకు సంబంధించిన పూజను, మంత్రములను సూచింపవచ్చును. ఒక చోట త్రిశూలాకారము కలదు. అచ్చటి ప్రజ లిప్పటికిని వాడుచున్న "పూను" నిది పోలియున్నదట. ఈశ్వరుని యాయుధమైన త్రిశూల మనాదినుండియు మన దేశమున నుపయోగపడుచున్నటుల కానవచ్చును. ఆ దేశము లిప్పటికిని క్రూరమృగముల కాకరమై యున్నవి కనుకను, ఆగుహలు బహుశా పూజామందిరములై యుండెనని కనుకను ఇట్టి వేటచిత్రముల నాచోట్న



చిత్రము ౪

వ్రాసినటుల నున్నది.

(౨) మనుష్యుల యాకారములందు వివరములు కానరావుకాని యాయంగవిన్యాసమునందు భావము బాగుగ వ్యక్తమగుచున్నది. దీనిని వేటచిత్రములందు చూడనగును. నిచ్చెన లాకారముగ వ్రాయబడిన మనుష్యులేకాక వింతగ వ్రాయబడినవారు నిచ్చట గలరు (౩-వ చిత్రము). ముసుగులను వేసికొనునటుల కొందరు కలరు (౪-వ చిత్రము). వివరములను వ్రాయక ఛాయామాత్రముగ (Silhoutte) వ్రాసిన వస్త్రధారులు నిటుల కానవచ్చెదరు. ముగ్గులవలె వ్రాయబడినవారి యర్థమును తెలియుటలేదు. ఒకచోట నిరువు రొకరితో నొకరు కలసియున్నటుల గలదు. వీరి చేతులు, కాళ్లు సహజముగ లేకపోవుటయేకాక వలయముల భాగములవలె వింతగ నున్నవి (౫-వ చిత్రము).

(౩) భాషాచిత్రము లక్షరములకుబదులు వాడుకయందుండుట యొకయాజిప్టునందేకాక, పూర్వమన్ని దేశములందును సామాన్యమై యుండినటుల యిచ్చటి చిత్రములవలన తెలియుచున్నది. ఇట్టి చిత్రములే రానురాను భాషోచ్చారణమునకు తగినటుల మారి, యిప్పటి

యక్షరములుగ పరివర్తితములై యుండవచ్చును. అన్ని దేశముల భాషలకు నాధారభూతములైన యక్షరములు భారతదేశమునందే పుట్టియుండవచ్చునని మహెంజొ దారొ మొదలగుస్థలములందు నూతనముగ కానవచ్చిన యక్షరములను బాగుగ బరిశీలించిన పండితులలో కొందరనుచున్నారు. సింగన్పూరునందు లభించిన భాషా చిత్రము లీవాదమును తప్పక బలపరుపగలవు. ఒకచిత్రమున వంకరగనున్న గీతలు కలవు. ఇట్టి ఈజిప్టుచిత్తరువులు ప్రవహించు జలమును సూచించునటుల పండితులు నిర్ణయించిరి కాన దీని యర్థము నిట్టిదియే యైయుండవచ్చును. మరియొకచోట వేలాడు జడలను బోలు వంకర గీతలు కలవు (౬-వ చిత్రము). ఇవి జలపాతమై యుండును. ఇట్టి జలపాత మాప్రాంతములందు కలదట! పక్షియొక్క ముక్కు, ఒకమనుష్యుడు, జంతువు (?), పలవలనుపోలు రెండు వింతరేఖలు నొకచోట వరుసగ గలవు (౭-వ చిత్రము). ఇది భాషాచిత్రమగుట నిస్సంశయము. దీని యర్థమును తెలిసికొనినయెడల యాగుహలను గూర్చియు, తక్కిన చిత్రములను గూర్చియు, తద్ద్వారా యప్పటి ప్రజలనుగూర్చియు అనేకములగు విషయములు తెలియవచ్చును. అలంకారార్థము వ్రాయబడిన చిత్తరువులు కొన్ని కలవు. వీటికి నేదియో యర్థ ముండవచ్చును. ఇట్టిచిత్రములు పూర్వకాలపు ఈజిప్టుకలశములపై కానవచ్చును. మన పురాతనపాత్రలపైని, ఇప్పటికిని వివాహములలో వాడుకయందున్న "అరివేణి" కుండలపైని నిట్టిచిత్రములే యుండును. కొన్నిచిత్రముల యర్థము నూహింపజాచుట యిప్పుడు వ్యర్థప్రయాసముగ దోచుచున్నది. కిరణములవంటి రేఖలతో నర్ధవలయాకారముగ నున్న చిత్ర మొకటి కలదు (౮-వ చిత్రము). చిత్రకారుడు వలయరేఖను కలపియే వ్రాసియుండును కాని యిప్పుడు విడిపోయినటుల నున్నది. కాలగతిని శిలయొక్క పొరలు కదలినవేమో! ఇట్టిమార్పుల జరిగెనో, జరుగుట సంభవమైనయెడల నెంతకాలము పట్టునో భూతత్త్వజ్ఞులు నిర్ణయింపగలిగినయెడల గుహల కాలమును నిర్ణయించుట కవకాశము కలిగిన గలుగవచ్చును.



చిత్రము ౯

(౪) జంతువుల చిత్రములు చక్కగ నున్నవి. ఇందు బల్లులు సొగసుగను, సహజముగను చిత్రితములైనవి (౯-వ చిత్రము). మనుష్యుల యాకారములందు వలెనే జంతువుల యాకారములందును భావము కనబడుచున్నది (౧౦-వ చిత్రము). ఇప్పుడాస్ట్రేలియాయందుమాత్రము కానవచ్చు కంగారూ (Kangaroo) అనబడు మృగమును బోలున దీచిత్రములందు కలదని కొందరి యభిప్రాయము (౧౧-వ చిత్రము). ఇట్టి చిత్తరువులు స్పెయినునందును కాన



చిత్రము ౮

వచ్చుటచే నీ జంతువులు పూర్వ మన్ని దేశములందు నుండిన నుండవచ్చును. ఇవి యెప్పు డీప్రాంతములందు నివసించుచుండినవో కనుగొనగలిగినయెడల నీచిత్రముల కాలమును నిర్ణయముచేయుట సులభమగును. కాని యా ప్రక్క నొకకొయ్యనంటేదికలదు. కాన దానికి కట్టబడిన సాధారణమృగమే యటుల కూర్చొనియున్న దేమో! జంతువుయొక్క కొన్ని భాగములు చెరగిపోయినటుల కట్టినతాడును చెరగియుండవచ్చును.

ఒకచోట వింతయైన చిత్తరువు కలదు (౧౨-వ చిత్రము). నలుపుగ నున్నది మరణించి, రూపుచెడిన మృగముకావచ్చును. తక్కిన చిత్రభాగముల కర్థము తెలియుటలేదు. పూర్తిగ వ్రాయు నుద్దేశముతో ప్రారంభించి యేకారణమువలననో చిత్రకారుడు విడచిపెట్టినటుల కానవచ్చుచున్నది.

ఇట్టి చిత్రము లనేకములు సింగన్పూరునందు కలవు కాని యెత్తిచూపినవి చాలునని తక్కినవాటి విషయమై వ్రాయలేదు.



చిత్రము ౧౦

ఈ చిత్తరువులందు రచనాప్రవీణత విశేషముగ లేదుకాని, స్పెయినునందు కోసులు (Cogul) ప్రాంతములందు కానవచ్చిన చిత్రముల నివి పోలియుండుటవలనను, భారతదేశములో నింతవరకు కానవచ్చిన చిత్రములలో నతిసనాతనము లగుటవలనను చిత్రకళావిమర్శకులకును, చరిత్రకారులకును అమూల్యము లైనవి.

ఈ గుహనద్ద లభించిన పురాతనపాషాణపరికరములవలన నీచిత్తరువులు బహుశా క్రీ. పూ. ౧౫,౦౦౦ సంవత్సరములనాటివని చెప్పుటకు వీలగుచున్నది. చిత్రములు కలచోటి రాతిముక్కలు కొన్ని సంగ్రహములైనవి. వీటిని, తక్కిన విషయములను బాగుగ బరిశీలించినయెడల నీచిత్తరువుల కాలమును నిర్ణయింపవచ్చునను యాశకలదు.



చిత్రము ౧౧

బళ్లారిజిల్లాయందలి కాపుగల్లువద్ద హెూన్. నాక్సు గారికి కొన్ని పురాతనములైన చిత్తరువులు కానవచ్చినవి. ఇవి బహుశా క్రీ. పూ. ౧౦,౦౦౦ మొదలు ౨౦,౦౦౦ సంవత్సరములనాటివై యుండవచ్చును. ఒకచోటమియందు మనుష్యాకారములును, ఒకచోట రెండేనుగుల చిత్రములును, వేరొకచోట నొకపక్షియు, కొమ్ములపోతును, మరియొకచోట రెండు పెద్దకొమ్ముల పోతులును కలవు. ఒకపోతునుజంపుట కాయుధధారులైపోయెడి యిరువురు మనుష్యులు కల వేటచిత్రము కలదు.

వైనాడుచెంత నున్న ఎడకల్లుగుహయందు కానవచ్చిన చిత్తరువులను కొన్నిటిని ఫాసెట్టు (Fawcett) గారు వర్ణించివ్రాసిరి. ఇచ్చట బహుపురాతనములైనట్టి చిహ్నములతోబాటు పిమ్మట చాలకాలమునకు తరువాత చెక్కబడిన శిలాశాసనములు లభించుటచే నీగుహ చాలకాలమునుండియు ప్రాముఖ్యమును వహించి యుండినటుల కానవచ్చును. ఇచ్చటి చిత్రరచనావిధాన

మును, లభించిన పాషాణపరికరములను బరిశీలించి ఈ చిత్రములు బహుశా క్రీ. పూ. ౧౦,౦౦౦ సంవత్సరముల నాటివని చెప్పుటకు వీలగుచున్నది. కొన్ని జంతువుల యొక్కయు, మనుష్యులయొక్కయు చిత్రము లిచ్చట గలవు. ఇవి యొకదానికొకటి సమీపమున నుండుటచే అర్థమును తెలిసికొనుటకు జాగరూకతతో పరిశీలింప వలసియున్నది. మనుష్యులకు పాగాలు కలవు. స్వస్తిక మొదలగు చిత్రములును కలవు. కాన వీటిలో నన్నిచిత్రములును నొకేకాలమునాటివి కావని తోచుచున్నది.

సింగభూము జిల్లాయందు ఘటసీలప్రాంతమున రాతిపై రేఖాకారముగ మలచబడిన కొన్ని ప్రాచీన చిత్రములు కనబడెను (౧౩-వ చిత్రము). ఇవి యొక పెద్దరాతిపై గలవు. ఆరుగురుమనుష్యుల యాకారములును, వారికి సంబంధించిన పాత్రలు, పరికరములును ఈచిత్తరువులు రూపించుచున్నవి. కొన్ని పురాతన పాషాణపరికరము లిచ్చట లభించుటవలన నివి సుమారు ౧౦,౦౦౦ సంవత్సరములకు పూర్వపువని నిర్ణయింపవచ్చును. ఆస్ట్రేలియాయందు కానవచ్చిన సనాతన చిత్రముల నివి పోలియున్నవి.



చిత్రము ౧౨

మిర్జాపురమువద్ద కొన్ని పురాతనపరికరములతో లేళ్లను వేటాడునటుల చిత్రములు కనబడెను. లోహ్రి గుహవద్ద నిట్టిచిత్ర మొకటి కలదు. సోననదీతీరమున రాతిమీన కల బల్లెముతో జంతువు నొక మానవుడు పొడచునటుల గలదు. "ఘోరుమంగరు" గుహాయందొక ఖడ్గమృగము నారుగురు మనుష్యులు వేటాడునటుల గలదు. ఒకని నాజంతువు తన కొమ్ములతో మీదికి విసరివేయుచుండ, నొకడు వెనుకనుండియు, నిరువురు ముందునుండియు నామృగమును పొడుచునటుల నున్నది. ఈచిత్రమునుబోలు అడవిపందివేటచిత్తరువు బురుహూరుపరగణాయందలి రూపు అనుగ్రామముచెంత గలదు. విజయగడమువద్దనున్న "హరిణ హరణ" మన బడు గుహలో ఖడ్గమృగమువేటచిత్రము మరియొకటి కలదు. సరహత్, మాల్వా, కురియాకుండము, కరపాటియా మొదలగు గ్రామములదగ్గిర నిట్టిచిత్రములు కానవచ్చెను. వెదకిచూచినయెడల వింధ్యపర్వతములం దిట్టిచిత్తరువు లింక ననేకములు కానరాగలవట.



చిత్రము ౧౩

కనబడిన చిత్తరువుల ఛాయాపటములను దీసి, బాగుగ పరిశీలించి, భూతత్త్వము, దేశచరిత్రము, ఆర్కియాలజీ మొదలగు శాస్త్రము లర్పించెడి యాధారములవలన నాటి యర్థమును గ్రహించి, యాచుట్టుపట్ల దొరకు పాషాణపరికరములబట్టి వాటి కాలమును నిర్ణయింపవలసియున్నది. ఇప్పుడు భూతత్త్వజ్ఞులు, ఆర్కియాలజీవారు నిర్ణయించిన కాలమును హిందూదేశమున అనేకకారణములబట్టి వెనుకకు నెట్టవలసియుండును. ఈపనియంతయు జరిగినపిమ్మట హిందూదేశమునందు మానవుడు తక్కిన దేశముల సోదరులకంటె నాగరికతయందు వెనుకబడలేదనియు, ఆధ్యాత్మికపరివర్తనమునకు తోడ్పడు చిత్ర

కళ ననాదినుండియు నభ్యసించుచుండెననియు స్పష్టపడ గలదు.

భారతీయుల నాగరికత మొన్నటిదన్న వారి వాద మెంతటి నిస్సారమైనదో తెలుపుచు వేరొకచోట వ్రాసియుంటిని. పైని పేర్కొనిన శాస్త్రవిమర్శన పూర్తియైనపిమ్మట భారతీయ సనాతనత్వమును చాటుటకు చిత్రకళ యొక యాధారమగును. స్పెయినునందు లభించిన చిత్తరువులలో కొన్ని సుమారు ౫౦,౦౦౦ సంవత్సరములనాటివని పండితులు చెప్పుచున్నారు. మానవుని యాదిమవాసము దక్షిణహిందూదేశము, ఆస్ట్రేలియాలని చెప్పుటకు కొన్నియాధారములు కలవు కాన మనదేశమున లభించిన పురాతనచిత్రములలో కొన్ని ప్రపంచములో తొలిచిత్రములు కావలెనని నిర్ధారణ మగుటయు సంభవము.

---



దశాశ్వమేధఘట్టము-కాశీ

—సి. జి. జగన్నాథదాసు.

# బసవరాజు అప్పరాయని కత!

మున్నంగి—శర్మ

"కత సేయుట, కత సెప్పుట,
కత వ్రాయుట, కతయ నాటకం బాడుటయుఁగా,
కతయెఱుఁగుట యును వేఱే;
కతయ యగుట వేఱె; దైవగతి వింతగదా!"

అప్పరాయఁడు తాన నేఁడు కత యయినాఁడు! ఆర్వేలని యోగిచిన్నవాఁడు; ఆనవాయతిఁజూడఁ గన్నవాఁడు. నామరూపములఁ గొంత మోసినాఁడు; నలువదేండ్లు నట్యము చేసినాఁడు. మనుగడలోని మెలఁకువలకంటె మనసులోని మెలిక లెక్కుడు. తెన్నున దిన్నదనమున కంటెఁ దెలివునఁ గలిమి యెక్కుడు. ప్రొద్దుగానని పోకడ; పొదుపు దెలియని వెచ్చము. దవ్వు పఱవని చూపు; తగవు నెఱపని యేపు. చదురు నేరని చదువరి; సంబరము దీఱని చనవరి.



కీ. శే. బసవరాజు అప్పరాయకవి

## ౧

పడమటి చదువుల నాని నాఁడు; పట్టభద్రుఁడైనాఁడు; పత్త్రికలకు* వరువుడము జేసినాఁడు; పరార్థవాది యనిపించుకొన్నాఁడు. తొలిప్రాయమునసే కైతమీఁదిమోజు మొలకెత్తినది. తలఁపులను పదాలనలవరించి కలవరించినాఁడు. భౌతికమూర్తియందుఁ గొలువడిన యందచందములు భావమునఁ జూపినాఁడు. 'కీట్సు' కవిసరుకు జట్టిగొని తెలుఁగురేవున దిగుమతి చేసినాఁడు.

'వల పెఱుంగక మిగులఁ గులికి మురిసే కన్న
వలచి విఫలం బంది విలపింప మేలురా!'

ఇందు మూలమున కొకింత మురువు నించి మెఱుఁగు వెట్టినాఁడు. మచ్చున కొక్కటిచాలును.

ఎరవు గొనక, తనలోఁ దలసూపిన తలఁపులను స్వానుభూతి కనుసంధించినాఁడు; రసావేశమునఁ బరువులెత్తుచుఁ బాడుకొన్న పాటలకు నమూనా:

"లోకముతో మన కేటికి,
లోలాక్షీ, రా పోదము!
....................."

"చిలుకలు కొఱికిన
పం డొక్కటి నా
చేతి కందెనో దేవా!
....................."

ఇట్టివి విలాసలాలసత్వమునందలి తలఁపుదరగలు కొన్ని రేఁగినవి.

## ౨

కాపురము కుదుట బడినది. కడుపు బండినది. ముద్దుముచ్చటల నూఱినాఁడు. కాఁగిటిలోని 'చిట్టెమ్మ'ను కాలము కబళించినది! 'చలి పిడుగా!' యని మిత్తిని దూఱి దుమ్మెత్తి పోసినాఁడు. బిడ్డల బిచ్చానికి నోములు పట్టినాఁడు. ఇల్లాలితో మల్లయ్యను (శ్రీశైల మల్లికార్జునునిఁ) గొలువఁ దఱలినాఁడు. మల్లేశునిపాదాలు పదాలతోఁ బూజించినాఁడు.

* 'ఆంధ్రపత్త్రిక' 'భారతీ' కార్యస్థానములలో సంపాదకవర్గమున.

## ౩

'అనుకరణమే కళయా?' అను కథావశేషుఁడగు కొమఱ్ఱాజు లక్ష్మణరాయనితో వాదించినాఁడు. 'ఎంకిపాటల గాలిదుమారము' రేపినాఁడు. 'కావ్యమీమాంస' పేరికవితావిమర్శ విసరినాఁడు. అడపదడప ఆవేశమువలనఁ గల మాడించినాఁడు. తనచిలుకరించిన తలఁపులచే తెలుఁగుబాసకు ముస్తాబు చేసినాఁడు. తన తెలివిమెఱుఁగులను, తనపెంకితనమును, నుడికారము మీఁది తనదొరతనమును తెలుఁగున జొన్పినాఁడు. తల్లినుడికిఁ జేసినయూడిగము కొలఁదియయినను వలఁతితనము వెలువరించినాఁడు. వాడుకబాస కెక్కుడు ఊఁత మిచ్చినాఁడు. తనరచనలలో అటనట రస మొప్పించిన బంతు లున్నవి. కవితయందుకన్న గ్రంథ విమర్శమునఁ గౌశలము జూపినపట్టు లున్నవి. పాడిన గీతికలలోఁ బౌరుషమునకన్న స్త్రైణ మదనముగఁ గనఁబడినది. కవితలోవలె గళరవమునను ఆడంగిరేక లున్నవి. పనిపాటలు తగ్గించి పదనైనబుద్ధికి సోమరితనము మప్పినాఁడు. కాఁ గలవాఁడు! కాలనివశుఁ డైనాఁడు!

## ౪

బెజవాడలో ప్లీడరుబల్ల తగిల్చినాఁడు. వేడుకకేని మూనాళ్లు వరుసగా కోర్టునకు హాజరయినపాప మునఁ బోలేదు. భృతి గిట్ట కున్నను, రతి కుదురని వర్తకము రక్తి కట్టదని ఎఱిఁగియు వకీలువేసము వేసినాఁడు. ఆముదానికి హంగుకు అమాంబాబతుఖర్చులు తాన పెట్టుకొని ఆట మొదలిడినాఁడు. 'భారతికి' పదాలు వ్రాయుట సుబఖాటమే కాని పాత్రనిర్వహణ ముంగూర్చి తలపోయఁడు. నెలలేని గడవకమునుపు నిజము దెలిసినాఁడు. 'తెర దింపవే!-ఈమాయనాటకము నింక నాడలేను' అని అంకాస్యమున నే ఆలాపన కుపక్రమించినాఁడు.

నాయనగారి చరమదశతో దరిద్రతాదోషము తొలఁగినది. వారసత్వము స్థిరపడినది. ధనము చేతి కందినది. ధార్వాడుకాంగ్రెసునకు ధర్మపత్నితో సెకండ్ క్లాసుబండిలో షికారు వెడలినాఁడు. ఉత్తర ధ్రువము ద్రొక్కి మఱలినాఁడు. 'తాజ్ మహాలు' చెలువమునకు ముగ్ధుఁడై గేయముల నల్లినాఁడు.

## ౫

మలిమాలు గూడ మలిఁగినది! కడుపు చెఱువుగాఁ గాకిగోసవెట్టినాఁడు. తీపి చెడి కాఁపురము చేఁదు గ్రమ్మినది! తల్లినుడిమీఁది తగులము బాయలేక 'శక్తి' లో నూటియగు కలముపోటులఁ గొన్నింటినిఁ జూప కుండఁ జాలఁ డయ్యెను. పెద్దగంతు వేసి పెన్నిధి నందికొనఁ బేరాస పెనఁగులాడినది. జతనము చితికినది. వేదుఱు గొన్నాఁడు! గడింపను లేదు; కడమ పెట్టను లేదు.

బ్రదుకుమీఁదనేగాని బడాయిమీఁద రోఁత పుట్టినది కాదు! మనసు కసుగాయయుఁ గాదు; కమియఁబండను లేదు! విషయములయందు వెఱ్ఱితీపియు లేదు; వెగటు బుట్టను లేదు! గాలిపాటువెంట గదలి గదలి కాడఁ దొఱఁగిన యరవిరి యైనాఁడు!

> చివికి చవికినాఁడు! త్రుప్పువట్టి తునిఁగినాఁడు!
> చదివినట్టిచదువు పదనున కొదవియు
> బ్రదుకు దెరువు దోఁచువడక మున్న,
> మొదలుపెట్టినట్టి పదముల్ చిగిర్చియు
> నుడువు తుదకు మొగ్గ విడకమున్న,
> కాపురంబు గాలిఁ గలిసె, నీమనుగడ,
> యప్పరాయ, స్వస్తి చెప్పి కొనియె.

చెన్నరాజధానియందు ౧౯౩౧-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

ఇతిహాసకథామంజరి—జె. వి. రాధాకృష్ణయ్య.
పరిక్షిత్తు—పి. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.
భక్తాగ్రేసరుడు—యస్. సూర్యనారాయణమూర్తి.
భరతుడు—వి. రంగస్వామిఅయ్యంగారు.
భారతేతిహాసములు, భా ౧—జె. తులశమ్మ.
మహాపురాణసారము, భా ౨—యం. పార్వతీశ్వర శాస్త్రి.
రామాయణము—వి. సుబ్బారెడ్డి.
వినాయకచరిత్రము—యం. జగన్నాథరావు.
శ్రీరామకథామంజరి—జి. ఇందుమతీదేవి.
సుకళాచరిత్రము—వెంకటాద్రిశర్మ.

—కల్పితములు

ప్రపంచవినోదకథలు—బి. టి. నరసింహాచార్యులు.
బాణగద్యకావ్యకథలు, భా ౧, ౨—యస్. లక్ష్మీపతి శాస్త్రి.
శ్రీకలభాషిణీచరిత్రము—కె. నరసింహాచార్యులు.

—చారిత్రికములు

రాజచంద్రిక—యం. శంకరరావు.
శ్రీకబీరుదాసుచరిత్రము—పి. యస్. సౌమర్వాంజి.
హిందూదేశచరిత్రకథలు, భా ౧—డి. సీతారామరావు.

కల్పములు

వనభోజనవ్రతకల్పము—(ప్ర) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము.
శ్రీత్రినాథవ్రతకల్పము—జి. లక్ష్మీనరసింహశాస్త్రి.

గణితశాస్త్రము

రేఖాగణితము—చ. బి. శంకరరావు.
శిశుగణితము—యస్. కృష్ణరావు.
సామాన్యగణితము—యస్. వి. రామదాసు.

గేయములు

అంబరీషచరిత్ర—యస్. కృష్ణమూర్తి.
అలిమేలుమంగమ్మఅను లక్ష్మీపద్మావతుల చవుతుల కొట్లాట—కె. చంగయ్యదాసు.
కాళీయమర్దనము—జంగముకథ—యు. నాగలింగం.
దావీదుకీర్తనలు—యం. డేవిడ్.
నూతనశృంగారకోలాట జావళీలు—యస్. వేదభాష్య భాగవతులు.
పంచామృతములు—వి. డేనియల్.
పాగల్ మురళి, భా ౧,౨—(ప్ర) పి. ఆర్. దాస్, కాకినాడ.
మోహనమురళి—పి. డి. మల్లికార్జున.
రామదాసుబందిఖానా—బి. కోటేశ్వరరావు.
రామాయణకీర్తనలు—యస్. ఏ. నరసింహాచార్యులు.
శ్రీవేంకటేశ్వరమేలుకొలుపులు—కె. చంగయ్యదాసు.
శ్రీహరిభజనరామాయణము—సి. కృష్ణదాసు.
సహకారవిజయము—వి. సుబ్బరాట్కవి.
పాగల్ హరనాథ్ భజనకీర్తనలు—యం. వెంకటలక్ష్మమ్మ.

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## చ రి త్ర

కడపమండలచరిత్ర— జె. శేషాద్రిశర్మ.

## చ ట్ట ము

మదరాసు హిందూమతిధర్మాదాయముల ఆక్టు—(ప్ర). కె. యస్. కాశ్యప, మదరాసు.

లఘుదీపిక—(ప్ర). పి. భీమశంకరుడు, అమలాపురము.

వ్యవహారచంద్రిక—జి. సేతుమాధవరావు.

## జీవితములు

ఆత్మకథ, భా. ౨—(అను) వి. శివరామశాస్త్రి.

భారతమంత్రులు—యం. నాగలింగశాస్త్రి.

లూయీపాస్టరు—(ప్ర) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

శ్రీగోపాలకృష్ణగోఖ్లే జీవితము—జె. సత్యనారాయణ మూర్తి.

శ్రీదాసులింగమూర్తి జీవితము—పి. సూర్యనారాయణ.

శ్రీరామకృష్ణపరమహంస చరిత్ర యుదోృధములును—కె. నరసింహం.

శ్రీలాలాలజపత్ రాయి జీవితము—జె. సత్యనారాయణమూర్తి.

శ్రీ వివేకానందస్వామిజీవితము—బి. వెంకటేశ్వరులు.

## దండకము

శ్రీమన్మహాకాళీ దండకము—డి. సూర్యనారాయణ శర్మ.

## ధ ర్మ శా స్త్ర ము

పులస్త్యస్మృతి—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

## న వ ల లు

కళావతి—యం. వెంకటరాఘవాచార్యులు.

జపమాలిక, భా, ౧,౨—యస్. రామానుజరావు.

ప్రణయచాంచల్యము—టి. రామచంద్రరావు.

మోహన—బి. రామానుజులు రెడ్డి.

రాణిభవాని, భా. ౧.—(అను) జె. తులశమ్మ.

వక్రరేఖ—యం. నరసింహారావు.

వనజాక్షి—వి. సుందరరామయ్య.

సీమంతినీచరిత్రము—జె. శేషాద్రిశర్మ.

## నాటకములు

అంపశయ్య—ఏ. వెంకటాచలపతిరావు.

ఉత్తరరాఘవము—(అను) బి. లక్ష్మీకాంతము.

ఉషాపరిణయము—ఏ. వెంకటనరసింహాచార్యులు.

ఔత్తానపాదీయనాటకము—యం. లక్ష్మీనృసింహకవి.

కమల—పి. వెంకటశాస్త్రి, యం. సత్యానందరావు.

దంపతులు—పి. వి. రంగారాం.

ప్రద్యుమ్నవిజయము—వి. పిచ్చయ్యశాస్త్రి.

భక్తత్యాగరాజు—వి. వెంకటరత్నశర్మ.

మదనగోపాల నాటకమువను పారిజాతము—జి. వెంకటేశము.

మార్టిన్‌లూథరు—యస్. రామమూర్తి.

రఘునాథ్—యు. సత్యనారాయణరావు.

రుక్మాంగదనాటకము—వి. పిచ్చయ్యశాస్త్రి.

## నీ తి

కథాకుసుమాంజలి—ఏ. వెంకటశాస్త్రి, యం. సీతాపతిరావు, కె. వెంకటరావు.

తెనుగునీతిబోధ—వి. వెంకటేశ్వరశాస్త్రి.

నీతికథారత్నావళి—ఏ. జగన్నాథశాస్త్రి.

నీతికథావళి—జె. శేషాద్రిశర్మ.

సన్మార్గదర్శిని, భా. ౧,౨,౩—జి. శ్రీరామశాస్త్రి.

సుభాషితములు—పి. సూర్యప్రకాశశర్మ.

## పరిశిష్టము

ఆంగ్లదేశాటనచరిత్ర—టి. శివశంకరం.

ఆంధ్రబాలవాచకము, భా. ౧,౨—నీలవేణియమ్మ.

ఆంధ్రోపాధ్యాయగ్రంథమాల—(ప్ర) సెక్రెటరి, గవర్నమెంటు ట్రైనింగు ఉపాధ్యాయులసంఘము, ఒంగోలు.

అతిథిపూజ—జె. స్వామినాథున.

ఇప్పటికలి—శ్రీరాములురెడ్డి.
ఉత్తమస్నేహితులు—జె. వి. రాధాకృష్ణయ్య.
ఉపాధ్యాయబోధిని—(ప్ర)ఆంధ్రఎవాంజిలికల్ ల్యూథరన్ సొసైటి, తర్లపాడు.
కలియుగప్రబంధమండలి మూడవభాగము—ఏ. శ్రీనివాసాచారి.
కృష్ణామండల అర్చకసంఘము—(ప్ర) సెక్రెటరి, కృష్ణాజిల్లాఅర్చకసంఘము, మచిలీపట్టణము.
కావ్యచంద్రిక—యం. డేవిడ్.
ఖాదీతత్వము—ఐ. సరోజినీదేవి, కె. జ్ఞానప్రసూనాంబ.
గర్భిణీస్త్రీ నియమము—సి. వెంకటరత్నం.
గౌతమీవాచకము,| తరగతులు, ౧,౨,౩—పి.సోమన్న.
గ్రామపరిపాలన, గ్రామాధికారులు—వై. సీతారామయ్య.
గ్రామమునసబులపరీక్షాప్రదర్శిని—బి.లక్ష్మీనరసింహము.
జ్ఞానబోధిని—(ప్ర) డి. శ్రీరామమూర్తిబ్రదర్స్, విదురుపాక.
చెన్నరాజధానిభూగోళ వాచకము—వి. పురుషోత్తం.
జంటలు—కె. వెంకటరావు.
తెలుగుపోటీపరీక్షా వ్యాసములు—యం. వెంకటరత్నకవికుమార్.
దోపిడివొంగలు—జె. యస్. బెన్ని.
నానాదేశవాసులు—సి. డి. మిస్. సౌజ.
నారాయణవాచకములు, బుక్. ౧,౨—ఆర్. నారాయణరావు.
పంచకావ్యకథానిధి—పి. సుబ్రహ్మణ్యశాస్త్రి.
పన్నా—కె. జగ్గయ్యచౌదరి.
పద్యగద్యరత్నావళి—(ప్ర) పద్మావతి అండ్ కో, ఏలూరు.
పానము—వి. శ్రీరాములు.
పుణ్యస్త్రీలు, తరగతులు, ౧,౨,౩,౪,౫—వి. జానకి పురుషోత్తం, ఏ. వెంకటసీతమ్మ.
ప్రాథమికపాఠశాలారోగ్యబోధిని—యస్. గోపాలన్.
ప్రాథమికపాఠశాలలయందలి పరిశ్రమాదికములు—యస్. యస్. కే. విలియమ్స్.
భారతసహకారము—(ప్ర) యన్. సత్యనారాయణ, ఆలమూరు.
భావనాయిక—బి. రామజోగరావు.
బృందావనపురగణార్చనాభివర్ధనము—యం. అంజయ్య.
బెంగుళూరు సిటీ వివాహసహాయ సమాజనిబంధనలు, చందాదారుల జాబితాయు అందుప్రకటనలు—(ప్ర) సి. వి. సుందరరాజరావు, బెంగుళూరు.
బ్రాందివలనబెడద—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
బ్రిటిషు పరిపాలనా సౌఖ్యము—భ. లక్ష్మీపతిశాస్త్రి.
మంథెన సంపూర్ణశతావధానము — జె. సుబ్రహ్మణ్యశాస్త్రి.
ధర్మశాస్త్రము—సారధి.
మాతృపూజ—జి. వి. వి. సత్యనారాయణ.
మాధవవార్షికోత్సవ సంచిక—(ప్ర) పి. సత్యనారాయణ, మచిలీపట్టణము.
మానవభూగోళశాస్త్రము—యం. సీతారామరావు.
ముక్తావళి—(ప్ర) వెంకటరాం అండ్ కో, ఎల్లూరు.
రామచంద్రుని హంపీయాత్ర—జి. జోగిసోమయాజి.
రామనామము—ఏ. వెంకటదాసు.
రామాశాస్త్రవాచకములు, ఫారం, ౧,౨,౩—టి. వి. నరసింగరావు, బి. హెచ్. పట్టాభిరామయ్య, సి. భానుమూర్తి.
లంజాట—యం. నారాయణదాసు.
వాచకబోధనము—యస్. భువనం.
వర్ణాశ్రమధర్మ పరిణామము—వి. సూర్యనారాయణరావు.
వావిళ్లవాచకపుస్తకము, తరగతి. ౧— జె. గంగన్న.
వివేకవాచకము, బుక్, ౨—సి. లక్ష్మీనరసింహం.
శకుంతలా కరగ్రహణము—(ప్ర) యం. రాజాభుజంగరావు, ఏలూరు.
శరీర ఆరోగ్యశాస్త్రము, ఫారం. ౫—యం. సాంబశివరావు.
శారదాబిల్లు హడావడి—బి. కోటీశ్వరరావు.
శారదావాచకములు, బుక్, ౫—(ప్ర) టి. రాజగోపాలరావు, మదరాసు.

శుకవాక్యము—పి. వెంకట సుబ్బయ్య.
శృంగారకంఠాభరణము—(ప్ర) జి. యస్. శాస్త్రి అండ్ కో, మదరాసు.
శ్రీనివాసాధ్వరీయము—వి. వెంకటాచార్యులు.
శ్రీ రామకృష్ణలీల—బి. రామదాసు.
శ్రీ లక్ష్మీనారాయణసంవాదము—జి. సీతారామయ్య.
శ్రీ లక్ష్మీనారాయణీయము—జి. కూర్మనాథకవి.
సకలసర్వగుణ అదృష్టదీపిక, భా. ౨—సి. చిన్నయ్య.
సప్తవ్యసనములు—భి. నారాయణమూర్తి.
సహకారోద్యమము—పి. రామాచార్యుడు.
సుగుణమణి—వి. నరసింహం.
సువర్ణపదగృహక్షేత్రదర్శనము—వి. కృష్ణమాచారి.
సంక్రాంతి-మనకర్తవ్యము—జి. లింగయ్యచౌదరి.
స్థూలసూక్ష్మపంచపక్షి అష్టదిక్కుల యారూఢ శాస్త్రము—(ప్ర) కె. చల్లప్పమొదలి, మదరాసు.
హిందువులఆధిక్యము—(ప్ర) సి. నాగరాజు, రాజమహేంద్రవరము.

## పురాణములు

తెనుగుబ్రహ్మపురాణము—(ప్ర) జె. శేషాద్రిశర్మ, కడప.
తెలుగువామనపురాణము—(ప్ర) ఆర్. కొండయ్య శాస్త్రి, చపుర్లపల్లి.
వామనచరిత్ర—(ప్ర) ఆర్యన్ బుక్ డిపో, రాజమహేంద్రవరము.
శివరహస్యఖండము, భా. ౨—(ప్ర) యం. వీరభద్రేశ్వరారాధ్యులు, నందిగామ.

## ప్రకృతి శాస్త్రము

బాలవిజ్ఞానశాస్త్రము. బుక్, 3—కె. వీరభద్రయ్య.
భౌతికశాస్త్రము, బుక్, ౨—కె. సుందరరాజ అయ్యంగారు.

## ప్రబంధములు

ఆముక్తమాల్యద—కృష్ణదేవరాయ.
రుబాయత్—(ప్ర) సి. నారాయణరావు, అనంతపురము.
శివలీలావిలాసము—కూచిమంచితిమ్మకవి.
హరిశ్చంద్రనలోపాఖ్యానము—(ప్ర) వి. రామస్వామి శాస్త్రిఅండ్ సన్స్, మదరాసు.

## భూగోళశాస్త్రము

కాకినాడతాలూకా భూగోళము—చ. అనంతరావు.
గుంటూరుతాలూకా భూగోళము—యం. రాధాకృష్ణమూర్తి.
పల్నాడుతాలూకా చరిత్రాత్మక భూగోళము—యస్. రాధాకృష్ణయ్య.
ప్రపంచభూగోళశాస్త్రము—కె. జగన్నాథం.
బళ్లారిజిల్లా భూగోళము—(ప్ర) బుచ్చయ్యశెట్టి అండ్ సన్స్, బళ్లారి.
రాజోలు అమలాపురం తాలూకాల భూగోళ శాస్త్రము—ఏ. పార్వతీశం.

## మతము—హిందు

ఆస్తిక్యము—వి. వెంకటశివయ్య, కె. సూర్యనారాయణమూర్తి.
ధర్మము—యం. సూర్యనారాయణ.
బ్రహ్మచర్యము—పి. శేషాచార్యులు, ఏ. వెంకటరత్నచౌదరి.
మానసదీపిక—వి. రామభద్రశర్మ.
శివరాత్రిచరిత్ర—కె. కోదండరామయ్య.
శ్రీ కృష్ణావతారతత్వము, భా. ౧౦, ౧౨—జె. శేషాద్రిశర్మ.

## —ఇతరములు

క్రిష్టమస్ పూలదండ—కె. యస్. యస్. జ్ఞానచలమయ్య.
జేసుదేవుడు—కే. భోగలింగాచారి.
జ్ఞానోపదేశ సంక్షేపము—ప్రతిరోజుచెప్పతగిన చిరుమంత్రములు—రెవరెండ్. డి. గ్రాసి, బెజవాడ.
జ్ఞానోపదేశముయొక్క సంక్షేపము—(ప్ర) రెవరెండ్. డి. గ్రాసి, బెజవాడ.
తల్లీవర్థిల్లుము—యం. ఇగ్నాటిస్,
తెలుగుకీర్తనలు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

# శృంగార నాయికలు

## (ప్రాచీన చిత్రములు)



౯. అభిసారిక ౨



౧౦. అభిసారిక ౩

పరమప్రసంగము—(ప్ర) క్రిశ్చియన్ లిటలేచరుసొసైటి, మదరాసు.

యేసుక్రీస్తుకథావళి—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## మాహాత్మ్యములు

అహోబల మాహాత్మ్యము—జి. శ్రీరామశాస్త్రి.

త్రినాథుని వ్రతమహాత్మ్యము—జి. లక్ష్మీనారాయణ.

పంపామాహాత్మ్య సంగ్రహము—కె. వెంకటరామశాస్త్రి.

శ్రీమదహోబిలచరిత్రము—పి. సూర్యనారాయణ.

శ్రీ మొగిలీశ్వర మాహాత్మ్యము—ఏ. వీరభద్రపిళ్లె.

## రాజకీయములు

మహాత్మగాంధి సత్యాగ్రహము—బి. కోటీశ్వరరావు.

సత్యాగ్రహోద్యమము-నిమ్న జాతుల నిరసనము—వి. అమోసు.

## వేదాంతశాస్త్రము

గురుశిష్యసంవాదము—షేక్ రాజా హుస్సేన్ యోగి.

తత్వరంజని—కె. వెంకటరెడ్డి.

ద్వైతాద్వైతప్రశ్నోత్తరమాల—బి. రంగస్వామిరెడ్డి శర్మ.

నిష్కామయోగము—(ప్ర) మానవాదర్శ గ్రంథ మండలి, అంగలూరు.

ప్రవృత్తిమార్గప్రదీపిక—యన్. వెంకయ్య.

మాధవసందేశము—పి. సీతారామశర్మ.

విచారసంగ్రహము—(ప్ర)ప్రణవానంద,తిరువణ్ణామలై.

వివేకసింధువు—కొండనార్యుడు.

శ్రీ శంకరానంద భగవద్గీతాభాష్యము—(ప్ర) ఐ. వెంకమాంబ, గుంటూరు.

## వైద్యశాస్త్రము

అష్టాంగహృదయము, భా. ౧,౨—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

వ్రణచికిత్స—కె. సుందరరామయ్య.

స్త్రీజనకల్పవల్లి—యం. భైరవమూర్తి.

## వ్యాకరణశాస్త్రము

తెలుగు ప్రారంభవ్యాకరణము—కె. నరసింహాచార్యులు.

త్రిలింగలక్షణము—డి. యగ్గన్న.

శారదావ్యాకరణము—టి. రాజగోపాలరావు.

## శతకములు

కుమారీశతకము—(ప్ర) ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.

కృష్ణభక్తకల్పద్రుమ శతకము—ఓ. లింగమూర్తి

జానకీశతకము—కె. వెంకటరాజేశ్వరరావు.

నవకుమారశతకము—టి. సుబ్బరావు.

భక్తకల్పద్రుమశతకము—కె. నరసింహసోదరులు.

వేమనశతకము—(ప్ర) ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.

శ్రీ కాళహస్తీశ్వరశతకము—(ప్ర) కె. వీరవెంకయ్య రాజమహేంద్రవరము.

శ్రీ రామలింగశతకము—యన్. సూర్యనారాయణ.

సుమతిశతకము—(ప్ర) పి. నటేశమొదలి, మదరాసు.

## సంగీతశాస్త్రము

స్వరవర్ణసుధానిధి—యం. పానకాలరావు.

## సాముద్రికశాస్త్రము

హస్తసాముద్రికశాస్త్రము—(ప్ర) పి. త్యాగరాయశెట్టి, మదరాసు.

## స్తోత్రములు

లక్ష్మీస్తవము—యం. వెంకటదాసు.

శివధ్యానామృతము—యం. శివలింగయ్య.

శివానందలహరి—(ప్ర) బి. లక్ష్మీకాంతకవి, గుంటూరు.

శ్రీ చెన్నకేశవ స్వామివారిభక్త చామరములు—పి. బుచ్చయ్య.

శ్రీ భగవత్ప్రార్థనములు—జి. సీతారామస్వామి.



కాశీ - ఉత్తరపువైపు

—సి. జి. జగన్నాథదాసు.



తిరుచూరు దేవాలయము

—ఎ. వి. యస్. సుబ్బారావు.



సింధియాఘట్టము, కాశీ

—సి. జి. జగన్నాథదాసు.



కన్యాకుమారి మొన (సముద్రములోనుండి)

—యస్. శంకరసుబ్రహ్మణ్యం.




[మంగిపూడి వేంకటశర్మ

### ౧. దాగుడుమూతలు

ఆటపెద్ద ఆడవచ్చినవారి నందరిని చూచి ఆటలో అరటిపండు ఎవరికోయి అని అడిగి నాకోయిఅని ముందుగా అడిగిన బాలికయొక్క కన్నులు



బాగుగామూయును. తక్కినవా రందరును తల యొక రహస్యస్థలమునకును పోయి దాగియుందురు. అట్లు దాగియున్నవారిలో ఒకరు అందరిపక్షమున 'సరే కాచుకొనిరావచ్చును' అని కేకవేసిన తర్వాత కనులు మూసుకొనియున్న బాలిక తోడిబాలికలను వెదకుటకై పోవును. ఆసమయమున దాగియున్నవారెవ్వరును దొరకకుండ పరుగెత్తుకొనివచ్చి కాచుకొనివచ్చువారికి కండ్లుమూయుట కేర్పడినబాలికను ముట్టుకొందురు. ఎవరైనను చేతితోతాకుదాక మరలమరల కాచుకొని వచ్చుచుండవలయును. పట్టుబడుటయనగా కదలకుండ పట్టుకొనినిల్పుట కాదు. చేతికి తగిలినచాలును.

కన్నులుమూయుట కేర్పడినబాలికను తల్లియందురు. కొందరు తల్లియైనబాలిక కూర్చుండియుండి గుమ్మమునుగాని, యరుగునుగాని, చిన్నగోడనుగాని ముట్టుకొనిన చాలునని యేర్పరచుకొని యట్లాడుకొందురు. ఈయాటకింతమంది యుండవలెనని నియమములేదు.

### ౨. పులి-మేక

కొందరుమనుష్యులు గుండ్రముగా నిల్చియుండి యొకరిముంజేయి యొకరు గొలుసువలె గట్టిగా పట్టుకొందురు. వారినడుమ మేకయని పేరుపెట్టుకొన్న బాలికయు, ఈవలిప్రదేశమున పులియని పేరుపెట్టుకొన్న బాలికయు నిల్చియుందురు. అప్పుడు దొడ్డివలె నిల్చియుండినవారు "పులివచ్చె మేక" యని కొందరును, "దాగుకో మేక" యని కొందరును పాడుచు



మేకను పట్టుకొనుటకై పులి లోపలికి రాకుండ కాచుచుందురు. పులి మేకను పట్టుకొనుటకై యుట్టహాసము

చేయుచు గొలుసులవలె నడ్డముగానున్న చేతుల క్రిందు నుండి దూరిగాని, పైనుండి ఎగిరి యురికిగాని మేకను పట్టుకొనవచ్చును. చేతుల గొలుసు జారిపోకుండ నందరును జాగ్రత్తగా నుండవలయును. ఒకవేళ ఆగొలుసు చేతుల పట్టుతప్పి విడిపోయినయెడల ఆసందునుండి వెళ్లి పులి మేకను పట్టుకొనవచ్చును. అంతేకాని పులి బలవంతముగా గొలుసు త్రెంపుకొని లోపలికిపోరాదు. పులివచ్చి మేకను పట్టుకొనినతోడనే మరియొకరు పులిగాను, వేరొకరు మేకగాను నుండవచ్చును. లేదా, వారే తమ కిష్టసరదాతీరునంతవరకు మరలమరల మేకగాను, పులిగాను నుండవచ్చును.

### 3. ఒప్పులకుప్ప

ఇద్దరు స్త్రీలు ఒకరొకరెదురుగా నిలిచియుండి యొకరి కుడిచేయి నొకరు ఎడమచేతితోను, ఎడమచేతిని కుడిచేతితోను పట్టుకొని నాలుగుకాళ్లు దగ్గరగాజేర్చి యేటవాలుగా వెనుకకు కొంచెమువంగి "ఒప్పులకుప్పా! ఒయ్యారిభామ!" అనిగాని, "గూటిలో రూపాయి



నీమగడు సిపాయి" అనిగాని, "కొబ్బెరికుడకలు బెల్లపచ్చులు" అనిగాని పాడుచు గిరగిరతిరుగుచుందురు. ఇట్లే నలుగురు బాలికలుగూడి యీయాట నాడుకొనవచ్చును.

శేషము—వెల్ల అదుగో, చుక్కలుఅవిగో అనిగాని, అద్దాలవిగో మేడలవిగో అనిగాని, సన్నబియ్యము, చాయపప్పు అనిగాని, గొట్టమునిండా ముగ్గోసి, కోడుమా బొక్కుదమా అనిగాని, తురకలదొడ్లో తుల్లిపువ్వు, మావాళ్లదొడ్లో మల్లిపువ్వు" అనిగాని పాడుచు ఆడుదురు.

### ౪. బొబ్బట్లు

బాలికలు రెండుసమభాగములుగా ఏర్పడి యొకరి వెనుక మరియొకరుగా నొకగుంపువారు కూర్చుండవలయును. వారికి ఎదురుగా రెండవగుంపువారు ఒకరి వెనుక నొకరుగానే కూర్చుండవలయును. రెండుగుంపులకుమధ్య కొన్నిగజముల యెడ ముండవలయును. తరువాత వారికిని వీరికిని మధ్య నడ్డముగా పొడుగుగా నొకగీతగీచి హద్దుఏర్పరచవలయును. ఇప్పుడు అందరు ఒకబంతిగా కూర్చుండియున్నారుగదా! ఇకను ఆట ప్రారంభించుటకుముందు ఏగుంపువారు కాచుకొని రావలసినదియు, ఎవరు ఆడుకొనుచు రావలసినదియు ఈ క్రిందివిధముగా నిర్ణయించవలయును: ఒక చిల్ల పెంకుముక్కను దెచ్చి ఒకప్రక్క సున్నమురాసి ఆట పెద్దలిద్దరును లేచి నిల్చియుండి "తెలుపుకావలెనా, నలుపుకావలెనా!" యనిగాని, "ఎండకావలెనా, వానకావలెనా"యనిగాని యడగవలయును. ఇక్కడ ఎండ యనగా తెలుపనియు, వానయనగా నలుపనియు ఎరుగవలెను. ఇద్దరిలో నెవరైన నొకరు రెండవవారి నడుగవలయును. రెండవవారు తమఇష్టమువచ్చిన దానిని కోరవలయును. తరువాత అడిగినవారు ఆచిల్ల పెంకును గోటితో మీటి ఆకాశమున కెగుర వేయవల యును. అది క్రిందపడినతరువాత పైకి ఏరంగు కనుపడునో ఆరంగు రెండవవారు కోరియున్నయెడల మొదటివారి (ఎగురవేసినవారు) గుంపువారు కాచుకొని రావలయును. కాని యెడల రెండవవారిభాగమువారు కాచుకొనుచు రావలయును. ఆట ఆడువిధమేమనగా కాచుకొనివచ్చువారును, ఆడుకొనివచ్చువారునుగూడ తమతమ బాలికలయందు వెనుకవారివెనుక నిల్చియుండవలెను. అంతట కాచుకొనివచ్చువారు "చద్దిఅన్నము, ఉల్లిపాయ" అనిగాని, "మంచినీళ్లు, మామిడాకు" అనిగాని, "నక్కచచ్చింది కుళ్లుకంపు" అనిగాని, "చాపచుట్టు చంకబెట్టు", "పొయిలోపెట్టి బొబ్బర్లరొట్టి" యనిగాని, "ఆకుతెచ్చుకో అన్నంపెడతా" అనిగాని,

"పొగాకుకట్ట తిరగేసికొట్ట" అనిగాని, "చిప్పతెచ్చుకో చిమ్మిలిపెడతా" అనిగాని, "వేడిఅన్నం కందిపచ్చడి" అనిగాని, "ఉట్టిమీదఊరగాయ నీకోబద్ద నాకోబద్ద" యనిగాని, "బింకెలబజారు నీకోబింకె నాకోబింకె" యనిగాని, "నారదబ్బకాయ నీయబ్బతలకాయ నన్నే మంటావు" అనిగాని గ్రుక్కవిడువకుండ పాడుచుపరుగెత్తి రెండవవారిని తరుముకు వెళ్లవలయును. ఇట్లు ఇద్దరును ఒకరవెనుకనొకరు ఏకపంక్తిగా గూర్చుండియున్న తమరెండుభాగములవారి చుట్టును విడువక తిరుగుచుండవలయును. పరుగెత్తునపుడు ఆడుకొనివచ్చువారికి వరుపు (ఆయాసము) వచ్చినయెడల తనస్థలమునకువచ్చి నిల్చియుండవచ్చును. నిల్చినప్పుడు కాచుకొనివచ్చువారు ముట్టుకొనరాదు. ముట్టుకొన్నను ఆటపోదు. కాచుకొనివచ్చువారికి అలసటవచ్చినను తనచోటికి పోయిన తర్వాత నిలువవచ్చును. గ్రుక్కవిడువకుండ పాటపాడుచు, పరుగెత్తుచు కాచుకొనివచ్చువారు ఆడుకొనిపోవువారిని ముట్టుకొన్నయెడల ముట్టుకోబడినవారు దూరముగా నుండవలయునుగాని ఆయాట ముగియుదాక మరల ఆటలోనికి రాగూడదు. ఇట్లే ముట్టుకొనవచ్చువారుగూడ గ్రుక్కవిడిచినయెడల ఓడిపోయినట్లగును. కాన వారును ఆటముగియుదాక వేరుగా గూర్చుండవలయును. ఇట్లు రెండుబంతులలోనివారును ఒకరొకరు ఓడిపోయి క్రమముగా తగ్గిపోవుచుందురు. అట్లుతగ్గిపోవుటలో ఏభాగమువారు ఆఖరగుదురో ఆభాగమువారు మొదటి యాటకు కాచుకొనివచ్చువారు (పరుగెత్తిపట్టుకొనువారు) గా నుండవలయును. ఆడుకొనువారు ఒకవైపునుండి పరుగెత్తునట్లగపడి (బెదరించి) మరియొకప్రక్కనుండి పరుగెత్తవచ్చును గాని కూర్చున్నవారి కీవలావల దూరముగా పోరాదు. కాచుకొనివచ్చువారు నడుమగీచిన బద్దెకు (గీత) లోపల అనగా తమప్రక్కనున్నపుడు గ్రుక్కమానినను ఇబ్బంది లేదు. బద్దెమీద అడుగు (కాలు) ఉండగా గ్రుక్కవిడచినను ఆటపోయినట్లేయగును.

## ౫. వానాలప్ప

బాలికలందరును చేతులు రెండును బారసాచి కన్నులు మూసికొనిగాని తెరచిగాని, "వానాలప్ప, వడ్డీలప్ప, ఎండ, వాన కుక్కలు నక్కలు పెళ్లి" అని పాడుచు ఎవరికివారే గిరగిర తిరుగవలయును. గుండ్రముగా తిరుగుటవల్ల కొందరికి కన్నులుతిరుగును గాన అలవాటగుదాక కన్నులు మూసికొనుట మంచిది. ఈ యాటలో ఒకరికన్న ఇంకొకరు ఎంతసేపు ఎక్కువ



తిరుగుదురోయని పందెములువేసికొని ఒకరినొకరుమించి జయమును, సంతోషమును పొందుటతప్ప రెండు కక్షలు (పక్షములు లేక భాగములు)గా యేర్పడి ఒకపక్షమువారి నింకొకకక్షవారు ఓడించుట, గెలుచుటయు లేవు. సామాన్యముగ ఎండయును, వానయును ఒక్కమారే కాయు వింతసమయములో సంతోషముగా ఆడుకొనుచుందురు. "అల్లి బిల్లిదండ, అరకాసుదండ, జంగంవారితోటలో జాజిపూలదండ" అనికూడ పాడుచు ఆడుదురు.

## ౬. కొక్కు

ఇద్దరుమనుష్యులు కొన్ని గజములయెడముగా నొకరికొకరెదురుగా గూర్చుందురు. వారికిమధ్య కొంతమంది యొకరివెనుక నొకరు వరుసగా నొకప్రక్కకు తిరిగి నిలిచియుందురు. ఒక మనుష్యుడు ఒకచోట కూర్చుండిన వానియొద్దనుండి బయలుదేరి రెండవవాని యొద్దకు వేగముగా బోవుచు మధ్య నిలిచియుండిన వారిలో నెవరినైన చేతితో నందుకొనబోవును. నిలుచున్నవారు కాచుకొనివచ్చువాని చేతికి తగులకుండ

వెనుకకు తప్పుకొనుచు మరల మధ్యనిల్చియుందురు. కాచుకొనివచ్చువారు అకస్మాత్తుగా వడినడిగా వచ్చి తనయిష్టమువచ్చినట్లు రెండుప్రక్కలనుండియు కాచుకొనిరావచ్చును. అట్లు కాచుకొనివచ్చువానిచేతికి తగిలినవారు కాచుకొనివచ్చుచుండవలెను. అదివరకు కాచుకొనివచ్చినవారు మరల మరల మధ్యనిల్చియున్న మనుష్యులలో గలిసియుండి యాటపూర్తియగువరకు ఆడుచుండవచ్చును. కాచుకొనివచ్చువారు ఒక్కొక్కమారు కూర్చుండిన మనుష్యులకు మిక్కిలిసమీపముగా నెవరైననిల్చియున్నప్పుడు తాను చప్పునబోయి కూర్చున్న వానిని "క్కొక్కొ" యని మెల్లగా ముందునకుద్రోసి తాను వానిప్రదేశమున గూర్చుండవచ్చును. అట్లు కూర్చుండినవెంటనే త్రోయబడినవాడు తనదగ్గరవానిని ముట్టుకొనవలయును. అట్లు ముట్టుకొన్నయెడల ముట్టుకోబడినవాడు కాచుకొనిరావలయును. వాడు చేతికి దొరకనియెడల త్రోయబడినవాడే కాచుకొనిరావలయును. కాచుకొనివచ్చువాడు కూర్చుండియుండిన ఇద్దరి మనుష్యులచుట్టును దిరుగుచుండవలయునేగాని మధ్యనుండి పోయి ముట్టుకొనరాదు. ఈయాటకే దక్షిణదేశమున పులగలమని పేరు.

## ౭. జలగ

బాలికలందరును చక్రమువలె (గుండ్రముగా) నిల్చియుండి యొకరిచేతులొకరు గొలుసువలె గట్టిగా పట్టుకోవలయును. ఒకబాలిక ఆ మనుష్యులమధ్యన గూర్చుండి కన్నులుమూసికొని మెల్లగావారికాళ్లు పట్టుకొనబోవలయును. కడియమువలె (గుండ్రముగా) నిల్చియున్న బాలికలు తమకాళ్లు దొరకకుండుటకై యొకచోట నిలువకుండ "జలగమ్మ! జలగ!" అని పాడుచు చుట్టి తిరుగుచుందురు. మందిలోనుండి పట్టుకొనబోవు బాలికకు "జలగ" యనిపేరు. ఇట్లు ఆడుచున్నపుడు జలగకు ఎవరైన దొరకినయెడల అందరు ఆగవలయును. జలగ దొరకినవారికాలు పట్టుకొనియుండవలయును. అప్పుడు ఆటపెద్దగాని, యితరులెవరైన నొకరుగాని "ఎవరని పట్టుకొన్నావు!" అని యడుగవలయును. అప్పుడు జలగ "చేపనుపట్టుకొన్నాను" అని చెప్పవలయును. "చేపనేమి చేశావు" అని మళ్లీ అడుగవలయును. "కాల్చుకొనితిన్నాను" అని చెప్పవలయును. "చేతికట్టేమిచేశావు?" అని యడుగవలయును. "అంగడివానికిచ్చాను" అని చెప్పవలయును. "అంగడివాడేమిచ్చాడు?" అని యడుగవలయును. "ఆకులుపోకలు ఇచ్చాడు" అని చెప్పవలయును. "ఆకులుపోకలేమిచేశావు?" అని యడుగవలయును. "గుడికట్టించి దేవతకిచ్చాను" అనవలెను. "గుళ్లోదేవతపేరేమి" అని అడుగవలయును. అప్పుడు జలగ తాను పట్టుకొన్నవారి పేరు చెప్పవలెను. పేరు చెప్పినయెడల అదివరకు జలగగా నున్నబాలిక జట్టులో చేరవలెను. పట్టుపడినబాలిక జలగయై ఆడుకొనిరావలయును. చెప్పలేనియెడల మరల తానే ఆడుకొనిరావలయును.

## ౮. చిప్పచిప్ప గోల్లు

ఇద్దరిద్దరుబాలికలు ఒకరికొకరెదురుగా నిలిచి చేతులు ముందరకు వ్రేళ్లుముందరకు సగమువరకు (కొక్కెములవలె) వంచి యొకరిపిడికిలి (గుప్పిడి) తో ఒకరి పిడికిలికి లంకెవేయవలెను (తగిలించవలయును). ఈలంకెవేసినపుడు ఒకరి అరచేతులు (పిడికిలియొక్క లోపలిభాగము) తిరుగబడియు, మరియొకరిగుప్పిడి బోరగిలబడియు నుండును. తరువాత "చిప్పచిప్పగోల్లు చిలాయి గోల్లు" "మాతాతగోల్లు మండపరాల్లు" అని కొంతసేపు ఎడమకును, కొంతసేపు కుడికిని గిరగిర దిరుగవలయును. ఈయాటకు ఓడుగెలుపులు లేవుగాని ఒక జోటితో ఒకజోడు పంతము వేసికొని ఒకరికన్న నొకరు ఎక్కువసేపు తిరిగియు, ఎక్కువవడిగా తిరిగియు గెలుపు సంపాదించుకోవచ్చును. ఓడుగెలుపులు లేనిచో ఉత్సాహ మెక్కువగ నుండదు గనుక ఉద్దీలువేసుకొని యొకరితో నొకరు పంతమువేసికొని ఆడుకొనుటయే మంచిది. "ఉలవలు ఉలవలు వేయించి, ఉట్లనిండ పోయించి, కందులు కందులు వేయించి, కడవలనిండా పోయించి, కుడుములు కూలపోసి అట్లు ఆరపోసి," అని తిరుగకుండ చేతులు కుడి ఎడమప్రక్కలకు వంచుచు ఆడుదురు.

## ౯. జల్లెడలు

ఇద్దరు ఇద్దరు బాలలు ఒకరొకరికి ఎదురుగా నిల్చి ఒకరి అరచేతి వ్రేళ్లసందునుండి ఒకరివ్రేళ్లు పోనిచ్చి గట్టిగా వ్రేళ్లతో నొక్కి బిగించవలయును. ఇప్పుడు ఒకరి కుడిచేతివ్రేళ్లు రెండవవారి ఎడమచేతి వ్రేళ్లతోను, ఎడమచేతివ్రేళ్లు కుడిచేతివ్రేళ్లతోను అదిమి



పట్టుకొబడియుండునుగదా! తరువాత చేతులు తల మీదవరకును పైకెత్తి చేతులపట్టు విడువకుండా చేతుల క్రిందనుండియే తిరుగవలయును. తిరుగునప్పుడు "జల్లెడలమ్మా జల్లెడలు, జల్లెడనిండా ముత్యాలు" అని పాడవలయును. దీనికి "చిప్ప చిప్ప గోల్లు" అను ఆటవలెనే ఒక జోడుతో ఒకజోడు పందెములు వేసుకొవచ్చును.

## ౧౦. అప్పసవరం

ఇద్దరేసిస్త్రీలు ఒకరికొకరు ఎదురుగా నిలువబడియుండి ఒకరిచేతివ్రేళ్లసందున ఒకరివ్రేళ్లు ఇరికించి గట్టిగాపట్టుకొనవలయును. తరువాత ఎవరికుడిచేతి అరచేయి వారి మెడమీదకుండునట్లు వెనుకకు వేసుకొవలయును. ఇప్పుడు ఒకరిఎడమచేయి రెండవవారి ఎడమచేతితో ఎదురుగా నుండునట్లు చేర్చబడి రెండవవారి మెడమీద వ్రేళ్లుండులాగున నుండును. ఇదివరకు ఒకరికొకరెదురుగా నున్నస్త్రీలు ఒకరు ఉత్తరముఖముగా నున్నయెడల మరియొకరు దక్షిణముఖము గలవారగుదురు. తరువాత "మా అప్పసవరము మాకుతే!" అని యొక్కరును, "మాదేవుని గిన్నె మాకుతే!" అని యొకరును పాడుచు తిరుగవలయును. జల్లెడలవలె దీనికి పందెములు వేసికొవచ్చును.

## ౧౧. కుమ్మరిసారె

ఇద్దరుబాలికలు కాళ్లుచాచుకొని యొకరి అరికాళ్లకు ఒకరి అరికాళ్లు (పాదములు) తగులునట్లు ఎదురుగా కూర్చుండవలయును. తరువాత ఒకరి ముంజేతు లొకరు పట్టుకొని కాళ్లుముందరకు తన్నిపట్టి మడమలు నేలయందు బిగదన్ని చేతుల యూతమున



కొంచెము ఎత్తువరకు లేచి మెల్లమెల్లగా గిరగిర తిరుగవలయును. అలవాటు అయినకొలది ఎక్కువపడిగా (వేగముగా) కుమ్మరిసారె (కుండలు ఆనుచక్రము) వలె తిరుగవచ్చును. రెండుప్రక్కలకును అనగా కుడియెడమలకు తిరుగవచ్చును. రెండవజోడులో పందెములు వేయవచ్చును.

## ౧౨. కొంగలబారు

కొందరు కన్యలు బారలుచాచి యొకరిచేయి యొకరు పట్టుకొని వరుసగా నిలిచియుండవలయును. ఇప్పుడు ఆబాలికలు ఉత్తర దక్షిణములుగా నిల్చియుండి పడమరముఖముగా ఉన్నారనుకొందము. అట్లున్నయెడల ఉత్తరమున చివరనున్న మొదటి యిద్దరి చేతులును ద్వారము (గుమ్మము) వలె పైకి ఎత్తవలయును. అప్పుడు దక్షిణముననున్న మొదటి బాలిక మొదలుకొని ఒకరివెనుక నొకరుగా చేతులు వదలకుండగనే "కొంగలబారోయి" అని అందరును ఒక్కసారిగా కేకవేయుచు పాడుచు మెల్లగాను తొందరగాను (నడు

చూచును పరుగెత్తుచును కూడా) ఆచేతుల ద్వారములో నుండి అవతలికి దూరిపోవలయును. ఇట్లు చేతులదండ విడిపోకుండా, బారు చెదరిపోకుండా మరలమరల మును



పటివలెనే నిలిచి యుండవలయును. ఇట్లు ఈ దిక్కు నుండి ఒకసారియు, ఆదిక్కునుండి ఒకసారియుగాని ఈచివర ద్వారముచేసి కొంతసేపును, ఆచివర ద్వారము చేసి కొంతసేపునుగాని దూరిపోవుచుండవలెను. చాల సారులు ఒకదిక్కు ద్వారమునుండియే దూరిపోవుచున్నయెడల బారు చాలాదూరము సాగిపోవచ్చును. కావున ఒకవీథిమొగనుండి ఆవీథి కొసకు పోవచ్చును. విశాలమైన పొడవైనచోటు లేనప్పుడు అటునుంచి యిటూ, ఇటునుంచి అటూ దూరిపోవుచున్నయెడల ఎంతసేపాడినను మొదట నిలిచియున్న చోట మితమైన స్థలములోనే ఆడుకోవచ్చును. ఈ యాటకు ఓడుగెలుపులు లేవు. ఇది అయిదారుగురికి తక్కువమంది ఆడినయెడల అందముగా ఉండదు. కనుక చాలమంది చేరినగాని పందెములువేయుటకు వీలులేదు. కొంచెపుమంది కూడి పంతములతో (రెండుజట్టులుగాచీలి) ఆడుకోవడముకంటె అంతా కలిసి చాలామంది అయి ఆడుకొన్నయెడల ఎక్కువ ఎచ్చరికగాను, కన్నులపండువుగాను ఉండును.

---



కన్యాకుమారి దేవాలయము

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానందరాఘవరావు, బి. ఏ. (కవితాసమితి)

(ఆషాఢమాసము)

ఉత్తరము




దక్షిణము

ఈపటమునందలి నక్షత్రము లిందున్నట్లు

జూలై 8-తేదిని రాత్రి 9 గంటలకును
15 ,, ,, 8-30 కును

జూలై 22-తేదిని రాత్రి 8 గంటలకును
29 ,, ,, 7-30 కును కనబడును.

ఈ నెల పున్నమనాడు నక్షత్రము పూర్వాషాఢ. అందుచేత ఈమాసము ఆషాఢమాసమని చెప్పబడు

చున్నది. ఈమాసమునందు రాత్రి తొలిజామున నాయా వేళలందు కనబడు చుక్కలు మొదలగువాని పట

మిందు చేర్చినాము. పడమటనుండి తూర్పునకు వరుసగా సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము అను రాసులును, అందలి నక్షత్రములును మనకు కనబడును. మఱియు పాలపుంత (Milky Way) అనబడు క్షీరోదము, ఆకాశగంగ యనువాని రూపము చంద్రవంకవలె వంగినరూపముతో ఈశాన్యదిశనుండి నైరృతిదిగ్భాగమువఱకు వ్యాపించియున్నది. ఇయ్యది యీశాన్యమున నప్సరసమండలము మొదలుగా నూర్వశీపురూరవసులపైనుండి, రాజహంస, వీణ, గరుడ, విష్ణుపద, శేష, ధన్విమండలముల గడచి జ్యేష్ఠ, వృక, వేదికామండలముల నడుమనుండి యయాతిమండలము నంటుచు, నశ్వతరమండలము దాటిపోవుచున్నది.

మిక్కిలి తేజోవంతములైన నక్షత్రము లెనిమిది మాత్ర మిపుడు ఖగోళమున కానవచ్చుచున్నవి. అవి యనగా:—

౧. పడమట అస్తమింపబోవుచున్న సింహరాశిలోని మఘ.

౨. గగనమధ్యరేఖకును, పడమటి క్షితిజమునకును మధ్య కన్యారాశిలోని చిత్త.

౩. చిత్తతో సమానముగా తోరణస్తంభమువలె ఎఱ్ఱగా మెఱయు స్వాతి — తులారాశిలోనిది.

౪. గగనమధ్యరేఖకు స్వల్పము తూర్పుగా, వృశ్చికరాశిలోని జ్యేష్ఠ.

౫. ఉత్తరార్ధమున వీణామండలములో బ్రహ్మ.

౬. ఆదిగువ గరుడమండలములో శ్రవణము.

౭. ౮. దక్షిణమున, త్రిశంకునకు ప్రక్కగా ఆశ్వినేయ (అశ్వినుల తృతీయస్థానమైన) అశ్వతర మండలములోని ఆల్ఫా, బీటానుర్తుగల తేజోవంతమైన రెండు చుక్కలు — ఈయెనిమిదీ First Magnitude Stars - తేజోవిషయమున నగ్రగణ్యములైన ఇరువదింటిలోనివి.

ఉత్తరాకాశమున, వాయవ్యదిగ్భాగమున విఘ్నేశ్వరుడు మూషికసహితుడై యస్తమింపనున్నాడు. ఈవల సప్తఋషులతో బృహదృక్షము ప్రకాశించుచున్నది. ధాత, విధాత, మిత్ర, అగ్ని, మహేంద్ర, కశ్యపులతో కూడుకొని, ఉదయాస్తమయములు లేక పరిభ్రమించు లఘుఋక్షముయొక్క తోకచివరను ధ్రువుడు మెఱయుచున్నాడు. ఈఋక్షద్వయముమధ్య మెలికలు తిరిగి నరకుడు మెఱయుచున్నాడు. నరకునికి తూర్పుగా నూర్వశీపురూరవసులును, అప్సరసలును వెలుగొందుచున్నారు. అప్సరస లింకను పూర్తిగా ఉదయము కాలేదు. ఇక, ఆకాశమధ్యమున పడమటనుండి తూర్పునకు వ్యాపించియున్న చుక్కల నరయుదము.

మఘ త్వరలో నస్తమింపబోవుచున్నది. మఘ కీవల మంచపుకోళ్లవలె పూర్వఫల్గుని, ఉత్తరఫల్గునీ నక్షత్రములున్నవి. వాని కీవల హస్తచుక్కలు మినుకు మనుచున్నవి. వానికి తూర్పున క్రాంతిచక్రముప్రక్కనే ముత్యములాగున చిత్త మెఱయుచున్నది. ఆపైని సప్తమరుత్తులతో కూడుకొనిన భూతేశమండలమునడుమన పగడమువలె స్వాతి ఎఱ్ఱగా మెఱయుచున్నది. వాయుదైవత్యమగు స్వాతి యొకప్రక్కను, గరుడరూపమున శ్రవణ మొకప్రక్కను గొలువ నడుమ శేషశాయియై శ్రీమహావిష్ణువు పరుండియున్నాడు. ఆషాఢశుద్ధైకాదశి శయనైకాదశియని మన పురాణములు తెల్పుచున్నవి. చాతుర్మాస్యవ్రత మానాడే యారంభమగుచున్నది. ఆషాఢ శు ౧౧ ఈ జులై నెల ౮-వ తేది యగుచున్నది. ఆనాటికి శ్రీ మహావిష్ణుతారారూపము గగనమధ్యరేఖ దాటి శయనించిన యాకారముదాల్చి పండుకొనియున్నాడు. ఆమూర్తిని సూచించు చిత్రపట మీప్రక్కపుటలో నీయబడినది. సప్తఫణములతో శేషుడు పాన్పుగాను, నాభికమలమునుండి బ్రహ్మయు, ఆతని ముఖమున సరస్వతి వీణ ధరించియుండుటయు నిందు గానవగును. బ్రహ్మసరస్వతియు, హంసవాహనము నెగురుచుండుట సూచించుపటము వేరొకటి ముందునుండి చూతము.

శేషమూర్తి — సంకర్షణునకు దిగువను, కుమ్మరి సారెవలె అయిదునక్షత్రములతో విశాఖయు, దానికి తూర్పుగ మిత్రు డధిదేవతగాగల అనూరాధ - గొడుగు వంటి యాకారముగల మూడునక్షత్రములును, దానికి తూర్పుగ నట్టియాకారమే గల మరి మూడు నక్షత్రములును, దిగువను తేలుకొండెవంటి వక్రాకారముగల ౧౧ నక్షత్రములును గలవు. ఇదంతయు వృశ్చికరాశి యనఁనొప్పును. మధ్యమూడునక్షత్రములలో మధ్య నెఱ్ఱనినక్షత్రమే జ్యేష్ఠ. ఆదిగువ ౧౧ ను మూలనక్షత్రము. మూలనక్షత్రమునం దైదుచుక్కలని చెప్పిరి గాని, ౧౧ చుక్కలకు తక్కువకాకుండ నగపడును. మూలకుసమీపముగా మృకండఋషియు, అతనిపుత్రుడు మార్కండేయుడును ఉన్నారు.

వీరికితూర్పుగా ధన్వియని చెప్పబడు మన్మథుడు ధనుర్ధరుడై యున్నాడు. ధన్వి సగము మనుష్యుడు, సగము గుఱ్ఱమునైన వికృతాకారుడని పాశ్చాత్యుల వర్ణన. కాని యాతడు చిలుకవాహనము గలవాడని మన వారు చెప్పుదురు. ఆదిగువనక్షత్రములు చిలుకయాకారముగలవి. ఆనక్షత్రములును, చిలుకయాకారమును వేరొకపటమున చూపబడును.

ఆదిగువను "నిరయంబైన నిబద్ధమైన ధరణి న్నిర్మూలనంబైనదుర్మరణంబైన కులాంతమైననిజముగా రానిమ్ముకానిమ్ము పో, హరుడైనన్‌హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నా, తిరుగన్నేరదు నాదు జిహ్వ" అని సత్యపదవీప్రమాణతత్పరుడై ఋజుమార్గవర్తనుడై శాశ్వతకీర్తిగొన్న బలిచక్రవర్తి గలడు. ఆదిగువనే యజ్ఞవేదిక గలదు.

రాజహంసకుతూర్పున నారదు డున్నాడు. ఇతడు బ్రహ్మమానసపుత్రుడు, పరమవిష్ణుభక్తుడు; కలహభోజనుడు. ఈ మండలమును పాశ్చాత్యులు Vulpecula అందురు. అనగా జిత్తులమారి గుంటనక్క (Fox) అని యర్థము. నారదునికీవల ధనిష్ఠ ఉదయమగుచున్నది. దిగువను—అనగా ఆగ్నేయమూలను మకరము ఉదయించుచున్నది. పూర్వము దీని నజమనెడువారు. పాశ్చాత్యులిప్పటికిని దీనిని Capricornus అనగా సముద్రపుమేక అనుచున్నారు. దీని స్వరూపాదులు ముందునుండి గమనింతము.

ఇక నైరృతిదిక్కునను దక్షిణమున గల చుక్కలను గమనింతము. చమస మింక త్వరలో నస్తమింపబోవుచున్నది. ప్రక్కనే వార్తికపుపక్షి అశ్వినీదేవతలచే రక్షింపబడి వృకమునోట బడకుండ సుఖముగా నున్నది. వీటి దిగువను నహుషసర్పము గలదు. దిగువను త్రిశంకుడు అస్తమించుచున్నాడు. మీదుగా అశ్వతర మున్నది. అశ్వతరమనగా కంచరగాడిదె. ఇది అశ్వినీదేవతలకు వాహనము. ఈవాహనముపై నెక్కివచ్చి పందెములు గెల్చుకొనినట్లు వేదగాథ లున్నవి. అశ్వినులనుగూర్చి ప్రత్యేకవ్యాసమునం దాగాథలు వివరింతము. మధ్యను 3 అంకెయును, అటు నిటుగల పెద్దచుక్కలును అశ్వినుల మూడవస్థానము సూచించును. వీరి శూలముచే బొడువబడి కన్నులు తేలవైచుచున్నట్లున్న రూపముతో వృక, మనగా తోడేలు ఆప్రక్కనే కలదు. వృకమునకు దిగువ దక్షిణత్రికోణమండలము (Triangulum Australis) అనబడు యయాతి మండలమున్నది. అందు యయాతియు, అతని వంశజుడైన వసుమనుడును కనబడుచున్నారు. శ్రవణనక్షత్రమునుండి వెలుగు మనకు చేరుసరికి ౧౮ సంవత్సరములు పట్టును. కనుక శ్రవణము మనకు ౧౨ మహాపద్మముల మైళ్లదూరమున నున్నదని లెక్క వేయబడినది. (ఒకమహాపద్మమనగా పదివేలకోట్లు.)

రాసులలో వృశ్చికరాశిరూపము మనకు స్వచ్ఛముగా వృశ్చికమువలె గోచరించుచున్నది. తక్కిన రాసుల రూపము లంత స్వచ్ఛముగా గానరావు.

## ఉల్కాపాతములు

సూర్యకుటుంబములో చేరి సూర్యునిచుట్టు క్రమవృత్తమార్గముల పరిభ్రమించుచు నున్న తోకచుక్క లనేకము లున్నవి. తోకచుక్క లేకారణము చేతనైన భిన్నము లైనపుడు ఆభిన్నశకలముల మార్గము

నుండి భూమి పోవునపుడు, ఆధూమకేతుశకలములు ఉల్కలట్లు భూమిమీద పడుచుండుట గమనింపవచ్చును. ఒకొక్క నెలలో కొన్ని తేదీలను, ఆకాశమునందు కొన్ని నక్షత్రముల ప్రాంతమునుండి ఉల్కలు వర్షించునట్లు కనబడును. ఈ నెలలో ముఖ్యమైన ఉల్కాపాతములు కొన్ని గలవు.

ఈనెల ౨౬-వ తేది మొదలు ౩౧-వ తేదీవఱకు కుంభరాశిలో ఉల్కాపాతము కలుగ గలదు. ఆ యుల్కలు దీర్ఘగమనముగల్గి మెల్లగా పడుచుండును.

పరశుమండలమునందును స్వల్పముగా నుల్కలను పడును. ఈనెల ౧౬-వ తేది మొదలు ౨౯-వ తేదీవఱకు మకరరాశిలో ముఖ్య నక్షత్రసమీపమున స్వల్పముగా నుల్కాపాత ముండును.

---









శ్రీమతి సోరాజి ఆనందరావుసతిగారు

చెన్నె నగరమున గౌరవన్యాయాధికారిణి పదమున నీయమ నియమింపబడినది. భర్త ఆనందరావుగారు వ్యవసాయశాఖయందు డిప్యూటీ డైరెక్టరుగ నున్నారు.

---




శ్రీమతి సుందరమ్మగారు, యం. ఏ.

ఈయమ మైసూరు విశ్వవిద్యాలయమున యం. ఏ. పరీక్షయందు అగ్రస్థానము నలంకరించెను. బి. ఏ., ఇంటర్‌మీడియటు పరీక్షలయందును ప్రథమస్థానము నలంకరించి బంగరుపతకముల పారితోషికమును బడసెను.

---




## విశ్వవిద్యాలయములన్నియు తొలగిపోవలయును

జార్జి బెర్నార్డ్ షా గారి యభిప్రాయములు: జపాను విద్యార్థులతోడి ప్రసంగము:

బెర్నార్డ్‌షా నొక అనాగరికవేత్తగా తలంచువారు కొందరు గలరు; అతడు అహంకారి, తెలివిమాలినవాడని తలచువారును గలరు. కాని అతడు వింతనుగొల్పు వ్యక్తి యనియు, ఏవిషయముగూర్చి మాట్లాడ బూనుకొన్నను అతని అభిప్రాయములు వినోదకరములనియు నెల్లరు నంగీకరింపక తీరదు. షాగారు ప్రపంచ యాత్ర చేయుచు నిటీవల చైనాదేశములోని హాంగ్‌కాంగ్ విశ్వవిద్యాలయ విద్యార్థులతో సంభాషించిరి. దానినుండి యీ క్రింది భాగము లుద్ధరింపబడినవి:—

ఈ ప్రపంచమున గల సకల విశ్వవిద్యాలయములను పడగొట్టి మంటిపాలు చేసి వాని పునాదులయడుగున నుప్పును పండజేయవలెనని నాకు దృఢాభిప్రాయము గలదు.

ఈమధ్యనే యొక భయంకరమగు ఘోరసంగ్రామము వలన నాగరకత నష్టప్రాయమయ్యెనని చెప్పుటకు నాకెన్నడును విసుగు లేదు. ఆసంగ్రామమువలన నాగరకత సంపూర్తిగ నాశనమై పోలేదా యను సంశయమును ఉన్నది కాని దానివలన అంతగా చింత లేదు. అసలు ఉన్న నాగరకతయే అతి స్వల్పమనుట, ఆసంగ్రామము ఋజువుపరిచిన విషయములలో నొకటి.

ఆమహాసంగ్రామమును నడపినది విశ్వవిద్యాలయపు చదువులు గల జనులే. ప్రపంచములో నిజముగా అపాయకరమగు రెండుతరగతు లున్నవి. సగము చదువుకొన్నవారు — తెలిసియు తెలియనివారు—ఉన్నారు; వారు సగము నాగరకతను నాశమొనర్చిరి. పూర్తిగా చదువుకొన్నవా రున్నారు; వారు ప్రపంచమును ఇంచుమించు పూర్తిగా నాశము చేసివైచిరి.

ప్రొఫెసర్ ఫ్లిండర్స్ పెట్రీ గారి రచనములను మీరు అతిశ్రద్ధగా చదువవలసియున్నది.

ఎన్నియో యేండ్లక్రిందట—నా చిన్నప్పుడు— ప్రాచీన నాగరికతనుగూర్చి యెవ్వరికి నేమియు తెలియదు. మనకు గ్రీసురోములను గూర్చి కొలదిగ తెలియును. రోము ఎట్లో శిథిలమై అదృశ్యమయిపోయినది. కాని ప్రొఫెసర్ ఫ్లిండర్స్ పెట్రీ గారు ప్రాచీన నాగరకతను త్రవ్వి బయటికి తీయనారంభించువరకును, అచ్చముగ మన నాగరకతవంటివే యగు నాగరకత లెన్ని శిథిలములయి నశించినవో మన మెరుగము. ఇంచుమించుగ అవి అన్నియు చదువులవలననే నశించినవి.

### కృత్రిమ మానసములు

అందులకు కారణము: నాకు తోచినది, నాగరకతను కాపాడుకొనుటకు ఇంచుమించు ఉపజ్ఞాసంపన్నులు కావలెను.

ఇప్పుడు, విశ్వవిద్యాలయము కృత్రిమ మనస్కులను తయారు చేయుచున్నది. మీరీ విశ్వవిద్యాలయముల ప్రవేశింతురు. అవి మీమనస్సును మీలోనుండి నెడలగొట్టి తత్‌స్థానమున కృత్రిమమనస్సును నిలుపుచున్నవి. ఇదేప్రకారముగ మన నాగరకతయొక్క సంపూర్ణవినాశనమును నాకు దృష్టిగోచరమగుచున్నది.

ఇట్లే మనమును వెనుకబడి అంధకారయుగములని పిలువబడువానిలో చేరిపోవుదుము.

మీరు ఏమి చేయనున్నారో నే నెరుగనులెండు. "నేను విశ్వవిద్యాలయమును విడిచిపెట్టనా ?" లేక "వీథివెంట తిరుగనా ?" అని మీ రనవచ్చును. అది నాకు తెలియదు! అయితే విశ్వవిద్యాలయమునుండి పొందవలసినదియు కొంత కలదు. సాంఘికజీవనము మీకు అలవడును; అది ప్రయోజనకారియే. నాకొక కొడుకు ఉండినయెడల, అతని కిట్టి సలహానే ఇచ్చియుందును.

వానినొక విశ్వవిద్యాలయమునకు పంపుచు నిట్లు చెప్పియుందును: "వారు నీలో నొక కృత్రిమమనస్సును తయారుచేసి పెట్టేరు, జాగ్రత్తసుమీ! నీవు చదువవలసినవని వారు చెప్పు పుస్తకములవిషయమా, వానిని నీవు చదువనేవద్దు."

విద్యాలయములోని పాఠ్యపుస్తకమనగా, సరియగు వివరణము, చదువ వలనుపడని—చదువరాని—పుస్తకము. నేను బొత్తిగా చదువుకొనని మనుష్యుడ ననుసంగతికి కారణము, ఏవిధమైన బడిపుస్తకములను నే నెన్నడును చదువజాలకపోవుటయే.

బడిపుస్తకములను చదువవలసిన కాలమున నేను నిజమగు గ్రంథములను చదువుచుంటిని—నిజముగా వ్రాయగల్గినవారి వలన రచింపబడిన పుస్తకములనే నేను చదివితిని—పాఠ్యపుస్తకములను వ్రాయువారు అట్టివారు కారు.

నేను చెప్పునట్లు, నిజమగు గ్రంథములను చదువుటకై జాగ్రతపడుడు; మీ విశ్వవిద్యాలయమునుండి మిమ్ములను తిరస్కారపూర్వకముగ వెడలకొట్టకుండునట్లు పేరునకు మీపాఠ్యగ్రంథములను చదువుకొనుడు.

మంచి పుస్తకములను చదువుడు, నిజమగు గ్రంథములనే చదువుడు, విప్లవబోధకములగు (Revolutionary) నన్ని పుస్తకములను మీరు చదువుడు. సమష్టివాదము మొదలగు నన్ని ఉద్యమములలోనికిని కంఠదఘ్నముగ ప్రవేశింపుడు. ఇరవైయేళ్ల వయస్సున మీరు విప్లవవాదులగుటకు ప్రారంభింపకున్నచో, మీ యాభైయవయేటనే మీరు ఎందుకును కొరగాని ప్రాతతుక్కులై పోదురు. మీరు ఇరువదవయేట వీరవిప్లవకారులైనచో, మీ నలువదవయేట వయసుకు తగినట్లుండుటకు మీకు కొంత అవకాశముండును.

మీఅందరకు నేజెప్పగలది యిదియే: నేను సూచించిన మార్గమునంటి సూటిగ ముందుకు సాగిపొండు. మీ ఉపాధ్యాయునితో నెల్లప్పుడును చర్చింపుచుండుడు. వీలయినచో, మీకొక చరిత్రాధ్యాపకుడుండి—అతడు చరిత్రపై తన యభిప్రాయమును మీకు చెప్పుచో, మీరు చెప్పవలసినదేమన, "అయ్యా, మేము మీయభిప్రాయములను వింటిమి. కాని మేము చేయబోవునదేమో తెలియునా? మీయభిప్రాయములతో నేకీభవింపని యింకొక చరిత్రాధ్యాపకుని మేము వెదకి తెత్తుము. ఉభయులును చరిత్రవిషయమై చర్చించి నిలుపు సిద్ధాంతములను విందుము."

మీరు నేర్చుకొనువానిని సవితర్కముగ తెలిసికొనుడు. దేనినిగూర్చియైనను ఏకపక్షముగనే అహేతుకముగ మీకు బోధించుటకు నిరంతరమును కుట్ర యొకటున్నదని మీరు గ్రహింతురు. బొత్తిగా మేలు పడయజాలని యువకు లనేకులు విశ్వవిద్యాలయమునకు వత్తురు. అట్టివారికి మీరు పట్టముల నీయవలసియుండును. అందువలన వారు మీప్రశ్నలకు ఉత్తరముల నీయగల్గుటకు తగినట్లెట్లో మీరు వారికి బోధింతురు.

ఏవిషయమునకైనను రెండుమతము లుండునని మీరు వారికి బోధించియున్నచో, వారు తీరని గాభరాపడుదురు. పరీక్షయందు కడతేరుటకు, అడుగబడిన ప్రశ్నలయొక్క తత్త్వమునే నిశ్చయింప బూనవలదు. మీఉపాధ్యాయునివద్దకు పోయి యిట్లడుగుడు: "ఈప్రశ్నకు నేనేమి యుత్తర మీయవలసియుండును?" అని.

మీలోనికి ఈవిషమును ప్రవేశపెట్టుటకు నాకు కలిగిన యీఅవకాశమువలన నాకు సంతసమయినది.

శృంగారనాయికలు

(ప్రాచీన చిత్రములు)



౧౩. వాసకసజ్జిక ౨



౧౪. అభిసారిక ౪



౧౬. సందేశము



౧౫. ప్రోషితభర్తృక

ఇందువలన మీకు ఖులాసా కలుగుననియు, కాని యొక్కవారములోపలనే మీరు దీనిని మరచిపోవుదురనియు నేను నమ్ముదును.

## సారవంతమగువానినే ఉంచుకొనుడు

నా చిన్నతనమున నేను విమర్శకుడనుగ నుంటిని. ఒకవారపత్రికకయి నేను చిత్రపటములనుగూర్చియు, నాటకములనుగూర్చియు విమర్శనలను వ్రాయుచుంటిని. ఒక చిత్రకళాప్రదర్శనమును, రాయల్ ఎకాడమీయందలి యొకానొక ప్రదర్శనమును, చూచితిని. దానిని గూర్చి నేను ఒక్కవ్యాసమును మాత్రమే వ్రాయగలనని గ్రహించితిని. అథవా రెండు వ్రాయగలను. ప్రదర్శనమున రెండుమూడువేల చిత్రములు గలవు. ఇక నేను చేయవలసినదేమి? వాటినన్నిటిని అతిత్వరితముగ చూచి "చెప్పనక్కరలేని" వానిలో ఏపన్నెండు పదిహేను బొమ్మలనో పరిగణించి వానినిగూర్చి పొగడి వ్రాయుటయే!

మీరు చేయవలసినదదియే. సందర్భానుసారముగ మీయుపాధ్యాయులును, బోధకులును మీకు కొన్ని సంగతులను చెప్పుచుండునపుడు మీరు చెప్పవలసినది "జ్ఞాపకముంచుకొనవలసిన యోగ్యతలేనిదానితో మాకు ప్రయోజనము లేదు" అని.

చరిత్ర యను పెంటకుప్పలవెంట నడచుచు దొరకిన గడ్డిపేలికను ఏరికొనువానివలె, మీకు దొరకుదానికెల్లను విలువను కనుగొని, సారగర్భముగువానినే యుంచికొని మిగిలినవానినెల్ల మరచిపోవలయును.

అవుట మీరు చదువుకొన్నవారివలె ప్రవర్తింపగలరు. జ్ఞాపకముంచుకొనదగిన కొలదిసంగతులతోడ మీరు సంచరింపగలవారుగ ప్రవర్తింపగలరు. పనికిమాలిన విషయములనెల్ల జ్ఞాపకముంచుకొనువాడే తరచుగ విశ్వవిద్యాలయమున ఉన్నతపట్టములను సంపాదించుకొనును. అట్టివానిని మీరు చేయిగలిగినచెల్ల, వానిని పాతిపెట్టుటయే!

'స్వరాజ్య'

---

## ఇంగ్లాండు, రషియా, ఇండియా

రషియాదేశమున కొలదిమంది ఆంగ్లేయులను వారు చేసిరనుకొన్న నేరములకు వారిని బహిరంగముగ విచారణచేయవలెనను తలంపుతో అరెస్టుచేసిరి. సక్రమవిచారణమువలన వారిలో కొందరు నేరమును చేసిరని ఏరుపడినది. వారు నేరములను చేసిరో, చేయలేదో తెలియుటకు ముందుగనే బ్రిటిషుపార్లమెంటువారు రష్యాదేశములోడి వర్తకమును బహిష్కరింపవలెనను శాసనము నమలునకు తెచ్చిరి.

భారతదేశమున, వందలకొలది భారతీయులు అరెస్టుచేయబడి, అంతులేని కాలము నేరము మోపుటగాని, విచారణముగాని లేక నిర్బంధమున నున్నారు. భారతదేశములో బ్రిటిషువస్తువస్త్రములను అమ్మవద్దనియు, కొనవద్దనియు శాంతియుతముగ బోధించుటయు, బహిష్కరించుటయు ఘోరమగు నేరమని బ్రిటిషువారు తలంతురు.

'మాడర్న్ రివ్యూ'

---

## ఆళ్వారు నిష్క్రమణము
### ఎంతకాలమువరకు?

సిపాయిలయుద్ధము అణచివేయబడినతరువాత భారతదేశములోని ప్రజలను, రాజులను శాంతిపరచుటయును, వారికి తోచినప్పుడు అభయమిచ్చుటయును అవసరములని విక్టోరియామహారాణి సుప్రసిద్ధమగు ప్రకటనను గావించినది. అందలి వాగ్దానములలో నొకటి "భారతీయ సంస్థానాధీశుల హక్కును, ప్రతిష్ఠను, మర్యాదను మేము మాసొంతములుగ భావించి గౌరవింతుము." సాధారణముగ రెగ్యులేషనుక్రింద, ఆర్డినాన్సుక్రింద, ఆర్డినాన్సు-శాసనప్రభుత్వము క్రిందను కాకున్నను సామాన్య వ్యక్తికి శిక్ష విధింపబడకముందు స్వసంరక్షణార్థమై ప్రతివాదిగ వాదనచేసుకొనుటకు హక్కుగలదు. ఆళ్వారుమహారాజుగారిపై ఏ రెగ్యులేషనుక్రిందగాని, ఆర్డినాన్సుక్రిందగాని ఎట్టి

చర్య జరుపబడినట్లు వెల్లడిపరచలేదు. అయితే ఆయన 48 గంటలకాలములోగా తన సంస్థానమును విడిచిపెట్టి పోవలయునని ఆజ్ఞాపింపబడినట్లు చెప్పబడు చున్నది గదా, అతని 'హక్కు, ప్రతిష్ఠ, మర్యాద'యు సామాన్యభారతీయులవానికంటె తక్కువవా ? అతడు ప్రతివాదము చేసుకొన వీలీయలేదు. నిజముగ నతడు ప్రవాసమంపివేయబడె నన్నమాట - రెండేండ్ల కాలమో; ఇంకను అధికకాలమో ?

ప్రభుత్వమువారు ఈ సంస్థానాధిపతులకు ఒత్తిడి కలిగించి ప్రజలను బాగుగా పరిపాలింపుడనియు, పరిమిత రాజ్యాంగములయొక్క ఆధునికములు, నేటికాలమున కనువగునట్టివియు నను విధానముల నవలంబింపుడనియు నేల సలహా నీయరాదు ? అవసరము కలిగినప్పుడు, సకాలమున వారిని ముందు హెచ్చరికగ ఏల మందలించుటలేదు ? కఠినోపాయమగు 'రాజ్యపరిత్యాగము', 'ప్రవాసము' గాక వేరుసాధనము లేదా ?




చ్యుతరాజ్యుడై విదేశాటనమునకు ఆళ్వారు మహారాజు

ఈ పెద్దమహారాజులు తమ రాజ్యాంగపు హక్కులనుగూర్చి డాబులు కొట్టుకొనుటయందు చాల సరదా కలిగియుందురు ! సామాన్యులకు పలుకుబడి యుండగల, ప్రతిపాదింపబడిన ఫెడరల్ ప్రభుత్వము నందు సర్వాధికారము లుంచబడుటను వీరు భరింపజాలరు.

ఆళ్వారువంటి సంస్థానములలో రాజ్యాంగ నిపుణులగు ఉద్యోగు లుంపబడుచున్నారు. వారిద్వారా

ఇంతవరకును మహమ్మదీయేతర సంస్థానాధిపతుల యెడలనే కఠినచర్య జరుపబడుటయు వింత సందర్భమే ! అందు రెండిటగల మహమ్మదీయ ప్రజల వలన తిరుగుబాటులు జరిగియుండినవి కూడను. అయితే అందుకు కారణము: హిందూసంస్థానములలోని మహమ్మదీయులును, బ్రిటిషుఇండియాలోని మహమ్మదీయులును రంజికములవంటివారగుటే లెండు; అంటుకొన్న భగ్గుమను వారు.

'మాడర్న్ రివ్యూ'

## భారతీయ రాజకీయఖయిదీల యిడుములు

భారతదేశములోని జెయిలుజీవనమును గూర్చి 'థియాసఫిస్టు' పత్రికయందు 'రెండుమారులు ఖయిదీగనున్నయతడు' వ్రాసిన వ్యాసమొకటి ప్రకటింపబడినది. దానినుండి యీక్రింద నుద్ధరింపబడిన భాగముల వలన భారతదేశములోని సి. తరగతి రాజకీయఖయిదీలు ఎట్లు ఎన్ని యిబ్బందులను పడుచున్నారో తెలియగలదు. అధికారులు తలంచుకొన్నచో పైయిడుములను అతిసులువుగా తొలగింపనుగలరు.

జాగా: ఖాయపుజైళ్లలో, ఖయిదీల ఒత్తిడి అధికముయినపుడు, మిక్కిలి తరుచుగ గొఱ్ఱెలమందవలె గుంపులు గుంపులుగ ఉంచబడుదురు. ఒక్కొకపుడు వార్డులలో మామూలుగకంటె రెండురెట్లకధికముగ గూడ నుంచుటయు గలదు. దీనివలన ఖయిదీలకు గొప్ప అసౌకర్యమును, మిక్కిలియిబ్బందియు కలుగును. తాత్కాలికపు క్యాంపుజైళ్లను గూర్చి ఏమియు చెప్పకుండుటయే ఉత్తమము. తమ చిత్తమునకు వచ్చినట్లెల్ల భారతీయులను జీవితముల గడుపుకొన జేయవచ్చునను నభిప్రాయముతో అధికారులిట్లు చేయుచున్నారని తోచుచున్నది. అసలే భారతదేశములోని జీవయాత్రా విధానపరిమాణము చాల నిరాడంబరమయినది. మరి జైళ్లలోనో ఎంతకయినను సర్దుకొనిపోవు ఖయిదీల స్వభావము అత్యంత కఠినపరీక్షకు లోనగుచున్నది.

ఉడుపులు: సామాన్యపుఖైదీలకు రెండుజతలు మోకాలుదిగని లాగులు; చేతులులేని చొక్కా ఒకటి; ఒక తువాలు; ఒక దుప్పాయి; మూడు కంబళ్లు ఈయబడును. వీనితో కనీసము ఆరునెలలైన గడుపవలెను. చలికాలములో ఇంకనొక్క కంబళియు, ఒక అర చొక్కాయు హెచ్చుగా ఈయబడును. కాని జోళ్లు ఈయరు. ఈబట్టలు చాలవు. అవికూడ అసంపూర్ణముగను, అసౌకర్యముగను ఉండును. పరుచుకొనుటకు, కప్పుకొనుటకు తలక్రిందికి అని ఈయబడు మూడుకంబళ్లును చాల వదులుగా నేయబడునవి. వానిలోని పోసులు తెగి ఊడి మనిషివెండ్రుకలవలె వార్డు అంతటను, జెయిలు ఆవరణమంతటను, ఎప్పుడును ఎగురుచునుండును. దీని ఫలితముగా ఈ రాలినవెండ్రుకలు కొన్ని అయినను కలియని అన్నపానీయములు ఖయిదీలకు లభించేవికావు.

పాత్రములు: ఒక్కొక్క ఖయిదీకిని, పెద్దదొకటి, చిన్నదొకటి, రెండు ఇనుపచట్లు ఇత్తురు. ఒకటి అన్నము తినుటకు, రెండవది నీరుత్రాగుటకు. ఈపాత్రలు త్వరలో త్రుప్పుపట్టిపోవును. అరగంటలోపుననే మంచినీళ్లు చిలుమూరిపోవును. ఆపాత్రములో కలిపిన అన్నముకూడ చిలుమూరిపోవును. కాబట్టి అడుగునను, ప్రక్కలను అంటిన అన్నమును ఖయిదీ తినకుండ జాగ్రత్తపడవలెను. ఈమధ్యనే 'ఏ' తరగతి, 'బి' తరగతి ఖయిదీలకు ఇనుపచట్ల బదులు ఎల్యూమినియమ్‌పళ్లెములును, కప్పులును, టంబ్లరులును ఈయబడుచున్నవి.

పారిశుధ్యము: స్నానాలంకరణాదికార్యసౌకర్యములయందు మనుష్యమర్యాదయే నశించినది. ముందువైపు మరుగులేని దొడ్లు వరుసగ నుండును. నీరు ఇంకొకచోట ఉండును. శౌచమునకు ఖయిదీ అచటికిపోయి తనకు వంతువచ్చువరకును వేచియుండవలెను. అత్యధిక సంఖ్యాకులగు ఖయిదీల ఉపయోగార్థము అచట నొక్కటో, రెండో తగరపు తపిలెలు మాత్రముండును. మరుగుదొడ్లలోనికి నీళ్లు తీసుకొనిపోరాదు. కావున దొడ్డికి పోవలసినపుడెల్ల ఈ రెండుచోట్లకును పోవలసియేయుండును. ఈయేర్పాటు మిక్కిలి అసభ్యముగనున్నది. దీనికి తత్‌క్షణమే సంస్కరణ మవసరమయియున్నది.

వైద్యసాహాయ్యము: పూర్వోక్తరీతిని కారాగారములలో మందులను ఉపయోగించుట ప్రాణాపాయము నివారించుటకేగాని వ్యాధులను చికిత్స చేయుటకై కాదు. అట్టి సహాయమునకైనను తరచుగ అత్యల్పముగు నేర్పాట్లుండును. ముఖ్యముగ కారాగృహములలో వేలకొలదిగ ఉండవలసివచ్చుచున్న రాజకీయఖయిదీల విషయములో స్థితి యిట్టిది. అపరిశుద్ధములగు క్యాంపుజెయిళ్ల పరిస్థితులవలన వందల కొలది ఖయిదీలు సదా రోగపీడితులుగా నుందురు. మరియు వారందరికి వైద్యముచేయుటకయి సాధారణ

ముగ ఒక్కరో యిద్దరో సబ్ అసిస్టెంట్ సర్జనులు ఉందురు. మంచుల నిలువ చాలకొంచెము. అతిప్రమాద స్థితిలోనున్న రోగులు పండుకొనుటకయి ఏ నాలుగయిదుడజనుల మంచములో మాత్రము ఉండును. ఇతర రోగులందరు నేలమీదనే పండుకొనవలయును. ఈలోపముగూర్చిన తీవ్రమగు అసంతృప్తి అందరుఖయిదీలకు ఉన్నదే.

జాబులు: 'సి' తరగతి ఖయిదీలు మూడునెలలకు ఒక్కజాబు వ్రాసుకొన వచ్చును, ఒకే జాబు నందుకొనవచ్చును. ఉత్తరముల రాకపోకలు, తత్పరీక్షణము కారణముగా, దినములు, వారములు ఆలస్యమగుచుండును. ఇది యెంతయో శోచనీయాంశమనియు, ఇంతకంటె తరచుగను, త్వరితముగను జాబుల రాకపోక లుండవలయుననియు చాలసులభముగా తెలుసుకోవచ్చును.

సందర్శన సంభాషణములు: ఈ విషయమున కూడ మూడునెలలలో ఒక్కమారు మాత్రమే ఖయిదీల బంధుమిత్రులు సందర్శించి సంభాషింప ననుమతి గలదు. 'ఏ' తరగతి ఖయిదీలకు పక్షమున కొక తూరియు, 'బి' తరగతికి నెలకొకతూరియు సందర్శింప ననుమతి యుండును. 'సి' తరగతి ఖయిదీల దురవస్థలను బాపుటకు ఈవిషయమున కూడ అతిశీఘ్ర సంస్కరణ మవసరము. ఈసంస్కరణము కాలము విషయముననేగాక, పద్ధతివిషయమునకూడ. మామూలు పద్ధతిప్రకారము ఖైదీయును, వానిని చూడబోయిన వారును కలుసుకొనుటకు వీలులేదు. కచేరిగదిలో ఎదురెదురుగనుండు రెండుగోడలలోని కిటికీలకు అమర్చిన యినుపతెరగుండా ఒకరినొకరు చూచుకొనవచ్చును. ఈచూపు-మాటలు-కూడ కొన్ని నిమిషములుమాత్రమే. మానవ స్వభావానుగుణముగా చెప్పినచో, ఇంతకన్న తరచుగను, ఎక్కువసేపును నిజముగ నొకరినొకరు చేరువగ చూచికొని మాట్లాడుకొనుటకును ఏర్పాటు చేయబడవలయును. అంతేకాని, నడుమ రెండుగోడ లుంచి ఒక్కమారు కొంచెము మిణికిచూచుట కాదు. ఈసందర్భమున గమనింపవలసిన విషయమింకొకటి కూడ గలదు. సందర్శనమున కధికారు లేర్పాటుచేయు వరకును, ఖయిదీలను చూడపోవువారు వేచియుండుటకు గాని, కూర్చుండుటకుగాని తావు లేదు. ఎండలో మాడుచు, వానలో తడియుచు గంటలకొలది బయట నిలిచియుందురు. ఇందుచేత వారికొరకు ఏదో ఉచితమగు నేర్పాటు చేయు టత్యావశ్యకము.

'మాడర్న్ రివ్యూ'

## 'స్వదేశీ' మతము

'ది యంగ్ బిల్డర్' పత్రికలో జామ్షెడ్ నస్సెర్వాన్‌జీ గారు స్వదేశిని గూర్చి ప్రబోధకమగు నీక్రింది వాక్యములను వ్రాసిరి:—

అమెరికాలోని సుప్రసిద్ధ రచయితలలో నొకరగు కాల్‌హిల్ గాబ్రియాన్ గారు భావగర్భితమగు తన కథలలో నొకట నిట్లు చెప్పిరి:—ఒకప్పుడొక శుభ్రమయిన తెల్లని తావుకాగితము తానెప్పుడును శుభ్రముగను, తెల్లగను, పరిశుద్ధముగనే యుంపబడవలెనని కోరుకొనెనట. ఈవాంఛను వినిన ఆ టేబిలుమీది సిరా చిరునవ్వు నవ్వుకొని ఊరకుండెనట. ఆటేబిలుమీదనే కొన్ని రంగుపెన్సిళ్లు ఉండినవట. ఈ తెల్లకాగితము వెల్లడించిన కోరికను అవి కూడ విని చిరునవ్వు నవ్వి ఊరకుండినవట. ఈ కథచివరను కథకు డిట్లు వ్రాసెను: "కాగితము నిజంగా అట్లు శుభ్రముగను, తెల్లగను, పరిశుద్ధముగను ఉండిపోయినది. మరి ఖాలీగాకూడ ఉండిపోయినది!"

ఈపాఠమునే బాగుగ మనము మన స్వదేశీ ఉద్యమమున నేర్చుకొనగలము. స్వదేశీ యనునది అనుభవముతో కూడుకొన్నదై రంగులు సిరాలు రాచికొన్నదైనగాని స్వదేశీయుద్యమము వట్టిదిగను, ఖాలీగనే యుండిపోవలసియుండును. ప్రతివస్తువును చక్కగను నాజూకుగను- రకము మేలిమిగను, వీలయినంత అందముగ సంపూర్ణతను సంపాదించుటకును, వీలయినంత చవుకగను ఉపయోగకరముగను తయారుచేయుట కనుభవమును సంపాదించుకొనుటయే స్వదేశీఉద్యమముపట్ల

నభిమానము గలవారికి నిర్దిష్టప్రయత్నమయియుండ వలయును. ఒకవస్తువును ఊరక స్వదేశీ దయినంతమాత్ర మున నే ప్రజలు దానిని కొనవలెనని తలచుట మానవ ప్రకృతి నెదిరించి పోషింపబూనుటయే యగును. మాతృ భూమియెడల భక్తియనునది మానవ ప్రకృతియొక్క ఒక్క పక్షమే, గాని మనము నిర్లక్ష్యముగా త్రోసి వేయ తగని యితరపక్షములును ఉన్నవి. అవి మిత వ్యయము, ఉపయోగము, సౌందర్యాభిజ్ఞతయు. ఇతర మాతృదేశముల పుత్రుల ఉదాహరణములను మనము అనుకరింతము. శాస్త్రపరిశోధనలగూర్చిన వారి 'తపస్య' ను, యితర దేశములవారిని తలదన్నుటకయి వారు కావించు త్యాగములను, మనము గమనించుచు ప్రశం సింతము. వస్తువులను వీలయినంత మంచివానినిగను, పనికివచ్చువానినిగను, చవుకగను తయారు చేయుటకు వారు సర్వవిధముల ప్రయత్నించుచున్నారు. ముడివస్తు వులయొక్కయు, వాణిజ్యనిర్మాణము యొక్కయు, వస్తుప్రశస్తిని పత్రికాదులలో ప్రకటించుకళ యొక్క యు, మూలమునుగూర్చి వారు గాఢముగ పరిశ్రమించి కావలసినవారెల్లరికిని సహాయపడునట్టి ఉపయోగకర ము వస్తువును తయారుచేయుదురు. ఒకానొక శస్త్ర చికిత్సకై జర్మనీలోని హీడెల్‌బెర్గు నగరమునకు గొంపో బడిన మాతల్లి యానగరమునుగూర్చి నాకిట్లు చెప్పెను:- ఒకరోగమునకు కారణమగు ఒక్కసూక్ష్మజీవిని గాని, ఒకరోగిమును కుదుర్చు నొక్క చికిత్సనుగాని కనిపెట్టు టకై, శాస్త్రపరిశోధనాలయములలోని ప్రశాంతమగు నేమూలనో రోజులతరబడిని యువకులను డాక్టర్లు కూర్చుండి పరిశ్రమించుచుండుటను ఆమె చూచెనట. ఇట్లు వారు సంవత్సరములకొలదిగను, ఒకప్పుడు నిజముగ నీపరిశోధనలయందు తమ జీవిత మంతయునుకూడ వ్యయముచేయుదురనియు తెలియనగును. వారికి ధనాశ లేదు, మరే ఆశయును లేదు. కాని తత్త్వమును కను గొనవలయుననియు, తమప్రజలకును సర్వమానవకోటికిని సహాయపడు దేనినేని ఉత్పత్తి చేయవలయుననియు నే వారి సంకల్పము. మాతల్లి చెప్పినట్లు వారే నిజమయిన సన్న్యాసులు. వారికాపేరు సార్థకమయినది.

అందువలన, మన స్వదేశీ ఉద్యమములో ఈ సిద్ధాంత సూత్రమును మనము అవలంబింపజేయజాలు నెడల, మాతృదేశము మేలుకొరకు తను జీవితములను పరిశోధన కొరకు కొందరును, పరిశ్రమలకొరకు కొంద రును, వాణిజ్యనిర్మాణముకొరకు కొందరును, క్రయ విక్రయ సామర్థ్యసంపాదనముకొరకు కొందరును, వస్తు ప్రచారప్రకటనాది కళార్జనముకొరకు కొందరును తమ జీవితముల నర్పించినయెడల, ఈయందరి మనస్సులలోను అసలు సహకారభావముండినయెడల, మన స్వదేశీ ఉద్య మము విజయమును గాంచగలదు. లేకున్న, అది నశించి పోవలసినదే. మన మీస్వదేశీఉద్యమమును లోకమాన్య తిలక్ మహాశయుని రోజులనుండియు అంతకుపూర్వము నుండియు కూడ ప్రారంభించితిమి. భావోద్రేకములు అలలవలె పొంగినవి, క్రుంగినవి. మనము తత్త్వమును గ్రహింపనియెడల, గాంధీమహాత్ముని నాయకత్వమునాటి భావావేశపుటలలును అట్లే అణగిపోవును. ఆ మహాను భావునిగాని, తదనుచరులనుగాని తిరస్కరించుట నా ఉద్దేశముకాదు. నిజమును, వెనుకటి అనుభవమును మీ యెరుకకు దెచ్చుచుంటిని. 'మాడర్న్ రివ్యూ'

---

## శృంగారనాయికలు

### (ప్రాచీనచిత్రములు)

కేశవదాసరచితమగు 'రసికప్రియ' యను హిందీ శృంగారకావ్యమున గల నాయికావర్ణనలకే చిత్రము లన్నియు చిత్రితరూపము.

కేశవదాసుడు బుందేల్ఖండమండలవాసియగు నొకహిందీకవి. రాజామధుకరషా యతనికి తన యాస్థా నమున నాశ్రయమిచ్చి సమ్మానించెను. మధుకరుని యనంతర మతనియాసనము నధిష్ఠించిన యతని కుమా రుడు ఇంద్రజిత్తుషా యతని పాండితికి మెచ్చి 21 గ్రామములను బహుమతిగా నొసగెను. కేశవదాసుని రచనలలో రెండవది యీరసికప్రియ. ఇది సుమారు క్రీ. శ. 1591-వ సంవత్సరమున రచింపబడినది. దీని

తరువాతి రచన 'కవిప్రియ' యను నలంకార గ్రంథము. అది క్రీ. శ. 1601 నాటిది.

హిందీభాషయందు గల ప్రేమకావ్యములలో నీ 'రసికప్రియ' కు చక్కని యెన్నిక గలదు. ౧౭, ౧౮-వ శతాబ్దములనాటి పహాడీచిత్రములు చాలవరకు నీ కావ్యమునే యాధారముగా గొనుటయే యాతని ప్రామాణికతకు నిదర్శనము కాగలదు. ఆ చిత్రములలో చాలవానియందు అడుగుభాగమునను, కొన్నిట వెనుక వైపునను ఇతని పద్యములు నుద్ధృతము లయినవి.

ఈ సంచికయందు ప్రకటితములయిన చిత్రము లన్నియు ౧౭-వ శతాబ్దపు తొలిభాగమునకు చెందినవి. మొగలు చిత్రకళాశైలి యీచిత్రముల నాదరించినది.

ఒకప్పుడు అక్బరుచక్రవర్తి ఇంద్రజిత్తుపాకు అవిధేయతకుగా 10 మిలియనుల రూపాయల అపరాధ మును విధించెను. ఆసందర్భమున కేశవదాసుడు అక్బరు నాస్థానమునకు బయలుదేరి, అక్బరు మంత్రి వీరబలునితో నీ విషయమై రహస్యముగ మంతనమాడి యీ రసిక ప్రియను అతనికి వినిపించెను. వీరబలుడు అతని పాండి తికి మిక్కిలిగ నానందించి యీ యపరాధమును రద్దు చేసెను.

రసికప్రియ ౧౬ అధ్యాయముల కావ్యము. అందు ద్వితీయ, తృతీయ, సప్తమాధ్యాయములు మాత్రమే యీ చిత్రములకు సంబంధించినవి. నాయక లక్షణమను ద్వితీయాధ్యాయము నాలుగురకముల నాయ కులను నిరూపించును. నాయికాజాతివర్ణనమను తృతీ యాధ్యాయము నాయికాష్టకమును పేర్కొనును. అష్టనాయికావర్ణనమను సప్తమాధ్యాయము ఆ యెన మండుగురు నాయికలనే విశేషించి నిరూపించును. ఇందు ప్రకటితములయిన చిత్రములు చాలభాగము ఈ యధ్యాయముచిత్రణమే.

పహాడీచిత్రకారులు అష్టనాయికలను విరివిగ చిత్రించిరి. కాని దురదృష్టవశమున నన్నిచిత్రములును లభించినవి కావు. పలుతెరగుల చిత్రకళాశైలిని సమ న్వయించుకొనుటకు ఇవి కొంతవరకొంత యుపకరింప గలవను నాశ నిండుగనుండి దొరకినంతవరకు ప్రకటి తములయినవి. ఈ చిత్రములలో చాలవరకు రాధా కృష్ణులే నాయికానాయకులుగ చిత్రింపబడిరి.

ఈ చిత్రములను The Journal of Indian Art and Industry నుండి గ్రహించితిమి. ఆపత్రికవారి కిని, సదరుపత్రికను సేకరించియిచ్చిన పి. విశ్వనాథ్ గారికిని కృతజ్ఞులము.

---

## గాంధిమహాత్ముడు



ఈచిత్రము మాయపట్టు, నూలు గలిసి నేయ బడినది. శ్రీ అడాల నారాయణస్వామిగారు చేతి మగ్గముపయి దీనిని నేసిరి. వీరిది నెల్లూరుజిల్లా. చెన్నపుర మున ప్రభుత్వవస్త్రపరిశ్రమాలయమున విద్యార్థి. పరిశ్ర మాలయముననే దీనిని వారు నేసిరి. పండిత మోతీలాలు చిత్రమును గూడ వీరు నేసిరట.

---



# విమర్శనావళి

చిత్రప్రభ

భాగవతుల హరిశాస్త్రి విద్వద్వరవిరచితము: లఘుశబ్దరత్న వ్యాఖ్యానరూపము. *

సంపాదకులు: మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు, ఆంధ్ర విశ్వవిద్యాలయ పుస్తకమాల ౬. ౧౯౩౭.

పాతంజలమహాభాష్యము దురవగాహము కనుక విద్యార్థులకు సులువుగా వ్యాకరణశాస్త్రంలో ముఖ్యాంశాలు అందుబాటులో ఉండేటట్టుగానూ, అభినివేశమమాత్రమే కాకుండా, అభిరుచి కలిగేందుకుగానూ, భట్టోజీదీక్షితుడు సిద్ధాంత కౌముదిని రచియించి ఉంటాడని ఆ ఆచార్యుడి ఉదారాశయాన్ని, వేల్హారన్‌పండితుడు మిసుల ప్రశంసించియున్నాడు: బాలమనోరమ తత్త్వబోధినులు ఆవుద్గ్రంథములో ఉన్న విశేషార్థములను చక్కగా వివరించుతూన్నవి:

సాధారణముగా కావ్యాన్ని రచించే దొకరూ, తద్గతార్థాన్ని-తత్రాపి కవిభావాన్ని-వివరించేది మరొకరూ - గ్రంథకారుడూ - వ్యాఖ్యాత- అనే విశిష్టమనీషిద్వయ పరస్పరాను యోజనముచేత సాహిత్య - తద్వతు, శాస్త్ర ప్రపంచమంతా, యథానిర్ణీతస్థితిని నడుచుకుంటూ వస్తూన్నా, జైనాచార్యులు, ఆ త్రోవకు చాలాచోట్ల వైదొలగి నడిచారు: చాలామంది-హేమచంద్రాదులు-స్వయంగానే, తమ గ్రంథములకు వ్యాఖ్యలను నిర్మించుకున్నారు.

ఔత్తరాహుల ఆచారాన్ననుసరించి, దీక్షితుడుకూడా తన సిద్ధాంతకౌముదికి ప్రౌఢమనోరమావలంబన మొనకూర్చినాడు: దాక్షిణాత్యప్రౌఢ, విశేషించి మనోరమ,-నోరూరించే, ఆమె ఆకారవిశేషము, పాదుపాల వైభవముతో విశేషపరిచయముచేత-యవనీ నవనీతకోమలాంగీ శయనీయే యది నీయతే కదాచిత్. .- అన్న విభ్రమములో మునిగియున్న ఆంధ్రుణ్ణి-పండితరాజును పరవశుణ్ణిగా చేసివైచినది.. గురుకులమునకు చెందినకన్నె అనిఅయినా యోజించకుండా.. మర్యాదాతిక్రమణానికి దోవతీసే ఆతని ఉద్యమము,— ప్రౌఢమనోరమాకుచమర్దనము—చిరప్రతిష్ఠ నందకపోవడం పండితరాయల భాగ్యప్రాబల్యాన అనే చెప్పవచ్చును: లేకపోతే, మనోరమ మనోరమగా ఈ నాటివరకూ ఉండకలిగేదా?

భట్టోజీదీక్షితుల ప్రౌఢమనోరమను, ఆతని మనుమడు.. సర్వసమర్థుడగు హరిదీక్షితుడు (లఘు) శబ్దరత్న సంకలితానర్ఘ భూషావిశేషముతో అలంకరించాడు. ఆతని ఛాత్రసంతతిలోనివాడగు భైరవమిశ్రుడు, గురుపాదుల వివరణమునకు మెరుగులు పెట్టినాడు: ప్రౌఢమనోరమ చదివేవారందరికినీ శబ్దరత్నభైరవి చాలా తోడ్పడుతూన్నది:

హరిదీక్షితుని వృత్తికి వివరణరూపమగు చిత్రప్రభను ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ప్రకటించి, శాస్త్రవిదుల కందరకు మహోపకృతి నొనరించినారు.

భాగవతుల హరిశాస్త్రిలుగారు పేరెన్నికగన్న పండితుడు: సద్వైదికుడు: విశ్వనాథశాస్త్రి మొద

---

* నాగరలిపి రాయలుసైజు ౮౫౦ పుటలు. వెల రు ౮-౦-౦.

లనువారితో చేర్చి గారవింపదగిన ప్రతిపత్తికల వ్యాకరణాచార్యుడు. పతంజలి కపరావతారమని పొగడ్త నందిన కాశీనాథశాస్త్రిమహోపాధ్యాయుని శిష్యుడు: కాశీనగరస్థ విద్యాపరిషదంతరముల నప్రతిమాను డని పించుకొన్న విద్వదగ్రణి: విజయనగర మహారాజ శ్రీ విజయరామ గజపతి యాదరణంబున కలరి, వాత్సల్యంబున, ఆతని యాస్థానము నలంకరించి, వాక్యార్థ చంద్రిక మొదలగు గ్రంథముల రచియించి చిరకీర్తి నందినవాడు:

వాక్యార్థచంద్రిక పుస్తకరూపమున వెలువడిన యాభై సంవత్సరములకు చిత్రప్రభ అందరికీ అందుబాటు లోకి వచ్చినది: పండితులందరికీ యీవ్యాఖ్యానము సంగతి తెలిసియున్నా, గ్రంథం సమగ్రంగా, అనువైన రూపమున లభియించడం ఇదే మొదటిసారి:

గ్రంథము అచ్చులోనికి వచ్చేటట్టు తయారు చేసింది, మ. మ. తాతాసుబ్బరాయశాస్త్రిగారు: హరిశాస్త్రులవారి గ్రంథాన్ని సంశోధించి ముద్రణరూపాన్నందించేందుకు, అంతకన్న వేరొకరు సమర్థులు తెలుగు దేశములో లేరనే చెప్పవచ్చును: శ్రీ శాస్త్రులవారి లఘుటిప్పణి.- అన్వర్థాభిధానయుతమై, విశేషములన్నీ విపులంగా వివరించేందుకు తగిన అవకాశాన్ని కలుగచేసుకోకుండా ఉన్నా—చిత్రప్రభకు సందర్భానుసారంగా తోడ్పడుతూ గ్రంథాన్ని అర్థంచేసుకునేందుకూ, సందేహాలు నివృత్తిచేసుకునేందుకూ, చాలావరకూ ఉపకరిస్తూన్నది: పునర్ముద్రణావసరము లభియించినపుడు, లఘుటిప్పణికి, లఘురూపాన్ని తొలగించి, గురుప్రసాద సంలబ్ధమైన ధిషణావిశేషాన్ని వ్యాకరణజిగీషామనీషులందరికి ఇతోధికంగా తోడ్పడేపద్ధతిని వెలయిస్తారని ఆశయము: చిత్రప్రభకు, శాస్త్రులవారు 'లఘు' టిప్పణిని ఏలా రచియించగలిగారో అని ఆశ్చర్యముగానున్నది:

హరిదీక్షితుడి లఘుశబ్దరత్నం విషయములో— ఆకృతి, సుప్రసిద్ధుడును, తచ్ఛిష్యుడును అగు నాగేశ భట్టే రచియించి, గురువుపేర వెలయించినాడన్న ఒక గాథ ఉన్నది—కాని దానికి సరియైన ఆధారములు లేవు: శబ్దరత్న గ్రంథప్రస్తావనయందునూ, లఘుశబ్దేందుశేఖర ఉపోద్ఘాతమునందునూ, సంపాదకులు ఈ విషయాన్నిగురించి చర్చసలిపి ఆప్రవాదము సరియైనది కాదని తెలిపినారు: కాన అది నిశ్చితమగు విషయమే, అన్యతమములగు ప్రమాణములు లభియించనంతవరకునూ:

నాగేశభట్టుకు తరువాతి వారందరూ, ఆతని సిద్ధాంతాలను ఖండించడమే చాలావరకు ముఖ్య ప్రయత్నముగా తలపెట్టినట్టు తోస్తూన్నది. కాని, గ్రంథములన్నీ క్రమముగా పఠించితే, అవి ఎవ్వరికినీ శక్యముకానివనీ, ఋజువైనవి కానివనీ తెలుస్తుంది. శ్రీసుబ్బరాయశాస్త్రిగారు ఈ మతమునకు చెందినవారు: హరిశాస్త్రులవారు. . ఇంకొకత్రోవను, ఈగమ్య స్థానమునే చేర నూహించినవారు: కావుననే, చిత్రప్రభకు లఘుటిప్పణి తోడ్పడగలుగుతూన్నది:

చిత్రప్రభను విడిగా ముద్రించక, హరిదీక్షితుని గ్రంథముతో చేర్చినచో ఇంకా చాలాబాగుండేది. శబ్దరత్నభైరవి, చిత్రప్రభ, రెండునూ సమానాశయము, సమానవ్యవహారము కల వ్యాఖ్యలు: అందు ముఖ్యముగా, భైరవమిశ్రుడి వ్యాఖ్యతోకూడా ఉంటేనేకాని, చిత్రప్రభ సార్థకత వహించదు. ఒకదానిలో లఘువుగా ఉన్న వివరణము వేరొకదానిలో విపులముగా లభించడముచేతనున్నా, ఆలాగే తద్వ్యతిరిక్తక్రమాన్నీ—రెండూ ఒకచోట, ఒకగ్రంథములో లభియిస్తేనేకాని, అంతప్రయోజనము ఉండదు. శబ్దశాస్త్రమంతా పుస్తక సాహాయ్యము లేకుండా తిరగవేయగల సామర్థ్యమున్న శ్రీరాయడుశాస్త్రులగారివంటివారికి గాని, ఈ విధములగు ప్రచురణములు సామాన్యులకు—కష్టంమీద కాని-ఉపకరించవు: ద్వితీయ సంస్కరణమునం దీలోపము విధిగా సవరింపబడవలసినది:

నారసింహ సంస్కృత పాఠశాలాధ్యక్షులగు వరదాచార్యులుగారు, హరిశాస్త్రులగారి జీవనవృత్తాంతమును ఆంగ్లమున భూమికారూపమున వెలయించినారు: శ్రీశాస్త్రులవారు, సంస్కృతంబున లఘువుగ ఉపోద్ఘా

తము రచియించినారు: విశ్వవిద్యాలయోపాధ్యాయుల తొలిపలుకు వీనికి ప్రాగ్భాగమున నున్నది:

అనతికాలముననే, హరిశాస్త్రిలవారి రత్నాపణమును (లఘుశబ్దేందు శేఖరవ్యాఖ్య) కూడ బయలు పరచుభారము ప్రచురణకార్యాధ్యక్షులదై యున్నది:

మల్లాదిరామకృష్ణశాస్త్రి

---

## అన్నపూర్ణాదేవి లేఖలు

కీ. శే. శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి తన భర్తయగు శ్రీ బాపినీడుగారికిని, మిత్రవర్యులగు శ్రీ దండునారాయణరాజుగారికిని వ్రాసిన లేఖలు. ప్రకాశకులు, బాపినీడుగారు. "అన్నపూర్ణకు బదులుగా తనకు తోడునీడయయి యుండుట కంగీకరించిన శకుంతలాదేవికి పరిణయసమయమున" (౨౫-౬-౩౩) బాపినీడుగారొసంగిన పారితోషికము. ఈ సంపుటము, "అనుకూల దాంపత్యము కలిగి దేశసేవాపరాయణులయిన యువతీయువకులకు ప్రేమపూర్వకమయిన కానుక"గ ప్రచురింపబడినది.

క్రౌను సైజున ౨౬౦ పుటలు. ఆంటిక్ కాగితములు. మంచియచ్చు. అందమగు ఆర్టుపేపరు. లోన నొకఛాయాచిత్రమును గలదు. వెల ౨-౦-౦. 'ఈగ్రంథమును గొనువారు శ్రీ అన్నపూర్ణాదేవి స్మారకచిహ్నములుగా నడుపబడుచున్న సంస్థలకు సాహాయ్యము చేయుటయే గాక ఆమె చేసిన దేశసేవను, త్యాగమును ప్రశంసించినవారగుదురు. ఈ పుస్తకము ప్రతులు కావలసినవారు ఈక్రింది చిరునామాకు వ్రాయవలయును:— కార్యదర్శి, అన్నపూర్ణాదేవి స్మారకసంఘము, ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా, లేక, మాగంటి బాపినీడుగారు, ఏలూరు.

కీ. శే. అన్నపూర్ణాదేవి 'బ్రతికిన కొలది కాలము బలే యనిపించుకొని పుణ్యజీవితయై ధన్యురాలయ్యెను...... దేశీయులందరిని ఆకర్షింపగల్గిన ఆదర్శజీవి అన్నపూర్ణ.' ఈమెనుగూర్చి గాంధీమహాత్ముడు "ఎంతయోధైర్యము, చిత్తశుద్ధి, దేశభక్తి గలిగి నిశ్చల భక్తితో ఫలాపేక్ష వదలి దేశసేవ చేసి, భారతపురంధ్రులలో తనకు గల పుత్రికలలో అత్యుత్తమురాలని భావించుకొను భాగ్యము తనకు గల"దని వ్రాసియుండెను. 'ఇట్టి అత్యుత్తమురాలి మనోవికాసమెట్టిదో తెలిసికొనుట పురుషుల కెట్లున్నను స్త్రీలకు అవసరము. కారణము ఈజాబులలో విద్యాకాంక్ష, పరిసరముల ప్రభావము, పండితుల స్నేహము, దేశారాధకుల సహవాసము, దేశసేవకయి వజ్రసంకల్పము, త్యాగము, చివరకు ఆత్మసమర్పణము, తమకథ తామే చెప్పుకొనును'. 'భార్యాభర్తల ఆదర్శజీవితము, దాంపత్యసౌఖ్యము, స్నేహము, ప్రేమ కనబడుటయేగాక, సదుద్దేశములున్న ఆదరించి ప్రోత్సాహపరచిన స్త్రీలెట్లు ఉత్తమురాండ్రయ్యెదరో సజీవమగు దృష్టాంత మిందు గలదు'. "ఆమెనిబోలి, భారతనారీమణులెల్లరు పవిత్ర హృదయులై, పతివ్రతలై అనురాగబలముననే తమ భర్తల ననుకూలురుగను సన్మార్గప్రవర్తకులుగను గావింపవలయు" నని మహాత్ముడు చెప్పెను. 'ఈపత్రములలో నామె నిజహృదయము విస్పష్టముగా ప్రకటితమగును.' 'ఆంధ్రదేశమందు ౧౯-౨౦ మొదలు ౧౯-౩౩ వరకు రాజకీయాందోళనచే ఆంధ్రులహృదయ మెట్లు మథించబడెనో, గాంధితత్త్వ మెట్లు యువతీయువకుల నాకర్షించి మహాయుద్ధమునందు దుమికించెనో, పూస గ్రుచ్చినట్లు ఈయుత్తరములలో చిత్రింపబడెను.' ఆమె 'మానసికస్థితి, భావములును' 'ఆధ్యాత్మిక చిత్తప్రవృత్తి' యు వీనివలన తెలియగలవు. 'లేఖలన్నియు పఠించిన, గాంధీభక్తురాలి క్రమవికాసమును, తన జీవితతత్త్వరహస్యమును విశదమగును'. "ప్రాచీనకాలమున మనదేశమనుభవించుచుండినట్లు అనేకులు చెప్పు స్వాతంత్ర్యమును మనదేశము తిరిగి పొందుటకుగాను అనేకులగు యువతీయువకులు ఈమెమార్గము ననుసరించి తమ జీవితములను నిజధర్మాచరణమునకు ధారపోయక తప్పదని నేను నిశ్చయముగా జెప్పగలను." అని గాంధీజీ ఈమెను గూర్చిన ప్రశంసందర్భమున వ్రాసియుండెను.

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు గీసంపుటమునకు 'కడమాట' ను వ్రాసిరి. 'తెలుగు భావలో ఇటువంటి ఉత్తరాలు ప్రకటించడానికి ఇది మొదలు ...... దేవిగారి ఉత్తరములు చాలమట్టుకు ఉన్నవిఉన్నట్టు ప్రకటించడముచేత ఆమె అంతర్భావములును, సమకాలిక విషయములును మరుగులేక వెల్లడియైనవి ...... దేవి బ్రహ్మసమాజవాతావరణములో పెరిగిన పిల్ల. సంస్కరణ బీజములు మనసున చిన్నతనముననే నాటుకొన్నవి. ...... వలచి వివాహమాడినది. తనవలెనే తన భర్తయును.... దేశసేవయొనర్చి ధీరుడు, వీరుడు, కీర్తిమంతుడు కావలెనని ఆశించినది. ... ఈమె రాజకీయభావములు మిక్కిలి తీవ్రమయినవి. ఖయిదుకుపోవుట స్వల్పత్యాగముగా కనబడినది. దేశమునకై ప్రాణములు సమర్పించి వీరవనిత అనిపించుకోవలెనని అభిలషించినది. సత్యాగ్రహోద్యమమును దేశమోక్షమునకేగాక ఆత్మమోక్షమునకును సాధనముగా గ్రహించినది. సత్యాగ్రహమును ధర్మసాధనగా గ్రహించినవారరుదు. ఈసాధన ఆమె ఆత్మోపలబ్ధికి మిక్కిలి తోడ్పడినది ...... ఈమె తీవ్రమైన సంఘసంస్కరణాభిలాషి. హిందూసంఘమునందు స్త్రీలకు అర్హస్థానము సంపాదింపవలయునని ఆశించినది. ... స్వాతంత్ర్యము కోల్పోవుట కామె యిసుమంతయు నంగీకరింపలేదు...' "నేను జనులకు భయపడను. ఎవరేమనుకొన్నను నాకు కష్టములేదు. ...నేనీభువిపై నెవరికిని భయపడను. కేవల మొక్క పరమేశ్వరునకే భయపడుదును." ఈ వాక్యము లామె పవిత్రతను స్వాతంత్ర్యమును ధైర్యమును చాటగలవు 'ఇట్టి ఉత్తమ భావములచే ఉత్తేజితయైన యావ్యక్తి ధన్యురాలు.' ఈమె 'భర్తకు సాధనమగుటయే స్త్రీజన్మసాఫల్యమని విశ్వసించలేదు. స్త్రీయొక్క ప్రత్యేకవ్యక్తిత్వమునందు ఆమెకు విశ్వాసము గలదు. ......ఆమె రాబోవు స్త్రీత్వమునకు మాతృక' ... 'ఈలేఖలు ప్రత్యేకించి శ్రీ దేవిగారియొక్క ఆశయములను, వ్యక్తిత్వమును, జీవిత సముదారలక్ష్యమును ఆంధ్రలోకమునకు వ్యక్తీకరించు నిమిత్తమే ప్రచురింపబడినవి. వీని ప్రచురణమునకయి శ్రీ బాపినీడుగారు చూపిన ధైర్యస్థైర్యములు, త్యాగము, సతియందలి శ్రద్ధయు స్తవనీయములు.'

ఆంధ్రనారీమణులకు ఆదర్శప్రాయమైయుండి సార్థకముగ కీర్తిశేషురాలయిన మాగంటి అన్నపూర్ణా దేవియొక్క ఈలేఖల సంపుటము ప్రతిస్త్రీయు, బాలికయు నేగాక యువకులెల్లరునుకూడ చదివి ఇందలి ఉత్తమ-ఉన్నత భావములను మననము చేసుకొనవలసినది.

జ. బ్ర.

---

## హరిజనసమస్య

గ్రంథకర్త: శ్రీ నండూరి వేంకటకృష్ణమాచార్యులుగారు, బి. ఏ., (కాకినాడ జాతీయ గ్రంథమాల మూడవ కుసుమము).

క్రౌను సైజు, పుటలు ౩౬౬, వెల రు. ౧-౦-౦.

ఈగ్రంథము అయిదుఖండములుగ విభజింపబడియున్నది. మొదటిదానియందు హరిజను లనువారు ఎవరయినదియు, వారిస్థితిగతులు మనదేశమున నే రాష్ట్రమున నెట్లుండునదియు మనపూర్వులను శంకరరామానుజ మధ్వాదిమతాచార్యులు హరిజనులపట్ల ఏవిధముగ మెలగుచుండినదియు, ఇటీవల మనదేశమున అవతరించిన మహనీయులు వీరల నెట్లయిన నుద్ధరింప, పడిన పాట్లను గురించియు విపులముగ వ్రాయబడియున్నది.

ద్వితీయఖండమందు హరిజనోద్ధరణకై నిరంతరము చింతించుచు వారిపాలిటి వేలుపై యవతరించిన గాంధీమహాత్ముని వ్యాసములయొక్క ఆంధ్రానువాదము గలదు.

మహాత్ముడు హరిజనులస్థితిని చక్కగానెరిగి, వారికి నిజమయిన హక్కుల నీయనియెడల తన జీవితశేషమంతయు ఉపవాసముచేసి ప్రాణములవీడెదనని ప్రతిజ్ఞచేసెను. అంతట, రాజకీయసంస్కరణలయందు హరిజనులవిషయమై తృప్తికరములగుమార్పులు జరిగినవి.

తృతీయఖండమందు రాజకీయ సంస్కరణములయందు హరిజనులకు తదితరజాతులతో సరిపోవునట్టి సంస్కరణములను సంపాదించుట, మహాత్ముని యుపవాస వృత్తాంతము, దేశనాయకులు హరిజనోద్ధరణకై గావించిన సంస్కరణల వృత్తాంతము గలదు.

చతుర్థఖండమందు హరిజనోద్ధరణకై యుపకరించునట్టివ్యాసములు, సవర్ణుల కర్తవ్యములు, శాస్త్రముల యొక్క రహస్యములు మొదలగువానినిగురించి, పూనా ఒడంబడికకుతరువాత మహాత్ముడు గావించిన ప్రకటనల కనువాదములు గలవు.

పంచమఖండమున మహాత్ముని మూడువారముల యుపవాసదీక్షాచరిత్రయు, అందునుగురించి దేశనాయకుల యభిప్రాయములును గలవు.

హరిజనోద్ధరణావశ్యకతనుగురించి సభలు జరిపి తీర్మానముల నామోదించి అంతటితో విరమించుకాలము కాదిది. హరిజనోద్ధరణదీక్షకై పూనుకొనినవారు ధనవంతులును, త్యాగశీలురుగను నున్నారు. ఇక మిగిలినది కావ్యధోరణిని కార్యధోరణిగ మార్చుటయే.

అనేకగ్రంథముల శోధించియు, హరిజనసేవ నుపకరించు భాగముల నాయాగ్రంథములనుండి యుద్ధరించియు గ్రంథకర్తగా రీగ్రంథమును రచియించిరి.

హరిజనోద్ధరణమునకయి యందందు ప్రకటితములయిన విషయముల నన్నింటిని ఏర్చి యొక్కచో కూర్చి గ్రంథముగ ప్రచురించిన శ్రీమదాచార్యులుగా రభినందనార్హులు. హరిజనోద్ధరణాసక్తులకందఱకు నీ గ్రంథము మిక్కిలి యుపయోగకరము.

---

## హిందూజీవనపథము

## ( The Hindu View of Life )

రాజమహేంద్రవరములోని ప్రాక్ ప్రతీచీ గ్రంథాలయమువారి ౨-వ ప్రచురణ మిది. క్రౌను సైజున ౨౧౬ పుటలు. మంచియట్ట, చక్కని అచ్చు, వెల ౧-౮-౦.

'ప్రాగ్దేశీయుల యొక్కయు, పాశ్చాత్యుల యొక్కయు ఉత్తమజ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తము చేయుట' ఆశయముగాగల ఈ గ్రంథమాలసంపాదకులగు శ్రీకామరాజు హనుమంతరావుగారు, సర్. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు, ఎమ్. ఏ., ౧౯౨౬-వ సంవత్సరమున ఆక్సుఫర్డులోని మాంచెస్టరు కళాశాలయందు గావించిన అప్టన్ ఉపన్యాసములను, ఆంగ్లము నుండి ఆంధ్రములోనికి అనువదించినారు. దీనివలన ఆంగ్లమురాని యాంధ్రజనుల కెంతో ఉపకారము చేసిరనవలెను. ఈ తెనుగురచనము చదివి ముగించినవెనుక ఇది యాంధ్రీకరణమేగాని అసలు తెలుగులోనే వ్రాయబడిన గ్రంథము కాదని స్ఫురించినను అనువాదకులు రాధాకృష్ణపండితుని భావములు పొల్లుపోకుండునట్లు చాల జాగ్రత్తగనే అనువాదకార్యమును సాగించిరని చెప్పక తప్పదు.

ఈ గ్రంథము హిందూధర్మముయొక్క విశేషమును లోకమునకు జాటుటకును, హిందూజీవనపథము యొక్క మూలసిద్ధాంతములను వెల్లడించుటకును ఉద్దేశింపబడినది. ఇందు ఈశ్వరానుభవము, తల్లక్షణము, తత్త్వము; మతములసంఘర్షణము; హిందువుల వైఖరి; హిందూధర్మము; అను శీర్షికలక్రింద నాలుగు ఉపన్యాసములు గలవు.

రాధాకృష్ణపండితునివంటివారు తమ మాతృభాషయందు తమఉపన్యాసములను జరిగించుటయు, వ్యాసములనుగాని, గ్రంథములనుగాని రచించుటయు చేయనప్పుడు వారు ఆంగ్లములో గావించిన అద్భుతరచనములను ఆంధ్రములోనికి పరివర్తనముచేయుట అత్యంతావశ్యకము. అట్టి పనిని నిర్వహించి శ్రీ హనుమంతరావుగారు ఆంధ్రులకు ఉపకారము నొనరించిరి.

ఈగ్రంథమందు రాధాకృష్ణపండితులు, భారతదేశమున ఆదికాలమునుండి నేటివరకును ప్రవర్తిల్లుచు వచ్చిన అసంఖ్యాకములు, వివిధములు, ఒక్కొకపుడు పరస్పరవిరుద్ధములునగు మతాచారవ్యవహార సంప్రదాయములను, కర్మకాండను, బహుదేవతారాధనమును, వర్ణ

వ్యవస్థను, ఆశ్రమచతుష్టయమును, జాతి భేదములను—ఇంత యేల, భారతీయజీవనమున గల సర్వమును—భేదములతోసహా—సమర్థించుచు వ్యాఖ్యానముచేసిరి. ఇతర దేశములనుండియు, ఇతరమతములనుండియు, ఇతర నాగరికతలనుండియు కలిగిన ప్రభావమువలన భారత జాతీయమతమున కలిగిన మార్పుకూర్పులనుకూడ రాధాకృష్ణగారు సమర్థించిరి. హిందూమతము అన్నిసంప్రదాయములను నదులను తన లోనికి చేర్చుకొని ఐక్యము చేసుకొను అగాధమును, అపారమును నగు మహాసాగరమని మామూలుగ ననుకొను వాక్యము సార్థకమనియు, ఇంత విశాలమగు మతము మరేదియు లేదనియు నచ్చజెప్పుట కీపండితులు చాల శ్రమపడి రనవలెను.

జ. ప్ర.

# పత్రికా విమర్శనము

## ఆంధ్రభూమి

క్రొత్తసచిత్రమాసపత్రిక. మొగటిసంపుటమున మొదటిసంచిక ౧౯౩౩ మే ౨౫-వ తేదిన వెలువడినది. సంపాదకుడు, ప్రకాశకుడు: ఆండ్ర శేషగిరిరావుగారు, బి. ఏ., ఆంధ్రభూమి ముద్రణాలయము, వేపేరి, మదరాసు. ప్రతినెల ౨౫-వ తేదినాడు ఈపత్రిక వెలువడుచుండును. చందా. సంవత్సరమునకు రు. 3-0-0. విడిసంచిక రు. 0-4-0.

'సమగ్రమయిన ఆంధ్రజాతీయైక్యమును పెంపొందించుటయు; ఆంధ్రకళ, ఆంధ్రసారస్వతము వీని విశేషాభ్యుదయమునకు పాటుపడుటయు' నీపత్రిక 'ప్రధాన సంకల్పము.' 'ఇందు ప్రముఖస్థానము నలంకరించు' నవి 'సర్వతోముఖమగు ఆధునికవిజ్ఞానమును, అర్వాచీన నాగరికతను ప్రస్తరించు వ్యాసములు.' ఇంతేకాదు. 'ఆంధ్రుల ఆర్థికసాంఘికాద్యభివృద్ధులను పెంపొందించు ప్రబోధకవ్యాసములకును, ఆంధ్రక్షేమమునకయి సర్వవిషయములకును' ఇందు 'ప్రతిమాసము కొన్నిపుటలు ప్రత్యేకింపబడును.'

'భీమావ్యాపారమునుగురించినవ్యాసము లిందొక విశేషాంశము'. 'భారతరమణుల ఔన్నత్యమునకైన ఉద్యమాభివృద్ధికి సముచితసరణిని కృషిసల్పి మహిళల జీవితసమస్యలకు సంబంధించినవిషయములకు ప్రత్యేక వివరణమిచ్చుట' దీని 'ఆశయములలో నొకటి'. ఈపత్రిక 'శ్రద్ధధానయై' 'వలసపోయిన ఆంధ్రులస్థితిగతులగూర్చి రాష్ట్రమునందలి ఆంధ్రులకు వివరించును;' 'భాషా ప్రచారమునకు మూలభూతములైన గ్రంథాలయసంబంధమగు విషయములను క్రోడీకరించు'ను; 'దేశాభ్యుదయమునకైన జమీందారుల విశేషకృషిని కీర్తించు'ను.

'ఇట్టి...విశేషాశయములతో వెలువడుచున్నది' ఈ 'ఆంధ్రభూమి.' సంపాదకులు నాలుగేండ్లు 'గృహలక్ష్మి' పత్రికాసంపాదనకార్యమును నిర్వహించి మించిన వారగుట యీపత్రికకు గల యుపర్యుక్త 'విశేషాశయములకు' వన్నెవెట్టు విశేషము.

ఉద్దిష్టాశయములకు సరిపోవు వ్యాసము లీసంచికయందు కొన్నిగలవు. గద్యవ్యాసములయందు 'ఉద్యోగపుటుద్ది' (కవికొండల వేంకటరావుగారికథ)యు, పద్యవ్యాసములయందు 'ఆంధ్రభూమి' (వోలేటి పార్వతీశముగారిది) యు నగ్రగణ్యములు. తక్కినవ్యాసములు రచయితృ సంస్కారానుగుణములయి దేశమునందలి విజ్ఞానసంపదయొక్క పరిమితికి నిదర్శనములుగ నున్నవి.

ఆయా వ్యాసకర్తల సంతకములకు ప్రతిబింబములు వారివారి వ్యాసములచివర ముద్రితములయినవి. ఇది యింకొక విశేషము.

ఇందు 'మహిళాలోక' మంతయు కీర్తిశేషమయినది. ఇది సరసముగా గాన్పింపదు.

గాంధిమహాత్ముని చిత్రము పత్రికముఖము నలంకరించినది. మరియొండురెండుచిత్రములు—ప్రకృతిచిత్రములుకూడ—గలవు.

మంచిపత్రికలు విజ్ఞానవర్ధకములు; విజ్ఞానసంపద దేశాభ్యుదయహేతువు. విద్య, సంస్కారము, ధనము పత్రికల యుత్పత్తిస్థితులకు సాధనములు. అందును ధనము

ప్రధానము. దేశహితకార్యములకు ధనము లభించుమార్గములు మన దేశమున లేనికాలమున ఏతత్పత్రికా ప్రారంభము సంపాదకుల సాహసోత్సాహములకును, దేశాభ్యుదయాకాంక్షకును గొప్పనిదర్శనము. సర్వాంగీణముగ స్వీయాభ్యున్నతికొరకై యవతరించిన ఈ 'ఆంధ్రభూమి' కాంధ్రభూమి చిరస్థాయిత్వమును సమకూర్చుకొనవలెను.

---

# గ్రంథస్వీకారము

## "అష్టాదశమహాపాపియగు బ్రాహ్మణునితో సహాయనిరాకరణ మొనర్పుము"

గ్రంథకర్త: దుగ్గిరాల రాఘవ చంద్రయ్య సచ్ఛాస్త్రి గారు. బెజవాడయంపలి సద్బ్రాహ్మణ గ్రంథమాలా ప్రథమకుసుమము.

క్రౌను సైజు: పుటలు ౪౬౪, వెల రు. ౨-౮-౦.

---

## సముద్రమథనము (విష్ణుమాయావిలాసము)

గ్రంథకర్త్రి: శ్రీమతి చిల్కపాటి సీతాంబ గారు. నెల్లూరి శ్రీవాగ్వల్లి గ్రంథమాలాష్టమకుసుమము, కే. వి. రామానుజాచార్యుల ప్రచురణము.

క్రౌను సైజు: పుటలు ౧౧౧, వెల రు. ౦-౧౪-౦.

---

## గిరికాపరిణయము

గ్రంథకర్త: కంచర్ల వేంకటహనుమయ్యగారు, నరసారావుపేటలోని రాజ్యరమాముద్రాక్షరశాలయందు ముద్రణప్రచురణములు.

డెమ్మీసైజు: పుటలు ౬౨, వెల రు. ౦-౧౨-౦.

---

## ధనంజయవిజయము (సైంధవవధ)

గ్రంథకర్త: వేమూరు సుందరరామశర్మగారు, నవాబుపేట, నెల్లూరు.

డెమ్మీసైజు: పుటలు ౮౪, వెల రు ౦-౧౨-౦.

---

## జ్ఞానాంజనము

క్రౌను సైజు: పుటలు ౨౦, వెల ౦-౦-౬. హెడ్డాఫీసు, రామన్కోటె, కేలమంగళము, సేలముజిల్లా.

## భక్తరక్షణశతకము

గ్రంథకర్త: వడ్డాది భీమశంకరకవిగారు. పరిశోధకులు: పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారు. ప్రకాశకులు: వడ్డాది సీతారామాంజనేయులు గారు, ఖాశింకోట.

డెమ్మీసైజు: పుటలు ౧౭, వెల రు ౦-౧-౦.

---

## అద్వైతమతసిద్ధాంతరహస్యం

గ్రంథకర్త: దెందుకూరి నృసింహశాస్త్రిగారు, శ్రీ విద్యాముద్రాక్షరశాల, విజయనగరమందు, ముద్రణ ప్రచురణములు.

డెమ్మీసైజు: పుటలు 33.

---

## గురుదత్త సరస్వతీయము

## (జ్ఞాన కర్మ భక్తికాణ్డాత్మకము)

గ్రంథకర్త: నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు. బందరు సత్యసాధనీ ముద్రాక్షరశాలలో ముద్రితము. ఇందు జ్ఞానకాండము ఆంధ్ర యూనివర్సిటీ ౧౯౩౬ బి. ఏ. పరీక్షకు పఠనీయము.

డెమ్మీసైజు: పుటలు ౕ౮౨, వెల రు. ౧-౮-౦.

---

## భాగవతావతరణము (పద్యనాటిక)

డెమ్మీ ౧౬ పుటలసైజు, ౪౦ పుటలు, వెల తెలియదు. నోరి నరసింహశాస్త్రిగారు, సాహితీసమితి, గుంటూరు, తెనాలి, రేపల్లె.

---

## అద్వైతచంద్రిక

గ్రంథకర్త: శ్రేష్ఠులూరు కృష్ణస్వామయ్యగారు. డెమ్మీ ౧౩౭ పుటలు, వెల రు. ౧-౦-౦.

ప్రకాశకులు: తిరుపతి శ్రీ స్మార్తధర్మమండలి.

---

## దేశభక్తుడు

## (Kandan The Patriot)

అనువాదకులు: గుఱ్ఱం సుబ్రహ్మణ్యంగారు.

వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్సువారిచే ప్రకటితము. క్రౌనుసైజు, పుటలు ౨౧౭, వెల ౧-౦-౦.

---

# శ్రీమంతుడా?

మం. వేంకటశర్మ

ఓయి శ్రీమంతుడా, చూడవోయి నీదు
పరిసరంబులయందు కాపురములున్న
నీదు సోదరు లెందరో నెవ్వచేత
పడెడుపాటులు నీకు కన్పడవటోయి
వారి యేడ్పులు నీకు విన్పడవటోయి
నీసహోదరు లెందరో బైసిమాలి
నీచదుర్దశచే తలదాచుకొనగ
చుట్టుగుడిసెలు లేక యేచెట్టుకింద
చేనుకిందనో పడరాని బాము లొంద
మిద్దెలందును నద్దాల మేడలందు
నీవు సుఖియింప నెటులొప్పె నీమనస్సు
పేదలగు నీదుసోదరుల్ పెంపుమాలి
చింపిమసిపాతలను గట్టి సిగ్గుపడగ
విలువలేనట్టి దువ్వలువలను దాల్చి
షోకుచేయంగ నెటు లొప్పె నీకు మనసు
సోదరుల కెవ్వరికి లేని సుఖము పొంద
గోరిగద కట్టుకొన్నావు గొప్పమేడ
మేడచుట్టును నున్నారు గోడుగోడు
మనుచు కూటికి గుడ్డ కల్లాడునట్టి
పేదతమ్ములు వారల రోదనముల
నడుమ నీ కేమిసుఖము చేపడునో చెపుము
నీకు సంతోష మున్నదో నిజముచెపుము
అర్థమే నీకు చుట్టమైనందుచేత
అర్థమే నీకు నేస్తమైనందుచేత
అర్థమే నీకు ప్రాణమైనందుచేత
అర్థమే నీకు పుణ్యమైనందుచేత
అర్థమే నీకు మోక్షమైనందుచేత
అర్థమే నీకు ధర్మమైనందుచేత
అర్థమే నీకు దైవమైనందుచేత
అర్థమే నీకు సర్వమైనందుచేత
అర్థమునె నీవు కొల్చుచున్నందుచేత
అర్థమునె నీవు నమ్మికొన్నందుచేత
అర్థమే నీకు గొప్ప యనర్థమయ్యె
నిత్యమును నీవు ధనము గణించునపుడు
నేర్పుతో నీవు దాని గుణించునపుడు
కరకుదనము వహించెడుకారణమున
కనికరము చూపు టెరుగని కారణమున
క్రౌర్యవృత్తిని వర్తించుకారణమున
ధనమదాంధతచే నీవు కనులుపోయి
కానిపను లొనరించెడుకారణమున
కారియలబెట్టి ప్రజ నొంచుకారణమున
నూరివారెల్ల వైరులైనారు నీకు
దూరమైపోయినారు బంధుగులుకూడ
లేనె లేరుగదా మిత్రులైనవారు
ఇష్టులొక్కరు లేరు నీకీ జగాన
కష్టముల కాదుకొనువారు కానరారు
మూలబడి లక్ష్మి నీయింట మూల్గుచుండ
కనకరాసులు నీయింట కునుకుచుండ
పోగులై సొమ్ము నీయింట మోగుచుండ
అకట నీయింట జేరిన యమితధనము
పెట్టుటలు తినుటలు లేక పెచ్చుపెరిగి
చెదలవలె లెక్కలిడ నంతుదిక్కుకుండ
మోతుబరురైతులకొ, గొప్పమోతుబైన
యేజమీందార్లకో బదులిడుటెగాని
అరసి నిరుపేదవారల కప్పుసప్పు
లిచ్చి పుచ్చుకొనుట లిచ్చగింపనట్టి
పిల్లికైనను బిచ్చము పెట్టనట్టి
చిల్లిగవ్వైన దానముచేయనట్టి
గురుని దేవుని బొత్తిగా మరచినట్టి
ధర్మదేవత సుతరాము దలపనట్టి
నెనరుకనికారముల మాట విననియట్టి
నీకు గలిగిన సిరి జూచి నిన్ను జూచి
నరుని మనసుగదా యిది నల్లరాయి
కా దినుముకాదు వజ్రంబు కాదుకాను

కరుగునగ్గలమగు జాలికతల కనుచు
ఆశలూరగ దరిజేరి యాశ్రయించి
దినదినము వెట్టిచాకిరిపనులు చేసి
ఎట్టకేలకు నోర్వెళ్లబెట్టి తుదకు
అందరానిఫలంబయి పొందరాని
అద్దమందలి యర్థమై యాత్మనొచ్చి
బట్టకును పొట్టకును మాసి బ్రతుకురోసి
నుడువరాని నిరాశలో నడగిపోవు
పాటకజనంబు పడునట్టి పాట్లు చూచి
గండశిలకన్న లోహముకన్న కర్క
శత్వమున పేరుగన్న వజ్రంబుకన్న
కోటిగుణముల కఠినమై కోమలంపు
సరణి నెరుగని నీమది కరుగకున్న
చెల్లరానట్టి కాసైన చేతితోడ
పుణ్యమని దానమిడు బుద్ధి పుట్టకున్న
బదులుగా నిచ్చియైన తోడ్పడకయున్న
వాకిటికి వచ్చి నిలిచినవారితోడ
ఆదరముజూపి మంచిమాటాడినావె
చిన్నపెద్దల మరియాదచేసినావె
పౌరు లెవరైన నిను జూచి పలుకరింప
చిర్రుమనక జవాబులు చెప్పినావె
అర్థివారలు వచ్చి నిన్నాశ్రయింప
నాలితనమున నోటితో నాస్తియనక
చేతితో లేదనుచు బ్రీతిజేసినావె
జన్మమున్యమునందు నేజనునికైన
చిన్నమంత సహాయము చేసినావె
ఇహిహి। నీవా!! సహాయమా!!! యేటిమాట!!!!
సాయ మెవ్వరికిని నీవు చేయకున్న
మానె, నీచేత వంచితుల్ గానివారు
గాని, నీచే తిరస్కృతుల్ గానివారు
గాని, నీచేత నిందితుల్ గానివారు
గాని, నీపరిసరముల గలరె చెపుమ
ఇట్టి పీనాసివాడవై యిట్టికటికి
వాడవై యిట్టి ఒంటెత్తువాడ వవుట
వల్ల హింసాపరుడ వౌటవల్ల ఘోర
పాతకంబులు చేయుటవల్ల రోసి
కన్నెడలుజేసి కనువిచ్చి నిన్నుజూడ
మనసు లెడజేసి మనసిచ్చి మాటలాడ
నొల్లకుండియు చనవిచ్చుచున్నరీతి
చెంతచేరి ముఖస్తుతుల్ చేయువారు
సారెకును నిచ్చకా లాడువారెగాని
నిండుమక్కువతో నోటినిండ నిన్ను
పలుకరించెడువారును పలుకరింప
కల్లకపటము లేక వర్తిల్లువారు
కానుపింతురె యొకరైనగాని నీకు
ధనమదాంధుడవై తారతమ్య మరయ
మాని నీతిని మాని ధర్మమును మాని
నీవు చేసిన పనులకు నీవు చేసి
నట్టి పాపములకు నేటికైనగాని
రోతగాని పశ్చాత్తాపభీతిగాని
కలనయిన నీకు గలుగదుగాని నేడు
గాకపోయిన నేనాటికైనగాని
నీదుసిరి నెంచుకొని నీదునీడ జూచి
నీవె బెగడొంది వగనొంది నిలువలేక
పోవురోజులు రాకుండబోవు సుమ్మి
ఎప్పుడో యననేల నీ కిప్పుడైన
మున్ను నీచేత నవమతిగన్నవారు
మున్ను నీచేత నపకృతిగన్నవారు
మున్ను నీచే నధోగతిగన్నవారు
తలపునకు బారినపుడును దారిలోన
నెదురుపడినప్పుడును గుండె లెగిరిపోయి
చేతులారంగ శత్రుల జేసికొన్న
వారు నీచేత బడినట్టి బన్నములకు
కడుపుమంట సహింపక కసినిబూని
యెవ్వ డేరీతి చెలరేగి యెప్పు డెట్టి
క్రౌర్యమునకు గడంగునోగద యటంచు
నేయెడగు లెన్నడు ఘటిల్లునో యటంచు
నెడద గడగడలాడగ హడలుతోడ
కుదుటబడనట్టి యెదతోడి బ్రదుకెగాని
మదికి నెమ్మది గలదె నీబ్రదుకునందు.

అంత దవ్వేల నీయొద్ద నప్పుగొన్న
లోకులం దెవ్వ రేవేళ నాకదప్పి
యప్పు లెగవేతురోయన్న యదటువల్ల
చేయు వ్యాపారములలోన చేతిసమురు
భాగవతమానో యన్నట్టి భయమువల్ల
దొంగలో దొరలో యన్న దుడుకువల్ల
కంటవత్తికొని వేయికనులతోడ
కనుచు నిద్దుర లేనట్టి కలవరింత
కలవరించెడు బహుధనకాంక్షవల్ల
అద్దగడైయైన చిటికైన నాదమరచు
గట్టినిద్దుర యున్నదే కడుపునిండ
హార మున్నదె తిన్నగా నాలితోడ
గాని, పిల్లలతోగాని క్షణికమైన
మాటలాడంగ తీరికమాట గలదె
తీరికైనను మనసుకు స్తిమితమన్న
మాట యున్నదె బొంకక మాకు చెపుము
మాటలోమాట ఇంకొక్కమాట నీకు
కాపురముమీదగాని, భోగములమీద
గాని కలనైన నభిలాష గలదె చెపుము
కలుగనేమాడు మాలాటి కాంక్ష నీకు
తీర్చుకొనుటకు పాపము, తీరికవునె?
మనసులో మాట దాచక మాకు చెపుము
తినక, కట్టక, తొడుగక దీనజనుల
కిడక పెంచెద వీధన మేల నీకు
ఈమహాధన మెల్ల నీదేయటంచు
చూచుకొని పొంగిపోవుచు దాచుకొనుచు
ఉత్తహోహోప్రపంచాన నూగుకొనుచు

బత్తె మాసించి నమ్మినబంటువోలె
ఘననిధిని గాచు పెద్దరాకాసివోలె
పచ్చపైకంబు ముట్టక పగలురాత్రి
కాడుగాచెడుచందాన గాచుకొనుచు
తనువు చాలింతువే! ఏమి మనుగడ!! ఇసీ!!!
అర్థవంతుడు గుణవంతు డయ్యొనేని
తాను భుజియించు సుఖియించు తనివితీర
పేదసాదల కనిపెట్టి యాదుకొనును
దాతయై మెప్పుగొను నర్థితతులచేత
అందరికి తలనాలుకై యతడు వెలయు
బంధులకు ప్రీతిపాత్రుడై బ్రతుకు నతడు
హాయి శ్రేయస్సును యశస్సు నందు నతడు
బుధజనులు గౌరవింతు రెప్పుడును నతని
వేలుపులు ప్రేమమించి దీవింతు రతని
ఆనరుని జీవితము పూటయైన చాలు
కాకివలె వేయియేళ్లున్న ఘనత లేదు
ఘనత లేకున్న మనికికి గణన లేదు
నీధనము శాశ్వతంబుగా నిలువబోదు
నీతనువె శాశ్వతంబుగా నిలువబోదు
ధనము నశియించి తనువున్న తనువునిలక
ధనము నిల్చిన ధర్మముల్ ధరణి మెచ్చ
తనువు తరియింప జేయంగ దరముకాదు
గాన వెలుగుండ నిలు దిద్దువానిబోలె
చేతులారంగ ధర్మముల్ చేసిచేసి
దైవమిచ్చిన ధనము సార్థకముచేసి
మనుము సిరిమంతుడా, మంచిమాట మోసి.

---

# మనవి మాటలు

## లక్ష్మీకల్యాణము

వృత్తివైవిధ్యమువలన వర్ణవైవిధ్య మేరుపడినది. ఒక్కొక వర్ణమును పెక్కుసంఘములుగ చీలిపోయినది. దేశకాలావస్థానుగుణములగుభిన్న భిన్న సంప్రదాయములు, ఆచారవ్యవహారములు వర్ణములకు, సంఘములకు నలవడినవి. ఆయాసంప్రదాయములు, ఆచారవ్యవహారములుగలవా రట్టివారితోడనే సంబంధబాంధవ్యములు కుదుర్చుకొను చుండుట కభిమానము హేతువయినది. 'వివాహశ్చ, వివాదశ్చ సమయోరేవ శోభతే' అను



వధూవరులు

సూక్తి అవతరించినది. తద్విపర్యయము సుతరాం నిషిద్ధమయినది. విషయతత్త్వము, విజ్ఞానము, వివేకము, సంస్కారము దూరమయినకొలది ధర్మతత్త్వమును, ప్రేమతత్త్వమును, వ్యక్తిస్వాతంత్ర్యమును మానవుడు గ్రహింపజాలకపోయినాడు. ఆచారసంప్రదాయసంబద్ధము కాని సంఘువ్యవహారము నిష్కృతిరహితమగు మహాపరాధ మయినది. తత్త్వతః ఇట్టి సాంఘికనిర్బంధములకు మనఃప్రవృత్తియే కారణము. లౌకికశారీరిక మానసిక ప్రవృత్తు లన్యోన్యాకర్షకములయి పరస్పరానురాగమునకు కారణములయినపుడు స్త్రీపురుషులసంబంధమును నిరోధించుటకంటె మహాపాతక మొండు లేదు. ఇట్లు ఏకైకము, నిత్యము, అకృత్రిమము నగు ప్రేమ అనేకము, అనిత్యము, కృత్రిమము నగు ఆచారసంప్రదాయరూప క్రూరపిశాచముబారిని బడి విపరీతపరిణామమును గాంచుచున్నది.

సాంఘికవిభేదములు బూటకము లనియు, మానవాభ్యుదయమునకు మహదంతరాయము లనియు విశ్వవిఖ్యాతసచ్చరిత్రుడు, దైవసముడు, లోకహితైకజీవనుడు నగు గాంధిమహాత్ముడు చిరకాలమునుండి లోకమున కనేకవిధముల చాటుచున్నాడు. తన యసువుల నొడ్డి తన్నివారణమునకు దలపడినాడు. పూనా-ఒడంబడిక కుదిరినది. సంఘములనుబంధించిన పాశములు క్రమముగ సడలుచున్నవి. ఇందుకు లక్ష్మీ దేవదాసుల కల్యాణ ముత్కృష్టనిదర్శనము.

వరుడు దేవదాసు, మహాత్మునికడపటి కుమారుడు; వధువు లక్ష్మీదేవి, రాజగోపాలాచార్యుల రెండవకూతురు. తండ్రులు వియ్యమున కన్నింటను దగినవారు. దంపతులు సమగుణశీలవంతులు; ఏకపథానువర్తులు; అన్యోన్యానురాగసంపన్నులు; నవయౌవనులు; సుందరులు. వీరి దాంపత్యము నిరుపమానము. ఈ విప్ర వైశ్య వధూవరుల కల్యాణము సర్వథా విశ్వకల్యాణసంధాయకము.

మహాత్ముడు పవిత్రోపవాసదీక్షను నిర్విఘ్నముగ నిర్వహించిన పవిత్ర 'పర్ణకుటీ' ధామము పరిణయ

వేదిక యయినది. అత్యంతాప్తవర్గము సదస్యులయినారు. సదస్యుల మనఃపూర్వకాశీర్వాదములే మహిత వైవాహిక పారితోషికములు. మహాత్ముని యమూల్యోపదేశ వాక్యములు జీవితరహస్యబోధక మంత్రములు. లక్ష్మీదేవదాసుల పరిణయమంగళ మిట్లు నిరాడంబరముగ, ఆదర్శకముగ ప్రవర్తిల్లినది.

మహాత్ముడు దేవదాసును "నీ భాగ్యము ఫలించినది. నీ అదృష్టమునకు అంతులేదు. * * * * * * * * * ఇదంతయు నా ఉపవాసదీక్షాఫలితమే. దీక్షను నా ఆప్తులకొరకు చేసితిని. ఇం దితరులకువలె మీకును పాలు గలదు. దీక్ష కేవలము మతసంబంధమయినది. దానిఫలితమును మతసంబంధకార్యమునకే వినియోగించుట ఉత్తమము. దీక్షవలన నీవు నేర్చుకొనవలసినది ధర్మము. సత్యమే ధర్మము. సర్వకార్యములయందును ధర్మమును మనస్సునం దుంచుకొనవలెను. దానిని మరువకుండినచో నది నీకు సర్వకార్యములయందును చేయూత నొసంగును. * * * * * * * * * * * ధర్మమును పుడమిపయి నుద్ధరించుటకే నీవు జీవించియుండవలెను. అవసరమయినయెడల ప్రాణముల నర్పించుటకుగూడ వెనుదీయకూడదు. ఐహికసౌఖ్యములకు ప్రాముఖ్య మొసంగక దేశసేవయందు నేటినుండియు నిమగ్నుడవై యుండుము. ఇదియే నేను మనఃపూర్తిగా చేయు నాశీర్వాదము" అని ధర్మస్వరూపమును, తదాచరణావశ్యకతను బోధించుచు నాశీర్వదించినాడు. మఱియు "నేడు నీవు రాజాజి రాజగోపాలాచారిగారి ప్రాణసమానమగు రత్నమును సంగ్రహించితివి. రత్నము లభించినంతమాత్రమున సంతోషింపగూడదు. దానిని ధరించుటకు నీవు అర్హుడ వయియుండవలెను. దానిని భద్రపరచుశక్తిసామర్థ్యములు కలిగియుండవలెను. లక్ష్మి నిజముగా లక్ష్మియే. సృష్టికంతకు సర్వేశ్వరియగు లక్ష్మిని ఎటులు కాపాడి రక్షింతువో అటులనే యీలక్ష్మినిగూడ కాపాడుము. ఈమె సద్గుణసంపన్నురాలు. రూపసి" అని హెచ్చరించి "మీరిద్దరును ధర్మపథగాములయి చిరంజీవులయి వర్ధిల్లుదురుగాక" అని మరల ఆశీర్వదించినాడు.

తరువాత కోడలి నుద్దేశించి "లక్ష్మీ, నీకు నే నెక్కువగా చెప్ప నవసరము లేదు. దేవదాసు నీకు తగినభర్త యనిపించుకొనునని నేను తలచుచున్నాను. నీపరిచయము గలిగినప్పటినుండియు నీవు సార్థకనామధేయురాల వనియే నేను భావించుచున్నాను. * * * మీ అన్యోన్యప్రేమ చాలకాలమునుండి పెరుగుచున్నదని నే నెరుగుదును. ఈ శుభదినమునకయి మీరిద్దరు పవిత్రతపస్సును చేయుచుంటిరనిగూడ నాకు బాగా తెలియును. మాయాశీర్వాదములకయి యిన్నాళ్లనుండి వేచియుంటిరని నాకు సంపూర్ణవిశ్వాసము గలుగుటచేతనే నే నీశుభకార్యమునకు హాజరయితిని. మా ఆశీర్వాదములకు మీరు అర్హులు. * * వధూవరుల నాశీర్వదించి హితోపదేశము చేయుట అత్యవసరమని భావించియే నే నీశ్రమను గైకొంటిని. సర్వేశ్వరుడు మిమ్ము సంరక్షించుగాక! దేవునకు మించిన ఆప్తులు లేరు. * * * జీవితయాత్రను దేశసేవయందు వినియోగింపుడు. క్రమేణ సర్వమానవసౌభ్రాత్రమును సాధింపుడు. మీరిద్దరును ఎల్లప్పుడు, వినయముతో మెలంగుచు సదా ఈశ్వరునియందే మనస్సును లగ్నముచేసి పాపభీతి గలిగి ప్రవర్తించెదరుగాక!" అని మహాత్ముడు పలికెను.

మహాత్ము నుపదేశవాక్యములయందలి పరమార్థమును చక్కగా గ్రహించి, తదనుసారిజీవితమార్గగాములయి లక్ష్మీదేవదాసులు ధన్యులు కాదగుదురు. ఈ యుపదేశవాక్యము లీయాదంపతులకే కాక సర్వసామాన్యముగ నెల్ల నూత్నదంపతులకు సమాచరణార్హములు. లోకమునందలి వధూవరుల తలిదండ్రులకును ఇవి యుపదేశవాక్యములు.

---

## 'సౌందర్యమంజరి' కృతిసమర్పణము

పూర్వము ప్రభువులు కవులు, పండితులు, కవి పండిత కల్పకములు నయియుండెడివారు. వారియాస్థానములు కవిపండితమండలికి స్థానములయి యొప్పియుండెడివి. మహారాజులు కవులను, పండితులను సకలసంపదలతో దులతూగజేసి వారితో నిరంతరవిద్యావినోదముల దేలుచుండెడివారు. కవులును, పండితులును సుఖమయ జీవను



కృతిసమర్పణ సభాధ్యక్షుడు　　కృతిపతి　　కృతికర్త

లయి సరసములగు కృతులను రచియించుచు వాఙ్మయ వికాసమునకు దోహదము చేయుచుండెడివారు. తత్కృతులను ప్రభువు లాదరపూర్వకముగ తమ పేరున కంకితము గావించుకొని కృతికర్తల నగ్రహారాదులతోడను, గజాంతైశ్వర్యముతోడను సత్కరించెడివారు. ఈవిధముగ నాయాకాలముల వెలసిన మహారాజులయాదర పోషణములవలననే కావ్యము లనేకము లుత్పన్నములయినవి; వాఙ్మయ మనంతముగ వృద్ధిజెందినది. అట్టి ప్రభువతంసములు కథాశేషులయిపోయినను వారి నామములు, వాఙ్మయపోషణగాథలు చరిత్రప్రసిద్ధములయి వాఙ్మయముతోపాటు చిరంజీవిత్వమును బడసినవి. ఇది యంతయు రెండుశతాబ్దులకు మునుపటిమాట. నేడదియంతయు కథలు, పురాణములు. తరువాత క్రమముగా నట్టి ప్రభువులు, అట్టికవులు, పండితులు దేశమున నరుదుకాజొచ్చిరి. కావున వాఙ్మయవికాసమును శూన్యప్రాయ మయినది. కాని నిన్న నేట, మరల ప్రభువు లొండొకళ్లు వాఙ్మయపోషణమునకు దొరకొనుట దేశసౌభాగ్యచిహ్నము.

జయపురసంస్థానాధీశులు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు పండితుడు, కవి, కృతికర్త, రసికవతంసము. నిరంతరవాఙ్మయ సమ్యక్కర్ష

ణము, కవిపండితపోషణము, ఔదార్యము తత్సహజశీలములు. ఇట్టియుత్తమగుణవంతుని జయపురరాజ్యరమ స్వయము వరియించినది. తానయి వలచి చేపట్టిన యాసహధర్మచారిణి బాసటగొని వాఙ్మయారామమున మధురకావ్యఫలముల బంకించి సహృదయహృదయముల కామెతేయిడుట యావిద్వత్ప్రభువతంసమునకు ధర్మము. సింహాసనము నధిష్ఠించినది మొదలు చేపట్టిన మేఘదూతాదికావ్యకన్యలుగాక మరల మొనమొన్న శ్రీకాళ్లకూరి గోపాలరాయని అభినవప్రసవము, నవ్యాలంకారరమణీయ, నవనాగరకలక్షణలక్షిత 'సౌందర్యమంజరి' పేరిటి కృతికన్యయు నాప్రభువును వరియించి తతోధికరూపాలంకారవతియయి తనుగన్నతండ్రికి కన్యాపితృతొలగించినది.

కృతికర్త గోపాలరావుగా రాంధ్రసారస్వతప్రపంచమున కవిపండితగౌరవమునకుపాత్రులయినవారు. తత్కృతులే తత్కవితాపాండితీగౌరవములకు నిదర్శనములు. ఆసుకృతి, తనసుకృతి ననురూపవరుని కరముల నర్పించి చరితార్థుడయినాడు.

కృతి సప్తసంతానములలో నుత్తమము; చిరంజీవము; కన్నవారికి కొన్నవారికి పేరుకీర్తులను పెద్దజేయునది. ఇట్లుభయతారకమగు కృతికారణముగా బాంధవ్యముగలిసిన కవియును, మహారాజును ధన్యులు.

ఇక మిగిలినది కవిసమ్మానము. కృతిస్వీకరణమునను, వాఙ్మయపోషణమునను పూర్వ మహారాజుల ననుసరించిన 'సౌందర్యమంజరి' కృతిపతి కవిసమ్మానమునను వారినే యనుసరించుట సంభావ్యము. మున్ముందును ఈప్రభువతంసమిట్లే పెక్కుసరసకృతుల చేపట్టి ఆంధ్రవాఙ్మయాభివృద్ధిని గలిగింతురుగాక! ఇతరసంస్థానాధీశులును సమకాలీనులగు శ్రీవారిమార్గము ననుసరించి వాఙ్మయోద్ధారకు లగుదురుగాక!

---

## ఆంధ్రచిత్రకళాపరిషత్తు-ఏలూరు

వెనుక నొకకాలమున మితిమీరిన విజ్ఞానసంపదకు నెలవయి విలసిల్లిన ఆంధ్రదేశము నేడన్నింటను ఇరుగుపొరుగుదేశములకంటెగూడ వెనుక జిక్కిపోయినది. లలితకళలయందింకను కొన్నియడుగులు వెనుకబట్టిపోయినది.

ఒకటిరెండుదశాబ్దులనుండి దేశమున జాతీయతావికాసమునకు దోహదక్రియ లందందు తలచూపుచున్నవి. భావుకులు, ఉత్సాహవంతులు నగుయువజను లక్కడనక్కడ పెక్కుచిక్కులకు లోనగుచు నాయాశాఖల విజ్ఞానము నార్జించుకొన జూచుచున్నారు. వారిలో చాలమంది తగినప్రాపు లేక విఫలప్రయత్నులయి నడుత్రోవనుండిగే తిరుగుమొగము పట్టవలసినవారగుచున్నారు. శిల్పచిత్రాదికళలయందీపాటిమాటయైన అనుకొనుటకు వీలుకానరాదు.

బాల్యదశ నతిక్రమింపని ఆంధ్రవిశ్వకళాపరిషత్తు లలితకళలయెడ నాదరమును చూపజాలకపోవుట యసంభావ్యము కాదు.

బందరుపురమున నెలకొనిన ఆంధ్రజాతీయకళాశాల తొలుత చిత్రకళను చేరదీసినది. తదాలంబనము, ప్రమోదకుమారఛటర్జీమహాశయుల నిరంతరకృషి ఏకమగుట నొకకొందఱు చిత్రకారు లాంధ్రదేశమున బయలుదేరిరి. వారివలన చిత్రకళకు కొంత యుత్తేజనము గలిగినది. వారిలో శ్రీదామెర్ల రామారావు ప్రథమగణ్యులు. ప్రాచ్యపాశ్చాత్య కళావిధానములకు సామరస్యము, సమ్మేళనము కుదిర్చి ప్రత్యేకవిధానము నొకదాని నాయన కొనితెచ్చినాడు. ఆయనచిత్రరచనయందుపజ్ఞ,కళాకౌశలము వ్యక్తమగుచుండును. ఆయన తూలికయందంకురించిన నవ్యకళాకౌశలము పరిపూర్ణత దాల్పకపూర్వమే ఆయన కాలవశంవదు డయినాడు. దేశమంతట వ్యాపింపగల దనుకొనిన యుత్తేజన మంతట మందగిల్ల జొచ్చినది. తదనుయాయు లాయనవైఖరి నందుకొనజాల కున్నారు. ప్రమోదకుమార ఛటర్జీ శిష్యులలో మొత్తమున ఏకొందరో తద్రచనావిధానము నొకింత యనుకరింపగలిగిరి. సాహిత్యాదుల సంస్కారము లేకపోవుటచే తరువాతివారికి దాని అంతు దొరకకున్నది. దానికి తోడు సముచితపోషణము కరవయి

నది ; చిత్రకళాలయములును లేకపోయినవి. కొంచెము కొంచెముగా తల యెత్తుచున్న చిత్రకళ యిట్లు మరల నీరసింపజొచ్చినది. నీరసించుచున్న యద్దాని కుజ్జీవనము గలిగించి తద్ద్వారమున జాతీయతను ప్రత్యక్షముచేయుటకయి చిన్న చిన్న చిత్రకళామందిరములొండురెండు యువకుల కళాభిమానముకారణముగా నేడు మొలకెత్తినవి. వానిలో నొక్కటి 'ఆంధ్రచిత్రకళాపరిషత్తు'.

ఈ ఆంధ్ర చిత్రకళాపరిషత్తును ఏలూరున శ్రీవంకసూరిశాస్త్రిగారు నెలకొలిపినారు. గాంధి మహాత్ము డాంధ్రదేశసంచారసమయము (౧౯౨౯-౩ సంవత్సరము) న దానికి శుభారంభమును గావించెను. చిత్రకారులు కొంద రందు భారతీయచిత్రకళావైఖరి ననుసరించి చిత్రరచనము నభ్యసించుచుండిరి. శ్రీయుతులు చంద్రుపట్లరామరావు, బాపిరాజు, ముడుంబ నరసింహాచార్యులు మొదలగువారు తత్పరిషచ్చిత్రకారులలో ముఖ్యులు. అచటి చిత్రకారులచిత్రములు నీటిరంగులవి. వానియందు భారతీయకళాసౌభాగ్య మమరి యుండును. ఆంధ్రతాసౌరభముల నవి వెలయించుచుండును. మైసూరు, పాటియాల, తిరువాంకూరు, చల్లపల్లి మొదలగు సంస్థానముల అధిపతులు పరిషత్తు చిత్రముల గొన్నింటిని క్రయించి తమ దివ్యసౌధాలంకారముల గావించికొనిరి.* కళాతత్త్వవేత్తలప్రశంస కవి పాత్రములయినవి. భారతియందు ప్రకటితములయిన చిత్రము లాంధ్రదేశమునకు పరిచితములు.† ఇంకను సుందరచిత్రములు పరిషత్తు సంచయమున గలవు. వికసనశీలము లయిన కళాసౌందర్యచ్ఛాయ లీపరిషచ్చిత్ర రచనావిధానమున గాననగును. ఈ ఛాయ లుత్తరోత్తర ఆంధ్రచిత్రకళకు ప్రత్యేకతను, విశిష్టతను సమకూర్పగలవని తలపవచ్చును.

కళారాధనాతత్పరులగు పరిషచ్చిత్రకారులు దేశారాధనాతత్పరులయి కారాగారములపాలయినకారణమున ౧౯30-3౨ సంవత్సరములయందు పరిషత్కార్యక్రమము లాగిపోయినవి. ప్రతిష్ఠాపకులు సూరిశాస్త్రిగారు మరల దాని నుజ్జీవింపజేయ ప్రయత్నించుచుండుట సంతసమగుచున్నది. కాని తన్నిర్వహణము ఆంధ్రదేశమునందలి సంస్థానాధీశులు, ఇతరశ్రీమంతులు నపారముగ ధనసాహాయ్యము నొనరింపకున్న సాధ్యము కాజాలదు.

ఈకాలమున నెల్ల దేశములయందును- విశేషించి ఆంధ్రదేశమునందు- శ్రీమంతులలో నధికసంఖ్యాకులు కేవలము ప్రాణమానరక్షణముల కావశ్యకములగు నన్నవస్త్రములకేని నోచుకొనక అంగలార్చుచున్న ప్రజాసామాన్యబాహుళ్యమునెడ అనుకంపాలేశమయినను లేకున్నారు. అట్టి స్వార్థపరులకు సౌందర్యగ్రహణశక్తి, కళాభిమానము లసలే యుండకపోవుట వింతకాదు. పూర్వకాలమున విద్వాంసులు, కళాకోవిదులు, ఉదారహృదయులు నగు మహారాజులయు, ఇతర శ్రీమంతులయు ఆదరణమున నవనవోన్మేషితములయి వెలయుచుండిన విద్యలన్నియు నేడట్టివారులేమిని వెలవెలవోయినవి. మున్నట్లు దేశోన్నతి కుపకరించుచుండిన తదీయసంపదయంతయు నిపుడు అనుటకు వినుటకు ననువుగాని అసభ్యకార్యముల కుపయుక్తమగుచుండుట యనుభవసిద్ధము. ఇట్టి విపరీతపరిణామము దేశదౌర్భాగ్యజన్య మనవలెను.

దేశమున నిపుడిపుడు ఎల్ల విషయములయందు సంస్కారవాంఛ చెలరేగుచున్నది. విజ్ఞానార్జనాసక్తి విస్తరిల్లుచున్నది. కళాతత్త్వజిజ్ఞాస కదలికను గాంచుచున్నది. భావకులు, ఉత్సాహవంతులు, సాహసికులు నగుయువకు

---

* పాటియాలమహారాజు రామారావుగారి ( ) ను ; మైసూరుమహారాజు బాపిరాజుగారి 'యాజ్ఞవల్క్యవేదగ్రహణము'ను, 'అభిసారిక'ను; తిరువాంకూరు మహారాణి నరసింహాచారిగారి 'నాగబాల'ను; చల్లపల్లి రాజావారు రామారావుగారి 'మహాకాళి' (స్వదేశపు పట్టుబట్టపయి చిత్రించినది) ని కైకొనిరి.

† రామారావుగారి 'అత్తవారింటికి', 'అశ్వత్థామప్రతిజ్ఞ' బాపిరాజుగారి 'యాజ్ఞవల్క్య కుటుంబము'. ప్రకటింప స్వీకరించినవి మరికొన్ని గలవు.

లనేకమార్గముల దేశాభ్యుదయమునకయి తమ సర్వస్వమును, జీవితమును సైతము, ధారవోయ సంసిద్ధులయియున్నారు. వారికి పోషణప్రోత్సాహములు లభించునేని దేశాభ్యుదయము నాతిచిరప్రాప్యమగుట నిక్కము. ఇకనయినను సంస్థానాధీశులు, ఇతరశ్రీమంతులు తమ సంపద సార్థకమగునట్లు ఇట్టి కార్యదీక్షాపరాయణులకు యథేష్టముగ ధనసాహాయ్యము నొనరించి లుప్తప్రాయమగు దేశపు పూర్వప్రతిష్ఠను తిరుగగడించి, దానిని నిలువబెట్టుటధర్మము, వివేకము. ప్రకృతము (రానున్న నవంబరుమాసమున) పునరుద్ధరణమును గాంచనున్న ఆంధ్రచిత్రకళాపరిషత్తు చిరంజీవిత్వమునకెట్టి సాహాయ్యము వారివలనలభింపగలదో యారయవలసియున్నది.

---

## శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారికి సమ్మానము

ఆంధ్రదేశంలో కొన్నాళ్లనుండి ఒకక్రొత్తసంచలనం కలిగింది. ఏదో నెపం, ఏదోపేరు పెట్టి కవులను, పండితులను ప్రజలు పూజిస్తూ ఉన్నారు. తమవాఙ్మయానికి వారుచేసిన మహోపకారానికి ప్రతిఫలంగా తృణమో పణమో వారికి సమర్పించి తమకృతజ్ఞతను తెలుపుకుంటూ ఉన్నారు. ఇది ఆనందించవలసిన విషయం.

ఆంధ్రదేశాన భాషాతత్త్వాన్ని ఎరిగినవారిలో అగ్రస్థానం రావుసాహేబు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారిది. వారు గడచిన యాభయియేండ్లనుండి శబ్దశాస్త్రాన్ని తరిచితరిచి శబ్దతత్త్వనిర్ణయంచేశారు. ఆంధ్రభాషను శాసించే వ్యాకరణాదిశాస్త్రాలలో నియమాలు అసంపూర్ణాలనీ, అన్నిపదాలను, భాషను ఆనియమాలు సరిగా శాసించవనీ సహేతుకంగా నిర్ధారణ చేశారు. వీరి పరిశోధనకార్యం అంతా కేవలం ప్రతిభామూలకం అయింది. ఈ భాషాతత్త్వనిర్ణయంవల్ల కృతకమగు గ్రాంథికంకంటే సహజమూ, సజీవమూ అయిన వ్యావహారికమే వాఙ్మయాభివృద్ధికి పనికివస్తుందని తేలింది. ఇందుకు విరుద్ధంగా గ్రాంథికవాదులు విరుచుకొని మీదపడినా సాహసించి వాళ్లనందరినీ ఎదుర్కొని తమ వాదాన్ని నిలువబెట్టిన వీరశిఖామణి పంతులుగారు. దీంతో వీరిపక్షం బాగా బలకొనింది. అనేకులు విద్యావంతులు పంతులుగారికి శిష్యులయినారు. ఇంచుమించుగా నేటికాలంలో వాఙ్మయం అంతా వ్యావహారిక భాషలోనే పుట్టుతూ ఉంది. గ్రాంథికవాదులుకూడా కొందరు వ్యావహారికంలో ఉండే మాధుర్యాన్ని గుర్తించి తాము వ్యావహారికాన్నే గ్రంథరచనానికి వాడుతూ ఉన్నారు. స్వార్థం అనేది ఇంతైనా లేకుండా ఇన్నియేండ్లు, నిరంతరం వీరివలె భాషాసేవ చేసిన, చేస్తూఉన్న — ఈ అపరవయస్సునకూడా — వారాంధ్రదేశంలో ఇంకొక్కరు లేరనడం సాహసం కాదు.



గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు

ఇంతేకాదు. వాగ్రూపంతో ఉన్న సవరభాషను పఠనలేఖనసాధ్యం అయ్యేటట్లు గ్రంథస్థం చేయడానికి ఇరవయి ఏండ్లనుంచి అపారంగా కృషి చేస్తున్నారువీరు.

పంతులుగారికి డెభ్భయియేండ్లు గడచేనాటికయినా వారి భాషాసేవకు ప్రతిఫలంగా వారిని సమ్మానించడానికి పూనుకొన్నవారిని విశేషంగా అభినందించవలసి ఉంది.

శ్రీ పంతులుగారికి సమ్మానం, ఎన్నాళ్లకయితే నేమి, తలపెట్టారు ఆంధ్రదేశంలో కొందరుపెద్దలు. దానికిగా నిర్వాహకసంఘం ఒకటి ఏర్పడింది. ఆసంఘానికి శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు పెత్తనం వహించారు. ఈ సమ్మానానికి 'పంతులుగారి డెబ్బదవజన్మదినోత్సవం' అని పేరు పెట్టారు నిర్వాహకులు. ఉత్సవ కాలం నవంబరు ౯౫ తేది; స్థలం రాజమహేంద్రవరం. దాంతోకూడా (ఒకరోజు ముందుగా ఆరంభించి) అక్కడే అభినవాంధ్రకవిపండితసభాద్వితీయసమావేశం కూడా జరపడానికి ప్రయత్నం చేస్తూ ఉన్నారు. ఈరెండూ ఒకమారు, ఒకచోట జరగడంవల్ల భాషకూ, వాఙ్మయానికీ ఎక్కువ మేలు కలుగడం నిశ్చయం. కాబట్టి భాషావాఙ్మయసంస్కారప్రియులందరూ తప్పక అక్కడచేరి మంచిసెబ్బరలు చర్చించి సంస్కారవిధానాన్ని నిశ్చయించుకోవడం అత్యావశ్యకం.

ఇంకా, ఆ ఉత్సవదినంనాటికే శ్రీపంతులుగారి వ్యాసాలూ, ఉపన్యాసాలూ, (ఒకసంపుటము) 'ఆంధ్ర పండితభిషక్కుల భేషజము', 'బాలకవిశరణ్యము', 'గద్యచింతామణి' అనే పంతులవారిగ్రంథాలూ అచ్చువేయడానికి సంకల్పించారు. మరిన్నీ, ఉత్సవస్మృతి చిహ్నంగా ఒకసంపుటాన్ని ముద్రించతలచారు. దానిలో ఆంధ్రశబరభాషల విషయమయి పంతులుగారు చేసిన కృషిని తెలిసిన పాశ్చాత్త్యులూ, మనదేశమువారూ వ్రాసిన వ్యాసాలనన్నిటినీ ప్రకటిస్తారు.

దీన్నంతా సరిగా నెరవేర్చడానికి సొమ్ము విపరీతంగా, అంటె వేలకొలదిగ కావాలి. దరిద్రదేవత తాండవమాడుతూ ఉన్న యీ దుర్భిక్షకాలంలో కావలసిన సొమ్ము దొరకడానికి నిర్వాహకులు చాలా శ్రమ పడవలసిఉంటుంది.

ఏమయినాసరే, పంతులవారిభాషాసేవను, దానివల్ల తాము పొందినమేలును, అందుకయి వారిని యథోచితంగా పూజించి, సమ్మానించి కృతజ్ఞతను తెలుపుకోవలసిన తమబాధ్యతను గుర్తెరిగి మహోత్సవం సఫలంగా, సాకల్యంగా నెరవేరేటట్లు చూడవలసినభారం వహించడం ఆంధ్రులకు తప్పనిసరి.

శ్రీ పంతులుగారు భాషారంగంలో భవ్యపరాక్రమాన్ని నెరపుతూఉన్న వీరుడు. వారిపూజ వీరపూజ. వీరపూజవలన సకల శ్రేయస్సులు కలుగుతవి. అన్నికాలాల్లోను, అన్ని దేశాల్లోను ప్రజలు తమ మేలుకోసం వీరపూజను నియతంగా చేస్తూఉంటారు. ఆంధ్రులకుకూడ వీరపూజ పరిపాటి అయిందే.

---

## కీ. శే. బసవరాజు వెంకటప్పారావు

## అశ్రుబిందువులు

అభినవాంధ్రమాత అనుగుబిడ్డలలో అప్పారావుగారొకరు. అశనిపాతమువలె నాయనకు సంప్రాప్తమయిన అకాలమరణము సంతాపమును గలిగించుచున్నది. నలువది ఏండ్లకే, పాపము, ఆయనకు నూరేండ్లు నిండిపోయినవి.

బ్రదికినన్నినాళ్లు నవ్యవాఙ్మయాకాశమునచుక్కవలె వెలిగినారు. కాగలవారనిపించుకొనినారు. అనిపించుకొనినంతవారు కాకుండగనే, కటకటా! కాలప్రవాహమున గలిసిపోయినారు.

అప్పారావుగారు సహజముగ తెలివితేటలుగలవారు; సంస్కారప్రియులు; రసికులు; మూడుభాషలను ముచ్చటదీర చదివి సారస్యమును గ్రహించినారు; పద్యముల నల్లినారు; పదములు పాడినారు; విమర్శనలు విసరినారు. ఆయన ఒకపాలు కవి; రెండుపాళ్లు విమర్శకులు. ఆయన గ్రంథకర్తకూడ: ఆంధ్ర కవిత్వచరిత్రమును రచించినారు. దానితత్త్వము భారతీపాఠకుల యెరుకకు వచ్చినదియే.

ఆయనస్వభావము నిరంకుశము; 'మురారిపంథః; నందిని పందిని, పందిని నందిని చేయజూచును. దానికి లోతుపాతులవిచారమున కోపికచాలదు. ఆయన అభి

ప్రాయములు నిగ్రహానుగ్రహములవెంట మార్పును జెందు చుండును.

ఆయన మానసిక ప్రవృత్తి ఆదినుండియు చంచలము; పలు మెంగముల పరువులు వారుచుండును. భోగలాలస ఎక్కువ. పొందిక తక్కువ. ఆయనకు కోరికలు కోటి. కొనసాగినది ఒకటియు లేదు. మనోనైకల్యము తలకెక్కినది. చివరకు ఆయనజీవితమే మూన్నాళ్ల ముచ్చట అయిపోయినది.

ఆయన పత్రికాసంపాదన కార్యమునను చేయి కలిపినాడు. ఆంధ్రపత్రికకు ఆటపాటలు నేర్పినాడు; 'భారతి' పాప కుస్తవెట్టినాడు. మొనమొన్న నె 'శక్తి'ని గూడ చేపట్టినాడు. ఇంచుమించుగ ఆంధ్రదేశమున పత్రికల కన్నింటికిని విజ్ఞానమును పంచిపెట్టుచుండినాడు.

ఆయన గంద్రతనముగలవాడయినను స్నేహమునకు పాత్రుడు.

అన్నిలక్షణములు అమరియున్నవి ఆయనయందు. కాని అదృష్టము, ఆయుష్యము లేకపోయినవి.

ఆయన అకాలమరణమువలన అభినవాంధ్రకవి పండితలోకమున దీరనికొరత ఏరుపడినది.

---



కన్యాకుమారి స్నానఘట్టము

—శంకర సుబ్రహ్మణ్యం.

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.
Editor: G. Subbaramayya.



# సాభిప్రాయ విశేషములు



ప్రపంచవ్యవహారము లతివిచిత్రముగ నుండును. సకలవిషయములందును అంతర మునకుపైయంతరముగలదు. మాటకుపైమాట, యుక్తికిపై యుక్తి, దెబ్బకు పైదెబ్బ యోగ మునకు పైయోగము ప్రకృతియందు పరిపాటియైన విషయములు. కాని ఈయనా దరణస్వభావము విద్యావంతుల నావహించి పీడించునటులు సామాన్యులనుపట్టి బాధింపదు. నిరాశా నిస్పృహా వైరాగ్యము లీయనాదరణ మునకు మూలములు. నక్క ద్రాక్షపళ్ల కథ యైనను, ఆత్మనిరసనమైనను ఫలము సమా నము. నిరాశా నిస్పృహలు వైరాగ్యమును, వైరాగ్యము నిరాదరణమును గలుగజేయు చున్నవి. వైరాగ్యము నిష్కామసిద్ధికి బదులు స్వోత్కర్షకును, పరనిందకును, స్వార్థారాధన మునకును, పరపీడనమునకును గారణంబగు చున్నది. అభిమానదేవతను సింహాసనము నుండి బడద్రోయుటకు వేలయేండ్లనుండి జరుగుచున్న ప్రయత్నము లింకను విజయ మును బడయలేదు.

ప్రపంచపరిణామమునం దభిమాన దేవతకు పదచ్యుతి గలుగుచున్నను అధి కారాభిమానము, రాజ్యాభిమానము, ధనాభిమానము, కులాభిమానము, వర్ణాశ్రమా భిమానము వర్తమానకాలమునందును బలీయ ముగ నున్నవి. రాజకీయార్థిక సాంఘిక మత వ్యవస్థలందుసంప్రాప్తమగుచున్న ప్రచండవిప్లవ ములుసయితముబలిష్ఠమైనయభిమానదేవతకు పదచ్యుతిని గలుగజేయజాలకున్నవి. రాజులను రాజ్యములను, ధనమును, సంపదలను, కుల మును,విద్యాదులనుఆనాశ్రయించినయభిమాన దేవత వ్యక్తులనుండి మరలినను సంఘముల నా శ్రయించుటకు పూనుకొనుచున్నది. అభిమాన దేవత వ్యక్తుల నాశ్రయించినను, సంఘముల నాశ్రయించినను ప్రజాసామాన్యమున కింకను నాత్మోపలబ్ధికి సాధనము దూరస్థముగనున్నది కాని సన్నిహితముగ గనుపడదు. ఇతరులకు శ్రీరంగనీతులను చెప్పుటయును, పరుల తప్పుల నెన్నుటయును సుకరము. ఆనీతినే తా నవలం బించుటయును తనతప్పులను దెలిసికొనుట యును దుష్కరము.

అభిమాన పరాయణుల ధర్మోప దేశము లెటు లున్నను సామాన్యుల దుఃఖానుభవమునకుమాత్రము ప్రపంచపరి స్థితులందు పరివర్తనము దురూహ్యముగ నున్నది. ఎండవానలను, శీతోష్ణములను,

నిద్రాహారములను, అన్నపానీయనివాసములను పాటింపకను స్వకర్మనిరతులై నిరంతరము పాటుపడెడి సామాన్యజనుల తరణోపాయ మగమ్యముగ నున్నది. సామాన్యజనుల కష్టములు సకలదేశములందును దుర్భరములుగ నున్నను పారతంత్ర్యదేశములందు దుస్సహతమములుగ నున్నవి. ప్రజాస్వామ్యముగల స్వతంత్రదేశములందు ప్రజాపోషణమునకేతంత్రములనో పన్నుట రాజ్యాంగపక్షములకాకవసరం బగుచున్నది. అధిరపక్షము, స్వజాతీయులైన నిరుద్యోగులకును స్వదేశవ్యాపార పరిశ్రమలకును, పేరుప్రతిష్ఠలకైనను నుపకృతిని యనివార్యముగ నున్నది. మాయమర్మము లెరుగని సామాన్యజను లధికారారాధకులైన విద్యావంతుల మాయతంత్రములను నమ్మి వారల నధికారపదవులం దెక్కించుట యాచారమైనది. అధికార దేవతారాధకులమాటలందుగల పస చేతలందు మృగ్యముగ నుండును.

* * *

అధికారారాధనము

బ్రిటిషుప్రజలు కార్మికప్రభుత్వమునకు పదచ్యుతిని గలుగజేసి జాతీయ ప్రభుత్వమును నెలకొలిపినవిధ మధికారారాధకుల ప్రజ్ఞాపాండిత్యములకు నిదర్శనము. రామ్సె మాక్డొనాల్డుగారు స్వీయాభ్యుదయమునకు సాధనభూతమైన కార్మికపక్షమును ధ్వంసము చేసి జాతీయపక్షనాయకత్వమును స్వీకరించుట మానవధర్మోదంతమునందు, స్మృతిభ్రంశాధ్యాయమునకు ప్రమాణముగనున్నది. రామ్సెమాక్డొనాల్డుగారి ప్రభుత్వము స్వదేశమునందును, విదేశములందును, ముఖ్యముగను సామ్రాజ్యాంతర్భాగములైన పారతంత్ర్యదేశములందు ధర్మగ్లానికిని, అధర్మాభ్యుత్థానమునకును వినియోగపడిన రీతిని ధర్మసంరక్షణమునకును, అధర్మసంహారమునకును వినియోగపడజాలకున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రములందు రామ్సెమాక్డొనాల్డు రూజువెల్టుగారులు పొదిగిన ఆర్థికతంత్రములు లంపనునందలి ఆర్థికసమావేశమునందు భగ్నములైనవి. మాక్డొనాల్డుగారు హిందూస్థానస్వపరిపాలనమునకు జేసిన వాగ్దానము లన్నిటిని సర్ సామ్యుయలు హోరుగారివశము చేసిరి. మాక్డొనాల్డుగారి ధర్మనిష్ఠకు కార్మికనాయకులకును, రుష్యాప్రభుత్వమునకును, కాంగ్రెసునకును, గాంధిమహాత్మునకును వారు చూపిన నిరాదరణ నిరసనభావములు నిదర్శనములు. గ్రేటుబ్రిటనునందువలెనే యితర దేశములందును అధికారనాటకము బీభత్సోదంతమును ప్రదర్శించుచున్నది. అమెరికాయందు రూజువెల్టుగారి హస్తములందు సంపూర్ణాధికారము ముంచబడినది. పాపము, విల్సనుగారేపుణ్యలోకమునందు నివసించుచున్నారో! వారు ప్రతిపాదించిన పదునాలుగు ధర్మసూత్రములును వారివెంటనే పుణ్యలోకమునకు బోయినవి. అమెరికా గ్రేటుబ్రిటనులందువలెనే జర్మనియందు హిట్లరుగారును, ఇటలీయందు ముసోలినిగారు, రుష్యాయందు

స్టాలినుగారును, నితర రాజ్యములం దితరనాయకులును పూర్వయుగోదంతములను విస్మరింపజేసెడి నిరంకుశాధికారము నారాధించుచున్నారు. జిజ్ఞాసపరాయణుల కీ యుదంతము విస్మయమును, నిరాశను గలుగజేయుచున్నది. సకలదేశములందును ప్రజలను నావహించిన నిరాశా నిస్సహాయ స్థితిగతులును, ప్రజానాయకుల నావహించిన ధనాధికారలోభములును నీవిపరీతస్థితికి మూలములు. స్వపరిపాలనకు బదులు నిరంకుశపరిపాలనము, శాంతి సన్నాహములకు బదులు సమరసన్నాహములు, రక్తసమరములకు బదులు శ్వేతసమరములు, ప్రజాప్రయోజనములకు బదు లధికారప్రయోజనములు, కార్మికప్రయోజనములకు బదులు ధనస్వాములప్రయోజనములు, పరప్రయోజనములకు బదులు స్వప్రయోజనములు ప్రపంచవ్యవహారములం దధికతరముగను ప్రబలుచున్నవి.

*          *          *

ధనరాజ్యము – ఆర్థికసమావేశము

లండనునగరమునందుగూడి భగ్నమైన ఆర్థికసమావేశోదంతము, వర్తమానకాలమునందు ప్రపంచమునందు ధనదేవతకుగల గౌరవాదరణములను వేనోళ్లను చాటుచున్నది. ప్రపంచమునందు వ్యాపారపరిశ్రమవాణిజ్యములకు గ్రేట్బ్రిటను చిరకాలమునుండియును పట్టమును గట్టుకొని ఫలము ననుభవించుచున్నది. ప్రపంచపణ్యములకు లండను కేంద్రస్థానమై బంగారు నవరసునాణెములకును, నవరసుపత్రాదులు, నవరసునిధులును ధనమునకు ప్రమాణములైనవి. ఇది గ్రేట్బ్రిటను కపారమైనలాభమును, ప్రతిపత్తిని సమకూర్చినది. ఐరోపా మహాసంగ్రామానంతరము కేంద్రస్థానము కొంతవరకు న్యూయార్కునకు సంక్రమించినది. గ్రేట్బ్రిటనునుండియును యూరపు రాజ్యములనుండియును చేరిన స్వర్ణప్రవాహములు న్యూయార్కునకు ధనోన్మాదమును గలుగజేసినవి. గతించిన ౧౨ ఏండ్లయం దమెరికాసంయుక్తరాజ్యములందు వర్ధిల్లిన దుష్టదౌర్భాగ్యపరిస్థితులు వర్ణనాతీతములు. ఒక సంవత్సరమునందు ౫౦౦౦ బ్యాంకులు దివాలా తీసినవి. అగ్గిపెట్టెలరాజు క్రూజరు కోట్లరూప్యములకు రాజ్యములను ప్రజలను ముఖ్యముగాను అమెరికాదేశీయులను మోసగించిన విధము మాయావికథగ గనుపడుచుండును.

అమెరికాదుష్టవాసనలకు ఫలము ననుభవించినది. అమెరికాస్థితి "అన్నియుండియును అల్లుని నోటశని" యను సామెతరీతి యైనది. బ్యాంకులు బంగారపుసంచులతో నిండియున్నను వ్యాపారపరిశ్రమలు క్షీణించినవి; 'నిరుద్యోగమస్య ప్రబలినది; దౌర్జన్యములు, దుష్కార్యములు నిత్యవ్యవహారము లైనవి; దివాలాలు, మోసములు, దోపిళ్లు, జనాపహరణములు సామాన్యవిషయము లైనవి. మద్యపాననిషేధము నిరాదరణీయమై మద్యపానము సమాదరణీయమైనది. ధర్మదేవతకు పదచ్యుతి గలిగినపుడాస్థానము

నాక్రమించిన ధనదేవతకును పదచ్యుతి గలిగి
నది. ధనదేవతను తిరిగి ప్రతిష్ఠాపనజేయుటకు
రూజువెల్టుగారికి ప్రజలును, సినేటును
పూర్ణాధికారమును నొసంగిరి. రూజువెల్టుగా
రార్థికసమావేశమును భగ్నము చేసినవిధ
మార్థికసౌభాగ్యమునకును, ప్రపంచాభ్యుదయ
శాంతులకును నాశాజనకము గాజాలదు.
బంగారునాణెముల చలామణి నిరాకరించిన
దేశములకును, నిరాకరించని దేశములకును
పొత్తు కుదురుట కేదో ప్రమాణము స్థిరపడ
వలసియున్నది. మొదటిమెట్టు లేకను రెండవ
మెట్టు కుదరదు. అన్ని దేశములకును సామాన్య
ప్రమాణము కుదురనంతవరకును సుంకముల
విధానము నిర్ణయముగాజాలదు. బంగారు
ప్రమాణమును విసర్జించి వ్యాపారలాభమును
బడయుచున్న గ్రేటుబ్రిటనుఅమెరికాలుపన్నిన
ఆర్థికవ్యూహములు నిరర్థకములైనవి. ఆంగ్ల
భాషాబాంధవ్యమునను, వ్యాపార పరిశ్రమలం
దును సహజవైరులైన అమెరికా గ్రేటుబ్రిటను
లకును నీ విషయమునందు సంయోగము
సాధ్యముగాదు. అమెరికా సంయుక్తరాష్ట్రము
లెటులు ప్రవర్తించినను యూరపురాజ్యముల
యోచనల నతిక్రమించుట గ్రేటుబ్రిటనుకు
సాధ్యముగాదు. ఇండియా గంగిగోవు స్వాధీన
మునం దున్నంత కాలము వెండిబంగారములను,
ముడిపదార్థములను బొందుటకును, నిర్మాణ
పదార్థముల నంటగట్టుటకును గ్రేటుబ్రిటనున
కెట్టి యాటంకములును గలుగజాలవు. ఆర్థిక
సమావేశము శాంతికి బదులు సంగ్రామము

నకు సాధనమగుచున్నది. బంగారు ప్రమా
ణమును నిరాకరించెడి దేశములకును,
ఆదరించెడి దేశములకును ఆర్థికవైరుధ్యము
సుస్థిర మైనది. ఈ వైరుధ్యము శేషించిన
సమస్యలకు ప్రతిబంధకమై యితరసమస్యలును
దుస్తరము లగుచున్నవి. ఆయుధవిసర్జన
సమస్య, వ్యాపారసమస్య, అప్పులసమస్య,
ధరలసమస్య, నిరుద్యోగసమస్య మొదలగు
సమస్య లన్నియును నీసమస్యమీద నాధార
పడియున్నవి. ఇప్పుడైనను అమెరికా వివేక
మును గలిగి, పట్టునువీడి, మొదటను సంయో
గమునకు మూలమైన అన్యోన్యప్రమాణ
నిర్ణయమున కంగీకరించుట సకలవిధములను
శ్రేయస్కరము. ఈనిర్ణయ మితరరాజ్యము
లకు వలెను అమెరికాకును కాలక్రమమునను
లాభదాయకము గాగలదు.

నిరంకుశాధికారరాజ్యము – ప్రజలు

ప్రజాస్వామ్యముగల దేశములందును
ప్రజల నిస్సహాయస్థితి నిరంకుశాధికారవ్యాప
మునకు కీలకము. ప్రజాపాలితు లేకజాతీయు
లును, నేకదేశీయులును, నేకాశయులును
నైనపు డధికారము నిరంకుశ మైనను, నియ
మితమైనను ప్రజలకు విశేషమైన యుపద్రవము
గలుగజాలదు. ఉపద్రవ నివారణోపాయము
సామాన్యముగను ప్రజల హస్తములందే
యున్నది. మునిగిపోయెడి మనుజుడు భల్లూక
మును పట్టుకొని మునిగితేలెడి విధమున నాప
త్కాలమునందు ప్రాజ్ఞులకును యుక్తాయుక్త
పరిజ్ఞానము దుర్లభము. అన్ని దేశములందును

ఆపదలందు మునిగియున్న ప్రజ లాపదుద్ధార కులనునమ్మి నియమనిషేధములులేకను అధికారసింహాసనాసీనులను జేయుచున్నారు. ధర్మసంస్కారమునంపస్థిత ప్రజ్ఞులుగానియధికారులును లబ్ధావకాశములను స్వాయంవికాసమునకును స్వాయంసహాయమునకు గాకను పరాక్రమణకును, పరపీడనమునకును వినియోగించుట యాచారమైనది. ఈ దురాచారము ధనాశాపరాయణములైన సకలరాజ్యములకును ననతిక్రమణీయముగ నున్నది. అమెరికారాజ్యాధికారు లిష్టదేవతమైన ధనదేవతకు దాసులుగ నున్నారు. వారి రాజ్యాధికారమంతయును నీప్రయోజనమునకు వినియోగపడుటకు రూజువెల్టుగారికి సంపూర్ణాధికార మొసంగబడినది. వారి యధికారము మానవకల్యాణమునకుగాకను స్వప్రయోజములకు వినియోగపడగలవిధమును రూజువెల్టుగారి ప్రకటనము తెలుపుచున్నది. రూజువెల్టుగారి ప్రకటనము స్వజాతీయ ప్రయోజనములను ప్రత్యేకలాభములను నపేక్షించుచున్నది.

యూరపురాజ్యములన్నియును అమెరికాకు బాకీయున్నపుడు డాలరునకును నితరనాణెములకును ప్రమాణమును నిర్ణయించుట పరమావసరము. అమెరికారాజ్యాధికారులు యథేచ్ఛగను బంగారు చలామణిని విసర్జించియును, మారకమును సమర్థించియును ప్రపంచార్థికస్థితికి మహాపకారమును గలుగజేసినది. ఇపుడైనను సంకుచితములైన స్వీయప్రయోజనములను విస్మరించి ప్రపంచప్రయోజనములను సంస్మరించుట ధర్మము. మాటలందు ప్రపంచప్రయోజనములను, క్రియలందు స్వప్రయోజనములను నడుపుచు ప్రపంచమును మోసగించుట ఎవరికిని సాధ్యముగాదు. బంగారు వాడెడి దేశములప్రతిఘటనము సకలవిధములను ధర్మముగ నున్నది. రూజువెల్టుగారి నాయకత్వముక్రిందను అమెరికా సంయుక్తరాష్ట్రము లవలంబించుచున్న ఆర్థికనీతిస్వప్రయోజనములకును ప్రత్యేకజాతీయప్రయోజనములకును వినియోగపడునట్లు ప్రపంచసౌభాగ్యమునకును ప్రపంచార్థిక ప్రయోజనములకును, వినియోగపడజాలదు. అమెరికామార్గమునె గ్రేటుబ్రిటను వేరొక రీతిని నవలంబించుచున్నది.

*   *   *

### గ్రేటుబ్రిటను - సుంకములు

ప్రపంచకావ్యాప్తమైన బ్రిటిషుసామ్రాజ్యమునకు మాతృస్థానమైన, గ్రేటుబ్రిటను కితరరాజ్యములతో నిమిత్తములేకను స్వాయంపోషణముసాధ్యమని బ్రిటిషురాజ్యనీతిజ్ఞులునమ్ముచు సుంకముల దుర్గములను నిర్మించుట కుపక్రమించిరి. కన్సర్వేటివునాయకు లేమిప్రగల్భములను పలికినను ఒటావానిర్ణయములు బ్రిటిషు ప్రయోజనములకు నిరుపయోగములైనవి. బర్గినుగారు చూపిన వర్తకపు లెక్కలు భ్రమ ప్రమాదజనకములని, సర్ హార్బర్టు సామ్యుయలుగారి ప్రత్యుత్తర మనవద్యమని ప్రాజ్ఞు లంగీకరింపగలరు.

గ్రేటుబ్రిటను అవలంబించిన స్టర్లింగు విధానము వ్యాపారమునం దభివృద్ధిని జూపి

నను నీయభివృద్ధి కృత్రిమమని ఆర్థికపండితులు గ్రహింపగలరు. గతించిన ఆరుమాసము లందును పెరిగిన ౩౦౦ లక్షల సవరనుల వ్యాపారాభివృద్ధికిని మూలము సుంకములు గాని యథార్థమైన వ్యాపారాభివృద్ధి గాదు. హిందూస్థానమునకు గతించిన ఆరునెలల యందును ఎగుమతులు ౧౦౦-కి ౨ వంతున మాత్రమె అభివృద్ధి నొందుట ఒట్టావా దుర్ణయములకు నిదర్శనము. హిందూస్థానమునుండి దిగుమతులుమాత్రము బంగారు వెండి మున్నగు వస్తువుల రూపమునను విశేష మభివృద్ధిని బొందినవి. బ్రిటిషువ్యాపారపరిశ్రమలు, వివిధపరిశ్రమలందును క్షీణించుచున్న విధమును గ్రేటుబ్రిటను వ్యాపారపరిశ్రమలు రుజువు చేయుచున్నవి. ఈ విషాదావస్థయందు హిందూస్థానమునకు గలుగుచున్న యన్యాయము బ్రిటిషుసామ్రాజ్య ధురంధరుల స్వప్రయోజన పరాయణత్వమును వెల్లడి చేయుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యాధికారుల రాజనీతి స్వప్రయోజనములకు తాత్కాలికము లాభించినను సామ్రాజ్యాంతర్భాగములకును ముఖ్యముగ పరాధీనాంతర్భాగములకును నష్టదాయకమని ధర్మజ్ఞు లందరును గ్రహించిన విషయము. చర్చిలుగారికిని, బాల్డ్విను గారికిని, మాగ్డొనాల్డుగారికిని, లాన్సుబరీగారికిని ఈ విషయమున అంతరము లున్నను ప్రయోజనముమాత్రము సమానము. బ్రిటిషుసామ్రాజ్యాధికారులకు జాతీయ లక్ష్యము ప్రధానము గాని అంతర్జాతీయ లక్ష్యము ప్రధానము గాదు. చర్చిలుగారు చెప్పినట్లు హిందూస్థానమువంటి పరాధీన దేశములు బ్రిటిషుప్రయోజనముల కేర్పడిన గంగిగోవులు. ఇట్టి అన్యాయతంత్రములు తాత్కాలికముగ ప్రయోజనవంతములుగ గన్పడినను కాలాంతరమున నిరుపయోగము లేగాకను నష్టదాయకములుగ పరిణమింపగలవు.

* * *

ఇతరరాజ్యవ్యవహారములు

గ్రేటుబ్రిటనునావరించిన విషాదమె ఇతర యూరపురాజ్యములను నావరించినది. హిట్లరుగారి రాజయోగము తాత్కాలికముగ విజయమును వడసినను, చిరకాలసంవర్ధితములైన మానవధర్మములను విధ్వంసము చేయుచున్నది. అన్నిపక్షములును హిట్లరుగారి యాజ్ఞానుసారము నిర్గమించినవి. ఒక నాజీపక్షము మాత్రమే నిలచియుండుటకు హిట్లరుగారు చేయుచున్న విశ్వప్రయత్నములు ధర్మవిరహితములై ప్రలయబీజములను దాల్చియున్నవి. ఇరువదియవశతాబ్దమునందు విశ్వమానవధర్మాభ్యుదయయుగమునందు సంకరములేని ఆర్యజాతీయతను నిర్మించుటకును, యూదుల సంహరించుటకును, హిట్లరుగారి నాయకత్వముక్రింద నాజీపక్ష మవలంబించుచున్న అధర్మమార్గము మహాప్రళయమునకు మూలముగ నున్నది. నాజీపక్షవిజయము విషాదావస్థయందు మునిగియున్న జర్మనీదేశమును విజయోన్మాదపరము జేసినది. నాజీపక్షవిజయము ఫ్రాంసు దేశమును విషాదపరమును, ఆస్ట్రియా దేశమును క్రోధ

పరమును, స్వల్పరాజ్యములను భయభ్రాంతుల పరమును జేసినది. ఈపరిస్థితులందు ప్రపంచార్థికవ్యవహారములు సంకుచితములును, స్వప్రయోజనపరాయణములునునైనజాతీయప్రయోజనములనుండి విశాలములును, పరార్థపరములునునైన ప్రపంచప్రయోజనములకు మరలునని విశ్వసించుటకు సూచనలు గనుపడుట లేదు. బలీయములైన యూరపురాజ్యముల సంఘర్షణమునందు పరాధీనములయిన రాజ్యములు ముఖ్యముగ హిందుస్థానమువలె నిస్సహాయములును దారిద్ర్యగ్రస్తములు నైన దేశములనుభవించుచున్న కష్టములు దుస్సహములై వర్ణనాతీతముగ నున్నవి.

*          *          *

హిందూస్థానము – శ్వేతపత్రము

బ్రిటిషు సామ్రాజ్యాధికారులు హిందుస్థానమును సామ్రాజ్యము వెంటను వారి యిష్టానుసారముగ నీడ్చుకొని పోవుచున్న విధమును గ్రేటుబ్రిటను వ్యవహారములును, సామ్రాజ్యాంతర్భాగముల వ్యవహారములును విస్పష్టము చేయుచున్నవి. హిందుస్థానమందలి రాజకీయార్థిక సాంఘిక మతాదివ్యవస్థలును విభేదములును బ్రిటిషుప్రయోజనములకు వినియోగపడవలసియున్న విధమును చర్చిలువర్గమువారు ఘంటాపథముగ చాటుచున్నారు. గతించిన రెండుమాసములందును జాయింటు పార్లమెంటరీ కమిటీయెదుటను శ్వేతపత్రమువిషయమై జరిగిన చర్చలు, విచారణలు, సాక్ష్యములు, వాదప్రతివాదములు హిందుస్థానమునుండి జాయింటు పార్లమెంటరీ కమిటీకి వెడలిన ప్రతినిధుల ప్రవృత్తియందే గాక దేశమునందంతటను నిరాశను గలుగజేసినవి. సప్రూగారు నిరాశనుజెంది స్వదేశమునకు వెడలుచున్నట్లు వార్తలు తెలుపుచున్నవి. పురుషోత్తమదాసు ఠాకూరుదాసుగారు తనకర్తవ్యమునుగురించి బొంబాయిలోని తనమిత్రులసలహా కోరినట్లు తెలియుచున్నది. సౌమ్యస్వభావుడైన జయకరుగారు జాయింటు కమిటీవ్యవహారములు హిందుస్థానమునకు ఋణదాతలవ్యవహారములవలె నున్నవని తెలిపిన భావములు జాయింటుకమిటీప్రహసనమును చక్కగా వర్ణించుచున్నవి. శ్వేతపత్రనిర్ణయములే పనికిరావని మితవాదనాయకులు కోరుచున్నపుడు వానిని వెనుకబెట్టుటకై జాయింటు కమిటీసభ్యులును కన్సర్వేటివుపక్షనాయకులును చేయుచున్న ప్రయత్నములు హిందుస్థానప్రతినిధుల హృదయములందును హిందూదేశమునందును నిరాశా నిరుత్సాహోద్వేగములను గలుగజేయుటయందు విచిత్ర మేమియును లేదు. మెస్టనుప్రభువు రాష్ట్రీయ స్వపరిపాలనముతో హిందుస్థానము సంతృప్తినందవలయునని చేసిన హితోపదేశము గమనార్హముగ నున్నది.

యథార్థమైన రాష్ట్రీయ స్వపరిపాలనము నంగీకరించుటకు తాను సంసిద్ధుడైయున్నట్లు గాంధీమహాత్ముడు రెండవరౌండు టేబిలు సమా

వేశసమయమునందే తెలిపియుండెను. కాని శ్వేతపత్రమునందు సూచితమైన రాష్ట్రీయ స్వపరిపాలనము, స్థానికస్వపరిపాలనమువలెనే, స్వపరిపాలన బీజములనే గలిగియుండలేదని వ్యవహారములు వెల్లడిచేయుచున్నవి. రాష్ట్రిములందులా, ఆర్డరులవిషయములందే సందియములు గల్గినపుడును, నిరంకుశాధికారులగుగవర్నరులున్నపుడును, రాష్ట్రిములకు బాధ్యత వహింపని పైయధికారులున్నపుడును పేరునకు స్వపరిపాలనముండినను క్రియయందది విశదమగుచున్నది. శ్వేతపత్రము వలన జాయింటుపార్లమెంటరీకమిటీ ప్రసాదింపనున్న రాజ్యాంగసంస్కరణము లేరూపమును దాల్పనున్నను దేశమనుభవించుచున్న కష్టపరంపరలకు తరణోపాయము అగోచరముగ నున్నది.

ప్రజలు దుర్భర దారిద్ర్య మనుభవించుచున్నారు. ధరలు పడిపోయినవి. వ్యాపారము క్షీణించినది. బ్రిటిషుప్రయోజనములకై కోట్లకొలది వెండి బంగారములు ఎగుమతి అగుచున్నవి. దేశమందు ప్రధాన పరిశ్రమమైన వ్యవసాయపరిశ్రమ ప్రజాపోషణమునకును, దేశక్షేమమునకును నిరుపయోగమైనది. పరిశ్రమలు విదేశపరిశ్రమలపోటీకి నిలువజాలకున్నవి. జపాను దేశమునంతను చవుకవస్తువులతో నింపివేయుచు హిందుస్థానపు దూదిని బహిష్కరించుటకు నిశ్చయించినది. గ్రేటుబ్రిటను అవలంబించుచున్న రాజకీయార్థిక వ్యవహారములు స్వప్రయోజనపరాయణములైనటులు హిందూస్థానమున కుపయోగపడకున్నవి; మీదుమిక్కిలి యపకారమును గలుగజేయుచున్నవి. రాజకీయార్థిక పారతంత్ర్యమునందు మునిగియున్న హిందూదేశమునకువ్యయభారముమాత్రముతగ్గకఅభివృద్ధియగుచున్నది. సకలరాజ్యములును జాతీయప్రయోజనములను రక్షించుచు నభివృద్ధి నొందుచున్న సమయమునందు నిస్సహాయములగు దేశములారాజ్యములకు బలియగుచున్నవి.

పాశ్చాత్యరాజ్యోదంతములును, చీనా జపానురాజ్యోదంతములును ప్రపంచము నావరించుచున్న మహాప్రళయమునకు సూచనలుగ నున్నవి. ఈప్రళయావస్థయందు హిందుస్థానమునకు, ఇతరుల దయాదాక్షిణ్యములు గాక స్వల్పమైనను స్వయంసహాయమే శరణ్యము. హిందుస్థానమునందు స్వయంసహాయ బీజములను ప్రతిష్ఠించిన గాంధిమహాత్ముని ఉపదేశాచరణములను విమర్శించి, పరిశోధించి, అనుష్ఠింపవలసిన యవసరము దేశమునకు సంప్రాప్తమైనది. హిందుస్థానప్రజలును, నాయకులును జాతిమతపక్షకులాదిభేదములను విసర్జించి దేశప్రయోజనములను ధర్మలక్ష్యముతో నిర్ణయించి, అనుష్ఠింపవలసిన యవసరమును గమనించి కర్మయోగారూఢులు కావలయును. పునహాయందు జూలై ౧౨-వ తేదీని కూడనున్న నాయకులసభ ఈపరమార్థమును గ్రహించి కార్యవిధానమును నిర్ణయించుట ప్రయోజనకరము.

* * *

## ధర్మసందేశము - గాంధిమహాత్ముడు

పాశ్చాత్యసంస్కారము ప్రపంచము నావరించి ధనాధికారదేవతారాధనమును విశ్వవ్యాప్తము చేసినది. సంస్కారస్వార్థపరత్వము ధర్మమునకు లక్ష్యమైనది. పాశ్చాత్యరాజ్యములు పరాక్రమణపరత్వము నపేక్షించెడి విధము నార్థికసమావేశోదంతిమును, రాజ్యాంగవ్యవహారములును విశదముచేసినవి. ధర్మాశ్రయము లేని ప్రచండజాతీయపరత్వము పరమానర్థములకును మూలమగుచున్నది. శ్వేత(సుంకముల) సమరము రక్తసమరమును మరపించుచున్నది. రక్తసమరక్రోధావేశము సమరానంతరమున శాంతిని బొందుచున్నది. శ్వేతసమరావేశము శాంతిని పొందకను ప్రపంచము నంతను చిరకాలము పీడించుచున్నది. శ్వేతసమరము సుక్షేత్రముల నూషరక్షేత్రములను జేయుచున్నది; ఊషరక్షేత్రములను సుక్షేత్రములను జేసినటులు భ్రమపడుచున్నది; అధర్మమును ధర్మముగను, ధర్మము నధర్మముగను తలపోయుచున్నది. రాజసతామసగుణావృతమైన జాతీయధర్మారాధనమునందు సర్వమును వ్యత్యస్త మగుచున్నది. ఆత్మావలోకనముతో నారంభము గావలసిన ధర్మసంస్కారము పరాక్రమణముతోను, పరపీడనముతోను నారంభ మగుచున్నది. స్వయంసహాయమునను, స్వయంవికాసమునను సాధ్యమైన ధర్మానుభవము పరాక్రమణమూలమునను సాధ్యము గావలసియున్నది. త్యాగరూపమునను సాధ్యము గావలసిన ధర్మము భోగరూపమునను సాధ్యమగుచున్నది. ధర్మార్థము నియమితములైన యజ్ఞదానతపస్సులును మమకారాహంకారపరములై ధర్మలక్ష్యము సకలవ్యవస్థలందును నిర్గమనమును బొందుచున్నది.

సకలవ్యవస్థలందును ధర్మదేవతారాధనమును సాధ్యముచేయుటకు గాంధిమహాత్ముడుపక్రమించిన సత్యాగ్రహోద్యమము వర్తమానప్రపంచపరిస్థితులందు దుర్గ్రాహ్యముగను దురారాధ్యముగ నున్నను, ధర్మానుష్ఠానమునకు శరణ్యముగ నున్నది. రాజకీయ వ్యవహారములందు గాంధిమహాత్ముడుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానమును, హరిజనోద్యమమునందు గాంధిమహాత్ము డవలంబించిన యుపవాసదీక్షయును ఆత్మోపలబ్ధికాత్మోద్ధరణము సాధనముగాగల విధమునకు ప్రమాణములు. ఆత్మోపలబ్ధికి పరాశ్రయము నిరర్థకమనియును, ఆత్మధర్మాశ్రయము సార్థకమనియును నిత్యమైన విశ్వధర్మము విశదము చేయుచున్నది. ఆ పరమార్థమునే గాంధిమహాత్ముడు తన ధర్మోపదేశాచరణములందు సువ్యక్తము చేయుచున్నాడు. హిందూస్థానమునకు స్వరాజ్యసిద్ధి ధర్మసంస్థాపన కాని దయాదాక్షిణ్యప్రసాదము కాదు; స్వరాజ్యస్థాపనము పరమార్థము కాని స్వార్థారాధనము కాదు. స్వరాజ్యోద్యమము ధర్మోద్యమము కాని ధనాధికార సంపాదనోద్యమము కాదు. సత్యాగ్రహోద్యమమునకు హృదయమైన అహింసాధర్మము ఆత్మధర్మోపలబ్ధికి పరమార్థము కాని

సాధనము కాదు. పరాక్రమణపరాయణమైన ప్రపంచపరిస్థితులందు స్వార్థారాధనము పరమార్థముగను గ్రహింపబడుచున్నది.

స్వరాజ్యోద్యమమునకువలెను హరిజనోద్యమమునకును మానవధర్మారాధనము పరమార్థము కాని సాధనము గాదు. హరిజనోద్యమమునకును మానవసేవ పరమార్థము. గాంధిమహాత్ము డీపరమార్థమును పొందగలవిధమును నిరశనదీక్షాసాధనముననుసవర్ణులకును, అసవర్ణులకును బోధించెను. సేవకు బదులు ప్రచారకోపన్యాసములును, ధర్మమునకు బదులు ధనమును హరిజనోద్ధరణమునకు సాధనములు గాజాలవు.

హిందూస్థానోదంతమునందు వర్తమానసమయము విషాదసందిగ్ధసమయముగనున్నది. గాంధిమహాత్ముడు బ్రహ్మత్వమును వహించుచు నాత్మోద్ధరణమునకు పరమార్థములైన స్వయంసహాయమును, ఆత్మవిశ్వాసమును బోధించుచున్నాడు. ప్రపంచపరిస్థితులును, హిందూదేశపరిస్థితులును ప్రజానాయకుల లక్ష్యములను నాత్మోద్ధరణమునకు ప్రపంచమునకు పరిపాటియైన బాహ్యములైన ధనాధికారాదిసాధనములందు లగ్నము చేయుచున్నది. పునహానగరమునందు శ్రీయుత ఆనెగారియాధిపత్యము క్రిందను జులై ౧౨-వ తేదిని గూడనున్న మహాసభను మహత్తరమైన ధర్మసమస్య యెదుర్కొనుచున్నది. గాంధిమహాత్ముడు ౧౩-వ తేదిని మహాసభకు ధర్మసందేశమును తెలుపుట కేర్పాటులు చేయబడినవి. ధర్మ మఖండముగాని ఖండములు గాదు. ధర్మము రాజకీయసాంఘికమతార్థికాది వ్యవస్థలందు భిన్నరూపములను గోచరంబగుచున్నను ప్రయోజనము పరమార్థమైన పురుషార్థము. గాంధిమహాత్ముడు గతించిన పదేండ్లయందును ప్రజాలక్ష్యమును ధర్మలక్ష్యమునందు లగ్నముచేయుటకు చేసిన తపస్సు సఫలము గాకపోయినను ప్రజాహృదయము నాకర్షించినది. పాశ్చాత్యసంస్కారము ప్రతిష్ఠించిన ధనాధికారదేవతలు స్వేచ్ఛావిహారమును జేయుచు ప్రజాహృదయముల నాకర్షించుచున్నవి. పారతంత్ర్యమునందును, దుర్భరదారిద్ర్యమునందును, దురాచారపాశములందును, సాంఘికావరణములందును, మతమీమాంసలందును చిక్కి, ఆత్మసాక్షాత్కారము లేకపోయినను, ఆత్మవిశ్వాసమైనను లేని ప్రజానాయకులకు, గాంధిమహాత్ముని ధర్మోపదేశాచరణము లాత్మవిశ్వాసమును గలుగజేయుట దుర్లభము. ఇతరదేశములందువలెనె హిందూస్థానమునందు నిస్సహాయస్థితియందున్న ప్రజలకు గాంధిమహాత్ముని ధర్మోపదేశములును, ధర్మనిర్ణయములును విశ్వాసము లేకపోయినను, శరణ్యములైనవి. ఈసందిగ్ధదశయందు నాయకులు నిర్ణయించెడి ధర్మనిర్ణయము భగవదనుగ్రహమును బడయుగాత!

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౮.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩





పంప - కుందుర్తి నరసింహారావుగారు ... ... ... ౧౮౧–౧౮౩

కావ్యపఠనము - శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ... ... ౧౮౫–౧౯౦

కన్యాశుల్క నాటక విమర్శనము-శ్రీపాద కామేశ్వరరావుగారు ... ౧౯౧–౧౯౮

బిల్హణకథ—డి. ఎ. నరసింహంగారు ... ... ... ౧౯౯–౨౦౬

ఖాన్‌ఖానా అబ్దుల్ రహీమ్‌ఖాన్—రామమోహన్‌రాయ్ ... ౨౦౭–౨౧౦

ప్రేమపాశం—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... ... ౨౧౧–౨౧౩

మేఘుడు—జి. జాషువగారు ... ... ... ... ౨౧౪

మాసంసారాలు—ఓకుమళ్ల కామేశ్వరరావుగారు ... ... ౨౧౫–౨౧౯

'మిస్ లైలా'—గొల్లపూడి జోగారావుగారు ... ... ౨౩౦–౨౩౫

సూరన—అయినంపూడి గురునాథరావుగారు ... ... ౨౩౭

ఉరిశిక్ష—తంగిరాల రాధాకృష్ణయ్యగారు ... ... ... ౨౩౯–౨౪౪

వినోదశిల్పము: కుట్టుపని—కొ. నరసింహాచారిగారు ... ... ౨౪౫–౨౪౬

తాజ్ మహాలు—క్రమధాటి జానకీగిరిగారు ... ... ... ౨౪౭–౨౫౨

గ్రంథప్రకటనము—'భాషాభిమాని' ... ... ... ౨౫౩–౨౫౪

ఆధునిక చిత్రకళయందలి లోపమేమి? ... ... ... ౨౫౫–౨౫౯

భారతీయ విద్యాచరిత్రము—మారేమండ రామారావుగారు ... ౨౬౦–౨౭౧

నేటి రష్యా—నార్ల వెంకటేశ్వరరావుగారు ... ... ౨౭౧–౨౭౬

చేతిపనులు—దశిక సూర్యప్రకాశరావుగారు ... ... ౨౭౭–౨౮౦

హిందూమతాచారములు: ప్రభుత్వపు అధికారబాధ్యతలు—కొమాండూరి శఠకోపాచార్యులుగారు ... ... ... ౨౮౧–౨౮౫

రాజకీయవిధేయత—శ్రీపాద గణపతిరావుగారు ... ... ౨౮౭–౨౮౯

ఆంధ్రగ్రంథముల పట్టిక— ... ... ... ... ౨౯౦–౨౯౩

నక్షత్రమండలము (శ్రావణమాసము)—గొబ్బూరు వెంకటానంద రాఘవ రావుగారు ... ... ... ... ౨౯౫–౨౯౯

బాలక్రీడలు—నుంగిపూడి వేంకటశర్మగారు ... ... ౩౦౦–౩౦౪
భారతీయ మహిళామండలి—శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు ... ౩౦౪
ఆంధ్రాభ్యుదయము—శ్రీ వేముల కూర్మయ్యగారు; డాక్టరు యం. వి. రాధాకృష్ణరావుగారు ... ... ... ... ౩౦౫
నాట్యకళ: కీ. శే. పిల్లలమఱ్ఱి సుందరరామయ్యగారు—ఏ. వి. సీతా రామయ్యగారు ... ... ... ... ౩౦౬–౩౦౭
మీగడతఱకలు: లాంఛనములు—మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ... ౩౦౮–౩౧౦
కలగూరగంప: జర్మనువిద్యాలయములలో వార్తాపత్రికలు; ఆంగ్లప్రధానో పాధ్యాయుని నేటికాలపు విద్యార్థుల వర్ణనము; సనాతన ధర్మ మనగా నేమి?; స్వాతంత్ర్య పరిచయము; విద్యాలయములలో ఆటలు; సహకారమహాసభ-౧౯౩౩; మొహెంజో దారో ... ౩౧౧–౩౧౬
— ... ... ... ... ... ౩౧౭–౩౨౧
మనవిమాటలు: ఆంధ్రవిశ్వకళాపరిషత్తు - ప్రాచ్యవిద్యాపరీక్షలు; ఆంధ్ర నాటక కళాపరిషత్తు (౧౯౩౩); ప్రాచ్యవిద్యాపరిశోధనాలయము, చెన్నపురి - సహాయాంధ్రపరిశోధక నియామకము; స్వర్గీయ జతీంద్రమోహనుడు; అశ్రుతర్పణము: కీ. శే. ఆ. వేం. సాంఖ్యాయనశర్మగారు; అరవమునకు ప్రోత్సాహము; దాంపత్యసౌఖ్యము; అశ్లీలప్రకటనములు. ... ... ౩౨౨–౩౩౩
సాభిప్రాయ విశేషములు— ... ... ... ... ౩౩౪–౩౩౬

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు—కన్నప్ప; చాకలి.

సాధారణ చిత్రములు—ఆధునిక శిరోజసంస్కారచిత్రములు ౮; మొహెంజోదారో; చిత్రములు ౧౨; తిరునీర్ మలై; శ్రీ గోవిందరాజస్వామి దేవాలయ గోపురము, తిరుపతి; కోటగిరిలోని బజారు, నీలగిరి; హూంటు ప్లెజంటు, కోటగిరి; డచ్చికోట శిథిలములు, అంజెంగోవద్ద; తుంగభద్రానది (హంపి శిథిలములు); జైనదేవాలయములు (హంపిశిథిలములు); ఏనుగుల శాల (హంపిశిథిలములు); కోటలోని రక్షకశాఖామందిరము (హంపిశిథిలములు); ఊరబావి; ఇతర చిత్రములును.

---




సంపు. ౧౦ శ్రీముఖ సంవత్సరము, శ్రావణమాసము (ఆగష్టు ౧౯-33) సంఖ్య ౮

# పంప

కుందుర్తి నరసింహారావు

౧

త్రెలుఁగుపొలాల పంట గుఱుతింపఁగరాని తెవుళ్ల పాలుగా,
మలఁచిన పైఁడిగద్దియల మంటిపొరల్ నునుసిగ్గు దాఁపఁగా,
కలఁగిన కాఱుమబ్బులు పికారులు కొట్టెడి గబ్బిలాలుగా—
నిలిచితవే, సరోవరమ, నీ వొకదానవు నాఁటిసొత్తుగా ?

అలల మెఱుంగుటద్దపు హొయల్ గులికించిననాఁడు తీవెక
న్నెలు నిను గారవించిరి, కనీనికల్ దొలుకారుమబ్బువ
న్నెల నునుసోగగాఁ దిలకనీలిమ పూవుమొదళ్ల దిద్దుకోఁ
దలఁచి, భవత్తటాంచలపద్భ్రమణక్రమలాస్యలోలలై !

౨

తురకరాడీల కత్తుల కఠారుల వేడి తుంగభద్రాదేవి నింగి కెగయ,
పగరతేజీల పాపాల హేషాఘోష కోటకొమ్మల గుడ్లగూబ లెగయ,

అరుల 'సారా'ల విహారాల 'సారా'ల మునలికొండలు ముక్కు మూసికొనఁగ,
పాదుషామీసాలపై చేతిగడగడ పైఁడి 'దర్వాజా'లు పకపక నగ
తొల్లి తెలుఁగుకోటలు పడ్డ దుర్దినమున - తోడికమలాకరములు ని న్వీడి చెదరి
కొండరా ల్లేవో పైఁగప్పకొన్న వోటు! - బావురుమటందు వమ్మ, పంపామతల్లి!

రమ్మనినావటే తెలుఁగురాయని కోటకి వైరిరాజదు
ర్గమ్ముల కీర్తికాంతను పరాజయకాంతను తోడుతోడుగా:
బొమ్మలపెండ్లిగా పగటిపూట జయోత్సుకుఁడైన రాజులె
న్నెమ్ముల నంటి చేయి నహితేశ్వరు స్వాగత మిచ్చినావటే?

౩

చచ్చిన తొంటియేఁడుల విశాంపతు లెల్లరు తుంగభద్రలో
ముచ్చటకై నిజాశ్వముల ముందుగ తా మెదురీఁదువారు; మా
కచ్చెరువయ్యె, నట్టికులమందు జనించియు, 'పుట్టి' గట్టి, యే
పిచ్చిపథాలనో కడచు వీరుల మైతిమటమ్మ, చూచితే?

ఇందుల కీవె సాక్షివి సఖి, సరసీ, నిజవామలోచన
స్పందనమాత్ర సూచితవిపక్షుల ప్రమదావిక స్వరా
క్రందనకోటివా తెలుఁగురాణివి: ప్రాక్తనకీర్తినామక
స్యందన మెక్క నర్హత రవంతయు నున్నదటమ్మ మా కిఁకన్?

మా పౌరాణిక పారిశుద్ధ్యమును పంపా, నీ తరంగద్యుతుల్
స్థాపించెన్ దొలినాళ్ల రామచరణస్పర్శప్రభావంబునన్,
తేపో మాపో నశించిపోఁగలుగు మా ప్రేమాభిమానాల స
ల్లాపా లియ్యవి లెక్కలోనివటె లీలామూర్తివా నీ కిటన్?

నీ కొకమాట చెప్పవలెనే, జలజాకరమా, తపస్వినీ
లోకము పుణ్యహస్తములలో నిను లాలనచేసినట్టి ప్ర
త్యేకత మంటఁగల్పి మతిహీనుల నెత్తుటికండ లాజిలో
ఆఁకలిగొన్నయట్టు లకటా! దిగమ్రింగుట పాపకార్యమే!

౪

ఆరుబయ లిది; మాది కొండంతకోట. ఏదొ, రవ్వంత యిది బలహీనపార్శ్వ
మాయెపో! వైరివీరుల ఆయువులకు - అమృతదాన మొసంగినావటవె నీవు?

౫

నీవు పిశాచివా, ప్రణయినీమణివా ముదుసల్ల గుంపులో
కానరమెక్కియున్న మొనగానికి వానికి రామరాయమూ
ర్ధావనిభృచ్ఛిఖామణికి? అంతయు నీదిశ నాశమైన, ఏ
దేవుఁడు నిన్ను 'మూలమిదియే' యని వ్రేలిడి చూపఁజాలఁడే!

అమ్మా, పంప, నిలింపసేవితతరంగా, నీకు జోహారు! దుః
ఖమ్మో, దోషబలమ్మొ నాకుఁ దెలియంగానీదు, నీపార్శ్వభా
గమ్మునాఁ డెటుచూచినన్ విడియపాకై పండెనా? నేఁటి కా
'కమ్మెరాకుల' తమ్మలో మెఱుపు రక్తస్రావమా, భోగమా?

౬

విఱుచుకుపడ్డ దేవతల విగ్రహపంక్తులలో దవానలుం
డఱచి 'లబోదిబో' యనిన అడ్డపడంగల కోఁఅమీస మె
వ్వరిది? సరోవరేందిర, నివాళులుపట్టిన పల్లెరమ్మలన్
తురకలు రత్నహారములతో తెగనింపి అదృశ్యులైరటే?

ఈ సన్న్యాసిమఠాలు నీగుహాలు నిట్లే యుండనీ—వీథులన్
రాసుల్ వోసిన పుష్యరాగముల బేరా లిప్డు డున్నట్టులే
యీశైలోపలఖండఖండములు నిట్లే యుండనీ...పేదస
న్న్యాసుల్ చేనగగాసులేక యిఁక నానందాశ్రువుల్ రాల్తురే!

ఇంకొకమాటతోడ ముగియించెద నాహృదయస్థదుర్వ్యపా
దాంకురజీవగాథ: సగమైన శరీరమువోలె జీర్ణప
ర్యంకము నంటఁగట్టుకొని ఱాతిపొరల్ పయిఁగప్పుకొన్న యే
ణాంకధరప్రతిష్ఠితమహాలయసీమకు దోయిలొగ్గుచున్.

౭

జీర్ణవిజయనగర శిథిలాలయప్రాంత - శైలరాశీ కటకటాలమధ్య
బందియై వడంకు పంపాసరోవరా - రామ మాతృదేవతామతల్లి!

---

# కావ్యపఠనము

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

గ్రంథపఠనములో ఆసక్తి ఉన్నవాళ్లైనా రేనా వాఙ్మయసముద్రాన్ని అమృతప్రాయమైన కావ్యాన్ని మరిచిపోలేరు. లలితకళలలో సంగీతమెట్లో, వ్రాతలలో కావ్య మట్లు. నవల చదవడానికి ఓరిమి అవసరము. అది త్వరగా పూర్తికాదు. తొందరపడి పరిశిష్టము చదివేస్తే ఆసక్తి నశించిపోతుంది. వ్యాసము భావమునకుకన్న ఆలోచనకే ప్రాధాన్యమిస్తుంది. చిన్నకథలు, నాటకాలు చదివి ఆనందించడానికి కళాకృతులను చాలామట్టుకు తెలుసుకుని ఉండాలి. ఠాకూరుమహాకవి వ్రాసిన పవిత్రనిశీథము (Supreme night) అనే కథను చదివినవారిని ఆరాత్రి పవిత్రమెందుకయిందని ప్రశ్నిస్తే సరియైనజవాబు సామాన్యంగా రాదు. శాకుంతలాని కామాధుర్యమెలా వచ్చిందో చెప్పగలిగినవారు లెక్కకు తక్కువ. కాని కావ్య రసాస్వాదనం సర్వమానవులకు కదలీఫలభోజనమువంటిది. 'భాష అర్థమైతే భావ మరటిపండే.' అన్నాడుగదా ఉమర్ ఖయ్యామ్.

'ఆనందలేశమైనా నోచుకోని 'ప్రవాస పాషాణజీవనా'లు కూడ కావ్యరసాస్వాదనమువల్ల 'దుఃఖపుంగసటు' నశించి భాగ్యసుమవాసనలను పరిమళిస్తాయి. కంకణవిభూషితమైన అదృశ్యకరసరోజము కావ్యపఠనాసక్తుడైన చదువరిని పాలుబారిన భాగ్యసీమలకు తీసుకుపోతుంది. ఆ సీమలలో ఉషాకన్య తన బంగారుచీరచెరగుల్లో తారకారత్నాలని మూటకట్టుకోడానికి హంసనడకలతో బయలుదేరుతుంది. చివురుమేతలచే జేవురించిన కంఠాల్లోపుట్టి తెమ్మెరత్రోవల్లో కోయిలపాటలు పరుగులెత్తుతాయి. బాలసూర్యుడు సయ్యాటలకని చేతులు చాపుతే వరిపంట చిన్నారి సిగ్గున శిరము వంచుతుంది. మనోహరగానసత్కళావిలసితుడైన అళిరాజును వరించిన మల్లెపూవుపరిణయానికి పువ్వులన్నీ గుమికూడుతాయి. తమ యేలికకోసము తుమ్మెదలు విరిదేనె పానకము కూడబెట్టుతాయి. పవనుడు పుప్పొళ్లు కూరుస్తాడు. ఈ వివాహమహోత్సవానికి ఉపశ్రుతిగా సెలయేటిచెలులు నదీకాంతతో కూడితే నదీకాంతలు సముద్రునితో చేరుతాయి. భాస్కరుడు బంగారుతివాచీమీద నడిచి పశ్చిమము చేరగానే మనుజహృదయాల కగమ్యాలయిన మధురగీతాలతో గాలిదారుల్లో గుంపులై పక్షులు తేలిపోతాయి. నభోమణి పోయిందని సంధ్యాదేవి జేవురిస్తుంది. నిశాకాంత తన నీలిచీరచెరగుల్తో సంధ్యాదేవి ఉంచిన రంగుముగ్గుల్ని తుడిచేసి ముత్యాలు చల్లుతుంది. ఉదయగ్రావమనే పానవట్టముమీద అభిషేకాంభోధిలోంచి శీతగభస్తిబింబశివలింగ ముదయించి కౌముదీ దీప్రప్రభారాశిలో దర్శన

మిస్తుంది. మానవుల ఆశల్తో విధికి నిరంతరా నీకము సాగే ఈ కటికి నేలే మనోజ్ఞమై నందనములాగ కనబడుతుంది. నీలాభ్రసరసిలో నిండుజాబిల్లి రాయంచవలె విహారము సల్పుతుంది. కమ్మతెమ్మెరలు శాఖాపత్రాలలోనో, కల్లోలినీతరంగాలలోనో దాక్కుంటాయి. నాట్యమూ, గానమూ మానేశి శైవలినిసుఖ నిద్ర పోతుంది. సర్వేశ్వరుని చేతుల్లో విశ్వమే హాయిగా విశ్రాంతి చెందుతుంది.

ఈ వింత ప్రపంచములో దేశకాల ... లేమీ లేవు. చలికి నరాలన్నీ జిల్లార్చే శీతకాలములో మంచుగడ్డతప్ప మరేదీ చూడలేని ఉత్తరసముద్రతీరవాసి "ఆకుపచ్చని చీనిచీనాంబరమ్ము, చారుసుకుమార పుష్పభూషలను దాల్చి, లలితశాద్వలశయ్యాతలమున గూరుచున్న" కుంజసుందరిని చూడగలడు. పోలీసువారి చేతులలోతప్ప వేరెచ్చటను కత్తిచూడని నేటి ఆంధ్రుడు కండకండదీయు పరాసు ఫిరంగిగుండ్లమధ్య పసుపు కొంగుల ముసుగు లెడలగ కొసలుదీరిన కోరకత్తులు కసరిపోరిన గండుయోధుల శౌర్యాన్ని దర్శించగలడు. నీరవమైన అడవిలో తడియారిన తేటకన్నుల్తో, విడిపోయి జీరాడే జుట్టుకట్టుతో ఒంటరిగా శిలాతలమున నుపవిష్టమైన జానకీదేవి మానసవీథిలో పరుగులెత్తే భావతరంగాలు కవితాప్రభావంచేత మన మనస్సులకి స్పష్టమౌతాయి. గుండెలవియించే శివరాత్రిప్రభల చప్పుడు దారుల్లో విహరించే కాలకంఠుని ప్రళయనృత్యాన్ని కవియొక్క లేఖిని మనకన్నులగట్టుతుంది. మోడుచిగిర్చే పచ్చదనముతో గగుర్పాటెందిన తూర్పుకనుమల పాటను కావ్యము మనకి వినిపిస్తుంది. ఇన్నెందుకు? కావ్యము కామినీ స్వయంగ్రాహములాగ గగుర్పుచెందిస్తుంది. మెరుపులాగ ఈ ప్రకృతికి పాటపూస్తుంది. శ్రీకృష్ణుని వేణువులాగ సంగీతడోలల్లో ఊగులాడిస్తుంది. సరస్వతీదత్త పాత్రములాగ పంచభక్ష్యపరమాన్నాలు వడ్డిస్తుంది. ఉద్యానవనములాగ పరిమళ మెగబోస్తుంది.

కావ్యపఠనమువల్ల చదువరుల దృష్టి వైశాల్యము హెచ్చవుతుంది. ఈ దృష్టి కేవలము భౌతికమైన బాహ్యదృష్టిమాత్రమే కాదు. ఈ బాహ్యదృష్టిని మన కివ్వడానికి ఫొటోగ్రాఫులు చాలు. దూరదేశాలలోని నదులు, కొండలు, వ్యక్తులు మొదలైనవారి స్వరూపము చూపడములో కవిత చిత్రకళకి తీసిపోతుంది. కాబట్టి వర్ణితవిషయాల రూపచిత్రాన్ని కన్నులకి కట్టించడములోకాదు, కవిత్వానికి గౌరవము. చిత్రకళ కందని విచిత్రవీథులకి కవిత మనలను తీసుకుపోతేనే దాని ఆధిక్యము. పుట్టింటినుండి అత్తింటికి వెళ్లే మాలెత లెందరినో మనము చూస్తాంటాము. ఫొటోగ్రాఫులలోని చిత్రములలాగే వారు ఒక క్షణము మనకి కనబడి నిష్క్రమిస్తారు. వారి నిష్కపటహృదయాలు పరిమళించే అమాయికపు వాసనలు చిత్రకళగానీ, మన చూపులుగానీ చెప్పలేవు. కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారి "దారితోడు" చదవండి.

మెత్తగా నున్న గౌతమీసైకతముమీద గమ్యభూమిఃచేరే కాంక్షతో కవి నడుస్తున్నాడు. ఆతని వెనుకనే ఎవరో ఒకయింతి నెత్తిని మూటపెట్టుకొని నడుస్తోంది. కవి "ఏమిమూట అమ్మి? ఎందుండి ఎందుల కేగుచున్న దాన విపుడు చెపుమ" అని ప్రశ్నించాడు. "పుట్టినింటినుండి పోదు నల్ల దిగో మాయూరి కల్యాగారు" అని జవాబిచ్చింది. కవి ఆమెకు మూట యంకిలైనదని జాలిపడగా ఆమె "మూట పైనమునకు నాటంకమగు గాని పూట గడవ దండి మూటలేక" అని జవాబిచ్చెను కొత్త కోక పెట్టి కుంకంబువెట్టి వైరివాడైన ఆమె పెద్దయన్న తనివితీరక పచ్చజొన్నలు మూట గట్టి నెత్తిని పెట్టినాడట. చిన్న బిడ్డపలుకుకన్న ప్రేమార్ద్రిమూ, కోమలమూ అయిన ఆ నిష్కపటురాలి పలుకు కవిహృదయానికి ప్రియము చేసింది. ఇద్దరూ పాటిరేవుపడవని ఏటిపాయను చేరారు. దోనెవాడు "బాపన య్యవారు పాయదాటకమున్నె దాటరాదు మాలదాని" కన్నాడు. కరుణార్ద్రుడగు కవి దోనెవానితో, వెలివాడని పుట్టగానే ఈశ్వరుడు వెలిబెట్టడనీ, పావనమైన గౌతమికి అంటు లేదనీ చెప్పి ఆమెతో దోనె నెక్కినాడు. గౌతమీపావనతరంగములపై తేలిపోయి మన కవి ధర్మరాజు కుక్కతోవలె స్వర్గానికి తొలిమెట్టు నెక్కినాడు. ఈ ఖండకావ్యము మనము దినదినమూ చూచే మాలెతల హృదయమును విప్పిచూపుతున్నది. మన మనస్సులలో మాలెత లాక్రమించగలిగే స్థూలరూప చిత్రాని కీకావ్యము భావవర్ణ మిస్తోంది. ఇప్పటినుంచీ ఈమాలెతయమాయకత్వము కవిహృదయములోనే కాక మనహృదయము మీద కూడా అచ్చుపడుతోంది. ఈకావ్యము మన లౌకికదృష్టికి భావమనేరంగు పూసి అందము తెస్తోంది. చిత్రకళ కీ భాగ్యము లేదు. ఇట్టి ఖండమే కవికొండల వేంకటరావుగారి "పడవ" కూడా. రాళ్లపడవలకి చుక్కానిపట్టే కుర్రకుంకలని మనముఎన్నిమారులైనా చూచి ఉంటాము. వారు మన హృదయాలదాకా ఎందుకు, కంటికికూడా ప్రత్యేకముగా కనపడరు. కవి మనకి బాహ్యదృశ్యాన్ని అతిక్రమించి వారి ఆంతర్యా నిదర్శించగల తపనీయ సులోచనా లిస్తున్నాడు. అప్పుడు, మన హృదయాలమీద నుండే నట్టిబొమ్మ చిత్రము లైన వర్ణాలు పొంది అక్కడే అతుకు కుంటుంది. లక్షలకి మించిన వర్ణచిత్రాలు చూచినా ఈ అమాయికత బోధపడదు. ఇది సజీవ ప్రకృతి సంగితి.

కవితా స్పర్శముచేత జడప్రకృతికూడ సజీవమై భావలహరులు వెలువరించడము కూడా కలదు. తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై కోయిలపాట పరువు లెత్తిందట. పచ్చగోగంట పరిమళ మొగబోస్తే పడుచుగేదంగి పైరుగాలికి నవ్విందట. విభుని విడిచిన విరహిణి సెలయేరు శుష్కించినదట. లజ్జవదిలేశిన గోపకాంతలను చూచి తరుణ కరుణవృక్షము పూనవ్వు నవ్విందట. అతిముక్తలతా పరిరంభణమువల్ల తియ్యమామిడి ముకుళితపులకిత

మైనదట. వెన్నెలరేని చల్లని కరముల గిలిగింతకు కలువకన్నె నవ్వెందట. నిర్మలమైన గౌతమీ నీరమందు తన సొగసు వన్నెలను చూచుకొనుచు నభశ్శ్రీలతాంగి సందెచెరగులను సర్దుకున్నదట. నిత్యమూ తమదగ్గరనే వసించే భుజంగములు కబలించిన క్లేశముచేత మలయ వాయువులు మంచునీటిలో స్నానము చెయ్యడానికి హిమవత్పర్వతమువైపు సాగినవట. ఇలాంటి ఉదాహరణాలు లక్షలు. అందరికన్నా లక్ష్మీ ప్రకృతి అంతా సజీవముగా కనిపించదు. తపనీయ సులోచనాలు ధరించిన సత్కవికి ప్రకృతి అంతా సజీవమే. ప్రాచీనులలో కాళిదాసు, ఆధునికులలో గురజాడకవి ఇట్టివారు. తక్కినవారికి వారి వ్యుత్పత్తిప్రతిభలనుబట్టి ప్రకృతిమాత తన చైతన్యాన్ని చూపిస్తూ ఉంటుంది. వారు తమ కావ్యాలలో ఈచైతన్యమును పొందుపరుస్తారు. కావ్యపఠనాసక్తుడైన చదువరిముందు జడప్రకృతి సజీవమై తిరుగులాడును. చైతన్యమగు ప్రకృతిని వెలయించడము కావ్యానికే సాధ్యము కావడము చేత కావ్యము చదువలేని జడుడు తన భౌతిక దృష్టితోనే ఆమెను దర్శించి మట్టిబొమ్మ అని అనుకుంటాడు. కావ్యము చదువరికి కవిదృష్టినిస్తోంది. చదువరిదృష్టి విశాలమేకాక ఉదాత్తముకూడా అవుతున్నది. అప్పుడే అతనికి నిండారబారు నఖండగోదావరి దాగిన చాళుక్యనాగరికతా, పల్లెపదాల జీవము నిల్పికొన్న పల్నాటి వీరుల రక్తనాళపటిమా కనబడును. అప్పు డాతడు తన్మయతతో,

విపినబంధుర వృక్షవాటిక
నుపనిషన్మధు వొలికె నిచ్చట
విపుల తత్త్వము విస్తరించిన
విశ్వమణి యిదె తమ్ముడా!

అని పాడును.

సత్కవిత్వము చదువరినికూడా కవిని చేస్తుంది. కవి అంటే ఎవరు? ప్రకృతిసంగీతములోని కళల కన్నిటికీ ప్రతినాదమిచ్చే హృదయము కలవాడే కవి. భ్రమరనాదము చెవి కెక్కిన కీటకము తానుకూడా భ్రమరమైనట్లే కవి హృదయముయొక్క ప్రతినాదమును తరచు వినే చదువరికూడా మొదట సహృదయుడై (వ్యుత్పత్తిలో) పిమ్మట రసికుడై, తర్వాత తానే కవి అవుతాడు. ప్రబంధ కవులలో పెక్కు రిలాంటివారే. ఈపాట చూడండి:

యెనకజల్మములోన యెవరమో నంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలకనాయెంకి
ముందు మన కేజల్మ ముందోలె యంటి
తెలతెల్ల బోయింది పిల్ల నాయెంకి
యెన్నాళ్లు మనకోలె యీసుకము లంటి
కంటనీ రెట్టింది జంట నాయెంకి

ఇలాంటి పాటలు చదివినా, విన్నా, చిత్రదర్శనమువల్ల మనకికూడా చిత్రకారుని హృదయాన్ని జనించిన భావాలు మొలకెత్తినట్లే, మన హృదయాలు సురభిళులవుతాయి. ఆసమయాలలో మనముకూడా కవనము చెప్పగలుగుతాము. గేటీ మహాకవి శాకుంతలాన్ని పఠించి,

తొలిపూవుల్ కడపండు లేటివరుసన్
తోడ్తోడ సేవింపగా

ఎలతేనిక్ జెలికాడ, జీవితసుస
　రృస్వంబు ప్రాపించి భూ
తలమున్ స్వర్గము రెండు గూడుసెడ నా
　త్మానంద సామ్రాజ్య సం
కలనన్ నిల్వ, మదిన్ శకుంతలనె సం
　లక్షింపు లక్ష్యంబుగన్.

అని నర్తించాడట. కృష్ణశాస్త్రి గురజాడ అప్పారాయకవిమీద రచించిన ముత్యాల సరాల్లోని

యుగయుగంబులనుండి మ్రోగే
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగ నాతని
గీతశీకరముల్.

అనేది మనహృదయాల్లో జనించే ఉత్సాహావేశానికి భాషారూపమేకదూ? కాబట్టి కావ్యము పఠించినప్పుడు, కవికి వర్ణ్యవస్తు సందర్శనవేళ జనించిన భావాలే మనకీ కలుగుతాయి. శివశంకరుల "కరస్పర్శ" చదవండి. కాశ్యపీసతనోన్ముఖుడైన కవికాయమను మనోజ్ఞశీతలహస్తముతో తాకి మెలకువతెప్పించిన వ్యక్తి యెవరా అని ఆలోచించే చదువరి హృదయము

అరిగె నాసాధ్వి స్థూలదేహమ్ము విడచి
సప్తపర్ణమ్ములకు ముందు స్వర్గమునకు
అవ్యయంబైన యాయమదివ్యయాత్మ
నన్ను గాపాడుచున్న దీనాడు కూడ.

అని చదివేసరికి మీటిన వీణతీగెలాగు రింగుమంటుంది. ఈమూగసంగీతానికి భాషారూపమిస్తే కవిత్వమౌతుంది. శివరాత్రిప్రభల చప్పుడు నృత్యాన్ని విన్న కవికొండల వేంకటరావు హృదయములో పుట్టిన అవ్యక్త సంగీతమే అతని గొంతులో చేరి "శివరాత్రి ప్రభ" అయింది. ఈరకపు అవ్యక్తసంగీతము కవిత్వమును చదవడమువల్లకూడా కలుగుతుంది. కవిత చదువరిహృదయతంత్రుల్ని మీటి పాడించగలదు. మనుచరిత్రము ఎన్ని కావ్యాలకి తల్లిఅయింది? అంతదూర మెందుకు? మన తిరుపతివేంకటేశ్వరు లెందరు కవులను చేయలేదు? తోకచిచ్చులాగ ఆంధ్రదేశమంతా రాజసందర్శనముకోసము పర్యటించిన వారి కవితాసరస్వతి ఎందరు కావ్యకన్యలను కలిగించింది? ఇప్పుడు కృష్ణాజిల్లాలోని కవు లించుమించు అందరూ వారు చేసినవారే. నేను మరొక్కమెట్టు పైకెక్కుతాను. వారి పద్యపఠనపద్ధతే ఎందరినో లాగింది కవిత్వములోకి.

కావ్యము గురువుకూడాను. భగవద్గీత గొప్ప ఉదాహరణము. అది కావ్యమని నా అభిప్రాయముకాదు. అది గ్రంథము. కావ్యముకూడా గ్రంథములాగే శిష్యులు తన నిర్దేశాన్ని జవదాటలేకుండా ఉపదేశము చేయగలదు. ఐశ్వర్యలోభముచే దుర్యోధనుడు దాయాదుల హక్కులు చులకన చేశాడు. అందువల్ల అన్నదమ్ములతో నశించాడు. పరాక్రమ గర్వముచేత హిరణ్యాక్ష హిరణ్యకశిపులు సమసిపోయారు. పరమ భక్తులైన ప్రహ్లాదుడు, అంబరీషుడు నారాయణుని కృపకి పాత్రులయారు. అనేసంగతులు పురాణ కవిత చెప్పుతుంది. ఇది తల్లి, తండ్రి చెప్పినట్లుంటుంది. భయభక్తు లున్నవారు వింటా రివి.

లేనివాళ్లు "శ్రీరంగ నీతుల్లా"అని తోసి పారే స్తారు. కాని భార్య చెప్పే నీతులు కాని, నిజాలు గానీ ఇలాగుండవు. ఆమె బహిరంగముగా కాక తన ఉద్దేశము పాలించబడేరీతిగా, అన్యాపదేశముగా చెప్పతుంది. కావ్యము ఇలాగు చెప్పతుంది తన ఉపదేశము. శాంత శృంగారరసములవిచిత్రసంఘట్టనములో శాంత రస మద్భుతవిజయము పొందుతుంది. "సతుల మాయలు ధీరచిత్తములను కలంచజాలవు." లాలసావేశుడైన గంధర్వుని కృత్రిమప్రేమా, రాలయిన వరూధిని ప్రాణప్రదమైన వలపూ ఋణానుబంధము తెగినప్పుడు ఒండొరుల బాసిపోవును. వీరి విపరీత సంయోగ మునకు ఫలము కామకలావేశుడైన స్వారోచి. స్వారోచి ష మ ను స ం భ వా నికి వనదేవత క్షేత్రము కాగా, తిర్యగ్జంతువుల ఆసన్నవైరాగ్యానికి విస్మితుడైన స్వారోచితేజస్సు బీజ మయింది. వీరి సంయోగానికి ఫలితము మను వవ శాని కధికారము గల స్వారోచిషమనువు. అనే ఈ సంగతుల్ని మనుచరిత్రము పైకి చెప్పకుండా చెప్పతుంది. ఈ ఉపదేశాన్ని ఇటీవలివార్త లంటున్నారు. తెలుగుదేశపు సిరులని గురించి ముక్తకంఠాన్ని గానముచేసిన రాయప్రోలు కవి "చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర హృదయములు చీల్చి చదువు డో సదయులార" అనే సువార్తని బ్రతికిచెడ్డ ఆంధ్రులకిచ్చి జాతీయకవనానికి స్వస్తి చెప్పినాడు. "కష్టాలు వచ్చినా కాలమే తరిమినా కన్నీరు రాల్చకే కలుష మెరుగని చెలీ" అని "చెలి"నాశ్వాసించిన తురగా వేంకటరామయ్య "ప్రేమలీలా సుధాస్వామి రాధాకృష్ణు వేణువే సత్యమై వెలసె మనకోసమే" అని ఓదార్పుని పూర్తిచేసినాడు. "హేమంత కృష్ణానంతశర్వరి" యైన కృష్ణశాస్త్రి "ప్రేమ పట్టునకు" బిచ్చగాని చేయి చాపినాడు. ఫలితము చూడవలసియున్నది. దారిలేని శోకంపు బెడారులందు ఏ విసుగు వేసటలులేక తిరిగిన వేదుల సత్యనారాయణశాస్త్రి, "ఏది ఇంకొక్కమారూదరా నీ మురళి" యని బాల కృష్ణుని వేడినాడు. విశ్వమంతటికీ గొంతువిప్పే గీతి ఇతని గొంతుని ఎలా మధురిస్తుందో చూడాలి.

వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు అను భవమువల్ల గొంతువిడి భరతఖండము పుల కింపులతో వినేటట్లు విశ్వగానము వినిపించారు. వీరిగీతాలు విన్న ఆలంకారికులు "నా నృషిః కురుతే కావ్యమ్" అని లిఖించారు. జీవన్ముక్తుల సుధామధురోక్తులు విని పాలించగలిగినవారు భ్రమరకీటన్యాయాన్ని పునీతులౌతారు. మినుకుమినుకుమని వెలిగే జీవ జ్యోతులు సత్కావ్యపఠనమువల్ల చుక్కలై ప్రకాశిస్తాయి. వాగులులాగ ఆరంభించిన మన నాగరికత సింధునదియై నిలచి గంభీర ముగా పారుతుంది. దొరకిన ఆధారాన్ని దేసినైనా సరే ఔత్సుక్యముతో గ్రహించే దీనత్వములో నున్న మన జీవలత కావ్యపఠనము వల్ల సత్యసుందరుని చుట్టును అనురాగ ముతో అల్లుకుంటుంది.

---

# కన్యాశుల్క—నాటక విమర్శనము

శ్రీపాద కామేశ్వరరావు

## ౧. కథాసంగ్రహము

కృష్ణరాయపురము అనే అగ్రహారంలో అగ్నిహోత్రావధాని అనే గృహస్థు ఉండెను. అతనికి ఇద్దరుకూతుళ్లు, ఒకకొడుకు కలరు. అవధాని వేదము జటాంతము అధ్యయనముచేసెను; కాని తద్ద్వారా ధనార్జనము చేయలేక పెద్దకూతురు బుచ్చమ్మను ఒక సహస్రమాసజీవికి పెళ్లిచేసి అతనివద్ద రు ౧౮౦౦ లు పుచ్చుకొనెను. ఇట్టి ద్రవ్యమునకు కన్యాశుల్కమని పేరు.

అగ్నిహోత్రుని కొడుకు వెంకటేశము విజయనగరములో ఇంగ్లీషుచదువుకొంటూ ఉండెను. ఇది తండ్రికి ఇష్టములేకపోయినా, కొడుకు గొప్పగొప్ప ఉద్యోగములు చేసి ధనము గడించగలడనే ఆశ కుర్రవాని చదువుకు వీలుకలుగజేసింది; వాని విద్యమాత్రము అభివృద్ధి నొందలేదు. ఒకసంవత్సరము పరీక్షపోతే గిరీశము అనేవానిచేత ఇంటివద్ద చదువు (tuition) చెప్పించుకొనెను. అదీ వ్యర్థమై పరీక్షపోయింది. ఇంతలో కిసిమిసి (Christmas) సెలవులు రాగా ఇంటికి పోతే తండ్రి చావకొట్టుననే భీతిచేత వెంకటేశము మొగము వేలవేసినాడు.

తన పరిస్థితులు బాగుండకపోవడముచేత విజయనగరమునుండి పారిపోవలెనని గిరీశము నిశ్చయించుకొని, వెంకటేశముతో సెలవులు గడుపవెంచి, వాడు పరీక్ష Pass అయినాడని తండ్రిలో చెప్పుతానని ధైర్యము పుట్టించినందున ఇద్దరూ కృష్ణరాయపురం చేరుకొన్నారు.

అక్కడ వెంకటేశముఅక్క బాలవితంతువు బుచ్చమ్మ కనపడగానే గిరీశముమన స్సామెపై పోయి ఎలాగైనా బోధించి పునర్వివాహమునకు ఒప్పించి పెళ్లాడవలెననే కోరిక పుట్టించెను. అందుకై వీలున్నప్పుడెల్ల గిరీశము ఆమెను పెళ్లిచేసుకొమ్మని ప్రోత్సహిస్తూండెను.

రెండోకొమార్తె సుభద్ర (సుబ్బి)ను లుబ్ధావధాని అనే వృద్ధునికి రు ౧౫౦౦ లు శుల్కము నిర్ణయించుకొని వివాహముచేయడానికి అగ్నిహోత్రుడు మాట యిచ్చెను. లుబ్ధావధాని గిరీశముపెత్తల్లి కొడుకు. ఈపెళ్లి అగ్నిహోత్రుని కుటుంబములోనివాళ్లకుకాని, గిరీశంకికాని ఇష్టములేదు. కావున దీని నెట్లయినా కాకుండా చేయవలెనని అనేక విధముల యత్నములు జరుగుతూండేవి.

లుబ్ధావధానివయస్సు అరవై యేళ్లని ఒకరు, నలభై అయినని ఒకరూ చెప్పేవారు. అతని ఊరు రామచంద్రపురం అగ్రహారము. అందు రామప్పంతులనే కరణము కలడు. అతడు లోకవ్యవహారమందు ఆరితేరినవాడని ప్రతీతి. సుబ్బిని పెళ్లాడుమని లుబ్ధావధానిని పురికొల్పినవాడు ఇతడే. మధురవాణి అనే వేశ్యను గిరీశము ప్రాపకమునుంచి తప్పించి తా నుంచుకొనెను. లుబ్ధావధాని సుబ్బిని పెళ్లాడడము మధురవాణికి కిట్టదు. కాటికి కాళ్లుచాచుకొన్నవాడు చిన్నపిల్లను పెళ్లిచేసుకోవడము కేవలము అన్యాయము కావున ఈపెళ్లి తప్పించవలసిందని రామప్పంతుల్ని ఆమె నిర్బంధపెట్టుతూండెను.

సుబ్బితల్లి ఈసంబంధము చేయవద్దని ఎంత మొత్తుకొన్నా భర్త ఆమెమాట వినలేదు. పెళ్లి తప్పకుంటే నూతిలో బడి చచ్చిపోతానని ఆమె భీష్మించుకొన్నది.

బుచ్చమ్మకూడా సుబ్బిపెళ్లి తప్పించుమని గిరీశమును కోరింది. ఈలాగు సర్వత్రా పరిస్థితులు పెళ్లికి ప్రతికూలముగా నుండెను. మొదట ఈదారితీసినవాడు సుబ్బిమేనమామ కరటకశాస్త్రి. ఇతడు తన శిష్యుని ఆడవేషము వేసి లుబ్ధావధానికి పెళ్లిచేయ నిశ్చ

యించెను. ఈపని తానొక్కనివల్ల అయ్యేదికాదు. సర్వసిద్ధమైన సుబ్బిపెళ్లి లుబ్ధావధాని మానుకొంటాడా? ఏదో గొప్పఎత్తు వేయవలెను. ఇందుకు తగిన తంత్రగాడు రామప్పంతులు. అతనిని లోబర్చుకొంటే అసాధ్యమైనదానిని సాధ్యము చేయగలడు. కావున అతనియింటికి శాస్త్రి స్త్రీవేషమున ఉన్న తనశిష్యుని వెంటబెట్టుకొని వెళ్లగా అక్కడ మధురవాణి తానుకూడా సాయపడుతా నన్నది. రామప్పంతులు రాబోయే కన్యాశుల్కములో ఐదోవం తిస్తే పెళ్లి సానుకూలముచేస్తా నని ఒప్పుకొని అగ్నిహోత్రావధాని వ్రాసినట్లు లుబ్ధావధానికి—"మీరు పిసినిగొట్టులు, ముసలివారు, క్షయరోగపీడితులనీ, మీకూతురు వర్తనబాగులేనందున మిమ్మల్ని వెలివేసినారు అనిన్నీ తెలిసినందున మీకు మాపిల్ల నివ్వదలుచుకోలేదు"—అని ఉత్తరము వ్రాసెను. ఈసమయముననే గిరీశము లుబ్ధావధానిపేర—"సుబ్బికి వైధవ్యలక్షణము లున్నవి. మీరు పెళ్లి మహావైభవముతో చేసుకొంటారని తెలిసి పెద్ద పటాటోపముతో అగ్నిహోత్రుడు ఏనుగులు, సత్ర్రాలు, లోటిపిటలు, పల్లకీలుకాక యాభై బళ్లతో పెళ్లికి తర్లివస్తూన్నాడు. ఇందువల్ల మీకు చాలాధనవ్యయమవునుకావున ఈసంబంధము మానుకోవలెను"—అని వ్రాసెను. రెండు ఉత్తరాలూ ఒక్కనాడే అందినవి. అంతతో లుబ్ధావధాని గుండెజారి రు ౧౨౦౦ లు శుల్కమిచ్చి కరటకశాస్త్రిశిష్యుని పెళ్లాడ నిశ్చయించెను. శుభముహూర్తము నిర్ణీతమయ్యెను. వివాహకాలమున నగపెట్టించండని కరటకశాస్త్రి రామప్పంతుల్ని వేడుకొనెను. కాని లుబ్ధావధాని ఒప్పుకోలేదు. రామప్పంతులు మధురవాణికంటె ఎరువుతెచ్చి పెళ్లికూతురి కిచ్చి లౌక్యులను పిలువడానికి పొరుగూరికి పోయెను. అతడు తిరిగిరాకుండానే ఏకరాత్రివివాహము చేయించి కరటకశాస్త్రి తనదారిని పోయెను. రామప్పంతులు వచ్చి తనకు రావలసిన శుల్కభాగము శాస్త్రి ఎగవేసినాడని గ్రహించి చిందులుతొక్కి లుబ్ధావధానిని కంటెయైనా ఇమ్మనుమని గద్దించెను. కాని అత"డా ఊసే ఎరుగ" ననెను. ఇంతలో మాయసుబ్బి లుబ్ధావధానియింట దెబ్బలుతినలేక కంటె తీసుకొని పారిపోయెను. లుబ్ధావధానికూతురు మీనాక్షిద్వారా కంటె సంపాదించనెంచి రామప్పంతు లొకనాటిరాత్రి ఆమెచెంత జేరి, పెళ్లాడెదనని ప్రమాణముచేసి కంటె తెమ్మని బతిమాలుకొనెను. వీరి సల్లాపము లాలించి లుబ్ధావధాని ఇద్దరికీ కాయశుద్ధి చేసి కూతురిని ఇంటినుండి గెంటెను. మీనాక్షి పంతులువెంట పడినది. ఇద్దరూ పంతులుగారింటికి వెళ్లగా కంటెతెస్తేనే కాని తలుపుతెరవ నని మధురవాణి పట్టుపట్టింది. అంతతో పంతులు ఊరుబైటికి పరుగెత్తెను. మీనాక్షి తండ్రి దగ్గరకు పోయెను. ఇంతలో తెల్లవారింది.

ఊరుబైట చెరువుదగ్గర కోలాహలముగా నుండెను. అగ్నిహోత్రావధాని ఆర్భాటముతో చెరువుపక్క తోటలో విడిసి, లుబ్ధావధాని తనకు స్వాగతమిచ్చుటకు ఎవరినైనా పంపునని ఎదురుచూస్తూండెను. అంతలో రామప్ప లుబ్ధావధాని వేరే సంబంధము కుదుర్చుకొని పెళ్లాడినాడని చెప్పగా అగ్నిహోత్రుడు మండిపడి లుబ్ధునితో జగడమాడి నాలుగు తన్నింది చాలక అతనిపై దావా తేవడమునకు రామప్పసాయము కోరెను. ఖర్చులకు సొమ్ముకావలసి బుచ్చమ్మనగ తాకట్టుపెట్టదలచి ఆమెను పిలిచేసరికి ఆమె లేదు, గిరీశమూ లేడు. అగ్నిహోత్రు డందుకు చింతించి తాతలనాటి తన చేకడియము తాకట్టుంచి దావా నడిపెనుకాని ఫలములేకపోయింది. పైపెచ్చు కడియము చేజిక్కించుకొని రామప్ప ఉడాయించెను.

రామప్ప లుబ్ధావధానిమీది కసిచేత మాయసుబ్బి నతడు చంపినాడని వాదువేసి పోలీసువాళ్ల సాయముచేత కూనీకే సొకటి బనాయించినాడు. అవధాని ప్రాపేదీ లేక సౌజన్యారావనే ప్లీడరుశరణుజొచ్చి మనస్సమాధానము చేసుకొనెను.

ఇట్టివేళ నితనికి సాయపడవచ్చి గిరీశము అన్ని విషయములూ చక్కబెట్టుటకు వీలుండేటట్లు తన్ను పెంచుకోవడముగాని, లేదా Power of attorney ఇవ్వడముగాని తగినకర్తవ్యమని లుబ్ధావధానికి బోధిం

చగా ఆమెర పెడచెవినిపెట్టి "అన్నిటికీ నాకు సౌజన్యారావుగారే దిక్కు"ని జవాబిచ్చెను. గిరీశం రావుగారివద్ద జేరి తాను గొప్పస్వార్థత్యాగి, సంఘసంస్కరణపరాయణుడని నచ్చచెప్పి ఆయనమెప్పు వడసి గుంటూరుశాస్త్రిపతా బయలుతీస్తానని మాటయిచ్చెను.

మధురవాణికూడా లుబ్ధావధానికష్టములు తొలగించదలచి మగవేషము వేసుకొని అర్ధరాత్రివేళ సౌజన్యారావుగారి యింటికి వెళ్లెను. రావుగారు వేశ్యలను చూడనేచూడరు. అట్టి యభిప్రాయము కేవలము అయుక్తమనీ, వేశ్యలలోకూడా గుణవతులు ఉండవచ్చుననడానికి నిదర్శనముగా గుంటూరు శాస్త్రికృత్యమంతా వివరముగా తెల్పి గిరీశము కేవల వాహ్యాకారుడేకావున అతని చర్య సమంజసముగా నుండకపోవడమువల్ల బుచ్చమ్మను పెళ్లాడతగడని సనిదర్శనముగా సూచించెను. ఈరీతిగా సుబ్బిపెళ్లి తప్పిపోయి లుబ్ధావధాని మీది కూనీకేసు తేలిపోయెను.

## ౨. ఆఖ్యానవస్తువిన్యాసము

ఈకథలోని ముఖ్యాంశము కన్యాశుల్కము. దీనివల్ల కలిగే కీడు చూపించి ఈదురాచారమును మట్టిలో కలుపవలసినని కవిఉద్దేశము. ఈ నాటకములో శుల్కవివాహాలు మూడుకలవు. బుచ్చమ్మమీనాక్షులకు పెళ్లి అయింది. సుబ్బికి పెళ్లిసన్నాహ మయింది. మొదటి రెండు పెళ్లిళ్లూ దుష్పరిణామముకలవే. ఇద్దరినీ బాల్యముననే పెద్దవాళ్లకిచ్చినందున త్వరలోనే వైధవ్యము ప్రాప్తించింది. బుచ్చమ్మ తల్లిదండ్రులచాటున భయభక్తులు కలిగి మెలగిందికావున సచ్చారిత్ర అయింది. మీనాక్షి తల్లిగతించినపిమ్మట లుబ్ధుడు రెండుమూడు పెళ్లిళ్లు చేసుకొన్నందున ఇంటిలో పెద్దఆడదిక్కు లేకపోవడమూ, తండ్రిగారు తరుచు దావాలకై తిరుగుతూండడమూ పట్టి మీనాక్షికి స్వాతంత్ర్యముకలిగి దుర్వర్తనమలవడెను. యావజ్జీవదాస్యమూ, వ్యభిచారమూ శుల్కవివాహముల ఫలములని చూపి సుబ్బిని లుబ్ధుని కిప్పించకూడదని కవిఉద్దేశ్యము. సర్వసన్నద్ధమైన పెళ్లి తప్పించడము సులభసాధ్యముకాదు. కేవలహితోపదేశము కార్యకారికాదు. "శఠం శాఠ్యే సమాచరేత్", "విషానికి విషమే విరుగుడు." బుచ్చమ్మ, ఆమెతల్లిన్నీ మొత్తుకొని పెళ్లిచేయవద్దని ఎంత మొఱపెట్టినా మూర్ఖుడైన అగ్నిహోత్రుడు మానలేదు. లుబ్ధావధానికి కూడా ఎందరో చెప్పియుందురు. అతడూ మానుకోలేదు. ఇక కుట్ర చేసి పెళ్లిమాన్పించవలెను. కరటకశాస్త్రి తనశిష్యునికి స్త్రీవేషము వేసి లుబ్ధునికి పెళ్లిచేస్తే సుబ్బిపెళ్లి కాబోదని తలచి కార్యక్రమము కవి మొదలుపెట్టెను.

లుబ్ధుని పెళ్లి కొప్పించవలెనంటే రామప్ప సహాయము కావలెను. శాస్త్రి రామప్పవద్దకు వెళ్లేసరికి తలవనితలంపుగా మధురవాణిసాయముకూడా దొరికింది. అదివరకే ఆమె లుబ్ధునికి సుబ్బిని పెళ్లిచేయవద్దని పంతులుతో పోరుతూండెను. శాస్త్రి రాగానే ఆమె మరింతబిగిసి పంతులుతో మాటలాడడము మానివేసింది; దగ్గిర చేరనివ్వలేదు. రామప్ప లంచగొండి, శాస్త్రి కూతురికి రు ౧౭౦౦ లు ధరపెట్టి అందులో ఐదోవంతు తనకు ఇచ్చేటట్టు బేరము కుదిర్చెను. బుచ్చమ్మ ప్రేరేపణవల్ల గిరీశముకూడా ఉత్తరమువ్రాసి ఇందు భుజము కలిపెను. లుబ్ధునికి డబ్బుఖర్చంటే కిట్టదు—సుబ్బిని పెళ్లాడవలెనంటే శుల్కానికితోడు పెళ్లిఖర్చు హెచ్చుననీ, అసలు పెళ్లికూతురికి కొన్ని అవలక్షణాలున్నవనీ భయపెట్టితే పెళ్లి మానుకుంటాడని గిరీశండూహ. ఇది కొంతవరకు నిశ్చయము. ఉత్తరము చూడగానే ఆడపెళ్లివారి ఆర్భాటము చూసి లుబ్ధుడు పెళ్లి కిష్టపడలేదు. అప్పుడే రామప్ప బనాయించిన ఉత్తరమూ అందింది. లుబ్ధుడు తమ పిల్లకు తగినవరుడు కాడనే అగ్నిహోత్రుని మాట వినగానే తన ఆత్మగౌరవము తగ్గించవని లుబ్ధుడెంచి సుబ్బిని పెళ్లిచేసుకొనితీరుతానని పట్టుబట్టదలచెనుకాని ధనవ్యయమునకు జంకి చవకబేరమని కరటకశాస్త్రిశిష్యుని వివాహమయ్యెను. ఇంతవరకు కథ సూటిగా సాగి సుబ్బిపెళ్లి కాజాలదన్న నమ్మకము పుట్టించింది.

ఈ మాయపెళ్లి జరిగినట్టు కృష్ణరాయపురములో తెలియకపోవడముచేత అగ్నిహోత్రుడు అత్యాశ్చర్యముతో తనకూతురుపెళ్లికి రామచంద్రపురం తర్లివెళ్లి తోటలో దిగెను. కొద్దికాలములోనే జరిగిన స్థితి నెరిగి లుబ్ధునివద్ద దారిఖర్చులైనా పుచ్చుకోలేక తహతహపడి అతనితో తగవులాడి నాలుగుతన్ని పైపెచ్చు దావాలోకి దిగెను. దావావెచ్చమునకు తాకట్టు పెట్టుకోవలసివచ్చింది.

ఇక బుచ్చమ్మచరిత్ర పరిశీలింతాము. ఈమె భక్తిశ్రద్ధలతో తల్లిదండ్రులను కొలుస్తూ పూర్వాచార పరాయణయై తదాచర్యములూ, ఆచారములూ జరుపుతూండెను. గిరీశ మామెకంటపడి డాబులు కొట్టి కు పురికొల్పెను. కాని అట్టిపెళ్లి అవైదికము, అశాస్త్రీయము, అనాచారము అవుట వల్ల ఆచరణీయముకాదని ఆమెదృఢమైన నమ్మకము. దీనిని తన ప్రతికూలబోధనచేత గిరీశము పూర్వపక్షము చేసి పునర్వివాహము పాపకర్మ కాదని సిద్ధాంతీకరించి దానివల్ల కలిగే లాభము అమితసౌఖ్యదాయకమని నిరూపించెను. బోధన బుచ్చమ్మకు నచ్చింది. కాని ఇంటిలోనుండి లేచిపోవడానికి ఆమె జంకింది. ఈ సమయమున పెళ్లికి తర్లి వెళ్లవలసివచ్చింది; అది కనిపెట్టి బుచ్చమ్మ తనతో సుబ్బిపెళ్లి కానీయకుండా యత్నముచేయుమని పోరుతూంది కనుక తద్విషయక యత్నము బుచ్చమ్మచేతనే కాగలదని చెప్పెను. ఈ మాట ఆమె కర్థముకాలేదు. పిమ్మట అతడు—"నీవు నావెంట రావడానికి ఇష్టపడితివా నీబండివానికి లంచమిచ్చి, తోవతప్పించి రామవరము తీసుకొనిపోయి నిన్ను శాస్త్రీయముగా పెళ్లాడుతాను. నీవు కనిపించక పోవడముచేత అందరినడుములూ విరుగుతవి, గుండెలు చెక్కలవుతవి. అంతతో సుబ్బిపెళ్లి ఆగిపోతుంది" అని వివరించిచెప్పెను.

చెల్లెలియందలి ప్రేమచేత బుచ్చమ్మ సమ్మతించింది. గిరీశంకోరిక ఇంతవఱకు కొనసాగింది—ముందున్నది ముసుర్ల పండుగ. వితంతువును పెళ్లియాడదలచినవాడు ఆమెభరణపోషణమునకు చాలినంత సొమ్ముకాని, తదితర-ఉపపత్తికాని చూపవలసియుండెను. ఇదికాక వేరొక ఆటంకముకూడా ఉండెను. సుబ్బివివాహ మాగిపోయి అగ్నిహోత్రుడు సురక్షితముగా ఇల్లుచేరుకొంటేనేకాని బుచ్చమ్మ పెళ్లికి ఒప్పుకోదు. ఈ రెండు ఆటంకములు తీరేలోపల గిరీశము రామచంద్రపురం వెళ్లవలసివచ్చెను.

లుబ్ధావధానికి విషమసంకటము ప్రాప్తించినది. ఒకవైపు కూనీకేసు, రెండోవైపు అగ్నిహోత్రావధాని ఒత్తిడి, మూడోవైపు మీనాక్షిదురాచరణము. ఇందొకపైనా తప్పేదారి తోచలేదు, పరవసలేదు. అందుచేతనే సౌజన్యారావు శరణుజొచ్చెను. గిరీశం రావుగారియెదుట డంబములుపల్కి— తాను సదాచార సంపన్నుడైన సంస్కరణాభిలాషి అనిన్నీ, బుచ్చమ్మమీది అవ్యాజప్రేమచేతనే ఆమెను వివాహమాడ నిశ్చయించెనుకాని లాలసచేత కాదనిన్నీ నచ్చచెప్పి లుబ్ధుని ఆస్తి తనకు చిక్కునట్లు ఏర్పాటుచేయవలెనని కోరెను. మోసకూరులైన రావుగారు గిరీశం మాటలు నిజమనుకొని సుంటూరుశాస్త్రులు భోగట్టా తెలుసుకొనివస్తే తగినసాయము చేస్తా ననగా అందుకాత డొప్పుకొనెను. ఇంతవరకూ గిరీశంపాచిక పారింది.

ఈతరుణమున మధురవాణి సౌజన్యారావుగారిని చూడవచ్చెను. ఆమె కనబడగానే గిరీశంగుండెలో రాయి పడ్డది. అన్యాయవర్తనము ఒంటిగా నున్నంతకాలము చెలరేగునుకాని న్యాయపరుల ఎదుట తలచూపలేదు. అందుచేత ఆతడు శీఘ్రముగానే జారెను. మధురవాణి లుబ్ధావధానిగండము తప్పించి ప్రసంగవశమున గిరీశము గుట్టు బయలుపెట్టక తీరిందికాదు; ఇందువల్ల అతని వలలోనుంచి బుచ్చమ్మ దాటిపోయింది, గిరీశముగారికి తగినశాస్తి అయింది.

ఈవిన్యాసమున ముఖ్యములైన ఘటనలుమాత్రమే చెప్పబడినవి. సుబ్బిపెళ్లి మొదట స్థిరపడి, తరువాత రద్దుచేయబడి, అనంతరము కొంచెము తడబడి, తుదకు భంగపడెను. ఈకుంతితగతి నిరూపించడమందు కవి చాతుర్యము కానవచ్చును. పెళ్లిపక్షాన పనిచేసినవాళ్లు అగ్నిహోత్రావధాని, రామప్పంతులు, లుబ్ధావధాని.

వీళ్లయత్నము నిరాటంకమయితే వివాహ మయితీరును. అట్లే జరిగితే వస్తుజటిలత (Complexity of plot) సమకూడదు. అందువల్ల కవి ఈఘటనకు ఘాత చేకూర్చెను. పెళ్లిప్రతిపక్షమున పనిచేసినవాళ్లు కృష్ణరాయపురములో బుచ్చమ్మ, ఆమెతల్లి వెంకమ్మ, కరటకశాస్త్రి, గిరీశము; రామచంద్రపురంలో మధురవాణి, రామప్పంతులు. ఈయిరువీడులవారి ప్రయత్నములు ఒకదానితో నొకటి కలియనంతకాలము పెళ్లియొక్క గతి అనుకూలముగా నుండెను. కరటకశాస్త్రి రామప్పంతుల సహాయము సంపాదించి ప్రయత్నములు జోడించగానే పెళ్లి ముప్పాతికపాలు ఆగింది. గిరీశమూ, రామప్పంతులూ వ్రాసినఉత్తరాలు లుబ్ధునకు చేరినవెంటనే అడుసునపాతిన స్తంభమువలె ముందుకీ వెనకకీ ఊగసలాడింది. గిరీశంఉత్తరము పెళ్లికి ప్రతికూలించగా రామప్ప ఉత్తరము పెళ్లిని కొంత ఆపి మాయసుబ్బిపెళ్లి కనుకూలించింది. తరువాత అగ్నిహోత్రుడు తర్లి రావడముసుబ్బిపెళ్లిని కొంచెము ముందుకు నెట్టగా అతనికీ లుబ్ధునికీ జరిగిన జగడము దాన్ని వెనక్కి పూర్తిగా నెట్టివేసింది. ఇంతతో ఈఘటన అంతమై మాయసుబ్బిపెళ్లి తలయెత్తింది. ఈసుబ్బి పరారికావడముచేత కూనీకేసు పుట్టి లుబ్ధావధానిమనస్సు కలతపెట్టి పశ్చాత్తాపము పుట్టించి తలప్రాణము తోకకు తెచ్చింది. ఇంతవరకూ అధర్మమూ, అన్యాయమూ, అసత్యమూ ప్రజ్వరిల్లి కార్యక్రమమును వంచనాకలితముగా చేసినవి. పాపకార్యము లొకదానినుండి ఇంకొకటి పుట్టినవి. ఇందు పాల్గొన్నవాళ్లందరూ స్వార్థపరులు, మోసగాళ్లు, ఈర్ష్యాపరులు. వీళ్ల ప్రభ వెలిగినంతకాలము పాపము చెలరేగి అందరికీ శృంగభంగముచేసి లుబ్ధావధానిపీక నురి అయింది. ముసలివాడు మతిపోయి ప్రాణాలమీద ఆశ విడిచి దిక్కులేనివా డయినాడు. పాపవృక్షముయొక్క ఫలము విషయుక్తమవుట వింతకాదు. ఈసంతతి నిర్మూలముకావలెనంటే ధార్మికులు, పరార్థవ్యాపృతులు, స్వార్థత్యాగులూ కార్యభారము వహించవలెను. ఇట్టివారీనాటకపాత్రములలో ముగ్గురున్నారు—కరటకశాస్త్రి, మధురవాణి, సౌజన్యారావు. వీరు కార్యనిర్వహణము మొదలుపెట్టగానే వంచనామేఘము లొక్కొక్కటి విరియబారి క్రమముగా పటాపంచలై స్వార్థధ్వాంతము దిశలకు పారెను. "ఒకపాపకృత్యమువల్ల కలిగిననష్టము ఇంకొక పాపకృత్యమువల్ల నశింపనేరదు. పాపము నాభిదుంపవంటిది; మొలకలు తెంపినంతమాత్రాన దాని వృద్ధి మానదు; దానిని చంపవలెనంటె దుంప నూడబెరికి నిర్మూలముచేయవలెను. పాపచిత్తులు ఏకార్యము పూనుకొన్నా భగ్నమనోరథులై పశ్చాత్తాపదగ్ధులవుతారు." అని ఈనాటకము బోధిస్తున్నది. అగ్నిహోత్రుడు, లుబ్ధుడు, గిరీశం, రామప్ప-వీరు నలుగురూ చెడ్డవారే-మొదటివాడు ధనాశాపీడితుడు. రెండవవానిని ధనేషణేకాక దారేషణ, పుత్రేషణకూడా పీడించెను. తక్కిన ఇద్దరినీ ఈషణత్రయమేకాక మోహమదమాత్సర్యములున్నూ పీడించెను. ఇట్టివాళ్లెన్నటికీ సత్కార్యనిర్వాహకులు కానేరరు. కించిత్కాలము లబ్ధవిజయులైనా తుదకు వీళ్లకి శృంగభంగము తప్పదు. "సత్యమేవ జయతి నానృతమ్"—ఇదే కావ్యన్యాయము (Poetic Justice). ఇట్టి కావ్యములే మన సాహిత్యములో నుండదగినవి. ఇవి మన కానందము కలుగజేయడమేకాకుండా హితముకూడా ఉపదేశించును.

నాటకరచన :—

### ౧. గీర్వాణపక్కి

మన ఆలంకారికులు నాటక కథను రెండుభాగములు చేసినారు:— ౧. ఆధికారికము, ౨. ప్రాసంగికము. మొదటిదానిలో ఫలభోక్త నాయకుడు; రెండోదానిలో ఫలము నాయకేతరులకు చెందును. ప్రాసంగికకార్యములవల్లనే కథ జటిలమగును. వీటి కన్యోన్యసంబంధము కల్పించినందువల్ల కొన్నికార్యములు ఆధికారికమునకు అనుకూలించి మరికొన్ని ప్రతికూలించును. ఈకార్యపరంపర సాగించడమందే నాటకకళాప్రకర్ష వ్యక్తమవుతుంది. ఇందుకే పలురంగములు (స్థలములు—Scenes) కూర్చబడును. అందలి పాత్రములు చెప్పే మాటలు, చేసేపనులు పరిశీలిస్తే కథాచమత్కృతి, పాత్రగుణములూ విశదమౌతవి. కొన్నిరంగములలో సమ

కాలిక — ఆచారవ్యవహారములు వ్యక్తమగును. దీనికే Local coloring అనిపేరు. ఈమూడు విషయముల యందున్నూ దేశకాలపాత్రములు ప్రతిఫలింపజేయడమే నాటకోద్దేశము. కవితాసారమునకు ఇవే నికషపాషాణములు.

కథావిన్యాసపద్ధతి వివరిస్తే కన్యాశుల్కము నాటకమవునో కాదో తేలుతుంది. దశరూపకమనే నాటకలక్షణగ్రంథమందు కథ ఐదుభాగములుగా విభజింపబడినది:—౧. బీజము, ౨. బిందువు, 3. పతాక, ౪. ప్రకరి, ౫. కార్యము. ఇవి "కన్యాశుల్క"మందు ఈక్రిందిరీతిని వివరించవచ్చును. సుబ్బిని లుబ్ధావధానికి పెళ్లిచేసే సంకల్పము బీజము. తద్విషయకప్రయత్నములు, అనగా సంబంధము నిర్ణయించుకోవడము, ముహూర్త వర్తమానములంపడము, శుల్కనిర్ణయము, తాంబూలా లివ్వడము మొదలైన చర్య బిందువు. అగ్నిహోత్రుడు బంధువులను పెళ్లికి పిలవడము, ఏనుగులు, గుఱ్ఱాలు, ఒంటెలుమొదలైనవి సమకూర్చుకొని రామచంద్రపురం తర్లివెళ్లడము పతాక. బుచ్చమ్మ కనబడక పోవడము, లుబ్ధావధాని మాయసుబ్బిని పెళ్లాడడము ప్రకరి. సుబ్బిపెళ్లి తప్పిపోవడము కార్య (భంగ) ము.

ఈ వివరణబట్టి "కన్యాశుల్కము" నాటకమే అని గ్రహించవచ్చునుకదా? ఇది ప్రహసనము (Farce) అనే విమర్శకులు ఈగ్రంథమును చులకనచేసి "It is after all a farce" అనుట విచారకరము. ఈగ్రంథమం దింకోచిత్ర ముంది. పైని వివరించిన నాటకపద్ధతి ఆధికారికకార్యమునందేకాక ప్రాసంగిక కార్యములందు కూడా కనబడుతూన్నది.

అగ్నిహోత్రుడు సుబ్బిపెళ్లి చేయడానికి ఎంత పాటులాడినాడో కరటకశాస్త్రి పెళ్లి తప్పించడానికి అంతయత్నము చేసినాడు. అట్టియత్నమును కథాసంగ్రహమందు వివరించినాము. కనుక ఇచ్చట విభాగప్రక్రియమాత్రము సూచిస్తాము:—సుబ్బిని లుబ్ధున కివ్వవద్దని వెంకమ్మపట్టు బీజము. బుచ్చమ్మపోరు, కరటకశాస్త్రిచేసిన మాయ బిందువు. మధురవాణిపట్టుదల పతాక. గిరీశమూ, రామప్పంతులూ వ్రాసిన ఉత్తరాలు ప్రకరి. మాయసుబ్బివివాహము కార్యము.

ఈ రెండుకార్యములకూ పరస్పరవిరోధముండుటచేత మొదటిది విఫలమయి రెండోది సఫలమయింది. ఆకార్యము ఖేదాంతము, ఈకార్యము మోదాంతము. మొత్తముపై నాటకము ఖేదమోదాంతము (Tragi-Comedy). మన వాఙ్మయమునందలి ప్రసిద్ధనాటకములు—నలీయము, హరిశ్చంద్ర, శాకుంతలము, ఉత్తరరామచరిత్రమున్ను ఇట్టివే.

### ౨. పాశ్చాత్యపద్ధతి

ఇప్పటి విద్యార్థులు కొందరు "దశరూపకము" ఆధునికలక్షణగ్రంథము కాదనిన్నీ, ఆంగ్లసాహిత్యపరిచయము విదేశాదర్శపక్షపాతము కలిగించడమువల్ల నాటకమునాదరము సెంచే (Appreciate) టప్పుడు పాశ్చాత్యనియమా లుపయోగించవలెననిన్నీ అభిప్రాయ పడుతూన్నారు. వీళ్లనికూడా సంతోషపెట్టడ మవసరము. కనుక సుప్రసిద్ధ-ఆంగ్లవిమర్శకులైన Bradley గారు ఏర్పరచిన నాటకకథావిన్యాసనియమము గీటురాయిగా ఉపయోగించి చూతాము. ఆమహనీయుడు అయిదుభాగములుగా కథావిన్యాసమును విభజించెను:—

#### ఖేదాంతనాటకము

౧ Exposition (కార్యవివరణ)

౨. Complication (కార్యాతిశయము)

3. Crisis (సంకటావస్థ)

౪. Resolution (కార్యవిజృంభణము)

౫. Catastrophe (చరమవిపత్తి)

#### మోదాంతనాటకము

౧. Situation (కార్యవివరణ)

౨. Complication or entanglement (కార్యాతిశయము)

3. Denouement (కార్యపరిణతి)

ఖేదాంతములయందు నిర్దేశించిన ౨,౩,౪ అవస్థలు మోదాంతములలోని రెండో అవస్థయందలి భాగములుగా గణిస్తే రెండురకాల నాటకాలకూ మూడు భాగములే ఏర్పడును. ఏకార్యనిర్వహణమందైనా సర్వసాధారణముగా కనబడే అవస్థలు మూడే:— ఆరంభము, అతిశయము, అంతము. ప్రస్తుతనాటకకథాసంవిధానము ఈమూడుభాగములయందు చక్కగా ఇమిడిపోవును.

ఏనియమాలబట్టి పరీక్షించిచూసినా "కన్యాశుల్కము" నాటకమునకు తీరదు.

ఘటనారచన :—

ఈనాటకమందలి ఘటనలలో ముఖ్యమైనది సుబ్బివివాహసంకల్పము. దీనికి తక్కిన ఘటనలతో సన్నిహితసంబంధ ముంది. దీనితోటి దూరసంబంధ ముండి ఈనాటకపాత్రముల గుణోన్మీలనము చూపించే ఘటనలు చాలా కలవు. అవి పాత్రపోషణకు పనికివచ్చును. మరికొన్ని ఘటనలు దేశకాలపరిస్థితులను సూచించును. వ్యర్థమైన ఘటన కానరాదు. ప్రతిరంగమందలి సంభాషణ సార్థకముగా నుండును. వ్యర్థమైన మాట వెతికినా కనబడదు. మచ్చుకి రెండురంగములు పరిశీలింతాము:—

మొదటి అంకమందు రెండురంగము లున్నవి. వాటియందు పూటకూళ్లమ్మల స్వభావము, గిరీశముతోటి రిజాలాయువకుల చరితము, భోగముదాని చిత్తవృత్తి, కాసుకి గతిలేకున్నా నూటికి పర్వాలేదనే డాంబికులు చిత్రింపబడినారు.

రెండో అంకములో అగ్నిహోత్రావధానినీ, బుచ్చమ్మనూ పునర్వివాహపక్షమునకు తిప్పవలెనని గిరీశం పాటుబడగా మొదటిప్రయత్నములో అంతా వ్యర్థమైనా రెండోయత్నములో కొంతవరకు జయము ప్రాప్తించెను.

ఈయంకమందు మూడోరంగములో గిరీశం తన అభిప్రాయములను కొంత మార్చుకొనెను. చిన్నబాలికలను ముసలివాళ్లకు పెళ్లిచేయడము మంచిదనీ, శుల్కము పుచ్చుకోవడము న్యాయమనీ అతని ఇప్పటివాదము. ఈ పరివర్తనము హాస్యరసమును పోషిస్తూ స్వార్థపరులు ఏయెండకు ఆగొడుగు పట్టుటకు కొంకరని బోధిస్తుంది. అగ్నిహోత్రునికి కోర్టులు, దావాలన్న ప్రీతి అని గ్రహించి ఆయనను సంతోషపెట్టడానికిన్నీ, గిరీశం తన కార్యము సాధించుకొనడానికిన్నీ ఈమార్పవసరము.

జ్యోతిషమంటూ, భూతాదులయందూ జనుల కెట్టి మూఢవిశ్వాస మున్నదో మూడు, అయిదు అంకములలోని మొదటిరంగములో చూపబడ్డది. జాతకాల బనాయింపు, దయ్యములను సీసాలలోకి దింపి భూస్థాపన చెయ్యడము, లుబ్ధావధాని కొండలవూ నీని కుదాహరణములు.

రామప్పంతులు లేనివేళ పూస్తె ముడివేయించి రూపాయి లెగవేసి శాస్త్రిన్నీ, ఎరువుకంటె పట్టుకొని శిష్యుడున్నూ పారిపోయినందుకు ఉగ్రుడై పంతులు లుబ్ధావధానితో "శాస్త్రి నీకు రెండోపెళ్లి ముండని కట్టిపెట్టినా"డని అన్నంతమాత్రాన అవధానికి పీడకలలు వచ్చి అందులో "మాయసుబ్బి (శిష్యుడు) మొదటి మగడు నాపీక నులుముతూన్నా"డని కేకలువేసి గోలపెట్టి దాన్ని ఇంటెనుండి గెంటివేయవలెనని నిశ్చయించినాడు. ఇంతకన్న మూర్ఖు డుంటాడా?

పేకాటరంగము (ఐదో అంకము రెండోరంగము) కున్నూ, నాటకమందలి ముఖ్యఘటనలకూ సన్నిహితసంబంధము అంతగా లేదు. కాని యీరంగమువల్ల తమ్ము పోషిస్తూన్న మహాజను లింటికి రానప్పుడు సానులు కాలయాపన మేలాగు చేస్తారో తెలుస్తుంది; పోలిసెట్టినై జము తేటపడుతుంది. రామప్పంతులుకి తెలియకుండా కరటకశాస్త్రిశిష్యుడు మధురవాణికి కంటె నిచ్చి ముందుకథకు బీజమునాటినాడు. దాని వల్లనే కథ సాగింది. కంటెసంగతి రామప్పకు తెలిస్తే కథ ముగిసినట్టే; కూనీకేసుబనాయింపు కవకాశము ఉండదు; లుబ్ధావధానికి ఏదికులూ ఉండదు, పశ్చాత్తాపమే కలుగదు; కథావైచిత్ర్యము తగ్గిపోవును.

సారాదుకాణమునీను కూడా అవాంతరఘటనే. దానివల్ల బైరాగుల దురాచారములు, అమాయికులను వాళ్లు వంచించే తీరులూ, వాళ్ల మెట్టవేదాంతాలు, పోలీసువాళ్లు దొంగసాక్ష్యము బనాయించడమూ, పైకి పెద్దమనుష్యులులాగు కనబడేవాళ్లు రహస్యముగా చేసే తప్పుపనులూ తెలుస్తవి.

ఇదేరీతిని జాగ్రత్తతో పరిశీలిస్తే ఈనాటకమందు ఘటనాసార్థకత కనబడుతుంది. ఘటనలు చాలా ఉండడముచేత ఆఖ్యానవస్తువు జటిలమై రసస్ఫూర్తి అలవడినది. ఘటనలలో ఘాతప్రతిఘాత ముందని ఇదివరకే చూపినాము. కొన్నిఘటనలు కథను ముందుకు నెట్టగా, కొన్ని దానిని వెనుక కీడ్చును. ఇదికాక నాటకమునందలి ముఖ్య పాత్రములకు "ఇది చేయనా? అది చేయనా?" అనే సంకటావస్థ (Crisis) ప్రాప్తించింది. ఒక్క మధురవాణికిమాత్రము ఈయవస్థ పట్టలేదు. ఆమె కార్యనిపుణ, దుష్కర్మకు పూనుకోలేదు. ఈకారణములచేత ఆమెకు భావసమరము (Internal Conflict) లేదు. నాటకరచనలో భావసమరము ముఖ్యాంశమని Bradley గారి అభిప్రాయము. ఇట్టిగతి ముఖ్యపాత్రములకు కల్పించునట్లు కథను రచించినకవి ఉత్తముడు. ఇట్టివానికి సంస్కృతాలంకారికులు "మహాకవి" అనే సార్థకమైన పేరు పెట్టినారు. "ఆచార్య", "ఉపాధ్యాయ", "మహాకవి" మొదలైన బిరుదులు మొదట సార్థకములై నానాటికి నిరర్థకములైనవి. పూర్వము శంకర, రామానుజ, గంగేశ, మొదలగు మహాత్ముల కుపయోగించిన బిరుదు లిప్పుడు వంట పూడుటోళ్లకింద వాడబడుతూన్నవి; వంటచేసేవాడూ ఆచార్యుడే!

(సశేషము)



శ్రీ గోవిందరాజస్వామి దేవాలయగోపురము, తిరుపతి

—డి. గోపాలరావు,

# బిల్హణ కథ

డి. ఎ. నరసింహం, యం. ఏ., యల్. టి.,

(గతసంచికతరువాయి)

## IV పాత్రపోషణము

బిల్హణకావ్యములోని ముఖ్యపాత్రములు కాశ్మీరకవి బిల్హణుడు, రాజకుమార్తెయగు శశికల, రాజగు వీరసింహుడు, పట్టపురాణియగు సుతారా, పురోహితుడు. వీరిలో రాజు వీరసింహుడు వీరుడు; కళలయందును, విద్యలయందును అభిరుచిగలవాడు; గాంభీర్యము, ధైర్యము, గొప్ప దానగుణము గలిగి లోకమును పాలించుచుండెను:

"యో వైరివీరవరవారణదర్పసింహో
విద్యావినోదవివిధాభిరసః కలావాన్,
గాంభీర్యధైర్యగురుదానగుణైః సలోకం
పాతిస్మ వీరనృపతి ర్నిజరాజధన్యైః."

కుమార్తెయొక్క సహజమగు బుద్ధిసూక్ష్మతను, గానకౌశల్యమును చూచి మదమంది సాహిత్యమును చెప్పించవలె ననుకొనుచుండగా కాకతాళీయముగా గుణవంతుడగు ఈ రాజును చూచుటకు బిల్హణకవి వచ్చెను. అతని పాండిత్యమును, కవితాశక్తిని పరీక్షించి సంతోషించి తనకుమార్తెకు విద్యగరుప నాతని నియమించెను. అతని నడత తెలిసి పురోహితునిద్వారా పలుసారులు మందలించెను. కవియును, తన సుతయును తనకు ప్రియులైనందున చాలాయోచించి విధిలేక తుదకు కవిని శిక్షింపనాజ్ఞచేసెను. జను లందరును, రాణియును, అమాత్యపురోహితులును చేసిన విన్నపములను మన్నించి కవిని ఆదరించి కూతునిచ్చి పెండ్లిచేసి, బహుమానములనిచ్చి పంపెను. ఈరాజు ఔదార్యసాహసములను, సమయోచితబుద్ధిని, యుక్తాయుక్తవిచక్షణను గలిగియున్నాడు.

బిల్హణచరిత్రమునందు మదనాభిరామనృపాలుడు అధికముగా వర్ణింపబడలేదు. 'భూపాలచూడామణిః' అని ప్రారంభమున పొగడబడినాడు. కుమారీవిద్యాయత్నములో మంత్రిసలహా ననుసరించి కవికి అంధత్వమును, కన్యకు కుష్ఠత్వమును ఆరోపించి కుట్రపన్నినాడు. తన ఏర్పాటుకు వారిద్దరిని ఒడబరచినాడు. రహస్యప్రణయప్రసంగము వినగానే ఉగ్రుడై కవిని బంధించినాడు. బుద్ధిగా నుండినచో కన్యతప్ప సైరించి వేరొకని కిచ్చి పెండ్లిసేతు నన్నాడు. ఆమెధీరప్రతిజ్ఞను విని కోపించి కసరివేసినాడు. కోటిపాలుని (తలారి) యొక్క శాంతిమాటలను నిరాకరించి తగిలివేసినాడు. కాని తుదకు ప్రజలందరు వచ్చి కవియొక్క ప్రణయైకాగ్రతను విన్నవింపగా మనసుకరగి కవిని మన్నించి ఆదరించినాడు.

ఇక ప్రబంధములోని మదనాభిరాముడు మొదట కపటి, తరువాత మూర్ఖుడు, చివరకు కవిశాపభీతుడు. నాయికానాయకులయొక్క స్థితిలో కరుణశోకరసములను వృద్ధిపొందించుట కీగుణములు తోడ్పడుననియే ప్రబంధకవి చూచుకొనినాడుగాని వీనివలన రాజునందు గౌరవము తగ్గిపోవునని మరచినాడు. కలాభిమానియగు రాజు తనయూరనున్న ప్రసిద్ధకవివరుని తెలియక యుండు టెట్లు? ఇట్టి విద్యాభిమాని వధ్యస్థానము నుండి కవి పాడిన ప్రణయగీతమును, కవి కనుపరచిన ప్రణయైకాగ్రతను నిరసించు టెట్లు? ఇవి ప్రబంధమున లోపములని నాకు తోచినది. కాని చివరకు శాపభీతి వల్ల "తదుభయదృఢతరస్నేహసారంబును, తత్కవితామహత్త్వంబును" ఆయనకు బోధపడినపిమ్మట సహజమగు ప్రేమను, దయను జూపి తన రాజదర్జాను నిలువబెట్టుకొనినాడు.

నాటకములోని మదనాభిరామునియందు ఈ మూర్ఖత మిక్కిలి వెగటుగలిగించునట్లుగా ప్రదర్శింపబడినది. కుమార్తెతోగాని, రాణితోగాని, చెలికత్తెలతో

గాని మాట్లాడునప్పుడు వీనియందు ప్రాకృతజనోచిత ధోరణియే కనుపడునుగాని రాజోచితధోరణి గనుపడదు. రాజు వధ్యస్థానమునకు తాను స్వయముగా బోయి తలారిని స్వయముగా తొందరబెట్టుట ఈచెడు గుణమును కడుహేయముగా మార్చెను. షేక్స్పియర్ నాటకమున ఋణస్థునిపై కసిదీర్చుకొనుటకు వాని కండలను గోయ నుద్యమించుచున్న షైలాక్ (Shylock) యూధుని పాత్రము ననుకరించునట్లు చేయబడినాడీమదనాభిరాముడు.

ఇక రాణినిగురించి చరిత్రలోగాని, ప్రబంధములోగాని అధికముగా నేమియు చెప్పబడలేదు. ప్రబంధమునం దీమె కూతురి మొర నాలించలేదని మాత్రము రాజకుమార్తె విలాపమువలన తెలియుచున్నది. నాటకమున వసుమతి, రాణి కూతురిని మన్నించమని, సహజదాక్షిణ్యమును విడనాడవలదని ప్రేమగల తల్లికిని సాధ్వియగు నిల్లాలికిని తగినరీతిగా రాజుకు చెప్పినది. కొంచెము కరుణరసమును తగ్గించినచో ఈమెసంభాషణము రాణి కుండవలసిన ధీరత్వమును కనుపరచి యుండును. బిల్హణకావ్యమున రాణి సుతార, పురస్త్రీలు ఈ ఘోరముల రెండింటిని వారింపుమని చెప్పగా మూర్ఛిల్లినది. కూతురినడతను, స్థితిని దలచుకొని ఖిన్నురాలైనది. అయినను మనస్సును దృఢపరచుకొని రాజును వేడుకొనుటకువెళ్లినది. ఈమెయందుగౌరవముచేతనే రాజు తన నిశ్చయమును మార్చుకొనెనని చెప్పనగును. ఈసుతారాదేవియందు తల్లికిని, ఇల్లాలికిని, రాణికిని ఉచితమగు గుణములు ప్రదర్శింపబడియున్నవని నాఅభిప్రాయము.

కావ్యమునందు పురోహితుడు నీతిజ్ఞుడు, స్నేహపాత్రుడు. రాజమనోనువర్తియై సమయోచిత మగు సలహానిచ్చి కవిని శిక్షింపుమని చెప్పినను తుదకు మంత్రులతోను, ప్రజలతోను ఏకీభవించి బ్రహ్మహత్యా స్త్రీహత్యలను వర్జింపుమని రాజుకు బోధించెను. చరిత్రమునం దీపాత్రము కనుపడదు. అమాత్యుడు రాజునకు కపటోపాయము చెప్పి తెరపన్నుగడ జేసినపిదప కథలో వాని ప్రసంగ మేమియులేదు. నాటకమునందు ఈకపటోపాయము రాజుకే స్ఫురించినది. అమాత్యున కీపాటి ప్రాముఖ్యమును ఇవ్వబడలేదు.

ప్రబంధమున తలారికిని, నాటకమున చెలికత్తెయగు కళావతికిని ప్రాముఖ్య మివ్వబడినది. తలారి వీరసేనుడు కవియం దంతేని సానుభూతిని గనుపరచి, కవి చెప్పిన పద్యములను వ్రాయించి, సాహసముతో సారెసారెకు రాజునకు పంపించి, తుదకు కవియొక్క విడుదలకు కారణభూతుడై, రాజకన్యచే బహుమానము నొందినాడు. పండితుడు కాకపోయినను కవితామహత్త్వమును గ్రహింపగలిగినాడు. దయాగుణము, సాహసము, యుక్తాయుక్తవిచక్షణ గలిగి యువకుల నిశ్చలప్రేమను మెచ్చుకొని వారికి సహాయము చేసినాడు. ఇట్టి ఫలాపేక్ష లేని పరోపకారపరాయణు లప్పుడప్పుడు కథలలోనేగాక జీవితమందును కనుపడుచుందురు.

నాటకమున నాయికయొక్క చెలికత్తె కళావతి రాజుకు ధర్మబోధచేసినది. దానిమాటలు యుక్తములని మనస్సులో తెలుసుకొన్నను రాజు వానిని నిరసించెను. ఈపాత్ర నాటకమున నెంతయు బాగున్నది. రాజసభలో పండితుల గోష్ఠి యిటులుగాక ప్రహసనమునకు మాత్రమే తగియున్నది.

ఇక నాయకుని పాత్రను పరిశీలింతును. బిల్హణకవి ధీరలలితుడు, పండితుడు, అసమానకవితాశక్తి గలవాడు. కావ్యమునం దీతని సౌందర్యము సూచింపబడినదిగాని వర్ణింపబడలేదు. రాజకన్య "భావ్యర్థభావితమనోభవతుల్యకాంతా" (ముందు సృష్టింపబడునని ఈశ్వరునిచే తలంపబడిన ఈమన్మథునకు తగిన కాంత) యని వర్ణింపబడుటలో ఈతడు నవమన్మథునివలె నున్నాడని ఊహించదగును. ఒకప్రతిలో రాజకన్య "వక్త్రం విలోక్య సుకవే ర్నయనాభిరామమ్" (సుకవియొక్క నయనాభిరామమగు ముఖమును చూచి) అట్లనే నితంబనిహితహస్తయై నిలబడిపోయెనని వర్ణింపబడియున్నది. బిల్హణచరిత్ర మీత డసమానశరీరసౌందర్యము గలవాడగుటచే రాజు కుమారీవిద్యకొరకు కాండపటరూపమగు కపటోపాయమును పన్నవలసివచ్చెనని

చెప్పుచున్నది. ప్రబంధమునం దీకవి సౌందర్యము మిక్కిలి అతిశయోక్తులచే వర్ణింపబడియున్నది. నాటకమును ఇట్లే నిరూపించినది. కుష్ఠగాత్రులను చూడనను వ్రతము కావ్యమునందు కవికి ఆరోపింపబడలేదు. ధర్మసందేహము గలిగినట్లు, కలగనినట్లు నాటకమున నున్నది. కాని ఇవి తక్కిన కావ్య, చరిత్ర, ప్రబంధములలో కనబడవు.

కావ్యమునందు కవి ఆత్మనిగ్రహము గలిగియున్నను శిష్యురాలియొక్క విలాసదృష్టులకు శీఘ్రము లొంగిపోయెనని యున్నది.

'విద్వాంస మాశు వశినంచ వశీచకార'

ఒకప్రతిలో అన్యోన్యానురాగము ప్రబలగా "తెర ఎందుకిక మనకు" అని కవి యనగా రాజకన్య తెరను తీసివేసి అయనదర్శనము చేసెనని యున్నది. అన్యోన్య ప్రియవాక్యములు పలుకు కొనినతరువాత

'రాజప్రియోఽపి వివిధాగమపారగోఽపి
భుంక్తే స గూఢచరితో నరరాజపుత్రీమ్,
శాస్త్రోదితా న్యనుదితానిచ మోహనాని
పశ్య న్నహర్నిశ మతీవ నిగూఢచేతాః.'

(రాజుకు ఇష్టుడైనను, సర్వశాస్త్రపారంగతుడైనను అతిరహస్యచరిత్రుడై ఆమెయందు శాస్త్రమున గలవి లేనివి అనేక మోహనకరములగు విలాసములను కని పెట్టుచు రాజకన్యను అనుభవించుచుండెను.)

రాజువలని భయమున్నను ఇట్టిమోహినిని విడిచిపెట్టలేనని నిశ్చయించుకొన్నాడు. "సింగముయొక్క గుహ యెదుటనున్నదైనను, సుగంధఫల్లవభూషితమగు సల్లకీవృక్షమును మాతంగము విడిచిపెట్టునా?" రాజపురోహితుడు రహస్యముగా దూతిచే చెప్పించి మందలించినను, తనకుతాను ఎన్ని వేదాంతవైరాగ్యబోధనలు చేసుకొనినను ఆమెను తన యంతరాత్మ మరువజాలదన్నాడు.

'తదపి న హరిణాక్షీం విస్మర త్యంతరాత్మా.'

ఆపడలో రాజద్వారమువద్ద నిలచి తనను చూచుచున్న ప్రియురాలినిచూచి 'మరణమందును నీవే నాకు శరణ' మన్నాడు:

'బాలే త్వమేవ శరణం మరణేఽపి భూయాః'.

శిక్షకుముందు తలారి ముక్తిప్రదుడగు దేవుని ధ్యానించుకొమ్మనగా "ఇప్పటికిని (అద్యాపి) నాకిక్కడ కనుపడునది ఆమెయేగాని ఆదిదేవుడు గా"దని బదులుచెప్పి "అద్యాపి" అనుశబ్దము ప్రథమమునగల ఏబది వసంతతిలకావృత్తములతో మనోహరప్రణయస్మృతిగీతమును బాడెను. ఈగీతము మామూలురీతిని నాయికయొక్క శృంగారచేష్టలను, స్థితులను, ప్రలాపములను స్మరించుచున్నను, ఈప్రణయమును మిక్కిలి పవిత్రముగా గణించుచు తన ప్రియురాలిని స్మరించుట గురూపదేశమును స్మరించుట యనినాడు. అర్జునుడు సర్వత్ర కృష్ణునే గనినట్లు ఈకవి సర్వత్ర తన మనోహారిణియగు రాజపుత్రినే గనుచున్నాడు. నిశ్చలచిత్తుడై తనలో కొంచెమైన మంచివర్తన, సుగుణము, దేవపూజాదికము ఉన్నయెడల జన్మజన్మములయందును శశికలయే తనకు భార్యయగున ట్లనుగ్రహింపుమని సర్వదేవతలను ప్రార్థించుచున్నాడు:—

'హరిహరవిధిముఖ్యా లోకపాలాః సమేతాః
వచఇహ మమసర్వైః శ్రూయతాం సాక్షిభిర్యత్,
నివసతి యదిచేష్టం భావనాయాం సుతథ్యం
భవతు శశికలా మే జన్మజన్మేఽపి జాయా'

'మమయది సుకృతంస్యాత్ పూర్వజన్మార్జితంచేత్
యది సకలసురాణా మర్చనం మేఽస్తి కించిత్,
యజనహవనవేదాధ్యాసనం యన్మమాస్తి
తదపి శశికలా మే ప్రాణనాథా సదాస్తు.'

ఇది చితాగ్నిచుట్టు ప్రదక్షిణముచేయుచు సీత 'రాముడే తనకు ప్రియుడు' అని పాడిన రామాయణములోని గీతమును జ్ఞాపకముచేయుచున్నది.

ఇట్లు దేవతలకు విన్నవించుకొని, మౌనమును ధరించి, అంతమును నిరీక్షించుచు కవి నిలబడెను. దేవుని

యం దుండవలసిన భక్తి స్త్రీప్రణయమందు లీనము చేయుట విద్వాంసునకు తగదని కొంద రూహింప వచ్చును. కాని "ప్రేమపాలిత మీజగం"బనియును, ప్రణవస్వరూపి ప్రణయస్వరూపియనియును మన మెన్నడును మరువరాదు. ఈకవిప్రణయము కేవల మైహికవాసనలచే నిండినదిగాదు. ఈశ్వరుడను జీవుడు తన శక్తికొరకు తపస్సుచేయుటను నిరూపించుచున్నదని నాకు తోచుచున్నది. శక్తి ఈశ్వరునికొరకెట్లుతపస్సు చేయుచున్నదో అట్లే తనశక్తిని కలియుటకు ఈశ్వరుడను జీవుడును "గోవువెంట దనులు కోడెభంగి" తదేకచిత్తుడై తపమాచరించును. ఇదియే యోగపరమరహస్యమని మహనీయులవలన వినియున్నాను. బిల్హణకవి మొదట రహస్యప్రణయముచేత నమ్మిన ప్రభువును మోసగించుటవలన తన నడవడికి కలంకము కలిగినను ఇట్టి నిశ్చలప్రేమ తపస్సువలన అత్యంతధీరతకు, ప్రణయమునకు ఆదర్శమైనాడు. బిల్హణచరిత్రగూడ కవియం దిట్టి తన్మయతను కనుపరచినది. తాను చనిపోయిన తరువాత తన శరీరమునందలి పంచభూతములను తన ప్రియురాలి సన్నిధిని చేర్చుమని బ్రహ్మను వేడుకొన్నాడు. ప్రబంధమునందును ఇట్లే:—

'తన పృథ్వి యాఘనాఘనవేణి చరియించు
క్షితిభాగమున నుండజేయుమయ్య,
తన రసం బాసుధాధర క్రీడలాడెడు
శృంగారసరసిలో జేర్పుమయ్య,
తన తేజ మాతప్తకనకాంగి దర్శించు
దర్పణాంతరమున దార్పవయ్య,
తన వాయు వాసుగంధశ్వాస విసరించు
కొను వ్యజనంబున గూర్పవయ్య,
తన నభం బారమణియింట నునుపవయ్య
యీశరీరంబు పంచత్వ మెనసినపుడు,
స్వాంశములతోడ భూతంబు లైదునైదు
గూర్పవయ్య విధాత నాకోర్కెదీఱ.'

చరిత్రమునను, ప్రబంధములోను రాజకపటమువలన నాయకుని నడవడియందు దోష మంతగా స్ఫురింపదు. వానిలో నీదోషమంతయు రాజకాపత్యఫలమేయని నాయిక యనును. ప్రబంధమునను, నాటకమునను నిందనంతయు నాయిక తనపైనే వేసుకొనును. ఇది ప్రేమకు సహజము. బిల్హణకావ్యమునందు రాజుపై నింద లేనేలేదు. నాటకములో కవికి ధర్మసందేహము పొడమగా రాజకన్య యుక్తితో నాసందేహమును పోగొట్టును. నాయకునియెడ దోసము నిది తగ్గించినను, నాయికయం దిట్టి ప్రగల్భత సమంజసమా? మన నాటకములలో చిత్రాంగిపాత్రకు ఇట్టి ప్రాగల్భ్యము, చాతుర్యము అమర్చబడుచుండును గాని ఆ పాత్రమునకుగూడా ఆమెస్థితిని, ఆమెయెడ లోకమొనర్చిన ద్రోహమును ఆలోచించగా ఇట్టి ప్రాగల్భ్యచాతుర్యములు అస్వాభావికములని నాకు తోచుచున్నది. ఈవిషయమునందు మానవస్వభావమును, కవుల యూహలను విచక్షణులు చర్చించి నిర్ణయమొనర్తురుగాక.

ఇక నాయికనుగురించి చర్చించెదను. కాశ్మీరకావ్యములో శశికల మిక్కిలి సౌందర్యవతి, సూక్ష్మబుద్ధిగలది. మధురమైన కంఠస్వరము గలిగి ఏమాటలాడినను తండ్రికి మిక్కిలి మోదమును గలుగజేయుటవలన తండ్రి యీమెకు తగినవిద్య చెప్పించుటకు తగిన గురువును వెదకుచుండెను. గురువు లభించగనే "శుకశారికలతో నాడుకొనుటను విడిచి గురువునొద్ద శాస్త్రమభ్యసింపు" మని కూతురికి నచ్చజెప్పెను. బిల్హణచరిత్రలో నీమె వయస్సువచ్చిన కన్యయని వర్ణింపబడినది. మధురవాక్కు, స్వచ్ఛస్వరము గలిగి సంగీతవిద్యయం దారితేరి ప్రాగల్భ్యగర్వాన్వితయై యున్నదని చెప్పబడినది. అందుచే ఈమెకు అపాయము లేకుండ సాహిత్యము చెప్పించు టెట్లని రాజు ఆందోళనపడుచుండెను. ఆంధ్రప్రబంధము దీనినే అనుకరించుచున్నది:

'ఈకులపవిత్ర సురుచిరహేమగాత్ర
చంద్రకళగద సంగీతజలధి కిపుడు,
దీనికిని సర్వవిద్యలు తేటపడగ
చేర్చి సాహిత్య మొదవ జెప్పింతు ననుచు.'

ప్రబంధకవి 'చంద్రకళ' యను శబ్దము ప్రయోగించుట "యామినీపూర్ణతిలక" యను నామమున కర్థమును జూచియే గాని కాశ్మీరబిల్హణకావ్యమునుండి గ్రహించినట్లనుకొనుటకు వీలులేదు. వేరుసూచనలేవియును లేవు.

విద్యారంభ మైనతరువాత నాయిక గురువును, తండ్రిని, సరస్వతిని మెప్పించునట్లు సంస్కృతప్రాకృతములందు శాస్త్రములను నేర్చెననియు, తరువాత కామశాస్త్రమును పఠించెననియు అన్నిగ్రంథములయందును గలదు. పఠనానంతరము శాస్త్రము తెలిసియుండుటను, వయస్సు వచ్చియుండుటను స్మరబాణవిద్ధయై కవికి పూర్వజన్మపతి యగుటవలన ప్రేరితయై, యీ నూతన మన్మథునకు తగిన రతియై కాంతునియందు కటాక్షాదిక శృంగారరసవిలాసములను కనుపరచెను.

'విజ్ఞాతమన్మథకలా స్మరబాణవిద్ధా
త స్యాన్యజన్మరమణీ నరనాథపుత్రీ,
భావ్యర్థభావిత మనోభవతుల్యకాంతా
కాంతే రసా న్వికిరతిస్మ దృశో ర్వికారాన్.'

తరువాత వానిని వశముచేసుకొనెను. అతడు మనస్సులో "అన్నియును విచారించి" ఆమెను గాంధర్వవిధిని వివాహమాడెను. ఇది దైవఘటనమని కావ్యము అభిప్రాయపడినది.

'దైవా త్తయో రఘటితం ఘటితం బభూవ.'

కవిని చూడవలెనను కుతూహల మామెకు పుట్టించినది కవికృతచంద్రవర్ణనమని చరిత్ర చెప్పుచున్నది. వర్ణన విని, సందేహము గలిగి, తెరతీసి చూచెను. చూచి మోహించెను. ఈవర్ణన వినుటకు ముందు ప్రబంధము ఆమెకు ఉద్యానవిహారసమయమున నొకకలను కల్పించి, అందు సుందరదివ్యపురుషదర్శనము చేయించి ఆమెమనస్సుకు ఉద్వేగము కలిగించినది. అట్టి ఉద్వేగములో చంద్రవర్ణన కుతూహలమునుకలిగించుట న్యాయమేకదా. ఆమెయందు దోషము తగ్గించుటకు ప్రబంధకవి యిట్లు చేసెను. నాటకము ఇద్దరికిని కలలను, అన్యోన్యస్వప్నదర్శనమును, భవానీదేవివరమును కల్పించి నాయికానాయకులయందు దోషమునింకను తగ్గించెను. పూర్వము వీరిద్దరును విద్యాధరదంపతులు. శాపోపహతులై ఇట్లు జన్మించిరనుల నొందినారని భవానీదేవిచేత చెప్పించి వీరియెడల దోషమే లేకుండజేసెను. ఈకల్పన లన్నిటిలోను బిల్హణకావ్యములోని కల్పనయే స్వాభావికముగానున్నది. అద్భుతరససాహాయ్యము లేకుండగనే స్వాభావికముగా అన్యోన్యప్రేమ గలిగినట్లు నిరూపించునట్టి శృంగారరసమే హృదయంగమముగా నున్నదని నాయభిప్రాయము.

ఈరహస్యప్రణయవృత్తాంతము రాజుకు తెలిసి రాజు కవిని శిక్షించునప్పుడు శశికలయొక్క ప్రవర్తన ఉత్తమజాతిస్త్రీకి తగిన ట్లున్నది. దీనతకు లోనుగాక తన కిప్పుడు కర్తవ్య మేమియని విచారించుకొనినది. పతి ననుకరించి ప్రాణత్యాగముచేయుటయే సద్వంశజాతయగు స్త్రీకి తగు నని నిశ్చయించుకొనినది. కృతనిశ్చయురాలై, తొందరపడక, తలుపులుబిగించి, వస్త్రమును గట్టిగా కట్టుకొని, మేడపైకి పోయి సమయమును నిరీక్షించుచున్నది. చరిత్రమునం దిదేమియు లేదుగాని తండ్రి పెండ్లిచేయుదు ననగా "సర్వము కవికి సమర్పించియున్న నాయొక్క నిశ్చేతనమైన కాయము నెవరికిత్తువు" అన్నది. అటుతరువాత ఈమె సంగతి వివాహమగువరకు ఎత్తుకొనబడలేదు. ప్రబంధము ఈమెయొక్క విలాపమును అతికరుణముగా ప్రదర్శించినది. అంతే. నాటకములోని నాయిక సఖీజనుల సలహాపైని కవితో సంప్రతించినపిదప తండ్రివద్దకు వెళ్లి కవిని మన్నించమని వేడుకొనినది. నిరసింపబడి చావునకు నిశ్చయించుకొనినదిగాని నేలమాళిగలో ఖైదు చేయబడినది. భవానీకృపవలన సంకెల లూడ ఈవలికి వచ్చి వధ్యస్థానమున నున్న ప్రియుని గలసికొనినది. గ్రంథములన్నిటిలోను ఈనాయికపాత్ర మనోహరముగానే యున్నను, బిల్హణకావ్యమందు నాయికానాయకపాత్రలును, వారి ప్రణయమును స్వాభావికముగను, భావౌన్నత్యముతోను ప్రదర్శింపబడియున్నవని తలచెదను.

ఈ లోకములో సంఘపుకట్టుబాట్లు పలురీతులుగా నున్నవి. అవియును కాలానుగుణముగా మారుచుండును. ప్రకృతియొక్క కట్టుబాట్లకును వీనికిని సంఘర్షణ ముదయించినపుడు ప్రకృతియే గెలుచుచుండును. శశికలాబిల్హణుల ప్రణయ మిట్టి ప్రకృతివిజయమునకొక యుదాహరణము. "ప్రణయముయొక్క పద్ధతి ప్రణయమదే. అది యింకొక పద్ధతికి కట్టుపడదు." అని 14-వ శతాబ్దపు ఆంగ్లేయకవి ఛాసర్ (Chaucer) పాడినాడు. "ప్రేమ కేవలబహిరుపాధుల నాశ్రయించి కలుగదు. నిరూపించుటకు వలనుపడని ఆంతరహేతు వేదియో యొకటి పదార్థములను చేరదీయును."

'వ్యతిషజతి పదార్థా నాంతరః కోఽపి హేతు
ర్నఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయంతే.'

అని భవభూతి పాడినాడు. ఇచ్చట శశికలా బిల్హణుల ప్రణయమునకు వారి మనోహరరూపములు, యౌవనము ముఖ్యకారణములుగా నిరూపింపబడినను, పూర్వజన్మవాసన ఆంతరకారణముగా సూచింపబడియున్నది. పురుషకార మనుచో సంఘనీతికి విరుద్ధమై నిరసింపబడదగిన లంపటము దైవకారమగుటచేత ఉత్తేజకమై మనోహరమైన ప్రణయముగా మారినది. తారాశశాంకుల ప్రణయము ఉభయులయెడలను జారత్వమే, ద్రోహపూరితమే. దీనికి మదోన్మత్తత, అవినీతియును మాత్రమే కారణములు. ఈశశికలాబిల్హణుల కథయన్ననో కులగర్వమును, హ్రస్వదృష్టిభావములను అతిక్రమింపజాలి పొంగిపారలు స్వాభావిక ప్రణయవాహినిని ప్రదర్శించుచున్నది. ప్రబంధకవుల అభిరుచులవలన పచ్చివర్ణనలచే నింపబడినందున అధునాతనయుగసంస్కరణమునకు పాల్పడినది. సందు దొరికితే చాలును, ఉత్ప్రేక్షలు, అతిశయోక్తులు, కచకుచనితంబాదివర్ణనలు, స్మరక్రీడాదివర్ణనలు గుప్పించబడును, ప్రబంధములందు. పక్షపాతములేక అందరునాయికలు, నాయకులును చంద్రబింబమువంటి ముఖముగలవారు, సింహమువంటి నడుముగలవారు, పద్మాక్షులు, పద్మహస్తులు, పద్మపాదులుగా వర్ణింపబడుదురు. ఇట్టి అభిరుచి కవితకు వేరుపురుగువంటిది. దీనివలననే బిల్హణచరిత్రములోను, బిల్హణీయ ప్రబంధములోను కవి నాయికను మొదటిమాపుననే కంటికగుపడని శరీరభాగములనుగూడ వర్ణించునట్లు చేయబడెను. పచ్చివర్ణనలను ప్రస్తుతకాలాభిరుచినిబట్టి వదలినను ఆంధ్రకవిత యిప్పటికిని ఈ ప్రబంధశైలిని అనుకరించి ఉత్ప్రేక్షాతిశయోక్తిభూయిష్ఠమై యున్నదనియే నాఅభిప్రాయము.

బిల్హణకవిమానసమునేగాక నేటివరకు సకల హైందవపాఠకలోకహృదయములను రంజింపజేయు నీశశికల (యామినీపూర్ణతిలక) యొక్క సౌందర్యమునుగురించి కొంచెము తెలిసికొనగోరితిమేని గ్రంథములన్నిటిలోను ఉత్ప్రేక్షలే కనుపడును. కావ్యములో నీమె పద్మిని:

'శ్రీపద్మపత్రనయనాం వరపద్మహస్తాం
పద్మప్రక్లృప్తచరణాం శుచిపద్మగంధామ్,
తాం పద్మినీమివ సుపద్మనికేతనాంచ
మేనే కవిః శశికలామివ కామవల్లీమ్.'

పరదేవతను "పద్మకాంతిపదపాణిపల్లవపయోరుహాననసరోరుహాం" అని ఒకేపద్మసూత్రముతో బంధించి వర్ణించియున్నారుగదా మహనీయులు! చరిత్రలో "ముఖమఖిలం నయనయుగం" అని యీమెను వర్ణించు నొక యుత్ప్రేక్ష గలదు. చూపు లంతజీవకళ గలిగియుండి అపూర్వబుద్ధిసూక్ష్మతను తెలియజేయుచున్నవని మనము అర్థముచేసుకోవలయునుగాబోలు. ఇంకొకచోట అప్పుడే స్నానముచేసి తెల్లనిచీర గట్టుకొని, తడిజుత్తును చేతబట్టుకొని నిలుచున్న ఆమెను జూచి క్రొత్తగా సానబెట్టిన కత్తివలెను, నిండువెన్నెలను వెదజల్లు శారదరాత్రివలెను, శృంగారససముద్రమునుండి వెలువడిన రెండవ లక్ష్మివలెను ఉన్నదని యామినీపూర్ణతిలక వర్ణింపబడినది. మొదట తెరతీయగా ఆమెను చూచినప్పుడు ఆమెయొక్క మెరుపువిగ్రహమును కవి వర్ణించు శ్లోకమును, ప్రబంధములోని పద్యమును ఉత్ప్రేక్షామయములయినను నేటికిని పఠింపబడుచున్నవి. ఇవి మొదటనే ఉదాహరింపబడినవి.

చోరపంచాశికలోని మొదటిశ్లోకము ఈమెను "కనకచంపకదామగౌరీ" (పరమసువర్ణచంపక విభాసురగౌరి) యని వర్ణించెను. మొదటిచూపున కీమె బంగారులతవలెను, మెరుపుతీగవలెను, చంపకపుష్పముల సరమువలెను గనుపడెనని తేలును. ఇందులో గాత్రసౌష్ఠవమును, కాంతియును ద్యోతితము లగుచున్నవి.

ఇక నీమెవిలాసములు పలుతెరగుల చోరపంచాశికలో వర్ణింపబడినవి. ప్రబంధమున తృతీయాశ్వాసమున రమణీయముగానే తెర్జుమా చేయబడియున్నను, మాతృకలోని వసంతతిలకావృత్తములవలె ఈదీర్ఘవృత్తములు స్మృతిభావమున కనువుపడినట్లు నాకు తోచదు. అశ్లీలములు లేని కొన్నివర్ణనలు మిక్కిలి మనోరంజకములుగా నున్నవి. రాత్రి కవి తుమ్మినప్పుడు, కోపముచే మామూలుగా "చిరంజీవ" యనువాడుకదీవనను ఉచ్చరించక జీవశక్తిని వృద్ధిజేయు బంగారుచెవికమ్మను తనకు తాకించినదట, యొకమారు. ఇంకొకమారు వెనుకనుండి వచ్చి కవి కన్నులుమూయగా, సఖులు ఎవరో చెప్పుకొమ్మని యడిగిరి. సంభ్రమపులకిత కంఠదేశయై, కొంచెము చిరునవ్వుగల స్వరముతో "అమ్మో, నాకు తెలియదు" (మాత ర్నవిద్యే) అని బదులుచెప్పినదట. తాను తలుపువద్ద నిలుచుండగా, ఆయనను చూడనిదై, ప్రియు డెప్పుడువచ్చునో యని చేయి మోమున జేర్చి ఎదురుగచూచుచు, కవియం దనురాగమును వెల్లడించు పాటను మెల్లగా కాకలీస్వరమున పాడుకొనుచుండుట విని కవి మిగుల మోదమందెనట. ప్రేమ ప్రియురాలి యం దనంతశృంగారలీలలను గనిపెట్టుచుండును. ఇవన్నియు శశికల సౌందర్యదేవతయేగాక, విద్యావతియైనను, రాజవంశజయైనను సహజముగా గర్వములేని ముగ్ధ, ఉత్సాహవతి, ప్రేమమూర్తియు నైయున్నదని చదువరులకు ద్యోతనముచేయుచున్నవి. చోరపంచాశికలో వర్ణింపబడిన ప్రియురాలి లీలలు కావ్య, చరిత్ర, ప్రబంధములలో రమణీయముగా సమర్పబడియున్నను, నాటకరచన ఈప్రణయస్మృతిగీతమునకు చోటివ్వలేదు.

## V ముగింపు

కవిచేత జేయబడిన చంద్రవర్ణన, నాయికావర్ణన చరిత్రయందును, ప్రబంధమునందును ప్రాముఖ్యమువహించుచున్నవి. నాటకమున చంద్రవర్ణన మాత్ర మనుర్పబడినది. నాయికావర్ణన కంతప్రాముఖ్య మివ్వబడలేదు. నాటకముయొక్క ప్లాను వేరు. ప్రబంధమున ద్వితీయాశ్వాసమునందు పూదోట, అందు రాజకన్యావిహారము, ఆమె కలగని లేచి విభ్రమమునొందుట మొదలగునవిగల భాగము శైలి శ్లేషభూయిష్ఠముగానున్నను అతిలలితముగా నున్నదని తలచెదను. విస్తరభీతిచే నిచట వానిని నే నుదాహరించుటకు సాహసింపలేదు.

ఈ ప్రబంధశైలి కొన్నిచోట్ల మనుచరిత్ర పోకడలను, కొన్నిచోట్ల భాగవతపు పోకడలను అనుసరించుచున్నది.

ఈ వ్యాసమును ముగించుటకుముందు ఇన్నిగ్రంథములు చేర్చి పరిశీలించుటలో నాకు దోచిన రెండు మూడు చిన్నయంశములను పొందుపరచుచున్నాను:—

౧. కాశ్మీరకావ్యమున కవికి శిక్ష చోరునకు తగిన శూలారోపణము (కొరతవేయుట) అని నిర్ణయింపబడినది. తక్కిన అన్నిగ్రంథములలోను శిరశ్ఛేదమని యున్నది. రాజు మంత్రుల నీవిషయములో సలహా అడిగినట్లు కావ్యమున నున్నది. చరిత్రలో రాజు ఎవరిని సలహాఅడుగకయే నిర్ణయించెను. ప్రబంధములో సభచేసి అభిప్రాయమడిగినను సభ్యులు దండింపుమనిరే గాని దండనస్వరూపమును రాజే నిర్ణయించెను. ఈసభ ప్రబంధకవియొక్క సొంతకల్పనయేగాని కాశ్మీరకావ్య పరిచయఫలమని ఊహించుట కాధారములులేవు.

౨. విద్యాభ్యాసముకొరకు "సప్తావని" యను పేరుగల ఒక ప్రాసాదమును ఏర్పాటుచేసి యిచ్చెనని కావ్యమం దున్నది. అచ్చటనే కవినివాసమునకు తగిన ఏర్పాటులును చేయబడినవి. చరిత్రలోను అట్లే. కాని చదువుకొను శాలలో శయ్య లమర్పబడినట్లు చరిత్ర

యం దుండుట వింతగానున్నది. రాత్రివేళ రాజకుమారి తన శయనమునకు వచ్చినట్లును, కవి చంద్రుని వర్ణించుట విని కుతూహలముతో తెరదీసి చూచినట్లును గలదు. శయ్యాగేహము, విద్యాగారము రాజభవనములో నొకటిగా నుండుట అసంభావ్యమని తలచెదను. చరిత్రలో కొన్ని భాగములు స్పష్టముగా లేవు.

౩. కవి "చేతోజాతాకులితహృదయుడై" చంద్రవర్ణన చేసెనని యున్నది. ఈమన్మథ ప్రేరేపణకు దృశ్యకారణము లేదు. శృంగారభావవిలసితమని యనుకొనవచ్చును. వర్ణనలో నొకచో:

'పశ్యోదితం శారద ముత్పలాక్షి
సంధ్యేందిరాకందుక మిందుబింబమ్'

(సంధ్యాలక్ష్మి యాడుకొను బంతివలె నుదయించిన శరత్కాలచంద్రబింబమును చూడు మోఉత్పలాక్షి) చంద్రబింబమును చూచునప్పుడు "కలువరేకుల వంటి నేత్రములుగలదానా" యని సంబోధించుట మంచి ఔచిత్యమును గలిగియున్నను ఈ ఉత్పలాక్షి ఎవరు? ఎవతెను సంబోధించుచున్నాడీకవి? రాజకుమార్తె సమీపమున నున్నట్లుగూడ తెలియదే. ఇందుచేతనే అనేక చాటుశ్లోకములను చేర్చి యీ దక్షిణదేశ బిల్హణ చరిత్రము కూర్పబడియుండునని నాకు తోచుచున్నది. కాశ్మీరకావ్యములోను అన్వయలోపములు గలవు గాని అవి వ్రాతలలో కాలక్రమేణ సంక్రమించినవని తలచెదను.

బిల్హణకవిప్రణయమునుగురించిన యీగ్రంథములన్నిటిలోను స్వాభావికవర్ణనలు గలిగి, మృదులమై నాతిక్లిష్టమగు వైదర్భీశైలిని గలిగి, శైలియందును కథాసందర్భములందును చోరపంచాశికను, మిక్కిలిగా అనువర్తించుచున్న కాశ్మీరబిల్హణకావ్యము మన యాంధ్రదేశములోని సమర్థులగు పండితులచే పరిష్కరింపబడి, వ్యాఖ్యానముతో ప్రచురింపబడ తగియున్నదనియును, దీని శైలిని, వృత్తములను అనుకరించు ఆంధ్రీకరణము కూడ వాంఛనీయమనియును చదువరులకు విన్నవించుకొనుచు ఈవ్యాసమును ముగించుచున్నాను.

---



కోటగిరిలోని బజారు, నీలగిరి

—టి. గోపాలకృష్ణ.

# ఖాన్ ఖానా అబ్దుల్ రహీమ్ ఖాన్

రామమోహన్ రాయ్

యద్యాత్రయా వ్యాపకతా హతా తే,
భిదైకతా వాక్పరతాచ నుత్యా,
ధ్యానేన బుద్ధేః పరతా పరేశ,
జాత్యాఽజతా క్షంతు మిహార్హసి త్వమ్.

—"రహీమ్‌కావ్యము" నుండి.

(ఓ పరమాత్మా, తీర్థయాత్రలకు బోవుట నీ విచట లేవని యంగీకరించుటయే దీనిచే నీసర్వవ్యాపకత్వము నవమానించిన ట్లగుచున్నది. నమస్కారాదికములచే జీవబ్రహ్మల మైక్యము, స్తోత్రములచే వాగతీతత్వము నంగీకరింపన ట్లగుచున్నది. జీవబ్రహ్మల కైక్యము నంగీకరించుచో నమస్కారము చేయువా డెవడు? చేయించుకొనువా డెవడు? స్తోత్ర మొనరించుచో వాగతీతు డను టెట్లుచెల్లును? ధ్యాన మొనరించుచో బుద్ధికతీతుడ వనుటను త్రోసివైచిన ట్లే! అవతారము లంగీకరించుచో నీయజత్వమును ధ్వంస మొనర్చిన ట్లే! పరమప్రభూ, మాయాయవివేకమును క్షమింపుము.)

పై నుదాహరించిన "రహీమ్‌కావ్యము"ను వ్రాసినవాడు అక్బరుపాదుషా ప్రధానమంత్రియగు అబ్దుల్ రహీమ్‌ఖాను. ఈతనిపుణ్యచరిత్ర సంస్కృతపాఠకులకు చిరస్మరణీయము. ఈతని మృదుమధురకవితాకుసుమములు సంస్కృతవాఙ్మయమునకు శిరోభూషణములు.

రహీమ్‌ఖాను సుప్రసిద్ధమగు 'కరాకూయలూ' వంశమున జన్మించెను. ఈతని పూర్వులందరు జాగీర్దారులు, సర్దారులునై విఖ్యాతిబడసినవారే. ఈతని పితామహుడు బాబరువద్ద సర్దారుగా నుండి యాతనితో భారతదేశమునకు వచ్చెను. నాటినుండియు ఆతడు భారతభూమిలోనే యుండిపోయెను. హుమాయూనుచక్రవర్తికాలమున ప్రధానమంత్రిగను, సేనాధ్యక్షుడుగను ఉండి ఆతని యనంతరము అక్బరుపాదుషాకు సంరక్షకుడుగ ఢిల్లీసామ్రాజ్యమును శాసించిన ఖాన్‌ఖానా బహరామ్‌ఖానుడు రహీమ్‌ఖానునితండ్రియే.

రహీమ్‌ఖానుని చిన్నతనముననే యాతని తండ్రియగు బహరామ్‌ఖానుడు చనిపోయెను. పితృమరణమునాటి కీతనివయస్సు నాలుగేండ్లు మాత్రమే. అప్పటినుండియు నక్బరుపాదుషాయే యీతని చేరదీసి విద్యాబుద్ధులు గరపించెను. రహీమ్‌ఖానుని సత్యసంధత, బుద్ధినైశిత్యముల కలరి చక్రవర్తి యీతనికి 'పాటిన్' జాగీ రొసగి గౌరవించెను. నాటి కీతని వయస్సు పదునెనిమిదేండ్లుమాత్రమే. బుద్ధినైశిత్యముతోబాటాతని సాహసవిక్రమములుగూడ అనుపమానములు. విక్రమశకము ౧౬33-వ సం. న గుజరాతుయుద్ధమున ఖాను చేసిన సహాయమునకు సంతుష్టుడై చిన్నవాడనియైన తలపక చక్రవర్తి ఇరువదేండ్లవాడగు రహీమును గుజరాతునకు సుబేదారుగా నియమించెను. ఈ దినములలో రహీమ్‌ఖానుని

యదృష్ట మత్యున్నతస్థానమం దుండెనని చెప్ప
వచ్చును. ఒకదానివెనుక నొకటిగ నాత డతి
శీఘ్రముగ నున్నతస్థానములు బడయసాగెను.
సామాన్యముగ నధికానుభవము గలవారికి
గాని యొసగబడని 'మీర్-అర్జ్' అనుపదవి
నీత డిరువదినాల్గవయేటనే బొందగలిగెను. తరు
వాత ఎనిమిదిమాసములకే 'అజ్మీరు' నకు
సుబేదారుగా నియమితుడై దర్బారులో
నున్నతస్థానమలంకరించెను. పాదుషా యీతని
యోగ్యతకు ముగ్ధుడై యెట్టి యున్నతపద
మొసగుటకుగూడ వెనుదీయలేదు. తన యిరు
వదియారవయేట నీతడు యువరాజసలీమునకు
సంరక్షకుడుగను, విద్యాశిక్షకుడుగను నియ
మితు డయ్యెను. ఇరువది తొమ్మిదవయేటనే
'ఖాన్‌ఖానా' యను బిరుదము వహించెను.
తరువాత మూడుసంవత్సరములకే ఖాన్‌ఖానా
అబ్దుల్ రహీమ్‌ఖాన్ ప్రధానామాత్యుడుగా
నొనర్పబడి సామ్రాజ్యమునం దత్యున్నతాధి
కార మొందెను. నాటి కీతని వయస్సు ముప్పది
మూడేండ్లుమాత్రమే.

అక్బరుపాదుషాయనంతరము జహాం
గీర్ చక్రవర్తిగూడ ఈ సమర్థుని సముచిత
గౌరవ మొసగి పూజించెను.

ఖాన్‌ఖానా ప్రధానామాత్యపదవియం
దించుమించు ముప్పదియేండ్లు పనిచేసెను.
ఈమధ్యకాలమం దీతడు మహాగౌరవముతో
బాటు మహదైశ్వర్య మనుభవించెను. పాదు
షా కుమారుడగు 'షాహ్‌జాదాఖుర్రమ్' ఖాన్
ఖానా ప్రథమపుత్రుడగు శాహ్‌బాజ్ ఖానుని
పుత్రికను వివాహమాడెను. చక్రవర్తితోడి
బాంధవ్యముగన్న ఖాన్‌ఖానాకు ప్రార్థనీయము,
గౌరవనీయము నగునది వేరొం డేమున్నది?

యౌవనముతోబాటు రహమానుని
యదృష్టచక్రముగూడ తిరిగిపోయెను. ఈయన
కుమారులు ముగ్గురిలో పెద్దవాం డ్రిరువురు
మరణించిరి. ఇంతలో మనుమరాలి మగడగు
ఖుర్రమ్ పాదుషాపై తిరుగబడుట సంభవించి
ఖాన్‌ఖానా రాజపుత్రునిపక్ష మవలంబింప
వలసివచ్చెను. యుద్ధమున ఖుర్రమ్ పరాజితు
డయ్యెను. ఖాన్‌ఖానా మహబత్ఖానుచేతిలో
బందీయయ్యెను. చెరసాలలో నీవృద్ధు డనేక
దుఃఖములకు లోనయ్యెను. అచటనే యీతడు
తన తృతీయపుత్రుని శిరమును విద్రోహాచర
ణమునకు బహుమానముగా బొందెను.

కొంతకాలమునకు జహాంగీర్ - ఖుర్ర
మ్‌లకు సంధి జరిగెను. వెంటనే ఖాన్‌ఖానా
చెరవీడి తిరిగి పూర్వపదమున నియుక్తు
డయ్యెను. కాని యీమారు రహీము తనపద
విని చిరకాల మనుభవించలేదు. మరుసటి
సంవత్సరముననే యీవృద్ధుడు తన డెబ్బది
రెండవయేట దివంగతుడయ్యెను.

ఈతని ప్రతిభ యొక్క రాజకీయరంగ
మున నేగాక సాహిత్యపీఠమునగూడ దివ్య
ద్యుతుల వెలార్చెను. ఖాన్‌ఖానా కేవలము
రాజనీతివేత్తయేగాడు; పండితకవి. ఈతడు
అరబ్బీ, ఫారసీ, హిందీ, సంస్కృతభాషలలో

కూలంకషమగు పాండిత్యముగలిగి రసవంత ముగను, ఆశువుగను కవిత చెప్ప నేర్చి యుండెను. ఈతని కవితాశైలి మృదులమై, మధురమై, హృదయంగమమై యుండును.

సంస్కృతభాషలో నీతడు వ్రాసిన గ్రంథములు రెండు:

౧. ఖేటకౌతుకజాతకము

ఇది యొక జ్యోతిషగ్రంథము. ఫారసీ పదయుక్తమగు సంస్కృతభాషలో దీనిని రచించి ఖాన్‌ఖానా గ్రంథరచనమున నూతన మార్గము ద్రొక్కెను. ఈ గ్రంథము ముద్రితము. మంగళాచరణానంతర మీక్రింది శ్లోకముతో గ్రంథ మారంభింపబడినది:

"కరో మ్యబ్దుల్ రహీమోఒహం
ఖుదాతాలా ప్రసాదతః,
పారశీకపదై ర్యుక్తం
ఖేటకౌతుక జాతకమ్."

౨. రహీమ్‌కావ్యము

భక్తిరసపూరితమగు గ్రంథము, అలభ్యము.

రహీమ్‌ఖాన్ జాతిచే తురుష్కుడైనను కృష్ణభక్తుడు. ఈమహాకవి రసవంతములగు కవితాకుసుమముల తన యిష్టదైవతము నర్చించెను. అపద్యముల సంగ్రహమే 'రహీమ్ కావ్యము.'

'రహీమ్‌కావ్యము' యొక్క వైశాల్యమూహించుటకు నేడు మన కెట్టి యవకాశములు లేవు. కాని ప్రస్తుత మారేడుశ్లోకములుమాత్రము కాలగర్భమున నశించిన యాయుత్తమగ్రంథముయొక్క యౌత్కృష్ట్యమునకు సాక్షిమాత్రముఃలుగ నిలిచియున్నవి రచనామాధుర్యము, విశాలభావములు గలిగి హృదయస్పర్శియగు కళతొలికించుచు యాశేషించిన శ్లోకము లాశిథిలకావ్యముయొక్క యౌత్కృష్ట్యమునూహించు నవకాశమును గలిగించుచున్నవి.

ఖాన్‌ఖానా మహదైశ్వర్య మనుభవించనది ప్రధాన మంత్రియగుటచే గాదు; విస్తృతకీర్తి బొందినది పెద్దబిరుదములచేగాదు. అమృతరసనిష్యందినియగు నాతని కలమే పాదుషాల మన్నలకు పాలుచేసినది; ప్రజాహృదయమున స్థాన మిప్పించినది. నేటికిగూడ ఉత్తర హిందూస్థానమున నే హిందూకవియొక్క కవితకు లేని వ్యాపనము, కీర్తి ఈతురుష్కకవికి గలవు. ప్రజ లెల్ల రీతనిని ఖాన్‌ఖానాగాకన్న మహాకవిగానే యెరుగుదురనుట సత్యదూరము గాదు. ఇట్టి మహాకవిగ్రంథము సమగ్రముగ లభించకుండుట విచారకరము.

ఈతని కావ్యములో శిథిలశేషములగు శ్లోకములు నాకు లభ్యమైన వీక్రింద వ్రాయుచున్నాను:

"ఆనీతా నటవ న్మయా తవపురః
శ్రీకృష్ణ యా భూమికా
వ్యోమాకాశ ఖఖాంబరాబ్ధివసువ
త్త్వత్ప్రీతయేఒద్యావధి,
ప్రీత స్త్వం యదచే న్నిరీక్ష్య భగవన్,
స్వం ప్రార్థితం దేహి మే

నోచే ద్బ్యూహి కదాపి మా నయ పున
స్త్వేతాదృశీం భూమికామ్."

"రత్నాకరోఽస్తి సదనం గృహిణీచ పద్మా
కిందేయ మస్తి భవతే జగదీశ్వరాయ,
రాధాగృహీతమనసే మనసేచ తుభ్యం
దత్తం మయా నిజమన స్తదిదం గృహాణ."

ఈ క్రింది శ్లోకములుగూడ ఖాన్‌ఖానా విరచితములే:

"ప్రాప్య చలా నధికారాన్
శత్రుషు మిత్రేషు బంధువర్గేషు,
నాపకృతం నోపకృతం
నోపకృతం కిం కృతం తేన."

"అచ్యుత చరణతరంగిణి
శశిశేఖరమౌలిమాలతీమాలే,
మమ తనువితరణసమయే
హరతా దేయా, నమే హరితా."

"భగవతి, మునికన్యే,తారయే పుణ్యవంతం
సతరతి నిజపుణ్యై స్తత్ర కింతే మహత్త్వమ్,
యదిహ యవనజాతం పాపినం మా పునీహి
తదిహ తవ మహత్త్వం తన్మహత్త్వం మహత్త్వమ్."



హాంటు ప్లెజంటు, కోటగిరి
(నీలగిరి)

—టి. గోపాలకృష్ణ.

# ప్రేమపాశం

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

(తరువాయి)

## రెండో అంకం

### మొదటి రంగం

[బంగారమ్మ వీధిఅరుగుమీద గోడకి ఆనుకొని కూచునివుంటుంది.]

బంగారమ్మ—(స్వగతం) మళ్లీ యెప్పుడు వస్తాడో బావ! మాయింటోనే భోజనంచేస్తూ మాయింటోనే వుండరాదూ? భోజనంకోసం యీయింటికీ, ఆయింటికీ పరిగెత్తడం యేం సుఖమూ? ఒకచోట పొద్దోతుంది. అప్పుడు పొద్దున్న వుండడం కష్టం. ఒకచోట తొమ్మిదింటికే అవుతుంది. అప్పుడు రాత్రిదాకా వుండడం కష్టం. రూపాయలకి రూపాయలు కాఫీహోటళ్లలో గుమ్మరించాలి. ఇక వారాల లాభం యేమిటీ? కాకపోయినా, వొకయింటో పప్పూ, కూరా, చారూ—యిలాంటివి పెడతారు. కొన్ని యిళ్లల్లో వట్టివూరగాయే వేసి పెడతారు, వొకర్తి "యేగో తింటాడు, పోతాడు" అని నిర్లక్ష్యంగా పెడుతుంది. వొకర్తి విధిలేక రుంజుకుంటూ పెడుతుంది. ఆదరించి పెట్టే యిల్లాళ్లు తక్కువవుంటారు. యెలా తింటు న్నాడో బావ? యెలా కాలం గడుస్తోందో?

మాయింటోనే యెందుకుండగూడదమ్మా? మా నాన్న మేనమామాయెను. తను మేనల్లుడు. మా అమ్మ భేదం యెరగదు. నేను ప్రాణం యిస్తాను. యేంలోటు? యేం తక్కువా? చాలామంది యిళ్లల్లాగ అసహ్యంగా వుండదు మాయిల్లు. వేసంకాలంలో డాబామీద పడుకుంటే యెంతసుఖంగా వుంటుందీ? యిల్లంతా నాపరాయేకదా? తను ప్రత్యేకంగా వొకగది పుచ్చుకో వచ్చు.

నేను వుండమంటే వుంటాడు. నేనంటే దయే బావకి. వొళ్లో కూచుంటే సంతోషించాడు కదా? అయితే యిదోకష్టం వచ్చిలావుంది. నిన్న యిట్టే వచ్చి పదిరూపాయలు చేతిలోపెట్టాడు. ఇందాకా వీసెడు మిఠాయి తీసుకువచ్చాడు. వొద్దు మొర్రో అని యెంత చెప్పినా ససేమిరా అన్నాడు; గాని మానేడా? వచ్చి నప్పుడల్లా యిలా అయితే కష్టమే. సంగీతంపాడి సంపాదించుకున్న డబ్బంతా యిలాఖర్చుపెడితే—యింకా పెళ్లికావాలి కూడానూ.

(అప్పుడు వెంకన్న వస్తాడు.)

వెంకన్న—(స్వగతం) బంగారం అరుగుమీదే కూచుంది. నేనంటే దీనికిష్టమే. నన్ను చూసిందంటే ముందు తనే పలకరిస్తుంది. (ఆమెయెదట ముసిముసి నవ్వులు నవ్వుతూ నుంచుంటాడు)

బంగారమ్మ—(స్వగతం) వీడు వచ్చాడెందుకూ యిప్పుడూ?

వెంకన్న—(స్వగతం) పలకరించదేం?

బంగారమ్మ—(స్వగతం) మొద్దులాగ నుంచున్నాడెందుకూ?

వెంకన్న—మాట్లాడవేమే బంగారం?

బంగారమ్మ—నువ్వెందుకు మాట్లాడావుకాదూ?

వెంకన్న—మావూరునుంచి వస్తే—

బంగారమ్మ—ఎప్పుడు వచ్చావురా?

వెంకన్న—యిప్పుడేగామూ యింకా వస్తున్నానూ? మూట యింకా బుజంమీదే—

బంగారమ్మ—అయితే యింటోకిపద.

వెంకన్న—(స్వగతం) తను లేవదేం? (ప్రకాశం) మాఅమ్మగూడా వస్తోంది.

బంగారమ్మ—ఏదీ?

వెంకన్న—అదిగో (వీధికేసిచూసి) అమ్మోయి! బంగారం వీధిలోనే కూచుందేవ్!

(అప్పుడు కోటమ్మ వస్తుంది.)

కోటమ్మ—ఇదిగో బంగారమే! వీధిలో కూచున్నావేమే?

బంగారమ్మ— వీధిలో కూచోలేదు, పెద్దత్తా, అరుసుమీద కూచున్నాను గానీ.

కోటమ్మ—అదీయిదీ వొకటికామా? ...పోనీ, మీనాన్న వూళ్లో వున్నాడా?

బంగారమ్మ—వున్నాడు. బజారుకికామోసు వెళ్లాడు.

వెంకన్న—యింటోకి వెడదాంరావే బంగారం!

బంగారమ్మ—మీరు పదండి, నేను తరవాత వస్తాను.

కోటమ్మ—నడవరా.

(తల్లీ, కొడుకూ లోపలికివెడతారు)

బంగారమ్మ—యిప్పుడు వచ్చారెందుకూ వీళ్లూ? ఎక్కడికో వెడుతున్నారు కాబోలు. చదువూ లేదు సంధ్యాలేమా, మాటలు మాత్రం మెయ్యగలడు వీడు. పెద్దత్త యెక్కడికి వెళ్లినా వీణ్ణే తీసుకువెడుతుంది. చచ్చు పెద్దమ్మ. అప్పుడే పద్ధెనిమిదేళ్లు వెళ్లాయి. నేనే నయం, ఆరోతరగతి చదివాను.

(వెంకన్న మళ్లీవస్తాడు)

వెంకన్న—వొశావ్! బంగారమ్మోయ్! నీకోసం పోకుండలు తెచ్చింది మాఅమ్మ. రా యింటోకి వెడదాం.

బంగారమ్మ— పోకుండలా? యెలా వుంటాయవీ? యేంచేసు—

వెంకన్న—తియ్యబెల్లం. తింటే వదలవు నువ్వు. పైకి బూరిల్లాగ—వేయించిన కొబ్బరికాయముక్కలూ, నువ్వుపప్పూ—యెంతరుచిగా వుంటా యనుకున్నావ్?

బంగారమ్మ—నేనెప్పుడూ ఆపేరే వినలేదూ. యిప్పుడెందుకు తెచ్చారూ?

వెంకన్న—నీకోసమే. తిందువుగాని రా యించక్క. నీమీద మాఅమ్మకెంతో యిష్టం. నువ్వంటే నాకెంత—(సద్దులిప్పుకుంటూ) అనుకున్నావ్? నిన్నె పెళ్లాడతాను నేను. మాఅమ్మ ముహూర్తం పెట్టించడానికే వచ్చింది. రా చిలకాగోరింకల్లాగ యింటోకి వెడదాం. (చెయ్యి పట్టుకోపోతాడు)

బంగారమ్మ—వుండు. అక్కడ నుంచోలేవూ? నువ్వుపో యింటోకి. నే నిప్పుడురాను. పో! నుంచుంటావేం?

వెంకన్న—తొరగారావాలి సుమా కాళ్లు కడుక్కోడానికి నువ్వే యిస్తావంది మఅమ్మ, నాకు నీళ్లు. (వెళ్లిపోతాడు.)

బంగారమ్మ—వోరిచచ్చు —

వెంకన్న—(మళ్లీవచ్చి) నువ్వు వచ్చేదాకా పోకుండలమూట విప్పను. (వెళ్లిపోతాడు.)

బంగారమ్మ—వీడి పోకుండలు కాలా. దున్నపోతూ. నన్ను పెళ్లాడతాట్ట. అవ్వ. (అని నోరుమూసుకొని) సిగ్గుసిగ్గు. యిక్కడకూచుంటే మళ్లీవస్తాడు. వాళ్లసూరమ్మతో ఆడుకుంటాను వెళ్లి.

(బంగారమ్మ వెళ్లిపోతుంది. వెంకన్నా, పోకుండలమూటతో కోటమ్మా మళ్లీవస్తారు.)

కోటమ్మ— నేను తీసుకువస్తానుండు. నిన్ను చూసి సిగ్గుపడింది. మొగుడంటే సిగ్గెరగదనుకున్నావా యేమిటి, పన్నెండేళ్లపిల్లా?

వెంకన్న—ఏదీ?

(ఇద్దరూ వెళ్లపోతారు.)

కోటమ్మ—యేదారినో యింటోకే వెళ్లింది, రా.

(ఇద్దరూ లోపలికివెడతారు.)

———

రెండోరంగం

[వాకట్లో వెంకటశాస్త్రి, కాంతమ్మ, కోటమ్మ, వెంకన్నా చేరి కూచునివుంటారు. బంగారమ్మ తల్లి పక్కని కూచునివుంటుంది.]

వెంకటశాస్త్రి—"సంగతి యిదీ" అనిచెప్ప కుండా "నేనెందుకు వచ్చానో తెలుసునా తమ్ముడూ?" అంటే యెలా తెలుస్తుందే అక్కయ్యా?

కాంతమ్మ—గంపంత వూహ మనస్సులో పెట్టుకుని వచ్చినట్టుంది పెద్దవొదిన.

వెంకన్న—మామ బంగారాన్ని నాకే యిస్తాడు.

కోటమ్మ—చెప్పాలిట్రా తమ్ముడూ నోరు చేసుకునీ? అయినా చల్లకివచ్చి ముంతదాచడం యెందుకూ? ఇలారా బంగారం వోమాటూ.

(బంగారమ్మ మాట్లాడదు. అలావెళ్లదు. సంగం వంచుకుంటుంది.)

కాంతమ్మ—అదేమిటో చెప్పు వొదినా, బంగారం వస్తుందిలే. అయినా పెద్దత్త పిలుస్తోంది, వెళ్లవే.

వెంకటశాస్త్రి—అమ్మాయిమొగమాటం మా పెద్దక్క యెరిగిందే-దగ్గిరికి వెళ్లదేమిటే? ఏమిటేఅక్కయ్యా?

కోటమ్మ—చెప్పడానికేంవుంది తమ్ముడూ? బంగారాన్ని మా వెంకడికి అడగడానికీ—యింకెందుకూ? ముహూర్తం స్థిరపరిపించడానికే వచ్చాను.

(కాంతమ్మ చకితురాలవుతుంది. బంగారమ్మ తల్లికేసి చురచురాచూసి వీధిలోకి వెళ్లిపోతుంది. వెంకన్న కనబడినంతసేపూ ఆమెనే చూస్తాడు.)

కాంతమ్మ—(స్వగతం) యిదా అమ్మా? మంచి మాటే. అమ్మాయి చెప్పుదెబ్బ కొట్టినట్టు మహాబాగా వెళ్లిపోయింది.

వెంకటశాస్త్రి—(స్వగతం) పెద్దయిత్తే!

వెంకన్న—(స్వగతం) పెళ్లిమాట చెప్పాటప్పటికి బంగారం చటుక్కున అవతలికి వెళ్లిపోయింది. ఎల్లమాలిన సిగ్గూ దానికి.

కోటమ్మ—ఏమంటావు తమ్ముడూ?

వెంకటశాస్త్రి—నువ్వడగనూ వచ్చు, నేనివ్వనూ వచ్చు. యిందులో యేమీ తప్పూలేదు, వింతాలేదూ. అయినా బంగారం చిన్నపిల్ల. అప్పుడే తొందరేమిటే?

కోటమ్మ—అదేమిట్రా అలాఅంటావూ? పన్నెండేళ్లు వెడతాయిరేపు కార్తీకం పున్నానికి. తల్లి పద్నాలుగేళ్లదాకా వున్నా, అమ్మమ్మ పదకొండేళ్లకే సమర్తాడిందిట. పిల్ల బొబ్బిల్లాగ బొద్దుగాకూడా వుంది. ఈయేడు పెళ్లిచెయ్యకపోతే కష్టంసుమా, యేమనుకున్నావోగాని నువ్వు.

వెంకటశాస్త్రి—రజస్వల అయితేమాత్రం కొంప మునిగిపోతుందా యేమిటి అమాంతంగాను?

కోటమ్మ—పట్టంలో ప్రవేశించాక యిలాంటి బుద్ధులు పుట్టాయేమిట్రా నీకూ? మనవంశం యెలాంటిది? మనతాత యెంతచదువుకున్నాడు? నాయనమ్మ యెంత ఆచారంగా వుండీది? అమ్మ చాదస్తం—

వెంకటశాస్త్రి—ఏమిటో? చూడూ పెద్దక్కా! అదంతా పూర్వకాలం. ఇప్పటివాళ్లకి ఆపద్ధతులు నచ్చవు.

కాంతమ్మ—దానికేంగానీ: ఈయేటికి మేం పెళ్లిచెయ్యలేము వొదినా! నీకు తెలవందేముందీ?

వెంకటశాస్త్రి—అదీ వొకకారణమే. మొన్న మొన్ననే మేడపని పూర్తయింది. కోమట్లపుణ్యమా అని నాలుగు వేలతో కొంప వేసుకొన్నాం. ఆమంచి యిల్లాలు రాధాబాయమ్మగారు మొన్ననే నుయ్యి కట్టించిపెట్టింది. యింకా యింటికి తగిన హంగు సంపాదించుకోడం తరవాయే. యిలాంటప్పుడు అమ్మాయికి పెళ్లిఅంటే మాట తక్కువుందా?

కోటమ్మ—పెళ్లిపేరుచెప్పి ప్రత్యేకంగా యెవరూ యివ్వకపోతే మాత్రంనువ్వు విడిచేతులతోవున్నావా యేమిటి? అయినా యేదోకార్యం అయిందనిపించుకుని వెళ్లిపోతాంమేము. నువ్వేమీ పెద్దపరుగులు పెట్టనక్కర్లేదు. లోకంలో అందరూ యిస్తున్నారు గనక నువ్వు

కవెండికి మురుసులూ, నెంశిమరచెంబూ, వెండికంచమూ, పట్టుతాపితాలూ ఇయ్యి. పైగా రొక్కం నూటప దహార్లు చాల్లే. యింటికి పెద్దాడబడుచునైనందు కిది వరకీ నువ్వు నాకు లోటుచెయ్యలేదూ. యికముందూ చెయ్యవూ. నామాటకేమిలే. నీకు తోచినంత యివ్వ వచ్చు. వొక్క ఆడపడుచుకనక మాఅమ్మాయికి వొక్క యాభై రూపాయలు ముట్టచెప్పు. నేనేమీ యెక్కువ అడుగలేదు. పప్పూ వణ్ణమూపెట్టు. తొంబతో రావ డం మీ కిష్టంలేకపోతే వరపంచకంగా వస్తాం మేము.

వెంకన్న—(స్వగతం) పట్టుతాపితాలు నే నెప్పుడేనా కట్టుకుంటూంటాను. రోజూ కట్టుకుంటే మాసిపోతాయి.

కాంతమ్మ—(స్వగతం) ఇవన్నీ—యింకా యివ్వ వలసిన సమ్మంధమే. పెళ్లికొడుకుని చూశాటప్పటికి మరొకళ్లయితే గుమ్మరిస్తారు. (నవ్వుకొంటుంది)

వెంకన్న—(స్వగతం) అత్త నవ్వుకుంటోంది. యిష్టమే.

వెంకటశాస్త్రి—(స్వగతం) వరుడంటే శ్రీ కృష్ణుడుతరవాత వీణ్ణేచెప్పాలి. వెయ్యిన్నూట పద హార్లుకూడా వీడికి తక్కువే.

కోటమ్మ—(స్వగతం) వొప్పుకుంటారు. నేను తక్కువ అడిగానేమో! అయిదువంద లడగవలసింది... మించిపోయిందేంవుందీ? పెళ్లిలో పట్టుపడితేసరి (ప్ర కాశం)వూరుకున్నావేం తమ్ముడూ? నీవుద్దేశం కూడా చెప్పవే మరదలా!

కాంతమ్మ—నాయిష్టం యేంవుంది వొదినా! మీ తమ్ముడూ మీరూ, ఆలోచించుకోండి.

వెంకటశాస్త్రి—నువ్వేమీ యెక్కువ కోరలేదు. కాని మాకంత తాహతు వుందా అని యోచిస్తున్నాను.

కోటమ్మ—నీతాహతు నీమేడే చెబుతోందిరా.

వెంకటశాస్త్రి—మీసాలపెరుగులాగ పైకి మేడ కనుపడుతోం దందరికీనీ. అయితే: యేంచదువుతు న్నావురా యిప్పుడూ?

వెంకన్న—శబ్దాలు నేర్చుకుంటాను, కోతలయి పోయాక. నేను కూడా రాజమండ్రీలోనే వుంటాను యికముందు, పురాణాలు చెబుతూనూ.

వెంకటశాస్త్రి—ఇదివరకేం చదివావూ?

వెంకన్న—రెండో కళాసు.

వెంకటశాస్త్రి—ఎన్నోయేడే నీకొడుక్కి?

కోటమ్మ—పద్ధెనిమిది వెళ్లాయి. దాచుకోడం యెందుకూ?

(వెంకటశాస్త్రి కాంతమ్మకేసి చూస్తాడు. ఆమె మందహాసం చేస్తుంది.)

కోటమ్మ—(స్వగతం) యెన్నివిధాల పోరినా నెవసాయంలో ప్రవేశపెట్టారు; గాని చదువుకో నిచ్చారా తండ్రీ? ఇంగిలీసులో ప్రవేశపెడితే యీపా టికి యెస్సే అయిపోవును.

వెంకన్న—(స్వగతం) శ్రద్ధపడితే శబ్దాలెంతా? శబ్దాలువస్తే కావ్యాలు పేలాప్పిండే.

కోటమ్మ—ఇప్పుడు చదువులెవరూ చూడ్డం లేదే మరదలా! నేల వుంటేగాని యీకాలంలో పెళ్లి కావడంలేదు మొగపిల్లలికి. ఎంతచదువుకున్నా నేల లేక పోతే వాడు గుటుక్కుమన్నాడంటే యిక పిల్లకి గతేదీ? మావూళ్లో కరణాలు యిలాగే చదువు మాసి యిచ్చాటప్పటికి పెళ్లయిన నాలుగునెల్లకి చచ్చిపూరు కున్నాడు పెళ్లికొడుకు. ఇప్పుడాపిల్లకి మనువర్తికేనా దారిలేదు.

వెంకటశాస్త్రి—సెబాస్!

కాంతమ్మ—(స్వగతం) చివరికి మంచిధోరణి లోనే పడుతోంది. యింకా మాట్లాడనిస్తే యింతకంటే పాడుమాటలు వస్తాయి. (ప్రకాశం) ఆలోచించి-చెబు తారులే వొదినా!

వెంకటశాస్త్రి—అలా చేద్దామే అక్కయ్యా!

కోటమ్మ—పిల్లతరవాత యిబ్బంది—

వెంకటశాస్త్రి—ఆలోచించి చెబుతామన్నాను గామూ? యింక అధికంగా ప్రసంగం యెందుకూ?

కోటమ్మ—అలాగే ఆలోచించుకోండి. నుం చున్నపాళంగా చెప్పడానికి—మీరుమాత్రం ఆలో చించుకోవద్దూ ? ఏమయినా నేను పెద్దాడబసుచుని గదా ? పుట్టినప్పణ్ణుంచీ బంగారం నా కోడలంటూనే వున్నాను నేను.

వెంకటశాస్త్రి—సరే.

కోటమ్మ—గోదావరివొడ్డున మావూరి కరణాల పిల్ల వుంది. చూసివస్తాను భోజనాలవేళకి. ఈ లోపుగా మీరు బాగా ఆలోచించుకోండి.

వెంకటశాస్త్రి—వెళ్లి రా.

కోటమ్మ—అంటూ సొంటూ లేని సమ్మంధం కదా ? మీస్థితీ, మా తాహతూ, మా యిదీ మీరు—

వెంకటశాస్త్రి—వెళ్లిరమ్మన్నాను కాదూ ?

వెంకన్న—యీవూళ్లో శబ్దాలు బాగా చెప్ప గలవాళ్లున్నారా మామయ్యా ?

వెంకటశాస్త్రి—నీకు చెప్పగలవాళ్లు యీ వూ ళ్లోనే గాదు, సాధారణంగా యెక్కడా కూడా—యిం తకీ, నువ్వు చదువుకోసం రాగలిగేటప్పటికి ఆవేళ కెక్కణ్ణుంచో యెవడో వొకడు వూడిపడకపోతాడూ ?

వెంకన్న—భక్తిశ్రద్ధలతో చెప్పేవాళ్లని కాస్త చూస్తూవుంకు.

కోటమ్మ—యిక తండ్రిపెత్తనం యెలాగా సాగనివ్వను. యింగ్లీషు లేకపోతే లేకపోయింది, మన వేదమ్మక్కలేనా చెప్పిస్తేగాని బాగాలేదు. మంచి గురువుని చూసిపెట్టు. యిక వాడిబాధ్యతఅంతా నీదే.

వెంకటశాస్త్రి—కూతుర్నివ్వడం వచ్చినప్పుడు అది వేరే చెప్పాలా ?

కోటమ్మ—రారా నాయనా !

వెంకన్న—మామా ! వెళ్లివస్తాను. అత్తా ! వెళ్లివస్తాను.

(కోటమ్మా, వెంకన్నా వెళ్లిపోతారు. వెంకట శాస్త్రీ, కాంతమ్మా వొక్కక్షణం వొకర్నివొకరు గం భీరంగా చూసుకొని ఫక్కున నవ్వుతారు.)

కాంతమ్మ—యిలాంటి సమ్మంధం యిక దొర కదు.

వెంకటశాస్త్రి — సందేహమేమీ ? అల్లుడు పొరుగింటికి వెడుతూ మన యిద్దరితోటీగూడా చెప్పాడు చూశావా ?

కాంతమ్మ—భయభక్తులెక్కువ—

వెంకటశాస్త్రి—వీడికి భక్తిశ్రద్ధలతో శబ్దాలు చెప్పే గురువు కావాలిట. పైగా యికముందు పురా ణాలు చెబుతూ యీవూళ్లోనే వుండిపోతాడుట, విన్నావా ?

కాంతమ్మ—మామగా రోవీధినీ, అల్లు డోవీధినీ పురాణాలుచెప్పి దోచెయ్యవచ్చు; దాటిపోనివ్వకండి.

వెంకటశాస్త్రి—బాగా కనిపెట్టావు.

కాంతమ్మ—కనక పిల్లనివ్వండి. లేకపోతే— పెద్దాడిబసుచూ, లోకం సహించదు.

వెంకటశాస్త్రి—నీకిష్టమేగదా ?

కాంతమ్మ—యెంత అందంగానో వుంది.

(అప్పుడు బంగారమ్మ వస్తుంది.)

బంగారమ్మ—ఏమే అమ్మా ! వాళ్లేరీ ?

కాంతమ్మ—సమ్మంధం నిశ్చయమైపోయింది. వాళ్లు వెళ్లిపోయారు.

బంగారమ్మ— ( బిక్కమొగంతో కిందకి చూ స్తుంది. )

వెంకటశాస్త్రి—ఏంతల్లీ ? ( కాంతమ్మకేసి తీక్ష్ణంగా చూసి ) యిలారా అమ్మా ! ( చేతులు చాపు తాడు.)

బంగారమ్మ—( నుంచునే వుండి మాట్లాడదు. కళ్లల్లో గిర్రున నీళ్లు తిరుగుతాయి. )

కాంతమ్మ—ఏం తల్లీ ! ఏంపమ్మా ! (అని లేచివెళ్లి, పాదివిపట్టుకొని) లేదమ్మా ! నిన్నతని కిస్తామా ? బెంగ పెట్టుకోకమ్మా.

వెంకటశాస్త్రి—అదేమిటమ్మా ! వెఱ్ఱిదానా ! నిన్ను ఆవాజమ్మకిస్తానా ? (కాంతమ్మతో) అమ్మాయిని నువ్వేడిపించావు.

కాంతమ్మ—వూరికే అన్నానండీ, చిట్టితల్లి యేమంటుందో అనీ. లేదమ్మా లేదు. వూరుకో మాతల్లీ ! వాళ్లని వచ్చినవారినే పొమ్మంటాములే. (బంగారమ్మ కళ్లు తుడుస్తుంది.)

(అప్పుడు పేరుభట్టు వస్తాడు.)

పేరుభట్టు—ఏంచేస్తున్నావు మామయ్యా ?

వెంకటశాస్త్రి—ఏమీ లేదు కూచోరా.

కాంతమ్మ— కూచోవోయి ! బావ వచ్చాడు చూడు తల్లీ !

బంగారమ్మ— (తల వంచుకొని కుమిలికుమిలి దుఃఖిస్తుంది.)

పేరుభట్టు—ఏంమామా ! ఏమిటత్తా అదీ ? అదేమిటి బంగారం ? (దగ్గిరికి వెడతాడు.)

(బంగారమ్మ పేరుభట్టుదగ్గిరికి వెడుతుంది. అత నామెని పాదివిపట్టుకొని ఆమె "అలా పద" అనగా మేడమెట్లెక్కి పైకి తీసుకు వెడతాడు.)

కాంతమ్మ—చూశారా ?

వెంకటశాస్త్రి—ఏమంటావు ?

కాంతమ్మ—ఏమిటంటారూ ?

వెంకటశాస్త్రి— కష్టమూ సుఖమూ, మంచీ చెడ్డా తెలిసే వయస్సూ. పైగా అమ్మాయి నిశితప్రతిభా శాలినిరాలు.

కాంతమ్మ—వెంకన్నని చూసి దిగ్గున లేచిపోయింది. పేరుభట్టుని చూసి దగ్గిరికి చేరింది.

వెంకటశాస్త్రి—కనిపెట్టావుగదా ? మనస్సులో వుంచుకో.

కాంతమ్మ—మీ పెద్దక్కా, వెంకన్నా యిక్కణ్ణుంచి వెళ్లిపోయేదాకా అమ్మాయి అన్నం ముట్టదు. వాళ్లున్నంతసేపూ అది యింటోనే వుండదూ. తొరగా పంపెయ్యండి, యేదోచెప్పి వాళ్లని.

వెంకటశాస్త్రి—రాత్రిబండిమీదే పంపేస్తాను (చిటికలువేస్తూ) తొరగా వంటకానియ్యి.

కాంతమ్మ—నిప్పురాజేశానంటే క్షణం. వేపుడు కూరలా, పిండివంటలా ?

వెంకటశాస్త్రి— (లేచి నుంచుని) పన్నెండేళ్ల పిల్ల. పాతికేళ్ల వాడికేనా మొగాడికి వుండదింత బుద్ధి. సెబాస్ ! యిలాంటి కూతురుండగా యిక కొడుకుల్లేరని విచారం యెందుకూ ? (వీధిలోకి వెళ్లిపోతాడు.)

కాంతమ్మ—చిట్టితల్లి యెంత నాజూకుమనిషీ ! తారతమ్యం పెద్దవాళ్లేనా కనిపెట్టలేరింతగాను. గాజురాయేదో, రత్నం యేదో విడమర్చేసింది క్షణంలోను. వాళ్లు వచ్చినప్పణ్ణుంచీ అది యెలాగో వుంది. యేం చెప్మా అనుకున్నాను గాని కనిపెట్టలేకపోయాను. నేను బతిమాలినా, తండ్రి వోదార్చినా పోనిదుఃఖం దానికి పేరుభట్టుని చూశాటప్పటి కేమయిపోయిందో గాని— పేరుభట్టూ అలాంటివాడే పాపం. బిడ్డ విచారంగా వుండడం చూశాటప్పటికి చివుకుక్కుమం దతని మనస్సు. ప్రాణం యిస్తున్నాడు బంగారం అంటేను. వారి కభిమానం వున్నట్టుంది. నేను కాదనను. చిట్టితల్లి వూహ యెలా వుంటే అలా నడుస్తాను.

(లోపలికి వెళ్లిపోతుంది.)

## మూడోరంగం

[పేరుభట్టుగది. భద్రయ్య అనే సహాధ్యాయి కూచునివుంటాడు.]

భద్రయ్య—యేమిటి గతి? భవిష్యత్తంతా అయోమయంగా వుంది. ఆరుమాసాల్లో యింటావిడ సిద్ధం. గిన్నెలు కాకపోతే కుండలతో వండుకుందామన్నా బియ్యపునూక లెలావస్తాయీ ? సాహిత్యంలో బుద్ధి

పాకిపోతోందన్న సంబరమేగాని ముందు సంసారం చెయ్యడం యెలాగా అని యింతవరకూ ఆలోచించ నైతిని. డబ్బుసంపాదించే లక్షణాలు యేమీ పట్టుపడ లేదు. అమాంతంగా సంసారం మీదపడిపోతే అప్పు డేమిటి చెయ్యడం ?

వా ! ప్రయోజకుడెవరూ అంటే పేరుభట్టుని చెప్పవయ్యా ! పాటలో అంతవాడు యీ పట్నంలో మరివొకడు లేడుకదా ? పేరుభట్టుగారి పాటంటే సభ నిండిపోతుంది కదా ? వూరికే పాడినా యేవో బహు మతీలు వొస్తూనేవుంటాయి. మహా మృదువైన గాత్రం. అతను తరుచు ప్లీడర్లతో సార్టుబళ్లమీద తిరుగుతూవుంటే నాకు సంతోషమే; కాని విద్యార్థిగాళ్లంతా అలా యేడుస్తారెందుకూ ? వాళ్లసొమ్మేం పోయిందీ, అతను పూర్వజన్మంలో చల్లాడు. యిప్పుడు పండుతోంది. నేను చల్లకుండానే పండాలని కోరుతున్నాను.

ఆరునెల్లు ఆక్టింగయితే అయింది, హితకారిణీ హైస్కూల్లో తెలుగుపండితుడుగా చేరదామంటే గురు వుగారు గూడా దానికి రహస్యంగా ప్రయత్నాలు చేస్తున్నారుట, యేమిటిదారి ? నిజానికి వారూరుకో వలిసింది. దగ్గిర పదిరాళ్లు వున్నాక బీదవాళ్లమీదకి పోటీయెందుకూ ? మొదట నన్ను ప్రోత్సాహంచేసింది వారేఆయె. అయినా, పడుచుపెళ్లాం పోరుతూవుంటే ఆయన యేంచెయ్యగలరూ ?

సాహిత్యంవిషయంలో తోటి విద్యార్థి గాళ్ల కందరికీ మొనగాణ్ణే. అయితో వొకటి తోచిందికాదు. పేరుభట్టు యీవూరు వచ్చినప్పణ్ణుంచీ—స్నేహం కలిసి నప్పణ్ణుంచేనా శ్రద్ధచేస్తే యీపాటికి పదిరాగాలు రాక పోవునా ? సాహిత్యానికి తోడు కాస్త రాగజ్ఞానం వుంటే హరికథలు చెప్పుకొని వకరుగా బతకవచ్చునే! తుదకిపురాణంచెప్పినా పదిరాళ్లూ దొరుకును, గౌరవం గానూవుండును. పేరుభట్టు మేనమామ పురాణం చెప్పే గామూ, దోచేస్తున్నాడూ ?

నిజంగా నేను ప్రపంచకాన్ని కనిపెట్టలేక పోయాను....... ఇప్పుడయితేమాత్రం యేం ? పేరు భట్టు నాకోరిక తిరస్కరించడు. నేను సంస్కృతా భ్యాసంలో సాయపడుతున్నాను గనక తప్పకుండా చెబుతాడు. నేను తనకేమీ అడ్డురానుకదా? రానియ్యి, మాట్లాడుదాం.

(అప్పుడు సూరన్న వస్తాడు)

సూరన్న—అయ్యా ! పేరుభట్టనే విద్యార్థి నెరుగుదురా మీరూ ?

భద్రయ్య—యెరక్కేమీ ?

సూరన్న—వాడిబస యెక్కడండి ?

భద్రయ్య—ఇదే.

సూరన్న—వున్నాడా ?

భద్రయ్య—వొకప్లీడరు గారి కూతురికి సంగీతం చెప్పడానికి వెళ్లాడు. వచ్చేవేళయింది. మీ దేవూరండి?

సూరన్న—వాడు మాతమ్ముడే.

భద్రయ్య—అలాగా ? దయచెయ్యండి.

(సూరన్న వచ్చి కూచుని వొకమాటు గదిఅంతా పారచూశాడు.)

సూరన్న—మావాడూ మీరూ సహాధ్యా యులా ?

భద్రయ్య—సహవాసులం. వొకరిదగ్గిర చదువు కుంటున్నాం కూడాను.

సూరన్న—ఈగదికి అద్దెయెంతండి ?

భద్రయ్య—అయిదు రూపాయలు.

సూరన్న—యిద్దరూ పెట్టుకుంటారా సమానం గాను ?

భద్రయ్య—నేనేమీ యివ్వలేనంటే మీ త మ్ముడు స్నేహరీత్యా "రావోయి" అన్నాడు,

సూరన్న—(స్వగతం) డబ్బంతా యిలా తగ లేస్తున్నాడన్నమాట వీడు. (ప్రకాశం) ఈరవివర్మపట మేలెవరివండి ? ఈట్రంకు పెట్టి, ఈపెద్దద్దమూ, ఈ

పరుపూ, ఈమడతమంచమూ, యీ బట్టలబీరువా, ఈ మడతకుర్చీలూ—

భద్రయ్య—నేను బీదవాణ్ణని ముందే మనవి చేసుకున్నాను. అన్నీ మీ తమ్ముడివే. ఆరైలుసంచీ మాత్రమే నాదీ.

సూరన్న—విద్యార్థిగాడి కింతవేమం యేమిటండీ?

భద్రయ్య— వూరికే వస్తే పుచ్చుకోవద్దన్నారా?

సూరన్న—సంపాదించడం మంచిదే; కాని వారాలు చేసుకునీవా డింతవేమంవేస్తే చూసినవాడు వారం యిస్తాడా? దొరికిందల్లా వీలయినప్పు డింటికి పంపేస్తే మళ్లీ యెవళ్లనేనా అడగడానికీ, సంపాదించడానికీ బాగుంటుంది. ఏమంటారు?

భద్రయ్య— మీరుచెప్పింది సర్వోత్తమంగా వుంది; గాని మీవాడు ఆమాత్రపు మనిషి కాడండి.

సూరన్న—నిజంచెప్పారు. అయితే మీరెందు క్కాకలేశారు కారూ?

భద్రయ్య—తోచిందికాదు. ఇక చెబుతాను.

సూరన్న—అయితే మావాడు యిలాగ వేషాలు వెయ్యడమేనా, యేమేనాడబ్బు—

భద్రయ్య—విద్యార్థిగాళ్లకి సంపాదనఅంటే యేమిటీ? ఇలాంటె పట్నంలో వారాలు దొరకడమే కష్టం. యింతకీ మీతమ్ముడు సంగీతపాటకుడు గనక—

సూరన్న—చూడండీ. విద్యార్థి గాళ్లలో మాత్రం సంపాదించేవాళ్లు లేరూ? నిజానికి విద్యార్థిగా వున్నప్పుడు సంపాదించలేనివాడు తరవాతా సంపాదించలేడు. నేను మాత్రం చదువుకునేటప్పుడు మాటిబిగించు క్కూచ్చోలేదు సుమండీ; కాని మావాడిలాగకాక దొరికిందల్లా యింటికి పంపేసి మళ్లీతయారయీవాణ్ణి.

భద్రయ్య—మీరు సంసార రాజులన్నమాట; కాని నోరుచేసుకొని మీవా డెవణ్ణీ అడగలేడండీ.

సూరన్న—మరి యివన్నీ యెలా వచ్చాయీ?

భద్రయ్య—(స్వగతం) జలగలాగపట్టుకున్నాడే? వీణ్ణి బోల్తాకొట్టించడం యెలాగా?

సూరన్న—ఏమిటో ఆలోచిస్తున్నారు. నిజం చెప్పండి.

భద్రయ్య— అదేమిటండోయి, అలా సెలవిస్తున్నారు. అబద్ధాలు చెబితే నాకేం వస్తుందీ?

సూరన్న—అదికాదు. మీరు పొరబడుతున్నారు—

భద్రయ్య—బాగుండండోయి మహానుభావా! నాది పొరపాటూ, మీది వాస్తవమూనా? అలా అన్నారేమిటండీ?

సూరన్న—నేనేమన్నానూ, యిప్పుడు తఫా వస్తుమాటా?

భద్రయ్య—ఘట్టిప్రశ్నే వేశారు; కాని నాకు తీరుబడిలే దిప్పుడు. యింకా పాఠంచూసుకోవాలి కూడానూ. నేనవతలికి వెడతాను. మీరు కూచునివుండండి. మీవాడు వస్తూవుంటా డీపాటికి.

సూరన్న—ఆ కష్టం మీకెందుకూ? ఈగదిలోనుంచి మిమ్మల్ని అవతలికి వెళ్లమనడానికి నాకేం అధికారంవుందీ? బజారుకివెళ్లాలి. మళ్లీ అరగంటలోపుగా వస్తాను. మావాడు వస్తే యీమాట చెప్పి, వుండమని చెప్పండి. (లేస్తాడు.)

భద్రయ్య—అవశ్యమూనూ.

సూరన్న—(వెడుతూ) తేలేపోయింది. పేరిగాడేమాత్రమో సంపాదిస్తున్నాడు. వీడికి తెలుసు నా సంగతి. కాని దాచాడు. వెట్టిమొఘం. అడిగినదానికి సూటిగా జవాబు చెప్పకపోవడమే అడిగింది వొప్పుకోడంకాదూ? పేరిగాడిదగ్గిరవున్నది—ఈసామానులో కూడా కొంత పట్టుకుపోవాలి. (వెళ్లిపోతాడు.)

భద్రయ్య—శనిలా వున్నాడే. కొంపలు కూల్చే రకం. వీడికి నేను లొంగుతానూ! హిహ్హి.

(పేరుభట్టు వస్తాడు.)

భద్రయ్య—వచ్చావా? కూచో. నీకోసం పోలీసు వచ్చాడోయి !

పేరుభట్టు—సర్కిల్ ఇనస్పెక్టరుగారు పంపించారు కాబోలు. నెల్లాళ్లనుంచి పోరుతున్నాడాయన తనయింటో పాడమనీ.

భద్రయ్య—అది గాదోయి పప్పూ. దొంగ పోలీసు.

పేరుభట్టు—అంటే ?

భద్రయ్య—నీసంపాదన యెలావుందో, నీదగ్గిర యేమాత్రం నిలవవుందో, సొమ్ము యేంచేస్తున్నావో, యీ పరుపూగిరుపూ యేలావచ్చాయో—

పేరుభట్టు—అర్థంలేనిమాటలు—

భద్రయ్య—నిజమే. మళ్లీవస్తాడులే కూచో. నిన్ను వుండమని చెప్పమన్నాడుకూడానూ.

పేరుభట్టు—ఏమిటోయి నీగడబిడా ?

భద్రయ్య—హహ్హహ్హా. కూచో ముందు. మీ అన్నయ్యట—

పేరుభట్టు—ఏ అన్నయ్యా? పేరు—

భద్రయ్య—అడుగలేదు. పల్లి పాడుగూ.

పేరుభట్టు—వాడా? మా చిన్నన్నయ్య. నిలువునా విషమూ. ఏమన్నాడేమిటి ?

భద్రయ్య—యీగదికి అద్దె యెంత ? నువ్వు చెరిసగమా యిచ్చుకుంటున్నావా లేదా ? యిలాగ గుక్క తిప్పుకోకుండా వూదరగొట్టేశాడు.

పేరుభట్టు—యిదంతా తనకెందుకూ?

భద్రయ్య—సంపాదించిందల్లా యింటికి పంపేస్తే గతిలేదు బాబోయని మళ్లీ ముష్టెత్తుకోవచ్చుట. తను అలాచేసేవాడుట.

పేరుభట్టు—వాడిమొఘం. వాడు చదువుకునేటప్పు డింటికి పంపడానికి సంపాదన అంటూ వుంటేనా? కట్టుకునేబట్టలుకూడా యింటిదగ్గిర్నుంచి పట్టుకుపోయేవాడు. యెప్పుడో వొకమాటు వొకపట్టురైక మాత్రం తెచ్చి మాఅమ్మకిచ్చా డెలావచ్చిందో గానీ.

భద్రయ్య—బాగుంది ; కాని మంచిప్రశ్నలు వేస్తాడోయి !

పేరుభట్టు—నీవంటి వెట్టిపెద్దమ్మ దొరికితే వెయ్యేం ? రానీ నన్నడిగితే నేనేం చెబుతానో విందువుగాని.

భద్రయ్య—పాఠం మానేస్తా నయితే.

పేరుభట్టు—అది నీయిష్టం. మా తగువులు వింటూ కూచోడం లాభమో, పోయి పాఠం చెప్పుకోడం లాభమో ఆలోచించుకో.

భద్రయ్య—మహా బాగా కొట్టావుదెబ్బ. అవునవును. వొకళ్ల గృహచ్ఛిద్రా లింకోడు వినడం తప్పే. అయితే: ఇవాళ నాటకంలోకి వెడతావు కాదూ నువ్వూ ?

పేరుభట్టు—తప్పకుండానూ.

భద్రయ్య—నన్నుకూడా తీసుకువెళ్లాలి సుమా.

పేరుభట్టు—అలాగే.

భద్రయ్య—టిక్కట్టు లేకుండాసుమా.

పేరుభట్టు—డబ్బు ఖర్చులేకుండా తీసుకు వెళ్లగలను ; గాని టిక్కట్టు లేకుండా నావల్లగాదు.

భద్రయ్య—వాయించేశావే ! (యెదటచూసి) అదిగో మీఅన్నగారు వస్తున్నారు. (గదిలోనుంచి వీధిలోకి వస్తాడు.)

(అప్పుడు సూరన్న వస్తాడు.)

సూరన్న—వాయించేశా వంటున్నా రేమిటండోయి ?

భద్రయ్య—మిమ్మల్ని కాదు. అదిగో మీ తమ్ముడు. వెళ్లండి. (వెళ్లిపోతాడు.)

(పేరుభట్టూ, సూరన్నా వొక్కక్షణం గంభీరంగా చూసుకొంటారు.)

సూరన్న—యెక్కడికి వెళ్లావురా?

పేరుభట్టు—వొకపిల్లకి పాఠంచెప్పడానికి.

సూరన్న—నెలకి యేమిస్తారూ ?

పేరుభట్టు—యెనిమిదీ.

సూరన్న—యిలా యిచ్చేవాళ్లెంతమంది వున్నారూ ?

పేరుభట్టు—యీవొక్కపిల్లే.

సూరన్న—ఇంతే ?

పేరుభట్టు—అంతే ?

సూరన్న—మొత్తానికి సంగీతం యెంతమందికి చెబుతున్నావూ ?

పేరుభట్టు—ఎందుకేమిటి ?

సూరన్న—నేనామాట అడిగితే తప్పా ?

పేరుభట్టు—నేనీమాట అడిగితే మాత్రం తప్పాయేమిటి ?

సూరన్న—బాగానేవుంది. యింతకీ : అదంతా నాకెందుక్కానీ. వొకకోకా, వొకఆడకట్టుజమారూ, రెండు పరికిణీలూ కావాలిట. రూపాయలేమేనా ఇవ్వాలి.

పేరుభట్టు—యెక్కడలేనూ ?

సూరన్న—యెక్కడేనా తేవాలి. లేకపోతే సంసారం యెలావెడుతుందీ ? ఆభారం అంతా నేనొక్కణ్ణీ మొయ్యగలనా ?

పేరుభట్టు—నువ్వు మోసేదేమిటోయి ?

సూరన్న—అంటే యేమన్నమాటా ?

పేరుభట్టు—? స్తేమవుతోంది ?

సూరన్న—సముద్రంలో కాకిరెట్ట. పెత్తనం చేస్తే తెలుస్తుంది. మాటలుచెప్పడంకాదు.

పేరుభట్టు—నువ్వు తప్పుకో పోనీ. మళ్లీకలిసి అంతా పెద్దన్నయ్య చక్కబెడతాడు.

సూరన్న—అయితే మూడోమేలు ఇంతకంటే వుందీ ?... అలాంటిమొగాళ్లే సంసారాలు దిద్దడం ?

పేరుభట్టు—మళ్లీ ఆనాలికమడతమాట యేమిటీ?

సూరన్న—వొక్కొక్క తవ్వాయి వచ్చినప్పుడు నేను పడీపాట్లు దేవుడికెరుక. దానికేంగానీ, అసలే యేమీ లేదంటే యెలాగా ? పోనీ, పదిరూపాయలు తే.

పేరుభట్టు—దమ్మిడీకూడా యివ్వలేను.

సూరన్న—యీసామానంతా యెలా వచ్చిందీ ? పట్టంచుల చాపు కట్టావు. సిల్కుచొక్కా తొడిగావు. నేలంకండువా పైనవేశావు. డబ్బంతా యిలా పాడుచేస్తూ—

పేరుభట్టు—మహా పోషిస్తూవున్న వాడిలాగే పరీక్షచేస్తున్నావే ?

సూరన్న—యివన్నీ యిలా యెదురుగా పెట్టుకూర్చోకపోతే యింటిక్కి పంపెయ్యరాదూ?

పేరుభట్టు—నాకోసమరి ?

సూరన్న—మళ్లీ సంపాదించు.

పేరుభట్టు—మంచి సలహాయే. నాకు తోచింది కాదు. యిదివరకే యెందుకు చెప్పావుకామూ మరీ ?

సూరన్న—చెప్పాలీ వొకరూ ?

పేరుభట్టు—అందరికీ నీకున్నంత ప్రతిభ వుంటుందా ?

సూరన్న—అయితే నువ్వు చిన్నమామతోటీ వాళ్లతోటీ మాట్లాడ్డం లేదుగదా ? వాళ్లయింటికి వెళ్లొద్దు నువ్వు. అమ్మ గట్టిగా చెప్పమంది యీమాట నీతోటి.

పేరుభట్టు—వాళ్లమాట యెందుకు వచ్చిందీ ?

సూరన్న—మ వీవువూళ్లో వున్నావుకనకా. ఆపయిని నీయిష్టం. అమ్మ చెప్పమన్నమాట చెప్పాను.

పేరుభట్టు—నీపని తీరిపోయిందిగదా ?

సూరన్న—రూపాయలమాటో మరీ ? అమ్మ పది మాట్లు చెప్పింది.

పేరుభట్టు—చదువుకొనేవాడిదగ్గిర డబ్బేం వుంటుందీ ? యెలా వస్తుందీ ? నువ్వెక్కడికేనా వెళ్లి సంపాదించరాదూ ?

సూరన్న—యిల్లు కదలడానికి వీలా నాకూ? పిల్లలు తుమ్ముతారు. దగ్గుతారు. చూసేవా ళ్లెవరూ?

పేరుభట్టు—పిల్లలు నీకొ క్కడికే వున్నారా? పెద్దన్నయ్య యెలా వెడుతున్నాడూ?

సూరన్న—వొదిన భయంలేని మనిషి. మీచిన్న వొదిన వొట్టిబేలమనిషి. నువ్వెరగవా యేమిటి?

పేరుభట్టు—జమాఖర్చురాస్తే తగిలీదంతా పెద్ద న్నయ్య పెట్టుకుంటా నన్నాడు గదా—

సూరన్న—దా పెయ్యడాని కదో యెత్తూ. లెక్కలు పెట్టకపోతే, నేను హరిస్తున్నాననుకున్నావా, లెక్క రాయడం నాకు చేతకాదనుకున్నావా. సంసా రంసుట్టు చెడిపోతుందని గాని.

పేరుభట్టు—జమాఖర్చులు రాస్తే గుట్టెలా చెడి పోతుందీ?

సూరన్న—లెక్కలు మొదలు పెట్టామంటే పెద్దాడు వాళ్లనీ, వాళ్లనీ తీసుకువచ్చి, మాటిమాటికీ చూపించమంటాడు.

పేరుభట్టు—కుటుంబమర్యాద వాడికి తెల వదూ?

సూరన్న—ఆసంగతంతా నీకే తెలుసు. పోనీ, బట్టలు అరువేనా యిప్పించు. వూళ్లో వర్తకులందరూ నీకు స్నేహితులుట.

పేరుభట్టు—దైవానుగ్రహంచేత స్నేహితులికీ లోటులేదూ, అరువూ పుడుతుంది; గాని ఆబాకీ నువ్వు తీరుస్తావా?

సూరన్న—ఈవూళ్లోవుండి నువ్వేంచేస్తావూ?

పేరుభట్టు—అయితే కోకయెవరికీ?

సూరన్న—మీచిన్నవొదినికి.

పేరుభట్టు—నీపెళ్లానికి నేనెందుకొనాలీ?

సూరన్న—సంసారంఅంతా నేను మొయ్యడం లేదూ?

పేరుభట్టు—యెవ రెవరిసంసారం మోస్తున్నా వోయి?

సూరన్న—అంతానూ.

పేరుభట్టు—పెద్దన్నయ్య నేరున్నాడాయె. నేనూ, తమ్ముడూ యెప్పుడూ యింటోనే వుండడం లేదాయె. యిక నువ్వూ, నీపెళ్లామూ, నీపిల్లలూ—

సూరన్న—ముసలిదీ, చెల్లెలూనో?

పేరుభట్టు—ఆస్తి వాళ్లకి వదిలేసి పెద్దన్నయ్య లాగే నువ్వు పైగాపో.

సూరన్న—పెద్దాడు తనకి పడీధాన్యం వుమ్మట్లో నుంచి తీసుకోడంలేదూ?

పేరుభట్టు—నేను మానిపిస్తాను.

సూరన్న—ముసలిదాన్నీ, పెళ్లిగాని చెల్లెల్నీ మీలాగే వదిలెయ్యనా? అదంతా నాకు తెలవదు. అమ్మ బట్టలు కావాలని నీతో చెప్పమంది. నేను చెప్పాను. నువ్వుచెప్పిన సమాధానాలు అమ్మకి చెబు తాను. నాకేం?

పేరుభట్టు—అమ్మ నాబుఱ్ఱ తీసేస్తే అప్పుడు చూద్దాంలే.

సూరన్న—అయితే: నేను వెడుతున్నాను. చిన్నమామగారియింటికి వెళ్లడంగాని, వాళ్లతో మాట్లా డ్డంగాని చేశావుసుమా. యిప్పుడు డబ్బులేకపోతే యిం టికి వచ్చాటప్పుడేనా కొనిపట్టుకురా బట్టలు. పరికిణీలు మానేసినా, ఆడకట్టుజామాగూ, మూడోనాలుగో పెడితే వస్తుంది, వొకచీరా పట్టుకురా. మరిచిపోకు సుమా.

పేరుభట్టు—చెల్లికి పరికిణీలక్కర్లేదా?

సూరన్న—డబ్బుంటే పట్టుకురా.

పేరుభట్టు—మరి అలా అన్నావేం? కోక మా నేసి పరికిణీగుడ్డలు తెస్తేనో?

సూరన్న—నీయిష్టం. యెలా చేసినా సరే. నువ్వు లేకపోతే కుటుంబఖర్చులకోసం రుణంచేస్తాను. నాకేం? (వెళ్లిపోతాడు.)

పేరుభట్టు—(స్వగతం) తేలిందా? యిలావుంది వీడిసంగతి. మాఅమ్మకి యేమీ తెలవడంలేదు. చిన్నబ్బా

యంటే సత్యహరిశ్చంద్రుడనుకుంటోంది ...... రుణాలు పెరిగితే పెరిగాయి. నేను నావాటూ వదులుకుంటాను. దిక్కుమాలిన తనువులు నాకు పనికిరావు. ఫిడేలే నాకు ఆస్తి.

(తెర దించవలెను)

నాలుగోరంగం

[పేరుభట్టు గది. గోడకానుకొని పేరుభట్టూ, పక్కని భద్రయ్యా కూచునివుంటారు. పేరుభట్టు యెదట ఫిడేలు గోడుగావుంటుంది.]

పేరుభట్టు—శ్రద్ధచేస్తే ఆరునూసాలు చాలు. పురాణానికి సంగీతం అట్టే అక్కర్లేదు. సంగీతం వస్తేనూ, సాహిత్యం వుంటేనూ పురాణం చెప్పడం సాధ్యం కాదు. ఆకళ వేరూ.

భద్రయ్య—సంగీతం లేకపోతే పద్యంలో వున్న గాంభీర్యమే పోతుంది. పద్యానికి రాగమే ప్రధానం.

పేరుభట్టు—రాగం అంటే బొమ్మలాటలోనూ వుంటుంది. భాగవతంలోనూ పాడతారు. నాటకాల్లోనూ, హరికథల్లోనూ కూడా పాడతారు. సంగీతకచేరీలలో సరేసరీ. యిందులో—

భద్రయ్య—పురాణరాగాలు వేరోయి!

పేరుభట్టు—అంటే యేమన్నమాటా? ఆధోరణి సహజంగా కలగాలి గాని; సంగీతం నేర్చుకుంటే రాదు. అయితే: మొన్న నువ్వు ప్రభలవారియింటో సత్యనారాయణవ్రతకల్పం చెప్పినప్పుడు విన్నాను. కొంచెం శ్రద్ధ చేస్తే పురాణం బాగానే చెప్పగలుగుతావు.

భద్రయ్య—యేలాగో నాలుగురాగాలు కాస్త శ్రావ్యంగాపాడడం నేర్పితివా, నాకు జీవనాధారం కలిగించినవాడ వౌతావు.

పేరుభట్టు—అది భగవంతుడే యేర్పరిచాడు. పురుషకారంవల్ల ఆ వరం స్వాధీన మవుతుంది. వున్న చిక్కల్లా యేమిటంటే? ప్రతీవాడూ తనకి నచ్చిన వృత్తిలో దిగబోతాడు. దాల్లో వాడికి బుద్ధి ప్రవేశించకపోవచ్చు. అలాంటప్పుడే మనవాళ్లు దైవాన్ని నిందిస్తారు. నీకు పురాణంచెప్పి డబ్బు సంపాదించాలని వుంది; గాని అందులో నీబుద్ధి ప్రసరించకపోతే—

(తెరలో)

పేరుభట్టుగారూ!

పేరుభట్టు—వుత్తరాలుంటే కిటికీలోనుంచి పడెయ్యవోయి!

(వొకకవరు కిటికీలోనుంచి పడుతుంది. పేరుభట్టు విప్పి చదువుకుంటాడు.)

భద్రయ్య—రహస్యమా యేమిటి?

పేరుభట్టు—నాకు రహస్యాలేమిటోయి! కాకినాడలో గానసభ అవుతోంది. గాయకురాలు మెడ్రాసునుంచి వచ్చింది. నాలుగుకచేరీలు గుత్త. మొన్న వొకటి జరిగింది. ఫిడేలుగాడు జ్వరపడ్డాడు. నన్నురమ్మనీ. వెడితే వెళ్లడమే. లేకపోతే తంతికొట్టాలి. కచేరీ వొక్కటికి యెనభైరూపాయ లిస్తారుట.

భద్రయ్య—వెడతావా యేమిటి?

పేరుభట్టు—రెండువందల నలభైరూపాయలు చేదా, విషమా?

భద్రయ్య—భోగందానిపక్కని హంగు—

పేరుభట్టు—అదేం మాటోయి?

భద్రయ్య—ఏమీ?

పేరుభట్టు—ఇది విద్య చూపించడమోయ్!

భద్రయ్య—భోగంది భాగోతం కడుతూవుంటే పక్కని తిత్తివూదడమూ, తాళం వెయ్యడమూ—

పేరుభట్టు—ఎంత చక్కని పోలిక తెచ్చావూ?

భద్రయ్య—అంతకంటే యిది యేవిధంగా మంచిదీ?

పేరుభట్టు—బ్రాహ్మడు తాలూకాకచేరీలో డవాలీపని చెయ్యవచ్చునా?

భద్రయ్య—ఛా!

పేరుభట్టు—తహసీలుదారీ?

భద్రయ్య—వో!

పేరుభట్టు—సత్రంలో గుమాస్తాగిరీ ?

భద్రయ్య—త-ప్పు-లే-దు.

పేరుభట్టు — అయితే యేసూత్రంప్రకారం డవాలీపని తప్పన్నావూ ?

భద్రయ్య—అది నౌకరీ.

పేరుభట్టు—తహస్సీలుదారీ, గుమాస్తాగిరీనీ ?

భద్రయ్య—అవి వుద్యోగాలు.

పేరుభట్టు—అదేసూత్రం యిక్కడానూ.

భద్రయ్య—నాకు తృప్తికాలేదు.

పేరుభట్టు—ఫిడేలు వాయించడం బాగా నేర్చుకో ముందు.

భద్రయ్య—నన్నింత చచ్చు పెద్దమ్మకింద కట్టేశావూ ?

పేరుభట్టు—ప్లీడరుకి లా చదువుకు నేటప్పుడుండే న్యాయపక్షపాతంవ్యవహారంప్రారంభించాకవుండదుట.

భద్రయ్య—నే నొప్పుకోను. పువ్వుపుట్టగానే పరిమళం అన్నాడు.

పేరుభట్టు—నువ్వు ధర్మనిర్ణయం మహా చక చక చేసేస్తున్నావు గానీ, మొన్నటి పుష్కరాల్లో నువ్వు నీ పెళ్లానికి పంపించిన రెండు కాసులూ నీకెలావచ్చాయీ?

భద్రయ్య—అవునూ. నేను స్నానంచేసి స్వామి దర్శనం చేసుకుని వస్తూవుంటే అప్పుడే స్నానంచేసి వస్తూవున్న మావూరి పరంజ్యోతీ, దానికూతురు అమ్మణ్ణీ యిచ్చారు నాకు మంచిబ్రాహ్మణ్ణనీ.

పేరుభట్టు—వేశ్యలు స్నానంచేసి, గోదావరి వొడ్డున డబ్బివ్వడమూ, నేను మంచిబ్రాహ్మణ్ణని పిఱ్ఱ మీగే పెద్దమనిషి పుచ్చుకోడమూ—

భద్రయ్య—వొకదాల్లోనుంచి వొకదాల్లోకి లాగుచున్నావు.

పేరుభట్టు—పోనీ, ఆ పరంజ్యోతి నువ్వు మంచి పండితుడవని తాంబూలం యిస్తుంది. పుచ్చుకుంటావా?

భద్రయ్య—యెలాంటి తాంబూలమూ ?

పేరుభట్టు—యెలాంటి హంగూ ?

భద్రయ్య—అన్నిటికీ యుక్తే ప్రధానమా ?

పేరుభట్టు—తాను చేస్తే ప్రధానం. ఇతర్లు చేస్తే అప్రధానం. తీసెయ్యవోయ్ !

(వీరావధాని వస్తాడు.)

వీరావధాని—తీసేస్తూనేవున్నారు లెక్కలేకుండాను. ఇవాళ యిన్నిస్ పేటలో ఆరుగురు. ఆర్యాపురంలో పదకొండుగురు. వీరభద్రపురంలో యెనమండుగురూ. లక్ష్మీవారప్పేటలో ముప్ఫయిముగ్గురు. మంగళవారప్పేటలో పద్దెనమండుగురు. వూళ్లో ముప్ఫయిమంది. చింతకాయలు దుల్లినట్లే.

పేరుభట్టు—యేమిటోయి యీవుద్ధృతం ?

భద్రయ్య—అయితే యిక క్షణం వుండను నే నీవూళ్లో.

వీరావధాని—(చంకలోని మూట చూపించి) చూశావా ? గఫ్‌చిఫ్ ! (వెళ్లిపోతాడు.)

భద్రయ్య— రాత్రిబండిమీద వెళ్లిపోనడమే. ఏమంటావు ?

పేరుభట్టు—ఇంత ధైర్యంవుంది మీకు. సరే. నేను కాకినాడవెళ్లివచ్చి యిక్కడే వుంటాను. వారాలు మానేసి యీ కలరా తగ్గేదాకా—

భద్రయ్య—నీయిష్టం. బతికివుంటే బలుసాకు తిని బతకవచ్చు. ఈరాత్రి యిక్కడవుంటే భయమే రోగకారణం అవుతుంది. తప్పుకో. రైలుసంచీ సద్దుకోనియ్యి. గురువుగారితో చెప్పేం ?

పేరుభట్టు—వారుగూడా వెడితే చెప్పలేను. ఆలస్యం చేస్తే బండి దొరకదు.

భద్రయ్య— జెండా యెత్తేశాం.(వెళ్లిపోతాడు.)

పేరుభట్టు—(స్వగతం) ఈరాత్రి మామగారి యింటో భోంచేద్దాం. కాకినాడలో వారందినాలు పడుతుంది గనక యీసామానుగూడా అక్కడ పెట్టేస్తే మంచిది. తరవాత చూసుకోవచ్చు. మళ్లీ వచ్చాటప్పటికి స్నేహితులందరూ క్షేమంగావుంటారా ? ...అంతా దైవాధీనం......"నగుమోమూ గనలేనీ—"

(తెర దించవలెను.) (సశేషము)

---

# మేఘుఁడు

జి. జాషువ

ఏనుఁగుపిల్లమాదిరి మహీధరశృంగమునందు దోఁచి నె
మ్మే నిసుమంతలోఁ బెనిఁచి, మింటిని కౌఁగిటఁబట్టి, బృంహిత
ధ్వానము లాచరించు నవవర్షపయోధర, భేకసంఘముల్
గానముసేయుచున్నవి, జగంబున నించుము కుంభవర్షముల్.

జలదా, యింద్రధనుస్సు వట్టుకొని నీసాన్నిధ్యమందున్న యా
విలుకాఁ డెవ్వఁడు? లక్ష్యమేమిటి? భవద్విద్యుల్లతాహాసలీ
లల యొయ్యారము లేమి? కర్షకుల కుల్లాసంబు గల్పించి, నె
మ్ముల నాడించెడు నీవిచిత్రచరితంబుఁ మాకు బోధింపుమా!

మద్దెలకాఁడు నీహృదయమధ్యమున న్నివసింపకున్న యా
గద్దరిగర్జనధ్వనులు గల్గుట కేమికతంబు? చెల్వముఁ
ముద్దులు మూటగట్టు నగుమోము తళుక్కునఁ జూపి డాఁగు న
మ్ముద్దియ లెల్ల నీయనుఁగుపుత్రిక లేకదరా, వలాహకా!

అంభోధిజలమునం దవగాహనముసేయు భానుమంతునిచేతఁ బ్రభవమంది
ధరనున్న ప్రతిపదార్థమును జ్ఞప్తికిఁదెచ్చు లెక్కింపరాని పోలికలఁ బొల్చి
నెమిలికన్నుల రమణీయవర్ణములచే పచ్చని శక్రచాపములు వ్రాసి
శుక్తికన్యకల విశుద్ధగర్భములలో ముత్యాల సంతానమును ఘటించి
చేతనాచేతనంబుల చిత్తమలర - నమృతదానంబుసేయు మోహనుఁడ వగుచు
భీకరములైన పిడుగులు విడిచెదేల? - యీస్వభావంబు మానుమోయీ పయోద!

వితరణవిలాసివై యభ్రవీథి నేలు - ఘనుఁడవగు నీకు హంసతో కలహ మేల?
తగదు తగ దంబుదా, సమాధానపడుము - వానకోయిలచే రాయబార మంపి.

---

# మా సంసారాలు

టేకుమళ్ల కామేశ్వరరావు

"ప్రియమైన తమ్ముడికి,

ఈమధ్య నేను చేసిన ఒకపరిశోధనసంగతులు నీకు తెలియజెయ్యాలని బుద్ధిపుట్టి, దీనివల్ల నీకు కలిగే లాభ మేదేనా వుంటే కలుగుతుందని, యీ వుత్తరం, అనేకపనుల్లో తెరిపిచేసుకుని రాస్తున్నాను.

"నేను యెన్నోమార్లు అనుకున్నాను, ఆడదాని సంసారం చాలాకష్టమనీ, మొగవాడి పనిలాగు సులువైనది కాదనీ, మొగవాడిపని యేముంది—యిన్ని భోం చెయ్యడం, వెళ్లడం, ఆఫీసులో కూచోడం, యింటికి రావడం ; ఆడదో మరి, పొద్దున్న అయిదుమొదలు రాత్రి పదకొండింటివరకూ తెరిపిలేకుండా కాలు వంచడానికేనా వీలులేకుండా, నడుమువాల్చడానికేనా అవకాశం లేకుండా పనిచేస్తూవుండవలసిందే అని. అంచేత యెప్పుడూ మాఆవిడే నాకంటే యెక్కువ కష్టపడుతూందనీ, పాపం! దానిఋణం నేను యెప్పటికీ తీర్చుకోలేననీ అనుకునేవాణ్ణి. కాని యెప్పుడెప్పుడేనా కొంచెం పరిశీలించి చూసేవాణ్ణి. చూస్తే యెంతసేపూ కడిగిందే కడగడం, తుడిచిందే తుడవడం, చేసిందే చెయ్యడం అని అనిపించేది. అయినా నాపరిశీలనే తప్పని నాలో నేను బుద్ధిచెప్పుకుని వూరుకునేవాణ్ణి. ఈపరిశీలనయినా యెందుకొచ్చేదంటే, ఎప్పుడేనా 'ఈ పుస్తకం చదువు, ఇది యెంతో బాగుంటుంది, ఇది చదువు' అనేవాణ్ణి. కాని ఆపుస్తకం మొదటిపుటేనాయెప్పుడూ తిప్పివుండడం నేను చూసివుండలేదు. అంతటితో ఆపుస్తకంమీద నాకూ, దానికీ కూడా విరక్తి పుట్టిపోయేది. 'పోనీ, నువ్వు పుస్తకాలు చదవక్కర్లేదులే. ఇంటికి తెప్పిస్తూన్న ఆంధ్రపత్రిక చదువు, చాలు. నాకు అంతకంటే నువ్వు మరేమీ వుపకారం చెయ్యక్కర్లేదు. అసలు నువ్వుకూడా చదవడానికనే నేను తెలుగుపత్రిక తెప్పిస్తున్నాను' అని అనేకసార్లు చెప్పేను. కాని ఆ పత్రికేనా అది చదవగా నేను యెన్నడూ చూసివుండలేదు. 'పాపం! పని తెరిపిలేదు. అంచేత చదవలేదు' అని అనుకునేవాణ్ణి. అంతేకాని మరొకమోస్తరుగా బద్ధకమనిగాని, పనులు తెముల్చుకోలేదని కాని యెన్నడూ అనుకోలేదు. ఎప్పుడెప్పుడేనా మీవదిన కుచ్చెల కథ తీసేది. అదేనా నాలుగు బంతులు చదివేది. అంతటితో సరదా, ఉత్సాహం తగ్గిపోయేవి. ఏకొడుకు వెధవో చదవనియ్యకుండా వున్నాడు, ఈవెధవలతో చదువేమిటి నామొహ మని వాళ్లని నాలుగుతిట్టి చరుపులు చరిచి ఆపుస్తకం ఒకమూలకి గిరవాటేసేది. ఈ మోస్తరుగా నడిచింది కాలం.

"ఆమధ్య మా మామగారు 'కూతురినీ, పిల్లలినీ ఒకమారు మావూరు పంపించు, నాలుగురోజులుండి వస్తారు' అని వుత్తరం రాసేడు. 'నేను అనేకపనుల్లో వుంటున్నాను. నా కిప్పుడు వీలులేదు' అని చెప్పి వుత్తరం రాసెయ్యా లనుకున్నాను. కాని 'ఇంతకంటే మనకు మరొకప్పుడుమట్టుగు తెరిపి తగలదుతుందా' అని అనిపించీ, ఇంతకీ మరొక కారణముంది కూడా, మరేం లేదు, నే నొక్కడినీ సంసారం చేసి చూస్తే యెలాగుంటుందో, మాఆవిడ పడ్డ కష్టాలన్నీ నేనూ పడి తెలుసుకుందామనీ యోచనకలిగి, ముఖ్యంగా యీ పరిశోధనకోసమే దాన్ని పుట్టింటికి పంపేసేను. వెళ్లేటప్పుడు అది పిల్లలనందరినీ తనతో తీసికెళతానంది. కాని నేనే వాళ్లని విడిచిపెట్టలేక పెద్దవాణ్ణి మాత్రం నాదగ్గిర వుంచుకొని చిన్నవాళ్ల నిద్దరినీ తనతో తీసికెళ్లమన్నాను. పెద్దవాణ్ణి నాదగ్గిరే వుంచుకొన్నాను. వెళ్లేముందరే మీవదిన నన్ను 'ఒకేల్లో జేరిపొండి. లేకపోతే మీరు నెగ్గలేరు. పోనీఅంటే ఆవు, దూడ వున్నాయి. వాటికి చాకిరీ చెయ్యాలి. ఈపాట్లు పడలేరు. వంట గింట పెట్టుగోకండి. ఆవెనవకుక్కరు మళ్లా పైకి తీస్తారేమో' అంటూ హితంచెప్పింది. నేను అన్నిటికీ 'ఊ' కొట్టేను. అదీ వెళ్లిపోయేక కుక్కరు పైకితీసి వండుకోడం ప్రారంభించేను. కుక్కరుసంగతి నీకు తెలియనేతెలుసు, అదెంతసులువో. అమృతంలా వుంటుంది పచనం. అయిదునిమిషాలపని, అంతే.

"నా కొత్తసంసారంలో నాకరివాడు తనపని తను చేసుకుపోయేవాడు, దాసీది దానిపని అది చేసుకు పోయేది. ఆచారవ్యవహారాల్లో మీవదినెపనికీ, నా పనికీ యెంతేనా భేద మంది. తను అంటూ సంటూ అని పేరు చెప్పి, గిన్నెతగిలినా తగలకపోయినా సరే, చేతులు కడుక్కునేది. మరి నేనో, అంట్ల గిన్నెలు ముట్టుకున్నా సరే చేతి కేదేనా అంటుకుంటేనే చెయ్యి కడుక్కునేవాణ్ణి, కాని లేకపోతే మానేసేవాణ్ణి. ఈ మోస్తరుగా నీళ్లఖర్చు తగ్గిపోయింది. ఇల్లు యెప్పుడూ తేమగా వుండక, పొడిగా శుభ్రంగా వుండేది. నీటిలో మునిగి తేలుతూ వుండకపోడంవల్ల నా కాళ్లూ చేతులూ వొరిసిపోలేదు.

"మీ వదినకి యిరవైయారు రకాల మడి. తలకు నీళ్లుపోసుకుంటే ముట్టుగోవచ్చు కొన్ని. కంఠస్నానం చేస్తే ముట్టుగోవచ్చు మరికొన్ని. మడిబట్ట కట్టుకుంటే కొన్ని. బట్ట లేకుంటే—దానికి పెద్ద మడి అనిపేరు—ముట్టుగోవచ్చు మరికొన్ని. నాతో యిన్ని రకాల మడి లేదు. చెయ్యి శుభ్రంగా వుంటేసరి, అన్ని వస్తువులూ ముట్టుగోవచ్చు. అంతా వొక్క మడే. ఇన్నిరకాల మడి వున్నా మీవదినెకి కొన్నికొన్ని రోజుల్లో కొన్నికొన్ని పనికి రావట! ఆదివారంనాడు వుసిరీపచ్చడి ముట్టుగోదు! అమావాస్యనాడు పెద్ద బచ్చలికూర వండదు! నాతో యిలాంటి చిక్కు లేమీ లేవు. పైఆచారాల్లో వేటినీ నేను పాటించలేదు, జ్ఞానవంతులిని నమ్మించగలిగిన అంశం వాటిలో వొకటే లేదు కాబట్టి.

"మీ వదినె యెప్పుడూ దాసీదాన్ని రాచ్చిప్పలూ, రుబ్బురోలూ, పాలకుండా కడగనిచ్చేదికాదు. ఆచారానికి పనికిరాదుట! కాని తక్కినవాటికీ వీటికీ భేదం నాకేమీ కనబడనందువల్ల వాటినికూడా దాసీదానిచేతే కడిగించేవాణ్ణి, తరవాతి సంగతేమైతే అదవుతుందని. ఎవళ్లమట్టుకు వాళ్లు. వాళ్ల పనులన్నీ చేసుగుపోతూ వుండేవాళ్లు, కొంచకి కూరలదానితోనైనా నే నెప్పుడూ రెండుమాటలకంటే యెక్కువ ఆడి యెరగను. ఆఖరికి నా కనిపించింది, ఆసంసాగమంటే యెంత సుఖమో అనీ, యెంత సులువో అనీ, మొగవాడు పడేపాటులో యిది యెన్నోవంతో అనీ. ఎటొచ్చీ సాయింత్రం షికారుమట్టుకు నష్టపోయేవాణ్ణి. ఎంచేతంటే, పనిచేసే మనిషి అంట్లకోసం ఆవేళకే వస్తుంది. అటుతర్వాతే దూడలు వస్తాయి. పాలుతీసేవాడు వస్తాడు. అంచేత సాయింత్రం షికారువెళ్లడానికి వీలులేకపోయేది. పొద్దున్న వెళ్లడానికి వీలుండేదికాదు. అదొక్కటే యిబ్బందని అనిపించింది.

"చెబితే నువ్వు నమ్మతావో నమ్మవో—మీవదినె యింట్లో లేకపోయింది, ఎన్ని పనులు చేసుగోవలసి వచ్చిందో అని నాకు ఒక్కనాడేనా అనిపించలేదు. ఆవూళ్లో అదీ పిల్లలూ క్షేమంగా వున్నారో లేదో అన్న మాటేగాని మరేమీ నాకనిపించలేదు. ఇలాగుంటూ వుండగా—రెణ్ణెల్లయింది అది వెళ్లి—మామగారి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది—'మీవూరికి పిల్లను పంపిస్తున్నాను. రైలు మీవూరికి రాత్రి పదింటికి వస్తుంది. పిల్లలతోటి వస్తూందికాబట్టి నువ్వు రైలు స్టేషనికి వచ్చి జాగ్రత్తగా వాళ్లని యింటికి తీసుకువెళ్లవలసింది' అని. 'సరే' అని అనుకున్నాను. అది వచ్చేరోజున నేను ట్రెయినికి వెళ్లేను, పిల్లాడితోకూడా ట్రెయినుమీద వచ్చింది. అందరం యింటికి ఎద్దుబండిమీద వచ్చేసేం. పిల్లలూ తనూ వాళ్ళవూళ్లోనే సాయింత్రం భోంచేసి రైలెక్కుతారని యెరిగివుండడంవల్ల నేను వాళ్లకి వంటప్రయత్నం చెయ్యలేదు. ఏదో కబుర్లన్నీ చెప్పుకున్నాం. ఇంతట్లోకి తను లాంతరుపట్టుకొచ్చి 'మీచెయ్యి ఇలా చూపించండి' అంది. 'ఏమీ యెందు' కన్నాను. 'చూపిద్దురూ, యెందుకో' అంది. పెళ్లానికి గాక మరి వూళ్లోవాళ్ళకా చనువని చెయ్యి చూపించేను. చూసింది. 'ఆచెయ్యి యియ్యండి' అంది. ఇచ్చేను. 'ఏదీ కాళ్లు చూపించండి' అంది. 'ఎందుకూ' అంటూ కాళ్లుకూడ చూపించేను. చూసి ఆశ్చర్యంతో 'మీకాళ్లూ, చేతులూ యీపాటికి వొరిసిపోయి నాకాళ్లూ చేతులులాగే వుంటా యనుకున్నాను' అంది. ఇంటిదగ్గిర వంటచేసుగుంటున్నానని నేను వెనకే వొకవుత్తరంలో రాసేనులే. 'అయితే యెలాగున్నా'యన్నాను. 'రాళ్ల లాగున్నా'యంది. 'అదే

మొగాడిసంసారానికీ, ఆడదాని సంసారానికీ భేద' మన్నాను. 'మీ అనాచారపు పనులుచూస్తే నీళ్లకి కూడా భయమే, లేకుంటే కాళ్లూ, చేతులూ వొరిసి పుచ్చిపోయి వుండవూ యీపాటికి' అంది మీ వదినె కాళ్లూ, చేతులూ యెప్పుడూ వొరిసి పుచ్చి పురుగు లోడుతూ వుంటాయి. ఆసుపత్రినుంచి నేననేకసార్లు మందు తెచ్చియిచ్చేను. నేను చెయ్యగలపని అంతే. తనెప్పుడూ తనకు తోచి మందుపెట్టుకున్న పాపాన్ని పోలేదు. నేను పోరగా పోరగా యెప్పుడేనా మందు పెట్టుకునేది.

"తెల్లారింది. ప్రయాణపు బడలికచేత ఆరింటికి లేచింది. నౌకరీవాడు వచ్చేడు. వచ్చినవెంటనే నాలుగు తిట్లు తిన్నాడు. 'ఇంతఆలస్యంగా వచ్చేవేం వెధవా?' అన్నది మొదటివాక్యంగా. ఆతిట్లు చెవుల్లో పడి నేనూ లేచి మళ్లా రెండుసెల్లకి విన్నానుకదా యీ కంఠస్వర మని మనస్సులోపల సంతోషించేను. వాడు 'అమ్మగారూ, అగ్గిపెట్టి యిత్తారా అండి, కుంపటి యెలిగిత్తా కాఫీకి' అన్నాడు. 'అగ్గిపెట్టె అడుగుతావుట్రా వెధవా? నువ్వు ముట్టుగుంటే అగ్గిపెట్టి యెందుకేనా పనికొస్తుందిట్రా, పెంటమీద పారేసుగోవాలికాని? నీఅనాచారం పనులు నాదగ్గిర పనికిరావు, నీ అయ్యగారిదగ్గిరగాని' అని మొదలెట్టింది. వాడు వూరుకున్నాడు. ఒక తాటికమ్మ పట్టుకొచ్చేడు. అది వెలిగించియిచ్చింది ఆవిడ.....పళ్లుతోముకుంటూవుంటే కాపది వచ్చింది. వచ్చి 'అమ్మగారొచ్చేరా అండి. చాలాకాల మయిందండి యెల్లి' అంది. ఆమాటలకి జవాబుక మోసు! 'ఇంత ఆలస్యంగా వచ్చేవేం? ఇంకా అయ్యగారే పనిచేస్తున్నా రనుకున్నావేమిటి? ఎవళ్లేనా బ్రాహ్మలన్నవాళ్లయింట్లో, యిప్పుడా పాచిపనిచేస్తారు, అడిగేవాళ్లు లేకగాని?' అని మొదలెట్టి కోపపడింది. అది వూరుకుంది. కాలకృత్యాలయేక అంట్లు-అంటే కుక్కరుగిన్నెలు-దాసీదానికి పడేసింది. నేను వంటింటిపక్కని వసారాలో కూచున్నాను, చంటిపిల్లాణ్ణి దగ్గిరపెట్టుగుని. మీవదినె వంటగదిలో కాలుపెట్టి వొక్కగంతుయీవలికి వేసింది. వేసి, 'నరకం, నరకం, మహానరక మంటే నమ్మండి. మహాప్రభో, యిలాంటి కొంపలో నాబోటి దొక్కటుణమేనా వుండగలదా? నేను వెళ్లేటప్పు డెలాగుంది? ఇప్పు డెలాగుంది? ఏమేనా అంటే నానోరు బయటపడడమేగాని......' అని వొకచిన్న ఉపన్యాస మిచ్చి 'వారంరోజుల వరకూ యిల్లు సవరించుగోడమే అయిపోతుం'దని సూచించి సంస్కరణ మొదలుపెట్టింది. ఇంట్లోవున్న వుప్పులూ, పప్పులూ-నే ననాచారంగా ముట్టుకున్నానుగా మరి; అంచేత పనికిరావు—దాసీదానికిచ్చేసింది. నూనినేతిగిన్నె లివతలపారేసింది. పోపుసామగ్రి వాకిట్లోకే వచ్చింది. బుట్టలూ, తట్టలూ గోడవతల విసిరేసింది. ఇంట్లోవున్న బిందెదగ్గిరనుంచి సుల్లీవరకూ యివతల పడేసింది. ఇవన్నీ దాసీది తోమడానికే! నేను మాటాడకుండా అవతలికి వెళ్లిపోయేను; చెప్పి లాభమేమీ నాకు కనబడలేదు, అంచేత. ఇల్లంతా గోడల దగ్గిరనుంచి, పీటలదగ్గిరనుంచి కడిగేసింది. అంతపనీ అయేటప్పటికి తొమ్మిదింపావు అయింది. అప్పుడు బిందెపట్టుకుని గోదావరికి స్నానానికి బయలుదేరింది. ఒక అరగంటలో వచ్చింది. పొయ్యిలో నిప్పువేసింది. ఆఫీసుకి వెళ్లడానికి నేను కోటూగట్రా వేసుగున్నాను. 'ఓయ్! మధ్యాన్నం సెలవుపుచ్చుగువస్తా భోజనాని' కన్నాను. 'రండి అప్పటికి తెములుతుందిలెండి' అంది. నేను ఆఫీసుకి బయలుదేరేను. మా పెద్దబ్బాయికి దారిలో హోటేలులో భోజనంపెట్టించి స్కూలుకు దిగబెట్టేను.

మధ్యాన్నం వచ్చి భోంచేసేను. సాయంత్ర మయింది. షికారు అలవాటు తప్పిపోడంచేత యింట్లోనే కూచున్నాను. దాసీది వచ్చింది. అంట్లగిన్నెలు అవతల పారేసింది మీవదిన. అంట్లు తోమింది దాసీది. దాసీది ఇల్లూడ్చింది, ఆవులసాలలో పనిఅంతా చేసింది. ఇంక వెళిపోతా నంది. అది వెళిపోతానంటే యేదోపని పురమాయించింది, మీవదిన. అబ్బాయీ! నే నెప్పుడూ కూడా చూడలేదు, దాసీదికాని, నౌకరుకాని యింటికి పోతానంటే సంతోషంతో మీవదిన యింటికి వెళ్లమనడం. ఏదోపని పురమాయించి వాళ్లు

యేడుస్తూవుంటే పంపడం. నెల అయినవెంటనే వాళ్లకి యెన్నడూ సరిగ్గా జీతంరాళ్లు యిచ్చి యెరగదు. నాలుగు రోజులు ఆలస్యంచేసో, లేక ఏదోకొంత యిచ్చేసి కొంత అట్టే పెట్టుకునో, యేదో యిలాగే చేస్తూవుంటుంది. నెలాఖరున వెంటనే జీతమిచ్చేస్తే వాళ్ల బద్ధకం బలిసిపోతుందిట. ఆ జ్ఞానం మరెవరికీ లేదు. గవర్నమెంటువారు యీ తెలివిలేకే మాకు నెలఅయిన వెంటనే జీత మిచ్చేస్తున్నారు............దాసీది వెళిపోయింది. ఆతర్వాత అన్నంగిన్నె తీస్తూవుంటే దీపందగ్గిర రవ్వంతమసి కనపడిన ట్టనిపించి అంచుకింద నిదానంగా చూసింది చూస్తే ఆవగింజలో సగమంతమసి కనపడింది. దానితో దాసీదానిమీద మండిపడిపోయి, తప్పేలా తోముకుని, నూతివద్దిర స్నానంచేసింది.

"అటుతర్వాత వంటకి పొయ్యిలో నిప్పువేసింది. అప్పుడు నేను అన్నాను, 'పోనీ కుక్కరుతో వండు. కుక్కరువంటరుచి నీకు తెలుస్తుంది. మరింక విడిచి పెట్టవు' అని. 'ఆకుక్కర్లు గిక్కర్లు నాకు పనికిరావు, మనుష్యజాతి పుట్టినదగ్గిరనుంచీ వుంది యీవంట' అంది. దానికి నేను 'ఉండవచ్చులే. అదికాదు నేనుచెప్పేది. నీకు పని తెరిపి వుంటుంది. ఎందుకలా హూనమయిపోతావు పొయ్యిదగ్గిర? రెండుగంటలనర సేపు పొయ్యిదగ్గిరే కనిపెట్టుకుకూచుంటావు. పొగవల్ల కళ్లు చెడిపోతాయి. వేడివల్ల వొళ్లుచెడిపోతుంది. మరి కుక్కరయితే అయిదునిమిషాలలో పని అంతా పూర్తిచేసుకుని మరొకగంటసేపటికి వచ్చి భోంచెయ్యవచ్చు' అన్నాను. అందుకు తాను 'దానిరుచి బాగుండదు' అంది. 'అవును, దానిరుచి దానిది, పొయ్యి వంటరుచి పొయ్యివంటది. బూర్లరుచి బూర్లది, గార్లరుచి గార్లది. ఒకదానితో వొకటి పోల్చగలమా' అన్నాను. ఏదైనా దాన్ని వొప్పించలేకపోయేను. పోనీకదా అని అప్పటికి వూరుకున్నాను. మరొకప్పటికి వాయిదావేసేను. వంటయేక భోంచేసి నిద్రపోయేము.

"మర్నాడు పొద్దున్న యేదో పెద్దపనివున్నట్టుగా పెంద్రాడే లేచింది మీవదిన. దాసీదాన్ని రానిచ్చి దానిదగ్గిర ఒకగంటన్నరసేపు లెక్చరిచ్చింది, నిన్న గిన్నె కు మసివుండడంమీద. అది యింటిదగ్గిర వున్నంతసేపూ పురుగుగొలికినట్టుగా గొలికేసింది. అది యెప్పుడేనా ఖర్మంచాలక ఒకమాట అంటేచాలు, మళ్లీ మరొక మాటు పెళపెళ మనిపించేసేది. 'భోంచేస్తూవుంటే నాతో చెప్పింది, 'దాసీదాన్ని యివాళ ఝాడించి విడిచిపెట్టేసేనండి' అని. అందుకు నేను 'నీమీద యెంతతప్పున్నా నేనెప్పుడేనా నిన్ను ఝూడించి విడిచిపెట్టేనేనా' అనిఅడిగేను. దానితోటి మొహం ఆల్చిప్పంత చేసుకుంది. సాయింత్రంవరకూ ఘుమఘుమలాడుతూ నేవుంది. నాతో మాటాడలేదు. పోనీ అని నేనూ వూరుకున్నాను. రాత్రి రాజీపడ్డాం.

"అబ్బాయీ! ఎందు కిన్ని చెప్పడం. మళ్లీ మొదలు–కూరగాయలదానితోటి, బియ్యపుమనిషితోటి, అపరదినుసులు తెచ్చే మనిషితోటి.....ఒకటేమిటి ఒక అరగంటసేపు వాదిస్తేగాని ఒకకూరగాయేనా కొనదు. నిన్నటికినిన్న దాసీది పిడకలు తిరగవెయ్యలేదని గంటన్నరసేపు లెక్చరిచ్చింది. ఈఘటనలే నాకూ వచ్చేవి. కాని నేను దాసీమనిషిలో 'ఆపిడక లివాళ తిరగ వెయ్యాలి' అని ఒకమాట అనేవాణ్ణి. అది తిరగవేసేది. ఒక్కమాటతో తెమిలిపోయేదానికి ఒకగంటన్నరసేపు వుపన్యాస మివ్వడం. ఇదీ ఆడదాని స్వభావం. .........దాసీది చెప్పిందిట, నేను దానికి రాచ్చిప్పలూ, పాలకుండా తోమడానికి వేసేవాణ్ణనీ, రుబ్బురోలు దానిచేతే కడిగించేవాణ్ణనీ. అంచేత రాచ్చిప్పలూ, పాలకుండా దాని కిచ్చేసింది. రుబ్బురోలుమీద పసుపునీళ్లు చల్లి పదిబిందెల పేడనీళ్లతో శుద్ధిచేసింది. ఇంకెందు కిన్నిసార్లు చెప్పడం, స్నానాలూ, కడగడాలూ, నీళ్లలో మునిగి తేలుతూవుండడం మళ్లా మొదలు.... ఆఫీసువేళకి సరిగ్గా వంటచేసిపెట్టిన రోజు లేదు. లేని పోని పనులు కల్పించుకుంటూవుంటే వేళ కెక్కడ వండగలదు? రాత్రి పదకొండింటికికూడా యిల్లు కడుగుతూన్న చప్పుడే, అవెన్నిపను లున్నాయోగాని.

"నూతివద్దిర పొరుగువాళ్లతో యుద్ధమయిపోతూవుంటుంది రోజూరోజూ. ఒకొక్కప్పుడు మ

హాభారతయుద్ధమంత అయిపోతూవుంటుంది. నిన్న పక్కయింటివాళ్లయింట్లోంచి కాకి అన్నంకెరడు యెత్తుకుపోయి మాపెరడుమీదుగా యెగురుతూపోగా పెరట్లో నాలుగుమెతుకులు రాలేయి. దానికోసమని పక్కయింటివాళ్లతో తగవులాడింది! ఏమని చెప్ప మన్నావు, పగలు పన్నెండుగంటలూ యీమోస్తరు గానే కాలక్షేప మయిపోతుంది. పుస్తకం ముట్టడాని కేనా అవకాశ ముండదు. ఈమోస్తరుగా కాలక్షేపం చెయ్యడం మనతరంకాదు. ఏదైనా దాన్ని యెప్పుడూ పల్లెత్తుమాట అని యెరగను. తిట్టడంగాని, కొట్టడం గాని యెన్నడూలేదు. తిట్టడంవల్లా, కొట్టడంవల్లా బాగుపడ్డసంసారం యింతవరకూ నాకు ఒక్కటేనా కనబడలేదు. అంచేత నే నెప్పుడూ దాన్ని యేమీ అనను. నేను చేసే పనేమిటంటే సలహా చెప్పడం, హితోపదేశం చెయ్యడం. అంతే. ప్రేమ, దయ వల్ల జయించవలసిందేకాని దీనికి మరొకదారి లేదు. ముమ్మాటికీ లేదు.

"నా ఒక్కసంసారమే యిలాగ వుందనుకుంటున్నావేమో! అన్నిసంసారాలూ యింతే. కోటికెక్కడేనా ఒకటి వేరుగా వుందేమో! అంచేతే నాకు ప్రత్యేకవిచారం లేదు. చదువుకొన్నవాడికీ, చదువుకోని ఆడదానికీ సంసారంచెయ్యడంలో యింత తేడావుందికదా అని నాకు ఆశ్చర్యం వేస్తూవుంటుంది. ఏపనికయినా చదువు అవసరమే. చదువుయొక్క లాభం తెలిసేక ఆడవాళ్లకి చదువువద్దన్నవాళ్లని సుండేసి కొట్టేసినా పాపంరాదు అని అనిపిస్తూంది. నిన్ను మీ పెద్దపిల్లని చదువులో ప్రవేశపెట్టమని అంటూవుండడం చదువు వుపయోగ మెరిగే. అంతా క్షేమం.

ఇట్లు : నీప్రియసోదరుడు,
సూర్యారావు"

ఈమోస్తరుగా హఠాత్తుగా ముగించబడివుంది. వుత్తరం. పైవుత్తరం మాఅన్నయ్య దగ్గిరనుంచి వచ్చింది. నేను"భారతి" పత్రిక్కి యేదేనా వ్యాసం రాయాలనుకొంటూవుండగా యీవుత్తరం వచ్చింది. ఈఉత్తరమే వొకవ్యాసంలా సుండడంవల్లా-అంతకంటే ముఖ్యమైన సంగతి-దీనివల్ల జనులు నేర్చుకోవలసిన సంగతులు చాలా వుండడంవల్లా, యీనెల నా వ్యాసంబదులు యీ వుత్తరాన్నే పంపిద్దామని తలచి దీనికి 'మా సంసారా'లని పేరుపెట్టి భారతికి పంపించేను.

---

## గమనిక

ఇకమీద భారతియందు 'పాతపాటల'ను ప్రకటింపజాలమని మనవి.

—భా. సం.

# 'మిస్ లైలా'

గొల్లపూడి జోగారావు

(రెండవభాగము)

౧

నేను దాదివృత్తిలో ప్రవేశించి రెండుసంవత్సరము లవుతుంది. నాది పవిత్రజీవనము. నారోగులను యెంతో వుత్సాహంగా నర్సుచేసేదాన్ని. 'లైలా, నీనర్సింగుతోటే సగంరోగము పోతుంది' అని శ్లాఘించే వారు డాక్టరుగారు. మేరీ, నేనూ సహవాసులమే. మాయిద్దరిదీ వొకటేవార్డు. నాది రాత్రిడ్యూటీ. మేరీ యెప్పుడూ సరదాగానే వుండేది. "లైలా, నారోగుల హృదయముల నువ్వు ఆకర్షిస్తున్నావు నిన్ను నేను envy చేస్తున్నా" ననేది. నే నెంత అదృష్టవంతు రాలిని. నాపూర్వపురోజులు తలచుకొన్నపుడు ఒక ం భరింపరానంత దుఃఖం వచ్చేది. ఇప్పుడు ఇట్టి పవిత్రజీవనము చెయ్యడానికి వీలుకలి గించిన డాక్టర్ని, మేరీని నిత్యమూ మన్నించేదాన్ని. నాభర్తకు, డాక్టరుగారికి వుండే స్నేహము, ఆమె కాయనయెడల నుండే గౌరవము చెపుతూ మేరీ తర చుగా మందలిస్తూ వుండేది నన్ను.

నాటిసాయంత్రము హాస్పిటలురూములో కూర్చు న్నాను. మేరీ అప్పుడే వెళ్లిపోయింది. టెలిఫోనుగంట మ్రోగింది. దగ్గరకు వెళ్లి పట్టుకున్నాను.

"లైలా!"

"ఆఁ"

"నెం. ౧౨ రూముకి వెళ్లు."

మరేమీ వినబడలేదు. డాక్టరు వెళ్లిపోయా రను కున్నాను. ముందుగానే బయలుదేరా ఆరూముకేసి. తలుపు దగ్గరగా వేసుంది. మెల్లగా లోపల ప్రవే శించాను. నలుబది వత్సరముల స్త్రీ మంచంమీద పడుకొనుంది. మంచందగ్గరగా వెళ్లేను. ఆమె నాకేసి చూచింది. మాయిద్దరికీ యిల్లా సంభాషణ జరిగింది:

నేను—ఏమిటి బాధ?

ఆమె కడుపుచూపెట్టింది.

నేను—ఆపరేషన్ చేస్తా మన్నారా?

ఆమె—అవును.

నేను—ఎప్పుడు?

ఆమె—రేపుదయం.

నేను లాకరు (locker) కేసి చూస్తున్నాను.

ఆమె—మీపేరు లైలాగదూ?

నేను—అవును. మీ కెల్లా తెల్సు?

ఆమె—ఇక్కడ ఆయా చెప్పింది మీరు వస్తా రని.

నే నామెటెంపరేచరు తీసుకోడానికి దగ్గరకు పోయాను. పరిచయం వున్నమొగంమల్లే కనబడ్డాది. నిదానించి చూచేను. మనసు చలించింది. హృదయం ఆరాటపడ్డాది. బాధ పైకి తోపనీలేదు. థర్మామీటరు తీసుకొని నామొగం చటుక్కున తిప్పేసేను. మరల యిట్లు ప్రశ్నించేను:

నేను—మీ రెక్కడున్నా రిప్పుడు?

ఆమె వూరుకుంది.

నేను—మీది రాజమండ్రీ కాదూ?

ఆమె—అవును.

నేను—మీరు చెన్నపట్నం వచ్చి యెంతకాల మయింది?

ఆమె—ఆరునెలలు.

నేను మాటలాడలేదు.

ఆమె—మరేమి భయంలేదుకద?

నేను—లేదు.

ఆమె—కడుపుకాదన్నారు డాక్టరుగారు.

ఆమె నాకేసి చూచింది.

"మీా రట్టే మాట్లాడకండి."

ఆమెకు వలయు సదుపాయములు చేసాను. ఆమెకు ధైర్యం చెప్పేను.

"వార్డు చూచుకొనివస్తా."

ఆమె వూరుకుంది.

"మరేం భయములేదు, పడుకోండి."

"నిద్ర పట్టలేదు."

ఆమె నిద్రపోవడానికి మందిచ్చేను.

"మళ్లీ వస్తారుకదూ?"

"నేను రాత్రల్లా యిక్కడే వుంటాను."

ఆమె కనులుమూసింది. నేను బయలుదేరాను. మనసులో శాంతిలేదు. వార్డు చూచుకొని రూములోకి పోయాను. ఎన్నో ఆలోచనలు తట్టేయి. 'అత డిక్కడే ప్రాక్టీసుపెట్టేడా?'......'రాజేశ్వరీ, న న్నెన్ని బాధలు పెట్టేవు?' ఆనిర్దాక్షిణ్యురాలి కిప్పటికి పాపఫలము పండిందా అని సంతోషించాను. అమా యికురాలను లీలను పెట్టినబాధలకు యిప్పు డిల్లా అనుభవిస్తోం దనుకున్నాను. పతిమీద చెలాయించిన అధికారమునకు ఈస్థితి అని ఆనందించేను. అంతట్లోనే నాహృదయం కరగిపోయింది. ఆమె కఠినహృదయు రాలై తేనేమి, నేను జాలివహించకూడదా అనుకున్నాను. ఆమె నన్ను తరిమితేనేమి, నేను ఆదరిద్దామని నిశ్చ యించుకొన్నాను. ఇంతకీ నాప్రస్తుత ఉద్యోగాన్ని బట్టి నేనల్లా ఆచరించడం నావిధిగా భావించు కొన్నాను.

ఊర్లో గడియారం ఒంటిగంట కొట్టింది. నెం. ౧౩ రూములోకి పోయాను. ఆమె పడుక్కునుంది. ఆమె నిశ్చేష్టితమైన ఆకారంకేసి చూసేను. ఎందుకో నేత్రగోళములు చెమ్మగిల్లేయి. ఆయాతో 'జాగ్రత్త' అని చెప్పి అడుగులువేసా కారిడరుకేసి.

౨

కనులువిచ్చి చూచేసరికి కర్టెనుసందునుంచి గవాక్షమార్గంద్వారా సూర్యకిరణాలు పడుతోన్నాయి గదిలో. లేచి వాచీ చూసేను. తొమ్మి దయింది. రాజేశ్వరి యెల్లాగుందో? ఆపరేషను చేసేరా? మేరీ పదకొండుగంటల కొస్తుంది. ఎన్నో వినూత్నభావ ములను రచించినది మనసు. 'ఆనిర్దయురాలి విషయము నా కెందుకో?' అనుకున్నాను. 'ఆమె బ్రతుకు తుందా?' అని అంతరాత్మని ప్రశ్నించేను. మనసు శాంతించలేదు. 'ఎందు కీఆతురత? నాజీవనప్రవృత్తిలో ఆతురతకు తావేలేదా?' అనుకున్నాను. మేరీ వచ్చే దాక మనసు వుండబట్టలా. హాస్పిటలుకి బయలుదేరేను. మేరీవున్న వార్డుకేసి పోయాను. గదిలో మేరీ యేదో మందుసీసా చూస్తోంది.

"ఎలాగుంది?"

"ఎవరు?"

"నెం. ౧౩ రూముపేషెంటు."

"తెలివిరాలేదు."

"బ్రతుకుతుందా?"

"ఏమో..."

"డాక్టరుగా రేమన్నారు?"

"ఏవీ చెప్పలేదు."

మేరీ వడిగా వెళ్లిపోతోంది.

"మేరీ!"

ఆమె వెనుదిరిగింది.

"ఆమె......"

"............"

"ఆమెను నీకు తెలుసా?"

"తెలీదు."

"మేరీ, ఆమెను నేను పోల్చేను."

"ఎవరు?"

"రాజేశ్వరి."

మేరీ తెల్లబోయింది. ఆమె నమ్మలేదు.

"మేరీ, ఆమె నన్ను పోల్చలేదు. నే నిక్కడున్నానని ఆమెకు తెలీడం నా కిష్టం లేదు."

మేరీ వెళ్ళిపోయింది. రాజేశ్వరి ప్రకృతావస్థకు జారేసింది. Quarters కి బయలుదేరాను. రూములోకి పోయాను. శాంతిలేదు. రాత్రివరకు బ్రకుకుతుందా? ఏసును ప్రార్థించా మనసులో. తలుపువేసుకొని పడుకున్నాను.

* * * *

ఎవరో తలుపుతట్టేరు. చర్చిలో గంటలు కొడుతున్నారు.

"లైలా!"

తలుపు తెరచేను. మేరీ నించునుంది.

నాహృదయం కొట్టుగుంది. "ఆమె చనిపోయుంటుందా? ఎంతమంది మరణించుట లేదు" అనుకున్నాను.

"అతడు చనిపోయాడు."

"ఎవరు?"

"ఆవైద్యుడు. Heart palpitation వల్ల చనిపోయాడు."

"ఏవైద్యుడు?"

"నిన్నల్లరిపెట్టిన వైద్యుడు."

"ఎప్పుడు?"

"ఎనిమిదిగంటలకి- డాక్టరు చెప్పేరు."

మేరీ నాముఖంలోకి చూస్తూంది.

"మేరీ, నువ్వెందు కలా చూస్తావు?"

"నీకు సంతుష్టిలేదా?

"లేదు. ఆమె యెలా వుంది?"

"తెలివివచ్చింది."

ఏసును ధ్యానించా వొక్కసారి.

3

సాయంకాలము ఏడుగంటలకి కారిడరుమీద మేరీ కలుసుగుంది.

"వెళ్ళిపోయాడా?"

"ఎవరు?"

"అతడు."

"గంటక్రిందనే వెళ్ళిపోయాడు."

"ఆమె ఎలా గుంది?"

"నీరసంజాస్తీగా వుంది."

"..........."

"నేను పోతున్నా."

మేరీ వెళ్ళిపోయింది. తనలో ఆత డెంత కలత జెందుతున్నాడో అనుకున్నాను. 'మావయ్యా, నిన్నెంతేడిపించి దాసె' అనుకున్నాను. 'నీ జీవితములో మరి శాంతిలేదేమో' అని వలవల యేడ్చేను.

"లైలా!"

కనులుతుడుచుకొని తిరిగి చూసేను.

డాక్టరు యెదుట నిలబడ్డారు. మాయిద్దరికీ యిల్లా సంభాషణ జరిగింది:

డా—ఏమి టాలోచిస్తున్నావు?

నేను—ఆమెవిషయమై.

డా—ఈరాత్రికి గడిస్తే బ్రతకొచ్చు.

నేను—గడవదా?

డా—రాత్రల్లా మేలుకోవాలి నువ్వు.

శూన్యదృష్టులతో అతని ముఖంకేసి చూచేను.

డా—అత డొచ్చేడు.

నేను—చూచేను.

డా—ఇప్పుడే వెళ్ళిపోయాడు.

నేను—మేరీ చెప్పింది.

డా—ఆనందరావు నేనూ సహాధ్యాయులమని చెప్పేను.

నేను తెల్లబోయేను.

డా—కన్నుల నీరునించే డాతడు.

నేను మాట్లాడలేదు.

డా—నీ విక్కడున్నావని చెప్పలేదు.

నేను—ఇంతకాల మూరకున్నాడేమి ?

డా—Pregnancy అని యేమరి పూరుకున్నారు. నీరసం అధికమైంది. డాక్టరుకి చూపెట్టేరుట. కడుపు కాదు. ఓవరియన్‌కిస్టు (Ovarian Cyst). ఆపరేషన్ చేయాలిసుంటుంది. హాస్పిటలుకి తీసుకువెళ్లమన్నాడు.

నేను—డాక్టరు ! నన్నేమిచెయ్యమంటారు ?

డా—ఆమెను కనిపెట్టివుండాలి. రాత్రి తప్పితే భయములేదు.

నేను—నే నామెమొగం చూడలేను. మేరీ వుండకూడదా ?

డా—ఆమెకు స్వస్థతగా లేదు.........
...ఆతనికోసము నువ్వు కష్టపడు.

డాక్టరు వెళ్లిపోయారు. నేనల్లాగే నించుండిపోయాను.

* * * *

తలుపు తెరచేను.

" లైలా ! "

దగ్గర కెళ్లేను.

" నే బ్రతుకుతానా ? "

" తప్పకుండా. "

ఆమె చూపుల్లో ఆశ మందహాసంచేస్తూంది.

" ఆసంగతి ఆతనితో చెప్పేరా ? "

" చెప్పేము. "

ఆమె సంతుష్టి జెందినది.

" అతడు వట్టి అమాయికుడు. రేపు మళ్లా వస్తారు."......"అందాకా ఉండనూ? "

" ఉంటారు. "

ఆమె నాకేసి చూచింది. ఆమె చూపుల్ని మళ్లించుకొన్నాను.

" లైలా, యిల్లా రా. నాశరీరాన్ని పట్టుగో."

వెళ్లి ఆమె శరీరమును పట్టుగున్నాను.

" చల్లగా వుందికాదూ ? "

" లేదు. "

" చలిగాలి వేస్తూంది, కిటికీ వేసిపెట్టు."

గ్లాసు ప్లేన్సు వేసీసేను.

" లైలా, నువ్వు రాత్రల్లా యిక్కడే వుంటావుకాదూ ? "

" ఊఁ. "

" నీఋణము తీర్చుకోలేను......నీవు దేవతవు."

ఆమె యేదో గొణుగుకుంది.

" మీ రట్టే మాట్లాడకండి. పడుకొండి. "

" పడుక్కుంటా...మీరుమాత్రం వెళ్లిపోవద్దు."

" వెళ్లను. "

ఆమె కనులుమూసింది. వాచీ చూచేను. పదయింది. ప్రక్కని స్టూలుమీద కూర్చున్నాను. ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. ఆమెచేతుల్లో నేనేలాంటి బాధ లనుభవించేనో తలంచుకొన్నాను. 'కాల మెప్పుడూ యిల్లా వుంటుందా ?' అంటే... "వుంటుం" దను ఆమెఅహంకార మిప్పు డేమయిందనుకున్నాను. ' రాజేశ్వరీ, యిప్పుడు నీలీలావతే నీకు గతయిందే ' అనుకున్నాను. 'నీవు పొమ్మనిన యీలీల నిద్రమానుకొని యిల్లా కూర్చుంది.' ఆమెమొగంకేసి చూచేను. నిశ్చలంగా పడుక్కునుంది. 'రాజేశ్వరీ,నీవల్ల యెన్నోకష్టా లనుభవించానుకాని నీమీద నా కిప్పుడు కోపంలేదు.' ఆమె నిశ్చలాకారానికి భయము వేసింది. ఆమె బ్రతికుందా ? దగ్గరకు పోయి నాడిపరీక్షించేను. రిస్టువాచీ చూచేను. పదకొం డయింది. తలుపుతీసి కారిడరుమీది కొచ్చాను. నిశ్శబ్దంగా వుంది ఆప్రదేశమంతా. ఉదయిస్తోన్న చంద్రుణ్ణి చూస్తూ నించున్నా ఒక్కగడియ.

" లైలా...లైలా ! "

త్వరగా లోపలికి పోయాను.

" లైలా ! "

" ఏమి ? "

" నువ్వెళ్లిపోయావు... నేను చచ్చిపోతాను. "

" భయములేదు. "

" నీరసం జాస్తిగా వుంది. "

డాక్టరుపెట్టిన మందు గ్లాసులో పోసి ఆమెకు త్రావించేను.

" బలం చేస్తుంది. "

" నువ్వెళ్లిపోకు. "

" లేదు. "

" నావిషయమై నువ్వు చాలా కష్టపడు తున్నావు. "

" నాకు కష్టములేదు. "

" నీపేరు లైలాకామా ?... "

" మీరు మాట్లాడకండి......నీరసం హెచ్చవు తుంది. "

" ఆమె నీయంతే వుండేది. "

" ఎవరు ? "

" మాలీలావతి. "

మంచము వదలి నేను లాకరుకేసి పోయాను. ఒళ్లు వణికింది.

" ఇప్పుడామె యెక్కడుందో... "

" మీరు పడుకోరూ ? "

" పడుక్కుంటా. "

ఆమె కనులుమూసింది. నేను బయటబడ్డాను. " రాజేశ్వరీ, నిన్నెన్నోమాట లంటున్నాను. నిన్నిప్పుడేమీ అనకూడదు. " అనుకున్నాను. " మావయ్యకు నిన్నప్పజెప్పగలనా ? " అనుకున్నాను. ఆమె నెల్లాగో బ్రతికించుకోగలనని ధైర్యం వహించేను. క్రిందికి చూచాను. ఆయాలు అక్కడక్కడ మేలుకొని వున్నారు.

అల్లా నించున్నా.

ఒంటిగంట కొట్టేరు.

* * * *

రెండు.

* * * *

మూడు. అలాగే వున్నా, ఆచలిగాలిలో.

* * * *

నాలుగు.

గదిలోకి పోయాను. ఆమె లేవలేదు. శరీరము పరీక్షించేను. చల్లగా వుంది. నాకు భయంవేసింది. నాడి మాత్రం వుంది. అరగంటయింది. ఆమె కదిలింది.

" లైలా ! "

" ఎందుకు ? "

" దగ్గరకు రా. "

" ఏమీ ? "

" నాకు భయంవేసింది. "

మందు త్రావించేను.

ఆమె నాముఖంలోకి చూచింది.

" లీలావతీ, నువ్వే ! ! "

ఆమె మూర్ఛపోయింది.

నాకు మతిపోయింది.

స్టిములెంటు మిక్శ్చరు (Stimulent mixture) త్రావించేను. అయిదునిముషాలు చూచేను. ఆమెకు తెలివి రాలేదు. పైకి వచ్చాను. గ్రుడ్డివెన్నెల కాస్తోంది. Duty డాక్టరుకి ఫోనుచేసా. అయిదునిముషాలలో డాక్టరొచ్చారు.

" లైలా, ఆమె కేమీయు భయములేదు. "

" బ్రతుకుతుందా ? "

" తప్పకుండా. "

* * * *

౪

రూముకొచ్చి యెల్లా పడుకున్నానో. తెలివొచ్చేసరికి మూడయింది. మేరీగదికేసి వెళ్లేను. ఆమె అప్పుడే వెళ్లిపోయింది. నాగదిలోకి పోయి టెలిఫోను తీసేను.

" మేరీ ! "

" ఆఁ. "

" డాక్టరుగారొచ్చేరు. ఉన్నారు ? "

" ఇంకా రాలేదు. "

" ఆమె యెల్లావుంది ? "

" నయంగా వుంది. "

మనసు సంతుష్టిపడ్డాది.

అరగంట పోయింది.

టెలిఫోనుగంట మ్రోగింది.

" ఎవరు ? "

" మేరీని. "

" ఎందుకు ? "

" సత్యనారాయణగారొచ్చేరు. వెళ్లికలుసుగో."

Dress వేసుకోని బయలుదేరాను హాస్పిటలుకి. గదిలో డాక్టరుగారూ, ఆయనా మాట్లాడుతున్నారు. లోపలికి వెళ్లాను. ఆయన పరికించి చూచేడు.

" లీలావతీ ! "

" అవు " నన్నాను.

ఆమె నన్ను పిలిచింది.

దగ్గరకు పోయాను. ఆమెజాలిచూపులు రక్తిమవహించేయి.

" లీలా...నిన్నెన్నో కష్టాలు పెట్టేను. నిన్ను దిక్కుమాలినదాన్ని చేసా......అట్టినన్ను రక్షించావు. నన్ను క్షమించు. చిన్నదానివైనా నీకు భక్తిపూర్వకంగా నమస్కారము చేస్తున్నా. "

ఆమె చేతులు జోడించింది.

నాహృదయము కరగిపోయింది.

ఆమెచేతులు విడదీసా.

"నీ పవిత్రత నే గ్రహించలేకపోయాను. నేను దురదృష్టవంతు రాలిని......ఇంటికి వెళ్లిపో రా. "

" నాకు కష్టమని తోచినపుడు వస్తాను. "

అతనికేసి చూచేను. వలవల యేడుస్తున్నాడతడు.

" మావఁయ్యా, నీవు దుఃఖించవద్దు. నా కిక్కడ సుఖముగానే వుంది. "

అతడు సెలవుతీసుకొని వెళ్లిపోయాడు. నెల రోజులలో రాజేశ్వరికూడా వెళ్లిపోయింది. వెళ్లిపోయేటప్పుడు రమ్మని బ్రతిమాలింది. అదే జవాబు చెప్పేను. కాని యిప్పటి కింకా యీపవిత్రజీవనమే చేస్తున్నాది లైలా.



శీఘ్రావృతి (చిత్రకారుడే బ్రహ్మయైనచో) ౧: సంగీతమన్న యిష్టము లేనివాడు



౧

చెలువయుఁ గోమలత్వమును సౌరభమున్ మధురత్వ మొక్కటన్
గలిగి యపూర్వమై చను నొకానొకవస్తువుఁ బోలి ముద్దులన్
గులికెడు సత్కవిత్వమునకున్ దెరువుల్ సరిదీర్చి యింపుమై
సలలితకీర్తిఁగొన్న కవిచంద్రుని సూరనఁ బ్రస్తుతించెదన్.

౨

కవితాభిజ్ఞను భావికాలకవికిన్ గల్పింపఁ దత్పూర్వస
త్కవిరాణ్ణిర్మితకావ్యమార్గముల స్వాతంత్ర్యమ్ము దీపింపఁగా
సవరింపన్ దలపెట్టి నవ్యకవితాసామ్రాజ్యధౌరేయతన్
స్తవనీయంబుగఁ గొన్నసూరనకవీంద్రా, నీకుఁ గేల్మోడ్చెదన్.

౩

కవితారీతిరహస్యమంతయును సాకల్యంబుగా నేర్చి మే
టివి; కానన్ మృదులప్రబంధముల మూఁటిన్ మూఁడుమార్గమ్ములన్
గవులెల్లన్ వినుతింపఁ గూర్చి యసమఖ్యాతిన్ గనంజాలి తీ
యవనిన్ గైతను నీకుసాటి కవిధీశా, నీవ వేయేటికిన్.

౪

భావముమించుశైలియును, భాసురశైలినిమించు భావముల్
ప్రోవయి వన్నెగూర్పఁగ నపూర్వపురీతులు సొంపునింపఁగాఁ
గేవలకల్పనాకథ లిఖించి కవీంద్రులమెప్పుఁగొన్న నిన్
భావమునన్ స్మరింతు ననివారితధారకు నోయి సూరనా!

౫

నీసమకాలికుండగు మనీషియ షేక్స్పియరున్; మహోన్నతిన్
భాసిలుచుండ్రు మీరు శశిభాస్కరులట్టుల నెప్డు వాఙ్మయా
కాశమునందు; ఆవిమలకాంతిని నేఁడు కవిత్వయాత్ర నా
యాసములేక సల్పి చరితార్థులుగారె కవీంద్రు లెల్లరున్.

---

# ఉరిశిక్ష

తంగిరాల రాధాకృష్ణయ్య, బి. ఏ., బి. యల్.

౧

ఉస్సురుమని లేచి కూర్చున్నది. పేరమ్మకు ఆవేదన దుర్భరమయింది. పగలో రాత్రో కూడా తెలీలేదు. మూ రోజుల నుంచి నిద్రకానీ, ఆహారంకానీ లేనప్పుడు ఎట్లా తెలీడం? కునికిపాటు పడిందో లేదో, ఎవరో తనరొమ్ముమీద కూర్చొని గ్రుద్దుతూవున్నట్లయింది. ఇటు కండ్లు తెరిస్తే ఊపిరాడటం లేదు. ఏమంటే ఏముంది? ఏదో పీడకలకాబోలు అని సర్దుకొనేదే. అయితే అట్టిసమాధాన మామెకు నచ్చలేదు. అబ్బా! అని పైకి చూచింది. చూస్తే ఏముంది — నిరామయం — నిర్భేద్యమైన జెయిలుగోడలు ఆమెనుప్రక్క చూచివాక్రుంగ చేసాయి. ఒక సన్న రంధ్రము మాత్రము కప్పు వద్ద కనుపడ్డది. అరచేతి వెడల్పు వుందో లేదో, దానికి నాలుగు గడ్డపారల లాంటికమ్మీలు అడ్డం బిగించి



వున్నాయి. దాన్ని చూచేటప్పటికి, ప్రపంచానికీ నాకు, ఇనొక్కటైనా సంబంధం వుంది కదా అనిపించిం దామెకు. ఉత్తరక్షణంలోనే దిగులు కలిగింది. ప్రపంచమంటే తనకేమి మొఖమాటం—తనకూ ప్రపంచానికీ ఏమిసంబంధము? ప్రపంచంలో వుండతగనిదనిగదా ఆమెకు ఈ వురిశిక్ష విధించారు—ఈవిష వృక్షాన్ని పెరగనీయకూడదని, ఇట్లాంటిముళ్ల కంచెలను లాగేస్తే దేశాన్ని మరామ్మతు చేయవచ్చునని.

౨

ఇంతలో తనకు ఎదురుగ్గా గోడమీద మసుగ్గా వెలుతురు కనుపడ్డది. వెన్నెలతునక పైరంధ్రంనుంచి లోపల జొరబడ్డది. పేరమ్మకు ఆవేదన ఇంకా జాస్తిఅయింది. ఈ చంద్రబింబం తనమంచికేనా వచ్చింది? ఈ వెన్నెలకు ఈదీనురాలితో ఏమి అవసరం? లోకానికంతా రోతఅయిన యీ పేరమ్మను కూడా యీ వెన్నెల ఎందుకు కనుకోవాలె? ఇంకా తనకు దేముడిసంగతి ఏమైనా జ్ఞాపకంచేయడానికి వచ్చిందాఏమి ?—ఛీ— తనకూ దేముడికీ ఇలాకా ఏమిటి ?—

౩

ఇంతలో జెయిలువెలుపల పారా జమానుకేక వినబడ్డది. జెయిలులోనుంచి ఎవ్వరూ తప్పించుకొనిపోకుండా కాపుదలచేస్తూ వున్నాడు. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం. తనేనా తప్పించుకపోయ్యేది! తప్పించుకపోయేటట్ల యితే యీ శిక్షలు కమామిషి ఎందుకూ? ఆహా! తప్పించుకుంటే!— ఒళ్లు పులకరించింది. మళ్లీ తనవూరు, తనవాండ్లు-హాయిగా, నిశ్చింతగా కాలంగడపవచ్చు. తనతో ముద్దాయిగావుండి తప్పించుకొన్న కోటయ్యమొఖమైనా చూస్తుందా. అరే!— కోటయ్యా!— పదేళ్లుగా నమ్మించి తనతో సుఖించి, ఒకటిగా నుండి, ఆఖరుకు కష్టాలువచ్చి యీకేసు పైనబడేటప్పటికి నేరమంతా యీపె మీదకి త్రోసి తప్పించుకుపోయినాడు. అబ్బా! అసలు నేరంచేసింది వాడే—తను అమాయకురాలే. తెలీక కోటయ్యను నమ్మి అతను చెప్పినట్లు చేసేటప్పటికి యింతముప్పు వచ్చింది. ఇంక ఆకోటయ్య మొఖాన ఉమ్మిఅయినా వేస్తుందా. అప్పుడు చివుక్కున ఆమెకు రామస్వామిసంగతి జ్ఞాపకంవచ్చింది. అయ్యో, ఎంతయోగ్యుడు రామస్వామి! అట్టిపెద్దమనిషిని చంపించినాడే కోటయ్య. తనో, తను ఏమర్మం ఎరుగదుగా మరి. కోటయ్య రామస్వామికి ఎప్పుడూ తెచ్చియిచ్చినట్లు ఆవేళ కూడా తెచ్చాడు మందు. పేరమ్మను కలిపి యియ్యమన్నాడు. పేరమ్మ యీ మందుకలిపి యిచ్చినగంటలో రామస్వామి ఎగిరిపోయినాడు. ఇంతలో వారు వీరు, పోలీసులు మేస్త్రీటులు, అంతావస్తే, మరి యీ పిచ్చి పేరమ్మ, "అవును నేనే మందుయిచ్చాను; మరి యిట్లయింది" అన్నది. అంతకంటె ఏంగావాలి?— పోలీసువ్వారు "పేరమ్మ రామస్వామికి విషంపెట్టి చంపి"దని ఛార్జీ పెట్టారు. మేస్త్రీటుగారు

"ఓయబ్బో, ఇంత పెద్ద కేసుగావుందే" అని జిల్లా జడ్జిగారికి పంపించారు. జిల్లాజడ్జిగారు "ఏమీ లేకుంటే నాదాకా ఎందుకురా వచ్చిం" దని ఉరిశిక్ష వేశారు.

౪

బయటపడితే మళ్లీ తనవూరికి వెళ్ల వచ్చు. వెళ్లి తనతల్లితో సుఖంగా ఉండ వచ్చు. ఇంక పేటకు చస్తే రానసుకుంది. తన వెయ్యేహూపాయలసొమ్ము కోటయ్యవద్దనుంచి లాక్కొని వూరికెళ్లి తల్లితోపాటు సేద్య పనులు చేసుకోవాలి. ఛ! ఈపేటవాండ్లను నమ్ముకుంటే ఇంతే. ఉన్నన్నాళ్లు ఉండి పొయ్యే టప్పుడు కొరివి ఒకటి కాల్చిపెట్టిపోతారు. కొరివి అనుకోగానే ఆవెన్నెతునక మరచి పోయిన తనకండ్లకు మళ్లీ కనుపడ్డది. ఈ మూడురోజుల జాగారం దృగ్గోచరం అయింది. మళ్లీ ఊపిరాడలేదు. బయట అయితే శుభ్ర మైన గాలి అయినా తిని బ్రతకవచ్చు. ఈవేడి బరువుగాలి! ఎట్లాగా మనుషులుంటారు ఇక్కడ! పొంగిపొంగివస్తూన్న తనమనోభా రాన్ని వదిలించుకోడానికి గోడలైనా వినేవి కావే. ఇట్లా ఇంకా ఒకటిరెండురోజులు ఉండ గలుగునా! ఉరిశిక్షఅంటే ఇదేకాబోలు. ఇంకా ఉరిశిక్ష ఏమిటి?—

౫

పేరమ్మను తట్టిలేపిన ట్లయింది. కండ్లు తెరిచేటప్పటికి మధ్యాహ్నము అయింది కాబోలు, జెయిలువార్డరు మూకుడులో సంకటివేయించి మంచిసెబ్బరలు కనుక్కొని పోతున్నాడు. పేరమ్మకు విసుకుపుట్టింది. ఆ మూడురోజులనుంచి తనకుగా వేస్తున్న సంకటి అట్లనేవుంది, ఎందుకు వీరి కీబాధ? గుండె రాయి చేసుకొని పేరమ్మ జెయిలువార్డరును అడిగింది.

"నాయనా, ఎప్పుడు—"

ఎంత కఠినుడికైనా మనసు కరుగు తుంది. ఎంతఘోరకలి, ఎంత క్రూరమైన నేరముచేసినా, అతనిని శిక్షించవచ్చేటప్పటికి అయ్యోపాపం అనిపిస్తుంది. ఆజెయిలువార్డరు ప్రొద్దునలేస్తే మనుష్యాకారాల్లోవుండే క్రూర మృగాలనూ, నాగుబాములనూ చూస్తూ వుండడమేకాని సిసలైన మనుష్యులను ఆట్టె చూడడం తటస్థించదుగా! అందుచేత అతను జాలిఅంటే ఏమిటోకూడా మరచిపోయినాడు. గిర్రుమనితిరిగి ఇంకావుంటే ఏం మాట్లాడవలసి వస్తుందో అన్నట్లుగా అతడు వెళ్లిపోయినాడు.

౬

ఇట్లా జరిగింది కొన్నినెలలు. పేర మ్మకు పిచ్చెక్కింది. ఆకలిఅంటే ఏమిటో మరచిపోయింది. ఇక్కడ తన్ను తిట్టేవాండ్లు గాని, కొట్టేవాండ్లుగాని ఎవ్వరూలేరు. తన జోలికి వచ్చేవారు లేరు. తనసంగతి అను కొనేవారు లేరు. అంతకంటె ఈ జీవశాంతికి కావలసినదేమిటి? అట్లాఉండడంలో, తన్ను భగవంతుడికి సూటిగా ముఖాముఖి నిలపెట్టా రన్నమాట. అయితే కండ్లు విచ్చిచూచుటకు

పేరమ్మకు ధైర్యము లేదు. శక్తి చాలలేదు. సూర్యుణ్ణి ఎకాఎకి చూడడానికి సామాన్య మాత్రులకు చేతవుతుందా? గాఢాంధకారాన్నిమాత్రం మనోధైర్యం, ఆత్మశక్తి లేనివారు ఓర్వగలరా?

౭

ఒకనాటి సాయంకాలం జెయిలు వార్డరు పేరమ్మవుంజే గుహతలుపు తటాలున తీయించాడు. తీయించి పేరమ్మను లేపి — "నీశిక్షను హైకోర్టువారు తొలిగించారు. నిన్ను విడుదల చేయడమైంది" అన్నాడు; తనకు వూరికి చేరుటకుగా రైలుఛార్జీ యిచ్చి, జెయిలుబయటికి వెళ్లగొట్టాడు. ఆరోజు ఉరిశిక్ష చెప్పినప్పుడు నిలుచున్నమనిషి నిలుచున్నట్లుగానే పడిపోయింది. ఇప్పుడుకూడా నిశ్చేష్టమై అట్లనే పడిపోయింది. ఇంచుక తెలివిరాగానే కాళ్లీడ్చుకుంటూ వూళ్లోకి బయలుదేరింది. తన్ను పలకరించేవారు లేరు. తనసంగతి అనుకొనేవారు లేరు. మతిపోయిందై ఏమిచేయుటకు తోచక నేరుగా రైలుస్టేషనుకు వెళ్లి, పేటకు టిక్కట్టు తీసికొన్నది. రాత్రి ౮ గంటలకు వాండ్లపేట చేరింది. సరాసరి కోటయ్యయింటికి వెళ్లింది. వెళ్లితే ఏముంది? ఇల్లు తాళంవేసివుంది. గుండెలో రాయిపడ్డది. అక్కడే ఆ ఇంటి ఖామందు పండుకోనున్నాడు. ఆయన్నడిగింది,"కోటయ్య ఎక్కడ, ఏమైనా" డని. ఆయన పేరమ్మను చూచి ఉసూరుమని నిట్టూర్పు విడిచాడు, ఏం పేరమ్మా అని. పేరమ్మవచ్చిన సంగతి తక్షణ టప్పటికి నిర్ఘాంతపోయినాడు. పేరమ్మ ఏమిటి, మళ్లీ రావడమేమిటి? చచ్చినవాండ్లు ఎక్కడైనా మళ్లీ లేచివస్తారా! — అతని కంతా చోద్యంగా తోచింది. 'ఏంపేరమ్మా, నిన్ను వురితీశారుగదా, ఎట్లావచ్చావు' అన్నాడు, నిద్రకళ్లలో ఇంకా కండ్లువులుముకుంటూ. పేరమ్మ తనసంగతంతా చెప్పింది, భారం తగ్గేటట్లు. అప్పటికి అతనికంతా తెలిసి— 'ఆహా! అట్లాగేం' అన్నాడు. పేరమ్మ ఆమాట ఈమాట చెప్పి మళ్లీ కోటయ్య సంగతి అడిగింది.

"కోటయ్యా—కోటయ్య ఆ మరునాడే వూరు వదిలిపెట్టి వెళ్లాడుగా దేశంమీదికి— నీసొమ్ముయావత్తు ఆరోజే అమ్ముకొనిపోయినాడు. ఎక్కడపోయినాడో మళ్లీ కంటి కవుపడలేదు. రంగంవెళ్లాడేమో ననుకుంటున్నారు." అని అన్నాడు మహాకష్టంతో.

పేరమ్మకు మాట రాలేదు. అరగంటసేపు కొయ్యబారి కూర్చుంది. ఉండి ఉండి,

"ఊరికిపోయి మాఅమ్మను చూచివస్తా, ముసిలిముండ ఎట్లాఉందో" అంది.

"ఆఁ. చెప్పడం మరచిపోయినా. మీ అమ్మ చచ్చిపోయిందిగా! మీయిల్లు మీ వూరిమునసబు అదెందుకో ఏలం వేయించాడట" అన్నాడు.

పేరమ్మ నిశ్చేష్టురాలయింది.

ఇంతకాలానికిగా ఇప్పుడు ఆకలయింది. ఇన్నాళ్లనుంచి ఎక్కడపోయిందో. ఒక్క ముద్దయినా తినంది ఉండలేదు ఇంక. అన్నం

పెట్టించమని అడిగింది, ఆముసల్వాణ్ణి. పట్టకపట్టక పట్టినని౦ద్ర పాడు చేసిందని తిట్టుకుంటున్నవాడు విసుక్కొని,

"ఇప్పుడేమన్నం, నా పిండాకూడు. చాల్చాల్లే, నా నిద్ర కాస్తా పాడుచేసావు పోపో" మ్మన్నాడు.

పేరమ్మ తన బలమంతా పోగుచేసుకొని లేచింది. ఏమీ చేయడానికీ తోచలేదు. ఇశ్శబ్బా—అన్నం అడుక్కోడంకూడా తెలీదు. అదిమాత్రం చేతకావద్దూ. బజారునపడిపోయి, పెద్ద శెట్టి మేడవాకిట నిలుచొని "అన్నంపెట్టమ్మా" అంది. లేదు పొమ్మని ఇంట్లోనుంచి కేక వచ్చింది. మళ్లీ అరిచింది. ఇంట్లోనుంచి ఒక ముసలావిడె, కొట్టేటట్టుగా వచ్చి, "నీకేం బుద్ధి లేదూ— బేహా— నీకుగాదూ చెప్పేది— దున్నపోతా" అని శరపరంపరలుగా కురిపించింది.



౮

పేరమ్మ వీధిమధ్యకువచ్చి కూలబడ్డది. లోకానికి తనయందు ఎందుకో ఇంతవిరోధం. నిమేష మాత్రం "ఇంతకంటే జెయిలే మేలేమో" ననిపించింది. ఉరే హోయి. అట్లాగే ఆకాశంవంక చూచింది. ఎందుకు చూచిందో తనకు తనకే తెలీదు. అప్పుడైనా దేమున్ణి తలుచుకుందో లేదో చెప్పజాలదు. మిణుకు మిణుకు

మనే నక్షత్రాలను చూచింది. చల్లని గాలి సోకింది. ఛ! తాను తప్పించుకొందిగా ఉరిశిక్ష—చల్లనిగాలి కొట్టేటప్పటికి పై ప్రాణాలు పైకివచ్చాయి, పేరమ్మకు. అంతకు ముందు అన్నము ముట్టడానికిగూడా అసహ్యాంచుకున్న యీ పేరమ్మ, యిప్పుడు తనఆకలిని ఏమైనా చంపుకోగల్గిందా? అయితే ఎంత అసహాయురాలైనా తనచుట్టూ కోటగోడలు లేవు ఇప్పుడు. బరువుగాలి ఇప్పుడు తన్ను అణచడంలేదు. ఎటుచూచినా విశాలప్రపంచం కనుపడ్డది. తనకు తెలీకుండానే తన కడుపు నిండింది. అరకన్నువేశి వెనక్కుపడ్డది, "అబ్బా—ఇదేచాలు" అని. ఆనిద్ర నుంచి ఎప్పుడులేచిందో, ఎట్లా లేచిందో ఎవరు చెప్పగలరు?

---



తుంగభద్రానది

శ్రీ విరూపాక్షాలయముప్రక్కను సన్నని కొండలోయలో ప్రవహించుచున్నది.

(హంపి శిథిలములు)

—కే. యల్. నరసింహాచార్యులు, గుంతకల్లు.

# వినోదశిల్పము

## కుట్టుపని

కో. నరసింహాచారి

### బట్టలపై అలంకారరూపములను కుట్టుట

రంధ్రముల అట్టలపై అలంకారరూపములను కుట్టినవిధముననే బట్టలపైగూడ కుట్ట వచ్చును. అట్టపై కుట్టునప్పుడు అందలి రంధ్రములు కొలతలకై తోడ్పడునట్లు, బట్టపై కుట్టునప్పుడు వలవంటి యొకగుడ్డ (Canvas-చిత్రము D) యొక్క సహాయ మావశ్యకము. ఇంతమాత్రముకాక చిత్రములు A B లందు చూపబడినట్టి రెండువిధముల కొయ్యవలయములుకూడ కావలసియుండును.

### కొయ్యవలయములు, లేక ఉంగరములు

A వలయము కోతలేక ఒకే ఉంగరముగా నుండును. B వలయము A ను చుట్టి రాదగి, ఒకకోతను కలిగియుండును. కోత వలయమును బిగించుటకును, వదలించుటకును వీలగునట్లు ఒక మరచీల బిగింపబడియుండును (చిత్రము B S) వలయములు ౬", ౭", ౮", ౯" లేక ౧౦" వ్యాసము గలవిగా నుండి వ్యాసమునకు దగినట్లు వెల కలిగియుండును.

### వలగుడ్డ (Canvas)

చిత్రము D యందుండునది వలగుడ్డ. ఇందు పడుగు, పేకదారములు, జంటలుగా నేయబడియుండును. పడుగును, పేకయు చేరుచోట (చిత్రము D, ౧, ౨ వలె) ఒక మూల (Cross) ఏర్పడును. ఈక్రాసులే, రంధ్రముల అట్టలోని రంధ్రములవలె, కుట్ల ఎన్నికలయందు తోడ్పడును. రంగుదారములతో కుట్టునపుడు, ఒక్కొక్కవరుసకు ఇన్నిక్రాసులని లెక్కించుకొని కుట్టుచుపోవలెను.

### కుట్టువిధము

కుట్టవలసిన బట్టను దీసికొని, దానిపై వలగుడ్డను, సరిగా చేర్చిపెట్టుకొని, ఈరెండింటిని A వలయముపై చదరముగా మడతలేక పెట్టవలెను.

పిమ్మట B వలయములోని మరచీలను వదలించి, దానిని బట్టను పరచియుండు A వలయముపై పెట్టి, అదిమినయెడల రెండువలయములును ఒకే మట్టమునకు వచ్చి బట్టను బిగువుగా లాగి పట్టుకొనును. వెంటనే మరచీలను బిగించినయెడల బట్ట చదరముగాను, బిగువుగాను అమరును (చిత్రము C).

తర్వాత కుట్టుట ప్రారంభించవచ్చును. దారపుకొన ఎల్లప్పుడును బట్టకు అడుగుప్రక్కనే ఉండునట్లు చూడవలెను. దారము చాయపోని రంగులు గలిగియుండవలెను. పట్టుదారము శ్రేష్ఠము. చిత్రములు, E, F, G లయందు చూపినవిధమునను, ఇంక ననేకవిధములగు రూపములను కుట్టవచ్చును. అన్ని రూపభేదములును ఒక్కొక్క వరుసలోని క్రాసుల సంఖ్యలయందలి మార్పులనుబట్టి ఏర్పడును. వలయముపై బిగింపబడిన భాగమందంతయు కుట్టినతర్వాత, B వలయమును వదలించి, బట్టను జరపి మరల ఆవలయమును బిగించుకొని, కుట్టును సాగించవలయును.


















F



G

కుట్టు పూర్తియయినతర్వాత, వల టిగా లాగివేసినయెడల రంగుదారముల కుట్లు గుడ్డనుమాత్రము జాగ్రత్తగా కత్తరించి మాత్రముఅడుగునగల బట్టపై నిలచును. అందలి పడుగు, పేకదారములను ఒకటొక



---

మొహెంజొదారో ప్రాచీన నిర్మాణావిష్కరణ చిత్రములు




నిర్మాణముల స్థూలచిత్రము

# తాజ్ మహాలు

క్రమధాటి జానకీగిరి

క్రీస్తుశకము ౧౬౦౪ లో, షహాజహాను ౧౫ వత్సరముల బాలుడై యున్నప్పుడు (యువరాజ కురామ్) అతనితండ్రి జహాంగీర్ చక్రవర్తి కుమారునికి వివాహ మహోత్సవము జరుప నిశ్చయపరచెను. కన్య, నూర్జహాన్ సోదరుడైన ఆసాఫ్‌ఖాన్ అను నతని పుత్రిక. ఈమెకు తలిదండ్రు లుంచిన పేరు, "అర్జమంద్ భాను బీగమ్". "ముంతాజ్ మహల్" ('మందిర జ్యోతి'— The Light of the Palace) అనునది తరువాత ఆమెభర్తచే నొసగబడిన ముద్దుపేరు. నిశ్చితార్థమైన ఐదుసంవత్సరములకు, అనగా ౧౬౧౨ లో ఈపవిత్ర కార్యము అతివైభవముగా జరుపబడెను. అప్పటికి వరునివయస్సు ౨౦ వత్సరములపై మూడు మాసములు. కన్య వరునికంటె సంవత్సరమే చిన్నది. వివాహమైన పందొమ్మిది వత్సరములలోపుగా, ముంతాజ్ బీగము ౧౪ మంది బిడ్డలను కని, తుదకు కడపటిబిడ్డను ప్రసవించునప్పుడు 30 గంటల దీర్ఘకాలప్రసూతిబాధ ననుభవించి, ౧౬౩౧-వ సంవత్సరము జూన్ నెల ౭-వ తేదీ మంగళవారమునాడు బర్హాన్‌పురమునందు పరమపదించెను.



౧. తాజ్ మహాలుయొక్క సింహద్వారము

## తాజ్ బీగము మరణము

ఇందు చెప్పెడి తాజ్ బీగముయొక్క మరణ వృత్తాంతవివరణము, కుదాబక్ష్‌పుస్తకాలయమునందు, పర్షియాభాషలో చేతితో వ్రాసిన ఒక అపూర్వమైన పుస్తకమునందు చెప్పబడియున్నది.

షాహజహానుకు దారా, షూజా, ఔరంగజేబ్, మురాద్ అను నల్వురుపుత్రులేకాక రోషన్-ఆరా, సైతి-ఆరా, జహా-నారా, గోహర్-ఆరా అను నల్వురు పుత్రికలుగూడ నుండిరి. కడగొట్టుబిడ్డను ప్రసవించుటకు ముందు, బీగము గర్భమందలిశిశువు యేడ్చినట్లు వినబడెనట. ఆరోదనశబ్దము వినినతత్క్షణమే ముంతాజ్‌కు తన జీవములపై నిరాశ జనించెను. ప్రేమనిధియైన భర్తను సమీపమునకు రా బిలిచి "ప్రభూ, నాఅంతము సమీపించినది. గర్భస్థశిశువు రోదించినపిదప, ప్రసవానంతరము దానితల్లి అసువులుబాయుట లోకవిదితమే కదా ! అందుచే నే నిక ఈమర్త్యలోకమును విడచి శాశ్వతప్రపంచమున కరుగుచున్నాను. నీయెడ నే నేవేని అపరాధములు చేసియుండిన మన్నించి, నాఅంత్య ప్రయాణమున కనుజ్ఞ నొసగుము" అనియు, తన అంతిమపు కోర్కెల రెంటిని చెల్లింప ప్రతిన సేయుమనియు ప్రార్థించెను. రేడు ఆ కోర్కెలను నెరవేర్చునట్లు ప్రమాణమొనర్చి, ఆకోర్కె లెవ్వియో తెలుపుమనెను. ఆమె "భగవంతుడు నీకు స్త్రీ పురుష సంతానములో చెరినల్వుర నొసగెయున్నాడు. నీ పేరుప్రతిష్ఠల నిల్పుటకు వీరే చాలుదురు. అందుచే ఇకపునర్వివాహము జేసికొని సంతానము కోరవలదు. అట్లుచేసిన ఆమెబిడ్డలకును, నాబిడ్డలకును స్థానాధికారముకొరకు ఘోర యుద్ధము జరుగుటలో సందేహము లేదు. ఇదియే నా మొదటికోర్కె. రెండవది:

నా భౌతికదేహముపైన, ప్రపంచమునం దెందును కానరానట్టి అసమానసౌందర్యము గలిగి, శాశ్వతముగ నిలుచునట్టి యొకగోరీని కట్టింపవలెను." అని తుదిపలుక్కులు పల్కి గోహన్-ఆరాను ప్రసవించిన మరుక్షణమే, కోమలకాయమును వదలి భగవత్సాన్నిధ్యమున కరిగెను.

షహాజహాన్ చక్రవర్తిదుఃఖము వర్ణనాతీతము. దుఃఖాబ్ధిలో మునిగిన అతను ఒక వారమురోజులు, ఏవిధమైన రాజకార్యములను చేయజాలకపోయెను. దుఃఖతీవ్రతచే, సర్వమును త్యజించి, సన్న్యాసిగావలంచెను. కాని గుణవంతుడైన అతను, ఈశ్వరుడు తనపైమోపిన రాజ్యపాలన భారమును అట్లు త్రోసిచనుట, ఘోరపాప మని యెంచెను. ప్రియభార్యామరణానంతరము, చక్రవర్తి, ...ను, వజ్రవైడూర్యాభరణాదులను ధరించుట మానెను. సుగంధలేపనాది సకలవిధ భోగములను పరిత్యజించెను. ఉత్సవాదులందు పాడెడు మంగళగీతికలు, వివిధ వాద్యనినాదములు అతనిచెవులకు శోకపూరిత ప్రలాపగీతములవలె వినపడుచుండినందువల్ల, వాటినెల్ల ఆపివేయునట్లాజ్ఞాపించెను. ఆమె సమాధియొద్దకు వెళ్లినప్పుడెల్ల, దానిపై అతని కన్నీటికాలువలు వెల్లువలై పారుచుండెను. "రాజ్యము సర్వశూన్యముగ కన్పట్టుచున్నది. జీవితమే జుగుప్సాకరమైన"దని అతికరుణముగ పలువరించుచుండెడివాడు. చక్రవర్తికి ముంతాజ్ బీగముగాక, ముసఫర్ ఖాన్ అనునతని పుత్రికలైన, మిర్జా, షాహ్ అను నిరువురుభార్య లుండిరి. ఐన, ముంతాజ్ యొక్క పవిత్రప్రణయసుధాంబుధిలో ౨౦ సంవత్సరములు ఓలలాడిన అతనికి, వీరి సఖ్యము కేవలము వ్యవహార సంబంధముగ తోచుచుండెనేకాని, ప్రేమబంధముగ నేమాత్రమును కన్పట్టుచుండలేదు.

చక్రవర్తినియొక్క దేహమును భూస్థాపన మొనర్చుటకు, ఆగ్రా దక్షిణదిక్కున విశాలావరణము రాజా జైసింగ్ (రాజా మానసింహుని పౌత్రుడు) వద్దనుండి క్రయమునకు తీసికొనబడెను. హైందవశిల్పులలో నిపుణులైన వారికి గోరీనమూనాను సిద్ధపరచు బాధ్యత ఒప్పగింపబడెను. వాటిలో చక్రవర్తి మెప్పువడసిన ఒక నమూనా యొక్క ప్రతిరూపము మొదట కఱ్ఱతో చేయబడెను. తరువాత తాజ్ మహాలు ౧౬౩౧-వ సంవత్సరపుమొదటిలో ప్రారంభింపబడి, ౧౬౫౩-వ సంవత్సరపు జనవరిమాసములోపుగా 3 కోట్ల రూప్యముల వ్యయముతో అల్లారుముద్దుగా పరిసమాప్తి యయ్యెను. కట్టడము నిర్మాణమందు పాల్గొనిన శిల్పులలో నీదిగువ పేర్గొనినవారు అతిముఖ్యులు—



౨. మహాలుయొక్క- సంపూర్ణదృశ్యము

౧. అమరనాథ్ ఖాన్-షిరాజ్. కాంధారదేశస్థుడైన యితడు, మహాలునందు 'తుఘ్రా' శాసనములను వ్రాసియున్నాడు.

౨. శిల్పకలాకోవిద 'ఐసా'. ఇతడు తాపీపని చేసినవాడు. ఇత డాగ్రాదేశస్థుడు.

3. శిల్పిశ్రేష్ఠుడగు 'పైరా' అను నితడు వడ్రంగి. ఇతనిది ఢిల్లీనగరము.

౪-౬. భానుహార్, జాత్ మాల్, జోరావార్. ఢిల్లీనివాసులైన వీరు ముప్వురును రాతిలో లతాగుల్మాదులను, విగ్రహాదులను చెక్కిన నిపుణులైన శిల్పులు.

౭. ఇస్మైల్ ఖాన్‌రుమి. ఇతను మహలుయొక్క ప్రధానగోపురమును, దానికి ఊతగా నొసగియుండు పరంజాను నిర్మించిన నేర్పరియైనశిల్పి.

౮. రామ్‌మాల్ కాశ్మీరీ. ఇతడు తోటమాలి.

ఈదిగువ పేర్కొనబడిన అమూల్యరత్నములు తాజ్ మహలునందు అమర్పబడియుండెను:—

౧. కార్నేలియన్ (Cornelian). కాంధారదేశమునుండి తేబడినది.

౨. లాపిస్‌లాజులి (Lapis lazuli) అను నైడూర్యము- సిలోనునుండి తేబడినది.



౩. మహలుయొక్క ప్రతిబింబము

౩. ఓనైక్స్ (Onyx)

౪. పాటుంజా (Patunja)- ఆఫ్రికాయందలి నైల్ నదిలో దొరకినది.

౫. సువర్ణము (సువర్ణ శిల Goldstone ?)- బాస్రాపట్టణము, ఓమస్ జ్ సముద్రములనుండి తేబడినది.

౬. ఖాటు (Khatu)-జోద్‌పురపు పర్వతముల నుండి తేబడినది.

౭. అజూబా (Ajuba) - కుమయోన్‌నందలి పర్వతనదులయందు దొరకినది.

౮. మార్బుల్ శిల (Marble) - మక్కానుండి తేబడినది.

౯. మారియామా (Mariama) - బాస్రాపట్టణమునుండి తేబడినది.

౧౦. బాడల్ శిల(Badal stone)-బనాస్‌నదిలో దొరకినది.

౧౧. యామినీ (Yamini)-యెమెన్ (?) నుండి తేబడినది.

౧౨. మంగాహ (Mungah) -అట్లాంటిక్ సాగరమునుండి తేబడినది.

౧౩. ఘోరి (Ghori) - ఘోర్ బాంక్సునుండి తేబడినది.

౧౪. టామ్రా (Tamrah) - గండకీనదినుండి తేబడినది.

౧౫. గరుడపచ్చయను రత్నము (Beryl)- బాబా బుడన్‌కొండలనుండి తేబడినది.

౧౬. ముసాయి (Stone of Moses ?)— సినాయ్‌పర్వతములనుండి తేబడినది.

౧౭. గ్వాలియర్ (Gwaliore)—గ్వాలియర్ నదిలో దొరకినది.

౧౮. ఎఱ్ఱయిసుకరాయి(Red Sand Stone)- నానాస్థలములనుండి సంగ్రహింపబడినది.

౧౯. ఒకరకపు పచ్చరాయి (Jasper)-పెర్షియా దేశమునుండి తేబడినది.

౨౦. దాల్‌ఛానా (Dalchana)—అసామ్ నదిలో దొరకినది.

## మహలుయొక్క మాన్యములు

రాణియొక్క ౧౨-వ ఆబ్దికమునాడు (౧౬౪౩ వ సం. జనవరి, ౨౭-వ తేది) మహాజహాను, తాజ్

మహాలును ప్రవేశించి, ఆగ్రా, మరియు నాగార్చి పరగణాలయందలి ౩౦ గ్రామములను ఈ మహాలుకు మాన్యముగ దయచేసెను. వీటిలో సంవత్సరమునకు లక్షరూకలు రాబడివన్ను చెల్లుచున్నది. ఇదిగాక, గోరీకి సమీపమునందు కట్టబడిన దుకాణములు, ఇండ్లు మొదలైనవాటిలోనే మరియొకలక్షరూప్యములు అద్దె వ్రోవసుచున్నది.

ఈ ధనము, మహాలును తరచు చక్కబెట్టు చుండుటకును, అందు ఉంచబడిన ధర్మనిష్ఠాపరులైన ఫకీరులు మొదలైనవారికి జీవనాంశము లొసగుటకును వినియోగింపబడుచున్నది.

## మహాలుయొక్క అందచందములు

మూడుకోట్ల రూప్యముల వ్యయముతో, ౨౨ వేలశిల్పులచే ౨౨ సంవత్సరములు కట్టబడిన ఈ మసమానమన్న అతిశయోక్తి గానేరదు. ప్రపంచమునందలి యపూర్వవస్తువులలోనెల్ల యపూర్వమైన ఈ మందిర మొక పెద్దముత్యమువలె కడు మనోహరముగ కడుశోభాయమానముగ కేవలము వర్ణనాతీతమై వెలుగుచున్నది. ఎఱ్ఱ చలువరాతిచే కట్టబడిన సింహద్వారముపై, ఖురానునందలి ఉత్తమపదజాలములు పుష్పలతాదులతోగూడి అతిచతురముగా చెక్కబడినవి. దాని తరువాత సగముబిలువంపుగా కట్టిన సరంబియందు (Demi vault) పలు రంగుల పుష్పలతాదులు అలంకరింపబడినవి. దానికావల సస్యశ్యామల మైన పూదోట మధ్యన చంద్రకాంతశిలచే చదునుచేయబడిన మార్గము అత్యంతరమణీయము. ఈమార్గమున కిరుప్రక్కలను, దట్టమైన పత్రసముదాయముతోగూడి స్తంభములవలె నుండు తమాల వృక్షములశ్రేణి దుఃఖభారముచే శాంతముగనుండు ఆస్థల గంభీరత కేయాటంకము రానీయక కావలిగాయుచున్న పహారాజవానులో యన్నట్లు కన్పట్టుచున్నవి. ఈ ప్రశాంతమార్గమునకు తుట్టతుదను, మార్గమధ్యమున నందందు అమర్పబడిన జలయంత్రములు, వేదికలు అన్నిటికినావల చంద్రకాంత శిలా నిర్మితములైన మందిర గోపురములు ప్రకాశించుచున్నవి. నట్టనడుమనుండు ప్రధాన గోపురము రజతాద్రివలె మెరయుచు చూపరదృష్టిని చూరగొనుచున్నది. ఆ చంద్రశిలాస్థిత మార్గమున నడచుచు, ఆగోపుర సౌందర్యమును తిలకించుచున్నప్పుడు ప్రతివారి హృదయములందును, షహాజహాను చక్రవర్తి యొక్క నిర్మలప్రేమప్రభావమే పొంగి పొరలుచుండును! ఎండవేడిమి యెంతయుగ్రముగ నున్నను. యిచ్చటమాత్రము తాల, తమాల, అశ్వత్థాది వృక్షముల చల్లని నీడవల్ల, తాప మేమాత్రమును సోకుటలేదు, వేడిగాలిసైతము జాజి, మల్లె, గులాబి మొదలైన పుష్పపుంజముల నెత్తావిచే చల్లబడుచున్నది. వెన్నెలకాలములందు, మహాలుయొక్క ప్రధానగోపురము శీతల చంద్రకిరణములలో తళతళ మెరయుచు చూపరను విస్మయపరచుచుండును.



౪. పార్శ్వదృశ్యము

చంద్రశిలామార్గమందలి మొదటి వేదికను సమీపించగానే హిమశైలశిఖరమువలె విరాజిల్లు గోపురము కాననగును. అకస్మాత్తుగా ఒక సుందరవదనారవిందమును చూచినప్పుడు, ఎట్టివారైనను దానిఅందమున కచ్చెరు వొందుదురేకాని, విమర్శచేయసాహ

సింపరు. అల్లే, ఈ మందిరపు గంభీరాకారమును కనుగొన్నతోడనే ఒకవిధమైన ఆనందము కల్గును. మరణముచే విస్మృతి జెందనీయకుండుటకు, పవిత్ర ప్రేమ, యెంతటి ఉద్రేకముతో పోరాడి విజయము గాంచియున్నదని ఆశ్చర్యానందవిస్మయములు కల్గి తన్మయులగుదుము. ఈ ఐక్యానుభవమున దుఃఖసమ్మిళితమైన మాధుర్యమెుండున్నది. అయ్యది అనుభవైకవేద్యము. సింహద్వారముపైన, "నిర్మలహృదయులు ఈశ్వరుని యుద్యానము ప్రవేశింతురు" అని అరేబియా భాషలో వివిధములగు నగిషీపనులమధ్యన చిన్ని అక్షరములు చెక్కబడినవి. ఈముద్దుగులుకు అక్షరముల తిలకించునప్పుడు, చక్రవర్తి అంతఃపురపు అనన్యమణియైన ముంతాజ్ మహలు యిచ్చట దీర్ఘవిశ్రాంతిని పొందుచున్నదని నమ్రతతో తెలుపుచున్నవో అన్నట్లు తోచును. మరియు, ఇవి ఆద్యంతరహితుడైన భగవంతునిమహిమ వేనోళ్ల బొగడుచున్నట్లు పొడకట్టును. పత్రములు పచ్చని జెండాలవలె వింతవిన్నాణము నొసగుచున్నవి. ఈతరువుల నడుమ నడుమ కనబడు చంద్రశిలామార్గపుతళతళలు ఎంత జూచినను తనివితీరదు. ఈమహలు ఒకనిర్జలమైన యెడారిప్రదేశమునందు కట్టబడియుండినను, తన సౌందర్యమహిమచేతనే ఆ ప్రదేశమును సారవంతముగ నొనర్చి, మృత్యువుకంటెను శక్తివంతమైన నిర్మలప్రేమయొక్క ప్రభావమును కనబరచునట్టి దృష్టాంతముగ నుండియుండును. స్వచ్ఛధవళకాంతుల నీను ఈమందిరముచుట్టును నడచుచు పోయిన, ఒకవైపున పవిత్ర యమునాప్రవాహము, మందిరప్రాకారకుడ్యములను తన నిర్మలజలములతో ప్రక్షాళనము చేయుచుండుట కానవచ్చును. కట్టడము నలుచదురముగ కట్టబడినది. ఒక్కొక్కవైపునను ౧౦౦ గజముల కంటె నెక్కువనిడివి గలిగియున్నది. నీలాకాశమున మెరయుచుండు గోపురాగ్రము ౨౭౭ అడుగుల ఔన్నత్యము కలిగియున్నది. దూరమునుండి జూచిన, ఈకలశము, దిఙ్మండలముపైన ఒకసుందరమైన తెల్ల జీమూతముభంగి కనపడును. దీని అసమానమైన అందములో లీనమై అటువైపే నడచుచు పోయిన, నేరుగా అర్జుమంద్ మహారాణి సమాధిని సమీపింతుము. ఈప్రదేశము చాల సరళముగ, నిరాడంబరమైన అలంకరణములు గలిగి ప్రశాంతమైయున్నది. ఇచ్చట ఒక పవిత్రజ్యోతి ప్రకాశించుచున్నట్లుండును. చక్రవర్తినిదేహము నుంచిన విశాలావరణమునందును, స్తంభములపైనను, నిలువుటద్దములు, చిత్రపటములు మొదలైనవాటి చట్టములపైనను, అచ్చటచ్చట నమర్పబడిన తెరలవలె నుండు చలువరాతి కటకటీలపైనను ఫలపుష్పలతాదులు, మృగములు, పక్షులు, అక్షరపఙ్క్తులు మొదలైనవి చాల నేర్పుగా చెక్కబడినవి. ఈ చెక్కడపుపనిలో మధ్యమధ్యన పచ్చరాళ్లు, గోమేధికములు, ముత్యములు, వజ్రవైడూర్యములు మొదలైన ఉత్తమోత్తమరత్న



౫. మహలు వెనుకభాగము

## ఉద్యానము, గోపురము

సౌందర్యమున నివి ఒకటినొకటి మించుచున్నవి. ఆసియాఖండమందలి ఉత్తమరకపుచెట్లనేకములు ఇచ్చట అమర్పబడినవి. నెమరుపొదరులు, మఱ్ఱిమ్రానులు వీటిచుట్టును పెంచబడిన కదళీతరువుల విశాల

ములు అమర్పబడియుండెను. ఆకాలపు శిల్పుల అద్వితీయ కళా నైపుణ్య వైభవము లిందు ప్రతిఫలించుచున్నవి. ముంతాజు బీగముయొక్క సుందర సుకుమారశరీరమును పాతిపెట్టినస్థలము, మందిరపు నట్టనడుమ సుస్నిగ్ధచంద్రకాంతశిలచే వలయాకారముగ ఎదురు చేయబడి గుర్తింపబడినది. పూర్వము న బాలసూర్య ప్రభాదీపితంబై యొప్పు పెద్దవజ్ర మొండు ఈ పవిత్ర సమాధిపై సముచితముగ నలంకరింపబడి యుండెను. చక్రవర్తిని సజీవయై యుండినకాలమున నా వజ్ర మామె మకుటము నలంకరించియుండె నట. షహాజహాను సార్వభౌముడు తన అగాధప్రేమకు సాక్షిభూతముగ నెలకొల్పిన ఈ శ్రేష్ఠమణులలో అనేకములు నేటికాలమున గాన రాకుండుట కడు విషాదకరము. ఈ సమాధికి చాల దీనికంటె జేనెడు యెత్తుకల వేదికయొకటి కట్టబడినది. ఇయ్యది ఆర్జుమందు ప్రియభర్తయు, ప్రభువు ఐన షహాజహాను సమాధి. ఇతడు అతిలోకసుందరియైన తన మోహంపురాణి జీవముల నిలుపుకొనజాలక పోయినను, ఆమె స్మారకచిహ్నమును ఆచంద్రతారార్కము నిలుపగలిగెను. భార్యావియోగ దుఃఖముచే, ఇతను, మహలునందు వ్రాయించియుండెడు సకరుణమైన కొన్ని వేదాంతవాక్యము లిట్లున్నవి:—



౬. లోనైపునుండి కనబడు సింహద్వారదృశ్యము

"ఈ ప్రపంచము ఒకవ్యాధివంటిది. దీనిపై నడవ తగునేగాని, నిలుకడగనుండ నిచ్ఛగింపరాదు. ఈయైహిక ప్రపంచము క్షణభంగురమైనది. ఈక్షణమును ఈశ్వర ధ్యానములో పవిత్రతమముగా కడపుట శ్రేయము."



జైన దేవాలయములు, హంపీశిథిలములు

—కే. యల్. నరసింహాచార్యులు, గుంతకల్లు.

# గ్రంథ ప్రకటనము

'భాషాభిమాని'

ఆంధ్రదేశమున నేడు కవులకు రాజాదరణము గణింపదగినంతగా లేకున్నది. పోనీ పాఠకు లున్నారో, తేరగా పుస్తకములు లభించిన చదువువారే గాని, కొనియైనను చదువవలె నను నభిలాష గలవారు మిక్కిలి తక్కువమంది కనబడుచున్నారు. ఎంతటి యుత్కృష్టగ్రంథమైనను, ఎంతటినూతనవిషయసంకలితమగు గ్రంథమైనను, ఎంత ప్రకటన జరిగినను నూరుప్రతు లమ్ముడైన మెచ్చదగ్గవిషయము. ఎక్కడనైనను కులాభిమానమును ప్రేరేపించి యిల్లిల్లు తిరిగి మఱికొన్ని ప్రతు లవనముగా నమ్మగల్గినవారు కొంతమంది యున్నమాట వాస్తవమే. అది ప్రత్యేకవిషయము.

పదిమందిచేరి పోషించు గ్రంథాలయములైనను గ్రంథములను గొని గ్రంథకర్తల నాదరించి సద్గ్రంథప్రకటనకు సహాయపడుట మిక్కిలిధర్మము. అయితే గ్రంథాలయాధికారు లేమిచేయుచున్నారు? "మీ గ్రంథమును దయయుంచి యుచితముగ మా గ్రంథాలయమునకు బంపు"డని మనవియొకటి ముద్రింపించి గ్రంథకర్తలకు బంపుచున్నారు. తపాలారుసుమును గ్రంథకర్తలు భరింపవలసినదే. పత్రికలకు, పండితులకు మఱికొన్ని ప్రతులను విమర్శనార్థము గ్రంథకర్తలు పంపుకొనునాచార మొండుగలదు. అందుచేత భాండాగారములనుండియో, పత్రికాకార్యస్థానములనుండియో, పండితుల ద్వారముననో పెక్కురు నూతనగ్రంథములను చదువ బడయగలరు. ఇంక నెవ్వరు గ్రంథములను గొని చదివెదరో! గ్రంథకర్తలకు ప్రోత్సాహ మెటనుండి వచ్చునో!! ఎంతకాలమునకు నమ్ముడుకాక చెదకు భయపడియో, స్థలసంకోచముచేతనో గ్రంథకర్తలు కాగితములవెలకు తమగ్రంథములను రైల్వేవాఙ్మయోద్ధారకులగు గ్రంథవిక్రేతల కమ్ముచున్నారు. ఆవిక్రేతలు మిగిలిన పుస్తకములతోపాటు అణాకు, బేడకు – విలువగల యాగ్రంథములను అమ్ముచున్నారు. ఐనను వారావిధముగనైన గ్రంథవ్యాప్తికి సహాయపడుచున్నారుగదా!

తెనుగుగ్రంథమాలలసంపాదకులైనను గ్రంథకర్తలకు దగినంతప్రోత్సాహ మొసగుటకు దేశీయులు వారి యుద్యమము నభిమానింపనిది యవకాశ మెట్లుండును? స్త్రీవిద్య యెక్కువవ్యాప్తి నొంది, స్త్రీపాఠకులసంఖ్య పెరిగిన గ్రంథములు కొనువారిసంఖ్య యెక్కువ కావచ్చునేమో! నేడు ముఖ్యముగా సామాన్యవిద్యావంతులు చదివెడుపొత్తముల కమ్మక మెక్కువగా గనబడుచున్నది. అందుకుగారణము వారి యభిరుచుల కవి సరిపోవుటయు, రైళ్లలో చౌకగా నమ్మబడుటయు నైయున్నది.

కాని నేడు తెనుగుదేశమున పుస్తకవ్యాపార మొండు జరుగుచున్నది. పఠనీయగ్రంథరచయితలు, ప్రచురణకర్తలు ముఖ్యముగా నీవ్యాపారము చేయుచున్నారు. సద్గ్రంథప్రచురణాభిలాషకంటె పెక్కుమందిని ద్రవ్యసంపాదనయే యిందు కాకర్షించుచున్నది. ఎవ్వరిచేతనో గ్రంథములు వ్రాయించి, ప్రచురణకర్తలు ఆగ్రంథము లామోదింపబడుటకును, బహుళవ్యాప్తిని బడయుటకును సహాయపడునట్టి విద్యాశాఖాధికారులను వారియామోదముతోనే గ్రంథకర్తలని ప్రకటించుటకూడ గలదట. కొన్నియెడల నట్టివారు స్వల్పమగుసలహా లిచ్చియుండవచ్చును. అంతమాత్రమున గ్రంథకర్తలు కారుగదా!

పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారు పూర్తిగా బరిశీలించి యామోదించుచున్నారా? గ్రంథకర్తల డిగ్రీలు, నామములు వారి నాకర్షించుచున్నవేమో! వాచకగ్రంథములలో నుండరానిదోషము లున్నను ఆమోదించుట యెవరిలోపము? నవలలు, నాటకములు, వచనగ్రంథములు ఆమోదింపబడినవన్న చాలునా? ఏతరగతికో నిర్ధారణచేయుట నేడవసరముగా గన్పట్టుచున్నది.

పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువా రామోదించిన గ్రంథములనుండి స్థానికసంస్థలయధ్యక్షులు ఆయా తరగతుల కాయా రచయితలగ్రంథములని మరల నిర్ధారణ చేయవలసియున్నది. అటుల నిర్ధారణ చేయుటలో నధ్యక్షులు గ్రంథకర్తలయొక్కయో, ప్రచురణకర్తలయొక్కయో, వారిప్రతినిధులయొక్కయో పలుకుబడిని ఎక్కువగా గమనించుచుండిరనుట సత్యము కాదని యెవ్వరనగలరు? విద్యార్థితరగతి, అతని వయస్సు, గ్రంథముయొక్క శైలి, విషయము, అర్హత, వెల విచారింప నవకాశము వారికి లేదు. అట్టివిచారణ చేయుటకైనను స్థానికసంస్థల కెల్లప్పుడు విద్యాధికులే యధ్యక్షులుగా లభింతురని చెప్పనేరము. విద్యాధికులు లభించినను న్యాయము చేయునవకాశము వారికి నుండదు. జాతీయాభిప్రాయములకు ద్రోహవ మిచ్చు పుస్తకములను పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారు ఆమోదింపరు గదా! అట్టియెడల నీయధికారము ప్రభుత్వము వారు ప్రధానోపాధ్యాయుల కొసగిన మంచిదిగా దోచుచున్నది. సాముదాయిక లాభనష్టములకు కారణమగు పాఠ్యగ్రంథములను నిర్ణయించుటలో పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారుగాని, స్థానికసంస్థల యధ్యక్షులుకాని స్త్రీలువ్రాసిరని గాని, నిమ్నజాతులు వ్రాసిరనిగాని భావింపక యర్హతయే ముఖ్యముగా గమనింపదగ్గది. స్త్రీలను, నిమ్నజాతులను ప్రోత్సహించుట కన్యమార్గములు గలవు.

విద్యాశాఖాధికారులుగాని, యన్యులుగాని విద్యావ్యాప్తిని మనస్సులో నుంచుకొని దేశసేవాతత్పరమతులై గ్రంథములను వ్రాయవలెనేగాని వ్యాపారమునకై గ్రంథములనువ్రాయుట నింద్యము. విద్యాశాఖలో బనిచేసి పించెను పుచ్చుకొన్న వాచకరచయిత యొకరు తనవాచకములను బోర్డుపాఠశాలలలో నుంచగలందులకా గ్రంథములను విద్యాధికులు, మామిత్రులు నగు నొక తాలూకాబోర్డుప్రెసిడెంటుగారికి బంపియుండిరి. అయితే, అడిగిన వారికెల్ల మేలుచేయవలె ననుకొను దుర్బలహృదయు లాప్రెసిడెంటుగారు. పాఠ్యగ్రంథములను నియమించుటలో ముఖ్యముగా నట్టిదృష్టి యెంతమాత్ర ముండరానిది గదా! నేను గ్రంథములందలి ముఖ్యదోషములను గుర్తుపెట్టి ఉన్నవానిలో నానందవాచకములే సర్వోత్తమమైనవని నాయభిమతమును జెప్పితిని. పైతరగతులకు ఉత్తమమైన శ్రీవాచకములు, వివేకవాచకములు నిన్ననేను వెలువడినవి. పైవాచకరచయిత స్వయముగ ఆతాలూకాబోర్డుప్రెసిడెంటుగారిని జూడ వచ్చిరి. ఆసమయమున వారిగ్రంథములోపల దోషముల సంగతి యేమనియడిగితిని. వారు సమాధానమును జెప్పనేరక 'పండితునిచేసవరింపించితినండీ' యనిరి. కళా, ద్రుత ప్రకృతికముల జ్ఞానమైనను వారికి లేకుండెను. ఒకానొక భాగవతకథల గ్రంథకర్తయు నాల్గయిదు తరగతుల కుపవాచకముగా తనగ్రంథమును నియమింప నడుగవచ్చిరి. ఆగ్రంథముయొక్క శైలి కళాశాలవిద్యార్థులకు బోధపడునేమో! అక్కడక్కడ కొన్నివాక్యములు చదివి వినిపించి "యిట్టికఠినశైలిగలగ్రంథము ఆతరగతుల కెట్లుపకరించును? ఆగ్రంథము ప్రాథమికోపాధ్యాయులకు బోధపడునా?" యంటిని. పాప మాయన భాగవతములోని వేదాంతఘట్టములనుగూడ విడిచినారు కాదు. ఆయన జవాబు చెప్పనేరక కాబోలు, కొన్ని తాలూకాబోర్డులలో బెట్టినారని ఆతాలూకాబోర్డులపేర్లు చెప్పి సెలవు పుచ్చుకొనిరి. వాస్తవము ఆయనకుమాత్రము తెలియదా?

ఉన్నతవిద్యావంతులు, మహోదారమనస్కులు, న్యాయపథమును వీడకుండ పరిపాలనచేయవలె నను నభిలాష గలవారు నగు జిల్లాబోర్డధ్యక్షు లొకరు పాఠ్యపుస్తకనిర్ణయవిషయమున సిఫార్సు లిచ్చుట, వానిని గమనించుట ధర్మయుతము గాదని చెప్పిరట. అట్టివారును బూర్తిగా న్యాయపథమునే యనుసరించిరని వారు గ్రంథనిర్ణయము చేసినపట్టికను జూచిన జెప్పనేరము. పాపము వా రేమిచేయగలరు? ఎన్నికలవిధాన మట్టిది. నేటియార్థిక దుస్థితిని గమనించిన ప్రాథమికపాఠశాలల పుస్తకములనైనను, తరుచు మార్చుట మంచిదికాదనిపించుచున్నది. పాఠశాలలలో గరపు ప్రతివిషయమునకు నచ్చుపుస్తకములు పిల్లలచే గొనిపింప నవసరము లేదని తలంతును.

# ఆధునికచిత్రకళయందలి లోపమేమి?

"ఆధునికచిత్రకళయందలి లోప మేమి ?" యను ప్రశ్న యందలి దురభిప్రాయ మీయుగలక్షణము. పద్ధతులయందు తమయిచ్చవచ్చినట్లు మార్పుల జేయువారివలె కొందరు కళోపాసకులచేత మార్పులను జెందిన కళ వారి యిష్టానిష్టములకులోంగి ప్రపంచమున కేలాటి సంబంధములేని, వేరొకవస్తువని నవీనులు తలంచుచున్నారని తేటపడగలదు.

కళ ప్రపంచగతినిబట్టి మారుచుండునుగాని ఏదే నొక యస్వాభావికమగు కారణమువలన తటాలున మార్పుజెంది క్రొత్తవస్తువుగా పరిణమించదు. ఏ యుగమునం దది యుద్భవించునో ఆయుగలక్షణముల నా కళ ప్రతిబింబించుచుండును. ప్రాచీనకాలపు కళయైనను, ప్రకృతపు కళయైనను ప్రపంచనాగరకతతో మిళితము కానంతమాత్రమున దోషపూరితమైన దనుటకు వీలు లేదు. గూఢముగ నుండవచ్చును, లేక సులభముగనర్థము గాకపోవచ్చును గాని కళయందు దోషమున్న దనుటకు వీలులేదు. శీతోష్ణస్థితికిని చెట్లుచేమలకును ఎట్టి సంబంధమున్నదో అట్టిదే కళకును, అది పుట్టినకాలమునకును గలదని చెప్పవచ్చును. తాటిచెట్లు ఉష్ణమండలములందు మాత్రమే బ్రతుకగలవు. అతిశీతలమండలములందు బ్రతుకలేవు. ఈస్థితి మనకు విస్మయకారణ మగుట లేదు. ఎక్కడ ఉండునవి అక్కడనే యుండవలయునని మన మంగీకరించుచున్నాము. కళాప్రపంచమందుసయితమట్టిభావమే యుండవలయును.

ప్రతియుగమందును కళ ప్రత్యేకరూపమున అవతరించుచున్నది. గ్రీకులకు శౌర్యసాధనయందు గల పిచ్చినమ్మకము, మధ్యకాలమందలి బర్బరుల మతావేశము, పునరుజ్జీవనకాలమందలి క్రొత్తదనము ఏవిధముగ కళయందు ప్రత్యేకశైలితో ప్రత్యక్షముగ నుండెనో అట్లే యిపుడును మన "ఆధునిక" మనెడి కళ మన యుగలక్షణముల ప్రతిబింబించుచున్నది. నూటయేబది యేండ్లకు పూర్వము కళాభావముయొక్క రీతి కవిత్వమందు పల్లెలవారి పనిపాటలను భావోద్రేక ముట్టిపడున ట్లుండెను. మరియిపు డట్లుగాదు.

రాజకీయములయందు సంస్కరణ లెట్లుగలుగు చున్నవో, వాటి ననుసరణముగనే నేటికళయు మార్పు జెందియున్నది. శాస్త్రములు, కల్పనలు ౧౫-వ శతాబ్దము మధ్యకాలమునుండి పాశ్చాత్య నాగరకత నావరించి యున్నవి. అందుమూలమున, కళయం దంతకుపూర్వ ముండిన విచిత్రము పోయి స్వాభావికత ఏర్పడినది. కాని యుద్ధానంతరము ప్రబలిన వేదాంతమార్గము కళ యందు భావప్రాధాన్యమును, సరళతను వృద్ధిచెందించు చున్నది. కళ ఏకాలమునకు సంబంధించియుండునో ఆకాలమందు వర్ధిల్లు నూత్నభావములయొక్క ప్రతిబింబమని చెప్ప నొప్పును.

నేటికాలపు కళ సరళముగను, మానసికప్రవృత్తిని తెల్పునట్టిదిగను ఉన్నను, అయ్యది అస్వాభావికముగ ఉన్నదని కొంద రనుచున్నారు. లోకులందరు సామాన్యముగ నిట్లేతలంచుచున్నారు. కళయను దానిని సరిగ నెరుగనివారు, ఏదయిన చిత్రమునుకాని, శిల్పమునుగాని చూచినపుడు, అది ప్రాణవంతమగు దానికి సరియైన ప్రతియైయుండిన, చాలమెచ్చుకొని చిత్రకళయొక్క ముఖ్యగుణ మిట్టిదని యనుకొను చున్నారు. స్వభావ విరుద్ధముగ చిత్రించియున్న వానిని చూచినపుడు వాని తత్త్వమును ప్రజ లెరుంగలేకపోవు చున్నారు.

ప్రస్తుతపు చిత్రకారులలో కొందరు వస్తు వెట్లున్నదట్లే చిత్రించుచున్నారు. కన్నుకాని, వేలు

గాని చాలస్వాభావికముగ గన్పడును. మరికొందరు చిత్రకారులు కడకు ఒకచేయినిగాని, పాదమునుగాని చిత్రించలేకయున్నారని ప్రజలు పొరవడుచున్నారు. అందువలన సామాన్యమానవుడు కళయందు తనకు దురూహ్యములైన సాంకేతికవిషయము లున్నవని తలంచుచున్నాడు. చిత్రరచనము అసలుకు సరిపోవునట్లుండుటయే సామాన్యునికి తెలిసిన విషయము. అట్లుండునదియే ఉత్తమమయిన స్వాభావికచిత్రకళయని యాతనియభిప్రాయము. నిజమైన శిల్పిగాని, చిత్రకారుడుగాని సాంకేతిక విషయములకు లోబడనివాడని యితనికి నచ్చజెప్ప బూనుట నిష్ప్రయోజనము. చిత్రకారుడు చిత్రించినదానికన్న అతడాచిత్రమందు చిత్రించు భావములు ప్రధానము లనువిషయము నతడు గమనించుటలేదు. ఒకే విషయమును చిత్రించవలసినపుడు ౧౭-వ శతాబ్ది చిత్రకారుడును, నేటి చిత్రకారుడును ఎట్లు రచించిరో పరిశీలించిన పై విషయము తెల్లమగును. ఎర్మియరు, మెటీసె అను నిద్దరు చిత్రకారులు నారగుడ్డపై "పియానోపాఠ" మనెడి చిత్రమును చిత్రించిరి.

వర్మియరు, సలక్షణమయిన డచ్చి గృహాంతర్భాగమును చిత్రించెను. పియానోదగ్గర కూర్చునియున్న ఒక అమ్మాయియును, ఉపాధ్యాయుని గంభీరమైన ఆకారమును ఇందు గననగును. అన్నిట, ఈచిత్రము గొప్పదనిపించు కొన్నది. ఈచిత్రమ, చిత్రకారుడు సొగసయిన బొమ్మను చిత్రించవలయునను యభిప్రాయమును వెల్లడిచేయుచున్నది. ఈచిత్రము అందరిని రంజింపచేయునట్టిదనుటలో సందేహము లేదు. "పియానోపాఠ" మనుటలో చక్కని గృహాంతర్భాగమునకన్న కొంత ఎక్కువయున్నదని తోచగలదు.

ఇకమెటీసే వ్రాసిన చిత్తరువు ఎట్లున్నది? పియానోపాఠమనగా- ఒకచిన్న బాలుడు ఇష్టములేక, అతి విలువయైన తన ఆటకాలమందొక అరగంట, ఈసంగీత వాద్యము నెదుట గడపుటయని యాతనిభావము. ఇందాబాలుని తలమాత్రము చిత్రింపబడియున్నది. పటమందలి తక్కిన భాగమంతయు పియానోపాటలతోను, పియానోతోను నిండియున్నది. విసుగుతనము, ప్రయత్నముమీద తెచ్చుకొన్న మనస్స్థిమితము అనుమొదలగు భావము లీబొమ్మయందు అతినిపుణతతో చిత్రింపబడియున్నవి. ఈచిత్రమందు వాద్యమునకు ముఖ్యస్థాన మొసగబడియున్నది. చిత్రమున మరియొకచో ఒకముసలామె చేతులు జోడించుకొని, యీపిల్లవాని బాధగమనించునట్లున్నది. ఇదంతయు చిత్రమందు గన్పడు విశాలమగు గదులయందు లీనమై యున్నటులు మనకు గోచరము కాగలదు. ఇచ్చోటగల యినుప కమ్మల కిటికీలవలన ఇందు శిల్పము గూఢ యున్నటుల స్ఫురింపజేయుచున్నది.

ఈరెండుచిత్రములును వేరువేరుగ నున్నవి. వర్మియరుచిత్రమందు భావము శూన్యముగను, మెటీసె చిత్రమందు పూర్ణముగను గలదు. ఈరెండును చిత్రకారుల మానసికప్రవృత్తుల దెల్పుచు వారు జీవించి యుండిన కాలమందలి పోకడల విస్ఫుటముచేయుచున్నవి.

ఉన్నదున్నట్లు వ్రాయుట నేటిచిత్రకారులకు తెలియనిది కాదు. కాని వారట్లు చేయుటలేదు. ౧౭-వ శతాబ్దమందలి డచ్చిచిత్రకారులు దృష్టికి గోచరమగు నట్లే చిత్రముల చిత్రించుచుండిరి. వీరి కీవిధమయిన చిత్రరచనయందొక ప్రత్యేకమగు ఉపజ్ఞ యుండినదిగాదు కాని, వీరి కీపద్ధతియందు ఆసక్తి మెండుగ నుండెను. చిత్రరచనయందు వస్తువుయొక్క స్వాభావికలక్షణములు కనబడకపోయినయెడల ప్రజలు దీనిని అర్థముచేసికొనలేక బాధపడుచున్నారు. ఎందువలననగా చిత్రింపబడిన వస్తువునకును దానియొక్క నిజస్వరూపమునకును అంతరము చాలగలదు. ఆశతాబ్దినాటివారికి, చిత్రరచనా పరీక్షకుండిన ప్రమాణమింతియే.

"గొప్పకళ"ను గుర్తించుటకు పూర్వకాలపు కళయొక్క స్థితిని చక్కగా నెరిగియుండవలయును. ఏకాలమందయినను కళ, బాగుగనున్నదా, లేదా, యను విషయము ఆకాలమువారు చిత్రములను, వాటి అసలు వస్తువులతో పోల్చిచూచి అందుమీదట చెప్పుచుండిరి. చిత్రకళాచరిత్రమును చదివిన యెడల కళను గూర్చి కొన్ని యభిప్రాయములు తేటపడగలవు.

బర్బరులకాలమందు కళనశించియుండినది. ఇందులకు నిదర్శనము వారి కాలపు విచిత్రచిత్రరచనయే యని యొకరి యభిప్రాయము. నేటికాలపు చిత్రకళయందలి సరళతను గూడ కళావిమర్శకు లట్లె తలంచుచున్నారు. వస్తువుల నిజస్వరూపముల చిత్రించలేక ఆధునిక చిత్రకారులు తమ చేతకానితనమును మరుగుపరచుకొనుటకు ఇట్లు చిత్రించుచున్నారని వారి నమ్మకము.

చిత్రకళ యొకవిధముగ నున్నపుడు, అది యెట్లుండవలయునను ప్రశ్నగల్గుటవలన చిత్రకారులకును ప్రజలకును గొప్ప భేద మేర్పడుచున్నది. చిత్రకళాస్వరూపమును గూర్చి యడిగిన అది "సుందరము" గ నుండవలెనని యనెదరు. సుందరమనగా కొందరు. శ్రేష్ఠమైన అంగసౌష్ఠవము గలిగినదే యందురు. కాని ఆధునికచిత్రకారు డట్లు తలంచుటలేదు. భావోద్రేకము గల్గించునట్టిది సుందరముగనదని ఆతని యభిప్రాయము. ఈరెండు అభిప్రాయములయం దేది శ్రేష్ఠతమమో నిర్ణయింప వలనిగాదు. గొప్పవిషయములనుండి కళగా పరిణమించినది ప్రశంసనీయముగ లేదు. అట్లే భావ పూరితమగు కళయం దభిరుచి యున్నంతమాత్రమున కళాప్రవీణు లగుట లేదు.

౧౮౭౦-వ సంవత్సరమున ప్యారిసునగరస్థులు కోర్బెటుగారి స్వాభావికచిత్రకళను నిరసించిరి. ఈ విధమగు నిరసనమే హెచ్చి, స్వాభావికచిత్రకళయెడ విముఖతగ పరిణమించి, కొలుత, అంగవైకల్య ముండు నట్లుగపడు మానవచిత్రముల చిత్రించిన వారిని గౌరవించిరి. గీతలసముదాయమువలన నేర్పడు చిత్రములను, కొన్నిదృశ్యముల చిత్రణము, వీనిని చిత్రించిన పెక్కు రంగుల పొందిక కలసి ఏర్పడు భావప్రతిమలు మనయందు గొప్పభావముల పుట్టించగలవు కాబట్టి వీనిని గని ఆనందించు డను నుద్బోధనము జయప్రదమగుటకు అనేకసంవత్సరములు పట్టినది. ఈ విషయమున ఇంకను ఏకాభిప్రాయము కుదురలేదు. ఇటీవల పదిసంవత్సరముల క్రిందనే పూర్వపుటభిప్రాయములు పోయి; చిత్రరచనమందలివస్తువునకన్న గుణమునకును, భావమునకును ఎక్కుడు ప్రాధాన్య మొసగుచున్నారు.

"వసంతమందు దేవకన్యల నాట్యము," "ఖైదీలతప్పుటడుగులు" అను రెండు చిత్రము లున్నవనుకొందము. నేడు వీనియందు చిత్రింపబడ్డ వస్తువునకన్న భావమునకు, గుణమునకు మాత్రమే ప్రాధాన్య మీయబడుచున్నది. ఇంకను అనేకులు ఈ రెంటిలో మొదటిదానియందే ఎక్కువ మక్కువ జూపుచున్నారు. వారు బొమ్మయందున్న గుణాతిశయమును గుర్తింపకున్నారు. ఈ విధముగ కళను గుర్తింపలేక వెనుకబడియున్నవారి విషయము మన మాలోచింపవలసినదే లేదు.

ఏసంఘ మందైనను పరస్పర విరుద్ధములగు రెండు బలములుండును. సంఘమం దితరులతో నివసించుటకును, జీవనమునకు సంపాదించుకొనుటకును, పౌరవిషయములందు పాల్గొనుటకును మానవుడు కొంచెము తెలివిగలవాడై యుండవలయును. అనగా నాగరకత గలిగియుండవలయును. నాగరకతను మించగలిగినదొకటి కలదు. అది విజ్ఞానము. విజ్ఞానమే నాగరకత కంతకును మూలము. నాగరకత అందరికిని జెందియున్నది. విజ్ఞానము వ్యక్తిగతమైన వస్తువు. ఉన్నతాదర్శములు గలిగి నీతిమంతులై మెలగువారలు జ్ఞానులు. విజ్ఞానము వారి సొత్తు. ఇకనాగరకత, స్పర్శ చేతనే అందరిని నాగరికుల జేయును. భోజనముచేయుటవలె విజ్ఞానము నెవరికి వారే ఆర్జించుకో వలయును. ఈ పోలికయం దొకలోపమున్నది. ప్రతిమనుష్యుడును జీవించుటకొరకు భోజనము చేయుచున్నాడు. జ్ఞానమార్జింపుమని వానిని బలవంతపెట్టువా రెవరును లేరు.

ఎందును భేదమగుపడని కళయం దిట్టిభిన్నాభిప్రాయములు గలుగుటకు కారణము విజ్ఞానమునకును, నాగరకతకును గల యంతరమే. నాగరక జనసామాన్యమున కంతయు తృప్తికరముగ నుండునది ఒకరకమయినకళ. వారిపోషణము గొనజాలని మరియొకకళ కూడ ఉన్నది. నాటకసారస్వతగ్రంథములు, "జనప్రియ" మైన సంగీతము, పారిశ్రామికకళలు అనేకుల యభిమానమును పొందకయుండిన, అవి లోకమున వర్ధిల్ల జాలవు. ఈవిధముగ వ్యాపారవృద్ధికొరకు కళోపాసకులు జనసామాన్యమునకు రుచించెడి వస్తువులనే తయా

రుచేయుచున్నారు. కాని స్వార్థత్యాగులై నిజమగు కళను వృద్ధిచేయుటలేదు.

విజ్ఞాన సముపార్జనమందు ఆసక్తి గలిగిన కళను ఉపాసించు చిత్రకళాభిజ్ఞులు, శిల్పులు, సంగీత శాస్త్రజ్ఞులు, లోకమును సరకుగొనుటలేదు. వారిని అభిమానించి వారి గొప్పతనమును గ్రహించువారు కొద్దిమందియైనను చాలు. ఇట్లు లోకాభిమానము పడయజాలనందువలన సత్యమైన కళారాధకుడు అన్యాయముగ ధనమును సంపాదింప లేకపోవుటకన్న మించినదేమియు లేదు. ప్రతికళారాధకునికిని ఇది తెలిసిన విషయమే. కాని ఎవడును తనసత్యమార్గమును త్యజించుటలేదు. ఇట్టి నిపుణులైన కళారాధకుల స్వతంత్రభావము, జనసామాన్యముయొక్క వాంఛలను తీర్పకపోవడము, అను రెండుకారణములే వీరికి వారికి గల భేదాభిప్రాయములుగ పరిణమించినవి. "ఆధునికకళయందు దోషమేమి ?" యను ప్రశ్న యుదయించినపుడు, అది వీరినిగురించియే గలిగినది.

పూర్వము కళయనునది మతమువలనను, శౌర్యము వలనను ఉద్భవించినది. నేటి కళకును అట్టికారణము లెవ్వియు లేకుండుటచే కాబోలు ప్రజలు దానిగొప్పను గుర్తింప లేకున్నారు. అంతేగాక, కళకును, ప్రజలకును గల చేతనసంబంధముగూడ తెగిపోయినది. పూర్వపు కళ నేటి చరిత్రగ పరిణమించినది. లోకముతో ఉండిన ఈసంబంధముగూడ చిరకాలముండలేదు. మానవసమత్వమనుభావమును పెంపొందించిన ౧౯ శతాబ్దము, కళకుండిన గొప్పతనమును తొలగించి కృత్రిమ(invention)ముల నభిమానింప దొడంగెను. ఈకాలపు ఛాయాచిత్రము ప్రజలకును, కళకును భేదముల గల్పించినది.

జనసామాన్యముపక్షమునను ఒకమాట చెప్పవలసియున్నది. ఆధునిక కళయందు ఏకీభావము గన్పించుటలేదు. చక్కనికళ యుదయించుటకు ఆదర్శప్రాయములగు ప్రమాణములు లేకుండుటయే కారణములు. నేటి విజ్ఞానావేశము ఉపయోగములేనిది. రాజకీయములందుగాని, మతములందుగాని విపరీతాభిప్రాయములు నిరుపయోగకరములు. కళోపాసకుని ప్రయత్నము రాక్షస ప్రయత్నముగావలసి యున్నది. కళయందు విముఖత జూపుచున్న ప్రపంచమునకు కళారాధకుడు చేయగలిగిన దేమన, సులభమగు విషయముల నింకను సులభముగ జేయుటయే. ఇపుడు ప్రపంచ ప్రవృత్తిని గ్రహించుట కెవరివలనను గాదు. ఏలనన ప్రపంచము భిన్నభిన్నాభిప్రాయముల గలిగియున్నది. ఏకీభావము లేనపుడు ప్రపంచప్రవృత్తిని చిత్రకారుడెట్లు చిత్రింపగలడు ?

పరిస్థితులనుబట్టి జూడ కళారాధకుడు నిరాశ జెందవలసిన ట్లున్నది. కాని సత్యాన్వేషకుడు తన దీక్షను వీడరాదు. బలమగు ప్రవాహమున కెదురీదు రీతి తనపద్ధతిపైనే చిత్రకారుడు కళను వృద్ధిచేయుటయే శ్రేయము. ఇదియు జరుగకపోయిన కళారాధకుడు ప్రాచీనకాలపు చిత్రకారుల ననుసరించియే చిత్రముల వ్రాయుచుండును.

కళయందు నేడు అనేకపద్ధతు లున్నవి. ఏది శాశ్వతముగ నిల్చునో తెలియరాకున్నది. అనేకులు దేని నభిమానించెదరో అదియే పైకి రాగలదు. పూర్వకాలపు చిత్రకళయు, శిల్పమును, నేటికళాతత్త్వమును నాశమొనర్చినవి. ఏలయన, సాధారణమానవుడు, వీనిని చూచునపుడు ఏదిఉత్తమమో, ఏదికాదో తెలిసికొనజాలక చిక్కుపడుచున్నాడు.

ఆధునికప్రపంచము దోషపూరిత మయిన, ఆధునికకళయు దోషపూరితమయిన దగును. వాటికేర్పడు చిక్కుల నవియే సరిచేసికొనుచుండవలయును. మన ప్రయత్నములు నిజమయినను, కాకపోయినను, ఇవన్నియు మానవుడు స్వీయక్రమవికాస పరిణామము లకు (Evolutionary Process) కల్పించుకొను సాధనములగుచున్నవి. ఆధునికకళ దోషపూరితమయిన దనిన, పూర్వకాలపుకళయు దోషపూరితమయినదని చెప్పవలసియున్నది. ఈకాలమునకు జెందినది ఈకాలపువస్తువే. ఈప్రశ్నకు తృప్తికరమగు సమాధానము తోచుటలేదు. ఏలయన, మనకర్థము గాని

విషయములనుండి యీప్రశ్న యుదయించినది. ఇదం తయు మననాగరకతకు సూచకమగు విషయముకాబట్టి దీనిని చాలముఖ్యముగా ఆధునికులు గ్రహించవలయు నని మనవి.

['కరెంటుహిస్టరీ' అనుపత్రిక జూను సంచికయందు Gene Lux అనువారు వ్రాసిన What is wrong with modern art అను వ్యాసమున కనువాదము. Lux శిల్పి, విమర్శ కుడు, అధ్యాపకుడును. వీరి వ్యాసములు పెక్కులు అమెరికా యూరపుఖండముల పత్రి కలయందు ప్రకటితము లగుచుండును. త్వరలో నితడు కళాచరిత్ర (History of art)అనుగ్రం థమును ప్రకటింపనున్నాడు.]

---



ఏనుగులశాల (నూతన దృశ్యము)
(హంపి శిథిలములు)

—కే. యల్. నరసింహాచార్యులు, గుంతకల్లు.

# భారతీయ విద్యాచరిత్రము

మారేమండ రామారావు, బి. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

[అనువృత్తము]

## III. విశేషాంశములు

ఇంతవరకును హిందూబౌద్ధయుగములందలి హిందూవిద్యావిధానమును, విద్యాసంస్థలను వర్ణించియుంటిమి. ఇటుపై హిందూమతమునందును, తద్విద్యావిధానమునందును గల విద్యావిషయకవిశేషాంశములను బరిశీలింపవలసియున్నది. ఆధునికవిద్యాసంస్కర్తలు ఉత్తమ విద్యావిధాననిర్మాణమునకై చేయు సూచనలనేకములు ప్రాచీనహిందువులకు దెలిసియుండినవి. ఈవిషయము హిందూమతమును, వర్ణవ్యవస్థను, ప్రాచీనబోధన నియమములను బరికిలించినచో స్పష్టము కాగలదు :

హిందూమతము :— ఆధునికకాలమున బాఠశాలలో విద్యార్థులకు బోధింపబడు విషయమును నిర్ణయించునెడ వైజ్ఞానికయుగవాదము (Culture Epoch theory) అను నొకవాదము గలదు. మానవజాతి యారంభమునుండి నేటివరకు ననేకపరిణామములను గాంచెను. అటులే ప్రతిమానవుడును పుట్టినదాదిగ ననేకములగు ననుభవములను గాంచును. ఈ జాతీయపరిణామమునందలి యవస్థలకును, వైయక్తికపరిణామము నందలి యవస్థలకును సన్నిహితమగు సామ్యము గలదు. కాన విద్యార్థి యేయవస్థలో నుండునో బరికిలించి, దాని కనుగుణ మగు జాతీయావస్థను స్మరించి యందలి యంశమునే బాలకునికి బోధింపవలెను అని యీవాదము యొక్క ముఖ్యోద్దేశ్యము. ప్రాచీనార్యులు ప్రతి మనుజునకును ఆధ్యాత్మికచింతనము, నాత్మతత్త్వజ్ఞానమునే జీవితాదర్శములని విధించియుండిరి. అవియే మతమునకును, జాతికినిగూడ నాదర్శములు. ఈయాదర్శములను గ్రహించుటకై, మానవ జీవితమంతయు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములను నాలుగాశ్రమములుగ విభజింపబడెను. ప్రతివారు నీయాశ్రమములను క్రమముగ నతిక్రమించి యందం దొదవు ప్రత్యేకానుభవములను బొంది, జ్ఞానపరిపాకమును గాంచవలసియుండెను. పై వైజ్ఞానికయుగవాదమునకును, వర్ణాశ్రమవ్యవస్థకును సామ్యము స్పష్టమగుచున్నది.

ఇప్పటి మానసికతత్త్వశాస్త్రజ్ఞులు (Psychologists) మన కెల్లప్పుడును కర్మాచరణమునకై లోపలినుండి ప్రోద్బలము (Impulse) గలుగుచుండుననియు, నట్టి ప్రోద్బలముచే జేసిన ప్రతిపనియును స్వేచ్ఛాకృతములనియు జెప్పుచున్నారు. ఆధునిక విద్యాసంస్కర్తల యభిప్రాయము ననుసరించి విద్యార్థి స్వప్రవృత్తిమూలముననే (Self activity) విషయములను గ్రహింపవలె నని వాదించుచున్నారు. ప్రాచీనహిందువులు వీనికి సరియగు నియమములనే యేర్పరచియుండిరి. యుక్తాయుక్తములను విచారించి స్వప్రవృత్తిని నియమించుకొని ప్రతివారును స్వయంకృషిమూలముననే తత్త్వమును దెలియవలెనని వారి యభిప్రాయము.

మానవునకు తననుదాను బూర్తిగ దెలిసికొని సిద్ధత్వము (Perfection) నందుటయె జీవిత పరమావధియనియు, మానవప్రవృత్తియంతయు నీవిషయమునే సాధింపవలెననియు, నందుచే జీవితలక్ష్యైక్యము (Unity of Life) గలదనియు నాధునికులు జెప్పుచున్నారు. ఈవిషయమునే ప్రాచీన హిందువు లాశ్రమ విభజనచే సాధించిరి. ధర్మార్థకామమోక్షములు నాలుగు పురుషార్థములు. బ్రహ్మచర్యాశ్రమమున ధర్మమును, గార్హస్థ్యమునం దర్థకామములును, వానప్రస్థ సన్న్యాసములలో మోక్షమును సాధ్యములు. మొదటినుండి తుదివరకును మోక్షమే పరమపురుషార్థము; ఇతరములు తత్సాధనములు.

ప్రకృత మానసిక తత్త్వశాస్త్రజ్ఞులు వైయక్తిక పరిణామమున కేవలమును ప్రకృతియేకాక వాతా

వరణముగూడ విశేషముగ దోడ్పడునని చెప్పుచున్నారు. ఈ విషయమును హిందువు లనేకశతాబ్దములకు బూర్వమే గ్రహించిరి. వినయవిధేయతలను పెంపొందించి, కేంద్రీకృత మనఃప్రవృత్తి కనుకూలములై, యుత్తమాదర్శ ఘన్నిబద్ధములై, జిజ్ఞాసావృత్తి కనుకూలములగు వాతావరణములు ముఖ్యము లను విషయమును గ్రహించియే మన ప్రాచీనులు గురుకులములను నిర్మించిరి. అనుకూలవాతావరణమునకు దోడుగ నిచ్చట విద్యార్థుల కాచార్యుని యాదర్శవిశేషముగూడ లభించుచుండెడిది. ఆధునిక విద్యాప్రపంచమున విద్యార్థుల వసతిగృహములను నిర్మింపవలెననియు, గురుశిష్యులు గలసియుండవలెననియు, విద్యార్థుల నైతికసంపద నభివృద్ధిచేయుట విద్యావిధానమునకు ముఖ్యావధియనియు జేయబడు సిద్ధాంతములన్నియు ప్రాచీన గురుకులపద్ధతిలో నిమిడియున్నవి.

నిర్బంధ విద్యాభ్యాసము, ఉచిత విద్య (Free and Compulsory Education) యనునవి యీకాలపు సంస్కరణములలో నగ్రస్థానము వహించుచున్నవి. ప్రాచీనభారతదేశమున ప్రతివారును స్వకులోచితమగు విద్య నభ్యసింపవలసియుండెడిది. లేనిచో వాని కాకులమున తావు లేకుండెడిది. ఆకాలమునందాచార్యులెల్లరు నుచితముగనే విద్యను నేర్పుచుండిరి. స్వాధ్యాయమువలెనే ప్రవచనముగూడ ప్రతివారికిని విధియైయుండెడిది. ఆధునికులు ప్రబలాందోళన ఫలితముగ చట్టమూలమున జేయ యత్నించు నీకార్యమును మన ప్రాచీనులు సులభముగనే తమ మతసాంఘిక నియమముల మూలమున సాధించియుండిరి.

వర్ణవిభజనము:—హిందూమత నియమములకు బిమ్మట జర్చింపవలసినది వర్ణవిభజనమునందలి విద్యావిషయక విశేషములు. ప్రాచీనార్యులు సట్లెజ్ నదీతీరమునం దుండినపుడు వారిలో సాంఘిక విభాగములు లేకుండినవి. ఎవరికి నేపనిజేయుటకును విధినిషేధములు లేకుండెడివి. క్రమముగ నార్యభూమియు, దన్మతమునుగూడ నభివృద్ధినందినవి. యజ్ఞయాగాదులును, దత్సంబంధమగు కర్మకాండయు బెరుగుటచే గొందరు ప్రత్యేకముగ నీవిషయమున గృషిసలుపవలసి వచ్చెను. అటులనే యార్యులు గంగామైదానము నాక్రమించి రాజ్యముల నేర్పరచుకొనినపిమ్మట రాష్ట్రరక్షణమును, కృషివాణిజ్యములు నవసరములుగా జొచ్చినవి. మతమునందువలెనే యీ యైహిక విషయములందుగూడ ప్రత్యేక పరిశ్రమ మావశ్యకమయ్యెను. కాన జనులు తమ ప్రకృతుల ననుసరించియు, దమ యర్హత ననుసరించియు నీప్రత్యేకకార్యములందు బ్రవర్తించుచుండిరి. ఇటుల వీరు నెరపు కర్మలు వేరుగ నుండినవి. ఈగుణకర్మలపైననే వర్ణవిభజన మేర్పడినది. అయిన నీ కర్మవిభాగములు చాలకాలమువరకును వృత్తివిభాగములుగ నేయుండినవి. వానిమూలమున సాంఘికవిభాగము లేర్పడియుండలేదు. ఈ కర్మలను బరిగ్రహించునెడ జన్మమే నియమముగ యోగ్యతానర్హతలను దెచ్చిపెట్టియుండలేదు. జనకుడు, జాబాలి మున్నగు క్షత్రియులు బ్రహ్మజ్ఞానసంపన్నులుగ నుండిరి. క్షత్రియకులసంజాతుడగు విశ్వామిత్రుడు మహర్షి యయ్యెను. పంచముడగు వాల్మీకి కవిబ్రహ్మ యయ్యెను. శీలము, మనస్సంయమము, వైదుష్యము ననునవియే యుత్తమవర్ణులకు గావలసిన లక్షణములు. ఆధునికులుగూడ ప్రతివాని ప్రకృతియు నాతని జన్మసమయముననే స్థిరపరుపబడునని, పిమ్మట నాతడు స్వయంకృషిమూలముననను, ఇతరులు, వాతావరణము నొసంగు శిక్షణమూలముననను దనకు బ్రకృతిసిద్ధములగు లక్షణములనే యభివృద్ధిపరచుకొనునని నిరూపించియున్నారు. ఆధునికవిద్యావిధానమున విద్యార్థియొక్క పారంపర్యము (Heredity) న కెక్కువ ప్రాముఖ్యమొసంగబడుచున్నది. మన ప్రాచీన వర్ణవిభజనముగూడ నీసిద్ధాంతముపైననే నిర్మింపబడినది. ప్రతివానికిని బ్రకృతి యొకవిధముగా బ్రవర్తనమును, వృత్తిని, అర్హతను (Fitness and aptitude) ఏర్పరచుననియు, నాతడట్టి వృత్తినే యవలంబింపవలయుననియు నభిప్రాయపడియుండిరి. మనస్సంయమమును, ఆధ్యాత్మికచింతనమును సహజగుణములుగ నుండువారలెల్ల నగ్రవర్ణమున కర్హులుగ నుండిరి. దేహబలమును, ధైర్యసాహసములును సహజముగ నుండినవారెల్ల క్షత్రియులుగ

నెంచబడిరి. అటులనే యాముష్మికసాధనములను కృషి, వాణిజ్యము మున్నగువానియందు ప్రకృతి సిద్ధమగు నభిరుచిగలవార లితరవర్ణములకర్తలుగ నెంచబడిరి. ఇట్టివో రెల్లరును దమ యిచ్ఛా ప్రకృతుల ననుసరించి ప్రత్యేకవృత్తుల ననుసరించుచుండిరి. కొంతకాలమునకు పారంపర్యముగ దండ్రి నుండి కొడుకులకు సంక్రమించుటచే నీవృత్తులు ప్రత్యేకత నందినవి. క్రమముగ నీవృత్తి విభాగము లనుల్లంఘ నీయములగు సాంఘికవిభాగములుగ బరిణమించినవి. ప్రతివర్ణము నారోజులలో సాంఘిక జీవితమునందలి యొక్కొకయంశమును జూపుచుండెను. కాన ప్రతి వ్యక్తియు నత్యవసరమగు సాంఘికాంగముగ నుండెను. ఆకాలమునం దాత్మవికాసమును, సంఘసేవయు నత్యుత్తమాదర్శములుగ బరిగణింపబడుచుండెడివి. ఇటుల విభిన్నవృత్తుల కాలవాలములగు విభిన్నవాతావరణములలో బుట్టిపెరిగిన విద్యార్థులకు వారివారి యోగ్యతావశ్యకతల ననుసరించియే శిక్షణ మొసంగబడుచుండెడిది. ఇట్టివిద్యను నేర్చినపిమ్మట స్వప్రకృతి కనుకూలమగు వాతావరణమునందుండి ప్రతివ్యక్తియు నాత్మసిద్ధిని బడసి సంఘసేవను జేయుట సుకరముగ నుండెడిది. ఆధునికులు సహితము విద్య సాంఘికమనియు, నిర్దుష్టమగు సాంఘికజీవితమును గడపగల వ్యక్తులను నిర్మించుటయే విద్యావిధానమునకు బరమావధియనియు జెప్పుచున్నారు. ఈయాదర్శము లన్నియు ప్రాచీన హిందూ వర్ణవ్యవస్థలో గాంచననుచున్నవి.

బోధనవిధి:—ప్రాచీన హిందూయుగమునందలి పఠనబోధనవిధులనుగూర్చి కొన్ని విశేషాంశములు తెలియుచున్నవి. ఆధునికవిద్యాతత్త్వజ్ఞులు "తెలిసిన విషయములద్వారా తెలియనివానిని జెప్పవలెను. సులభ విషయములనుండి క్లిష్టవిషయములను సాధింపవలెను; ప్రత్యక్షమునుండి యనుమానమునకు బోవలెను." అను సూత్రములను బోధనసందర్భమున ప్రతిపాదించి యున్నారు. మన ప్రాచీను లీసూత్రములను గ్రహించియే యుండిరి. దృశ్యమానప్రపంచమునందలి పదార్థములను వివరించి వాని లక్షణములను దెల్పు శాస్త్రములును, మానవీయము లగు నితరకళలునుగూడ పారమార్థికములుగనే యుండినవి. సుజ్ఞేయములును, సులభములును, ప్రత్యక్షములును నగు విషయములనూలమున ప్రాచీన భారతీయవైదుష్యమంతయు సూక్ష్మమును, పరోక్షసాధ్యమును, పరమార్థమును నగు బ్రహ్మపదార్థమునే జేర్పునదిగ నుండినది.

శాస్త్రనిర్మాణమున ప్రాచీనులు Inductive method నే యనుసరించిరి. పదార్థతత్త్వమును సవిమర్శముగ వివరించి శాస్త్రకారులు సిద్ధాంతములను సాధకునికే వదలియుండిరి. దానజేసి బుద్ధివికాసమును, తార్కికశక్తిని ఉపయోగించి ప్రతివారును దమకు దోచినరీతిని సిద్ధాంతముల నేర్పరచుకొనుట కవకాశమేర్పడెను. ఇట్లు మతాంతరములు, పక్షాంతరములు నేర్పడి విజ్ఞాన మభివృద్ధినందుటకును, వ్యక్తుల కిచ్ఛాస్వాతంత్ర్య మొసగుటకును అవకాశ మేర్పడెను.

పూర్వము పరిశోధనకును, విమర్శనమునకును నెక్కుడు ప్రాముఖ్య మొసంగబడుచుండెడివి. అనేకులు తమ పూర్వు లొనర్చిన సిద్ధాంతములను విమర్శించి నూతనసిద్ధాంతములను జేసి, వాదప్రతివాదములనూలమున వానిని బలపరచుకొని ప్రచారము చేయుచుండిరి.

* * *

## రెండవ అధ్యాయము

[ఆధారములు

Dutt-Civilisation in the Buddhistic Age
Rhys Davids-Buddhist India
Samaddar-The Glories of Magadha
Satyanarayana-Bauddha Mahayugamu
NarayanaRao- Pracheena Vidya-
Pithamulu]

### బౌద్ధవిద్య

ప్రాచీనకాలమునుండి క్రీ. శ. ౬౪౭. వరకును ప్రబలియుండిన హిందూవిద్యాచరిత్రము నింతవరకు

వర్ణించియుంటిమి. క్రీ. పూ. ౨౦౦ నుండి క్రీ. శ ౬౪౭ వరకును గలకాలమున హిందూబౌద్ధమతములు రెండును భారతదేశమున వ్యాపించినవి. ఈ కాలమున బౌద్ధమత మనేకవిధముల ఆదరప్రోత్సాహములనంది సర్వతోముఖముగ విజృంభించి ఖండాంతరములకును దేశాంతరములకునుగూడ వ్యాపించినది. బౌద్ధులు తమ మతాచారముల ననుసరించి ప్రత్యేకవిద్యావిధానమును, విద్యాసంస్థలను నిర్మించిరి. ఈకాలపు రాజకీయాది పరిస్థితులను పూర్వప్రకరణమున వివరించియుంటిమి. బౌద్ధయుగమునందలి బౌద్ధవిద్యాచరిత్రము నభివర్ణించుటకు పూర్వము బౌద్ధసిద్ధాంతములను, బౌద్ధమతచరిత్రమును, బౌద్ధహిందూమతములకు గల పరస్పరసంబంధమును సంగ్రహముగ బరిశీలింపవలసియున్నది.

## I. బౌద్ధమతము

క్రీ. పూ. ౫-వ శతాబ్దినాటికి వైదిక మతిబహుళమై, కష్టసాధ్యముగ నుండెను. వాఙ్మయమును, దత్త్వమునుగూడ కేవలపాండితీసాధ్యములై, ప్రజాసామాన్యమునకు దురవగాహములును, నిరర్థకములును నైనవి. అందుచే పామరులకు దైనందినజీవితమునం దత్యవసరము నాధ్యాత్మికచోదనము గరవయ్యెను. అట్టిసమయమునం దిద్దరు క్షత్రియవీరులు బయల్వెడలి యీ సమస్య నెదుర్కొనిరి. వీరే వర్ధమాన గౌతములు. విశేషకష్టములేకనే ప్రజాసామాన్యము పాపభీతియు, సౌహార్దము నలవడజేసికొని శాంతియుతజీవితములను సాగించునటు లొనర్చుటయే యీసంస్కర్తల ముఖ్యోద్దేశ్యము. గౌతము డనేకదేశముల దిరిగి ప్రజాతత్త్వమును గ్రహించియు, సుదీర్ఘకాలము చింతనజేసియు నొక నూతన తత్త్వమును గన్గొని యెల్లరకును బోధింపసాగెను. అందలి ముఖ్యాంశము లీక్రింద పేర్కొనబడియున్నవి:

౧. దృశ్యమానమగు నీప్రపంచము నశ్వరము.

౨. మానవజన్మము సుఖాపేక్షియై యనేక దుఃఖముల ననుభవించును.

3. తృష్ణయే సర్వదుఃఖములకును గారణము. దీనివలననే దుష్కార్యప్రవృత్తి గల్గును.

౪. కాన వాంఛలను తెగటార్పవలయును.

౫. నిర్వాణమే పరమపురుషార్థము. దానిని జెందుటకు భూతదయ, సౌభ్రాత్రము, సర్వసమభావము, వినయము, నిరాశ మున్నగునవి సాధనములు.

ఈ సిద్ధాంతములు సర్వజనాకర్షకములుగ నుండుటచే శీఘ్రముగ ననేకు లీబౌద్ధమతము నవలంబింప జొచ్చిరి. ఇట్టివారిలో రెండుతరగతు లేర్పడినవి. సర్వసంగపరిత్యాగ మొనర్చి సన్న్యాసులై సదా యాధ్యాత్మికచింతన మొనర్చువారలు కొందరు. వీరిలో స్త్రీలును, పురుషులునుగూడ నుండిరి. అటుగాక మరి కొందరు గృహస్థులైయుండియు బౌద్ధధర్మము నవలంబించుచుండిరి. వీర లుపాసకులని పిలువబడుచుండిరి. అనతికాలమున నే బుద్ధ, ధర్మ, సంఘ-యనునవి బౌద్ధులకు ముఖ్యావశ్యములుగ నొప్పినవి. ఈమతమున మరికొన్ని విశేషాంశము లుండినవి:—

౧. ఇందు జాతివర్ణభేదములు లేవు.

౨. పండితసాధ్యమగు గీర్వాణభాషను వదలి బుద్ధుడు,నాతనియనుచరులును దమమతబోధనలను దేశీయభాషలలోనే చేయుటచే నామతవాఙ్మయ మాయా భాషలలో నిర్మింపబడినది.

3. బౌద్ధులు వేదముల ప్రామాణ్యము నంగీకరింపరు.

౪. స్త్రీపురుషులకు సమానములగు నధికారగౌరవములు గలవు.

౫. భిక్షుభిక్షుణీజనముల కేకాంతవాస మవసరముగుటచే వీరలకై యనేకములగు నారామవిహారములు నిర్మింపబడుచుండెడివి.

౬. ప్రతివారికి నెనిమిదవయేట 'పబ్బజ్జ' యను సంస్కారపూర్వకమగు మతప్రవేశమును, యిరువదవయేట 'ఉపసంపద' యను మతదీక్షయు నొసంగబడుచుండెడివి.

౭. బౌద్ధు లెల్లరును సౌశీల్య, నిస్సంపత్త్వ (Poverty), ఆత్మసంయమములను, గలిగియుండవలెను.

౭. భిక్షువులు భిక్షాటనమూలమున నాహారమును సంపాదింపవలెను.

౮. పాపకార్యముల నొనర్చినవారలు బహిరంగముగ వానిని దెలిపి నిజముగ పశ్చాత్తాపము నందుటచే బరిశుద్ధు లగుదురను సిద్ధాంతము బౌద్ధులలో నుండెడిది.

ఇటులు క్రీ. పూ. ౬-వ శతాబ్దమున గౌతమునిచే ప్రవర్తింపబడిన యీ నూతన మతమునకును, ప్రాచీనవైదికమతమునకును అనేకసాదృశ్యవైదృశ్యములుండినవి. బౌద్ధమతము కేవలము విలక్షణమగు నూతన మతము గాదనియు, నందలి సిద్ధాంతములు, నాచారములు ననేకముగ వైదికమతముపై నాధారపడియున్నవనియు బండితుల యభిప్రాయము. పూర్వజన్మకృత కర్మవలననే సుఖదుఃఖానుభవము గల్గుచుండుననియు, జన్మబాహుళ్యము, తృష్ణావిషయేచ్ఛలే సర్వదుఃఖమూలములనియు, నిస్సంగమగు సన్న్యాసమే మోక్షసాధనమనియు, వాసనారాహిత్యమే ముక్తిలక్షణ మనియు నీరెండుమతములును జెప్పుచున్నవి. వర్ణభేదమును, యజ్ఞయాగాదిరాహిత్యమను దప్ప హిందూబౌద్ధ గృహస్థధర్మములకు భేద మేమియు లేదు. అయిన నీరెండుమతములకు నొక ముఖ్యవైషమ్యము గలదు. వైదికమతమంతయు పరబ్రహ్మపదార్థ నిరూపకమై యుండ బౌద్ధధర్మ మనాత్మవాదకముగ నున్నది. పరమాత్మపదార్థము కేవలము మిథ్యయని బౌద్ధుల సిద్ధాంతము.

బుద్ధునికి బిమ్మట వైదిక బౌద్ధ మతములకు విశేషముగ సంపర్కసంఘర్షణములు జరగుటచే నీ రెండు మతములందునుగూడ గొన్ని మార్పులు జరగినవి. మొదట బౌద్ధగ్రంథములన్నియు పాళీభాషలోనే నిర్మింపబడి యుండినను, దమ సిద్ధాంతములు వైదికపండితులకు సుగమములుగ నుండుటకై బుద్ధుని తరువాతివారలు తమ గ్రంథములను సంస్కృతములోనికి బరివర్తించిరి. వర్షాకాలమున సంచారమును మానివేయుట, చాతుర్మాస్య దీక్ష నవలంబించుట, అనధ్యాయదినములను బాటించుట మున్నగు వైదికాచారములను బౌద్ధు లనుకరించిరి. మహాయానశాఖకు జెందిన బౌద్ధుల గ్రంథము లనేకములు హిందూపురాణముల కనుకరణములే. వారి యవలోకితేశ్వరచరిత్రము విష్ణుభాగవతపురాణములను సూచించును. హిందువులు బౌద్ధసిద్ధాంతములను, బౌద్ధులు వైదికసిద్ధాంతములను బఠించుచుండిరి. కాలక్రమమున హిందూమతము బుద్ధుని యొకయవతారముగ బరిగణించి బౌద్ధధర్మమును దనలో నిముడ్చుకొనియెను. వాస్తవముగ వైదికమతమునందలి యాధ్యాత్మికాదర్శములను సాధించుటకు బౌద్ధమతమునందలి నైతికసాంఘిక విధు లౌపచారికములుగ నుండుటచే నీ రెండుమతములకును తీవ్రమగు వైషమ్యము లేకుండినది. దానజేసియే యీ రెండుమతములు నేకకాలమున మహోచ్చదశ ననుభవింపగల్గినవి. వీనికి గల సన్నిహితసామ్యమే కడకు బౌద్ధమతము హిందూమతమున గలసి జన్మస్థానమగు నీ దేశము రూపుమాయుటకు గారణము.

ఇంతవరకును బౌద్ధమతతత్త్వమును నిర్ణయించి యుంటిమి. క్రీ. శ. ౬౮౪ వరకును గల యీమతచరిత్రమునుగూడ సంగ్రహముగ బరిశీలించినచో దాత్కాలిక విద్యాచరిత్రము సుగ్రాహ్యము గాగలదు. గౌతమ బుద్ధుని యనంతర మాతనిశిష్యు లీనూతనమతము ననేక విధముల వ్యాపింపజేసిరి. బుద్ధుడు నిర్వాణమునందిన సంవత్సరముననే బౌద్ధసమావేశ మొకటి గావింపబడెను. ఇందు బౌద్ధులందరును జేరి గౌతముని బోధనలను గూడ బల్కికొనిరి. పిమ్మట మరియొక శతాబ్దమున కింకొక పరిషత్సభ సమావేశమయ్యెను. ఇప్పటికే బౌద్ధులలో నభిప్రాయభేదములు ప్రబలినవి. వీనిని సరిచేయుటకే యీపరిషత్సభ యత్నించెను. కాని బౌద్ధులందరును రెండుశాఖలుగ జీలిపోయి నేపాళ, త్రివిష్టప (Tibet), జపాను దేశములలోనివా రుత్తరబౌద్ధులనియు, సయాం, సింహళ, బ్రహ్మదేశములందలివారలు దక్షిణబౌద్ధులనియు పిలువబడుచుండిరి. క్రీ. పూ. 3-వ శతాబ్దమునం దశోక చక్రవర్తి యిటులు క్షీణించుచున్న బౌద్ధమతమునకు జేయూత నొసగెను. ఈత డీమతమున కమూల్యము, నిరుపమము నగు సేవను జేసియుండెను. బౌద్ధధర్మములను శిలాస్తంభములపై వ్రాయించి తనరాజ్యమునందలి వివిధ భాగముల బ్రతిష్ఠించియు, ననేకులగు మతప్రచారకులను

దూరదేశములకు సహితము పంపియు నీచక్రవర్తి యనేకవిధముల బౌద్ధమతమును వ్యాపింపజేసెను. అంతియగాక నీతడు స్వయముగ మతదీక్షనుగొని, యప్పటికే బౌద్ధమతమునగల వైషమ్యములను సరిచేయుటకై తృతీయ బౌద్ధపరిషత్సమావేశమును గావించెను. ఈసభకుఫలితముగనే యశోకునికుమారుడగు మహేంద్రు డనునాతడు సింహళద్వీపమునకు బోయి యచ్చట త్రిపిటకమును వ్యాపింప జేయుటయును, వేనవేలుగ బౌద్ధభిక్షువులు సింహళ, బ్రహ్మ, శ్యాము, త్రివిష్టపాదిదూరదేశములకే బౌద్ధధర్మమును బ్రచారము చేయుటయును జరగినది. క్రీ. పూ. ౨-వ శతాబ్దమునందు మౌర్యవంశ మంతరించినపిమ్మట శుంగవంశజులు మగధరాజ్యము నాక్రమించిరి. వీరు వైదికమతావలంబులై యజ్ఞయాగాదికముల నొనర్చి బ్రాహ్మణమతము నభివృద్ధిపరచిరి. కాన తాత్కాలికముగ బౌద్ధమతమునకు గొంచె మొత్తిడి గల్గెను. దక్షిణాపథమున బ్రబలిన శాతవాహనాంధ్రులు బౌద్ధమతము ననేకవిధముల నాదరించి దేశమును విహారారామశోభితముగ నొనర్చిరి. ఈకాలమున భారతభూమిపై దండెత్తివచ్చిన విదేశీయు లనేకులు బౌద్ధమతము నవలంబించిరి. క్రీ. శ. ౨-వ శతాబ్దమున దిరిగి బౌద్ధమతమునకు మంచిదినములు గల్గినవి. అప్పటికి కుషాను లుత్తరదేశము నాక్రమించి పాలించుచుండిరి. వారిలో నగ్రగణ్యుడగు కనిష్కచక్రవర్తి యశోకునివలెనే బౌద్ధమతము ననేకవిధముల నాదరించెను. స్వబాహుబలముచే మధ్య ఆసియా నంతటిని జయించి యీతడు బౌద్ధధర్మము నచట ప్రచారము చేయించెను. ఈతనికాలముననే బౌద్ధమతమున మహాయానశాఖ ప్రబలినది. హీనయానమని పేర్కొనబడు పూర్వబౌద్ధమతమునం దీకాలమున నాగార్జునుడను భిక్షువు విశేషములగు మార్పులను జేసెను. మహాయానమున వైదికమత సంప్రదాయము లెన్నియో చొప్పింపబడినవి. బుద్ధు డొకయవతారముగను, దైవముగను బరిగణింపబడి యాతని యారాధనము, నుత్సవములు గల్పింపబడినవి. బౌద్ధధర్మము భక్తిరసప్రధానము గాజొచ్చెను. మరియును గనిష్కుడు కుండలివనమున జతుర్థబౌద్ధపరిషత్సభను సమావేశపరచెను. అప్పుడు వసుబంధువనుభిక్షు వగ్రస్థానము నలంకరించెను. అటులు సమావేశమైన పండితు లందరును జేరి బౌద్ధసారస్వతమును దరచి భాష్యములను వ్రాసిరి. ఈసభకుఫలితముగ నుత్తర-ఆసియా ప్రాంతములందెల్ల మహాయానమతము వ్యాపించినది. కనిష్కు డనేకవిహారములను, సౌధములను నిర్మించెను. ఆతనికి బిమ్మట బౌద్ధమతమునకు దుర్దినము లేతెంచినవి. ఇందలి మహాయానమతము వైదికమతమును సర్వవిధముల బోలియుండుటచేతను, బౌద్ధసంఘమున దురాచారములు ప్రబలుటచేతను, బౌద్ధమతము రూపుమాయదొడగెను. వీనికన్నను ముఖ్యమగు కారణము గుప్తవంశీయులకాలమున జరిగిన వైదికమత పునరుద్ధరణము. కుషానులకు బిమ్మట గుప్తవంశీయులు మగధరాజ్యము నాక్రమించిరి. వీరలు వైదికధర్మనిరతులై తన్మతము ననేకవిధముల బోషించిరి. ఇతిహాసపురాణాదికము లొకవంక గ్రంథస్థములగుచుండ, కాళిదాసాదిమహాకవు లింకొకవంక గీర్వాణభాషాయోషకు నూతనాలంకారములను సమకూర్చుచుండ, హిందూ దేవాయతనము లింకొకవంక వేనవేలుగ నిర్మింపబడుచుండ, నిరుపమతేజోవంతమై వెలుగొందుచుండిన హిందూదీపికలో బౌద్ధధర్మము లీనమైపోయినది. దక్షిణాపథమునగూడ నీవైదికమతవిజృంభణ మీకాలమున గాంచనగుచున్నది. గుప్తచక్రవర్తుల యనంతరము శ్రీహర్షునికాలమున బౌద్ధమతము కడసారి యొక వెలుగు వెలిగినది. ఈచక్రవర్తికాలమున బౌద్ధబ్రాహ్మణమతములు రెండును బ్రబలినవి. స్వయముగ నీతడు బుద్ధభక్తుడై బౌద్ధుల ననేకవిధముల సత్కరించెను. సర్వమతముల నీతడు సమానముగ జూచెను. ఈతడుగూడ నొకబౌద్ధపరిషత్సభను సమావేశపరచి మతవైషమ్యములను జక్కబరుప యత్నించెను. మహావైభవముతో జరగిన యీసభలో తుదకు మహాయానమతమే సర్వోత్కృష్టమని నిశ్చయింపబడినది. చక్రవర్తి తనసర్వస్వమును బౌద్ధభిక్షువులకు, నితరమతప్రవర్తకులకును ధారవోసెను. శ్రీహర్షునియనంతర ముత్తరాపథము నంతటి నేలిన ఘనుడు లేకుండెను. దానజేసి బౌద్ధధర్మము

నిరాలంబమయ్యెను. పిమ్మట మగధరాజ్యమునేలిన కడపటి గుప్తవంశీయులు గొంతవరకును బౌద్ధుల నాదరించిరి. వీరిచరిత్రము నాలందావిక్రమశిలావిశ్వవిద్యాలయముల చరిత్రమున చేర్కొనబడును.

## II. విద్యావిధానము

ఇంతవరకును బౌద్ధమతసిద్ధాంతములను చేర్కొని యామతచరిత్రమును సూచించియుంటిమి. ఇటుపై బౌద్ధవిద్యావిధానమును వర్ణింపవలసియున్నది. బౌద్ధవాఙ్మయమంతయు సూత్ర, గేయ, నిదాన, వ్యాకరణ, గాథా, అవదాన, వదాన, ఇత్యుక్త, ఉపదేశ, జాతక, అద్భుత, ధర్మ, వైపుల్యయను విభాగములకు లోనైయుండెను. ఈవాఙ్మయమును, మతధర్మమును బ్రచారముచేయుటకై యొకప్రత్యేకవిధానము నిర్మింపబడెను. విద్యాపోషణము రాజులకు ముఖ్యకర్తవ్యమై యుండెను. వారలు, గురుశిష్యులు నిశ్చలమనస్కులై విద్య చేయుటకనువగు ప్రశాంతస్థలములలో ననేకములగు నారామవిహారములను నిర్మించి వానికి భూములను, ద్రవ్యమును దానము చేయుచుండిరి. కడపటి గుప్తపాలకులగు శక్రాదిత్య, బాలాదిత్యాదులు నాలందా విశ్వవిద్యాలయమునం దెన్నియో కట్టడములను గట్టించిరి. విద్యాభ్యాసము పూర్తియైనపిదప ననేకులు రాజాస్థానముల కేగి యున్నతోద్యోగములను బడయుచుండిరి. పదిసంవత్సరములు భిక్షువులై యుండి నిష్కళంకచరిత్రులగువార లుపాధ్యాయులుగ నుండిరి. విద్యార్థికి త్రిపిటకాంతమువరకును విద్యను నేర్పి, యాతని ప్రవర్తనమును నీతిమార్గమున జొప్పించి, యాతని దనపుత్రుని వలె ప్రేమించు టాకాలపు గురువులకు విధియైయుండెను. శిష్యులుగూడ గురువునెడ పుత్రునివలె బ్రవర్తించి, భిక్షాటనమునం దాతని ననుసరించి యాతనికి సపర్యలొనర్చుచు, విద్యలుపూర్తియగువరకు నాతనివద్దనే యుండవలసియుండెను. ఈవిద్యావిధానమునందలి శిక్షణముగూడ కఠినముగనే యుండెను. ఉల్లిపాయ, మద్యము మున్నగు తామసపదార్థములు నిషేధింపబడినవి. దేహమునం దస్వాస్థ్య మొదవినచో నుపవాసము విధింపబడెను. సాయంకాలమున గురుశిష్యులు కొంతదూరము నడచి దేహపరిశ్రమ మొనర్పవలసియుండెను.

ఈత్ సింగ్, హ్యూయాన్ స్వాంగ్ అనుచైనాదేశయాత్రికులవ్రాతలవలన బౌద్ధవిద్యాప్రణాళికను గూర్చి విశేషాంశములు దెలియుచున్నవి. సాధారణముగ బాలురకారవయేట నక్షరాభ్యాసము చేయబడుచుండెడిది. వారక్షరములను, చిన్నచిన్నమాటలను నేర్చుట కొకసంవత్సరము పట్టెడిది. ఎనిమిదవయేట వారు "సిద్ధా" యను గద్యపఠనమును జేయుచుండిరి. అటుపై "సిద్ధాంత" మను పంద్రెండుప్రకరణములుగల వ్యాకరణము వారికి బోధింపబడుచుండెడిది. ఈవిధానము మన ప్రకృతప్రారంభవిద్యాప్రణాళికకు సరియగుచున్నది. ఇటుపై నభిరుచి ననుసరించి బాలురు కళలు, పరిశ్రమలు, వైద్యము, తర్కము మున్నగువానిలో ప్రత్యేక కృషి నొనర్చుచుండిరి. ఇయ్యది ప్రస్తుతవృత్తివిద్యకు సరియగును. అటుగాక ఇంకను విద్యాభ్యాసమును సాగింపనెంచువారు పాణినీయ సూత్రములను, ధాతుపాఠమును, ఖిలప్రకరణములను, వృత్తిసూత్రములను బఠించి, యిరువదవసంవత్సరమున విద్యాభ్యాసమును బూర్తిచేయుచుండిరి. ఇంకను విశేషప్రజ్ఞ నార్జింపదలచినవారలకు గూడ నొకప్రత్యేక ప్రణాళిక యేర్పరుపబడెను. గద్యపద్యరచనము, హేతువిద్య, అభిధర్మకోశము, న్యాయద్వారా తర్కశాస్త్రము, పాతంజలి మహాభాష్యము, భర్తృహరిసూత్రము, వాక్యవృత్తి, పెయినము, వినయపిటకము మున్నగు విషయము లిందలివిభాగములు.

బౌద్ధవిద్యావిధానమునందలి బోధనవిధులలో గూడ గొంతప్రత్యేకత గాంచనగుచున్నది. బ్రాహ్మణవిద్యార్థులవలెనే బౌద్ధబాలురుగూడ ప్రాయికముగ విషయములను గంఠస్థములుగ నొనర్చుకొనుచుండినను, ఇచ్చట వాక్యార్థమునకును, చర్చలకును విశేషమగు ప్రామాణ్య మీయబడెను. విఖ్యాతవిద్యాలయములన్నిటి యందునుగూడ బండితశ్రేష్ఠు లొకప్రత్యేకభవనమున జేరి యచ్చట తత్త్వమునుగూర్చి వాదోపవాదములను జేయుచుండిరి. దీనిచే విషయము సుగమమగుటయే కాక

విద్యార్థుల విమర్శనాబుద్ధి పెంపొందుటయు, స్వతంత్ర వ్యాఖ్యానములు బయల్వెడలుటయు జరగుచుండెడిది.

## III. విద్యాపీఠములు

బౌద్ధవిద్యావిధానమనఁదగు ప్రాచీనభారతీయ నాగరికతకునుగూడ బౌద్ధవిద్యాలయములు వెలలేని భూషణములు. సుప్రశాంతస్థలములలో నిర్మింపఁబడి యసంఖ్యాకములగు సౌధగోపురస్తూపములతో రాజిల్లుచు, రాజాదరణమును బడసి, భిక్షుభిక్షుణీజనముల తోడను, పండితప్రకాండులతోడను రాజిల్లి, సరస్వతీ నిలయములై యొప్పిన విద్యాలయము లనేకము లీదేశమున వర్ధిల్లినవి. దూరదేశములనుండి యనేకు లీ యాలయములలో విద్యాభ్యాసము చేయుచుండిరి. ఫాహియాన్ అను చైనాదేశయాత్రికుఁడు క్రీ. శ. ౫-వ శతాబ్దమున ఉద్యాన, పురుషపుర, మథుర, సంకాశ్య, కన్యాకుబ్జ, శ్రావస్తి, సాకేత, రామగ్రామ, కపిలవస్తు, వైశాలి, పాటలీపుత్ర, రాజగృహ, వారణాసి, గయా, చంపా, తామ్రలిప్తి మున్నగు స్థలములలో సుప్రసిద్ధ విద్యాపీఠము లుండెడివని వ్రాసియున్నాఁడు. హ్యూయాన్ ష్వాంగ్ అను నాతఁడు సింహపుర, ఉరశ, కాశ్మీర, పునచ, రాజపుర, నాలందా, వృజ్జి, హిరణ్యపర్వత, పుండ్ర, వర్ధన, కామరూప, సమతట, వేంగీ, ధనకటక, మంషూయట, భరుకచ్ఛ, వల్లభీ, ఉజ్జయినీ, మూలస్థాన విద్యాలయములను దర్శించెను. ఈత్ సింగ్ అను మరియొక యాత్రికుఁడు తామ్రలిప్తి, హరికేల, రాజగృహ, కుశనగర విద్యాపీఠములను గాంచియుండెను. ఇవికాక నింక ననేకములగు విద్యాలయము లుండెడివి. వాని నామములు సహితము నేఁడు దెలియకున్నవి. పై విద్యాలయములలో ముఖ్యములగువాని చరిత్రముమాత్ర మిట సంగ్రహముగ బేర్కొనబడుచున్నది :

నాలందా:—బౌద్ధవిద్యాలయములలోనే కాక ప్రాచీనభారతీయవిద్యాపీఠములలోనెల్ల నాలందా విశ్వవిద్యాలయ మగ్రగణ్యము. ప్రస్తుతపు పాట్నాజిల్లాలోని రాజగిరికి ఏనిమిదిమైళ్లదూరమునందున్న బారగావ్ అనుగ్రామమున పాడుపడిన చెఱువులును, సుమారు ౩౦౦౦ అడుగులదూరము వ్యాపించిన మట్టిదిబ్బలును బూర్వపు నాలందావిద్యాపీఠ ముండిన స్థలమున నేటికి గానవచ్చుచున్నవి. ఇటీవల ప్రభుత్వమువారి యార్షశాఖచే నీస్థలమంతయు బరిశోధింపబడి యమూల్యములగు శిథిలములు బయల్వెడలింపబడినవి. అందు సువిశాలములగు భవనములును, చక్కని స్తూపములును, వసతిగృహములును నెన్నియో గలవు. ఈవిద్యాలయము వృద్ధిలోనుండినపు డిటకేతెంచిన యాత్రికులవ్రాతల నుండి యిందలి శిథిలములను గుర్తించుటకు వీలగుచున్నది. తారానాథుఁడను చరిత్రకారు డీస్థలమున శారిపుత్తుఁడను భిక్షువు జన్మించెననియు, నాతనిచైత్యమును జేరి యశోక చక్రవర్తి యొకయాలయమును నిర్మించెననియు వ్రాసియున్నాఁడు. హ్యూయాన్ ష్వాంగ్ అనునాతఁడు శక్రాదిత్యుఁడనురాజు నాలందాసంఘారామమును నిర్మించెననియు, నాతనికి బిమ్మట రాజ్యమేలిన బుధగుప్త, తథాగతగుప్త, బాలాదిత్య, వజ్ర యనువార లిచ్చట ననేకభవనములను నిర్మించిరనియు వ్రాసియున్నాఁడు. అటుపై నింకొకరా జీయారామములచుట్టు నొకగోడను గట్టించి యందొక ద్వారమును వేయించెను. దీనినుండి క్రీ. శ. ౪౫౦ నాటి కీవిద్యాపీఠము గుప్తరాజుల యాదరము నందెనని స్పష్టమగుచున్నది.

ఇందు సుందరశిల్పవిరాజమానములగు గోపురములు, గిరిశృంగములను ధిక్కరించు బురుజులు నుండెడివి. సౌధములందలి పైయంతస్తులు మేఘమండలమును దాటియుండ వానిపై నిర్మింపబడిన గ్రహదర్శనశాలలు (Observatories) సాధారణముగ నదృశ్యములుగ నుండినవి. భిక్షువులు నివసించుటకు నాల్గంతస్తులభవనము లుండినవి. వానియందలి స్తంభములును, దూలములును చక్కని శిల్పనైపుణిని జూపుచుండినవి. వాని పైభాగమునం దమర్పబడిన పెంకులు సూర్యకాంతిలో వింతవింతలగు రంగుల నీనుచుండెడివి. ఇందలి గోపురముల మధ్య సువిశాలములు, మహోన్నతములు నగు భవనము లుండెడివి. ఇందు నిరంతరమును శాస్త్రవాదములు జరగుచుండెడివి. గోపురముల కిరుపార్శ్వములను చైత్యములును, ఆలయములును ఉండెడివి. వీనికి బాహ్య

ప్రదేశమున భిక్షువులవసతు లుండెడివి. వీని చుట్టును మనోహరములగు కాసారములు, ఆహ్లాద కరములగు మామిడితోపులు నుండెడివి. కాసారము లందలి స్వచ్ఛమగు నీటిపై నల్లకలువలు, రక్తవర్ణము లగు కణకపుష్పములు నీప్రదేశమున కంతటికిని విలక్షణ మగు శోభ నొనగూర్చుచుండినవి. ఈవిద్యాలయమున శిక్షణము నందుటకై కొరియా, మంచూరియా, బొఖారా మున్నగు దూరదేశములనుండికూడ ననేకు లేతెంచుచుండిరి. ఇందలిజనులు ౧౦౦౦౦ లకు మించి యుండిరి. ఇచ్చటి భిక్షువులందరును మహామేధా సంప న్నులు. వారి ప్రవర్తనము నిష్కళంకము. ఈవిద్యా పీఠమునందలి శిక్షణ మతికఠినముగ నుండెను. ఇందు బ్రవే శమునందుటకుబూర్వ మెల్లరును ద్వారమును గాచి యుండు పండితశ్రేష్ఠునితో వాదించి యాతనియనుమతి పైననే లోని కేగవలసియుండెను. ఈపరీక్షయం దుత్తీ ర్ణులైనవారలు లోపలి మహాభవనములలో జరగు చుండెడి వాదప్రతివాదముల నాకర్ణించి తమ యల్ప జ్ఞతను దెలిసికొనుచుండిరి. ఇచ్చట విద్య నేర్చినవార లకు దేశమునందంతటను విశేషమగు గౌరవము చూప బడుచుండెను. క్రీ. శ. ౭-వ శతాబ్దమునం దిచ్చట నెని మిది కళాశాలలు, నూఱువందలకు మించిన సౌధములు నుండెడివి. ఇచ్చటియాచార్యులలో నాగార్జున, అశ్వ ఘోష, వసుబంధు, దిఙ్నాగ, కమలశీల, సంఘభద్ర, శాంతరక్షిత, వీరదేవ, మంజుశ్రీదేవ, శ్రీజ్ఞాన మున్నగువారల నామములు వినవచ్చుచున్నవి. వీరిలో నెల్ల నాగార్జును డగ్రగణ్యుడు. విశేషప్రజ్ఞాశాలియగు నీతడు నాలందావిద్యాపీఠమున శిక్షితుడై వైద్య, జ్యోతిష, రసాయన, తత్త్వశాస్త్రములపై నెన్నియో గ్రంథములను రచించెను. పిమ్మట నీత డావిద్యాపీఠమున కధ్యక్షుడై మాధ్యమిక సిద్ధాంతమును బ్రతిపాదించెను. ఈవిద్యాలయమున విఖ్యాతమగు నొక భాండాగార ముండెడిది. ఇయ్యది రత్నసాగర, రత్నోదధి, రత్న రంజక యను మూడుభవనములలో నుండెడిది. రత్నో దధియను తొమ్మిదియంతస్తులభవనమున ప్రజ్ఞాపారమితా సూత్రము మున్నగు బౌద్ధగ్రంథములన్నియు నుండెడివి.

రాజులందరు నీవిద్యాపీఠమున కనేకవిధముల సహాయమొనర్చుచుండిరి. హ్యూయాన్ త్సాంగ్ కాలమున నూరుగ్రామములపై యాదాయ మీవిద్యాలయమున కొసంగబడుచుండెడిది. ఆగ్రామములందలి గృహస్థు లందరును బియ్యము, పాలు, వెన్న, ఫలములు మున్నగు తినుబండములను ప్రతిదినమును బంపుచుండిరి. దానం జేసి యిందలి విద్యార్థులకు భిక్షాటనావసరము లేకుండె డిది.

ఈవిద్యాలయమున బ్రతివిద్యార్థియు నొకగురువు నొద్దనే యుండి యాతనికి శుశ్రూష చేయుచు విద్య నేర్చుచుండెను. ఇదిగాక విరామసమయములలో నాతడు ఆచార్యులు చేయు వాదోపవాదములనుగూడ వినుచుండెను. మహాయానమును, మఱి పదునెనిమిది బౌద్ధ దర్శనములును, వేదములు, హేతువిద్య, శబ్దవిద్య, చికిత్సావిద్య, తంత్రము, సాంఖ్యము, వ్యాకరణము మున్నగునవియు నీవిద్యాలయమున నేర్పబడుచుండెడివి. ఇచ్చట సూత్రములను, శాస్త్రములను బోధించువారలు వేయిమందియు, తత్త్వరహస్యములను జెప్పగలవార లైదువందల మందియు నుండిరి. ఇచ్చట నూరుపన్యాస వేదిక లుండెడివి. ధర్మపాల, చన్ద్రపాల, గుణమతి, ప్రభామిత్ర, జ్ఞాన చంద్ర, శీలభద్రాద్యాచార్యు లనే కులు వీనినుండి యుపన్యాసములను జేయుచుండిరి.

క్రీ. శ. ౮-వ శతాబ్దమున విక్రమశిలావిద్యాల యము విజృంభించినపిదప నీనాలందావిద్యాపీఠము పూర్వౌన్నత్యమును గోలుపోయెను. అయిన నీవిద్యా పీఠము ౯-వ శతాబ్దమువరకును వర్ధిల్లి పిమ్మట మహమ్మ దీయులచే నాశమొనర్పబడెను. ముదితభద్రుడనునాత డిందలి కొన్నిభాగముల నుద్ధరించెను. తుద కీవిద్యా లయము హుతాశనున కాహుతి యయ్యెను. "క్షమచే కోపమును, సత్కార్యములచే దుష్టులను, దానముచే లోభులను, సత్యముచే మృషావాదులను జయింపవలెను" "ధర్మము, నధర్మము నొకేవిధమగు ఫలము నీయవు. అధర్మము నరకమున కీడ్చుకొనిపోవ ధర్మము మను జునికి స్వర్గమున శాశ్వతనివాసము నొనగూర్చును" అను నాలందావిశ్వవిద్యాలయాదర్శములు సర్వకాలములం

దును, సర్వదేశములందునుగూడ ప్రాచీనభారతీయుల నైతికశుద్ధిని, హృదయవైశాల్యమును వేనోళ్ళ చాట గలవు.

విక్రమశిల:—నాలందావిద్యాపీఠమునకు ప్రత్యర్థియై యనతికాలముననే దానిని మించి విజృంభించిన దీవిక్రమశిలావిద్యాపీఠము. దీని శిథిలములైనను నేడు కానరాక స్థలనిర్ణయముసహితము క్లిష్టముగ నున్నది. గంగానదికి కుడిభాగమున భాగల్‌పురమువద్ద నుండు పాతర్‌ఘాటాకొండలపై నీవిద్యాలయ ముండియుండునని పండితులప్రకృతాభిప్రాయము. క్రీ. శ. ౮౧౦-వ సంవత్సరమున ధర్మపాలుడను పాలరాజు దీనిని స్థాపించెను. మొదట నిచ్చట నూర్గురాచార్యులు వివిధవిషయములను బోధించుచుండిరి. వీరుగాక కొందరు భిక్షువులుగూడ నిటనుండిరి. ఈ విద్యాపీఠమును ఆర్గురుసభ్యులుగల సంఘము రాజాదరణముచే నిర్వహించుచుండెను. ఇచ్చట విద్యాభ్యాసమును ముగించినవారిని రాజులు "పండిత" యను బిరుదము నిచ్చి గౌరవించుచుండిరి. రత్నవజ్ర, జేతారి, ద్వీపంకర, రత్నకీర్తి, జ్ఞానశ్రీమిత్ర, రత్నాకరశాంతి మున్నగువార లిట్టి పండితులలో నగ్రగణ్యులు.

విక్రమశిలావిద్యాపీఠమున కారుద్వారములుండెడివి. వానివద్ద దిగ్దంతులగు పండితు లుండిరి. వీరిలో ప్రజ్ఞాకరమతి యనునాతడు దక్షిణద్వారమును, రత్నాకరశాంతి ప్రాగ్ద్వారమును, వాగీశ్వరకీర్తి యుత్తరద్వారమును, నరోపంతయనునాతడు పశ్చిమద్వారమును నొకప్పుడు రక్షించుచుండిరని తారానాథుడను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. ఇందలి భిక్షువులకు, నాచార్యులకును రాజులు వసతుల నేర్పరచిరి. విద్యాలయమధ్యమునం దొకవిశాలసౌధ ముండెడిది. అందలి యారుద్వారములకు నెదురుగా నారువిశాలము లగు కళాశాల లుండెడివి. ఒక్కొక్కకళాశాలలో నూట యెన్మండుగు రుపాధ్యాయు లుండిరి. ఇదిగాక నీయంతర్భాగమునం దొకేసారిగ నెనిమిదివేలమంది యుపాసకులు నిల్చుటకు సరియగు బహిరంగప్రదేశ ముండెడిది. ఒక్కొక్కద్వారముకడనుండు పండితు డొక్కొక్క కళాశాల కధ్యక్షుడుగ నుండెను. విద్యాపీఠమును ప్రవేశించుటకు బూర్వ మభ్యర్థులెల్లరును ద్వారపండితులచే బరీక్షింపబడుచుండిరి. ఈవిద్యాలయమునందు విద్యార్థులకు భోజనాదిసౌకర్యములను గల్గించుటకై ధర్మసత్రము లుండెడివి. వీనికి రాజులును, ధనికులును వసతులను గల్పించుచుండిరి. ఈవిద్యాపీఠముచుట్టును గల గోడపై సింహద్వారమునకు దక్షిణపార్శ్వమున నాగార్జునునియొక్కయు, నుత్తరపార్శ్వమునం దతిశునియొక్కయు చిత్రములు వ్రాయబడియుండినవి. ఈవిధమున పండితశిఖామణు లిచ్చట బహూకరింపబడుచుండిరి.

విక్రమశిలావిద్యాపీఠము బౌద్ధతంత్రమునకు విశేషఖ్యాతి వహించియుండెను. క్రీ. శ. ౯-వ శతాబ్దమునం దింద్రజాలాదికములతో గూడిన తంత్రశాస్త్రము బౌద్ధులలో ప్రబలి ౮, ౧౦ శతాబ్దములలో విశేషముగ నభివృద్ధి నందినది. ఏకేశ్వరాత్మకమగు మహాయానబౌద్ధమునం దీశక్త్యారాధనపర మగు తంత్రము చొప్పింపబడినది. వ్యాకరణ, వేదాంత, తర్కములు పిమ్మట నేర్వ్కొనవలసిన విషయములు. నాలందా విద్యాపీఠమునకు బిమ్మట విశేషవిఖ్యాతిని గాంచిన యీ విద్యాపీఠము తుదకు భక్తియార్‌ఖిల్జీచే నాశమొనర్పబడెను.

ఒదంతపురి:—ఒదంతపురి బీహారులో నుండినది. ఈ నగరమున కుద్దండపురమను నామాంతరము గలదు. పాలవంశీయుడగు గోపాలుడనురాజు క్రీ. శ. ౮-వ శతాబ్దమునం దీవిద్యాపీఠమును నిర్మించెను. ఇచ్చట కేవలము బౌద్ధగ్రంథములేగాక బ్రాహ్మణవిద్యగూడ గరపబడుచుండెడిది. ఈ విద్యాలయమునందలి గ్రంథాగారము మిగుల ఖ్యాతివహించియుండెను. క్రీ. శ. ౧౧౯౭ లో మహమ్మదీయు లీయుద్దండపురిని జయించి, యిచ్చటిభిక్షువులను, విద్యార్థులను జంపి యిందలిగ్రంథాలయమును నాశమొనర్చిరి.

ఇంతవరకు నుత్తరహిందూస్థానమున ప్రసిద్ధి గాంచిన బౌద్ధవిద్యాపీఠములలో ముఖ్యములగువానిని వర్ణించియుంటిమి. ఈ సమయమున దక్షిణమునగూడ బౌద్ధధర్మము వ్యాపించి యనేకముగ నచ్చటి నాగరికత నభివృద్ధిచేసెను. విహారములు, సంఘారామములు, స్తూపములు మున్నగున వెన్నియో బయల్వెడలినవి. క్రీస్తుశక ప్రారంభమున దక్షిణాపథము శాతవాహనాంధ్రుల పాలనమునం దుండెను. వారిలో ననేకులు బౌద్ధమతము నాదరించియుండిరి. కాన నిచ్చటగూడ భిక్షుసంఘములు విద్యావ్యాసంగము చేయుట కవకాశము లేర్పడినవి. ఆకాలపు విద్యాపీఠములలో నీక్రిందివి ముఖ్యమైనవి:

ధాన్యకటకము:—ఇయ్యది ప్రకృతము గుంటూరు జిల్లాలో ధరణికోట యని పిలువబడు గ్రామము. కృష్ణా దమరావతికి సమీపమున గొన్ని మట్టి దిబ్బలచే నావరింపబడియున్న యీగ్రామ మొకప్పుడు విఖ్యాతినందిన విద్యాపీఠముగ నుండినది. బ్రాహ్మణ బౌద్ధవిద్యలు రెండునుగూడ నిచ్చట ప్రబలినవి. క్రీ. శ. ౨-వ శతాబ్దమున బౌద్ధమతమును సంస్కరించి మహాయానసిద్ధాంతమును నెలకొల్పిన సిద్ధనాగార్జును డీధాన్యకటకవిద్యాపీఠము ననేకవిధముల నభివృద్ధిపరచెను. విదేశయాత్రికుల వ్రాతలనుండి యీవిద్యాలయమును గూర్చిన విశేషాంశములు నాలందావిద్యాపీఠము నందలి గ్రంథాగారములలో పదిలపరుపబడియుండెడివని తెలియుచున్నది. క్రీ. శ. ౭-వ శతాబ్దమునం దీదేశమునకు వచ్చి, బౌద్ధతత్త్వమును దెలిసికొనుచు, బౌద్ధగ్రంథములను సేకరించుచు బర్యటన మొనర్చిన హ్యూయన్ స్వాంగ్ అను చైనాదేశ యాత్రికు డీధాన్యకటకనగరమునం దనేకసంఘారామములు, స్తూపములు నుండెడివనియు నచ్చట విద్యావ్యాసంగములును, బౌద్ధపూజలును నిరంతరాయముగ జరుగుచుండెడివనియు వ్రాసియున్నాడు. టిబెట్ దేశము నందలి "డాపంగ్" సంఘారామ మీధాన్యకటకము నందలి నిర్మాణము ననుసరించియే కట్టబడెననుటలో నీయాంధ్రవిద్యాపీఠముయొక్క మహత్త్వము తెలియుచున్నది.

వేంగీ:— బౌద్ధయుగమునం దాంధ్రదేశమున విఖ్యాతిగాంచిన విద్యాపీఠములలో వేంగీపీఠము మరియొకటి. చక్కనిశిల్పములతో విరాజిల్లు నైదంతస్థుల హర్మ్యము లిచ్చటి సంఘారామమునం దుండెడివనియు, నిచ్చటిస్తూపము నిరుపమముగ నుండెడివనియు చైనా దేశయాత్రికుల వ్రాతలవలన దెలియుచున్నది. ఇచటి విద్యాపీఠమునకు దిఙ్నాగాచార్యు డధ్యక్షుడుగ నుండెను.

శ్రీశైలము:—ఇచ్చటగూడ క్రీ. శ. ౨, 3 శతాబ్దములలో నొకసంఘారామ ముండెడిది. నాగార్జును డిచ్చట నొకగ్రంథాలయమును స్థాపించి, యనేకుల నిట జేర్చి విద్యోపదేశమును జేసెను.

కాంచీపురము:—ధాన్యకటక, శ్రీశైల విద్యాపీఠములవలెనే బౌద్ధయుగమున గాంచీపురము దక్షిణదేశమునం దొక ప్రఖ్యాతవిద్యాలయముగ నుండెను. ఇట బౌద్ధబ్రాహ్మణవిద్యలు రెండును వ్యాప్తినందినవి. బౌద్ధగ్రంథములనుండి క్రీ. శ. 3-వ శతాబ్దములో నుత్తరమునుండి యిటకు గొందరు భిక్షువు లేతెంచిరనియు, నిటనుండియే బౌద్ధమతము సింహళదేశమున వ్యాపించెననియు దెలియుచున్నది. హ్యూయన్ స్వాంగ్ ఈవిద్యాపీఠమునుగూర్చి ప్రశంసించియున్నాడు.

[సశేషము]

# నేటిరష్యా

### పరిశ్రమలు

విశేషసహజసంపత్తి గలిగియున్నను పాశ్చాత్య దేశములన్నిటిలోను రష్యా పారిశ్రామికముగ నేటికిని చాల వెనుకబడియున్నది. జారు చక్రవర్తులపరిపాలన కాలమున దేశీయపరిశ్రమలకు తగు ప్రోత్సాహము లభింప కుండుటయే దీనికి ముఖ్యమైన కారణము.

జర్మనుయుద్ధమునకు పూర్వము రష్యా పారిశ్రామికముగ నెంత వెనుకబడియున్నదియు క్రిందిపట్టిక వలన స్పష్టపడగలదు:—

| | సకటున ఇనుము ఉపయోగము 3 పూడ్సులలో | తలకు బొగ్గు ఉత్పత్తి టన్నులలో |
|---|---|---|
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | ౧౪ | ౪.౧ |
| ఇంగ్లండు | ౧౧ | ౬ |
| జర్మని | ౧౦ | ౩.౮ |
| రష్యా | ౧౫ | ౦.౨ |

(3 పూడ్ = ౩౬ పౌనులు)

పైపట్టికయందు తదితర పాశ్చాత్యదేశములలో కన్న రష్యాలో ఇనుము, బొగ్గు చాలతక్కువ వాడుకలోనుండె నన్నట్లు చూపబడినది. ౨౦-వ శతాబ్దమున ఇనుము, బొగ్గులు పరిశ్రమలకు ప్రధానావశ్యకములుగాన, అవి తక్కువవాడుకలో నున్నప్పుడు పరిశ్రమలు కూడ తక్కువగ నున్నవనుట ఊహ్యము.

ఇట్లు ౧౯౧౪-వ సంవత్సరపు ఐరోపామహాసంగ్రామమునకుపూర్వమే రష్యాదేశమున పరిశ్రమలు చాల తక్కువగ నుండెడివి. ఆసంగ్రామమునకు ఫలితముగ వానిస్థితి పూర్తిగ చెడిపోయెను. జర్మను "బ్లాకేను" వలన పూర్వమువలె యంత్రములను, వానిసామగ్రిని దిగుమతిగావించుకొనుట దుస్సాధ్య మయ్యెను. కార్మికులలో నెక్కువమంది ఆయుధపాణులై రణరంగమున కేగవలసివచ్చెను. దేశమునగల కొలదిపెట్టుబడియు (Capital) యుద్ధపరికరములపై వినియోగింపబడు చుండెను. ఈకారణములన్నిటివలనను ౧౯౧౭-వ సంమున సోవియటుప్రభుత్వము అధికారము వహించుసరికి పరిశ్రమలన్నియు పరిపూర్ణభగ్నావస్థలోనికి వచ్చెను.

అందుచే నధికారమువహించిన కొలదిదినములలోనే (౧౯౧౭ నవంబరు ౧౪-వ తేదీని) సోవియటుప్రభుత్వము దేశములోగల యంత్రాలయములనన్నిటిని స్వాధీనము గావించుకొని, వానిని కార్మికసంఘముల పరిపాలనలో బెట్టెను. ఈపద్ధతి వలన పరిశ్రమలు సత్వరముగ పెంపొందగలవని భావింపబడెను. కాని ౧౯౧౮-౨౦ సం. ములమధ్య ఇంటను బయటనుకూడ గలిగిన ముత్తిడివలన సోవియటుప్రభుత్వము త్వరలో నైపద్ధతిని విసర్జించి నూతనమునుమరొకదానిననుసరింపవలసివచ్చెను. ఈక్రొత్తపద్ధతికి "మిలిటరీ కమ్యూనిజము" (Military Communism) అని నామకరణ మొనర్పబడెను.

మిలిటరీ కమ్యూనిజముపద్ధతిక్రింద ప్రభుత్వమే స్వయముగ పరిశ్రమాలయముల పరిపాలనభారమును వహించెను. ౧౯౨౦-వ సం. మునాటికి దేశము మొత్తమువీద గల షుమారు ౬౯౫౫ పరిశ్రమాగారములలోను కొలదికి ప్రభుత్వాధికారములో నుండెను. మిగిలినవిమాత్రము వాని పూర్వపు ఆసాముల చేతులలో నుండెను.

"సుప్రీమ్ఎకనమిక్ కౌన్సిలు" (Supreme Economic Council) అను ప్రభుత్వశాఖ యుద్ధావశ్యకముల కనుగుణముగ పరిశ్రమసంస్థలను పరిపాలించు

చుండెను. దీనియధికారములో ౧౯ కేంద్రము (Head-Centres)లుండెను. ఒక్కొక్క పరిశ్రమభారమంతయు నొక్కొక్క కేంద్రము వహించుచుండెను. అనగా, రసాయనపరిశ్రమయంతయు నొకకేంద్రముక్రిందను, చర్మపరిశ్రమయంతయు మరొకకేంద్రముక్రిందను, కాగితపు పరిశ్రమ వేరొకకేంద్రముక్రిందను–ఇట్లే తదితర పరిశ్రమలు తక్కినకేంద్రములక్రిందను ఉండెను. ఇక, వివిధపరిశ్రమలలో గల యంత్రాలయముల పరిపాలన వానిలో పనిచేయు కార్మికులకమిటీలకు ఒప్పగింపబడెను.

వివిధ పారిశ్రామిక శాఖలచే నుత్పత్తి గావింపబడు వస్తుసముదాయములో నాయాశాఖలలోని కార్మికులకు వలసినభాగమును మిగిల్చి తక్కినదానిని ప్రభుత్వము వశపరచుకొనుచుండెను. ఈ శాఖలకు వలయు ముడివస్తువులను కార్మికులకు ధనరూపమున చెల్లింపవలసిన మొత్తమునకు "కరన్సీనోట్లు"ను(Paper money) ప్రభుత్వమే "సప్లయి" చేయుచుండెను.

ఇట్లు సేకరించిన వస్తుతతిని ప్రభుత్వము ప్రజలకు "రేషనుకార్డ్సు" ప్రకారము పంచిపెట్టుచుండెను. వర్తకవ్యాపారమంతయు "బార్టరు" పద్ధతిపై జరుగుచుండెను. ధనమునిచ్చి వస్తువులను కొనుట, అమ్ముట పరిపూర్ణముగ నిషేధింపబడెను.

ఈపారిశ్రామికపద్ధతి నవలంబించుటవలన సోవియటుప్రభుత్వము ఇంటను బయటను కూడ సంఘటిల్లినయుద్ధములలో జయమంది, తన యధికారమును సుస్థిర మొనర్చుకొనగలిగెను. కాని దానివలన దేశమునకు తదితరవిధముల చాలనష్టము వాటిల్లెను. వ్యక్తిగతవ్యాపారము (Private trade) నిషేధింపబడుట వలన గ్రామస్థుల కత్యంతోపయోగకరమైన గృహపరిశ్రమలు క్షీణించిపోయెను. యుద్ధపరికరముల యుత్పత్తి కెక్కుడు ప్రాధాన్య మొసగుటవలన, తదితరపరిశ్రమలకు దెబ్బతగిలెను. ఇట్టివే పెక్కుకారణములవలన ౧౯౨౦-వ సంవత్సరము వచ్చుసరికి పరిశ్రమలు చాల క్షీణస్థితిలోనికి వచ్చెను. ఆసంవత్సరములో పరిశ్రమలెట్టిస్థితియందున్నదియు క్రిందిపట్టికవలన తేటతెల్లము కాగలదు:—

| | ఉత్పత్తియందు ౧౯౧౩-వ సం.ములో కన్న తగ్గుదల (నూటికి) | |
|---|---|---|
| బొగ్గు | ౭౮ | వంతులు |
| ఇనుము (ముడిపదార్థము) | ౯౭౪ | ,, |
| ,, (లోహము) | ౯౭ | ,, |
| నూలు | ౯౫ | ,, |
| కిరసనాయిలు | ౫౮ | ,, |
| పంచదార | ౯౪ | ,, |
| రసాయనములు | ౯౫ | ,, |
| పాదరక్షలు | ౭౯ | ,, |
| పరిశ్రమలు మొత్తముమీద | ౭౫ | ,, |

ఇట్లు పరిశ్రమలన్నియు కడు క్షీణించిపోవుటను గాంచి సోవియటుప్రభుత్వసంస్థాపకులలో నగ్రగణ్యుడగు లెనినుమహాశయుడొక "నూతన-ఆర్థికనీతి" (New Economic Policy)ని ప్రకటించెను. ఈ నీతియే నేటికిని రష్యాపారిశ్రామికజీవితమునకు ప్రాతిపదికగ నున్నది.

నూతన-ఆర్థికనీతి ప్రవేశపెట్టిన సంస్కరణముల నిట్లు సంగ్రహముగ పేర్కొనవచ్చును:—

౧. వ్యక్తిగత వ్యాపారముపై పూర్వపు నిషేధమును తొలగించుట.

౨. గృహపరిశ్రమలకు ప్రోత్సాహ మొసగుట.

౩. పారిశ్రామిక సంస్థల పరిపాలనభారమును "ట్రస్టుల" (Trusts) పైనను, "సిండికేటుల" (Syndicates) పైనను మోపుట.

వీనిలో మొదటిరెంటినిగూర్చి వివరింపవలసిన యగత్యము లేదు. కాని మూడవవిషయమును గూర్చి కొంత ముచ్చటింపవలసియున్నది. ఒకేరకపువస్తు సముదాయము నుత్పత్తిగావించు పరిశ్రమాలయముల సమాఖ్యయే ట్రస్టు. ఈట్రస్టులు వ్యాపారసరళిపై నడుపబడుచుండె

డును. వీనిలో లాభసాటిగ పనిచేయుచున్న వానినుండి ప్రభుత్వము నిర్ణీతమైన కొంతమొత్తమును పరిగ్రహించును. తద్వ్యతిరేకముగ పనిచేయుచున్న వానికి కొంత ధనసహాయము (Subsidy)నిచ్చును. ఇంతకుమించి ప్రభుత్వము ట్రస్టుల ఆర్థికవ్యవహారములలో జోక్యముకలిగించుకొనదు. అవి శాస్త్రయుక్తముగ (Scientifically) వస్తుతతి నుత్పత్తిగావించి, వీలైనంత చౌకగ విక్రయింపవలెనేకాని విపరీతముగ లాభమును బడయుటకు యత్నింపరాదు. దీనికి భిన్నముగ ట్రస్టులు వర్తింపకుండుటకుగాను కొన్ని నిబంధనలేర్పరుపబడినవి. ఉదాహరణముగ వానిలో కొన్ని క్రింద పేర్కొనబడుచున్నవి.—

౧. ప్రతి ట్రస్టు జమఖర్చులెక్కలను జాగ్రత్తగనుంచవలెను.

౨. వస్తువులను విక్రయించుటలో ప్రభుత్వసంస్థలకును, సహకారసంఘములకును "ప్రిఫరెన్సు" చూపవలెను.

3. ప్రభుత్వ వర్తక వ్యాపారశాఖ నిర్ణయించు ధరలకే వస్తువులను అమ్ముచుండవలెను.

సిండికేట్లు ట్రస్టులచే నుత్పత్తిగావింపబడిన వస్తుజాలమును విక్రయించుట కేర్పడిన సంస్థలు. వీనివలన వస్తువులయుత్పత్తిధరపై చిల్లరవర్తకుడు వేసుకొను లాభము తగ్గిపోవును. ఇవి నిర్వర్తింపవలసిన విధులను సంగ్రహముగ నిట్లు ఉదాహరింపవచ్చును:—

౧. మార్కెటును పరిశీలించుట. వర్తకపరిస్థితులను గమనించుట. "ఆర్డరుల" (Orders)ను సేకరించి, వానిని వివిధములగు ట్రస్టులకు తగురీతిని పంచిపెట్టుట.

౨. ప్రభుత్వపు వర్తకవ్యాపారశాఖవారితో కలిసి వస్తువుల ధరను నిర్ణయించుట.

3. ముడివస్తువులను మొత్తముగ కొనుట, ట్రస్టులకు సప్లయిచేయుట.

౪. క్రయవిక్రయములను గావించుటకు ఏజెన్సీలను ఏర్పాటు గావించుట.

సిండికేట్లలో సభ్యత్వముగల ట్రస్టులు తాముత్పత్తిగావించు వస్తుసముదాయమును విక్రయార్థము వాని కొప్పగించును. ప్రస్తుతము రష్యాలో నిట్టి సిండికేట్లు ౨౦ కి పైగా కలవు.

ప్రభుత్వ పరిశ్రమాలయములన్నియు అనుకరింపవలసిన నీతి నున్నగువిషయములను "సుప్రీము ఎకనమిక్ కౌన్సిలు" నిర్ణయించును. ఈ కౌన్సిలును ప్రభుత్వపు పారిశ్రామికశాఖయని చెప్పవచ్చును. ప్రతి రాష్ట్రీయప్రభుత్వములో కూడ నిట్టిశాఖ కలదు. అందుచే ప్రభుత్వపరిశ్రమలను మూడుతరగతులక్రింద విభజింపవచ్చును:—

౧. సమాఖ్యకు సంబంధించినవి.

౨. రాష్ట్రములకు సంబంధించినవి.

3. పురపాలకసంఘములు మొదలగు స్థానిక సంస్థలకు సంబంధించినవి.

ట్రస్టులును, సిండికేట్లును ప్రభుత్వపరిశ్రమల పరిపాలన భారమును వహించును. ఇక "సుప్రీము ఎకనమిక కౌన్సిలు" పైరెండుసంస్థలును అనుకరింపవలసిన నీతిని నిర్ణయించును.

నూతన-ఆర్థికనీతి ప్రభుత్వపరిశ్రమల పరిపాలన క్రమము నిట్లు నిర్ణయించుటయేకాక ప్రయివేటు పారిశ్రామికసంస్థలకుసహితము కొంతస్థానమును కల్పించెను. వీనిలో మూడురకము లున్నవి. * కేవలము వ్యక్తిగతముగ నిర్వహింపబడు పారిశ్రామిక సంస్థలు మొదటిరకములోనికి వచ్చును. ఇట్టివానిపై కనీసపు పెట్టుబడి (Minimum capital) ని పెట్టవలెను. ప్రతిసంవత్సరమును ప్రభుత్వమునకు కొంత "రాయల్టీ" చెల్లించుకొనుచుండవలెను. ప్రారంభముననే నిర్ణీతమైన ౨౫ సంవత్సరములో, ౫౦ సంవత్సరములో గడచినపిదప సంస్థను ప్రభుత్వవశే మొనర్పవలెను. ఈ

* These are known as "Concessions", "Leases" and "Mixed Companies."

లోపుగ సంస్థకు సంబంధించిన ఆస్తిని అమ్ముటకుగాని, తాకట్టు పెట్టుటకుగాని వీలుపడదు. ప్రభుత్వము తాను నిర్వహింపలేక కొందరువ్యక్తులకు గాని, సహకారసంఘములకు గాని అద్దెకిచ్చు సంస్థలు రెండవరకము లోనికి వచ్చును. ఇక ప్రభుత్వము ప్రయివేటువ్యక్తులతో భాగస్వామిగ నుండు సంస్థలు మూడవరకములోనికి వచ్చును. ఇట్టివానిలో యంత్రాగారము ప్రభుత్వమునకు చెందియుండును. దానిని పనిచేయించుటకు వలయు పెట్టుబడి ప్రయివేటు వ్యక్తులదై యుండును. ఈమూడుపద్ధతులలో తుదిరెండును అధికముగ ప్రచారములో నున్నవి.

ఇట్టి నూతనమగు నీతి నవలంబించుటవలన పరిశ్రమలు త్వరితముగ వృద్ధినందసాగెను. ౧౯౨౦-వ సం. ములో పరిశ్రమలు ౧౯౧౩-వ సం. ముతో సరిపోల్చినప్పుడు నూటికి షుమారు ౮౫ వంతులు తగ్గిపోయెనని పైన చెప్పబడెను గదా! కాని నూతన-ఆర్థికనీతిని ప్రవేశపెట్టుటచే నవి క్రమముగ వృద్ధినంది ౧౯౨౬-వ సం. మునాటికి పూర్వస్థితికి రాగలిగెను. ఈవిషయము క్రింది అంకెలవలన సువిదితము కాగలదు :—

(వేలటన్నులలో)

| | సం. ౧౯౧౩ | ౧౯౨౧ | ౧౯౨౨ | ౧౯౨౩ | ౧౯౨౪ | ౧౯౨౫ |
|---|---|---|---|---|---|---|
| జొగ్గు | ౨౮,౭౭౭ | ౯,౬౩౧ | ౧౧,౬౮౧ | ౧౬,౦౯౮ | ౧౬,౦౮౩ | ౨౪,౩౮ |
| కిరసనాయిలు | ౯,౨౧౬ | ౪,౫౨౨ | ౫,౨౭౫ | ౬,౦౭౦ | ౬,౯౬౦ | ౮,౨౦౫ |
| ఉక్కు | ౪,౨౪౭ | ౧౭౩ | ౩౦౦ | ౬౫౩ | ౧,౨౯౨ | ౨,౨౦౩ |
| ఇనుము | ౩,౫౦౯ | ౨౫౦ | ౪౫౭ | ౬౮౮ | ౧,౩౯౦ | ౨,౧౫౭ |
| సిమ్మెంటు | ౧,౧౧౮ | | ౧౮౦ | ౩౫౪ | ౭౧౬ | ౧,౨౮౫ |

(ఇట్లే తదితరములు)

ఇట్లు ౧౯౨౮-వ సం. ము నాటికి సోవియటు ప్రభుత్వము పరిపూర్ణముగ శిథిలమైన పరిశ్రమలను జర్మను మహాసంగ్రామపు పూర్వస్థితికి పునరుద్ధరింప గలిగెను. తదుపరి రష్యాను తదితర పాశ్చాత్యపారిశ్రామిక దేశములతో సరిపోలున ట్లొనర్చునిమిత్తము "ప్రథమ పంచవర్ష పద్ధతి" (First Five Year Plan) ప్రవేశపెట్టబడెను. ఈపద్ధతిని జయప్రదముగ కొనసాగించు నిమిత్తము షుమారు ౨,౦౨౫ కోట్ల రూప్యములను వెచ్చింపవలెనని నిశ్చయింపబడెను. దీనివలన ప్రథమములో అంచనావేయబడిన ఫలితములకన్న నధికమైనవే సిద్ధించెను. ౧౯౩౩-వ సం. ము జనవరి ౭-వ తేదీని రష్యాడిక్టేటరగు స్టాలనుమహాశయు డొక సామ్యవాద పక్షసభలో నుపన్యసించుచు పరిశ్రమలకు సంబంధించినంతవరకు ప్రథమపంచవర్ష పద్ధతివలన కలిగిన ఫలితమునుగూర్చి క్రింది అంకెలను పేర్కొనెను:—

| | | ౧౯౧౩-వ సం.ముతో సరిపోల్చినప్పుడు పరిశ్రమలలో వృద్ధి లేక క్షయము (నూటికి) |
|---|---|---|
| సోవియటురష్యా | + | ౩౩౪ |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | — | ౮౪ |
| ఇంగ్లండు | — | ౭౫ |
| జర్మనీ | — | ౬౨ |

| | | ౧౯౨౮-వ సం.ముతో సరిపోల్చి నప్పుడు పరిశ్రమలలో వృద్ధి లేక క్షయము (నూటికి) |
|---|---|---|
| సోవియటురష్యా | + | ౨౧౯ |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | — | ౫౬ |

| | | |
|---|---|---|
| ఇంగ్లండు | — | ౨౦ |
| జర్మనీ | — | ౫౫ |
| పోలెండు | — | ౫౪ |

దీనివలన జాతీయాదాయము ౧౯౩౨-వ సం.ములో కంటె నూటికి ౨౫ వంతులును, కార్మికుల రాబడి నూటికి ౬౭ వంతులును, "సోషియలు ఇన్ష్యూరెన్సు ఫండు" నూటికి ౨౯౩ వంతులును వృద్ధినందెను.

ఈ విధముగ ప్రథమ పంచవర్ష పద్ధతివలన రష్యాకు విశేషలాభము కలిగెను. అందుచే త్వరలో (ఒకటి రెండుమాసములలోనే) ద్వితీయపంచవర్ష పద్ధతి ప్రవేశపెట్టబడనున్నది. ఇదికూడ జయప్రదముగ కొనసాగింపబడెనేని రష్యా పారిశ్రామిక దేశములలో నగ్రస్థానము వహించి, విశేష సహజసంపత్తి గలిగికూడ పారిశ్రామికముగ కడువెనుకబడియున్న చైనా, ఇండియా మున్నగు దేశములకు ఆదర్శప్రాయమై విలసిల్లగలదు.

## సహకారోద్యమము

జర్మనీయుద్ధమునకు పూర్వము రష్యాలో ౧౦,౦౦౦ సహకారసంఘము లుండెడివి. వానిలో సుమారు ౧౫ లక్షల సభ్యులుండెడివారు. ఆసంఘములు సాలీనా మూడుకోట్లపౌనుల చిల్లరవ్యాపారమును చేయుచుండెడివి. అనగా, దేశపుమొత్తము చిల్లరవ్యాపారములో నైదవభాగము పైసంఘముల ద్వారా జరుగుచుండెడిది.

యుద్ధసమయమున రష్యాసహకారోద్యమము కడువ్యాప్తిజెందెను. ౧౯౧౭-వ సం. లో బోల్షివికు విప్లవముజరుగుసరికి సహకారసంఘముల సంఖ్య ౪౦,౦౦౦ కు పెరిగెను. సభ్యులసంఖ్య సహితము కోటికి పైగా హెచ్చెను. ఈసంఘములద్వారా జరుగు చిల్లర వ్యాపారము దేశపుమొత్తముదానిలో సుమారు మూడవ వంతువరకు వృద్ధిజెందెను.

సోవియటుప్రభుత్వమొసగిన ప్రోత్సాహము వలన ౧౯౨౨-వ సం. ము వచ్చుసరికి సహకారసంఘ సభ్యులసంఖ్య ఒకకోటినలభయిలక్షలవరకు పెరిగెను. కానియప్పటిలో రష్యాలో ప్రబలియున్న కాటకపు బాధవలనను, ఇంగ్లండు, ఫ్రాన్సు మున్నగుదేశములు రష్యాపై ప్రయోగించిన బహిష్కారనీతివలనను సభ్యుల సంఖ్యాభివృద్ధి కనుగుణముగ సహకార సంఘముల ద్వారా జరుగువ్యాపారము వృద్ధినందుటకు బదులు తగ్గిపోయెను.

పిమ్మట లెనినుమహాశయుడు ప్రవేశపెట్టిన "నూతన-ఆర్థికనీతి" (New economic policy) క్రింద పరిశ్రమలన్నియు ప్రభుత్వాధికారములో నుంచబడెను గాని వ్యక్తిగత వ్యాపారము (Private trade) నిషేధింపబడలేదు. ప్రభుత్వము స్వయముగ కొంత చిల్లర వ్యాపారము చేయుచుండెడిది. కాని తద్ద్వారా వ్యక్తిగతవ్యాపారమును పరిపూర్ణముగ నణగద్రొక్కుటకు వీలుపడదు గాన తత్కార్యము సహకార సంఘముల కొప్పగింపబడెను. ఈ యేర్పాటువలన సహకారసంఘములకు విశేష ప్రాబల్యము వచ్చెను. ౧౯౩౨-వ సం.మునాటికి సహకారసంఘసభ్యత్వము ౩ కోట్లకు పైగాను, వానిద్వారా జరుగు వ్యాపారము ౬౫ కోట్ల పౌనులవరకును వృద్ధినందెను. అనగా మొత్తపు చిల్లరవ్యాపారములో సుమారు సగము సహకారసంఘములద్వారానే జరుగుచుండెను.

రష్యాను సహకారోద్యమపు ఘనత కేవలము దాని ప్రాబల్యములోనే లేదు. దాని నీతికూడ కడు విలక్షణమైనది. "ఎక్కువ వ్యాపారము, తక్కువ లాభము" అనునదియే దానినీతి. అందువలన దేశపు మొత్తము వ్యాపారములో సగము సహకారసంఘముల ద్వారా జరుగుచున్నను, చాల తక్కువ "డివిడెండు" పంచిపెట్టబడుచున్నది. ఇంగ్లండు లో వాటాదార్లకు పెద్దపెద్ద డివిడెండ్లు పంచిపెట్టుదురు. డివిడెండులో కొంతభాగమును క్రొత్తపెట్టుబడి క్రిందకూడ వినియోగింతురు. కాని రష్యాలో లాభములో నధిక భాగము రిజర్వుక్రింద నుంచబడును. ౧౯౩౨-వ సం. ములో రష్యాను సహకారసంఘములకు ౨ కోట్ల పెట్టుబడి యుండెను. దీనిలో కేవలము ౩ కోట్ల

పౌనులు షేరుధనము. తక్కినదంతయు లాభమునుండి సేకరింపబడిన "రిజర్వుఫండు."

రష్యనుసహకార సంఘములు కేవలము నామ మాత్రమును లాభమున కిట్లు వ్యాపారముచేయుటకు కొన్ని ముఖ్యమైన కారణములు కలవు. ఇంగ్లండులో నిప్పటికిని వ్యక్తిగతవ్యాపారము విరివిగ నున్నది. అందువలన సహకార సంఘములుకూడ బజారుధరలకే వస్తువులను విక్రయించుచు, మంచిలాభమును తీయు చుండును. ఇక రష్యాలో నట్లుకాదు. అక్కడ వ్యక్తి గత వ్యాపారము తక్కువ. దానినికూడ రూపుమాప వలెననియే సహకారసంఘముల సంకల్పము. అందుచే నవి దాదాపు కొన్నఖరీదుకే తిరిగి వస్తువులను విక్రయించుచుండును.

నేడు రష్యను సహకారసంఘములలో ౭౪ లున్నారు. అనగా, రష్యాలో మైనారిటీ దాటిన స్త్రీ పురుషులందరిలోను ముప్పాతికపాలు సహకారసంఘసభ్యులు. వీనికి ౩౫ కోట్ల పెట్టుబడి గలదు. ఈ మొత్తములో ౧౫ కోట్ల పౌనులు షేరు ధనము. తక్కినది రిజర్వుఫండు. సంఘముల ద్వారా ౧౭౫ కోట్ల పౌనుల వ్యాపారము జరుగుచున్నది. అనగా, దేశపుమొత్తము వ్యాపారములో నూటికి ౭౦ వంతులు వానిద్వారానే జరుగుచున్నది.

చిల్లర వ్యాపారమునకు వలసిన వస్తుసముదాయమునంతయు సోవియటుసంస్థలనుండి కొనుటయు, దానిని తిరిగి విడుదలచేయుటయు మొదలగు కార్యముల నన్నిటిని ప్రస్తుతము సహకారసంఘములు నిర్వర్తించుచున్నవి. లక్షలకొలది కార్మికులు, కర్షకులు, విద్యార్థులు మున్నగువారికి భోజనసౌకర్యములను గావించుటకుకూడ సహకారసంఘములు యత్నించుచున్నవి. ఇట్లు గావించుటవలన స్త్రీలు జీవితమంతయు వంటయింటిలోనే గడుపవలసిన ఆవశ్యకత తప్పుననియు, వారు పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుటకును, పాఠశాలలో జేరుటకును వీలుకలుగుననియు ఉద్దేశము. ౧౯౩౦-వ సం. లో సహకారసంఘములయాజమాన్యమున కేవలము నగరములలోనే ౫౩౦౩ హోటల్సు ఏర్పాటు చేయబడెను. ఇవి ప్రతిదినము ౭౫ లక్షలమందికి భోజనపు టేర్పాటు గావించుచుండెడివి. ౧౯౩౧-వ సం. ము జూలై నెల వచ్చుసరికి పై సంస్థలసంఖ్య ౧౩,౭౮ వరకు పెరిగెను. అవి ౧ కోటి ౨౦ లక్షల మందికి భోజనసదుపాయ మొనర్పసాగెను. వీని సంఖ్య ప్రస్తుతము మరికొంత హెచ్చినది. ఇట్టి హోటల్సు కేవలము నగరములలోనేకాక గ్రామములలో కూడ నున్నవి.

కేవలము భోజనసదుపాయముల నొనర్చుటయే గాక రష్యను సహకారసంఘములు రొట్టెలను చేసి అమ్ముచున్నవి కూడ. ఇప్పుడు సహకారసంఘముల యాజమాన్యముక్రింద రొట్టెలను చేయు యంత్రాలయములు ౫ వందలకుపైగా నున్నవి. ఇవి రోజుకు ౭౩౦౦ టన్నులరొట్టెను తయారుచేయుచున్నవి. కొలదికాలములో దేశమునకు కావలసిన రొట్టెయంతయు సహకారసంఘములద్వారానే సప్లయి కాగలదు.

ఈ సహకారసంఘములు తమకు వలయు ముడి వస్తువుల నిమిత్తము కొన్నివేల యెకరములను సాగు చేయుచున్నవి. వానిపోషణలో ౧,౮౧,౦౦౦ ఆవులు, ౭౨౦౦ ఎద్దులు, ౬౭,౦౦౦ దూడలు, ౧,౧౮,౦౦౦ పందులు కలవు.

దేశము మొత్తముమీద కడు బాహుళ్యముగ వ్యాపారము చేయబడుచున్నను, ఖర్చులను క్రమక్రమముగ తగ్గించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ౧౯౨౯-వ సం. ము లో సంఘములద్వారా జరిగిన మొత్తము వ్యాపారములో నూటికి ౧౭౪ వంతులు చొప్పున ఖర్చులయ్యెను. ఇవి ౧౯౩౦-వ సం. ము లో ౧౫౪ వంతులకును, ౧౯౩౧-వ సం.ములో ౧౫ వంతులకును తగ్గింపబడెను.

ప్రపంచములో మరియే దేశమందును సహకారోద్యమ మింత ప్రాబల్యములో లేదు. రష్యను సహకారోద్యమము తక్కిన దేశము లన్నిటికిని ఆదర్శ ప్రాయమైయున్నది. (సశేషము)

# చేతిపనులు

దశిక సూర్యప్రకాశరావు

చేతిపనులకు పోటీ యంత్రపరిశ్రమలు. నాల్గువందల యేండ్లక్రిందట ఎక్కడను యంత్రములు లేవు. అంతకుపూర్వ మీఖండ మాఖండ మనుభేదములేక చేతిపనుల నాధారముగా గొనియే కొన్ని దేశములు సుప్రసిద్ధ నాగరకతాశోభ నఖండముగ ననుభవించినవి. పూర్వము అస్సీరియా, ఈజిప్టు, పారశీకము, ఇండియా మున్నగు సామ్రాజ్యముల వింత చెలువు జగమెఱిగిన దే. అటుపిమ్మట గ్రీసు, రోమకసామ్రాజ్యముల చిన్నెవన్నెలు చారిత్రకములే. తదుపరి క్రీస్తుశకము ౧౯-వ శతాబ్దివరకు సర్వప్రపంచము చేతిపనుల కళాసంపదనే యనుభవించినది.

అటుతరువాత నీనాలుగువందల సంవత్సరములకాలములో గదా, యంత్రములు విలసిల్లినవి; ప్రపంచము సమ్మోహింపబడినది. చేతిపను లొక్కపెట్టున మూలబడినవి; క్రొత్త పుంతలు త్రొక్కబడినవి; జగత్తంతయు నూతనయంత్రమున తగుల్కొన్నది; యంత్రమునకు దిగ్విజయమును ఘటిల్లినది. అది వచ్చినపనియు పూర్తియయినది.

మన మీకాలములో నున్నాము. భారతదేశమునే కాక ప్రపంచమునంతయు నెదుర్కొన్నసమస్య యిదియే. ఆర్థికసమస్యాపరిష్కారమునకు గృహపరిశ్రమల నుద్ధరించుట శ్రేయోదాయకమా, యంత్రపోషణ యుచితమా?

భారతదేశపు ప్రస్తుతస్థితియు, యంత్రపరిశ్రమలకు చేతిపనులకు గల తారతమ్యమును తెలిసికొనవలసియున్నది.

ఈకాలమున రెండు సంప్రదాయములు గలవు. ఒకటి యంత్రపారిశ్రామికప్రపంచము. రెండవది చేతిపనుల చిన్నారిచెలువులు. మొదటిసంప్రదాయ మమలులో నున్నది. రెండవది భావమం దున్నది. నిన్నమొన్నటివఱకును దేశోద్ధరణకు చేతిపనులవసరములని యెవ్వరు ననియుండలేదు. భారతదేశము సయితము అమెరికా, ఇంగ్లాండుల వలె యంత్రములను తలనుధరించి యెన్నడు కులుకగలుగుదుమా యనియే ఆశించినది. పూజ్యులయిన రమేశచంద్రదత్తు, గోపాలకృష్ణగోఖలే, మహాదేవగోవిందరానడే, శ్రీస్వామి రామతీర్థ మున్నగువారి యాశయము లట్టివే. అది కాలసూచనమాత్రమే చేయగలదు.

గాంధిమహాత్ముడు వచ్చి, యంత్రచక్రమున బానిసయై తగుల్కొన్నప్రపంచము నీడ్చి బయటకు తెచ్చి తిరిగి చేతిపనులవైపునకు దృష్టిని మరల్చుచున్నాడు. ఆయన మతము నవలంబించువారు స్వదేశవిదేశము

లం దేర్పడుచున్నారు. ఐరిషునాయకుడగు డివెలిరా, మహనీయుడగు ప్రఫుల్ల చంద్రరే, గాంధిమతముతో విశేషముగ నేకీభవింతురు. ప్రాపంచిక సంప్రదాయముల నీవిధముగ విడదీయుటలోగూడ మహాత్మాగాంధి నూతన శకోదయమునకు మూలపురుషు డయ్యెను.

అయితే, ప్రకృతమున నెందఱు గాంధి మతమునకు - అనగా, చేతిపనులను భారత దేశమున చొప్పించుట కనుమతింతురని తేలుదురు? అట్లు తేలుటకుముందు యంత్రముల విషయమున మహాత్మునిభావ మెట్టిదియో తెలిసికొనగోరుదురు. మహాత్మగాంధి యిట్లు వ్రాయుచున్నాడు:—

"యంత్రములు మంచిచెడ్డల విచక్షణ లేక వృద్ధిపొందుటకు నే నంగీకరింపను. యంత్రములవలన శ్రేష్ఠఫలితములు కలిగినవన, నాకు నచ్చదు. వ్యక్తికష్టమును తగ్గించి, లక్షులకొలది పనివాండ్రపనిని చులకనచేయగల చిన్నచిన్న పనిముట్లు, పరికరములు, అట్టివే యంత్రములు నున్నయెడల, తప్పక నే నంగీకరింతును."

ఈపద్ధతిమాత్ర మందఱ కంగీకారమా? చేతిపనులను సంపూర్ణముగ వికసింపజేసి, యంత్రముల బలగర్వముల క్రుంగజేసి, సర్వ పరిశ్రమలను (విచక్షణతో) గృహపరిశ్రమలుగా నొనర్చి, దేశమును కళావంతమొనరించుట కెందఱు సిద్ధపడియున్నారు? నూటికొక్కరును, కోటి కొక్కరును. ఏమి? ...... మహాత్ముని సంకల్పము నిర్వీర్యమైనదేనా? ...ఆ-ఈవిషయమున ఆయనపనికిరాడనువారు కొందఱో, లేక పెక్కండ్రో కూడ నుండ వచ్చును....కారణమేమి?

నవీనకాలమున భారతీయాశయముల నావహించిన భావదాస్య మట్టిది. దేశమందేమూల చూచినను పేరునకు భారతీయులును, భావమున, చూపులో, నడకలో, పాశ్చాత్యులు నయినట్లు పెక్కండ్రు గోచరింతురు.

ఆనందకుమారస్వామిగా రిట్లు వ్రాయుచున్నారు:— "ఆంగ్లదాసియయిన నవీన భారతదేశమున, మనకు సంప్రదాయసిద్ధములైన సౌందర్య రసోత్సాహములు నశించిపోయినవి. హిందూదేశము రాజకీయముగను, ఆర్థికముగను సర్వస్వతంత్రమయినను, దాని యంతరంగమున పాశ్చాత్యవాసనలు నిండియుండెనా—అట్టి హైందవభూమికొఱ కెవరు జీవింతురు—ఎవరు చత్తురు? దాని ప్రశంస ఎవరికి.........ఇప్పటి విద్యాపద్ధతుల వల్లను, వ్యాపారలక్ష్యములవల్లను నీచత ననుభవించుచున్న ఈహిందూదేశ మెక్కడ—సౌందర్యరస ప్రపూర్ణయగు పూర్వ భారత మెక్కడ?"

భావములలో కలిగిన యీమార్పువల్లనే దేశమునకు ప్రాణవంతములగు కళలు, పరిశ్రమలు నశించినవి. దానితో దుర్భరదారిద్ర్యము మెడకు చుట్టుకొన్నది. దీనికి వగపులేదు. జీవతుల్యమగు రసవిచారము మటుమాయమైనదిగదా!

## మొహెంజోదారో ప్రాచీన నిర్మాణావిష్కరణ చిత్రములు



౧. వెలువడిన ప్రాచీన భవనములు

"కళాపరిజ్ఞానము లేకపోవుట వల్ల నే హైందవపరిశ్రమలు రూపుమాసిపోయినవి. కాని ఇతరకారణము లేమియును లేవు. కనుక నే వాటిని తిరిగి నెలకొల్పు టసాధ్యముగా నున్న"దని ఆనందకుమారస్వామిగారే వ్రాసి యున్నారు.

ఎండలు వచించిననేమి? యంత్రములలో నుండు సౌకర్య మెక్కడ? వాటి విలక్షణ మెక్కడ? చేతిపనులు వాటికి నీడా?— అనువా రున్నారు. వారి కిట్లు సమాధానము:

యంత్రపరిశ్రమలు—స్వేచ్ఛావాణిజ్యము

యంత్రములతో కొన్ని ఆర్థిక సూత్రములు ముడిపెట్టుకొనియున్నవి. అవి కేవలము పాశ్చాత్యవాసనాధారములయి కన్పట్టును. మానవునికోరిక లెంత వృద్ధిపొందిన నత డంత నాగరికు డగుననియే పాశ్చాత్య-ఆర్థికశాస్త్రమందలి ప్రధానసూత్రము. అవి విచక్షణతో నుండవలె ననునది ప్రాచ్యుల సంప్రదాయము. ఈ ప్రధానసూత్రమందే ప్రాచీ, ప్రతీచీ సంప్రదాయములకు విరోధ మేర్పడినది. వారి దృష్టి ఐహికము, వీరిదృష్టి ఆధ్యాత్మికము. ఈ త్రాటిపైననే అల్లికయంతయు నేర్పడినది.

ప్రతీచీసంప్రదాయము ననుసరించి, ఏపరిశ్రమయు సంకుచితముగ నుండుటకు వలనుపడదు. అందువలన రాక్షసయంత్రములు కనుగొనబడినవి. వారి పారిశ్రామికవ్యాప్తికి భూనభోంతరములు చాలవు. పెట్టుబడులకు లక్షలు, కోటులు కావలెను. అందువలన జాయింటు స్టాకుకంపెనీ లుండవలెను. పెద్ద సొమ్ములు దాచుకొనుటకు, ఋణములు తెచ్చుకొనుటకు ఇంపీరియలుబ్యాంకు లుండవలెను. తమసరకులు విడుదలయగుటకు ఖండాంతరములు స్వాధీనమం దుండవలెను. స్వాధీనము లేనిచోట స్వేచ్ఛావాణిజ్యసిద్ధాంతములులో నుండవలెను. ఇవి యంత్రపరిశ్రమల కవసరమైన భాగములు.

యంత్రపరిశ్రమవ్యాప్తికిని, స్వేచ్ఛావాణిజ్యమునకును సూత్రకారులయినరికార్డో, ఆడముస్మిత్తు, కాబ్డెను చెప్పెడుకారణము లివి: "ఏపరిశ్రమల క్షేత్రప్రదేశ మనుకూలమో అది యక్కడ సహజవికాసమున విలసిల్లును. ఖండఖండాంతరముల దాని కడ్డులేని చలామణి యుండగలదు. సరకులు కారుచౌకగా కిట్టగలవు. కాలమును, శక్తిని ఎంతయో మిగుల్చుకొనవచ్చును. ఇంతియకాక అతీతమగు విశ్వదృష్టి యేర్పడగలదు"అని. నేటి భారతీయులును తమవాదమున కీకారణములే సూచించెదరు.

వాటికి సమాధానము ప్రొఫెసరు మార్షలు ఇట్లు చెప్పుచున్నాడు: "ఏదయినను ఆర్థికసూత్రము ఆయా కాలమానపరిస్థితుల ననుసరించి ఆ నిర్ణీతప్రదేశములం దమలు జరుపుట మంచిది. దానికి తగినకారణములు నశించినవెనుక ఆసూత్రము నశించిపోవుచున్నది."

దీనివలన ఏ సూత్రమును స్థిరము కాదని, భూతభవిష్యద్వర్తమానముల నే త్రాటితోను కట్టి బంధింపరాదని తెలియు చున్నది. అందుచే స్వేచ్ఛావాణిజ్యసూత్రమే కాని, మఱియొకటి కాని ఎల్లకాలమును సమానాదరణము పొందుననుట పొసగని మాట. కాని మంచిచెడ్డల విచారించు టెప్పటి కప్పు డవసరమే.

ఆడముస్మిత్తు మున్నగువారు బోధించి నది ఆదర్శముమాత్రమేయనియు, విశ్వమం తయు ప్రజాపాలనరాష్ట్రమువలె నుండ వలెననియు, ప్రపంచమం దశాంతి యుండ రాదనియు వారి యాశయములని చెప్పెదరు.

ఫ్రీడిషులిస్టు అను పండితుడు స్వేచ్ఛా వాణిజ్యసూత్రము నీవిధముగా ప్రతిఘటించి యున్నాడు: స్వేచ్ఛావాణిజ్యమం దీలోప ములు గలవు. ప్రపంచముయావత్తును సర్వా భిప్రాయసమ్మేళనమని భ్రమించుట పొర పాటు. ఒక్కొక్కజాతి కొక్కొకజాతీయ సం ప్రదాయ ముండును; ప్రత్యేకలక్ష్యము లుం డును. అట్టివాటి నన్నిటి నేమఱుచుండుట ప్రమాదము. రెండవది-పశుతుల్యమగు భౌతిక దృష్టి ఏర్పడుచున్నది. ఒకజాతి రాజకీయ మానసిక శక్తులు, జీవనాధారముల హెచ్చు తగ్గులు, భూతవర్తమానభావి గతులు గుర్తిం చుటకు వీలులేకపోవుచున్నది. మూడవది- ప్రపంచమంతయు వివిధజాతీయతలు కలిగిన దైయున్నను తాను స్వేచ్ఛగా వాణిజ్యము సాగింపగలననుటయు లోపమే.

ఈభావములు పూర్వ ముల్లేఖింపబడి నవి. ఇప్పు డవి యమలుజరుగుచున్నవి. ఐరోపా దేశములలో, క్రమక్రమముగా నేమి, సాంతముగానేమి స్వేచ్ఛావాణిజ్యసూత్రము నకు స్వస్తిచెప్పుచున్నారు.

ఇక మిగిలినవి చేతిపనులును, శాంతి జీవితమును.

## చే తి ప ను లు

వీటివలన కలిగెడిసుఖ మేమి? చేతి పనులందు జీవ మున్నది; చైతన్యశక్తి కలదు; కళాప్రాదుర్భావ మున్నది; జాతివికాస మున్నది; శాంతిస్థిరతలు కలవు; ఐహికాధ్యా త్మికపోషణ కలదు; విజాతీయులు కొల్లగొను నవకాశములు దొరకవు; జాతీయసంప్ర దాయమునకు మిక్కిలి తగినది. అన్నిటి కంటె దేశమందు నిర్వీర్యమై, శోభారహి తమై, చంచలమై గాలికిపోవుచున్న అమో ఘమగు మానవశక్తి కేంద్రీకృతమై జీవనసంప దల నొసగగలదు.

---

# హిందూమతాచారములు: ప్రభుత్వపు అధికారబాధ్యతలు

కొమాండూరి శఠకోపాచార్యులు, యం. ఏ., బి. యల్.

మనదేశమున కొన్నిసాంఘికవిషయములు మతవిషయములు గానే చాలమందిచే పరిగణింపబడుచున్నవి. ప్రత్యేకముగా మతవిషయమును గూర్చి కాకపోయినను ఇట్టి మిశ్రితమతసాంఘికవిషయములను గూర్చి సంస్కరణములు ఇటీవల తరుచు చర్చకు వచ్చుచున్నవి. ఆసందర్భమున ప్రజాక్షేమకరములను సంస్కరణములు చేయించు అధికారమును, బాధ్యతయు ప్రభుత్వముపై కలవనియు, అట్టిబాధ్యతను ప్రభుత్వము వారు వహించక తప్పుకొనుచున్నారనియు, ఇకముందైనను ప్రభుత్వమువా రీవిషయములందు తగుసహాయము చేయవలెననియు నొకపక్షమువా రనుచున్నారు. ఇందుకు వ్యతిరేకముగా ప్రభుత్వమున కట్టివిషయములలో శాసనముచేయు నధికారమే లేదనియు, ఉన్నదని భావించినను అట్టి విషయములందు జోక్యము కలుగజేసుకోమని ప్రభుత్వమువారు వాగ్దాన మొనరించినందున, అందుకు భంగముకలుగకుండ ప్రభుత్వమువారు కేవలము వ్యతిరేకులుగానో, ఉదాసీనులుగానో ఉండవలయు ననియు, మరియు హిందూధర్మవిషయముల ఆచారవ్యవహారములందు ప్రభుత్వమువారు కల్పించుకొను మామూలు లేదనియు, అందుకు భిన్నముగా నిప్పుడు ప్రభుత్వమువారు నడువకూడదనియు రెండవ పక్షమువారు ప్రతిఘటించుచున్నారు. ఇట్టిసమస్యలిటీవల తరుచు శాసనసభలయెదుట వచ్చుచున్నవి. అట్టివిషయములలో ఆసంస్కరణములు ప్రజోపయోగకరములని తమ యభిప్రాయమైనను వాటికి ప్రభుత్వమువారు సహాయము చేయక ఉదాసీనులుగా నుండుటయే కాక కొంత వ్యతిరేకధోరణికూడ కనుపరుచుచున్నారు. శారదాచట్టమును, హరిజనదేవాలయప్రవేశపుబిల్లును ఇందుకు నిదర్శనములు. వీటి మూలసూత్రములు, అనగా అతిబాల్యవివాహములు సంఘమున కనర్థకరములనియు, దేవాలయప్రవేశవిషయమున కులభేదములను గమనించుట యుక్తము కాదనియు, ఆంగ్లేయజాతివారందరును అంగీకరించినదే. మరియు ఈమార్పులు ఇదివరకున్న ఆచారమునకు వ్యతిరిక్తములు. ధర్మశాస్త్రము ఇందుకు వ్యతిరిక్తముగా నున్నదా లేదా అనుసంగతి వాదోపవాదములకు లోనై సందిగ్ధముగా నున్నది. అయినను ఇండియాప్రభుత్వమువారును ఈరెంటి సందర్భమునను వహించుచున్న మాంద్యము అందరికిని తెలిసియే యున్నది. అందువలన ఇట్టివిషయములలో ప్రభుత్వమువారి అధికారమును, బాధ్యతయు ఎట్టివి? ఇదివరలో ఇట్టివిషయములలో మన ఆంగ్ల ప్రభుత్వమువా రేమి చేయుచువచ్చిరి? అను సమస్యలు ముఖ్యముగా విమర్శింపదగియున్నవి.

పూర్వము మనదేశమున మతసంరక్షణమును, ధర్మశాస్త్రప్రకారమే పరిపాలనమును చేయుచుండెడివారు. అట్టి అధికారమును బాధ్యతనుకూడ ఈఆంగ్ల ప్రభుత్వమునకు కలవని మనము భావింపవచ్చును. అందువలన దేశకాలసందర్భములను బట్టియు, ప్రజలలో బుద్ధిమంతులు కోరినప్పుడును ఇదివరలోనున్న ధర్మమునుగాని, ఆచారమునుగాని మార్పవచ్చునా, లేదా యనునదియే మొదటియంశము. ఈసందర్భమున ఈక్రింది ప్రమాణమును గమనింపదగును:

> వేదః స్మృతి స్సదాచారః స్వస్యచ ప్రియ మాత్మనః,
> ఏత చ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణమ్.
>
> మనుస్మృతి.

యాజ్ఞవల్క్యస్మృతిలోగూడ ఇట్లే ఆత్మకు, లేక అంతఃకరణమునకు తృప్తికరముగా తోచినది ప్రమాణమని చెప్పబడినది. ఒకప్పుడు ధర్మమును, సదాచారమును అయినదిగూడ కాలక్రమమున లోక

మునకు విరుద్ధముగాను, బాధకముగాను ఉన్నయెడల అట్టి ఆచారములను మార్పుచేయవచ్చుననియు, బుద్ధిమంతు లట్లు నిర్ధారణచేసి మార్పుచేయవచ్చుననియు కూడ బృహన్నారదీయములోని ఈ క్రిందిశ్లోకములచే తెలియగలదు:

అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్య మప్యాచరేన్నతు,
సముద్రయాత్రాస్వీకారః కమండలువిధారణమ్.

ద్విజానా మసవర్ణాసు కన్యా సూపయమ స్తథా,
దేవరేణ సుతోత్పత్తిః మధుపర్కే పశోర్వధః.

మాంసదానం తథా శ్రాద్ధే వానప్రస్థాశ్రమ స్తథా,
దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానం పరస్యచ.

దీర్ఘకాలం బ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ,
మహాప్రస్థానగమనం గోమేధశ్చ తథామఖమ్.

ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యా నాహు ర్మనీషిణః.

ఆదిత్యపురాణములోని యీ క్రిందివచనములచే గూడ పూర్వము మహాత్ములు లోకగుప్త్యర్థమై, అనగా సంఘసంరక్షణనిమిత్తము చాలమార్పులు చేయుచువచ్చిరని స్పష్టము కాగలదు:

దత్తౌరసేతరేషాంతు పుత్రత్వేన పరిగ్రహః,
శూద్రేషు దాసగోపాలకులమిత్రార్ధసీరిణామ్.

భోజ్యాన్నతా గృహస్థస్య తీర్థసేవాతిదూరతః,
బ్రాహ్మణాదిషు శూద్రస్య పక్వతాదిక్రియాపిచ.

భృగ్వగ్ని మరణంచైవ వృద్ధాదిమరణం తథా,
ఇమాని లోకగుప్త్యర్థం కలేరాదౌ మహాత్మభిః.

నివర్తితాని కర్మాణి వ్యవస్థాపూర్వకం బుధైః,
సమయశ్చాపి సాధూనాం ప్రమాణం వేదవద్భవేత్.

ఇట్లు బుధులు వ్యవస్థాపూర్వకముగా నేర్పరుచు మార్పు వేదమువలెనే ప్రమాణమగునని కనబడుచున్నది. అట్టిమార్పులను శాసనముగా రాజు అమలుజరుపవలసియున్నది.

ఇక మన ప్రస్తుతాంగ్లప్రభుత్వమువారైనను విక్టోరియాప్రకటనము మొదలగువానిలో హిందువులకు హిందూ న్యాయశాస్త్రప్రకారమును, హిందూ ఆచారప్రకారమును పరిపాలన చేయుదుమని చెప్పిరేకాని అందు ముందు ఎట్టిమార్పులును చేయబడవని చెప్పియుండలేదు. మరియు మనకోర్టుల అధికారమును నిర్ణయించు మద్రాసు సివిలుకోర్టు ఆక్టు (Madras Act III of 1873) ౧౬-వ సెక్షనులో వారసత్వము, వివాహము, కులవిషయము, మతాచారములు వీటినిగూర్చి విచారించునపుడు హిందువులకు హిందూలా, హిందూ ఆచారము వర్తింపచేయవలెననియు, అయితే అట్టి లాగాని, ఆచారముగాని ప్రభుత్వమువారు చట్టముచే మార్పుచేసినయెడల ఆమార్పుచేయబడినప్రకారమే అమలుజరుగవలెననియు విధింపబడినది. అమలులోగూడ మనహిందూశాస్త్రగ్రంథములలోనిఅనేకవిధులను ప్రస్తుతప్రభుత్వమువారు సివిలుకోర్టువారును త్రోసివేసియున్నారు. ఇందు కనేకోదాహరణముల నీయవచ్చును. అనేకశాఖలకు క్రొత్తచట్టములు విధింపబడినవి. బదుల్లు, క్రయవిక్రయములు ఇత్యాదులనుగూర్చిన మనధర్మశాస్త్రవిధుల స్థానమునకాంట్రాక్టుఆక్టు, ట్రాన్స్ఫర్ ప్రాపర్టీ ఆక్టు మొదలగు చట్టముల నేర్పరచిరి. అట్టి విషయములందు హిందువులకు మన హిందూ ధర్మశాస్త్రప్రకారమే అమలుజరుపవలెనని యిపుడు కోర్టులో వాదించుటకు హిందువులకు హక్కులేదు. (బెంగాల్ లా రిపోర్టు ౧౪-వ వాల్యూం ౭౬-వ పేజీ చూడుడు) నేరములగూర్చి హిందూధర్మశాస్త్రనిబంధనలు ఇప్పుడు అమలులో లేవు. ధర్మశాస్త్రప్రకారము బ్రాహ్మణులకు తక్కువశిక్షయు, ఇతరులకు హెచ్చుశిక్షయు ఏర్పాటుకాబడినది కాని వీటినన్నిటిని రద్దుచేసి వాటి స్థానమున పీనల్‌కోడ్డును, క్రిమినల్ ప్రొసీజరుకోడ్డును ఏర్పరిచి ఆప్రకారమే విచారణలను, తీర్పులను ఇప్పుడు జరిగించుచున్నసంగతి అందరకును తెలిసియేయున్నది. సాక్ష్యము తీసుకొనుటకు సాక్ష్యముల కీయదగిన విలువ మొదలగు విషయములను గూర్చియు స్మృతులలోని వచనములకు బదులుగా ఎవిడెన్సుఆక్టుప్రకారము అమలుజరుగుచున్నది. హిందువుల వారసత్వపు అధికారము హిందూధర్మశాస్త్రప్రకారమే జరిపెదమని చెప్పినను

దానిలోకూడ అప్పుడప్పుడు మార్పులు జరుగకపోలేదు. తల్లితండ్రులవద్దనుండి వారసత్వముద్వారా దఖలు పడిన ఆస్తి కుమార్తెకు సంపూర్ణమగు హక్కుగల స్త్రీధనమగునని మన ముఖ్యధర్మశాస్త్రమగు మితాక్షరిలో నున్నది. అయినను అట్టిఆస్తిలోగూడ ఆమెకు యావజ్జీవము అనుభవపుహక్కు మాత్రమే ఉండునని ప్రీవీ కౌన్సిలువారిచే తీర్పుచేయబడినది. (ఇం. లా. రి. ౨౫ అలహాబాదు ౪౬౮, ౪౭౬ పేజీలు చూడుడు.) జ్ఞాతులందరు, అనగా సపిండులు సమానోదకులుకూడ అయి వారుకూడ లేనపుడుమాత్రమే బంధువులు, అనగా అప్పచెల్లెండ్రు మేనల్లుండ్రుకూడ వారసులగుదురని ధర్మశాస్త్రములో నున్నది. కాని ప్రజాప్రతినిధుల యంగీకారముతో ప్రభుత్వమువారు జ్ఞాతులకన్న ఈబంధువులే దగ్గిరవారసులగునట్లు చట్టము కావించిరి. (Act II of 1929) పుట్టుకనుండి గుడ్డి, కుంటి- మొదలగులోపముగలవారికి ఆస్తిహక్కు లేదని మన ధర్మశాస్త్రము. కాని అట్టివారికికూడ ఆస్తిహక్కు కలవని ౧౯౨౮ లో చట్టము చేయబడెను. మరియు ఆగమగ్రంథములు పరమప్రమాణములనియు, అందలి సంగతులను వేటినికూడ మార్చుటకు వీలులేదనియు, అట్లు ప్రభుత్వమువారు మార్పకూడదనియు ఇటీవల తీవ్రముగా వాదించిన సనాతనహిందూనాయకులగు శ్రీమాన్ వి. వి. శ్రీనివాసఅయ్యంగారే తాము మద్రాసు హైకోర్టుజడ్జిగా నుండినపుడు ఆగమములోనున్నంత మాత్రమున ప్రతివిధియును అమలు జరుపవలసినఅవసరము లేదని హైకోర్టులో తీర్పుచేసియుండిరి. (ఆలిండియా రిపోర్టరు, ౧౯౨౫ మద్రాసు ౧౧౫ పేజీ చూడుడు) హరిజనులు దేవాలయములలోనికి రాకూడదనుటకు ఈఆగమముల వచనములే శాస్త్రాధారములని యాతీవ్రవాదులు చెప్పుచున్నారు. మరియు దౌహిత్రదత్తత, మేనరికపువివాహములు కేవలము హిందూధర్మశాస్త్రమునందు నిషేధింపబడినను ప్రస్తుతాచరణనుబట్టి యివి మన ప్రాంతమందలి కోర్టులచే అంగీకరింపబడినవి.

ఇంతేగాక హిందువులకును, అన్యమతస్థులకును సంబంధించిన అనేకవిషయములలో మనప్రభుత్వమువారు కేవలము మధ్యస్థులుగా నుండక మనవారికి నష్టకరముగా ఇతరమతస్థులకు సహాయముచేసిన ఉదాహరణములుగూడ చాలగలవు. ఎన్నికలలోను, ఉద్యోగములలోను మహమ్మదీయులకును క్రిష్టియనులకును ఎక్కువలాభములు కలుగుచున్నవి. అందుచే మనకు నష్టము కలుగుచున్నది. మరియు మనప్రస్తుతప్రభుత్వపు ఆదాయము చాలవరకంతయు హిందువులనుండియు, మహమ్మదీయులనుండియు వసూలు చేయబడుచున్నది. కాని దానిలోనుండి యేమియు ఆయా మతముల నిమిత్తము వినియోగింపక క్రైస్తవమతాధికారుల నిమిత్తమును, క్రైస్తవదేవాలయములకొరకును మన ప్రభుత్వాదాయములో కొంత ఖర్చుపడుచున్నది. ఈప్రభుత్వశాఖకు యెక్లీజియాస్టికల్ డిపార్టుమెంటు అనిపేరు. ఈశాఖపై మనభారతీయమంత్రులకును, శాసనసభ్యులకునుగూడ యెట్టి అధికారములును లేకుండునట్లు రాబోవు రాజ్యాంగమున నిబంధనలు చేయబడుచున్నవి. ఇంకొకవిషయము: ఇటీవల మనరాష్ట్రమందలి హిందూదేవాలయముల పరిశీలనలకై కొందరు ప్రభుత్వోద్యోగుల నేర్పరిచిరి. కాని వారలజీతములు, ప్రయాణములు మొదలగువానికి ఖర్చులనిమిత్తము ప్రభుత్వాదాయమునుండి ఖర్చుపరచుట న్యాయమైయున్నను అట్లుచేయక అందునిమిత్తము మన హిందూదేవాలయములనుండి దామాషాను పన్నులను వసూలుచేయుచున్నారు. ఇట్టిచర్యలు ప్రభుత్వముయొక్క మధ్యస్థత్వమును కనపరుచుచున్నవా ?

హిందువుల మతాచార విషయమునగూడ ప్రభుత్వమువారు ప్రత్యక్షముగానే మార్పులు చేయుచు సుమారొకశతాబ్దమునుండి అప్పుడప్పుడు కొన్నిశాసనములను చేయుచునేయున్నారు. వాటిలో కొన్ని ముఖ్యమైనవి యీక్రింద ఉదాహరింపబడినవి. పూర్వము హిందూస్త్రీలు తమ భర్త పోయినప్పుడు సహగమనము చేయునాచారముండెడిది. దానిని నిషేధించుచు ౧౮౨౯-వ సం. మన అప్పటి గవర్నరుజనరలగు విలియంబెంటింక్ ప్రభువుగారు ఒక రిస్యులేషనును చేసి ఆ యాచారము నణచివేసిరి. మరియు హిందూమతము

నుండి భ్రష్టులై పతితులైనవారికి, ఇతరమతములలోనికి కలియువారికి హిందూధర్మశాస్త్రము ప్రకారము కుటుంబ బాస్తిలో వాటాగాని, వారసత్వపు హక్కుగాని లేదు. ఈసంగతి స్మృతులలోను, మితాక్షరి మొదలగువ్యాఖ్యానములలోను స్పష్టముగా విధింపబడినది. ఆప్రకారము క్రైస్తవమతము పుచ్చుకున్న హిందువులకు తమ హిందూకుటుంబ బాస్తియందును, వారసత్వమునందును గూడ హక్కు నశించును. కాని ౧౮౫౦-వ సం. మున ఈనియమమును రద్దుచేయుచు ప్రభుత్వమువారు ఒక చట్టమును (Casle Disabilities Act 21 of 1850) గావించి యిదివరకున్న ఆచారమును మార్చివేసి హిందూమతమునకు చిరకాలమునుండి యున్న యీరక్షణను తీసివేసిరి. (ఇండియన్ లారిపోర్ట్సు అలహాబాదు 33-వ వాల్యూం 356 పేజీ చూడుడు.) హిందూవితంతువులు పునర్వివాహమును చేసుకొనకుండ ఉండు ఆచారము గలదు. మన ధర్మశాస్త్రములప్రకారము వితంతువులు పునర్వివాహము చేసుకొనకూడదని చాలమంది హిందువుల అభిప్రాయము. కాని ౧౮౫౬-వ సం. ౧౫-వ ఆక్టు అను హిందూవితంతు పునర్వివాహశాసనము (Hindu widows' remarriage act) అను చట్టమును చేసి ప్రభుత్వమువా రిదివరకు బ్రాహ్మణాదులలో ఉన్న ఆచారమునకు గల శాసనత్వమును తీసివేసిరి. మన మతాచారములకు భార్యాభర్తల సంబంధము స్థిరమైనది. వీరిలో ఒకరికి హిందూమతభ్రష్టత కలిగినను వీరి భార్యాభర్తృ సంబంధము వీడదు. కాని ౧౮౬౬-వ సం. ములో ప్రభుత్వమువారు చేసిన Native converts marriage dissolution act అను చట్టముప్రకారము హిందువు క్రైస్తవమతములోనికి పోయినచో ఇదివరలోనున్న తన హిందూభార్యాభర్తృ సంబంధమును నశింపజేసుకొనవచ్చును. ఇక వర్ణాంతర వివాహవిషయమై అనులోమ వివాహములు కూడునవనియు, ప్రతిలోమవివాహములు నిషిద్ధములనియు మనశాస్త్రములలో నున్నను ఇవి రెండునుకూడ చెల్లవని కొంతకాల్లము తీర్పులుండినవి. అట్టివారు హిందువులము కామని ప్రకటించి వివాహమును రిజిష్టరుచేసుకొనవచ్చునని ౧౮౭౨ లో ఒకచట్టము చేయబడినది. హిందువులుగానుండియే అట్టివివాహములు చేసుకొనవచ్చునని యిటీవల ౧౯౨౮-వ సం. ములో ఆచట్టము సవరణ చేయబడినది. ఇవన్నియు మన ధర్మశాస్త్రములోను, ఆచారములోను చేయబడిన మార్పులే యనుటకు సందేహ మేమియు లేదు. ఇవియన్నియుగాక మన రాష్ట్రమందలి హిందూమతసంబంధమగుసంస్థలు, అనగా దేవాలయములు, మఠములు- వీటియాజమాన్యమునుగూర్చియు, వీటిపరిపాలననుగూర్చియు యిటీవలనే ౧౯౨౫-వ సం. ములోను, ౧౯౨౭-వ సం. ములోను, మనమద్రాసు ప్రభుత్వమువారిచే నొకచట్టము (Hindu Religious endowments act) కావింపబడి అమలులోనున్నది. పైనవ్రాసిన సంగతులన్నియునుగూడ మన ప్రస్తుతప్రభుత్వమువారు మనమతాచారములలో కలుగజేసికొనివాటిని తమకుచితమని తోచినరీతిని సవరించుచున్నందుకు నిదర్శనములు. అందువలన అవసరమైనప్పుడు ప్రజాభిప్రాయము కోరినప్పుడు అట్టిసంస్కరణముల చేయుటకు ప్రభుత్వమువారికి అధికారము, బాధ్యతయుకూడ కలవని స్పష్టమగుచున్నది. ఇదివరలో ౫ సం. లకు పూర్వము మొదట శాసనసభలలో ప్రజానియమిత ప్రతినిధులు కొద్దిమందిమాత్రమే యుండుటవలన అప్పుడు ప్రజాభిప్రాయము సరిగా వ్యక్తమయ్యెడిదిగాదు. అట్టిసమయమందే స్వతంత్రించి ప్రభుత్వమువారు మన మతాచారములం దనేకసంస్కరణముల గావించిరి. వాటిలో కొన్ని హిందూసంఘములకు లాభకరములు, కొన్నినష్టకరములుకూడ కలవని చాలమంది హిందూనాయకుల అభిప్రాయము. ప్రస్తుతము రాష్ట్రీయశాసనసభలందును భారతశాసనసభయందునుగూడ సభ్యులలో ప్రజాప్రతినిధులే యధికసంఖ్యాకులుగా నున్నారు. మరియు ప్రస్తుతము హరిజనుల దేవాలయప్రవేశమును గూర్చిన బిల్లులో ఆయాప్రాంతములందలి ప్రజలయభిప్రాయమును తీసుకొని ప్రజాభిప్రాయ మందులకు స్పష్టముగా నంగీకరించి అనుకూలముగా నున్నయెడల అట్టిస్థలములందుమాత్రమే ఆలయములలోనికి హరిజనులను రానిచ్చుటకుమాత్రమే యిప్పుడు చర్చలో ఉన్న

బిల్లులో నియమము వ్రాయబడినది. హరిజనులకు దేవాలయములో ప్రవేశము లేకుండా ఉండు ప్రస్తుతపు ఆచారము కేవలము హానికరమనియు, ఆయాచారము మార్పుచెందవలెననియు ప్రజలు నిశ్చయించుకొనినను కూడ అట్లు చేయుటకు వీలులేకుండ ప్రభుత్వమువా రేర్పరిచిన హిందూధర్మాదాయపు చట్టములోని నియమములే ఆటంకమును కలుగ జేయుచున్నవి. ముఖ్యముగా ఆచట్టములోని నియమములను సవరణచేయుటకే ఈ క్రొత్తబిల్లు పెట్టవలసివచ్చినది. హిందూ పబ్లికు దేవాలయములకే యీబిల్లు వర్తించునుగాని స్వంతదేవాలయములకు వర్తించదు. అట్టి పబ్లికుదేవాలయములు హిందూజనులందరికొరకును ఉద్దేశింపబడినవి. అందుకు సాధారణముగా ప్రజలఆస్తి ఖర్చుపరచబడుచున్నది.

అనగా హరిజనులుగూడ జాతిలో నంతర్భాగమే యనుటచే నట్టివారినికూడ దేవాలయములలోనికి రానిచ్చుటకు హిందూజనాభిప్రాయ మిష్టపడినయెడల హరిజనులనుకూడ రానిచ్చుటకు ప్రస్తుతము దొరతనపు శాసనములలో నున్న ఆటంకములను తొలగింపవలెనని యీబిల్లుయొక్క భావము. అట్టిచట్టమును చేయుటకు ప్రభుత్వమునకు అధికారము లేదనియు, అందువల్లనే మన మత మంతరించుననియు సనాతనులలోని తీవ్రవాదులు వాదించుట విచిత్రముగ నున్నది. మతవిషయములందు అస్పృశ్యతను కేవలము నిషేధించు క్రైస్తవమతస్థులను ప్రభుత్వమువా రట్టి బిల్లునకు కేవల ముదాసీనులగుటయేకాక అందుకు వ్యతిరేకధోరణికికూడ కొంత ప్రోత్సాహ మొసగుట మరియు విచిత్రముగ నున్నది.

---



కోటలోని రక్షకశాఖామందిరము, హంపీశిథిలములు

—కే. యల్. నరసింహాచార్యులు, గుంతకల్లు.

శీఘ్రావృతి (చిత్రకారుడే బ్రహ్మయైనచో) ౧:



అధికారుల ప్రియముకొరకు ఆత్మగౌరవమును విడనాడువాడు

# రాజకీయ విధేయత

## (Political Obedience)

శ్రీపాద గణపతిరావు

పాలకపాలితభావము చాల విచిత్రమైనది. దానికి కారణములును విచిత్రమైనవే. "కొందఱుమానవు లధికారము చలాయించుచుండగా నంతకంటె సహస్రగుణాధికులగు మానవులు వారికి లొంగియుండుట యెట్లు సంభవించుచున్నది?" అను ప్రశ్నకు సమాధానము చెప్పుట చాలదుష్కరము. చెప్పినను అట్టిసమాధానము జనసామాన్యమునకు నచ్చుట మఱియుకష్టము. ఏలన: మానవప్రకృతి అతి క్లిష్టము. అది యేసూత్రములనైన నతిక్రమింపగలదు. అందుచేతనే గొప్పగొప్ప మేధావంతులుసైతము ఈపాలకసేవకభావమునుగూర్చి సముచితమైన సమాధానము నొసంగజాలకపోయిరి. వీరందఱు మానవప్రకృతిలో నేదేనొకగుణముపైననే యూది పలికిరిగాని దాని సమగ్రస్వరూపమును పరిగణించరైరి. ఇదియే వారిలో పెద్దలోటు. ఈభావమునకు వాస్తవములు, సంభవములు నగు కారణములను నిరూపించుట కీవ్యాసమున నొక అల్పప్రయత్నము చేయబడుచున్నది.

మానవప్రకృతిలో నంతర్లీనమై 'విధేయత' యనుగుణము కలదు. ఉత్తమమగుదాని ముందు వినీతుడగుట మానవప్రకృతిలోనుత్తమమగుగుణము. ఈవిధేయత స్థాయివలె నుండక ఆ యుత్తమవస్తువు గుణోత్తరమగుచున్నకొలందియు పరిణత మగుచునేయుండును. ప్రకృతము మనము శిక్షాసాధనసామగ్రితోటి యేతంత్రమును ప్రభుత్వ మనుచున్నామో, అది బహుశః అతిప్రాచీనమానవసంఘమునం దత్యంతగౌరవమునందుచు సంఘమునకు నాయకుడైయుండిన విద్యావయోవృద్ధునుండి పుట్టియుండవచ్చును. మానవప్రకృతిలోని యీవిధేయత యను గుణమునుండియే నిర్దేశింపబడుటకు, శిక్షింపబడుటకు, పాలింపబడుటకు 'సమ్మతి' యావిర్భవించినది. మానవుని స్వభావము చాల మితవ్యయవాది: అనగా నది తన్నుగుఱించి తాను శ్రద్ధవహించి బుద్ధిని వ్యయింపగోరదు. తనకై యెవరైన శ్రద్ధ వహించుటకే సమ్మతించును. కనుక మానవుడు తన్ను పాలించుకొనుబాధ్యత తాను వదలుకొని సంతోషపూర్వకముగా దానిని తనకు నమ్మకము, గౌరవము గల యొకవ్యక్తి పరము గావించినాడు.

'సమ్మతి' వేఱొకవిధముగాసైతము పుట్టవచ్చును. పరిస్థితులు విషమించి తప్పనిసరియైవచ్చినప్పుడు మానవుడు సమ్మతింపక చేయునదిలేదు. ఇది యెట్లు పుట్టినను 'సమ్మతి' యనునది పాలకపాలితభావములో నొకయంగమనుటయే మన కవసరము.

ఫలితము సుష్ఠుగాలభించినపట్ల నీ సమ్మతి సంతుష్టము, హృదయపూర్వకము నగుచున్నది. కాగా పాలకపాలితభావమునకు ప్రయోజనమను వేఱొకకారణ ముత్పన్నమగుచున్నది. మానవునకు జీవితములో సాధింపదగిన యర్థములు పెక్కుగలవు. వీని నన్నిటిని సాధించుట కాతనికి పైవాని సాయమగత్యము. కనుకనే మానవునికి ప్రభుత్వమగత్యము, ఉపకారకము నగుచున్నది. అనగా మానవుడు వాస్తవమగు నేదియోసాయమును కాంక్షించి ప్రభుత్వపరతంత్రు డగుచున్నాడు. ఈపరతంత్రత విధేయతాగర్భితమనుట తెల్లమే. కాని ప్రభుత్వమునెడ మానవుని యీవిధేయత కేవలము పరిమిత మనుటయు గ్రహింపదగియున్నది.

హక్కులు, ధర్మములువలెనే బలము, విధియు పరస్పరసంబంధముగలవి. ప్రభుత్వ మెంతవఱకు తనవిధిని నెఱవేర్చునో అంతవఱకే ప్రజలు దానికి విధేయులు. ప్రజలకు దానివలని ప్రయోజనమునుబట్టియు, దాని యాదర్శములనుబట్టియు ప్రభుత్వము విధి నెంతవఱకు నెఱవేర్చినదియు తేలగలదు: అనగా ప్రజలకు పరిపూర్ణ ప్రయోజనకారియగుచో దానివిధి నెఱవేఱినట్లే.

ఇంతయుగాక పాలకసేవకభావములో బలాత్కృతియు గలదు. మానవప్రకృతి యెంతయుచ్చమో అంతతుచ్ఛమును. ఎల్. పి. జాక్స్ మానవస్వభావము నైతికమని యెంత వాదించినను భౌతికబలభీతిచే నది కాదాచిత్కముగా తన యున్నతాశయములను విస్మరించుచునేయుండును. వ్యక్తులపరస్పరసంబంధము నీతిసూత్రములచే నెంతదృఢబద్ధమయ్యు సక్రమముగా నడువజాలదు. కాని మన మీయంశము నంతగా పాటింప నక్కఱలేదు.

నైతికబల ముత్కృష్టమగుచోట పశుబలము పటాపంచలగుట సత్యము. బలాత్కృతి పాలకపాలితభావమున కొకయంగమే కాని దాని సాధనసర్వస్వము కాదు. ఇట్లు తెలిచి చూడగా పాలకపాలితభావమునకు కారణములు మానవునిలోని విధేయత, సమ్మతి, ప్రయోజనము, బలాత్కృతి అని తేలుచున్నది. ఈసంగ్రహచర్చను ముగించుటకు పూర్వము హెగెలు గ్రీసు ప్రముఖులచే పరామర్శింపబడిన యొకయంశమును విచారించుట తగును. ఆదర్శప్రభుత్వమునుగుఱించిన వారి యభిప్రాయములలో ప్రభుత్వముయొక్కయు, వ్యక్తియొక్కయు ఆశయముల నైక్యము చెప్పబడినది. వారిప్రకారము మహోన్నతము, మహోదారము నగునంశ మానవులకెల్లరకు సమానమే. ఈయంశయొక్క వ్యక్తీకరణమే ప్రభుత్వము. ప్రభుత్వమునాజ్ఞకు విధేయు డగుటలో మానవుడు తనయొక్క మహోన్నతము, మహోదారము నగు నంశకు విధేయు డగుచున్నాడని చెప్పవలయును. మఱియు హెగెలు గ్రీసులమతమున స్వాతంత్ర్యమనగా శాసన విధేయత యని యర్థము. ఇట్లనుటలో విధేయ

తకు, స్వాతంత్ర్యమునకు అభేదము చెప్పివేయ బడినది. కాని, యిట్టి తలయుతోకయులేని ఆధ్యాత్మికసిద్ధాంతములవలన పని జరుగదు. మహోన్నతమగునంశ ఎల్ల మానవులకు సమానము గాదు. ప్రభుత్వము వారివాంఛలకు వ్యంజకమును గాదు. ప్రతిమానవుడును తనకు తా నొకవ్యక్తి. ఇట్టి యాధ్యాత్మికదృష్టిలో విచారించుటవల్ల నొకపిధమగు మానసికతృప్తి దక్క ఏమియు ప్రయోజనము కలుగదు. మానవుడు సంఘప్రేమియగు ప్రాణి యను సూత్రముకంటె నీపాలకపాలితభావమున కుచితమగు కారణము వేఱు కనబడదు. అతడు సంఘమును ప్రేమించుననుటలోనే అతడు ప్రభుత్వమును ప్రేమించునని ఉపరినిర్దిష్టచర్చవల్ల తెలియుచునేయున్నది. మానవుడు సంఘమునందు, అనగా పాలకసేవకాత్మకమగు సంఘమునందు జీవించుటకే కోరును. సంఘజీవనము కొన్ని సూత్రములకు కట్టుబడియుండును. ఈసంఘజీవనములో సాంఘికవిధేయత ధ్వనించుచున్నది. కనుక రాజకీయజీవితము రాజకీయవిధేయతను చాటును. సంఘమునకు కొన్ని నియమము లావశ్యకములు. ప్రభుత్వము దానిని నిర్మించును. కనుకనే ప్రజలు దానికి విధేయులు.

---

చెన్నరాజధానియందు ౧౯౩౧-వ సంవత్సరము ఏప్రెలు ప్రారంభము మొదలు జూను తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

గజేంద్రమోక్షము—(ప్ర) పి. నటేశ మొదలియారు, మదరాసు.

జయవిజయులు—సి. శ్రీరామశాస్త్రి.

పావని—జె. సీతారామస్వామి.

పురాణపతివ్రతలు—బి. వెంకటరమణయ్య.

శ్రీకృష్ణచరిత్రము—యం. వెంకటరమణాచారి.

### —కల్పితములు

దైవమిచ్చినభార్య—జి. వెంకటాచలం.

పిల్లలకథలు—యం. సుబ్రహ్మణ్యం.

భోజకాళిదాసు—యం. శ్రీరామమూర్తి.

మణిమంజూష—యస్. వెంకటసుబ్బయ్య.

మాకర్మమిట్లా కాళింది—జి. వెంకటాచలం.

మిత్రలాభము, కాకోలూకీయము—బి. వెంకటరమణయ్య.

సీమంతినీచరిత్రము—జె. వెంకటసుబ్రహ్మణ్యశర్మ.

### —చారిత్రికములు

దశకుమారచరిత్రము—(ప్ర). సి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

భారతపుత్రులు, భా. ౧, ౨—కె. కొండలరావు.

## కల్పము

పొంగలివ్రతము—(ప్ర) సి. లక్ష్మీనృసింహము, మచిలీపట్టణము.

బుధాష్టమీవ్రతకల్పము—(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము.

హనుమద్వ్రతకల్పము—(ప్ర). సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము.

## గణితశాస్త్రము

భూమికొలత సర్వేగణితము—యం. రామయ్య.

## గేయములు

శ్రీకీరపండరీపుర విఠల్ ప్రసన్న కీర్తనలు—యం. నరసింహదాసు.

శ్రీవాసుదాసకీర్తనలు—వి. సుబ్బరావు.

సభారంజిత సంగీత కీర్తనలు, భా. ౧—(ప్ర). చంద్రిక అండ్ కో, మదరాసు.

స్త్రీలపాటలు—డి. సీతారామరావు.

స్త్రీలపాటలు, భా. ౧—జి. లక్ష్మీకాంతమ్మ, జె. శారదాంబ.

## చరిత్రము

బాలహిందూదేశచరిత్రము, బుక్, ౧, ౨—వి. పార్థసారథి.

హిందూదేశచరిత్ర—డి. అప్పారావు, బి. సూర్యనారాయణ.

హిందూదేశచరిత్ర, భా. ౧—యస్. సుబ్బరావు.

## చట్టము

వ్యవహారచంద్రిక—జి. సేతుమాధవరావు.

సివిల్ వ్యవహారములు—జి. సేతుమాధవరావు.

## ఛందశ్శాస్త్రము

ఆంధ్రకవిత్వలక్షణము—బి. వెంకటనాంచారయ్య.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప—పద్యము. ప్ర.—ప్రకాశకులు భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## జీవితములు

కాళిదాసుచరిత్రము—యం. శ్రీరామమూర్తి.
తెనాలిరామకృష్ణుడు—యం. శ్రీరామమూర్తి.
బొల్లిని మునిస్వామినాయుడు గారియొక్క జీవిత చరిత్రము—టి. యస్. ఉమాపతిఅయ్య.
శ్రీవీరేశలింగ సంస్మృతి—ఆర్. వెంకటశివుడు.

## దండకము

భల్లాణదండకము—యస్. రామజోగికవి.

## నవలలు

అన్నపూర్ణ మందిరము—నిరుపమదేవి.
ఏకాక్షి, భా. ౧, ౨—జి. నారాయణరావు.
జోరాజాని—(ప్ర). శ్రీకృష్ణాడిపో, రాజమహేంద్రవరము.
నూటపదునాఱు—(ప్ర). భారతీగ్రంథమాల, కర్నూలు.
పరంతపవిజయము—యం. సుబ్రహ్మణ్యం.
మాయామయి, భా. ౬—కె. రంగయ్య.
రాణిభవాని, భా. ౨—(ప్ర). వెంకటపార్వతీశ్వరకవులు, పిఠాపురము.
స్వార్థత్యాగము—గ. కృష్ణమూర్తి.

## నాటకములు

కళాపాహాడ్—(ప్ర). చ. వెంకటరామయ్య, రాజమహేంద్రవరము.
జయంతజయపాలము—యం. శ్రీరామమూర్తి.
ధరణికోట—యస్. రామానుజరావు.
ధాష్టికపంతులు—యస్. కృష్ణమూర్తిశాస్త్రి.
శకుంతల—(అను) వెంకటపార్వతీశ్వరకవులు.
సంజయరాయబారము—వై. బుల్లికొండలరాయుడు.
సంభాజినిర్యాణము—చ. వెంకటరామయ్య; రాజమహేంద్రవరము.
సారంగధర—వి. మైసూరయ్య.
సావిత్రిపరిణయనాటకము—సి. సుబ్బదాసు.

## నీతి

కుమారగుణబోధిని—(ప్ర) ఏ. రామమోహనరాయి, బెజవాడ.
నీతిదర్పణము—వి. గంగాధరశాస్త్రి.
నీతిరత్నావళి, భా. ౧—కె. వెంకటశాస్త్రి.

## పరిశిష్టము

ఆర్తవచంద్రిక—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము.
ఇటావాసమాధి—యం. శ్రీరామశాస్త్రి.
కల్పమంజరి—ఏ. రంగనాయకులు.
కోదండరాముడు—(ప్ర) సి. కుమారస్వామి నాయుడు అండ్ సన్, మదరాసు.
కోళ్లనుపెంచుట—(ప్ర) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
గీతావళి—పి. వెంకటసుబ్బయ్య.
గ్రామకరణముల పరీక్షాదర్శిని—బి. లక్ష్మీనరసింహం.
చమత్కారము—జి. నారాయణరావు.
తూర్పుగోదావరిజిల్లాసంఘము—(ప్ర) తూర్పుగోదావరిజిల్లా సంఘ సెక్రెటరి, కాకినాడ.
త్రిపురసుందరీవిలాసమును గురించి లెక్చరు—పి. సాంబశివరావు.
నవగ్రహచింతామణియను ప్రశ్నశాస్త్రము—సి. లక్ష్మీనృసింహశాస్త్రి.
పశ్చాత్తాపము—జి. నారాయణరావు.
ప్రాక్పశ్చిమములు—వివేకానందస్వామి.
ప్రేమతత్వము—యం. సూర్యనారాయణశాస్త్రి.
బంగారుయోగము—జి. నారాయణరావు.
బాలరామాయణము—(ప్ర) కె. దొరసామి మొదలి, మదరాసు.
బాల్యవివాహము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
మాధవదాసుచరిత్రము—శేషాచలదాసు.
మారులునూతనసివిక్సు వాచకము—బి. రామమూర్తి, యస్. యస్. సోమయాజులు.

మోటారు డ్రైవర్సుగైడ్—యన్. ఆర్. వరదారెడ్డి.
రజస్వలానంతర వివాహములు—యం. సింహాచలం.
రుక్మిణీకల్యాణము—(ప్ర) పి. నటేశమొదలియారు, మదరాసు.
వాచకపుస్తకము, తరగతి, ౬—జె. గంగన్న.
వినోదవల్లరి—కె. గురునాథమూర్తి.
వివేకవాచకము, బుక్. ౩—సి. లక్ష్మీనరసింహం.
శ్రీ గురుసాక్షి దేవమానస గోచరిదేవలతత్వం— బి. తాతయ్య.
శ్రీ వాచకము, ౧, ౨—డి. కోదండరామస్వామి.
సస్యదోహదము—యం. సత్యనారాయణరాజు.
సస్యానందము — (ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము.
సూక్తిరత్నావళి, భా. ౨ — యం. వెంకటశాస్త్రి, వి. సూర్యనారాయణశాస్త్రి.
సోదరీస్మృతి—ఏ. నాగగోపాలరావు.
స్త్రీ—జి. వెంకటాచలం.

### పారిశ్రామికము

మననేతపరిశ్రమ—భ. పట్టాభిసీతారామయ్య.

### పు రా ణ ము

విష్ణుపురాణము—కె. భావనారాయణ.

### ప్రబంధము

శ్రీమదాంధ్ర చంపూరామాయణము—(ప్ర) పి. కృష్ణమూర్తి, రాజోలు.

### భూగోళశాస్త్రము

గుంటూరుతాలూకా భూగోళము—కె. రామకృష్ణయ్య.
దక్కనుచరిత్ర భూగోళముల సంగ్రహము — (ప్ర) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు.
భూగోళశాస్త్రము, చెన్నరాజధాని—కె. ఏ. వీరరాఘవాచారి.
రామచంద్రపురము కాకినాడ తాలూకాల భూగోళము—ఏ. పార్వతీశము.
వాణీభూగోళశాస్త్రము, బుక్ ౧, ౩ — ఏ. రామచంద్రరావు, పి. అప్పరావు.
హిందూదేశ భూగోళశాస్త్రము—కె. జగన్నాథం.

### మతము—హిందు

ఆబ్దిక శ్రాద్ధవిధి—(ప్ర) సి. లక్ష్మీనరసింహశాస్త్రి.
ఆస్తిక్యము—వి. వి. శివయ్య, కె. సత్యనారాయణమూర్తి.
దశాహాశౌచవిధి—(ప్ర) డి. రామబ్రహ్మార్య, గుంటూరు.
మతధ్వజము—పి. ఉమామహేశ్వరశాస్త్రి.
సంధ్యామంత్రార్థదర్పణము— (ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము.

### —ఇతరములు

ఆదిక్రైస్తవసంఘచరిత్ర — యఫ్. యఫ్. (రెవ్) గ్లాడ్‌స్టన్.
కొరింథీయులకు వ్రాసిన మొదటిపత్రిక—డబ్ల్యు (రెవ్) హొవర్డ్ కాంప్‌బెల్.
క్రైస్తవమతజ్ఞానబోధిని — (ప్ర) ఏ. ఇ. యల్. సి. మిషన్, గుంటూరు.
తప్పిపోయినకుమారుడు— (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
నాయీబ్రాహ్మణ ప్రకాశిక—రేవతి ప్రసాదశర్మ.
పరిశుద్ధచరిత్రోపదేశము — (ప్ర) ఏ. ఇ. యల్. సి. మిషన్, గుంటూరు.
శ్రీబుద్ధోపదేశము— (ప్ర) వ్యాసఆశ్రమము, ఏర్పేడు.

### మాహాత్మ్యము

శింగరాద్రిమహాత్మ్యము — ఏ. వెంకట రంగస్వామి అయ్యంగారు.
శ్రీచెన్నకేశవస్వామి మాహాత్మ్యము — రామకృష్ణ సీతారామసోదరకవులు.

### రాజకీయములు

శాంతిసంగ్రామము—వి. వెంకటసుబ్రహ్మణ్యశర్మ.
స్వరాజ్యఢంక—బి. కోటీశ్వరరావు.

## వేదాంతశాస్త్రము

అచలబోధామృతము—పి. అరుంధతాంబ.

నిష్కామయోగము — (ప్ర) మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు.

ముండకోపనిషత్తు— (ప్ర) రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

శ్రీమదాంధ్రాధ్యాత్మ రామాయణము—వి. జానకిరామశాస్త్రి.

శ్రీమద్భగవద్గీత — (ప్ర) హిందూసమాజము, రాజమహేంద్రవరము.

శ్రీమహాయోగపురుషుడు వేమనార్యుని బ్రహ్మజ్ఞానోపదేశ వాక్యంబులు—(ప్ర) పి. త్యాగరాయశెట్టి, మదరాసు.

స్వాత్మప్రకాశిక—కె. వెంకటరెడ్డి.

సుజ్ఞానదీపిక—యం. లక్ష్మీనరసింహం.

## వైద్యశాస్త్రము

అష్టాంగహృదయము— (ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రసంగ్రహవ్యాకరణము, భా. ౧. ౨—ఏ. వి. నరసింహం.

## శతకములు

ఆరోగ్యవేంకటేశ్వర రాజరాజేశ్వరీ శతకములు—వి. రామసుబ్బారాయుడు.

దశరథరామశతకము—వి. నరసింహదాసు.

పతివ్రతాశతకము—(ప్ర) సి. రాజగోపాలరావు, నూజివీడు.

భారతాంబికాశతకము—జి. మల్లావధాని.

మాధవశతకము—జి. నరసింహాచార్యులు.

మానసబోధశతకము—ఏ. వీరబ్రహ్మచారి.

రంగనాయకశతకము—బి. నరసింహదాసు.

రామచంద్రప్రభుశతకము—కె. నరసింహము.

శూన్యలింగశతకము—వి. సుబ్బారాయుడు.

శ్రీకొమర్పురీశ్వరశతకము—టి. అప్పాస్వామి.

శ్రీ పాండురంగశతకము—యన్. శేషాంబ.

శ్రీపుల్లగుమ్మిబుగ్గరామశతకము—యల్. వెంకోబరావు.

శ్రీ భద్రశైలరామశతకము—పి. అప్పలానందము.

శ్రీ వెంకటేశ్వరశతకము—రామరాయకవి.

శ్రీ సరస్వతీశతకము—సి. సరస్వతీదేవి.

శ్రీ సర్వేశ్వరశతకము—సి. వెంకట కామేశ్వరకవి.

శ్రీ సంగమేశ్వరశతకము—సి. వెంకటాచలకవి.

## స్తోత్రములు

అష్టోత్తరశతనక్షత్రమాలిక—డి. నారాయణ.

ఆర్యలఘుసంధ్యావందనం—(ప్ర) సి. బసవయ్య, గుంటూరు.

ఆంధ్రీకృతజితంతేస్తోత్రం— (అను) బి. శ్రీనివాసులు, ఆంజనేయులు, రాఘవయ్య, బాపట్ల.

యజుర్వేద సంధ్యావందనం—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము.

రంగనిరత్నమాల—యన్. రంగరావు.

శనిస్తోత్రనక్షత్రమాల—వి. రామసుబ్బారాయుడు.

శ్రీ భగవత్ స్తోత్ర రత్నాకరము—(ప్ర) జమీందారు, నూజివీడు.

స్తోత్రకదంబము—వి. శివరామశాస్త్రి.

## హరికథలు

గాఢభక్తచరిత్రము—బి. ఆశన్న.

సుమతీదేవిచరిత్రము—ఏ. వీరబ్రహ్మచారి.

# నక్షత్రమండలము

(శ్రావణమాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు, బి. ఏ. (కవితాసమితి).

ఉత్తరము




దక్షిణము

ఈ పటమునందున్నట్లు నక్షత్రాగులు ఈ ఆగష్టునెల

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8-వ | తేదీని | సుమారు | 9-0 | గంటలపుడును, | 22-వ | తేదీని సుమారు | 8-0 | గంటలపుడును, |
| 15 | ,, | ,, | 8-30 | ,, | 30 | ,, ,, | 7-30 | ,, కనబడును. |

[ఈపటమును చూచి ఆకాశమున చుక్కలు గుర్తింపనెంచువారు ఈ పటమును తలకుమీదుగా నుంచుకొని ఇందు తెలుపబడిన దిక్కులు ఆయాదిక్కులకు సరిపడునట్లు పటమును త్రిప్పి పట్టుకొని చూడ

ఈనెల పున్నమనాడు చంద్రుడు శ్రవణనక్షత్రముచెంత నుండుటచేత ఈమాసమునకు శ్రావణమాసమని పేరు వచ్చినది. ఈనెల తొలిజామున నాయావేళలందు పటమునందు తెలిపినప్రకారము కానవచ్చు నక్షత్రాదులను పరిశీలింతము.

## రా సు లు

పడమట కన్యారాశి అస్తమింపనై యున్నది. కన్యనుండి తూర్పునకు వరుసగా తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము నను రాసులు వ్యాపించియున్నవి. మీనరాశి ఇపుడిపుడే ఉదయమగుచున్నది. విషువృత్త, క్రాంతి వృత్తములు కన్యామీన రాసులలో నొకటొకటిని కలియుట పటములో కానవచ్చుచున్నది.

## క్షీరోదము, ఆకాశగంగ, Milky way

ధవళధవళమైన యీవిచిత్రదృశ్యము ఇపుడీశాన్య దిశనుండి యాకాశమున రంభాదులగు నప్సరసమండలము నుండి బ్రహ్మవాహనమగు రాజహంసమండలమును జేరి యక్కడ రెండుశాఖలుగా చీలుచున్నది. పడమటవైపున నున్నశాఖ స్వల్పముగా తెలుపువర్ణము కలిగియున్నది. ఈ శాఖయే శ్రీమహావిష్ణునిపాదము లంటుచు, శేషమండలము గడచి, వృశ్చికరాశిమీదుగా దక్షిణమున మూల నక్షత్రముక్రింది యగ్నివేదికవరకు వ్యాపించినది. తూర్పునయిపుననున్నశాఖ సాంద్రధావళ్యము గలిగి గరుడమండలము (Aquila) అనగా శ్రవణముమీదుగా ధనుస్సు దాటి యగ్నివేదికకడ పశ్చిమశాఖను కలియుచున్నది. ఈరెండు తెలుపుశాఖలకు మధ్య సన్నగను, దీర్ఘముగను నల్లనిప్రదేశ మొకటి కానవచ్చుచున్నది. ఈనలుపుగల ప్రదేశమునుగూర్చి యీదిగువ నిపుడే 'ఛాయాపథ' నిరూపణసందర్భమున వ్రాయుచున్నాను.

శ్రీ మహావిష్ణుని పాదములనుండి యుత్తరముగా వ్యాపించియున్న ధవళప్రదేశము అప్సరసమండలము దాటి ఆర్ద్ర, మృగవ్యాధనక్షత్రములమీదుగా పోవుచున్నది. ఇందువలననే ఆకాశగంగ విష్ణుపాదోద్భవయనియు, దేవాంగనావిహారస్థానమనియు, శివుజటాజూటమున నిల్చినదనియు పురాణములు తెలుపుచున్నవని నా విన్నపము. ఆర్ద్రానక్షత్రము రుద్రదైవత్యము. మృగవ్యాధుడును ఒకరుద్రుడే. ఈనక్షత్రములమీదుగా పోవు ధవళదృశ్యము, ఫేనసహితిమైన యాకాశగంగ యని మనబుధులును, కవులును వర్ణించుట సహజమై యున్నది. ఇట్టి ఆకాశగంగను ఈశ్వరుడు శిరమున ధరించెననిచెప్పుట ఎంతయు ఒప్పియున్నది. ఆర్ద్ర, మృగవ్యాధులకు అనతిదూరమునసే యమునయు నీ దివిజ గంగతో సంగమించునట్లు కనబడగలదు.

మతోద్రేకపూరితులైన విష్ణుభక్తులు కొందరు గొప్పశివభక్తులతో వాదించుచు "మా దేవునికాళ్లలో పుట్టినగంగను మీదేవుడు తలమీద పెట్టుకున్నాడు. కాబట్టి మీదేవుడు మాదేవుడికాలికిందనాడు" అని ప్రగల్భములు పలికినట్లు శ్రీబుద్ధరాజు ఈశ్వరప్పగారు మొదలగు హాస్యప్రియులు వినోదార్థము ప్రహసనములు వ్రాసినారు. ఇట్టి గాథలకు, యుక్తులకు మూలము ఈఖగోళదృశ్యమే. విష్ణుమండలసమీపమునుండి ఉత్తరముగా వ్యాపించిన ధవళవాహిని ఆర్ద్ర, మృగవ్యాధనక్షత్రములమీదుగ పోవుటయేనని విన్నవించుచున్నాను.

## ఛాయాపథము

మహాకవి కాళిదాసు రఘువంశము ౧౩-వ సర్గ, ౨-వ శ్లోకము

---

వలెను. అట్లు చేసినపక్షమున కుడిచేతివైపు పడమట అనియు, ఎడమచేతివైపు తూర్పు అనియు పటమున వ్రాయుటవలన కలిగినసంశయము నివారణయగును. ఇందలి దిక్కులు, చుట్టునున్న దిక్కులతో చక్కగా నప్పి సరిపోవును. చుక్కలు సరిగా గుర్తింపనగును.]

"వైదేహి పశ్యామలయాద్విభక్తం మత్సేతునా ఫేనిల మమ్బురాశిమ్, ఛాయాపథేనేవ శరత్ప్రసన్న మాకాశ మావిష్కృతచారుతారమ్" అని వ్రాసియున్నాడు. ఇందు ఛాయాపథమనునది పాశ్చాత్యులు Milky way అని చెప్పునది యగునా ? అని నెల్లూరు నుండి మ.రా. శ్రీ, ఒంగోలు వెంకటరంగయ్యపంతులు (B. A., B. L.) గారు చక్కని ప్రశ్న వేసినారు.

రావణవధానంతరము శ్రీరాముడు పుష్పకవిమానము నెక్కి సీతతోకూడ అయోధ్యకు పోవునపుడు, సేతువు నామెకు చూపుచు చెప్పినట్లు రచింపబడిన శ్లోక మిది. ఈశ్లోకములో సముద్రము ఆకాశముతోను, నురుగు ఆకాశమునపై జూపబ్బెడి ధవళదృశ్యముతోను, ఆ నురుగును వేరుచేయుచున్న సేతువు ఛాయాపథముతోను రమ్యముగా పోల్చబడినవి. ఆకాశమునందలి నురుగు వంటి యీ తెలుపు సాంద్రమైన చుక్కలసముదాయమనియు, ఊహింపరానంతదూరమున నుండుటచేత నిది తెల్లని నురుగుమాత్రముగా కనబడుచున్నదనియు, టెలెస్కోపు (దూరదర్శియంత్రము) లో చూచువారందరికి స్పష్టము. ఈ తెలుపునకు నల్లనల్లని ప్రదేశములు విశేషముగా నగపడును. మిక్కిలి నల్లగా నున్నచోట్లు రాతిసిబొగ్గుసూట (Coal sacks) లని పాశ్చాత్యసిద్ధాంతులు చెప్పుదురు. వాటిని మనము శ్యామసీమలంటిమి. ఈసంచిక నక్షత్రపటములో శ్యామసీమలు లేవు. కాని విష్ణు, శేష, జ్యేష్ఠప్రాంతముల నంటియున్న తెలుపునకును శ్రవణధనూరాసులనంటియున్న తెలుపునకును మధ్య దీర్ఘముగ, సన్నగ, నల్లగ కొంతప్రదేశమున్నది. నురుగువలె బహుముఖముల నాకాశమున వ్యాపించియున్న ధవళప్రదేశము యావత్తును ఛాయాపథ మనుటకంటె ఇటునటు తెలుపుమధ్యనున్న నల్లనిప్రదేశమునే ఛాయాపథమనుట యెంతయు ఒప్పియున్నట్లు తోచుచున్నది. మల్లినాథసూరి, పైశ్లోకమునకు వ్యాఖ్యలోకూడ "ఛాయాపథోనామ జ్యోతిశ్చక్ర మధ్యవర్తీ కశ్చిత్తిరశ్చీనో౽వకాశః" అని తెలిపియున్నాడు. ఆకాశగంగనుగూర్చి చర్చించుచు లోకమాన్యతిలకుమహాశయులు Orion ౧౨౨-వ పుటలో నీక్రిందిశ్లోకములను ఇచ్చియున్నారు :

౧. నేదం నభోమండల మంబురాశి ర్నైతాశ్చ తారా నవఫేనఖండాః. (సాహిత్యదర్పణము, ౧౦. అపహ్నుతి కుదాహరణము.)

౨. వియద్వ్యాపీ తారాగణగుణితఫేనోద్గమరుచిః ప్రవాహో వారాం యః పృషతలఘుదృష్టః శిరసి తే, జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమిత్యనేనైవోన్నేయం ధృతమహిమదివ్యం తవవపుః.

"The conception of Shiva embodied in this verse is really a grand one. The poet asks his readers to imagine how great must Shiva be, the celestial stream on whose head encircles the Universe. The Milky way which girdles the celestial sphere can not be better described" అని తిలకుగారు వ్రాసినారు.

కాబట్టి యీధవళదృశ్యమును క్షీరోదము, ఆకాశగంగ అనియు, అచ్చతెనుగున పాలపుంత యనియు చెప్పుదము. అందలి నల్లనల్లని దృశ్యమును ఛాయాపథమందము. నాయం దమితసద్భావముతో ఛాయాపథమునుగూర్చి పైసూచనచేసిన మ. రా. శ్రీ ఒంగోలు వెంకటరంగయ్య పంతులుగారికి కృతజ్ఞుడనై నమస్కరించుచున్నాను.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు, గ్రహములు

ఈనెలలో తొలిజామున మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు ౬ మాత్రమే కనబడుచున్నవి. అవి యేవియనగా:—కన్యలో చిత్ర; మరుద్గణములో స్వాతి; వీణలో బ్రహ్మ; గరుడునిలో శ్రవణము; వృశ్చికములో జ్యేష్ఠ; కుంభముదిగువ ఇంద్రద్యుమ్నుడు.

గ్రహములలో గురుడు కన్యలో ప్రవేశించినాడు. అందుచేతనే ఈమాసములో కృష్ణపుష్కరము. అంగార

కుడు చిత్రసమీపమున నున్నాడు; తులారాశిలో ప్రవేశించు చున్నాడు. శని శ్రవణమునదిగువను కనబడు చున్నాడు.

మిగిలినచుక్కలలో —పడమటి యాకాశమున స్వాతికిని, ఉత్తరఫల్గునికిని మధ్య వేణీమండలము మిణుకు మిణుకు మనుచున్నది. మరుద్గణమున నెగువ భూతేశ మండల మున్నది. దానికిపైగా క్రతు,పులహ, పులస్త్య, అత్రి, ఆంగీరస, వసిష్ఠ, మరీచులను సప్తఋషులును త్వరలో నస్తమింప నున్నారు. వసిష్ఠుని ప్రక్కనే మహాపతివ్రతయగు అరుంధతి మిణుకుమిణుకు మనుచున్నది. పులహ, క్రతురేఖ సూచింప ధ్రువుడు లఘుఋక్షముయొక్క తోకచివరను మెరయు చున్నాడు. ధ్రువునకు క్రిందుగా కశ్యప, మహేంద్ర, అగ్నినక్షత్రములును, అగ్నికి పడమట ధాతయు, ధాతకుదిగువ విధాతయు, విధాతకు తూర్పుగా మిత్ర నక్షత్రమును ఉన్నవి. ఈయేడు నక్షత్రములతో కూడు కొనియున్న లఘుఋక్షమునకును, క్రతుపులహాదులను సప్తఋషులతో కూడియున్న బృహదృక్షమునకును మధ్య మెలికలు తిరిగి నరకాసురు డున్నాడు.

భూతేశస్వాతిమండలములకు తూర్పుగా నున్న శేషునిఫణములక్రింద శేష-పాన్పుపై పండుకొనియున్న శ్రీమహావిష్ణుస్వరూపము గగనమధ్యరేఖ దాటినది. ఆషాఢశుద్ధ-ఏకాదశినాడే విష్ణువు శయనింప నారంభించినసంగతి మనము క్రిందటిసంచికలో చూచినాము. విష్ణునినాభికమలమునుండి ఉద్భవించినాడని చెప్పబడు బ్రహ్మనక్షత్రము వీణా మండలము (Lyra)లో ముఖ్యమైనది. కాలుచున్న మెగ్నిసియముతీగవలె తెల్లని కాంతితో తేజరిల్లు నీబ్రహ్మనక్షత్రము మన సూర్యుని కంటె నూరురెట్లు తేజోధికమైన మహాగోళము. అచటి నుండి మనకు చేరుసరికి నలుబదిసంవత్సరములు పట్టునని లెక్కింపబడినది. ఈమండలమునకు తూర్పుగా బ్రహ్మకు వాహనమైన రాజహంస యున్నది; కలహాశనుడైన నారదుడు నున్నాడు. ఆవల గరుడమండలము నందు శ్రవణమును, శ్రవణమున కటునిటు రెండుచుక్కలును ఉన్నవి. ఈమూడుచుక్కలును "ప్రత్తికాయ పేలినపుడు బయల్పడు ప్రత్తిబోజలలాగున నున్న"వని శ్రీనాథమహాకవి వర్ణించియున్నాడు. అందు 'గామా' గుర్తుగల పైచుక్కను అరబ్బులు త్రజేదీ (Trazed) అందురు. ఆమాటకు బందేటుదొంగ అని అర్థము. బీటా గుర్తుగల దిగువచుక్కను అరబ్బులు ఆల్షైన్ (Al shain) అందురు—అనగా తెల్లగద్ద. తెల్లగద్ద యనబడు బొల్లిగద్ద విష్ణువునకు వాహనము, ధ్వజము అగుట సుప్రసిద్ధవిషయము. ఉదయమగునపుడు వాహనమైనదే అస్తమించునపుడు ధ్వజ మగును. విశేషించి గరుడుడు ఇంద్రుని జయించి అమృతమును బలవంతముగా హరించినసంగతి పురాణప్రసిద్ధము. గాయత్రి గరుడాకారమున సోమము తేజనుటయు, కృశాను డాగాయత్రిపై బాణ మేయుటయు లోనగు వేదగాథలు ఐతరేయబ్రాహ్మణాదులందు వర్ణింపబడినవి. (చూ. ఐ. బ్ర. III 3. ౨౬) ఆగాథలు చిత్రపటములతో ముందు వివరింపబడును. గాయత్రి గరుడరూపమున సోమము హరించిన వేదగాథనుండి ఇంద్రునిజయించి గరుడు డమృతము హరించిన వృత్తాంతము పురాణములోనికి వచ్చినది. ఈగాథయే మరియొకరూపమున ఆరబిక (Arabic) జ్యోతిర్గాథలలో చేరినట్లు కనబడుచున్నది. శ్రవణమునకావల వసుదేవతాకమైన ధనిష్ఠ, దానికావల కుంభరాశి, కుంభమున కావల పేద్వఘాశ్వమునందలి పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములును, వీటికావల రేవతియు, క్రమముగా ఒకదాని కొకటి తూర్పుగా నున్నవి. రేవతి ఇపుడే ఉదయించుచున్నది. ఈశాన్యదిశను ధ్రువునికి తూర్పునను, పడమటి ఋషిమండలమున కెదురుగను రంభాదు లుదయించినారు. ఇంద్రమద ఉదయమగుచున్నది. రాజహంసకు మీదుగాను, కశ్యపమహేంద్రాదులకు తూర్పునను ఊర్వశీపురూరవసులు కానవచ్చుచున్నారు. నైరృతిదిగ్భాగమున చిత్రకుదిగువ నహుషునిలో రెండు చుక్కలు మాత్రము కనబడుచున్నవి. కొదువ సర్ప మస్తమించినది. ఆ దిగువను అశ్వతరమండలమున కొన్నిచుక్కలు మాత్రము అగపడుచున్నవి. అందలి అశ్వినులచే బల్లెపుపోటు తిని నోరు వెళ్లబెట్టుచున్న

వృకము విశాఖ, అనురాధానక్షత్రములదిగువ నున్నది. అనూరాధ, జ్యేష్ఠ, మూలనక్షత్రములు కూడి పెద్దవృశ్చిక రూపముతో ఆపేరుగలరాశి మెరయుచున్నది. ఈ రాశిలో జ్యేష్ఠనక్షత్రము బ్రహ్మాండగోళము. దీని వెలుగు మనకు చేరుసరికి ౧౫౩ సంవత్సరములు పట్టు నని లెక్కింపబడినది. మూలదిగువను అగ్ని వేదిక (Ara) ఉన్నది. ఆవేదికపై సత్యయజ్ఞము చేయుచు భగవంతుని ఇంకను ధూపదీపాదులతో నారాధించుచున్నట్లు బలి చక్రవర్తి కనబడుచున్నాడు.

అగ్ని వేదికకు తూర్పుగా చిలుక ఉన్నది. ఇది ధన్వియనబడు మన్మథుని వాహనము. మన్మథునిదిగువనే బాణాసురుడు;ఆప్రక్కనే వాని మయూరము (నెమిలి). దీనికి చిత్రశిఖండి యను నామాంతరమును కలదు. ఉత్తర చిత్రశిఖండిమండలము మన సప్తఋషిమండలమే. దక్షిణ చిత్రశిఖండిమండలసందర్భములు వేరొకచోట చర్చింతము. ఇక ఆగ్నేయదిగ్భాగమున నాళీకజంఘబకము. ఇంద్రద్యుమ్నమహారాజును, యుగంధరకమఠమును ఇపు డిపుడే ఉదయించుచున్నారు. వీటికిపైన మకరరాశి యున్నది.

## క్షీ-ఉ-ధ్రు.

సప్తఋషులకును, ఉత్తరఫల్గునికిని మధ్య, మన పటములో "క్షీ-ఉ-ధ్రు" అని మూడక్షరములు వేసి ఒకచుక్క చూపించినాము. అది యొక గురుతుగాని నిజముగా చుక్క కాదు. ఖగోళముచుట్టును వ్యాపించి యున్న క్షీరోదమను వలయము (Galactic Belt)నకు ఈచుక్కగలచోటు ఉత్తరధ్రువ (North Galactic Pole) మని చెప్పవచ్చును. దీని దక్షిణధ్రువమును గూర్చియు, క్షీరసాగరమథనమునుగూర్చియు, ఈశ్వరుడు హాలాహలము భక్షించిన వృత్తాంతమునుగురించియు ముందు వ్యాసములలో చూతము.

## ఉల్కాపాతములు

ఈనెల ౧౧-వ తేది మొదలు ౧౩-వ తేదివరకు భృగుపరశుమండలములో ఉజ్జ్వలములై వేవేగ రాలు నుల్కాసమూహము చూడనగును. లోగడ ౧౮౬౨-వ సంవత్సరములో కనబడిన యొక తోకచుక్కయొక్క శకలము లివియని తెలియుచున్నది. భూమి సూర్యుని చుట్టును తిరుగుచున్నపుడు ఈనెలలో పై తేదీలను పై ధూమకేతుశకలములున్న తావు చేరునపు డీశకలములు ఉల్కారూపమున మనభూమిపై పడుచున్నవి.

ఇంకను ఈనెల ౧౫-వ తేదీమొదలు ౨౫-వ తేదీవరకు నరకాసురమండలములోనుండియు చిన్న ఉల్కాపాతము కానవచ్చును.






మంగిపూడి వేంకటశర్మ

## ౧౩. అరటిచెట్లు

ముగ్గురు బాలికలుమాత్రము పైగానుండి తక్కిన వారందరును గుంపుగా నొకచోట నిలిచియుండి చేతులు పైకెత్తవలయును. అట్లు గుబురుగా నిలిచియున్న మనుష్యులకు అరటిచెట్లు లనిపేరు. పైనున్న ముగ్గురు బాలికలలో ఒకరు ఇంటియామెయగు గొల్లదిగాను, ఒకతె ఆయిల్లు కావలికాయు కుక్కగాను, ఒకతె దొంగగాను ఏర్పడి ఆపేరులు పెట్టుకోవలయును. గొల్లది ప్రొద్దున లేచి మొగము కడుగుకొని చల్లకుండ నెత్తిమీద పెట్టుకొని కుక్కను పిలచి "కుక్కా, చల్లమ్మికొనివచ్చెదను. అరటిచెట్లను కాయలు, పండ్లు ఉన్నవి. దొంగ లెవ్వరును వచ్చి కోసుకపోకుండా జాగ్రత్తగా చూచుచుండుము. నేను వచ్చినతర్వాత నీకు పెరుగూ, బువ్వ పెడ్తాను. ఇల్లుకూడ పదిలముసుమా" అనిచెప్పును. కుక్క 'సరే' అని యూరకుండును. గొల్లది వెళ్లిపోవును. దొంగ పేరుపెట్టుకొన్న పిల్ల కుక్కతో గొల్లభామ చెప్పిన మాటలన్నీ చాటునుండి వినుచుండును. కుక్క అరటిచెట్ల సమీపమునందే ఒకచోట పండుకొని కొంతసేపటికి నిద్రపోవును. తరువాత దొంగ వచ్చి అరటి పండ్లూ, కాయలూ కోసుకొని పారిపోవుచుండును. ఆఅలుకుడువల్ల కుక్క లేచి చూచి మొరుగుచు వెంబడించును. దొంగ పారిపోవును. కుక్క మళ్లీ వచ్చి ఎప్పటిచోట పరుండియుండును. అంతట గొల్లదివచ్చి అరటిచెట్లను పండ్లూ, కాయలూ లేకుండుట చూచి ఎవరో దొంగలు కోసుకపోయినారని తెలిసికొని కుక్కదగ్గరకు వెళ్లి "కుక్కా, మన అరటిచెట్ల కాయలూ, పండ్లూ కోసుకొనిపోయినారు. నిన్ను కావలియుంచి వెళ్లితిని కదా, నీవేల యూరకుంటివి? ఏమిచేయుచుంటివి?" అనికోపపడును. అందుకు కుక్క "అయ్యో! నేను ఎక్కడికినీపోక ఇక్కడే పండుకొనియుంటిని. కాని పొరపాటున కొంచెము కునుకుపట్టినది. ఆసమయమున ఎవరో దొంగ వచ్చి దోచికొని పారిపోయినాడు. అంతలో నాకు మెలకువవచ్చి తరుముకొని పోయితిని కాని ఆదుర్మార్గు డందక పరుగెత్తిపోయినాడు. నాపొరపాటును క్షమింపుము." అని వేడుకొనును. అది విని గొల్లపడుచు "అయ్యో! ఎన్నో మంచికాయలూ, పండ్లూ నిష్కారణముగా పోయినవి" అని విచారించి, కుక్కను చూచి "సరే, పోయినవేమో పోయినవి. ఇక ముందైన జాగ్రత్తగా కాచుచుండుము. నే నింటిలోలేనప్పుడు నిద్రపోకుము. అట్లు నిద్రపోతివేని ఇక నెన్నడును పెరుగుబువ్వ పెట్టను." అని బుద్ధిచెప్పి ఆహారము పెట్టును. కుక్క మేత మేసి అరటిచెట్టువగ్గర కూర్చుండును. అప్పుడు గొల్లదివచ్చి "కుక్కా, నేను పెరుగమ్మబోయెదను, దొంగలను రానీయక ఇంట జాగ్రత్తగా నుండుము." అనిచెప్పి వెళ్లిపోవును. కుక్క కొంతసేపుండి ఎక్కడికో పోవును. ఆసమయమున దొంగ వచ్చి అరటిఆకులు కోసుకొనిపోవును. ఇక్కడ ఇంకొక సంగతి తెలుసుకొనవలసియున్నది. అరటిచెట్లవలె గుబురుగా నిలిచియున్న పిల్లలు పైకెత్తినచేతులలో కొన్ని గెలలవలెను, కొన్ని ఆకులవలెను చేతులు వంచియుంచవలయును. దొంగ ఆకులుకాయలు కోసుకొని పోవునపుడు "ఇవి లేతవి. ఇవి ముదురువి. ఇవి చెడ్డవి.

ఇవిమంచివి" అని యెంచి వానిలో దొడ్డవానినే కోసికొని పోవుచుండును. దొంగవచ్చి ఆకులు కాయలగెలలు కోసికొన్నందుకు గురుతుగా పైకెత్తినచేతులు క్రిందికి దింపి యథాప్రకారముగా నుంచవలయును. కనుక మొదట గెలలుకోసుకుని పోయినపుడు కొన్నిచేతులును, పిదప ఆకులు కోసుకుపోయినపుడు కొన్ని చేతులును వ్రేలాడవేయవలయును కనుక రెండవమారు అన్నిచేతులును వంచివేయబడి మోడులవలె వట్టిచెట్లుండును. దొంగ పారిపోవుచుండగా కుక్కవచ్చి మొరుగుచు తరుముకొనిపోవును; కాని దొంగ దొరకక పారిపోవును. కుక్క తిరిగివచ్చి తనచోట కూర్చుండి చింతించుచుండును. అంతలో గొల్లది వచ్చి అరటిచెట్లు మొరడులైయుండుటచూచి, "అయ్యో! మాయదొంగలు మళ్లీ వచ్చి అరటిచెట్లన్నీ మోళ్లు చేసివేశారు; కుక్క ఎక్కడికి పోయినదో" యని కోపముతో వచ్చి కుక్కను చూచి "కుక్కా, నీవు నమ్మకమయినదానవు గదా యని నీ కప్పగించి వెళ్లినాను. నిక్షేపమువంటి అరటిచెట్లన్నీ ఎవరో దొంగలువచ్చి మోళ్లుచేసి పోయినారు. అయ్యో! నిన్నునమ్మి మోసపోయినాను. పెరుగు అన్నము పెట్టి పెంచినందుకా ఇట్లు చెట్లన్నీ దొంగల పాట్లనుబెట్టి చూచుచున్నావు. నీవు విశ్వాసములేని దానవు. ఛీ! నీవు మాయింట నుండదగదు లేచిపొమ్ము" అని చీవాట్లుపెట్టును. అందుకు కుక్క మిక్కిలి భయపడి "అయ్యో! ఇప్పటిదాక నేనిక్కడే కాచుకుని ఉన్నాను. ఇక్కడ ఎవరును లేరుకదా, ఇంతలోనే ఏమిభయమని ఇప్పుడే కోమటింటికి బెల్లముకోసము వెళ్లినాను. మళ్లీ వచ్చుచుండగా, దొంగ అరటాకులు కోసుకపోవుచు నాకెదురుపడ్డాడు. నేను మొరుగుచూ వానిని కరచుటకై పరుగెత్తితిని. కాని ఆదొంగముండా కొడుకు రాళ్లతో నన్ను కొట్టుచూ గబగబ పారిపోయినాడు. పొరపాటున తప్పుచేసితిని. ఈతప్పుకూడా క్షమించుము" అని ప్రార్థించును. గొల్లది జాలిపడి శాంతమునొంది కుక్కను క్షమించి "వెర్రికుక్కా! ఇక్కడ ఎవరును లేరుకదా యని యిల్లువిడచి దూరముగా వెళ్లుదురా! దొంగలు మాయదారులు. మనము చీమంత పరాకుపడితిమా, చిటుకలోవచ్చి దోచుకొనిపోవుదురు. ఇక ఎవరును లేనప్పుడు దొంగతనము చేయుట కడ్డమా? ఇంతటినుండి బహుభద్రముగా నుండుము." అని మందలించి తనపనిలో నుండును. కుక్క ఎక్కడికినీ పోక చెట్లదగ్గర కావలియుండును. సాయంకాలమైనతోడనే గొల్లభామ వచ్చి కుక్కకు పాలుఅన్నము పెట్టి "కుక్కా, నేను పాలు అమ్మబోయెదను. పదిలముగా నుండుము. దొంగలను దొడ్డిలోనికి రానీయకు." అని చెప్పి పాలచట్టిని నెత్తిమీద పెట్టుకొని "పాలమ్మో పాలు" అని కేకలువేయుచు వెళ్లవలయును. కుక్క కొంతసేపు కాపుండి ఎక్కడికో పోవును. అప్పుడు దొంగ వచ్చి ఈ అరటిగెలలకోసము, ఆకులకోసము నేను రోజు ఇక్కడకు గానేల? వారుచూస్తారేమో, వీరుచూస్తారేమో యని భయపడనేల? ఇప్పుడే గొల్లది పాలమ్మటకై వెళ్లినది. కుక్కకూడా ఎక్కడికో పోయినది. ఇద్దరును ఇప్పుడప్పుడే రారు కనుక ఈ అరటిచెట్లన్నీ తవ్వి ఎత్తుకుపోయి మాదొడ్లో వేసుకొని హాయిగా కావలసినన్ని కాయలూ, పళ్లూ కోసుకొని రోజూ సుఖించెదను." అని యనుకొని ఒక్కొకచెట్టే ఊడదీసి తన పెరటిలోనికి పట్టుకొని పోవును. అనంతరమున కుక్క వచ్చి "అయ్యో! దిక్కుమాలినదొంగలు! ఈమాటు చెట్లకుచెట్లే యెత్తుక పోయినారు. నేను ఎరుగకపోయి ఇట్టే అవతలకి వెళ్లితిని. గొల్లది వచ్చి నన్నేమిచేయునో! కొట్టునో తిట్టునో! ఏమిచేయను?" అని దుఃఖించుచుండును. ఇంతలో గొల్లది వచ్చి, చెట్లు లేకుండుట చూచి, గుండెలు బాదుకొనుచూ ఏడ్చి కుక్కను కొట్టి, తిట్టి, ఇంటినుండి లేచిపొమ్మని కోపపడును. కుక్క భయముతో ఏడ్చుచూ "అయ్యో! ఇప్పటిదాకా నేనిక్కడే యున్నాను. దాహమవుటచేత మంచినీళ్లకని చెఱువుకు వెళ్లివచ్చితిని. వచ్చునప్పటికి అరటిచెట్లు లేవు. దొంగలు ఎవరును కనపడలేదు. ఎట్లు పోయినవో తెలియదు. ఇక నెప్పుడును ఇట్టితప్పు చేయను. క్షమించుము." అని బతిమాలుకొనును. గొల్లది కుక్కను మన్నించి, కొన్నిబుద్ధులు చెప్పి "అరటిచెట్లు అపహ

రించినాడని ఒకనిమీద నాకు అనుమానమున్నది. ఏదో వంక పెట్టుకొని వానియింటికి పోయి అరటిచెట్ల ఆనవాలుపట్టి తగవుపెట్టి పట్టుకవచ్చెదను. ఆలస్యమైన యెడల దొంగ తనపెరటిలో పాతిపెట్టుకొనును. త్వరగా పోవలయును. నీవు పదిలముగా ఇల్లు కనిపెట్టుకొని యుండుము." అని బోధించి పిడక చేతబట్టుకొని నిప్పుకోసమని వంకపెట్టి దొంగయింటికి వెళ్లి మెల్లగా దొడ్డిలోనికి పోవును. దొంగ అరటిచెట్లు నాటుకొనుచుండును. అదిచూచి గొల్లది తన అరటిచెట్లు ఆనవాలుపట్టి "ఈఅరటిచెట్లు మావి. మీయింటికెట్లు వచ్చినవి? ఇంకా ఎవ్వరో దొంగలు ఎత్తుకపోయినా రనుకొన్నాము. నీవే దొంగతనము చేసినావా? అమ్మయ్యో! ఎంతపనిచేశావు! మాచెట్లు మాకిమ్ము. లేదా, తగవుపెట్టి అల్లరిచేసి నలుగురిచేతను చీవాట్లుపెట్టించి నీపరువు తీసివేయించెదను. ఇంక నిన్నెవరును నమ్మరు. కనుక మాటలాడక వేగిరముగా మా అరటిచెట్లు మాకిచ్చి నీమానము కాపాడుకొనుము." అని బెదరించును. ఆ మాటలకు దొంగ భయపడి "పొరపాటున తప్పుచేసితిని. మీచెట్లు మీకిచ్చెదను. నన్ను అల్లరి పెట్టకుము. నిన్ను బతిమాలుకొనెదను." అని వేడుకొనును. ఆ మాటలు విని గొల్లది కోపముతో "నిన్ను క్షమించగూడదు. నీ విదివరకు రెండుమారులు దొంగపని చేసితివి. ఇదివరకు ఆకులు, కాయలేకదా అని యూరకున్నాము. ఇపుడు లోకువకట్టి చెట్లే పెల్లగించుకొని వచ్చినావు. ఇప్పుడుకూడ నీకు తగినశిక్ష చేయించక విడిచిపెట్టిన యెడల ఇంకేమి దోచుకొందువో? కనుక నిన్ను విడువగూడదు." అని కేకలు వేయును. దొంగ అతిభయముతోను, సిగ్గుతోను "అల్లరిచేయవ"ద్దని బతిమాలుకొని యేడ్చును. అప్పుడు గొల్లది "నీవు మాయింట్లో మూడు మారులు దొంగతనము చేశావా లేదా, నిజముచెప్పుము. నిజము చెప్పినయెడల విడిచిపెట్టెదను." అని యడుగును. దొంగ నిజము ఒప్పుకొనును. అంతట గొల్లది తన చెట్లు తాను తెచ్చుకొనును. ఇంతటితో ఆట ఆఖరు.

"అరటిచెట్టుకు నీళ్లుపోసి అరటికాయలు నేనే తిందు. అరటిచెట్టుకు నీరుబోసి అరటిపళ్లు నేనే తిందు." అని గొల్లది వెళ్లునపుడు పాడును.

## ౧౪. చీకటిమూతలు

మొదట ముగ్గురుబాలికలు ప్రాయిగడ్డలవలె నిల్చియుండి యొకరిచేతు లొకరు పట్టుకొని పయికెత్తి చేతులు పట్టువిడిచి అందరును ఒక్కమారుగా ఎవరి యెడమచేతిలో (అరచేతిలో), వారు తమకుడిచేతితో చప్పట్లుకొట్టినట్లు అడ్డముగా వేసి కొట్టవలయును. అట్లు వేయుటలో కుడిచేతిని తిరుగవేసినను సరే, బోరగిల వేసినను సరే యెవరియిష్టము వచ్చినట్లు వారు వేయవచ్చును. అందరును చూచుచుండగాక వేసిన చేయి వేసినట్టే యుంచవలెనుగాని తీసివేయరాదు. ఆ ముగ్గురిలోనూ ఒకరు తిరుగవేసి యిద్దరు బోరగిలవేసినయెడల తిరుగవేసిన చిన్నది పండినట్టు. ఇద్దరూ తిరుగవేసి యొకరు బోరగిలవేసినయెడల బోరగిలవేసిన చిన్నది పండి



నట్టు. కనుక ఇద్ద రొకరీతిని, ఒకరొకరీతిని వేసినయెడల ఒక్కరుగానున్నవారే పండిపోవుదురు అని గ్రహింపవలయును. అట్లు పండినయామె దూరముగా నుండవలయును. తరువాత మరియొకరు వచ్చి యిద్దరితోను గలసి మొదటివలెనే చేతులు వేసికొని చూచి యెవరు పండినారో వారిని పండినబాలికతో చేర్చవలయును. ఇట్లు ఉన్నవారందరిలోనూ ఇద్దరుతప్ప తక్కినవారందరునూ పండువరకును చేయవచ్చును. ఇద్దరు మిగిలినయెడల

మూడవబాలిక లేనిదే యెవరు పండిరో నిశ్చయించుటకు వీలులేదు. కనుక పండినవారిలో నొకరిని సహాయముగా తీసుకొని రావలయును. సహాయమువచ్చిన చిన్నది అదివరకు పండినదేకనుక ఆమె పండినను, పండక పోయినను పండినట్లుగానే యెంచవలయును. అనగా ఇతరులకు సహాయముగా వచ్చినబాలికయే కడపటి ముగ్గురిలో నుండుననుకొందము. ఆపంట లెక్క లేదు. అనగా మిగిలినయిద్దరిలోనూ ఎవరోయొకరు పండుదాక అట్లు మరలమరల చేతులు వేయుచుండవలయును. పండకుండ మిగిలినబాలికయే ఆడుకొనిరావలయునని మీకు తెలిసినదికదా? తరువాత ఆటపెద్దగా నున్నయామె పండని బాలికమొగమునకు ఒకరుమాలును కట్టవలయును. అప్పుడు అందరును ఆడుకొనివచ్చు బాలికకు కొంచెము దూరముదూరముగా కూర్చుండియుందురు. ఆడుకొనుచూ వచ్చినబాలిక యెవరినైన పట్టుకొనవలయును. అపుడు ఆటపెద్ద వచ్చి "నీవుపట్టుకొన్నవారిపేరు ఎవరు?"అని అడుగును. ఆపేరు సరిగా చెప్పినయెడల పట్టుబడినబాలిక ఆడుకొనిరావలయును. చెప్పలేనియెడల చెప్పగలిగినదాకా మరలమరల మొదటి బాలికయే ఆడుకొనిరావలయును. తమ్ముపట్టుకొన వచ్చినప్పుడు తప్పించుకొనుటకై బాలికలు తాము కూర్చున్న చోట్లనుండి కదలకూడదు. కదలి దూరముగా పోవువారు అయిపోయినట్లే యగును. మొగమునకు కట్టే రుమాలు మనుష్యుల ఆనవాలు తెలియునంతపలుచగా నుండకూడదు.

## ౧౫. పచ్చాకు

పచ్చని చిన్నఆకు ఒకటి తెచ్చి ఒకచోట నుంచి దానిమీద దుమ్ముగాని, యిసుకగాని పోసి కప్పి బాలికలంతా చేరి ఒకరొకరే మెల్లగా నోటితో ఆదుమ్మును, లేక యిసుకను ఊదవలెను. వరుసగా అందరును ఒకమారు ఊదినతరువాత మళ్లీ ఒక్కొక్కరుగానే పచ్చనిఆకు బయలుపడేదాకా ఊదవలయును. ఏమాత్రము ఆకు కనపడినను చాలును. ఆకు అంతా పైకిరానక్కరలేదు, కనపడ నక్కరలేదు. ఎవరు ఊదుచుండగా పచ్చాకు బయలుపడుతుందో వారే దొంగఅవుతారు. వారే ఆడుకొనిరావలయును. ఇట్లు ఆడుకొనివచ్చేవారెవరో తేలినతరువాత అందరూ దూరముగా పోయి ఒక్కొక్కరే అక్కడక్కడ పచ్చికమీదగాని, పచ్చని చిన్నమొక్కలమీదగాని కూర్చుండవలయును. ఆటఆడేచోటును విడిచి చాలాదూరము పోరాదు. అట్లు కూర్చున్నవారు "నన్ను ముట్టుకోకోయి! నామాలకాకోయి" అని పాడుచు ఇవతలికి వచ్చి నిల్చియుండి ఆడుకొని వచ్చువారు తన్ను ముట్టుకొనుటకై దగ్గరకు వచ్చిన తోడనే చటుక్కున పచ్చికమొక్కలమీదికి పోవలయును. అందరును ఒక్కమారుగా గాని, కొందరు మాత్రమేగాని, ఒక్కరొక్కరుగాగాని లేచి తమతమ చోటులు దాటి పచ్చాకులు లేనిచోటులలో నిల్చియుండి 'నన్ను ముట్టుకోకు నా మాలకాకి' అని పైరీతిగానే పాడుచు గంతులు వేయుచు కాచుకొనివచ్చే బాలికను కవ్వించుచుండవచ్చును. తాము మొదట నిల్చిన



పచ్చికమీదనుంచి యిదివరకు ఇతరబాలికలు నిల్చిన పచ్చికపట్టులకు పోయి నిల్చియుండవచ్చును. అనగా బాలికలు ఒకరున్నచోటునుంచి మరియొక చోటుకు మారుచుండవచ్చును. ఆడుకొనివచ్చేబాలిక అందరినీ జాగ్రత్తగా కనిపెట్టిచూచుచూ ఎవరు పట్టిచోట నిల్చి పరాకుగా ఉన్నారో వారిని అమాంతముగా ఉరుకుచూ పోయి ముట్టుకోవలయును. పచ్చని ఆకుమీద నిల్చినప్పుడు ముట్టుకోరాదు. ముట్టుకుంటే

లాభము లేదు. ముట్టుకోబడ్డబాలిక దొంగ కాదు. సామాన్యముగా ఈ ఆట పచ్చికమొక్కలుగల పట్టులకు పోయి ఆడుకోవలయును. అట్టిస్థలములు లేనియెడల పచ్చనిఆకులుగాని, గడ్డిపరకలుగాని తెచ్చి అక్కడక్కడ వేసి వాటిపైని నిల్చుచూ ఆడుకోవచ్చును. పచ్చికమొలవని స్థలములో ఆడేటప్పుడు దొంగఅయినవారు పచ్చాకులు కొన్ని దాచియుంచుకొని పట్టుపడగానే తమచేతిలో ఆకులు నేలవేసి కాలికిందకు తీసుకొని తాను దొంగకాలేదని బొంకుటకు వీలున్నది. కనుక పచ్చికమొలిచినచోటులలో ఆడుకోవడమే మంచిది. పచ్చాకు కాలికింద లేనప్పుడు ఎవరు పట్టుపడుతారో వారు ఆట ఆడుకొని వచ్చుచుండవలయును.

---







శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు

ఈమె కడపమండల విద్యాసంఘాధ్యక్షురాలుగా ఎన్నుకొనబడెను. యం.యల్.సి. అగు శ్రీ కె. కోటిరెడ్డిగారు ఈమె భర్త.



# ఆంధ్రాభ్యుదయము




## శ్రీ. వేముల కూర్మయ్యగారు, బి. ఏ.,

ఇతడు హరిజనయువకుడు. ఇతని జన్మస్థానము కృష్ణామండలమునందలి మల్లవరగ్రామము. కాశీ హిందూవిశ్వవిద్యాలయమున బి. ఏ., పరీక్షయందుత్తీర్ణుడయిన ప్రథమహరిజన యువకుడు. ఇతనికి బిర్లాగారి విద్యార్థివేతన మొసగబడినది. హిందూ విశ్వవిద్యాలయమున ప్రవేశము లభించిన ప్రథమ హరిజన విద్యార్థి యీతడు. స్వసంఘాభివృద్ధికయి పరిశ్రమించుచున్న ఉత్సాహవంతుడగు యువకుడు. ఈతడు యం. ఏ., యల్ యల్. బి. చదువుటకు మరల కాశీకి వెళ్లనుండుట ఆనందింపదగిన విషయము.




## డాక్టరు, యం. వి. రాధాకృష్ణరావుగారు, (యం. బి., బి. యస్.)

వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయమునాదరమున విశాఖపట్టణమున వైద్యకళాశాలయందును, కింగ్ జార్జి వైద్యాలయమునందును జలోదరమును, యకృద్వృద్ధి (Liver Enlargement) ని గురించి పరిశోధనము కావించినారు. ఈవ్యాధులనుగురించి యింకను ఎక్కువ పరిశోధనమును విశాఖపట్టణము వైద్యకళాశాలయందు చేయుటకు లేడీ తాతారీసర్చి విద్యార్థివేతనము ఈ జూలయినుండి వీరికి లభించినది. ఆంధ్రవిశ్వవిద్యాలయమునందు ఆంగ్లవైద్య పరిశోధనముచేయు ప్రథమావకాశము వీరికి దొరికినది.




# కీ. శే. పిల్లలమర్రి సుందర్రామయ్యగారు

ఎ. వి. సీతారామయ్య, యం. ఏ.

శ్రీయుతులు కాశీనాధుని నాగేశ్వరరావుగారు బెజవాడలోని తమ దుర్గాకళామందిరంయొక్క ప్రారంభోత్సవం చేసినప్పుడు 'కృష్ణతులాభారం' ప్రదర్శించారు. అప్పుడు సుందర్రామయ్య. నారదపాత్ర ధరించాడు, స్థానంవారి సత్యభామప్రక్కన. తులాభార నాటకంలో ప్రథమ ప్రవేశం నారదునిది. పద్యంపాడే ప్రథమ-అవకాశంకూడా నారదునిదే. మనరాష్ట్రంలోనికల్లా విలువైనట్టువంటి అటువంటి నాట్యకళోపాసన మందిరంలో ప్రారంభోత్సవంలో ప్రథమ ప్రవేశావకాశం సుందర్రామయ్యకే దక్కింది. అటువంటి గౌరవం పొందటానికి అర్హుడు గాబట్టే అటువంటి అవకాశం లభించింది ఆయనకు. అప్పటినుంచీ ఆ కళామందిరం దినదిన ప్రవర్ధమానంగా ఉత్తమనటులనేకులకు రంగస్థానమైంది.

ఆంధ్రదేశంలో సుందర్రామయ్య నారదపాత్ర చూడని నాట్యకళాభిలాషులు లేరనే నా అభిప్రాయం. సుందర్రామయ్య నారదపాత్రలోని వేషధారణ ఆదర్శప్రాయంగా వుండేది. ముఖాన దేవర్షిత్వం చిందులాడుతుంటే, వకచేతితో తాంబూర మీటుతూ, రెండవ చేతితో చిరతలువాయిస్తూ గజ్జెలు కట్టుకున్న కాళ్లతో నృత్యంచేస్తూ భక్తితన్మయత్వం మూర్తీభవించినట్లుగా అవతరించేవాడు. సత్యభామవద్ద ఆ మాయమాటలూ, ఆ కలహప్రియత్వమూ, ఆమెమూఢప్రేమకు జాలీ, కృష్ణుని తనకు దానమిచ్చినప్పుడు కల్గిన ఆనందమూ, సత్యభామ గర్వభంగంతరువాత తన కార్యసాఫల్యమువలన కలిగిన సంతోషమూ, ఒంటరిగా వున్నపుడల్లా నిశ్చలమైన భక్తీ అఖండంగా ప్రదర్శించేవాడు సుందర్రామయ్య. పాత్రకు దగిన వేషధారణలో నరసింహారావు, నాగరాజరావు, గతించిన మాస్టరు అంజి మొదలయినవారితో సమానుడు. దొంగచిరునవ్వులతో చిందులుతొక్కే నారదుడు బొబ్బిలిపులివలె గాండ్రించేవాడు పాపారాయుడిలో. రుక్మాంగదపాత్రలో సౌందర్యమూర్తివలె రాణించేవాడు. రామసింహుడిలో రాజపుత్రయోధుడైపోయేవాడు. అటువంటి వేషధారణసామర్థ్యముండేది సుందర్రామయ్యవద్ద.

ఏనటుడిలోను లేని వక గొప్పశక్తి యితనిలో వుండేది. భక్తిరసమూ, రౌద్రరసమూ సమానకౌశల్యంతో ప్రదర్శించగల నటుడు మన ప్రస్తుతాంధ్ర నాట్యరంగంలో లేడనవచ్చు. అటువంటిశక్తి సుందర్రామయ్య పూర్తిగా కనబరచాడు. ఆతని పాపారాయుడిపాత్ర ఆంధ్రదేశాన్నంతా కదిలించింది. "ఎవడవు నీవు బొబ్బిలిపురీశ్వరమున్ మరి వారి యుద్ధమున్ బ్రబిమల శౌర్యమున్ వితతబల్కుచు లేవనుచుంటి వేమిరా" అని గర్జిస్తూ రంగస్థలంమీదకు వచ్చేటప్పటికి ఆనాటి వెలమవీరుల శౌర్యపటిమ తిరిగి మూర్తీభవించి వచ్చిందా అన్నట్లుండేది. విజయరామరాజును సంహరించే రంగంలో అతడు తన్నుతాను మరచిపోయి పాత్రలో లీనమైపోయేవాడని ఆతనిప్రక్కన విజయరామునిపాత్ర

ధరించిన ప్రతివారికీ అనుభవమే. ఆకాసేపూ ప్రేక్షకులు శిలాప్రతిమలవలె నిశ్చేష్టులై కూర్చొనేవారు. విజయరాముని భావ పాపారాయుని ప్రతీకారానికి నాటకశాలంతా కంపించిపోయేది. రంగారాయ వెంగళరాయ మల్లమాంబాదులను తలుచుకొని విచారపడుతూ తుదకు ఆత్మహత్య చేసుకొనే సందర్భంలో ప్రేక్షకులచేత కన్నీరు కార్పించి విచారసముద్రంలో ముంచేశేవాడు సుందరరామయ్య.

సుందరరామయ్య అభిమానపాత్ర హరిశ్చంద్రుడు. పామరజనులచేత పొగడ్త పొందకపోయినా రసజ్ఞులచేత మెప్పుపొందాడు, ఆవేషంలో. పద్యం చదవడంలో రామనాథశాస్త్రి నరసింహారావులతో సమానమైనచేయి. సంగీతంలో రాగంకన్నా భావానికే ఎక్కువ లక్ష్యపెట్టేవాడు. సంగీతంలో భావం ధ్వనించాలంటుండేవాడు. (Sound echoing the sense) ఈ సూత్రం- తనహరిశ్చంద్రపాత్రలో ముఖ్యంగా- బాగా విశదీకరించాడు, తనపాత్రలలో. సంగీతం బాగా పాడగలగాయకుడయినా భావానుగుణ్యంగా తగ్గించి పాడేవాడు.

'రోషనార'లోని 'రామసింహుడి'పాత్రలో అభినవరామసింహు డన్నారు అతన్ని. జాతీయభావం నిండిన కీర్తనలన్నా, పద్యములన్నా ఉప్పొంగిపోయేవాడు. సదా ఖద్దరు ధరించేవాడు. వీలయినంతవరకు వేషధారణలోకూడా ఖద్దరు వాడేవాడు. రోషనార నాటకంలోని యితని రామసింహపాత్ర జీవనాడిగా వెలిగింది.

నిజమైన నాట్యకళోపాసకుడుగా జీవించాడు సుందరరామయ్య. నాటకసమయంలో నేమి, రిహార్సల్సులో నేమి, ఆఖరుకి ఎవరయినా ఒకపద్యం పాడమన్నప్పుడేమి అతని 'సిన్సియారిటీ' స్నేహితులను ముగ్ధులనుగా చేసేది. రిహార్సలురూములో స్నేహితులెవరయినా ఏదన్నా ఒకపద్యం పాడమన్నప్పుడు కళ్లు మూసుకొని కొంచెంకాలం నిశ్చలంగా నిలిచేవాడు. 'ఎందుకయ్యా' అంటే 'పద్యంయొక్క సందర్భంలో లీనంగావాలి' అనేవాడు. అటువంటి అమాయకుడు, కళోపాసకుడు. నాట్యకళకొరకు తమకున్నదంతా ధారపోసినవారిలో సుందరరామయ్య ఒకడు. ఒకనెలరోజులు ఆతన్ని చూడకుండా వుండి కలుసుకుంటే ఎటువంటిస్నేహితుణ్ణి అయినాకావిలించుకొని నలిపివేశేవాడు. ఆతనియిల్లు మిత్రులందరికీ సత్రం. రాజభోజనంతో సత్కరించేవాడు. ఇంకా ఒకనెలరోజులకు పోతాడనగా ఎవరో కుర్రవాళ్లతోకలిసి తులాభారంలో నారదపాత్ర ధరించటానికి కాకినాడ వచ్చాడు. స్టేజిలోనికి వెళ్లి కలుసుకున్నా. గుండెల్లో నొప్పివస్తుంటుందన్నాడు. అప్పుడే అనుమానం తగిలింది నాకు, ఆయనరొప్పూ, ఆయాసం చూస్తే. అదే ఆఖరుమారు ఆయన్ని చూడటం. దురదృష్టం. ఆరాత్రి ఆయనతో జరిగిన సంభాషణవలన చివరరోజులలో ఆయన చాలాకష్టంగా జీవించినట్లు తోస్తుంది—ఆర్థికంగా కూడా. అన్నిటికన్నా ఆయనను ఎక్కువగా ఖేదపరచింది తనమిత్రులు స్థానం నరసింహారావు మొదలయినవారితో విడిపోవడం. 'రామవిలాససభ'ను దాని ఉచ్చదశను తలుచుకొని 'ఇన్నాళ్లు బ్రతికి యీవిధమైంది' అన్నాడు అశ్రుపూరితనయనాలతో.

ఇంటర్మీడియటువరకే చదువుకున్నా ఆంగ్లభాషలో అపారమైన కృషిచేసి బ్రహ్మాండమైన వక్తలాగ మాట్లాడేవాడు. నాటకాలు వేయటానికి ఒకమారు విజయనగరం వెళ్లినప్పుడు అక్కడ 'సుందరరామయ్య ప్లీడ'రని చెప్పుకుంటం విని సుందరరామయ్య నవ్వాడు.

ఎంత వాపోతే ఏంలాభం ? అనపోతనాయుడి పాత్ర చదువుతూ అటువంటి వీరరసప్రదర్శనానికి తగినప్రేక్షకులు - పిరికిపందలు, జాతీయతాద్వేషులు, కృతఘ్నులు ఎక్కువగాగల యీకాలంలో యిక్కడ లేరనుకున్నాడుగామాలు మరి. దేవనాట్యసభకు వెళ్లిపోయాడు ఆత్మశాంతి కొరకు,కుటుంబాన్ని,మిత్రుల్ని విచారాంబుధిలో ముంచి. అతనికేం ? నష్టం మనకేగా!



# లాంఛనములు

మల్లాది రామకృష్ణశాస్త్రి

ప్రసిద్ధులైన కవులందరికీ, విశిష్టపదప్రయోగ విధానయోగమున లాంఛనములు గౌరవరూపమున అమరుతూ వచ్చినవి: ఆలాటిసన్మానభాజనులైన కవులందరూ సమానముగా ప్రఖ్యాతులుకారు: కాని వారి కృతులు లభియించకపోవడమే అందుకు కారణమై ఉంటుంది: వల్లభదేవుడు, శార్ఙ్గధరుడు, హరిపండితుడు మొదలైనవారికృషికి ఫలితముగా, ఆమహామహుల కొన్ని రచనలైనప్పటికీ లభియిస్తూన్నవి:

ఉదాహరణరూపంగా..

(a) కాళిదాసు.. (దీపశిఖా.. కళికా అని కూడా ప్రసిద్ధము—.. కాళిదాసు)

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా,
నరేంద్రమార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం సస భూమిపాలః.

(రఘువంశము-vi—౬౭)

(b) భారవి (ఆతపత్రభారవి.. లేక ఛత్రభారవి)

ఉత్ఫుల్లస్థలనలినీవనా దముష్మా
దుద్ధూతః సరసిజసంభవః పరాగః,
వాత్యాభి ర్వియతి వివర్తితః సమంతా
దాధత్తే కనకమయాతపత్రలక్ష్మీమ్.

(కిరాతార్జునీయము-v—౩౯)

(c) మాఘుడు (ఘంటామాఘకవి)

ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా
వహిమరుచా హిమధామ్ని యాతి చాస్తమ్,
వహతి గిరి రయం విలంబిఘంటా
ద్వయపరివారితవారణేంద్రలీలామ్.

(శిశుపాలవధ-iv—౨౦)

(d) రాజానకరత్నాకరకవి (తాలరత్నాకరుడు)

అస్తావలంబిరవిబింబిత యోదయాద్రి
చూడోన్మిషత్ సకలచంద్రతయాచ సాయమ్,
సంధ్యాప్రనృత్తహరవాద్యగృహీత కాంస్య
తాలద్వయేవ సమలక్ష్యత నాకలక్ష్మీః.

(హరవిజయము-xix—౫)

(e) శ్రీకంఠకవి (భవభూతి)

సాంబా పునాతు భవభూతిపవిత్రమూర్తిః.

(f) చంద్రోదయకవి

[ఈకవిదీ, మిగతా ఉదాహరింపబోయే కవులవి కొందరివీ సామాన్యనామములు తెలియడము లేదు: వీరిప్రసిద్ధశ్లోకములుమాత్రమే సుభాషితావళి మొదలైనవాటియందు దొరకుతూన్నవి.]

ప్రసీద గతి రుజ్ఝ్యతాం వ్రజతు రాజహంసీ సుఖం
స్మితంచ పరిముచ్యతాం స్ఫురతు కుందపుష్పప్రభా,
నిమీలయ విలోచనే భవతు హారి కర్ణోత్పలం
కరస్థగిత మాననం కురు విభాతు చంద్రోదయః.

[సుభాషితరత్నావళి ౨౦౩౫]

(g) దగ్ధమరణకవి

యది ప్రియావియోగేఽపి
రుద్యతే దీనదీనకమ్,

త దిదమ్ దగ్ధమరణ
ముపయోగం క్వ యాస్యతి.

(h) దర్శనీయకవి (దోర్లతికాదర్శనీయుడు)

కస్మా ద్దోర్లతికే నిధాయ నచిరం
ద్వారోపరోధః కృతో
లగ్నా వా కిము న స్థితాపి రుదతీ
రుద్ధోత్తరీయాంశుకా,
కాలేఽస్మిన్ కుసుమాకరే ద్విగుణిత
ప్రేమ్ణి ప్రియేరాగిణాం
గచ్ఛ న్నగ్రతఏవ మూఢహృదయే
ముక్త స్త్వయావల్లభః.
[ఆఫ్రేట్ పండితుడు సంపాదించినది.]

...(మరియిరువురు దర్శనీయు లున్నారు, ఇతడుకాక: ప్రకాశవర్షసూనుడు ఒకడు, మరియొక దర్శనీయకవియున్నా. వారిపద్యములు సుభాషితావళి యందూ, సదుక్తి కర్ణామృతమునందూ దొరుకుతవి)

(i) నిద్రాదరిద్రకవి

జానే కోపపరాఙ్ముఖీ ప్రియతమా
స్వప్నేఽద్య దృష్టా మయా
మా మాం సంస్పృశ పాణి నేతి రుదతీ
గంతుం ప్రవృత్తా తతః,
నోయావ త్పరిరభ్య చాటుకశతై
రాశ్వాసయామి ప్రియాం
భ్రాత స్తావదహం శఠేన విధినా
నిద్రాదరిద్రః కృతః.
[వల్లభదేవసంపాదితము: 3౬౨]

(j) సీత్కారరత్నకవి

ఖ్యాతిం యత్ర గుణా నయాంతి గుణినః
తత్రాదరః స్యా త్కుతః
కింకుర్యాత్ బహుశిక్షితోఽపి పురుషః
పాషాణభూతే జనే,
ప్రేమరూఢవిలాసినీ మదవశ
వ్యావృత్తకంఠస్వనః
సీత్కారోఽపి మనోహరోఽపి బధిరే
కంనామ కుర్యా ద్గుణమ్.
[జల్హణసూక్తి ముక్తావళినుండి]

(k) ఛమచ్ఛమికారత్నకవి

త ప్తే మహావిరహవహ్ని శిఖావలీభి
రాపాండురస్తనఘనే హృదయే ప్రియాయాః,
మన్మార్గవీక్షణనివేశితదీనదృష్టేః
నూనం ఛమచ్ఛమితి బాష్పకణాః పతంతి.
[బూలర్ పండితుడు]

(l) అకాలజలదకవి

భేకైః కోటరశాయిభిర్మృతమివ
క్ష్మాన్తర్గతంకచ్ఛపైః
పాఠీనైః పృథుపంకపీఠలుఠితై
ర్యస్మి న్ముహు ర్మూర్ఛితమ్,
తస్మిన్ శుష్కసర స్యకాల జలదే
నాగత్య తచ్చేష్టితం
యే నాకంఠనిమగ్న వన్యకరిణాం
యూథైః పయఃపీయతే.
[ఆఫ్రేట్ పండితుడు]

[ఈకవి దాక్షిణాత్యుడు: రాజశేఖరకవిరాజు యొక్క ప్రపితామహుడని తెలియవస్తూన్నది. (బాల రామాయణం I-౩౧: విద్ధసాలభంజిక I-౫౫: స్టెన్-కోనోవ్-కర్పూరమంజరీ భూమిక: థేడోర్ ఆఫ్రేట్ తృతీయనివేదిక)

(m) రండానందకవి

మదనపరిపాండుగండా...
.. ..
ఖండయతు దుఃఖ మధికం
సుఖఖండకరండికా రండా.
[సుభాషితావళి ౨౩౮౫]

[ఈతనిపద్యములు వేరే ఎక్కడా లభియించ లేదు: అపహాసరూపమైనబిరుదు ఈ పద్యమూలము

ననే లభియించిఉంటుందని పీటర్ సన్ పండితుడి అభిప్రాయము]

(n) నగ్నాచార్యుడు.

రత్నోత్కటోత్తమాంగీ
శ్యామాథ వికంచుకా తరుణీ,
పతతు తవోరసి దయితా
ఛురికా భుజగీచ శత్రూణామ్:
[సుభాషితావళి ౨౧౨౧]

(o) ఉంఛవృత్తికవి (హరిగోపకవి)

భ్రష్టై శ్శ్లేష్మకుకాఖాత
దలితా దర్కదాడిమాత్,
ఫలై రివ మహీపింగైః
పూరితా హరిగోపకైః.

[ఈ యిరువురుకవులకు పద్యభావానురూపములైన బిరుదములు లభియించినవని ఆటోఫ్రాట్లింక్ అభిప్రాయము]

(p) వక్షస్థలాచార్యుడు

కాంచిత్ కాంచనగౌరాంగీం
వీక్ష్య సాక్షాదివ శ్రియమ్,
వరదః సంశయాపన్నో
వక్షస్థల మవైక్షత.

(q) రత్నఖేటదీక్షితులు

తంజావూరు అచ్యుతనాయకుని ఆస్థానవిద్వాంసుడు: వ్యావహారికనామము శ్రీనివాసదీక్షితులు: ఈతని సంధ్యావర్ణనాచాతుర్యమునకు ప్రముదితుడై అచ్యుతరాయలు రత్నఖేటదీక్షితులని పేరిడి బహూకరించినట్లు తెలుస్తూన్నది: ఈవిషయమే యజ్ఞదేవేశ్వరుడు, రాజచూడామణి (రత్నఖేట దీక్షితుని కుమారుడు) మఖిరచితమైన రుక్మిణీపరిణయ మహాకావ్యవ్యాఖ్యానారంభమునందు—

సంధ్యాసంధుక్షితాంభోధర నలికగణా
దుద్గతార్కా సీసఖండాం
స్తారాకారాన్నిరోద్ధుం శశిరవి కపటా
ద్బిభ్రతో రత్నఖేటౌ
అన్యోన్యం యుధ్యమానా వుదయచరమ భూ
భృత్పతీరావిలి ద్రా
గస్త్రౌ ఖ్యాతాపరాఖ్యఃక్షితిపతి వచసా
రత్నఖేటాధ్వరీతి.

అని వివరించియున్నాడు.

[కుప్పుస్వామిశాస్త్రిగారి శివ లీలార్ణవ భూమికనుండి]

[వక్షస్థలాచార్యుని పద్యము అప్పయదీక్షితులు చిత్రమీమాంసయం దుదాహరించినాడు: ఇది కాంచీవరదరాజవసంతోత్సవసందర్భమున చెప్పినదని తెలియవస్తూన్నది: దీక్షితుల కాతడు మూలపురుషుడు]

పై నుదాహరించినవారిలో చాలమందికృతులు దొరకకపోవడం గీర్వాణికి తీరనిలోరంత: కాలక్రమమున ఆలోటు తీరుతుందేమో:

---




## జర్మనువిద్యాలయములలో వార్తాపత్రికలు

'ది ఎడ్యుకేషనల్ రివ్యూ' లో జర్మను విద్యాలయములయందు వార్తాపత్రికల ఉపయోగమునుగురించి డాక్టర్ ఓట్టో హెర్బార్ట్ గారిట్లు వ్రాయుచున్నారు:—

"వార్తాపత్రికాపఠనము వీలయినంత లాభదాయకమగునట్లు చేయుటకు అనేకవిధానములు కనిపెట్టబడినవి. ఒకవిద్యాలయము వివిధములగు పండ్రెండు పత్రికలప్రతులను సుమారు మూడునెలలు పుచ్చుకొన్నయెడల ఒక్కొక్కబాలుడును ఒక్కొక్కపత్రికను వారము దినములు చదువవచ్చును. ఈవిధముగ నతడు త్వరలోనే వివిధములగు నభిప్రాయములను చాల తెలిసికొనగలుగును. ఏపార్లమెంటు ఎన్నికయో, ఏజాతిసమితిసభయో జరుగు ప్రత్యేక సందర్భములయందు బాలురు తాము పత్రికలలో చదివినదాని సారాంశముల వ్రాయవచ్చును. వారి యభిప్రాయముల వైవిధ్యమును పోల్చి చూడవచ్చును; సారాంశములను తేల్చవచ్చును. ఇన్నిపత్రికలను, ఇన్నిప్రతులను తెప్పించుటకు విద్యాలయము వారికి డబ్బు చాలకపోయినచో, ముఖ్యముగ విశేషాంశములు ప్రచురింపబడిన సంచికలనే ప్రత్యేకముగ తెప్పించవచ్చును. అయితే, యీవిధముగా ఎప్పుడో ఒక్కపత్రిక సంచికను చదువుటవలన కలుగు రాజకీయ పరిజ్ఞానము తక్కువే యగును, నిజమే. ఉపాధ్యాయుడు బాలునకు చెప్పిపెట్టవలసినది అధికమగును. ఇంకొకవిధమిది: ఒక్కొక్కమాదిరివిషయములయందు శ్రద్ధగల బాలురజట్టు ఒక్కొక్కటిని వివిధపత్రికలలోని ఆయా విషయములను చదువుకొననిచ్చి, వారు చదివిన వివిధ విషయములనుగూర్చియు అప్పుడప్పుడు వ్రాయనిచ్చుట. రాజకీయములనుగూర్చి తమ దృక్పథముతో నేకీభవించు పత్రికలనేగాక, వీలయినంతవరకు అన్ని పత్రికలను చదువునట్లు విద్యార్థులను ప్రోత్సహింపవలయును. ఈ విధముగ చదువుటకు కావలసిన యన్నిపత్రికలను ప్రజలకొరకేర్పరచిన పఠనమందిరములనుండి సంపాదింపవచ్చును.

నానావిధములగు పాఠములను చెప్పుటకును వార్తాపత్రికల పఠనమును పయోగింపవచ్చును. చరిత్ర, భూగోళవిషయపాఠములకు వార్తాపత్రికలలో చాల శ్రద్ధను పురికొల్పువిశేషము లుండును. పత్రికలలోని నాటక విమర్శనములును, నవీనప్రచురణములగూర్చిన విమర్శలును సారస్వతముగూర్చిన పాఠములు కాగలవు. విదేశీయములగు పత్రికలవలన భాషావిషయమగు పాఠములను నేర్పుటకు ఉపాధ్యాయునకు వీలుకలుగును. భాషలను నేర్చుకొనుటకుగాను జర్మనీలో అన్ని విద్యాలయములలోను అన్యదేశీయపత్రికలను తప్పక చదువుచుందురు.

జర్మనువిద్యాలయములలో వార్తాపత్రికా పఠన ప్రయోజన ఫలితములు చాల ప్రోత్సాహకరముగనున్నవి. విద్యాలయములలో చదువుకొనుచున్న బాలురును, చదువులుముగించిన యువకులునుకూడ ఈవార్తాపత్రికాపఠనాదిపాఠములను చాల ప్రశంసించిరి. దీనివలన సామాన్య జ్ఞానమును, నిష్పక్షపాతబుద్ధియు బాగుగ తమబాలుర కలవడుచున్నవని తలిదండ్రులును తమ సంతృప్తిని వెల్లడించిరి. జర్మనీదేశపు విద్యాంగ సంస్థయందు వార్తాపత్రిక యొక ముఖ్యాంశముగ స్థిరపడినదనియే చెప్పవచ్చును.

[అనువాదకుడు : జయంతి బ్రహ్మానంద]

—

## ఆంగ్ల ప్రధానోపాధ్యాయుని నేటికాలపు విద్యార్థుల వర్ణనము

యుద్ధానంతరమున ఆంగ్ల పాఠశాలలందలి విద్యార్థులు అబద్ధము చెప్పువారుగనో, దొంగలుగనో, పిరికిపందలుగనో, డాంబికులుగనో యున్నారు. బ్రిటిషు వైద్యసంఘమందొకసమావేశ సందర్భమున అతిథిగా నుండిన లాన్సింగుపాఠశాల ప్రధానోపాధ్యాయులు ఫ్రాంక్ బర్టు బ్లాక్సునుగారు పైవిధమున జెప్పిరి.

పెద్దమనుష్యులనువారికి అనాది సిద్ధముగ నున్న విషయముల నేటివారు గమనించుటలేదు. స్వర ములనెక్కి స్వారి చేయువారిని మరచి ఈ కాలపువారు క్రికెటు ఆటతో తృప్తినొందుచున్నారు. ఇంతకన్న అన్యాయమైన దేదనగా ఆంగ్లేయుని మాటయే వానికి పరమప్రమాణమని గర్వించు దినములు నశించిపోవుచున్నవి. నెపోలియను పరాజయానంతరము వెల్లింగ్టను ప్రభువుగారు పలుమారు వాటర్లూ యుద్ధమున గెలుపు ఈటనుదేశమందలి ఆరామప్రదేశము లందే గలిగెనని చెప్పెను. కాని ఆధీరుడు నేటిపరిస్థితుల చూడవలయును.

నేటికాలపు విద్యార్థి యొంటరిగా నుండుటకు భయపడుచున్నాడని బ్లాక్సనుగారనిరి. ఒంటరితనమన్నను, విసుగుతనము పుట్టించు విషయములన్నను నేటివిద్యార్థి మిగుల భయము జెందుచున్నాడు. పూర్వ కాలపు ధీరత్వగుణము నశించిపోయినది. ఈకాలమున ౧౫,౧౬ సంవత్సరముల యీడుగల బాలురు దూర దేశములకు పోయి తమకేదేని జీవనోపాయముల గల్పించుకొను విషయమున జూపు ననిష్టము పై విషయముల విస్పష్టముచేయుచున్నది.

ఈ కాలమున అసత్యము ప్రబలుచున్నది. ఇందువలననే పాఠశాలల విషయము సరిచూచుట కష్టమగుచున్నది. పుస్తకములను దొంగిలించుట, గ్రామఫోను రికార్డులను దొంగిలించుటయనునవి ఎరవుతీసుకొనుట వంటివిగనే భావింపబడుచున్నది. ఒరులను దేబెరించి సొమ్ములను, సైకిలను కొనివచ్చి యలంకరించుకొనుటయు నిట్టిదిగనే బరిగణింపబడుచున్నది. ఇదంతయు డాంబికము. ఈతరమువారిట్లు నిలుకడలేక క్రొత్తరీతిని అవస్థపడుచున్నారు. (జూలై మాడరన్ రివ్యూ)

---

## సనాతనధర్మమన నేమి?

ఆధునిక హిందూసంప్రదాయముల ప్రకారము నడచుకొను మతపిచ్చిగలహిందువులు తాము సనాతనులమని చెప్పుకొనుచున్నారు. వారట్లనుకొనుటకు వారికేమి హక్కుగలదని మనము వారిని ప్రశ్నింపనక్కరలేదు. సనాతనమన శాశ్వతమైనది; స్థిరమైనది; నాశములేనిది; అనాది. సనాతనధర్మములు, మతవిధులు, సంఘవిషయములు, సంప్రదాయములు అనాదినుండియు మార్పుజెందక నేడెట్లున్నవో యట్లే యున్నవని చరిత్రమూలమున సిద్ధాంతము చేయుటకు వీలులేదు. పురాణములు, స్మృతులు మొదలగువాని యందుగల విషయములకును అంతకన్న ప్రాచీనములగు వేదములయందును, ఉపనిషత్తులయందును గల విషయములకును అంతరము గలదు. (జూలై మాడరన్ రివ్యూ)

---

## స్వాతంత్ర్య పరిపయము

### (ఒక సత్యమగు సందర్భము)

భారతదేశమున ఈమధ్య నెన్నియో సంవత్సరములుగ స్వాతంత్ర్య సమరము జరుగుచున్నది. ఈ లక్ష్యప్రాప్తికొరకు ఎందరో మహాపురుషులు బలి అయిపోయిరి. మరి నేడును ఆప్రయత్నముననే ఎందరో తగిలియున్నారు. స్వాతంత్ర్యము ఎవరభిలషింపరు? పరాధీనత ఎవరికి రుచించును? కాని, స్వాతంత్ర్యము సంపాదించుటకై ప్రయత్నించుచున్నవారు దాని మూల్యమును పూర్తిగ నెరుంగుదురా అను విషయ మాలోచింపవలసియున్నది. స్వాతంత్ర్యము యొక్క యథార్థమగు మూల్యమును తెలిసికొనుట కయి మనము అన్యత్ర వెదకి చూడవలసియున్నది

అట్టి స్థలము అడవియే. వనచరములే స్వాతంత్ర్యమును పూర్తిగా నెరుంగునవి. ఉదాహరణముగా పాఠకులకు నేనొక సత్యమగు సంఘటనమును తెలుపుచున్నాను. ఒకరాజ్యములోని అడవులలో లేళ్లు దొరకవు. ఆ రాజ్యమునకుగాను వానిని పట్టియిచ్చుటకు ఈమధ్యనే నాకు ౕ౦౦ రూపాయలు బహుమతిగా పంపిరి. చాల శ్రమపడి తుదకు మూడునాలుగు లేళ్లను పట్టుకొనగలిగితిని. మొత్తము పదిపండ్రెండింటిని పట్టుకొని తరువాత అన్నింటిని కలిపి యొకమారే రవానా చేయవచ్చునుగదా యని ఆ నాల్గింటిని నావద్దనే బోనులలో నుంచితిని. అవి బోనులలో బంధింపబడిననాటినుండి తిండి, నీరు మానివైచి కృశించి కృశించి ప్రాణములను త్యజించినవి. పట్టుకొనునపుడు బహుశః వీనికి కొంచెము దెబ్బ తగిలియుండవచ్చుననియు, అందువలననే యివి మరణించియుండుననియు నేను అనుకొంటిని. మరల నేను వల పన్నితిని. మరల నా ప్రయత్నము సఫలమైనది. రెండుమూడు దొరికినవి. ఈమారు వీనిని నేను చాలజాగ్రత్తగ పట్టుకొంటిని. దేనికిని రవ్వంతయేని దెబ్బ తగులకుండ జూచితిని. కాని యింత జాగ్రత్తపడినను నేను వీని ప్రాణరక్షణయందు అసమర్థుడనైతిని. అప్పుడు నా కళ్లు విడినవి. వీని ప్రాణత్యాగమునకు కారణము ఒడలిమీది దెబ్బలు కావనియు, స్వాతంత్ర్యమును గోల్పోయినందున కలిగిన శోకమే యనియు తెలిసికొంటిని. ఈఘటన నాహృదయమును పూర్తిగా మార్చివైచినది. నేను తరువాత వానిని పట్టుకొను ప్రయత్నమునే మానుకొని, 'ఈకార్యము నా శక్తికి మించినది' అని ఆ రాజ్యము వారికి బహుమతిధనమును వాపసు పంపివేసితిని.

'స్వాతంత్ర్యము' అన నేమియో, దాని యథార్థ మూల్యము ఎంతయో నాకప్పుడు బోధపడినది. స్వాతంత్ర్యదేవత ప్రాణములను బలికోరును. ఇతరుల ప్రాణములను కాదు, స్వాతంత్ర్యమును కోరువాని ప్రాణములనే. (హిందీ 'విశాలభారత్' నుండి)

[అనువాదకుడు: జయంతి బ్రహ్మానంద]

## విద్యాలయములలో ఆటలు

విద్యాలయములలోని అందరు విద్యార్థులును కూడ ఆటలయందును, శరీరవ్యాయామాదికమునందును శ్రద్ధతో పాల్గొనునట్లు ఏర్పాటులు గావింపవలయును. మద్రాసునుండి వెలువడు 'ఫీల్డు' అను పత్రికయందు డాక్టర్ జగదీశన్ యమ్. కుమారప్పగారిట్లు వ్రాయుచున్నారు:—

"భారతదేశమున మన మింతవరకును ఒక విద్యాలయమునకును ఇంకొక విద్యాలయమునకును మధ్య జరుగు ఆటలపోటీలయందు శ్రద్ధను కనబరచుచుంటిమి గాని, విద్యాలయములోని అందరు విద్యార్థులకును శరీరవ్యాయామాదికము చేయుదురనట్లు ఏర్పాటులు గావించియుండలేదు. ఇట్లు విద్యాలయములవారికి పరస్పరము జరుగు పోటీలయందును, శరీరవ్యాయామమును నిరివి యొనర్చుటయందును చేయవలసినది యింకను ఎంతోయున్నది. విద్యాలయములవారికి ఒండొరుల మధ్య జరుగు ఈపోటీ పందెములు మొదలగు వానివలన శరీరవ్యాయామమునందును, ఉల్లాసమును, ఉత్సాహమును కలిగించు ఆటలయందును పందెములు వేయగలవారలు తయారగుట మేలేయైనను, పరమప్రయోజనములగు శారీరక, నైతిక, సాంఘికమూల్యములు చేకూరుటకయి వీనియందు అందరును పాల్గొనవలెనను ఆశయమున కిది పూర్ణావకాశ మీయదు. మనవిద్యాలయములలో ఆటలకును, వ్యాయామమునకును ఇంకను ఎక్కువ సౌకర్యములను కలుగజేయవలయును. ఒక్కొక్క విద్యార్థియు ఏదో ఒక నిర్ణయమగు వ్యాయామమునే క్రమముతప్పక ఆచరించునట్లు చేసినయెడల శ్రేష్ఠముగనుండగలదు. మంచి ఫలితములు కలుగవలెనన్నచో, నియమములు కలవానిని, తెలివిగలవానిని, ఉత్సాహవంతుని నాయకునిగ నేర్పరుపవలయును. అనగా ఒక్కొక్క విద్యాలయములోను కాలమంతయు శరీరవ్యాయామపాఠములను బోధించుటకే వినియోగింపగల సమర్థుడగు అధ్యాపకుడు నియమింపబడవలయును. అతనికి అన్ని సదుపాయములును, వీలయినచో సహాయకులును కూడ ఈయబడవలెను. ఇట్టి యేర్పాటులతో

అత్యధికసంఖ్యాకులను విద్యార్థులు ఆటలలోను, పోటీలలోను పాల్గొనునట్లు చేయవచ్చును. ఒకవిద్యాలయము వారికిని ఇంకొకవిద్యాలయమువారికిని జరుగు ఆటల పోటీలవలన విద్యార్థులకు శ్రద్ధ హెచ్చునది నిజమే. కాని యిప్పుడు ప్రతివిద్యార్థికిని పొందనగు వ్యాయామాదికమును వృద్ధిపొందించి సరియగు విలువను కలుగజేయుట కగు దూరాలోచనయు, ధనమును, సౌకర్యములును, సరియగు మార్గదర్శిత్వమును అవసరము లయియున్నవి. విద్యాలయములలో తప్పనిసరిగను, తరగతులవారీ భేదముతోను వ్యాయామవిద్య గరపుట వలననే విద్యాలయములలోని ఆటలు పోటీలవలని అత్యధికమగు ప్రయోజనము చేకూరును. విద్యాలయములలోని బోధనవిషయక్రమమునందు వ్యాయామాదికమునకు ఇట్టి స్థాన మీయబడిననాడే, విద్యాలయములలోని యితర సామాన్యపు పనులకు సాంఘిక నైతిక మూల్యములును, ఉత్సాహమును, పోటీకి కావలసిన పూనికయు కలుగుట కిది తోడ్పడగలదు.”

[అనువాదకుడు: జయంతి బ్రహ్మానంద]

---

## సహకార మహాసభ—౧౯33

ఇటీవల చెన్నపురిలో ౨౦-వ రాష్ట్రసహకార మహాసభ సమావేశమైనది. సభ జయప్రదముగా జరిగినది. సభాంగణమునకూడిన సహకారులు ఉత్సాహమును జూపిరి. కాని, జరిగినది సహకారసభ కాకున్నచో, ఆనందోత్సాహములు వెల్లివిరిసెడివి. ఏదేని రాజకీయసమావేశమైనయెడల, సభయందలి అడుగుజాడలు ప్రజల హృదంతరాళములందు అంకితము లయ్యెడివి. ఉపన్యాసములు దేశమం దెల్లకడల నవవర్ష జలధారలట్లు నిండిపోయెడివి. పత్రికలందలి అక్షరమక్షరమును కౌతుకాహ్లాదములతో తొలుకాడుచుండెడిది. సరిగ నీసమయమందే బర్మింగుహాములండను నగరములలో సహకారులు కలిసికొనిరి. ఆంగ్లేయులు చూపిన ఉత్సాహములో, నూఱవవంతైన మనదేశీయులు చూపలేదు. దీనికి హేతువు దురూహ్యము కాదు. కారము రుచించినట్లు మనకు సహకారమంతగా రుచింపదు. ప్రయోజనమైనదయ్యు, ప్రయోజనములేనిదయ్యు, వెంట్రుకలను నిలువంబెట్టు చప్పుడు వలనగాని మనము మేలుకొనము.

ఆంధ్రుడు దక్షిణదేశపు వంగీయుడు. ఇత డధికముగా కాంక్షించునది ఆవేగము. ఆవేగబంధురమైన ఎట్టిపనికైన ముందుల కాతడు ఉఱుకును. ఈలంఘనమున నాతడు మేరువుపై నధిష్ఠించినను అధిష్ఠించును! కాలు విఱుచుకొనినను విఱుచుకొనును! బూరా చప్పుడు వినపడినంతనే ఆతడు మహారథుడై నిలుచును! సహకారమున ఉద్వేగము లేదు. బోరుకలంగు ప్రణాళిక లేదు. ఉద్వేగములేనియెడల ఆంధ్రు డుదాసీనుడై యుండును. అందుచే సహకారమును ఏమో మాఱుమూల గుసగుసయని అత డూహించుచున్నాడు.

నడుముగట్టి పునాది త్రవ్వి, ఎత్తైనకట్టడము కట్టుటకు వలసినది విరాట్ప్రజ్ఞగాని యుయుధానవిజృంభణము కాదు. ఈప్రజ్ఞ మనలో నింకను గోచరింపక పోవుటచే సహకారముదెస సామాన్యులును విద్యాధికులునుగూడ ఆదరదృష్టి పఱుపుటలేదు. దోషము కొంత సహకారోద్యమమందుగూడ నున్నదని చెప్పక తప్పదు. ప్రజలందు ఉత్సాహమును పుట్టించు క్రియావిధాన మింకను అందు చూపట్టుట లేదు. క్లిష్టమైన ఆర్థికసమస్యలు ఏకొలదిమందికో కాని జనబాహుళ్యమునకు రుచింపవు. కేవలము స్వదేశోద్యమమే కాకున్నను, స్వదేశోద్యమమున కది వేఱుగాదనియు, స్వదేశవస్తుప్రచారమును, ఉన్నతాశయప్రబోధమును దాని ముఖ్యోద్దేశములనియు కొంత ఆందోళనము జరుగవలెను! ఈయాందోళనమువలన ప్రభువులు ఉలికిపడరాదు. స్వదేశోద్యమమునందు పాల్గొనువారు ఇప్పటివలె మూకీభావము వహింపక సహకారమున పాల్గొనవలెను. ఇతరోద్యమములందు జేరునట్లు యువకులును, యువతులును సహకారోద్యమమున బాలుగొని, దానివిజయమునకై కంకణము గట్టుకొనవలెను. యువకుడు లేని చోటులందు ఆనందము సున్న; యువతిలేనియెడలందు

ఉత్సాహము రెండుకేటిబిలు. పాశ్చాత్యదేశములలో విశేషముగ యువతులే యీయుద్యమమును నడపుచున్నారు. మనదేశమందుగూడ పంజాబులో యువతులే సహకారమండలి తియ్యందనమును విశేషముగ గ్రోలుచున్నారు. కావున నారాష్ట్రమం దది సర్వజనాదరణీయమై యున్నది. మనరాష్ట్రీయులు పాంచాలీయులను, పాశ్చాత్యులను అనుకరించి, నిర్మాణక్రియా విధానమున ఎనలేని అవకాశము జూపు సహకారోద్యమమున పాల్గొని సర్వతోముఖాభివృద్ధి నందుదురుగాక!

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## మొహెంజోదారో

### (ప్రాచీన నిర్మాణావిష్కరణము)

౧౯౨౨-వ సంవత్సరమునాదిలో మొహెంజోదారోవద్ద సుమారు ౧౩౬౧౦ చదరపు గజముల ప్రదేశము పరిశోధనకై త్రవ్వబడినది. దానికి ఫలితముగ కొన్ని చక్కని శిల్పిగృహములు వెలువడినవి.

తరువాత ౧౯౨౭-౨౯ సంవత్సరముల నడుమ ఆగృహముల ఆనుపానులను వివరముగ తెలుసుకొనుటకు మరికొంతభాగము ( సుమారు ౮౫౫౫ చదరపు గజములు ) త్రవ్వబడినది. మొత్తము త్రవ్వబడిన ప్రదేశముయొక్క వివరములు స్థూలచిత్రము ( Plan ) నందు కననవును. దానిలో నల్లని, దళసరిగీతలతోను, చుక్కలతోను గుర్తింపబడిన గృహములు వగైరాలు అర్వాచీన యుగమునకు చెందినట్లు నిర్ణయింపబడినది. కట్టడముల తాపీపనినిబట్టి యీయుగము మూడు ఉపయుగములుగ విభజింపవచ్చును. ఈ గృహములన్నియు దాదాపు మధ్యయుగపు కట్టడములపై నాధారపడినవి.

ఈ అర్వాచీనయుగపు శిల్పిగృహములను బయటికి తీయుటలో కొన్ని బావులుకూడ బయలుపడినవి. ఆకారమున నవి కర్మాగారములందలి పొగగొట్టములను పోలియున్నవి. చూడవచ్చినవారు వీనిని చూచి ఏవో శిఖరములని తరచు భ్రమసెడువారు. ఈబావులను చక్కగ పరిశీలించిన ఈరెండు యుగములందును ఆప్రదేశ మెట్టి యెట్టిమార్పులను చెందినదియు తెలియవచ్చును.

ఈత్రవ్వటములో లోమట్టమున బయల్పడిన యిండ్లన్నియు మామూలుతీరునసే చతురస్రముగనో, దీర్ఘచతురస్రముగనో కట్టబడినవి. కట్టడములలో నగిషీపను లంతగా కనబడవు. ఒక్కొకయింటిముందును ఒక అంగణము. తరువాత తరువాత ఇంటిగోడలయం దేర్పడిన మార్పులవలన కిటికీ లుండినది, లేనిది నిర్ణయింపరాకున్నది. కాని మామూలుగవాక్షములుమాత్రము ఉండినట్లు చిన్నెలు కనుపించుచున్నవి.

నాడు ఇండ్లకు కప్పువేయుట చాల సులభమైన పద్ధతిలో జరిగెడిది. ఒక్కొకకట్టడముపైనను దళసరి, చదరపు కొయ్యదూలములువేసి, వానిపైన తుంగచాపలను పరచి వానిపైన రెండు అంగుళములమందమున వరిపొట్టు కలిపిన బురదమట్టిని పరచెడివారు. నాటి యిండ్లయొక్క నిర్మాణమును ౧-వ చిత్రమునందు చూడవచ్చును. దీర్ఘచతురస్రమైన యీ యింటిపొడవు ౮౧ అ. ౮ అం; వెడల్పు ౫౪ అ. ౬ అం. కుడిప్రక్కన కానవచ్చు తొల్లిటిద్వారము ౨౦. ౨ అ. ఇది ఇటుకలచే మూయబడియుండినది. ఎడమప్రక్క కనబడు రెండును కిటికీలవలె కనబడినను నిజమునకు, తరువాత నేర్పడినద్వారములే.

ఈ యింటిముందు తనుపాటి పరిమాణము గలిగి, ఇటుకలు పరచిన ముంగిలి కలదు. ( చిత్రము ౨ ) కాని యీయింటికి ఆనుకొని తూర్పువైపున మరియొక కట్టడము కలదు. రెండుసందులు ఈయింటిని ఉత్తర దక్షిణములందలి యిండ్లనుండి వేరుపరచుచున్నవి. ఈరెండుసందులును కొంతకాలమువరకు రాకపోకలకుపయోగింపబడుచుండినను వెనుక మూసివేయబడినవి.

మధ్య, అర్వాచీన యుగములందలి కట్టడములలో చాలకొన్నిటికిమాత్రమే ఇటికపరపులు కనబడుచుండుట వింతగనున్నది. మధ్యయుగపు కట్టడములలో చాలమటుకు ఇటికపరపులే వాడుకయం దుండినట్లును, కాని తరువాత ఆయిటికనంతయు నూడబెరికి యితర

కార్యములకు వినియోగించుకొనినట్లును చెప్పుటకు ఆధారములు కలవు. ౬-వ చిత్రమున గల యింటిని, దాని ఇటికెరాతిపరపును చూడుడు. ఉన్న యిండ్లలో నీయిల్లే మిక్కిలి పెద్దది.

౪-వ చిత్రము లోమట్టములోని వివరములను, పనితనమును స్పష్టముగ తెలియపరచుచున్నది. ఎడమ చేతిప్రక్కనగల గదియందలి ఇటికరాతి పరపును చూడుడు. ఇట్టి పరపులను తరువాతి తరమువారు ఊడ బెరికి ఇటికనంతయు తమతమయిండ్లను కట్టుకొనుట కుపయోగించిరనుట కిదియొక యుదాహరణము కాగలదు. ఇందు కనబడుచున్న బావియే తరువాతి కాలమున నేర్పడిన మార్పులతో ౩-వ చిత్రమున చూపబడినది. ఈబావియొక్క మదురులోవ్యాసము ౨ అ. ౫ అం.

దిబ్బకు దక్షిణపశ్చిమదిగ్భాగమున గల యొక కట్టడమున రెండు సోపానపథములు గలవు. ఈరెంటి నడుమ నొక మురుగునీటికాలువ పారుచుండెడిది. అది ౭-వ చిత్రమున కనవచ్చును. ముందుభాగమునగల కాలువ తరువాత ఎప్పుడో ఏర్పడినది.

కొన్నియిండ్లు బురదయిటికలతో నింపబడి యుండినవి. తరువాత కట్టబడు ఇండ్లకివి గట్టి పునాదులుగ నుండగలవను నుద్దేశ్యమే దీనికి కారణము. ౨-వ, ౬-వ చిత్రములను చూడుడు.

ఈ త్రవ్వటములో ఇక్కడ కొన్ని క్రొత్తవస్తువులు దొరకినవి. అందు కొన్నింటి చిత్రము లిందు కలవు:

౯. హాత్తరమువంటి యొక బలపపురాతి ముద్ర యొక్క ముద్రణము. ఇట్టి యాకారముగలముద్ర లిది వరకు ఇండియాలో ఎక్కడను దొరకినదిలేదు. ఇందలి బొమ్మలవిధానము, ఇది కేవలము భారతీయ నిర్మాణమే యనుటకు నిదర్శనము.

౧౦. మరియొక బలపపురాతి ముద్రయొక్క ముద్రణము. దీనిలో ఒక పిప్పలవృక్షమున వృక్షదేవత కాబోలు, ఒక స్త్రీ వ్యక్తి నిడుపైన వెంట్రుకలతోను, కొమ్ములతోను నున్నది. ఆమె ముందు మరియొక స్త్రీ వ్యక్తి మోకరిలియున్నది. ఈమెవెనుక మేకవంటి యొకవ్యక్తి మనుష్యముఖముతో నున్నది. చెట్టుఆకులను బట్టి యిది పిప్పలవృక్షమే యనవచ్చును.

౧౧. ఇంకొక బలపపురాతిముద్ర. ఒకవ్యక్తి యొక వేదికపై యోగాసనమున కూర్చొనియున్నాడు. తలపై త్రిశూలాకారముగ కొమ్ములు గలవు. చేతులు మోకాళ్లపైకి చాపబడియున్నవి. మూడో, నాలుగో ముఖములు. చుట్టును నాలుగుజంతువులు—ఏనుగు, పులి, ఖడ్గమృగము, దున్నపోతు కలవు. ఇవన్నియు తరచు మామూలుముద్రలయందు కనబడునవే. వేదికకు క్రింద మరిరెండుమృగములు కలవు. ఈ లక్షణముల నన్నిటినిబట్టి యీవ్యక్తి పంచముఖుడు, త్రిశూలధారి, వృషభవాహనుడు, మహాయోగి, పశుపతి యను శివుడని యొకరి యభిప్రాయము.

మొదటినుండి ఒకే నాగరికత, ఒకే విశ్వాసము గల ప్రజలే ఈపట్టణమును క్రమముగ నాక్రమించుచు వచ్చిరని యీ భూవిదారణమువలన తెలియవచ్చుచున్నది. ఇంకను పరిశీలించినచో నెట్లు తేలగలదో!

[భారతపురాతనవస్తు పరిశోధనశాఖవారి వార్షిక నివేదిక (౧౯౨౭-౨౯) నుండి యిందలి చిత్రములును, విషయములును గ్రహింపబడినవి.]



# విమర్శనములు

## బాలాదిత్య

సప్తసామ్రాజ్య పునర్నిర్మాణప్రయత్నములకు సంబంధించిన ఒకచరిత్రాత్మకమగు నవల. భారతీయ పునర్నిర్మాణప్రయత్నములు తీవ్రముగ జరుగుచున్న ఈకాలమున ఈనవల భారతీయుల కొక నూతన సందేశమును, ఉత్సాహమును ఒనగూర్చకమానదు. వివిధ జాతులమధ్యను సామరస్య మవసరము. వివిధమతధర్మములను స్థూలముగమాత్రమే చూచి వాటిసూక్ష్మతత్త్వముల నెఱుంగకున్నచో దేశపతనము నిశ్చయము. ఈధర్మములు మనకు విశదమగునట్లు పాత్రలచర్యల ద్వారా బోధపఱచు నవలలు, నాటకములు వ్రాయుట విశేషప్రజ్ఞ యనవలెను.

ఈ నవలయందు బౌద్ధమతముయొక్క సాధారణనీతులను గ్రహింపకపోయిన యశోధర్మవంటి సనాతనమతశ్రేష్ఠులు, హిందూమతముయొక్క విశాలాశయములను గ్రహించలేక మోక్షధర్మపరాఙ్ముఖుడైన బాలాదిత్యునివంటి బౌద్ధమతపక్షపాతులు, అసలు మతమన్న నేమియో యెఱుగక బాహ్యాడంబరములయందు చొక్కుచు మతోద్ధారకుల మనుకొని మానవధర్మమును మఱచి రాక్షసకృత్యములకు వెనుదీయని నారాయణభట్టువంటి కపటబ్రాహ్మణులు, జ్ఞానమనునది యెక్కడనుండియో యూడిపడువస్తువనుకొని దానిని పొందు తలంపుతో నెల్ల యజ్ఞానపథంబుల ద్రొక్కుచు ఎందును తృప్తిబడయక జగత్తనిన రోతగొను, అజ్ఞానాంధునివంటి సంశయాత్ములు కూడియున్న దేశమునకు మోక్షమెన్నడును సమీపస్థము కానేరదు. మనదేశముయొక్క అవస్థయు నించుమించుగా నిట్టిస్థితిలోనే యున్నది. కథావసానమునకు వచ్చుసరికి నారాయణభట్టు చచ్చి, అజ్ఞానాంధు లవ్యక్తులై బాలాదిత్యునకు మనస్సు తిరిగి యశోధర్మకు ప్రపంచతత్త్వము తెలియవచ్చుసరికి విజయము చూపుమేర యయ్యెను. కాని వీరల అసలుతత్త్వములు మాఱలేదు. కనుక భావిస్థితి యెప్పటివలె సంశయావస్థలో వ్రేలాడుచు నుండిపోయినది. హిందూ, మహమ్మదీయ క్రైస్తవమతాదిభేదములతోడను, బ్రాహ్మణాది వర్ణభేదములతోడను, ఆర్థిక, ఆముష్మిక, ప్రాచ్య, పాశ్చాత్య, సాంఘిక, రాజకీయ సిద్ధాంతభేదములతోను కొట్టుకొనుచున్న మనకు ఈనవల యొకకర్తవ్యధర్మము నుపదేశించుచున్నది.

కథ సులభమగుభాషలో జాతీయములగుసామెతలు, ఉపమానములు మొదలగువానితో కూడి, దైనందిన సాధారణచర్యలతో కూడినకథవలె రాణించుచుండును. వీరవనితలు, శూరపురుషులు, క్రూరయవనరాజులు, ధీచాతుర్యముగల దేశీయులగు రాయబారులు, దేశభక్తిపూరితబాలబాలికాప్రజాసమూహములు, వ్యాపారదక్షులై శ్రీమంతులైన వర్తకులు, సౌందర్యమూర్తులై సద్విద్యావిలాసినులై, సదాశయభూషితలై, పురుషులయందు భక్తిశ్రద్ధలు, వినయవిధేయతలు గలిగియే వారి ఆవేశములవలన కుటుంబములకు కాని, దేశమునకుగాని, కీడుమూడకుండ కాపాడిన సరస్వతి, చారుమతి, మహామాయ, పార్వతి, వసంతలవంటి వనితారత్నములు,

ఇంతటి అల్లకల్లోలమున నుప్పులును నంటుకొనక జ్ఞాన జిజ్ఞాసలయందే తన్మయులై విశ్వదృష్టిని విశాలపఱచుచున్న వరాహమిహిరునివంటి పండితశ్రేష్ఠుల శాంత గృహజీవనములు మొదలగువానితోగూడి కథయెల్లయు జీవకళల నొప్పుచుండును. ఇట్టి నవలారాజ మాంధ్ర భాషలో నిదియొక్కటియే యనిచెప్పవలెను. ఇట్టి గ్రంథము ననువదించి ఆంధ్రభాష నలంకరించినట్టి శ్రీ వరిగొండ సత్యనారాయణగారు ప్రశంసార్హులు. ఈగ్రంథ మాంధ్రులెల్లరు పఠించదగినది. ఈ అత్యుత్తమతరగతినవల ఇంటర్మీడియేటు, బి. ఏ. తరగతులకు నాన్‌డిటెయిల్డు తెలుగుపాఠ్యగ్రంథముగ నిర్ణయింపదగినదని నిస్సందేహముగ చెప్పవచ్చును.

గ. స.

---

## భా ర త నీ తు లు

కొల్లాపురం స్నేహలతా కవితాసంఘమువారి ప్రకటనము. శ్రీమతి వాజపేయయాజుల మహాలక్ష్మిగారు, పంచమవేదమగు భారతమునుండి నూరు ప్రశస్తనీతిపద్యముల నెత్తి వానికి యథోచితమగు మకుటములనిచ్చి ప్రకటించినారు. గ్రంథముచివరను కఠినపదముల కర్థములు వివరింపబడినవి. భారతమహిమ మొదలు ఫలశ్రుతివరకు గల సకలనీతులును నిందు గలవు. పాఠశాలలలోని బాలికల కత్యుపయోగకరము. వెల రు. ౦-౪-౦ లు మాత్రము.

గ. స.

---

## తే జః కి ర ణ ము లు

క్రౌనుసైజు ౧౦౫ పుటల ఆంగ్లగ్రంథము. 'Rays of Light' అని దీని ఆంగ్ల నామము. స్వామీ బోలానాథజీ మహారాజా వారివలన రచితము. వీరు దైవికప్రేమసంఘు (Divine Love Society) స్థాపకులు. గ్రంథాదిని వీరి చిత్రపటమున్నది. దైవిక మహత్త్వము, విశ్వప్రేమద్వారా దాని ననుభవించు సాధనము ఇందు తెలుపబడినవి. సందర్భవశమున గీతా తత్త్వరహస్యము, గోపీకృష్ణతత్త్వము మొదలగు విషయములు నూతన తేజోయుక్తముగ నన్వయింపబడినవి. విశ్వమానవకోటికిని, అందు ముఖ్యముగ ప్రతిభారతీయునికిని పఠనీయము, శాంతిదాయకము, మోక్షదాయకము. క్యాలికో బైండు, వెల రు ౧-౮-౦ లు. లక్నో యూనివర్సిటీ రిజిస్ట్రారు యమ్. ఆర్. ఖన్నా గారివద్ద ప్రతులు లభించును.

గ. స.

---

## క వి త్వ ము

Poetry అను పేరుగల ౭ పుటల ఆంగ్లగ్రంథము. సి. ఆర్. రామానుజాచార్య రచితము. Pictures and Poems Series లో మొదటి ప్రకటనము. కవిత్వమను నది భానునివలె అజ్ఞానాంధకారమును తొలగించునదియు, మారుతమువలె హృదయమును సంచలింపజేసి హాయిగూర్చునదియు, జలధివలె మనమునకు గాంభీర్యమును గూర్చునదియు నని లేఖకుని సిద్ధాంతము. ఋగ్వేదమిట్టిదని వీరి యభిప్రాయము. వెల రు ౦-౧-౦. మదరాసు మౌంటురోడ్డు హోగార్థ్ ముద్రణాలయమున ప్రతులు లభించును.

గ. స.

---

## పాశ్చాత్య భావప్రపంచము

కర్త: ఎమ్. వి. ఎన్. సుబ్బారావుగారు, ఎమ్.ఏ. రాజమహేంద్రవరములోని ప్రాక్ప్రతీచీగ్రంథమాల లోని మొదటి కుసుమము.

క్రౌనుసైజున ౧౦౪ పుటలు, ఫేదరువెయిటుకాగితములు. వెల ౧-౪-౦.

ఇందు కార్లయిలు, ఎమర్సను, గెటి, మాజిని, రినాను, టాల్‌స్టాయి, ఇబ్సెను, ఏమియల్ గారల గూర్చిన వ్యాసములును, కొందరి ఛాయాచిత్రములును



౯. పొత్తరమువంటి బలపపు రాతిముద్ర



౧౦. మరియొక బలపపు రాతిముద్ర



౧౧. పశుపతి ముద్ర

గలవు. ఇందలి వ్యాసములు ౧౯౧౬-వ సంవత్సరమున 'ధర్మశాసని' పత్రికయందు ప్రచురణము గాంచినవి.

---

### ఆత్మజ్యోతి

(రెండవముద్రణము)

అనువాదకులు: ముద్దా విశ్వనాథముగారు (కవితా సమితి)

ప్రకాశకులు: వ్యాసకుటీరము — మేలుపాక — ఎలమంచిలి, విశాఖపట్టణముజిల్లా.

క్రౌను, ౩౩ పుటలు, వెల రు. ౦-౮-౦

"జగత్ప్రసిద్ధమహాపురుషులలో నొకరుగ పరిగణింపఁబడుచున్న టాల్‌స్టాయి మహర్షిచే విరచితమయిన The Two Pilgrims అనుకథ కిది స్వేచ్ఛానుకరణము." ఇంగ్లమున మాత్రము గ్రంథనామము, కథయందలి విశేషములను కొంత స్ఫురింపజేయుచున్నది. 'ఆత్మజ్యోతి' యనుపేరు కథలో వచ్చుయాత్రికులలో నొకఁడగు సుదర్శనునకు జెందునట్లు గ్రంథనముం దొకచోట అనువాదకులు తెలిపినారు. అనువాదమునను 'ఇద్దరు యాత్రికులు' అనియుండిన గ్రంథకర్తగారి భావసూచనకును, అనువాదకుల 'స్వేచ్ఛానుకరణము' నకును నేలాటి లోపమును వచ్చియుండదు. 'చెఱకు వంకర యైనంతమాత్రాన మాధుర్యము తగ్గునా?'" 'ప్రకరణాద్యంతములఁ గూర్పఁబడిన పద్యరత్నములు— ఆంధ్రసారస్వతరంగమున క్రొత్త పోకడలతో విహరించిన కావ్యరచనా ప్రవీణులగు శ్రీవేంకటపార్వతీశ్వరకవుల దివ్యలేఖినినుండి వెలువడిన "కావ్యకుసుమావళి" లోని'వి. ఆయాసందర్భములకు తగియున్నవి. ఈవిధముగ, అనువాదకులు మక్కికిమక్కిగ తెనిఁగించక దేశకాలపరిస్థితులను గమనించి టాల్‌స్టాయిమహర్షిని అనుకరించి వ్రాసిరి. పాత్రముల, యాత్రాస్థలముల నామములు మనకు పరిచితములయినవే. శైలిసులభమై బాలురకుసూడ అర్థమగునట్లున్నది. కథావ్యూహము చిక్కైనదిగాక పసిపిల్లలకుసయితము సులభముగ నర్థమగునట్లున్నది. కథ యిరువురు యాత్రికుల మనఃప్రవృత్తుల గురించినది. 'మానవసేవయే మాధవసేవ' యనునార్యోక్తిని ఈకథ విస్ఫుటము చేయుచున్నది.

నీతిబోధకములగు నిట్టికథలు పసిపిల్లలు చదువదగినవి. పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువా రీగ్రంథమును పాఠశాలలలో ప్రవేశపెట్టదగినదిగా నిర్ణయించి ఆంధ్రదేశమునకు గొప్పసేవచేసిరి. 'మనదేశములోని తరుణవయస్కులగు ఈతరమువారి' కిట్టి గ్రంథములు 'కడు సాహాయ్యకారు' లనుటలో అతిశయోక్తి లేదు.

---

## గ్రంథస్వీకారము

### శ్రీమల్లేశ్వరశతకము

గ్రంథకర్త: మావునూరు శ్రీశైల మల్లికార్జునరావుగారు, శ్రీకాకుళము. క్రౌనుసైజున ౨౪ పుటలు, వెల రు ౦-౪-౦.

---

### నందనారు చరితము (నాటకము)

కర్త: కృష్ణకాంతిస్వామి. ఆంధ్రగ్రంథమాల ౨౧-వ ప్రచురణము. ౧౯౩౩. డెమ్మీసైజున ౬౩ పుటలు. గ్లేజు కాగితములు. వెల రు. ౦-౮-౦. ఆంధ్రపత్రిక కార్యాలయము, ౪ తంబుచెట్టివీథి, మద్రాసుకు వ్రాసినప్రతులు బడయవచ్చును.

#### i. నవ్వగలవా? (మొదటి భాగము)

హాస్యములు. చిన్నసైజు, ౧౩ పుటలు, వెల మూడు కాన్లే.

#### ii. పెళ్లాన్ని యెలాపిలవడం?

నవ్వుతాలకథ, చిన్నసైజు, ౧౪ పుటలు, ఖరీదు ఒక్కఅణాయే.

కర్త: కాంచనపల్లి వేంకటరంగారావుగారు, బరంపురం (గంజాంజిల్లా.)

---

### యోగసంకలనము : జ్ఞానయోగము

శ్రీ అరవిందఘోషుగారిచే రచింపబడిన Synthesis of yoga కు తెలుగుతర్జుమా. వాల్యూము II. భాగము I. అనువాదకులు: మహాశ్రీ దౌల్తాబాదా గోపాలకృష్ణారావుగారు, బి. ఏ. కాకినాడ నాట్యకళా విజ్ఞానమండలి అయిదవ కుసుమము. ౧౯౩౩. డెమ్మీసైజు ౧౬౧ పుటలు. వెల ౦-౧౨-౦.

---

### భక్తముకుంద జీవితము

గ్రంథకర్త : పండిత వడ్లమాని సోమనాథశర్మగారు; అంజనాలయము, కాకినాడ. క్రౌనుసైజు ౩౨ పుటలు; వెల రు ౦-౬-౦.

---

### క్షత్రియ కుల గోత్రప్రకాశిక

విజయనగరం క్షత్రియచారిత్రకమండలి యందు ఫాదిసాగ్రంథమాలలో తృతీయప్రకటనముగా దువ్వూరి జగన్నాథశర్మగారిచే ప్రకటితము.

క్రౌనుసైజు, ౫౨ పుటలు, వెల రు ౦-౪-౦.

---

### భోగేశ్వర మాహాత్మ్యము

గ్రంథకర్త : మల్లంపల్లి మల్లికార్జునారాధ్యకవి. బందరు సత్యసాధనీముద్రాలయమున ముద్రితము. డెమ్మీసైజు ౪౦ పుటలు. వెల రు ౦-౧౦-౦.

---

### మానవస్వత్వములు

థామస్ పెయినీగారి Rights of Men అను గ్రంథమున కాంధ్రానువాదము.

అనువాదకులు : వడ్లమూడి గోపాలకృష్ణమూర్తిగారు, తెనాలి. క్రౌనుసైజు, పుటలు ౬౦. వెల రు ౦-౮-౦.

---

### అక్బరుసార్వభౌముడు

కృతికర్త: వెంపటి సత్యనారాయణగారు, సి. బి. యం. హైస్కూలు, విశాఖపట్టణము. క్రౌనుసైజు, పుటలు ౧౨౩, వెల రు ౦-౪-౦.

---

### అరుంధతి

గ్రంథకర్త : జాలా రంగస్వామిగారు. రాజమండ్రి హరిజనగ్రంథమాల ప్రథమపుష్పము.

క్రౌనుసైజు, పుటలు ౩౦, వెల రు. ౦-౪-౦.

---

### నిరుద్ధభారతము

అస్పృశ్యతాఖండనాత్మకమైన పద్యకావ్యము. తృతీయముద్రణము.

కర్త : మంగిపూడి వేంకటశర్మగారు, నిడువోలు. వెల ౦-౫-౦.

---

### అస్పృశ్యత

గ్రంథకర్త : జాలా రంగస్వామిగారు. రాజమండ్రి హరిజనగ్రంథమాల ద్వితీయ పుష్పము. క్రౌనుసైజు : పుటలు ౪౪; వెల రు ౦-౪-౦.

---

### అడవిపువ్వులు

గ్రంథకర్త : మిన్నికంటి గురునాథశర్మగారు, ఆంధ్రోపాధ్యాయుడు, టవున్ హైస్కూలు, గుంటూరు.

క్రౌనుసైజు, ౯౮ పుటలు. వెల రు. ౧-౦-౦.

---

### త్యాగమహిమ

గ్రంథకర్త : గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, రేపల్లె.

క్రౌనుసైజు ౪౦ పుటలు.

---

### కథాకావ్యము

గ్రంథకర్త : త్యాగి. మార్కండేయులభవనము, నరసారావుపేట.

క్రౌనుసైజు ౧౬౮ పుటలు, వెల రు. ౦-౧౨-౦.

---

### ఆత్మచరిత్రము

ఆఖ్యాత : రాయసం వేంకటశివుడుగారు, యం. ఏ., యల్. టి. గుంటూరు.

ఆంధ్రగ్రంథమాల ౨౨-వ కుసుమము. క్రౌను సైజున ౬౫౦ పుటలు. వెల ౧ రూ.

---

### అభిజ్ఞానశాకుంతలము

ఆంధ్రీకర్త : కవిరాజ శ్రీ వత్సవాయి వేంకట నీలాద్రిరాజుగారు, తుని.

డెమ్మీసైజు, ౧౧౯ పుటలు, వెల రు. ౧-౮-౦

---

### శ్రీ సోమనాథరేఖాశాస్త్రము

(మొదటి భాగము)

వ్యాఖ్యాత : పండిత వడ్లమాని సోమనాథశర్మ గారు, కాకినాడ.

డెమ్మీసైజు, ౭౮ పుటలు, వెల ౦-౮-౦.

---

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## (రెండవ ముద్రణము) మొదటి సంపుటము

ఇందు చరిత్రలు, ప్రకృతిశాస్త్రములు, జీవితములు, నీతి, మత, సాంఘిక, వైద్య, రాజకీయాది విషయములు, భూగోళము, న్యాయము, శిల్పము, జ్యోతిషము మొదలగు సమస్తవిషయములు చర్చింపబడును.

ఈ సంపుటమున 'అ' నుండి 'అధ్వర్య' వఱకు గల నాలుగువందల పదములకు సంబంధించిన విషయములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితములయిన రంగుల బొమ్మలు ఎనిమిది, సాదాబొమ్మలు ౧౬౫ ఉన్నవి.

డెమ్మీ నాలుగుపుటలసైజున ౬౦౦ పుటలు, మేలైనకాగితము. బంగారురేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు తోలుబైండు. వెల పది రూపాయలు మాత్రము. తపాలు లేక, రైలు ర్చులు ప్రత్యేకము.

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయ. రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి ఎచ్చును, తగ్గను వచ్చును. రు. ౧౧-౮-౦ మణీఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజస్టరు తపాలుద్వారా పంపబడును. వి. పి. గా పంపగోరువారు అయిదు రూపాయిలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

కొలదిప్రతులే నిలువయున్నవి. త్వరపడవలయును. రెండవసంపుటము త్వరలో వెలువడనున్నది.

మేనేజరు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,
నెంబరు ౭, తంబుశెట్టివీధి, మదరాసు.

# మ న వి మా ట లు

### ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రాచ్యవిద్యాపరీక్షలు

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రాచ్యవిద్యల యందు ఏటేట పరీక్షలను నెరపుచు, సంస్కృతమునవానికి 'విద్యాప్రవీణ' పట్టమును, దేశభాషలవానికి 'ఉభయభాషాప్రవీణ' పట్టమును ఒసగుచున్నది. ఈపరీక్షలు సంస్కృతమున నేడు* శాఖలుగను, దేశభాషల మూడు† శాఖలుగను విభజింపబడినవి. వానిలో నొక్కొక్కశాఖయు పూర్తియయి పట్టమును బడయుటకు రెండు‡ పరీక్షలు గలవు. ఈపరీక్షలకు జదువునర్హతను నిర్ణయించుట కింకొకపరీక్షయు॥ గలదు. 'విద్యాప్రవీణ' పట్టమునకు దేశభాషను చదువ బనిలేదు. ఇంగ్లీషు చదువువారు బి. ఏ. లో కూడ, ఏశాస్త్రమును జదివినను, ఇంగ్లీషు సాహిత్యమును, మాతృభాషాసాహిత్యమును చదువవలెనను నియమము గలదు. 'విద్యాప్రవీణ' పట్టమునకు జదువువారికి మాతృభాషను చదువునావశ్యకము లేకపోయినది. విశ్వకళాపరిషత్తు ఇంగ్లీషున కట్లు, సంస్కృతమున కిట్లు నియమమును విధించుటకు కారణము దురూహము. దీనివలన 'విద్యాప్రవీణ' లు 'సంస్కృతారణ్యాసంచారి విద్వన్మత్తేభము' లగుచున్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఒసగు పట్టములకు కొన్నింటికి దేశభాషాపఠన మావశ్యకము కాకపోవుట వింతగా తోచుచున్నది. ఇది యొక పొరపాటు. విశ్వకళాపరిషత్తు శాస్త్రశాఖల 'విద్యాప్రవీణ'కు అథమము ప్రిలిమినరివరకును, సాహిత్యశాఖకు సంపూర్ణముగను మాతృభాషాసాహిత్యపఠనమును విధిగ నియమించి ఎట్లో పొసగిన పొరపాటును ఇకనయిన దిద్దుకొనుట ఉచితము. 'ఉభయభాషాప్రవీణ' యందు 'ఉభయభాషా' శబ్దమునకు నియతముగా సంస్కృత మొక్కభాషయు, రెండవది దేశభాషలలో నొక్కటియు నని సంప్రదాయసిద్ధమగు నర్థము. ఆపట్టమున కర్హుడయిన

---

* ౧. మీమాంస, ౨, ౩, ౪. అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతశాఖల వేదాంతము. ౫. న్యాయశాస్త్రము, ౬. వ్యాకరణము, ౭. సాహిత్యము. ఈ యేడింట దేనినేని జదివి పరీక్షలయందు కృతార్థులగువారు తత్తచ్ఛాఖానామపూర్వక విద్యాప్రవీణపట్టముల కర్హులు.

† ౧. ఎ-సంస్కృతము, దేశభాష ఒకటి, సమానముగ జదువవలసినది. ౨. బి-సంస్కృతము చాల కొంచెము. దేశభాషవిరివిగ నుండును. ౩. సి. రెండు దేశభాషలు సమప్రధానములు. ఏ. బి. సి.లలో దేన కృతార్థుడయినను పట్టమున కర్హుడగుచున్నాడు.

‡ ౧. ప్రిలిమినరి, ౨. ఫైనలు. మొదటిదానియందు కృతార్థులయినవారు. రెండవదానిని చదువవలయును.

॥ ప్రవేశపరీక్ష (Entrance).

వాడు రెండుభాషలయందును ప్రావీణ్యము కలవాడని పట్టనామమువలన విస్పష్టమగును. దీనికి సరితాళునది 'ఏ' శాఖ యొక్కటియే. తక్కిన రెంటివలన పట్టమాత్రలాభమేకాని జ్ఞానలాభము మృగ్యము. 'ఏ' శాఖకు సంస్కృతమున సాహిత్యముతోకూడ ఛందోవ్యాకరణాలంకారాదిశాస్త్రపఠనము నావశ్యకమగుచున్నది. 'సి' శాఖకు మాతృభాషాన్యతరదేశభాషాపఠన మావశ్యకము. కావున నీరెండును కష్టసాధ్యములు. 'బి' అట్టిది కాదు. ఇందు పేరునకే అనవచ్చును సంస్కృతమును చదువుట — ఒకపద్యకావ్యమున కొన్ని సర్గలు, ఒక గద్యకావ్యమున కొన్నిపుటలు, ఒకానొకనాటకము (ప్రిలిమినరి, ఫైనలులకు కలిసి). అవియైన సవిమర్శముగ జదువబనిలేనివి. సులభమనుభావముతో పలువురు — ఇంచుమించుగ నందరు-ఈశాఖకే చదువుదురు. దేశభాషలు అనేకముగ సంస్కృతభాషాజన్యములు; తద్భాషాభూయిష్ఠములును. సంస్కృతభాషాజ్ఞానములేని దేశభాషాజ్ఞానము, పునాదిలేనియిల్లు. ఈవిధముగ 'బి' శాఖవలన ప్రయోజనముదూరమగుచున్నది. పరీక్షార్థము చదువవలసిన విషయములు, వానికి దగినగ్రంథములు, చదువవలసినకాలము, పరీక్షాపద్ధతి మొదలగునవానియందును లోపము లుండుటచేత తత్ప్రయోజనము మిక్కిలిదూరమయి పోవుచున్నది.

'ఉభయభాషాప్రవీణ'కు లీ దేశభాషా పాఠ్యగ్రంథము లిరువదిటికి పైబడియుండును. వానిలో పదునైదుదనుక సాహిత్యగ్రంథములు. కొన్నికొన్ని అనివార్యములగు కారణములవలన తప్పులతడుకలు (భాషలో, అచ్చులో), గ్రంథభాగములు లోపించినవి, కొరకరానికొయ్యలు, అసమర్థరచనములు, భావార్థశూన్యములు, ఎక్కడను దొరకనివికూడ కొన్ని యీ పాఠ్యగ్రంథములలో తరుచు చేరుచుండును. ఇట్లెల్ల నిర్ణీతములయిన పాఠ్యగ్రంథములలో పెక్కిట నేదోయొకమూలనొకయింతయె చదువవలసియుండును. గ్రంథైకదేశముల జదివినవారికి లభించు శబ్దార్థజ్ఞానపరిమితి యూహాతీతము కాదు. నిర్ణయించినది ఏకదేశమేమైనను ఒకొక్కగ్రంథమును సంపూర్ణముగ జదివియుండవలెనని తలచుట కేవలము పొరపాటు. నిర్ణీతభాగములనే సవిమర్శముగా జదువుటకు చాలదు కాలపరిమితి. ఇట్లు అర్థజ్ఞానమే చాలనపుడు భావవిశేషములు, తత్తత్కవి కవితాతత్త్వ చమత్కారాదులు నెట్లు గోచరము కాగలవు?

పరీక్షాపత్రములయందు సాహిత్య, శాస్త్రలక్షణాది జ్ఞాననిర్ణాయకములగు ప్రశ్నములు చాల తక్కువ. పాఠ్యగ్రంథములకు ఏదో బాదరాయణసంబంధమును గల్పించి ఎవరో, ఎన్నడో వ్రాసి యెందో ప్రకటించిన వివాదగ్రస్తములగు నేవో యనావశ్యకములగు చర్చలయొక్క గుణదోష విచారము చేయవలసిన ప్రశ్నము లధికముగ నుండును. ఆ ప్రశ్నములకయిన నన్నింటికి నందరు సమాధానము వ్రాయబనిలేదు. ఒక్కొక

పత్రమునకు ప్రశ్నము లనేకము లుండును. వానిలో పరీక్ష్యుల యిచ్చకు వచ్చినవానికి ఏవో కొన్నిటికి మాత్రమే సమాధానము లీవలసియుండును. ఇది 'ఛాయిస్' (Choice) పద్ధతి. ఈపద్ధతి నేరికొనిన ప్రశ్నముల కొసగు సమాంధానములవలననే జయాపజయనిర్ణయము చేయవలసినది. జయముచేకూరినవా రెట్లును పట్టాంచితులే. ఈ 'ఛాయిస్' పద్ధతి ప్రతిభయందును, పాండిత్యమునందును పరీక్ష్యులలో నొండొరులకు గల తారతమ్యము నిశ్చయించుటకు బనికిరానిది. చదువవలసినగ్రంథము లందరకు నభిన్నములయియుండ వానిని బురస్కరించుకొని బయలుదేరినప్రశ్నలకు మాత్రము 'ఛాయిస్' పద్ధతి యేల? ఇట్లు పట్టములను గడించినవారి లేఖినినుండి విషయమునగాని, రచనమునగాని, భాషనుగాని లోపములులేక పట్టి పదిపంక్తులు వెలువడజాలకున్నవి. పట్టభద్రులలో ననేకులపట్ల నీమాట చెల్లును.

ఈపట్టములకు భాషాతత్త్వము, చరిత్ర, వాఙ్మయచరిత్రకూడ చదువవలెను. వానిని గూర్చినగ్రంథములు ఇంగ్లీషున నున్నవి కాని దేశభాషలయందు లేవు. పరీక్షార్థులు ఇంగ్లీషు చదువువారు కారుకాన స్వయముగ వానిని జదివి తెలిసికొనజాలరు. ప్రాచ్యభాషల తత్త్వమును చక్కగా దెలియని ఇంగ్లీషువిద్యాపట్టభద్రుల యనువాదవాక్యములే వారికి గతి యగుచున్నవి. శబ్దార్థజ్ఞానమే బాగుగ నమరనివీరికి భాషాతత్త్వజ్ఞాన మేపాటి కుదురగలదు?

ఏవంరూపపాండిత్యమండితు లగు పట్టభద్రులే పాఠశాలలయందు దేశభాషా పండితులుగ నియమింపబడవలెననునది శాసనమయినది. కావున నెన్నియేండ్లనుండియో పాఠశాలలయందున్న దేశభాషాబోధకులు గట్టి పండితులయిననుగూడ, వారిపై విద్యాశాఖాధికారులు దయయుంచి శాసననియమమును తొలగించినతప్ప, పట్టభద్రులు కాని కారణమున నూడబెరుకబడి వారి పదముల నేఁటేట నధికసంఖ్యాకులుగ తయారగుచున్న 'బి' పట్టమువారు నియమింపబడుచున్నారు. వారిబోధనమువలన బాలురకు గలుగు భాషాజ్ఞానము వారి పాండిత్యానుగుణముగ నుండుట నిశ్చయము. 'తా జెడ్డకోతి వనమెల్ల చెరపక' మానదు.

ఈ లోపమును బరికించియె కళాపరిషత్తు శాఖాత్రయాత్మకముగనున్న 'ఉభయభాషా ప్రవీణ'ను ఏకమాత్రముగ నేర్పరుప నిశ్చయించెను. ఇది యిప్పటి 'ఏ' శాఖనుబోలినది.

ఇది మెరుగయినమార్పే. * కాని దానితోపాటు పాఠ్యవిషయ, గ్రంథాదినిర్ణయము

* ఈ మార్పును గొనితెచ్చిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి ప్రాచ్యభాషాభిమాన మభినందనార్హము.

నను, పఠనక్రమముననను, పరీక్షాపద్ధతియందు ను, పఠనకాలపరిమితియందును సముచితమగు మార్పు జరుగవలెను. లేకున్న నుద్దిష్టప్రయో జనము గలుగజాలదు. ఈ చెప్పినదంతయు పాఠశాలలయందు క్రమముగ చదివి పట్ట ములు పొందువారివిషయమున.

ఈ పట్టములను బడయుటకు ప్రైవేటుగ గూడ చదువుట కవకాశము గలదు. వారి విషయమున నెంతయేని చెప్పవలసియుండును. అట్టివారిలోనత్యధికసంఖ్యాకులపఠనక్రమము, వారి పాండిత్యము, వారు పరీక్షలయందు సులభ ముగ కృతార్థులయి పట్టములను బడయుటకు పన్ను నుపాయములు, పట్టభద్రులయి పండితం మన్యతచే, ఉపాధ్యాయులు, గ్రంథకర్తలు, వ్యాఖ్యాతలు నయి వాఙ్మయమునకు, తద్ద్వార మున దేశమునకు వారుచేయు నపకారము మొదలగువానిని విస్తరించి చెప్పుటకంటె ప్రైవే టుగా చదువు నవకాశమునే రద్దుచేయుట వివేకమన్న తీరిపోవును. అట్లు చేయుట సరికా దని తలపబడు నేని, గట్టి కట్టుదిట్టములనయిన నేరుపరుపవలెను.

ఈ లోపమునకంతకును ముఖ్యకారణ మాంగ్లవిద్యాబోధనక్రమానుకరణము. అశ్ర ద్ధయు, నసమర్థతయు నానుషంగికములు. ఇంగ్లీషుభాష, దానితత్త్వము, దానిని చదువ వలసినక్రమము నన్యము. ప్రాచ్యభాషలు, వానితత్త్వము, వానిని చదువవలసినక్రమము నన్యము. ఈ విభేదమునెరిగి శ్రద్ధతో, సమర్థు లగువారి సాహాయ్యమున ప్రాచ్యవిద్యావిధా నము నామూలము సంస్కరించు టవశ్యకర్త వ్యము. అట్లు చేయజాలనినాడు 'నామ్‌కే వాస్తే' ప్రాచ్యవిద్యాపరీక్షలకు స్వస్తిచెప్పుట సర్వోత్తమము. అందుచేత కళాపరిషత్తునకు వానికొరకగుచున్న వ్యర్థవ్యయము తప్పి పోవును. ప్రాచ్యవిద్యలును ప్రాచీనమార్గముల బడి తత్పఠనతత్పరులప్రాపున చిరంజీవము లయి విలసిల్లగలవు. అప్పుడయిన నాంధ్రమున కభ్యున్నతిని గలిగించు మార్గముల నరయవల సిన బాధ్యత కళాపరిషత్తునకు తప్పదు. లేనియెడ 'నాంధ్రవిశ్వకళాపరిషత్తు' అనునామము నిరర్థ కమే యగును.

ఇదియంతయు పర్యాలోచించి విజ్ఞాన సంపన్నులు, దేశహితైషులు, ప్రాచ్యవిద్యాభి మానులు నగు నాంధ్రు లీప్రాచ్యవిద్యల విషయమున విశ్వకళాపరిషత్తునకు సము చితములగు సలహాల నిచ్చి, ప్రాచ్యవిద్య లకును, కళాపరిషత్తునకును, ఆంధ్రదేశమున కును అభ్యున్నతిని సమకూర్తురుగాక!

---

ఆంధ్రనాటక కళాపరిషత్తు (౧౯౩౩)

ఈ పరిషత్తు ౧౯౨౯ లో తెనాలిలో జన్మించి ౩౧ లో గుంటూరులో రెండవ మారు సమావేశమయి స్థాయిత్వాన్ని గూర్చు కొన్నది. మరల రెండుసంవత్సరాల వ్యవ ధానముతో రాగల డిసెంబరులో చెన్నపురి యాంధ్రుల నడుమ సమావేశముకానున్నది.

ఏలాగైతేనేమి, అపూర్వముగా బయలుదేరిన యీసంస్థ మూడవసమావేశానికి వచ్చినదంటే ఆంధ్రుడైనవానికి సంతోషము మితిమీరి పోకతప్పదు.

కాని నేటికాలపు పరిషత్తుల సామాన్య లక్షణాల ఆవరణలోనుంచి యిదిగూడ తప్పుకో లేకపోయినది. ఏదోఒక నిర్ణీతసమయములో సమావేశముల నేర్పాటుచేయుట, పేరెన్నిక గన్న యేవ్యక్తినో అగ్రాసనమున నుంచి యుప న్యాసముల నిప్పించుట, అవీయివీ నాలుగు ప్రదర్శనాల వంటివి జరిపించుట, Vote of thanks తో అటుతరువాతి సమావేశము వరకు మాటుమణగియుండుట పరిషత్తులకు మామూలయినదంటే ఉలుకుపడితే లాభము!

ఏసంస్థఅయినా తన యుద్దేశ్యాలను నిండుమనసుతో నెరవేర్చుకోవలెనంటే, కొన్ని కట్టుబాట్లతో పనిచేయవలసియుండును. కేవ లము పరిషత్తులను సమావేశపరచి, కొన్ని యుపన్యాసముల నిప్పించి, కొన్ని తీర్మానము లను చేయించి, మరల సమావేశములో మామూలు తంతునే నడపుతూఉంటే ఎన్నటి కైనా ఉద్దేశ్యాలు గట్టెక్కేమార్గమున్నదా? ఒకవేళ రెండుసమావేశములనడుమ కార ణాంతరములవలన నిడుపాటి వ్యవధానము తప్పనిసరిఅయినా, అవాంతరసమావేశములను కూర్చి, పూనుకొన్న కార్య మెంతవరకు ముందుకు సాగుచున్నది గమనించుచు, చల నానికి కొంచె మడ్డుతగిలియుండినపట్ల చురుకు దనమును కల్పించుచు వచ్చినగాని మహా సమావేశము లెన్ని జరిగినను ఫలిత ముండదు. మాటవరుసకని అనుకొందము — ఇప్పటికి రెండుసమావేశములు కూడి చేసిన తీర్మా నాలలో తుద కొకటైనా కార్యరూపమునకు వచ్చినదా? మరి ప్రయోజనము?

వైయక్తికముగా నెటు లున్నను, సాం ఘికముగా మనదేశములో నాట్యకళ యింకా ప్రథమావస్థలోనే యున్నదంటే, తలవంచు కోక ఎత్తుకోవడానికి వీలేది? సర్వావయవ ముల నాట్యకళాకాంతులుగల సంఘము మన ఆంధ్రదేశమున మచ్చున కొకటి లేదు. పేరుకు కొన్నిసంఘము లున్నవేకాని వానిలో జీవము తక్కువ; కట్టుబాట్లు అసలే లేవు. సభ్యు లలో ప్రతివాడును స్వయంరాజు, స్వయం మంత్రి. ఇక నిర్వాహకులా, వారికి కావలసి నది డబ్బు. సమయముచూచి, ఏదో ఒక నాటకమును ఏరి, ఒకరిద్దరు విఖ్యాతనటులను రప్పించి ప్రదర్శనములను సాగించుట, నాలుగు డబ్బులను రాల్చుకొనుట. ఇంతే - చిల్లర నటులతోగాని, రంగస్థలసామగ్రి, తక్కం గల విశేషములతోగాని వారికి పనియేలేదు. ఇలాటి పరిస్థితులలో మన రంగభూమి కళా కాంతులతో రాణించవలెనంటే సాధ్యమా? 'రంగస్థలముమీద కేవలము నటులే ప్రధాన ముగాదు. రంగంమీద కనుపించు ప్రతినీడ గమనింపవలసియుండును. ప్రతివెలుగు, ప్రతి కాంతి, ప్రతికిరణము, ప్రతికుర్చీ, ప్రతివస్తువు

కూడ ముఖ్యమైనదే.' ఇన్ని కుదిరికలు నిర్వాహకుల కౌశలముపై నాధారపడియుండును. వారికిని నటులకును సామరస్యము, సౌహార్ద్రము పెంపొందియుండవలెను. నటులును నిర్వాహకుల గిరిగీతలపై ఏమరక నడచుచు తమకు నిర్ణీతములయిన పాత్రములను విమర్శనదృష్టితో పరిశీలించి కార్యరంగమున కంజవేయవలెను. అందరికిని అన్ని పాత్రలు ఒప్పవు. నే నన్నిటికిని తగుదుననుట అహంత. తరువాత — 'ఆడే నాటకము ఏ కాలముదో, ఆకాలపు ఆచార వ్యవహారములను బాగా అవగాహన చేసుకోవలెను. బహదూర్ వేషమున పంపుషూలు వేసుకొనివస్తే లాభము లేదు.' ఇక రంగులు వేసుకోవడము—'ప్రత్యేకముగా అభ్యసించవలసిన విద్య' అది. 'అది నేర్చుకొంటే ఒకగీటుతో ఏలాగు మార్చుకొనవలసిన ఆలాగు మార్చుకొననచ్చు, వేషము.'

మనదేశములో చక్కని, ప్రేక్షకుల హృదయముల నావర్జించు నాటకములు లేనే లేవు. ఏమున్నా, అన్నీ ఒకసూత్రముపైననే, ఒకదృష్టితోనే కూర్పబడినవి. దేశకాల పరిస్థితులతో వీని కానుగుణ్యా ముండదు. 'మా నవసమస్యలతో, మనుజమాత్రుల కష్టసుఖములతో సంబంధముగల నాటకములు' నేడు కావలసినవి. అవి ఎంత 'స్వల్పముగానున్నను అవే నిజముగా నాటకములు.' నవీనాభిరుచులకు సరిపోవు నాటకములు లేనప్పుడు రంగభూమిపై ఆదరము లేదంటే, లేక మరేమవును?

ఇంతకును—నాట్యకళాభివృద్ధియే నిజముగా ఈపరిషత్తుయొక్క ఉద్దేశ్యమయితే యిట్టి తాబేటినడకలతో లాభములేదు. చేయవలసిన కార్య మపారము. పరిషత్తులలో చర్చించుకొన్న, తీర్మానించుకొన్న సంగతులనెప్పటికప్పుడు కార్యరూపమునకు తేజాలిన చురుకుదన మవసరము.

---

## ప్రాచ్యవిద్యా పరిశోధనాలయము, చెన్నపురి.

### (Oriental Research Institute)

### సహాయాంధ్ర పరిశోధక నియామకము

చెన్నపురి విశ్వవిద్యాలయము నెలకొలపిన ప్రాచ్యవిద్యా పరిశోధనాలయమున నాంధ్రవాఙ్మయ పరిశోధనమునకయి, తొలుత, మూడేండ్లకాలము కాబోలు, ముగ్గురు పరిశోధకులు నియమింపబడిరి. వారిలో నొకరు (ప్రధానులు) ప్రాచ్యవిద్యా పాండిత్యముతోపాటు యం. ఏ. పట్టమును పొందినవారుగను, తక్కిన యిరువురు (సాహాయ్యకులు) కేవలము ప్రాచ్యవిద్యాపాండిత్యముగలవారుగను ఉండవలెననునియమముండెను. అపుడు వారిని నియమించుట కేరుపడిన కమిటీయొక్క అసమీక్ష్యకారిత మొట్టమొదట నియమితులయిన సహాయపరిశోధకులకు ఆశాభంగము కలుగుటకు, తరువాతను ఇద్దరుపట్టభద్రులు నియమింపబడుటకు కారణమయినది. వారిలో నొకరొక సంవత్సరకాల ముండి మానుకొనిరి. తత్ స్థానమున నింకొకరు నియమింపబడక పోయిరి. రెండవమారు మరల క్రొత్తగ నిరువురను మాత్రమే నియమింప విశ్వవిద్యాలయము నిశ్చయించినది. వారియందు సహాయ-పరిశోధకునకు ప్రాచ్యవిద్యాపాండిత్యాతిశయము గలిగి యుండవలయు ననుట విధియయ్యెను. తదనుసారముగనే తన్నియామకము జరిగెను. ఈ కార్యాలయము ప్రారంభమయి అయిదారేండ్లు లయినను ఆంధ్రేతర

10. 8- 19 3౨౬

భాషలయందు నిశేషముగ పరిశోధనము జరిగి గ్రంథములు ప్రకటితములయియుండ, ఆంధ్రమున విష్ణుపురాణ మొకటిమాత్రము ప్రకటితమయినది. అనల్పవ్యయమూలకమను నీయల్పఫలమునకు కారణము దురూహముకాదు.

ఇపుడు సహాయపరిశోధకు డుద్యోగము సుజ్జగించుటవలన మరియొకరిని క్రొత్తగా నియమించవలసిన ఆవశ్యకత కలిగినది. ప్రకృతము తత్స్థానమునకు సర్వథా తగినవా రాంధ్రులలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగా రొక్కరుమాత్రము కాన్పించుచున్నారు. వా రించుమిం చిరువదియైదేండ్లకాలమునుండి ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నాంధ్రపండిత పదము నధిష్ఠించి బహుగ్రంథపరిశోధనమును గావించుచు వాఙ్మయ, వాఙ్మయచరిత్రాదుల పరిశోధన కార్యములయందు ముక్కాకలుదీరియున్నారు. శ్రీ శాస్త్రిగారు స్వతంత్రముగ రచించిన శృంగార శ్రీనాథము, సంస్కరించి పరిష్కరించిన బసవ పురాణము, తంజావూరు ఆంధ్రరాజులచరిత్ర, క్రీడాభిరామము, ప్రబంధరత్నావళి, చాటుపద్యమణిమంజరి (భాగద్వయాత్మకము) మొదలగు గ్రంథములు - తద్విపులసవిమర్శపీఠికలు, నీతినిధి, ప్రతిమ, మధ్యమవ్యాయోగము, కర్ణభారము మున్నగు అనువాదగ్రంథములు, అనేకపత్రికలయందు ప్రకటితములయిన ప్రాచీనాధునాతన సారస్వతచారిత్రికా పరిశోధనవ్యాసములు - రసవత్పద్యఖండ రచనములు వారి పాండిత్యగౌరవమును, చారిత్రకజ్ఞానమును, విమర్శనశక్తిని, ప్రతిభాకౌశలమును అనంతముఖముల నాటిచెప్పుచున్నవి. ప్రాచీన భాషాశబ్దస్వరూప, తత్త్వనిర్ణయమునకు ముఖ్యసాధనములయిన ప్రాచీనశిలాతామ్ర శాసనములయు, ప్రాచీన తాళపత్రసంపుటములయు పరిశోధనమును పెక్కేడులనుండి చేయుచుండుట శాస్త్రిగారి సహజసామర్థ్యమునకు మెరుగగుచున్నది. ఇట్లు సకలవిధముల శ్రీశాస్త్రిగారు ఆసహాయపరిశోధకపదవి నలంకరింప జాలినవారు. వారినియామకమువలన నాంధ్రవాఙ్మయమునకు వికాస మపరిమితముగ గలుగ గలదు. సర్వథా తన్నియామక మవశ్యకర్తవ్యము. విశ్వవిద్యాలయము పరిశోధనకార్యారంభముననే శాస్త్రిగారిని నియమింపవలసి యుండెను. ఇపుడయిన వారిని నియమించుట వివేకము. ఇప్పటి కీకార్యాలయమున నాంధ్ర శాఖయం దయిన పరిశోధనాదికార్యముల ఫలము ఆశాఖనిమయమున విశ్వవిద్యాలయమునశ్రద్ధను, కర్తవ్యపరాఙ్ముఖతను వెల్లడిచేయుచున్నది. విశ్వవిద్యాలయ మెల్లభాషలయెడను సమానాదరమును చూపుచు అన్నిటను కార్యములు సరిగా కొనసాగునట్లు చూచుట న్యాయ్యము.

వివిధవాఙ్మయవిజ్ఞానసంపదలను నిరంతరము పెంపును సంపాదించుకొనుచుండుట విశ్వవిద్యాలయముల కార్యము. తదర్థము పక్షపాతరహితదృష్టితో నాయావిషయముల సిద్ధహస్తులనువారి నేరితెచ్చుకొని వారిప్రాపున తత్తత్సంపద నెల్లపుడు వృద్ధిచేసికొనుచుండుట విశ్వవిద్యాలయముల కావశ్యకము.

వెనుకనొకరు నిలిచిపోగా వారిస్థానమున నెవరిని నియమింపకుండినట్లు ఇపుడును ఈసహాయపరిశోధక స్థానమున నెవ్వరిని నియమింప కుపేక్షను చూపునేని ఆంధ్రభాషయెడ చెన్నపురి విశ్వవిద్యాలయము చూపు ననాదరమున కది గొప్పనిదర్శనము కాగలదు. అట్టియనాదరము నాంధ్రలోకము సహింపజాలదు.

---

## స్వర్గీయ జతీంద్రమోహనుడు

పండితపుత్రుడంటే శుంఠఅనియర్థము. తండ్రి గుణాలు ఏవీ అంటవు. అందుకని పండితుల పుత్రులందరు అట్లాంటివారని అంటానికి వీల్లేదు. కాని అనుభవము అట్టిది. ఇట్లాగే భాగ్యవంతుల పుత్రుల విషయంలో కూడాను.

జతీంద్రమోహనసేనుగుప్త గరాబులో పుట్టాడు. ఇతడు ఆగర్భశ్రీమంతుడు. ఇతనితండ్రి ఒకజమీందారు. అయినా జతీంద్రుడు సర్వసాధారణముగా భాగ్యవంతుల పిల్లలుమాదిరిగా తయారవలేదు.

కేంబ్రిడ్జిలో బ్యారిష్టరయి వచ్చాడు. జతీంద్రుడు పూర్తిగా స్వయంకృషిమీదనే పైకొచ్చినాడని అనటానికి వీల్లేదు. జన్మకూడా ఇతనికి తోడ్పడింది. అసలు వస్తువు మంచిదికావడంచేత ఇవి మెరుగుపెట్టినాయి. జతీంద్రునికి మొదటినుంచి ప్రజాసేవ చేయడంలో ఉత్సాహం మెండు. ఇతనితండ్రికూడా ఇట్టి విషయాలలో పేరు వడసినాడు.



సేనుగుప్త దంపతులు

(మొన్న కరాచీ కాంగ్రెసుసమయమున పీరిబసవద్ద తీసిన ఛాయాచిత్రము. తరువాత గుప్తగారు జైలులోనుండుటకారణమున మరిఫోటో తీసినట్లు కానరాదు.)

—I. P. P. A.

క్రమంగా చుట్టుప్రక్కల ఇతని ప్రఖ్యాతి ప్రసరించింది. కాని అప్పుడు వంగరాష్ట్రీయ నాయకులలో ఒకడవలేదు.

సమయమనేది ప్రతివ్యక్తికి, ప్రతికార్యానికి ఉంది. కాని అది గ్రహించుకోక మనం తొందరపడతాము, ఒకసారి ఉరుకుదామని. ఇది మానవ స్వభావం. అది అనుభవంమీద రావలసిందేగాని ఒకళ్లుచెపితే వచ్చేదికాదు.

సేనుగుప్తకికూడా ప్రఖ్యాతపురుషుడవటానికి ఒకసమయముంది. అది అస్సాము-బెంగాలు రైల్వేపనివాండ్ర సమ్మె సమయము. అప్పుడు ఆయన పనివాండ్రకు చేసిన సహాయ మపారము. వాళ్లకి భోజనం పెట్టడానికి అపరిమితంగా డబ్బు వెచ్చించాడు. ఆయన ధనంలో చాలాభాగం దీనిక్రిందే వ్యయమయిందని వాడుక.

సమ్మెలో పనివాండ్రు జయ మందారు. జతీంద్రుని ప్రఖ్యాతి దిగంతములకు వ్యాపించింది.

జతీంద్రుడు కలకత్తాకు వచ్చాడు. వన్నెకెక్కిన న్యాయవాదులలో ఒకడయినాడు. కొద్దికాలంలోనే నాగపూరు కాంగ్రెసులో సహాయనిరాకరణమే కావాలని అన్నారు. నాయకులు తమ వృత్తులను మానేసినారు. జతీంద్రుడుకూడాను.

బెంగాలులో చిత్తరంజనుని ప్రతిభ భూమ్యాకాశాలు నిండింది. ఆతని ధాటికి అందరు తొలిగారు. జతీంద్రుడు అతని ముఖ్యసేనాని.

దాసు చనిపోయినాడు. అతనితరువాత కిరీటధారణకి ఎవరు తగుదు రనే సమస్య వచ్చింది. ఆలోచించారు. చివరకి జతీంద్రుడే తగుపురుషుడని అతనికే పట్టం కట్టారు.

జతీంద్రుడు కిరీటత్రయాన్ని ధరించాడు. అంటే కలకత్తా మేయరుపదవి, బెంగాలు రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాధ్యక్షత, బెంగాలు స్వరాజ్యపార్టీనాయకత్వము. ఈపదవులు పొందటానికి ఇంకా అనేకమంది తంటాలు పడ్డారు. ఆసందర్భములో కొందరు కొన్ని అసభ్యమైన పనులనుకూడ చేశారు. వాటిని ఇక్కడ పేర్కొనడం అనవసరం.

నేనుసప్త మంచి టెన్నిసు, క్రికెటు ఆటగాడు. సౌత్ క్లబ్బునకు అనేకపర్యాయాలు ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. పందెములలో చివరదాకా వచ్చేవాడు. కాయం స్థూలంఅవడంచేత ఈమధ్య ఆటలు మానేసినాడు.

నేనుసప్త ధైర్యవంతుడు, ఉల్లాసవంతుడు. ప్రతిపక్షి విమర్శ చేస్తున్నా మందహాసంతో వింటూ ఉంటాడు. ఆటల్లో తగిలిన దెబ్బ అరటిపండుఅనే తత్త్వము మనిషిది. ఆగుణమే అతన్ని పైకి తీసుకొని వచ్చింది.

అదిగాకుండా నిష్పక్షపాతి. తాను కార్పొరేషను మేయరుగా ఉన్నన్నాళ్లు సమానబుద్ధితో వ్యవహరించేవాడు. తనపక్షమువారితోను, ఇతరపక్షములవారితోను ఒకేవిధంగా ఉండేవాడు. అందుకనే అయిదుసారులు వరుసగా ఎన్నుకొనబడినాడు.

ప్రతివ్యక్తికి ఏదో ఒక శక్తి, సామర్థ్యము ఉంటుంది. ఇవి కొందరిలో ఎక్కువగా ఉంటాయి, కొందరిలో తక్కువగా ఉంటాయి. దానికి తగినట్లుగా వ్యక్తులు ప్రకాశిస్తూ ఉంటారు.

అట్టిదే జతీంద్రునియందుకూడా ఒకశక్తి ఉంది. శక్తిఅంటే, సాధారణంగా మనమనుకునే వాక్పటిమ, ధైర్యము, నాయకత్వం వహించడం, సంగీతం పాడడం ఇట్లాంటిదే ఇంకొకటి. కాని జతీంద్రుని శక్తి త్యాగము; తన కున్నదంతా దేశానికి అర్పించడము. అదికూడా ఒకశక్తే. అది కొద్దిమందికే ఉంటుంది.

జతీంద్రుడు మధ్యవయస్కుడుగానే చనిపోయినాడు. అయినా అతను పెద్దవాడే. ఏండ్లు జరిగి పోతుంటాయి. కాని అతను మనహృదయాలలో ఉంటూనే ఉంటాడు.

జతీంద్రుడు చావలేదు; జతీంద్రుడు కీర్తిమూర్తి.

---

## అశ్రుతర్పణము:

### కీ. శే. ఆ. వేం. సాంఖ్యాయనశర్మగారు.*

ఆంధ్రాకాశమునుండి యొక విజ్ఞానతారక యూడిపడిపోయినది. దానితో కొంత వికాసమును, ఉత్తేజనమును పొందజూచిన యాంధ్రులను వెరగు క్రమ్ముకొన్నది.

మహోపాధ్యాయులు 'శర్మగారొకసంస్థ; అపురూపపువ్యక్తి'; 'విజ్ఞానసరస్వము'. కాదామరి? అతడేమికాడు? కవి, పండితుడు, విజ్ఞాత, విమర్శకుడు, న్యాయవాది, పత్రికాసంపాదకుడు. సంస్కృతాంధ్రాంగ్లములయందు సిద్ధహస్తుడు. తెలుసునాటనే 'యాంధ్రభీష్మ' ని ప్రతిభ వెల్లివిరిసినది. ఇట్టియాయనతీరనియెడబాటు ఆంధ్రలోకమునకు సహింపరానిదనుట చెప్పనేల?

---

* వీరి పాండిత్యవిశేషాదికముల వివరించులేఖన మొకటి వెనుకటి వైశాఖమాసపు భారతియందు కలదు.



కీ. శే. ఆ. వేం. సాంఖ్యాయనశర్మగారు.

శర్మగారి పాండిత్తి, కవనము, విమర్శకత, భావుకత వారి రచనముల ప్రతిఫలించినవి. దైవగతిని వారి సాక్షాద్రూపము నేడు మనమండి మరుగుపడినను ఛాయారూపము వారి రచనలమూలమున మనకు చిరము గోచరించుచునే యుండును.

ఇదియొక ఊరటమాత్రమే. చేపడిన వగపు ఎల్ల రీతుల తుడువరానిది. ఏమిచేయగలము? అనుభవించి తీరవలయును.

---

## అరవమునకు ప్రోత్సాహము

'ఆద్రా' పత్రికయం దీక్రింది విషయముకలదు:

"అణ్ణామలై విశ్వవిద్యాలయమున అరవమున ఆనర్సుపరీక్షకు చదువుట కవకాశము గలదు. ఇటీవలనే అరవమున తర్కశాస్త్ర (Logic) పాఠ్యగ్రంథము నొకదానిని రచియించుటకు వేయిరూపాయలు పారితోషిక మివ్వబడెను. పట్టపరీక్షాపఠనక్రమమున రెండవ భాగమున కరవము నేర్పబడుచున్నది. విద్వాన్ పరీక్షకును, ట్రెయినింగుపరీక్షకును అరవమున నొకశాఖ కలదు. మదరాసు విశ్వవిద్యాలయమువారును అరవము పెంపొందుటకయి చాల తోడుపడుచున్నారు; పరిశోధనశాఖ నొకదానిని నెలకొలిపినారు; రమారమి ఆరు లక్షలరూపాయలు వెచ్చించి నిఘంటువును ప్రకటింప జేయుచున్నారు; విద్యాభ్యయనక్రమమున అరవమునకు మంచి గౌరవమును సమకూర్చినారు."

ఆంధ్రులకొరకే ప్రత్యేకముగ పుట్టువుగన్న ఆంధ్రవిశ్వవిద్యాలయమును, అంతకంటె వయోవృద్ధయి దేశభాషల నన్నింటిని సమానముగ నాదరింపవలసిన మదరాసు విశ్వవిద్యాలయమును తెలుగునకిచ్చిన ప్రోత్సాహము చెప్పుకొనదగినంత లేకున్నది. మరియు శాస్త్రములు (Sciences), చరిత్ర మొదలగువానిని సయితము తెలుగుననే నేర్పవలయునని చిరకాలముక్రిందటనే ఆంధ్రవిశ్వకళాపరిషత్తు నిశ్చయించినది. ఆయావిషయములనుగూర్చిన గ్రంథములు లేక అట్లు చేయుట సాధ్యము కాజాలదని చెప్ప బనిలేదు. కాని ఇప్పటికిని విశ్వకళాపరిషత్తు తద్దృష్టితో రచియింపించిన గ్రంథములు, తుదకు తత్ప్రయత్నమేని యున్నట్లు కానరాదు. వయసున చిన్నదయ్యును గుణమున పెద్దగా పేరునకెక్కిన అణ్ణామలై విశ్వవిద్యాలయము నికనయిన ననుసరించి తెలుగునకు చక్కని ప్రోత్సాహ మిచ్చుట దీనికి ధర్మము. ఆంధ్రులు నీ విషయమున మిక్కిలి శ్రద్ధను వహింపవలెను. 'అడుగకఅమ్మయయిన పెట్టదు'

---

## దాంపత్యసౌఖ్యము

“హంగెరీలో నేడొక క్రొత్తసమస్య బయలు దేరినది. అది దేశీయఋణమునకుగాని, ఆయుధములకు గాని, ఇన్ఫ్లుయంజారోగమునకుగాని, నిరుద్యోగము నకుగాని సంబంధించినది కాదు. వానికంటె చాల గడుసయినది.

ప్రధానామాత్యుడు గోంబోసుగారికి ఒకమహజరునామా అందినది. దానిని నూటఏబదిమంది పార్లమెంటుప్రతినిధులభార్యలు వ్రాసి సంతకముచేసి పంపిరి.

రాత్రులయందు పార్లమెంటుసమావేశములు జరుపరాదనియు, రాత్రివేళయంతయు తమపతులను తమకు దూరముచేయు రాజ్యాంగవ్యవహారములు దాంపత్యసౌఖ్యమున కపాయకరములనియు, తమ దాంపత్య జీవితము విధ్వస్తమగుచుండ తా మూరక చూచుచు నూరుచుండుట అసాధ్యమనియు, తమభర్తలు రాత్రి వేళలందు ఇంటిపట్టున నుండకపోవుటకు నిర్బంధముగ నలవాటుపడుదురుకాన, వారు ప్రొద్దుట నింటికి వచ్చినపుడు, వారు రాత్రియంతయు కేవలము దేశ వ్యవహారములయందే నిమగ్నులయియుండి రనుకొనుట కెంతమాత్రమును వీలుపడదనియు నందు వ్రాసిరి.”

పయిన పేర్కొనిన విషయము ౧౬-౭-౧౯33 నాటి ‘హిందూ’సచిత్రవారపత్రికలో వినోదవిషయములయందు ప్రకటితమయినది. ఇది కేవలము వినోదవిషయముగ భావింపదగినది కాదు. మన దేశమునను వివాహితులగు మగవారు చాలరాత్రి-పది, పండ్రెండుగంటలవరకు- ఒకొకప్పుడు రాత్రియెల్లను పనిచేయవలసిన నిర్బంధము సంప్రాప్తమగుచున్నది. తాలూకాకచేరీల గుమాస్తాలు, జమీందారుల నౌకరులు, షాహుకారుల నౌకరులు ముఖ్యముగ నిట్టినిర్బంధమునకు పాలగుచున్నారు.

హంగెరీలో పార్లమెంటుసభ్యులు రాత్రులయందు పనిచేయుట దేశహితకార్య నిర్వహణముకొరకు; ఇచ్చటివారెల్లరు దాంపత్యానురాగశూన్యులు, అరసికులు, ధనాశాపీడితులు, అధికారదుర్విదగ్ధులు నగు మనుష్య పశువుల స్వార్థసంపాదనముకొరకు. రాత్రులయం దిట్లు చాలప్రొద్దువరకు మగవార లిండ్లను వదలియుండవలసినవా రగుటచే వారి దాంపత్యసౌఖ్యమున కంతరాయము కలుగుచుండుటయేకాక, వారి సతులకు వారి ప్రవర్తనమునెడ సంశయము గలుగుటయు, తద్ద్వారమున వారి దాంపత్య మంతరించుటయు సంభావ్యము. దాంపత్యసౌఖ్యము మాటయటుండుగాక!

పార్లమెంటుసభ్యులకు కొంతకుకొంత స్వాతంత్ర్యము గలదు. వారి పలుకుబడి బహుసంఖ్యాకులగు ప్రజలయొక్క ఇచ్ఛననుసరించి యుండును. ఈనౌకరులకన్ననో స్వాతంత్ర్యము పూర్ణానుస్వారము. పొట్టకొరకు నౌకరీలో నున్నంతకాలము ఓర్పాత్రము వారికి చీవాటులు. నిగ్రహానుగ్రహములరెంటను జీవితము దుర్భరమగుచుండును. నిగ్రహ మించుక మించిన తరచు వారి జీవనమునకు, కొండొక తరి జీవితమునకును స్వస్తి చెప్పబడుచుండును. సంఘమున కొందరికి సంప్రాప్తమగు నిట్టి యమానుషప్రవర్తనము కడుంగడు హేయము.

మన దేశమున స్త్రీలును విద్యా విజ్ఞానములనార్జించుచున్నారు; దేశహితైకజీవనలగుచున్నారు; ఆత్మహిత కార్యములయందును అభినివేశము గలిగియున్నారు. కావున, తమ దాంపత్యసౌఖ్యమునకు కలుగుచున్న యీ యాటంకమునుగూడ హంగేరీస్త్రీలవలె సముచితప్రయత్నముమూలమున నివారించుకొను టావశ్యకము.

---

## అశ్లీల ప్రకటనములు

"గతసంవత్సరపు 'విశాలభారత్' సంచికలలో నొకసారి 'అశ్లీల ప్రకటనముల' ను గురించి ఒక సంపాదకీయవ్యాఖ్య వెలువడియుండెను. అన్నిభాషలలోను వార్తాపత్రికలయందు అశ్లీలప్రకటనములకు కొరత లేదు. ఈవిషయమై కలకత్తాలోని భారతీయ పత్రికాకార సమితివారు ఒక ప్రత్యేక-ఉపసంఘమును నియమించిరి. ఈసంఘమువారు మంచిసెబ్బరలను చర్చించుకొని యీ క్రిందివిధముగా పత్రికాసంచాలకుల కొక విన్నపము నంపుకొనిరి:—

(అ) పాఠకుల మనస్సులందు అశ్లీల భావములు ఉత్పన్నములగుటకు కారణమగు నెట్టిశబ్దముగాని, వాక్యముగాని, ప్రకటనలలో నుండరాదు.

(ఆ) కాముకతకు ఉత్తేజనము నిచ్చు ఔషధముల ప్రకటనములు అచ్చువేయనేరాదు.

(ఇ) జననేంద్రియసంబంధమగు రోగములను కుదుర్చు మందుల ప్రకటనము అచ్చువేయవలసివచ్చినపుడు, ఆరోగములపేరులు శీర్షికలలో నుండరాదు. మరియు ఆప్రకటనలో అశ్లీలమగుతలంపులను పురికొల్పునట్టి ఏవాక్యమును ఉండరాదు.

(ఈ) ఇట్టిరోగముల వైద్యముపేరు లిచ్చుట అనివార్యమేయగునెడల వానిని మామూలు అక్షరములతోనే ముద్రింపవలయును.

మన హిందీపత్రికలయందును యిట్టి ప్రకటనలు చాల బయలుదేరుచున్నవి. హిందీపత్రికా సంచాలకులును ఈసంఘమువారి పై సిఫారసులను అమలుజరుపుదురని మేము ఆశింపవచ్చునా ?"

(విశాలభారత్ - సంపాదకీయవిచారణ)

ఈవిన్నపము విశాలభారత (జూలయి సంచిక) యందు కలదు. తెలుగు దేశమున గల పత్రికలయందును ఇట్టి అశ్లీలప్రకటనలు చాల తరుచుగ కాన్పించుచుండును. వానివలన పత్రికలకు ధనలాభ మధికమయ్యును సంఘము నైతికప్రవృత్తి కవి న్యూనతను గల్పించుచున్నవి. పత్రికలు నానావిధముల సంఘాభివృద్ధిని కావింపవలసినవి. కావున తెలుగు పత్రికల అధిపతులును ఉపర్యుక్తములగు నుపదేశవాక్యములకు సాఫల్యమును సమకూర్చుటావశ్యకము.





# సాభిప్రాయ విశేషములు

ఓ ధర్మమా! నీ మహిమ విచిత్రము. నీ సందర్శనమునకు సబర్మతి సత్యాగ్రహాశ్రమనివాసము సాధనమొ, సబర్మతి జెయిలునివాసము సాధనమొ సామాన్యులకు తెలియకున్నది. ప్రవృత్తియందు భోగత్యాగములకు గల సంరంభము ధర్మసంస్థాపనము వినియోగపడుటయును, విచిత్రముగ నున్నది. సుఖప్రాప్తియును, దుఃఖనివృత్తియును జీవయాత్రకు సహజములైనను పరమార్థములు గావు. ధర్మనిర్వహణమునందు దుఃఖానుభవమును సుఖనివృత్తియును పరమార్థములుగ గనుపడుచున్నవి. సుఖదుఃఖములు జీవయాత్రయందు ధర్మనిర్వహణమునకు సమానార్థకములు. గాంధిమహాత్ముడు ధర్మనిర్వహణమునకై సబర్మతీ సత్యాగ్రహాశ్రమమును పరిత్యాగము చేసిన మహాత్యాగోదంతము ప్రపంచేతిహాసములందపూర్వముగ నున్నది. సత్యాగ్రహ పరిత్యాగము గాంధిమహాత్మునకు గలుగజేసిన హృదయసంతాపమును గాంధిమహాత్ముని దివ్యవాక్యములు వ్యక్తము చేయుచున్నవి.

“౧౯౧౫ సం, హిందూ దేశమునకు వచ్చిన క్రొత్తలో సత్యాగ్రహ ఆశ్రమమును నిర్మించితిని. సత్యాన్వేషణమే ఆశ్రమ-ఆదర్శము. ఆశ్రమవాసులందరు సత్యము, అహింస, బ్రహ్మచర్యము, జిహ్వాచాపల్యమును స్వాధీనపఱచుకొనుట, దరిద్రనారాయణసేవ, ధైర్యసాహసములు, అస్పృశ్యతానిర్మూలన ప్రచారము, స్వదేశీ (ముఖ్యముగా ఖద్దరు) మున్నగు ఆదర్శముల నన్నింటిని మతాచారముగా పాటించి, ఉదరపోషణము చేసుకొందురు. ఆశ్రమస్థలమును ౧౯౧౭. సం. లో కొంటిని. పనులనన్నిటిని ఆశ్రమవాసులే చేసుకొనుచున్నారు. ఖద్దరు, పశుపోషణపరిజ్ఞానము, శాస్త్రరీత్యాపారిశుధ్యముచేయుట, విద్యాభ్యాసము మున్నగునవి ఆశ్రమవాసులు నేర్చుకొనునవి. ఆశ్రమములో ౧౦౭ మంది ప్రస్తుతము గలరు. (పురుషులు ౪౩, స్త్రీలు ౩౧, బాలురు ౧౩, బాలికలు ౧౩) ప్రస్తుతము చెరసాలలోనున్న వారిసంఖ్య యిందుచేర్చ లేదు. ఆశ్రమము వెలుపల పనిచేయుచున్న వారిసంఖ్యగూడ యిందుచేర్చ లేదు. ఇప్పటివరకు ఖద్దరు పరిశ్రమలో ౧౦౦౦ మంది తయారైరి. వీరందరు నాకు తెలిసినంతవరకు ప్రజానిర్మాణకార్యక్రమ నిమగ్నులైయుండిరి. ఆశ్రమము రిజస్టరైనది. ట్రస్టుఫండు సక్రమముగానే యున్నది. మిత్రులనుండి విరాళములను స్వీకరించుచున్నాము. ఇది కేవలము విద్యావ్యాపకమునకే వినియోగపడుచున్నది. జీతములు లేకపోవుటయే గాక, విద్యార్థులకు భోజనము పెట్టి, కట్టుబట్టలనుగూడ యిచ్చుచున్నారు. ఆశ్రమస్థిరాస్తి రు ౩,౫౦,౦౦౦. చరాస్తి రు ౩,౦౦,౦౦౦ ఆశ్రమము రాజకీయములందు పాల్గొనుట లేదు.”

సత్యాగ్రహోద్యమమునకు జనకుడ నను నేను అత్యధిక త్యాగము చేయవలసిన ఆవశ్యకత యిపుడు

కల్గినది. ఏది నాకు ప్రియతమమో, ప్రాణసమమో, దేని నేర్పఱచుటకు ౧౫ సం. నుండి నేనును, ఆశ్రమవాసులను, నిరుపమానశక్తుల వినియోగించి పనిచేసితిమో అట్టి ఆశ్రమమునే నేనిపుడు త్యాగము చేయుచున్నాను. ఈ ఆశ్రమమునకు సంబంధించిన ప్రతిపక్షి, పసవులలో ప్రత్యేకపవిత్రచరిత్ర గలదు. ఈ ఆశ్రమమునకు సంబంధించిన చరస్థిరము లన్నియు ఒకగొప్ప కుటుంబమునకు చెందినవే. వెనుక పనికిమాలిన బీడుగానున్న ప్రదేశము, మనుష్యులకృషివలన ఒకపెద్ద ఆరామక్షేత్రమైనది. ఇట్టి ఆశ్రమమును చీల్చివేసి యిచట జరుగుచున్న పలువిధములగు కార్యములను విరమింపవలసి వచ్చినప్పుడు మేము అశ్రుజలపూరితనేత్రులముకాకుండ నుండజాలము. దీనిని గూర్చి ఆశ్రమవాసులను స్త్రీపురుషులతో చాలసార్లు సంభాషించితిని. ప్రస్తుతము దీనిని విరమించుటకు వారందరు సమ్మతించిరి.

సత్యాగ్రహ మింతలో ముగియునటుల లేదు. అందువలన దాని ఫలితముల నన్నింటిని అనుభవింపవలసి యుండునని ఊహింపక తప్పదు. ఆకారణమున ఆశ్రమము విరమింప నిశ్చయించితిమి కాని ఆశ్రమముసొత్తు నంతను ప్రజాహితమునకే వినియోగించవలెనని మాకోరిక, నగదును. చరాస్తుల నన్నిటినిగాని కొన్నిటినిగాని వశపఱచుకొనగోరనియెడల వాటిని నేను ప్రజలలాభమునకు నా సూచనలప్రకారము వినియోగింపబూనిన మిత్రులకు వశపఱుపగోరెదను.

సత్యాగ్రహాశ్రమమును విచ్ఛేదము చేయుటయందు మహాత్మునకు గలిగిన హృదయసంతాపమును, పూర్వోదాహృతములైన సత్యవాక్యములు సకలజనులకును పరమవిచారమును గలుగజేయుచున్నవి. పదునెనిమిదేండ్లు శ్రమపడి పోషించి పెంచిన యాశ్రమమును నిర్మూలముచేయుట సామాన్యులకు సాధ్యముగాని విషయము. ప్రాణావసానసమయమునందైనను నిస్సంగత్వమును, నిస్పృహయును దేహధారులకు దుర్లభము. సన్న్యాసాశ్రమమును స్వీకరించియును మహాశ్రమములను నిర్మించి మమకారము బూనుట ప్రపంచమునందు పరిపాటియైనవిషయము. సత్యాగ్రహమునకై వినియోగపడని సత్యాగ్రహాశ్రమనిర్వహణము సత్యాగ్రహనాయకుడైన గాంధిమహాత్మునకు నిరర్థకమేకాకను దురారాధ్యమును.

సత్యవ్రతపరాయణుడైన మహాత్మునకు సత్యధర్మనిర్వహణమునకు సంసారము, ఉద్యమములు, ఆశ్రమములు సాధనములు కాని పరమార్థములుగావు. సామాన్యులకు సాధనముకాని గ్రాహ్యామైనటులు సాధ్యములు గ్రాహ్యములు గావు. సాధ్యములకు నిరర్థకములైన సాధనములను విసర్జించుట మహాత్ములకు సులభము. మనోవాక్కాయములను సత్యము నారాధించుటకు ప్రతిబంధకములను నిగ్రహించుట మహాత్ములకు పరమార్థము. సత్యాగ్రహనిర్వహణమునకు ప్రతిబంధకమైన సత్యాగ్రహాశ్రమమును విచ్ఛేదము చేయుటయందు గాంధిమహాత్ము డవలంబించినత్యాగ వ్రతానుష్ఠానము ప్రపంచము నందంతటను భయసంభ్రమములను గలుగజేసినది.

*  *  *  *

గాంధి మహాత్ముని సత్యాగ్రహాశ్రమ త్యాగము బుద్ధదేవునిరాజ్య సంసారత్యాగ

మును విస్మరింప జేయుచున్నది. గౌతమ బుద్ధుడు దుఃఖనివృత్తికిని, ఆత్మోపలబ్ధికిని సంసారమును, రాజ్యమును విసర్జించెను. గాంధి మహాత్ముడు సత్యవ్రతపరాయణమైన ధర్మ నిర్వాహణార్థము శ్రమపడి పోషించి పెంచిన సత్యాగ్రహాశ్రమమును తృణప్రాయముగను విధ్వంసము చేయుట త్యాగోదంతములందు దివ్యోదంతము. వర్తమానసమయమునందు సత్యాగ్రహోద్యమమునందు సత్యాగ్రహాశ్రమ పరిత్యాగము విషాదాధ్యాయముగను గోచరం బగుచున్నను కాలాంతరమునను దివ్యాధ్యాయముగను వెలయగలదు. సత్య నిర్వహణమునకై సోక్రెటిసు విషపానము చేసిన ఇతిహాసమువలెను, మానవ మోక్షమునకై ఏసుక్రీస్తు శిలువను ధరించిన యితిహాసము రీతిని గాంధిమహాత్ముని త్యాగమును కాలాంతరమునందు ధర్మేతిహాసమునందు పరంజ్యోతి వలెను ప్రకాశింపగలదు.

* * * *

ఏసుక్రీస్తు అశ్వశాలయందు పుట్టినరీతిని ధర్మము నిర్బంధాశ్రమములందు, బీభత్సపరిస్థితులందు తేజోవంత మగుచున్నది. పంచ మహాపాతకులకును వాసస్థలములైన చెరసాలలు మహాత్ములకు నిర్బంధవాసస్థలము లగుట ప్రపంచావృతమైన దురదృష్టము. అనిత్యమైన బాహుబలమునకు గల ప్రతిష్ఠ రాజ్యాంగములం దాదికాలమునుండియును నిత్యమైన ధర్మబలమునకు గలుగకున్నది. రోమక సామ్రాజ్యము క్రీస్తుమత విధ్వంసనమున కుపయోగించిన పశుబలప్రయోగమునే వర్తమానకాలమునందు ౧౯౩౩ సంవత్సరముల యనంతరము రాజ్యాంగములు వినియోగించుచున్నవి. శిక్షాస్మృతియందు సత్య సంకల్పములును, ధర్మనిర్ణయములును దండనార్హము లగుచున్నవి. సత్యసంహారమునకును, ధర్మనిరాదరణమునకును నధికారము చేసెడి ప్రయత్నము లసహ్యములైనను సదుపయోగము లగుచున్నవి. అధికారభయావృతమైన ప్రపంచపరిస్థితులందు ధర్మాభయములసు స్థాపించుటకు ప్రపంచ మనుభవించిన దుఃఖ వేదనను ఘోరసంగ్రామములు, మతకలహములు, సాంఘికసంరంభములు, వ్యాపారార్థిక సమరములు వేనోళ్లను బోధించుచున్నను జ్ఞానోదయము దుస్తరముగనున్నది. సంరంభమయమైన ప్రపంచోదంతములందు గాంధి మహాత్ము డుపక్రమించిన మహాత్యాగోదంతము ఆసురబలనిరసనమునకును, దైవబల సంవర్ధనమునకును, ధర్మపరమైన శాంతిస్థాపనమునకును పరంజ్యోతివలె వినియోగపడుటకు భగవదనుగ్రహము గలుగు గాత!

---

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౯.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩



# విషయసూచిక


పద్మావతీచరణచారణ చక్రవర్తి—శ్రీ శివశంకరశాస్త్రిగారు ... ౩౩౭–౩౪౦

కన్యాశుల్క నాటక విమర్శనము—శ్రీపాద కామేశ్వరరావుగారు ... ౩౪౧–౩౫౫

పేరు—ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు ... ... ... ౩౫౬–౩౬౨

సారంగధరచరిత్ర—బులుసు పాపయ్యశాస్త్రిగారు ... ... ౩౬౩–౩౬౪

అనంతపంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షము—విశ్వనాథ నరసింహం గారు ... ... ... ... ... ౩౬౫–౩౬౮

సంస్కృతము దేశభాషగ నుండినదా?—వంగోలు వేంకటరంగయ్యగారు ౩౬౯–౩౭౪

ప్రేమపాశం—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... ... ౩౭౫–౩౮౧

తోటమాలి—కృత్తివెంటి వేంకటసుబ్బారావుగారు ... ... ౩౮౫–౩౮౭

విద్యాప్రమాణము—సి. పి. రామచంద్రరావుగారు ... ... ౩౮౮–౩౯౨

మధువ్రత—పాటిబండ మాధవశర్మగారు ... ... ... ౩౯౩–౩౯౪

భారతీయవిద్యాచరిత్రము—మారేమండ రామారావుగారు ... ౩౯౫–౪౦౦

నేటిరష్యా—నార్ల వెంకటేశ్వరరావుగారు ... ... ... ౪౦౧–౪౦౬

రౌండుటేబిల్ సభల సంస్కరణవిధానము—చా. వెం. హనుమంతరావుగారు ౪౦౭–౪౧౨

పిచ్చితలపులు—హనుమదింద్రకంటి ... ... ... ౪౧౩

యుగలక్షణసమన్వయము—బులుసు వేంకటరమణయ్యగారు ... ౪౧౪–౪౧౬

కష్టతల్లి పెళ్లి—చావలి బంగారమ్మగారు ... ... ... ౪౧౬

వోటు—సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు ... ... ... ౪౧౭–౪౨౧

ఆంధ్రగ్రంథముల పట్టిక ... ... ... ... ౪౨౨–౪౨౫

జీవితరహస్యము—కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు ... ౪౨౬

క్షీరసాగరమథనము—బాలాంత్రపు వేంకటరావుగారు ... ౪౨౭–౪౩౪

భారతము: పరమార్థప్రదర్శనము—నందూరి బంగారయ్యగారు ... ౪౩౫–౪౪౦

పిపాసువు—దివాకర్ల వేంకటావధానిగారు ... ... ... ౪౪౧–౪౪౨

నా లాటరీ మోటారు—పెద్దాడ రాజలింగమూర్తిగారు ... ... ౪౪౩–౪౪౮

శర్వరి—పెమ్మరాజు లక్ష్మీపతిగారు ... ... ... ... ౪౪౯–౪౫౦

ఉరుస్వతీవిజ్ఞానమందిరము ... ... ... ... ౪౫౧—౪౫౪

మీగడతఱకలు : ఆధునికాంధ్రవాఙ్మయము—శాస్త్రి ... ... ౪౫౬—౪౫౮

ఆంధ్రభాషాప్రవీణ—ఉన్నవ లక్ష్మీనారాయణగారు... ౪౫౮—౪౫౯

బాలక్రీడలు—మంగిపూడి వేంకటశర్మగారు ... ... ... ౪౬౦—౪౬౪

నాట్యకళ—కీ. శే. పిల్లలమఱ్ఱి సుందరరామయ్యగారు ... ... ౪౬౫

ఆంధ్రాభ్యుదయము—శ్రీ కె. ఎస్. హరిశ్చంద్రుడు ... ... ౪౬౬

భారతీయమహిళామండలి—శ్రీ బొడ్డపాటి సీతాబాయి; శ్రీ టి. నారాయణమ్మాళు, శ్రీమతి రమణబాయి నీలకంఠ, బి. ఏ., ... ౪౬౭—౪౬౮

కలగూరగంప—మెత్తనివారినిచూస్తే—; హెన్రీఫోర్డు; ఆధునికప్రపంచమున బానిసతనము; శ్రీ సోదరీ సుశీలాదేవి; జర్మనీయందు స్వయంసహాయము; కోహినూరు వజ్రము; శిక్షణమువలని ప్రయోజనము; భారతదేశ గ్రామములయందు బ్రాడ్‌కాస్టింగు; సముద్రమున నడక; తక్షశిల; జమీందారీల ఆదాయము; గణపతి; ఎత్తయినగోపురము; పిల్లల గండములు ... ... ... ... ౪౬౯—౪౮౧

కేళి—శ్రీరంగం శ్రీనివాసరావుగారు ... ... ... ౪౮౨

ఆగడపలు—సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు ... ... ౪౮౨

నక్షత్రమండలము: (భాద్రపదమాసము)—గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు ... ... ... ... ౪౮౩—౪౮౬

వినాయకచవితి—కర్లపాలెము కుటుంబశాస్త్రిగారు ... ... ౪౮౬

విమర్శనము ... ... ... ... ... ౪౮౭—౪౯౬

పునర్విమర్శనము ... ... ... ... ... ౪౯౭—౪౯౮

సాభిప్రాయవిశేషములు— ... ... ... ... ౪౯౯—౫౦౪

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు: గణపతి; మీరాబా.

సాధారణ చిత్రములు: చౌఖండిస్తూపము (సారనాథము); కుత్తాలము జలపాతము; ఉస్మానియా ఆసుపత్రి - హైదరాబాదు; హైదరాబాదు - మూసీనదిఒడ్డున; సూర్యోదయానంతరము; చార్‌మినార్ - హైదరాబాదు; అశోకస్తంభాగ్రమునందలి సింహశిఖరము (సారనాథము); క్లిక్; సింహళరాజధానియగు అనూరాధపురమునుండి కొనితెచ్చి పాతిన అశ్వత్థ వృక్షశాఖ; తిరుపతిగుంట్రప్రక్కన నుండు రాగిచెట్టు; తక్షశిలచిత్రములు; యక్షురేచిత్రములు; ఆకస్మికచ్ఛాయాచిత్రములు; ఇతర చిత్రములును.

---



సంపు. ౧౦ శ్రీముఖ సంవత్సరము, భాద్రపదమాసము (సెప్టెంబరు ౧౯33) సంఖ్య ౯

# పద్మావతీ చరణచారణ చక్రవర్తి

(మూడురంగముల పద్యనాటిక)

శ్రీ శివశంకరశాస్త్రి
[మాహేశ్వరాశ్రమము]

## ప్రథమరంగము

పద్మావతి

అరుగుచున్నారుగా హృదయాధినాథ,
గౌడలక్ష్మణ సేన భూకాంతుసభకు!
అవధరింపంగవలయు కృపార్ద్రమతిని—
ప్రార్థనం బొండు చేయు మీపాదదాసి.

జయదేవుడు

ఏల యింతజాలి హృదయేశ్వరీ, చెప్పు
మెన్నడే నిరాకరించినాడె
నేటివర కితండు నీవాంఛితంబును!
వెరగుదోప నిట్లు వేడనేల?

పద్మావతి

ఏలనో కాని ప్రాణేశ, యిదె మదీయ
మానసాబ్జము దోలాయమాన మయ్యె!
వెరపుసైతము కల్గు నావిన్నపంబు
సఫలతం గాంచ దనియెడి సంశయమున.

జయదేవుడు

ప్రార్థనమ్ము మాని ప్రాణేశ్వరీ, నాకు
నాజ్ఞ యిత్తువేని యచిరముగను
అనుసరించువాడ నౌదలం దాలిచి
శంక విడువదగదె యింకనైన?

పద్మావతి

వినగ నెల్లరు గీతగోవిందకృతిని
పాడుదురు మీరు నృపసభాభవనమందు
కావ్యదోషము లున్న నిష్కారుణముగను
బయలు పెట్టరె పండితప్రవరు లపుడు ?

జయదేవుడు

అష్టపదులు చాల యవధరించిననాడు
గోష్ఠిలోన నృపతి కుతుకమునను
కావ్యపరిసమాప్తి కావుట యాలించి
ప్రభు వొసంగె నాజ్ఞ పఠనమునకు.

అధిపుదర్శనార్థ మరుదెంచియున్నారు
దాక్షిణాత్యపండితప్రకాండు,
లీదినంబు వార లేతెంత్రు లక్ష్మణ
ప్రభునిసభకు కావ్యపఠనవేళ.

నిఖిలకళలయందు నిష్ణాతులై మహా
విబుధులైనవారు విన్నయపుడె
కావ్యబంధమందు గల్గుప్రాశస్త్యంబు
విశదమగును కవికి యశము నిలుచు.

అవగుణంబులున్న నాస్థానకవికృత
గ్రంథమందు ధరణికాంతునకును
కీర్తి తరుగుననుచు గీతగోవిందమ్ము
తరచి చూచినాను తాల్మితోడ.

అంతెకాక శ్రీమదాచార్యగోవర్ధ
నార్యుసమ్ముఖమ్మునందు కృతిని—
ఆదినుండి శ్రద్ధ నాలింపగా ఉమా
పతియు, శరణకవియు—పాడినాను.

దోషరహిత మనియె ధోయీకవీంద్రాది
సమితియెల్ల, నాకు శాంతి యొదవె.
అతికుశాగ్రబుద్ధియా పరాశరునకు
కావ్యమయ్యె నపుడె కంఠగతము.

కావ్యశోభకొరకు కావింపదగుమార్పు
లేవి తోచకున్న వింక నాకు.
పరిణతాత్మ యైన పద్మావతీదేవి
భావమేమొ విశదపరపవలయు.

పద్మావతి

రససదనమైన కృతిశరీరమ్మునందు
కానబడుచున్నయది కళంకత్రయంబు
ప్రాణనాయక, మన్నించి పాదదాసి
విన్నపము, దాని దొలగించివేయవలయు.

జయదేవుడు

నాతలంపునందు నాలుగుదోషముల్—
పదమునందు, వాక్యబంధమందు,
అర్థమందు, రసమునందును—వీనిలో
తుదిది యొకటె ప్రబలదోష మరయ.

అందులోన నెది రసాదిప్రతీతి ప్ర
కర్షములకు బంధకారకములొ,
సహజముగనె యెది రసప్రతీతివిలంబ
కారకములొ వాని గడపవలయు.

దోష మున్న దాని దొలగించివేయుటే
కవికి సముచితంబు, కావ్యమందు
తెలుపగదవె సకలలలితకలాభిజ్ఞ,
తోచినట్టి ప్రబల దోషములను.

పద్మావతి

కెరలి పద్మావతీచరణచారణచక్ర
　వర్తి యం చాదినే వైచినారు
స్థానాంతరమ్మున జయతి పద్మావతీ
　రమణ యం చేమేమొ వ్రాసినారు
వేరొకతావున విహితపద్మావతీ
　సుఖసమాజే యంచు జొనిపినారు
ఇమ్మాడ్కి నాపేరు ముమ్మారు గీత గో
　విందబద్ధమ్ము కావించినారు
కేవలమ్ము రహస్యంపు[గీడలందె
పేర్కొనం దగు నిజభార్యపేరు మీరు
స్వీయకావ్యశరీరాన జేర్చుకతన
గ్రంథమునకు కలంకమ్ము కలుగలేదె?

జయదేవుడు

తనివితీరునే సుధామధురమ్ము నీ
నామధేయచింతనమ్మువలన
పద్మ, కావ్యమందు బద్ధంబు చేయుట
వలన దాని కొదవె వైభవంబు.

సకలలోకపూజ్య జగదంబపేరె నీ
పేరు పద్మ: దాని పేరుకొన్న
రసనమీది తుప్పు రాలిపోవుటె గాక
అతిపవిత్రభావ మంకురించు.

కవుల కృతులయందు కాంతాభిధానంబు
సంస్మరించుచుంట సముచితంబె.
ఉన్నవారు కొంద రుత్సాహవంతులు
పెట్టినారు భార్యపేరె కృతికి.

పద్మావతి

నిండుసభలోన నేను నానృత్యవిషయ
మవధరించినపెద్ద లేమందురో కద!
కవులదృష్టాంతముల్ పెక్కు కలవు నాథ,
కాని బాధించుచున్నది గాఢలజ్జ!

జయదేవుడు

విన్నయపుడు దాన వ్రీడాకరంబైన
దేమియుండు వార లేవగింప?
నేర్పు కలదు నీకు నృత్యాదికళలలో
ననుచు సంతసించి యభినుతింత్రు.

పద్మావతి

మీకు నిజభార్యపై ప్రేమ మేదురముగ
నుండుగాక, మనస్సులో నుంచికొనుట
సముచితంబగు: నీరీతి జనము మ్రోల
ప్రకటనముచేయ పాడియే ప్రాణనాథ!

జయదేవుడు

అవగతంబె నీకు కవులు నిరంకుశుల్
స్వేచ్ఛలోనె వారిజీవనంబు.
ఒరుల కెట్లుసాధ్య మున్మత్తమాతంగ
గమన మాప వారికవితయందు?

పద్మావతి

చాటువాక్కులచే వివశత్వ మొదవు
ఐన నాతుదివిన్నపం బాలకించి
తెలియనీయక పద్మావతీసమాఖ్య
జగమునకు, నన్ను రక్షింపదగును నాథ!

జయదేవుడు

చెప్ప లేదు నేను సిగ్గిల దగుమాట
నామధేయ మెత్తినానె కాని
నీవు కళలలోన నిష్ణాత వనుకీర్తి
శాశ్వతముగ నిల్చు జగమునందు.

ఓర్మి నీవు నాకు నుత్సాహమీకున్న
కావ్య మెట్లు చేయ గలుగువాడ
పద్మ, పద్మ, నాకు ప్రాణేశ్వరివి, మూ_ర్తి
దాల్చినట్టి యిష్టదైవతమవు!

పరాశరుడు

[ ప్రవేశించి ]

జాగుచేసెదవేల జయదేవ, యింక?
నీకోస మెల్లరు నిర్నిమేసముగ
నుత్కంఠతో వేచియున్నవా రదిగొ
పట్టభంగశ్రేణిపార్శ్వమ్మునందు.

కవివత్సలుండు లక్ష్మణసేననృపతి
పంపె నాదరముతో భద్రగజంబు
జాగుచేయక రమ్ము స్తంబేరమమ్ము
నిలిచియున్నది ద్వారనికటమ్మునందు

* * *

నీహ_స్తగత మైన నీలకౌశేయ
బద్ధమనోజ్ఞ ప్రబంధంబు సఖుడ!
రాధికాదృఢపరీరంభమం దున్న
గోవిందుపోలిక గోచరించినది!

పద్మావతి

అదిగొ కల్యాణశంసి ఘంటారవమ్ము!
బయలు దేరుడు నృపసభాభవనమునకు
వరదు డైనట్టిరాధికావల్లభుకృప
విజయ మగుగాక, గీతగోవిందకృతికి!



చౌఖండిస్తూపము (సారనాథము)

—సి. జి. జగన్నాథదాసు.

# కన్యాశుల్క—నాటక విమర్శనము

శ్రీపాద కామేశ్వరరావు

(అనువృత్తము)

## ౨. పాత్రపోషణ — ౧. గిరీశం

ఇది నాటకవిమర్శయందు రెండోవిషయము. ఈ నాటకమందలి పురుషపాత్రములలో ప్రఖ్యాతి చెందినది గిరీశము. నాటకప్రదర్శకులకు ప్రేక్షకులకూ ఇదే ముఖ్యపాత్రమని నమ్మకము. కాబట్టె ముందు దీనిని పరిశీలింతాము.

గిరీశంపైని లక్ష్మీసరస్వతులు చిరికన్ను వేసినారు. ఇతనికి చదువు పూర్తికాలేదు; సంపద పూర్ణానుస్వారము; కాబట్టి ఉద్యోగమే లేకుండా నోరుపెట్టుకొని జీవిస్తూండేవాడు. మనిషికి కలిమి లేకపోయినా మాటలకు లేమి లేదు. ఇతడు కొన్ని రోజులు మధురవాణి అనే భోగముదాని నుంచుకొని, పైపెచ్చు సంసారికాంతలపై కన్నువేసి ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవాడు. అందువల్ల కొన్ని ప్రమాదములు సంభవిస్తూండెను. పూటకూళ్లమ్మ ఒత్తిడి లేకుండా ఆమెతో అసంగతమైన చెలిమిచేసెను. ఈ పాపము కోడై కూసింది. పిల్లవాళ్లకు చదువుచెప్పుతానని పూనుకొని డబ్బు పుచ్చుకోవడమేకాని, చదువు చెప్ప లేదుసరేకదా ఎప్పుడూ కబుర్లు, చుట్టలుకాల్చడము నేర్పేవాడు. ఇతడు ప్రత్యుత్పన్నమతి — అనగా ఎట్టి కష్టదశలోనైనా మతిపోగొట్టుకోక తగిన ఉపాయము వల్ల తరించగలడు. ఫొటోగ్రాఫరు కివ్వవలసిన సొమ్మెగవేసి తన్నలమిన తక్కినకష్టాలు తప్పికొనుటకు ఊరువిడిచి పారిపోదలచినాడు. ఇతని నోటిబూకరానికీ బడాయికీ అంతులేదు. హైదరాబాదునవాబు తనకు నెలకు వెయ్యిరూపాయీల ఉద్యోగ మిస్తానన్నాడని అందరితోను చాటినాడు. దీనివల్ల పరపతి హెచ్చింది. పూటకూళ్లమ్మ సంతఖర్చు కిచ్చిన ఇరవైరూపాయిలూ దుర్వ్యయముచేసినందున ఆమె అతనిని వెదకివెదకి మధురవాణియింట్లో నుండునని ఊహించి చీపురుకట్ట పట్టుకొని అక్కడికి రాగా మధురవాణి మంచముకింద దూరి అక్కడ అదివరకే దాగియున్న రామప్పంతులిని ముందుకు నెట్టి, చీపురు దెబ్బ లతని పాలు చేసి, పైపెచ్చు తానుకూడా అతని తలదిమ్మపట్టేటట్లు మోది పూటకూళ్లమ్మచే చెడతిట్టించెను. ఇతని చాతుర్య మిట్టిది. మధురవాణిపై నమ్మకము లేకపోయినా ప్రాణము పెట్టేవానివలె నటించినాడు. అగ్నిహోత్రుని ఆవేశమునకు తగినట్టు సుగ్గిలమువేసి ఆతని దావాలన్నీ ఖర్చులేకుండా నడిపిస్తానని ఆశపెట్టినాడు. అతను తన్ను తిట్టినప్పుడు "పెద్ద లనడము పిన్నలు పడడమూ విధాయక" మని సంతసింపజేసినాడు. బుచ్చమ్మను చూడగానే వలచి కనికారము కలవానివలె కనబడి—My heart melts - అందరి కళ్లలో దుమ్ముకొట్టి ఆమెను లేవదీసినాడు. వెంకటేశముతో తాను Social reformer కావున Infant Marriage, bride - money, చిన్నపిల్లలను పెద్దవాళ్లకు పెళ్లిచేయడము తనకు కిట్టవనీ చెప్పి అగ్నిహోత్రుని దయ సంపాదించుటకు తన views మార్చుకొన్నాడు. ఆలాగు అప్పుడప్పుడు opinions change చేస్తేనేకాని politician కాడని సమాధాన మిచ్చినాడు. ఇతడు గోడమీది పిల్లిలాగు జీవించే ఏబ్రాసికాని స్థిరమనస్కుడు కాడు; పాపభీతిలేని పాషండుడు, ఋజుమార్గవర్తి కాడు. అవసరమువస్తే అబద్ధాలకి జంకడు. లోకజ్ఞానము బాగుగా కలదు. మూఢవిశ్వాసి కాడు. దయ్యాలు, అంజనమువేయుట మొదలైన తాంత్రికచర్య దబ్బర అని గ్రహించినాడు. వంచనచేయడములో సిద్ధహస్తుడు.

బుచ్చమ్మని బుట్టలో వేయవలెనని శృంగారచేష్టలు, సరసంపుమాటలు మొదలైన జారులదారులు

తొక్కి లాభము లేక న్యాయమైన కొత్తదారి తొక్కాలి అని నిశ్చయించి Widow marriage civilisation కల్లా నిగ్గ అని నిర్ధారణ చేసినాడు. బుచ్చమ్మతల్లి నూతిలో పడ్డప్పుడు తానుదిగి తీసినప్పటి నుండి తాను సత్యహరిశ్చంద్రుడని ఊరందరికీ నమ్మకము కలిగిందని తెలుసుకొని బుచ్చమ్మయెడ తా నెంత చనువు చేసినా సుతిమించేదాకా పర్వాలేదని ధైర్యముతో మసలినాడు. చేసిన ఉపకారానికి అతడు కోరేఫలము బుచ్చమ్మని లేవదీసుకొనిపోవడము. ఇదీ అతని నీతి! ఆమెకు Love stories చెప్పి ground prepare చేసి, స్త్రీపునర్వివాహము మంచిఆచారమని బోధింప నిశ్చయించి, వెంకటేశానికి పాఠముచెప్పే మిషపైని Widow Marriage పాపకార్యము కాదని వేదములలోనూ, శాస్త్రములలోనూ, పురాణములలోనూ, శంకరాచారిపత్రికలోనూ ఉందని నోటికివచ్చినట్లు ప్రమాణములు చూపి, తనబోటి బ్రహ్మచార్లకు వితంతువులను పెళ్లిచేసుకోవడమే ముఖ్యవిధి అని బోధించి, అట్టి పెళ్లిళ్లు ఐదువేలయినవనీ, ఒక్కొక్కదానికి Widow Marriage Association వారు నెలకు నూరురూపాయలు పురస్కార మిస్తారని కోతలుకోసి బుచ్చమ్మ కాశపుట్టించినాడు. తుదకు వితంతులను వివాహము చేసుకొమ్మని దేవుడు ఆజ్ఞాపించినాడు, కనుక ఆలాగు చేసునివాళ్లకు ఘోరమైన పాతకము వచ్చునని భయపెట్టినాడు. ఇదంతా వట్టిబూకరింపు. సాధ్యము ( End ) మంచిదేకాని సాధనము ( Means ) బాగులేదు; స్త్రీపునర్వివాహము అవశ్యకర్తవ్యమే, కాని గిరీశం చెప్పిన యుక్తులు సబబుగా లేవు; వట్టి అమాయికురాలుకనుక వలలో పడ్డది. ఈవాదము సహేతుకమనుకొంది.

వెంటనే "సరే, బ్రహ్మచారికి వితంతును పెళ్లాడడము విధి అన్నారుకదా మీ రెందు కాలాగు చేయలేదు ?" అని బుచ్చమ్మ ప్రశ్నించగానే "ఇందుకు రెండుకారణము లున్నవి" అని జవాబుచెప్పి కారణములు వివరించినాడు. మొదటిది, లోకోపకారము చేయవలెననే వ్రతము. అనగా పిల్లలకు చదువుచెప్పడము, సానివాళ్లని హితమార్చడము, నూతులలో పడ్డ వాళ్లని తియ్యడము. ఇటువంటి పనులు చేయడానికి వీలుండదని తాను పెళ్లి మానుకొన్నాడట. రెండో కారణము గొప్పరహస్యముకనుక ఎవ్వరితోనూ చెప్పనని ప్రమాణముచేస్తే చెప్పుతానన్నాడు. బుచ్చమ్మ అందుకు సమ్మతించి అతనిమీద ప్రమాణముచేసింది. అప్పుడు మొదలుపెట్టినాడు తన వంచన. "నీవంటి బంగారుబొమ్మ, గుణవంతురాలు నన్ను పెళ్లిచేసుకొమ్మని కోరితే చేసుకొంటాను. ఎందుచేతనంటే— లోకానికన్న విలువగల నీబోటి రత్నమునకు ఉపకారముచేయడము లోకోపకారముకంటె విలువగలది." బుచ్చమ్మ ఔనన్నది. పిమ్మట పెళ్లిచేసుకొన్నతర్వాత స్థితిని అతిశయోక్తిగా వర్ణించి బుచ్చమ్మమనసు కరిగించినాడు. ఈవర్ణన మూఢుడైన వెంకటేశముకూ నచ్చి "(కొంపతీసి) మా అక్కయ్యను పెళ్లాడేస్తారా ఏమి" టని సహజసరళముగా అడిగినాడు. ఈ సందేహము బుచ్చమ్మకీ కలిగి గిరీశంజవాబు కెదురుచూస్తూన్నది. అప్పుడు "ఆఁ! మాటవరుసకంటే (నీకు) మతిపోయిందా ఏమి ?" అని వాళ్ల ఆందోళన మాపినాడు. ఈమాట విన్నతోడనే బుచ్చమ్మ "అంతే కదా" అని తెప్పిరిల్లి ఊపిరితీసింది. ఆతరుణము మించి పోకుండా "అంతకంటె అదృష్టం నాకు పట్టడమేలాగు ? ఆమాట మన మెవరమన్నా మీవాళ్లు నన్ను తన్నితగిలేస్తారు. రహస్యముగా నీతో చెప్పుతూన్నాను. నిన్ను పెళ్లాడుతానుకాని అచ్చమ్మనీ పిచ్చమ్మనీ చేసుకోను." ఇంతతో బుచ్చమ్మ కాశపెరిగింది.

"లోకములోవాళ్లు వితంతువులకు వివాహము చేయకపోవడానికి కారణము చెప్పుతాను విను; పెళ్లి లేకుంటే వితంతువులు పుట్టింటివద్దనే ఉంటారు. శక్తి ఉన్నంతకాలము చాకరీ యథేచ్ఛముగా చేస్తారు. జీతమివ్వనక్కరలేదు. పెళ్లిచేస్తే అత్తింటికి పోతారు, చాకరిచేసేవాళ్లుండరు," అని గుట్టురట్టు చేసినాడు.

బుచ్చమ్మమనసు కరిగించడానికి గిరీశం ఉపయోగించిన అస్త్రాలు అయిదు. మొదటిది — శృంగార కథలు చెప్పడము. రెండోది — వేదము,శాస్త్రము,

పురాణములు, ఆచారము, మతాధికార్లు మొదలైన సనాతనసర్వోపదేశకు లంతా వితంతువివాహము నిషేధించలేదని బోధన. మూడోది—వితంతువులు పెళ్లాడితే పిల్లలని కనుక్కొని వాళ్లని చూసుకొన్నందువల్ల కలిగే ఆనందము, పెనిమిటివల్ల చేకూరే సుఖము, సంసారమున అనుభవించే భోగము, ప్రపంచమందు కలిగే కీర్తి మొదలైన గొప్పలాభములు వర్ణించి భావిస్థితి కళ్లకుకట్టినట్లు చేసినాడు. ఈఅస్త్ర మమోఘము. దీనిని విన్న తర్వాత బుచ్చమ్మ తనమనసులో—"ఆహా! నే నితన్ని పెళ్లాడితే ఈసుఖము, ఈభోగము, ఈ ఆనందమూ నాకు కలుగవచ్చును. అందువల్ల నష్టమేమి? పాపము రాదు. పెళ్లాడకపోతే భగవంతుని ఆజ్ఞ మీరినదాన నౌతాను, పాపము మెడకు చుట్టుకొంటుంది. తల్లిదండ్రుల మాటవిని పెళ్లాడకపోతే దుర్భరమైన బానిసము అనుభవించి నిర్భరబ్రహ్మచర్యమున ఉండి సాటివాళ్లందరూ సంసారసుఖము అనుభవిస్తూఉంటే అందని పళ్లకు అర్రులు చాచవలసిఉంటుంది. వీళ్లదగ్గిర ఉంటే సుఖము సున్న, కష్టము దుర్భరము; వీళ్లని విడిచిపోయి పెళ్లిచేసుకుంటే నిరతిశయానందము అనుభవించవచ్చును, కష్టము కనబడదు. కనుక పెళ్లిచేసుకోవడమే మేలులా గుంది" అని అనుకొనియుండును. సుఖపడవచ్చుననే ఆశ ఉంటే ఎంతకష్టమైనా పడవచ్చును. అట్టి ఆశ లేనప్పుడు జీవనమే రుచించదు. ఆశకదా జీవితానికి ముఖ్యమైన ఆసరా. నిరాశాకలితమైన జీవితము నిర్భరమవుట నిశ్చయము.

ఇంతవరకూ పనిచేసినతరువాత సుబ్బిపెళ్లి దగ్గిర పడినందున పందిళ్లు వేయించే పెత్తనము గిరీశముపైని పడింది. "ఏక క్రియాద్వ్యర్థకరీ" అన్నట్లు లుబ్ధావధాని పేర ఉత్తరము వ్రాసినాడు. అందు అతని యవస్థకు వగచినట్లు వాతపెట్టినట్లూ హాస్యకరుణారసము లూరుతూన్నవి. భావ మూడా తదనుకూలముగానే ఉంది. ఈ ఉత్తరము బుచ్చమ్మను సంతోషపెట్టి లుబ్ధు నేడ్పించింది. ఐనా సుబ్బిపెళ్లి ఆగేటట్లు లేదు. పప్పు రుబ్బుతూ బుచ్చమ్మ కంట నీరుపెట్టింది. తండ్రి ఊళ్లో లేడు, తల్లి వాకిటపడ్డది, వెంకటేశం ఆడుకోపోయినాడు. మంచిఅవకాశము చిక్కిందని మరిరెం డస్త్రాలు ప్రయోగించదలచినాడు.

"ఏమి, వదినా, కంటనీరుపెట్టుతూన్నారు? నామనస్సు కరిగిపోతూంది" అని గిరీశం పలుకరించగానే బుచ్చమ్మ "సుబ్బికి ఈసంబంధము తప్పించారు కారుకదా?" అని సతాయించగా అతడు "నేను రెండువిధాల ఖేదపడుతూన్నాను—సుబ్బికి ఈసంబంధము తప్పించలేకపోతినని ఒకటి, బుచ్చమ్మని పునస్త్రీని చెయ్యలేకపోయినానుకదా అని రెండు. ఇవి సంతతము నన్ను బాధిస్తూన్నందువల్ల విరక్తి పుట్టి ఊరువిడిచిపోదా మనుకుంటూన్నాను" అని అనగానే వెంటనే "వెళ్లిపోకండి" అని బుచ్చమ్మ పల్కింది. తనమీద కాస్త అనురాగము పుట్టిందని గ్రహించి "నీవు కనబడకపోతే నేను బ్రతుకలేను; అందుకే నీకు నాపై కనికారము రవ్వంతైనా లేకపోయినా, ఇక్కడుంటే నిన్ను చూసుకొనియైనా సంతసించవచ్చునని మీయింట సకలచాకరీ చేస్తూన్నాను. నీకొకరహస్యము చెప్పుతాను కోపము తెచ్చుకోవుకదా? సుబ్బికి ఈపెళ్లివల్ల సుఖముండదు సరేకదా లుబ్ధావధాని గతించినతరువాత రామచంద్రపురంఅగ్రహారీకులు దానిని చెడగొట్టకమానరు. మీనాక్షి సంగతి చూస్తూన్నాముకదా? రామప్పంతులనే పరమదుర్మార్గుడు అక్కడున్నాడు. నా డెందరు సంసారులనో పాడుచేసినాడు. సుబ్బి తప్పకుండా చెడిపోతుంది." ఈలాగు ఒరిసినపుండుమీద ఉప్పు జల్లినాడు. ఏవిధముచేతనైనా సుబ్బిపెళ్లి తప్పించవలెననే దృఢాభిప్రాయము బుచ్చమ్మకి కలిగింది.

తిరిగీ గిరీశం "ఇక నీమాట—ఇప్పుడు తల్లిదండ్రుల చాటున ఖాయిదాగా ఉన్నావు సరే. వీళ్లు గతించి డబ్బు నీచేతికి వస్తే నీకూ స్వాతంత్ర్యము కలుగుతుంది. ఉప్పు పులుసూ తిన్నశరీరముగనుక నీయీడువాళ్లందరూ సంసారసుఖ మనుభవిస్తూంటే ఎప్పుడైనా నీకాలు జారకమానదు. "గిరీశం మాట విని హాయిగా అతనినే పెళ్లిచేసుకొన్నాను కానుకదా" అని అప్పుడు విచారిస్తావు. నేనో, నీవు పెళ్లిచేసుకొన్నావుకావనే

విచారముచేత ప్రాణముమీద ఆశవదలి నిన్ను తలుచుకొంటూ పిస్తోలుతో కొట్టుకొని ప్రాణమువిడిచి విమానము ఎక్కి స్వర్గానికి పోతాను" అని అనేసరికి "వద్దు, వద్దు, మీరు కొట్టుకోకండి. అలాగంటే నా కేడుపొస్తుంద"ని వారించింది. గిరీశం మరికొంత ధైర్యముతో స్వర్గావాసము వర్ణించి "మన మిద్దరము స్వర్గములో నున్నప్పుడు నిన్ను పువ్వులాగు నెత్తిమీద పెట్టుకొంటాను. ఆసుఖ మిప్పుడే కావలెనంటే నావెంట వచ్చి నన్ను పెళ్లిచేసుకో" అని నిర్బంధించగా ఇష్టమున్నా తగినంత ధైర్యములేక "అమ్మ నాయనా, నేను మీవెంట రాను" అన్నది బుచ్చమ్మ. కృషి చాలకపోవడముచేత నాల్గోఅస్త్రం గురితప్పింది. ఇంక మిగిలినది—సుబ్బిపెళ్లి తప్పించడమే. అనంతర ప్రసంగంలో అయిదోఅస్త్రం ప్రయోగించినాడు.

గిరీ—నే నేమైతేనేమికాని నీచెల్లెలిమీదైనా నీకు కనికరంవద్దా?

బుచ్చ—ఉండకుండా ఉంటుందా?

గిరీ—ఉంటే దానికి సంబంధం తప్పించే సాధనం నీచేతులోనే ఉంది.

బుచ్చ—ఏమిచిత్రమైన మాట! నాచేతులోనా ఉంది?

గిరీ—ఒకమాట ప్రమాణపూర్తిగా చెప్పు. "నీ చెల్లి పెళ్లి తప్పించడము నీచేతనైతే చేస్తావా? నామీద ప్రమాణంచేస్తే ఆమాట చెప్పుతాను.

బుచ్చ—మీమీద ప్రమాణమే, చెప్పండి.

గిరీ—అమ్మయ్య! ఈమాట నీతో రహస్యంగా చెప్పుదామని ఎన్నాళ్లనుంచో కాచి ఉండగాఉండగా ఇప్పటికి సమయం చిక్కింది. మీచెల్లి పెళ్లి తప్పడానికి ఒకటే సాధనం ఉంది, చక్కగా విను. నీవు ముందూ వెనకా ఆలోచించక నన్ను పెళ్లిచేసుకోవడమే. లేకుంటే పెళ్లి తప్పదు.

బుచ్చ—నేను మీతో లేచివస్తే నాచెల్లి పెళ్లి ఆగుతుందా?

గిరీ—నీచేతనే ఒప్పిస్తాను. మనము పారిపోయినతరువాత మీవాళ్లు నీకోసము బెంగపెట్టుకొని ప్రస్తుతం పెళ్లి మానుకొంటారు. నీలాగే సుబ్బికూడా ఉడాయించి తన కిష్టమున్నవాడ్ని పెళ్లాడుతుందనే భయముచేత ముసలివాడికి దాన్ని కట్టిపెట్టరు.

ఈమాట లాడేటప్పుడు బుచ్చమ్మ ముసిముసినవ్వింది. చేప వలలో పడడానికి సిద్ధమైనదని గ్రహించి-

గిరీ—నాతో బయలుదేరడానికి సమ్మతమేనా?

బుచ్చ—అమ్మనాయనా! నా ప్రాణంపోతే మీవెంటరాను.

"ఏమిది! ఇంతయత్నమూ వృథా అయిందే! ఆతురము కూడదు. కానీ, నేను చచ్చిపోతానంటే తన కిష్టములేనట్టు చెప్పిందికదా? ఇప్పుడా అస్త్రము జోడిస్తాను" అని కృతనిశ్చయుడై—

గిరీ—నీవు రాకపోతే మీచెల్లెలికి పెళ్లితప్పదు, నాకు చావు తప్పదు.

బుచ్చ—అలా అనకండి.

గిరీ—అనకపోతేమాత్రం చావుతప్పేదుందా? నిన్నువిడిచి బ్రతకలేను, అదొక చావు. నామీద ఒట్టువేసుకొని మాటతప్పినావంటే నన్ను దేవుడే చంపేస్తాడు, అది రెండోచావు. నా కెలాగూ చావు తప్పదు.

బుచ్చ—నానుంచి మీరు చచ్చిపోతే నేనూ చచ్చిపోతాను. మీరు చచ్చిపోవద్దు.

గిరీ—నావశమా?...అదిగో నీతమ్ముడు వస్తున్నాడు. మన మిక కష్టసుఖాలు మాట్లాడుకోవడానికి వీలుండదు, త్వరగా ఒక్కమాట చెప్పు. నన్ను చావుమన్నావా? బతుకుమన్నావా?

బుచ్చ—వెయ్యేళ్లు బతకండి.

గిరీ—ఐతే నావెంట రావడము ఖాయమేనా?

అప్పుడు బుచ్చమ్మ ఇలా గనుకొనిఉంటుంది:– అన్నా! ఏమి సేతును? ఇతడు చెప్పినట్లు చేయకుంటే నిష్కారణమూ ఇతడు చచ్చిపోతాడు, అంతట నేను బతకలేను. ఇతనిమాట వింటినా ఇద్దరమూ హాయిగా బతుకుతాము, సుబ్బిపెళ్లీ తప్పిపోతుంది. గిరీశంగారు చెప్పినట్లు నే నాతన్ని పెళ్లాడితే సుబ్బీ నాలాగే చేస్తుందని మానాన్న దాన్ని ముసలివాడికి కట్టిపెట్టడు. అది సుఖపడుతుంది, నేనూ పెళ్లాడి సుఖిస్తాను. నా చర్యకు మావాళ్లు నాలుగురోజు లేడుస్తారు అంతే; తర్వాత వాళ్లూ సంతసిస్తారు. కాబట్టి నే నితనివెంట రామవరం పోవడమే మంచిపని–అని నిర్ధారణచేసుకొని

బుచ్చ—ఏం చెయ్యమంటే అది చేస్తాను.

గిరీశంకష్టం ఫలించింది. పాచిక పూర్తిగా పారింది. కార్యసాధనమందు ఎంతచాతుర్యము కవి కల్పించెనో, యోచించండి.

బుచ్చమ్మను రామవరము తీసుకొనివెళ్లినాడే కాని పెళ్లిచేసుకొనడానికి వీలులేకపోయింది. Widow Marriage Association వారు వితంతువులను కనబడ్డ వారికల్ల పెళ్లిచేయరు. భార్యను పిల్లలను పోషించ డానికి తగిన హామీ చూపిస్తేనేకాని పెళ్లి కానేరదు. బుచ్చమ్మతో బూటకపుమాట లాడినాడేకాని గిరీశం వద్ద సొమ్ము లేదు. ఏదో మాయోపాయము చేసి ధనము సంపాదించవలెను. లుబ్ధావధాని గట్టి చిక్కులలో పడ్డాడు—హతురు లేచిపోవడానికి సిద్ధంగా ఉంది; పెళ్లాడిన పిల్ల పారిపోయింది; హనీ కేసు తలమీదపడింది. రామప్ప కొంపతీసినాడు. కేసు తప్పేమార్గము తోచలేదు. అధికార్లు తనపూ, హతురికీ ఉరిశిక్ష వేయించడానికి పట్టుబట్టి సాక్ష్యం సరిచేసి నారు; తనపక్షాన పల్కేవాళ్లు లేరు. సౌజన్యారావు పంతులుగారు సాత్వికుడు, ధార్మికుడు, పరోపకార పరుడు; శరణంటే చక్ర మడ్డువేస్తాడు. అతనికాళ్లు పట్టుకొని ఈగండము తప్పించుకొని కాశికి పోవలెనని లుబ్ధావధాని నిశ్చయించుకొన్నాడు. కావలసినంత ధనము ఉన్నా మనిషిదిక్కు లేనందున దీనస్థితి వచ్చింది. ఇట్టిసమయమున అతనికి సాయపడితే ఏమైనా లాభించవచ్చుననే ఆశ కలిగింది గిరీశంకి - ఇంకోటి - సుబ్బిపెళ్లి ఆగిపోయిందని కచ్చితమైన కబురు తెలి యనిదే బుచ్చమ్మ పెళ్లాడనన్నాదికాబోలు. ఈ కారణ ములచేత గిరీశం రామచంద్రపురం వెళ్లకతీరిందికాదు. అగ్నిహోత్రుడు తనపైని తెచ్చిన Abduction కేసు తీసివేసుకొన్నాడు. ఇక భయములేదని ధైర్యముతెచ్చు కొని లుబ్ధునివద్ద చేరి "అన్నయ్యా! కష్టకాలమందు నీకు సాయపడవలెనని వచ్చినాను. బుచ్చమ్మను లేవదీసి నానేకాని పెళ్లాడలేదు. నీవు నన్ను చేరదీసి పెళ్లి వైభవములో చేస్తావనే ఆశతో నున్నాను. నీవు ఒంటరివైనావు, తోడుపడేవాళ్లు నేనుతప్ప ఎవరూ లేరు. నాకు లౌక్యవ్యవహారము చక్కగా తెలుసును. నీకు తగినసాయము చేయుమని సౌజన్యారావుగారు నన్ను పంపినా" రనే సరికి "నా కెవరిసాయమూ వద్దు, ఎవరిజోక్యమూవద్దు, అన్నిటికీ ఆమహారాజేఉన్నాడు" అని కసరినాడు. పోనీ Power of attorney అయినా ఇయ్యి, నీ క్లేశమూ లేకుండా నీవ్యవహారాలు చక్కబెట్టుతాను. దుర్మార్గుడా! కపటావతారుడైన రామప్పను నమ్మినావుకాని ఏకల్మషమూ లేని బంధు వుడను, నన్ను నమ్మకున్నావు. వాడు నీకొంప ముంచు తూనేఉన్నాడు. పెళ్లి మానుకోఅని పెద్దఉత్తరము వ్రాసినాను. నామాట పెడచెవినిపెట్టకపోతే ఈ చిక్కులు రాకనేపోను; ఇప్పుడున్న కేసు మాయము చేయిస్తాను. నామాట విను." ఈశ్రమ, హితోపదేశమూ మహాబధిరశంఖారావ మయింది. తుదకు సౌజన్యారావు గారిని చూసి నాలుగుకోతలు కోసి లుబ్ధావధానికి తన సాయము చేసూరేటట్టు బందోబస్తుచేయండని ప్రాధేయ పడగా ఆసంటూరుశాస్త్రిహబీ బయలుచేస్తే హనీకేసు పోతుందిగనుక ఆప్రయత్నము చేయుమన్నారు రావు గారు. ఈగిరీశం Social reform లో గట్టిపని చేసినవాడుగనుక పెద్దమనుష్యుడనిన్నీ, బుచ్చమ్మ నతని కిచ్చి పెళ్లిచేయవచ్చుననీ అతని అభిప్రాయము.

ఈ సమయమున మధురవాణి రావుగారి దర్శనమునకు వచ్చింది. ఆమె తనసుట్టు రట్టుచేస్తుందని భయపడి గిరీశము రెండర్థము లిచ్చేటట్టు మాటలాడి "ఒకర్ని కాపాడి ఉపకారంచెయ్యడం ఉత్కృష్టమైన పుణ్యము; చెడ్డవాడనైన నాయెడల మంచిగా ఉండడమే యోగ్యత; అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాడె నేర్పరి—"మధురవాణిని బతిమాలుకొని పోయి పరుండెను. పిమ్మట ఆమె గిరీశంగారి నైఖరి ఉన్న దున్నట్లు చెప్పకతీరిందికాదు. ఆక్షణమే సౌజన్యారావు అతనిని మధురవాణిఎదుట మొగమువాచేటట్లు చీవాట్లుపెట్టి "నీవు బుచ్చమ్మను పెళ్లాడతగవని Social reform Association వారికి వ్రాస్తాను. బుద్ధికలిగి చదువుకొంటే ధనసహాయము చేస్తా"నని చెప్పి తగిలివేసినాడు.

—౨. రామప్పంతులు

ఈ నాటకమందు గిరీశంతరువాత ఎక్కువపని కల్గినవాడు రామప్ప. ఇతనికి అన్నిపాత్రములతోనూ సంబంధ ముంది, ఇతడు రామచంద్రపురానికి కరణము. వాక్చాతుర్యమం దాతనితో సమానుడేకాని స్వతః పిరికి; పరశ్రేయస్సహనము పూజ్యము. అందరిని చులకనచేస్తాడు. ఆత్మస్తుతి, పరనింద ఇతనికి ఆజన్మ మలవడింది. గిరీశమంటే అసూయ, అమితభయము. అతని పోషణ మధురవాణి ఉండి డబ్బు కిబ్బందిపడుతూండగా అప్పులు తీర్చుకోమని రెండువందలరూపాయి లిచ్చి ఆమె నుంచుకొని రామచంద్రపురము తెచ్చుకొన్నాడు. "చంకదుడ్డు శరణార్థి" రకము. డాబుకై అందరిమీద నిందారోపణ చేస్తాడు.

సుబ్బిది ధనజాతకము, ఆమెకు సంతానరేఖ బాగా ఉన్నదని పొగిడి లుబ్ధావధానిని పెళ్లికి పురికొల్పినాడు. ఇతని కొక సిద్ధాంతి, ఒక పండాయున్నూ స్నేహితులు; వాళ్లచేత జాతకాలు తన చిత్తమువచ్చినట్లు బనాయించేవాడు. తాను గొప్ప లౌక్యుడని తగని అభిమానము; లౌక్యమంటే మోసమని ఇతని సిద్ధాంతము. తనయెడల ఎవరేనా ఏకవచన ప్రయోగం చేస్తే తన్నుకో చస్తాడు. మధురవాణిపైని అమితానుమానము. తాను ఇంటలేనప్పుడు ఆమె ఎవరెవరితో మాటలాడుతుందో తెలుసుకోవలెనని కాపుపెట్టింది చాలక కనబడ్డవారినందరినీ అడిగేవాడు. తాను లంచము తినడమేకాక ఇతరులకు మేపేవాడు. పిత్రార్జితానికి కరారావుకి చుట్టినాడు. అనగా క్రయము చేసినాడు, కనుక డబ్బుకి ఇబ్బందిపడేవాడు. ఇతని కథ పైకి పటారము, లోపల లొటారము అని ఎరిగినదికావున మధురవాణి కితనిపైని నిగా లేదు. వీలైనపుడెల్ల వేళాకోళము చేస్తూ సిరా, నీళ్లూ, ఇతనిపై దిమ్మరించి పరాభవిస్తూండేది. అతనెంతపోరినా అందరితోనూ మాటలాడుతూ ఉండేది.

అధికార్లకు లంచమివ్వవలెనని చెప్పి సొమ్ము పుచ్చుకొని ఎగవేసేవాడూ, పేచీకోరు కావడముచేత అతనితో విరోధపడ్డవారిమీద పగబట్టి నానావిధాల బాధించేవాడు. పోలీసువాళ్లను మంచిచేసుకొని అందరినీ బెదరిస్తూ కార్యసాధనము చేసుకొనేవాడు. లుబ్ధావధానికి తనంటే పక్కబెదురు. రామప్ప కింగ్లీషు రాదుకాని మాటిమాటికీ Damage దావా పడేస్తానని బెదరించేవాడు. దావాలంటే ఇతనికి చాలా సరదా. పరమజారుడు; లుబ్ధావధానికూతురు మీనాక్షిని చెరిపినవాడితడే, కాని మధురవాణిని మరిగి మీనాక్షిని మరచినాడు. మధురవాణి ప్రోత్సాహముచేత తాను లుబ్ధునకు కూర్చిన సుబ్బిపెళ్లి తప్పించ నిశ్చయించి కరటకశాస్త్రివద్ద ఇరవైఅయిదురూపాయిలు లంచముపుచ్చుకొని - ఇది సంచకరువు - శుల్కములో ఐదోవంతు తన కిచ్చేటట్టు ఏర్పాటుచేసి లుబ్ధునివద్ద ౧౨౦౦ రూపాయిలు శుల్కము నిర్ణయించి మాయసుబ్బిపెళ్లి స్థిరపరచినాడు. అగ్నిహోత్రుని సంతకము forge చేసి సుబ్బిని ఇవ్వమని లుబ్ధునిపేర ఉత్తరము వ్రాసినాడు, కాని తత్ఫలము విపరీతమైనది. తనలో లేనిలోపము లెంచి సంబంధము తప్పించచూసిన అగ్నిహోత్రునిపైని పట్టరాని కోపము వచ్చి లుబ్ధుడు సుబ్బిని పెళ్లాడితీరుతానని పట్టుపట్టినాడు.

ఇదీలాగుండగా మాయసుబ్బిపెళ్లి నిర్ణయించబడి ముహూర్తనిశ్చయ మైనది. తనరొట్టె నేతిలో పడ్డదని తలచి సాలెమనే ఊళ్లో నున్న శిష్యుల నందరిని పెళ్లికి పిలిచి మధురవాణిచేత మేళముకట్టించి మహానంద మనుభవించవలెనని ఉబలాటపడి ఊరు విడిచినాడు. ఇంతవరకూ ఇతని ఆట సాగింది.

"ఉరుమింగే అత్తగారికి తన్ను మింగే కోడ" లన్నట్లు కరటకశాస్త్రి రామప్ప ఊళ్లో లేకుండడము చూసి ఏకరాత్రివివాహము చేయించి రామప్పవంతెగవేసి ఊరుదాటినాడు. అదివిని రామప్ప అడలిపోయి మధురవాణికంటెయినా చేజిక్కించుకొనవలెనని లుబ్ధు నడిగినాడు. వస్తుతః అతడుకంటె పెట్టుతాననలేదు; ఇదంతా రామప్పకల్పన. బెదరిస్తే పిరికి లుబ్ధుడు లొంగుతాడనుకొన్నాడుగాని పరాభవమయింది. అంతతో మానుకోక మీనాక్షిద్వారా కార్యము సాధించవలెనని ఎంచినాడు. ఈ మధ్య ఆమెజోలికే పోలేదు; మనస్పూర్తిగా ఆమెచేత యత్నము చేయించవలెననే ఉద్దేశ్యముతో ఆమె పెళ్లాడుతానని ప్రమాణముచేసినాడు. ఇందువల్ల ఫల మేమీ లేకపోయిందిగాని ప్రతిబంధక మొకటి కలిగింది. వీళ్ల రహస్యసంభాషణవర్తనమున్నూ పొంచియుండి విన్న లుబ్ధుడు లేనిధైర్యము తెచ్చుకొని కర్రతో రామప్పకాలు విరుగకొట్టి మీనాక్షిని ఇంటి నుండి తరిమినాడు. రామప్ప తనయింటికి పరుగెత్తినాడేకాని మధురవాణి తలుపుతీయ నన్నది. వెనుక తిరిగిచూసేసరికి మీనాక్షి ప్రత్యక్ష మయింది. చూడండి రామప్పగతి: ఇంటిలోపల సానిలంజె కంటె తెస్తేనేకాని విడువదు; బైట సంసారిలంజ పెళ్లాడితేనేకాని విడువదు. "ముందు నుయ్యి, వెనుక గొయ్యి." ఏమిచేయడానికి తోచక పైకి దాటి తప్పించుకొన్నాడు. తాను చేసిన మోసము తన క్రొంపే ముంచింది. "మితిలేని పాపానికి మృత్యుకల్ప మైన దండన" ఇంతతో తలకుడుచుకొని ఊరకుండవలసినది; అభిమాన మాగనిచ్చింది కాదు. రామప్ప తెలివితోకూడా రాత్రి తెల్లవారింది. పంతులపాపమింకా పండలేదు.

అగ్నిహోత్రుని సరసచేరగానే లుబ్ధునిపై కసి రగిలి తిరిగీ కార్యప్రవాహమున అతని కాలుపెట్టించింది. అగ్నిహోత్రుని ఉసికొల్పి లుబ్ధునిపైకి పంపగా వారిద్దరికీ జగడము పెరిగి లుబ్ధునికి కాయశుద్ధి అయింది. తన్ను కొట్టినందుకు తగినశిక్ష అయింది; పైపెచ్చు తనకు అగ్నిహోత్రుని ఆసరా దొరికింది; అతనిచేత దావా దాఖలుచేయించినాడు; కూహకముచేసి తాను కూనీకేసు దాఖలుచేసినాడు. వీటితో లుబ్ధునికి, మీనాక్షికీ ఉరిశిక్ష అవుతుందని ఊహించినాడు.

అగ్నిహోత్రునిచేతిలో డబ్బులేదు; తాతలనాటి కడియము తాకట్టుపెట్టించి ఫీజుతక్కువ అని తెనుగు ప్లీడరుకి వకాల్తి ఇచ్చి, అతడు మధురవాణిఇంటిపక్కనుండి రావడము చూసి అనుమానపడి ఇంగ్లీషువకీలుకి వకాల్తి ఇచ్చినాడు. వకీలు, ప్లీడరున్నూ పరస్పరస్పర్ధచేత కేసు పాడుచేసినారు. న్యాయాధిపతి అగ్నిహోత్రునిమీద అడ్డమైన కేకలు వేయడముచూసి తన పరపతి దగ్గమౌననే భీతిచేత రామప్ప చల్లగా జారినాడు. అగ్నిహోత్రునికేసూ, కడియమూ, రెండూ పోయి అవమానానికితోడు అర్థనష్టము ప్రాప్తించింది,

ఇంతటనైనా రామప్ప తనయత్నములకు స్వస్తి చెప్పక లుబ్ధావధాని చిక్కులలో పడ్డాడని ఎరిగి ఇన్స్పెక్టరుగారికీ, కలెక్టరుగారికీ లంచాలిచ్చి కూనీకేసు కమాపుచేయిస్తానని చెప్పి లుబ్ధుడు తనవద్ద సొమ్ము లేదంటాడని ఎరిగి అప్పు ఏర్పాటుచేసి నోటు వ్రాయవలసిందని సలహా యిచ్చినాడు. లుబ్ధుడందుకు ఒప్పుకోనందున కూనీకేసు బలపర్చడానికి కూటసాక్ష్యము కల్పించుమని Head Constable ని ప్రోత్సహించి అందుకు బైరాగిమఠము, తాగుబోతుల అఖాడా మొదలైనచోట్ల తిరిగితిరిగి విఫలమనోరథుడయినాడు. ఇప్పటికి పాపము పరిపక్వమైనది. మధురవాణి కితనిపైని వెగటుపుట్టింది. ఎంత దుష్టునకైనా ధార్మికుల ప్రాపు ఉన్నంతకాలము అపాయ ముండదు.

రామప్పకు అట్టి పరవస పోయింది. ఎటుచూసినా బ్రతుకు ఎడారిలా నుంది. గుంటూరుశాస్త్రీ జోగట్టా తెలియలేదు. బైరాగివేసిన అంజనము ఫలవంతము కాలేదు. మాయసుబ్బి చచ్చి దయ్యమయిందని విని దానిని సీసాలో దింపించినారుకాని లాభం లేక పోయింది. రామప్పకు దేవుడుకాని, దయ్యముకాని, మనుష్యులుకాని సాయముచేయలేదు.

ఇప్పు డొక్కటే ఉపాయ ముంది. లుబ్ధావధానిపైని తేబడిన కేసులో సౌజన్యారావుగారు గట్టి పట్టుతో పనిచేస్తున్నారు. అతనిని చూసి అందులో ఏదైనా ఫని కొంత కల్పించుకొని నాలుగురూకలు సంపాదించవలెననే బుద్ధి పుట్టింది రామప్పకి. రావుగారు పరమధార్మికుడు. అసత్యమనహా అతనికి చుక్కెదురు. ఈవాజమ్మ అత డందరుపకీళ్లలాగు అబద్ధ సాక్ష్యము అల్లేవాడు అనుకొని ఎత్తుఎత్తినాడు. తురుపు కలియలేదు ఆటకు దేలయింది. రావుగారికి రామప్ప నైజము తెలుసునుకావున అతడు "లుబ్ధావధానిమీది కేసు వట్టిఅన్యాయము; ఒకరవైన్నా నిజంలేదు; కలవైతే గట్టి Defence సాక్ష్యం" — అనేసరికి అర్ధచంద్రప్రహార మయింది — "అవతలకి నడువు" అన్నారు రావుగారు. "ఏకవచనప్రయోగమా?" అనే సరికి "నడువు" అనిక సరినారు. రామప్ప అట నిల్వ లేక తలగోక్కొంటూ తరలి అగ్నిహోత్రునివద్ద చేరి గిరీశంపైని Abduction కేసు పెట్టించి అది నిలిచే విధం లేకపోతే తనకూరికి దారితీసినాడు.

"చెడపకురా చెడేవు" అనేన్యాయము రామప్ప యెడ సార్థకమయింది. ఎప్పుడూ ఏదో రేగిస్తూంటేనే కాని ఇతనికి తోచదు. గిరీశంకి రామప్పకి కొంత సాదృశ్య మున్నా, పిరికితనము, తెలివితక్కువ ఉండడముచేత రామప్ప గిరీశంకి తీసిపోయినాడు. కొందరిని చాలాకాలమువరకు మోసగించవచ్చును. అందరినీ కొద్దికాలము మోసగించవచ్చును; అందరిని చాలా కాలము మోసగించడము అసంభవము. వంచకునకు ధైర్యమూ, వివేకమున్నూ ఆవశ్యకలక్షణములు. రామప్ప మోసగించడంలో సామదానభేదజ్ఞుడేకాని, ధైర్యము, బుద్ధి తగినంత లేనందున తనగోతిలో తానే పడుతాడు. ఈ నాటకపాత్రములయందు అధము డితడే. ఐనా ఇతన్ని చూస్తే అందరికీ జాలి పుట్టేలాగు కవి ఈపాత్రము నిర్మించినాడు. ఇట్టి చాతుర్యము మెచ్చతగినది. హాస్యగసపోషణకు ఈ పాత్ర మెంతో ఉపయోగించును. ప్రపంచమందు ఇట్టి మొండివాళ్లు అనేకు లుండడముచేత కథయందలి యాథార్థ్యమునకు ఈ పాత్రము ప్రయోజనకారి. పురుష ప్రయత్నమే కార్యసాధనకు ముఖ్యసాధన మనిన్నీ, ఒకచోట ఇది విఫలమైతే వేరొకచోట సఫలము కాకతీరదనిన్నీ, ధర్మమార్గమనేది పిరికివాళ్లు, అజ్ఞానులూ కల్పించిన తోవఅనిన్నీ, ధీమంతులు ఇది వెఱితోవ అని గణించవలసినదనీ రామప్పకు దృఢమైన నమ్మకము. ఇతని ఆచరణముబట్టి చూస్తే ఇతనికి దయాదాక్షిణ్యములు, విశ్వాసము, కృతజ్ఞత లేశమైనా ఉన్నట్టు తోచదు. సర్వకాలమూ స్వలాభమే చూసుకొందురుగాని పరోపకారము పొరపాటునైనా చేయడు. ఇతనికి సిగ్గుబిడియములు లేవు. "కింద పడ్డా మీది వాడనే" అని భావిస్తాడు.

## —3. అగ్నిహోత్రావధాని

ఈతడు కథానాయకు డనవచ్చును. జటావల్లభుడైన స్వాధ్యాయవేత్త. అతికోపనుడు. ఎదుటివారి నెవరినీ లక్ష్యపెట్టక తనమాట చెల్లించుకోవడమే ఇతని పట్టు. ఇతని అభిప్రాయాలు వింతగా ఉండును. ఎవరో ఇద్దరు పిల్లవాళ్లు ఇంగ్లీషు చదువుకొంటూంటే వాళ్లకు ప్రాణముమీదికి వచ్చిందట, అందుచేత ఆవిద్య తన కచ్చిరాదట! తన భార్యపట్టుచేత పుత్రవానికి చదువుచెప్పిస్తూన్నాడేగాని కొంప గుండమాతున్నదని గునుస్తూనే ఉన్నాడు. కడుల్లోభి ఔటచేత ఇంటికెవ్వరూ రావడ మితనికి కిట్టదు. గిరీశం రాగానే "ఇతని వైఖరిచూస్తే ఇక్కడ వేసేటట్టు కనబడుతూరది. మాయింట్లో భోజనం ఎంతమాత్రం వీలుపడ"దని కేకలు వేసినాడు. పుస్తకాలకి సంవత్సరానికి పదిహేనురూపాయి లవుతుందని వినగానే "ఒకపైసా

ఇవ్వను, వేదమంతా ఒకదమ్మిడీ ఖర్చులేకుండా. నేను చదివినా” నన్నాడు. శీఘ్రకోపి కాని ఇతడు దీర్ఘ కోపి కాడు. తన లోపము తా నెరిగి తడబడేవాడు. “చూశారా, గిరీశంగారూ, కొంచెము నాకు ప్రథమ కోపము. ఎవరో తెలియకుండా అన్నమాటలు గణించ కండేం” అని పశ్చాత్తాపపడి వేడుకొన్నాడు.

ఆసపడుచుల్లను అమ్మకోవడం శిష్టాచారమట; తమ వంశములో నూడుతరాలబట్టి ఇది జరుగుతూన్న దట; “శుల్కము పుచ్చుకోకపోతే మగడు చచ్చిన తరువాత పిల్లగతి ఏమికాగలదు” అని ఇతనివాదన. ఎవ రేనా “నీవు పిల్లనమ్మినా” వంటే ఇతనికి ఒళ్లు మంట. అది తప్పని ఎరిగీ ద్రవ్యాశతో అలాగుచేయకుండా ఉండలేడు. సుబ్బిని రు. ౧౮౦౦ లకు అమ్మనిశ్చయిం చినాడు. ఆసొమ్ము పెట్టి కొడుకుపెళ్లి చేస్తాడట!

సంఘసంస్కరణ యితనికి పీడకల. శుల్కము మానుకోలేడు. చిన్నపిల్లలను పెద్దవాళ్లకి కట్టిపెట్టక పోతే శుల్కము లభించదు. వితంతువివాహమంటే వెగటు. దావాలంటే తగని సరదా; చేతిలో సొమ్ము లేకుంటే నగైనా తాకట్టుపెట్టి గ్రంథము నడిపిస్తాడు. ఇరుగుపొరుగువారితో దెబ్బలాడి గోడహక్కులు నిలువబెట్టుకొన్నాడు. దావాలో వీగితే యజమానులు లంచము పుచ్చుకొన్నారని నిందిస్తాడు. లుబ్ధావధాని తన కూతురుని మాని ఇంకొకపిల్లను పెళ్లాడితే అతని ఇంటికి వెళ్లి పోట్లాడి, అతనిని కొట్టి పైపెచ్చు అతని పై దావాచేసినాడు. సొమ్ముపట్ల ఎవరినీ నమ్మడు; రామప్పమాత్రము మసిబూసి మారేడుచేసి ఇతని కడి యము అపహరించగలిగినాడు. నోటువ్రాయడ మితని కిష్టము లేదు, కేసుపోతే ప్లీడరుకి ఫీజు ఇవ్వడు. వెర్రి కోపముచేత ఒకానొకప్పుడు నష్టపోవును. శిష్టాచార సంపన్నుడైనా సమయము వచ్చినప్పుడు సానివాడకు వెళ్లినాడు. బుచ్చమ్మ లేచిపోయిందని విని చింతించు టకుమారుగ కోపపడి తిట్టినాడు. గిరీశం చెప్పినట్లు ఇతనికి హితోపదేశము చెయ్యడము వ్యర్థము. తాను వినకపోవడమే కాకుండా చెప్పేవాళ్లని చేసతిట్టును. శుల్కము పుచ్చుకోగూడదని గిరీశమంటే పెరుగన్నము బుచ్చమ్మనెత్తిని పులిమినాడు. సౌజన్యారావు సంఘ సంస్కరణము మంచిదని బోధిస్తే అతన్ని తిట్టినాడు... అదంతా మీకెందుకయ్యా? ఓహో! మీగృహకృ త్యాల ఊసుకి నే నొచ్చానా ఏమిటి? నాగృహ కృత్యాల ఊసు మీకెందుకూ?............వెధవ ముండని లేవదీసుకుపోయిన పకీరువెధవప్రశ్నం మాట్లాడుతావు, ఏమిపెద్దమనిషివయ్యా! వెధవముండ లకీ పెళ్లిచేయడపు పోయికాలం పట్టుకుందేమి పెద్ద పెద్దవాళ్లకికూడాను?......“గిరీశంమీద చేసిన దావా తీసివేసి బుచ్చమ్మఆస్తి ఆమెపరం చేయవలసినది. లేకుంటే చాలాబాధ కల్గుతుంది. ఆరెండుకేసులలో నేనే పనిచేస్తాను, మీకు శరీరక్లేశము, అర్థనష్టము కలుగతవి” అని రావుగారు సలహాయిస్తే, “నేను అగ్రహారపు చెయ్యని, దావా అని బెదిరిస్తే భయపడే వాడనుకాను” అని ప్రగల్భములాడినాడేకాని ఊరూ పేరూ తెలియని ప్రతివాదిపైని దావాతెచ్చినాడు; బుచ్చమ్మ పుట్టినసంవత్సరము “భావ” అని జాతకములో నుంటే తాను “ఆంగీరస” అని ప్రమాణముచేసి చెప్పినాడు. రెండేళ్లు పైనిబడితే మైనార్టీ తీరిందని వాదించే ఆశమాత్రమే చూసుకొన్నాడుగాని అస త్యానికి వెరవలేదు. చేయదలచుకొన్న కార్యము చేసి వేయడమేకాని ముందువెనక లాలోచించడు. నాయుడి మీద అనుమానపడి వకాల్తి భీమారావుగారి కిమ్మని రామప్ప చెప్పినందువల్ల మార్చినాడు. నాయుడు ఫీజడిగితే నీవు వ్రాసిన defence బాగుందికాదని ధిక్కరించినాడు. ఇందువల్ల సొమ్మెగవేయకలిగినాడు కాని తీరరాని ముప్పు మూడింది. నాయుడు అగ్ని హోత్రునిపై పగపట్టి అతనిపైని కొండెములు కల్పించి కలక్టరుగారికి కోపముతెప్పించి కేసు పాడుచేయించి నాడు.

అవధానిగారి తెలివితేమికి ఒక్క విషయము చాలును. ఇతనితో సంబంధమున్నవాళ్లందరూ ఇతని కంట్లో దుమ్ముకొట్టినారు. కొడుకు గొప్పఉద్యోగాలు చేస్తాడని ఇతడు ఆశిస్తూంటే వాడు దుర్వినియోగము చేస్తున్నాడు. కరటకశాస్త్రి లుబ్ధావధానికి మాయ

పెళ్లి చేసి ఇతని నోట్లో మన్ను కొట్టినాడు. ఇతనిచేత తగినరీతిని సత్కరింపబడి జడాయికొట్టి గిరీశం బుచ్చమ్మను లేవతీసినాడు. ఇతనికూతుర్ని పెళ్లాడుతానని నమ్మించి లుబ్ధావధాని ఇంకొకర్తెను వివాహమాడినాడు. ఇందువల్ల అవధానిగారికి ధనవ్యయము, గౌరవహానిన్నీ కలిగినవి. ఇతనిని కోతివలె నాడించి, ఊళ్లవెంట తిప్పి, డబ్బు ఖర్చుపెట్టించి అందరిచేత అవమానపరిపించి, తాతలనాటి తాకట్టు పెట్టి తాను హరించి చెప్పకుండా తనవూరికి చల్లగా జారినాడు. ఇతను కేసులో నియోగించిన ఇద్దరు ప్లీడర్లూ తగవులాడి కేసు దగ్ధపటలమొనర్చినారు. సౌజన్యారావుగారు హితోపదేశముచేసి తలతిక్కమనిషి అని విసికి బుచ్చమ్మఆస్తికి దావాతెచ్చినారు. కలక్టరుగారు తల వాచినట్లు చీవాట్లు పెట్టినాడు. డబ్బుపుచ్చుకొన్న దాసరి దారిచూపించలేదు. భార్య ఇతనితో ఏకీభవించక ఇంట్లో పోరుపెట్టింది. కూతురు బుచ్చమ్మ ఇతని కృత్యముల నేవగించి ఇంటినుండి లేచిపోయి హాయిగా పునర్వివాహముచేసుకొంది. ముక్కుమొగమెరుగని మధురవాణికూడా ఇతనితో స్పర్ధించి ప్రతిగా వ్యవహరించి నాటకమాడించింది. ఈతీరున ఇంట్లో వాళ్లూ, పైవాళ్లూ ఇతనిమీద కత్తిగట్టినారు. దీనికంతటికీ మూలము అవధానిగారికి—కన్యాశుల్కమందున్న గట్టిపట్టు. అందరూ వద్దన్నపనిని చేయవలెననే హఠమే అగ్నిహోత్రుని కొంప గుల్లచేసింది. తలపెట్టిన పని తారుమారుచెయ్యనా అనే అహంభావ మింతమట్టుకు తెచ్చింది. పట్టుదల మానవునకు మంచిలక్షణమేకాని అది దుష్ప్రవృత్త్యావేశముచేత పుట్టినట్టయినా కీడు తప్పదు. తా నొకటి తలుస్తే దైవ మన్యథాతలచునన్న న్యాయ మితనియెడల సార్థకమయినది. చెడ్డపని చేయదలచినవాళ్లకు చేటుతప్పదు. తమకు దోచినదే తథ్యమనిన్నీ, పరోపదేశము పాటిచేయరాదనీ తలచే మహాత్ములు అనేకు లున్నారు. వీరి దుస్సర్వజ్ఞత్వము దురపనేయము, సర్వానర్థకారి. ఐనా వీరీపట్టు విడువరు. అహమిక అంతటినీ పాడుచేస్తుంది. మానవుడు సర్వజ్ఞుడు కాడు. అందుచేతనే "వినదగు నెవ్వరు చెప్పిన........" అని చెప్పినాడు వేమనయోగి. అవిమృశ్యకారికి ఆపదలు నెండు. ఎట్టి ధీమంతునకైనా ప్రమాదము సంభవించవచ్చును. అందు హితబోధ ఆవశ్యకము. "బాలాదపి గృహీతవ్యం యుక్తముక్తం మనీషిభిః" అని మహావాక్యము మరువగూడదు.

## —౫. లుబ్ధావధాని

ఈతడీనాటకమునకు ప్రతినాయకుడనవచ్చును. కరటకశాస్త్రితో రామప్పంతులితనిగూర్చి "వాడికి డబ్బుతోనేకాని ఇంకొకరితో స్నేహము లేదు. లోకవ్యవహారము చేతకాకపోవడమూ, కోర్టంటే భయమూ ఉండబట్టి నన్ను మంచిచేసుకొన్నా" డనెను. ఇతని నాలుక పలచన, అందరినీ తిట్టుతాడు. దీర్ఘాలోచన లేదు. గిరీశము వ్రాసిన ఉత్తరము చూసి అది బోధపడకపోవడముచేతనూ, అందులో అగ్నిహోత్రుడార్భాటముతో తరలివస్తూన్నా డని వ్రాసియుండుటచేత తనకు వృథాధనవ్యయ మయిపోవుననే చింతచేతనూ రామప్పంతులు సహాయముకోరును. ఇతనికి పరోపదేశపాండిత్యమేకాని స్వబుద్ధివికాసము లేదు. జగడమన్నా, దావాఅన్నా అమితభయము; అందువల్లనే రామప్పంటే పక్కబెదురు. అతనికి తెలియకుండా ఏకరాత్రివివాహము చేసుకొనడానికి జంకి "పంతులు తనకు పదిరాళ్లు దొరుకుననే ఆశతో నున్నాడు కనుక ఏకరాత్రివివాహమున కొప్పుకో" డని కరటకశాస్త్రి చెప్పితే ధనలాభముందని ఒప్పుకున్నాడు. "నీమీద కిట్టనివారెవరో (రామప్పకాబోలు) నీవు వివాహము చాలావైభవముతో చేస్తావని చెప్పినారట. అందుచేత అగ్నిహోత్రుడు అత్యార్భాటముతో తరలి వస్తూన్నారు, నిష్కారణముగా నీకు ధనవ్యయము కలుగజేయడమే దీనికి హేతువు; నీ కాత్మబంధువునైన నామాట విను" అని గిరీశం వ్రాస్తే, దీనికంతటికి కారణభూతుడు రామప్పే అని నమ్మకొని అతనిపైని అలిగినాడు. "ఈ అడావిడివల్ల పంతులికి లాభ మేమీ లేదు, పోలిసెట్టిభాగ్యము పండుతుంది. ఈకూహాక

మతనిద్దై ఉండవచ్చునని" అనగానే రామప్పని వదలి పోలిసెట్టిమీద పడ్డాడు. ఇదీ అపోహమే. ఎవరేమి చెప్పితే దానిని నమ్మకొంటాడేకాని మంచిచెడ్డల నరసేమనిషి కాడు.

సుబ్బిపెళ్లిని లుబ్ధుడు మానుకోవడానికి ముఖ్యమైనహేతువు దానికున్నవని గిరీశముచెప్పిన అవలక్షణాలు; ఇదెంతవరకూ నిజమో అరసినాడా? అదీ లేదు. డబ్బుఖర్చుకూడా కారణము కాకపోలేదు. పిల్లనివ్వదలచుకొన్నవారికీ పెళ్లి ఇష్టము లేకపోవడమువల్ల తానుకూడా తప్పుకోవలెనని ఎంచినాడు; ఇది మూడో కారణము. ఇన్నికారణములచేతనైనా ఈ వివాహము మానుకొన్నాడా? రెండో ఉత్తరములో — "నీవు ముసలివాడవు, క్షయరోగపీడితుడవు, పిసినారివి, నీకూతురు చెడుతిరుగులు తిరుగుతూన్నందువల్ల నీకు వెలి" అనేవ్రాత వినగానే ఆత్మగౌరవానికి హానివచ్చిందని కనలి ఒక్కొక్కమాటకీ తగినసమాధాన మిచ్చినాడు: యాభైఏళ్లకే ముసలితనమా? — కొంచెము దగ్గ ఉన్నంతమాత్రాన క్షయరోగమా? — సంసారము పొత్తుగా చేసుకొంటే పిసినారినా? అదీకాక నిలివెడిధనము (రు ౧౫౦౦ లు) పోసి పిల్లను కొన్నవాడు పిసినారి అవుతాడా? నేనాపిల్లని కొనుక్కొన్నతరువాత దానిఘోష నాఘోష తనకెందుకూ? డబ్బుచ్చుకొన్నవాడు చచ్చినశవానికైనా ముడికట్టక తీరదు. ఇక నాకూతురు విషయము — ఈరామప్ప నాకొంపకూల్చినాడు — ఈమాటకు రెండర్థములు స్ఫురిస్తవి. నాగుట్టు అంగడిని పెట్టినవాడు రామప్ప అని పైవిషయములన్నీ బైటపెట్టినవాడితడే—లేకుంటే ఈవిషయములు కృష్ణరాయపురంవాళ్లకి ఎలాగు తెలియగలవు. ఇంటిగుట్టు రచ్చకీడ్చినవాడీ రామప్ప! వీడే నాకొంపతీసినాడని ఒకఅర్థము. రెండోది— నాకూతురిని మాయచేసి తనవలలో వేసుకొని దాని మానము చెడగొట్టినవాడు రామప్పే! అని ఒకఅర్థము. ఈరెండోవిషయము లుబ్ధునికి తెలిసినా రామప్ప తనమీద ఏమిపితూరీ తెచ్చిపెట్టునో అనేభయముచేత ఏమీ చేయలేకపోయినాడు! సమాధానము తగినట్టు లిచ్చినపిమ్మట అగ్నిహోత్రునిపై పగబట్టి అతనికి తగిన శిక్ష చేయడానికి అతనికూతురిని పెళ్లాడితీరవలెనని పాకులాడినాడు. భావస్థైర్యమేలే దీబ్రాహ్మడికి. మొదట సుబ్బిని పెళ్లాడతలచి శుల్కము సిసలుచేసుకొన్నాడు. తరువాత పెళ్లిమానుకోవలెనని ఎంచి కొంతకాల మూరకున్నాడు. కోపావేశమువల్ల తిరిగీ పెళ్లిచేసుకోవలెనని పట్టుబట్టి తుద కాపిల్లను మానిచవక బేరముకదా అనికరటకశాస్త్రి కూతుర్ని పెళ్లాడినాడు. ఈభావపరివర్తనము చూసి మధురవాణి ముక్కమీద వేలుపెట్టుకొన్నది!

ఇట మరియొకగొప్పవిషయము వ్యక్తమయినది. బాలికలు ఆటవస్తువులవంటివారని వీడి ఊహ. వారిగతి ఏమైనాసరే డబ్బిచ్చికొన్నవాడే వాళ్లప్రభువట— వివాహానంతరగతి తండ్రి కక్కర లేదట— వరునివయస్సు, రూపము, శీలము, సంప్రదాయమూ చూసి పెళ్లిచేయడముకాదు; ఎవడు హెచ్చుసొమ్మిస్తే వాని కమ్మివేయడమే యోగ్యమైనపనియట—శిష్టాచారమో అని మొత్తుకొనే అవధానిద్వయము కుదుర్చుకొన్న వివాహసంబంధమెట్టిదో చూడండి. యాభైయేళ్లవానికి ఎనిమిదేళ్లబాలికను కట్టిపెట్టడమే శిష్టాచారమా? ఇది సర్వజనామోదకముకాదని ఈనాటకమే బోధిస్తూన్నది. స్వలాభాపేక్షు ఉత్తమాదర్శకముగా ఎంచిన ఇద్దరు అవధానులూ, వాళ్లకన్న రెండాకులు హెచ్చుచదివినరామప్పంతులు మాత్రమే ఈవివాహమున కనుకూలురు. అగ్నిహోత్రావధాని నరమాంసవిక్రయముచేసే పాపాత్ముడు. అనుభవశాలికాడేమో అంటే బుచ్చమ్మ గుండెమీది కుంపటిలాగు ఉండనేఉంది. వానిస్వభావ మట్టిది. ధనలాభమంటే కూతురిని గోతిలో కూలవేసేడుంక! రామప్ప పదిరాళ్లు కాజేసేవాడు, అతనికేమిపోతుంది? పద్దెనిమిదివందలకు పిల్లనమ్మకొని కన్యాదానముకు పూనుకొన్న అవధాని ఎట్టిశిష్టుడో ఆలోచించండి— ఇది కన్యాదానమా? కన్యావిక్రయమా? లుబ్ధావధాని లక్షాధికారి అనివాడుక, ఎంతోకాలము బ్రతకడు— అతనియాస్తి హస్తగతమవుతుందనే ఆశ అగ్నిహోత్రుని

కుండదా? ధనాశాపిశాచము పట్టినదముతోనే దారపు త్రాదులయందలి దాక్షిణ్యము తప్పిపోయినది. వీడిచదు వేల? ఎంతబుద్ధిజాడ్యము! ఎంతఉన్మాదము! వివాహమువంటి పవిత్రాచారము అంగడిబేర మనుకొన్నాడు. బాలుకుహడా ఛీ ఛీ అనేదురాచారము వీనికి శిష్టాచారమయినది! బానిసవృత్తి మనదేశములో ఈరీతిని సదాచారమయింది. శూద్రులలో డబ్బిచ్చి బాలికలను కొని వారికి వేశ్యావృత్తి నేర్పడము రహస్యముగా జరుగుతూన్నది. కొనుక్కొన్నవాళ్లు పెంచుకొన్నామని పైకిచెప్పుతారు. "చింతామణి" అనేనాటకములో ఈవిషయము వ్యక్తపరచబడినది. బాలికలపై నెట్టి అత్యాచారములు జరుపబడుతూన్నవో చిత్తగించండి- ఇవిచేసేవారు వాళ్లతల్లిదండ్రులే. తల్లి విషంబుపెట్టినను, తండ్రి ధనికులకమ్ముకొన్న, అవల్లభు డొల్లకున్న ఇక వారికి నెవ్వరు దిక్కు? కన్యావిక్రయమనే దురాచారము మనసంఘములో వేరుతన్నింది.— చూచి దాసిని నిర్మూలించేదిక్కు లేదు.

ఇది యిట్లుండగా లుబ్ధావధాని బుద్ధి పరీక్షింతాము. తాను సార్థకనాముడే, ఇంతసొమ్మిచ్చి ఎందుకుకొంటున్నాడు తనభార్యను? ఆమెవల్ల తానెంతకాలము సుఖించగలడు? కానీ వానితనివి తీరుతుంది అనుకొందాము. తాను గతించినపిదప భార్యగతి ఏమికాగలదు? దానితనివి తీరుతుందా? విషమదాంపత్యమువల్ల ఆమెకు సుఖమేఉండదు. కావలసినన్నినగలూ, కడుపునిండా తిండి, కోరుకొన్నచీరె లభిస్తుందేమో అంటే మగడు పిసినిగొట్టు— డబ్బుకీ వానిప్రాణానికీ లంకె. ప్రాణమే వదలునుకాని ధనమువదలడు. అతనియనంతరము డబ్బు చేతిలో చిక్కుతుంది. సుఖమోఅని అహోరాత్రములు మొరపెట్టుతూన్న ముద్దరాలు. తనచిత్తమునకు నచ్చినట్లు స్వతంత్రతతో వ్యవహరిస్తుంది. ఆమెకు శీలభంగము తటస్థిస్తే తప్పెవరిది? తనకూతురుసంగతి ఏమైంది? రామప్ప మీనాక్షిని పాడుచేసినాడు, సుబ్బిని ఇంకొకడు పాడుచేస్తాడు. దానిదుర్గతికి కారకులెవ్వరు- స్వలాభాపేక్ష చూచుకొని ముసలివాళ్లిద్దరూ ముద్దరాలికొంప ముంచదలచినారు. ఎంతచదువుంటేనేమి? ఎంతధనముంటేనేమి? స్వార్థకాంక్షకదా వీళ్లనిట్టిదురంతకార్యమునకు ప్రేరేపించింది. ఇట్టివాళ్లు తమసంతానయోగక్షేమముల అరసేవారా? ఆపూచీ ఇట్టివారిపై సంఘము పెట్టవచ్చునా? యావజ్జీవదుఃఖభాజనమగు ఈదురాచారమును మట్టిలో కలపవద్దా? ఈవిమక్రిమిని అవిచ్ఛిన్నముగా అభివృద్ధినొందించే గృహస్థులను సదాచారసంపన్నులుగా నెంచి, గౌరవిస్తూన్న మనవారు సంఘసౌఖ్యమును అభివృద్ధిని కొంచమైనా ఆలోచిస్తూన్నారా?

దారేషణ ధనేషణలవల్ల తలపట్టి యావ్వబడిన లుబ్ధావధానికి ఇంకోపిశాచము పట్టుకొన్నది. తన కచిరకాలమున వివాహయోగముందనీ అదికాకపోతే మారకము తప్పదని సిద్ధాంతిపండాలు జెప్పినారు. రామప్పగారికుతంత్ర మిది. చావంటే అందరికీ భయమే, అందులో ధనవంతులసంగతి చెప్పనక్కరయే లేదు. దీనికితోడు సుబ్బికి సంతానయోగము సమృద్ధిగా ఉందని సాముద్రిక శాస్త్రవేత్త రామప్ప చెప్పినాడు. ఈమాటలన్నీ నమ్మి లుబ్ధుడు పెళ్లిమానుకో లేకపోయినాడు! ఈ పాత్రను పోషించడములో కవికళాకౌశలము కనబడుతూన్నది. లోకవ్యవహారములను గమనించక చెప్పినమాటలన్నీ నిజమనుకొన్న మూర్ఖుని చిత్రించి అతనియందు మనకు అనురాగము కలిగించే నేర్పు ఉత్తమకవులకుకాని అలవడదు. జంతుకోటికి ఇహపరములు చేకూర్చే వివాహమను పరమపవిత్రాచార మెంతదురాచారముగా పరిణమించిందో చూడండి. బేజోడుపెళ్లివల్ల ఇహసుఖము వధూవరుల కిద్దరికీ సున్న. పిల్లకడుపున రెండుకాయలు కాస్తేసరి అని పెద్దలంటారు. సంతానప్రాప్తియే వివాహోద్దేశమని అందరూ ఒప్పుకోవలసిందే కాని విషమవివాహమువల్ల కలిగేసంతానము కుక్కమురికిది. కుళ్లిపోకుండా ఎన్నాళ్లో ఉండదు. ఒకవేళ కొనసాగినా ఆరోగ్యవంతము, సౌఖ్యభాజనము కాజాలదు, పితృతర్పణానికి పనికిరావచ్చును. అనగా ఇట్టి వివాహమువల్ల వరుడు బ్రతికియున్నప్పుడు సుఖించలేడుకాని చచ్చి కొంతవరకు సంతసించగలడు. ఇక వధువుమాట — బ్రతికి

నన్నాళ్లు సుఖము లేదు. ముద్దుముచ్చటలు ముక్క-లవును. తన ఈడువాళ్లందరూ తగినవరులతో సుఖించడము చూస్తూన్న తలిరుబోడి తనగతినివలచి తల్లడిల్లదా ? ఆఁ అంటేతప్పు, ఊఁ అంటేతప్పు. ఇంద్రియనిగ్రహము అభ్యసించవలెనని అందరూ అంటారు. మంచిది — ఇట్టినిగ్రహము ఇచ్ఛాపూర్వకమైతే మెచ్చతగినదేకాని నిర్బంధమైతే ఎన్నాళ్లు నిలువగలదు ? ఇంద్రియజయము ఉత్తమాదర్శమేకాని సులభసాధ్యము కాదు. అదీకాక యీ ఖైయేళ్లు పైనబడి రెండుమూడుపెళ్లిళ్లు చేసుకొని కొంతకాలము సంసారసుఖమనుభవించినవాడు ఇంద్రియనిగ్రహము అభ్యసించవలెనా ? లేక సంసారసుఖమన్నదే తెలియనేరని ముద్దరాలు అభ్యసించవలెనా ? స్త్రీపురుషులకిద్దరికీ ఇంద్రియనిగ్రహమే ఆవశ్యమయితే విజ్జోడుపెళ్లిళ్లకు వీలుండదు. ఇట్టిపెళ్లిళ్లు అయుక్తములని ముసలోకొందరి కేలతోచదో ! కాటికి కాళ్లు చాచిన ఖలుడు ఇంద్రియనిగ్రహము నభ్యసించలేక సంసారసుఖమో అని తల్లడిల్లి అభముశుభము నెరుగని అమాయకురాలిమెడకు తాడుగట్టి ఆపసిబాలకు నిర్బంధయావజ్జీవనిర్భరదాస్యవృత్తిసంఘటన విధించుట మేమి న్యాయము ? తల్లిదండ్రులు తమబిడ్డలను సుఖింపజేయవలెనా ? లేక ఎన్నో సుఖము లనుభవించగలమని ఉవ్విళ్లూరుచున్న పసివాళ్లను తమ్మావేశించిన ధనాశాపిశాచమునకు బలియొసంగవలెనా ? జంతుబలి కొంత మెరుగు, క్షణములో పోతుంది ప్రాణము. కన్యాబలి యావజ్జీవయమయాతన కలిగించును. ఆడవాళ్లకు స్వత్వమివ్వక మగవాళ్లే పూనుకొనిచేసే ఇట్టిపెళ్లిళ్లు ఎట్టిదురాచరణములో కాస్త యోచించండి. ఇట్టివి దూరమయ్యే విధము కానరాదు. ప్రభుత్వమువారే చట్టనిర్మాణము చేసి వీటిని మట్టిపెట్టవలెను కాని మనసంఘముచేత కాదు. సంఘసంస్థలన్నీ దేవుడు పెళ్లిళ్లైనవి. అంతా పెద్దలే. అదమాయించేవ్యక్తులు లేనందువల్ల సంఘబలము సమసింది, జీవనాడి జీర్ణించింది. సంస్థలలో జిగి లేకుంటే జాతికి జిగి ఉండదు. ఊపిరిలేకుంటే ఉజ్జీవనము సాధ్యము కాదు.

లుబ్ధావధానితో పెళ్లిచేసుకోవద్దని హితులెవరూ చెప్పలేదు. మధురవాణి చెప్పిందికాని అతడు వినలేదు. రామప్ప ఈహితబోధకు విపరీతవ్యాఖ్యానము చేసి "పెళ్లికాకపోతే అవధానిగారియింట తాను చేరి ఇల్లు గుల్లచేయవచ్చుననే స్వలాభ మపేక్షించి మధురవాణి ఆమాటాడిం" దని లుబ్ధునికి బోధచేసినాడు; అతను నిజమని నమ్మకొన్నాడు. ఈలాగు జరుగకపోతే మధురవాణి తన్నువిడిచి అవధానిప్రాపకము సంపాదించుకొంటుందని రామప్ప బెంగ. ఏలాగైతేనేమి సుబ్బి పెళ్లి తప్పిందని మధురవాణి సంతసించింది. చూసినారా, ముసలివాళ్లకి కట్టిపెట్టవలసిన కన్యకలపైని వేశ్యకున్నంతవాత్సల్యము వైదికశిఖామణులకు లేకపోయింది ! కొందరు బ్రాహ్మణబ్రువుల సదాచారపరాయణత ఇలాగుంది !

మాయసుబ్బిపెళ్లికి ముఖ్యకారణము శుల్కము తగ్గడమే. సకలశాస్త్రవేత్త రామప్పఉన్నాడుగా! మాయసుబ్బికి రేఖలన్నీ మంచివి. అని చెప్పినాడు; ఓలితక్కువ, కావున లుబ్ధావధానికోరిక ఫలించింది. ఏకరాత్రినివాహము చేయించి కరటకశాస్త్రి రామప్పను మోసగించినాడు. రామప్ప తోకతొక్కిన తాచులాగు పడగవిప్పి బుసకొట్టినాడు — శుల్కములో ఐదోవంతా శూన్యమయింది, మధురవాణికంటె మాయమయింది, అన్నివిధములా అతనికే నష్టం. ఊరుకొంటాడా ? కంటెసొమ్ము లాగడమేకాకుండా కసితీర్చుకోవాలని కూనీకేసు బనాయించినాడు లుబ్ధునిమీద. అవధాని అప్పటికే లొంగక సౌజన్యారావనేచింతకొమ్మ పట్టుకొన్నాడు. కంటె పెట్టుతానని లుబ్ధు డొప్పుకోలేదు. రామప్ప తనపూచీపైని కరటకశాస్త్రినిరోధమువల్ల ఒప్పుకొన్నాడు. పెళ్లిసమయమున తానుదగ్గరనుంటాడు గనుక ఏదో మాయచేసి కంటె అంకించుకొందా మనుకొన్నాడు. ఈగుట్టునెరిగి కరటకశాస్త్రి పంతులుకంట్లో దుమ్ము పోసినాడు- అర్థనష్టమేకాకుండా అవమానము పాలైన పంతులు లుబ్ధుని చిక్కులలో పడవేయవలెనని పన్నాగము పన్నినాడు కాని ఫలము లేకపోయింది !

లుబ్ధునిప్రకృతావస్థ చూసి జాలిపడినవానివలె నటించి గిరీశం సాయముచేయవచ్చి "నీకూ, నీకూతురికీ, ఉరిశిక్ష తప్పదు, ఉత్తరక్రియలకు తగినఏర్పాటు చేసుకో, నన్ను పెంచుకొంటివా నీచిక్కులు విడ తీస్తాను" అని ప్రాధేయపడెను కాని లుబ్ధు డొప్పుకో లేదు; పోనీ Power of attorney ఇమ్మన్నాడు, అందుకూ లుబ్ధుడు "ససేమిరా" అన్నాడు.

ఇతనికి దయ్యమంటే తగనిభయము; ఎవరైనా ఏదైనా అనుమానముపెట్టితే ఇతనికి కాళ్లూచేతులూ ఆడవు. "సంటూరుశాస్త్రి ఏదోమోసముచేసినాడు కను కనే గొబ్బున దాటినాడు; నీకిచ్చినపిల్ల రెండోపెళ్లి పిల్ల అయిఉంటుంది" అని రామప్ప కోపావేశాన అంటే ఆమాటలు అవధానినల్లగుండెలో నాటినవి. అదే ధోరణిలో పడడముచేత పీడకలలు వచ్చేవి, తానుపెళ్లా డినపిల్ల మొదటిమగడు భూతమై తనగొంతు నొక్కు తున్నాడనీ, మంచముపైనుండి దిగువకు తోసివేస్తు న్నాడనీ కేకలు వేస్తూండేవాడు- అతనికూతు రెంత ధైర్యముచెప్పినా వినక తనకొత్తభార్య నింటినుండి తరిమితేనేకాని తన కాబ్రహ్మరాక్షసిబాధ తీరదని మొరపెట్టినాడు. "భూతవైద్యుని పిలువనా?" అని కూతు రడిగితే వాడు డబ్బడుగునని వెరచి వద్దన్నాడు. బాధ ఎంతైనా భరిస్తాడుకాని పైసాఖర్చు కొప్పడు. తానుతినడు, ఒకరికి పెట్టడు. ఈబాధ విరగడయ్యే సాధనము తోచలేదు, పైపెచ్చు మాయసుబ్బి తాను రెండోపెళ్లిపిల్లనని చెప్పి ఒరిసినపుండుపై ఉప్పు జల్లి నది. తరువాత తండ్రికూతుళ్లు తన్నేసరికి దెబ్బలు తిన లేక అది అదృశ్యమయింది.

అంతట అది చచ్చిందని నిశ్చయించి "నీవు పెళ్లాడినముండ దయ్యమయిందని పూజారిగవరయ్య అన్నాడు. కాబట్టి నీకూతురూ, నీవూ దాన్ని చంపి నారు అని రామప్ప అన్నాడు. ఇదే కూనీకేసుకి బీజము. కేసు కమాపుకాదు; పోలీసువాళ్లూ, అధికార్లూ రామప్పపక్షమువాళ్లు. గవరయ్య, పోలిసెట్టి లుబ్ధుని పక్షాన సాక్ష్యమిస్తారో ఇవ్వరో? దొంగసాక్ష్యము పొందుపరిస్తేనేకాని కేసు పోదు. గంపంతబలగమున్నా లుబ్ధునికీ కష్టకాలమున సాయపడేవా రెవరూ లేరు. ఈ సందర్భములో గతము స్మృతికివచ్చింది, నిరాధారుడు, నిస్సహాయుడు, ఏకాకి అయినలుబ్ధుడు నిరాశాపరవ శుడై కూతురిని అమ్మినందుకు, వయస్సుమీరిన తరువాత తాను వివాహప్రయత్నము చేసినందుకు, కూళయైన రామప్పను నమ్మి గోతిలోపడినందుకూ పశ్చాత్తాపపడి, కూతురిని వితంతుశరణాలయమునకు పంపి తాను కాశీ వాసము చేయడానికి నిశ్చయించుకొన్నాడు. చూసి నారా దుష్ప్రవృత్తి పరిణామము. స్వార్థప్రవృత్తి ఆదర్శముగా పెంచినవారిచరితము ఈలాగే దుఃఖ భాజన మౌతుంది. అగ్నిహోత్రునికివలెనే ఇతనికీ కూతురుఉసురు తగిలింది. మీనాక్షి పసిపిల్లగానున్న ప్పుడే మూడుకాళ్లముసలికి దానినమ్మి ధనమార్జించి నాడు. అత డామెయెడ నొనర్చిననేరమును కాస్త పరిశీలింతాము.

హిందూశాస్త్రములప్రకారము ప్రతివ్యక్తీ ధర్మ, అర్థ, కామ, మోక్షములకై పాటుపడడమే కాకుండా తన సంతానముకూడా ఈచతుర్విధ పురుషార్థములకై పాటు పడుటకు తగినపరిస్థితులు కల్పించవలెను. సంతానము నకు యథాయోగ్యముగా తనశక్తికొద్దీ విద్యాబుద్ధులు చెప్పించి వాళ్లు పెద్దవాళ్లయినతరువాత కూటికీ గుడ్డకీ లోటులేకుండా ఉత్తమమార్గచరులై కీర్తిని సంపాదించి సుఖించునట్టి ఏర్పాటు కావించవలెను. శుల్కవివాహ ములు చేసినపిల్లలకు సుఖము సున్న. ఈడూజోడూసరి పడ్డదంపతులు భిక్షమెత్తి జీవించినా సుఖించగలరు. ఇరవైయేళ్లభార్యకు అరవైయేళ్లభర్త సంప్రాప్తమవుతే ఆమె కేమిసుఖము కలుగగలదు? వయస్సు విషమ మైతే వర్తన విషమము, ఆశలు, ఆచరణములు, ఆదర్శములు విషమములే. పెళ్లిచేసేటప్పుడు ప్రాయము, రూపము, ముందుచూసి అవి తగిఉంటే తక్కినవిష యాలు ఆలోచించవలెను. చేతులారా ముక్కుపచ్చ లారనిదానిని ముసలివానికి కట్టిపెట్టి దానికి వైధవ్యము సంప్రాప్తమైతే దానిప్రారబ్ధ మనడము న్యాయమా?

సరిజోడు కూర్చినపిమ్మట ఇట్టిది ప్రాప్తిస్తే హానికర్మమనవచ్చును. తలిదండ్రులకంటె హితచింతకులు ఉండరనికదా పిల్లలలాలనపాలనములభారము పితరులపైని పడుతున్నది. ఈబాధ్యత వాళ్లు తగినరీతిని నిర్వహించకుంటే నేరముచేసినవాళ్లు వారే అవుతారు. నాపిల్లలను నాయిష్టమువచ్చినట్లు పెంచుతాను; నన్నడిగేవాళ్లెవరని పట్టుబట్టితే అందువల్ల కలిగేనష్టమునకు కారకులెవరు? నాసొమ్ము నేను పాడుచేసుకొంటాను, నన్నడిగేవాళ్లెవరంటే దానివల్ల నష్టపోవువాళ్లు లేకుంటే ఎవరూ ఏమీ అనరు. నాయిల్లు నేను తగులబెట్టుకొంటానంటే ఇరుగుపొరుగువాళ్లు ఊరకుండరు. నాపశువిది, దీనికాలు విరుగకొట్టతానని బహిరంగముగా అంటే జంతురక్షణసంఘమువారు (S. P. C. A) శిక్షించితీరుతారు. శుల్కవివాహాలు చేసి పిల్లలను పాడుచేసేతల్లిదండ్రులను దండించేధార్మికులు లేరు. సంఘమే అట్టిపనిని చేయవలెను. ఊరూర సభాపతులున్నారు. కాని వాళ్లు చేతకానివాళ్లు; సంభావన పుచ్చుకోవడము తప్ప సంఘసుఖము గంగలోకలిసినా వాళ్లు నోరెత్తలేరు. సంపన్నగృహస్థులు ఉదాసీనులవుతున్నారు, కాబట్టి ధనాశాప్రేరితులై తల్లిదండ్రులు పిల్లలను తమచిత్తమువచ్చినవాళ్లకిస్తున్నారు. సంతానము సుఖించుటకు తగినకార్యములు చేయడానికి పితరులు బాధ్యులుగాని ధనాశమూలానకాని మాటపట్టింపులమూలానకాని కూతుళ్లకాపురములు కూలవేసేవాళ్లు తప్పకుండా దండ్యులు. కూతుళ్లకు యావజ్జీవబ్రహ్మచర్యము దాస్యమున్నూ నిర్బంధించినతండ్రులు దానవులుకాని మానవులుకారు. "పాపము పెరిగితే ఫలము ఇహమందే అనుభవించబడునన్న" మహావాక్యమునకు లుబ్ధుడే గొప్పదృష్టాంతము.

(సశేషము)

---



కుత్తాలము జలపాతము　　—యస్. శంకర సుబ్రహ్మణ్యము.

# పేరు

ఏలేశ్వరపు కృష్ణమూర్తి, బి. ఏ., బి. యల్.,

లోకంలో ఏ మూలకు చేరుకున్నా పేరడగని ప్రాంతం అంటూ లేదు. మరీ మొగమాటస్తులు పేర డగకుండా ఎక్కడో చూచినట్టుందని చుట్టరికం కలుపుతారు. కొందరు మన చేతులో పుస్తకం వుంటే, దాంటో మనపేరుంటే ఎల్లాగు తెలుస్తుంది కదా అని అదేం గ్రంథం అండీ అని నిలవేస్తారు. బంగారు పతాకాల్ని ధరించే వారి పేరుని మెరుగే మింగివేయడం బట్టి సందేహం అట్టే వుంటుంది. ఇంటిముందు తెల్ల తురాల నల్లబల్లలు తగిలించుకున్నవారు యీ విషయంలో ధన్యులు. ఇటు జపానో, అటు జినీవావో ఎనుమతీ అయినా మన పేరు మనదే. పేరెట్టి పిలుచుకోవడం పరిచయానికి మూలం. అదిగాక, మనపేరు పెట్టి పిలుస్తేనే గాని మనం ఓయనం. అందుచేత వ్యక్తిని వివరించడానికి పేరోసాధనం. సాధనం అంటే పెడచెవిని పెట్టే వారుంటారని, మనలో యిదో సంస్కారం. నల్లకోటని, ఎర్రరుమాలని, చాలా సాధనాలు వున్నా, పేరులో ఆ మనిషి అంగీకారము కూడా వుంటుంది. కొంటె కథల్లో పుల్లక్క అని ఎవరో వున్నా, వాడికీ పేరుంది. నవలలలో పేరు చెపుతే చెముక్క లేదని చామన చాయవాడు, చంపకు చారడేసి కన్నుల వాడు, చలికిలపడు వాడని ప్రారంభిస్తారు. ఒక్కొక్క సందర్భంలో యింత అనామధేయుడు యీ కథానాయకు డెందు కయ్యాడో అనిపించ గలదు. పూర్వం నుంచి అనామికకు పేరుంది. సందేహం లేకుండా కవి ప్రక్క నున్నాడు:

పురా కవీనాం గణనా ప్రసంగే
కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా,
అద్యాపి తత్తుల్య కవే రభావా
దనామికా సార్థవతీ బభూవ.

అని. మనిషికి పుట్టక ముందే పేరుండదు. అయినా ముందర నుంచి దూరం ఆలోచించి కొడుకుపేరు సోమలింగం అనే వారు లేకపోరు. వారికి ప్రాయశ్చిత్తం మన చేతిలో లేదు. బ్రతికిన రెండురోజులు పేరు నీడలాగు మనిషిని అంటివుంటుంది. కష్టపడే రోజుల్లో పేరుండదని లోకులన్నా పేరే మిత్రునివలె తోడు పడుతుంది. తర్వాత మనిషి చచ్చినా, పేరే మిగిలేది. మనిషిలో లేని జీవం పేరులో వుంటుంది. ఈవిషయం తెలుసుకున్న ఒక పెద్దమనిషి నేను కూడ పేరుతో పుట్టి కట్టుకుని వెళ్ళాడుతే ఎంతబాగుండేదో అని రాగం పెట్టడం మొదలుపెట్టినాడు. కాని అది సాధ్యంకాదు. పేరు, ప్రతిష్ఠ తను ఏడవడంలో నిలిచేవికావు. ఒరులు ఏడ్చినంత మాత్రమున పోయేవికావు. ఇంతకు వచ్చిన పేరు చచ్చినా పోదు. అపవాద అట్టే వుంటుంది. పెద్ద పేర్లల్లో చిన్నతనం వుంది. చిన్నపేర్లల్లో పెత్తనం వుంది. పేరుకి పేదరికం లేదు. అందుకనే తలోపేరు పెట్టుకున్నా చాలాపేర్లు అట్టే వున్నాయి. పేరు నోటి నుంచి నోటికి ప్రాకిపోతుంది.

దేవుడు అనంతమైన జగత్తును సృష్టించినపుడు, అతని కోపేరు మానవుడు వుంచడం సహజం. శత నామాలు, సహస్రనామాలు, తోచకనుగాని ఎందుకండీ అని ఒక మతం వుంది. ధాతపని ఆదినే ముగిసింది. ఇక అతని స్మరణ ఎందుక నేవారున్నారు. అల్లా అంటే కళ్లుపోతాయి. బ్రహ్మసమాజంలో చేరమనే వారున్నారు. ఏది ఎల్లాగున్నా, దేవునికి పేర్లతో పని లేదు. మానవుడికే పేర్లు ప్రధానం. అందుచేత ప్రపంచంలో ప్రతిదానికి పేరుంది. రాయి దగ్గర నుంచి రాజుదాకా అన్నీ పేర్లే. మరచి పోకుండా మతంనుంచి మందు బుడ్డిదాకా చీటీ లమిరాయి. వాడగా వాడగా వస్తువులకు వాటి పేర్లు స్థిరపడ్డాయి. దేశం మార్చినా, భాష మారినా, వస్తువులకు పేరు మారును. అందుకనే నిఘంటువులు చాలావున్నాయి.

ప్రతి ఆసామికీ ఒక పేరు వాళ్ల వాళ్లు పుట్టడం తడువుగా, సంప్రదాయం కొద్దీ, వీలైనంతత్వరలో, శక్తి కొద్దీ, మంచి అభిప్రాయంతో బ్రతికి నాలుగు

కాలాల పాటు బాగుండాలని పెడతారు. ఓ పేరు వెయ్యేళ్లు మొదలవాలని దీవించుతారు. ఆ పేరు మోటని తోచీ, మన స్వతంత్రం నలుగురికి నాలుగు మూలల తెలియనీ, అని చాలా చదువుకున్న వారు డబ్బిచ్చి గెజెటులో పేరు మార్చుకుంటారు. బలువుగా వుంటే బలువు తగ్గించుకుంటారు గాని వారూ పేరు వద్దన లేదు. మనలో దేవుడి పేర్లు పెట్టడం మామూలు. మొక్కుకుంటే ఆ దేవత పేరు పెడతారు. దెయ్యమై పీడిస్తే ఆమనిషి పేరు రివాజు. ఇక తాత పేరో, ముత్తవ తల్లి పేరో తప్పనిసరి. పిల్లలు నిలవకపోతే ఒక పేరు. ఇక ఏదీ కనబడకపోతే ఆకు అలం పేర్లు పెడతారు. స్ఫురిస్తే పుణ్యపురుషుల పేర్లు పెడతారు. కేశవనామాలు నోటికి వచ్చినవే కదా. ఉపాసన వుంటే ఆ వేలుపు పేరు పిల్లలకి వరప్రసాదం క్రింద అందచేస్తారు. పురాణ గాథల్లో పేర్లు మరీ పొదుపుగా వాడుతారు. కాలం ధర్మాన్ని హరిశ్చంద్రులకి నిజంమీద ధ్యానం లేదు. సీతాదేవులున్నా వనవాసం లేదు. ఆంజనేయులకు లంకాదహనం లేదు. అన్నీ కొత్తదారులు. నామకరణమప్పుడు వ్యాకరణం అదీ చూడకుండా పేర్లు పెడతారని ఒకరు కోపం తెచ్చుకున్నారు. వ్యాకరణంమాట దేవుడెరుగును. మీ పేరుకి వర్ణక్రమం చాలాకష్టం అని మొర ఒకమూల. ఈమధ్య దేశంలో కలిగిన అలజడికి ఇదిగో స్వరాజ్యం వచ్చింది అని ఒకాయన ఎలుగెత్తి అపరిమితానందంతో అంటూంటే అది వాళ్ల చిన్నపిల్ల పేరని కడకు తేలింది. కొందరి జీవితం అంతా పేర్లు వెతకడంతోనే సరి. భారసాల వారికి క్రొత్త. నవలలు, కథలు, నాటకాలు వ్రాసే మహాత్ములకు యీ అవస్థ. ఒక్కొక్కరింట్లో సాలీనా భారసాల. ఈ మధ్య పల్లెటూళ్లోను పూటకూళ్లమ్మ పేరు బాగా వెలిసింది. రాను రాను కాలం చెడిపోయిందర్రా, సోముదేమప్ప పేరు చూద్దామన్నా కనబడడంలేదు. కాటకం మరీ ముండిపోతోందని ఒక అవ్వగారు కంట తడిపెట్టారు. గిరీశం పేరు మరి చూడలేదని ఒకరు వగిచారు. గిరీశాన్నే చూడడం పడింది కాదని ఒకరు విచారించారు. వారింట్లో అదేం దురంతం, భారసాలచేసుకోకపోవడం అని పొరుగింటి చర్చ. వచ్చేది ప్రళయం, తొందరగా పేరెట్టండోయ్, బరి మీద అందరిని మేపుకు ఖర్చు సెందుకు రోజులు కావు అని ఒకరిసంత. ఏవిధముగానైనా, బొడ్డుకోసి పేర్లు పెడుతున్నారు. బాజావాయించి, వుంగరంతో బియ్యంలో వ్రాస్తే యేమి, చడీచప్పుడు కాకుండా చెర్చిలో బాప్టిసమ్ చేస్తేనేమి, ఏదీలేకపోతే మనకుయింతే దేవుడిచ్చాడని ఏచెట్టుక్రిందో ఓ పేరనుకుంటే యేమి? నామకరణం అవుతోంది. మొత్తంమీద మన అనుమతిమీద మనపేరు మనకు రావడంలేదు. మన్ని ఆలోచించి పెట్టడానికి చిన్నతనం. కొందరికి పొరుగూళ్లలోను, మరీ కొన్ని పేటల్లోను, వద్దు మొర్రో అన్నా చాలా పేర్లు తటస్థపడుతాయి. ఇల్లావుండడం ఎంతటివారు అడ్డలేరు కాబట్టి సహజం అని, మనం ఓ సమాధానానికి వచ్చి ప్రతి మనిషికి అథమం ఒక పేరు వుంటుంది అందం.

సాధారణంగా యింటిపేరు, మనిషిపేరు రెండుంటాయి. దేశం ఏలే దొరల్లోను వుంది యీ విశేషం. కొందరు తమ పేరుముందు గ్రామంపేరు ధరిస్తారు. మరీ అరవలైతే, తండ్రిపేరు ముందుపెట్టి పితృభక్తిని ప్రకటిస్తారు. కొందరు దైవభక్తిపరులు ఏదో తోచినపేరు పెట్టుకుంటారు. అందులో మాత్రం దేవుడు చావలేదాని. కొన్ని ప్రాంతాలల్లో కొన్ని పేర్లకు ఎక్కువ చలామణీ. కొన్ని పేర్లకు అంతా చేతులు చాస్తారు; ఓట్లకు మల్లే. అప్పడిది విశాఖపట్నం; వెంకడిది తిరుపతి; జగ్గడిది ఓఢ్రదేశ ప్రాంతం; నర్సడిది అంతర్వేదిదగ్గర; నటరాజుది చిదంబరం; చిదంబరం అని ఓ పేరుంది; విశ్వనాథుడిది కాశీ; రామనాథుడిది రామేశ్వరం—అల్లా పేర్లు వాడుతారు. ఒకే శబ్దానికి చిలవలుపలవలు పెట్టడంతో పేరు మారుతుంది. ఒక్క రామశబ్దం ఎన్నివిధాలగా పేరులో యిముడుతుందో చూద్దాం. రామను, రామస్వామి, రామానుజం, రామమూర్తి, రామేశం, రామలింగ, రామదాసు, రామచంద్ర—మొదలగునవి,

యితరములు వూహ్యాములు. పేర్లకి వుత్పత్తి యిల్లాగే. మరో విషయం. పేర్లకి వర్ణం వుంది. కులం వుంది. తెగ వుంది. మతం వుంది. ఈ విషయం ఆలకిస్తే పేరులో చివర ధ్వనిస్తుంది. ఆత్మగౌరవసంస్థవారు యీ తుదిముక్కని కోయంబత్తూరులో వదిలారుట. కాశీలో కాదు. వారు తరించారు; యితరులు ధన్యులైనారు. ఎన్నిమాయలుచేసినా, కొందరిపేర్లకి ముందు బరువెక్కువ. కొన్నిటికి వెనుక బరువెక్కువ. పేర్లకు హాని కలుగకుండా కాయడానికి ముందువెనుక కవచం లాంటి కరుకు బిరుదులుంటాయి. లోగడ ఒకాయన్ని, ఏమండీ, యింత పనిచేశారు, మీపేరు మరీ దిసమొలగా వుంది అంటే మాకేంలోటు, నాడు వుంటే నవాబు సాహేబు, అన్నం వుంటే అమీరు సాహేబు, బీద పడితే ఫకీరు సాహేబు, చస్తే పీరుసాహేబు అన్నట్టు, ఎంచి చూస్తే ఏవిధానా గొప్పపేరు అన్నాడు. అత డాగీతాసారం చాలా కష్టం మీదే సంపాదించాడు. నాగరీకంతో పేర్లు పొడిగించడం ఒకప్రక్క, తెగకొట్టడం ఒక ప్రక్క పంతంమీద జరుగుతున్నాయా అనిపించగలదు. ఒకరు పుట్టినప్పటినుంచి, కొంచెం కొంచెంగా పేరు, చేగోడీ అనే భావంతో, నములుతూ వచ్చేసరికి, పాపం, చచ్చేసరికి మిగల లేదుట. దాంతో ఫలానా వారు పోయారని పత్రికా విలేఖరికి కబురందచేయడంకూడా పడలేదుట. ఫోటో మాత్రం వేసి వూరుకున్నారు. క్రింద పేరు మింగిన పెద్దలని సంపాదకులు సూచించారు. ఆయనే బ్రతికి వుంటే అదీ నయమే ఒక విధాన అనేవాడు. కాని బ్రతికి వుంటేను, పేరు వున్నది వున్నట్టు వుంచుకుంటేను యింత గొడవ జరిగి వుండదు. కాని అతడు కీడెంచలేదు. మరొకరికి పేర్లు మార్చడం అనేది వంట్లో జబ్బు క్రింద ప్రవేశించింది. ఆయనకు ఎవరుచెప్పినా విన కూడదనే జబ్బు ఆదివరకునుంచి వుందిట. పాపం దానితో ఆయన కీర్తిశేషులైన సమయానికి కోటిపేర్లు, ఎవరుపోయారనే సందేహం, శవం మిగిలాయట. ముక్కుకు సూటిగా పనిచేయడం ఆదర్శంగా పెట్టుకున్న న్యాయస్థానాల్లో వీరు వీరు వారు వారు అని రుజువుచేసేసరికి బ్రహ్మాంతవాణ్ణి క్రింద పెట్టడం అవుతుంది. ప్లెయింట్లలో పేర్లు ముఖ్యం. ప్లెయింటులో పేరు సరిగా పేర్కొ లేదనే పట్టింపుమీద ప్రీవీ కౌన్సిల్ దాకా డేకించి, పదివేలకు పైగా ఖర్చుచేసిన పౌరుషవంతు లున్నారు. పేరులో వుంది యీ మహత్యం.

పేరంటే మరీ మనిషిముఖంమీద వ్రాసివుండదు. ఎక్కడో తిమ్మన్న సంగతి మనం చెప్పలేం గాని. అప్పుడప్పుడు గోడలెక్కుతుంది మసిబొగ్గ ధర్మాన్ని. మనిషిని చూడగానే కనబడదు. ఎవరిపేరు వారు వుచ్చరించడం వుండదు. వ్రాయడం వుంటుంది. ఆ మనిషిని అడిగితేనే గాని మాట్లాడుతోంటే విన బడదు. ఆపేరు మనం ఆలకిస్తే వింటూంటాం. ఇంకో రెండుమాట్లు వింటే పోలుస్తూంటాం. మళ్లీ ఆ మనిషినిగురించి చెప్పేటప్పుడు ప్రయోగిస్తాం. అందుచేత ఒకరిని గురించి ముందుగా పిలవడానికి, వెనకాల తిట్టడానికి వుపయోగింప బడే ధాతువు పేరు. ఫలానా వారిని గురించి యీ తంతు అని నిరూపించడానికి పేరు వీలుకలుగ జేస్తుంది. పేరును బోలిన పేర్లున్నా, తక్కువ. చేంతాళ్లలాంటివి; నోరుపట్టనివి; గుక్కతిరగనివి; గుండెఝల్లుమనిపించేవి; చెవులు మూసుగునేంటివి; నోరునొక్కునేవి; దడ పుట్టించేవి; కోపం తెప్పించేవి; శ్రవణానందంగా వుండేవి; కరువుతీర్చేవి; కానుకలూసగేవి; కంఠం ఎత్తిపాడేవి: ప్లేటెక్కి కూర్చునేవి; వీణవాయించేవి; తాళం వేసేవి; తెయ్యిమని నాట్యం సలిపేవి; కయ్యానికి కాలుదువ్వేవి; పేర్లున్నాయి. పొగలు మనిషి కాని రాత్రి మనిషికాదనిపించేవి గలవు. విద్వాంసు డంటే అతన్నే వేలేసి మణవాలని పించేవి వున్నాయి. ఛీఛీ వట్టి పశువండీ అనజేసే వున్నాయి. కొన్నిపేర్లు తోనేసినా లోకంలో మిగిలాయి. కోపానికి విశ్వామిత్రుడు, దానానికి శిబి కర్ణ దధీచులు, నిజానికి మరొకరు. ఇల్లాగు ధనానికి, ధర్మానికి, త్యాగానికి, సత్యానికి, పౌరుషానికి, చాదస్తానికి, వికటానికి విన్నపేరు వినకుండా ఎందుకోందుకు పేర్లు

వింటాం. ఒక పేరుకున్న వాడుక యింకో పేరుకి లేదు. స్మరింపబడే పేర్లు కొన్ని. ఉచ్చరింపబడేవి కొన్ని. స్మారకం పోగొట్టేవి; తలచుకొనేవి; ప్రేమించేవి; తాపం కలుగజేసేవి; పకపకనవ్వించేవి; పరువు పోగొట్టేవి; పరమాత్మని తెలిపేవి, గడబిడ పేర్లు, వుడుకు పేర్లు, నాజూకు పేర్లు, మోటు పేర్లు, సగం తెగిన మొండి పేర్లు, కాసుల పేరులు, వరహాల పేరులు—చాలా చెవి సోకుతాయి. పేరులోనే వుంది ప్రభ. మరో విషయం. ఎవరి పేరు వారు చెప్పుకోడం పాశ్చాత్యులు తల కొట్టేసినట్టు భావిస్తారు. మరీ అవతలమనిషి పెంకిఘటం అనిపించి పట్టింపులకు పోతే మేము ఫలానా అని మీరు వినేవుంటారు అని చెప్పుకోడం తటస్థిస్తుంది. మనలో పెళ్ళిలో పేరు చెప్పించడం అంటూ ఒక ముచ్చట. అంతా బిలబిల లాడుతూ మూగుతారు. దంపతులచేత ఒక యుగానికి ఒకరి పేరు ఒకరిచేత చెప్పిస్తారు. ఇక పెళ్ళాడాక మన దేశంలో సాధ్వీమణులు భర్త పేరు పైకి చెప్పరు. లేని సిగ్గు తెచ్చుకుంటారు. ప్రేమజాబులలో వ్రాయగలుగుదురు. పలుకలేరు. ఇప్పుడిప్పుడు క్రొత్తచదువులొచ్చాక తెగేసి ఇతడు నా భర్త అన్న రీత్యా మాట్లాడడం అలవాటు చేసుకుంటున్నారు. హక్కులకొరకు హుంకారములు చేయుచున్నారు. భర్త కెన్నిహక్కులున్నాయో, నాకు అన్నేహక్కులున్నాయి, మా ఐక్యభావం లోకవిదితం ఎల్లాగు అవడం అని భర్త పేరు తమ పేరు చివర వ్రాసుకునే నారీమణులున్నారు. పేరులో వుంది ప్రేమ. భర్తను వెనుకకు మోటతనముగా గెంట రాదనియు, ముందునకే సరసముగ తోయవలయుననియు ఒక అభిప్రాయమున్నది. మాకే ఎక్కువహక్కులున్నాయని తలచు సోదరీమణులు భర్త పేరు తల పెట్టరు. దూరముగ గెంటివేయుదురు. అంటరానితనము అభినయింతురు. అంతా తమపేరే అని వారు తలచుటయు సరియే అగును. పూర్వం ఒక సాధ్వీమణి భర్త సోముదెమ్మమగడనే చుట్టుపట్ల వ్యవహారింపబడువాడుట!

పేరుని గురించి యింతకమాయిషీ వుంటూంటే ఓ పేరుకో పేరు తభావతుని తారుమారవడం చాలా సులభం. కావాలని తారుమారుచెయ్యడం మరీ మరీ సులువు. సులువులు ప్రతినేరస్థుడు ఎరుగును. నేరము చేయనెంచిన ప్రతిమనిషికి నేరము గురించి మొదట తలంపు కలుగుతుంది. ఆలోచన అధికమగుతుంది. చిత్తశాంతి పోతుంది. కృషి సల్పుతాడు అనుకున్న విషయమై. ఏదోవిధంగా దృఢనిశ్చయుడై ఆవేశపరవశుడవుతాడు. కృత్యమునకు గడగుతాడు. నెరవేర్చువరకు నిదురపోడు. కలవరపడతాడు. నేరము చేయగానే ఆందోళన మనసు నావరిస్తుంది. కడకు పశ్చాత్తాపం పొర్లి ప్రవహిస్తుంది. తగిన ప్రాయశ్చిత్తంకూడా జరుగుతుంది. లోకంలో అప్రయత్నంగా జరిగే నేరాలు తక్కువ. కలవరపాటులేక జరిగే నేరాలు తక్కువ. పశ్చాత్తాపం ఎంతటివారికోగాని రాకపోదు. ఏది ఎటులున్నను, ప్రాయశ్చిత్తంగట్టిగాచేయడానికి న్యాయస్థానములున్నవి. భయములేదు. కారాగారాలు ఉరిస్తంభాలు, కొరడా దెబ్బలు, కఠినశిక్షలు, ద్వీపాంతరవాసాలు, జుల్మానాలు, ఆస్తిలాక్కోడాలు, నేరస్థుడికి సంభవించే శిక్షలు. కేవలం పేరుమార్చడం అని ఒక నేరం లేదు. కాని నేరాలు చేయడానికి నేరమునుద్దేశించి, నేరస్థుడు పేరు మార్చడం కలదు. నేరం చేసి పట్టుబడకుండా వుండడానికి కూడా పేరుమారుస్తారు. తలుపులు మింగేవానికి అప్పడాలు లొటలొట!

సాధారణంగా ఒకే పేరున్నవారు ఒకే కుటుంబములో దాపరిస్తే చాలా చిక్కు ప్రశ్నలు బయలుదేరును. ఉత్తరాలు ఒకరివొకరు విప్పిచూడడం; మాది అనుకున్నాననడం; ఒకరనుకొని ఒకరిని పిలవడం; ఒకరనుకొని ఒకరికి తాంబూలాలు యివ్వడం, పుచ్చుకోడం జరుగకపోవు. నేరస్థులు లేనిపేరు వూహించి పెట్టుకుంటారు. లేకుంటే మోతుబరి దెవరిదైనా పేరు పెట్టుకొని, ఆమనిషికి తెలియకుండా సంచరిస్తారు. కుడితేనే తేలు, లేకుంటే కుమ్మరిపురుగు అనే వెర్రి నమ్మకం యీ యుగంలో చెల్లదు.

ఈ ప్రపంచం అంతా మాయఅనిన్నీ, మరీ విశాలమైన దనీ, చాలామంది పనిలేకుండా తిరగడానికి అవకాశం వుందనీ, తెలివితేటలు వృథాగా పోకుండా ప్రజల మీద ప్రయోగించేందుకు తగిన వసతులున్నాయని ఏదో యథాశక్తిని లాభం కొట్టేందుకు వీళ్లున్నాయని బ్రతుకు తెరువు బాగా ఎరిగిన క్రొత్తరకం పుట్టింది. వారు మారుపేర్లంటే చెవి కోసుకుంటారు. వార్తాపత్రికల్లో పరారియైన లక్ష్మీకాంతం పార్థసారథి అనే మారు పేరుతో వున్నట్టు, పట్టుబడ్డట్టు విన్నాం. నేరము చేయడానికి నేర్పున్నవాడు నేరమును కప్పిపుచ్చుటకు ప్రయత్నిస్తాడు. గొప్ప నేరస్థులందరు నేరము చేయక ముందో, చేసేటపుడో, చేసినవెనుకో, మారుపేరుతో మసులుకోడం చరిత్రకు క్రొత్తకాదు. నేరస్థులకు మారు పేర్లమీద దృష్టిపోతే పరిశోధకులకు నేరము పట్టుకో వాలని పంతం ప్రబలుతుంది. ఈ పట్టుదల ఆంగ్లేయు లది. స్కాట్‌లండ్‌యార్డ్‌లో కనుక్కోరారా అంటే కాల్చుకువచ్చే బుద్ధిమంతులున్నారు. వారు ఆవలిస్తే పేసు లన్నీ లెక్క పెట్టేందుకు బకధ్యానంచేస్తూంటారు. సందే హం ఏమాత్రం కలిగినా రాకపోకలు ఆకట్టుతారు. పుట్టు పూర్వోత్తరం త్రవ్వి కనుక్కుంటారు. పట్టు పడ్డపుడు నేరస్థునకే దిగ్గ మనిపిస్తుంది, అన్నా అని! నేరం జరుగకముందు జరుగకుండా కాపుదల, జరుగు నపుడు జరుగకుండా ఆపుదల, జరిగినవెనుక నేరస్థుని కనుగొనుటకు పట్టుదల పోలీసుశాఖకు అత్యవసరము. ఈ విషయం బాగా బుర్రలో ఎక్కిస్తేగాని యీ శాఖలో ఎవరిని చేర్చరాదు. లండనుపోలీసుశాఖ పేరెన్నిక గాంచుటకు యిదే రహస్యం. దొంగపడిన ఆరునెలలకు వాకిట కుక్క బొయ్యిమనడంలో విశేషం లేదు.

నేరస్థుని పట్టుకోడం ఓ ప్రజ్ఞ. పేరుమార్చడం అనే రోగం బయలుదేరినపుడు నేరస్థుడికి చికిత్స ఎల్లాగ అనే ప్రశ్న పెద్దలు ముందు వేసుకున్నారు. మార్గాలు వెతికారు. ప్రతిమనిషికి వూరు, పేరు వొంటిమీద చెరిగిపోకుండా వాతలు పెడుతేనో, పచ్చపొడిపిస్తేనో యీ కాల్చుకు తినే వార్ని విన్నట్టుంది.

పోల్చేందుకు వీలవుతుందేమో అని బుర్రలు కలేసి ఆలోచించారు. బుర్రలు కలవడానికని ప్రత్యేకం చేరితే, అభిప్రాయభేదం వుండకపోదు చూడండి. జూరర్‌లలాగు. ఏదో ప్రతివాడికి సంభావన ముట్టచెప్ప డం అసంభవం అనిపించింది. అమానుషం అనుకున్నారు. మారుపేర్లతోదగా హెచ్చిపోతే ఒకరికి అందులో ఒళ్లు మండి చొక్కాలు విప్పించండి అన్నాడు. ఈ వూహ మీద మెడికల్ పరీక్షలు ప్రారంభించారు. మరీ నేరం ఓ వృత్తిగా భావించి రాజుని తోసుకు తిరిగే వారికి అంగ బలం, అంగ లోపం, అంగవిహీనాలు, పుట్టు మచ్చలు, పచ్చపొడువులు, కాల్పుడు మచ్చలు, స్ఫోట కపు గంట్లూ, తదితర విషయములు బాగా మాచేటం దుకు పూనుకున్నారు. దీనితో నేరాలకి చాలామట్టుకు కిటుకు దొరకడం మొదలుపెట్టింది. నేరస్థుడు పరారి అయినపుడు పేరు, ఫోటో ప్రకటించి పట్టుకున్న వారికి బహుమతీ లిస్తారు. దొంగకు దొంగతనం మీద దృష్టి. డిటెక్టివ్‌కు నేరస్థునిమీద దృష్టి. లోకానికి వీరిద్దరి మీద దృష్టి. దొంగని దొంగే పట్టాలి. నేరా లలో చిక్కులు వీడాలంటే లోక జ్ఞానం కావాలి. విశేషదృష్టి వుండాలి సురుకుజాకులకన్నట్టు.

ఇంకొకరినని ఒక మనిషి వ్యవహరించడానికి తగిన కారణం వుండాలి. రాత్రో పగలో సరదా కోసం మారుపేరు ఎక్కడోగాని పెట్టుకోరు. మారు వేషం వెయ్యరు. మరీలాభం దొర్లిపోతూంటే వూరికే పోనివ్వడం ఎందుకని మారువేషం వేస్తారు. మారు పేరు పెట్టుకుంటారు. మేము ఫలానా అని క్రియ జరుపుతారు. ఇది నాటకంలో పాత్ర మార్చడం కాదు కాబట్టి ప్రమాదం అనిపించుకుంటుంది.

...ధవళధవళములగు జన్నిదములతోడ
గాశికా ముద్రయిడిన యుంగరముతోడ
శాంత రసమొల్కు బ్రహ్మతేజంబుతోడ
బ్రవరుడయ్యె వియచ్చర ప్రవరుడపుడు!

పేరుమారినా, మనిషి మారినా క్రొత్తనాటకం వేసినట్టవుతుంది. మరో మారుమూల సవతిపోరు

...పట్టియాడె నారంంభతో బ్రభమ రభ
ప్రియుడు నిలుమన్న నిలువక పెద్దరొదగ...

ఇల్లా చాలా కష్టాలున్నాయి.

ఇంతకు నేరానికి ముఖ్యం యితరుల మెత్తతనం. అశక్తత. నేరస్థుడు ఎక్కడ బుర్ర ఎరువు తెచ్చుకో తగ్గవారుంటారో పసికడతాడు. పట్నాలు, పల్లెలు కలియజూస్తాడు. మంచివేషం వేసి కథ అడ్డంగా తిరుగకుండా కట్టివేస్తాడు. కోర్ట బేరానకు వెళ్లి కోట కబుర్లడుగుతాడు. నగల కొట్లో బేరంచేస్తూ నగలు కాజేస్తాడు. మోటారు కదిలాకగాని మోసం బయటపడదు. నమ్మించి స్వామిద్రోహం చేస్తాడు. ఓ అర్థరాత్రి మకాము వూళ్లోంచి ఎత్తేశ, యివ్వవలసిన వారికి మూడుపైసాలైనా గిట్ట నివ్వడు. గొప్ప గొప్ప వుద్యోగులతో బుజం కలిపి వారిని టోపీ వేయడం కలదు. ధనాగారాల్లో పద్దున్న వారి పేరట చెక్ ప్రసాదిస్తాడు. ఆటల్లోను, పేకాటల్లోను, కంట్లో దుమ్ముకొడతాడు. జూదం సాగిస్తాడు. ఆడవారితో పరిచయం కలుగజేసికొని, చల్లని మాటలుచెప్పి, మంచి చేసికొని డబ్బు వడుకుతాడు. వర్తకులతో భాగస్వామిగాచేరి, వారిపేరట అప్పు నిలిచేట్టు పని మెలకువగా చేస్తాడు. ఇల్లా ఎందుకో ఒకందుకు నేరస్థుడు పేరుమార్చడానికి మిష వుంటుంది. అందులో లాభం జనసామాన్యానికి తెలియదు. ఈ విషయం నిజం కాకపోతే నన్ను మారుపేరుపెట్టి పిలు అని ఒట్టుపెట్టుకుంటారు; మారుపేరు అసలే శిరచ్ఛేదం అని వారు భావించబట్టి! అడగని వారిదే పాపం అనే సోదరభావంతో ఎంతటిపేర్లకీ ఇదిగో అనడం న్యాయ కళాశాలలో ఓసాంప్రదాయం. అల్లావల్లకాదు, కళ్ల ముందర పేరు కాగితంమీద వ్రాయవయ్యా పెద్దమనిషి అని కొన్నిచోట్ల అడిగి పుచ్చుకుంటారు. పరీక్షాధికారులకు పేర్లతో పనిలేదు; అంకెలు చాలనుకున్నారు. కాని వారూ కొన్ని పరీక్షలకు అంకెలు మాకు గిట్టవు, పేరే నిలపమన్నారు. వారి మాటకేంగాని, పేర్లతో పోష్టుమన్‌కి ప్రాణ పోకట. ఎక్కడ కుమ్మం దిగే గుమ్మం రోజు. వ్రాతగాళ్లల్లో మారు పేర్లు వుంటాయి. విమర్శకులు డొక్క బ్రద్దలు చేస్తారేమో అని; ప్రజాసామాన్యం పట్టుకొని వుతుకుతారేమో అని; భావాలు కాలానికి విపరీతంగావున్నాయని తమకే సందేహం తోచి; పోనీ యెందుకు పేచీ, మన కోచోట మంచి పేరుంది కనుకనా, సుట్టుగా పోనిద్దాం అని; విషయం మిగిలి పోకుండా తెలియజేశాము, మనం తొంగి చూడడం ఎందుకు ఘోషా అని; స్వోత్కర్షనిరసన తెలుపడానికి; పేరు పైకి రాకుండా కప్పెట్టి డక్కాముక్కాలకి మారు పేరు కాసుగుంటుందని ఒక అభిప్రాయం లేక పోలేదు. ఇల్లా మనుష్యుడే మారుపేర్లతో మునిగి తేలుతూంటే దేవుడు మారు పేర్లకి గునవడంలో ఆశ్చర్యం లేదు.

పేరు మార్చడంతో నేరం కప్పడిందని నేరస్థుడు సంతోషించడం పొరబాటు. తదితరములన్నీ మార్చడం అతని తరం కాదు. కుక్కవేషం వేసినా, మొరగకుండా వల్లకాదు. అలవాట్లు మారవు. మాటలో ధ్వని మారదు. సులోనాలు మారవు. చూపు మారదు. మచ్చలు మాసిపోవు. మోటతనం మారదు. కాని మారు పేరు పెట్టుగున్న నేరస్థుని పేరడగ గానే తట్టెడంత కోపం రావడం గలదు. మీకు దానితో జోక్యం ఏముంది అన్నట్టు చూస్తాడు. కొంచెం తటపటాయిస్తాడు. సంభాషణలో నీళ్లు నములుతాడు. వార్తా పత్రికల్లో తన నేరమును గురించి చర్య ఎల్లా జరుగుతున్నదీ వృత్తాంతం తెలిసికొనుటకు రోజూ దేవులాడుతాడు. ఆ వార్తలను కత్తిరించి జాగ్రత్తపరుస్తాడు. టోపీలోనో, మరోచోటో. దగ్గర పెద్దమనుష్యుల సర్టిఫికేటులు, బనాయించేనా, పదిలపరుస్తాడు. తనమీద ఒకవేళ నింద పడితే బాపుకునేందుకని. ఎన్నిచేసినా పరిశోధకుడు చిటికలో వాకబుచేసి సుట్టు కనిపెడతాడు. నేరస్థుని నోటమ్మట ఏ ముక్కరాలితే అది గుర్తుపెట్టుకుంటాడు. బట్టల కున్న చాకలగురుతులో చిక్కు విప్పుతాడు. టెలిఫోను సాలెగూడులాగు అల్లుకు పోయిన దేశాలలో శోధనకు మంచి వీలుంది. కాని అట్టి దేశాల్లో నేరాలు జరగడానికి హంగు వుంది. నేరస్థుడిని పూర్వవృత్తాంతంగురించి అడిగితే సమయాను

మూలంగా మార్చివేస్తాడు. తడక అల్లడం, మాట తడబడడం, నేరమును గురించి ఏమక్క అనుకున్నా బుజాలు తడుముకోడం, గుండెదడ హెచ్చడం, ముఖం ఎర్రబారడం, నాకేమి తెలియదని మాటమార్చడం, పరధ్యాన్నంగా వున్నట్టుండడం కలదు. ఈ చిహ్నములేవీ తెలియకుండా గట్టిగా బొంకే నేరస్థులున్నారు. అమెరికాలో నేరస్థుని యంత్రమూలంగా పరీక్షిస్తారు, ప్రశ్నలడిగి. ఏమిచేసినా ఒకవ్యక్తి వేషం, వృత్తి, కులం, దేశం, భాష, బంధువులు, చరిత్ర అతనినే ముఖస్తాగా అడగకుండా, సాధించుటకు రావడం గొప్ప పరిశోధకుని లక్షణం. ఒకరు ఒక పేరు చెప్పిన మాత్రాన అది వారిపేరని మోసపోకూడదు. కావని వారి ముందు సందేహించాకూడదు. వారితో నయంగా మాట్లాడి, వచ్చింది రాబట్టుకోవాలి. పేరు చెప్పగానే ఆ మనిషి నేరస్థుడనిగాని, నేరము చేయనెంచెననిగాని, నేరమును మరుగు పరిచెననిగాని వూహించుట సామాన్య పౌరునికి కడు దూరము. పరిశోధకునికి అది కొట్టిన పిండి. పరిశోధకునికి పౌరునికి పరుగు అందదు. పరుగందేట్టు చేసుకోడం పౌరునిలోవుంది. పరుగు అందకుండా చేసుకోడం పరిశోధకుడిలో వుంది. పౌరుడు పరిశోధకుడు కలుస్తే నేరస్థుడు వేరు పడతాడు.

కట్టినవారికి ఒక పేయిల్లు. కట్టనివారికి వెయ్యిళ్లు. నాగరీకంతో పేర్లు హెచ్చినవి. మనం మనమేనా అని మనకే, నేరస్థులగాథలు చదువుతే, సందేహం కలుగుతుంది. నాగరీకంతో ఒడుదుడుకులు, ఒళ్లుపై తెలియక పోవడం వుంటుంది. ధనవ్యయం ప్రబలుతుంది. పేదరికం ఒక ప్రక్క నేరాలు యింకొక ప్రక్క ఎక్కువవుతాయి. తోటకూర నాడైనా తెలియదు గదరా అని తల్లి యిల్లాంటి నాగరికానికి "హోరుహోరు" అని ఏడ్వడం. దేశం నాగరికం కోరినా, మరమ్మత్తు కోరాలి. అందుచేత మీ పేర్లు యితరులు సవ్యంగా వాడేట్టుగా కాయండని హెచ్చరించడం వివేకం. జాగ్రత్త పడడం వివేకం. ఆంధ్రప్రభ కాకినాడలో వెలిసిన రెండురోజులు బాగానే వెలిగింది.

చెందును సాకొకటది నే
నంపరి వలె తరుచు వాడ నది యితరులకున్
పొందుగ నుపయోగించును

అనే కందవ అందులోదే. జవాబు మీకే వ్యక్తపడుతుంది. పేరులోనే వుంది పరువు. పంతం. పవిత్రత. దాన్ని బట్టే ఖండాంతరాలకి ఎగబ్రాకునవి కొలది పేరులే.



# తక్షశిల చిత్రములు

## ౧. ౧-౬ మట్టములయందలి నిర్మాణశిథిలముల నమూనాలు




౧-౨ మట్టముల నమూనాలు




౩-వ మట్టము నమూనా




౪-వ మట్టము నమూనా




౫-వ మట్టము నమూనా




౬-వ మట్టము నమూనా




(f) SECTION ON A. B. (LOOKING NORTH).

SIRKAP. BLOCK 2
PLANS & SECTIONS
OF
SIX STRATA

లోతును, ఆయామట్టముల ప్రారంభమును సూచించును.

# సారంగధర చరిత్ర

బులుసు పాపయ్యశాస్త్రి

శ్రీరుద్రాభట్ల ప్రకాశరావుపంతులు గారు ఈసంవత్సరము వైశాఖమాసపుభారతిలో సారంగధరచరిత్రనుగురించి వ్రాస్తూ ఆ ప్రబంధములోని కథకు మాతృక అని చెప్పదగినకథ రెండువేలసంవత్సరములక్రిందట ఉండిన గ్రీకుకవి యురీపిడిస్ రచించిన నాటకములోను, దాని ననుసరించి సెనెకాకవి ల్యాటినుభాషయందు రచించిన నాటకములోను ఉన్నట్టు తెలిపినారు. గ్రీకు-ల్యాటిను కవులు రచించిన గ్రంథములలోనికథలు మన దేశములో చొచ్చి వ్యాపించడము అసంభవము కాదు. కాని ఈదేశపుగ్రంథములలోను పుక్కిటిపురాణములలోను అటువంటి కథలు ఏవయినను ఉన్నవేమో చూడడము మంచిదిగదా!

'సారంగధరచరిత్ర' కృతికర్త చేమకూర వెంకటకవి క్రీస్తుశకము ౧౭-వ శతములోని వాడు. ౧౬-వ శతములో నంజుండకవి కన్నడమున రచించినకావ్యములో ఉన్న కథను ఒకరు ఈ సంవత్సరము జూను ౧౦-వ తేది గల 'వీక్లీ హిందూలో' సంగ్రహించినారు. దానిసారాంశ మీక్రింద వ్రాస్తున్నాను.

పంపారాజ్యమునకు (అదే కుంతల రాజ్యము - అదే పూర్వపు కిష్కింధ) రాజయిన కంపిలుడికి నలుగురు భార్యలు, ముగ్గురు కొడుకులు. కడపటిభార్య, రత్నాజి అనేపేరు గలది. మిక్కిలి చక్కనిది, యౌవనవతి, చాతుర్యము గలది. కొడుకులలో రామనాథుడు శూరుడు, శక్తిమంతుడు, రూపసి, సాహసికుడు. అతడి శౌర్యసాహసములను గురించి యెన్నో కథలు గలవు. అతడికి "పరదారసోదరరామ" అని బిరుదు ఉండెను.

ఒకప్పుడు రాజుగారి కడపటి భార్య అయిన రత్నాజి తనసవతికొడుకయిన పూర్వోక్తరామనాథుడిపైన పట్టరానిమోహము గలదై తనమోహమును అతడికి తెలియపరిచెను. అతడు ఉగ్రముగా నిరాకరించెను. ఆ మాయలాడిరాణి తనపెనిమిటిఅయిన రాజుగారితో తన్ను రామనాథుడు చెనకె నని చాడీలు చెప్పి నమ్మించెను. రాజు అతడితల దీయించుమని మంత్రిఅయిన బైచప్పకు అతణ్ణి అప్పగించెను. బైచప్పకు తనకొడుకులమీదకంటెనూ రామనాథుడిమీద ఎక్కువ ప్రేమ. అతడు రామనాథుణ్ణి ఎక్కడనో మారుమూలకొండలలో దాచి రాజుకు తాను అతణ్ణి చంపించినట్టు తెలియజేసెను.

రామనాథుడు కల్పితపురుషుడుగాక దేశచరిత్రతో సంబంధించినవాడు. అనేకయుద్ధములలో అతడు అసాధారణ బలపరాక్రమములు కనపరచి శత్రువుల నోడించెను. బల్లాల

రాజు, కాకతీయవీరరుద్రుడు, గజపతివంశము వాడయిన నరసింగరావు - వీరెవరును రామ నాథుణ్ణి గెలువలేకపోయిరి.

దేశమందు వ్యాపించిన మరొకకథ:— అశోకుడిభార్య అయిన తిష్యరక్షిత తనసవతి కొడుకయిన కునాలుణ్ణి మోహించెను. అతడు నిరాకరించగా ఆమె రాజుతో అతడి మీదనే నేరముమోపి చాడీలుచెప్పి అతణ్ణి శిక్షింపించెను.

ఈ కథలకన్నింటికీ యురీపిడిస్ సెనెకాల కథే మాతృకఅయితే కావచ్చు గాని అదే సిద్ధాంతము అనడము యుక్తముకాదు. పయిని జెప్పినకథలు కల్పితములు అన్నప్పటికీ భరతఖండకవులకు కల్పనాశక్తి లేదా ?

---



ఉస్మానియా ఆసుపత్రి, హైదరాబాదు

—కె. కృష్ణమూర్తి.

అనంతపంతుల రామలింగస్వామిగారి

# శుక్లపక్షము

విద్వాన్ పిశ్వనాథ నరసింహము, బి. ఏ.,

విచిత్రనామధేయముతోఁగూడిన యీ గ్రంథమును దిలకించినంతన పఠింప నిచ్ఛ గలిగినది. పఠించితిని. తన్మూలమునఁ గలిగిన భావవిశేషంబుల నీ క్రిందఁ బొందుపఱచుచున్నాను. నవీనాంధ్ర సారస్వతమున నూత్న యుగారంభముననే భావకవిత్వము విజృంభించి కృష్ణపక్షసమారంభ మైనదని యోచించు పండితవిమర్శకప్రవరులు నేఁడు శుక్లపక్షసమున్నతి చూపట్టినదని యమందానందమంద వలసినయదను.

కళానిధివిలాసంబుల సుఖంబు గాంచు కవితాప్రపంచంబున "కృష్ణపక్షము" కృష్ణపక్షముతోడనే పూర్వపక్షమగును.

"మొదలగు శుక్లపక్షగరిమోదయ మింతటి నుండి యందు నిన్ను దరియ పీలులేదు..."

"కృష్ణపక్షమందుఁ జెరలివచ్చి యాడెద..."

"కృష్ణపక్షోత్తకాకము..." మొదలగు పదములంబట్టియు, భావకవితాయుగ నిశాసమయమున శుక్లపక్షోద్ధతిని భావశూన్యంబగు భావకవిత్వపు పెంజీఁకటి విరియింపం జేయునట్లు కవి యుద్దేశించె నని స్ఫురించుచున్నది.

పుస్తకమును, నామమును జిత్రముగనున్నట్లే యంకితమును జిత్రముగనేయున్నది. కావ్యము హేళనమార్గము ననుసరించిన యుత్తమ విమర్శనము. శైలి గంభీరము. రచనాపద్ధతి లక్ష్యలక్షణసమ్మతమైన పూర్వకవిమతము. కృతి నొసంగుటలో కవికి ధనాశ లేదు. ఇంకఁ గృతిపతిత్వమునకుఁ దగినవాఁడు? ఉత్తమకవీంద్రుఁడయ్యు, వికటకవిత్వమునఁ బ్రకటితసామర్థ్యము గల్గినవాఁడును, ప్రామాణికుఁడును, హాస్యరసంబున కునికిపట్టును, నల్లనికాకిని తెల్లకాకిగాఁ జేయు సామర్థ్యము గలవాఁడును, కుపథంబునఁ బోవువారి సుపథానువర్తులఁ జేయఁగల వాఁడు నగు తెనాలిరామలింగకవికంటె నితరుండు తగిన కృతిభర్త లేఁడనుట నిర్వివాదాంశము. కవిగారికి కృతిభర్తతోఁ గల నామసామ్యమును, ప్రతిభాసామ్యమునుగూడ నీకృతిప్రదానమునకుఁ గారణమై యుండ నోపు. దిగువపద్యంబులఁ దిలకింపుఁడు.

"నాపేరఁ బరఁగువాఁడవు
నాపద్యము లరసి ప్రీతి నను మెచ్చుచునే
రేపును మాపును నాకృతు
లే పఠియించెదవు గాన నెలమి నొసంగెన్,

"ప్రాచురోజ్జ్వల కీర్తి రూపలలనా
రక్తాత్ముఁడై, హాస్యవా
చాచాతుర్యగుఁడై, విమర్శనకళా
చంద్రుండునై, కాకవి
ప్రాచీనాహిమమార్గుఁడై, కవిజన
ప్రాలంబుఁడై యస్మదీ
యాచార్యుం డగు "రామలింగకవి" నే
నశ్రాంతముం గొల్చెదన్."

రసములకెల్ల నునికిపట్టయి సముద్రము వలె నతి గంభీరములైన రామాయణ మహాభారతాది గ్రంథములను, వివిధములైన పోక డలకు నాకరములైన వసుచరిత్రాది ప్రబంధరాజములను, మనోహరము లైన రామలింగాదికవివర్యుల చాటువులను ధిక్కరించి విచ్చలవిడిగా పెచ్చుపెరుగుచున్న నేటిభావశూన్యంబగు భావకవిత్వములోని దోషములను సరసముగా నుగ్గడించి హృదయంగమమగు మార్గమున సత్కవితాలక్షణములను బాలకులకు బోధించుటయే కవిగారి ముఖ్యోద్దేశమగుట స్పష్టము. "కవిరాజు" అను ఖండమునందు శ్రీనాథునియున్నతిని, 'వికటకవి' యనుదాన రామలింగకవిప్రతిభా విశేషమును 'భావకవి' యనుదాని యందు తిక్కన జిలిబిలిపలుకుల తెలుఁగు కవిత్వమును గవిగారు స్తుతించి యమూల్యము లగు నవ్వాని ముందు నేటి భావకవిత్వ మనఁబడెడు గవ్వలక తూలకుప్పలను దెచ్చి సరిపోల్చి చూపి వాని యందుఁ గలభేదమును బాలకులకుఁ గాంతా సమ్మితముగా బోధించుచున్నట్లు స్పష్టముకాఁ గలదు. ఈదిగువ పద్దియంబుఁ బరీక్షించునది.

"లేఁత తెనుంగుపాపనుఁ గు
లీనను మంజులశయ్య నుంచి సం
ప్రీతినిఁ బెంచి, పాకరస
వృత్తుల రీతుల నీతులన్ గుణ
ఖ్యాతకళారహస్యముల
నర్మిలి నేర్పి, యలంకృతిప్రభో
పేతగఁ బెద్దఁజేసిన క
వీంద్రునిఁ దిక్కనయాజిఁ గొల్చెదన్."

ఈ గ్రంథమున నెనిమిది ఖండములుగలవు. ఇందు మొదటిది విఘ్నకవి. ఇందు పూర్వకవి మతానుసారముగ విఘ్నేశ్వరస్తుతి చేయఁ బడినది. కాని వ్యంగ్యముగా నెల్లమొదలను, భావకవిత్వమును, భావకవులనుగూడ నిరసించుటయే కనుపట్టుచున్నది. "పూజ్యభావ రూపావధి," "నిర్గుణాత్మకుఁడు" "దోషాకరోపాధి" "వక్రహస్తుఁడు" "కళానిధికి హాసము గొల్పెడు" మొదలగు శబ్దంబులు వ్యంగ్యమర్యాద. ననుసరించిన భావకవినిరాసంబులుగానిమొదల వేఱేవియో యెఱుంగ రాదు.

రెండవది 'కుకవి'. కుశలకవీశు లెల్లరును దప్పక నిందించు కుకవు లూహాగోచరులేయనియును, అట్టినింద యధునాతనులచే తమయజ్ఞానావకుంఠనమునకై యవలంబింపఁ బడినదనియుఁ గవిగారిచే సరసంబుగా బోధింపఁ బడెను.

'వికటకవి' యనుదానియందు కవి తన కవితాశక్తిని జక్కఁగఁ బ్రకటించెను. "కవిసింహాము..." మొదలుగాఁగల పద్యమునందు జూపిన హాస్యమును "కుతలకవీశులందు తలగోల్పడువారు కుకవీశు లద్దిరా" యను చోటంగల శబ్దార్థంబులపొందికయు, తెనాలి రామలింగని మార్గమునే యనుసరించుచున్న వయ్యును, అంతకంటె మిన్నగా నున్న వని చెప్పక తప్పదు. "కవులవెనుక నుత్తములు ముకవులే సుమ్మా." అనుపాదమునం దీనాఁటి భావకవులవెనుక దిరుగాడుచు వారివలె కవితాభాసములనైనను రచింప శక్తిహీనులైన కవినామధారు లగువారలకు 'ముకవు' లను క్రొత్త నామకరణమును కవిగారు నేసియున్నారు. ఇట్టివారు లెక్కకుమిక్కిలిగా నిప్పు డున్నటు లూహింపనగును.

'కవిరాజు' నాల్గవది. ఇం దనవేమభూపాలుని ప్రాభవమును, శ్రీనాథాదులైన పూర్వకవులప్రతిభయును, నందలి పేదబాపని వంటి యర్థశూన్యులైన భావకవులను గవిగారు చక్కని కవితామార్గమున నిరూపించి యున్నవారు.

భావకవిత్వ మనుదానియందు నయిదు విధములైన నేఁటి భావకవిత్వమును కవిగారుదాహరించియున్నారు.

'భావతురంగ' మనుదానియందు కవిగారు తమ యనూనప్రతిభను చూపి చమత్కారమైన కల్పనఁజేసి భావకవిత్వమును భావతురంగమువంటిదే యని నిరూపించి యున్నారు.

'భావకవి' యను వ్యాసమునందు భావకవుల బహిరంతస్స్వరూపములయందలి సాధారణ చిహ్నములను గవిగారు నేర్పున నేర్పరించిరి. పద్యమొం డుదాహరించుచున్నాను:

"తెనుఁ గాడుటను వ్రాయుటను దెలియ న్వలె
నాంగ్లభాషాజ్ఞాన మవసరంబు
దేశాటనోత్కటావేశ ముండన్వలె
నుద్యోగమున బుద్ధి యుంచరాదు
భావగీతాలను బాడుచుండన్వలెఁ
బూర్వకవులఁ దిట్టిపోయవలయు
స్వేచ్ఛావిహారంబు సేయవలెన్, సభ్య
లోకరినోకసు మెచ్చుచుండవలయు
నప్పకవి సెప్పినదియెల్లఁ దప్పవలయు
నరయఁ గర్ణద్వయముఁ గప్పి యాడుకురులఁ
బెంచవలె, నూత్న వేషంబు వేయవలయు
మా సమితిసభ్యులకు నియమంబు లివ్వి."

తుదిదయ్యును నీ వ్యాసములలో మిన్న యగునది 'గణాధిపతి' యనునది. ఇందు కవిగారు తమ శ్లేషసామర్థ్యముచేతను, ధ్వనిమార్గ మవలంబించుచునే కవిగణాధిపుని చక్కగ పరామర్శించినారు. ఇందానాథుని జీవితచరిత్రమును, కవితాప్రాగల్భ్యమును, పాండిత్యప్రకర్షయు, శీలసమున్నతియు నున్నవున్నట్లు తెలుపంబడినవి.

ఈ గ్రంథమున ధ్వను లనేకములు గలవు. శ్లేషాద్యలంకారముల కిది బరణి. హాస్యమున

కిక్క; విచిత్రకల్పనలకు తావు. ఇట్టి హేళన కావ్యములు తెలుఁగున నింతవఱకు లేవని చెప్పుట సత్యదూరము కాదు. ఒకదానితో నొకటి పొందని చేష్టలుగాని, పల్కులుగాని, లక్షణములుగాని యేకాధికరణములైనప్పు డయ్యవి చూపఱకు హాస్యరసస్ఫోరకము లగు చుండును. అట్టివి సారస్వతమునందు గన్పించిన నే యిట్టి హేళనకావ్యములు సారస్వతము నందు బయలుదేరును.

ఇట్టి సరసమై, లలితమై, నాగరకమై యొప్పారు కావ్య మాంధ్రసారస్వతాభివర్ధక మార్గమున నవీనయుగమును సూచించునట్టి స్థిరచిహ్నమై యొప్పారుగావుత.

---



హైదరాబాదు, మున్సీనది ఒడ్డున

—కె. కృష్ణమూర్తి.

# సంస్కృతము దేశభాషగ నుండినదా?

వంగోలు వేంకటరంగయ్య, బి. ఏ., బి. యల్.,

ఈ సందియము భారతవర్షమున నేరికిం గలుగ లేదు. పదునెనిమిదవశతాబ్దియందు పాశ్చాత్యులు, వారిలోనను ఆంగ్లేయులు సంస్కృతపరిచయము చేయ సాగినపిదప ఈవిచికిత్స వారిలో నంకురించినది. డూగల్డు స్టూవర్టు (౧౭౫౩-౧౮౨౮) అనుస్కాట్లాండు తత్త్వవిచారకుడు సంస్కృతమనునది ఏనాడును దేశభాషగ ఉండినది లేదనియు, అలెగ్జాండరు ఇండియామీద దండెత్తివచ్చినపిదప ఆయన శిబిరములలోని గ్రీకుపండితులజూచి ఈదేశపుపండితులును అట్టిదానివలె నుండుటకై సంస్కృతమను నొకదానిని కృత్రిమముగ కల్పించిరని యొకప్రవాదమును పుట్టించెను. ఈవాదమును వానివెనుక మరికొందరును ఆమోదించిరి. పెద్దబాలశిక్షలోని మూలభద్రికమువంటి సంకేతభాషయని తలచిరి. "అకాఖగాన్యఘశ్చైవే" త్యాది సంకేతములవంటిదని భావించిరి. అటులగాకున్న ఐరోపాదేశములో సామాన్యభాష నొకదానిని కల్పింపవలయునని 'యస్పరాంటో' అను నొకభాషాసంవిధానమును ఇటీవల ఏర్పరుప యత్నించినటుల సంస్కృతమునుకూడ కల్పించియుండవచ్చుననియు, ఇది యింటిభాషగ మాట్లాడుచుండిన జనము ఎపుడును ఉండియుండరని యూహింపబడినది. దీనికంతయు కొంచెమాధారము కల్పించినది సంస్కృతమనుశబ్దమే. సంస్కృతమనుశబ్దమువలన అసంస్కృతముగా నుండినది కొంత సంస్కారమును పొంది సంస్కృతమనుపేరు పొందినదని యూహింప నవకాశము కలుగుచున్నది.

> "సంస్కృతం సంస్కృతం విన్ద్యాత్
> ప్రాకృతం ప్రాక్ కృతం మతమ్"

అను నొకప్రాచీనవచన మున్నది. దీనివలన సంస్కృతప్రాకృతములమధ్య ప్రాకృతము ప్రకృతియనియు, మూలభాషయనియు స్ఫురణ గలుగుచు ఆప్రాకృతము సంస్కరింపబడి సంస్కృతమనుపేరున వాఙ్మయములోనికి వచ్చియుండవచ్చునని యొకయూహ గలదు.

మరియు సంస్కృతమునకు తొలిపేరు గీర్వాణమనియు, ఆగీర్వాణభాష కొంతసంస్కారమును పొంది సంస్కృతమనుపేర వ్యవహారములోనికి వచ్చినదనియు నొకయూహ గలదు.

అపారపారావారమను మహాసముద్రమువలె ఇంతింతయనరానివిస్తృతి గలిగి రత్నాకరమువలె నమూల్యములగు గ్రంథములుగల ఈప్రసిద్ధమగు సంస్కృతభాష కల్పితము కావలయునా? అటుల నేమాత్రమునుగాదు. వేదభాషను జూడ నయ్యది ఆవేదకాలమున జనసామాన్యము మాటలాడుకొనుచుండినదిగా తోపగలదు. మహమ్మదీయుల ఖురాను మహమ్మదువారికాలమున అరేబియాదేశములో వాడుకలోనుండినభాషలో నున్నదని ఆభాష దెలిసినవారు చెప్పుచున్నారు. ఏసుక్రీస్తును తన యుపదేశములనెల్ల తనకాలపుదేశభాషలో జేసెనని తెలియుచున్నది. బౌద్ధమతగ్రంథములు చాలవరకును, అశోకచక్రవర్తిశాసనాదులును ఆకాలములలో వాడుకలోనుండిన పాళియను నొకవికృతియందు రచింపబడియున్నవి. పైజెప్పబడిన అరబ్బి మొదలగుభాషలీనాడు దేశభాషలుగ నుండనందున ఇవన్నియు కల్పితభాషలని చెప్ప సాహసించువా రగపడరు. సంస్కృతమునెడలమాత్రము సందేహము కల్గుట విపరీతముగ నున్నది.

ఒకభాషను కల్పించువారు ఏవోకొన్ని సంకేతములు పెట్టుకొని ఆ భాషావ్యవహారము లితరులకు తెలియకుండునటుల Code wordsగనో లేక రాజ

నీతిలో జెప్పినటుల మ్లేచ్ఛితసంకేతములుగనో యుం డునేకాని యింత విస్తారమగు వాఙ్మయమును, అనాది ప్రసిద్ధియు గలిగియుండజాలదు.

ఆదికావ్యమనుఖ్యాతిగల రామాయణ ప్రామాణ్యమును సంశయింప నలవిగాదు. ఆ రామాయణమున నరణ్యకాండయందలి ౧౧-వ సర్గయందు వాతాపి ఇల్వలుల ప్రస్తావము వొడమి యిల్వలుడు బ్రాహ్మణరూపము ధరించి సంస్కృతము మాట్లాడుచు ఋషుల వంచించి వధించుచుండినటులున్నది:

"ధారయన్ బ్రాహ్మణం రూపం
ఇల్వలః సంస్కృతం వదన్"

అని యున్నది. కల్పితమగు నొకభాషను ఇట్టి యుపయోగమునకు ఎవరయిన పెట్టుట యూహాతీతముగ నుండగలదు. మరియు సుందరకాండ 30-వ సర్గయందు హనుమంతుడు సీతాదేవితో సంభాషింప ప్రయత్నించు సందర్భమున నామెతో నేభాషలో మాట్లాడవలయునని బహువితర్కించినటులు, తుదకు మానుష సంస్కృతమున ననగా లౌకిక సంస్కృతమున మాటలాడ నిశ్చయించుకొనినటులను ఈ క్రిందివాక్యములవలన తెలియగలను:—

"వాచం చోదాహరిష్యామి
మానుషీ మిహ సంస్కృతామ్"
సుం. కాం. 30 స. ౧౭ శ్లో.

"యది వాచం ప్రదాస్యామి
ద్విజాతిరివ సంస్కృతామ్,
రావణం మన్యమానా మాం
సీతా భీతా భవిష్యతి"
సుం. కాం. 30 స. ౧౯ శ్లో.

ఉదాహృతవాక్యములవలన ఆకాలమునసంస్కృతమునందు మానుషభాష అనగా సామాన్యముగ స్త్రీశూద్రాదులు మాటలాడు లౌక్యభాష యొకటియు, ద్విజాతులు బ్రాహ్మణాదులు పండితులు మాటలాడు సంస్కృత మొకటియు, రెండువిధములుగ నున్నటుల తెలియుచున్నది. ఇప్పటి మనతెలుగును పరిశీలించినను చదువుకొనినవారు, బ్రాహ్మణాదులు ప్రయోగించు తెలుగు వ్యాకరణయుక్తముగను, తదితరులుమాటలాడునది కొంచెము గ్రామ్యభూయిష్ఠముగను నుండుట యనుభవమున జూచుచున్నాము. బ్రాహ్మణుడు, దేహము, అన్నము, కుటుంబము అనుచోట జనసామాన్యము, దేహము, వణ్ణము, కుటుంబరము అని పలుకుదురు. ఇట్టిభేదములు రామాయణకాలములోగూడ ఉండినవి గదా! ఒకనాడు కల్పించుకొన్న భాషయయిన యెడల ఇట్టి భేదముల కవకాశ ముండదు.

మరియు భారతము కర్ణపర్వమున (కలకత్తా ప్రతి), ౪౪-వ యధ్యాయమున కర్ణుడు శల్యుని మద్రదేశమును నిందించుచు ప్రాస్తావికముగ మద్రదేశపు వాడుకమాటలగూర్చి యిటులు చెప్పియున్నాడు:—

"హేహతే హేహతే త్యేవం
స్వామిభర్తృహతేతిచ,
ఆక్రోశేస్త్యః......"

ఇత్యాది యున్నది. అనగా ఆదేశమున స్త్రీలు, (తల్లులు బిడ్డలనుకాని, యితరస్త్రీలు ఇతరస్త్రీలనుగాని) సంబోధించునపుడు "హేహతే, హేహతే, స్వామి భర్తృహతే" యను మొదలగు ముదుసుమాటలను ప్రయోగింతురని తెలుపబడియున్నది. ఇపుడును కొందరు కొందరు అలపరిజనము, పిలిచిన పలుకకయున్న బిడ్డలను 'ఓరి చచ్చినవాడా,' 'ఓసి చచ్చినదానా,' 'ఓసి, నీముండమోయ,' యిత్యాదిపరుష వాక్యములతో పిలుచుచుండుట వినుచుందుము. ఇట్టివే ఆకాలమునగూడ వాడుకలో నున్నటులును అవి సంస్కృతమున నున్నటులును ఉదాహృతభారతప్రమాణమువలన తెలియుచున్నది. దీనివలన పామరజనముకూడ ఆప్రాతకాలమున ఈసంస్కృతభాషనే యుపయోగించుచుండినటు లూహింపదగియున్నది.

ఇవికాక సంస్కృతమున దృశ్యప్రబంధము లనేకములున్నవి. వానిలో నుత్తమపాత్రలన్నియు సంస్కృతమునే యుపయోగించుచున్నవి. సంస్కృతము దేశభాష గాకుండిన మృచ్ఛకటిలోని చారుదత్తాభియోగ

ఘట్టము సంస్కృతమున నుండునా? ఏమూలనో, ఏమహా సత్రమునన్ కొందరు బ్రాహ్మణులు చేరి యొకభాషా సంకేతమును నేర్పరచికొనిన రనుట హాస్యాస్పదముగ నుండగలదు.

కాత్యాయనుడు, పాణిని మొదలగు వాగనుశాసనులు వ్యత్యస్తములు, రూపభేదములు కలుగకుండ వ్యాకరణములచే నీసంస్కృతమును బంధించిరి. అందుచేత నీసంస్కృతముయొక్క సంస్కృతత్వము అవధారిత మగుచున్నదేకాని కల్పితవ్యాకరణసూత్రముల నేర్పరచి ఆసూత్రముల కనుగుణముగ తిఙంత సుబంతముల నేర్పరచియుండరు.

సంస్కృత మొకదేశభాషగ నుండినటులను ఆ భాషలో ఆయాప్రదేశముల వాడుకలోనుండిన కొన్ని దేశవాళిమాటలు, ప్రయోగములు (Dialects) ఉండినటులను అనేకనిదర్శనములు గలవు. పస్పశాధ్యాయమునందు ఈక్రిందివాక్య మున్నది:—

"ఏతస్మింశ్చ అతిమహతి శబ్దస్య ప్రయోగవిషయే తే తే శబ్దాః తత్ర తత్ర నియతవిషయాః దృశ్యన్తే"

అని సామాన్యవిషయము చెప్పి దానికి కొన్నియుదాహరణముల బతంజలి చూపియున్నాడు—

(i) "శవతిః గతికర్మా కాంభోజేష్వేవ భాషితో భవతి.—" అనగా శవధాతువునకు కాంభోజదేశమున సామాన్యముగ గతియు, కర్మయు అర్థములు.

ఇదేధాతువును ఇపుడు మనమందరము వాడుకొనుప్రకారము ప్రేతపర్యాయముగ ఆర్యులు ప్రయోగింతురనియు తెలిపియున్నాడు. "వికారే ఏనం ఆర్యా భాషన్తే."

(ii) "హమ్మతిః సురాష్ట్రేషు—రంహతిః ప్రాచ్యమధ్యేషు— గమి మేవతు ఆర్యాః ప్రయుంజతే—" అనగా సౌరాష్ట్రమున "హమ్మ" ధాతువును, ప్రాచ్యమధ్యదేశస్థులు "రంహ" ధాతువును, ఆర్యులు "గం" ధాతువును ప్రయోగించుస్థానముల ఉపయోగపెట్టెదరు.

(iii) "దాతిః లవణార్థే ప్రాచ్యేషు దాత్రం ఉదీచ్యేషు—" లవణార్థమందు ప్రాచ్యులు ప్రయోగించు "ద" శబ్దమునకు ఉదీచ్యులు "దాత్రం" అనుదురు.

ఇట్టి యుదాహరణము లనేకములు గలవు. "కృషి" యనుదానికి "కసి" యనురూపభేదమును "దృశి" యనుదానికి "దిసి" యనురూపభేదమును గలవు.

సంస్కృత మొకదేశభాషగ నుండుటయేకాక దానిలో ప్రదేశప్రయోగభేదములుగూడ ఉండినటులు పైయుదాహరణములవలన స్థిరపడగలదు.

వార్తికకారుడగు వరరుచియు ఇట్టిదేశభేదములను (Dialectical differences) కొన్ని చూపియున్నాడు. ఉదాహరణము: "వర్తకా శకునౌ ప్రాచాం, ఉదీచాంతు వర్తికా" ప్రాగ్దేశస్థులు "వర్తకా" యను పక్షిపేరు ఉదీచులు "వర్తికా" యందురట.

పాణిన్యాచార్యులుకూడ ఇట్టిభేదముల గొన్ని చూపియున్నాడు. ప్రకృతమున కొకయుదాహరణము చాలును.

"ఉదీచాం వృద్ధా దగోత్రాత్"—౪-౧-౧౫౭ ఈ సూత్రోదాహరణముగ అపత్యార్థతద్ధితరూపమున "ఆమ్రగుప్తాయనిః" అనియుండవలసినదానిని ప్రాగ్దేశమున "ఆమ్రగుప్తిః" అందురట. వాడుకలో లేని భాషకు ఇట్టిరూపభేదములు గలుగుట సహజమగునా?

ఈభాగమును దాటిపోవులోపల ఇంకొక విచిత్రోదాహరణము చూడనగును. ఒకానొకసూతునికిని (రథము తోలువాడు) ఒక వ్యాకరణజ్ఞునికిని "ప్రాజితృ" శబ్దస్వరూపవిషయమై సంస్కృతమున సంవాదము జరిగినటులును తుదకు సూతుడే గెలిచినటులును మహాభాష్యమున ఒక యాఖ్యాయికను పతంజలి చూపియున్నాడు.

లాక్షణికమతమునను సంస్కృత మొక దేశ భాషగ అనాదిగ నుండినటుల తోచుచున్నది. లాక్షణిక శేఖరుడు రాజశేఖరుడు (క్రీ. శ. ౮౮౦-౯౨౦ ప్రాంతములవాడు) తనకావ్య మీమాంసయందు కవిభేదముల బేర్కొనుచు మార్గకవియని యొకని జెప్పె కవిత్వమున కొకయుదాహరణముకూడ జూపియున్నాడు. బహుశః ఈతనిమతమున మార్గకవియనగా వాల్మీకిరామాయణమున "మార్గవిధానసంపదా" (బాలకాండ ౪-౪౧౫) యని ప్రయోగించినపుడు "మార్గ"శబ్దమున కేయర్థమును సూచించెనో రాజశేఖరుడును మార్గకవి యనినపుడు ఆయర్థమునే యనుసరించియుండును. వాల్మీకి తన కావ్యమునందలి సంగీతమాధుర్యమును ప్రశంసించుకొనుచు తన కావ్యము మార్గవిధానసంపదచే నొప్పియున్న దనినాడు. ఈవాక్యముపై వ్యాఖ్యానములలో సంగీతమున 'దేశి' యనియు "మార్గ" యనియు రెండు ప్రకారములు అనాదిగ నున్నటులను "దేశి" యనునది క్వాచిత్కముగ అచటనచట ఆయాదేశములలో ప్రచురముగనుండు ప్రకారమనియు "మార్గ" విధానము సార్వత్రికమైన దనియు చెప్పబడియున్నది. "దేశి" విధానమున కుదాహరణముగ "హిందుస్థాని మోడి" యనియు, "కర్ణాటక" మనియు "తంజావూరుబాణి" మనియు పాటకచ్చేరిలలో వినుట గలదు. ఇట్టి ప్రకారభేదము కావ్యములందును, కవిత్వములందునుకూడ నుండినటుల మార్గకవిశబ్దము స్ఫురణచేయుచున్నది. ప్రాచీనాంధ్ర కవులును ఈవిధానద్వయము నెరిగినటుల నన్నెచోడుని కుమారసంభవము సాక్ష్యమిచ్చుచున్నది—

> "మునుమార్గకవిత లోకంబున వెలయఁగ
> దేశికవితఁ బుట్టించి తెనుం
> గు నిలిపి రంధ్రవిషయమున"
>
> (ప్రథమాశ్వాసము, ౨౩-వ పద్యము)

ఇట్టి భేదవ్యవస్థలజూడ అత్యుత్తమ ప్రౌఢశైలిచే నొప్పినదొకటియు, సామాన్యముగ లోకజనమునకు తెలియదగినవిధముగల దొకటియు నుండినదని అంగీకరింపకతప్పదు.

ఇంతియేగాక, సంస్కృతము వాడుకభాషగా నుండినదా యనువిషయమున రాజశేఖరుడు ఇంకొక గొప్ప సహాయము చేసియున్నాడు. కొందరు రాజుల బేర్కొని వారివారియంతఃపురాదులలో వాడుకలో నుండిన భాషలగూర్చి యుపన్యసించుచు ఇటులు జెప్పియున్నాడు.

౧. "శ్రూయతేహి మగధేషు శిశునాగోనామ రాజా— తేన దురుచ్చారాన్ అష్టౌ వర్ణాన్ అపాస్య స్వాంతఃపుర ఏవ ప్రవర్తితో నియమః — టకారాదయశ్చత్వారో మూర్ధన్యాః తృతీయవర్జం ఊష్మాణస్త్రయః క్షకారశ్చేతి—"

౨. "శ్రూయతేచ శూరసేనేషు కువిన్దోనామ రాజా — తేన పరుషసంయోగాక్షరవర్జం అంతఃపుర ఏవేతి సమానం పూర్వేణ."

3. "శ్రూయతేచ కుంతలేషు సాతవాహనో నామ రాజా— తేన ప్రాకృతభాషాత్మక మన్తఃపుర ఏవేతి సమానం పూర్వేణ"

౪. "శ్రూయతేచ ఉజ్జయిన్యాం సాహసాంకో నామరాజా—తేనచ సంస్కృతభాషాత్మక మన్తఃపుర ఏవేతి సమానం పూర్వేణ."

పై నాల్గింటిలో మొదటి రెండింటి విషయము ప్రస్తుతమునకొనినను మూడవదానియందు ప్రాకృతము మాట్లాడువిషయమును, నాల్గవదానియందు సంస్కృతము మాట్లాడువిషయమును ఆయాదేశరాజుల నగళ్లలోని వ్యవస్థ యయినటులు కనబడుచున్నది. సంస్కృతము మాటలాడనిభాషయైనయెడల సాహసాంకునియంతటి రాజాధిరాజాంతఃపురమున నెంతజనముండురో యందరికిని ఆనియమ మెట్లు చెల్లియుండును?

భోజరాజును (౧౦౧౦-౧౦౫౫) తన సరస్వతీకంఠాభరణమున నీయంశము నీ క్రింది శ్లోకమువలన నూర్జితపరచియున్నాడు:—

> "కేఽభూవ న్నాఢ్యరాజస్య
> రాజ్యే ప్రాకృతభాషిణః,

కాలే శ్రీసాహసాఙ్కస్య
　　కే న సంస్కృతవాదినః. *

సంస్కృతము పండితభాషగను, వ్యవహారభాషగను నుండుటయేకాక దేశభాషగనుకూడ నుండినదనుటకు ఇంకొకయాధారము చూపవచ్చును. ఆయాకాలములలో రాజులు చేయుచుండిన అగ్రహారాదిదానముల దెలుపుశాసనములు సంస్కృతముననే చాలవరకు కలవు. ఈశాసనములోనివిషయము లోకమునకు దెలియరాని భాషయందు వ్రాయుట నిష్ప్రయోజనముకదా? కాబట్టి ప్రాయికముగ శాసనభాషయగు సంస్కృతము దేశభాషగ ఉండియుండవలెను. దీనికి విరోధపక్షమున విజయనగర సామ్రాజ్యమునాటి శాసనములును, ఈపలికొన్ని శాసనములును సంస్కృతమున నున్నవి గదా. ౧౪-౧౫ శతాబ్దములవరకు సంస్కృతము దేశభాషగ నున్నదనుట సాహసమని ఒప్పుకతప్పదు. ప్రాచీనాచారము ననుసరించియుందురని సమర్థకము జెప్పనగును. మరియు అగ్రహారాదిదానశాసనములందు దాతృవంశానుకీర్తనము, ప్రతిగృహీతృవంశావళి, దానమహిమాతిశయములు, ఇత్యాదులు సంస్కృతముననున్నను దత్తవస్తునిరూపణము చేయునపుడు, ఒకవేళ లిపి నందినాగరిగనున్నను ఆభాగము భాషమాత్రము తెనుగున నుండెడిది.

ప్రతితెగవారికిని వారివారిభాషయందు అత్యంతాదరాభిమానము చూపట్టుచున్నది. “భాష” యనగ వారివారికి తమ స్వభాషయనియే రూఢిగ నున్నది. హిందూస్థానీదేశమున భగవద్గీత లోనగుగ్రంథముల నచ్చువేయు వారు హిందూస్థానీ టీకాతాత్పర్యములగూడ జేర్చుట గలదు. గ్రంథప్రకటనయందు ఈటీకాతాత్పర్యములను హిందూస్థానీ టీకాతాత్పర్యసహితమనక భాషా టీకాతాత్పర్యసహితమని ప్రకటింతురు. మహారాష్ట్రీ, గుజరాతీప్రకటనలయందును ఇట్టి విశేషమే కనపడుచున్నది. నిర్విశేషముగ భాషయనుటచే తనతమ స్వభాషయని వారియభిమానము. కొన్ని కొన్ని తెలుగుగ్రంథములలోనను తెలుగుకావ్యము, తెలుగుకృతి యనుటకు బదులు భాషాకావ్యము, భాషాకృతి యని గౌరవోక్తి కనపడుచున్నది. పింగళిసూరన రాఘవపాండవీయమున తన తెలుగుకవిత్వమునుగూర్చి చెప్పుకొనుచు,

　　“ దక్షుం డెవ్వా డిల రామ భారతకథల్
　　　　జోడింప భాషాకృతిన్ ”

అని ప్రయోగించియున్నాడు. మరియు నాతడే కళాపూర్ణోదయమునను,

　　“ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నెచ్చట నెవ్వారికి నీక చెల్లె నది భాషాకావ్యముల్
　　　　　　　　　　　జేయగన్. ”

అనియు వ్రాసియున్నాడు. సందర్భము ననుసరించి యీభాషాకృతి, భాషాకావ్యశబ్దములు తెలుగునకే పర్యాయములు కాగలవు. భాషయన్నమాత్రమున నిట్టి యాదరాభిమానములు ప్రకటితము లగుచున్నవి. పాణిన్యాచార్యునికిని తనవాడుకభాషయగు సంస్కృతముపై నిట్టి యాదర ముండినటులు ఆంగ్లేయుడగు కీత్తుపండితుడు తన సంస్కృత వాఙ్మయచరిత్రమున ప్రథమభాగమున సూచించియున్నాడు.

ఇంతేకాక సంస్కృతమువిషయమై మనదేశమున మనకుండగల అభిమానాతిశయము కాక సంస్కృతవాఙ్మయమున మహాపండితులును పరిశోధకులును నగు కీత్తు లోనగుమహాశయులు సంస్కృతమెన్నడైన దేశభాషగ నుండినదియా యను మీమాంస కుపక్రమించి దేశభాషగనుండినటులనే సిద్ధాంతము చేసియున్నారు. వీరును ఈవ్యాసప్రారంభమున పలుకరింపబడిన మాగల్లు స్టూవర్టు సజాతీయులును, సమానదేశీయులును అయియున్నను వారివిద్యాతిశయము మహిమపాంటె నిరభిమానముగ సంస్కృతము నెంత

* అధ్యరాజః=శాలివాహన
　సాహసాఙ్కః = విక్రమాదిత్య } సరస్వతీకంఠాభరణము—టీక.

ష్ఠమైన స్తుతించియున్నారు. ఇట్టిభాష దేశభాషయై విలసిల్లక కేవల బ్రాహ్మణ శ్రోత్రియజనముచే సంకేతితమగు కృత్రిమకల్పితభాషయనుట చెల్లునా ?

ఇట్టి దేశభాషావిషయములో పారిశుద్ధ్యస్వరూపమునకు పరమప్రమాణ మేమనిన "సిద్ధిర్లోకాద్వ్యాశ్చ" యని మనకు సకల భాషావాగనుశాసనులు నన్నయభట్టారకులు శాసించియున్నారు. భాషకు లోకవ్యాప్తి లేనియెడల నీసూత్రమునకు ప్రసక్తియు, అమోఘసిద్ధియు కలుగజాలకపోవచ్చును. వాగనుశాసనునుపదేశము ఇట్టిదగునా ?

---



సూర్యోదయానంతరము

—యస్. శంకరసుబ్రహ్మణ్యం.

# ప్రేమపాశం

**శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి**

( అనువృత్తము )

## మూడో అంకం

### మొదటి రంగం

[వేంకటశాస్త్రియిల్లు, వీధితలుపు వేసివుంటుంది. తలుపుతట్టుతూ రాయుడు—]

రాయుడు—చిన్నమామయ్యా! (తలుపు మళ్లీ తట్టి, స్వగతం) యింట్లో లేనట్లున్నాడు మామయ్య. అత్త వంట్లో వుంటుంది. బంగారమ్మ యేం చేస్తోందో? పదిసార్లకలకేనా పలక్కపోతే యెలాగా? అబ్బ! మండపేటనుంచి ద్వారపూడిదాకా నడిచి వచ్చేటప్పటికి తాతలు దిగివచ్చారు. కాళ్లు పీక్కపోతున్నాయి. కాస్తసేపు కూచుంటేగాని వుండలేను. వొక్కక్షణంవుండి మళ్లీ పిలవ్వచ్చు. (మెట్ల మీదికి కాళ్లువేసుకూర్చుని) రైలుఖర్చులుకి సరిగ్గా తూచియిచ్చింది మా అమ్మ డబ్బులు. రానూపోనూ అర్ధరూపాయవుంటే దర్జాగా జట్కాయెక్కుదును. మొన్న ఆలమూరులో దొరికిన సంభావనడబ్బులు అర్ధ రూపాయీ జట్కాకోసం తగలేస్తే క్రాపింగుదువ్వెన్న మాటేమిటి? వెధవ కొమ్ము దువ్వెన్నతో పాపిడి బాగారాక చస్తున్నాను. (ఒక్కక్షణం వూరుకొని) పదిమాట్లు వస్తూ పోతూవుంటే శక్తి సామర్థ్యాలు గ్రహించి మామయ్య బంగారాన్ని నాకిస్తాడని అమ్మ వూహ. ఇది మంచిదారే. లేకపోతే మామయ్యకి నా సంగతి యేం తెలుస్తుందీ? కాని నాన్న వద్దంటాడు. "మాపిల్లని మీ అబ్బాయి కిస్తా" నంటూ తన కాళ్ల దగ్గిరికి రావాలంటాడు. అలా అయితే మామయ్య మరోసమ్మంధం చూసుకుంటే? కోటమ్మ దొడ్డమ్మ అప్పుడే బేరాలు మొదలుపెట్టిందిట. వాడి మొఘం వెంకడి కిస్తారుటగానీ—అయినా మన ప్రయత్నం మానగూడదు. యెలాగేనా బంగారమ్మని పెళ్లాడితినా నేను అదృష్టవంతుణ్ణన్నమాట. ఈమేడా, ఆస్తీ అంతా దానిదే; కనక బంగారమ్మని పైగా దాటిపోనియ్యగూడదు......మహా చెడ్డదాహంగావుంది. మళ్లీ పిలిచి చూద్దాం (లేచి 'మామయ్యా' అనితలుపు తట్టుతాడు.)

( తెరలో )

ఎవరు వారూ?

రాయుడు—(స్వగతం) బంగారమ్మే. తలుపు తీశాప్పటికి పెళ్లికూతురుదర్శనం. మంచిశకునమే. (ప్రకాశం) నేనురాయణ్ణి.

(అప్పుడు తలుపుతీసి బంగారమ్మ యివతలికి వస్తుంది.)

బంగారమ్మ—నువ్వా?

రాయుడు—యెన్నిమాట్లు పిలిచినా పలికారు కారేం యెవరూనూ?

బంగారమ్మ—యింటో యేదోపని చేసుకుంటున్నాం. కాకపోయినా మేమిప్పుడాట్టే తలుపు తియ్యడంలేదు. కలరాతో వూరంతా పేలిపోతోంది.

రాయుడు—ఎక్కడెప్పణ్ణుంచీ?

బంగారమ్మ—నిన్న పొద్దుటినుంచీనీ. యిలాంటప్పుడు వచ్చావేం?

రాయుడు—తెలిసిందికాదు. మాఅమ్మ తొందరపెడితే వచ్చాను.

బంగారమ్మ—యేంపనీ?

రాయుడు—అదివేరేపనీ. మామయ్య వున్నాడా?

బంగారమ్మ—యెందుకో వూళ్లోకి వెళ్లాడు. భోజనాలవేళకి వస్తాడులే. నూతికి వెళ్లి కాళ్లు కడుక్కో.

రాయడు—(స్వగతం) కలరా అంత తీవ్రంగా వుంటే పెళ్లికూతురు చూపులు దేవుడెరుగును. భోజనంకాగానే పరుగోపరుగు.

(లోపలికి వెళ్లిపోతాడు.)

బంగారమ్మ—(స్వగతం) యింకా వచ్చాడు కాదు నాన్న. యెన్నివిధాల చెప్పినా మానకుండా వున్నాడు వూళ్లోకి వెళ్లడం. యెప్పుడు తగ్గుతుందో యీకలరా? బావయెప్పుడు వస్తాడో? కలరాతగ్గిదాకానేనా మాయింటోవుండమనాలి. యీమాటు పట్టుపట్టి యింటో కూచోపెడతాను. నామాట వినక పోతే యెరగనూ? బావవుంటే అతనిచేత చెప్పించి నాన్ననికూడా కదలకుండా చెయ్యవచ్చు.

(తలుపువేసేసి, లోపలికి వెళ్లిపోతుంది.)

రెండోరంగం

[మాచవరంగ్రామంలో పేరుభట్టుయిల్లు. లోపల సూరన్నా, తల్లిజోగమ్మా, చెల్లెలు సుబ్బమ్మ కూచుని వుంటారు.]

సూరన్న—అసలు నువ్వు గారంచేశ్వావు పేరిగాడికి.

జోగమ్మ—నే నేంచేశానురా? నిన్నెలా పెంచానో వాణ్ణీ అలాగే పెంచాను.

సూరన్న—నువ్వు లక్షచెప్పు. నాన్నకూడా వాడు లొంగలేదు.

జోగమ్మ—దానికి నేనేం చెయ్యమూ? చిన్నప్పణ్ణుంచీ వాడికి స్వతంత్రమే. అది వొంటెత్తుగుణం కాదుగానీ—

సూరన్న—అదిగో. అదే నీ తెలివితక్కువ. అబ్బా! వాడంత వొంటెత్తుగుణంవున్నవా డింకొకడున్నాడా పృథివిమీదా? పెద్దాడు నయంకొంచెం.

జోగమ్మ—వాడిమొఖం. పెళ్లాంవచ్చాక వాడిబుద్ధి బొత్తిగా మారిపోయిందిరా.

సూరన్న—పేరిగాడికి పెళ్లాం కాపరానికిరానే అక్కర్లేదూ. పెళ్లయ్యాక—మూడుముళ్లూ పడ్డాక వొక్కక్షణమేనా కలిసివుండడువాడు.

జోగమ్మ—వేరుపణ్ణిస్తానేం వాణ్ణి?

సూరన్న—యేంచేస్తావూ?

జోగమ్మ—ఆమాటకివస్తే యింతట్లో వాడికి పెళ్లేచెయ్యమూ. దాంతో చప్పగా కుదురుతుంది రోగం.

సూరన్న—నువ్వు చెయ్యకపోతే ఆగుతుందా యేమిటి? అసలు వాడు రాజమహేంద్రవరంలో ప్రవేశించడమే ముప్పు. దానివల్ల వచ్చే చిక్కులితో గ్రహించావా? మనల్ని లోకువచెయ్యడానికి చిన్నమామ వాణ్ణి లోపు చేసుకుంటాడు. ఈ వాజమ్మ అతనివెనకాల గంతులేస్తాడు.

జోగమ్మ—వెంకటేశంతో మాట్లాడడంటే వాణ్ణి గుమ్మంలోకిరానివ్వను.

సూరన్న—అదికాదు ప్రయోజకత్వం. యింట్లో నుంచి వొక్కరాగిదమ్మిడీ అయినా వాడికి దొరకనివ్వకూడదు.

సుబ్బమ్మ—చిన్నమామయ్యగారి యింటికి వెడితే యేమో పేరుభట్టన్నయ్య?

జోగమ్మ—వెడితేయెరుగనూ?

సుబ్బమ్మ—ఏమే? ఏంతప్పేఅమ్మా?

జోగమ్మ—చిన్నమామ భండాలుడు. వాడి మొఖం చూడకూడదు.

సుబ్బమ్మ—ఏంచేశాడే?

జోగమ్మ—నీకిప్పుడు తెలవదది.

సుబ్బమ్మ—అత్త యెంచక్క మాట్లాడుతుంది. బంగారమ్మవొదిన యెంచక్కనిపాటలు పాడుతుంది. పోనీ దాన్ని పేరుభట్టన్నయ్యకి పెళ్లిచెయ్యరాదుటే అమ్మా?

జోగమ్మ—ఛీ! దాన్నా!

సుబ్బమ్మ—యించక్కవుంటుందే వొదినా.

జోగమ్మ—దాని చక్కదనం మాసిపోయెను! అదెందుకు మనకీ?

సూరన్న—పేరిగాడు బహుశా దానిమీద కన్నువేసే రాజమహేంద్రవరం ప్రవేశించివుంటాడు. ఇన్నీసుపేటలో ప్రవేశించడంచేత నాసందేహం మరీ వృద్ధివుతోంది. వాడూ, మామా రోజూ యెక్కడో వొకచోట తారసపడకమానరు. అలా పదిమాట్లు జరిగేటప్పటికి—ముందు మనపెద్దమ్మే కలుపుతాడు.

జోగమ్మ—అవున్రోయి, నువ్వన్నది నిజమే. లేకపోతే సంగీతం విజయనగరంలో చెప్పుకున్నవాడు కావ్యాలకోసం రాజమహేంద్రవరం యెందుకు చేరతాడూ? విజయనగరంలో లేరాయేమిటి చెప్పేవాళ్లు?

సూరన్న—కనిపెట్టావూ అబ్బాయియుక్తి? యేమనుకున్నావు మరి?

జోగమ్మ—యింటికి నుంచున్నపాళంగా రమ్మని వుత్తరం రాసెయ్యి, వాణ్ణక్కడవుండనివ్వగూడదు.

సుబ్బమ్మ—ఏమేఅమ్మా? బుల్లన్నయ్యకి బంగారమ్మ వొదిన్ని పెళ్లిచెయ్యండే, దాండగ్గిర నేను పాటలు నేర్చుకుంటానే.

సూరన్న—బాగానే నేర్పుతుంది నీకది పాటలు.

సుబ్బమ్మ—ఏమమ్మా? చిన్నప్పుడు నేనూ అదీ జతగావుండేవాళ్లం యేమనుకున్నావో. నీపెళ్లిలో అదీ నేనూ ప్రత్యేకంగా కూచునేవాళ్లం భోజనాల దగ్గిర. అదీ నేనేగాదా యేమిటి నీకు హారతి యిస్తే?

జోగమ్మ—నువ్విప్పుడు జ్ఞాపకమా ఆసింగమ్మకి?

సుబ్బమ్మ — యెందుకు జ్ఞాపకంవుండనూ? బుల్లన్నయ్యకి పెళ్లిచేస్తే—

సూరన్న—వూరుకో సుబ్బూ నీకేమీ తెలవనూ.

సుబ్బమ్మ—ఏమేఅమ్మా! దాన్ని బుల్లన్నయ్యకి పెళ్లిచెయ్యవే.

జోగమ్మ—వుండవే వూరికేను. జలగలాగ పట్టుకు పీక్కుతింటావేమిటి? వూరుకో లేకపోతే అవతలికిపో.

సుబ్బమ్మ—(మూతిముడుచుకొని) పోతానులే. (వెనక్కి తిరిగితిరిగిచూస్తూ వెళ్లిపోతుంది.)

సూరన్న—నువ్వు కనిపెట్టలేకపోయావు గాని వాడిగుణం మొదణ్ణుంచీ అంతే. నీదోవెఱ్ఱి. నీమీద యెవడికి భక్తివుందో, యెవడికి లేదో కనిపెట్టలేవు నువ్వు.

జోగమ్మ—నేనంతచేతగాని పీనుగు ననుకున్నావా యేమిట్రా? పెద్దాణ్ణి నే నెప్పుడూ నమ్మలేదూ. పేరిగాడి గుణంకూడా యేడాదినుంచి తెలుస్తూనేవుంది. యెందుకూ? మొన్న అన్నివిధాల కబురంపినా వొక్కజామారుగుడ్డ తల్లిముండకికొని పంపలేకపోయాడు. మరిచిపోతానా యీజన్మలో?

సూరన్న—యెన్నిప్రశ్నలు వేశాడనుకున్నావావేళ?

జోగమ్మ—వేస్తాడు వేస్తాడు. సాగుతోంది ఆంధ్రబ్బ.

సూరన్న—యిప్పుడేంచూశావూ? పెళ్లి అడ్డం కాస్తా తీరనియ్యి.

జోగమ్మ—ఆమాటకివస్తే అసలు వాడికి పెళ్లే తలపెట్టనూ యింతట్లోను.

సూరన్న—మొత్తానికి వాడివిషయంలో జాగ్రత్తగా వుండకపోతే సంసారం నట్టేట్లో కలుపుతాడు. మరి నాకు పొద్దెక్కుతోంది. సోమేశ్వరంలో యివాళ నవగ్రహశాంతివుంది. వెడితే అర్ధరూపాయేనా దొరుకుతుంది.

జోగమ్మ—నిన్న బ్రాహ్మణార్థం మూలాన్న రాత్రి భోజనం లేదుకదా శాంతిభోజనాలయ్యేదాకా వుండగలవా నాయనా? పైగా అయిదుమైళ్లు నడవాలి గూడానూ.

సూరన్న—లేకపోతే రోజు వెలావెడతాయమ్మా? వెడితే యివాళతో చెల్లాయికి పరికిణీ

కొనెయ్యవచ్చు. కొత్తపరికిణీ కావాలో అంటోందది పాపం యిరవై రోజులనుంచి. ( వెళ్లిపోతాడు. )

జోగమ్మ—( స్వగతం ) పేరిగాణ్ణి నమ్మకూడదు. సూరిగాడే నయం అందరికీ కీనీ. అమ్మాయికి పరికిణీలూ, చొక్కాలూ కావాలని చెప్పడం తడువూ. కూతుళ్లనేనా అంతశ్రద్ధగా మాడడు. నారోజులు వీడి దగ్గిరే వెడతాయి.

## మూడో రంగం

[వేంకటశాస్త్రియిల్లు. విచారంతో కాంతమ్మ కూచునివుంటుంది. బంగారమ్మకూడా విచారపడుతూ పేరుభట్టు తొడమీద కూచుని వుంటుంది. రత్తమ్మ ఒకపక్కనీ, రాయడు వొకపక్కనీ కూచునివుంటారు.]

పేరుభట్టు—డబ్బుకాశపడి వెళ్లాను కాకినాడ. వెళ్లాటప్పటికి మామయ్య ఖులాసాగానే వున్నాడు. అనుమానమే లేదూ. వచ్చాటప్పటికంతా—అన్నీ జరిగిపోయాయి. ఘోరకలి.

రత్తమ్మ—నల్లరాయి బద్దలై పోయిందిరా.

కాంతమ్మ—యీవూరు వచ్చి ఆరేళ్లయింది. ఎప్పుడూ జబ్బెరగరు. జలుబేనా చెయ్యలేదు మీ తమ్ముడికి. నేటికి వొక్కమాటేవచ్చింది ముప్పెన.

బంగారమ్మ—బావోయి నువ్వు మమ్మల్ని విడిచిపెట్టకు సుమా. నాయన వెళ్లేపోయాడు. యిక మాకు దిక్కెవ్వరు బావా? (కంఠానికి చేతులు పెనవేసి దుఃఖిస్తుంది.)

పేరుభట్టు—వద్దువద్దు. యేడవకు బంగారం! నేనెక్కడికి పోతానూ?

కాంతమ్మ—నాయనా! చెట్టుకింది పక్షులం అయిపోయాం. (దుఃఖిస్తుంది.)

పేరుభట్టు—అత్తా! వూరుకోమనడానికి గుండెలు తాళడంలేదు. అయినా యేంలాభమూ?

రత్తమ్మ—దిగ మింగుకోమ్మా దిగ మింగుకో. (పైకిచూసి) దేవుడా! నీకళ్లకి నాతమ్ముడే కనపడ్డాడా?

రాయడు—దేవుడు మంచివాళ్లని యేరుకుపోతాడు.

కాంతమ్మ—యేలోటూ లేదని పొంగిపోయే రోజుల్లో తీరని యీపెద్దలోటు పెట్టాడు దేవుడు. కష్టం మరిచిపోయినవాళ్లని నష్టేట్లో ముంచేశాడు.

పేరుభట్టు—అంతే పెట్టిపుట్టాం. మనుష్యమాత్రులికీశ్వరలీల యేంతెలుస్తుందీ?

రత్తమ్మ—నువ్విక్కడే వుంటున్నావుట్రా పేరుభట్టూ?

పేరుభట్టు—అవును పిన్నీ. నువ్వెప్పుడువచ్చావూ?

రత్తమ్మ—నిన్నరాత్రికి వచ్చామురా నాయనా! మేంవచ్చాటప్పటి కన్నీ అయిపోయాయి. అన్నింటికీ యెవటింటో వున్న ప్రకాశంగారు దిక్కయారుట.

కాంతమ్మ—నాయనా! కొంపపడిపోవడమూ, దిక్కు లేకపోవడమూనూ. అయ్యో! భరించలేనోయి! (దుఃఖిస్తుంది.)

బంగారమ్మ—బావా! సముద్రంలోపడి కొట్టుకుపోయామనుకో. యెలాబతికివున్నామో తెలవదు. నిన్ను చూసేదాకా ప్రాణాలు ప్రాణాల్లోలేవు. యిక నువ్వెక్కడికీ వెళ్లకుబావా! మాయింట్లో వుండవూ? వుండవూ? నాకేడుపువస్తోంది. (ఏడుస్తూ) వుంటానవూ?

పేరుభట్టు— (బంగారమ్మనిదుచ్చి కౌగలించుకొని) నాకడుపు చెరువై పోతోంది. యిక యేడవకు బంగారం! నేనిక యెక్కడికీ వెళ్లను. యిక్కడే వుంటాను వూరుకో.

కాంతమ్మ—నీకు సాధుకుందా నాయనా?

పేరుభట్టు—చూస్తావుకాదూ?

రత్తమ్మ—(స్వగతం) వీణ్ణిక్కడ వుండమంటూ రెండుకూ తల్లీ కూతురూనూ? వీళ్లమనస్సు తిప్పెయ్యాలి. లేకపోతే బంగారం తక్కడు.

రాయడు—(స్వగతం) యుక్తిచేసి యిది జరగ నివ్వకూడదు.

(అప్పుడు ప్రకాశంవస్తాడు.)

ప్రకాశం—యిదిగో పేరుభట్టుగారా ? అంతా యిలా జరిగింది.

పేరుభట్టు—డబ్బుకాశపడి మామయ్యాని విడిచి పెట్టి వెళ్లాను. కానలేకపోయాను.

ప్రకాశం—రెండువందల నలభై రూపాయలు—కాకపోయినా యిలాజరుగుతుందని అనుకోడం యెలాగా ? కలరా తగులుతుందన్న సూచన యతిక్కించిత్తేనా వుంటేనా ?

కాంతమ్మ—సాయంత్రం మణిగింది, మన్నాడు తొమ్మిదయ్యేటప్పటికి కొట్టేసింది. రెండురోజులేనా నిలుపుచెయ్యందే నాయనా ! (ఏడుస్తూ రత్తమ్మకేసి తిరిగి) నన్ను కొట్టెయ్యరాదూ వొదినా ? నాకీమొండి బతుకెందుకూ ?

బంగారమ్మ—(కళ్లుమూసుకుని దుఃఖిస్తుంది.)

పేరుభట్టు—నామాటవినవూ ? నేనుభరించలేను బంగారం. (డగ్గుత్తికతో) వూరుకోవూ ?

రత్తమ్మ—ప్రకాశంగారూ ! యీలోటంతా—యీదురదృష్టం అంతా మాది. వొక్కతమ్ముడున్నాడు నాతమ్ముడు మానాయనకంటే యెక్కువగా మమ్మల్ని చూశాడు. యికమాకు పచ్చంచులబట్టపెట్టే తోడబుట్టినవాడేడీ ? (ఏడుస్తుంది.)

ప్రకాశం—అక్కయ్యగారూ ! యిది సముద్రం. ఆగదు; కాని ఆపుకోవాలి. యేంచెయ్యం ? యెవళ్లవల్ల యేమవుతుంది ? ఆ మహానుభావుడు బతకడానికి వయస్సులేదా, బతకలేనన్నాడా ? యిలాజరగాలి. మనం అంతా యిలా యిదవాలి.

రత్తమ్మ—అంతేనండీ. మనవల్ల — యెంత యేడ్చినా యేమీరాదు. మనస్సు రాయిచేసుకోవాలి. (కాంతమ్మకేసి చూసి) యేంచెప్పను మరదలా ? దిగమింగుకోవాలి.

రాయడు—మామామయ్యదగ్గిర రాజమహేంద్రవరంలో వుందామనుకున్నాను నేను.

ప్రకాశం—అందరికోరికలూ పూర్వపక్షంఅయిపోయాయి. అంతా మనతోటే వుందని వూరికే కల్పనలమీద కల్పనలు చేసుకుంటాం ; కాని యీశ్వరుడు కొనసాగించవద్దూ? తక్కువచేసుకొని యెక్కువకోసం ఆశపడితే యేంలాభమూ ? నామట్టుకునాకు కుడిచెయ్యి పడిపోయింది. యేంచెయ్యనూ.

పేరుభట్టు—నామాటచెప్పండి బాబుగారూ ? మామయ్య ఆధారంచూసుకుని యీవూళ్లో వుందామని నిశ్చయించుకున్నాను. నాకల్పన యెలాకూలిపోయిందో చూశారా ?

ప్రకాశం—యిందరి దురదృష్టం పోగయినాక శాస్త్రిలుగారెలా బ్రతికివుంటారూ?......అక్కయ్యగారూ ? మీరోమాటు దొడ్లోకి రావాలి.

(కాంతమ్మ ప్రకాశంవెనకాల వెడుతుంది.)

బంగారమ్మ—నేనుకూడా రావచ్చునా మామయ్యగారూ ?

ప్రకాశం—నీకడ్డేమిటమ్మా ?

కాంతమ్మ—రాతల్లీ !

(బంగారమ్మకూడా వెడుతుంది.)

రత్తమ్మ—చూడూ, పేరుభట్టూ ! యెంత మేనమామ కూతురయినా, యెంత చనువయినా, దుఃఖంలో నేవున్నా పన్నెండేళ్లపిల్ల. నువ్వు వొళ్లో కూచోబెట్టుకోకూడదురా నాయనా !

రాయడు—అలాయెందుకన్నయ్యా? దూరంగా వుండే—అంటే ముట్టుకోకుండా సుమా, మనం ధైర్యం చెప్పవచ్చు. మనం జాగ్రత్తగా వుండడమే మంచిదీ. యేమంటావు ?

పేరుభట్టు—నిజమే పిన్నీ ! నువ్వు పెద్దదానవు. నీమాట తోసెయ్యడానికి వల్లకాదు. రాయడుకూడా చిన్నవాడయినా చాలాదూరం ఆలోచించాడు. మంచి సలహా చెప్పాడు వాడు. అలాగే చేద్దాం.

రత్తమ్మ—అదిగదీ. నాయనా! కష్టంలో వున్నారు. చేతనైనంత సాయంచేద్దాం.

రాయడు—అన్నయ్యకి వొకళ్లు చెప్పనే అక్కర్లేదే అమ్మా. ఆదుర్దాకొద్దీ—తీరా దానికదివచ్చి వొళ్లో కూచోడంవల్ల కూచోబెట్టుకున్నాడు; గాని తెలవదనుకున్నావా? నావంటివాళ్లకి పధ్నాలుగురికి చెప్పగలడు వాడు.

పేరుభట్టు—(స్వగతం) యేం శ్రీరంగనీతులూ? కారణం మరేమీలేదూ. బంగారంమీద కన్ను వేశారు వీళ్లు. అబ్బురమా? అలాంటిపిల్ల యెంత తపస్సుచేస్తే దొరుకుతుందీ? రాయడు అదృష్టవంతుడు. రాకపోకలున్నాయికనక కోరిక నెరవేరవచ్చు. నేను కేవలమూ దురదృష్టవంతుణ్ణి. మాచిన్నన్నయ్యచేసిన కుట్ర నన్ను పాడుచేసేలావుంది.

ప్రకాశం—(ప్రవేశించి) మీరోమాటు యిలా రావాలి.

(ఇద్దరూ వెళ్లిపోతారు.)

రత్తమ్మ—వొరేయి! రాయడూ! పేరుభట్టు బంగారానికి చనువయినట్టుగా వున్నాడు. దాని మనస్సు నీమీదికి తిప్పేసుకోవాలి. యేంచేస్తావోమరి. నేను కాంతమ్మ మెడలు వొంచుతానులే.

రాయడు—ఈ పదిరోజుల్లోనూ యెంత పని చేస్తానో చూసుకో.

రత్తమ్మ—నే నోమాటు బసలోకి వెళ్లివస్తాను. అత్త యేదేనా చెప్పిందంటే వెంటనే చేసేస్తూవుండు నువ్వు.

రాయడు—ఆవిడ చెప్పకుండా—వూహించే చేసేస్తాను నేను.

### నాలుగో రంగం

[పొద్దున్న యెనిమిదింటికి; కాంతమ్మ తూర్పు వసారాలో గోడకానుకొని కూచునివుంటుంది. ప్రకాశం రెండుగజాలలో నుంచుని వుంటాడు.]

ప్రకాశం—పేరుభట్టుగారిలాంటి మనిషి వున్నాడా? కానీ, అక్కయ్యగారూ! ఆయన చిన్నన్న వున్నాడే సూరన్నగారు? రామరామా! ఈశ్వరుడాయన్ని యెందుకోసం సృష్టించాడో గాని కిందపెడితే పంటలూ, పైన పెడితే వానలూ వుండవు.

కాంతమ్మ—అతగాడిదేనండీ యీపట్ల అంతానూ. దేవుడు సాధించినప్పుడు మనుష్యులు సాధించడం ఆశ్చర్యమా అన్నయ్యగారూ?

ప్రకాశం—పొద్దుటిపూట యేగడియో వుంటారిక్కడ. తరవాత స్నానంచేసింది మొదలు యిక అక్కడవొకటే గుసగుసలు. ఇవాళనారు చెవులు తడకలు కట్టిపోయాయి. రత్తమ్మగారుకూడా కలిసింది; కాని ఆవిడమాటలు నాకు సరిగా వినపడలేదు.

కాంతమ్మ—ఆభాసు చేసేలావున్నారేంగతి అన్నయ్యగారూ?

ప్రకాశం—విచారించకండమ్మా. పేరుభట్టుగారు అలాంటి తాత్రాలకు జడిసేవారు కారు.

కాంతమ్మ—అత నలాంటివాడేనండీ. కనకనే వొప్పుకున్నాను. మాడండీ. యిద్దరు తమ్ములున్నారు. వచ్చారుకూడానూ; కాని వొక్కడుకూడా సిద్ధపడలేకపోయాడు. పేరుభట్టు పూనుకోకపోతే—

ప్రకాశం—పూనుకోకపోవడం యేదీ? వొకవేళ ఆయన యేకారణంచేతనైనా జంకి మానేస్తే నే నేమయినానూ?

కాంతమ్మ—దేవుడు మిమ్మల్నే మాకు దిక్కుచేశాడు. (అంటూ అతని పాదాలు అంటబోతుంది.)

ప్రకాశం—(వెనక్కిజరిగి) మీకేవెఱ్ఱి యేమిటక్కయ్యగారూ?

(అప్పుడు పేరుభట్టు మెల్లిగావస్తాడు.)

ప్రకాశం—రండి మహానుభావా!

కాంతమ్మ—మా మూలాన్ని నువ్వు మీవాళ్లకి దూరం అయిపోయీలావున్నా వోయి నాయనా!

పేరుభట్టు—అదేమిటత్తా? మాఅత్త అలా అంటుందేమండీ బాబుగారూ?

కాంతమ్మ—మేము సముద్రంలోపడి మునిగి పోయేటప్పుడు నువ్వు రక్షించడం మీవాళ్లకిష్టం లేదు.

ప్రకాశం—మీచిన్నన్నయ్య కిందామీదా వుండడం లేదు.

పేరుభట్టు—వాడి బతుకెప్పుడూ అంతే. కట్టిపెట్టండి వాడి ప్రస్తావన, అందులో సారస్యం లేదు.

ప్రకాశం—నిజమేగాని మీవాళ్లకి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే మీకేమేనా నష్టం వస్తుందేమో అని మీఅత్తగారి భయం.

పేరుభట్టు—నష్టం యెలాగా కనిపెట్టుకునే వుంది. మాఅమ్మకి మాచిన్నాడిమాట యెప్పుడు పథ్యం అయిందో అప్పుడే మొదలయింది సంసారానికి దిగతీత. విచారించవలసిన సంగతి యేమీ లేదు. నాకు బెంగ కూడా లేదు. మీకుగూడా యేమీ—

కాంతమ్మ—నామహారాజు పోయి నే నేడుస్తూవుంటే వాళ్ల కీసుసునసలూ, యీకుట్రలూ యెందుకు చెప్పండన్నయ్యగారూ! కష్టంలోవుందిగదా అని అంతా తలోరాయీ వేస్తారా?

ప్రకాశం—సత్రాల్లో రాళ్లువేశేరకం యిదీ. అయితే యేది యెలా జరగాలో అలా జరుగుతుంది. మనం మాట్లాడవలసిందేమీ లేదు. ఏమీ యెరగనట్లూ, విననట్లూ వూరుకుందాం. ఏమంటారు పేరుభట్టుగారూ?

పేరుభట్టు—అదీ నావుద్దేశం.

(అప్పుడు బంగారమ్మ వస్తుంది.)

బంగారమ్మ—అమ్మోయి! (ప్రకాశాన్ని చూసి) నరసయ్యశెట్టిగారి చెల్లెలు విశాలాక్షమ్మగారు రెండు కావిళ్లతో యేమిటేమిటో పట్టించుకు వచ్చారండీ మామయ్యగారూ!

కాంతమ్మ—చూశారా అన్నయ్యగారూ? ఆ యింట్లో అందరికీ నామహారాజంటే దేవుడు. నాదేవుకిడి యోగం లేకపోయింది; గాని మేడమీది సామానంతా విశాలాక్షమ్మగారిచ్చిందే. కాశీ తీసుకువెళ్లినప్పణ్ణుంచీ ఆయన భోంచేశారని తెలిస్తేగాని ఆవిడ పచ్చిమంచినీళ్లేనా ముట్టుకోదు. నేనూ, పిల్లా కట్టుకొనే బట్టలన్నీ ఆవిడయిచ్చినవే. వొక్కకడుపున పుట్టిన చెల్లెల్నికంటే యెక్కువగా చూస్తోందినన్ను. నిన్న యాభైరూపాయలు యిచ్చేవుందిగదా మళ్లీ యివాళ అంతసామాను తేవడం—కులం కాకపోతే మాత్రం యేమిటండీ స్నేహమూ, దయా ప్రధానం గానీ?

ప్రకాశం—బ్రాహ్మలనేకమంది శాస్త్రులుగారి సాయం పొందారు; గాని వాళ్లకి విశ్వాసం లేకపోయింది. ధర్మం చెప్పవలసివచ్చినా, విశ్వాసం చెప్పవలసివచ్చినా కోమట్లది.

బంగారమ్మ—మామయ్యగారూ! అవి యింటో పెట్టిస్తారా?

ప్రకాశం—నువ్వు పెట్టించరాదుటమ్మా? పోనీ, పేరుభట్టుగారూ! మీరూ—

పేరుభట్టు—తమరు—

ప్రకాశం—వచ్చినవారిని మీరెరగరు. నేనావిడితో మాట్లాడుతూవుంటాను. మీరే పెట్టించండి. పదండి.

(ఇద్దరూ వెళ్లిపోతారు. రత్తమ్మ వస్తుంది.)

రత్తమ్మ—యెవరోకోమటావిడిలావుండే యేమిటేమిటో రెండుకావిళ్లతో పట్టించుకువచ్చిందీ.

కాంతమ్మ—వొదినా! యీవూళ్లో కోమట్లకి మామీద యింత అనుగ్రహంవుంది. దేవుడు చూడలేకపోయాడు.

రత్తమ్మ—అవన్నీ యింటో యెవరు పెట్టిస్తారూ?

కాంతమ్మ—ప్రకాశం అన్నయ్యగారు వెళ్లారులే. విశాలాక్షి దొడ్డమ్మగారిని తీసుకురాతల్లీ నువ్వూ.

(బంగారమ్మ వెళ్లిపోతుంది.)

రత్తమ్మ—(స్వగతం) పేరుభట్టు దగ్గిరేవున్నా వాడితో చెప్పిందిగాదు ఆసామాను యింటో పెట్టించ మనీ. నా ఆశకి ఆధారం లేకపోలేదు. (వెళ్లి పోతుంది.)

(తెర దించాలి.)

## అయిదో రంగం

[ప్రకాశంయిల్లు. దక్షిణపువసారాలో సూర న్నా, పేరుభట్టూ, జోగమ్మా కూచునివుంటారు.]

జోగమ్మ—నువ్వింతలక్ష్యం లేకుండా తిరుగు తున్నావేం ?

పేరుభట్టు—యేం చేశానూ లక్ష్యం లేకుం డానూ ?

జోగమ్మ—దాని తమ్ముళ్లుండగా చిన్నమామకి నువ్వెందుకు కర్మచెయ్యాలీ ?

పేరుభట్టు—వాళ్లూరుకుంటే నేనూ వూరుకో వాలా ?

సూరన్న—వాళ్లూరుకుంటే చిన్నత్త కూలి మనిషిచేత చేయించుకుంటుంది. నీకెందుకూ ?

పేరుభట్టు—నేను చేస్తే యేంతప్పూ ?

జోగమ్మ—వూళ్లోవాళ్లెవళ్లేనా పోతూవుంటే వాళ్లకందరికీ నువ్వుచేస్తావా ?

పేరుభట్టు—చిన్నమామ వూళ్లోవాడేనా ?

సూరన్న—అతని భావమరుదులికి లేని బాధ నీకేం ?

పేరుభట్టు—ఇవి బ్రాహ్మ డనవలసిన మాటలే ?

సూరన్న—నువ్వే మహా బ్రాహ్మడవు పాపం. చూశావా అమ్మా ? (నిరాసకంగా చెయ్యి వూపి పెదవివిరుస్తాడు.)

పేరుభట్టు—(మంగోపంతో) యేమిటా వికా రం ? తెలివితేటలన్నీ వెళ్లగక్కేస్తున్నావే ?

సూరన్న—వూరుకోరా అట్టే మాట్టాడకా.

పేరుభట్టు—నీతో మాట్టాడ్డం నాదితప్పే. నీకు హృదయంలేదు. మెదడులేదు. కేవలమూ యిన పదుంగవు. కుట్ర, ద్రోహం, అసహనం—ఇవన్నీ నీదగ్గిర పేరుకొనివున్నాయి. నిన్ను నమ్మినవాడవు ములిగిపోవడమే. మరిలేలకు.

సూరన్న—నోరుమూసుకోరా.

పేరుభట్టు—ఛీ !

సూరన్న—నీతో మాట్టాడగూడదు. (వెళ్లి పోతాడు.)

పేరుభట్టు—(సూరన్న పోయినవేపు చూస్తూ) పాకీది నయం నీకంటే. అప్రాచ్యుడవు.

జోగమ్మ—వాణ్ణి తిడతావా ?

పేరుభట్టు— విన్నావా ?

జోగమ్మ—వాడేమి అవాచ్యాలు పలికాడూ ?

పేరుభట్టు—ఏం అట్టేపెట్టాడూ ?

జోగమ్మ—నువ్వు నాకడుపున చెడబుట్టావు ఛండాలుడా !

పేరుభట్టు—నీకలా తోచిందా ?

జోగమ్మ—నామాట కడ్డుచెబుతావా ?

పేరుభట్టు—నన్నాజ్ఞాపించడానికి నీకు అధి కారంలేదు. నువ్వు తానికమాటలు వింటున్నావు.

జోగమ్మ—నువ్వు పురుగులోడిచస్తావు.

పేరుభట్టు—నీనోటి కడ్డురాను.(వెళ్లి పోతాడు.)

జోగమ్మ—చచ్చుపెద్దమ్మా ! యెంతపనీ చేశా వూ ? నాపగవాళ్లలో కలుస్తావా ? నీకు దమ్మిడీ ఆస్తి మిగలనివ్వను. చూస్తూవుండు.

(అప్పుడు రత్తమ్మవస్తుంది.)

రత్తమ్మ—ఏంచేస్తున్నావే చిన్నక్కా ?

జోగమ్మ—యేడుస్తున్నాను.

రత్తమ్మ—అదేమిటే అలాఅంటావూ ?

జోగమ్మ—పేరిగాడు చెప్పినమాట వినడంలేదు. వాడు మానట్ట.

రత్తమ్మ—యిక నువ్వాప్టే పట్టుపట్టకు. పైకి తెలిస్తే బాగుండదు.

జోగమ్మ—వూరుకోమంటావా ?

రత్తమ్మ—వాడు విననప్పుడేమిటే చెయ్యడం ?

జోగమ్మ—చూడు వీణ్ణేంచేస్తానో ?

రత్తమ్మ—యింటికి వెళ్లాక నీయిష్టం వచ్చినట్లు చెయ్యి. యిక్కడ గట్టిగా మాట్లాడకు......కాని కన్నకొడుకు చెప్పినమాట వినకపోతే తల్లిమంచకి అంతకంటే యిక కష్టంలేదు.

జోగమ్మ—నీకొడుకు చూడూ. వాణ్ణి చూస్తే ముచ్చటవుతుంది.

రత్తమ్మ—నాతండ్రి నామాట కెదురు చెప్పడమ్మా, నేనదృష్టవంతురాలినే.

జోగమ్మ—యిలాంటి నిర్భాగ్యుడు పుట్టాక 'నేనూ అదృష్టవంతురాలినే' అని చెప్పుకునీయోగం నాకెలా వుంటుందీ? ఛీ! వీడిబతుక్కాలా ?

(అప్పుడు రాయడువస్తాడు)

రత్తమ్మ—ఏంనాయనా యిలావచ్చావూ ?

రాయడు—వూరికేనమ్మా !

జోగమ్మ—సాటివాళ్లని చూసేనా బుద్ధితెచ్చుకోకపోతే చావనా?......వొరే రాయడూ ! పేరిగాడేం చేస్తున్నాడురా ?

రాయడు—పెద్దన్నయ్యా, పెద్దవొదినా వచ్చారు, వాళ్లతో లోపలికి వెళ్లాడు.

జోగమ్మ—దిగారూ ? పైవంటలోకి వస్తారుకామోసు. ఏమిటిగతి ?

రత్తమ్మ— కళ్లుమూసుకుని నాలుగురోజులూ గడిపెయ్యి.

జోగమ్మ—నావల్లగాదు. వుపాయం చూడాలి. సూరన్న యెక్కడున్నాడో తీసుకురా రాయడూ వొమాటూ.

రత్తమ్మ—వెళ్లిరా నాయనా !

రాయడు—అలాగే. (వెళ్లిపోతాడు.)

జోగమ్మ—నాకొడుక్కూడా యిలాంటివాడు కాగూడదూ ?

రత్తమ్మ—నిజానికి నీకొడుకుదగ్గిర దురుసుతనం వుందే.

జోగమ్మ—నాకర్మంకాకపోతే నువ్వీమాట అనగలవా నామొహమ్మీదా ?

రత్తమ్మ—నేనేమన్నానే మాతల్లీ ?

జోగమ్మ—నాప్రారబ్ధానికి నేనేడుస్తూవుంటే నీమీద పెట్టుకుంటావేమిటే ?

రత్తమ్మ—అంతేగదా ? నేనేమీ తప్పుమాట అనలేదమ్మా నన్ననడానికి నువ్వూ.

జోగమ్మ—నిన్నేమంటానూ ? నిన్ననడానికీ, నీచేత పడ్డానికీ నాకేం ? నాకొడుకు నేను చెప్పిన మాట వినడంలేదు; కనక నేనేదో సంజుకోకుండా వుండలేను. వొకళ్ల నెందుకంటానూ నేనూ ?

రత్తమ్మ—మడికట్టుకునే వేళ అవుతోంది వెళతానుమరి.

జోగమ్మ—చూడూ పెద్దపేనుకు రానే వచ్చింది కనక అక్కడివంటకి దాన్నప్పగించి నువ్విక్కడికిరా. నువ్వుంటే నాకు కసింత మనశ్శాంతేనా కలుసుతుంది.

రత్తమ్మ—కాంతమ్మ నన్ను విడిచిపెట్టదే.

జోగమ్మ—పట్టుకుంటుందా యేమిటి? దాంతో వియ్యమందాలని చూస్తున్నావుకామోసు నువ్వు. దాని మొఖం మండేది.

రత్తమ్మ—అదేమిటే అలాఅంటావూ ?

జోగమ్మ—దానికర్మం దాందీ. అది మనకెందుక్కానీ, నువ్విక్కడికివస్తూ.

రత్తమ్మ—కాంతమ్మ వొప్పుకుంటే చూస్తానులే. (వెళ్లిపోతూ స్వగతం) అక్కడ వంటమానేస్తే అస్తమానూ అక్కడ వుండడానికి కారణం వుండదు. వాళ్లకి—బంగారమ్మకీ, కాంతమ్మకీగూడా పేరు భట్టు మీద కలిగిన అభిమానాన్ని ముదరనివ్వగూడదు. నేనివతలికివస్తే రాయడొక్కడైపోతాడు. విషమసంధి వచ్చిపడింది. ఉహ్! ఇక్కడేంవుంది నాకు? వీళ్ల కర్మం! నాకేం? (వెళ్లిపోతుంది.)

---



చార్ మినార్, హైదరాబాదు

—కె. కృష్ణమూర్తి.

## తోటమాలి

కృత్తివెంటి వేంకటసుబ్బారావు, యం. ఏ.,

విలుతురా, రసికహృద్వీథి సమ్మోదాద్యతనవినిర్భిన్న కేతకిసుమమ్ము?
పిలుతురా, భావసంవిత్ప్రియాసీమంతినీసూక్తి శామంతికాసుమాప్తి
నిలుతురా, ఘుమఘుమానిల దిశాప్రసృతిచేతోబహూకృతి మేల్ గులాబిజాతి?
తలఁతురా, సరసహస్తతలాభిమత నవాంకూర సంతుష్టి. మందారవృష్టి?
మచ్చులున్నవి మీయిచ్చు హెచ్చుకొలఁది - రకము లున్నవి మీనాగరకముకొలఁది,
కలతురా గంప మీకోరికలు ఫలింప; - వలతురా తన్విదీఱ మీవలపుమీఱ.

తెచ్చినాఁడ వసంతదివసాంతముల నితాంతలతాంతమల్లికాస్తబకములను,
వచ్చినాఁడ నిదాఘవాసరమ్ముల సౌధభాసురాంగనలంద కేసరముల,
ఇచ్చినాఁడను ప్రావృడీర్ష్యాళు విరహిదృగ్జాలమ్ములైన స్రగ్జాలములను,
గ్రుచ్చినాఁడ భుజంగకోటిస్వాంతముల హేమంతశామంతికాసంతతులను,
మారుబేరమ్ముగా దిందు మాయ లేదు - సొంతమడిపంట యెఱువు కాసంత లేదు,
ఒక్కనాటిదే కలకాల ముండవలయు, - మాటనచ్చిన కొనుఁడు మోమోట వలదు.

మఱతురా, సౌధాళి మధుమాసచంద్రికాసల్లాపవిహరణాసక్తులందు?
వెఱతురా, చంచలావిష్క్రియోద్ధతఘనాఘనరవాకలితయామినులయందు?
తెఱతురా, బంతిక్రొవ్విరిదండకై దండ నెమ్మినేర్పుల శరన్నిశలయందు?
పఱతురా, శిశిరదుర్భరశైత్యవారణకృతకృత్యతకు బుజ్జగింపులందు?
కన్ను మెఱగించు నలకాలకాంతలకయి - వలతురా? ఐన రే పీయవచ్చు సొమ్ము
ప్రాతకాపునె ప్రతిరోజు వచ్చుచుందు - వతనుచే మంచిచెడ్డ మీమతికె తెలియు.

విందురా యొకమాట విరివిలేమావిగున్నల జివుళ్లానుకోయిల తెఱంగు?
తిందురా, యొకతూఱి తియ్యందనపువిందు పెంపునందున దిమ్యుమాంపసందు?
అందురా, ఇదిగో యిందక్కజం బపురూప మగు జగామగఱా మెఱుఁగుబెడంగు
కందురా, యొకమాఱు గరువంపుమురిపెంపు కలిమిపెన్నిక్క ఒక్కటియెలెక్క,
ఉందురా చూడఁగోరి యిం దొక్కమాటు - లేదు పడికట్టుటను లోటు లేదు రాల,
తూకమున మోసముండఁబోదు కలదేని - ఊరకిడిపోదు రాగిడ బ్బీయవలదు.

జలతారునకు విల్చి సరకుపింగాణి మాఱ్ఱోవఁబట్టెడు దొడ్డదొంగ గాను
అమ్మకమ్మునెపాన నానవాళ్ళు లెఱింగి చాటునిల్చొచ్చు పిసాళిగాను,
మంచిమాటల మోసగించి మచ్చికను కంఠము లుత్తరించు బల్ఠవళిగాను,
దాటఁబోవుచునున్నవారి నాకర్షింప నెఱిమందుచల్లు మచ్చెఱుక గాను,
గారడీకాదు మఱి కనికట్టుగాదు - తిఱుగుద్రిమ్మరిగాను దొమ్మరిని గాను
సాణెమైననే బలవంతమేడ దమకు? - వత్తు మఱొకప్పు డింకొక్క వాడ కఱిగి.

జగము నుక్కిరిబిక్కిరిగ జేయుశబ్దసంకులభావములు మెచ్చగలుగునోట,
అక్షరశూన్యపానాయత్తనటకాభినయచిత్రములు లోన నచ్చుచోట,
దౌర్భాగ్యదామోదరార్భాటములు నిరుద్యోగప్రకర్షపే రొప్పుబాట,
నైసర్గికమనోజ్ఞతాసౌష్ఠవాభావ నిర్జీవకళల మన్నించునాట,
'పూవులబ్బీ' యనుచు బిల్వబోక 'యిదిగో-పండ్లగంపా' యనుచు మూగిపడక, 'ఓయి
కావడీ' యని యఱచి కేకలిడకుండ - నగరివిపణివణిజురీతి నాకుగలదె?

ఉబ్బితబ్బిబ్బులై యూహార్ణవతరంగ కల్లోలతకు చాల నల్లలాడి,
ఆర్భాటవృత్తిసందర్భదాంభికవాద విద్యాధికులమ్రోల విన్నబోయి,
అధికారబధిరాధమావజ్ఞతాతృప్తి సంకోచములసేవ సగము చచ్చి,
కుక్షింభరోద్యోగ కుటిలకండూయన వ్యాపారముల కోడి ప్రాకులాడి,
నటనచణులౌ భిషగ్వరార్భటుల విసిగి, - ఘోరకాంతారకుంతల భారభావ
నాప్రభావహతుల రోసి నన్ను వారి - సాటిచేయుదురా? నమస్కారశతము.

మృతివార్ధకరుజారహితులౌ యశఃకాయ నవసిద్ధ శుద్ధసత్కవులవలన,
జ్ఞానప్రశూన్యాంధ్య సాంద్రతావిచ్ఛేద నియతిప్రభార్క పండితులవలన,
ప్రణయపుష్పంధయప్రతిభానుభావజీవకళాసమృద్ధ గాయకులవలన,
చేతనాచేతనవ్రాతకంజాతసంజాతవిన్మర్మవ్యథీతివలన,
ఆరితేఱినధిషణావిహారులేని - తెలిసిననె చాలు లాభమ్ము దేవిరించి
పొట్టనింపెడుకొఱకు రాఁబోనుసుండి, - ఇంతయూరుండ రసికు లిం దెచటలేరె?

చెమటగారిచి సొంతచేను పండించు కర్షకుల కా పలుకు నిష్కర్ష మెందు?
మోసి కావడి మెండ చొక్కి వానలస్రుక్కు బీదకా మాటమర్యాద మెందు?
కూలినాలిని చేసి యాలిబిడ్డల బెంచు నెడఁదకా పేర్వాసిబెడఁద మెందు?

దబ్బరాడక యున్నదానం దినునిజాయ తీలకా యిదిమంచి వేళ యెందు?
బుద్ధిగలవారికా కార్యసిద్ధి నేఁడు? - దైవభక్తులకాః సరి—తగినభుక్తి;
పనికిరా వివి వెనుకటి పలుకులు—ఐన - నింతయూరున కొనరె యొక్కింట నెవరు?

తెమ్మందురా, కొమ్మ తేఁటిముక్కున కింపు గాదొకో చంపకామోదసుఖము,
రమ్మందురా, క్రొత్తకమ్మందనముల గొజ్జంగినూత్నాంగనాపాంగసుఖము,
పొమ్మందురా, బోటిపొలయల్క వెలఁబల్క బంతిచేమంతిపూబంతిసుఖము,
ఇమ్మందురా, యింతి నెమ్మినమ్మించు బృందారకామంద మందారసుఖము,
జాతికేతకివరపారిజాతతతులు - కాశ్మిరత్నాలు పుష్యరాగములు చంద్ర
సూర్యకాంతముల్ ఋతురీతిశోభ దొడఁగు - కాంచి నవ్వింతురా ప్రియాకాంచనేచ్ఛ?

---



అశోకస్తంభాగ్రమునందలి సింహశిఖరము (సారనాథము)
క్రీ. 250 నాటిది.

—సి. జి. జగన్నాథదాసు.

# విద్యాప్రమాణము

సి. పి. రామచంద్రరావు, బి. ఏ., బి. యల్.

(ఆంధ్రయూనివర్సిటీ సెనెటు మెంబరు)

ఎక్కడజూచినను విద్య కావలెను, ఉన్నవిద్య చాలదు, హెచ్చుగా నుండవలయు ననుఘోష వినుచున్నారము. కాని, ఎటువంటివిద్య మనకు కావలెను— ఏవిద్య మనదేశోద్ధరణమునకు కారణభూతముగ నుండును; అట్టివిద్యయొక్క స్వరూపమేమి? ఆవిద్య నెటులు మనము వ్యాపింపజేయవలయును? అను ప్రశ్నములకుమాత్రము అనేకులు అనేకవిధంబులుగ ప్రత్యుత్తరముల నిచ్చుచున్నారు. ఈభిన్నాభిప్రాయముల రాపిడిలో మనబుద్ధి కంపమునొంది కర్తవ్యమును తేటపడనీయకయున్నది. దేశోద్ధరణమున కుపకరించు విద్యయొక్క స్వరూపనిర్ణయమే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యము.

## చదువు-విద్యయు

విద్యాస్వరూప నిర్ణయమును అడ్డుపరచువానిలో చదువునకును, విద్యకును గలతారతమ్యమును గ్రహింపలేకపోవుటే మొదటిదైయున్నది. 'చదువు' అనగా కేవలము అక్షరజ్ఞానము. దేశమున విద్యావంతుల లెక్కించు జనాభాలో అక్షరజ్ఞానము కలవారెల్లరును విద్యావంతులుగ పరిగణింపబడుచున్నారు. ఒ-న-మ-లు వచ్చిన వారందరు విద్యావంతులే! అక్షరజ్ఞానమునకును విద్యకును సంబంధము లేదు. అక్షరజ్ఞానము విద్యనేర్చుట కుపకరించుమార్గములలో నొక్కటి. నిరక్షరకుక్షి చక్రవర్తి కావచ్చును. రాజ్యమును ఏర్పఱచిన హైదరుఅల్లీ మహానుభావుడు చేవ్రాలు చేయుటకుకూడ తెలియనివాడు. హైదరుఅల్లీ విద్యావంతుడు కాడని మనము చెప్పవచ్చునా? బి. ఏ. యం. ఏ. ప్యాసుఅయినవారలే విద్యావంతులు అని మనల నొక యజ్ఞాన మావరించి విద్యాస్వరూపమును తేటపడనీయకున్నది. విద్యాశిరోమణి యని చెప్పదగు శ్రీరవీంద్రనాథ ఠాకూరును, శ్రీరామకృష్ణపరమహంసయును మహాత్మ గంధీయును,- యూనివర్సిటీ డిగ్రీలు పొందకయే విద్యావంతులైరి. యూనివర్సిటీ డిగ్రీలు చాలగల్గియు 'అన్నమోరామచంద్రా!' యని ఏడ్చువారలు యెందరో యున్నారు. డిగ్రీలవల్ల విద్య యేర్పడదనుటకు వీరలే తార్కాణము. ఇటువంటివారలు దేశమున హెచ్చుకొలది దేశమునకు అనిష్టము సంప్రాప్తమగును. చదువుమాత్రము విద్యయగునని యింగ్లీషులో మూడు 'ర' కారములసామెత యొకటి యున్నది. (Three R's) అనగా 'రీడింగు' (చదువుట) 'రైటింగు' (వ్రాత) 'రిత్మెటిక్' (గణితము). ఈ 'ర'కారత్రయముగల్గినవాడు విద్యావంతుడని భావము. ఈభావమే మనదేశమందెల్లెడల వ్యాపించియున్నది. ఈ భావమును చక్కగ విమర్శించి ఆంగ్లవనిత యొకతె (Miss Florence Nightingale) యీ విధముగ చెప్పియున్నది. ఈ 'ర'కారత్రయముతో కూడ కూటికొరకు విద్య యేదేని లేకపోయినయెడల 'రాస్కల్డం' (Rascaldom) అను మరియొక 'ర' కారమును చేర్చుకొని నీ 'ర'కారత్రయము 'ర'కారచతుష్టయమగునని చెప్పినది. "కోటివిద్యలు కూటికొరకే" అను నార్యోక్తి చొప్పున, కూడుసంపాదించు మార్గము లేకపోయినయెడల వ్రాతయు, చదువు, గణితము దుష్టమార్గములబడి మానవుని దుష్టస్వభావుని జేయునని యీమెయొక్క భావము. ఒక్కమాటలో నీయువతి ఆధునికులవిద్యాభిప్రాయముల హైన్యమును సూచించినది.

## విద్యాస్వరూపము

విద్యాస్వరూపమును నేను చతుః "క్తి"లయందు చూపింపదలచినాను. "యుక్తి", "భుక్తి", "ముక్తి" "రక్తి". విద్యకు ఈనాల్గంగములుండవలయును. ఏయం

గము తగ్గినను విద్యకు కొరతయే. ఈనాల్గంగములు అక్షరజ్ఞానముపై నాధారపడవు. అక్షరజ్ఞాన మీయంగముల సాధనమునకు ఉపకరింపవచ్చునుగాని, అది ఏయంగము గానేరదు. లిపి లేకనే సంస్కృతభాష ఏర్పడెనని మనము వినుచున్నారము.

## యుక్తి

'యుక్తి' విద్యకు ప్రథమాంగమైయున్నది. 'యుక్తి' అనగా నేమి? పరిస్థితులకు తగుమైన చర్య నూహించు జ్ఞానము 'యుక్తి'. ఈజ్ఞానము అక్షర పరిచయమువల్ల గల్గునది కాదు. పరమానందయ్యగారి శిష్యులు చేసినపనులు 'యుక్తి' హీనమైనవి. వారు చదువరులయ్యు, తర్క వేత్తలయ్యు, "పాత్రాధారం ఘృతంవా?" "ఘృతాధారం పాత్రంవా?" అని తర్కించి తర్కించి కడకు నెయ్యిని క్రిందబోసిరి. పరిస్థితులకు తగుచర్యను ప్రతిమానవుకు కొద్దిగనో గొప్పగనో ఆచరించుచునే యుండును. లేనియెడల నతడు జీవింపనేరడు. ఈపరిస్థిత్యనుసరణమును విద్యార్థులయందు వర్ధిల్లజేయుట విద్యయొక్క ముఖ్యోద్దేశముగా నుండవలెను. కేవలము పుస్తకముల నొప్ప జెప్పుటయే యిప్పుడు విద్యగా పరిగణింపబడుచున్నది. మనచుట్టు జరుగు అనేక చిత్రములను మనము చూడకయున్నారము. కారణము? ఆమార్గమున మనబుద్ధి ప్రసరించుట లేదు. సృష్టివైచిత్ర్యములయందు విద్యార్థులయొక్క గమనము ప్రసరించునపుడే గొప్పశాస్త్రజ్ఞులు బయలుదేరుదురు. కాలేజీలలో చెప్పినపాఠములను వల్లించి పరీక్షలలో క్రక్కరావడముతోనే మానుకొనియుండినయెడల, సి. వి. రామన్‌గారు సర్. సి. వి. రామన్‌గా నెట్లగుదురు? నోబెల్ బహుమానము నెట్లు పొందుదురు? మనమందరము సముద్రముయొక్క నీలవర్ణమును చూడలేదా? రామన్‌గారు ఇంగ్లాండుకు వెళ్లినప్పుడొకతూరి సముద్రవర్ణమును చూచి—యీవర్ణమునకు కారణమేమి యని తర్కించి, పరిశోధించి, తద్వారా శాస్త్రజ్ఞానమును వృద్ధిపరచి కీర్తివడసిరి. విద్యార్థులకు గమనించి విమర్శించుజ్ఞానమును వృద్ధిచేయనిచో మనము వారికి నేర్పునది విద్య కాదు. 'మార్కుల'పిచ్చి వదలవలయును; పరీక్షలపిచ్చివదలవలయును. అందరి కన్నను తక్కువమార్కులు వచ్చినవాడు హెచ్చుమార్కులు క్లాసులో తీయుచుండెడివానిపైన దర్శన విమర్శనాజ్ఞానముకలవాడై జీవయాత్రయందు గొప్పజయము గాంచవచ్చును. మార్కులు పరీక్షలతో సరి; విద్య పంతులతో సరి. కుక్క సంతకు పోయివచ్చిన విధముగా మనము యిల్లుచేరుదుము. ప్రపంచములో మరల మనము చదువబడవేయవలయు! యుక్తిమంతుని నెక్కడనుంచినను పైకి లేచివచ్చును. ఉన్న సందర్భములను చూచి తగునుపాయములచే హైదరల్లీ రాజ్యమును సంపాదించెను. వాణిజ్యమునకుమాత్రమే వచ్చిన ఈస్టయిండియాకంపెనీ వారు సామ్రాజ్యమును సంపాదించిరి. యుక్తిని వృద్ధిపరుపనివిద్య వ్యర్థము. ఇటువంటి యుక్తివిహీనమైనవిద్యనే మన బళ్లయందును, కాలేజీలయందును నేర్పునది. ఈవిద్యను నేర్చుకొని మనబుద్ధిస్వాతంత్ర్యమును పోగొట్టుకొనియున్నారము. ప్రతిదానికిని ఇతరులపై నాధారపడవలసి యున్నది. ప్రతిసంవత్సరము వేలకు వేలు డిగ్రీలను పుచ్చుకొనుచున్నారేకాని, అందులో ఇద్దరైనను ముగ్గురైనను, యుక్తివంతులై దేశమును వృద్ధిపరచు మార్గముల పరిశీలించుటకు సమర్థులైనవారుండకపోవుట మిక్కిలి శోచనీయ విషయముగా నున్నది. యూనివర్సిటీలు ప్రబలుకొలది యుక్తి అడుగంటుచున్నది. దేశ మెటులు బాగుపడును? మిక్కిలి తెలివిగలపిల్లలు, పట్టుదలగల పిల్లలు విద్యార్థులుగా దొరికినయెడల వారలను పరీక్షలబారికి ద్రోసి, మార్కులకు దాసులుగా జేయక వారియొక్కయుక్తిని వృద్ధిపఱిచినయెడల దేశ మెంత బాగుపడును? అటువంటి విద్యార్థులకు ప్రత్యేక శిక్షావిధానముల నేర్పరుపవలయును. మన కాలేజీలలో, బళ్లలో నేర్పబడు విద్య రోడురోలరుమాదిరి అందరిని సమముగా నుంచుటకు ప్రయత్నించుచు, గుఱ్ఱమును, గాడిదెను ఒకేగాట గట్టుచు, విద్యార్థులయందు చిన్నతనమున నుబుకుచుండు యుక్తి - ఉత్సాహములను చితుకగొట్టుచున్నది.

# "భుక్తి"

'కోటివిద్యలు కూటికొరకే' యనునట్లు విద్య యొక్క ముఖ్యోద్దేశ్యములలో నొకటి ఆశ్రితుల యొక్క ఆకలి దీరుటగా నుండవలయు. ౨౫ సంవత్సరములు, చదివిచదివి, ప్యాసై, తుదకు 'కూటికి గుడ్డకు యేలాగు' అని అల్లాడుట బాగుండదు. విద్య "ప్రచ్ఛన్న గుప్తంధనం," "విద్యా భోగకరీ" అని భర్తృహరి చెప్పియున్నాడు. సర్కారు ఉద్యోగములు లేక పోయినయెడల కాలేజీలలో నేర్పువిద్య "ప్రచ్ఛన్న గుప్తంధన" మగునా? ఈ సర్కారు ఉద్యోగములు అందరికి వచ్చునా? కాలేజీలలో మనము నేర్చుకొన్న విద్య మనకు పావుసేరుబియ్యపు అన్నము సంపాదింప గలదా? విద్యావంతు డెచ్చటనున్నను అన్నవస్త్రము నకు కరువులేదనిగదా భర్తృహరిగారి అభిప్రాయము? ఇప్పుడు విద్య "ప్రచ్ఛన్నగుప్తం దారిద్ర్యం" అయినది. అందుచేతనే కాలేజీమాని యింటికివచ్చిన కుఱ్ఱవాండ్లకు 'మనగతి ఏమిటి' అని భయముగల్గుచున్నది. విద్యావంతులకు అన్నవస్త్ర భయము గలిగించువిద్య విద్యగాదు; అదిలేనిపోనిగద్య. విద్యావంతులు పైచెప్పిన ప్రకారము యుక్తి—ఊహలుగలవారై యుండిన యెడల, ఏదియో భుక్తిమార్గము వారల కగపడును. అనేకధన సంపాదనమార్గములు దృగ్గోచరమగును. ఒక దానియందే అందరు పడి పీకులాడరు. ఇంగ్లండు లోనే పండెడి పైర్లచేత యింగ్లండులోని జనులలో ౧/౧౦ పాలు జనులుకూడా జీవింప నేరరు. అయితే వారు తమయొక్క విద్యాబుద్ధిశ్రద్ధలను అనేకమార్గంబుల ప్రసరింపజేసి ధన మార్జించుచున్నారు. హిందూదేశము కేవలము వ్యవసాయముచే జీవించు దేశము. ఈ వ్యవసాయమున ఎన్ని కోట్లజనమైనను సునాయాసముగ యిమడగలరు. వ్యవసాయోద్యోగమున పోటీ లెంతజరిగినను దేశమునకు క్షేమమేగాని కీడుగాదు. ఇటువంటి దేశమున వ్యవసాయమునందు దేశముయొక్క బుద్ధిని జొనిపి శిక్షించి ప్రకాశింపజేసినయెడల మనవిద్యావంతులు అన్నవస్త్రముల కేల వగవవలయు? "కృషితో నాస్తి దుర్భిక్షం" అనిగదా ఆర్యోక్తి. వ్యావసాయిక వాసనకూడా మనదేశములో గరపెడి విద్యయందు లేదు. ఇంగ్లండులో వాణిజ్యమున దేశముయొక్క బుద్ధిని, యుక్తిని, శ్రద్ధను, ఊహను, సాహసమును ప్రసరింపజేయకుండిన యెడల ఇంగ్లం డెట్లులుండునో గమనింపుడు. ఆవిధముగనే మనదేశస్థులయొక్క బుద్ధిని, యుక్తిని, ఊహను, సాహసమును వ్యవసాయమున ఉపయోగపఱుపకుండుట బట్టి, మనదేశము చెప్పదరముగా నటువంటి హైన్యమును బొందియున్నది. వ్యవసాయమున సకలశాస్త్ర జ్ఞానము ఉపయోగపరచవచ్చును. అటులుగావించిన దేశము ఐశ్వర్యముతో దులదూగుచుండును. వీధిబడి మొదలు యం. ఏ., వరకు వ్యవసాయవిషయములను మనబాలురకు చెప్పుచుండిన దేశముయొక్క బుద్ధి చాతుర్యములు వ్యవసాయము వృద్ధిపఱచక మానదు. ప్రతిమనుజునకును పుష్కలముగ అన్నము దొరకును. అప్పుడే విద్య "ప్రచ్ఛన్నగుప్తంధనం" "భోగకరి" యగును. ఇప్పుడు మనము నేర్చెడివిద్య "ప్రచ్ఛన్న గుప్తం విషం" అయినది. వ్యవసాయమన్ననో మనకందరికి ఎగతాళి హాస్యము. కేవలము వ్యవసాయముచే జీవించెడివారలుగూడ సర్కారు ఉద్యోగమును బోగముచిన్నదానియొక్క తళుకుబెళుకులు జూచి తమకులవృత్తిని మానుకొనుచున్నారు. నౌకరివల్ల జీవనము మిక్కిలి హీనమని మనపెద్దలయభిప్రాయము. "న శ్వవృత్త్యా కదాచన" శ్వవృత్తి అనగా యితరులక్రింద నౌకరి. దానిని ఎప్పుడును చేయబోకు అని మనపెద్దల సుబోధము. ఇప్పుడన్ననో విద్యావంతులకు శ్వవృత్తితప్ప యితరజీవనోపాయములు తోపక యున్నవి. ఎంతచదువుచదివినా తాలూకాఆఫీసులో 30 రూపాయల నౌకరీలో ప్రవేశింపవాలి! అనేకకచ్చేరీలలో వూరక వాలంటరీకూడా చెయ్యాలి! బ్రదికినన్నాళ్లు కలంనడిపి జీవనం చెయ్యాలి!

కాబట్టి విద్య భుక్తికి ఉపకరింపవలెనని యెడల, దేశసముదాయమునకు ఏభుక్తిమార్గము దేవుడేర్పఱచి నాడో ఆమార్గమునందు దేశముయొక్కయుక్తిని,

ఉత్సాహము, సాహసమును, శ్రద్ధను ప్రసరింపజేయవలెను. అప్పుడే భుక్తి పుష్కలము దేశమునకు కుదురును.

"ముక్తి"

మనుజునకు హెచ్చుగా యుక్తి యుండవచ్చును. తద్ద్వారా అత డనేకయంత్రసూక్ష్మములను గనిపెట్టి అనేకవిధములైన చిత్రమార్గములచే సృష్టిశక్తులను లోబఱచుకొనవచ్చును. అతనికి పుష్కలముగ భుక్తి కుదరవచ్చును. అటువంటి తరుణముననే సంపన్నాంధత అతని నావరించి విషయలోలునింజేసి క్రిందపడవేయును. ఈవిధముగనే పాశ్చాత్యదేశీయులు విషయలోలురై విషయపిపాసచే బాధింపబడుచున్నారు. అడ్డులేని మానవ యుక్తియు, భుక్తియు విపరీతపుపోటీలకు కారణ మవును. అందుచేత సామాన్యజనులు పోటీలలో నెగ్గలేక కడకు ధనికులపంచ వేలకువేలుగా గావవలసివచ్చును. ఆర్థికమైనటువంటితొందర లనేకములు గలుగవచ్చును. కార్మికసమస్యలు బయలుదేరును. జనబాహుళ్యమునకు భుక్తి తగ్గి దేశక్షోభ గలుగును. దేశక్షోభ ప్రబలుకొలది రాజ్యములే తల్లక్రిందులు గావచ్చును. వ్యక్తియుక్తికి తగుమైనబంధ మొకటి యుండవలయును. బంధరాహిత్యమును వ్యక్తి యుక్తి కేవలము భుక్తిమార్గమున బడి "అందరిసొమ్ములు మాకేరానీ" అను త్రోవలో పనిచేయును. వ్యక్తియుక్తి దుష్టపథంబుల ద్రొక్కకుండ "ముక్తి" కాపాడును. ముక్తి, మానవయుక్తిని భగవద్విషయములపై ద్రిప్పి పర శ్రేయోభిలాషిగా జేయును. శక్తిమంతుడును యుక్తిమంతుడును, స్వార్థపరుడైనయెడల యితరులకది అనిష్టదాయకమగును. ముక్తికాంత నుపాసించుశక్తిమంతుడును యుక్తిమంతుడును స్వార్థత్యాగి యగును. ఇతరులకతడు క్షేమకరుడగును. ముక్తియందు విద్యఅభిలాషను కలిగింపవలెను. మనదేశమున గరపెడి విద్యయందు ముక్తివాసనయే లేదు. అందుచేతనే గొప్పత్యాగులను మనవిద్య పుట్టింప లేకయున్నది. ఉగ్గుపాలనాటినుండియు మతము నభ్యసింపజేసెడి మనదేశములో, అతిబాల్యములోనే శుక శంకరులవంటి మహాయోగులను పుట్టించిన మనదేశములో బళ్లలోగాని, కాలేజీలలోగాని మతమను వాసనయే లేకుండుట మిక్కిలి శోచనీయముగా నున్నది. విషయ పిపాసకు విద్య ఎడమివ్వకుండవలె నని నయెడల ముక్తిమంత్రము తప్ప వేరొండు లేదు. "ముక్తి" యనగా బంధవిమోచనము, మనహృదయవైశాల్యమును హ్రస్వపరచు బంధంబులను తెగగొట్టుమార్గము. ప్రపంచంబునకు మనలను కట్టివేయు బంధంబులు రెండున్నవి. నేను, నాది, అను అహంకారమమకారములు. ఈబంధములను విడుదల చేయునది ముక్తి. చిన్ననాటనుండియు అహంకారమమకారములవల్ల గల్గుప్రమాదముల బాలురకు తెలుపుచు వారల మనములయందు నాటుచువచ్చినయెడల అహంకార మమకారములపై ఒకనైతిక ప్రతిబంధక మేర్పడును; ఇటువంటి ప్రతిబంధకమే యితరులయొక్క క్షేమంబునందు ఉత్సాహమును బుట్టించును; ఇటువంటి ప్రతిబంధకమే విషయపిపాసకు అంకుశమగును; ఇటువంటి ప్రతిబంధకమే దేశమును ఆర్థికవిప్లవముల నుండి తప్పించును. కాబట్టి ముక్తివాసన లేని విద్య వ్యక్తికిని, సంఘమునకును శ్రేయోదాయకము గాదు. మరియు ముక్తివాసనలేని విద్యావంతునికి తృష్ణ తగ్గదు. మనుజునికి తృప్తి లేకపోయిన యెడల పెక్కుకష్టంబులు సంప్రాప్తమగును. వ్యక్తితృష్ణ పెరిగినచో సంఘసముదాయమునకు కీడేగాని మేలుగాదు. తృప్తిలేని వ్యక్తులుండు సంఘము ఎటువంటి ఐశ్వర్యస్థితియం దొకప్పు డుండినను తుదకు దుఃఖములపాలై నాశమునొందును. ఈజిప్టు, రోము, నినివై- దేశంబులు తమ నిరంకుశప్రభుత్వమును గోల్పోయి యావిధంబుగ నశించి కడపట రూపనామములు కూడా లేకపోయినవి. హిందూదేశమున జనబాహుళ్యము పురాతనకాలమునుండి ముక్తికాంతను వరించియుండుటచేత తృష్ణను సరియయిన పరిమితి యందుంచి తమయొక్క ఔన్నత్యమును గోల్పోవ లేదు. ఎన్నివేల సంవత్సరములు జరిగినను, ఎన్నిరాజ్యములు స్థాపితములై వర్ధిల్లి ఖిలమైనను, మనదేశస్థుల యొక్క స్వభావము మారలేదు. ఎన్నివిప్లవములు తటస్థించియుండినను నైతికవిప్లవము ఎప్పుడేగాని తటస్థించి యుండలేదు. నైతికవిప్లవము రాకుండుట చేతనే మన దేశముయొక్క ఔన్నత్యము శాశ్వతముగా నున్నది.

## "ర క్తి"

"విద్యావిహీనఃపశుః" అనిగదా భర్తృహరి చెప్పినది. ఈవచనములో విద్యావంతునికిని విద్యావిహీనునకునుగల తారతమ్యమును తెలిపిరి. ఆహారనిద్రాభయమైథునంబులతో నరుడు తృప్తిపడి యుండెనేని పశువనుటకు సందియ మేమున్నది? ఈ పశుస్వభావమును విడిపించి మానవునికి విద్య ఆత్మప్రకాశము గలిగించవలెను. రసవంతములగు వచనంబులు, కావ్యములు, వేదాంతవిచారములు ఆనందము నిచ్చుచు ఆత్మనైశాల్యము గలుగజేయును. రసాస్వాదనము విద్యయొక్క అంగములలో నొక్కటి. చుట్టుప్రక్కలనుండు సృష్టి విశేషంబులలో నేమి, మానవప్రకృతి - అతిశయంబులలో నేమి ప్రపంచమున నడుచు అనేకవ్యవహారంబులలో నేమి, రసగ్రహణము లేకపోయినయెడల జన్మము నిరర్థకము. ఇతర అంగంబు లన్నియుండియు రస మొక్కటి లేకపోయినయెడల విద్య ఉప్పులేనిపాకము వలె నుండును. చంద్రుని మనమందరము చూచుచున్నారము. కాని చంద్రస్వరూపము రసవంతముగ నీవిధముగ జెప్పిన ఎంత ఆహ్లాదకరముగా నుండును?

> కామతంత్రటీక కలువలజోక కం
> దర్పుడాక విటులతాల్మిపోక
> చకితచక్రవాక సంప్రీతజనలోక
> రాక వచ్చె మేలురాకయగుచు.
>
> భాగవతము.

ఇంకొక కవి చంద్రుని "...కుముదంబుల చక్కిలిగింత...సారసలక్ష్మి తోలంగుబావ కోకములకు గుండెతల్లడము కైరవ మిత్రుడు దోచెతూర్పునన్." సృష్టిచిత్రములు పురాణగాథలు ఎంత సుందరముగ నీ మాటలలో నిముడ్పబడినవి! కాబట్టి రసములేని చదువు నీరసమని చెప్పనక్కర లేదు. రసములేనివిద్య రసము లేని ఆయుర్వేదమువలె నుండును.

### ముగింపు

విద్యాస్వరూపమును మనము గ్రహించితిమి. దానియొక్క నాల్గంగంబుల చూచితిమి. ఈయంగములలో నేయంగము తగ్గినను విద్యకు కొరతయే. విద్యకు ఇటువంటికొరతలు గలుగుకొలది వ్యక్తుల శిక్షయందు లోపములు యేర్పడి తుదకు సంఘముచెడును. దేశోద్ధారకమగువిద్య మనకు కావలె ననినయెడల ఈనాల్గంగములు కొరతలేకుండునట్లు చూచుకొనవలయును. దేశనాయకులును, విద్యాధికారులును, ఈ యంశంబును గమనించి నిక్కమైన విద్యావ్యాపకవిషయమై పాటు పడుదురుగావుత!!



# మధువ్రత

పాటిబండ మాధవశర్మ

౧

ఓ కవిరాజమిత్ర, నిలువోయి నిమేషము, నీవియోగపుఁ
గాఁకలలోఁ గుమారిలెడు నానిఱుపేదయెడందపైన, శు
ష్కాకృతిపైనఁ జిల్కెదవు గ్లావవతంసశిరఃప్రసూత మా
ధ్వీకధునీనికాశభవదీయమనోహరగానవాహినుల్!

౨

హ్రస్వతరమ్ము జీవము, రహస్స్పృహ దీర్ఘతరమ్మునైన, ఈ
నశ్వరమైనజీవితమునన్ క్షణ మొక్కయుగమ్ముగాఁగ, స
ప్తస్వరమాతృకాయితభవన్మృదుగానసుధాప్రవాహ స
ర్వస్వము నారగించు ప్రబలత్వర నేఁగెద నీకునై ప్రియా!

౩

నీయెడ రక్తురాలను, పునీతను నేను పతివ్రతన్ జుమీ!
నాయెడ నిట్టివైరము గొనందగ దోహృదయప్రభూ, సుమ
శ్రీ యెద నాహరించి భ్రమరించెదవో, మధుదిగ్ధమూర్తి, ఆ
నీయెదలోన నన్నొదుగని మ్మొకయింత, తరించిపోయెదన్.

౪

నాయనిచెప్వకో నినువినా మఱిలేనియనాథదాసి, న
న్నా యిటులేడిపింతువు దయాతుహినాచల, చల్లనైన కై
దోయి నిగిడ్చి యీవిరహదుఃఖశిఖాపరిదగ్ధదేహమున్,
తీయని కౌఁగిఁటం బొదివి నీరయిపోగద వో మనోహరా!

౫

నిగనిగలాడునీలముల నిగ్గులు జగ్గులు నీను నీగరు
ద్యుగళముక్రిందఁ దారెడుమహోత్సవమున్ కరుణించి నాథ, ఈ

మొగిళులు గ్రమ్ముకొన్న యహమ్ముల మధురింతువుగాని, యీనభో
గగనపథాంచలమ్ములు వికాసిలచేయుదుగాని రాగదో!

౬

తెక్కలు తెక్క హత్తి విహరింతము కాలు మొయిళ్లతోటి సాం
పెక్కినయీవియత్తటము లెక్క మనఃప్రియ, రాగదోయి నా
చక్కికి, ఈరహోమయతృషాశరధిన్ తరియింపఁ జేసి నీ
యక్కున జేర్పు మీ మొగిలుటంచుల లోకము విస్మరించెదన్.

"మధుకణములు" నుండి.

---



క్లిక్

—యస్. వి. యస్. రామారావు.

# భారతీయ విద్యా చరిత్రము

మారేమండ రామారావు, బి. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

(అనువృత్తము)

## మూడవ అధ్యాయము

[ఆ ధా ర ము లు

Lakshmana Rao - Hindumahayugamu

Mazumdar - History of Ancient Indian History and Civilisation

Virabhadra Rao - Andhrula Charitramu

Rama Rao - Political History of the Kakatiyas

Sarma - Pracheena Vidyasamsthalu

Annual reports on South Indian Epigraphy

South Indian Inscriptions, Vol. IV, V, VI.]

### మధ్యయుగము

క్రీ. శ. ౬౪౭ లో శ్రీహర్షచక్రవర్తి మరణించినయనంతరమునుండియు మధ్య యుగారంభమగును. ఉత్తరాపథము నేలిన చక్రవర్తులలో హర్షవర్ధనుడే కడపటివాడు. ఆతనికి బిమ్మట చిన్నిచిన్ని సంస్థానము లనేకములు బయల్వెడలినవి. పశ్చిమమున రసపుత్రులును, దూర్పున పాల, సేనరాజులును విజృంభించిరి. దక్షిణాపథమున దూర్పుపడమరతీరముల చాళుక్యులు ప్రబలిరి. కాంచీపురప్రాంతమున బాదుకొని పల్లవులు చోళపాండ్యాదులతో బోరి తమ యధికారమును విస్తరించుకొనజొచ్చిరి. ఉత్తరాపథమున క్రీ. శ. ౧౧-వ శతాబ్దినాటికే హిందూరాజుల పాలన మడుగంటి దేశము మహమ్మదీయులకు లోనయ్యెను. అంతటినుండియు హిందూవిజ్ఞానము క్షీణింపసాగెను. ఇట్టియెడ దక్షిణాపథముమాత్రమే విదేశీయుల పీడ నెరుంగక శౌర్యధనులును, విద్యాపక్షపాతులును నగు రాజన్యుల పాలనమునం దుండి క్రీ. శ. ౧౪-వ శతాబ్ది మొదటిపాదమువరకును శాంతిస్వాతంత్ర్యముల ననుభవించెను. పౌనఃపున్యముగ యవనవిజయయాత్రల నడ్డగించి యిరువదిసంవత్సరములకాలము విదేశీయులతో నిరంతరమును బోరుచు దక్షిణాపథహిందూస్వాతంత్ర్యమును నిలువబెట్టి తుద కాత్మార్పణమును సహితము గావించిన యేకశిలానగరాంధ్రసామ్రాజ్యము నశించిన పిమ్మట గొంతకాలము దక్కనులో విదేశీయపీడ గల్గినది. కాని క్రీ. శ. ౧౩౩౫ లోనే హిందూపౌరుష ము విజయనగరమున మొలకెత్తి శీఘ్రముగ విజృంభించినది. కాన క్రీ. శ. ౮-వ శతాబ్దమునుండి ౧౬-వ శతాబ్దమువరకును దక్షిణాపథమున హిందూవిద్యావైదుష్యము లభివృద్ధినందుచుండినవని స్పష్టమగుచున్నది. ఈ ప్రకరణమునం దీచరిత్రము వివరింపబడుచున్నది. ఉత్తరాపథమునం దీసమయమున ఢిల్లీసుల్తానుల పాలనమున మహమ్మదీయవైదుష్యము ప్రబలినది. ఆచరిత్రము రాబోవు ప్రకరణమున జర్చింపబడును.

పరిస్థితులు:—మధ్యయుగమునాటి దక్షిణాపథమునందలి విద్యాచరిత్రమును వర్ణించుటకు బూర్వ మచ్చట తాత్కాలిక రాజకీయాది పరిస్థితులను సంగ్రహముగ బేర్కొనవలసియున్నది. శ్రీహర్షుని కాలముననే మహారాష్ట్రదేశమున బూర్వచాళుక్యులు విశేషఖ్యాతి గాంచియుండిరి. రెండవ పులికేశి మహారాజు దక్షిణాపథమునందలి రాజుల ననేకుల నోడించి తూర్పు తీరమునందలి యాంధ్రభూమినెల్ల జయించి, యచ్చట తన తమ్ముని బ్రతినిధిగ నెలకొల్పెను. అప్పటినుండియు ౧౧-వ శతాబ్దిమధ్యభాగమువరకును వేంగీచాళుక్యులను

పేరిట జళుక్యు లాంధ్రదేశము నేలసాగిరి. ౮-వ శతాబ్ది మధ్యకాలమున రాష్ట్రకూటవంశజులు ప్రబలి, మహారాష్ట్రమునందలి చాళుక్యుల నణచి, వారి దాయాదులగు వేంగీ చాళుక్యులతో నిరంతరము పోరుచు, దక్షిణమునకు దమ రాజ్యమును విస్తరించుకొనిరి. ఈసమయమున కాంచీనగరమునుండి పల్లవులు విజృంభింపసాగిరి. ౧౦-వ శతాబ్దమునాటికి పరిస్థితులు మారినవి. పల్లవ రాష్ట్రకూట వంశములు క్షీణించినవి. మహారాష్ట్రమున బశ్చిమచాళుక్యులును, వారికి బ్రాగుత్తరమున దేవగిరి యాదవులును, రాష్ట్రకూటుల స్థానమున గాకతీయులును, దత్తమండల తొండమండలములలో నాంధ్ర చోళులును, దక్షిణమున చోళపాండ్యులును, గర్ణాటకమున హోయసలరాజులును బయల్వెడలి సామ్రాజ్య నిర్మాణదీక్షతో నన్యోన్యమును బోరుచుండిరి. ౧౧-వ శతాబ్దమునం దీ సామ్రాజ్యసమరములలో బశ్చిమచాళుక్యులు విజయమంది దక్షిణాపథమంతటిని స్వాధీనము చేసికొని పాలించిరి. ఈసందర్భమున త్రిభువనమల్ల విక్రమాదిత్యుని రాజ్యకాల మగ్రగణ్యము. ఇదేసమయమున చోళరాజు లితరప్రత్యర్థులను నిర్జించి దక్షిణదేశమునం దప్రతిములై యుండిరి. ౧౨-వ శతాబ్దినాటికి బశ్చిమచాళుక్యులయొక్కయు, దాక్షిణాత్యచోళులయొక్కయు బ్రతిభ నశింప ద్రవిడమున బాండ్యరాజులును, ఆంధ్రదేశమున గాకతీయులును విజృంభించిరి. ఏకశిలానగరకేంద్రమగు నీకాకతీయాంధ్రసామ్రాజ్య మనతికాలమునకే యాంధ్రభాగమును,దత్తమండలములను, తొండమండలమునుగూడ నాక్రమించి దక్షిణదేశవిజయమునకై బాండ్యులతో స్పర్ధింపసాగినది. గోదావరీనది నుండి కాంచీనగరమువరకును గల భూభాగమున దుర్నిరీక్ష్యతేజోవంతమై రాజిల్లిన యీ కాకతీయాంధ్ర సామ్రాజ్యము క్రీ. శ. ౧౩౨౩ లో దురుష్కులచే నాశమొనర్పబడెను. కాని మరి పదిపదునైదువత్సరము లకే యీ యాంధ్రసామ్రాజ్యము, త్రిమూర్త్యాత్మకముగ బయల్వెడలి రాచకొండ, కొండవీడు, విజయనగర సామ్రాజ్యములుగ విజృంభించెను. ఇంతకుబూర్వ మేకశిలానగరమున విశేషాదరమును బడసిన హిందూవైదిక్యమున కిపుడు మూడు కేంద్రములు లభించినవి.

ఈకాలమునందలి మతచరిత్రము భారతదేశ చరిత్రమునకు మిగుల ముఖ్యమైనది. మధ్య యుగారంభ కాలమునకు జైన, బౌద్ధ, బ్రాహ్మణమతములు మూడును దక్షిణాపథమునం దుండినవి. క్రమముగ బౌద్ధమతము క్షీణింప జైనులును, బ్రాహ్మణులును అత్యుత్సాహమున దమతమ మతములను వ్యాపింపజేయజొచ్చిరి. రాజులలో ననేకులు జైనమతము నాదరించి జైనుల కనేక సౌకర్యముల నొనగూర్చుచుండిరి. విశేషించి బ్రాహ్మణమతమే ప్రబలముగ నుండినది. మతవైషమ్యములును, దద్విషయకములగు హింసాప్రతిహింసలు నీ కాలమున లేకుండినవి. ఇట్టిపరిస్థితు లుండుటచే నీ కాలమునం దనేకులగు మతసంస్కర్తలు బయల్వెడలిరి. ౧౦-వ శతాబ్దమున శ్రీ శంకరాచార్యుడు బయల్వెడలి నిగూఢ తాంత్రిక సిద్ధాంతకళంకితమగు బౌద్ధమతమును ఖండించి యద్వైతసిద్ధాంతస్థాపన మొనర్చి ప్రాచీన వైదికమతమునకు నూతనోత్తేజమును గల్గించెను. అటుపై శ్రీరామానుజాచార్యుడు బయల్వెడలి విశిష్టాద్వైతసిద్ధాంతమును బ్రతిపాదించి జైనమతమును నిర్మూలమొనర్చి, వైదిక మతమును విశేషముగ వ్యాపింపజేసెను. దక్షిణమున వైష్ణవమతము బ్రబలుచుండ బశ్చిమోత్తరమున గల్యాణీ నగరమున బసవేశ్వరుడు వీరశైవసిద్ధాంతమును బ్రతిష్ఠించి యమితోత్సాహముతో జైనమతనిర్మూలనమును, స్వమత విస్తరణమును నొనర్చుచుండెను. పిమ్మట శ్రీ మధ్వాచార్యుడు ద్వైతసిద్ధాంతమును ప్రతిపాదించి భక్తితత్త్వమును బ్రచారముచేసెను. ఇదేసమయమున గోళగీ మఠశైవాచార్యులు శైవమతమును వ్యాపింపజేయుచుండిరి. ఈపరిస్థితులలో విజ్ఞానమోహ యనేకగతుల విలాసనృత్యముల నొనర్చినది. బ్రాహ్మణమతమునకు, సంస్కృత భాషకు నద్వితీయమగు ప్రోత్సాహము లభింప నయ్యవి సర్వతోముఖమగు నభివృద్ధి నందినవి. వీరశైవాదిమతప్రవర్తకులు దేశభాషలలో మతప్రచార మొనర్చుటచే నాభాషలుగూడ నభివృద్ధి నందసాగినవి. జనసామాన్యోపయోగార్థమై నన్నయాది మహాకవు

లుద్గ్రంథముల నెన్నిటినో దేశభాషలలోనికి బరివర్తింప జొచ్చిరి. దానజేసి యింతవరకును సంస్కృతభాషనాశ్రయించియుండిన హిందూవైదుష్య మిపు డనేక భాషలలో బ్రసరించినది.

రాజాస్థానములు:—సముద్రగుప్త చంద్రగుప్తాది గుప్తచక్రవర్తుల కాలమున శ్రీహర్షుని రాజ్యకాలము నందు నుత్తరహిందూస్థానమునందువలె దక్షిణాపథమున మధ్యయుగమునందు నిజమైన జాతీయ జీవనము, సర్వతోముఖమగు వైదుష్యము నభివృద్ధినందినవి. ఇట్టి నూతనోజ్జీవనమును గల్పించిన సంస్థలలో రాజాస్థానము లగ్రగణ్యములు. పండిత, కవి, గాయక వర్గము రాజసభలకు ముఖ్యాంగములు. వేనకువేలుగ దొరకు శిలాతామ్రశాసనములు రాజులు పుణ్యకాలములందును, పట్టబంధ, సమరవిజయాది సంతోష సమయములందును బండితుల కొనర్చిన దానములను దెలుపుచున్నవి. అనేకులగు పండితుల కగ్రహారము లేకభోగములుగ నొసంగబడినవి. ఇతరసమయములలో విద్వాంసులకు వృత్తు లేర్పరుపబడెడివి. ఇవిగాక అధ్యాపకులకు గౌరవవేతనము లీయబడుచుండెడివి. మహాభారతరచనసందర్భమున నన్నయ భట్టునకు దోడ్పడిన నారాయణ భట్టునకు చాళుక్యరాజరాజు నందమపూడిని, మనుచరిత్రరచయితయగు పెద్దన కవికి కృష్ణదేవరాయలు కోకటగ్రామమును అగ్రహారములుగ నొసంగిరి. ఇట్టి యుదాహరణము లసంఖ్యాకములు గలవు. రాజరాజ, మనుమసిద్ధి, ప్రతాపరుద్ర, కృష్ణరాయాది విద్వద్రాజులు నిరంతరమును పండితగోష్ఠితో కాలముగడపుచుండిరి. తిక్కనసోమయాజి, శివమహాముని, విద్యారణ్యుడు మున్నగువారలు తమ పాండితీప్రతిభలచే నిరుపములై రాజ్యముల పురోభివృద్ధికి మూలస్తంభులై యొప్పిరి. కాకతీయాంధ్రచక్రవర్తియగు గణపతిదేవుని యాస్థానమునం దొకవిద్యామంటప ముండినటుల మాల్కాపురశాసనమునుండి తెలియుచున్నది. అతని మనిమనుమడగు ప్రతాపరుద్రచక్రవర్తి సంస్కృతాంధ్రవాఙ్మయములను, జ్యోతిషాదిశాస్త్రములను, శిల్పము, నాట్యమున్నగు కళలను ఆదరించెను. మల్లినాథుడను మహాకవి యష్టావధానమొనర్చి యాతని మెప్పు వడసెను. ఈచక్రవర్తి స్వయము విద్వాంసుడు. కొండవీటిరెడ్లువిద్యాశాఖ నొకదానిని బ్రత్యేకముగ నెలకొల్పిరి. వారివద్ద శ్రీనాథకవి విద్యాధికారిగ నుండెను. శ్రీనాథుని జీవితమునుండియా కాలమున గవులకును, బండితులకును జరిగెడి సన్మానము తెలియుచున్నది. డిండిమభట్టువలె నప్పటి పండితులు ఢంకావాద్యము మున్నగు ప్రకటనసాధనములను గల్గియుండిరి. శ్రీనాథు డీతని నోడించుటచే విజయనగరాధీశ్వరు డాతనికి స్వర్ణాభిషేక మొనర్చెను. ఈపండితుడు రాజభోగముల ననుభవించెను. రత్నాంబరములు, హేమపాత్రాన్నము కస్తూరి మున్నగున వీతనికి సులభసాధ్యములుగ నుండెడివి. అటులే కృష్ణరాయ లల్లసాని పెద్దనార్యునకు జూపిన గౌరవమర్యాదలుగూడ నీ మధ్యయుగమున పాండిత్యమునకు గల మహత్త్వమును జూపుచున్నవి. ఏనుగుపై రాజుతో నర్ధాసనమున గూర్చొనుట, కవియెక్కిన పల్లకిని రాజు స్వయముగ నెత్తుట, కాలికి గండపెండేరమును దొడగుట, అగ్రహారముల ననేకముల నిచ్చుట మున్నగున విందుల కుదాహరణములు. ఈకాలపు రాజులుగూడ నెందరో మహావిద్వాంసులైయుండిరి. అందువలన "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం" అనునటుల వారు విద్వాంసులయెడ విశేష గౌరవాదరములను జూపిరి. ఆంధ్రరాజులలో నన్నెచోడుడు కాకతీయరుద్రదేవ ప్రతాపరుద్రులు, రెడ్లలో కుమారగిరి కాటయవేములు, పద్మనాయకులలో రావుసింగ మహీపాలుడు, విజయనగరరాజులలో కృష్ణదేవరాయలు నిందుల కుదాహరణములు. రాజబంధువులు, సామంతులు, ప్రధానోద్యోగులు, ధనికులునుగూడ రాజాదర్శము ననుసరించి చాలమంది కవులకును, బండితులకును ఆశ్రయమొసగి వారిచే నెన్నియోగ్రంథములను వ్రాయించుచుండిరి. విద్వజ్జనదారిద్ర్య దుఃఖమును రాజాస్థానములు నిర్మూలించుచుండినవి. "నిరాశ్రయా నశోభంతే పండితా వనితా లతాః" యనునటులు రాజాదర ముండుటచేతనే మధ్యయుగమున విద్యావైదుష్యము లపూర్వశోభను గాంచినవి.

అగ్రహారములు:—మధ్యయుగమునందు విద్యావైదుష్యములను వ్యాపింపజేసిన సంస్థలలో రాజాస్థాన

ములకుబిమ్మట పేర్కొనవలసినవి అగ్రహారములు. పర్వకాలములందును, దిగ్విజయపట్టబంధాది మహోసనయములందును రాజు లనేకులు వేదవేదాంగపారగులును, పురాణేతిహాసజ్ఞులును, కర్మనిరతులును అగు విప్రుల కీయగ్రహారములను దానమొసంగుచుండిరి. వీని యాదాయముతో జీవయాత్రను జేయుచు నీ బ్రాహ్మణులు నిశ్చింతులై స్వాధ్యాయప్రవచనములతో గాలక్షేపమొనర్చుచుండిరి. ఈయగ్రహారము లేకభోగములు, బహుభోగములు నని రెండువిధములు. అందు మొదటి తరగతి వొక్కని హక్కుభుక్తములోనే యుండునవి. రెండవతరగతి యగ్రహారములలో ననేకపండితకుటుంబములకు వృత్తు లేర్పరుపబడియుండెడివి.

అగ్రహారములకు మంగలములనియు, చతుర్వేదిమంగలములనియుగూడ పేరుండెడిది. వీరచోడ చతుర్వేదిమంగలమను నొకచో గల శాసనమునుండి, యచ్చట వ్యాకరణ, మీమాంసా, వేదాంత, ఋగ్యజుస్సామ, రూపావతార, పురాణ, జ్యౌతిష, వైద్యవిద్యలను బోధించు నాచార్యుల నొక్కొకని కొక్కొక వృత్తి గల్పింపబడియుండెడిదని తెలియుచున్నది. ఈ యగ్రహారముల కేవిధమగు బాధయు గలుగకుండగ జేసి రాజులు వానికి సర్వస్వాతంత్ర్యముల నొసంగియుండిరి. వీనిపై ఏ విధమగు పన్నులును విధింపబడకుండినవి. ఇందలి భూములపై వచ్చు ధాన్యమంతయు నగ్రహారీకులదే. రాజకీయోద్యోగుల కిందు ప్రవేశము లేకుండెడిది. అందలి పండితులును అన్యాపేక్ష లేక సర్వకార్యములను నిర్వహించుకొనుచుండిరి. ఇటు లన్నివిధములను నేటి రాజశాసనములచే నిర్మింపబడిన విశ్వవిద్యాలయములను మించిన స్వాతంత్ర్యమును గలిగి యీ యగ్రహారము లనన్యదృష్టితో వైదికవిద్యను వ్యాపింపజేయుచుండినవి.

మహాసభలు:—అగ్రహారములవలెనే యందుండిన మహాసభలుగూడ విద్యావ్యాప్తి నొనర్చుచుండినవి. ఇయ్యవి యగ్రహారములందలి కార్యములను నెరవేర్చుటకై యేర్పరుపబడిన సంఘములు. అనేక సమయములలో రాజులును, శ్రీమంతులును ఈగ్రామములందలి విద్యాభివృద్ధికై మహాసభల పరముగ ననేకధర్మములను జేయుచుండిరి. తుంబళే మను గ్రామమున క్రీ. శ. ౧౨-వ శతాబ్దములో నిర్మింపబడిన యొకశాసనమున మలయవతీదేవి యను చాళుక్యరాజ్ఞి యాగ్రామమునం దధ్యాపకాధ్యేతల సౌకర్యార్థమై యొక భోజనసత్రమును నిర్మించుటకును, ఋగ్యజుస్సామాధ్యాపకులను, బౌరాణికు నొకనిని ఏర్పరచుటకును తుంబుళగ్రామ మహాసభాసభ్యులను నూటనలుబదిమంది కాయూరినుండి వచ్చు 'సిద్ధాయము'లో ముప్పది గద్యాణములను దానమొనర్చెనని చెప్పబడియున్నది. అటులే క్రీ. శ. ౯-వ శతాబ్దమున పల్లవరాజుల యాశ్రితు డొకడు బాహుగ్రామమునందలి చతుర్దశవిద్యల యభివృద్ధికొరకును మూడుగ్రామములును దానముచేసి వాని నా గ్రామ మహాసభవారికి స్వాధీనము గావించెను.

దేవాలయములు:—మధ్యయుగమునందలి విద్యాసంస్థలలో నెల్ల దేవాలయము లగ్రగణ్యములు. ఇయ్యవి గ్రామ జీవితమునకు కేంద్రస్థానములుగ నుండినవి. గ్రామస్థుల యాధ్యాత్మిక జీవితమునకేకాక వారి యైహిక ప్రవృత్తులకుగూడ ననేకవిధముల నాదర్శప్రోత్సాహముల నొసంగి దేవాయతనములు సర్వాభీష్టప్రదములై యొప్పినవి. రాజ్యమువలెనే దేవాలయముగూడ నొక క్లిష్టసంస్థగా నుండినది. సువిశాలములగు నీ యాలయములలో రాజ్యాంగమునందువలె ననేకనియోగములును, ననేకులగు నుద్యోగులును ఉండిరి. అట్టినియోగములలో విద్యాశాఖ ముఖ్యమైనది. ప్రభువులును, శ్రీమంతులును అనేక భూములను దానముజేసియు, ధనమును నిధులుగ నర్పించియు, ప్రత్యేక కార్యనిర్వాహకులకు వృత్తుల గల్పించియు, కుడ్యగోపురద్వార మంటపాదుల గట్టించియు, నారామతటాకాదుల ద్రవ్వించియు, ప్రత్యేకములగు నుత్సవాదులను జరపించి వాని కగు వ్యయములకై దానముల జేసియు, భోజనసంభారములను, పాత్రసామగ్రిని గల్పించియు, దేవతలకు ధనకనక వస్తువాహనాదికముల నర్పించియు ననేకవిధముల నా దేవాలయములను బోషించుచుండిరి. దేవాలయ కార్యనిర్వహణమునకై యొక సంఘ ముండెడిది.

ఈసంఘమే యాలయమున కొసంగబడిన భూములను పరిమాచుటకును, దేవతాకార్యముల నెల్ల నిర్వహింపుటకు నుద్యోగుల నేర్పరచి ప్రమత్తులగువారల శిక్షించుచు, సర్వకార్యములను నిర్వహించు చుండెను. ఇదిగాక భక్తులొసగు ద్రవ్యమును, దేవోపయోగార్థమొసంగబడు వస్తువాహనాదులను రక్షించుటకు నొక భండారము, నొక భండార సంఘము నుండెడిని. తరచుగ రాజోద్యోగులీయాలయకార్యములను బరీక్షించుచు లోటుపాటులను సవరించుచుండిరి. ఇట్టియుత్తమ పద్ధతులపై నిర్మింపబడిన దేవాలయము లుత్కృష్ట విద్యాపీఠములుగ నుండినవి. ఆంధ్రద్రవిడ దేశములందలి శాసనము లనేకము లిట్టి యాలయములలో నధ్యాపకులుగ నుండినవారికిని, విద్యార్థులకును వృత్తుల నేర్పరచుసనిగ నున్నవి. దక్షిణార్కాడు మండలములోని త్రిభువని యనుగ్రామ మీసందర్భమున ముఖ్యాంశము లను దెల్పుచున్నది. ౬౨ వేలీల భూమిపై సంవత్సరమున బండు ౧౨౦౦౦ కలముల ధాన్యములో ౨౫౦౦ కలములను మతసంబంధములగు కార్యములకై వినియోగించి మిగిలినవానిని విద్యాపోషణార్థ ముపయోగింపవలెనని యాశాసనము జెప్పుచున్నది. ఈవిధమున ఋగ్వేదమునకు ముగ్గురును, యజుర్వేదమునకు ముగ్గురును, సామవేదమున కిద్దరును, అపూర్వవాజసనేయ, బోధాయనీయ సత్యాషాఢ సూత్రముల జెప్పుట కొక్కొక్కరును, వేదాంత, వ్యాకరణ, రూపావతార, భారత, రామాయణ, మనువైఖానసధర్మశాస్త్రాదుల కొక్కొక్కరును ఉపాధ్యాయులు ప్రత్యేకవృత్తులను బడసిరి. అటులే ఋగ్యజుర్వేదముల బఠించు నూటయిరువదిమందికిని, సామవేదమును జదువు నిరువదిమందికిని, యేబదిమంది యితరశాస్త్రముల నభ్యసించువారలకును, వేదాంత వ్యాకరణరూపావతారములను నేర్చుకొను డెబ్బదిమందికిని విద్యార్థులకు భాగము లేర్పరుపబడినవి. ఇదేవిధమున ఎణ్ణాయిరమను మరియొక గ్రామమునందలి యాలయమున జజుర్వేదములను బఠించు రెండువందల యేబదిమందికిని, రూపావతార, వ్యాకరణ, ప్రాభాకర వేదాంతాధ్యయన పరులగు నూర్గురు విద్యార్థులకును వసతులు కల్పింపబడినవి. ఇచ్చటి యుపాధ్యాయులకు దినవెచ్చమిచ్చుటకేర్పాట్లు గావింపబడినవి. అదియునుగాక వ్యాకరణ, ప్రాభాకర, వేదరూపావతారాధ్యాపకులకు వారి వారి శాస్త్రములలో నధ్యాయమున కొకకలంజు బంగారమును, ఆయాశాస్త్రముల నభ్యసించు విద్యార్థులకు డెబ్బదిమందికిని ముప్పదియైదుకలంజుల బంగారము నొసంగుటకై శాసింపబడెను. తిరుముక్కూడల్ అను గ్రామమునందలి మరియొక యాలయమునందలి శాసనమునుండి యింకను గొన్నివిశేషాంశములు దెలియుచున్నవి. అచ్చట 'జననాథమంటపము'నందు వేదశాస్త్రాదులను బోధించుటకై యొక విద్యాలయమును, విద్యార్థులభోజనశాలయు, నొకవైద్యాలయము నుండెడివి. ఇచ్చటి విద్యార్థులకు రాత్రులు చదువుకొనుటకై దీపములకు చమురు నిచ్చుటకును, ప్రతిశనివారము నభ్యంగస్నాన మొనర్చుటకును వలయునేర్పాటులు చేయబడినవి. ఇట్టివివరములను దెల్పుశాసనము లనేకములు శ్రీశైలము, త్రిపురాంతకము, దాక్షారామము, మందరము, మున్నగున నేకస్థలముల గాంచనగుచున్నవి. వీనినుండి యాకాలమున వ్యాప్తిలోనుండిన శాస్త్రాదికములు దెలియుచున్నవి. ఒక్కొక్క శాస్త్రమున కొక్కొక్క యాచార్యుడుండి వారివేతనములకై ప్రత్యేకవసతు లేర్పరుపబడి, వివిధ విషయములవ్యాసంగములకై ప్రత్యేకస్థలములు నియమింపబడి, విద్యార్థులకుమజ్జనభోజనవైద్యాది సౌకర్యములు గల్పింపబడి, భగవత్సన్నిధానమున సౌశీల్యమును పెంపొందించుకొను గురుశిష్యబృందములతో నలరారుచుండిన ప్రాచీనహిందూదేవాలయములు మధ్యయుగమున హిందూ విద్యావైదుష్యముల కాలవాలములైయుండినవి. మహానాగరికులమనియు నిర్మాణకార్యదీక్షితుల మనియు విఱ్ఱవీగునాధునికులు నేటివరకును బరిష్కరింపజాలని వసతికళాశాలా (Residential Colleges) సమస్యను మనప్రాచీను లుత్తమగతుల బరిష్కరించియుండిరి.

భట్టవృత్తి:— దేవాలయాగ్రహారములవలెనే భట్టవృత్తి మధ్యయుగమునాటి మరియొక విద్యాసంస్థ. భట్టవృత్తియనగా బండితులకు ప్రభువులును, సామంతు

లును సర్వబాధాపరిహారముగా నొసంగు భూదానము. వేదవేదాంగపారగులగు పండితుల కొకప్పుడు గద్యాణములను నాణెములనుగూడ నొసంగుటగలదు. ఇందుకు ప్రతిఫలముగ వారు విద్యార్థులకు విద్యనేర్పవలసి యుండెడిది.

జైనబస్తీలు:—జైనబస్తీలు గూడ బ్రాహ్మణాగ్రహారములవలెనే విద్యావ్యాప్తికి గారణములైయుండెడివి. వీనియందు జైనధర్మప్రచార మెక్కుడుగ నుండెడిది. ఇట్టి జైన విద్యాపీఠములు బెజవాడ, ధర్మవరము, రామతీర్థము, హనుమకొండ, కొల్లిపాక, గంగాపురము మున్నగు నాంధ్రభాగములందును, దక్షిణమున మధుర, ఒరయూరు మున్నగుస్థలములందును నుండినవి. రాజులనేకు లీసంస్థలకు దానధర్మములను జేయుచుండిరి.

మఠములు:—దేవాలయములవలెనే మఠములు గూడ నీకాలమున విద్యావ్యాప్తికి మూలములై యుండినవి. వీని నిర్మాణమునకు మార్గదర్శులైనవారు శైవులు. కాశ్మీరమునుండి కొందరును, భాగీరథీనర్మదామధ్యస్థమగు దహాలమండలమునుండి మరికొందరును దక్షిణమునకేతెంచి దమయసమాన పాండితీప్రతిభచే కేరళచోళమాళవాంధ్రదేశాధీశులను మెప్పించి వారియాదరముచే ననేకమఠములను నిర్మించి హిందూవైదుష్యమును, శైవమతమును బ్రచారముజేసిరి. కాలాముఖశైవులు క్రీ. శ. ౯-వ శతాబ్దమునుండియు గర్ణాటాంధ్రదేశములలో విద్యావ్యాప్తి నొనర్చుచుండిరి. పిమ్మట పాశుపతులగు గోళగీమతాచార్యులుగూడ నీకార్యమును నిర్వహించిరి. ఈశైవులవిద్యాప్రచారమునకు మఠములు ముఖ్యస్థానములుగ నుండినవి. అనతికాలముననే ఆంధ్రదేశమున శ్రీశైలము, కాళేశ్వరము, భీమేశ్వరము, మున్నగుస్థలములు వాసికెక్కినవి. పాశుపతశైవాచార్యులప్రచారమువలన ద్వరలో దహాలమండలమందలి గోళగీమఠమునకు పుష్పగిరి, త్రిపురాంతకము, మందరము నను నాంధ్రభాగములందును, తిరుప్పఱం కున్రమ్, మధుర, శెయ్యూరు, దేవికాపురము మున్నగు దక్షిణదేశస్థలములందును శాఖలు బయల్వెడలినవి. గుంటూరుజిల్లాలోని మంగళగిరికి సమీపమునందున్న మల్కాపురగ్రామమునందలి యొకశాసనమును బరిశీలించినచో నీశైవమఠములొనర్చిన విద్యాసేవ స్పష్టమగుచున్నది. భాగతీయరాజ్ఞీమణులలో నగ్రగణ్యయు నాంధ్రదేశమునెల్ల రాజ్యమువలె నేలిన తేజస్వినియు నగు కాకతీయ రుద్రాంబ మందరమను గ్రామమును గోళగీమఠశైవాచారప్రవర్తకుడును రాజగురువు నగు విశ్వేశ్వరశివమహామునికి దానమొనర్చెను. ఆయాచార్యుడా గ్రామమునకు విశ్వేశ్వరగోళగి యనునామ మిడి యందలి భూములను కొన్ని బ్రాహ్మణకుటుంబములకును, దాను నూతనముగ నిర్మించిన విశ్వేశ్వరాలయమునకును, శుద్ధశైవమఠమునకును, విద్యార్థులకును, ప్రసూత్యారోగ్యశాలకును, విప్రసత్రమునకును బంచిపెట్టెను. ఆశైవమఠమునందలి విద్యార్థులకొరకై ఋగ్యజుస్సామవేదాధ్యాపకులు మువ్వురును, పదవాక్యప్రమాణ సాహిత్యాగమవైద్యగణితములను నేర్పుటకు నైదుగురుపాధ్యాయులు నుండుటకును, వారిలో నొక్కొకనికి రెండుపుట్లభూమి యొసంగబడుటకు నేర్పాటు గావింపబడెను. ఇదేవిధమున గన్నడదేశమున కేదారేశ్వరాలయమున 'కోడియ' మఠమను నొకవిద్యాసంస్థ బెలగామి యనుచోట బ్రసిద్ధికెక్కియుండెను. అట వేదవేదాంగములును కుమారపాణిని శాకటాయనవ్యాకరణములును, షడ్దర్శనములును, యోగశాస్త్రమును, పురాణేతిహాస, ధర్మశాస్త్ర సాహిత్యములును బోధింపబడుచుండెడివి.

ఇంతియకాక మతత్రయాచార్యులు దమ నిరంతరకృషిచే మతవ్యాప్తి నొనర్చియు నాకార్యము పారంపర్యముగ నడచుటకై భారతదేశమునం దనేకమఠములను నెలకొల్పిరి. వీనికి సన్న్యాసు లధ్యక్షులుగనుండి సంస్కృతవిజ్ఞానము దోడుగా స్వమతసిద్ధాంతములను వ్యాప్తి చేయుచుండిరి. శ్రీ శంకరాచార్యునిచే శ్రీ శారదాపీఠమును, ద్వారక పూరీ కాశీ హరిద్వారము బదరీనారాయణము మున్నగు స్థలముల మఠములు నిర్మింపబడినవి. అటులే శ్రీరామానుజుడుగూడ మేలుకోటలోను, మన్నార్ కోయిల్, అహోబలము మున్నగుస్థలముల మఠస్థాపన మొనర్చెను. ద్వైతవేదాంతప్రతిష్ఠాపకుడగు శ్రీ మధ్వాచార్యుడు గూడ ఉడిపిగ్రామమునం దేడుమఠములను స్థాపించి, ప్రాచీన హిందూవిజ్ఞానమును, ద్వైతసిద్ధాంతమును విస్తరింపజేయుటకై యుత్తరాదిమఠమును స్థాపించెను. ఈమఠములన్నియు నేటికిగూడ సుపాటవములై యుత్కృష్టవిద్యాసంస్థలుగ నొప్పుచున్నవి.

---

# నేటి రష్యా

నార్ల వెంకటేశ్వరరావు

( అనువృత్తము )

## కార్మికసంఘములు

జారు చక్రవర్తులపరిపాలనాకాలమున రష్యాలో కార్మికజనోద్యమము కడుతీవ్ర నిర్బంధవిధానమునకు లోనుగావింపబడుచుండెడిది. అందుచే నప్పుడు కార్మికసంఘములసంఖ్య అత్యల్పముగ నుండెడిది. ఉన్నకొలదిసంఘములైనను రహస్యముగ నుండెడివి. ౧౯౧౬-వ సంవత్సరములో బహిరంగముగను, చట్టసమ్మతముగను నున్న కార్మికసంఘములన్నిటిలోను కేవలము ౧,౫౦౦ మంది సభ్యులుమాత్రమే కలరన్నప్పుడు నిర్బంధవిధాన మెంతతీవ్రముగ నుండియుండెడిదో పాఠకమహాశయులే కడుసులభముగ నూహించుకొనవచ్చును.

ఈ నిర్బంధవిధానతీవ్రతవలననే ౧౯౧౭ - వ సంవత్సరము మార్చిమాసమున రష్యాదేశమున విప్లవము చెలరేగుటయు, జారుచక్రవర్తులపరిపాలన అంతరించుటయు, కెరన్‌స్కీప్రభృతులు రాజ్యాధికారము వహించుటయు సంభవించెను. ఈనూతనప్రభుత్వమేర్పడినంతనే కార్మికజనోద్యమము ప్రబలసాగెను. ప్రతిప్రదేశమందును కార్మికసంఘములు మొలకలెత్తనారంభించెను. ౧౯౧౭-వ సంవత్సరము జూన్ నెల నాటికే ౧౫ లక్షలమంది కార్మికసంఘ సభ్యులైరి! కెరన్‌స్కీప్రభృతులు దూరదృష్టిగలవారే యైనచో దినదిన ప్రవర్ధమానమగుచున్న కార్మికజనోద్యమ ప్రచండశక్తిని స్వీయప్రభుత్వమును సుస్థిరమొనర్చుకొనుటకు వినియోగించుకొనెడివారు. కాని రాజకీయవేత్తలకు ప్రథమావశ్యకమైన దూరదృష్టి లేనివారగుటచే, వారు రష్యాపునరుద్ధరణనిమిత్తము సాహసోపేతులై నూత్నవినూత్నపథములను ద్రొక్కుటకు బదులు, ప్రాతమార్గములనే అనుసరించిరి. దానితో కార్మికులు అసంతృప్తులు కాసాగిరి. ఈ యసంతృప్తి క్రమాభివృద్ధి నంది (౧౯౧౭-వ సంవత్సరము) అక్టోబరుమాసపుబోల్షివిక్ విప్లవముక్రింద పరిణమించెను.

బోల్షివిక్ విప్లవమునుగూర్చియు, దానిలో కార్మికులు పైకొనినభాగమునుగూర్చియు వ్రాయదలచినచో పెద్దగ్రంథ మగును. కనుక దానిని వదలివేయుచున్నాను. అది కొంతవరకు అసందర్భముకూడ నేమో!

పిమ్మట సహజముగనే కార్మికజనోద్యమము త్వరితగతిని ప్రబలసాగెను. ఈక్రింద పేర్కొనబడిన కార్మికసంఘసభ్యత్వపు అంకెలవలన దానిదినదినప్రవర్ధమానప్రాబల్యము విశదము కాగలదు.

| సం. | వేలసంఖ్యలో. |
|---|---|
| ౧౯౧౭ | ౧,౪౭౫ |
| ౧౯౧౮ | ౧,౯౪౬ |
| ౧౯౧౯ | ౩,౭౦౬ |
| ౧౯౨౦ | ౫,౨౨౨ |
| ౧౯౨౧ | ౮,౪౧౮ |

పైయంకెలు ౧౯౧౭-౨౧సంవత్సరముల మధ్యకాలమునకు సంబంధించినవి. ఆకాలమున కూలికి పనిచేయుప్రతివ్యక్తియు నేదోయొకకార్మికసంఘసభ్యుడుగ చేరవలసిననియమ ముండెడిది. అందువలన పైయంకెలవలన కార్మికజనోద్యమపుసత్యస్వరూపము గోచరముకాదు. ఇందులకుగాను నూతనఆర్థికనీతి ( New Economic Policy or shortly N. E. P.) ప్రవేశపెట్టబడినతర్వాత గల కార్మికసంఘసభ్యత్వపు అంకెలను పేర్కొనవలసియుండును. అవి క్రింద నుల్లేఖింపబడుచున్నవి:—

| సం. | వేలసంఖ్యలో. |
|---|---|
| ౧౯౨౨ | ౫,౮౪౭ |
| ౧౯౨౩ | ౪,౮౪౧ |

| | |
|---|---|
| ౧౯౨౪ | ౫,౮౨౩ |
| ౧౯౨౫ | ౬,౯౫౦ |
| ౧౯౨౬ | ౮,౭౬౮ |
| ౧౯౨౭ (ఏప్రిల్ ౧-వ తేదీ) | ౯,౮౨౮ |
| ,, (జులై ౧-వ తేదీ) | ౧౦,౨౫౦ |

ప్రస్తుతము కార్మికసంఘసభ్యులసంఖ్య ౧౫ కోట్లకు మించినదనియే చెప్పవచ్చును!

ఇట్లు కార్మికజనోద్యమము ప్రబలమగుటకు సోవియటుప్రభుత్వము దాని కొసగుచున్న ప్రోత్సాహమే చాలవరకు కారణము. దీనికి నిదర్శనముగ కార్మికులకు చేయబడిన కొన్ని ప్రత్యేకసౌకర్యములను క్రింద పేర్కొనుచున్నాను:—

౧. వైద్యాలయములలో కార్మికసంఘసభ్యులకు ఉచితముగ నౌషధము లొసగబడును. దీనినిబట్టి తదితరులకు ఉచితవైద్యసహాయములేదని భావించుట పొరపాటు. తక్కినవారికికూడ ఉచితవైద్యసహాయము కలదు. కాని కార్మికసంఘసభ్యులకు తదితరులకంటె ప్రథమమున ఔషధము లొసగబడును. వైద్యాలయమునందుండి చికిత్స గావించుకొనురోగుల (In-patients) లో ప్రథమమున కార్మికసంఘసభ్యులకే వసతి కల్పింపబడును. వీరికి ఎక్సురేపరిక్షకూడ ఉచితముగ చేయబడును.

౨. పబ్లికుస్నానాగారములు (bath houses), బల్లకట్లు, నాటకశాలలు, సినిమాలు, విచిత్రవస్తు ప్రదర్శనశాలలు మున్నగువానియందెల్ల కార్మికసంఘసభ్యుల వద్ద తక్కువరేటు వసూలుచేయబడును. రేడియో లైసెన్సులు, వినోదయాత్రల (excursions) కరుగునప్పుడు రైలుటికెట్లు మొదలగునవికూడ వీరికి తక్కువ చార్జీలకే యివ్వబడును. ఇట్లే తదితరసౌకర్యములుకూడ పెక్కులు కలవు.

౩. సత్రములలోను, ఆరోగ్యాశ్రమములందును కార్మికసంఘసభ్యులకు కడుసులభముగ వసతి లభించును.

౪. సమ్మె జరిగినపుడు సమ్మెనిధినుండి కార్మికసంఘసభ్యునికి ప్రథమమున సహాయ మొనర్పబడును.

౫. అతనిమాసపువేతన మెంతయుండునో అంత మొత్తము ప్రతికార్మికసంఘసభ్యునికిని సహకారసంఘములచే వలసినచో ప్రతిమూడుమాసముల కొకసారి అప్పుక్రింద నొసగబడును.

౬. కార్మికసంఘసభ్యుని బిడ్డలకు విద్యాభ్యాససౌకర్యము లధికముగ చేయబడును.

౭. కార్మికసంఘసభ్యులకు ప్రత్యేకము క్లబ్బులు స్థాపింపబడినవి. వీనిలో నతిచక్కని గ్రంథాలయములు, రేడియోలు, సినిమాప్రదర్శనములు మొదలైనవి యేర్పరుపబడినవి.

౮. అన్యులకంటె కార్మికసంఘసభ్యునికి నిరుద్యోగసమస్య నెదుర్కొనవలసిన ఆవశ్యకత చాలతక్కువ. కార్మికసంఘసభ్యులు కొదువయైనప్పుడే అన్యులకు పని యొసగబడును.

ఇట్లే పెక్కుసౌకర్యములు కార్మికసంఘసభ్యులకు గావింపబడినవి. విషయవిస్తరభీతిచే వాని నన్నిటిని పేర్కొన విరమించితిని.

ఇక కార్మికసంఘములనిర్మాణమునుగూర్చి కొంత పేర్కొనవలసియున్నది. యంత్రాలయము లేక ఫాక్టరీ కార్మికసంఘములప్రాతిపదిక యనిచెప్పవచ్చును. ప్రతి ఫాక్టరీలోను కార్మికసంఘ మొకటి స్థాపింపబడును. అది క్రింధివిధులను నిర్వర్తించుచుండును:—

౧. సంస్థలోని కార్మికుల క్షేమము నరయుచుండుట.

౨. కార్మికుల ఆర్థిక, సాంఘికస్థితులను బాగుపరచుటకు సర్వవిధముల కృషిసల్పుట.

౩. ఫాక్టరీయజమాని (లేక ట్రస్టు) తోనే కాక ప్రభుత్వముతోను, తదితరసంస్థలతోగూడ కార్మికులకు సంబంధించిన వ్యవహారములను పరిష్కరింపవలసివచ్చినప్పుడు వారితరఫున ప్రాతినిధ్యము వహించుట.

౪. సంఘములో సభ్యులను జేర్చుకొనుట, చందాలను వసూలుచేయుట వగైరా.

ఈసంఘువ్యవహారముల నన్నిటిని చూచుట కొక కమిటీయుండును. కమిటీసభ్యుల సంఖ్య ఫాక్టరీలోగల కార్మికులసంఖ్య ననుసరించియుండును. కార్మికులసంఖ్యకును కమిటీసభ్యులసంఖ్యకును గలసంబంధము క్రిందివిధముగ నుండును:—

| ఫాక్టరీలోని కార్మికులు | కమిటీసభ్యులు. |
| --- | --- |
| ౨౦ మొదలు ౧౦౦ వరకు | ౩ |
| ౧౦౦ ,, ౩౦౦ ,, | ౫ |
| ౩౦౦ ,, ౧,౦౦౦ ,, | ౯ |
| ౧,౦౦౦ ,, ౫,౦౦౦ ,, | ౧౩ |
| ౫,౦౦౦ పైన | ౧౫-౨౦ |

ఫాక్టరీలో కార్మికు లెంతమందియున్నను కమిటీసభ్యులసంఖ్య ౨౦ కంటె మించరాదు.

కమిటీసభ్యులలో కొంతమంది కేవలము కార్మికసంఘువ్యవహారములనే జూచుచుందురు గాని ఫాక్టరీలో పనినిచేయరు. ఇట్టివారికికూడ వేతనము యథాప్రకారము చెల్లింపబడుచుండును. ఇట్లు తమకాలము నంతయు సంఘువ్యవహారములకు వినియోగించు కమిటీసభ్యులసంఖ్య ఫాక్టరీలోని కార్మికులసంఖ్య ననుసరించియుండును. వానిరెంటికిని గల సంబంధము క్రింద ఉదాహరింపబడినది:—

| ఫాక్టరీలోనికార్మికులు, | | | | కేవలము సంఘువ్యవహారములనే జూచు కమిటీసభ్యులు. |
| --- | --- | --- | --- | --- |
| ౨౫ | మొదలు | ౫౦ | వరకు | ౧* |
| ౫౦ | ,, | ౩౦౦ | ,, | ౧ |
| ౩౦౦ | ,, | ౧,౦౦౦ | ,, | ౨ |
| ౧,౦౦౦ | ,, | ౫,౦౦౦ | ,, | ౩ |
| ౫,౦౦౦ | పైన | | | ౫ |

కమిటీసభ్యులు సాలీనా యెన్నుకొనబడుచుందురు. వారు ఆరుమాసముల కొకసారి నివేదికలను ప్రకటించుచుందురు. నివేదికలు అసంతృప్తికరముగనున్న యెడల క్రొత్తయెన్నికలు జరుపబడుచుండును.

ఈ కమిటీతోపాటు కార్మికులరక్షణ, విద్యావ్యాప్తి, కూలినిగూర్చిన తగాయిదాలపరిష్కరణము, ఉత్పత్తి అనునాలుగువిషయములనుగూర్చి శ్రద్ధ వహించుటకు నాలుగుసబ్‌కమిటీలు సాధారణముగ నియమింపబడుచుండును. ఇట్టి సబ్‌కమిటీసభ్యులసంఖ్య ఆయా కార్మికసంఘము చేయునిబంధనల ననుసరించియుండును. సబ్‌కమిటీలు ఫాక్టరీలో పని ముగిసినపిదప సమావేశమగుచుండును. సబ్‌కమిటీలలోనిసభ్యులు తమ కిష్టమైనవిషయమునుగూర్చి శ్రద్ధవహించుచు, తాము నిర్వహించినకార్యకలాపములనుగూర్చి అప్పుడప్పుడు నివేదికలను ప్రకటించుచుందురు.

ఈ నాలుగుసబ్‌కమిటీల కార్యక్రమములు క్రింద క్లుప్తముగ సూచింపబడినవి:—

కార్మికులరక్షణ సబ్‌కమిటీ లేబరుచట్టములను అమలునందుంచుట, ప్రమాదములు జరుగనీయకుండుట, కార్మికుల ఆరోగ్యమును కాపాడుట మున్నగు విషయములందు శ్రద్ధవహించును. అది కార్మికులగృహములను గూర్చియు, శిశుసంరక్షణాలయములనుగూర్చియు ప్రమాదకరములగు యంత్రముల చుట్టును కటకటాలు వగైరా కట్టించుటనుగూర్చియు బాధ్యతగైకొనును.

విద్యావ్యాప్తిసబ్‌కమిటీ కార్మికాభివృద్ధికి సర్వవిధముల కృషిసల్పుచుండును. అన్ని సబ్‌కమిటీలలో నిదియే ముఖ్యమైనదనుట అతిశయోక్తి కానేరదు. అది కార్మికులనిమిత్తము తప్పక క్లబ్బు నొకదానిని స్థాపించుచుండును. ఆక్లబ్బులో ఆటలకు, పాటలకు, విద్యకు, వినోదమునకు అవకాశ ముండును. ప్రతిక్లబ్బులోను ఉపన్యాసములకు, భోజనమునకు, ఆటలకు, విశ్రాంతికి, వ్యాయామమునకు, బాలబాలికలకు, గ్రంథాలయమునకు, పత్రికాపఠనమునకు,

* వారమునకు రెండురోజులుమాత్రమే.

రేడియోసంగీతము వినుటకు ప్రత్యేకప్రత్యేకముగ గదులుండును. కొన్నిటియందు వైద్యసంబంధ మగు సలహా నొసగునిమిత్తము డాక్టరుగారికిని, దాదికిని ప్రత్యేకముగ నొకగది యేర్పాటుగావింపబడును. మరి కొన్నిటియందు సినిమా నాటక ప్రదర్శనములకు వేరుగ నొకశాల యుండును. ప్రతిదానిలోను రష్యాదేశమున కధిదేవతయగు లెనినుమహాశయుని జ్ఞాపకార్థము "లెనినుకార్నర్" (Lenin corner) అను ప్రత్యేక భాగమొకటికూడ నుండును. ఎప్పుడుచూచినను క్లబ్బు లన్నియు కార్మికజనసంకీర్ణములయి కళకళలాడు చుండును!

విద్యావ్యాప్తిసబ్‌కమిటీల కార్యక్రమమువలన దేశమున కత్యంతమగులాభము చేకూరెను. అదివరకు కార్మికులు నిరక్షరకుక్షులుగ నుండెడివారు. కాని పై కమిటీల కృషివలన నేడు నిరక్షరకుక్షిత్వము దాదాపు నశించినదనియే చెప్పవచ్చును. దీనికి నిదర్శనముగ క్రిందియంకెలను గమనింపుడు:—

| విద్య లేనికార్మికులు (ఏయేవృత్తిలో) | ౧౯౨౧ నూటికి వంతులు | ౧౯౨౬ నూటికి వంతులు |
|---|---|---|
| గనులుత్రవ్వుట | ౫౦ | ౪ |
| వ్యవసాయము | ౮౦ | ౧౮.౪ |
| కలప | ౫౦ | ౬.౫ |
| లోహములు | — | ౨ |
| రసాయనము | — | ౬ |
| తాప్పీ | — | ౫ |

ఇట్లు రష్యాకార్మికుల నిరక్షరకుక్షిత్వము దాదాపు రూపుమాయుచున్నది. ఈ సరి కది పరిపూర్ణముగ సమసిపోయియుండెడిది. కాని కొందరు కార్మికులు సాగుబడికాలమున గ్రామముల కేగుచు, తదితరసమయములందు పట్టణములలో పనిచేయుచుండుటవలన వారికి విద్యగరపుట కష్టసాధ్యమగుచున్నది.

కూలినిగూర్చిన తగాయిదాలసబ్‌కమిటీ కూలిని నిర్ణయించుట, తగాయిదాలను పరిష్కరించుట, కార్మిక చట్టమును అమలునందుంచుట, కార్మికసంఘము తరపున కంట్రాక్టులు పుచ్చుకొనుట, ఫాక్టరీనియమావళిని సిద్ధముచేయుట మున్నగు విషయములనుగూర్చి జాగ్రత్త వహించుచుండును. కమిటీసభ్యులందరును ఏకగ్రీవముగ నామోదించిననేగాని వారితీర్మానములకు విలువ యుండదు.

ఉత్పత్తిసబ్‌కమిటీయొక్క ఆదర్శములు యంత్రములను సున్నితమొనర్చుట, సారుపోకుండ జూచుట, ఉత్పత్తిని వృద్ధిగావించుట, కార్మికులయందు నూతన విషయములను కనిపెట్టుటకు వలయుమేధాశక్తిని పెంపొందించుటకు యత్నించుట మున్నగునవి.

ఈ నాలుగు సబ్‌కమిటీలతోపాటు అప్పుడప్పుడు గృహముల సబ్‌కమిటీ, విద్యార్థులసబ్‌కమిటీ, వినోదయాత్రలసబ్‌కమిటీ, నాటకములసబ్‌కమిటీ, అనాథరక్షణ సబ్‌కమిటీ, అంతర్జాతీయకార్మికసహాయకసబ్‌కమిటీ మొదలగునవి నియమింపబడుచుండును. ఇవి తాత్కాలికముగనే పనిచేయుచుండును.

ఇంతవఱకు రష్యాకార్మికజనోద్యమమునకు ప్రాతిపదికమైన ఫాక్టరీకమిటీలవిషయమే చర్చింపబడినది. ఇక తదితరకార్మికసంస్థలవిషయమైకూడ కొంత ముచ్చటింపవలసియున్నది.

ఫాక్టరీకమిటీల పైగల కార్మికసంస్థల నన్నిటిని రెండుతరగతులక్రింద విభజింపవచ్చును. అందు మొదటిది జిల్లారాష్ట్రములవారీగా నేర్పరుపబడినది. రెండవది పరిశ్రమలస్వభావమునుబట్టి యేర్పరుపబడునది. అనగా నొకజిల్లాలోగల ఫాక్టరీకమిటీలకన్నిటికిని కలిసి జిల్లాసంఘమొకటి యుండును. ఇట్టి వివిధములగు జిల్లాసంఘములకన్నిటికిని కలసి యొక రాష్ట్రీయసంఘముండును. ఇట్లే యొకజిల్లాలోగల (ఉదాహరణముగ) వస్త్రపరిశ్రమాలయములకన్నిటికిని కలసి యొకజిల్లా వస్త్రపరిశ్రమాలయములసంఘ ముండును. ఇట్టివివిధములగు జిల్లావస్త్రపరిశ్రమాలయములసంఘముల కన్నిటికిని కలసి యొకరాష్ట్రీయ వస్త్రపరిశ్రమలసంఘముండును. దీనినిబట్టి చర్మ పరిశ్రమ, లోహపరిశ్రమ, రసాయన

వస్తుపరిశ్రమ మున్నగువాని కన్నిటికిని వేర్వేరుగ జిల్లా, రాష్ట్రీయసంఘము లుండుననుట ఊహ్యము. మొదటితరగతి రాష్ట్రీయసంఘములన్నిటిపైనను కార్మిక సంఘముల కాంగ్రెసు (All Soviet union Congress of Trade unions) ఉండును. రెండవతరగతి రాష్ట్రీయ (ఉదాహరణముగ) వస్త్రపరిశ్రమాలయ ముల సంఘము లన్నిటిపైనను వస్త్రపరిశ్రమ కార్మికులకాంగ్రెసు (All Soviet union of Congress of Textile Workers) ఉండును.

ఇప్పటికే కార్మికజనోద్యమమునుగూర్చి కడు దీర్ఘముగ వ్రాసియుంటిని. అందుచే పైనపేర్కొనబడిన వివిధసంస్థలకు ప్రతినిధుల నెన్నుకొనుట, వారి కర్తవ్యము మున్నగువిషయములనుగూర్చి చర్చించుటకు వీలుపడుట లేదు.

ఇక సోవియటురష్యాలో కార్మికుల క్షేమము కొరకుచేయబడిన కొన్ని నిబంధనలనుమాత్రము పేర్కొన వలసియున్నది. అవేవన:

౧. కార్మికులు ప్రాణాపాయము లేకుండ పని చేయుటకు వీలుగలదని లేబరుఇన్స్పెక్టరు అభిప్రాయ పడిననేగాని యేయంత్రాలయమును పనిని ప్రారంభింప రాదు.

౨. ౫½ మాసములు పనిజేసినతర్వాత ప్రతి కార్మికునికిని రెండువారములు సెలవు నివ్వవలెను. అపాయకరమగు సంస్థలలో పనిచేయువారికి సంవత్సర మునకు రెండుమాసములు సెలవు నివ్వవలెను.

౩. ౧౯33-వ సంవత్సరములో ప్రవేశపెట్ట బడిన నిబంధనప్రకారము కార్మికులచే యంత్రాలయ ములలో దినమునకు ౭ గంటలుమాత్రమే పనిచేయింప వలెను. గనులలో దినమునకు ౬ గంటలుమాత్రమే పని చేయింపవలెను.

౪. జనవరి ౧, జనవరి ౨౨, మార్చి ౧౨, మార్చి ౧౮, మే ౧, నవంబరు ౭ తేదీలు సెలవుదిన ములక్రింద పరిగణింపబడవలెను. ఇవిగాక ప్రతిఫాక్టరీ కమిటీస్థానికపరిస్థితుల ననుసరణముగ సంవత్సరమునకు ౧౦ దినములకు మించకుండునట్లు సెలవునేర్పరుప వచ్చును.

౫. స్త్రీలకు, పురుషులకిచ్చుపాలినే యివ్వ వలెను. స్త్రీలు అధికసంఖ్యాకులుగ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుటకుగాను వారికి ప్రత్యేక సౌకర్యములను చేయవలెను.

౬. స్త్రీలచే గనులలో పనిచేయింపరాదు. వారికి బరువుపనినిగాని, అనారోగ్యకరమగు పనినిగాని యివ్వరాదు. ప్రత్యేకపరిస్థితులలో తప్ప స్త్రీలచే రాత్రిపూట పనిచేయించరాదు. గర్భవతులుగా నున్న వారిచేతగాని, బాలింతలుగానున్నవారిచేత గాని యేప రిస్థితులందు రాత్రిపూట పనిచేయించరాదు.

౭. స్త్రీ కార్మికురాండ్రకు నీళ్లాడుటకు ముందు రెండుమాసములును, నీళ్లాడినతర్వాత రెండుమాసములును పూర్తివేతనముమీద సెలవు నివ్వవలెను.

౮. సెలవుమీదనుండగా చెల్లింపబడుపూర్తివేత నముతోబాటు, శిశువు జనింపగనే మరికొంతమొత్తమును చెల్లింపవలెను. ఇది ఆయా స్త్రీకార్మికురాలి మాసపు వేతనములో సగమై యుండవలెను.

౯. సెలవుదినములు పూర్తికాగానే తిరిగి పనిలో ప్రవేశించుకార్మికురాండ్రశిశువులను పనికాల ములో లాలనచేయుటకు ప్రతిపరిశ్రమాలయమును శిశు సంరక్షణాలయముల నేర్పాటుచేయవలెను. వాటికగు ఖర్చులనన్నిటిని పరిశ్రమాలయమే భరింపవలెను. శిశు వులకు పాలిచ్చునిమిత్తము కార్మికురాండ్రకు ఉదయము అరగంటయు, సాయంత్రము అరగంటయు అవకాశ మివ్వవలెను.

౧౦. కార్మికురాండ్ర శిశువులకు ౯ నెలల ప్రాయము వచ్చువరకు వారిమాసపువేతనములో నెని మిదవవంతును శిశుసంరక్షణార్థము అదనముగ నిచ్చు చుండవలెను.

౧౧. ౧౬ సంవత్సరముల ప్రాయమునకు లోబ డినబాలబాలికలచే ఫాక్టరీలలో పనిచేయించరాదు. ప్రత్యేకముగ దరఖాస్తు పెట్టుకొనబడినప్పుడు లేబరు

ఇన్‌స్పెక్టర్లు ౧౪ సంవత్సరముల పైన, ౧౬ సంవత్సరములలోపు ప్రాయముగలఅనాథలకుగాని, అవిటివారైన బంధువులనుపోషింపవలసిన బాలబాలికలకుగాని, వర్ణనాతీతమగు కష్టదశయందున్న వారికిగాని పైనియమము నుల్లంఘించి ఫాక్టరీలలో పనిచేయుటకు అనుజ్ఞ నివ్వవచ్చును. ఇట్టివారిచే రోజుకు నాలుగు గంటలకు మించి పనిచేయింపరాదు.

౧౨. ౧౬ సంవత్సరములపైన, ౧౮ సంవత్సరములలోపువయస్సుగల యువతీయువకులు రోజుకు ౮ గంటలు పనిచేయవచ్చును. ఇట్టివారికి పెద్దవారికిచ్చు కూలినే యివ్వవలెను.

౧౩. ఈడు లేనివారికి బరువైనపనుల నివ్వరాదు. విసుగుపెట్టు పనుల నిచ్చి వారి ఉత్సాహమును చంపరాదు. వారిచే రాత్రిపూటగాని, నిర్ణీతకాలమునుమించిగాని పనిచేయింపరాదు. వారికి సంవత్సరమున కొకసారి వైద్యపరీక్ష చేయించుచుండవలెను. చట్టములో కూడ వని పేర్కొనబడిన ౧౩౯ పారిశ్రామికశాఖలయందు వారిని నియోగింపరాదు. పెద్దవారి కిచ్చు సెలవుకన్న వారికి సంవత్సరమునకు రెండువారములు అధికముగ నివ్వవలెను.

౧౪. కార్మికు లెవరైనను జబ్బుపడినప్పుడు వారికి రెండుమూడుమాసములు పూర్తివేతనముమీద సెలవు నివ్వవలెను. ఏకార్మికుడైనను జబ్బుపడుట వలన పనిలోనికి రాలేకపోయినప్పుడు అతని స్థానమును రెండుమాసములవరకు ఖాళీగా నుంచవలెను.

౧౫. ప్రత్యేకపరిస్థితులనుబట్టి అవసరమైనచో పరిశ్రమాగారములు స్వంతఖర్చులమీద కార్మికులకు వలసినవసనములు, పాదరక్షలు మొదలగువానిని సప్లయి చేయవలెను.

౧౬. ప్రతి పరిశ్రమాలయమును కార్మికుల సౌకర్యార్థము కార్మికులకు వైద్యసహాయము నిమిత్తమును, వారి జీవితములను భీమా చేయవలెను. ఈ భీమామొత్తము ప్రభుత్వముచే నిర్ణయింపబడును. పరిశ్రమాగారము కార్మికుల కందరికిని కలిపి యిచ్చువేతనములో సుమారు నూటికి ౧౪ వంతుల సొమ్ము భీమానిమిత్తము వినియోగింపబడవలెను. కార్మికులవేతనములోనుండి రాగిదమ్మిడినైనను ఇన్సూరెన్సుప్రీమియముక్రింద బిగబట్టుకొనరాదు. ఏకార్మికునిజీవితమైనను నిర్ణయింపబడనిరీతిని భీమా గావింపబడనిచో నతడు వ్యాజ్యము వేసి తనభీమామొత్తమును రాబట్టుకొనవచ్చును. ఈ ఇన్సూరెన్సు సాధారణముగ క్రిందిరూపములలో నుండును.

(అ) వైద్యసహాయము.

(ఆ) జబ్బువలనగాని, గాయపడుటవలనగాని, గర్భధారణవలనగాని, జబ్బుపడిన ఆప్తబంధువులకు పరిచర్య గావింపవలసి వచ్చుటవలనగాని తాత్కాలికముగ పనిలోనికి వెళ్లలేకపోయినప్పుడు సహాయము.

(ఇ) శిశుపోషణనిమిత్తమును, ఔషధములను ఖరీదు చేయునిమిత్తమును, భీమా పట్టాదారుడు గాని, అతని కుటుంబములోనివారు గాని మరణించినప్పుడు సమాధిచేయునిమిత్తమును సహాయము.

(ఈ) నిరుద్యోగముగ నున్నప్పుడు సహాయము.

(ఉ) అవిటివారైనప్పుడు సహాయము.

(ఊ) పట్టాదారునికి మరణము సంభవించినప్పుడు వారికుటుంబములకు సహాయము.

పైన పేర్కొనబడినభీమాలనన్నిటిని కార్మికులను నియమించుసంస్థలు చట్టముప్రకారము గావింపవలెను. ఇవిగాక ఇన్సూరెన్సుకంపెనీలచే కార్మికునకు కొన్ని ప్రత్యేకసౌకర్యములు గావింపబడును. కార్మికుడెవడైనను జబ్బుపడినయెడల అతనిని ఇన్సూరెన్సుకంపెనీ తనచే నడుపబడు ఆరోగ్యాశ్రమమునందు చేర్చుకొనును. ఇందులకుగాను ప్రభుత్వము పూర్వపురాజవంశీకులసౌధముల నన్నిటిని ఇన్సూరెన్సుకంపెనీల అధీనములో నుంచినది. స్వస్థతనుబడయుటకేగాక, విశ్రాంతిగైకొనుటకుకూడ ఇన్సూరెన్సుకంపెనీలు తగు సదుపాయము లొనర్చుచుండును.

ఇట్టికార్మికులకు పెక్కుసౌకర్యములు గావింపబడుచున్నవి. స్థలాభావముచే వాని నన్నిటిని పేర్కొనుటకు వీలులేదు. కాని యింతదనుక వ్రాసినదానిని బట్టియే రష్యాకార్మికజనోద్యమము ప్రపంచచరిత్రలో నిరుపమానమైనదని పాఠకమహాశయులకు స్పష్టపడినదనియే నమ్ముచున్నాను.

# రౌండు టేబిల్ సభల సంస్కరణవిధానము

[గవర్నరు జనరలు అసాధారణ అధికారములు]

చా. వెం. హనుమంతరావు

ప్రధానమంత్రియగు రామ్సేమాక్డొనాల్డుగారు ౧౯౩౧ జనవరి ౧౯ తేదీని మొదటిరౌండు టేబిల్ సభను ముగించుచు నిచ్చినఉపన్యాసమునందు హిందూదేశసంస్కరణములనుగురించి ఈక్రిందిప్రకటన చేసియుండిరి:—

"బ్రిటిష్‌ప్రభుత్వమువారి ఉద్దేశ్యములో హిందూదేశప్రభుత్వమునకు బాధ్యత ఇకముందు కేంద్ర, రాష్ట్రీయ శాసనసభలపైననే యుండవలెను. కాని పూర్తిగా అట్టి బాధ్యత ఏర్పాటుకాబడకముందుండ వలసినమార్పుదల కాలములో కొన్ని అవసరమైనప్రత్యేకాధికారములు, అల్పసంఖ్యాకుల హక్కులను స్వేచ్ఛను కాపాడుటకు కావలసిన విధానము మాత్రము ఏర్పాటు చేయబడును."

"మార్పుదలకాలమున కనుకూలముగ నుండునట్టి ఏర్పాటులుచేయుటలో, బ్రిటిష్ ప్రభుత్వముయొక్క ప్రధానోద్దేశ్యము ప్రత్యేకాధికారములు హిందూదేశము క్రొత్తసంస్కరణములద్వారా పూర్తియగు బాధ్యతాయుత ప్రభుత్వము నేర్పాటుచేసుకొనుటకు తనుపరిస్థితులేర్పడునట్లు చేయుటయైయున్నది."

పైన ఉదాహరింపబడిన విషయములు బ్రిటిష్ ప్రభుత్వముయొక్క అభిప్రాయమును పూర్తిగ వ్యక్తీకరించుచున్నవని తలంచుటలో తప్పేమియు లేదు. వాటిని తారుమారుచేయు ఇతర ప్రకటనలేవియు ఇంతవరకు ఎవరిచేతను చేయబడలేదుసరికదా, ఆ అభిప్రాయములనే బలపరచుచు అనేక ఇతరప్రకటనలు కూడ చేయబడినవి. కాని మూడవ రౌండుటేబిల్ సమావేశమునందు నిర్ణయింపబడిన సంస్కరణ సూత్రములను బట్టి విచారించిన మాక్డొనాల్డుగారి ప్రకటనయందు పేర్కొనబడిన బాధ్యతాయుత స్వపరిపాలనసూత్రము వాటివలన పూర్తిగ కాకపోయిన కొంతవరకైనను ఏర్పాటు కాబడునని తలంచుటకు వీలు లేకుండనున్నది.

పైవిషయమును ధ్రువపర్చుటకు అనేక దృష్టాంతములు కలవు కాని ఈ వ్యాసమునందు వాటియందొకవిషయముమాత్రమే చర్చించి ఎట్లు బాధ్యతాయుత స్వపరిపాలనవిధానమునకు దానివలన తీరని లోపము వాటిల్లునో తెలిసికొనవచ్చును. ఆవిషయము సంస్కరణవిధానముప్రకారము గవర్నరుజనరలు, గవర్నరులకీయ దలంపబడుచున్న అసాధారణాధికారములకు సంబంధించినదై యున్నది. మార్పుదలకాలములో గవర్నరుజనరలుకు ప్రత్యేకింపబడిన శాఖలవిషయములలో అట్టి అధికారములు ఆతనికుండుట అవసరమనియే మన మొప్పుకొనవచ్చును, కాని ప్రజాయత్తశాఖల పరిపాలనకు సంబంధించిన విషయములలోకూడ వాటిని గవర్నరుజనరలున కిచ్చుట కెవ్వరును సమ్మతింపరు. చివర సూచింపబడిన విషయములలోకూడ శాసనసభవారికి చాలతక్కువ అవకాశములు రౌండుటేబిల్ సమావేశ ప్రణాళికప్రకార మీయబడునని ఈక్రింద వివరింపబడుసంగతులనుబట్టి తెలిసికోవచ్చును. బాధ్యతాయుత స్వపరిపాలనాసూత్రముప్రకారముశాసనసభకుండవలసిన అధికారములలో ఈ క్రిందివిధముగ లోపములు ఆప్రణాళికప్రకార మీయబడును:—౧. శాసనసభను పిలుచుటకును, ఆపుచేయుటకును, రద్దుచేయుటకును; ౨. శాసనసభవారిచే చేయబడినచట్టములకు సమ్మతించుట, సమ్మతించకపోవుట, లేక చక్రవర్తిసమ్మతినివాటిని ప్రత్యేకించుటకును; ౩. కొన్నివిధములగు చట్టములను శాసనసభలో ప్రవేశపెట్టుటకుముందు వాటికి సమ్మతించుటకును; ౪. అవసరమగు సమయములలో శాసన

సభలోని రెండుభాగములను కలపి ఒకే సమావేశము చేయుటకును; ౫. ఒకవిషయమై శాసనసభవారు వ్యతిరేకాభిప్రాయము నొసంగినప్పటికిని, ఆ విషయమై అతనియొక్క ఇష్టప్రకారము చర్య తీసుకొనుటకును; ౬. శాసనసభ ఏదేనివిషయమై జరుపుచున్న చర్చను ఆపుచేయుటకును, ౭. శాసనసభకార్యక్రమములో తనస్వంత బాధ్యతలను నిర్వహించు నిమిత్తము అవసరమైన నిబంధనలు మొదలగునవి చేయుటకును, గవర్నరుజనరలుకు అధికారము కల్గియుండవలెను.

పైనసూచించిన పట్టికలోని విషయములను క్షణమాత్రము గమనించిన రాబోవుసంస్కరణములలో శాసనసభవారికి ఎంత తక్కువ అధికారము లుండునో గ్రహింపనగును. ఆయధికారములను సంకుచిత పరచు విషయములలో ముఖ్యమైనవి పైవాటిలో ౩, ౫, ౬, ౭, నెంబర్లుగల అధికారములలో ఇమిడియున్నవి. ఈనాల్గుఅధికారములును, మనహిందూదేశమును బాధ్యతాయుత ప్రభుత్వసూత్రముపై నాధారపడియుండి వలసరాజ్యవిధానమునుండి చాలదూరము తొలగించుటలో చాలసహాయపడునని వేరుగ చెప్ప నక్కరలేదు. ఒక విషయమునుగూర్చి శాసనసభవారికి సంపూర్ణబాధ్యత నిచ్చివేసినతరువాత దానినిగురించి ఎట్టిఏర్పాట్లు చేయవలెనో నిర్ణయించుటకు శాసనసభవారికే యధికారముండవలెనుకాని గవర్నరు జనరలున కుండుట స్వపరిపాలన విధానమునకు సంపూర్ణముగ వ్యతిరేకము. ఆవిధముగనే కొన్నికొన్ని చిత్తుచట్టములకు గవర్నరు జనరలుముందు అనుమతి నీయవలెనని ఏర్పాటుచేయుట కూడ ఆవిధానమునుండి మనదేశమును దూరముగ తొలగించుటయే. ౭-వ నెంబరు అధికారము సంస్కరణవిధానములో ఏర్పాటుచేయబడిన,అది మన దేశమునందే మొట్టమొదట ప్రవేశపెట్టబడినట్లగును. ఏ స్వాతంత్ర్యదేశమునందైనను శాసనసభా కార్యక్రమమునకు సంబంధించిన నిబంధన లన్నియు శాసనసభవారే చేసికొనుట కధికారము కల్గియుందురేకాని ఇతరులు ఆవిషయములో జోక్యము కల్గించుకొనుట యుండదు.

గవర్నరు జనరలు ప్రత్యేకాధికారములు పైన ఉదాహరించినవాటితో అంతమొందలేదు. శాసనసభ విషయములోనున్న అధికారములుకాక గవర్నరు జనరలు కొన్నిప్రత్యేక సమయములందు, అవసరమైనచో శాసనసభవారితో ఏమియు జోక్యము లేకుండగనే, వారితో ఆలోచింపవలసిన అవసరము లేకుండగనే, తనస్వంత బాధ్యతపై చట్టములను జేయుట కధికారము కల్గియుండున ట్లేర్పాటు చేయబడినది. ఇది అన్నిటికంటెను కూడ దారుణమైనట్టి యధికారము; దానివలన ప్రస్తుతమమలునం దున్న సంస్కరణములక్రిందకన్న గూడ గవర్నరుజనరలు ఎక్కువ అధికారములు కల్గియుండును. ప్రస్తుత మమలునందున్న మాంటేగ్యూ - సంస్కరణములప్రకారము గవర్నరు జనరలుకు ౬ నెలలవరకు అమలునందుండునట్టి ఆర్డినెన్సులను నిర్మించుట కధికారము కలదు. ఆరునెలలపరిమితి యైనతరువాత ఆర్డినెన్సులు మరల ప్రచురింపనైనవలెను, లేక శాసననిర్మాణసభవారిచే ఆమోదింపబడి చట్టములుగ మార్చబడనైనవలెను. కాని రాబోవు సంస్కరణములప్రకారమన్ననో శాసనసభవారిసమ్మతి లేకుండగనే వారనుమతించినట్లుగానే గవర్నరుజనరలు శాసనములను చేసి కాలపరిమితి లేకుండ అమలులోనుండునట్లు ఏర్పాటు చేయవచ్చును. ఈ అధికారము శాసనసభవారి గౌరవమునకును, అధికారమునకును గొప్పలోపము నాపాదించునని ప్రత్యేకించి చెప్పవలసిన అవసరములేదు. అట్టి చట్టసంబంధమైన నిబంధన సంస్కరణచట్టమునందు ప్రవేశపెట్టుట చాల అపాయకరము.

ఇంతకుముందు సూచింపబడిన అధికారములు కాక వేరొకవిధమగు మరికొన్ని అసాధారణాధికారములుకూడ గవర్నరుజనరలున కీయబడును. సంస్కరణ విధానము క్రమముగ పనిచేయక, ఏకారణముచేతనైనను భగ్నమగు పరిస్థితు లేర్పడినప్పుడు, ప్రభుత్వశాఖలనన్నింటిని తనక్రిందకు తీసికొని ప్రభుత్వచక్రమును స్వంత బాధ్యతపై నడుపుట కతనికి అధికారము లీయవలెనని రౌండుటేబిల్ సమావేశమునం దొప్పుకొనబడినది. ఈ అధికారము పైన చెప్పబడినటు

వంటి అసాధారణసమయములం దుపయోగించుట
కుండవలెనను విషయములో ప్రతివారు నంగీకరించె
దరు. కాని అట్టిఅసాధారణపరిస్థితు లేర్పడినవని నిర్ణ
యించుబాధ్యత ఎవరిదైయుండవలెను; ఎట్టిపరిస్థితులు
అసాధారణపరిస్థితులుగా పరిగణింపబడవలెను అను
విషయములు చాలముఖ్యమైనవి. రౌండుటేబిల్ నిర్ణ
యము ప్రకారము ఆబాధ్యత గవర్నరు జనరలుదే
అయియుండును. అట్టిపరిస్థితు లేర్పడినవని నిర్ణయిం
చుటలో పూర్తిగ ఆయనకే అధికార మీయబడిన అ
దెట్లుపయోగింపబడునో తేలికగ గ్రహింపవచ్చును.
సర్వసాధారణముగ పైయధికారములు ప్రభుత్వముఖ్యాధి
కారి (Constitutional Head) ఆచరణలో నుంచు
టకుముందు ఇతరమార్గముల నన్నింటిని ప్రయత్నించి
వాటివలన ఆ అసాధారణ పరిస్థితులు మారుట కవకాశ
ములు లేనప్పుడుమాత్రమే అతడు ప్రభుత్వబాధ్యత
యంతయు తనభుజములపైకి తీసుకొనవలెనను సూత్ర
మాచరణయందున్నది. అప్పుడుకూడ అప్పటికి ప్రభు
త్వము చేయుచున్న పక్షనాయకుని సలహాపైననే అట్టి
చర్య తీసుకొనుటకూడ ఆచారమైయుండును. కాని
ఆవిధముగ మంత్రివర్గపు సలహాపైన మాత్రమే గవర్నరు
జనరలు చర్యతీసుకొనవలె ననుచట్టసమ్మతమైన నిబం
ధన లేనప్పుడు ఆత డట్లు మంత్రులసలహా తీసుకొన
వలసిన అవసరము లేదు. కాన చేయవలసినమార్పేమన
గవర్నరు జనరలు అసాధారణపరిస్థితు లేర్పాటుకాబడిన
వని ప్రకటింపకముందు శాసనసభవారియొక్కయు, మం
త్రులయొక్కయు అభిప్రాయమును తీసుకొనుటకు
ప్రయత్నించి దానిపైననే అవసరమైన చర్య జరుప
వలెను అనునిబంధన సంస్కరణచట్టములో చేర్చుట
మైయున్నది.

రౌండుటేబిల్ సమావేశఫలితముగ మనదేశములో
ఇదివరకున్న స్వాతంత్ర్య చిహ్నములుకూడ తగ్గిపోవు
ననుభయమునకు నిదర్శనముగ వేరొక విషయముకూడ
మనము జ్ఞాపకముంచుకొనవలసియున్నది. గవర్నరు జన
రలునకేకాక గవర్నరులకుకూడ సంస్కరణములప్రకా
రము ఆర్డినెన్సులను చట్టములను చేయుట కధికారమీయ
బడును. కేంద్రమందు బాధ్యతాయుతప్రభుత్వము లేక
పోయినను, రాష్ట్రములందైనను సంపూర్ణ స్వపరిపాలన
పద్ధతి రౌండుటేబిల్ సమావేశ ఫలితముగ ఏర్పడుననుఆశ
ఇంతవరకును ప్రతివారును కల్గియున్నారు. కాని రాష్ట్ర
గవర్నరులకు పైనచెప్పినట్లుగ ఆర్డినెన్సులను, రాష్ట్ర
శాసననిర్మాణసభలతో ఆలోచనచేయ నక్కరలేకుండ,
చేయుట కధికారమునిచ్చుట సంపూర్ణరాష్ట్రీయస్వా
తంత్ర్య సూత్రమునకు పూర్తిగ వ్యతిరేకము. దానివలన
క్రొత్తసంస్కరణము లెంత సంకుచితాధికారములను
ప్రజల కిచ్చుచున్నవో గ్రహింపవచ్చును.

గవర్నరు జనరలుయొక్క ప్రత్యేకాధికారము
లనుసరించి రౌండుటేబిల్ కాన్ఫరెన్సు రిపోర్టునం
దీవిధముగ వ్రాయబడియున్నది. "గవర్నరుజనరలుకు
ప్రత్యేకాధికారముల నిచ్చుటలో, అతడు వాటి ననుస
రించి తీసికొనిన ప్రతిచర్యయు శాసనసభవారి కెట్టి
సంబంధములేకుండ తనస్వంతబాధ్యతపైననే తీసికొని
నట్లు తెలియజేయుట కనువగు విధానము నేర్పాటు
చేయవలెను." ఈవాక్యముప్రకారము గవర్నరుజనరలు
ప్రత్యేకబాధ్యతలను వేరుచేయుటవలన స్వపరిపాలన
పద్ధతి కేమియు లోపము రాలేదని తలంచువారును,
నమ్మువారును దేశమందు లేకపోలేదు. కాని దాని
నిజార్థము గ్రహించుటకు ప్రయత్నించిన తేలున
దేమనగా ప్రజాప్రతినిధులయొక్కయు, మంత్రివర్గము
వారియొక్కయు సంబంధము లేకుండ గవర్నరుజనరలు
ఏపనినైనను చేయవచ్చును. శాసనసభవిషయములోని,
రిజర్వుశాఖలవిషయములోను, చట్టములను చేయుట,
అసాధారణ పరిస్థితులవిషయములోను గవర్నరుజనరలు
కున్న అధికారము లన్నిటిని సంపుటిచేసి చూచిన
ఏ ఒక్కవిషయమునందుగాని ప్రజాభిప్రాయము పరి
పాలన జరుగునని, మంత్రులకు ఏ పరిపాలనశాఖపై కాని
సంపూర్ణమగు అధికారముండునని, తలంచుటకు వీలు
లేదు. ఏవైపుచూచినను గవర్నరు జనరలుకు ప్రజా
హక్కులను పూర్తిగ అడ్డుటకు అవకాశము లేర్పరుప
బడినవి. కొన్ని సంవత్సరముల కొకసారి ఒక్కొక్క
గవర్నరుజనరలు తన ప్రత్యేకబాధ్యతలను ప్రత్యే

కాధికారములను దేశప్రజల హక్కులను హెచ్చు చేయుటకు వినియోగించిననినియోగించవచ్చును, కాని అట్లు తప్పక చేయవలెనను చట్టసంబంధమైన బాధ్యత ఆతనిపైలేదు. అట్టిబాధ్యత ఏర్పాటుకాబడు నంతవరకు, గవర్నరు జనరలు ప్రత్యేకాధికారములు తగ్గింపబడి ప్రజలహక్కులు నిలువబెట్టుకొనుటకు వీలైనంత పూర్తియగు అవకాశము లేర్పాటుచేయబడనంత వరకు సంస్కరణవిధానము ప్రజాసమ్మతి బడయజాలదు.

గవర్నరు జనరలు ప్రత్యేకాధికారపట్టికను బట్టి చూచినట్లయిన మనకు క్రొత్తసంస్కరణములవలన వచ్చునది"డొమినియన్ స్టేటస్" కాదుగదా, దానికంటె చాలరెట్లు తక్కువయధికారముల నిచ్చు ఒక రాజకీయ ప్రణాళికయని స్పష్టమగుచున్నది. మన దేశమందలి వివిధ రాజకీయపక్షములవారందరు నేకగ్రీవముగ అంగీకరించి సర్వదాకోరుచున్నది డొమినియన్ స్టేటస్ కు దేశమును తేలికగ తీసుకొనిపోవుటకనుకూలముగ నుండునట్టి సంస్కరణములై యున్నవి. కొన్ని ముఖ్యమైన ప్రభుత్వశాఖల విషయములో (అనగా విదేశాంగవ్యవహారములు, సైన్యము, దేశసంరక్షణ మొదలైనవి) మాత్రము ప్రస్తుతము కొంతకాలమువరకు గవర్నరు జనరలునకును, రాజుగారికిని ప్రత్యేకబాధ్యత నిచ్చుటకుకూడ ప్రతివారు నంగీకరించుచునే యున్నారు. కాని ఎవరునుకూడ పైననూచింపబడినంతలోపభూయిష్ఠమగునట్టియు, శాసనసభవారికి మంత్రులకు వదలివేయబడిన ప్రభుత్వశాఖల సందర్భములోకూడ గవర్నరు జనరలు తనఇష్టముప్రకారము వ్యవహరించుట కధికారమిచ్చునట్టియు పద్ధతి నంగీకరింపరని నొక్కిచెప్పవచ్చును. ఈసందర్భములో అత్యవసరముగ కావలసిన మార్పు లీక్రింద పొందుపరుచ బడినవి:—

౧. గవర్నరు జనరలుకు కొన్నిశాఖల విషయములలో ఈయదలంచబడిన యధికారములు ఎంతకాలముండవలెనో, ఎప్పుడు ఎంతకాలములో అవి పూర్తిగ ప్రజాయత్తము చేయబడవలెనో స్పష్టముగ సంస్కరణచట్టమునందు నిర్ణయించుట, ఆకాలములో ఆయా శాఖలు ప్రజాప్రతినిధులగు మంత్రులస్వాధీనము చేయుటకవసరముసుచర్య తీసుకొనవలసినదని గవర్నరుజనరలు సూచనలపట్టీయందు(Instrument of Instructions) నందు స్పష్టపరుచుట.

౨. ట్రాన్స్ఫర్డుశాఖల పరిపాలనవిషయములో శాసనసభవారికి, మంత్రులకు సంపూర్ణమగు స్వాతంత్ర్యాధికార ముండవలెను. వాటివిషయమై గవర్నరు జనరలుకు ఏవిధమైన జోక్యము కల్గించుకొనుటకుకాని అవకాశ ముండరాదు.

3. "మార్పుదలకాలము" నందు రిజర్వుడు శాఖలప్రభుత్వ మేవిధముగ కొనసాగింపబడుచున్నదియు ఆశాఖలనిర్వహించు అధికారులు శాసనసభవారికి నివేదించుచుండవలెను. ఆశాఖలకు సంబంధించిన బడ్జెటులను శాసనసభవారు చర్చించుటకును, వోటు చేయుటకునుకూడ అధికార మీయబడవలెను. ఏశాఖకు సంబంధించిన ఖర్చులనుకాని శాసనసభవారు త్రోసివేసినచో వాటికి తనస్వంతబాధ్యతపై కావలసిన సొమ్మునేర్పాటుచేయుటకు గవర్నరుజనరలున కధికార ముండవచ్చును. పైననూచించిన మార్పువలన శాసనసభవారికి రిజర్వుడుశాఖల పరిపాలనతో పరిచయము కల్గించుకొనుటకును, వాటిని ఆకాలము తరువాత తమ చేతులక్రిందకు తీసుకొనుటకును వీలగును.

౪. మార్పుదలకాలమున కనంతరము అన్నిశాఖలనుకూడ ప్రజాయత్తము చేయుట కనువగు విధానము సంస్కరణచట్టమునందే ఇముడ్చబడియుండవలెను. దానికై మరల పార్లమెంటువారి విచారణయు, నిర్ణయమును అవసరముండకుండునట్లె ఏర్పాట్లు చేయవలెను.

౫. గవర్నరు జనరలుకును, గవర్నరులకును చట్టములకుగల అధికారము కల్గియుండునట్టి ఆర్డినెన్సులను, చట్టములను చేయుట కధికారముండరాదు. ఇట్టి అధికారము ప్రపంచమందే ఇతరదేశమునందును ఆచరణలో లేదు. హిందూదేశమందు దానిని ఏర్పాటు చేయుటకు ప్రయత్నించుట మనదేశము నెప్పటికికూడ స్వరాజ్యము ననుభవింపకుండ చేయుటయే యగును.

ప్రస్తుతమును, వెంటనే కాకపోయినను కొంత నియమితకాలములో నైనను బాధ్యతాయుత స్వపరిపాలనము దేశమునం దేర్పరుపబడవలెననిన పైమార్పులు ప్రధానముగ చేయబడినగేకాని ఆలక్ష్యమును చేరుట కష్టము.

గవర్నరు జనరలుకు కేంద్రప్రభుత్వ సందర్భములో ఎట్టి అసాధారణాధికారములు కలవో, అట్టి అధికారములే గవర్నరుకు రాష్ట్రీయప్రభుత్వ విషయములలో కలవు. మనకు సంస్కరణములవలన కేంద్రమునందు బాధ్యతాయుత ప్రభుత్వము ఏర్పాటు కాబడకపోయినను రాష్ట్రములందైనను అట్టిపరిపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వ మేర్పడునని అందరును తలంచుచున్నారు. కాని అదికూడ జరుగుటకు అవకాశములు చాల క్షీణముగా నున్నవని చెప్పవలసియున్నది. రాష్ట్రీయగవర్నరులు "ప్రత్యేక బాధ్యతల" సందర్భములో గవర్నరు జనరలు ఆజ్ఞలను మాత్రమే శిరసావహింపవలసియుండు ననుసూత్రము శ్వేతపత్రమునందు విశదీకరింపబడినది. అనగా శాంతి, నెమ్మది మొదలగు ముఖ్యశాఖలలో గవర్నరు తనప్రత్యేక బాధ్యతల ననుసరించి పరిపాలింపవచ్చును. గవర్నరు జనరలు ఏవిధముగ తన ఇష్టప్రకారము ఈశాఖలను పరిపాలింపవచ్చునో ఆవిధముగనే గవర్నరులు మంత్రులసలహాపైగాక ఇష్టము వచ్చినరీతిని రాష్ట్రములందు ప్రవర్తింపవచ్చును. ఇదియు కాక రాష్ట్రీయగవర్నరులకు తమ(౧)స్వంతబాధ్యతపైన చట్టములుచేయుటకు, (౨) ఆరునెలలవరకు అమలులో నుండు ఆర్డినెన్సులను చేయుటకుకూడ అధికారము లీయబడుటకు నిశ్చయింపబడినది. ప్రస్తుతసంస్కరణముల చట్టముప్రకారము గవర్నరునకు లేనియధికారములు రెండు క్రొత్తగ ఈయబడుచున్నవని దీనియర్థము. శాసనసభవారికి రాష్ట్రీయపరిపాలనకు సంబంధించిన విషయములన్నింటిని గురించియు చట్టములు చేయుటకున్న అధికారముల నరికట్టుటకు, మంత్రులను ఏర్పాటు చేయుటదగ్గరనుంచి, మంత్రులను తనఇష్టమువచ్చిన రీతిని తొలగించుటవరకును ప్రతివిషయమునందును, ఎప్పుడు తనప్రత్యేకబాధ్యతలకు నష్టమువచ్చునని తోచిన అప్పుడే కలుగజేసుకొనుటకు, గవర్నరుకున్న అసాధారణాధికారము లింతింతయని నిర్ణయించుటకు వీలులేకయున్నవి. ఇట్టిసందర్భములలో రాష్ట్రీయ స్వాతంత్ర్యము పట్టిబూటక మనుసంగతి ఎల్లరకును విశదమగును. రాష్ట్రీయస్వాతంత్ర్య సిద్ధాంతము ఆచరణలోనికి తీసుకొని రావలెననిన కేంద్రప్రభుత్వము విషయములో గవర్నరుజనరలు అసాధారణాధికారముల సందర్భములో ఏమార్పులుకావలెనని పైన సూచింపబడినవో ఆమార్పులే రాష్ట్రప్రభుత్వముల విషయములో కూడ చేయవలసియుండును.

## అనుబంధము

తరువాత పార్లమెంటువారు హిందూదేశ సంస్కరణవిధానమునుగురించి చర్చించుటకు ప్రత్యేకపార్లమెంటరీకమిటీని ఏర్పాటుచేసియున్నారు. ఆకమిటీవారి యెదుట ఈయబడుచున్న సాక్ష్యమును ముఖ్యముగా ఇండియా కార్యదర్శియగు సర్ సామ్యూయల్ హోరుగా రిచ్చినసాక్ష్యమును పరిశీలించిన రాబోవు సంస్కరణములందు గవర్నరుల ప్రత్యేకాధికారములు ఎంతమాత్రము తగ్గవనియు, సంస్కరణచట్టమునందు వాటికి స్థానమీయబడుననియు తలంచుట కెట్టి అనుమానమును లేదు.

సర్ సామ్యూయల్ హోరుగారు ప్రత్యేకబాధ్యతలను తగ్గించుటకు వీలులేదనియు, వాటియందు చేర్చబడనటువంటి విషయములందుమాత్రమే మంత్రుల కధికారముండుననియు తమవిచారణయందు చెప్పియుండిరి. ఆయనసాక్ష్యముప్రకారము గవర్నరుకు రాష్ట్రప్రభుత్వములో ఏవిషయమునుగురించికాని అతనికి అవసరమని తోచినపుడు కలుగజేసికొనుటకును, మంత్రుల యధికారమును, సలహాను త్రోసిపుచ్చుటకును అధికారము కలదు. అనగా గవర్నరు ఎంతవరకు వారికి అవకాశమిచ్చుట కిష్టముతోనుండునో అంతవరకుమాత్రమే మంత్రుల స్వాతంత్ర్యము, బాధ్యత యుండునని తలంపవచ్చును. ఒక ఉదాహరణవలన ఈ సంగతి స్పష్టముకాగలదు. రాష్ట్రమునందు "లా అండు ఆర్డరు"ను ఏర్పాటు చేయుటకు రాష్ట్రీయ స్వాతంత్ర్య సూత్రమునుబట్టి బాధ్యత ఆశాఖ కధికారియగు మంత్రి దైయుండును; కాని ఎప్పుడైనను ఆ మంత్రి గవర్నరు అభిప్రాయములకు

వ్యతిరేకముగ అభిప్రాయము వెలిబుచ్చినతోడనే గవర్నరు తనప్రత్యేక బాధ్యతల ననుసరించి మంత్రుల యభిప్రాయములకు వ్యతిరేకముగ ప్రభుత్వోద్యోగీయులను చేయుడని చెప్పవచ్చును. జాయింటు సెలెక్టుకమిటీవారి ఎదుట జరిగిన ఈ ఉత్తరప్రత్యుత్తరములవలన ఈ విషయము స్పష్టమగును:—"సర్ ఆస్టిన్ ఛాంబర్ లేనుగారి ప్రశ్న:- సెలెక్టు కమిటీవారిముందు సాక్ష్యమిచ్చినవారిలో చాలమంది "లా అండు ఆర్డరు" శాఖను మంత్రులచేతులయందుంచుటనుగురించి తమ భయమును వెలిపుచ్చియుండిరి. "లాఅండు ఆర్డరు" మంత్రుల యధికారమునకు మార్చబడినప్పటికిని పోలీసు ఉద్యోగుల సామాన్యకార్యములలో మంత్రులుకలుగజేసికొని, దానిద్వారావారిలో శిక్షణతగ్గనట్లు చేయకుండ మీరేమిరక్షణలనేర్పాటుచేయుదురు?"

సర్ సామ్యూల్ హోరుగారి జవాబు:—ఛాంబర్ లేనుగారు శ్వేతపత్రము అర పేరాచూచిన పోలీసువారిశిక్షణ కట్టిలోపము రాకుండచూచుటకు తగిన రూల్సును చేయుటకు గవర్నరుకుఅధికారముకలదనిస్పష్టమగును. కానిగవర్నరుకు అట్టి అధికారములు కలవని చట్టములో స్పష్టీకరించుటకన్న ఎప్పుడు అట్టి అధికారములు అవసరమో నిర్ణయించు బాధ్యత గవర్నరుకే వదలుట మంచిదని నా అభిప్రాయము. చట్టములో ఆసంగతులు వ్రాసినమన మొకప్రక్క రాష్ట్రీయస్వాతంత్ర్యము నేర్పాటుచేయుచు వేరొకప్రక్కనుంచి దానిని తొలగించుటకు మార్గము లేర్పాటుచేయుచున్నా మను ఉద్దేశ్యము ప్రజలలోకలుగును. అయినను అవసరమైనప్పుడు గవర్నరు తప్పక తనప్రత్యేక బాధ్యతలక్రింద కలుగజేసికొనవలసినదనియే మా నిశ్చితాభిప్రాయము." పైదానినిబట్టి ఏవిషయములోనైనను, ఏసమయములోనైనను గవర్నరుకలుగజేసుకొని మంత్రుల అధికారమును త్రోసిపుచ్చవచ్చును; అదియుకాక ఎప్పుడు అట్లు గవర్నరు కలుగజేసుకొనవలెనో నిర్ణయించు అధికారము అతనికే యుండును.

మరియు గవర్నరుకు మంత్రులను తన ఇష్టము వచ్చినప్పుడు వారిపదవులనుండి తొలగించుటకధికారము కలదు. బాధ్యతాయుత ప్రభుత్వ సూత్రప్రకారము మంత్రులు శాసనసభలలో వారికి అధికసంఖ్యాకుల సహాయమున్నంతకాలమును ప్రభుత్వభారము వహించి నడుపుట కధికారము కలదు. శాసనసభలో విశ్వాసరాహిత్యతీర్మానము మామోదింపబడినప్పుడుగాని, శాసనసభలో వారిబలము తగ్గిపోయినప్పుడుగాని, శాసనసభల ఎన్నికలలో వారిపార్టీబలము తగ్గిపోయినప్పుడుగాని మాత్రమే తమప్రభుత్వాధికారమును వదలుకోవలసిన అవసరము కలదు. కాని సర్ సామ్యూల్ హోరుగారి వాదన ప్రకారము మంత్రులు గవర్నరున కెప్పుడు వ్యతిరేకులుగా నుండిన అప్పుడే వారియుద్యోగముల ఆశవదలుకోవలసియున్నది. "బాధ్యతాయుత ప్రభుత్వ" సూత్ర మీసందర్భములలో ఎట్లుపాటింపబడుచున్నదో గ్రహించుటకష్టము.

ఇట్లే ఇతరవిషయములలో కూడ గవర్నరు మంత్రులసంపర్కము లేక స్వంతబాధ్యతపైననే ప్రభుత్వము సాగించుట కధికారము కలదు. పెద్దఉద్యోగస్థులకు, ప్రభుత్వకార్యదర్శులకు గవర్నరు ప్రత్యేకముగ దర్శనమిచ్చుటయు, వారితో ప్రభుత్వకార్యములగూర్చి చర్చించుటయుకూడ జరుగును. ప్రభుత్వకార్యదర్శులు మంత్రుల సమావేశములకు అవసర సమయములందు హాజరై సలహానిచ్చుటలో ఎట్టిఆక్షేపణయు నుండనవసరము లేదు. కాని మంత్రులసంపర్కము లేకుండ వారు గవర్నరుతో ప్రభుత్వవిషయముల చర్చించుట బాధ్యతాయుత ప్రభుత్వసూత్రమున కెంతమాత్రము అనుకూలముకాదని వేరుగ చెప్పనక్కరలేదు.

క్రొత్తసంస్కరణచట్టము ప్రకారము మనదేశమునకు ఎంతమాత్రము హెచ్చుప్రభుత్వాధికారము వచ్చునని తలంచుట కెంతమాత్రము పరిస్థితు లనుకూలముగ లేవు. సామ్యూల్ హోరుగారిసాక్ష్యమునుబట్టి చూచిన మనకు ప్రసాదింపబడునది "రాష్ట్రీయస్వాతంత్ర్యము" కాదనియు, గవర్నరుల స్వాతంత్ర్యమనియు స్పష్టమగును. ప్రస్తుతడయార్కీ పద్ధతిప్రకారము ప్రజలకున్న అధికారములుకూడ ఇకముందు చాలవరకు తగ్గిపోవుననుట నిశ్చయము. ఇప్పుడు "ట్రాన్స్ఫర్డుశాఖల" విషయములోనైనను మంత్రులకును, శాసనసభలకును కొంతస్వతంత్రముగ ప్రవర్తించుట కధికారము కలదు; రాబోవుసంస్కరణములో ఆకొద్దిస్వాతంత్ర్యముకూడ పోవుననుట కెట్టిసందేహము లేదు.

# పిచ్చితలపులు

హనుమదింద్రకంటి

౧

ననుజూసి నవ్వింది
నవ్వులో మెరిసింది
కనుగొనల పొంగేటి
కలతకోరిక లేవొ
మిణుకుమిణుకూమంటు
కసికరిస్తాయి
ఆచిన్నిహృదయాన నేమున్నదో-గాని

౨

పసిడిమెడవంపులో
పరువులెత్తేతళుకు
తళుకులో మెలుకువై
తలలు దిప్పేపాట
పూలవాసనమల్లె
జాలి పెడుతుంది
ఆచిన్నిగొంతులో నేమున్నదో-గాని

౩

బాల్యయౌవనదశలు
బంతు లాడేవేళ
తొంగిచూసేమిసిమి
దొరికి పోయేవేళ
మెదిలితే అందాలు
కదలిపోతాయి
ఆచిన్నివయసులో నేమున్నదో-గాని

౪

ఆపిల్ల జడలోన
నేపూలో ముడుచుకొని
ఘుమఘుమావాసనల
కులుకుతూ వచ్చి
ననుజూచి తలవంచి
నవ్వుకుంటుంది
ఆచిన్నిసిగ్గులో నేమున్నదో-గాని

౫

పూలసన్ననివలపు
బాలకమ్మనితలపు
పాటతియ్యనిపిలుపు
పలకరించేసరికి
పేదగుండెల్లోన
పిడుగుపడుతుంది
బీదకళ్లల్లోన బెంగపుడుతుంది.

---

# యుగలక్షణ సమన్వయము

ఉభయభాషా - సాహిత్యవిద్యా - ప్రవీణ
బులుసు వేంకటరమణయ్య, రిసర్చిస్కాలరు

చరిత్రకారులు తమగ్రంథరచనమునకనుకూలముగఁ జరిత్రమును గొన్నికొన్నివిభాగములు చేసి యొక్కొక్కదాని కొక్కొక్కసంజ్ఞ నిడుట యాచారము. ఆ విభాగములు వారిసౌకర్యద్యోతకములేగాని యనాదిసిద్ధములుమాత్రము కావని మన మెఱుఁగుదుము. ఆరీతి ననుసరించియే మనయాంధ్రవాఙ్మయచరిత్రకారులుకూడ వాఙ్మయమును గొన్నియుగములుగా విభజించియున్నారు. ఆ విభాగములు తలకొకరీతిని జేయఁబడియుండుటచే నాయాగ్రంథకర్తల స్వేచ్ఛయే తత్తద్విభాగమునకు మూలాధారమైనట్లు తోఁచకమానదు.

యుగవిభాగానుసారముగఁ గవుల చరిత్రమును వ్రాసిన రా. బ. శ్రీ కం. వీరేశలింగముపంతులుగారు ప్రాచీనకవులనియు, మధ్యకాలపుకవులనియు, నర్వాచీనకవులనియు ముత్తెఱంగులఁ గవుల విభజించియున్నారు. కాని కేవల వాఙ్మయ చరిత్రమును వ్రాయువారు పురాణయుగమనియుఁ, బ్రబంధయుగమనియు, నవయుగమనియు నీరీతి విభాగములఁ బరికల్పించియున్నారు. Telugu Literature అను గ్రంథమునఁ బ్రబంధ-నవయుగములకు నడుమ జీర్ణయుగ మొకటియధికముగ నంగీకరింపఁబడినది. కవిత్వవేదిగారు "ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహమునఁ బెక్కుయుగములను జేర్కొనిరి. అందలి యుగవిభాగము కవిత్వమునుబట్టిగాక వాఙ్మయము నుద్ధరించిన యాంధ్రప్రభువులకాలముంబట్టియే యొనర్పఁబడినట్లు తోఁచుచున్నది. పురాణకవిత్వము, కావ్యప్రబంధకవిత్వము, ప్రబంధకవిత్వము మొదలగుశీర్షికలతో నధ్యాయములు విభజింపఁబడియున్నవి; కాని అవి యుగపదలాంఛితములుమాత్రము కాలేదు. తక్కిన వాఙ్మయ చరిత్రగ్రంథములలోఁ బురాణయుగాది విభాగములు కన్పించుచున్నవి. ఈరీతి వ్యవహారములుకూడఁ బండితజనప్రసిద్ధములై యున్నవి.

ఆయా విభాగములకుఁ బురాణయుగాదినామములు, ఆయాయధ్యాయములకుఁ బురాణకవిత్వము మొ. శీర్షికలును గల్గుటకు ఆయాసమయములందుఁ గేవల పురాణాదులే రచింపఁబడి యుండుటగాని, రచింపఁబడినగ్రంథములలోఁ బురాణాదులే యధికసంఖ్యాకములై యుండుటగాని కారణము కావలెను. పురాణములవలె నితరగ్రంథములు విరివిగ రచింపఁబడినపుడుమాత్రము మీఁదివిభాగము లంతటియన్వర్థములు కాఁజాలవని చెప్పవలసియున్నది. ఈమీఁదివిభాగములనాదిసిద్ధములు కావనియుఁ, జరిత్రకారుల స్వేచ్ఛానుసరణమే యిందుకు మూలమనియు నిదివఱకుఁ జెప్పఁబడియుండుటఁబట్టియు, నొకరు విభజించిన రీతిని మఱొకరు విభజింపకుండుటంబట్టియు, యుగవిభాగమునఁ గొన్నిలోట్లుండుటంబట్టియు నియ్యది (ఈ విభాగము) యంతటిసముచితముగ లేదని చెప్పవలసివచ్చుచున్నది.

వైదికవాఙ్మయచరిత్రకారులు, వేదయుగమునే—సంహితాకాలమున బ్రాహ్మణములుగాని, బ్రాహ్మణరచనాసమయమున సంహితాదులుగాని రచియింపఁబడలేదనియు, (అనఁగా సంహితా, బ్రాహ్మణ, ఉపనిషదాదులకు సాంకర్యము లేదని) ఆకారణమున నక్కాలమును సంహితాకాలము, బ్రాహ్మణకాలము, ఉపనిషత్కాలము. అని విభజింప వీలగుచున్నదనియుఁ జెప్పుచున్నారు. ఒక్కవైదికవాఙ్మయమునందే యిట్టి విషయసాంకర్యము లేదుగాని, ప్రాచీనమైనదైనప్పటికిని సంస్కృతవాఙ్మయమునందు విషయసాంకర్యము కానవచ్చుచున్నది. క్రీస్తునకుబూర్వము ౬౦౦

ప్రాంతమున నాదికావ్యమగు రామాయణమేకాక ఇతిహాసమగు మహాభారతము, వ్యాకరణాలంకారాది శాస్త్రగ్రంథములు రచింపఁబడినవి. ప్రాచీనుఁడగు నశ్వఘోషమహాకవి బుద్ధచరిత, సౌందరనందకావ్యములనే కాక శారీపుత్రప్రకరణ మనునాటకమును రచించెను. కాళిదాసాదు లగు మహాకవులు కావ్యములనే గాక నాటకాదిగ్రంథములను రచించుట మనము వినుచున్నాము. కావున సంస్కృతవాఙ్మయమునఁ గావ్యయుగమనుగాని, నాటకయుగమనుగాని, శాస్త్రయుగమనుగాని వేఱుగ విభజింప వీలులేదు. అట్టివిభాగము నెవ్వరు నొనర్చియుండను లేదు.

ఆంధ్రవాఙ్మయమునకుఁ జాలవిషయములలో సంస్కృతమే మూలమగుచుండుట నెఱుంగవలెను. సంస్కృతమందువలె నాంధ్రమునను విషయసాంకర్యముండుట స్పష్టము. పురాణయుగమని పేర్కొనఁబడు కాలమున భారతమేగాక నన్నెచోడవిరచితమగు కుమారసంభవకావ్యము, సోమనాథుని వృషాధిపశతకము, భీమన కవిజనాశ్రయము, ఇంచుమించుగ సమకాలమునందే యుద్భవిల్లియున్నవి. మఱియుఁ గడచినపందొమ్మిదవశతాబ్దపుఁజరమభాగమువఱకు ఆంధ్రవాఙ్మయమున నెన్నిరీతులకవితలు బయలువెడలియున్నవో, అవి యన్నియు నిపుడు పురాణయుగమని చెప్పఁబడుసమయముననే తెలసూపియున్నవి. అప్పుడులేనికవిత ౧౯-వ శ. చరమావస్థవఱకును లేదు. కావుననే నాటకకవిత యాదినుండి అంతమువఱకు లేకపోయినది. గద్యకావ్యము లర్వాచీనసమయముననే వెలువడియున్నను, ఆదిగ్రంథమగు మహాభారతమున గద్యభాగము లుండుటచే, గద్యకవిత తొలుత లేదని చెప్ప వీలులేదు. దీనింబట్టి పురాణయుగమునఁ బురాణకవిత్వమేగాక కావ్య, శతక, శాస్త్రాదికవిత్వములుకూడ వెలయుటచే నానామమాయుగమున కంతయుచితమైనట్లు తోఁచదు.

ఇంతియగాక మనవారు సంస్కృతమునందలి పురాణముల నాంధ్రీకరించుటచే మూలానుసారముగఁ దామురచించినగ్రంథములకుఁ బురాణములని పేరు పెట్టిరి. కాని నిజమునుబట్టి యవి పురాణములు కావు. మనవారు రచించినగ్రంథములన్నియుఁ (పురాణనామాంకితములు) గావ్యములే యని చెప్పవలసియున్నది. నన్నయభట్టు తాను మహాభారతమను నితిహాసమును గావ్యముగ రచించుచున్నట్లుఁ దొలుదొల్తనే చెప్పియున్నాఁడు. తిక్కనసోమయాజి తనగ్రంథమును కావ్యరీతిని, నాటకరీతిని భావ-రసప్రధానమగునట్లు రచించుటచేతనే మేటికీరితిని సంపాదించెనని పండితవిమర్శకులయభిప్రాయమై యున్నదిగదా! నృసింహపురాణ, జైమినిభారతాదులు పేరునకుఁ బురాణములుగాని యథార్థముగఁ గావ్యములేగదా! పరిశీలించి చూచినచో మనవాఙ్మయమునఁ దొలుతనుండియుఁ గావ్య-ప్రబంధకవితయే బయల్వెడలినదిగాని పురాణకవిత బయలుదేఱలేదని చెప్పవలసియున్నది. నన్నయకాలమున—అనఁగా — క్రీ. శ. ౧౧-వ శతాబ్దమున భారతదేశమందంతట నన్నివాఙ్మయములందును, కావ్యవాఙ్మయభాగమునకే ప్రాముఖ్య మీయఁబడియుండుటచేతను, భోజదేవాదులయాస్థానములందు మనవాఙ్మయమునకు మూలమనఁదగు సంస్కృతవాఙ్మయమునఁ గావ్యకవితకే యగ్రస్థాన మీయఁబడియుండుటచేతను, భాష, దేశము వేరైనను జనసామాన్యముయొక్కయభిప్రాయము లంతట సమానము లగుచుండుటచేతను, మనవారికిఁగూడఁ గావ్యకవితారచనయందే యభినివేశము కలిగి, వారు పురాణాదులనుగూడఁ గావ్యములరీతి నాంధ్రీకరించియుండవచ్చును.

నామసాదృశ్యమున మన యాంధ్రగ్రంథములు పురాణము లగునని చెప్ప వీలులేదు. పినవీరభద్రుని శాకుంతలము, శ్రీనాథునివీధినాటకము నామసామ్యమాత్రమున నాటకములు కాఁజాలవుకదా!

మఱియుఁ బురాణాంధ్రీకృతి ప్రాచీనయుగముననేగాక మధ్యమార్వాచీనయుగములందును గానవచ్చుటచేఁ బురాణములు పురాణయుగమునందే రచింపఁబడినవని చెప్ప వీలుపడదు.

పైని వివరింపఁబడిన యంశములంబట్టి పురాణయుగమనునామము సరిగ లేదని చెప్పవలసివచ్చినది. ఒకవేళఁ బ్రాచీనయుగమనుట నది పురాణయుగ మగునని

యందురేని, సందేహజనకమగు పురాణపదమును దీసి, ప్రాచీనయుగమని పేరిడుటయే లెస్స. ఇట్లే ప్రబంధ యుగాదివిషయమునంగూడ నని యెఱుంగునది. ఈ మీఁది పురాణయుగాదినామములు తద్విభాగమునందలి విషయములను బూర్తిగఁ దెలియపఱుపఁ జాలక యున్నవి.

యుగశీర్షికలబట్టి యుగమునందలి వాఙ్మయ చరిత్రమును గొంత వ్యక్తపఱుపఁదలఁచిన చరిత్ర కారులు ప్రస్తుతమున కంతగ ననుసరింపని మీఁది విభాగముల నుపేక్షించుట లెస్స. ఇఁకఁ బ్రాచీన యుగము, మధ్యయుగము, అర్వాచీనయుగము నని క్రీ. శ. ౧౯-వ శతాబ్దచరమభాగమువఱకుఁ గల సారస్వతమును మూఁడుతెఱఁగుల విభజించుట యుచితము. ప్రాచీనకాలమున రచింపఁబడిన పురాణాంధ్రీకరణములు, కావ్యములు, శాస్త్రగ్రంథములు, శతకములు మొదలగునవి ప్రాచీనయుగమునకును, నడిమికాలమున శ్రీనాథుఁడు, కృష్ణదేవరాయలు మొదలయినవారి కాలమున రచింపఁబడిన గ్రంథములు మధ్యమయుగమునకును, తక్కినసమయమున రచింపఁబడిన నర్వాచీన యుగమునకును జెందఁగలవు. చరిత్రలు, విమర్శనలు, నాటకములు, కథలు, నవలలు, భావప్రధానఖండ కావ్యములు, గేయములు, కథానకములు మొదలగునవి మీఁదిమార్గములకంటె విశేషముగ నిపుడు వెలువడు చుండుటంజేసి యియ్యవి ప్రస్తుతము, నాల్గవది యగు నవయుగమునకుఁ జెందియుండుననని, చెప్పవలెను. ఇట్లీయుగచతుష్టయవిభాగమే యుచితమై యున్నదని నాకుఁదోఁచుచున్నది.

---

# కప్పతల్లి పెళ్లి

చావలి బంగారమ్మ

కప్పతల్లి పెళ్లి నేడూ-చూడరే
కావెల్ల నీళ్లోంపినాడు
వరుణదేవుడు పంపినాడూ-ఓచెలీ
వాడలన్నీ నింపినాడు
గగనతలమునుంచి నేడు-వీవనలు
చెట్లచే వేయించినాడు
స్వర్గాధినాథుడు నేడూ-రథమెక్కి-
పయనమై పోవుచున్నాడు
భత్యాలులేకనే వాడూ-పెళ్లికీ
బాజాలు వేయించినాడు
బండరాళ్లపైని వాడు-చక్రములు
బడబడా దొర్లించినాడు

బాణసంచా వెలితి లేదే-పెళ్లికీ
బహుబాగుగా చేసినారె
కళ్లుచెదిరే మెరుపులమ్మా-చూడగా
వొళ్లు పరవశమౌను సుమ్మా
కప్పమ్మ పెళ్లికోయంచూ మేళములు
గొప్పగా తెప్పించినారే
చెప్పశక్యముగాదు వేరే-బోదురూ
కప్పలా మేళములు రారె
కప్పమ్మ గడపతొక్కినదీ-శుభమన్న
సూచనలు చూరుచెప్పినదీ
కప్పలెగిరే వానలమ్మా! పొలములు
కనకమే పండుతాయమ్మా!

---

# వోటు

సోమంచి యజ్ఞన్నశాస్త్రి

ఇది ప్రజాపరిపాలనకాలము. పూర్వమువలె రాజు లిప్పుడు ప్రభుత్వముచేయుట లేదు. కొన్నికొన్ని దేశములరాజులున్నను వారు రబ్బరుస్టాంపులే. మంత్రి గారు గట్టిగ దబాయించిన సంకేలు తీయవలసినగతి వారికి పట్టినది.

కాని, నిజమున కిది ప్రజాపరిపాలనము కాదు. (mobocracy) పూర్వము గ్రీకు, రోము దేశములందు పౌరులందరు నొకచోగూడి రాజకార్యముల చక్క బెట్టెడివారు. ఇప్పటివలె ప్రతినిధుల నెన్నుకొనుట లేదు. ప్రతిపౌరుడును ప్రతినిధియే యన్నమాట.

ఇప్పు డది కుదరదు. గ్రీకునందలిరాజ్యములు చాలచిన్నవి; పట్టణరాజ్యములుమాత్ర మగుటచే పౌరుల సంఖ్య చాలకొద్ది. బానిస లన్నిపనులు చేయుటచే పౌరులకు కాలవ్యవధికూడ చాలయెక్కువ. అందుచే పౌరులంద ఱొకచోగూడి యాలోచింప వీలయ్యెడిది. కాని యిప్పటిరాజ్యములు చాలపెద్దవి. పౌరులందరును ఒకచోకూడుట అసంభవము. పూర్వమువలె మనపని నంతయు చేసి మనకడుపులో చల్ల కదలకుండ కూర్చుండబెట్టుటకు బానిసలును లేరు.

అందుచే నిప్పుడు ప్రజలు, తమకుబదులుగ, తమయభిప్రాయములతో నేకీభవించి పనిచేయుప్రతి నిధుల నెన్నుకొని వారి ద్వారా ప్రభుత్వమును కొన సాగించవలసివచ్చినది. కాన, నిజముగ నిప్పటి ప్రభుత్వములు ప్రతినిధుల ప్రభుత్వములు. ప్రజలో, స్వాములు మాత్రమే. వారియిష్టానిష్టముల ననుసరించి ప్రతినిధులు ప్రభుత్వమును కొనసాగింతురు. అందుచే నిప్పటిరాజ్యములను ప్రజాస్వామికపరిపాలనము లనుట మంచిది.

ఇట్టి ప్రజాస్వామికపరిపాలనము ఆధారపడునది 'వోటు'పై. ప్రతినిధుల నెన్నుకొనుట 'వోటు' నిచ్చి. కాదా?

కాబట్టి 'వోటు' అననేమో, దాని నెట్లుప యోగించవలయునో, ఎవరెవరి కాహక్కుండవలయునో తెలిసికొనుట ప్రతిపౌరునకును విధి. పౌరునినిర్వ్యక్త ధర్మము తిన్నని ప్రతినిధుల నెన్నుకొని ప్రభుత్వము చక్కగ ప్రజారంజకముగ కొనసాగింప బడుటకు తోడ్పడుటయే! ఇది చేయనినా డతనికి 'వోటు' చేయుటకు హక్కిచ్చినయెడల నది బూడిదలోపోసిన పన్నీ రగును.

'వోటు' పెట్టెలో పెట్టె దాచుకొనవలసినది కాదు. మారుబేరమున కమ్ముకొని వర్తకము చేయవల సిన వస్తువును కాదు. అది ఒక హక్కు. తాను దేశ ములో ప్రభుత్వములో పాల్గొనవచ్చుననియు, తా నొకపౌరుడననియు గుర్తింపబడినచిహ్నము. దానిని జాగ్రత్తగ, తెలివిగ పౌరు డుపయోగింపవలయును.

మనుజులు సౌఖ్యమును, శాంతిని ఇచ్ఛగింతురు. అట్టిది దేశములో కూర్చునది ప్రభుత్వము. ప్రభుత్వము కొన్నిధర్మములను నెరవేర్చుకొనుటకై యేర్పరుపబడిన సంస్థ యగుటచే, ప్రభుత్వముచేయ నుంకించుప్రతినిధు లాధర్మములను నిర్వర్తించుటకు తగినశక్తిసామర్థ్యములు కలిగినవారుగ నుండవలయును.

ప్రభుత్వముచేయుట ఒకగొప్పకళ. ప్రతిమను జుడును చేయ లేడు. దానికి కొంతతెలివితేటలు, క్లిష్ట సమస్యల నర్థముచేసికొనుటకు తగినజ్ఞానము, కావల యును. జనసామాన్యము చేయవలసినపని, చేసెడిపని, అట్టివారి నేరుకొని శాసనసభల కంపుటయే.

శాసనసభలలో చేయబడుచట్టములకు మనము లోబడియుండవలయును. ఆచట్టములు మన యభి ప్రాయములకు వ్యతిరిక్తమయిన మనము ఆమోదించ లేము; లోబడలేము. ఒకవేళ 'మద్దుకట్టుకు, ఎత్తి టోపీకి' భయపడినను అట్టిది దేశమునకు, పౌరులకు

శ్రేయస్కరము కాదు. అది బలవంతపు బ్రాహ్మణార్థమువలె కష్టతరము.

అట్టిదేశమున తిరుగుబాటు తప్పదు. అందుచే జనులు తమయభిప్రాయములతో కొంచెమెచ్చుతగ్గగ నేకీభవించు ప్రతినిధుల నెన్నుకొనవలయును. ఇట్లెన్నుకొనుటకు గలహక్కే 'వోటు'. అట్టిహక్కుగలవారు 'వోటర్లు'.

ఇట్టి హక్కెవరికుండవలయు ననునది యాలోచనీయాంశము. ప్రతిమనుజునకును వోటుచేయుటకు హక్కుండవలయునా? లేక కొందరికేనా? కొందరే యైన, ఏకొందరు? ఆవిభజన దేనిమీద నాధారపడి యుండవలయును?

సాధారణముగా నిపుడు మూడుసంగతులపై నిది యాధారపడియున్నది:

౧. ఆస్తి,

౨. రాబడి,

౩. విద్య.

పన్నుగా కొంతధనమును ప్రభుత్వమునకు చెల్లించువారికే కొన్నికొన్నిచోట్ల వోటు కలదు.

I. ఆస్తియున్నవారికి దేశములో కొంత పలుకుబడి యుండును. విప్లవములు మొదలయినవి వచ్చిన వారియాస్తి పోవు ననుభయము వారి కుండును. అందుచే వారట్టివాటిలో పాల్గొనరు. వారికి భుక్తి గడచుటచే లంచములు మొదలయినవి పుచ్చుకొనరు. వారు వారిధర్మమును బాగుగ నెరవేర్చుకొని, తమ ప్రతినిధుల నెన్నుకొనెదరు. అందుచే 'నాస్తి' యున్న వారికే 'వోటుండవలెననునది వాదము.

కాని మనము చూపినటుల వోటరుకుండవలసిన ముఖ్యలక్షణము తగినప్రతినిధి నెన్నుకొనుట. ఆస్తి యున్నంతమాత్రమున నాశక్తి యలవడు ననుకొనుట పొరపాటు. ఇప్పు డున్నటువంటి 'ఆస్తి'కే ప్రజాస్వామికపరిపాలనమున తావులే దనునపుడు, దానిపై నాధారపడు విభజన కడమే లేదు. 'ఆస్తి' కల యెంతమంది మూర్ఖులను మనము చూచుటలేదు. ఎంతమంది సోమరిపోతులు ఆస్తికలవారిలో లేరు. ఆస్తి లేనంతమాత్రమున ఎన్నుకొనుటకు తగినశక్తి లేదని మనము చెప్పగలమా? ఆస్తిని సంపాదింపని తెలివిగల వానికైనను 'వోటు' లేదనుటయేనా? తగుసమర్థుల నెన్నుకొనుశక్తి 'ఆస్తి' కలవారిలోనేగాని, పైనలేరని మనము చెప్పలేనపుడు 'వోటును' ధనమున్నవారికే యీయ కూడదు. 'వోటు' నెవరి కిచ్చుట యను విభజన కలిగినపుడు ఎవరు ప్రతినిధుల నెన్నుకొన సమర్థతగలదో యనునదికాని, ఎవరికి ధనమున్నదో యనునది కాదు ఆలోచనీయాంశము. అటుకాకపోయిన, రాజ్యము ధనవంతుల రాజ్యమగును కాని ప్రజాపరిపాలన కానేరదు. అట్టిరాజ్యమును ప్రభువులరాజ్యమన వలెను. కాని ప్రజాస్వామిక మనరాదు.

II. రెండవది విద్యవచ్చినవారికే యీ హక్కుండవలెననుట. విద్య మిగులనవసరమే. విద్యలేని వాడు పశువే. ఆతడు జరుగుసంగతులను తెలిసికొని, సరిగ వోటుచేయుటకూడ కష్టమే. కాని దీనిప్రకారము విభజించుట చాలకష్టము. విద్యయనగా నెంత విద్య? ఎట్టివిద్య? పదియేండ్లు కష్టపడి సంతకముచేయ నేర్చుకొనిన — జనాభాలెక్కలలోవలె — నావిద్య చాలునా? లేక రాత్రి టీ పుచ్చుకొని, కంఠతాపట్టియైన బి. ఎ. గట్టెక్కింపవలయునా? ఎంతమట్టుకు విద్యవచ్చినతర్వాత ప్రతినిధుల నెన్నుకొనుటకు తగిన శక్తి యలవడును? ఏక్లాసుచదివిన వోటరుగా నుండుట కర్హుడయినటులు? సంతకముచేయుటయే 'వోటరు'గ నుండుటకు చాలనిన ఎటులనో కష్టపడి—కుంటలుకొప్ప— అందరును నేర్చుకొనలేరా? అంతమాత్రమున, పూర్వము కంటె వారు గొప్పవారయిరా?

కాని నిజముగ నాలోచించిన విద్యయా, విజ్ఞానమా ముఖ్యము? విద్య వచ్చినంతమాత్రమున విజ్ఞాన మలవడితీరునా? విద్య లేకపోయిన విజ్ఞాన ముండదా? మరి విజ్ఞానమును కొలుచు టెట్లు? అక్షరునకు సంతకముచేయ రాదట! ఆతనిపాటి

విజ్ఞానముకలవారు మన యిప్పటి M. A. లలో నెంత మంది కలరు ? మనరైతులలో చాలమందికి, అ, ఆ, లు రావు; కాని వారివిజ్ఞానము చాలగొప్ప దనునది యందరికిని తెలిసినయంశమే. వారు ప్రతిదినమును వినుచుండిన భారతభాగవతరామాయణములే వారికి కావలసినంత విజ్ఞానము నిచ్చును. ఇట్టిస్థితిలో—ముఖ్యముగా హిందూదేశమున—విద్య లేదని రైతులు మొదలగు వారికి వోటు లేకుండచేయుట న్యాయమా ?

పైగా విద్యనేర్చుకొనుటకు ధన ముండవలయును. 'వోటు' నకు చాలువిద్య B. A. కావలయుననిన, సాధారణముగ ధనవంతులుకాని చదువుకొనలేరు. అందుచే నావిభజన పేరునకు విద్యపై నాధారపడియున్నను, నిజమున కది ధనముపైననే యాధారపడియున్న దన్నమాట. దాని కష్టములు పైననే చర్చింపబడినవి.

కాక చాలతక్కువవిద్య చాలుననిన, నది అందరి అందుబాటులో నుండునటుల చేయవలసినవిధి రాజ్యముది. ఉచితనిర్బంధప్రాథమికవిద్య యుండిన కాని విద్యపై వోటు నాధారపడ జేయుట న్యాయము, ధర్మమును కాదు. లేకపోయిన, గదిలో నొకనిని తాళము వైచి పైకి రమ్మనినటులుండును. విద్య జనసామాన్యమున కందుబాటులో లేనపుడు, దానిపై నాధారపడ జేయుట మోసముచేయుటకాని వేరొకటి కాదు. విద్య యందరికి నందుబాటులో నున్నపు డందఱును విద్య నేర్చుకొందురు గాన, విద్యావంతులకే వోటుండు ననుట యవసరము. ప్రతివారికిని వోటు కలదని చెప్పుటయే శ్రేయస్కరము.

ఇప్పుడు చాలదేశములలో నున్నపద్ధ తిదియే. ఇంగ్లాండున ౨౧ సం. వచ్చిన ప్రతివారును—పిచ్చవాండ్రు మొదలయినవారుతప్ప—వోటరులే. రోమను కాథలిక్కుదేశములందుమాత్రము స్త్రీలకు వోటింగు హక్కు లేదు. ఇది చాలశోచనీయము.

చట్టములు మనలను తిన్ననిమార్గముల నడిపించుట కేర్పరుపబడిన నిబంధనలు. అట్టిచట్టముల చేయుటలో కొంతమంది యభిప్రాయమును తీసికొనకపోయిన, సంఘమువా రిచ్చుమంచిని గ్రహింపలేకపోయినదన్నమాట. అట్టివారు ప్రభుత్వములో మనఃపూర్తిగ నేకీభవించరు. వారియంగీకార మర్ధాంగీకారముగానే యుండును.

అదిగాక చేయబడుచట్టములు దేశములోని ప్రజలందరి సౌకర్యార్థమైకాని కొందరికొఱకుమాత్రమే కాదు. కాని ఎవరికి వోటు కలదో రాజ్యములో వారి సౌకర్యములు మాత్రమే జరుగును. వోటులేనివారి సౌకర్యార్థ మెవరును, ఏశాసనసభయును పాటుపడరు. కారణము? వారు మనల నేమియు చేయలేరుగదా యను ధైర్య మొక్కటియే ! ఇంగ్లాండుదేశమున కార్మికులకు వోటిచ్చువఱకును మిల్లులలోని పరిస్థితులు చెప్ప నలవికాకుండ నుండెడివి. కాని వారికిగూడ రాజ్యపాలనములో హక్కు దొరకగానే వారిస్థితిని వారు బాగుచేసికొన నవకాశము దొరకినది. కాని వోటింగుహక్కు ధనవంతులకే యుండిన అధికవిద్య కావలయుననిన నదియు ధనముక్రిందనే లెక్క—ధనవంతుల సౌకర్యములుమాత్రమే జరుగును. దీనికు పాటిలో మన్నే ! 'వారిమొరాలకించు' వా రెవ్వరు నుండరు. వోట్లు లేకపోయిన వారి కష్టసుఖములు విచారింపబడవు గనుక రాజ్య మందరికొఱకును కాబట్టి 'వోటందరికిని' ఉండవలయును. ప్రతినిధుల నెన్నుకొనుటకు కావలసినది విచక్షణజ్ఞానము. అది విజ్ఞానమువలన కలుగును. అట్టి విజ్ఞానము వెదచల్లవలసినవిధి ప్రభుత్వముది. ఇది ముఖ్యావసరము.

ఇప్పటిఎన్నికలను చూచిన దీనియవసరము మనకు తెలియును. లంచముల నిచ్చుట, పుచ్చుకొనుట, అబద్ధములు చెప్పి మోసముచేయుట మొదలయినవన్నియు విజ్ఞానము లేకపోవుటవలననే కలుగుచున్నవి. ఎవ రెక్కువలంచమిచ్చిన వారికే ఎన్నికలలో జయము కలుగుచున్నది. అందుచే, తిరుగ ధనమే ముఖ్యమగుచున్నది. అందువలన ప్రతినిధులుగ చాలచోట్లనుండి యెన్నుకొనబడువారు జమీందారులుగ నున్నారు.

కాన మనము ధనమునకు దాసుల మగుచున్నాము. ధనమే ముఖ్యమగుటచే, దొరతనమునునో, దొంగతన మునునో ధనసంపాదనయే యిపుడు ముఖ్యమగుచున్నది. కాని లోకకల్యాణముకొరకు పాటుపడుట కాదు. మనమ్యునిసిపలు, తాలూకాబోర్డు వ్యవహారములను జూచిన మనము స్వరాజ్యమున కర్హులమా యనుసంశ యముకూడ కొన్నిసమయముల పుట్టక మానదు. ఇది విజ్ఞానముయొక్కలమునే తొలగింపవలయును.

చట్ట మందరికి నొకటియే. తప్పుచేసిన బ్రాహ్మ ణుడైన నొకటే, బ్రాహ్మణేతరుడైన నొకటే. అట్టి చట్టముల తయారుచేయుటకు కులవివక్షతతో పనిలేదు. ఒకచట్టమును తయారుచేయునపుడు చూడవలసినది దేశమున కది యుపయోగమా, కాదా యని కాని, తన చుట్టాలకు, కులమువారికి లాభము చేకూరవలయునని కాదు అట్టిసమయముల బ్రాహ్మణులకే కాని 'వోటీ'య మనిగాని, బ్రాహ్మణులకు 'వోటీ' యమనిగాని చెప్పుట సరిగాదు. అది వోటును సరిగా నుపయోగించుట కాదు. వోటు సరియైనప్రతినిధుల నెన్నుకొనుటకు గదా హక్కు! ఇద్దరు ప్రతినిధులలో ఎవరు లోక కల్యాణమున కెక్కువసహాయులనిక్కదా ఆలోచింపవలసి నది. కాని కులమునుబట్టి కాదుగదా వోటు నిచ్చునది. అట్టిచో చదువుకొంటిమని విఱ్ఱవీగువారుకూడ కుల వివక్షులలో కాలము పుచ్చునపుడు వారివోటు ప్రయో జనమేమి? ఇదివిజ్ఞానము లేకపోవుటనేతనైనది. వోటు నెపుడును స్వలాభముకొరకు కుపయోగింపరాదు. ఇట్లు దుర్వినియోగముచేసిన దేశమునకు చెడుగేకాని మంచి కాదు. అందుచే విజ్ఞానము వెదచల్లుట ప్రభుత్వవిధి. ప్రతిమనుజునకును ఎట్టివారిని ప్రతినిధిగ నెన్నుకొనవల యునో, ప్రతినిధి చేయవలసినపని యేదో, వోటరునకును ప్రతినిధికిని గలసంబంధ మెట్టిదియో తెలియవలెను.

పూర్వము చెప్పినటుల ప్రతివారును చట్టముల చేయజాలరు. ప్రతివారును ఒకపని నిచ్చగింప వచ్చును; కాని చేయుట తెలియకపోవచ్చును. మోటారు కారులో చాలమంది ప్రయాణము చేయుదురు; కావల సినచోటునకు పోయెదరు; కాని నడపునది డ్రైవరు మాత్రమే. రాజ్య మొకపెద్దకారువంటిది. ప్రయా ణీకు లెచటికి తీసికొనిపొమ్మనిన డ్రైవ రచటికి కొని పోవలయును. వారు దాని కధికారులు, స్వాములు; కాని ప్రతిప్రయాణీకుడును కారు నడుపుటకుసిద్ధముగుటకు వీలులేదు. ప్రయాణీకులపని తమ కేప్రదేశమునకు, ఏదా రిని పోవలయునో చెప్పుటయే; కాని నడపునదిమాత్ర మావిద్యనేర్చిన డ్రైవరే.

అటులనే చట్టము లెటువంటివి, ఏవిషయముల గురించి నిర్మింపబడవలెను అని మాత్రమే ప్రజలు తెల్ప గలరు. కాని చట్టములను నిజముగ నిర్మించునది, ఎన్ను కొనబడినప్రతినిధులే. అందుచేత అట్టివిధానమును తెలిసినవారిని, ప్రజలకు కావలసినసంగతులను వారి యభిప్రాయములను తెలిసికొని సభలయందు చెప్పగల వారినే వోటర్లు ప్రతినిధులుగ నెన్నుకొనవలయును; ఎవ రట్టివారు కారో తెలిసికొనవలయును.

అట్లు చట్టములను చేయవలసియుండుటచే సం ఘము వారికి కొంత శక్తి (Power) నిచ్చుచున్నది. ఆశక్తిని వారు ఎట్లుపయోగింపవలయునో చెప్పునది వోటర్లు ఆశక్తిని వారి కిచ్చినది దేశమునకును సంఘము నకును మంచిచేయుమనికాని తనబంధుమిత్రుల కుప యోగించుకొనుమని గాదు. అందుచే ఎవరుదుర్వినియోగ ముచేయుదురో, ఎవరు సద్వినియోగము చేయుదురో తెలిసికొని ఎన్నుకొనవలయును. దీనికికూడ విజ్ఞాన మవసరము.

ఇట్టి విజ్ఞానము ప్రజల కందరికిని తెలిపి అంద రికిని వోటుచేయుటకు హక్కిచ్చితీరవలయును. విజ్ఞా నము పౌరులకు లేకుండ జేసి, విజ్ఞానము లేకపోవుటచే వోటు నీయుటలేదని చెప్పుటకంటె అన్యాయము మరి యొకటి లేదు. అట్టివిజ్ఞానము ఎవరికి కలుగవీలు లేదో వారు—పిచ్చివాండ్రు, మొదలయినవారు— మాత్రమే వోటున కనర్హులు.

వోటిచ్చినయెడల దేశమునకు ముప్పు నెవరు తీసికొనివత్తురో, వారికి మాత్రమే ఈయకూడదు. కాని కులముపైనను, భాగ్యముపైనను నిది యాధార

పడి యుండకూడదు. విజ్ఞానములేనివారివోటు వ్యర్థమే కాక దేశారిష్టముకూడను. లంచములిచ్చుట, పుచ్చుకొనుట దేశక్షేమంకరములు కావు. అట్టివారికి వోటీయకూడదు. లేదా, అట్టివి జరుగనటుల చూడవలయును.

ప్రతినిధు లెన్నికసమయమున వోటర్లతో వారికి 'కొండమీదకోతిని' తెచ్చి యిచ్చెదమని చేయు నసంభవ వాగ్దానముల నమ్మి మోసపోక వోటును తగినప్రతినిధికే యీయవలయును. తనలాభముకన్న, దేశకల్యాణమే యెక్కుడుగ నెంచుకొనవలయును.

ఇది వోటర్ల ధర్మము. వోటు పైనచెప్పినట్లు దేశమునకంతకును మేలుకూర్చుప్రతినిధుల నెన్నుకొనుటకు—తానుగూడ సమర్థుడై ప్రతినిధిగ యెన్నుకొనబడవచ్చును.—గలహక్కు— అనగా తాను తనచేతనయినంతమంచిని దేశమునకు చేయ వాగ్దానము చేసినా డన్నమాట. అందుచే నీహక్కు పరమపవిత్రము, పాడుచేయ వలనుపడనిది. తప్పుగ నుపయోగింప కూడనిది.

ఇట్టిహక్కును, రాబడి, ఆస్తి, విద్యలపై నాధారపడజేయుట ధర్మముకాదు కావునను, ఒక్క విచక్షణ జ్ఞానమే ముఖ్యమగుటచేతను, అట్టివిచక్షణజ్ఞానము విజ్ఞానమునూలమున నే యలవడును కానను, విజ్ఞానమును నిరూపించుటకు పిచ్చివాండ్రుమొదలయినవారి కడ తప్ప, వీలులేకపోవుటవలనను కొందరికి వోటు చేయుటకు హక్కియకపోవుటయన వారికి తమచేతనయినంతమంచిని సంఘమునకు చేయునవకాశము కల్గింపకపోవుట యగుటవలనను, వోటు పౌరులందరికిని ఉండవలయును. (Universal suffrage) (స్త్రీపురుషవివక్షత యుండరాదన నక్కరయే లేదు గదా !) ఏమైన కష్టములున్నయెడల వాటిని ప్రజలకు విద్యగరపుటమూలమున తొలగింపవచ్చును.

వోటుహక్కియకపోయిన వానిని మనుజునకన్న తక్కువగ చూచుచున్నా మన్నమాట. వారు పౌరులు కానేరరు. అందరికిని వోటు హక్కున్నపుడే యది నిజమయిన ప్రజాస్వామికపరిపాలనము. మిగిలినవాటిని 'ప్రజాపరిపాలనము' లనుట పొరపాటు.

---



సింహళ రాజధానియగు అనూరాధపురముననుండి కొనితెచ్చి పాతిన అశ్వత్థవృక్షశాఖ

సారనాథము

—సి. జి. జగన్నాథదాసు.

చెన్నరాజధానియందు ౧౯౩౧-వ సంవత్సరము జూలై ప్రారంభము మొదలు సెప్టెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

### కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

పంచపాండవుల అజ్ఞాతవాసము—పురాణం పిచ్చయ్య, సి. చిన్నయ్య

మయూరధ్వజచరిత్రము—కె. సంజీవమూర్తిరావు

మృత్యుంజయవిలాసము—వి. రామమూర్తి

రఘువంశము, భా. ౧—(ప్ర) డి. పి. శాస్త్రి కో, నెల్లూరు.

విజయాభిమన్యుజన్యము—కొమండూరు వెంకటరామానుజాచారి

శుచిముఖి—నూకల సీతారామమూర్తి

శ్రీకృష్ణార్జునీయము—కొమండూరు వెంకటరామానుజాచారి

సూర్యవంశము—యం. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

### —కల్పితములు

కథారత్నావళి—యం. భాస్కరరావు

కాదంబరి, భా. ౧—(ప్ర) యం. నాగలింగశాస్త్రి, తెనాలి.

నూతనకథలు, భా. ౧—సి. శ్రీనివాసరావు, ఆదోని.

పల్లెటూరి కథలు—యస్. సుబ్బరావు

### —చారిత్రకములు

ఆంధ్రరమణీమణులు—ఆంధ్ర శేషగిరిరావు

మహానుభావులు, భా. ౨—శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రి

సార్వభౌములు—కొప్పర్తిభానుమూర్తి.

సాహసిక వీరచరిత్ర—దువ్వ శేషగిరిరావు

హిందూదేశ చరిత్రకథలు, భా. ౨—ద్రోణంరాజు సీతారామరావు

హిందూదేశ చరిత్రకథలు, తరగతులు, ౪, ౫—జి. రంగరావునాయుడు, కె. జగన్నాథం

### కల్పములు

మంగళగౌరీ పూజావిధానము—(ప్ర) ఆంధ్రదేశవర్ణాశ్రమసభ, బెజవాడ.

శ్రీవరసిద్ధి వినాయకపూజా కల్పము, పద్యములు—(ప్ర) వెంకటసుబ్బయ్యశాస్త్రి, వేటపాలెం.

శ్రీ సత్యనారాయణవ్రతకల్పము—(ప్ర). వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

### గణితశాస్త్రము

గణితచంద్రిక, తరగతులు, 3, ౪—యస్. రంగరావు

ప్రారంభ గణితము, బుక్. ౧—కె. యస్. శ్రీనివాసాచారి.

బాలబోధ గణితశాస్త్రము, బుక్. ౫—స్వామికన్.

సర్వేగైడ్—కె. సుబ్బరావు.

### గేయములు

అంబోపాఖ్యానము—పి. సుబ్బరాయకవి

కలికాల శృంగారపాటలు—ఆత్మకూరు నరసింహదాసు

దేశీయగీతములు—(ప్ర) సాధన పబ్లిషింగ్ హౌస్, అనంతపురము.

నిజభక్తభజనకీర్తనలు, భా. ౧—చిల్లర నారాయణదాసు

శ్రీ వేంకటేశ్వర బృందావన భజనకృతులు—యం. సుబ్బరామదాసు

సంగీతకీర్తనలు—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప —పద్యము. ప్ర.—ప్రకాశకులు భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

స్వరాజ్యపదని—సూరిదాస్

## చరిత్ర

ప్రపంచచరిత్ర—(ప్ర) పంచానన గ్రంథమాల, సోంపేట.
హిందూదేశచరిత్ర—డి. అప్పారావు, ఆర్. సూర్యనారాయణ
హిందూదేశచరిత్రము, భా. ౧—సి. యస్. శ్రీనివాసాచారి

## చట్టము

అంతర్జాతీయ ధర్మశాస్త్రము—వల్లూరి సూర్యనారాయణరావు

## జీవితములు

తెనాలిరామకృష్ణకవి జీవితము—మునగాల సత్యనారాయణ
దేవిజోన్—జి. లింగయ్యనాదరి
నానారాజన్య..విఖ్యాత జనచరిత్ర—యస్. వీరబ్రహ్మకవి
వేములవాడ భీమకవిచరిత్రము—యం. శ్రీరామమూర్తి
సర్దార్ భగత్సింగు జీవితచరిత్ర—సి. కృష్ణస్వామిశర్మ

## నవలలు

యుగంధరవిజయము—(ప్ర) యం. రామకృష్ణరావు, నెల్లూరు.
లవంగలత—(ప్ర) కె. రంగయ్య, నరసపూరు.
వ్రజరాణి—(ప్ర) ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.
శశిరేఖ—నందివాడ కామేశ్వరరావు

## నాటకములు

ఆశ్చర్యచూడామణి—(ప్ర) మల్లాది వెంకటవిశ్వనాథశర్మ, విజయనగరము.
ఉత్కలపతనము—పురిపంత అప్పలస్వామి
ఉత్తరాకల్యాణము—బి. పాపయ్యశాస్త్రి
కల్లుపెంట—పప్పూరు రామాచార్యులు
గర్వభంగము—బండారుమోషె
సత్యహరిశ్చంద్రీయము—బలిజేపల్లి లక్ష్మీకాంతకవి
సావిత్రీపరిణయము—శేతవరపు వెంకటశాస్త్రి

## నీతి

నీతికథలు, భా. ౧,౨,౩—ఐ. విఘ్నేశ్వరరావు
నీతికథాగుచ్ఛము. భా. ౨,౩—పి. బాలకృష్ణరెడ్డి
నీతికథారత్నావళి—దాసరిలక్ష్మణస్వామి
నీతిచంద్రికాసంగ్రహము—ఐ. విఘ్నేశ్వరరావు
సదుపదేశకథలు. భా. ౧,౨,౩,౪—మహావాది వెంకటరత్నం
సుఖాధారపులోకనీతి—(ప్ర) వి.యస్.స్వామినాథన్, మధుర.

## పరిశిష్టము

అంబికపల్యగ్రహారచరిత్రము — పెండ్యాల రామశాస్త్రి
కలికాలమహిమ—కె. సుదర్శనదాసు
కాశీసారము—(ప్ర) యం. వెంకటరత్నకవి, అనమనమూరు.
కులలక్ష్మి—వడ్లమూడి వెంకటరత్నం
గాంధీమహాత్మునిచరిత్రము దసరాపద్యములు—అద్దంకి వెంకట జగన్నాథాచారి
గీతమంజరి—చిలకమర్తి లక్ష్మీనరసింహం
గాతవిూవాచకము తరగతులు ౪, ౫ — పి. సోమన్న
గ్రామపునర్నిర్మాణకేంద్రసమిష్టి నివేదిక—(ప్ర) జి. రాఘవశర్మ, గుడ్లవల్లేరు.
ద్రావిడభావములు—జి. జె. సోమయాజి.
నానాదేశసహకారము—జె. సత్యనారాయణ
నానారాజసందర్శనము—తిరుపతి వెంకటేశ్వరకవులు
నిలకడపద్ధతులు—(ప్ర) రెవరెండ్ జాన్. సి. ప్రైస్ ఫ్రోక్, తణుకు.
పుష్పమాల—కె. ప్రభాకరశాస్త్రి
ప్రాథమికోపాధ్యాయులకు ఉపయుక్తమగు వ్యాయామగ్రంథము—పి. ఉమామహేశ్వరశర్మ

బంగ్గు సేవ మహాసంచిక — (ప్ర) బి. శ్యామసుందర రావు, బరంపురము.

బాలభారతము—హసబ్నెస్ వాసుదేవరావు

బాలరామాయణము—హసబ్నెస్ వాసుదేవరావు

భీడీపురాణము—బి. శ్రీరాములు

భావతరంగములు—కె. అహోబలరావు

మల్లికాంబ—ఏ. రామకృష్ణరావు

లోకజ్ఞాన పాఠములు, తరగతులు 3, ౪, ౫—కె. గోపాలకృష్ణ, చ. అనంతరావు.

విశాఖపట్టణముజిల్లా ఆది ఆంధ్రమహాజన సంఘము—(ప్ర) కి. వై. సదానందరావు, భీమిలిపట్నం.

శ్రీ ఉమామహేశ్వరై కాంతసేవ—వై. వీరేశ్వరశాస్త్రి

శ్రీపోలురాజీయము—ఆరాధ్యుల వెంకటరామరాజు

శ్రీమద్వేదార వ్రతాఖ్యానము — పి. పరబ్రహ్మకవి

శ్రీరామాశ్వమేధయాగము—పురాణంపిచ్చయ్యశాస్త్రి

సకలతీర్థక్షేత్ర యాత్రదర్పణము—యం. రామకోటీశ్వరరావు

సత్ప్రవర్తనము—జె. శేషాద్రిశర్మ

సర్వోదయము — (ప్ర) మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు.

సుఖాధారవాక్యములు—(ప్ర) వి. యస్. స్వామినాథన్, మధుర.

స్వరాజ్యజండా—శృంగవరపు సీతారామాచారి

హాస్యగాని కలాపము—కె. వెంకటరత్నం

హిందిమొదటి పుస్తకమునకు తెలుగు అనువాదము—(ప్ర) దక్షిణభారతహిందిప్రచారసభ, మదరాసు.

హిందూదేశ సహకారము—యస్. కామేశ్వరరావు

హిందూస్తాని తెనుగుబోధిని — యం. యల్. యన్. శాస్త్రి

## పారిశ్రామికము

కుట్టుపని—కె. జాలరామరావు

## ప్రకృతిశాస్త్రము

శాస్త్రవాచకము, తరగతి, ౭—చ. యస్. ప్రకాశరావు, కె. హెచ్. వి. యస్. నారాయణ

## ప్రబంధములు

అనర్ఘరాఘవము—(ప్ర) బి. చంద్రశేఖరరెడ్డి, పల్లెపాడు.

ఆంధ్రకాదంబరి—పి. పూర్ణప్రజ్ఞాచార్యులు

## భూగోళశాస్త్రము

ఒంగోలుతాలూకా భూగోళము—డి. సత్యనారాయణమూర్తి

గుంటూరుతాలూకా చరిత్రభూగోళము—మాదిరాజు రాధాకృష్ణమూర్తి

తిరువూరుతాలూకా భూగోళము—ఆర్. అప్పలరాజు

తెనాలితాలూకా చరిత్ర భూగోళము — మాదిరాజు రాధాకృష్ణమూర్తి

బాపట్లతాలూకా చరిత్ర భూగోళము—మాదిరాజు రాధాకృష్ణమూర్తి

భూగోళశాస్త్రము—యం. వెంకటేశ్వరరావు

భూగోళశాస్త్రమును బోధించు విధానము—డి. సత్యనారాయణమూర్తి

## భౌతికశాస్త్రము

భౌతికశాస్త్రము, బుక్ ౨, 3—కె. యస్. సుందరరాజ అయ్యంగారు

## మతము—హిందు

దివ్యప్రబంధమార్గ ప్రదీపిక—యన్. వెంకయ్య

మతధర్మము—పి. ఉమామహేశ్వరపండిట్

స్నానవిధి—బి. రామచంద్రాచార్యస్వామి

## —ఇతరములు

ఆంధ్రఇవాంజెలికల్ లూథరన్ సంఘనిర్మాణ విధానము, నిబంధనలు—(ప్ర) రెవరెండ్ జాన్. సి. షైన్‌ఫ్రాక్, తణుకు.

ఇస్లామ్ అనసేమి—(ప్ర) ఆంధ్రముస్లింసంఘము, విశాఖపట్టణము.

క్రీస్తుమతమూలాధారము—అహమెడ్ షరీఫ్

జేసు మరియు జోజప్పగారి సభఅనబడు అర్చ్యశిష్ట కన్య మరియమ్మగారి సభకుజేరిన కన్యస్త్రీలకట్టు బాటు—(ప్ర) రెవరెండ్ జె. ఆలన్, నెల్లూరు.
దైవికస్వస్థత—యల్. జీవరత్నం
బైబిలువాచకము, తరగతులు, ౧, ౨, ౩—(ప్ర) ఏ. ఇ. యల్. చర్చ్, గుంటూరు
బైబిలువాచకబోధిని—(ప్ర) ఏ. ఇ. యల్. చర్చ్. గుంటూరు.
శ్రీ జేసునాథునకు జెయ్. (ప్ర). జోసప్స్ కన్వెంట్, గుంటూరు.

## మాహాత్మ్యములు

చౌడేశ్వరీమాహాత్మ్యము—౨. సుబ్బరాయకవి
విభూతిరుద్రాక్షమాహాత్మ్యము — సి. లక్ష్మీనృసింహశాస్త్రి

## వాస్తుశాస్త్రము

శ్రీకృష్ణవాస్తుశాస్త్రము—(ప్ర) వి.రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

## విమర్శనము

విమర్శతరంగిణి, భా. ౧—యన్. వీరరాజుపంతులు

## వేదవాఙ్మయము

వైదికవాఙ్మయచరిత్రము—కె. సత్యనారాయణచౌదరి

## వేదాంతము

అహంగ్రాహిని—ఏ. పుండరీకాక్షుడు
ఘటకాంతోపదేశము—ఘ. కాంతయ్యకవి
మణిద్వీపము—జె. సూర్యనారాయణ
శ్రీమదాంధ్రభగవద్గీతా పద్యమాలిక (ప్ర). కె. బ్రహ్మయ్య, మదరాసు.
సుజ్ఞానసుధాకరము—సాంగల అప్పన్నస్వామి

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రలక్షణచంద్రిక—(ప్ర).రామాఅండ్ కో., ఎల్లూరు.
సంక్షేపణరూపమైన వ్యాకరణము—వై. జి. శామెల్
సరళవ్యాకరణము, భా. ౧, ౨—కె. వి. కృష్ణమాచార్యులు

## శతకములు

నృసింహశతకము—(ప్ర) ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము
రామశతకము—యస్. సుబ్బరావు
విశ్వకర్మశతకము—బి. కోటయాచార్యులు
విష్ణునామానందశతకము—యన్. వెంకయ్య
శ్రీబలరామశతకము—శాతలూరు సుభద్రాచారి.
శ్రీ వేణుగోపాలశతకము—యస్. వెంకటరామయ్య

## సారస్వతము

సారస్వతోపన్యాసములు—ఆర్. అనంతకృష్ణశర్మ

## స్తోత్రములు

మారుతి— యం. రామకృష్ణయ్య
శ్రీచేజర్ల కపోతేశ్వరనక్షత్రమాల, ఎనమదల సీతారామస్తవము—పి. శ్రీనివాసరావు
శ్రీమదాంధ్ర దేవీస్తోత్రము—టి. చంద్రమౌళి
శ్రీరామచంద్రస్తోత్రమ్—ఆర్. వేంకటలక్ష్మీనృసింహశాస్త్రి
శ్రీలలితా సహస్రనామస్తోత్రమ్. (ప్ర). వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు.
శ్రీ వీరాంజనేయతారావళి—పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు
స్తవమంజరి—(ప్ర). పశ్చిమగోదావరిజిల్లా నాన్ మిషన్ యైడెడ్ ఎలిమెంటరి టీచర్ మానేజర్ అసోసియేషన్, ఏలూరు.
శ్రీహరిధ్యానపద్యములు—ఉప్పలవెంకటకవి

## హరికథలు

అంబరీషోపాఖ్యానము— పింద్రిప్రోలు నారాయణమూర్తి

# జీవితరహస్యము

కీ. శే. జనమంచి వేంకటరామయ్య

కలయనుకొందునో నిజముగాఁ గయికొందునో లేక రేవగల్
గలసినసంజయందునో తలంపఁగ దేవరహస్యమట్టులై
తెలియఁగరాకయుండెడును దెల్పెడివారును గానరా రిఁకన్
వెలువడు టెట్టు లిద్ది కనువెల్తురునుంగను మర్త్యవాక్కునన్. ౧

అరుదగు మర్త్యజీవితరహస్యము! దీని నెరుంగ భూనభో
తరమున సందుగొందుల ససారతముం బరికించి చూచితిం
దిరిగితి సాధుసంగతిని, దిర్గఁగవైచితి గ్రంథకోటులన్
మఱియుఁ దదేకనిష్ఠమెయి మౌనము దాల్చి తపంబు సల్పితిన్. ౨

చుక్కల మెల్లగా నరసి చూతమటంచును మింటివంకనేఁ
జక్కని చిమ్మచీఁకటిని జీమచిటుక్కన నాలకింపనౌ
నొక్కనిశీథవేళఁ జెవియొగ్గి వినం దమకించుచుం గనన్
దక్కుచుఁ దారుచుం జనియెఁదారకముల్ ననుఁ జూడకుండనే. ౩

చక్కనివాఁడటంచును రసాత్మకుఁడంచుఁ గళావిభూతిఁ బెం
పెక్కినవాఁడటంచు మదినెంచి భజించితిఁగాని చంద్రుఁడుం
బక్కనవ్వెడుం గడుపువ్రక్కలుగా ననుఁజూచి, వెఱ్ఱినై
త్రొక్కుడులాడుచుంటకును, దూరపుఁ గొండలను న్వెఱుంగమిన్. ౪

---

## ఒక సవరణ

కడచినసెల భారతిలోని 'హిందూమతాచారములు: ప్రభుత్వపు అధికారబాధ్యతలు' అను నావ్యాసమున ౨౮౩-వ పుటలోని (ఆలిండియా రిపోర్టరు ౧౯౨౮ మద్రాసు ౧౧౮ పేజీ చూడుడు) అను కుండలీకరణమునందలి '౧౯౨౮'ని '౧౯౨౯' అనియు, అదే వ్యాసమున ౨౮౪-వ పుటలో రెండవకాలమున ౧౯-వ పంక్తియందు '౫ సం. లకు' అనుదానిని '౫౦ సం. లకు' అనియు చదువుకొనునది.—కో. శ.

---

ఈకావ్యము ౧౮-౧౦-౨౮ తేదీని మొదలుపెట్టి అట్లే అసంపూర్తిగా వదలివేసినారు.

# క్షీరసాగరమథనము

బాలాంత్రపు వేంకటరావు

## అవతారిక

శ్రీపతులను సంస్మరించి నుతించి,
విఘ్ననాయకుల భావించి, సేవించి,
దాసానుదాసులఁ దలఁచి, చింతించి,
ప్రకృతిపురాణసారము సంగ్రహించి
పాలేటిమథియించుపట్టుఁగన్గొంటిఁ
గని విని మెఱుఁగని కథఁ జెప్పుచుంటిఁ
జెవియిచ్చివినరయ్య ! శివభక్తులార !
ఆలించి వినరయ్య ! హరిభక్తులార !

శ్రీకాసపడి మ్రొక్కు చెల్లించుకోరె ?
ఆనాఁటి సుకవుల కదిజీవమైన ;
ధీ కాసపడి మ్రొక్కు తీరిచికోరె?
యీనాఁటిసుకవుల కిది భావమైన ;
వారికి వీరికి వ్యంజనం బైన
తలఁపుల పాలేఁటితరి వెన్న యిడుదుఁ
జెలిమిచేఁ గొనరయ్య ! శ్రీమంతులార !
తెలివిచేఁ గొనరయ్య ! ధీమంతులార !

జగదీశతత్త్వంబుఁ జదివినకవులు
ప్రకృతితత్త్వంబును బాడినకవులు
నేఁడును నాఁడు నెన్నికఁగన్నకవులు
తడవరే మూలంబు తమకావ్యకథల
నామూలగాథాసుధాసారపూర
మనుభవజ్ఞులకెల్ల నమృతోదకముగ
సుకృతిమూర్తులకెల్ల శుద్ధోదకముగఁ
గల్పింతుఁ, దత్కథాక్రమ మెట్టిదనిన—

క్షితి దైత్యకులమునఁ జెన్నొందువారు
అతిబలాఢ్యులు బలి, హలి యనువారు
చెవిసోఁకఁగానీరు శ్రీవిష్ణుపేరు
భవభక్తు లనిపేరు బడసినవారు
హరిసిరి నెటులైన హరియింప నెంచి
హరునిచే వరముల నందఁదలంచి
యురునిష్ఠ వింధ్యాచలోత్తరశిఖరిఁ
జిరకాలము తపంబుఁ జేసిరి వారు—

దానవపతు లిట్లు దారుణభంగిఁ
దపము సేయఁగ వారితనువులఁ బొంగి
పావకజ్వాల లుప్పరమున కెగసి
చద లాక్రమించి భూచక్రంబుఁ గప్పి
జీవసంఘంబులఁ జీకాకుపఱుపఁ
బరమేష్ఠిపంపునఁ భాగవతుండు
కలహాభోజనుఁడు నిక్కపుహితుఁబోలి
దితిజుల దర్శించి దీవించియనియె—

చిఱుతప్రాయమునాఁడె శివుని మెప్పించి
వీరభద్రునిఁగూడి విశ్వాంగణమున
దక్షునియజ్ఞంబు ధ్వంసం బొనర్చి
వీరయుద్ధంబున విష్ణుఁ దట్టించి
దివ్యమునీంద్రుల దేవసంఘములఁ
బలుపాట్లఁ బెట్టించి ప్రౌఢిఁ గాంచితిరి ;
ఈరేడుజగముల నీ డేది మీకు ?—
దానవపతులార! తపమేల మీకు?—

మును రమణాచలంబున దపంబుండి
కెరలి యగ్గిరి తలక్రిందుఁజేసితిరి ;

చంద్రమండలమున జపము గావించి
జీవన మచట శుష్కింపఁ జేసితిరి ;
సూర్యమండలమును జొచ్చి యచ్చోట
విధివిప్లవాంగార వృద్ధిఁ గూర్చితిరి;
మీతపోమహిమ సమృద్ధంబు గాదె !
జగమేలుకొనుఁ డింక జపమేల మీకు ?—

నావిని, బలి నవ్వి, నారదుఁ గాంచి
వలనుగాంచినభాగవతశిఖామణివి,
నాఁ డాడితివి కదనము పురివెట్టి,
నేఁ డాడెదవు మమ్ము నిపుణులు వోలె,
వీరభద్రుం డేల? విగ్రహ మైన
మా శక్తి చాలదే !-మఱచిపోయితివె ?
వైకుంఠపతి వీడివచ్చిననాఁట
భయముతో మావెన్క పాడినపాట !—

మముఁ దెల్పితివి మేలు మాటలాడితివి,
మఱలిపోవుదుగాక! మరియాదఁ దలఁచి,
కైలాసనగముపై ఘనయోగనిద్రఁ
గనుమోడ్చియున్న ముక్కంటి మేల్కొల్పి
మఱలిపోనేర్తువే?—మాను మీనడత,
లావిష్ణుసిరి కొల్లలాడినదాఁకఁ
ద్రిభువనలక్ష్మి వరించినదాఁకఁ
దపమేల మానుపఁ దలఁతు మునీంద్ర !—

ఉన్నయట్టులె మాట లూఁదిపల్కుటనొ
తిన్నయింటనె పోరు తెచ్చిపెట్టుటనొ
కలహభోజనుఁ డను ఖ్యాతిఁ గాంచితివి
తల నిట్లు వ్రాసిన తండ్రిని దెగడి
తనకుఁ గొల్విచ్చిన తాతను బొగడి
జగములఁ దిరుగుట సరిపోమె నీకు,

మముఁబోంట్లఁ జెనకుట మాటలపనియె ?
తిన్నగాఁ బొమ్మింక దేవమునీంద్ర !—

అని పల్కి బలిదైత్యు నాంతర్య మెఱిఁగి
మాఱువల్కఁగ నోడి మఱలె నారదుఁడు ;
సురముని వెల్లనై సురిఁగిన వెనుక
శుచిమతులై వారు శూలిని గూర్చి
నిరవధికతపంబు నిష్ఠఁ గావింపఁ
బశుపతి దనుజులభక్తికి మెచ్చి
నందీశ వాహనానందుఁడై వచ్చి
పార్వతీసతితోడఁ బ్రత్యక్షమయ్యె—

తెల్లనినందిపై దేవితోఁ గూడి
సాక్షాత్కరించినస్వామినిఁ గాంచి
పులకితగాత్రులై పూర్వదేవతలు
శ్రుతిమనోహరముగా స్తుతియించి రిట్లు—
'సోమసుందరమూళి ! చూడుము మమ్ము
కామతమోహేళి! కావుము మమ్ము
భద్రామనోహరా! పాలింపు మమ్ము
అర్ధనారీశ్వరా ! ఆలింపు మమ్ము—'

భవబంధనము లేదు, పరుఁడవు నీవు
గుణబంధనము లేదు, గురుఁడవు నీవు
ప్రకృతిబంధము లేదు, ప్రభుఁడవు నీవు
ప్రకృతిలోఁ జొత్తువు ప్రకృతి సేవింతు
సంసారివయ్యు సుజ్ఞానుండ వీవు
అర్ధనారీశ్వరాద్యంతమూర్తులను
భవుఁడవై మముఁ బ్రోవఁ బ్రత్యక్ష మైతి
పాలింపవే మమ్ముఁ బార్వతీనాథ !—

సరసమోహన విశ్వసంకీర్తనముగ
గురుతరానంద సద్గురుకీర్తనముగ

సంసారతారణస్వరకీర్తనముగ
భక్తిప్రణయరూప భవకీర్తనముగఁ
గైవల్యభాగ్యసంగతకీర్తనముగఁ
బార్వతీపరమేశ పదకీర్తనంబు
వినిపింపఁగంటిమి; విశ్వదంపతులు
కనిపింపఁ గంటిమి కైవల్యపదము——

బలి, హాలి, శ్రుతిసూక్తిఁ బ్రార్థింప నిట్లు
కరుణాంతరంగుండు గంగాధరుండు
భక్తమందారుండు ప్రసన్నుఁడగుచు
"అసురనాయకులార! అనుజన్ములార!
వీరభద్రునికంటె వేయిమడుంగు
లాదరించుచునుందు నాత్మలో మిమ్ము
మీతపోనిష్ఠకు మెచ్చి యిచ్చటికి
వరమిచ్చి మెప్పింప వచ్చితి" ననిన——

సర్వేశ్వరుని సుప్రసన్న వాక్యములఁ
గన్నులానందాశ్రుకణములుగురియఁ
జేతులుజోడించి శివభక్తు లనిరి——
"వరముప్రసాదింప వచ్చితే వరద!
తనయులఁ దయఁజూడఁ దలఁచితే తండ్రి!
దానవకులవైరి దామోదరుండు
మముఁజూచి మాతోడ మాటాడుమాత్ర
నిశ్శ్రీకుఁడగునట్లు నీ విమ్ము వరము!——"

అనవిని శంకరుం డాత్మ శంకించి
తెలువేఁది, యర్ధాంగి దిక్కుఁ గన్గొనియె;
హిమశైలసంజాత యెలనవ్వు నవ్వి
యిగురుఁగెంగేల నందీశ్వరుఁ దట్టె;
మెడఁబైడిగంటలు మెల్లనమ్రోయ
మోమువాలిచి నంది ముంగాలు గదిపె;
దనుజు లీతడఁబాటు తముఁదామ యెఱిఁగి
శివుతేజి కెదురుగాఁ జేరి యిట్లనిరి.——

"అన్న! నందీశ్వరా! ఆఁగు మొక్కింత,
పరమేశుఁ డన్నింట బాధ్యుఁడైయుండ
నోఁగాము లెఱుఁగని యనుజుల మమ్ము
నూరడింపకపోవు టుచితమే నీకు?——
వరమిచ్చిపుచ్చుకో వచ్చును గాని
చనవిచ్చి వెనుదీయఁ జాఁగ మాతండ్రి
కన్నబిడ్డల మమకారంబుఁ దలఁచి
జగదంబ! నీవైన సవరింపవమ్మ!"——

"అఖిలేశ్వరజగన్నియంతవు నీవు
నీశాసనములకు నిలుపుండునయ్యా!
జగదంబ నవ్వించుసందడిగాక
నందిని గదలించు నటన మేలయ్యా
కొడుకుల యాచిన్ని కోరికఁ దీర్చి
మాయమ్మ నవ్వు క్రమ్మఱఁ గాంతుఁగాక!
తనయులఁదయఁజూచు తండ్రి వీ వనుచు
విశ్వవిఖ్యాతిమై వెలయుదుగాక!"

నావిని, బొమ్మచందంబున నట్లె
యున్నచోటనె నిల్చియుండె నా నంది;
ఆపరమేశ్వరు నర్ధాంగలక్ష్మి
చిత్రవిచిత్రంపు జెలువంబుఁ దాల్చె,
భక్తుల కార్యతత్పరతను జూచి
ప్రకృతిస్థుఁడై యుమాపతి తల యూఁచి
యాంతర్యమున మెచ్చి యభయంబు నిచ్చి
చిఱునవ్వుమొగమునఁ జేర్చి యిట్లనియె.——

"దానవపతులార! తబ్బిబ్బు లేదు,
విశ్వపాలకుఁడైన విష్ణుని వీడి,

శ్రీకాంత పెఱవారి చెంతమెట్లుండు ?
ఎడఁబాపుటొక్కటే యీడేరు మీకు ;
హరిభృగుశాపంబు, నమరేంద్రు నెడల
దుర్వాసుశాపంబుఁ దోఁచిన దిపుడు,
కాలకర్మంబులు గలసినచోట
మీ కామ్యసిద్ధులు మీకుఁ జేకూరు. ”

“హితవుసెప్పెదను మీ రిట్లుపోరాదు.
వేయిమాయలవాఁడు వెన్నుఁ డట్లయ్యు
హరిదాసులకు డాఁగఁడాంతర్య మిచ్చు
నటుగానఁ గార్యార్థులైన మీ రిపుడు
హరిభక్తవేషంబు లమరంగఁ దాల్చి
విష్ణుకీర్తనముల వెలయింతురేని
మాయాప్రియుండు మీ మాయలఁ జిక్కి
దర్శనంబొసఁగు మీ తలఁపు లీడేరు—— ”

భవుఁ డిట్లు వరమీయ, పక్కన నవ్వి
అగజాతభక్తుల నల్లనఁగాంచి
“సుతులార ! మీమాట సోఁకినయంత
పగతురు విభ్రాంతి పడునట్లు మీకు
శాంబరీమాయ ప్రసన్న మౌ” ననియె,
“ఈ త్రిశూలముఁగొని యేసితిరేని
అభిమతార్థంబు మీ కందు” నటంచు
నందుఁడై దితిజుల నంది దీవించె.——

అగజావిభునిచేత నంబికచేత
వరవృషాధిపుచేత వరముల నంది
బలిదానవుఁడు వారిఁ బ్రస్తుతిసేయ,
హలిదానవుఁడు వారి కంజలిసేయ,
భక్తసంస్తుతులకుఁ బ్రమదంబుఁ గనుచు
గిరివరాత్మజ తన్నుఁ గీర్తించుచుండ

నందీశవాహుండు నాగభూషణుఁడు
వేంచేసె నంబరవీథి; నావెనుక.——

పట్టెనామములతోఁ ఫాలంబు నిండఁ
తులసిపూసలపేర్లతో మెడ నిండ
శంఖచక్రములతో సరిదండ నిండ
గనకచేలములతోఁ గటితటి నిండ
నసురులు నిక్కంపు హరిదాసులట్లు
హరినామసంకీర్తనాలాపములను
బంగారువీణెలఁ బలికించుకొనుచు
వైకుంఠపురి చేరవచ్చి ద్వారమున——

జయవిజయులఁగాంచి సన్నుతుల్ నించి
మఱలవారలచేత మన్ననలంది
పరమేశ్వరువర ప్రభావంబువలన
సన్నిహితంబైన సాహిత్యశక్తి
వీణాశ్రుతుల మహావిష్ణునిమహిమ
బహిరంతరంబులఁ బలికించుకొనుచు
సంకీర్తనంబుల సాగించుకొనుచుఁ
బలికించి రావేళ భావగీతముల——

“నానోముఫలముగా నడయాడఁగంటి
నఖిలాండనాథుసింహద్వారమందు,
నాతపఃఫలముగా నాఁచికోఁ గంటి
నాత్మేశుహృదయ రాజ్యాధిపత్యంబు
పండులు కొఱికిన ఫల మిఁక లేదు,
కన్నెఱ్ఱఁజేసిన కథ యిఁక లేదు,
పదరకుము శుకంబ, పాడకు పికమ,
నాథుఁడు నేను మంతనముండు వేళ.——

మునుపీవు సుకృతివి మురళిఁ బల్కింప,
వెనుకథన్యవు నీవు వీణ మోఁగింప,

పాడకే కోకిలా, పలుకకే చిలుక,
నేనందుకొంటినా నీలాల మురళి,
నాచేతఁబడినది నాపైఁడి వీణ,
సూత్రధారిని నేనె, సుకృతిని నేనె,
హరినామసంకీర్తనామృత సేవఁ
జొక్కుదునానాథుఁ జొక్కింతు నింక.—

వైకుంఠపతి నిన్ను వలచివచ్చితిని
దేశదేశంబులఁ దిరిగివచ్చితిని
వెదకుచు వెదకుచు విమలపదంబు
సేవింపవచ్చితి సెలవీయు మింక,
సుదల యి మ్మింక నీ మోముఁ జూడంగ
విశ్వేశ! నీకయి వేచియున్నాను,
తలుపులు తెఱచి, చిత్తంబును మఱచి
హృదయేశ! నాకోస మెదురేలచూతు?—

సిరు లొల్ల నీపాదసేవయె కాని,
పదమొల్ల నీమీఁది భక్తియె కాని,
గౌరవంబొల్ల నీ కరుణయె కాని,
జ్ఞానంబు నొల్ల నీ స్మరణమె కాని,
అర్థినై దాస్యంబు నభిలషించితిని
వరదుండవైనాకు వైకుంఠవాస!
దర్శనంబు నొసంగి దాస్యం బొసంగి
ఆదరింపంగ నేఁడభయమీవయ్య!—"

భక్తు లీవిధముగాఁ బాడి కూయిడఁగ
నగరిలో లక్ష్మీకానందంబు గాఁగ
సొగటాల నాడుచు సోలి, యాలించి
'అభయ మిచ్చి'తి నని యబ్జాక్షుఁ డనియె;'
ఆటమోడితి రిప్పు డభయ మెవ్వరికో?
సెలవీయుఁడని లక్ష్మి చిఱునవ్వు నవ్వె;
హరి లేచిమాట్లాడ కాస్థాని కేఁగె,
జేసినపని కంత సిరి చిన్నవోయె.—

నాలుగుమూలల నగరిలో నంత
హరిదాసులనుగూర్చి యబ్జాక్షుఁ డిడిన
యభయవాక్యంబున కలజడి పుట్టె;
తుంబురుం డిటునటుఁ దోఁచక తిరిగె;
నారదుం డున్నజ్ఞానంబు నశింప
గరుడుని చెవిలోనఁ గాఁబోలు, నేమొ
యూఁది వెల్లమొగంబు నొంది బ్రాన్పడియె;
తనతప్పె లక్ష్మికి తలమీఁద నుండె.

తుది కంద తేకమై త్రొక్కుడుల్ గాంచి
దాసుల కభయంబు దగదని కొంత
విన్నవింపఁగ మహావిష్ణుని చెంత
కొకరొక్కరుగఁబోయి యుగ్గడింపటకు
తెగువఁ జేసిరి, కాని తేఁకువ లేక
యెవ్వరు ముందేఁగి యెఱిఁగింపవలెనో
మతి దప్పి శాంబవీ మాయకు లోఁగి
తేలక, యిందందుఁ దిరిగి, యాపిదప—

తుంబురుం డిది దుష్ట దోహదం బనియె,
నారదుం డిది విధానంబు గా దనియె,
వైనతేయుఁ డిది వరుస గాదనియె,
గుడుసువా లిది మాయఁగూరుట యనియె,
కంతుం డిది ప్రమాద కారణం బనియె
లక్ష్మి యియ్యది భయాలంబనం బనియె,
ఎవ్వ రేమాడిన నేమి?— యర్థులకుఁ
బలు కిచ్చి తప్పనే ప్రభుమూర్తి యతఁడు!
హరియురంబున లక్ష్మి యలిగి కూర్చుండె,
చక్రంబు బుజమున పసిదప్పి పడియె,

గరుడుండు పాదాలకడఁ బడియుండె,
మన్మథుం డాత్మలో మత్సరపడియె,
వీణతీగలు తెంపివేసెఁ దుంబురుఁడు,
మతి దప్పి యిటునటు మసలె నారదుఁడు,
సంసార మిట్లుండ సారసాక్షుండు
బెదరక దాసులఁ బిలిపించుకొనియె—

వినమితగాత్రులై వీణాస్వనములఁ
గంఠ స్వరమ్ములు గలిపి, శ్రీనాథు
శోభనముఖమునఁ జూపులు నిలిపి,
హరినామసంకీర్తనాలాపములను
తముఁదామ మఱచి నృత్యముఁ జేసికొనుచుఁ
బరతెంచుచుండినభక్తులఁ గాంచి
కుశలకటాక్షముల్ కొసరి విభుండు
తేనియపల్కులఁ దేర్చియిట్లనియె—

"గాడవలులేవుగా గుమ్మమునొద్ద?
తడవయ్యెనే మమ్ముఁ దరిసింప మీకు?
దాసానుదాసుని తప్పు సైరించి
చనుదెంచినా రంతెచాలు భాగ్యమున;
దాసులు చుట్టాలు, దాసు లాత్మజులు,
దాసులే యుసురులు తన కెల్లయెడల,
తనకు దాసులకు భేదంబెందు లేదు,
దాసులఁ జూచితి ధన్యుండ నైతి.—"

అనవిని యుప్పొంగి హరిదాసు లనిరి-
'దానవవైరి! మా తపములు పండెఁ
గువలయాధీశ! మా కోర్కులు నిండె
శ్రీనివాసునిదయఁ జేసి యీనాఁడు
దాసులజన్మముల్ ధన్యంబు లయ్యె;
కన్నులుకన్నులు గలిసికొన్నపుడె
చిత్తంబు, చిత్తంబుఁ జేరినయపుడె
మావరంబులపంట మాకు లభించె—'

అని వినుతించుచు నసురనాయకులు
లక్ష్మీశుపదకమలములకు మ్రొక్కి-
బలిపాటఁ బాడఁగా బ్రహ్మానుభూతి
నందినట్టులు హరి యూడంగఁదొడఁగె;
వరభక్తి కదిపాగ వశ్యచిహ్నముగఁ
బద్మాక్షుఁ డాత్మలో భావింపఁ దొడఁగె;
హరి వీణమీటఁగా నద్భుతానంద
పరవశుం డై బలి పాడంగఁ దొడఁగె.—

"హృదయేశ! ప్రాణమే యిచ్చిన నిన్నుఁ
గాననియొకనాఁడు కసరితిట్టితిని,
పలుకనియొకనాఁడు ప్రాకులాడితిని,
నిలుచునే కోపంబు నినుఁ గన్నయంత?
నన్నాడుకొనునంగనాచు లేద్వంగ
నాకంటఁ బడితివి నా కంతె చాలు,
నన్నుఁ బతిమాలితి నా కంతె చాలు,
సరసఁజేరితి హరీ! చరితార్థ నైతి.—"

"హృదయంబుతోడనే యెగిరి రాలేక
ఆత్మేశ! నీయెడ నపచారి నయ్యు,
భావంబు వెంటనే పరువెత్తలేక
అఖిలేశ నీయెడ నపరాధి నయ్యు,
మదిలోన నీదివ్యమంగళాకృతిని
సేవించుకొంటిని జేరితి నిన్ను!
తలఁపులో నీ దివ్య తత్త్వరూపంబుఁ
గల్పించుకొంటిని గాంచితి నిన్ను."—

"పదము లొత్తఁగనేర్తుఁ, బాడంగనేర్తు
భావ ముంపఁగనేర్తుఁ బచరింపనేర్తు

గృతులు దీర్పఁగనేర్తుఁ గీర్తింపనేర్తుఁ
జిత్త మత్తగనేర్తు సేవింపనేర్తు
భక్తి సేయఁగనేర్తుఁ బాలింపనేర్తు
నాలించి నాదాస్య మంగీకరించి
సెలవిమ్ము నేనేమి సేయంగవలెనో ?
నాథ ! నీచిత్తము, నా భాగ్య మింక.—"

"వక్షంబు బరువెక్కె వరద నీ కిపుడు
శ్రీకాంత నానెత్తిఁ జేర్చికోనిమ్ము ;
భుజములు నొచ్చెను భువనేశ, నీకు
భూకాంత నాభుజంబుల మోవనిమ్ము ;
శంఖచక్రంబుల సకలాయుధముల
నఖిలాంగకములు కాయలు కాచిపోయె
దాస్యంబు సేయ నే దగ్గఱనుండఁ
బ్రభువరా ! నీకిట్టి బడలిక లేల ? —"

అని దానవుఁడు పాడ నబ్జనాభుండు
ఆశాంబరీప్రభావాహతుండగుచు
నది భక్తులప్రపత్తి కానవాలనియొ
అది దానవరులభక్త్యావేశ మనియొ
అది భావసంకీర్తనానంద మనియొ
అదిశ్రుతిసుఖముగా నాలించెఁ గాని
అది యమంగళవాక్య మనుకొనఁ డయ్యె
ఆగ్రహింపఁగనేరఁ డయ్యె నందులకు...—

ఆయమంగళవాక్య మాలింపలేక
ధృతి యేది శ్రీకాంత తెరలి మూర్ఛిల్లె ;
తమ్ముఁ దామెఱుఁగక తార్క్ష్యాదులెల్లఁ
జేష్టలఁ దక్కిరి చింతలఁ జిక్కి !
మాయచే స్మృతివీడె మాధవుఁ డంత,
అదనెంచి శూలాన హరిబొమ్మ నొంచి

కమలతో వనమాల కౌస్తుభమాల
హరియించి దానవు లరిగిరి సురిఁగి—

పోయె లక్ష్మియటంచుభూనభోంతరము
లొక్కట మార్మ్రోఁగుచున్నంతలోనె
గరుడసుదర్శన ఘనభాగవతులు
తెలిసి యేఁగిరి వెంట దితిజుల నంట ;
వారికి వీరికి వనధిపై మింట
నతిభయంకరయుద్ధ మయ్యె ; శ్రీతోడ
నబ్ధిలో హరిగూలె ; నాబలిపాటె ;
హరిబంట్లు వ్యర్థులై యరిగిరి పురికి—

ఆలోన హరి తెలివంది డెందమున
"కొల్లవోయినదె వికుంఠ పురంబు ?
పోయెనే లక్ష్మి యీభువనముల్ దాఁటి ?
వెట్టివాఁ డయ్యెనే విశ్వపాలకుఁడు ?
కాలకర్మంబులు గలసినచోట
మునిశాపమూఁతగా మొనసినచోట
కారకు లైరి రక్కసు లిప్పు" డనుచు
యోగదృష్టి సమస్త మూహించుకొనుచు—

"శివుఁడుమూలము కాలచిహ్నంబు లెఱుఁగ
శివుఁడు మూలము కర్మసిద్ధిఁ జేకూర్ప,
శివుఁడు మూలము లక్ష్మిఁ జేఱుప; నెడప,
శివుడు మూలము తపస్సిద్ధి ఘటింప
శివుఁడు మూలము జ్ఞానసింధు మథింప
శివునాజ్ఞ లేనిదే చీమేల కుట్టు ?
శివునకే విషఫలశ్రీ సమర్పింతుఁ
దానెవ్వఁ డీమాయ తనకేమి గలదు ? —"
"శ్రీహీనమైన నా శిశిరవాసరము
ధన్యాత్మునకు వసంతంబు కాఁగలదు,

అంధకారావృతం బైన నా రాత్రి
భాగ్యరాశికిఁ బట్టపగలు కాఁగలదు,
అగుఁగాక! కరుణాపయస్సింధు వతఁడు;
అగుగాక! శ్రితజీవనానందుఁ డతఁడు!
కాలవశంబులు కష్టసుఖములుఁ,
అడలఁ డుబ్బఁడు ప్రాజ్ఞుఁ"డని హరి తఁచె.
తనప్రతిజ్ఞ యుఁ బోయెఁ దన్వియుఁ బోయెఁ
వరకౌస్తుభము వోయె వనమాల వోయె
శ్రీవత్స మెంతనో చ్చనో చిన్న వోయె
అఖిలేశుఁ డసురమాయకు వెల్లవోయె—
క్షీరాబ్ధి మథియింపఁ జేసిన దిదియె,
జేజేలదాయలఁ జెఱిచిన దిదియె,
సితికంఠుఁ గఱకంఠుఁ జేసిన దిదియె,
శ్రీవిష్ణు విభ్రమ శ్రీగాథ యిదియె—

---



తిరుపతి గుంటప్రక్కన నుండు రాగిచెట్టు
ఇచ్చట యాత్రికులు శిఖముడుపు చెల్లింతురు
(మంగలిమిట్ట)

# భారతము: పరమార్థ ప్రదర్శనము

నండూరి బంగారయ్య

ఉ. శిక్షితచిత్తులార, శుభసిద్ధులు వొందు ననేకజన్మపా
పక్షపణంబునన్ వెలుఁగు భారతసంహితకెల్ల పుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁగని విన్నమానవుం
డక్షయసౌఖ్యసత్ప్రథమునందు రమించు నిరామయస్థితిన్.

—భారతఫలశ్రుతి.

ఉత్తమకావ్యములలో మహార్థ మొకటి అంతర్జ్యోతియై వెలుఁగుచుండును. అది కావ్యమునకు ఆత్మ వంటిది. దానిని సందర్శించినవారికిఁ గావ్యవైభవ మెల్లఁ గరతలామలకము. ఇతరకావ్యవిశేషముల నెన్నిటిని దెలిసికొనినను ఈ అంతర్జ్యోతిని సందర్శింపని యెడల నిష్ఫలము.

భారతమందు అంతర్జ్యోతియై వెలుఁగుచున్న మహనీయార్థము అద్వైతసత్యము. కావుననే తిక్కన కావ్యాదిని: వ్యాసుఁడు భారతాఖ్యమగు నామ్నాయమును "ధర్మాద్వైతస్థితిని" వ్రాసె నని వాక్రుచ్చినాఁడు. సృష్టినంతను తరిచితరిచి ఈ యద్వైతధర్మమను నమృతకలశమును భారతకారుఁడు మనచేతి కందిచ్చినాఁడు.

## షేక్స్పియరు - తిక్కన

సృష్టివైచిత్ర్యమును బ్రదర్శించుటలో 'షేక్స్పియరు' అద్వితీయుఁడని మనయభిప్రాయము. కాని సూక్ష్మదృష్టితోఁ బరికించినచో నీయభిప్రాయమున సారమున్నట్లు తోఁపదు. షేక్స్పియరుచేసిన సృష్టితత్త్వమథనమువలనఁ బ్రకటింపఁబడిన పరమార్థ మేది? ఈ ప్రశ్నమునకు ఉత్తరము కష్టము. ఆలు - మగల ప్రణయ-విరహములు, అన్న-దమ్ముల యంతఃకలహములు, వీరశిఖామణుల శౌర్యము, దేశభక్తుల స్వార్థత్యాగము- మొదలుగా వివిధములగు స్థూలదృశ్యములను ప్రదర్శించుటలో షేక్స్పియరు నిపుణుఁడే. దీపావళినాఁటి బాణసంచావలె కనులను మిఱుమిట్లుగొనఁజేయు ఈ స్థూలదృశ్యములను దాఁటి "వీనికన్నిటికి అంతరాత్మ యేది?" అని వెదుక నారంభించునపుడు మాత్రము షేక్స్పియరునాటకవాఙ్మయము అంధకారమగును. సృష్టియందలి భిన్నత్వమును జూచి అతఁడు చంచలచంచరీకమువలె మ్రోయుచున్నాఁడేకాని ఆ భిన్నత్వమునందలి ఏకత్వమును దైవత్వమును అనుసంధించి అందువలనఁ గలిగెడు నానందమును మన కందిచ్చుటలేదు. అనఁగా షేక్స్పియరునందు కళాప్రవణత పరిపక్వదశ నందలేదు.

షేక్స్పియరు సాధకుఁడు; వ్యాసుఁడు తిక్కనయు సిద్ధులు. సాధకునకు సమగ్రదర్శన (Vision of perfection) మలవడదు. సమీచీనద్రష్ట కానినాఁడు సృష్టిని-ప్రకృతిని-యథాతథముగఁ జిత్రింపనేరఁడు. ఆవుపటము నొకదానిని వ్రాయఁబోయి దానికాలో, ముక్కో, చెవియో వ్రాసి యూరకున్న నది ఆవుపటమగునా? ఆలాగుననే ప్రకృతినిఁ జిత్రింపఁబూనువారు సాగరముమీఁది ఫేనమువలె నున్నదాని బాహ్యవిలాసములను మాత్రము చిత్రించి అంతరాత్మను చిత్రింపమానినచో నది సమగ్రచిత్రమగునా? కాదు. మీఁదుమిక్కిలి అది యొకప్పుడు ప్రకృతికి దృష్టిబొమ్మవలెను గానఁబడవచ్చును. ఖండదర్శనుఁడగు షేక్స్పియరు రూపకములు— సృష్టియొక్క అసంపూర్ణ స్వరూపమునకు ఛాయామాత్రములుకాని పునస్సృష్టులు గావు.

షేక్స్పియరుపాత్ర నిర్మాణశక్తికూడ పరిపూర్ణత నందజాలకపోయినది. దుర్మార్గులయందును, సన్మార్గులయందునుగూడ అంతర్జ్యోతియై వెలుఁగుచుండు దైవత్వమును అసంపూర్ణజ్ఞానియగు షేక్స్పియరు చిత్రింపలేడయ్యెను. అదిగాక షేక్స్పియరు ఒక్క పరిపూర్ణుని (Perfect man) గూడ తన నాటకవాఙ్మయమున పోషింపలేఁడయ్యెను. అతనిపాత్రనిర్మాణసామర్థ్యము హ్యామ్లెటును దాటిపోలేదు. ఉన్నంతలో షేక్స్పియరుపాత్రలలోకెల్ల హ్యామ్లెట్టే కాంతిమంతుఁడు.

కాని షేక్స్పియరు మకుటాగ్రమున తాండవించుచున్న ధర్మసమ్మూఢ చేతస్కుడును, కార్పణ్య దోషోపహత స్వభావుఁడును అగు నీహేమ్లెట్టు భారతకారుని శ్రీకృష్ణునికి శిష్యప్రాయుడు—నిజమునకు హేమ్లెటు నకుఁ గలిగిన కింకర్తవ్యతావిమూఢతకును శ్రీకృష్ణునికి శిష్యమాత్రుడగు నర్జుననకు గలిగిన ధర్మజిజ్ఞాసకును గల దూరముకూడ అపారము. అర్జునునికివలె హేమ్లెట్టు నకుఁగూడ నొకవిధమైన విషమసందిగ్ధత వచ్చినది కాని హేమ్లెట్టు వివేకమునకు చేవగలిగించుటకు శ్రీకృష్ణుని వంటి సద్గురువు లభింపకపోవుటచే "సంశయాత్మా వినశ్యతి" యనుగీతావాక్య మాతనిపట్ల సార్థకమైనది.

భారతకారుని పాత్రనిర్మాణన కౌశలమంతయు శ్రీకృష్ణునిలో మూర్తీభవించినది. ప్రకృతితత్త్వము నెల్ల మథించి తీసిన అద్వైతామృతము నాతఁడు (భారతకారుఁడు) కృష్ణుఁడుగాఁ బోతవోసినాఁడు. శ్రీకృష్ణుఁ డొక్కటేపాత్రమని సౌకర్యార్థ మను కొందుము గాని నిజముగా శ్రీకృష్ణుఁడు విశ్వస్వరూపి. ఒక్క శ్రీకృష్ణపాత్రరచనయందుఁ గనిచూపిన అమానుషప్రాగల్భ్యమును గ్రహింపఁ గలుగుదుమేని భారతకారు శేముషీవైభవము సర్వము కరతలామలక మగును. కావుననే భారతమునకు వాసుదేవుఁడు ప్రకటార్థమని కవియే వ్రాక్రుచ్చినాఁడు.

నవీనకళావిమర్శనమునుండి కైకొనిన ఈ "పాత్రము" అనుమాట నుపయోగించుటలో ఒకయంశమును విస్మరింపరాదు. భారతమును రచించునపుడు తిక్కన, వ్యాసుఁడు నిజభావనాప్రపంచమునుండి శ్రీకృష్ణుని సృష్టించుచున్నట్లు తలంపఁడు. శ్రీకృష్ణావతారమునందు తిక్కనకు పరిపూర్ణవిశ్వాసము గలదు. ఈభారతకథ యథార్థమే యని యాతనినమ్మకము. భారతయుద్ధరూపముననవతరించినకృష్ణలీలలను వ్యాసుఁడయినను తాను (తిక్కన) ఐనను, తెరయెత్తి బొమ్మలను లోకులకుఁ జూపుచున్నట్లు తమజ్ఞాననేత్రములతో సందర్శించుచున్న దానిని ప్రదర్శించుచున్నామనియే యాతని నిశ్చయము. కావుననే కృత్యాదిని: "మహనీయులైన పాండుపుత్త్రులచరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచు" నని పాండవుల కథ యథార్థముగ జరిగినట్లును వైశంపాయనుఁడు సేయుచున్నదియు వ్యాఖ్యానమే . యనియు నాతఁడు పేర్కొనినాఁడు.

## వ్యాసుడు - తిక్కన

ఇది నిజమయిన చరిత్రమేయనియు, వ్యాసుఁడు చరిత్రకారుడే యనియు నమ్మకమున్నచో తిక్కన తెలుగున భారతమును తనయిష్టమువచ్చినట్లుగ మారి. వ్రాసెనేల? జీవితచారిత్రములలో స్వకపోలకల్పితములను జేర్చినచో నది యసత్యకథనము కాదా? అను ప్రశ్న మొకటి వచ్చును. ఈసందర్భమున షేక్స్పియరు చరిత్రాత్మకనాటకములనుగూర్చి విమర్శకు లేమి వ్రాసిరో యించుక జ్ఞప్తియం దుంచుకొనవలెను గ్రుడ్డియెద్దువలె నొకనిచరిత్రమున నున్నయంశములన్నిటిని ఒకచోఁ జేర్చుట చరిత్రరచన మెన్నడు కానేరదనియును, ఆపురుషునియాత్మను సందర్శించి దానికి సరియయినస్వరూప మిచ్చుటలో నికృష్టాంశములు తారుమారు చేసినను బాధలేదనియు, మీదుమిక్కిలి అదియే యధికతరసత్యమనియుకూడ వారు సెలవీయ లేదా?

తిక్కన భారతమునఁజేసిన మార్పులుకూడ ఆతెర గతికి చెందినవే. వానినిబట్టియే ఆతనిఘనత శతగుణాధిక మగుచున్నది. వ్యాసునియం దాతనికి గురుభావమే. కాని గురుభక్తికి మించినయాత్మవిశ్వాస మొకటి యాతనిలో విరాజిల్లుచున్నది. భారతవీరులసందర్శన మాతనికి వ్యా సు ని ప్ర సా ద ము న నే లభించెను. కాని వారిని చూచుటకు ఆతనికి వ్యాసునికన్నలనే ఎరవుతీసికొనవలసినయగత్యము లేకపోయినది. వారందఱిని తాను స్వయముగా చూచుటకు జాలిన దివ్యచక్షువులను భగవంతు డాతని కనుగ్రహించి యున్నాడు. సహస్రసూర్యసంకాశమగు భారతార్థమంతయు నొక్కసారిగ నాతని యాత్మలో నుదయించినది. అరటిపండొలిచి చేతబెట్టినట్టుగ ఈ మహార్థమును లోకులకు ప్రదర్శించుటయే యాతనికర్తవ్యము

కాని దానిని వ్యాసుడు చెప్పినట్లే "తుచలు" తప్ప కుండ చెప్పవలె ననుబాధ్యత యాతనికి లేదు. వ్యాసు డును తిక్కనయు నొకేసత్యమును ప్రదర్శించుచు న్నారు. కాని దానిని ప్రదర్శించువిధానమునందుమాత్ర ము వారు భేదపడిరి. వ్యాసు డాసత్యమును వేదాంత వాక్యములలోను, పురాణకథలలోను ప్రదర్శించెను. తిక్కనచేతిలో నదియొకనాటకముగ మనకు ప్రత్యక్ష మైనది.

అసంఖ్యాకముగనున్న తిక్కనపాత్రముల నన్ని టిని విడిచిపెట్టి ఎంతప్రతిభాశాలియైనను ఒకశ్రీ కృష్ణుడే భారతమునకంతకు నర్థమని చెప్పుటలో నేమి స్వారస్యమున్నది? విదురుడు, భీష్ముడు, ద్రోణుడు, ధర్మరాజు, అర్జునుడు, కర్ణుడు, ధృతరాష్ట్రుడు, దుర్యో ధనుడు మున్నగునితరపాత్రము లెన్నియో భారతమున నున్నవి. వీనిలో నేయొక్కదానిని గైకొన్నను పర్వ తమువలె మహోన్నతముగను, సముద్రమువలె గంభీ రముగను గానవచ్చును. వీనికి వ్యక్తిత్వసంపదలో లోపము లేదు. పామరజనులుకూడ వీరినిగూర్చి మాటా డునపుడు సుప్రసిద్ధులగు సమకాలికులనుగూర్చి ముచ్చ టించునట్లుగ "విదురు డిట్లుచెప్పెను." భీష్ముడిట్లు చెప్పెను. అని పాత్రములకు ప్రాధాన్యము నిచ్చుచు న్నారుగాని షేక్స్పియ రిట్లువ్రాసె ననునట్లుగ వ్యాసు డిట్లువ్రాసెనని కవికి ప్రాధాన్యము నిచ్చుటలేదు. ఈ భారతయోధు లిప్పటికిని దేశీయులతో బాగుగ కలసి మెలసి తిరుగుచుండుటచే వారికి భారత మెవ్వరు వ్రాసి రను ప్రశ్నే మెన్నడునురాదు. పండితపామరభేదము లేక ఎల్లరకు సజీవులై కానవచ్చు ఈవీరమండలి నెల్ల తృణీ కరించి యొక్కపాత్రమునకే ప్రాధాన్యమీయనేల?

భారతమునందలి పాత్రపోషణము సరిగా సృష్టికి ప్రతిసృష్టి; చదువరి రసగ్రహణశక్తినిబట్టి దాని వైభవమును పెరుగుచుండును. మానవులు మూడుతర గతులు: మొదటితరగతి మానవులకు శరీరబాహుళ్యము గల యీసృష్టియంతయు భిన్నముగా గానవచ్చును. పరస్పరవిరుద్ధముగా దోచుదీనిస్వరూపమును వారు సమ న్వయింపజూడక తమకంటబడినదృశ్యములకు సంతో షించుచు కాలము గడుపుచుందురు. ఇంకొకతరగతి మానవు లట్లు సంతోషపడక సృష్టిలోనిపరస్పరవిరు ద్ధాంశములను సమన్వయింపజూతురు. వీరికి ప్రతిమను జునియందును ఉన్నదైవత్వము స్ఫురించి భిన్నప్రకృ తులుగల మనుజులందరికి "మయి ప్రోత మిదం సర్వం సూత్రే మణిగణా ఇవ" అనునట్లు ఆంతర్యములో నున్నఐక్యము గోచరించును. మూడవతరగతికిచెందిన మనుజులు, అదే పరమహంసలు: సృష్టినెల్ల పరతత్వ మయముగా జూచుచుందురు. మానవులందరికి దైవ మొక్కడే యనుటతో నాగక వారందఱు దైవస్వరూ పులే యనియు సృష్టియంతయు నీశ్వరమయమేయనియు వారు భావింతురు. సరిగా నిట్టిత్రివర్గభేదమే భారత పాఠకులలోకూడ నున్నది. మొదటితరగతివారికి దుర్యోధ నాదిదుష్టులు, యుధిష్ఠిరాదిశిష్టులు భిన్నవ్యక్తిత్వములో, భిన్నజాతిపుష్పములవలె, సౌందర్యసౌరభ్యములను వెద జల్లుచు నలరారుచుందురు. రెండవతరగతికి చెందినవారు ఈపుష్పములనన్నిటిని శ్రీకృష్ణసూత్రమున భారత కారు డొకచేదండగ గ్రుచ్చినాడని తెలిసికొనగల్గు దురు. ఉత్తమతరగతిరసికులు భారతమునంతను శ్రీకృష్ణ మయముగా దర్శింపగల్గుదురు. తిక్కనపాండవకౌరవ వీరులెల్ల నామహాజ్యోతినుండి వెల్వడుకిరణములవలె వారికి గానవత్తురు. మొదటితరగతికి చెందినపాఠకులను గూర్చి మనము ముచ్చటించుకొనవలసిన విశేష మెద్ది యును లేదు. తక్కినరెండుతరగతులవారియభిప్రాయ ములను నించుక సావకాశముగ నాలోచించినచో భారతార్థము సువ్యక్తమగును.

భారతములో పరమదుర్మార్గుడు మొదలుకొని అత్యుత్తమపాత్రమువఱకు అందఱిలోను దైవాంశము చిత్రింపఁబడినది. దుర్మార్గులలో నిది విస్పష్టముగ స్ఫురించుటలేదు. సన్మార్గులయందు బాగుగఁ బ్రకా శించుచున్నది. ఈ దైవాంశ మాయాపాత్రములకు శ్రీకృష్ణునియందుగల భక్తినిబట్టి వ్యక్తమగుచున్నది. శ్రీకృష్ణునియవతారకథయందు నమ్మకము లేనివారు దైవశక్తుల నన్నిటిని ఒక్కప్రోవుగ జేసి దానికి కవి శ్రీకృష్ణుడని పేరుంచెనని భావింపవచ్చును. భారత

మున ఎంతటిదుష్కృత్యములో నిమగ్నులయినవారయిన శ్రీకృష్ణుడు తమపాలిటిదైవమనియు ఆతనిసంకల్పమును నెరవేర్చుటకు తాము నిమిత్తమాత్రులమనియు స్వస్వరూపజ్ఞానముతో వర్తించినట్లు కానవచ్చుచున్నది. అందువలన తామేపక్ష మవలంబించినను తమకు సద్గతి తప్పదని వారినిశ్చయము. ముందుగ కౌరవపక్షమున దుర్మార్గులని పేరువడసిన కర్ణదుర్యోధనులను ఉత్తములని పేరందిన భీష్ముని పరీక్షించి యీవిషయమును స్థాపింతము.

## దుర్యోధనుడు

దుర్యోధనుడు భారతవీరులలోనెల్ల నికృష్టుడు. లోకముననున్న దుర్గుణములన్నియు కాంతాకనకముల నాశ్రయించియున్నవని పెద్దలు వచించిరి. కాంతాకనకములనగా కామలోభములని మన మర్థముచేసికొనవచ్చును. ఈరెండును దుర్యోధనునిలో మూర్తీభవించినవి. ఈభయంకరపిశాచము లాతని నొమ్మపైనెక్కి విచ్చలవిడి నాట్యమాడుచున్నవి. కీచకుడే కామదాసుడని మన మేవగించుకొనుచుండగా దుర్యోధనుడాతనినే మంచివాడనిపించినాడు. కీచకుని కింకను లోకభయమున్నది. ఒకప్పు డొరులెఱుంగక ద్రౌపదిని తన్నినను విరటుడువచ్చి సాంత్వనములు పల్కియనునయింపగానే యింటికిఁ బోయినాడు. దుర్యోధనుడన్ననో భీష్మాదికురువృద్ధులు ద్రోణాది-ఆచార్యులు చూచుచుండగా నిండుకొలువున ద్రౌపదిచీర లొల్పించినాడు. స్నేహితులచే పరిహాసము చేయించినాడు. తనతొడమీద గూర్చుండుమని జిఱునవ్వుతో సంజ్ఞచేసినాడు. కామమున కింతకంటె నవధి యేమున్నది? ఇక లోభము, నసూయ దుర్యోధనునికి వెన్నతోబెట్టిన విద్యలుగదా! వానికి బానిసీడయి పాండవుల నీతడు పెట్టినబాములను వేరుగ గణింప నక్కఱలేదు. నిద్రించుచున్న భీముని నీటద్రోయించుట, విషముపెట్టించుట, లాక్షాగృహదాహము, కపటద్యూతము మున్నగుదుష్కృత్యములకు దుర్యోధనుడు పుట్టినిల్లు. పాండవులను జయించినను శౌర్యముచే జయింపవలెనని కర్ణుడు తలంచును. దుర్యోధనుని కామాత్రమైన సన్మార్గచింత లేదు. అన్యాయముగనైన సరియె జగత్తు నపాండవముగా జేసి వారిరాజ్యమును తాను సంపాదింపవలెను.

మొదటినుండి తుదవరకు భారతమంతయు వెదకి చూచినను ఈతనిపాపవ్యవసాయమున కొక్కగడియయైన విరతియున్నట్లు కానరాదు. పశ్చాత్తాపసూచకమగు నొక్కభావమయినను ఈతని కెప్పుడు నుదయింపలేదు. తనకు స్వయముగ దోచకున్న మానె, ఇతరులు ప్రబోధించుచున్నపుడైన నది స్ఫురింపవలదా! భారతమున కవి దుర్యోధనునికి చెప్పఁగలవారందరిచేతను బుద్ధిచెప్పించినాడు. కాని దుర్యోధనచక్రవర్తిమాత్రము తనదురభిమానమును విడువలేదు.

ఉద్యోగపర్వమున భీష్ముడు, బాహ్లీకుడు మున్నగు వయోవృద్ధులు నారదాదిమహర్షులు నిజశ్రేయోభిలాషులగు జననీజనకులు బుద్ధిచెప్పిరి. ఆతడు తానుబట్టినకుందేటికి మూడేకాళ్లని పూర్చుండెనుకాని వారిమాట వినిపించుకొనలేదు. యుద్ధము వచ్చినది. తననమ్మిన యోధవీరులెల్ల నొకరితరువాత నొకరుగ మరణించుచున్నారు. అంపశయ్యమీదనున్న భీష్ముడు పాండవులతో సంధిచేసుకొనవలసినదని బ్రతిమాలి చెప్పినాడు. దుర్యోధను డేమాత్రమును వినిపించుకొనలేదు. తుదకు దుశ్శాసనుడుకూడ మరణించినాడు. కర్ణార్జునులు ద్వంద్వయుద్ధమునకు సిద్ధపడినారు. అప్పుడు అశ్వత్థామ యెన్నివిధముల ప్రార్థించి దుర్యోధనునికి బుద్ధిచెప్పెను. కాని లాభము లేకపోయెను. తనయాశలకన్నిటికి మూలకందమగు కర్ణుడుకూడ నశించెను. కాని దుర్యోధను డింకను శల్యునిగూర్చికొని యుద్ధమునకు బునఃప్రారంభము చేయుచున్నాడు. శల్యుడుగూడ తెగటారి మూర్ధాభిషిక్తుడగు తానొంటరిగ పాదచారియయి దిక్కులేనివానివలె ద్వైపాయనహ్రదములో దాగికొనునప్పుడైనను సంజయునితో,

క. ఇమ్మడువులోన దాగెద,
నిమ్ముల నెచ్చటికినైన నేగెద దనువు

త్తమ్ముల దొలగి నిలిచి మఱి,
యెమ్మెయినేనియును దీర్తు నే బగయ చుమీ.

అని పాపనిశ్చయుడై పలుకుచున్నాడు. తుదకు తొడలువిఱిగి నేలమీదబడి మరణసంసిద్ధుడైనప్పుడైన ఇకముందు గతి యేమి యనునాలోచనపొడమి తాను చేసిన దుష్కృత్యములకు పశ్చాత్తాపము రావచ్చునా!

గీ. కపటధర్మకంచుకంబున వెలసిరి
గాని సత్యపురుషకారపరులు
గారు పాండుసుతులు వారల నమ్మంగ
గాదు చేత సందెకాయ యిడిన.

అని తనయనుచరులకు బోధించి ఎట్లయిన పగ సాధింప జూచుచున్నాడు. తనమట్టుకు తానేమియు దోషము లొనరించినట్లే యాతనికి స్ఫురించుట లేదు సరికదా తనదుష్కృతములన్నియు ఎదిరివీరులకడ గానవచ్చుచున్నవి చూడుడు :

గీ. ఎదిరి పెనగంగజాలక నిదురవోవ
నొంచు తెరగున విషము పెట్టించుపగిది,
ఇంటఁ జిచ్చిడుచాడ్పున నట్లు చేసి
పఱయుదురుగాక రాజ్య మప్పాండుసుతులు.

మరియు అంతటిలో నాగక అశ్వత్థామకు సేనాధిపత్య మిచ్చి పాండవవధార్థము పురికొల్పుచున్నాడు. తుద కశ్వత్థామ వచ్చి ఉపపాండవుల మరణవార్తను నారాయణమంత్రమువలె తనచెవిలో నూదువరకు నాతనిప్రాణము పోయినది కాదు. ఇట్లు జన్మించినఘడియమొదలుకొని తుదిముహూర్తమువఱకు పాండవనాశనమును కర్మయోగముగ నభ్యసించిన దుర్యోధనుడు భావిగతినిగూర్చి సంశయించుచున్నాడా ?

చ. చదివితి నెల్లవేదములు
జన్నము లొప్పగ జేసితిన్ రమా
స్పదమనువృత్తిఁ బొబ్బి నర
పాలకులెల్లను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వపరి
మర్దనకేళి యొనర్చితిన్ దగన్
తుది నని మిత్రబాంధవుల
తో త్రిదివంబునకేఁగు టొప్పదే.

అని స్వర్గ మరచేతిలో నున్నట్లు నిశ్చయించి పలుకుచున్నాడు.

దుర్యోధనుని యీ నిశ్చయబుద్ధి కంతకును మూర్ఖ్యమే కారణమని మనము సులభముగ సమాధానము చెప్పవచ్చును. కాని అట్లుచేసి యూరకున్నచో మనము దుర్యోధనుని పూర్ణముగ నర్థము చేసికొనిన వారము కాఁజాలము. భారతవీరుల హృదయము లన్నిటిలోకి దుర్యోధనుని హృదయమే మిసుల దుర్గమము. దాని కవాటములు తెఱచుట కష్టసాధ్యము. ఎంతయాప్తునితో మాటాడుచున్నప్పుడైన నాతనికి స్వస్వరూపజ్ఞాన మున్నట్లే స్ఫురింపదు కాని కొంతశ్రమచేసినచో నాతనికున్న నిశ్చయబుద్ధికి కారణము స్వస్వరూపజ్ఞానమే యని మనము నిరూపింపవచ్చును.

శ్రీకృష్ణుడు సంధినిమిత్తము హస్తినాపురము వచ్చునని తెలిసినసందర్భమున భీష్మధృతరాష్ట్రులతో:

గీ. అతఁడు పూజనీయుఁడనునే నెఱుంగుదు;
నైన ధనము వీసె నవదత్తనము,
వచ్చు బెచ్చువెరికి వైరులు గర్వింతు
రేల పగ యడంగుని ట్టులైన.

అని శ్రీ కృష్ణునిగూర్చి యాతడు తనకు పూర్వపరిచితుడే యనునట్లుగ మాట్లాడినాడు. కర్ణాదులు సంధినిగూర్చి మాట్లాడునపుడు,

క. మనులార నన్ను విధి యేమని
మనుపుట్టించె నట్టులయ్యెడుగాక
వినఁ జవిగానిమాటలకుఁ
బనిగలదే యుడుగుఁ డింక బహుభాషణముల్.

ఈ వాక్యములు దుర్యోధనుని బాహ్యస్వరూపమగు మూర్ఖ్యమున కనుగుణముగ విరసముగ జెప్పింపబడినను తన్నొకయమానుషశక్తి నడిపించుచున్నదనియు తానెందరెన్నివిధముల చెప్పినను వినక దానికనుగుణముగ వర్తింపవలెనను నిశ్చయముతో దుర్యోధనుడు వర్తించుచున్నాడనియు తెల్లమగుచున్నది. దీనిని మనము Fatalism అనిచెప్పినను చెప్పవచ్చును. ఏపేరుపెట్టినను Fatalism కూడ మహాపురుషులలో గానవచ్చు

దైవపరతంత్రతకు (Self surrender) వికారరూపమే యని యొప్పుకొనక తప్పదు. ఇంతకంటెను విస్పష్టముగ శల్యపర్వములో దుర్యోధనుని స్వస్వరూపజ్ఞానము ప్రదర్శింపబడెను. తొడలు విఱిగిపడియున్న యశ్వత్థామతో,

చ. వినుఁడు మహానుభావులను
            విష్ణు నెఱింగియెఱింగియే మిమున్
నొని వెరపేదికాదె బగ
            కర్ణు దలకొంటి జయంబుగోరి మీ
రును బలశౌర్యసంపదను
            రూపముగాఁ బొగడొందుభంగులన్
బెనఁగితి రేమిచేయుమరు
            బెట్టిదుఁడై విధి తప్పఁజూచినన్.

అని చెప్పినపద్యమునుగూర్చి లెస్సగ నాలోచింపవలెను. దుర్యోధనునికి శ్రీకృష్ణునిమాహాత్మ్యము లెస్సగ తెలియునఁట! అయినను యుద్ధముమానినవాఁడు కాఁడు. ఇంకొకచిత్రము; యుద్ధమునం దాతనికి జయముకాలేదని చింతయున్నట్లే కానరాదు. అశ్వత్థామాదులు శ్లాఘ్యముగ బెనఁగి రనుచున్నాడేకాని వారినికూడ నెపపెట్టుటలేదు. ఇట్లు జరిగినదానికి చింత లేదు. తనభావిగతినిగూర్చి భయము లేదు. కాని యింకను తనకంఠములో ప్రాణమున్నంతవఱకు పాండవవధోద్యోగమునకు స్వస్తిచెప్పుట లేదు. దీనినిబట్టి శ్రీకృష్ణునిసంకల్పమే తన్నట్లు పాండవులకు విరోధిగా ప్రవర్తింప జేయుచున్నదనుజ్ఞానము దుర్యోధనుని కున్నదనుటలో నాక్షేపణ మేముండును? ఇట్లు మూర్ఖుఁడయిన దుర్యోధనుడు తుదకు శత్రుపక్షముననున్న శ్రీకృష్ణభక్తుడే యయినట్లు తేలుచున్నది.

ఒక్కవిషయమును మనము బాగుగ నాలోచింపవలెను. శ్రీకృష్ణు డితరులచే జెప్పించియు, తాను స్వయముగా చెప్పియు దుర్యోధనుని మనస్సు త్రిప్పుటకు తనపౌరుషశక్తినంతను వినియోగించినాడేకాని దైవశక్తి నించుక వినియోగించినను ఆతడు చక్కబడక పోయినాడా? తనవిశ్వరూపమును చూపి అర్జునుని రణోన్ముఖుని చేయగలిగినప్పుడు అదేసాధనము దుర్యోధనుని రణవిముఖుని చేయుటయందు నిష్ఫలమయి పోయినదా? సంధికి కృష్ణుడు బయలుదేరినపు డాతనితో దైవము, పౌరుషము రెండును అతనివినోదము లని యర్జునుడు పలికినపుడు,

ఉ. కావున సంధికిన్ బురుష
            కార మొనర్చెద నోపినంతయున్
దైవముచేత యెట్లగునొ
            దాని నెఱుంగ; సుయోధనుండు సం
భావన చేసి పాలొసగు
            పాడిియె గల్గిన బాల్యమాదిగా
నేనిధినైనను జెరుప
            నింతలు పాపము లాచరించునే.

అని కృష్ణు డిచ్చిన ఉత్తరము దుర్యోధనుని చారిత్రమున కంతకు నర్థము ధ్వనింపజేయుచున్నది. మొదటి నుండియు దుర్యోధనుని దైవము నడిపించినప్రకారమును బట్టిచూడగా దైవశక్తులు సంధికి వ్యతిరిక్తముగా నున్నట్లు తోచుచున్నదని సత్యమును కొంత ప్రకాశింపఁజేసినాడు. పైకి నలువురు నోళ్లఁబడినవాడు దుర్యోధనుడు. లోపల బనిచేయుచున్నశక్తి శ్రీకృష్ణసంకల్పము. దీనినెఱింగియే గాంధారియు, నుదంకుడును యుద్ధానంతరము శ్రీకృష్ణునే శపింపబూనినారు.

మానవదృష్టితోఁ జూచినచో మూర్ఖ్యము మనకు సరిపోవుచున్నది. కాని సూక్ష్మదృష్టితో బరికించినచో దుర్యోధనునిమూర్ఖ్యము శ్రీకృష్ణునిసంకల్పము యొక్క బాహ్యస్వరూపమని తేలినది. ఇట్లొకేపాత్రమున మానుషదైవముల రెండింటిని విస్పష్టముగ జిత్రించుటలోనే మహాభారతకారుని ప్రాగల్భ్య మున్నది. ఈరెండును ఒకదానినొకటి నాశనము చేయుటలేదు. వీనిని ప్రదర్శింపజూచుటలో కవి పాత్రములను వేదాంతము బోధించుట కేర్పడినదృష్టిబొమ్మలనుగా జేయుట లేదు. మనుష్యాంశమును దైవాంశమును ఒకేపాత్రమునందు ఒకదానికొకటి భంగము లేకుండగ నడపుకొని వచ్చుటలోనే మహాభారతకారుని అతిమానుషపాత్రోన్మీలనప్రాగల్భ్యమున్నది.

## పిపాసువు

దివాకర్ల వేంకటావధాని

చేతులు మోడ్చి నీచెలిమిఁ జేయుటకోసము వేఁడుచుంటి నో
సీ! తరళాయతాక్షి! చెవిఁ జేర్ప వహంకృతియేల? మోహమె
ట్లో తలకెక్కి రంభవనునూహ దలిర్చుట గాదు నీదు రూ
పాతిశయంబె నెమ్మదికి నార్తినిగొల్పె ననుగ్రహింపుమా!

కలుగునె నాకు నీదుసముఖ మ్మనినంతనె సంబరంబు! దృ
ష్టులకు ననుక్షణం బిటులె చోద్యము గొల్పుచునుండుఁ జిత్రమం
దలిరచనావిలాసము లనంతములై, ఘటియింతువేల? కొం
దల, మిఁక నవ్వు మొక్కచిఱునవ్వు కృతార్థుఁడ నౌదుఁ గోమలీ!

నిన్నన రాదుగాని నవనీరరుహానన! యెన్నఁడైన న
త్యున్నతసౌఖ్యముం గొలుపు నుత్తమవస్తువులే దురంతమై
యెన్నఁగరానిబాధ ఘటియించును జుమ్ము, జగత్స్వభావ మి
ట్లున్నది యేమిసేయుదు నహో! విధికిన్ దయరాదు నాపయిన్.

కలికీ! మీకు నిరంకుశత్వము నిసర్గం, బేరిపై నేల్బడుల్
గలుగున్ మీ కలవారిబాధలపయిన్ లక్ష్యమ్ము పూజ్యాంబు, ప
ల్కులు వేయేటికి మీస్వరూపజితు లాక్రోశించుచున్ జేరి మి
మ్ములఁ బ్రార్థించుకొలంది మీ కనుపదమ్మున్ గర్వ ముప్పొంగునే!

ఎందుల కీవిచార మనెదేని భవత్కృపవచ్చుదాఁక నా
నందముగల్గు టెట్లు లలనా! మరి యింతఁగఁ గన్గొలంకులన్
జిందఁగనిమ్ము బాష్పములు నీపయి రక్తికి వన్నె హెచ్చు, నే
సందడి లేకయే కలుగుసౌఖ్యములం దనుభూతి గొప్పయే?

ఇదివర కెవ్వరింగొలువ దీహృదయమ్ము, భవత్పదంబులం
దొదిగినకాన్క గైకొన నయోగ్యమొ? యోగ్యమొ? యెంతకాలమో
ముదిత! పరీక్షచేసినను మోదమె! వృక్షముకంటెఁ దత్ఫలా
భ్యుదయము గ్రోలువారలదె పూర్ణముగాగ నదృష్ట మన్నదో!

అందని మ్రానిపండని నిరాదరణంబు వహించుచున్న నా
డెందమునన్ దలంపులు బలీయములై కనుపట్టుచుండె నీ
యం దనురక్తిమాత్రము నిరాశ వహింపఁగనేల? సిగ్గుచే
తం దరళాక్షి యీగతికిఁ దారె నన్ నిజమౌనె? సుందరీ!

భవదీయప్రణయప్రసక్తికి నన్ బాత్రమ్ముగాఁ జేయనే
ర్తువయేనిన్ గనకాభిషేకము నొనర్తుంగాని లేకున్నచో
నవశమ్మైనవిరక్తి గొల్పెడు నసహ్యద్వేషమూలమ్ముగా
నవివేకంపుఁబనుల్ పొనర్పఁగ మనంబం దెంతునేమో సుమా!

మార్పునకుఁ జోటు గల్గుచో మారిపోవు
నట్టి దనురక్తి యె ట్లౌనటందువేని
ప్రాణ మున్నంతవరకుఁ దలంతు నాదు
హృదయరాజ్యాధిదేవత వీవె యనుచు.

తలఁప న్మానుము నన్నుఁగూర్చి బలవంతమ్మైన నాసమ్మతిన్
గలుగన్నేర్చునె? నీకొకింతయిన సౌఖ్యం బెల్లయుద్వేగ మా
వల మాయంబగునందువేమొ? కడుబాపం బబ్బు నట్లన్నచో
న్విలయంబన్నది ప్రేమవాహినికి లేనేలేదు శాతోదరీ!

హృదయగేహంబునం దొకయింత నాకుఁ
దావొసంగుము మొదట సుందరి! పదపడి
యీపిపాసితు నార్తి సహింపజాల
కప్పు డొసఁగెద వింత ప్రేమామృతమ్ము.

తనకున్ నచ్చినసుందరీమణిని బొందంగోరి ప్రార్థింపఁగాఁ
జనుదోషమ్మును లేదుగాని యిట యాచ్ఞాదైన్యమున్ భంగపా
టును లేకుండిన యాతఁడే సుకృతి; నేఁడో రేపొ నావాంఛిత
మ్మును నీవై నెరవేర్తువేమొకొ? చలమ్మున్ వీడి ప్రాణేశ్వరీ!

---

# యక్స రే చిత్రములు

( కలగూరగంపలోని 'పిల్లల గండములు' అను చిన్నవ్యాసమును చూచునది.)



చిత్రము ౧ G. S. A.

# నా లాటరీ మోటారు

పెద్దాడ రాజలింగమూర్తి, బి. ఏ.,

## ౧

లాటరీ అంటే నాకు చిన్నప్పటినుంచీ తల నొప్పి పరమాసహ్యానూను. లాటరీవేయడ మంటే ఏదో పాపంచేసినట్టుగా మనసు చివుక్కు మంటుంది. లాటరీ రాలేదంటే టిక్కట్టుకు వెచ్చించినడబ్బు-న్యాయమైనది- వృధా అయిందికదా అనిన్నీ, నిరుపేదలకు దానంచేస్తే కొంతపుణ్యమైనా వచ్చి వుండేది అనిన్నీ. లాటరీ గెల్చేటట్టయితే అన్యాయంగా, అనాయాసంగా అన్యులధనం మనకు ప్రాప్తించింది, ఇతరులప్రాణము లెంతవుసూరుమన్నవో యిందువల్ల మనం అక్కరకు వస్తామా అనిన్నీ ఆందోళన అంకురిస్తుంది. అందుచే చిన్నప్పటినుంచీ లాటరీవేయడ మంటే అకార్యంగా అనుకునేవాణ్ణి.

## ౨

రాత్రి పెందలకడనే భోజనంచేసి పండు వెన్నెట్లో 'యీజీ ఛైరు' లో పగలల్లా వ్రాయగా మిగిలిన ఆఫీసుకాగితాలను వ్రాసుకుంటూ కూర్చున్నాను. సమీపంలో మంచంమీద మాచిట్టి సుఖంగా నిద్రబోతూంది. భోజనానంతరం చేసికోవలసిన గృహ కృత్యాలు నిర్వర్తించుకొని వేగిరంగా మా కల్యాణి కూడా అక్కడికేవచ్చింది. కల్యాణి తన ఒడిలోనున్న మల్లెపూలను మాలగా గుచ్చుకొంటూ కుర్చీకి మంచానికీ మధ్యగా కూర్చుంది. కల్యాణిచేతిలోని మల్లెపూలు ముఖబింబమున తాండవించు లేనవ్వులు, వెన్నెలలో నైక్యమౌతూ నూతనశోభ కలిగించాయి.

"రాత్రిపగలు ఆఫీసుపనేకాని అన్యం అక్కర లేదా ?" అంటూ కల్యాణి నాముఖంకేసి చూచింది.

వెంటనే జవాబుచెప్పటకు నాకేమీ తోచింది కాదు. ఆడాళ్లకు మగవాళ్ల కష్టసుఖా లెట్లు తెలుస్తాయి? తాలూకాసుమాస్తా చేయవలసివుండే విధులు చేసేవారికేగాని తెలియవు. చేసినకొలదీ పనికి అంతుండదు. చేసినదానికి మెప్పుండదు. ఒక డిప్యూటీ కలెక్టరు కూతురు తనభర్తపై కోపంవచ్చినప్పుడు "నా తండ్రితో చెప్పి మీకు తాలూకాసుమాస్తాపని వేయిస్తా" నని బెదరించుచుండేదట! తాలూకాసుమాస్తా పడే కష్టాలు అనుభవైకవేద్యము, వర్ణనాతీతము.

దైవానుగ్రహంకొలదీ, ఆనర్సు పేసయినాననే కారణంచేతనో, డిప్యూటీ కలెక్టరుగారి అల్లుడననే కారణంచేతనో, నాకు ప్రథమంలోనే 'ప్రొబేషనరీ రివిన్యూ యినస్పెక్టరు' పని లభించి నాలుగేండ్లలోనే యేబది రూపాయిల జీతంలోనికి వచ్చాను. తక్కిన గుమాస్తాలకంటె చాలాశ్రమ నాకు తప్పింది. ప్రొబేషనరునని మా ఆఫీసులో మా అధికార్లకు నాయందు కొంత గౌరవ ముండడంమూలాన్ని కూడా నాకు తక్కువపని కల్పించారు. ఏది యెట్లావున్నా రాత్రిళ్లు యింటివద్ద ఆఫీసుపని చేసుగుంటే కాని arrears లేకుండా నిర్వహించడం దుర్ఘటం. ఈ సంగతి మా కల్యాణికికూడా కొంతవరకు తెలుసును. కల్యాణి యిప్పుడు వేసినప్రశ్న ఇదివరలో చాలామారులు వేసినదే. ఆ ప్రశ్నకు ఒక నవ్వే నా సమాధానం. ఆ నవ్వులో నా అసమర్థత, అసహాయత, అనాదరణ మిళితమైవుంటాయి.

కల్యాణిప్రశ్నకు మామూలునవ్వే సమాధానంగా ఉపయోగించాను. కాని కల్యాణి యీనాడానవ్వుతో తృప్తిపడ లేదు.

"నామాటకు సమాధానం లేదు, మీ ధోరణి మీదేనా ?" అంటూ కల్యాణి నా సమీపంలోవున్న దీపం తగ్గించేసింది. ఇతరపరిస్థితుల్లో కల్యాణి చేసిన నేరమునకు తగినశిక్ష విధించేవాణ్ణే. కాని అప్పట్లో ఏమిచేయడానికీ తోచక, నా అసమర్థత వెలికితోచనీయక "ఎప్పుడూ యీలాంటి అల్లరిపనే" అని అంటూ చిరునవ్వు తెచ్చుకొని కల్యాణిచెక్కులను

నొక్క ముద్దాడాను. కల్యాణి విజయమునకు విఱ్ఱవీగుచు "మోటసరసము" అని అస్పష్టవాక్యములతో ఆనందించింది.

ఆఫీసుకాగితములందొకచోట పొందుపరచి ఆనందమును వెదజల్లుచు పిండియారబోసినట్లుండిన బ్రహ్మాండమునంతను కండ్లార గాంచుచు తన్మయుల మైనాము.

## 3

"బొంబాయిలో లాటరీయట! మీరు విన్నారా?" అని కల్యాణి ప్రశ్నించింది.

"బొంబాయి యందేమి, దేశమెక్కడ చూచినా లాటరీలే!" అంటూ విసుగుసూచించాను.

వెంటనే దుమారం రేగింది. లాటరీలు వేయకూడదని చిరకాలం నుండి నా మనసులో ఖాయపడియున్న దృఢాభిప్రాయాలు వెలిబుచ్చి కల్యాణిని నా పక్షానికి మరల్చడంకు యత్నంచేశాను. సాధ్యం కాలేదు. ఆమె విద్యావతి. మరల్పరాని ఆశయములు కలది. కీ. శే. తన తండ్రివలెనే తాబట్టిన కుందేటికి మూడేకాళ్లని అనే స్వభావంకలది. ఏదోవిధంగా రాజీచేసుకొనక తప్పదని ఆమెఆశయములకే నేను సంపూర్ణాంగీకారము చూపవలసివచ్చింది.

దరహాసవదనంతో ఆమె "మీరు నాకెప్పు క్షమిస్తారన్నమాట!" అనిఅంది.

"ఏంతప్పు"?



"రాత్రి పగలు ఆఫీసుపనేకాని అన్యం అక్కర లేదా?"

"బొంబాయి మోటారులాటరీకి అయిదు రూపాయిలుపెట్టి మీపేర టిక్కట్టుకొన్నాను—మధ్యాహ్నం మీరు కచ్చేరీకి వెళ్లింతర్వాత" అని అంది కల్యాణి.

నామనస్సులో కోపం ఒక్కుమ్మడి పెల్లుబికింది. "ఆడవాళ్లకు ధనముయొక్క విలువ తెలియదు. ఎంత

నిర్లక్ష్యము! ముప్పదిరోజులు కష్టించి పనిచేయగా యీ ఆకరువురోజుల్లో Salary cut పోగా వచ్చే స్వల్పజీతంలోని అయిదురూపాయిలను వృథాగా మంటి



అంటూ కల్యాణి నాముఖం కేసి చూచింది.

పాలుచేసిందే!" అని విషాదం మనసును కలచివైచింది. కాని యింతలో మాచిట్టి 'బాబా-బాబా' అనిపలవరించింది. చిట్టిపెదవులపై కేలియాడిన చిరునవ్వులున్నూ సన్నని పండ్ల ధవళచ్ఛాయలున్నూ చంద్రరేఖను వెక్కిరించినట్లు మెరిసినాయి. నిద్రించు మాచిట్టిముఖబింబమున తాండవించు నిర్మలమందహాసవీచికలు నాహృదయాందోళనము చల్లార్చి సేదతీర్చినవి.

"మంచిపని చేసితివి, సంతోషము" అని అప్రయత్నముగా కల్యాణిచేసిన కార్యమున కామె నభినందించాను.

తలవనితలంపుగా కల్యాణి పొందిన గౌరవమునకు ఆమె ఆహ్లాదమందింది.

## ౪

పదునైదుదినములు గడచినవి.

సాయంకాలము మూడుగంటలైనది. ఆఫీసులో తహశీలుదారుగారు నాచే తయారు చేయబడినఆఫీసులెక్కలను పరీక్షించుచుండిరి. ఇంతలో తపాలా బంట్రోతు తంతినొకటి గొనివచ్చి నాకిచ్చెను. తంతిని నేనిప్పకుండగనే "పాపము! ఆప్తులలో నెవరికైనా ప్రమాదము కలుగలేదుకదా!" అని తహశీలు దారుగారు ప్రస్తావించారు. తోడిసుమాస్తాలందరూ చుట్టూచేరారు. తంతినిచ్చి "లాటరీవచ్చింది. బొంబాయిమోటారులాటరీ గెల్చాను" అని అప్రయత్నంగా ఆనందాందోళనలతో అధికారి సమక్షమందున్న సంగతికూడా మరిచి అరిచాను. అక్కడ నేను పొందిన అభినందనములకు అంతులేదు. తహశీలుదారుగారు కూడా ఆ రోజుకు తణిఖీ ఆపుచేసి యింటికేగుట కనుమతినిచ్చారు. నాతోడి సుమాస్తాలు అప్పట్లో నాజేబులోనున్న పదిరూపాయిలు వెచ్చించి నా అనుమతిలేకుండానే 'టీపార్టీ' చేసికొని ఆనందించారు. వార్త తెచ్చిన తంతి జవానుకున్నూ, ఆఫీసుజవానులకున్నూ బహుమానాలక్రింద తాలూకా షరాబు అయిదు రూపాయీలు అప్పుకూడా పెట్టాడు.

## ౫

కల్యాణిఆనందమునకు మేరలేదు. అప్రయత్నంగా వాహనాధికారం కలిగెందికదా అని ఆమె సగర్వి అయింది. మోటారుకారుహక్కెవరిది అని ప్రణయకలహం ప్రారంభమయింది.

"నాజీతపు రాళ్లతో కొన్న టిక్కట్టుకదా, మోటారు నాదే"నని నేనన్నాను.

"టిక్కట్టు కొన్నది నేను. కావలిస్తే అయిదు రూపాయీలు యిచ్చేస్తాను. కారుమాత్రం నాదే" అంది కల్యాణి.

మాకు సమాధానం కుదరక మాచిట్టిని తగాదా పరిష్కరించేందుకు న్యాయాధికారిగా కోరుకున్నాము.

"చిట్టీ, చిట్టీ, కా రెవరిదమ్మా?" అని అడిగాము.

"నాదే!" అంది మాచిట్టి వచ్చీరానిమాటలతో.

చిన్నప్పుడు చదువుకున్న రెండుపిల్లులతగాదా కోతి తీర్చినకథ జ్ఞాపకంవచ్చి మేమిద్దరం నవ్వుకున్నాం.

"కారు నీదేనమ్మా!" అంటూ చిట్టిని ఉభయులమూ ముద్దాడాము.

మరునాడు రెండువేలురూపాయిలిచ్చేదమనిన్నీ, కారు విక్రయించవలసిందనిన్నీ ఒక యేజంటు తంతినిచ్చాడు. కారు పంపుచున్నానని లాటరీయజమాని తంతినిచ్చాడు. యీ రెండువార్తలను చూచినపిమ్మట కళ్లు తెరిచాను.

కారా ? రెండువేలరూపాయిలా ??

యిదమిద్ధమని నిర్ణయించలేక Shakespeare పడ్డ అవస్థలోపడ్డాను.

తోడిఉద్యోగస్థులందరూ "తాలూకాసుమాస్తాకు కారెందుకు? రెండువేలూ పుచ్చుకొని బ్యాంకులో వడ్డీకి వేసుగో" మన్నారు.

కల్యాణి కీపద్ధతి నచ్చలేదు.

"ఈ అపశకునపుమాట లేమిటి? వచ్చిన కారు అమ్ముకుంటారా? శిరివస్తూంటే మోకాలడ్డుతారా? అయిదువేలరూపాయిల కిమ్మతుచేసే కారు రెండువేలకా అమ్ముకోవడం? కావాలన్నప్పుడు కారు దొరుకుతుందా? కారే వుంచుకోవాలి" అంటూ ఆమె గట్టి ఉపన్యాసం యిచ్చింది. ఆమె బాల్యంలో తండ్రి డిప్యూటీకలెక్టరు చేసేటప్పుడు కారుసౌఖ్యం అనుభవించింది. తండ్రి చనిపోవుటచేతనున్నూ, పుట్టింటివారి కుటుంబము చితికిపోవుటచేతనున్నూ ఆమెసౌఖ్యంకు విఘాతం కలిగింది. తిరిగి అట్టిసౌఖ్యం తనంతటతానే వెదకికొని వచ్చుచుండగా పోద్రోచుట కామె కిష్టము లేదు. ఆమెయాజ్ఞ యెప్పటివలె శిరసావహించాను. కారు స్టేషనుకురాగానే రైల్వేవారి కీయవలసిన ఖర్చు ఏబదిరూపాయిలు నాజీతం రానందున హెడ్క్వార్టర్సు రెవిన్యూయినస్పెక్టరుగారివద్ద చేబదులు తెచ్చి చెల్లించి కారుయింటికి తెప్పించుకున్నాను. కారు క్రొత్త Model ది. నూతనంగా యింగ్లాండునుంచి దిగుమతి చేయబడింది. ఆ Model కారు చూచినవాళ్లంతా బాగుందని వేనోళ్ల పొగిడారు. మాయిల్లొక తీర్థయాత్రాప్రదేశమైంది. వచ్చి చూచేవా రడిగేప్రశ్నలకు సమాధానం చెప్పలేక విసిగిపోయాను.

కల్యాణి పొందిన ఆనందము వర్ణింపశక్యంకాదు. వచ్చిపోయే అమ్మలక్కలందరకు ఆకారుయొక్క చరిత్ర నామూలాగ్రంగా సుమారు వేయిమార్లయినా వర్ణించియుంటుంది. కారులోనే గాక యివతల హార్నొ నొక్కితే యేడ్పుప్రారంభించేది మాచిట్టి.

కారునకు ఒకషెడ్ వేయించవలసిందని అంతా సలహాయిచ్చారు. అందుకోసం మాయింటికెదురుగా వున్న కాళీదొడ్డి అద్దెకుతీసుకొని అరవై రూపాయిలు ఖర్చుపెట్టి వకరేకుషెడ్డు వేయించాను. డ్రైవింగు తరిఫీదుపొందిన గ్రామంలోని నిరుద్యోగులందరూ ఉద్యోగం నిమిత్తం అప్లికేషనులు పంపడం ప్రారంభించారు. సమయాసమయాల్లేకుండా వేపించుకు తిన్నారు. గ్రామంలో అందరిదగ్గరనుంచీ స్నేహితులేమి, బంధువులేమి, పరిచయులేమి, అధికార్లేమీ, అందరిదగ్గరనుంచీ రెకమెండేషన్సు తీసుకురావడం ప్రారంభించారు. ఆఖరికి మా తహశీలుదారుగారుకూడా కులాభిమానాన్ని పురస్కరించుకొని ఒకడిని రికమెండు చేశారు. ఆతగాణ్ణి కాదంటే, నా ఉద్యోగానికి భంగ

మొత్తం దేమోనని నెలకు పదిహేనురూపాయిల జీతం మీద అతణ్ణే డ్రైవరుగా అప్పాయింటు చేసినాను. ఉద్యోగాలను భర్తీచేసే అధికారం వున్నవారిపాట్లు నాకప్పుడు గోచరించాయి

౭

మ్యునిసిపాలిటీవారి దగ్గరనుంచీ, జిల్లాబోర్డువారి దగ్గరనుంచీ మోటారు లైసెన్సు ఫీజులు చెల్లించవలసిం దనిన్నీ, లేనియెడల ప్రాసిక్యూషను చేస్తామనిన్నీ శ్రీముఖాలు వచ్చాయి. డబ్బు సర్దుబాటుచేసుకోలేక చాలా చిక్కులుపడ్డాను. కల్యాణి నాకష్టం కనిపెట్టి యేమనడానికి తోచక తనవడ్డాణం విక్రయించి సొమ్ము సకాలంలో సర్దింది.

మాడ్రైవరు కొద్దిరోజుల్లోనే మాకు యజమాని కావటం ప్రారంభించాడు. తన్ను "నాయుడు" అని పిలిస్తేనేకాని పలకనని నాకు వినబడేటట్టు యితరుల వద్ద అంటూవచ్చాడు. అవిధేయత, అవిశ్వాసం వృద్ధి కావడం మొదలెట్టాయి. పెట్రోలుకు అయ్యేఖర్చు మితిమీరింది. కారు మరమ్మతుల పేర వసూలుచేసిన మొత్తం పెరిగిపోయింది. ఇదేమనడానికి భయం. తాను తహశీలుదారుతరఫుమనిషినిగదా అని పొందిన అహంకారము హద్దుమీరింది. తగినట్లు మందలిద్దామంటే తహశీలుదారుగారి కోపానలంలో ఆహుతి కావలసివస్తుందేమోనని లోపల నాకు భయం.

కారు వచ్చింతరువాత నాకు కష్టపరంపర లెక్కువైనాయి. మనశ్శాంతికి దేహశాంతికి కూడా భంగము వాటిల్లింది. నాకు వచ్చేనెలజీతంతో సుఖంగా జీవయాత్రగడిపే సంసారమునకు ఇప్పుడు నూటయేబది రూపాయలవరకు ఖర్చు పెరిగింది. ప్రస్తుత ఆర్థికపరిస్థితు లనుబట్టి అప్పుకూడా పుట్టడం మానేసింది. మోటారు ఏజంటుయిస్తానన్న రెండువేలరూపాయిలు పుచ్చుకుంటే బాగుండియుండేదని కల్యాణి ఒకటిరెండుసార్లంది. నాకష్టసుఖాలలో పాలుపొందే కల్యాణి తనవేయి రూపాయిల కిమ్మతుగల నగలను కుటుంబఖర్చు క్రిందే వినియోగించింది. కుటుంబఖర్చు నిమిత్తం మారువాడీకి అయిదువందల రూపాయీలు ఋణపడ్డాను.

కారు వచ్చినపిమ్మట లోకులుకూడా విరోధులు కావడం మొదలెట్టారు. "కారువచ్చా"క గర్వంవచ్చింది రావీడికి అంటూకొందరు, "దీనితో వీడిదీపం ఆరిపో తుం"దని కొందరు, "కోతికి కొబ్బరికాయ దొరికిన విధంగా కులుకుతున్నారు మగడూ పెండ్లాము" అంటూ కొందరు, నిర్నిమిత్తంగా అసూయాపరు లనడం సాగించారు. గ్రామంలో అవసరమున్నవాళ్లూ లేనివాళ్లూ కూడా కారొకమారు lend చేయమంటూండేవాళ్లు. ఇస్తేవకతంటా, ఈయకపోతే వకతంటా. నిరంతరము నాకారు తమస్వంతకారుగా వినియోగించుకొనుచుండిన మాతహశీలుదారు హెడ్డు అక్కవుంటెంటుగార్లకు కూడా నేను అప్రియుడనైపోయాను.

మాడ్రైవరు చేసిన దుర్ణయము లొక్కటొకటిగా బయలుపడ్డాయి. నాపేర పెట్రోలుకొని యెప్పటి కప్పుడు తిర్గి యితరులకు విక్రయించి సొమ్ముహరించే వాడు. రిపేర్సు పేరెట్టి నావద్ద వసూలుచేసిన సొమ్ము తయు తనకే జమకట్టుకునేవాడు. కారుసామానులు కొన్నిమార్చి లాభంచేసుకున్నాడు. ఒకరోజు సాయంత్రం మాచిట్టి కారులోకూర్చొని ఆడుకుంటూండగా మెళ్లోవున్న బంగారుగొలుసు తీయడానికి ప్రయత్నించాడని యిరుగుపొరుగువారు మాకల్యాణితో చెప్పారు. ఈసంగతులన్నీ విమర్శించి డ్రైవరును నౌఖరీలోంచి తగ్గించి తహశీలుదారుగారి భయాన్ని ఛార్జీయివ్వకుండా వదిలేశాను. కారు నేనే నడపడం ప్రారంభించాను.

౮

సాయంత్రం అయిదుగంటలయింది. చల్లగాలికి షికారు కెడదామని కల్యాణిఅంది. ఆదివారమవడంచేత, అర్జంటు ఆఫీసుపని లేకపోవడంచేత నేనందుకు "సరే" నన్నాను. కారుమీద ప్రయాణమైనాము. కారు వేగంగా పోతూంది దారి నిర్మానుష్యమవడంచేత. కొంత దూరం పోయేసరికి రోడ్డుపైనున్న మామిడిచెట్టు

పై కెక్కి కాయలుకోసుకుని యొకకుర్రవాడు రోడ్డుమధ్యకు దుమికాడు. పాప మాతడు కారువస్తూవున్న సంగతి చూడనే లేదు. కారువేగంవల్లనూ, వ్యవధి లేనందువల్లనూ ఏమి చేయుటకూ నాకు తోచలేదు. ఎట్లో ప్రేకుమాత్రం వెంటనేవేశాను. పదిగజములు పరుగెత్తి కారు గమన మాగింది. రోడ్డుపైనున్న బాలుడు తబ్బిబ్బయినాడు. కారు చక్ర మాతనికాలిపైనుండి పోయింది. ఈ దృశ్యంచూచి కల్యాణీ చిట్టీకూడా హాహాకారాలు చేశారు. ఆయువకుడి కుడికాలి యెముక విరిగింది. స్పృహకూడా కొంచెము తప్పింది. కారులోనే వైద్యాలయంకు తీసుకొనివచ్చి సకాలంలో తగినచికిత్స చేయించాను. పోలీసువారికికూడా సమాచారం తెలియపరిచాను. పదరాని పాట్లుపడి, పట్టరానివాళ్ల కాళ్లుపట్టి, బోలెడు ధనం వెచ్చించి కేసు లేకుండా మాపు చేయించుకునేటప్పటికి తలప్రాణాలు తోకకు వచ్చాయి.



మాడ్రైవరు కృతఘ్నుడని యిదివరలోనే చెప్పాను. వాడికి నేను చేసిన మేలుకు బదులు వాడు నాపై ద్వేషము పెంచి మార్వాడీచేత నామీద దావాచేయించి నా కారు జప్తుచేయించాడు. కోర్టువేలంలో మార్వాడీయే నా కారు తనబాకీ క్రింద పాడుకున్నాడు. నాకేమిచేయుటకును దోచలేదు. దుఃఖము వెల్లువలై పారింది. క్రొత్తనీరువచ్చి పాతనీరును గొనిపోయినట్లు యీకారువచ్చి మనలను దరిద్రులను చేసిపోయింది అంటూ వేడికన్నీరు కార్చాను.

"యీదుఃఖమునకు బాధ్యురాలను నేనే" అంటూ కల్యాణి నన్నూరడించింది.

"చిన్ని లేడినికోరి
సీతమ్మ తెచ్చింది
శ్రీరామునకు కష్టమూ
శ్రీరామునకు కష్టమూ"

అని యెవరో పాడుకుంటూండగా విన్న పాదమాలా పిస్తూ చిట్టి మావద్దకు పరుగెత్తుకుంటూ వచ్చింది.

---

# శర్వరి

పెమ్మరాజు లక్ష్మీపతి

జగముపాలిమేరలను దాటె సవితృరథము - ప్రకృతి యెల్లెడ నిశ్శబ్దభావ మూనె,
అల్లకల్లోల మొనరించి యరిగినట్టి - యోడ వెనుక సద్దడిగినయుదధివోలె.

పోటుపొడిచినకాంతిసముద్రమందు - మానవతరంగఘోష సమాప్తిజెందె,
గగనతలమొప్పె నక్షత్రగణముతోడ - డిప్పవిడినట్టి ముత్తెపుచిప్ప యనగ.

జడతదాల్చినమానవజగతిపైన - చిరువెలుగులీనుతార లంబరమునందు,
నీరవంబైన నిద్రావినీలజగతి - వ్యక్తిపొందెడుస్వప్నానుభవములీల.

ఎన్నియుగములు జగము లికెన్ని యీవి-శాలనీలాంబరంబున శాంతి జెందె!
అమృతతేజోమయంబులై యట్టె నిలిచె - శ్యామలాకాశవీథి నక్షత్రసమితి.

ప్రేలికగ సందు లేకుండ విరియబూచి - యున్న చుక్కలపూదోట నొక్కమధుప
మగుచు తమికీర దివ్యపుష్పాసవంబు - నాని యాని మత్తిలి పాడనగునె నాకు?

నురువుల్ కట్టెడు తెల్లమబ్బులొలయన్ నూనూగులేగాలిక్రొం
దరగల్ చీల్చుచు చందమామపడవన్ దళ్కొత్తగా బోయి, యం
బరనీలాపగ జుక్కలై నిరతమున్ భాసిల్లుచున్నట్టి బం
గరునెత్తమ్మివిరుల్ గ్రహింప మదిలో గాంక్షింతు నే నిమ్యెడన్.

* * * * * * * *

తలపయి తారకాకుసుమదామము లల్లినసొంపు, దక్షిణా
నిలమృదువీవనల్ (?) విసరునీటు, విశాల తటాకదర్పణం
బులఁ బ్రతిబింబముల్ గనెడుపొల్పు, చెలంగ; మనోజ్ఞలీలలన్
బొలుచు నిశావిలాసిని, విముగ్ధకళామయి, నాశ్రయించెదన్.

చెమికీచుక్కలనీలికోకచెరగుల్ జీరాడగా గప్పి మం
త్రమృదూక్తిన్ ధరణీజనంబులను నిద్రాముద్ర బంధించి, రం
గము సర్వాంగమనోజ్ఞభావ మొనరన్ గైసేసి యాకాశమా
ర్గమునన్ రమ్మని నన్నుబిల్చెడు నిశారత్నాంగి శాంతశ్రుతిన్.

ఈనిశ్శబ్దతమిస్రమధ్యమున నిర్యేకాంతపుంజోట నా
నానక్షత్రసువర్ణదీపికలు చెన్నారంగ వెల్గించి నా
తో నేమంతన మాడగోరినదియో ద్యోవీధి నీశర్వరీ
శ్రీనారీమణి శాంతశీల ప్రణయార్ద్రీభూత చేతస్కయై.

అకట యేనాడు పడిపోయినవియొ యిలకు - నేడు తము విడదీయు నీనింగి గడచి
తారకలతోన జేరిపోగోరునౌర - తారకలు రెండు నాదునేత్రములనుండి.

* * * * * * * *

చెలగి చెలరేగి చిత్తరాజీవ మెల్ల-చిదిపి చిందరవందర చేసి, యొకట
విసువు విశ్రాంతిగననిద్రప్రవృత్తియందు-మరగి మగ్నమైపోయిన మామకీన
జీవితాసారరభసము జేర రోసి ; - నాహృదయకోటరమున నిన్నాళ్లు మేను
చుట్టగా జుట్టి నిద్రించుచున్నభుజగి, - ఆగభీరప్రశాంతి మయప్రవృత్తి.

నైక్యమైపోవ గోరు జీవాంశ ; మీ - సనాతనామృతశోభఁ జెన్నారుచున్న
తారకాపుష్పములశాంతిసౌరభము వ-హించి యాకస్టజగతి కందించుమృదుల
పవనసంస్పర్శనంబున పడగ నెత్తి-అట్టె నిలచి యచలానంద మనుభవించు ;
అందరును నిద్రబోవు నియ్యావసరమున.



# ఉరుస్వతీవిజ్ఞాన మందిరము

భారతదేశ పశ్చిమోత్తర ప్రాంతములలో పంజాబున గల కాంగ్రాజిల్లాయందు "నగర" మను నొక చిన్నపట్టణము గలదు. ఈపర్వతనగరముననే, రష్యాదేశస్థుడగు "నికోలస్ రోరికు" "ఉరుస్వతీ హిమాలయన్ రిసర్చి ఇన్‌స్టిట్యూటు" అనుపేరుగల విజ్ఞానప్రచార మందిరము నొకదానిని స్థాపించెను. ఈపరిసరముల నానావిధ ఫలజాతులు సర్వదా విరాజిల్లుచుండును.

పంజాబులోని అమృతసరమునుండి నార్తువెస్టు రైలుమార్గమున పఠాన్ కోటకు జేరి అచటినుండి మండి రాజ్యమువారి లైటురైలుమీద (Light Railway of Mandi State) జోగేంద్రనగరునకుచని యచటినుండి మోటారుబస్సుమీద కులూచేరవలెను. కులూనుండి పోవుత్రోవ రాళ్లమిట్టలమీది కొండబాట. వ్యాస నదియంచుననే యీబాట నదిలోపాటు వంకలు తిరిగి పోవును. కులూనుండి నగరమునకు పదునైదు మైళ్ల దూరము. ఈపదునైదుమైళ్లలో పండ్రెండుమైళ్లదూరము మోటారులు నడుచును; మిగిలినమూడుమైళ్లు పాదచారియైకాని, గుఱ్ఱముమీదగాని, పోవలయును. హిందూదేశమునుండి టిబెటు-చీనా-మధ్యాసియాలకు పోవు మార్గమున దుర్గమమగునొకప్రదేశమున నీ'నగరము'కలదు.

పైనజెప్పిన నికోలసురోరికు జగత్ప్రసిద్ధుడగు నొకచిత్రకారుడు. మొదట ఆతడు న్యాయశాస్త్రము (Law) నభ్యసించెను గాని నైసర్గికముగ నాతనిచిత్తవృత్తి చిత్రకళమీదను, పురాతత్త్వవిషయములమీదను లగ్నమైయుండెను. అందుచే నాతడు చిరకాలము రష్యాయందుండి చిత్రకళయందును పురాతత్త్వమందును కృషిచేసెను. "కళా" యను పత్రికకు సహాయ సంపాదకుడుగ నుండెను. ఈవిధముగ నీతడు రష్యాయందలి కళాసంస్థల ననేకముల నాదరించెను.

చిత్రకళయం దితనికిగల నైపుణ్యము ప్రశంసనీయమైనది. ఈత డతినేర్పుతో, హిమాలయములందును, టిబెట్టునందును చూచి చిత్రించిన చిత్తరువులే యేనూటికిపైగా నున్నవి. ఈవిధముగ నీతడు తన జీవితము నంతయు చిత్రకళా విజ్ఞాన ప్రచారముల మీదను, చిత్రకళౌన్నత్య ప్రశంసనములమీదను గడుపుచున్నాడు. ఇపుడు ప్రపంచముమీద రోరికు సంస్థలు యేబదికి మించి యున్నవి. వీని ప్రధాన కార్యస్థానము అమెరికాయందున్నది. అందొక ప్రదర్శనాలయము (మ్యూజియము)కలదు. దానిలో వేయింటికిపైగా రోరికు రచించిన చిత్రములు గలవు.



ఓషధిప్రయోగశాల



విజ్ఞానమందిరమునకు సంబంధించిన భూమి

౧౯౨౩ - వ సంవత్సరములో రోరికు, భార్యతోను, పురాతత్త్వవేత్తలగు కొందరు స్నేహితులతోను, సైబీరియా, మంచూరియా, మంగోలియా, మధ్యాసియా, టిబెటు, హిమాలయదుర్గమప్రదేశములు లోనగువానినెల్ల పరిశీలించుటకై యాత్రవెడలెను. యాత్ర పూర్తియగునప్పటికి అయిదు సంవత్సరములు పట్టెను. ఈపంచవర్ష పరిమితకాలములో వీరు పండ్రెండువేలమైళ్లు యాత్రచేసిరి. విమానములు, రైలుబండ్లు, మోటారులు విరివిగనుండు నీయిరువదియవ శతాబ్దమునను టిబెట్టు-మధ్యాసియా దేశములగూర్చి లోకమునకేమియు తెలియదు. హిమాలయమన్న నిది ప్రపంచమున నొక రహస్యగుప్తవస్తువుగ నున్నది. ప్రాచీనకాలములందలి ప్రజలు, వారి గుణశీలములు, వారి నాగరకత మున్నగు విషయముల తెలిసికొనవలయు ననిన ప్రాతకాలపు-ఐతిహాసిక గ్రంథాదిసామగ్రుల కాలగర్భమునుండి త్రవ్వి తీసి కనుగొనవలసియుండును. అయితే టిబెట్టు-మధ్యాసియా లోనగు ప్రదేశముల బరికించిన యెడల యచటి జనుల మనుగడలపద్ధతు లనాదిగ యెట్టిమార్పులను జెందక ఏకరీతిగ నున్నటులు తోపగలదు. కనుక ఇట్టి భూభాగములపర్యటనము చేసి వానినెల్ల చక్కగ పరిశోధించిన యెడల మానవజాతిచరిత్రము చక్కగ బోధపడగలదు. పైనచెప్పిన రోరికుదళమువారీప్రదేశములందంతటను సంచరించి సంపాదించిన సామగ్రివలన లోకవిజ్ఞానము వృద్ధిచేసికొనుటకు తగినంత సహాయ మేర్పడును.

ఇట్టిదేశయాత్రావిధానములందు సంపాదింపబడు విజ్ఞానమునంతయు పరిశీలించి పఠనయోగ్యము చేయుట కొకకేంద్రస్థాన ముండవలయునని యాత్రానంతరము రోరికు తలంచెను. ఈవిషయమై యాతడు లెస్సగ నాలోచించి నగరమున "ఉరుస్వతీ హిమాలయన్ రిసర్చి ఇన్‌స్టిట్యూటు"ను స్థాపించెను. నగరము చాల ఆరోగ్యకరమైనప్రదేశము. ఎల్లపుడును చల్లగనుండును. నగరమత్యంతోన్నత ప్రదేశమున నున్నది. హిమాలయ పరిసరములయం దుండుటచే పర్వతములమీద



రోరిక్ ఆచార్యుని ఇల్లు

పెరుగు సమస్త-ఓషధులు లోనగునవి ఇచట పెరుగ గలవు. మరియు భైషజ్యశాస్త్రాధ్యయనమున కిందు గొప్ప అనుకూల్యమున్నది. ఓషధులు పుట్టుచోటనే వానిగుణదోషపరీక్ష కధికముగ నవకాశముండును.

నన్నిటిని శోధించి తెలుసుకొనుట యీసంస్థయొక్క ఉద్దేశమని అచటి పాఠ్యసూచి (Syllabus) వలన తెలియగలదు. పురాతత్త్వము మొదలు బ్రహ్మతత్త్వశాస్త్రమువరకు గల యావద్విషయపరిశోధన



ఓషధిప్రయోగమునకయి కట్టబడుచున్న క్రొత్తభవనము

భరతఖండముయొక్క మధ్యభాగము మొదలుకొని టిబెటు, చీనా, రష్యా, తుర్కిస్థానము, మధ్యాసియా లోనగు దేశముల విజ్ఞానాదికముల పరిశీలించుట ఈనూత్న సంస్థయొక్క యుద్దేశము. సృష్టిలో నేవేవి పుట్టెనో, మానవుడే యేవస్తువుల చేసేతజేసెనో వాని లీసంస్థపరిధిలో చేరియున్నవి. ఉరుస్వతీద్వారా అనేక ప్రాచీన విషయములు, వస్తువులు, భూగర్భమునుండి వెలువడ గలవు. ఆప్రాంతములయందు టిబెటు భాష కెక్కువ ప్రచారము గలదు కావున టిబెటు పండితులసహాయమున ఉరుస్వతీలో టిబెట్టుభాష చెప్పబడు చున్నది.



భూకంపముల బాధ లేకుండుటకయి కల్పించిన 'ధజ్జీదీవార' నామక నిర్మాణవిధానము

ఉరుస్వతీయందు వృక్షశాస్త్రాభ్యాసము కొరకు చాలినన్ని రకముల వృక్షములును అనేక పశువులును గలవు. హిమాలయ ప్రాంతములందును, కులూకనుమల ప్రాంతములందును నానాజాతుల మూలికలు, అనే

కములను వనౌషధులు ఎక్కువగ దొరకును. ఉరుస్వతీ విజ్ఞానమందిరమున నీసకలకందమూలవనౌషధులయొక్క ప్రయోజనములు అధునాతనపరీక్షాపద్ధతులవల్ల చక్కగ



న్యూయార్కునందలి రోరిచుమ్యూజియమున తిబేతు వస్తుసంగ్రహాలయము

వివరింపబడుచున్నవి. ఆ విజ్ఞానసంస్థలో నానాజాతిఓషధులను తోటలలో నాటిపెంచెదరు అందు దాదాపు రెండువేలు నానాజాతివనౌషధులు పెంచబడుచున్నవి. ఉరుస్వతీవిజ్ఞానశాలనుండి ౧౫౦౦ జాతులయొక్క ౩౭౦౦ అంట్లు అమెరికాలోని మిషిగాన్ యూనివర్సిటీ ఉద్భిజ్జశాలకున్ను, ౧౫౦౦ రకముల ౩౮౦౦ అంట్లు న్యూయార్కులోని బొటానికల్ గార్డన్ యొక్క ఉద్భిజ్జశాలకున్ను పంపబడియున్నవి.

టిబెటునందు అనాది ప్రచారము గల చికిత్సా పద్ధతి యొకటి గలదు. ఈ చికిత్స చే ఘోరమగు క్షయ రోగమును, కాన్సరు ప్రండ్లును కుదురుచున్నవి. ఇందువలన టిబెటు భాషనునేర్చి. అచటి భైషజ్యశాస్త్ర

మును అధ్యయనము చేయించుటకు తగిన యేర్పాటులు ఉరుస్వతిలో కలవు. 'టిబెటికా' యనుపేర సాగింపబడుచుండు గ్రంథమాలయందు టిబెట్ ఆయుర్వేద గ్రంథములు రెండు ఇప్పటికే అనువదింపబడినవి.

ఉరుస్వతి విజ్ఞానశాలాభవనము సుందరమగు నొక రెండంతస్థుల మేడలో నున్నది. దీనికిచేరిన పడిభూమి చాలాయెకరములు కలదు. రోరిచాచార్యశ్రీ షౌధమును, ఆ భూమిని ఈవిజ్ఞానశాలకు దానరూపముగా సమర్పించినారు. ఇందు కచ్చేరి, పుస్తక భాండాగారము, మరియు. నారుగురు వైజ్ఞానికులు(Research Scholars) కాపురముండుటకు వసతులు కలవు. ఈవిజ్ఞానసంపాదనయందు అధునాతనవిమర్శలన్నియు ఇచట జరుగవలయునని రోరిచ ఉద్దేశము. ఈ విషయమున ఈవిజ్ఞానశాలకు దేశాంతరములలోని అనేకవైజ్ఞానికుల యొక్కయు, విజ్ఞానశాలలయొక్కయు సహాయసంబంధములు కలవు.

ఉరుస్వతీవిజ్ఞానశాల ౧౯౩౭ లో స్థాపింపబడిన క్రియాకలాపములు ౧౯౩౯-౩౦ నుండి ప్రారంభ



ప్రయోగశాలదృశ్యము-ఈశాన్యమునుండి

మయి సాగుచున్నవి. ౧౯౨౮ కడభాగమున రోరిక మహాశయుడు పుదుచ్చేరిలో పురాతత్త్వ విచారసంబంధముగ కొన్నిప్రదేశముల త్రవ్వించి వాటినుండి ప్రస్తర యుగ (Stone age) సంబంధములగు అనేకవస్తువుల వెలువరిచినాడు. ఈతనిచే పంపబడిన మరియొకదళము లాహోలి ప్రాంతములకు పోయి యచటి వనస్పతుల యొక్కయు, పశుపక్ష్యాదులయొక్కయు పరిశీలనము జరిగించెను. వీరచటినుండి ౧౩౦౦ వనస్పతులయొక్కయు, ౧౦౦౦౦ పర్వతపక్షులయొక్కయు, ౩౦౦ గొఱ్ఱె జాతులయొక్కయు మాదిరులను తెచ్చిరి. ఈ అన్నివిషయముల విజ్ఞానప్రచారము నగరములో జరుగును.



రోరిక నివాసము. వేరొక దృశ్యము.
శీతకాలపు క్రొత్తమంచు చెట్లపైనంటి వ్రేలాడుచున్నది.

ఈవిజ్ఞానశాలవారు టిబెటు-ఇంగ్లీషు నిఘంటువు నొకదానిని వ్రాయుచున్నారు. టిబెట్ భాషావిషయమై 'టిబెటికా' అనుపేర నొక పెద్దగ్రంథము ప్రకటింపబడుచున్నది.

ఓషధులు, కందమూలములు లోనగువానిపరిశీలనకై ఆధునికవిధానములచే సిద్ధముచేయబడిన ఆయుధపరికరములతో సజ్జీకృతమగు నొకప్రయోగశాల ఉరుస్వతీవిజ్ఞానశాలసమీపముననే నిర్మింపబడియున్నది.

'నగరము' న్న కాంగ్రాజిల్లాలో భూకంపము లెక్కువగ సంప్రాప్తించుచుండును. ఈకారణముచే నీప్రయోగశాల "ధజ్జీ-దీవార్" పద్ధతిమీద కట్టబడినది. "ధజ్జీ-దీవార్" పద్ధతియనగా: మొదటకొయ్యతో నొక చట్టమును నిర్మించి దానిమీద సున్నముపూతపూయుట. ఈకట్టడములను భూకంపములు ఛేదింపజాలవు.

పైనచెప్పినప్రయోగశాలయందును నివాసస్థానములందును విద్యుత్తు ఉపయోగింపబడుచున్నది. ఈవిద్యుత్తు నగరసమీపమున నొకనిర్ఝరమునుండి యుత్పత్తి చేయబడుచున్నది.

ఈ ఉరుస్వతీసంస్థ న్యూయార్కులోని రోరిక మ్యూజియముయొక్క శాఖయై యున్నది. ఈసంస్థ నిరంతరాయముగ జరుగగలందులకు కావలయు ధన మంతయు న్యూయార్కు మ్యూజియము భరించుచున్నది.

ప్రపంచములోని యనేక వైజ్ఞానిక సంస్థలతో నీ ఉరుస్వతీసంస్థకు సంబంధము గలదు. అమెరికాయందును, యూరోపునందును నుండునట్టి విశ్వవిద్యాలయములలోనను, వైజ్ఞానికసంస్థలలోనను దాదాపుమున్నూటికి పైగా ఈఉరుస్వతిసంస్థ ప్రకటించు గ్రంథములతో తమ యుద్గ్రంథములను సమానప్రతిపత్తిమీద మార్చుకొనుచున్నవి.

హిమాలయ పర్వత కందరములలో ననేకమంది మహాజ్ఞానులును, తత్త్వవేత్తలును, మహర్షులును నివసించియున్నటులు హిందువులు నమ్ముచున్నారు. ప్రపంచవ్యాప్తిగల యెన్ని జ్ఞాన విజ్ఞానప్రణాళికలు హిమాలయ కందరములలో నుత్పత్తియైనవియో యెవరుచెప్పగలరు? ఆధునికుడగు నొక ఐరోపేయమనీషి హిమాలయమును సర్వవైజ్ఞానికకేంద్రస్థాన మనుచున్నాడు. బహుశః నాటిచిరకాలమున సమస్తలోకోపకారకమగు విజ్ఞాన మహాభాండారము ఉరుస్వతినుండి వెలువడగలదను నాశ సంపూర్ణముగాగలదు.

[విశాలభారతి: జులై ౧౯౩౩]

రాజు.




## ఆధునికాంధ్రవాఙ్మయము

మనదేశమున ఇంగ్లీషుభాష వ్యాపింపకపూర్వము మనరాజులు మన కవులను పోషించినారు. మన వాఙ్మయము హుటాహుటిని నడకలతో పెంపొందినది.

ఆ వాఙ్మయము సర్వతోముఖము కాకపోవచ్చు. కేవలము శృంగారరసాత్మకము, ధార్మికము ననుపద్యరూపమే కావచ్చు; కాని ఆకాలపు రుచినిబట్టి ఆరూపమున అది సంపూర్ణమే.

ఆ రాజులు తెనుగుకవులను జాంబూనదాంబరాభరణము లొసంగినారు; మాన్యము లిచ్చినారు. గుఱ్ఱములు, ఏనుగులు, శిబికలు సమర్పించినారు; అగ్రహారములు బహూకరించినారు; కనకాభిషేకములు చేసినారు.

ఆరాజులు తమ సంస్థానములలో ఒక్కొక్క తెనుగుకవియైన లేకుండుట అసభ్యత అని భయపడినారు; కవులను పోషింపని తమయైశ్వర్యము తిలకము లేని అయిదువతనమువంటి దని జడిసినారు.

రాజులనుజూచి సామంతులు, మంత్రులు, సరదారులుమున్నగు పదస్థులేగాక, సంపన్నులగు గృహస్థులు గూడ అప్పుడు కావ్యములను అంకితము పొంది, కవులను పూజించినారు.

ఇంతేకాదు: కవుల యనుగ్రహమునకు వారు కొంగు జూపినారు; కవుల యాగ్రహమునకు వెనుకంజ వేసినారు.

మితవ్యయ మెఱుగని కవిసార్వభౌమునివంటి కవులు కొందరు చరమదశలో లుకలుకలుపడినా మొత్తముమీద ఆకాలపుకవులు దారిద్ర్యము నెరుగరు.

నరస్తుతులకు రోసి, దారిద్ర్యమును వరించి, ఐహికవిడంబనములను స్వయముగ దూరులైన పోతనామాత్యునివంటి కవులకును ఆకాలమున నుణము నెరిగిన ఆదరాభిమానములు నవశక్తిని సంఘటించినవి.

ఏతావతా: అప్పటికవులు ఇష్టమృష్టాన్నములు కుడిచినారు; దుకూలములు తాల్చినారు; సుఖములు పడసినారు; ఆనంద మనుభవించినారు.

ప్రభువులరసికత — అథవా స్తుతిప్రీతి వారిని ఉద్బుద్ధులను గావించినది. జనుల కవితాప్రీతి వారికి ఉల్లాసము సంఘటించినది.

ఎట్టి విఘాతములును లేక వారి భావనాశక్తి విజృంభించినది.

ఈవిధముగ జిలిబిలిపలుకులతో రాజులయాస్థానములయందు సరస్వతి గానముచేయగా, బంగరుగజ్జెలతో కవులప్రాంగణములయందు లక్ష్మి నృత్యము చేసినది.

ఏల?

ఆకాలమున దేశీయులకందరకును ఆంధ్రమొక్కటే భాష. ఆంధ్రమునందే వారి కక్షరాభ్యాసము; ఆంధ్రమునందె జ్ఞానోపదేశము.

అపిచ, ఆంధ్రమునందే వారికి భావోదయము; ఆంధ్రమునందే భావప్రకటనము.

నూనిదాంత్రి "కయిదురు బొయిదురు" సన్నలకున్న అప్పుడు ఆంధ్రమే ప్రాతిపదిక. ఘట్టంభుల నిర్ధక్రభూపంచనములన్ను ఆంధ్రమునందే వార్తికము.

అప్పుడు, శిశువు లేభాషలో తమతొక్కుపలుకులతో నిసర్గకవితామాధుర్యమును రుచిచూపింతురో,

తల్లు లేభాషలో జోలలు పాడి ప్రేమామృతము వర్షింతురో ఆయాంధ్రమునందే జనులు తమ జీవితములు గడపినారు. ఆయాంధ్రమునందే వైశ్యులు వాణిజ్యము సాగించినారు. ఆయాంధ్రమునందే రాజులు తమప్రభుత్వమును చలాయించినారు. ఆయాంధ్రమునే మనకవులు రసమయము గావించినారు.

ఇట్లప్పుడు ఎటుచూచినా ఆంధ్రమే; ఎటు విన్నా ఆంధ్రమే.

ఈవిధముగ అప్పు డందరకును ఆంధ్రమున వైదుష్య మలవరుచుకొనవలసినవిధి యేర్పడినది.

వైదుష్యముతోడిదే రసికతయు.

ఇక విస్తరమేల? కవులు తన్మయులై ఆంధ్రమున గ్రంథములు రచియించినారు. జనులు ఉబలాటపడి ఆకావ్యములను పారాయణచేసినారు. రాజులు ఆకావ్యకన్యలను వరించి కవులను సత్కరించినారు.

ఆంధ్రగ్రంథపఠనము ఇట్లాకాలమువారికి ఉగ్గుపాలతో ప్రారంభమైనది.

వాఙ్మయము పెరిగి వికసించినది.

కించ: జాతీయతయు మిసమిసలాడినది.

ఇప్పుడు............?

'చాప చిరిగి చదర యగు'నట్లు మనరాజ్యములు కూలిపోయి జమీందారీ లేర్పడినవి.

జమీందారులకు విద్యావ్యాసంగము తక్కువ. ఎక్కువగానున్నవారు ఇంగ్లీషులో కేరింతలు కొట్టుచున్నారు.

మనశిశువులకు ఏ, బీ, సీ, డీలు ముందు, ఓనమాలు తరువాత.

మనస్త్రీలలోగూడ 'బియ్యే'లు లెక్కకు మిక్కిలిగా తయారనుచున్నారు.

ఇప్పు డింగ్లీషుతెలియనికర్షకుడు తనవ్యవహారములను సమాళించుకొనలేడు.

ఇంగ్లీషురానివైశ్యునకు వర్తకమున దివాలా. అథవా, కనుబొమ్మలమీది వెంట్రుకలస్థితి.

రాచరికమంతయు ఇంగ్లీషున నిర్వహింపబడుచున్నది.

బడులలో నేర్పబడుచున్న ప్రారంభవిద్యవలన మనబాలికలకు, బాలురకు ఉన్న సహజజ్ఞానముగూడ మకిలయై పోవుచున్నది.

ఉన్నతవిద్యలో ఆంధ్రము నామమాత్రమే. ఐచ్ఛికమనియు చెప్పవచ్చును.

ఆపైని హిందీ. దేశీయులిది కోరి నెత్తికెక్కించుకొనుచున్న బరువు.

కాగా: మనవారికిపుడు ఇంగ్లీషుమీద నిర్బంధమువలన అలవాటయిన ప్రీతి. హిందీమీద చెల్లింపువలన కలిగిన ప్రేమ. ఆంధ్రముమీద విధిలేని సవతితల్లిప్రేమ.

ఇన్నివిధముల నేడు మనవారికి ఆంధ్ర మందుబాటులో లేకుండ బోయినది.

ఇది యిట్లుండగా:

ఇంగ్లీషులో దిట్టలైనవా రాంధ్రగ్రంథములను తాకరు. వారి విజ్ఞానమునెదుట ఆంధ్రగ్రంథములు చెత్తయు, చెదారమును.

ఇంగ్లీషులో డొక్కశుద్ధిమాత్ర మయినవారికి ఏగ్రంథమును పనిలేదు. దేశీయపరిశ్రమలు వృద్ధికావలయు నని ముతకనూలుబట్టలు కట్టువారికి హిందీమీదనే మోజు.

జనసామాన్యమునకు రైల్వేలిటరేచరే కొంగుబంగారము.

ఇక ఆంధ్రమునందలి ఉద్గ్రంథము లెవరికి కావలయును?

ఉన్నవి చాలునా అంటే తయారగుటకు ప్రోత్సాహ మేదీ?

ఆంధ్రగ్రంథములకు అచ్చుపడుటకు మార్గములు లేవు. అచ్చుపడినవాటికి గిరాకీ లేదు.

ఆంధ్రేతరులు మనదేశమున తమభాషాపుస్తకము లమ్ముకొని మిద్దెలు, మేడలును కట్టుకొనుచుండగా, తమగ్రంథము లచ్చువేయించుకొనుటకు ఆంధ్రగ్రంథ కర్తలు ప్రోనోట్లు వ్రాసి కోర్టులలో కీడ్వబడు చున్నారు.

ఇట్టిస్థితిలో ఆంధ్రవాఙ్మయము పెరుగుటయెట్లు?

అయితే: యిక గతి యేమి?

ఇంతవరకు నేదో యికముందు నదే.

మన ఆంధ్రు డిప్పుడు తన్ను తానెరుగడు; తన మాట తనకు లెక్కలేదు; తనభాషమీద లక్ష్యము లేదు; తన సంప్రదాయముసెడల నభిమానము లేదు.

ఒకని వేషము తాల్చుట, ఒకని భాష మాట్లాడుట, ఒకని యాజ్ఞలు చెల్లించుట, ఒకని సలామై యుండుట, ఒకనిని మెప్పింపగోరి తన సర్వస్వమును భస్మముచేసికొనుట—ఇదీ నేటి ఆంధ్రుని దినచర్య.

ఈస్థితిలో మనకవుల కేమిప్రోత్సాహముండును?

గాని, నేటి ఆంధ్రకవియే జాతీయోద్ధారకుడు. ఏమంటే? స్వత్వమును గోలుపోయిన నేటిఆంధ్రునకు ఆంధ్రభాష నేర్పవలయును. ఆంధ్రహృదయము నంకితముచేయవలయును. సంపూర్ణముగ ఆంధ్రత్వమునే సమకూర్పవలయును.

ఇదియంతయు నేటి ఆంధ్రకవివలననే అగును.

ఎట్టివాఙ్మయము పరపదదళితమై, పతితమై, జర్ఝరితమై, ధూళిధూసరితమై, క్షుణ్ణమై పోయిన నేటి ఆంధ్రజాతిని ప్రబోధింపగలదో, తనకాళ్లమీద తాను నిలుచునట్లు చేయగలదో, ఆంధ్రత్వమునుండి యెట్టి సన్నివేశములయందును గళితము కాకుండునట్లు నిలుపగలదో, తనవిద్యావివేకములచేతను, బలపరాక్రమముల చేతను, విజ్ఞానసంప్రదాయములచేతను భారతాకాశము నుబ్బెత్తుగ ధగద్ధగితము చేయగలుగునట్లు దిద్దితీర్చగలదో అట్టివాఙ్మయము మన కిప్పు డావశ్యకమై యున్నది.

ఇట్టివాఙ్మయమును నిర్మింపగల ఆంధ్రకవియే నేడు ధన్యుడు. అట్టివానికొరకే జాతి ప్రతీక్షించుచున్నది.

—శాస్త్రి.

---

## ఆంధ్రభాషాప్రవీణ

ఆంధ్రవిశ్వ విద్యాలయమువారు ఉభయభాషాప్రవీణ ఏ బి సి శాఖలను తీసివేసి 'ఆంధ్రభాషాప్రవీణ' అను ఒక్కపరీక్షనుమాత్రమె పెట్ట నుద్దేశించినట్లు తెలియుచున్నది. ఏ శాఖలో సంస్కృతము ప్రధానముగను తెలుగు అప్రధానముగను, బి శాఖలో తెలుగుప్రధానముగను సంస్కృతము అప్రధానముగను, సి శాఖలో తెలుగుతోబాటు మఱియొక ద్రవిడభాషయును చదువవలసియుండెను. మొదట ఏ శాఖమాత్రమే యుండెనుగాని తెలుగు భాషాభిమానులైన త్రిపురనేని రామస్వామిచౌదరి, కట్టమంచి రామలింగారెడ్డిగార్ల కృషిచేత బి సి శాఖలు చేర్చబడెను. మదరాసు యూనివర్సిటిలో అరవ మొక్కటే చదువదగిన 'డి' శాఖకూడ కలదు. మదరాసుయూనివర్సిటిలో అరవమున కున్న ఉత్తమగౌరవము ఆంధ్రయూనివర్సిటీలో ఆంధ్రమునకు లేకున్నను, బి సి శాఖలను తీసివేయుట మూలముగా ఇదివరకు ఆంధ్రమున కున్న మధ్యరకపు గౌరవముకూడ పోయినది. ఆంధ్రములో సంస్కృతపు మాటలు చేరినందున సంస్కృతము చదువుట అవసరమేగాని తెలుగుయొక్క పుట్టుపూర్వములు తెలియవలయునన్న సంస్కృతము చదువుటకంటె మఱియొక్క ద్రవిడ భాషాజ్ఞానము ఎక్కువ అవసరము. కాని ఆంధ్ర విశ్వవిద్యాలయములోని ప్రాచ్యభాషాశాఖ తెలుగుయొక్క దురదృష్టముచేత "సంస్కృత మాద్యప్రకృతి, ఆంధ్రభాషవికృతి" అని దుర్వాదముచేయు సంస్కృత భాషావాదుల చేతిలో బడినది. ఈక్రొత్తమార్పు వలన తెలుగునకు రాదగినముప్పును కొంత విచారింతము.

ఎ బి సి శాఖలను తీసివేయుటకు గలకారణములను ముందు విచారించవలసియున్నది. బి సి శాఖలలో తేరిన వారి పాండిత్యముసెడల పండితులకు గౌర

వము లేదట. ఏపండితులకు? సంస్కృతపండితులకు. సంస్కృతపండితులయెడల తురకపండితులకు గూడ గౌరవ ముండదు. అందువలన తెలుగునకు వచ్చినలోటేమి? ఆంధ్రదేశములోని ఒక్కప్రాచ్యవిద్యాలయములోగూడ బి సి శాఖలు నేర్పబడుటలేదు. అయినను బి శాఖకే ప్రైవేటుగా ఎక్కువమంది చదువుచున్నారు. అది సంస్కృత-బళ్లవారికి కంటగింపు. నేలమువెట్టిగా చాలామంది చదువడముచేత బి శాఖ పనికిరాదనీ, ఎవరు చదువుటలేదు గనుక సి శాఖ పనికిరాదనీ కారణములు చెప్పి బి సి శాఖలను తీసివేయవలసిన దన్నారు. ఇతర సాహిత్యపరీక్షలు సంస్కృతమును బోధించును గనుక ఏ శాఖ తీసివేయవలసినదన్నారు. అందువలన సంస్కృతమునకు నష్టమురాకుండ చూచుకున్నారు గాని తెలుగునకు ముప్పు వాటిల్లినది. క్రొత్తగాపెట్టునట్టి ఆంధ్రభాషా ప్రవీణకు ఏశాఖకంటె తక్కువసంస్కృతమును, బి శాఖ కంటె తక్కువతెలుగును నేర్పుదురట. కనుక పర్యవసాన మేమనగా క్రొత్తపరీక్షలో తెలుగు తగ్గించి సంస్కృతము కొద్దిగా హెచ్చించెదరు. అందువూలముగ ఈపరీక్షకు గౌరవము హెచ్చునట. ఎంతతక్కువ తెలుగుపాండిత్యముండిన అంతగౌరవము హెచ్చునని సంస్కృతవాదుల ఆశయముగాబోలు.

ఇంతేకాదు. క్రొత్త ఆంధ్రభాషాప్రవీణకు సంస్కృతము తప్పక తీసుకొనితీరవలయును; దానితోబాటు ఒకద్రావిడభాష తీసికొనవలయును. అనగా తెలుగుభాష తీసికొని తీరవలయు నను నిర్బంధము లేదు. కాబట్టి ఆంధ్రభాష చదువకుండానే ఆంధ్రభాషాప్రవీణపరీక్షలో ఉత్తీర్ణులయి బిరుదును పొందవచ్చును. ఇట్టి సౌకర్యమును కనిపెట్టినఆంధ్రవిశ్వవిద్యాలయమువారియొక్క బుద్ధికుశలత ప్రశంసనీయము.

బి శాఖపండితులకు తగినంత తెలుగుపాండిత్యముగాని, గౌరవముగాని లేదనుట కేవలము కల్పితమయిన అపవాదము. వీరు ఏ విద్వానువారికంటెను, మామూలుసంస్కృతపండితులకంటెను ఎక్కువ బాగుగ తెలుగు బోధించగలరు. మామూలుగ సంస్కృత పండితులు సంస్కృతము చదివిన చాలుననియు, తెలుగు ప్రత్యేకముగ చదువ నవసరము లేకయే తెలుగు బోధించవచ్చుననియు అభిప్రాయపడుదురు. ఎవరోతప్ప మామూలుసంస్కృత పండితులకు తెలుగురాదు. "అటజనికాంచె", "బహురత్నద్యుతి" ఇటువంటి పద్యములకు మాత్రము అర్థము చెప్పగలరు. ఇట్టి పండితులే పూర్వకవులు చాలామంది. ఇప్పటి ఇంగ్లీషు ప్రొఫెసర్లకెంత తెలుగువచ్చునో వారికి గూడ అంత తెలుగే వచ్చును. మనము సగము ఇంగ్లీషు ముక్కలు వేయకుండా తెలుగు ఎట్లా మాట్లాడలేమో వారును సంస్కృతము కలపకుండ తెనుగు వ్రాయలేకపోయినారు. మనకును, వారికినిగూడ మన భావములను వెల్లడించుటకు తెలుగులో మాట లున్నవా లేవా అనేప్రశ్న లేదు. మనకు వచ్చినవి ఇంగ్లీషుమాటలు; వారికి వచ్చినవి సంస్కృతపుమాటలు. మన ఉభయులమధ్యను తెలుగు నాశనమయినది; ఇంకను అగుచున్నది. అరసున్న బండి ఱ, మాత్రము వేసినయెడల అది పక్కా తెలుగయినట్లే. తక్కినదంతయు సంస్కృతమయినను పరవాలేదు. విశ్వవిద్యాలయము చివర కిక్కడికి దేలినది.

ఉన్నవ లక్ష్మీనారాయణ.




మంగిపూడి వేంకటశర్మ

## ౧౬. బుడబుడసంచి

ఇద్దరుబాలికలు పెండేసి పెద్దలు (ఆటపెద్దలు) గా నుండి తక్కినవారిని ఉద్దీలువేసి చెరిసగము పంచుకొందురు. తరువాత రెండుభాగములవారును ఒకరికొకరెదురుగా రెండుబంతులుగా తీరికూర్చుండవలయును. కూర్చున్నతరువాత ఏభాగమువారో ఒకభాగమువారు ముందుగా ఆడుకొనుటకు యేర్పరచుకోవలయును. అట్లు యేర్పడినభాగమువారి ఆటపెద్ద తనబంతివారి కందరికిని బంతిపువ్వుఅని యొకరికి, గులాబిపువ్వు అని యొకరికి, మల్లిపువ్వు, జాజిపువ్వు, సంపెంగపువ్వు, పొగడపువ్వుమొదలయినపేర్లు చెరియొకరికి రహస్యముగా పేర్లుపెట్టి తాను రెండవబంతివారిలో ఒకరికి కన్నులు మూసి తాను గుర్తుగా పెట్టినపువ్వు పేరుపెట్టి తనవారిలో నొకరిని కేకవేసి పిలుచును. ఆపువ్వుపేరుగల బాలికకన్నులుమూయబడిన బాలికయొక్క ముక్కు మెల్లగా గిల్లి మాటలాడకుండ తనచోటికి వచ్చి కూర్చుండును. తోడనే యీబంతివారందరును చప్పటులగొట్టుచు "బుడబుడసంచి, బుడాయిసంచి" అని పాడుచుందురు. అప్పుడు వీరిఆటపెద్దఆబాలిక కన్నులు విడిచి నీముక్కుగిల్లినవారిపేరు చెప్పుమని యడుగును. ఆబాలిక సరిగా చెప్పగలిగినయెడల ఎవరిపేరు చెప్పునో ఆబాలిక పేరు చెప్పుకొన్నవారిపంక్తిలోకి వెళ్లవలయును. చెప్పలేనియెడల చెప్పలేనిపిల్లయే యీవలిబంతిలో కలియవలయును. ఒకమారు వీరును, ఒకమారు వారును ఆడుచు రావలయును. ఇట్లు ఆడగా ఎవనిపంక్తిలోనివారు క్రమముగా తగ్గిపోవుదురో వారు ఓడిపోయినట్లు అగును.

## ౧౭. వెన్నెలకుప్పలు

ఇద్దరు పెండేసిపెద్దలుగా ఏర్పడి బాలికలనందరిని సరిసమానముగా ఉద్దీలువేసి పంచుకొని ఒకపక్షముబాలికలు రెండవపక్షమువారు చూడకుండునట్లు చాల దూరముపోయి యొకచోట యిసుకగాని, దుమ్ముగాని ప్రోసుచేసికొని యెవరికివారు ఒక్కొక్కకుప్ప వేసికొని రావలయును. మొదటివారు చాటునకు పోయిన వెంటనే రెండవపక్షమువారుకూడ మరియొకచోటికి (చాటునకు) పోయి అట్లే వెన్నెలకుప్పలు వేసికొని రావలయును. ఒకరు పోయెడుచోటు మరియొకపక్షమువారు ముందుగా చూడకూడదు. ఒకభాగమువారు కుప్పలు పెట్టుకొన్నస్థలము మరియొకభాగమువారికి తెలియకుండ రహస్యముగా నుండవలయును. ఇట్లు రెండుపక్షములవారును వెన్నెలకుప్పలు చేసికొనివచ్చినతరువాత ఒకపక్షమువారికుప్పలు మరియొకపక్షమువారు కనుగొనుటకై పోవలెను. పోవునపుడు వారిపెండేసిపెద్ద వీరివెంటను, వీరిపెద్ద వారివెంటను పోవలయును. అట్లు వెళ్లి తమయెదుటిపక్షమువారివెన్నెలకుప్పలను కనుగొన్నవెంటనే త్రొక్కివేసి వేగరముగా పరుగెత్తి ఆటస్థలమునకు రావలయును. ఎవరు ముందుగా వచ్చెదరో వారు (ఆపక్షమువారు) గెల్చినట్టును, వెనుకవచ్చినవారు ఓడిపోయినట్లును అగును. మరలమరల ఉద్దీలువేసి మార్చుకొని ఆడుకొనుచుండవలయును. వెన్నెలకుప్పలు పెట్టుకొనుటకు వెళ్లువారు ఇండ్లదొడ్లలోనికిని, ఇండ్లలోనికిని మాత్రము వెళ్లరాదు. సందులలోనికిని, చిన్నవీథులలోనికిని వెళ్లవచ్చును. ఒకవీథినుండి మరియొకవీథి

కూడ పోవచ్చును. ఈయాట వెన్నెలదినములలోనే ఆడుకొనవలయును.

## ౧౮. వెన్నెలవత్తి

ఒకబాలిక ఆటపెద్దగా నుండవలయును. తక్కిన వారందరును ఆటపెద్దతిరిగినదిక్కుగానే మొగములుంచి నిలిచియుండి "వంగనారు నాటవలయునమ్మా!" యని ముందుకు వంగి మొక్కలు నాటుచున్న ట్లుండవలయును. అప్పుడు ఆటపెద్ద ఒకదు దివత్తిగాని, గుడ్డ వత్తిగాని చేతితో పట్టుకొని అందరిని కండ్లు మూసు కొండని చెప్పవలయును. అట్లు మూసికొన్న తరువాత ఆవత్తి ఆబాలికలవైపునకు పారవేసి "వెన్నెలవత్తిని వెదకితీసుకరండి" అని చెప్పవలెను. అంతట ఆబాలిక లందరును కన్నులు తెరచి చూచి వెదకి తెచ్చి తల్లి బాలికకియ్యవలెను. అట్లుతల్లికివత్తితెచ్చియిచ్చినబాలిక తరువాతి ఆటకు తల్లి యగుచుండును. అదివరకు తల్లిగా నున్న యామె వెదకుకొనివచ్చువారితో కలియుచుండవలయును. రెండవమారు వంగకాయలు కోసికోవలయునని అందరును మొదటివలెనే వంగియుండి కన్నులు మూసికొని కోయుచున్నట్లు అభినయించుచుండవలయును. మరల తల్లి బాలికవత్తి పారవేయవలయును. వత్తి తెచ్చినబాలిక తరువాత యాటకు తల్లి కావలయును. ఇట్లు వంగతోటకు నీళ్లు తోడవలయు నని యొకమారును, కలుపుతీయవలయు నని యొకమారును ఇట్లు మార్చి చెప్పుచూ తోటపని చేయుచుండవలయును. వత్తిదొరకినవారు తల్లిగా మారుచుండక ఒక్కబాలికనే ఆట పూర్తియగుదాక తల్లిగా నుంచుకొన్నను ఉంచుకోవచ్చును. తోటపని చేయునపుడు కన్నులు మూసికొనియుండవలయును. గాని కాళ్లసందు నుండి వత్తి యేవైపున వేయుచున్నదో యని చూడరాదు. అట్లు చూచితెచ్చినవారిఆట లేదు.

## ౧౯. కాళ్లగజ్జె

ఒకబాలిక తల్లిగా ఏర్పడి తక్కినవారినందరిని కాళ్లురెండును చాచి కూర్చుండునట్లును చేయవలయును. అప్పుడు తల్లిబాలిక "కాళ్లగజ్జెలు, కంకణాలు, వేసుచుక్క, వెలగమొగ్గ, మొగ్గకాదు, మోదుగునీరు, నీరు



కాదు, నిమ్మలవాయి, వాయికాదు, వావింపుకూర, కూరగాదు, గుమ్మడిమెట్టు, మెట్టుకాదు, మేదరిల్లు, ఇల్లుకాదు, ఈగలపుట్ట, పుట్టకాదు, తూముకుమన్ను, మన్నుకాదు, మంచిగంపపుచెక్క, చింతకాయ, బొంతకాయ, జీడిమామిడికాయ, కొల్లేటివంకాయ, కొమ్మనిమ్మపండు, వాలుగులసంటలో జీలుగులు చెయ్యగా ఒక్కటే ఉండగా, ఒంటిపువ్వారాలగా, తాటాకు ధప్పళం, కోటవెలుగు, కోటలోఉన్నది కొంచేటిపిల్ల, తరిమితరిమికొట్టింది, తాచేటిపిల్ల, ఆవుపేరేమి, గోవుపేరేమి, చంద్రక్కనీమొగుడుపేరేమి. ఉత్తిత్తిపండు, ఉత్తరాణిపండు దానిమ్మపండు, దబ్బపండు," అని పాడుచు ఒక్కొక్కమాటకు ఒక్కొక్కకాలు చొప్పున ముట్టుకొనిపోవుచు చివరదాక పోవుచుండును. అట్లు పోవునపుడు చివరమాటయగు "దబ్బపండు," అనుముక్క యేకాలిమీద చేయివేసి ముట్టినపుడు వచ్చునో ఆకాలు పండినట్లు అగును. కనుక ఆకాలు వెనుకకు దీసుకొని ముడుచుకొనవలయును. అనగా ఒకబాలికయొక్క ఒకకాలు పండినయెడల రెండవకాలు పండువరకును పండనివారితో కలిసి కూర్చుండవలయును. ఆటలో ఎవరిదైనా ఒకకాలు పండినయెడల ఆకాలు ముడిచి ఆకాలితరువాత కాలి వద్ద ఆరంభించి మరల "కాళ్లగజ్జె" అనుపదము పాడుచు ఆట ఆడవలయును. ఇట్లు ఆడుచూ రాగా క్రమక్రమముగా అందరును పండిపోయి ఒక్కతె మిగిలియుండునుకదా! అప్పుడు తల్లికూడ కూర్చుండి మిగిలిన బాలిక కాళ్లకును, తనకాళ్లకును ఆడుకొనవలయును. అట్లు ఆడుకొనగా ఎవరో యొకరు పండి ఒకరుపండక

మిగిలి యుండునుకదా! ఆమిగిలినవారిని "ముట్టు" అందురు. ముట్టుఅనగా "మైల" అని పేరు. అట్లు మైలపడ్డబాలికను నిలుచుండబెట్టి ఆటపెద్ద ఆబాలిక తలవెం(డ్రుకలను చేతబట్టుకొని గిరగిరతిరుగుమని అనగా ఆబాలిక తిరుగవలెను. రెండుమూడుచుట్లు తిరిగినతరువాత ఆటపెద్ద "మీఅమ్మ నిల్చుండి పాలిచ్చినదా! కూర్చుండి పాలిచ్చినదా!" అని అడుగగా "కూర్చుండి పాలిచ్చినది" అని చెప్పవలెను. "నులకమంచముమీద పాలిచ్చినదా పట్టెమంచముమీద పాలిచ్చినదా," అని అడిగిన "పట్టెమంచముమీదనే" అని చెప్పవలెను. "నిల్చుంటే ముట్టుకుంటావా, కూర్చుంటే ముట్టుకుంటావా?" అనిఅడిగిన ఏదియో యొకటి చెప్పవలెను. "కూర్చుంటేముట్టుకుంటా"నని చెప్పినయెడల అందరును నిల్చియుండి ఒక్కొక్కమారు కూర్చుండి "మైల" బాలికనుచూచి "నీఅత్తవారింట్లో యింతకోడిపిల్ల" అని చేతులతో చూపుచూ ఆబాలిక ముట్టుకొనుటకై దగ్గరకు వచ్చిన తోడనే నిల్చియుండవలెను. "నిల్చుంటే ముట్టుకుంటా"నని చెప్పినయెడల అందరును చటుక్కున కూర్చుండి "మైల" గలబాలిక కొంచెము దూరముగా నున్నప్పుడు లేచి నిల్చుండి మీయత్తవారింట్లో యింత కోడి పిల్ల" అని ఉడికించవలయును. ఎవ్వరైన నిల్చుండవలసినప్పుడు కూర్చుండిగాని, కూర్చుండవలసినప్పుడు నిల్చుండిగాని పొరపాటుగానున్నప్పుడుగాని మైలబాలిక (కాచుకొనివచ్చుబాలిక, లేక ఆడుకొనివచ్చుబాలిక )దగ్గరకు వచ్చినపుడు చటుక్కున కూర్చుండలేకగాని, నిల్చుండలేకగాని యున్నప్పుడు అకస్మాత్తుగా పరుగెత్తివెళ్లి పట్టుకోవలయును (ముట్టుకోవలయును). అట్లు ఎవరిని ముట్టుకొంటే వారు ఆడుకొనిరావలయును. ఆడుకొనివచ్చుబాలిక ముట్టుకొనును గదాయని కూర్చుండినవారు నిల్చుండుటగాని, నిల్చుండినవారు కూర్చుండుటగాని చాలసేపు ఎవరును మానగూడదు. బాలికలందరును కొంచెము దూరదూరముగా నుందురు గనుక ఎవరికి దూరముగా నున్నప్పుడు వారు నిల్చుండుటగాని, కూర్చుండుటగాని ఆట రివాజు(ప్రకారము తప్పక చేయవలయును.

ఆడుకొనివచ్చువారి నేర్పరచువిధము:—

నాలుగుస్తంభాలాట, నడిమికి తొడిమికి, తానక తప్పక, తనపేరేమంటే ఊరగాయలకుండ, ఉస్తికాయలకుండ, పాపిటకాయలకుండ పటుక్కుమనె.

## ౨౦. స్తంభాలాట

ఎందరు బాలిక లుందురో అంతకన్న ఒకటి తక్కువగా స్తంభము లుండవలయును. అనగా: పది మంది(స్త్రీ) లున్నయెడల తొమ్మిదిస్తంభము లుండవలయును. బాలికలందరును స్తంభములకు సమీపమునందు నిల్చియుండినతరువాత ఆటపెద్ద "స్తంభము నెవరు



ముట్టుకొందురో" అని కేకవేయును. ఆకేక వినినవెంటనే బాలికలందరును పరుగెత్తిపోయి "ఈస్తంభము నాది ఇది నాది" యనుచు తలకొక స్తంభము పట్టుకోవలయును. తల్లి (ఆటపెద్ద) కూడా తానొక స్తంభమును వారితోనే పోయి పట్టుకొనవలయును. బాలికలకన్న స్తంభములసంఖ్య ఒకటి తక్కువగుటచేత ఒక బాలిక మిగిలియుండునుగదా! ఆబాలిక మొదట ఆడుకొనివచ్చునదిగా ఉండవలయును. ఆడుకొనివచ్చు బాలికకు గొల్లది అని పేరు. కనుక ఆబాలిక "చల్లోయమ్మచల్ల" అని కేకవేయుచు చల్ల అమ్ముచున్నట్లు అభినయించుచు మొదటిస్తంభముమొదలుకొని చివర స్తంభమువరకు అన్నిస్తంభములవద్దరకును వచ్చుచు పోవుచుండవలయును. గొల్లభామ తమస్తంభములను

దాటి వెళ్లి దూరముగా నున్న సమయమున ఆ స్తంభముల వద్దనున్న బాలికలు ఒక స్తంభముదగ్గరనుండి మరియొక స్తంభమునకు పరుగెత్తి వెళ్లి తమ స్తంభములను మార్చుకొనుచుండవలయును. అట్లు మారుటకు ఒక స్తంభమునుండి బయలుదేరి యింకొక స్తంభముదగ్గరకు పోయెడులోగా గొల్లది పరుగెత్తుకొనివచ్చి ముట్టుకొనవలయును. గొల్లది ఎవరి స్తంభమును ముట్టుకొనునో వారు కాసుకరావలయును. ఎవరైనా తన స్తంభమును విడిచి మరియొక స్తంభమునకు పోవుచుండగా తాను పోదలచిన స్తంభమువద్ద నున్న బాలిక గొల్లభామ వచ్చి పట్టుకొనునేమో యనుభయమున తాను విడిచివెళ్లిన స్తంభముకడకు రాకయున్న యెడల ఇంతలో గొల్లభామ కాళీగాఉన్న ఆ స్తంభమును పట్టుకోవలయును. అట్లు పట్టుకొన్న యెడల ఆ స్తంభమును విడిచివెళ్లినబాలిక ఆడుకొనిరావలయును. కనుక స్తంభములను మార్చుకోదలచినబాలిక లిద్దరును ఒక్కసారిగానే తమతమ స్తంభములను వదలి యొక్కసారిగానే వారి స్తంభమును వీరును వీరి స్తంభమును వారును ఆక్రమించుకోవలయును. అవకాశ మున్న యెడల దగ్గర స్తంభములనుగాక దూరమునగల స్తంభములనుగూడ మార్చుకోవచ్చును.

## ౨౧. చెమ్మ చెక్క

ఇద్దరుబాలికలు ఒకరికొక రెదురుగా నిలిచియుండి అరచేతులు నిలువుగా ముఖములయెత్తువరకు



ఎత్తి ఒకరి అరచేతు లొకరిఅరచేతులతో తట్టి చేతులు బారుగా క్రిందికి వ్రేలాడవేసి వెంటనే ముందర ప్రక్కకు తీసుకొని చప్పట్లు కొట్టవలయును. ఈప్రకారముగా ముందర ఒకరిచేతులతో ఒకరిచేతులు తట్టి తరువాత వ్రేలవేసి పిమ్మట చప్పట్లు కొట్టుచుండవలయును. మరియు చేతులు వ్రేలవేసి చప్పట్లు కొట్టునపుడు కొంచెము వెనుకకు పోవుచు ఒకరిచేతుల నొకరు తట్టునపుడు ముందరకు వచ్చుచుండవలయును. ఈప్రకారముగా ఆడునపుడు ఈక్రిందిపదము (పాట)ను ఇద్దరును కలిసి పాడుచుండవలయును. "చెమ్మచెక్క, చేరడేసి బుక్క, అట్లు పోయంగా, ఆరగించంగా, ముత్యాల చెమ్మచెక్క ముగ్గులవెట్ట, రత్నాలచెమ్మచెక్క రంగు వేయ, మాతాతపందిరిలో పెళ్లిచేయ; పెళ్లిఅమ్మపెళ్లి, సుబ్బారాయుడుపిల్ల చూచివత్తమురండి, అమ్మ నాకు బువ్వ, ఎడమచేతిలో గవ్వ, ఎడమకాలిచెప్పు, బోగముదాని కొప్పు.

## ౨౨. సూర్యుడుమైనం

చీకటివూతలఆటలోవలె ముగ్గురు మనుష్యులు చొప్పున ఎవరుపండినారో నిర్ణయించి పండక మిగిలినవానిచేతిలో మొదట పండినబాలిక "సూర్యుడు మైనం, చుక్కలమైనం, దెబ్బలమైనం" అని మూడు మార్లు మెల్లగా కొట్టవలెను. తరువాత ఓడిపోయినవాని జుట్టుపట్టుకొని "నిల్చుంటే ముట్టుకుంటావా? కూర్చుంటే ముట్టుకుంటావా?" అని అడుగవలయును. ఆబాలిక చెప్పినదానికి వ్యతిరేకముగా అనగా "నిల్చుంటే ముట్టుకుంటా"నంటే అందరు కూర్చుండవలయును. "కూర్చుంటే ముట్టుకుంటా"నంటే అందరును నిల్చుండవలయును. ఆకూర్చుండుటగాని నిల్చుండుటగాని చేయునపుడు ఆటపెద్ద ఓడిపోయినబాలికచేతిలో చటుక్కున ఒక దెబ్బ కొట్టి నిల్చుండుటకాని, కూర్చుండుటగాని చేయవలయును. అట్లు కొట్టగానే చేయక ఆలస్యము ఏమాత్రము చేసినను ఓడిపోయినబాలిక ముట్టుకోవచ్చును. ముట్టుకొన్న యెడల ఆటపెద్ద ఆడుకొనిరావలయును. ఓడిపోయినబాలికకు బారెడుఎడమునకు లోపుగా యెవరైన నున్న యెడల ముట్టుకోవచ్చును. ఒకవేళ

ఇద్దరుబాలికలు రెండుప్రక్కలను దగ్గరగా నుండి బారలను అందినయెడల ఇద్దరిని పట్టుకోవచ్చును. అట్లు ఒక్కసారిగా ఇద్దరు అంటుఅయినప్పుడు ఆపిల్లల నిద్దరిని పేరులు చెప్పుకొని రమ్మని పంపవలయును. ఆటపెద్దకూడా వెళ్లవలయును. అప్పుడు కంటె, కాసులపేరు రాగిడి, చంద్రవంక, సూర్యుడు, చంద్రుడు, మొదలయినపేరులలో ఏదైన ఒక్కొక్కపేరు యిద్దరును పెట్టుకోవలయును. ఆపేరులు అందరకీ వినబడకుండా కొంచెముదూరముగా బోయి మెల్లగా చెప్పుకొనవలయును. తరువాత యిద్దరికిని ఏపేరులు పెట్టినారో ఆపేరులుమాత్రము ఓడిపోయినబాలికకు చెప్పవలెను (ఎవరిపేరు ఏదో చెప్పకూడదు). ఆరెండు పేరులలో ఏపేరుకావలెనని ఓడిపోయినబాలిక చెప్పునో ఆపేరు పెట్టుకొన్న బాలిక ఆడుకొనిరావలయును.

పటము పటము ఎంతాపటము.

---



త్రవ్వి వెలువరిచిన నిర్మాణ శిథిలము (సారనాథము)

—సి. బి. జగన్నాథదాసు.




ANDHRA PATRIKA

కీ. శే. పిల్లలమఱ్ఱి సుందరరామయ్యగారు వేయు వేషములలో నొకటి.

[వీరినిగూర్చిన చిన్నవ్యాసమొకటి శ్రావణమాసపు భారతి సంచికయందు గలదు. సం. భా.]



# ఆంధ్రాభ్యుదయము



శ్రీ కె. యస్. హరిశ్చంద్రుడుగారు
పోలవరం-తూర్పుగోదావరి
ఆంధ్రవిద్యార్థి సంఘకార్యదర్శి చెన్నపురి.

---






శ్రీ బొడ్డపాటి సీతాబాయి

బెజవాడలో, గౌరవన్యాయాధికారిణి, భారత స్త్రీసంఘ కార్యదర్శిని. కృష్ణాజిల్లా విద్యాసంఘమున సభ్యురాలుగా ఇపుడు ఎన్నుకోబడెను.




శ్రీ. టి. నారాయణమ్మాళు

తిరువాంకూరు మూలం శాసనసభయందు సభ్యురాలుగా నియమింపబడిన మొట్టమొదటియువతి.



శ్రీమతి రమణభాయి నీలకంఠ, బి. ఏ

లక్నో నగరమున జరిగిన అఖిలభారత మహిళా మహాసభాధ్యక్షురాలు; నడుమనున్న వృద్ధ. తక్కినవారైదుగురు నామె సహాయురాండ్రు. బొంబాయి విశ్వవిద్యాలయ పట్టభద్రలు. భిన్నభిన్నరాష్ట్రముల ప్రతినిధులుగా నా మహాసభకు వచ్చినవారు.




## మెత్తనివారి చూస్తే.—

తెలుగుసామెతలు మిగుల వాడిగలవి—తవ్వ్వోలలై సారస్వతమునుండియు, ప్రత్యక్షజీవనమునుండియు ఎంతేనిభావమును దొలిచి చేతిలో బెట్టగలవు. "మెత్తనివారినిమాస్తే మొత్తబుద్ధి!" ఇది సర్వాంతర్యామియైన సామెత! అనాదినుండి అనంతమువఱకు ఇది బారలుచాచినది! దీనిశక్తి తెలుగక ఇళ్లలోనే వాడుకైనమాటని చాలమంది అనుకొంటారు. చద్దిలోని ఆవబద్దని, నోరూర్చు,-రుచిదేల్చు,- తెలుగులకు మిగుల గూర్చు పదార్థమే అని వారియూహకాని, రాజకీయ, ఆర్థికరంగములందు ఎగిరిపడు కోసైనకరవాలుకూడా అని వారెఱుగరు.

రాజకీయములను ఒకమూల నిలిపి, తక్కిన మూలలందు దీనిని చూడుడు. ఇపుడెక్కువుగా కుతకుతలాడుచున్నవి ఆర్థికాంశములు! ఏపదునులో నున్నవో నొక్కిచూడగా, ఇవి చిమిడి చేలి కంటుచున్నవి! భారతమాత చల్లనితల్లి మాత్రమే కాక మెత్తనితల్లికూడాను. ఈమె సుజ్జనగూడుకూడ ఈమెవంటిదే! అందుచే నీమెయెడలను, ఈమెయన్నముయెడలను ప్రపంచమునకంతకు నిండైనప్రేమ! ఆరగించునవి వృకములయ్యు, వృకవంశములయ్యు ఈమె కసరికొట్టదు. ఏవంకజూడక మీరాబాయివలెతన్మయత్వమున నీమె మునిగియుండును. ఆర్థికముగ అవసియున్నను, ఆధ్యాత్మికమున తనుకాంతినుండి సూర్యచంద్రుల నీమె తనదివ్వెలను వెలిగింప నిచ్చుచుండెను! ఇతర ఖండములందు రాజ్యములును, గీజ్యములును ఆకసము వఱకుఎగసినవి—జువ్వలై రాలిచరిత్రలందు మసిబోసినవి! సహస్రాబ్దములు, కుట్టికుంకలవలె నీమెముందుండి ఆడుచుపాడుచు నీమెకు వంగి జోహారొనరించి తరలుచున్నవి!

ఆధ్యాత్మికచింతనుగూడ అటుండనిండు. ఆర్థికముగ నీపృథను చూచి తెయ్యిమనువా రెందఱు లేరు! ప్రక్కనున్నది బుద్ధభగవానునిశిష్యురాలు జపాను. ఈమెకన్నులు తెఱచినది మొన్న! నిన్న నీమెకు ముక్కు పచ్చలారినవి! నేడీమె గొల్లభామయై మెఱుగుపూసుకొని ఎంతపనేని చేయుచున్నది!— గజ్జెకట్టి భారతాంబదెస చేయి జాపినది! నింపాదిగా తనసరుకుతో మనఅమ్మకు కట్టుగట్టినది— కట్టుతూ, దోసిళ్లతో ఒడి నింపుకొని తనయింటపాతర వేసినది! అగిడి మంటలెత్తుచున్నను, మెత్తని యిల్లాలుకాన అమ్మ, శిలాసఖీని పునశ్చరణచేయుచు కూర్చున్నది!

కాకి జున్నుముక్క ఎగదన్నుచుండ చూచుచు నిలుచుటకు గ్రద్ద అంతవెట్టిబాగులది కాదు—కాకిపై నుఱికి జున్నును,—జున్నునేగాక ఎందేని అడగియున్న పిచుకనుకూడ ఎగదన్నుకొని గ్రద్ద తనప్రజ్ఞ చూపకున్న, 'అమరేంద్రుని గెలిచిన ఖగనాథుని' కులమునకంతకు కళంకము రాదూ? ప్రజ్ఞావిజృంభణమని మనతో నిది చెప్పదు. 'కృష్ణా' అని అఱచి అంగుటిలో పాఱవేయును ఏజంతువునైనను, ఏవస్తువునైనను సరే, జపానుకాకిని మించినది లంకషైరుగద్ద!

బలవంతముగ తమబిడ్డను ఎట్లయిన ఇండియాచే కట్టించి,తమప్రేమను చూపితీరవలెనను గట్టిపట్టుపట్టినవి జపానులంకషైరులు! తనసుడ్డ తానుకట్టుటకు భారతమాత ఇంకను ఎన్నోనోములు నోచవలెననియే ఈహితైషులగు యీపులిమీదిపుట్రల అభిప్రాయము! సుడ్డనేతలో జపాను పాడుగెక్కినది!౧౫౦,౦౦౦ కదురులను, ౨౦౦౦

బాలికలును, ౧౫౦౦ పురుషులును పట్టుచునుందురు. సాధారణముగ మూడేండ్లకంట్రాక్టుపై బాలికలు పని చేతురు. వారమునకు బాలికకు ముట్టు కూలి ర షిల్లింగులు. వారమునకు సరాసరిగ ఏడుదినాలపని–దానికి మించి లేదు! ఈడువచ్చిన ఆడుదానికి వారమునకు కూలి ౧౨ షిల్లింగులు. మగవానికి దీనిపై ఒకపిసరు కొంచె రుంటుంది! జినీవా లేబర్ ఆఫీసునుండి బయటబడ్డ "ఇండస్ట్రియల్ లేబర్ ఇన్ జపాన్" అనుగ్రంథములో జపాను స్పష్టముగా తోస్తుంది. సుమారు ౬౦,౦౦౦ ఫ్యాక్టరీలుమాత్రమే జపానులో నున్నవి. నూటికి ౫౫ చిన్నవి. మొత్తముమీద జపానులో ౩౬౧౫,౦౦౦ మగవారును, ౧౫౦౦,౦౦౦ ఆడువారును పనిచేతురు. ట్రేడుయూనియను ఉద్యమమిందు ఇంకను దోబూచులాడుచున్నది! ౧౯౧౬ లో రోజుకు ౧౬ గంటలుపని ఉంటూ ఉండేది. ౧౯౩౦ లో ౯ గంటని. లకు దిగ గలిగినది. గడ్డిమేటివలె తయారగు గుడ్డను ఇండియారేవులలో పడవేయక, జపాను చేతులు ముడుచుకొనునా? నూటికి ౪౫ వంతు దిగుమతిసుంకము హెచ్చినపుడు చప్పుమని, మీపత్తికి దిగదుడుపన్నది జపాను. పాపము అప్పటినుండి మనకై లంకషైరు వలవలమని కడవలు సుమ్మరించుచున్నది. ఇండియన్ కాటన్ ఇన్క్వ్యయిరీకమిటీ, లంకషైరు చేబట్టిన పంజరంలో 'అక్కయ్యా!'అంటోంది! ఈకమిటీని తోలుతె పొదిగినది అటావాపిట్ట! ఇండియాపత్తినుండి ౭౮ రకాలు– రకరకాలు తయారైనవట! జరీబుట్టపై ముఖములు తట్టజేరి మనతలపై ఎక్కిపోవును! మామంచి దొమ్మరాట! ఫిబ్రవరిమొదటివారమున కరాచీలో కలిసి కొన్నపుడు ఈకమిటీ ఏమన్నదంటే! ఎంపైరుకు పైగలవానికి మొండిచెయ్యిచూపి, దాక్షిణ్య దక్షిణ ఇండియాసరుకు కీయవలెనని. అటావాఒడంబడికలోని ౭-వ ఆర్టికిలుచే చెమ్మచెక్క ఆడించు కర్తవ్యమును టెక్నోలాజికల్ రీసర్చికమిటీ, మీదవేసి కొన్నది! ఇంపీరియల్ కవున్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసర్చి (యీపదవి సామాన్యమైనది కాదు పొడుగెంతో చూడండి!) లో వ్యవసాయనిపుణుడు బర్టుగారు అటావాకు "జయవిజయీభవ" అంటూ, బ్రిటిషుగవర్నమెంటు ఆశీర్వాదఅక్షతలు చల్లెనని చెప్పివేసిరి! ఒగర్చుచు చెమటలోడ్చు భారతకృషికుని సంతోషపెట్టితేనేగాని మంచిదిగాదని బహువత్సరాలనుండి ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీవారు లంకషైరులో రకరకాలు చీనిచీనాంబరాలు పుట్టాలని హెచ్చరించుచు ఉన్నారు. వీరిహెచ్చరిక సద్యోగర్భం దాల్చింది! హైకమిషనరుగారు దగ్గరనేయుండి చేయూత ఇచ్చారు! ఇండియను ట్రేడ్కమిషనర్ "శభాష"ని మంచిజాతకము చెప్పింది! చూచారా మైత్రి నమ్మకై ఎంతతంతు జరుగుతోందో!

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## హెన్రిఫోర్డు



అమెరికాలో ఫోర్డు మోటారుకారులు తయారు చేయుచున్న యాతడు. ఈతని డెబ్బదవజన్మదివసమహోత్సవము ఇటీవల జరిగినది.

---

## ఆధునికప్రపంచమున బానిసతనము

రైటుఆనరబల్ లార్డునోయల్ బక్స్టనుగారు International Review Missions అనుపత్రిక యందు 'స్వాతంత్ర్య శతాబ్ది' అను వ్యాసమువ్రాసిరి. గ్రేటుబ్రిటను, బానిసతనమును నిర్మూలముచేసి నేటికి సరిగ శతవర్షములు గడిచినవి. ఆధునికప్రపంచమున నింకను బానిసతనము నెలకొనియున్నదని యీవ్యాసరచయితగా రిట్లు సూచించుచున్నారు:

"బానిసతనమునుగురించి ఏమియు నెరుగనివారు, నేడు ప్రపంచమునగల బానిసలసంఖ్య ౫౦ మొదలు ౬౦ లక్షలవరకు గలదని వినినపుడు విస్మయ మొంద గలరు. ఒకశతాబ్దమునకు పూర్వము వీరిసంఖ్య యింతకు రెండింత లుండెడిది. బానిస యనుపదమునకు పూర్ణమైనయర్థ మేదిగలదో యది వీరందరికిని అన్వయింప గలదు. అనగా, చట్టము ప్రకారము వీరందరిని విక్రయించుట మున్నగు హక్కులు మరియొకరికి జెంది యున్నవి. వీరుకాక, యింకను లక్షలకొలదిప్రజలు బానిస జీవనము చేయుచున్నారు.

చైనా, అబిసీనియా, అరేబియా, లైబీరియాలలో ముఖ్యముగా బానిస లున్నారు. ఇంకను అనేకదేశము లందు బానిసతనము ఆయాదేశ సంఘములయందు స్థిరముగ నాటుకొనియున్నది. ఏదేశమం దెందరుబానిస లుండునదియు తెలిసికొనుటకు ఆధారములు లేవు. కాని చైనాయందుమాత్రము సుమారు ఇరువదిలక్షలబానిస లున్నారని తెలిసికొనుటకు ఆధారము లున్నవి. చైనాయందు బానిసతనము ముఖ్యముగ స్త్రీలయందు గలదు. చైనాలో ఆడుపిల్లలను దాసీలనుగాను, బానిసలనుగాను కొనుటయు, అమ్ముటయు గలదని, అమాయ్ యందు బ్రిటిషుకాన్సలుగారగు రస్సెల్ బ్రౌనుగారు చెప్పిరి. ౧౯౩౦-వ సంవత్సరమున చైనాయందలి ప్రముఖులును, క్రైస్తవమిషనరీలును నివేదించినప్రకారము సాధారణముగ చిన్నచిన్న ఆడుపిల్లలను నూర్లకొలది పట్టణములయందు కొనుటయు, విక్రయించుటయు జరుగుచున్నదనియు కష్టకాలము సంభవించినపుడిట్టిక్రయ విక్రయాదులు కొన్నివేలనుగూడ దాటుచున్నది. చైనాలో గొప్పక్షామము గలిగినపుడు నాలుగు వేలమంది ఆడుపిల్లలను గ్రామములనుండి ముఖ్యపట్టణమునకు తెచ్చి బానిసలుగఅమ్మిరని, చైనాలో నలువదిసంవత్సరములు మిషనరీపనియం దనుభవముండిన శ్రీమతి డైమండుగారు 'యున్నాన్' అనుగ్రంథమున విస్పష్టముచేసిరి.

బానిసలసమస్య అబిసీనియాయందు సయితము భయంకరముగ నేయున్నది. సంఘపద్ధతులయం దింతదృఢముగ బానిసతనము నాటుకొనియుండుదేశము ప్రపంచమున వేరొకటి లేదు. ఇచట విస్తారముగ వ్యాపించియున్న బానిసతనమునకు తోడు బానిసల నమ్ముటయు, వారికొరకు దేశమును కొల్లగొట్టుటయు అను రెండుదుర్గుణములు దేశమున గలవు. బానిసలకొరకు మనుష్యులను దొంగిలించుట దోపిడిచేయుట మొదలగునవి నీగ్రోమండలమందుమాత్రము గలదు. సాధారణముగ బానిసలుగ అమ్మబడువారుసయితము నీగ్రోలుగనే యున్నారు. ౧౯౧౩ మొదలు, ౧౯౨౭ వరకు సూడను, కెనియాలలో ౧౩౯ పర్యాయములు బానిసలకొరకు అబిసీనియావారు దోపిడి గావించిరనియు, గడచినసంవత్సరమందు కూడ కొన్నిదోపిళ్లు జరిగినవనియు బ్రిటిషుప్రభుత్వము వారు తెలిపియున్నారు. ఈదోపిళ్లలో వందలకొలది మనుష్యులు—బ్రిటిషువారిపాలనయందుండువారు చంపబడిరి. మరికొందరు బానిసలుగ గొంపోబడిరి. అబిసీనియాయందలి పురాతత్త్వశాస్త్రమును గురించి మాక్సుగ్రుల్ గారువ్రాసినగ్రంథమందు ఒక బానిసలగుంపునుగురించి హృదయభేద్యమగువర్ణన గలదు:

'వర్ణనాతీతమగు ఊరేగింపునొకదానిని మేము చూచితిమి. వారు మానవులా! దిగంబరులయిన స్త్రీపురుషులను ఒకరినొకరిని జోడించి సంకెలలతో కట్టివేసి వారిపిల్లలను నడిపించుచునో, లేక కట్టలుకట్టినట్లు వీపులపై బడవైచియో, వీధులయం దసహ్యకరమగు ప్రదేశములలో నీడ్చుకొనిపోవుచు పసువులమందలను వలె, కనికరములేని బానిసవర్తకులు వీరిని తోలుకొనిపోవుట చూచియు నమ్మలేకపోయితిమి. అనేకపర్యాయములు, పాపము, వీరు రోగబాధగలపసువులవలె మధ్య

మస్య పడిపోవుచుండిరి. ఆబానిసలగుంపులు మమ్ము దాటిపోవుటకు కొన్నిగంటలు పట్టుచుండెడిది. ఈ వాక్యముల వ్రాయుచుండగ మేముండిన చోటంతయు తామువెరపట్టిన బానిసలతో దోపిడిగాండ్రు మమ్ము చుట్టుకొనిరి. కుంభవర్షము కురియుచుండెను. వారికి వర్షమునుండి రక్షణగాని, అన్నముగాని, వెచ్చదనమునకు నిప్పుగాని లేకుండెను. గాఢాంధకారమునుండి బానిసల సంకెలలధ్వని ప్రతిధ్వనించుచుండెడిది.'

పురాతత్త్వవిజ్ఞానశాస్త్రజ్ఞుడు తన కేవిధమయిన సంబంధములేని యీవిషయమున పైవిధమున వ్రాసియున్నాడు.

అబిసీనియాలో బంధింపబడినబానిసలు, బానిసతనము సాగుచున్న అరేబియామొదలగు దేశములందు విక్రయింపబడుచున్నారు. ఎఱ్ఱసముద్రముమీదుగ రవాణాచేయబడుబానిసలసంఖ్య సంవత్సరమునకు కొన్నివేలగుచున్నదని బ్రిటిషునావికాధికారి యగు వుడ్‌వర్డుగారు చెప్పిరి. మక్కాయందు బానిసవర్తకము విరివిగా జరుగుచున్నది. ఆ పట్టణమునకు వచ్చిన యాత్రికులను బంధించి బానిసలుగ అమ్ముచున్నారు. ఇచట బానిసలుగ విక్రయింపబడువారు ఆఫ్రికాయొక్కయు, పాగ్దేశములయొక్కయు వాస్తవ్యులు."

* * *

"బానిసతనము నిర్మూలింపబడి గడచిన జూలై వదినాటికొకశతాబ్దము నిండినది. ఈసందర్భమున శతవర్షవర్ధంతి ఆనాడు జరిగినది. అమానుషమైన బానిసతనమునుసరించి ప్రజలయందాందోళన గలిగించినవారిలో ముఖ్యుడు 'విలియంవిల్బర్‌ఫోర్సు'గారు. శతాబ్దముక్రింద వారీదినముననే స్వర్గస్థులయిరి. బానిసతనము కొంతమటుకు నిర్మూలింపబడినది. అది సంతోషింపదగినవిషయమే. మానవాభ్యుదయయాత్రయందది యొక మజిలీకాని, బానిసతన మింకను కొన్ని దేశములయందున్నది. బలవంతముమీద ధనికులు బీదలవలన పనిచేయించుకొను దేశములందును, ఆఫ్రికా, యిండియాలలోను బానిసతనము మారువేసమును ధరించి నిలిచియున్నది. [illegible] రాజకీయనిర్బంధ సేవకవృత్తి బానిసతనము కాదు. కాని అదికూడ అమానుషమై ప్రజలకు హాని కలిగింపవచ్చును. 'మాడరన్ రివ్యూ'

---




శ్రీ సోదరిసుశీలాదేవి

ఈమె అమెరికాదేశపుయువతి. జననీజనకులను, జన్మభూమిని విడనాడి, భారతదేశమున ఆంధ్ర

రాష్ట్రమునందలి తోటపల్లి కొండలలో నున్న శాంతి ఆశ్రమమునకు అధిపతియగు శ్రీ ఓంకార స్వాములవారికి ప్రియశిష్యురాలయి రెండేండ్లనుండి తదాశ్రమమున నివసించుచున్నది. ఈమె భూతదయ, సేవాసక్తి నిరుపమానములు. ఈమె కడచినమాసమున అమెరికా దేశమునకు పోయినది.

---

## జర్మనీయందు స్వయంసహాయము

తనయభిప్రాయమును వెల్లడించు హక్కు ప్రతి మానవునికి కలదని యుద్ధానంతరము అంగీకరింపబడినది. సామాన్యమైన అక్కరలుకూడ అపరిమితములుగ నున్నవి. సంపన్నులగుయువకులుకూడ అనేకులు లేరు. అందువలన పూర్వమువలె ఇప్పుడును క్రొత్తవిషయములను తెలుసుకొనుటకై దూరదేశముల దిరుగుటయు, అందులకనుబత్తెఖర్చులను భరించుటకు ధనము లేదు. అవల్లనిదేశములయందు దిట్టిప్రయాణములు మనదేశమునకన్న ఎక్కువగ జరుగుచుండును. యుద్ధానంతరము యువకులధైర్యము రెండువిధములుగ పరీక్షింపబడినది. ఉపవాసములు చేయుట, ఏవిధమయిన సౌఖ్యములుగాని, విరామముగాని లేకుండుట, చదువుకొనుటకు సమితము వీలుండకుండుట యనునవి నేటియువకులను బాధించుసమస్యలు. కాని వీరుమాత్రము చలించుటలేదు. ఆర్థికస్వయం సాహాయ్యక సంఘములు అనేక స్థలములయందు స్థాపింపబడినవి. అన్నిటికిని కేంద్రమం దొకసంఘము ప్రథమమున స్థాపింపబడినది. ఈ కేంద్రస్థానమువారు ప్రయాణికుల సౌకర్యముకొరకు విశ్రాంతిభవనములను, పూటకూలి ఇండ్లను జర్మనీయందంతయును స్థాపించిరి. పల్లెటూళ్లయందును, పాత పట్టణములయందును, కొండలమీది కోటలయందును, చరిత్రప్రసిద్ధమైన యితరభవనములయందును స్థానిక ప్రభుత్వమువారు బాటసారులగు యువకులకు స్వాగతమిచ్చుచున్నారు.

ఆడంబరములేనివిధమున నీచోటులన్నియు, ఆ ప్రదేశముల పనిపాటలవారు తయారుచేయువస్తువులచే అలంకరింపబడుచున్నవి. కేంద్రస్థానము వారి సర్టిఫికేటును చూపువారికందరికిని ఇచ్చట ఆతిథ్య మొసగబడును. యువకుల అభిప్రాయముల ప్రకారమైన విధమున గ్రహించి, మంచినడవడి గలిగి పొగచుట్టల త్రాగనివారిని, సారాయిత్రాగనివారిని, గడ్డిపడకమీద నిదురించువారిని, సాధారణమైన భోజనముచేయువారిని ఇందు చేర్చుకొనుచున్నారు. ఒకయూరికుర్ర పనివాండ్రును, మరియొకయూరిబడిపిల్లలును ఒకరినొకరు కలసికొనునపుడు సమభావమును వెలిపుచ్చుచున్నారు. ప్రతి హోస్టెలును ఒకని అధికారముక్రింద ఉండును. ఇంటిని పరిశుభ్రముగ నుంచుటకును అల్లరి జరుగకుండ చూచుటకును ఇతని కధికారము కలదు.

ప్రపంచమున ఏదేశమందుకూడ ఇంతటి స్వల్పమైనవసతులయందు ప్రయాణీకులకును, బడిపిల్లలకును నిట్టియేర్పాటులు లేవు. ౧౯౨౩-వ సంవత్సరమున పరిస్థితులు సరిగలేనపుడే ౧౮౦౦ లు హోస్టెల్సు ఉండినవి. సంవత్సరమున కీహోస్టెల్సులో పదిలక్షలకన్న నెక్కువగనే అతిథులు వచ్చుచుండిరి. వీరిలో రెండు పాళ్లు బడిపిల్లలు. ౧౯౨౬-వసంవత్సరమున ౨౩౦౦హోస్టెల్సు ఉండినవి. అతిథులసంఖ్య యిరువదిలక్షలు. వీరిలో ౩౦% ఎలిమెంటరీస్కూళ్లపిల్లలు. ౩౨% విశ్వవిద్యాలయముయొక్క విద్యార్థులు. ౩౮% సెకండరీ స్కూళ్లవిద్యార్థులు. యువకులగు ప్రయాణీకులు దినమునకు భోజనమునకు ఎనిమిదిఅణాలును అచట బసకు రోజునకు నాలుగణాలును చెల్లించుటమామూలు.

ఈ హోస్టెలు — విశ్రాంతిభవనముల సంస్థయందు అన్నిపాఠశాలలవారును సభ్యులయినప్పటికిని పట్టణపు పాఠశాలలవారికిమాత్రము గ్రామములయందు వేరుగ భవనములు గలవు. వేసవిసెలవులందు ఒక్కొక్కక్లాసు పిల్లలును రెండేసివారము లిందుండవచ్చును. ఇట్టివిహారములు సెలవుదినములలోగాక సాధారణముగ బడిదినములలోనే జరుగుచుండును. ఎప్పుడైన పాఠశాలను చూడబోయినవారికి కొన్నిక్లాసులు కనబడకనే పోవును. ఆక్లాసులపిల్లలందరు విహారమునకు పల్లెలకు పోయియుందురు. అచ్చట వారు పురాతనభారతీయపద్ధతిని

చెట్లక్రింద పాఠములనేర్చుకొందురు. లేక పల్లెలయందు తిరుగుచుందురు. సంవత్సరమంతయు వీరు రైలుబండ్ల లోనో, రహదారులలోనో, సముద్రతీరమందో, లేక అడవులయందో కనబడుచుందురు. పిల్లలు ముచ్చటగ, కోట్లు, చడ్డీలు వేసుకొని సాధారణముగా టోపీలు లేకయే హాయిగా తిరుగుచుందురు. తంబురుశ్రుతితో వీరు పాతజర్మనుపాటల బాడుచుందురు.

ఈవిధముగ యువకులయుద్యమము వారికి అభ్యుదయమును, ఆరోగ్యమును, దేహదార్ఢ్యమును ఒసగుచున్నది. ఇందువలన వీరికి కష్టకాలములో ఉచితముగ విద్యగూడ లభించుచున్నది. కాని యూరపునందలి జనులందరు యుద్ధమువలన గలిగిన దురవస్థల దగుల్కొని యున్నారు. ఇరువదిసంవత్సరముల వయసునకు లోబడినవారిలో ౪౦% మాత్రమే యీయుద్యమమందు పాల్గొనుచున్నారు. దీనివలన యువకులలో కొందరికి మాత్రమే లాభము గల్గుచున్నది."

'కలకత్తారివ్యూ' అనుపత్రికయందు ప్రకటింపబడిన పైవిషయము ఆనందమును గూర్చుచున్నది. దానియుపయోగమును భారతీయులును గుర్తించి అట్టిసౌకర్యములను తమకుర్రలకు కలిగించి వారిని విజ్ఞానసంపన్నులను గావింపదగుదురు.

---

## కోహినూరువజ్రము

'Journal of Indian History' యందు అబ్దుల్ అజీజ్ గారు కోహినూరుచరిత్రనుగురించివ్రాసిరి. అందు దానినిగూర్చిన సంపూర్ణచరిత్ర ఇట్లు గలదు:—

"కోహినూరువజ్రమునుగురించిన ప్రాచీనకథలు, కాలముగడచినకొలది మాయమగుచున్నవి. ప్రొఫెసరు మెస్కెలీనుగారనినటు లీకథలన్నియు కలసి ౧౪-వ శతాబ్దినాటికి సమ్మదగినచరిత్రరూపము దాల్చినవి. మొదట ఈవజ్రముయొక్క వృత్తాంతము ౧౪-వ శతాబ్దిప్రారంభమున లోకమునకు తెలియవచ్చినదని ప్రొఫెసరుగారు నుడివిరి. పూర్వమొకపుడు హిందూస్థానమునంతయు నేలినమాల్వరాజులవశమున క్రీ. శ. ౧౩౦౦-వ సంవత్సరమున ఈవజ్రముండినది. ఈ వంశపురాజులు షుమారు ౧౦౦౦ సంవత్సరములకాలము మహమ్మదీయులకు లొంగకయుండిరి. కడపట అల్లాయుద్దీనుకాలమున ఈరాజ్యము మహమ్మదీయులచే సంపూర్ణముగ జయింపబడినది. అపుడుజ్జయిని నగరమందుండినధనరాసు లన్నియు ౧౪-వ శతాబ్దపులోలి దశకమందే మహమ్మదీయులచేబడినవి.

ఫెరిస్టావ్రాసినప్రకారము పైదండయాత్ర క్రీ. శ. ౧౩౦౪-వ సంవత్సరమున జరిగినది. ఆమందలనే అమూల్యమగు నీవజ్రపువృత్తాంతముగూడ చరిత్ర కెక్కినది.

తరువాత నీవజ్రముయొక్క ప్రశంస 'అక్బరునామా'యందును,ఇతరచరిత్రల యందునుగలదు. హుమాయూనునకు జబ్బుచేయగా ఆవ్యాధియొక్క తీవ్రతను రాజవైద్యులు గమనించి రాజకుమారుని ప్రాణమునకై భయపడసాగిరి. అపుడు మీర్ అబుల్ బాకా యనువృద్ధసేవకు డిట్లు చెప్పెను: లోకజ్ఞానముగల్గినవైద్యు లేమియు చేయజాలనపుడు, తమకత్యంతప్రియమగువస్తువు నొకదానిని సమర్పించి పరమేశ్వరునిధ్యానించిన యెడల రోగికి స్వస్థత చేకూరును. ఇది పూజ్యులగు ఋషుల వాక్యము కావున అవశ్యము ఆచరణీయము. హుమాయూనునకు తనతండ్రికన్న ప్రియమగువస్తువు వేరొకటి లేనందున జేబరు తన్నుతానే భగవంతునికర్పించు కొనన నిశ్చయించుకొనెను. కాని యాస్థానికులు జేబరునిశ్చయము సరియైనదికాదని, మనవి యనదగినవానిలో కెల్ల గొప్పదానిని దేవుని కర్పించుటయనియు, ఆప్రకారము పూర్వము ఇబ్రహీంలోడీని జయించగా లభించిన యమూల్యమగువజ్రము—హుమాయూనున కొసంగబడినది,—దానముచేసినట్లయిన ఋషులవాక్యము పాలించినట్లగునని చెప్పిరి. (అక్బరునామాగ్రంథము ౧౧౧౬) జేబరుమాత్ర మిందుల కీయకొనలేదు. ఆతరువాతికథ

# ఆకస్మిక చ్ఛాయాచిత్రములు

**(SNAP SHOTS)**



చిత్రము ౧

—బి. కృష్ణశాస్త్రి, గుంటూరు.



చిత్రము ౨

మనకవసరము. దీనినిబట్టి మనకుతెలియున దేమన: ౧౫౩౦-వ సంవత్సరమున నీవజ్రము ఢిల్లీశ్వరునిఖనాగారమునను౦ డినది.

అమూల్యమగు నీవజ్రమునుగురించిన మరియొక విషయము అబుల్‌ఫజల్ వ్రాసినయుడంతేమువలన తెలియుచున్నది. షర్‌షాచే ఓడింపబడి,హుమాయూను దేశభ్రిమ్మరియై, రాజామాల్దేవ్ రాజ్యమగు మార్వార్ పరిసరములం నుండెను. రాజామాల్దేవ్‌నకు మిక్కిలి నమ్మకమైన యనుచరులలో నొకడు నాగోర్‌వాస్తవ్యుడగు శంకాయనునతడు వర్తకునివేషమున వచ్చి అమూల్యమగు నీవజ్రమును కొనెదనని చెప్పుకొనెను. ఇందు మోసమున్నదని హుమాయూను గ్రహించెను. యుద్ధములందు దైవకృపవలన జయమందువారికిగాని మహారాజులఅపరము బడయువారికిగాని యిట్టియమూల్యములైన వజ్రములు లభించుననియు, ఇట్టివస్తువులను విక్రయింపరాదనియు, నాతనికి హుమాయూను తెలియజేసి పంపివేసెను. (A. N. I. 180.)

తరువాత హుమాయూనుసహాయార్థమై పర్షియాకు పోయెను. పర్షియా ప్రభువొసంగినస్వాగతమునకు ప్రతిగా నతడు ఈవజ్రము తనవద్దనుండిన ౨౫౦ రత్నములను కానుకగా పర్షియా ప్రభువున కొసంగెను. పర్షియాయందు హుమాయూనున కొసంగబడినయాతిథ్యమునకయినఖర్చునకన్న నీయమూల్యవజ్రములఖరీదు నాలుగురెట్లుకన్న నధికమని అబుల్‌ఫజల్ నుడివెను. (A. N. Text, ౧౨౧౪) ఇదంతయు ౧౫౪౪ వేసవియందు జరిగెను.

పర్షియాలోనున్నగోల్కొండనవాబు ఇబ్రహీం కుతుబ్‌షాయొక్క రాయబారి ఖూర్‌షా చెప్పినటులు హుమాయూను పర్షియానవాబయిన షాతహ్మాస్ప్ గారి కీవజ్రము నిచ్చెనని బివెరిజ్ గొప్పయాధారముల గొన్నిచెప్పెను. జేబరు ఈవజ్రమును ఇబ్రహీం ఖజానాలనుండి తెచ్చెను— (B. M. Ms. Or. ౫౩,) దీని తూనిక ౬౪ మిస్కాల్సట. షాతహమాస్ప దీనివిలువనుస్తరించలేక డక్కనుదేశపాలకుడయిన నైజామ్‌షాకు బహుమానముగ పంపెను. (f. ౫౨ b of Ms.)

జేబరు వజ్రము ఈవిధముగ దక్షిణహిందూస్థానమును జేరెనను సంగతి తారీఖ్‌ని ఇ-ఫెరిష్టావలన తెలియుచున్నది. హుమాయూనువలన తాను పొందిన పెద్దవజ్రమును షాతహ్మాస్ప్, అహమెద్‌నగరు నవాబయిన నైజాముషాకు బహుమానముగ నంపెను. ౧౫౪౭-వ సంవత్సరమునాటి కీవజ్రము హిందూదేశమున నుండెననిమాత్రము తేలుచున్నది.

అందువలన ౧౬౦౦ సంవత్సరమున అక్బరు అహమద్‌నగరమును జయించి యటనుండి విలువగల యితరవస్తువులతోగూడ నీవజ్రమునుగూడ కొనివచ్చెననుట సంభవము. ఇట్టిది నిజముగ జరిగియుండినయెడల ఆకాలపుచారిత్రకు లీవిషయమును చరిత్రయందు వ్రాసియుండరా? ఢిల్లీశ్వరులఖజానాయందు ఇతరనవరత్నములతోపాటు నీవజ్రముగూడ జహంగీరు, షాజహానుల పాలనయందుండినయెడల దీనిప్రస్తావన 'టుజుక్'యందుండదా? అబ్దుల్‌హమీద్‌గారు తయారుచేసినఆభరణపుపట్టికయందును ఈవజ్రపుప్రస్తావన యగుపడదు. (B. N. II-391)

ఈరత్నమునుగురించి మనకు లభించగల నమ్మకమైన యావద్వృత్తాంత మింతయే. 'మాడరన్ రివ్యూ'

---

## శిక్షణ (Discipline) మువలనిప్రయోజనము

డాక్టరు యస్. జే. థియోడరుగారు The Young Men of India, Burma, and Ceylon పత్రికయందు వ్రాసినదానినుండి:

మార్పులేక ఒకేపనిని చేయుటయందు కొంత నేర్పు అలవడగలదు. ఇట్టిపని చేయుటయందుగల నేవయే మనకు ప్రాణాధార మగుచున్నది. మనము చేయుపని యొక్క స్వభావమునకన్న ఆపని చేయుటయందు మనకుగలఅభిమానము చాలముఖ్యము. పనిచేయుటవలన మనకు, పనియనిన సంతోషము జనించునట్లు చేయును. మనశక్తియంతయు వినియోగించి చేయుపనియందు మనకు శ్రద్ధ ఎక్కువ. చేసినదానినే మరల

మరలచేయుటవలన మనకు స్తిమితము చేకూరును. ఆపనినే శ్రద్ధగాని తెలివితో చేసినయెడల మనకుతృప్తిగలుగును. బుద్ధి నుపయోగించి చేయవలసినపనులను మరలమరల చేయుటయందు మనహృదయమును గట్టిపరచి మనము చేయవలసినపనియందు మనకు సంతోషము గలుగునట్లు చేయును. ఇట్లే ఒకయువకుడు ప్రపంచమందు కష్టపడి తునకు కష్టముల కలవాటుపడియుండగలడు.

యువకులు అనుభవమును సంపాదించుకొనునట్లు తమజీవితములను దిద్దుకొనవలయునని నేడు కొందరు తలంచుచున్నారు. ఇందువలన మానవజీవితమందు నిరాటంకముగ కలుగగలకొన్నిమార్పుల కవకాశము కలుగకున్నది. ఇట్లుండుటవలన స్వార్థపరత్వము, అవిధేయత ప్రబలుచున్నవి. బలమనునది క్రమమైనశిక్షణమువలన గలుగుచున్నది. ఏవో కొన్ని ముఖ్యవిషయములలోనే కాక, ఆరోగ్యమునకును, సంపదకును ముఖ్యసాధనము శిక్షణమే. శిక్షపొందనివారిజీవితము నిరుపయోగకరము.

నేడున్న నిరుద్యోగసమస్య మన కందరికిని తెలిసినదే. కాని ఉద్యోగములకు అర్హులుగానివారిసంగతి మన క్షేమి తెలియును? సరియైనశిక్షపొందనివారికి పూచీగలపనుల నొప్పగించుట సరియగునా! మనదేశమందలి కచ్చేరీలలో పని చక్కగ జరుగుట లేదనుటకు కారణము అచటియుద్యోగీయులకు క్రమమైనశిక్షణము లేకపోవుటయే.

శిక్షపొందనివారివలన జాతికే నష్టము. ప్రపంచమున నేడు కొన్నిజాతులు గొప్పస్థితియం దున్నవనుటకు, వారిదేశములందు జనులకుగలక్రమమైనశిక్ష కారణమగుచున్నది.

---

## భారతదేశగ్రామములయందు బ్రాడ్‌కాస్టింగు

ప్రపంచములో నితరదేశములవలెనే మనదేశమునను రేడియోబ్రాడ్‌కాస్టింగు మూలమున గ్రామజనులకు చదువు నేర్పించవచ్చును. ఈవిషయమై The Educational Review నం దిట్లు గలదు:

భారతదేశ గ్రామములయందు బ్రాడ్‌కాస్టింగు ద్వారమున పల్లెలవారికి చదువునేర్పించు విధానమును గురించి యింగ్లండునగల The Indian Village welfare Association అధ్యక్షులు సర్ ఫ్రాన్సిసు యంగు హస్‌బెండుగా రొక యుపాయము నాలోచించిరి. దీనిని భారతప్రభుత్వమువారును, భారతీయప్రముఖులును మిక్కిలిగ గమనింపదగుదురు. రేడియోమూలమున చదువునేర్పించు పద్ధతియొక్క సౌలభ్యము నింకను భారతీయులు తెలుసుకొనవలసియున్నారు. ఇంగ్లండున ఈప్రయోజనమునకై లక్షలకొలది రేడియోయంత్రముల స్థాపింపబడియున్నవి. సోవియటురష్యాయందుగూడ ఇవి కొంతకాల ముపయోగింపబడినవి. ఇట్లు పాశ్చాత్యదేశములవారు అనేక విధములయిన సౌకర్యముల నీరేడియోలవలన పొందుచున్నారు. కావున పైసంఘమువారు భారతదేశశ్రేయమునకై ఈవిషయమై దీర్ఘాలోచనచేసి ఇట్టిఏర్పాటును కావించుట వారిబాధ్యత గ నెంచిరి. బ్రాడ్‌కాస్టింగుకొరకు అయిదువందల గ్రామములయందు రేడియోయంత్రముల స్థాపించవలయును. ఒక్కొక్కగ్రామమువారును సాలునకు ఖర్చులకై రు. ౧౨౦ లు చందా నివ్వవలయును. ఈయుపాయము నాలోచించినవారు చెప్పినటుల గ్రామమున ఇంటికి ఒకరూపాయవంతున ౧౨౦ ఇండ్లవారివద్దను వసూలుచేసినయెడల వీరికార్యము సులభముగ నెరవేరగలదు. గ్రామజనులు రేడియోచుట్టుపట్టులను కూర్చుని పాటలను, కథలను, విద్యావిషయక ప్రసంగములను వినుచుండవచ్చును. ఇవన్నియు గ్రామస్థుల ననేకుల నాకర్షింపగలవు. సిలోనునం దీప్రచారము జయము గాంచినది. అట్టియెడ భారతదేశమునమాత్ర మాపద్ధతి యేల సరిగా కొనసాగక పోవును? విద్యావిషయకమైన లాభము లపారములైయుండ, దేశాభ్యుదయమే పరమార్థమని యెంచెడు వారందరును దీనికగుఖర్చును సరకు గొనక యుందురుగాక!

---

## సముద్రమున నడక




సినీమానటుడు వాలెస్ బిలియమ్స్. ఇతడు రబ్బరుపటకాకు తగిల్చియున్న చిన్ని మోటారుయంత్రము ఊతగా సముద్రమున నడిచిపోగలుగును.

---

## తక్షశిల

౧౯-౨౭-౨౮-వ సంవత్సరమున 'సిర్కాపు' వద్ద జరిగిన 'తక్షశిల' ప్రాచీన నగరావిష్కరణకార్య ఫలముగ 'పార్థియను' మట్టమున ముప్పదియిండ్లు బయలుపడినవి. అవి పూర్వము బయలుపడినవానిని పోలియేయున్నవి. (చిత్రము ౨.) ఈ నిర్మాణశిథిలములక్రింద త్రవ్వి తీయవలసిన ప్రాచీనవస్తు శిథిలములనేకములు గలవు.

సిర్కాపువద్ద కుషాను-పార్థియను నిర్మాణములు గల చిన్న ప్రదేశము పట్టణపు టుత్తరద్వారమువద్ద తెరిపిచేయబడెను. (చిత్రము ౧) పై మట్టమున ఆదికుషానుల కాలపు కట్టడముల గుణావర్తములు కొన్నిమాత్రము గలవు. ఇవి నూడనుగులబోతుననే నిలిచిపోయినవి. రెండవ మట్టమున నిర్మాణములు అతిశిథిలములు. దిబ్బలు తేలినవి. వీని గుణావర్తముపయిపయినన్నే కలవు. మూడునాలుగు మట్టముల నిర్మాణములననూనాలు ఏకరీతిగ నున్నవి. మూడవమట్టమునందలి యిండ్లగోడలలో చేర్చియే నాల్గవమట్టమునందలి యిండ్లగోడలు కట్టబడినట్టు లున్నవి. రెండవమట్టమునందలి ఇండ్లు మూడు నాలుగుమట్టములందలి యిండ్లనమూనాలను పోలియున్నను కొంతయుత్తరమునకు జరిగియున్నవి. ౩, ౪ మట్టములఇండ్లను ఇసుక సున్నములతో కట్టినసూచనలు కానవచ్చుచున్నవి. కొండొక్కయెడ ముంగిటగోడయు నున్న ట్లున్నది. మొహెంజోదారోలో కనుపట్టిన చరిత్రకందని ప్రాచీన నిర్మాణములయందు ఇట్టి అడ్డుగోడలు కానవచ్చినవి. నాలవ మట్టమున ఇంటికి వెనుకవీథిలోనికిని త్రోవ గలదు. అయిదవమట్టమున ౪-వ మట్టమునందలి రెండిండ్లస్థలమున ఒకటే యిల్లున్నది. ఆయింటినమూనా చక్కగా నున్నది. దాని గోడలు గట్టిరాళ్లతో దిట్టముగా కట్టబడినవి. ౫,౬ మట్టముల కట్టడములు తక్షశిలను గ్రీకులుపాలించిననాటి కట్టడములను పోలియున్నవి.

ఆరవమట్టము ౧౭ అడుగులలోతున ఆరంభమగుచున్నది. ఈమట్టమునందలి నిర్మాణములకు తక్కిన మట్టముల వాని నిర్మాణములకు పోలిక యింతయైనకానరాదు. అక్కడియిండ్లగదులలో జలదారులు గలవు. ఇవి కొన్ని భూగర్భమున నున్నవి.

ఈ ఆరుమట్టములు నొకదానిక్రింద నొక్కటిగానున్నవి. త్రవ్వి వెలువరిచిన యీమట్టముల నిర్మాణములు ఒకవాడలోనివి. దానిఎదుటి వీథి ౨౬ అడుగులలోతున త్రవ్వబడెను. (చిత్రము ౩) అందు ౨౩ అడుగులలోతున అడుగుమట్టి తగిలినది.

ఈసంవత్సరము త్రవ్వినప్రదేశములలో గృహోపకరణములయు, శిల్పచిత్రములయు అవశేషము లనేకములు లభించినవి. వానిలో హృద్యమగు మద్యపానరంగము చెక్కబడిన వర్తులఫలకమొకటి గలదు. (చిత్రము ౪) అది ఆకుపచ్చ, బూడిద రంగులు కలిసిన అభ్రకపు రాయితో చెక్కబడినది. నడుమ నొక్క బల్ల; దానిపయి నొక స్త్రీ, యొక పురుషుడు ఆసీనులయి యున్నారు. పురుషు డెడమచేతితో స్త్రీని కౌగలించుకొని యున్నాడు. కుడిచేత రాజసంతమును పట్టియున్నాడు. స్త్రీ వానికి పానపాత్రను నందిచ్చుచున్నది. కొందరు ద్రాక్షాదులచే ఆసవమును తయారుచేయుచున్నారు. కొందరు తప్పత్రాగి మత్తెక్కిపడియున్నారు.

[భారతపురాతనపరిశోధనశాఖ వారి వార్షికనివేదిక(౧౯౨౮-౨౯) నుండి యిందలి చిత్రములును విషయమును గ్రహింపబడినవి.]

---

## జమీందారీల ఆదాయము

ఈ క్రింది పట్టికవలన మన రాజధానిలోని ముఖ్యములైన జమీందారీలకు వచ్చు రివిన్యూలో ప్రభుత్వమువారి కెంత పేష్కష్ చెల్లింపబడుచున్నదో తెలియనగును.

| పేరు | ౧౯౩౧-౩౨ వ సంవత్సరమునకు ఎస్టేటు రివిన్యూ | ౧౯౩౧-౩౨ లో ప్రభుత్వమున కియ్యవలసిన పేష్కష్ |
|---|---|---|
| పర్లాకిమిడి | రు ౪,౯౮,౪౦౦ | ౭౯,౭౮౮ |
| విజయనగరం | ౨౦,౧౬,౨౬౯ | ౪,౯౪,౮౧౬ |
| బొబ్బిలి | ౬,౧౨,౩౧౩ | ౮౩,౪౫౩ |
| జయపూరు | ౧౨,౦౨,౦౧౯ | ౧౫,౯౮౮ |
| పిఠాపురం | ౫,౯౭,౯౩౦ | ౨,౬౨,౭౮౨ |
| దేవైకోట | ౨,౮౧,౧౭౦ | ౭౯,౪౯౫ |
| వెంకటగిరి | ౧౧,౬౮,౩౫౩ | ౩,౬౮,౭౩౪ |
| కార్వేటినగర్ | ౫,౭౧,౧౧౦ | ౧,౭౩,౮౪౨ |
| కాళహస్తి | ౫,౮౨,౫౫౦ | ౧,౭౨,౯౮౨ |
| శివగంగ | ౬,౭౬,౯౩౭ | ౨,౫౩,౪౫౧ |
| రామనాడ్ | ౧౧,౬౯,౭౧౫ | ౨,౯౨,౬౨౭ |
| ఈథియపురము | ౨,౯౬,౨౫౬ | ౭౭,౯౮౫ |
| ఇతర ఎస్టేటులు | ౧,౨౬,౩౦,౫౮౫ | ౨౬,౩౬,౦౦౫ |
| మొత్తము | ౨,౨౩,౧౨,౫౯౮ | ౪౯,౯౧,౯౪౭ |

—కృష్ణాపత్రిక.

---

## గణపతి

ఆసేతు హిమాచల మనుష్ఠింపబడు వ్రతములలో వినాయకచతుర్థి యొకటి. కార్యారంభమున, సదాచారసంపన్నుడగు ప్రతిహిందువుడును మొదట విఘ్నేశ్వరపూజ చేయుచున్నాడు. కారణము, ఈదేవుడు విఘ్నముల కలుగనీయ డనునమ్మకమే. విఘ్నేశ్వరుని గురించినకథ లనేకములు అనేకవిధము లయినవి మనపురాణముల గలవు. ఈతనికిగల యనేకనామములు సయితము పౌరుష నామములుగనే కన్పట్టుచున్నవి. అటులుండ ఫలపుష్పసమృద్ధియైన వర్షర్తువం దీతనిపూజించుటకు కారణ మేమి? భాద్రపదశుద్ధచతుర్థినాడు, అనగా వర్షర్తువుయొక్క మధ్య

కాలమున నీతని నర్చించుట పరమార్థమేమి? ఋతు ధర్మములు చక్కగనున్న శ్రావణభాద్రపదము లప్పటికి దేశ మంతయు చక్కగ వర్షించి సకలవిధములయినపాడి పంట లేర్పడవలయును. సాధారణముగ గణపతిని పూజించు పూజాద్రవ్యములు, అటవిపూలు, ఆకులు మొదలగునవి. ఈవిఘ్నేశ్వరునిస్థానము గ్రామముల పొలి మేరయం దుంటున్నది. ఈతడు త్రిమూర్తులకును పూజ నీయుడు.

పైర్లు పంటలు అభివృద్ధికి వచ్చుకాలమున నర్చింపబడునీదేవుడు వ్యవసాయాధిపతిగ నుండగలడని యొకయూహ గలదు. ఈతనియనేకనామములలో నొక టగు "ద్వైమాతుర" యనినది ఈయూహను బలపర చును. 'ద్వైమాతుర' యనగ ఇద్దరుతల్లులు పార్వతీ గంగాదేవుల గలవాడని యర్థము. కాని యీయర్థ మంత తృప్తికరముగ లేదు. ఏలయన, దేవత లైనను పార్వతీగంగలు సవతులు. అట్టియెడ వారిలో నొకరి కుమారుడగు గణపతికి ద్వైమాతురత్వము సులభముగ జేకూరనీయరు.

"ద్వైమాతుర" శబ్దము, గ్రీకులవ్యవసాయదేవత యగు 'డెమిటర్' ( Demeter or Demerius ) నామ మును ఏకార్థము గల వనియనుకొనవచ్చును. 'డెమి టర్' యనునామె సస్యదేవత. ఈమెకు 'సిరిస్' (Ceres) అను మరియొక పేరు గలదు. 'సిరిస్' అనిన శ్రీ లేక సంపదయనిస్ఫురించుచున్నది. సిరిస్ అనగా సస్యదేవత యనియర్థము. ద్వైమాతురశబ్దమే డెమి టర్‌గ మారుట కవకాశము గలదు. కనుక ఈరెండు పేర్లును ఏకధర్మము గలిగిన యొకదేవతకే చెందుట అసంభవము కాజాలదు.

'డెమిటర్' అనుదేవత స్త్రీయైయున్నది. మన ద్వైమాతురుడు పురుషుడు. ఇదెట్లు అన్వయింపగలదని సందేహము గలుగవచ్చును. గ్రీకులదేవతయగు వీనస్ దేవత స్త్రీగ పరిగణింపబడుచున్నది. మనదేశపుపురాణ ములప్రకారము వీనస్ అనగా శుక్రగ్రహము. శుక్రుడు పురుషుడు. వీనస్ ఆడుది. ఇట్లెన్నియేని యుదాహరణ ములు చూపవచ్చును. కావున ద్వైమాతుర, డెమిటర్ నామములు ఒకేదేవత పేరుకా దను శంకకు తావులేదు.

గణపతికిగల నామములు మరి కొన్నిగూడ ఈయూహ కాధారము గల్పించుచున్నవి. లంబోదర యనుపేరు గణపతికి చెందియున్నది.

మన మొసగు కుసుమములను, సకలవిధములయిన ఫలములను ఆరగించు ద్వైమాతురుడు మనవ్యవసాయ మును కాపాడవలదా!

---

## ఎత్తయినగోపురము

ఫ్రాన్సుదేశమున అత్యున్నతమగు నొక గోపుర మును కట్టుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. "ప్రపంచపుగోపుర" మని దీనిపేరు. దీనిని కట్టుటకు చట్రము, కంకర యుపయోగింపబడును. దీనిఎత్తు ౨౩౦౦ అడుగులు. ౧౯౩౭-వ సంవత్సరమున పారిసు నగరమున జరుగగలప్రదర్శనముభాగముగ నీగోపురము తలపబడుచున్నది.

ఈగోపురమును నెక్కగోరువారు తమ మోటా రులలో ౧౬౦౦ అడుగులఎత్తువరకు పోవచ్చును. బండ్లు ఆఎత్తువరకు పోవుటకు వలయాకారపుఎక్కుడు బాట ఈగోపురముచుట్టును ఉండును. అచటినుండి పైకి పోవుటకు చేదుడుయంత్రములు (elevators)గలవు.

గోపురపుశిఖరభాగమున దీపస్తంభ మొకటియు, వాతావరణస్థితిని కనుగొను యంత్రాలయ మొకటియు నిర్మింపబడగలవు. ఆ ఎత్తున నుంచబడుదీపకాంతి చుట్టు ౧౨౦ మైళ్లవరకు ప్రసరించగలదు. ఆగోపురపుక్రింది భాగమున ౪౩౦ అడుగులవ్యాసముగల పెద్దసభామంటప మొకటి యుండును. అది గొప్ప పౌర సభలు జరుగుట కుపయోగపడును. అత్యున్నతప్రదేశమున ప్రయోగ శాలలకు విశేషము అనుకూల్యములు గలుగగలవు. ౧౬౦౦ అడుగుల లోలకము ( Pendulum ) వలన భూమియొక్కచలనము, ఆకర్షణశక్తి మొదలగువిషయ ముల పరిశీలించవచ్చును. ఈగోపురపు క్రిందిభాగమున




1. వాతావరణ యంత్రస్థానము
2. దీపస్తంభము
3. శాస్త్రపరిశోధనాలయము
4. హోటలు
5. నాలుగువందలు మోటారు కారులుండుటకు వసతి
6. దీనియెత్తు 1600 అడుగుల పెండులమునుంచి, శాస్త్ర పరిశోధనము చేయుటకు వీలుగ నున్నది.
7. సభామంటపము
8. వాయు, తంత్రీ, రేడియో-వార్తా ప్రచారకార్యాలయములు

పత్రికాప్రచారమునకును, ప్రపంచవ్యవహారప్రచారమునకును నుపకరించు యంత్రసాధనము లుండును. నలువదిసంవత్సరములు దీనివలన రాగల సకలవిధములయిన ఆదాయములవలన దీని నిర్మాణమునకు వ్యయమయిన ధనమును రాబట్టవచ్చునట.

"పాప్యులర్ సైన్సు"

---

## పిల్లలగండములు

చిన్నతనమున కుర్రవాండ్రు స్వయముగగాని, ఇతరులను అనుకరించుతలపుతోగాని తమకగు చెరుపును తెలిసికొనుజ్ఞానములేక నోటను, ముక్కునను, చెవియందునను ఏవోవస్తువులను ఇరికించుకొనుచుందురు. నోట వేసికొనిన వస్తువులు గొంతులో నిరుకుకొనిపోయి తద్ద్వారా వారికి చాల బాధ గలుగుచుండును. వానిని వెలికితీయించుట చాల కష్టమగు కార్యము. ఒక్కొకప్పుడు, కాదు - తరుచు - వారికి ప్రాణములమీదికి వచ్చుచుండును. తల్లిదండ్రుల దురభ్యాసములచేతను, జాగరూకత లేమిచేతను పిల్లల కీయాపద కలుగుచుండును. పిల్లలకు ప్రాణాపాయము కలిగినయెడల యావజ్జీవము ఘోరదుఃఖముతో క్రుంగవలసినవారు తలిదండ్రులు. వారు ఎంతయో జాగ్రత్తతో తమ పిల్లలను కనుపెట్టియుండవలయును.

సాధారణముగా పెద్దవయసువారును గుండుసూదులు, మడతసూదులు మొదలయినవానిని నోటనుంచుకొని పండ్లతో నొక్కుచు వానిలోని చిలుముమాధుర్యమును రుచిచూచుచునుందురు. ఇది వారికే ఒక్కొకప్పుడు బాధను కలిగించుచుండును. ఇక ఇట్టివారిని అనుకరించు అజ్ఞానులగు పసికుర్రలమాట చెప్పబనిలేదు.

వెనుకటికాలమున మ్రింగినవస్తువు లోపలనెక్కడ ఉండునో తెలిసికొనుట సాధ్యము కామిచే డాక్టరులు వానిని తీయుటకు చాల కష్టపడెడువారు; తరుచుగా వ్యర్థప్రయత్నులు నయ్యెడువారు. నేడు అట్లుకాదు; యక్సురే (X-ray) ఫోటోద్వారా మ్రింగబడిన వస్తువున్నచోటును, వస్తువునుకూడ స్పష్టముగా కనుగొని దానిని వెలికి తీయుమార్గముల నాలోచించి యుక్తితో నాయుధములసాయమున వానిని బయటికి దీయగలుగుచున్నారు. ఈవిధమయినఫోటోలు ఇట్లు ముఖ్యముగా పసిపిల్లలకు పైతీరున కలిగెడు ప్రాణాపాయమును తొలగించుటకు మిక్కిలి ఉపకరించుచున్నవి. ఇట్టిఫోటోలు రెండు ఈసంచికయందు ప్రకటింపబడినవి.

అందొకటి: సిలువను మింగిన 'బోస్టను' కుర్రవానిది. వానికుత్తుకలో సిలువ తగులుకొని యున్నది. వానితల్లి మెడనుండితీసి బట్టలబల్లపయి నుంచినసిలువను బాలుడు నోటవయిచుకొని మ్రింగెను. దానిని వైద్యుడు ప్రత్యేకాయుధములతో లోపలనే ముక్కలుచేసి వెలుపలకు తీసివైచి బాలునిప్రాణములను రక్షించెను.

రెండవది: తల్లి నోటిలో మడతసూది నుంచుకొనుచుండుటను చూచుచుండిన ఒకచికాగో కుర్రవాడు ఎనిమిదినెలలవయసుగలవాడు, తాను విడియున్న ఒకమడతసూదిని నోటవైచుకొని మ్రింగెను. అది గొంతుక దిగకయే నిలిచిపోయెను. గట్టిబిసుబండములను తినిపించి దానిని తిన్నగా ఎట్టులెట్టులో కడుపులోనికి పోజేయగలిగిరి వైద్యులు. కాని వెలుపలికి దీయనుపాయమునకయి చాలకష్టపడిరట. ఈరెండును తల్లియొక్క అజాగ్రత్తకు, దురభ్యాసమునకు నిదర్శనములు. విద్యావతులగు స్త్రీలుగల దేశములయందే యీయవివేక కార్యములు జరుగుచున్నవి. విద్యాకరవగు భారతదేశమున నిట్టివి విపరీతముగ జరుగుచుండుట వింతకాదు. తప్పించుకొనుట కుపాయములుగలవని అపాయములను తెలిసి నెత్తికితెచ్చుకొనరాదు. విధికృతముగ సంప్రాప్తములగు వానిని తొలగించుకొనుటకే ఉపాయములు, సాధనములు కల్పింపబడినవి.

పిల్లలకు అనుకొనకుండ వచ్చుగండములలో నిది యొక్కటి. దీని వాతపడకుండ పిల్లలను కాపాడుకొనుటకు తల్లు లెంత జాగరూకత వహించిన నంత శ్రేయము.

---



మధురానగర దృశ్యము

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

## కేళి

శ్రీరంగం శ్రీనివాసరావు (కవితాసమితి)

*

నిదురవలె, నిదురలో
నొదవు స్వప్నమ్మువలె,
అడుగు సడిలేక న
న్నావరించెదవు.

గాలివలె, గాలిలో
తేలు సౌరభమువలె,
చూచాయ కొలుపకే
సురిగిపోయెదవు.

ఎపుడో నీ ఆగమన,
ఎపుడో నీ నిష్క్రమణ.

*

---

## ఆగడపలు

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

లలితమగు నింగి జవ్వని వళులునాఁగ
జదలి సెలయేటి సోపానసరణినాఁగఁ
నుడువధూమణి పయ్యెదముడతలనఁగ
రేఁగిన సురాంగనల పాన్పు బాగులనఁగ
మింటిపూఁబోఁడి వీఁడియమెట్టులనఁగఁ
బఱచు వేల్పురాయంచల మొఱకలనఁగఁ
బ్రకృతిసతి మందహాస తరంగలనఁగ
నాగడప లొప్పుచుండె రమ్యముగ వింట.

---

# నక్షత్రమండలము

(భాద్రపదమాసము)

గొబ్బూరు వేంకటానందరాఘవరావు, బి. ఏ.

(కవితాసమితి)

ఉత్తరము




దక్షిణము

ఈపటములో నున్నట్లు నక్షత్రాదులు ఈసెప్టెంబరునెల

8–వ తేదీని సుమారు 9–0 గంటలపుడును, 22–వ తేదీని సుమారు 8–0

15 ,, ,, 8–30 ,, 30 ,, ,, 7–30 కనబడును.

ఈ నెల పున్నమనాడు చంద్రుడు పూర్వా భాద్రనక్షత్రముచెంత నుండుటచేత ఈమాసమునకు భాద్రపదమని పేరు వచ్చినది. ఆకాశమునందు ఈ నెల తొలిజామున నగపడు నక్షత్రాదులను గమనింతము.

10. 9- 19 ౪౪౩

## క్షీరవాహిని (Milky Way)

ఉత్తరదిశాసమీపమున నున్న ఈశాన్యదిశనుండి (North East by North) దక్షిణసమీపమున నున్న నైరృతివఱకు (South West by South) అర్ధమండలాకారమున (Like a great semi-circular arch) నభోమండలమున నీ క్షీరవాహిని వ్యాపించియున్నది. ఈశాన్యదిశనుండి వరుసగా, భృసపరశు, అప్సరస ఇంద్రమద, ఊర్వశీపురూరవసు, రాజహంస, గరుడ, శేష, ధన్వ, వృశ్చిక, అగ్ని వేదిక లనుమండలముల మీదుగా నైరృతికి వ్యాపించియున్నదీ. ఈవాహిని రాజహంసమండలమున శాఖలుగా చీలి అగ్ని వేదిక వఱకు నీశాఖలతోనే కానవచ్చుచున్నది. ఇందలి ఉత్తరార్ధములో మిక్కిలిసాంద్రమైనప్రదేశము రాజహంసలో Deneb అనబడు ౧ గుర్తుగలచుక్కకడ నున్నది. దిగువ దక్షిణార్ధములో ధన్వమండలముకడ నది సాంద్రతరముగ చూపట్టుచున్నది. మఱియు ఉత్తరార్ధములో ఈహంసమండలములో ౧, ౩ గుర్తులుగల చుక్కలమధ్య చుట్టును తెలుపులో నల్లనినలుపుమచ్చ కనబడుచున్నది. దీనిని (Northern coal sack) అనగా ఉత్తరశ్యామసీమ యని చెప్పుదురు. ఆదిగువను, క్షీరవాహిని రెండుశాఖలమధ్యను ఛాయాపథ మున్నది. దక్షిణమున నగ్నివేదికమండలమువఱకును ఈ ఛాయాపథము వ్యాపించియేయున్నది.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు

( First Magnitude Stars )

ఈమాసములో తొలిజామున మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు ఐదుమాత్రము కనబడుచున్నవి. అవి యేవియనగా:—

౧. పడమట అస్తమింపనున్న భూతేశమండలము ( Bootes ) లోని స్వాతి ( Arcturus ).

౨. క్షీరవాహినినంటి పశ్చిమముగా నున్నవీణామండలములోని బ్రహ్మ ( Vega ).

౩. క్షీరవాహినితూర్పుశాఖ నంటియున్న గరుడమండలములోని శ్రవణము.

౪. క్షీరవాహినిదక్షిణభాగమున వృశ్చికరాశిలోని జ్యేష్ఠ.

౫. తూర్పున మకరరాశిదిగువ ఇంద్రద్యుమ్నుడు.

## గ్రహములు

ఈనెలలో గురుడు, శుక్రుడు కన్యారాశియందు కొంతవఱకు నుందురు. పిమ్మట శుక్రుడు తులలోనికి వచ్చుచున్నాడు. కుజుడు తులలోనే ఉన్నాడు. అయితే మననక్షత్రపటములో ఇంగ్లీషుమాసారంభమున రాత్రి తొమ్మిదిగంటలపైనను, అమాసాంతమున నేడుగంటలపైనను కనబడునక్షత్రములే యిందు చూపబడుచున్నవి. ఆవేళకు గురుశుక్రు లస్తమింతురు. గనుక ఆగ్రహముల నిందు చూపలేదు. కుజుడు తులలోనున్నాడు కావున నాగ్రహమును చూపినాడను. శని శ్రవణము దిగువనే ఉన్నాడు. ఈమాసములోనే సూర్యుడు ౨౧-వ తేదీ ప్రాంతమున విషువృత్తము (Equinox) నుచేరి దాటగలడు. నాటినుండి దక్షిణదిశాగతుడగుచున్నాడు.

దక్షిణదిశ యమునిది; పితృప్రీతికరమైనది. భాద్రపద బహుళపాడ్యమి మొదలు అమవాస్యాంతము పితృప్రీతికరములైన మహాలయ పక్షదినములు. ఈఋతువున పితరులను పూజించుట ఒక్కహిందూదేశములోనేకాదు. క్రైస్తవాది ఇతరమతములలోనను చూపట్టుచున్నది.

[Festival of All Souls derived from the world wide pagan feasts of the Dead and their Ghosts at this Season]

## ఉత్తరదిక్కునక్షత్రములు

ధ్రువుడు ఉత్తరమున లఘుఋక్షపుతోకచివరను మెఱయుచున్నాడు. ధ్రువరక్షకులను ధాతవిధాతలును, లఘుఋక్షములోనివేయను, మిత్ర, అగ్ని, మహేంద్ర, కశ్యప నక్షత్రములును, ధ్రువునికి దిగువ వాయవ్యదిశను కనబడుచున్నారు. సప్తఋషులలో పులహుడు

అస్తమించినాడు. అత్రి క్రతుపులస్త్యఋషులు అస్తమించుచున్నారు. ఆంగీరస, వసిష్ఠ, మరీచులును, వసిష్ఠునిచెంత మిణుకుమిణుకుమనుచు నరుంధతియు కానవచ్చుచున్నారు. ఈ రెండుఋక్షములకు మధ్య నరకుడు మెలికలుతిరిగి చుట్టుకొనియున్నాడు. ఉత్తరమునుండి ధ్రువునిచుట్టి యీశాన్యదిశకు క్షీరవాహినిపర్యంతము ఊర్వశీపురూరవసులు కనబడుచున్నారు. రంభాది అప్సరసలు పూర్తిగ ఉదయించినారు. అప్సరసల కావల ఈశాన్యమూలను భృగుపరశుమండలము ఉదయమగుచున్నది. దానికిదిగువను, రంభాదులకు తూర్పునను ఇంద్రమద బాసుగా ఉదయించినది. ఆదిగువ చ్యవనుడును ఉదయించి మెఱయుచున్నాడు. చ్యవనునిపైని గ్రద్దను మిటకరించుచు పులోముడను రక్కసుడున్నాడు.

## మధ్యనక్షత్రములు

అశ్వినీనక్షత్రములు ఇప్పుడిప్పుడే ఉదయమగుచున్నారు. అశ్వినులకు పడమరగ మీనమున్నది. మీనమనగా ఒకచేపమాత్రము గాదు. పాశ్చాత్యులు రెండు చేపలను, వాటితోకలకు ముడిపెట్టుచున్న ఒక ribbon సన్నపునవారును చూపించుచున్నారు. మనవారును "మత్స్యద్వయం చేతి" అని వర్ణించినారు. ఆదిగువ శింశుమార మిప్పుడే ఉదయమగుచున్నది. శింశుమారమునకు పశ్చిమముగా వరుణమండల మున్నది. ఇది కుంభరాశిలోనిది. వరుణునికి దిగువప్రక్కను పడమరగా అతని వాహనమైన మకరము ఉన్నది. ఆదిగువను ఇంద్రద్యుమ్నుడు మెఱయుచున్నాడు. వీటెని చూడగానే మనకు గజేంద్రమోక్షణకథ స్ఫురింపకమానదు. ఇంద్రద్యుమ్ననికి తూర్పుగా యుగంధరకమఠము గలదు. అక్కడ మధ్య నొకచిన్నవలయపుగుఱుతుపెట్టి "క్షీ-ద-ధృ" అను అక్షరములు వ్రాసినాము. ఆయక్షరములు క్షీరోద, దక్షిణ, ధ్రువము అని తెలియచేయును. క్షీరోదము- అనగా పాలసముద్రము ఒకగోళముగా భావించినపుడు దాని దక్షిణధ్రువము ఈకూర్మమును, ఉత్తరధ్రువము కన్యసమీపముననుఉండును. క్షీరసాగరమథన వృత్తాంతములో పాలసముద్రము నడుమున శ్రీహరి కూర్మమై నిలిచి రక్షించినట్లు చెప్పెడిగాథయొకటి గలదు. అట్లే అమృతమును మోహినీకన్య పంచిపెట్టెదనని బయలుదేరినగాథయు గలదు. ఆవివరములు క్షీరసాగరమథనమునుగూర్చి వ్రాయు ప్రత్యేకవ్యాసమున చర్చింతము. ప్రస్తుతము క్షీరవాహిని కొకధ్రువముకడ కూర్మమును రెండవధ్రువముకడ కన్యయు మనకు ఆకాశమున కానవచ్చుననిమాత్రము చెప్పి విరమింతము. ఈయుపపత్తులపై క్షీరసాగరమథనకథ ఆధారపడియుండునని చెప్పుదుము.

మఱియు, ఈకూర్మము, నాళీకజంఘబకము, ప్రావార కర్ణఘూకము, మధ్య నింద్రద్యుమ్నుడును కనబడుటచే భారతమునందలి ఇంద్రద్యుమ్న మహారాజుకథకూడ స్ఫురణకు రాకమానదు. వీటికి తూర్పుగా క్షీరవాహిని నంటి ధన్వియమసమన్మగు డున్నాడు. ఆదిగువను అతనివాహనమైన చిలుకయున్నది.

రేవతికిపైన పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రము లున్నవి. ఇవి రెండు, రెండుమంచపుకోళ్లవలె ఉన్నవి. ఇదియే పెగసస్ చతురస్రము (Square of Pegasus). అశ్వినులచే శైదు అనురాజర్షి కియ్యబడిన అఘాశ్వము- శైద్యఘాశ్వము- పాశ్చాత్యగాథలలో పెగసస్‌గా మారినది.

ఈయశ్వమునకు పడమట వసుదేవతాకమైన ధనిష్ఠ యున్నది. ధనిష్ఠకు పడమట శ్రవణము. శ్రవణమునకావల ఛాయాపథమునకు పశ్చిమముగా క్షీరోదశాఖ నంటి శ్రీమహావిష్ణువు శేషపాన్పుపై పవళించియున్నాడు. ఇక త్వరలో పరివర్తనము పొందనైయున్నాడు. పరివర్తనమనగా నిద్రలో ఒకప్రక్కనుండి రెండవప్రక్కకు ఒత్తిగెలునని పామరుల భావము. పడమట నస్తమించి, తిరిగి తూర్పున నుదయించుస్థానమును చేరుచున్నాడని శాస్త్రీయార్థము (Scientific meaning). పడమట భూతేశమరుద్గణములస్తమింపబోవుచున్నవని యీసరికే చూచినారము.

ఇక దక్షిణనక్షత్రములను చూతము. కులాల చక్రాకారముగల విశాఖయు, ప్రక్కనే తులజూడును ఉన్నారు. విశాఖకు తూర్పుగా మిత్రదైవత్యమైన అనూరాధయు, దానికావల ఇంద్రదైవత్య మైన జ్యేష్ఠయు, జ్యేష్ఠకావల తేలుకొండివంటి మూలయు కనబడు చున్నవి. మూలదిగువ క్షీరవాహినిలో నగ్నివేదిక కొంత కనబడుచున్నది. దానికి తూర్పున మయూర ముతో బాణాసురు డున్నాడు.

## ౭౧ రాజహంస

రాజహంసగుంపులో ౪ అంకె వేసి ఒకచిన్న చుక్క చూపినాము. ఇది ఆగుంపులో ౭౧ సంఖ్య గలచుక్క. ఇందులో విశేషమేమనగా ఉత్త రాకాశమున నిది భూమికి చాలాసమీపమైన చుక్క. దీనివెలుగు భూమిచేరుసరికి ౯ సంవత్సరములు పట్టును. అయినను ఇదే మనకు అత్యంతసమీపమున ఉత్తరాకాశమున నున్నచుక్క.

## రాసులవరస

పశ్చిమమునుండి తూర్పునకు వరుసగా మన కీ మాసమున కానవచ్చురాసులు:

౧. తుల, ౨ వృశ్చికము, ౩. ధనుస్సు, ౪. మకరము, ౫. కుంభము, ౬. మీనము, ౭. మేషము.

## ఉల్కాపాతవిషయము

ఈనెలలో ప్రముఖమైనఉల్కాపాతములు లేవు. ఇక చిల్లరఉల్కాపాతములలో ఈనెల ౫ మొదలు ౧౫ తేదీవఱకు మీనమున స్వల్పపాత ముండును.

పిమ్మట ఈనెల ౨౦ - వ తేదీని ఇంద్రమునలో కొంత ఉల్కాపాత మగపడును.

---

## వినాయకచవితి

కర్లపాలెము కుటుంబశాస్త్రి. బి. ఏ.,

ఏమియందము గాంచితో ఎలుకలోన
వాడుకొందువు దానిని వాహనముగ
ఏమియభిమానమున్నదో యేనుగునెడ
దానిశిఖరమును వరియించి తాల్చినావు
ఏనుగుధరించుతొండము నెలుకతోక
రెంటికిని ముడివెట్టి చేర్చితివి నీవు
స్థూలసూక్ష్మస్వరూపుడ జూడుడంచు
బోధజేయ నెంచితివె లంబోదరుండ!

---



## అడవిపువ్వులు

ఆంధ్రమున సుభాషిత గ్రంథములు లేమికిఁ జింతించి, గీర్వాణభాష నిదివఱకు వెలువడియుండిన సహృదయపత్రికయందలి సుభాషితములఁ గొన్నింటిని బురస్కరించుకొని, స్వకపోలకల్పితముల బహుసంఖ్యాకములఁ జేర్చి యీగ్రంథమును తాము రచించినట్లు శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు చెప్పుచున్నారు. "సారస్వతగహనమున నిండుగా మెండుగా విరియఁబూచిన తీవియలనుండి కవి తనకిచ్చవచ్చినట్లు ఏర్చియు, తనయొక్క యుదాత్తభావలతావితానము ప్రసరించునట్లు కూర్చియు" నీయడవిపువ్వులను వాఙ్మయప్రపంచమున విరజల్లినట్లు గ్రంథపరిచయముంగూర్చిన శ్రీ నా. వేంకటేశ్వరశాస్త్రిగారు వ్రాయుచున్నారు. వారు తలంచినట్లే నామ మీగ్రంథమున కెంతయుఁ దగియున్నది. తేనియలొలుకు నీసూక్తిసుమములు రసలాలసములగు సహృదయభృంగముల హృదయముల నాకర్షించి తేనెవాకలఁదోఁ దేలించుననుటలో సందేహము లేదు. కావుననే యిందలి కొన్ని సుమముల నీవఱకే భారతి యలంకరించుకొనియున్నది.

ఈ ఖండకావ్యమునందలి కొన్ని వర్ణనములు ధ్వనిప్రధానములై, కొన్ని ధ్వనిప్రధానములు కాకున్న నన్యాపదేశపరము లై వాచ్యార్థ చమత్కారముగలవై సదుపదేశకము లగుచున్నవి.

క. ఇచ్చునది కూప ముండఁగఁ
బుచ్చుకొనునది ననఁబోఁడి పొంతనె యుండన్,
గుచ్చితపు గిలకనడుమ
న్వచ్చిన తనకేమొ వాయి వసులఁగ నఱచున్.

[ కూపము ]

అనునీరీతివర్ణనములు మనకు నిత్యప్రత్యక్షములగు విషయములను సంబంధించి మిగుల చమత్కారము గల్గించుచున్నవి. కాని శర్మగారు గీర్వాణాంధ్రీకరణము పట్ల, గొన్నియెడలఁ గొంతజాగరూకత గ్రహింపమిచే గొలఁదిలోటులు కలిగినవి. ఒకచిన్నయుదాహృతి.—

కొమ్మలపై విహంగములు
కోటరమందు భుజంగముల్ ప్లవం
గమ్ము లొగిన్ సిగన్ వికచ
క్రమఘుమంఘుమగంధనవ్యపు
ష్పమ్ముల భృంగముల్ చెలఁగుఁ
జందనపాదపమా! గణింప శ
క్యమ్మఁటె మాకు నీతనువు
నం దెటలేవు వనీపకావళుల్.

దీనికిమూలము—

మూలం భుజంగై శ్శిఖరం విహంగైః
శాఖాః ప్లవంగైః కుసుమాని భృంగైః
పార్శ్వం మతంగైః కరుణాంతరంగైః
సంసేవ్యతే చందనపాదపస్య.

అను పండితరాజశతకశ్లోకము. తదనుసారముగ నిచట "కొమ్మలపైఁ బ్లవంగములు కోటరమందు భుజంగముల్ విహంగమ్ములొగిన్ సిగన్" అనియుండుట లెస్స. శాఖామృగములు శాఖలయందే యుండుట

యుచితముకదా! ఇట్టివి పొరపాట్లు కావచ్చును. అట్టివి ద్వితీయముద్రణమున సవరింపఁబడవచ్చును. సహృదయులగు పాఠకులు

సిరుల నదృష్టమేఘములఁ
జెందినచంచల, లెవ్వ రాఁగనే
ర్తురు? నిరతప్రయాణముల
తో నసువుల్ నిలువంగఁబోవహో
నరవరులార! కావ్యసుధ
నవ్యయశోమయకాయముం బరి
స్ఫురణమునేయు సత్కవులఁ
బూజ్యుల నోజ్జలఁ గొల్వఁ డర్హులై.

అనుకవిప్రబోధము నాలించి కవిలోకమును కృతార్థముంజేయుదురుగాక!

తెలుఁగున నిట్టిగ్రంథములలో నిది మొదటిదని చెప్పవచ్చును. ఇట్టి యమూల్యగ్రంథము నాంధ్రలోకమున కర్పించిన శర్మగారుధన్యులు.

బులుసు వేంకటరమణయ్య

---

## అక్బరు సార్వభౌముఁడు

కృతికర్త: వెంపటి సత్యనారాయణగారు, బి.ఏ., బి.ఇడి., విశాఖపట్టణము.

క్రౌను సైజున ౧౨౩ పుటలు: వెల రు. ౦-౮-౦.

హిందూదేశమును బాలించిన మహమ్మదీయులలో నక్బరు కడు సమర్థుడు. అక్బరు వీరుడు, రాజనీతిని చక్కఁగ నెరిగినవాడును గనుక తన రాజ్యమందలి అన్ని మతములవారిని సంతోషపెట్టగలిగెను. 'ఒకనాఁ డొక మహమ్మదీయుఁ డొకతాయిని దీసికొనివచ్చి దానిపై మహమ్మదు పాదచిహ్న మున్న దని చెప్పెను. అక్బరునకు దానియందు విశ్వాసము లేకపోయినను మహమ్మదీయుల కానంద మొనగూర్చుట కాతఁ డా తాతిని మహా వైభవముతోఁ బూజింప నానతిచ్చెను. తాను స్వయముగఁ జని యాతాతిని గొంతదూరము మోసెను.' ఇట్లే యాతడు హిందువుల సంతోషపెట్టుటకు హిందువుల పెండ్లాడియు, ముఖమున బొట్టు పెట్టుకొనియు అనేకవిధముల ప్రజలమనముల నాకర్షించెను.

శత్రుశేష ముండినయెడల తనకు ముప్పు వాటిల్లునని రాజపుత్రుల నందరిని తన వశము చేసికొనెను. కాని రాణా ప్రతాపసింహుమాత్ర మాతనికి లోబడలేదు.

రాజ్యపాలన విషయమున పుత్రుడైనను తన్నెదిరించినవానిని కఠినముగ శిక్షించుచుండెను. 'ఉదారస్వభావుఁ డనియు, నీతిశాస్త్ర నిపుణుఁ డనియు, సత్ప్రవర్తకుఁ డనియు, మహాపురుషుఁ డనియు విఖ్యాతిఁగాంచిన యక్బరుసార్వభౌముడు—రాజకీయవ్యవహారములయం దెన్నియోపర్యాయములు' ద్రోహకార్యముల నాచరించుచుండెను. కాని అదంతయు ప్రజలక్షేమముకొరకే!

ఇట్టి అక్బరుసార్వభౌమునిచరిత్రమునకు వలయు విషయము సేకరించి సులభశైలితో వ్రాసిన సత్యనారాయణగా రభినందనీయులు. వీరి ఉద్యమము శ్లాఘనీయము.

ఈ గ్రంథము పాఠశాలయందు ప్రవేశపెట్టదగినది. మనదేశమును పాలించిన చక్రవర్తుల జీవితచరిత్రలు మనకే తెలియకుండుట శోచనీయము. అందును అక్బరునుబోలిన చక్రవర్తులవి.

'రాజు'

---

## విజయాశ్వచరిత్రము

కర్త: పురాణం పిచ్చయ్యకవి, నెల్లూరు.

ఇయ్యది పూర్వప్రబంధకవులమార్గము ననుసరించి వ్రాయబడిన యొక ప్రబంధము. అయినను చదువుట కింపుగానుండు నూతనవిషయములు పెక్కులు కల్పింపబడి క్రొత్తదారిని ద్రొక్కినది. ఎందో పురాణమునందు గలుగునని విన్నకథ యీరచన కాధారము. శ్రీపురము గాపురముగాగల విజయాశ్వధరణీపతి సత్యవ్రతుడు. పాండ్యదేశమునందలి కనకపురము రాజ

థానిగా గలిగిన శశిబిందునరపాలుని పుతురు యశోవతి యాలెనిసతి పతివ్రత. వీరిరువురి పుణ్యచరితంబులు నీ ప్రబంధమున గూర్చబడినవి. యశోవతీ విజయాఖ్యల పరిణయాదికవృత్తాంతమంతయు పూర్వభాగముగా, ఈ యిరువురి వ్రతపరిపాలనను, నారదునితోడున శ్రియఃపతి శ్రీమన్నారాయణుడు పరిపరివిధముల పరిశీలించుట యుత్తరభాగముగ నని యిది రెండుభాగములుగ వెలసినది. ఈ కథను జదివిన నేరికయినను మరి యొక కథ మనమున కింపుగ దోపక దీనినే మరిమరి చదువ మనసగును. పౌరాణికకథల కొండొంటికి కొన్నిట పోలికలు తప్పవనుట కిందలి సిద్ధునిచరితము తార్కాణ మగును.

శైలి మృదుమధురమై తీగలువారుచున్నది. ఎనుడు డిపములులేనిశయ్య. రచన సందర్భశుద్ధిగలిగి సలక్షణమయియున్నది. ప్రబంధంపుపోకడలన్నియు దీన నమరియున్నవి. పలునీతు లిందు తెసురీతుల సంగతి దప్పక పొందుపరుపబడినవి. సర్వలక్షణసంపన్నమైన దీనిని రచించి నేటిప్రమాణప్రబంధములకు మరియొకసంఖ్యను గూర్చి, తాను నొకప్రబంధకవి యయిన పిచ్చయ్యాకవి గారి నాంధ్రు లభినందింతురు. ఇట్టికవులు నేటికి నున్నారాయని ఆశ్చర్యానందములును, వీరి నజ్ఞాతవాసమున నుంచిన విచారమును పాఠకులయందు ముప్పిరిగొనగలవు. వీరింకను కొన్నిరచనలను గావించినట్లు తెలియుచున్నది. కాని యట్టిసూచనయేని యీగ్రంథమున గనుపించదు. తగినయాదరాభిమానములే లభించుచో నెన్నిటినేని రచింపగలుగుదురనుటకు వెనుదీయ నవసరము కానరాదు. దీనివెల రు. ౧-౪-౦

---

## పాశ్చాత్యభావప్రపంచము

రాజమహేంద్రవరమున వెలసిన ప్రాక్ప్రతీచీ గ్రంథమాలా ప్రథమపుష్పముగ నీగ్రంథము వెలువడినది. 'సర్వజన సామరస్యమునకు తోడ్పడు ప్రాచ్యపాశ్చాత్యదేశముల యుత్తమజ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తము చేయుట యీగ్రంథమాలవారి యుద్దేశము. 'ప్రాచ్యులును పాశ్చాత్యులును ఒకేమానవజాతికి చెందినవారు. సుఖదుఃఖములు, అనురాగాదిభావవిశేషములు వారికి సామాన్యములు. చిత్తవృత్తి, మానసికవికాసము, ఆధ్యాత్మికోన్మేషము వారిఏకత్వమును ప్రకటించుచున్నవి.' అట్టియెడ ప్రపంచమందలి మహనీయుల జీవితచరిత్రలు మనకు ఆదర్శప్రాయములు కాగలవు. ఒకప్రాచ్యపాశ్చాత్యదేశములవారే కాక ప్రపంచమందలి అన్నిదేశములకు జెందిన మహాత్ముల జీవితచరిత్రలు ప్రపంచమునకును, ఆంధ్రులకును ఉపయోగకరములు కాగలవు.

'పాశ్చాత్యభావప్రపంచము' న, పందొమ్మిదవ శతాబ్దమున యూరపు అమెరికాలలో జీవించియుండిన మహాపురుషుల కొందఱి జీవితముల సంగ్రహమును, వీరు ప్రపంచమున కందజేసిన మహోత్కృష్ట సందేశములును గలవు. కొంచెమించు మించుగ యిందుదహరింపబడిన మహనీయులందరును సమకాలికులు. వీరందరును జ్ఞానసముపార్జనకొరకు రేయుంబవళ్లు తప మొనరించిరి. లోకము నుద్ధరింప తమసర్వస్వ ముపయోగించిరి. వారు కనుగొనగలిగిన సత్యములను లోకమునకు వెల్లడించిరి. స్వార్థమునకు లొంగరైరి. విపులముగ వ్రాసినయెడల వీరలయొక్కొక్కరి జీవితచరిత్రమే గొప్పగ్రంథము కాగలదు. దుర్భర దారిద్ర్యము ననుభవించుచు తమ సత్యమార్గమును వీడక లోకసేవచేసిరి.

వీరందరిలోనను గెటిమహాశయుడు చాలగొప్పవాడని చెప్పవచ్చును. ఇంగ్లండునగల Minerva Press ఆతని గ్రంథముల నిరసించి, 'అవిగూడ వాఙ్మయమునం దుండవచ్చునులే' యనెను. కాని యితని యాధిక్యమును గుర్తించి యింగ్లండునకు తెలిపినవాడు కార్లయిలు. కార్లయిలున కీతనియందు గురుభావ ముండెను. గెటియొక్క జీవితచరిత్రననుసరించి వ్రాయుచు అతడు ప్రపంచమున కుపదేశించిన జ్ఞానమును విస్ఫుటము చేసెను.

ఇంగ్లీషు తెలియనివారి కీగ్రంథము చాలయుపయోగకరము. 'ఇయ్యది బి. ఏ. పరీక్షకు పఠనీయ

గ్రంథముగ (B. A. Part II, Detaild text) నిర్ణయింపబడుటయే దీని యాధిక్యమునకు నిదర్శనము.

'రాజు'

---

## శారద

శారద: సచిత్రమాసపత్రిక. సంపాదకుడు, ప్రకాశకుడు: ఎఱ్ఱాప్రగడసత్యనారాయణమూర్తిగారు, మదరాసు. మదరాసునందలి మధుకరవేణిముద్రాక్షరశాలయందు ముద్రితము. సంవత్సరపుచందా రు. ౧-౮-౦ లు. విడిసంచికవెల రు ౦-౨-౦ లు. శారదయొక్క మొదటి సంపుటం మొదటిసంచిక ౧౯౩౩ జులై నెలలో వెలువడినది.

'జన్మవృత్తాంతమున' నిలిచిపోయిన పత్రికలయు, ఇపుడు వర్ధిల్లుచున్న పత్రికలయు ప్రశంస గలదు. ఇపుడున్న యితర 'పత్రికల ననుకరించుటకు యిది వెలువడలేదు. నామమాత్రములగు చిల్లరపత్రికలను దూషించుటకు తిరుగాడ లేదు......ధన సంపాదనకు పూనుకొనుట లేదు. ఆంధ్ర విద్వాంసులయొక్కయు కవులయొక్కయు యభివృద్ధికై పాటుపడుటయే దీని ముఖ్యోద్దేశము' ఇట్టి ఆశయాదర్శములతో యీ "శారద" ఆంధ్రదేశమున తిరుగుటకు మొదలిడెను.

ఇందు కథలు, నాటికలు, పద్యములు గలవు. వానిలో కొన్ని సశేషములు. సమాజసంస్కారమను అనువాదమొకటి కలదు. దుర్గాబాయ్ కథయందు అల్లిక కొంతగలదు కాని పాత్రపోషణము ఉచితరీతిని లేదు. 'వినోదిని' యనునది యొకనాటిక. ఇందు స్త్రీస్వాతంత్ర్యమును గురించి వ్రాయవలయునను కుతూహలము చూపట్టుచున్నది. 'బందిఖానా' అనుకథయందు కథకుని కల్పనా నైపుణ్యము గననగును. ఇతర వ్యాసములును రచయితల నేర్పును, వారిసంస్కారమును విస్ఫుటము చేయుచున్నవి.

పత్రికా 'నిర్వహణము దుస్సాధ్యమనుసంగతి' తెలిసియు, ఈకార్యమునకు గడంగిన శ్రీ సూర్యనారాయణ మూర్తిగారికి 'ఆంధ్ర విద్వత్కవి సోదరులు' ప్రోత్సాహము నొసంగెదరుగాత!

'రాజు'

---

## భాగవతావతరణము

రాయలు ౧౬ సైజు ౮౦ పుటలు. గ్రంథకర్త నోరినరసింహశాస్త్రిగారు, సాహితీసమితి, గుంటూరు. ఇదియొక చిన్న పద్యకావ్యనాటిక. ఋగ్యజుస్సామాథర్వణ వేదములను వ్యాసమహర్షినుండి పొందిన పైల వైశంపాయన జైమినిసుమంతులును, సకలపురాణములను పొందిన రోమహర్షణుడును తమలో తా మెవరెక్కువయని వివాదపడుదురు. ఒకేధర్మమును నిష్పక్షపాతముగ నీరేపుర శేమువిషముల నుపదేశించినవ్యాసులవారికి వీరికి జరిగిన వాద మచ్చెరువుగొలుపును. అతను పరమేశ్వరుని ధ్యానింప నారదుడు ప్రత్యక్షమగును. తా నుపదేశించినయొకేధర్మము తననలువురు శిష్యులలోను వివాదకారణమైనందుకు తానుచేసినలోప మెట్టిదో వివరింపుమని వ్యాసులు నారదుని ప్రార్థించును. ఈనాలుగు వేదములకును సమన్వయముగూర్చు భగవద్భక్తి లేకున్నచో శుష్కవ్యాఖ్యానములు వివాదకారణములగుటలో నచ్చెరువు లేదనియు, ఈశ్వరగుణసంస్తవ మొనరించినచో ఈవివాద మంతరించుననియు, ఈ మహత్కార్యమునకు వాణీదేవి యతని కశేషసహాయ మొనరించుననియు నారదుడు చెప్పును. గంగాస్రోతస్సువలె వాణి యతనిజిహ్వాగ్రమునుండి వెల్లివిరియును. దానిని భరింపగలశుకయోగికూడ యెట్టయెదురై భరించి భక్తిరసమరందమత్తతతో మైమరచి నృత్యము చేయును. శిష్యులు తమవివాదములు మరచి భగవత్సంకీర్తనములతో నాట్యములు సల్పుదురు. భక్తిలేనిజ్ఞానము పరస్పర వివాదములకు మూలమనియు, భగవద్భక్తిజ్ఞానాజ్ఞానజనిత సమస్తభేదసంహారకమనియు, అట్టిభక్తిని కీర్తించి వ్యాసులు ప్రాపంచికశాంతికిని, మానవకోటిముక్తికిని మార్గము నేర్పరిచెననియు గ్రంథముయొక్క సందేశము. ధర్మమున కెన్ని వ్యాఖ్యానములు చేసినను భగవత్సం

కీర్తన రూపమున భాగవతము వ్రాయనిదే ధర్మోప దేశము పూర్తికాక, భాగవతముయొక్క అవతరణమున కావశ్యకత యేర్పడె, అది అవతరించి ధర్మసమన్వయ మును ఆత్మతృప్తినిగూర్చినవిధానము నతిసుందరముగ, మధురముగ, వర్ణించినశాస్త్రులుగారికల్పన మెంతయు ధన్యము.

గ. స.

---

## అద్వైతచంద్రిక

డెమ్మీసైజు ౧౩౪ పుటలు, వెల రు ౧-౦-౦ గ్రంథకర్త: శ్రేష్ఠలూరు కృష్ణస్వామయ్యగారు. తిరుపతి శ్రీస్మార్తమండలివారిచే ప్రకటింపబడినది. శ్రీకంచి కామకోటి పీఠాధిపతులు శంకరాచార్యులవారికి కృతి యీయబడినది. శ్రుతిస్మృతిపురాణములలోని వాక్య ములు, శ్లోకములు నాధారముగా అద్వైతేతరమతముల నెల్ల ఖండించి అద్వైతసిద్ధాంతము నిస్సంశయముగ విశదపరచు రెండుప్రకటనముల గ్రంథము. వేదాంతజిజ్ఞా సాపరులు నగువారిపాలిటి కల్పతరువు. సంస్కృత వాక్యములు తెలుగుతాత్పర్యములతోగూడి సాధారణు లకుగూడ సులభముగ బోధపడగలదు.

గ. స.

---

## అభిజ్ఞాన శాకుంతలము

మహాకవి కాళిదాసు రచించినగీర్వాణమాతృక నాధారముచేసికొని కవిరాజశ్రీరాజావత్సవాయి వేంకట నీలాద్రిరాజుగారీగ్రంథమును రచించియున్నారు. ఇది వఱకే అనేకులగు నాంధ్రపండితకవులు కాళిదాసుని నాటకమునకుఁ దెలుఁగుచేఁత లొనర్చియున్నారు. కాని యింతవఱకుఁ గలతెలిఁగింపులు కేవలభాషాంతరీ కరణ ములేయనియు, నిందు కవిరాజుగారు రసానుగుణముగ స్వతంత్రరీతుల నవలంబించి గ్రంథమునకుఁ గొంత వన్నె తెచ్చియున్నారనియు గ్రంథాంతరవైలక్షణ్యమును, దీనికిఁ బీఠికను వ్రాసిన శ్రీబండారు తమ్మయ్యగారు బాగుగ వివరించియున్నారు. అట్లే యిందుఁ గొన్నిస్వతంత్ర రచనములు రసోచితములై కవిరాజుగారిప్రతిభను విశ దముచేయుచున్నవి. సులలితము సలక్షణము నగు శ్రీ నీలాద్రిరాజుగారికవితామృతము సహృదయపేయమగుట నిస్సంశయము. కాన నీయాంధ్రీకృతి పాఠకలోకమునకు బహూపకారక మగుచున్నది.

శ్రీ కవిరాజుగారు సహజపాండితీవిలసితు లగు టచే నీగ్రంథము నాటకమయ్యును కొన్నిప్రబంధపుఁ బోకడలును, ప్రౌఢరీతులును ఇందుఁ గానవచ్చుచున్నవి. ప్రబంధరీతి ననుసరించి యైదంకములవఱకును, అంకాంత మున, కవిబిరుదములను, అంకపరిసమాప్తిని నిరూ పించుపద్యములు కలవు.

ఇంతకంటెఁ గొంత సులభశైలి నీనాటకము రచింపఁబడిన మిగులరమణీయముగ నుండును.

శ్రీకవిరాజుగారియాంధ్రీకరణము చాలజాగ్ర త్తగఁ జేయఁబడియున్నను గొన్నియెడల నంతయుత్తమ ముగ నున్నట్లు తోఁచుటలేదు.

1 అం. పుట 2. పం. 19. ఓహో ! రాజా ! ఇది యాశ్రమమృగ మాశ్రమమృగ మహన్తవ్య మహంతవ్య ము" అని తెనిఁగింపు. "ఆశ్రమమృగోఽయం నహన్త వ్యో నహన్తవ్యః" అనిమూలము.

లేఁడినిజంప దుష్యంతుడు సంసిద్ధుఁడైయున్న పుడు సంభ్రమమున ఋషులుపల్కు నీమాటలలో "నహన్తవ్యః" అనుదానికి ద్విరుక్తి యుచితము. సంభ్ర మమున ద్విరుక్తి కలుగును. ఆశ్రమమృగమునకు ద్విరు క్తి యనవసరము. కావుననే మూలమునఁ గానరాదు. మఱియు నిచటి నఞ్ పదము ప్రసజ్య ప్రతిషేధమగుటఁ గ్రియతోనే యన్వయించును. కావునఁ బర్యుదాస నా శ్రయించి "అహంతవ్య" మనియాంధ్రీకరించుట సర సము కాదు. ఇచట "చంపవలదు" అనుక్రియయే విధే యము. కాన "ఇది యాశ్రమమృగము: దీనిం జం పకుము, చంపకుము" అనురీతినుండుట లెస్స.

పుట 5. పం. 13 "ఆశ్రమంబు లవ్యాజవేష ప్రవేష్టవ్యంబులు" అనియాంధ్రము. "వినీతవేషేణ ప్రవేష్టవ్యాని తపోవనాని నామ". అని మూలము.

ఇచట వినీతపదమున కవ్యాజమనునది ప్రతిపదము కాదు. రాజునకు రాజవేష మవ్యాజమే యగును. కావున నిచట "ఆశ్రమములు వినీతవేష ప్రవేష్టవ్యములు" అనియే యుండవలెను. వినీతము = నమ్రము, అవ్యాజము = కపటముకానిది.

పుట 15. పం. 24. "సన్నిహితతాపసోత్తములారా! యాశ్రమమృగంబుల రక్షించుకొనుఁడు." అని తెలుఁగు, "భోభో స్తపస్వినః, సన్నిహితా స్తపోవనసత్త్వరక్షాయై భవత" అని మూలము. ఇచట నాశ్రమజంతురక్షకై సన్నిహితులు కండు అని యుండవలెను. కాన సన్నిహితపదము తపస్వివిశేషణము కాదు.

2 అం. పుట. 21 పం. 3. "లడ్డుండలు బజాయించుటలోనా? అట్లయిన నేనిప్పుడే క్షణము పుచ్చుకొన్నాను" అని తెనుఁగు. "కిం మోదకభక్షణే! తత్ప్రీతి గృహీతోఽయం క్షణః" అని మూలము. సమమైనయాంధ్రీకరణమున నిట్టిరీతి తెలిఁగింపు బాగుండదు. రసోచితముగ స్వేచ్ఛాంధ్రీకృతి నొనర్చునపుడు మక్కికిమక్కిగాఁ బ్రత్యయములను మార్చి వ్రాయుట రసానుగుణము కాఁజాలదు. "లడ్డుండలు తినుటయందా! ఆపనికైనచో ఈక్షణమందే సిద్ధము" అని యుండిన బాగుండెడిదేమో!

పుట 28. పం. 3 "నేఁటితో మాత్రిరాత్రోపవాసము పూర్తియగును. రేపు నాల్గవనాఁడు వ్రతోద్యాపనానంతరము చిరంజీవితోఁ బంక్తిఁగూర్చుండి పారణసేయ సంకల్పించినాము" అని తెలుఁగు. "ఆగామినిచతుర్థదివసే ప్రవృత్తపారణో మ ఉపవాసో భవిష్యతి. తస్మిన్ దివసే దీర్ఘాయుషా వశ్యం సన్నిహితేన భవితవ్యమ్" అని మూలము.

మీఁది యాంధ్రీకృతి మూలమునకు సరిపడఁజాలదు. రాఁబోవునాలవదిన మనఁగా రేపని యర్థమెట్లగును? అట్టి యభిప్రాయ మున్నచో "తస్మిన్ దివసే" అనిచూపఁ జెప్పుట మాని కవి "శ్వోఽవశ్యం దీర్ఘాయుషా" అనియే చెప్పియుండును. శ్రీతమ్మయ్యగారు సరియగునాంధ్రీకరణము లనుపపన్నములనియూ, శ్రీకవిరాజుగారి తెలిఁగింపే యుచితమనియుఁ టీకలో వివరించియున్నారు. కాని యది సరిపడదు. వారు చెప్పినట్లు ఋషులయష్టిపూర్ణిమాసమై రాజమాత నోచిన సావిత్రీవ్రతము పౌర్ణమితోఁ బూర్తినొందె, రెండు నేక కాలావస్థితములయి వ్యవధానశూన్యము లనుటకు వీలు లేదు. ఈరెండుకార్యములకును నడుమ వ్యవధానమే యున్నచో, నొకదానిపిదప నింకొకదానిని నెరవేర్పనవకాశ ముండుననియు, నపుడు రాజు తనమిత్రుని రాజధానికిఁ బంపుట అనవసరమనియు, శ్రీతమ్మయ్యగారి యభిప్రాయము. ఋషికుమారులు కొన్నిరాత్రులు సారథిద్వితీయముగ రాజు నుండఁగోరిరి కాని యొక్కరోజే యుండవలెనని యాచింపలేదు. కావున వ్యవధానమున్నను రాజాశ్రమమును వీడ వీలులేదు. సావిత్రీ వ్రతము జ్యేష్ఠశుద్ధద్వాదశిదినమునఁగాక చతుర్దశియం దారంభింపఁబడునట్లు పంచాంగములవలనఁ దెలియుచున్నది.

4 అం. 46 పు 20 పం. అపటీక్షేపముతో ప్రవేశించి" అని తెలుఁగు. "అపటీక్షేపేణ ప్రవిశ్య" అని మూలము.

47 పు. 3 పం. "మేలుకొన్నప్పటికి నే నేమి చేయఁగలను?"

అని తెనుఁగు. "ప్రబుద్ధాపి కి మహం కరిష్యే" అని మూలము. శకుంతలయెడ రా జన్యాయముచేయుట యెఱిఁగినను నే నేమిచేయఁగలను? అనిచెప్పుట ప్రస్తుతముకాని మేలుకొనుట కాదు.

52 పు. 6 పం. "ఇటు ఇటు భవతీ శకుంతలా!" అని తెల్గు. మఱిమూలమో, "ఇత ఇతో భవతీ" అనియే.

55. పు 3 పం. తెలుఁగు "భగవంతుఁడా!" మూలము 'భగవన్'.

56. పు. 2 పం. తెలుఁగు: వత్సా! శకుంతలా! మూ. వత్సే శకుంతలే!

ర్గా-శి

6 అం. 90 పు. 6 పం. "జనపనారపేచువలె వ్రేలాడుగడ్డాలతో చిత్తరువంతా......" గడ్డాలు కాదు. గడ్డాలు గల ఋషులు. మూలమున "లంబ కూర్చానాం తాపసానా" మని కలదు.

91 పు. 15-16 పంక్తులు. "ఏమీ! ఇది చిత్తరువా!" అనిరాజు పల్కుమాటయున్నఁగాని సమన్వయము కుదురదు. మఱియు నచటఁ గొంతగ్రంథ పాతము కలదు.

97 పు. 23 పం. "వారు భవత్సుఖండయిన వజ్రి కవధ్యులు" అని తెలుఁగు. "సఖ్యు స్తే సకిల శత క్రతో రజయ్యా" అని మూలము. అవధ్యులు = చంపఁదగనివారు. అజయ్యులు = చంపశక్యము కాని వారు. కాన "వజ్రి కజయ్యుల" నుట లెస్స.

7 అం. 104 పు. 9 పం. "అవతరింపవచ్చును" తె. దిగవచ్చుననుట లెస్స.

104 పు. 3 పం. "నమ స్తే కష్ట తపసే" అని కవిరాజుగారు.

"నమ స్తస్మై—" అని మూలము. కాశ్యపుని యెదుట పడినపుడుగదా మధ్యమపురుషప్రయోగ ముచితమగును!

111 పు. 17 పం. "(రాజు శకుంతలవందన మందికొని) వీరప్రసవా భూయాః" అనును. ఇది మూలమున మృగ్యము. శకుంతల యీవరకే వీరప్రసవిని యైనదే; కవిగారి యీయాశీర్వచనకల్పనమున కభిప్రాయమేమో!

స్వతంత్రగ్రంథములను రచించుటకంటె భాషాంతరీకరణ మొనర్చుట చాలకష్టమైనపని. కావున శ్రీకవిరాజుగారిగ్రంథమున నిట్టిలోట్లుండుట వింతకాదు. శ్లోకముల నాంధ్రీకరించుపట్ల వారు మిగులశ్రద్ధ పూని యుండుట, వచనమునఁగూడ నట్టిశ్రద్ధ మాపిన మిగుల రమణీయముగ నుండెడిది. అది ద్వితీయముద్రణమునఁ జక్కఁపడఁగలదని యనుకొనుచున్నాను.

మొత్తముమీఁద శ్రీ నీలాద్రిరాజుగారి యీ శాకుంతలము [అంకాంతపద్యములలో "శకుంతలన్" అనివారు చెప్పినారు కాని "శాకుంతలమునన్" అని యుండవలెను.] రమణీయ నాటకమగుటచేఁ బాఠకలోకము దానికి స్వాగత మొసఁగి కవిరాజుగారి ప్రయత్నమును సఫలము చేయుఁగాక.

బులుసు వేంకటరమణయ్య

---

## ఆత్మచరిత్ర

గ్రంథకర్త: రాయసం వెంకటశివుఁడుగారు, యం. ఏ., యల్. టి.; మదరాసు ఆంధ్ర గ్రంథమాలయందు ఇరువదిరెండవ కుసుమముగ బ్రకటింపబడినది.

వాఙ్మయమందు ఆత్మచరిత్రలకు ప్రాధాన్యమవసరము. మనదేశవాఙ్మయమందు ఆత్మచరిత్ర లనేకములు లేవు. ఆత్మచరిత్రల వ్రాసికొనుట ఆత్మస్తుతి కాజాలదు. ఆత్మచరిత్రలయం దాత్మస్తుతికి స్థానము లేదు. "స్వీయచరిత్ర కథన మాత్మోద్ధరణమునకువలె పరోద్ధరణమునకును" వినియోగపడుచున్నది. 'చేసిన తప్పుల చెప్పిన పోవు' నన్నట్లు తమ లోటుపాటుల నుత్తరించుటవలన ఆత్మోద్ధరణ కవకాశము కలుగుచున్నది. 'ప్రపంచమునందు కులీనులు, శ్రీమంతులు, బలవంతులు, పండితులు, వీరులు, శాస్త్రజ్ఞులు, మతాచార్యులు' మాత్రమె 'స్వీయచరిత్రకథనమున కధికారులుగ పరిగణింపబడుచున్నారు.' కాని విశ్వమందలి ప్రతి యణువునుండియు మనము నేర్చుకొనవలసిన విషయము లున్నవి. అందువలన పైనుదహరింపఁబడిన వారి జీవితములే కాక అందరిజీవితములును లోకమున కుపకరింపగలవు. ప్రతివస్తువును ఏదోయొకవిధమున ఆదర్శనీయమైనదిగ స్ఫురించుచున్నది. మహనీయుల జీవితచరిత్రములు సామాన్యుల కాదర్శనీయములు. రామాయణమన్న ప్రాయికముగ రాముని కథయె. పురుషోత్తముడు కావున ఆతనిచరిత్ర మానవుల కందరికి ఆదర్శనీయమై విరాజిల్లుచున్నది.

'గ్రంథకర్త యేపుస్తకము వ్రాసినను యాత్మచరిత్రము వ్రాయుచున్న ననియొక సుప్రసిద్ధరచయిత నుడివెను.' గ్రంథకర్తయొక్క యావజ్జీవితాంశముల నా గ్రంథములు ప్రతిబింబించకపోయినను మానసికాధ్యాత్మిక విషయములందు మాత్ర మని గ్రంథకర్తయొక్క మతమును, మనోనిశ్చయములను చాటుచున్నవి. అందరు గ్రంథకర్తలయెడ మాత్ర మీన్యాయము చెల్లదు.

ఆత్మచరిత్రల కుపయోగము లనేకములు గలవు. ఆత్మచరిత్రరచయిత జీవితమందలి విశేషముల నెరిగి అందలి యుత్కృష్టతఁ గొని మన పద్ధతుల మార్చుకొనుట యొకటి. ఆయాదేశకాల పరిస్థితుల ననుసరించియు, దేశచరిత్రననుసరించియు, ఆకాలమున దేశమున వర్ధిల్లుచుండిన ఉద్యమముల గురించియు ఆత్మచరిత్రల మూలమున మన కెంతయేని తెలియగలదు. రాయసం వెంకటశివుడుగారి ఆత్మచరిత్రయు ఈకాలముననను ముందుకాలమునను పైచెప్పినరీతిని ఉపయోగపడగలదు.

రాయసం వెంకటశివుఁడుగారు తమ ౬౩-వ సంవత్సరమున ఆత్మచరిత్రను వ్రాసిరి. వారు ఎక్కువ కాలము విద్యాబోధన, విద్యాదానముల జేసిరి. మన దేశమున నేటి విద్యావిధాన మెట్లుండునదియు, యెట్లుండవలసినదియు, ఎట్టి సంస్కారము బొందిన దేశాభ్యుదయముగలుగునదియు, సూచింప వారుసమర్థులు. వీరు ఇంచుమించు తూర్పు సముద్రతీరమందలి ఆంధ్ర జిల్లా లన్నింటియందును ఉపాధ్యాయపదవియం దుండిరి. ఇందుమూలమున వీరు అనేకవిధము లగు మనఃప్రవృత్తులు గల్గ యువకుల నెరిగియుండగలరు. ఇట్టి వీరివంటి అనుభవశాలుల ఆత్మచరిత్రలో దేశీయయువకుల మానసికప్రవృత్తులకు తగునట్లు విద్యావిషయికములయిన సూచనలు కూడ ఉండినయెడల నీగ్రంథము అధికతర ప్రయోజనకారియైయుండును.

మనదేశమున ఆదర్శప్రాయులగు పురుషు లనేకులు గలరు. వారి జీవితచరిత్రలు సామాన్యుల కనేకవిధముల నుపయోగపడగలవు. వారుకూడ ఆత్మచరిత్రలవ్రాసి లోకోపకారము చేయుదురుగాక!

'రాజు'

---

## సముద్రమథనము

శ్రీమతి చిల్కపాటి సీతాంబాప్రణీతము.

నెల్లూర నెలయు శ్రీవాగ్వల్లీ గ్రంథమాలాష్టమ కుసుమముగ శ్రీమాన్ కొమాండూరు వెంకటరామానుజాచార్యులచే ప్రకటితము. వెల రు ౦-౧౪-౦.

'......మృదుమధుర పద్యరచనా విభూతిఁ "రుక్మిణీపరిణయం" బను నుత్తమకావ్యంబు విరచించి సరసు లగు రసికవరుల నలరించిన శ్రీమతి చిల్కపాటి సీతాంబగారిని దృశ్యప్రబంధ మొండు రచింపఁగోరిన పెక్కండ్రు నాటకాభిమానుల యభిమతం బీడేర్ప "సముద్రమథనం" బను "విష్ణుమాయావిలాస నాటకము" ప్రదర్శనోపయోగంబుగ లలితపదభూయిష్ఠంబై విరాజిల్లఁ గృతి నొనరించి మా వాగ్వల్లికిం దొడవుగ నర్పించినందులకు గృతజ్ఞుల' మని అవతారికయందు గలదు.

బలిచక్రవర్తిచే నోడింపబడిన యింద్రుడు విష్ణుప్రేరితుఁడై దానవుల సముద్రమథనమున కాహ్వానించుటయు, సముద్రమథనకాలమున జనించిన హాలాహలమును శివుడు మ్రింగి లోకముల రక్షించుటయు, విష్ణువు మోహినిరూపమున సురలకు అమృతమును పంచి యిచ్చుటయు ఇందలి కథాపూర్వభాగము. ఉత్తర భాగమున, శివుడు మోహినిని వెన్నాడుటయు, తత్పర్యవసానమును గలదు.

నాటకమున నివిరెండును ప్రత్యేకవిధమున ఒకదాని కొకటి యతకక యున్నవి. 'సముద్రమథనము'నకును, శివకేశవుల కథకును పొందిక యేర్పడునట్టుల లేదు. విష్ణు మాయావిలాసము లనేకములు గలవు. అందు సముద్రమథన మొకటి; హరిహరుల ప్రణయనాటకము మరియొకటి.

నాటకమందు Unity of action అనునది ఆవశ్యకము. అటులుండ, మోహినియవతారమునకుఁ బ్రసక్తి అమృతమును పంచిపెట్టుటతో ముగియగా 'గిరీశుని యహంకారంబుఁ బాపుసెపంబున నారదుని మనోరథంబును దీర్చుట' కయి మరల యీయవతారము నెత్తుటచే కథయంతయు మారుచున్నది. ఇట్లే నాటకమున ఐక్యత సుదురదు.

నాటకము వ్రాయుటకు వలసిన సాహిత్యము మల వరచుకొనిన యీ గ్రంథకర్తి కడుంగడు ప్రశంస నీయురాలు. కవిత్వము సరళముగను, మనోహరముగను ఉన్నది.

'రాజు'

---

BANKS THE MONEY MARKET

గ్రంథకర్త: బి. రామచంద్రరావుగారు, యం. యే., పిహెచ్. డీ., యల్. టి., యఫ్. ఆర్. ఇ. యస్. (లండను) కలకత్తావిశ్వవిద్యాలయమున ఆర్థిక వ్యాపార విద్యాశాఖోపన్యాసకులు. డెమ్మీ సైజున ౨౫౭ పేజీలు. వెల రు. ౨-౦-౦.

ఈ గ్రంథము గ్రంథకర్త Institute of Bankers వారి పక్షమున నొసంగిన నాలుగుపన్యాసముల సంచిక. గ్రంథకర్తగారు మారదేశమున కలకత్తా నగరమున నేగి యార్థికవిషయములందు ప్రావీణ్యము బడసి కొన్నిగ్రంథముల వ్రాసియున్నారు. ఈగ్రంథమున నితరగ్రంథములవలెనే భారతదేశపు టార్థిక విషయములు, బ్యాంకులు మొదలగువిషయములు విమర్శింపబడినవి. బ్యాంకింగు పద్ధతులు ప్రపంచమునందితరదేశములం దేవిధముగ నున్నవియో చక్కగ వ్రాయబడియున్నది. మనదేశమునను ప్రైవేటుబ్యాంకుల స్థితిగతుల వెల్లడిచేసిరి. బ్యాంకుల సంస్కరించుటకు కొన్ని సూచనలును గలవు. రిజర్వుబ్యాంకు ఫెడరలు బ్యాంకు మొదలగు సంస్థల ప్రయోజనమును తెలియజేసిరి.

ఆర్థికముగ మనదేశము కడుహీనదశయందున్నది. ప్రభుత్వమువారి యనుమతిని కమీషనులు బయలుదేరి యావిషయమై దేశస్థితుల చక్కగ బరిశీలించి నివేదికల ప్రభుత్వమువారి కందచేసియున్నారు. ఈనివేదికల విలువను, వీనియందు చేయబడిన సిఫార్సులను అమలునకు దెచ్చినయెడల ఎట్లు దేశస్థితి మారునదియు గ్రంథమున విపులముగ విమర్శించిరి.

గ్రంథమున పారిభాషిక పదప్రయోగ ముండుట వలన అర్థశాస్త్రమందు ప్రవేశము లేనివారికి సులభముగ నర్థము గాకపోవచ్చును. కాని సమాలోచనా దృష్టితో దేశకాలపరిస్థితులను గమనించియు ప్రమాణగ్రంథముల ననేకముల శోధించియు వ్రాయబడిన గ్రంథముకావున నిది అర్థశాస్త్రాధ్యయనము చేయువారి కుపయోగపడ గలదు.

'రాజు'

---

# గ్రంథస్వీకారము

## రాయబారము

(మొదటిసంపుటము) గ్రంథకర్త: దేవరాజు వేంకటకృష్ణారావుగారు, బరంపురం, గంజాం జిల్లా. డెమ్మీ సైజున ౧౫౭ పుటలు, వెల రు. ౧-౦-౦.

---

## ధ్యానము

గ్రంథకర్త: నిమిషకవివెంకయ్యగారు, మోడేకుర్రు, గ్రంథము ఉచితముగ దొరకును. డెమ్మీసైజున ౨౩ పుటలు.

---

## మాహేశ్వరసూత్రములు

నందికేశ్వరవిరచితములు

గ్రంథము, నిరంజనానందస్వామిచే ప్రకటితము. రమణాశ్రమము, తిరువణ్ణామలై. క్రౌనుసైజున ౧౪౩ పుటలు; వెల రు. ౦-౮-౦.

---

## అధినివేశస్వరాజ్యము

గ్రంథకర్తలు: దిగవల్లి వేంకటశివరావుగారు. గొసపల్లి వేంకటప్పయ్యగారు, బెజవాడ. క్రౌనుసైజు న ౨౩౬౨ పుటలు. వెల రు. ౦-౧౨-౦

---

## శ్రీమద్భగవద్గీత

(యక్షగానము) (ద్వితీయముద్రణము)

గ్రంథకర్త: శ్రీ తూముసీతారామదాసుగారు, భారతశక్తినిలయము, వీరభద్రపురము, రాజమహేంద్రవరము, వెల రు ౦-౬-౦

---



శివాలయము
(సారనాథము)



మూలగంధకుటీ విహారమునందలి
బుద్ధ విగ్రహము
(సారనాథము)



ధామేఖస్తూపము
(సారనాథము)

—సి. జగన్నాథదాసు.

---

# పునర్విమర్శనము

## 'ఉచ్చారణసంజ్ఞలకు' జవాబు

పేకుమళ్ల కామేశ్వరరావు

౧౯౩౩-వ సం. మేనెలభారతిలో 'ఉచ్చారణ-విభేదపుగుర్తులు' అనువ్యాసం ప్రకటించేను. ఆవ్యాసం జూన్ నెల భారతిలోని మనవిమాటలలో 'ఉచ్చారణ సంజ్ఞలు' అన్న శీర్షికతో (పుట ౧౦౦౬) భారతీ సంపాదకులచేత విమర్శించబడింది. ఈ విమర్శకు జవాబు అవసరమనితోచి యీ జవాబు రాస్తున్నాను:

౧. నేను నావ్యాసంలో ఉచ్చారణవిభేదాన్ని తెలపడానికి అక్షరాలపైనో కిందో ఒక్కొక్కరొక్కొక్క మాదిరి గుర్తును వరసతీరులేక పెడుతున్నారనిచెప్పి వాటినన్నిటినీ తీసివేసి శాస్త్రీయంగా వుండడానికని ఒకగుర్తును యేర్పరిచేను. దానిని విమర్శకులు "ఈగుర్తుకూడ 'ఒక్కొక్కరొక్కొక్క మాదిరిగా వరసతీరులేక పెడుతూన్న' గుర్తుల సంఖ్యను అధికము చేయును......" అని విమర్శించేరు. ఇలాగు యెప్పటికయినా అవుతుందా? అనేకరకాల గుర్తులు తీసివేసి ఒకేగుర్తును యేర్పరచడం గుర్తులసంఖ్యను యెక్కువ చెయ్యడ మవుతుందా?

౨. చదువుకున్నవాళ్లే కొన్నికొన్నిమాటల్ని తప్పుగా వుచ్చరిస్తున్నారని విమర్శకులు చెప్పి కొన్నిమాటల్ని వుదహరించేరు. అవేవంటే-భాగవతముఅనేది బాహవతము, బాఘవతము, బాగవతము అనీ, బ్రాహ్మణుడు అనేది భ్రామ్మడు బ్రామ్మడు అనీ మొదలైనవి. ఈవుదాహరణలిచ్చి 'ఉచ్చారణకు సరిపోవుసంజ్ఞలు అక్షరములు- లేకయావారిట్లుచ్చరించుచున్నారు? ... అభ్యాసములేక, నోటికి శ్రమనీయనిష్టము లేక' అని విమర్శకులన్నారు. భాగవతాన్ని యెన్నిమోస్తరులుగా వుచ్చరిస్తూన్నా అసలుస్వరూపం భాగవతమనే అంటున్నాము. అంతేకాని వారివారి తప్పువుచ్చారణ లే అసలురూపాలనడం లేదు. అదేమోస్తరుగా అనేకమంది అభ్యాసంలేక, నోటికిశ్రమనీయ నిష్టంలేక కొన్నివిదేశభాషాపదాల్ని తప్పుగావుచ్చరించి, ఉచ్చరించినట్లే తప్పుగా రాస్తున్నారు. అది సవరించి అసలురూపం రాసేపద్ధతి నేనుచెప్పేను. కనుక దీంట్లో విమర్శకులకీ నాకూ వివాదముండవలసిన అవసరం లేదు.

౩. నేను చెప్పిన విదేశభాషాపదాలు క్రమేపీ తెలుగులో కుదురుకుపోతాయనీ, కొన్నిటిని సమానపదాలు మనం యేర్పరుచుకోవాలనీ విమర్శకులు రాసేరు. ఇలాగు కుదురుకుపోడానికీ, సమానపదాలు యేర్పరుచుకోడానికీ వీలులేనిభూగోళశాస్త్రం, విదేశచరిత్రలలోని పదాలను గురించికూడా నేను నావ్యాసంలో చెప్పేను.

౪. "Bank, Mail పదములయందలి a, ai, వుచ్చారణలేకదా ఆంధ్రలిపిని వ్రాయసాధ్యము కాకుండునవి! అచ్చుల యుచ్చారణములు హల్లుల యచ్చారణము లెట్లుకాగలవు? ఒకభాషలోని అచ్చు లింకొకభాషయందు హల్లులగునని యేభాషాతత్త్వవేత్తయు, ఏశబ్దానుశాసనుడును పేర్కొనినట్లుగానరాదు," అని విమర్శకులు విమర్శించేరు. దీనికి సమాధానమేమిటంటే Bank, Mail అనేమాటలలో వుండే a, ai లను గురించి నేను నాసిద్ధాంతం చెప్పలేదు. ఆమాటల మొదటవున్న హల్లుల్నిగురించి నేను నాసిద్ధాంతం చెప్పేను. అంచేత విమర్శకుల విమర్శ సరికాదని నా అభిప్రాయం. ఇంక రెండోసంగతి- ఒకభాషలో అచ్చులు మరొకభాషలో హల్లులవుతాయా అన్న సంగతిని గురించి ఇంగ్లీషులో w, y అనుఅక్షరాలు ఒక్కొక్కప్పుడు అచ్చు లవుతూవుంటాయి. కాని అవియెన్నటికైనా మనభాషల్లో అచ్చులవుతాయా?

౫. "'అచ్చుమీద అచ్చుకలియడం అసందర్భ' మని ఏ ఐ ఓ ఔల ఉచ్చారణతత్త్వమును తెలిసినవారనసాహసింపరు" అని విమర్శకులురాసేరు. గుణసంధి, వృద్ధిసంధులలో కొంతభాగాన్నిగురించి నా అభిప్రాయం చెప్తున్నాను. రమేశుడు, సూర్యోదయము, కరుణైకనిలయుడు, గంగౌఘము మొదలైనమాటలలో సామాన్యంగా అందరూ అచ్చుమీద అచ్చు కలిసిందంటున్నారు. కాని యిది శాస్త్రీయంకాదని నా అభిప్రాయం. అచ్చు హల్లువంటిదికాదు, ప్రత్యేకంగా ప్రాణం లేకపోవడానికి అచ్చులకి ప్రత్యేకవ్యక్తిత్వముంది. రెండుఅక్షరాలు కలిసేయన్నప్పుడు ఆరెండింటియొక్క గుణంకాని, ఆరెండిటిలో యేదో ఒకదాని గుణంకాని వుండాలి. ఆలాసుగాక ఆరెండిటికంటె కొత్తమాదిరి దొకటివస్తే అది కలియడమెలాగవుతుంది. ఇది రసాయనశాస్త్రమా యేమిటి! కనుక ఆసంధిపదాల్లోవున్న అక్షరాలుగాక కొత్తఅక్షరం వొకటి వచ్చినప్పుడు అది కలయికఅనకూడదు ఉదా:— రమా + ఈశుడు రమేశుడు, కరుణా + ఏకనిలయుడు= కరుణైకనిలయుడు. పై ఉదాహరణలలో ఈమార్పెందుకు వచ్చేయంటే ఆయామాటల్ని కలిపి వుచ్చరించేటప్పుడు పలుకుబడిలో వ్యవధాన మేమాత్రం లేకుండా వుండాలంటే ఆరూపాలే వుండాలి. అంచేత. అంతేగాని ఆయాఅచ్చులు కలిసి ఆకొత్తఅచ్చులు యేర్పడాయనకూడదు. 'ఏ' ని విభజిస్తే 'అ + ఇ' కాని 'ఔ' ను విభజిస్తే 'అ + ఓ' గానిరావు. అ, ఇ, ఓలు ఎంతప్రాతిపదికాలో ఏ, ఔలుకూడా అంత ప్రాతిపదికాలే. కనుక అచ్చులు కలియవన్నాను.

౬. "Furlong, Pharmacy మొ. పదముల యందలి మొదటి వర్ణముల యుచ్చారణమును దెలుపుటకు వ క్రింద నొక చుక్క పెట్టవలయునన్నారు" అని విమర్శకులన్నారు. దీనిలో వారికికలిగిన సందేహమేమిటో నాకు బోధపడడం లేదు.

౭. "వచ్చాము, నవ్వారు, కావాలా, తాటాకు, విడాకులు మొదలుపదములలోని చ్చా, వ్వా, వా, టా, డా మొదలుగువర్ణముల నంటియున్న అచ్చును వ్యావహారికముగా నుచ్చరించునపుడగు ధ్వనిని దెలుపుటకును వానిమీద రెండుచుక్క లుంచవలెననిరి. అస లీపదముల యుచ్చారణమే యొకతీరున లేదు. వచ్చీము, వచ్చేము- నవ్వేరు, నవ్వీరు- తాటేకు- విడేకులు అని ఊరి కొకదినుసుగానున్నది. ఎన్నిగుర్తు లుంచినను వాని యుచ్చారణ యొక్కతీరున నిలువదు. 'మామ, ఏమి, రామమ్మ' ల విషయము నింతియే" అని విమర్శకులు రాసేరు. నేను నావ్యాసంలో చెప్పినదేమిటంటే వచ్చాము, నవ్వారు మొదలైనమాటలు రాసేపద్ధతి చెప్పేనుకాని గ్రామ్యాగ్రామ్యవివాదాన్ని గురించి కాని, వ్యావహారికాంతర్భేదాల్ని గురించికాని నావ్యాసంలో చెప్పలేదు. కనుక విమర్శకుల యీ విమర్శకు అవసరం కనబడదు.

౮. "తెలుగున అచ్చుఅక్షరములు (Types) తొమ్మిదివందలవరకున్నవి. ఈక్రొత్తఅక్షరములు మరి రెండుమూడువందలు కాగలవు. ఇప్పుడున్న వానిని తగ్గించి అచ్చుకూర్పును సుకరము చేయవలసియుండ ఇంకను వీనిని ఎక్కువచేయవలచుట సంస్కరణము కాదు" అని విమర్శకులు అన్నారు. నేను రెండుమూడుకొత్త గుర్తులు మాత్రమే చెప్పేనుకాని వందలు వేలు చెప్పలేదు. ఈగుర్తుల అవసరమైనా కొన్నిటికి ధర్మంగా వస్తూ వుంటుందిగాని, నిత్యంరాదు. కనుక యీ గుర్తులను ప్రతి అక్షరంతోటీ పోతపోయవలసిన అవసరం లేనేలేదు.

విదేశభాషలు, యితరభాషలలోని పదాలను తెచ్చుకునేటప్పుడు అనేకకొత్తగుర్తు లేర్పరచుకుని తెచ్చుకొన్నాయి. భాషాభివృద్ధికోస మవసరమిది. అమోస్తరుగానే మనభాషకిన్నీ. అక్షరాలు యెక్కువవుతాయి, తక్కువవుతాయి అన్న కారణాలు దీనికి సరిపోవు.

౯. "సంస్కరణము లభ్యుదయహేతువులు. కాని తాము సంస్కరింపబూనిన విషయతత్త్వమును చక్కగా దెలిసి, సంస్కరణమువలని సాధకబాధకములను లెస్సగా విచారించి, సంస్కరణప్రయోజనములను నిశ్చయించి సంస్కర్తలు సంస్కరణమును జేయవలసియుందురు. సంస్కరణములపట్ల కేవలము నభిలాష, ఉత్సాహము నెవ్వరికిని సంస్కరణార్హతను గలిగింపజాలవు." అని విమర్శకులు రిమార్కులు చేసేరు. ఈరిమార్కులు యేవిమర్శకుడు యేవిమర్శకుని గురించి చెయ్యకూడదు? కాని మంచి విమర్శలో యిటువంటివి వుంటే విమర్శకే లోటు.

అసలు వ్యాసమును, దానిపయి విమర్శనమును, పయి 'జవాబు'ను వరుసగా చదివి చక్కగా వానియందలివిషయములను గ్రహింపగల సహృదయులు పయి 'జవాబు' 'సాబు'ను నిర్ణయించుకొన గలరు.—పూర్వ విమర్శకుడు.



# సాభిప్రాయ విశేషములు



ప్రపంచవ్యవహారములు విచిత్రగతిని నడచుచున్నవి. సకలవ్యవహారములును వక్రగమనము చేయుచున్నవి. ప్రపంచావృతమైన ప్రబోధసమయమునందు ఆచారవిజ్ఞానములకు ప్రచండసంరంభము సకలవ్యవహారములందును ప్రవర్ధమానం బగుచున్నది. ఆది కాలమునండియును మాహాత్మ్యమునకు మతాచారములు, బలసంపదలు ప్రమాణములుగను పరిణమించినవి. మాంత్రికులు, తాంత్రికులు, వీరులు, శూరులు, ధీరులు, పండితులు ప్రపంచమునందు ప్రజలను, దేశములను వశపరచుకొని ధర్మవ్యాజమునను గలుగజేసిన బీభత్సము వర్ణనాతీతము. నిత్యమైన ధర్మమనిత్యమైన ఆచారపాశబద్ధమై ప్రజాశక్తిని స్తంభింపజేసినది. అవిన్యాకరమైన ఆచారమహార్ణవము ప్రళయముల కాశ్రయమైనది. ఆచారమహార్ణవమునందు జ్ఞానాశ్రయములు విశ్వశ్రేయస్సునకు వినియోగపడిన దివ్యఘట్టములు స్మరణశ్రవణమనన యోగ్యములైనను నిత్యజీవనమునందు నిరాదరణమును బడయుచున్నవి. సకలవ్యవహారములందును ప్రపంచావృతమైన ప్రతిఘటనము విపరీతాకృతిని దాల్చుచున్నను ధర్మాభ్యుదయమునకు సాధనముగ నున్నది.

ప్రపంచపరిణామమునందు సృష్టివికాసమునకు శాంతి సాధనమైనను విప్లవము సాధనముగను విశ్వసింపబడుచు నుపయోగింపబడుచున్నది. ప్రపంచధర్మపరిణామమునకు ప్రళయము రౌద్రరూపమునను వినియోగపడుచున్న విధమును విశ్వరూపసందర్శన సంస్మరణములు విశదము చేయుచున్నవి. రాజ్యాంగవ్యవహారములకు సహజములైన ప్రళయాంగములు మతార్థికసాంఘికాది రంగములకును వ్యాపించి శాంతి దుర్లభమై విశ్వమునందు విప్లవము తాండవ మాడుచున్నది. స్వార్థపరాయణమైన ఆచారపిశాచము విప్లవతాండవమును జేయుచు పరార్థపరాయణమైన శాంతిని దుర్లభము చేయుచున్నది. విప్లవతాండవమును ఉపసంహారముచేయుటకు శాంతరసము సాధనము గాని రౌద్రరసము సాధనము గాదు. విజయుడు భయంకరమైన విశ్వరూపమును సందర్శించి భీతిల్లి సౌమ్యమైన శాంతరూపమును సందర్శింపగోరినటులు సంగ్రామసంతప్తమైన ప్రపంచము శాంతికి

పరితపించుచున్నను శాంతి దూరస్థ మగుచున్నది. యుద్ధపర్వములు సౌప్తికపర్వానంతరము ముగియుట సహజము. శాంతిపర్వానంతరముననే ఆనుశాసనికపర్వమును సాధ్యము.

* * * *

శాంతిపర్వము

ప్రపంచమంతయును శాంతిపర్వము నభిలషించుచు యుద్ధపర్వము నారాధించుచున్నది. ఈ యారాధనమునకు చిరకాలాగతంబైన సంగ్రామసంస్కారము బీజము. మతసంస్కారమునకు మతసంగ్రామము సాధనమగుచున్నది. రుష్యాయందు దేవాలయములు ధ్వంసముచేయబడి దేవాలయస్థానములను నాటకమందిరములు, భోజనశాలలు, విద్యాలయములు, పఠనమందిరములును నాక్రమించుచున్నవి. విద్యాలయములందు భగవన్నామస్మరణము ప్రతిషేధింపబడినది. హిందూస్థానమునందు సనాతనులకును సంస్కారులకును సంరంభము వ్యాపించుచున్నది. సకల దేశములందును మతవిషయములందు ప్రచండ సంరంభము సంప్రాప్తమగుచున్నది. సుస్థిర విశ్వాసములు భగ్నములగుచున్నవి. మతేతరంగములందు ప్రవర్ధమానంబగుచున్న సంరంభమార్థిక రాజకీయాది రంగములందును విపరీతాకృతిని దాల్చుచున్నది.

ఆర్థిక సంగ్రామము భయంకరాకారమును దాల్చుచున్నది. సుంకముల సంరంభము ప్రపంచపణ్యములను, ప్రపంచసస్యములను, ప్రపంచ క్షేత్రములను, కర్మాగారములను, యానవాహనాదులను తారుమారు చేసినది. భగవద్దత్తములైన సంపదలు స్వప్రయోజనార్థమై భస్మము చేయబడుచున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రములందు మానవ పోషణమునకు కీలకములైన గోధుమపంటలు, ప్రత్తి పంటలు నాశనముచేయబడుచున్నవి. ధరలను పెంచుటకై చేయుచున్న ప్రయత్నములు శాంతిరూపమును గాకను ప్రళయరూపమును దాల్చుచున్నవి. బంగారువిషయమునను, వ్యవసాయపరిశ్రమల సందర్భమునను రూజువెల్టుగారవలంబించుచున్న రాజ్యనీతి సంరంభమునకు మూలమగుచున్నది. అమెరికాయందు వస్తువుల ధరలు 100-కి 50 వంతునను పెరిగినటు లార్థికపండితు లభిప్రాయపడుచున్నారు. ధరలు పెరిగినను తరిగినను, ప్రచండమైన ఆర్థికసంరంభము ప్రవర్ధమానం బగుచున్నది.

గ్రేటుబ్రిటను రాజకీయార్థికసాంఘికసంగ్రామవ్యవహారములం దవలంబించుచున్న రాజ్యనీతి సంరంభమునకు సాధనమైనటులు శాంతికిసాధనము గాకున్నది. ఒటావానిర్ణయము లార్థికప్రయోజనములకు నిరర్థకములైనవి. పరాధీనరాజ్యముల దుఃఖానుభవమును ఒటావానిర్ణయములు ద్విగుణీకృతము చేసినను గ్రేటుబ్రిటను కేవిధమైన ప్రయోజనమును గలుగలేదు. అధినివేశరాజ్యములు కొంతలాభమును పొందినను గ్రేటుబ్రిటను మాత్రము శుభస్థితిని బడయుటలేదు. ఆర్థిక

వ్యవహారములందువలెను సాంఘికవ్యవహార ములందును గ్రేటుబ్రిటనునందు సంరంభము పెరుగుచున్న విధమును జాతీయపక్ష కార్మిక పక్ష సంరంభము విశదముచేయుచున్నది. సమీపమునందున్న అయిర్లాండుపట్లను, దూర మునందున్న హిందూస్థానముపట్లను గ్రేటు బ్రిటను చూపుచున్న నిరసనభావము బ్రిటిషు రాజ్యాధికారు లవలంబించుచున్న భేదదండో పాయములకు ప్రమాణముగ నున్నది. సరి హద్దురాష్ట్రప్రాంతములందు బాంబుల ప్రయో గమువిప్లవసాధనములకు నిదర్శనముగనున్నది. వివిధరంగములందును సంగ్రామసాధనములకు గల ప్రతిష్ఠ శాంతిసాధనములకు గలుగ కున్నది.

జర్మనీయందు నాజీపక్ష మవలంబించు చున్న రాజ్యనీతియును ప్రచండమైన సంగ్రామమార్గము నవలంబించుచున్నది. జన్మ భూమి నామమునను జరుగుచున్న నిర్బంధ ములు, దురంతములు, హత్యలు భయభ్రాం తులను గలుగజేయుచున్నవి. ఫ్రాన్సుదేశ మునం దాయుధవిసర్జనము లేకపోవుటయే కాక ఆయుధధారణము వ్యాపించుచున్నది. ఇటలీ, ఆస్ట్రియారాజ్యములు శాంతినామమున ఆయుధధారణమును జేయుచున్నవి. పాశ్చాత్యరాజ్యములు జినీవాయందు కోట్ల రూప్యములను వ్యయముచేసి శాంతిమందిర ములను నిర్మించుటయును, స్వదేశములందును, విదేశములందును సంగ్రామసన్నాహములను జేయుటయును సంరంభసాధనము గాని శాంతి సాధనముగాదు. ప్రపంచావృతమైన ప్రళయా వృత్తమునందు పరాధీనరాజ్యములస్థితి మాత్ర మయోమయముగ నున్నది. పరాధీనరాజ్య ములందు హిందూస్థానస్థితి పరమవిషాదమును గలిగించుచున్నది.

* * * *

హిందూస్థానము

ప్రాచ్యపాశ్చాత్య సంస్కారసంఘర్షణము నందు హిందూస్థాన మధోగతిపాలయి స్వీయ ప్రయోజనములకును, పరప్రయోజనములకును నిరుపయోగమైనది. ప్రాచ్యసంస్కారపరమైన హిందూస్థానసత్త్వమునకు కీలకమైన భావ స్వామ్రాజ్యము శిథిలమైనది. పారతంత్ర్యము పాశ్చాత్య సంస్కారపరమైన భౌతికస్వామ్రా జ్యమును దుర్లభముచేసినది. భావభౌతిక స్వామ్రాజ్యశూన్యమైన దేశమునకును, ప్రజ లకును పుట్టుగతులు లేవు. హిందూస్థాన మాత్మస్వరూపస్వభావములను విస్మరించినది. సహజమైన ఆత్మశక్తి స్తంభించినది. చిరకాలా గతంబైన ఆచారావరణములం దాత్మప్రకా శము మందగించినది. సకలాంగములును శుష్కించినవి. జవసత్త్వములు స్తంభించినవి. భౌతికవికాసమునకు కీలకములైన అన్నవస్త్ర ములు దుర్లభము లైనవి. ఆత్మవిశ్వాసము నకు బీజమైన విజ్ఞానము దుస్తర మైనది. ఆత్మోద్ధరణమునకును దేహసంరక్షణమున కును పరావలంబనము శరణ్యమైనది. పరా వలంబనము పరమార్థములకును మూల మైనది. అన్నవస్త్రముల కాకరమైన దేశమున

కన్న వస్త్రములకు పర దేశము లాధారములయి నవి. సకలసంపదలకును నిలయమైన దేశము దరిద్రగ్రస్తమైనది. ధైర్యసాహసముల కాల వాలమైన దేశము నిర్వీర్య మైనది. కళా శాస్త్రములకు ప్రసిద్ధిని బడసిన దేశము కళా కాంతి విహీనమైనది. జ్ఞానసామ్రాజ్యము నధి ష్ఠించిన దేశ మజ్ఞానావృతమైనది. వేదాంతమున కాశ్రయమైన పవిత్ర దేశము మూఢాచార ముల కాశ్రయ మైనది. ఉత్తమోత్తముల కైనను స్వదేశమునందే ఆత్మోపలబ్ధి దుస్తర మై పర దేశీయులకుగల గౌరవప్రతిష్ఠలు దుర్ల భము లైనవి. వివిధాంగములును, భాష యును, భావములును అధికారాచారావర ణములందు బద్ధములై ఆత్మవిశ్వాసమును, ఆత్మశక్తియును నంతరించినవి. పరావలంబ నమువలెను, ఆనారావలంబనమును ప్రజా శక్తిని నిర్వీర్యము చేసినది. ప్రజలును, నాయ కులును అల్పసంతుష్టులై పరమార్థమును విస్మరించి స్వధర్మపరాఙ్ముఖులైరి. సకలమును నంధకారబంధురమై తరణోపాయము దుస్తర మైనది. పరమవిషాదావస్థయందును ఆత్మ విశ్వాసము తరణోపాయమునకు సాధనము గాని పరాశ్రయ మాత్మోపలబ్ధికి సాధనము గాదు. నిత్యమైన ఆత్మావలంబనము పరమ పురుషార్థమునకు సాధనముగాగలవిధమును ప్రపంచేతిహాసములందలి మహానుభావుల చరి త్రములు విశదము చేయుచున్నవి.

* * * *

ఆత్మవిశ్వాసము

ప్రపంచవ్యవహారములందు జీవజాలముల కాత్మోపలబ్ధికి పరిమితమైన బాహ్యవిషయా రాధనమునందుగల విశ్వాసము పరిపూర్ణమైన ఆత్మారాధనమునందు గలుగకున్నది. "స్వయంతీర్ణః పరాన్ తారయతి" యనెడి పరమార్థము ప్రజలకును, నాయకులకును తరణోపాయముగ నున్నది. ఎవరి తరణో పాయము వారి హస్తములందే కలదను పర మార్థమును అమెరికా, రుష్యా, ఇటలీ, జర్మనీ, జపాను దేశముల యుదంతము సహస్రముఖము లను ప్రత్యక్షము చేయుచున్నది. అమెరికాసం యుక్తరాష్ట్రీము లవలంబించుచున్న "నీరా" విధానము ప్రజల కాత్మశక్తిని గలుగజేయు చున్నది. ఆయుధధారణము నారాధించెడి రాజ్యముల నడుమను సోవియటు రుష్యా పొందు చున్న యభివృద్ధిని హేరియటుగా రభినం దించుచున్నారు. బ్రిటనునందు గూడిన ట్రేడుయూనియను కాంగ్రెసున కధ్యక్షులు వాల్డెనుగారు రూజువెల్టుగారి విధానమును ప్రశంసించిరి. దుర్భరమైన ఆర్థికదుస్థితికి పాలైన జర్మను రాజ్యమునకు హిట్లరుగా రాశాకాం తులను ప్రసరింపజేయుచున్నారు. జపాను, ప్రపంచమునం దంతటను ప్రతిబంధకములకు పాలయ్యును ఆత్మవిశ్వాసమును గలిగి వికసించుచు భయభ్రాంతులను గలుగజేయుచు న్నది. ప్రపంచావృతమైన ప్రళయావస్థ యందు సకలరాజ్యములకును ఆత్మోద్ధరణ మున కాత్మవిశ్వాసము శరణ్యముగ నున్నది.

స్వతంత్రరాజ్యములకు శరణ్యమైన ఆత్మా వలంబనము పరాధీనరాజ్యముల కత్యంతా వసరమనుట నిర్వివాదాంశము. పరావలంబన ఫలమును రౌండుటేబిలు సమావేశములు, శ్వేతపత్రనిర్ణయములు, విల్లింగ్డను సాల్సుబరి ప్రభువుల భావములు, హోరు, మిచెలురాంకు, సప్రూ, జయకరు, పాత్రో, ముత్తులక్ష్మిరెడ్డి గారులు మొదలగువారు తెలిపిన యభిప్రాయ ములు, పార్లమెంటు శాసనసభల చర్చలు, జనాభిప్రాయములు, పత్రికాభిప్రాయములు విశదముచేయుచున్నవి. ప్రజలు కామితార్థము లను బడయుట కాత్మావలంబనసాధనము నారాధించవలసిన యవసరమును గతానుభవ మును, గాంధిమహాత్ముని యుపదేశాచరణము లును విశదముచేసినను ప్రజల కాత్మావలం బనము దుర్లభముగ నున్నది.

గాంధిమహాత్ముని యుపదేశాచరణము లాత్మసంస్మరణమునకు వినియోగపడుచున్న ను సంకల్పసాధనరహిత మైన ఆత్మసంస్మరణ మాత్మసాక్షాత్కారమునకు నిరుపయోగ మగుచున్నది. సంకల్పసాధనములు పార తంత్ర్యమును సమకూర్చునటులు ఆత్మ సాక్షాత్కారపరమైన స్వాతంత్ర్యమును సమకూర్చుచున్నవి. ప్రజలకు పరాధీనమైన పారతంత్ర్యపాశముల నతిక్రమించుట దుష్కర మైనను స్వయంకృతము లైన ఆచారపాశ బంధముల నతిక్రమించుట సుకరము. ఆచార పాశబంధముల నతిక్రమించుటకు సకల జనుల కును నియమశీకర్మానుష్ఠానము సాధనముగ నున్నది. ప్రపంచ మంతయును శాంతిపథము నధిష్ఠించుటకు ఘోరమైన తపస్సును జేయు చున్నది. ఒకమూలను మతాచారములు ధ్వంసము లగుచున్నవి వేరొక వైపున నార్థికనిర్ణయములు నిర్మూలము లగుచున్నవి. మరొకప్రాంతమునను రాజ్యాంగములు పరి వర్తనమును బొందుచున్నవి. ప్రపంచమునం దంతటను సంగ్రామసన్నాహములును, ఆర్థిక సమరములును చెలరేగుచున్నవి. ప్రపంచ వ్యాప్తము లైన పరివర్తనసన్నాహము లన్నియును శాంతిశ్రుతియందు స్థాయిని పొందుచున్నవి.

అశోకచక్రవర్తి 2300 సంవత్సర ములకు పూర్వ ముపక్రమించిన శాంతిధర్మ మునె గాంధిమహాత్ముడు వర్తమాన కాలము నందు లోకకల్యాణమునకు పూరించుచున్నా డు. గాంధిమహాత్మునకు యెరవాడా చెరసాల మైనను, సబర్మతి సత్యాగ్రహాశ్రమమైనను, పర్ణకుటిసౌధమైనను ధర్మనిర్వాహణమునకు సమానాశ్రయములుగ నున్నవి. కర్మయోగ ము, జ్ఞానయోగము, భక్తియోగము పూర్ణ మైన శాంతియోగమునందు సమన్వయమును పొందుచున్నవి. ఆత్మసాక్షాత్కారమునకు గాంధిమహాత్ము డుపదేశించిన సహాయనిరా కరణయోగము వర్తమానప్రపంచ సంస్కార మున కపరిచితమైనను ధర్మసాధనముగ నున్నది. త్యాగయోగపరాయణమైన ఆత్మ సందర్శనము సకలార్థసాధనముగ నున్నది.

గాంధిమహాత్ముని ఉపవాసోదంత మాత్మయోగపరాయణ మైన పూర్ణయోగ ప్రభావమును విశదము చేయుచున్నది. ప్రజలును, నాయకులును వారి లక్ష్యమును శ్వేతభవనము, శ్వేతపత్రము, పార్లమెంటు, శాసనసభలు, రౌండుటేబిలు సమావేశములు మొదలగు బాహ్యవిషయములనుండి మరల్చి స్వయంసహాయపరమైన ఆత్మయోగావలంబనమును జేయవలసిన యవసరమును విశదము చేయుచున్నవి. శాంతమూర్తి, సాధుమూర్తి, గాంధిమహాత్ముడు ప్రత్యక్షము చేసిన ఆత్మశక్తిప్రభావమును ప్రజానాయకులు గ్రహించి వారి యావచ్ఛక్తిని నాత్మోపలబ్ధికి వినియోగించి కామితార్థములను బడయుట వివేకము, ధర్మము.

---

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra PatrikaPress, No.7, ThambuChettySt., Madras.
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౧౦.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩





పద్మావతీచరణచారణ చక్రవర్తి—శ్రీ శివశంకరశాస్త్రిగారు ... ౫౦౫–౫౦౯
కన్యాశుల్క-నాటక విమర్శనము—శ్రీపాద కామేశ్వరరావుగారు ... ౫౧౦–౫౨౧
అర్ధరాత్రి—పిలకా గణపతిగారు ... ... ... ౫౨౨
కవికొండలవారి కవిత—ఆచంట వెంకటరావుగారు ... ... ౫౨౩–౫౨౫
భోజుని శృంగారప్రకాశము—మా. రాధాకాంతయ్యగారు ... ౫౨౬–౫౩౨
మాయజగత్తు—లంకలపల్లి గోపాలరావుగారు ... ... ౫౩౩–౫౩౮
ప్రేమపాశము—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... ... ౫౩౯–౫౫౦
గన్నేరుపూలు—'గిరి' ... ... ... ... ౫౫౧–౫౬౦
వర్షాశ్రీముఖము—వోలేటి పార్వతీశముగారు ... ... ... ౫౬౧–౫౬౨
ప్రపంచ-ఆర్థికమహాసభ—కపిల కాశీపతిరావుగారు ... ... ౫౬౩–౫౭౧
శృంగారము—మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ... ... ౫౭౨–౫౭౭
మాలతి—కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు ... ... ౫౭౭
"ఈసంఘమే మమ్మల్ని పాకీవాళ్లని చేసింది"—మద్దూరి హనుమంతరావుగారు ౫౭౯–౫౯౦
మహమ్మదు దారాషికూ రాకొమరుడు—ఆకుండి వేంకటశాస్త్రిగారు ౫౯౧–౫౯౪
నేటిరష్యా—నార్ల వెంకటేశ్వరరావుగారు ... ... ... ౫౯౫–౬౦౦
బాలక్రీడలు—మంగిపూడి వేంకటశర్మగారు ... ... ... ౬౦౧–౬౦౫
నక్షత్రమండలము: (ఆశ్వయుజము, కార్తికము)—గొబ్బూరు వేంక
టానంద రాఘవరావుగారు ... ... ... ౬౦౭–౬౧౦
బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ౬౧౧–౬౧౫
కీ. శే. ఆనిబిసెంటు— ... ... ... ... ౬౧౭–౬౧౮
భారతీయవిద్యాచరిత్రము—మారేమండ రామారావుగారు ... ౬౧౯–౬౨౪
బ్రాహ్మణుడు—కీ. శే. కొడాలి వెంకటసుబ్బారావుగారు ... ౬౨౫
సూర్యగ్రహణము—చివుకుల వెంకటరమణశాస్త్రిగారు ... ౬౨౬–౬౨౯
శైలి—కాంచనపల్లి కనకాంబగారు ... ... ... ౬౩౦

వినోదశిల్పము : తెరువదగు వంతెన—కొ. నరసింహాచారిగారు ... ౬౩౧_౬౩౨

భారతము : పరమార్థప్రదర్శనము—నండూరి బంగారయ్యగారు ... ౬౩౩_౬౩౮

మిాగడతఱకలు : ఆంధ్రుని స్వదేశీ—శాస్త్రి ... ... ౬౩౯_౬౪౦

ఆంధ్రాభ్యుదయము : కే. వి. రమణరావుగారు, యస్. వి. యస్. రామరావుగారు ... ... ... ... ౬౪౧

భారతీయమహిళామండలి : శ్రీమతి కల్యాణిదేవిగారు, శ్రీ సారంగు సీతాదేవిగారు ... ... ... ... ... ౬౪౨

కలగూరగంప : నూతనాదర్శము ; స్త్రీవిద్య ; అహింసయొక్క విజయము ; యకన్సరే చిత్రము ; రాబోవు యుగమునకు ఫోర్డుగారి ఉపాయము ; శ్రీ ప్రఫుల్లఘోషుగారు ; విద్యావిధానమున నూతనాభిప్రాయములు ; రొమ్మునకు బలము కూర్చుట ; కొహినూరు రత్నము ... ౬౪౩_౬౫౧

విమర్శనము ... ... ... ... ... ౬౫౨_౬౫౭

మనవిమాటలు : ఆంధ్రపత్రిక రజతోత్సవము; ధన్యవాదము ... ౬౫౮_౬౬౧

సాభిప్రాయ విశేషములు— ... ... ... ... ౬౬౨_౬౬౬


## చిత్రములు

త్రివర్ణ చిత్రములు : దీపావళి ; ఇంటికి.

సాధారణ చిత్రములు : ప్రాచ్యచిత్రములు ౮; ఆంధ్రవిశ్వకళాపరిషత్తు నూతనభవనముల చిత్రములు ౬; హిందూవిశ్వవిద్యాలయ చిత్రములు ౭; తులసిపూజ; ఏమిటీ!; బాలభానుకరలాలనము - కృష్ణానది; సముద్రపుకాలువ, అల్లప్పీ; గోరాజు; దమ్ము; రాధాకృష్ణ; సంగీతస్తంభము ; ఇతర చిత్రములును.

---



సంపు. ౧౦ శ్రీముఖ సంవత్సరము, ఆశ్వయుజమాసము (అక్టోబరు ౧౯౩౩) సంఖ్య ౧౦

# పద్మావతీ చరణచారణ చక్రవర్తి

శ్రీ శివశంకరశాస్త్రి
[మాహేశ్వరాశ్రమము]

ద్వితీయరంగము

లక్ష్మణసేన మహారాజసభ

మహారాజు

భూసుర పుంగవు, లేత
ద్వాసరమున కావ్యగోష్ఠి తత్పరు లగు మీ
యాసంపూర్తి శ్రవణము
మాసుకృత ఫలంబు గాక మరియొం డగు నే!

మీారో సమస్త విద్యా
పారంగతు, లఖిలకావ్య భవ్య సమీాక్షా
ధీరులు, సంగీతకలా
పారీణులు, విమలదేవభాషాకవులున్.

కావున మా కెరిగింపం
గా వలె విపులముగ కావ్యగానంబులు మీా
కేవిధముగ రుచియించెనో:
కోవిద సమ్మతి యథార్థగుణకంబు గదా!

మహేశ్వర భట్టు

చిత్తము మహాప్రభూ! మీా రశేష శేము
షీధురంధరులు, రసజ్ఞ శేఖరులును.
అట్టి మీాసన్నిధానమునందు మేము
వ్యాఖ్యసేయుట కేవల మాజ్ఞవలన.

మేము విన లే దితఃపూర్వ మీామనోజ్ఞ
గీతగోవిందసంగీతరీతు లెపుడు!

తనివి తీరగ గానామృతంబు గ్రోల
జ్వరము వాసె పుటాయిత శ్రవణములకు !
కానవచ్చుచు నున్నవి గానకళను
శీఘ్రకాలములో మార్పుచిన్నె లెన్నొ.
అయిన, జయదేవ కవిశేఖరాష్టపదుల
పాట కెపుడు జగత్తులో లోటు రాదు !

వామదేవ దీక్షితుడు

మాళవ వసంత దేశవరాళి గుణక
రీ గుణక్రియలును, ఘూర్జరీ విభాస
భైరవులును, రామక్రియ పాడినాడు
రక్తకంఠముతో కవిరాజు నేడు.
మ్రోగుచున్నది ఘూర్జరీరాగ మింక
మా శ్రవోయుగళంబున మధురకళల.
కవివరేణ్యుని యద్భుతగానకలన
కావ్యబంధము మధురిమోద్గార మయ్యె !

నీలకంఠమఖి

కవులు ప్రాయికముగ గాయకుల్, జయదేవ
కవివరుం డఖండగాయకుండు.
నేటిగానమునకు నిజముగా గంధర్వు
లైన వివశులగుట యబ్బురంబె.
కావ్యవిషయ మింక గౌడేశ, అన్యథా
యీకవిప్రకాండు డెంచకున్న
వివరములను కొన్ని విద్వద్వినోదార్థ
మడుగదలతు మాజ్ఞ యయ్యెనేని.

మహారాజు

సుమనసుల భాషణంబుల
కమర్ష కవి క్షేల కలుగు? అగుటఁ సంకో
చము వీడి కావ్య మియ్యెడ
విమర్శ చేయంగ దగును విబుధప్రవరా.

నీలకంఠమఖి

ఎందు జేర్పవచ్చు నీనవ్యకావ్యంబు?
కాదు నిండురూపకమ్ముగాని,
శ్రవ్యకావ్య మైన సంపూర్ణముగ కాదు,
గేయకృతియు గాదు కేవలముగ.

ఉమాపతి

ఏల చేరవలయు నే శ్రేణిలోనైన?
సూక్ష్మదృష్టితోడ జూచునెడల
ప్రతికవీంద్రురచన ప్రత్యేకమై యుండు,
కూడు నన్నిగతులు కొన్నియెడల.
ఏగుణంబు మిగుల హెచ్చుగా గన్పించు
చుండు దానివలన నొదవు నాఖ్య
యెట్టి కృతికి నైన. ఈమహాకావ్యంబు
నందు గేయగుణము తుందిలంబు.

నీలకంఠమఖి

వినుతి కెక్కినారు వెనుకటికవివరుల్
వేలకొలది పద్యవితతితోడ
సర్గబంధములను సంఘటించి యుదాత్త
వస్తుకథన గౌరవంబు మీర.
ఇందు గేయసంఖ్య యిరువదినాలుగు
పదియుకొదువ నూరుపద్యములకు.
ఇట్టి గ్రంథమునకు నేవిధంబుగ మహా
కావ్యసంజ్ఞ యీయగలము చెపుడి!

శరణమిశ్రుడు

గ్రంథబాహుళ్యమే మహాకావ్యమునకు
కాదు లక్షణ : మమరుకకవివతంసు *
పద్యమొక్కటె నూరుప్రబంధములకు
సాటి యని విన్న దేగద సరససూక్తి.

వామదేవదీక్షితుడు

శ్రీమదాచార్యదండి శాసించినాడు
సర్గబంధంబునందు నష్టాదశమిత
వర్ణనమ్ములు చేయగావలయు ననుచు :
కలవె యన్ని యేతద్గీతికావ్యమందు ?

శరణమిశ్రుడు

సంఖ్య కష్టాదశమ్ముగా సంతరింప
గ్రంథమున వర్ణనలు మహాకావ్య మగునె ?
స్వీకరింపగవలె దండి చెప్పినట్టి
పలుకు కేవలసూచనప్రాయముగనె.
వస్తుగౌరవవిస్తృతి వర్ణనమున
కలుగుట సమంజసము మహాకావ్యసంజ్ఞ.
గర్భితముగ వర్ణన లన్ని కలవు, విషయ
గౌరవముకూడ చెలగు నిక్కావ్యమందు.

వామదేవదీక్షితుడు

వృత్తములు గేయములకన్న నుత్తమమ్ము
లనెడి ఛందోవిదాశయ మఖిలవిబుధ
సమ్మత; మ్మిందు గీతికాసరణి యుండు
కతన న్యూనత కలుగదె కావ్యమునకు ?

ధోయీకవి

శ్రవణసౌఖ్యము లక్ష్య మేఛందమునకు ;
చదువవచ్చును పద్యాలసరణి వీని.
పద్యమునకైన గీతికాపదమునకైన
రాగతాళాల వరుసను రక్తి మెండు.

వామదేవదీక్షితుడు

ఒకట శార్దూలవిక్రీడితోక్తితోడ †
అవల నొకదాన పుష్పితాగ్రాహ్వయమున
పృథ్వియని యింకనొక్కచో పేరుచొనిపె
వృత్తములయందు ; అర్థాన వెలితిరాదె ?

ఉమాపతి

ప్రకరణార్థమునకు భంగంబు గూర్చి త
త్పదములే ప్రధానతను వహింప
అనగ వచ్చు దోష మని : చమత్కారంబె
ప్రతిఫలించె మూడు పద్యములను.

వామదేవదీక్షితుడు

అతిమధుర మైన శబ్ద విన్యాస కలన
సారె సారె కలంకారచతురిమమున
పదశరీరముపై నిల్పి భావగరిమ
గనుగొనగ నీదు బుద్ధి నీకావ్యరచన.

ధోయీకవి

మాటలను రీతులందును మధురిమంబు
ద్యోతితం బైన శోభకే హేతు వగును.

---

* అమరుకకవే రేకః శ్లోకః ప్రబంధశతాయతే.

† కందర్పోపి యమాయతే విరచయన్ శార్దూలవిక్రీడితమ్.
చిరవిరహేణ విలోక్య పుష్పితాగ్రామ్.
అహో విబుధయావతం వహసి తన్వి, పృథ్వీగతా !

అధమ మగు శబ్దచిత్రమే నైన కావ్య,
మిందు నీపదలంకృతియే యెసంగు.

మహేశ్వరభట్టు

వివిధవిధముల గీతగోవిందమందు
కడు విశృంఖలరీతి నిక్క వివరుంచు
రతిని వర్ణించుకతమున రక్తి హెచ్చ
దే పఠనపాఠనమ్ముల దేహముపయి?

గోవర్ధనాచార్యుడు

ఇందుల కవి రాధాగో
విందుల లీలలను భక్తివివశుండై యా
నందంబున మకరంద
స్యందివచోగుంఫనముల నభివర్ణించెన్.

జనియింపవచ్చు నొకచో
మనుష్యరతివర్ణనమున మదిని వికారం
బనఘమతి దివ్య చరితము
వినంగ నేలాగు కల్గు వికృతి మహాత్మా!

రసికప్రవరుల కెల్లన్
రసాపకర్షకము కాదు రతివర్ణన; మీ
యసదృశకృతి దాత్పర్యం
బెసంగు జీవేశ్వరైక్యమే తలపోయన్.

ఎరుకగలవార లందురు
శరీర మాద్యంబు ధర్మసాధన మని. త
ద్వరవాక్యంబును మెచ్చని
విరాగులకు దేహ మన్న విసుగు కవీశా!

మీరు వినోదార్థముగా
నేరిన దోషములె కాక యితరము లెన్నో
ఆరోపింపగ జాలుదు
రూరక, నిజదృష్టిదోష మున్న జనంబుల్.

మహేశ్వరభట్టు

భక్తులకు రసికవరులకు పండితులకు
కవిజనంబుల కిది మహాకావ్య మగును.

మహారాజు

మణిహారమును పుష్పమాలికం జుట్టి
గ్రంథరాజము భద్రగజముపై నుంచి
వివిధవాద్యములతో వీథుల వెంట
వైభవమ్ముగ నుత్సవము సేయవలయు.

శిల్పిచే జెక్కించి శ్రీజయదేవ
కవిరాజనామమ్ము గారుత్మతాశ్మ
ఫలకభాగమ్మున భర్మాక్షరముల,
జాలమార్గముమీద సంధింప వలయు.

కవిరాజు భార్యకు గౌరవార్థముగ
నర్పించినార మీయాభరణాలు
ఒసగినారము తటిన్యుద్యానవాటి
బిందుబిల్వం బనుపేరిట కవికి.

తగు బిరుదంబుగా తన భాషితంబె
మన కవీంద్రునకు పద్మావతీచరణ
చారణుం డని సభాస్తారు లెల్లరును
అంగీకరింత్రుగా నైకకంఠ్యముగ!

[ హర్షధ్వనులు ]

మహేశ్వరభట్టు

దేవ, మీకవుల్ విక్రమాదిత్య హర్ష
ధరణిపాస్థానకవులకు తగ్గి పోరు.

మహారాజు

వాచః పల్లవయ త్యుమాపతిధర,
స్సందర్భశుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ, శరణ
శ్లాఘ్యో దురూహద్రుతేః,
శృంగారోత్తర సత్ప్రమేయ రచనై
రాచార్య గోవర్ధన—
స్పర్ధీ కోఽపి న విశ్రుతః, శ్రుతిధరో
ధోయీ కవిక్ష్మాపతిః.

వామదేవదీక్షితుడు

యది హరిస్మరణే సరస మ్మనో
యది కథాసు విలాసకుతూహలమ్,
సరసకోమల కాన్త పదావలీం
శృణు తదా జయదేవ సరస్వతీమ్.

నీలకంఠమఖి

సాధ్వీ మాధ్వీక, చిన్తా న భవతి
భవతః ; శర్కరే, కర్కశాఽసి ;
ద్రాక్షే, ద్రక్ష్యన్తి కే త్వా ? మమృత,
మృత మసి ; క్షీర, నీరం రస స్తే;
మాకంద, క్రంద ! కాంతాధర,
ధర సతులాం, గచ్ఛ ! యచ్ఛన్తి భావం
యావచ్ఛృంగార సారం శుభమివ
జయదేవస్య వైదగ్ధ్య వాచః.

మహేశ్వరభట్టు

యద్గాంధర్వ కలాసు కౌశల
మనుధ్యానంచ యద్వైష్ణవం
యచ్ఛృంగార వివేక తత్త్వ రచనా
కావ్యేషు లీలాయితమ్,
త త్సర్వం జయదేవపండితకవేః
కృష్ణైకతానాత్మనః
సానందాః పరిశోధయన్తు సుధియః
శ్రీగీత గోవిందతః.

గోవర్ధనాచార్యుడు

శ్రీ భోజదేవ ప్రభవస్య రామా
దేవీసుత శ్రీ జయదేవకస్య,
పరాశరాది ప్రియవర్గకంఠే
శ్రీ గీతగోవింద కవిత్వ మస్తు !

---

# కన్యాశుల్క—నాటక విమర్శనము

శ్రీపాద కామేశ్వరరావు

## (అనువృత్తము)

### —౫. కరటకశాస్త్రి

ఇతడు అగ్నిహోత్రావధానిభార్యకు అన్న; విజయనగరము సంస్కృతనాటకసమాజములో విదూషకుడు.; భూవసతికలవాడు కావున ధనాశాభిభూతుడు కాడు; గిరీశమును చూడగానే అతడు సాత్వికవేషధారియైన కపటి అని తెలుసుకొని "ఇతని నిక్కడనుండి శీఘ్రమే సాగనంపవలెను; లేకుంటే మోసమువస్తుం" దన్నాడు. అగ్నిహోత్రుని కోపజ్వాల నార్పుటకు గిరీశము స్తుతి మొదలుపెట్టితే "మా అగ్నిహోత్రునికి తగినవాడు దొరికినా" డని హాస్యముచేసెను. అవధాని తాను వేదాభ్యాసము చేసినప్పుడు దమ్మిడీ ఐనా పుస్తకాలకి ఖర్చుపెట్టలేదు; తనకొడుకు ఇంగ్లీషుమొదలుపెట్టి సాలుకి పది పదిహేనురూపాయీలు పాడుచేస్తున్నాడనేసరికి "కోట్లకు విలువైనమాట అన్నావు బావా" అని ఎకసక్కెములాడెను. పిమ్మట వెంకటేశమును "పద్యమొకటి చదువు" మనేసరికి వాడు "పొగచుట్టకు సతిమోవికి" అని చదువగానే "సెబాస్" అని వ్యంగ్యముగా మెచ్చుకొన్నాడు. ఇంతవరకు అతని విదూషక భావము వ్యక్తమయింది.

సుబ్బిని లుబ్ధావధానికి పెళ్లిచేస్తానని అగ్నిహోత్రుడు చెప్పగానే "బావా, ఈసంబంధముచేస్తే నీకొంపకు అగ్గిపెట్టుతా" నన్నాడు. అతనిఅక్క "నూతిలోపడుతాను, అన్నయ్యా, ఏలాగైనా ఈ సంబంధము తప్పే మార్గ మాలోచించు" అని బతిమాలుకుంటే ఆమె కేదో రహస్యముచెప్పి సమాధానపరిచి కార్యప్రవాహములో కాలుపెట్టినాడు.

ఇతని అధ్యాపనవిధానము రెండోఅంకము రెండో రంగములో వర్ణించబడినది. శిష్యునిచేత ఆర్నాల్డు కోమాటు పుస్తకము పట్టించేవాడు. అప్పుడు విద్యార్థికి కొత్తశ్లోకాలు పాతశ్లోకాలూ ఒక్కలాగే కనబడేవి. శ్లోకాలు ముందు భట్టీయము వేయించేవాడు—అనగా గుడ్డిపాఠము వర్లింపించేవాడు. లెక్కలు, భూగోళము, దేశచరిత్ర మొదలైనవి మాని నిరుపయోగములు, అనసుభూతములైన విషయములు చెప్పేవాడు. చదువిలాగుండేది. ఇంకోవిశేషము. తాను నాటకములలో విదూషకపాత్రము తీసుకొనేవాడు గనుక శిష్యునికికూడా స్త్రీవేషము వేయించి పెద్దచాంతాడులాంటి అర్థముకాని సంస్కృతముముక్కలూ, హిందూస్థానీ ముక్కలూ వర్లింపించేవాడు. నాలుగురోజులకైనా ఒకశ్లోకముచెప్పడాని కితనికి ఓపిక లేదు. పట్టణమువదలి అగ్రహారానికి వచ్చినప్పుడు ఊసుపోక పుస్తకము తీయుమంటే శిష్యునికి సంస్కృత మేమివచ్చేని? అందుచేత శిష్యునికి విముఖత కలిగి వాడు ఇంగ్లీషు చదువుకో నిశ్చయించినాడు; కాని చెప్పించేదాత ఏడీ? సరిగా ఈతరుణానికే శాస్త్రులుకి మంచి అవసరము తటస్థించింది. శిష్యుని కాడవేషము వేయించి లుబ్ధావధానికి మాయపెళ్లి చేస్తే సుబ్బి కీసంబంధము తప్పుతుందనే ఆలోచన తోచింది. కావున శిష్యునితో "నా కొకకష్టసాధ్యమైన రాచకార్యము తటస్థించింది; అది నీవు నిర్వహించుకొని వచ్చినట్టయితే నీకు ఇంగ్లీషు చెప్పించడమేకాకుండా నాకొమార్తె నిచ్చి వివాహము చేస్తా" నని ప్రమాణము చేసినాడు. యథావిధిగా ఈకుట్ర సాగింది. రామప్ప లుబ్ధావధానికి ముఖ్యస్నేహితుడని ఎరిగి అతనితో మంచిచేసుకోనెంచి అతనియింటికి వెళ్లేసరికి మధురవాణి కనబడింది. శాస్త్రులుగారు ఆమెకు పరిచయులు. వారినీ శిష్యునీ చూసీచూడగానే ఆడవేషముసంగతి గ్రహించి "ఓహో! నాటకాలలో చెడి పగటివేషములోకి దిగిందా మీగతి?" అని అడిగింది. పిమ్మట కొంత ప్రసంగము నడిచినతరువాత శాస్త్రులు ఆమెసలహా కోరెను. అందు కామె "రామప్ప, మీనాక్షీ, సిద్ధాంతి—వీరిముగ్గురికీ లంచము పెట్టితే కార్యము సానుకూల మవు

తుంది. హెడ్ కాన్‌స్టేబిల్ని కట్టుకోవలెను. నేను వెనుక నుండి సమయోచితముగా హంగుచేస్తా"నన్నది. ఇంతలో రామప్పవచ్చినాడు. కొద్దికాలముకిందటనే పోలీసువాళ్లకి లంచ మిస్తానని పాతికరూపాయలు ఒకరిదగ్గిర పుచ్చుకొని పులుసులోవేసుకొన్నాడు. పోలీసువాళ్లూర కుంటారా? మనిషి నొకడిని తైనాతీ ఉంచి తక్షణమే సొమ్మిమ్మన్నారు. రామప్పచేతిలో కాసైనా లేదు. మధురవాణి నడిగితే ఆమె రుసరుసలాడి తనవద్ద సొమ్ములేనందున తాకట్టుమీద బనులు తెచ్చుకొమ్మని సరుకుఇవ్వబోయేసరికి కరటకశాస్త్రిఆరూపాయిలిచ్చి రామప్పగండము తప్పించినాడు. మాయసుబ్బిపెళ్లిసందర్భమున రామప్పకు ఐదోవంతులంచ మివ్వడాని కొప్పుకొని స్థిరపరచి అతడు ఊళ్లోలేనప్పుడు ఏకరాత్రి వివాహము కానిచ్చి లంచ మెగవేసినాడు. లోకజ్ఞానము కల గడుసువాడు కాని అవధానిద్వయమువలె తెర్ర కాడు. శఠునియెడల శాఠ్యమే కర్తవ్యమని యెంచి మెలకువతో మెలగేవాడు. లుబ్ధునివద్ద పుచ్చుకొన్న శుల్కము అపహరించవలెనని ఇతనిఉద్దేశము కాదు, సుబ్బిపెళ్లి మాన్పించడమే అతనిపట్టు.

శిష్యుడు మధురవాణికి కంటె నిచ్చినపిమ్మట ఆమె దాన్ని దాచిపెట్టి కంటెతెస్తేనేకాని గడప తొక్కనివ్వనని రామప్పను నిర్బంధించినందువల్ల అతడు హానీకేసు బనాయించి లుబ్ధునిపీకమీదికి తెచ్చినాడు. శాస్త్రికి, తనమెడకు బ్రహ్మహత్య చుట్టుకొంటుందనే భీతి పట్టుకొన్నది. కంటెను బహిరంగముగా మధురవాణి కిచ్చేస్తే కేసు ఉండనేఉండదు. మధురవాణిని కంటె ఎరువడిగి శుల్కముగా తానుపుచ్చుకొన్న సొమ్ముతోకూడా దానిని సౌజన్యారావుగారికి పంపుటకు నిశ్చయించినాడు. మధురవాణికి కంటె తిరిగి రాదని భయము వేస్తే దాసిఖరీదు తా నిస్తానని శాస్త్రులు మాట యిచ్చినాడు. సౌజన్యారావుగారి స్వభావము చక్కగా ఎరిగినందున శాస్త్రులకీధైర్యము కలిగింది. సౌజన్యారావుగారితో నిజముచెప్పితే లుబ్ధావధానికి సిద్ధమైన ఉరి తనమెడకు తగులుకొంటుందని భయమువేయడముచేత తనచర్య గుట్టుగా నుంచినాడు.

ఈ పాత్రము నాటకములో ముఖ్యమైనది: శాస్త్రి పరోపకారి. సుబ్బిని లుబ్ధునకు పెళ్లిచేయకుండా ప్రయత్నించినవాళ్లలో ఇతడే ముఖ్యుడు. ఆ కార్యభారము ఇతడు పూనడానికి రెండుకారణము లున్నవి: మొదట ఆసంబంధము తన కిష్టములేదు. రెండోది, తనచెల్లెలు ప్రాణత్యాగము చేస్తా నన్నది. ఈ రెండింటిలోను పరోపకారవాంఛ అంతగా కానరాదు. తనకార్యము నిర్వహించుటలో శిష్యుడుచేసినసాయమునకు తనకూతురి నిచ్చి పెళ్లిచేసి ఇంగ్లీషు చెప్పించుతా నన్నాడు. మాటసాయము చేసినంతమాత్రాన నలభై రూపాయీ లిస్తానంటే సంతోషించక శుల్కములో సగము లంచ మివ్వమని నిర్బంధించి తుదకు ఐదోవంతు కొప్పుకొన్న లంచసుండి, వంచకుడు, బడాయికోరు అయిన రామప్పంతులు నోట్లో బెడ్డకొట్టినాడు. ఇది గొప్పపని. మోసగానిని మోసముచేతనే వంచించవలెనని నిశ్చయించి తనఊరూపేరూదాచి చిరిగడ్డము తగిలించుకొని శిష్యుని కాడవేషమువేసి, కార్యవాదికనుక రామప్పంతులు మర్యాద కాపాడవలెనని తన్నడుగక ముందే పాతికరూపాయలు ఇచ్చినాడు. పొగడితే ఎవరికైనా భుజాలుపొంగుతవని ఎరుగును కనుక రామప్ప బడాయికబుర్లకుచాటు వేసినాడు. మధురవాణి సంసారి స్త్రీకన్నమర్యాదతో ప్రవర్తిస్తున్నదని రామప్ప ఎంపికను పొగడినాడు. తాను వేశ్యాలోలుడైనందున వేశ్యసాయమువలన తనకార్యము సాధించినాడు; కాని శిష్యుని సానియిళ్లవెంట తిప్పి కొంతవరకు పాడుచేసినాడు.

ఈపాత్రమువలాన సమకాలీన-ఆచారవ్యవహారములు కొన్ని విశదీకరింపబడ్డవి. ఒక్కసారిమాత్రము ఇతని స్వార్థపరత్వము తేటపడ్డది. "డిప్యూటికలెక్టరుగారు నాయునిద్వారా కబురంపినారు; కాని, ఆతని ఆశ్రయము నాకు నచ్చలే"దని మధురవాణి చెప్పగా ఆయనప్రాపు దొరికితే లుబ్ధావధానిమీదికేసు పోతుందనీ, తన క్షేమప్రమాదనూ రాదుగనుక తనకొరకైనా కలెక్టరుగారిని మంచిచేసుకొమ్మనీ మధురవాణిని బతిమాలుకొన్నాడు. అందుపై నామె—"పురుషు లెంత

స్వార్థపరులు—మీకు చేతనైతే నన్ను చిత్రగుప్తునికి తార్చి మీపాపములను మాపుకొందురుకాబోలు! నాయిష్టానిష్టములతో మీకు పనిలేదు; మీకార్యసాధనమే మీకు కావలసిన" దని తెగచీవాట్లు పెట్టగా వెంటనే నెత్తిమీద కొంగువేసుకొని వెళ్లినాడు.

—౬. సౌజన్యారావు

చిల్లరపురుషపాత్రములలో సౌజన్యారావు పాత్రము మేలైనది; ముఖ్యమైనది. నాటకకథతో ఇతనికి సంబంధము తక్కువే; కాని ప్రతిముఖ్యపాత్రముతోనూ కొంచెమో గొప్పో సంసర్గ ముంది. గుణగణముబట్టి పాత్రాధిక్యము గణిస్తే ఈపాత్ర మత్యుత్తమ మైనది. ఇతడు చేసినపని కొంచెమైనా ఇతని గుణసామగ్రిమాత్రము ప్రశంసనీయము. "చేపలకు ఈత, పక్షులకు ఎగరడము సహజమైనట్లు ఇతనికి పరోపకారము సహజము; బహున్యాయమైనవ్యక్తి! అంత మంచివాడు మరిఒకడు లేడు. ముక్కుకి సూటిగా ధర్మమార్గమున పోయేవాడు. మోసము, బడాయి ఇతనికి కిట్టవు. అందుచేతనే "అతనివంటి అచ్ఛాణీ లర" దన్నాడు కరటకశాస్త్రి. రామప్పనైజము బాగా ఎరిగినవాడుగనుక తన కాతనిసాయ మక్కరలేదని తరిమినాడు. దొంగసాక్ష్యము తాను బనాయించడు; ఇతరులు బనాయించడ మితని కిష్టములేదు. కూటసాక్ష్యము కూర్చితే కూనీకేసు పోతుందని ఎరిగియుండీ అది చేయ నెంచక ప్లీడరువృత్తి సంస్కరించడానికి ఒకసంఘము స్థాపించవలెనని ఎంచినాడు. కోర్టులో సాక్ష్యమిచ్చేవాళ్లు సత్యము పలుకనందుకు మంచికారణము చెప్పినాడు—నిజమాడేవాళ్లు సాక్ష్యానికి రారు; సాక్ష్యానికివచ్చినవారు నిజమాడలేరు. ఎందుచేతనంటే వాదిని బాధించేనిజము వాదితరఫువకీలుకి అక్కరలేదు; ప్రతివాదిని బాధించేనిజము ప్రతివాదివకీలుకి అక్కరలేదు. Cross examination ఆరంభించేసరికి ఎంతటిసాక్షి కూడ కవిత్వము ప్రారంభిస్తాడు. అందుచేతనే పెద్ద మనుష్యులు ఎంతన్యాయతత్పరులైనా బోనెక్కడానికి భయపడుతారు. ప్లీడర్లు అసత్యాలు సృష్టిస్తూంటే, ఉభయపార్టీలసాక్షులు వల్లెవేసి నేర్చుకొన్న అబద్ధాలు జడ్జిగారు చెయ్యి పీకేటట్లు వ్రాసుకొంటారు. ఈచూల కూడంతా తన కిష్టము లేదు గనుక సౌజన్యారావుగారు ప్లీడరువృత్తి మానుకోదలచుకొన్నారు. "సౌజన్యారావుగారు మహాదొడ్డవారు; కోట్లలో ఎన్నవలసినమనుష్యులు; ఆపదలో ఉన్న ఎవరికైనా ఆయన ఉపకారము చేయవలసినవారే; అధికార్లంతా ఆయనమాట వింటారు" అని రావుగారి ఎదుటిపక్షమువారుకూడా ఒప్పుకొన్నారు. ఆయన ఎప్పుడూ నిజము కనుక్కోడానికి పాటుపడేవారు. సంఘసంస్కర్తలు కావున వీరిసిద్ధాంతములలో మూడు ముఖ్యమైనవి:—

౧. ముసలివాళ్లు పెళ్లిచేసుకోగూడదు; ౨. కన్యాశుల్కము కానిపని; 3. యోగ్యులైనవిధంతువులు చక్కగా పరిశీలించి యోగ్యులైనవాళ్లను వివాహము చేసుకోవచ్చును. ఇవి లుబ్ధావధానికి చక్కగా బోధించినారు.

రావుగారు సానులను చూడరు. గుంటూరు శాస్త్రిగారి మతమున ఇంగ్లీషుచదువుకొన్నవాళ్లలో కొందరికి పట్టుకొన్నదట ఈచాదస్తము. ఈ Anti nautch movementలో దేశకాలములబట్టి రకరకాలున్నవట- గంజాముజిల్లాలో ౧౮౯౦-౯౧ సం. రములలో ఇట్టిసంఘములు కొన్ని ఏర్పడి చాలా మందియువకు లందు చేరి సానిమేళములు చూడమని పెళ్లిళ్లు మొదలయిన ఉత్సవదినములలో ఇట్టి మేళములక్రింద ధనము వ్యయముచేయకుండా సభలలో నుపన్యాసము లిచ్చి అందరినీ నిరుత్సాహపరుస్తామని లిఖితపూర్వకముగా ఒప్పుకొనిరి. కాలక్రమమున వారి ఆచరణలో కొన్నిమార్పులు తటస్థించి మొదటి ఊక నానాటికి సడలింది. అందుచేత రకరకాల anti-nautch లు బయలుదేరినారు. అట్టివారికి కరటకశాస్త్రి యథాశక్తి anti-nautch లని పేరుపెట్టినాడు. "పొజుపొజంతా మాటల్లో మహవీరులు; కొందరు పొగలు anti-nautch, రాత్రి pro-nautch- అనగా రహస్యంగా రాత్రిళ్లు సానికొంపల్లో మాకే

వారు; కొందరు ఉన్నఊళ్లో anti, పరాయి ఊళ్లల్లో pro; కొందరు శరీరదార్ఢ్య మున్నంతకాలము pro, శరీరము చెడ్డతరువాత anti; కొందరు బలిమున్నంత కాలము pro, చచ్చినతరువాత anti; మరికొంద రదృష్టవంతులు చచ్చినతరువాతకూడా pro, అనగా యజ్ఞాదిక్రతువులుచేసి పరలోకములో రంభాసంభోగానికి టిక్కెట్లు ఇహలోకమందే కొంటారు. జన సామాన్యములో అల్పప్రజ్ఞకలవాళ్లు లభ్యమయినప్పుడు pro, లభ్యముకావంటే anti. ఈపట్టికబట్టి ఈ సంస్కార మేలాగు పరిణమించినో తెలియగలదు. సౌజన్యారావుగారు ఈమానమువారు కారు. వారు మనోవాక్కర్మల సదా anti-nautch; అందుకే ఆయన్ని అచ్ఛాణీ అన్నాడు కరటకశాస్త్రి.

రావుగారు లుబ్ధావధానికి చేసిన ఉపదేశము ఎంతఫలవంతమైనదో చూసినాము కదా? ఆ బోధన లేకుంటే లుబ్ధునికి పశ్చాత్తాప ముండదు; అతడు మానవుడే కాకపోవును. పాపము పరిపక్వమయినందు వల్ల అతనిబుద్ధి మారింది. రావుగారు అగ్నిహోత్రునికి కూడా హిత ముపదేశించినారు; కాని ఫలము లేక పోయింది. ఆరో అంకములో ఏడో రంగము చూడండి. అందులో అగ్నిహోత్రు డాడినవన్నీ అవకతవకమాటలే. పిల్లల నమ్ముకోవడము వాళ్ల కుటుంబములో మూడుతరాలనుంచి అవిచ్ఛిన్నముగా జరుగుతున్నది గనుక అది శిష్టాచారమట! ఆపిల్లలను వయస్సు చెల్లినవరులకే ఇచ్చినారట; వాళ్లంతా పుణ్యస్త్రీ చావే చచ్చినారట; బుచ్చమ్మ ప్రారబ్ధము చాలక పోవడముచేత వితంతు వైనదట! పెద్దవాడి కిస్తే వైధవ్యము నిశ్చయమంటే, ప్రారబ్ధము చాలకుంటే పిన్నవాడికిచ్చినా వైధవ్యము వస్తుందట. నుదుటివ్రాత ఏలాగుంటే ఆలాగు జరుగుతుంది. దాన్ని ఎవ్వడైనా తప్పించగలడా? అన్నాడు. అప్పుడు రావుగారు, "సరే, విధికృతమని మీరు పురుషప్రయత్నము మానుకొంటారా? దావాచేసినా రనుకోండి; విధికృత మేలాగుంటే అలా గవుతుందని ప్లీడరును పెట్టడము మానుకొన్నారా? పైసా కాశపడి పసిపిల్లను పల్లుపడి పోయినవాడికి మీరు కట్టిపెట్టి వైధవ్యము ప్రాప్తిస్తే పిల్లప్రారబ్ధ మనడము ఏమిన్యాయమండి?" అని అడుగగా దానికి జవాబు చెప్పలేక "శాస్త్రులు మాత్రము వరశుల్కము పుచ్చుకోలేదా? అదిమాత్రము కూడునేమి?" అని ప్రశ్న వేసినాడు. ఈ సందర్భము ననే "మీశాస్త్రులలోనే ఆడపిల్లలకి 'ఇన్ని తులాల బంగారము పెట్టవలెను' అని నిర్ణయించుకోలేదా? అని అడిగినాడు. ఈరీతి ప్రచారములో నున్నట్టు కనబడదు. రెండోపెళ్లి వరునికి పిల్ల నివ్వదలచుకొన్న వాళ్లు సవతిబిడ్డలు, అన్నలు, తమ్ములు మొదలైన వారసు లున్నప్పుడు తమపిల్లకు కొంతసొమ్ము కేటాయించడానికి ఈపరకు కోరుదురేకాని అందరు శాస్త్రులలో ఇట్టి ఆచారమే లేదని చెప్పవచ్చును. ఒకవేళ ఉన్నా అది కన్యాశుల్కము కానేరదు. అవధానిగారి మొండివాదనకు ఇది గొప్ప ఉదాహరణము.

సౌజన్యారావుగా రితనికి బోధించినవిషయములు రెండు:—మొదటిది, "మీసుబ్బిని మర్యాదగలయింట బుట్టిన బుద్ధిమంతుడను కుర్రవాడికి పెళ్లిచేయండి"; రెండోది:—మీపెద్దపిల్లమాట, "ఆమెను వితంతువుల మఠముకు పంపండి. సంఘసంస్కారసభవారు ఆమెకు విద్యాబుద్ధులు నేర్పుతారు. ఆమె ఎక్కడైనా సుఖంగా ఉండడము కదా మీకు కావలసినది. ఆమె తాలూకు ఆస్తి కొంత, మీవద్ద ఉన్నదట, దానిని ఆమె కిచ్చివేయండి." అవధానిగారికి ఈరెండూ కిట్టలేదు. ద్రవ్యాశాపీడితు డౌటచేత వాటి కొప్పుకోలేదు. మొదటిదానికి జవాబే చెప్పలేదు; రెండోదానికి కోపావేశమున—"ఏమిటి ఈ ముండా ఏడుపుసంత! మీ రెవరు? అదెవర్తె? నాపిల్లా? ఫకీరుముండ! ఇంటికి వెళ్లగానే నేను ఘటాశ్రాద్ధము పెట్టేస్తాను; లేదా ఆవెధవ పెళ్లిచేసుకోకుండా నాయిల్లు చేరితే ఇంట్లో పెట్టుకొంటాను. అంతేకానిఆస్తిగీస్తి ఇమ్మంటే ఇచ్చేవాణ్ణికాను" అన్నాడు. (బ్రాహ్మణులలో ఎవర్తె అయినా జాతి చెడగొట్టుకొంటే ఆమె బంధువులు ఘటా-

(శ్రాద్ధము పెట్టుదురు.) రావుగా రతన్ని భయపెట్టదలచి "బుచ్చమ్మ ఆస్తి ఇచ్చివేయకపోతే మామీద తప్పకుండా దావాపడుతుంది. నిష్కారణముగా ఖర్చులు తగుల్తవి" అని హెచ్చరిస్తే "నేను అగ్రహారపు చెయ్యిని. దావా గీవా అని బెదిరిస్తే భయపడేవాడను కాను" అని బీరములు పల్కినాడు, అవధాని. ఇంతలో దయాదాక్షిణ్యములు లేని దానవుడని గ్రహించి రావుగారు, "నామాట విని బుచ్చమ్మఆస్తి చిక్కులుపెట్టకుండా ఆమెకిచ్చి గిరీశంగారిమీద Abduction Case తేవడము ప్రయత్నము మీరు మానుకుంటే లుబ్ధావధానిగారు మీమీద తెచ్చినకేసులు తీయించేస్తాను. మీపిల్లమీద మీకు కనికారం లేకుంటే పోనీ, డబ్బు ఖర్చవుతుందనేభయముచేత స్వలాభమైనా ఆలోచించుకోండి" అనిసలహాఇస్తే కార్పణ్యము కన్నుకప్పగా, "వెధవముండని లేవతీసుకోపోయిన పకీరువెధవ పక్షమున మాట్లాడుతున్నావు, ఏమిపెద్దమనిషివయ్యా? నేనా కేసు వదలుకొంటాను! ఆవెధవ కనబడినట్టాయినా కూనీచేస్తాను. పెద్దప్లీడరు ప్రత్యుత్థానము చేసి పిలిచాడంటే కేసుల్లో ఏమిసలహాచెప్పుతాడో అని భ్రమపడ్డాను. వెధవముండలికి పెళ్లిచెయ్యడపు పోయికాలము పట్టుకుందేమి పెద్దపెద్దవాళ్లకి కూడాను?" అన్నాడు. చూసినారా సంభాషణ ఎంతమార్దవంగాను, గౌరవముగాను ఉందో? తాముచేసినతప్పు చూపిస్తే కోపావేశముచేత కొందరు మతిపోయి ఇట్టికారుకూతలు కూస్తారు. రావుగారు ఇది తెలిసి కోపపడక నెమ్మదిగాను, దృఢముగానూ "లుబ్ధావధానితరఫున మీమీద గ్రంథము నడిపించవలసినవాడను నేనే. మీరు వృథాగా డబ్బుతట్టుబడీ, శిక్షా, క్షూణతకూడా సంభవిస్తాయికదా అని ఇంతదూరము చెప్పుతున్నాను. మంచికి మీరు మనుష్యులయినట్టు కనబడదు. పెద్దపిల్లఆస్తివిషయమైకూడా దావా నేనే పడేస్తాను. ఇంటికివెళ్లి ఆలోచించుకొని నాసహాయము కావలసిఉంటే తిరిగిరండి" అని పంపించివేసినాడు.

నాటకముతుదిసీనులలో రావుగారు గిరీశంతోనూ, మధురవాణితోనూ ప్రసంగిస్తారు. ఆసంభాషణ మిక్కిలి రసవంతమైనది. కపటమెరుగనిగౌరవనీయులు కావున రావుగారి నతిసులభముగా మోసగించవచ్చుననే ధైర్యముతో గిరీశం ఆయనచెంత జేరి తాను పరోపకారి, సత్యపరుడని ఆయనకు తట్టునట్లు ప్రసంగము మొదలుపెట్టినాడు. నిజమైన సాక్ష్యము నిరుపయోగము, నిష్ప్రిప్యము అయినందుకు ఎంతో చింతించినవానిలాగు నటించి "లుబ్ధావధానిగతి ఏమికానుం" దని అడిగె, "సంటూరుశాస్త్రి పట్టుబడేమార్గము చూపిస్తే మూడులోకాలు గాలించి పట్టుకొంటా" నన్నాడు. ఈమాటలవల్ల ఇతడు పెద్దమనిషి అని రావుగారు నమ్మికొని "మీయోగ్యతకు నాకు చాలాసంతోషముగా ఉంది. మీలాంటి young men హెచ్చుగాఉంటే మన దేశము బాగుపడుతుంది. ఈకారణమువల్ల మీ వివాహము postpone కావలసివస్తుందికదా అని విచారిస్తున్నాను" అని గౌరవించినారు. పిదప గిరీశము కొన్ని డాబులు కొట్టి తనస్నేహితులందరూ తనకు Nepoleon of the anti-nautch movement అని పేరుపెట్టినారనిన్నీ, తాను యోగము, ఇంద్రియనిగ్రహమూ అభ్యసిస్తున్నాడు కావున Duty first, and pleasure next అనే మహావాక్యము ఆదర్శముగా నుంచుకొని వర్తిస్తున్నాడనీ ప్రగల్భము లాడి తన్ను లుబ్ధావధాని పెళ్లియాడేఏర్పాటు చేయవలసిందని ప్రార్థించి అందుకు వీలులేకపోతే Power of Attorney అయినా వ్రాయించవలసిందని ప్రాధేయపడ్డాడు. ఇంతవరకూ అతనిపాచిక పారింది. ఇది లోకస్వభావము; తానెట్టివాడో అందరూ అట్టివారే అనుకోవడము సర్వసామాన్యధర్మము. మనుష్యులస్వభావములు వివిధరీతుల ననుసరించునని అనుభవసిద్ధమయినప్పుడు ఈ సిద్ధాంతము మారుతుంది.

ఈ పరిస్థితులలో మధురవాణి మగవేషములో రాగా గిరీశం పోల్చి నివ్వెరపడి వెంటనే సమాళించుకొని ద్వ్యర్థిగా "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్," అనేన్యాయప్రకారము ఒకరిని కాపాడి ఉపకారముచెయ్యడము ఉత్కృష్టమైనపుణ్యము. వాడిమానాన్న వాడు బతుకుతూన్నవాడికి నిష్కారణముగా

అపకారము చెయ్యడము పాపానికి కారణము" అని శ్రీరంగనీతులు పలికి ఈమాటలవల్ల రావుగారికి తనయెడల దయకల్గడమున్నూ మధురవాణి తనగుట్టు రట్టుచేయకుండా తనమర్యాద కాపాడవలసిందని బతిమాలుకోడమున్నూ—ఈరెండు లాభాల నాశించి వాక్చాతుర్యము కన్పరచినాడు; కాని ఇది వ్యర్థ ప్రలాపమే. రావుగారివలెనే మధురవాణికికూడ అసత్యము, బడాయి, వంచనలు కిట్టవు. అట్టివాళ్లు బహిర్వేషములవల్ల ఎంతోకాలము మోసపోరు. "మంచివారి యెడ మంచిగాను, చెడ్డవారియెడ చెడ్డగాను ఉండుమని మాతల్లిగారు ఉపదేశము చేసినారు; అందుచేత తమతో అబద్ధమాడ" నని ఆమె రావుగారితో నిష్కర్షగా చెప్పింది. ఇందువల్ల ఆయనకు పరమానందము కలిగి "చెడ్డవారియెడకూడా మంచిగాఉంటే లోకము బాగుపడుతుంది"అని పరమోత్కృష్టమైన ఆదర్శము బోధించినారు. గిరీశంగుండె చెక్కలయింది. మధురవాణి తనమర్మము నిలిపేటట్టు లేదు. కనపడినవాళ్లకళ్లు కప్పుకలిగినకపటమునకు కాలము మూడింది. ఇది గొప్పఅవమానము. ఋజుమార్గవర్తియైన రావుగారు తన యథాస్థితి ఎరిగినట్టయితే లుబ్ధావధానివద్దనుండి కాసైనా రానీయడు, విశ్వప్రయత్నము చేసి తాను వశపర్చుకొన్న వితంతువును వివాహము కానీయడు. మధురవాణి గిరీశంకొంపముంచుతుంది. సన్మార్గవర్తనుల సరస దుర్మార్గుడు తలయెత్తలేడు. సత్యవాక్పరుల ఎదుట సత్యదూరుల జంఝాటములు సాగవు. నూరుగొడ్లను తిన్నరాబందుకి ఒక్కగాలివాన రాదా? ఇదంతా ఆలోచించుకొని నిరాశతో "అపకారికి నుపకారము నెపమెన్నకచేయువాడె నేర్పరి" అని ప్రార్థించి "బలవానింద్రియగ్రామోవిద్వాంసమపికర్షతి"—అనగా 'ఎంతమంచివాడినైనా, ఎంతకట్టుదిట్టమైనవాడినైనా కర్మ రెక్కపట్టుకొని తప్పుతోవలోకి లాగుతుంది' అని కారణము చెప్పేసరికి ఇంకా గిరీశంకి బుద్ధి రాలేదని గ్రహించి మధురవాణి వ్యర్థిగా "నటనవల్ల కొద్దికాలమే లోకానికి కళ్లు కప్పవచ్చును; కాని నిడివిమీద బంగారాన్ని ఇత్తడినీ లోకము ఏర్పరుస్తుంది" అని సౌజన్యారావుగారి మంచితనమును అభినందించింది.

"మీరు వచ్చినపని చెప్పినారుకారు" అని పంతులుగారు అడుగగా మధురవాణిని మాటలాడనివ్వకూడదనే దురుద్దేశముతో "నేను కనుక్కొని తమతో ఉదయము మనవిచేయనా?" అని పిలువనిపేరంటమునకు వచ్చి "వారికి నేనేమైనా సాయము చేయడానికి వీలుంటుందేమో అనీ, తమకు నిద్రవేళ అయిందనీ మనవిచేసినా"నని అసత్యమాడి వంచించ నెంచినాడు. మధురవాణికి ఈఅసంగతప్రసంగము కిట్టలేదు... తానదివరకు వ్యంగ్యముగా పల్కినమాటలు అమాయికులైన రావుగారికి బోధపడనందువల్ల గిరీశంప్రతిభ వాచ్యముగా చెప్పనెంచి "గిరీశంగారు లోకోపకారపరులు; వారి నెరుగనివారెవరు?" అని ఆమె మొదలుపెట్టగానే ఇక తనఆబోరు దక్కదని నిశ్చయించి పరుంటానని చెప్పి అక్కడినుండి పారిపోతూ ఆమెను బతిమాలుకొనెను. ఈశమభిమలు ఆమెవద్ద చెల్లవు. "గిరీశంగారు Anti-nautch movement కి గురువు" లని రావుగారంటే "ఆయన నాకుకూడా గురువులే" అన్నది. పంతులుగారు సంతసించినారు. గిరీశం దాటినాడు. అటుపిమ్మట వేశ్యజాతియెడ రావుగారికి ఎట్టి అభిప్రాయముందో తెలుసుకోవలెనని ఎంచి,

మధు—వేశ్యలను పాటకు పిలువకపోతే వాళ్లు బతికడ మేలాగండి?

సౌజ—పెళ్లి చేసుకుంటే సరి. వేశ్యలు విద్య నేర్చుకొని ఇతరవృత్తులవల్ల సత్కాలక్షేపము చెయ్యరాదా?

మధు—వేశ్యజాతి చెడ్డ కావచ్చును; కాని చెడ్డలో మంచి ఉండకూడదా? మంచి ఎక్కడనున్నా గ్రాహ్యముకాదా?

సౌజ—మంచి ఎక్కడున్నా గ్రాహ్యమే. మీరు వచ్చినపని ఏమి?

మధు—నాపనిమట్టుకు మిమ్మల్ని చూడడమే.

సౌజ—చూడడానికి నిశీథవేళ రావలెనా ?

మధు—అవధాన్లుగారికేసులో గట్టిసహాయము చెయ్యగలమనిషిని నే నెరుగుదును.

సౌజ—అలాగైతే మిమ్మ మాపాలిదేవుణ్ణిగా భావిస్తాము.

మధు—అంతమాట నాకు దక్కాలికదా ?

సౌజ—ఏమి ? అలా గంటున్నారు ?

మధు—మరేమీ లేదు. ఆకార్యసాధనము ఒక వేశ్యవల్ల కావలసిఉన్నది

సౌజ—డబ్బు ఇద్దాము.

మధు—ఆవేశ్య ద్రవ్యానికి సాధ్యురాలు కాదండి.

సౌజ—మ రేమికోరుతుంది ?

మధు—ఆమెకోరిక అసాధ్యమని తలుస్తాను. చెప్పితే మీకు ఆగ్రహము రావడమేకాని కార్యము ఉండదనుకుంటాను.

సౌజ—తన్ను ఉంచుకోమంటుందా ఏమిటి ? అది యెన్నడూ జరిగేపని కాదు.

మధు—ఆముసలిబ్రాహ్మణుని దురదృష్టము ! మన మేమిచేయగలము ?

సౌజ—ఎంతబుద్ధిహీనురాలు ! నేను మన్మథుడననా నన్ను వలచినది ?

మధు—మిక్కిలిమంచివారని కాబోలు.

సౌజ—సానిదానికి మంచితో పని ఉండదు. ఇదేదో ఎత్తై ఉండాలి.

మధు:—తమకు ఉంచుకోవడము మనస్కరించకపోతే, తన్ను వివాహము కావచ్చునని ఆమె అభిప్రాయము.

సౌజ—వేశ్య డబ్బొల్లకపోదు. ద్రవ్యము కోరుమనండి; ఆయనైనా ఇస్తాడు, నేనైనా ఇస్తాను.

మధు—అందాకా ఎందుకు ? ఆబ్రాహ్మణునికి ఉపకారార్థము నేనే యివ్వగలను. ఆమనిషి ద్రవ్యానికి సాధ్యురాలు కాదని చెప్పలేదా ?

సౌజ—మీరు గిరీశముగారిశిష్యులన్నారే. వేశ్యవల్ల యీభోగట్టా యావత్తూ మీ కెలాగువచ్చింది ? ఎగతాళి; కుట్ర కావచ్చును.

మధు—ఎగతాళీకాదు; కుట్రాకాదు. నేను అక్షరాల Anti-nautch నే. వివేకలేశము ఉన్నవారెవరు Anti-nautch కారండి ? కాని విధికృతము చేత నాకు వేశ్యాసంసర్గ తప్పిందికాదు. (అని వేషము విప్పి) నా ఊరు విజయనగరము, పేరు మధురవాణి.

సౌజ—ఎంత మోసము ?

మధు—అయ్యా, చెడ్డలోకూడా మంచి ఉండవచ్చునన్నారుకదా ?

సౌజ—ఏమిదగా !

మధు—నిర్మలమైన అంతఃకరణతో వస్తిని. మీకు దగా అని తోచింది—వెళ్తాను.

సౌజ—లుబ్ధావధానిమాట ఏమిటి ?

మధు—ఆయనయందు మీ కట్టే అభిమానము భగవంతుడు పుట్టించ లేదు.

సౌజ—ఆయనను కాపాడడానికి న్యాయమైన పని యేది చెయ్యమన్నా చేస్తాను. నేను వేశ్యతో ఎన్నడూ మాట్లాడ లేదు. ఈ నాటికి వ్రతభంగమయ్యెనుకదా అని చింతిస్తున్నాను.

మధు—వేశ్యలు పార్టీ ఐతే కేసు మీరుపట్టరా ?

సౌజ—నీవు పార్టీవైనా కావే ?

మధు—దేవాలయములో భగవంతుని చూడడమునకు పోవచ్చునుకాని మీబోటి సత్పురుషుల దర్శనమునకు మాత్రము మాకు నిరోధమా ?

సౌజ—నా శత్రువు లెవళ్లో నిన్ను నాదగ్గిరకి పంపినారు.

మధు—అలాగైతే తమ మంచితనమే తమకు శత్రువై ఉండాలి. మీకార్యం నిర్వహించి డబ్బు ఒల్లనప్పుడు కుట్రలేదని నమ్ముతారా?

సౌజ—నీ వంత మంచిమనిషివైతే పాప మా బ్రాహ్మణునికి ఉపకారము చెయ్యరాదా? మధ్య నాకు గంపకత్తెర ఏమి?

మధు—నేను మంచిదాన్నని నమ్మగలరా?

సౌజ—ఆ బ్రాహ్మణుని కాపాడితే నమ్మనా?

మధు—అయితే తునితగువు మనవిచేస్తాను. ఒక్కచిన్న ముద్దుకి కరువో?

సౌజ—అంతటితో కార్యము నిర్వహిస్తావా?

మధు—ఏమిచెయ్యను?

సౌజ—నావ్రతభంగము చేయడమేనా నీపట్టుదల?—నెయ్యిరూపాయి లిస్తాను; తీసుకొని ఆబ్రాహ్మణుని కాపాడు. (మధురం పోబోవును) వెళ్లకు; నీకు ముద్దాకావలె? ఏమి వెర్రిదానవు! ఏమి లాభము?

మధు—నాకు తెలియదు.

సౌజ—తప్పదూ?

మధు—తప్ప దనుకొంటాను.

సౌజ—అయితే విధిలేక ఒప్పుకొంటాను. చిత్రము! నెయ్యిరూపాయిలకన్న ఒకముద్దు ఎక్కువ విలవా?—సరే—నీవుచేసేసాయ మేదో చెప్పు.

మధు—తెల్లబియ్యము, పాటిమానికా. లుబ్ధావధాన్లు వివాహమైనపిల్ల ఆడపిల్ల కాదు.

సౌజ—ఏమిటీ?

మధు—అందుతో సంబంధించినవాళ్లకి ఎవరికీ హాని రాకుండా కాపాడుతానని సెలవిస్తేనే కాని పేర్లు చెప్పజాలను.

సౌజ—లేకుంటే చెప్పవా?

మధు—చెప్పను.

సౌజ—లుబ్ధావధానివల్ల ఎవరికీ బాధ లేకుండా కాస్తాను.

మధు—కరటకశాస్త్రిగారు వారిశిష్యుడికి ఆడవేషము వేసి పెళ్లిచేశారు.

సౌజ—కరటకశాస్త్రియా సుంటూరుశాస్త్రి?

మధు—మరేమి?

సౌజ—ఔరా, అతఃగానిదారుణము!

మధు—అతనివల్ల తప్పు లేదండి. లుబ్ధావధాని సంబంధము తనమేనకోడలికి తప్పించవలెనని ఆత డీయెత్తు వేసినాడు. ఆయనకుమాత్రము హాని రానీకండి.

సౌజ—నేను మేలుకున్నానా? నిద్రపోతున్నానా?

మధు—నాఫీజు యిచ్చి మరీ నిద్రపొండి.

సౌజ—బీదవాణ్ణి ఇచ్చుకోలేను—నీవు సాగ సరివి; ముద్దు చేదనికాదు. వ్రతభంగముకదా అనిదిగులు...... (ముద్దుపెట్టుకొనబోవును.)

మధు—ఆగండి.

సౌజ—ఏమి?

మధు—నాకొక వ్రత ముంది. చెడనివాళ్లని చెడగొట్టవద్దని మాతల్లి చెప్పింది. అందుచేత, మిమ్మల్ని ముద్దుపెట్టుకో నివ్వను.

సౌజ—కృతజ్ఞుడను. నీవు మంచిదానవు. ఎవరో కాలుజారిన సత్పురుషునిపిల్ల వైయుంటావు. ఈవృత్తి మానలేవా? స్థితిలోపమా?

మధు—దైవానుగ్రహమువల్ల లోపము లేదు. సత్పురుషులదయ సంప్రాప్తమైనతరువాత దుర్వృత్తి ఎందుకుంటుంది? వృత్తిమానుకుంటే అప్పటప్పట తమ దర్శనము చేసుకోవచ్చునా?

సౌజ—తప్పకుండా రావచ్చును.

మధు—కృతార్థురాలను, సెలవా?

సౌజ—నీకు గిరీశముగారిపరిచయ మెక్కడ?

మధు—క్షమించండి.

సౌజ—చెప్పవా ?

మధు—తాము చెప్పకతీరదని ఆజ్ఞాపిస్తే దాట గలనా ? పాపము, ఆయన బతకనీయండి.

సౌజ—వీడు అన్యాయస్థుడైతే పాప మాబుచ్చమ్మ బతుకు చెడుతుంది; అది ఆలోచించినావు కావు.

మధు—ఆయన నాకు కొంతకాలము ఇంగ్లీషు చెప్పేవారు, కొంతకాలము ఉంచుకున్నారు కూడాను.

సౌజ—ఎన్నాళ్లకిందట ?

మధు—మొన్న మొన్ననే.

ఇంతతో గిరీశముపుట్టి మునిగింది. పాపము, బుచ్చమ్మని పెళ్లాడుదామని కొండంత ఆశ పెట్టుకొని లుబ్ధావధానివద్ద యథాశక్తి డబ్బు లాగుదామని యత్నిస్తూఉంటే, మొదటికే మోసమువచ్చింది. "కొండనాలుక కు మందువేస్తే ఉన్న నాలుక ఊడింది" సౌజన్యారావు గారి పాత్రమున కుపయోగ మిది. పైని ఉల్లేఖించిన సంభాషణలో ప్రతివాక్యమూ ఆపాత్రలపోషణమునకు పనికివచ్చేదే. ఏమిధైర్యము! ఏమి న్యాయసరళి! ఎంత పరోపకారబుద్ధి! ఒకబ్రాహ్మణునిప్రాణము రక్షించుటకై రావుగారు తనవ్రతమునుకూడాభంగపెట్టుకోవలచి నారు. ఎంతవిమృశ్యకారి. ఇతనితోడి సాంగత్యమువల్ల ఎంతమంది బాగుపడ్డారు? అట్లుకానివా రిద్దరే-అగ్నిహోత్రావధాని, గిరీశము. వీరు సహజమర్మార్గప్రవర్తకులు, స్వార్థపరులు, మత్సరులు, పాపభీతిలేనివారు. దుష్ప్రవృత్తి వీరియందు వేరుతన్ని రోమకూపములు రక్తనాడులు-నఖశిఖపర్యంతమూ పాపాక్తము లవుటచేత వీరిద్దరి బుద్ధిపుడకలతోగాని పోయేది కాదు. తెలిసీతెలియని మూర్ఖులు. రావణుడు, దుర్యోధనుడు, ఇయాగో మొదలైనవాళ్లతో పోల్చవచ్చును. ఇట్టివాళ్లని Tragic heroes అంటారు; వీరు తాము చెడకమేకాకుండా అమాయికుల ననేకుల చెడుపుతారు. Shakespear వ్రాసిన ఒతెల్లోనాటకములో Iago నేరములు బైటపడిన Scene కీ ఈ నాటకములో చివరసీనుకీ సామ్యము కొంతఉన్నది. రెండింటిలోనూ కపట మార్గానువర్తులైన దుష్టులు (Villians) శృంగభంగము పొందినారు. Iago తుదకు—"నేను చేసిన దేదో చేసినాను. ఇంక మాటాడను" అన్నాడు; గిరీశము "Damn it కథ అడ్డంగా తిరిగిం" దన్నాడు. ఇందులో ఎవరు ఘనులు ?

ఇంతటితో ముఖ్యమైన పురుషపాత్రములు ముగిసినట్టే. వీరుకాక మిగిలినవాళ్లుకూడా కథాసరళికి అవసరమైనవాళ్లే. పలురకముల పురుషులు ప్రపంచమున ఉన్నారు. అందులో కొన్నిరకములు ఈకథకు సంబంధించినవారు. ఒకరినిపోలినవాళ్లు మరొకరు లేరు-వ్యర్థులు అసలే లేరు. వీళ్లను కల్పించడములోనూ కవిచాతుర్యము కనబడుతుంది.

—స్త్రీపాత్రములు

ఇక స్త్రీపాత్రములలో ముఖ్యమైనవి మూడు-మధురవాణి, బుచ్చమ్మ, మీనాక్షి. వెంకమ్మ (సుబ్బితల్లి) రెండురంగములలోనే వచ్చును. ఆమె సర్వసామాన్యమైన గేస్తురాలు. "బుచ్చమ్మపెళ్లి బుగ్గిఅయినది; గుండెలుమీది కుంపటిలాగు భరిస్తూనే ఉన్నాము: సుబ్బికికూడా వయసుమీరినవాడి కియ్యావ"ద్దని పెనిమిటి చెవి నిల్లుకట్టుకొని పోరింది; మూర్ఖుడు ఆమె సలహాను పెడచెవిని బెట్టినాడు. వెంకమ్మకు సంతానవాత్సల్యము మెండు. వెంకటేశముకి చదువు చెప్పించి వాడిచేత గొప్పఉద్యోగము చేయించవలెనని ఈమె యూహ. ఈమె పుట్టింటివాళ్లు కాస్తసంపన్నులు కనుకనే పసుపుకుంకానికి భూమి యివ్వడమే కాకుండా ఎప్పటికప్పుడు యథాయోగ్యము పరిదానము లివ్వడము చేతనే "మనసొమ్ము చెడతిని కొవ్వున్నా" డంటాడు కరటకశాస్త్రి. పతి తనమాట విననప్పుడు సతి కింకేమున్నది ? నూతిలోనో, గోతిలోనో పడతానని పట్టుబట్టింది. పెనిమిటి ముక్కోపి; గిరీశమును అనరానిమాట లన్నాడని ఎంతో నొచ్చుకొని "ఆయన మాటలు గణించకు బాబూ, ఆయన మోస్త రది... ఇంటి కెవరొచ్చినా నా కిదేభయము...వెళ్లిపోకండి బాబూ" అంది. పెళ్లికి తర్లివెళ్లినప్పుడుకూడా—

"ఈసంబంధము వద్దని పోరితే విన్నారా?" అని ప్రార్థిస్తే—"పింజారీ! ఊరుకో!" అని అగ్నిహోత్రుడు కసరినాడు. ఈమెయం దింకేగుణాలూ స్ఫుటముగా కనబడవు.

పెళ్లికూతురు సుభద్ర పెదవి కదల్పనే లేదు. ఆమెసంగతి ఎవరికీ అక్కర లేదు—పసిపిల్ల. ఆమె యోగక్షేమాలబాధ్యత తలిదండ్రులకే ఉంది; పెళ్లికి తల్లి ప్రతికూలముగా నుందని ఎరిగి ఆమెతలదన్ని తండ్రి యావద్భారము తానే వహించి తడిగుడ్డతో దానిగొంతు కోయ నిశ్చయించినాడు. వస్తుతః సుభద్ర కేమీ తెలియకపోయినా ముసలిమగడంటే ఇష్టముండదు; కాని దాని నడిగేవారూ లేరు, దానిమాట వినేవారూ లేరు.

బుచ్చమ్మ తలిదండ్రులచాటుబిడ్డ-పల్లెలో నుండడమూ, శిష్టసంప్రదాయముగల కుటుంబములో పుట్టడముచేతనూ వెర్రివేషాలు వేయక నాలుగుగోడలమధ్య పడి తనప్రారబ్ధమని మర్మవ్రణమువంటి వైధవ్య దుఃఖము దిగమింగింది. ఈమె నడవడి బాగున్నందుకు గిరీశమే సాక్షి—"ఇది చెప్పినట్లల్లా వశమయ్యే మనిషి కాదు. నా experience (జారమార్గాలు), నా శృంగారచేష్టలు గుడ్డిగవ్వంత పనిచెయ్యకుండా ఉన్నవి. ఇంత simplicity ఎక్కడా కానలేదు. దీనికి love signals ఏమీ తెలియవు. చమత్కారంమాటలు ఆడితే ఏమిన్నీ అర్థం చేసుకోలేక ఆలేడి కళ్లతో తెల్లబోయి చూస్తుంది—ఇది pure diamond-utterly innocent widow. ఈ బుచ్చమ్మ సాక్షాత్తు Widow with gilt letters" అని మెచ్చినాడు.

ఇటువంటి సంప్రదాయముగల బాలవితంతువు కంటపడగానే కూడని చనువు కైకొని శృంగారకథా కాలక్షేపములచేతనూ, మూఢవిశ్వాసఖండనముచేతనూ, పునర్వివాహానంతర సుఖానందాతిశయవర్ణనముచేతనూ, మిథ్యాశయసిద్ధాంతీకరణములవల్లా, తుదకు సర్వానర్థదాయక సోదరీవివాహనివృత్త్యాశచేతనూ గాలమునపడ్డ పెనుచేపలాగున ఓపికతో మెల్లగా లాగి బుట్టలో వేసినాడు. ఇదే దురాచారపరురాలైతే ఇంతశ్రమ అనవసరము. ఒకటి రెండురోజులలో ఒప్పించవచ్చును. ఎంతసద్వర్తనలైనా అతిజాగరూకతతో పెంచుకొని రాకుంటే దుస్సాంగత్యమున చెడుతా రనడానికి బుచ్చమ్మ తార్కాణము. గిరీశ మెంతో మహాప్రయత్నము చేసి ఎన్నోసారులు హతాశుడై పట్టినపట్టు విడువక పాకులాడినాడుగనుక తుదకు సాధించినాడు.

బుచ్చమ్మ వట్టి అమాయికురాలు అయినా తెలివితేటలు కలదే. గిరీశము lecture ఇస్తూన్నప్పుడు ఆమె వేసిన ప్రశ్నలు పరీక్షిస్తే ఆమెబుజుమార్గసంపత్తి తేటపడుతుంది. మొదట గిరీశముస్వభావము కనుగొనడానికి వెంకటేశాన్ని కొన్నిప్రశ్నలు వేస్తే వాడు తగినజవాబు చెప్పలేకపోయినాడు; చూడండి:—

బుచ్చ—గిరీశంగారు గొప్పవారటరా?

వెంక—గొప్పవారంటే అలా ఇలాగా అనుకున్నావా ఏమిటి? అందరికంటే గొప్పవారు.

బుచ్చ—అయితే అతనికి ఉద్యోగం కాలేదేమి?

వెంక—Nonsense. నీ వాడదానివి. నీ కేం తెలియదు. ఉద్యోగం అంటే servant అన్నమాట. Servant అంటే నౌఖ రన్నమాట—హైదరాబాదు నవాబు వెయ్యిరూపాయలపని ఇస్తామంటే, నీప నెవడికికావాలి పొమ్మన్నాడు.

బుచ్చ—ఆయనికి పెళ్లయిందిరా?

వెంక—లేదు.

బుచ్చ—విధవలు పెళ్లాడడము మంచిదంటారుగదా, ఆయ నెందుకు పెళ్లాడినారుకాదురా?

వెంక—నీకు ఎంతచెప్పినా తెలియదు. ఆయన ఉద్యోగమూ, పెళ్లీ మానుకోవడము లోకం మరామత్తు చేయడానికట.

బుచ్చ—ఎలా మరమ్మత్తుచేస్తున్నారురా?

వెంక—నావంటికుర్రవాళ్లకి చదువుచెప్పడమూ, సానివాళ్లందరిని దేశంలోంచి వెళ్లగొట్టడము, National Congress అనగా దివాన్గిరీ చలాయించడం—

బుచ్చ—ఉద్యోగము చెయ్యరన్నావే? దివాన్గిరీ ఏరాజుదగ్గిర?

వెంక—ఆడదానివి, నీ కెందుకు కాషాయ అంతాను.

ఇలాగే గిరీశముతో ప్రసంగించినప్పుడూ అడిగింది. అతడు చేసినరెండు ప్రలోభనప్రయత్నములు ఫలించినవి. తత్ప్రేరణల కొన్నింటిని ఉదాహరింతాము. లోకాని కేమి ఉపకారాలు చేస్తారు? లోకము వెళ్లుతూన్న తప్పులోవ లేమిటి? మనవాళ్ల దురాచారాలు నాకు బోధపడలేదు. ముసలివాళ్లకి చిన్నపిల్లల్ని పెళ్లి చేయడము దురాచారమే. ఇప్పటి కప్పుడే బుచ్చమ్మ బుద్ధి మారుతూంది. శిష్టాచారములనీ, సంప్రదాయసిద్ధము లనీ మనవాళ్లనుకొనే వృద్ధవివాహాలు దురాచరణములని తెలుసుకొన్నది. "ఇట్టిపెళ్లి ళ్లైనతరువాత వైధవ్యము ప్రాప్తించి కష్టంసుఖం ఎరగని పసిపిల్లలు పూర్ణయౌవనవతులయిన తరువాత మనసు పట్టలేకపోతే వాళ్లదా తప్పు? పెళ్లిళ్లుచేసిన పెద్దలదా తప్పు?" అనే ప్రశ్నకు పెద్దలదే తప్పని జవాబు చెప్పవలసిందే కాని,అలా గనలేక "నాకు తెలియ"దన్నది. ఈమాత్రము తెలియకపోదు— పెద్దవాళ్లని నిందించకూడ దనుకొన్నది. ఇంకో ప్రశ్న చూడండి-పెళ్లి చేసుకుంటే మాత్రం లోకం మరమ్మత్తు చేయకూడదా?—ఎంత తెలివితేటలతో వేసిం దీప్రశ్న? దానికి తగిన సమాధానము ఇయ్యలేకపోయినాడు గిరీశము. ఒకపట్టాన వివాహము చేసుకోవడాని కొప్పుకొన్నదా? గిరీశాన్ని ముప్పతిప్పల బెట్టి మూడుచెరువులనీళ్లు తాగించింది. గిరీశముపాత్ర పోషణమును విమర్శించినప్పు డీవిషయము స్పష్టపరుపబడినది. గ్రంథము ఇప్పటికే పెరిగింది కనుక ఇంతటితో విరమించి ముందువిషయముగురించి ముచ్చటింతాము.

ఈనాటకములోని స్త్రీపాత్రలన్నిటిలోనూ మిక్కిలి నిర్వాహకమయినది మధురవాణి. దీనికి ముఖ్యపురుషపాత్రములన్నిటితోనూ సంసర్గ ముంది. సానులలో సంసారి. ఒకరిపోషణలో నున్నప్పుడు రెండోవారిని దరిజేరనీయదు. రామప్పంతులు పోషిస్తానంటే గిరీశము సంబంధము వదల్చుకొన్నపిదపగాని లొంగ లేదు. H.C.తో దీనికి మైత్రిఉందని రామప్పంతులు అనుమానించినాడేకాని అతనిచేత నౌఖరీచేయించుకోవడమే కాని హెచ్చుచను వేమాత్ర మీయలేదు. "కరటకశాస్త్రితో తనకులమర్యాద ఈరీతిని చెప్పుతుంది: మాకు ధనార్జనమే ముఖ్యపురుషార్థము. అదేనా పోషించేవారిపట్ల; కాని దయాదాక్షిణ్యాలు, స్నేహము లేకపోవు" సత్ప్రవర్తకులయెడ స్నేహముండును కనుకనే కష్టపడి ఆర్జించిన కంటె ఇచ్చింది. ఇక వలపు; బతుకనేది ఉంటే వలపు వస్నె తెస్తుంది. అంగడివానికి మిఠాయిమీది ఆశా, సానిదానికి వలపూ మనస్సులోనే మణగాలి. కొద్దికాలం ఉండే యౌవనాన్ని జీవనాధారముగా చేసుకొన్నమాకు వలపు బంగారముమీదనే. శృంగారము వస్నె చెడినదగ్గరనుంచీబంగారముకదా తేటతెచ్చేది. సరసులయిచ్చకాలకి సంతసించేసాని సమూలము చెడుతుందనేసామెత నమ్మి తల్లిబోధనప్రకారము నడుచుకొంటూ జరుగుబాటుకి లోపములేకుండా ధనమార్జించింది. సరసులతారతమ్య మెరిగి మెలగుతూండేది. పరిహాసరసిక. రామప్పంతులుకి ఎప్పటికప్పుడు తాటాకులు కట్టుతూండేది. గిరీశమన్నా లెక్కలేదు. వేశ్యావృత్తి సలపడము దాని కిష్టము లేదు. మొగ్గ తప్పినవెంటనే మానుకొన్నది. ధనార్జనమే దీని ముఖ్యోద్దేశము కాదు; దాతృత్వము, స్నేహము, దయ, దాక్షిణ్యములు కలిగి తగినరీతిని వర్తించేది. అన్యాయాచరణము దీనికి రుచించనందున సుబ్బిపెళ్లి తప్పించడానికి గట్టిప్రయత్నము చేసింది. మంచివాళ్లప్రాపే కోరుతూండేది. మనుష్యుల తారతమ్యము చక్కగా నెరుగును. కార్యవాదిని అవుటచేత తనకు కాబట్టినవాళ్లయెడ కలుపుకోరుగా నుండేది. రామప్పంతులు ఉడికినకొద్దీ ఉడికించేది. అతనియెడ కోపమువహించడమే కాకుండా వీలుచిక్కినప్పుడెల్లా విముఖి అయ్యేది. కంటె రహస్యముగా చేతిలో చిక్కినపిదపకూడా రామప్పంతులిని బాధించి అతనిమీదనే నిష్ఠూరముంచి తన ఊరుపోయింది. సౌజన్యారావుగారు మంచివా రని విన్నప్పటినుండి ఆయనను చూడ

వలె నని నిశ్చయించి మారువేషముతో రిశీథమున ఆతనియింటికి వెళ్లింది. ఇచ్చటిసంభాషణలో ఈమె నైజము తేటబడినది. చెడనివారిని చెరుపకూడదని ఈమె వ్రతము. కరటకశాస్త్రికి శిష్యుని భాగుచేసేమార్గము బోధించింది. ఆర్తులబ్రోచువేళలందు నిజసౌఖ్యభంగము కనుగొనదు. కావున మధురవాణిని అవదాతసువృత్త మూర్తులలో చేర్చవచ్చును. సౌజన్యారావుగారిని సందర్శించినపిమ్మట సానివృత్తి మానుకొన్నది. మిత్ర వాత్సల్యము కలదేకాని ఎవ రేమిచెప్పితే అట్లు చేసే చెనటి కాదు. విమృశ్యకారిణి.

ఇట్లే తరచినకొద్ది ఆమెయందు ధర్మమార్గాను వర్తనమే కనపడును కాని వంచన, లోభము, మత్స రము మెందలైన దుర్గుణములు అగపడవు. ఈపాత్రము పోషించడములో కవి ఆదర్శనిరూపణము (Idealism), యాథార్థ్యనిరూపణమును (Realism) తగినరీతిని నిపుణ తతో మేళవించినాడు. మృచ్ఛకటికనాటకములోని వసంతసేనాపాత్రమును చాలవరకు పోలి అంతకన్న యథార్థద్యోతకముగా నుండి స్వభావమును అనుకరిస్తూ న్నది మధురవాణిపాత్రము.

చదువరులారా! కన్యాశుల్కమనురూపకమును నాకు తోచినరీతిని విమర్శించి అందున్నగుణమును నా శక్తికొలది చూపినాను. ఇంతతో ఇది నాటకమో, ప్రహసనమో మీరే నిర్ణయించుకోండి.

కవిగారీనాటకమును ౧౮౯౭-వ సంవత్సరమున ప్రచురించిరి. అంతకుమున్నే దీనిప్రదర్శనమును విజయ నగరమున నేను చూచినాను. అప్పుడు ప్రేక్షకులలో సంతసించనివాళ్లు లేరు. కొందరి కీనాటకము కిట్టదు. అందుకు నాకుతోచినహేతువులు మూడు: మొదటిది భాష. వ్యావహారికభాషను ఒల్లనివా రిప్పటికీ తం డోపతండము లున్నారు. వాళ్లతో వాద మెందుకు? ఇది వ్యక్తికి వెగటు. రెండోవిషయము, గిరీశము బుచ్చమ్మను లేవదీసుకొని పోవడము. ఇది సంఘానికి వెగటు. మూడోది. హాస్యరసప్రాధాన్యము. హాస్య రసపోషణము మనకావ్యములలో అతివిరళముగా నుంది. దానిఉపయోగము మనవాళ్లకు రుచించలేదు. కనుకనే దానియెడ నిరసనభావము. అది ప్రధానరసమైతే కృతి నాటకమే కాదు, ప్రహసన మవుతుంది అని నమ్మకము. హాస్యముమాత్రము రసము కాదా? ప్రహసనము దశరూప కములలో నొకటి కాదా? దానితగ్గ నాకు ద్యోతకము కాలేదు. ఈకావ్యమందు నాటకలక్షణము లున్నవని చూపినాను. మనవాళ్ల ప్రహసనములలో పాత్రపోష ణము, ఆఖ్యానవస్తువు, నాటకకళాచాతురినీ "కన్యా శుల్కము"ను పోలియుండవు. వీరేశలింగముగారు రచిం చిన "బ్రాహ్మణవివాహ" మనేరూపకమందు పాత్ర గౌరవము, పాత్రపోషణ, జటిలము, నూతనము నగు కథావిధానమును హృద్యముగా లేవు. మననాటకము లలో మోదాంతఖేదాంతనాటకవిభజనమే లేదు. నాటకము ఖేదాంతము కానేగూడదని దశరూపకమం దున్నది. భాసకవిమాత్రము "ఊరుభంగము" అనేనాట కమును ఖేదాంత మొనర్చెను. తక్కినసంస్కృతనాట కములన్నీ మోదాంతములే. కాబట్టి నాటకలక్షణములలో ప్రాచ్యప్రతీచ్యసారస్వతముల కంతగా సామరస్యము లేదు. వాటి రచనామార్గములు వేరు. అట్టిచో వాద మప్రస్తుతము, నిరుపయోగము. దేనిమంచిచెడ్డలు దానివే. ఈవిషయము జ్ఞప్తియందుంచి విమర్శచేసుకోవలయును.

---

# అర్ధరాత్రి

పిలకా గణపతి

తరు నికరముల ముంచి
మెరయు తారల నొరసి
జిమ్ముమను చీకటులు
క్రమ్ముకొని ప్రవహించె—
అలసి నిదురించి ఏ కలగాంచెనో గాని
యెలమావితోటకోకిల కలువరించినది!
కలవరపుతరగములు దిశలంట ప్రాకినవి.

వడివడిగ పరుపెత్తె
విశ్రమించినగాలి ఆవులింపగ
పండుటాకు లొక్కొక్కటిగ
చిటపటని రాలినవి;
చీకటిని మెరసినవి
విసువనక దీపికల వెలిగించి మిణుగురులు
నీలపర్ణములలో నేమియో నెమకినవి
సౌవర్ణ సహకారసుమము లటుమెరసినవి.

మెరపువలె తళతళని
మెరయు సర్ప మ్మొకటి
పడగెత్తి నాలికల
చీలికలు కదిపినది
జీర్ణపర్ణమ్ములను
చీల్చుకొని ప్రాకినది
ఊరిలో జాగిలము హోరుమని మొరిగినది
పైనున్న తారకలు కునికిపాటులు పడెను
లోకమంతయు నిద్రలో మునిగిపోయినది
కవియొకడె మేలుకొని నిట్టూర్చె నేలకో!

---

# ప్రాచ్య చిత్రములు



౨. బుద్ధుడు - సమాధిలో
(క్రీ. శ. రెండవశతాబ్ది సిలోను రాతిశిల్పము)



౧. బోధిసత్త్వుడు
(చీనాలో ఒకానొకయాలయములోని శిలాప్రతిమ)



౩. ప్రజ్ఞాపారమిత
(పదునాలవ శతకపు జావానీయ శిల్పము)



౪. పరివేషములతోడి నలువురు బోధిసత్త్వాలు
(క్రీ. శ. 600 నాటి చైనీయ దారుశిల్పము)

# కవికొండలవారి కవిత

ఆచంట వెంకటరావు, బి. ఏ.,

అభినవసారస్వతాభివృద్ధివిషయంలో వెంకట్రావుగారు అపూర్వాభ్యాసకుడున్నూ, అభిమానాభిరుచులు గలిగిన ప్రచారకుడున్నూ. ఆంధ్రభాషామతల్లికి గల యలంకారములలో ఈయనయమర్చిన పూలమాలలు కూడా ఆమెకు శోభ సమకూర్చుతున్నాయి. లోకమంతా యెరిగున్నవాణ్ణి చూచారా అంటే లోకులంతా నవ్వడం సహజం. అదే సూర్యుణ్ణి కరదీపికతో చూపడం అంటే. ఆయనకి నిత్యం అల్లడం, ప్రఖ్యాతివహించిన భారతికి అంగడికి పట్టికెళ్లటం అలవాటైపోయింది.

కవిత్వమా: స్వానుభవా న్ననుకరించిన భావంపుటూట, భావాలను మ్రింగనిభాష, నవీనప్రకటనలో నూత్నశోభ, ప్రకృతిని పలుకరించే పదజాలము, గ్రామ్యభాషను కాదనని మాటలకలయిక, చిన్నపల్లెల దాటని మూలచిత్రము, దృశ్యాన్ని దాటనివ్వని దుర్వారపరిశీలన, శైలిలో శతవిధాల నడక, నిరాడంబరమైనా నిస్సారముగాని నీటు, రాగాని కనుకూలమైన రామణీయకత, స్వాంతవీణెతంత్రులతో సామరస్యము వహించేరచన, నవరసములనూ ప్రకటించే నవీనగీతాలు-లోటేమిటి?

అనేకమందినోళ్లనుంచి అనేకవిధాలగా ఆయనకవిత్వాన్నిగురించి వినడమయింది. అట్టే ఆయనపుస్తకాలన్నీ ఒక్కపర్యాయం ఈమూలనుంచి ఆమూలకి తిరగేశా, యేదో యింత తేల్చుకుందామనే ఉద్దేశ్యంతో. అదీ చాలక ఆయనే పాడుతూంటే ఆలకించా. అప్పుడు కుదుటబడ్డాయి అన్నివిషయాలూ. పదిమంది పదివిధాల పలుకుతారు, ఒకరు గౌరవాస్పదంగానూ, ఒకరు మెగతాళిగానూ, ఒకరు తృణప్రాయంగానూ, ఒకరు అటూ యిటూగాని మధ్యరకంగానూ, పలురకాలుగా. వాటన్నిటితోటీ వీసమైనా నిమిత్తం లేదు. ఒక్కసంగతితో అవన్నీ ఆవిరైపోతాయి. పాడితే వినాలి. పలికితే ఆలకించాలి. 'తింటే కాని రుచి, దిగితేనేకాని లోతు తెలియ' దన్నట్టు వింటేకాని బోధపడటం కష్టం కవిత్వవిషయంలో. ఒక్కఉదాహరణ: ఆంగ్లసారస్వతాభిరుచి కలవాళ్లల్లా టెన్నిసన్ మహాకవిని చవిచూచేఉంటారు. అతడు 'మాడ్'అని ఒకచిన్నిపొత్తం ప్రచురించాడు. వెంటనే చెలరేగింది, వివిధప్రాంతాలనుంచీ వివిధరకాల విమర్శన. అతనిరచనలోకల్లా అదే గొప్పదని యొకరు; అత డేదైనా ఉత్కృష్టమైంది ఇంతకుపూర్వం వ్రాసుంటే అదికూడా దీనితోపాటు ఊడ్చిపెట్టుకుపోవాలని మరియొకరు. అదేరకంగా, అంతాకలిసి కవి నెదుటబెట్టుకుని చదివితేనేగాని వలనుపడ దన్నారు. తప్పనిసరి మీద చదివాడు. గాలిదుమారంలోని దూది పరకస్థితిలో పడ్డాయి వారిఅభిప్రాయాలన్నీని. కదలకుండా విన్నారు. కనికట్టుపనిలో కాలు

వెట్టినట్లయిం దండరికీ. అంతా యేకగ్రీవంగా అతనిగొప్పతనం అంగీకరించారు. ఆంగ్లోదాహరణమవడంచేత ఇది మనకి శంఖతీర్థమే. కనుక కవినోట్లోంచి వినడం ప్రధానం.

వర్ణనావిషయం: మబ్బుతునకని మారిపోనివ్వడు; చిరుపచ్చికను చీలిపోనివ్వడు; మందమారుతాన్ని మసలిపోనివ్వడు; రవికిరణాలరంగు రాలనివ్వడు; విహంగవిహారణ వీడిపోనివ్వడు; కీటకములకీచుకీచు కిరవుండకపోదు; పశువులుమసలడం పసటుపోదు; నీరేజకాంతులు నిలబడియుండవలసిందే; మొత్తంమీద కవిలో కనిపించవలసిన సరకులకు కరవుండదు.

కొండకొాలకు, వికసితోత్పలశీర్షిక విషయం:—ఈకొలకులో జనించినపుష్పములు శతసహస్రములు; ఒకటి యేపుగా యెన్నికగంటూవుంటుంది; ఒకటి నీరసంగా నిలకడలేకుండా ఉంటుంది. ...వ్రాసిందంతా ఒక్కమోస్తరుగా ఉండమంటే యేలాగుంటుంది? ఒకతల్లిగర్భాన్ని జనించినవాళ్లంతా ఒకలాగే ఉండగలరా? తెలివితేటలలో, రూపాలలో, ప్రవర్తనలలో పరిపరివిధాలు. అల్లే మానవకృత మాటచేత బాగోగు లనేకంగా ఉంటాయి. కనుక నిందింపవలసినపనిలేదు. గ్రహించవలసిందల్లా మంచే.

పాత్తములు: 'మాతృదేశసంకీర్తన'కే నాయూహాలో నగ్రస్థానం. నిత్యప్రార్థనల కనుకూలమైన 'నమోనమోజయ...'లాంటి గీతికలు దీనియుత్కృష్టత ప్రకటిస్తాయి. 'ఆంధ్ర రాష్ట్రము'వంటివి కవి తనకాలమును ప్రతిబింబింపజేయుననుట వ్యక్తపరుస్తుంది.

'ఆజన్మాంతపు హక్కు స్వతంత్రము'
ఊహాపోహాల యుక్కు స్వతంత్రము
ఆత్మోద్ధరణకు దిక్కు స్వాతంత్రము
మాతృదేశమున కదియేనాడో?

అని చదువుకునేటప్పుడు కలిగేభావోద్రేకం వర్ణనాతీతము.

'మోహనగంగా' అనుగీతము రవీంద్రుని 'జనగణమనఅధినాయక' లాంటి గీతాలని తలపిస్తుంది.

నామనస్సులో ద్వితీయస్థానం ఆక్రమించేది 'కోనేరు' అనే చిన్నిరూపకం. దీనిరూప సౌందర్యం దేనికీ రాదు. స్వల్పంలో మోక్షం. పాశ్చాత్యపద్ధతుల ననుకరించే పడుచువాళ్లకి బుద్ధిచెప్పడంలో గట్టిది - సరసిజనేత్రలయొక్క సాధారణసంభాషణ- ప్రధానాంశప్రచురణాను. మరికొన్నిటువంటివి ఉంటే సంఘమర్యాద నిలుస్తుం దనడంలో ఆశ్చర్య మేమీఉండదు. చదువుటకు శ్రమ యివ్వనిది,— అనవసరప్రసక్తి లేకుండా అర్థమయ్యేది, సంసారగోష్ఠితో కూడుకున్న సదంశాలని సరసంగా చవిచూపేదిన్నీ.

తరువాత "త్రయి"కి తృతీయస్థానం. రచన పోకడలు క్రొత్తవి కాకపోయినా భావాలు నూతనములున్నూ, తెలుసుకోవలసినవిన్నీ. 'కవితాలలనామణి' కవిగారి 'చూపు

లో జూపయి' 'పల్కులను జొక్కపుపల్కుయి' వినోదలీలలలో విహరించింది. దాని మెఱుగులన్నీ విపులంగా వ్రాయుట కవకాశము తక్కువ, క్షమార్పణం.........

'ప్రకృతిచందనం' పద్యవరుసేగాని అమర్చడంలో నవీనరకపునాజూకు, సహజవర్ణనలతో గూడిన చదువు. ఉత్ప్రేక్షాలంకారాలలో ఊరికే ఉనికి లేకుండా ఊగిపోదు. దృశ్యమంతా దృష్టిపథంలో ప్రవేశించి తీరుతుంది. 'చీకటి-నదీరవము' 'శోభ' మున్నగునవి విశేషశోభ దెస్తున్నాయి యీపాత్రానికి. "ఎఱుపులో ప్రొద్దుగ్రుంకు"తూంటే "మెట్టనందంబు చందంబు పంటకాలువనీట ప్రతిఫలించు"తూంటే యెంతశోభో అనుభవిస్తేగాని తెలియదు. అందుచేతే "సరసకవితాభావసౌఖ్య" మావహించింది కవిని. ఆసమయంలో ఇంద్రియజ్ఞానంగలవాడు ప్రతివాడూ కవైతీరుతా డనుకుంటా...

'నెలబాలుని' నేస్తంచేయనివా ళ్లెవరుంటారు? అత డుదయించగానే ఉత్సాహం జనిస్తుంది. ఛందోభిన్నంగా నడుస్తున్నా భావప్రకటన బాగుంటుంది. 'కవితామతల్లి' గానంబులు కలకలలాడుతుంటాయి. 'సంక్రాంతి ప్రొద్దు' లాంటివి పిల్లల కొంటెతనం బయిట బడేస్తాయి. 'సాయంతనం' చక్కనివర్ణన. 'వేణువు' చేసేగానం వినవలసిందే. రగడ ఉత్సాహాలలో ఉత్సాహపూరితంగా నుంటుంది. 'ఆత్మవ్యక్తి' అనే చిన్నిపొత్తంకూడా అటువంటిదే.

'జనపదములు', 'కలమతము', 'భావమురళి' మున్నగు చిన్నిపొత్తములు బాలుర విద్యాభ్యాసంలో చేర్చదగిన మృదుగీతమంజులములు. నోటబట్టుటకు సులభములు, గానానుకూలంచేత జ్ఞాపకముండేవిన్నీ. 'శివాజి'యను గీతికవంటివి బాలుర కత్యంతావశ్యకములయిన వీరరసోక్తులు బోధిస్తాయి. ఇక్కడికే యెక్కువయింది.

ఆంధ్రావనిలో బయలుదేరిన యీనూతనలత మనకవివంటి పోషకులచేతిలో పదికాలాలపాటు వర్ధిల్లాలి; దీనిఅంట్లు దేశదేశాల వ్యాపించాలి, పెరగాలి; పెంపొందాలి; పుష్పించాలి; వికసించాలి; పరిమళించాలి; సారస్వతాభిలాషుల తనివి దీర్చాలి.

---

# భోజుని శృంగారప్రకాశము*

మా. రాధాకాంతయ్య

భారతఖండమును బరిపాలించిన రాజశిఖామణులలో స్వయముగాఁ గవులై సమస్తవిద్యాపరిపోషకు లని ప్రఖ్యాతి గాంచిన శూద్రక, వాసుదేవ విక్రమాదిత్య, శాతవాహనభోజులలోఁ జరిత్రకాలమును బట్టి యర్వాచీనుఁ డయ్యును భోజునకుఁ గలిగినకీర్తి యేరాజును జెందఁడయ్యె. ఇతని విద్యాయోగక్షేమకీర్తి యెట్టిదన నితనికంటెను నూఱేండ్లుతరువాత జీవించిన యితనిప్రత్యర్థిరాజులుసహితము విద్యాభోజుఁడ ని బిరుదనామంబును వహించి యితని నుపమానభూతునిగా స్వీకరించుట యత్యద్భుతము. ఉదాహరణముగా హొయ్సలరాజగు రామచంద్రుని దండనాయకుఁడగు లక్ష్మణుని తాత యగు శ్రీధరుని వర్ణించుచు నీ క్రింది శ్లోకము శాసనస్థముగాఁ గలదు :

> " ధారాధిపస్య భోజస్య కీర్తి రేకాకినీ సతీ,
> అద్య శ్రీధరదండేశకీర్తిః సహచరీ సఖీ."

ఈశాసనము ౧౨౮౦ కాలములో లిఖింపఁబడినది. భోజునికీర్తి తక్కినరాజులకంటె నెక్కుడుగాఁ బ్రకాశించె నని దృఢముగాఁ జెప్పవచ్చును. రాజతరంగిణిలోఁ గల్హణుఁడు కాశ్మీరక్షితిరాజును వర్ణించుచు వానిని భోజసమానునిగాఁ జెప్పి దానోత్కర్షముచేత కవిబంధు వయ్యె నని భోజుని శ్లాఘించెను.

> " స చ భోజనరేన్ద్రశ్చ
> దానోత్కర్షేణ విశ్రుతౌ,
> సూరీ తస్మిన్ క్షణే తుల్యం
> ద్వా వాస్తాం కవిబాంధవౌ."

ఈక్షితిపతి క్రీ. శ. ౧౦౫౦ లో రాజ్యమునకు వచ్చినందున భోజుఁడును దత్కాలపువాఁడె యనుటకు సంశయము లేదు. ఇతఁడు సర్వశాస్త్రములలో గ్రంథములు రచించియుండుటయు, వానిలో ననేక గ్రంథములు మనకు లభించుటయు, ఆతనికాల నిర్ణయముగూర్చి యింకను గొన్ని సందేహములు గలవు. ఇతనిగ్రంథములలోఁ గొన్ని భోజనామకుఁ డను మఱియొకకవి రచించినట్లు కొందఱ యభిప్రాయము. బల్లాలుఁ డనుకవి రచించిన భోజచరిత్రములోఁ బ్రఖ్యాతసంస్కృతకవుల నందఱ భోజునిసభాలంకారములుగాఁ గల్పించుటచే భోజుని కాలనిర్ణయము మఱికొంత కష్టమగుచున్నది. కావున నేభోజునిగూర్చి వ్రాయఁదలంచితిమో యతని దేశకాలముల నిర్ణయింపక యతనిశృంగారప్రకాశాదిమహాగ్రంథరచన గూర్చి వ్రాయుట నేఁటికాలపు వాఙ్మయచరిత్రమర్యాదకు నించుక నుల్లంఘన మగు నని మొదట భోజుని దేశకాల ప్రశంస యించుక చేయుదము.

భోజనామకు లగురాజులు పెక్కండ్రు గలరు. ఋగ్వేదములో " భోజా యాశ్వం సంమృజం త్యాశు భోజ స్యేదం పుష్కరణీవ వేశ్మ" అని కలదు. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దములో నొకభోజుఁ డున్నట్లు కాన్యకుబ్జదేశశాసనమువలనఁ దెలియుచున్నది. మామూద్ గజిని కాలంజరపురమును ముట్టడించినప్పుడు భోజుఁ డనేకరాజులతోఁ జేరి యతని నోడించి యతనిని దేశమునుండి తఱుమఁగొట్టెనఁట. ఇది బహుశః ౧౦౧౯ క్రీ. శ. కాలమై యుండును. మహారాష్ట్రదేశమున

---

* ఈ సుప్రసిద్ధ ధారానగరేశ్వరునిగుఱించి పెక్కండ్రు పెక్కువ్యాసములు రచియించియున్నను దత్కృతమగు శృంగారప్రకాశమునుగూర్చి యెవ్వరును విస్తరించి వ్రాయరైరి. ఈలఘువ్యాసములో శృంగారప్రకాశరచనా విషయమే ముఖ్యవస్తువైనను అతని దేశకాలములు కొంతచర్చించుట యావశ్యకమయ్యెను. దీనిని నేను వ్రాయునప్పుడు సందిగ్ధస్థలములయందు మాతండ్రిగారిసహాయమును బుచ్చుకొనియున్నా నని విన్నవించుచున్నాను.

లభించిన శ్యామలాదండక లిఖితాదర్శము నందు తద్గ్రంథ లేఖనానంతర మీ క్రింది శ్లోకములు లిఖింపఁబడినవి. బహుశః అవి గ్రంథకర్తృ కృతములే యైయుండును. అందు ధారానగరాధీశ్వరుఁడగు భోజుఁడు శంకరపీఠమును ముట్టడించిన మహమ్మదీయుల నోడించి మరలివచ్చుమార్గమున నర్మదా నదీతీరమున మహాకాళీదేవాలయమును దర్శించి శ్యామలాదండకమును రచియించియుండిన పురాంతకుఁడనుకవిని శ్లాఘించి యతని కగ్రహారములు దానముఁ జేసె నని యాశ్లోకములచేఁ దెలియుచున్నది:—

ధారాధీశో ధరాధీశో
        ధారాయాం ధనదోపమః,
బభార రాజ్యం భోజాఖ్యో
        దానమానైశ్చ పణ్డితాన్.
మ్లేచ్ఛా నమ్లోచయ ద్వీరో
        ద్వారకాయాం విరాజితమ్,
శఙ్కరార్యసుహూణాం స్వం
        మోషిణో మతమూషిణః.
లోకాక్షిరససంఖ్యాక
        (౯౨౩) శాకాబ్దే పూర్ణిమాతిథౌ,
శ్రావణే మాసి విప్రేభ్యః
        కవిభ్యో వ్యతర న్ముదా.
గ్రామా న్సోమోద్భవాతీరే
        శతం యో గిరిశప్రియః,
సరస్వతీకంఠభూషాం
        సరసాలఙ్కృతిం కృతిమ్.
ప్రాణయ తీక్కర్తికాయస్య
        ప్రాయచ్ఛ త్స్వ వ్యస్య నిత్యతామ్,
జీయతాం తద్యశో నిత్య
        మాచన్ద్రార్కం ద్యుభూవనమ్.
మహాదేవద్విజ శ్శైవో
        మహాకాలస్య పూజకః,
పురాన్తక స్తస్య పుత్రః
        పురారేః కృపయాఽభవత్,

శ్యామలాయాః ప్రసాదా ద్యః
        శ్యామలాదండకం వ్యధాత్.
వాగ్దేవీ యస్య వశ్యాఽభూ
        ద్వాచో వాచస్పతే రివ,
తస్మై గ్రామాన్ శత ముదా
        చ్ఛిప్రావారసవేదినః.

(౧౯౧౭ ఉగాదిసంచిక.
"పుష్పాంజలి" నుండి. పే. ౨౨౮)

ఘూర్జరేశ్వరుఁడగు భీమదేవునితో నుత్తర చాళుక్యులు చేరి భోజుని యుద్ధములో నోడించిరఁట. ఇది ౧౦౭౦ క్రీ. శ. కాల మనుచున్నది.

"భోజ శ్చిత్తపబిల్హాణాదికవిభిః."

అని ప్రఖ్యాతి ననుసరించి చూడ బిల్హణుఁడు భోజుని యాస్థానకవి యని యూహింపఁదగియున్నది. అయినను విక్రమాంకదేవచరిత్రములో బిల్హణుఁడు కాశ్మీరమునుండి కల్యాణకటకాధీశ్వరుఁడగు చాళుక్య విక్రమాదిత్యునియొద్దకు వచ్చునప్పుడు, అయోధ్యా, ధారానగర, ఘూర్జర దేశములమార్గముగా వచ్చుచు ధారానగరమును బ్రవేశింపకయు, భోజుని చూడకయు వెడలిపోయె నని తానే పదునెనిమిదవ సర్గములో నిట్లు చెప్పుకొనియున్నాఁడు:—

నీత్వా గంగాధర మధరతాం
        డాహలాధీశధామ్ని
క్రీడాక్రాన్తప్రతిభటకవేః
        పూర్వదిక్కోటరేషు,
నిర్జి త్యైరావత మదజలభ్రాన్త
        భృంగాలినాదా
న్సుత్రాణ్ణోఽపి శ్రవసి లుఠితం
        యస్య శంకే కథాభిః. (౧౮-౯౪)
భోజః క్ష్మాభృ త్స ఖలు న ఖలై
        స్తస్య సామ్యం నరేంద్రైః
త త్ప్రత్యక్షం కిమితి భవతా
        నాగతం హా హతాస్మి,

యస్య ద్వారోడ్డమరశిఖర
క్రోడ పారావతానాం
నాదవ్యాజా దితి సకరుణం
వ్యాజహారేవ ధారా. (౧౮-౯౬)

కక్షాబంధం నవిదధతి యే
సర్వదైవావిశుద్ధాః
తద్భావస్తే కిమపి భజతే
యజ్జుషస్సాస్పదత్వమ్,
తేషాం మార్గే పరిచయవశా
దర్జితం సర్జరాణాం
యః సంతాపం శిథిల మకరో
త్సోమనాథం విలోక్య. (౧౮-౯౭)

* దీనిఁ దెనిఁగించిన తిరుపతివెంకటేశ్వరకవులు మహోకుధారగా వచననిర్మాణముఁ జేయుచుఁ బద్యార్థము గ్రహింపనేరక చిత్తానువృత్తముగా బిల్హణుఁడు ధారానగరమును జొచ్చి భోజునిచే సమ్మానితుఁడైనట్లు కల్పించి వ్రాసిరి. గ్రంథములువ్రాయువారెంతవేగముగా రచింపవలసియున్నను జదివెడివారు యథావకాశముగాఁ బ్రత్యక్షరవిచారము చేయుదురు. కావున నాశురచన గొంతయపఖ్యాతికిఁ గారణ మగుచున్నది.

బిల్హణుఁడు క్రీ. శ. ౧౦౭౬ న రాజ్యమునకు వచ్చిన విక్రమాంకుని యాస్థానమున నుండి ౧౦౯౦ ప్రాంతములోఁ గాశ్మీరమును వెడలిపోయినందున నితఁడు భోజునియాస్థానములో నేకాలములో నుండెను? ఏల యతనియాస్థానమును వదలెను? అనుసంశయములు ప్రబలముగా బాధించుచున్నవి. భోజుఁడు క్రీ. శ. ౯౯౭ నుండి ౧౦౫౬ వఱకు రాజ్యము చేసియుండు నని మాయభిప్రాయము.

కొంద ఱతఁ డింకను పదిసంవత్సరముల తర్వాత ననఁగా ౧౦౬౬ వఱకు జీవించియుండు నని చెప్పుదురు. అతఁ డట్టిస్థితిలో బిల్హణుఁడు చాళుక్యసభకు రాకపూర్వమే యల్పకాలము భోజసభలోనుండి యతనిమరణానంతరము కాశ్మీరముననో యయోధ్యాదాహళాధిచ్ఛత్రరాజులవద్దనో యుండియుండును. రాజరాజనరేంద్రుని మరణమువలన నన్నయభట్టునకు తగిన యాశ్రయము లేక తన గ్రంథరచనను మానుకొనెను. బిల్హణుఁడును వయస్సులో నుండినందునఁ బ్రభుమరణానంత

* "దాహళాధీశునింట నున్న గంగాధరుం జయించి విలాసముగాఁ బ్రతిపక్షకవికోటి నాక్రమించిన యే రాజ దేవేంద్రునికథలు పూర్వదిక్కోటరంబులం దైరావతమదజలాస్వాదమత్తంబులై యున్న తుమ్మెదలరొదలతో బ్రతిస్పర్ధఁ గావించుచు దేవేంద్రుని కర్ణద్వయముం బ్రవేశించి యచ్చెరువు పుట్టించెనో యట్టి భోజరాజున కితర నృపాలురకును సామ్య మెట్లు లభించును? ఆ మహారాజుగుణములు ప్రత్యక్షముగాఁ జూడకపోతిరి. హా దైవమా! నేను వర్ణించిన నమ్ముదురో నమ్మరో కదా! అతనిధారానగరమే సర్వదా ద్వారోపాంతములయం దున్న విటంకములమీఁద నున్నపారావతముల యారావము లను నెపంబున నతని నుతించుచుండును. తాదృశమహనీయగుణగరిష్ఠుం డగు భోజరాజకవీంద్రునింగూడ నానారాజసందర్శనకుతూహలంబునం బోయి కాంచి యతనిచే మిగుల సత్కరింపఁబడి యయ్యనఘుని సాన్నిధ్యముం బాసి సముద్రస్వేచ్ఛాప్రసారము గావింపకుండ భార్గవుం డొనర్చిన యర్గళవలె నుండి పోకక్రముకులచే శ్యామలమై కన్నులకు విందుగావించు పశ్చిమాంబుధితీరంబునం బోయిపోయి సేతువుం గాంచితి."

ఇందు ౯౬-వ పద్యములోని 'యస్య' శబ్దము బిల్హణున కన్వయించునుగాని భోజున కన్వయింపదు. అనఁగా బిల్హణుఁడు దాహళదేశమునుండి తనకీర్తి తూర్పునఁ దూర్పుదిక్పాలుని శ్రవణపర్యంతము పోయినందునఁ గృతార్థుఁడై ధారానగరగూర్జరమార్గముగా సోమనాథుని దర్శింపఁబోయెను. ౯౭-వ శ్లోకమునకుమాఱుగా భోజరాజు కవిని సత్కరించినట్లు కథ మార్పఁబడినది. అది చరిత్రమునకు విరుద్ధమైనందున నుపేక్ష్యము. ఇట్లే మఱి కొన్నిస్థలములలో నాంధ్రీకరణమున స్ఖాలిత్యములు పడినవి.

రము పరరాజుల నాశ్రయించెను. భోజునియం దతనికిఁ గల గౌరవాతిశయమునఁ దాను ధారానగరమును జొచ్చి రాకున్నను దదధీశుని స్తుతించుటచేత నాహవమల్లుఁడు భోజుని ధారానగరమును బట్టుకొనె నని చెప్పునప్పుడు భోజుఁడు ధారను వదలినను దానధారను వదలకుండె నని ప్రశంసించుటచేతనే యనుమేయమగుచున్నది. విక్రమాంకదేవుఁడు చంద్రికాదేవిస్వయంవరమునకుఁ బోయినప్పుడు ధారేశ్వరాదు లచ్చట నుండఁగా వారిని వదలి చందలదేవి విక్రమాంకుని వరించినటుల బిల్హణుఁడు తచ్చరిత్రములో నాయకోత్కర్షమును బ్రకటించెను. ఇందులో ధారేశ్వరుఁడు భోజుఁడే యైనచో నతనికి న్యూనత లేదు. అతని కప్పటికి వార్ధకదశ కొంత వఱకుఁ జెల్లుచుండెను. ఏల యనఁగా విక్రమాంకుని వివాహము సుమారు ౧౦౫౦ పూర్వము నడచియుండుట యసంభవము. వృద్ధుఁడైన భోజుని నుపేక్షించి కుమారవయస్కుని స్వయంవరకన్యక వరించుట వైవాహికధర్మమేకదా.

భోజునిశాసనములు పెక్కులు గలవు. వానిలో నుదయపురప్రశస్తి యొకటి. రాజమృగాంక మనుగ్రంథమును భోజుఁడు వేదరసనవమితశకాబ్దము (౯౬౪ + ౭౮=౧౦౪౨ క్రీ. శ.) లో రచించెనఁట. భోజుని నోడించిన యుత్తరచాళుక్యభీమరాజు ౧౦౨౧ నుండి ౧౦౬౩ వఱకు రాజ్యము చేసెను. భోజుని మఱియొకశాసనము క్రీ. శ. ౧౦౨౨ లో నున్నది. అప్పటికే యనేకరాజుల నోడఁగొట్టి ప్రఖ్యాతపుణ్యస్థలములలో దేవాలయములను నిర్మించి కీర్తి సంపాదించినట్లు ౧౦౩౦ ప్రాంతపుశాసనములలోఁ జెప్పఁబడియున్నందున నది యతనికి ప్రౌఢవయస్సనుట నిర్బాధముగా నంగీకరింపవచ్చును. ఇతఁడు చేదిరాజును చాళుక్యభీముని మామూన్ గజిని కర్ణాటలాటఘూర్జరరాజులను ఓడించి కేదార రామేశ్వర సోమనాథసుండీర కాలానల రుద్రక్షేత్రములలో దేవాలయములు కట్టినట్లుదయపురపు ప్రశస్తిలోఁ గలదు. భోజరాజు ధనుర్విద్యయందు మహానిచక్షణుఁడై కలియుగములో నెవ్వరును గొట్టిచూపని ధారాయంత్రమును బాణముతోఁ గొట్టెనఁట. కొంకణదేశీయులతో యుద్ధము చేయునప్పుడు తత్పర్వతగహనభూముల నమితపరివారముతో శత్రువులు ముట్టడింపఁగాఁ గేవలధనుర్విద్యాబలముచే వారినెల్లఁ జెదరఁగొట్టి తద్రాజ్యమును జయించెనఁట. కోదండమండన మను ధనుశ్శాస్త్రములోఁ దద్గ్రంథకర్త యీవిషయమును జెప్పెను:

> " మనుష్యోఽపి మహాధన్వీ
> భోజరాజో ధనుశ్శ్రమాత్,
> విద్యాధ స్ఫారనారాచై
> ర్ధారాయన్త్రం కలౌ యుగే.
> శ్రీమతో భోజరాజస్య
> కుంకణానాం క్షయక్షణే,
> అద్వితీయస్య సాహాయ్యం
> విదధీత శరాసనమ్. "

హేమాద్రి దేవగిరిసేవణరాజుల వర్ణించుచు,

> " యో భోజదేవా న్నృపతేః ప్రతాపీ
> జగ్రాహ ఃహం మదమన్దసత్వమ్,
> సార్ధం జనన్యా సహ జీవితేన
> సోమేశ్వరస్యాపి జహార రాజ్యమ్. "

మఱియొకచోట,

> " యేన క్షోణిభృ దర్జునోఽపి బలినా
> నీతః కథాశేషతాం
> యేనోద్దామభుజేన భోజనృపతిః
> కారాకుటుంబీకృతః. "

అని వర్ణించెను. దీనిలో నర్జునుఁడు బహుశః కళింగదేశపురాజై యుండును. ఈప్రశంస ధారానగరభోజుని గూర్చి చెప్పిన దగునా, కాదాయని సంశయింపవలసి యున్నది. భోజచరిత్రములోఁ గాళిదాసభవభూతిమాఘబాణమయూరశంకరకవిప్రభృతులు భోజసభలో నుండినట్లు విచిత్రముగా వర్ణింపఁబడెను. కాళిదాసు క్రీ. శ. పూర్వమున నుండెనని కొందఱును, క్రీ.శ.౫-వ శతాబ్దిప్రారంభమున నుండె నని మఱికొందఱును జెప్పుచున్నారు. భోజచరిత్రములోఁ బ్రశంసింపఁబడినకవులలో బాణమయూరులుమాత్రమే పరస్పరము సమకాలికులు.

తక్కినకవు లెల్లరు భిన్నకాలవర్తులు కావున విద్యారణ్యులవారికి గ్రంథకర్తృత్వ మారోపింపఁబడిన శంకరవిజయ మెంతప్రామాణ్యహీనమో యట్టిదే భోజచరిత్ర యని యట్టిగ్రంథములఁ గాలనిర్ణయవిషయముల నుపేక్షింపఁదగు. వానిలోఁ గొన్ని యంశములు సత్యములే యైనను సంశయితాంశములకుఁ బ్రమాణములు కానేరవు. భోజుఁడు దిగ్జయము చేయుటయేకాక యనేకయాగములు చేయించి మహాదాత యయి ప్రఖ్యాతిగాంచెను. ఈ యంశ ముదయపురిప్రశస్తిలో,

> "సాధితం విహితం దత్తం
> జ్ఞాతం య త్తన్న కేనచిత్,
> కిమన్యత్ కవిరాజస్య
> శ్రీభోజస్య ప్రశస్యతే"

ఇందు విహిత మనఁగా వేదవిధిచోదితము లగు కర్మలు యాగాదులు చేసె ననియు, జ్ఞాత మనఁగా నధ్యాత్మశాస్త్రము లెఱింగి బ్రహ్మజ్ఞానమును బొందె ననియు, శత్రువుల సాధించి యాగములు చేసి మహాదానము లొనర్చి తెలిసికోఁదగినదెల్ల నెఱింగె ననియు భావము. ఇతఁడు మహామాహేశ్వరుఁడు. శివాద్వైతి. తత్త్వప్రకాశ మనుగ్రంథమును దదర్థపరముగా రచించెను. ఇతఁడు సర్వశాస్త్రములయందును గ్రంథములు రచించెను. వ్యాకరణమున సరస్వతీకంఠాభరణ మను శబ్దానుశాసనమును, నిఘంటువున నామమాలికయు, జ్యోతిషమున రాజమార్తాండము, ఆదిత్యప్రతాపము, రాజమృగాంకకరణము, ప్రశ్నచింతామణి, భుజబలనిబంధము మొదలగునవియు, వైద్యమునఁ జరకసుశ్రుతములకు రాజమృగాంకవృత్తియుఁ, జారుచర్యయు, ఆయుర్వేదసర్వస్వమును, శిల్పమున సమరాంగణసూత్రధారీయమును, ధర్మశాస్త్రమునఁ గామధేనువు, యుక్తికల్పతరువు, వ్యవహారసముచ్చయము మొదలగునవియు, యోగమున రాజమార్తాండ మను యోగసూత్రవృత్తియు, కావ్యమున విశ్రాన్తివిద్యావినోదము, శృంగారమంజరి, శివతత్త్వరత్నకలిక, సాహిత్యప్రకాశము మొదలగునవియు, అశ్వశాస్త్రమున శాలిహోత్రోన్నయమును, అలంకారమున సరస్వతీకంఠాభరణము, శృంగారప్రకాశమును, సుభాషితమున సాహిత్యప్రకాశమును, శివాద్వైతమున శైవసిద్ధాంతసంగ్రహమును, తత్త్వప్రకాశమును, సంగీతమున గీతప్రకాశమును మొదలగునవి రచించెను. ధనుర్వేదమున కోదండమండనమును రచియింపఁజేసెను. ఇతని యాస్థానములో నానామతస్థులు నానాశాస్త్రపండితులును వెలసియుండుటచేత నిన్నిగ్రంథముల నితనికి సులభముగా రచించుట కానుకూల్యము గలిగియుండెను. వ్యాకరణాలంకారగ్రంథములకుఁ జిత్తపుఁ డనుకవి చాలసాహాయ్య మొనర్చియుండు నని యూహింపఁదగి యున్నది. ఏలయనఁగా సదుక్తికర్ణామృత మనుగ్రంథమునఁ జిత్తప రచితమని క్రిందిశ్లోక ముదాహరింపఁబడినది

> "అచ్ఛిన్నమేఖల మలబ్ధదృఢోపగూఢ
> మప్రాప్తచుంబన మవీక్షితవక్త్రకాన్తి,
> కాన్తావిమిశ్రవపుషః కృతవిప్రలంభ
> సంభోగసఖ్య మివ పాతు వపుః పురారేః."

ఇది భోజుని శృంగారప్రకాశములో మొదటి శ్లోకము. నిరంతరము విద్వత్పరిషత్పరివృతు లగుమతిమంతులకు జ్ఞానోత్పాదన మగుటయు నిష్కల్పషమైనగ్రంథరచన యలవడుటయు నంత యచ్చెరువు గాదు. బహుకార్యపరులై సంతతశాత్రవశరశరవ్యు లగురాజులు విద్యలను గేవలము పోషించుటయే దుర్భరము; మహాగ్రంథములు రచించుట యంతకంటెను గష్టతరము. కాళిదాసబాణాదులు నిస్సహాయులై గ్రంథములు రచించుటయు, భోజాదులు ససహాయులై గ్రంథరచన చేయుటయు సమ్మానప్రతిపత్తులకుఁ దుల్యులే యగుదురు. మహాపండితసాహాయ్యము లేక రాజులకు గ్రంథరచన సులభము గాదు. నన్నెచోడునకు షణ్ముఖుఁ డనుకవియు,సర్వజ్ఞసింగభూపాలునకురసార్ణవసుధాకర,రత్నపాంచాలికా*

---

* ఇది నాలుగంకముల నాటిక. సింగభూపాలుఁడే రచించినట్లు ప్రస్తావనయందును, గ్రంథాంతమునందును గలదు. అయినను ప్రస్తావనలోనే 'శ్రీ సింగధరణీపతేః శ్లాఘాయై యస్య సన్నద్ధా విశ్వేశ్వరసరస్వతీ" అనియు, గ్రంథాంతమునందు "సింగభూపతే రత్నపాంచాలికానామ నాటికా రసపేటికా" అనియు నున్నది.

కందర్పసంభవాది గ్రంథనిర్మాణమున విశ్వేశ్వరకవియు పెద్దకోమటివేమభూపాలునకు వామనభట్టబాణుఁడును సాహాయ్యమొనర్చినట్లు సుప్రసిద్ధమే కదా. సాల్వసుంఠ నరసింహరాయలు రామాభ్యుదయము రచించినట్లు ప్రతి సర్గాంతమునఁ జెప్పఁబడినను బంచమసర్గము కడపట యతని కర్తృత్వసూచకశ్లోకమునకు వెంబడిగానే

"శోణాద్రీంద్రం కవీంద్రం
శ్రవణకటురటడ్డిండిమం సార్వభౌమం
ప్రాసూతాంబాభిరామా
నవనవకవితాభాజనం రాజనాథాత్,
తస్యైతస్మిన్నయాతిక్రమ
విషయమహానాటక స్యాగ్రజాతే
కావ్యే సర్గో నిసర్గోజ్జ్వలరసవిలస
త్పంచమోఽయం జగామ."

అని తద్గ్రంథమును డిండిమకవులలోఁ బ్రఖ్యాతిఁగాంచిన యరుణగిరినాథుఁడే రచించినట్లు దెలుపుచున్నది. భోజాదులకుఁ గవిసాహాయ్యము నిర్మలజాతిరత్నములకు నికషోపలములవలె నుత్తేజక మగుచున్నది.

భోజుని పూర్వవంశ్యులలో ననేకులు గ్రంథరచనను బ్రోత్సహించి కవిపండితసంఘముల నాదరించుచుండి రని గ్రంథములవలనను, శాసనములవలనను దెలియుచున్నది. ఇతనితండ్రి యగు ముంజుని యాస్థానమునందే దశరూపకకారుఁడగు ధనంజయుఁడు ప్రఖ్యాతిఁ జెందెను. అతని పితృవ్యుఁడు నవసాహసాంకుఁ డను బిరుదముగల వాక్పతిరాజనేకవిద్వాంసులను బోషించి గ్రంథముల రచింపఁజేసెను. పరిమళకాళిదాసుఁ డను బిరుదము వహించిన పద్మగుప్తుఁ డనుకవి యతని యాస్థానభూషణమై నవసాహసాంకచరిత్రము రచించెను. వాక్పతిరాజదేవుని విద్యాపరిశ్రమను వర్ణించుచుఁ దత్కవి

"అతీతే విక్రమాదిత్యే
గతేఽస్తం శాతవాహనే,
కవిమిత్రే విశశ్రామ
యస్మిన్ దేవీ సరస్వతీ."

కవిమిత్రుఁ డను వాక్పతిరాజును వాగ్దేవి యాశ్రయించి విశ్రమించుచున్న దని చెప్పెను. త్రివిక్రముఁ డను కవి నలచరిత్ర మను చంపూకావ్యము నితనిసభలో నుండియే రచించెను. ధనపాలుఁడు తిలకమంజరియు, ధనంజయుఁ డనుమఱియొకఁడు రాఘవపాండవీయ మను జైనకావ్యమును సాహసాంకుకీర్తికంఠమలుగా రచించిరి. భోజుని తర్వాతివారిలో యర్జునవర్మ యనురాజు అమరుకకావ్యమునకు స్వయముగా రమణీయమైన టీక గూర్చెను. అతనియాస్థానముననే మదనుఁ డను ప్రఖ్యాతుఁడగుకవివెలసి పారిజాతమంజరి యనునాటకము నర్జునవర్మవిజయప్రశస్తిగా రచించి నశ్వరము లగు తాళపత్ర భూర్జపత్రములమీఁదలిఖింపక శిలోట్టంకితముగా, శాశ్వతముగా నొనర్చెను. భోజుని ధారాప్రశస్తి యను రెండు ప్రాకృతకావ్యములును శిలాలిఖితములై వెలయుచున్నవి.

మదనుఁడు నాటకమును భోజస్తుతితోనే ప్రారంభించెను. ఎట్లన, భోజుఁడే యర్జునవర్మయవతార మెత్తి నుణోన్నతుఁ డయ్యెనని సూత్రధారుని దేవతాస్తోత్రమునఁ గృష్ణుఁడే యర్జునుఁడు, యర్జునవర్మయే భోజుఁ డని నలువురకుఁ బరస్పరసామ్య ముద్యోతించునట్లు మంగళశ్లోకము రచింపఁబడెను.

"అత్ర కథంచి దలిఖితేఽతి
శ్రుతిలేహ్యం లిఖ్యతే శిలాయుగళే,
భోజస్యైవ గుణోర్జిత
మర్జునమూర్త్యావతీర్ణస్య."

"వల్గద్బాణజయశ్రమో విజయతే
నిశ్శేషగోత్రాణకృత్
కృష్ణః కృష్ణ ఇవార్జునోఽర్జున ఇవ
శ్రీభోజదేవో నృపః,
విస్ఫూర్జద్విషమేషు వేధవిధురాం
రాధాం విధత్తే స్మ య
స్తూర్ణం పూర్ణమనోరథ శ్చిర మభూ
ద్గాంగేయభంగోత్సవే."

ఇందుఁ గృష్ణార్జున భోజదేవులమహిమ వర్ణింపఁబడినది. బాణశబ్దము కృష్ణపరమున బాణాసురుఁ

డనియు, గోశబ్దము భూమి, గోవులు, శబ్దశాస్త్రమనియు, విష మేషు-మన్మథుఁడు విషమమైన బాణములు అనియు, రాధాయను కృష్ణపరిగ్రహమును, రాధాయనగా ధనుఃప్రయోగమున నిలుచుండు స్థానభేదమనియు కర్ణునితల్లియనియు, గాంగేయశబ్దము భీష్ముఁడనియు, గాంగేయుఁ డను రాజనియు అర్థభేదముల నూహింపదగు. ధారాప్రశస్తి కడపట,

" కులగిరిణో భూమిహరా
సయలా విహు లహుఇఆ ఇహం జేణ,
తేణ స అం నిమ్మవిఅం
ఏఅం సిరిభోయరాఏణ."

(ఛాయా-కులగిరయో భూమిధరాః సకలా అపి ఖలు లఘూకృతా ఇహ యేన; తేన స్వయం నిర్మాపిత మేతత్ శ్రీభోజరాజేన)

(కుల గిరు లను సమస్తభూధరములకు ఎవఁడు భారమును దగ్గించుచున్నాఁడో యట్టి శ్రీభోజరాజుచే నీకావ్యములు రచింపఁబడియె అని కలదు. ఇతఁడు యోగసూత్రవృత్తిలోఁ దాను పతంజలివలె మనోవాక్కాయమలములను వివిధగ్రంథరచనచేఁ బోఁగొట్టుకొనె నని విచిత్రముగాఁ జెప్పుచున్నాఁడు. అనఁగాఁ బతంజలిమహర్షి యోగసూత్రముల రచించి మనోమలమును, జరకమును రచించి కాయమలమును, వ్యాకరణ మహాభాష్యమును రచించి వాఙ్మలమును బోఁగొట్టుకొనినట్లే భోజుఁడును సరస్వతీకంఠాభరణ మనునష్టాధ్యాయీసూత్రముల రచించి వాఙ్మలమును, పాతంజలయోగసూత్రములకు భాష్యము రచించి చిత్తమలమును, సుశ్రుతమునకు వ్యాఖ్యానము రచించి కాయికమలమును దొలఁగించుకొనె నని చెప్పుకొనెను. ఇఁక నితనిచరిత్రము నింతటితో నిలిపి యితని గ్రంథములలో నతివిస్తీర్ణ మగు శృంగారప్రకాశమునుగూర్చి యథోచితముగాఁ జెప్పెదను.



" తులసిపూజ "

—క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యము, కాకినాడ.

# మాయ జగత్తు

లంకలపల్లి గోపాలరావు, బి. యస్ సి.(ఆనర్సు)

## ఈమధ్య మనకు తెలియవచ్చే వింతలు

నేటి శాస్త్రజ్ఞుల ఊహలు భూమి ఆకాశము పట్ట రానివి. గజము బద్ద తూర్పువైపు చూపిస్తూపట్టుకుంటే గజముపొడవేకాని పడమటివైపు చూపిస్తూ పట్టుకుంటే కొంచె మెక్కువని చెబుతున్నారు. మన భూమి ఒకవైపునుంచి ఇంకొకవైపుతిరిగేసరికి మూడంగుళములు కురుచైపోతున్నాదని నిరూపించారు. మనశాస్త్రవేత్తలందరిలోను గొప్పవాడైన ఐన్స్టైను(Einstein) రెండురెండు నాలుగు కాదని గణితశాస్త్రమే ఆధారముగా పుచ్చుకొని రూఢిగ చెప్పాడు. మనము చూసేదంతా మాయ, తెలుసుకొనేదో అబద్ధము అన్నాడు. జబాబు చెప్పలేక పండితులంతా నోరుమూసుకున్నారు. దొంగ, దొంగను వెంబడించే పోలీసువాడు, గంటలో కలుసుకోగలుగుతే ఒకరికొక రెదురుగా పరుగెత్తి అరగంటలోనో, పావుగంటలోనో కలుసుకోడ మనుభవము. కాని దొంగవానికంటె పదివేలరెట్లు వడిగా పరుగెత్తుతున్న మనభూమి, భూమికంటె పదివేలరెట్లు వేగముగా పరుగెత్తే వెలుతురు, రెండు ఏవిధంగా పరుగెత్తినాసరే ఒకేవేళలో కలుసుకోడము ఈరోజులలో మనము కళ్లార చూడగలుగుతున్నాము. అనుమాన మేమి లేదు. దీనికి విపరీతమైన సమాధానము చెప్పాడు ఐన్స్టైను. ఎదురుగుండా పరుగెత్తే పోలీసుదొంగవాళ్ల వేగముల మొత్తము నాలుగు కోసులు, మూడుకోసులు కలుపుతే రాదట. ఈ మొత్తములోనుంచి వెలుతురువేగముతో కూడుకొన్న వేరొకసంఖ్య కొట్టివెయ్యాలి. ఇది పురాణము కాదు, ఇతిహాసము కాదు. కేవలము గణిత శాస్త్రము. అందులో బాగా ఆరితేరినవారికేగాని మన బోటివారికి బోధపడదు.

ఈ గణితము చాలించి మనకు కొంచెము బోధ పడేవిషయాలాలోచింతాము. భూమి, ఆకాశము, సూర్యచంద్రులు, జగము అంతా దేనితో చేయబడ్డది? ఏవిధంగా చేయబడ్డది?—ఇవి చిరకాలమునుండి మహామహులాలోచిస్తుండే ప్రశ్నలు. మనరసాయనశాస్త్రము చెప్పేది భూలోకములోని వస్తువులన్ని విధముల పదార్థములతో చేయబడ్డవని. కాని, కేవలము భూమి జగత్తుకాదు—హిమాచలమునుండి సేతుపర్యంతము వరకే భూమి కానట్టు. భూమికంటె సూర్యుడు పదమూడులక్షలరెట్లు పెద్ద; మూడువేలకోట్ల రెట్లు బరువు. మనభూమివలె బుధ, శుక్ర, కుజ, గురు, శని మొదలగు గ్రహములు తుపాకిగుండుకంటె వేగముగా సూర్యునిచుట్టు తిరుగుతున్నాయి. ఇందులో గురు, శనులు భూమికంటె వెయ్యిరెట్లు పెద్దవి. ఇదంతా కలిస్తే సూర్యప్రపంచకము. మన మాకాశములో చూసే ప్రతి నక్షత్రము సూర్యప్రపంచమువంటి మరొక ప్రపంచము. వాటినిగురించి మనకు తెలిసినది చాలతక్కువ. జగత్తులో మనభూమి, మనము ఎంతలెక్కకు రానివాళ్లము! అయితే జగత్తెంతపెద్దదనగా, మళ్లీ ఐన్స్టైనే జబాబు చెప్పాడు, కోటి కోటి కోట్లమైళ్లలో ముప్పాతిక అని. అనగా రమారమి మనోవేగముతో పరుగెత్తే వెలుతురు ఒక లక్షసంవత్సరములు ప్రయాణము చెయ్యాలి, జగత్తు తిరగాలంటే. వెలుతు రెంతవేగముగా వెళ్లగలదా అంటే రెప్పపాటుమాత్రములో భూమిచుట్టు పదిసారులు తిరిగి రాగలదు.

ఇట్టి జగత్తులో మనము చూసేవి, తెలుసుకొనేవి రెండు—రెండుమాత్రమే. అవి పదార్థము, శక్తి. మనము చూడగలిగేవి, తాకగలిగేవి పదార్థములు. చూడలేనివి, తాకలేనివి, అనగా వేడిమి, వెలుతురు, సంతోషము, దుఃఖము, ప్రాణము, మనలో చాలమందికి బహుశః తెలియనిదైన ఎలెక్ట్రిసిటి (Electricity-

విద్యుచ్ఛక్తి) ఇవన్నీ శక్తియొక్క వివిధరూపములు. పదార్థములన్నీ ఒకటిని మరొకటిగా మార్చవచ్చు— దేవాలయములు,గుడిసెలు దోచి మసీదులు,యంత్రశాలలు కట్టినట్లు. చెట్టును కోసి కుర్చీగా మార్చవచ్చును. లేదా ఆకట్టితో పంచదార చేయవచ్చును. ఈ కుర్చీనిగాని, పంచదారనుగాని కాల్చగా వచ్చిన వాయువువలన మళ్లీ చెట్టు పెరుగుతున్నది. ఇత్తడి బంగారము చేయలేమని పెద్దలు చెప్పారు. కాని క్రొత్తకాలములో ఆపని చేయగలమని తోస్తుంది. ఎలాగునో తర్వాత చూస్తాము. ఆవిధంగానే ఎలెక్ట్రిసిటీని వేడిగాను, వేడిని వెలుతురుగాను మార్చవచ్చును. వెలుతురులోనుంచి సంతోషము పుట్టవచ్చును. కాని చెట్టును సంతోషముగా మార్చడము, లేదా, కేవలము సంతోషముతో చెట్టు పుట్టించడము అసాధ్యమని నేటివరకు శాస్త్రజ్ఞుల మతము. ఇట్టి పనికూడ మనము చెయ్యవచ్చునని యీమధ్య నిరూపింపబడ్డది. కోపము, సంతోషము మొదలైనవి ప్రకృతి శాస్త్రజ్ఞులు పనిచేయడానికి వీలైనశక్తులు కావు ప్రస్తుతం. వీళ్లందరి వాడుకలోనున్న శక్తి ఎలెక్ట్రిసిటీ. ఎలెక్ట్రిసిటీ అనగా పదార్థములకు మన మిప్పింపగలిగే ఒకస్థితి—మనుష్యులకు కోపము పుట్టించేటట్లు. ఒకగాజుకొయ్యను పట్టుగుడ్డతో తోమితే యీకొయ్య వింతగా పనిచేస్తుంది. చిన్నకాగితపు ముక్కల నాకర్షిస్తుంది సూదంటురాయిలాగు! దీనికి కారణము గాజులో రాపిడివలన పుట్టిన ఎలెక్ట్రిసిటీ. అటువంటి ఎలెక్ట్రిసిటీనుండి పదార్థము పుట్టించారు, నేటి పాశ్చాత్య శాస్త్రజ్ఞులు. అంతే కాదు: మనకు తెలిసిన పదార్థములన్నీ ఎలెక్ట్రిసిటీలోనుండే పుట్టినట్లు నిరూపించగలుగుతున్నారు. సూర్యచంద్రులు, భూమి, సముద్రము, వాయువు, అగ్ని, వెలుతురు అన్నీ శక్తియొక్క వేరువేరు రూపములని మనము తెలుసుకోవాలి.

ఈవిషయములు చిత్రమైనవే. వీటిని కనిపెట్టే మార్గ మింకా చిత్రమైనది-అంధుడు వేళ్లతో తాకి పుష్పముయొక్క అందము గ్రహించినట్లే. ఏమంటే పదార్థములలో నుండే అణువులు మనకళ్లకగపడవు— సరేసరి; మనము చేయగలిగే అతిసూక్ష్మయంత్రములకుండానైన అగపడవు. అందుచేత సూటిగా చూపించడము కష్టము. కాని పదార్థముల జ్ఞానముకోసరము మనుష్యుడు కనిపెట్టినయంత్రములు బ్రహ్మాండమైనవి. ఇందులో ముఖ్యమైనది స్పెక్ట్రోస్కోపు (Spectroscope). మూడు ప్రక్కలుగల గాజుఖడ్డీ (Prism) పై సూర్యుని వెలుతురు పడితే విచిత్రమైన సప్తవర్ణములగుపడతవి. ఇంద్రధనుస్సు ఈవిధంగానే యేర్పడుతుంది. సూర్యుని వెలుతురుబదులు దీపములో కొంచెము ఉప్పు వేసి ఆవెలుతురు గాజుపై ప్రసరిస్తే సప్తవర్ణముల బదులుగా రెండు పచ్చని గీతలుమాత్ర మగుపడతవి. ఉప్పుబదులు వేరొకపదార్థ ముపయోగిస్తే వేరొకరకమైనగీత లగుపడతవి. ఒకపదార్థముగీతలు, ఇంకొకపదార్థముగీతలు ఎన్నడు ఒకేవిధముగా అగుపడవు. అందుచేత ఈగీతలు పదార్థముల వేలిముద్ర లనవచ్చును. ఈ వేలిముద్రలవలన ఏపదార్థమునుండి వెలుతురు వచ్చినదీ సులువుగా నిర్ణయించవచ్చును. ఈ విధముగా సూర్యుడు మనకు తొమ్మిదికోట్ల మైళ్లదూరంగా నున్నప్పటికి సూర్యునిలోనుండే పదార్థములు తెలుసుకోగలిగితిమి.

స్పెక్ట్రోస్కోపు మొదలైన యంత్రముల సహాయమువలన మన ప్రపంచమంతా ౯౨ విధముల పదార్థములతో చేయబడినదని తెలిసింది, ౫౬ అక్షరాలతో మన గ్రంథములన్నీ వ్రాయబడినట్లు. ఈ పదార్థములొక్కొక్కటి ఒక్కొక్కవిధమగు మోలిక్యూలను (Molecule) అతిసూక్ష్మమైన అణువులతో కూడుకొనియున్నది. ఈ అణువులలో రెండుగాని, మూడుగాని, నాలుగుగాని ఇంకా చిన్న అణువు లుంటాయి. ఈ చిన్న అణువులకు ఏటము (Atom) లని పేరు. ఒక లక్షకోట్ల పెసరగింజలు కలిస్తే భూగోళ మేర్పడుతుంది. ఆవిధంగానే ఒకలక్షకోట్ల ఏటములు కలిసి రెండు గోనెసంచులు నింపలేవు.

శాస్త్రజ్ఞు లింతటితో ఊరుకోలేదు. ౯౨ విధములగు ఏటము లెవ్విధంగా యేర్పడుతున్నవా అని తీవ్రంగా ఆలోచించారు. ఏటములన్నిటిలో చులకనివి హైడ్రోజను (Hydrogen) ఏటములు. ఇవి

ప్రాణవాయువు ఏటములతోకూడిన మంచినీ రేర్పడుతుంది. ఈ హైడ్రోజను-ఏటములే వేరువేరు సంఖ్యలుగా కూడి వేరువేరు ఏటములుగా కనబడుతున్న వని ప్రౌటు (Prout) గారు నూరేళ్ల క్రిందట చెప్పారు. అట్టి ఉద్దేశమున కానాధారము లేకపోయినా నేడు మన కది నిజంగా తోస్తున్నది. బరువుప్రకారముగా ఏటములను పేర్చి మెండలీఫ్ (Mendeleef) అను రష్యాదేశస్థుడు ఏటములన్నిటికిని విచిత్రమగు పరస్పర సంబంధ మున్నదనిన్ని, బరువు హెచ్చినకొలది మనుష్యులవలె శక్తి తగ్గిపోతుందనిన్నీ నిరూపించాడు. దీని కుదాహరణము ౧౯ (అనగా హైడ్రోజనుకంటె ౧౯) రెట్లు బరువుగలది ఫ్లోరిన్ (Fluorine). ఇది కొంచెము పచ్చనివాయువు. ఉపద్రవమైనశక్తితో హైడ్రోజన్ ఏటములతో కూడుకుంటుంది. ౩౫ రెట్లు బరువుగలది క్లోరిన్ (Chlorine). ఇది పచ్చని విష వాయువు. హైడ్రోజను-ఏటములతో సులువుగా కూడుకుంది. ౮౦ రెట్లు బరువుగల బ్రోమిన్ (Bromine) తేనెవలెఅగపడు ద్రవము. ఎండలోనే తప్ప హైడ్రోజన్-ఏటములతో కలుసుకోదు. ౧౨౭ రెట్లు బరువుగల అయొడిన్ (Iodine) ఊదావర్ణముగల గట్టిపదార్థము. హైడ్రోజన్-ఏటములతో కూడడము చాలకష్టము. ఈపరస్పరసంబంధము రానురాను రూఢిగ అగుపడుతూ ఉంది. పైచెప్పిన ౯౨ ఏటముల వెలిముద్రలు కొలవగా వచ్చేసంఖ్యలన్నిటికి ౧, ౨, ౩, ౪......౯౨ సంఖ్యలతో సంబంధ మగపడుతున్నది! ప్రౌటుగారు చెప్పినది ముమ్మాటికి నిజము. పదార్థములన్నిటికి మూలమొకటే అని విశదమయింది.

ఏటములో యేముందా అనేసంగతి మన మికనాలోచించవలసినది. జీమన్ (Zeemann) గారు ఉప్పు వెలిముద్ర (Spectrum) కాలుస్తూ ఆ కాలుతున్న ఉప్పుపై ఎలెక్ట్రిసిటీ ప్రయోగించగా వెంటనే ఆవెలిముద్ర మారిపోయింది. ఉప్పు కేదోమార్పు వచ్చిం దన్నమాటే. అంతేకాదు. పదార్థమును శక్తి మార్చగలదనిన్నీ, అందుచేత పదార్థము శక్తితో కూడుకొన్నదనిన్నీ మన కిది మొట్టమొదటి రుజువు. ఇది కనిపెట్టినందుకు జీమనుగారు రెండులక్షలరూపాయల నోబెలుబహుమానము పొందారు, పదార్థమునకు శక్తికి నడుమ స్థిరమైనవంతెన కట్టుబడు. క్రుక్సు (Crooks) గారు ఇదివరకె ఎలెక్ట్రిసిటీసహాయముచేత పదార్థము లన్నిటిలో నుండి శక్తికిరణములు పుట్టించగలిగారు. ఈకిరణములు కేవలము సూక్ష్మమైన అణువులని టామ్సన్ (Thomson) గారు తెలుసుకున్నారు. వీటికి ఎలక్ట్రానులని పేరు. ఇట్టి ఎలక్ట్రానులు నాలుగువందలు కలిస్తే సూదిమొన పాటిచుక్క యేర్పడుతుంది. ఎలక్ట్రాను లించుమించుగా వెలుతురువేగముగా గిరగిర తిరుగుతుంటాయని మన మూహించవలెను-తేనెపట్టుచుట్టు ఈగలు ఝుమ్మని తిరిగేమోస్తరు. ఇట్లుండగా బెక్వరెల్ (Becquerel) ను, క్యూరీదంపతులు (Curies) ను (వీరందరు ఫ్రాన్సు దేశస్థులు) ఇంకొక బరువైన ఎలక్ట్రానులు కనిపెట్టారు. ఇవి రేడియమ్ (Radium) మొదలగు పదార్థములనుండి యెల్లప్పుడు వెలువడుతుంటవి. ఆల్ఫాకణము (Alpha particles) లని వీటికి పేరు. ఈ రెండువిధములగు ఎలక్ట్రానులు కేవలము శక్తికిరణములైనప్పటికిని వీటి కన్యోన్యసంయోగము కలిగినప్పుడెల్ల హీలియమ్ (Helium) మొదలగుపదార్థము లేర్పడును! ఇంతేకాదు. ఆల్ఫాబిందువుల బరువు ౪, రేడియమ్ బరువు ౨౦౬, సీసము బరువు ౧౨౬. అనగా ఒక రేడియం ఏటమునుండి ౫ ఆల్ఫాబిందువు లెగిరిపోయెనా రేడియముపోయి సీసము మిగలాలి. ఈమార్పు జరిగింది! రేడియమువిలువ యింతని చెప్పడానికి వీలులేదు. సూదిమొనలో రవంతపెట్టి గొప్ప ఔషధాలయాలలో నుంచుతారు. కడుపులోనిబల్ల కాల్ఫాబిందువులు దివ్యమైన ఔషధము. ప్రపంచమంతా వెతికిన ఇది ఒక తులముమాత్రము బయలుపడుతుందేమో!

అమూల్యమైన రేడియమును సీసముగా మార్చగలిగితిమి. కొన్నాళ్లకు సీసము రేడియముగాను, ఇత్తడి బంగారముగాను మార్చడానికి వీలవుతుంది. 'పందిచెవితో పట్టుసంచి చేయలేమన్నట్లు' అను పాశ్చాత్యుల సామెత *లోని అనుమానము తీర్చేశారు ఆర్థరు డీ లిటిలు

* We cannot make a silk purse out of a sow's ear.

(Arthur D. Little) గారు. కావలసినన్ని ఆల్ఫా బిందువులతో కావలసినన్ని యెలక్ట్రానులు కలిపి కావలసిన పదార్థ మేర్పరచగలశక్తి మనకు ప్రస్తుతములేదు. ఉప్పు, చింతపండు మొదలైనవి కలిపుతే పచ్చిపులుసు. కాని రుచిగలపులుసు చేయాలంటే నిప్పు కావాలి. అలాగునే యిత్తడి బంగారముచేయడానికి నిప్పు కంటె గొప్పశక్తి యేదో కావలసిఉంటుంది. వేడి మనకు తెలిసిన మహాశక్తులలో నొకటి. నిప్పు చన్నీటి వేడి (Absolute Temperature) కంటె మూడురెట్లెక్కువ. మూడుబదులు నాలుగురెట్లవేడితో బంగారము కరగబోయవచ్చు. సూర్యునివేడి ౧౩౦ రెట్లు! ఉపద్రవమైనశక్తి లింకను ఉండవచ్చును. అందుచేత సూర్యునిలో నెటువంటివస్తువు లున్నప్పటికి ఆశ్చర్యము కాదు. మనకు తెలిసినపదార్థములలో చాలబరువైనది బంగారము. కాని సూర్యునిలోనిపదార్థము లంతకంటె రమారమి లక్షరెట్లు బరువు. ఒకవేళ సూర్యునినుండి సూది భూమిమీదికి జారితే దానిని లేవనెత్తడానికి వస్తాదులు రావాలి!

ఏటములోని యెలక్ట్రానుల ఆల్ఫాబిందువులస్థితి యేమి? వీటిపరస్పరసంబంధ మేమి? ఈప్రశ్నకు త్తరము ఐన్స్టైనువంటి మహామహులే చెప్పాలి. గణితము, ప్రకృతిశాస్త్రములవలన మన కీవిషయములో బోధపడేవి చాలతక్కువ. ఇక కేవల మూహించాలి; ఊహకాధార మున్నదా అని వెతకాలి.

"కెంపు నేనెరుగనా కుంపటివలె నుండు
కోతికివలె రెండు కొమ్ము లుండు"

అని పెక్కుశాస్త్రజ్ఞు లూహించారు. తోవతప్పి తెలివితెచ్చుకున్నారు. ఆల్ఫాబిందువుల సమూహము ఏటమునడుమ నుంటుందని పెక్కుకారణములచేత మన మూహించాలి. ఈసమూహమునకు న్యూక్లియస్ (Nucleus అనగా బీజమనిఅర్థము) అని పేరు. న్యూక్లియస్‌చుట్టు ఎలక్ట్రాను తిరుగుతుండగా నేర్పడేదియేటము.

ఏటము బూరెవలె నుంటుందని టామ్సనుగారూహించారు. సూర్యునిచుట్టు గ్రహములు తిరిగే విధంగా బూరెచుట్టు ఎలక్ట్రానులు తిరుగుతుండవచ్చునన్నారు. వీరి ఊహలు సులువుగా ఖండింపబడినవి. రూథర్ఫర్డుగారు (Rutherford) టామ్సనుగారి బూరెలోని పూర్ణము భాగ తగ్గించి మధ్య చిన్న ఆవగింజమాత్రము పెట్టి దానిని 'న్యూక్లియ' సన్నారు. కొత్తబూరెరుచి బాగుండలేదు. ఎలక్ట్రానులన్ని తిరిగి తిరిగి నడుమనుండే "ఆవగింజ" దగ్గరకు వెళ్లిపోవునయ్యా అని గణితశాస్త్రము చెప్పింది.

అట్టి సమయములో మాక్సు ప్లాంకు (Max Planck) గారు విపరీతమగు కొత్తమతము బోధించారు. గడియారముముల్లు సునుపుగా తిరగదు. టిక్కు టిక్కు టిక్కు మని గంతులువేస్తూ తిరుగుతుంది. శక్తి వెలువడునప్పుడిదేవిధముగ గంతులువేస్తూ వెలువడుతుంది. ఒకేధారగ వెలువడ దని ప్లాంకుగారి ఉద్దేశము. ఈ మతము ప్రకృతిశాస్త్రమం దంతట వెంటనే వ్యాపించింది. నీల్సుబోరు (Niels Bohr) గారు ప్లాంకుగారిసూత్ర ముపయోగించి రూథర్ఫర్డుగారి బూరెరుచి బాగుపరచాలని తలచుకున్నారు. "మీ యిష్టము వచ్చినట్లు తిరగడము పనికిరా" దని యెలక్ట్రానులతో చెప్పారు. ఎలక్ట్రానులకు కొన్ని చక్రముల వంటి రోడ్లిచ్చి "మీ రీరోడ్లలోనేకాని రోడ్లమధ్య సంచరించకూడ" దని ఆజ్ఞయిచ్చారు. అందుచేత ఎలక్ట్రానులు వాల్తేరు, అనకాపల్లి, ఎలమంచిలి, తుని, లోనేగాని వీటిమధ్యనున్న చిన్నస్టేషనులలో ఆగడానికి వీలులేదు. ఎలక్ట్రా నొకస్టేషనునుండి రెండవస్టేషనుకు వెళ్లేతోవతో శక్తి ప్రసరించాలి. ఈ శక్తి మనకు పైచెప్పబడిన స్పెక్ట్రొస్కోపులో "వేలిముద్ర" గా నగుపడుతుంది. ఇదంతా మనకు సబబులేని భావనగా తోచవచ్చును. కాని యీ ఊహలవల్లనే బోరుగారు చిరకాలము నిలిచే పేరు పొందారు. బోరుగారి ఉద్దేశముల కాధారము రోజురోజుకి అమాంతముగా పెరుగుతున్నాది.

బోరుగారివంటి పండితు లింకా తీవ్రంగా ఆలోచిస్తున్నారు. ఎలక్ట్రానును విరుగగొట్టి చూదామనే ఉద్దే

శములో నున్నారు. ఫ్రాన్సుదేశస్థుడు డీ బ్రాగ్లీ (De Broglie)గారు "ఎలక్ట్రాను చుక్కా కాదు. కిరణమూకాదు. కెరటములమూక" అని చెప్పాడు. "మా ఉద్దేశముకూడ అదే" అని డేవిసన్ (Davisson), గెర్మరు(Germer), టామ్సన్ (Thomson)గార్లు చాల ఆధారములు చూపించారు. ఈపునాదిపై ష్రెడింగరు గారు (Schroedinger) విచిత్రమైన మేడ కట్టేశారు. మనబోటివారి కీమేడ పైకి అందముగా ఉన్నప్పటికి లోనికి వెళ్లి తే దుర్యోధనుకిలాగు పరాభవము తప్పదు. ఐనా చూతాము కాస్త.

ఇందుకు కెరటమంటే యేమిటో కొంచెమాలోచించాలి. పొంగి పొరలి మనవైపు వచ్చే సముద్రపుకెరటమంపరూ చూసినదే. ఇంకొకరకము కెరటముంది,మనము సాధారణంగా చూడండి. చలనములేని నూతినీటిమధ్య నొకచిన్నరాయి వేసి చూడండి. కెరట మేర్పడుతుంది. క్రమంగా పెరిగిపెరిగి గట్టు అడ్డము రాగానే మాయమై పోతుంది. ఈకెరటముకూడ అంతమంది చూసేఉంటారు. కాని కెరటము గట్టువైపు వెళ్తుండగా నీటిమీద తేలుతుండే ఆకు లేమవుతున్నాయో చూశారా? సముద్రములో కెరటము మనుష్యులనేమి, పడవలనేమి ఒడ్డువైపు కొట్టేస్తుంది. కాని నూతిలోనికెరటము ఆకు నేమీచేయలేదు. ఆకు కొంచెమునేపు కెరటములో తేలి మునిగి యథాస్థానములో నుండి పోతుంది. కెరటము సెలవుపుచ్చుకొని గట్టువైపు వెళ్లిపోతుంది. అంటే అర్థమేమి? కెరటము నూతిమధ్యనుండి గట్టువైపు వెళ్లిందేగాని నీటిలోని ఒకచుక్కైనా మధ్యనుండి కొసకు వెళ్లలే దన్నమాట! మనకు కనబడే చలనము కెరటముదేకాని నీటిది కాదు. మరొకఉదాహరణము: ఒకయిరవై మూరలచేంతాడు నేలమీద తిన్నగ పరిచి ఒకకొనను చేతితో పుచ్చుకొని చివ్వుమని కొరడా వలె కొట్టి విడిచిపెట్టా మనుకుందాము. ఈకొసనుండి రెండవకొసవరకు ఒకకెరటము వెళ్లడము చూస్తాము గాని ఎక్కడితా డక్కడే నిలిచిఉంటుంది. ఒకవేళ చేంతాడు పామువలె కొంచెముదూరము ప్రాకినా కెరటపువేగముతో ముందుకు పోవలసినఅవసరము లేదు. తాడుకంటె కెరటము వేగముగా పోవచ్చును. ఈ రెండిటివేగములకు పరస్పరసంబంధము లేదని మనము బాగుగ తెలుసుకోవాలి. లేదా ష్రెడింగరుగారి మేడలో పరాభవము తప్పదు.

ఇక 'ఏట' మెలాగుందో ఆలోచింతాము. మధ్యన 'న్యూక్లియస్' బీజముంది. ఆచుట్టు ఎలక్ట్రానులు అనగా కెరటపుమూకలు అల్లకల్లోలము. సముద్రములోనికి వెళ్లేకొలది అల్లకల్లోలము తగ్గేటట్లు న్యూక్లియసునుండి దూరంగా వెళ్లినకొలది యీ విప్లవము తగ్గి క్రమంగా చల్లారుతుంది. ఎలక్ట్రిసిటీప్రయోగము చేత ఎలక్ట్రానులు పైకి రావడ మిదివరకే చెప్పబడ్డది. అట్టిసమయములో జరిగే దేమిటంటే రాయి వెయ్యగానే నూతిమధ్యనుండి కెరటాలు బయలుదేరినట్లు ఏటమునుండి యెలక్ట్రానుకెరటపుమూక లల్లకల్లోలముతో వెలువడుతాయి. ఈవెలువడడములో ఎలక్ట్రాను మూక వడిగా పోతే మూకలోని కెరటములు మెల్లగ పోవడము, యెలక్ట్రాను మెల్లగా పోతే కెరటములు వడిగాపోవడము తటస్థిస్తుంది-మన చేంతాడు, చేంతాడు కెరటములలాగునే. కాని భేద మేమిటంటే చేంతాడును ముట్టుకోవచ్చు, పట్టుకోవచ్చు. పొడవుగలది; బరువుగలది. ఎలక్ట్రానో భూతమువంటిది; దేహము లేదు. కాళ్లుచేతు లంతకంటె లేవు. కాని మనోవేగముతో పరుగెత్తుతుంది; మన మూహింపలేని పను లెన్నో చేస్తుంది.

తుదకు మనకు స్ఫురించేసంగతి ఒకటి. పదార్థము, శక్తి అని రెండుకావు. పదార్థమే శక్తి; శక్తే పదార్థము. మనదేహము, ఆత్మ అదేవిధముగ కేవల మొకటేగాని వేరువేరు కాదు. మనపూర్వులు మహాశాస్త్రజ్ఞులు. జ్ఞానమే జీవితములో నుద్దేశముగా పెట్టుకొని లెక్కలేని వింతలు కనిపెట్టారు. కోట్లకొలది కోసులదూరముగా నుండే గ్రహములు మనుష్యుల జీవములలో ప్రతిరోజు, ప్రతినిమిషము ఎట్టిమార్పులు తేగలవో గ్రహించారు-మన కెంతో ఆశ్చర్యము కలిగించారు. మంత్రశక్తి ఉపయోగించి పులులు, పాములు మన

దగ్గరకు రాకుండా చేశారు. కాని ఆత్మకు, దేహము నకు సంబంధము లేదని చెప్పారు అది మనము నమ్మ డానికి వీలులేదేమో! ప్రకృతిని బాగా జయించిన తర్వాత ప్రాణముకూడ సృష్టించడానికి మనకు వీలవు తుందని చెప్పవచ్చును. అగ్నిశక్తిని ప్రాణశక్తిగా మార్చుటము!—వేడిని వెలుతురుగా మార్చినట్లు. స్మశాన ములో ముఖాన్ని చాలవచ్చును చనిపోయినవారిని మరల బ్రతికించడానికి. నేటికల రేపటి అనుభవము.

---

"రోగనివారణముకన్న రోగమురాకుండ చేయుట మంచిది" అనువిషయమునుగూర్చి వ్రాయమనగా మా చిత్రకారు డీ చిత్రమును వ్రాసిపంపెను.



# ప్రేమపాశము

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

(అనువృత్తము)

## నాలుగో అంకం

### మొదటిరంగం

[ మధ్యాహ్నం మూడుగంటలవేళ. కాంతమ్మ యింటో వుత్తరపువసారాలో శేషయ్యా, పేరుభట్టూ కూచునివుంటారు. ]

శేషయ్య—ఈమధ్య వీర్రాజుదగ్గిర నూట యాభైరూపాయలు పుచ్చుకున్నాట్ట నోటుమీద.

పేరుభట్టు—సంతకం నువ్వూ చేశావా ?

శేషయ్య—అలాంటిమాటలు నాదగ్గిరా ?

పేరుభట్టు—వీర్రా జెలా యిచ్చాడూమరీ ?

శేషయ్య—ఏమో ?

పేరుభట్టు—రాఘవరాజుగారి నోటులో యేమేనా చెల్లుపెట్టాడా ?

శేషయ్య—దమ్మిడీకూడా యివ్వలేదు.

పేరుభట్టు—మొత్తం—

శేషయ్య—మూడువేలకిపైన.

పేరుభట్టు—సున్నకిసున్నా, హళ్లికిహళ్లీనీ.

శేషయ్య—ఏమనుకున్నావుమరి ?

పేరుభట్టు—ముందుసంగతి యేమిటి ?

శేషయ్య—నాడికీ, ఋణదాతలికీ లంకె.

పేరుభట్టు—వాడికొక్కడికే వాళ్లెలా యిస్తున్నారూ, మైనారిటీవదిలిన మనం వుండగానూ ?

శేషయ్య—అనుభవిస్తారు. మనమేం చేస్తామూ ?

పేరుభట్టు—భవిష్యత్తు ?

శేషయ్య—నీవుద్దేశం యేమిటి ?

పేరుభట్టు—నావాటా వొదులుకుంటే ?

శేషయ్య—యకరంభూమి చేదా ?

పేరుభట్టు—పేచీలుపడాలి. తిరగాలి.

శేషయ్య—నేనున్నానుగాదూ ?

పేరుభట్టు—ఇక్కడ ప్లీడర్లతో ఆలోచిద్దాం. అవసరమైతే డబ్బు పుచ్చుకోకుండా వ్యవహారం నడపడానికి నాకు పదిమంది ప్లీడర్లు ఆధారంవున్నారు.

శేషయ్య—ఇంకేం ? అయితే కాస్త సావకాశం చూసుకుని విభాగానికి దావా పడెయ్యి నువ్వు.

పేరుభట్టు—వాడిమీదా ?

శేషయ్య—నన్నుకూడా కలిపే.....నేను దావాకి వొప్పుకుంటాను.

పేరుభట్టు—సరే. అయితే వుమ్మడిలోనుంచి నువ్వేమాత్రమో తీసుకుంటున్నావుట కాదూ ?

శేషయ్య—మూడేళ్లయింది మానేసీ.

పేరుభట్టు—మూడేళ్లా ?

శేషయ్య—ఏమనుకున్నావుమరి? నేను మానేశాకే ఋణానికి మొదలు.

పేరుభట్టు—ఇప్పటికీ తీసుకుంటున్నావన్నాడు మొన్న.

శేషయ్య—నాయెదట అనమనూ.

పేరుభట్టు— ఎంతదగా ?

శేషయ్య—నువ్వేం చూశావురా ? ఇంతకీ : అమ్మ చేస్తోంది వాణ్ణలాగ.

పేరుభట్టు—అవునవును.

శేషయ్య—బతికివున్నప్పుడు చిన్నమామ బంగారం పెళ్లిమాట యెప్పుడేనా తెచ్చాడా ?

పేరుభట్టు—లేదు లేదు. కాని కోటమ్మవొడ్డమ్మ వెంకన్న కోసం వొకమాటు ప్రయత్నంచేసిందిట. అదో గమ్మత్తుకథా. తరవాత చెబుతానులే. ఇప్పుడు చెబితే—తలుచుకుంటె నవ్వువస్తోంది. తరవా—తా—రత్తమ్మ పిన్ని రాయుడుకోసం వొడుపేస్తోంది.

శేషయ్య—అత్తవుద్దేశం యేమిటో?

పేరుభట్టు—బ్రహ్మభేద్యంగావుంది; కాని బంగారంమాత్రం క్షణమేనా విడిచివుండలేకుండావుంది నన్ను.

శేషయ్య—మంచిమాట విన్నాను. ఈ పది రోజులూ వెళ్లిపోయాక కాస్త సంగీతం మొదలుపెట్టు. అత్తకి చేదోడువాదోడుగావుంటివా, ముందు లాభిస్తుంది. తెలిసిందా?

పేరుభట్టు—నాజాగ్రత్తలో నేనున్నాను.

శేషయ్య—“యత్నేకృతే యది నసిద్ధ్యతి కోత్రదోషః” కాని అత్త మామంచిమనిషిరా. ఏమాత్రమో నిలవవుందనుకుంటాను.

పేరుభట్టు—ఉండవచ్చు.

శేషయ్య—ప్రకృతస్థితి యెలావుందీ?

పేరుభట్టు—ఏంచెప్పనూ? పొద్దున్న వొక షావుకారుచెల్లెలు రెండుకావిళ్లసామాను పట్టించుకు వచ్చింది. వొకప్లీడరుగారు పాతికరూపాయలు పంపారు. “నెయ్యీ, నూనీ యెంతపడ్డాసరే, డబ్బాలు పంపం చండి” అని యిందాకా వొకసాహుకారు చెప్పివెళ్లారు. మామయ్య బతికివుండి, బంగారంపెళ్లిచేస్తే నా పెద్దన్నయ్యా, సప్లయిలికి యిల్లుచాలకపోవును.

శేషయ్య—ఈశ్వరకటాక్షం యింతేవుంది.

పేరుభట్టు—నాదురదృష్టంకూడా తోడయింది.

శేషయ్య—మామయ్యవుంటే నీకు ఆశలేకపోవునేమో?

పేరుభట్టు—ఉంటే సందేహమేలేకపోవును.

శేషయ్య—ఏమయినా, కనుగలిగివుండు. ఆవిడ చెప్పినట్లు మసులుకో.

(అప్పుడు ప్రకాశంవస్తాడు.)

ప్రకాశం—(వెనక్కితగ్గుతాడు.)

పేరుభట్టు—దయచెయ్యండి. మాయింటిగొడవ చెప్పుకుంటున్నాం. పెద్దన్నయ్యా, వీరిని నువ్వెరగవనుకుంటాను. చేబోలు ప్రకాశంగారని—యెదటియిల్లు వీరిదే. వీరు హితకారిణీహైస్కూల్లో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా వున్నారు. నెలకి యాభైరూపాయలిస్తారు వీరికి.

శేషయ్య—అలాగా?

పేరుభట్టు—మామ పోయినప్పుడెవరూ లేకపోగా దహనసంస్కారం—

శేషయ్య — ఏంపుణ్యాత్ములండీ! మహానుభావా! నమస్కారం. దయచెయ్యండి.

ప్రకాశం—చిత్తం చిత్తం. తమరుపెద్దలు —

పేరుభట్టు—దయచేశారుకారు. కూచోవాలి. (తానుజరిగి చోటుచూపిస్తాడు.)

ప్రకాశం—కూచోడానికి సందేహంలేదు; కాని కొంచెంపనివుంది. అత్తయ్యగారు మిమ్మల్ని—వీరు మీపెద్దన్నగారా?

పేరుభట్టు—అవునండి. నేనంటే ప్రాణం యితనికి. మొదణ్ణుంచీ మేమిద్దరమూ వొకటి.

ప్రకాశం—అయితే సందేహం అక్కర్లేదు. అత్తయ్యగారు మీతో మాట్లాడాలంటున్నారు. అయ్యా! మీరుకూడా రావచ్చు.

శేషయ్య—మీరిద్దరూ—

పేరుభట్టు—నువ్వూ రావాలి.

(అప్పుడు బంగారమ్మ వస్తుంది.)

బంగారమ్మ—పెద్దబావనికూడా తీసుకురమ్మంటోందండీ మామయ్యగారూ, మాఅమ్మ.

ప్రకాశం—సందేహంతీరిందా ? మరి లేవండి.

శేషయ్య—మీ సెలవు.

(అందరూ లేచివెడతారు. బంగారమ్మ పేరు భట్టుచెయ్యిపట్టుకొని వెడుతుంది.)

రెండో రంగం

[కాంతమ్మ యిల్లు. దక్షిణపువసారాలో రత్తమ్మా, రాయడూ నుంచునివుంటారు.]

రత్తమ్మ—పెద్దాడువచ్చాక మరి కాస్త చెడ్డట్టుందిరా మన పనీ.

రాయడు—ఓపికపట్టాలి. రెండుపుట్ల భూమి వున్నవాణ్ణి నేను. ఇంగ్లీషు చదివాను. బంగారాన్ని గురించి నాకు అనుమాన మేమీ లేదు.

రత్తమ్మ—ఉండకూడదు.

రాయడు—అత్త ప్రతీపనినిగురించీ పేరుభట్టు తోటీ, శేషయ్యతోటీ ఆలోచిస్తాం దేమీ అనుకోకు. వాళ్లు చాకిరీచెయ్యడంలో చాలా తెలివయినవాళ్లు.

రత్తమ్మ—చెప్పిన పనులన్నీ తెలివి తేటలతో చేస్తూవుంటే పేరుభట్టు ప్రయోజకుడవుతాడనుకోదూ అదీ ?

రాయడు—ఇంటోవున్న వట్టుకు చక్క బెట్టడమా తెలివంటే? సంపాదించవద్దూ? సంగీతం వచ్చినంతమాత్రాన సంపాదించగలడా? ఇంతకీ: సంగీతంలో తెలివివుడితే మళ్లీ కావ్యాల్లో యెందుకు ప్రవేశిస్తాడూ ? సరే, భూములసంగతి మనకి తెలిసిందే కదా? పంచుకోడంఅంటూ వస్తే మనిషికి యకరం దాటదు. అదేనా యీలోపుగా నూరన్న మిగలనిస్తేనూ.

రత్తమ్మ—మొన్న కాకినాడవెళ్లి ఆరురోజుల్లో రెండువందలనలభై తెచ్చాట్ట.

రాయడు— భోగందానివెనకాల హంగుచేసీ. అదేనా జన్మాని కోమాటు. ప్రతీనెలా యిలా తేగలుగుతున్నాడనుకున్నావా యేమిటి ?

రత్తమ్మ—ఈవూళ్లో నెలకి యాభై—

రాయడు—నాకు భూములమీదే వస్తాయి కాలుమీద కాలువేసుక్కూచున్నానూ నెలకి డెబ్బయి రూపాయలు. పైగా యేమేష్టరీచేసినా పాతికరూపాయలు తేగలను. దైవం మేలుచేసి సబురిజస్ట్రారుకచేరీలో గుమాస్తాపని దొరికిందంటే జీతంకాక రోజుకి నాలుగురూపాయలేనా చులాగ్గా యేరేస్తాను.

రత్తమ్మ—అయినా పేరుభట్టుమీద బంగారానికీ, అత్తకీ యిష్టం ముదరనివ్వకూడదు.

రాయడు—నీకాసులపేరు మారువాడీదగ్గిరవుండిపోడమూ, యిప్పుడిక్కడ అసాధ్యపురోజులు రావడమూ తటస్థించింది; గాని లేకపోతే అది బంగారం మీదపడేస్తే బజానాలాగ బిగిసి—యెందుకూ ?

రత్తమ్మ—మీనాన్న నావస్తువుల్లో వొకటేనా అట్టేపెట్టారట్రా ? పైకి చెప్పకుంటేసిగ్గు. ఆయనికి ప్రయోజకత్వ మేవుంటే ఆరుయకరాలభూమి తనఖాలో పడిపోతుందా ? నీకు యాభైయేళ్లొస్తేగాని అది స్వాధీనంకాదాయె. అత్తకి చెప్పాడో లేదోగాని యిది మామయ్యకికూడా తెలుసును.

రాయడు—ఇప్పుడేనా పెత్తనం నామీద పడేస్తాడా నాన్నా ?

రత్తమ్మ—నామీద పడేసినా బాగుండిపోను మొదణ్ణుంచీనీ. వద్దుమొర్రోఅంటూంటే కాగితాల మిల్లులో నాలుగువేలు తగలేశారు. ఆరుణం మనకిప్పుడు నల్లతాచై మెడకిచుట్టుకుంది.

రాయడు—అదంతా యిప్పుడేంలాభమూ? నీశక్తి కొద్దీ ప్రయత్నంచెయ్యి.

రత్తమ్మ—నువ్వు చాలా జాగ్రత్తగావుండాలి. నీలాంటి పెళ్లికొడుకు దొరకడనుకోవాలి కాంతమ్మత్త.

రాయడు—వో! చూస్తూవుండు.

( తెరలో )

మావెంకడు వచ్చాట్టే యిలాగ రత్తమ్మా?

రత్తమ్మ—దొడ్డమ్మ వస్తోంది, నువ్వింటోకి వెళ్లిపోనాయనా!

రాయడు—నిజంగా పెద్దమ్మే ఆవిడ. మొఘం మీద యెప్పుడూ దరిద్రంవోడుతూవుంటుంది.

(రాయడు లోపలికి వెళ్లిపోతాడు. కోటమ్మ వస్తుంది.)

కోటమ్మ—యేమిటమ్మా కొడుకూ, నువ్వూ మాట్లాడుకుంటున్నారూ?

రత్తమ్మ—తమ్ముడినూటే. ఇంకా పదికాలాల పాటు బతికివుంటే యెంతేనా బాగుపడును.

కోటమ్మ—బంగారమ్మతోపాటు వొక మొగ పిల్లాడేనా కలిగివుంటే రాజాంగంగావుండును.

రత్తమ్మ—పెట్టిపుట్టవద్దూ? కూతురికేనా పెళ్లి చేసుకునేయోగం లేకపోయింది.

కోటమ్మ—తమ్మ డెంతగురదృష్టవంతుడో చూడూ. కూతురికి పెళ్లిచేసి అల్లుణ్ణి యింటోపెట్టు కుంటే అదో అందంగా వుండును. అదేనా జరిగింది గాదు.

రత్తమ్మ—అయితే అక్కయ్యా? (మెల్లిగా) వెంకన్నకిమ్మని అడిగావుటకాదూ బంగారాన్నీ?

కోటమ్మ—యేదో అడిగానేఅనుకో. ఆలోచించి చెబుతామన్నారు మొగుడూపెళ్లామూనూ. పదిహేనురోజులు తిరగలేదింకా. ఏమిశాశ్వతమే?

రత్తమ్మ—వాళ్లవుద్దేశం యేమేనా తెలిసిందా?

కోటమ్మ—మరదలివ్వపడ్డట్టే తోచింది. తమ్ముడు మాత్రం చదువులేదని సందేహించా డనుకున్నాను. అయితే వెవసాయంకూడా చదువుల్లోనే లెక్కట. మీబావచెప్పారు. ఇప్పు డింగ్లీషు చదివినా లాభం లేదుట. బ్రాహ్మలకెక్కడా వుద్యోగాలు దొరకడం లేదుట. అదేదీ? అదేవోనమ్మా! దాని పేరు నోట్లో ఆడుతోందీ. అదివచ్చాక వున్నవుద్యోగాలుగూడా మానేస్తున్నారుట అంతానూ. నీకొడుకు నాలుగేళ్లయింది చదువునూనేసీ. యిప్పటికేనా నౌకరీ దొరక దాయె.

రత్తమ్మ—నాకొడుక్కి నౌకరీకర్మం యేమిటే? రాజులాగ వుద్యోగంచేస్తాడువాడు. యేమేస్టీటుకచేరీ లోనో గుమాస్తాగా చేరాడంటే రోజుకి నాలుగు రూపాయలేనా కళ్లబడతాయి. ఉద్యోగం దొరక్క వూరుకోలేదు మావాడు. ఇప్పణ్ణుంచీ యెందుకూఅని చూస్తున్నాం.

కోటమ్మ—వస్తేచేదని మానేశామంటావా?

రత్తమ్మ—కాకపోతే? మావాడెక్కడికివెళ్లినా నెత్తిమీదపెట్టుకుని యిస్తారు పని.

కోటమ్మ—ఉద్యోగంవస్తే స్వతంత్రం వుండదుటే.

రత్తమ్మ—వచ్చినవాళ్లకి బాధలేదు.

కోటమ్మ—మీరుణాలు తీరిపోయాయా?

రత్తమ్మ—ఇంతసేపా? చిల్లరరుణాలేమేనా వుంటే వుద్యోగందొరికిన ఆరుమాసాల్లో తీర్చేస్తాడు మావాడు, ఆడుతూ పాడుతూనూ.

కోటమ్మ—మాకు రుణాలు లేవుసుమా. మావాడు పదిరూపాయలుతెస్తే పదీ నిలవే.

రత్తమ్మ—కాస్త భూమివున్నవాళ్లకి రుణా లెవరిస్తారూ? రెక్కాడకపోతే డొక్కాడుతుందాయె.

కోటమ్మ—మేమేం లోటుగా వున్నామూ? మీలాగ మజ్జిగనీళ్లకి లోటులేదు. నేతికీ లోటులేదు. పొలంలో మావాడు అన్నికూరగాయలూ కాకిస్తాడు. ప్రతీ రోజూ నేను మీలాంటివాళ్లకి పదిమందికి పంచి పెడుతూనేవుంటాను. బెల్లానికి బెల్లం, ధాన్యానికి ధాన్యం, పప్పుదినుసుకి పప్పుదినుసు—యేంలోటు మాకూ?

రత్తమ్మ—(స్వగతం) ఇక పాకం ముదర బెడుతుంది. (ప్రకాశం) ఎవరికీ యేంలోటూలేదు. పద, స్నానంచేద్దాం.

కోటమ్మ—నేను కూచోమన్నానా యేమిటి నిన్ను? (వెళ్లిపోతుంది.)

రత్తమ్మ—ఇదా సమయం? సరసం యెరగదు......అదెంతగింజుకున్నా మరదలు బంగారాన్ని వెంకడి కివ్వదు నాకొడుకూ, నేనూ పెట్టిపుడితే అది నాయింటో నేపడుతుంది. ప్రయత్నిం మానను. (వెళ్లి పోతుంది.)

మూడోరంగం

[ప్రకాశం యిల్లు. దొడ్డిసన్నుంపెట్లమీద బంగారమ్మ, సుబ్బమ్మ కూచునివుంటారు.]

సుబ్బమ్మ—నేను రమ్మంటూంటే అదంతా నీకెందుకూ?

బంగారమ్మ—మీయింటికి నువ్వుపెద్దవా?

సుబ్బమ్మ—మాఅమ్మ నామాట తీసెయ్యదు. మాచిన్నన్నయ్యకూడా యేమీ అనడు.

బంగారమ్మ—ఎందుకంటావూ?

సుబ్బమ్మ—అనడంటున్నానుకామా?

బంగారమ్మ—అస లీమాట యెందుకురావాలీ?

సుబ్బమ్మ—అదేమిటే అలాఅంటావూ? మా వాళ్లూ, మీవాళ్లూ పోట్లాడుకున్నారు కాదూ మరీ?

బంగారమ్మ—వాళ్లకి కలిసిందా?

సుబ్బమ్మ—లేదు—

బంగారమ్మ—మీఅమ్మ కలవనిస్తేకామా? (దుఃఖిస్తూ) మా నాయన—మీఅమ్మమూలే మిగిలింది.

సుబ్బమ్మ—మామయ్యవుంటే నామాట తీసెయ్యగలుగుదువా నువ్వు?

బంగారమ్మ—మానాన్నవుంటే మీరిక్కడి కెందుకు వస్తారూ యిప్పుడూ? మానాన్న చచ్చి పోయాడుగనక మీఅమ్మ సంబరపడుతూ వచ్చింది. ఆవిడితోగూడా నువ్వు వచ్చావు. లేకపోతే నామొగం నీకూ, నీమొగంనాకూ కనిపించకేపోవు నింతట్లోను.

సుబ్బమ్మ—అవన్నీ యెందుకే యిప్పుడూ?

బంగారమ్మ—మా నాన్న బతికివుండగా మీ అమ్మ మాగుమ్మంలో అడుగు పెట్టలేకపోయింది. మా నాన్న మీఅమ్మకేంలోటు చేశాడూ? ఏటామూడు—

సుబ్బమ్మ—మాదొడ్డమ్మకీ, మా పిన్నికీగూడా పెట్టాడుగాని మాఅమ్మకి వొక్కత్తికే పెట్టాడేమిటి మీనాన్న కోకలు? అయినా అదంతా యిప్పుడెందుకూ? నువ్వు—

బంగారమ్మ—అనవలసినమాట అనేశావు. చివరి కదంతా యెందుకూఅని తేల్చేశావు. మీఅమ్మ వొక్కత్తేనా యేమిటి మానాన్నకి తోడబుట్టువుపడుచు? మీ అమ్మకిమాత్రంపెట్టి వూరుకుంటే పెద్దత్తయ్యా, బుల్లత్తయ్యా వుసూరుమనరూ? ఆవుసురెందుకు తగలాలీ మాకూ?...... మానాన్నలాంటివా డున్నాడా? మీఅమ్మ "యేం పట్టుకుపోతావూ" అందిట. ఏమీ పట్టుకుపోలేదు మానాన్న. నిజమే. చచ్చిపోయిన వాళ్లంతాకూడా పట్టుకుపోతున్నారా యేమిటి యేమేనా? మీనాన్నయేమేనా పట్టుకుపోయాడా? మీపెద్దక్క యేంపట్టుకుపోయిందీ?

సుబ్బమ్మ—(మాట్లాడదు)

బంగారమ్మ—అప్పుడు వొక్కరూపాయికూడా చేతిలోలేదుట. ఉంటే అనుకోవచ్చు. ఎన్నివిధాల చెప్పినా వినక "నీమూలాన పెళ్లిపడిపోయిం" దంది ట మీఅమ్మ. "నువ్వు ముందుకువస్తావా?" అందిట. ఏమిటేమిటో అందిట. వాళ్లదగ్గిరా వాళ్లదగ్గిరా "వీడు మన్నుతాడా?" అందిట. మానాన్న వెళ్లి పోయాడు. పోనీ మీఅమ్మని యెల్లకాలమూ వుట్టికట్టుకుని వూరేగమను.

సుబ్బమ్మ—ఇప్పు డామాటలెందుకే? మా అమ్మకేమీ తెలవదే.

బంగారమ్మ—అడిగిన బదులివ్వకపోతే శాపాలు పెట్టడం తెలుసునా? మానాన్న మీ సొమ్మేమేనా తిన్నాడా?

సుబ్బమ్మ—నాయోగం. నేనేంచెప్పనూ?

బంగారమ్మ—నీకేమీ యోగానికీ? మారాత వా౹ప్రారబ్ధం (దుఃఖిస్తుంది).

(అప్పుడు పేరుభట్టువస్తాడు.)

పేరుభట్టు—అదేమిటి బంగారం?

బంగారమ్మ—(కళ్లుమూసుకుని మరింత దుఃఖిస్తుంది.)

పేరుభట్టు—(బంగారమ్మని పొదివిపట్టుకొని) ఎందుకే సుబ్బూ బంగారం యేడుస్తుందీ?

సుబ్బమ్మ—వాళ్లనాన్నని తలుచుకుని యేడుస్తోంది బుల్లన్నయ్యా!

పేరుభట్టు— ఏంలాభం బంగారం? ఇలా చూడూ. ఊరుకోవూ?

(బంగారమ్మలేచి నిలుచును. పేరుభట్టు ఆమెను యింటికి తీసికొనిపోవును)

సుబ్బమ్మ—(స్వగతం) మాఅమ్మే మంచిది కామా. తలుచుకుతలుచుకు యేడుస్తోందివొదిన. పాపం దానికెంత కష్టంగావుందో?........వాళ్లఅమ్మతోటి నేనేమేనా అన్నానంటుందేమో? నేనేమన్నానూ? నేనేమీ యెరగనుబాబూ! వాళ్లనాన్నని తలుచుకుని అదియేడుస్తోంది......మామయ్య చాలామంచివాడు. నాకు యేడాదికి మూడు పరికిణీలిచ్చేనాడు......నా కర్మం! వొదిన మాయింటికిరాదు.

(వెళ్లిపోతుంది.)

## నాలుగోరంగం

[కాంతమ్మయిల్లు. వీధిఅరుగుమీద రాయడు నుంచునివుంటాడు. వెంకన్న ఆయాసపడుతూ వెలికిల పడుకుని వుంటాడు. అరుగుకింద చాకలి నుంచుని వుంటుంది.]

రాయడు—మడేలూ! నువ్విల్లుకట్టిపెట్టుకుని వుండడం నిజమే; కాని చాకిరీ సరిగ్గాచేశావుకావు. నేననడం యెందుకూ? నువ్వేఆలోచించుకో.

చాకలి—ఏంలోటు—

రాయడు — ఇక మాట్లాడకు. అయిందేదో అయిపోయింది. గొడవలు పెంచకు. పెట్టిందేదో పట్టుకుపోయి కళ్లనద్దుకుని సుఖంగా తినండి నువ్వూ, మొగుడూ, పిల్లలూను. నుంచో వస్తారు...యెవరక్కడ? వొరేయ్! వెంకన్నతమ్ముడూ! మాడూ, చాకల్దానికి అన్నమూ, పప్పూ, కూరా, పులుసూ, నాలుగు బూరిముక్కలూ—

చాకలి—నాలుగేనంటండీ?

రాయడు—నాలుగంటేనాలుగే? చూడరామూ? అయినా యిదేం శుభకార్యమా యేమిటి తిన్నన్నీ పెట్టడానికి? నల్లరాయి బద్దలాసిపోయింది. ఏదో తంతు నడపకతప్పదు. పెట్టిందేదో పట్టుకుపో. వెళ్లరా వెంకన్నతమ్ముడూ!

వెంకన్న — ఏమిటన్నయ్యా! చెబుతున్నావూ?

రాయడు—ఇందాకణ్ణుంచీచెప్పిందంతా అరణ్యరోదనమే? ఓరితులసీదానూ? చూడూ! ఈచాకల్దానికి అన్నమూ, పప్పూ, కూరా, బూరిముక్కలూ—

చాకలి—ముక్కలెందుకండీ? ఎన్ని పెట్టాలని వుంటే అన్నీ బూర్లే పెట్టండి మారాజా!

రాయడు—అవేనే. అర్థాలు మాబాగా తీస్తున్నావే? వెళ్లరా తమ్ముడూ! సిసిందిరిలాగ పని చెయ్యాలి యివాళ.

వెంకన్న—నీకేం చెబుతావు కడుపునిమురుకుంటూ కూచునీ. నా కాయాసంగావుంది. కాస్తసేపు పడుకుని దొర్లితేగాని నేను కదల్లేను.

రాయడు—వేశావూ? వెట్టిమొగమా! ఓమాటిలారా చెబుతాను.

వెంకన్న—నావల్లకాదు.

రాయడు—ఛా! నీకు లాభించేదీ తెలవదు, మరొకళ్లకి లాభించేదీ తెలవదూ నీకు. పోనీ నేనేం చెయ్యనూ? నీయిష్టం.

వెంకన్న—(దగ్గిరికివెళ్లి) అదేమిటో చెప్పు.

రాయడు—ఇలారా! (చెవిలో) బంగా గాన్ని నీకు పెళ్లి చెయ్యాలని చూస్తోంది మీయమ్మ, జ్ఞాపకంవుందా?

వెంకన్న—అవును.

రాయడు—ఇలాంటప్పుడు చుగగ్గావుండక పోతే—తెలిసిందా? గప్‌చిప్! వుండనే నిమిషంలో వస్తాడు మావాడూ. పులుసుకేదేనా తెచ్చుపన్నావా?

చాకలి—పులుసుకుండ నాకిచ్చేసేదేనండి.

రాయడు—అయితే సరే. అలాసందులోకిపద. పదరా తమ్ముడూ!

(అందరూ వెళ్లిపోతారు.)

## అయిదోరంగం

[ఉత్తరపువసారాలో కాంతమ్మ, బంగారమ్మ, శేషయ్యా, పేరుభట్టూ, ప్రకాశమూ నుంచునివుంటారు.]

కాంతమ్మ—మీరు నలుగురూ వుండబట్టి వొడ్డెక్కించారు. పేరుభట్టుమాట చెప్పనే అక్కర్లేదు. తుదకి నువ్వుకూడా కష్టపడవలసివచ్చింది. అన్నయ్యగారి సంగతి—

ప్రకాశం—కష్టంఅంటే యెక్కడికి? కాకపోయినా కష్టపడకుండా సంసారంగెంటుకు పోగలవాళ్లు మనలోయెవరు?...ఇంతకీ: కోసుట్ల పుణ్యానూఅని సకలవస్తువులూ కావిళ్లకొద్దీ వచ్చాయి. గనక ఖర్చుపెట్టడానికి నేనంటే నేనని పందాలు వేసుకుని సిద్ధపడ్డాం మేము.

శేషయ్య—కాస్తోకూస్తో కష్టపడ్డాం. నిజమే. అయితే యీకష్టం మామయ్యబతికివుండి బంగారంపెళ్లి చేసి—ఆపెళ్లిలో పడివుంటే ఆనందంగావుండును.

కాంతమ్మ—అంతసౌభాగ్యానికి మేము పెట్టి పుట్టవద్దూ? అందమూ, ఆనందమూ వున్నా లేకపోయినా యీకష్టంమాత్రం తప్పవదా? యెప్పుడేది యెలా చెయ్యాలో, యెవరితో యెలామాట్లాడాలో వోపికపట్టాలి. ఇదిమాత్రం సామాన్యమానాయనా?

శేషయ్య—ప్రకాశంగారివంటివారు బహు అరుదుగావుంటారు. అత్తా, యెదుటచెప్పడంకాదు. నిగర్వి అన్నా, పరోపకారిఅన్నా ప్రకాశంగారినే చెప్పాలి. చూడలేదు నేనెక్కడా యిలాంటి మహానుభావుణ్ణి. ఆశ్చర్యంఅయింది.

పేరుభట్టు—ప్రకాశం బాబుగారి సాయమూ సలహాలూ లేకపోతే మాకష్టానికి వినియోగమే లేకపోవును.

ప్రకాశం—బాణాలు నామీదకి తిప్పేరూ? అన్నాతమ్ముడూ యేకమయినాక నేనాగగలనామరీ?

పేరుభట్టు — ఎంతమందయినా మీగోటికి చాలరు.

శేషయ్య—మీకు సమాధానం చెప్పలేను. మరి పొద్దెక్కుతోంది. రైలు దాటిపోతే చిక్కుపడాలి. సెలవూ.

ప్రకాశం—అవునవును. పెందలాడేవెళ్లాలి. టైము ఆట్టేలేదు.

శేషయ్య—అత్తా!—

కాంతమ్మ—దిక్కుమాలినఅత్త. నేటికీయింటికి అత్తపెద్దనయిందా? నాకర్మం. నాయనా! నీతో పదిమాట్లు చెప్పడంగాదు. అక్కర్లేదు కూడానూ. మాస్థితి నువ్వు కళ్లారా చూసేవున్నావు. కాస్తకని పెడుతూవుండాలి.

శేషయ్య—రాగూడని ఆపత్తు వచ్చింది. దైవికానికెవరూ యేమీ చెయ్యలేరు; కాని పేరుభట్టు యిక్కడేవుంటాడుగనక యింకేమీ భయం వుండదు. తరుచు నేను వస్తూనే వుంటాను కూడానూ. తమ్ముడూ! నీకు పదిమాట్లు చెప్పనక్కర్లేదు. జాగ్రత్తసుమా. ప్రకాశంగారూ! తమ్ముడికి కొంచెం వ్యవహారజ్ఞానం కలిగిస్తూవుండాలి మీరు.

ప్రకాశం—నాకే నేర్పగలరు మీతమ్ముడుగారు.

పేరుభట్టు—మీమాట మీవాత్సల్యానికి సర్దు.

శేషయ్య—బంగారం! మరివెళ్లనా?

బంగారమ్మ—వెడతావా పెద్దబావా! (దుఃఖిస్తుంది.)

శేషయ్య—(బంగారమ్మని పొదివిపట్టుకొని) యేడవకమ్మా. మళ్లీ వారంరోజుల్లోరానూ? బుల్లిబావ యిక్కడే వుంటాడుగాడుటమ్మా? తమ్ముడూ! బంగారాన్ని చూశావా? అమాయకురాలు. సుకుమారి. భద్రం.

పేరుభట్టు—అలాగే అన్నయ్యా! (అని బంగారమ్మని దగ్గిరికితీసుకుంటాడు.)

శేషయ్య—అత్తా! ప్రకాశంగారూ! మరి సెలవు. మీవోనిన బండియెక్కిందిగామూ తమ్ముడూ? సరిగ్గా ప్రయాణంనాటికి వచ్చిందిఆంక్షు. ఆడాళ్లతో ప్రయాణం యిలాగేవుంటుంది. ఇకరా.

పేరుభట్టు—సాగనంపివద్దాంరా బంగారం!

(తెరదించాలి.)

## అయిదో అంకం

## మొదటిరంగం

[నాళంవారిసత్రంలో భోజనాలహాలు పక్కగది. పేరుభట్టూ, భద్రయ్యా కూచునివుంటారు.]

భద్రయ్య—పెళ్లాం కాపరానికివచ్చినక్రొత్తలో మనవయస్సులో వుండేనాడికి ప్రపంచకం తెలవకపోవడం సహజమే; కాని నాపని అందుకు తారుమారయింది. ఇదివరకి నేనిక్కడ వారాలతో యెలాగో కాలం గడిపేశాను. ఇకముందుకూడా అలాగే చెయ్యరాదాఅంటే యింటావిణ్ణి తీసుకురాకతప్పదు.

పేరుభట్టు—ఆవుప్పెన యేమిటోయి?

భద్రయ్య—పున్నమి వెళ్లినతదియ—యివాళకి పన్నెండురోజులుంది. "ఈముహూర్తం తప్పిపోడానికి వల్లగాదు. తరవాత నీపెళ్లాన్ని నేనుభరించలే" నని—

పేరుభట్టు—బ్రహ్మరాక్షసిలావుందే?

భద్రయ్య—సవతితల్లి అంతకంటె యెక్కువ చేస్తుందని మనం ఆసించడం యెలాగా?

పేరుభట్టు—(ఆలోచిస్తాడు.)

భద్రయ్య—బాగాఆలోచించు.

పేరుభట్టు—ఇప్పుడు నీదగ్గిర యేమాత్రం వుందో నిజంచెప్పు.

భద్రయ్య—కార్యానికయినఖర్చులు పోగాబ్రహ్మకేనా తెలవకుండా యిక నూటపాతిక జాగ్రత్తచేశాను. ఆర్నెల్లకేనా చాలదు.

పేరుభట్టు—భూములమీద—

భద్రయ్య—పొల్లుగాయలుగూడారావు...... ఇంకా పదేళ్లు రెక్కలమీద బతకాలి. అంచేతే పురాణధోరణో అంటూ నేను గోలపెడుతూవచ్చాను. దిక్కుమాలిన కలరావచ్చి పడింది గాని—

పేరుభట్టు—తగ్గి యెన్నాళ్లయిందోయి?

భద్రయ్య—నిజమే. అయితే భయంవల్ల కొన్నాళ్లు, యింట్లో చిక్కులువచ్చి కొన్నాళ్లు, కార్యం గొడవలు కొన్నాళ్లు—

పేరుభట్టు—లేకలేకవచ్చిన పెళ్లాన్ని విడవలేక కొన్నాళ్లు—

భద్రయ్య—చెప్పానుకామూ? అది యెంతవాడికి? పెళ్లాం దగ్గిరికి వచ్చాటప్పటికి "దీన్ని పోషించడం యెలాగ?" అంటూ ఆలోచనపడితే యింకేం సుఖమోయి?

పేరుభట్టు—సరే, కానియ్యి.

భద్రయ్య—ఇంతలో కోనసీమనుంచి వొకశాస్త్రులుగారు వచ్చి మావూళ్లో రెండుమాసాలు రామాయణం పురాణంచెప్పారు. చదవడం నామైని పడింది.

పేరుభట్టు—ధోరణిలో పడ్డావా?

భద్రయ్య—మునపటికంటేనయం. అయితే నే నోగమత్తుచేశాను. రాత్రి శాస్త్రులుగారిదగ్గిర

మూలం చదవడం. మర్నాడు మధ్యాహ్నం ఆడాళ్లని పదిమందినిచేర్చి ఆభాగమే సొంతంగాచదివి, సొంతంగా చెప్పడం.

పేరుభట్టు—భేషూ!

భద్రయ్య—లేకపోతే పద్మవనంలోపడ్డ రాస భంలాగ—

పేరుభట్టు—ఇందులో రెండులాభాలు. చూ శావా? ఒకటె పురాణధోరణి పట్టుపడడమూ, నలగడ మూనూ. రెండోది స్త్రీలకి పురాణంచెప్పగలగడం. ఇక ఫరవాలేదు నీకు.

భద్రయ్య—దీంతో యేమయిందంటే? పండి తులయెదట కొంచెం నట్టినా—

పేరుభట్టు—ఒకపండితుడు పురాణంచెబుతూ వుంటే యింకోపండితుడువచ్చి దద్దమ్మలాగ వింటూ కూచుంటా డనుకున్నావా యేమిటి? సామాన్యులకే పురాణం.

భద్రయ్య—అయినా యిక్కడ నాచేత పురాణం చెప్పించేవారెవరు?

పేరుభట్టు—దేవుడు.

భద్రయ్య—అంటే?

పేరుభట్టు—దీపావళి యెన్నాళ్లుందీ?

భద్రయ్య—అయిదురోజులు.

పేరుభట్టు—కార్తీక శుద్ధపాడ్యమినాడు తెల్ల వారగట్ల నాలుగ్గంటలకిలేచి, నాళంవారి సత్రంచేవులో స్నానంచేసి కార్తీకమాహాత్మ్యం పురాణం—

భద్రయ్య — ఏమన్నావు?

పేరుభట్టు—ఈనెల్లాళ్ల సాధనవల్లా తరవాత నువ్వుపౌరాణికుడుగా చెలామణీ కావడానికి అభ్యం తరం—

భద్రయ్య—(చెయ్యి జాడిస్తూ) సెభాస్! రక్షించావోయ్! ఈకార్తీకంలో, వందరూపాయ లేనా యేశేస్తాను. ఇకలే. నామూలాన నీకుకూడా పొద్దుపోవడంయెందుకూ? పాపం బంగారమ్మ నీకోసం యెదురుచూస్తూవుంటుంది.

పేరుభట్టు—ఇక కొట్టుకుపోతావన్నమాట.

భద్రయ్య—నిస్సందేహంగానూ. మరిపద.

(వెళ్లిపోతారు.)

## రెండోరంగం

[కాంతమ్మ యిల్లు. హాల్లో బల్లమీదకూచుని పేరుభట్టు.]

పేరుభట్టు—(స్వగతం) ఎందుకూ భద్రయ్య కాగొడవా? నాకూ తనకీ స్నేహంవుంటే నాదగ్గిర అనాలి...నాదగ్గిరమాత్రం యెందుకు తేలడం? అత్త దగ్గిర అంటాడా? దుడుకుమనిషి. నిదానం లేదు. ఇంగిత జ్ఞానం లేదు. అత్త యేమనుకుంటుందో? నేనిందుకోసమే యింటో చేరాననుకుంటుందో యేమిటో?...నిజానికి నాకు ఆకోరికవుంది. తప్పకుండావుంది. కాని యేం లాభమూ? ఈవిషయం అత్తదగ్గిర చూచాయగా అయినా తేలుద్దామంటే గుండెలు తాళడం లేదు. తాళ డానికి నాతాహతెంత? నేనెంత?..............బంగారం మనకితక్కదు. మరిచిపోవలిసిందే......మరిచి పోవలిసిందే అంటే యెలాగ? ఓపూట ఆలస్యంగా కనబడితే తర్జనభర్జన చేసేస్తుంది. ఇంటోవుంటే రాత్రీపగలూ కల్లీబొల్లీమంటూ తోచనివ్వదు. నన్ను సంతోషపెట్టడాని కనేకవిధాల ప్రయత్నంచేస్తుంది. బావా అనేటప్పటికి నాకు వొళ్లు పొంగిపోతుంది. ఇంకెలాగ మరవడం?...... ఎలాగఅంటే అలాగే. ఆశవొదులుకోకతప్పదు. కాదంటే యెలా లభిస్తుందీ?

(అప్పుడు బంగారమ్మ వస్తుంది.)

బంగారమ్మ—రాత్రి వచ్చావుకాదేం బావా? (ఎదట మోకాళ్లమీదకూచుని) సగంరాత్రిదాకా మేలు కున్నాను, ఇంకేవస్తావో యింకేవస్తావో అనీ, తలుపు తియ్యడానికి.

పేరుభట్టు— రాలేక పోయాను బంగారం! (ఇలాచెబుతూ ఆమెని వొళ్లోకూర్చో బెట్టుకుంటాడు.)

బంగారమ్మ—తెల్లారగట్ల బండిమీద తప్ప కుండా వస్తావనుకుంటూ నిద్రపోయాను. జామురాత్రి వేళ మెలుకువవచ్చింది. ఇక నిద్రపోకుండా కూచుం దామనుకున్నాను గాని ఆగలేకపోయాను. నేను లేచా టప్పటికి నువ్వు పాఠాలుచెప్పడానికి వెళ్లిపోయావుట.

పేరుభట్టు— దయవుందికనక నాకోసం అంత సేపు మేలుకున్నావు; కాని—

బంగారమ్మ—దయో గియో నాకు తెలవదు. ఈమాటు నువ్వెవ్వూరూ వెళ్లేవద్దూ. అంత తప్పక పోతే అన్ననాటికి—అన్నగడియకి తప్పకుండా రావాలి. ఆగడియకి సరిగ్గా యెదురుచూస్తూవుంటాను. క్షణం ఆలస్యంఅయినా నాకు మతిపోతుంది. ఈమాటు ఆల స్యంచేస్తే నేను వొప్పుకోను యేమనుకున్నావోను.

పేరుభట్టు— నువ్వలాపట్టుపడితే యెలాగా? పొరుగూరువెడితే అన్ననాటికి సరిగ్గా రావడం సాధ్యమా?

బంగారమ్మ—అయితే వెళ్లడానికి వల్లకాదు బాబూ!

పేరుభట్టు—డబ్బెలావస్తుందీ? డబ్బులేకపోతే కాలం యెలాగడుస్తుందీ?

బంగారమ్మ—కూచుంటుందికాలం. వున్నవాళ్లకీ వెడుతోంది, లేనివాళ్లకీ వెడుతోంది వొక్కమోస్తరుగా. అంతకావాలంటే యీవూళ్లో సంపాదించు కోరాదూ?

(అప్పుడు కాంతమ్మవస్తుంది.)

కాంతమ్మ—అదేమిటే వొళ్లోకూచున్నావూ? బావ యేమనుకుంటాడూ? రోజూ అదేపనా?

బంగారమ్మ—పదిమాట్లు కూచుంటాను రోజుకి. మనబావేకదూ? ఏంబావా! (చేతులు మెడకి పెన వేస్తుంది)

కాంతమ్మ—చెప్పినకొద్దీ మరీనీ. బావ కొ[illegible] పరికిణీ— తళతళ మెరిసిపోతోంది, పట్టుదీ, జాకెట్టు కూడా తెచ్చాడు.

బంగారమ్మ—అవునాబావా? చెప్పావుకాదేం? చీలిపిల్లాడా! (బుగ్గ గిల్లి) ఇప్పుడు కట్టుకోనా బావా?

పేరుభట్టు—ఆలోచన యెందుకూ?

బంగారమ్మ—(లేచినుంచుని) ఇవ్వవే అమ్మా కట్టేసుకుంటాను. తొరగా యివ్వాలి. వాళ్లసూరమ్మ బువ్వాలాటకి పిలిచింది. అది కట్టుకునే వెడతాను. ఏంబావా! మంచిదే యివాళా?, ఇవ్వవుటే అమ్మా?

పేరుభట్టు—ఎంతో మంచిదీ యిప్పుడు.

కాంతమ్మ—సంకురాత్రికి కట్టుకుందువుగానిలే దాచుకోమ్మా!

బంగారమ్మ—ఉహుఁ! చూశావా బావా మాఅమ్మని?

పేరుభట్టు —కట్టుకోనియ్యవమ్మ అత్తా! సంకు రాత్రికి ఇదే వుండాలాయేమిటి?

బంగారమ్మ—మరే. ఊరికే, మాఅమ్మయెప్పుడూ యింతే. ఇవ్వవుటేఅమ్మా? బావ సరదాపడి కుట్టించుక వస్తే నువ్వు దాస్తావా?

కాంతమ్మ—పండుగనాడు కట్టుకుందువుగాని లేవే అంటే క్షణం వుండనంటావు. అప్పుడేంచేస్తావూ? నాకేం? కట్టుకోపోనీ. రామరీ! (వెడుతుంది.)

బంగారమ్మ— కట్టుకువస్తానుండేం బావా! (తల్లితో వెడుతుంది.)

పేరుభట్టు—(స్వగతం) ఇదీమప్పు. ఏమిటి చెయ్యడం? మనస్సు తిప్పేసుకోవాలంటే ప్రాణపోక డగావుంది. తిరగడమే లేదూ.

(తెరలో)

ఇంతసేపా పసుపుపెట్టడం. తొరగా.

పేరుభట్టు—(స్వగతం) ఏంవుబలాటమూ? అతి చురుకూ. సిసింద్రీ.

(తెరలో)

జాకెట్టు సరిగ్గా తొడుక్కోకుండానే? అప్పుడే పరుగే?

పేరుభట్టు—(స్వగతం) వచ్చేస్తోంది. గంగా ప్రవాహంలాగ వురకలు వేసుకుంటూ వస్తోంది. అదిగో: మీదపడిపోతుంది. (చేతులుచాపి వుంచుతాడు. బంగారమ్మ గభీమనివచ్చి ఆచేతుల్లో యిరికి చుట్టపెట్టు కుంటుంది.)

కాంతమ్మ—(వస్తూ) అయితే: బంగారం! బావ పరికిణీ, జాకెట్టూ తెస్తే దుడుగూదుడుగూ కట్టుకోవడమేనా, దణ్ణంపెట్టడంవుందా?

బంగారమ్మ—అవును. మరిచిపోయాను. గట్టిగా పట్టుకో బావా!

పేరుభట్టు—పట్టుకున్నాను.

బంగారమ్మ—ఇదిగో దణ్ణం.

పేరుభట్టు—మరి మీఅమ్మకో?

బంగారమ్మ—విడిచిపెట్టు. (తల్లిదగ్గిరికివెళ్లి) కాళ్లివ్వవే అమ్మా! (పాదాభివందనం చేస్తుంది.)

కాంతమ్మ—(బాష్పపూర్ణ నేత్రయై) మీనాన్న కంటె యెక్కువగా చూస్తున్నాడుబావ. ఇలాగేనా పెట్టిపుట్టావు.

పేరుభట్టు—ఏంవుందిఅత్తా? పదిమాట్లు యెందు కంటావూ అలాగా?

కాంతమ్మ—లేకేంనాయనా? ఇప్పటికి వంద రూపాయలేనా ఖర్చుపెట్టివుంటావు బంగారంకోసం.

పేరుభట్టు—ఒకటి చేస్తే వందంటావు.

బంగారమ్మ—వందరూపాయలే? అవునాబావా! అయితే నాకొద్దీపరికిణీ, జాకెట్టూనూ. వందరూపాయలా? బాబోయ్! ఇంకా యేమిటో అనుకున్నాను నేను. ఇంకెప్పుడూ తీసుకురాకు బావా యిలాంటివి. (జాకెట్టు విప్పపోతుంది.)

పేరుభట్టు—విప్పేస్తావా యేమిటి? మంచి దానవే. చాల్లే.

కాంతమ్మ—ఇంకెందుకూ తీరాకట్టుకున్నాకా?

బంగారమ్మ—వందరూపాయలు. మా నాన్న నాకిచ్చినవి సరిగ్గా వందరూపాయలున్నాయి. అవి యిచ్చేస్తాను పుచ్చుకో బావా!

పేరుభట్టు—(మూతిముడుచుకొని) ఇచ్చెయ్యి. నేను వెళ్లిపోతానమ్మా!

బంగారమ్మ—చూశావా? అదేమిటి బావా?

పేరుభట్టు—నా రూపాయలు నాకిచ్చెయ్యి. ఒక్క క్షణమేనా వుండనింక. తొరగా తేవాలి.

బంగారమ్మ—కోపం వచ్చిందా? విప్పేయ్యను లే బావా! మరి యింతసొమ్ము నాకోసం ఖర్చుపెట్టకేం యింకా?

పేరుభట్టు—ఏమో. నాడబ్బు నాకిచ్చెయ్యి. నువ్వు మంచిదానవు కావు.

బంగారమ్మ—నువ్వా మంచివాడవు కావా యేమిటి?

పేరుభట్టు—నే నేంచేశానేమిటి?

బంగారమ్మ—నాతో సరిగ్గా నువ్వుకూడా పట్టుపడతావా?

పేరుభట్టు—(స్వగతం) ఇంకేంచెప్పనూ?

కాంతమ్మ—(ముందుకుచూసి) ఎవరువారు పేరుభట్టూ? రత్తమ్మవొదిన కాదుగదా?

పేరుభట్టు—(చూసి) అవును. అడిగో రాయుడు కూడా వస్తున్నాడు.

బంగారమ్మ—(చూడబోతుంది.)

కాంతమ్మ—(చూడకుండా వెనక్కితీసి) ఇంటోకిరా. పరికిణీ, జాకెట్టూ విప్పెయ్యి తొరగాను. (లోపలికి తీసుకుపోతుంది.)

పేరుభట్టు—(స్వగతం) ఎంచేతా? రత్తమ్మ పిన్నినీ, రాయణ్ణీ మాసి అలాఅందేం అత్తా?

(రత్తమ్మా, రాయడూ వస్తారు)

రాయడు—ఇదుగో. అన్నయ్య యిక్కడే వున్నాడు.

రత్తమ్మ—ఎప్పుడు వచ్చావు—అన్నట్టిక్కడే వుంటున్నావు కామా? కాంతమ్మా, బంగారం కులా సాగావున్నారా నాయనా?

పేరుభట్టు—ఆ. ఇంటిదగ్గిరనుంచేనా రావడం? వెంకయ్యబాబు కులాసాగా తిరుగుతున్నాడా?

రత్తమ్మ—ఏంతిరగడం?

రాయడు—ఇంటో వొకళ్లసాయం అక్కర్లేదు. వీధిలోకివెళ్ల లేడు.

పేరుభట్టు—అలాగా?......లోపలికి పదండి, నేను భోజనంచేసివస్తాను.

రాయడు—భోజనంయెక్కడ అన్నయ్యా?

రత్తమ్మ—ఇక్కడ కాదుట్రా?

పేరుభట్టు—వారాలు చేసుకుంటున్నాను పిన్నీ!

రాయడు—(ఉత్సాహం కనపరుస్తాడు.)

రత్తమ్మ—అలాగట్రా? మరివెళ్లిరా, పాపం, అక్కడ కనిపెట్టుకుంటారో యేమిటోను.

పేరుభట్టు—ఇదిగో, వెడుతున్నాను. (వీధిలోకివచ్చి) ఇప్పుడెందుకువచ్చారూ వీళ్లూ? బంగారం కోసమేనా?......నా అదృష్టం యెలావుందో? (వెళ్లిపోతాడు.)

రత్తమ్మ—భయంలేదురా!

రాయడు—నేనుచెప్పలేదూ? ఈమాటుధైర్యంగా వుందా? మొగదిక్కులేకపోవడంవల్ల, పూళ్లోవున్నాడు గదాఅని రానిస్తోంది. అన్నంపెడుతుందీ వీడికి అత్తా?

రత్తమ్మ—ఏమీభయంలేదు.

రాయడు—బంగారం దాటిపోదే. చూస్తూ వుండు.

రత్తమ్మ—అయితే నువ్వూ అదృష్టవంతుడవే, నేనూ అదృష్టవంతురాలినే. అత్త బంగారాన్ని నీకిచ్చిందంటే వెయ్యిరూపాయలు నగలుపెడతాను.

రాయడు—పెట్టాలి. ఈసంగతి తెలిసిందంటే యివాళే నిశ్చయంచేస్తుందిఅత్త...కానిడబ్బెలావస్తుందీ?

రత్తమ్మ—ఎకరంభూమి తెగనమ్మితే నగలూ వస్తాయి, పెళ్లీఅయిపోతుంది.

రాయడు—అవును. వుద్యోగం అయిందంటే ఆరుమాసాల్లో కొనేస్తాను ఆయకరమూనూ. అసలు సంవత్సరంలోపున సొమ్మిస్తే మళ్లీమనభూమి మనకిచ్చీలాగే మాట్లాడదాం.

రత్తమ్మ—అట్నుంచి నరుక్కువద్దాం. ఇంటోకి పద. (ముందుకి అడుగువేస్తుంది.)

రాయడు—నాకు నెల్లాళ్లలో యాభైఅరవై రూపాయల వుద్యోగం అవుతుందని చెప్పాలిసుమా. మరిచిపోకు.

రత్తమ్మ—నేనెరగనూ?

(ఇద్దరూ యింటోకివెడతారు.)

---

# గన్నేరుపూలు

‘గిరి’

౧

ఆ క్లబ్బుకి ఆనివున్నతోట చాలాఅందమైంది; విశాలమైందిగూడా. గమ్మని సువాసనని విసిరే పూలమొక్కలూ, కళ్లకి ఆనందం కలిగించేరంగుల ఆకులక్రోటన్లూ దాంట్లో అనేకం. చక్కగా విశాలంగా పెరిగిన సరివిచెట్లగుంపుల గాఢమైననీడల్లో చాటుగా ప్రియులు కూచొని మాట్లాడుకోడానికి చిన్న చిన్న అరుగులు వున్నాయి అక్కడక్కడ. పచ్చని పొదల్ని పెద్దగా పెంచి వానినడుమ పెద్దహవుజులు కట్టారు. తెల్లనిజాతులు వాటితేటనీటిలో ఈదుతోంటాయి. ఆహవుజులచుట్టూవున్న మంచిరాళ్ల అరుగుమీద కూచొని హవుజునీళ్లలో చేతులాడించొచ్చు.

తీర్పుగావున్న ఆబాటలవెంబడి నడుస్తోంది వసుంధర. సరివిచెట్లగుంపులోంచి కొంచెంకొంచెంగా అవుపడుతోన్నక్లబ్బుగదిలో ఆంగ్లయువతి వొహామె పియానోమీద “All I know is you are in my arms” అనేపాటని గొంతెత్తి పాడుతోంది. ఆ పాటని వింటో తనప్రియుడిని తన కవుగిట్లోఉన్నట్లు వూహించుకొని నడిచిపోతోంది వసుంధర.

ఆపూలతిరిగి నాలుగడుగులు ముందునడిచేవరకు కుడివేపువున్న గన్నేరుచెట్టుపక్కన కాళ్లుచేతులు జాచి చలికలగా పడివున్నవొహాయువకుడిఆకారం చప్పున ఆమెకంటికి అవుపడ్డది భయంకరంగా; కెవ్వుమన్నది. కాని దగ్గిరగా యెవరూ లేకుండటంవల్ల వినపళ్లా యెవరికి. చీరచింగులు సవరించింది పరుగెత్తడానికి. కాని ఆముహూర్తాన్నే అలాఅశక్తుడైపడివున్నవ్యక్తి తనని యేమీచేయలేడనేధైర్యం వొచ్చింది. అట్లాగే దూరంగానుంచొని నిదానించి చూసింది. డజన్‌కన్నా యెక్కువతొాట్లులుండి, చేతులు సగంవరకు చినిగిపోయిన సిపాయివాళ్లకో టూహాటి తొడుక్కున్నాడు. చెమట చేత మాసి, చూస్తేనే అసహ్యంవొచ్చే మురికిషర్టు వొహాటి తొడుక్కున్నాడు లోపల. మురికిలో షర్టుకి యేమాత్రం తీసిపోని ధోతి గూడకట్టుకట్టాడు అరవవాళ్లమాదిరి. ఆగుడ్డపేలికలు ఆదేహంమీదవున్నాయన్న మాటేగాని యేవుద్దేశంచేతనైతే గుడ్డలు ధరిస్తామో అది అట్లానే వుంది. షర్టూ అవీ తొలిగిపోయి యేమాత్రం శ్రద్ధలేక మురికిగావున్నదేహం అవుపడ్తో ఆడవాళ్లకేమిటి మొగాళ్లకే సిగ్గుగలిగిస్తోంది. ఆతనిస్థితి చూసి వసుంధరకి పాపమనిపించింది. కాలేజికుఱ్ఱాళ్లు వొచ్చి ఆతన్ని పరిహాసంచేస్తారని ధైర్యంగా దగ్గిరికెళ్లి తొలిగిపోయినగుడ్డని సరిచేసింది. అలా కిందికివొంగి నప్పుడు సారాయివాసన గప్పున విసిరింది. ఆతనిముఖం వేపు చూసింది. అసహ్యంగాపెరిగినగడ్డం, వుంగరాలుగా మెలికలుతిరిగిన తలవెంట్రుకలు, ఆతీర్చినకనుబొమ్మలు, చక్కనిముక్కు, ఆమెకు మరీజాలిని కలిగించాయి. ముప్పైయేళ్లన్నా రాకముందే యీ యువకుడు యిట్లా పాడైతే తక్కినజీవితమంతా యెట్లాగడవాలి పాపం అనుకుంది.

ఆమె వెడ్తో వెనక్కి తిరిగి చూసింది. ఆతడు లేచి వెనక్కి చేతులమీద ఆనుకొని కూచున్నాడు. వీలైతే సంగతేమిటో తెలుసుకుందామని వెళ్లి దూరంగా నుంచుంది. ఒకనిమిషం ఆతడామెని యెగాదిగా చూసి చేతులుజాచి “తారా, తారా” అని అరుస్తో లేవబోయాడు. కాని కాళ్లు తడబడి పడిపోయాడు. అట్లాగే కూచొని మళ్లీ ఆమెను పరీక్షగాచూసి, “కాదు, కాదు, నువ్వుకావు నాతారవి. పో, పో” అని చేతిని విసిరి చేతుల్లో తలదాచుకొని భోరున యేడ్చాడు చుట్టుపక్కలంతా మారుమ్రోగేటట్టు. “ఎవరునువ్వు?” అని వసుంధర అడిగింది. వినపళ్లే దేమో అని ముందుకి వొంగి గట్టిగా అడిగింది, మూడు సార్లు అదేప్రశ్నని. ఐనా ఆతడు జవాబు చెప్పలా. తల

పైకెత్తి చూడసైతంచూళ్లా. లాభం లేదని వసుంధర వెనక్కి తిరిగి తన యింటివేపు వెళ్లింది. దారిపొడుగు నంతా ఆదృశ్యాన్నే పునఃస్మరించు కుంది. చివరకి యింటిసమ్మంచేరిన తరువాత దీర్ఘంగా నిట్టూర్పువిడిచి, "యిట్లాయెన్ని జీవితాలు సారాయికి బలిఅవుతోన్నాయో" అంది.

౨

సాయంత్రం నాలుగు గంటలకి స్కూలునుంచివొచ్చి రోజంతా అరవడంచేత డస్సిపోయి యీజీ చేరులో పడిపోయింది వసుంధర. కళ్లుమూసుకొని అయిదునిమిషాలు నిశ్చలనంగా కూచుంది. పనిమనిషి వొచ్చి "టీ చల్లారిపోతోంది." అంటే మళ్లీ యీప్రపంచం జ్ఞాపకం వొచ్చిం దామెకి. మెల్లిగా లేచి లోపలి కెళ్లి ముఖం కడుక్కుంది. చీరా, జేకట్టును మార్చి తలసరిచేసుకొని టీ త్రాగింది. టెన్నీస్‌రాకెట్ కోసం కిటికీకి సమీపంలో వున్న టేబిల్ దగ్గిరి కెళ్లింది. కిటికీకి సమీపంగా టేబిల్ మీద తెల్లగన్నేరు పూలగుచ్ఛ వుంది. ఏమాత్రంవాడక నిగనిగలాడుతోన్నాయి పూలు. పనిమనిషిని పిలిచి, "యీపూ లెందుకు పెట్టావు యిక్కడ ?" అని అడిగింది. వాటివిషయమే తనకు తెలీదంది పనిమనిషి. వసుంధర వాటిని కిటికీలోంచి విసిరిపారేసింది.

మరునాడు స్కూలునుంచి వొచ్చేరావటంతోటే గదిలోకెళ్లి టేబిల్ వేపు చూసింది. మళ్లీ నిగనిగలాడేగన్నేరుపూలగుచ్ఛ ! ఆమెకి ఆశ్చర్యమేసింది యీపూలగాథ యేమిటని ? అవి గన్నేరుపూలుగాక యేగులాబిపూలో ఐతే కథవూహించుకోడం యింతకష్టంకా దామెకి. పైగాగర్వపడేదికూడా వోహకొత్తరాజ్యాన్ని వశపరుచుకున్న రాజులు మల్లే. కాని యీగన్నేరుపూలఅర్థం కంగారుపరిచిం దామెని. ఆమరుసటిదినం ఆదివారంకదా, ఆరసికు డెవరో కనుక్కుందా మనుకొంది.

ఆదివారం మధ్యాన్నం పదకొండుటికల్లా భోంచేసి ఆ కిటికీకి యెదురూగా బాగా అవుపడేటట్లు మంచం వేసుకొని పడుకుంది. ఆ కిటికీపైట ఆ రసికుడి ఆకారం అవుపడ్డంతోటే కళ్లు కాస్త మూసికొని నిద్రపోతోన్నట్టు



" ఆ పూలని టేబిల్ మీద పెట్టి

నటించాలని ఆమెయెత్తు. ఆమె మోహపాశాల్లోపరితపిస్తోన్న ఆప్రియుడు లోపలికి చూస్తూ ఆకిటికీదగ్గిరనుంచుంటే, నిద్రపోతోన్న సౌందర్యదేవతలా మంచంమీద తను అవుపడితే, ఆతనిహృదయంమీద కలిగేపరిణామం యేమిటో ఆమె యిదివరకే వూహించింది. అప్పుడే ఆతని మనోవికారాన్ని గమనించటానికి బాగా వీలుంటుందని ఆమెఆలోచన తనఆకారం మిగులఆకర్షణీయంగా వుండేటట్టు పల్చనిగులాబివన్నె చీరకట్టుకొని తెల్లనిపరుపులో కుచ్చుగవుసెన్ల తలగడలమీద ఆ నల్లనివెండ్రుకలు కుప్పగా పడివుంటే మధ్య కమలంలాంటి తన లేమోమును అమర్చింది. వేస్టుకోటువంటి చేతులు లేని రవికలోంచి



ధైర్యంచేసి లోపలికి తొంగిచూస్తాడు మెల్లిగా."

వెడలిన ఆనిడుపైన చేతిముందుభాగం మంచంపైనుంచి కిందికి వ్రేలాడుతోపొడువైన ఆసన్న నివేళ్ల మోజుని మరీ అధికపరుస్తోంది. తక్కినవన్నీ అలావుంచి వోహకాలిపై కాస్త వంకరగాముడిచిన రెండోమోకాలూ, ఆనడుము పక్కన ఆపొంకమైనయెత్తూహృదయాన్ని కొట్టుకునేట్టు చేస్తాయి. ఊర్వశిని చూడకుండానే ఆమెవర్ణనతో వందలకొద్దీపేజీలు నింపినపెద్దనగనక ఆముహూర్తాన ఆ కిటికీదగ్గిర వుండడమే తటస్థిస్తే 'వసుంధరవర్ణనం.' అనే గ్రంథాన్ని రచిస్తో అక్కడే వుండిపోయేవాడు ఆకృష్ణ దేవరాయలుకూడా జ్ఞాపకం లేకుండా.

ఒకాటీ, రెండూ; మూడూ గడచిపోయాయి. విసుగెత్తింది. ఎంతసేపని అలా పోజుయిస్తుంది! ఇహ లేతామనుకునేవరకు కిటికీకుడిచేతిపక్కన గన్నేరు పూలగుచ్ఛ అవుపడ్డది. ఆమెహృదయం కొట్టుకుంది. కళ్లు సన్నగా తెరిచివుంచింది. క్రమంగా ఆగుచ్ఛ ముందుకి జరిగింది. కిటికీలోకి దూరింది. దాన్ని పట్టుకున్న పిడికిలికూడా అవుపడ్డది. ఆచేయి ముందుకి జరిగి ఆ గుచ్ఛని టేబిల్ మీద పెట్టింది. ఆచేతిమణికట్టూ, దానికిమీద మోచేతిదగ్గిర వ్రేలాడే చినిగినసిపాయి కోటూ, ఆమె కప్పుడే తెలిపాయి ఆచేయి యెవరిదో. ఈపిచ్చివా డింకా యేంచేస్తాడో చూడదలుచుకుంది ఎవరో తాను సొంతంగా రాధైర్యం లేక యీతనిపిచ్చి వల్ల లాభం పొందుతోన్నారని వూహించగలిగింది.

ఆపూలని టేబిల్ మీదపెట్టి ధైర్యంచేసి లోపలికి తొంగిచూస్తాడు మెల్లిగా. ఆమెనిచూసి ముగ్ధుడైపోయాడు. పూర్తిగా కిటికీముందుకి వొచ్చి కిటికీకడపని పట్టుకొని ఆమెవేపు నిదానంగా చూస్తోనుంచున్నాడు. తా నలా చూస్తోన్నది దొంగతనంగా ననే విషయమే జ్ఞాపకం లే దాతనికి. అట్లాగే నుంచున్నాడు. కళ్లెంబడి నీళ్లు వరదలుకట్టి కడపమీద పడుతోన్నాయి.

పది, యిరవై, ముప్పై నిమిషాలు గడిచిపోయాయి. చిత్రంలోని బొమ్మలాగా అట్లాగే నుంచున్నాడు యేమాత్రం చలనంలేక. కళ్లెంబడి నీళ్లు అట్లాగే యేకధారగా కారుతో కిటికీలో మడుగు కట్టాయి. ఇదంతేమీ అర్థంకాలా వసుంధరకి. ఏనో త్రాగుడుకోసం నాలుగుడబ్బుల కాసించి తెచ్చినగన్నేరుపూలని అలా పడేసి వెళ్లిపోక అతను ఆవిధంగా అర్ధగంటనుంచి కదలకుండా నుంచోడం, దాంట్లో యేకధారగా కంటినీరు కారుస్తో నుంచోటం ఆమెని గాభరాపెట్టాయి. అదివరకుండిన తుంటరితనం, ధైర్యం వొక్కముహూర్తాన కరిగిపోయాయి. చప్పున లేచి అతన్ని పట్టుకొని చెంపలు వాయించటానికిగాని, చివరకి చీవాట్లు పెట్టడానికిగాని ధైర్యం లేకపోయిం దామెకి. ముందే పిచ్చివాడు, దాంట్లో త్రాగుబోతుకూడా. ఏంమోటుతనం చేస్తాడో అని భయమేసింది. ఎట్లాగైనా వాడు వెళ్లిపోతే చాలనిపించింది.

కదిలింది కాస్త. ఐనా వెళ్లలా వాడు. మెలకవవుతోన్న దాని మల్లే వొళ్లు విరిచింది. కదల్లా వాడు. దగ్గింది. తలగూడా తిప్పలా వాడు. ఇంకా యెంత సేపని పడుకుంటుందిమరి? కళ్లు నలుపుకుంటో లేచి కూచుంది. చేతులు జోడించి ఆమెకేసి భక్తిగా చూస్తో నుంచున్నాడు, ప్రత్యక్షమవుతోన్న దేవుడి వేపు భక్తుడు చూస్తో నుంచున్నట్టు. కళ్లెంబడి నీళ్లు కారుతూనేవున్నాయి. ఏమో అనబోతాడు. కాని పెదిమలు తడబడతాయి. వసుంధర లేచి నుంచొని అప్పుడే ఆతన్ని చూసినట్టు చూసింది కోపంగా. వాడు మరీ భక్తితో చూస్తోన్నాడు. "ఎవరునువ్వు" అని గద్దించి అడిగింది. తొట్రుపడుతో పెదిమలుకుండా అస్పష్టకంఠంతో "తార, తార" అన్నాడు రెండుసార్లు. ఆమె వాడిదగ్గిర కెళ్లి ఆపూలని వాడిముఖంమీద విసిరి, "ఎవరుచెప్పారు నీకు యీ పూలని యిక్కడ యివ్వాలని?" అని అడిగింది పోలీసుయిన్స్పెక్టరు దొంగని అడిగినట్టు. ఆమెప్రశ్న వినబడనట్టే ధ్వని లేకుండా ఆమెవేపుచూస్తో పెదిమలతో "తార, తార," అంటోన్నాడు. "చెప్పు. లేకపోతే చంపేస్తా" నంది పళ్లు బిగబట్టి. ఐనా అదేజపం వాడిది. ఛీ, వీడితో లాభంలేదని, "వెళ్లు. వెళ్లిపో. మళ్లీ వొచ్చావంటేచస్తా" వని గట్టిగా అరుస్తో వెళ్లమని చేత్తో సంజ్ఞ చేసింది.

మెల్లిగా తరిలాడు ఆమెవేపుచూస్తోనే. వాడు నాలుగు అడుగులు నడవటంతోటే చప్పున కిటికీ మూసేసింది.

3

స్కూలువాళ్లంతా కలిసి ఆఆదివారం పిక్నిక్ (Picnic)కి వెళ్లారు, ఆవూరికి చాలాదూరంలో మనుషులెవరూ వెళ్లనివేపుకి. విశాలమైన నదివొకటి పారుతుంది. దానిరెండువొడ్డులకి దట్టమైన అడివి. ఆఅడవిని యింకా పెద్దగా దట్టంగా పెంచాలనేవుద్దేశంతో కొట్టనీటంలేదు. సంవత్సరానికి వొకటి రెండుతడవల యిన్స్పెక్షన్‌కి వొచ్చేఫారెస్టుఆఫీసర్లుతప్ప యెవరూ పోరు దాంట్లోకి. ఆపెద్దయిసుకలో విడిసారు యీపార్టీవాళ్లు. నాగరికబంధాలూ,సంఘంతెచ్చిపెట్టినమన్నన,మర్యాద, సిగ్గూ అన్నిటినీ ఆనాటికోసం వొకమూల కట్టిపెట్టి, అంతా మరిచి ప్రపంచాన్నెరుగని పసిపిల్లల్లాగా ఆనందిస్తోన్నారు. వూరికే కిలకిలమని నవ్వుతోన్నారు, మాటిమాటికి నవ్వటం అసభ్యత్వం అని తోడివారనిపోతారేమో అనేభయం యేమాత్రం లేకుండా. తమగదిలో వొంటరిగావున్నప్పుడుగూడా పాడుకవాళ్లంటే గాడిదస్వరం అనిపోతారేమో అనేజంకుతో గొంతెత్తి యెరుగనివాళ్లు కూడా ఆచెట్లూ, గుట్టలూ ప్రతిధ్వనించేటట్టు పాడుతోన్నారు. లోతు లేక సన్ననియిసుకలో నిర్మలంగా ప్రవహించే ఆస్వచ్ఛమైననీటిలో బుటకలుకొడుతోన్నారు కొందరు. కొంద రాచెట్లగుంపుల్లో దాగుడుమూత లాడుతోన్నారు.

వసుంధర, యింకాయిద్దరుస్నేహితుల్తో జుట్టుముడి విప్పేసి గుడ్డల్ని వొదిలేసి వెన్నల్లాంటిదేహాల్తో వనదేవతల్లాగా ఆపాదలసుండా పందాలుకట్టుకో పరుగెత్తుతోన్నారు. డస్సిపోయినా కొద్ది నవ్వులోన్నారు. వొళ్లంతా చెమటలు పెట్టినా పట్టుదలగా పరుగెత్తుతోనేవున్నారు. కొద్దిగా యెత్తుగావున్న గుండ్లసమూహమొకటి కొంతదూరాన అవుపడ్డది. అక్కడికి పరుగెత్తి స్వచ్ఛమైనగాలికి ఆయెత్తుగుండ్లమీద పక్షుల్లాగా కొంతసేపు కూచొని విశ్రాంతిబొందాలనుకున్నారు. ఆవేపు పరుగెత్తారు. వసుంధరకాలికి యేదో వొత్తుకోపోతే వెనక్కివుంది కాస్త. తక్కినయిద్దరు ఆగుట్టమీదికి ముందుగా పరుగెత్తి వొకగుండుని ప్రాకారు. ఆవలివే పేదో కనబడ్డది. ఇద్దరూ గబాలిన వెనక్కిదుమికారు. అర్ధగంటనుంచి మరిచిపోయినప్రపంచం, సిగ్గూ చప్పున వాళ్లని అల్లుకున్నాయి మళ్లీ. దేహాన్నంతా వీలైనంతవరకు దగ్గిరకి ముడుచుకొని వొంగి వసుంధరకి యెదురుగా పరుగెత్తి ఆమెమెడకి వ్రేలాడపడి నవ్వుకున్నారు. ఆగుండువేపుచూపుతో నవ్వుతారేకాని అసలువిషయ మేమిటో చెప్పరు. ఐనా ఆవే పేదో వుందనిమాత్రం వూహించింది వసుంధర. కాలేజికుఱ్ఱాళ్ల పార్టీ వుందనుకుంది. వెనక్కితిరిగి మళ్లీ పరుగెత్తడానికి వుంకించింది. కాని వాళ్లిద్దరూ "నువ్వుచూడు, నువ్వుచూడు" అంటో ఆమెని పట్టుకో బలవంతాన గుండువేపు లాగారు. గుండు నెక్కించారు. విధిలేక మెల్లిగా ఆవలివేపు తొంగిచూసింది. ఆమురికిసిపాయికోటు, తోలులాంటి అరవధోతి! బోర్లింతగా పడుకొని మోచేతులమీద ఆనుకున్నాడు. ఆతనిచుట్టు నాలుగువేపులా నాలుగు విశాలమైనగుండ్లువుండి కప్పులేని గదిలాగుంది ఆప్రదేశం. అలా బోర్లపడుకున్నాతనిముందు బండమీద బొగ్గుతో రాసిన ఆడబొమ్మ వొకటుంది. ఆబొమ్మ బొగ్గుతో బండమీద రాయబడ్డా అచ్చం ఫోటోమల్లే రూపురేఖల్తో వుండి జీవకళతో వుట్టిపడుతో చిత్రకారుడినైపుణ్యాన్ని చాటుతోంది. ఆబొమ్మకాళ్లదగ్గిర పచ్చిరేగటిమట్టిగద్దెమీద రతనాల్లాంటి యెఱ్ఱనిగురిగింజల్తో, "తార" అని యింగ్లీషులో నాలుగుఅక్షరాలు పొంకంగా కూర్చాడు. ఆపేరుకింద ఆగురిగింజల్తోనే యింకా యేమో పేరుస్తోన్నాడు. ఆమెతోగూడా అట్లానే వొంగి తొంగిచూస్తోన్న యిద్దరు ఆగుట్టలన్నీ యెగిరిపోయేటట్టు నవ్వారు. వసుంధర చప్పున వెనక్కి దూకింది. వాళ్లిద్దరుకూడా ఆమెదగ్గిరకి వొచ్చి ఆపిచ్చివాడితో తమాషాచేద్దామన్నారు. వసుంధరకి మనసొప్ప లేదు. వొద్దంది.

"మొగాళ్లకి యెవరూ లేనిప్రదేశంలో అందమైనఆడది అవుపడితే యేంచేస్తారో మనకేం తెలుసు! మనం యీవెధవని చూసి భ్రమపడ్డామని కాదు. వాడు

మనల్ని యిలాచూస్తే యేంచేస్తాడో, యేం అనుకుంటాడో చూద్దాం." అంది ఆఅమెరికాయువతి.

"వాడేమైనా మోటుగా ప్రవర్తించవుద్యుక్తుడైతే మనంముగ్గురం కలిసి వాడిని చావమోదం?" అంది మరొకామె.

అంతసాహసం లేదు వసుంధరకి, వుత్తమాటలే కాని. అలా సుడ్డలులేక పట్టపగలు పరుగెత్తడాని క్కూడా ధైర్యం లేకపోయింది. కాని యీదేశం వాళ్లంతా పిరికిపందలని తక్కినవాళ్లు తిడతారని మొండిధైర్యం చేసింది. ఇలా వాడికి అవుపడడమేకాక వాడిని రేగించటం తలుచుకుంటేనే గుండె లవిసిపోయాయి. వాళ్లకి యిట్లాంటివి లక్ష్యం లేదు. తమలాగా చదువుకొని నాగరికు లనిపించుకునే మొగాళ్లే మొగాళ్లని వాళ్ల భావం. తక్కినవాళ్లు మనుషుల్ని యేమీచేయలేని మొగజంతువులు వాళ్లదృష్టిలో. రోముదేశపు చక్రవర్తి నీరోభార్యలు, నపుంసకులనిసైతం తపింపచేసే యవ్వనం కలవాళ్లు, నిరభ్యంతరంగా తమసేవకులముందు స్నానాలుచేసేవాళ్లట. ఈపిచ్చివాడంటే వోహలక్ష్యమా వాళ్లకి! అందుచేతే ఆఅల్లరికి బూనుకున్నారు. వాళ్లిద్దరూ మళ్లీ ఆ గుండెక్కి వాడికి పూర్తిగా అవుపడేట్టు నుంచొని పెద్దగా అరిచారు. వెంటనే "వొస్తోన్నాడు" అంటో వెనక్కిదూకి చిన్న గుండువెనక దాగున్నారు. వసుంధర వొహపొదవెనక దాగుంది. చుట్టుపక్కలంతా వినపడేట్టు నవ్వుతో వాడు లోపల్నుంచి యెక్కివొచ్చాడు. ఇంకా వాడు గుండు మీదవుండి నవ్వుతో చుట్టూ చూస్తోండగనే వసుంధరముఖం ఆపల్చని పొదలోంచి అవుపడ్డది. అతని ముఖంలోని ఆనవ్వు, ఆ ఆనందం మెరుపుమల్లే మాయమయాయి. చేతులు వొదిలి కిందికి పడిపోయాడు. ఏకదృష్టిగా ఆపొదవేపు చూస్తో అమాంతంగా లేచి దెబ్బ తగిలి మోకాలినుంచి కారేనెత్తురునికూడా లెక్కపెట్టక ఆపొదవేపు రెండడుగులు నడిచాడు. పక్కగుండు వెనకనుంచి "నువ్వే కావాలట వసుంధర" అని వాళ్లు నవ్వుతో అరుస్తోన్నారు. కాని అవి వాడిచెవిని సోకినట్టు లేదు. బాగా అవుపడ్డ దాతనికి వసుంధర. వాడక్కడే ఆగి తనకోటుని విప్పి ఆపొదలోకి విసిరి, "చలి, చలి. తొడుక్కోతార" అంటో యేడ్చాడు. తనకిటికీదగ్గిరి దృశ్యం జ్ఞాపకంవొచ్చింది వసుంధరకి. ధైర్యం వొచ్చింది. గొంతు సవరించుకొని చేతిని సాచి "వెళ్లు వెళ్లు. తొరగా వెళ్లిపో" అంది. కదిలాడు వాడు. వెనక్కి తిరిగిచూస్తో మెల్లి మెల్లిగాఆమెచూపించిన వేపు నడిచిపోయాడు, ఆడుకుంటోన్న తక్కిన పిల్లలవేపుచూస్తో విధిలేక బడిపంతులుముందు నడిచిపోయే పిల్లవాడిలాగా. ఆపేగులవర్టుని తొడుక్కోని నడువలేక దరిద్రనారాయణుడిలాగా కదిలిపోతోన్న వాడి దీనమైనముఖం, భక్తియుక్తమైనచూపులూ వెనక్కి ఆమెవేపు తలని తిప్పినప్పుడల్లా వసుంధరకి వొహవిధంగా జాలిని కలిగించాయి. దుఃఖమనిపించింది. వెనకాలే పరుగెత్తి ఆకోటాతనికి తొడిగి బుజ్జగించి పంపా లనిపించింది. దట్టమైనపొదలు కొన్ని అడ్డమై ఆతన్ని అవుపడకుండ చేసాయి.

వాడు వెళ్లిపోవటంతోటే గుండువెనకాల్నుంచి వాళ్లిద్దరూ పరుగెత్తుకోవచ్చారు. "వొక్కనిమిషంలో నీప్రియుడిని కుక్కనుచేసేసావే!" అని బహూకరించింది అమెరికాయువతి. "తొడుక్కోవుమరికోటును అంతప్రేమగా వాడిస్తే?" అని నవ్వింది మరొకామె.

వాడినగరులో యేముందో చూద్దామన్నారు. వాళ్లిద్దరు ముందు వెళ్లారు. వాళ్లవెనక మెల్లిగా వెళ్లింది వసుంధర. ఆబండమీద చిత్రించిన ఆబొమ్మను చూసేచూట్టంతోటే వాళ్లిద్దరు వసుంధరని ముందుకి లాగి "హా! వసుంధరా!" అని అరిచారు. అంతకొంటెస్వభావంకలవాళ్లిద్దరుకూడా ఆముహూర్తాన పరివర్తనబొందారు. నవ్వు మానేసి సీరియస్‌గా ఆబొమ్మని పరీక్షించారు. ప్రాణం వుట్టిపడుతోంది. ఆమురికిబండమీద బొగ్గుతో యింతనిపుణంగా యెలారాయకలిగాడా అని ఆశ్చర్యపడ్డారు. వసుంధరని యెదురుగా కూచో పెట్టుకొని నిపుణుడైన చిత్రకారుడు చిత్రించినబొమ్మలాగుంది. కాని కొన్నిపోలికలు, వెంట్రుకలు, కను

బొమ్మలు మాత్రం వసుంధరవి కావు. ఇంకా యేముందో అని వెతికారు. వోహమూల రెండు గుండ్లమధ్య యిరుకుసందులో యెండిపోయిన తెల్లగన్నేరు పూలరాశీ, గన్నేరుకొమ్మలూ వున్నాయి. వాటి కింద అద్దమంతా తుత్తునకలైపోయిన ఫోటో వోహటుంది. దాన్ని బైటికితీసింది అమెరికాయువతి. ఆబండమీద రాసినబొమ్మే దాంట్లో వుంది. ఆఫోటోను చూసే ఆబొమ్మని రాసాడు. వసుంధరని మిక్కిలి దగ్గిరగా పోలే వుంకొహామెది ఆఫోటో. ఎవరూ మాట్లాడకుండా దాన్ని పరీక్షించారు. దాన్ని అక్కడే పడేసి వాళ్లు వెడ్తోంటే ఆ ఫోటోను మళ్లీయెప్పటిమల్లే పూలకిందవుంచింది వసుంధర.

౪

ఆనాడు సాయంత్రం సరిగ్గా నాలుసుగంటలకి పెద్ద వర్షం కురిసింది. అందుచేత టెన్నీసుకి వెళ్లటానికి వీల్లేక తన గదిలో గ్రామఫోను పెట్టి సామాను పెట్టెలుసరుదుకుంటోంది వసుంధర. ఇహ రెండు రోజులుమాత్రమేవుందికొత్తవూరు వెళ్లి ఛార్జీపుచ్చుకోటానికి. ఆ కొత్తవూళ్లో, కొత్త నాకట్లో, కొత్తనాకర్లూ, కొత్త స్నేహితులమధ్య స్థిరపడ్డానికి యెంతో యత్నం కావాలి. ఎన్నాళ్లో పడుతుంది. నిజంగా వోహవూరినుంచి వుంకో వూరికి



“ఎవరూ మాట్లాడకుండా దాన్ని పరీక్షించారు.”

మారటమంటేయెంత అసహ్యమో అనుభవానికొస్తేకాని తెలీదు.

పనిమనిషివొచ్చి,"మీకోసం యెవరో ముసలామే, చిన్నకుఱ్ఱాడూ వొచ్చా" రంది. గ్రామఫోన్‌ను ఆపి వాళ్లున్నగదిలోకెళ్లింది. తలుపు దగ్గిరే నుంచుం దామె యెడమచేతులో అబ్బాయిని పట్టుకో. ఆఅబ్బాయి వసుంధరకి తెలుసు. కృష్ణమూర్తి. ఆమెక్లాసులోనే చదువుతాడు. ఐదేళ్లుంటాయి. చాలా తెలివికలవాడేకాక ముద్దుకుఱ్ఱాడుకూడా. వసుంధరని చూడ్డంతోటే ఆముసలమ్మని ముందుకి లాక్కొచ్చాడు. అరవైయేళ్లుంటాయి దాదాపు ఆముసలమ్మకి. కళ్లు కాస్తమబ్బు. దగ్గిరికొస్తేనేకాని బాగా చూళ్లేదు. పూర్తిగా తెల్లబారినఆసిగ, పండు తమలపాకులాంటిదేహం చూసేవాళ్లకి పూజ్యభావం కలిగిస్తాయి. వసుంధర వాళ్లని కూర్చోపెట్టి ఆమె దగ్గిరగా కూచుంది. ఆముసలమ్మ వసుంధరని దగ్గిరగా పరీక్షించి చూసి నోరు తెరిచింది. పటపట నీళ్లు కారాయి కళ్లల్లోనుంచి. పైటలో ముఖం దాచుకొని వెక్కివెక్కి యేడ్చింది. వసుంధరకి దీనిఅర్థం తెలీక వూరికే చూసింది. ఏదో కష్టంలో వుంది పెద్దమనిషి అనిమాత్రం వూహించింది. "ఎందుకమ్మా యేడుస్తావు?" అని దయగా అడిగింది. ఆముసలమ్మ తల పైకెత్తలా. ఐదునిమిషాలు మాట్లాడకుండా కూచుంది వసుంధర. ఆఅబ్బాయి ఆముసలమ్మని బుజ్జగించాడు. చివరకామె వొస్తోన్నదుఃఖాన్ని అణుచుకొని కళ్లనీళ్లు తుడుచుకుంటో,"మీక్లాసులోనేనటమ్మా మాఅబ్బాయి చదువుతోంది?" అంది.

"అవును."

"మీసరింవి గంటలాతరువాయి చెప్తుతోంటాడు వీడు. మీరంటే వాడికి చాలాగురి."

"మీఅబ్బాయి చాలా తెలివిగలవాడులెండి. చాలచురుకు."

"వీడిమాటల్ని యీఆరునెల్లనుంచీ విని మిమ్మల్నిబాగా అర్థంచేసుకోకలిగా. నిండువిశ్వాసం కలిగింది. అందుచేతే యీసాయంత్రం ధైర్యంగా వొచ్చా."

"ఏమిటో చెప్పండి."

"ఈఅబ్బాయి నాకూతురికొడుకు."

"అలాగా?"

తుఫానులాగా వొచ్చేదుఃఖాన్ని గొంతులో అణిచి, "వీడిపుట్టుకతోటే అది పోయింది, ఆరేళ్లకింద."

"పాపం."

"తండ్రి—"అణుచుకున్నదుఃఖం ఆగిందికాదు. ఏడ్చింది.

"తండ్రికూడా పోయాడా పాపం?"

"పోయాడన్నమాటే వొకవిధంగా."

"అలాఅంటే?"

"నాకూతుర్నా, ఆతనూ సుఖంగా, దేవుడు వోర్వలేనంత ప్రేమగా బతికారు పెళ్లయినమూడేళ్లు. అప్పుడాతను గొప్ప చిత్రకారుడు. ఆతనిబొమ్మల్ని విదేశీయులు వేలకువేలిచ్చి కొన్నారు. ఆదంపతులిద్దరూ చకోరపక్షుల్లాగా వొకరికోసం వొకరు బతికారు. అది—అదిచచ్చినవారంలోనే పిచ్చి యెత్తింది. హా! ఆదైవం తొందరగా వాడికళ్లు మూస్తే ఆకష్టాలు పోస్తాయి."

"బతికున్నాడా యిప్పుడు?"

ఏడుస్తో అవునని తల వూగించింది.

చెప్పరానిహృదయవేదనేదో కలిగింది వసుంధరకి. "మీకూతురిపేరేమిటి?"

పలుకలేక కష్టంతో "తార."

"తారా?"

మళ్లీ తలవూగించింది అవునన్నట్టు.

అర్థమైంది. అంతా అర్థమైంది వసుంధరకి. ఆపిచ్చివాడి "తార" జపానికి అర్థం యిప్పుడు తెలి

సింది. హృదయం కరుణతో నిండిపోయింది. "ఆత నిప్పుడు యెక్కడుంటాడు?" అని అడిగింది.

"అంతటా. చూసినవాళ్లు చెప్తారు అప్పుడప్పుడు అవుపడ్తాడట, తెల్లగన్నేరుచెట్లు యెక్కడుంటే అక్కడ". ఏమన్నా "తెల్లగన్నేరంటే అమితమైనప్రేమ ఆతనికి. పెళ్లాన్ని రోజూ తల్లో ఆ పువ్వొహటి పెట్టుకోమనేవాడు." తరువాత పలుకలేకపోయింది. ఆగానంతా జ్ఞాపకం వొచ్చి పైటలో తలదాచుకొని యేడవడం ఆరంభించింది. తన ఆలోచనల్లో తాను మునిగి వోదార్చడానిగ్గూడా అశక్తురాలైంది వసుంధర. ఇద్దరూ ఐదునిమిషాలదాక మాట్లాళ్లేదు. కృష్ణమూర్తి కడపమీద కూచొని దారి పొడుగుతా వొచ్చిపొయ్యేవాళ్లని చూస్తోన్నాడు. ఆనిశ్శబ్దాన్ని భంగపరిచింది ముసలమ్మ, "వీడికి నేను తప్ప యింకెవరూ లేరు దగ్గిరతీయటానికి." కాస్తనే పాగి, "రేపోమాపో నేను రాలిపోతే వీణ్ణి కన్నెత్తి చూసేవాళ్లుగూడా వుండరు."

ఆమెవేపు చూసింది వసుంధర.

"నేనిప్పుడు మీదగ్గిరకి రావటానికి ముఖ్య కారణం యీఅబ్బాయిని మీచేతుల్లో పెట్టి యేచింతా లేకుండా మృత్యువుకోసం యెదురుచూస్తో కూచోవాలని. నాకు తెలుసు మీకీవార్త పిడుగులావుంటుందని. ఇప్పుడే జవాబు చెప్పాలిసినఅవసరం లేదు. రేపు సాయంత్రందాకా ఆలోచించండి. ఎట్లాగైనా వీడిని మనిషినిచేసేభారం మీది. మీరు వొప్పుకుంటే వీడి తల్లిదండ్రికి సంబంధించినపదివేలనగలూ, నోట్లూ, తెచ్చి మీకు వొప్పచెబ్తా."

నిజంగా యిది వసుంధరమీద పిడుగులాగా పడ్డది. లేచి యేమో అనబోయింది కాని యింతట్లో ఆమెతోపాటు స్కూల్లో పనిచేసే స్నేహితురాలొహామె వొచ్చింది. ముసలమ్మ అబ్బాయిని చేతులో పట్టుకొని వెళ్లిపోతో తలుపుదగ్గిర నుంచున్నవసుంధరముఖాన్ని పరీక్షగా చూసి మళ్లీ యేడవటం ఆరంభించింది. "ఎందు కట్లా యేడుస్తావమ్మా, యేడవకు" అంది వసుంధర. "నాతార నాకళ్లముందు యీచేతుల్లో చావకపోతే మిమ్మల్ని చూట్టంతోటే "తారా" అని మెడకి పడేదాన్ని" అని కళ్లనీళ్లు తుడుచుకుంటో వెళ్లిపోయింది.

వసుంధర స్నేహితురాలితో మాట్లాడక స్టూలుపైని సడ్డవేపు చూస్తో ఆలోచిస్తోంది దీర్ఘంగా. ఆ స్నేహితురా లంది "ఎవరు వసుంధరా, ఆఅబ్బాయి? ఆపెదిమలూ, ఆచిన్నిగదవ అవి నీవే. నిన్ను చూసినవాళ్లు ఆతను నీకొడుకే అనుకుంటారు."

"అవును. నేనేసాకితే యెక్కడో దొంగతనంగా కని యిన్నాళ్లు దాచి యిప్పుడు స్నేహితుల కొడు కంటుందని అనుమానిస్తుంది లోకం." అని అనుకుంది వసుంధర మనసులో.

౫

మరునాడుసాయంత్రం స్కూలునుంచి వొస్తోంటే తోవలో అవుపడ్డా డతడు. వొహ పొగడచెట్టుకి వొరిగి రాజులాగా కాలుమీద కాలేసుకొని కూచొని పాటపాడుతోన్నాడు. ఆపాటకి అర్థంలేకపోయినా ఆధ్వనిలో మాధుర్యం వుంది. వసుంధరని చూడ్డంతోటే లేచి పరుగెత్తబోయాడు. కాని వసుంధర దయతో ఆగమని సంజ్ఞచేసింది. ఆగి ఆమెవేపొచ్చాడు మెల్లిగా. ఆసిపాయికోటుని వసుంధరకోసం త్యాగంచేసి ఆచింపులషర్టుతోటే లక్ష్యం లేకుండా తిరుగుతోన్నాడు. ఆమెకి జాలేసింది. తనవెంట రమ్మని సంజ్ఞచేస్తో యింటిదాకా తీసికెళ్లింది. పిల్లికూనలాగా ఆమెవెంట వెళ్లాడు "తార, తార" అంటో. వసుంధర లోపలికెళ్లి వారంరోజులకింద కొత్తగా కుట్టించుకున్న వోవరుకోటు తెచ్చి ఆతనికిచ్చి తొడుక్కోమంది. అది వాడు మురుస్తో తొడుక్కున్నాక వొహ రూపాయిడబ్బులు తెచ్చి ఆతనికిచ్చి పొమ్మంది. ఆతని సంతోషం మీరిపోయి రోడ్లో నాట్యం చేయటం మొదలెట్టాడు. అప్పుడే రాజులాగా గాంభీర్యంతో నడుస్తాడు; అప్పుడే బఫూనులాగా గంతు లేస్తాడు. మోటార్ల హార్ను, బండివాళ్లకేకలూ ఆతనికి వినపడవు.

ఒహాయిరమై అడుగులు యిట్లా నడిచేటప్పటికి జువ్వుమని సార్జెంటుకారొహటి యెదురుగుండా వొచ్చి ఢీకొన్నది. గుమ్మంలోనుంచోని ఆతురతతో చూస్తోన్న వసుంధర కళ్లు మూసుకుంది. రెండునిమిషాలతరువాత మాసేసరికి జనులంతా గుమిగూడారు. జ్ఞానం లేకుండా యీ దేశంవాళ్లంతా రోడ్లో తిరుగుతారని దుమికి కారుతోలుకోవెళ్లిపోయాడు సార్జెంటు. ఆతడు మధ్య రోడ్లో చచ్చిపడ్డాడు. వసుంధరదృష్టిని ఆకర్షించిన మెలికలు తిరిగిన ఆజుట్టూ, తీర్చిన కనుబొమ్మలూ, చక్కని ముఖమూ చిదిగి రక్తలీనమైపోయాయి. తలమీదుగానే



“వసుంధర కుర్చీలో......ఆతనితల తనవక్షానికి అదుముకుంది.”

వెళ్లించి కారు. రెండు నిమిషాలకుముందే వసుంధర యిచ్చిన అణాబిళ్లలన్నీ చెల్లాచెదరై పడ్డాయి. ఆకో... దుమ్ములో దొర్లిపోయింది. ఆమె మెల్లిగావొచ్చి యా... చేత్లో పడిపోయింది. ఒహగంటతరువాత పనిమనిషి వొచ్చి టీ చల్లారిపోతోందంటే దాన్నే తాగేయమంది. వాడిమృత్యువుకి కారణంఅంతా తనే అనే బాధతో దహించుకుపోయింది.

దీపాలు పెట్టాక పరుగెత్తుతో యెగదమ్ముతో కృష్ణమూర్తి వొచ్చాడు. ఎదురుగా నుంచున్న వసుంధర అవుపడ్డంతోటే పెళ్లున నవ్వాడు. ‘ఏమిటి’ అన్నట్టు ఆవేపు చూసింది వసుంధర.

“రేపు నన్ను మీతో తీసికెడ్తారా ఆకొత్తవూరికి?”

“ఏం?”

“మాఅమ్మమ్మ అడగమంది.”

“నిజంగా నాదగ్గిర వుండాలనివుందా నీకు?

చప్పున ఆమె నడుంచుట్టూ అల్లుకొని వ్రేలాడపడ్డాడు. వసుంధర కుర్చీలోకూచొని ఆతన్ని దగ్గిరకి లాక్కుంది. ఉంగరాలుగా మెలికలు తిరిగిన ఆ క్రాపును తన వేళ్లతో దువ్వింది. చప్పున ఆతని ఆతీర్చిన కనుబొమ్మల్ని, ముక్కుని ముద్దెట్టుకొని ఆతనితల తన వక్షానికి అదుముకుంది. ఆమెకళ్లెంబడి రెండు నీటిధారలు చెంపలమీదుగా జారాయి. ఒక్కనిమిషం తరువాత ఆతన్ని వొదిలి “వెళ్లు. మీఅమ్మమ్మతో చెప్పి రేపుపొద్దున్నే రా. ఏం?”

“వొచ్చేప్పుడు మాపెరట్లో గన్నేరు పూలున్నాయి, తేనా?”

“పూలేకాదు, వొహ చిన్నిమొక్క వుంటే తీసుకోరా.”

“చాలా వున్నాయి.”

“వొహటి పట్టుకోరా, ఆ పూళ్లో నాటుకుందాం.”

# వర్షాశ్రీముఖము

కవిరాజహంస, వోలేటి పార్వతీశము

౧

ఔరుల సుఖదుఃఖ యోగవియోగములకు
సాధకము, బాధకం బయ్యు సమతఁ గనుచు
నిత్యనూత్న సనాతన నియతి నెగడు
ప్రకృతిపరిణామవితతికిఁ బ్రణతిశతము.

౨

ఆ సముద్రుచే మును గొన్న యప్పు లెల్ల
నూర్చుకొని యెక్కుచో ఘనుల్ గ్రుమ్మరించు
కాలమే, యొక్కుచోఁ బేదకర్షకాళి
నప్పులో యప్పులో యంచు నడలఁ జేయు.

౩

నెమ్మికనువిందు జాలప
దమ్మున కెదగుం దటంచుఁ దలఁకునె నీలా
భమ్మున మెఱుముచు నుఱుముచుఁ
గ్రమ్ముకొనఁగాక కాలకాలాంబుదముల్.

౪

జాతిక్రొవ్విరులకు, సకలసస్యములకు
నాణిముత్యములకు, నాపగలకు
నెమ్మినటనములకు, నేరేడుపండ్లకు
వాట మగు బిడారు వానకారు.

౫

వనదముల్ కూడనీ వార్ధులూటాడనీ
మలసి వీసకపోవు మారుతములు
జీవముల్ దనియనీ చీఁకటు లొమ్మనయనీ
చేరి క్రమ్మకపోవు నీరదములు
అమృతంబు సిలుకనీ యగ్నిగుండ్లొలుకనీ
వడిసి నింపకపోవు వాఁజడులు
పైరులు పెరుఁగనీ పల్లెలు ముఱుఁగనీ
నిండి పాఱకపోవు నిర్ఝరిణులు.
దారుణ గ్రీష్మసంతాప దగ్ధభూత
ధాత్రి జీవామృతమ్మునఁ దనియఁ జేసి
యగణితశరద్విభూతి బీ తడఁపకుండ
నరుగునే నభ మెడలి వర్షాగమంబు.

౬

ఎప్పుడు సమయం బగునో
యప్పుడె వర్షోపలబ్ధి యగుఁగాక పురుల్
విప్పిన కేకుల కేకలు,
కప్పల బెకబెకలు మూఁగఁ గలవె ఋతువులన్.

౭

ఉఱిమి యుఱిమి పిడుగు లురలించుమఘ మించి
మబ్బు లుబ్బరింపఁ బుబ్బ రేఁగి
చిలికి చిలికి కురియఁ జెలరేఁగి తెరువాఁగు
కోడెనాగులాగు కొండవాగు.

౮

కడలఁ గ్రక్కడలించి కలగాలి వడిఁ దూలి,
గిరికాననములఁ జిందఱలు సేయ
కన్నుమిన్నును మూసి కాఱుమబ్బులు గ్రమ్మి
చిమ్మచీఁకటుల విశ్వమ్ము నింప

అవనీతలము ముంచి యాసార మెగఁజల్లి,
యేల్లనూ ళ్లనుభేద మేకపఱుప
పెళపెళధ్వని మించి పిడుగు లేక్కఱ రాలి
పడి మొత్తి జగతి బీభత్సు చేయ
క్రొత్తరాజధాని గోపురభవనంబు
లురలునంతవాన గురిసెఁ గాని
పనితినంబు నెఱపు పచ్చపిచ్చుకగూట
నొక్కతుంపురైన నుట్టిపడెనె?

౯

బోలుమ్రాన నిట్టె పుట్టి పొంగునుగాని
పుట్టగొడుగు దాని పొడు గదెంత
చిన్నిపైరు నలమి చిగిరింత చిందాడుఁ
గాని యెంత సేపు దానియేపు?

౧౦

దినమణి సుప్రసన్నకర
దీధితిఁ గప్పెదువిప్పనన్ ఘనా
ఘనము నభంబుఁ గ్రమ్మి భయ
గర్జల గింగురువెట్టుఁగాక ప్రా
క్తనసుకృతుల్ ఫలింపఁగల
కాలముఁనన్ వరణీయజాతిశో
భన సుమనోవిభూతిపరి
పాకము లోక మెలర్పకుండునే.

౧౧

ననుఁ గాంచి వెక్కిరించిన మల్లి కావల్లి
పల్లవంబులు ముందుపాటు దలఁచి
న న్నీసడించిన నవమాలతీగంధ
కళికలు రానున్న గతులు దలఁచి
నేనున్న వనవాటి కైనఁ గన్గొలుపని
తేఁటు లాగామిదుర్దినముఁ దలఁచి
నాతావు లరయక మాతావులనె చొక్కు
తెమ్మెరల్ భావిదుస్థితులు దలఁచి
కలిమిలేములు కాలసంగతము లగుట
నెంచెనే దుర్మదంబె చూపించె నంచు
ప్రాప్తకాలంబుదాఁక నూఱడి తపంబు
దీర్చి ఫలసిద్ధిఁ గాంచె నీలిగలజాతి.

౧౨

మునుపు దుర్భిక్షవేళఁ గైకొనినవిందు
మాట మధుమదభ్రమరంబు మఱచుఁగాక
మరలఁ దఱిఁ జూచి దరిఁజేరు మధుపమునకుఁ
బ్రీతినే కూర్చు నుత్తమజాతి జాతి.

---

# ప్రపంచ - ఆర్థికమహాసభ

కపిల కాశీపతిరావు

ఇవి కరువురోజులు. గతించిన మూడు నాలుగు సంవత్సరములనుంచీ ఈవిషయం దేశంలో ఆబాల గోపాలానికీ స్వానుభవమే. ఈ క్షామం ఆహారములకే కాక వ్యవహారములకుకూడా సంబంధించినది. ఇదిఅదిఅని ఒకదేశానికి కాక ప్రపంచం అంతా జాడ్యం మాదిరి వ్యాపించినది. ఐరోపామహాసంగ్రామానికి పూర్వం వొళ్లువాచిన దేశాలన్నీ ఈ కరువుదెబ్బకు కృశించి శల్యావశిష్టంగా ఉన్నవి. లోకంలో ఆర్థిక వ్యవహారాలు పరిశీలిస్తే ప్రస్తుతావస్థ తెలుస్తుంది. వ్యవసాయమే ప్రధానవృత్తిగావున్న భారతదేశంలోనే యింతకష్టంగా వున్నపుడు తక్కిన మరపరిశ్రమలు జన బాహుళ్యానికి ఆధారమైన దేశముల దుస్థితి చెప్పనలవి కాదు. పాశ్చాత్యదేశాలలో అనేకమరలు మూసివేసినారు. తత్కారణంగా పనివాండ్లు తిండిలేక తిప్పలు పడుతున్నారు. జనసామాన్యం బతికిచెడ్డారు. కొన్ని ప్రభుత్వాలు దివాలాస్థితికి వచ్చినవి. తక్కిన ప్రభుత్వాలలో ఆదాయానికి వ్యయానికి ఎక్కడా లంగరు అందడంలేదు. క్రీ. శ. ౧౯౨౯-౩౦ వ సంవత్సరం మొదలు ధరలు క్రమేణా తగ్గుతూవచ్చినవి. ౧౯౩౧ లో మరీ చచ్చిపోయినవి. సాహుకార్లకు చేతిలో పైసా పిగల కుండా వచ్చినది. హేమాహేమీలంతా "ఏంచేరమండీ, సంచికింద మన్ను" అనడమేగాని సంతోషం ఎవరి ముఖాన కనబడడంలేదు. ఏడవసాగితే వ్యవసాయ మనేవారు. కాని సామెత సర్వత్రా నిజమైపోయినది. ఈకరువులో రైతాంగపు అప్పులులాగే ప్రభుత్వాల ఋణాలుకూడా పాపంపెరిగినట్టు పెరిగిపోతూన్నవి. గోరుచుట్టుమీద రోకటిపోటులాగ ఒకరిమీద ఒకరు ఎగుమతిదిగుమతులమీద సుంకాలు ఎక్కువచేసినారు. దీనికి తోడు ఎంతటి మేధావులకూ అర్థంకాని దిక్కుమాలిన మారకపురేట్లు. హైదరాబాదు వెళ్లివచ్చిన ఆంధ్రులకు అనుభవమే. పదిరూపాయిల నోటు తీసుకు వెళ్లి సిక్కారూపాయిలలోకీ, సిక్కాలు హాళీలలోకీ పొద్దుణించి సాయింత్రందాకా మారుస్తూంటే చివరికి చేతిలో ఏమీ మిగలదు. హారతికర్పూరంలాగున బిళ్ల బెత్తుగాంటి రూపాయిలు హరించిపోతవి. ఎందుకంటే ఈనాణెం ఆనాణెంలోకి మార్చేటప్పుడు ఒకనిర్ణయింపు ప్రకారం ఇంతకి అంత అని ఒకరేటు వుంటుంది. దాన్నే మారకంరేటు ( Exchange ) అంటారు. వివిధ ప్రభుత్వాల ప్రత్యేక నాణెముల మారుదలలో, కొన్ని రేట్ల ప్రకారం లాభం, కొన్ని రేట్లప్రకారం నష్టం వస్తుంది. పౌండు,షిల్లింగు,పెన్నులు రూపాయి,అణా,పైసలలోకి మార్చేటప్పుడు వ్యాపార-అవసరాన్ని బట్టి ఇచ్చిపుచ్చుకోవడంలో సదారూపాయిదారుకే నష్టం. పౌండు ఇంగ్లాండుది. రూపాయి భారతదేశానిది. ఇల్లాగే అనేకదేశాలకు అనేకరేట్లు ఉంటవి. అంతర్జాతీయవ్యాపారంలో ఒకప్రభుత్వం మరొకప్రభుత్వానికి బాకీ తేలుతుంది. కొందరు బంగారమేగాని పుచ్చుకోమంటారు. అటువంటి సమయాలలో నష్టం వస్తుంది. ఈలాభనష్టాలు ఈ కరువుకి సగం కారణం.

చేతిపరిశ్రమలు మాని మరపరిశ్రమలవెర్రిలోపడ్డ పాశ్చాత్యజాతులలో కావలసినదానికంటె పదిరెట్లు ఉత్పత్తి ఎక్కువైపోయినది. విజ్ఞానం వృద్ధిపొందిన కొద్దీ మరలవేగం, దానితో సహజంగా వస్తుసముదాయపు ఉత్పత్తివేగం వృద్ధిపొందుతోంది. పనివాండ్ల అవసరం తక్కువకావడమే కాక, సాహుకారు ఆశ ఎక్కువై ఉత్పత్తి వేగమైపోయినది: అమెరికాలో ఒక పెద్దఫ్యాక్టరీ ముప్పదియారుగంటలు ఒక్క మనిషికూడా సమీపంలో లేకుండా పనిచేస్తుందిట. దాని పర్యవసానం ఏమిటిఅంటే, అవసరం అయినదానికంటె ఎక్కువ తయారై ఖర్చుకాదు. సరుకు నిలవవుండిపోతుంది. కొద్ది రోజులలో ఫ్యాక్టరీ మూసివేయాలి. అదేవిధంగా అన్ని దేశాలలో పెళ్లిభోజనంలోనో, సమారాధన

లోనో మంది లేస్తారని ఊహించి గుండెగలు వార్చి నట్టు వుంటుంది. ఆహారం అయితే ఎప్పటికైనా ఎవరైనా తినవచ్చు. కాని అక్కడ తయారయేవి కర్రముక్కలు, ఇనపముక్కలు. నిజంగా ఆలోచిస్తే మన నిత్యజీవనానికి అవి అనవసరం. ఈకరువుకి ఈ అలహాయిదా వుత్పత్తి ఒక కారణం.

ఇవేకాక అనేక కారణాంతరాలవల్ల ప్రపంచంలో శేరసారాలుగాని, పరిశ్రమలుగాని, సగటున వ్యాపారం గాని ౧౯౨౯ మొదలు ౧౯౩౨ లోగా నాలుగింట మూడోవంతు పడిపోయినవి. పదిరూపాయిలు అమ్మే ధాన్యపుబస్తా మూడున్నరఅమ్మితే ఎంత అవస్థపడు తున్నామో, అల్లాగే. మొత్తంమీద సంవత్సరానికి నూరురూపాయిలు సంపాదించే ఆసామి యిప్పుడు సర్వత్రా ఇరవైఅయిదురూపాయిలే ఆర్జించి కష్టపడు తున్నాడు. నిత్యజీవనమే దుర్లభంగా ఉన్నది. ప్రపంచంలో ౩౦౦౦౦౦౦౦ మంది నిరుద్యోగులని లెక్క తేల్చినారు. లెక్కకు రానివారు ఇంకా చాలమంది వుంటారు. మరి కరువో కాటకమో ఇంతవరకు ఈప్రపంచం ఎరగదు!

ప్రభుత్వాలు ఖంగారు, గగ్గోలు. మహారాజులు, మహామంత్రులు, రాజ్యాంగవేత్తలు, ఆర్థికశాస్త్రజ్ఞులు, మేధావులంతా తరణోపాయంకోసం ఆలోచించారు. నానాజాతిసమితిలో తర్కించారు. అంతా సంప్రతించి సద్దుబాటు చేసుకుంటేనేగాని ఈక్షుద్బాధ తీర దన్నారు. ఎందరో ఎన్నో కారణాలు సూచించారు. కాని ఏది నిజమో, ఏది అబద్ధమో ఎవరికీ తెలియదు. మనదేశంలో సర్కారువారు దీనికంతకూ గాంధీగారు కారణం అన్నారు. ఇల్లాగే అనేకమంది అనేక అవకతవకమాట లన్నారు. కాని ఇదమిత్థమని నిర్ణయించలేకపోయారు. జాతీయప్రభుత్వాలు సమావేశం చేసుకున్నారు. నానాజాతిసమితి ఆర్థికసంఘంలో ఆలోచించారు. దారి కనబడలేదు. వరుసగా ఒకటేసభలు! లానేన్, లొకార్నో, వాషింగ్టన్, జినోవా, రపాలో, పారిస్, వెర్సేలీస్, అట్టావా. ఇవన్నీ చరిత్రాత్మకమైన మహాసభలు; యావత్తుమానవకోటికి సంబంధించినవి; మనకూటిగుడ్డలు వీటిపైన ఆధారపడివున్నవి; ఉత్కృష్టమైన ఆర్థికవ్యవహారాలు చర్చించి ప్రపంచంలో శాంతి నెలకొల్పడానికి ఉద్దేశింపబడ్డవి. పర్యవసానం ఏమిటి? వెనకటికి పశ్చిమగోదావరి జిల్లాలో పుల్లయ్య అనే పురుషుడు వేమవరం వెళ్లిరాలేదూ? గుంటూరుజిల్లాలో సింగడు అద్దంకి వెళ్లిరాలేదూ? ఆ మహాయాత్రల పర్యవసానం ఏమిటి? అంతే ఈ మహాసభలుకూడా. దేశదేశాల బుద్ధిమంతులంతా జేరి బువ్వకోసం కొట్లాడుకునే బూటకాలు.

ఇటువంటి సభలన్నీ ఎందుకూకాకుండాపోయి నవి. ఆర్థికవ్యవహారాలు చూస్తే ఆరోజుకారోజు అడుగంటిపోతున్నవి. ప్రపంచ-ఆర్థికస్థితి అంకెలలో ఈవిధంగా వున్నది:

క్రీ. శ. ౧౯౨౯-వ సంవత్సరంలో ప్రపంచపు వర్తకసరళికి ౧౯౩౨ లో స్థితికి వ్యత్యాసం, ఎగుమతి దిగుమతులు సగటున లెక్కతీస్తే ఇల్లా తేలింది:

సగటున ప్రపంచపు దిగుమతుల నాణెపు వెల:—

| | | |
|---|---|---|
| ౧౯౨౯ | ౨౭౧౬ | కోట్ల బంగారు డాలర్లు |
| ౧౯౩౨ | ౧౦౬౧ | ,, ,, ,, |

ఎగుమతులు

| | | |
|---|---|---|
| ౧౯౨౯ | ౨౮౮౬ | ,, ,, ,, |
| ౧౯౩౨ | ౯౮౫ | ,, ,, ,, |

దిగుమతులు సగం పడిపోయినవి. ఎగుమతులు మరీఅన్యాయం. వర్తకంలో పేరుపొందిన దేశాలు విడి విడిగా:

| | ఎగుమతులు | దిగుమతులు |
|---|---|---|
| | ౧౯౨౯ - ౧౯౩౨ | ౧౯౨౯ - ౧౯౩౨ |
| అమెరికా | ౮౨౯ - ౧౩౮ కోట్లు | |
| ఇంగ్లాండు | ౨౯౫ - ౧౦౬ ,, | ౮౫౦ - ౧౯౦ |
| ఫ్రాన్సు | ౧౬౩ - ౬౮ ,, | |

సరుకులధర పడిపోవడంచేత పన్నులు, అప్పులు, హెచ్చుతగ్గులులేని తదితరఖర్చులు మొదలైనవాటి బరువు పెరిగిపోయినది. ధరలు ఏవిధంగా పడిపోయి

నవో ఈక్రిందిఅంకెలు చూస్తే తెలుస్తుంది. ఒకవస్తువు ధర ౧౯౨౯-వ సంవత్సరంలో ౧౦౦ రూపాయిలు అనుకుంటే తరువాతసంవత్సరాలలో ఈవిధంగా పడిపోయినవి. ధరలు దేశాలవారీగా క్రింద ఉదాహరింపబడ్డవి:

| దేశము | ౧౯౨౯ | ౧౯౩౨ మొదటి భాగం | ౧౯౩౨ రెండో భాగం | ౧౯౩౩ |
|---|---|---|---|---|
| గ్రేటుబ్రిటను | ౧౦౦ | ౭౫.౧ | ౭౨.౦ | ౭౦.౫ |
| అమెరికా | ౧౦౦ | ౬౮.౮ | ౬౫.౮ | ౭౦.౫ |
| ఫ్రాన్సు | ౧౦౦ | ౬౮.౭ | ౬౪.౦ | ౬౪ |
| జర్మనీ | ౧౦౦ | ౭౧.౩ | ౬౬.౮ | ౬౬.౮ |
| ఇటలీ | ౧౦౦ | ౬౮.౨ | ౬౪.౪ | ౬౪.౪ |

నిద్రపోతూన్న వ్యాపారం, పడిపోయిన ధరలూ లేవదీస్తేనేగాని తరణోపాయం లేదన్నారు. కానైతే చేతనైంది యింకోసభ చేద్దామన్నారు. నానాజాతిసమితివారు అంగీకరించినారు. రాబోయేసభ కర్తవ్యం ఏమిటేఅంటే పైన ఉదాహరించిన దుస్థితి తొలగించడానికి తరణోపాయం ఆలోచించడం. సభవారు తీర్మానించవలసిన విషయాలు ఇవి:

౧. ప్రస్తుతవర్తకమాంద్యానికీ, ధరల తగ్గదలకీ బంగారుమానము పడిపోవడం, తన్మూలకంగా వచ్చిన మారకపుకట్టుబాట్లు ఎంతవరకు కారణం?

౨. అంతర్జాతీయవ్యాపారంలో సుంకములు ఎంతవరకు కారణం?

౩. అనవసరమైన సరుకుల ఉత్పత్తి ఎంతవరకు కారణం?

౪. ఇవన్నీ సద్దుబాటుచేసి, సంప్రతించి, సర్వప్రభుత్వముల సమ్మతిమీద కొన్నియేర్పాట్లు చేసి వర్తకమాంద్యం తగ్గించడం.

సభాపతులంతా కార్యక్రమం ఈ క్రిందినివేదికలో సూచించినారు:

"మూడు సంవత్సరాలనుంచి ప్రపంచ-ఆర్థికవ్యవహారములు తారుమారై వర్తకవ్యాపారము చాలా దుస్థితికి వచ్చినది. అంతర్జాతీయవ్యాపారములలో ఎగుమతిదిగుమతులకు నిరోధములు, నాణెమానపు మారకపురేట్లు, అన్నీ కలిసి వర్తకమును చంపుచున్నవి. ఆదిలో ఎవరిపరిశ్రమలు వారు సంరక్షించుకుందామనే సముద్దేశ్యంతో నియమించినప్పటికీ, ఈకట్టుబాట్లవల్ల ప్రపంచము ఇంచుమించు ఆర్థికసంగ్రామంలోకి దిగుతూన్నది. కర్రలతో, కత్తులతోగాక ఆర్థికచట్టములతో ప్రభుత్వాలు పెనగులాడుతున్నారు. ప్రపంచ సౌభాగ్యానికి ఈచట్టములు అడ్డువస్తున్నవి. ఆర్థికవిషయములలో జాతీయభావముల తీవ్రత తగ్గిపోయినగాని దేశములు బాగుపడవు. ఈ చట్టములను మార్చి కొత్తచట్టములు ఏర్పాటుచేసే బాధ్యత ప్రపంచ-ఆర్థికసభవారిపైన వున్నది. ఆర్థికసమరము మానివేసినగాని శాంతి చేకూరదు. పరిస్థితులు ఇంకకొన్నాళ్లు ఇదేవిధంగా వుంటే మళ్లీ ఘోరయుద్ధం తప్పదు. ఈమాటు యుద్ధంలో మనుష్యజాతినాశనం అయినా కావచ్చును. అటువంటి మహాఆపద తప్పించవలసిన బాధ్యత ఈసభవారిది."

దేశదేశాలకు ఆహ్వానములు పంపినారు. అబ్బే! ఈ సభ వెనకటిమోస్తరుకాదన్నారు. అఖిలప్రపంచ-ఆర్థికమహాసభ అన్నారు. ఇంగ్లీషులో వ్రాసేటప్పుడు అన్నీ పెద్దక్షరాలు వ్రాయమన్నారు. కనలేదు, వినలేదు, మంచి తరుణము మించిపోవునన్నారు. మహాసభ కార్తిక్యం బ్రిటిషువారు. సభ లండనులో. కెన్సింగ్టన్ జియలాజికల్ వస్తుప్రదర్శనశాలలో దుమ్ము తుడిచి, బూజు దులిపి మహాసభకు సిద్ధం చెయ్యమన్నారు. పనివాండ్రు రాత్రింబగళ్లు విద్యుద్దీపాలమధ్య కష్టించారు. వివిధదేశాల అభ్యర్థులకు విడుదు లేర్పరచినారు. వారి ఆహారవ్యవహారాలేవో కనుక్కొని అక్కర్లేనివి విడిచిపెట్టి కావలసినవి వేయించుకుని, నెమ్మదిగా, సంతుష్టిగా భోజనం చెయ్యవలసినదిగా చెప్పమన్నారు.

నిజమే, ఇటువంటి మహాసభ ఇదివరకు జరగలేదు. ఏభై ఏడుప్రభుత్వాలు అభ్యర్థుల్ని పంపడానికి

ఒప్పుకున్నారు, ఎట్టిమిరపకాయరష్యాకూడా. నానా జాతిసమితి అంతాకలిసినా ఇంతలేదు. సభకానైతే మహాసభే.

జూన్ ౧౨-వతారీఖుప్రారంభము. మహారాజ రాజాధిరాజు, బ్రిటిషుసామ్రాజ్యచక్రవర్తి, పంచమ జార్జి సార్వభౌముడు ప్రారంభోపన్యాసం. ఉపన్యాసం రేడియోలో ప్రపంచంమూలమూలలలో మారుమ్రోగించినారు. "సర్వజాతులు సమావేశమైన ఒకమహాసభను ఒకమహారాజు ఆశీర్వదించినది మానవచరిత్రలో ఇది ప్రథమపర్యాయమని మావిశ్వాసము. ఇట్టిసభ కూడినందుకు మాకు సంతోషము. ఈసభకు జయమవుగాక యని మాయాశీర్వచనము. అఖిలజాతుల అభ్యర్థులకు మాహృదయపూర్వకమైన స్వాగతము. మా సామంతులైన అధినివేశస్వరాజ్యములకూ,మాహిందూదేశమునకు ప్రత్యేకస్వాగతము.

"మహాసభికులారా, మీకర్తవ్యము చాల గొప్పది. ప్రపంచక్షామము బాపడానికి చేరిన మహాత్ములు మీరు. నిరుద్యోగము, వర్తకమాంద్యము అనే మహాజాడ్యములు చికిత్సచేసి మానవజాతిని దురవస్థలోనించి తొలగింప ప్రార్థితులు. సంఘీభావముతో పని చేయవలసినదని హెచ్చరిక." అన్నాడు జార్జిచక్రవర్తి. ఫ్రెంచిఇంగ్లీషుభాషలలో చెప్పినాడు ఉపన్యాసం.

కాని ఇటువంటి దుస్సాధ్యమైన కార్యము కొనసాగించే సమర్థులెవరూ జీవించిలేరు. సభ సమావేశం కాకమునుపే పర్యవసానం తెలిసిపోయింది. ఈ సభకు విజయం చేకూరదని అందరకు తెలుసును. దీనికి కారణం విదితమే. యుద్ధసమయంలో ప్రభుత్వాలు ఒకరి దగ్గిర ఒకరు అప్పులుచేసినారు. అసలువడ్డీలతో అవి తడిసి మోపెడైనవి. ఆబరువుకి దేశాలు క్రుంగిపోతున్నవి. వీటికి షాహుకారు అమెరికా. చాలదేశాలు వారికే బాకి. ఈయుద్ధపుఅప్పుల విషయం చర్చించడానికే లాసేన్‌లో ప్రభుత్వాలు సమావేశమైనవి. ఆసభ ఇంకా ముగియలేదు. ఆసభనుంచే ఈ సభ వచ్చినది. అక్కడ వచ్చిన ప్రశ్న ఏమిటి అంటే, ఎవరు ఎవరికి ఏలోహంలో, ఏనాణెంలో, ఏమారకపురేటున, ఎంత ఇవ్వాలో తేలలేదు. ప్రపంచంలో వివిధద్రవ్యమానములు స్థిరపడితేనేకాని ఆసభ జయప్రదంగా కొనసాగదు. తీర్మానములు ఏలా చెయ్యడానికీ వీలుండదు. ఆవిషయాలన్నీ చర్చించి సమాధానపడడానికే ప్రపంచ-ఆర్థికమహాసభ ఆహ్వానించారు. ఈ సందర్భంలో ద్రవ్యమానములను గురించి కొంత తెలిసికోవలసి ఉంటుంది. వాటిచరిత్ర పరిశీలిస్తే మహాసభ భగ్నం కావడానికి కారణం బోధపడుతుంది.

ప్రస్తుతం ద్రవ్యమానంవిషయమై దేశాలు తబ్బిబ్బుపడుతున్నవి. బంగారుమానం వెండిమానం, అంటే, ఇచ్చిపుచ్చుకోవడంలో బంగారమేగాని పుచ్చుకోమనేవారు కొందరు, వెండిఅయినా ఫరవాలేదనేవారు కొందరు ఉన్నారు. కాని ఈమధ్య అనేకకారణాలవల్ల బంగారుమానానికి మర్యాద తగ్గుతున్నది. చాలాప్రభుత్వాలు బంగారుమానం విడిచిపెడుతున్నారు. ఈమానం తక్కినవారుకూడా విడిచిపెడతారా? లేక పట్టుపట్టి ఉంచుతారా? అని ప్రశ్న. ఆరు ప్రభుత్వాలుమాత్రం ఇంకా బంగారుమానానికి అంటుకొని వదలడంలేదు. వీరు ఫ్రాన్సు, హాలెండు, స్విట్జరులెండు, బెల్జియం, పోలెండు, ఇటలీదేశాలవారు. వీరంతా కలిసి పారిస్‌లో సభచేసుకుని బంగారుమానం తాము విడిచిపెట్టమని శపథం చేశారు. నేటి మారకపురేట్లు నాణెపు అసలువిలువకు వీలైనంతదగ్గరకు తెచ్చి, హెచ్చుతగ్గులు లేకుండా వ్యవహారములు జరుపుకుంటే వర్తకమాంద్యము పోవునని వీరి అభిప్రాయము. తమ సంఘీభావము ఎవరువచ్చినా భేదించలేరని వీరు చాటించినారు. ఈ బంగారుదేశాలకు తక్కిన వెండిదేశాలకు ప్రస్తుతం సంగ్రామం అన్నమాట. కాని ఒకసంగతి. యుద్ధానికి సామగ్రి అవసరం. ఈస్వర్ణపక్షకం లోకంలో పదింట నాలుగోవంతుబంగారం తమదగ్గిర నిలవ చేసుకున్నారు. తక్కిన ఆరుభాగాలూ మిగతదేశాలు పంచుకొన్నాయన్నమాట. ఈఆరుదేశాలదగ్గర ఉన్న బంగారంబరువు ౮౦౦౦ టన్నులు. దీని మేలిమి వెల ౧౦౦౦౦౦౦౦౦౦౦ పౌండ్లు. వీరివాదం ఏమిటంటే

వర్తకమాంద్యం పోవాలంటే సర్వదేశాలు బంగారుమానం అనుసరించాలి. మారకపురేట్లు మారకుండా స్థిరపర్చుకోవాలి. నాణెంలో ఉన్న లోహపుధరకు నాణెం చెల్లుబడిధరకు వ్యత్యాసం ఉండకూడదు. దాన్నిబట్టి మారకం నిర్ణయించుకోవాలి. ఇల్లా చేస్తే ధరలు హెచ్చుతగ్గులులేక నిదానంగా ఉంటవి. అంతర్జాతీయవ్యాపారం బాగుపడుతుంది.

కాని అమెరికానాయకత్వంకింద తక్కిన యావత్తు ప్రభుత్వాలూ వెండిమానంలో పడ్డారు. ఈ బంగారుమానానికీ ధరలకూ సంబంధం లేదని వారివాదన. బంగారుధర పడిపోవా లన్నారు. పడిపోతేనేకాని వస్తువులధరలు పెరగవు. ధరలు పెరిగితే వ్యాపారం దానంతట అదే సవ్యంగా జరుగుతుంది. గత పది పదిహేను సంవత్సరాలనుంచి ద్రవ్యమానపుచరిత్ర పరిశీలిస్తే పిల్లిమొగ్గలు దొమ్మరాటకింద ఉన్నది. ఒకటే హెచ్చుతగ్గులు. ఒకటే మార్పులు. యుద్ధానికిపూర్వం వివిధప్రభుత్వాల నాణెములమారకంలో హెచ్చుతగ్గులు ఉండేవికావు. సర్వత్రా బంగారుమానమే ఉండేది. మొత్తంమీద సరిగానే పనిచేసేది. బంగారమే అంతర్జాతీయనాణెపులోహం. ప్రభుత్వాల అప్పులు తీర్చడంలో బంగారమే ఒకరాజధానినుండి ఇంకోరాజధానికి ప్రవహించేది. వర్తకంలో ఏదేశానికైనా రాబడి ఎక్కువ ఉన్నప్పుడు, అనగా దిగుమతులకంటె ఎగుమతులు ఎక్కువ ఉన్నప్పుడు అధికముగా ఉన్న ఎగుమతుల ఖరీదు వారికిరాబడి. అది బంగారురూపంగానే వచ్చేది. ఏదేశంలోనైనా బంగారువిలువ ఎక్కువైనప్పుడు లోహంవిలువ తగ్గేది. బంగారువిలువ తగ్గితే వస్తువులధరలు హెచ్చేవి. దానితో వ్యాపారం బాగుగా సాగేది. వడ్డీధరలు పడిపోయేవి. వడ్డీ పడిపోవడంతోనే తక్కినదేశాలవారు తమద్రవ్యం పరాయిదేశాలకు పంపేవారు. ధరలు ఎక్కువగా ఉండడం చేత సరుకుల అమ్మదల తక్కువయేది. వ్యాపారం అన్నిదేశాలతో సరిమట్టానికి వచ్చేది. ఒకదేశాన్నిమించి మరొకదేశం వ్యాపారంలో విపరీతలాభంపొంది తక్కినవారికి నష్టం కలుగజేయడానికి వీలుండేదికాదు.

యుద్ధానంతరం బంగారుమానం విసర్జింపబడ్డది. చాలా దేశాలలో కాగితపురూపాయలు ఎక్కువైపోయినవి. ఈకాగితపుద్రవ్యం సృష్టించడానికి అసలు సూత్రం ఏమిటంటే, ఇంతబంగారం బొక్కసంలో ఉంటేగాని ఇన్నినోట్లు వెయ్యడానికి వీలులేదని. అవసరంపట్ల ఈ నియమాలు అతిక్రమించి నిలవ బంగారంకంటె ఎక్కువవిలువగల నోట్లు అచ్చువేశారు. గాలి పోసుకున్నట్టు కర్రెన్సీ పొంగిపోయింది. అచ్చుకొట్టడమే కనుక వీటికి తాకట్టుగా వుండవలసిన లోహాలు లేకుండానే కాగితపునోట్లు కట్టలుకట్టలుగా పెరిగిపోయినవి. వాటివిలువ తగ్గినది, ధరలు విపరీతంగా పెరిగిపోయినవి. కొన్నిదేశాలలో పాట్లాలు కట్టుకొనేస్థితికి వచ్చినవి. రాగిడబ్బు ఇస్తే ఒకానొకప్పుడు జర్మనీలో ఒకకట్టనోట్లు ఇచ్చేవారట.

ఏవిధంగానో ఇటువంటి ఆర్థికదుస్థితి సర్దుకొన్నది. ఇంగ్లండులో స్టెర్లింగుపౌండు అసలుధరకు మూడోవంతు పడిపోయినా ౧౯౨౫-వ సంవత్సరంలో మళ్లీ మామూలుధర అందుకున్నది. తక్కినదేశాలుమాత్రం కర్రెన్సీస్థిరపరచి ధరలు సర్దుపాటుచెయ్యలేకపోయారు. ఐనా ఏకష్టమో ఏనష్టమో భరించి మారకపురేట్లు స్థిరపరచుకున్నారు. కొన్నాళ్లు జరిగినవి. మళ్లీ ౧౯౩౧-వ సం.లో బ్రహ్మాండం తలక్రిందైనది.బంగారుమానం తోసిరాజన్నారు. ఎవరోకాదు! మహాపకార్లు బ్రిటిషువారు! ఎందుకంటే జాతీయప్రభుత్వపు పరిపాలనలో పౌండుధర మరీ నీచస్థితికి వచ్చి బొత్తిగా చచ్చిపోయినది. ౧౯౨౫-వ సంవత్సరంలో కష్టపడి పౌండుసమానధరకు తేవడంవల్ల నష్టం వచ్చిందని గ్రహించారు. అమెరికా, ఇంగ్లాండు ఆరాతీస్తే పౌండుకొనుబడిధర ౧౫ షిల్లింగులుమాత్రమేనని తేలింది. పౌండు ఒక్కింటికి ౪.౮౬ డాలర్లు మారకపురేటు నియమించారు. విజాతీయవ్యాపారంలో అమెరికావారు పౌండుఒక్కింటికి ౪.౮౬ ఇవ్వడంవల్ల అసలుధరకంటె ఎక్కువవిలువగల లోహంఉన్న నాణెం ఇచ్చినట్టుగా తేల్చినారు. ౪.౩ డాలర్లు అసలుధరఅయిన వస్తువులకు ౪.౮౬ డాలర్లు వారు ఇచ్చేవారు. తక్కు-

రణంగా ప్రియమైన బ్రిటిషువస్తువులు సకారణంగానే బహిష్కరింపబడ్డవి. ఎగుమతులు పడిపోయినవి. వర్తకము స్తంభించినది. ౧౯౩౧-వ సంవత్సరంలో పౌండు వెల లోహపువెలకు సమానంచేస్తేనేగాని వీలులేకవచ్చినది. పర్యవసానం ఏమిటంటే బ్రిటిషువారు బంగారు మానానికి హస్తోదకా లిచ్చినారు. ఇంకా కొన్ని దేశాలు కూడా ఇదేత్రోవతొక్కినవి. తన్మూలంగా ౧౯౩౩-వ సం.ము ఆరంభంలో ౪౫ ప్రభుత్వాలు బంగారుమానం విసర్జించినవారిలో లెక్కతేలినారు. లోకంలో బంగారమంతా అమెరికాఫ్రాన్సుదేశాలకి చేరింది. ఈ రెండు దేశాలలో కలిసి మూడింట రెండోవంతు బంగారం నిలువచేయబడినది. ఇంతలోహం వెనకఉన్నట్టి అమెరికాఫ్రాన్సునాణెమానములు సాధారణంగా దెబ్బతినవని లోకులు విశ్వసించినారు. కాని, ౧౯౩౩ లోగడ ఇంకోబాంబు పేలింది. ఇంతవరకు కనివిని ఎరుగని బంగారుముద్ద తమవద్ద నిలువచేసుకొన్న అమెరికా వారు బంగారుమానం విసర్జించినారు. దీనివల్ల వ్యాపారం బాగుపడి ధరలు పెరుగునని వారి నమ్మిక. ప్రపంచ-ఆర్థికమహాసభకు ఏర్పాట్లు అమెరికా బంగారు విసర్జింపకముందే జరిగినవి. ఏమిజరిగినా ప్రపంచమహాసభ సమావేశమయ్యేసరికి పూర్తిచేయవలసిన సమస్యలలో నాణెమానము ముఖ్యమైనదని తేలినది.

మహాసభ జూలై ౧౨-వ తారీఖు. మూడురోజుల తరువాత, అనగా జూలై ౧౫-వ తారీఖున ఇంగ్లాండు అమెరికాకు ఇవ్వవలసిన అప్పుచెల్లించడానికి వాయిదా. కాని సభాకార్యక్రమంలో యుద్ధఋణాలసంగతి లేదు. కావలిస్తే ఎవరన్నా ఆసంగతి మాట్లాడవచ్చును. చాలా మంది ఆశ్చర్యంగా కనిపెట్టుకొని చూసినారు. ఇట్టి మహాసభ తమరాజధానిలో జరిగేసమయములో అప్పు చెల్లించలేదనే అపవాదు ఇంగ్లాండు భరిస్తుందా, లేక చెల్లిస్తుందా ? బ్రిటిషుప్రధానమంత్రి రామ్సేమేక్డోనాల్డుగారు సభాధ్యక్షుడు ఏమి నిర్ణయిస్తాడో ఎవరికీ తెలియలేదు. అభ్యర్థులు దేశదేశాలనుంచి ప్రత్యేక విడుదులల్లో దిగినారు. లండన్ మహానగరమంతా కళకళలాడుతూ నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుంది. ఒక్క అమెరికాదేశమే ౪౬ ప్రతినిధులను పంపినది. సర్వదేశాల విడిదిలో బ్రిటిషుసారాయములు, ఆహార పదార్థములు అన్నీకూడా విరివిగా చెలామణి అయిపోతూఉన్నవి. టెలిఫోనుకంపెనివారికి క్షణం తీరుబడిలేదు. ప్రతినిధులు స్వదేశప్రభుత్వంతో చేసే సంప్రతింపులేకాదు, ప్రభుత్వాలు ప్రతినిధులకు పంపే ఫరమానాలేకాదు, వారివీరి రహస్యాలోచనలేకాదు, ప్రసంగాలు సముద్రాలుదాటిపోయినవి. మహాసభ అన్ని సభలకుమల్లేనే ప్రారంభమైంది. కాని ఒక్కవ్యత్యాసము. సభ సమావేశమై సమాప్తం కాకపూర్వమే పర్యవసానం హుళక్కి అని అందరికీ విదితమే. ఇంతలో జూన్ ౧౫-వ తారీఖు వచ్చినది. అమెరికాకు చెల్లించవలసిన అప్పు భారతదేశాన్ని వెండిలో చెల్లించమన్నారు. ఈవెండిబేరానికి అప్పులవారు అంగీకరించారు. భారతశాసనసభకుకూడా తెలియకుండా భారతీయప్రజల వెండి బొంబాయిరేవులో అమెరికాపడవ ఎక్కించారు. ఈ వ్యవహారంలో మనకు కోటిరూపాయలు నష్టమని ఆర్థికశాస్త్రజ్ఞులు అఘోరించారు. ఇది మనలో మనమాట. ఆర్థిక మహాసభమాత్రం లండన్‌లో ౪౫ రోజులు రాత్రింబగల్లు సమావేశమైంది. అన్నిసభల మాదిరిగానే సభ్యుల్ని భాగించారు, విభాగించారు. సంఘాలన్నారు, ఉపసంఘాలన్నారు. వెండి కోసంఘమన్నారు, మొండి కోసభన్నారు. అవితర్కం, అకార్యక్రమం ఇప్పుడనవసరం, వృథాప్రయాసం.

ఒక చిన్నసంగతి. ఏదో ఒకదేశపు అభ్యర్థిగడియారం ఆయనజేబులోనుంచి ఎవరో సంగ్రహించారట. ఆయన వెళ్లి సభాధ్యక్షుడు మేక్డోనాల్డుగారితో మొరపెట్టుకొన్నాడు. "దానికి నేనేం జేసేదయ్యా" అంటే "అల్లాకాదు, మహాప్రభో! నాపోయినసొత్తు నాకు అందజేస్తేనేగాని ఈసభ జయప్రదంగా కొనసాగటం దుర్లభం. ఎందుకంటారా, సభకు ముఖ్యం ఒకరిమీద ఒకరికి నమ్మకం లేకపోతే ఒకరిమనసూ నిబ్బరంగా వుండదు. ఈవేళ ఇదైంది, రేపు ఇంకొకటి అవుతుంది" అన్నాడాయన. వివాహసమయంలో అభాసుజరిగిన పెళ్లి

పెద్ద ముఖంలాగ మేక్డోనాల్డుగారు తెల్లబోయినారు. ఇంతలో ఇంకోఆయన లేచి పోయినసొత్తు అసలువారికి అందజేసేటందుకు ఒప్పుకున్నాడు. ఏవిధంగా, ఏంకష్టపడి ఆరాతీశాడోగాని పోయినగడియారంమాత్రం దొరికింది. ఉన్నరహస్యం ఏమిటంటే దొంగిలించినవాడిదగ్గర దొంగిలించాడీ పెద్దమనిషి. గడియారమాయనముఖం మాత్రం సంతోషంవల్ల చింకిచాటంతైంది. తరవాతేమీ చోరీ జరగలేదు. ఈవిధంగానే సభ సమాప్తానికి వచ్చినది. ఎవరికి ఏమి కావాలో చివరరోజుదాకా తెలియలేదు. ఎవరి ఉద్దేశ్యం వారు చెప్పి సభసమావేశం ప్రస్తుతం ముగించారు.

ఫ్రెంచి అభ్యర్థి బొనెట్టుగారు, "ఇప్పుడు మనం ఏదో ఒక తీర్మానానికి రాలేకపోయినప్పటికీ ఇకముందైనా అట్టి వీలుంటని ఈసభవల్ల తేలిం'' దన్నారు.

అమెరికాదేశీయుడు కాక్స్, "ఈప్రయత్నం మానేస్తే లోకారిష్టమే పర్యవసానం అని అందరి ఏకాభిప్రాయం. అప్పులసంగతి తేలితేనేగాని ఏతీర్మానం దుర్లభంకాబట్టి ముందు అది తేలుద్దా"మన్నాడు. ప్రపంచానికంతకీ కలిపి ఒకబ్యాంకి పెట్టవలసినదిగా సూచించినాడు.

రన్సిమన్ (ఇంగ్లండు), వ్యాపారనిరోధకరమైన చట్టములు తీసివేస్తేనేకాని క్షామం పోదని తేల్చినాడు.

డాక్టరు కాల్జిన్ (హాలెండు), మహాసభ వ్యర్థమన్నాడు. చేసింది ఏమీలేదు కనుక వృథాప్రయాసమన్నాడు.

సీనార్జంగు (ఇటలీ): "మహాసభకార్యక్రమం చూడగా ఇక ముందుముందు అంతర్జాతీయసహకారానికి మంచివీలున్నట్టు తేలింది. ఈలోపుగా ఎగుమతి దిగుమతిసుంకాలు, వేరువేరు నాణెమానములు ఉన్నంతకాలం సహకారం కష్టం. ద్రవ్యంవిషయంలో ఉన్న లోటుపాట్లు ప్రభుత్వాలన్నీ కలిసి సద్దుబాటు చేసుకోవాలి."

జర్మనీ అభ్యర్థి: (పేరు తెలుగులో వ్రాయడం కష్టం) "నిరుద్యోగపుసమస్య పూర్తిచేయడం ప్రధానం. జర్మనీ ఆర్థికసహకారానికి తోడ్పడడానికి ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నది."

జపాను: "సుంకాలుతీసివేసి వ్యాపారనిరోధం ఆపితేనేకాని సహకారం కష్టం."

రామ్సేమాక్డోనాల్డుగారు అంత్యోపన్యాసంలో సభ ఆటవిడుపుగాని ఆఖరుగాదు అన్నారు. జులై ౨౭-వ తారీఖు సాయంత్రం ౪-౩౦ గంటలకు సభ సమాప్తం. మళ్లీ ఎప్పుడు కలుస్తుందో ఎవరికీ తెలియదు.

మహాసభ సమాప్తమైన పదినిమిషాలకు సభాభవనంలో దాసీవాళ్లు ప్రవేశించారు. మహానుభావుల ఉపన్యాసరవములస్థానే దుమ్ముతుడిచే చీపుళ్లచప్పుడు వినపడింది. జులై ౧-వ తారీఖునే మహాసభకాళ్లు చచ్చుబడ్డవి. బంగారుమానపు దేశాలు తమశపథం నిజమన్నట్టుగా కార్యక్రమానికి అడ్డువచ్చారు. థియడోరు రూజువెల్టు, అమెరికాసంయుక్తరాష్ట్రముల అధ్యక్షుడు "నాణెమానములు స్థిరపడితేనేకాని కార్యక్రమం జరగడానికి వీల్లేదు" అన్నాడు. బంగారుమానపుదేశాలవారు బ్రిటిషువారిపై ఆగ్రహించారు. బ్రిటిషువారు తెల్లమొగం వేశారు. "ఇల్లంటించి దూరంగా నుంచుని మంటచూసి ఆనందిస్తున్నారమెరికావా" రన్నారు. ప్రపంచమహాసభ చచ్చిందని పత్రికాధిపతులు వ్రాశారు.

ఐతే కొండతవ్వి ఎలుకని బట్టినట్టు వెండి విషయంలో ఒక చిన్నసమాధానం ఏర్పరచుకున్నారు. బ్రిటిషువారుమాత్రం తమసామంతులతో అనుకూలమైన ఏర్పాట్లు చేసుకున్నారు. ప్రత్యేకసమావేశం ఏర్పరచి సామ్రాజ్యంలోవున్న కరెన్సీవ్యత్యాసాలు సద్దుబాటు చేసుకున్నారు. ఇది సభమర్నాడు,

అమెరికామాత్రం ప్రత్యేకంగా రూజువెల్టుగారి నియంతృత్వంకింద ఆర్థికోద్ధరణోద్యమం ఒకటి ప్రారంభించింది. వ్యాపారాల్లో పోటీలు తీసివేయడం, పనిచేసేగంటలు నూటికి పాతికచొప్పున తగ్గించడం, పనివాండ్లకూలి నూటికి ముప్పైవంతున ఎక్కించడం, వారానికి ౪౦ గంటలకంటె ఎక్కువ పనిచేయకుండా ఉండడం, వారానికి ౧౩ డాలర్లకంటె కూలి

తక్కువగా ఉంచక పోవడం, ఈఉద్యమం యొక్క ప్రధానాశయములు. ఆసాములుకూడా ప్రభుత్వంతో ఏకీభవించారు. నూటికి పదికంటె లాభం తీసుకోమన్నారు. పత్తి, బొగ్గు, మోటారు ఇత్యాదివ్యాపారాలన్నింటిలో ఇటువంటిషరతులే ఏర్పరచినారు. అమెరికాలో ఈ ఆర్థికోద్యమం ఇంకా సమాప్తంకాలేదు. దీని అభివృద్ధి పత్రికాముఖంలో రోజూ చూస్తున్నాము.

ఇంతకూ మనకూ, అనగా భారతదేశానికీ, ఈ సభకూ సంబంధం ఏమిటి అనే ప్రశ్న తోస్తుంది. నానాజాతిసమితిలో హిందూదేశానికి ప్రత్యేకస్థానం ఉన్నట్టుగానే, బ్రిటిషువారికి సంబంధించిన ప్రతిఉద్యమంలోనూ పేరుకి మనకుకూడా ఒకస్థానం ఉంటుంది. ఇక్కడనుంచి అభ్యర్థులు వెళ్లివస్తారు. ఉపన్యాసాలు కూడా చెపుతారు. వీరిమాటకు కాతరు ఏమిటి అంటే వేరేసంగతి. వీరు ప్రజాప్రతినిధులా, ప్రభుత్వప్రతినిధులా అంటే తప్పకుండా ప్రభుత్వప్రతినిధులే. మనకు ఏసభలో ప్రజాభిప్రాయం తెలియజేసే ప్రతినిధు లున్నారుగనుక?—అదేవిధంగా ఈ ప్రపంచ మహాసభకు కూడా ఇండియాప్రభుత్వంవారివల్ల పేర్కొనబడి, బ్రిటిషుపార్లమెంటువారిచే ఆమోదింపబడి మనదేశంనుంచి కొందరు సీమకు పోయివచ్చినారు. ఇండియాఅభ్యర్థులకు నాయకుడు పార్లమెంటులో ఇండియాకార్యదర్శి సర్ సామ్యూల్ హోరుగారు. తదితరులలో ముఖ్యుడు సర్ సి. పి. రామస్వామి అయ్యర్ గారు. జనాభిప్రాయంలో ప్రముఖు లింకెవరూ లేరు. ఆర్థికవ్యవహారాలకు సంబంధించినవారు ఈ ప్రతినిధులలో మచ్చుకైనా లేరు. ఛేంబర్ ఆఫ్ కామర్సులో ఈవిషయమై తీర్మానాలు చేశారుగాని లాభం లేక పోయినది. ఎవరో ఒక చిన్నకథ చెప్పినారు. లండన్‌లో సభ జరిగేటప్పుడు వీధిలో ఒక నీగ్రోమనిషిని కాపలా ఉంచినారట. వాడి ఆకారం చూసి ఇద్దరు తెల్లదొరలు ఒకరినొకరు చూచి నవ్వుకొన్నారట. ఆనీగ్రోమాత్రం నిశ్చలంగా, నిర్భయంగా వీళ్లనవ్వు లెక్కచెయ్యక "అయ్యా, ఇదేతోవ" అని చూపినాడట. అవును! ఎన్నిసభలు జరిగితేమాత్రం అతని కేంలాభం? అతని ఆకారం మారుతుందా? వీళ్లు నవ్వితే వాడికి వచ్చిన నష్టం ఏమిటి? మనస్థితి కూడా అంతే! ఊరుమీద ఊరుబడ్డా కరణంమీద కాసు పడదన్నట్టు ఇండియాదేశం ఏఅవస్థలో ఎంతకష్టం పడ్డా తక్కిన ప్రపంచానికి చీమనన్నా కుట్టదు. అల్లాఅని మనధోరణిలో మనం వుండడానికి వీలులేదు. తక్కినదేశాలలో, ముఖ్యంగా ఇంగ్లాండులో జరిగే మార్పులవల్ల మనకు అనేకకష్టనష్టాలు వస్తవి. ౧౯౩౧-వ సంవత్సరంలో ఇంగ్లాండు బంగారుమానం విడిచిపెట్టడంవల్ల ఈరోజువరకు భారతదేశంనుంచి ఎన్నికోట్లరూపాయల బంగారం వెళ్లిపోయిందో చెప్పనలవికాదు. ఇంకా ఈబంగారునది ప్రవహిస్తూనే వుంది. జీవనది కాదుకదా!

ఇంతద్రవ్యం ఖర్చుపెట్టి, ఇంతకష్టపడి ఇన్నాళ్లు చర్చించడంవల్ల ఎవరికి ఏంలాభం అంటే ప్రప్రథమంగా ఇట్టి మహాసభ సమావేశంకావడమే లోకానికి మంగళకరం. ఇది శాంతిసూచన. పూర్వప్రపంచంలో రాజ్యాలు జయించడానికి, జయించారన్నకీర్తి సంపాదించడానికి యుద్ధాలు చేసినారు. అలెగ్జాండరు, సీజర్, నెపోలియన్ ఇత్యాదిమహావీరులంతా రాజ్యకాంక్షవల్ల, కీర్తికాములై, దండయాత్రలు చేసి, యుద్ధాలు గెల్చి దిగ్విజయం చాటించారు. అనగా నాటియుద్ధాలు రాజరిక సంబంధమైనవని అర్థము. మధ్యయుగంలో మతమంటూ వచ్చింది. ఐరోపాఖండంలో నైతేనేమి, తూర్పుదేశాలలో నైతేనేమి మహమ్మదీయమతానికీ తక్కిన మతాలకూ వచ్చిన రగడలవల్ల ముప్పాతికమూడుపాళ్లు యుద్ధాలు జరిగినవి. కాంక్షకంటె మతప్రచారమే మధ్యయుగంలో యుద్ధకారణం. 'క్రూసేడ్సు' ఈ జాతిలోవే. ఆధునికప్రపంచంలో యుద్ధకారణం అర్థం—కాటిల్యుని అర్థం, మానవజాతికి ముఖ్యావసరములైన కూటిగుడ్డలకోసం. ౧౯౧౪ మొదలు ౧౯౧౮ వరకు జరిగిన ఐరోపామహాసంగ్రామానికి ఆర్థికసమస్యలే కారణం. వెర్సైలిస్‌సంధితో ఆమహాయుద్ధం ఆగిపోయింది. సంధిపత్రంలో వ్రాయించిన షరతులు తాత్కాలికంగా న్యాయమని తోచినప్పటికీ కొన్నిదేశాలకు అవి క్షేమకరంగా లేవు. ఆసం



౬. కంబోడియా ఉబ్బెత్తుప్రతిమ



౫. ఆదిమబౌద్ధులు
(క్రీ. శ. రెండవశతకపు అమరావతీశిలాశిల్పము)



౭. అవలోకితేశ్వరుని విగ్రహములోని యొక కాంస్యబింబము



౮. నిర్వాణము
(ఆస్కారు జె. డబ్ల్యు. హాన్సెనుగారి శిల్పము)

ధివల్ల లోకం రెండుభాగాలైంది- ధనవంతులూ, దరిద్రులూ. కొన్ని దేశాలకు ఒకటేదారిద్ర్యం, మరికొన్నింటికి ఒకటే ఐశ్వర్యం. నివురుగప్పిన నిప్పువలె అప్పుడుజరిగిన అన్యాయములే క్రమేణా రాజుకొంటూవచ్చి అంటుకోవడానికి సిద్ధమైనవి. ఏచెడ్డనక్షత్రంలో సమావేశమైనారో వెర్సేలిస్‌లో, ఆసంధి మొదలు ప్రతినిత్యమూయుద్ధభయమే. యుద్ధమాపడానికిఅప్పుడు స్థాపించిననానాజాతిసమితికూడా లేస్తే మనిషినికానన్నట్టుగా పేరుకేగాని అవసరంవస్తే పూర్ణానుస్వారమే. తీవ్రమైన జాతీయోద్యమము ఎవరిదేశంలో వారు వృద్ధిచేసుకోవడానికి ఈసమితిని ఒకదాన్ని అడ్డంపెట్టుకొన్నారు. దీనికెక్కడా తాడూ బొంగరం లేదు.

మొన్న ధిక్కరించి వీపావినమన్న జపానుదేశాన్ని ఈసమితి ఏంజేయగలిగింది? నిజంగా యుద్ధం చేద్దామని ప్రభుత్వాలకు ఉద్దేశ్యంఉంటే ఎంతోమంది అక్కర్లేదు. జపానువంటి సీమమిరపకాయ ఒకటిచాలు. రణభేరి మ్రోగిస్తే చేసేవాళ్లు లేరు. శాంతి శాంతి అని తహతహలాడుతున్నవి ప్రభుత్వాలు. మూతికాలినపిల్లులు. వెనకటిదెబ్బకే తట్టుకోలేకుండా వున్నారు. సోవియటు రష్యావారు, ఇటలీవారు ఈమధ్యనే సంధికుదుర్చుకున్నారు. ఫ్రాన్సుకూడా ఇంకోసంధి చేసుకున్నది. ఇవన్నీ యుద్ధంఆపుజేయడానికే. అమెరికాలో, ఇటలీలో, జర్మనీలో యుద్ధబలం వృద్ధిచేస్తున్నప్పటికీ, ఆప్రయత్నం యుద్ధంకోసం కాదని అందరికీ తెలుసును. ఒకవేళ యుద్ధంవస్తే సిద్ధంగా వుండడానికి, అవసరంవస్తే కాసుకునేందుకు అందరు తయారుగానే వున్నారు. కానైతే తమకుతాము చెయ్యిచేసుకోరు. సంధి, శాంతి అనేమాటలు నాలుకచివరనుంచి కాక హృదయంలోంచే వస్తున్నవి. ఒక్కజపానుమాత్రం చిందులుతొక్కుతోంది. ఢీఅంటే ఢీ అంటోంది. కాని ఎదురువుజ్జీ ఎవరూ లేరు. కొట్టకుండా తిట్టకుండా జపానులొందర అణచడానికి పాశ్చాత్యప్రభుత్వాలు ఉపాయం ఆలోచించారు. సుంకాలతో అరిగట్టి జపానువ్యాపారం నాశనంచెయ్యదలుచుకున్నారు. ఇన్నికష్టాలు పడుతున్నా ఇంతవరకు యుద్ధం రాలేదంటే, అది నానాజాతిసమితిప్రజ్ఞ కాకపోవచ్చు. కాని దేశాల అసమ్మతిమాత్రం నిజం. ఘోరయుద్ధాలు జరగవలసినచోట ఇప్పుడొక మహాసభ జరుగుతున్నది. పర్యవసానం అనుకూలమైనా కాకపోయినా లోకారిష్టంమాత్రం కాదు. యుద్ధాల స్థానే వచ్చిన మహాసభలలో ఈప్రపంచ-ఆర్థికమహాసభ ఒకటి. అందువల్లనే ఈసమావేశం లోకానికి మంగళకరం; శాంతిసూచన.



# శృంగారము

మల్లాది రామకృష్ణశాస్త్రి

సృష్టిక్రమాన్ని అనాదిగా బంధించుకువస్తూ, ప్రవర్తింపచేస్తూన్న సూత్రానికి రూపనిష్పత్తీ, నామకరణమూ చేసింది వైదికయుగము నాటి ఛాందసబుఋషులు. 'ఏకో దేవః సర్వభూతేషు గూఢః' అనే ఉపనిషత్సిద్ధాంతము ప్రతిపాదించక ముందు కల్పించుకున్న ధ్యేయమూర్తి, నిర్గుణపరతత్త్వము, వారు కల్పించుకున్న సంకుచితావకాశంలో ఉక్కిరి బిక్కిరి కావడం మొదలుపెట్టింది. అందుచేత ఆఏకైకమూర్తి విభావాంతరాల్ని పునఃపృథక్ ప్రతిష్ఠాపనావసరమందు, వెనుకటిమతాలన్నీ మార్చుకుని, వేర్వేరుదేవతలను వెలయింపవలసివచ్చింది . . ఆపనంతా, ఆర్యులు, ఉత్తరధ్రువప్రాంతాన్ని వదలివేసేనాటికే జరిగిపోయింది:

పుణ్యభూమియైన ఆర్యావర్తంలో స్వేచ్ఛగా విహరించడం మొదలుపెట్టినతరువాత, క్రమంగా, మంచుచేత కరడుకట్టుకునిపోయిన మనఃప్రవృత్తులు క్రమమైన రీతుల్లో వికసింప మొదలుపెట్టినవి: ఉద్దీపన వస్తుసామగ్రి అంతా ఉచితంగా అలవడటంచేత, దాంపత్యంవిషయంలో అదివరకు అనూచానంగా వస్తూన్న రాక్షసత్వాన్ని విస్మరించి, కోనలెత్తుతూన్న కోరికలతో లోకాన్ని చూడ మొదలుపెట్టినారు: మంచుతెరలు దాటిరాగానే, ఆర్యులు మనసులోనైనా ఎన్నడూ ఊహించని కొత్తప్రపంచములో జొరబడి, కొత్తచూపులతో నలువైపులా చూడ మొదలుపెట్టినారు. ద్యావాపృథివీల సహవాసాన్ని మన్నించి క్రమంగా ఇంద్రుడికి ఇంద్రాణీసాహచర్యమొనగూర్చింది ఈ అవకాశంలోనే:

లోకాన్నంతా అనురాగాంబుధి ఆక్రమించి వెల్లివిరిసిపోతూందని క్రమంగా గుర్తించగలిగారు: దేవతలయెడల భయమువిడిచి భక్తిశ్రద్ధలుమాత్రమే చూపడం సమంజసమని నేర్చుకున్నారు: తాము పరమావధి అని ఊహించి నిశ్చయించుకున్న ఆనందాతిశయాన్ని, తమ ఉపాసనామూర్తులకు అందుబాటులో ఉండేటట్టుగా చేశారు: అప్పటినుంచే, అదివరకు పనిపాటలు లేకుండా యోగనిద్రపోతున్న ప్రజాపతి 'బహుస్యాం ప్రజాయేయ' అని ప్రయత్నించడం మొదలుపెట్టినాడు: రుద్రుడు క్రోధాన్ని చాలావరకూ ఉపసంహరించుకోవలెననీ, సవితృమండలమధ్యవర్తి అయిన నారాయణుడు చల్లబడవలెననీ తంటాలుపడటం ప్రారంభించినారు:

సతీయుతులై గార్హస్థ్యధర్మాల్ని అవిచ్ఛిన్నంగా అనుభవిస్తూన్న భక్తులకు, దేవతల కఠినబ్రహ్మచర్యం చాలా కష్టమనిపించింది:—ఒక సుముహూర్తాన ముఖ్యదేవు లందరూ పెండ్లికొడుకు లైపోయినారు: లోకక్రమాన్ని బంధించుకునడుపుతూన్న శృంగారసూత్రమే బంగారుజన్నిదముగా వెలసినది: రౌద్రానికి ఉండే ప్రాముఖ్యము పోయి, సాత్త్వికభావోదయమైనది:

భర్తఅనే అన్వర్థాభిధానం కలవాడు-పురుషుడు: ప్రకృతిని తరతరాలనుంచీ, విసువులేకుండా-విధిలేక-మోసుకుని వస్తున్నాడు: బరువైనప్పటికీ భరించక తప్పినదికాదు. ఆభారంతో క్రుంగిపోతూన్నాడనే, భక్తులెవరూ ప్రకృతిపురుషులజోలికి పోరు: ఈవిషయం గమనించి,ప్రకృతి, తానే పురుషుణ్ణి వహిస్తున్నానని కొంటెవేషం వేసినా, యథార్థస్థితిని ఎరిగినవారు గనుక, భక్తులైన భర్తలు ఎవరూ, ఆఉపాసనాపద్ధతికి అంగీకరించరు: ఎంతోసదుపాయంతో, అర్చనకు సిద్ధం చేసేటప్పటికి, చివరకు తయారయిన క్రమం-వీరశైవం-అధోకొత్తప్రపంచకం-ఆబీభత్సశృంగారం సామాన్యులు భరించలేరు:

పురాణకాలంనాటికి, వేదాలమీద సాపుగా తెరకప్పుకుపోయింది: మానవులకూ, దేవతలకు బాగా

జోస్తీ కలిసింది: ఒకరిఇంటిగుట్టు ఒకరు తెలుసుకోవడం, ఒకరి వ్యవహారాల్లో ఒకరు జోక్యం కలిగించుకోవడం-చివరకు సంబంధబాంధవ్యాలదాకాకూడా వచ్చింది. ఎవరో బుద్ధిమంతుడు, దేవలోకంలో జనాభా పెరిగిపోతే తంటా వస్తుందని నిత్యయౌవన మూర్తులు, ఎప్పుడూ కనిపెంచడానికి వీలుంటుంది కనుక:—(అన్నం నిద్రా లేకుండా, అమృతంత్రాగే అనిమేషులైనా, ఉండటానికి చోటు చాలక, క్రింది లోకాలకు వలసవస్తారేమోనని) పార్వతీశాపరూపాన, దేవకామినులందరికీ ఒకేమారు వంధ్యాత్వం కలిగించాడు: గ్రహచారవశాన ఆదోసగు పార్వతికికూడా అంటుకున్నది - కన్నబిడ్డ లిద్దరినీకూడా-తాతిలోంచీ రెల్లులోనుంచీ తప్ప - కడుపునకన్న పాపాన పోలేదు:

పార్వతీపరమేశ్వరులదాంపత్యం, అన్నియుగాల వారూకూడా అనువుగా అన్వయించుకుని అర్థంచేసుకునేందుకు వీలుగాఉంటుంది.

పార్వతి, కుబేరతుల్యవైభవుడైన హిమవంతుడి గారాబుకూతురు. అతిలోకమోహిని అయిన మేనక ఆమెతల్లి : చక్కదనమూ, అభిజాత్యమూ, సద్గుణసంపన్నతా ఉన్నా, ఆపిల్లకు ఎక్కడా మంచిసంబంధము దొరకలేదు. విశేషము ఏమిటంటే, హిమవంతుడు అంతకుపూర్వం, పెద్దకూతురు గంగను సముద్రుడికి ఇచ్చి వివాహంచేస్తే, ఆమె ఆతన్ని కాదని ఎప్పుడూ ఇంటిపట్టున ఉండకుండా - ఎవరు చెప్పినమాటా వినకుండా - మూడులోకాలూ తిరుస్తూండేది. అందుచేత విధిలేక, రెండోపెళ్లి వాడికి - శంకరుడికి - ఇవ్వవలసివచ్చింది. నిలువ నీడలేక, కట్ట బట్టలేక ఉన్న సర్వశూన్యుణ్ణి హిమవంతుడు జామాతగా స్వీకరించాడు. తన రాజధానిలోనే, కైలాసంమీద కాపురముపెట్టాడు. కాని ఆకాపురము! ఆమెపరివారజనము వేరు, భోజనము వేరు, వాహనము వేరు: దిగంబరిఅయిన మగని సాహచర్యం గిట్టక ఎప్పుడూ భక్తులయిండ్లలో హాయిగా పూజలందుతూ, యిష్టంవచ్చినప్పుడూ . . ఎన్నడో . . యిల్లుజేరుకుంటూండేది. శివుడు భిక్షాశనుడై. . శ్మశానాల్లో సంచరిస్తూ ఏకాంతవాసం చేస్తూండేవాడు: తీరిక అయినప్పుడు, సాయంసమయాల్లో చంద్రుడు, ఆతనితల తడవి తాపోపశమనం చేస్తూండేవాడు: కొంచెం గౌరవం చూపిస్తే నెత్తికెక్కే గయ్యాళి వదినెగారివల్ల ఆతని కేవీ ఉపచారాలు కలిగేవి కాదు: ఎవరితో చెప్పుకునేందుకూ మనసొప్పక, కష్టాలు మగచిపోవడానికి తాండవలీలావినోదు డౌతూండేవాడు. మరీ మనసు చలించినప్పుడు . . దారుకావని స్త్రీలు, మోహిని మొదలైన అసందర్భపుశృంగారము ప్రవర్తిల్లచేస్తూండేవాడు:

ఇక బ్రహ్మవిషయం — ముదిమదిలేప్పినముసలి వకుగని . . కన్నె లెవరూ దరియరాకపోవడంచేతనూ, ఎవరూ ఆతని వివాహప్రయత్నము చేయకపోవడంవల్లనూ . . ఏమైతేనేమని తెగించి, కన్నకూతురిలాగా పెంచుకుంటూన్న కన్నెమీదనే కన్నువేశాడు: 'తలలో నాలుకగా' మెలగుతుందనే ఆతని ఆసలన్నీ వ్యర్థపరచి, వాణి, అతనివంకైనా చూడకుండా సంచరిస్తూన్నది: పైగా ఆమెకొంటెతనానికి అంతులేదు: అనాదిసిద్ధంగా ఉన్న ఆతని ఆసనం - సితపుండరీకం - తాను లాక్కున్నది: ఆతని వాహనమైన హంసచేత ఊడిగము చేయించుకుంటూన్నది. 'నాలుగుమోము లన్ నిగమనాదము లుప్పతిలేటప్పటికల్లా, కచ్ఛపికి శ్రుతి ఎక్కువచేస్తుంది. ఈ గొడవంతా కనిపెట్టే, వాణీవిషయికంగా—'యా స్థవిరం ప్రహసంతీ కవికుల వదనాంబురుహ బద్ధనివేశా'. . అని అధునాతనులుకూడా ముచ్చటించి నవ్వుకుంటూంటారు. సంతానవిషయంలో ఈదంపతులదికూడా విచిత్రయోగమే - పితామహుడికి వివాహము కాకముందు కొందరు మానసపుత్రు లుద్భవించారు. వాణికి, సంతానవాంఛకుకాని, ప్రాప్తికికాని అవకాశాలు లేవు: ఎన్నియుగాలు గడిచినా ప్రథమ యౌవనంలోనే వుంటుంది — ఎన్నడూ ఇనకరస్పర్శ సోకనిపాపాన:

—నల్లనివరుడు దొరికినదే తడవుగా, వేరే ఏమీ విచారించకుండా, పిల్లనిచ్చి కృతార్థతనందినా ననుకున్నాడు సాగరరాజు: శంకరుడిమీద కొంత కాలం మోజుఉండేదేమో కాని, ఇల్లు తెలుపు, ఒళ్లు

తెలుపూ - అల్లుడుకూడా తెల్లనివా డైతే బాగుండ దని, నీలమేఘశ్యామునకే లక్ష్మిని కన్నెధారపోశాడు. ఎంత అనుకూలవతి యైనా, తనపుట్టినయింట తిష్ఠవేసు కుని కూర్చున్న మగనిమీద భార్యలకు గౌరవం ఉండ టం చాలాకష్టం: అదీగాకుండా, గారాబాన పెరిగిన పిల్ల కావడంచేత ఒకచోట కాలునిలువదు. ఎక్కిన గుమ్మం ఎక్కకుండా, ఎవరినీ లక్ష్యపెట్టకుండా చరి స్తూంటుంది — తానుపుత్రవతి కాకపోయినా, అలా యిదాగా ఏర్పడ్డకోడలు — సరస్వతి—మీద అధికారం చెలాయిస్తూఉంటుంది: అత్తగారి కోరంటికానికి ఆమే జగత్తుకంతా ఆదర్శం. కామదహనం జరిగినప్పుడు కూడా . . అందరూ జ్ఞాపకం చేసి హెచ్చరిస్తేనే కాని, ఆమెకు కంట నీరు రాలేదు:

—త్రిమూర్తులలోకి విష్ణువే చాలావరకూ శృంగార పురుషుడు: ఆతడు తీసుకునివచ్చే చాడీలకు అంతు లేదు: అతిలోకకాముకు డవుటచేత వేషంవిషయంలో చాలాజాగ్రత్తగా ఉంటాడు. ఎప్పుడూ మాపుకనబడని పట్టుబట్టలు కట్టుకుంటూ వయసు తెలియకుండా, శ్మశ్రువులను విసర్జించి, స్త్రీలనూ పురుషులనూ కూడా సమానంగా తనియించడానికి ప్రయత్నిస్తూంటాడు: ఆడవేషం వేయడానికి అనువైన దేహసంపద కలిగినవా డీతడొక్కడే: శృంగారాలవిషయంలో, లభికన్న కడగండ్లే ఎక్కువపడటం అలవాటయిపోయింది. తన్ను ధిక్కరించిన నాయికలవిషయంలో భక్తుడిలాగా తయారయే రసికవతంసుడు: ఎన్ని అవతారములు ఎత్తినా, విధిలేక తనతోకూడా రూపాంతరములు పొందుతున్న లక్ష్మినేతప్ప వేరొకకన్నెను వలపించ లేకపోతున్నాడు: గజేంద్రుడు వేయివర్షములు మొర పెట్టగా - కదలలేక, విని ఊరుకుని - చివరకు ధిక్క రించడం మొదలుపెట్టేటప్పటికి, ఇక గత్యంతరము లేక, బయలుదేరివచ్చిన పరమకారుణికుడు: అదే ఆతడు కాలు క్రిందపెట్టడానికి మొదలూ చివరాను: శేషుడిమీదనుంచి గరుడుడిమీద అధిరోహించడమే తప్ప ఎన్నడూ నాలుగడుగులు నడచినపాపాన పోలేదు: అందరు దేవులకన్నా మందివాహనము, ఆయుధాలూ ఉన్నా ఆఅలసత్వం మరెవ్వరికీ లేదు . . పనీ పాటా లేకుండా . . 'కలశపయోధిమీద తరగల్ మరి హోయని మ్రోయ, వేయుభంగుల తలపాన్పు పాము బుసకొట్టు' తూన్నా లక్ష్యపెట్టకుండా, యోగనిద్ర అనే వంకతో కదలకుండా పడుకునే నిశ్చలు డీతడు: లక్ష్మికి ఇదంతా సరిపోక, విడిగా కాపురం ఏర్పరచుకున్నది:—ఇంతవరకూ బయటికి రాకుండా గుప్తంగా ఉన్న ఆమెచీకటితప్పును — బాణకవి బయటపెట్టాడు: కాని, అడిగినవారికి లేదన కుండా వరాలిచ్చే విశ్వదాత్రి అని, ఆకళంకాన్ని ఎరుగున్నవారందరూకూడా మరచిపోవాలని ప్రయ త్నిస్తూంటారు:

ఇంద్రుడిప్రాంతాలకు వచ్చేటప్పటికి - పురాణ యుగంలో తొణుకుతూన్న శృంగారం, ఉచ్ఛృంఖల వృత్తిలో విజృంభించింది: వైదికయుగంలో శచీపతి దుర్నిరీక్షుడుగా ఉండేవాడు: ఆలాటివాడికి రసమయ జగత్తులో అనువైన స్థానం కల్పించాలనేటప్పటికి, యావదార్షధిషణాసంపత్తికీ ఘట్టిపని తగిలింది: ఋగ్వేదకాలంనాటి ఇంద్రాణితోనూ, కుమారుడు జయంతుడితోనూ, సంసారపక్షంగా ఆతడు కాలం గడుపుతాడని వా రెన్నడూ అనుకోలేదు: అందుచేత ఆతని తృప్తికోసం, ఊహలకు అలవియైన శృంగార విలాసాల్ని కల్పించి అంటగట్టారు. నందనవనికా విహారధీరుణ్ణిగానూ, 'అఖిలోప్సరోంగనా విటుణ్ణి'గానూ చేయకుండా ఊరుకోలేకపోయినారు: క్రమంగా, ఆవర్ణనాతీతమైన వైభవం సామయాచారిక మైపోయింది: త్రిదశులందరిమీద అధికారము . . రాక్షసబాధ లేనప్పు డల్లా చెలాయిస్తూఉంటాడు. బలవంతుడైన పగతుణ్ణి స్వాధీనంచేసుకునేందుకు, స్త్రీజనాన్ని ప్రయోగించ డం అనే అమోఘమైన ఉపాయాన్ని కనిపెట్టింది మొదట ఇంద్రుడే.

దేవతలుమాత్రమే ఏకధాటిగా అచ్చరల నందరినీ అనుభవించడం చూడలేక, తరువాతిమహర్షి ఎవరో, మానవులకుకూడా హక్కు ఏర్పరచాడు: రంభమీద

ఆసతోనైనా—అసలు లోకమంగళార్థము - క్రతు
వులుచేసి తరిస్తారని ఆతని ఆశయము. కాని, వాన్ని
మన్నించకుండా, హద్దు మీరిపోయి - ఏతంటాలోపడి
వందక్రతువులు చేసి ఇంద్రుణ్ణే పదభ్రష్టుణ్ణి చేద్దామని
కొందరు బుద్ధిమంతులు తలపెట్టేటప్పటికి గట్టిచిక్కు
వచ్చింది. ఇంద్రుడుకూడా భయపడి, ఋషులతో
వరీకుఅయి, తనపదవిని ఎవరైనా వాంఛిస్తున్నారని
తెలియడంతోనే, హాజరులో ఉన్న అప్సరలను వాళ్ల
మీదికి తోలడం మొదలుపెట్టినాడు: తరువాత—
'స్వర్గకామో యజేత' అని సాక్షీచేసినా . . కొందరు
సోమయాజులనైనా రంభాదులను వరియనీయక తప్పింది
కాదు. కాని యవనులధాటితో, సోమయాజులకు పర
మందైనా, శృంగారరసానుభూతికి అవకాశం లేకుండా
పోతున్నది: రతిపతికి సెలవైనా, త్రిదశధామముకూడా
గగ్గోలుపడిపోతూన్నది. అక్కడకూడా శాంతి లేదు:
అచ్చరలు అనువైనవారికైనా అందుబాటులో
లేరు. అందుచేతనే శతమన్యుడు అడపాదడపా,
అనువుకాని విరహాంబుధిలో మునిగి తేలుతూ,
భూలోకంలో రాచకన్నెలకు కబురులంపుతూ ఉం
టాడు. చివరకు, తెగించి దమయంతిని వివాహంచేసు
కుందామనికూడా ప్రయత్నంచేసి ధోకా తిని అంత
టితో విరమించి ఊరుకున్నాడు: ఛాందసకల్పితములైన
శృంగారవైభవములన్నీ ఈవిధముగా స్వప్నగతతుల్యాము
లైపోవడంచేత . . ఇంద్రుడు గత్యంతరము లేక . . కాము
కత్వానికి రాజీనామాఇవ్వ లేక . . మన్మథుడిచేత . . ఆత
నికి వీలైనప్పుడు, 'కా మేకపత్నీవ్రతదుఃఖశీలాం...
నితంబినీ మిచ్ఛసి ..' అని బింకంగా అడిగించుకుని వలసిన
సాహాయ్యం పొందుతూఉన్నాడు : 'బంగారువంటి
కోమటి సంగీతముచేత బేరసారము లుడిగెగా' అన్నపద్ధ
తిని . . శతమన్యుడు, ఈ రసాభాసవశంచేత, తొల్లిటి
వైభవమంతా కోల్పోయి,హాస్యాస్పదుడైపోయినాడు:
దొంగప్రొద్దున కోడికూత కూయవలసినఅగత్యం . . తనకు
దాసోహం అంటూఉండే గౌతముడిచేత శపించబడటం,
మొదలైన తలవంపుపనులు అనేకం జరగడం సంభవిం
చింది: పోనీ ఈ నీమాజామా అంతా వదలివేసి, వెనుకటి
లాగా దుర్జ్ఞేయుడుగా తయారవుదామన్నా, ఆనాటి
జవసత్వాలుకాని . . దబాయింపుపోకడలుగాని లేవు . .
బొత్తిగా ఎన్నడూ వాడకుండా మూలనుంచడంచేత
దంభోళి తుప్పుపట్టి పనికిరాకుండాపోయింది: క్రొత్తది
తయారు చేయించుకునేందుకు దధీచితుల్యు లెవరూ
అవతరించడం లేదు: శరీరం వజ్రకాయం చేసుకుందా
మన్నా అశ్వినులకు కూడా నిదానం చిక్కని క్రొత్త
ఆమయములు — బహుశః భూమ్యాదిలోకములనుండి
రవాణాఅయినవి — ఆతన్ని అంటిపట్టుకుని వదలనం
టూన్నవి: కనుక ఇంద్రుడు . . నిత్యయౌవనులైన త్రిద
శుల్లోకల్లా చాలా దురదృష్టవంతుడు:

విష్ణువు తరతరాలనుంచీ వస్తూఉన్న అపయశ
స్సును బాపుకోవడానికి కృష్ణుడుగా అవతరించాడు:
అవతారములకాలమునాటికి మానవజగత్తులో దేవతలంటే
భక్తిమాత్రమేకాకుండా మర్యాదాకూడా సాఫుగా అం
తరించిపోయింది. అందుచేతనే కృష్ణావతారానికిముందు,
నారాయణుడు అనేకబాధలు పడితేనేగాని - భృగు
శాపమూ, వామనాదిరూపములూ ఇత్యాదులు - కృష్ణ
డుగా అవతరించడానికి అవకాశము లేకపోయినది.
కనుకనే, ఇకముందైనా, అవిచ్ఛిన్నంగా విహరించ
డానికి వీలుంటుందని, పోటీలేకుండా యాదవకులంలో
ఉద్భవించడానికి నిశ్చయించుకున్నాడు: కులంవారిలో
ఆతడుతప్ప అందగా ళ్లెవరూ లేకుండాఉండేటట్టు
చూసి :

అప్పుడైనా అలౌకికచర్యలతో తోటివారిని
విభ్రమంలో ముంచి, తాను సామాన్యమానవుడు
కాకుండా దివ్యమూర్తిఅనే ఊహకలిగించి, అపార
వశ్యమునుంచి వాళ్లందరూ తప్పించుకొనేలోగా తన
కోర్కెలన్నీ తీర్చుకున్నాడు: ఏదైనా చిలిపిపని చేసి
నప్పుడు ఎవరైనా గదమాయించిఅడిగితే ఐంద్రజాలికుడు
లాగా తయారై - నోటిలో చరాచరభూతజగత్తునంతా
మెరపింపజేసో, లేక అదీ చాలనప్పుడు, వైకుంఠంలో
వచ్చేటప్పుడు భద్రంగా దాచుకువచ్చిన అలాయిదా
చేతులు రెండూ, వాటితాలూకు ఆయుధాలూ తటా

లున సాక్షాత్కరింపచేసో, అంతకూ మీరినప్పుడు, విశ్వరూపంచూపింపో తప్పించుకుని బయటపడుతూండేవాడు. దర్జాకు లోటులేకుండా, (సరియైన జవాబు చెప్పడానికి ఎక్కడా అవకాశం లేదుగనుక) పేచీ లేకుండా ఆతను సాక్షీగా నెరవేర్చినకార్యము ఒకటి లేదు: వేదాంతధోరణిలోకి దించకుండా వలపించిన కాంత ఒకతె లేదు: రాజకీయాల్లో ఉల్లాసీదాలు కొట్టించే ఎత్తులు మొదట లోకానికి నేర్పినది ఆతడే:

కృష్ణావతారము, ఛాందసుల శృంగారకల్పనలకూ, అనుభవాలకూ పరమావధి అని ఎన్నుకొనవచ్చును. లోకమంతా కృష్ణలీలలతో-శృంగారకలాపములతో నిండిపోయినది. దేవతలందరికీ, నాయికల విషయంలో సారళ్యంనడుపుతూ సంధానకుశలుడైన మన్మథుడు, కలియుగానికి స్వాగతం ఈయడానికి భూమిమీదకు వచ్చిన వెన్నదొంగకు అపత్యస్థానం ఆక్రమించి, ఆతనిసట్టు ఇతరులు తెలుసుకోకుండా-కనుసన్నలమేరనే ఇంగితాన్ని గ్రహించి కార్యములు చక్కబెడుతూండేవాడు. లోకులందరూ, కృష్ణుడు విష్ణ్వంశసంభూతుడని, సాక్షాత్తు విష్ణువే అన్న అంశాన్ని విస్మరించకుండా, దేవతలు ఏదోపని కల్పించుకునివచ్చి, అందరికీ వినబడేటట్టుగా స్తోత్రంచేసి తిరిగి వెళ్లిపోతూండేవారు: అదీ చాలనప్పుడు, శిలావర్షము, దానికిగాను గోవర్ధనోద్ధరణమూ మొదలైన బనాయింపు పనులు జరుగుతూండేవి.

కృష్ణుడు స్వైరవిహారం చేస్తూండే రోజుల్లో మానసికంగానైనా ఆతన్ని వరించని మగనాలుండడానికి వీలులేకుండాపోయింది. ఇక కన్నెలసంగతి చెప్పనక్కరలేదుకదా! ఎందరు భార్యలు! ఎన్నిరకముల వరుసలు! ఎందరు ప్రియురాండ్రు!

'దేవతలు చేయుతప్పులు దివ్యకథలు'అన్నదానికి తార్కాణంగా, కృష్ణుని జారకృత్యముల డైరీలుగా భాగవతాదికములు తయారయినవి. గుట్టుకోసం తరువాతిమహానుభావులు, యమునాతీరాన ఏకాంతంగా, నాయికలవేటకు బయలుదేరే శృంగారశేఖరుణ్ణి పట్టుకుని 'వేదాంతవీథుల విహరించుచున్నాణ్ణి'అని ప్రతిష్ఠ కాపాడటానికి చూసినా, ఏపరీక్షిత్తులాటివాడో, నిలవేసి, ఏమి టీగలభా అంతా నని నుచ్చి అడిగేటప్పటికి, శుకుడుకూడా సమర్థించలేక నీళ్లునమలి ఊరుకోవడం సంభవించింది: ఏతన్మూలకంగా, 'రతి'కి నిరతికిమించిన అర్థము చెప్పకూడదని అనుశాసించడం మొదలుపెట్టిన వైదికమూర్తుల వేదాంతపు చిలిపితనంవల్ల, 'వల్లవీచక్రమకరీమకరాలయు'నికి కొంతకాలంవరకూ కోర్కెలు తీరకుండా వచ్చినవి: ఉపనిషన్మథనువులో పడిపోయి, ఈగెలాగా కృష్ణుడు-భాగవతంలో కృష్ణుడు,-కలియుగాదిని అవతారం చాలించుకున్నాడు:

కాని అక్కడితో అది తీరిపోలేదు: రామానుజమతాంభోరాశి, చైతన్యచంద్రోదయంతో అతివేలమైపోయింది: అప్పటికప్పుడే బ్రహ్మాండపురాణం కృష్ణుని పునరుజ్జీవితుణ్ణి చేసి, రాధతో వరుసకలిపి, మహత్తరమైన ప్రచారం మొదలుపెట్టింది: భాగవతకాలంనాడు జరుగని మర్యాదలు వైష్ణవసంప్రదాయమూలకున జరుగుతూన్నవి: ఈమారు స్త్రీలే కాకుండా పురుషులుకూడా రాధాలోలుడికి లోకువఅయిపోయినారు: రూపగోస్వామి, బృందావనంనుంచి, లోకంలో కృష్ణుడుమినహా మొగపురుగు లేదనీ, అందరూ ఆతనికి లోకువ అయిన ఆడవాళ్లేనని సిద్ధాంతం చేశాడు: ఆపిచ్చ పట్టించుకుని, తెలుగుబ్రాహ్మణుడు వల్లభాచార్యులు పక్కతాళం వేయడం మొదలుపెట్టి, వేదాంతశాస్త్రమంతా తల్లక్రిందులు చేసేశాడు: నారాయణతీర్థులు, యతిఅయిఉండీకూడా, మతి మార్చుకోలేక, బృందావనానికి, బృహదారణ్యకానికి సంబంధం కల్పించి, కృష్ణున్ని వ్యత్యస్తపాదారవిందుణ్ణి చేసి ఆరెండుచోట్లా అహోరాత్రములు పట్టువిడవకుండా నృత్యంచేయించాడు: కాని, ఏంప్రయోజనం! ఎరుగున్నవారెవరూ, నందకిశోరమూర్తిచర్యలు చూసి, విని, నవ్వి ఊరుకోవడమేకాని, అంతకుపైకి పోవడం లేదు: భక్తులనుకునేవాళ్లయినా, జలసాలసంపిణీ మీద ఉత్సవాలుచేసి తామకూడా పండుగచేసుకుం

టున్నారుకాని, ఆరాధనాతత్పరులు కావడం లేదు - అందుకు అవకాశం లేదు:

కృష్ణావతారాన్ని మించిన కల్పన ఇంతవరకూ మళ్లా ఏదీలేదు: కారణం, అంతకుమీరిన ఊహలున్న వాడు, మతాచార్యుడు ఉద్భవించకపోవడమే:

నిజంగా, ఇంద్రవైభవంతో సాటివచ్చేదికాదు, కృష్ణుడి కలాపమంతా: కాని, దేవరాజు స్వర్గంవిడిచి వచ్చి, నరరూపం తాల్చి, భూలోకం విహారస్థానంగా చేసుకోకపోవడంచేత, ఆతనికి అంత ప్రాముఖ్యం రాలేదు:

ఛాందసుల శృంగారకల్పనలన్నీ ఈరీతిగా, చివరకు పరిహాసాస్పదములుగా పరిణమించినవి. అందుచేతనే గురుతెరిగినవారందరికీ, శైవం ఆలంబనమైంది: కాని దానికి, వైష్ణవానికి వచ్చినంత ప్రచారం రాకపోవడానికి కారణం లోకుల అలసత్వమే: పురుషులకు, ధీరులకు అనువైన అనుష్ఠానయోగ్యత ఉన్న పంథా అది: వైష్ణవగుణానుసంధానంచేత, తమప్రకృతినే విస్మరించి, కృష్ణునే నాథుణ్ణిగా భావించేవారందరికీ అది అందుబాటులో లేకపోవడం సామాన్యవిషయమేకదా! కలియుగం ప్రథమపాదమన్నా సమాప్తి నందకముందే జవసత్త్వము లుడిగిన జాతులకు, అది ఏలా ఆచారమత మవుతుందీ!

---

# మా ల తి

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

పవన!

చిగురుగుబురుల నోదిగి సేదగొని నిదురించి
ఉన్నయటు చించుకొని యులికిపడి మేలుకొని
దొంగపాటున నెపుడో ? చెంగుచెంగున దుమికి
నవమధురపరిమళము నపహరించుకుపోయి
దిశలెల్ల విశదముగ దెలియ విరజిమ్మెదవు
సిగ్గనియు దెలియదుర ? చిరుపాప వయితివిర?
తెలిసి నలుగురు నగర? తెలివి కొలదిగ వలద?
వినుము! తుమ్మెద లవిగో! వినువీథిమ్రోగునటు
లరచుచును నర్తనము నపుడె మొదలిడసాగె
తరులమరుగున మరగి తరణి చటుకున చూచె
పికము పడిపోయినటు పిలచుచున్నది అపుడె.

---

# "ఈసంఘమే మమ్మల్ని పాకీవాళ్లనిచేసింది"

మద్దూరి హనుమంతరావు, బి. ఏ.,

ఆది శ్రావణమాసం. "మామిడికాయలు, మామిడి కాయలు" అను కేక వీథిలో వినబడింది. అకాలంలో మామిడి కాయలు రావడంతోనే ఆతురతగా నొకయువతి యింట్లోంచి గుమ్మం లోకి వచ్చి "ఓఅమ్మా! ఇల్లారా" అని పిలి చింది. ఆయాసపడుతూ, ఆమనిషి, తట్ట దింపి "సాయంకాలమైందమ్మా, కాయలు త్వరగా తీసికొండి, కావలిస్తే" అంది. కొన డానికి వచ్చినఆయువతి ఆమనిషి కేసి చూచి "ఎవరమ్మా మీరు?" అంది. కలకల్లాడే ఆముఖ కాంతి, కండ్లయందలి సౌమ్యదృష్టి, శ్రావ్యంగానున్న ఆకంఠధ్వని, వికారపునగ లేమీలేకుండా సాధారణపురవిక ధరించిన ఆమనిషి యెవ్వరైయుండునా అని అనుకుంది ఆమె. "పాకీవాళ్లవమ్మా, దూరంగానే నిలు చున్నా లేండి త్వరగా యేరుకోండమ్మా కా యలు" అంది. ఈజవాబు చాలాఆశ్చర్యంగా తోచింది ఆయువతికి. "అమ్మా, నిజంగాచెప్పు. మీరు పాకీవాళ్లా? నువ్వుస్వచ్ఛమైనబ్రాహ్మణ కుటుంబస్త్రీలాగ కనబడుతున్నావు." అంది. "ఎందుకుతల్లీ—యేం చెప్పకోను?— పాకీదాన్నే లేండమ్మా. ఇంకా కాయలన్నీ అమ్ముకో వాలి. చీకటిపడితే కొంపజేరుకోటం కష్టం" ఈమాటలతో కొనేఆమెసందేహం బలపడింది. ఆమని షెవరో? ఎందుకు పాకీదాన్నని చెప్పకుంటోందో? ఏంబాధలు లేకుంటే గౌరవకుటుంబస్త్రీ పాకీదాన్నని చెప్పకుంటుం దా? ఏదో గూఢమైనకథ వున్నట్లు ఆమనిషి మాటల్లోనే తెలుస్తోంది. ఎట్లాగైనా తెలు సుకొని తీరాలని నిశ్చయించుకొంది ఆమె.

"ఓ అమ్మా, యీతట్టలోనికాయలన్నీ తిరిగి అమ్ముకునే కష్టంలేకుండా నేనేకొంటాను, నీవుచెప్పినఖరీదుకి. నిన్నుచూస్తే నా కెదో జాలి వేస్తోంది. పాపం! ఎంతదూరాన్నుంచి మోసుగొచ్చావో యీ బరువుతట్ట? నువ్వు ఇంటికి వెళ్లి వంటచేసుకొనేకష్టం లేకుండా యీపూటకి అన్నంఆధరువులూ అన్నీ నేను ఇస్తాను. తొందరపడకు. నువ్వెవరు? నిజంగా చెప్పు. భయం లేదు. నీముఖం చూడగానే నీవు పాకీదానవు కావని అను కున్నాను. నన్ను చూచి భయపడకు. నీసం గతి ఎవ్వరితోనూ చెప్పను. పైకి అరుగు మీదకు రా. వచ్చికూర్చో—నిజమైన నీసం గతి త్వరగా చెప్పాలి మరి" అని ఆమె తొందరచేసింది. "అమ్మా! మీఆదరం, ప్రేమా ఎక్కడా చూల్లేదు. నన్ను చూస్తే మీ కెంతజాలి కలిగిందో మిమ్మల్ని చూస్తే నా కంతగౌరవం, పూజ్యభావం కలిగిందమ్మా.

కాని ఎందుకు తల్లి, నా పాడుకథ మీరు కాదు. తగుదునమ్మా అని వచ్చింది మనం వినడం? తీరా చెప్పగానే మీకు నామీద దరదగ్గరకీని, పొమ్మని చెప్పండి" అంది ఒక జాలి పోయి కోపం వస్తుంది...తిడతారు వద్దమ్మా, చెప్పను" అంది.

"ఓ వెఱ్ఱిదానా, నేను నిన్నేమీ అనను. నీక్షోభ ఎవ్వరికి తెలుస్తుంది? ఇంక పిచ్చిఅభ్యంతరాలు చెప్పక కథ చెప్పు."

"అమ్మా, మీ రంతబలవంతం పెడుతూంటే చెప్పక తప్పదు. మరి నా వెనకటి సంగతి తలుచుకుంటే నాశరీరం అంతా వణుకుతోంది. గుండె బరువెక్కుతోంది. ఎన్ని బాధలుపడ్డా ననుకొన్నారు?

"మాది నిడదవోలు. చెప్పుకోను. చెప్పుకుంటే సిగ్గుచేటు. శ్రీవైష్ణవులపిల్లని. నే నేమీ యెఱుగని మూడేళ్లవయస్సులో మా అమ్మ వొళ్లోకూర్చోపెట్టుకొని, యేడుస్తూంటే నాకు పటికబెల్లం పెట్టి, రు. ౧,౬౦౦ లకి నన్నమ్మి పుస్తె కట్టించిందట. తరువాత ఏడాదినాటికి ఆపెండ్లికొడుకు స్ఫోటకంవచ్చి చనిపోయాట్ట. అతని పన్నెండుఎకరాల భూమి నాపేరటే వుందిట కాని మావాళ్లే అనుభవిస్తున్నారు.

"నే నాడుకొనేయీడులో అట్లతద్దీ అవీ వస్తే అందరపిల్లలతోటి నే నాడుకోడానికి వెళ్లినప్పుడు నన్ను చూపిస్తూ తక్కిన పిల్లలందరూ యెదోగుసగుసలాడుకొనేవారు. "దీని మొగుడు చచ్చిపోయాట్ట. ఇది వెధవముండ అని మాఅమ్మ చెప్పింది. ఇల్లాంటి పండుగ రోజుల్లో దీనితో ఆడుకుంటే మనకి మంచిది




"పాకీవాళ్లవమ్మా,......త్వరగాయేరుకో॥

పిల్ల. వెంటనే మరియొకపిల్ల ముందుకు వచ్చి తక్కిన పిల్లలందరు చూస్తూంటే "పో, పోవే! శుభం మళ్లే వచ్చావు గోరింటాకేనాపెట్టుకోగుండాను" అని త్రోసేసింది.



"...న్నాళ్ళ కాళ్ళలు" అంది.

"మా అన్నయ్యకి చాలకాలం దాకా పెండ్లి కాకపోతే నాకంటె, నడ్డాణం, నేనేడుస్తూన్నా గూడ కొంచెమైనా జాలి లేకుండా మా అమ్మ తీసికెళ్లి పెళ్లికూతురికి పెట్టి కొడుక్కి పెళ్లి చేసింది. ఆ పెళ్లికైనా నన్ను తీసికెళ్ల లేదు. మా ముసలమ్మ దగ్గర వుంచేశారు, పెండ్లివారందరూ వచ్చేటప్పటికి చాకిరీలు చేసి యిల్లు సిద్ధంగా వుంచమని. అందరూ సంతోషంగా బళ్లెక్కి పెళ్లి కెడుతూంటే నేను గొల్లున గోలపెడుతూ తులసికోట వెనకాల కూర్చోవలసివచ్చింది. తరువాత బాజాలు,పల్లకీ వస్తూంటే మావాళ్లేగదా వస్తున్నారని వీథిలోకి పరుగెత్తాను. చప్పున మానాన్న యెదురుగుండా వచ్చి,నాకేసి కోపంగా చూస్తూ పళ్లు కొరికి "అప్పుడే శనిలాగు తయారయ్యావ్, వీథిలోకి వెధవమొఖం వేసుకొని? కాస్సేపు గాదిమెట్లవెనకాల కూర్చో, ధప్పళానికి గుమ్మడికాయముక్కలు తరుగుతూను. పోపో, యిల్లా యెదురుగుండా రాకూడదు ముండా!" అన్నారు. వెనకాల యింట్లోంచి "ఇల్లారావే జ్యేష్ఠా" అని మాముసలమ్మ అరిచింది. ఏడుస్తూనే వెనక్కి వెళ్లిపోయాను.

"సంతోష మిచ్చే ప్రతీవిషయంలోకీ నన్నిల్లాగే గెంటేశేవారు. నేను పెద్దమనిషి నయిననాడు యింట్లో యెవరో పోతే యేడ్చి నట్టుగా యిల్లు యేవన్నంచీ గోల మొదలు పెట్టారు. అందరు పసుపు, పారాణీ, బొట్టూ, గంధం, పువ్వులు పెట్టుకుంటూంటే నాకెంతో ముచ్చటగా వుండేది. నేనూ పెట్టుకోవాలని దొడ్లో ఒకమూల కూర్చొని పసుపు రాసుకొని కాటుకా, బొట్టూ పెట్టుకొని దొడ్లో పూచిన రాధామనోహరంపూవులు తల్లో పెట్టుకొని అద్దం చూచుకుంటే ముద్దులు మూటగడుతోంది నాముఖం. నాకే ఎంతోముద్దొ

చ్చింది. అద్దంలో నాబొమ్మ నేనే ముద్దు పెట్టు కొనేదాన్ని. ఒకసారి నే నలాచేస్తూంటే మా అమ్మ చూచి "నీ కేమిచేటుగాలమే, యివన్ని పెట్టుకుంటున్నావు?" అని నాలేతబుగ్గలన్నీ రక్తం వచ్చేటట్లు గిల్లి పదిబిందెలనీళ్లతో నన్ను స్నానంచేయించింది. ఇదిగో చెంపమీద ఆ గిల్లుమచ్చ. అన్నేళ్లొచ్చినమనిషి త నెన్ని అలంకారాలు చేసుకొన్నా మంచిదేట! కాని పసిపిల్లని నేను చేసుకొంటే "చేటుగాలంట!" ఇల్లాగడచింది నాబాల్యావస్థంతాను. నాలో బాలోత్సవం పొంగిపొరలుతూ వుంటే చూ చినమావాళ్లకి వాళ్లకళ్లలో కారం చల్లినట్లు వుం దనుకుంటాను. వెంటనే దానిని శక్తికి మించినబలంతో అణచేదామని ప్రయత్నించే వారు. ప్రకృతినైజంగా దేవుడు కల్పించిన వుత్సాహాన్ని చూస్తే వారి కంత యేవగింపు మెందుకో? మళ్లీ దైవభక్తులట!

"క్రమంగా నాకు ౧౬ యేళ్లు వచ్చేయి. ఒళ్లంతా నున్నగా తళతళలాడుతూ మెరస్తూం డేది. కండ్లలో కేదో చక్కని కాంతి, ముఖంలో కళ, చెంపలనునుపూ చూస్తే నాకే ఎంతో అం దంగానూ, ఆశ్చర్యంగానూ వుండేది. నాముసి ముసినవ్వులు, లావణ్యం సౌకుమార్యం చూచి సంతోషించేప్రాణి ఒక్కరూ కనిపించలేదు సరికదా, యిరుగుపొరుగువాళ్లయిళ్లల్లోవాళ్లు నన్ను ఈర్ష్యతో చూచేవారు. కాళ్లకీ, చేతులకీ, చెవులకీ వున్ననగలని కంసాలిని పిలిపించి తీసేయించేసారు. అదివరకు నేను చీర, రవిక కట్టుకొనేదాన్ని. ఒకరోజున మాఅన్నయ్య రెండు 'సైను' పంచలు తీసికొనివచ్చి నామీద పడేసి "ఇక్కణ్ణుంచి నీ వీబట్టలే కట్టుకోవాలి. నీచీర లమ్మ కిచ్చె సెయ్యి" అన్నాడు. నా కప్పు డెంతదుఃఖ మొచ్చిందో, తల్లీ, ఏంచెప్పను? రవికతొడు క్కుంటే మాముసలమ్మ "నలుగురూ గడ్డెడు తున్నారే నానోట్లో. చాలీపాటికి రవికలూ, వేషాలు" అంటూ నేను చూస్తూండగానే వాటిని చింపి పొయ్యి అలికేసింది. రవిక లేక పోతే నాకు బట్ట కట్టుకున్నట్లే వుండేది కాదు ఎన్నేళ్లదాకానో!

"మావదిన కాపురానికి వచ్చింది. నాతో టిదే. సాయంకాల మయ్యేటప్పటికల్లా జడ వేసుకొని, నీళ్లు పోసుకొని, బొట్టూ, కాటుకా పెట్టుకొని దొడ్లో మల్లెపూవులన్నీ తలనిండా పెట్టుకొనేది. నేను కష్టపడి నీళ్లోసి పెంచిన మల్లెపూవులన్నీ తనకోసమే పూచినట్లు వాడు కొనేది. అందరు ఆ అమ్మాయిఅలంకారా లనీ, ఆ అమ్మాయినీ చూచి సంతోషించే వారు. దానిపుణ్య మేమిటో? నాపాప మేమిటో?

"వర్షాకాలంలో మా అమ్మా, నాన్నా ఒకగదిలోనూ, అన్నయ్యా, వదినా ఒకగది లోనూ పడుకునేవారు. నేను చలిలో గడగడ వణుకుతూ చాపమీద చెంగేసుకొని కాళ్లు ముడుచుకొని పడుకునేదాన్ని. ఒకమూల మాముసలమ్మ పడుకునేది, పెద్దగుఱ్ఱు పెడు

తూను. ఆగుబ్బు వింటే నా కెదో వెఱ్ఱిభయ మేసేది. నిద్ర పట్టేది కాదు. ఏమీ తోచేది కాదు. ఏడుపొచ్చేది ఒకప్పుడు చెయ్యి కరుచుకొని, ఒళ్లు రక్కుకొని యేడ్చేదాన్ని. నాయేడుపుధ్వని, మామునలమ్మగుబ్బు కలసి మృత్యుదేవత గలగల నవ్వుతోందా అనిపించేది నాకు.

"ఎవరో కావాలనిపించేది నాకు. నన్నాదరించి దగ్గరకు చేర్చుకొనేవాడు కావాలి. నామీద ప్రేమ చూపించేవాడు కావాలి. నేనే కావా లనేవాడు కావాలి. తనసంతోషంలో నన్ను ముంచి నాఆనందంలో తాను మునిగిపోయేవాడు కావాలి. అప్పుడు నా ప్రేమంతా అతనితో, ఆతనిచేతుల్లో ముఖం పెట్టి చెప్పుకోవాలి. ఈమాట మెవరితో చెప్పుకోనూ? ఎవరు నాకోర్కె తీరుస్తారూ? అయినా మాఅమ్మతో ఒకసారి యీసంగతి సాహసించి చెప్పేశాను. అందుకు ప్రతిఫలం, ఇదిగో, గంటె కాలేసి వాతపెట్టింది. నాకం డ్లెప్పుడూ మెవరినో వెదకుతూ చంచలంగా కదిలేవి. శరీరసంపర్కంకోసం స్త్రీపురుషులకి ఒకరిమీద ఒకరి కుండేవాంఛ కామం. ఈ వాంఛ లేనివారు చాలాతక్కువ. ఆకలిలాగే యీవాంఛనికూడా తీర్చుకోడానికి ప్రతిపురుషునికి, స్త్రీకి హక్కు, అవసరం వున్నా వితంతువులవిషయంలో సంఘం ఒప్పుకోదు. అమ్మా, ఒకబాలిక వితంతువు కాగానే శుక యోగి అయిపోతుందని తలచడం పొరపాటు కాదూ? నాకు మోహం ఉద్భవించేసరికి మాయింటిలోనివారందరికి నేను గర్భశత్రువు నై పోయాను. న న్నెప్పుడూ వీథిగుమ్మంలోకి పోనిచ్చేవారు కాదు. నాకు చదువు రాదు ఎప్పుడూ దొడ్లో పశువులదగ్గర చాకిరీచేస్తూ పశువులాగే వుండేదాన్ని.

"ఒకరోజున అర్ధరాత్రివేళ నా కెంతో ఆరాటంగా వుంది. నిద్ర పట్టలేదు. అన్నయ్యా వదినా యేమ్మాటలాడుకొంటారు ప్రతీరోజూనూ? ప్రతీరోజూ రహస్యా లుంటాయా చెప్పుగోడానికి? ఎంతఅదృష్టవంతురాలోకదా మావదిన, అల్లా ప్రాణ మిచ్చే భర్త దొరికాడు! అప్పు డేంచెప్పుకుంటున్నారో వినాలి అనుకున్నాను. నెమ్మదిగా అడుగులు చప్పుడు కాకుండా వచ్చి తలుపుసందులో చెవిపెట్టి వింటున్నాను. రెండునిముషాలయిందో లేదో తలుపుసందులోవున్న తేలు చెవిమీద చురుక్కున కుట్టింది. దాంతో నేనున్నచోటు మరచిపోయి 'కేరు' మని యేడ్చాను. వెంటనే మాఅన్నయ్య వచ్చి "యేంజరిగింది" అని అడక్కుండానే మూలనున్న దుడ్డుకఱ్ఱతో గొడ్డును బాదినట్లు బాదేశాడు, "ఇక్కడి కెందుకొచ్చావే ముండా?" అంటూను. వదిన పమిట సవరించుకుంటూ వచ్చి పళ్లుకొరుకుతూ చెడ తిట్టింది. అబ్బబ్బా! శ్రీహరీ! తేలుబాధ, అవమానం, కఱ్ఱదెబ్బలు, తిట్లు కలసి మెంతబాధగా వుండివుంటుందో ఆలోచించు

కోవాలమ్మా, నేను చెప్పలేను. ఆతక్షణమే మడుగులో పడి చచ్చిపోదా మనుకున్నాను. గుమ్మందాకా వెళ్లాను గాని యింత అందమైన సుకుమార దేహాన్ని, ఇంత ప్రేమగల హృదయాన్ని ధ్వంసం చేయడానికి మనస్సు ఒప్పక ఆరాత్రి ఎట్లో గడిపేశాను. తెల్లారగట్ల ఒకకునుకు పట్టింది. ప్రొద్దెక్కిందాకా మెళుకువ రాలేదు. "మొద్దులా గింకా నిద్రపోతావేం? జాము ప్రొద్దెక్కింది. లేవే పెంటముండా!" అంటూ కాలితో తన్ని లేపాడు మానాన్న. హడలిపోతూ లేచి మామూలుగానే బిందె పట్టుకొని దొడ్డిగుమ్మాన్ని కాలవ కెళ్లి బిందెనీళ్లు యెత్తుకొస్తున్నాను. నావల్లు నాకు తెలీటం లేదు. నడుంవిరిగింది కాళ్లనిండా కట్టదెబ్బలు. ఏంచెప్పను? బిం దేసుకొని మడుగువద్దనె కళ్లు తిరిగి పడి



పోయాను.

* * *

౨

"ఎంతసేపు పల్లాపడివున్నానో నాకు తెలీదు సుమండీ? నేను కళ్లుతెఱచి చూచేటప్పటికి ఒకయువకుడు, రాయితగిలి రక్తంగారుతున్న నాముఖాన్ని తనఖండువాతో తుడుస్తున్నాడు. తనఖండువా చింపి బిందెలోనినీళ్లోసి తడిపి నాముఖంమీది గాయానికి కట్టుగట్టాడు. ముఖముమీద నీళ్లు చిలకరించి చేత్తో మెల్లగా రాస్తున్నాడు.

"ఏదో విపరీతమైన స్పర్శసుఖం తోచి, చప్పున కళ్లు తెఱచి చూచాను. సుమారు

౨౩ యేండ్లున్న యువకుడు. చక్కని మీస కట్టు, మెరుస్తున్న కండ్లు, గోధుమరంగుశరీరం కలిగి పొడుగ్గా, బలంగా వున్నాడు. చక్కని పంచ, ఖండువా వేసుకొని వున్నాడు. నేను కండ్లు తెఱవడం చూసి, ఆతురత పడుతున్న ఆతనిముఖంలోకి సంతోష మొచ్చింది. పెద వులు చిఱునవ్వు నవ్వాయి.

"ముఖంమీదకి వంగి సేవచేస్తున్న వాడు లేచి చప్పన దూరంగా నించున్నాడు. మా యిద్దరచూపులు ఆక్షణంలో కలుసుకొని అంత టితో చాలకుండా హృదయంలోనికి దూసు కొని పోయాయి. నేను వింతగా వెఱ్ఱిబోయి చూస్తుంటే తాను "ఏమండోయి, నే నిక్క డికి వచ్చేటప్పటికి మీ మొఖంనిండా రక్తం కారు త్తోంది. ప్రాణం లేనట్లు పడిపోయారు. చుట్టు పట్ల యెవ్వరూ లేరు, పిలుద్దామంటే. అంచేత, నేను పాకీవాడనే అయినా ధైర్యంచేసి ముట్టు కొన్నాను. నన్ను క్షమించి యింకోసారి స్నానంచెయ్యండి. జాలేసి యేమీతోచక యిల్లాచేశాను" అన్నాడు, నే నేమంటానో అని భయపడుతూను. నా కేంచెప్పడానికి తోచింది కాదు. బాధంతా యేమయిందో తెలీదు. చప్పన ఒళ్లు దులుపుకుంటూ లేచి నవ్వుతూ ఆతనికేసి చూస్తూ యింటి కెళ్ల బోయి, నీళ్లు తేకుండా వెడితే యింట్లోవాళ్లు మళ్లీ తిడతారని మడుగులో దిగి నీళ్లుపోసు కొని బిందెనీళ్లు తీసికొస్తుంటే అతడు వెన కాలే వచ్చి, యిటు అటు చూసి, "యెవరి తోనూ చెప్పకండి యీసంగతి. జాగ్రత్తగా వెళ్లండి" అంటూ నాకేసి తిరిగి నవ్వుతూ ప్రక్కనున్న మామిడితోటలోనికి వెళ్లి పోయాడు.

"ఎట్లాగో యింట్లోకి ఘటం చేరేశాను. "ఇంతసే పెక్కడున్నావే" అని మాఅమ్మ గద్దించింది. రక్తంగారుతున్న గాయం చూపిం చాను. "అవిటికాళ్ల మొద్దుపి. మాట్లాడితే చిన్నపిల్లలాగు పడతావేమిటి? బిందె సా ట్టోయిందే మొద్దూ!" అని విసుక్కుంటూ రాక్షసిబొగ్గు నూరి, నూనెలో కలిపి గాయం లో కూరింది మాఅమ్మ. ఇదిగోనండి ఆమచ్చ. నాకు గాయం బాధగాని, వాళ్లునొప్పులుగాని కనబడలేదు సుమండీ. ఏదో నూతనోత్సాహం గా వుంది. ప్రొద్దుట జరిగినచరిత్ర వేయివిధాల జ్ఞాపక మొస్తోంది. నావంట్లో ప్రతీరక్తపు చుక్కాగూడా వుద్రేకమైన ఆనందంతో తాళం వేస్తోంది. ఆహా! ఆతడు నాచెంపలమీద చెయ్యేసి ప్రేమగా రక్తం తుడుస్తూంటే యెంత బాగుందనిచెప్పను! ఎల్లా చెప్పతే తెలుస్తుంది మీకు? భయంకరమగు రోహిణీకార్తిమెండ లికి మలమల మాడిపోయినవాళ్లకి తొలకరి వానకురిస్తే యెలావుంటుందో, కటికచీకటి కొట్టులో చిరకాల మున్నవాళ్లకి వెలుతురు లోకి వస్తే యెల్లావుంటుందో, సముద్రంలో రిక్కుమొక్కులు లేక కొట్టుకొనిపోతూన్న వాళ్లకి తెప్ప దొరికితే యెల్లావుంటుందో, ఆకలి చేత కడుపు మండిపోతూన్నవాళ్లకి మంచి

భోజనం దొరికితే యెల్లావుంటుందో, అల్లాగ వుంది అతని చెయ్యి నాకు. అయ్యో! తెలివి తక్కువదాన్ని, కాసేపు ఆచెయ్యి నాగుండె మీద అనుముకోలేకపోయాను. ఆసమయానికి వెఱ్ఱిసిగ్గోటు నన్ను చంపడం మొదలెట్టింది. ఆహా, యెంతబాగున్నా డతను! పాకీవాడైతేనేం, ఎవరైతేనేం? అంతప్రేమ నా మీద చూపించాడు. పాపం, వెఱ్ఱివాడు! ఎంతకష్టపడ్డాడో నాకోసానికి? ఖండువాకూడా చింపుకొన్నాడు. అత నెదురుగుండావున్నప్పుడు ఒక్కమాటేనా చెప్పలేకపోయాను. మళ్లీ యెప్పుడు కనబడతాడో — రేపు పోనీ మళ్లీ నేనే వెళ్లి కలుసుగుంటాను, ఆతనితోట లో, యేమైనాసరే" అని అనుకుంటూ ఆరో జంతా యెట్లాగో గడిపేశాను.

"మర్నాడు వుదయాన్నే సరిగ్గా ఆసరికే ఆతనితోటలోకి వెళ్లాను. ఆతను కొంకెకట్ట, పండ్లబుట్టా పట్టుకొని వస్తుంటే చెరుకువిల్లూ, పూలబాణాలకోసం బుట్టా పట్టుకొని వస్తున్న మన్మథునివలె వున్నాడతడు నాకండ్లకు. అతని ఎదురుగుండా పోయి నిలుచున్నాను నేను. అతను నాకేసి ఆశ్చర్యంగా చూస్తూ "ఏమండోయి, యెల్లావుంది నొప్పి?" అన్నాడు. "నిమ్మళంగానే వుంది. పాపం, నాకోసం చాలా కష్టపడ్డావు! ఈగాయంమీద పట్టీ తీసేస్తావూ" అంటూ చిఱునవ్వునవ్వుతూ దగ్గరకెళ్లాను. అతను సందేహిస్తూ యెడంచేత్తో నాగడ్డం పట్టుకొని కుడిచేత్తో నాకళ్ల కేసిచూస్తూ పట్టీ తీసేస్తూంటే అప్రయత్నంగా నారెండుచేతులు వెళ్లి అతని నడుం చుట్టుకొన్నాయి, నాకు తెలియకుండానే. ఆతనిమీద జార్లపడి సుఖావేశంతో కళ్లుమూసుకొన్నాను. అతను తనపొడుగు చేతులతో నన్ను గట్టిగా అదుముకొని తన ఱొమ్ముకి చేర్చుకున్నాడు. ఆసమయంలో నేను స్వర్గంలో వున్నానో, అంతకన్నా ఆనంద వైనచోటేదేనావుంటే అక్కడేవున్నానో తెలుసుకోలేని మహాసుఖంలో మునిగిపోయాను. అమ్మా, నమ్మండి, నమ్మకపోండి! ఎంత ప్రాణం లేచివచ్చిం దనుకున్నారు ఇంతకంటె సుఖ మేదైనా వుంటుందా ప్రపంచంలోనూ అని అనిపించింది.

"కొంచెంసేపట్లోనే, మళ్లీ యిట్లా, మా వాళ్లు జ్ఞాపకంవచ్చారు. వెంటనే భయమేసింది. మెల్లగా అతనిచేతుల్లోంచి తప్పించుకొని "ఇంటికి వెడతాను; మావాళ్లు చూస్తే చంపేస్తారు" అన్నాను "వెడతావా" అంటూ నా చెయ్యి దగ్గరకి తీసికొని నన్ను గట్టిగా ముద్దెట్టుకొన్నాడు. దాంతో విశ్వం మఱచిపోయాను. జన్మమెత్తి అఖండమైన—అట్లాంటిసుఖం అనుభవించడానికదే మొదలు. స్వర్గం వదలి నరకంలోనికి పోయినట్లు ఇంటికి వెళ్లాను. ఇల్లాగ నాలుగైదురోజులు ప్రొద్దున్నా, సాయంత్రము ఆతనితోటలోనే కలుసుగొనేవాళ్లం. అంతకంటె మాకు చోటేది? నాసంతోషానికి పరిమితి లేకుండావుంది. మావాళ్లందరూ నాబుగ్గలతళతళ చూచి ఆశ్చర్యంగానూ, సందేహంగానూ చూస్తున్నట్లు నేను కనిపెట్టాను.

అహర్నిశం అతనిమీద ధ్యానందప్ప వేరు ప్రపంచ మేమీా తెలీటంలేదు, నాకు, మావా ళ్లెంతతిడుతున్నా సరే.

"ఆతనిపేరు జోగన్నట; అడిగి తెలిసి కొన్నాను. అక్కడెల్లా కలుసుగోటం జోగ న్నకి చాల భయంగా వుంది, మాయిద్దర్నీ కూడా మావాళ్లు చంపేసిపోతారేమో అని. తా నింకా పెళ్లిచేసుకోలేదుట! ఎంత మంది తనజాతిపిల్లల్ని యిస్తామన్నా వద్ద న్నాట్ట. తనతో నేను వచ్చేస్తే తనప్రాణం కంటె యెక్కువగా చూచుకుంటూ యావ జ్జీవం సుఖంగా గడుపుతా నన్నాడు. ప్రాణా నికి ప్రాణం అడ్డువేస్తానన్నాడు. నేను రాక పోతే నాయెదురుగుండానే తనతల బ్రద్దలు కొట్టుకొని చచ్చిపోతా నన్నాడు. "అమ్మ య్యో! యెల్లాగ? పాకీవాడితో లేచిపోయిం దనుకుంటారు. నేను రానుబాబూ!" అన్నా ను. "అయితే మొదట నన్నెందుకు కౌగ లించుకొన్నా" వన్నాడు. "నన్నెందుకు ముందర ముద్దుపెట్టుకొన్నా" వన్నాను. మనిద్దరం కూడా అనుకుని యీపని చేయ లేదు. దేవుడే కలిపాడు మనిద్దర్నీని. ఈ రాత్రి పన్నెండుగంటలకి మీాదొడ్డిగుమ్మం దగ్గర నుంచుంటాను. తప్పకుండా రావాలి. నిన్ను పువ్వులాగ చూచుకుంటాను. నీకష్టా లు చాలారోజులనుంచి నేనూ చూస్తూనే వున్నాను. నీవు రాకపోతేమాత్రం తెల్లారే టప్పటికి మీాగుమ్మాన్నేసి తల బ్రద్దలుకొట్టు కొని పడివుంటాను. నాశవం దాటి మరీ వెళ్లాలి నీవు మడుగుకి. తెలిసిందా? నామీాద ఏమాత్రం జాలివున్నా తప్పకుండా రా." అన్నాడు. "సరేలే వస్తాను. సిద్ధంగా వుండు. నువ్వు చచ్చిపోతే నేనుమాత్రం బ్రతకగలనా?" అన్నాను నేను.

"వస్తానన్నానేకాని ఆమాట తలచుకుంటే భయమేసింది. ఆరోజున ఇంట్లో యెవరిని చూచినా, యేంతిన్నా యేడుపొచ్చింది. ఇంట్లో నా కెవరిమీాద ప్రేమ లేదు. అందరి మీాద విరక్తి పుట్టేట్లు వాళ్లే చేసుకొన్నారు. నాసుఖం వాళ్ల కక్కరలేదు. నన్ను ప్రేమించినవాడు, నేనే కావాలన్నవాడు జోగన్న ఒక్కడే.

"పాపం! నేలేకపోతే బ్రతకట్ట, చచ్చిపోతాట్ట ఏమైనాసరే, పాపం, వెళ్లిపోతాను అతనితో నేను. కాని చిన్నప్పట్నుంచీ ప్రాణంలా పెంచు కొన్న మల్లిపందిరిని విడిచి వెళ్లడవంటే ప్రాణం ఒప్పటంలే దనుకుని సాయంత్రం యె వ్వరూ చూడకుండా దోసెడుమల్లి మొగ్గలు కోసి గుడ్డలో మూటకట్టుకున్నాను. ఆవేళ మాయింట్లో తద్దినం. అరిసెలు, గారెలు మిగి లినవి జోగన్నకోసం మూటగట్టాను, రహ స్యంగా. ఆవేళతో నాకూ మావాళ్లకీ సరి. ఋణం తీరిపోయింది మావాళ్లకీ నాకీని. నాఆత్మ బంధువునికోసం దొంగనిద్దుర నటించాను.

"అర్ధరాత్రి అయింది. ఇంట్లో అందరు గాఢంగా నిద్రపోతున్నారు. మెల్లిగా తలుపు

తీసికొని మూట చేత్తో పట్టుకొని దొడ్డితలుపు భయపడుతూ తీశాను. అన్నప్రకారం గుమ్మం దగ్గరే నుంచున్నాడు, నామిత్రుడు. చీకట్లో గూడా ధగధగలాడుతూ మెరుస్తున్నాయి అతనికళ్లు. నన్ను చూడగానే "వచ్చావా" అంటూ కౌగలించుకొని మెత్తుకొని పోతున్నాడు.

"మళ్లీ భయం వేసింది. "వెనక్కి వెళ్లి పోతా" నన్నాను. "సరే వెళ్లు నన్ను చంపుకొని...... నిన్ను బలవంతంగామాత్రం తీసికెళ్లను. వెళ్లిపో" అంటూ అక్కడున్న పెద్దరాయినేసి తల బ్రద్దలుకొట్టుకోడానికి సిద్ధమైనాడు. "ఏమైనా సరే, నిన్ను వదలను. నీతో వచ్చేస్తాను. చచ్చిపోకు" అంటూ చేతులు పట్టుకొన్నాను. హాయిగా కబుర్లు చెప్పకుంటూ ఆ రాత్రంతా తాడేపల్లిగూడెందారినిబట్టి నడచిపోయాము. నేనుమాత్రం వెనక్కు తిరిగిచూస్తూవుండేదాన్ని, మావా ళ్లెవరేనా వచ్చి నన్ను చావకొట్టి తీసుకొనిపోతారేమో అని.

*   *   *

## 3

"నడచినడచి అలసిపోయి తెల్లారగట్ల ఒకతోట దగ్గర-యిక్కడికి కదిచేరువే, చేరుకున్నాము. హాయిగా చల్లనిగాలివేస్తోంది. ఆతోటలో ఒక మామిడిచెట్టుక్రింద పచ్చికమీద కూర్చున్నాము. నేను నామిత్రుడితొడలమీద మోచేతులానించి అతనికళ్లలోనికి చూస్తూ "బ్రాహ్మణపిల్లని యీ విధంగా లాక్కురాగల అందం, తెలివితేటలు నీ కెలావచ్చాయి?" అన్నాను. అతను నా ప్రశ్నకి కన్నీరు కారుస్తూ "నేను కూడా బ్రాహ్మణ్ణే కనక" అన్నాడు. "ఆ! నిజంగా?" అని ఆశ్చర్యపడ్డాను.



"నిజమైన చరిత్ర చెపుతే నమ్ముతావా?"

"తప్పకుండాను."

"జోగన్నను పెంచినతండ్రి ఒకడున్నాట్ట. అతను చెప్పాట్ట యీకథ.

"ప్రతీరోజూ సాయంత్రం నన్ను పువ్వుల్లో

“కొన్నేండ్లక్రిందట ఒకరోజున ఆపాకీవాడు వీథులుతుడుస్తూంటే ఒకమేడదగ్గర పులిస్తరాకుల డబ్బాలో ఒకపసిబిడ్డ “ కేరుకేరు ” మనడం విని చప్పున డబ్బా యెత్తి చూశాట్ట. కనుచీకట్లో ధగధగలాడుతూన్న ఒకమగబిడ్డ తెల్లనిబట్టలో కప్పబడి వున్నాడు. వెంటనే యెక్కడలేనిజాలితో ఆతను చప్పున బిడ్డని యెత్తుకొని వంటినిండా బట్టకప్పి తనయింటికి తీసికెళ్లడం చూసి ఒకదాసీది చప్పున పరుగెత్తి వచ్చి “ఇదిగో, యీపదిరూపాయలు పట్టుగెళ్లి పిల్లాణ్ణి జాగ్రత్తగా పెంచు... వెంకుపంతులుగారి విధవకూతురు కన్న దీబిడ్డని. ఇంట్లో వుంచడానికి వీల్లేక సంఘానికి వెఱచి యిల్లా పారెయ్యవలసివచ్చింది. ఈపిల్లవాడిఖర్చు అంతా మాఅమ్మగారు భరిస్తారు. నీకు మంచి యినాం యిస్తామని చెప్పారు. రహస్యంగాను, జాగ్రత్తగానూ పెంచు” అని చెప్పింది. ఆతనికి పిల్లలు లేకపోటంవల్ల జోగన్నని చాలప్రేమగా పెంచేవాట్ట. ఖర్చులంతా ఆమె రహస్యంగా దాసీదానిచేత పంపుతూవుండేదిట. పిల్లవాడు పెద్దవాడై తండ్రితో తోటల్లో గునపం, పాఱ పట్టుకొని కష్టపడ్డం ఒకసారి తల్లి చూచి “నా కడుపున పుట్టిన నీ కెంతగతి పట్టిందిరా ?” అని నెత్తి నోరు కొట్టుకొందిట. కాని పాప మామె యేంచేయగలదు ? ఈజన్మకథవిన్న జోగన్న పాకీపిల్లల్ని పెళ్లిచేసుకోటానికి యిష్టపడ లేదుట.



కూర్చోపెట్టి వూపుతాడు. ”

“ఈకథంతా చెప్పి జోగన్న వుసూరుమంటూ చెట్టుకి జార్లపడ్డాడు. నేను అతని మొఖంమీది చిఱుచెమట తుడుస్తూ “అయ్యో, పాపం, నీకథ జ్ఞాపకానికి తెచ్చి చాల బాధకలిగించాను. చాల అలసిపోయావు. నావద్ద కొన్ని పిండివంట లున్నాయి. తిందువుగాని ఆదొరువులో ముఖం కడుక్కో. నీవుకూడా బ్రాహ్మణుడవని తెలియగానే నాసంతోషానికి మితి లేదు. ఇదిగో పంచభూతముల సాక్షిగా నీతలమీద తలం

ప్రాలు పోస్తున్నా నీమల్లెపూవులతోటి. ఇది వఱకు నాకు జరిగినపెండ్లి అసలు జ్ఞాపకమే లేదు. ఇదే మనసిజమైనపెండ్లి" అంటూ నేతెచ్చిన మల్లెపూవులు దోసిలితో జోగన్న తలమీద పోశాను. అతను నానెత్తిమీద తిరిగి పోశాడు. మాలో మేము చేసుకున్న యీపెళ్లిచూసి పంచభూతాలు నవ్వాయి; కోకిలలు పాడేయి; చిలుకలు, గోరువంకలు నాట్యం చేశాయి. ప్రక్కనున్న గన్నేరుచెట్లు పచ్చనిపూవులని అక్షింతలమల్లే రాల్చి మమ్మన్ని ఆశీర్వదించాయి.

"జోగన్న అదివఱకే ఆతోట కౌలుకి తీసి కొన్నాట్ట. చాలపెద్దతోట అవడంచేత సమస్తఫలవృక్షాలు, పూవులచెట్లూ అం దున్నాయి తోటమధ్య చక్కనిబంగాళా. దాని కెదురుగుండా పెద్దదొరువూ, పచ్చిక బైలూ అన్నీ చాల అందంగా వున్నాయి. జన్మమెత్తి అట్టితోట యిదివఱకు చూడ లేదు. మేము పండ్లూ, కాయలూ జాగ్రత్త పెడుతూ, యజమానులసుఖం అలావుంచి మేమే ఆతోటయజమానులమల్లే అనుభ విస్తున్నాం.

"అమ్మా, నాభర్త న న్నిప్పటివఱకూ పువ్వులాగే చూచుకుంటున్నాడు. న న్నేమీ ఎక్కువ కష్టంపడనీయడు. కష్టం అంతా అతనిదే. ఇద్దరూ జోడుపక్షుల్లాగ ఆతోటంతా తిరుగుతాము. నాభర్త స్వయంగా నారతో లావుపాటిత్రాడు పేని పెద్దచెట్టుకొమ్మకి వుయ్యాలా వేశాడు. ప్రతీరోజూ సాయంత్రం నన్ను వుయ్యాల్లో కూర్చోపెట్టి వూపుతాడు. అతనికి నేను గతి, నా కతను గతి. తన్ను పెంచి నందుకు కృతజ్ఞతాపూర్వకంగా తండ్రికి జోగన్న అప్పుడప్పుడు సొమ్ము పంపుతూ వుంటాడు.

"అమ్మా, నా కిష్టమొచ్చినప్పుడు పసుపు, బొట్టూ మొదలైన అలంకారాలన్నీ చేసుకుం టాను. ముచ్చటదీరా అన్నిరకాలపూవుల తోటి నాభర్తే నన్ను అలంకరించి సంతో షిస్తాడు. ఇంట్లోవుండే భయంకరనిర్బంధా లేమీ లేవు. నాభర్త నన్నూ, నాఅలంకారా లనీ చూచి పొంగిపోతాడు. నా కొకమొగ బిడ్డ. నా కింక కావలసిన దేమిటి తల్లీ, భగ వంతుని దయతప్ప! ఒకమామిడిచెట్టు పునాస కాపు కాచింది. మీవంటివారు తిని సంతో షిస్తారని అమ్మడానికి యీవేళ వచ్చాను. అమ్మా, నిజంగా చెపుతున్నాను. మమ్మల్ని ఈసంఘమే పాకీవాళ్లని చేసింది. చీకటి పడు తోంది, పిల్లవాణ్ణి చూసుకోవాలి. శలవమ్మా మరి."

ఇల్లా యీకథ విని ఆయింటిఆమె నివ్వెర బోయి మాట్లాడలేకపోయింది, ఎంతసేపు దాకానో!

---

# మహమ్మదు దారాషికూ రాకొమరుడు*

ఆకుండి వేంకటశాస్త్రి

దారాషికూ షాజహాను చక్రవర్తి జ్యేష్ఠకుమారుడు. ఇతడు[౧౦౨౪ సం. హిజ్రా వెనుక ౡ౨౪-వ సాఫర్‌న] అజ్మీరునగరమున జన్మించెను. అజ్మీరునగరమున ప్రసిద్ధమహమ్మదీయయోగియగు మ్యూనుద్దీను సమాధి గలదు. మహమ్మదుభక్తులెల్ల నాసమాధిని చూచుటకు పోవుచుందురు. షాజహాన్ కాలమునకు మున్నే యాసమాధి యచట నుండెను. షాజహానుకూడ మ్యూనుద్దీనుసమాధిని దర్శించి తనకు పుత్రునిమ్మని ప్రార్థనలు చేసెను. షాజహానున కింతకుము న్నిద్దరు కుమార్తెలు [హురార్‌నిసాబీగము, జహనారా బీగము అనువారు] గలరు. షాజహానుప్రార్థనలవలన 'దారాషికూ' అనుపుత్రుడు జన్మించెను.

గొప్పమహమ్మదీయయోగి సమాధిచేయబడిన యీ అజ్మీరునగరమున జన్మించుట జేసి దారాషికూకూడ గొప్పసూఫీమతభక్తు డగుటయు నొకమంచిసంఘటనమే. దారా మొదటినుండియు సూఫీమతసిద్ధాంతముల ననుసరించువాడై సూఫీమతభక్తుడుగా మహమ్మదీయులచే పరిగణింపబడెను.

దారాబాల్యజీవితమునుగూర్చి షాజహానుజీవితచరిత్ర వ్రాసిన చరిత్రకారులెవ్వరు విశేషముగ నేమియు వ్రాసియుండలేదు. కాని షాజహాను అధికముగ ప్రేమించినపుత్రు డీతడేయని చరిత్రలు చాటుచున్నవి. అందుచే తన్ను విడిచి యేదూరపుపరగణాను గాని తనకు ప్రతినిధిగా పోయి పరిపాలించుటకు దారా వెడలుట కిష్టపడకుండెను. షాజహాన్ తనతక్కిన కుమారులను ఢిల్లీకిదూరముననున్న పరగణాలకు రాజప్రతినిధులనుగా పంపివేసెను. ఔరంగజేబు 'దక్కను'నకు రాజప్రతినిధిగాను, 'మూరాదు' అను కడపటి కుమారుని మాల్వాకు రాజప్రతినిధిగాను, షూజాను వంగదేశమునకు రాజప్రతినిధిగను ఉండునట్లు నియమించి వా రాయాపరగణాలలోనే రాజధానుల నేర్పరుచుకొని యచట పరిపాలించుచుండ నియమించెను. జ్యేష్ఠపుత్రునియందుగల యత్యధికమగు ననురాగమున జేసి, అతనినికూడ అలహాబాదుపంజాబురాష్ట్రములకు రాజప్రతినిధిగ నేర్పాటు చేసినను, అత డక్కడకు వెళ్లనక్కరలేకయే యతనిక్రింద యేజెంట్ల నేర్పాటు చేయించి యతడుమాత్రము ఢిల్లీలోనే తనకన్నుల యెదుటనే యుండునట్లు చేసెను. ఇటుల షాజహాను రాకొమరునకు తగని 'గారాబము'ను జేయుటచే దారా రాజకీయపరిజ్ఞానము ననుభవమువలన గ్రహించుటకుగల యవకాశముల పోగొట్టుకొనెను. ఇత డొకసారి ఖాందహారుపై సైన్యమును గొని దండువెడలెను. కాని యుద్ధముచేయుదక్షత లేనివాడగుట నోడిపోయెను. అందువలన దారా యుద్ధతంత్రమున దక్షతారహితుడే. ఇత డెల్లప్పుడు రాచనగళ్లలోనే కాలము గడపిన సుకుమారుడు. ఇతనికి సుగుణగణమున జేర్పదగిన గుణములు కొన్ని గలవు. ఇతడు తన కెట్టివిషమపరిస్థితులు కల్గినను అకలుషితమానసముతో ఆయాపరిస్థితుల ననుసరించి తనజీవితమార్గమును సంస్కరించుకొని మెలగగల్గెడు శ్లాఘనీయమగు సామర్థ్యము గలవాడు. ఎట్టి వ్యత్యస్తవిభవము గలవాడయ్యు ఉదాత్తమహత్వహృదయముగలవాడగుట ఎట్టివైభవలక్ష్మీరూక్షవీక్షణములనైన నిర్భయముగ భరింపగల్గును. అసాధారణమగు విరక్తభావముల వినోదింపగలవాడు. ౧౦౬౮-వ సం. హిజ్రాతరువాత షాజహానునకు జబ్బుచేసినప్పుడు

*దారాషికూ రచించిన 'మజ్మాల్ బెహరైన్' (హిందూ మహమ్మదీయమతము లనెడి సంద్రములకలయిక) అను పర్షియనుకావ్యము: కలకత్తా ప్రెసిడెన్సీకాలేజీలో పర్షియన్ అరబిక్ భాషోపాధ్యాయులగు మహాఫజ్ అల్ హాగ్ గారి (ఎమ్. ఎ.,) వ్యాఖ్యతో ప్రకటింపబడినగ్రంథమునుండి.

సింహాసనమునకై యాతనికొమరులు నల్వురు ఒండొరులతో యుద్ధముచేయునవసరమున దారాకూడ ఒక సైన్యమును నడిపించుకొనుటలో తననాయకత్వమును ప్రకటించుటకు తనసామర్థ్యమును వినియోగించినను, మంచిరాజ్యతంత్రమున ప్రజ్ఞామహితుడును, నాయకాగ్రేసరుడును నగు ఔరంగజేబునకు మాత్రము సాటి యనిపించుకొనలేకపోయెను. షూజా, ఔరంగజేబు, మూరాదులను సోదరులు ముప్పురును తమ గొప్పసైనికదళములతో ఆగ్రాపైకి దండెత్తిరి. దారా వారి నెదుర్కొనజాలకపోయెను. 'సముఘర్' అనుస్థలమున నన్నదమ్ములకు జరిగిన ఘోరసంగ్రామమున దారా యోడిపోయి పారిపోవలసినవా డయ్యెను. అచ్చట నుండి దారా ఆగ్రా, లాహోరు,ముల్టాన్, భాక్కర్, గుజరాతము, కచ్ మొదలగుస్థలములకు పారిపోయెను. దారా యిటులు పారిపోవునప్పుడు పడినకష్టములు, బాధలు ఒకవిషాదగాథ యగును. ఇతని మిత్రు లితని కష్టకాలమున విడనాడిరి. ఇతని కింతకుమున్ను తోడ్పడుచువచ్చిన మిత్రవర్యులే యితనిని విడనాడిరి. ఇట్టి విషాదజీవితమార్గమున నీత డధికముగ ప్రేమించినట్టియు, నీతనిమనసున కెక్కినదియు, ప్రాణాధికయు నగు 'నాదర్ బీగము' అనుభార్య స్వర్గమలంకరించుటతోనే యీతనిజీవితము దుఃఖపర్యవసాయి యయ్యెను. ఇంతటితో అతడు భగ్నజీవితము గలవాడై సర్వస్వమును దైవసంకల్పమునకై విడచి విరక్తుడై కాలము గడుప నారంభించెను.

ఇతడు దేశమెల్లెడ తిరుగుచుండ మాలిక్ జీవన్ అను ఆఫ్గనువీరునిచే పట్టుకొనబడి ఔరంగజేబుచే పంపబడిన సేనానాయకుల కాపుదలతో ఢిల్లీకి ఖైదీగా గొనిపోబడెను. ఢిల్లీలో ఔరంగజేబు దారా నొక యేనుగుపై కూర్చుండజేసి పురవీథుల నూరేగింపజేసెను.

ఔరంగజేబు, దారా యిస్లామమతమునందు విశ్వాసియై యున్నందుల కతనిని శిక్షింపనెంచి, ఖాజీలను, మౌల్వీలను, మహమ్మదీయన్యాయవేత్తలను పురికొల్పి వారిచే దారాపై కపటవిచారణ, తీర్పు మొదలైనవి జరిపి యతనికి ఉరిశిక్ష విధింపబడునట్లు చేసెను. ఆతీర్పు ననుసరించి ౧౦౬౯-వ సం. హిజ్రా తరువాత ఒకనాటిరాత్రి దారా యురితీయబడెనని చరిత్రవలన తెలియుచున్నది.

దారాషికూ రచించినగ్రంథములు :

ఈతనిగ్రంథములన్నిటినిబట్టి యితడు చిన్నతనమునుండియు సూఫీమతమునం దభిమానము గలవాడని కన్పట్టును. ఈతడు ఇస్లామమతములో సూఫీమతమునకు చెందినవారు రచించినగ్రంథముల నన్నిటిని సవిమర్శముగను, నిశ్శేషముగను చదివి, సూక్ష్మాంశములనెల్ల గ్రహించినట్లు చూపట్టును. ఇతనిగ్రంథములలో నెల్ల సూఫీమతావలంబకుల గ్రంథములలోని సమయోచితమగు వాక్యాళి నుదాహరించుచుండుటయు గలదు.

ఇతడు 'ఖరాను'ను సవిమర్శముగ పఠించి అందలి కొన్నివిషయములపై సందర్భోచితమైనవియు, తనస్వతంత్రవ్యక్తిత్వమును చాటునట్టివియు నగు వ్యాఖ్యలను రచించెను. కొన్నిసందర్భములలో వివాదాంశములపట్ల నితడు ఇదమిత్థమని నిర్ణయించి సారాంశములను తీయుటలో సుప్రజ్ఞామహితుడై తనరినాడు. ఇతడుచేసిన సూఫీమతవిషయకపరిశోధనలవలన వెల్లడియగువిషయ మేమన సత్యముకనుగొనుటలో సునిశితబుద్ధి యేకొలదిమందికో యుండునని. ఈతనిమనస్సు క్రమముగ ఐహికవిషయములపై నాస్థ వీడి పరతత్త్వవిషయములపై నిమగ్నమైయున్న ట్లితనిగ్రంథములవలన తెలియవచ్చుచున్నది.

ఇతనియిరువదియైదవయేట యితని మొదటిగ్రంథము రచింపబడెను. 'సఫీనత్-అల్-ఆలి యా' అని ఆగ్రంథము పేరు. ఆగ్రంథము సూఫీమతతత్త్వమును విపులముగ ఘోషించును. ఇందు నాలుగువందల పదునొకండుగురు సూఫీమతావలంబకులగు సాధువులయు, దైవసాక్షాత్కారముచే పునీతజీవితములుగల మహనీయులయు జీవితములు గలవు. ఇందు మహమ్మదు (మతప్రవక్త) యొక్కయు, అతనిభార్యలయొక్కయు జీవితవిశేషములు వివరింపబడినవి. ఈగ్రంథాంతమున "యిందరుమహనీయుల పవిత్రచారిత్రముల నుల్లేఖించిన తనభవిష్యజ్జీవితము సుఖాలవాలము కాగలదను విశ్వా

సముతో గ్రంథమును ముగించుచున్నాను" అని తెలిపికొనెను.

'ముల్లాషా' యను నితనిసమకాలికు డొకసాధువే యితనిసురువుగా తనగ్రంథమున తెలిపికొనెను. ఇతని వలననే 'ప్రాణాయామము' మొదలగుయోగాభ్యాసముల నభ్యసించెను.

'రిసావేహాక్నుమ' అనుగ్రంథ మితని మూడవ కృతి. ఇది మనుజు డాధ్యాత్మికోన్నతిని బడయుటకు గల సోపానములు, అవస్థలు తెలిపెడునట్టి గ్రంథము. ఈగ్రంథము ప్రతిపాదించుతత్త్వ మెద్దియన, దైవము తన కిష్టుడగు భక్తుని ఆత డెట్టి లౌకికమగుపరిస్థితులలో నున్నను తనవైపున కాకర్షించుకొని యాతనిచే లోకోద్ధరణకార్యముల జేయించునని. "నే నెప్పు డేగ్రంథమును వ్రాయ సంకల్పించినను ఖురానుగ్రంథమునుండి శకునములను * చూచి యాగ్రంథమున లభించిన శకునముల స్వభావానుకూలతలను పరిశీలన మొనరించి యవి ప్రోత్సాహజనకముగ నున్నచో ఆగ్రంథరచనమున కారంభించుచుందు"నని దారా యొకచో తెలిపెను.

'హాక్నుమ' అనుగ్రంథమును, ఇట్టిశకునమును చూచుకొని అనుకూలముగ నున్నందుననే వ్రాసితినని యొకచో దారా తెలుపుచున్నాడు.

దారా వివిధమతతత్త్వములను సవిమర్శకదృష్టితో చదివి (Comparative study of religions) అందలిసారమును గ్రహింప నభిలాష గలిగియుండెను. ఇతడు క్రైస్తవుల మతగ్రంథమగు బైబిలు ప్రాతనిబంధనను, క్రొత్తనిబంధనను చదివి అందు ముఖ్యముగ దావీదుకీర్తనలను, ఇతరగ్రంథభాగములను దీక్షతో పఠించి అందు తనకు కావలసినతత్త్వము లభింపనందున హిందువులమతగ్రంథములగు నుపనిషత్తులను పరిశీలనతో పఠించి యందలి యేబదియధ్యాయములను పరిష్యాను భాషలోని కనువదించెను. ఆగ్రంథమునకు ఉపనిఖాట్ లేక సిర్రీ-ఇ-అక్బరీ అనునామకరణము చేసెను. ఈ గ్రంథమును ౧౦౬౭-వ సం. హిజ్రా వెనుక రచించెను. అనగా ఇతనికి ఉరిశిక్ష విధింపబడుటకు రెండు సంవత్సరములకు పూర్వము. ఈయుపనిఖాట్నందలి గొప్పగుణ మేమన, ఇందలి పరిష్యానుభాష సులలితమైన శైలిచే నొప్పారుచు చక్కగ నర్థమగునట్టిభాష యగుటయే.

దారాకు ఉపనిషన్మతము ఎందులకు తృప్తి కల్గించె ననగా అందు 'దేవు డొక్కడే' అనువిషయమే సిద్ధాంతము చేయబడుటచే.

హిందువులవేదములలో ఏకేశ్వరునిగూర్చిన శ్లోకములు ఇతడు సేకరించి వానినికూడ తన 'ఉపనిఖాట్' గ్రంథమున జేర్చి వానియర్థవివరణము చేసెను. ఇత డుపనిషద్వాక్యములను పరిష్యానుభాషలోనికి సరిగా, అనగా మూలానుసరణముగ అనువదించెను. మూలగ్రంథములగు ఉపనిషత్తుల యర్థములను కాశీనగరమున గల ప్రసిద్ధపండితులవలనను, సన్న్యాసులవలనను తెలిసికొనెను. ఎట్టికఠినమైన సిద్ధాంతముగాని, యెట్టి వేదాంతవిషయముగాని చిక్కువిడక మనస్సు నాందోళనపరచు ఎట్టిక్లిష్టసమస్యగాని యీ యుపనిషత్తులను చదివినట్లయిన నజ్ఞానమనెడు చీకటియు, మంచును భాస్కరప్రభచే తొలగిపోవునటులనే విచ్ఛేదమగునని నాదృఢనిశ్చయమనియు, ఖురానులో సంశయాస్పద విషయములుకూడ ఉపనిషత్తులవలన వీడుననియు దారా తన'యుపనిఖాట్' గ్రంథపీఠికలో తెలిపెను.

---

* ఇట్టి సంప్రదాయాచారము హిందువులలోకూడ గలదు. రామాయణ, భారత, భాగవత, భగవద్గీతాది హిందూమతగ్రంథములలో నేదైన నొకదానిని చేతగొని యుద్దిష్టకార్యమును మనమున నిష్ఠతో ధ్యాన మొనరించుచు, దైవమునుకూడ తలచుచు నిమీలితనేత్రుడై గ్రంథములో నొకానొకచో నొకపుల్ల నుంచి యచట గ్రంథమును తెరచి యచటగల కథాఘట్ట మెట్టిదియో చూచుటవలన తమకార్యము నెరవేరునో లేదో నిర్ణయించుకొందురు. గ్రంథమునుండి శకునములు గొనుటయన నిదే.

'కిటా-ఇ-మక్‌నూన్' అను నొకపరిష్యను గ్రంథమునకూడ మతవేదాంతవిషయకము లగు సంశయాస్పదసమస్యల నన్నిటిని విడగొట్టగల గ్రంథము హిందువుల యుపనిషత్తేయని తెలుపబడినది.

ఉపనిషత్తులను పరిష్యన్‌భాషలోని కనువదించుటలో తనయుద్దేశ మేమని తెల్పుకొనెననగా, "నాకు సంశయాస్పదమగు విషయములన్నియు నీయుపనిషత్తు వలన విడిపోయినందున నాకొరకును, నాసంతతి వారికిని, నాస్నేహితులకును, మతతత్త్వపరిశోధకు లగు నెల్లరకు నుపయోగించునను విశ్వాసమున నీయనువాద మొనర్చితి" ననెను.

భగవద్గీత పరిష్యన్‌భాషలోని కనువదింపబడుటకు దారాయే ప్రోత్సాహకారకు డని "ఇండియా ఆఫీసులైబ్రరీ"లో భద్రపరుపబడిన దారా వ్రాసిన వ్రాతప్రతి నెం. ౧౯౮౯ లోని విషయమువలన తెలియవచ్చుచున్నదట.

దారా పరిష్యన్‌భాషలో గద్యగ్రంథములనే కాక పద్యకావ్యములనుకూడ రచించెను. ఇతని పరిష్యన్‌భాషలోని పద్యము లితనికాలముననే జనులచే చదువబడుచు మెప్పునందుచుండెడివట.

దారా చిత్రకళాదిలలితకళలయం దభినివేశమును, ప్రీతియు నధికముగ గలిగియుండెడివాడు. ఇతడు పరిష్యన్‌లిపిని వ్రాయుటలో కడుసమర్థుడు. సంస్కృతభాషలో రచింపబడిన యోగవాసిష్ఠమను వేదాంతగ్రంథమును దారాయే పరిష్యన్‌భాషలో కనువదింపబడుటకు ప్రోత్సాహకారకుడయ్యెనని చరిత్ర వలన తెలియుచున్నది. ఇందుల కుపబలకముగా నొకవిషయము తెలుపబడుచున్నది.

దారా కొకనాటిరాత్రి స్వప్నమున వసిష్ఠ రామచంద్రులు కనబడినట్లును, రామచంద్రు డేదియో మధురపదార్థమును తినుటకై దారా కిచ్చినట్లును, దారా దానినిగొని భుజించినట్లును కనుపించెను. ఆస్వప్న వృత్తాంతము గడచిన కొంతకాలమునకు తన యాస్థాన విద్వాంసులలో నొక్కనిచే యోగవాసిష్ఠమును పరిష్యన్‌భాషలోని కనువదింపజేసె నని తెలుపబడెను.

ఈ 'మజ్మా-అల్-బెహరైన్' అనునీతనికృతియే యితనిని విచారణచేసి శిక్షింప నియోగింపబడిన ఖాజీలు, మౌల్వీలు, ఇతరధర్మశాస్త్రవేత్తల సమితి యెదుట పరిశోధనకై యుంచబడెను.

వీరీగ్రంథభాగములు చదివి చక్రవర్తియగు ఔరంగజేబుమతమగు 'సునీ' మతమునకు వ్యతిరేకమగు మతము నవలంబించినద్రోహియనియు ఆతనిగ్రంథము ఆతనిమతమున కుపబలము రచించెననియు నేరమారోపించి యాతనికి ఉరిశిక్ష విధించిరి. హిందూమహమ్మదీయ మతసామరస్యమును బోధించు మతగ్రంథరచనమే యాతనియురిశిక్షకు తోడ్పడినదయ్యెను.

---

# నేటి రష్యా

( అనువృత్తము )

నార్ల వెంకటేశ్వరరావు

## విద్య

జారుచక్రవర్తుల పరిపాలనాకాలమున రష్యా విద్యలో చాల వెనుకబడియుండెడిది. అప్పుడు నగరవాసులలో నూటికి ౪౦.౬ వంతులమందియు, గ్రామవాసులలో నూటికి ౭౨.౩ వంతులమందియు నిరక్షరకుక్షులుగ నుండెడివారు. దీనికి ముఖ్యమైన కారణము జారుచక్రవర్తు లవలంబించిన విద్యానీతియే! ప్రభుత్వకోశమునుండి విద్యనిమిత్తము కడుస్వల్పముగ వెచ్చింపబడుచుండెడిది. ఆస్వల్పమొత్తములో నధికాంశము విశ్వవిద్యాలయములే కబళించుచుండెడివి. అందు వలన ప్రాథమికవిద్య కేవలము నామమాత్రముగ నుండెడిది.

దీనికితోడు ఉన్న కొలదివిద్యాలయములలోను బొత్తుగ స్వాతంత్ర్యముండెడిదికాదు. విద్యార్థులు తుదకు గ్రంథాలయమునకు గాని, నాటకప్రదర్శనమునకు గాని వెళ్లుటకుసహితము ఉపాధ్యాయుల అనుమతిని బడయ వలసియుండెడిది. రష్యనుభాష మాతృభాషకానిరాష్ట్రములందుసహితము దానిలోనే బోధనయంతయు గావింపబడుచుండెడిది. పరీక్షలు చాలకఠినముగ నుండెడివి. నూటికి షుమారు ౭౦ మంది తప్పింపబడుచుండెడివారు. ఉపాధ్యాయుల ఆదర్శము విజ్ఞానవ్యాప్తియై యుండుటకుబదులు రాజభక్తిని పెంపొందించుటయై యుండెడిది. దీనికి నిదర్శనముగ నప్పటిపాఠపుస్తకముల లోని క్రిందిసంభాషణను గమనింపుడు:

ప్రశ్న :— నీకు జారు చక్రవర్తియెడ నేయేధర్మములు గలవని మతము బోధించుచున్నది?

ఉత్తరము :— భక్తి, విశ్వాసము, ప్రేమ, సేవ, సిస్తులను సరిగచెల్లించుట. వీనినన్నిటిని భక్తివిశ్వాసములను వానిలో నిమిడ్చి చెప్పవచ్చును.

అసలు అంకెలతోను, పాఠపుస్తకములలోని ప్రశ్నోత్తరములతోను పనియేలేదు. మూడవ అలెగ్జాండరుచక్రవర్తి యొకసందర్భమున నెట్లువ్రాసెనో గమనింపుడు: "కర్షకులు తమపుత్రులను పాఠశాలలకు పంపుట కడువిచారణీయమైన విషయము." అతడే మరొకసందర్భమునం దిట్లువ్రాసెను: "విద్యను రద్దు చేయవలెను." పాలకుల దృక్పథ మిట్లున్నప్పుడు విద్య వ్యాప్తిగాంచలేదనుటలో నాశ్చర్యములేదుగదా!

ఇట్లు విద్యవిషయమునందు వెనుకబడియున్న దేశములో ప్రజామోదకరముగ ప్రభుత్వమేర్పడి నప్పుడు దాని ప్రథమకర్తవ్యము విద్యావ్యాప్తిని గావించుటయేగదా! అందుచే సోవియటుప్రభుత్వము అధికారమునకు వచ్చినంతనే దానివిషయమై విశేషశ్రద్ధను వహించెను. ప్రత్యేకముగ లెనినుగారిధర్మపత్ని విద్యావ్యాప్తికై పాటుపడసాగెను. ఈ ప్రయత్నములఫలితముగ ప్రతిప్రదేశమందును విద్యాలయములు మొలకలెత్త నారంభించెను. ౧౯౧౪-వ సం. పు జర్మను సంగ్రామమునకు పూర్వము రష్యాలో ౭౨,౩౬,౦౦౦ మంది విద్యార్థులుమాత్రమే యుండెడివారు. కాని ౧౯౨౦-వ సం. ము నాటికి వారిసంఖ్య ౯౨,౧౧౦౦౦ కు పెరిగెను. ఇంతలో దురదృష్టవశమున దేశములో నంతఃకలహములు చెలరేగుటయు, విదేశములతో యుద్ధములు పొసగుటయు సంభవించెను. అందుచే ౧౯౨౨-వ సం. ము నాటికి విద్యార్థులసంఖ్య ౬౫,౦౫,౦౦౦ వరకు తగ్గిపోయెను. తదుపరి శాంతి నెలకొనుటవలన తిరిగి విద్యార్థులసంఖ్య క్రమముగ పెంపొందసాగెను ౧౯౨౫-వ సంవత్సరములో వారిసంఖ్య ౯౭,౯౭,౦౦౦ వరకును, ౧౯౨౯-వ సంవత్సరములో ౧,౧౭,౯౦,౦౦౦ వరకును వృద్ధినందెను. ఈయభివృద్ధి మరియొకవిధముగ కూడ పేర్కొనవచ్చును. ౧౯౧౪-వ సంవత్సరములో

చదువుకొనుటకు తగినవయస్సు (School age) గల బాలబాలికలలో కేవలము నూటికి ౪౫ మొదలు ౫౦ మందిమాత్రమే పాఠశాలల కేగుచుండిరి. కాని ౧౯౨౯-వ సంవత్సరము వచ్చుసరికి వారిసంఖ్య నూటికి షుమారు ౯౩ మందివరకు హెచ్చెను.

ఈ మధ్య నే రష్యాలోగలిగిన విశేషవిద్యావ్యాప్తి క్రింద పేర్కొనబడిన పట్టికవలనకూడ విశదము కాగలదు:—

| | పురుషులలో విద్యగలవారు (నూటికి) | స్త్రీలలో విద్యగలవారు (నూటికి) |
|---|---|---|
| ౧౮౯౭ | ౩౩.౭ | ౧౧.౭ |
| ౧౯౨౦ | ౪౪.౬ | ౨౫.౮ |
| ౧౯౨౧ | ౪౬.౬ | ౨౭.౮ |
| ౧౯౨౭ | ౫౮.౨ | ౪౪.౪ |

పైపట్టికవలన ౧౮౯౭-౧౯౨౦ సంవత్సరముల మధ్యకాలములో, అనగా ౨౪ సంవత్సరములలో నెంత విద్యావ్యాప్తి జరిగినదో అంతకు కొంచె మెక్కుడుగనే ౧౯౨౧ ౧౯౨౭ సంవత్సరముల మధ్యకాలములో(అనగా ౬ సంవత్సరములలో) జరిగినట్లు తేటతెల్లమగుచున్నది.

ఇట్లు సోవియటుప్రభుత్వాధికారముక్రింద విద్య కడువ్యాప్తిగాంచెను. ఐనను ౧౯౩౦-వ సంవత్సరములో గ్రామములందింకను ౧౫ సంవత్సరముల మొదలు ౩౫ సం.ల వయస్సుగలవారు ౧,౮౦,౦౦,౦౦౦ మంది నిరక్షరకుక్షులు మిగిలిపోయిరి. అందుచే ౧౯౩౧-వ సంవత్సరములో సోవియటుప్రభుత్వము ౮ సంవత్సరముల ప్రాయముదాటిన బాలబాలికల కందరికిని నిర్బంధోచిత ప్రాథమికవిద్యను ప్రవేశపెట్టెను. దీనివలన ౧౯౩౧-వ సంవత్సరములో విద్యార్థులసంఖ్య ౧,౬౦,౦౦,౦౦౦ వరకును పెంపొందెను.

ఈరీతిగ విద్యాభివృద్ధిని గాంచుటకు వలయు ధనమును ఇచ్చించుటకు సోవియటుప్రభుత్వము వెను దీయుటలేదు. జారుచక్రవర్తు లెప్పుడును విద్యనిమిత్తము ౩౮,౧౦,౦౦,౦౦౦ రుబుల్సుకన్న అధికముగ వ్యయ మొనర్పలేదు. కాని సోవియటుప్రభుత్వము ౧౯౩౦-వ సంవత్సరములో ౧౦౦,౦౦,౦౦,౦౦౦ రుబుల్సును, ౧౯౩౧-వ సంవత్సరములో ౨౯౦,౦౦,౦౦,౦౦౦ రుబుల్సును ఖర్చుపెట్టెను.

సోవియటుప్రభుత్వము విద్యార్థులసంఖ్యను పెంపొందించుటకేకాక, ఉపాధ్యాయులసంఖ్యనుకూడ తగినట్లు వృద్ధిగావించుటకు యత్నించుచున్నది. ౧౯౩౦-వ సంవత్సరమునందు రష్యాలో ౩ లక్షలమంది ఉపాధ్యాయులుండిరి. ఇప్పుడు వారిసంఖ్య మరింత పెరిగినది.

కేవలము విద్యావ్యాప్తిని గావించుటతోనే సంతృప్తినందక, సోవియటుప్రభుత్వము విద్యావిధానములో సహితము నూత్నపథములను త్రొక్కుచున్నది. జారుచక్రవర్తుల పరిపాలనసమయమున రష్యనుభాషలోనే విద్య గరుపబడుచుండెడిది. దీనివలన రష్యనుభాష మాతృభాష కానివారికి విద్యనభ్యసించుట కష్టమనిపించెడిది. సోవియటు ప్రభుత్వమువారు పై పద్ధతిని విసర్జించి మొత్తము ౩౬ భాషలలో విద్యను గరపుచున్నారు. మైనారిటీసంఘములకు చెందినవారికందరికిని పాఠపుస్తకములను సప్లయిచేయుటకు మాస్కోనగరమున ప్రత్యేకముగ నొకముద్రణాలయము స్థాపింపబడినది. ఈ ముద్రణాలయము ౧౯౧౭-వ సంవత్సరములో ౨,౮౦,౦౦,౦౦౦ తావుల (తావునకు దాదాపు ౪౦,౦౦౦ అక్షరములుండును) పఠనగ్రంథములను అచ్చువేసినది. మైనారిటీసంఘముల విద్యాలయములకు తగిన ఉపాధ్యాయులను సప్లయిచేయుటకుగాను ప్రత్యేకము కొన్ని ట్రెయినింగుపాఠశాలలుకూడ నెలకొల్పబడినవి.

బాలబాలికలకు జీతములు లేకుండగనే విద్య గరుపబడుటయేకాక, కలము, కాగితములును, పఠనగ్రంథములును, ప్రయాణపుఖర్చులును, ప్రాతఃకాల భోజనమును ఉచితముగ నొసగబడును. ఇట్లే తదితర సౌకర్యములన్నియును గావింపబడును. జారుచక్రవర్తుల రాజ్యకాలమునం దొక్కొక్క విద్యార్థినిమిత్తము ౮ మొదలు ౧౨ రుబుల్సువరకు ఖర్చుపెట్టబడుచుండెడిది. కాని సోవియటుప్రభుత్వము ౧౯౨౯-వ సంవ

త్సరములో నొక్కొక్క విద్యార్థికి ౪౩ రుబుల్సు చొప్పునను, ౧౯౨౯-వ సంవత్సరములో ౫౭ రుబుల్సు చొప్పునను, ౧౯౩౦-వ సంవత్సరములో ౬౩ రుబుల్సుచొప్పునను వెచ్చించెను.

పాఠశాలపరిపాలనను సామాన్యముగ విద్యార్థులే కొనసాగించుచుందురు. వారే పాఠశాలతరఫున వ్రాత పత్రికలనుకూడ నడుపుచుందురు. విద్యార్థులు కేవలము పఠనగ్రంథములతోను, పరీక్షలతోను సంతృప్తినందక పెక్కు జాతీయవ్యవహారములందుసహితము పాల్గొనుచుందురు. అనాథలకు సహాయమొనర్చుట, గ్రంథాలయములలోను, పఠనమందిరములలోను ఉపన్యాసములు మొదలగువాని నేర్పరుచుట, గ్రామపారిశుద్ధ్యమును పెంపొందించుట, అవిద్యను పోదోలుట, బాలబాలికల సభలను జరుపుట, వ్యవసాయములో నభివృద్ధిప్రదములగు మార్గములను ప్రవేశపెట్టుట, జ్ఞానాభివృద్ధిదాయకమైన వాఙ్మయమును పంచిపెట్టుట మున్నగు పెక్కు విషయములందు వారు కడుశ్రద్ధనువహింతురు. స్వీయజ్ఞానాభివృద్ధికి వినోదయాత్రలకును, యంత్రాలయములు, చిత్రవస్తుప్రదర్శనశాలలు మున్నగువానిని దర్శించుటకును అవకాశము లభించినప్పుడెల్ల వెడలుచుందురు.

ఇట్లు బాలబాలికలకేకాక అంధులకు, బధిరులకు, కార్మికులకు, కర్షకులకు, సైనికులకు, నావికులకు, తదితరపౌరులందరికిని విద్యగరపుటకు ప్రబలయత్నములు సలుపబడుచున్నవి. ఇందులకుగాను వార్తాపత్రికలు, సినిమాప్రదర్శనములు, నాటకరంగములు, సంచారగ్రంథాలయములు, రేడియోలు, చిత్రవస్తుప్రదర్శనశాలలు మున్నగుసాధనములన్నియు సాధ్యమైనంతవరకు నుపయోగింపబడుచున్నవి. స్థలసంకోచముచేతనే వీని నన్నిటినిగూర్చి విపులముగ వ్రాయుటకు వీలుపడుటలేదు.

విద్య యిట్లు సర్వతోముఖముగ నభివృద్ధినందుచుండుటవలన రష్యాలో వార్తాపత్రికలు, గ్రంథములు మున్నగువాని ప్రకటన నానాటికిని హెచ్చుచున్నది. ౧౯౧౩-వ సంవత్సరములో రష్యాయందు షుమారు ౧౦౬౩ వార్తాపత్రికలే ప్రకటింపబడుచుండెడివి. కాని ౧౯౨౪-వ సంవత్సరములో వానిసంఖ్య ౫౮౦ వరకు పెరిగెను. ఇట్లే ౧౯౧౩-వ సం. లో ౧౧,౯౦,౦౦,౦౦౦ గ్రంథప్రతులుమాత్రమే ముద్రింపబడెను. కాని ౧౯౨౪-వ సంవత్సరములో వానిసంఖ్య ౨౫,౩౦,౦౦,౦౦౦ వరకు పెంపొందెను.

అచిరకాలములో నీ రష్యాదేశములో నవిద్య రూపుమాసిపోగలదు. భారతదేశమునకుకూడ నట్టి యదృష్ట మెప్పుడబ్బునోగదా!

## స్త్రీలు

నేటి రష్యనుసంఘములో స్త్రీలకు గల స్థానమును పరిపూర్ణముగ నవగాహ మొనర్చుకొనవలెనన్న వారి పూర్వస్థితినిగూర్చి క్లుప్తముగనైనను కొంత తెలిసికొనవలెను. జారుప్రభుత్వకాలమున రష్యాలో స్త్రీలకు రాజకీయముగగాని, సాంఘికముగగాని, ఆర్థికముగగాని లేశమైనను స్వాతంత్ర్య ముండెడిదికాదు. విద్య మొదలే సున్న. ఆదినములలో స్త్రీలు కేవలము గృహకృత్యములను నిర్వహించు దాసీజనముక్రిందను, పురుషుని కామలిప్సను దీర్చుసాధనములక్రిందను, సంతానము నుత్పత్తి గావించు యంత్రములక్రిందను పరిగణింపబడెడివారు.

ఇట్టియెడ స్త్రీలకు వివాహవిషయములో నిసుమంతయైనను స్వాతంత్ర్య ముండెడిదికాదని వేరుగ చెప్పనక్కరలేదుకదా! సాధారణముగ తండ్రియే పుత్రికలకు వరుని నిశ్చయించుచుండెడివాడు. ఈ నిశ్చయములో బుత్రికసౌఖ్యముకన్న తనకులభించు కన్యాశుల్కమునుగూర్చియే యెక్కుడుశ్రద్ధ వహించెడివాడు. చర్చియాజమాన్యమున జరుగు వివాహములే చట్టసమ్మతమైనవిగ భావింపబడుచుండెడివి. భర్త యెట్టివాడైనను భార్య అతనియెడ సుగుణములకు మనుసులొత్తుచు భయభక్తులతో మెలగుచుండవలెనని చర్చి ఆదేశించుచుండెడిది. డైవోర్సు (విడాకులు) పొందుట బహుకష్టముగ నుండెడిది. భర్త వ్యభిచరించెనని సాక్షులద్వారా రుజువు చేయగలిగినప్పుడుమాత్రమే డైవోర్సును బడయుటకు

వీలగుచుండెడిది. భార్య తనతో కాపురముచేయుటకు నిరాకరించినప్పుడు ఆమెను బలవంతముగ లాగికొనుపోవుటకును, వ్యభిచరించినప్పుడు కారాగారమున బెట్టించుటకును భర్తకు అధికారముండెడిది. పిత్రార్జితములో ౧౩ వంతులు కుమారునికిని, ౧ వంతు మాత్రము కుమార్తెకును సంక్రమించుచుండెడిది. భార్యఆస్తిపైన భర్తకు సర్వాధికార ముండెడిది.

ఇట్లు సర్వవిధములను స్త్రీలను నీచముగను, నికృష్టముగను చూచుచుండుటవలన నాటి రష్యనుసంఘము పెక్కుఅనర్థములకు గురియగుచుండెడిది. నేడు భారతదేశమున నున్నట్లే శిశుమరణములు చాలహెచ్చుగనుండెడివి. సగటున నూటికి ౨౬ మంది శిశువులు జననమందినసంవత్సరములోపుగనే మరణించుచుండెడివారు. కొన్నికొన్నిప్రదేశములలో శిశుమరణసంఖ్య నూటికి ౬౫ వరకుగూడ ప్రాకుచుండెడిది. తగు వైద్యసహాయము లభింపకుండుటవలన ప్రసూతిసమయమున పెక్కుమంది తల్లులు మరణించుచుండెడివారు. పడుపువృత్తి విపరీతముగ వ్యాప్తినందుచుండెడిది. దీనిని చట్టము సహిత మామోదించుచుండెడిది. అనాథబాలబాలికలసంఖ్యాకముగ నదీనదములలో విసరివేయబడుచుండెడివారు. ధర్మపత్నికివినా జనించిన సంతానమునకు తండ్రి తన యాస్తిలో గొంతభాగ మివ్వదలచినను చట్ట మంగీకరించెడిదికాదు. ఇట్లే మరి పెక్కు దురాచారములు ప్రబలముగనుండెడివి.

తా నధికారమువహించినంతనే సోవియటు ప్రభుత్వము పైనపేర్కొనబడిన ఘోరదురాచారముల నన్నిటిని రూపుమాప సమకట్టి పెక్కుచట్టములను గావించెను. ఆచట్టముల ఫలితముగ స్త్రీలకు రాజకీయముగను, సాంఘికముగను, ఆర్థికముగను, వేయేల, సర్వవిధములను పురుషులతోబాటు సమానమగు ప్రతిపత్తి లభించెను ఒకానొక సందర్భమున లెనినుమహాశయుడు "ప్రతి వంటమనిషికిని రాజ్యపరిపాలన తెలిసియుండవలెను. (Every cook should learn how to govern the state)" అని ప్రకటించియుండెను. అట్టియెడ స్త్రీలకు పురుషులతోబాటు సమానమగు ప్రతిపత్తి యొసగబడుటలో నాశ్చర్యము లేదుగదా!

నేటి రష్యనుచట్టము స్త్రీలకు వోటింగుఅధికారము నిచ్చినది. మైనారిటీదాటిన ప్రతిస్త్రీ— ఆమె వివాహితయైనను, అవివాహితయైనను, విధవయైనను, సధవయైనను —వోటుచేయవచ్చును. అధికసంఖ్యాకులచే నెన్నుకొనబడినప్పుడామె యెట్టియున్నతపదవినైనను అధిష్ఠింపవచ్చును. చట్టముపై రాజకీయాధికారములను స్త్రీలకు ప్రసాదించినను ప్రప్రథమమున వారు వాటిని విరివిగ నుపయోగించుకొనలేదు. దీనికి తరతరములుగ వచ్చుచున్న దాస్యము శల్యగతమగుటయే ముఖ్యకారణము. చాలకాలము పంజరనిబద్ధమైయున్న కీరము స్వేచ్ఛలభించినప్పుడుసహితము రెక్కలువిప్పుకొని వినిర్మలాకాశపథమున నెగసిపోవుటకు వెరచుచుండుట మన మెరిగినవిషయమేగదా! ఇట్లే రష్యను స్త్రీలును స్వేచ్ఛలభించిన తొలుదొల్తదినములలో వర్తించిరి. కాని కాలక్రమమున వారు రాజకీయాధికారములను పరిపూర్ణముగ నుపయోగించుకొననారంభించిరి. నేడు పెక్కుమందిస్త్రీలు గ్రామ, పట్టణసంఘముల (Village and Town Soviets) కు అగ్రాసనాధిపతులుగ పనిచేయుచున్నారు. మహమ్మదీయమతము ప్రాబల్యముతోనున్న సోవియటురాజ్యభాగములందుసహితము స్త్రీలు వోటింగుచేయునిమిత్తము పరదాను పూర్తిగ విసర్జించుచున్నారు. వీరిలోనే పెక్కుమంది సభ్యత్వమునకు సహితము పోటీచేయుచున్నారు. ౧౯౨౬-వ సంవత్సరమునాటికే రష్యాప్రాగ్దేశమందు (Asiatic Russia) ౧౬,౦౦౦ మంది స్త్రీలు స్థానికపుసోవియటుసంఘములలో స్థానమును బడయగలిగిరి.

ఇట్లే సాంఘికముగగూడ పెక్కుసంస్కరణములు ప్రవేశపెట్టబడెను. 'సివిలు' వివాహముమాత్రమే చట్టసమ్మతము గావింపబడెను. ఇట్లని మతమునకు వివాహముతోగల సంబంధమంతయు త్రెంచివేయబడెనని భావింపరాదు. నేటికిని మతసిద్ధాంతములపై విశ్వాసముగలవారు తదనుగుణ్యముగనే పరిణయమును జరిపించుకొన

వచ్చును. కాని వారుసహితము మున్ముందు వివాహముల "రిజిస్ట్రేషను ఆఫీసు"నుండి తగిన "సర్టిఫికెట్టు"ను బడయవలెను.

నేడు రష్యాలో వివాహముగావించుకొనుట కడుసులభము. వధూవరులే "రిజిస్ట్రేషను ఆఫీసు" వద్దకైనను వెళ్లి స్వల్పమైన రుసుమును చెల్లించినచో పది, పదిహేనునిమిషములలో పరిణయమహోత్సవమంతయు పూర్తికాగలదు.

వివాహము గావించుకొనుట యెంత సులభమో, డైవోర్సును బడయుటకూడ నంత సుకర మొనర్పబడినది. దంపతులిర్వురును డైవోర్సును కోరినచో క్షణములో దానిని 'రిజిస్ట్రేషనుఆఫీసు' ద్వారా బడయవచ్చును. దంపతులిర్వురిలో నొకరుమాత్రమే డైవోర్సును కోరినప్పుడుమాత్రము కోర్టునకు వెళ్లవలసియుండును. అప్పుడైనను కోర్టువారు డైవోర్సును కోరుటకుగల కారణములనుగూర్చి ప్రశ్నింపరు. సంతానపుసంరక్షణ, డైవోర్సిచ్చుట నుభయపక్షములపోషణ మున్నగువిషయములను గూర్చిమాత్రమే విచారించి తమనిర్ణయమును గావింతురు. తదితరపాశ్చాత్యదేశములందు నేటికిని సతీపతులలో నెవరో యొకరు వ్యభిచరించినప్పుడుగాని, కడుక్రూరముగనో, నిర్లక్ష్యముగనో వర్తించినప్పుడుగానిమాత్రమే డైవోర్సు ఇవ్వబడును. ఇది చాలతప్పనియు, భార్యాభర్తలలో నెవరైననొకరు అడిగినంతమాత్రముననే డైవోర్సు నిచ్చుట సంఘమునకు శ్రేయస్కరమనియు బెర్నార్డుషాగారు తమగ్రంథములలో నొకదానియందు (in Getting Married) వాదించిరి. చూడగ సోవియటుప్రభుత్వము వారు షా గారివాదము నమలునందుంచినట్లున్నారు.

ఈ సందర్భముననే వివాహమునుగూర్చియు, విడాకులనుగూర్చియు మరికొన్ని నిబంధనలనుసహితము పేర్కొనవలసియున్నది. సోవియటుప్రభుత్వపుచట్టము ప్రకారము ౧౬ సంవత్సరములవయస్సునకు లోబడిన బాలికకుగాని, ౧౮ సంవత్సరముల ప్రాయముకన్న తక్కువగల బాలునికిగాని వివాహముచేయుటకు వీలులేదు. ఈనిర్ణీతప్రాయములకు దంపతులలో నెవరి వయస్సు తక్కువయైనను వారివివాహము వెంటనే రద్దగును. ఐతే నిర్ణయింపబడినప్రాయములకన్న వధూవరుల వయస్సు తక్కువగనున్నదని ఋజువైన తేదీనాటికి వారికి సంతానము కలిగినను లేక గర్భధారణ జరిగినను వివాహము రద్దుకానేరదు. బహుపత్నీత్వము చట్టవిరుద్ధము. వివాహితుడైన పురుషుడుగాని, స్త్రీగాని డైవోర్సును పొందకయే పునర్వివాహముగావించుకొనిన శిక్ష విధింపబడును. పిచ్చివారుగాని, మందమతులుగాని వివాహముగావించుకొనరాదు. వివాహమైనపిదపసహితము స్త్రీ తనపూర్వ నామధేయము నిచ్చవచ్చినచో యథాతథముగ నుంచుకొనవచ్చును. భర్త గ్రామాంతరముననగాని, స్థలాంతరముననగాని నివాసమేర్పరుచుకొనినప్పుడు భార్య యిష్టమైనచో నతని ననుగమింపవచ్చును. లేదా, యాప్రదేశమునందే యుండవచ్చును.

ధర్మయుతముగ వివాహమైనప్పుడుకలిగిన సంతానమున కెట్టిహక్కులు గలవో, అవివాహితుల సంతానమునకు (illegitimate children) కూడ నట్టిహక్కులే ప్రసాదింపబడినవి. అవివాహితయగు స్త్రీకి గర్భము వచ్చినచో నామె ప్రసవకాలమునకు మూడుమాసములు ముందుగ నెప్పుడైనను 'రిజిస్ట్రేషనుఆఫీసు'నకు వెళ్లి గర్భధారణకు కారకుడైనవాని నామమును తెలుపవచ్చును. ఇట్లు తెలుపబడిన రెండువారములలోగా కారకుడైనట్టివా డేయభ్యంతరమును తెలుపకపోయినగాని, లేక తాను కారకుడను గానని నిరూపింపలేకపోయినగాని జననముకానున్న శిశువును పోషించుభారమంతయు నతనిపై వేయబడును.

గర్భవిచ్ఛిన్నము గావించుకొనుట కొన్నికొన్ని సందర్భములందు చట్టసమ్మతమొనర్పబడినది. అదివరకే నలుగురైదుగురు సంతానముగల కార్మికురాండ్రుగాని, తిరిగి గర్భమును ధరించుటవలన ఆరోగ్యము పరిపూర్ణముగ భగ్నమగునని వైద్యులుచెప్పినప్పుడుగాని, ఆర్థికస్థితి కడుక్లిష్టముగ నున్నప్పుడుగాని గర్భవిచ్ఛిన్నము గావించుకొనుటకు చట్టము అనుమతించును.

కాని ప్రభుత్వపు టుత్తరవును బడసిన వైద్యులు మాత్రమే గర్భవిచ్ఛిన్నము గావింపవలెను. గర్భవిచ్ఛిన్నము చట్టసమ్మతమొనర్పబడుటవలన రష్యాలో ననాథ బాలబాలికలసంఖ్య తగ్గినదనియు, శిశుమరణములు క్షీణించినవనియు కొందరు చెప్పుచున్నారు. కాని దీని వలన సత్ఫలితము కలిగినదో లేదో నిర్ధారణగ నుడువుట కష్టము.

ఇట్లే ఆర్థికముగకూడ పెక్కు సంస్కరణములు ప్రవేశపెట్టబడినవి. వీనినిగూర్చి స్థలసంకోచకారణమున విపులముగ వ్రాయ సాధ్యపడదు. పైగా కార్మికుల రాండ్రకు కల్పింపబడిన ప్రత్యేకసౌకర్యములనుగూర్చి పూర్వ మీవ్యాసమునందొకచో వ్రాసియుంటిని. ఈ సంస్కరణములన్నిటికిని స్త్రీలకు సాధ్యమైనంతవరకు పురుషులతోబాటు సమానమగు ప్రతిపత్తి నొసగుటయే మూలసూత్రమని చెప్పిన చాలును. సంఘసుస్థిరత్వమునకు (Perpetuation of Society) స్త్రీలు ముఖ్యకారకు లగుటచే వారికొన్నొకచో ప్రత్యేకాధికారములను సహితము కల్పించుటకు ప్రయత్నింపబడినది.

ఈవిపులసంస్కరణములవలన మొత్తముమీద సత్ఫలితములే కలిగినవి. ౧౯౨౪-వ సంవత్సరమునాటికి శిశుమరణసంఖ్య నూటికి ౧౪ వరకు తగ్గినది. ఇప్పుడిది మరింతతగ్గిపోయినది.

ఏదియెట్లున్నను రష్యాలో నేకొకనూత్నసంఘ నిర్మాణమునకు ప్రయత్నములు జరుగుచున్నవని చెప్పక తప్పదు. ఈప్రయత్నములలో సోవియటుప్రభుత్వము వారు పలుచోట్ల పొరబడియుండవచ్చును. ఐనను సోవియటుప్రభుత్వము అధికారముగ్రహించి నిండుగ నిరువది సంవత్సరములైనను కాలేదుగదా! అందుచే వారిప్రయత్నములు సఫలీకృతములైనవో, కాలేదో నిర్ణయించుటకు ముందు మరికొంతకాల మోపికపట్టుట మంచిది.



ఏ మి టీ !

—వి. సూర్య.




మంగిపూడి వేంకటశర్మ

## ౨౩. గుమ్మిడిపండు

ఆటపెద్ద బట్టలో (చాటున) చేతు లుంచుకొని ఏదోయొకవ్రేలు విరుచుకోవలయును. పిమ్మట తన రెండు చేతులును బయటికి చాచి ఎవరి కేవ్రేలు కావలెనో వారి నావ్రేలు పట్టుకొమ్మని చెప్పవలయును. అప్పు డందరును ఒక్కొక్కవ్రేలు పట్టుకొనవలయును. అట్లు పట్టుకోగా నెటికవిరిచిన వ్రేలు ఎవరు పట్టుకొందురో వారు అయిపోయినట్టు (అంటుఅయినట్టు). కనుక ఆబాలి



కను ఆటపెద్ద ఒకచేతితో కన్నులుమూసి రెండవచేతితో ఆమెచేయి పట్టుకొని బాలికల నందరిని వరుసగా నుంచి "వీణావీణ గుమ్మడిపండు, వీ రెవ్వరు" అనిగాని, "అమ్మకొమ్మ వీ రెవరు?" అనిగాని ఒక్కొక్క బాలికకేసి చూపుచూ అడుగవలయును. అప్పుడు ఆబాలిక పేరు | చెప్పినయెడల ఎవరిపేరు చెప్పుకొనునో ఆబాలికను కన్నులుమూసి మునుపటివలెనే అడుగవలయును. ఎవరిపేరును ఆలాగు చెప్పలేనియెడల అందరును దూరముగా పోయి దాగుకొనవలెను. తరువాత ఆడుకవచ్చు బాలిక పరుగెత్తుకపోయి యెవరినైన ముట్టుకొన్నయెడల ఎవరిని ముట్టుకొనునో ఆమెకు కన్నులు మూయవలెను. దాగుకొన్న బాలికలందరు అంటుపడిన బాలికకు దొరకకుండ పరుగెత్తివచ్చి ఆటపెద్దను ముట్టుకోవలెను. అప్పుడు ఎవరిని ముట్టుకొననియెడల మొదటి బాలికకే కన్నులుమూయవలయును. ఇద్దరిని ముట్టుకొన్నయెడల 'సూర్యుడుమైనము' వలెనే పేర్లుచెప్పుకొని రమ్మని ఓడిపోయినవా రెవరో నిశ్చయింపవలెను. రెండుచేతులను పదివ్రేళ్లుండునుగాన పదిమందికంటె ఆడుకొనే బాలికలు ఎక్కువయున్నయెడల ఆటపెద్ద కూర్చుండి కాలివ్రేళ్లు, చేతివ్రేళ్లుకూడ కప్పి ఏదోయొకవ్రేలు విరువవచ్చును.

## ౨౪. గిరిదాగుడుమూతలు

ఆటపెద్ద (నమస్కారముచేయునట్లు) అరచేతులు అంటకట్టుకొని ఆఅరచేతులనడుమ జానెడు పొడుగుగల దారముగాని, తడపగాని కొస పైకికనబడునట్టుగా ఉంచి ఒక్కొక్కబాలికనే ఆకొన పట్టి కొంచెముకొంచెముగా లాగుమని చెప్పవలయును. అట్లు లాగునపుడు ఏబాలిక లాగినపుడు ఆతడప ఆఖరై పోవునో ఆబాలిక అంటుయినట్లు. కనుక ఆబాలిక ఆడుకొనివచ్చునదిగా యెరుగవలయును. తరువాత పొడుగుగా ఒకబద్దె (గీత) గీచి ఆగీతకు ఇవతల ఓడిపోయిన బాలికయు, అవతలప్రక్కను తక్కినబాలిక

లందరును నిల్చియుండవలయును. ఆట పెద్ద గీతకు ఈవల, అనగా ఆడుకొనివచ్చు బాలికకు కొంచెముదూరముగా నుండవలయును. గీతకు అవతలనున్న బాలికలందరును కాచుకొనివచ్చు బాలికకు దొరకకుండ పరుగెత్తివచ్చి తల్లిని (ఆటపెద్దను) ముట్టుకోవలయును. ఓడిపోయిన బాలిక గీతయివతలనుండియే ఆబాలికలను ముట్టుకోవలయును. గీతపొడుగునను పోవచ్చునుగాని గీతదాటి అవతలికి పోరాదు. ఎవరైన దొరకుదాక ఆబాలికయే కాచుకొని రావలెను. ఎవరైన దొరకినయెడల దొరకిన బాలిక ఆడుకొనిరావలయును.

## ౨౫. గంజికావిడి

మొదట అందరుబాలికలును వరుసగా కూర్చుందురు. ఇద్దరుబాలికలు ఒకరి చేతివ్రేళ్లసందులందు ఒకరివ్రేళ్లు ఇరికించి గట్టిగా పట్టుకొనియుందురు. ఆ చేతులమీద ఒకరు కూర్చుందురు. అప్పుడు "గంజికావడి



గడగడముద్ద" అని పాడుచూ మోచుకొనిపోయి యొక చోట కూర్చుండబెట్టుదురు. ఇట్లే అందరిని మోచుకపోయి కూర్చుండబెట్టుదురు. అందరు అయినతరువాత ఎవరైన ఇద్దరువచ్చి అందరిని మోసినవారిని మోసికొనివెళ్లి కూర్చుండబెట్టుదురు. మరికొందరు ఇంకొకరీతిగా ఆడుదురు. మోసికొనిపోబడు బాలిక, బాసిపట్టు (బసికే) వేసికొని కూర్చుండి కాలిబొట్టనవ్రేళ్లను చేతులతో గట్టిగా పట్టుకొనును. అప్పుడు ఇద్దరు బాలికలు చెరియొకజబ్బ (దండచెయ్యి) పట్టుకొని "కుంచెడు గంజి, ఒక్కటే మెతుకు" అని పాడుచూ ఎత్తుకొని పోయి యొకచోట కూర్చుండబెట్టుదురు. అందరును అయినతరువాత అక్కడినుండి మొదట గూర్చున్న చోటికి అదేప్రకారము మోచుకొనిపెత్తురు. దీనికి ఓడు గెలుపులు లేవు. ఉద్దీలు వేయనక్కరలేదు.

## ౨౬. ఉడుముతుడుము

బాలికలనందరిని వరుసగా నిలబెట్టి ఆటపెద్ద వారికి ఎదురుగా నిలిచియుండి "ఉడుముతుడుము, తుతేలు మతేలు, పార్లు పలింగు లట్కి లుట్కి ఛైల్" అని ఒక్కొక్కమాటకు ఒక్కొక్కరిని తనచేతివ్రేలితో తాకుచు పాడుచుండవలయును. "ఛైల్" అను మాట యెవరిమీదికి వచ్చునో వారు పండుచుందురు. కనుక నట్టివారు దూరముగా నుండవలయును. ఇట్లు అందరునూ పండినతర్వాత పంక్తిలో నొకరు మిగిలియుందురుకదా! అప్పుడు ఆటపెద్ద తనకును మిగిలిన బాలికకును ఆడవలయును. ఆయిద్దరిలోను పండగా మిగిలినవారు ఓడిపోయినారని గ్రహించవలెను. అప్పుడు ఆబాలికను ఆటపెద్ద తనయిష్టమువచ్చిన ఆకు ఏదైన ఒకటి తెమ్మని చెప్పిపంపవలయును. ఆబాలిక వచ్చులోపల ఇక్కడనున్న బాలికలందరును తలయొకచోటికి పోయి దాగుకోవలయును. ఓడిపోయినబాలిక ఆకుతీసికొని వచ్చి అందరిని వెదకుకొనుచు పోయి ఆకు అందరికిని చూపవలయును. చూపినతరువాత మళ్లీ యథాప్రకారముగా ఆడవలయును. చుట్టుపట్ల ఎక్కడను లేని ఆకుగాని, స్వాధీనముగాని ఆకుగాని తెమ్మని చెప్పగూడదు.

## ౨౭. పందిమొలగుడు

ఆటపెద్ద లిద్దరేర్పడి బాలికల నందరిని ఉద్దీలు వేసి సమముగా పంచుకొని ఎవరు ముందు ఆడుకొని రావలయునో వెనుకటిఆటలలోవలె చిల్లపెంకువూలముగా తెలిసికొనవలెను. తరువాత ఆడుకొనివచ్చువారు ఆటప్రదేశమున నిల్చియుందురు. రెండవవారు దూరముగా పోయి ఛాటున నుందురు. అప్పుడు ఆటచోటున

నున్నవారి ఆటపెద్ద తనవారిలో కొందరిని మరియొక చాటుచోటునకు పంపివేసి తక్కినవారిని వరుసగా వంగి యుండుమని చెప్పి అట్లుచేయించి ఎవ్వరును కన్పడకుండ పైన బట్టలు కప్పి "సరే రావచ్చును" అని రెండవగుంపువారిని కేకవేయును. అప్పుడు ఆగుంపువారు వచ్చి ముసుగులో నున్నవారి పేరులు తప్పులేకుండా చెప్పవలయును. అట్లు చెప్పుటకు ఆటపెద్దగాని, యితరులలో ఎవరయిన యొకరుగాని ప్రతియాటకు ముందుగా నిశ్చయించుకోవలెను. ఆపేరులలో ఒకరిపేరు తప్పినను ఓడిపోయినవారగుదురు. అన్ని పేరులు సరిగా చెప్పినయెడల గెలిచినవారగుదురు. కనుక పేరులు చెప్పలేనియెడల మరలమరల వారే దాగుకొనిరావలయును. చెప్పగలిగినయెడల చెప్పినవారు దాగుకొనిరావలయును. పేరులు చెప్పినప్పుడుగాని, చెప్పలేనప్పుడుగాని మళ్లీ క్రొత్తయాట ఆడుటకుగాని, తప్పుపేరులు చెప్పినపుడు వారికి నమ్మకమునకైగాని ముసుగులు తీసిచూపునపుడు అందరును "పందిమొఱిగో" అని కేకలువేయుచుందురు.

## ౨౮. గుంటెడుగుంటెడు నెయ్యి అల్లల్లకోడి వత్తిపత్తి

ఆటపెద్ద లిద్దరేర్పడి పిల్లలనందరిని సమానముగా పంచుకొని ఒకభాగమువారి కెదురుగా మరియొక భాగమువారు వరుసగా బంతులుదీరి కూర్చుందురు. ఆటపెద్దలిద్దరును సన్నమురాచిన చిల్లపెంకుమూలముగా మామూలుప్రకారము ఆడుకొనిరావలసినవారెవ్వరో నిశ్చయించుకొందురు అట్లు నిశ్చయించినతర్వాత ఎవరిబంతికి వెనుక వారి పెండేసిపెద్ద నిలిచియుండవలయును. తరువాత ఆడుకొనివచ్చుబంతి ( పంక్తి ) వారి పెండేసిపెద్ద తనపంక్తివారి నందరిని చేతులను వెనుకకుపెట్టవలసినదని ఆజ్ఞాపించి తాను చిల్లపెంకు చేతబుచ్చుకొని "అల్లల్లకోడి ఆకుమిరియంబు, పిల్లల్లాకోడి పిండిమిరియంబు, గట్టుమీదకోడి గవ్వమిరియంబు" అని పాడుచూ మొదటిబాలికవద్దనుంచి చివరబాలికవరకు తిరుగుచు ఎవరిచేతిలో పెట్టినది యితరుల కెవరికిని తెలియకుండ ఒకరిచేతులో నుంచి "అప్పలారా! ఒప్పులు గట్టిగా మూయండోయి" అని కేకవేయవలెను. తరువాత అందరును గుప్పిళ్లు గట్టిగా మూసి చేతులు ముందరకు పెట్టవలయును. అప్పుడు రెండవభాగము వారి పెండేసిపెద్ద ఫలానివారిచేతిలో పెట్టినది అని గ్రహించి వారిపేరు చెప్పి ఆకాయ ( పెంకుముక్క ) అడుగవలయును. ఆమె సరిగా చెప్పగలిగినయెడల తరువాతియాట తాను ఆడవలయును. లేనియెడల మొదటివారే మళ్లీ ఆడుకరావలయును. ఇట్లు ఆడగా ఎవరి చేతిలో కాయ యున్నదో చెప్పవలసినవారు చెప్పలేనియెడలఓడిపోయినవారును, కాయదాచినవారు గెల్చినవారును అగుదురు. ఇట్లు ఏభాగమువారైన మూడు మారులు గెలిచినయెడల తమబంతిలో ఒకబాలిక పండినట్లు. అనగా ఆబాలిక ఆటలోనుండి లేచి ఆఆట ఆఖరు అగువరకు అవతల నుండవలయును. వరుసతప్పకుండ మూడుమార్లు గెలువ నక్కరలేదు. ఒకమారు ఒకభాగమువారును, రెండవమారు రెండవభాగమువారును గెల్చినను, వారు రెండుమార్లును, వీరు ఒకమారును గెల్చినను, అవి లెక్కలోనికి రావచ్చును. ఇట్లు ఆడగా ఏభాగమువారు అందరును పండుదురో ఆభాగమువారు పూర్తిగా గెలుపొందినట్లు అగును. అందరును పండుట అనగా చివరకు ఒకబాలిక మిగిలియుండును. అప్పుడు తల్లి (ఆటపెద్ద) తానుగూడ ఆడుకోవలయును.



అనగా తనచేతిలోగూడ కాయ యుంచుకోవచ్చును. తనబంతిలో ఒకరికంటె ఎక్కువమంది బాలిక లున్నప్పుడు తనచేతిలో దాచుకోరాదు. ఏభాగమువారు ఓడిపోవుదురో వారి ఆటపెద్దను కూర్చుండబెట్టి అందరును ఒకసారి గిల్లుదురు.

## ౨౯. అత్తవారింటికి దారేది?

కొందరు బాలికలు ఒకరివెనుక నొకరు వరుసగా నిల్చియుండి ఒకరిబుజము లొకరు పట్టుకొని ముందర నున్న బాలికకాక తక్కినబాలిక లందరును కన్నులు మూసికొని "అత్తవారింటికి దారేది" అనియు, ముందర నున్న బాలిక "ఆమడదూర మున్నది" అనియు పాడుచూ ముందుకు నడచుచుందురు. కొంతదూరము వెళ్లినతర్వాత మళ్లీ వెనుకకు మళ్లి మొదట బయలు దేరినచోటికి అట్లే ఆడుచూ వత్తురు. ఈయాటలో ఓడుగెల్పులు లేవు. ఉద్దీ లక్కర లేదు. ఇంద రుండ వలెనని నియమము లేదు.

## ౩౦. ఆలంకిగుడి

నల్గురు బాలికలు దొడ్డివలె చుండ్రముగా నిలిచి ఒకరిచేతు లొకరు పట్టుకొని అందరును చేతులు పైకెత్తి నిల్చియుండవలయును. తరువాత ఒకబాలిక



చేతులక్రిందినుండి తిన్నగా (యెదురుగా) దూరి యవతలకు పోవలయును. అట్లు పోయిన బాలిక వెనుకకు తిరిగియుండునుకదా! ఇప్పు డందరును అట్లే తిరుగవలయును. కనుక తక్కినముగ్గురును ఎవరిస్థానములో వారే చేతులు విడువకుండ మొదటిబాలిక యవతలికి వెళ్లగా కలిగిన చేతులమెలికను తప్పించుకొనుచూ వెనుకకు తిరుగవలయును. అట్లు అందరును వెనుకప్రక్కకు తిరిగి నిలిచియుండినతరువాత అందరును లంకెలుగా పట్టుకొన్న చేతులు అరచేతులుపయిగా నుండునట్లు క్రిందికి వంచియుంచవలయును. తరువాత ఒకబాలిక తనయొక్క కాలు వెనుకకు చాచి వెనుకప్రక్కను తనకు తిన్నగా నున్న యిద్దరిచేతులయొక్క లంకెమీద, అనగా అరచేతులమధ్యను మీగాలిని తగిలించి యొంటికాలిమీద నిలబడియుండవలయును. తరువాత రెండవ బాలిక మొదటిబాలికయొక్క మోకాలిమడతమీద తనయొక్క యొకకాలి మీగాలిని తగిలించి తానుకూడ యొంటికాలిమీదనే నిల్చియుండవలెను. తరువాత మూడవబాలిక తనయొక్క యొకకాలు రెండవబాలిక కాలి క్రిందినుండి పోనిచ్చి పైకి తీసి తన మీగాలిని మొదటిబాలికకాలితో లంకెవేయవలయును. దీనిపేరు చీలబిగించుట యందురు. ఇట్లు చేయుటవల్ల కాళ్లు ఊడిపోకుండ నుండును. తరువాత నాల్గవబాలిక తన కాలుకూడ పైన తగిలించవచ్చును. ఆటబాలికలు బలముగలవారుగాని, వయస్సువచ్చినవారుగాని అయినయెడల మరియిద్దరుముగ్గురు కాళ్లులంకెవేసి ఆడినను ఆడవచ్చును. లేతబాలిక లైనయెడల బరువెక్కి కాళ్లు నొప్పియెత్తును లేదా బెణుకును. కనుక వీలునుబట్టి జనుల సంఖ్య యుండవలయును ఇట్లు అందరును లంకెలువేసినతరువాత చేతుల లంకెలు విడిచిపెట్టవలెను. అట్లు విడిచినను కాళ్లలంకె లూడిపోవు. తరువాత అంతా చప్పట్లుకొట్టుచూ "ఆలంకి ఆలంకోయి, చందురు బాలంకోయి" అని పాడుచూ మెల్లమెల్లగా తిరుగుదురు. ఒంటికాలిపై నిల్చియుండుటచే అట్లు తిరుగునప్పుడు బాలికలు ఆపుకోలేక పడుచుందురు. అట్లు పడినబాలిక వెంటనే లేవక అరచేతులు నేలపై ఆనుకొనియుండవలెను. అప్పుడు ఆమెను జూచి

"ఎందుకు పడ్డావు" అని అడుగవలెను. "వెదురుపేళ్లకు" అని చెప్పవలెను. "పేళ్లెందుకు" అని అడుగవలెను. "బొట్టుపెట్టెకి" అని చెప్పవలెను. "పెట్టెయెందుకు?" అని అడుగవలెను. "కాటుకకాయ, కుంకుమబరణి పెట్టుకునేటందుకు" అని చెప్పవలెను. "కాటుకకాయ, కుంకుమబరణి యెందుకు?" అని యడుగవలెను. "బొట్టు, కాటుక పెట్టుకోడానికి" అని చెప్పవలెను. "బొట్టు, కాటుకయెందుకు?" అని యడుగవలెను. "అందానికి చందానికి" అని చెప్పవలెను. "అందము చందము ఎందుకు?" అని యడుగవలెను. "అయిదువతనానికి" అని చెప్పవలయును. తరువాత "నీమగడు పసుపుకుంకుమ పట్టుకవచ్చినాడులే" అని అనవలెను. అప్పుడు ఆబాలిక లేచి యథాప్రకారము ఆడవలెను. ఇట్లే యెవరు పడినను ఆడవలెను. కొందరు ఈయాటనే "సిరసిర బండి" అందురు. "ఆలంకి ఆలంకి చంద్రబాలంకి" అనుటకు బదులుగా "సిరసిరబండి చీరాలబండ" అని పాడుదు.

---

# ఆంధ్రపత్రికా భావసంవత్సరాదిసంచిక

ఆంధ్రమహాజనులారా,

ఎప్పటితీరున రాఁబోవు భావ సంవత్సరమునకు సంవత్సరాది సంచికను బ్రకటింపఁబోవుచున్నాము. అందు సారస్వత సాంఘిక రాజకీయార్థికాది విషయములకు సంబంధించిన వ్యాసములు ప్రకటింపఁబడును. తాము పూర్వమువలెనే దయయుంచి అమూల్యములగు తమ వ్యాసములతో సంచిక నలంకరించి మా యుద్యమమునకుఁ దోడ్పడఁ బ్రార్థితులు.

సంచికయందు విషయవిభాగమును గావించి యేవిభాగమునకు సంబంధించిన వ్యాసముల నావిభాగమునందే ముద్రించి సంచికను ఉగాదినాఁటి కాంధ్రుల కర్పింపఁ దలఁచినాము. నియమితకాలమునకుఁ బూర్వమే వ్యాసములన్నియు మాకుఁ జేరినఁగాని అట్లు విషయవిభాగమును గావింప ననుకూలము గానేరదు. సంచికముద్రణ మారంభించిన పిదపఁ బంపు వ్యాసములను సంచికయందుఁ జేర్చుటకు వీ లుండదు. కావున వ్యాసములు రాఁబోవు నవంబరు ౧౫-వ తేదిలోపల మాకందఁజేయ వేఁడికోలు.

వ్యాసములకు చిత్రములును, ఇతర చిత్రములును సంపూర్ణవివరణములతో నియమితకాలమునకుఁ బూర్వమే మాకుఁ బంపఁబ్రార్థన.

చిత్తగింపుఁడు—

కా. నాగేశ్వరరావు,

ఆంధ్రపత్రికాధిపతి.

☞ ప్రతివ్యాసమునను 'సంవత్సరాది సంచికకు' అని వ్రాసియుండవలెను.

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(ఆశ్వయుజము - కార్తీకము : అక్టోబరు 33)

ఉత్తరము




దక్షిణము

[ఈపటము శిరస్సుమీదుగా,ఆయాదిక్కులు సరిగా కనబడునట్లు పట్టుకొని చూడవలెను. ఇందలినక్షత్రములు
అక్టోబరు 7-వ తేదిని 9- 0 గంట లపుడును, అక్టోబరు 21-వ తేదిని 8- 0 గంట లపుడును,
,, 14 ,, 8-30 ,, ,, 28 ,, 7-30 ,,
ఇం దున్నట్లు కనబడును.]

ఆశ్వయుజమాసము అక్టోబరు ౨౦-వ తేదివఱకుండును. నాటినుండి కార్తికమాసము ఆరంభమగుచున్నది. అక్టోబరుమాసాంతమును, నవంబరు ౧౯వఱకును కార్తికమాస ముండును. కాబట్టి అక్టోబరులో ఆశ్వయుజ - కార్తికమాసములు రెండును కొంతకొంత చేరియున్నవి. ఈ మాసపు తొలిజామున కనబడు గ్రహనక్షత్రాదులను పరిశీలింతము.

## క్షీరవాహిని (Milky way)

ఆకాశమునందు ఈశాన్యమునుండి నైరృతిదిక్కునకు క్షీరవాహిని చిన్నవంపు గల ఆర్చి, లేక మండలఖండము*వలె వంగి వ్యాపించియున్నది. ఈశాన్యమున సారథిమండలమునుండి భృగుపకళు, అప్సరస, ఉర్వశీపురూరవసు, రాజహంస, శ్రవణ, ధనుర్మండలములమీదుగా నైరృతికి వ్యాపించియున్నది. రాజహంస నుంచి క్షీరవాహిని రెండుపాయలుగా చీలి క్రిందకు వ్యాపించియున్నది. ఆపాయలు కలియుట దిగువనుండి పోయి కానరాదు. మధ్య ఛాయాపథము చక్కగా నున్నది.

## తేజోవంతమైన నక్షత్రములు

ఈనెలలో తేజోవంతమైన నక్షత్రములు నాలుగుమాత్రమే కనబడుచున్నవి. అవి యేవి యనగా:—

(1) వీణామండములోని బ్రహ్మ (Vega)

(2) వృశ్చికములో జ్యేష్ఠ (Antares)

(3) శ్రవణము (గరుడమండలములో) (Altair in Aquila)

(4) ఇంద్రద్యుమ్న (Toma Chant)

## గ్రహములు

కన్యలో నున్న గురు డస్తమించినాడు. శుక్రుడిపుడు సూర్యాస్తమాన మైనపిదప పడమట మంచికాంతితో వెలుగుచున్నాడు. గ్రహములు మన సూర్యకుటుంబములో చేరి మనభూమికి పొరుగున సంచరించుచుండును. ఊహింపరానంత దూరమందున్న నక్షత్రములు స్థిరముగా నున్నట్లును, గ్రహము లతివేగముతో సంచరించుచున్నట్లును మన కగపడును. గ్రహమనగా సంచరించునది-చలించునది యని యర్థము. కావున నొకనెల నక్షత్రపటములో నక్షత్రములను చూపినంత స్థిరముగా గ్రహములను చూపజాలము. గురుడు ౧౧-౧౨ సంవత్సరములకుగాని ఒకసారి సూర్యుని చుట్టిరాలేడు. శని సుమారు ౨౯ సంవత్సరములకుగాని చుట్టిరాలేడు. ఇవి మందగ్రహములు. వీటిని పటములో చక్కగా చూపగలము. కాని కుజశుక్రులు వేగముగా చరింతురు. ఈమాసములో నీగ్రహములు రెండును మొదట తులలో నుండి పిమ్మట వృశ్చికరాశిలోనికి వచ్చుచున్నవి. విశాఖ అనూరాధలమధ్య కుజుడును, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠల దాటి మూలవఱకు శుక్రుడును కనబడుచుందురు. శని ఇంకను వక్రగతిలోనే ఉన్నాడు. త్వరలో ఋజుగతికి వచ్చుచున్నాడు. శ్రవణధనిష్ఠలమధ్య కనబడుచున్నాడు.

## ఉత్తరనక్షత్రములు

లఘుఋక్షపుచ్ఛాగ్రమున ధ్రువుడును, పుచ్ఛమునందు అగ్ని, మహేంద్ర, కశ్యపులును కనబడుచున్నారు. చిన్నయెలుగు ఇపుడు పశ్చిమముఖమైయున్నది. ఇందలి రెండవ ముఖ్యనక్షత్రము-ధాతకు-Kochab అనిపాశ్చాత్యులు ప్రత్యేకనామముంచినారు. ధ్రువునకు కొంచెముమీదుగా ఉర్వశియొక్క ఎడమపాదముతోసహా ఊరువు ఉన్నది. పురూరవసు డాదిగువను క్షీరవాహినిలో నున్నాడు. సప్తఋషు లిపుడు కనబడకున్నారు. నరకుడు పశ్చిమశిరస్కుడై బ్రహ్మకు సమీపమున (అతిసమీపముకాదు-కొంచెముదూరమున) కానవచ్చుచున్నాడు.

---

* Segment of a circle-మండలఖండము.

## ఈశాన్యమున

అజశాబకములతో సారథి ఉదయమగు చున్నాడు. సారథి కీవల భృగుపరశుమండలమును, ఆదిసువను గ్రుడ్లుమిటకరించుకొనుచు పులోమ రాక్షసుడును కానబడుచున్నారు. Algol అనబడు నీచుక్కయొక్క విచిత్రచర్యకు కారణ మేమనగా, నల్లనిచుక్క యొకటి దీనిచుట్టును తిరుగుచుండును. నల్లచుక్క అడ్డములేనప్పుడు ఇది తేజోవంతముగను, అడ్డమున్నపుడు కాంతిహీనముగను కనబడుచుండును. ఇట్లు తేజోవృద్ధిక్షయములు అల్పకాలములో కన బడుటచేత అరబ్బులు దీనిని మిటకరించురక్కసు (Blinking Demon) డని యర్థమిచ్చు ఆల్ గోల్ (Algol) నామముతో వ్యవహరించుచున్నారు.

పులోమునిచే హరింపబడి హోరున నేడ్చుచు చ్యవనునిగన్న ఇంద్రమన (Andromeda) ఆప్రక్కనే యున్నది. ఆమె యేడ్చివిడిచిన కన్నీళ్లు ఒక మహా ప్రవాహ మయ్యెననియు, ఆప్రవాహమునకు 'వధూసర' అనుపేరు బ్రహ్మదేవుడు పెట్టెననియు భారతమునందు కలదు. ఆవధూసర ఆకాశగంగలో చేరినది కావలయు. ఎవరు స్నానముచేయుటచే ఆకాశగంగాజలమునకు పాటలవర్ణము కలిగెనని పురాణములు చెప్పుచున్నవో, ఆయప్సరసలును ఊర్వశి కనతిదూరమునం దున్నారు.

## తూర్పున

కృత్తిక లుదయించినవి. వీటికి ఈవల పొయ్యి పొక్కిళ్లవలె భరణియు, భరణి కీవల అశ్వినులును స్పష్టముగా కనబడుచున్నారు. తల్లి ఇంద్రమదకును, మిత్రులగుఅశ్వినులకును మధ్యచ్యవనుడుమెఱయుచున్నాడు. అశ్వినికీవల రేవతియు, ఉ. భాద్రపద, పూ. భాద్రపదయు నగపడుచున్నారు. ఆఖరురెండును చతురస్రాకారముగల నాలుగు చక్కనిచుక్కలతో మెఱయుచున్నవి. రేవతికి దిగువ శింశుమారము పూర్తిగా ఉదయించినది. ఇందు మైరానక్షత్రము చాల చిత్రమైనది. ఇది యొకప్పుడు మిక్కిలి తేజోవంతముగా నుండును. పిమ్మట దీని తేజము క్షీణించును. కంటికగపడక కొంతకాల ముండును. మరల తేజ మతిశయించి క్రముగా వృద్ధిపొందుచుండును. గరిష్ఠతేజమును పొంది మరల క్షీణింపనారంభించును. వృద్ధిక్షయములకు సరియైన కాలనిర్ణయము లేదు.

## ఆగ్నేయము

క్షీరోదమునకు దక్షిణధ్రువమైన హార్మ్మయు గంగరకమతము. ఫీనిక్సు (Phaenix) అనబడుప్రావారకర్ణఘూకము, నాళీకజంఘబకములతో ఇంద్రద్యుమ్నమహారాజు (Fomalhant) 'విష్ణురూపు' డగుచు వెలుగుచున్నాడు. ఇతనిం గారించిన మకరము ఆప్రక్కనే కాననగుచున్నది. మకరవాహనుడై, జలకుంభధారియైన వరుణుడు ఆవిూదనే ఉన్నాడు. కమఠమునకుతూర్పున ధుంధుడను రక్కసుడు ఉదయమగుచున్నాడు.

## పడమట - వాయవ్యము

శేషశాయియైన శ్రీమహావిష్ణువు ఇక త్వరలో నస్తమించుచున్నాడు. ఇతని నాభికమలమున జనించిన బ్రహ్మయు, బ్రహ్మముఖమందున్న వీణాధారిణి సరస్వతియు మరికొంతకాలము కనబడుచున్నారు. ద్యావాపృథివీదంపతులకు శరత్సమాగమ మైనది. వాణీహిరణ్యగర్భుల రాజహంసయానమును సువ్యక్తమయినవి. మహర్షిమండలోపాసితమైన యీరాజహంసగమనము శరద్గమనములో సరియగుచున్నది.

## నైరృతిదిక్కు

విశాఖ అస్తమింపనున్నది. కుజ శుక్రు లిద్దఱును మాసారంభమున విశాఖదిగువ నుందురు. కాని మాసాంతమునకు కుజుడు జ్యేష్ఠదిగువకు వచ్చును. శుక్రుడు జ్యేష్ఠను, కుజుని దాటి మూలలోనికి వచ్చును. అనూరాధ త్వరలో నస్తమించును. జ్యేష్ఠ ఎఱ్ఱగ నీదిక్కున చక్కగా మెఱయుచున్నది. మూల తేలుకొండెలో చక్కగా నగపడుచు. మూలకుపైన మృకండుడును, ఆతని పుత్రుడు మార్కండేయుడును ఉన్నారు. వీటికావల పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రము

లున్నవి. పాలపుంతపొరుగున విల్లు చేతబట్టుకొని, బాణము ప్రయోగించుచున్నట్లున్న ధనుర్ధరుని చక్కని చక్కదనపు రూపము చూచి మెచ్చదగియుండును. ఆ క్రిందనే ఇతని వాహనమైన చిలుక ఉన్నది. ఆప్రక్కనే మయూరధ్వజముతో బాణాసురు డున్నాడు. ధన్వి మన్మథుడు; మన్మథుడు ప్రద్యుమ్నుడు. ప్రద్యుమ్న పుత్రు డనిరుద్ధుడు. ఉషాకన్యార్థమై అనిరుద్ధబాణాసురులకు పుట్టిన విరోధము హరిహరుల ద్వంద్వయుద్ధమునకును, పాశుపత, నారాయణాస్త్రముల ప్రయోగమునకును కారణమై తుదకు బాణాసురునికి తీటగలిగించిన వేయిచేతులును విరిగినదాక చల్లారలేదు. ఈరమ్య చరిత్రమునకు ఖగోళార్థమును కలదు. మఱియొకమారు దానిని సావకాశముగా పరిశీలింతము.

## మ ధ్య ను

అష్టవసుదేవతాత్మకమైన ధనిష్ఠ ఉన్నది. వసువులు వసిష్ఠమునివరు శాపముచేత భూమిమీద గంగా శంతనుల పుత్రులై పుట్టిరి. ఏడుగురు వెనువెంటనే శాప విముక్తులైరి. భీష్ముడుమాత్రము స్వచ్ఛందమరణము కలవాడై మాఘమాసమున నస్తమించెను.

## గమనింపవలసిన మరికొన్ని విశేషములు

కృత్తిక, సూర్యాస్తమానముకాగానే ఉదయించునప్పటినుండియు శీతకాలము ఆరంభమగు నని ప్రాచీనులు లెక్కించుకొనుచుండిరి. ఇంచుమించుగా మనకును అంతే.

కృత్తికలమధ్య నున్న అభ్రయంతి (Alcyone) నక్షత్రము మన సూర్యునికంటె ౧౫౦ రెట్లు తేజోధికమైన మహాగ్నిగోళము.

## ఉల్కాపాతములు : ముఖ్యమైనపెద్ద ఉల్కలు

ఈనెల ౧౮-వ తేదినుండి ౨౫-వ తేదివఱకు Orion లో ఒరయనైడ్సు (Orionids) అనబడు ఉల్కలు పడుచుండును. ఇవి మంచి తేజస్సు గలిగి వేగముగా భగ్గున రాలుచుండును. ఇట్లు పడుట వీటి లక్షణము (characteristic) అయియున్నది. ఇవి పెద్దవి.

## చిన్నఉల్కలు

మేషములో ౧౨ మొదలు ౨౫వఱకు చిన్నచిన్న ఉల్కలు రాలును. కాని అవి అంతముఖ్యమయినవి కావు.

---



సముద్రపుకాలువ, అల్లప్పీ

—యస్. శంకర సుబ్రహ్మణ్యము.

# బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

వేటూరి ప్రభాకరశాస్త్రి

పూజ్యపాదులను బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము మచిలీపట్టణమున నేఁడు జరుగుట మహానందవిషయము. బందరుపౌరుల నిందులకు ప్రస్తుతించుచున్నాను. నిజముగా నీయుత్సవ మిక్కడనే జరుగఁదగినది.

సీ. మోహనమ్మున జగన్మోహనంబుగఁ బద్య
పఠనంబు నిచ్చోటఁ బాదుకొల్పె
మాదృశాంతేవాసిమండలంబున కెల్ల
వేక్కసైమె నిచ్చోట విద్య నేర్పె
తేటతేటగఁ దియ్యఁదియ్యఁగా సత్కావ్య
నిర్మాణ మిచ్చోట నిర్వహించె
ఉల్లాసవారాశి నోలార్చునల్లారు
బెల్లంబు నిచ్చోటఁ జేర్మిఁ గనియె.
తే. నెన్నఁటికి వీడరానట్టి యిట్టి యిట్టి
శాశ్వతానుబంధంబు లెసంగియుండ
నెట్టు నిబ్బరించెనొకదే యిట్టి పురము
వీడనాడంగ మాకవివీరవరుఁడు ?

(ఇది నేను వేంకటశాస్త్రిగారు బందరు విడిచి స్వగ్రామమున కేఁగునప్పుడు చెప్పినది.)

ఇర్వదియైదేండ్లకుఁ బూర్వము నేను వేంకటశాస్త్రిగారిదగ్గఱ చదువుకొన నరిగిననాఁడు "అలపతంజలి కృతంబయిన భాష్యమునకే పరిఢవిల్లును మహాభాష్య పదము" ఇత్యాదిపద్యమును, మోహనరాగరసమును బద్య భావమున జీర్ణింపఁజేసి వారు చదువఁగా తన్మయత చెందితిని. అంతకుఁ బూర్వము భైరవ్యాదిరాగములను దీగవార్చి పద్యముల నీడిగెలబఱచి పౌరాణికులు చదువు చదువుతీరే నే నెఱిఁగినది.

రసస్ఫూర్తితోఁ దెలుఁగుపద్యములు చదువు చాతురికి నేఁడాంధ్రదేశమున శ్రీశాస్త్రులుగారే ఆచార్య పీఠము. ఆనాఁటనుండి ప్రతి విద్యార్థియు శ్రీశాస్త్రులు గారిం బోలి పద్యములు చదువుటకుఁ బ్రయత్నించు వాఁడే. ఎందఱో వారి పద్యపఠనానుకరణద్వారమున నాంధ్రభాషాపండితు లయిరి. వేంకటశాస్త్రిగారి శిష్యులలో వారి పద్యపఠనచాతుర్య మావంతైన నంటనివాఁడను, నే నెఱిఁగినంతవఱకు, నే నొక్కఁడనే కానవచ్చుచున్నాను.

ఉ. కొంకులువోని సత్కవన
గుంభన మంతకు మించి బింకపుఁ
బొంకము గల్గఁగా చవులు
పొంపిరివోఁ బఠియించు నేర్పు మా
వేంకటశాస్త్రి పండితక
విప్రభు చక్కటిదక్కఁ దక్క ని
ద్యాంకులయందు నెందు గల
దా సకలాంధ్రమహామహీస్థలిన్.

ఆనాఁడు బందరులో శ్రీశాస్త్రిగారి యుపన్యాససంపర్కము లేని పౌరసభ లుండెడివి గావు. వారియుపన్యాస మన్న నే శ్రోతలు సభలో క్రిక్కిఱియ నిండెడివారు. వారియుపన్యాసమునకు ముందు సందర్భము చక్కఁజూచుకొనుట మొదలయిన జాగ్రత్త లక్కఱలేదు. ఐనను జాగ్రత్తపడి వచ్చి చెప్పినవారి యుపన్యాసమునకంటె శ్రీశాస్త్రులవారి యుపన్యాసమునకే సంగతులు, చమత్కారములు హెచ్చుగ నుండెడివి. సభానంతరము సభ్యులు వేంకటశాస్త్రిగారి వాక్చమత్కృతినే సంస్తుతించుకొనుచు ఇండ్ల కేఁగెడివారు. ఆనాఁడు సభలకు పద్యములు, శుభలేఖలకు పద్యములు. స్వాగతములకు పద్యములు, సంగీతములకు పద్యములు, బంతులాటలకు పద్యములు, ప్రకటనములకు పద్యములు. ఆనాఁటినుండియే పద్యరచనాబిభీషికకు బరువు తగ్గినది. వేంకటశాస్త్రిగారికి తీఱికలేనపుడు వారివిద్యార్థులో, బడిబాలురోకూడ పద్యము లల్లి యిచ్చుచుండెడివారు. అంతకు పూర్వము బందరు




బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు
( షష్టిపూర్తి మహోత్సవమున )

ప్రాంతములకు బ్రహ్మశ్రీ నాదెళ్ల పురుషోత్తమకవి గారే పద్యరచనావిషయమున నద్వితీయులు.

పూర్వము, భోజరాజుముఖదర్శనమాత్రముననే పలువురు విద్వాంసు లైరని ప్రతీతి. నేడు శ్రీశాస్త్రిల వారి ముఖదర్శనమున నది ప్రత్యక్షమైనది. సూక్తులులో శ్రీ శాస్త్రిలవారు పాఠములు చెప్పకుండనే, తాము పాఠములు చదువకుండనే పరీక్షలలో నెందఱో బాల కులు కృతార్థు లగుచుండిరి. అంతే కాదు, కవు లగుచుం డిరి. మన లక్ష్మీకాంతకవిప్రభృతు లట్టి సూక్తులు విద్యార్థులలో నాటిశేఱినజగజెట్టులే. ఇది వింతగాదు. శ్రీ శాస్త్రిలవారిచే నెన్నఁడును చూడఁబడనివారును, శ్రీ శాస్త్రిలవారి నెన్నఁడును చూడనివారును కూడ వారిశిష్యులై యెందఱో నేడు సరసకవితారచనము నేర్చి సర్వాంధ్రదేశమునఁ బ్రఖ్యాతిగనుచున్నవారున్నా రు. ఈవిధముగా శ్రీశాస్త్రిలవారు విద్యావంశవృక్షమును తొలుత బందరుపురముననే ఆనాఁ డంటుదొక్కిరి. అది యిప్పు డాంధ్రదేశమున సర్వత్ర ప్రబలి చెట్లు గట్టు చున్నది. దీనికి శ్రీ శాస్త్రిలవారి కొక మంచి ప్రతిఫలముగూడ లభించినది సుమండీ, గోదావరీ తీరముననుండి కొనివచ్చి శ్రీ శాస్త్రిలవారు బంద రున విద్యావంశవృక్షము నంటునాటినందు లకు సరిగా తాము బందరునుండి అపురూపము, నసా ధారణము నైన జహంగీరుమామిడియంటును గోదా వరీతీరమునకు గొనిపోయి తమతోఁటలో నాటికొనిరి. వారివూలముననే జహంగీరుమామిడికూడ నక్కడ నుండి సర్వాంధ్రదేశమునను వ్యాప్తినొందుచున్నది.

శ్రీ శాస్త్రిగారు నివసించి బహువర్షములు కవితామృతప్రపను సాగించిన భైరవ ప్రెస్సు ప్రక్క యింటిపట్టు, ధనాఢ్యసపత్తు లనుహలించెనేని వారిపేర విద్యాస్థానముగా వెలయించుట యుక్తమని నాయెన్నిక. సభ్యు లిది సమాలోచింతురుగాక.

శ్రీ తిరుపతివేంకటేశ్వర కవీశ్వరుల శతావధాన సత్ప్రబంధ చాటుధారాకవితా చమత్కారములగూర్చి ప్రశంసాలేశము జరుప నారంభింపనున్న నా కీసందర్భ మున,

చ. పరిణతపాండితీబల మ
　　ధంసరధారణమాధురీపరి
స్ఫురితకవిత్వము న్గలిగి
　　శుభ్రయశంబు గణించుకొన్నమా
తిరుపతిశాస్త్రిసత్కవి గ
　　లించెనె యాంధ్రవపోవఘాటికిన్
స్థిరతరకావ్య భూషణని
　　శేషపరిష్క్రియ తీఱిపోయెనే!

అన్నవిచారము కొంత తొట్రుగల్గించినది. కాని తిరుపతివేంకటేశ్వరులు భిన్నశరీరు లైనను కవితావిష యమున నొక్కరే. శ్రీవేంకటశాస్త్రిగారు కవితరచించు చున్నంతవఱకును శ్రీ తిరుపతిశాస్త్రిగారును నున్నవారే. వేంకటశాస్త్రిగారి కవితాగంగాస్రవంతిలో తిరుపతి శాస్త్రిగారి కవితాసరస్వతి యంతర్వాహినిగానున్నది.

క. నుతకవితామృతవాహిని
　నతిలోకయశశ్శరీర మగపఱుచుండన్
మృతి యకె తిరుపతికవికిన్
జత యగు వేంకటకవీంద్రు చాటయి యుండెన్.

అని యూఱడిల్లితిని. తిరుపతివేంకటకవులు ఎక్క డేని యవధానము చేసిరనఁగా నాచుట్టుపట్టులవా రసే కులు ప్రతిభాసౌధమున పదిమెట్లు లెక్కిరన్నమాటే. మెవడు కమలిపోవునో, నరములబరువు సడలి శరీరము నకనకలాడునో యని సాధారణబుద్ధిమంతులు సందేహిం చునట్లు పగలు శతావధానతంత్రము జరపి, రాత్రి పది గంటలదాఁక పరిపరివినోదములఁ బాల్గొని తరువాత నిమ్మకు నీరెత్తినటుల నిశ్చలముగా నిద్రపోయి మఱు నాఁటిప్రొద్దుట మరల మందహాసవదనముతో అల్పా హారములనైన నారగింపక అవధానశేషమును పూరింప నారంభించు నీజంటకవుల యంతఃకరణములు శ్రుతికలసి ఒకే 'మనసు' అయ్యెడివి. అది యొకవింతతీరు. ఆసమ యములందు వేంకటశాస్త్రిగారు విశ్వమూర్తులు, సభ్యులు వెంటాడుభక్తులు. తిరుపతివేంకటేశ్వరుల కవితాధార ప్రాచీనసంప్రదాయఘట్టముల త్రవ్వి త్రవ్వి, ఊటయూరిచి చేదిచేది పారించినది కాదు. స్వయము ఉద్బుద్ధమైన

బుగ్గధార. వారు ప్రాచీనగ్రంథములకంటె, హెచ్చుగా ప్రస్తుతపరిసరపరికరములనే చదివిరి. కావుననే సంప్రదాయమాత్రపరిజ్ఞాతలు కొందఱు వారికవితను సంప్రదాయమార్గమైనదానిగా, క్రొత్తతీరు గలదానిగాఁ దలఁతురు. నేఁటి యువకవులు వారికవితను నవకవితామార్గోపదేశకముగా నారాధింతురు.

తిరుపతివేంకటకవులు ప్రౌఢపండితప్రభుసభలలోనేకాదు, బాలపామరజారచోరాదుల గోష్ఠులలో కూడ కవితాచమత్కారములను గల్పించి సత్కారములను బడయఁగలరు. వేంకటశాస్త్రిగారికి లల్లాయిపదములు పాడ వేడుక; కొల్లాయిగుడ్డలు వాడ వేడుక. వారికి భాషాడంబరము గిట్టదు. అట్లే వేషాడంబరము గిట్టదు. కనుకనే వారికవితాకన్య జనముద్దుగా వెలసినది. వారిచనవు అల్లారుచెల్లముగ అందరికి నాస్వాద్యమైనది. సమయస్ఫూర్తి, హాస్యయుక్తి ప్రయుక్తి చమత్కారము వేంకటశాస్త్రిగారికి ఆజానజములు నలవాటు. ఇట్టివారు నూరేండ్లకుముందు నడిమింటి మంగళేశ్వరశాస్త్రిగా రొకరని వింటిని. బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారిని నింకొకరిని గంటిని. మంగళేశ్వరశాస్త్రిగారు బొబ్బిలి రాజసభలో, నక్క కుడిప్రక్కనుండి యెడమప్రక్కకు పాఱినమేలా, యెడమప్రక్కనుండి కుడిప్రక్కకు పాఱినమేలా యని ప్రశ్న రాఁగా, అది కఱవనిచో నెటుపాఱినను మేలే యనిరఁట. వేంకటశాస్త్రిగారు బందరు హైస్కూలు పండితపదమున ప్రవేశింప క్రొత్తగా వచ్చినప్పుడు నైష్ఠికశ్రేష్ఠులయిన బ్రహ్మశ్రీ జంధ్యాలగౌరీనాథశాస్త్రిగారియింట, పట్టుబట్టమడి గట్టుకొని భోజనము జేయుచుండఁగా, 'పట్టుబట్ట ఎంతకాలముదాక మడియండీ' యని గౌరీనాథశాస్త్రిగారు ప్రశ్నింపఁగా, వేంకటశాస్త్రిగారు, "చెమటకంపు గొట్టకున్నచో ఎన్నాళ్ళకైనను మడియే" అనిరఁట. ఇది యొకచమత్కారలేశము. ఇట్టివి వేంకటశాస్త్రిగారి చమత్కారము లనేకములు. అవియెల్ల నేకరింపఁదగినవి.

ప్రాచీనాంధ్రకవులలో ప్రబంధములకంటె శాశ్వతము లగునట్లు చాటురచనలను సాగించినవాఁడు శ్రీనాథుఁడు. ఆతని చాటురచనలు నేఁటికిని నాంధ్రరసికులనాలుకలపై నాట్యమాడుచున్నవి. వర్తమానాంధ్రకవులలో నట్టివారు మన తిరుపతివేంకటేశ్వరకవీశ్వరులు.

పదునైదేండ్లకుఁ బూర్వము విశాఖపట్టణమండలమున శృంగవరపుగోటనుండి ఏదోయొకయూరికి రాత్రివేళ బండిమీఁదఁ బ్రయాణమై నే నేఁగుచుంటిని. ప్రక్కబండిలో నొకపట్నాయకుఁడు "ఇంజరంబొకసాక్షి యేనాముదాసాక్షి పల్లెపాలెంబు దానెల్లసాక్షి—ఇత్యాది పద్యమును బాడుచు నడుమ—"శంకరుం డాతని సాని సాక్షి" యనుపట్టున నాఁగి యొకనవ్వు నవ్వి మరల నారంభించి పద్యము ముగియఁజదువుట వింటిని. తిరుపతివేంకటకవుల చాటుధారలు మలయమారుతపుంబిండెలు. అవి యాహ్లాదజనకములై సర్వాంధ్రప్రపంచము నలముకొన్నవి. లక్షలకొలఁది గ్రంథసంఖ్య యుండునట్లు (ముప్పదిరెండక్షరములరచనమునకు గ్రంథ మని పేరు) బహుగ్రంథముల రచించు కవీశ్వరులు పలువు రిప్పుడున్నారుగాని వారి పద్యములు గొన్నియేని హాయి మని పండితులుగాని, పామరులుగాని పలువురు పలుమాఱులు పఠించునవిగా నున్నవా యన్న ప్రశ్నకు సమాధానము సభ్యులారా, మీరే సమాలోచింపఁదగుదురు.

శ్రీ వేంకటశాస్త్రిగారికిఁ బ్రాయపుఁబ్రొద్దు కొంత పడమటికిఁ దిరుగ నారంభించెను. విద్యావివాదసంజ్వరము కొంత చల్లనాఱెను. అన్నవస్త్రములకుఁ గొఱంతలేని స్థితియేర్పడెను. ఇట్టి స్థితిలో తమ కప్పటికి సంతానము కలుఁగకున్నను సంతానవంతుఁడై వంశవృద్ధి కల్గింపఁగల్గు ననుకొనుచున్న చిన్నవేంకటశాస్త్రిగారు పుత్త్రసంతానరహితులుగానే కీర్తిశేషు లయిరి. ఆనాఁడు శ్రీ వేంకటశాస్త్రిగారు స్వైకాశ్రయమై యున్న చెళ్లపిళ్లవంశవృద్ధిని దలపోసి యస్మదాదిశిష్యగోష్ఠిలో నొకనాఁడు ఆఁపరానివిధమున దుఃఖార్తులయిరి. అల్పకాలముననే భగవంతుఁ డనుగ్రహించెను. వేంకటశాస్త్రిగారు గృహారామధనకనకవస్తువాహనసమృద్ధితో పాటు సత్సంతానలాభమునుగూడ బడసిరి. ఆనందమయ

ముగా జీవితయాత్రను గడప ననువుపడెను. ఆకాలమున నట్టి యానందసందర్భమున నే నొకజాబులో శ్రీ శాస్త్రులుగారికి వ్రాసినపద్య మిది :

సీ. గాటంపుదమిఁ దోఁట నాఁటుకొన్నారు నిం
డారఁ బండెనె జహంగీరుమావి ?
అవధానములు నూడ నభ్యర్థితులు వేఁడ
నేఁగుచుందురె యిప్పు డెచటికేని ?
సత్కవితారహస్యము లభ్యసింపఁగా
వచ్చుచున్నదె శిష్యవర్గ మిపుడు ?
భగవత్పరము లైన పరమార్థరచనముల్
క్రొత్తవి యేవేని కూర్చినారె ?
కులుకుఁగుట్టల నునుదొక్కుఁబుక్కలందు
ప్రౌఢిమీఱిన సుకవితాఫణితులందు
పరువుగల యంటుమామిడిపండులందుఁ
జక్క గుజిలించుచుందురే చవులవాసి ?

శ్రీ వేంకటశాస్త్రిగారు నెలలబాలు రై యుండఁగా, వారి తండ్రిగారు కడియమునుండి వారిని విజయనగరపు టగ్రగ్రామమునకుఁ గొనిపోయి యక్కడ వారింగూర్చి పక్షిప్రశ్న మడిగిరఁట. (ఆప్రశ్నశాస్త్రవిషయమును శ్రీశాస్త్రిగారే సభాముఖమున యుక్తమయినంత వివరింపఁ గలరు.) ఆప్రశ్నగ్రంథమున వారిని గూర్చికొన్ని శ్లోకము లున్నవి.అందు స్వసమానవయశ్శక్తిమంతుఁ డగు నొక సుకవితోఁ గూడి బహుగ్రంథములు రచించుకవి యగుట, రాజపూజితులగుట మొదలగువిషయము లేవో కొన్ని తర్వాత వాస్తవములయినవి గలవు. తుదనందు 'షష్టివత్సరకీర్తిమాన్' అని కలదు. ఆతుది పలుకునకు షష్టిపూర్త్యుత్సవ వైభవసందర్భమున గొప్ప కీర్తి గల్గు నని ప్రస్తుతసముత్సాహసందర్భమునుబట్టి యర్థముచెప్పవలె నని నేను నిశ్చయించుకొన్నాను. భగవదనుగ్రహమున శ్రీ శాస్త్రిగారి కిదివఱకే యఱువది యేండ్లు నిండినవి. శ్రీ శాస్త్రిగారి కిట్లే యింకొకషష్టిపూర్త్యుత్సవముగూడ జరుగునట్లు భగవానుఁ డనుగ్రహించునుగాక !

వేంకటశాస్త్రిగారు విద్వద్రాజగోష్ఠులందు వివిధసత్కారములఁ బడసిరి; విద్యావివాదములందు విజయము లందిరి; రసవత్కావ్యములఁ జెక్కుంటి రచియించిరి; చాలమందిశిష్యులకుఁ జదువు చెప్పిరి; సంతానసమృద్ధిని బడసిరి; సకలసంపదలఁ బడసిరి; సమానులలో నుత్తము లయిరి. ధర్మార్థకామములందు పరిపూర్ణమయినపరితృప్తి వారికి దొరకినదనియే నావిశ్వాసము. ఇఁక జీవితవిశేషమున వారు పరమపురుషార్థలాభమునకై పని గొనుట బాగు గదా !

అంతర్యామియగు పరమాత్ముఁడు శ్రీవేంకటశాస్త్రిగారికి ఆత్మాభిముఖ్యము ననుగ్రహించును గాక !

ఈ శరీరముననే నిర్మలహృదయు లగు వేంకటశాస్త్రిగారు సచ్చిదానందాత్మక మగు పరతత్త్వమును సమీక్షింపఁగల్గుదురుగాక !

భగవత్కృప ఇట్లు పరఁగుఁగాక! ఇది నా ప్రార్థనము.

(కడచిన ౩౦, ౧-వ తేదులందు బందరున జరిగిన షష్టిపూర్తి యుత్సవమున చదివినది.)



రాధాకృష్ణ

ప్రాచీన వర్ణచిత్రమునకు నకలు

—ఉయ్యూరు జమీందారుగారు.



సంగీత స్తంభము

ఇది మధుర దేవాలయమున నున్నది. ఒక్కటే నల్లరాయి యిట్లు ఇన్ని శాఖలుగా మలచబడినది. వీని నొక్కొక దానిని చిన్నరాతితో కొట్టినయెడల జలతరంగిణివాద్యమువలె మధురస్వరము లుప్పతిల్లును.

—యస్. శంకర సుబ్రహ్మణ్యము.

ఈమె ఐర్లాండున క్రీ. శ. ౧౮౪౭ అక్టోబరు తే ౧ దిన జన్మించినది. ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు దేశములందు విద్యనభ్యసించినది. మొదటినుండియు నీయమసంఘసంస్కారమందు కడుశ్రద్ధ వహించుచుండెడిది. ముఖ్యముగ మతసంస్కారమునెడల నీమెకు అభిలాష మెండు. ప్రపంచమంతయు వ్యాపించియున్న దివ్యజ్ఞాన సమాజమున ౧౮౮౯-వ సంవత్సరమునచేరి యీయామె తదభివృద్ధికై కృషిచేసి ఆసంఘమున కధ్యక్షురాలయ్యెను. సంఘముయొక్క కేంద్రస్థానము అడయారునందు ఏర్పడినప్పటినుండియు నీమె యచటనె యుండి దివ్యజ్ఞాన సమాజమతమును వ్యాపింపజేయుచుండినది.

హిందూమత గ్రంథమగు భగవద్గీత కీమెవ్యాఖ్య రచించి యింగ్లీషున కనువదించినది. హిందూమతమునం దీమెకు గల నమ్మకమున కిది గొప్పతార్కాణము. దివ్యజ్ఞాన సమాజమువారి మతసంప్రదాయముల గురించి యనేకగ్రంథముల నీమె వ్రాసి ప్రచురించినది.

భారతదేశాభ్యుదయమునకై ఈమెచేసిన సేవ యపారము. కేవలము మతముకొరకుమాత్రముకాక రాజకీయములందుకూడ భిన్నభిన్న మతములందు ఏలాటి పక్షపాతమువహింపక భారతదేశస్వరాజ్యసంపాదనమునకై యామె యనేకసంవత్సరములు పాటుబడినది. అఖిల భారతకాంగ్రెసుమహాసభ కధ్యక్షురాలాయెను. హోమురూలు ఉద్యమమును ప్రారంభించి దానికి నాయికయై ప్రభుత్వమువారి నిర్బంధమునకు గురియైనది.

మనదేశమున విద్యావిషయములయం దీమెకొనిన శ్రద్ధయొక్క ఫలితముగ అనేకపాఠశాల లేర్పడినవి. ఇపుడు కాశీయందు గల హిందూవిశ్వవిద్యాలయము తొలుత ౧౮౯౮-వ సంవత్సరమున సెంట్రలు హిందూ కాలేజి యనుపేర నీమెచే స్థాపింపబడి క్రమేణ వృద్ధిజెంది నేటి యున్నతదశకు వచ్చినది. మదనపల్లియందు గల మొదటితరగతి కళాశాలసయిత మీమెచే స్థాపింపబడినది. ఇవిగాక నీయమచే స్థాపింపబడిన హైస్కూళ్లనేకములు కలవు.

వేలకొలది మైళ్లదూరమున సముద్రమధ్యమున నొకచిన్నద్వీపమునందు జన్మించిన అనీబిసెంటమ్మగారు మనదేశమునకువచ్చి ఇచటిస్థితుల గమనించి మనయభ్యుదయమునకు గావించిన సేవకు కారణమేమి? విశ్వమానవాభ్యుదయమే యాయమకు లక్ష్యము.

తన జీవితసర్వస్వము భారతదేశమునందు గడపి ౧౯33-వ సంవత్సరమున సెప్టెంబరు ౨౦-వ తేదిన నీమె పరమపదించినది. ఈమెచరిత్ర లోకమున కంతకును ఆదర్శప్రాయమైనది. ఈయమయాత్మకు ఈశ్వరుడు శాంతిని ప్రసాదించుగాక!

# ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, నూతనభవనములు

(నిర్మాణదశ)



౧. ఆర్ట్సు కాలేజి
(ముందు)



౨. ఆర్ట్సు కాలేజి
(ప్రక్కసైపు)



3. సైన్సు కాలేజి (పురోదృశ్యము)



౪. సైన్సు కాలేజి
(పార్శ్వదృశ్యము)



౫. యూనివర్సిటీ హాస్టలు



౬. సెనేటుభవనము                    (కె. సుబ్బరాజుగారు, అనకాపల్లి)

# భారతీయ విద్యా చరిత్రము

మా రేమండ రామా రావు, బి.ఏ.(ఆనర్సు) బి.ఇడి.

(అనువృత్తము)

## నాల్గవ అధ్యాయము

[ఆధారములు

Elliot - History of India

Elphinstone - "

Law - Promotion of Learning in Mahomadan times.]

### ఢిల్లీ సుల్తానుల పాలనము

(౧౦౦౦ - ౧౫౨౬)

క్రీ. శ. ౧౦౦౦-వ సంవత్సరము నాటికి ప్రాచీన హైందవస్వాతంత్ర్యభాను డస్తమించెను. అప్పటి నుండియు బశ్చిమోత్తరమునుండి మహమ్మదీయు లీ దేశముపై దండెత్తివచ్చి సస్యశ్యామలమును, బహుధన సమృద్ధమును, బహురాజపాలితమును నగు నీదేశమును కొల్లగొని తమమతాచారములకు వ్యత్యస్తము లగు మతాచారముల నవలంబించు హైందవుల ననేకవిధముల బాధింపసాగిరి. అనతికాలముననే యీ విదేశీయు లీ యాదృచ్ఛిక దండయాత్రలను మాని యీదేశమున స్థిర పడి రాజ్య మేలసాగిరి. క్రీ. శ. ౧౨-వ శతాబ్ది ప్రారంభమునుండి పదునెనిమిదవశతాబ్ది మధ్యభాగమున ఈస్టిండియాకంపెనీవారి పాలనము సుస్థిరముగ నాటు కొనువరకును మహమ్మదీయు లీదేశముపై నిరంకుశాధి కారమును నెరపిరి. దక్షిణాపథముమాత్రము పదునాల్గవ శతాబ్దమువరకును స్వాతంత్ర్యము నను భవించి యటుపిమ్మట మహమ్మదీయులకు వశమయ్యెను. అందుచే నుత్తరదేశమునందలి హిందూ బౌద్ధ విద్యా సంస్థలు క్షీణించి నశించినవి. తురుష్కులు తా మీ దేశమున స్థిరపడినపిమ్మట దమ విద్యావిధానమునుగూడ నిచ్చట బాదుకొల్పిరి. వారివిద్యాసంస్థలలో "మక్తాబ్, మద్రసా" లను విద్యాలయములు ముఖ్యము లైనవి. మక్తాబ్ అనునది యిప్పటి ప్రాథమికపాఠశాలకుసరియై, సామాన్యముగ మశీదులను చేరియుండెడిది. ఇందు కొరాన్ అను మతగ్రంథమును చదువుటయు, వ్రాయుట యు, గణితమును మాత్రము బోధింపబడుచుండెడివి. మద్రసా యనునది ప్రస్తుతకళాశాలకు సరియగును. ఇం దున్నతవిద్యయు, తత్త్వము నభ్యసింపబడుచుండెడివి.

మహమ్మదీయయుగమున రెండు విభాగములు గాంచనగుచున్నవి. వానిలో మొదటిది ఢిల్లీసుల్తానుల పరిపాలనాకాలము. రెండవది మొగలుసామ్రాజ్య కాలము. మహమ్మద్‌గోరీ యీదేశమును జయించిన పిమ్మట తనబానిసయు, మహాశూరుడు నగు కుతుబ్ ఉద్దీననునాతని నిచ్చట రాజప్రతినిధిగ నియమించెను. మహమ్మద్‌మరణానంతర మీబానిస స్వతంత్రుడై క్రీ. శ. ౧౨౦౬ నుండియు ఢిల్లీనగరమునుండి రాజ్యమేల సాగెను. అప్పటినుండియు క్రీ. శ. ౧౫౨౬ లో మొగలు లీదేశముపై దాడివెడలువరకును ఢిల్లీసుల్తానుల పాలనము కొనసాగినది. ఈ ప్రకరణమునందు సుల్తానుల పాలనము నందలి విద్యాచరిత్రము వర్ణింపబడుచున్నది. ఇప్పటి విద్యాస్థితి కేవలమును పాలకుల వైదుష్యముపైనను, రసజ్ఞతపైనను ఆధారపడియుండినది. వారలు విద్వాంసు లైనచో వారియాస్థానము లనేకులగు పండితకవిగాయ కుల కాలవాలము లగుటయు, దేశమునం దనేకములగు విద్యాసంస్థలును, గ్రంథాగారములును బయల్వెడలు టయు జరగుచుండెడివి. ఈ కాలమునందలి రాజాదరము కేవలమును మహమ్మదీయవైదుష్యమునకే యొసంగ బడుచుండెడిది. సుల్తానులు యథాసాధ్యముగ దేశీయ విద్యాసంస్థలను, వైదుష్యమును నశింప జేయుచుండిరి.

గజినీవంశము, ౯౬౨-౧౧౫౨:— ఈ వంశమునం దగ్రగణ్యుడగు సుల్తాన్‌మహమ్మదు మిక్కిలివిద్యా

ప్రియుడు ప్రతిసంవత్సరము నీతడు వాఙ్మయాభివృద్ధికై ౪౦౦,౦౦౦ దీనారములను వెచ్చించుచుండెను. గజినీ నగరమునం దొకవస్తుప్రదర్శనశాలయు (Museum), దానిసిజేరి యొక విశ్వవిద్యాలయము (Univers ty)ను నీతనిచే నిర్మింపబడినవి. 'షానామా' యను రాజ చరిత్రమును రచించిన ఫిర్దౌషీకవి యీకాలముననే జీవించెను. ఈ సుల్తానునకు పర్షియన్ వాఙ్మయమునం దభిరుచి మెండుగ నుండెడిది. ఈతని యాస్థానమునందలి పండితులలో ఆల్ బిరూనీ యనునాత డగ్రగణ్యుడు. సుల్తాన్ మహమ్మదు పంజాబును జయించినపిమ్మట నీపండితు డచ్చట గొంతకాలము నివసించి హిందూ వైదుష్యమున ప్రవేశము సంపాదించెను. సంస్కృత భాష నభ్యసించి యీతడు పురాణములను, గణితము, జ్యోతిషము, కాలజ్ఞానము (Chronology), భూగోళ శాస్త్రము, భౌతికరసాయనాదిశాస్త్రములు మున్నగు విషయములను బెక్కింటిని బరిశోధించి తన మాతృ భాషలోనికి బరివర్తించెను. ఈ పండితునికి హిందూ తత్త్వశాస్త్రమునందును, ముఖ్యముగ భగవద్గీతపైనను బ్రీతి యెక్కుడుగ నుండెను.

సుల్తాన్ మహమ్మద్ పుత్రుడగు మసూద్ గూడ చక్కని విద్వాంసుడు. ఈతడు జ్యోతిషమును గూర్చియు, తత్త్వశాస్త్రమునను గొన్నిగ్రంథములను సహితము రచించెను. ఈతనికి బిమ్మట సుల్తాన్ బైరం అనునాతడు పేరొక్కనదగినవాడు. ఈతని ప్రోత్సాహముచే నన్యభాషలనుండి యనేకగ్రంథములు పర్షియను భాషలోనికి తర్జుమాచేయబడినవి. హిందువుల 'పంచ తంత్రము' 'ఖలీలాదమ్నా' యనుపేరున భాషాంతరము నందినది.

ఘోర్ వంశము, ౧౧౭౩-౧౨౦౬:—పంద్రెం డవ శతాబ్దపుటంత్యభాగమున మహమ్మద్ ఘోర్ అను వీరుని యాధిపత్యమున మహమ్మదీయులు మనదేశముపై దండెత్తివచ్చి చౌహాణ, పాల, సేనవంశీయులగు రాజుల నెల్ల జయించి యుత్తరదేశము నాక్రమించిరి. పిమ్మట నీ మహమ్మదు సుల్తానయ్యెను. ఈతనివద్ద ననేకులగు తురుష్కబానిస లుండిరి. వీరికెల్లరకు నీసుల్తాను చక్కనివిద్యను నేర్పించి రాజ్యాంగనిర్వహణమునందును వారిని నిపుణులుగ నొనర్చెను.

బానిసవంశము, ౧౨౦౬-౧౨౯౦:—మహమ్మద్ ఘోర్ మరణించినపిమ్మట నాతనిబానిసలలో నగ్రగణ్యుడగు కుతుబ్ ఉద్దీన్ అనునాతడు హిందూదేశము నాక్రమించి ఢిల్లీనగరమునుండి స్వతంత్రపాలనమును సాగించెను. ఇంతటినుండియు ఢిల్లీసుల్తానులపాలన మారంభమయ్యెను. కుతుబ్ ఉద్దీను కొన్ని మశీదులను గట్టించియుండినను విద్యావిషయమునం దితడు విశేషాదరమును జూపిన ట్లగపడదు. అంతియకాక, యీతని సేనానులలో నగ్రగణ్యుడగు భక్తియార్ ఖిల్జీ తనవిజయయాత్రలలో, దేశీయవిద్యాసంస్థలకు నిరుపమమగు వినాశమును చేకూర్చెను. బీహారురాష్ట్రమునందలి బౌద్ధ విద్యాలయరాజములగు నాలందా విక్రమశిలా విశ్వవిద్యాలయము లితనిచే నిర్మూలింపబడినవి. మహమ్మదీయులు బౌద్ధభిక్షువులను చిత్రవధ గావించియు, గ్రంథాలయముల నగ్నిహోత్రప్రీతి గావించియు, కట్టడములను బడగొట్టియు ననేకవిధముల విధ్వంసము గావించిరి. వంగరాష్ట్రమునందలి నవద్వీపవిద్యాలయముగూడ నిదే యవస్థకు లోనయ్యెను.

కుతుబ్ ఉద్దీనునకు బిమ్మట నీవంశీయులలో ఆల్ ఏమిష్, బాల్ బన్, రెజియా, నాజిరుద్దీన్ అనువారలు విద్యాప్రియులై యుండి విద్య ననేకవిధముల బోషించిరి. భారతరాజ్ఞీమణులలో పేరెన్నికగాంచిన రెజియాబీగము పెక్కుమందివిద్వాంసుల కాశ్రయమొసంగెను. ఈమె ఢిల్లీనగరమునం దొకకళాశాలను నిర్మించెను. అనంతరము ఢిల్లీసింహాసనము నధిష్ఠించిన నాజిరుద్దీను మహావిద్వాంసుడై యుండెను. ఈతడు మహారాజపదమున నుండియు స్వయముగ ననేకగ్రంథములను రచించి వాని విక్రయమూల్యమువలననే తనజీవితమును గడపుచుండెను. జలంధర్ నగరమునం దీత డొకకళాశాలను గట్టించెను. సుల్తాన్ బాల్బన్ కాలము విద్యాచరిత్రమునకు మిగుల ముఖ్యమైనది. పర్షియాదేశమునుండి ప్రాణరక్షణార్థమై

పారివచ్చిన రాజన్యులకు, వారితో నేతెంచిన కవి పండితాదులకు ననేకుల కీతడు శరణ మొసంగెను. కాన ఢిల్లీనగరమునం దొకనూతనోత్తేజనము గల్గెను. విద్వాంసులు, విద్యాకలాపములు నచ్చట సామాన్యము లైనవి. యువరాజగు మహమ్మద్ ఆకాలమున మహా పండితుడని పేరుగాంచెను. ఆత డీవిదేశములనుండి యేతెంచిన విద్వాంసులను, భారతదేశమున పేరెన్నికగాంచిన యితరులను రాజధానీనగరమునకు రావించి యచ్చట నొకవిద్వత్సమాజము నేర్పరచెను. ఈవిధమున నీతని యాదరసన్మానములను బడసినవారిలో "అమీర్‌ఖుస్రూ, అమీర్‌హస్సన్" అనుపండితు లగ్రగణ్యులు.

ఖిల్జీవంశము, ౧౨౯౦ - ౧౩౨౦ :— ఈ వంశీయుల పరిపాలనకాలమున ఢిల్లీనగర మొకగొప్పవిద్యాకేంద్రముగ నుండెను. ఈవంశీయులలో విద్యావిషయమున పేరొందదగినసుల్తాను లిర్వురు. జలాలుద్దీను కాలమున విద్వాంసులను రావించి వారల కనేకవిధములగు వినోదములను గల్పించుట రాజాస్థానమున కొక ముఖ్యకర్తవ్యముగ నుండెను. ఈసుల్తాను ఢిల్లీనగరమునం దొకగ్రంథాలయమును నిర్మించెను. సయ్యాన్ మౌలా యనుపండితు డీతనియాదరమును బడసి రాజధానీనగరమునం దొకసారస్వతసమాజమును (Literary Society) నిర్వహించుచుండెను. జలాలుద్దీనునకు పిమ్మట రాజ్యమునకు వచ్చిన "అల్లాఉద్దీన్" సుల్తానునకు విద్యావాసన తక్కువగ నుండెను. ఈతడు స్వస్థానరక్షణమునందును, రాజ్యవిస్తరణమునందునే తనశక్తిసామర్థ్యములను వినియోగించి విద్యావిషయమున నిర్లక్ష్యమును, ద్వేషమునుగూడ వహించియుండెను. ఎల్లర ననుమానించుట, స్వాహంకారము, నితరులను చులకనచేయుట మున్నగుదుర్గుణము లీతనికి సహజముగ నుండినవి. దానంజేసి విద్వాంసు లనేకు లీతనికి దూరముగ నుండిరి. తనవిజయయాత్రలకై విశేషముగ ద్రవ్యము గావలసియుండుటచే నీసుల్తాను విద్యాసంస్థలకును, విద్వాంసులకును దనపూర్వు లొసంగియుండిన భరణములను, వసతులను వారినుండి తప్పించి తనవశము చేసికొనెను. అయినను జిత్రమేమన, రాజింత విద్యాపరాఙ్ముఖుడుగ నుండిన యీకాలముననే విద్య దేశమున విశేషముగ విస్తరించెను. ఇంతకుబూర్వము సుల్తాన్ బాల్బన్‌కాలమునం దీదేశమున కేతెంచినపండితు లిచటనే స్థిరపడిరి. కాన నీకాలమునకు వారిప్రతిభ దేశమునం దంతటను వ్యాపించుటచే ననేకు లీపండితుల గృహములకు గుమిగూడుచుండిరి. అల్లాయుద్దీనుకాలమున రాజాస్థానము లొనర్పవలసిన విద్యావ్యాపనము నీపండితగృహములు చేయుచుండినవి. అదియునుగాక విజ్ఞానచంద్రికలను వెదచల్లు సారస్వతసమాజము లనేకము లాకాలమున ఢిల్లీనగరమునం దుండినవి. కాన నీకాలమునం దనేకప్రబంధములును, మతము, వేదాంతము, చరిత్రము, వ్యాకరణము మున్నగు విషయములకు సంబంధించిన గ్రంథము లనేకములును రచింపబడినవి. సుల్తానుగౌరవాదరములను బడయజాలని విద్వాంసు లనేకులు సామంతులచేతను, రాజోద్యోగులచేతను బోషింపబడుచు విద్యను వ్యాపింపజేయుచుండిరి.

తుగ్‌లక్‌వంశము, ౧౩౨౦-౧౪౧౪:—ఖిల్జీవంశీయులలో కడపటివాడగు 'ముబారక్' యొక్క నీతిబాహ్యమగు ప్రవర్తనమువలనను, దాత్కాలిక రాజకీయ విప్లవములవలనను ననేకులగు విద్వాంసులు రాజధానిని విడిచిపోయిరి. "ఘియాసుద్దీన్" తుగ్‌లక్ రాజ్యమునకు వచ్చినపిమ్మట కొంతశాంతి చేకూరినది. కాని యతని యనంతరము ఢిల్లీసింహాసనము నధిష్ఠించిన మహమ్మద్‌కాలమున తిరిగి యుపద్రవములు జరగినవి. అల్లాఉద్దీన్‌ఖిల్జీ విద్యయెడ నిరాదరమును జూపినగూడ నాతనికాలమున వైదుష్య మభివృద్ధినందెనని యిదివరలో చెప్పబడియున్నది. ఈ మహమ్మద్ తుగ్‌లక్ స్వయముగ మహావిద్వాంసుడై పండితపక్షపాతియై యుండినగూడ నీతనికాలము విద్వాంసుల కపాయకరముగనే యుండెను. ఈసుల్తానుపిచ్చిచేష్టలను పైశాచిక క్రోధజ్వాలలను దాళజాలక పండితులనేకులు పలాయితు లైరి. అయిన నీతనివైదుష్యము సర్వతోముఖముగ నుండెను. కవిత్వమునందును, చరిత్రమునందును,

తర్కమునందును, వైద్యశాస్త్రమునందును ఈసుల్తానున కెక్కుడభిరుచి యుండెను. ఈతని ధారణాశక్తి నిరుపమము.

మహమ్మద్‌కు పిమ్మట ఫీరోజ్ షా సుల్తానయ్యెను. మహావిద్వాంసుడు, రసజ్ఞుడు నగు నీతడు విద్వత్సమ్మానార్థమై ప్రత్యేకముగ నొకభవనమును గట్టించెను. విద్యానిలయముల యభివృద్ధికిని, పండితులయొక్కయు, విద్యార్థులయొక్కయు భరణములకొరకును ప్రతివత్సరము నీసుల్తాను కోశాగారమునుండి ముప్పదియారులక్షల టంకములు వ్యయపరుపబడుచుండెడివి. రాజాంతఃపురమునందలి పదునెనిమిది వేలబానిసలకు నీతడు విద్యనేర్పించి, వారలనుపరిశ్రమలందును, ఖొరాన్ గ్రంథమునకు ప్రతులను వ్రాయుటయందును నిపుణుల నొనర్చెను. ఈసుల్తానుచే నూతనముగ నిర్మింపబడిన "ఫిరోజాబాద్" నగరము సర్వవిద్యలకును కేంద్రస్థానముగ నుండెను. అనేకములగుపాఠశాలలు, కళాశాలలు నీతనిచే నుద్ధరింపబడినవి. కవులను,తత్త్వజ్ఞులను దేశమునందలి వివిధరాష్ట్రముల కేగి ప్రజలకు జ్ఞానదానము నొనర్ప నీసుల్తాను నియమించుచుండెను. ఈతడు నిష్పక్షపాతియై హిందూవిజ్ఞానమునెడగూడ నెక్కుడుగౌరవమును చూపుచుండెను. ఈతనియాజ్ఞచే నొకజీర్ణ దేవాలయమునుండి యనేక హిందూగ్రంథము లుద్ధరింపబడి పర్షియనుభాషలోనికి బరివర్తింపబడినవి. ఇట్టియుదారబుద్ధిగల సుల్తాను స్వీయ చరిత్రమునుగూడ రచించెను. విద్యాసంపదగల్గియు దారిద్ర్యదుఃఖముచే బీడింపబడుచుండెడివా రందరును ప్రభుత్వాదరణమునకు పాత్రులుగ నుండవలెనని యీసుల్తాను శాసించియుండెను.

లోడీవంశము, ౧౪౫౦-౧౫౨౬:— తుగ్‌లక్ వంశీయులకు పిమ్మట ౧౪౧౪-౧౪౫౦ ల నడుమ "సయ్యద్"వంశీయులు రాజ్యమేలియుండిరి. విద్యాచరిత్రమునకు వారిపరిపాలనకాలము నిరుపయోగమగుటచే నిచట విడువబడినది. లోడీవంశీయులలో రెండవవాడగు సికందర్‌రాజ్యకాలము మిగులముఖ్యమైనది. ఈతని కవితాశక్తి శ్లాఘనీయముగ నుండెడిది. రాజధాని యాగ్రానగరమునకు మార్చబడుటచే నానగరము ప్రధాన విద్యాస్థానముగ నుండెడిది. తనసైనికనియోగమునందుండినవారెల్లరును రణనీతిశిక్షితులుగ నుండవలెనని యీసుల్తాను శాసించెను. తాత్త్వికవాదముల నాకర్ణించుటయం దీతనికి శ్రద్ధ మిక్కుటముగ నుండెను. ఈతనికాలమున హిందువులుగూడ పర్షియనుభాష నభ్యసించుచుండిరి. సుల్తానుకీర్తి దూరదేశములకుగూడ వ్యాపించుటచే పర్షియా, అరేబియా, బొఖారా మున్నగు దేశములనుండి యనేకమందివిద్వాంసు లీతని యాస్థానమున కేతెంచి యుద్గ్రంథములను రచించుచుండిరి.

ఇంతవరకును ఢిల్లీసుల్తానుల పరిపాలనకాలమున వారియాదరగౌరవములచే నభివృద్ధినందిన విద్యావైదుష్యములచరిత్రమును వర్ణించియుంటిమి. ఈకాలమున చిన్నచిన్న సంస్థానము లనేకములు ప్రబలియుండినవి. వానిపాలకులుగూడ విద్యాభివృద్ధికై యనేకవిధముల గృషిసల్పియుండిరి. కాన నాచరిత్రమునుగూడ పరిశీలింపవలసియున్నది.

బహమనీరాజ్యము, ౧౩౪౭-౧౫౨౬:— బహమనీసుల్తానులలో రెండవవాడగు మహమ్మద్‌షా పర్షియను అరబ్బీభాషలలో నిర్దుష్టమగు కవిత్వమును చెప్పగల్గియుండెను. గుల్‌బర్గా, బీదర్, ఎల్లిచ్‌పూర్ మున్నగు నగరములం దితడు పెక్కువిద్యాలయముల నేర్పరచి విద్యార్థులకు వసతులను, భోజనసదుపాయములను ఏర్పరచెను. అనంతరము పేరొక్కనదగినవాడు సుల్తానుఫీరోజ్ షా బహమనీ. ఆకాలపుచరిత్రకారుల వ్రాతలనుండి యీతడు బహుభాషాభిజ్ఞుడనియు, నంతఃపురస్త్రీలతో బండ్రెండుభాషలలో సంభాషించుచుండెడివాడనియు దెలియుచున్నది. విశేషములకు నొకలనంపి యచ్చటి సుప్రసిద్ధులగు విద్వాంసులను రావించి యీతడు వారివలన వృక్షశాస్త్రము, రేఖాగణితము (Geometry), తర్కము మున్నగునభిమానవిద్యలను నేర్చుచుండెను. జ్యోతిశ్శాస్త్రాభినిరతుడగు నీరాజు దౌలతాబాదునం దొకజ్యోతిర్దర్శనశాలను (Observatory) నిర్మించెను. రెండవమహమ్మద్‌షా యను మరియొకసుల్తానుకాలమున మహమ్మద్‌గవాన్ అనునొకమంత్రి విద్యావ్యాప్తికై విశేషముగ పాటుపడెను. బీదర్‌నగరమునం దొకకళా

శాలయు, దానికిజేరి ౩౦,౦౦౦ గ్రంథములుగల యొక విశాలభవనము నీతనిచే నిర్మింపబడినవి.

ఢిల్లీసుల్తాను మహమ్మద్ తుగ్లక్ కాలమున హాస్సన్ అనువానిచే నీబహమనీరాజ్యము నిర్మింపబడెను. ఇందలి మొదటి సుల్తానులు కాకతీయాంధ్రసామ్రాజ్యమునకు రాజధానియై విశ్వవిఖ్యాతి నందియుండి క్రీ. శ. ౧౩౨౩లో మహమ్మదీయులకు వశమై తన యౌన్నత్యమును గోలుపోయి నామావశేషమై యుండిన యేకశిలానగరమును (Warangal) సాధించుటకై యత్నించిరి. అనంతర మీబహమనీరాజ్యమునకును, హైందవస్వాతంత్ర్యసంరక్షణదీక్షాబద్ధమై తుంగభద్రాతీరమున బయల్వెడలిన విజయనగరసామ్రాజ్యమునకును ఎడతెగని పోరాటము సంభవించినది. ఈయుద్ధములలో నెల్ల బహమనీసుల్తానులు వర్ణనాతీతమగు క్రౌర్యమును చూపియుండిరి. ప్రజాసామాన్య మనేకకష్టములకు లోనయ్యెను. ఈసుల్తానులు దక్కనునందు హిందువులను నిర్మూలించుటకును, లేనిచో వారలనెల్ల మహమ్మదీయులుగ మార్చుటకును అనేకవిధముల ప్రయత్నించియుండిరి.* పాలకులెల్లరును విషయలోలురై యుండిరి. అందుచే నీకాలమున విద్యావైదుష్యములు విశేషముగ నభివృద్ధినందుటకవకాశము లేకుండినది.

బిజాపురరాజ్యము, ౧౪౯౦-౧౬౮౬ :—బహమనీరాజ్యపతనానంతరము యూసఫ్ ఆదిల్షాయనునాత డీబిజాపురరాజ్యమును స్థాపించెను. న్యాయమునకు, సత్ప్రవర్తనమునకు నీత డాదర్శప్రాయుడుగ నుండెననియు, సంగీతసాహిత్యములయం దభిరుచి గలిగియుండెననియు ఫెరిష్టాయను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. పర్షియా, టర్కీస్థానము, రూమ్ మున్నగు దేశములనుండి విద్వాంసులను రావించి యీతడు వారిని తనయాస్థానమున బోషించుచుండెను. యూసఫ్నకు బిమ్మట రాజ్యమునకు వచ్చిన ఇస్మైల్ షా గుణశీలములలో దండ్రిని బోలియుండెను. బిజాపురమున నీతనిచే నొకచక్కని గ్రంథాలయముసెలకొల్పబడెను. ఈవంశమునందలి నాల్గవ సుల్తానగు "ఆలీఆదిల్ షా" కాలముననే చరిత్రప్రసిద్ధమగు తళ్లికోట యుద్ధమును, విజయనగరాంధ్రసామ్రాజ్యపతనమును జరగినవి. బిజాపురపాలకులలో కడపట బేర్కొనదగిన సుల్తాను రెండవఇబ్రహీం. ఈవంశీయులు హిందూరాజ్యములలో నగ్రగణ్యమగు విజయనగరసామ్రాజ్యనాశమునకు కారకులై యుండినను, వీరిపరిపాలనమున హిందువులు సౌఖ్యము ననుభవించి యనేకముగ రాజకీయోద్యోగములనుగూడ చేయుచుండిరి. ఈసుల్తానుల పరిపాలనకాలము విశేషముగ విజయనగరాధీశులతో బోరుటయందే వినియోగింపబడుటచే విద్యావైదుష్యము లభివృద్ధిజెందుటకు వలనుపడకుండినది.

గోల్కొండరాజ్యము:—ఈరాజ్యము నేలిన సుల్తానులలో నెల్ల ముఖ్యుడగు కులీకుతుబ్షా యను నాతడు హైదరాబాదునగరమున 'చార్ మినార్' అను భవనమును గట్టించి యందొకకళాశాలను స్థాపించెను.

బంగాళారాజ్యము, ౧౩౪౦-౧౫౭౬ :—విద్యాచరిత్రమున కీబంగాళారాజ్యవృత్తాంతము మిగుల ముఖ్యమైనది. ఇతర మహమ్మదీయరాజ్యములందువలె నిచ్చటను రక్తపాతములును, హత్యలును సర్వసామాన్యములుగనే యుండినను, ఇచ్చటిసుల్తానులు వంగసంస్కృతవాఙ్మయములకు చక్కని ప్రోత్సాహము నొసంగియుండిరి. ఘియాసుద్దీనప్రతినిధిపాలకుడు ౧౩౬౦ ప్రాంతమున లక్ష్మణావతీనగరమున నొకకళాశాలను నిర్మించి, యందు విద్యావ్యాసంగము జేయుపండితులకు వేతనముల నేర్పరచెను. నాసిర్షాయనునొకసుల్తాను దేశీయమగు వంగభాష ననేకవిధముల బ్రోత్సహించి సంస్కృతభారతము నాభాషలోనికి బరివర్తింపజేసెను. విద్యాపతి యను వంగకవి యీసుల్తాను ననేకవిధముల గొనియాడియున్నాడు. రెండవఘియాసుద్దీన్ కాలమున వాల్మీకిరామాయణము బంగాళీభాషలోనికి తర్జుమాచేయబడెను. హుస్సేన్ షా భాగవతపురాణమును మాలాధర్ బాసు యనుపండితునిచే బరివర్తింపజేసెను. పరాగల్

* Smith—Oxford History of India, P. 284.

ఖాన్ అను నీసుల్తాను సేనాని కవీంద్రపరమేశ్వరుడను పండితునిచే శ్రీమహాభారతమునకు మరియొకయను వాదమును వ్రాయించెను. దీని నీసేనానితనయుడు శ్రీకర్ణనంది యనుమరియొక విద్వాంసునిచే బూర్తిచేయించెను. ఈవిధమున వంగరాష్ట్రమున మహమ్మదీయపాలకులు హిందూవాఙ్మయమునెడ గౌరవాదరములనుజూపి, ప్రజోపయోగార్థమై దానిని దేశభాషలోనికి బరివర్తింపజేసిరి. ఇయ్యది కడుశ్లాఘ్యమగు విషయము.

క్రీ. శ. ౧౦౦౦-౧౫౭౬ సంవత్సరముల నడుమ మహమ్మదీయుల పరిపాలనమునందలి భారతీయ విద్యాచరిత్రమును సంక్షేపముగ వర్ణించియుంటిమి. ఈ కాలమున విద్వాంసులును, విద్యాపోషణాభినిరతులును అగు ఫిరోజ్ షాతుగ్లకువంటి సుల్తాను లెందరోయుండిరి. రాజాదరణము లేకుండినను సామంతులయొక్కయు, ప్రజాసామాన్యముయొక్కయు సమాదరణముచే నీకాలమున విద్య యభివృద్ధి నందుచుండె ననుటకు అల్లాయుద్దీన్ ఖిలీపాలనకాలమె తార్కాణము. ఢిల్లీ, ఆగ్రా, ఫిరోజాబాద్, బిజాపురము, జునాపూర్, బీడర్ మున్నగు నగరములు విద్యాకేంద్రములుగ నొప్పినవి. మఖ్తాబ్లను పాఠశాలలును, మద్రసాలను కళాశాలలును, పండితుల గృహములును, ప్రధాననగరములందలి విద్వత్సమాజములును దాత్కాలిక విద్యాసంస్థలలో నగ్రగణ్యములు. పాలకుల వైదుష్యమార్థ్యము లే విద్యాభివృద్ధికిని, క్షైణ్యమునకును గారణములై యుండినవి. ఈకాలపు హిందూవిద్యాస్థితిని గూర్చిన ప్రశంస యైనను మహమ్మదీయచరిత్రకారుల వ్రాతలలో గానరాకున్నది. అందుచే నుత్తరాపథమున బంగాళమున దక్క నితరరాష్ట్రములందలి హిందూప్రజ లాత్మరక్షణమునకే తమశక్తినంతయు వినియోగించి యథాసాధ్యముగ బూర్వవిద్యావిధానమును సాగించుకొనుచు, నపూర్వములగు గ్రంథముల నెటులైనను మహమ్మదీయులబారిని పడకుండునటులు సంరక్షించుకొనుచుండిరని స్పష్టమగుచున్నది. ఈకాలపు హిందూ వైదుష్యమును దెలిసికొనుటకు దక్షిణాపథచరిత్రమే శరణ్యము. అచ్చటనే కాకతీయవిజయనగరాంధ్ర సామ్రాజ్యాభిరక్షితమై ప్రాచీన హైందవవిజ్ఞానదీపిక వెలుగుచుండినది.

---

గోరాజు




—క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యము, కాకినాడ.

# బ్రాహ్మణుడు

కీ. శే. కొడాలి వెంకటసుబ్బారావు, బి. ఏ.,

ఓయీ బ్రాహ్మణ, సౌరతైజసము వాయూద్వేగ మాకాశ గీ
తీయాథార్థ్యము భూక్షమంబు జలమూర్తి స్పర్శమా నీ ముఖ
శ్రీయున్ మేధయు వాక్కు మానసము దృగ్గీతుల్ పురాసృష్టి ర
క్షాయోగంబున పాంచభౌతికములై శాసించె విశ్వాకృతిన్.

అవు నోయీ, ఒకనాడు వెన్నెముక నీవై లోకసంత్రాసహే
తువు రక్షోగణనాయకావృత మసాధుత్వమ్ము చెక్కించి మా
నవ దేవాహిధరాత్రయస్థితికి స్థానం బయ్యె! ఆ నీవె యి
ప్డు వృథామంగళపాఠకుండ వయినావున్ పో లయాలంబివై!

ఒక డనుగ్రహముతో నుర్వీశు జన్నంబు – తీర్చి స్వర్పతిని వేధించినాడు
ఒక డాగ్రహించి పయోధిబాడబవహ్ని – నిగలతో నాపోశనించినాడు.

ఒక డనుగ్రహముతో నుగ్రకాకోలాగ్ని – గళభూషణంబుగా నిలిపినాడు
ఒక డాగ్రహించి యుర్వీధరాగ్రము పెంపు – లెచట నచ్చోటె మాయించినాడు.

నిగ్రహానుగ్రహ ప్రజ్ఞ నీదుమూర్తి – బానిసత్వ విధాప్రథా బాహిర మయి!
స్వార్థమై ఆంతరంగికాచ్ఛత తొలంగె – బ్రాహ్మణా, తొంటిజాడ నిష్పచ్ఛరమయి!

ఋతువు లారింటను ఋజువర్తనము లేమి – కాలానుసృతి వానకలిమిలేమి
సూర్యభానువులు తేజులు పెంచి కాల్చుట – భూమిసస్యంబు లపూర్ణ మగుట
మిథ్యామతవ్యాప్తి మించి పోరులు పుట్టి – అడుగడ్డునకు శంక లావహిలుట
సారస్వతప్రేమ సన్ననై దుర్భాష – లానోట నానోట నల్లుకొనుట
నీకతన గాదె? నీపురానియతి నీవె – నిలిచి నిష్కల్మషత్వము నించుకొనిన
తారుమా రౌనె భారతధరణి విప్ర! – గుండెలో నీకు మంచి ఉగ్గునకు లేదు!

ఒకమా రంతరమున్ పరీక్షుగొని నీదో తప్పు లోకంబుదో
ప్రకటింప న్వలె నీవె; నీయశము లోపం బౌనో యేమంచు జం
కక తొల్లింటి ప్రభావమున్ సహజమార్గంబందు పోనిచ్చి భూ
మికి కల్యాణము తెమ్ము; నిన్ననరు సామీచీన్య సౌఖ్యస్థితుల్.

---

# సూర్యగ్రహణము

చివుకుల వెంకటరమణశాస్త్రి

సూర్యగ్రహణమనగా సూర్యుడు మన కగు పడకుండుట. ఇయ్యది మేఘాచ్ఛాదనవలనను గల్గును గాని అది నియతము గానందున గ్రహణ మనబడదు. ఇందుకు కారణము చంద్రుడు భూసూర్యుల మధ్యకు వచ్చుటయే. భూమిచుట్టు చంద్రుడు తిరుగు మార్గమునకు చంద్రకక్షా వృత్తము (Moon's Orbit) అని పేరు. సూర్య చంద్రు లొకచోనుండకపోయి నను భూసూర్యులమధ్య చంద్రుడుంటచే మనకు సూర్య దర్శనముగాదు. ఇది పగటిభాగమందగు దేశమునకు మాత్రమే గ్రహణమనబడును. (చిత్రము ౧ చూడుడు.)




చిత్రము ౧

ఇందు భూసూర్యులమధ్య చంద్రుడుండుటచే భూమి లోనిసగభాగమునకు గ్రహణమయ్యె. మిగిలినసగమందు రాత్రియగుటచే గ్రహణమనబడదు.

చంద్రుడెప్పుడు తిరుగుచుండువాడగుటచే కొంత కాలమునకు చంద్రుడు భూసూర్యులమధ్యనుండి తొలగి పోవును. చంద్రుడు భూసూర్యులనడుమ ప్రవేశించ పారంభించుకాలమునకు స్పర్శకాలమనియు, వెడలిపోవు కాలమునకు మోక్షకాలమనియు పేర్లు.

ఇయ్యది భిన్న దేశములకు భిన్నవిధములుగా నగు పడును. కారణమేమనగా (చిత్రము ౨ చూడుడు) భూమి విశాలముగను, గుండ్రముగను ఉండుటచే భూ




చిత్రము ౨

తలము(Surface of the Earth) నందలి 'అ. ఇ. ఉ'. భిన్న దేశములందలి ద్రష్టలు ఎవరికివారు తామే భూమికి ఊర్ధ్వమందున్నామని తలచెదరు. అమావాస్యాంత కాలమున భూచంద్రసూర్యుల కేంద్ర (Centre) ము లేకరేఖయం దుండును. అందువలన 'ఇ' అనుస్థానమం దుండెడివారికి 'చ' స్థితిలో 'ఇక' 'ఇత' అనురేఖగుండా దృష్టి ప్రసరించును. అందువలన సూర్యు డేమియు నగుపడడు. 'చ చ' స్థితులందుచంద్రుడున్నపుడు సూర్యుడు సంపూర్ణముగా నగుపడును.

'అ' అనుస్థానమందుండువారికి 'చ' స్థితి (Position) యందు సూర్యునిలో 'ప. త. ట.' అనుభాగము మాత్రమే అగుపడును. 'చ' స్థితియందు 'ప గ జ క న ఖ ట' అను సూర్యునిభాగ మగుపడును, 'చ' స్థితిలో సూర్యబింబము సంపూర్ణముగా నగుపడును.

ఇట్లే 'ఉ' అనుస్థానమందున్నవానికి 'చ' స్థితిలో సూర్యుడు సంపూర్ణముగా నగుపడును. 'చ' స్థితిలో 'జ క న' అనుసూర్యునిలోనిభాగ మగుపడదు. 'చ' స్థితిలో 'గ క ఖ' అనుసూర్యునిలోనిభాగ మగుపడును. 'గ ప, త ట ఖ' అనుభాగ మగుపడదు.

అందుచే భిన్నదేశములందు భిన్నరీతులుగ నగుపడును. ప్రకృతము మనభారతదేశమందు భిన్నస్థానములందు




చిత్రము ౪

గ్రాస (సూర్యునిలో నగుపడనిభాగము) భేదమును స్పర్శ, మోక్షకాలమును ఈయబడినవి. (చిత్రము 3 చూడుడు.) ఇందు మన ప్రాచీనగ్రంథసమ్మతమగు లంకోజ్జయినీరేఖనే భూమధ్యమున నుంచుకొని అచట నుండి రేఖాంశలు (Longitudes) ఇవ్వబడెను. ఈ రేఖ ప్రకృతమందలి గ్రీనిచ్‌రేఖకు 75.8° E గా నుండును. భూమధ్యరేఖనుండి ఉత్తరముగా అక్షాంశలు (Latitudes) ఇవ్వబడినవి. వీటినిబట్టి పట్టణములు తెలియనగును. దశాంశలలో (Decimal) గ్రాసమివ్వబడినది. గంటలనిమిషములలో రేఖయందలి ప్రదేశములకు స్పర్శకాలము, మోక్షకాలము ఇవ్వబడినవి.

పౌరాణికులు గ్రహణమునకు రాహుకేతువులు కారణ మనెదరు. ఆరాక్షసులు సూర్యుని మ్రింగెదరని వీరియాశయము. దీనిని వాస్తవముగా సమన్వయము చేయవచ్చును. (చిత్రము ౪ చూడుడు.)

ఇందు భూసూర్యులెల్లపుడు క్రాంతివృత్తిమందే యుందురు. చంద్రుడుమాత్రము భూమిచుట్టు తన కక్ష్యావృత్తములో తిరుగుచు చుట్టుకు రెండు పర్యాయములు మాత్రము క్రాంతివృత్తగతు డగును. ఆరెండుస్థానములకే- అనగా క్రాంతివృత్త చంద్రకక్ష్యావృత్త సంపాతస్థానములకే-రాహుకేతువులని పేరు (Moon's Ascending Node and Descending Node). చంద్రుడీస్థానములందున్నపుడు మాత్రమే 'భ' అనగా క్రాంతివృత్తగతు డైనపుడే క్రాంతివృత్తీయులగు భూసూర్యుల కడ్డపడును. కాని తనకక్ష్యావృత్తములో 'చ' రాహువునకు (సంపాతమునకు) దూరములో నున్నపుడు అడ్డపడడు. అందుచే గ్రహణముండదని పై చిత్రమువలన స్పష్టపడుచున్నది.

N. B. 'చ.' స్థానము (Position)నకే రాహువు (Moon's Ascending Node) అని పేరు.



విద్వాన్, కవితిలక కాంచనపల్లి కనకాంబ

ధయయున్ సత్యము శౌచము - భయభక్తులు కలిగి మెలఁగవలయు గురులలో
నియతిన్ యత్నమున మనో - లయపర్యంతం బదవ్వలన్ నైజంబౌ.

కాంచనంత మేర కాలుసాగించినఁ - దోఁచుచుండు నవల త్రోవ యదియ
ఉన్నచోట నుండి యూహించుచుండిన - గోరుదాని నెవఁడు చేరఁగలఁడు?

హితమున్ బ్రియమున్ దన కెది - హితు లద్దానిని నడుగక యె యొనర్చుచు రా
మతి తగులుంగద యేకా - గ్రతఁ దాసాధింపఁగోరు కార్యమునందున్.

మనమున శాంతి గల్గిన సమానుషశక్తి ఘటించు సంచితం
బనుపమలీల డుల్లు; పరమాత్ముని దర్శన మబ్బు; మబ్బుపో
కను గురుమూర్తి సత్కృపను గాఢవిరాగము కల్మితాల్మి శో
భనముల కాటప ట్టనుచుఁ బల్మరు తెల్పుచునుందు రెందరో.

ఎట్టిమనోవికార ముదయించిన యే నది జీవసంజ్ఞగా
నెట్టుము, సద్గురూక్తవిధినేర్పున శౌరిపదద్వయంబునే
పట్టుము, భక్త కోటికిఁ బ్రపత్తి నొనర్పుము, ముక్తికాంత చే
పట్టును వేదచోదితము భవ్యపథం బిది త్రొక్కఁ గల్గినన్.

వయసురా, వచ్చు చిహ్నలవలె జగానఁ - గానవచ్చును జ్ఞానంబు కలుగుకొలఁది
ముక్తలక్షణములు గురుపుత్త్రులందు - నురక తలపోయుమాత్రాన నుట్టిపడునె?

జ్ఞానపాదపంబుఁ గానఁ బోషింపఁగా - నదిచిగుర్చు, పూచు, నదె ఫలించు
దానినైజ మద్ది దానికై చింతింప - వలదు, లెస్స సాఁకవలయుఁగాక.

ఊఁచినచొప్పునన్ గదిలి, యూరక నిల్పినయప్పు డాత్మలో
డాఁచి సమస్తవృత్తులఁ దటాలున జీవుఁడ నే నటం చధ
ర్మాచరణప్రవృత్తిగలయప్పుడు నిన్ను స్మరించునట్లు, వే
మోచన మబ్బచేయర, తమోహర, శావర, యోరమావరా!

రామ రామ రామ రమణీయగుణధామ, - వదనవిజితసోమ, వైరిభీమ
దానకామ, దేవతాసార్వభౌమ, మా - వాసహృదయసీమ, భవ్యనామ.

---




## తెరువదగు వంతెన

కొ. నరసింహాచారి

చిత్రము 1 లో గుర్తించిన కొలతలు గలిగిన గట్టిఅట్టలను రెంటిని దీసికొని వాటిని చిత్రము 2 నందు జూపినవిధముగ రెండు పెట్టెలుగా చేయవలెను. వాటిలో నొకదానికి r అనుచోట నొకరంధ్రమును చేయవలెను.

చిత్రము 3 నందలివిధముగా కొలతలుగల మఱిరెండు అట్టలను దీసికొని వాటియందు మూలగీతలతో గుర్తించినభాగములను కత్తిరించివేసి మిగతభాగమును చిత్రము 4 నందలివిధముగ రెండుద్వారములుగా జేయవలెను. ఇందుగూడ r. r. అను రెండురంధ్రము లుండవలెను.

మరల చిత్రము 5 నందలివిధముగ కొలతలుగల రెండుఅట్టలను దీసికొని వాటిని చిత్రము 6 నందలివిధముగ మడువవలెను. ఇందు r అనునది ఒక నాలుగుమూలల రంధ్రము.

పిమ్మట ౮¼ లేక ౫½ అం. నిడివిగల యొక వేముతునుకనుగాని, వెదురుతునుకనుగాని దీసికొనవలెను. ఇది దారపుబండియందలి రంధ్రమున దూరదగి యుండవలెను. వెదురుతునుక యైనయెడల దానిని గుండ్రముగా చెక్కకొనవలెను. ఈతునుకయొక్క కొనలను నాలుగు పక్షములుగా చెక్కవలెను (చిత్రము7a). దానిపై రెండుదారపుబండ్లను దూర్చవలెను (చిత్రము7). a అనుకొనలు చిత్రము 5 నందలి రంధ్రమున దూరగలిగి యుండవలెను.

తర్వాత సుమారు ౧౦ అంగుళముల నిడివిగల యొక కమ్మిని దీసికొని దానిని చిత్రము 8 యందలి విధముగ వంచుకొనవలెను. h, h అను రెండువలయములు దానియందు ఉండవలెను. చిత్రము 2 నందలిపెట్టెలోని రంధ్రములగుండా ఈకమ్మిని, కొనలు వెలికివచ్చునట్లును, hh అనువంపులు పెట్టెయొక్క లోప్రక్క నిమిడియుండునట్లును దూర్చుకొని పిమ్మట కొనలను 8 చిత్రము నందలి విధముగా వంచుకొనవలెను.

అటుపిమ్మట చిత్రము 2 నందలిపెట్టెలు రెంటిమీదను చిత్రము 4 నందలి పెట్టెల నుంచి అతికించవలెను (చిత్రము A చూడుడు). అందు ఒకదానిపైనమాత్రము చిత్రము 6 నందుగల రెండు ఆధారముల నుంచి అతికించవలెను. ఈ ఆధారములందలి రంధ్రముల యందు చిత్రము 7 నందుగల బండ్లను అమర్చ

వ లెను. తర్వాత చిత్రము 9 యందుగలట్టి అట్టను దీసికొని, చుక్కలగీత వెంబడిగా దానిని మడిచి, మడతవఱకుగలసన్నని భాగ 7 అనుదారపు బండ్లమీదుగాను, 2 నందలి పై రంధ్రములగుండాను పెట్టి క్రిందివైపునకు దీసికొని, దారపు కొనలను క్రిందుగల కమ్మి యందలి వలయ ములకు కట్టవలెను.




రెండవ అరుగు ద్వారమును చిత్ర ము 9 అట్టకు అందు నంత దూరమున నుంచవలెను. 9 అట్ట బల్లపఱుపుగా నుండినపుడు బండ్లు-పోవుట కనుకూల మగు బాటగా నేర్ప డును. ఇట్టి స్థితికి చాలినంత పొడ వుండునట్లుదారము లుండవలెను. ఈఅ ట్టనుఎత్తవలెనన్న, 8 కమ్మినిచుట్టినయె డల, దారము కమ్మి కి చుట్టుకొని, అట్ట పైకిలేచును. అప్పు డు అరుగు ద్వార ముల మధ్య గల నదియందు పడ వలు పోవచ్చును.

మును చిత్రము A యందు 2 పై అతికించ వలెను. తర్వాత ఈఅట్టపైయంచున S,S గుర్తుగలచోట్ల రెండుదారములను కట్టి వాటిని కావలెనన్న రెండుఅరుగు ద్వారము లను ఒక అట్టపై ఎదురెదురుగా అతికించ వచ్చును.

# భారతము : పరమార్థప్రదర్శనము

నండూరి బంగారయ్య

(అనువృత్తము)

## కర్ణుఁడు

కర్ణుని చారిత్రము విచిత్రస్వరూపము కలది. ఇందు మంచిచెడ్డలు రెండును విడఁదీయరాకుండఁ బెనఁగొనియున్నవి. ఇతఁడు శౌర్యమున నిరుపమానుఁడు. కాని భారతరణమున నీతఁడు పారిపోయినన్నిసారులు సుప్రసిద్ధవీరు లెవ్వరును పారిపోలేదు. బ్రహ్మాస్త్రము నిమిత్తము పరశురామునితో సబద్ధమాడుటకు వెనుదీయలేదు. కాని కురుపతికిచ్చినమాటను దేవతలు వచ్చి బోధించినను వెనుకకుఁ దీసికొనలేదు. ద్రౌపదిని సభలో పరిహాసముచేసిన గుంటరి. కాని "పాంచాలరాజపుత్రియు నంచితముగ నిన్నుఁబొందు నాఱవవరుసన్" అని శ్రీకృష్ణుఁడు మురిపించినపు డామెవైపునకు బుద్ధి మరల్చినట్లే లేదు. వదాన్యత మొదలగు నీతనిసద్గుణములు చూచినపు డీతనియందు మనకు స్నేహము, గౌరవముకూడ నుదయించును. ఇట్టిపరస్పరవిరుద్ధాంశములతో నిండియున్నకర్ణుని బాహ్యచారిత్రమున మనకు స్థాయిభావము చిక్కుట లేదు. మేఘపిహితమయిన సూర్యబింబమువలె కర్ణునియాత్మ మనకు స్పష్టముగాఁ గానవచ్చుట లేదు. కాని యీమేఘమును జీల్చుకొని యొకటిరెండుకిరణము లీవలకు వచ్చుచున్నవి. ఉద్యోగపర్వమున కృష్ణునికి కర్ణునకు నడచినసంభాషణమువలన నాతని యంతరంగస్వరూపము పూర్ణముగ మనకు గోచరించుచున్నది.

కర్ణుని పాండవపక్షమునకు రమ్మని ప్రార్థించుటలో శ్రీకృష్ణునియభిప్రాయ మేమి? తా నెంత నేర్పుగా నడిగినను, కర్ణుఁడు కౌరవపక్షమును వీడుననియే యాతఁ డాశించినాఁడా? ఈఘట్టమును భీష్మపర్వములోని యింకొకఘట్టముతోఁ గలిపి చదివిననే కాని దీనియర్థము బోధపడదు. ఉద్యోగసమయమున నెంతచెప్పిచూచినను తనమాట వినిపించుకొనని కర్ణునితో మరల శ్రీకృష్ణుఁడు భీష్మపర్వమున "భీష్మునిపైనలుకచే సమరమునకుఁ జొరవఁట. ఈపదిదినములు నిరుద్యోగముగ నుండనేల? పాండవపక్షమునకు రారాదా?" యని ప్రార్థించెనే! ఉద్యోగపర్వమున కర్ణుఁడిచ్చిన ప్రత్యుత్తరమునుబట్టియే కర్ణునిమనస్సు పూర్తిగా గ్రహించిన శ్రీకృష్ణుఁడు మరల నీప్రశ్నము వేయనేల? ఇట్టి ప్రశ్నములవలన కర్ణుని ఘనతను లోకమునకు వెల్లడిచేయవలయుననియే శ్రీకృష్ణుని యుద్దేశ్యము. అట్లుచేయుట కాతఁడుతప్ప మఱియొకఁడు సమర్థుఁడు కాఁడు. మానవత్వమందలి దైవత్వమును బ్రకాశింపఁజేయుటకు దైవమునకే కాని మానవునికి సాధ్యపడదు.

కర్ణుని దైవత్వము తాను కౌంతేయుఁడనని తెలిసియు పాండవపక్షమునకు రాకుండుటలోఁ బ్రకటమైనది. కుంతియు, సూర్యబింబమునుండి యశరీరవాణియు నాతనిని పాండవపక్షము నవలంబింపుమని హితవొసంగినవి. భీష్ముఁడు శరతల్పగతుఁడు తన్నుఁ జూడ వచ్చిన కర్ణుని పాండవులఁ జేరఁబొమ్మని ప్రార్థించెను. శ్రీకృష్ణుఁడు పాంచాలరాజపుత్రికూడ తనకు లభించునని చవులూరించెను; పాండవపక్షమునకు రమ్మని యాహ్వానించెను. కాని అందఱివాక్యములు నిరాకరించి కర్ణుఁడు కౌరవపక్షముననే నిలవఁబడినాఁడు. దీనికి కారణములు (౧) దుర్యోధనునియం దాతనికిఁ గలకృతజ్ఞతయు, (౨) అంతకంటె నెక్కుడుగ నర్జునునియం దసూయయు నని సాధారణముగా ద్యోతక మగును. కాని విచారించినచో నింతకంటెను సూక్ష్మకారణ మొకటి గోచరించుచున్నది. అది భీష్మునితో కర్ణుఁడు చెప్పిన "దైవాధీనము సర్వమున్ మనమతిన్ దప్పింపఁగా వచ్చునే" యనుటలో సూచిత మగుచున్నది. కుంతితోచెప్పిన "సవ్యసాచిపై కోపము పెద్ద" ఇత్యాది

వాక్యములకు ప్రాధాన్యము నీయక "నీపలు కెంతవోలి నను నిర్ణయ మిట్టిద" యనుమాటకును "సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తికరమ" యనుమాటకును ప్రాముఖ్యము నిచ్చి చదువుకొన్నచో కర్ణుని మనస్సులోని యభిప్రాయము స్పష్టతర మగును. దాని నర్థముచేసి కొనియే కుంతి ఒకమూల కడుపుశోకము బాధించుచున్నను "ఇది దైవసంఘటన" మని యూరడిల్లినది.

శ్రీకృష్ణునికి కర్ణుఁడిచ్చిన ఉత్తరములో నా సూక్ష్మకారణము బాగుగఁ బ్రత్యక్షమగుచున్నది.

క. అనుజులు ఋత్విజులుగ నీ
పని యిటు సేయుమని నీ వుపద్రష్టవుగా
విను, కురుకుమారపశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్.

ఇక్కడ కర్ణుఁడు పూర్ణముగ దైవత్వమును వహించినాఁడు. అందువలననే తా నింతవఱకు భుజములు రాచుకొని తిరిగిన దుర్యోధనాదులను "కురుకుమారపశువు"లని నిరసించివైచుచున్నాఁడు. ఇంతకంటె నాతనిఘనత తరువాతివాక్యములలోఁ గానవచ్చినది. తాను కౌరవపక్షమును వీడ నక్కఱలేదు. కాని అర్జునాదులు తమంత తాముగ వచ్చి తమకాళ్లపైఁ బడుట కేమియభ్యంతరముండును? అట్లుచేసినచో కర్ణుఁడు దుర్యోధనునియెడల కృతఘ్నుఁడు కా నక్కఱలేదు కదా! అర్జునుఁడే తనపాదములు పట్టుచున్నప్పుడిఁక అర్జునునికి కర్ణుఁడు వెఱచెనను జనాపవాదమునకు తావుండదుకదా! అట్టి నిరపాయమైన యుపాయము లభించినను దాని కాతఁడు సమ్మతింపమి కేమికారణము? ఇంతవఱకు తుచ్ఛముగఁ గానవచ్చిన కర్ణునిజీవిత మిప్పు డొక్కసారిగ శ్రీ కృష్ణుని కృపావలోకనమునకుఁ బాత్రమై సూర్యకిరణసంపర్కమున అర్కకాంతమువలె గప్పుమని ప్రకాశించుచున్నది. "రహస్యము రక్షితముగఁ బాటింపుమయ్య చిత్తములోనన్" అని యాతఁడు శ్రీ కృష్ణుని వేఁడుకొనుచున్నాఁడు. ఎందువలన?

గీ. ధర్మతనయుండు తాను నాతమ్ముఁడగుట
ఎఱిఁగెనేనియు సామ్రాజ్య మేల పూను?
అట్టిధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగా వసుధకెల్ల.

అని యసూయావిలచిత్తుఁడనుకొనిన కర్ణుఁడు పలుకుట కడునద్భుతావహమే. తనశత్రువు ఘనతను కొనియాడుటవలన కర్ణుని కొకనూతనమాహాత్మ్యము లభించినది. అంతటితో నాఁగక "ఈసమరసముద్రంబు దరి నీఁది నిన్నుం గనియెద. కాదేని నూర్ధ్వలోకంబునన్ గనియెద. నీవింక నేమియుం బలుకకుము. పనివినియెద" అని శ్రీకృష్ణుని కౌఁగిలించుకొనుచున్నాఁడు. కర్ణునిసౌశీల్యమున కవధి యింతకంటె మఱిలేదు. ఈ ఘట్టమువలన కవి మన కెన్నియంశములు ధ్వనింపఁజేయుచున్నాఁడు! తుదకు కర్ణుఁడు, శ్రీకృష్ణుఁడు తోడిదొంగలనినమాట స్పష్టమగుట లేదా? కర్ణుఁడు శ్రీకృష్ణునితో నింతచనువుగ మాటలాడుటకు ఆతఁడెంతగ కృష్ణుని మనస్సులో ధ్యానించి యుండవలెను! సమరమున జయించినను, చచ్చినను తనకు కృష్ణసాన్నిధ్యము తప్పదను నిశ్చయముతో నున్నకర్ణునికృష్ణభక్తుఁడని పేర్కొనుటకు సంశయింపవలెనా?

భారతయుద్ధము గాకుండఁ జేయవలె నన్నచో కర్ణుఁ డాపని నవలీలగ నిర్వహింపఁగలఁడు. కాని అది యాతని కిష్టముకాదు. తా నేకాదు, ఇతరుఁ డెవ్వఁడును గూడ నాపనికిఁ బూనుకొనుట కాతఁ డిష్టపడఁడు. ఎందువలన? జగన్నాటకసూత్రధారియగు శ్రీకృష్ణుని సంకల్పము, నిజసంకల్పమును ఒక్కఁడగుటవలన. కృష్ణుని సంకల్పమగు భారతయుద్ధమునకు తాను నిమిత్తమాత్రముగ వర్తించి తీరవలె ననుస్వస్వరూపజ్ఞానము కర్ణునకున్నది. కాకున్న "రహస్యము రక్షితముగఁ బాటింపుమయ్య" అని కోరియుండఁడు. ఇట్లు కర్ణునియసూయ తిన్నఁగా శ్రీకృష్ణునిసంకల్పమున లీనమైనది.

## భీష్ముఁడు

ఇఁక భక్తశిఖామణియైన భీష్మునిజీవితమననున్న శ్రీకృష్ణతేజమును సందర్శించుట సులభము. భీష్ముని చారిత్రమున కున్నవైవిధ్యము మఱి యేభారతవీరునికిఁ గానరాదు. ఆతనికడ శౌర్యమునకు శౌర్య మున్నది.

భువనైకధన్వియగు పరశురాముని జయించినపరాక్రమ
శాలి. ఆత్మసంయమమునకు ఆత్మసంయమ మున్నది.
తండ్రికోర్కెఁ దీర్చుటకై శాశ్వత బ్రహ్మచర్యమును
స్వీకరించిన దేవవ్రతుఁడు. జ్ఞానమునకు జ్ఞానమున్నది.
ఆతఁడస్తమించినచో లోకమున జ్ఞానమే నశించునని
శ్రీకృష్ణునియభిప్రాయము. ఇన్నియుత్కృష్టశక్తులాతని
యందు నెలకొనియున్నను వీనినన్నిటిని దండగ్రుచ్చి
యాతఁడు శ్రీకృష్ణపాదాంకితము సేయుచున్నాఁడు.
భారతరణమున నత్యుగ్రముగ తనవా రెవ్వరో, పరు
లెవ్వరో తెలియరానంత తీవ్రతతోఁ బ్రతివీరులను
వేటాడుచున్న సందర్భమున శ్రీకృష్ణుఁడు రెండుసారులు
చక్రమును చేతఁ బుచ్చుకొని తనమీఁదికి లంఘింపఁగా
అవలీలగా నాయుధముతోపాటే యుద్ధమునందలి యభి
మానమునుకూడ త్యజించి "స్వామీ రమ్ము" అని
చేతులు జోడించుచున్నభీష్మునిమూర్తి జగద్వంద్యము.
ఎన్ని రాజకార్యములలోను, ఎన్ని లౌకికవిషయములలోను
నిమగ్నుఁడయినను సరియే భీష్మునిదృష్టి యెంతసేపును
ఒక్కశ్రీకృష్ణతేజముమీఁదనే నిలచియున్నది. అంత
స్వస్వరూపజ్ఞానముగల రాజయోగి భారతరణరంగమున
యుద్ధముచేసిన వీరులలో లేఁడు.

ఒక్కయంశముమాత్రము భీష్ముని చారిత్రమున
మిగుల నిగూఢముగ నున్నది. పరశురాముఁడు పరాను
రక్తయగు నంబను తీసికొనివచ్చి తనసోదరునికి వివా
హముచేయుము మనినంతలకే మండిపడి,

గీ. గర్వియై కార్య మిట్టి దకార్య మిట్టి
దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ కున్మార్గవృత్తి వర్తించునట్టి
వాని గురునైన దండింపవలయు నండ్రు.

అని గురుని దండింపనేసిద్ధపడిన యధర్మద్వేషి భీష్ముఁడు
కౌరవులు చేయు దున్నయములన్నిటిని సహించి యెట్లు
భారతయుద్ధమున వారికి సాయపడఁగల్గెను? పాంచాలిని
దుశ్శాసనుఁడు కొప్పుపట్టి యీడ్చుకొని వచ్చి తన
యెదుట చీర లొలుచుచుండఁగా వారిని దండింపఁడేలనో?
ఏవో చప్పిడి ధర్మవాక్యము లాడి యూరకుండెనేలనో?
వారి యకృత్యమును గర్హించుచు కొలువు విడిచిపోనైని
లేదేలనో! తాను చెప్పినధర్మవాక్యములు వినక ధర్మా
త్ములగు పాండుపుత్రులను హింసించి దుర్యోధనాదులు
యుద్ధమును తెచ్చిపెట్టఁగా తాను వారిపక్షమును వీడి
ధర్మరాజాదులకు తనభుజబలము సాహాయ్యము నీయ
లేదు సరికదా, మీదుమిక్కిలి కౌరవపక్షముననే
యుద్ధము చేయుచున్నాఁడే! భీష్ముని యీవిపరీతవర్తన
కేమికారణమను చిక్కుప్రశ్నకు సమాధానమును 'భారత
కారుఁ' డీయలేదు. కాని అక్కడక్కడ నున్న యం
శము లన్నిటిని సమన్వయించుకొని చూచినచో భీష్మున
కున్న భవిష్యజ్జ్ఞానమును, శ్రీకృష్ణభక్తియు నాతని
విపరీతవర్తనమునకుఁ గారణములని స్ఫురించును.

పాంచాలీపరాభవసమయమున ధర్మబోధనముతో
తృప్తిపడి యూరకున్న భీష్ముఁడు శ్రీకృష్ణుని యాగ
మనమునకుముం దాతనిని బంధింతునని ధృతరాష్ట్రునితో
దుర్యోధనుఁడు చెప్పినప్పుడు సభలోనుండి "మొగంబు
గంటువెట్టికొని దిగ్గన లేచిపోయె" నఁట. ధర్మముకం
టెను భీష్మునికి శ్రీకృష్ణుఁడు ప్రియతముఁడు కావున
నతఁడు ధర్మద్వేషమునైనను సహించునుకాని శ్రీకృష్ణ
ద్వేషము సహింపఁడు. శ్రీకృష్ణు దూషించిన శిశుపా
లుని తాను దండింపఁగడంగక యూరకుండుటయేకాక
యుద్ధమునకు సిద్ధపడుచున్న భీమునికూడ వారించి
నాఁడు. ఇట్లుచేయుటలో తనప్రభువగు శ్రీకృష్ణునిచే
దండింపఁబడవలసిన శిశుపాలుని చేయిచేసుకొనుట కిత
రులకుఁగాని, తనకుఁగాని అధికారము లేదనియే యాతని
యుద్దేశ్యము.

ఇంకొకవిషయమును దీసికొందము: దుర్యోధ
నాదులు శ్రీకృష్ణుని బంధింపనుద్దేశ్యము వెలిపుచ్చినంత
మాత్రమునకే సభనుండి లేచిపోయినవాఁడు తీర కౌరవు
లందఱును కృష్ణుని నిజముగ బంధించుటకు సర్వసాధన
ములతో సంసిద్ధులగుచుండఁగా భీష్ముఁడు పెదవియైనను
మెదల్పలేదే! త్రికాలవేదియగు భీష్ముఁడు ముందు
రానున్న విశ్వరూపసందర్శనమునకే సంసిద్ధుఁ డగు
చున్నాఁడు కాని కౌరవులతో వృథావాగ్వ్యయ మొన

ర్పుచు అట్టియుత్తమసన్ని వేశమున తనమనస్సును చెదర నీయఁదలఁచుకొన లేదు. కావున కొన్నికొన్నిఘట్టము లలో భీష్ముఁడు తనయధర్మద్వేషమును ప్రకటింపక పోవుటకు కారణము శ్రీకృష్ణభక్తియే యని తేలు చున్నది.

యుద్ధమున సర్వసేనాధిపత్యమును వహించు నపుడు ఆతనికి ముందేమి జరుగునో తెలియక ప్రవే శించినాఁడా?

క. మీఁటుగలరాజరథికుల
నాఁటికి వేవుర వధింతు; నరుశరముల నో
నాటి పడవైచునంతకు
వేటాడెద ప్రతిబలంబు వీరుల సెల్లన్.

అని భావ్యంశములను ప్రజ్ఞానముతోఁ జూచుచున్నాఁడు' భీష్ముఁడు భారతయుద్ధమును శ్రీకృష్ణలీలకు ఏపక్షమున నుండి తాను తోడ్పడవలెనని దైవనిర్ణయమో తనజ్ఞాన నేత్రముచే నెఱింగికొని స్వయముగ తాను ధర్మాధర్మ నిర్ణయమునకు పూనుకొనక తనయంతర్వాణిపలన విన వచ్చు శ్రీకృష్ణునియాజ్ఞను శిరసావహించెను. లోకము నకుమాత్రము తా నిన్నాళ్లు దుర్యోధనాదుల పోషణ ములో నుండుటచే ఆపక్షముననే యుద్ధముచేయుట యుక్తమని ప్రకటించుచున్నాఁడు. ఇట్లు భీష్ముని చారి త్రమును బరిశీలించినచో ఎక్కడచూచినను అది శ్రీ కృష్ణమయముగాఁ గనవచ్చుచున్నది. ఈసత్యము గ్రహిం పనిచో నాతనిచారిత్రము మన కగమ్యము. అందువల ననే ఆతనికి యుద్ధముచేయుచున్నప్పుడా దానిలో సక్తతలేదు; యుద్ధము ముగిసినవెనుకనా దానినిగూర్చి యెక నాలోచనము లేదు. తన్నన్యాయముగఁ బడ వైచినందులకు నరునిపై నించుకంతైన కోపము లేదు సరికదా, తన్ను పడవైచినతత్క్షణమే చూడవచ్చిన నరునితో భీష్ముఁడాతఁడు తనమనుమఁడనుమాటను మఱచి నరుని నిజస్వరూపమునుమాత్రమే మనస్సునం దుంచుకొని,

ఉ. నారదుచేత నిన్ను మని
నాథునిఁగాఁగ నెఱింగియుండుదున్;
శౌరియు నీవు గూడిన న
సాధ్యము లెవ్వియు లేవు; దర్పదు
ర్వారుఁడ వైన నీవలని
వైరము కీడని చెప్పఁ జెప్ప నీ
కౌరవరాజు మానఁడు తె
గన్ జెడుగా కిటమీఁద భీముచేన్.

అని భక్తిపూర్వకముగఁ బలికినాఁడు. బాణశయ్యాపైఁ బరుండి యుద్ధమును స్వప్నవృత్తాంతమువలె మఱచి నారాయణధ్యానము చేసికొనుచున్నాఁడు.

ఇట్లు దుర్యోధనాదులకు స్వస్వరూపజ్ఞాన మాపా దితమయినది. భీష్మాదియోగులకును ఆత్మసాక్షాత్కృతి ఆపాదింపఁబడినది. ఈయిరుతెఱంగులవారి స్వస్వరూప జ్ఞానమునకు తారతమ్యము లేదా? ఉన్నది. ఆదానినిం బురస్కరించుకొనియే ఒకరు దుష్టులనియు, ఇంకొ కరు శిష్టులనియు వ్యవహరింపఁబడుచుందురు. భీష్మా దుల స్వస్వరూపజ్ఞానము అఖండము. నివాతదీపమువలె నది సర్వదా నిశ్చలముగ వెలుంగుచుండును. దుర్యోధ నాదుల స్వస్వరూపజ్ఞానమున్ననో మిగుల స్వల్పముగ ద్యోతమానమగుచుండును. ఉన్నదా, లేదా యనిమూడ గాఢముగ నాలోచించుపఱకు సంశయింపవలసియే వచ్చును. ఎప్పుడోయొక్కసారి మెఱపుతీఁగవలె గప్పు మని ప్రకాశించినను సర్వసాధారణముగా నది తమో వృతమై యడఁగియుండును. శ్రీకృష్ణుఁడు జ్యోతి ర్మయుఁడుగావున నాతనిసాన్నిధ్యము సిద్ధించినపుడెల్ల వీరిలోనున్న దైవాంశము పైకిఁ బ్రకాశించును. కాని ఆప్రకాశము ముహూర్తమాత్రమే. మరల నిత్యకృత్య ములలో మునిఁగినపుడు ఈజ్ఞానము నిలువమి వారిని కర్తృత్వాహంభావము పైకొనును. మేరువు విరిగి తల మీఁదఁ బడినను భీష్మాదియోగులను కర్తృత్వాహంభా వము పైకొనదు. వీరిహలోకముననే దేశకాలస్థితు లెట్లుమాఱుచున్నను నిర్వికారులయి ఆనందసామ్రాజ్యము ననుభవింపఁ గలుగుచున్నారు. పరమార్థజ్ఞానము స్థిర ముగ నిలువకుండుటచే నహంభావము పైకొనినపుడెల్ల దుర్యోధనాదులు బాధపడుచున్నారు.

భారతకవి, తనపాత్రములలో పరమనీచునికి మొదలుకొని అత్యుత్తమునికివఱకు ఎవ్వరికిని బాధ్యత నారోపించుట లేదు. భీష్మునిసన్మార్గమున నడపించు సర్వశక్తియే దుర్యోధనుని నసన్మార్గమున నడపించుచున్నదని యాతనిమతము. అందువలన మాటిమాటికి భరతోత్తములచే దుర్యోధనునికి బుద్ధి చెప్పించుచు వచ్చినను తుదకు "విధినియోగ మలంఘ్యము; దుర్యోధనాదులుమాత్ర మేమిచేయఁగల" రను వాక్యములను వారిచేత పలికించుచుండును. సృష్టికి యథార్థప్రతిసృష్టి గావించుటయే యాతని ఉద్దేశ్యము కాని ఒకపాత్రమును నిందించుట కాని ఇంకొకపాత్రమును భూషించుటకాని యాతనియాశయ మెన్నఁడును కాదు. యథార్థప్రదర్శనము (Objective representation of life) నకు తిక్కనకృతాంధ్రమహాభారత ముత్తమనిదర్శనము.

ఇఁక పాండవపక్షమునకు వత్తము.

పాండవపక్షమున నందఱును ప్రకటముగ శ్రీకృష్ణభక్తులే కావున వారిలో శ్రీకృష్ణతేజ మెట్లు ప్రతిఫలించుచున్నదో నిరూపించుటకు అధికశ్రమ మక్కఱలేదు. ఒక్కయర్జునునిఁ దీసికొని యాతనికి శ్రీకృష్ణునికిఁ గల సంబంధమును బరికించినఁ జాలును.

## అర్జునుఁడు

భారతమునందలి పౌరుషశక్తి నరునిలో మూర్తీభవించియున్నది. ఈతనిపాత్రమునకున్న వైభవము పాండవకౌరవ వీరులలో నెవ్వరికిని లేదు. పరాక్రమమునందు భీష్మాదులకంటె నధికుఁడు. భీష్ముఁడు పరశురామునే జయించెనుకాని ఈతఁడు పరశురామునిగురువగు శంకరునికూడ జయించెను. త్రిలోకాధిపతియైన ఇంద్రుని జయించి ఖాండవదహనము నిర్వహించెను. కాలకేయాదులను జయించునిమిత్తము దేవతలే ఈతని సాహాయ్యము వేడుటలో భారతవీరుల కెవ్వరికిని లభింపని గౌరవ మీతనికి లభించెను. ఎప్పుడో యుద్ధమంతయు ముగిసినవెనుక ధర్మరాజు బొందితో స్వర్గమున కేఁగెను కాని అరణ్యవాససందర్భమునవే ఈతఁడు స్వర్గమున కేఁగుటయేకాక దేవేంద్రునియర్ధాసనమును గూడ నధిష్ఠించెను. ఉత్తరగోగ్రహణసందర్భమున భారతవీరులనందఱను సైన్యసమేతముగ తానొక్కఁడే తఱిమితఱిమి కొట్టెను. ఈప్రకారముగా నెట్లుచూచినను భారతయుద్ధమునకు పూర్వమే ఈతనిశౌర్యవైభవములు మిన్నంటెను.

కాని భారతయుద్ధమునకుపూర్వము ఊర్వశి వచ్చి వేడినను లోలుఁడు గాకపోవుటచే జిజ్ఞాసువునకుండవలసిన జితేంద్రియత్వ మీతని కున్నట్లు స్పష్టపడుచున్నను ఆధ్యాత్మికవిషయములలో నర్జునుని కంత ప్రవేశము లేదు. శ్రీకృష్ణునియెడల సస్నేహమైన భక్తి యున్నది.

హిత మిబ్భంగిది మాకు; ధర్మమువెఱం
    గిట్లుండు నం చేను నీ
మతి బోధింప వలంతినే! హితము ధ
    ర్మంబుల్ విచారించిచూ
చి తగన్ బొమ్మని యేదిపంచి తది ని
    శ్చింతంబునన్ జేసి యు
న్నతి బొందంగలవారమై యునికి కృ
    ష్ణా నేఁడు గావచ్చునే!

మున్నుగుపద్యములు అర్జునునికి శ్రీకృష్ణునియందుఁ గల భక్తివిశ్వాసములను దేటపఱుచుచున్నవి. కాని ఈ భక్తి శ్రీకృష్ణునిమాహాత్మ్యమును తనకు మాన్యులగు భీష్మాదియోగులమాటలనుబట్టి కర్ణాకర్ణిగ వినుటనుబట్టి యుదయించినదేకాని చక్షురక్షురయోగముగఁ జూచుట వలన జనించినది కాదు. ఆతనిపరాక్రమమును కన్నులారఁ జూచుట కవకాశములు ఘటించెను. కాని ఆతని యోగస్వరూపమును దెలిసికొనఁదగిన యగత్యము గాని, తెలిసికొనవలె ననునభిలాషముగాని యర్జునునికి భారతయుద్ధమునకుపూర్వ మెన్నఁడును కలుగలేదు.

స్వవిషయమునఁగూడ తా నెవ్వరు, తా నెందులకు జన్మించి, ఎందులకుఁ బనిచేయుచున్నాఁడు, తాను చూచుచున్న ఈసృష్టికంతకు నర్థమేమి? అని ఆత్మజిజ్ఞాసువునకుఁ గలుగవలసిన ప్రశ్నము లాతని కెన్నఁడును కలుగలేదు. ఏదో తనయదృష్టము పండి తనకు

త్రిలోకవిజయుఁ డనుపేరు లభ్యమైనది. దానితో తృప్తి పడి తనయన్నగారికి రాజ్యము చేకూర్చుటయే తన జన్మావధి యని పనిచేయుచున్నాఁడు. భారతయుద్ధము ధర్మరాజును రాజ్యస్థాపితునిఁ జేయుటకు జరుగుచున్న మనుష్యప్రయత్నమే యనియు, అది తనభుజబలము వలనతప్ప నెరవేరఁజాలదనియు సంకుచితభావముతో నీతఁడు భారతరణరంగమునఁ బ్రవేశించినాఁడు.

కాని తీరా యుద్ధభూమిపై నిలచినవెనుక బాల్య మాదిగ తన్ను చేతులలో నెత్తి పెంచిన భీష్మాదిపితామహులును, ధనుర్విద్య నేర్పిన ద్రోణాదిగురువులును తన కత్యంతప్రియులైన బంధువులును ఒక్కసారిగ వధ్యస్థానమునకు వచ్చి నిలుచుండిన మేఁకలవలె తన యెదుటఁ బడఁగానే యాతనిమనస్సు చెదరినది. యుద్ధము చేయ నిరాకరించినచో వీరందరిని తాను బ్రదికింపఁగల నన్నయహంభావ మొకటి మనస్సులో మైనాకపర్వతమువలె నడఁగియున్నది. అందుచే నాతఁడు యుద్ధము మాన నిశ్చయించుకొనెను. తనహృదయగ్రంథులనెల్ల శ్రీకృష్ణునికి విప్పిచెప్పెను. శ్రీకృష్ణునివలన తాను పొందఁదగినలాభ మేదియో ఆతని కిపుడు గోచరించుటచే "ఏను ధర్మసమ్మూఢచేతస్కుండను, కార్పణ్యదోషోపహతస్వభావుండను నై నిన్ను శరణంబు వేఁడెదను. నీశిష్యుండనగు నన్ను శాసింపు" మని శిష్యత్వమును బ్రకటించుకొన్నాఁడు. ఈప్రశ్నానంతరము అర్జునునికే కాక మనకుఁగూడ నర్జునుని నిజమయిన స్వరూపము గానవచ్చుచున్నది.

తాను యుద్ధము చేయ నన్నంతమాత్రమున భారతరణ మాఁగిపోవునది గాదు. అట్లు నిరాకరించుటకుఁగూడ ప్రకృతిబద్ధుఁడగు తనకు సాధ్యపడదు. తా నిష్టపడినను లేకున్నను గూడ తా నారణభారనిర్వహణమున నిమిత్తమాత్రుఁడు కాక తప్పదు. తనచే నెఱవేఱుచున్నదని తా ననుకొను భీష్మాదివీరులవధ జగత్తునంతను నడిపించుచున్న యొకమహాశక్తియొక్క అమోఘసంకల్ప మనుట యాతఁడు విస్పష్టముగ గ్రహించెను.

భారతవీరులందఱు నామహాశక్తితేజమున నణుతుల్యులయి మెలంగుచున్న ట్లాతఁడు కన్నులార చూచినాఁడు. చూచినకొలఁది దిగ్భ్రమ కలిగి ఏమియు అర్థముకాక,

మ. అనలజ్వాలలు పర్వు నీముఖమునం
దాధార్తరాష్ట్రవ్రజం
బును, భీష్మాదులు నిద్దెసం గలుగు నీ
భూపాలలోకంబు గ్ర
క్కున నొక్కుమ్మడి వచ్చి చొచ్చెదరు నా
కుం జెప్పవే యెవ్వరో
యని శంకించెద నిన్ను భూరికరుణా
యత్తైక చిత్తుండవై.

అని వడవడ వడంకుచు ప్రశ్నించుచున్నాఁడు. అప్పుడు "ఏను లోకక్షయకర్తయగు కాలుండను; ఇచ్చో జనసమూహహరణంబునకుఁ బ్రవృత్తుండ నైతి; నీవు సంపవలె నని లే; దీగురుభీష్మాదు లెట్లును లేకుండువార. నాచేఁజచ్చినవారి వీరి జయించుటకు నిమిత్తమాత్రుం డవు గమ్ము; లెమ్ము" అని విశ్వరూపధారియగు శ్రీకృష్ణుఁ డాజ్ఞాపించుచున్నాఁడు. యంత్రమును నడపించు విద్యుచ్ఛక్తివలె నర్జునుని పౌరుషశక్తిని బ్రేరేచుచున్నది శ్రీకృష్ణతేజమే. ఈఘట్టమువలన నర్జునుని జీవితమున కొకనూతనరామణీయకము లభించుచున్నది. రాజ్యముకొఱకయి స్వార్థపరుఁడై పోరాడునర్జునుఁడు నశించినాఁడు. ఆతనిస్థానమున జనసమూహరణమునకుఁ బ్రవృత్తమైన దైవశక్తికి సాహాయ్యభూతముగా నుండుటకయి, పౌరుషశక్తికి చిహ్నముగ నరనామమును దాల్చి విశ్వరూపధారియగు శ్రీకృష్ణుని సన్నిధిని జేతులు జోడించుకొని నిలువఁబడినయర్జునుఁడు బ్రత్యక్షమగుచున్నాఁడు. ఈద్వితీయవ్యక్తిని సందర్శించుటలో నున్నయానందము మొదటిపాత్రమును జూచుటలో నుండదుగదా!

# హిందూ విశ్వవిద్యాలయము, కాశీ



౧. ఆర్ట్సుకాలేజి



౪. సెంట్రల్ హిందూ కాలేజి, హాస్టలులు



౨. ఆర్ట్సు కాలేజి ప్రార్థనమందిరము



3. సైన్సు కాలేజి



౫. ఇంజనీరింగు కాలేజి హాస్టలులు



౬. రెండవ హాస్టలు



౭. సుందరలాలు ఆసుపత్రి, ఆయుర్వేద కళాశాల —సి. జి. జగన్నాథదాసుగారి చిత్రములు.



## ఆంధ్రునిస్వదేశీ

"నేను", "నాది" అనుభావములు సర్వజనీనములు. ఇవి లేని జాతి, వ్యక్తి — పిపీలికగూడ లేదు.

అయితే: ఈ యహంకారమమకారములను ఆధ్యాత్మికచింతాపరాయణులు ద్వేషించి సమూలముగ పెల్లగించివేయవలె నని యుపదేశించుచున్నారు. ఆధిభౌతికతత్త్వవేత్తలు ప్రేమించి శాఖోపశాఖలుగ విజృంభించుటకు దోహదములు చేయుచున్నారు.

"ఇవి మానవత్వమునకు వేరుపురుగు" లని వారి వాదము. "ఇవి లేకుండిన యిక మానవజన్మ యెందుకు?" అని వీరివాదము.

పుట్టుకతోగూడ పెనవేసికొనియున్న వీటిని నశింపజేయుటకు వారిప్రయత్నము. గిట్టునంతవరకును తీవ్రముగ నంటిపెట్టుకొనియుండునట్లు చేయుటకు వీరిప్రయత్నము.

పాశ్చాత్యజాతులవారు ఈభావములను పరమాదరముతో పూజించుచున్నారు; కాని వారు ఆర్థికముగను, సాంఘికముగను, రాజకీయముగను అపాయరంగమును సమీపించుచున్నారు.

మనవారు వీటిని ఎప్పుడును తిరస్కరించుచునే యున్నారు; కాని మనము ఆర్థికముగను, సాంఘికముగను, రాజకీయముగను అధోగతియే కాదు—దాస్యమననుభవించుచున్నాము.

ఇది యేమి?

ఈభావములే యిల్లెటు చూసినా సర్వనాశకములా? వీటిని జీవితమున ఆచరణలో పెట్టుటయందు పొరపాటులు జరుగుచున్నవా?

పరిశీలింపవలసిన విషయ మిదే.

జగత్తుమాత్రమే సత్యమను భావన వారిది. జగత్తే మిథ్యయను భావన మనది.

ఐహికమే పరమావధి వారికి. పారలౌకికమే పరమావధి మనకు.

వారి వేదాంతము జాతిలో నిగ్రహమును ప్రవేశపెట్టలేకపోయినది. మన వేదాంతము జాతియొక్క చైతన్యమునే చంపివేసినది.

వైరాగ్యము వారిలో అగతికులకును లేదు. మన జాతికి తరుగని సొత్తేఅది.

వారిప్రవృత్తి తామసము. మనప్రవృత్తి సాత్వికము.

రాజసము వారికి ప్రభుశక్తి నిచ్చినది. వైరాగ్యము మనకు దాస్యమును సంఘటించినది.

దీనితో అక్కడ పతనము సిద్ధముగ నున్నది. ఇక్కడ సర్వనాశము పూర్తియైనది.

కాని ఆంగ్లేయుల సాహచర్యము, ఆంగ్లవాఙ్మయముయొక్క పరిచితి భారతజాతికన్నులు విప్పినవి.

ఆపతనమునకు, ఈసర్వనాశనమునకు కారణములు 'ఇవి' యని బోధపడినది.

కేవలైహికవాంఛ, కేవలపారలౌకికవాంఛయు గూడ సజీవజాతిప్రవృత్తికి విరుద్ధములనీ, ధర్మమోక్షములూ, అర్థకామములూ ఏకసూత్రగ్రథితములే గాని వాటికి ఉత్తమాధమభేదములు కల్పించుట అజ్ఞాన మనీ అవగాహన యైనది.

కావుననే భారతదేశము తన పరిశ్రమలను తాను పునరుద్ధరించుకొనబూనియున్నది. తన అక్కరలను తాను తీర్చుకొనజూచుచున్నది.



10- 18 ౬.3౯

మరల నవనవోన్మేషము ప్రారంభమైనది.

కాని మన ఆంధ్రజాతికి ఈవిద్యుదాఘాతము తగులలేదు.

అయితే: 'స్వదేశీ' అనుమాట వినపడనిండు. మనవారు ఎగిరి గంతువేయును. ప్రదర్శనములు ప్రారంభించును. అంగడులు తెరచును.

ఇందుకే దేశమంతయు తిరిగి ప్రబోధము కలిగించును. ఇందుకే పత్రికలు ప్రారంభించి దేశీయుల నుద్రిక్తులను గావించును.

ఇక అవి మేలుకొలుపులు గావు, అవి హుషారులుగావు, అవి జయధ్వనులుగావు—

సకల హంగామా చేయును.

"ఆంధ్రదేశము మేల్కొన్నది.", "ఆంధ్రజాతి ముందంజవేసినది.", "ఆంధ్రుడు కటిబద్ధుడైనాడు"—ఎక్కడ జూచిన ఇవియే కనపడునట్లు, ఎక్కడవినిన ఇవియే వినపడునట్లు పరవళ్లుత్రొక్కను.

కాని ప్రదర్శనములలో ఆంధ్రునకు స్థలమేదీ? అంగడులలో ఆంధ్రుని చేయిఏదీ? గృహములలో ఆంధ్రుని ప్రతిభయేదీ?

ఇత్తడి రాగి కంచుపాత్రలు మనకు కుంభకోణమునుండి రావలెను. పింగాణీచిప్పల క్రాశపడినను అవి గ్వాలియరునుండి రావలెను.

ఇప్పుడు స్వదేశీకెల్ల ప్రాతిపదికములగు సబ్బులు, తలనూనెలు, సెంట్లు, క్రీములు, స్నోలు, పౌడర్లు, బిస్కత్తులు, పిప్పరమెంట్లు—తుదకు లక్కబొమ్మలు గూడ కలకత్తా, బొంబయి, లాహోరు మున్నగుచోట్ల నుండి రావలెను.

లాంతరులు, శాలువలు, ఆయుర్వేదౌషధములు గూడ అనేకములు, గుండీలు, కలములు, చాకులు, పాళీలు, గుండుసూదులు, అగ్గిపెట్టెలు-ఇట్టివెన్ని ఆప్రాంతములనుండియే రావలెను.

మనకు పందలపాకలో రెండు నూలుమిల్లులున్నవి; గాని బట్టలు అహమదాబాదునుండి, బొంబయినుండి రావలెను.

మనకు రాజమహేంద్రవరమున బ్రహ్మాండమైన కాగితాల మిల్లున్నది; కాని కాగితములుమాత్రము కలకత్తానుండి రావలెను.

కాన్పూరునుండి కందిపప్పు, కలకత్తానుండి చింతపండువచ్చినగాని మన గృహకృత్యములు నెరవేరవు.

ఇంతే యెందుకు? ఆంధ్రదేశగర్భస్థము లగు గుంటూరు, బెజవాడ, బందరు, ఏలూరు, రాజమహేంద్రవరము, కాకినాడ మున్నగు నగరములలో అచ్చతెనుగుపడుచులు శిరముల ధరించుటకు దవనము, మరువము-తుదకు చేమంతులుగూడ దిండిగల్లు మున్నగు అరవనగరములనుండి రావలెను.

ఇంకేమిటి చేయుట?

ఆంధ్రుని శిరస్సున మెదడున్నదా? ఆంధ్రుని హృదయమున చైతన్యమున్నదా? ఆంధ్రుని హస్తమున నరములపట్టున్నదా? ఆంధ్రుని కండ్లలో తేజస్సున్నదా? ఆంధ్రుని ముఖమున జీవకళ యున్నదా?

ఆంధ్రునిలో ఆంధ్రత్వమున్నదా?

ఆంధ్రుడు హిందీలకు నౌకరు. ఆంధ్రుడు గుజరాతీలకు భృత్యుడు. ఆంధ్రుడు బంగాళీలకు బంటు. ఆంధ్రుడు రాజపుత్రులకు వంది.

ఆంధ్రుడు ఆంధ్రదేశమున అరవసాంబారు త్రావి గఱ్ఱున త్రేన్చును.

ఆంధ్రదేశమున—ఈరత్నగర్భలో ఇతరపరగణాలవారి యెదుట దోసిలియొగ్గి నిలువకున్న ఆంధ్రున కేమియు లేదు.

ధిక్! ఇంకెక్కడి ఆంధ్రజాతి? ఇంకెక్కడి ఆంధ్రత్వము? ఆంధ్రునకు స్వదేశీ అన నేమిటి?

—శాస్త్రి.



# ఆంధ్రాభ్యుదయము




శ్రీ కె. వి. రమణరావుగారు

వీరు గుంటూరుజిల్లా సర్జనుగా నున్నారు. వీరికి లెఫ్టనెంటు కర్నలుబిరుద మొసగబడెను. ఆంధ్రులలో నీబిరుదమును బడసిన మొదటివారు వీరు.

---




శ్రీ యస్. వి. యస్. రామరావుగారు

మైసూరు దశరా చిత్రకళాప్రదర్శనమున నీటి రంగుల చిత్రములలో నీ చిత్రకారుని చిత్రమునకు మొదటిబహుమతి లభించినది. ఈతనిచిత్రములు తరుచు భారతియందు ప్రకటితము లగుచున్నవి.

---






శ్రీమతి కల్యాణిదేవి

ఈమె కీ. శే. స్వర్ణకుమారిదేవి మనుమరాలు. ఆమెతోనున్న యారుగురును ఆమెపిల్లలు. ఆమె, ఇప్పుడు ప్రైవేటుగా చదివి బి. ఏ., పట్టమును బడసినది. వయసుమీరిన సంతానవతులయిన వనితలెల్లరు నీయమవలె విద్యార్జనముగావించి తమకును, దేశమునకును ఔన్నత్యమును గడించుకొందురుగాక.




శ్రీ సారంగు సీతాదేవిగారు

ఈయమ ఉభయగోదావరీమండల మహిళాసభకు (తుని, ౨౩-౯-౧౯౩౩) అధ్యక్షతను వహించినది. శ్రీసారంగు నరసింహారావు (పెద్దాపురం డిప్యూటీ కలెక్టరు) గారిభార్య యీామె.




## నూతనాదర్శము

వాల్టరు లిప్‌మన్‌గారు సంఘపరిణామమును గురించి 'The young Men of India, Burma and Ceylon పత్రికయందు ప్రకటించిన వ్యాసమును గూర్చి ఆపత్రికయొక్క సంపాదకీయము:

"సాధారణజనులు రాజకీయములలో స్వయముగ గాని, మరియితరవిధముననుగాని బాగుగతెలిసి పాల్గొనిన మొదటి పరిణామయుగ మిదియే యని వాల్టర్ లిప్‌మాన్‌గారి వాదను. డిక్టేటర్లచే పాలింపబడు దేశముల యందుసయితము మిదివర కెన్నడును లేనివిధమున, సామాన్యుల యభిప్రాయములు రాజకీయవేత్తలచేతను, అధికారులచేతను గౌరవింపబడుచున్న వని యాయన వాదము.

జరుగవలసినదానికి మనము బద్ధులమని పూర్వము తలంచబడుచుండినది. ప్రస్తుతము జనులు జరుగవలసిన దానిని తామే నిర్ణయింపవలసినట్లు నమ్ముచున్నారు. పూర్వము సంఘమందు మార్పులు గలుగవలయునన్న మన కగోచరములయిన తిన్ననిమార్గములే యాధారము లయియుండినవి. పూర్వము దూరదృష్టిగలిగిన బుద్ధిపూర్వకమయిన కార్యము లనేకములు జరుగలేదు. కాని యికముందట్లు జరుగదు. ఈకాలమున మానవుడు కోరినది తనంతట లభించువరకు వేచియుండడు. వర్తమానభవిష్యత్కాలములను గూర్చి యాతడాలోచించుకొనుచుండును.

మనుష్యుడు తెలివిగా ఆలోచించుకొనగలడా? స్వార్థమును వీడి ప్రజలయభ్యుదయమునే కోరినయెడల ఇది జరుగగలదు. కాని మన ఆదర్శములకు, నిజమయిన మన కార్యములకును చాల యంతరము గలదని వ్యాసకర్తగారు సూచించుచున్నారు. అపుడింతకన్న మేలగు పరిస్థితుల స్థాపించుట కవకాశము కలుగుచున్నది. కనుక ఈకాలమున మానవుడు తన కార్యములు తన యాదర్శములతో సరితూగునట్లు ప్రయత్నింపవలయును.

కట్టుబాటుగలిగిన సంఘ ముండుటయే ఈకాలపువారి నూతనాదర్శము. కట్టుబాటుగలిగిన సంఘ మేర్పడవలయునన్న పూర్వపు అహంభావము పోయి సర్వమానవశ్రేయమునకు ప్రాధాన్యము రావలయును. జనసామాన్యముయొక్క క్షేమము, వ్యక్తులస్వాతంత్ర్యమునకన్న ఎక్కువయినదిగ పరిగణింపవలయును. ఈకాలమున గల సంఘపు కట్టుబాటనునది పూర్వపు సంఘైక్యమనుదానియొక్క రూపాంతరమని వ్యాసకర్తగారి యభిప్రాయము. అహంభావమనునది యిటీవల ఏర్పడినది. అది సమసిపోయి అంతకన్న మిన్నయగు కట్టుదిట్టమయిన సంఘ మేర్పడవలయును.

'మాడరన్‌రివ్యూ'-రాజు

---

## స్త్రీ విద్య

స్త్రీవిద్యయందు భారతదేశము శ్రద్ధపుచ్చుకొనుట లేదు. అందువలన భారతదేశము త్వరితగతిని వృద్ధిపొందకయున్నది. బీహారు-ఒరిస్సాసహకారపత్రికయందు యఫ్. యల్. బ్రెయినుగారు (ఐ. సి. యస్.) ప్రకటించిన 'భారతదేశమున స్త్రీవిద్య'యనువ్యాసమున ఇట్లుగలదు:

"ప్రపంచమున ఏదేశముగాని-ముఖ్యముగ బీదస్థితి యందున్న భారతదేశము ప్రతిగ్రామమునను రెండు

పాఠశాలల నెలకొల్పలేకయున్నది. నేను చూచిన ప్రతి గ్రామమునను, రివెన్యూ తగ్గించవలసినదిగను, మరియొక పాఠశాలను స్థాపించవలసినదిగను గ్రామస్థులు ఒకేసారిగ చెప్పుకొనుచున్నారు. రెండుపాఠశాలలు కావలసినపుడు పన్ను రెండింతలగుచున్నది. అనేకగ్రామములలో పాఠశాలలే లేనపుడు కొన్నిట రెండుపాఠశాలల స్థాపించుట అన్యాయము.

గ్రామములలో బాలికాపాఠశాలల స్థాపించినను ఆపాఠశాలలకు కావలసినంతమంది ట్రెయినింగయిన యుపాధ్యాయులు లేరు. కనుక ఈపాఠశాలలకు ఉపాధ్యాయుల నేర్పరచుటకు ఇరువదియైదు సంవత్సరములు పట్టును. పట్టణపు బాలికలు గ్రామములబల్లకు పోరు. ఒకవేళ పోయినను పట్టణములలో పెరిగినవారికి గ్రామ పాఠశాలల పద్ధతు లేవియు అర్థముకావు కనుక ప్రయోజన ముండదు. పల్లెటూరి పడుచులు పాఠశాలలకు పోయి చదువుకొన్న నేగాని మరియొకరికి చెప్పలేరు. మరియు, బాలికాపాఠశాలల తనిఖీచేయుట చాలకష్టమైనపని. ఏలనన బాలురపాఠశాలలకన్న వీరిపాఠశాలలలో విద్యాప్రమాణము చాల తక్కువైనది. ఈ పరిస్థితులలో ట్రెయినింగు ప్యాసుచేసిన యుపాధ్యాయినులు దొరకుట దుర్లభమయినను గృహకృత్యములయందు కావలసిన విద్యల వారు సులభముగ నేర్పగలరుకనుక కొద్దినెలలలో వారికి కావలసిన ట్రెయినింగు నీయవచ్చును. తద్వారా వీరు పల్లెటూరిబాలికలకు ఆరోగ్యము, పరిశుభ్రత, పసిపిల్లల యారోగ్యము, కుట్టుపని మొదలగు ఇంటి పనులను సులభముగ నేర్పగలుగుచున్నారు. ప్రస్తుతము పల్లెటూరియాడువారికి సక్రమమయిన ట్రెయినింగు నీయవలయునన్న కొన్నిసంవత్సరములు పట్టును.

కాబట్టి స్త్రీవిద్య ప్రబలవలయునన్న బాలురతో కూడ బాలికలను గ్రామములందలి ప్రైమరీస్కూళ్లకు పంపుటకన్న ఉపాయము లేదు. పాఠశాలలో ఉపాధ్యాయులవద్ద వ్రాయుట, చదువుట, లెక్కలువేయుట నేర్చుకొని, యుపాధ్యాయుల భార్యలవద్దగాని, వారి బంధువులయొద్దగాని యింటిపనుల నేర్చుకొందురు. బాలికాబాలురు పెద్దవారయినతర్వాత బాలికలు తమ మిడిల్‌స్కూళ్లలోను, బాలురు తమ మిడిల్‌స్కూళ్లలోను చేరుదురు. ప్రపంచమందలి ప్రతిదేశమందును, భారతదేశమున కొన్నిచోట్లను ఈపద్ధతియే అనుసరింపబడుచున్నది.

ఉపాధ్యాయుల బంధువులలో స్త్రీలను ఉపాధ్యాయులపదవులకు తగియుండునట్లు తయారుచేయు నాందోళన జరుగగనే ప్రతిజిల్లాయందును ఇందునిమిత్తము పాఠశాలలు నిర్మింపబడవలయును. ఈరీతి సుశిక్షితమైన స్త్రీలమూలమున గ్రామస్త్రీలకు కావలసిన విద్య, జ్ఞానము లభించుచున్నది. వీరు స్త్రీల పాఠశాలల స్థాపించి అందు అపుడపుడు అందరును కలసికొనుచుందురు. ఇచ్చట వీరు ఇంటిసంబంధమైన పనుల నేర్పుచు స్త్రీసంఘస్థాపనకు ప్రయత్నము చేయుదురు. ఇట్టిస్త్రీలు గ్రామపాఠశాలలలో చేరుటవలన, గ్రామపునర్నిర్మాణమున కిదివర కెన్నడు ఉద్దేశింపబడనట్టి శక్తి చేకూరగలదు. సంయుక్తప్రాథమికపాఠశాలల మరియొక గొప్పలాభ మేమన, స్త్రీ లిచట చేరి త్వరలో బాలికాబాలుర తరగతుల పాఠముల తాము గొందురు. అందువలన అనేకపురుషుల కసాధ్యమైనపనిని వారే నిర్వహింతురు. పసిపిల్లలకు చదువుచెప్పుటకు కావలసిన నేర్పు అనేకపురుషులయందు గానరాదు. పసిపాపలకు చదువు నేర్పించు విషయములో స్త్రీలకు సహజమైన నేర్పు గలదు. ఈమార్పు ఎంత త్వరితముగ గల్గునో పిల్లలకును, ఉపాధ్యాయులకును అంత మేలు. ఏలన ఈ మార్పు గలిగినంతనే బాలురవిషయములో ఉపాధ్యాయులు ప్రస్తుతము జూపు అత్యధికజాగరూకత కగత్య ముండదు.

బాలురకు విద్య యేబదిసంవత్సరములుగ చెప్పుచున్నను గ్రామముల స్థితి యేమాత్రమును బాగుపడలేదు. బహుశః ఏబదేండ్లకన్న యిప్పటిబాలురస్థితి కడుహీనముగను, నీతిబాహ్యమయినదిగను ఉన్నదేమో! పురుషులు సాధింపలేనిదానిని స్త్రీలకు వదలినయెడల ఎట్లుండునో చూతము. 'నీపిల్ల లేల సొమ్ముల పెట్టుకొనెదరు? వారికి టీకాల నేల పొడిపించరు?' అను ప్రశ్నములకు, తరచు, ప్రతిమనుష్యుడును, తనభార్యయొక్క

బలవంతమే కారణమని చెప్పుచున్నాడు. ఈపరిస్థితులలో గృహకార్యనిర్వహణముల స్త్రీలు నేర్చుకొనుటకవకాశ మిచ్చినయెడల వారు పిల్లల నేరీతిగ వృద్ధికి తెచ్చెదరో, గ్రామములనెట్లు బాగుపరచగలుగుదురో తెలియగలదు.

పంజాబునందలి గ్రామములలో నాకు ౨౭ ఏండ్ల అనుభవము గలదు. పరిశుభ్రత, స్త్రీలస్థితి, కార్యముపట్ల తెలివియొక్క ప్రయోజనము, విరామకాలమును, అధీనమయిన ద్రవ్యమును ఉపయోగించు విధములు నాగరకతయొక్క ముఖ్యలక్షణములుగ నెంచి పరీక్షించిన దేశమందెచటను నాయనుభవములో వృద్ధిగానవచ్చుట లేదు. స్త్రీవిద్యయెడల మనకు గల యశ్రద్ధయే దేశాభ్యుదయగమనమును మందీకరించుచున్నదని, ఈవిషయమునుగూర్చి చక్కగ ఆలోచించిన ప్రతియొక్కని అభిప్రాయమయియుండగలదని నేను నమ్ముచు,అట్లే తలచుచున్నాను. ఇందు గల లోపమును సత్వరముగ తొలగించుటయే మన కర్తవ్యము."

'మాడరన్ రివ్యూ'-రాజు

---

## అహింసయొక్క విజయము

జి. పి. విషర్డుగారు The young Men of India, Burma and Ceylon పత్రికయం దిట్లు వ్రాసిరి:

"సంఘమందు కట్టుబాటేర్పడవలయునన్న హింసచేయవలయు నన్నమాట నాకు నచ్చుటలేదు. హింసామార్గమున సంఘమందు న్యాయము నేర్పరచుట అసాధ్యమయినదిగ నాకు తోచుచున్నది. బలవన్మార్గమున మార్పులు కలుగజేయవచ్చును, సంఘమే తలక్రిందులు కావచ్చును, అధికారమును ఒకసంఘమందుండి మరియొకరి కీయవచ్చును. కాని యిదంతయు సంఘమున న్యాయమనబడుచున్నదా? సంఘసంస్కారమత్యావశ్యకమైనపు డెపుడయినను,అయ్యది బలవంతము ప్రయోగింపబడక లభించిన దనుటకు చరిత్రయందెక్కడయిన దార్కాణ గలదా? సంయుక్తరాష్ట్రములందు బానిసతనమును తొలగించు ప్రయత్నములు జరిగినపుడు తొలుత బలవంతమువిూదనే సాధ్యమైనది. కాని బానిసతనమును తొలగింపప్రయత్నించినవారు కొంచెము తెలివితో ఈపని కుపక్రమించియుండినయెడల ఘోరమగు అరాజకయుద్ధము జరుగకపోయియుండెడిదని విద్యావంతు లనేకుల యభిప్రాయము.

అహింసామార్గమునే యుపదేశించి ఆమార్గముననే కార్యసాధన కుపక్రమించిన గాంధిమహాత్ముడు, హింస చేయించనందువలన, తనదేశమునకు చాలనెట్లధికమైన సేవ చేసినాడని నా నమ్మకము. అహింసావ్రతమున గలిగిన విజయము నా నమ్మకమును మరింత గట్టిపరచుచున్నది. అహింసవలననే సంఘమందును, రాజకీయములందును, ఆర్థికవిషయములందును కోరిన మార్పులు సాధ్యము లగుచున్నవి. అట్లుగాక బలవన్మార్గమున హింసచేసి ప్రాణహాని గలుగజేసినయెడల శాశ్వతమైన శాంతి గలుగదని నా దృఢమైన నమ్మకము. ఇదంతయు అనుభవసిద్ధమే!

విషయముల నెదుర్కొనునట్టి న్యాయస్థుడను గావలయు ననుకోరిక నాకు గలదు. భారతదేశసేవకులలో బలవన్మార్గ ముపయోగించి సాధించినవారికన్న గాంధి ఎంతయో తన అహింసామార్గమున సాధించియున్నాడు. ఈ విషయమును నేను గమనింపవలసియున్నది. ఇదంతయు ఊహగాను, స్వప్నావస్థయందు జరుగునదియు గాదు. భారతదేశమున,హింసకన్న భయంకరమైన ఆయుధ మగు అహింసవలన నూతనపరిస్థితు లేర్పడబోవుచున్న వని అందరికిని తెలియును. ఆశ్చర్యకరమగు నింతటి విషయములు ప్రేమవలనను, త్యాగమువలనను, అహింసామూలముగ తిరుగబడుటవలనను జరుగుచుండ, బలవంతమువలననే శాంతియుతమగు సంఘ మేర్పడగలదని ఎట్లు చెప్పగలము? బలవన్మార్గోపదేశకులు, విషయపరిశీలన చేయక, తప్పుదారుల ద్రొక్కుచున్నారని నా యభిప్రాయము. అందువలన బలవంతము నిరుపయోగ మగుచున్నది."

'మాడరన్ రివ్యూ'-రాజు

---



## యక్సురే చిత్రము

తల్లిదండ్రులాడుకొనుటకు తెచ్చిన చిన్నిబొమ్మలలోని మోటారు నొకదానిని కుఱ్ఱది (పైన) మ్రింగ జూచినది. కాని కుత్తుకలో తగుల్కొనినది.

నడుమ నున్న 'యక్సురే చిత్రము'న కుత్తుకను దగుల్కొనిన ఆ చిన్ని మోటారు కాన్పించుచున్నది. డాక్టరులు వెలుపలకు దీసిన ఆ మోటారు అడుగుననున్నది.

## రాబోవుయుగమునకు ఫోర్డుగారి ఉపాయము

'The Indian Review' లో జే. యస్. కుమారప్పగా రిట్లు వ్రాయుచున్నారు:

"ఉద్యోగములులేక బాధపడుచున్నవా రిపుడు కొన్నిలక్షలను మించియున్నారు. ఫోర్డుగారు వారి కొరకీయుపాయమున్నినారు. నిరుద్యోగసమస్యను నిర్మూలించుటకు సేద్యము చేయవలయునని వారి నిశ్చితాభిప్రాయము. నిరుద్యోగసమస్యను తొలగించుటయే గాక మనుష్యులకు నమ్మకమైన పోషణగూడ లభించుచున్నది. సేద్యమే పోషణకు మూలాధారమని యాతని యభిప్రాయము. భూమి జీవనమున కాధారము కల్పించుచున్నది. కృషివలన మనుష్యుడు భూమి తన్ను పోషించునట్లు చేసికొనుచున్నాడు. సేద్యముమాని మనుష్యుడు జీవనమునకు యంత్రములమీద నాధారపడి పనిచేసిన యెడల, మనము పనిచేయుట మానకపోయినను సేద్యము వలని ఫలితము మనకు కల్గుటలేదు. మనకు సంపద లభించునది సేద్యమువలనగాని బ్యాంకులవలన కాదు. పనివాని శక్తిని హెచ్చుచేయుటకు వానికి ఎక్కువ జీతము నివ్వవలయునని ఫోర్డుగారి వాదము. కొంత కాలము సేద్యముచేయుటవలనను, కొంతకాలము కృషి చేయుటవలనను, పనివాని సంపాదన తగ్గదా-అందు వలన ఆతని కొనగల శక్తియు క్షీణించదా?-యను ప్రశ్న యుదయింపవచ్చును. యంత్రములు తయారు చేయు వస్తువులను విక్రయించు టెట్లు?

సంఘముయొక్క నిజమైన పోకడ లిట్టివని ఫోర్డుగారే యింతవరకు సరిగ కనుగొనలేదు. కాని ప్రస్తుతపుస్థితి పనివాండ్రను 'జాగ్రత' యని హెచ్చరించుచున్నదని యాతని యభిప్రాయము మన జీవిత పద్ధతిని మార్చి దానిని పారిశ్రామికములకు సరిపోవునట్లు చేయుటయందు ఫోర్డుగారికి శ్రద్ధ లేదటగాని పారిశ్రామికము లక్షుగంటకుండ మన జీవితపద్ధతుల మార్చుటయందు శ్రద్ధ గలదట. "బ్రతుకు టెట్లు" అనునది జనముయొక్క సమస్యయని ఫోర్డుగారు చెప్పుచున్నారు. బ్రతుకుటయనగా పారిశ్రామికములకు

చోటులేదు. జీవనమునకు చాలినంత లభించినదానితో మానవుడు తృప్తిజెందినయెడల ప్రారిశ్రామికముల స్థితి ఏమియని అడుగవచ్చును. దానివలన జనులు పారిశ్రామికములు వ్యాపారము లేకయే జీవించవలసివచ్చును. జను లిపుడు కొంతకుకొంత ఆపనియే చేయుచున్నారు. ప్రారిశ్రామికవస్తువులను కొనుటకు ధన మొకటియే ప్రధానము కాదు. యంత్రశాలలలో తయారగు వస్తువులు లేకపోయినను జనులు బ్రతుకగలరు. వ్యాపారము లేకున్నను ప్రాణమునకు హాని లేదు. మోటారుకార్లు మొదలయినవాటికి ప్రాధాన్య మిచ్చిన పరిస్థితులును, రాజకీయములును మారిననేగాని జనమునకు మేలు గలుగదు.

వ్యవసాయమును మరల ప్రవేశపెట్టుటకు కొంత మంది ఆందోళనచేసినను, ఫోర్డుగారి అభిప్రాయము ప్రకారము సేద్యమును, పారిశ్రామికములను ఏదేశపు వారును కలుప సాహసించలేదు. ఫోర్డుగారికి పట్టణములతో పని యేమియు లేదు. పట్టణములు విశాలము లైననిగనుక ఏమియు చేయుటకు తోచక లేనిపోని సమస్యల కలుగజేయుచున్నవని ఫోర్డుగారు తలంచుచున్నారు. విద్యుత్సహాయమున నడుపబడు యంత్రశాలలు గలిగి, విద్యుత్సహాయమున వ్యవసాయము సాగింపబడు గ్రామము లుండిన అతనికి చాలును. జనులను సేద్యపు వృత్తిలోనికి మరల ప్రవేశపెట్టవలయునని ఫోర్డుగారి అభిప్రాయమయినను అంతకుపూర్వమే ఆ వృత్తిలో నుండువారితో వీరిని సమానులచేయుట మాత్రము వీరి సంపూర్ణకార్యము కాదు. ఈమార్పు వలన పట్టణముల అంగళ్లయందు వస్తువుల కొనువారు తగ్గినను మిగిలినవారికి వస్తువులను కొనుశక్తి హెచ్చగలదు. ఈదినములలో, గోధుమలు, ఉర్లగడ్డలు, మొదలయిన వాటిని పండించుటయందు లాభము లేదు. కాని పని వాండ్రు పట్టణములనుండి గ్రామములలో చేరుటవలన గొప్ప వ్యవసాయదారులకు నష్టము కలుగదు. సాధారణముగ పట్టణములనుండి వచ్చు పనివాండ్రంతయు అందరు ఏపనిలో చేరుదురో అందే చేరి తమభుక్తికి కావలసినంతయు, రొఖ్ఖపుఖర్చుకు కావలసినంతయు సంపాదించుకొనెదరు. వ్యవసాయమున ప్రవేశించినందున వీరికి పోటీలు కలుగకపోవుటయేగాక, నిరుద్యోగుల సంరక్షణార్థము విధించుపన్నును తప్పించుకొనగలరని ఫోర్డుగారు తెలుపుచున్నారు."

'మాడరన్ రివ్యూ'-రాజు

---




శ్రీ ప్రఫుల్ల ఘోషుగారు

వంగయువకుడు. ఈతడు ప్రపంచవిఖ్యాతుడగు ఈతకాడు.

---

## విద్యావిధానమున నూతనాభిప్రాయములు

The Educational Review లో హరిదాసు, టి. మజుందారు విద్యలందు నూతనవిజ్ఞానసంపాదన కొరకు చేయవలసిన కృషిని గూర్చి ఇట్లు వ్రాయుచున్నారు:

"ఆంగ్లో శాక్సనుబ్యోవుల్ఫ కాలమునుండి ఛాసరుకాలమునను, ఛాసరుకాలమునుండి విక్టోరియనుకాలమునను, అటనుండి జార్జి బర్నార్డుషాగారి కాలమునను ఇంగ్లీషుభాష యెట్టి పరిణామమును బొందినది విమర్శించగల విద్యాధికులు మనదేశమున అనేకులు గలరు. ప్రముఖులగు ఈవిమర్శకులలో ఎంతమంది సంస్కృత భాషాపరిణామమునుగూర్చి చెప్పగలరు? సంస్కృతము వేదకాలమునుండి కాళిదాసబాణులకాలమున కెట్టిమార్పు జెందినది? ప్రాకృతము సంస్కృతముగ మారినదా? అరబ్బీ పార్శీభాషల సంపర్కము కొంత గలిగి ఆ సంస్కృతమే నేటి యిండో-ఆర్యనుభాషలుగ నెట్లు పరిణమించినది? సంస్కృతవాఙ్మయమునుండి మరాఠీ వాఙ్మయము ఎపుడు జనించినది - స్పష్టముగ ఎవరు చెప్పగలరు? వాఙ్మయమున గుజరాతి, మరాఠీ, బంగాలీ, హిందీభాషలయం దేమయిన సామ్యమున్నదా యని విమర్శించినవా రెవరయిన గలరా? మహమ్మదుఘోరీ హిందూదేశముపై దండెత్తివచ్చినపుడు ఈదేశమున భాషాస్థితి యెట్లుండెను? మెగస్తనీసునకు సంస్కృతము తెలియునా? పాశ్చాత్యులీ దేశమునకు గాక పూర్వము మనదేశముతో వ్యాపారము సాగించుచుండిన వారులు ఏభాషను వ్యవహారము జరుపుచుండిరి? మహమ్మదీయయుగమునకు పూర్వము హిందూదేశమున నాట్యకళ ఎట్లుండెను? మొఘలుల కాలమున ఇది యెట్లుండెను?

ఉదాహరణమునకు కొన్నిప్రశ్నముల సూచించితిని. మనదేశవిషయముల చక్కగ నర్థముచేసుకొనిన యెడల మన దేశభాషలయం దుత్పన్నమగు ప్రశ్నముల విచారింపదగియుండును. భాషాసంస్కరణము విషయమున దక్షిణహిందూదేశమున మతాచార్యుల జోక్యము వింతైనది. ప్రస్తుతము రాజకీయనాయకులు దేశీయవాఙ్మయమున చేయుచున్న సంస్కరణము నూతనపద, పదజాలముల నేర్పరుచుటను తప్పక గమనింపవలయును.

ఉన్నతవిద్య నభ్యసించువా రీవిషయముల చక్కగ విమర్శించవలయును. పరాయిభాషయయిన యింగ్లీషుయొక్క పరిణామవిషయము మన కనవసరము. "భారతదేశచరిత్రను బోధించు పద్ధతులు: దాని యొక్క ఫలితము"లనువిషయమును ఎవరయిన ఆలోచించియున్నారా? ఇది పరిశోధనకు తగిన విషయము.

మనదేశచరిత్రను మనదేశమందు బోధించువిధము కడుశోచనీయముగ నున్నది. ఇంగ్లీషుబోధించు ఉపాధ్యాయులు, భారతీయబాలికాబాలురు తాము హీనులమని యనుకొనునట్లు చేయుచున్నారు. భారతదేశమున భారతచరిత్రబోధనమునకు వలసినంత సంస్కరణ ప్రపంచమున మరెచటను ఏవిద్యాపద్ధతికిని అవసరము లేదు. చరిత్రను మనదేశమున చదువుటయనగా పూర్వపు విషయములను గురించి ప్రభుత్వమువారి యభిప్రాయముల నొప్పుకొనిన ట్లగుచున్నది. ఇందలి లోపమింతియేగాదు. ప్రస్తుతపు పరిస్థితులకును, చరిత్రకును ఏలాటి సంబంధము లేదనియనుచున్నాము.

అమెరికాయందును, యూరోపునందును విద్యార్థులు సాంఘిక, రాజకీయ, ఆర్థిక, అంతర్జాతీయ విషయములలో ప్రస్తుతము మానవుల ప్రయత్నము లెట్లున్నవియో చదువవలసియున్నారు. యథార్థము నెరుగని భారతీయవిద్యార్థి భావికాలపు పౌరుడు కావలసియున్నాడు."

'మాడరన్ రివ్యూ'-రాజు

---

## రొమ్మునకు బలము కూర్చుట

The oriental watch man and Herald of health అనుపత్రికయం దిట్టు గలదు:

"రొమ్మునకు బలముకూర్చుటకు సరియయిన కాలము బాల్యము, యౌవనము. పెరుగిడుట మొదల

లయిన చురుకును గలిగించు ఆటలే రొమ్మునకు మంచి వ్యాయామములు. చెల్లెకుక్కాట, మెట్లు నెక్కిదిగుట మొదలగు పనులవల్ల ఎక్కువ గాలిని పీల్చుట కవసరము గలుగుచున్నది. అట్టిపనులు రొమ్మునకు బలము నివ్వగలవు. గాలినిపీల్చు ఇతరవ్యాయామములకన్న పైని వివరించినవే ఎంతో ఉత్తమమైనవి. గాలినిపీల్చు వ్యాయామములవలన ఊపిరితిత్తులలో సహజముగ పట్టుగాలికన్న చాలఎక్కువగాలిని పీల్చుచున్నాము. అందువలన కష్టము కలుగవచ్చును. ఇది అనవసరముగ మనము చేయుపని. ఇందువలన మన కండరములు చెడిపోవును. చురుకైనపని నేదైన చేసినపుడు మన రక్తమందు బొగ్గుపులుసువాయువు చేరును. ఇది విషము. దీనిని వెడలగొట్టుటకు మనము ఎక్కువగా ప్రాణవాయువును పీల్చవలయును. అపుడు త్వరితగతిని ప్రాణవాయువును పీల్చుదుము. ఇందువలన మన కేలాటి కష్టమును కలుగకుండుటయేగాక మన కొక విధమగు ఆనందముగూడ గలుగును. ప్రాణవాయువు మనకు కావలసినపుడు దేహములోని అవయవములు మనము చురుకుగా, సులభముగా గాలిని పీల్చునట్లు చేయుచున్నవి.

మామూలుగ పరుగెత్తువారికి విశాలమగు, ఎక్కువ పనిచేయగలిగిన వక్షములుండును. ఎప్పుడు కూర్చుని ఏదోపనిచేయువారి వక్షము అట్లుండదు. రొమ్ము ఎంతవరకు సాగగలదో అంతవరకు సాగునట్లు దినమున కనేక పర్యాయములు చేయకపోయిన దానికి గల సాగుడుశక్తి క్షీణించిపోవును. ముప్పదిసంవత్సరముల వయసుదాటిన పిదప యిట్లు జరుగును. నడివయస్సు దాటినవారికి రొమ్ము అప్పటికంటె ఎక్కువగ పెరుగదు. గాలి కండరములద్వారా కొద్దిగ రొమ్మువై శాల్యమును వృద్ధి చేయవచ్చునుగాని ఇట్టిపని చేయుటకు సరియయిన సమయము బాల్యమును, యౌవనమును.

రొమ్మును, గాలిపీల్చుశక్తిని వృద్ధిపరచుటకు ఈత చాలమంచి వ్యాయామము. ఈదునపుడు మన దేహము, తలయు వెనుకకు వచ్చియుండును. రొమ్ము మాత్రము బాగుగ ముందుకు వచ్చియుండును. అపుడు కాళ్లకు, చేతులకు ఎక్కువ చురుకయినపని యుండును. ఈకారణమువలన ఈత మంచివ్యాయామ మగుచున్నది. చల్లనీటియందు ఈవిధముగ ఈదుటవలన రొమ్మునకు చురుకుతనము కలుగుచున్నది.

గాలిని పీల్చుట, ఎక్కువప్రాణవాయువును కోరు కండరములవ్యాయామమును ఊపిరితిత్తులకు బలమునిచ్చి రొమ్ముయొక్కయు, కండరములయొక్కయు, ఊపిరితిత్తులయొక్కయు సాగుడుశక్తిని వృద్ధి చేయును. ఈవ్యాయామము మన గర్భకోశమున గల లీవరు, జీర్ణకోశము మొదలయిన అవయవములకు బలము నివ్వగలదు. మనము ఎక్కువగ గాలిని పీల్చినపుడు ఊపిరితిత్తులు పెద్దవగును. అపుడు జీర్ణకోశము, లీవరు మొదలగునవి ఒత్తబడుచున్నవి. అందువలన స్పాంజిని పిండినపుడు నీరువచ్చునట్లు ఈయవయవములనుండి రక్తము బయటికి వచ్చును. గర్భకోశమందలి అవయవములు బలముగలిగి పనిచేసినయెడల మన గాలిపీల్చు శక్తికూడ వృద్ధియగును.

'మాడరన్ రివ్యూ'-రాజు

---

## కోహినూరురత్నము

ఈ సెప్టెంబరు భారతిలో 'మాడరన్ రివ్యూ' పత్రికనుండి యనువదింపఁబడిన కొహినూరుమణిచరిత్రము కలదు. తత్పూర్వ మామణినిగూర్చిన కథల నీక్రిందివిధముగా వింటిని. వాని నీక్రింద వ్రాస్తీకరించుచున్నాను:

'కొహినూరు శబ్దమునకు 'తేజఃపర్వతము' అని యర్థమఁట! అది 'శమంతకమణి'యని భారతకాలమున్న బిలువఁబడుచుండెడిది. సూర్యు నారాధించి సత్రాజిత్తు (సత్యభామతండ్రి) శమంతకమణి నొందుటయు, నాతని సోదరుఁడగు 'ప్రసేనుఁడు' దానిని ధరించి వనమున కేగఁ బ్రసేను వధించి సింహము, దానిఁ బరిమార్చి జాంబవంతుఁడు, వానిని నిర్జించి 'లోకాపవాదనివృత్తి' కొఱకు శ్రీకృష్ణుఁడు బాలామణితో,

మణితో ద్వారకకు వచ్చుటయు భాగవతపాఠకులకు, వినాయకచవితి కథాశ్రోతలకుఁ దెలియును. శ్రీకృష్ణుఁడు శమంతకమణి హర్తయేకాని కౌస్తుభాలంకృతుఁడైనట్లు శమంతకాలంకృతుఁడు కాలేదు. సత్యను సత్రాజిత్తు శ్రీకృష్ణున కొసంగి యల్లునకుఁ గట్నముగా శమంతక మణినిగూడ నొసంగె. కాని సత్రాజిత్తు పిసినారియని తెలిసిన శ్రీకృష్ణుఁడు శమంతకమణిని దిరిగి సత్రాజిత్తు నకే యొసంగెను.

సత్రాజిత్తు యాదవులలో నంతర్ఖ్యాతమగు భోజ కులజుఁడు. తనకూఁతురు సత్యను శ్రీకృష్ణునితో మణి వ్యవహారము కలుగకముందు 'అక్రూర, కృతవర్మ, శతధన్వుల'ను భోజకులజులలో (శ్వఫల్గు, హృదికు లనువారి పుత్రులు) నెవరికేని యిచ్చెదనని చెప్పుచుండు వాఁడట! మణివ్యవహారముచేఁ దాను కృష్ణుపై మోపిన యపవాదరూపదోషముఁ బోఁగొట్టుకొనుటకుఁ గృష్ణు నకే యీయవలసివచ్చెను. ఈ యీర్ష్య 'అక్రూరా'ది త్రయమునకుఁ గలిగియున్నది. కాని కృష్ణుఁడు బల వంతుఁడగుటచే నేమియుఁ జేయఁజాలకుండిరి. ఇంతలో బలరామకృష్ణులకు దుర్యోధనాదులు పాండవులను లాక్షాగృహమున దహింతురనువార్త వినరాఁగాఁ బాండ వులఁ గాపాడ వారిరువురు వారణావతమున కరిగిరి. వా రూరు (ద్వారక) వీడిననాఁటిరాత్రియే శతధన్వుఁడు నిద్రలో సత్రాజిత్తును జంపి శమంతకమణి నపహరిం చెను. ఈవార్త వెంటనే సత్యభామ మార్గమధ్యముననే యుండిన శ్రీకృష్ణబలరాములకుఁ దెలియఁజేయ వారు వారణావతమునకుఁ బోవకయె ద్వారకకుఁ జేరిరి. వారి రాక నెఱిఁగి శతధన్వుఁడు తన కంతకుఁబూర్వము సత్రా జిత్తుఁ జంపుటలోఁ బ్రోత్సాహకులను 'కృతవర్మా క్రూరు'లను కృష్ణబలరాములు తనపైఁబడిన సహాయ మునకు రండని కోరెను. కృష్ణబలరాముల పరాక్రమ మున కోడి వారు శతధన్వునకు సాయముచేయ రామ నిరి. అపుడు శతధన్వుఁడు చేయునదిలేక శమంతక మణి నక్రూరునకిచ్చి యశ్వమునెక్కి పరునిడెను. శత ధన్వు పలాయనవృత్తాంతముఁ దెలిసి రామకృష్ణులు వెన్నాడి పోవంబోవ మార్గమధ్యమున శతధన్వాశ్వము మృతినొంద వాఁడు వనమున గుఱ్ఱముదిగి బడి వక్ర గమనముఁ జేయుట మూచి కృష్ణుఁడు రాము నొక్కెడ నుండుమని తాను శతధన్వు వెన్నంటి యొక్కెడ చక్రముఁ బ్రయోగించి వాని శిరశ్ఛేదముఁ జేసి వాని కట్టుపుట్టములు వెదుక మణి కాన్పింపలేదు. ఈయం శమును రాముకడకు వచ్చి తెలుప బలరాముఁడు నమ్మక 'నీవే మణి నపహరించితి'వని కృష్ణుపై నేరమునెట్టి 'నీవుండినపురిలో నే నుండ'నని కోపించి 'మిథిలాపురి' కరిగి జనకుచేఁ బూజింపఁబడుచు నచటనూఁడేం డ్లుండెనఁట. శమంతకమణి (కొహినూరు) అవతారపురు షులంగూడ గలహింపజేసెనుగదా! ఆకాలముననే బలదే వుఁడు దుర్యోధనునకు గదాయుధాచార్యుఁ డయ్యెను. * శతధన్వుమరణముఁ దెలిసి శమంతకమణిని విడువలేక కృష్ణుభయముచే ద్వారకలో నుండలేక, అక్రూరుఁడు శమంతకమణిని రహస్యముగ తనకడ నుంచుకొని కాశీ పురికేగి యచట శమంతకమణిమహిమచే లభించు చున్న ధనముచే ననేకదానధర్మములఁ జేయుచుండెను.

అక్రూరుఁడు ద్వారకలో లేకుండుటచే క్షామము సంభవింపఁ బ్రజలు శ్రీకృష్ణుకడకు వచ్చి అక్రూరుని తండ్రి ధర్మాత్ముఁడనియు, నాతనిపుత్రుఁ డగు నక్రూరుఁడును నట్టివాఁడె యనియు, నాతఁడిచ్చట లేకుండుటచే క్షామము సంభవించినదనియు, నెటులైనను నక్రూరుం ద్వారకకు రప్పింపవలయుననియు వేఁడ ప్రజల కోరిక ననుసరించి అక్రూరునకు వర్తమాన మంపి యాతఁడు రా ద్వారకలో నాతని నుండుమని సగౌర వముగాఁ గోరెను. అక్రూరునికడ శమంతకమణి యుం డుట యంతకుముందే శ్రీకృష్ణునకుఁ దెలిసియుండుటచే నాతనితో మణి నీకడఁ గలదన నక్రూరుఁ డౌనని యా మణిని సభాసదుల యెదుటనె శ్రీకృష్ణునెదుట నునిచెను.

ఈవృత్తాంతము కృష్ణుఁడు బలరామునకుఁ దెల్పుడుచేయ నాతఁడు మిథిలనుండి ద్వారకకువచ్చెను. అపు డీశమంతకమణిలో సత్యా శ్రీకృష్ణబలరాములు మువ్వురకు వివాదము సంభవించునట్లు కాన్పించెను.

* ఈ గాథ విష్ణు, భాగవత, హరివంశపురాణములలో నించుమించు సమానముగానె చెప్పఁబడెను.

పితృధనమగుటచే సత్యభామకు, శతధన్వువధముకై తోడ్పడఁబోవుటచే బలదేవునకు, రెండుసారులు కష్టపడి దానిని సంపాదించుటచే కృష్ణునకుఁగూడ నారత్నమున వాటాలు కలవు. అపుడు కృష్ణున కేమి సేయుటకును దోఁచక యుక్తిచే నాలోచించి "యక్రూరా, ధర్మాత్ముఁడవగు నీకడనె యీమణి యుండఁదగు"నని యాతనినే పుచ్చుకొమ్మని సభయందే యక్రూరున కిచ్చివేసెను. వాటాలు దగకనె యట్లు కృష్ణుఁడు చేసి యుండెనుగాని ధారాళతచేఁ గాదు. దానిచే శ్రీకృష్ణునకు 'అక్రూరవరద' అనుబిరుదము లభించినది.

ఆమణి నాఁటినుండి యక్రూరునికడనె యుండెను. యాదవు లన్యోన్యకలహమునఁ జచ్చునపుడు కృష్ణసంబంధులు ముచ్చంచుతుంగచే మోఁదులఁబడి యక్రూరుఁడు మడసెను. కంసుని వంశస్థులగు నక్రూరకృతవర్మాది భోజులకును, వార్ష్ణేయులగు శ్రీకృష్ణాదులకును శమంతకమణి, నారీమణియగు సత్యభామతో సంబంధించిన వివాదములే కృతవర్మ కురుక్షేత్రసంగ్రామమునఁ గౌరవులతోఁ జేరుటకును, సర్వయాదవనాశమునకును మూలమైనట్లు కాన్పించును.

యాదవనాశాంతమున నక్రూరుకుటుంబమువారు మిగిలియుండిరి. వారికడనె యీశమంతకమణి బోయల బారిఁ బడలేదనుట కాయక్రూరు కుటుంబమువారి నర్జునుఁడు రక్షించి శ్రీకృష్ణప్రపౌత్రుఁడగు వజ్రుని పాలనమున నుంచె ననుటయె నిదర్శనము. కాని యక్రూరుని కుటుంబమువారు వజ్రునికడ నుండక యెటకో పోయిరఁట! ఎటకుఁ బోయిరో తెలియదుగాని, భోజులలోని కృతవర్మపుత్రుఁడు 'మార్తికావత' మునకు రాజుగా నర్జునునిచేఁ జేయఁబడినట్లు భారతముననే కలదు. మార్తికావతము దక్షిణాపథములోని దగుటచేతను, త్రిలింగదేశములోని 'మట్టివాడ' మార్తికావతభవముగాఁ గాన్పించుటచేతను నిది యదియై యుండుననినా భారతచరిత్రయొక్క ద్వితీయముద్రణమునఁ జర్చించియున్నాను. అక్రూరుసంతతివారు తమవంశస్థుఁడగు కృతవర్మపుత్రునికడఁ జేరిరేమొ! రుక్మిణీదేవి పుట్టినింటివారు భోజులు. వారు 'విదర్భ' దేశము నేలిరి. దేవగిరి యాదవులు, బల్లాలయాదవులు నను రెండుతెగలవారు కృతవర్మాక్రూరాదిభోజులయొక్క సంతతి కాదనుటకు నిదర్శనము కలదా? ఇప్పుడును యాదవులలో నొక తెగవారై 'భోజులు' అను గొల్లరాజులయొక్క వంశస్థులు కర్నూలుమండలములోని 'మద్దకరి'లో నున్నారు. వారి పూర్వుల శిలాశాసనాదులు 'మద్దకరి' ప్రాంతమున విరాజిల్లుచున్నవి. కాన అక్రూరభోజుని సంతతివా రాంధ్రావనికే చేరియుందురనియు, వారితో నాశమంతకమణియు నీయాంధ్రభూమికిఁ జేరెననియుఁ దలంపవలసియున్నది. కాన కోహినూ రాంధ్రదేశపుమణియైనదని తలంతును.

కోహినూరు గోదావరినదిలో లభించెనని కొందఱును, గుంటూరుమండలములోని కొల్లూరున దొరకెనని మఱికొందఱును (కోహినూరే కొల్లూరై నదఁట), కొల్లేరుసరస్సున లభించెనని మఱికొందఱును చెప్పుదురు. పిమ్మట నది గోలకొండనవాబులకుఁ జేరెనఁట. తక్కిన సంగతి సెప్టెంబరు భారతిసంచికలో నిదిగా నుండవచ్చును.

## ఇంక నొక గాథ

ఒక వర్షకాలమున గోదావరి పొరలి పొంగుచుండఁగ నొక గోదావరీపరిసరపుఁబల్లెయందొక జాలరి చేపను బట్ట నదికిఁ బోయి వలను వైచెనఁట. వాని వలలో నీకోహినూరు నదీవేగమునఁ గొట్టుకొని వచ్చుచుఁ బడెనఁట. ఉపలాస్ఫాలనోత్క్షేపవిక్షేపితమగుచుఁ గొట్టుకొనివచ్చుచుండుటచే శాణితమైనటులనె ప్రకాశించుచుండు నీకోహినూరును జూచి ముగ్ధుఁడై యాజాలరి తన గ్రామములోనికిఁ దీసికొనిపోవ నాపల్లెలోని యొక వర్తకుఁడు రెండుమూఁడు రూప్యములకె దానిం గొని కొన్నిపదుల రూప్యములకుఁ బరిసరపట్టణమున నమ్ముకొనెనఁట. అది క్రమముగా వెలలో వృద్ధినొందుచు గోలకొండనవాబుం జేరెనఁట. ఎటులైన నది యాంధ్రదేశమునఁ బెక్కు శతాబ్దములకాల ముండెననుట సత్యమునకు దూరము కాదు. అది యింక నాంధ్రావనిఁ జూచుట యెప్పుడును సంభవింపదు.

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.



# విమర్శనములు

## హరిజనశతకము

రాయలు ౧/౧౬ సైజు, ౪౫ పుటలు, వెల రెండు అణాలు.

ఆంధ్రమున ననేకగీతపద్యగద్యప్రచారక గ్రంథములు రచించిన హరిజనకవీంద్రుడు శ్రీయుత కుసుమ ధర్మన్నకవిగారిచే రచింపబడిన ౧౦౮ ఆటవెలదుల చిన్నిపుస్తకము. నిద్రాణుడై యున్న హరిజనుని మేలుకొల్పి, సవర్ణులు తమ ధన, కుల, జ్ఞానాధిక్యగర్వములచే వాని నెట్లు అడగద్రొక్కుచున్నారో తెలిపి, సమానగౌరవముకొరకు సమ్మెకట్టు సూత్రము నవలంబింపవలెనని బోధించుచున్నది. కవిగారి మునుపటి గ్రంథములకంటె నిందలి కవిత్వము చాలా సాఫీగా యున్నదనియు, కాలక్రమమున వేమన్నకవిత్వముతో సరిపోవచ్చుననియు చెప్పవచ్చును. వైద్యరత్న కుసుమ ధర్మన్నకవి, లక్ష్మీవారంపేట, రాజమండ్రికి వ్రాసిన ప్రతులు లభించగలవు.

గ. స.

---

## భావతరంగాలు

శ్రీయుత ఉన్నవలక్ష్మీనారాయణగారు రచించిన ఏలలు, సుద్దులు, చిందులు, బుర్రకథలు మొదలగు ౧౨ పాటలుగల ౧౬ పుటల గ్రంథము. అనాగరక నిమ్నవర్ణ్యజాతుల స్త్రీపురుషుల భావములలో నెట్టి ఆశలు, ఆశయము లూగుచుండునో తదనుకూలమైన గ్రామ్యపదములలో చిత్రించు నేర్పు మన లక్ష్మీనారాయణగారి కున్నట్లు ఇప్పటికవులలో ననేకులకు లేదు. తక్కెళ్ల జగ్గన్నబోధలు, దయ్యాలపాట, విడుదలో విడుదలో యనుపాటలు యుగయుగములనుండి అణచబడిన అల్పజాతుల మానమర్యాద లొక్కసారి యగ్ని పర్వతమువలె పైకుబికి యెట్లు ప్రళయమును గూర్చ గలవో తెలియజేయును. కవిత్వమువంటి మనోహర భావము లొక్క విద్వజ్జాతులలోనే కాక నిరక్షరాస్యులగు మానవులు, పశువులు, పూలు మొదలగు నన్నిటి హృదయములయందుగూడ నుండుననియు, చిత్రించగల కవీంద్రు డున్నచో వానిని కవీంద్రుడు చిత్రింపవచ్చుననియు ఈచిన్నగ్రంథములోని భావములవలన తెలియనగును. వెల రు ౦-౧-౦. వలయువారు గుంటూరులో నున్న గ్రంథకర్తగారి పేర వ్రాయవచ్చును.

గ. స.

---

## మాధవాశ్రమము (ద్వితీయభాగము)

బళ్లారి శ్రీ కృష్ణదేవరాయగ్రంథమాలవారి యెనిమిదవపుష్పము. గ్రంథకర్త: సుంటిసుబ్రహ్మణ్యశర్మగారు, క్షేత్రపల్లి, కల్యాణదుర్గంతాలూకా.

కరూరు గ్రామములో కల్లుదుకాణము నెత్తివేయించుటకును, జాతీయపాఠశాలను నెలకొల్పుటకును ఖద్దరుత్పత్తిని పెంచుటకును మాధవశర్మయు, అతని యనుచరులును పడిన శ్రమ లిందు వివరింపబడినవి. మేఘపటలములను చీల్చుకొని వెలుగు చంద్రునివలె

నీరాపనిందలను తొలగి జైలునుండి విముక్తుడై మాధవశర్మ రాణించును. గ్రామపునర్నిర్మాణోద్యమమునం దాసక్తిగల యువకులును, సంస్థలును దీనిని తప్పక పఠించవలెను. వెల రు ౦-౫-౦ లు.

గ. స.

---

## భోగేశ్వర మాహాత్మ్యము

డెమ్మీసైజు, ౮౦ పుటలు, నాలుగాశ్వాసముల ప్రబంధము. వెల రు ౦-౧౦-౦ లు మాత్రము. గ్రంథకర్త శ్రీయుత మల్లంపల్లి మల్లికార్జునారాధ్యకవి. ౧౯౩౮-౯ సంవత్సరము బి. ఏ., పట్టపరీక్షకును, 'ఉభయభాషాప్రవీణ' ఏ.బి. గ్రూపులకును పఠనీయగ్రంథముగ నిర్ణయింపబడినది. శివదేవుని వరప్రసాదలబ్ధపుత్రియగు గొడగూచి యిడిన నివేదనలను శంకరుడు గుప్తముగను, ప్రత్యక్షముగను వచ్చి ఆరగించిపోవువిధంబును, గొడగూచి శీలముపై తలిదండ్రుల కనుమానము జనించుటయును, ఆమెమాహాత్మ్యమున వారికిగూడ శివసాక్షాత్కారమగుటయును, శ్రీశైలపర్వతపరిసర పుణ్యసంస్థల మనోహరవర్ణనములును కలిగి గ్రంథ మత్యంతనీతిదాయకమై, భక్తిరస ప్రధానమై రాణించుచున్నది. శైలి గంగాప్రవాహమువలె స్వచ్ఛమై, గంభీరమై, సవేగమై, సులభగమ్యమై అలరారుచున్నది. నగర, ఋతు, సూర్యోదయాస్తమయాదివర్ణనలు స్వతంత్రములై ప్రబంధవర్ణనముల బురడించుచుండును. పండితప్రశంసనీయమైన శైలిలో ఆర్షసంప్రదాయబద్ధజీవనము మనోహరముగ చిత్రింపబడినది. ఒకపద్యమున కొకపద్య మీడుతీయకుండుటచే ఉదాహరింపబోవుట సాహసకృత్యమేయగును. కవిత్వమునం దభిమానముగలవా రెల్లరును పఠించితీరవలెను. ప్రతులువలయువారు మచిలీపట్టణముదరినుండు నిడుమోలులోని శ్యామలాధర్మపాఠశాలయందుండు కవిగారికి వ్రాయవలయును.

గ. స.

---

## చంద్రహాసము

క్రౌనుసైజు, ౭౫ పుటలు, వెల రు ౦-౧౨-౦ లు. గ్రంథకర్త శ్రీయుత జి. జోసఫుకవిగారు, వినుకొండ, గుంటూరుజిల్లా.

ఆరు అధ్యాయములతో గూడిన వచనగ్రంథము. ఇతిహాస మెల్లరు నెరింగిన చంద్రహాసుని చరిత్రమే. వర్ణనలు, కల్పనలు కవిగారిచే పెంచి వ్రాయబడినవి. శైలి యున్నత తరగతి విద్యార్థులకు పఠనీయమై, గంభీరమై, కఠినమై, సంస్కృతసమాసకలితమైనది. దేశోద్ధారకుని కంకితమై ఆంధ్రపత్రికాముద్రాలయమున ముద్రితమైనది. విద్యాశాఖవారు దీని నెంతయు ప్రోత్సాహమిచ్చి పఠనీయగ్రంథముగ నిర్ణయింపతగినది. గ. స.

---

## గిరికాపరిణయము

డిమ్మీసైజు, ౭౨ పుటలు, వెల రు ౦-౧౨-౦ లు. గ్రంథకర్త శ్రీయుత కంచర్ల వేంకటహనుమయ్యగారు, వినుకొండతాలూకా పెరుమాళ్లపల్లె వాస్తవ్యులు. వసుచరిత్రలోని ప్రధానభాగమగు గిరికాపరిణయము కథాంశము. ఏకాంకముల నాటకము. ఈమనోహరకథ నింతవర కాంధ్రులు రామరాజభూషణకవికృతవసుచరిత్రనామక ప్రబంధముగ చదివి యానందించుచున్నారేకాని, నటింప సందర్శించు భాగమునకు నోచుకొనలేదు. ఇట్టి రసవత్తరకథను ప్రదర్శనయోగ్యముగు నాటకరూపముగ రచించి గ్రంథకర్త సురుచిర కీర్తివంతు లగుచున్నారు. వచనమును, కొన్ని పద్యములును గ్రంథకర్తగారు స్వయముగా వ్రాసినవి. ఉత్కృష్టములగు పట్టులలోని పద్యములనెల్ల యథారూపముగ వసుచరిత్రనుండి సంగ్రహించి పొదిపి వాటి యమూల్యప్రతిభను ప్రకటించినారు. సుప్రసిద్ధ నటశేఖరు లీనాటకము నాడి తమప్రతిభను ధ్రువపరచుకొనుటకు మంచి యవకాశము.

గ. స.

## సత్యనారాయణ శతకము

డెమ్మీసైజు, ౨౦ పుటలు, సత్యనారాయణా యను మకుటముతో ౧౦౮ శార్దూలమత్తేభవృత్తములు. గ్రంథకర్త: శ్రీయుత పండితారాధ్యుల సూర్యనారాయణకవిగారు, ముమ్మిడివరం, తూర్పుగోదావరి జిల్లా.

హిందూమతమునందలి సర్వశాఖాజన సంసేవ్య దైవతమగు శ్రీ అన్నవరము సత్యనారాయణమూర్తివారి మాహాత్మ్యము భక్తిరసపూరితమగు ప్రౌఢశైలిలో వర్ణింపబడినది. శ్రీయుతులు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు మొదలగువారు గ్రంథముయొక్క శయ్యను ప్రశంసించియున్నారు. సత్యనారాయణవ్రతసమయమున ప్రతిగృహమునందును పఠింపతగినది.

గ. స.

---

## వీరకరవాలము

ఇది మ-రా-శ్రీ బైరెడ్డి రంగారెడ్డిగారు "గరమ్ తుల్‌వార్" అను హిందీగ్రంథమునకు భాషాంతరీకరణముగఁ జేసిన ౧౭౨ (క్రౌను) పేజీల నవల. ఇది చరిత్రమును సంబంధించిన దగునో కాదో తెలియదు. కాని నవల చిన్నదైనను చాల రమణీయముగ నున్నది. ఇందలి భయంకరపరిణామములు కొన్ని పాఠకులఁ జకితులఁ జేయుచున్నవి. మయూరధ్వజుని ప్రభుభక్తిపరాయణత, జగమల్లుని భ్రాతృభక్తి, రణమల్లుని కార్యదీక్ష, రాయసింహుని మూర్ఖపుపట్టుదల, శీలవతికృతజ్ఞత మిక్కిలి చక్కఁగఁ బోషింపఁబడినవి. ఆయా విషయములం దాయావ్యక్తు లాదర్శస్వరూపులు.

కాని రణమల్లు శీలవతిప్రేమహృదయమును గ్రహింపలేకపోవుట యొకలోపము కాఁగలదు. సౌమ్యవతీరణమల్లుల యనురాగము ఎచటను వర్ణింపఁబడకయే యిర్వురికిని వివాహము జరిగించినది. సౌమ్యవతీపాత్ర మిచట చాల నీచముగ విడువఁబడినది. ఆమె తన ప్రియుని ప్రాణములను గాపాడుటకై శీలవతిని బలి యగునట్లు కోరినది. ఇట్టి క్షుద్రహృదయ రాజమహిషి యగుట—అందు రణమల్లునిదేవియగుటయు ఉచితముగ లేదు.

రచన చక్కఁగ సాగినది. గ్రంథకర్త పీఠికను వ్యావహారికాంధ్రమున వ్రాసినను గ్రంథమును గ్రాంథికభాషచే వ్రాసెను. అచ్చటచ్చట "సభికులు" (సభ్యులనుటకు), "ధ్యేయిని" మొదలగు దుష్టప్రయోగములు కలవు.

హిందీగ్రంథము "గరమ్‌తుల్‌వార్" అయినను, కవి స్వతంత్రించి "వీరకరవాలము" అని నామ మిడినట్లు పీఠికలోఁ జెప్పఁబడినది. కాని యాపదము నాంధ్రీకరించినచో, మూలాభిప్రాయము చెడకుండ "వీరకరవాలము" అని మార్చుటయే యుక్తము. కావునఁ గవి స్వతంత్రించి చెప్పినట్లు వ్రాసికొననక్కఱలేదు. వీరకరవాల మనునర్థమున "గరమ్‌తుల్‌వార్" అనునది భాషాసంప్రదాయసిద్ధపద (Idiomatic word) మని యెఱుఁగవలెను. శ్రీ రెడ్డిగా రిట్టినవలలను వ్రాసి భాషాసేవ నొనర్తురుగాక!

బులుసు వేంకటరమణయ్య,

---

## తర్కసంగ్రహము

న్యాయవైశేషికముల సిద్ధాంతములను బాలురకుఁగూడ బోధపడునట్లు సంగ్రహించి అన్నంభట్ట విద్వాంసుఁడు రచించిన తర్కసంగ్రహమున కిది యాంధ్రీకరణము. అనువాదకులగు బ్ర. శ్రీ మలుగు విశ్వేశ్వరశాస్త్రిగారు, ఆయుర్వేదవిద్వాంసు లగుటచే, ఆయుర్వేదమునకుఁ దర్కమునకుఁ గల సంబంధమును దెలుపు చరకమతదీపికయను వివరణమునుకూడ దీనియందుఁ గ్రోడీకరించియున్నారు. అన్నిశాస్త్రములకును న్యాయవైశేషికములతో సంబంధము కలదు. కాని శ్రీశాస్త్రిగారు ఆయుర్వేదవిద్యార్థుల యుపయోగార్థము ఆయుర్వేదమతములను నిరూపించు టెంతయు సముచితము. ఈయాంధ్రీకృతితో మూలము కూడఁ జేర్పఁబడుట బహూపకారకము,

భాషాంతరీకరణము-అందు శాస్త్రగ్రంథాంధ్రీకరణము చాల కష్టమైనపని. కావున శ్రీశాస్త్రిగారెంతటి జాగరూకులైనను ఈగ్రంథమునఁ గొన్ని దోసంగులు దొరలుట తప్పినదికాదు.

పుట ౧. మూలమున "పదార్థాన్ విభజతే. తత్ర ద్రవ్యేతి" అని గలదు. ఇయ్యది న్యాయబోధినిలోనిది. ఇచట మూలమున నెట్లు పడినదో తెలియకున్నది.

పుట ౭. మూలము "నిత్యా పరమాణురూపా, అనిత్యా కార్యరూపా. పున స్త్రివిధా" అని యీయఁబడినది.

"ఈభూమి మరల మూఁడువిధములు" అని యాంధ్రీకరణము వేరే పేరాలోఁ గలదు. దీనింబట్టి నిత్యానిత్యస్వరూపయగు పృథివి యంతయు మూఁడు విధములని శ్రీశాస్త్రిగారి మతమును గ్రహింపవలసియున్నది. "పదార్థవివరణసూచిక" లోని వారి వివరణముకూడ మీఁది వారిమతమునే బలపరచుచున్నది, మాకుఁడు.




కాని నిత్య పరమాణుస్వరూపయగుట నచట నీభేదములు లేవు. అనిత్యయే మూఁడువిధములు. శ్రీశాస్త్రిగారు మీఁదిరీతినే జలము-తేజస్సు-వాయువుల పట్లఁగూడ సూచించినారు. ఇది న్యాయశాస్త్రవిరుద్ధమగు సిద్ధాంతము. "సా పున స్త్రివిధా" అను మూలపాఠమును గ్రహింపవలెను. ముద్రితగ్రంథములలో నట్లే కలదు.

పుట ౧౧. "దివ్యమన నీటిచే నార్పఁబడక వెలుఁగునది. బడబాగ్ని" అని శ్రీశాస్త్రిగారు మూలమున లేని నూతనమార్గము త్రొక్కిరి. ఉపపత్తి యేమో? మఱియు బడబాగ్ని యంతరిక్షమున నుండదుకాన దివ్యముకాఁజాలదు. "దివ్యమబింధనం విద్యుదాది" అని మూలమునఁగలదు. ఇచటి "అబింధన" మ్మనునది విద్యుద్విశేషణము. ఆదిపదముచే సూర్యచంద్రాదులను గ్రహింపవలసినదిగాని బడబాగ్నిని కాదు.

పుట ౩౯. మూలము "కార్యం ప్రాగభావప్రతియోగి." తెలుఁగు "ప్రాగభావమునకు (తను పుట్టుటకు పూర్వము లేకుండుటకు) ప్రతియోగి (విరుద్ధము) కార్యము." అని కలదు. కాని ప్రతియోగియనఁగా ఆధేయమనుగాన విరుద్ధమను నర్థముఁ జెప్ప వీలు లేదు. ప్రాగభావము నాశ్రయించియుండునది కార్యము. అనఁగా కార్యము కాకపూర్వమే అభావముండునుగాని, కార్యమైనపిదప నుండదని భావము. మఱియుఁ బ్రతియోగియన విరుద్ధమని అర్థము చెప్పినచో "ప్రాగభావాప్రతియోగిత్వే సతి, ధ్వంసాప్రతియోగిత్వే సతి, అన్యోన్యాభావభిన్నత్వే సతి అభావత్వ మత్యంతాభావత్వమ్" (న్యాయబోధిని) మొదలగు లక్షణములే విరోధింపఁగలవు. మఱియు "చతుర్వింశతిగుణాః, జలేతు మధురఏవ. స ద్వివిధ సురభిరసురభిశ్చ" మొదలగు ముద్రణస్ఖాలిత్యము లచ్చటచ్చటఁ గలవు.

ఇదివఱకు కీ. శే. కం. వీరేశలింగముపంతులుగారు తర్కసంగ్రహము నాంధ్రీకరించియున్నారు. కాని శాస్త్రాంతరసంబంధప్రదర్శనపూర్వకముగ నిట్లు నూతనరీతిని ఎవరు నాంధ్రీకరింపలేదు. కావున శ్రీశాస్త్రిగారి ప్రయత్నము కొనియాడఁదగియున్నది.

బులుసు వేంకటరమణయ్య.

---

## ఆంధ్రీకృతలఘుసిద్ధాంతకౌముది

గీర్వాణభాషను లఘురీతిని వ్యాకరించుచు వరదరాజపండితుఁడు వ్రాసిన లఘుసిద్ధాంతకౌముది కిది తెనిఁగింపు. క్రౌనుసైజున ౭౫౬ పుటల గ్రంథము. చిట్టి

గూఁహూరునందలి నారసింహసంస్కృతకళాశాలాపండితులగు బ్రహ్మశ్రీ చంద్రభట్ల సూర్యనారాయణశాస్త్రిగారును, ఉభయభాషా-సాహిత్య విద్యా-ప్రవీణ శ్రీమాన్ పంచాంగము వేంకట నరసింహాచార్యులుగారును దీనిని రచించిరి. తత్కళాశాలాధ్యక్షులగు శ్రీమాన్ శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులుగారు ఈగ్రంథమున కుపోద్ఘాతము వ్రాసిరి. అందు సంస్కృతవ్యాకరణచరిత్ర సంగ్రహముగ నీయఁబడినది. కాని ప్రస్తుతాంధ్రీకరణముయొక్క బాగోగులు వివరింపఁబడియుండలేదు.

ఈగ్రంథమునఁ బాణినీయసూత్రములు-వార్తికములు-పరిభాషలు-ఆరీతినే యుంచఁబడి వరదరాజపండితకృతమగు వృత్తిమాత్రము తూ-చాలుతప్పకుండ నాంధ్రీకరింపఁబడినది. గ్రంథకర్తలు సమర్థులగు విద్వాంసులగుటచే ఆంధ్రీకరణము కడుజాగ్రత్తగనే చేయఁబడినదని చెప్పవచ్చును.

కాని గ్రంథమంతయు యథాశ్రుతముగ (మక్కికిమక్కిగా) తెలిఁగింపఁబడినదని చెప్పవలసివచ్చుచున్నది. గ్రంథాదినుండియే కొన్ని యుదాహరణములఁ గనుఁడు-

పుట. ౨. హలన్త్యమ్. ౧. ౩. ౩.

[వరదరాజపండితుని మూలము.] ఉపదేశేఽన్త్యం హ లిత్ స్యాత్. ఉపదేశ ఆద్యోచ్చారణమ్. సూత్రే ష్వదృష్టంపదం సూత్రాంతరా దనువర్తనీయం సర్వత్ర.

[తెలుఁగు] ఉపదేశమునఁ జివర నుండు హల్లిత్సంజ్ఞక మగును. ఉపదేశమన మహేశ్వర-పాణిని-కాత్యాయన- పతఙ్జలుల యాద్యమగు నుచ్చారణము. సూత్రమున లేని యావశ్యకపదముల నితరసూత్రముల నుండి గ్రహింపవలయును.

[ఇచట మహేశ్వరాదుల యాద్యోచ్చారణమన నర్థ మేమో తెలియకున్నది.] మఱియు "సూత్రేష్వదృష్ట" మ్మనుదానికి వివరణము బాగుగ వ్రాయవలెను.

పుట. ౬. తెలుఁగు. "ఖర్" లకు వివారము-శ్వాసము-అఘోషము......మూలము "ఖరో వివారాః శ్వాసా అఘోషాశ్చ" అని. ఇచట "ఖర్" లని అనక, వివరించుట లెస్సగదా!

పుట. ౧౨. యస్మిన్ విధి స్తదాదా వల్ గ్రహణే.

"సప్తమ్యన్తే విశేషణీభూతే యో విధి రారభ్యతే స తదాదేర్ జ్ఞేయః" అని మూలము. తెలుఁగు "అల్ మాత్రబోధకమును—" అల్లనఁగా నేమో వివరించుట యుచిత మేమో!

మూలముకంటె భాషాంతరీకరణము సుగమమై వ్యాకరణజిజ్ఞాసువులు స్వతంత్రముగ నర్థముచేసికొనవీలగురీతి నున్ననే దానివలనఁ బాఠకలోకమున కుపకారము కలుగఁగలదు. లేనిచో భాషాంతరీకరణము నకుఁ దగినంత ఫలము లేదు. ప్రస్తుతగ్రంథమును, లఘుసిద్ధాంతకౌముదిని సంస్కృతమునఁ జదువనివారెవ్వరు (నూతనప్రవేశముకలవారు) ను స్వతంత్రముగ గ్రహింపఁజాలరు. గురువునొద్దఁ జదువుకొనునపు డిద్దానికంటె మూలమే బహూపకారక మగును. దీనితో మూలమునుగూడఁ జేర్చి ముద్రించినఁ జాలవఱకు ఉపయోగ ముండెడిది. కాని యేలకో గ్రంథకర్త లట్లొనర్పలేదు.

వ్యాకరణాదిశాస్త్రగ్రంథములు దేశభాషకు సంబంధించినవైనను, సర్వజనవేద్యములు కాక దుర్ఘటము లగును. అట్టిచో నొకభాషనుండించిన వ్యాకరణమును వేఱొకభాషలో వ్రాయునపుడు మిగుల జాగరూకత వహించి, మూలాభిప్రాయము బాగుగ తమ భాషాంతరీకరణమున ప్రతిబింబించునట్లు రచించుట భాషాంతరీకర్తల ముఖ్యకర్తవ్యము.

అనువాదకులు మక్కికిమక్కిగా లఘుసిద్ధాంతకౌముది నాంధ్రీకరించినను, మూలాభిప్రాయము చెడకుండఁ దీసికొనివచ్చుటయుఁ బ్రశంసింపఁదగిన విషయము. ఆంధ్రవిద్వాంసు లీగుణమును గ్రహించి గ్రంథకర్తల ప్రయత్నమును సఫలముగఁ జేయుదురుగాక!

బులుసు వేంకటరమణయ్య

# గ్రంథస్వీకారము

## క్రొక్కారు

గ్రంథకర్త: జలసంకి కృష్ణస్వామిశర్మగారు, ఒంగోలు, గుంటూరుజిల్లా, క్రౌనుసైజున 31 పుటలు. వెల రు 0-5-0.

---

## నీతిముక్తావళి

గ్రంథకర్త: మంత్రిరావు వెంకటరత్నముగారు, తణుకుతాలూకా కాకరపర్రు. క్రౌనుసైజున 28 పేజీలు, వెల రు 0 2-0.

---

## శివమహిమ్న స్తోత్రము

గ్రంథకర్త: వడ్డాది సీతారామాంజనేయులుగారు, మణిద్వీపము, ఖాశింకోట, విశాఖపట్టణముజిల్లా, వెల రు 0-2-0.

---

## జీవనసంధ్య (సాంఘికనవల)

గ్రంథకర్త: వినోదుడు. సరస్వతీగ్రంథమాల, కాకరపర్రు. క్రౌనుసైజున 112 పుటలు. వెల రు. 0-12-0.

---

## గానకళాచంద్రిక

గ్రంథకర్త: అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు, సంగీతోపాధ్యాయులు, "సుందరవిలాస్", గాంధీనగరము, బెజవాడ. డెమ్మీసైజున 361 పుటలు, వెల రు 2-0-0.

---

# పత్రికలు

## ప్రజాసంస్థ

సంపాదకులు: గాదె సింహాచలంపంతులుగారు, M. L. C., గుంటూరు. చందా సంవత్సరమునకు రు. 2-0-0.

---

## విశ్వకళ

సంపాదకులు: కుందుర్తి నరసింహారావుగారు, గాంధిపేట, గుంటూరు. సంవత్సరపుచందా రు. 1-0-0.

---

## సరస్వతి

సంపాదకుడు: వెంపటి సత్యనారాయణగారు, విశాఖపట్టణము. సంవత్సరపుచందా రు. 2-8-0 లు.

---

# మ న వి మా ట లు

## ఆంధ్రపత్రిక రజతోత్సవము

ఆంధ్రపత్రికకు ఇరువదినైదేండ్లు నిండినవి. రజతోత్సవము జరుగకున్నను, సంచిక మాత్రము వెలువడినది. ఆంధ్రప్రముఖుల ఆశీర్వాదములతోను, అభినందనములతోను సంచిక యొప్పుచున్నది.

ఆంధ్రపత్రిక బొంబాయినగరమున పుట్టినది. విజ్ఞానసంపన్నమగు తనదృష్టి నాంధ్రదేశముపయి ప్రసరింపజేసినది. ఆవెలుగుననే ఆంధ్రులు, తమ్మును, ప్రపంచమును కనుగొనగలిగిరి; తమయందు కనుపట్టెడు లోపములను గుర్తించి తమ్ము దిద్దుకొన మొదలిడిరి; క్రమముగా తమ జాతీయతను, వ్యక్తిత్వమును లోకమునకు చాటగలిగిరి; సాటిదేశములలో తమదేశమునకును, సాటిజాతులలో తమజాతికిని గౌరవమును సమకూర్చుకొనగలిగిరి. పెక్కులేల? వారియందు నేడు సకలవిషయములను కనుపట్టుచున్న యభివృద్ధి యంతయు నాంధ్రపత్రికయే ప్రసాదించినది. ఇది సత్యము. ఇంకను ఆంధ్రులయెడ నిలిచియుండు లోపములకు వారి అలసతయే కారణము.

పత్రికాధిపతి యాంధ్రుడే. అయినను ఆంధ్రజనసహజమగు అలసత మొదలగు నవగుణము లాయనయెడ మృగ్యములు. ఆదిని సంపన్నుడు కాకున్నను ఉత్సాహము, ధైర్యము, స్థైర్యము, ఔదార్యము, కార్యదీక్ష మున్నగు సుగుణముల కాయన యునికిపట్టు. ఆబంగారు పళ్లెమున కాంధ్రదేశమున చేర్పుగా గోడ లేకపోయినది. ఏకాకిగా దేశాంతరమును జేరుకొనినాడు. ఆయన యుత్తమపురుషలక్షణముల కదృష్టదేవత చేయూతయిచ్చినది; పట్టినది బంగారము కాజొచ్చినది.

ఆయనది మత్సరము లేని మనస్సు ఆయన తనకు తావీయని దేశముజోలి తనకేల యని యూరకున్నవాడు కాడు; దాని దీనస్థితిని తిలకించినాడు; తదుద్ధరణమునకయి కంకణము గట్టినాడు; తత్కార్యసాఫల్యమునకు సాధనమగు పత్రికను, ఆంధ్రముననే ప్రకటింప మొదలిడినాడు. ఆయనలోకజ్ఞతకు, దూరదృష్టికి, దేశాభిమానమునకు నింతకంటె నిదర్శనమేమికావలెను?

ఆయన మొదట వారపత్రికను ప్రారంభించినాడు. తన యుద్దేశము సర్వాంగీణముగా సఫలమగుటకు అది యొక్కటి చాలదని తెలిసికొని తరువాత కొన్నియేండ్లకే దినపత్రికనుగూడ ప్రారంభించినాడు. వ్యయ ప్రయాసములను లెక్కపెట్టుట ఆయనప్రకృతికి గిట్టదు. కావుననే రెండుపత్రికలును నేటికిని నిరంతరాయముగా సాగుచున్నవి.

ఆయన దేశోద్ధరణాసక్తి పత్రికలను ప్రకటించుటతోమాత్ర మాగిపోయినదికాదు. నిరంతరము నితరములగు నుపాయములను కూడ వెదకుచుండును. తనహృదయమునకు గోచరించిన యుపాయములకు రూపము నొసగుటయే యాయన యాదర్శము. అందుకయి తన యైశ్వర్యము నంతయు వినియోగించుటయే యాయనసంకల్పము. దేశమువిషయముననే కాదు, వ్యక్తివిషయమునను ఆయన యౌదార్యము కుంటుపడనిది. ఆయనను

అడిగి లేదనిపించుకొనిన యదృష్టహీను డుండు నేని వా డజాగళ స్తనము.

ఆయనను ఐశ్వర్యమున వేయింతలు మిగుల గలవారు ఆంధ్ర దేశమున ననేకులుగలరు. కాని దేశసేవాపరాయణతయందు వేయవవంతేని సరిపో గలవారొక్కరేని గానరారు. నేడే యననేల. అట్టి వ్యక్తి 'నభూతో నభవిష్యతి?'

ఆయుదారచరితుని ప్రాపున నిరువది యైదేండ్ల నుండి నిర్విఘ్నముగా కొనసాగుచున్న ఆంధ్ర పత్రికప్రసాదించు విజ్ఞానసంపదను కొల్లగొనుచున్న ఆంధ్రులకు, తత్పత్రికకు రజతోత్సవమునుజరిపి, తదధిపతిని సముచిత రీతిని సన్మానించి తమ కృతజ్ఞతను తెలుపుచు నానందించుట ధర్మము.



శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారు,
ఆంధ్రపత్రికాధిపతి.

ఇది సన్మానమహోత్సవముల యుగము. ఎవరేనికాని, ఎప్పుడో, స్వార్థపరాయణులయి యొనరించుకార్య మేదో యొకవంక, నొక కొంతయే, యేకొంచరికో ఉపకరించినజాలును! తదభిమానులు ప్రయత్నపూర్వకముగా వేలకొలది ధనము నార్జించి వారికి సన్మానములను, మహోత్సవములను దేశముపేర జరుపుదురు. ఆంధ్రపత్రిక నిరంతరము కావించుచున్న సేవ పరార్థమయినది. ఎల్లవంకల నాంధ్రుల కెల్లరకు నపరిమితముగ నుపకరించునది. ఇట్టి పత్రిక నాంధ్రు లెల్లరు గాఢముగ నభిమానింతురనకతప్పదు. కావున వారెల్లరు పత్రికను, తదధిపతిని అధికోత్సాహముతో, అధికవైభవముతో సన్మానింపవలసిన వారు. కాని ఎవ్వరు నా విషయమున నించుకయైన ప్రయత్నించినట్లు, తుదకు మాటమైన తలపెట్టినట్లు కానరాదు. సన్మానములయు, ఉత్సవములయు మాటయటుండుగాక! రెండున్నరకోట్ల ఆంధ్రులకుప్రకృతమున్న దినపత్రిక ఆంధ్రపత్రిక యొక్కటియే. దేశకాలానుగుణమగు ప్రబోధము

కలుగుట కింకను ఎన్నియో పత్రిక లావశ్య కము లయి యుండ ఉన్న యీయొక్కపత్రిక కేని దేశీయులప్రోత్సాహము తగినంత కానరా కున్నది. అధిపతి శ్రీమంతుడు, దేశాభిమాని, వ్యయప్రయాసములను లెక్కింపని యుదార శీలుడు కాన పత్రిక తనజీవితము నెట్లో నిలువబెట్టుకొని యున్నది. కానిచో నాంధ్రు లకు పత్రికయే లేకపోవలసినది. పత్రికవలన ననేకవిధము లగు లాభముల బడయువారు దేశీయులు. తమ లాభమునకయి వా రెంత కాలమేని యిట్లు లొక్కవ్యక్తిని అధికనష్ట ములకు పాలుచేయుట న్యాయ్యముకాదు. ఉన్నదాని యునికినే స్థిరముచేసికొన బూనని వారు క్రొత్తపత్రికలను బయలుదేరదీయబోరు. ప్రత్యేకము వ్యక్తిత్వము, తాహతు లేని స్వాతం త్ర్యము ప్రకటించుకొన నుబలాటపడు నేటి యాంధ్రులు సంతతపరాశ్రయణము కళంక మని భావింపకపోవుట వింతకాదు.

ఆంధ్రులకు పత్రికలవిషయమున గల అనుభవ మత్యల్పము. నేటిపత్రికలే యిందుకు తార్కాణము. కాని, ఉన్న పత్రికలలో, తెలిసియు తెలియక, లేనిపోని దోషముల నెన్నుటయందు వారి యనుభవము మిక్కిలి పెద్ద. మరియు పత్రికల ప్రాముఖ్యము మిన్నుముట్టుచున్న యీ కాలమున వాని ప్రయోజనమును గుర్తింపగలవారు రెండు న్నరకోటి యాంధ్రులలో నెందరో లేరు. ఇక పత్రికానిర్వహణము లాభకర మగుట యెట్లు సాధ్యము కాగలదు?

వివిధదేశములను, వివిధవిషయములను గురించిన వివరములను, ప్రచారార్హము లగు వానిని సేకరించి ప్రజలకు పంచిపెట్టి వారిలోక జ్ఞతకును, విజ్ఞానసంపదకును పుష్టిని చేకూ ర్చుట పత్రికలకు ధర్మము. సుసమర్థము లగు సంపాదననిర్వహణములు తద్ధర్మనిర్వహణ మునకు ముఖ్యాంగములు. వీని పరోక్షమున పత్రిక నిస్సారముగను, నిష్ప్రయోజకముగను పరిణమింపగలదు. పత్రికలయందు లోపములు గలుగుట కింకను నెన్నియో కారణములు గలవు. ఆంధ్రపత్రికయందును గొన్నిలోప ములు గలవు; కాని, యందలి గుణబాహుళ్య మున నవి పరిగణనయోగ్యములు గావు. కార్యనిర్వాహకులు మునుముందా లోపముల కవకాశము లేకుండ జూచుకొనదగుదురు.

ఇరువదయిదేండ్లనుండి బహుముఖముల దేశాభ్యుదయమున కుపకరించుచున్న యీ పత్రికకు స్థిరజీవనము కల్పించుట దేశీయు లకు ముఖ్యకర్తవ్యము. పత్రికవలన తాము పొందిన మేలును స్మరించి, దానికి చిరస్థాయి త్వమును గుదిర్చి, భావికాలమునను దానివలన నితోధికలాభమునుబడయవలసినవారు వారు. వా రందుకు బూనుకొని ముందునకు రానిచో పత్రికాధిపతియేని దేశోపకారక మగు తన సంతానమునకు స్థిరజీవనమును కల్పించుట సమంజసము. సప్తసంతానములు పరిమితఫల దము లయ్యును చిరంజీవములుగను, చిరకీర్తి దములుగను పేర్కొనబడినవి. పత్రికా సంతాన మంతకంటె నుత్కృష్ట మయినది. అది అపరిమితఫలదము. దానివలన గలుగు కీర్తి శ్రేయము లనిర్వాచ్యములు. దానితో సంతానముల సంఖ్య ఎనిమిది యగుచున్నది.

ఇట్టి యుత్కృష్టసంతానము చిరంజీవముగా వెలయ జూచుట మిక్కిలి సముచితము.

ఇరువదియైదేండ్లనుండి స్వార్థరహితమగు నంతఃకరణముతో నీ పత్రికామతల్లిని నడుపుచు, దేశమునకు సమున్నతిని చేకూర్చుచున్న పత్రికాధిపతియు, పత్రికాధిపతియొక్కయు, దేశీయులయొక్కయు అభిరుచుల ననుసరించి పత్రికను నిర్వహించుచున్న సంపాదక బృందమును అత్యంతము నభినందార్హులు. నిరంతర దేశసేవాపరాయణమగు నాంధ్రపత్రికయు చిరంజీవియై ఇంకను బహుగుణముగా దేశసేవను చేయుచుండునుగాక.

---

ధన్యవాదము:

ధన్యమయినది. ఆంధ్రదేశము ధన్యమయినది. జీర్ణప్రాయముగ నుండిన యాంధ్ర కవితాసామ్రాజ్యము నుద్ధరించి దేశమునందు నలుకెలంకుల విజయపతాకలను ప్రతిష్ఠించి, యాంధ్రకవితకు శకపురుషు లనమించిన నిక్కంపు కవిసార్వభౌమునకు, సంకల్పించిన షష్టిపూర్తి మహోత్సవాభ్యర్హణను సర్వలక్షణసంపన్నముగ, మహావైభవముతో నిర్వహించి సకలాంధ్రప్రపంచము కృతకృత్యమైనది. శతావధానులొనరించిన మహోపకృతికిని, వారియందుగల అనూనగురుభక్తికిని ఆంధ్రుల ఈయర్హణ యర్హమై వెలసినది. ఆంధ్రప్రపంచ మీతెఱగున తన కర్తవ్యమును నిర్వహించి ధన్యత గన్నందుకు విశ్వభారతి సంతసించినది. కామితఫలప్రదాయిని, దేవి, కామేశ్వరి యీమహనీయునకు ఇతోధికాయురారోగ్యముల నొసంగి, తెలుగుకవితకు మఱింత సొంపుపెంపులను గూర్చునట్లు అనుగ్రహించుగాత మని యాశంసనము.

ఈ షష్టిపూర్తిమహోత్సవముతోపాటుగనే, శ్రీ వేంకటశాస్త్రిగారి- కాదుకాదు, తిరుపతివేంకటకవుల, మాయానేత్రములకు వీ రొక్కరే సాక్షాత్కరించు చున్నారు- శాశ్వతస్మృతిచిహ్నముగ వీరిరచనల నన్నింటిని సంపుటములుగ ప్రచురించుటకును, ఆంధ్రవిశ్వకళాపరిషత్తున బహుమతి పతకము నేర్పాటుచేయుటకును నిర్ణయింపబడినది. ఇవి రెండును అచిరకాలములోనే వారి శిష్యులు, ప్రశిష్యులు, తత్పరంపరలోనివారు, అభిమానులు-ఈనరుసకు రానివారు నున్న—అందరి యాదరమున రూపుగొని తిరుపతివేంకటకవుల శాశ్వతస్మృతిచిహ్నమయి వెలయగలదు. ఆంధ్రభారతికి ఈడురాని సేవ సల్పి శాస్త్రిగారు ధన్యులయినారు. అట్టి మహనీయునకు ఉమతభక్తిగ పూజగావించి తెలుగు మాగాణమును ధన్యమయినది.

---



# సాభిప్రాయ విశేషములు



ప్రపంచపరిణామ మనవరతమును ననంత రూపములను సంప్రాప్తమగుచున్నది. మమకారాహంకారాభిమానములు సంప్రాప్తమగుచున్న పరిణామపరంపరలను గ్రహించుటకు ప్రతిబంధకములుగ నున్నవి. సామ్రాజ్యాభిమానము, వర్ణాభిమానము, జాత్యభిమానము, ధనాభిమానము, విద్యాభిమానము సాహిత్యాభిమానము, కళాభిమానము, వ్యాపారాభిమానము మతాభిమానాద్యభిమాన పరిణామములు ధర్మవ్యాజముననుగలుగ జేయుచున్న మహాప్రళయము కాలాంతరముననుధర్మావతరణమునకు సాధనంబైనను వర్తమానసమయమునందు భయభ్రాంతులను గలుగజేయుచున్నది. వర్తమానసమయమునందభిమానపరిణామములు కామార్థారాధనములకును, పరపీడనమునకును వినియోగపడునటులాత్మోద్ధరణమునకును, ధర్మారాధనములకును, ఆత్మవికాసమునకును వినియోగపడజాలకున్నవి. ధర్మము కామార్థరూపముల, భక్తి అభిమానరూపముననునారాధింపబడుచు మహాప్రళయమునకు సాధనంబులుగ నున్నవి. అభిమానాంధకారబంధురమైన ప్రపంచమునందు జ్ఞానకాంతుల ప్రసారము దుర్లభముగనున్నది. అభిమానము సర్వత్ర ధర్మస్థానమునాక్రమించి బీభత్సరాజ్యము చేయుచున్నది. ధర్మాత్ముల ధర్మోపదేశము లరణ్యరోదనములుగ నున్నవి. అసిధారావ్రతమైన ధర్మానుష్ఠాన మసాధ్యమైనను ధర్మబోధయును బధిర శంఖారావమై నిర్బంధములకు పాలగుచున్నది. విశ్వవ్యాప్తమైన నిర్బంధావరణములందాత్మవిశ్వాసమును, ఆత్మధర్మానుష్ఠానమును దురారాధ్యములుగ నున్నవి. ప్రపంచమునందంతటను జరుగుచున్న యాగములు ధర్మారాధనకై యేర్పడుచున్నను అర్థకామారాధనములకై వినియోగపడుచున్నవి. నానా దేశముల యుదంతమును, నానాసంస్థల యుదంతమును, సమావేశముల ప్రయోజనమును నీలకృష్ణము నే సువ్యక్తము చేయుచున్నవి. వర్తమానకాలమునందు రాజ్యాంగములును, మతములును, ధనాగారములును, సంఘవ్యవస్థలును నీలకృష్ణమునకే వినియోగపడుచున్నవి.

* * *

రాజ్యాంగములు

ప్రపంచవ్యవహారములందు సకల రాజ్యాంగములందును ఆత్మ విశ్వాసము బాహ్యసాధనములందు ప్రబలుచున్నది.

గ్రేటు బ్రిటనునందు సామ్రాజ్యాభిమానభరితమైన జాతీయ ప్రభుత్వము ప్రబలి స్వాతంత్ర్యసంహారమున కుపక్రమించినది. స్వదేశ విదేశములందు పరాక్రమణమునకై చేయుచున్న ప్రయత్నములన్నియును విఫలములగుచున్నవి. ఒటావాబడంబడిక స్వదేశ ప్రయోజనములకు నిరర్థకమైనది. సామ్రాజ్య వాణిజ్యాభ్యుదయసంఘ మంతరించినది. ఆర్థిక మహాసభ, ఆయుధ విసర్జనసభ, నానాజాతి సమితి ధర్మప్రయోజనములకు నిరర్థకములైనవి. ఇంటను గెలువజాలని సామ్రాజ్యాభిమానులు వారి యభిమానమునంతయును నిస్సహాయులపట్లను చూపుటకు యత్నించుచున్నారు. ఇది ప్రపంచమునకు పరిపాటియైన యుపాయము. డైహార్డులు శ్వేతపత్రముపట్లను, భారతరాజ్యాంగములపట్లను చూపుచున్న నిరసనభావ మధికార సామ్రాజ్యాభిమానమునకు నిదర్శనముగ నున్నది. జాయింటుకమిటీసమక్షముునను సామ్రాజ్యాభిమానులు చేసెడి ప్రశ్నలును, హోరుగారి ప్రత్యుత్తరములును బ్రిటీషు రాజ్యాధికారుల సామ్రాజ్యాభిమానమును విశదము చేయుచున్నవి. సామ్రాజ్యాభిమానులకు స్వప్రయోజనములు గోచరించునటులు ధర్మప్రయోజనములు గోచరముగావు. సామ్రాజ్యాశయము లధోగతి పాలగుచున్నను స్వప్రయోజనమునకు గల ప్రతిష్ఠ ధర్మప్రయోజనములకు గలుగకున్నది. పరపీడన మాత్రోద్ధరణమునకు గాక నాత్మనాశనమునకు వినియోగపడుచున్నది.

జర్మనియందు నాజిపక్షము యూధుల నిర్బంధమునకు బూనుటయును విచిత్రముగ నున్నది. ఇరువదవ శతాబ్దియందు జర్మను ప్రజను పరిశుద్ధార్యజాతీయులను జేయబూనుట పరిహాసాస్పదముగ నున్నది. కోప మితరులమీదను జూపుట సులభము; ఆత్మనిగ్రహము దుర్లభము. నిస్సహాయస్థితియందున్న స్వదేశీయ యూధులమీదను నాజీపక్షము దండయాత్రకు బూనుట జర్మనుల కోపావేశమునకు నిదర్శనమైనను నిగ్రహానుగ్రహ సామర్థ్యమునకు నిదర్శనము గాదు. నాజీపక్ష మవలంబించుచున్న దురాగ్రహము దుర్బలమునకువలెను బలమునకు నిదర్శనము గాదు. నాజీపక్ష మవలంబించుచున్న దండనీతి సంగ్రామవ్యాపనమునకు వినియోగపడి మహాప్రళయమునకు సాధనం బగుచున్నది.

అమెరికా యవలంబించుచున్న జాతీయార్థికోద్ధరణవిధానమును స్వప్రయోజనములకు వినియోగపడినటులు ధర్మప్రయోజనములకు వినియోగపడుట లేదు. రూజువెల్టుగారి నిర్ణయములు, శాసనములు బాహ్యప్రయోజనములకు వినియోగపడినటు లాత్మవిశ్వాసమునకు వినియోగపడుట లేదు. ధర్మార్థముల సంరంభమునందు సర్వత్ర అర్థమునకుగల ప్రతిష్ఠ ధర్మమునకుగలుగ కున్నది. రుష్యాయందు ప్రవర్ధమానమగుచున్న యర్థకామారాధనమును ధర్మప్రతిపత్తికి సాధనముగాకున్నది. ప్రపంచావృతమైన వర్తమానవిషాదావస్థయందు జాతులకును, వ్యక్తులకును కర్తవ్యముగ్రాహ్య

ముగాకున్నది. సందిగ్ధస్థితియందు ప్రపంచ గౌరవమునకు పాత్రుడైన గాంధిమహాత్ముని సత్యాగ్రహధర్మసందేశము జిజ్ఞాసువులకు విమర్శనాచరణార్హముగ నున్నది. గాంధి మహాత్ముని ౭౬-వ వర్ధంతి సత్యాగ్రహ పర మార్థమును లోకమునకు బోధకము చేయు చున్నది

* * *

గాంధిమహాత్ముడు

గతించిన సోమవాసరముననుదేశము నందంతటను జాతి మత కుల దశాభేదములు లేకను మహాత్ముని ౭౬-వ వర్ధంత్యుత్సవ ములు మహావైభవముతో జరుపబడినవి. ఆటలు, పాటలు, సభలు, సంకీర్తనములు, సంభాషణములు, వినోదములు, వ్యాఖ్యాన ములు, విమానములు మొదలగునవి గాంధి మహాత్ముని మహత్త్వమును విశదము చేసి నవి. మహాత్ముని జీవితమునం దెవరు సంభావించినటులు వారికి ఆత్మస్వరూపవిశ్వా సములు గోచరించినవి. స్త్రీలు, బాల బాలి కలు వారి గాఢభక్తిని వ్యక్తముచేసిరి. పండితులు ధర్మోపదేశములను చేసిరి. పామ రులు మంగళహారతులను సమర్పించిరి. ధని కులు ద్రవ్యమును సమర్పించిరి. జను లందరును జాతి మత కుల భేదములను విడిచి ధర్మమూర్తికి మంగళగీతములను పాడిరి. ఈ మహోత్సవములు మహోదయసాధనములను ప్రపంచమునకు కరతలామలకము చేయు చున్నవి. గాంధిమహాత్ముని జీవయాత్రయందు కర్మజిజ్ఞాస, ధర్మజిజ్ఞాస, బ్రహ్మజిజ్ఞాస ఆత్మా ర్థమైన స్థాయిభావమునందు లగ్నములై పూర్ణయోగప్రభావమును లోకమునకు సువ్య క్తము చేసినవి. మహాత్ముని కర్మధర్మయాత్రలు ప్రజాలక్ష్యమును అర్థకామారాధనములందు లగ్నము చేసినటులు ధర్మానుష్ఠానమునందు లగ్నము చేయకున్నవి. గాంధిమహాత్ముడు స్వరాజ్యకాములకు రాజ్యాంగనాయకుడు; సంఘసంస్కర్తలకు సంస్కరణపరాయణుడు; మతప్రవర్తలకు బ్రహ్మజ్ఞుడు; కర్మయోగులకు కర్మప్రియుడు; ధర్మజ్ఞులకు ధర్మాత్ముడు; శాంతి కాములకు అహింసాదీక్షాపరాయణుడు; సత్య కాములకు సత్యాత్ముడు. గాంధిమహాత్మునిపట్ల ప్రజలకు బాహ్యలక్ష్యము గలిగినటు లాత్మ లక్ష్యము గలుగకున్నది. ఆత్మసాధనరహిత ములైన బాహ్యసాధనములు పురుషార్థసిద్ధికి నిరర్థకములని మహాత్ముని ధర్మోపదేశము లన వరతము వ్యక్తముచేయుచున్నవి. ఆపరమార్థ మును లోకమునకు వ్యక్తము చేయుటకై గాంధిమహాత్ముడు పూనిన కర్మానుష్ఠానము లోకమునకు కర్మానుష్ఠానమునకును, ధర్మా నుష్ఠానమునకును పరమలక్ష్యముగ నున్నది.

గాంధిమహాత్ము డొక సంవత్సరము సత్యాగ్రహప్రస్థానమును విరమించిరి; సబ ర్మతి సత్యాగ్రహాశ్రమమును హరిజనాశ్ర మమును జేసిరి; నవజీవనముద్రణాలయమును నిర్మూలము చేసిరి. అర్థకామారాధనమునకై

ప్రపంచ మవలంబించిన మార్గమును ధర్మారాధనమునకై మహాత్ముడవలంబించు చున్న విధము వర్తమాన విషాద పరిస్థితులందు ప్రపంచమునకు ధర్మోపదేశమును జేయుటకు దగియున్నది. ధర్మమునకు ఆత్మగతమైన త్యాగము సాధనమైనట్లు బాహ్యాము లైన అర్థకామములు సాధనములు గావు. బాహ్యాసాధనములందైనను నిష్కామకర్మ యోగమువలెను కామకర్మయోగము సాధనము గాదు. గాంధిమహాత్ముడు పూనిన కర్మయోగానుష్ఠానము సామాన్యులకు సాధ్యము గాకపోయినను బాహ్యాకర్మానుష్ఠానమునందైనను వ్యవసాయపరాయణత్వము దుర్లభమైనది. గాంధిమహాత్ముని మహా త్యాగప్రస్థానము భారతీయులకువలెను సకల ప్రపంచమునకు కర్మయోగపరాయణమైన ధర్మయోగాభ్యాసమునకు మార్గదర్శకము గావలయును. ప్రపంచపరిణామమునకు గాంధి మహాత్ముని ధర్మయోగానుష్ఠానము వినియోగపడగల విధమును ప్రజానాయకులు గ్రహించుటకు మహాత్ముని ౭౯-వ వర్ధంత్యుత్సవములు సకలవిధములను వినియోగపడుచున్నవి. కీర్తిశేషులైన శ్రీమతి వసంతమ్మగారి జీవితము నీపరమార్థమునే భిన్నమార్గమునను సువ్యక్తముచేయుచున్నది.

*         *         *

### వసంతమ్మగారు

గాంధిమహాత్ముడు ప్రాచ్యాత్మను పాశ్చాత్యసంస్కారాధారమునను వ్యక్తముచేసిన కర్మయోగమును వసంతమ్మగారు పాశ్చాత్యాత్మను ప్రాచ్యసంస్కారాధారమునను వ్యక్తము చేసి భారతీయుల కాత్మసంస్కరణమును గలుగ జేసినది. సంశయాత్ములైన భారతీయుల కాత్మవిశ్వాసమును గలుగజేయుటకు సకల రంగములందును వసంతమ్మగారి ప్రయత్నములు వినియోగపడినవి. ఆచారకర్మపాశబద్ధమైన భారతహృదయమునం దాత్మవిశ్వాసమును, ప్రత్యభిజ్ఞానమును నుదయించినవి. మానవస్వాతంత్ర్యధ్వజారోహణమును చేయుటకు వసంతమ్మగారు చేసిన సేవ యపారము. ఆసేవ మతావరణబద్ధమై వాదప్రతివాదములకు మూలమైనను పాశ్చాత్యసంస్కారప్రతిహతమైన హృదయమునందు ప్రాచ్య సంస్కార సంస్మరణమును గలుగజేసినది. తరణోపాయమును, గమ్యస్థానమును తెలియకను సంశయములపాలైన ప్రజలకు ధర్మసంస్కారాంకురములను ప్రత్యక్షము చేసినను ధర్మస్వరూపము ప్రత్యక్షముగాకున్నది. నిత్యమైన ధర్మస్వరూపమును గాంధిమహాత్ము డఖండమైన ఆత్మశక్తి సాధనమునను లోకకల్యాణమునకై వినియోగింపగల విధమును వారి ఆత్మచరిత్రము విశదముచేయుచున్నది. ఆత్మవిశ్వాసమె ఆంధ్రుల ప్రత్యభిజ్ఞానమునకును సాధనముగ నున్నది.

*         *         *

### ఆంధ్రాభ్యుదయము

ఆంధ్రహృదయమునందును దేశావృతమైన ప్రత్యభిజ్ఞాన ముదయించినది. దేశము

నందంతటను దివ్యజ్ఞానము లుత్పన్నములై ఆత్మసంస్మరణము గలిగినది. జిడ్డు కృష్ణమూర్తి గారి యవతార మాంధ్రుల ప్రత్యభిజ్ఞానము నకు నిదర్శనము. ఆచారావరణపాశబద్ధమైన హృదయమునందు జ్ఞానకాంతులు ప్రసరించి నవి. వసంతమ్మగారి గురుత్వ ... వస:తోద మును గలుగజేసినవి. దేశమునందు సాహి త్యోపాసకులు, కళోపాసకులు, కర్మోపాస కులు, ధర్మోపాసకులు, సంస్కర్తలు, సత్యా గ్రహులు బయలుదేరి ఆంధ్రహృదయావరణ మును వికాసవంతము చేసిరి. ఆంధ్రహృద యాంతరాళములందు స్తంభితమైన సంభావనా శక్తి, రసగ్రహణశక్తి, ఉత్సాహశీలము బహి ర్గతమగుట కుపక్రమించినది. గతకాలోదంత మీపరిణామమును విశదముచేయుచున్నది. సాహిత్యవికాసమునకు శ్రీతిరుపతివేంకటేశ్వర కవులు చేసిన మహోపకారము దేశావృతమైన కావ్యనిర్మాణములు విశదముచేయుచున్నవి. గతవారమునందు బందరునందు శ్రీ వేంకట శాస్త్రిగారి షష్టిపూర్తి ఉత్సవసందర్భము నం దాంధ్రలోకము చూపిన యుత్సాహానంద ములు వారి యాత్మసంస్మరణమునకు నిదర్శ నములు. దేశమునం దుత్పన్నములైన కావ్య ములు, కళలు, సంస్కరణమార్గములు, జాతీయసంస్థాపనలు ప్రజాహృదయమునం దుదయించిన ప్రత్యభిజ్ఞానమును వెల్లడి చేయుచున్నవి. ఆత్మవిశ్వాసమునకు సాధన మైన నిర్మాణకార్యవిధానమునం దాంధ్రులు చూపిన శక్త్యుత్సాహములు నిందాస్తోత్ర ములకు పాలైనను ప్రజాసంకల్పమునకు నిద ర్శనములు. వేంకటశాస్త్రిగా రుపక్రమించిన భావకావ్యములు పల్లవించి ఫలించి ఆంధ్ర స్వాతంత్ర్యహృదయమునందు ప్రతిబింబించు చున్నవి. సత్యాగ్రహోద్యమ మాంధ్ర హృదయమునకు సహజమైన ఆత్మవిశ్వాస మును వికసింపజేసినది. ప్రపంచపరిణామము నందు ధర్మప్రతిష్ఠ అదృష్టరూపమునను సక లార్థములను నిర్ణయించి నిరూపించుచున్నది. వర్తమానసందిగ్ధసమయమునందు ధర్మప్రతిష్ఠ ధర్మరాజ మైన అహింసాధారమునను ప్రతిష్ఠితము గావలసియున్నది. శ్రీమతి వసం తమ్మ సంస్మరణము, గాంధిమహాత్ముని వర్ధం త్యుత్సవము, వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి ఉత్సవము, దేశావృతమైన ప్రబోధము, ప్రజల యాత్మవిశ్వాసమును సువ్యక్తము చేయుచున్నవి. గాంధిమహాత్ము డుపక్రమిం చిన త్యాగప్రస్థానము ప్రపంచమునం దపూ ర్వమైన ధర్మసంచలనమునకు వినియోగపడు చున్నది. ఆంధ్రులును నీధర్మమహోదయ సమయమునం దాత్మవిశ్వాసమును గలిగి, ఆత్మశక్తి నారాధించి ధర్మనిర్వహణమును జేయుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

---

Printed and Published by C.Seshagiri Rao, B. A., at the Andhra PatrikaPress, No.7, ThambuChettySt., Madras
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౧౧.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯33





పద్మావతీచరణచారణ చక్రవర్తి—శ్రీ శివశంకరశాస్త్రిగారు ... ౧౬౭—౧౭౪

పిరదౌసి—చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు ... ... ౧౭౫—౧౮౩

శ్రీ రాజా రామమోహనస్మృతి—వోలేటి పార్వతీశముగారు ... ౧౮౪

వేణీసంహారము-ద్రౌపది—కపిస్థలం కృష్ణమాచార్యులుగారు ... ౧౮౫—౧౮౯

మద్దుకల-ప్రశంసాలేశము—బులుసు వేంకటరమణయ్యగారు ... ౧౯౦

ప్రేమపాశము—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... ... ౨౧౦

దేవుడితో ముగ్గురం, ఇకేమి?—అక్కరాజు ఆంజనేయులుగారు ... ౨౧౧—౨౨౩

అణ్ణామలై విశ్వవిద్యాలయము—ఒంగోలు పద్మరాజుగారు ... ౨౨౪—౨౩౦

వినోదశిల్పము: కాగితముల తోరణములు—కొ. నరసింహాచారిగారు ౨౩౧—౨౩౨

"దేవునిపై విశ్వాసరాహిత్యతీర్మానము"—నందివాడ చిదంబరంగారు ౨౩౩—౨౪౩

ప్రస్థానభేరి—శి. రాజశేఖర శతావధానిగారు ... ... ... ౨౪౪—౨౪౫

ప్రభుత్వ వ్యాపారపరిమితి—శ్రీపాద గణపతిరావుగారు ... ... ౨౪౬—౨౪౮

వీరభద్రవిజయము—కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు ... ... ౨౪౯—౨౫౭

హిట్లరు—జరుగుమిల్లి సాంబశివరావుగారు ... ... ... ౨౫౯—౨౬౪

భారతి—తలిశెట్టి రామారావుగారు ... ... ... ౨౬౫—౨౭౧

శిఖండి—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ... ... ౨౭౩—౨౭౬

ఆంధ్రగ్రంథములపట్టిక— ... ... ... ౨౭౭—౨౮౧

వ్యవసాయపరిశోధనాలయముల ఆవశ్యకత—దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు ౨౮౧—౨౮౭

భారతీయవిద్యాచరిత్రము—మారేమండ రామారావుగారు ... ౨౮౯—౨౯౪

విద్యయొక్క పరమార్థము—ఆర్. యస్. పట్నాయక్ గారు ... ౨౯౫—౨౯౬

భారతము: పరమార్థప్రదర్శనము—నందూరి బంగారయ్యగారు ... ౨౯౭—౩౦౦

బాలక్రీడలు—మంగిపూడి వేంకటశర్మగారు ... ... ... ౩౦౧—౩౦౪

రోగవారసత్వము—వడ్డాది సీతారామారావుగారు ... ... ౩౦౫—౩౦౬

ఉపేక్షితము—కొంపెల్ల జనార్దనరావుగారు ... ... ... ౩౦౬

యశోమూర్తి ఆనీబెసెంటు—సి. అశ్వత్థనారాయణరావుగారు ... ౮౦౭–౮౦౮
నక్షత్రమండలము: (కార్తిక, మార్గశిరమాసములు)—గొబ్బూరు ...
వేంకటానంద రాఘవరావుగారు ... ... ... ౮౦౯–౮౧౧
మిాగడతఱకలు: షష్టిపూర్తి—శాస్త్రి ... ... ... ౮౧౩–౮౧౪
ఆంధ్ర విశ్వకలాపరిషత్తువారి దేశభాషాపరీక్షలు— తు. వెంకట
రామయ్యగారు ... ... ... ... ౮౧౫–౮౧౬
నాగార్జునకొండ-బౌద్ధస్తూపము—కపిల కాశీపతిరావుగారు ... ౮౧౭–౮౨౩
ఆంధ్రాభ్యుదయము: చంద్రుపట్ల రామారావుగారు; బుంగా అప్పా
రావు దేవుగారు; మోచర్ల శ్రీహరి రావుగారు; ప్రొఫెసరు
అల్లూరి నరసింహరాజుగారు; యం. రామచంద్రరావుగారు;
నీలంరాజు వెంకటశేషయ్యగారు ... ... ... ౮౨౫–౮౨౭
గ్రంథస్వీకారము ... ... ... ... ... ౮౨౯
మనవిమాటలు: ఆంధ్రకవుల ఛాయాచిత్రప్రదర్శనము; విఠలభాయి
పటేలు నిర్యాణము ... ... ... ... ౮౩౦–౮౩౧
సాభిప్రాయ విశేషములు ... ... ... ... ౮౩౨–౮౩౬

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు: పకీరు; తీయనితలపులు

సాధారణ చిత్రములు: చంపకదేవి జలపాతము, కుత్తాలము; విశ్రాంతి; పాండామర కొలను; వేకువ; క్రొత్తబౌద్ధాలయము - మూలగాంధారకుటీవిహారము, సారనాథము; గంగాఘట్టములు, కాశీ; కేదారగౌరీవ్రతము; నాగార్జునకొండ బౌద్ధస్తూపచిత్రములు; ఆనీబిసెంటు చిత్రములు; వ్యంగ్యచిత్రములు; ఇతరచిత్రములును.

---



సంపు. ౧౦ శ్రీముఖ సంవత్సరము, కార్తికమాసము (నవంబరు ౧౯౩౩) సంఖ్య ౧౧

# పద్మావతీ చరణచారణ చక్రవర్తి

శ్రీ శివశంకరశాస్త్రి
[మాహేశ్వరాశ్రమము]

తృతీయరంగము

జయదేవుని భవనమున మేడపైభాగము

[రాజమార్గమునుండి కోలాహలము]

జయము జయమ్ము శ్రీ జయదేవకవికి!
విజయమ్ము గీతగోవిందకారునకు!
జయము పద్మావతీచరణ సీరేజ
చారణమృదుకలాసార్వభౌమునకు!
జయ గౌడనృపసభాజలజాతహేళి!
జయ గాయకోత్తంస జయము జయమ్ము!
జయము భక్తాగ్రణి జయము జయమ్ము!
జయము పరాశరసఖ విజయమ్ము!
విజయమ్ము రాధికావిభునకు జయము!
విజయమ్ము విజయమ్ము విష్ణుభక్తులకు!
సత్కవిత్వమునకు జయము జయమ్ము!
జయము జయమ్ము శ్రీజయదేవకవికి!

పరాశరుడు

[పేటికతో పద్మావతిని సమీపించి]

మన కిది చెల్లెలా, మహితవాసరము.
జయదేవు డీనాడు చంద్రుడువోలె
షోడశకళలతో శోభిల్లినాడు
గౌడాధిపతిసభాగగనాంగణమున.

10. 11 1 ౬౬౭

పద్మావతి
బావగారును నీవు నిచ్చట
బయలుదేరినదాది నడచిన
ఘటన లన్నియు దెలుపు మన్నా,
కర్ణపేయముగన్ !

పరాశరుడు
[పేటికను జాలమార్గమున నుంచి]
ప్రజలు బారులు దీర్చి పార్శ్వంబులందు
జయ జయ ధ్వానముల్ నల్పుచుండంగ
భక్తి నంజలి ఘటింపగ రాజపురుషు
డెక్కినా మిర్వుర మిభరాజుమీాద.
మాటి మాటికి రాజమార్గమ్మునందు
కల్యాణశకునముల్ కాన్పించుచుండ
గజరాజు సత్వరగమనమ్ముతోడ
కొల్వుకూటమునకు గొంపోయె మమ్ము.
కవివరుల్ పండితుల్ గాయకోత్తములు
ఉన్నతరాజకీయోద్యోగిజనులు
పౌరాగ్రణుల్ రెండు పార్శ్వంబులందు
కూర్చుండి యుండిరి కొల్వుకూటమున.
ఇంతలోన నృపాలు డెదురుగా వచ్చి
జయదేవు మృదుపరిష్వంగంబు చేసి
కనుగొని నను శిరఃకంపంబుతోడ
వెడలె లోనికి మేము వెనువెంట జనగ.
జయ మహాగౌడ లక్ష్మణసేన భూప
యనుచు సభాసదు లైకకంఠ్యముగ
బల్కుచు లేచిరి. ప్రభుసమీాపమున
గూర్చుంటి మాయనకోరికమీాద.
ఆచార్యగోవర్ధనార్యుండు పిదప
తనకు నాగంతుకదాక్షిణాత్యులకు
పరిచితి చేయ సంభావించినాడు
కోవిదులను బావ కుశలమ్ము లడిగి.
అవల లక్ష్మణసేను డానతి యిచ్చె:
"ఆర్యులారా, యింక నాలకింపుండు
జయదేవకవిరాజు స్వప్రబంధంబు
కర్ణపేయమ్ముగా గానంబు చేయు."
ఉద్యానవనసీమనుండి యవ్వేళ
పరిమళ శీతల పవమాన వీచి
కావలి మృదువుగా నలముచు నుండ
సభ్యుల వదనముల్ సంఫుల్ల మయ్యె.
అవల గ్రంథము దీసి యధిపతి గాంచి
జయదేవకవి సభాస్తారుల జూచి
అంజలి ఘటియించి యల్లన ననియె :
"వినిపింతు గీతగోవిందకావ్యంబు."
అని మనోహరముగా నాదిపద్యంబు
పాడినయంతనే పరమహర్షమున
శ్రోతల నయనముల్ సుస్మేర మగుట
జలజాకరమువోలె సభ విరాజిల్లె.
అంతట వాగ్దేవతాదికం బగుచు*
పద్మావతీత్యాదిపంక్తి గలట్టి
పద్య మ్మలౌకికభావపూర్ణముగ
పాడినా డమ్మ నీప్రాణవల్లభుడు

పద్మావతి
అయ్యొ సిగ్గగుచున్న దయ్యెడ
ఆమహావిబుధాగ్రగణ్యులు

* వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ.

గాని లక్ష్మణసేన నరపతి
గాని యే మనిరో !

ప రా శ రు డు

నరసుండు లక్ష్మణసార్వభౌముండు
ప్రార్థించె తత్పునఃపఠనమ్ముకొరకు.
దిశ లెల్ల నిజనేత్ర దీధితుల్ పర్వ
పాడెను కవి లతల్ పల్లవింపంగ.

అంతలోపల ప్రతీహారిణి వచ్చి
జయము మహాప్రభూ జయ మని పల్కి
శిల్పశోభిత మైన చిరుత పేటికను
ధరణినాథుని సన్నిధానమం దుంచి—

"పద్య మాకర్ణించి పట్టపుదేవి
పారితోషికముగా పంపి యున్నారు"
అని నిష్క్రమింపగా, నవనీశ్వరుండు
తత్పేటికాంతర్గతం బై వెలుంగు
నూతనమణిమయనూపురద్వయము
దీసి కవీంద్రునిదెస విలోకించి
మందహాసమ్ముతో మరల నం దుంచ
మేలు మేలని బుధుల్ మెచ్చుకొన్నారు.

ప ద్మా వ తి

రసనిధానం బైన కావ్యము
రచనచేసిన కవికి గాని
భార్య కేటి కొసంగవలయును
పారితోషికమున్ ?

పరాశరుడు

భార్య కొసంగుచో పారితోషికము
భర్తనుగూడ సంభావించినట్లె.
బహుమానములనెల్ల పరికించునెడల
నిజముగా నీనాడు నీకె జయమ్ము !

[పేటికనుండి పత్రము దీసి]

"గానము సేయుచో కవివల్లభుండు
పద్మావతీదేవి పాదయుగ్మమున
అలరుగావుత నాట్య మాడెడువేళ
మధురశింజితముతో మణినూపురములు."

ప్రభువరేణ్యుని పార్శ్వభాగమం దున్న
కక్ష్యలో గూర్చుండి కావ్యంబు వినుచు
రసపిపాసాయత్త రాజ్ఞి యుద్రిక్త
హృదయమ్ముతో వ్రాసె నీ చతుష్పాది.

ప ద్మా వ తి

తెలియు దేవి రసజ్ఞురా లని
దేవభాషాభిజ్ఞురా లని
నేడు విశదం బయ్యె కవితా
నిపుణురా లనియున్.

పరాశరుడు

వీక్షించినా వమ్మ, వెలలేని రత్న
తాటంకయుగళి పద్మావతీరమణ *
జయదేవకవి యను సందర్భమందు
పంపె రాజకుమారి పారితోషికము.

ఈ కంకణమ్ములు నీ కాంచిదామ
మీ మణిహారమ్ము నీ బాహుపురులు

* జయతి పద్మావతీరమణ జయదేవకవి,భారతీ భణిత మతిశాతమ్.

విభు డొసంగెను నీకు విహితపద్మావ
తీసుఖేత్యాది* ప్రదేశగానమున.

ప ద్మా వ తి

ఏటి కన్యా బ్రాహ్మణాంగన
కీ యమూల్యానేకభూషలు!
అర్హమా జగదంబ పద్మకు
నర్పణము సేయన్.

పరాశరుడు

కవిభార్య వని నీకు గౌరవంబునను
బహుమాన మొసగిన ప్రభుకుటుంబంబు
నిల్పుకొన్నది గాని నిజగౌరవంబు
ఆభరణంబు లీ వర్థించినావె!

*    *    *    *

ఆపగాతీరాన ననతిదూరమున
రమణీయ మైన యారామమ్ము కలదు
అందలి కాసార మలరారుచుండు
నబ్జాతములతోడ నంచలతోడ.
మాధవీమంటపమధ్యభాగముల
లాస్యముల్ సేయు కలాపముల్ విప్పి
క్రేంకారములతోడ కేకిసంఘంబు.
సహకార భూమిజ శాఖలలోన
పాడును కోకిలల్ పంచమశ్రుతిని.
శుకగణ తీక్ష్ణచంచూవినిర్దళిత
ఫలరసంబులు నేల బ్రవహించుచుండు.
మకరందరసపానమత్తద్విరేఫ
ఝుంకారముఖరితశాద్వలస్థలుల
హరిణముల్ లీలావిహారముల్ సేయు.

వీనుల విందుగా వేణుకుంజముల
మురళీరవము ముహుర్ముహు రుల్లసిల్లు.
కనులపండువు సేయు క్రముకమార్గములు
వకుళావనీజముల్ వాసించుచుండు
తాపమ్ము పున్నాగతరువులు పాపు.

ప్రభువతంసుడు కావ్యపఠనాంతమందు
కానుకగా నొసగెను కవిచంద్రమునకు
అతిమనోహర మైన యారామవాటి
"బిందుబిల్వం" బను ప్రియనామ ముంచి.

కావ్యప్రతిని నమస్కారపూర్వకము
గా స్వీకరించుచు కనుల కద్దుకొని
ఉత్తమాంగమ్ముపై నొక్కింత నిలిపి
ఆనతి యిచ్చె ముఖ్యామాత్యు జూచి:
"మణిహారమును పుష్పమాలిక జుట్టి
గ్రంథరాజము భద్రగజము పై నుంచి
వివిధవాద్యములతో వీథులవెంట
వైభవమ్మున నుత్సవము సేయవలయు.
"శిల్పిచే జెక్కించి శ్రీ జయదేవ
కవిరాజనామమ్ము గారుత్మతాశ్మ
ఫలకభాగమ్మున భర్మాంకురముల
జాలమార్గముమీద సంధింపవలయు."

కవితాప్రియుండును కవివిధేయుండు
కవివత్సలుండు లక్ష్మణసేననృపతి
నామమ్ము జయదేవనామమ్ముతోడ
నాచంద్రతారార్క మలరునుగాక!

* విహిత పద్మావతీ సుఖసమాజే, భణతి జయదేవకవిరాజరాజే.

అన్నివిశేషమ్ము లవల దెల్పెదను,
ప్రొద్దు పోయిన దింక బోమెద నమ్మ.
ద్వారదేశమున పెద్దల వీడుకొల్పి
చనుదెంచు లోనికి జయదేవు డదిగొ.

[ నిష్క్రమించును ]

జయదేవుడు [ ప్రవేశించి ]

కలుగలేదామె నా కవకాశ మింత
దనుక ప్రియతమ, నీ సన్నిధానమునకు
మరలి వచ్చుటకై క్షమామండలేంద్రు
నతిథినై యుండుకతన బ్రాహ్మణులతోడ.

అందియుండును నీకు నే నంపినట్టి
వా_ర్త; లవకాశమున నిటు వత్తు నన్న
కూర్మిమీద సారస్వతగోష్ఠిలోన
నేడు నన్ను విద్వత్కవుల్ వీడరైరి.

భోజనానంతరమ్ము సంపూర్ణ చంద్రి
కామనోహరకాంతిలో గజముమీద
గ్రంథమును నిల్పి నగరమార్గముల వెంట
నుత్సవము చేయ బంచె నృపోత్తముండు.

నను గజారోహణము ధరానాయకుండు
చేయు మని కోర, పండితశ్రేణితోడ
నగరమున పాదచారినై నడతునంటి...—
ఎట్టకేలకు గాడేను డియ్యకొనిమె.

ద్వారదేశమువరకు నుత్సవము లోన
వెంట నరుదెంచు పెద్దల వీడుకొలిపి
ఏగుదెంచితి లోనికి నెపుడు నిన్ను
చూడగల్గుదు నను మహోత్సుకతతోడ!

పద్మావతి

వత్తురని నే వేచియుండగ
వార్త లంచెను సక్రమమ్ముగ.
ఉత్సవమ్మును జాలమార్గము
నుండి కన్గొంటిన్.

లేదు చందనపేటియందును
లేదు మీహస్తమ్మునందును
ఉత్సవమ్మున విస్మరించితి
రొక్కొ కావ్యంబున్ ?

జయదేవుడు

అధిపున కొసంగితిని.పఠనాంతమందు ;
కంఠగత మైనపిదప నాగ్రంథ ముంచు
ధరణిపతి హేమపేటికాభ్యంతరమున
సుందరాత్మీయ దేవతామందిరాన.

పద్మావతి

నేడు గానం బవిరతంబుగ
నిండుసభలో జేయుచుండగ
కంఠమున స్వరభంగ మేమియు
కలుగలేదుగదా ?

జయదేవుడు

కంఠమున క్లాంతి యేమియు కలుగలేదు:
ఒక్కయామముమాత్రమే యుదయవేళ
సార్ధయామముపైన సాయాహ్నమందు
పాడితిని, పొందె కావ్యము పరిసమాప్తి.

పగలు సౌమ్యము మందాతపమ్ము వలన
చలువరాకట్టడము సభాసౌధరాజ
ముపవనము పుష్పగుచ్ఛ నేత్రోత్సవంబు
ప్రసవసారవాసితము తద్భవనసీమ.

శ్రద్ధధానులు కూడినసభ్యు లెల్ల
గానవిద్యావిశారదుల్ కలరు మెండు
సంస్కృతాభిజ్ఞు లున్నారు చాలమంది
కలరు కవిపుంగవులు నలంకారవిదులు.

రాగములకు విపంచి పరాశరుండు
మేళవింప, ఉమాపతిమిశ్రసుకవి
తాళములు వేయగా, ప్రమోదమ్ముతోడ
పండితోత్తము లాలింప పాడినాను.

దాక్షిణాత్యులు సకలవిద్యాప్రవీణు
లధికమేధానిధులు పద్మ! అవల వారి
కావ్యమీమాంస వివరింతు. గానమునకు
పరవశత జెంది మెచ్చిరి బహువిధాల.

అచ్చెరువు గొల్పె నాకు: సేనాధిపతియె
వినుట సంగీతమును రెండువేళలందు ;
చామరగ్రాహి వివశహస్తములనుండి
సారెకును తాళవృంతముల్ జారుచుంట.

స్త్రీజనోచిత మగులజ్జ చెందినావు
కాని, నీమంజులాభిధ కావ్యమందు
కర్ణగోచర మైన యాఘట్టములనె
సరసరాజకుటుంబమ్ము సత్కరించె.

రాజ్ఞి యొసగెను మణినూపురద్వయంబు
రత్నతాటంకము లొసంగె రాజపుత్రి
ఒసగినాడు నృపుండు కేయూరయుగళి
కాంచిదామమ్ము హారమ్ము కంకణములు.

ఆపగాతీర మంజులోద్యానవాటి
నధిపు డొసగెను బిందుబిల్వాహ్వయమున
అందు శ్రీరాధికావల్లభాలయంబు
శీఘ్రకాలమునం బ్రతిష్ఠింతు పద్మ!

పద్మావతి

అభిజనం బగు బిందుబిల్వము
నందు నిర్మించితిరి పద్మకు
అచటి జనములు హర్ష మొందగ
ఆలయము మున్నే.

ప్రభుసమర్పితబిందుబిల్వో-
పవనవాటికయందు రాధా
వల్లభాలయ వినిర్మాణము
వైళమే యవుతన్!

ప్రత్యహంబును బిందుబిల్వము
పావనంబగుగాక నాథా,
పరమభాగవతాగ్రగణ్యుల
పాదసంస్పర్శన్!

జయదేవుడు

గాయకుల్ హరివంశ భాగవత విష్ణు
బ్రహ్మవైవర్తముల్ గర్గభాగవతము
గీతగోవిందకావ్యంబు ప్రీతితోడ
పాడుచుందురు మందిరప్రాంగణమున.

గౌడవాసుల మైత్రి ముత్కలములోని
బిందుబిల్వము విడిచి. ఆ పేరె దయను
ఉపవనికి లక్ష్మణప్రభు వుంచె మనల
నభిజనవియోగఖిన్నత యలమకుండ.

పద్యపాదంబె లక్ష్మణప్రభువరుండు
నాకు బిరుదమ్ముగా నుంచినాడు నేడు.
త్రిభువనమ్ముల పద్మావతీ, త్వదీయ
చరణచారణు డనియే ప్రశస్తి నాకు!

పద్మావతి

కష్ట మొకరిది, ఫలిత మిం కొ
క్కరిది, చిత్రము లోకపద్ధతి:
తలప భట్టమురారి పల్కులు
తథ్య మౌను గదా!

శ్రవణమునకే నిశితవేధ
శ్రమను నుద్వహానక్లమంబును
భూషణ మ్మగు కుండలంబు క
పోలపాళికకే.

జయదేవుడు

నీవు చెప్పిన వాక్కులు నిక్కవములె;
రత్నభూషణధారణశ్రమను నీకు
నాకుమాత్రము లోచనానందదాయి:
ప్రియతమా, భూష లొకసారి పెట్టుకొమ్మ!

పద్మావతి

ఏటి కాభరణములు నాథా?
ఇంట వెలసిన వంశదేవత
త్రిజగతీజనయిత్రి పద్మా
దేవి కర్పింతున్.

జయదేవుడు

అర్పణముచేసినాను సర్వాంగభూష
ణాళి పూర్వ మాపద్మకు నధికభక్తి.
మండనము చేయగావలె నిందురక్తి
నన్నిభూషలు నీపద్మ కభినవముగ.

నీ వలంకారముల్ దాల్చి దేవిమోల
భక్తితో నాట్యమాడెడు పట్టులందు
నేను గానమ్ము సేయుచో, నిందుకృపను
ప్రేయసీ, చూచు దేవి సుప్రీత యగుచు.

పద్మావతి

అంతకన్నను వాంఛితం బేది?
అటులె యగుచో వల్లభా, మీ
శిల్పహ_స్తముతో నలంకృతి
చేయ బ్రార్థింతున్.

జయదేవుడు

[ పేటిక తెరచి పత్రము దీసి పఠించి ]

మధురగీతిక లిఖియించు మహిషికోర్కి
పద్మ, మన కిర్వురకును సంభావ్య మగుట,
పాదయుగళికి నుంతు ప్రప్రథమమందు
రమ్యశింజానమణినూపురద్వయంబు.

పద్మావతి

చాలు నాథా, చాలు నే నప
చార మింకను జేయజాలను
తొలుత వేడుట మి మ్మలంకృతి
దోషమే యయ్యెన్.

జయదేవుడు

వల్లభునియెడ నే కదా వాంఛితంబు?
చరణసంస్పర్శవలన దోషమ్ము రాదు.
ఆననాబ్జ కరాబ్జ పాదాబ్జములకు
తారతమ్యము లేదు నాతలపునందు.

ప్రథమమా నాకు నీపదగ్రహణసుఖము!
పెద్దవారల యానతి బెండ్లినాడె
ప్రమదమున నీపదాబ్జము పట్టినాను:
ఎరుకయున్నదె యావల నెన్నిసార్లొ?

మందమందాతు మత్యంతమంజులంబె.
పద్మ, యొకదాని కబ్బురపాటు కలుగు:
*మమ శిరసి మండన మ్మని మధురఫణితి
దేహి పదపల్లవ మ్మని దేవుచేత

అష్టపదిలోన రాధిక ననునయింప
జేసితివి పద్మ, యిపుడు నిషేధ మేల ?
ప్రణయినీ, ఉంతు నీపదపల్లవముల
కన్రమణినూపురమ్ము, లోంకార మిమ్మ !

పద్మావతి

కావ్యలోకమునందు రాధా
కాంతుచే ననిపించు పల్కులు
ఈ ప్రపంచమునందు నాథా,
యెట్లు వర్తించున్ ?

జయదేవుడు

తెలిసినది ! కృష్ణు డనవచ్చు దేవు డగుట,
నేనో ప్రియతమ, అనరాదు మానవుండ.

పద్మావతి

ప్రత్యవాయం బౌదవె నయ్యో
ప్రాణనాథా, ప్రమాదంబున !
పాదదాసికి మీరు సాక్షా
త్పరమదైవతమే !

* * * *

అవధరింపుడు విన్నపము : పా
దాదికేశాంత మ్మలంకృతి
వలదు చేయఁగ దేవతకువలె—
వల్లభా ! వినరా !

జయదేవుడు

నిన్ను ప్రాణేశ్వరీ, నేను నిఖిలదేవ
తాస్వరూపిణిగా నెంతు తలపులోన
సత్యముగ, నీయసారసంసారయాత్ర
భార్య యనుభాషణము విడంబనము సుమ్ము !

* * * *

లలితమణిమయభూషణాలంకృత మయి
తావకీనతనూలత తనరు మిగుల
పల్లవిత మైన వాసంతవల్లివోలె
శాణితం బైన పుష్పేషుశరమువోలె !

చంద్రికా ప్లావిత ప్రదేశమ్మునందు
చేయు మొక్కింత నృత్యమ్ము చిత్త మలర.

పద్మావతి [ నృత్యము చేయుచు ]

హరి చరణ శరణ జయ
దేవ కవి భారతీ
వసతు హృది యువతి రివ
కోమలకలావతీ...

శ్రీమద్రాధావల్లభో విజయతే !

---

* స్మరగరళ ఖండనం మమ శిరసి మండనం, దేహి పదపల్లవ ముదారం ప్రియే...

## పిరదౌసి

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు, బి. ఏ.,

### వాఙ్మయాభివృద్ధి:

శ్రీ ఆంధ్రభోజుడగు కృష్ణరాయనికాలమున సక్రమ దోహదముల నంది, కొనలుసాగి, మొగ్గదొడగి, పుష్పించి, ఫలించి, సర్వసౌభాగ్యములతో నలరారిన యాంధ్రవాఙ్మయారామవాటి, దురదృష్టవశమున కొన్ని వత్సరము లే ఘనాఘునియండయు లేక, ఆంగ్లభాష యందలి వ్యామోహమున పెడమొగముద్రిప్పిన పుత్రు లను గాంచి కృశింప దొడగెను. కాని పరాత్పరుని యనుగ్రహమున, దేశోద్ధారకుని కటాక్షమున నెలకొల్ప బడిన ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రగ్రంథమాల మొద లగువానివలన పుష్టిజెంది, ఆంధ్రవిశ్వవిద్యాలయమువంటి సంస్థల సంస్థాపనమువలన వికసించి మరల నేటికా వాఙ్మ యారామము ఆధునికాంధ్ర కవికోకిలములచే కళకళ లాడుచున్నది. ఏఘనాఘుడును సాహసింపనిసమయ మున వాఙ్మయలక్ష్మిని చేరదీసి సకలాభరణములతో నలం కరించిన దేశోద్ధారకున కాంధ్రాక్షరాస్యు లెల్లరు సువర్ణపల్లైరములతో నివాళి యొసగెదరుగాక! దేశో ద్ధారకా, ఆంధ్రవిజ్ఞానసర్వమును పునరుద్ధరించి కొన వరకు సాగింపదలచిన నీకార్యదీక్ష యనుంతితము. విశ్వదాతా, నీవు చిరంజీవివి.

ఆధునికాంధ్రకృతు లన్నియు నూతనాభిప్రా యముల విరియజిమ్ముచున్నవి. సర్వతోముఖమగు వాఙ్మయాభివృద్ధి కిది ప్రబల నిదర్శనము. ఉదయించు చున్న విజ్ఞానభాస్కరుని యరుణకిరణము లపుడె యాం ధ్రావని నీరీతి నాక్రమించుట ముదావహము. కాల మున కనుకూలముగ వాఙ్మయము మార్పుచెంద నిచ్చగిం పనివారి కీకృతులు రుచింపవు.......ఆగొడవ నిపుడు తడవనేల?........ఆధునికకవికుమారుడు స్వాతంత్ర్య మును సర్వదా ఆకాంక్షించుచున్నాడు.

"నవ్వుకొందురుగాక నా కేటిసిగ్గు
నాయిచ్ఛయేగాక నా కేటివెఱపు"

అని గళమెత్తి తన్మయత్వమున పాడుకొనుచున్నాడు. తనహృదయమునం దుద్భవించిన భావసంచయమును తన కనువగురీతి రచనములందు ప్రదర్శించుచున్నాడు. లోక మునకు వెఱచి హృదయమునందలి యభిప్రాయముల నణచి వైచి, పిరికితలంపులను రచనములందు వెలువరించిన లాభమేమి? కవి నిరంకుశుడు; ఆతనికలమున కేదియు అడ్డుగానేరదు. ఆతనికృతు లన్నివేళల నూతనాభిప్రా యములతో, కళాకాంతులతో, తేటతేనె లొలుకు నూతన పదములతో వెలుగొందవలసినవే. అప్పుడేకదా తెనుగు బాసయొక్క తియ్యదనము కడవరకు నిలిచియుండునది!

ఆధునికాంధ్రకృతులలో గణనీయమైనవానిలో 'పిరదౌసి' యొకటి. జి. జాషువకవిగారు దీనికి కర్తలు. 'భారతి' మూలమున వీ రాంధ్రులకు చిరపరిచితులు. వీరిపద్యములను గాంచి సంతసించినవా రెందఱో వీరిని గూర్చి ప్రశ్నించుచున్నారు. మారుమూలను విను కొండయందున్న కవిచంద్రునిగూర్చి యాంధ్రలోక మున కేమియు తెలియకపోవుట వింతగాదు. ఈవిషయ మును పురస్కరించుకొని, గ్రంథవిమర్శనమునకు గడం గకపూర్వ మొకింత వీరి జీవిత చరిత్ర నిచ్చుట వ్రాయ దొరకొంటిని.

### కవిజీవితచరిత్ర:

జాషువకవిగారు ౧౮౯౫-వ సంవత్సరమున జన్మించిరి. వీరు ప్రథమమున యాదవకులజులగు హిందువులు. కాని, వీరితండ్రి చిరకాలముక్రిందనే క్రైస్తవమతమును స్వీకరించెను. వీరు మూడవఫారము వరకు చదివి తరువాత బాపట్లలో ట్రైనింగ్ ప్యాసయిరి. ౧౯౧౨-౧౩ సంవత్సరములలో శతావధాన, అష్టావధాన సభలు తెలుగుదేశమున జిత్తుబిత్తుగా జరుగుచున్నకాల మున వీరికి కవితయం దభిరుచి కలిగెను. ఇట్టి శుభసమయ మున శ్రీ ద్యూపూడి హనుమచ్ఛాస్త్రిగారు వీరి పద్యము లను విని సంతసించి కొంతకాలము కాళిదాసత్రయము పాఠము చెప్పి వీరిని ప్రోత్సహించిరి. తదుపరి యుద్యో

గములేక తిరుగుచు వీరొకానొక బయస్కోపు కంపెనీ లో ట్రాన్సులేటరుగా కుదిరి, అయ్యెడ గ్రామముల సంచరించుచు, రాజమహేంద్రవరము చేరి అచ్చట చింతామణీనాటకసంఘమువారికడ నాటకములు వ్రాయు కవిగా చేరిరి. నాటకమండలి విచ్ఛిన్నము కాగా, వీరు గుంటూరు మిషన్ హైస్కూలున నాంధ్రోపాధ్యాయులుగా నియమింపబడిరి. తరువాత కొంత కాలము బాపట్ల హైస్కూలులో నుపాధ్యాయు లయి ప్రస్తుతము స్వగ్రామ మగు వినుకొండయందలి పాఠశాలలో నున్నారు. ధ్రువవిజయము, చిదానందప్రభాతము, కుశలవోపాఖ్యానము, రుక్మిణీకల్యాణము అనునవి వీరు వ్రాసినగ్రంథములలో ముద్రింపబడినవి. 'శివాజి' యను పద్యకావ్య మింకను ముద్రితము కాలేదు. వీరి 'ఖండకావ్యతరంగిణి' అనుగ్రంథము శ్రీ వెంకటగిరికుమారరాజావారి కంకితముచేయబడినది. నే డది యచ్చులో నున్నది. ఈ పిరదౌసి గ్రంథము సింగరాజు లక్ష్మీనారాయణ పంతులుగారి కంకితము చేయబడెను. కవిగారికి శ్రీశ్రీ విక్రమదేవవర్మమహారాజుగారు గడచిన వేసవిలో విశాఖపట్టణమున జరిగిన ఆంధ్ర రీసర్చి యూనివర్సిటీ వసంతోత్సవసమయమున 'కవితావిశారద' అనుబిరుద మొసగి గౌరవించిరి. ఇది కవిజీవితము.

వసుధ శాసింపగల సార్వభౌము డగును
ధీరు డగు, భిక్షుకుం డగు, దీను డగును,
దుఃఖితుం డగు, నిత్యసంతోషి యగును
సత్కవి ధరింపరాని వేషములు గలవె?
('పిరదౌసి' పుట ౬)

ఇది యీ కవివర్యుని పద్యము. ఇందలి యౌచిత్యమును పాఠకులే నిర్ణయింతురు గాక!

### కథావస్తువునకు మూలము :

"నే నీతనిచరిత్రము నయిదేండ్లక్రిందట నొక మాసపత్రికయందు చదివి స్తంభించిపోయితిని. నాటనుండియు నే నిక్కథ నొక చిన్నిప్రబంధరూపమున వెలువరింప దలచియుంటిని" అని గ్రంథకర్త నుడివి యున్నాడు. గ్రంథమునందు నెచ్చటను మానవాతీతములగుకార్యములు వర్ణింపబడియుండనందున, పాఠకున కెచ్చటను సంశయముగాని, "ఇట్లు జరిగియుండునా" అను ఆలోచనగాని కలుగవు. "ప్రాని కరాసికి న్మనుజభుక్తి యొసంగెడు తాలిసుండెసుల్తానులు" ఒక కవిని నిరసించి పరిమార్ప నుంకించుట మొదలగు విషయములు మనకు క్రొత్తవి కానేరవు. "జాతిమతభేదములను పరిగణింపక విశ్వమానవసోదరత నెఱపు దివ్యపురుషులిక్కవిజీవితము ననాదరింపరని విశ్వసించి నే నీ చరిత్రమును పద్యకావ్యముగా రచించితిని" అను గ్రంథకర్తవాక్యములు వారి విశాలహృదయమును వెలువరించుచు, కాలమున కనుగుణముగ నున్నవి.

నే నీ గ్రంథమును విమర్శింప దలచి, ఈ పిరదౌసి కవికి చెందిన కొన్నివిషయములను సేకరింపగడఁగితిని. ఆంగ్లకవిపుంగవు డగు వాలస్ గాన్డి (Wallace Gandy) చే వ్రాయబడిన 'పారసీకవీరుడు' (A Persian Hero) అను గ్రంథమునందున్న యుపోద్ఘాతమున పిరదౌసికవికి చెందిన కొన్నియుపయుక్తములగు విషయములు ప్రస్తరింపబడెను. వాని నిచ్చట క్లుప్తముగ వివరించుచున్నాను: పిరదౌసియొక్క నామము అబ్దుల్ కాసీమ్ మానుసూర్. ఇతడు రచించిన గ్రంథము లత్యంతమధురములై పాఠకులకు స్వర్గసుఖమును కలిగించుచుండెను. పారసీకభాషయందు పిరదౌస్ అనగా స్వర్గమని యర్థము. స్వర్గసుఖమును గల్పించుచున్న గ్రంథములకు కర్తయగు మానుసూర్ నకు పిరదౌసి (స్వర్గసుఖమును గల్గించువాడు) అనుబిరుదము రాజుగారిచే నొసంగబడెను. ఈ బిరుదమే నామముగా వాడుకకు వచ్చెను. ఇతడు క్రీ. శ. ౯౪౧ లో జన్మించెను. తన ముప్పదియారవ వత్సరమున షానామాగ్రంథమును వ్రాయగడంగెను. షానామాగ్రంథ మంతయు రాజులచరిత్రతో నిండి యున్నది. ఈ యుపోద్ఘాతమునందలి కొంత కథకును, పిరదౌసి గ్రంథమునందలి కథకును చాలభేదములు గలవు. అందుచేతనే 'రెండుమూడుచోట్ల షా కీతని చరిత్ర చూడ తటస్థించినది. కాని మొదట నేను

చూచినకథకును తరువాత చూచినదానికి విశేష భేదము గోచరించినది' అని గ్రంథకర్త నుడివియున్నాడు. అచ్చటచ్చట గ్రంథకర్త కథను పొడుగించియున్నాడు.

## కథావస్తువు-కవితాశిల్పము:

భరతఖండమును పదునెనిమిదిమారులు పరితపింప జేసిన మేటివీరుడు గజనీమహమ్మదు. సోమనాథుని పెకలించి తొమ్మిదివన్నెల రత్నరాసులను గొనిపోయిన స్వార్థపరుడు. 'బంగారునాణెముల్ బస్తాలకెత్తించి', 'మొలకవజ్రముల జాలెలబోసిగూర్పించి', 'లేతపచ్చల నేరిగోతాల నట్టించి', 'సర్వము హరించి', 'గజనీ మాపూదు గజనీకి కదలిపోయె'ను. ఈ పలుకులు వీనుల బడినంతనే, ఆశ్చర్యముతో క్రుంగిపోవుచున్న పాఠకునకు ఆతురతతో కవి,

" భారతక్షోణి గల్గు దేవస్థలములు
చెదరి గజనీపురాన మసీదులయ్యె,
నిప్పటిమసీదు లేరూప మెత్తగలవొ
కాల మెఱుగును, ధారుణీగర్భ మెఱుగు. "

అని వచించి వింతభావములతో ఆతని హృదయమును పరీక్షించుచున్నాడు. విశ్వమయునిమ్రోల మానవుని యల్పత్వమును విశదపఱచి పాఠకునకు సిగ్గులో గూడిన చిఱునవ్వును గల్పించుచున్నాడు, కవిశేఖరుడు. " పదియు నెన్మిదిమారులు చిక్కనిరుధిరంబులో భరతఖండము నార్ద్రి " మొనరించిన మహమ్మదు, ఈ పలుకులను విని తలయూపి మిన్నకుండవలసినవాడేకదా!

పరుల నీరీతి పరితపింపజేసిన మహమ్మదునకు సుప్రతిష్ఠ నార్జింపవలయుననెడి యాశ లేకపోలేదు. అందువలననే పారసీకదేశమున వీనుమిగిలిన పిరదౌసి కవిని రావించి 'యుద్ధసింహమునేతకై యొసగె గర్భూరంపుదాంబూలమున్.' రసికుడగు మహమ్మదు కవులనిన గొప్ప యభిప్రాయముతో వారి కీశ్వరత్వము గలదని నమ్మియుండెను. రక్తపాతముచే ద్రవ్యమునార్జించినవాని కిట్టిమంగళప్రదములగు నభిప్రాయము లుండుట ప్రశంసార్హము. పిరదౌసిని గాంచి మహమ్మదు:

"తమ్మిమాలికేలుదమ్మిని గల నేర్పు
కవికలంబునందు గలదు గాన
నీశ్వరత్వ మతనికే చలామణి యయ్యె
నిక్కవముగ బూజనీయు డతడు.

క్షణము గడచిన దాని వెన్కకు మఱల్ప
సాధ్యమే మానవుని కిలాచక్రమందు?
దాటిపోయిన యుగములనాటి చరిత
మరల బుట్టింపఁగలియ సమర్థుడనుసు. "

అని ప్రశంసించియున్నాడు. ఈపద్యములవలన గ్రంథకర్తగారి ఆదర్శములును, కురకభూధవుని రసజ్ఞతయు విశద మగుచున్నవి.

పిరదౌసికవికి ఒక్కొకపద్దియమున కొక్కొక బంగారునాణెము బహూకరించెద నని మహాసభామధ్యమున భూనాయకుడు వాగ్దాన మొనరించెను. కవి పరమసంతోషమున షానామా అను గ్రంథమును వ్రాయ దొరకొనెను. అట్టి శుభసమయమున:

" వానిడెందంబు సోకిపోవనితలఁపులు
వాని కనుసన్న దలలు వంపనియుపమలు
వానికలమున నులుకు జూపని పదములు
మందునకు లేవు నాటివాఙ్మయమునందు. "

ఇట్లు భావోన్మాదమున గ్రంథరచన కుపక్రమించిన కవి కొకరేయి స్వప్నమునం దొకస్త్రీ యరుదెంచి వానిని వివాహమాడదలచెను. ప్రియమార పిరదౌసి యామెను కౌగిలించినంతనే వాని కొకబాణము హృదయమున గ్రుచ్చుకొనినట్లు తోచెను. ఆత డులికిపడి లేచెను. మఱునాడు, కుమారుడు చనిపోయినట్లు భార్యకడ నుండి జాబు వచ్చెను.

'కథ చిన్నదనుటచే.........ఉత్తరకథాసూచకముగ నొకదివ్యస్త్రీదర్శనమును......గల్పించితిని' అని గ్రంథకర్త పీఠికయందు నుడివియుండెను. మరియు 'నరుని సుఖదుఃఖములముందు నడచివచ్చు నీడలే స్వప్నములుసుమ్ము నిశ్చయముగ' అని వచించి పిరదౌసికి రానున్న విపత్తును పాఠకున కొకింత తెలియజేయుచున్నారు.

తెలుగుదేశమున కొందరు, స్వప్నములు రానున్న సంగతులను తెలియజేయునని నమ్మకమున్నవారు గలరు. కాని కొంద రట్టివిషయమును త్రోసివేయుదురు. మొత్తముమీద తెలుగునాటియందు 'కలలో జరిగినది ఇలలో జరుగదు' అనుసామెత మిగుల వాడుకలో నున్నది. మనగ్రంథకర్తగారు పైవరుసలోనివారు.

పిరదౌసి "రెండేడు ల్ననినంత జక్కనికుమా ర్తెన్ గాంచి సానందుడై గంపూషించె మనోవిచార" మును. మరల కావ్యమును వ్రాయగడంగెను. 'మదురు కోయిల...కొసరింపుగూతలగుట్టు దెలిసి' 'పిల్లగాడ్పుల జన్మవృత్త మరసి' 'మెఱపుబోగముసానిమోసగింపుల యర్థమును గ్రహించి' 'ముప్పదేడులు సర్వాంగపుష్టి మెఱయ' 'షష్టిసహస్రపద్యసంధానితమైన' 'గబ్బము రచించె పిర్దౌసికవివరుండు.'

ఇట్లు కృతిని ముగించి నవాబుగారి ఆస్థానమున కేగి గ్రంథమును మూడుమాసములు పఠించి, దాని నచ్చట సమర్పించి పిరదౌసి నిజాలయంబున కేగెను. సుల్తాను అరువదివేల పద్యములకు అరువదివేల బంగారు నాణెములకు బదులు వెండినాణెములు బంపెను.

ముప్పదివత్సరములు, దేహమునందలి రక్తము నంతయు ధారవోసి తననేర్పుకొలది గ్రంథమును రచించి, భూనాయకుని యొడ్డోలగంబున పండితుల సమక్షమున కనకాభిషేకము చేయించుకొన నుత్కంఠ తో నున్నసమయమున, వెండినాణెములను చూచినం తనే.........

"ఎన్నోకొండలు గుండెలో గరగిపో
యెన్ వార్ధిసంతానముల్
గన్నీరయ్యె సమస్తలోకము నిరా
కారస్థితిం బోల్చె ను
త్పన్నంబయ్యె విషాదమేఘపటల
ధ్వాంతౌఘ మాశాలత
ల్సున్నా లయ్యె నగాధకూపజలరా
సుల్ దోచె పిర్దౌసికిన్."

చేయునది లేక పిర్దౌసి ఘనము మఱలించి, ఒకయుత్తరము వ్రాసి మానవేంద్రునకు బంపెను.

ఈ గ్రంథమున రసము చిప్పిలు స్థలములలో నిది యొకటి. పిరదౌసిచే నిందాసహోక్తికముగ గ్రంథకర్త వ్రాయించిన యుత్తరమునందలి పద్యములు హృద్యము లుగ నున్నవి. కొలదినిముసములు జాషువాకవి పిరదౌసికవిగా మారిపోవుచున్నాడు. భావోన్మాద మున పద్యములు పాలమున్నీటితెరగలవలె నటునిటు కదలియాడుచున్నవి. సమయానుకూలముగ భావముల నీరీతి ప్రదర్శించి, పాఠకునిహృదయమును తాండవింప జేయుటకన్న మహాకవి కింకేమి కావలయును? పిరదౌసికి గలిగిన యాశాభంగ మెంత రమణీయముగ తన కూర్పునేర్పువలన,కవి పాఠకునకు విశదపరచుచున్నాడో చూడుడు :

"...................అ
భాస్యుఁడ నై లివయఃపటుత్వమున్
గ్రుంకె శరీరమం దలము
కొన్నది వార్ధకభూతి మీ నిరా
శాంకితబాష్పము ల్ఫలము
లైనవి ముప్పదియేండ్లసేవకున్."

"ఒక్కొక్క పద్దియంబునకు
నొక్కొక్క నెత్తురుబొట్టు మేనిలో
దక్కవగా రచించితి వృ
థాశ్రమ యయ్యె............"

అనియు,

'.........పట్టిచేతులన్,
బోయెద నంధకారమున
మున్గి సుఖంబుల బ్రోద్దుగుంకె రా
జా యికదాండవించెదభ
యంకరఖేదతమాలవాటికన్.'

'నా, శిరమున బోసుకొంటిని న
శింపని దుఃఖపుటగ్నిఖండముల్.'

అని వాపోయెను. ఈవాక్యములు రాతిగుండెనైనను కరగించునవిగా నున్నవి. మఱియు,

"అల్లాతో డనిపల్కి నాపసిడికో
వ్యర్థద్రవ్యము న్వెండితో
జెల్లింపం దొరకొన్నటక్కరివి; నీ
చే బూజితుం డైనచో
నల్లాకు న్సుఖమే ?"

"..................పాలిసుండెసు
ల్తానుల కస్మదీయకవి
తాసుధ జిందినపాతకంబు నా
పై నటనంబొనర్చినది......"

"చిరముగ బానిసీని నభి
షేక మొనర్చితి మల్లెపూవు ట
త్తరు లాలికించి మాయజల
తారున రాదుగదా పసిండి, యో
కఱకుతురుష్కభూపతి, య
ఖండమహీవలయంబునందు!"

అనువాక్యములు మాత్రమే యొకింతకటువుగ నున్నవి. జీవితమునంతయు ధారవోసి తుద కీర్తి వంచింపబడి, కడుపుమంటచే గనలి, ఇట్లు పలికినందులకు సుల్తాను కవిని బట్టి చంపుడని సేనాపతి కాజ్ఞాపించెను.

ఈపైకథ నంతయు నొకచిన్ని గీతమునం దిమిడ్చి, లోకప్రవృత్తి నెరిగిన గ్రంథకర్త, ఏమనుచున్నాడో ఆలింపుడు:

"రాజుతలమీద కవి కప్పురంబు చల్లె;
సుకవితలమీద రాజు నిప్పుకలు విసరె.
కొంప కేపుణ్యమో చేరకొనియె ననిరి;
కొంద కేపాపమో పట్టికుడిపె ననిరి."

సుల్తాను తన్ను జంపనున్నాడని వినినంతనే పిరదౌసి చేయునది లేక:

"ముత్యముల కిక్కయైన సముద్రమునను
బెక్కుమాఱులు మున్కలు వేసినాడ;
భాగ్యహీనుడ ముత్యమ్ము వడయనయితి
వనధి నను మ్రింగ నోరు విచ్చినది తుదకు."

అనుభావయుక్తమగు పద్యమును మసీదుగోడపై వ్రాసి, అర్ధరాత్రమున సకుటుంబముగ స్వగ్రామమైన తూసు పట్టణమునకు బయనమయ్యెను.

అరణ్యము; అర్ధరాత్రము; ఆకసమునందు మేఘము లావరించియున్నవి; అబలలతో ప్రయాణము; పిరదౌసికవి కేమియు తోచలేదు; "దిక్కు లేనివారికి దేవుడే దిక్కు." అత డొకచో నాగి పరాత్పరుని గూర్చి ధ్యానించెను.

ఈగ్రంథమున రసవంతమైన పద్యములలో కొన్ని ఇచ్చట గానవచ్చుచున్నవి. ఈ ప్రార్థనమునందు వెలువరింపబడిన భావము లాంధ్రవాఙ్మయమున కొకింత నూతనము లనుట సాహసము కానేరదు. "సంజకెంజాయలో జలకంబుసవరించి పరతెంచు సూర్యబింబంబులోన", "చంద్రుని ధవళహాసముల లోన", "చెఱలాడు మొలకతెమ్మెరలలోన", "హాయిగా బవ్వళించి బ్రహ్మాండములను బల్కరించుచున్న దివ్యస్వరూపుని" పిరదౌసి పూజ లర్పింప నాహ్వానించుచున్నాడు. అర్థమునం దంతులేనిప్రశ్నలను సామాన్యమానవున కన్వయముగాని పల్కులను గ్రంథకర్త పిరదౌసిచే బల్కించుచున్నాడు. సత్కవి యందు మానవాతీత మగు లక్షణము లుండుననుటలో నాశ్చర్యమేమి? నిర్వికల్పుడును, నిర్గుణుడును, నిత్యతృప్తుడును అగు పరాత్పరుని మానవమాత్రుడా ప్రశ్నింపగల్గునది! భావనాప్రపంచమునకు సృష్టికర్త యగు కవిబ్రహ్మయే అట్టిదాని కర్హుడు.

ఆర్తరక్షణపరాయణుడగు ఆదినారాయణుని మ్రోల, వినయము వెల్లివిరియ నంజలి ఘటించి ప్రశ్నించుచున్నాడు పిరదౌసి:

"ఆ నిదురించు పెద్దపులి
యాస్యబిలంబున కెన్ని జంతువుల్
బోనములై యదృశ్య మయి
పోయెనో - రేపటిభుక్తికిన్ దయా
రైనమృగంబు లేపావల
యం దవుగాము లెఱుంగ కింపుమై

మేనులు వాల్చెనో—యెతిగి
మిన్నక చూచుచు నంగలార్తువా ? ”

*     *     *     *

“ నన్ను బోలు కోటినరులమృత్తికనుండి
వెలువరింప శక్తి గలిగియుండి
నన్ను విడువలేక కన్నుమూయ వదేల ? ”

*     *     *     *

“ .....................శ్యేనపం
క్తుల నటనావిలాసముల
కుం దలయూచుచు నేను మ్రొక్కనన్
గిలకిల నవ్వి నన్ను దిల
కింపని కారణ మేమి దైవమా ?

*     *     *     *

“ వేసురుజుక్కతో నిలిపి
వేసిన నీరచియించు లేఖకుం
గానెత మైన యాకసము
నన్ జిరునవ్వుల గ్రుమ్మరించుచున్
డాగెదవేల యర్థవద
నంబున ? ఏమని వ్రాసికొంటివో
నాగతు లందులోన ?...... ”

*     *     *     *

“ పిట్టల బీచుపీచు మని
పించుచు వేసుబసంతిదోసిటన్
బట్టె గులాబిసుత్తుల, న
భంబున పుప్పొడిదుమ్ము రేగ, నీ
విట్టి నిసర్గపూజలకు
దృప్తి వహింతువా ? నా స్తవంబులో
బట్టము గట్టుకొందువో ? ”

*     *     *     *

“ సరదాగా భుజశక్తి మీఱ నెపుడో
క్ష్మానామకంబైన బొం
గరమున్ ద్రిప్పితి, వీపరిభ్రమణవే
గం బింత చల్లాజినన్
జరుగ న్నేర్చునె లోకవృత్తము మహే
శా, యప్పు డేదిక్కుగా
నొఱగుం ? బర్యవసాన మెట్లగునొ... ! ”

అర్థవంతమును నిట్టిప్రశ్నలవలన ఆలోచనాసాగరమున మునిగిన పాఠకు డొకింత తేరుకొనుటకు, అర్థవంతమయ్యును, మిగుల లలితమగు భావముతో నీక్రిందిపద్య మెంతరమణీయముగ నున్నదో తిలకింపుడు :

“ ఆగడపుమబ్బుశయ్యల నపరశిఖరి
బుడుతచంద్రుడు నిద్దురవోవుచుండె
ఈచెఱువునీట నతని కుయ్యాలలు గట్టి
జోలపాడుచు నావంక జూడవేమి ? ”

ఇట్టిపద్యములు పాఠకులహృదయముల జూరగొనుచున్న వనుటలో నతిశయోక్తి గలదా ! ఇది మహాశిల్పమునకు నిదర్శనముకాదా !

ప్రార్థన ముగించి పిరదౌసి కారడవిని బడిపోవుచున్నప్పు డొకనిషాదుడు వారికి సాయ మొనరింప వచ్చి కొంతదవ్వు వారితో నడచి దారి చూపించి పోయెను.

“ ఆకనుపించుపర్వతపు
టంచున నున్నది పెద్దచెర్వు...... ”

“ కొంచెము సాగెనన్ జెఱువు
కొమ్మన మీకు డిచేలివాలుగా...... ”

“ అవలన్ బచ్చికపట్టులం జిలుగునీ
హారంబు భక్షించి............... ”

పైపద్యములన్నియు, నిషాదుడు కవికుటుంబమునకు దారిదెల్పునదిగా నున్నవి. ఈసందర్భమున పాఠకునకు మేఘసందేశమునందలి యక్షునిపలుకులు జ్ఞప్తికివచ్చును. మరియు, “ఈగ్రచ్ఛపాదలయందే నిర్భయము మీఱ, బెబ్బులుల్ పిల్లల బెట్టుచుండు......”అను అడవివర్ణనలను దెలుపుపద్యములు ఉత్తరరామచరిత్రమునందలి భవభూతిపోకడలవలె నున్నవి.

పిరదౌసి తుదకు తనగ్రామము సురక్షితముగ చేరెను.

ఇట్లుండ కవిహననోద్యుక్తుడయిన మహమ్మదు సామంతరాజులు సేయు హితోపదేశమున శాంతి వహించి, కవిఋణము దీర్చుకొన దలచి, ధనమును వీరభటుల కొసగి కవికి పంపెను. కాని ప్రయోజనమేమి? ధనము తూసుపట్టణముతూర్పుగవిని ప్రవేశించెను; కవి శవము పడమటిగవిని ప్రేతభూమికి గొంపోబడెను. పిరదౌసికూతు రాధనమును నిరాకరించెను.

ఈఘోరవార్త విని మహమ్మదు ఎంతయు జింతించి, యేతద్ధనముతో తూసుపట్టణమున పిరదౌసి పేర నొకసత్రశాల గట్టించెను. దానిచిహ్నములు నేడును గలవు. కాని యిం దొకరికి కీర్తియు, నొకరి కపకీర్తియు దక్కినవి. ఇద్దఱును గాలగర్భమున గలసి పోయిరి. తారతమ్యము లింతియ.

### జాషువగారి గజనీమహమ్మదు:

ఈ రీతి కథ ముగియుటకు గజనీమహమ్మదే కారకుడు. పాఠకుని క్రోధానలమునకు సుల్తాను గురి యగుచున్నాడు. కాని గ్రంథకర్త భూభర్త కన్యాయ మొనరింపలేదు. సాధ్యమైనంతవరకు గ్రంథకర్త భూనాథుని కీర్తిచంద్రున కపకీర్తిశీమూతము లడ్డురాకుండు నట్లు కాపాడెను. ఇది, కవిచంద్రుని విశాలహృదయమును పాఠకున కెఱిగించుచున్నది.

పిరదౌసికవిని రావించి ప్రథమమున గౌరవించి నపుడు, సుల్తానుని నోటివెంట వెడలినవాక్యము లాతని విజ్ఞానమును విశదముచేయుచున్నవి. కవులయం దాతని కున్నగౌరవమును, వారిని పోషింపవలసినవిధమును ఆపలుకులు వ్యక్తపరుచుచున్నవి.

పిరదౌసికి, బంగారునాణెములబదులు వెండినాణెములు పంపినపుడు, "వెండినాణెముల్ బాస దొలంగి పంపె నరనాథుడు పండితు లేమి చెప్పిరో?" అని నుడివి గ్రంథకర్త నరనాథుని కాపాడుచున్నాడు. అప్రతిష్ఠలో సగభాగము పండితులతలపై మోపబడినది. ఈర్ష్యవలన, వారే నరనాథుని కీరీతి బోధించియుందురని పాఠకుడు నమ్ముచున్నాడు. దానితో మహమ్మదు కొంతవరకు నిరపరాధి యని తేలిపోయినది.

ధనమదాంధున కాగ్రహము వచ్చు టొక లెస్స గాదు; రక్తపాతముచే రాజ్యమును జయించి, దేశముల కొల్లగొనినరాజు, 'కనులన్ గెంపు నటింప మైమఱపు హుక్కా ద్రావుసుల్తాను' ప్రథమమున నట్టియక్రమమునకు బాల్పడినను "ఒక్కకవి మీచే గోరుద్రవ్యంబు మీహుక్కా ఖర్చుకు సాటిరాదుగద, రాజోత్తంస యోజింపుమా!" "గడియించితిరిగదా కనకరత్నచయంబు ధననాయకునకు దంతములు పులియ" మొదలగు సామంతుల ప్రశంసావాక్యములచేతను, "నిండు కొలువున కవులకన్నీరు తగదు" అనెడి హితోక్తుల చేతను ఆతని హృదయము నీటికన్న పలుచన యై పోయెను ఇట్టి ప్రయత్నమునకు సామంతులు ప్రథమముననే కడంగియుండిన మహమ్మదున కీయపకీర్తి లభింపకుండెడి దని పాఠకున కాలోచన గలుగకపోదు.

పిరదౌసి మసీదుగోడపై వ్రాసిన పద్యమును గని మహమ్మదు పడినపరితాప మపారము. వెంటనే 'పారసీకునకు నిచ్చెద నన్నపసిండి నూరు బస్తాలకు బట్టి' పంపెను. పిరదౌసిమృతి విని శయనమందిరము జొచ్చి ఆత డనుభవించిన హృదయవేదన మాతని పూర్వపాపమును కడిగివేయుచున్నది. తిరిగివచ్చిన ధనమును ధనాగారమున నుంపక పిరదౌసిపేర సత్రశాలగట్టించుటయు కొనియాడదగిన విషయము. చేసిన నేరము నీరీతి నే కొలదిమో సవరించుకొనుట ఎల్లర కలవడని విషయమేకదా!

ఈరీతి మహమ్మదుపాత్రను పోషించి, పాఠకుల కాతనియెడ సదభిప్రాయమును గల్పించిన గ్రంథకర్త ప్రశంసనీయుడు. కొలదియాశయములు గ్రంథకర్త కుండినచో సుల్తానుపాత్రను మిగులహేయముగ చిత్రించియుండెడివాడే.

### ప్రకృతిపరిశీలనము:

ఆధునికాంధ్రకవికుమారులు ప్రకృతిమాత నారాధించుటయందు ముందడుగు వేయుచున్నారు. లలితములగుభావములతో ప్రకృతియొక్క రమణీయతను తమ

కావ్యములందు ప్రదర్శించి, వానికి మిసుల సౌందర్య మను గల్పించుచున్నారు.

ఈకవిగారు ప్రకృతిమాతయొక్క కళాకాంతుల నీగ్రంథమున కొన్నిస్థలములందు గన్పరచియున్నారు. ప్రకృతిని గాంచి యుప్పొంగి భావోన్మాదమున గాన మొనరించువాడె సుకవి. ఎందరుమానవులు లోకమున లేరు? అందరును ప్రకృతిని గాంచి ముగ్ధు లగు చున్నారా? ఎవని హృదయకమలము కవితాకన్య కాస్ప దమై వెలయునో, అట్టివాడు ప్రకృతిసౌందర్యమును గాంచి తన్ను దాను మఱచిపోవుచున్నాడు. ఇట్టి తారతమ్యము లుండుటచేతనే కవి పూజనీయు డగు చున్నాడు.

సూర్యోదయవర్ణన మీగ్రంథమునం దెట్లు క్రొత్త భావముల కాలవాలమై యలరారుచున్నదో తిలకింపుడు:

"కుంకుమపంకముం బులుము
కొన్నవి తూరుపుకొండనెత్తముల్
పంకజబాంధవుం డరుణ
పాదముల న్నిగిడించె మింట నే
డొంకుడు చిన్నవోయి చర
మాచలసానుతటంబు లెక్కి పై
బింకయు దాను గడ్డిగఱి
చెన్ పెనుచీకటు లార్చె గాకులై."

పైన, గీటుంచినపదములు భావగర్భితములై యూహిం చినకొలది యాలోచన నతిశయింపజేయుచున్నవి.

కొన్ని సమయములం దీకవి తనకు సాధ్యమగు నంతవరకు చూపు నిగిడించి ప్రకృతిమాత గర్భమునం దున్న రహస్యములను లోకమున వెలువరించు చున్నాడు. "నీలమేఘంబుల నెఱియలలో గుల్కి పరువెత్తు మెఱుపు గర్భములలోన" చూపున కందని మేఘములలోని కెగిరి, వాని నెఱియలలో పరుగిడు చున్న మెఱుపుయొక్క గర్భములయందు "హాయిగా జవ్వళించి బ్రహ్మాండములను బల్కరించుచున్న దివ్య స్వరూపు"ని గని ప్రణమిల్లుచున్నాడు కవిచంద్రుడు.

సామాన్యమానవున కవి మబ్బుగట్టులు; మెఱపు తీగెలు!

గాలికి దూగియాడు గిజిగానిగూళ్లాయమునం దీ కవి పరాత్పరుని పోలికలను గాంచి తన్మయు డగు చున్నాడు. "ఏమిటి కెక్కువెట్టితివి ఇంద్రధనుస్సును మింటిచాయ" అని భావోద్రేకమున ప్రశ్నించు చున్నాడు. ప్రకృతియందలి ప్రతివిషయమున కిత డర్థ మును దెలిసికొనవలయు నని ప్రయత్నించుచున్నాడు. తుదకు "కొసరి నివ్వరిధాన్యంబు గోటికి నమలు నెలుక మునిపంటి సవ్వడి"ని గూడ నీకవి వినగల్గు చున్నాడు.

ప్రకృతిరహస్యముల నీరీతి గ్రహించియు ఇంకను తృప్తిలేక;

'ప్రకృతిపదార్థజాలముల
పై నుదయాస్తమయంబులందు నీ
యకలుషపాణిపద్మము ర
హస్యముగా లిఖియించిపోవు టా
కొక్కకసమయాన నేను గను
గొందునుగాని గ్రహింపజాల నెం
దుకు సృజియించినాడవొ న
నున్ ఘనుడా, యసమగ్రబుద్ధిగన్.'

అని వాపోవుచున్నాడు.

ప్రకృతిపరిశీలనమువలన గల్గిన, అవ్యయానందమే యిట్టిరచనాకౌశలమును గూర్చుననుటలో సందియము లేదు.

## పదసామగ్రి:

జాషువాకవిరచనములం దెక్కువ అచ్చతెనుగు శబ్దములు గన్పట్టుచున్నవి. అందులకే ఆకవనమున కంత రుచి కుదిరినది. వీరిపూర్పు నేర్పు కొనియాడదగినది. పదములపొందిక, కుఱ్ఱుకుదనున కెనవచ్చు పద్యగమనము వీరికవనమున కపారమగు చక్కదనమును గల్పించు చున్నవి.

'జారిపోవని జవ్వనము'. 'సాంప్రతడియారని పద్యములు', 'ఉక్కు పుప్పొడి రాలు యుద్ధభూమి', 'గర్భిణీమేఘములు', 'నీదుమనంబు లేతనవనీతము', 'పక్కణంబులన్ జల్లెడవట్టి', 'రత్నరక్తములు,' 'గండూషించె మనోవిచారము', 'మనశ్శయ్యలు' మొదలగు తియ్యని వింతపదముల పొందికచే నీ గ్రంథమునకు వన్నెవెట్టుచున్నాడు. అచ్చటచ్చట నివి పతకమునందలి రత్నములవలె మెరయుచున్నవి.

"సిరి నిజంబుగ వట్టి టక్కరిదిసుమ్మ."

"గండుచేప దాకు కమల మయ్యె."

"కాలపురుషుండు దినదినాకారు డనుచు
భావకుని లీల నోదార్చిపోవుచుండె."

"చక్కని మల్లి కాసుమము
నన్ జరియించి మదద్విరేఫముల్
ఱెక్కలు రాచి యందు సవ
రింపగ జాలునె నీలివన్నెలన్."

"కవీంద్రుని వేడిరక్తధారాపతనం
బమంగళకరంబు."

"నిండుకొలువున కవులకన్నీరు తగదు."

"ప్రొద్దుగ్రుంకె......పంది కోఅకత్తి
పదునువెట్టె."

"పొడుపుగుబ్బలి తొలుదొల్త బూదివంటి
గవళవర్ణంబు దాల్చి యంతట పసిండి
నిగ్గుమెదిపి నీచెంగల్వ మొగ్గదొడిగె
వేగుజామున నూసరవెల్లివోలె."

ఈపై నుదాహరించిన పద్యపాదములందు కొన్ని యర్థాలంకారసహితములు, మఱికొన్ని కవివరుని విపుల మగు లోకజ్ఞానమును వెలువరించునవియు నై యున్నవి. అచ్చటచ్చట కొలదిగ శబ్దాలంకారములును గలవు.

'మహాకవి శబ్దాలంకారముల నెప్పుడో కాని ముట్టడు; ముట్టినచో నది సానతీరిన రాయి. అల్పమో అధికమో గుణాలంకారములను వలసినచోట సంగ్రహించనే సంగ్రహించును.'

"కావ్యము వెదకిచూచినను ప్రత్యక్షరము, ప్రతి శబ్దము, ప్రతివాక్యము, ప్రతిఅలంకారము, కావ్యరసోన్ముఖముగానే పరుగెత్తును. ఇది మహాశిల్పము; మిక్కిలిగా మాట్లాడినచో ఇంతకన్న మహాశిల్పము లేదు." అను మాగురువర్యులగు విశ్వనాథ సత్యనారాయణగారి వాక్యము లీ గ్రంథముపట్ల సరిగా సరిపోవుచున్నవి.

గ్రంథకర్త గ్రంథాదిని :

"అనుకూలుం డను నీ మనోహరుని నా
మాంకంబు దిగ్దేశరా
జ్ఞనజిహ్వాంచలసీమలన్నిలుపు మా
చంద్రార్కమున్ జాజిపో
వని నీజవ్వన మస్మదాంధ్రవిషయ
ప్రాగ్దేశదీపంబుగా
మని, భాషాలలితాంగి కూతయిడు మ
మ్మా, కావ్యకన్యామణీ!"

అని కోరుచున్నాడు. సర్వతోముఖమగు ప్రతిభ నార్జించిన కవికృత మగు గ్రంథముపట్ల నింక ననుమానమా!

---

# శ్రీ రాజా రామమోహన స్మృతి

కవిరాజహంస, వోలేటి పార్వతీశము

నిర్మలానందచంద్రికల వెల్గునుజుమీ నీ దివ్యతేజంబు నేఁడు గూడ
శీతలామృతపయస్వినుల నింపునుజుమీ నీ కృపారసవృష్టి నేఁడుగూడ
వరవిహంగకలారవముల మ్రోగునుజుమీ నీ సుధామధురోక్తి నేఁడుగూడ
సచరాచరప్రపంచమునఁ దోఁచునుజుమీ నీ శాంతమయమూర్తి నేఁడుగూడ
నేఁడు నీనాఁడు మాకు నూఱేఁడు లైన - నెదుటఁ గలయట్టులే తోఁచు నెల్లవేళ
నమరమైనది నీదు దివ్యప్రచార - మమరుఁడవు నీవు రామమోహన మహాత్మ!

నీవు నాఁటినమోక నిఖిలార్థసిద్ధమై యమృతకల్పకవల్లి ననుకరించె
నీవు పాడినపాట నిరుపమానందమై ప్రణవవీణాతంత్రిఁ బ్రతిరవించె
నీవుపట్టినజోతి నిశ్చలాభోగమై పరమతేజంబునఁ బ్రస్ఫురించె
నీవు తీర్చినబాట నిష్కంటకంబయి యాగమాంతపథంబు నధిగమించె
నమరమైనది నీ పావనావతార - మమరమైనది నీప్రణయప్రవృత్తి
మమరమైనది నీ నిశ్చయాత్మబోధ - మమరుఁడవు నీవు రామమోహన మహాత్మ!

సరసఫలాభిశోభితరసాల మొకప్పటికైన నెండి కా
న్పఱు నవరత్నహేమఖను లంతట నిండు మహాద్రికాలగ
హ్వరమునఁ గూలుఁ గాని నిరవద్యభవద్విమలప్రబోధసా
గర మటుగాక తన్పుఁ గలకాలము లోకము రామమోహనా!

---

# వేణీసంహారము - ద్రౌపది

సరసకవితాధురీణ, కపిస్థలం కృష్ణమాచార్యులు, బి.ఏ., యల్.టి.,

విపశ్చిల్లోకమునఁ బ్రఖ్యాతిగాంచిన నాటకములలో వేణీసంహార ముచితస్థానము నాక్రమించియున్నది. సామోపాయకుశలుఁడగు శ్రీకృష్ణుని సంధిసందేశము మొదలు దుర్యోధనుని యంతిమపరాజయమువఱకుఁ గల భారతకథావిషయ మీనాటకముయొక్క వస్తువు. కథాసంవిధానమంతయు భీముఁడు, దుర్యోధనుఁడు, ద్రౌపది-వీరిమీఁదనే యాధారపడి యుండుటవలన దీని యనేకపాత్రములలో వీరే ముఖ్యులు. ఇందు రౌద్ర మంగిరసము. వీర కరుణము లంగరసములయి దీనిని రాణింపఁజేయుచున్నవి. ఇందలి శైలి వస్తునిర్మాణౌన్నత్యమునకుఁ దగియున్నది. ఇఁక భట్టనారాయణ కవిప్రణీత వేణీసంహార నాటకము సర్వజన సమాదరణము వడసినదని వేఱుగఁ జెప్పనేల? ఇట్టిప్రశస్తనాటకమునకు నాయికయగు ద్రౌపదీపాత్రమును, భట్టనారాయణుఁడు తెలిపినట్లు ఈవ్యాసమున విమర్శింప యత్నించెదను. కాని యీనాటకపు విలువను చదువరులు నిర్ణయించుకొందురుగాక!

పాండవు లజ్ఞాతవాసానంతరము మఱలి వచ్చియు, దుర్యోధనుఁడు తనమాట ననుసరించి ప్రవర్తించుట లేదు. పినతండ్రికుమారులతో తనరాజ్యము- ననుభవింపవలయున్నా, వలదా యని సంశయించుచున్నాఁడు. యుధిష్ఠిరుఁడు రాజ్యమునకయి బహిరంగముగ సమర మొనర్చునట్లు లేదు. అతని యభిప్రాయము భీముని కంతగ రుచించుట లేదు; భీముఁ డిప్పటికే కోపోద్దీపితుఁ డయియున్నాఁడు. అతనిమెడ సహదేవుని శాంతోక్తులు విఫలము లయినవి. తనసహోదరుల బుద్ధిమాంద్యమున కతఁ డెంతయుఁ జింతిల్లుచున్నాఁడు. వారు తత్క్షణమే యుద్ధసన్నద్ధులు కావలయు ననుచున్నాఁడు. నిరుత్సాహులగు తనసోదరులు యుద్ధమున కనుమతి నీయరని సంశయించుచున్నాఁడు. తన కార్యమును ద్రౌపది యామోదించు నను దృఢవిశ్వాస ముండుటవలన నామెతో యోచింప నెంచుచున్నాఁడు. ఈవిషయమున భీమునియభీష్టము ఫలించినది. సహదేవుఁ డూహించినట్లే.

యద్వైద్యుత మివజ్యోతి రార్యక్రోధేఽద్య సంభృతమ్,
తత్ప్రావృడి కృష్ణేయం నూనం సంవర్ధయిష్యతి.

ద్రౌపదీసాన్నిధ్యము భీముని కోపానలానిలమయి పరిణమించి యతనిసంకల్పమును ప్రోత్సహించినది.

భీముఁ డంతఃపురమును జేరునప్పటికే తనయవమానకారణము నతనికి తెలుప ద్రౌపదీ యుత్కంఠితయయి యతని యాగమనమును నిరీక్షించుచున్నది. ద్రౌపది దేవీసహితుఁడగు ధృతరాష్ట్రుని సేవించి, మఱలి వచ్చుచుండ

దుర్యోధనుని భార్యయగు భానుమతి యామె నవమానపఱచెనఁట! ద్రౌపదిసంకల్పము నామె పరిహసించి, కలుషమందహాసముతో

అయి, యాజ్ఞసేని, పంచగ్రామా స్తవ పతిభిః ప్రార్థ్యన్త ఇతి శ్రూయతే త త్కస్మాత్త్వనః అద్యాపి తే కేశాః న సంయమ్యన్తే?

అని ప్రశ్నించెనఁట. తనచేటియగు బుద్ధిమతి యొక్క—

అయి, భానుమతి, యుష్మాక మయుక్తేషు కేశేషు కథ మస్మాకం దేవ్యాః కేశాః సంయమ్యన్తే?

అను సమయోచితప్రత్యుత్తరమునహిత మామెను తృప్తిపఱచుట లేదు. ద్రౌపది తత్ప్రతి యాణి; ప్రతిక్రియయొక్కటే యామె నోదార్చఁగలదు. తన పంచప్రాణనాథులలో భీముఁ డొక్కఁడే తన యవమతి కను తాపము నొంది ప్రతిక్రియ చేయ సమర్థుఁడని యామె బాగుగ నెఱుఁగును. ఆమె యందులకే భీముఁ డెప్పుడు వచ్చునా యని వేచియున్నది.

దుర్యోధనాదుల దుర్వర్తనముల తలఁచి తలఁచి తద్దర్పదళనవిధానము సహదేవునికి తెలుపుచు భీముఁడు ప్రమత్తుఁడయియున్నాఁడు. కావున తనముమోల నిలిచియున్నను ద్రౌపదిని జూడఁజాలకున్నాఁడు. భీముని ఔదాసీన్యము ద్రౌపదికి కోపోద్దీపకము కాలేదు. సరికదా, అతఁడు క్రోధముతో శత్రునాశముసేయ సంకల్పించుకొనుటయే యామెకు కర్ణామృతమగుచున్నది. తనరాక నెఱిఁగించి, యతనిఁ గలప నామె యభిలషించుట లేదు. అతనికి తెలియక నెమ్మదిగ నచటఁ గూర్చుండి యతని కౌరవ వినాశప్రశంసాత్మకవాగ్ద్రోర్తుబలనుసావధానముగ నాలకించుచున్నది. దుర్యోధనుఁడు పంచనగరములను పాండవవశ మొనర్చునెడ సంధి సలుపఁ దలఁచిన యుధిష్ఠిరు నుద్దేశ్యమునకు తన యసమ్మతిని సహదేవునికి తెలుపుచు, నాయుపక్రమణమంతయు నసమంజసమని భీముఁ డిట్లు నిందించుచున్నాఁడు:

మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్
దుశ్శాసనస్య రుధిరం నపిబా మ్యురస్తః,
సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ
సంధిం కరోతు భగవాన్ నృపతిః పణేన.

ఆలకించి ద్రౌపది దీనిని మనఃపూర్వకముగ నామోదించుచు, అతనిని తనప్రతిజ్ఞను మాటిమాటికి చెప్పుమని ప్రోత్సహించుచున్నది.

నాథ, అశ్రుతపూర్వ మిదృశం వచనం. త త్పునః పున ర్భణ.

మఱియు, నాయైదునగరము లేవియో యనికూడ భీముఁడు తెలియఁగోరుట లేదు. ఆపట్టణములు తమ్ముప్రకటించు కుట్రలలో పాల్గొన్నవని సహదేవుఁడు తెలుపఁగా భీముని కావరమంతగ రుచించుట లేదు. యుధిష్ఠిరుని కోరికకు కౌరవు లియ్యకొను టసంభవమనియు, పాండవులు కయ్యమునకుఁ గాలుద్రవ్వి రను నింద లేకుండుటకే యానగరములను యుధిష్ఠిరుఁడు గోరనెంచె ననియు సహదేవుఁడు చెప్పుచున్నాఁడు భీమునికి కపటోపాయములు రుచించుట లేదు. నిజదర్పదర్శన కుతూహలియై,

యుష్మాన్ హ్రేపయతి క్రోధా ల్లోకే శత్రుకులక్షయః,
న లజ్జయతి దారాణాం సభాయాం కేశకర్షణమ్.

అని యడుగుచున్నాఁడు. స్వావజ్ఞాసూచకమగు నీమాటలు ద్రౌపది హృదయమును రసోద్రేక పూరితము సేయుచున్నవి.

నాథ నలజ్జసే నలజ్జసే ఏతే. త్వ స్తావత్ మా విస్మార్షీః.

అనియామె తనదుఃఖమును వెలిబుచ్చుచున్నది.

ఈసమయమున భీముఁడు నిజకార్యమును జ్ఞప్తికిఁదెచ్చుకొని, పాంచాలికొఱ కెంతకాలము వేచియుండవలయునని సహదేవు నడుగు చున్నాఁడు. ఆమె యచ్చట చాలకాలమునుండి యున్నదనియు, ప్రాయశః భీముఁ డామెను జూడలేదేమో అనుచున్నాఁడు సహదేవుఁడు. తోడనే భీముఁడు క్షమాపణ వేఁడుచున్నాఁడు. కాని యట్టిక్షమాపణకుఁ బ్రసక్తియే ద్రౌపది కగపడుట లేదు. ఏలన,

ఉదాసీనేషు యుష్మాసు మమ మన్యుః నపునః కుపితేషు.

పరస్పరస్వాగతోక్త్యనంతరము, భీముఁడు తన జన్మవిరోధి దుర్యోధనుని రాణియగు భానుమతి ద్రౌపది నవమానించినవిధము బుద్ధిమతివలన నెఱిఁగి,

చంచద్భుజ భ్రమితచండగదాభిఘాత
సంచూర్ణితోరుయుగళస్య సుయోధనస్య,
స్త్యానావనద్ధ ఘనశోణిత శోణపాణి
రుత్తంభయిష్యతి కచాం స్తవ దేవి భీమః.

అని తనదేవి నోదార్చ యత్నించుచున్నాఁడు. ద్రౌపది యపరిమితానందము నొందుచున్నది కాని, దానికతని సహోదరులు సమ్మతింప రేమో అనియే యామె భయము. సోదరు లందఱును యుద్ధసన్నద్ధు లయియున్నారను చున్నాఁడు సహదేవుఁడు. రణభేరీనినాదము దానిని మఱింత రూఢిపఱచినది.

మఱియొకపర్యాయము తన్నోదార్పుఁడని బుద్ధిమతిమూలమున నాథుని ప్రార్థించి, ద్రౌపది యతనిని వీడ్కొనుచున్నది. భీముఁ డును

భూయః పరిభవక్లాన్తలజ్జావిధురితాననమ్,
అనిశ్శేషితకౌరవ్యం నపశ్యసి వృకోదరమ్.

అని తా నామెకు వాగ్దాన మొనరించినదంత యు నెఱవేర్చుదనుక నామెను మఱల సందర్శింప ననుచున్నాఁడు.

తుట్టతుదకు తనకయి సంగరమున ప్రమత్తులరయి సాహసకృత్యములకుఁ గడఁగకుఁ డని ద్రౌపది నాథుని ప్రార్థించుచున్నది. అందులకు భీముఁడు పాండుకుమారు లప్రతిమాన యుద్ధకౌశలము గలవారనియు, నావిషయమున భయపడవలదనియు ననుచున్నాఁడు. విని ద్రౌపది సంతసించుచున్నది.

భీముఁడు తన్ను వీడ్కొనినదాదిగ ద్రౌపది కేమియు తోఁచుటలేదు; ఆమె మనశ్శాంతి నేదియో కలఁచుచున్నది. నాథుఁడు రణభూమినుండి రాఁడా యని యాత్రపడు చున్నది.

ఇంతలో సేవకుఁడొకఁడు యుద్ధభూమి నుండివచ్చి, కౌరవసైన్యము దాదాపు ధ్వంస మయ్యెననియు, భీమార్జునులు దుర్యోధనునితో మల్లయుద్ధముసేయ వానిని వెదకుచున్నా

రనియుఁ దెలుపుచున్నాఁడు. దీనిని వినుట తోడనే ద్రౌపది కపటకునశంక గలుగుచున్నది. ఆమెయస్వస్థచిత్తయయి కలఁతఁజెందుచున్నది. ఇంతటికి నామె యబలయే కదా! జీవన్మృత్యు సందిగ్ధసమయములందుసహితము స్త్రీసహజ మగు మనోవేదన యామెను పరితపింపఁ జేయ కుండునా? ప్రతిక్రియ చేయనలయునని యామె యింక నేమాత్రమును కోరుటలేదు. తన ప్రియులుభీమార్జునులు మఱలివచ్చినఁజాలునను చున్నది. దుర్యోధనుని మిత్రుఁడగు చార్వా కుఁడను రాక్షసుఁడు మాయాబుు వేషధారి యయి యుధిష్ఠిరునితో యుద్ధమున భీమార్జు నులు దుర్యోధనునిచేత నొకరివెనుక నొకరుగ మడిసిరని కల్లలాడుచున్నాఁడు. నిజనాథుల శౌర్యపరాక్రమముల చక్కఁగ నెఱిఁగిన దయ్యును ద్రౌపది యామాటలను నమ్ము చున్నది. నమ్మి, వగల మిగుల బాగులు చున్నది; ప్రాణత్యాగమునకయి తనకును, యుధిష్ఠిరునకును నొకచితిని పేర్చినది.

తత్క్షణమే భీముఁడు రక్తసిక్తాంగము లతో ప్రవేశించుచున్నాఁడు. ప్రవేశించి ద్రౌపదీయుధిష్ఠిరులను వెదకుచున్నాఁడు. కాని, పాపము! జనులెల్లరును వానిని దుర్యో ధనుఁడని భ్రమించి, సతీత్వము గక్షించు కొనుటకయి శీఘ్రమ చితి నుఱుకవలయునని ద్రౌపదిని బలవంతపఱచుచున్నారు. పాపము, ద్రౌపది, చేయునదిలేక, మృతులగు భీమార్జు నులకు తర్పణము లాచరించి, పాండువం శాంకురమగు ఉత్తరాగర్భస్థశిశువును రక్షించు కొమ్మని సుభద్రకు చెప్పి, ప్రాణత్యాగము నకు సంసిద్ధురాలగుచున్నది. ప్రజ లాందో ళితమనస్కులగునట్లు, దుర్యోధనుఁడని యెంచఁబడిన భీముఁడు సమయమునకు వచ్చి ద్రౌపది నట్లే నిలుపుచున్నాఁడు. దైవాధీన ముగ నందఱును భీముని గుర్తుపట్టుచున్నారు. కృష్ణార్జునులు వారిని గలసికొని చార్వాకుని కపటోపాయములను వివరీకరించుచున్నారు.

భీముఁడు

చంచద్భుజభ్రమిత.........

అను తనప్రతిజ్ఞ జ్ఞాపకమున్నదా యని ద్రౌపది నడుగుచున్నాఁడు. ఆమెయు నత్యా హ్లాదమున

స్మరామ్యనుభవామిచ.

అని ప్రత్యుత్తర మొసఁగుచున్నది.

శిరియఁబోసిన కేశపాశమును ముడుచు కొనుమని భీముఁడు ద్రౌపది నడుగుచున్నాఁడు. కాను భీముఁడు వేణీసంహార మొనరించు నానందము ననుభవింపఁగోరి, ద్రౌపది యుక్తి యుక్తముగ,

విస్మృతాస్మి తం వ్యాపారం నాథస్య ప్రసా దేన పునరపి శిక్షయిష్యామి.

అనుచున్నది; అని సఫలీకృతమనోరథ యగుచున్నది

ద్రౌపది ప్రథమమున భీముని భయంకరసంకల్పమును ప్రోత్సహించి యతని కోపా నలజ్వాలలను విజృంభింపఁజేయుచున్నది.

కాని, కార్యనిర్వహణసమయము వచ్చినపు డామెయే రానురాను అబలాజనసహజమగు భయమున మునుఁగుచున్నది. ధీరుఁడగు యుధిష్ఠిరుఁడే చార్వాకుని మాయాజాలములోఁ జిక్కి బెగడొందుచుండ, నబలయగు పాంచాలి యెట్లన్యథా వర్తింపఁగలదు? నిజమగు ప్రేమ లేనిపోని యిక్కట్టులకు వెఱచుట సహజమే (అతిస్నేహః పాపశంకీ).

ఇంతకును, ద్రౌపది మానవ స్త్రీయే కదా! మన బలాబలములను మనతో పోల్గొననిమెడల ద్రౌపది నిజప్రకృతికి విరోధముగ వర్తించిన ట్లగునుగదా!



చంపకదేవి జలపాతము, కుత్తాలము

—యస్. శంకరసుబ్రహ్మణ్యం.

# మడ్డుకత - ప్రశంసాలేశము

సాహిత్యవిద్యా-ఉభయభాషా-ప్రవీణ, బులుసు వేంకటరమణయ్య

" కులముతక్కువవారు కుమతులుకారు
కులముతక్కువవారు కులటలుకారు;

* * * *

చదువున కర్థంబు జ్ఞానంబుగాని
చదురైన యక్షరజ్ఞానంబు కాదు; "

[ మడ్డుకత ]

ధర్మాధర్మములను, మంచిచెడుగులను, జాతి మతాచారములనుబట్టి నిర్ణయింప వీలు లేదు. కొన్ని జాతిమతాచారము లుత్తమ ములు, మఱికొన్ని యధమములు నని తలం చుట పొరపాటు. గుణోత్కృష్టములగున వన్నియు నుత్తమము లగును; గుణములులేని యపు డెట్టి కులములైనను నీచము లనియే చెప్పకతప్పదు. సత్యధర్మప్రియుఁడగు భగవం తుఁడు జాతిమతాచారములను ప్రేమింపఁడు. అట్లే చదువునకును, జ్ఞానమునకును పరస్ప రము సంబంధము లేదు. చదివిన మూర్ఖుని కంటె చదువరికాని జ్ఞాని యెన్నియో మడుం గులు మేలు.

అనశ్వరములగు కీర్తిప్రతిష్ఠలు సత్య ధర్మములపై నాధారపడియున్నవి. ఎట్టికుశాగ్ర బుద్ధికిని సత్యాన్వేషణ మొనర్చుట చాల దుర్ఘటము. సూక్ష్మాతిసూక్ష్మములగు ధర్మా ధర్మముల తత్త్వమును నిర్ణయింపఁ గోరి మన పెద్దలు కొందఱు ప్రాచీనకాలమునందే కొన్ని విషయములగు పరీక్షలను నిర్ణయించినట్లు ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.

ఇట్టిపరీక్షలు ఎపుడు ప్రారంభింపఁబడి నవో చెప్పుట కష్టము. కౌటిలీయార్థశాస్త్ర మున ముద్దాయి తాను నిర్దోషియని స్థిరపఱచు టకు సాక్ష్యమును, శపథమును నుపయోగింప వలెనని చెప్పఁబడియున్నది. స్మృతివాఙ్మయ మున మీఁదిశపథమునకే కొంతబలము కూర్పఁ బడినది. అపరాధి బ్రాహ్మణుఁడైనచో, " సత్య ముతో నోట్టుపెట్టుకొనుచున్నా " నని చెప్ప వలసినట్లును, క్షత్రియుఁడైనచో ఆయుధాశ్వ ములతో నోట్టుపెట్టుకొనవలసినట్లును, వైశ్యుఁ డైనచోఁ బసువులను, ధాన్యములను, బంగార మును ముట్టి ప్రమాణము చేయవలసినట్లును, శూద్రుఁడైనచో నెనిమిదంగుళముల పొడవు కల్గి, ఎనిమిది పలములయెత్తు గల్గిన యినుపకణి కను, ఎఱ్ఱగఁ గాల్చినదానిని చేత నుంచుకొని కాని, నీట మునిఁగికాని, వేర్వేఱుగ భార్యా పుత్రాదుల శిరసులు ముట్టి కాని ప్రమాణము చేయవలసియున్నట్లును మనుస్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

అగ్నివలన నతనిచేయి కాలి పొక్కక పోయినను, నీటమునింగినయతఁడు తేలక యున్నను, భార్యాదులతలలపై చేయి నుంచు నపుడు స్వల్పకాలమున రోగము కలుగ

కున్నను శూద్రుఁడు నిర్దోషియగునఁట! అపరాధముయొక్క హెచ్చుతగ్గులం బట్టి యీ శపథములు మాఱుచుండును.

క్రమముగ నీశపథము పరీక్షగ మాఱి పోయినది. యాజ్ఞవల్క్యస్మృతియందు, మితాక్షరమునను ఈ పరీక్షలు దివ్యపదాంకితములయి యెనిమిదివిధములుగఁ జెప్పఁబడినవి:

౧. తులాదివ్యము: అపరాధి నొకసారి తూఁచి, పిదప మంత్రములను పఠించి మఱల తూఁచవలెను. అపు డతఁడు తక్కువతూఁగినచో నిరపరాధి యగునని నిశ్చయము.

౨. అగ్నిదివ్యము: ఇదివఱకుఁ జెప్పిన రీతిగ నపరాధి నగ్నిపరీక్ష చేయవలెను. అగ్ని వలన నతనికి హానికలుగనిచో అతఁడు నిర్దోషి యగును.

౩. జలదివ్యము: జలశపథమురీతినే జలదివ్యమును గ్రహింపవలెను. అపరాధిని జలము తేల్చకపోయినచో నతఁడు నిరపరాధియగును.

౪. విషదివ్యము: అపరాధిచేఁ గొన్ని విషమాత్రలను దినిపింపవలెను. లేదా, యొక కుండలో నేదైనవస్తువును, పామును ఉంచి వస్తువును పైకి తీయవలెనని యతనిఁ గోరవలెను. తినినవిషము వాని కపాయముఁ గలిగింపకున్నను, పాము వానిని కఱవకున్నను అతఁడు నిర్దోషి యగును.

౫. కోశదివ్యము: సమంత్రముగ దేవాభిషిక్తమగు నుదకము మూఁడుదోసిళు లపరాధి త్రాగవలెను. పదునైదురోజులలో రాజకీయమునుగాని, దైవికమునుగాని విపత్తు నాతఁడు పొందకున్న నతఁడు నిర్దోషి యగును.

౬. తండులదివ్యము: శుచియగు పరీక్షకుఁడు తెల్లగఁ గడిగిన బియ్యమును సూర్యాభిముఖుఁడై యొకమట్టికుండలో స్నానోదకములతోఁగూడఁ బోయవలెను. పిదప అపరాధికి స్నానము చేయించి తలపై నొక ఆకు నుంచి, వానిచే బియ్యము నమలించి వేఱొక యాకుపై (పిప్పలపత్రముపైఁగాని, భూర్జపత్రముపైఁ గాని) ఉమియింపవలెను. అపరాధి మూతి ఎఱ్ఱగఁగాకున్నను, దౌడలు చీరుకొనిపోకున్నను అతఁడు నిర్దోషి యగును. ఈ మీఁది దివ్యమును చౌర్యవిషయముననే అవలంబింపవలెను.

౭. తప్తమాషకదివ్యము: ఒకమూకుడులోఁ జముడుపోసి సలసలఁ గ్రాఁగనిచ్చి యందు నాణెములనుగాని, బటువునుగాని పడవేయవలెను. అపరాధి తనచేతిని పూర్తిగ నాచముడులో ముంచి వస్తువును బయటికిఁ దీయవలెను. అపు డతనిచేయి కాలక—పొక్కిపోకయున్నచో నతఁడు నిర్దోషి యగును.

౮. ధర్మాధర్మదివ్యము: ఒకవస్తువునకు ధర్మమనియు, వేఱొకదాని కధర్మమనియుఁ బేర్లు మనసున ననుకొని పరీక్షకుఁడు పరీక్షితుని, ఏదైన ఒకదానిని స్పృశింపఁ గోరవలెను. అపరాధి ధర్మసంజ్ఞకమును ముట్టినచో నిర్దోషి యగును.

ఫాలదివ్యము మొదలగునవి మఱికొన్ని యిట్లే కలవు.

విషయముయొక్కయు, కాలముయొక్కయు భేదమును, తారతమ్యమును బట్టి యీ పరీక్షలు మాఱుచుండును. ఇయ్యవి స్త్రీపురుష సాధారణములే యైనను, సామాన్యముగ స్త్రీల విషయమునందే యుపయోగింపఁబడు చున్నట్లు తెలియుచున్నది. ఈ పరీక్ష లిప్పటికిని మన దేశమునఁ గొన్నికొన్ని స్థలములయం దాచారమున నున్నవి.

ఖండాంతరముల సంగతి యెటులున్నను భరతఖండమునమాత్రము సత్యము, పాతివ్రత్యము మొదలగు నుత్తమధర్మములకుఁ దగినప్రాధాన్యము కలదు. భార్యకు భర్తయే దైవము. పతి యెంతకఠినహృదయుఁడైనను, తన్ను బాధించుచున్నను భారతరమణీమణి యతనియాజ్ఞ నుల్లంఘింపదు. సర్వదా అతనిని మెప్పించుటకే ప్రయత్నించును. అట్లే భర్తయుఁ దనభార్యను శరీరమునందలి సగపాలుగఁ దలంచును. "జంపతి - దంపతి" అను పదములందుఁగూడ ధ్వనితమగు మీఁది తత్త్వము గోచరించుచున్నది. పతివ్రతలగు వనితలు తమ పాతివ్రత్యమును నిర్ణయించుకొనుట కెట్టికఠినపరీక్షలకైనను వెనుదీయరు. వేయేల? పరమపతివ్రతామతల్లియగు సీతాదేవియే మండునిప్పులో నురికినదిగదా!

జాతిమతాచారములతో సంబంధములేని యిట్టియుత్తమధర్మము నొక యథార్థచరిత్రముతో మేళవించి శ్రీమంగిపూడి వేంకటశర్మ గారు "మద్దుకత" యను నీచిన్నిగ్రంథము నాంధ్రలోకమున కర్పించుచున్నారు. ఒక యెఱుకపడుచు తనసతీత్వమును బ్రకటింపఁ దలఁచి యిదివఱకుఁ జెప్పఁబడిన విషమపరీక్షలలో నొకటియగు "తప్తమాషకదివ్యము" నకు గురియై కృతార్థయైనయంశ మిందు వర్ణితము

ఒకయెఱుకని కిరువురు భార్యలు. వానికిఁ జిన్నభార్యయెడ మక్కువ యెక్కువ. ఒకప్పుడామె యెఱుకచెప్పుటకు వాడవాడలఁ దిరుగు సమయమున పెద్దయామె సవతియగునామెపై లేనిపోని కొండెములు కల్పించి యామెసతీత్వమునకుఁ గళంకము కల్గించి మగనితోఁ జెప్పి యతనిని నమ్మించినది. అతఁడు వానిని నమ్మి చిన్నదానిని దిట్టరానితిట్లు తిట్టెను. ఏపాపము నెఱుంగని యాసతీమణి తనసతీత్వమును సమర్థించుకొనఁ దప్తమాషకపరీక్ష నిచ్చి జయము పొంది మగనిమన్ననకుఁ బాత్రమైనది. ఇదియే యిందలి కథాభాగము. కథ చిన్నది; కాని యిందువలన లోకము నేర్వఁదగిన నీతిమాత్రము మిక్కిలి పెద్దది.

కావ్యమునకు రసము ప్రధానము. కవిత యన్నివిధముల రసాభివ్యంజకమై యుండవలెను. ఇందలి సవతులపోరు, సంధ్యాకాలము, రాత్రి, చీఁకటి మొదలగువాని వర్ణనములు, నుడికారముసొంపు రసమున కత్యంతము ననుకూలములు.

# నాగార్జునకొండ-బౌద్ధస్తూపచిత్రములు



౮. స్తూపము వెలుపలిగోడ (✕ గుర్తుగలచోట బుద్ధుని శిల్పముగల బరణి దొరకినది.)



౭. శిల్పముగల ఆయక స్తంభము

ఇందు ఎఱుకసాని సత్యపరాక్రమమును వ్యక్తపఱచినందున నిది ధర్మవీరప్రధానక మగుచున్నది. వీరగాథలు సామాన్యముగ ద్విపదలు, వానితోడి దగ్గఱిబాంధవ్యముగల పదములు మొదలగు ఛందములలో రచింపఁ బడిననే రసావహము లగును. "పల్నాటివీర చరిత్రము", "బొబ్బిలియుద్ధము" మొదలగు వీరగాథ లట్లే కూర్పఁబడియున్నవి. కావున నీకథారచనము మంజరీద్విపదయందుఁ జేయఁ బడుట యొంతేయు సమంజసము.

ఆంధ్రదేశమునకుఁ జిరపరిచితులగు శ్రీ శర్మగారి రచనాచాతురిని పేర్కొనుట చర్వితచర్వణము. లలితలలితమగురీతుల జాను తెలుఁగునఁ గబ్బములు వ్రాయువారిలో వీ రగ్రగణ్యులు.

"ఓసోసి వగలాడి! యో వాడవదినె"
"బయలెక్కఁబో నీదు బాజారమెల్ల"
"మననేస్తమును జూచి మనమన్కిఁజూచి
కన్నుగుట్టిన చెడ్డకామిని యెవతొ"
"ఏమనికూసితివే యోసిబసివి!"
"మగఁడును నీవు మమ్మైకమ్ము చెంద"
"ఓసిగరాన! ఓసోసి పిసాళి!"
"ఈలాటి సూడు నీ కేలనే సవతి!"

ఇట్టి జాతీయ ప్రయోగములతో నీచిన్ని కావ్యము నిండియున్నది.

మఱియు వీ రేకావ్యమును రచించినను నీతిని ముఖ్యముగఁ బాటింతురు. ఇందలి సతీ ధర్మోపదేశ మమూల్యము. ఇట్టి నీతిజాతీయ తలమేళవింపు మనకు వీరి "బాలవితంతువిలాపము", "నిరుద్ధభారతము" మొదలగు కావ్యములయందును గానవగును. ఈమద్దుకతయం దచ్చటచ్చట "ఓసోసి, ఎవతొ, ఎంతున్న, గతేమానో, మున్నగు వ్యాకరణాసాధ్యము లగు ప్రయోగములు కానవచ్చుచున్నను, రసతన్మయులగు కవి, సహృదయుల కవి నెఱసులని తోఁచదు. రసాభివ్యక్తి కడ్డంకులగు ప్రయోగములే దుష్టములని సహృదయుల యాశయము. రసతన్మయులగు కవు లచ్చటచ్చట వ్యాకరణశృంఖలలఁ ద్రెంచుకొని స్వేచ్ఛావిహార మొనర్చుట వాఙ్మయప్రపంచమున గలదు.

ఆంధ్రమున కన్నివిషయములందునుఁ బ్రత్యేకత కలుగవలెనను వాంఛ యిప్పుడిప్పుడే యాంధ్రులహృదయభూమి నంకురించుచున్నది. అనేకులగువిద్వాంసు లీవిషయమున నుపన్యాసము లిచ్చుచున్నారు; కాని యవి క్రియారూపముఁ దాల్చుట యరుదుగనున్నది. అట్టి ప్రత్యేకతాభిమానులు రచించుగ్రంథములుకూడ సంస్కృతపదభూయిష్ఠములై ప్రత్యయమాత్రప్రత్యేకతనే యాంధ్రమునకు గూర్చుచున్నవి. తెలుఁగుబాసకు సంపూర్ణముగఁ బ్రత్యేకత కలుగవలెనన్న "మద్దుకత" వంటిగ్రంథములు–సర్వజనవేద్యములు, భావవిలసితములు, లలితాంధ్రపదగుంభితములు–ఎన్ని యేని కావలసియున్నవి. సహృదయులు,

పండితులు నగునాంధ్రులిట్టి గ్రంథములను రచించి భాషకు వన్నెగూర్చుటకై సర్వవిధ ముల సత్వరముగఁ బ్రయత్న మొసరించుట ఆవశ్యకము.

ఈమద్దుకత సదుపదేశకము; నీతిదాయకము ; ఉత్సాహాభివర్ధకము ; భావవిలసితము; ముఖ్యముగ సులలితాంధ్రపదగ్రథితము. దీనిని పఠించినచోఁ బలువిధములగు మనోభావములు ద్రిక్తములై కార్యసాధనమునఁ బట్టుదలను అంతకంటె నెక్కువగ తేనియలొల్కు తెనుఁగునుడికారపు సొంపును గుర్తించుటలో మిగుల బీదపడియున్న నేటివిద్యార్థుల యాంధ్రభాషా జ్ఞానసంపదను వృద్ధిపఱుపఁగలదు కావున నీగ్రంథము స్కూలుఫైనలుతరగతికి అవశ్య పఠనీయ గ్రంథముగ నిర్ణయింపఁబడవలసి యున్నది.

శ్రీ శర్మగారిట్టిగ్రంథములను పెక్కింటిని రచించి పలువురకు మార్గదర్శకులై సంస్కృత వాఙ్మయభూయిష్ఠమైనామమాత్రముగ మిగిలి యున్న ఆంధ్రవాఙ్మయమునకు జీవమును, జవమును సమకూర్చి ప్రత్యేకతను సంపాదింతురుగాక !

---



చంపకదేవి యాలయము, కుత్తాలము

—యస్. శంకరసుబ్రహ్మణ్యము.

# ప్రేమపాశం

(అనువృత్తము)

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## మూడోరంగం

[ నూతిపెరట్లో రాచవుసిరిచెట్టుకింద ప్రకాశం కూచునివుంటాడు. కాంతమ్మ నుంచునివుంటుంది.]

కాంతమ్మ—గడుసుదికనక రత్తమ్మవొదిన కదిపి వెళ్లిపోయింది. చాలాఆశగానేవుంది.

ప్రకాశం.—ఆశ్చర్యమా అక్కయ్యగారూ? అయిదుయకరాలభూమి, పైగా యకరం నారింజతోట, యకరం కొబ్బరితోట, యకరం నిమ్మతోట, సందుకు పెట్టిలాంటిమేడ. పిల్ల చక్కనిచుక్క. యేంలోటూ?

కాంతమ్మ — అన్నీవున్నాయి. ఆమహారాజే గొంతుకోక్కశారు. భూమ్మీద యేదీవుండిపోదండీ. అన్నీ అయిపోతాయి. బంగారం పెళ్లిఆగదు. ఆవేళ కెవరో దానికి తగినవాడు—తగినా తగకపోయినా ఘటనవున్నవాడు—

ప్రకాశం—ఎవరిఅదృష్టం బాగుందో చెప్ప లేము. రత్తమ్మగారు సరేకదా? కోటమ్మగారు మొదశ్శే బేరం మొదలుపెట్టిందాయె. ఆర్యాపురంలో వొక బట్టలవర్తకుడు ఆశచూపించాడు మొన్న.

కాంతమ్మ—యెవరికిచ్చినా చిట్టితల్లిని విడిచి వుండలేనండీ అన్నయ్యగారూ!

ప్రకాశం—ఎందుకువుండాలీ అసలూ. అల్లుణ్ణి యింటోకే తెచ్చుకోవచ్చు.

కాంతమ్మ—అదే చూస్తున్నానండీ.

ప్రకాశం—మీవుద్దేశం యేమిటి అక్కయ్య గారూ?

కాంతమ్మ—యిప్పటికేమీ లేదు. నాకాధ్యానమే నిలవడం లేదూ. ప్రపంచకం యేమీ తెలవడంలేదండీ.

ప్రకాశం—ఆశ్చర్యమా అమ్మా? కాని బంగా రానికి యీడువచ్చింది. ఇక ఆపడానికివల్లకాదు.

కాంతమ్మ— పెనిమిటిపోవడమూ, కూతురు పెళ్లీనీ. చూశారా అన్నయ్యగారూ? ఎలాగాభరించడం?

ప్రకాశం—గోరుచుట్టుమీద రోకలిపోటన్నట్లు- యేంచెయ్యగలమూ? అనుభవించడంతప్ప వేరేదారి లేదు.

(అప్పుడు బంగారమ్మవస్తుంది)

బంగారమ్మ—వెంకమ్మత్తగారు భోజనంచేసీ దాకా విడిచిపెట్టారుకారు. ఈపూట యిక అకల్లేదే అమ్మా!

కాంతమ్మ—పోనీలేఅమ్మా! ఒదిన నువ్వంటే ప్రాణంయిస్తుంది. అన్నయ్యగారిసంగతి చెప్పనే అక్కర్లేదూ.

ప్రకాశం—ఇలారాకోడలా!

కాంతమ్మ— మామయ్యగారిదగ్గిర కూచో అమ్మా!

బంగారమ్మ—ఎందుకండీ మామయ్యగారూ? (అంటూ ప్రకాశందగ్గిర కూచుంటుంది.)

ప్రకాశం—మీరాయనుబావ తెచ్చిన మిఠాయి అంతా తినేశావా, కొంచెంవుంచావా?

బంగారమ్మ — బాగుందికాదండీ. బ్రాహ్మణ దుకాణంలోది కాదుట. నిలవసరుకులా వుంది, చూస్తారా?

ప్రకాశం—అంటే?

బంగారమ్మ—పుచ్చుకుంటారా?

ప్రకాశం—బాగుంటే పెట్టకేపోదువు.

బంగారమ్మ — పెట్టకపోడానికి బాగుండడం యేదీ? నాకరకం చూశాడు రాయడుబావ: కాక పోయినా బజారునుంచి తెచ్చింది తింటారు కామోసు మీరు.

ప్రకాశం—మిఠాయికేంగానీ; రాయడుబావ బాగున్నాడా కోడలా?

కాంతమ్మ—రాయడుబావ బాగున్నాడా, వెంకన్న బావ బాగున్నాడాతల్లీ?

బంగారమ్మ—వాళ్లిద్దర్నే అడిగావేం?

కాంతమ్మ—అదోజట్టూ. వెంకన్న పోకుండలు తెచ్చాడు. రాయడు మిఠాయితెచ్చాడు.

ప్రకాశం—ఇంకాయెవరున్నారూ అడగడానికి?

బంగారమ్మ—యెవరేనా వుంటారు.

ప్రకాశం—అడిగినవాళ్ల సంగతి చెప్పమంటే యెవరో వున్నారంటావేం?

కాంతమ్మ—అడిగినదానికి జవాబుచెప్పుతల్లీ!

బంగారమ్మ—యిద్దరికీ తేడావుంది.

ప్రకాశం—ఏమిటది?

కాంతమ్మ—మాతల్లి చాలాదూరం ఆలోచిస్తుందండీ. సరిగ్గాచెప్పమ్మా.

బంగారమ్మ—మట్టిబెడ్డవొకటే, గాజుపూస వొకటేనీ.

ప్రకాశం—అంటే?

బంగారమ్మ—కొండముచ్చువొకటే, పండుకోతి వొకటేనీ.

ప్రకాశం—అసలే తెలవలేదూ.

బంగారమ్మ—గాడిదవొకటే, గుఱ్ఱంవొకటేనీ.

కాంతమ్మ—అదేమిటితల్లీ? తెనిగించిచెప్పమ్మా.

బంగారమ్మ—ఏంవుందనిచెప్పమంటావే? పీనుగు వొకటే, ఏనుగు వొకటేనీ.

ప్రకాశం—ఏనుగు మంచిదేకదూ?

బంగారమ్మ—సింహందగ్గిర యేనుగు తీసికట్టు కాదుటండీ మామయ్యగారూ?

ప్రకాశం—సింహంయెవరూ?

బంగారమ్మ—మీరిద్దర్నే అడిగారు మరి.

కాంతమ్మ—నొరకదు మా అమ్మ.

ప్రకాశం—ఇప్పు డడుగుతున్నాను. సింహం యెవరో చెప్పు.

బంగారమ్మ—ఎందుకోసమోచెప్పండి.

కాంతమ్మ—రాయడుబావని పెళ్లాడతావా తల్లీ?

ప్రకాశం—పోనీ, వెంకన్న బావనో?

బంగారమ్మ—(చురచురచూస్తూ కళ్లల్లో నీళ్లు పెట్టుకుంటుంది.)

ప్రకాశం—అదేమిటి బంగారం? కోపం వచ్చిందా? యేం?

బంగారమ్మ—నాకర్మం (దుఃఖిస్తుంది.)

కాంతమ్మ—అడిగింది యిష్టమోకాదో చెప్పాలిగాని యేడుస్తారా తల్లీ? ఇలారా అమ్మా!

(తెరలో: 'బంగారం! తలుపు')

బంగారమ్మ—మాపేరుభట్టుబావతో చెబుతానుండండి. (కళ్లు నులుముకుంటూ వెళ్లిపోతుంది.)

కాంతమ్మ—చూశారా అన్నయ్యగారూ?

ప్రకాశం—నాదేతప్పా. అందమూ చందమూ, కష్టమూ సుఖమూ, మంచీచెడ్డా తెలిసినపిల్ల. తారతమ్యం బాగాకనిపెట్టింది. వెంకన్న పీనుగూ, రాయడు యేనుగూనా? పైగా సింహంవుందా? అతగాడెవరూ? కనిపెట్టారా అక్కయ్యగారూ?

కాంతమ్మ—పేరుభట్టేనండీ.

ప్రకాశం—అవునవును. సందేహం లేదు. మనం చేసిన నేరం అతనితో చెబుతుందట. యెంతతీవ్రమైన ఆఘాతమూ? అక్కయ్యగారూ! కోడలు చూపు మంచిచోటేపడింది. సుఖపడతుంది.

కాంతమ్మ—ఏమంటారన్నయ్యగారూ?

ప్రకాశం—ఆలోచించవద్దు.

కాంతమ్మ—మీరేదిక్కు నాకూ నాబిడ్డకీనీ.

ప్రకాశం—అందరికీదిక్కు భగవంతుడున్నాడు. మరోసమ్మంధం చూడవద్దు.

కాంతమ్మ—మీయిష్టం.

ప్రకాశం—వాళ్ల సంభాషణ వినాలి.

కాంతమ్మ—పదండి.

(ఇద్దరూ వెళతారు)

## నాలుగోరంగం

[బంగారమ్మ తలుపుతీస్తుంది పేరుభట్టు లోపలికి వస్తాడు.]

పేరుభట్టు—మొగం అలావుందేం? ఏంబంగారం అలావున్నావేం?

బంగారమ్మ—(మొగమువంచుకుని దుఃఖిస్తుంది)

పేరుభట్టు — అదేమిటిబంగారం? (ఆమెని పొదివిపట్టుకొని అక్కడవున్న బల్లమీదకూచుని ఆమెని కాళ్లలో యిరికించుకొని ముంగుర్లు దువ్వుతూ) ఊరుకో. యెందుకేడుస్తావూ?

బంగారమ్మ—(మరింత దుఃఖిస్తుంది.)

పేరుభట్టు—చూడమా! ఇంతదుఃఖం యెందుకు వచ్చిందీ? ఎవరేంచేశారూ?

బంగారమ్మ—మాఅమ్మా, ప్రకాశంమామయ్యగారూ—

పేరుభట్టు—ఏంచేశారూ?

బంగారమ్మ—మాఅమ్మ రాయణ్ణిపెళ్లాడతావా అంది. వెంకన్నని పెళ్లాడతావా అన్నారు మామయ్యగారు.

పేరుభట్టు—అయితే?

బంగారమ్మ—ఏడుపువచ్చింది.

పేరుభట్టు—వారలాఅడిగితే ఆడతాననో, ఆడననో కచ్చితంగా చెప్పెయ్యాలిగాని యేడవడం యెందుకూ?

బంగారమ్మ — నన్ను వెంకణ్ణి పెళ్లాడమంటారా?

పేరుభట్టు — అంటే?

బంగారమ్మ—ఛా! వెంకన్న చచ్చుపెద్దమ్మ. రాయడు—మొగంనిండా స్ఫోటకంమచ్చలూ వాడూ గంటేసిన తిరగటిరాయిలాగ యేంబాగున్నాడూ?

పేరుభట్టు—నాకక్కర్లేదని చెప్పలేకపోయావా యిష్టం లేకపోతే?

బంగారమ్మ—వాళ్లకి తెలవగూడదూ?

పేరుభట్టు—వేళాకోళాని కన్నారేమో.

బంగారమ్మ-ఇలాంటిదా వేళాకోళం అంటేను?

పేరుభట్టు—(స్వగతం) బంగారాని కిష్టంలేదు కనక మనకి వెంకన్నపోటీగాని, రాయడుపోటీగాని వుండకపోవచ్చు. అయితే వాళ్లపోటీ లేకపోతేమాత్రం నామీద యిష్టంకలగవద్దూ?......ఇదంతా యిష్టం లోనే జమఅవుతుందా?......ఒకబెంగ తీరింది. చివరికి అన్నిబెంగలూ ఇలాగే తీరిపోగూడదూ?

బంగారమ్మ—బావోయి! వోమాటు వెంకన్న నన్ను పెళ్లాడతానంటూ (నవ్వుతూ) పో-కుం-డ-

పేరుభట్టు—ఏంచేశాడూ?

బంగారమ్మ—పోకుండలు (నవ్వి) నాకోసమే తెచ్చాట్ట. హిహిహీ. అవేమిటిబావా?

పేరుభట్టు—అది పూర్వకాలపు పిండివంట. ఇప్పుడది తీసికట్టు. అప్పుడు నువ్వేంచేశావూ?

బంగారమ్మ—"పో అవతలికి. ఇంకానుంచుంటావేం" అన్నాను.

పేరుభట్టు—తప్పుగాదూ?

బంగారమ్మ—లేకపోతే నన్ను పెళ్లాడతానంటాడేం? చెయ్యి పట్టుకోపోయాడుకూడానూ.

కంయిమనేటప్పటికి అడిలీ బేజారై పోయాడు. వాడికి కాళ్లుకడుక్కోడానికి నీళ్లుకూడా యివ్వాలిటనేను.

పేరుభట్టు—పాపం ఆశించివచ్చాడు కాబోసు, యివ్వలేకపోయావా?

బంగారమ్మ—వస్తాడు, వస్తాడు. సిగ్గులేకపోతే సరీ.

పేరుభట్టు—సిగ్గెందుకూ బంగారం?

బంగారమ్మ—మాయింటో దాసీదాని కూతు రేనా వాణ్ణి పెళ్లాడదు.

పేరుభట్టు—రాయణ్ణో?

బంగారమ్మ—వూరుకో బావా! మళ్లీ అడిగా వంటే నాకు కోపంవస్తుంది. మామయ్యగారితో యివాళ మాట్లాడను. ఇవాళరాత్రి మాఅమ్మదగ్గిర పడు కోను.

పేరుభట్టు—(ముక్కుమీద వేలుపెట్టుకొని) యెంతతప్పూ? నువ్వలా చెయ్యవచ్చునా?

బంగారమ్మ—నన్నలాఅనడమేం?

పేరుభట్టు—వారికి నీమీదకోపమా?

బంగారమ్మ—కోపంకాదు. నిజమే. వేళాకోళం అయితేమాత్రం అలాగాచెయ్యడం?

పేరుభట్టు—నువ్వలా పంతంపట్టుకుని కూచో కూడదు.

బంగారమ్మ—యివాళ అస్తమానూమానేసి, రేపు పొద్దున్న చీకటితోలేవెళ్లి దణ్ణంపెట్టి, యెప్పుడూ అలా అనవద్దని మాట్లాడతానులే.

పేరుభట్టు—నువ్వు నేనుచెప్పినమాట విన్నదేదీ యిందులో?

బంగారమ్మ—వూరుకుందూ బావా నువ్వూ.

పేరుభట్టు—నాతో మాట్లాడ్డంకూడా మానే స్తావాయేమిటి?

బంగారమ్మ—అ-మ్మ-బాబో! నిన్నుచూడక పోతే నేవుండలేనూ.

పేరుభట్టు—హాయిహాయి! (గుచ్చి కౌగిలించు కొని) దయవుందికనక. అయితే నామాటవినవూ?

బంగారమ్మ—యింతపట్టు పడుతున్నావేమిటి బావా యివాళా?

పేరుభట్టు—తప్పుకాదూ?

బంగారమ్మ—(చిరునవ్వుతో) పట్టుపట్టడ మేనా?

పేరుభట్టు—అవును. మాట్లాడవని.

బంగారమ్మ—అదాఅమ్మా? ఓహో!

పేరుభట్టు—యిలాచూడూ.

బంగారమ్మ—యేం? (చూస్తుంది)

పేరుభట్టు—మాబంగారం నామాటవింటుంది. తీసెయ్యదు. ఆవీథిని అలాచెప్పుకుంటున్నారు.

బంగారమ్మ—వాళ్లబంగారం వొక్కొక్క ప్పుడు వాళ్లపేరుభట్టుబావమాట వినకపోవడంకూడా వుందని ఆర్యాపురంలో చెప్పుకుంటున్నారు బావోయ్!

పేరుభట్టు—చూశావా? పోనీ.

బంగారమ్మ—ఆ. పోనీ. పోనీ. మాట్లాడ తానులేబావా! ఏం?

పేరుభట్టు—నువ్వు నాకు నచ్చినదానవు. మీ అమ్మ నువ్వు మాట్లాడకపోతే అన్నంతింటుందా? పచ్చిమంచినీళ్లేనా తాగుతుందా? ప్రకాశంగారు యెన్ని విధాల కనిపెడుతున్నారూ? ఆయనతో మాట్లాడక పోతే కృతఘ్నతకామా?

బంగారమ్మ—మాట్లాడతానన్నాను కాదూ? ఈదండకంఅంతా యెందుకూ యింకా?

పేరుభట్టు—అయితేసరే, నేను స్నానంచేసి వస్తా నింటోకిపద.

బంగారమ్మ—నూతిదగ్గిర చెయ్యిబావా? నేను నీళ్లుతోడతానులే.

పేరుభట్టు—నువ్వు నీళ్లుతోడితే నీచేతులు లాగు తాయి బంగారం!

బంగారమ్మ — నీకుతోడితే యెంతో బాగుంటుందిబావా! ఎన్ని నీళ్లైనా తోడెయ్యగలను యించక్క. మరిలే. సబ్బు తెస్తాను పద నూతివగ్గిరికి.

పేరుభట్టు—నువ్వువచ్చేదాకా నేను నీళ్లు తోడుతూవుంటాను. ఏం ?

బంగారమ్మ—నేనొప్పుకోను, నేనే తోడతాను. నీళ్లుతోడాకే సబ్బు తెస్తాను. రా. (చెయ్యి పట్టుకుంటుంది.)

పేరుభట్టు—తోడుకోనులే, సబ్బుపట్టుకురా.

బంగారమ్మ—(చెయ్యివిడిచిపెట్టి, రెండడుగులు వేసి) తోడుకున్నావంటే నేను వొప్పుకోనుసుమా, నన్ను చంపుకుతిన్నట్లే. వొట్టుపెట్టనా ?

పేరుభట్టు—దీనిపేరేమిటో ?

బంగారమ్మ—మరినువ్వు తోడుకుంటాననడమేం ? (వెళ్లిపోతుంది.)

పేరుభట్టు— (చొక్కావిప్పుతూ) బంగారం భావం యేమిటి ? నేను భ్రాంతిపడుతున్నానా? నా దగ్గిర యేంవిశేషంవుందీ?.........చివరికేమయినా పెండలాడే అట్లోయి సో తేలిపోతే బాగుండును. (వెళ్లిపోతాడు.)

(అప్పుడు కాంతమ్మా, ప్రకాశమూ వస్తారు)

ప్రకాశం—యెంతకోపంవచ్చిందీ కోడలికీ ?

కాంతమ్మ—యేమీ యెరగనిపిల్ల. మరోలాగ అనుకోకండి అన్నయ్యగారూ !

ప్రకాశం—అనుకోడంయెందుకూ ? నేనన్నది తప్పుమాటే.

కాంతమ్మ— (చేతులుజోడించి) తండ్రిలేని పిల్ల. తప్పుపట్టుకోకం డన్నయ్యగారూ !

ప్రకాశం — అదేమిటక్కయ్యగారూ ? ఇందులోతప్పుకి యేంవుందీ ? నేనే మాట్లాడిస్తాను ముందు.

(అప్పుడు సబ్బుపెట్టెపట్టుకొని బంగారమ్మ వడిగావస్తుంది)

బంగారమ్మ—పదబావా! (చూసి) మాబావ యేడండీ మామయ్యగారూ ?

ప్రకాశం—నేను చూడలేదమ్మా.

బంగారమ్మ—యేమేఅమ్మా ?

కాంతమ్మ—నూతికి వెళ్లాడుతల్లీ !

బంగారమ్మ—నీళ్లుతోడుకుంటున్నాడు కామోసు. అలాచేస్తే యెరగడూ ? (వెళ్లిపోతుంది.)

కాంతమ్మ—బిడ్డ తప్పుదిద్దుకుంది. క్షమించాలి మీరు.

ప్రకాశం—అలాఅనకూడదు మీరు. బంగారం క్షణక్షణమూ నన్నోడించేస్తోంది. ఏమీ సమాధానం చెప్పలేకుండావున్నాను. నాకు చాలా ఆనందంగా వుంది.

కాంతమ్మ—ఆశీర్వదించండి.

ప్రకాశం—అవశ్యమూనూ. మరి బజారులో పనివుంది వెళ్లివస్తాను.

కాంతమ్మ—వెళ్లిరండన్నయ్యగారూ !

ప్రకాశం—భోజనంచేసి మళ్లీ కనపడతానులెండి. (వెళ్లిపోతాడు.)

కాంతమ్మ—(స్వగతం) చిట్టితల్లి వరస యిలా వుంది. (దుఃఖంతో) తండ్రిలేనిపిల్ల అయిపోయింది.

(తెరదించాలి)

## అయిదోరంగం

[హాలులో బీరువాపక్కన బంగారమ్మ కూచుని వుంటుంది. సుమ్మంయొక్క సూటిగాచూస్తూ లోపలి తలుపుకేసి వెళ్లేవారికి ఆమెకనపడదు.]

బంగారమ్మ—పాపం నిన్నరాత్రల్లా కష్టపెట్టాను బావని. మొదట బద్ధకించాడు; గాని చివరికి మూడుకాలాలూ ఫిడేలుమీద అలవాటయిందాకా నేర్పాడు పాపం. శ్రీరాగంవర్ణం మాబాగావుంది. ఇది బావపాడితే మరీబాగుంటుంది. అతను ఫిడేలు మీదవాయిస్తే—వూరికే పాకిపోతుంది. బావ యెంత

మంచివాడూ? నాకోసం యెంత కష్టపడుతున్నాడూ? వారాలు చేసుకుంటాడు; కాని యెన్నివిధాల బతిమాలినా—తనే యెదర బతిమాలుతాడుకూడాను. ప్లీడర్లూ, వుద్యోగస్థులూ, భాగ్యవంతులూ పిలిచి భోజనం పెడుతూవుంటే కాళ్లతో తన్నేసుకోడంకానయితే మంచిదికాదు. నిజమే. అయితే కల్లీబొల్లీమంటూ కబుర్లుచెప్పుకుంటూ అతనిదగ్గిరకూచుని తిందామంటే నాకు యోగం లేకుండావుంది. ఎప్పుడో వొకమాటు యీమాట నోరుజారి అనేటప్పటికి లడ్డూ, హల్వా, మైసూరుపాకూ, బాసండీ, జహాంగీరూ—యిలాంటివి తెచ్చి, వొళ్లోకూచోబెట్టుకుని "మరితినూ, కభుర్లు చెప్పూ" అంటూ కవ్వించడం మొదలుపెట్టాడు. యెంతమంచివాడమ్మా బావా? పాటపాడేటప్పుడు ఆ కళ్లు తిప్పుకుంటూవుంటే, ఆకంఠం ఖంగుమనిమోగుతూ వుంటే, ఆకథలు చెబుతూవుంటే—బావని విడిచివుండడంకష్టమే.

(అప్పుడు పేరుభట్టు వొకకండువాలచాపు పట్టుకొనివస్తాడు.)

బంగారమ్మ—(స్వగతం) అదుగో బావ. కాస్సేపు మాట్లాడకుండా కూచుంటాను. ఏంచేస్తాడో చూద్దాం. ఆకొత్తబట్టయేమిటో?

పేరుభట్టు—(స్వగతం) ఇంకాభోజనాలు కాలేదు. తలుచుకోందీ యివాళ యీవిందునాకు. కండువాలచాపు చాలామంచిదీ. (చూసి) నేలంకండువాలా యేమిటి? ఆఅడావడిలో చూడేలేదూ తిన్నగాను. భేష్! బంగారానికి వల్లెవాటువేసుకోడానికి మహా బాగుంటాయి! ఇవాళ రథసప్తమికనక యీపండుక్కికూడా యేదో కొత్తవస్తు విచ్చినట్లవుతుంది. బాగానే కుదిరిందిపదకం......ఇచ్చిందాకా తోచదూ. పిలిస్తే తొరగానేనా అన్నంతినివస్తుంది. (తలుపు నెమ్మదిగా తట్టి) బంగారం!

బంగారమ్మ—(స్వగతం) అప్పుడే పలగ్గూడదు.

పేరుభట్టు—(మళ్లీ తట్టి) ఓరత్నమాణిక్యం!

బంగారమ్మ—(స్వగతం) ఇంకా యేమంటాడో అననీ. ఏదో తెచ్చాడు. అందుకోసమే యీతొందర.

పేరుభట్టు—ఓవెండీ!

బంగారమ్మ—(స్వగతం) చివరికి తగరంఅనీ, సీసంఅనీ అంటాడేమో కొంపతీసి.

పేరుభట్టు—(మళ్లీ తట్టి) మామయ్యకూతురా!

బంగారమ్మ—(స్వగతం) మార్చేశాడు ఇంకా యేమంటాడో?

పేరుభట్టు—(మళ్లీ తట్టి) మరదలా!

బంగారమ్మ—(స్వగతం) యిదీ బాగానేవుంది.

పేరుభట్టు—యింటోవున్నట్టా, లేనట్టా?

బంగారమ్మ—(స్వగతం) చెప్పుకో చూస్తానూ.

పేరుభట్టు—బావమరిదీ!

బంగారమ్మ—(స్వగతం) ఇది మరీబాగుంది. ఇకపలికేస్తాను. పాపం బావకి గొంతుకు నెప్పిపెడుతుంది.... పోనీ, యింకా స్తసేపు చూస్తాను.

పేరుభట్టు—ఓరేబావా!

బంగారమ్మ—(స్వగతం) ముద్దినుసుపేర్లూ పెడుతున్నాడు పాపం. ఇంకోమాటుకూడా చూస్తాను. పోనీ పలికేస్తే? ఉండటం కష్టంగా వుంది......ఇంకా యెంతచక్కనిపేర్లు పెడతాడో పెట్టనీ.

పేరుభట్టు—నాసంగీతపాఠకురాలా!

బంగారమ్మ—(స్వగతం) తనకంటేనా?

(తెరలో)

వాకిట్లో లేదుటోయి?

పేరుభట్టు—లేదత్తా!

(తెరలో)

దొడ్లోవుందేమో యింకోమాటుపిలు. లేకపోతే నేను చూసివస్తానుండు.

పేరుభట్టు—(మళ్లీ తలుపుతట్టి) బంగారంపంతులుగారూ!

బంగారమ్మ—(తటాలున లేచివచ్చి) యెందు కండీ పేరుభట్టు శాస్త్రుల్లుగారూ!

పేరుభట్టు—ఇందాకణ్ణుంచీ యెక్కడున్నావు చిలిపిల్లా?

బంగారమ్మ—అప్పుడే చత్వారంవచ్చిందా యే మిటి పెంకిపిల్లాడా?

పేరుభట్టు—ఏంచేస్తున్నావూ మరి పలక్కుం డానూ?

బంగారమ్మ—(ఎదటికివచ్చి రెండుచేతులూపట్టు కొని) నువ్వేంచేస్తావో చూద్దామని వూరుకున్నాను బావా! సట్టుకిపడి వూరుకున్నానుగాని మహాకష్టం అయిందిసుమా! అదేమిటిబావా?

పేరుభట్టు—నీకోసమే తెచ్చాను యీకొండువాల చాపు. వల్లెవాటు వేసుకోడానికి బాగుంటాయేమో చూడూ.

బంగారమ్మ—(పుచ్చుకొని చూస్తూ) నిక్షేపంలా వున్నాయి; కాని యెప్పుడూ యేమీ తేవద్దంటే యెం దుకు తెచ్చావుబావా?

పేరుభట్టు—కొన్నానా యేమిటి?

బంగారమ్మ—మరెలా వచ్చాయమ్మా?

పేరుభట్టు—ఆవీధిని వొకప్లీడరుగారి కొడుక్కి పెళ్లి. ఇవాళ జామార్లుకట్టుకున్నారు. అవతలా ప్లీడరు గారే, యివతలాప్లీడరుగారే. ఇద్దరికీ నామీద అభి మానమే. వీరు కూడా తీసుకువెళ్లారు. వారు ఆదరించి బహుమతీ యిచ్చారు.

బంగారమ్మ — నువ్వు నాకు బహుమతీ చేస్తున్నావు.

పేరుభట్టు—నువ్వు పరీక్ష చేస్తున్నావు.

బంగారమ్మ—నాకోసం అస్తమానూ డబ్బు ఖర్చుపెడుతూ వుంటే చెయ్యనాయేమిటి?

పేరుభట్టు—చేస్తే చేశావుగానీ, వల్లెవాటు వేసుకురా ముందూ.

బంగారమ్మ—వేసుకుంటానుగాని ఆపెళ్లిలో నువ్వేంచేస్తావు బావా? ఆడపెళ్లివారిలో చేరతావా, మొగపెళ్లివారిలో కూడతావా?

పేరుభట్టు—రెండువేపులా పెద్దనే నేనూ. అయి తే: నాపెళ్లిలో నువ్వేంచేస్తావో చెప్పూచూద్దాం.

బంగారమ్మ—నేనా—నేనా—మరీ—మరీ—

పేరుభట్టు—తొరగా తెల్చూ.

(తెరలో)

నీతో కూడా పెళ్లిపీటమీద కూచుంటుంది.

(సరిగ్గా యీసమయంలో ప్రకాశంవస్తాడు. బంగా రమ్మ చెయ్యివిడిపించుకొని యింట్లోకివెళ్లిపోతుంది.)

ప్రకాశం—ఏంచేస్తావు కోడలా? నుంచో— వెళ్లిపోతావేం?

పేరుభట్టు—ఎంతమంచిమాటా? ఎన్నాళ్లకి విన పడిందీ? ఎంత అనుగ్రహంవచ్చిందీ అత్తకిప్పటికి? చాలు నాకిది. నేను పుణ్యమే చేసుకున్నాను. నాబంగా రం నాకు తక్కింది.

(అప్పుడు కాంతమ్మ బంగారమ్మని చెయ్యి పట్టుకు తీసుకువస్తుంది).

కాంతమ్మ—అంతసిగ్గెందుకే? బావకొత్తవాడా యేమిటినీకు? ఇంతాకటిదాకా యెలాంటిబావో యిప్ప డుమాత్రం అలాంటి బావకామా పేరుభట్టు నీకూ? "పేరూ" అనివొకమాటూ, "భట్టూ" అనివోమాటూ, "నీపేరు భట్టూ" అని యింకోమాటూ, "మాబావపేరు భట్టూ" అనిమరోమాటూ, "భట్టుపేరు బావా" అని యింకొకమాటూ—యిలాగ చెవులుపట్టుకుని ఆడించేదా నవు కాదుటే, ఇప్పుడు సిగ్గుపడతావూ! సమయానికి పిలిచినట్టు మామయ్యగారుకూడా వచ్చారు దణ్ణం పెట్టమ్మా! (అని అతనిదగ్గిరికితీసుకువెళ్లి) ఇలాఅన్నా నన్న—య్యగారూ! నావిద్ద అతనికి తగిందికాదు గానీ—

ప్రకాశం—చాలా మంచిపనిచేశారండీ అక్క య్యగారూ! వరుడికితగినవధువూ,—వధువుకితగిన వరు డూనూ. ఇకతాహతా—?

పేరుభట్టు—అది నేను సందేహించవలసిన విషయం. ఎటుచూసినా బంగారానికి నేను తగను—కానీ—

ప్రకాశం—అక్కయ్యగారి మాటా మీమాటా గూడా నాకు లెక్కలేదు. ఏమంటే? మాకోడ లిదివరకి వొకపేనునునీ, వొకయేనుగునీ యేరిపారేసింది ఇక యెక్కడో సింహంవుందిట. ఆసింహం యెవరో యిప్పుడు తేలాలి. ఏంకోడలా? యేమంటావు? సింహం—

కాంతమ్మ—(మందహాసంతో) చెప్పవేతల్లీ!

బంగారమ్మ—(తలవంచుకొని చిరునవ్వునవ్వి వూరుకుంటుంది.)

ప్రకాశం—చెబితేగాని నేను వొప్పుకోను. ఇదివరకి మాట్లాడితే నన్ను వోడించేసేస్తున్నావు. యిప్పుడు—

కాంతమ్మ—తప్పుకాదుటే అలా వూరుకుంటావూ? చెప్పమ్మా!

బంగారమ్మ—(అలాగే చిరునవ్వు నవ్వుతూ వొకమాటు మొగంయెత్తి ప్రకాశానికి నమస్కారంచేసి మళ్లీ తలవంచుకొంటుంది.)

ప్రకాశం—ఇందాకా మీఅమ్మగారు దణ్ణం పెట్టమన్నందు కిప్పుడైనా పెట్టావు. సంతోషమే. కాని చెప్పేదాకా నేను వొప్పుకోను.

కాంతమ్మ—పోనీ, చెప్పలేకపోతే చూపించు తల్లీ!

బంగారమ్మ—(చిరునవ్వుతో పేరుభట్టుకేసి చూసి మళ్లీతలవంచుకొంటుంది.)

ప్రకాశం—అన్నా! ఎంతదానవై నావుకోడలా? ఎక్కడ, యెప్పుడు నేర్చుకున్నావూ ఈసిగ్గంతానూ? వెంకన్నబావని కంయిమని కసిరినప్పు డీసిగ్గంతా యేమైపోయిందీ?

కాంతమ్మ—అన్నయ్యగారూ! మీకుసమాధానం చెప్పగలదా నాబిడ్డా?

ప్రకాశం—ఇంతకంటే యేం చెప్పాలీ? యెవరు చెప్పగలరూ? చాలామంచిపని చేశారు మీ రక్కయ్యగారూ! ఈమాట వినడానికి నేను చాలారోజులనుంచి యెదురుచూస్తున్నాను. పేరుభట్టుగారు మీయింటికి మొట్టమొదట భోజనానికి ఉండిపోయినరాత్రి బావగారూ నేనూ యీమాటే అనుకున్నాం. బావగారి వుద్దేశాన్ని మీరు అక్షరాలా నెరవేర్చారు.

కాంతమ్మ—ఆయనవుంటే యెంతఅందంగా వుండు నన్నయ్యగారూ యిప్పుడూ!బిడ్డ కెన్నిముచ్చట్లు తీరును? అంత అదృష్టం నాకు లేందే తండ్రీ!

పేరుభట్టు—నామాట చెప్పండి బాబుగారూ! మావాళ్లకీ మామామయ్యగారికీ చాలారోజులనుంచి మాటల్లేవు. నేను విజయనగరంలోనూ, అక్కడా వుండిపోయాను కనక విరోధంతో సంబంధం లేకపోయినా—దూరదృష్టి లేకపోవడంచేత యీవూళ్లో వుండికూడా—బంగారం ఆవేళపిలవడం యిలాంటి అదృష్టం నాకు సంభవిస్తుందనడానికి సూచనకామోసు—

కాంతమ్మ—పేరుభట్టు పిలవగానే వస్తాడని మాకెంతమాత్రమూ నమ్మకం లేదు. తీరా పిలిస్తే చిన్నపుచ్చుకోవలసివస్తుందేమోనని బిడ్డని వద్దనికూడా మేం బోధించాం; కాని అది—

పేరుభట్టు—బంగారం పిలిచినప్పుడు సమ్మంలోకి రావడానికి మొదట నాకు మొగంచెల్లిందికాదు. ఏమంటే? మొదట నేను పలకరించవలసినవాణ్ణి. అలా చెయ్యనందుకు సిగ్గుపడిపోయి తటపటాయించాను. మామయ్య నన్ను పిలిచి సిగ్గుపోగొట్టాడు కనక—యింతకీ అప్పుడు బంగారం నన్ను తానై పిలవడం వరంయిచ్చినట్లుంది.

ప్రకాశం—నిజంగా యీసంతోషం అంతా నాదీ. ఏమంటే? బంగారాన్ని పెళ్లాడ్డాని కనేకమంది వుబ్బితబ్బిబ్బవుతున్నారు. కోటమ్మగారి మాటకేంగాని రత్తమ్మగారు తపస్సే చేస్తున్నారు. ఇంకా యిద్దరు ముగ్గురు నాస్నేహితులుగూడా వూగిసలాడుతున్నారు; గాని భగవంతుడు మీయిద్దరికీ ఘటనకూర్చాడా లేదా అని నేను తహతహలాడిపోతున్నాను. ఇంకోపిల్ల మీకు

పనికిరాదు. ఇంకోపిల్లాడు బంగారానికి పనికిరాడు. మీదాంపత్యం దేవతలికికూడా లోభంపుట్టించగలదు.

కాంతమ్మ—అన్నయ్యగారూ! మీబావగారి వుద్దేశం నేను చాలామట్లు గ్రహించాను. ఆయన యీ సంగతి నన్ను మనస్సులో పెట్టుకోమన్నారు. అయితే పేరుభట్టువొప్పుకుంటాడో వొప్పుకోడో—

పేరుభట్టు—బంగారాన్ని తిరస్కరించడమంటే మానవత్వం లేదన్నమాట. హృదయంగలవాడెవడూ నీకూతుర్ని వద్దనలేడు. పైగా మీసపాటివారి మర్యాదని గురించీ, ఔదార్యాన్ని గురించీ, సాంప్రదాయాన్ని గురించీ యెవరికీ సందేహాలుపుట్టవు. బాబుగారూ! నిజంచెబుతున్నాను నేను. రాయడుకోసం మారతమ్మ పిన్నీ, వెంకన్నకోసం మాకోటమ్మవొడ్డమ్మ చేసే ప్రయత్నాలు నేను చాలామట్లు చూశాను. దాంతో నాకు మనస్సుమనస్సులో వుండటంలేదు. బంగారం యెక్కడ పైకిదాటిపోతుందోఅని నేను నిద్రాహారాలెరక్కుండా తపించిపోతున్నాను.

కాంతమ్మ—నాయనా! ఏంచెప్పనూ? నేనేం చెప్పగలనూ? దిక్కులేనివాళ్లకిలాంటి కోరిక లుండకూడదు. నిజంచేత తాహతుమాలినపరుసులు మంచివి కావుగాని—.అయినా ఆశకి అంతమూ తారతమ్యమూ తెలవదుకాదూ? కట్నా లివ్వలేను. కానుక లివ్వలేను. ముద్దుమురిపాలు తీర్చలేను. పండుగనాడు పప్పూ అన్నమూ అయినా సరిగ్గాపెట్టలేను. నాపిల్లని నీ కిస్తున్నాను. అందం లేకపోయినా, తెలివితేటలు లేకపోయినా, మేనమామకూతురుగనక అభిమానించుకొని, నాచిట్టితల్లిని (బంగారమ్మచేతిని పేరుభట్టుచేతిలో వుంచి) అన్నయ్యగారూ! ఆశీర్వదించండి.

ప్రకాశం—సర్వేశ్వరుడు ఈనూతనదంపతులికి సకలసంపదలూ సమకూర్చుగాక. అక్కయ్యగారూ! ఈశుభసన్నివేశాన్ని యింతటూకీగా ముగించకూడదు. మీవొదిన్ని తీసుకువస్తాను. తాంబూలాలు యిప్పుడే అయిపోవాలి.

కాంతమ్మ—అలాగే చెయ్యండన్నయ్యగారూ!

పేరుభట్టు—అవకాశంవుంటే చెప్పండి బాబుగారూ! నాస్నేహితుల్ని పిలుచుకునివస్తాను. రెండుగంటలు వ్యవధివుంటే అన్నీ సక్రమంగా జరిగించవచ్చు.

కాంతమ్మ—ఆలోచించండన్నయ్యగారూ!

ప్రకాశం—పంచాంగంచూసి చెబుతాను. (గోడనున్న పంచాంగంతీసిచూసి) బాగుంది. సాయంత్రం ఆరున్నరగంటలవేళ అమృతఘడియలు వస్తాయి. అప్పుడు ముహూర్తంకూడా రాసివుంది. యీలోపుగా తరవాయిలన్నీ తీర్చుకోవచ్చు. పేరుభట్టుగారూ! మీరు వెళ్లి అదేదోచూడండి.

పేరుభట్టు—చిత్తం. (కాంతమ్మకీ, ప్రకాశానికీ పాదాభివందనంచేసి వెళ్లిపోతాడు.)

కాంతమ్మ—బజారుకివెళ్లి జామారుకూడా తెస్తారా అన్నయ్యగారూ?

ప్రకాశం—అలాగేతెస్తాను. ఈలోపుగా మీరు కోడలికి అభ్యంగనం చేయించండి. పేరుభట్టుగారికి మాయింటో చేయిస్తాను. మరి వెళ్లివస్తాను. (వెళ్లిపోతాడు)

కాంతమ్మ—రావేతల్లీ! (బంగారమ్మచెయ్యి పట్టుకొని యింటోకి తీసుకువెడుతుంది.)

## ఆరో అంకం

### మొదటిరంగం

[భద్రయ్యబస. పేరుభట్టు రెండుచేతులతోటీ ద్వారబంధపుకమ్ములు పట్టుకొని యివతలే నుంచుని వుంటాడు. భద్రయ్య వొకకండువాకోసం రైలుసంచీ తిరగవేస్తూవుంటాడు.]

భద్రయ్య—ఆవేళ నువ్వు నన్ను కొట్టినంతగా సకలహంగామా చేశావు; కాని చివరికి నామాటే నిరుకయింది చూశావా?

పేరుభట్టు—నీకు పరేంగితజ్ఞానం యింతగా వుందన్నమాట.

భద్రయ్య—ఇంకా వొప్పుకోవాయేమిటి?

పేరుభట్టు—ముమ్మాటికీ వొప్పుకోను. నువ్వు ఆవేళ ఆమాట అనడం చాలాతప్పు. అప్పుడు నాస్థితి యెంతసున్నితంగా వుండిందో యిప్పటికికూడా నీకు బోధపడలేదు. ఇక కట్టిపెట్టు ఆప్రస్తావన.

భద్రయ్య—నేను కట్టిపెట్టను. అప్పుడు నే నామాటే అనివుండకపోతే మీఅత్తకి బంగారాన్ని నీకివ్వాలనే ఆలోచనే కలక్కపోవును. ఈసంగతి నువ్విప్పటికికూడా గ్రహించలేకపోయావు. (ఒకకండువా తీసుకొని రైలుసంచీతాళం వేసేసి) అంతా నీప్రయోజకత్వంవల్లనే నెరవేరుతోందని గర్విస్తున్నావుకాబోలు పాపం. వేషాలు చాలించు.

పేరుభట్టు—అంటే యీసమ్మంధం నువ్వే—

భద్రయ్య—నేనే కుదిర్చానని ఘంటాపథంగా చెప్పవచ్చు; చెప్పగలనుకూడాను. సందేహమేం?

పేరుభట్టు—సెబాస్! చాలా సంతోషించాను. అయితే యీకార్యంకూడా నువ్వేగట్టెక్కించి యీమాట కూడా తక్కించుకో.

భద్రయ్య—నువ్వలాకోరుతూవున్నపుడికఆలోచనకూడా యెందుకూ? చూసుకో యెంతదర్జాగా—అంటే—

పేరుభట్టు—డబ్బుకూడా మాటతక్కిస్తినా—

భద్రయ్య—తక్కిస్తునా, తక్కించి చూపిస్తునా?...... ఎందుకూ? (కండువా జందెప్పేట్టుగా వేసుకొని సవరించుకొంటాడు.)

పేరుభట్టు—తక్కించినంత మాట అన్నావు. అంతేచాలు. ఈనాలుగురోజులూ నాకూడా తిరిగితివా వన్నూలయినసొమ్మంతా నువ్విచ్చినట్లే జమ.

భద్రయ్య—అయితే, దానికి ఖర్చుపద్దుకూడా చెప్పు, అదెలావుంటుందో విందాం.

పేరుభట్టు—"దంపతుల వివాహ మహోత్సవ సమయమందు బ్రహ్మశ్రీ—

భద్రయ్య—ఆ! ఆ! కొంచెం వుండూ. (ఆలోచిస్తాడు)

పేరుభట్టు—పోనీ మహారాజశ్రీ—

భద్రయ్య—ఏదీ రెండూ కలుపూ.

పేరుభట్టు—బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ—

భద్రయ్య—పూరుకుంటావేం?

పేరుభట్టు — బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ, శ్రీయుత—

భద్రయ్య—(చెయ్యిజాడిస్తూ) బ-లే బ-లే!

పేరుభట్టు—వేమూరి భద్రయ్యఅనే భద్రాద్రి రామచంద్రశాస్త్రి పంతులు మహాశయులుగారు వధువుకి కంఠాభరణం నిమిత్తమూ, వరుడికి హస్తాంగుళ్యాభరణం నిమిత్తమూ—

భద్రయ్య—ఏం? మొత్తం చదివేసెయ్యావోయ్!

పేరుభట్టు—అది నువ్వు లేల్చండే.

భద్రయ్య—అయితే, యింతవరకూ వచ్చాక యిక చచ్చేందుకూ? వెయ్యిన్నూటపదహార్లు అనేసెయ్యి.

పేరుభట్టు—ఔదార్యం అంటే అలావుండాలి. నిజంగా చేతిలో డబ్బున్నవాడింతమాట అనగలడా?

భద్రయ్య—అనగలడా కాదు. ఎవరేనా అంటే కూడా వినగలడా? అను.

పేరుభట్టు—వహవ్వా!.....పురాణధోరణిలో పడ్డాక సమయస్ఫూర్తి యెలా హెచ్చవుతోందో చూశావా?

భద్రయ్య — అదంతా నీచలవే. మరి నేను తయారూ.

పేరుభట్టు—నే నరుగే దిగాను.

(ఇద్దరూ గదిదాటి యివతలికి వస్తారు. భద్రయ్య గదికి తాళం వేసి శకునం చూస్తాడు.

పేరుభట్టు—చూడ నక్కర్లేదు. పూర్ణకుంభ ద్వయం!

భద్రయ్య—వా! నెత్తిమీదబిందెలు తొణక్కుండా మహాశివిగా నడుస్తున్నారోయి నాయన పిల్లలూ. జేబు నిండించవన్న మాటే యివాళ. చూస్తావేం. అడుగువెయ్యి ముందుకి.

పేరుభట్టు—యస్మివో నామరూపాభ్యాం—

భద్రయ్య—యాదేవీ సర్వమంగళా.

పేరుభట్టు—తయో స్సంస్మరణా త్పుంసాం—

భద్రయ్య, పేరుభట్టున్ను — సర్వతో జయ మంగళమ్.

( ఇద్దరూ గుమ్మందిగి వెళ్లిపోతారు )

రెండో రంగం

[ కాంతమ్మయింటో పేరుభట్టు గది. జేబులో వున్న మూట తీసి, విప్పి, అందులో ఉన్న రూపాయలు చిక్కంలో పోస్తాడు.]

పేరుభట్టు— (స్వగతం, గర్వంతో) పేరుభట్టంటే రాజమహేంద్రవరంలో యింత గ్యాతఉందా? మూడురోజుల ఫూటకీ నాలుగువందలయెన్భైరూపాయలు వసూలా? చెట్టు దులిపినట్లే. పాతికరూపాయలు లిగామపద్దూ. యాభైలు సర్వసామాన్యం. పెద్దమెట్టు నూటపదహార్లు. ఇంకో అయిదారువందలకి తక్కువ వస్తాయా?......సన్నాయి అలాగా, భోగంమేళం అలాగా యేర్పాటయిందికదా? భేష్! ఇంకేం? ఫరవా లేదు. పెళ్లి సలక్షణంగానే జరుగుతుంది. ( చిక్కం సూటుకేసులో వుంచి ) అత్తకి నేను సంపాదిస్తున్నానని తెలుసు. కాని పరిమితి తెలవదు. ముందుముందు నేను బాగా సంపాదించగలననీ, సంసారం లోటు లేకుండా నిర్వహిస్తానని అనుకొంటూనే వుంది; కాని యిదివరకే బాగా జాగ్రత్తపడ్డానని బాగా యెరగదు. మనప్రయోజకత్వం వొక్కమాటు ఆనికికి చూపించాలి. కనక పొట్టంకూడా పైకితీద్దాం. ( ట్రంకుఅడుగునుంచి వొకపొట్టం తీసి తూచడం అభినయిస్తూ ) మహాలక్ష్మీ! తెల్లవారి లేచి రోజూ వొక్కమాటు మొక్కితే యెక్కడికి వెళ్లినా యింత అన్నం దొరుకుతుంది. (రెండు చేతులతోటీ పట్టుకొని కళ్లకద్దుకొని) బంగారం యిప్పటిదాకా బావ బాగా పాడతాడనీ, అందంగా ఉంటాడనీ, సుఖపెడతాడనీ సంతోషిస్తూనేఉంది. అయినా ఆబావ వొట్టొట్టిబావ కాడని ఆమెకికూడా తెలియచెయ్యాలి. ఈపొట్టం చూసిందంటే ఆమె పొంగిపోతుంది. (ఆపొట్టంకూడా సూటుకేసులో పెట్టి మూటు నొక్కి, ట్రంకుతాళం వేసి సూటుకేసు పుచ్చుకొని బయలుదేరతాడు. )

(హాలు, మేడమీదనుంచి వస్తూ బంగారం కూడా పేరుభట్టులాగే అప్పుడే హాలులో అడుగుపెట్టి, పేరుభట్టుని చూసి సిగ్గుచేత వెనక్కి జంకుతుంది; కాని పేరుభట్టు ఆమెని గభీమని రెక్కపట్టుకొని బల్లదగ్గిరికి తీసుకువెళ్లి, సూటుకేసు బల్లమీద పెట్టి ఆమెని కాళ్లతో పెనవేసి బల్లమీద కూచుంటాడు. బంగారం విడిపించుకోడానికి ప్రయత్నిస్తూవుంటుంది. కాని చాలా సున్నితంగానే పెనగులాడుతుంది.)

పేరుభట్టు—(ఆమెమొగంమీద మొగంపెట్టి) ఏం? నీకూ నాకూ మాటలు లేవూ?

బంగారమ్మ—(తల వంచుకొంది. ఆనందం మొగంఅంతా ఆవరించివుంది; కాని మాట్లాడదు.)

పేరుభట్టు—(మెల్లిగా) ఇక్కడ యెవరూ లేరులే. దూరాన్నుంచేనా యెవరూ చూడ్డం లేదు. ఇలాచూడూ. (గడ్డంకింద చెయ్యిపెట్టి మొగం పైకెత్తుతాడు.)

బంగారమ్మ—(వెళ్లిపోడానికి చేసే ప్రయత్నాలు మానేస్తుంది. కదలదు; కాని కళ్లు మూసుకుంటుంది.)

పేరుభట్టు—మొగం పైకెత్తితే కళ్లుమూసుకుంటుం దేమిటో? (కళ్లమీదవూది) ఏం? ఈమాటు ఏం చేస్తావూ?

బంగారమ్మ—(చూడదు. కదలదు.)

పేరుభట్టు — చక్కలిగిల్లి పెడితే యేం చేస్తావూ? (పెడతాడు.)

బంగారమ్మ—(అతని చేతుల్లోనే యెగిరెగిరి పడుతూ గునుస్తూ) చూడవే అమ్మా!

పేరుభట్టు—మీఅమ్మ వచ్చి యేంచేస్తుందేమిటి నన్ను? బుద్ధిపూర్వకంగా నిన్ను మీఅమ్మే యిచ్చేసిందినాకు. మునపటిలాగ నే నిక జంకుతా ననుకున్నావేమో? మాచెల్లెలి నప్పగించానంటే అది పెళ్లయి అత్తారింటికి వెళ్లేదాకా ముక్కు నేలబెట్టి రానేస్తుంది. కనక యిలాచూడు. వోమాటు చూడు. ఏదీ? కొంచెం. ఇంకా కొంచెం. (మెల్లిగా మొగం పైకెత్తుతాడు.)

బంగారమ్మ—(మళ్లీ బాగా కళ్లు మూసేసుకుంటుంది. నవ్వు వస్తోంది. కాని అణుచుకొంటుంది. అయినా పెదిమెలు విడతాయి. దంతాలు కొంచెం కనపడతాయి.)

పేరుభట్టు—నవ్వుతోంది. వచ్చేస్తోంది. పెదిమెలచివరికి వచ్చేసిందికూడానూ. దొంగా! అణుచుకొంటున్నావా? ఏదీ? (గడ్డంపట్టుకొని బతిమాలుతూ) పైకి రానిచ్చెయ్యి. వొక్కమాటు. వొక్క క్షణం.

బంగారమ్మ — (మొగం వంచుకొంటుంది. అప్పుడు కాంతమ్మ వచ్చి మాట్లాడకుండా నక్కుతూ లోగుమ్మంలో నుంచుంటుంది. పేరుభట్టు అది కనిపెడతాడు; కాని చూడనట్టే వుంటాడు.)

పేరుభట్టు—(బంగారమ్మ మొగం పైకెత్తుతూ) మామయ్యకూతురవుగా మాత్రమే వున్నప్పుడు 'బావా, బావా' అంటూ యేమీ తోచనిచ్చేదానవుకాదు. పెళ్లయాక యేంవొరగతోస్తావో కాని యిప్పుడు మాట్లాడం, చివరికి కళ్లతోచూడ్డమే మానేశా వేంపుణ్యమే? పేరుకాకుండా పలుకే బంగారం అయిపోయిం దేమిటే కుందనబ్బొమ్మా!

కాంతమ్మ—జవాబు చెప్పమ్మా! తప్పుకాదూ? (బంగారమ్మ వులిక్కిపడుతుంది; కాని ఆలాగేనుంచుంటుంది)

పేరుభట్టు — చూశావా అత్తా నీకూతుర్ని? క్షణంలో యెంత పెంకితనం వచ్చిందీ దీనికి? ఇలా అయితే కష్టమే. బతిమాలడం నాచేతకా దేమనుకున్నావోగానీ. చిలకలాగ కులుకుతూ, హంసలాగ తక్కుతూ, పావురంలాగ తారుతూ చలాకీగా వుంటేగాని నాకు పనికిరానుమరి.

కాంతమ్మ—సిగ్గుపడకమ్మా! మునపటి పేరుభట్టుబావేకదుటే? కొత్త యేంవచ్చిందీ యిప్పుడూ? తిన్నగా కూచోతల్లీ వొళ్లోను.

బంగారమ్మ—(పలకదు. కదలదు)

పేరుభట్టు—ఇలా కాదు ఉండవమ్మా అత్తా! ఇక వొట్టొట్టిమాటలు పనికిరావు కాబోలు నీకూతురికి. ఏదీ? ఆపెట్టె—పోనీ నన్నందుకోనియ్యి.

(పేరుభట్టు పెట్టె దగ్గిరికితీసుకొని తెరుస్తాడు. బంగారమ్మ వోరకంట చూస్తూ నుంచుంటుంది. కాంతమ్మ మహానందపడుతూవుంటుంది.)

పేరుభట్టు—అత్తా! నీకు చూపించడానికి నా దగ్గిర యేమీ లేదు; గాని—అయినా పెళ్లన్నాక వూరికే కాదుకనక—

కాంతమ్మ—ఇప్పు డెందుకోయి? కాకపోయినా నాకు చూపించే దేమిటే?

పేరుభట్టు—అలా కాదు. ఇంటిదగ్గిర నాకున్న ఆస్తి నీకు తెలవంది కాదు. అది నాకు తక్కుతుందని యేమీ ఆశ లేదు. ఇక నాకు రెక్కలే ఆధారం.

కాంతమ్మ—నీ తాత మామ రెక్కలే ఆధారం చేశారు. అయినా రాజమహేంద్రవరం ప్రవేశించాక మా కేమీ లోపం రాలేదు. రెక్కలు చల్లగావుంటే యిక లేనిదేమిటి నాయనా?

పేరుభట్టు—నే నలాగే ధైర్యం చెప్పుకొంటున్నాను. నీ ఆశీర్వచనంవల్ల నాకు సంగీతంలో కొంచెం పేరువచ్చింది. సాహిత్యంలోకూడా బుద్ధి ప్రసరిస్తోంది. దేవుడు మేలుచేస్తే నా కేమీ లోటుకలగకూడదు. కాని చదువుచూసుకొని మురుస్తూకూచుంటే సంపాదన—

కాంతమ్మ—నీసంపాదన నాకు తెలుస్తూనే వుంది. ఒక్కసంవత్సరంలో బంగారానికి నూటయాభై రూపాయలు ముట్టచెప్పావు. నీదగ్గిర యెంతాలేకపోతే అంత యివ్వగలవూ?

పేరుభట్టు—ఏమీలేనివా డేమీ యివ్వలేడు. నిజమే; కాని నేను బంగారానికిచ్చింది యేమంత గొప్పా? బంగారం నామీద చూపిస్తూవున్న దయకి నేను చేసినసేవ యేం సరిపోతుందీ? కాకపోయినా అదలావుండనియ్యి. రెండేళ్లయింది నాకు పెళ్లిచేసుకోవాలని సంకల్పం కలిగి. ఇప్పుడు కాకపోతే మరొకప్పుడేనా మావాళ్లు నాపెళ్లికోసం ప్రయత్నం చేస్తారు. మాఅమ్మతో తాసికలు చెప్పి మానిన్నన్నయ్య నాపెళ్లి పడగొడితే పడగొట్టావచ్చుహూడాను.

కాంతమ్మ—ఎంతెంతవిరోధాలుండినా అన్నదమ్ము లంతంతద్రోహం చేసుకుంటారా నాయనా?

పేరుభట్టు—కాకపోయినా జ్ఞానం వచ్చాక, యేదో ప్రయోజకత్వంహూడా కాస్త కలిగాక నాపెళ్లి భారం మరొకళ్లమీద యెందుకు వెయ్యాలీ.

కాంతమ్మ—అదీ మాట. ప్రయోజకుడిలక్షణం అదీ.

పేరుభట్టు — పెళ్లిమీద దృష్టికలగడంతోటే బాగా ఆలోచించాను. పిల్లనిచ్చేవాళ్లేంచూసియిస్తారు? పెళ్లాం వచ్చాక యేమిటి తినడం? తీరా అప్పుడు ప్రయత్నంచేస్తే డబ్బురావడం యెలాగ? ఇలాఆలోచించాటప్పటికి అంతా అయోమయంగా కనపడింది.

కాంతమ్మ—అంత ముందుచూపు యీకాలంలో యేపిల్లాడి కుందీ?

పేరుభట్టు—ఉండకపోతే తరవాత బోల్తాపడతాడు. పెళ్లాం తమలపాకులు తెమ్మంటే "మాఅమ్మనడిగి డబ్బుతెస్తా" నుండు అనాలి.

కాంతమ్మ—బాగా చెప్పావు.

పేరుభట్టు—అంచేత అప్పుడు పెళ్లిమీదికి పోయినదృష్టిని డబ్బుమీదికి మళ్లించాను. అందుకు ఫలితంగా యిదిగో యీకాసులు (పొట్లం విప్పిచూపిస్తూ) సంపాదించాను. ఇవి అరసై మూడు. కాసుపదమూడు—పద్నాలుగురూపాయలలో పడనకొన్నాను.

బంగారమ్మ—(కాసులకేసి వోరకంటచూస్తుంది.)

కాంతమ్మ—కాసులికి దణ్ణంపెట్టవే బంగారం.

బంగారమ్మ—(ఊరుకుంటుంది.)

కాంతమ్మ—చూసి వూరుకోగూడదమ్మా, పోనీ కళ్లకద్దుకో.

బంగారమ్మ—(సనిసినిసి నమస్కారంచేసినట్లు కాసులకేసిచూస్తూ, శిరస్సు వంచుకొంటుంది.)

కాంతమ్మ—నోట్లో ముక్క వున్నవాడవు. నీ కేంలోటు నాయనా?

పేరుభట్టు—ఇవి రూపాయలు. పాతికతక్కువ నాలుగువందలు. ఆకాసులతో నగలూ, యీరొక్కంతో ఖర్చులూ సరిపెట్టా లనుకొంటున్నాను.

కాంతమ్మ—చేతిలోవుంటేమాత్రం వున్నవన్నీ ఖర్చుచేసుకొంటే—మనం జమీందార్లముటోయి?

పేరుభట్టు—ఇది పూర్వపుసంపాదన. నీకు నామీద అనుగ్రహం కలిగిన తరవాత—అంటే బంగారాన్ని నా కిస్తా నన్నతరవాత మూడురోజులపూటలోనూ సంపాదించినవివీ. (ఇంకోమూటవిప్పి బల్లమీద పెడతాడు.)

కాంతమ్మ—నీకు అడ్డేమిటోయి? ఎక్కడికి వెళ్లినా యెలాంటివాళ్లనీ హూడా నువ్వు క్షణంలో లోపుచేసుకోగలవు.

పేరుభట్టు—ఇవి నాలుగువందల యెనభైరూపాయలు.

కాంతమ్మ—బాగుంది నాయనా!

పేరుభట్టు—ఇంకా ఆరువందల చిల్లరవాగ్దానాలున్నాయి. మంగళసూత్రమూ, ప్రోల్లో పెట్టవలసిన

పట్టుచీరా వొక జమీందారుగా రిస్తామన్నారు. వారిది వరకి—అంటే మొన్న సాయంత్రం నూటపదహార్లిచ్చారు.

కాంతమ్మ—ఎంతధర్మాత్ముల్లోయి వారూ?

పేరుభట్టు—పెళ్లి వారి పెత్తనమిాదేజరుగుతుంది.

కాంతమ్మ— ఆహా! సరసం అంటే అలా వుండాలి.

పేరుభట్టు—ఇంకా చాలామంది బట్ట లిచ్చేవా రున్నారు. ఇవి యిలావుండగా: వేంకటరాముడు సుర దక్షిణగా తనజట్టుతో వచ్చి అయిదురోజులూ—గృహ ప్రవేశం అయిందాకా సన్నాయి వాయించివెడతా నన్నాడు. తనతమ్ముణ్ణి ఫిడేలువాద్యంలో తయారు చేసినందుకు సంతోషంగా పరంజ్యోతి తనమేళంతో వచ్చి ఆరురోజులూ మేజువాణీ చేస్తానంది.

కాంతమ్మ—నీవన్నీ జమీందారీయెత్తులు. నీకు నే నేమి ముచ్చట్లు తీర్చగలనూ? మిామామయ్యవుంటే నీప్రయోజకత్వంచూసి పొంగిపోదురు. పిల్లా, నేనూ పెట్టిపుట్టలేకపోయాం. (కళ్లు తుడుచుకొంటుంది.)

బంగారమ్మ—(కళ్ల నీళ్లు పెట్టుకుంటుంది.)

పేరుభట్టు—(గద్గదికతో) ఆ మరదృష్టంఅంతా నాదీ. మామయ్యఆసరా చూసుకొని నే నెన్నోకల్ప నలు చేసుకొన్నాను. అన్నీ గాలిమేడ లయి పోయాయి

(వొక్కక్షణం యెవరూ మాట్లాడలేకపోతారు.)

కాంతమ్మ—పదిమాట్లు చెప్పడం యెందుకు నాయనా? నాబిడ్డకేనా, నాకేనా నువ్వే ఆధారం. నన్ను వొక్కకడుపున పుట్టిన తమ్ముడులాగ చూస్తు న్నావు నువ్వు.

పేరుభట్టు—ఎదటివాళ్లని త నెలాచూస్తే ఆయె దటివాళ్లు త న్నలాచూస్తారు. నన్ను నువ్వు తోడ బుట్టినవాణ్ణిలాగ చూసి, నేను నిన్ను తోడబుట్టినపడు చుని చూడవలసినట్లు చూసేలాగ చేశావు. ఇందులో నావిశేషం యేమిాలేదు. అదలావుండనియ్యి. కష్టం వచ్చినా, సుఖంవచ్చినా సంసారంలో యేదీ నిలిచి పోదు—

కాంతమ్మ—ఏం అడ్డింది నాయనా! పెనిమిటి పోయినా కూతురికి పెళ్లిచెయ్యడం తప్పిందికాదునాకు.

పేరుభట్టు—అది అంతాయింతాలోటా? ఈశ్వ రుడేనా తీర్చలేని దది.

కాంతమ్మ—అంతా 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' చేసుకోవాలి.

పేరుభట్టు—అంతే మరీ......ఇక చెప్పవలసిం దేమిాలేదు. పెళ్లిపేరు చెప్పి యింకా చాలాసంపాదిం చగలనని ధైర్యం వుంది. అది యెలావున్నా, ముం దీకాసులికి సరిపడేనగలికి పురమాయిద్దాం. ఏంబంగారం! ఏంకావాలి నీకూ? నీయిష్టం వచ్చిన నగలు చేయించ మంటావా, నాయిష్టంవచ్చినవా? కాసులు చూపిం చినా మాట్లాడకపోతే యింకెలాగా మరీ? వొక్క మాటు—నాకేసి కాదులే. ఈకాసుచూడూ. (మొగం పైకెత్తుతాడు.)

బంగారమ్మ—(కళ్లు మూసుకుంటుంది. ఆనం దం మొగంఅంతా కమ్మి వుంటుంది.)

కాంతమ్మ—సమాధానం చెప్పు తల్లీ! అత నం తగా బతిమాలేటప్పుడు మాట్లాడకపోతే మోటతనం అని పించుకోవూ?

పేరుభట్టు—ఇదివరకి నేను వుత్తో త్తిబావనే. ఇప్పుడు తాళికట్టబోతున్నాను కనక బతిమాలించుకో వాలి. ఆడపిల్లలికి యెలావస్తుందో యీగడసరితనం ఆశ్చర్యం కలుగుతుంది.

కాంతమ్మ—నేనుకనుక్కుంటానులే నాయనా!

పేరుభట్టు—అలాగే చెయ్యి. అది లోకధర్మం కనక అలా వూరుకుంది. కాని బంగారానికి నామిాద దయలేదా. అది నేననుభవించలేదా?

కాంతమ్మ—దయవున్నా ప్రేమవున్నా నీకే వుంది. చంటిపిల్ల, దాని క్షేంతెలుసును నాయనా? లోట్లన్నీ నువ్వే సర్దుకోవాలి.

పేరుభట్టు—లోట్లుంటూ వుంటే, నువ్వు వుండ నిస్తే సద్దుకోవలసిందే. లేకపోతే సంసారా లెలా నెగ్గుతాయీ? ఇంతకీ: నావల్ల మాత్రం లోట్లు రాకుండా వుంటాయా? ఇక నాకు వేళ అవుతోంది. సబుకలెక్టరుగారు ఇవాళ విందుచేసి బహుమతి యిస్తారు. అప్పుడే తొమ్మిది దాటింది. తొరగా వెళ్లాలి.

కాంతమ్మ—వెళ్లిరా నాయనా!

పేరుభట్టు—కాసులూ, రూపాయలూ జాగ్రత్త చేయించు.

కాంతమ్మ—నీదగ్గిర దాచవోయి!

పేరుభట్టు–నాదగ్గిరెందుకూ? నాదగ్గిర వున్నదీ, నీదగ్గిర వున్నదీకూడా యిక నీచేతిమీద నడవవలసిందే. (లేస్తాడు.)

కాంతమ్మ—అయినా—

పేరుభట్టు—ఇక మీరు చెప్పవద్దు. పూచీ అంతా నీది కాని నాది కాదు. వెళ్లివస్తానే బంగారం! (బంగారమ్మవీపుతట్టి వెళ్లిపోతాడు.)

(బంగారమ్మా, కాంతమ్మా ఒక్కక్షణం గంభీరంగా చూసుకొంటారు.)

కాంతమ్మ—అనిదాచుకోమ్మా!

బంగారమ్మ—ఏమోబాబూ! (వసారాలోకి వెళ్లి పోతుంది.)

కాంతమ్మ—నాకేం. పోనీ అలాగే వుండనిచ్చుకో.

బంగారమ్మ—నీకు కాకపోతే నాకా యేమిటమ్మా పూచీ?

కాంతమ్మ—అవి జాగ్రత్తచేయించమన్నాడు; కాని నన్ను జాగ్రత్త చెయ్యమన్నాడా యేమిటమ్మా నీమొగుడూ?

బంగారమ్మ—(చకితురాలై) అదా యేమిటి అర్థం?

కాంతమ్మ—మ రేదేమిటి?

బంగారమ్మ—(తీక్ష్ణంగా చూస్తుంది.)

కాంతమ్మ — (మందహాసంతో నిదానంగా చూస్తుంది.)

బంగారమ్మ—నువ్వు దాచగూడదా యేమిటి?

కాంతమ్మ—నువ్వు దాచమనగూడదాయేమిటి?

బంగారమ్మ—(నునుస్తూ) ఇవి దాచండీ అమ్మగారూ!

కాంతమ్మ—(కళ్లు తిప్పుకుంటూ) గదిలోకి పట్టుకురండీ రాణీగారూ!

బంగారమ్మ—ఇదుగో తెస్తున్నానండీ.

కాంతమ్మ—ఇనప్పెట్టె తాళాలుగూడా తీసుకు రండీ.

బంగారమ్మ—నిమిషంలో తెస్తా నివి పుచ్చుకోండీ.

కాంతమ్మ—నే నిప్పుడు యినప్పెట్టె ముట్టుకోను, యెలాగండీ మరీ?

బంగారమ్మ—చూశావా? (నునుస్తుంది.)

కాంతమ్మ—చూస్తున్నావా?

బంగారమ్మ—(ఆలోచిస్తూ పైకిచూస్తుంది.)

కాంతమ్మ—(ఓరచూపులు చూస్తూ పూరుకుంటుంది.)

బంగారమ్మ-(తల్లి కేసి నిదానంగా చూస్తుంది.)

కాంతమ్మ—(తనలో) ఏమీ తోచడం లేదు మాఅమ్మకి. మన స్నేంత కొట్టుకొంటోందో? అయినా నొక్కక్షణం—

బంగారమ్మ—(బతిమాలుతూ) దాచిపెట్టవుటే అమ్మా?

కాంతమ్మ—(లటాలున ఆమెని పొదివిపట్టుకొని) మా మ్మే! మాతల్లే! ఇప్పటికి తోచిందా అమ్మా? దాచిపెడతానమ్మా! నా కింతకంటే మరోపనేంవుందమ్మా?

బంగారమ్మ—అయ్యో! నీమడి—

కాంతమ్మ—అయితేలే తల్లీ! నువ్వెక్కడా నాకు మడి యెక్కడా? (ఆమె నెత్తుకొని) నాచిట్టి తల్లి యీకాసులతో నగలు చేయించుకొని, అవన్నీ పెట్టుకొని వొయ్యారంగా మసులుతూవుంటే నా కింక నిద్రయెందుకు, ఆహారం యెందుకు? అంతకంటే నాకు మ దేమిటి, పుణ్యం యేమిటి? నా అదృష్టం మంచిది. కనక నాతల్లికి మంచిమొగుడు దొరికాడు. మా అమ్మకి తండ్రియిచ్చినమేడలో మొగుడు కాసులూ, రూపాయలూ రాసులుపోస్తాడు. (ఆమెని ముద్దుపెట్టుకొని) అవునా నాకూనా?

బంగారమ్మ — (ఆనందంతో తల్లిని గట్టిగా కౌగలించుకొంటుంది.)

కాంతమ్మ — (ముద్దుగా) నీ మొగుడుపేరు చెప్పవూ తల్లీ!

బంగారమ్మ—(తల అడ్డంగా వూపుతుంది.)

కాంతమ్మ—వొక్కమాటు చెప్పమ్మా!

బంగారమ్మ—ఊఁ ఊఁ! (గునుస్తుంది.)

కాంతమ్మ—నాచిట్టితల్లివికామా? (బతిమాలుతుంది.)

బంగారమ్మ—పెళ్లిలో చెప్పేస్తారుకాదా యేమిటమ్మా?

కాంతమ్మ—అప్పటిదాకా వూరుకూ కూచోమంటావా?

బంగారమ్మ—వులకం!

కాంతమ్మ—కాకపోయినా అప్పుడు నేను నలుగురిలోకీ వచ్చి నుంచుంటానా యేమిటమ్మా?

బంగారమ్మ—(తల్లి చెవిలో నోరు పెట్టి పెదిమలు కదుపుతుంది.)

కాంతమ్మ—పెదిమలు కదిపావు. చెవులు వింటాయి గాని చూస్తాయిటే మాతల్లీ?

ంగారమ్మ—(మళ్లీ చెవిలో నోరుపెట్టి కాస్త బ వినపడీలాగ చెబుతుంది.)

కాంతమ్మ—సరిగా వినపడ లేదమ్మా!

బంగారమ్మ—(చెవిలోనే యింకాస్త గట్టిగా చెబుతుంది.)

దేకాంతమ్మ—వొక్క చెవికే వినపడింది. ఇ మిటే మామ్మా యింత బతిమాలించుకొంటావూ.?

బంగారమ్మ— (చెవిలోనే గట్టిగా) పేరుభట్టు భావ!

కాంతమ్మ—మామ్మే! మాతల్లే! నాచిన్నారి నామాట తీసెయ్యదు. నేను చెప్పింది కాదనదు. చాలమ్మా! బ్రహ్మానందం అయింది. కాని యిక 'బావ' అని తుంచేసి పలకగూడదమ్మా!

బంగారమ్మ—(తల్లిచెవికేసి నోరుపెట్టి కొంచెం నింపాదిగా) పేరుభట్టు బావగారు. (గట్టిగా) ఏం? బాగుందా?

కాంతమ్మ — నిక్షేపంలా వుంది. అమృతం లాగకూడా వుంది. పెళ్లిలోకూడా యిలాగే ఝూంకారంగా చెప్పేయ్యమ్మా!

బంగారమ్మ—ఇకదెంపుమరి,తాళాలుతెస్తాను.

కాంతమ్మ—నువ్వెందుకమ్మా తేవడం? ఇక నిన్ను నడవనిస్తానా నాకొండా? అలా అయితే నేను బతికివున్నలాభం యేమిటమ్మా? (ఆమెని మాటిమాటికీ వత్తూనికి అదుముకొంటూ, ముద్దుపెట్టుకొంటూ గదిలోకి వెడుతుంది.)

---

# దేవుడితో ముగ్గురం, ఇకేమి?

అక్కరాజు ఆంజనేయులు, బి. ఏ.,




౧

"సరోజినీ, సరోజినీ! ఏమే సరోజినీ! నీదుంపతెగా, ఇల్లెత్తిపొయ్యేటట్టు కేకలు వేసినా పలకవు. ఒసే సరోజినీ!" అంటూ కోపంతో అరుస్తూ కమలమ్మ వాకిట్లోకి వచ్చింది. సరోజిని మంచం మీద పండుకొని చేతులతో పిలుస్తూ "చందమామ రావే, జాబిల్లి రావే, బండెక్కిరావే, బంతిపూలు తేవే" అని పాడుతూ మధ్య మధ్య చప్పట్లు కొడుతూ ఉంది. పిల్ల ఆటచూచేసరికి అమ్మకోపం ఆకాశాన పోయింది. కమలమ్మ వచ్చి మంచంలో కూర్చొని పిల్లను ముద్దు పెట్టుకొంటూ, బొడ్డులో వేలుపెట్టి చక్కిలిగింత పెడుతూ లాలన చేసి "తల్లీ, ఇక అన్నానికి రావూ?" అంది.

సరో:—ఆఁ, నువ్వు నెయ్యివెయ్యవు. ఆపాడు కారం పచ్చడిలో నే తినలేను. నాకొద్దు పో.

"...నెయ్యిముంత దించి కొంచెం వేస్తుండగా..."

కమ:— ఎట్లనో నాలుగుముద్దలు తినకుంటే ఎట్ల?

సరో:— ఆఁ, రోజూ ఇంతే. మాటలు చెప్ప డానికేమి? రోజుకొంటూ తినేదానికి నాక్కదూ ఆకష్టం తెలుస్తుంది?

కమ— రోజూ ఇంతేనంటావా? బావవచ్చి పోయినప్పటినుంచేకదూ లేకపోవడం? రేపు మళ్లీ అప్పతద్దినం, కావలసినంత వేసుకో.

సరో:—ఛీ, ఎవరు పెంచమన్నారు? చంపి నెయ్యకపోయినావా? ఈబాధ లేకపోనే.

కమ—కడుపుతరుక్కొని పొయ్యేటట్టు మాట్లా డుతావుకదే! తల్లీ, రేపుపొద్దున అన్నవస్తాడు, తద్ది నానికి. లే, అన్నంతిని పెందలాడే పండుకొంటే, పొద్దున నాకు పుట్టెడు పనిఉంది. వడలన్నా చెయ్యక తప్పదు. రేపు నీకు వడలూ, అన్న ఏమైనా తెస్తే అవ్వీ తిండానికి కావలసినన్నీ.

సరో—అయితే అన్నవస్తాడూ?

కమ—వస్తాడు, నీకు తిండానికి తెస్తాడు.

సరో—అన్నవస్తాడు, అన్నవస్తాడు.

అంటూ చప్పట్లు కొట్టుకొంటూ, అమ్మచంక యెక్కింది. కంచం చూచే సరికి రోజను మొదలు పెట్టింది. పిల్లను కంచంముందర కూర్చోబెట్టి, రేపటికి దేవుడున్నా డనుకొని, తద్దినానికని పిల్లకుకూడా కడుపుకట్టి నిలవచేస్తూవచ్చిన నెయ్యిముంత దించి కొంచెంవేస్తుండగా సరోజిని "ఆఁ, అంతావెయ్యి" అంటూ, ఎంగిలిచేత ఒడిసిపట్టి లాగి దొర్లించుకొంది సరోజిని. కంచంలో నేతిముద్ద పడింది; పిల్లవీపున దెబ్బలు పడ్డాయి. లేమివల్లకలిగినదుఃఖంచేత వచ్చిన కోపంలో కొట్టిందేగాని; మళ్లీ తన్నుతానే 'బంగారు తల్లిని కొడితినీ పాడుముండనూ' అని తిట్టుకొంటూ, ఏడుస్తూ గోడను చేరబడ్డది. పిల్ల ఆత్రంతో నెయ్యి ముందుతిని మరి అన్నం తిన మొదలుపెట్టింది.

పిల్లనుకొట్టినదెబ్బలు వినబడికాబోలు భాను మూర్తి పరుగెత్తుకొంటూ లోపలికి వచ్చాడు. భాను మూర్తీ, కమలమ్మకొడుకు శ్రీహరీ, స్నేహితులు. చిన్నప్పటినుంచీ ఒకటిగా చదువుకొంటూ, ఆడు కొంటూ, ఆలోచిస్తూ పెరిగారు. భానుమూర్తికి అమ్మా నాయనా ఒక్కమారు చనిపోవడంవల్ల; సంసార భారం తలపైనబడి, భూములపైన పెత్తనం చేసేవారు లేక తాను ఆరోఘారంతో బడిచదువు మానాడు. శ్రీహరికి తండ్రిపోయి ఆయనహనీకేసులో మూడుకోర్టులూ తిరగడంలో ఆస్తిపోయి, అమ్మనూ, చెల్లెలినీ పోషించేభారం తలమీద పడినా, ఏమి పెట్టి పోషించడం? భానుమూర్తిలాగా పైపెత్తనం చెయ్యడానికి ఊళ్లో ఉండే ఆస్తిఅంతా పోయింది. తనకున్న కొంచెం చదువుతో ఏఉద్యోగమూ దొరక లేదు. అందువల్ల ఊరూరూ తిరిగి తనమంచితనం, నేర్పూ, తెలివితేటలచేత తన్నుతానే చదివించుకొం టున్నాడు. సహపాఠులిద్దరూ ఇప్పుడు వేరైనా, మనస్సు లొకటిగానే ఉన్నాయి. కొడుకు దగ్గరలేని కమలమ్మకు భానుమూర్తినిచూస్తే ఏనుగునెక్కినంత సంతోషం. భానుమూర్తి కమలమ్మను అమ్మా అని పిలుస్తూ కొడు కును మరపించాడు.

ఎంతకష్టాలలో ఉన్నా, అనాదిగా పెట్టిన చెయ్యేగాని పట్టినచెయ్యి కాకుండా బ్రతికి పెద్దల ఆర్వేలనియోగివంశంలోది కాబట్టి, ఇట్టిస్థితిలోకూడా ఇతరుల ఋణంపైన ఉంచుకోదు కమలమ్మ. ఇక భాను మూర్తి కమలమ్మతో ఆమెకష్టాలనుసరించి మాట్లాడ డానికి సందేహించేవాడు; భయపడేవాడు. పౌరుష వంతులు తమకష్టాలు ఇతరులతో చెప్పుకోరు; మరిన్నీ, ఏవిధంగానన్నా ఇతరులు తెలుసుకొంటే తలవంపు లైనట్టు భావిస్తారుకదా! అందువల్ల తనకు సహాయం చెయ్యడానికి ఎంతఇష్టమున్నా "ఇది తీసుకో అమ్మా" అని అడగడానికికూడా భయపడేవాడు. ఇంట్లో తిండికి కూడా ఇబ్బంది పడుతూ ఉంది కమలమ్మ అని తా నెరుగును.

దెబ్బలు వినబడగానే, భానుమూర్తికి దుఃఖమూ, భయమూ కలిగాయి. అన్నం తింటూ ఏమీతోచక ఎంగిలిచేత్తో పరిగెత్తాడు. సరోజిని పచ్చడిఅన్నం తింటూ, గోడ చేరబడి కన్నీళ్లు కారుస్తుండే అమ్మను చూస్తూ విచారంగా ఉంది. భానుమూర్తి హఠాత్తుగా ప్రవేశించాడు. తటాలున మొగంతిప్పి, కొంగుతో కన్నీరు అద్దుకొని, పొంగివచ్చే దుఃఖాన్ని అణచుకోలేక, అణచుకోలేక అణచుకొని, సగమణిగిన గొంతుతో, 'భానూ, రారా' అంది కమలమ్మ.

ఆవలిస్తే పేగులెంచేజాతికదా ? రెప్పపాటులో అంతా గ్రహించాడు: 'చెల్లీ, రా' అని సరోజినిని ఎత్తుకొన్నాడు ; అమ్మముఖం చూస్తూ తడబడుతూ వెళ్లాడు.

గది శుభ్రం చేసి కమలమ్మ పండుకొంది. ఎంత ప్రేమ తనకు ఎక్కువైనా, భానుమూర్తి తనకంటే ఎక్కువ ఆదరం చూపగలడు పిల్లవిషయంలో. అయినా, తనదగ్గర లేనంతమాత్రంచేత, సరోజినికేమో లోటు అయ్యేటట్టుగా మూడునాలుగుమార్లు వెళ్లి చూచివచ్చింది కమలమ్మ. ఇందులో తెల్లవారితే తద్దినమనే ఆలోచన బుర్రలోకి వచ్చింది. శ్రీహరి వచ్చేబండికి బాడుగ ఇచ్చుకోవాలి; తిరిగివెళ్లడానికి ప్రయాణపుఖర్చు ఇచ్చుకోవాలి. తద్దినపుఖర్చుకాక బ్రాహ్మలకు దక్షిణలు ఇచ్చుకోవాలి. పట్నమాసాలు తిరిగివచ్చిన ఈ కర్ణాటకపుబ్రాహ్మలు తలకు అర్ధరూపాయ భోజనాలకుముందు ఇస్తేనేగాని ముద్ద యెత్తరు. "ఏమిచెయ్యాడం భగవంతుడా !" అని కమలమ్మ ఏమీతోచక కుళ్లిపోతూ ఉంది. నిద్ర పట్టదు.

దరిద్రంలో తనకు కలిగిన ఒక ఆలోచనకు సంతోషించింది. పౌరోహితుడు గణపతిశాస్త్రికి ఈ తద్దినపుసంగతి ముందుగా చెబితే, మరియిద్దరితో ముగ్గురుగా తయారౌతాడు. తద్దినంనాడు పొద్దున తెలిపితే, ఆవూళ్లో ఇక వైదీకులు లేరు కాబట్టే, పైవూరికి వెళ్లి పిల్చుకొనివచ్చే వ్యవధి ఉండదు కాబట్టే, తాను ఒకడే వస్తాడు. ఖర్చు తగ్గుతుంది; దక్షిణ మిగులుతుంది. ఇదీ ఆమెకు తోచినయుక్తి. ఇది తోచబట్టే ఆమె ఒకమనిషిగా తెల్లవారి లేచింది.

కండ్లు తెరిచేసరికి, శ్రీహరి పక్కలో కూర్చొని అమ్మముఖం చూస్తున్నాడు. సరోజిని అన్నపక్కను కూర్చొని ముంతమామిడిపప్పు తింటూఉంది. 'ఎంతసేపైంది శ్రీహరీ, వచ్చి ? అబ్బా, ఎంతఎండబడ్డది ? తల్లీ, లేవనీ, పుట్టెడుపని ఉంది" అనుకొంటూ ప్రక్కలోనుంచి లేచింది. "బండిమనిషి యేడి నాయనా ? బాడిగ ఎంతయివ్వాలి ?" అని బెంగతో అడిగింది. అటూఇటూ చూడగా, పెట్టె కనబడదు. శృంగారనైషధముమాత్రము మంచంమీద ఉంది. ఒక్కక్షణంలో అంతా కండ్లగట్టినట్టైంది. సాయంత్రం వారపింటికివెళ్లి అన్నం తిని, రాత్రి చీకటిలో బండ్లవెంబడే బంగారు తండ్రి ఇరవైమైళ్లూ నడిచివస్తున్నట్లు కండ్లకు కనబడ్డాడు. కొడుకుకాళ్లమీద చెయ్యివేసి నిమురుతూ, ఒత్తబోయ్యేటప్పటికి, శ్రీహరికి ఆమహాతల్లి మనసులో ఉండేదుఃఖం తన్ను కొట్టినట్టయి, ఎక్కడలేని పొంగువచ్చి, కన్నీరు రాల్చాడు. వేడికన్నీళ్లు చేతిమీద పడగా కమలమ్మ తల యెత్తింది. "వెధవదేవుడూ" అని తానూ కంట నీరుబెట్టింది. ఇదంతా చూచి పరుగెత్తుకొంటూ వెళ్లి భానును పిల్చుకొని వచ్చింది సరోజని. ఏడుస్తూఉండే తమ్ముణ్ణి చూచేసరికి భానుమూర్తికి దుఃఖంవచ్చింది; కాని అణచుకొని అటూయిటూ చూచాడు; అంతా గ్రహించాడు. "ఎంతసేపైంది తమ్ముడూ వచ్చి?" అంటూ వచ్చి పక్కలో కూర్చొన్నాడు.

సరో—అన్నయ్యా వచ్చి నిన్ను లేపకుండా నన్ను ఎత్తుకొని వచ్చి పండ్లుతోమి ముంతమామిడిపప్పు పెట్టాడు. ఇదో తింటున్నా.

భానుమూర్తి తమ్ముడు ఎందుకు వచ్చాడా అని ఆలోచిస్తున్నాడు. సెలవులు ఏమీ లేవు. కారణమేమిగా ఉండునో అనుకొంటుండగా, సరోజిని "ఇవ్వాళ నాకు అన్నయ్యతెచ్చిన ముంతమామిడిపప్పూ,

తద్దినంవడలూ తిండానికి కావలసినన్నీ. అమ్మ నాకి ప్పుడు అన్నం వద్దే" అంది. భానుకు తద్దినం అని జ్ఞాపకం చేసింది చెల్లెలు. "ఇవ్వాళ ఖర్చు ఉన్నదే! అమ్మ ఎట్లా నడుపుతుంది? ఇస్తే తీసుకోదు" అని ఏమీ తోచక ఆలోచిస్తున్నాడు భానుమూర్తి. కమలమ్మ లేచిపోయింది.

## ౨

సరోజిని తనపాటికి తాను పప్పు ఒలుచుకొంటూ తింటూఉంది. శ్రీహరి వంచినతల యెత్తకుండా, ముడిచికలిపిన ఉంగరపువ్రేలూ బొటనవ్రేళ్లమీద గడ్డం మోపి చూపుడునడిమివ్రేళ్లురెండూ చెంపచేర్చి, తనువు నేలను మనసు ఆకాశానగా ఉన్నాడు. భాను నైషధం అటూయిటూ తిప్పుతూ 'తమ్ముడూ, ఈ ఒక్క నాటికిహుడా పుస్తకం మోసుకరావాలా? బండిలో కూడా రాలేదే! ఒక్కనాటికి చదువు పోతే కొంప మణిగినట్టు ఏమిటెి యీశ్రమ? మొన్న వచ్చినప్పుడు ఇది లేదే! ఎప్పుడు కొన్నావు? ఎంతవెల? దీనికి అయిదురూపాయలు ఎక్కడ తెచ్చావు?

శ్రీహరి—కొత్తదిగా ఉందేగాని చెయ్యి మారినపుస్తకం రెండురూపాయలే. అయింది.

భాను—తమ్ముడూ, నీవు ఇక్కడ ఉంటే నేను దీనిని చదువుకోవచ్చును. మరి నీవు వెళ్లుతావు గదా. నేను చాలాకాలంగా నైషధం చదువుకోవలె నని సరదాపడుతున్నాను. ఇది నాకిద్దూ. ఎంత అయిందీ? అయిదు కదూ?

శ్రీహరి—కాదు రెండే. ఎంత అయితే నేమి? నీవు చదివి తరువాత నాకు ఇవ్వరాదూ?

భాను—తొందరగా చదవాలని నీకెంతో సర దాగా ఉండికదా కొన్నావు. నేను అయిదురూపా యలు ఇస్తాను. అక్కడికి వెళ్లికొనుక్కో. ఇది నా కియ్యి.

శ్రీహరి—నే నది రెంటికే కొన్నాను.

భాను—అయిదురూపాయ లని వెలవేసి ఉంటే రెండని చెబితే నేను నమ్మతానా?

శ్రీహరి—చెయ్యిమారిన పుస్తకమంటూంటేనే?

భాను—చెయ్యిమారిన పుస్తకము ఇట్ల ఉం టుందా, అచ్చులోనుంచి ఇప్పుడే వచ్చినట్లు?

శ్రీహరి—వాడినవాడిజాగ్రత్త. నేను అబ ద్ధము చెబుతానా?

భాను—పోనీ, మళ్లీ నీవు కొనుక్కోడానికి సిద్ధంగా చెయ్యిమారిన పుస్తకము దొరకదుకదా? కొత్తది అయిదురూపాయలకు కొనుక్కోక తప్పదు కదా? నీవో నేనో కొత్తది కొనక తప్పదు. నేను వ్రాసి తెప్పించడానికి పోస్టుఖర్చులు పైన పడతాయి. నీవైతే ఆఖర్చు లేకుండా అయిదు రూపాయలకు అక్కడ కొనుక్కోవచ్చు.

శ్రీహరి—వృథాఖర్చు ఎందుకనుకుంటే, ఇది నీవు చదువుకొంటూ ఉండు. నీ అయిదు రూపాయలతో అక్కడ కొని వచ్చేటప్పుడు తెచ్చి యిస్తాను. అంతేగాని, నేను రెండు రూపాయలకు కొన్న పుస్తకానికి నీవు అయిదురూపాయలు ఇస్తానంటే తీసుకోడానికి నేను కోమటిని కాను.

భాను—అట్లగే చేయి. ఇది నేను తీసుకొం టాను.

శ్రీహరి—అట్లగే నీపుస్తకము వచ్చేవరకూ.

బ్రతికాను దేవుడాఅనుకొన్నాడు భానుమూర్తి. ఎంత లేదన్నా నాలుగురూపాయలు లేనిది తద్దినం కాదు. తనను అమ్మ అప్పుకావలెననిహుడా అడగదు; ఎందుకంటే, ఆమె లేవడితెలిసి భానుమూర్తి ఎంత దుఃఖిస్తాడో అని. అడగకుండా యిస్తే, "ఎందు" కని అడిగితే ఏమి జవాబు చెప్పడం? సరోజినిచేతికి యిస్తామంటే, పండగా, పర్వమా? అంతేకాక, ఇది వరకు అమ్మ కొట్టినప్పటినుంచీ, భానుదగ్గర ఏమి తీసు కోవలెనన్నా అమ్మ ఒళ్లునిరగకొడుతుం దని భయం. ఇన్నిచిక్కులు ఉన్నవి. పోనీ తమ్ముడిచేతికి యిస్తామం

శే అమ్మకు మించినకొడుకు,ఆత్మగౌరవం కాపాడుకోవడంలో. అన్నదమ్ములవలె ఉన్నా, ఆసంబంధం డబ్బువిషయంలోకి రానీయడు శ్రీహరి. ప్రతిష్ఠకు ప్రాణం విడుస్తాడు. ఇదంతా ఆలోచించే, పుస్తకంతా నిప్పుడు చదవాలని అనుకోకపోయినా, సరదా తెచ్చిపెట్టుకొని, పాతదని తెలిసీ, అయిదురూపాయలు తీసుకోమంటాడు. భానుమూర్తిమోసానికి లొంగి శ్రీహరి అట్ల తీసుకోడు. తుదకు ఒకరాజీమార్గానికి తెచ్చి, భానుమూర్తి మనిపర్సులో అయిదురూపాయలు తీసియిచ్చాడు.

## 3

కనులమ్మ గణపతిశాస్త్రియింటికి వెళ్లి "నాయనా, మాబావతద్దినం ఇవ్వాళ. అల్లుడు ఊరినుంచి వచ్చాడు. కార్యం జరిపిపోవూ?" అని అడుగుతుండగా, పక్కఊరి సుబ్బావధాని సుమ్మంలోనుంచే "ఒరే గణపతీ! రేపు పాలెంలో సంతర్పణరా. కొంచెం నడకశ్రమకు ఓర్చావంటే రూపాయ సంభావన రారా. చెప్పడానికేవచ్చాను," అంటూ లోపలికి వచ్చాడు.

గణ—రేపటిసంభావన సరేకాని, ఇంతదూరం వచ్చినవాణ్ణి ఊరకే పంపను నాకు ఇష్టంలేదు. ఇక్కడ తద్దినం; బ్రాహ్మణార్థానికిరా, అర్ధరూపాయ దక్షిణ.

సుబ్బా—అమ్మమ్మా, పంతులుగారి తద్దినం యీరోజేనా? అయితే మీరు ఇక్కడికి రావాలా, ఈ వెధవాయని పిలవడానికి? ఎంత వారు పోయినా, ప్రభుకుటుంబంలోవారనికూడా కనిపెట్టకుండా, మీ చేత పిలిపించుకొంటున్నాడా? మొన్నటిదాకా మీ యింటికి వచ్చి పంచాంగం చెప్పుతూఉండిన గణపతికి పంతులుగారు పోగానే కండ్లు మీదకువచ్చాయా?

అని కమలమ్మగారిని తన్ను పిలవడానికి వచ్చేంత అగౌరవం చేసినందుకు గణపతిని నాలుగు చీవాట్లు వేశాడు. పల్లెలలో ఆచారం ఎవరింట్లో ఏకార్యం ఏతిథినాడు జరిగేదీ తనఅబ్బశ్రాద్ధంవలె జ్ఞాపకం ఉంచుకొని, ఆయానాడు ఆయాయింటికి వెళ్లి వారికి జ్ఞాపకం చెయ్యడం పౌరోహితుడివిధి. ఇక కమలమ్మగారు దేశపాండ్యకుటుంబమువారు కాబట్టి, వారి యింటికి వెళ్లి గణపతికుటుంబమువారు ప్రతిరోజూ పొద్దున తిథివారనక్షత్రాలు చెప్పి వారుయిచ్చిన మోయిన తీసుకొనిపోవడం అనాదిగా ఆచారం.

వైదికవృత్తి అంటే పాడిబర్రెవంటిది. లేవడి కలలోకూడా కనబడదు. ఆవృత్తిని అందరూ చులకనగా చూస్తున్నారేగాని, దానివల్లనే గణపతి అందరికంటే మెరుగుగాఉన్నాడు. ఇప్పుడు నాలుగుకాసులువచ్చాయి గదా అని కండ్లు మీదకువచ్చాయి. కమలమ్మగారి యింట తద్దినమని తెలిసే, ముందురోజు వెళ్లి జ్ఞాపకం చెయ్యడం మాని, ఇప్పుడు ఆమెచేత పిలిపించుకొన్నాడు; అందుకు నాలుగుచీవాట్లూ తిన్నాడు.

సుబ్బావధాని గణపతిమీద కోపపడి, ఇటు తిరిగి, "అమ్మా, సమయానికి నేను రాబట్టి సరిపోయింది కాని, లేకుంటే ఒక్కబ్రాహ్మడితో తద్దినం సక్రమంగా ఎలాజరుగుతుంది? చాలాపనిఉందిగదా? అబ్బాయి వచ్చాడా? ఒరేగణపతీ, వదినెను పంపరా, తద్దినపువంట అమ్మగారు చేయలేరూ" అన్నాడు.

గణ—నిన్నటిరోజు ఇంట్లో రెండుమారలూ, పప్పూ చేసేటప్పటికే మావదినెకు ఆయాసం వచ్చింది. ఇక తద్దినపువంట చెయ్యడమే?

సుబ్బా—ఔరా, కాలం! ఔరా, సుకుమారం! మొన్నమొన్నటిదాకా యీ గణపతి పెండ్లామే అమ్మగారియింట అంట్లుకూడా పనిమనిషికి అడ్డంపోయి తాను తోమేది. మరి యింతలో యీసుకుమారం ఎక్కణ్ణుంచి వచ్చిందో? అమ్మా, మీరుపొండి. కాలకృత్యాలు తీర్చుకొని నేను వస్తాను వంటకు. వ్యగ్రగా అనుకోకండి. అనాదిగా మీయింట పనిచేసి బతికినవాండ్లమే. మీరు పొండి తల్లీ, వస్తా నింతలో.

ఇలాగా సుబ్బావధాని మాటిమాటికీ బలవంతపెట్టగా కమలమ్మ నెమ్మదిగా కదిలింది. కాని ఏదో గణపతితో మాట్లాడ దలచి, కొత్తమనిషి వచ్చినందువల్ల మాట్లాడలేక పోయినట్లు వారికి తోస్తూనేఉంది. ఒక్కబ్రాహ్మడితో పితృకార్యం వెళ్లతీస్తామనే తల

పుత్తో ఆమె ఉండింది. ఇప్పుడు గొప్పచిక్కు తెచ్చి పెట్టాడు దేవుడు. సుబ్బావధాని బ్రాహ్మణార్థానికి రావడమేకాక, వంటచేస్తానన్నాడు. వంటకు పైగా ఏమైనా ఇవ్వాలి. వద్దంటే వినడు; తోసుకొని వస్తాడు. స్థితి చెప్పుకోడానికి నోరు రాదు. ఆయన వచ్చేసరికి ఇంట్లో సామగ్రిఅంతా సిద్ధంగా లేకపోతే లేవడి బయటపడుతుంది. "భగవంతుడా! ఎందుకు ఆయనను తీసుకొనిపోయి నన్ను ఉంచావు? భూదేవీ, దారియిచ్చి ఇంతట నన్ను కడుపున బెట్టుకో" అని ఆమె ఏడవడమేకాని, యీ మొఱ్ఱలు భగవంతుడు వింటాడా? నెమలికంట నీరు కారితే వేటగాడికి ముద్దా? ఏమిచేయనూతోచక, కమలమ్మ నడుస్తూవుంది. ఎవర్నడిగితే నాలుగురూపాయలు అప్పు ఇస్తారు? అప్పైనా అడగడానికి అలవాటుపడ్డనోరు గాదు. అడిగి లేదనిపించుకోవడం మహావమానం. పొద్దెక్కుతూఉంది. సుబ్బావధాని వచ్చి గొంతుమీద కూర్చొంటాడు. ఏమిటిదారి దేవుడా? అనుకొంటూ అంగడి మీదుగా నడిచింది.

అంగడివాడిని అడిగితే అప్పు ఇవ్వనన్నాడు. కమలమ్మకు అప్పిస్తే తొందరలో ఆడబ్బు రాలేదు. డబ్బు ఆలస్యం లేకుండా తిరుగుతుంటేకదా పిల్లలు పెడుతుంది? ఈమె కిస్తే రేపే సంవత్సరానికోగాని రాదు, అసలు వస్తే. అప్పటికి ఆనాలుగురూపాయలూ నాలుగ్గానే ఉంటాయి. పాపము బ్రతిమాలుకొంటుంది; వినడు, ససేమిరా అంటాడు. ఒకప్పుడు ఈకోమటే పంతులుగారు తనఅంగడిలో ఖాతా పెడితే బాగుండు నని కమలమ్మభర్తచుట్టూ కనబడినప్పుడల్లా తిరిగేవాడు. ఇప్పుడు కమలమ్మ వచ్చి అడిగితే అప్పు ఇవ్వనన్నాడు. ఔరా! కాలం ఎంతతలక్రిందు లైంది. ఓడలు బండ్లు అవుతాయి; బండ్లు ఓడలు అవుతాయి. అడిగినఅవమానమేకాక లేదనిపించుకొన్న అవమానంతో తలవంచుకొని ఆమె ఊరినుంచి వచ్చిన కొడుకును ఒక్కమారు చూచుకొని మరి తద్దినంసంగతి ఆలోచిస్తామని ఇంటికి వెళ్లగా కొడుకు లేడు. "అన్న యేడీ" అని అడగ్గా "సామానుకు అంగడికి పోయినా" డని సరోజిని చెప్పింది. "ఏఅంగడి"కంటే "ఏమో" అంది. కమలమ్మకు ఏమీ తోచలేదు. సామానుకు డబ్బు ఎక్కడిది? ఎవరైనా అప్పు ఇస్తారనుకొందామా? ఏది కావాలో, ఎంతకావాలో తన కేమితెలుసు? అనుకొంటూ తన కేమీ తోచక పిల్లను ముద్దాడుకొంటూ కూర్చొంది.

౪

ఇంతలో భానుమూర్తిగారి నౌకరిచేత సామాను ఎత్తించుకొని భానూ, శ్రీహరీ వచ్చారు. భానుమూర్తిని చూడగానే కమలమ్మకు కోపం వచ్చింది. తమ్ముణ్ణి మోసంచేసి తద్దినానికి డబ్బు ఇచ్చాడని గ్రహించి కోపంతో చూచేసరికి భాను అదిలిపోయాడు. నెమ్మదిగా ధైర్యంతెచ్చుకొని "అమ్మా! డబ్బునాది కాదు, తమ్ముడిదే" నన్నాడు.

కమ—తమ్ముడికి కెక్కణ్ణించి వచ్చింది?

భాను—నాకు నైవుణ్యం కొనితెమ్మని తమ్ముడి చేతికి అయిదురూపాయలు ఇచ్చాను. దానితో ఇప్పుడు సామాను కొన్నాడు. ఏది ఎంతకావాలో చెప్పడానికి నేను తోటే వెళ్లానేగాని మరేమీ కాదు.

వాడుకోడానికి చేతిలోకి డబ్బు వచ్చిందికదా అని బ్రహ్మానందమైంది కమలమ్మకు. వెనక ఏలాగో తేల్చి పుస్తకము కొని భానుకు ఇవ్వవచ్చు. ఆ క్లిష్టావస్థలో ఉన్నకమలమ్మకు మనసు ఇంతకుపైన పోలేదు.

వీరు మాట్లాడుకొంటూఉండగా నౌకరి సామాను తీసి కిందపెట్టాడు. కమలమ్మ నౌకరిని అన్నానికి రమ్మన్నది. భాను, తన్నుపిలుస్తుందేమో అని భయపడుతూ, ఏమిసాకు చెప్పి తప్పించుకోనా అనుకొంటున్నాడు. మరొకఆలోచన కలిగింది. శ్రీహరి మరుసటినాటిరాత్రికి వెళ్లుతాడు. శ్రీహరితో భోజనం మరి యెన్నినెలలకో? మంచిసంధిగావస్థ కలిగింది. ఇదంతా మనస్సులో ఒక్కక్షణంలోకలిగిన ఆలోచన. "భానూ! నీవూ పద్మా ఇక్కణ్ణే ఇవ్వాళ. రేపు తమ్ముడు పోతాడు. మరెప్పటికో రావడం" అని కమలమ్మ పిల్చింది. తనతల్లి పోయినప్పటినుంచీ కమలమ్మే భానుకు తల్లి. అమ్మమాట తోసివేయగలడా? తమ్ముడు

## నాగార్జునకొండ - బౌద్ధస్తూపచిత్రములు



౭. బుద్ధ జననము



౮. జాతక లేఖనము



౭. ప్రలోభనము



౮. కుడిప్రక్క — శిశుసమర్పణము : ఎడమప్రక్క — సిద్ధార్థుని దేవాలయగమనము

ఉండేఒక్కనాడూ తమ్ముడితో భోజనం చెయ్యక ఓర్వగలడా? ఎట్లయితేనేమి? "అట్లగేఅమ్మా" అన్నాడు. ఇంతకూ తనమనసులో ఆలోచన యేమి? మంది యెక్కువఅయ్యేకొద్దీ మజ్జిగ పల్చన అన్నారు. నౌకరిని పిల్చింది. ఇక తానూ పద్మా మనిషికి మనిషి తోడయితే కష్టపడుతుంది. ఎవరు ఏమడిగినా లేదన రాదుకదా? కానీ చూతా మనుకొన్నాడు. ఒప్పుకున్నాడు. "చెల్లీ, వెళ్లి మీవదినెను పిల్చుకరా" అని సరోజినితో చెప్పాడు.

సరో:—వదినంటే ఎవరు?

భాను—దానిపేరు చెప్పిందాకా వదలదయ్యా యిక. పో, పద్మను పిల్చుకొనిరా.

సరో—పద్మా! పద్మ ఏమిటి గిద్మ. బాగు బాగు. నన్ను 'సరూ' అంటావా యిక? ఆకలై పేర్లు తింటావా? పూర్తిపేరు చెబితేనే.

భాను—పద్మావతి.

సరో—ఆఁహఁ.

భాను—పద్మావతమ్మ, పద్మావతమ్మ, పద్మావతమ్మ.

సరో—పద్మావతమ్మ, పెండ్లామమ్మ, అమ్మగారు, అలారా. ఇప్పుడు పిల్చుకొనివస్తా.

ఇలా అన్నను వేళాకోళంచేసి మరి వెళ్లింది.

పద్మావతి వచ్చి ముందు మినప్పప్పు నానబోసి, తక్కినవన్నీ బాగుచేస్తూ "అత్తా, తద్దినంసంగతి నాకు చెప్పకపోయినావేమి? పడమటింట్లోనుంచి 'పద్మా, వంటకు రావే' అంటే రాకపోయినానా? ఎంతపొద్దు పోయింది." అంటూ ఏమేమో మాట్లాడుతుండగా కమలమ్మ మడికట్టుకొంటా నని స్నానానికి లేచింది. చివాలున పద్మ లేచి, "వీట్లో రాళ్లు తీసియిచ్చి పైపని నీవుచెయ్యి. వంట నేను చేస్తా. ఇంతమందికి నీవు వండలేవు." అని పడమటింట్లోకి వెళ్లింది. ఒకరి మనసు ఒకరు కనుక్కొనేభావ. యీభార్యాభర్తలకు బాగా వచ్చు. ఇంతలో భానుమూర్తి అటులిరిగి వెళ్లి తనయింట్లో అయిదార్గురి మోయినసామాను అమ్మకు తెలేకుండా చూరులోనుండా ఇవతల పడమటింట్లో ఉండేపద్మకు అందించాడు. అవి దాచి తాను తొందరతొందరగా తలస్నానం చేసి మడికట్టుకొని, వంటమొదలుపెట్టింది. ఇంతలో సుబ్బావధాని స్నానంచేసి వచ్చి తిన్నగా వంటయింట్లోకి వెళ్లేసరికి వంట అవుతూఉంది. పైకివచ్చి "అమ్మా, నేను వస్తూఉండగానే ఇంతతొందరా? నాకు పని చెప్పడానికే యింతమొగమాటమైతే యెలాతల్లీ? మీ మామగారినాయన ఆదిమూర్తిగారు దానంచేసినఅగ్రహారంలో నాభాగానికి అయిదువందలరూపాయలు వస్తున్నాయి. మూడుతరాలుగా మావంశమంతా పుష్కలంగా బ్రతుకుతున్నామే! మీబిడ్డలము. నాకు పనిచెబితే ఋణపడతారా? కానీండి, ఏమిచేతాం? మీ రేపనిచెప్పినా చెప్పండి, చేస్తా. మీరు చేస్తుంటేచూడలేను. మీ అబ్బాయినిఒకటిగా నన్నొకటిగా చూచుకోకండి;" అంటూ తడిసుడ్డలుఇచ్చి పొడిసుడ్డలుకట్టిదొన్నెలూ, దర్భలూ తయారు చేస్తూ నమకచమకపారాయణం చేస్తున్నాడు. కమలమ్మ ఏమిచేయబోయినా ఏమితేబోయినా తాను అడ్డముపోతాడు.

ఎట్లయితేనేమి, వంటఅయింది పద్మావతి వచ్చి "ఇక లేవవచ్చు" నన్నది. "ఈమె ఎవరమ్మా?" అని అవధాని అడగగా, "మాభానుమూర్తిపెండ్లాముకదూ నాయనా" అని కమలమ్మ బదులుచెప్పింది. అది మొదలు సంభావణకు. అటువంటిసమయాల్లో ఇంటివారికీ బ్రాహ్మలకూ జరిగేసంభావణ స్వభావం అది విన్నవాండ్లకే తెలియాలి. కర్తయొక్క పెద్దలు చేసిన గోదానాలు, భూదానాలు, కన్యాదానాలు చెప్పి పెద్దలను పొగడడం. మామూలుగా ఈఔదార్యాన్ని గోరంతలు కొండంతలుచేస్తారు. ఎందుకనుకొన్నారు? దక్షిణ దగ్గర కర్త వెనకతియ్యకుండా ఉండడానికి. పెద్దలను పొగిడితే, ఎవడు వశంగాడు? అట్లని కమలమ్మగారి కుటుంబమువారు చేసినదానాదులు అల్పాలని కాదు. సుమీ. ఆమెమామగారినాయన సంవత్సరానికి రెండు

వేలువచ్చే అగ్రహారాన్ని ధారపోశాడు. ఆఅగ్రహారపు పేరు పోయి ఆయనపేర ఆదిమూర్తిపురం అనేపేరు నిల్చింది.

ఈతద్దినపుసంభాషణ జరుగుచుండగా, గణపతి వచ్చాడు. బ్రాహ్మలు స్నానంజేశారు. మంత్రం మొదలు పెట్టారు. సుబ్బావధాని సక్రమంగా ఆద్యంతాలూ బాగా జరుపుదామనే ఉద్దేశంతో ఉండగా, గణపతి అడ్డంవచ్చి తాను మంత్రం చెబుతానన్నాడు. గణపతికి మంత్రం రాదని అవధాని యెరుగును. గణపతి శాస్త్రికి శాస్త్రినామం నామకరణంలో వచ్చిందే గాని, శాస్త్రజ్ఞానంవల్ల వచ్చింది కాదు. అయినా "మీరు రాజపురోహితులు. మీవెనకనే మేము" అని అవధాని సద్దుకున్నాడు. గణపతి అయిదునిమిషాల్లో మంత్రం ముగించాడు. "అపవిత్రః పవిత్రోవా" లగాయతూ "కాయేనవాచా" ఆఖరువరకూ "సర్వం శ్రీకృష్ణార్పణమస్తు" అన్న కలికాలపుసంధ్యలాగా, మంత్రంలేని సంధ్యకు మరిచెంబెడు నీళ్లన్నట్టు, గణపతి పెట్టించే తద్దినానికి తంత్రలోపం లేదు, మంత్రం సన్నమైనా. అక్కడ కానీ, యిక్కడపరకా, అప్పుడు అణా, యిప్పుడు బేడా అని మంత్రపుదబ్బులక్రిందనే రూపాయ లాగాడు. ఇదే ఇంతైతే దక్షిణ ఎంత కావాలి?

వడ్డించవచ్చు నన్నాడు గణపతి. సరోజిని వెళ్లి భానును పిల్చుకొనివచ్చింది. పిండాలు ముందే చేయించి, అంతా ఒకటిగా కూర్చొన్నారు. భోక్తలకు భోజనమైనతర్వాతకదా కర్తకు తిండిఅంటే, అక్కరలేదన్నాడు గణపతి. ఈనియమాలు అట్టే అక్కరలేదు. అతనికి దక్షిణనియమం తప్పకుంటే చాలు. అవుపోసనం పట్టడమే ఆలస్యం ఇక ముందుపురోహితుడు పడితేనే గాని ఇతరులు పట్టరు. గణపతి ఎంతసేపటికీ పట్టడు. అవధానిచేత నీళ్లు పోసుకొని, ఎడమచేతివ్రేల విస్తరి ముట్టుకొని ఉన్నాడు; 'కానీరా' అంటాడు. ఆఖరుకు 'దక్షిణ' అన్నాడు గణపతి. "సిగ్గులేనిమనిషిగా ఉన్నావు. నీదక్షిణ ఎగవేస్తారట్రా? ఏడ్చావులేకానీ; తారతమ్యం అక్కరలేదూ?" అని చీవాట్లు వేసేటప్పటికి గణపతి అవుపోసనం బట్టాడు.

నెయ్యివడ్డనలో చాలుఅనేవరకూ వడ్డించాలి. గణపతి వేళ్లు సందులుగా పట్టుకొని, ఎప్పటికీ చాలు ననడు. నేలిగిన్నె ఖాళీఅయినా చేర నిండదు. పద్మావతికి భయం వేసింది. ఇక అందులో అదితక్కువ, ఇందులో ఇదితక్కువ అనడం; రెండోపిండివంట లేదని ఆక్షేపణ: పరమాన్నంలో బెల్లం వేసినందుకు తప్పుపట్టడం. భానుమూర్తికి కోపం వస్తూఉంది: ఏమీ అనగూడదు. ఏమిచెయ్యడం? ఇక పట్టలేక, "తద్దినపు పాయసంలో పంచదార పనికిరాదుగదా?" అన్నాడు. "వీటికంతా శాస్త్రాలేమిటి?" అని గణపతిజవాబు.

ఎట్లయితేనేమి, భోజనాలు అయినవి. కమలమ్మ "నాయనా, శ్రీహరీ, తాంబూలాలు ఇయ్యి" అనగా అబ్బాయి అర్ధఅర్ధరూపాయ పెట్టి తాంబూలాలు ఇచ్చాడు. అవధాని ఆశీర్వదిస్తూండగా గణపతి తాంబూలం క్రిందపెట్టాడు. శ్రీహరి 'తాంబూలం తీసుకోండి శాస్త్రులుగారూ' అని బ్రతిమాలుకొంటాడు.

గణ—మీతాతగారు మానాయనకు ప్రతి తద్దినానికీ గోదానం చేసేవారు. మీనాయన పంచలచాపు ఇవ్వడం మామూలు. అదీపోయింది మీకాలాన "నానాటికి తీసికట్టు నాగంభొట్లూ" అన్నట్టు. అందుకూ అనను. పెదవి కదల్చని అవధానికీ అర్ధరూపాయా, మంత్రంచెప్పిన నాకూ అర్ధరూపాయానా? ధర్మమా?

భాను—తమ్ముడూ, మరోపావలా ఇయ్యి.

శ్రీహరి—(పావలాపెట్టి) తీసుకోండి శాస్త్రులుగారూ.

గణ—(తీసుకొని) అయితే మూడోబ్రాహ్మడే కూర్చొనిఉంటే తాంబూలము ఇవ్వవలసిందేగదా? గంధపుచెక్క పెట్టామంటే బ్రాహ్మడు ఉన్నట్టే. ఆతాంబూలం నాకు వస్తుంది, రాజపురోహితుణ్ణి కాబట్టి.

ఇంతటికి భానుమూర్తికి వచ్చిన కోపానికి మేర లేదు. కాని తద్దినపుబ్రాహ్మణ్ణి యేమనగలడూ? నాగ

రకహాస్యంగా, "మీభోజనానికి పైగా నూడో బ్రాహ్మడి పాలు మీరు తింటే, మీకు ఆపక్షిణ వస్తుంది. లేదా గంధపుచెక్క చేల తినిపించండి దానికిస్తాం" అన్నాడు. "బ్రాహ్మడిమర్యాద గంధపుచెక్కకు జరపాలి. లేకుంటే బ్రాహ్మడే నని గంధపుచెక్కను ఎందుకు పెట్టడం?" అని గణపతి అన్నాడు. "నిజమే, అదితిని తీసుకుంటే" నని భానుమూర్తి అన్నాడు. అంతట అవధాని నాలుగుచీవాట్లువేసేసరికి ఆకర్కోటకుడు, "నీ సొమ్మేం పోయింది, నాకు వచ్చేడబ్బులు పోతే" నంటూ అతిక్రోపంతో తాంబూలం అక్కడ పెట్టి లేచి పోయినాడు. "తీసుకోరా గణపతీ" అంటూ అది పట్టుకొని అవధాని వెనకనే వెళ్లాడు.

"మంచీచెడ్డా, న్యాయం అన్యాయం ఆలోచించరుగదా యీకర్కోటకపుబ్రాహ్మలు" అని భానుమూర్తి అన్నాడు.

కమ—ఆలాఅనకు నాయనా! తప్పు. పితృకార్యం జరిపిన బ్రాహ్మడిలో పితృదేవతలు ఆవహించి ఉంటారు.

భాను—వీడిలో పితృదేవతలే ఆవహించిఉంటే ఆపితృదేవతలు వీణ్ణి యిలా ప్రవర్తించనిస్తారా ?

కమ—వాండ్ల కులాచారం అది.

భాను—అకులమేగదా సుబ్బావధానిది. ఆయన చూడూ, ఎంతసౌమ్యంగా ఉన్నాడో!

*　　*　　*　　*

కష్టపడి వంటచేసినపద్మావతికి ఆకలి అవుతూంది. వృథాగాపాగుపోవడం ఎందుకని "అత్తా! లేచిరావూ ?" అని పిలవగా, కమలమ్మ లోపలికి వెళ్లింది.

## ౬

భాను—తమ్ముడూ, నీవైనా అమ్మకు చెప్పుమా. లక్ష్మివంటి యీపిల్లకష్టము చూస్తే గుండె నీరై పోతుందీ. జాతీనీతీలేని నీచులకు ఐశ్వర్య మిస్తాడు వెధవదేవుడు. శౌర్యమానవంతులకు తిండికి లేకుండా చేస్తాడు. మొన్నటిరోజు అమ్మ చెల్లెను కొడితే నాగుండె బద్దలయింది. ఈముద్దులుగులికే లక్ష్మికా యీ కష్టాలు ?

సరో—అన్నయ్యా, అన్నయ్యా, బావ వచ్చి పోయినప్పటినుంచీ అమ్మ నెయ్యిలేకుండా అన్నం పెట్టుతూంది.

శ్రీహరి—దానికితోడు కొట్టడమెందుకూ ?

సరో—రాత్రి నేను యేడిస్తే నెయ్యివెయ్య డానికి ముంత తెచ్చింది.

(లోపలినుంచి) సరోజినీ, ఏమిటది ?

సరో—(నోరుమూసుకొంది.)

భాను—తమ్ముడూ, ఈవెధవతద్దినంనాడు యీకర్కోటకపువైదీకులకు పిండివంటలు చేసిపెట్టడానికీ, ఎంతటికీనిండని కన్నాలచేరలలో పొయ్యడానికీ నని పూడవేస్తూ, బంగారుతల్లికి కడుపుకాలుస్తూ, వారం రోజులు నెయ్యి లేకుండా తల్లి అన్నముపెట్టడమా ? వివేకానందులవారు "మూఢాచారాలలోబడి జీవనము దుర్భరమౌతున్నది!" అన్నమాటకు అందరికీ అర్థము. తెలుస్తుందా ? ఎన్నికష్టాలు అనుభవించాలి, లేక ఎంత లోకవిమర్శన ఉండాలి ?

సరో—అయితే, అన్నయ్యా, వీండ్లకోసమా నాకు నెయ్యిలేకుండా చేసింది ?

శ్రీహరి — వాండ్లకోసంగాదు చెల్లీ, తద్దినం కోసం. ఇవ్వాళ మనయింట్లో తద్దినంగదూ!

సరో—అంటే ?

శ్రీహరి—అప్ప చచ్చిపోయినరోజు ఇవ్వాళ. ఆయనకు ఇవ్వాళ అన్నమ పెట్టాలి. పెట్టకుంటే ఆకలికాదూ ?

సరో—అయితే, మనతాస్తుర్లూ ఇంకెవరో ఒకాయనా వచ్చారు గాని, అప్పవచ్చాడా ? వస్తే నాకేమీ తిండానికి లేదూ ?

శ్రీహరి—చచ్చిన అప్ప ఎట్లా తెస్తాడు ?

సరో—ఎట్లా వచ్చి తింటాడో అట్లనే.

శ్రీహరి—అట్లకాదు చెల్లీ. వీండ్లకు పెడితే ఆయనకు ఆకలి తీరుతుంది.

సరో—బహుబాగు ! — అయితే నీవు చదువుకొంటుంటే ఇక్కడ ఎవరన్నా తింటే అక్కడ నీకు ఆకలి తీరుతుందా ?

భాను—ఒక్క ముద్దు. ఏదీ, మరో ముద్దు.

సరో—నీపేరు చెప్పి ఈ అన్నయ్యకు ముద్దుపెడతాను; నీకు ముద్దు పెట్టినట్టే.

సరోజినికి జవాబు చెప్పలేక ఒకర్ని మార్చి ఒకరు ముద్దుపెట్టుకుంటూ నలిపేసరికి, అక్కణ్ణుంచి పారిపోయింది.

భాను—తమ్ముడూ, మతగ్రంథాలేమైనా చదివావా ?

శ్రీహరి—అట్టే చదవలేదు. తీరిక ఉంటేకదూ ? నీకంటే బడిచదువూ, పరీక్షబెదురూ లేదు కాబట్టి అన్నీ చదువుతావు.

భాను—వివేకానందులవారి గ్రంథాలన్నీ చదివావా లేదా ?

శ్రీహరి—నీదగ్గరనే గదా చదివాను?

భాను—అవి చాలు. పరిశోధన చేసేజ్ఞానం కావలసినంత కలుగుతుంది. శ్రాద్ధమంటే యేమిటి ?

శ్రీహరి—అనగా శ్రద్ధతో కూడినది.

భాను—అవును. అంటే పెద్దలు ఏసత్కార్యాలు చేస్తూఉండిరో వాటినిపుత్రులు శ్రద్ధతో చేస్తే పెద్దలు పరితృప్తులౌతారు. అంతే గాని వారిపేరు చెట్టి నీవు భప్పళాలు కొట్టడంగాదు. ఆలోచించు. నీకు చెప్పే దేమిటి ? విమర్శనశాస్త్రము చదివే ఉంటావు గదా. పోనీ, పామర జనుల విశ్వాసాన్ని బట్టి పెద్దల ఆకలి తీరుస్తామనే భావతోం ఆలోచిస్తాము.



" తీసుకోరా గణపతీ " అంటూ అది పట్టుకొని

నీఆకలి నీవు తీర్చుకోలేవు, పితృదేవతల ఆకలి తీరుస్తావా యిక ?

శ్రీహరి— ఈవిషయ మై అట్టే నేను ఆలోచించలేదు. ఇద మిత్థ మని జవాబు తేల్చిచెప్ప లేను.



అవధానివెనకనే వెళ్లాడు.

భాను — చచ్చిపోయిన తర్వాత పితృదేవతలు ఇంకా వచ్చి నీ పిండాలు తింటున్నారనే అనుకొంటున్నావా ?

శ్రీహరి—వచ్చి తినరని నీ వెట్లు చెప్పగలవు ?

భాను — పిండాలు ఖర్చుకావడం లేదు కాబట్టి.

శ్రీహరి—తమాషా కాదు. దివ్య జ్ఞానసభవారు మరణించినవారి జీవులను పిలిచి వాటితో సంభాషణలు జరుపుతున్నారే ?

భాను — వస్తున్నాయనే అందాము. నీ పిండాలు వాటికి కావలె నని సిద్ధాంత మేమిటి ? తిలకుగారి ఆత్మను 'నీదినచర్య యేమిటి ?' 'అని అడిగితే దేశాలు తిరిగి ఇండియాకు స్వరాజ్యము సంపాదించే ప్రయత్నమే' నన్నాడు. ఆకలి దప్పికలు లేవని చెప్పాడు.

శ్రీహరి — ఆయనకంటే లేకపోవచ్చు. సామాన్య మానవులకో ?

భాను—ఇందులో దిగితే, మన మతం ఒక మహారణ్యం. ప్రతి సిద్ధాంతానికీ విరుద్ధంగా పదిసిద్ధాంతాలు ఉన్నాయి. ఎవడి కర్మనుబట్టి వాడు కర్మఫలము అనుభవించడానికి పోతున్నాడనే కర్మసిద్ధాంతం ఉండగా, ఇక నీపిండాలు వాడికి చెందవుకదా ?

శ్రీహరి—పుత్రుడంటే 'పుం' అనే నరకమునుండి కాపాడేవాడు. శ్రాద్ధమువల్ల ఆకార్యము సాధ్యమౌతుంది.

భాను—చేసినకర్మకు ఫలము తప్పదుకదా అను. ఇక ఒకడు మంచికర్మ చేసిఉంటే వాణ్ణి అదే రక్షిస్తుంది. లేకపోతే నీపిండాలు అతణ్ణి రక్షించలేవుగదా? అట్లు రక్షించడమే సాధ్యమైతే దుష్కర్మచేసినవారిని శ్రాద్ధాదికకర్మలచేత డబ్బుగలపుత్రులే రక్షించగలరు; లేనివారురక్షించలేరు. దీన్నిబట్టి, డబ్బుగలవారు దుష్కర్మచేసినా వారికి భయం లేదు. లేనివాడు చేస్తేముక్తి లేదు. అనగా, దేవుణ్ణి డబ్బుగలవారు కొనివెయ్యవచ్చునన్నమాట. ఇదే మనమతమైతే నా కక్కరలేదు.

శ్రీహరి—ఆఅభిప్రాయముచాలామందికి ఉన్నదిసుమీ.

భాను—ఇంకొకవిషయము. పితృదేవతలన్నాము. వారిని దేవతలనుగా భావించి భక్తితో ఆరాధించేవేళను ఈచండాలపు బ్రాహ్మణనామకులను వారిస్థానంలో కూర్చోబెట్టడమా? తానుబోతులూ, ముండలమఠాకోరులూ, అసత్యవాదులూ,అన్యాయకారులూ నా పితృదేవతలస్థానం ఆక్రమించేవారు? పితృస్థానం ఆక్రమించగలవా డేడీ?

శ్రీహరి—ఆవిషయంలో సందేహం లేదు. నిజమైనబ్రాహ్మడు నీకు చిక్కడు. మాళవ్యాగారిని 'మనదేశం బాగుపడడానికి ఏమికావలె'నని అడిగితే 'నిజమైనబ్రాహ్మలు కావలె' నన్నాడు. అంటే వారు లేరన్నమాట.

భాను—ఇక శ్రాద్ధభోజనమే పితరులకు అవసరమనుకొందాము. మనలో ఎవడైనా సన్న్యాసం పుచ్చుకొన్నవాడు మరణిస్తే, వాడికొడుకు ఆరాధన అని ఒకపితృకార్యం చేస్తాడు. అందులో తాతముత్తాతల పోలూపొందూ రాదు. తండ్రిని ఆరాధించడమే. అట్టివిషయంలో, ఈయన సన్న్యాసం పుచ్చుకొన్నాడని, ఈయన తండ్రితాతలు తిండిమానుకొంటారా? మరిన్నీ, ఏమీవద్దని సన్న్యాసంపుచ్చుకొన్నవాడిని బలవంతమాఘుస్నానంగా సంసారంలోకి లాగి నీవు అన్నంపెడితే, వాడు వస్తాడా? తింటాడా? సంసారంలోనే వున్న తాతముత్తాతలను తలచవు; వారి ఆకలి చస్తుందా?

శ్రీహరి—పితరులకు అన్నమే అవసరము అయితే, కొడుకు సన్న్యాసి అయినమాత్రాన అయ్యనకు ఆకలిపోతుందా? ప్రకృతివిరుద్ధము.

భాను—ఇక ఆధ్యాత్మికంగా ఆలోచిస్తాం. మన ఆధ్యాత్మికసారస్వతసారం భక్తీ,సద్వర్తనమాత్రమే ప్రధానము అని. జ్ఞానియైనవాడు ప్రతివాడూ, ఈజపతపాలూ, ఈపితృకర్మలూ అనవసర మంటున్నాడు. సన్న్యాసాశ్రమము మనజీవనంలో పరమావధి. అది సత్యమని అందరూ ఒప్పుకొంటారు. అదే సత్యమైతే, ఈ అసత్యంతో మన క్షేమిపని? సత్యం అవలంబించడం, అసత్యం విసర్జించడం యోగుల క్షేమి, కాని వారిక్షేమి? అందరికీ అవసరమే. "వారు యోగులు; వారికి సత్యం ప్రధానం. మనం సంసారంలో ఉన్నాము. మనకు ఈఅసత్యమే ఉండవలెను." అని జ్ఞానం గలవాడు ఎవడూ అనడుగదా? అసత్యం వదలేకొద్దీ జన్మ పవిత్ర మాతుంది. క్రమక్రమంగా పవిత్రమైతేనే కాని ఆత్మజ్ఞానం గలుగదు. ఒక్కమారు యోగుల మయ్యేవరకూ అసత్యమే పట్టుకొనిఉందాం అంటే అందులో తెలివేమిటి?

శ్రీహరి—నాకు చాలాకాలంగా మనసులో ఒకఆలోచన ఉంది. ఈమాధ్యానికంతా స్వార్థపరులైనబ్రాహ్మలు కారకులని.

భాను—అది రూఢి.

శ్రీహరి—ఈ మూఢాచారాలు మనకే కాదు, అన్నిజాతులవారికీ ఉన్నవి.

భాను—శ్రాద్ధము, మళ్లీ, కేవలము మూఢాచార మనడానికి వీలులేదు. మూఢులచేతులలోబడి మూఢమైంది. నీవు చెప్పినట్టు ఈమూఢాచారాలు అన్ని జాతులవారికీ ఉన్నవి. మనకూ ఉన్నవి. ఇవన్నీ మన వేదమతానికి సమ్మతములు కావు. అని వేదములుబాగుగా పరిశీలించినవారు చెబుతారు. కాని ఇవి ప్రాచీనాచారాలక్రింద నిల్చినవి.వేదం దైవదత్తము,అపౌరుషేయము

అనిచెప్పువారు వేదములో చెప్పినట్లు ఎందుకు నడుచు కోరు ? అందులో చెప్పినట్లు నడుచుకోవాలి, లేకుంటే దానిని వదలుకోవాలి. ఇకసంప్రదాయమూ, ఆచారమూ అంటే ఎవరు ఏర్పరచిన ఆచారం ఆచరణీయమని నిర్ణయించడం? తరతరాలుగా పెద్దలు చుట్టలు తాగితే పుట్టేవారు తాగాలి; ఆచారం విడువరాదు గదా ? అట్లయితే నేను ఒకఆచారం ఏర్పాటుచేస్తాను, సురాచారం. సంప్రదాయమని ఇక తరతరాలవారూ ఆచరించకతప్పదు. ఆలోచిస్తే యీవంశాచారాలూ, సదాచారాలూ అనేవి కొన్ని పరమమూఢాచారాలు మనను తినేస్తున్నవి. ఈకర్మకావత్తూ అనవసరమని జ్ఞానులు చెప్పనేచెప్పారు. మనమే అడుసులో పడ్డ పిల్లికి అదేవైకుంఠ మన్నట్టు బాధపడుతున్నాము.

శ్రీహరి—ఈదిక్కంతా వదలించుకొని మన కర్మలన్నీ సంస్కరించుకొనవచ్చునుగదా ?

భాను— శ్రాద్ధకర్మ కేవలము చెడ్డదికాదు.మానవుడికి ఎప్పుడూ ఉదాహరణభూతంగా మార్గదర్శిగా ఒకడు ఉండాలి. ఊరక "సత్యంవద", ధర్మంచర" అని ధర్మసూత్రాలు చెప్పినంతమాత్రాన ప్రపంచం బాగుపడదు. ఆవిధంగా ఒకవ్యక్తి ఆచరిస్తే, అందరికీ అతన్ని చూచి ఉత్సాహమూ, తెంపూ, నీచజీవనంమీద రోతా పుట్టి మంచిదారి తొక్కుతారు. ఆవిధంగా కష్టాలెన్నో పడి సత్యవ్రతమాచరించిన మహాపురుషులను అప్పుడప్పుడూ సాధ్యమైతే ఎప్పుడూ స్మరిస్తుంటే, భ్రమరకీటన్యాయంగా వీరిజీవితాలు బాగుపడతాయి. అందుకోసమని పోయినవారిని శ్రద్ధతో స్మరించడం, అనగా శ్రాద్ధం పెట్టడం. అంతేగాని, చండాలపుబ్రాహ్మలకు పెట్టడానికని కన్న బిడ్డలకు కడుపులు కాల్చడం గాదు. తమ్ముడూ, నేను చెప్తాను విను. సత్యంగా చెల్లెలికి వారంగా నెయ్యి ఉన్నట్టు కనబడదు. ఈవిధంగా మనదేశంలో ఎన్ని వేలకుటుంబాలు ఉంటాయంటావు? వారందరికీ ముక్తియెన్నటికి ?

శ్రీహరి — మనమేమిచెయ్యగలము ? లోకం అంతా మరామత్తు చేయగలమా ? నేనొక్కణ్ణి, నీవొక్కడివీ.

భాను—అట్లనకు, 'నేనొక్కణ్ణీ, నీవొక్కడివీ' అంటావేమి ? 'మనమిద్దరము' అనరాదూ ? మనమధ్య ఉండే భగవంతుడితో ముగ్గురము. ఇక ప్రపంచాన్ని ఎదిరించవచ్చు. సత్యం మనపక్క ఉన్నంతసేపూ భయ మెందుకూ ? కష్టానికి వెరవడం నీచలక్షణం. ధర్మానికి కష్టాలుపడ్డవారే శాశ్వతప్రతిష్ఠ సంపాదించి విశ్వజీవనానికి మూలకారకు లౌతున్నారు.

శ్రీహరి—అయితే మనం సదుద్దేశంలో మూఢాచారాలను తుంగలోతొక్కినా, ప్రస్తుతం డబ్బులేక ఉన్నందువల్ల, గతిలేక సదాచారాలు మానారు అంటారు.

భాను—అంటే అననీ. భయమెందుకు ? ఎల్లకాలమూ నీవు డబ్బులేకనే ఉంటావా ? ఇక రెండు నెలల్లో బియ్యేపరీక్ష అవుతావు; ఉద్యోగం చేస్తావు. అప్పుడు అయిదురూపాయలు లేక తద్దినం మానాడు అనలేరుగదా ? దానికి తోడు లోభితనం దగ్గరచేరనీయకుండా సద్వ్యయం చేస్తుంటివా, అందరూ నిన్ను చూచి హర్షిస్తారు. ముందు అనుమానించినా, నెమ్మదిగా నీదారికే వస్తారు. తెలేనివారు తెలియక మౌఢ్యంలో ఉండీ, తెలిసినవారు భయంలో, మౌఢ్యంలో ఉంటే తరించడ మెన్నటికి ? విద్యావంతులు మార్గదర్శకులు కావాలి. ప్రతిఆచారమూ శోధించి, చెడ్డా చెత్తా మాని, మంచిమంచిరీతిన ఆచరిస్తాము. అందరికీ జీవనం కొంచెం సాధ్యంగా, రుచిగా చేతాం. తమ్ముడూ, ఇదే కంకణంగట్టాను. ధర్మసేవకుడ నైనాను. నీతో ఇద్దరమూ, దేవుడితో ముగ్గురమూ, ఇకేమి ? దీర్ఘంగా ఆలోచించి సత్యమని తోచింది విశ్వమంతటా వెదజల్లుదాం.

శ్రీహరి—ఇద్దరమా ?

భాను—మళ్లీ ఆమాటఅంటావు ? బౌద్ధమతకర్త బుద్ధుడు మొదట ఒక్కడే ఒకపక్షము. మొదట క్రైస్తు ఒక్కడు; మహమ్మదు ఒక్కడు. సత్యం తోడైతే, ప్రపంచమంతా ఎదిరించినా ఏమిభయం ? ముందు ఎదిరించినా, వెనక నీకు పాదాక్రాంత మౌతుంది.

శ్రీహరి—మౌఢ్యవిముక్త సమాజం లేవదీస్తాము. దేవుడితో ముగ్గురమూ మొదటిసభ్యులం, నీవన్నట్టు.

# అణ్ణామలై విశ్వ విద్యాలయము

ఒంగోలు పద్మరాజు, బి, ఏ.,

" సహ నౌ యశః సహ నౌ బ్రహ్మవర్చసం "

(తైత్తిరీయోపనిషత్తు)

విశ్వవిద్యాలయములు విజ్ఞానమును వెదచల్లు స్థానములు. ప్రాచీనకాలమున భారతదేశమున విశ్వవిద్యాలయము లనేకములు వర్ధిల్లినవి. వాటిమూలమున భారతదేశ విజ్ఞానము ప్రపంచమున కంతయు ప్రసరించెను. పూర్వము మనదేశపు విశ్వవిద్యాలయములను ఆకాలపు రాజులు పోషించుచుండిరి. విద్యాభిమానులగు సంపన్నులు విద్యాపోషకు లయిరి. మనదేశమున ఆంగ్లప్రభుత్వము ప్రారంభమయిన తర్వాత పాశ్చాత్య నాగరకతా విజ్ఞానములు ప్రబలినవి. గడచినశతాబ్ది మధ్యభాగమునుండి మనదేశమున విశ్వవిద్యాలయములు కొన్ని మొలకలెత్తినవి. ప్రాయికముగ వీనియుందంతటను ఆంగ్లభాషా బోధనమునకును, పాశ్చాత్యనాగరకతా విజ్ఞానముల ప్రసరణకును ఎక్కుడు ప్రాధాన్య మొసగబడుచున్నది. ఈ విశ్వవిద్యాలయము లన్నియు ప్రభుత్వము వారి యాదరణవలన వృద్ధికి వచ్చియున్నవి.

మనచెన్నపురిరాజధానియందుగల మూడువిశ్వవిద్యాలయములలో రెండు చాలవరకు ప్రభుత్వమువారి పోషణలోనే యున్నవి. అణ్ణామలైవిశ్వవిద్యాలయస్థాపనమునకుగాని, తదభివృద్ధికిగాని సంపూర్ణముగ రాజా సర్ అణ్ణామలై శెట్టిగారిసహజౌదార్యమే కారణము. ఈవిద్యాసంస్థ చిదంబరమునకు తూర్పుదిశను ఒకటిన్నర మైలుదూరమున నున్నది. చిదంబరము చాలపురాతనమైన శైవక్షేత్రము. అనాదిగ చిదంబరము ద్రవిడ వాఙ్మయ విజ్ఞానములకు కేంద్రమై, విద్యాధికులను, రాజులను, జిజ్ఞాసువులను అనేకుల నాకర్షించుచుండెడిది. అట్టి చిదంబరమునకు చేరువనే విశ్వవిద్యాలయము నొకదానిని స్థాపించుట మిక్కిలి యొప్పియున్నది. ఈవిశ్వవిద్యాలయస్థాపనమునకు పూర్వ మిచట నుండిన శ్రీ మీనాక్షీకళాశాలను, తమిళ సంస్కృతకళాశాలలను, గానకళాశాలను శ్రీ అణ్ణామలై శెట్టిగారే పోషించుచుండిరి. ఈ విద్యాసంస్థల నెల్ల కలిపి విశ్వవిద్యాలయము నొకదానిని స్థాపించి ద్రవిడభాషాపోషకులయి తమిళనాడున కొకప్రత్యేకవిద్యాపీఠము కావలయునని యువ్విళ్లూరుచుండిన ౧,౫౦,౦౦,౦౦౦ల తమిళులకృతజ్ఞతకు పాత్రులు శ్రీ శెట్టిగారే. దీని స్థాపనమునకు వీరు ఇరువదిలక్షలరూప్యముల నొసగిరి.



రాజా సర్ అణ్ణామలై శెట్టిగారు (విశ్వవిద్యాలయస్థాపకుడు)

మదరాసుప్రభుత్వమువారును వీరి యౌదార్యమునకు మెచ్చి విశ్వవిద్యాలయభవననిర్మాణములకుగాను ఏడున్నరలక్షల రూప్యములను, విరాళముగ ఇరువదియేడు లక్షలరూప్యములును, ఇవిగాక వార్షికముగ ఒకటిన్నర లక్షలరూప్యములను ఒసంగుటకు సమ్మతించిరి. తరువాత ౧౯౨౯-వ సంవత్సరము జనవరినెలయం దీవిశ్వవిద్యాలయము స్థాపింపబడినది.

అణ్ణామలై విశ్వవిద్యాలయమున ప్రాచ్యభాషావాఙ్మయవిజ్ఞానములకు ప్రాధాన్య మొసగబడియున్నది. ఇచటి పాఠసూచియందు తమిళసంస్కృతవాఙ్మయముల పరిశోధనకు ప్రత్యేకవసతు లేర్పరుపబడియున్నవి. ఈ విద్యాపీఠమునగల మహాపండితులయాజమాన్యమున జరుగు పరిశోధనలు అమూల్యమైన విజ్ఞానసంపదను విస్తరింపజేయగలవనుటకు సందేహము లేదు. ప్రతిభాషాశాఖయందును ప్రత్యేకము భాషాపరిశోధకవిద్యార్థులు గలరు. వీరు చేయువాఙ్మయపరిశోధనలయందు ఇచటిపండితులు వీరికి సాయముచేయుచుందురు ఇతరవిద్యాపీఠములందువలె నిచటను ప్రాచ్యభాషలయం దున్నతపట్టపరీక్షలు



రావుబహదూరు యస్. ఇ. రంగనాథంగారు, యం, ఏ., ఐ, ఇ. యస్. ఉపాధ్యక్షులు

కలవు. ప్రాచ్యభాషాకళాశాలయందు విద్యార్థులకు వారి తరగతులనుబట్టి విద్యార్థి వేతనముల నిచ్చుటగలదు.

ఈవిద్యాపీఠమునకు సంబంధించిన గానకళాశాలయు ఒకటిగలదు. ఇచట నాలుగుసంవత్సరములు సంగీతము నేర్పబడును. గానకళాశాలయందలి విద్యార్థులు ముఖ్యముగ తెలుగు నభ్యసించవలెను. అందుకుగా ప్రత్యేకమైనఏర్పాట్లు చేయబడియున్నవి. గానకళయందు కొంతప్రవేశమున్నవారిని రెండవతరగతియందుగాని, మూడవతరగతియందుగాని చేర్చుకొనెదరు. ఈ విద్యార్థులకు వేతనము లీయబడుచున్నవి.

ఇతరవిశ్వవిద్యాలయములందువలెనే యిచటను గొప్పప్రధానకళాశాల యొకటి గలదు. ఇంటరుమీడియటుమొదలు యం. ఏ., వరకును ఇందువిద్య నేర్పబడును. ఇచటచదువువిద్యార్థులసంఖ్య షుమారు అయిదువంద లుండును. ఇచటనయితము ప్రతిశాఖయందును పరిశోధనలకు ప్రత్యేకవసతు లేర్పరుపబడియున్నవి. భౌతిక, రసాయన, గణిత, వార్తా (Economics) శాస్త్రములందును, చరిత్ర, వేదాంతము మొదలయినవిద్యలందు పరిశోధనలు జరుగుచున్నవి. వీరికి విశ్వవిద్యాలయమువారు సౌకర్యముల గూర్చి వీరిపరిశోధనలకు ఎక్కుడుసాయము చేయుచున్నారు. ఈవిధముగ నీ విద్యాపీఠమున సర్వవిద్యలకును, సకలకళలకును, శాస్త్రములకును, అత్యుత్తమమయినబోధన పరిశోధనలకును తగినవసతులు కల్పింపబడినవి. పరిశోధనకు వసతులు కల్పించుట, విద్యాబోధనమునకు సరియయినఏర్పాటులు కావించుట, విశ్వవిద్యాలయమున విద్యార్థులకు వసతిగృహముల స్థాపించి వారికందరికి ఏకవిధమయిన విద్యగరపునట్టివసతి విశ్వవిద్యాలయపద్ధతుల నెలకొల్పి విద్యార్థులకును, విద్యాబోధకులకును పరస్పరముమైత్రిని కలిగించుట, ప్రాచ్యవిద్యావిజ్ఞానముల పునరుజ్జీవింపచేయుట, వీటికన్నిటికి కావలసినద్రవ్యమును ప్రోగుచేయుట, ఈ విద్యాపీఠమువారి యుద్దేశములలో ప్రధానము లయినవి.

ఈవిశ్వవిద్యాలయమువారియాశయములు చాల గొప్పవి. వీరుతలపెట్టినరీతినే విద్యాలయమును సాగించిన యెడల ఈవిశ్వవిద్యాలయము దేశమునకు గొప్పసేవ



ప్రథాన కళాశాల

ఇచట అణ్ణామలై విశ్వవిద్యాలయగ్రంథాలయ మొకటి యున్నది. సుమారు మున్నూటికి పైగా దేశ విదేశ పత్రిక లిచటికి వచ్చుచున్నవి. ఈ గ్రంథాలయము, ముఖ్యమైన సెలవుదినములందు తప్ప ప్రతి దినమును, ఆదివారమునాడు సయితము తెరువబడియే యుండును. ప్రతి విద్యార్థికిని ఒకేసారి నాలుగుపుస్తకముల నిచ్చెదరు. ఈ గ్రంథాలయము కాక విశ్వవిద్యాలయమునకు సంబంధించిన ప్రతిశాఖకును ప్రత్యేకము వేరొక గ్రంథాలయము కలదు. ఎప్పటి కప్పుడు అచ్చగు గొప్ప గొప్ప గ్రంథములను వీరు తెప్పించుచునే యుందురు.

అణ్ణామలై విద్యాపీఠపుటావరణము మూడువందల చేసినదగును. ఈవిశ్వవిద్యాలయము స్థాపింపబడి యింకను అయిదుసంవత్సరములు కాలేదు. ఇంతలోననే, వీరు సాధించి నిర్వహించినకార్యము లెవ్వియని ప్రశ్నించుట సరికాదు. ఇచట పారిశ్రామికవిద్యలుసయితము నేర్ప వలయునని కొందరియభిప్రాయము. కాలక్రమమున ఈ విద్యాసంస్థ వృద్ధియై అన్నివిద్యల కును ముఖ్యస్థానము కాగలదు. అందుల కనువగు వసతు లనేకములు వీరికిగలవు. పారిశ్రామికకళాశాలను స్థాపించుటకు ద్రవ్య మపారముగ వెచ్చింపవలయును. ఈ కార్యము త్వరలో నెరవేరునది కాదు. విశ్వవిద్యాలయమువారి మనస్సునను ఈ ఆలోచన యున్నది. పారిశ్రామిక విద్యల ప్రాముఖ్యమును, ఆవశ్యకములనుగూర్చి ముచ్చటించుట యనవసరము. బీదవిద్యార్థుల కిచట విద్యార్థివేతనములనొసగి భోజనము పెట్టుచున్నారు.



శాస్త్రశాఖ

యెకరములవిస్తీర్ణము గలిగియున్నది. విద్యాలయపరిసరములవిద్యార్థులకొరకు విశాలములగు ఆరామస్థలములేర్పరుపబడియున్నవి. ఆచేరువనే నాలుగువందలకుపైగా విద్యార్థులకు వసతిగూర్పగలహాస్టెలు భవనములుగలవు.



ప్రాచ్యవిద్యాశాఖ

హాస్టెలునందు భోజనాదిసౌకర్యములు చక్కగ నమరియుండును. ఇందులకగుఖర్చుసయితము స్వల్పమే. విశ్వవిద్యాలయము నెలకొల్పబడినపూర్వపు 'తిరుక్కళమ్' అను పల్లె నేటి అణ్ణామలై నగరమయి అత్యారోగ్యవంతమైన ప్రదేశముగ నున్నది. విద్యార్థులకు సమపదేశములనొసగి వారిని సన్మార్గానురక్తుల చేయుటకు కొందరుపాధ్యాయులు హాస్టెలునందు వసించుట కేర్పాటు లునున్నవి.

చిదంబరము స్టేషనుకడ రైలు దిగి రాగనే విశ్వవిద్యాలయోపాధ్యక్షుల భవనము కానవచ్చును. ఆ భవనమున కుత్తరదిశను ఉపాధ్యాయుల భవనములు కొన్నిగలవు. ఆ మార్గముననే యింకను తూర్పున విద్యాలయభవనములు మూడుగలవు.

ఉత్తరదిశయందు గల భవనములలో రసాయన భౌతిక శాస్త్ర ప్రయోగశాలలును, ఉపన్యాసమందిరములును కలవు. మధ్యనున్న విశాలసౌధము క్రిందిభాగమున విశ్వవిద్యాలయగ్రంథాలయము గలదు. పైభాగమున విశ్వవిద్యాలయపు కచేరీలు, ఉపాధ్యాయుల గదులు, విశ్వవిద్యాలయ విద్యార్థిసంఘ సమావేశముల సభామందిరము (Assembly Hall) గలవు. ఇందే పట్టప్రదాన మహాపరిషత్తు ప్రతిసంవత్సరమును జరుగుచున్నది. దక్షిణదిశనుగల మరియొక పెద్దభవనమున ప్రాచ్యభాషాకళాశాల గలదు. ఈ భవనమునకు పైభాగమున, ఇంగ్లీషు, చరిత్ర, వార్తాశాస్త్రము, గణితశాస్త్రములకు సంబంధించిన యుపన్యాసమందిరములు కలవు. విద్యాలయములను దాటివచ్చినపిదప విద్యార్థుల సౌకర్యార్థము నెలకొల్పబడిన వైద్యశాల గలదు. తరువాత విశ్వవిద్యాలయమున కతిథులుగ వచ్చు ప్రముఖుల సౌకర్యార్థ మొకవిశ్రాంతిభవనము కలదు. దానిప్రక్కనే తపాలాఫీసు, తంతిఆఫీసు గలవు. తపాలాఫీసునకు సరిగ దక్షిణమున బోవుమార్గమున కళాశాల ప్రధానాచార్యుల



ఉపాధ్యక్షుని భవనము

గృహములుగలవు. ఆదారినే పోయి మరల పశ్చిమము నకు తిరిగినయెడల విద్యార్థుల భోజనశాలలు వచ్చును. అటనుండి హాస్టెలు ప్రవేశించ వచ్చును. హాస్టెలు నుండి తిన్నగా ఉత్తరము నకు వచ్చిన వ్యాయామ శాఖాధికారి గారి కచ్చేరి గలదు. ఈ విశ్వవిద్యాలయము మున విద్యార్థుల ఆరోగ్య విషయమై చాలశ్రద్ధ తీసు కొనుచున్నారు. ఇందులకు గా విశ్వవిద్యాలయోపాధ్యక్షుని యాజమాన్యమున నొక సంఘముకలదు. కళాశాలయందు అన్నితరగతుల విద్యార్థులు వ్యాయామములందును ఫుట్‌బాల్, క్రికెట్, హాకీ మొదలగు ఆటలయందును పాల్గొనుట తప్పనిసరియై యున్నది. వారమునకు రెండుమారులు పాఠములు చదువు కాలముననే, ఆరోగ్యము, శుభ్రత మొదలగు విషయ ములం దుపన్యాసము లొసగబడుచున్నవి.



విశ్వవిద్యాలయోద్యోగుల నివాసములు

ఇచట విద్యార్థిసంఘము లనేకము లున్నవి. విద్యార్థులను సంఘసేవయందు నేర్పరులజేయుటకు సంఘసంస్కారసమాజ మొకటి గలదు. వీరు గ్రామపున ర్నిర్మాణము మొదలగుకార్యముల చేయుచున్నారు. విశ్వవిద్యాలయవిద్యార్థిసంఘ మొకటి గలదు. ఇందు నిర్వాహకులందరు విద్యార్థులే. వీరు ప్రతిశనివారమునాడును సమావేశమై ఏదేని విషయముల చర్చించుచుందురు. ఇచ్చోటగల ఆంధ్రవిద్యార్థులును, కర్ణాటకులును, మల యాళీయులును వారువారు తమకు ప్రత్యేకసంఘముల నిర్మించియున్నారు. ఇట్టిసంఘములనుసయితము విశ్వవిద్యాలయమువారు ప్రోత్సహించుచున్నారు. ఇవిగాక విశ్వవిద్యాలయమున నాటకసంఘ మొకటి గలదు. ఇందు ఉపాధ్యాయులును, విద్యార్థులును కలిసి సంవత్సరమున కొకటిరెండుసారులునాటకముల నాడుచుందురు. ఈ వివిధసంఘములను నిర్వహించుటకు విశ్వవిద్యాలయము వారు సాయపడుచున్నారు. విద్యాలయమునగల సకల విద్యాశాఖలకు సంబంధించినసంఘములు ప్రత్యేకముగా నున్నవి. వీటియన్నిటికిని విద్యార్థులయుత్సాహమును, విశ్వవిద్యాలయమువారిప్రోత్సాహమును కారణములు.

ఈవిశ్వవిద్యాలయము ఆయామవిస్తారముల భారత దేశమందలి విశ్వవిద్యాలయములన్నిటిలోనను చిన్నది. కాని విద్యాభివృద్ధివిషయమున దేనికిని తగ్గినదికాదు. విశ్వవిద్యాలయచిహ్న మున్నతాదర్శములను స్ఫురింప జేయుచున్నది. దాని పైవరుసను రెండువైపుల గల ఏనుగుతలలు గాంభీర్యమును, గొప్పతనమును, తెలివిని, విధేయతను తెలుపు చున్నవి. మధ్యనున్న కమలము, స్వచ్ఛతకును, విజ్ఞానమునకును,




ముద్రిక

జ్ఞానోదయప్రభకును గుర్తయి యున్నది. క్రిందివరుసను పతాకమున కుడమవైపున టెంకాయచెట్టు కలదు. (తెన్ = దక్షిణపు, టెంకాయ = దక్షిణదేశపు కాయ) దక్షిణదేశముయొక్కయు, తద్విజ్ఞానము యొక్కయు సమృద్ధిని తెలుపుచున్నది. కుడిప్రక్కనుగల వీణెసార

స్వతోపలక్షణమై, సంగీతసాహిత్యముల స్ఫురింపజేయును. మధ్యనున్నగోపురము, స్థలమాహాత్మ్యమును, ప్రాచీనభారతశిల్పకళానైపుణ్యముయొక్క యౌన్నత్యమును సూచించును. ఇన్నింటికంటెను, అందుగల "With Courage and Faith" అను ఆదర్శవాక్యము అచటికివిద్యాభ్యాసముకొరకు చేరువారికందరికిని తారకమంత్ర తుల్యమను చున్నది. మనము నిర్వహింపదలచిన కార్యమును ధైర్యముతోను, దృఢమైన నమ్మకముతోను తలపెట్టవలయు ననుటకన్నను న్నతాదర్శము వేరొకటి లేదు.



విద్యార్థుల నివాసములు

భారతదేశమున విద్యాపద్ధతి సమీచీనముగ లేదనియు, విద్యార్థులకు కొన్ని చిలుకపలుకుల నేర్పి వారిని పరీక్షలకు మాత్రము సిద్ధము చేయుచున్నారనియు నొకయపవాదము గలదు. గవర్నమెంటు ఉద్యోగములకొరకు విశ్వవిద్యాలయ పట్టపరీక్షుల కనేకులు చదువుచున్నారు. ఈవిషయమై విశ్వవిద్యాలయములు శ్రద్ధగొని కేవలము పరీక్షలయందుత్తీర్ణులగుటకు మాత్రము విద్యార్థులను తయారుచేయక నిజమైన కళావిజ్ఞానముల వారి కందజేయుట కర్తవ్యము.

దక్షిణహిందూస్థానము వాఙ్మయమందును, చిత్రకళయందును, శిల్పమందును, గానకళయందును, ఇంకను అనేకలలితకళలయందును నిరుపమానమైన ప్రజ్ఞగల దేశమని యనేకులు కొనియాడి యున్నారు. వాస్తవమున నదియట్టిదియే. అట్టిదేశమున, నేడు మరల సకలకళలను, శాస్త్రములను పోషింపగల విద్యాలయము లవసరములు. అణ్ణామలై విశ్వవిద్యాలయ మీ విషయమున నిలోధికశ్రద్ధాభినివేశములు వహించి మార్గదర్శి కాదగును. విద్యార్థులకు మానసికాధ్యాత్మికశారీరికసంపదలను పాడిగించు విద్యలనొసగి ఆంధ్రద్రావిడకర్ణాటాదినాగరకతలను పున



వ్యాయామశాఖాధికారి కార్యాలయము

రుద్ధరించుటకు ఈవిశ్వవిద్యాలయము నిరంతరము కృషి చేయవలెను. త్యాగమూర్తులగు శ్రీ రాజాసర్ అణ్ణామలై శెట్టిగారి కింకువలన ననన్యమగు ధన్యత చేకూరును. సత్పుత్రికవలన నుభయగోత్రములకును కీర్తిగలుగు నటులు శ్రీ అణ్ణామలై శెట్టిగారి ఈమహావిద్యాపీఠము వలన గురుకులమునకును, శిష్యమండలమునకును ఉపనిషదుపదిష్టవిధమగు యోగపద్యముగ "సహ నౌ యశః సహ నౌ బ్రహ్మవర్చసం" అను నుత్తమత్వసిద్ధి కలుగుగాక. మరియు విద్యాపీఠము పరాకాష్ఠ ఇట్టిదియ.

---



విశ్రాంతి

—సూర్య.

# వి నో ద శి ల్ప ము

## కాగితముల తోరణములు

కొ. నరసింహాచారి

పలురంగులకాగితములు తీసికొని, ఒక యంగుళము వెడల్పును, నాలుగంగుళముల పొడవును గలతునుకలుగా కత్తిరించవలెను (చిత్రము 1). అం దొకతునుకను దీసికొని దానికొనలను చేర్చి అతికించినయెడల ఉంగరమువలె నగును (చిత్రము. 2) ఈయుంగరమున మఱియొకతునుకను దూర్చి దానిని గూడ ఉంగరమువలె నతికించవలెను. ఇట్లే ఒకదానిలో నొకటిగా తునుకలను దూర్చుచు ఉంగరములవలె నతికించుచు వచ్చినయెడల నొకపెద్దగొలుసుగా నేర్పడును (చిత్రము 3). గొలుసునందు కొన్నియుంగరముల కొకమారు కాగితములరంగును మార్చుచు రావలెను. ఇట్టిగొలుసునకు సాధారణపువ్రాత కాగితము వలె నంతమందమగు కాగితము బాగుండును.

### మఱొకవిధమగు తోరణము

ఈతోరణమునకు సన్ననికాగితములు బాగుండును. గాలిపటముల కుపయోగించు కాగితములను పలురంగులుగలవాటిని దీసికొనవలెను. ఒకకాగితము మొదట రెండు లేక మూడంగుళముల వెడల్పునకు చిత్రము 4 నందు a, b, c అను చుక్కలగీతలవెంబడి మడువవలెను. అట్లు మడిచినదానిని చిత్రము 5 నందు d, e, f, g అను చుక్కలగీతల వెంబడి సమచతురాకారముగ నుండునట్లు మడువవలెను. ఇట్టిసమచతురములు ఒక కాగితమునందు అనేకములు ఏర్పడును. మడువబడిన సమచతురముచుట్టును అంచు వెంబడి కత్తిరించినయెడల చతురములన్ని వేరగును. చిత్రము 5 నందలి చతురములు చిత్రము 6 నందు పెద్దవిగ జూపబడియున్నవి. ఈచతురములను 7 లేక 8 ని చేర్చి తీసికొని a, c అను చుక్కలరేఖవెంబడి మూలకు మడువవలెను (చిత్రము 6). పిమ్మట (చిత్రము 7) o, b అనుచుక్కలరేఖ వెంబడియు, అటుపిమ్మట (చిత్రము 8) o p అనుచుక్కలరేఖవెంబడియు క్రమముగా మడుచుచు వచ్చినయెడల చిత్రము 9 యందలిరూప మేర్పడును. దానిని, చిత్రము 9 యందలి o a అను మూలనుండిగాని, చిత్రము 10 యందలి o p అనుప్రక్కవెంబడిగాని గలచుక్కలగీత వెంబడి కత్తిరించవలెను. o అనుమూలను గూడ కొంచెముగా కత్తిరించవలెను. మడిచిన కాగితమును విప్పినయెడల, చిత్రము 9యందలి రీతి కత్తిరించినయెడల చిత్రము 11 నందలి విధముగను, చిత్రము 10 యందలి విధముగ కత్తిరించినయెడల చిత్రము 12 నందలిరూపము గను ఏర్పడును. o అనుచోట నొకరంధ్ర మేర్పడియుండును. ఒకతోరణమునకు కావలసిన ముక్కలన్నియు, పై రెండువిధములలో నేదోయొకవిధముగనే కత్తిరింపబడియుండవలెను. పిమ్మట నొకనిడుపగుదారమును ఈ ముక్కలమధ్యగల o అను రంధ్రముగుండా




దూర్చి దారముయొక్క రెండుకొనలను రెండు అట్టముక్కలకు కట్టివేయవలెను.

తర్వాత మొదటిరెండుముక్కలను దీసికొని, వాటిలో నొకదానియందలి × గల మూలలను రెండవదానియందలి యదేవిధములగు మూలలకు అతికించవలెను (చిత్రము 11, 13). ఇందలి మొదటితునుకనుదాని ప్రక్క నుండు అట్టముక్కకు అతికించవలెను. పిమ్మట రెండవ ముక్క యొక్క a, b, c, d అను వెలుపలిమూలలను, మూడవ ముక్కయందలి యదే విధముగు బయటిమూలలకు అతికించవలెను. మూడవముక్క యందలి × వంటి లోపలి మూలలను, నాలుగవ ముక్కయందలి యదే విధముగు లోపలిమూలలకు అతికించవలెను.

ఈ విధముగా నతికించుచు పోయినయెడల, ముక్కలన్నియు చిత్రము 14 నందలి విధముగ s t అనుదారముపై పూర్వాపరవరుస వలె నేర్పడును. ఇందు కడపటిముక్కను, రెండవకొనయందుగల అట్టకు అతికించవలెను.

కావలసినపుడు దార మాధారముగ దీనిని పొడవగుతోరణముగ కట్టవచ్చును; అక్కర లేనపుడు, ముక్కలన్నింటిని దగ్గరకు చేర్చి చిన్నకట్టగా కట్టిపెట్టవచ్చును.

# "దేవునిపై విశ్వాసరాహిత్య తీర్మానము"

నందివాడ చిదంబరం, బి. ఏ., బి. యల్.,

[ఇది ఆంధ్రవిశ్వవిద్యాలయ వైసుఛాన్సలరు గారైన సర్. యస్. రాధాకృష్ణన్ గారి ఆధిపత్యమున ౨౧-౨-33 తేదీని జరుపబడిన రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రాతవిద్యార్థిసంఘముయొక్క వార్షికోత్సవ సందర్భమున గ్రంథకర్తచే చదువబడినది.]

సృష్టినుండియుగూడ దేవునిప్రభుత్వముపై నసంతృప్తిచెందినవారు పెక్కులు ఉండియున్నారు— రిఫారమ్‌ఆక్టువచ్చిననాటినుండియూ దానిపై నసంతృప్తిచెందినవాళ్లు ఉన్నట్టు. కాని, యింతవరకూ, భగవంతుని తోసిరాజనేమొనగాళ్లు,ఎవళ్ళూ గట్టిగా బయల్దేరియుండలేదు–తాలూకాబోర్డుప్రెసిడెంట్లను ఎలక్షను అయినమరునాడే విశ్వాసరాహిత్యతీర్మానంతో తోసిరాజనేమొనగాళ్లు బయల్దేరియుండినట్లు. పూర్వకాలంలో మనుష్యులకే స్వతంత్రత, ధైర్యం ఉండేవి కావు. వారు ఒట్టిపోలీసువారిచేతిలోనున్న మేజస్ట్రేటులు. క్రొత్తకోడళ్లకూ,స్కూలుమాష్టర్లకూ ఉన్నంత స్వతంత్రత, ధైర్యమూకూడా పూర్వీకులకు ఉండేవి కావు. అక్కడక్కడ హిరణ్యకశిపుడూ, నరకాసురుడూవంటి హేమాహేమీలు, ఒకళ్లిద్దరు బయలుదేరినా, అప్పట్లో వాళ్లది మైనారిటీపార్టీ అనుచూ వచ్చుటవల్ల మహాఅయితే ఒకఊపుఊపేరేమోగాని, మొత్తంమీద వారిఆటలు సాగిరాలేదు. పైగా దేవునికి ఎదురుతిరిగి, కాస్త 'డీ' అంటే 'డీ' అన్నవాళ్లని, అప్పట్లో "రాక్షసు"లని నామకరణం చేసి, దుర్మార్గులక్రింద లెఖ్ఖలలో నమోజుచేయించి పారేశారు. పార్టీబలం లేకయూ, పలుకుబడి లేకయూ అప్పట్లో వారు దుర్మార్గులక్రింద లెఖ్ఖలలో ఎంచబడ్డారుకాని, లేకపోతే శ్రీమహావిష్ణువుకున్నూ,భూదేవికిన్నీ జన్మించిన నరకాసురుడు దుర్మార్గుడసునా? సృష్టికర్తయైన బ్రహ్మమనుమడు రావణాసురుడు ఒట్టిఆకతాయిమనిషి అసునా? ప్రపంచమంతయూ భగవంతునిపరిపాలన క్రింద ఉన్నప్పుడు భగవద్విరోధులు రాక్షసులవడం, భగవంతునికి సలాములై దొంగసలాములుచేసే తాబేదార్లు దేవతలవడం ఏమీ ఆశ్చర్యంగాదు. ఏకాలమందునూగూడ పరిపాలనావర్గమునకు చెందిన పార్టీమనుష్యులు అధికసంఖ్యాకు లగుటవల్ల దేవత లనుచూ వచ్చారు. అల్పసంఖ్యాకులయిన ఎడటిపార్టీ మనుష్యులు "రాక్షసులు" అనుతూవచ్చారు. ప్రస్తుతంలోగూడా 'చిత్తం', 'చిత్తం' అంటూ, పనికల్పించుకొని, వారమున కొకసారైనా జడ్జీగారింటికి అటూయిటూ కాస్త ఎవ్వరూ లేకుండా చూచి, లోపలికి జొరబడి, సలాములై మూటలు జేరవేస్తూన్న ప్లీడర్లంతా సదరు జడ్జీకోర్టులో దేవతలే. తక్కినప్లీడర్లు ఆకోర్టులలో రాక్షసులు. దేవతలకి కమీషన్లు; రాక్షసులకి హాజరు లేనప్పుడు దావాలు కొట్టివేయబడుట: దేవతలకి వాయిదాలు దొరుకుతాయి. రాక్షసులకు దొరికేవి చివాట్లే. దివ్యులకు "బెయిలు" దొరుకుంది. రాక్షసులకు "బెయిలు" నిరాకరింపబడుతుంది. ఇలాగే జిల్లాబోర్డులలోనూ, మ్యునిసిపాలిటీలలోనూగూడా దేవతలూ, రాక్షసులూ అంటూ రెండుతెగలు ఉన్నట్టు కనబడతాయి. దేవతలకు మారుపేరుతో కంట్రాక్టులు. రాక్షసులవార్డులకు మరమ్మతులు సహితం మర్దూర్. దేవతల్లసన్నిహితవర్గానికి ఉద్యోగాలు నూతనంగా సృష్టింపబడుతాయి. రాక్షసుల దూరబంధువులకి సహితం ఉన్న ఉద్యోగాలే ఊడి ఊరుకుంటాయి. ఏది ఎట్లున్ననూ, అసలు భగవద్విరోధులు అంటూ ఒక ఎదటిపార్టీవారు అన్నికాలములలోగూడా ఉండబట్టి దేవునియొక్క పరిపాలనావిధానంలోని లోటులు, అక్రమములూ, కొన్నిగాకపోతే కొన్నైనా వీధులో

బడ్డాయి. లేకపోతే, ఉద్యోగస్థుల లంచాలవలె, నితంతువుల ప్రణయప్రయత్నములవలె, పరీక్షలలో విద్యార్థుల కాపీలవలె, డాక్టర్ల పొరపాటులవలె, జెయిళ్లల్లో జరిగే ఘోరములవలె, పై ఉద్యోగస్థులు క్రిందవాళ్లను పెట్టేబాధలవలె భగవంతుని ప్రభుత్వంలోని లోటు పాటులు ఇంతమాత్రంగూడా వీధులలో బడకుండానే ఉండేవి. ఏమయితేనేం, అప్పట్లో దేవునిమీద ఒక్కమాటైనా విశ్వాసరాహిత్యపుతీర్మానం ఉపపాదింపబడేన్నా లేదు. ఒక్కపర్యాయం అట్లు విశ్వాసరాహిత్యతీర్మానం భగవంతునిపై ప్యాసుచేయబడ్డా- పాపం, ఏమాటకిఆమాటే చెప్పుకోవాలి,—ఆమహానుభావుడు ఉద్యోగానికి నీళ్లు వదిలి, ఛార్జీ వప్పజెప్పి వెళ్లి పోయేవాడేగాని, రెండుమాట్లూ విశ్వాసరాహిత్యతీర్మానములు ఆక్టుప్రకారం ప్యాసుచేయించుకొని రెండు చెంబులపేడనీళ్ళు కొట్టించుకొంటేనేగాని వెళ్లనని మూర్ఖించే తాలూకాబోర్డు ప్రెసిడెంటు కాదు.

పోనీ, విశ్వాసరాహిత్యతీర్మానం ప్యాసుచేయక పోయినా, కనీసం, దేవుణ్ని కోర్టుల్లోకైన్నా లాగే, ఒకఆట ఆడించారాఅంటే, అప్పట్లో కోర్టులుగూడా పకడ్బైనవి కానందున, అదికూడా సాగిందికాదు. అదీగాక, ఏదైన్నా కాస్త అవుసరంవచ్చినప్పుడు, కొంచెం "అబద్ధం సాక్ష్యం" సృష్టిద్దామంటే, ఇప్పుడు దొరికి నట్లు అప్పట్లో సాక్షే దొరికేవాడు కాదట. అసలు ఆరోజుల్లో సాక్ష్యం యివ్వడం వృత్తిగా పెట్టుకుంటు జొత్తిగా అయిదుగురేనట—పృథ్వి, ఆకాశం, జలం, వాయువు, అగ్ని. ప్రతికేసులో ఈఅయిదుగురే సాక్ష్యానికి తయారయ్యేవారట,—మావూళ్లో ప్రతీశవానికి వాహకులు ఒక్కరేవలె. ఆరోజుల్లో కోర్టులే సరిగ్గా వుంటే, ప్రజలకి గార్డియను అని విర్రవీగుతూఉన్న భగవంతుడు ప్రజాభిప్రాయములకు భిన్నంగా నడచిన ఉత్తరక్షణం, గార్డియన్‌గా తొలిగించి, ఏకోర్టుగార్డియన్‌గాడినో ఒకడిని నియమించమని ఘోషైన పిటీషను ఒకటి, ఏకోర్టుపక్షినో కోర్టులో పారేశేఉండును. అప్పట్లో కోర్టులే తిన్నగాఉంటే, ఆనకటికి హరిశ్చంద్రమహారాజుకొడుకు తిండి లేక మలమల మాడడం ఎందుకు? అడవులపాలవడం ఎందుకు? ఏచెట్టుక్రింద ప్లీడరో వెళ్లి "అబ్బాయి, నే ఉన్నా వద, మరేమీ భయము లేదు. ఆస్తికి ఒకాపాపరుదావాపడేయి, దానితో విశ్వామిత్రునికి "సప్తసాకోధిని భ్రాజిత ఖండ భూవలయం" పోయి, ఆయనస్వార్జితంతాలూకు "గడ్డం" మాత్రం మిగులుతుంది" అని సలహా యిచ్చే ఉండేవాడు. ఆరోజుల్లో కోర్టులే సరిగాఉంటే దశరథమహారాజు కైకేయికి లోగడ ఎప్పుడో యిచ్చిన మూజివానీవరములు ఆయనని బైండుచేసి ఉండేనా? ఏప్లీడరుగుమాస్తాగాడో దశరథమహారాజుదగ్గరకు ఒకరస్తానైనా పరుగెత్తివెళ్లి "రెండువరాలు యిచ్చినట్టు వ్రాతమూలకమైన సాక్ష్యం లేదయ్యా, లిమిటేషను తగాయిదా, పైరిమొజనిచరు తగాయిదాలూ ఉన్నాయి. నీవు యిచ్చినవరములు నిన్ను బాధించవు" అని సూరిపోశేనేవుండును. శ్రీరామచంద్రమూర్తి అడవులపాలవడం, ఆయనకు వాలిని అన్యాయముగా చంపిన అపఖ్యాతి రావడం, రావణాసురుని చంపినందుకు బ్రహ్మహత్యాదోషం మీద పడడం "హింసాలా" అంగీకరించనిచర్య సీతాఅమ్మవారిని వదిలివేయుటలో కనబడ్డడం లేకుండా ఉండేవి. ఎట్లనో యిప్పటికి భగవంతునిపార్టీ క్రమంగా క్షీణదశకు వచ్చింది. భగవంతుని తాబేదార్లు ప్రతిష్ఠించిన వర్ణాశ్రమధర్మములలో వికారాలు బయలుదేరాయి. షట్‌శాస్త్రములలోనూ వెఱ్ఱినమ్మకాలు అడుగంటాయి. మతాలు మన్నయినాయి. కట్టుబాట్లు గంగలో గలిశాయి. వివాహములలో నమ్మకములు తగ్గాయి. శాసనమంటే భయం పోయింది. నేరముచేయుటలో తప్పు కనబడుట లేదు. అయినా, రోమన్ ఎంపైరులాంటిదే కొంతకాలానికి నశించగా, ప్రజల అమాయికత్వంమీద మాత్రమే ఆధారపడిన భగవంతుని ప్రభుత్వం శాశ్వతమా? అందులో ఈ ఎలక్షనుయుగములో ఆయన పప్పులు ఉడుకుతాయా? భగవంతునికి పలుకుబడి నీరసించడంవల్ల, అప్పుడే, దేవునిమీద విశ్వాసరాహిత్యతీర్మానం ఒకటి ఘాటుగా ప్యాసు చేసి, రాక్షసప్రభుత్వాన్ని ప్రతిష్ఠించేందుకు, తగిన

ప్రయత్నాలు జరుగుతున్నట్టు వినికిడి బయలుదేరింది. సర్వజనులూ మెచ్చేటట్టు, సర్వప్రపంచాన్నీ భగవంతుడు సక్రమంగా నడిరించాడా అంటే, అలాంటిది ఏమీ కనపడదు. పరిపాలనలోని లోటులు, లొగసానులు, అక్రమములు, అవకతవకలు అపారంగా ఉన్నట్టు అందరికీ తెలియకపోలేదు. ప్రభుత్వవిధానంలో భగవంతుడు ఒట్టిచండశాసనుడు. దయాదాక్షిణ్యములు శూన్యం. భట్రాజులుపొగడినట్టు షేక్స్పియర్, పోతన్న వగైరాలు దేవుని పొగడుతూ తాళంవేసినా నౌకర్లు అయిన సూర్యచంద్రాదులూ, సముద్రం వగైరాలు ఆ సదరుకవుల అభిప్రాయములతో ఏకీభవించరు. త్రిలోకోపకారపరాయణుడగు సూర్యభగవానుడు తననౌకరు అనిచెప్పి పనిలోకి హాజరవడంలో, బొత్తిగా ప్రపంచమందలి ప్రజలంతా యింకా ఒకమూల నిద్రపోతూండగానే, లేచి రారమ్మని బాధపెట్టూ, కాస్త ఉదయాన్నే ముఖప్రక్షాళన, కాఫీ, క్షౌరం, స్నానం ఏమీ లేకుండా, పరుగుపరుగున వచ్చి హాజరవమనడం కేవలం కర్కోటకత్వం. ఇది పోనీ, ఒక్కరోజు ఏమైపైతే సరేఅనుకోవచ్చు. ఎల్లకాలమూ, తెల్లవారగట్టే, కొండలు మునిగిపోతూన్నట్టు, డ్యూటీకి రమ్మనడం, లేకపోతే తాలూకాబోర్డుప్రెసిడెంటు ఎలిమెంటరీస్కూలుమాష్టర్లను బెదరించినట్టు బెదరించడం, ఏమీ న్యాయంగా లేదు. పైగా పైముపట్టింపు ఉన్నప్పుడు, భగవంతుడు సూర్యునికి ఓబిగ్ బెన్ గడియారమైనా దగ్గరఉంచుకోమని యివ్వగూడదూ? అదేమీ లేక, కాలచక్రం తనచేతిలో ఉంచుకొని, టైముకు రమ్మని నిర్బంధనా?

పోనీ, సూర్యభగవానుడు ఒట్టిదొంగ. ప్రపంచములో ఎక్కడెక్కడ ఏంరహస్యం జరుగుతూఉన్నా తనవెల్తురు అక్కడకు పోనిచ్చి, రహస్యం బట్టబయలు చేసే ఒట్టిగ్యాసులైటుగాడు. వీడిని ఏంచేసినా తప్పు లేదంటారు అనుకోండి; అతిసుకుమారపు చంద్రునిగతి మాత్రం దేవునిచేతిలో ఏమిబాగుంది? సాయింత్రం, ప్రజలంతా, క్లబ్బులలో యింకా కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, పేచీకయంకర-పేకఆటమో, కాలక్షేపచక్రవర్తి బిల్లియర్డుఆటమో, కాలహంతక-చదరంగమో యింకా ఒకమూల ఆడుకుంటూ ఉంటే, బీచ్ దగ్గర ఒకమూల యింకా ప్రియులు తమరహస్యపు ప్రేమమాటల్లతో ఏమీఎరుగనట్టుండి ప్రసంగములు నడిపిస్తూఉంటే, సినీమాల్లో విద్యార్థులు ఆడంగుల జ్ఞాపకు కాస్త చేరువగా కూర్చొని "రుడోల్ఫు లేలెంటినో" యొక్క ప్రణయసరసములను చూచి ఒకమూల యింకా ఆనందిస్తూ ఉంటే, అలాంటివన్నీ వదలిపెట్టి స్నేహితులను విడనాడి, తొందరగా, నాలుగుమెతుకులైనా నములీనమలక, కిల్లీకి మొహం వాచి, కత్తెరమార్కు సిగరెట్టు కాల్చుటకుసహితం నోచుకొనక, ఒంటరిగా, ఉత్తశోభలయినవాడిమొహం పెట్టుకొని, డ్యూటీకి సిసలుగా పైముకిప్రతిరోజూ సాయంత్రాన్నీ హాజరవమని ఫర్మానా పైగా, పట్టపగలు డ్యూటీమీద ఉన్నసూర్యునికి ఎవరూ తోడు అవసరం లేదూ అంటే అర్థం ఉందిగాని, యావత్తు ప్రపంచమూ నిద్రపోతూ ఉన్నప్పుడు, ఒంటరిగా అర్ధరాత్రి అంతా దివిటీవేస్తూ కూచునేచంద్రునికి, భయపడ్డా చేసినా, కాస్తవయస్సులోనున్న ఒకఆడపిల్లనన్నా దగ్గిర ఉంచకపోవడం కేవలం. హుషారులోనున్న అశ్రద్ధ. అదీగాక బ్రిటిషు గవర్నమెంటువారి ప్రభుత్వంలో సహితమూ నౌకర్లకుఉండే Casual-Leave, Privilege Leave వగైరాలు-వలయునప్పుడు వాడుకొనుటకు—చంద్రునికి నిరాకరిస్తూ, కాస్త మనసైనప్పుడు ఏ "తారాశశాంకవిజయ" మో చదవగా తనివితీరగ విని సంతోషించుటకుగాని, తాను నిజముగ సారంగధరుడనుగానని కవులకు బుద్ధిచెప్పుటకై ప్రచారంమీద నాల్గు ఊళ్లూ తిరుగుటకుగాని, వియోగులు నిష్కారణంగా తనమీద పడి ఏడవడం ఎందుకూ అని హరిశ్చంద్రబాహుకులకు గడ్డిపెట్టు నిమిత్తం పయనమైబోవుటకుగాని ప్రభువైనదేముడు చంద్రునికి తగినవిశ్రాంతి, శెలవూ యివ్వకపోవడం కడుంగడు శోచనీయం.

సూర్యచంద్రాదులమాట అటుంచినా, సముద్రునిగతిమాత్రం ఏంబాగుంది? సముద్రునికి స్వేచ్ఛ అనేది నిరాకరించి, కాళ్లకూ, చేతులకూగూడ సంకెళ్లు

తగిలించి, మేరమీరి ఎక్కడకూ కదలకుండగా ఫర్మానా విధించవచ్చునా? ఎన్నడైనా ఆటవిడుపు ఉండగూడదా? లంచికి లేవనిజడ్జీలలాగున అస్తమానం ఉన్నచోటుననె ఉంటే, సర్వవ్యాధులూ బయలుదేరవూ? విహారానికి ఎప్పుడైన్నా కాస్త చెన్నపట్టణంలో ఏరాక్సీథియేటరువైపుకో, ఢిల్లీలో ఏకొత్త ఢిల్లీభవనములవైపుకో, దక్కనులో ఏహైదరాబాదు చూచుటకో వెళ్లనియ్యగూడదూ? బ్రిటిషు జెయిలలో గూడ ఖయిదీలకు అంతకన్న ఎక్కుడు విశ్రాంతి యిచ్చుచున్నారే! కొత్తకోడళ్లకు తలనెంట్రుకలున్న అత్తగార్లు సహితము అంతకన్న ఎక్కువస్వేచ్ఛ యిస్తున్నట్లు ఈమధ్య ఈమధ్య వింటూన్నామే. భగవంతుడు, పోనీ, ప్రపంచములో విద్యావిషయమై బోధనాభ్యాసనపద్ధతులలో ఏమన్నా వివేకం కనబర్చియున్నాడా అంటే, అదికూడా కనపడదు. ఏవిషమైనా బోధచేయవలెనన్న Experimental గానూ, సులభముగా గ్రాహ్యమగునట్లునూ చెప్పవలెను. అంతేగాని, వెనకటికి మాన్నే హితుడొకడు చెప్పినట్లు "గుఱ్ఱం" అంటే "అశ్వం" అని అర్థంచెప్పగూడదు. ప్రళయములు, అగ్నిపర్వతములు, భూకంపములు, ఉప్పెనలు అని ప్రజలు చాలమంది ఊహించుటయేకాని, స్వయముగా యెరుగరు. సదరు భూకంపములు వగైరాలను ప్రతీదేశములోను, ప్రజలందరికీ తుణ్ణంగా తెలిసేటట్టు చెప్పవలెనన్నచో మాసమున కొకసారెన్నా వాటిని అన్నిచోట్ల రప్పించవలెను. అట్లురప్పించక పోవడం కేవలం నిర్లక్ష్యం. దీనినిపట్టి చూస్తే దేవదేవుడు యల్. టీ., పరీక్షలో బోధనాభ్యాసనపద్ధతులు తెలియక ఫెయిల్‌కొట్టినవాడిలాగున కనబడతాడు.

పోనీ, ఈఅనంతసృష్టిలో ఏమన్నా ఆలోచన గనపర్చాడా దేవదేవుడు, అంటే, ఎక్కడా వివేకం, దూరదృష్టి, అవుసరచేఅవుసరములు పరికించినట్టు కనబడదు. సీతాఫలం చిన్నలూ, పెద్దలూగూడ అతి అప్యాయంగా తినేఫలంగదా, దానిలో తినడానికి అడ్డంగా అన్నిగింజలుపెట్టుకోవడం ఏమిటి? విత్తనం కోసమైతే, ఏదోమూల ఒకగింజ అఘోరించరాదూ? మామిడిపండులో టెంక, సైజులో ఏగచ్చకాయంతో ఉంచక అంతపెద్దదిగా ఉంచనా? తినేవాళ్లు అందులో ఏమితింటారు? కొనుక్కొనేటప్పుడు కోమట్లు ఏమనుకుంటారో కాస్త తెలుసుకోనక్కరలేదూ? అన్నివిషయములలోను సపోటాపండుకు సరిపడ్డఫలం లేదంటారుగదా, అటువంటిఫలమును సైజులో బొత్తిగా అంతచిన్నదిగా సృజించడం ఏమిటి? దానిని ఏసుమ్మడికాయ అంతగానో సైజులో సృష్టిస్తే బొక్కసంలో ఏంనష్టం వస్తుంది? ద్రాక్షపండుమట్టుకు ద్రాక్ష, కిస్మిసు పండుమట్టుకు అది, బొత్తిగా పంటిక్రిందకెన్నా రాకుండాచేసి వదలనా? పెద్దసుమ్మడికాయలోని గింజలు బొత్తిగా పెద్దచదువుచదివిన ఆసాంగులలాగ పల్చగా, రేకుల్లాగున ఉంచడంఎందుకు? కాస్త ఒకఅంగుళం దళసరెన్నా ఉంచితేనేగాని పంటిక్రిందకు వస్తుందా? తొక్కవల్చినశ్రమకెన్నా గిట్టుబాటు అవవద్దూ? పోనీ, పుష్పముల సృజించడంలోనెన్నా ఆలోచన ఉందా? మోదుగపువ్వును అంతఅందముగా సృజించి సువాసన అనేది అసలేలేకుండా, ఒట్టినిరక్షరకుక్షియైన తాలూకాబోర్డు ప్రెసిడెంటులాగున చేసి వదలడం న్యాయమే? పోనీ, లోహములవిషయం చూద్దాం. కావలసిన బంగారం, వెండి బొత్తిగా తక్కువగా చేసి, అనవసరమైన రాయి, రప్ప, యిసుక, యినుము విరివిగా చేసిపారవెయ్యడమా? ఒక్కొక్కదేశములో ఉన్న బంగారం యావత్తూ, ఫక్తు, ఒక్కపోలీసు డిపార్టుమెంటువారికే చాలదే, అటువంటిసందర్భములో, తక్కినవాళ్లమాటేమిటి?

పోనీ, సృష్టిలో సంతానంఏర్పాట్లు సవ్యంగా ఉన్నాయా అంటే, అవికూడా సరిగ్గా ఉన్నట్టు కనపడవు. సంతానం కావాలయ్యా మహాప్రభూ! అని అహోరాత్రాలు దేవుళ్లాడేవాళ్లకి సంతానం శూన్యం చేసి, "దేవా! నాకు యిక మరి సంతానం వద్దూ, నేనూ రివెన్యూడిపార్టుమెంటువాడినీ, నాకు సాగదూ, యిదివరకేనే మాయింట్లో పిల్లలూ నేనూ కలసి ఒక మ్యునిసిపాలిటీకి సరిపడ్డజనాభా ఉన్నాం" అంటూన్న అమోఘవీర్యులకి ఏటా రెండేసి, కనీసం రెండేళ్లకి

మూడుపంటలెన్నా లెక్కల్లోకి వచ్చేటట్టు చెయ్యడమా? పోనీ, సృష్టిలో వెంట్రుకసమస్యను ఎట్లు నిర్వహిస్తున్నదీ చూద్దాం. మొన్నమట్టుకు మొన్న, పాపం, ఒకాయన "అయ్యా! నాఛాతీమీద కొన్నిఎకరాలూ, పొట్టమీద మరికొన్నిఎకరాలూ వెంట్రుకలు సాగుచేసుకుంటున్నాను; ఇంక గెడ్డంమీదకూడ వెంట్రుకలసాగు చేసేందుకు పెట్టుబడీ, పనిచేసేవాళ్ళూ, సావకాశం లేదూ, నాకుసాగదూ" అని మొరబెట్టూ గెడ్డమును "పర్రనేలక్రింద చేసేవయ్యా" అని మహజర్లుపెట్టుకుంటే, ఉద్యోగస్థులు రివాజుగా మహజర్లను చూడకుండానే తోసిపారేసినట్టు, తనుగూడా వాట్లను తోసిపారెయ్యడమేగాకుండా, వానిగెడ్డమును పాటిమన్ను తోలిన భూమికన్నా, డెల్టాలోని భూమికన్నాకూడా సారవంతముగా చేసి వదలిపెట్టవచ్చునా? అది, పోనీ, అటుంచగా, మొన్న, పేడుభూతిపార్వతీశ్వర్రావు "మహాప్రభూ, నాతాలూకు భూతిమీద సరియైన నీటిసప్లయిలేక, వెంట్రుకలు ఏమీపండటం లేదు. వెంట్రుకలసాగు చాలకష్టంగా ఉంది. తమ తాలూకు యింజనీర్లలో లంచాలు స్వీకరించని అమాయకుణ్ణి ఒకడిని పంపి, ఆయనచేత ఏగోదావరినుండో ఒకచిన్నపంటకాలువ నాభూతిప్రక్కనుండి పెట్టించి, కాస్త నాభూతిని ఆయకట్టులో చేర్చి, పల్లంభూమిక్రింద లెఖ్ఖలో నమోదుచేయించ"మని కాళ్ళావేళ్ళా ప్రాధేయపడుతూఉంటే, అది లక్ష్యంచేయక, దానిని ఒట్టిబంజరుభూమిక్రింద వదలివేయడం న్యాయమేనా? అవన్నీ అలాఉంచగా, ఈమధ్య నిరుపేదలు కొందరు వాడకములేని కాలీ స్థలములున్నూ, పోరంబోకులున్నూ తమకు ఇప్పించమని భగవంతునికి దరఖాస్తులు చేయడంలో బట్టతలలుగల ప్రభుత్వపెద్దలయొక్క బట్టతలలలోని మధ్యనున్న సన్నని కాలీస్థలమును తమకు ఇళ్లుకట్టుకొనుటకు నివేశనస్థలములుగానూ, పొగాకు పండించుకొనుటకు పెరళ్లుగాను వాడుటకు యిప్పించమని దరఖాస్తులు చేస్తే, అవి సహాయనిరాకరణ ఉద్యమంలో పనిచేయని రాజభక్తులకుమాత్రమే యిస్తామని చెప్తూ, నిరుపేదలలో పెక్కుమందికి సదరు కాలీస్థలములను మంజూరు చేయడం మానవచ్చునా? అదీగాక, యీడబ్బుయిబ్బంది రోజులలోనైనా వితంతువులు వెంట్రుకసమస్యలో ఎంతయిబ్బందిపడుచున్నదీ తెలుసుకోనక్కరలేదూ? వారికి మాటిమాటికి మంగలికి డబ్బుయివ్వడం ఆవుసరంరాకుండా ఉండేటట్టు వితంతువుఅయిన ఉత్తరక్షణంనుంచీ తలమీద వెంట్రుకలు మొలవకుండా ఒకఫర్మానా జారీచేయిస్తే ఎంతబాగుండేది? సృష్టినుండీ కూడా భగవంతుడు ఈవిషయము అశ్రద్ధచేయడం, కేవలం, అనాథలయందు విముఖత్వంగాని వేరొకటి గాదు. అదీగాక, శిరంమీద సాహేబులు సాపుగా వెంట్రుకలు లాగిపారేస్తారుగదా, ఆసంగతితెలిసి, మళ్లీ అలావారికి,అక్కడ వెంట్రుకలు మొలిపించడం ఎందుకు? వారికిక్షౌరంలో డబ్బుతగులబాటుచేయించడం ఎందుకు? సృష్టిలో పశువులను బరివంటితో వదలివేసి, సాటి మానవులకు దుస్తులు ధరించడానికి ఏర్పాటు చేస్తూ, సృష్టిలోనే పక్షపాతమా? పశువులకుగూడ దుస్తులు వుంటే అవిమాత్రం శాసనసభ్యులంత ఠీవిగా ఉండకపోయాయా? సృష్టిలోనే మేకలకి మెళ్లో Bands రెండున్నూ ఉంచుకొనుటకు అర్హత యిచ్చియు, యీరోజువరకు హైకోర్టులో అడ్వొకేటుగా ప్రాక్టీసుచేయనియ్యకపోవడం కేవలం అన్యాయం కాదూ? ఒకపల్లెటూళ్లో వెనకటికి ఒకమేష్టర్ని, "ఏం చేంస్తూన్నావయ్యా, మేష్టరూ" అంటే "తప్పుచెయ్యా దిద్దుకోనూ" అన్నట్లు దేముడు అసలు పొగాకును ప్రపంచంలో సృష్టించడంఎందుకు? దానిని సృష్టించడం పొరబాటు అనిగ్రహించి మళ్లీ కాల్చిపారేయించడం ఎందుకు? సృష్టిలో ఇలాంటిలోపాలు యిన్నీఅన్నీనా! మోడరేట్సులోగూడ మొగవాళ్లని సృష్టించడ మేమిటి? జస్టిసుపార్టీలోగూడ స్వార్థత్యాగులను సృష్టించడ మేమిటి? కాంగ్రెసుపార్టీలోగూడా అభిప్రాయములను తరుచు మార్చనివాళ్లనిగూడా సృష్టించడ మేమిటి?

అదీగాక మానవుడు అనే "చాచా" జంతువుని సృజించినతర్వాత, మళ్లీ వేరే యితరజంతువులనుకూడా

సృజించడంలో దేవదేవుడు, ఏం వివేకం కనబర్చాడు? కోతిచేసేచేష్టలన్నీ మానవులలో విద్యార్థులు చేస్తూండగా, వేరేమర్కటముల నెందుకూ సృష్టించడం? తోడేళ్లకన్న క్రూరులు పోలీసువారిలో నున్నప్పుడు సృష్టిలో తోడేళ్లెందుకు? నక్కకన్న జిత్తులమారులు వకీళ్లలో నేమి, వైశ్యులలో నేమి వేలకువేలుండగా మళ్లీ నక్కలెందుకు? కూతకూసి ప్రక్కనుండే మోటారులు వస్తూన్నా, గోడ్డువిూద గేదలకన్న అశ్రద్ధగా నడచేమానవు లుండగా మళ్లీ గేదలెందుకు? చిత్రకార్తిలో శునకములకుగల ఉత్సాహముకంటె ఎక్కువ ఉత్సాహ-ఉద్రేకములు సర్వకాలములలోనూ గలవారు అనేకమంది మానవులలో నుండగా సృష్టిలో వేరే శునకము లెందుకు? ఎలుకబంటికన్న దళసరి రోమముల రాజ్యం (Roman Empire) గలవారు పెక్కులు మానవులలోనే ఉండగా మళ్లీ సృష్టిలో ఎలుకబంటు లెందుకు? మానవస్త్రీలచిత్తములు జింకనేత్రములకన్న చంచలములుగదా, అట్టియెడ సృష్టిలో వేరేజింక లెందుకు? సింహముకన్న ముఖంమీద ఎక్కువజూలు ప్రేళ్లాడేవారు మనుష్యులలో కావలసినంతమంది మోటారుడ్రైవరు లుండగా, సృష్టిలో మళ్లీ సింహము లెందుకు? పులికన్న ఆకలిగల బెంచిగుమాస్తా లుండగా వేరే పులులెందుకు? కరణము అనేవా డుండగా వేరే సృష్టిలో తేళ్లెందుకు? పందికంటె ఎక్కువభోజన ప్రియులు, గాడిదకన్న శుద్ధతెలివితక్కువ మొద్దులు, గోవుకన్న శాంతస్వభావులు, పిల్లికన్న పెద్దదొంగలు, గొర్రెకన్న కొమ్ములు ఎక్కువతిరిగినవారు, ఏనుగకన్న ఎక్కువ చర్మందళసరిగలవారూ మానవులలో అనేకు లుండగా వేరే సృష్టిలో ఆయాజంతువు లెందుకు? స్కూలుమాష్టర్లు Redundancy అని శెలవిస్తారు అనైనా తోచలేదూ?

ఇవి అన్నీ అటుంచగా, మానవులలోనే, సృష్టిలో వేర్వేరురంగులు పెట్టి, సృష్టినుండియూ రంగులపోటీ పెట్టి, పార్టీలు లేవగొట్టి పోరుపులు పెట్టతగునా? మానవులందరకూ, ఏకంగా ఏగాంధిమహాత్ముని నిర్మలాత్మయొక్క శ్వేతవర్ణమో, లేక అమావాస్యచీకటిని ధిక్కరించు ఏ ఆర్డినెన్సులయొక్క నల్లనిరంగో, లేక చామనచాయలో మిఠాయి అని అనబడే తొక్కుడు లడ్డూరంగో పోశేస్తే, మనలో మనము రంగువిషయమై రౌండుటేబిల్ కాన్ఫరెన్సు ప్రతినిధులు తగాయిదా పడ్డట్టు పడక, దేశమంతా ఐకమత్యంలో ఉందుము గదా? పోనీ. ఆరంగులలోనైనా: కాస్త, కుడీ, ఎడమా ఉండనక్కరలేదూ? ధనమునుబట్టి రంగు నిర్ణయిస్తూ, ధనికులకు బీదలరక్తము త్రాగగా బయల్దేరినట్లు కనబడుటకోయన, ఏ ఎర్రనిరంగో యిచ్చి, బీదలకు రక్తములేక పాలిపోయినందున ఏ సఫేదురంగో యిచ్చి, మధ్యస్థులకు ఏనీరకావిపంచరంగో పోశేస్తే ఎంతవీలుగా ఉండేది? ఇంకొంటాకున్నవారు పన్ను విధించడంలో ఇష్టమువచ్చినట్లు విధించక, రంగును బట్టి మనిషికి పన్ను వేశేవారుగదా? ఇటువంటివిజ్ఞ నియామకం సృష్టిలో లేకపోవడంవల్ల ధనికులలో నల్లనివారు బయల్దేరారు, అందమైనపిల్లకు అవకతవక మొగుడు తయారయినట్లు. బీదలలో ఎర్రవారు బయల్దేరారు— పోలీసుడిపార్టుమెంటులో దయాదాక్షిణ్యాలుగలవారు బయల్దేరినట్లు. ఇట్లు రంగులలో భేదాలు పెట్టుటవల్ల ఎన్నియిబ్బందులు వస్తూన్నాయో దేముడు గ్రహించనక్కరలేదూ? దంపతులలో సహితం రంగు భేదాలేనా? మాణిక్యంలాటిపిల్లకి మసిపాతగాడిని కట్టడంలో భగవంతునివివేకము ఏముందీ? కాకికి గోరింకకీ స్నేహమలవడునా? నల్లవాడంటే తెల్లవాడి కెప్పుడైనా గిట్టుతుందా?

పైగా, సృష్టిలో సముద్రం నాల్గువంతులు, భూమి ఒకవంతూ సృజించడమేమిటికి? భూమి నాల్గువంతులూ, సముద్రం ఒకవంతూ అయితే ప్రజలు మసిలేందుకు భూమి ఎంతవిశాలంగా ఉండేది? భూమియే నాల్గువంతులు అయితే, పట్నంలో బ్రాడ్వే, రాజమండ్రిలో రాజవీధి, బెజవాడలో బజారు, విశాఖపట్నంలో సముద్రం ప్రక్కరోడ్డు, యిప్పుడున్నంతయిరుకుగా ఉండేనా? లావుపాటిమనుష్యులు ఒకేసారి యిద్దరువెళ్లినా, ఒకరినొకరు తోసుకొనకుండా వెళ్లగలిగిఉండేవారు గదా? ప్రపంచములోని భూమివైశాల్యం పెరగడం

వల్ల రైలుబండ్లుగూడా విశాలమయి, యింటరుక్లాసు లోనిసీట్లు వెడల్పు పెరిగి, కాస్త పెద్దపిరుదులుగలవారిని గూడా ఇబ్బందిలేకుండా ఆహ్వానిచ్చేదిగదా? పూట కూళ్ల యిళ్లలోనిక్లీనులు, మద్రాసులో మురుగుగొడ్లు, జట్కాలలోనిస్థలము, నైశాల్యంలో కాస్త ఎదిగి, ప్రజ లకు ఎంతహాయి యిస్తూండేది?

సృష్టిలో, పాలవిషయంఏర్పాటులు ఎంత తెలివితక్కువగా చేసిందీ అందరికీ తెలియకపోలేదు. పిల్లలకు జీవనాధారమునకున్ను, పెద్దలకు, కాఫీ, టీ, లకున్నూ పాలు ముఖ్యావసరముగదా, అటువంటి సందర్భములో ఆవులను, గేదెలను నిష్కారణంగా, నిర్ద యతో నిత్యమూ బాధపెట్టడంకన్న, భగవంతుడు తన దగ్గరనున్న క్షీరసాగరంనుండి, కాల్వని ఒకదాన్ని ఈప్రపంచంలోకి లాగి, దానినుండి అన్ని ఊళ్లకూ పిల్ల కాలువలు లాగేస్తే, తనది ఏంమునిగిపోతుంది? భూత దయాసుత్వం ఇతరులకి చెప్పటకేనా? గొల్లలు పైపుల దగ్గిర పాలలో నీళ్లను కలపడం, హెల్తాఫీసర్లు గొల్ల ఆడంగులను పాలవిషయమై తనిఖీచేయించడం, ప్రజ లకు డబ్బుఖర్చు లేకుండాఉండేదిగా! పోనీ, ఈ వర్తకమందరోజులలో, ప్రపంచం యావత్తూ ఆర్థిక దుస్థితిలోనూ, ఇతరయిబ్బందులలోనూ బాధపడుచున్న ప్పుడు, సదరుయిబ్బందులను అన్నింటినీ అణచుటకు, తనసాన్నిధ్యములోనున్న కల్పవృక్షమునకు తాను కాస్త అంటులుకట్టి, ప్రపంచంలోకి కొన్నివేలఅంటులను దిగు మతిచేస్తే ఎంతకామితార్థప్రదాయకమై యుండేదిది.

పరీక్షలలో ఫేలయినవిద్యార్థులకు, నిరుద్యోగు లకు, పదవిభ్రష్టులైన మంత్రిపుంగవులకు, విశ్వాస రాహిత్యతీర్మానంవల్ల గెంటివేయబడ్డ బోర్డుప్రెసి డెంట్లకు సదరుఅంట్లు ఎంతఉపకారం చేసియుండేవి? సంతానరహితులగు భార్యాభర్తలకు కాలవశాత్తూ ఒకరు ఢిల్లీలోనూ, మరియొకరు కొలంబోలోనూ ఉన్నప్పటికీగూడా, సంతానలోపము లేకుండా ఉం డేదికదా? పాపకరంబగుకోరికను పుట్టులోనే నిర్మూ లనము చేసే కల్పవృక్షమును అంట్లు కట్టి, దేవదేవు డీభూలోకంలోకి పంపక, పైపెచ్చు "కోరిక అనే దాన్ని మీరే అసలు చంపుకోండోయి" అని ప్రజలకు తానూ సలహాయివ్వడమా?

సృష్టిలో, కొన్ని పరమముఖ్యము లైనవిషయ ములలో భగవంతునిఅశ్రద్ధ మెండుగ నున్నట్లు కనబడు చునే యున్నది. స్త్రీపురుషులు ఒండొరులను ప్రేమిం చెడిప్రేమలోని నిజమైన గాఢతను కొలచుటకుగాని, కవిత్వము, చిత్రలేఖనము, శిల్పము, గానము, నృత్యము మొదలుగుకళలయొక్క ప్రత్యేక ఔన్నత్యమును కొల చుటకుగాని, మానవుని కీర్త్యపకీర్తులను కొలచుటకు గాని తగినకొలతయంత్రములుగాని, వీళ్లుగాని ప్రపం చంలో లేకుండా జేయడం ఎంతపొరబాటు? ఉద్యో గస్థులయిబ్బందులను భగవంతుడు అసలే పరికించినట్లు కనబడదే. కొందరు ఉద్యోగస్థులకు మెదడులో వెల్తురు తక్కువగా నుండినందున, తగిన ఎలక్ట్రిక్‌బల్బు ఒకటి Enlightenment నిమిత్తం మెదడులో నుంచ నక్కరలేదూ? కొందరు ఉద్యోగస్థులకు అస్తమానం మిక్కిలి ఆలోచించడంవల్ల మెదడు మరీకదిలి స్క్రూలు వదలయినప్పుడు అని మధ్యమధ్య బిగింపులు చేయిస్తూ ఉండేందుకు తగిన మేకులు మారుగా ఏర్పాటు చేయించగూడదూ? అదిగాక, ఉద్యోగస్థులకు కాస్త పెద్దఉద్యోగము కాగానే చూపు నేలమీదుగా ప్రస రించక, కొంచెం పైకి ఉండడం యిబ్బందివల్ల, పెద్ద ఉద్యోగము అయినతక్షణం సదరు ఉద్యోగులకి నేత్రములు మామూలుకంటికి మూడుఅంగుళములు క్రిం దకు ఉంటితే ఉద్యోగం అవగానే కళ్లయొక్కచూపు సరియైనఎత్తులో నుండిపోవుచూ ఉండునుగదా! సృష్టిలోపములకన్న పరిపాలనావిధానంలో ఉన్న లోపములు మరీ ఎక్కువ. బ్రాహ్మణవ్యవసాయమువలె జగన్నిర్మాత ఎక్కడో కూర్చుని, ఏజన్మానీ ఒక్క సారైనా యీప్రపంచంలోకి వచ్చి, విషయాలు స్వయంగా దర్యాప్తు చెయ్యక, నాకర్లని నమ్మి ప్రభుత్వం చేస్తాడా? పోనీ, కావలిస్తే జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు T. A. పుచ్చుకోవడంలో హద్దులేని పూర్వంరోజుల్లో పుచ్చుకొన్నంత T. A. పుచ్చుకో

నెన్నా కాస్త స్వంతంగా వచ్చి చూసుకుంటే, ఉద్యోగులమదాంధత, అమాయికులు చిక్కుల్లోకి రావడం, దుర్మార్గులు వృద్ధిలోకి వచ్చుట, స్త్రీల యిబ్బందులు, మగవారిధిక్కారం, వడ్డీవ్యాపారస్థుల క్రౌర్యములు, అన్నియూ తేటతెల్లముగా తెలిసేవిగా. పోనీ, ప్రజలలోనినాయకులు డిప్యూటేషనుమీద దేవదేవుని సంపర్శించి యిబ్బందులు చెప్పుకుందామా అంటే, తాను ఎక్కడో పాలసముద్రంక్రింద దాగుకొనడమా? ఊపిరిఆడని సముద్రంక్రింద సంభాషణకి సావకాశం ఏది? పోనీ అని, సాహసించి, గాలి అక్కరలేని ఒకరిద్దరు రికామిగా ఉన్నపేషర్లు, ఎంత చెడ్డా భూలోకంకంటె అధేనయం అని ఎంది వెళ్తామా అంటే, తాను ఏడుతలల శేషునిపై టెంగు రంగామని కూర్చుంటే, ప్రాణాలమీద ఆశ వదలుకొని, దగ్గరకు వెళ్లడం ఎట్లు? బ్రతికిఉంటే బలుసుఆకు దిని బ్రతుకుదామని ఎంత బండాభాయిలకు సహితమూ తోస్తుందే. అదీగాక, తనబసులు ఏటా ఒకామా టెన్నా లెక్కాడొక్కా, కాస్త తణిఖీకి, తనబంటుఅయిన ఏ Ex-Accountant General గారినెన్నా, ఒకా బిరుదిచ్చి భూలోకంలోకి పంపితే ఎంత బాగుండును? జిల్లాబోర్డులలోనూ, మ్యునిసిపాలిటీలలోను కంట్రాక్టర్లు సదరుసంస్థల ప్రెసిడెంట్లకు లంచములు యిచ్చి నట్టయితే అవి రోజుబుక్కులోకి, ఎక్కించబడినదీ, లేనిదీ తేలునుగా! సబురిజిస్ట్రారుఆఫీసులో సాయింత్రం అగుసరికి కోర్టుకి రావలసినడబ్బుగాక, పైన ఏమన్నా రివాజుగా రోజూ ఉండేదీ, లేనిదీ తేలునుగా! ఇంజనీర్లు, పోలీసువారూ, ఆబ్కారీవారు, ఉద్యోగానంతరము వారిదగ్గర జాగ్రత్త పెట్టబడిన సొమ్ముఅంతయు, వారికి నెలజీతంలో వచ్చినడబ్బులో మిగిల్చినదో, లేక యితరత్రా వచ్చినదో తేలునుగా.

పోనీ, అధికారి అయినప్పుడు, నిష్పక్షపాతంగా ఉండాలిగాని, ప్రజలలో ఒకరికి రొట్టె, మరొకరికి ముక్క యివ్వడం న్యాయమేనా? కొందరిని కురూపులుగాను, కొందరిని అధికదరిద్రులుగాను, కొందరిని శుద్ధతెలివితక్కువ మొద్దులుగానూ సృష్టించడమేమిటి? పైగా వాళ్లు ప్రభువుని నిలేశి 'ఇదేమిన్యాయమయ్యా' అని అడుగుతే, "మీకర్మం అంతే, మీరు నాకు ఎప్పుడూ సలాములు చేయడంసహితం మానేశారు. అంతపొగరా! పైగా బొట్టుపెట్టడంలోసహితం, నేను పెట్టినట్టు పెట్టుకోవడం లేదు. మీరు నేను కనబడ్డా లేకపోయినా గూడా, తాహసిల్దారులు, మేజస్ట్రీటులు, రివిన్యూయినస్పెక్టర్లు, కరణాలు, డిప్టీకలెక్టరువారిని ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పొగడుతూన్నట్లు పొగడుతూఉండాలి. అలాచెయ్యకపోతే మీకు అన్నియిబ్బందులు తెచ్చి, ఆఖరుకి మీకు ఎలక్షన్లలో వోటుసహితం లేకుండా చేసి బోలెడు నష్టం చేస్తాను" అని జవాబుచెప్పడమా! పైగా బొట్టులో అడ్డబొట్టు అయితేఏం, నిలువుది అయితేఏం? నిలువుబొట్టు పెట్టకపోతే పోషణకర్తయైన శ్రీమహావిష్ణువు మానవునకు జీవించియున్నంతకాలం చిక్కులు తెప్పించడమున్నూ, అడ్డబొట్టు పెట్టకపోతే లయకారణుడైన శివుడు సదరుమానవుని పెందరాళే చంపి పారేయడమూనా? పాపం, ఆవిఘ్నవినాయకుడిని చూడండి, నిలువుబొట్టువాడు కాకపోయినంతమాత్రమున ప్రపంచపోషణమునకు జవాబుదారీగానున్న శ్రీమహావిష్ణువు, వినాయకునికి, ఇన్నిఏళ్లువచ్చినా, యీరోజువరకూ యింకా వివాహం అన్నా చెయ్యక, ఆయనను బ్రహ్మచారిగా అలా వదలివేయడం న్యాయమేనా? ముడిపెట్టేందుకు పిల్లయే దొరక లేదా? శారదా ఆక్టు అమలులోకి రాబోయేరోజులలో, గాలివాన వచ్చిన మరునాడు మామిడిపిందెలు దొరికినట్లు పిల్లలు దొరికారుగదా! అప్పుడైన్నా ఒకపిల్లను ముడిపెట్టి, వినాయకుడినిగూడా ఒకయింటివాడిని చేస్తే మల్లె ఏమిపోతుంది? పోనీ, యిప్పటివిద్యార్థులవలె వినాయకుడు నీరసుడా? సుగ్రీవునికి, పంచపాండవులకీ, కుచేలునకూ శ్రీమహావిష్ణువు ఎక్కువ పక్షపాతం చూపినసంగతి ఎవడికి తెలియదు? ఉద్యోగస్థులు కారణాంతరములవల్ల ఒకపార్టీకి అనుకూలం చేస్తే అప్పట్లో తెలియకపోయినా తరువాతన్నా ప్రజలకి




౯. బుద్ధుని ప్రథమప్రవచనము



౧౦. బుద్ధుని శల్యాదిసంచయము




౧౧. మహాభినిష్క్రమణము




౧౨. ప్రలోభనము




౧3. బుద్ధుని శల్యములు మొదలగునవి 1. శల్యము 2. బంగారుబరణి




౧౪. మహాపరినిర్వాణము

ఎలా తెలుస్తుందో, అల్లే భగవంతుని పక్షపాతపుచర్యలు గూడ యివతలబడక దాగుతాయా ?

ప్రభుత్వపరిపాలనలో చురుకుతనం లేకపోవుటయేకాక, బహుఅశ్రద్ధ, మందకొడితనం కనబడుతోంది. మనసబుకోర్టులలో బెంచిసుమాస్తా కారణాంతరములవల్ల అనుగ్రహిస్తేతప్ప పెట్టినపిటీషను సంవత్సరములతరబడి ఆర్డరు అవకయే ఉంటుంది. దేవదేవుని ప్రభుత్వంలోగూడా, ప్రజలమొరలు వినిపించుకొని సత్వరం ఆర్డరు వేయడం కనబడటం లేదు. Disposal లో మందం సృష్టినాటినుండీ కనబడుతోంది. లోగడ, గజేంద్రుడు వెయ్యిసంవత్సరాలు దేవుని C. P. C. ౧౫౧ సెక్షనుక్రింద వెయ్యిసంవత్సరములు నోరుపడిపోయేటట్టు చంపకమాలలలోనూ, సీసపద్యములలోనూ ప్రార్థించిప్రార్థించి ఏడ్చినతర్వాత ఒహవూల "తావులూ పావుతావులూ" కూడా తప్పి డస్సి సొమ్మసిల్లినతరువాత, అప్పుడా గజేంద్రునిరక్షించడం ? గజేంద్రునిభక్తికిమెచ్చి గజేంద్రునిభక్తి కనిపెట్టినవాడైతే అన్ని సంవత్సరాలు ఏడ్పించి ఏడ్పించి మరీ రక్షించడం ఎందుకూ ? జడ్జీలు మేజస్ట్రేటులు చేతులో అధికారం ఉందికదా అనిచెప్పి, బెయిలు యివ్వడంలో నాల్గునూరురోజులు ఆలస్యం చేసి తరువాత బెయిలు యిచ్చినట్లు. హరిశ్చంద్రమహారాజువిషయంలోమాత్రం ఏం బాగా చేశాడు ? ఒహవూల మహారాజత్వం మంటగలసి, బానిసయై, తిండికి మలమలమాడుతూఉంటే చూసి ఊరుకుని, కుమారుడు లోహితుడు చస్తూంటే చూస్తూ ఊరుకుని అనుంగుభార్య సకలబాధలూ పడుతూ ఉంటే చూస్తూ ఊరుకుని, బాకీలకు Arrest warrent పెండింగుగా ఉంటే ఊరుకుని, చిట్టచివరకు ఆయన పించనుపుచ్చుకునేప్పుడు ప్రత్యక్షమయి "మెచ్చుకొన్నానోయ్, నీసత్యవ్రతనిష్ఠకు, పంతులూ, నీవు చాలాగట్టివాడవోయి" అంటే హరిశ్చంద్రునికి ఏం కడుపునిండింది ?

దొంగలు పడ్డ ఆరునెలలకు కుక్క మొరిగిన నేమిలాభము ? మొరగకపోయిన ఏమి నష్టము ? ప్రజాపతిఅయిన ఆసామీ ప్రజలకు యిబ్బందులలో ఆదుకొనవలెను గాని, తనసంగతి కాదుగదా అని ఉపేక్ష చేయతగునా ? అదే హరిశ్చంద్రుడూ, గజేంద్రుడూ కాబట్టి ఉపేక్షచేసెనుగాని,స్వంతంవిషయమైతే దేముడు అంత అశ్రద్ధచేయునా ? ఒక్కవిషయం చూడండి, ప్రపంచంలో ఎంతమంది భార్యారత్నములను ఎంతమంది అపహరించుకపోతూంటే భగవంతుడు "నామాలకాక్" అంటూ ఊరుకున్నాడుగాదు ? అదే తనభార్యవిషయం రాగానే, సీతామ్మవారిని రావణాసురుడు ఎత్తుకెళ్లినాడని చెప్పి, దానికై రావణాసురుని చంపి, రాక్షసుల రూపుమాపి పెద్దఅట్టహాసం చేశాడు. భగవంతుడైనా తనదాకా వచ్చిందాకా ఎవడికీ మంచిచెడ్డలు పంటపట్టవు. భీష్మునిబాణములు తనకు తగిలిన వెంటనే, భగవంతుడైన శ్రీకృష్ణుడు, యుద్ధంలో చక్రం పట్టి మాట తప్పాడా, లేదా ? బావగారైన అర్జునుని రక్షించుటకు భారతయుద్ధంలో ఇండియన్ పీనల్ కోడ్ క్రింద ఉండేప్రతీసెక్షను క్రింద నేరంచేసేన్నా కాసాడియున్నాడుగదా. ఇలాగే ఎంతచూచినా, మోడరేట్లవలె, భగవంతుడుకూడ ఒట్టి స్వార్థపరుడువలె కనిపిస్తాడుగాని, గాంధిలాంటి త్యాగివలె కనిపించడు. పరాయివాళ్లను ఇబ్బందిలోనుండి వెంటనే తొలగించి కాపాడడం ఆయన నైజం గాదు. ఈ అనంతసృష్టిలో అన్నిటికన్న చిత్రం ఏమిటంటే, ప్రతీవస్తువునుగూడ ప్రజలకొరకు సృష్టించినట్టు చెప్తూ, అందులో మళ్లీ కొన్నివస్తువులు తింటే జబ్బులు తెప్పించడం. జీడిమామిడిపండు, సీతాఫలం, జామకాయ రేగలు, మొక్కజొన్నపొత్తులు మొదలుగాగల ఫలాదులను తినమని సృష్టించి, తిన్నవాళ్లకి తిన్నందుకు జబ్బులు తెప్పించడం కేవలం ప్రజలను దగాచేయడం గాని వేరొండు గాదు. ప్రజలకు భగవంతుడు తండ్రివంటివాడైనప్పుడు ప్రజలకు జబ్బు తెప్పించడంలో దేవదేవునికి భూతదయ అనేది హారతికర్పూరంలా హరించిపోతోందా ? లేక పాపాత్ములను శిక్షించుటకే ఈజబ్బులను సృష్టించెనా ? ప్రతిమానవునిలోనూ తాను ఒక అడ్డిగెత్తు మకాం ఉండడంవల్లను ప్రతి

మానవుహూగూడ భగవంతునిలో ఒకభాగమే అయిన సంపర్కంవల్లనూ్నా తనే తనకు జబ్బులు వగైరాశిక్షలు విధించడంలో ఎక్కువవివేకం ఏముంది? ఈగోజున ఉండి రేపు నశించే ఈమానవుని భౌతికదేహము ఎన్నటికినీ బాధచెందదు. ప్రతిమానవునిలో వెచ్చగా దూరి కూర్చున్న చిన్నదేవుడే బాధపడేది.

మానవులకు శిక్షలు విధించే ఆసామీఅయిన భగవంతుడు తాను ఎంతఆదర్శప్రాయమైన ప్రవర్తనను కలిగియున్నదీ పరిశీలించినచో చిత్రములు కనిపించక పోవు. భూభాగములో నాల్గవవంతుభాగమును ఏలుచున్న బ్రిటిష్‌గవర్నమెంటువారిచే సృష్టించబడ్డ ఇండియన్‌పీనల్‌కోడ్‌లోని యించుమించు ప్రతిసెక్షనుక్రిందనూ భగవంతుడు నేరములు చేసినట్టు కనబడుచున్నది. భగవంతునిఅవతారమగు శ్రీకృష్ణుడు తాను పాలుత్రాగెడి రోజులలోనే పాలీయవచ్చిన పూతనను గుండెలమీద తన్ని చంపి పీనల్‌కోడ్ - ౩౨౩ సెక్షనుక్రింద నేరము చేసియుండెను. పోలీసువారైతే ఆనేరమునే ౩౦౨ సెక్షనుక్రింద హత్యానేరము జరిగియున్నట్లు రుజువు చేసియుందురేమో తెలియదు. చిన్ననాటినుండియు శ్రీకృష్ణుడు గొల్లయిండ్లలోకి దూరి, తక్కినపనులు ఏవిచేసినా మానినా పాలు, వెన్న, మీగడ వగైరాలెన్నో దొంగిలించి యిళ్లలోని వంటలక్కలు చేసినట్లు హీనమైనదొంగనేరమెన్నో చేసియుండుట అందరు విని ఎరుగనిది కాదు. రామావతారమందూ భగవంతుడగు శ్రీరామచంద్రుడు, తాను దగ్గిరనుండి లక్ష్మణునిచే శూర్పణఖయొక్క ముక్కు, చెవులూ గోయించి పీనల్ కోడ్‌లోని ౩౨౫-౧౧౮ సెక్షన్లక్రింద నేరము చేసియుండెను, పోలీసుఇనస్పెక్టరు దగ్గరనే ఉండి కనిస్టేబులచేత లాఠీచార్జి చేయించినట్టు. శ్రీకృష్ణావతారములో రుక్మిణీపరిణయంసందర్భమున భగవంతుడు దౌర్జన్యంగా రుక్మిణిని వివాహం చేసుకుందామనే దురుద్దేశ్యంతో, ఆమెను, తండ్రిగార్డియన్‌షిప్పునుండి ఎత్తుకొనిపోయి Kidnap చేసి, ఐ. పి. సి ౩౬౩ శెక్షను క్రింద ఘోరమైననేరము చేసియుండెను. సైంధవవధ సందర్భమున, శ్రీకృష్ణుడు సూర్యభగవానునికి సుదర్శనచక్రము నడ్డము వైచి, తాత్కాలికముగ చీకటిని దెచ్చి, సూర్యుడస్తమించనిదే అస్తమించెనని సైంధవుడు నమ్మునట్లు చేసి, ఆతనిని చెన్నపట్టణములో మూర్‌మార్కెట్టువద్ద దగా చేసేవారివలె దగాచేసి ఐ. పి. సి. ౪౧౭ సెక్షన్‌క్రింద నేరము చేసియున్నాడు. అదియునుగాక, భగవంతుడొక్కడే యయ్యు, దశావతారములు దాల్చుటలో ప్రజలకు పది వేరువేరు రూపములుగా అగుపడి సదరు రూపములు పది వేరువేరువ్యక్తులతాలూకువని ప్రజలను నమ్మించి, పగటివేషధారివలె భూప్రజలను దగాచేసి ఐ. పి. సి. ౪౧౯ సెక్షనుక్రింద నేరము చేసియుండెను. శ్రీరామావతారములో చెట్టుచాటున దాగి, వాలిని బాణమువేసి చంపుట కేవలము ఐ. పి. సి. ౩౦౨ సెక్షనుక్రిందవచ్చే హీనమైన ఖూనీనేరమై యున్నది. గోపికలు తమచీరెలను కొలనుప్రక్క నిడుకొని, స్నానము చేయుచుండగా, శ్రీకృష్ణుడు కొంటితనముతో అక్కడకు చేరి, సదరుచీరెలను తీసికొనిపోయి, సామీప్యముననున్న చెట్టుపై నిడి, ఐ. పి. సి. ౪౨౬ సెక్షనుక్రింద కొంటెతనపు అల్లరినేరము చేసియుండెను. అది అటుండగా వస్త్రహీనలై సిగ్గుపడుచున్న సదరు గోపికలను కొరచూపులతో చూచుచు, వారి నవమానపరచుటలో శ్రీకృష్ణుడు ఐ. పి. సి. ౩౫౪ సెక్షనుక్రింద, స్త్రీని అవమానము చేయుట అనే నేరము చేసియుండెను. రాధ మరియొక మానవుని భార్యయని తెలిసియుండి, దురుద్దేశముతో, ఆమెను తరుచు తనవెంటబడి వచ్చునట్లు ఆకర్షించి, అనేకపర్యాయములు, ఐ. పి. సి. ౪౯౭ సెక్షనుక్రింద, పరాయివాని భార్యను ఆకర్షించి తీసికొనిపోవుట అనే నేరము చేసెను. అఖిలోచనుడను రాక్షసుని పెట్టెలో కూర్చోమని చెప్పి అట్లాతడు కూర్చొనినతర్వాత, శ్రీకృష్ణుడు పెట్టెకు మూతవేసి సదరు అఖిలోచనుని బాధించి ఐ. పి. సి. ౩౪౨ సెక్షనుక్రింద అక్రమబంధము (Wrongful Confinement) అనునేరము చేసెను. రారాజైన దుర్యోధనమహారాజు రాజ్యము పరిపాలించునప్పుడు, రాజవిరోధులైన పాండవులపక్షము బూని,

కుట్రలు పన్ని రాజుపై యుద్ధమునకు పురికొల్పవ ట్లుండి పురికొల్పి మహాత్మాగాంధీగారునూ, లోకమాన్య బాలగంగాధరతిలకుగారునూ చేసినారని చెప్పబడే ఐ. పి. సి. ౧౨౪ A సెక్షను క్రింద రాజద్రోహమను నేరము చేసియుండెను.

ఇవన్నియు అటుంచగా, భగవంతుడు ఇతర చట్టముల క్రిందగూడ మిక్కిలి హీనమైన నేరములు చేసియున్నట్లు కనబడుచున్నది. శ్రీరామావతారములో విల్లునకుగాని, అమ్ములకుగాని, శ్రీ కృష్ణావతారములో సుదర్శన చక్రమునకుగాని, అవిదగ్గర ఉంచుకొనుటకుగాని, వాడుటకుగాని ఎన్నడును లైసెన్సు పొందియుండక Arms act క్రింద నేరము చేసియుండెను. బోలెడుడబ్బు రాబడి ఉన్నప్పటికినీ, ఎన్నడును Accounts Income-tax డిపార్టుమెంటువారికి చూపక రాబడిని దాస్తూ, పన్నును evade చేస్తూ, అప్పటి గవర్నమెంటువారికి నష్టం దెచ్చి Income-tax Law క్రింద నేరము చేసియుండెను. కాబట్టి యిన్ని హీనమైన క్రిమినలు నేరములుచేసిన ఆసామి ప్రజలకు ప్రభువుగా నుండుటకు ఎట్లు అర్హుడు?

ఇట్టి క్రిమినల్ నేరములు చేసిన ఆసామీ, ఓట్లసంఖ్యనుబట్టి మానవుని మంచిచెడ్డలు నిర్ణయింపబడే ఈ ఎలక్షను యుగములో, ప్రజలను పరిపాలించడానికి ఎంతమాత్రమూ వీలులేదు. అందుకనే అసలి కాలములో దేవునిపై పరిపాలన సవ్యముగా లేనందులకు ఒక విశ్వాసరాహిత్య తీర్మానం ప్రజలు ప్యాసు చేయిస్తారనేవదంతి బయలుదేరింది. సంతాననిరోధం మీద పుస్తకములు వ్రాయుట, ఉపన్యాసములు యిచ్చుట సంతాన నిరోధమూగూడ సర్వేశ్వరునిమీదకు దండయాత్రకే, సృష్టిప్రతిఘటించుటకే! విశ్వాసరాహిత్య తీర్మానము పెట్టబడుననుటకు యిదియే ప్రథమ తార్కాణము !!!

---



పొందామరకొలను

—యస్. శంకరసుబ్రహ్మణ్యము.

# ప్రస్థానభేరి!*

శ్రీ డి. రాజశేఖర శతావధాని

కాండ్రుకాండ్రని పెద్దగా మ్రోఁతలు నిగుడ్చి గబ్బిబెబ్బులిపిండు బొబ్బరించు;
శైలముల్ వదలి పచ్చడిగాఁగ ధ్వని లేపి సింహపోతములు గర్జించు చుండుఁ;
జేమెత్తు లేచి పచ్చివిసంబు వెదచల్లి కోడెనాగులు బుసకొట్టు చుండు;
వసుధ యిట్టటు లాడ బరువై పరువులెత్తి యేనుంగుగుములు ఘీంకృతులు చేయుఁ;
బహ్మజాతాండమంతలై భయముఁగొలుపు-గండశిలలకొండలు చుట్టు నిండి యుండుఁ;
బ్రమథయుతుఁ డైన కైలాసభర్తకైనఁ-జాలునే గుండె నాదురాజ్యంబుఁ జొరఁగ!

భూలోకనాకమా బోయెపాళెం బుండుఁ జందనతరువరచ్ఛాయ లుండుఁ
గొలువుకూటం బుండుఁ గోడెగుబ్బెతగుముల్ వింజామరమ్ములు వీచుచుండ్రు
బొమిడికంబులభిల్లపుంగవుల్ నడదివ్వె లగుదు: రందఱును నీయాజ్ఞ నుండ్రు
నాయాత్మ కెంతో యానందమా; నాదుసింహాసనంబందు నీ వధివసింపు:
మంచఁ గూర్చుండి తృణమైన నవలఁబోకఁ-గొలిచి దేవ్రన కట్లు సేవలు ఘటింతు.
నడుగు మన్నాట కోర్వ; నాహస్తయుగము-జాళువాపట్టుదిండుగా సంతరింతు.

సరి యంచుఁ దలయూఁచి చూచు మఱి యాస్వర్గంబునందైన ని
ర్జరులుఁ ముప్పదిమూఁడుకో ట్లైపుడు పూజల్ చేసి సేవించు న
ప్పురుహూతుండును జూచియుండని సుఖంబుల్ భోగముల్ వచ్చి దాం
తరలై చుట్టును జేరి కొల్చు నిను; మద్వాక్యంబు నాలింపుమా!

అకటా! నీమెడ నెయ్యపుఁ బలిమి నే నట్లాడితిఁ గాక, యే
టికి నాప్రార్థన మియ్యకొంన: వెపుడుఁ డెందంబునన్ దేశమా
తకు వాటిల్లు విపత్తుకై వగచి చింతన్ గ్రాఁగు నీ వగ్గి క్రిం
గక స్వాతంత్ర్యము దక్కుదాఁక నొకచోఁ గాలూని కూర్చుండువే!

జాతియు జన్మదేశమును భిన్నములైన మనపూర్వులకు మైత్రి దనరకున్న
నాకన్న వయసు సుంతగఁ దక్కువైన బాల్యమున నొండొరు చూచినది మొదలుగ
నీపైన నవ్యాజనియతి నామది నిల్చె; రెండవదేవుఁ డనురీతిఁ జూతుఁ;
గడఁబోదు నీదుజాగ్రన్మంగళాకృతి కలనైన హృత్ఫలకముననుండి!
నీవు పాల్గొననట్టి యీనిఖిలలోక-సార్వభౌమత నరకవాసముగ రోతు!
నండ నీవున్న నంబలినైన నమృత-మట్లు సేవించి యానంద మంద నేర్తు.

---

* మత్కృత "రాణా ప్రతాపసింహ చరిత్రము"— అముద్రితమునుండి యుద్ధృతము.

అహితదైతేయపశ్యత్ఫాలమూర్తులౌ శౌర్యదుర్జయు లొక్క-జాతివారు;
తరతరంబులుగ స్వాతంత్ర్యలక్ష్మీమహోదయముఁ గోరి, విదేశధరణిపతుల
మాఱొడ్డి, బాహుశుంభత్ప్రతాపము చూపి, ధనధాన్యవస్తువాహనయుతముగ
సర్వార్పణ మొనర్చి, శాశ్వతధన్యత్వ మందు రెవ్వారికి వంద్యంబు గాదు!
హృదయము గలట్టిమానవుం డెవఁడు వారి-యడుగులను గొల్చి యహితుల నణఁచి
పావనము చేయఁ! డాతనిబ్రదు కదేల!- బలమదేల!నిరర్థకైశ్వర్య మేల! [జన్మ

అకటా! ముప్పదికోట్లహైందవులు మోయర్ దగ్గభారంబుఁ గొం
కక నీవొక్కఁడ వెత్తుకోఁదలఁచి! తింకర్ నిన్ను సేవించి గొం
తుక లర్పించెడువారు పూజ్యులగుభక్తుల్; నీపతాకంబుక్రిం
దికి రానొల్లనివార లందఱును మాతృద్రోహులుర్ వంచకుల్.

'పొదలర్ వెల్వడుదొడ్డక్రోలుపులు, లేపుర్ జూపు నాసింగపుం
గొదమల్ వీ' రనిశాత్రవుల్ బెదరు నుక్కుందుంట లున్నార లేఁ
బదివే ల్లెంకలు భిల్లవంశజులు: నీపాదాబ్జముల్ గొల్వ నే
కొఱద లేకుండఁగ నందఱర్ బనిచి నీకుర్ బ్రీతి గావించెదర్.

వెదురుపొదలనుండి ప్రిదిలినయాణిముత్యములు కుప్పలుకుప్పలై రహించు;
ఫణిఫణాగ్రములందుఁ బడి రాలినమణుల్ పరుపులుపరుపులై, ఇరిధవిల్లు;
గనులమొల్చినయనర్ఘస్వర్ణరౌప్యాదిలోహముల్ పెనుకొండలుగఁ దనర్చు;
శైలసానువులలోఁ జంద్రకాంతశిలలీ జగమంతటికినైనఁ జాలి యుండుఁ;
బెఱుగుటమెకాని తఱుగుట యెఱుగనట్టి-రత్నగర్భ సార్థముగ నారాజ్యసీమ!
యూఁచముట్టుగ నాయొద్దనున్నసిరులు-నాథ! నాప్రోల సర్వార్పణం బొనర్తు!

రవిబింబధ్వజ మొప్ప నీ వనికిఁ జేరర్, నీకు మున్మున్నె, యా
రవికన్నర్ మును దోఁచు నప్పొడుపుఁదారర్ బోలె జృంభించి యా
హవరంగాభ్రముఁ జొచ్చి శాత్రవకులధ్వాంతంబుఁ జీల్తుర్ బ్రతా
పవిభుం డన్నపిరంగి కీఘనుఁ డయఃప్రస్ఫీతగోళంబనర్!

పారతంత్ర్య మదల్చి స్వాతంత్ర్యమును నిల్పుబవరమ్ము వచ్చె సంవత్సరాది
పండుగువోలె నీభారతప్రజకెల్ల సమభాగమైన యుత్సాహవేళ!
యందఱు మొకమొగంబై నిల్చి యరుల గెల్చితిమేని స్వాతంత్ర్యసిద్ధి మొదవు!
ననిలోనఁబడినఁ గల్పాంతంబువఱకు శాశ్వతనాకలోకవాసంబు గలుగు!
రెంట నేదిగల్గినఁ గృతకృత్యులగుదు!-మింతకన్నను జిరపుణ్య మేది గలదు?
మీనమేషంబులను బ్రొద్దు మించకుండ-నిపుడె ప్రస్థానభేరి మ్రోయింపవయ్యా!

"భీమచాందు"

---

# ప్రభుత్వవ్యాపారపరిమితి

(The Scope of the state activity)

శ్రీపాద గణపతిరావు

మనము చేయు ప్రతికార్యమును ఏదేని ఒక ఆశయముచేత ప్రేరేపింపబడి ఉన్నది. అనగా మనపనులలో ఉద్దేశరహితముగాని, ప్రయోజనరహితము గాని అనునది ఒక్కటియు కానరాదు. ఒకవ్యక్తి యొక్క ప్రారంభములు అతని ఆదర్శములను, ఆశయములను అనుసరించియుండును. మత, సారస్వత, వర్తకాదిసంఘములయొక్క వానివాని ఆశయములచేత నియమింపబడును. అట్లే ప్రభుత్వవ్యాపారమును అది సాధింప యత్నించు ప్రయోజనములబట్టి యుండును. కనుక ప్రభుత్వవ్యాపారపరిమితిని నిర్ణయించుట అది సాధింపగోరు పరమావధులను తెలిసికొనుటయే.

ప్రభుత్వ మెందులకు పుట్టినది? దాని పరమావధి యేమి? దాని ప్రయోజన మేమి? దాని అవధులు, ఆశయములు దృష్టిలో నిడికొని, ప్రభుత్వవ్యాపారము పరిమితమా, అపరిమితమా? అను ప్రశ్నలకు సమాధానములు చెప్పుట కీవ్యాసమున కొంతయత్నము చేయబడుచున్నది.

ప్రభుత్వపరమావధి ముఖ్యముగా త్రివిధము:

౧. వ్యక్తిపరమావధి (The end of the individual)

౨. జాతిపరమావధి (The end of the nation)

3. విశ్వమానవపరమావధి (The end of mankind as a whole)

౧. వ్యక్తిపరమావధి:— బేకను (Bacon) ప్రభువు చెప్పినట్లుగా "భగవంతుని ఐశ్వర్యము, మానవుని మోక్షము" కొరకే ప్రపంచవ్యాపారమంతయు నున్ముఖ మగుచున్నది. ఈప్రపంచమున తొలుత ప్రతి మానవుడును స్వేచ్ఛాభావనయు, స్వేచ్ఛావర్తనయు గలిగిన యొక స్వతంత్రజీవిగా జన్మించును. సాంఘిక జీవనమున మానవుని యథాపదవికి ఉద్ధరించుటయే ఫరాసువిప్లవము (French Revolution) నాటి వలెనే నేడును గొప్పసమస్యయైయున్నది. ఇదియే యథార్థమగు స్వాతంత్ర్యమున కర్థము. ప్రతిజీవియు ప్రపంచమునం దవతరించుట సౌఖ్యమును, ఆనందమును అనుభవించుటకుగాని, దుఃఖమును, బాధయు ననుభవించుటకు గాదు. కనుక అతనిశక్తి గమించినంతదనుక పోనిచ్చి అతనికి సాధ్యమయినంత కల్యాణమును పొందగలుగునటుల అవకాశము లేర్పరచుటయే ప్రభుత్వమునకు విధియైయున్నది. అవకాశలోపముచే నేవ్యక్తియు దుఃఖభాజనము కాకుండ చేయుకొరకు ప్రభుత్వము పాటుపడవలసియున్నది.

౨. జాతిపరమావధి:— వ్యక్తిపరమావధికంటె జాతిపరమావధి మరియు విశాలమైనది. వ్యక్తివలెనే జాతియు సుఖజీవనము నడపుటకును, సాటిజాతులలో ప్రతిష్ఠ గడించుకొనుటకును కోరును. వ్యక్తివలెనే జాతియు కీర్తికై, ఐశ్వర్యమునకై, ప్రపంచవిజ్ఞానమున స్థానమునకై, సాటిజాతులపై అధికారమునకై యత్నించుచునేయుండును. జాతిపరమావధి వ్యక్తిపరమావధికి భిన్నమును, విరుద్ధమును నగుటయు తటస్థింపవచ్చును. కనుక ప్రభుత్వముయొక్క వివేకము ఈ రెంటికిని సామరస్యము గలిగించుటలో గాని, వీనిలో నేది యుత్తమము, ఏది గ్రాహ్యము అని నిర్ణయించుటలో గాని ఇమిడియున్నది.

3. విశ్వమానవపరమావధి:—విశ్వమానవపరమావధి అత్యంతవిశాలము, ఉత్కృష్టము నైయున్నది. ప్రతివ్యక్తికిని సౌఖ్యమునకు హక్కుగలదనిచెప్పినప్పుడు,

సమూహములైన మానవులెల్లరకు నది హక్కు అని వేర చెప్పనక్కరలేదు. కాని వ్యక్తి, జాతిపరమావధుల వలెనే విశ్వమానవ, జాతిపరమావధులు కూడ విరుద్ధములగుటయు సంభవమే. కనుక ఒకజాతికల్యాణముకంటె విశ్వమానవకల్యాణము కర్తవ్యమనుసంగతి గుర్తింపవలసినది ప్రభుత్వము.

ఇన్నియుగాక సర్వసాధారణసౌఖ్యము (General welfare) అనున దొకటియు గలదు. ఇది బెంథము (Bentham) మొదలగువారి ప్రయోజనవాదమునకు (Utilitarianism) సమంజస మగు పూర్వపక్షముగా ప్రతిపాదింపవచ్చును. ప్రభుత్వము దాని ప్రజలశుభము, సౌఖ్యముకొరకే కావలయునని వారివాదన. "సౌఖ్యము నభివృద్ధిచేయుటకై యత్నించుటలోనే ఒకపనియొక్క మంచియు, ఇందుకు భిన్నమగుటలో దానిచెడుగును కలదు" అని మిల్ (Mill) మహాశయుడు పలికెను. కాని, విశ్వమానవసౌఖ్య మనునది కేవలము భావనాత్మకమును అసంభవమునని ప్రయోజనవాదులుసైతము విశ్వసించెదరు. కనుక అధికసంఖ్యాకులయొక్క అధికతమసౌఖ్యము రెండవపక్షమున ఆమోదించెదరు. మరియు నైతిక ప్రమాణము సుఖజీవనము, అనగా వ్యక్తియొక్క అత్యధిక సౌఖ్యముగాక 'అధికసంఖ్యాకుల అత్యధికసౌఖ్యము' అనవచ్చును. కనుక ఈసూత్రమే ప్రభుత్వవ్యాపారమును నియమించుచు, దాని పరిమితి నిర్ణయించవలెనని ప్రయోజనవాదుల ఉద్దేశము. సాంఘికప్రయోజనము, వ్యక్తికల్యాణము అను ఆదర్శములను ప్రభుత్వమునకు నిర్ణయించుటలో పైవిషయమునందు కొంత సత్యము గలదు. కాని ఈ సూత్రమునకు ముఖ్యముగా రెండు లోపములు గలవు: ౧. అట్టిసూత్రము ప్రజలహక్కులు, ధర్మములు నియమింపజాలదు కనుక అధికసంఖ్యాకుల యత్యధికసౌఖ్యమే న్యాయపరిపాలనకు ప్రమాణమెంతమాత్రము కాజాలదు. ౨. సౌఖ్యమనునది ప్రతి వ్యక్తికిని ప్రత్యేకమగుటచే, సౌఖ్యానుభవము ఎట్టి బహిరంగవిధానముచేతను ప్రత్యక్షానుభవములో ప్రదర్శించుటకు వీలుకాదు. ప్రతివ్యక్తికిని, తనకనురూపమగు పద్ధతిని తనహక్కులను వినియోగించుకొని సుఖము సంపాదించుకొనుటకు అవకాశమును కలిగించుటయే ప్రభుత్వము ప్రజలకు చేయగలపని.

కనుక సర్వసాధారణసౌకర్యమనునదియే ప్రభుత్వవ్యాపారమునకు ఉత్తమ మగు సూత్రమని తోచుచున్నది. బ్రైస్ (Bryce) ప్రజాపరిపాలనమును గురించి వ్రాయుచు "ఏప్రభుత్వమునకైనను సౌకర్యము, న్యాయము కలిగించుటయే ధర్మము" అని చెప్పినాడు. కనుక ఏప్రభుత్వమునందు ప్రజలు అత్యంతము సుఖితులు, సంతృప్తులు నైయుందురో ఆప్రభుత్వమే ఉత్తమము! అదియే లోకములో అన్నిప్రభుత్వములలోను మహోన్నతస్థానము నాక్రమింపజగియున్నది.

ప్రభుత్వవ్యాపారపరిమితి—

౧. మనము State అనిపిలుచునది విల్సన్‌గారు (Woodraw Wilson) చెప్పినట్లు "ఏకశాసనబద్ధమును నొకభూఖండములోని ప్రజాసమూహము" కనుక ప్రభుత్వము ఏపనిచేసినను, అది యారాష్ట్రములోని ప్రజలకు సంబంధించినదై యుండవలయును. ఏలననగా ఒకరాష్ట్రములోని ప్రజల కుపయోగకారియైనది వేరొకరాష్ట్రములోని ప్రజల కుపయోగకారి కాకపోవచ్చును. అట్టి విరుద్ధములగు పనులను ప్రభుత్వము తలపెట్టజాలదు. కనుక మనము State అనునది ఒక భూభాగమున నివసించుజనులకే చెందుటచే ప్రభుత్వవ్యాపారమున కిది యొకహద్దును నిరూపించుచున్నది.

౨. ప్రభుత్వముయొక్క సాధనము శాసనము. ఇదియు ప్రభుత్వవ్యాపారమునకు కొంతపరిమితిని విధించుచున్నది. ప్రభుత్వము తనఉద్దేశమును దేనినైనను నెరవేర్పదలచినయెడల దాని సాధనసర్వస్వమును శాసనమే. కనుక ప్రభుత్వము చేయదలచినపనులు పెక్కులున్నను, అవన్నియు శాసనముక్రింద రానందున అది వానిని నెరవేర్పజాలకున్నది. ప్రజలయొక్కమతము, నీతి మున్నగున వీజాతివి. కనుకనే నేటిప్రభుత్వములు మతములో జోక్యము కలిగించుకొనుట కిష్టపడవు. ఆహారము, దుస్తులు మున్నగునవి నియమించు శాసనముల నిష్ప్రయోజనమునకు నిదియేకారణము. వ్యక్తులయొక్క

బాహ్యసంబంధములనే ప్రభుత్వము శిక్షింపగలదుగాని అంతరంగికవిషయములలో జోక్యము కలిగించుకో జాలదు.

3. ప్రభుత్వము ఒక సంస్థగా తక్కినసంస్థల కంటె చాల విలక్షణమైనది. తక్కిన సంస్థలకంటె నది దీర్ఘజీవి. ఏసంస్థయైనను దాని ప్రస్తుతసభ్యుల అభ్యుదయమునకైమాత్రము యత్నించి భవిష్యత్సభ్యులు దాని సూత్రములను భిన్నములుగా చేయుటలోపలనే గతించవచ్చును. కాని ప్రభుత్వము తనప్రజలవర్తమానాభ్యుదయమును, ఒకటి రెండు భవిష్యత్తరముల యభ్యుదయమునుమాత్రమే కాక సాధ్యమయినంత సుదూర భవిష్యత్కల్యాణమును గూడ గణింపవలసియున్నది. కనుక సహజసంపత్సంరక్షణాదులు (Conservation of natural resources) ప్రభుత్వపుపనులలో చేరుచున్నవి. ఈవిధముగా ప్రభుత్వము స్థిరస్థాయిగనుక అది శాసననిర్మాణమును భావిప్రజల సౌకర్యమును లక్ష్యమునందిడుకొని కావింపవలయును. ఈవిషయము మాత్రము ప్రభుత్వవ్యాపారపరిమితిని విశాలము చేయుచున్నది.

4. విశ్వజనీనత (Universality) యను లక్షణముచేతగూడ ప్రభుత్వము తక్కిన సంస్థలకంటె ఉత్తమస్థానము నాక్రమించుచున్నది. ప్రభుత్వబాధ్యత చాలవిశాలమైనది. అనగా అది ఒకరాష్ట్రములోని ప్రజలసంస్థ కనుక ఆరాష్ట్రములో పుట్టినమాత్రముననే ప్రతివ్యక్తియు నందు సభ్యుడగుచున్నాడు. ఇతరసంస్థలలో సభ్యత్వము ఐచ్ఛికముగాని జన్మసిద్ధము గాదు. కనుక ఒకరాష్ట్రములోని ప్రజలందరు నాప్రభుత్వమునందు విధిగా సభ్యులై యుండవలయును. అందుచేత సమూహముమీద వారందరి సౌఖ్యమును చూడవలయునేగాని ప్రభుత్వము ఏఒకపక్షముయొక్క సౌఖ్యమునుమాత్రమే గణింపరాదు. ఈకారణమువల్లను ప్రభుత్వము ప్రజలమతములలో జోక్యము కలుగజేసికొనదు. కనుక ప్రభుత్వవిధానము స్థూలదృష్టికి పాక్షికముగా తోచినను, యథార్థమున నది సర్వప్రజాసౌఖ్యమునకే యత్నించవలయును. కార్మికశాసనవిధాన (Labour legislation) మిట్టిది. అది స్థూలదృష్టికి పనివాండ్ర సౌఖ్యమునకే నిర్మింపబడినది అని తోచినను, సత్యముగా నది సర్వప్రజాసౌకర్యమునకే ఉద్దేశింపబడినది. కనుక ప్రభుత్వము పాక్షికమైన ప్రభుత్వనిర్మాణము చేయజాలదు. ఇదంతయు ప్రభుత్వముయొక్క స్వైరప్రవర్తనపై నియమముల విధించుచున్నది. ప్రభుత్వము తనచిత్తము వచ్చినట్లు శాసననిర్మాణము చేయజాలదు.

కాని యథార్థము విచారించిన ప్రస్తుతకాలమున ప్రభుత్వవ్యాపారమున కొక హద్దున్నట్లు తోచుట లేదు. మానవుని అవసరములకు, కోరికలకు అంతము లేకుండుటయే దీనికి కారణము. కనుక ప్రభుత్వవ్యాపారపరిమితి యెంతవిశాలమగుచున్నను, అది యొక స్థిరస్థాయి యగు సంస్థయనియు, భావిప్రజల సౌకర్యమునకై యీ విపులీకరణ మగత్య మనియు సమాధానము చెప్పవచ్చును. లాస్కి (Laski) గారు చెప్పినట్లు మానవహక్కుల చరిత్ర పూర్వమువాని విపులీకరణకథ. కాని నేడు అవి క్రమముగా సంకుచిత మగుచున్నవి. క్రమక్రమముగా మానవుని స్వేచ్ఛను ప్రభుత్వము కొల్లగొట్టుచున్నది.

ఉపసంహారము:—

కనుక ఒకప్రభుత్వముయొక్క విధానము దాని యొక్క ౧. వ్యక్తిపరమావధిని, ౨. జాతిపరమావధిని, 3. విశ్వమానవపరమావధినిబట్టి నిర్ణయింపవలయును. సర్వసాధారణ సౌకర్యమును విషయము దానిని సర్వదా నిర్దేశించుచునే యుండవలయును. ప్రభుత్వము స్వభావసిద్ధముగ చలచిత్తము, స్వైరము నై యుండజాలదు. అది యొక రాష్ట్రీయసంస్థ యగుటచేతను, శాసనమే దాని సాధనసర్వస్వమగుటచేతను, దాని స్థిరస్థాయిత్వముచేతను, దాని విశ్వజనీనత్వముచేతను ప్రభుత్వముయొక్క వ్యాపారములు పరిమితము లగుచున్నవి.

# వీరభద్రవిజయములు

విద్వాన్, కట్టి సాంబమూర్తిశాస్త్రి

వీరభద్రవిజయ మనఁగానే పాఠకులకు వీరభద్ర విజయ మను పేరఁ బ్రకటింపఁబడిన యాంధ్ర ప్రబంధము స్మరణకు వచ్చును. కాని నేను దెలుపఁబోవు విజయములు దేవుఁడగు వీరభద్రునకు సంబంధించినవి కావు. క్రీ. శ. ౧౫-వ శతాబ్దాదిని రాజమహేంద్రవరము రాజధానిగా నుత్తరాంధ్రదేశము నుత్కలసీమావధిగ నవక్రపరాక్రమంబునం బాలించిన పంటవంశముక్తామణి యగు వీరభద్రారెడ్డికి సంబంధించినవి. ఆనరపాలుని విజయము లభివర్ణించుటకు ముందుగా నాతని యాస్థానకవియగు శ్రీనాథునిగూర్చి యెంతయేని చెప్పవలసియున్నది కాని యీవఱకే పలువురు మహాపండితు లాతని చరిత్రమును బుస్తకములుగా రచించియుంటచే నిప్పు డావిషయ మప్రస్తుతమే.

కాని దేశోద్ధారకులగు కవులలో మన శ్రీనాథుఁ డగ్రగణ్యుఁడను విషయమును మాత్రము మనవి చేయక తప్పదు. లోకములో ననేకులు మహానుభావు లనేకరీతుల దేశాభ్యుదయమునకై మానప్రాణధనములు తృణప్రాయములుగా వ్యయించి కీర్తి గనియున్నా రనుట యెల్ల రెఱింగినదే. కాని మహాకవులు సేయుదేశసేవ అనన్యాదృశము, నఖండము నైనది. వాల్మీకి మహర్షి రామచరితమును బ్రబంధముగా రచింపకున్నచో నీలోకమున నీతిసత్ప్రవర్తనములుఁ దావే లేకపోయెడిది. కాళీదాసుఁడు రఘువంశకావ్యమున నాల్గవసర్గమందు, నాఱవసర్గమందు నాఁకాలపురాజుల బలపౌరుషసాధన సంపత్తులను, దేశనైసర్గికస్వరూపములను, దేశసంపదలను నిప్పటికిని గనులకుఁ గట్టునట్లు వర్ణించియున్నాఁడు. శూద్రకుని మృచ్ఛకటికనాటకము నాఁడు నేఁడుగూడ లోకవ్యవహారములకు దర్పణప్రాయమై యున్నది. తిక్కనసోమయాజియు, నల్లసాని పెద్దనయుఁ దమకవితా

రక్షింపఁగల్గిరి. మన శ్రీనాథుఁడుగూడఁ గవిత్వమహత్త్వంబున శత్రుహస్తములకుఁ జిక్కిన తనప్రభువుల కటారిని దిరిగి తెచ్చెనుగదా? కావుననే కవులు కావించు దేశోద్ధార మనన్యాదృశమైనది. ప్రతాపరుద్రయశోభూషణ మను నలంకారగ్రంథమును రచించిన విద్యానాథ మహాకవియు, మన శ్రీనాథకవిసార్వభౌముఁడు నిరువురు మాత్రమే మనయాంధ్రదేశమునఁ గవితామృతరసమునఁ జరిత్రాంశముల నిమిడ్చి భావకుల కఖండానంద మొనఁగూర్చిన మహానుభావులు. శ్రీనాథకవిగ్రంథముల ననుసంధించియే నే నిప్పు డారాజచంద్రుని విజయంబుల నివేదించుచున్నాఁడను.

శ్రీనాథుఁడు కొండవీటిరెడ్డిరాజుల యాస్థానకవిగా నుండి యనేకదానశాసనములు మొదలగు కృతులను సంస్కృతాంధ్రభాషలలో రచించి యారాజులకీర్తి దిగంతవిశ్రాంతముగా నొనర్చియున్నాఁడు. కొండవీటి రాజ్యము క్షీణించినవెనుక ననేకాస్థానములు దర్శించి, యనేకకృతుల నక్కడక్కడ రచించి, రాజమహేంద్రవరమున కరిగి యందు రెడ్ల యాదరాభిమానముల నొందెను. రాజమహేంద్రవరరెడ్లమంత్రి యగు బెండపూఁడి యన్నయమంత్రి కంకితంబుగా భీమేశ్వరపురాణము రచించి, యందుఁ దనకును నామంత్రికి నేలిక లగు వీరభద్రవేమనరపాలుర రాజ్యము సింహాద్రిపర్యంతము వ్యాపించియున్నదని వర్ణించియున్నాఁడు.

"ధారాసురత్రాణ ధాటీసమారంభ
గర్వాపహోరాశికలభుజులకు
సప్తమాడియరాయ ఝాడియక్ష్మాపాల
వందిత శ్రీపాద వనరుహులకు
సింహాద్రిపర్యంత సీమాంధ్రమేదినీ
మండలీపాలనాఖండలులకు."

అను పద్యమున నారెడ్డిరాజుల విజయము వర్ణిం

మధురిమ చేఁ బరహస్తంగతములగు మహారాజ్యములనేచియున్నాఁడు. కవి భీమఖండరచనమునాఁటికి రెడ్డి

రాజులరాజ్యము సింహాద్రిపర్యంతవ్యాప్త మైనదని కంఠోక్తిగాఁ జెప్పుటచే కీ. శే. వీరేశలింగముపంతులుగారు తమకవులచరిత్రమందు నట్లే వ్రాసియున్నారు. కాని యాకాలమునాఁటికే వీరిరాజ్యము గంజాంమండలములోని చిల్కాసముద్రమువఱకు వ్యాపించియున్నదని యీపద్యమువలననే తెలియఁగలదని ముందు ఋజువు పఱిచెదను. శైవధర్మఖండములు రాజులకుఁ గాక వారిమంత్రుల కంకితము గావింపంబడుటచే నారాజుల విజయచరిత్రము లెక్కువగా వర్ణింప నవసరమైనది కాదు. కాశీఖండము రాజునకే యంకితమిచ్చుటంజేసి దానియందు వారి విజయములు సమగ్రముగ వర్ణించియున్నాఁడు.

కాశీఖండమందలి విజయములం దెల్పుపద్యముల నీక్రింద నుదాహరించి వానిని వివరించెదను.

నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్నవేమేశ్వరునియంక మాశ్రయించి
నిండుకొలువుండెఁ గన్నులపండువుగను.
(ఆ. ౧, ప. ౧౦.)

అనవేమక్షితిపాలు పౌత్రియగు వే
మాంబామహాదేవికిన్
ఘనుఁడయ్యల్లడభూమిపాలునకు సం
గ్రామస్థలీగాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధా
ధ్యక్షుండు దొడ్డప్రభుం
డును నన్నయ్యయు బాహువిక్రమకళా
టోపప్రతాపోద్ధతుల్.

సప్తమాడియరాయ చంద్రబింబాననా
చికురవల్లరులపైఁ జిన్నిపువ్వు
ఝూడెజంతుర్నాటిజననాథశుద్ధాంత
కుచకుంభములమీఁదఁ గుంకుమంబు
బారహదొంతిభూపాలలీలావతీ
గండస్థలంబులఁ గలికినవ్వు
కలువపల్లొడ్డాదికటకాధిపతివధూ
సీమంతవీథులఁ జేరుచుక్క

* * * *

కొనియెం గంచుకము ల్సముద్భటనట
ద్ఘోటీభటప్రౌఢి గై
కొనియె న్వేదుక జీకికోటయపితృ
క్షోణీశు లల్లాడఁ జే
కొనియె న్మాత్రకవరంబు వీఁక మనవ
ద్ఘోరారిసంహారియై
ఘనుఁ డల్లాడమహీశువేమన నిరా
ఘాటైకధాటీగతిన్.

పండువాసులతాళిపావడం బిచ్చిన
భద్రేభములు వీథిఁ బాళెముండు
నొడ్డెధాత్రీనాథుఁ డుపదఁ బుత్తెంచిన
బింబాగుణోష్ఠి సంబెల వహించుఁ
గర్ణాటభూపతి కానుక యనిపిన
ముక్తాతపత్రంబు మ్రోల నెఱయు
యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన
పాగాహయంబులు వాగె వచ్చు
దూర మంతంత బారహదొంతి మన్నె
సప్తమాడియరాజన్యసమితి మ్రొక్కు

..............................

జౌరా యల్లయరెడ్డినొడ్డవసుధా
ధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతఘోరఘోషమున ని
ర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోతగ ట్టయును ను
ద్ఘాటించె నత్యుద్ధతిన్
క్షీరాంభోధితటంబున న్నిలిపె ది
క్సీమాజయస్తంభముల్.

హరిదాటించెఁ బురోపకంఠమున వా
హ్యాళీప్రదేశంబునం
దరుదే యల్లయరెడ్డినందనుఁడు దొ
డ్డయ్యాకుమారేశ్వరుం

డిరుసై నాలుసుమూళ్ల మేర యనుగో
సెక్కింపఁగా నేలయ
ద్ధరణీనాథుని కీర్తి దాఁటెఁ గడు ను
ద్దండించి బ్రహ్మాండమున్.

ప్రాకటవిక్రమస్ఫురణ
రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్రమున
నేలెను వీరనృపాలుఁ డు_త్తమ
శ్లోకుఁడు వేమశౌరి యను
జుండు సమున్నతవైభవాఢ్యుఁడై
చీకటియుం గళింగమును
జిల్కసముద్రము సింహశైలమున్.

బలవద్బాదరహమ్మాంతిమన్నె ధరణీ
పాలావరోధాంగనా
విలసన్మంగళసూత్రరక్షణకళా
విఖ్యాతకారుణ్య యు
త్క_లకర్ణాటకురుష్క_రాట్పరమమి
త్రా.............

కర్ణాటోత్క_లపారశీకనృపస
ఖ్యప్రాభవశ్రీనిధీ
................................

పంచారామవధూటీ
పాంచాల కళింగరాజపరమేశ్వర య
భ్యంచితదయాధురంధర
చెంచూమలచూరకార చిరపుణ్యనిధీ!

వేమక్షోణినరానుసంభవ.........
మత్స్యవంశనృపరక్షా కేళిపద్మేక్షణా!...
................................

కసిమికోట వేంకటాయికప్పకొండ కిల్లెడా
ద్యసుహృదవనిపాంతరంగహాలహాలవిషానలా!
ధారాపట్టణసార్వభౌమ సురధాణ్దర్పాపహారక్రియా
ధౌరంధర్య పటిష్ఠనిష్ఠురభుజాదంభోళిసంరంభ!
................................

ధారాసురధాణదర్పధరణీధ్రపవీ!

అనుపద్యములందు వీరభద్రారెడ్డియు, వలని యగ్ర జానుజులును జయించిన రాజ్యములను బేర్కొని యున్నాఁడు. వీనిలో పండువాసులతోని, ఒడ్డెధాత్రీ నాథుడు, యవనాధిపతియుఁ గాక తక్కినరాజులందఱు విశాఖపట్టణ, గంజాం మండలములలోని చిన్న చిన్న సంస్థానములకుఁ బ్రభువులు. వీరిరాజ్యములు చిన్న వైయైనను బలపరాక్రమాదిశూరగుణములుమాత్రము పరభయంకరములై, యసాధారణములై యుండుటచేతనే మన కవి యీరాజ్యముల జయించినవృత్తాంతమును విపులముగా వర్ణించియున్నాఁడు. ప్రస్తుత మీగ్రామముల గూర్చిన యైతిహ్యములును, వింతవింత సంగతులను బాఠకుల కించుక నివేదింపవలసియున్నది.

పూర్వము కళింగదేశమును గంగాంగవంశపు రాజులు పాలించియుండిరనుట చారిత్రికులకుఁ గ్రొత్త విషయము గాదుగదా! క్రీ. శ. ౧౩-వ శతాబ్దమువఱకునుగూడ నీదేశము కళింగరాజుల పాలనమునందే యున్నట్లు తలంపనగును. అనంతరము కాకతీయు లీదేశమును జయించినట్లు వాదుక కలదుగాని ప్రబలాధారము లగపడలేదు. ఆకాలమున నీదేశమున నేకపాలనము లేక బలవంతులెల్ల దమకు చేఁజిక్కినంతభూమినిఁ బాలించుచుఁ జిన్నచిన్న సంస్థానముల నేర్పఱచి యుండిరి. తొలుదొల్త ౧౪-వ శతాబ్దమునఁ గాకతీయరాజ్యక్షయానంతరము కొండవీటిరెడ్లు స్వతంత్రులై సింహాచలపర్యంతము గల దేశమునెల్ల నేకచ్ఛత్రాధిపత్యంబుగ నేలిరి. ఆసమయమున నేరాజమహేంద్రవరరాజ్యము వేమవీరభద్రారెడ్లవశ మయిన తరువాత నారాజసోదరులు నలువురును సాహసోత్సాహములు మెఱయఁ జిల్కసముద్రమువఱకుఁ గల కళింగాంధ్రదేశమునెల్ల స్వాధీనము గావించికొని యవక్రపరాక్రమంబునఁ బాలించిరి. రెడ్డిరాజుల ప్రాభవ మించుకపలుచబాఱినతఱి మత్క_లరాజు లీదేశమునుమాత్రమే కాక కృష్ణామండలములోని కొండపల్లి యుదయగిరుల వఱకును గూడ స్వాధీనపఱుచుకొనిరి. ఇంతలో విద్యానగరమున శ్రీకృష్ణదేవరాయ లవతరించి తన బాహుబలంబునను, తిమ్మరుసుమంత్రీశ్వరుని శేముషీవిశేషంబు

నను నుత్కలరాజులవశమందున్న కళింగాంధ్రదేశమును వశముచేసికొనుటయేకాక కటకమువఱకుఁ గల యుత్కల భూమినికూడ జయించి గజపతులతోడి సంబంధవశమున నారాజ్యమును వారికే యిచ్చివేసెను. విజయనగర రాజ్యము క్షీణించినపిదపఁ దురుష్కు లీదేశమునెల్లఁ దమయేలుబడిలోనికిఁ దెచ్చుకొనిరి. కావుననే "రెడ్డి యొడ్డితెలుఁగుతురకలు" ఈదేశము నేలిరని సామాన్యులు గూడ చెప్పుకొనుచుందురు. గంజాంమండలమందలి బరంపురప్రాంతమున మన్నెసంస్థానము లధికముగా నుండుటయు, నుత్కలదేశీయులనాటి కివి సన్నిహితముగా నుండుటయుఁ గారణములుగ నాయారాజులు వారివారిపాలనకాలమున నిక్కడఁ దమతమకు విశ్వాసపాత్రమగు కొంతసైన్యమును, రాజప్రతినిధులను నిలువ యుంచెడివారు. ఆసైనికులు కాలక్రమమున నీదేశమ ననే స్థిరపడుటచే వారివంశము లిప్పు డీప్రాంతమున శాఖోపశాఖలుగా నున్నవి. విశాఖపట్టణప్రాంతము మొదలుగ బరంపురమువఱకును గల "రెడ్డిక" యనుజాతి వా రానాఁటి రాజమహేంద్రవరరాజులస్వజాతీయులు, వారి సైనికుల వంశస్థులు నై యున్నారు. అజ్ఞానవశమున నితరజాతులవారు వారి నిపుడు "రెడ్డిక" వారని వ్యవహరించినను వారుమాత్రము "పంటరెడ్లు" మని చెప్పుదురు. వీరిలో చాలమంది యిపుడును దొరతనము వారి సేనలలో సైనికులుగా నుండుచుందురు. నాఁటికి నేఁటికిఁగూడ వీరవిహారమే వారి కానందదాయక మగు వృత్తియై యున్నది.

తెలుఁగురాజుల (కృష్ణదేవరాయని) కాలమునఁ దెలగాణ్యమునుండి తెలుఁగుసైనికు లీ దేశమునకు వచ్చి యిక్కడ స్థిరనివాస మేర్పఱుచుకొని యున్నారు. ఈ తెలగాజాతికూడ నీ ప్రాంతములం దధికసంఖ్యముగానే యున్నది. వీరును ననేకులు పటాలములలోఁ గొలువు చేయుటకే యుత్సహించుచుందురు.

తురకలపాలనమునఁ నీదేశమున దురుష్కులు చాలమంది నివాసమేర్పఱుచుకొనియుండిరి. కాని ప్రస్తుతము వారిసంఖ్య యీప్రాంతములందు చాల సన్నగిల్లియున్నది. ఆయాస్థలములలో నున్న శిథిలములయిన మసీదులును, వేనవేలుగానున్న మృతసమాధులు మాత్రమే వారి పూర్వాధిక్యమును వ్యక్తపఱుచుచున్నవి. ఇంక నీసామాన్యవిషయమును విడిచి రెడ్డిరాజులు జయించినరాజ్యములగూర్చి యించుక పరిచయము గావించుకొందము.

౧. ధారాసురత్రాణుఁడు, ధారాసురథాణుఁడు అనునామములతో నొక్కరా జగపడుచున్నాఁడు. ఈ ధారాపుర మెక్కడిదో తెలియరాలేదు. గంజాంమండలమందు ఏజెన్సీప్రాంతమున ధారాకోట యనునొక జమీందారీస్థలము కలదు. కాని యాకాలమున దానిని సురత్రాణుఁడు పాలించెనా యనుసంశయము గలుగుచున్నది. సుల్తాను అనుతురకపదమును సురత్రాణ, సురథాణపదములతో మనకవు లుపయోగించిరి. ఈదేశమును పాలించినవారు, నిప్పుడు నీదేశమం దట నట నివాస మేర్పఱుచుకొన్నవారు నగు తురుష్కులెల్లరును నైజాము దేశమునకు సంబంధించినవారుకాని యుత్తరమునుండి వచ్చినవారు గారు. విజయనగరరాజ్యము క్షీణించిన పిదపనే దక్కనుతురుష్కు లీదేశమునకు వచ్చిరి. కావున రెడ్డిరాజులకాలమున ధారాకోటలో సురత్రాణుఁ డుండుట సంశయాస్పదమే. కావున నీధారానగరము వేఱొక స్థలమందలిదియని యైనను, లేక సురత్రాణపదమునకు వేఱొకయర్థమైనను జెప్పవలసి యుండును. ఈధారాసురత్రాణపదము ఈ రాజులవిషయముననే కాక చాలమందిరాజుల విజయములందుఁగూడ వర్ణింపఁబడినది.

౨. "సప్తమాడియ" యనుపేరుగలగ్రామ మేదియు నిపుడు స్పష్టముగాఁ దెలియకున్నది. బరంపురమునకు సమీపమున "సప్తపాండ్య" యనుగ్రామము గలదు. ఉత్కలప్రాంతమందే 'సప్తబానియ' యను వేఱొకగ్రామము కలదఁట. ఈరెంటిలో నేదైనను గావచ్చును. ఇదికాక విశాఖపట్టణమండలమందు "మాడుగుల" యను సుప్రసిద్ధమగు సంస్థానము నేఁటికిని గలదు. కృష్ణదేవరాయని విజయవర్ణనమున "మాడెముల నేర్చె నొడ్డాది మసిమొనర్చె"నని పెద్దనార్యుఁ డామాడుగుల విజయము చేర్కొన్నాఁడు. ఇందు మాడుగుల,మాడెముల యనుపదములు లేకున్నను "మత్స్యవంశనృపరక్షా

శేళిపద్మేక్షణా!" యని కలదు. మాడుగులరాజులది మత్స్యవంశము. కావున నీసప్తమాడియపదము మాడుగులకైనను జెందియుండును. మాడుగులకు నలుక్రోసు దూరమునఁగల "మాకవరము"ను వీరభద్రారెడ్డి జయించినట్లు కాశీఖండమున నుండుటంజేసి యీసప్తమాడియ యుత్కలసీమయందలిదే యనిచెప్ప టుచితముగా నుండును.

ఒడ్డాది, శృంగారంకోట, లోతగడ్డ యను గ్రామములు విశాఖపట్టణమండలములోనివి. ఇప్పటికిని వీరులు, బలిష్ఠులు నను తెలగాలకు ఒడ్డాది ప్రసిద్ధికెక్కినది. పూర్వ మది విరటరాజురాజధానియని యక్కడివారు చెప్పుకొందురు. మాడుగుల ద్రుపదునిరాజధాని యందురు. శృంగారంకోటయం దిప్పుడు శిథిలమైనకోట యొకటి కలదు. ఆకోట చాలఁ బ్రాచీనమైనదని యనేకులు చెప్పుచున్నారు. లోతగడ్డయనుగ్రామము లోతుగడ్డయను పేర ఆంధ్రసంస్థానమునకు దగ్గఱగా మెంటాడ గ్రామముకడ నున్నది. ఈగ్రామములన్నియు మాళియా ప్రదేశములందలివే. శృంగవరపుకోటకు సమీపమున విరటకొండయను నొకపర్వతము కలదు. ఆకొండకడనే యుత్తరాభిమన్యులకు వివాహమైనదనియు నక్కడివారు చెప్పుదురు. వర్ష కాలమునం దాప్రాంతభూములందు బియ్యపుగింజపరిమాణముగల బంగారుకణికలును, వంగగింజలంతేసి బంగారునాణెములును లభించుచుండును. వీనినే వంగపరక లందురు. కొన్నింటిమీఁద నందివిగ్రహము ముద్రితమై యుండును. వానిని నందిపరకలని వ్యవహరింతురు. ఉత్తరాభిమన్యుల తలఁబ్రాలుగా వీనిని వ్యవహరించుచున్నారు. మఱియు శృంగవరపుకోట కనతిదూరమున నున్న జామిగ్రామమును శమీపురమనియు, దానికి దగ్గఱగనే కల "అలమండ"ను ఆలమంద యనియు, పాండవులు శస్త్రములుంచిన శమీతరు వుండుటచే శమీపుర మనియు, విరటునియాలమంద లున్నతావునకే "యలమండ" యని పేరువచ్చెననియు నచ్చటివారు నమ్ముచున్నారు. భారతకథయెల్ల నాప్రాంతముననే జరిగిన దని వారినమ్మకము. ఆనమ్మక మెట్లున్నను నాస్థలములుమాత్రము పాండవులుకాకున్న వారితోసమానులగు రాజన్యులచేఁ బాలింపఁబడినవనుట మాత్రము నిక్కువము. ఆపాలించినవారు కొంతకాలము రెడ్డిరాజులు, పిదపఁ దెలుఁగురాజులు ననుట నిర్వివాదము. రెడ్డిరాజులు పాలించినతావులందెల్ల వంగపరకలు, నందిపరకలు లభించుటమాత్రము వింతగొల్పుచున్నది. "క్షీరాంభోధితటంబున న్నిలిపె దిక్సీమాజయస్తంభముల్" అని కలదు కదా! ఆ క్షీరాంభోధి యేది? కార్తికశుద్ధద్వాదశికి మథనద్వాదశి యనియు, క్షీరాబ్ధిద్వాదశియనియు సంస్కృతనామములు. దానిని నాంధ్రమునఁ జిలుకుద్వాదశి యందురు. అట్లే గంజాం మండలమందలి రంభికడ నున్న చిలకసరస్సును చిలుకుసముద్ర మని యాప్రాంతీయులు వ్యవహరింతురు. "చిలుకు" వ్యవహారవశమున నిప్పుడు చిలుక యైనది. శ్రీనాథుఁడు "చిలుకు" సముద్రమునే "క్షీరాంభోధి" యని పేర్కొన్నాఁడు. ఆప్రాంతముననే ఆంధ్రోత్కల సీమలఁ దెలుపు శిలాశాసన మున్నదఁట. అదియే వీరభద్రుఁడు నిలిపిన జయస్తంభ మనునేమో!

దొంతి, కలువపల్లి, జీడికోట, చెంచూమల కప్పకొండ, కిల్లెడ లెందు నేపేరుననున్నవో తెలియవలయును. దొంతిమన్నె యని దొంతిని మన్నెముగా వర్ణించుటంజేసి యది పర్వతప్రాంతమని యూహింపవచ్చును. గంజాంజిల్లాలో దంతయను నొక్క జమీందారీగ్రామము గలదు. దానికిసమీపమునఁ గొన్నికొండలును, గుహలును గలవు. అక్కడ నొక్క గొప్పసరస్సును, దానిసమీపమున శిలపై "కణ్వాశ్రనిర్మితం పద్మసరః" అనుశాసనాక్షరములును గలవు. అదియే గంగ, గాంగవంశపురాజుల ప్రాచీనరాజధానియగు దంతవరమని కొందఱనుచున్నారు. బహుశః మనవీరారెడ్డి జయించిన దొంతి యిదియే యైయుండునేమో? కప్పకొండయనునది "అప్పికొండయను" క్షేత్రమనియు,అనకాపల్లికి సమీపమునఁ గలదనియుఁ గొందఱు చెప్పుచున్నారు. అదియే వాస్తవమైనచో నాస్థలమున నిప్పుడు ప్రాచీనతాసూచన లేవియు లేవుకాని యాస్థలమున నేఁటేట నొకయసభ్యమైన యాత్రోత్సవముమాత్రము సాగుచున్నది. చెంచూమల యనేకరాజులవిజయములందు వినఁబడుచుండుటనుగాని

యదియెందున్నదో యెఱుఁగఁబడలేదు. కిల్లెడకూడ నల్లేకాని యిచ్ఛాపురమునకు సమీపమునఁ గల బెల్లుపడయే కిల్లెడయని కొందఱు చెప్పుచున్నారు. బెల్లుపడయందును, నాపరిసరగ్రామములందును రెడ్డికుటుంబములనేకములు గలవు. ప్రాచీనములగు మందిరాదు లేవియు లేవుగాని బెల్లుపడతోఁ గలిసియున్న యిచ్ఛాపురమునందు పాడువడినకోటయుఁ గందకమును గలవు. ఆ రెండుగ్రామములందును శిథిలములయిన మసీదులు చాలగలవు. ఈచోటులం గల తురుష్కమృతసమాధులకు లెక్కలేదు. దొరతనమువారి లెక్కలందు బెల్లుపడ యనియేకాని యిచ్ఛాపురము పేరు లేనేలేదు. పూర్వము బెల్లుపడ మహాపట్టణముగా నుండెడిదనియు, మహమ్మదీయు లత్యధికముగా నందుండెడివారనియుఁ జెప్పుదురు. సయద్ ఖానునవాబు దక్కనునవాబులకుఁ బ్రతినిధిగా నీకోటలోఁ బాలించిననవాబులలో నాఖరివాఁడనియు, నాతనితోడనే రాజ్యమువైభవము నస్తమించెననియుఁ జెప్పుచున్నారు. ఆసయ్యద్ఖానుఁడు త్రవ్వించినసరోవరమొక్కటి సుందరములగు సోపానములతోడను, సునిర్మలమై యమితారోగ్యకరమగు జలముతోడను నిప్పటికి నున్నది. ఇచ్ఛాపురపట్టణమున కెల్ల దీనియందలి మంచినీరే పానీయము. ఈచెఱువు ద్వాదశాదిత్యు లుదయించినను నెండదని పెద్దలందురు. దీనితలము గాంచినవా రెవ్వరును లేరు. ఈచెఱువు త్రవ్వించి హిందువులు నిశ్శంకముగా నందలిజల ముపయోగించుటకై యా తురుష్కప్రభుఁడు ఆఱువందలకావిళ్ల కాశిగంగ తెప్పించి యాసరస్సును దొలుదొల్త నిండించెనఁట! ఆహా! ఆ తురుష్కుని ధర్మబుద్ధి, పరమతసహనము నెంత వర్ణించినను దనివితీఱదు. ఇచ్ఛాపురమునకు సమీపమున పీర్లకొండయను నొకకొండగలదు. దానిపైని యొకగొప్ప మసీదును, దానిప్రాంతములం దసంఖ్యాకములగు గోరీలును గలవు. అవియన్నియుఁ బురాతనములే. హిందువులు లక్ష్మీకరమని యెన్ను ప్రతిలక్ష్మీవారమునందును విశేషించి మార్గశీర్ష లక్ష్మీవారములందు నాప్రాంతమునందలి జనులెల్లరు నాకొండపైనున్న మసీదున కేగి పీర్లకు మ్రొక్కులు చెల్లింతురు. ఆకొండమీఁదఁ బూర్వమొకమహమ్మదీయయోగి తపము సల్పుచుండెడివాఁడనియు, నాతని కమండలువు పవిత్రసరస్సుగాను, ఆతని దంతకాష్ఠ మొకగొప్పవృక్షముగాను బరిణమించిన దనియు చెప్పుదురు. ఇవి నమ్మవీలులేని పిట్టకథలే కాని యీ ప్రాంతమునందలి హిందువులు, నందు దెలుఁగు మాతృభాషగాఁగలవా రెల్లరును దురుష్కదైవముల నిట్లు భజించుటమాత్ర మాశ్చర్యజనకము కాకపోదు. ఇంకొక్కవింత. నాదిర్ ఖాన్ సాహేబను నొకతురుష్కధనికుఁ డొకనూయి త్రవ్వించెనఁట. ఆనూయి యిప్పుడును గలదు. అందలి నీరము మధురాతిమధురము. నూతియాకారము కుక్కుటాండాకారము. లోతు పది మూరలుమాత్రమే. నూయియున్న స్థలము కొండప్రక్కనున్న మిట్టనేల. అయినను నానూతినీటికి తరుగెన్నఁడు నుండదఁట. ఈనూయి దర్శింపఁదగినవింతలలో నొక్కటి యనకతప్పదు. ఈబెల్లుపడ యీప్రాంతముల నున్న మన్నెసంస్థానము లనేకములకు మార్గమం దున్నది. ఇక్కడ బ్రిటిషుదొరతనమువారి పటాలముకూడ గొంతకాల ముండెడిది. ౧౮౫౭ లోను ౧౮౫౮ లోను మరణించిన యిరువు రాంగ్లేయసైనికాధికారుల సమాధులీగ్రామమునఁ గలవు. ఈగ్రామముకడ సుమ్మాళి యను గ్రామ మున్నది. ఆగ్రామసమీపమున నిప్పుడు దొరతనమువారి ఉప్పుఫ్యాక్టరీ కలదు. ఇక్కడ నొక్కకోట శిథిలమైనది కనఁబడుచున్నది. అకోటబురుజు ఒకటి, మలచినరాలతోఁ గట్టినది నేఁటికిని దృఢముగా నున్నది. మిగిలిన మూఁడుబురుజులును మంటిదిబ్బలుగా నున్నవి. ఆబురుజులయు, ప్రాకారముయొక్కయు రాలు పెరికి తెచ్చి యిచ్ఛాపురముకోట కట్టిరఁట. సుమ్మాళికోటకూడ మహమ్మదీయులదేయని యిక్కడివారి నమ్మకము. మహమ్మదీయులదేయైనచో నొక్కక్రోసుదూరమననే రెండుకోట లుండుటకును, సుమ్మాళికోట భగ్నము గావించుటకును గారణములు గానరావు. బాగుగ నాలోచించిన సుమ్మాళికోట ఒడ్డెరాజులో, లేక రెడ్డిరాజులో కట్టినదేకాని తురుష్కులు నిర్మించినది కాదనియుఁ, దురుష్కులే సుమ్మాళికోటను భగ్నము గావించిరనియుఁ దేలును. ఈ బెల్లుపడకాక

ఘుంసరామన్యమున పల్లాడయను గ్రామము గలదు. అందు శిథిలమైన కోట గలదు. అది పూర్వము గొప్ప వైభవ మొందినదని యెల్లరు నంగీకరింతురు. "పల్లాడ" యే యిందలి కిల్లెడ యగునేమో?

సింహాచలము, చిల్కాసముద్రము, కళింగము నెల్లరు నెఱింగినస్థలము లగుటంజేసి వానివిషయమయి తెలుపవలసినది లేదు. గంజాంమండలము మొదలుగ రంభవఱకుఁగల సముద్రము చిలుక యాకారముగా నుండుటచే నీప్రాంతమందున్న సముద్రమున కెల్లఁ జిల్కాసముద్రమని వ్యవహార మేర్పడినది. కొందఱు రంభకడనున్న సముద్రభాగమునకే చిల్కాసముద్రవ్యవహారము గలదందురు. రంభకడనున్నదానికి చిలుకసరస్సని వ్యవహారము ప్రసిద్ధము. అక్కడ సముద్ర మున్నతతరంగములు లేక చిన్నచిన్నయలలతోడను, సముద్రమధ్యమున ఫలపుష్పశోభితము లగు తరులతాజాలములుగల క్రీడాపర్వతములతోడను విలసిల్లుచు చూపఱకమితానందము గల్పించును. శ్రీనాథకవి రంభకడనున్న చిలుకసరోవరమునే క్షీరాంభోధి యని పేర్కొన్నాఁడు. కసిమికోట విశాఖపట్టణమునకు ముప్పదిమైళ్లదూరమున నున్నది. అందిప్పుడును బ్రాహ్మణులు జమీందారులు గలరు. బ్రాహ్మణజమీందారుల కారాజ్య మెప్పుడు వశపడినదోకాని యాపట్టణ మొకప్పుడు తురకలపాలనమున నుండెడిదని పెద్దలు చెప్పుదురు. ఇపుడాయూర మహమ్మదీయులు పెక్కుకుటుంబములవా రున్నారు.

ఇంక ఝూడియ, జంతర్నాడు, బారహ, వేంకటాయి, కంచుకమల్ అనుగ్రామముల గూర్చి తెలిసికొందము. ఝూడియ ప్రకృతము ఝామపూఁడియను పేర నున్నది. కంచుకమల్ అనునది ఝామపూఁడికిని సోంపేటకును నడుమ సోంపేటరైలుస్టేషనుకడ కంచిలి యనుపేర నున్నది. మొదట నీయూరిపేరు కంచెల. దానికి సంస్కృతము కంచుకము. గ్రంథమున బహువచనము లేఖకప్రమాదాపతితము. ఝామపూఁడియుఁ గంచిలియుఁ బూర్వము రాజధానులుగా నుండి యెట్టికీర్తి నొందినవో మనము కనలేదు గాని ప్రకృతమున నాళికేరకదళీపనసాదిఫలములకు మిగుల ప్రసిద్ధికాంచినవి. సోంపేటరైలుస్టేషనునకుఁ గొంతకాలము కంచిలిస్టేషనునియే పేరుండెడిది. చీకటి ప్రస్తుతముగూడ జమీందారీస్థలముగానే యున్నది. ఈకోట బహుబలిష్ఠమైన గిరిదుర్గముగా నున్నది. జనసామాన్యమునందు చీకటికోటయనియుఁ, జీకటియనియు రెండుపేళ్లను వ్యవహారము గలదు. గ్రంథములందు జీకటియనిమాత్రము కలదు. గ్రామమునకే రెండుపేళ్లువ్యవహరించుట యింకొక్కయెడఁగూడ నాతఁడు గావించియున్నాఁడు. జంతుర్నాడు ఈప్రాంతమునసేకల "జలంత్రా" దుర్గ మనికొందఱును, విజయనగరసమీపమునఁగలదంతర్నాడే జంతుర్నాడని కొందఱును జెప్పుచున్నారు. రెండుస్థలములును బ్రాచీనవైభవముగల ప్రదేశములే. ఇందేదియైనను గావచ్చును.

పాఠకులకు తెలిసికొనవలసిన దింక నొక్క "బారహ"ను గూర్చిమాత్రమే కలదు. గంజాంమండలమునందలి బారువయే బారహ యని తెలియవచ్చుచున్నది. నేను మొదట బారహ యనుపేరు బారువ యని మాఱినదో, లేక బరహంపురముగా మాఱినదో యని సంశయించితిని. బస్తరురాజ్యమందు బారహకోట యనుపేర నొకయూరు కలదనియుఁ గొందఱు చెప్పిరి. కాని ముందుఁ జెప్పఁబోవు కారణములవలన బారువయే బారహగా నిశ్చయించితిని. బారువ గ్రామము సముద్రతీరమున నున్నది. సముద్రమునకు నూరికి నఱమైలుకంటె నధికదూరముండదు. అక్కడ నోడరేవు కలదు. బర్మా మొదలగు దేశములకు జనుల రాకపోకలును, వర్తకవ్యాపారములు నారేవున విరివిగా సాగుచుండును. మహేంద్రగిరిపైని జనించిన మహేంద్రతనయ యను నది యీగ్రామమున సాగరసంగ మొందుచున్నది. ఈగ్రామమున నిప్పుడు యూనియను పంచాయతీ కలదు. ఈగ్రామవిషయమున చిత్రవిచిత్రములగు పురావృత్తముల నక్కడివారు చెప్పుచుందురు.

పాండవు లరణ్యవాససమయమున మహేంద్రగిరిపైని గొంతకాలము వసించిరనియు, నాసమయమున

నొకనాఁడు వారు వన్యమృగభ్రాంతిచే నొక కపిలగోవును సంహరించి రనియు, యథార్థము, తెలిసికొని పశ్చాత్తాపపడి పాపహరణమునకై యక్కడ యజ్ఞము గావించి బ్రాహ్మణుల కనేకసువర్ణదక్షిణ లర్పించిరనియు, మఱియుఁగోటీశ్వరుఁడను శివలింగమును, జనార్దనుఁడను విష్ణువును బ్రతిష్ఠించిరనియుఁ జెప్పుచున్నారు. కపిలగడ్డ యనుపేరఁ గొంతభూమియును, యజ్ఞంబట్టి యనుపేరఁ గొంతభూమియును నక్కడ నిప్పటికిని వ్యవహరింపంబడుచున్నది జనార్దనకోటీశ్వరాలయము లిప్పుడు నున్నవి. ఆలయములు ప్రాచీనము లనుటకు సందేహము లేదు. కోటీశ్వరాలయమున నొకజైనవిగ్రహము కొంత శిథిలమైనది కలదు. కోటీశ్వరాలయమునఁ గోటిలింగము లున్నవఁట. లింగములు కందిగింజలంతేసి యసంఖ్యముగా నున్నవి. అన్నియుఁ జలనము లేకుండ జాతినంటుకొని యున్నవి. ఇచ్ఛాపురప్రాంతమునందు బౌద్ధవిగ్రహము లక్కడక్కడ నగపడుచున్నవి. జనార్దనాలయముపైని వరాహనారసింహ వామనావతారములం దెల్పువిగ్రహములు మూఁడు కలవు. జగన్నాథాలయకుడ్యములందును మూఁడు ప్రక్కల నా మూఁడవతారములు నున్నవి కాని యవి యంతప్రాచీనమైనవిగా నగపడలేదు. జనార్దనాలయమందు అష్టబాహువులు, సింహవాహనము గల మహిషాసురమర్దనీవిగ్రహ మొకటి కలదు. అదియు నంత ప్రాచీనముగాఁ దోఁపలేదు జగన్నాథాలయ మొకటి గొప్పది కలదు. అందు శిథిలములైన చిత్రశిలాశకలము లనేకములు పడియున్నవి. ఆలయము నవీనముగా బాగుచేయింపఁబడినది. గుడిపై నెల్లెడల చిత్రితములగు విగ్రహము లున్నవికాని యన్నియు నసభ్యములే. కవచమును ధరించిన మహారాష్ట్రయోధుఁడును, కిరస్తానిదొరసానివేషముగల యొకస్త్రీయును మాటాడుచున్నట్లు చిత్రింపఁబడియున్నది. పునర్నిర్మాణము జరిగినదికాని యీయాలయము బురాతనమైనదే యని తోఁచుచున్నది. ఇంకొక్కచిత్రము. ఈయూరుకడ మహేంద్రతనయాసాగరసంగమస్థలమును బవిత్రముగా గణించి యాప్రాంతజనులు మృతినొందినవారియస్థికల నిక్కడఁ గలుపుదురు. ఆయస్థికలు కొంతకాలమునకు సగముమేర శిలలుగా పరిణమించునఁట. సగముటాఁయి, సగముశల్యముగా నున్నయొకవస్తువును నేనును జూచితిని. చాల ఆశ్చర్యముగానే యున్నది. ఈయూరికి భారహరశాసనమని పూర్వనామము కలదు. పాండవులపాపభారమును హరించుటచే నీపేరు వచ్చినదందురు. శాసనమనఁగా గ్రామమని యీప్రాంతములసంజ్ఞ. ఈయూరి ప్రక్కనే తురకశాసనమను చిన్నపల్లె కలదు. అది తురకలరాజ్యమున నిర్మింపఁబడుటచే నాపేరు వచ్చినది. భారహరశాసనమే కాలక్రమమున రేఫలోపమున భారహమై, రెడ్డిరాజులనాఁటికి బారహాయై, యిపుడుబారువయై యున్నది. రెడ్డిరాజులకాలమునాఁడే దీనికి వెంకటాయి యనునామాంతరముగూడ నుండెడిది. ఇపుడును దొరతనమువారి లెక్కలలో వెంకట్రాయపురమనియే కలదు. పూర్వముగూడ వెంకట్రాయపురమనియే యుండి యుండఁగా శ్రీనాథుఁడు గ్రామ్యజనవ్యవహారమం దున్న రీతినే వెంకటాయియని పేర్కొన్నాఁడు. ఇట్టిప్రయోగము లాతనిగ్రంథములో మఱికొన్ని కలవు. కాశీఖండమున శృంగారంకోట "ఇరువైనాలుగుమూళ్ల మేర" యని ప్రయోగించినాఁడు. ఇరురేఫకు ఉకారము లేకుండ నిపుడు సామాన్యముగా వ్యవహారమందున్న "ఇరవై" యనియే కవి ప్రయోగించియుండును. సంస్కర్తలు "ఇరు" అని దిద్ది దానిని సాధువు చేయఁజూచిరి. "వై, మూళ్ల మేర" పదము లెప్పుడును వ్యావహారికములే కాని లాక్షణికములు గావు. వ్యావహారికభాషామాధుర్యలుబ్ధుఁడగు కవి వాని నట్లే ప్రయోగించినాఁడని తెలియనగును. బారహాయన్నను, వేంకటాయియన్నను బారువయేకాని వేఱుస్థలము గాదు. ఈయూరఁగూడ వర్షాకాలమున వీథులందు బంగారువంగపరకలు, వెండిపరకలు లభించుచుండును. రెడ్డిరాజులు పాలనము చేసినస్థలము లనేకములం దిట్టివి లభించుచుండును. ఈనాణెములు రెడ్డిరాజులవో, యింకనంతకు మునుపటిరాజులవో నాకుఁ దెలియరాలేదు. వంగపరక వంగగింజపరిమాణము గలిగి పలుచనిరేకును, చుట్టు నంచు నుండును. మధ్య నొకపెద్ద చుక్కయును,

రెండవవాఁడు చిన్నచుక్కలు నుండును. ఒకప్రక్క నేమియు నుండదు. నందెపరకపై నొకప్రక్క నేవో చిన్నయక్షరములును, రెండవప్రక్క నందివిగ్రహము నుండును.

వ్యాసము ముగించుటయందు ముఖ్యమైనవి రెండుసంగతులు చెప్పవలసియున్నది. భీమఖండ రచనము నాఁటికి రెడ్లరాజ్యము సింహాద్రిపర్యంతమే వ్యాప్తమైన దని కీ. శే. వీరేశలింగముపంతులుగా రూహించి యున్నారు. కవి "సింహాద్రిపర్యంతసీమావని" యని సామాన్యముగాఁ జెప్పినను నా పద్యమందే "ధారాసుర త్రాణరక్షాడియ, సప్తమాడియ" పదము లుండుటచే నించుమించుగ పూర్ణముగనో, అసంపూర్ణముగనో వారి పాలనము ప్రస్తుత బరంపురమువఱకు వ్యాపించి యున్న దని తలంచుట సాహసము కాదేమోయని నా యూహ. ఆంధ్రకవులచరిత్రమునందు శ్రీనాథుని గూర్చి వ్రాయుచు వీరభద్రారెడ్డికి భార్య యగునని తల్లివలన రాజ్యప్రాప్తి యైనమాట చెప్పలేదని యాతని కొకదోషమారోపింపఁబడినది. ఆదోషారోపణము ప్రామాదికమనియుఁ గవి యావిషయమును జక్కఁగా వర్ణించియేయున్నాఁడనియు నాతలంపు. కాశీఖండము నందలి పద్యమును జిత్తగింపుఁడు :

మ. మనుతుల్యుండనుకాటభూవిభుని వే
　　　మక్ష్మాతలాధీశునం
　దనఁ బాణిగ్రహణంబు చేసెఁ బ్రియమెం
　　　దన్వీరభద్రేశ్వరుం
　డనితల్లి న్వనితామతల్లి నుదయా
　　　స్తాద్రీంద్రసీమావనీ
　ఘనసామ్రాజ్యసమర్థసుప్రథిమ సా
　　　క్షాదిందిరాదేవతన్.

ఇందలి "ఉదయాస్తాద్రీంద్రసీమావనీ ఘనసామ్రాజ్య సమర్థసుప్రథిమ సాక్షాదిందిరాదేవతన్" అను విశేషణము అనితల్లిసామ్రాజ్యాధిపురాలని నిరాఘాటముగాఁ జెప్పుచున్నదే! నాయకుని రాజుగా వర్ణించు టుచిత మగాని యొకరికిఁ బ్రతినిధిగా వర్ణించు టుచితము గాదు గదా! కావుననే వీరభద్రుఁడు, నాతనిసోదరులును భూములనెల్ల జయించిరని వర్ణించి వీరభద్రారెడ్డి రాజ్యాధీశ్వరుఁడని వర్ణించియున్నాఁడు. అయినను అనితల్లిదే రాజ్యము గావున నామె నట్లే వర్ణించి యున్నాఁడు. కావున నిందు శ్రీనాథుఁడు చెప్పక విడిచిన రహస్య మేమియు లేదనియు, నాతఁడు రాజమహేంద్రవరరెడ్లకు రాజ్య మేరీతివచ్చినదియు, వారు దాని నేరీతి నెంతవఱ కభివృద్ధి నొందించినదియు నుచిత రీతిని జక్కఁగా నాస్తవమును గరతలామలకముగా వర్ణించినాఁడనియే నమ్మవచ్చును.

కొండ అనుకొనుచున్న రీతిని వీరభద్రదేవునివిజయమును బోతనకవి యెట్లువర్ణించినాఁడో శ్రీనాథకవి వీరభద్రరెడ్డివిజయముల నట్లు విస్పష్టముగ వర్ణించి యున్నాఁడు. విశతములగురాజ్యము లాయాప్రాంతముల నున్నవని తెలుపుట వేలోకమహాపురాణఖండము రచింప నున్నకవి కవసరము కాదు. ఆంధ్రరాజులవిజయములను స్పష్టముగఁ దెలిసికొనుట కాంధ్రుల కుత్సాహముండుట సహజము. నాకుఁ దెలిసినరీతి నాయాస్థలములచరిత్రమును వివరించితిని.

―――――

# హిట్లరు

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.,

కూటికిలేని నిరుపేదగ నుండిన హెర్ ఆడాల్ఫు హిట్లరు జర్మనుసామ్రాజ్యమును అవిచ్ఛిన్నముగ ఏలుచున్నాడు. అట్టి అపూర్వవ్యక్తిచరిత్రమును తెలిసికొనుట అవశ్యకర్తవ్యము.




హెర్ ఆడాల్ఫు హిట్లరు

వెర్సెయిల్సుఒడంబడిక కుదిరినపిదప రెండు మూడుసంవత్సరములపాటు జర్మనీలో హిట్లరు పేరే విన్పించలేదు. ఆతడొక అనామకరువుగనుండెను. జర్మనీవెలుపల కూడ ఆతనినిగూర్చి ఎవరికిని తెలియదు. ౧౯౨౦-వ సంవత్సరమున హిట్లరు ఒకనాటిసాయంకాలము నూతనముగ ఏర్పడిన జాతీయసోషలిస్టుపనివాండ్రరాజకీయ పక్షసభలో మెరుపుతీగవలె ప్రవేశించెను. ఈపక్షమువారి యభిప్రాయములు, తన యభిప్రాయములు ఒకటిగనే ఆతనికి తోచెను. ఆపక్షముతో చేరుటకు ఆతడు నిశ్చయించుకొనెను.

జర్మనీలో దినదినాభివృద్ధి గాంచుచున్న జర్మను ఫ్యాసిజముఉద్యమమునకు ౧౯౨౧ లో హిట్లరు అధ్యక్షుడుగ నియమింపబడెను. ౧౯౨౩ లో హిట్లరు లూడెన్‌డార్ఫుతో చేరి మ్యూనిచిపై దండెత్తెను. కాని ఆతడు వ్యర్థప్రయత్నుడాయెను. అయినప్పటికిని, హిట్లరు అంతర్జాతీయవ్యక్తి ఆయెను. కాని ఇంతటితో హిట్లరునక్షత్రము రాజకీయగగనమున అస్తమించిన దనుకొనిరి. ఈదండయాత్రసందర్భమున హిట్లరు అయిదు సంవత్సరముల శిక్షకు పాల్పడెను. కాని యతడు శిక్షాకాలమును పూర్తిగ అనుభవించలేదు. కొద్దిమాసములు మాత్రమే ఒకదుర్గమున నిర్బంధవాసమును సల్పెను. లూడెన్‌డార్ఫుసేనానిని శిక్షించుటకు ప్రభుత్వమునకు మనసొప్పక ఆతనిని విడిచిపెట్టిరి.

నేడు ఆతడు జర్మనీఅంతను ఏకచ్ఛత్రాధిపత్యముగ ఏలుచున్నాడు.

మొన్న ఏప్రిలుతో హిట్లరుకు ౪౪ సంవత్సరములు నిండెను ఇతడు జన్మచే ఆస్ట్రియాదేశీయుడు. ఇన్నునదిమీద నున్న బ్రానాఅను చిన్న పట్నము ఆతని జన్మస్థానము. ఇయ్యది బవేరియాసరిహద్దుకు అతిసమీపముగ నున్నది. హిట్లరుతండ్రి సుంకములఉద్యోగి. ఇతడు బవేరియాకుటుంబములోనివాడు.

౧౫-వ సంవత్సరము వచ్చుసరికి హిట్లరు తలిదండ్రులను గోల్పోయెను. హిట్లరును ఆతని తండ్రి ఉన్నతపాఠశాలలో చేర్చెను. సివిలుసర్వీసుఉద్యోగము చేయించవలెనని తండ్రిసంకల్పము. కాని ఈయభీష్టము నెరవేరలేదు. జర్మనీయుద్ధము ప్రారంభమగువరకు, అనగా ౧౯౧౪-వ సంవత్సరమువరకు హిట్లరు మ్యూనిచి, వియన్నాపట్నములలో దారిద్ర్యమున మునిగితేలుచుండెను. కొంతకాలము గృహములయందు చిత్తరువులను వ్రాయుచుండెను. కొన్నాళ్లు కార్మికుడుగ పని చేసెను. పని విస్తారముగ దొరికినపుడు ఇంజినీరు వేయు ప్లానులను వేయుచుండెను.

౧౯౧౪ ఆగస్టునెలసము వచ్చుసరికి హిట్లరు మ్యూనిచిలో ప్రవేశించెను. ఆస్ట్రియా సైన్యములో చేరుట కితడు ఇష్టపడలేదు. తా నెపుడును జర్మనువ్యక్తి ననే భావించెను. ఫ్లాండర్సురణరంగమునకు బయలు దేరెను.

నాలుగుసంవత్సరములపాటు యుద్ధములో పని చేసినను 'కార్పోరలు' హోదాకంటె ఎక్కువపదవి ఆతనికి లభించలేదు. కాని ఆతడు సైన్యములో చేసినపనిని అధికారు లందరును మెచ్చుకొనిరి. సోమీనదిదగ్గర జరిగిన యుద్ధమున ఆతనికి తీవ్రమగు గాయములు తగి లెను. ఆతరువాత ఈజరునదిదగ్గర జరిగిన పోరాట మున విషవాయువు తగులుటచే ఆరణరంగమునుండి వెనుకకు పంపబడెను. ఇతడు మొదటితరగతిఐరన్ క్రాస్ పతకమును సగౌరవముగ బడసెను. జర్మనురిప బ్లిక్ప్రెసిడెంటుతరువాత పెద్దహోదా హిట్లరుదే. తాను కూడ రిపబ్లికుఅధ్యక్షపదవిని కోరుచున్నానని బహి రంగముగ అతడు ప్రకటించెను. హిండెన్ బర్గుతో పోటీ చేసెను. ఇతనికి ౧౩,౪౧౮ ఓట్లు వచ్చెను. హిండిం బర్గునకు ౧౯,౦౦౦,౦౦౦ ఓట్లు వచ్చెను.

హిట్లరు రాజకీయధురంధరుడా, లేక ఉత్తవక్త యేనా యనుశంక పలువురను బాధించుచున్నది. కొందరు ఇతడు రాజకీయవేత్త గాడనుచున్నారు. కొందరు గొప్ప యుక్తిపరు డనుచున్నారు. జర్మనీలోయువకు లందరును, అనగా ఈనాటిజర్మనులందరును హిట్లరుగారిని దైవము అపరావతారముగ చూచుచున్నారు. ప్రపంచమున ఈపాటివక్త లేడనే అందరి యభిప్రాయము. ఆతడు వేల కొలదిగల సభలలో ఉపన్యసించుచుండ సింహగర్జనమును పోలియుండును.

వెర్సెయిల్సుఒడంబడికయన్న హిట్లరునకు కడు పుమంట. దానిని కాలిక్రింద వేసి త్రొక్కవలెనని ఆతని తలంపు. నష్టపరిహారముల విధానమన్న (ఎంగుప్లాన్) అతడు దండతాడితభుజంగమువలె లేచును. యూదులను దూరుటలో వెనుదీయడు. తాను అధికారమును బడయుట తటస్థించుచో రక్తపాత మేర్పడునని ప్రకటించుటకు జంకలేదు. లీపుజిగులో తన పక్షమునకు చెందిన ముగ్గురు నాజీఉద్యోగులపై మోపిన నేరమును విచా రించుసందర్భమున హిట్లరును సాక్షిగ విచారించిరి. తన యుద్యమము విజయముగాంచునపుడు, ౧౯౧౮ లో కైజరును పదచ్యుతుని చేసి రిపబ్లిక్ప్రభుత్వమును స్థాపించిన ద్రోహులు తను చర్యలకు ప్రాయశ్చిత్తమును అనుభవించెదరని నదురు బెదురు లేకుండ న్యాయ మూర్తుల సమక్షమున పలికెను.

“ఇసుకలో తలలు పొరలాడును-మాతలలైన గావచ్చును, ఇతరులలైన కావచ్చును” అని న్యాయ స్థానమున అందరును అచ్చెరువొందునట్లుల పలికెను. అసంతృప్తి అంతయు హిట్లరునందు మూర్తీభవించినది. జర్మనుల అసంతృప్తి కంతయు హిట్లరే ప్రతినిధి యన వచ్చును. ప్రస్తుతపరిస్థితులలో అసంతృప్తి చెందు జర్మనులు కమ్యూనిజము అన్నను, సోషలిజము అన్నను గజగజవడంకెదరు. ఈ రెం డును వారి కెంతమాత్రము కిట్టనే కిట్టవు. వీరంద రును హిట్లరుపక్షము చేరిరి. జర్మనీనంతను భూలోక స్వర్గముగ మార్చెదనని హిట్లరు వీరందరకును అభయ మిడెను. యుద్ధము చూచుటకు అవకాశములేని యువ కులకు నాజీదుస్తులు, సైనికులఏర్పాటులు, 'స్టారం' సైన్యముల యుద్ధప్రయత్నములు ఎంతయు ఆకర్ష ణీయములుగ నుండెను. రాజుపరిపాలనమును కోరువా రందరును నూతనహోయిన్ జోలరన్ సింహాసనమును మరల హిట్లరొక్కడే స్థాపింపగలడని విశ్వసించు చున్నారు.

రాకొమరులు అందరును బ్రవునుషర్టులను (నాజీదుస్తులు) ఆతురతతో ధరించిరి. జర్మనుయువ కులు లక్షలకొలది హిట్లరును జర్మనుజాతి నుద్ధరించుట కవతరించిన ముస్సోలినీ యనుచున్నారు.

కాని కొందరు హిట్లరునకు పెక్కుమంది మిత్రులు లేరని తలంచుచున్నారు. తనతో తిరుగు మిత్రులతోకూడ ఆతడు మెడసరముగ నుండునట.

దీర్ఘాలోచనాపరతంత్రునివలె ప్రవర్తించునట. తన ఉద్యోగులతో కూడ ఇతడు నిరంకుశముగ ప్రవర్తించునట.

హిట్లరు మధ్యమతరగతిలో తక్కువస్థితిపరుల లోనివాడగుటచే ఇతనికి వారియందే ఎక్కువ యభిమానము. పెద్దవర్తకసంఘములను అంతరింపజేసి ఈతరగతివ్యక్తులు చిన్నదుకాణదారులుగ పొట్టపోసికొనుటకు ఏర్పాటుచేయవలెనని తెలియజేసెను. బెర్లినులో యూదుల పెద్దదుకాణములన్నిటిని మూసివేసెదనని హిట్లరు బెదిరించెను. యూదులు జర్మను పౌరసత్వములను బడయుటకు హక్కులేదనెను.

మ్యూనిచితిరుగుబాటులో శిక్షింపబడి వదలబడినను ఆతనికి నిర్బంధములు పూర్తిగ తప్పలేదు. బవేరియాలో ఇతడు రాజకీయోపన్యాసముల నీయరాదని ఉత్తరువుచేయబడెను. ౧౯౨౭ మే మాసమువరకు ఈఉత్తరువును తొలగించలేదు. అప్పటినుండియు దొరికిన ప్రతియవకాశమును హిట్లరు చక్కగ ఉపయోగించుకొనెను.

## నాజీయుద్యమము

కడచిన అయిదుసంవత్సరములలో ఈయుద్యమము అత్యద్భుతముగ ఏర్పడెను. ప్రారంభమున ఈ యుద్యమము అతిస్వల్పముగ కన్పించెనుకాని రాను రాను ఇంతింతై నభోవీథిని ముట్టినది. యూరపుఅంతయు ఈయుద్యమమునకు భయపడుచున్నది. ౧౯౨౮ వరకు హిట్లరునకు రిచిస్టాగులో నాజీసభ్యులు ౧౨ గురు కంటె ఎక్కువమంది లేరు. అపుడు హిట్లరును, ఆతని 'బ్రవునుషర్టు' పక్షమువారిని ఎవరును లక్ష్యముచేయలేదు. వీ రింతపలుకుబడిని గడించెదరని కలలోనైన తలచియెరుగరు. ౧౨మాసములు గడచెను. కొంతమార్పు ఏర్పడెను. నాజీపక్షమునకు కుడిభుజముగ హ్యూగెను బర్గు బయలుదేరెను. సర్వవిధముల ఇతడీపక్షమును పెంచి పోషించెను. ఇతడు గొప్ప నిర్మాణకార్యక్రమ నిపుణుడు. ఇతడు పూనుకొన్నదాదిగ నాజీయుద్యమము విశ్వరూపమును దాల్చెను. ౧౯౩౦-వ సంవత్సరము వచ్చుసరికి రిచిస్టాగుపార్లమెంటులో హిట్లరుపక్షమువారు ౧౦౭ గురు ప్రవేశించిరి. దీనితో ప్రపంచమంతయు అచ్చెరువొందెను.

ఇంతకంటె ఆశ్చర్యకరమగు విషయము ఇంకొకటి కలదు. కడచిన జూలై ఎన్నికలలో రిచిస్టాగులో వీరి సంఖ్య రెండింతలుగ పెరిగెను. జర్మనీలోనున్న రాజకీయపక్షములలో నాజీపక్షమే గొప్పదిగ నిలబడెను. కాని కడచిన నవంబరు ఎన్నికలలో నాజీలు ౩౫ స్థానములను గోల్పోయిరి. కాని వీరిబలము చెడలేదు.

మొన్న మార్చి ౫-వ తేదిని జరిగిన ఎన్నికలలో నాజీలకు అఖండవిజయము చేకూరెను. స్వతంత్రముగ ఇతరులపై ఆధారపడు నవసరము లేకుండగనే రిచిస్టాగుపార్లమెంటులో కార్యభారమును నిర్వహింపగల బలమును గడించిరి. ౨౮౮ స్థానములు వీరికి లభించెను. ఉద్యోగములన్నియు నాజీలవే. అధికారమంతయు నాజీలదే. నాజీలు పెట్టినదే భిక్ష. నాజీ యుద్యమచరిత్ర మిట్టిది. మొదట ౭ గురితో ప్రారంభమైన హిట్లరుఉద్యమము నేడు విశ్వరూపమును దాల్చినది. నాజీపక్షమునకు మొదటిపేరు స్వతంత్రజాతీయ సోషలిస్టుకార్మికపక్షము. బ్రవునుషర్టులే నాజీల దుస్తులు. తనకు ప్రధానామాత్యపదవిని ఇచ్చిననే స్వీకరించెదనని తెలుపుటకు హిట్లరు వెనుదీయలేదు. జర్మనీలో ఈపదవికే ఛాన్సిలరు అనిపేరు. మొన్నటివరకు హిండెంబర్గుగారు హిట్లరుకోరికను నిరాకరించెను. మార్చి ఎన్నికల ఫలితముగ హిట్లరుకీపదవిని ఇవ్వక తీరినదికాదు. పార్లమెంటుప్రభుత్వము నేర్పాటుచేయుటకు వాన్‌ష్లీషరు, వాన్‌ప్యాపెనుగార్లు విఫలప్రయత్నులగుటచే హిట్లరునకు మంచిఅవకాశ మేర్పడెను. గతమాసము మాగ్డీబర్గులో ౮౦౦౦ నాజీఉద్యోగుల సమక్షమున ఉపన్యసించుచు తమకు ప్రభుత్వాధికారము నిచ్చిననే గాని ఎట్టి ఉద్యోగములను నాజీలు స్వీకరించువారు కారని నిర్భీతిగ హిట్లరు పలికెను. మన యుద్యమమునకు సంపూర్ణవిజయము చేకూరువరకు నిద్రించువాడను కానని నెను. నేడు జర్మనీలో హిట్లరునదే ప్రతిభ. ఇతడే సర్వస్వతంత్రుడు.

నేడు హిట్లరు గంగిగోవుగ మారిపోయెను. ఆరుమాసముల క్రిందటనున్న అహంభావము, అదిరిపాటు అదృశ్యము లాయెను. నేడుకూడ హిట్లరు ఛాన్సిలరుగ నున్నను హిండింబర్గు ఈనాజీపక్షనాయకుని చర్యను వేయికన్నులతో కనిపెట్టిచూచుటయేకాక వాన్‌ప్యాపెన్‌ను ఆతని ప్రవర్తనమును కనిపెట్టుటకు తనప్రక్కనే ఉంచుకొనెను.

హిట్లరు రణరంగమునుండి జర్మనీకి మరలినపుడు దేశమంతయు యుద్ధము, విప్లవములతో పీల్చి పిప్పి చేయబడియుండెను. ఎక్కడచూచినను అల్లకల్లోలమే. బోలిషివిజము అతిరయమున విజృంభించుచుండెను. దీనిని ప్రతిహతమొనర్చుటకు హిట్లరు బద్ధకంకణుడాయెను.

౧౯౨౧ జూలైలో కొద్దిపాటి అనుచరులతో నేషనలుసోషలిస్టుపక్షము నేర్పరచెను. దీనినే నాజీ పక్షము అని పిలిచెదరు. నాజీపక్షపూర్వవృత్తాంత మిదియే. ౭ గురితో ఈపక్షమును స్థాపించెను. చేత ౭ షిల్లింగులుతప్ప వేరు లేదు.

మిత్రమండలి గొంతెమ్మకోర్కెలు జర్మనుప్రజలు మండిపడునటుల చేయుచుండెను. దేశములో ఎక్కడ చూచినను అధికారధిక్కారమే. శ్రీమంతులు పరిభవముచే కుందుచున్నారు. యూదులపేరన్న జర్మనులకు బొత్తుగ కిట్టుటయే లేదు. ఈపరిస్థితు లన్నియు నిప్పులను గ్రక్కుచున్న హిట్లరునకు దోహదములుగ నుండెను. సంవేదనపరులగు యువకులు, దేశభక్తులు సమరోత్సాహముతో ఆయనచుట్టును మూగిరి. అతిశీఘ్రముగనే ఆతనికి చాలమంది అనుచరులు ఏర్పడిరి. వీరందరును సత్కులసంజాతులే. ప్రపంచములో నేడు హిట్లరును మించిన వక్త లేడు. ఆతని గంభీరోపన్యాసములను వినుటకు వేనవేలుగ ప్రజలు పెనగులాడుచు గుంపులుగ చేరెడివారు. ఆతని యుపన్యాసములకు టిక్కట్లు ఏర్పాటు చేయబడెను. దానివలన ఎంతయో సొమ్ము లభించెను. ఆసొమ్మనే నాజీపక్షమునకు ఆతడు వినియోగించెను. జర్మనుయుద్ధముచే తటస్థించిన అధోగతిని తొలగించుటకు ప్రతినపూనెను.

౧౯౨౮-౧౯౩౨ సంవత్సరములమధ్యనే హిట్లరు ఉద్యమము విశ్వరూపమును దాల్చెను.

ఇటలీలోవలెనే పారిశ్రామికులు ఈ నాజీ యుద్యమమును తమ పరిశ్రమలను పెంపొందజేసికొనుటకు ఎంతయు కృషిసల్పిరి.

పారిశ్రామికుల ఘనసహాయముతో నాజీపక్షనాయకుడు పెక్కుసంస్థల నేర్పరచి కమ్యూనిష్టులపైనను యూదులపైనను నిర్దాక్షిణ్యముగ దాడివెడలెను. స్వస్తిక పతకములు, నాజీదుస్తులే ఎచట చూచినను. ప్రతిచోటున హిట్లరునకు సలాములే.

౧౯౩౦ ఎన్నికలలో విజయముగాంచినను హిండింబర్గు హిట్లరును ఛాన్సిలరుగ చేయ నిరాకరించెనని హిట్లరు మండిపడెను. తన పగను సాధించుటకోయన్నటుల రెండుసారులు ప్రభుత్వమును ఓడించెను. కాని తుదకు ఆతడు సాధువర్తనమునకు దిగెను. పూర్వపు దుందుడుకుతనము పోయెను.

హిట్లరుఅభ్యుదయమునకు యూరపు అంతయు అచ్చెరువొందుచున్నది. జర్మనీకి డిక్టేటరుగ నుండవలెనని యే ఆతని ప్రధానాశయము. ౧౨ సంవత్సరములక్రిందట హిట్లరు ఎవరో ఎవరికిని తెలియదు. ౧౯౧౪ లో తటస్థించిన జర్మనుయుద్ధమునకుముందు ఆతడు వియన్నావీధులవెంట 'అన్నమోరామచంద్రా' యని అల్లాడుచుండెను. నేడన్నో ఆతడు జర్మనీఅంతను హస్తంగతము చేసికొనుటయేగాక యూరపునంతను గజగజలాడించుచున్నాడు. ఫ్రాంసు అపుడే హాహారావములు సల్పుచున్నది. పోలండు కలవరపడుచున్నది. జర్మనులు అందరును తమకు మరల హిట్లరు ముక్తిని కలుగజేసెనని అపుడే సంతసించుచున్నారు.

హిట్లరుకు తల్లియందు ప్రేమయధికము. హిట్లరు తల్లి ఉపవాసములు సల్పి తననోరును కట్టుకొని పిల్లలను పోషించుచుండెను.

హిట్లరు రోమనుక్యాథలికుమతస్థుడు. అతనికి మతమన ఎక్కువ ఆసక్తి. ఇందుకు ఆతనితల్లియే

కారణము. హిట్లరు కళారాధకుడు. అతని గదిలో గోడలన్నియు చిత్తరువులతో అలంకరింపబడును.

ఆతడు ఎన్నడును పొగాకు నెరుగడు; చుట్టను కాల్చిన పాపమున పోలేదు; మద్యపానవైరి; సాత్వికాహారమునే భుజించువాడు. శాకాహారభక్షకుడేయని చెప్పనగును. సాధారణముగ ఫలరసముతోనే పొట్టను నిండించుకొనును. ప్రాణము నిలుచుట కెంత ఆహారము కావలెనో అంత తిండినే తినును. అతని దుస్తులు వీలైనంత వరకు నిరాడంబరముగ నుండును.

హిట్లరు సదా బ్రహ్మచారి. కాని స్త్రీలసమస్యల యందు ఆతనికి ఆసక్తి మెండు.

తీరికసమయమున ఆతడు గ్రంథపఠనమును గావించును. థామస్ కార్లయిలు గ్రంథములన్న ఆయనకు ప్రీతి మెండు. జర్మనువేదాంతగ్రంథములు కూడ ఆతనికి ఇష్టము. పనులన్నియు రెప్పపాటున జరిగిపోవలెననును. యంత్రములన్న ఆతనికి ఎంతయో ప్రీతి. యంత్ర మేదైన చెడిపోవునో చీకాకుపడక చెడిపోయిన యంత్రములను,మరలను తానే ఉత్సాహముతో చక్కబరుచుటకు పూనుకొనును. తాను 'మెకానికు' అయిన బాగుండెడిదని యనుకొనును. సంగీతమన్న ఆతడు చెవికోసికొనును. అతడు గానకళాకోవిదుడు. వియన్నాలో తిండిలేక తిరుగురోజులలో నాటకరంగమున కడపటితరగతియందు కూర్చుండి సంగీతమును గ్రోలుచు క్షుద్బాధను బాపుకొనుచుండెడివాడు. తీరికరోజులలో కొండలపైకెక్కి ప్రకృతిసౌందర్యమును చూచుచు ఆనందించును. హిట్లరునకు ఆడంబరము మెండు. స్వోత్కర్షపరుడు. హిట్లరు పత్రికలన్నిటిని తానే నిర్వహించు తలంపుగలవాడు. జర్మనీయభివృద్ధినిగూర్చి తన తలంపులను వెల్లడిచేయుట ఆతని కిష్టములేదు. వెల్లడియగునో తన సంకల్పమునకు భంగ మేర్పడునని తలంచును.

ప్రజాహితైకకార్యములందు హిట్లరు వ్యక్తులతో మొగమాటములేక పోరాడును. కాని వ్యక్తిపరముగ ప్రజలను మిత్రులుగ ఆదరించును.

హిట్లరు సుందరాకారుడు. నిగనిగలాడు నల్లని శిరోజములు, మిలమిలలాడెడి ఆపాదునుపాటి మీసములు చూపరులకు అందముగ కన్పించునట. కాని ఆతని ముక్కుమాత్రము కొంచెము వికారముగ నుండును. అతిధైర్యశాలి. కాని మిత్రులపట్ల ఆతడు అత్యంత విశ్వాసముతో ప్రవర్తించును. మిత్రులసంఖ్య స్వల్పము. ఆత్మవిశ్వాసమే హిట్లరువిజయమునకు కారణము.

కైజరు నిష్క్రమించినదాదిగ జర్మనులు సోషలిస్టుప్రభుత్వముతో విసిగిపోయిరి. నష్టపరిహారములు జర్మనీని పీల్చి పిప్పిచేసెను. వెర్సైయిల్సు ఒడంబడిక కుదిరినవెనుక పెక్కుసంవత్సరములవరకు ఫ్రాంసు జర్మనీని న్యూనతగ జూచుచు అంటరానివాని నాదరించినరీతి మెలగుచుండెను. యూరపులో తన ప్రాబల్యమునే స్థాపించుకొనుటకు, జర్మనీని అణగద్రొక్కుటకు సంకల్పించుకొనెను. ప్రాతపగలను తీర్చుకొన నుద్యుక్తు లాయెను. ఇట్టి పరిస్థితులందు నేడు ఈఅకుంఠిత విక్రమశాలి పతితులైన జర్మనుల నుద్ధరించి శత్రుశేషమును నిష్కంటకముగా చేయబూనుకొనుటచే జర్మనులు ఆతని నాయకత్వమును స్వీకరించిరి. ప్రజలకు అతడు అభయమిడెను.

ముసోలినీ స్టాలినులవలె జర్మనీని నిరంకుశముగ హిట్లరు పాలింపదలంచెను. కమ్యూనిస్టులను, సోషలిస్టులను హతమార్చును. ఫ్రాంసు ఇంగ్లండుమాటల పెడచెవిని పెట్టును. స్వతంత్రముగ వ్యవహరించును. వారు మర్యాదగ ప్రవర్తించిన తాను గూడ మర్యాదగనే ప్రవర్తించును. ఆయుధవిసర్జనసభ వారు జర్మనీకి సమానసైనికత్వమును నిరాకరించిరేని, జర్మనులందరిని ఆయుధపాణులుగ జేయును. హోయింజోలెరను సైనికసంప్రదాయములను ప్రవేశపెట్టును. జర్మనీమితవ్యయసమస్యను పరిష్కరించుటకు పూనుకొనును. పోయిన ఎగుమతివర్తకమును మరల రాబట్టుటకు ప్రయత్నించును. వెర్సైయిల్సు ఒడంబడికను ముక్కముక్కలుగ చింపిపారవేయును.

జర్మను రైతుల దారిద్ర్యమును బాపుటకును, పని లేనివారికి జీవనోపాధిని కలుగజేయుటకును హిట్లరు నాలుగుసంవత్సరముల విధానములను రెంటిని సంకల్పించెను. సంఘసంస్కరణములు, పరిపాలకసంస్కరణములనుగూడ ఇతడు తలపెట్టెను. నిర్బంధకార్మికవృత్తిని ప్రవేశపెట్టెను. ప్రభుత్వకార్యక్రమమునకు ఇదియే పట్టుకొమ్మ యనుచున్నారు.

ఇతరజాతులతో జర్మనీ సమానస్థానము నాక్రమించునటుల చేయును. వెర్సైయిల్సు ఒడంబడికను పూర్తిగ రద్దుచేయుతలంపును సూచించెను. జర్మను లందరును మరల ఆయుధపాణులుగ చేయబడుదురు. ఫ్రాంసునకు జర్మనీవ్యవహారములతో ఎంతమాత్రము ప్రమేయము లేకుండ చేయదలంచెను. జర్మనులు స్వతంత్రముగ తమకు నచ్చినకార్యములను చేసికొనుటకు అవకాశము లేర్పరుపబడును. అనవసరముగ జాతిసమితిసలహాతో ప్రసక్తిలేకుండ చేయ సమకట్టెను. వెర్సైయిల్సుఒడంబడికచే జర్మనీ దుర్భరస్థితియందుండెను. కాలుచేతులు బంధించినటులాయెను. ప్రజలందరకును ఇది సంకటముగనున్నది.

జర్మనుజాతీయక్షేమమునకు అవసరమగునంతవరకు హిట్లరుప్రభుత్వము వైమానికదళమును పెంపొందచేయుటకు తోడ్పడునని గోరింగుగారు తెలియజేసిరి. గోరింగుగారు గడచిన యుద్ధములో వైమానికమంత్రిగ నుండెను. వెర్సైయిల్సు ఒడంబడికవలన జర్మనువైమానికదళాభివృద్ధికి ఆటంకము కల్గెను. ఆపాశములను తెగటార్చి ఇతరప్రభుత్వములతో సమానముగ వైమానికదళమును నెలకొల్పవలెననిరి. ఫ్రెంచిప్రభుత్వమునకు ఇదే హిట్లరుప్రభుత్వముయొక్క మొదటిసవాలు.

ఆర్థికపరిపాలనమును సవరించుటకు పూనుకొనెను. ప్రజలు స్వతంత్రముగ వ్యాపారము చేసికొని బ్రతుకుటకు తగిన యుపాయమును జూపెను. గ్రామజీవన పునరుద్ధారణమునకు పూనుకొనెద మనిరి. కరెన్సీపరిశోధనలను చేయునారము కామనిరి. సోవియటుప్రభుత్వముతో స్నేహముగ మెలగెద మనిరి.

౨౩-౩-౩౩ తేదీని హిట్లరు ఇట్లు రిచిస్టాగసభలో వచించెను:— జర్మనీలో మరల రాజపరిపాలనము ప్రవేశపెట్టువిషయమై ప్రస్తుతము ఆలోచించవలదు లేదు.

జర్మనీలో అన్నిమతములకును న్యాయమును కలుగజేతుము.

వెర్సైయిల్సుఒడంబడికను శిలాక్షరములుగ అమలు జరిపితిమి. యుద్ధనౌకలనుగూడ తీసివేసితిమి. కాని ఇది కొంచెముగనే జరిగెను. జర్మనుసైన్యమును హెచ్చింపరాదనే ప్రభుత్వసంకల్పము. దీనిని అవలంబించుటకు త్రికరణశుద్ధిగ ప్రయత్నించెదము. కాని ప్రపంచములో ఇతరులుగూడ తమసైన్యములను పెంచక జర్మనీసైన్యముతో సగిపోవునటులు చేయవలెను. ఆయుధములను తగ్గించవలెను. జర్మనీ సమానస్వత్వములనే కోరుచున్నది. స్వాతంత్ర్యము నపేక్షించుచున్నది. ప్రపంచమందరితోను సంధిచేసికొని శాంతముగ నుండుటయే జర్మనుల కోరిక. కడచినసంగతులన్నిటిని మరచిపోయి క్రొత్తగా అందరును మైత్రితో నుండుటకు ఇష్టపడువారితో చేతులుకలుపుటకు జర్మనులు సంసిద్ధులుగ నున్నారు. నష్టపరిహారములను, ఋణభారములను తొలగించవలెను.



ప్రవక్త బుద్ధుడు



విష్ణువు



బోధిసత్త్వుడు

(ఈమూడును కంచువిగ్రహములు. ఇవి నాలంద మ్యూజియమున గలవు.)

ఆదిని నిష్కళుడును, నిష్పందుడును అను పరబ్రహ్మము. ఈ పరమాత్మునకు సృష్టి చేయవలెననెడి యిచ్ఛ జనింప "ఓం"కారశబ్ద మాతనిగర్భమునుండి వెడలెను.

"...శబ్దబ్రహ్మంబు కారణంబు బిందావాత్మకంబై నిష్పందత్వంబునకుంబురుషేచ్ఛాప్రయత్నంబున మూలాధారావస్థితపవన సంఘుషణంబునం జేసి యభివ్యక్తంబై పరావాక్కనంబడు నాబ్రహ్మం బీ నాభిపర్యంతం బావాయువుచేత నభివ్యజ్యమానంబైన మనంబుతోడ గూడి సామాన్యస్పందప్రకాశరూపిణియు, గార్యబిందుతత్వాత్మకయు, నీశ్వరాధిదేవతయు నై పశ్యంతీ వాక్కనంబడు నాబ్రహ్మం బావాయువుచేత హృదయపర్యంతం బభివ్యజ్యమానంబై నిశ్చయాత్మకబుద్ధియుక్తంబై విశేషస్పందరూపయు, నాదబిందుమయయు, హిరణ్యగర్భాధిదేవతయునై మధ్యమావాక్కనంబడు నాబ్రహ్మం బాస్యపర్యంతం బావాయువుచేతన కంఠాదిస్థానంబులయం దభివ్యజ్యమానంబై, యకారాదిక్షకారాంత వర్ణమాలారూపంబై, నిశ్చయాత్మయై, శ్రోత్రగ్రహణయోగ్యంబై వైఖరీవాక్కనంబడు నీ చతుర్విధసూక్ష్మస్థూలమాతృకాస్వరూప విట్టిదేవీ, నీకు నమస్కారంబు."[2]

పరబ్రహ్మమునం దిట్టిపరివర్తనమును బొంది వైఖరీరూపమున వెడలిన ఓంకారమే తరువాత తక్కిన శబ్దములకు మూలమై సృష్టికి కారణమయ్యెను. నిష్పందుడగు పరమేశ్వరుడు ఓంకారమువలన స్పందత్వమును కలుగజేసెను. ప్రపంచమునకు జగత్తను మారుపేరు కలదు. నిష్పందుడగు పరమేశ్వరుడుతప్ప తక్కినవన్నియు స్పందత్వము గలిగి సృష్టి. స్థితి, లయములకు లోనగుచున్నవి. ఇటుల స్పందత్వముగల వస్తువుల కన్నిటికిని మాతయు, ఓంకారస్వరూపిణియు నగుదేవికి సరస్వతియనునామమే యత్యనుకూలముగ నున్నది. "సరస్వతి" యనగా "ప్రసరణము కలది; ప్రసరణము కావించునది" యనియర్థము. ఈమె పరబ్రహ్మమునందు లీనమై యుండినప్పుడు చిద్రూపిణిమాత్రము. వైఖరీస్థితికి పరిణమించినప్పుడు నీమెకు రూపము లేదు. ఇట్టి యాదిసరస్వతిని భావింపవలెననిన నోంకారాక్షరరూపమే యాధారము కాని వేరులేదు.

పరబ్రహ్మమున కన్యము లేదు. అతని శక్తిసహాయము లేక ప్రపంచమున నేదియు సాధ్యము కాదు. కనుకనే ఓంకారస్వరూపిణి సృష్టిని చేయుటకు పరివర్తనమును బొంది ప్రయత్నమున నాపరమాత్మతో గూడి గర్భమును దాల్చి[3] లోకమాత యయ్యెను.

ఇటు లావిర్భవించిన శబ్దమునుండి యాకాశమును, ఆకాశమునుండి వాయువును, వాయువునుండి తేజస్సును, తేజస్సునుండి జలమును, జలమునుండి పృథ్వియు బుట్టినవి. ఈయాదిస్థితియం దివి యతీంద్రియములు. వీటిని పంచభూతతన్మాత్ర లందురు.

సృష్టికల్పనముకొరకు పరమాత్ముడును, సరస్వతియు తొలిస్థితికంటె తక్కువస్థితిని బొందిరి. ఈరెండవస్థితియందలి పరబ్రహ్మమునకు హిరణ్యగర్భ డందురు. హిరణ్యగర్భుడు పంచభూతతన్మాత్రలను మేళవించి భౌతికసృష్టిని జేయును.

---

౧. ఈవ్యాసమునందలి వేదాంత, మంత్రశాస్త్రభాగములను చెప్పి, కావలసిన ప్రమాణముల నేర్చియిచ్చి, నే నీవ్యాసమును వ్రాయుటకు తోడ్పడిన శ్రీమన్మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ (ఇపుడు కీర్తిశేషులు) గారికి వందనములు.

౨. శ్రీనాథుడు, కాశీఖండము, తృతీయాశ్వాసము.

3. శతపథబ్రాహ్మణము; బృహదారణ్యకోపనిషత్తు.

పరబ్రహ్మము విరాట్టుస్వరూపమున సరస్వతితో నైక్యమై మనకు కానబడు భూతప్రపంచమును సృజించెను.

పరబ్రహ్మ మొక్కడైనను సృష్టిని జేయుటకు కర్మబద్ధుడై హిరణ్యగర్భుడు, విరాట్టు అనురూపములను దాల్చెను. ఈమూడుస్వరూపములను సుషుప్తి, స్వప్న, జాగ్రదవస్థలతో బోల్చి యర్థము చేసుకొనవచ్చును.

సృష్టికంతకును మాత శబ్దస్వరూపిణి యగు సరస్వతి. ఈశబ్దతన్మాత్రయే వర్ణములుగను, పదములుగను, వాక్యములుగను మారెను.

ఈస్పందత్వమువలన ప్రపంచము నిలిచియున్నది. ఇందువలననే దీనియందు ప్రతినిమిషము మార్పులు కలుగుచున్నవి. ఈగుణము చరాచరపదార్థములకును, దృశ్యాదృశ్య పదార్థములకును గలదు. కొన్నివిషయము లందు మార్పు కానరాదనుటకు మనయింద్రియముల యొక్కయు, జ్ఞానముయొక్కయు నసంపూర్ణతయే కాని వేరుకాదు. స్పందత్వ మున్నయెడల శబ్ద ముండక తీరదను విషయము మనప్రత్యక్షానుభవమున గలదు. కాని మననాళములందు ప్రవహించు రక్తముయొక్క కదలికను మనము వినజాలకున్నాము. మనచెవు లాశబ్దమును వినునంతటి సునిశితములు కావు. కాని ప్రయత్నమువలన, అనగా యోగాభ్యాసమువలన ఆయింద్రియముయొక్క శక్తి నధికపరచినయెడల నాసూక్ష్మశబ్దమునుగూడ వినగలుగుదుము.

మనయింద్రియములకు తెలియువిషయముల కతీతములైన విషయము లనేకములు కలవు. భూతప్రపంచముయొక్క సృష్టికారణముల స్పందత్వమువలన గలుగు శబ్దము లీచెవులకు వినబడవు. యోగులు సాధనమువలన నీశబ్దములను కొంతవరకు వినగలరు. "వినుట" యను గుణము శుద్ధమైనయెడల నీశబ్దములన్నియు స్పష్టముగ వినబడును. ఒకరాయి యటులు సృజింపబడుటకు కారణ మొకశబ్దముగ వినబడును. అగ్ని యొకశబ్దముగ వినబడును. ఇట్టియవ్యక్తస్వతస్సిద్ధశబ్దము లటులు వినువారు మనకు చెప్పినయెడల నారవములు ధ్వన్యాత్మకములును, వర్ణాత్మకములును అగును. కాని మానవుని లోపభూయిష్ఠమైన కంఠముతో నుచ్చారణమును బొందునప్పు డీశబ్దములు లోపములతో కూడిన వగునుకాని యట్టిశబ్దములు విశేషముగమాత్రము సత్యదూరములు కావు. అగ్నియొక్కశబ్దము "రం" అని యందురు. ఇది మంత్రోచ్చారణయం దొకబీజము. ఇటులనే "హాం", "యాం" మొదలగునవియు కొన్ని పదార్థముల సృష్టికారణములను సూచించు శబ్దములు. "హంస", "స్వాహా" మొదలగు మంత్రభాగము లిట్టిశబ్దముల కూటములు. ఇట్టికూటములను చేర్చుటచే మంత్రము లగుచున్నవి. ఏదోయొకటి సంభవింపవలెనన్న (ఇదియు సృష్టిలో నొకభాగమే యగును) దాని కనుకూలపడుమంత్రమును పఠించినయెడల నది సంభవించును. పదార్థములకు కారణములైన స్వతస్సిద్ధశబ్దముల ననుసరించి యుచ్చరించుటవలన నావస్తువు లుద్భవించును. మన ముచ్చరించుశబ్దములందు లోపము కలదు కనుకనే మనము సృష్టికర్తలము కాజాలకున్నాము.

అగ్నియొక్కశబ్దము "రం" అని చెప్పుట మనము వినుచున్నాము. కాని యగ్ని యనేకవిషయములు చేరుటవలన కలుగుచున్నది. ఈ ప్రత్యేకవిషయము లన్నిటికిని ప్రత్యేకశబ్దము లుండును. ఈ శబ్దముల సంపుటియే మనకు "రం" అని వినబడుచున్నది. ప్రాణవాయువు (Oxygen) ఒకవిధమగు మోలక్యూలుల (Molecules) సంపుటి. మోలక్యూలులు ఏటముల (Atoms) సంపుటి. ఏటములకు కారణము ఎలెక్ట్రానులు (Electrons). ఎలెక్ట్రానులకు స్పందత్వము కలదని యాధునికప్రకృతిశాస్త్రము మనకు నచ్చచెప్పుచున్నది. ఈయెలెక్ట్రానులకు మూలకారణ మొకటి యుండిన నుండవచ్చును. ఇటులనే శబ్దప్రపంచమున నీఎలెక్ట్రానులనుబోలు సూక్ష్మశబ్దజాలము లుండునటుల

---

౮. Sir John Woodroffe: Garland of Letters; Chapters VI and VIII.

మన మూహింపవచ్చును. ఇవియన్నియు గలసియే అగ్ని విషయమున "రం" అను శబ్దముగ బరిణమించు చున్నవి. ఈ సూక్ష్మశబ్దజాలముల కతీత మగుదానికి నిత్యశబ్ద మనుపేరు కలదు. ఇదియే యిన్నివిధముల పరిణామమును బొంది మనకు గోచరమగుచున్నది. ఇదియే శబ్దస్వరూపిణి యగు సరస్వతి. శబ్దములు వర్ణములుగను, భాషగను మారును కనుక నీమె విద్యలకు రాణి.

సృష్టిని జేయు సమష్టిశబ్దము "ఓం"కారము. ఇదియే స్థితిలయములు కలిగించుటకును గారణము. ఈశబ్దమున కంతము లేదు. అంతము కలిగినప్పుడు మహాప్రళయము సంభవించును. కనుకనే లోకమాతయగు సరస్వతి ఓంకారస్వరూపిణి.

ప్రార్థించుటకుగాని, వర్ణించుటకుగాని, చిత్రించుటకుగాని యీయాదిసరస్వతిని మనబుద్ధితో నూహించుట యలవికాని పని కావున నీయమ్మ కొకరూపమును బుద్ధిమంతు లిడిరి.

లోకములను గన్నశక్తి కనుక నీమె స్త్రీస్వరూపిణి యగును.

భారతీదేవిరూపమును మనపూర్వులగు ఋషులెటుల నూహించిరో కనుగొనుటకు సనాతనగ్రంథములం దనేకములగు నిదర్శనములు కలవు. ఇట్టి నిదర్శనములు లభించుభాగములలో మంత్రములకు సంబంధించినవి ముఖ్యములు. కృతార్థులగుటకు పఠింప ననేకములగు మంత్రములు కలవు. ఈమంత్రములు సాధారణముగ నేదోయొక దేవతనో, దేవునినో యుద్దేశించు ప్రార్థనరూపములుగ నుండును. మంత్రములయర్థము తెలియక పఠించుటకంటె, అర్థమును బాగుగ గ్రహించి, యాయిష్టదేవతయొక్కరూపమును మనస్సున నుంచి జపము చేయుటవలన నెక్కువఫలము కలుగునని పెద్దలు చెప్పుదురు. మంత్రముల కనుకూలములగు దేవతారూపములను వర్ణించు శ్లోకము లనేకములు కలవు. ఇట్టిధ్యానశ్లోకములు చిత్రకారులకు విశేషముగ నుపయోగపడగలవు.

సరస్వతి వాక్కుకాన వాగ్వాదినీధ్యానశ్లోకము చూడుడు. దీనియర్థ మిటులుగలదు:

> "పుస్తకము, జపమాల హస్తములందు గలదానా, వర-అభయ చిహ్నములు గల చక్కనిబాహులతలు కలదానా, కర్పూరమువలె నిర్మలమైన దేహము కలదానా, వాగీశ్వరీ, నాయంతఃకరణమును శీఘ్రముగా శోధింపుము." ౫

"పుస్తకము" వేదములు, విద్యయను నర్థములను సూచించును. వేదము లనగా నిప్పుడు పుస్తకరూపముల లభించు చతుర్విధవేదములు కావచ్చును, లేక మంత్రాత్మకముగ పరిగణింపబడు నాదివాక్కులగు దేవభాష కావచ్చును. ప్రతివస్తువునకును స్వతస్సిద్ధమగు నిర్మల ధ్వని కలదని మీద వ్రాసియున్నాను. వ్రాత, యుచ్చారణల కతీతములును, దేవదత్తములును అగు వేదము లీస్వతస్సిద్ధ మగు భాషయం దుండును. బ్రహ్మయొక్క నాలుగు ముఖములనుండి వెలువడు నాలుగు వేదములివియే. ఈ బ్రహ్మకు సరస్వతి భార్య. వేదములు "వా" క్కనియూడ చెప్పవచ్చును. ఈయర్థమున వేదములును, సరస్వతియు నొక్కటియే కాని సరస్వతి ఓంకారస్వరూపిణి. ఓంకారముతరువాత తక్కిన శబ్దములన్నియు బుట్టినవి. అందువలన సరస్వతి వేదములను చేత ధరించును.

"జపమాల" ధ్యానమును, మంత్రమును సూచించును. పరమేశ్వరుని సహాయము లేక సరస్వతి లోకమాత కాజాలదు. కనుక నాయమ్మ యాయాదిదేవుని ధ్యానించును. ఈధ్యానముయొక్క వ్యక్తీకరణము జపమాల. కాని, జపమాలయందు సాధారణముగ ముప్పదిరెండుపూస లుండును. చతుర్విధగాయత్రీమంత్రము—

---

౫. పుస్తకజపవటహస్తే
వరదాభయచిహ్నచారుబాహులతే,
కర్పూరామలదేహే
వాగీశ్వరి, శోధ యాశు మమ చేతః.

౬. త త్స వి తు ర్వ రే ణ్యం (ణి+యం)
భ ర్గో దే వ స్య ధీ మ హి
ధీ యో యో నః ప్ర చో ద యాత్
ప రో ర జసి సా వ దోమ్. మొరసి౩ ౨అక్షరములు.

నందు ముప్పదిరెండక్షరములు కలవు. కనుక నీజపమాల యనుదినమును బ్రాహ్మణులు పఠించునట్టియు, హిందువు లందరిచేతను పరమపవిత్రముగ పరిగణింపబడు నట్టియు గాయత్రీమహామంత్రమును సూచించును. ఈ మంత్రముయొక్క ధ్యానశ్లోక మొక్క గాయత్రీదేవినే వర్ణించినను పూజావిధానమునందు సావిత్రి, సరస్వతి, గాయత్రి యను ముగ్గురుదేవతలను జేర్కొనుట యాచారము. ఇందొక దేవత సరస్వతి యనుట గమనింపవలసిన విషయము.

లోకములను గని, వరముల నిచ్చి, రక్షించుతల్లి కనుక వరద, అభయముద్రలు కలవు.

పంచభూతతన్మాత్రలలో మొదట బుట్టినది యాకాశతన్మాత్ర. దీనితరువాతనే తక్కినభూతములును, తద్ద్వారా లోకములును బుట్టినవి. ఆకాశము యొక్క స్వతస్సిద్ధమైన వర్ణము తెలుపు. బుద్ధియొక్క వర్ణమును తెలుపు. కనుకనే సరస్వతి కర్పూరము వలె నిర్మలమైన దేహము కలది. ఆమెవసనములును తెల్లనివి. మనకు కానవచ్చెడి యాకాశపురంగు నీలిమ కనుక నామె నీవర్ణముతోను చిత్రించుట కలదు.

ఈ శ్లోకమునందు గల చిహ్నములేకాక యితర వ్యక్తీకరణబద్ధములైనచిహ్నములను సరస్వతికిచేకూర్చిరి.

సరస్వతి ఓంకారస్వరూపిణి; వాక్కు సకలశబ్దములబుట్టించి తద్ద్వారా సృష్టిని కల్పించినది. ఈశబ్దజాలములనన్నిటిని సూచించుట కామెహస్తములందు వీణ కలదు. ఇప్పుడు వాడుకయందున్న వీణయా, లేక యాదినుండియు భారతదేశమున నుపయోగపడిన వీణయా యనుచర్చ యక్కరలేదు.

సృష్టిని కల్పించవలెనని పరమశివుడు ఓంకారము నుచ్చరించి సరస్వతిని సృజించెను. ఇటుల నుచ్చరించుట కవసరమైన యుచ్ఛ్వాసనిశ్వాసములే హం, స (హంస)లు. కనుకనే హంస సరస్వతికి వాహనమయ్యెను. హంస యెట్టిపక్షిజాతి యనువాదమును అనవసరము. హంసయనుశబ్దమున కనేకములగు అర్థములు మంత్రశాస్త్రమున గలవు. హంసలో "హం" అనునది పురుషస్వరూపవాచకము. ఇదియే పురుషుడు; శివుడు. "సః" అనునది స్త్రీస్వరూపవాచకము. ఇది ప్రకృతి; శక్తి. కనుకనే హం,స ద్వంద్వము శివ-శక్తులను, పురుష-ప్రకృతితత్త్వములను౨ సూచించును. హంస యనుద్వంద్వమును వెనుకనుండి చదివినయెడల "సోహం" అగును. కనుకనే "హంస"కు జీవుడనియు నర్థము కలదు. ఇందు హకారమొకరెక్కగను, సకారమొకరెక్కగను, మధ్యనున్నది "తార"గను గణింతురు. "తార"యనగా ఓంకారమను ప్రణవమంత్రము. యోగు లూహించు హంస యంతరాత్మ. ఈహంసయొక్క ముక్కు తార(ప్రణవము) నిగమాగమములు రెండురెక్కలు; శివుడును, శక్తియు రెండుకాళ్లు; బిందుత్రయము దానిమూడుకన్నులు. ఈ రూపమునే పరమహంస యందురు. హంసయనుశబ్దమునకు మరికొన్ని యర్థములును కలవు. కాని యవి యప్రస్తుతములు.

అస్పందుడగు పరబ్రహ్మ మోంకారము నుచ్చరించునప్పుడు స్పందత్వము కలిగెను. ఈ "కదలిక" నెమలినాట్యముయొక్క కదలికవలె నుండునని యూహించుటవలన సరస్వతికి నెమలియు నొకవాహనమయ్యెను.

సరస్వతి జ్ఞానస్వరూపిణి; జ్ఞానాతీతురాలు కూడ. పద్మము జ్ఞానమును సూచించును. కనుకనే పద్మమునందు సరస్వతిని ప్రతిష్ఠించిరి. పరబ్రహ్మము సర్వాంతర్యామి కనుక మీయందును, నాయందును, తదితరవస్తువులందును గలదు. ఈయంతరాత్మకు నెలవు "అనాహత" చక్రము. అనాహతచక్రము పద్మము వలె నుండునని యోగులు చెప్పుదురు. ఈపద్మము మాయ యనుపంకమున బుట్టును. అనాహతచక్రమునందే వాక్కు మధ్యమారూపమును బొందును. హంసలకును, పద్మములకును ఉనికి యొకచోటనే. అనాహతమగు జ్ఞానమను పద్మమున స్వస్వరూపజ్ఞానమను తేనె

---

౨. పుంప్రకృత్యాత్మకో హంసస్ తదాత్మకం ఇదం జగత్.

యం దానందించు హంసద్వంద్వమును ప్రార్థించుట కలదు.

ప్రణవమంత్రధ్వని యెంతవరకు నుండునో యంతవరకు సృష్టి, స్థితి, లయములు కలుగుచుండును. ఈరవ మాగినయెడల మహాప్రళయము సంభవించును. కనుక ఓంకారస్వరూపిణియగు సరస్వతి యీమూడవస్థలకు కారణము. వాణీపూజయందు సృష్టిన్యాసమున నీమహాదేవి నిటులు ప్రార్థించెదరు:

"యాభైయక్షరములచేతను రచింపబడిన యంగభాగములు కలది, చంద్రఖండమును ధరించునది, తెల్లకలువవంటి శరీరకాంతి గలది, వర, అభయ, పుస్తక, అక్షసూత్రములను ధరించునది, మూడునేత్రములు కలది, అట్టి సరస్వతిని భజింపుచున్నాను." ౮

విద్యలకు రాణియు, వాక్కునకు సరస్వతి కాన నీమెరూపము నక్షరములతో రచించుట యెంతయు సమంజసము.

చంద్రు డమృతకిరణుడు కనుక నీయమ్మ కలంకారము.

మూడవనేత్ర మనగా జ్ఞానము. సరస్వతి జ్ఞానస్వరూపిణి.

స్థితిన్యాసమునందు

"లేడిపిల్ల, వరము, విద్య, అక్షసూత్రములను కరముల ధరించునది, (జప) మాలావిద్యలచేత ప్రకాశమానమైన హస్తములు గలది, అట్టిసరస్వతిని ధ్యానించుచున్నాను." ౯

అని ప్రార్థించెదరు.

సంహారన్యాసమున ధ్యాన మిటులుండును:

"అక్షసూత్రము, టంకము (అనగా పరశువు-గండ్రగొడ్డలి), సారంగము (లేడిపిల్ల), పుస్తకము హస్తములందు గలది, మూడుకన్నులగలది, చంద్రమౌళి, స్తనభరనమ్ర, ఎఱ్ఱతామరపూవుమీద కూర్చుండునది, అట్టిసరస్వతిని భజింపుచున్నాను." ౧౦

సర్వసాధారణముగ సరస్వతిని పైన చెప్పినటులు శాంతస్వరూపిణిగ, శుభదాయినిగ స్మరించెదరు. కాని శక్తి, కాళీపూజలందువలె నీమెను భయంకరరూపముతో వర్ణించుటయు కలదు. కాళీదేవికివలె నీలసరస్వతికిని౧౧ శవ మాసనము; సర్పములు భూషణములు; కపాలత్రిశూలాదివస్తువులు కరములం దుండును; పుణికెలమాల హారముగ నుండును.

మతవిషయములందే కాక యితరస్థలములందును కవు లనేకవిధముల నీమెనుగూర్చి మనోహరముగ బాడిరి:

"ఎవ్వతె మల్లెలు, చంద్రుడు, మంచు, ముత్యములవలె తెల్లనికాంతి గలదో, ఎవ్వతె తెల్లని వస్త్రములను ధరించునదో, ఎవ్వతె శ్రేష్ఠమైన వీణాదండమును చేత ధరించునదో, ఎవ్వతె బ్రహ్మ విష్ణుశంకరప్రభృతులను దేవతలచేత సదా పూజింపబడుచుండునో,

---

౮. పంచాశద్వర్ణై రచితాంగభాగాం ధృతేందు ఖండాం కుముదావదాతామ్, వరాభయే పుస్తక మక్షసూత్రం భజేగిరం సందధతీం త్రినేత్రామ్. —మంత్రమహోదధి.

౯. మృగబాలం వరం విద్యా మక్షసూత్రం దధత్కరైః, మాలా విద్యాలసద్ధస్తాం వహన్ ధ్యేయః శివో గిరమ్. —మంత్రమహోదధి.

౧౦. అక్షస్రక్టంకసారంగవిద్యాహస్తాం త్రిలోచనామ్, చంద్రమౌళిం కుచానమ్రాం రక్తాబ్జస్థాంగిరం భజే. —మంత్రమహోదధి.

౧౧. శవాసనాం సర్వవిభూషణాఢ్యాం, కర్త్రీం, కపాలం, చషకం, త్రిశూలం, కరైర్దధానాం, నరముండమాలాం, త్ర్యక్షాం భజే నీలసరస్వతీం తామ్. —మంత్రమహోదధి.

ఎవ్వతె నిశ్శేషముగా జడత్వమును పోగొట్టునో అట్టి భగవతియగు సరస్వతి నన్ను రక్షించుగాక "౧౨

"ఒకచేతితో స్ఫటికమణిమయమగు నక్షమాత్ర మును ధరించునదియు, ఒకచేత తెల్లనిపద్మమును, ఇంకొకచేత చిలుకను, మరియొకచేత పుస్తకమును ధరించునదియు, మల్లెలు, చంద్రుడు, శంఖము, స్ఫటికమణి-పీటికాంతివంటి శరీరకాంతి గలదియు నగు ఈవాగ్దేవత సుప్రసన్నత గలిగి యెల్లప్పుడు నాముఖమునందు నివసించియుండుగాక."౧౩

ఇట్టివర్ణనలు, ప్రార్థనలు విశేషముగ పేర్కొననేల? ఏయాంధ్రప్రబంధమును విప్పినను మొదటిపుటయందే మనోహరమగు సరస్వతీప్రార్థనము కానవచ్చును. ఇట్టివర్ణనలన్నియు చిత్రకారుల కాధారములు కాగలవు.

మనపూర్వులు భారతీదేవి కెట్టిస్థానము నిచ్చి యెంతయర్థమును జెప్పి, యెంతమనోహరముగ వర్ణించి యున్నారో చూడుడు. ఈవిషయమంతయు బోధపరచుకొనినయెడల నీమెను లెక్కలేనన్ని విధముల — పరబ్రహ్మముయొక్కయు, హిరణ్యగర్భునియొక్కయు, విరాట్టునియొక్కయు భార్యగ—చిత్రింపవచ్చును. మనోజ్ఞకళలగు సంగీతము, సాహిత్యము, చిత్రరచనలను ముగ్గురు పరిచారికలుగను, సరస్వతిని శుద్ధమైనదేవతాస్వరూపిణిగను చిత్రింపవచ్చును.౧౪

ఇట్టి మనోహరభావములను పూర్వులు మనయెదుట బెట్టినను ఆంధ్రచిత్రకారులు చక్కని సరస్వతీచిత్రములను వ్రాయకుండుటకు కారణము దురూహ్యము. పత్రికారాజమగు "భారతి" ముఖపత్రములందు కానబడు సరస్వతీచిత్రము లిందులకు నిదర్శనములు.

౧౯౩౨-వ సంవత్సరముజనవరినుండి జూనువరకు ప్రచురింపబడిన చిత్రమును జూడుడు. ఇంతటి యసహ్యాకరమగు రూపమును భారతీదేవి కిడుటకు తగిన కారణము నూహించుట యలవికానిపని. ఆంగ్లవిద్యయామోదమును బడయుచున్న యీకాలమున తమ స్వభాషను, సంస్కృతమును చదువ మానుటచే జనపదములం దాదరణమును బొందజాలక సరస్వతి యడవులపాలై యిట్టి మోటురూపును పొందియుండవలెను. సంరక్షణలేక యంగములు కృశించినవి. పాపము! తలదువ్వుటకైన నెవరు లేకపోయిరి. అలవాటు లేకపోవుటచే నామెకు చేతగాకపోయినది. నగలన్నియు శిథిలములగుటచే గాజులు, నేకొండవారి నగలనో పెట్టుకొని, వారర్పించిన చీరను గట్టుకొనినది. వీణయు విరగుటచే నేదోయొక వీణాకృతిని జేతబూని వాయింప యత్నించుచున్నది-తీగలు లేకపోయినను. నవరసములను జలములేకపోవుటచే నిటునటునున్న తామరలు చిన్నవై నవి-జాతిలక్షణముచే కాడలు వలముగ నున్నను. ఇట్టిపరిస్థితులను జూచి రూపుచెడియున్న హంసలు సిగ్గుతో తలలను వంచుకొనియున్నవి.

జూలైనుండి డిసంబరువరకు ప్రచురింపబడిన ముఖపత్రమును బరికింపుడు. ఈచిత్రమునుగూర్చి యేమి చెప్పుటకును దోచకయున్నది. అట్టి కాంతిలేనిముఖమే స్త్రీకినున్నను (సంసారికైనను, సానికైనను) మనము చూచి యానందింపజాలము. అందు, "మూడుమూర్తుల

౧౨. యా కున్దేన్దుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా యా వీణావరదణ్డమణ్డితకరా యా శ్వేతపద్మాసనా, యా బ్రహ్మాచ్యుతశఙ్కరప్రభృతిభి ర్దేవైః స్సదా పూజితా సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా.

౧౩. దోర్భి ర్యుక్తా చతుర్భిః స్ఫటికమణిమయీ మక్షమాలాం ధధానా, హస్తే నైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ; భాసా కున్దేన్దుశఙ్ఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా, సా మే వాగ్దేవ తేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.

౧౪. ఈభావమును నేను చిత్రించియున్నాను.

సారంపుముద్ద" యనదగు సరస్వతీదేవియందున్న భారతీయ మనిపించుకొన్న యెట్టివానికైనను కడు పుడుకక మానదు. మనోజ్ఞకళల కధిష్ఠానదేవత కాని స్త్రైజసమగు ముఖ మేల? నడుమువరకు మనుష్యాకారముగను, దిగువ భాగము పుష్పమునందు లీనమైనటులను, చేప, గుఱ్ఱము ఎద్దు మొదలగు జంతువులుగ బరిణమించునటులను లోకమునం దనేకదేశములందు పూర్వకాలమునుండియు నూహించుట యాచారమైయున్నది. కాని ముడుకులవరకు మనుష్యాకారముగ నుండుటమాత్రము నే డీ చిత్రమున గంటిమి. పాదము లుండుట కాపుష్పమున తా వెచ్చట గలదో చిత్రకారులే యూహించుకొనెదరుగాక. ఆవీణ నెవరును పట్టుకొనకపోయినను, నడుమునకో మెడకో వ్రేలాడగట్టుకొనకపోయినను అనట యెటులు నిలిచినదో దురూహ్యము.

౧౯౩౩-వ సంవత్సరము జనవరి మొదలు ప్రచురింపబడుచున్న చిత్రమును తిలకింపుడు. ఇందును సరస్వతి యేదియో రోగమువలన కృశించియున్నటులున్నది. ముఖమునందు నిస్పృహ, భయము కానవచ్చుచున్నవి. భయంకరతరంగములను జూచి భయపడి, పద్మాసనమునుండి దిగిపోబ్రయత్నించుచున్నది. వస్త్రములకు బ్టేమియు బాగుగ లేదు. తరంగములు చిత్రమున నుండునటుల నుండవు. హైందవచిత్రరచనయందటుల నుండు నని యనుకొన్నను అట్టిచోట్ల తామరలు పెరుగవన్న విషయ మందరు నెరిగినదే. పండు తామరాకు నచ్చట వ్రాయుట యేలనో బోధపడలేదు. తామరాకు పండునా?

ప్రకృతియందు కానబడినటులు వ్రాయకపోవుటయే భారతీయచిత్రకళ యయ్యె నీనాటికి! అజంతరచన నుద్ధరించుచున్నామని శుష్కాంగములను వ్రాయువారు అజంతచిత్రములయంగములు శుష్కములుకావని యెంతవేగముగ గ్రహించిన దేశీయచిత్రకళకంత శ్రేయస్కరము. రొమ్ముపైని బట్టను తీసివేయుటకేదైన అర్థ ముండవలెను. పురాతనభారతీయసంప్రదాయములను దేశచరిత్రమువలన బాగుగ నేర్చుకొనియిట్టిసాహసమునకు బూనుకొనవలెను. శుద్ధదేవతామూర్తిగ వ్రాసినప్పుడు బట్ట లేకపోవచ్చును — అశ్లీలముగ వ్రాయునప్పుడును. లేక పురాతనవస్త్రధారణము వలె బట్టక ట్టుండవలెను.

నాకు తోచినది వ్రాసితిని. బుద్ధిమంతులగు చిత్రకారు లీవిషయమున పరిశ్రమ చేసి, పురాతన చిత్రములను బరిశీలించి, శాస్త్రములను చదివి, చిత్రకళయొక్క కట్టుబాట్లను నేర్చుకొని, చక్కనిచిత్రములను వ్రాసి, భారతీయచిత్రరచనను పోషించెదరు గాక!.

---

కంసాలి నగలను గడువున కివ్వనందున ?



# శిఖండి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, యం. ఏ., బి. యల్.,

భావము ఆత్మ! భావము సారథి! నరుని నడపు ఆధ్యాత్మికశక్తి భావము! తురగముల నంటి సారథిచేతులం దిముడు కళ్లెము చిత్తము! ఇంద్రియములు విచిత్రహయములు — ఈహుమాయులందు పొందు హుళక్కి. రథికునకు ప్రాపగు భావము బలవత్తరమైనది కానిచో, మనసును పడలాగి వారువములు నరునిలోఁతుగోతిలోఁ గూల్చును! తన కురుక్షేత్రమున విజయుఁడు కాఁగోరు పురుషుఁడు తేరును బారుగ దశతేజుల స్వచ్ఛందలంఘనమునకు విడువక పటుత్వసిద్ధినందిన భావముపై నాధారపడును. మనుజుని కర్మను ధర్మముఁ గావించునదే యీభావము! పంచభూతాత్మకమగు శరీరమున—ఇదియు నొక విశ్వమే. దివ్యమరీచుల నీనునది భావము. ఇది లేని యంతరంగము చీఁకటికోణము. ఇది లేని హృదయము శ్మశానవాటిక. ఇది లేని శరీరము కట్టెమోము. భావము లేకున్న బ్రదుకే లేదు. నైతికదార్ఢ్యమునకును, ఆధ్యాత్మిక విభూతికిని, మేధాసంపదకును, శారీరకశక్తికిని—దీనికిని దానికిని అననేల? సర్వతోముఖమైన ధర్మనిర్వహణమునకు అనివార్యమైనది భావము!

భావము భగవంతునివంటిది. అనుటయు నిది భగవంతునివలెనే అదృశ్యమైనది. అదృశ్య, అఖండ, అపరిచ్ఛిన్న, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సర్వవ్యాపి, సచ్చిదానంద ఘనస్వరూపమును నిజహృదయమందు స్మరించి ధ్యానించుట ఆటితేటిన అర్జునునకే సాధ్యముకాని వృకమట్లు అనవరతము మెక్కువానికిఁ గాదు. విశ్వవ్యాప్తమయ్యు నీశక్తి వడ్లగింజకంటె చిన్నదియై మనుష్యహృదయమం దిమిడియుండునని ఛాందోగ్యోపనిషత్తు వాకొనుచున్నది. అద్భుతమైన నీయాధ్యాత్మికశక్తి నలవఱుచుకొనుట కెంతేని సాధన మవసరము. ధర్మనిష్ఠాగరిష్ఠుఁడగు యుధిష్ఠిరుఁడును, సగుణోపాసనయందు అద్వితీయశక్తిసంపన్నుఁడైన వడిముడియు, మూర్తీభవించిన త్యాగలితిక్షులైన నకుల సహదేవులును పరమార్థమును జయించి, ధనంజయ సార్థకనామమందిన నిర్గుణోపాసకునకు సాటిరారు. కనులయెదుటఁ గానంబడునది, చేతి కందునది, చెవులఁ జొచ్చునది, నోరూరించునది, సామాన్యమానవసాధ్యమైనది, జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును గలిసి మానసాగారమందు ప్రోవొనరించు భావరాశినే పామరుఁ డెఱుఁగును. ప్రత్యక్షానుభవఫలములను కబళింపఁజాలునేకాని దశేంద్రియములు ఎచ్చోటికో ఎగసి భావైశ్వర్యమును కొల్లఁగొట్టుకొనిరావు. శరీరావరణమును దాఁటిన, వీనికి తెరువు లేదు. సొంతయింటినుండి, ఏదో కొంత భావఫలసాయము నివి కొలఁబోసికొనఁజాలును. కాని, దూరస్థమై, అదృశ్యమైయున్న భావైశ్వర్యమును కనులారఁ గాంచఁగలుగుట కల్ల.

ఉన్నమట్టునకు మనసునింపుకొని కాలక్షేపము చేయుటకు ఏకోరిక లేని—ఏయాశలు లేని పల్లీయుఁడొప్పునుగాని ఱెక్కలుకట్టుకొని పదునాలుగు భువనములందు నెసరఁజూచు విజ్ఞాని యొల్లఁడు. సంతృప్తిపడి సంతసంపడుటకంటె, అసంతృప్తియందుఁ బడి సంతపించుట కీతఁ డీయకొనును. అసంతృప్తి ఈతఁ డీఁదులాడు రత్నాకరము. మునిఁగిమునిఁగి యీతఁడు మిరుమిట్లుకొలుపు జ్ఞానరాశిని చేఁబట్టును. సంతృప్తినందు సన్యాసికంటె అసంతృప్తిఁ గను పాపియే పెక్కుమడుంగు లధికుఁడని నేఁడు తత్త్వశాస్త్రము ఘోషించుట లేదా? అసంతృప్తి కింత ప్రాముఖ్యమేలని చేయెత్తుదురా?

అసంతృప్తినుండి ఆనందము నూటొమడలు పరువెత్తును. ఇది దూరీకృతమగుట అదృశ్యమై యంతరంగమున ప్రవేశించుటకే. ఆనందము ఏసువంటిది. తనయెడల విముఖులైనవారిపై నిది చల్లని యాశీస్సు కురిపించును. తమోగుణమున దిగఁబడునాతఁడు సుఖ

మునకై చెలంగోసికొనును. మెఱుఁగులోనిదాని విష మెఱుఁగక నిండుప్రేమ నీమూర్ఖుఁడు దానిని కవుంగలించుకొనును. నిష్కర్మయందు వీని యిహపరములు నక్కియుండును. ఎద్దువలె తిని యాపలుగాకి మొద్దువలె పరుండును. బ్రదికియుండియు నీమహనీయుఁడు చచ్చుదాఁక చచ్చినట్లే పడియుండును. బురదగోఁతిలోఁ దిగఁబడు బఱ్ఱెవలె, దుర్గంధమందు మునిఁగితేలు పంది పనిది ఈతిండిపోతు అలసానందమున పొరలాడుచుండును. తనలోఁదాను చీఁకటికై దీపమై నిద్దురలో నీతఁడు కూలఁబడియుండును. ఇఁక సత్త్వగుణసంపన్నుని పరికింపుఁడు. ఇతఁడు సుఖమపేక్షించు సోమరికాఁడు. రజస్తమములు అవసరమగుపట్ల వీనికి దాస్యమొనరించునుగాని, యీతనిపై స్వారిచేయవు. ఈతఁడు శాంతిమయుఁడు. భగవతి, సీత యీతనియం దనారతము విరాజిల్లుచుండును. శాంతి భగవతి యున్నచోటునందే గదా ఆత్మారాముఁ డుండును! జ్ఞానద్రవము కనిన శాంతి, ద్రౌపది వీనియంతరంగమం దాసీనయై యుండును. బాహ్యావృష్టి కీతఁడును, తమోగుణబద్ధుఁడును శాంతిమయులుగఁ గానంబడుదురు. కాని యితఁడు మరీచి—ఆతఁ డంధకారము! ఇతఁడు స్వర్గము—ఆతఁడు శ్మశానము! ఇతఁ డింద్రియములను జయించిన మహారథుఁడు!— ఆతఁ డింద్రియములను జయింపనిచ్చిన జయద్రథుఁడు! ఇతఁడు వాంఛలు విసరివైచిన మహేష్వాసుఁడు! మహత్తరాశయము జేఁబూనిన ధృష్టకేతువై, చేతనశక్తి నందిన చేకితానుఁడై, అంతఃశత్రుల నిర్జించిన పురుజిత్తై, ధృఢప్రజ్ఞ గల కుంతిభోజుఁడై, జ్ఞానచ్ఛటలు జిమ్ము కాశీరాజీతఁడు! కలుషభావకురుసేనకు రాజై, చిరనిరయమున మ్రగ్గ మనుష్యాధముఁ డాతఁడు! కర్ణావస్థనుండి కడచి, శల్యాశక్తిని వృద్ధిఁగావించి, వికర్ణస్థితినంది, అద్భుతమాయాశక్తి— అవిద్యాశక్తి—భీష్మశక్తి నశ్వత్థామచే నదృశ్యమొనరించి ధృష్టద్యుమ్న (ధృష్టం, ద్యుమ్నంయస్యసః) శక్తి-సాహసశక్తినాయకత్వమును చరితార్థ మొనరించి, సకామావిద్యలు కడువ నిష్కామ కృపుఁడై, వీర్యవానుఁడైన నరపుంగవుఁ డీతఁడు! దురాశయను ధృతరాష్ట్రునకుఁ బుట్టి, దుశ్చరిత్రుఁడైన దుర్యోధనుఁడై అరిషడ్వర్గమునకు లొంగిన నరాధముఁ డాతఁడు! చూపులందును, రూపులందును గుణనిర్ణయ మగుచో, నిరయకుండమునుండి సుందరాకారులు పరుగిడి దేవత్వ మధిష్ఠింపఁగలరు. నరాధముఁడు సుందరుఁడు కావచ్చును. నరోత్తముఁడు రూపరహితుఁడు కావచ్చును ఇరువురును సురూపులు కావచ్చును. కురూపులు కావచ్చును. బహుయత్నలబ్ధమైన పున్నె మీతఁడు!—బహుజన్మలందు 'సిల్లి మంత్రము' వేయుచు, వసుమతికి దాపరించిన పాప మాతఁడు! ఈతఁడు చిరజీవి!—నిముసనిముసము తనలోఁ దాను చచ్చుచు, నొరులను చంపఁదలఁచు చేవటి యాతఁడు! సుఖమపేక్షింపక యీతఁ డందు సచ్చిదానందమునకును, సుఖమునే వలచి, స్వార్థమునే ఆరాధించి, అహంకారమునకు అర్ధాంగియై, అఘమునకు దాసియైన ఆతఁ డందు ఆనందమునకును భేదములేదా? సంతృప్తి నెఱుఁగక నిరంతరపరిశ్రమచేసి కర్మవీరుఁడై, భక్తితత్పరుఁడై, జ్ఞానమయుఁడై సత్యకి (సత్యం కం యస్యసః) యైన పురుషశ్రేష్ఠుఁ డీతఁడు!—సంతృప్తిని గోరి, చిరమూఢ్యమున మునిఁగియున్న హీనుగరాయఁ డాతఁడు! అసంతృప్తి లేకున్న చిరమను సంతృప్తి యేది, పరిశ్రమ యేది? పురుషార్థమేది, పరమార్థమేది? ఈపరమార్థమే మహత్తరమైన భావధనముకదా! ఈధనమునందిన నరుఁడేకదా నరుఁ డనిపించుకొనఁగలఁడు?

అసామాన్యమైన ఈభావధన మెందు లభించును? పృథ్వికిని మనకును సంబంధబాంధవ్యముఁ గూర్చు ఇంద్రియము లీధనము నావిష్కరింపఁజాలకున్నయెడల చదువులనేమి, నీతులనేమి, ఉద్యమములనేమి, సాధారణ వివిధదైనిక క్రియలనేమి దేని నుద్దేశించి నడపుచుంటిమి? ఇవన్నియు వట్టిబొమ్మలాటలని తత్త్వజ్ఞులేల ననుచుందురు? వెతకివెతకి వేసారినను కానంబడని ఈవిభూతి యెందుండును? ఈప్రశ్నముల కుత్తర మొసఁగవలెనన్న, ప్రాచీనప్రస్తుత ప్రపంచ విజ్ఞానమును గుమ్మరింపవలెను. బహుజీవ, బహుజన్మయత్న ఫలితమును కనులయెదుట ప్రదర్శింపవలెను,

ఇంద్రియము లందిపుచ్చుకొను పదార్థములందు పెనగులాటయే లేదు. ఇవి యిచ్చు భావమును తనివారఁ గ్రోలి తలతిరిగి నేలఁగూలుట కెంతకాలము పట్టును? ఇంద్రియము లిచ్చు గంజిమెతుకులకై జన్మపరంపరలం దూయలలూఁగి, మాఘఫాల్గుణముల ననుసరించి (మా + అఘ; ఫల్గు + న) నరకనాకములను విదల్చుకొనవలెనా? అనిత్యసుఖమునకై స్వీయకురుక్షేత్రమును ధర్మక్షేత్ర మొనరించి, నారాయణుని వ్రేల విషాద పూరము వెడలఁగ్రక్కనేల? విజ్ఞానికృషికిని భౌతిక శాస్త్రజ్ఞుని కృషికిని భేదమెంతేని కలదు. ఎదుటిదృశ్యమును భేదించి భౌతికశాస్త్రజ్ఞుఁడు తనకు వలయు జ్ఞానమును చేఁబట్టఁగలఁడు. కవికార్యమందు క్లేశము లేదు. పాలకుని పనియందు ఎంతోచిక్కు లేదు. ఇంద్రియములకు సాధ్యమైన పనికై బహుజన్మ లెత్తనక్కఱ లేదు. బహుజన్మ లెత్తినను లభింపని పరమధన మెట్లు చేఁబడును?

ఎదురరును నింద్రియములను వెనుద్రిప్పవలెను. వెనుఁదిరుగుట పనియైన, ప్రపంచ మేల, జన్మసంపర్క మేల అని సందియము కలుగవచ్చును. ముందులకు లంఘించు ఇంద్రియములకు ముంగలపని మనము చూపనక్కఱలేదు. సముచితముగ వల్గములను చేఁబట్టి దశాశ్వములను నడిపితిమేని ప్రపంచక్షేత్రమున నెంతేని యభ్యుదయము నందఁజాలుదుము. మహత్తరమైనదయ్యు కర్మక్షేత్రమొక్కటియు జ్ఞానపిపాసువును సచ్చిదానందముతోఁ దనియింపఁజాలదు. అసంతృప్తితో పొసలు విజ్ఞానికి కర్మక్షేత్ర మెంతభిక్ష పెట్టును? బుద్ధి శ్రమకై ఆతురపడునాతఁడు భక్తిమార్గమున విడియుటకు మక్కువపడునా? భక్తికి దీర్ఘ యోచనగాని, పెనగులాటగాని యక్కఱలేదు. భక్తున కెంతేని ఎన్నిక కలదు. భ్రమరకీటక న్యాయము సాధ్యాతీతమగుచో మర్కటకిశోరన్యాయమును, మర్కటకిశోర న్యాయము అడలుపుట్టించుచో మార్జాలకిశోరన్యాయమును వీనిమనుగడ నడపు ఏడుగడయై యుండును. తన్నుఁగనిన తల్లి—జగన్మాతకడుపుఁబట్టి వ్రేలాడిన భక్తుఁ డెట్టియనర్థములనైన నతిక్రమింపఁజాలును.

కష్టముకాని, ప్రజ్ఞగాని అనివార్యమైయుంట జ్ఞానమార్గావలంబికే.

ఇంద్రియములను వెనుద్రిప్పఁజాలువాఁడు విజ్ఞానిమాత్రమే. మూలభావమందలి పరమార్థమును, పరమార్థమందలి మహత్వపటుత్వములను కరస్థామలకముఁగావించుకొనఁజాలు ప్రజ్ఞాధురంధరుఁడు విజ్ఞాని. విజ్ఞానియనిన నుట్టలకొలఁది గ్రంథములను దిగమ్రింగిన అద్భుతనోక్త కాఁడు. తమకును, తమవిజ్ఞానమునకును సంబంధము లేని విజ్ఞానులు కొల్లలై ప్రపంచమున పుట్టిరి, గిట్టిరి. విద్వాంసులయ్యు, వేదవేదాంగపారంగతులయ్యు పల్వురు మనుష్యరక్తమును నుటుకలువైచిరని ప్రపంచచరిత్రలు కన్నీరుజాలువార్చుచుఁ దెలుపుచున్నవి. ఇట్టి విజ్ఞానులను మట్టువెట్టుటకు సాధారణులు తలక్రిందు లైరి. అఖండుఁడైన భగవంతుఁడు, స్వీయమథనము గావించుకొని మథురయందుఁ దోఁచి సాధారణబాలునిపగిది గోకులమున నింద్రియములను పెరుగనిచ్చి, బృందావనమున వర్ధిల్లి, నిజశరీరద్వారక కధీశ్వరుఁడై, ప్రభాసియందు భాసమానమైన తనువువీడు వఱకు నెందఱెందఱు పలుగాకులను దునుమాడ లేదు? అవతారమూర్తులచే వధింపఁబడిన దుష్టులు విద్వాంసులు కారా? నేను లక్ష్యించు విజ్ఞాని యీప్రోవులోనివాఁడు కాఁడు. తన విజ్ఞానము తానై, తాను తన విజ్ఞానమై, తన జీవనమును తన భావము గావించుకొని, తన భావమును దన జీవన మొనరించుకొనిన విజ్ఞానియే విజ్ఞానికాని ఒరుఁడు కాఁడు. ఇట్టి విజ్ఞాని పుస్తకపఠనమందుమాత్రము పుట్టఁడు. తనకర్థముగాని ఘోషయందు బ్రదుకీడ్చువాఁడును, నిరక్షరకుక్షియు వేఱు కారు. కొండచిల్లువడునట్లు పనసల నఱచినంతన విజ్ఞాన మలవడునా? నిక్కమైన విజ్ఞాని ప్రతిపదమునుండియు, ప్రతిపదార్థమునుండియు జ్ఞానసుధను పీల్చి తనమనసునందు, తన బుద్ధియందు, తన యాత్మయందు, తన ప్రాణమందు, తన జీవనమందు దానిని ప్రవహింపఁజేయును. శరీరస్థదేవత లైదింటిని—జ్ఞానేంద్రియము లైదింటిని ఉపనిషత్తులు దేవతలని పేర్కొనినవి. అల్లనవ్వులికంపె, దక్షిణామూర్తివలె,

నీఁగనుండియు, దోమనుండియు, పుర్వునుండియు, చెట్టు నుండియు నీతఁడు విజ్ఞానమును సంపాదించును. వేఱొక మాఱు ఇంద్రియములను లోనికిఁ ద్రిప్పి, హృదయ కోశాగారమున నిండియున్న సచ్చిదానందమునుండి అమూల్యమైన మూలభావము నీతఁడు నెమరువేయును. దేహధారి లోఁగొను అన్నపుముద్ద రక్తమై, వీర్యమై, మణిపుష్పకమై, సుఘోషమై, అనంతవిజయమై, పౌండ్రమై, దేవదత్తమై, పాంచజన్యమై, (అపాం తత్త్వమ్ దరవరం, సుదర్శనం తేజస్తత్త్వమ్) శరీరస్థములైన ఐదైదులను దనిపి, పిండాండమును బ్రహ్మాండమును జేరుచున్నట్లు విజ్ఞానిభావము అంతరంగమందు మహోద్భూతి జన్మాభివృద్ధి నంది దివ్యశక్తినిఁ బడసి తుదకాతని భగవంతునందు నింపివైచును.

మనుష్యజన్మ దేవజన్మకంటె మహత్తరమైనదని మహాత్ముఁడు శుకయోగి ఏల వాక్రొనెను? పశువులందు వలెనే దేవతలం దభివృద్ధి లేదు. దేవతలందు సుఖమే వారి ప్రోవల నడ్డుగోడయై నిలుచును. పశువులు దుష్కర్మ మనుభవింప నిలింపులు సుకర్మ లనుభవింతురు. (నాభుక్తం క్షీయతే కర్మ జన్మకోటి శతైరపి) సుకర్మవలని ఫలము ముగిసినంతనే యనిమిషులు నేల రాలవలసినదే! మనుజుఁడో, పుణ్యమును గోరక పాపమందుఁ జొరఁబడక కర్మముక్తినంది, పరమార్థమును చేఁబట్టి, పరమాత్మయందుఁ గలియఁగలఁడు. కావుననే శుకయోగి మనుష్యజన్మ కట్టియాధిక్యము నొసఁగెను. సంచితమైన కర్మము ప్రారబ్ధమై ప్రస్తుతజన్మతో బాటుగ విడిపోవుచుండ ఆగామి కర్మ చేరకుండవలెనుగదా! నేఁటి యాగామికర్మ రేపటి సంచితకర్మమై, రేపటి సంచితకర్మ ఆమఱునాఁడు ప్రారబ్ధమై సంకెలకు సంకెలఁ జేర్చ, జన్మపరంపరల కంతు ఉండకు టెట్లు? సంచితాగాములను మటుమాయ మొనరించి ప్రారబ్ధమును చితిచిచ్చులో చిటచిటలాడించితిమేని, కర్మ పంజరమునుండి ఎగసి జీవాత్మ పరమాత్మను చేరఁజాలును. పరమాత్మను చేరఁజాలుట పరమార్థమునందుట.

ఆధ్యాత్మికమున నసంతృప్తివలననేమి, కర్మనిష్ఠా గరిష్ఠతవల్ల నేమి, సగుణనిర్గుణోపాసనల మూలముననేమి, భక్తితత్పరతచేనేమి, జ్ఞానపథావలంబనమువల్ల నేమి, జితేంద్రియత్వముచే నేమి పరమార్థసాధనమును, పరమభావ హృదయంగమమును సాధ్యమగును. కురుక్షేత్రయుద్ధమున విజయధ్వానము బోరుకలంగును!! నాఁడే నరుఁడు నారాయణుఁ డగును!!! అఖండస్వరూపు నందిన నాఁడే మానవుఁడు శిఖండి యగును!!!!

---



క్రొత్తబౌద్ధాలయము–మూలగాంధారకుటీవిహారము, సారనాథము

—సి. జి. జగన్నాథదాసు.

చెన్నరాజధానియందు ౧౯౩౧-వ సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు డిసెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

త్రాసకంపరామాయణము—కె. వెంకటరామయ్య

భారతకథా సుధార్ణవము—యన్. రామస్వామి

శ్రీగరుడచరిత్రము—డి. సర్వేశ్వరుడు

శ్రీమహాభక్తవిజయము—యస్. సుబ్రహ్మణ్యశాస్త్రి

## కల్పితములు

కథాసుచ్ఛము, భా. ౩—(ప్ర) కె. నైఘంశరావు, మదరాసు.

కథానిధి—కె. వెంకటరావు, యం. సీతాపతిరావు

తెలుగుకథాసప్తతి, భా. ౧—పి. నారాయణశాస్త్రి

మేధానిధులు—బి. పూర్ణయ్యశర్మ

సత్యరాజాపూర్వదేశయాత్రలు—కె. వీరేశలింగం

## చారిత్రకములు

బాలుర ఇండియాచరిత్ర కథలు—(ప్ర). సి. కుమారస్వామినాయుడు అండ్ సన్స్, మదరాసు.

## కల్పములు

ఏకాదశి గురువారవ్రతము—(ప్ర). సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

విఘ్నేశ్వరపూజావిధానము—(ప్ర) పి. వీరేశలింగాచారి, చికాకోల్

వినాయకవ్రతకల్పము—(ప్ర) కె. శోభనాద్రిరావు, విజయనగరము

శ్రీ తులసీవ్రతమహాత్మ్యపూజావిధానము—(ప్ర) శారదా ప్రెస్, అనంతపురము

షష్టిపూర్తి శాంతివ్రతకల్పము—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

సత్యనారాయణవ్రతకల్పము—సి. లక్ష్మీనృసింహశాస్త్రి మచిలీపట్టణము

## కావ్యములు

ద్విపద మేఘదూతము—(ప్ర) పల్లెపూర్ణప్రజ్ఞాచార్యులు, గుంటూరు.

పుష్పబాణవిలాసము—కె. ప్రభాకరశాస్త్రి, కొల్లూరు.

మేఘదూత—(ప్ర) కె. నాగేశ్వరరావు, మదరాసు

శతకంఠ రామాయణము—పి. సన్యాసి

## గణితశాస్త్రము

గణితశాస్త్రము—వి. శ్రీనివాసాచారి

## గేయములు

ఆత్మగీతము—వి. పార్థసారథిరావు

ఆత్మబోధ సుజనతత్త్వరత్నావళి — (ప్ర) మస్తాన్ షరీఫ్, పెంటపాడు

కీరపండరీ పాండురంగ విఠల్ భగవాన్ నామములు, భజన కీర్తనలు—(ప్ర) టి. రామకృష్ణయ్య, చిలకలపూడి

గాంధీమహాత్ముని ప్రభావము—ఏ. వెంకటజగన్నాథాచార్యులు

గాంధిరత్నావళి—కరణం మహాలక్ష్మి

గాంధిరాయబారము—మున్నంగిశర్మ

గేయరామాయణము—వాసుదాసు

చారగేయములు—పి. యస్. రామశర్మ

దేవీప్రసన్నతత్త్వాలు—యస్. వీరన్న

శృంగారనిలయరంగనిత్త్యములు—జి. పోలందాసు

శ్రీభక్తజనానంద రామాయణము—బి. పాలయ్యదాస్

సంగీతకీర్తనలు—(ప్ర) కె. సీతారామయ్య, కడప

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

సూక్ష్మరామాయణము—(ప్ర) కే. కృష్ణమూర్తి; నర్స పూరు
స్వదేశగీతమను మహాత్మగాంధిపాటలు—సి. చిన్నయ్య నాయుడు.
స్వరాజ్యపదము—కే. సత్యనారాయణ

## చరిత్రము

ఆంగ్లదేశచరిత్రసంగ్రహము—బి. సుబ్బయ్య
మనమాతృదేశచరిత్ర—యం. షణ్ముఖసుందరం
మనమాతృదేశచరిత్రకథలు—యం. షణ్ముఖసుందరం
శ్రీ పూసపాటివంశానుచరితము, భా. ౧—దువ్వూరి జగన్నాథశర్మ
హిందూదేశచరిత్ర—యన్. సుబ్బరావు
హిందూదేశచరిత్రము—వి. వెంకటరంగరావు

## చట్టము

ప్రావిన్షియల్ ఇన్సాల్వెన్సీ ఆక్టు — (ప్ర) పి. వెంకట సుబ్రహ్మణ్యం, బాపట్ల
మదరాసు లోకలుబోర్డుల చట్టదిట్టములు—(ప్ర) సి. వి. నాయుడు, మదరాసు
సివిల్ గ్రామపంచాయతి కోర్టులరూల్సు—(ప్ర) ఆర్యక్ పబ్లిషింగ్ హౌసు, బెంగుళూరు

## జంతుశాస్త్రము

జంతుశాస్త్రము—యం. సాంబశివరావు

## జీవితములు

అళియరామరాయలు—చి. వీరభద్రరావు
తుకారామస్వామిచరిత్రము—(ప్ర) వి. రామస్వామి శాస్త్రిఅండ్ సన్స్, మదరాసు.
వేమన—వంగూరి సుబ్బరావు
శ్రీ సమర్థరామదాసస్వామి—(ప్ర) వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు
స్వీయచరిత్ర —వల్లూరి సూర్యనారాయణరావు
హనుమద్వీరజీవితము—దూసి కామయ్యభుక్త

## జ్యోతిషశాస్త్రము

కేరళభాష్యసంగ్రహము—కాళీదాస్
దైవజ్ఞచింతామణి—యం. కోటనాగయ్య

## నవలలు

దుర్గేశనందిని—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు
రాణీదుర్గ లేక దుర్గాకుమారి — బి. హనుమంతరావు, డి. సూర్యనారాయణ
సమరసింహ—జి. వెంకటకృష్ణయ్య
సీమంతిని—(ప్ర) వి. పార్వతీశం, పిఠాపురము
హత్యాశ్రమ — (ప్ర) ఏ. లక్ష్మణస్వామి నాయుడు, రాజమహేంద్రవరము

## నాటకములు

కళానందవిజయము అను జరాసంధవధ—యం. వెంకటప్పయ్య
ఖిల్జీ రాజ్యపతనము—జి. వెంకటసుబ్బరావు
దెయ్యాలలంక—పి. వి. రాజమన్నారు
నిజలింగచిక్కయ్య అను పంచాక్షరీమహాత్మ్యం — పి. దేవబ్రహ్మం.
శాకుంతలనాటకము—(ప్ర) జె. గంగన్న, రాజమహేంద్రవరము
శ్రీ పాండురంగ విలాసనాటకము—పి. వీరాస్వామి నాయుడు
శ్రీ సీతాకల్యాణము—యం. లక్ష్మీనృసింహాచార్యులు

## నిఘంటువు

త్రికాండశేషము—పురుషోత్తమదేవ

## నీతి

బాలనీతికథలు, భా. ౧—ఏ. యల్. నారాయణ
వివేకదర్పణము—వి. పాపరావు, యస్. రామలింగ శాస్త్రి

## పరిశిష్టము

అధ్యక్షోపన్యాసము—(ప్ర) ప్రెసిడెంట్, పుల్లా
అహింస—జె. రంగసామి
ఉత్తమమార్గము—జనమంచి శేషాద్రిశర్మ

ఉపవాచకములు, భా. ౧, ౨—పి. సూర్యనారాయణ శర్మ

ఐరావతచరిత్ర—(ప్ర) పి.అక్కిరాజుఅండ్ సన్స్, నరస పూరు

కల్పలత—నేతి సుబ్బయ్యశాస్త్రి

కాశీసారము—(ప్ర) యం. వెంకటరత్నకవి, అనమన మూరు అగ్రహారము

కుటుంబనిర్వాహశాస్త్రము—వై జి. బాసెల్

గాంధిమహాత్మకు—ఏ. సోమనాథరావు

గ్రామసహకార పరపతిసంఘములు—కె. లక్ష్మీనారాయణ

జంతుసంతాపము—నిడమర్తి ఈశ్వరప్ప

జ్ఞానాంజలి—పి. సత్యనారాయణరాజు

జ్ఞానోదయము—యస్. గోపాలం

దురభ్యాసములు, పొడుము—వేదుల సూర్యనారాయణ శాస్త్రి

నయప్రదీపము—డి. వెంకటకృష్ణమూర్తి

నీయోగీశ్వరము—వెంకటాచలపతిరావు

పతివ్రతలు—వి. శేషగిరిరావు

ప్రసూతలపరిచర్య, భా. ౧,౨—క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు

భగవత్కథ—(ప్ర) పి. నరసింహం, గుంటూరు

బైబిలు వాచకబోధిని—పి.బి. పాల్. యస్., భూషణం

వావిళ్లవాచకపుస్తకము, త. ౭—జె. గంగన్న

విజయవాడఖద్దరు ప్రచారచరిత్ర, (ప్ర) విజయవాడ వైశ్యమహాసభ, బెజవాడ

విజయాభిమన్యుజన్యము—కె. వెంకటరామానుజాచారి

రయితు నిజస్వరూపము—యస్. లక్ష్మీపతిశాస్త్రి

రామమోహనగుణస్మరణము—ఓలేటి వేంకటరామశాస్త్రి

మనస్సు—యస్. నారాయణమూర్తి

మహర్నవమి పద్యములు—(ప్ర) యస్. సుబ్బరావు, పాలుకోలు

మారుతివాచకము, త. ౬, ౭, ౮—జి. గంగరావు, పి. సత్యనారాయణ, యం. పార్వతీశ్వరశాస్త్రి, బి. నారాయణమూర్తి

శుచిమాలిక, బుక్. ౧—వై. జోసఫ్‌ఏలిష

శ్రీ కోనసీమ ధార్మికస్వరాజ్యసంఘము—(ప్ర) పి. ఉమామహేశ్వరశాస్త్రి, గంగలకుర్రు

సంభావణరూపక కుటుంబ సుఖాధారశాస్త్రము—వై. జి. బాసెల్

సహకారకౌముది—(ప్ర) ఈస్ట్ గోదావరిడిస్ట్రిక్టు కోఆపరేటివ్ ఫెడరేషన్, ఆలమూరు

సుజ్ఞానసమాజము—(ప్ర) సుజ్ఞానసమాజము, విజయనగరము

## పురాణము

శ్రీ బ్రహ్మేశ్వరపురాణము—(ప్ర)సోమ వెంకటస్వామి గుప్త, మదరాసు

## ప్రకృతిశాస్త్రము

పదార్థవిజ్ఞానశాస్త్రము—యం. సాంబశివరావు

పదార్థవిజ్ఞానశాస్త్రము—వి. లక్ష్మీనృసింహం

ప్రకృతిశాస్త్రము—వి. సుబ్బరావు

## భూగోళశాస్త్రము

కర్నూలుజిల్లా—టి. వి. చెల్లప్పశాస్త్రి

రాజమహేంద్రవరము—పెద్దాపురము తాలూకాల భూగోళము—ఏ. పార్వతీశము

## మతము—హిందు

వర్ణాశ్రమధర్మములు—వి. వెంకటశివావధాని

సర్వపితృ అమావాస్యతర్పణము—(ప్ర) ఆల్ ఇండియా పురోహితమహాసభ, చిత్తూరు

## —ఇతరములు

జూబిలీచరిత్ర—యం. అప్పారావు

పదియాజ్ఞలు—(ప్ర) హోప్ అండ్ కో, మదనపల్లి

సత్యవేదసారసంగ్రహము—(ప్ర) జె. సి. ఆలన్, నెల్లూరు

## మాహాత్మ్యములు

ఏకాదశీమహాత్మ్యము—(ప్ర)సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

సింధూస్నానమాహాత్మ్యము—(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము

## యక్షగానములు

శ్రీ కృష్ణతులాభారము—గోపాలుని హనుమంతరాయ శాస్త్రి

శ్రీ సీతాకళ్యాణము—సి. నాసరుదాసు

## యోగశాస్త్రము

అనుభవయోగాభ్యాసము—పాలపర్తి ఆంజనేయులు

## రాజకీయము

స్వరాజ్యశంఖు—కె. సత్యనారాయణ

## విమర్శనము

కావ్యనాటకాదిపరిశీలనము — అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి

## వేదాంతశాస్త్రము

అద్వైతసుబోధిని—జి. సూరయ్య

భగవద్గీత—(ప్ర) వి. రామస్వామిశాస్త్రిఅండ్ సన్స్, మదరాసు

బృహదార్ణ్యకోపనిషత్—(ప్ర) పి. కొండయ్య, జి. అప్పలస్వామి

మహావాక్యదర్పణము—(ప్ర) వి. సామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు

శ్రీ భగవద్గీతా మంజరి—(ప్ర) రాజా పానగంటిపార్థ సారథిరావు, కాళహస్తి

శ్రీమదాంధ్రోపనిషద్జ్ఞానదీపిక — ఏ. వెంకటసుబ్బ రాయశర్మ

## వైద్యశాస్త్రము

కలరా—(ప్ర) డిస్ట్రిక్టుబోర్డు, చిత్తూరు

తిబ్బెఅక్బర్ సాహి—డి. రహింతుల్లా బేగ్ సాహెబ్

దీర్ఘరోగ చికిత్సాసారము—పాలపర్తి నరసింహారావు

బాలతంత్రము—వల్లూరి సుబ్బరావు

మశూచి—(ప్ర) డిస్ట్రిక్టుబోర్డు, చిత్తూరు

## శతకములు

అభినవసుమతి శతకము—దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

ఆత్మారామశతకము—బి. వెంటయ్య

తిరుపతి వెంకటేశ్వరశతగీతి—బి. కనకాచలకవి

పద్మలోచనశతకము—డి. గురురాజాచార్యకవి

పారమతల్లి శతకము—కె. కృష్ణరాయశాస్త్రి

రాఘవశతకము—కృష్ణకుమారమిశ్రులు

లక్ష్మీశారదాశతకములు—(ప్ర) లక్ష్మి, శారద, పెనుగొండ

శ్రీ కూడలిసంగమేశ్వరశతకము—జె. లక్ష్మీనరసింహయ్య

శ్రీ తిరుపతి వెంకటేశ్వరశతకము—బి. సుబ్రహ్మణ్యం

శ్రీ వేణుగోపాలకృష్ణశతకము—జె. లక్ష్మీనరసింహయ్య

సాంబశతకము—యం. కోటయ్య

## సారస్వతము

ఆంధ్రధ్వని—(ప్ర) ఏ. సుబ్రహ్మణ్యశాస్త్రి, కొవ్వూరు

## స్తోత్రములు

ఆనందగురుస్తవము—మన్నవ నరసింహం

వరదరాజ నక్షత్రమాలా—కి. రామానుజాచార్యులు.

విష్ణుసహస్రనామస్తోత్రం —(ప్ర) వి. రామస్వామి శాస్త్రిఅండ్ సన్స్, మదరాసు

శ్రీరామచంద్రస్తవం—యం. జొల్లా అప్పల నృసింహ శాస్త్రి

శ్రీ హనుమన్నామావళి—పి. సుబ్రహ్మణ్యఅయ్య

## హరికథలు

... రవిలాసము—కె. యల్లమందరాజు

# వ్యవసాయ పరిశోధనాలయముల ఆవశ్యకత

రా. బ. దువ్వూరి బాలకృష్ణమూర్తి

౧

సర్కారువారిచే వ్యవసాయపరిశోధనస్థానము లెందుకు ఏర్పాటుచేయబడినవి? వాటివలన రహితులకు ప్రయోజన మెట్లు కలుగుచున్నది? వ్యవసాయాభివృద్ధిని కలుగజేయుటలో వాటి కెట్టిస్థానము గలదు? వాటికిని, దేశమునిూవ వ్యవసాయశాఖాప్రచారకులు చేయు వ్యవసాయాభివృద్ధిబోధనలకును ఎట్టిసంబంధము గలదు? అనుముఖ్యాంశము లీవ్యాసములో చర్చింపబడును.

ఈదేశములో అనాదినుండి హిందూరాజులును, మహమ్మదీయ నవాబులును ఉద్యానవనములను, నందనవనములను బహుశ్రద్ధాసక్తులతో పెంచుచుండెడువారు. రామాయణాది ప్రాచీనగ్రంథములలో వర్ణింపబడుచు వచ్చిన ఇంద్రుడు, కుబేరుడు, రావణుడు మొదలగు వారి నందనవనము, అశోకవనాదులే ఇందుకు తార్కాణము. అట్టి ఉద్యానవనములు వారికిని వారికి తాబేదారులుగా నుండు ఇతరప్రభువులకును ఆవర్శప్రాయములుగా నుండుచుండెడివి. వీటిని పోషించుటలో ముఖ్యోద్దేశ్యము ఆనందమును కలుగజేయుచు ఆహ్లాదజనకములుగా నుండుటే అయినను, వాటిని బహుపొందికగాను, క్రమపద్ధతులతోను, నాజూకుగా నుండులాగునను అమర్చబడి, అచ్చట సామాన్యజనులకు సాధ్యము గాని, సహజవస్తుసముదాయమును సేకరించి వాటిని సంరక్షించుటలో బహు జాగరూకత చూపింపబడుచుండెడిది. నూతనములైన విషయములను నేర్చుకొనుటయందాసక్తిగలవారు, శిక్ష, జ్ఞానము, అభివృద్ధులకొరకే ప్రదేశములకు తరచుగా మిక్కిలియాతురతతో చేరుచుండెడివారు. రాజాధిరాజులుకూడ శేరీలను నడపించుచు వాటిలో వివిధజంతువులను పోషించి వ్యవసాయమును చేయుచు పండినపదార్థమును మహలులలోని కందాలలో వంటచేయించుచు అనుభవించుచుండెడివారు. నవీనములైన క్రొత్తక్రొత్త మొక్కలను, ఆవులను, ఆబోతులను ఈశేరీలలో పెంచి క్రమముగా దేశమునిూదకు పంపి ఆపరిసరప్రాంతములలో అభివృద్ధిని కలుగజేయుచు వచ్చుచుండిరి. అటువంటి శ్రద్ధాఫలితములే యిప్పటికిని మంచిమంచి జాతుల కూరగాయలలోను, బహురుచికరములగు మామిడిమొదలగు ఫలవృక్షములలోను, సువాసనగల ధాన్యాదులుమొదలగు పంటలలోను కానవచ్చుచున్నవి. జహంగీరు, ఇమాంపసందు మొదలగు అత్యుత్కృష్టమైన మామిడిజాతులు ప్రప్రథమమున బందరు నవాబువారి తోటలోమాత్రమే పెంచబడుచువచ్చి ఇప్పుడిప్పుడు ఇతరత్ర వ్యాపించుచున్నవి. అదేరీతిగా బంగనపల్లిమామిడికూడ సర్వత్ర వ్యాపించినది. ఈవిధముగానే విజయనగర సంస్థానాధీశులైన రాజపుత్రరాజుల ప్రాపకమున నెల్లిమర్లతమలపాకుతోటలు, సపోటా మొదలగు ఫలవృక్షము లెన్నో ఆంధ్రదేశమున ప్రసిద్ధికి వచ్చినవి. తంజావూరుమహారాష్ట్రప్రభువులును, మైసూరు సంస్థానాధీశులును, తిరువనంతపురం మహారాజులును, బొబ్బిలి వెలమదొరలును ఇంకా యితరరాజులును వారివారి ముఖ్యపట్టణములలోను, ఆచుట్టుప్రక్కలను నూతనమైన అనేక ఫల పుష్పాదులకు, మంచిమంచిజాతుల పశుసంతతుల వ్యాప్తికి కారణభూతులు.

ఋగ్వేదకాలమునకు తరువాత మనపూర్వులలో బుద్ధిమంతులైనవా రందరు ఆధ్యాత్మికచింతతో వారి తెలివితేటలను వేదాంతవిషయములయందును, రాచకార్యములందును, సంగీతము, సాహిత్యము మొదలగు నుత్తమవిద్యలయందును వినియోగపరచుచు, సర్వదా యితరులపై నాధారపడవలసియున్నట్టియు, అజ్ఞానులై

నట్టియు దరిద్రనారాయణుల చేతులలో జనబాహుళ్య మున కంతకు వలయు ఆహారమును పండించు భారమును విడిచిపెట్టుటవలన మన దేశపు వ్యవసాయపుపద్ధతులు కడు హీనస్థితిలో నుండుచువచ్చినవి. ఈవిషయమునే కీ. శే. పద్మసాలల అగ్నిహోత్రశాస్త్రిగారు వ్యవసాయదీపిక రెండవఅధ్యాయములో వివరించియున్నారు:

"ఆర్యు లీదేశాన నాదినుండియు నుండు
రటుగాన నిద్ది యార్యావర్తమయ్యె;
ఆర్యులప్పటివార లతిశాంతబుద్ధులును
వేదవేదాంగాదివిద్యాన్వితులును,
అంతియేకాకుండ యజ్ఞాదికర్మముల
గడుశ్రద్ధవహియించి గావించువారు;
సర్వకాలములందు జపతపంబులు బూని
యొరులతో మాటాడ నూహింపరెపుడు;
అద్వైతశాస్త్రంబు నభ్యసించియు కొంద
రవనిభోగము లెల్ల నస్థిరము లనుచు,
గోరకుండెడివారు కోరినప్పటికైన
దను వశాశ్వత మనుచు దలచి మదిలోన,
కామాదిదుశ్శత్రుగణము నంటగనీక
శమదమాదులతోడ సహవాస మొంది,
పొట్టపోషించుకొన నెట్టులైనను వారు
కొంచెము మిచ్చిన జాలునంచు నూహించి,
కడుసంతసము బడుచు కాలంబు గడపుచును
బరమార్థమున కాసపడుచుండువారు.
కాన నెంతటితెల్వి గలిగి యుండిన దమకు
శ్రమకరములగు వ్యవసాయాదికృతులు
నాచరించుట మాని యవి తెలివియును
ధనము చాలకుండినవారి పాలుగావించి
తా మూరకుండుటను ధరణిలో నేటికిని
బహుళలాభము నిచ్చు వ్యవసాయవృత్తి
తగిన బుద్ధిబలంబు ధనబలంబును లేని
వారిచేతుల జిక్కి వర్ధిల్లదయ్యె."

ఈరీతిగా దేశాధారమైన వ్యవసాయవృత్తి విద్యాగంధములేని కడుభీదల చేతిలో నుండబట్టి, యేవిధమైన అభివృద్ధిని బొందక మనదేశపు వ్యవసాయము కడు హీనస్థితిలో నుండుటకు కారణమైనది. వ్యవసాయ మట్టి హీనస్థితిలో నుండుకాలములలోగూడ రాజాధిరాజులవలన పోషింపబడుచువచ్చిన శేరీలు రహితుల కత్యంతోపయోగకారులై యుండుచువచ్చినవి. అట్టి బీదరహితులకు వసతులు తక్కువగాను, మితముగాను ఉండుటవలన వారికి సర్వదా రాజపోషణయు, సహాయము, సలహా లగత్యములు. పూర్వకాలములో నుండిన శేరీలు ఇప్పటికిని తెనుగుజిల్లాలలో "హవేలీ" భూములుగాను, అరవజిల్లాలలో "పన్నై" నేలలుగాను నామమాత్రమున కున్నవి.

ప్రజాసంరక్షణ దేశపాలకుల విధియగుటచే అనాదినుండియు అరణ్యములలో నివసించు తపోధనులు గూడ షడ్భాగమును రాజులకు పన్నుగా చెల్లించుచున్నట్లు మన ప్రాచీనగ్రంథరాజములే చెప్పుచున్నవి. వ్యవసాయదారులవద్దనుండి పన్నులను పుచ్చుకొను రాజులకు వ్యవసాయాభివృద్ధిమార్గములను కనిపెట్టి బోధించవలసిన బాధ్యత యుండుటచేతను, రహితుల క్షేమముమీదనే దేశక్షేమము, ప్రభువుల క్షేమము ఆధారపడియుండుటచేతను అభివృద్ధిమార్గములను రహితులకు బోధించుటకుగాను పూర్వకాలమునుండి వ్యవసాయశాఖ యొకటి యేర్పడియున్నట్లు కౌటిల్యుని అర్థశాస్త్రమువలన తెలియవచ్చుచున్నది. అట్టివ్యవసాయశాఖలే యీకాలమందు ప్రపంచమందంతటను అన్ని రాజ్యములలోను ఏర్పాటుకాబడి దేశైశ్వర్యమునకు తోడ్పడుచున్నవి. మః దేశములోకూడ ఆంగ్లేయప్రభుత్వమువారొక వ్యవసాయశాఖను ఏర్పరచి బహు నిపుణులైన శాస్త్రజ్ఞులచే పరిశోధనలను చేయించి వ్యవసాయాభివృద్ధికి శక్తివంచనలేక తోడ్పడుచున్నారు.

"ఈయవస్థల జూచి యిపుడు మనదొరతనము
వారు మన కందందు ఫారంబు లుంచి
ఆఫారములలోన నధికవిద్యావంతు
లతిబుద్ధిసంపన్నులైనవారలను

అధికారులుగ మంచి యామహాత్ములచేత
బాగైన వ్యవసాయపద్ధతుల నెల్ల
నేర్పించుచున్నారు నేర్చి రైతులు మంచి
పంటలను పండించి బాగుపడుడయ్య;
పంట లెక్కువగాను బండింపలేకున్న
లావుభూమిని దున్ను లాభంబు లేదు;
ఇదియంతయును వీర లెరిగి మనదొరతనము
వారు చెప్పుచునున్న పద్ధతుల వినుడు."

వ్యవసాయాభివృద్ధికి నవీనమార్గములు మూడు—విద్య, పరిశోధన, ప్రచారము. పరిశోధన మిగిలినరెంటికి పునాది రాయి. విద్యాగరపుటలోగాని, ఒకపద్ధతి నవలంబించునట్లు చేయుటలోగాని ఏసంగతి యెట్లు తటస్థించు చున్నది, యేపద్ధతియైనను అవలంబింపతగినదో విడిచి పెట్టవలసినదో మొదట తెలిసికొనవలయును.

పరిశోధనలేనిది యెట్టి వ్యవసాయమును నేర్పు గురువును విద్యార్థులకు అభినివేశమును గలిగింపజాలడు. అట్టి అభినివేశము లేనప్పుడు గురువులవద్దకు శిష్యులు చేరనేచేరరు. పరిశోధన లేనిదే యెట్టివ్యవసాయదారుడు తనవృత్తిని చాలకాలము సాగింపజాలడు. పూర్వకాలమునందు వ్యవసాయదారులు వారిపోషణకు వలయు పదార్థములనుమాత్రమే పండించుచువచ్చిన మార్గములు అప్పటిమట్టుకు సరిపోయినను కాలక్రమమున దేశకాలపరిస్థితులు మారుచు వచ్చుచుండుటచే ప్రాచీనపద్ధతులు తృప్తికరములు కాక మార్పబడవలసి వచ్చినవి. మొట్టమొదట జీవనోపాధిమట్టుకే సరిపోవుచుండిన వ్యవసాయము క్రమముగా వ్యాపారములోనికి మారినది. వ్యాపారసౌకర్యములు ఏర్పడినకొలది ప్రపంచమంతటిలో నుండు అంగళ్లకు సరిపోవునట్లుగా పంటలను పండించవలసిన పరిస్థితు లేర్పడినవి. వ్యవసాయదారు డిప్పుడు ప్రపంచకపు పోటీలో సరిగా నెగ్గి బ్రతుకవలయు ననిన అతని పంటలనుగాని, వ్యవసాయపు పద్ధతులనుగాని మార్చుకొని తాను సుఖముగా జీవింపగలుగునట్లు తగిన వసతుల నేర్పరచుకొనవలెను. అనగా ఇతరదేశములవారితో సరిగా పోటీచేసి అందుకనుగుణమైన వ్యవసాయపద్ధతులను, పంటమార్పులను అవలంబించి సరియగుమార్గమున పంటలను పండించవలెను. ఇందుకు వ్యవసాయదారునికి పరిశోధనయే శరణ్యము. కాబట్టి వ్యవసాయాభివృద్ధికి పరిశోధనయే కీలకము. వ్యవసాయాభివృద్ధిమార్గములను బాహుళ్యముగా నవలంబించి దేశకాలపరిస్థితులనుబట్టి తగుమార్పులతో రహితుల కుపదేశముచేయుటకు వ్యవసాయపరిశోధనస్థానములుతప్ప వేరు సాధనము లేదు.

౨

వ్యవసాయవృత్తికి సంబంధించి సిద్ధాంతపరచబడిన శాస్త్రీయపద్ధతులను అవలంబించి పరీక్షించుటకు వ్యవసాయస్థానములే ముఖ్యప్రదేశములు. తక్కినచోట్ల ఎక్కువఆదాయము నిచ్చుచున్న కొన్నిపంటలను పరీక్షార్థము ఈస్థానములందు పెంచిచూడబడును. వ్యవసాయకళాశాలయందు తరిఫీదుకాబడిఉత్తీర్ణులయినవారిచ్చోట వారు కళాశాలలో నేర్చుకొనిన శాస్త్రజన్యజ్ఞానము దేశకాలపరిస్థితుల కెట్లు అనుసరించునో పరీక్షించి చూచెదరు. ఇచ్చోటనే స్థానికపద్ధతులను పరీక్షించి అవి నిలిచియుండుటకు తగుకారణముల నరయుదురు. ఇచ్చోటనే పలురకముల యెరువులు, వ్యవసాయపు పనిముట్లు పరీక్షించి యెక్కువపంటల నిచ్చుట కెట్లుపయోగపడునో చూచెదరు. ఖర్చుతక్కువలో ఎక్కువఆదాయము వచ్చుమార్గముల నరసెదరు. రయితు లిచ్చోటికే, తమపైర్లకు జబ్బుతగిలి తెగులుగాని, చీడగాని పట్టినప్పుడును, 'తమపశువులకురోగములు వచ్చినప్పుడును ఎక్కువ ఆతురతతో వచ్చెదరు. ఇచ్చోటనే పశువుల మలమూత్రాదులనుసరిగా భద్రపరచి వాటియెరువును హెచ్చువిలువగలదిగాను, సారవంతముగుదానినిగాను చేయుట నేర్చుకొందురు. మంచిదూడలు పుట్టునను ఆశతో తమ పెయ్యలను ఘారముఆబోతుచే దాటించుటకు తీసుకొనివచ్చెదరు. ఇట్టిపనులన్నియు సర్కారువ్యవసాయస్థానములయందు సాధ్యమగునుగాని యొకొ్కకవ్యక్తివలన నిట్టి పనులు చాలకాలము జరుగగలవో లేవోమాత్ర మెంతమాత్రము నిదానించి ఆలోచనచేయరు. ఒకయజ

మానికి గల ఆసక్తి తగ్గవచ్చును; అతని ఆరోగ్యము గాని, స్థితిగతులుగాని చెడిపోవచ్చును. అందువలన సర్వము నాశనమగును. కొంతమంది జమీందారులు, వారు కోర్టు ఆఫ్ వార్డ్సువద్దనుండి వారి శేరీలపరిపాలనమును తీసుకొనిన కొద్దిరోజులలోనే వాటిని పూర్తిగా మూసివేయుట యిందుకు తార్కాణము.

ఆరంభించినపనిని జయప్రదముగా నడిపించుటకు ఇతరత్ర ఉపయోగింపదగిన ఫలితములను సంపాదింపగలిగియుండుట, బోధిచే అభివృద్ధిమార్గములలోని యుపయోగవిషయములనుసరించి నిశ్చయమైన నమ్మకము కలిగియుండుటకు వ్యవసాయస్థానములలో క్రమమైన శిక్షణను పొందిన తగినంత సిబ్బంది యుండవలయును. అచ్చట పశువులు, పనిముట్లు, యంత్రసామగ్రి చాలినంత యుండవలెను. బాగుగా పనులను నేర్చుకొనిన అనుభవశాలులైన ఖాయపుహలీలు చాలినంతమంది యుండవలెను. పశువులను కట్టిపెట్టుటకు, ఖరీదుగల యంత్రసామగ్రి చెడిపోకుండ నుంచుటకు, విలువగల పంటల ఫలితమును భద్రపరచుటకు, తాత్కాలికోపయోగముల కవసరమగు శోధనలను చేయుటకు, తగిన వసతిగృహము లవసరము. వీటికన్నిటికి చాలినంత ఖర్చును, తరిఫీదయిన తగిన మనుష్యులును, వినియోగపరచుటకు చాలినంతకాలము కావలయును. నిజమైన వ్యవసాయాభివృద్ధికిని పరిశోధనాఫలితముల యాథార్థ్యమునకును ఈమూడును ముఖ్యాంశములు. ఈకారణముల వలన ఏవ్యవసాయస్థానమును ప్రత్యేకము వ్యాపారపద్ధతులమీదనే నడిపించుటకు వీలుపడదు ఏయొక వ్యవసాయస్థానఫలితములును ఆయాచుట్టుప్రక్కల ప్రదేశములందు క్రమక్రమముగా వ్యాపించి నిదానించి కనిపెట్టినప్పుడు సమూహమువిూద కనుపించును. ఆపరిస్థితులకు ఆఅభివృద్ధి అవహలించినట్టును, ఎక్కువఫలితము నిచ్చినట్టును, వ్యవసాయపుఖర్చులు తగ్గినట్టును, వ్యాపారము చురుకుగా నున్నట్టును, ప్రజలు సుఖజీవనము చేయుచున్నట్టును కనుపించును. కాని యిందువలన, ఇచ్చట పనిచేయువారు అసమర్థులనియు, వారికి ఒప్పగింపబడిన ఫారమును లాభకారియగు పద్ధతులమీద నడిపించుటలో అనుభవములేనివారనియు అర్థముచేయరాదు. ఇందుకొకఉదాహరణము—పర్లాకిమిడిరాజాగారు అనేక సంవత్సరము లొక స్వంతశేరీని నడిపింపగా ప్రతిసంవత్సరము సుమారు రెండువేలరూపాయల నష్టమువచ్చుచుండెడిది వ్యవసాయపు డిపార్టుమెంటువారి తాబేదారును అయిదుసంవత్సరములపాటు ఇచ్చి పనులుచేయించగా అట్టి హెచ్చుజీతగానికగు ఖర్చు, హలీలకు హెచ్చుజీతములుకూడ పోగా ప్రతిసాలుకు రెండువేలరూపాయల నికరలాభము తేలినది. ఎస్టేటురయితులు ఈఅభివృద్ధులను అత్యంతాసక్తితో అవలంబించి యెక్కువలాభమును పొందుచున్నారు. ఇంతేకాక రాజాగారికి కూడ ఈశేరీని పోషించుటవలన మంచిలాభమును, స్థిరమైన ఆదాయమును ఏర్పడినవి. కాని పైనచెప్పిన రీతిని వ్యవసాయస్థానములను వ్యాపారపద్ధతులమీద నడిపింపవీలులేదు కాని వ్యవసాయశాఖలోని ఉద్యోగుల నిపుణతగల పాండిత్యమును పొంది జమీందారు లేరీతిని లాభములను పొందుటకు వీలుకలదో తెలియుటకు యీ ఉదాహరణము చాలును.

పరిశోధనలను కనిపెట్టుటలో, పనిచేయుటయందు సదాశ్రద్ధయు, పరిష్కారములను తేల్చుటలో ఎక్కువ ఊహాపోహలును, మితిలేనిశ్రమపడుటకు తగినంత శక్తిని కలిగియుండవలెను. ఇట్టిశక్తులను కలిగియుండుట అందరకిని లభించనూలభించదు; ఇట్టిగుణములను అవసరమైనంతవరకు కనపరచుటకు పరిస్థితులు అన్నిచోట్లను, అన్నికాలములందును సమకూడనూసమకూడవు.

పైన వివరింపబడిన సంగతులనుబట్టి వ్యవసాయస్థానముల నేర్పరచుటలో సంఖ్యలోను, ప్రదేశములలోను మితి యేర్పడుచున్నది. రాజధానియంతటిలోను ప్రతిచోటను వ్యవసాయస్థానముల నేర్పరచుట సాధ్యపడదుగాని క్రమశిక్షణను పొందిన తగిన ఉద్యోగస్థులు లభించి చాలినంత ధనము సమకూరినప్పుడు వ్యవసాయపద్ధతులలో నిర్దిష్టమైన ప్రత్యేకస్థలములయందు వ్యవసాయస్థానముల నేర్పరచుటయే ఆశయము.

సాగరీఫారంలోని నల్లరేగడభూములలో వరి పంటకు ఎరువులపరీక్ష చేయుటకు వీలుపడదు. అచ్చట తేలినఫలితములు గోదావరిజిల్లాలోని సామర్లకోటలో గాని, తంజావూరుజిల్లాలో ఆడుదురైలోగాని ఆ పైరుకే ఉపయోగించుటకు వీలుపడదు. తిరునల్వేలి జిల్లాలోని కోయిల్పట్టిలో పరీక్షించతగినది ప్రత్తిపంట; అది ఆడుదురైలో సరిగా పెరగజాలదు. ఉత్తరమల యాళములోని తాలిపరంబాలో మిరియము బాగా పెరుగునుగాని దానిని గోదావరియేజెన్సీలో పండించు టకు రాకున్నబర్గు దొరవారు చేసినప్రయత్నములన్నియు నిష్ఫలములైనవి. ఇందువల్ల ప్రత్యేకస్థలములకు వేరు వేరు ప్రశ్నలు కలవని స్పష్టమగుచున్నది. బళ్లారి, కర్నూలు, కోయంబత్తూరు, తిరునల్వేలిజిల్లాలకు ముఖ్య మైనపంట ప్రత్తి. దత్తమండలములలో ప్రత్తిని గొర్రు తో వరుసగా చల్లుదురు. అరవదేశములో వెదజల్లుదురు. బళ్లారికర్నూలుజిల్లాలలోకూడ వరుసలలోని దూర ములో వ్యత్యాస మున్నది. హెచ్చువర్షపాతము గల కర్నూలుజిల్లావరుసలు దగ్గరగా నుండును. వర్షము తక్కువ కురియు బళ్లారిజిల్లాలో వరుసలను దూర ముగా వేయుదురు. ఒకవ్యవసాయస్థానముసందా ప్రదేశ మునకు ముఖ్యావసరములను, వెంటనే ఫలితమును కలుగ జేయు ప్రత్యేకాంశములు మాత్రమే శ్రద్ధతో పనిచేయ బడును. ప్రతివ్యవసాయస్థానములోను పంటలను పం డించుపద్ధతు లాయాప్రదేశములకు తగియుండును. వాటి జయాపజయములమీద అచ్చటి రహితాంగముయొక్క లాభనష్టము లాధారపడియుండునట్లు చేయబడునుగాని దారినిపోవు వ్యవసాయదారులుకానివారి రుచులకు తగి నట్టుగాను,వినోదములకుగాను అవలంబింపబడియుండవు.

౧౯౦౦-వ సంవత్సరమునకు పూర్వము తిరునల్వేలి జిల్లాలో ప్రత్తి కల్తీగా అమ్మబడుచుండెడిది. న్యాయ మైన రయితెవరైనను తన కరుంగణిప్రత్తిని నూలు వడుకువారికి కావలసినట్లు శుద్ధముగా ఏరి, దుమ్ము, ఎండుఆకులచెత్త లేకుండా జమచేసినను శ్రమకుతగిన ప్రతిఫలము వచ్చుచుండెడిది కాదు. శ్రద్ధతో తీయ బడిన శుభ్రమైన ప్రత్తి బహుమితముగా నుండుట వల్లను, దానిని ప్రత్యేకముగా నుంచుటకు తగినంత సరకు లేకపోవుటవల్లను సరియగుసరకు రాక, లోడిరహి తులు వారు పండించుటలోను, ప్రత్తితీయుటలోను అవలంబించు చెడుమార్గములను విడిచిపెట్టకుండ నుండు టకు కారణమైనది. అందువలన కల్తీప్రత్తికి పెట్టేధరే మంచిప్రత్తికికూడా వచ్చుచున్నది. ఇందుకు ఫలితముగా వ్యాపారము మందగించుట, తక్కువధరలు వచ్చుట వలన ప్రత్తిపంటకు నష్టము సంభవించినది. తిరునల్వేలి జిల్లాలోని ప్రత్తిపంటను అభివృద్ధిచేయుతలంపుతోను, దత్తమండలములలో నుపయోగింపబడు గొర్రు, దానికి సంబంధించిన తక్కినపనిముట్లు ద్వారా వ్యవసాయపద్ధ తులలో అభివృద్ధిని చేయుతలంపుతోను ౧౯౦౯-వ సం. లో కోయిల్పట్టిలో వ్యవసాయస్థాన మేర్పరచబడినది. అట్టిఉద్దేశ్యముతోనే బళ్లారిజిల్లాలో పండు ప్రత్తి రకములను పరీక్షించి వృద్ధిలోనికి తీసుకొనివచ్చుటకు నంద్యాలబళ్లారిఫారము లేర్పరచబడినవి.

ఇదేరీతిగా చెరుకు కొకవిధమైన తెగు లంకు రించి దానికి తగినచికిత్స తెలియక రహితులకు నివా రణచేయుటకు సాధ్యముకాని సమయములో బెల్లపు వ్యాపారము త్వరలో నశించిపోవు స్థితిలోనికి వచ్చినది. ౧౯౧౪-వ సంవత్సరమునకు పూర్వము జిల్లామొత్తముమీద పదివేలయకరములకుపైగా నుండిన చెరుకుతోటల విస్తీర్ణము ౧౯౧౮-వ సం.రమునాటికి మూడు వేలయకరములకు దిగిపోయినది.అందువల్ల బెల్లపు వ్యాపారము తగ్గిపోయినందున కాకినాడ వర్తకసంఘము వారి గమనములోనికి వచ్చెను. వారీసంగతిని మద్రాసు గవర్నమెంటువారికి తెలియపరచగా వెంటనే సామర్ల కోటలో చెరుకుపరిశోధనస్థానము నేర్పరచిరి. వివిధ ప్రదేశములనుండి కొత్తరకముల చెరుకుజాతులను తెప్పిం చి దేశవాళీచెరుకులతోకూడ పైరుచేసి శ్రద్ధతో పరీక్షిం చిరి. తృప్తికరములుగా నుండిన కొత్తరకములను జిల్లా మీద పంచిపెట్టి చెరుకుపంట నుద్ధరించిరి. ఈకొత్త రకములు లాభకారులని కనిపెట్టబడి దేశవాళీరకములను పూర్తిగా అంతరింపజేయుటయే కాక విశాఖపట్టణము,

దక్షిణఆర్కాడు, మలబారు, దక్షిణకన్నడజిల్లాలలో త్వరితముగా దేశవాళీరకములను త్రోసివేయగలిగినవి. సాలుకు రెండులక్షలకుపైగా నష్టమువచ్చే కాకినాడ బెల్లపువ్యాపార మిప్పుడు పదిలక్షల లాభమును పొందుచున్నది.

ఇంతేకాక తనపంటలలో నభివృద్ధిని చేయుటకు ప్రయత్నించు రయితు ఇతరత్ర హెచ్చు పంటలను, ఎక్కువలాభము నిచ్చుటకు కారణములను, స్థానికపరిస్థితులను పూర్తిగా తెలిసికొనవలయును. తిరునల్వేలి జిల్లారయితు వ్యయప్రయాసలకోర్చి నంద్యాలగాని, బళ్లారిగాని వెళ్లి అచ్చట ప్రత్తిపండించు విధానములను తెలిసికొనుటకు తగిన స్థితిలో నుండడు. తన పట్టాభూములను పరీక్షార్థము సేద్యముచేయుటకు సమర్థుడుగా నుండజాలడు. సామాన్యవ్యవసాయదారులు చేయజాలని పనులను చేయుటకు ప్రథమమున విశేషధనవ్యయము చేయవలెను. చేసినను కొన్ని సంగతులు లాభకారులుగా నుండకపోవుటయేకాక తుదకు నాశనమునకుకూడ హేతుభూతము లగును. అటుమైన లాభకారిగా కనుపించిన పద్ధతులను బహిరంగపరుచక రహస్యముగా నుంచుటచే ప్రక్కనుండురయితులకైనను ఎంతమాత్రము లాభకారులు గానేరవు. అందరికి నుపయోగముగా నుండునట్లు గ్రామములోని కొంతమంది రయితులు కలిసి సమష్టిమీద కొంత పెట్టుబడి పెట్టి పనిచేసినయెడల అది వేరేసంగతి. నష్టమువచ్చినను అందరిమీద సర్దుకొనిన ఒకరికి ఎక్కువభారముగా నుండనేరదు. లాభకరమైన సంగతు లందరికి వ్యక్తమై బాగుగ నుపయోగములోనికి వచ్చును. ఇతరదేశములలో కార్యము లీరీతిని జరుగుచున్నవి. జావాద్వీపములో చెరుకు పండించువారు స్వయముగా పరీక్షాస్థానమును నడపుచున్నారు. ఇంగ్లాండులో గవర్నమెంటుతో సంబంధము లేకుండా రాజ్యాంగవ్యవసాయసంఘమువారు జీబరఖ్ వద్ద నొక వ్యవసాయస్థానమును పరిపాలించుచున్నారు. ఈ దేశములో శాస్త్రీయమైన నూతనవ్యవసాయాభివృద్ధిమార్గములను గమనించువా రెవరు తగినంతమంది లేని హేతువుచే అట్టి సంఘములు చేయుపనిని గవర్నమెంటువారే అవలంబింపవలసివచ్చినది.

వ్యవసాయస్థానమున కింకొక ముఖ్యమైనసంగతి గలదు. పరీక్షచేయబడు అంశముల ననుసరించి ఆ పరీక్షాఫలితములను కొంతకాలము కనిపెట్టి చూడవలసియుంటున్నది. మంచి ఆబోతుయొక్క ప్రాశస్త్యము ఒకసంవత్సరములోనే కనిపెట్టవచ్చును. లోతుదుక్కియొక్క ఉపయోగము ఒకమంచివర్షము కురియగానే తెలియును. క్రొత్త కసువుయొక్కగాని, గడ్డిరకముయొక్కగాని ఆధిక్యము పసువు లత్యాతురతతో తినగానే తేలును. క్రొత్తరకముల పంటఫలితము కోసి నూర్చగానే కనిపించును. పచ్చిఆకుయెరువుయొక్క ఉపయోగము రెండుమూడుసంవత్సరములకుగాని, దానిని వేయుటవల్ల కలిగే క్రమమైన జాస్తి పంటవలనగాని తేలదు.

రయితు లాభము పొందవలె నన్న ఈ స్థితిగతులలోని భేదములను వానికి చక్కగా బోధచేయవలెను. ఇట్టిపరిజ్ఞానమున క్రమమైన శిక్షణను పొందిన వ్యవసాయప్రచారకుడు సదా రయితును కలుసుకొనుచు, నూతనపద్ధతులను బోధచేయుచు, మంచివ్యవసాయపు పనిముట్లను చూపించి వాటి ఉపయోగములను ప్రత్యక్షముగా పనిచేసి కనుపరచియు, క్రొత్తరకముల విత్తనములను, ఎరువులను ఇచ్చియు వాటిని వేసిచూడవలసినదని ప్రోత్సాహము చేయుచు వానిసమ్మతముముందుకే యీ పరిజ్ఞానము నందజేయుచున్నాడు.

వ్యవసాయస్థానమున్న గ్రామములోని రయితులు అచ్చట పెంచబడు పంటల మంచిచెడ్డలను కొంతకాలము కనిపెట్టుటకు సాధ్య మగును. దానికి దూరములో నుండు రయితులకు ఆసక్తి లేకపోవుటవలనను, అసమ్మతివలనను, అజ్ఞానమువలనను తరుచుగా విముఖతకు కారణమగుచున్నది. వ్యవసాయప్రచారకుడు సర్వదా వ్యవసాయస్థానములో సంబంధ మంచుకొనుచున్నాడు. అతడు వ్యవసాయస్థానములో పనిచేసినవాడుగా నుండి తరుచు దానిని చూచుచు, అచ్చట పనిచేయువారితో

ప్రసంగించుచు రహితులకు పంచిపెట్టుటకుగాను ఫారం విత్తనములను తీసుకొని వెళ్లుచు, ఆఫారంలో నుండి యినుపనాగళ్లను, వాటితో పనిచేయగలిగిన కూలీలను రయితులచేలో దున్ని చూపించుటకు తీసుకొనివెళ్లుచు, అట్టి ఉపయోగముల ఫలితములను, ఆపనిము ల్లేవిధముగా పని చేసినదియు ఫారంవారికి తెలియజేయుచుండును. ఈ రీతిగా నిరంతరము ఫారములనుండి దూరములో నున్న గ్రామములకును, గ్రామములనుండి ఫారములకును వ్యవసాయప్రచారకునిద్వారా పరిజ్ఞానప్రవాహము నడుచుచుండును.

క్రమమైనశిక్షణలేనిది మంచిఫలితముల నిచ్చు పంటలు పండుటకుగాని, చెడిపోవుటకుగాని కారణములను కనిపెట్టుటకు ఫారము లేనిదే వ్యవసాయప్రచారకుడు ప్రామాణికముగా నొక క్రొత్తపంటను గాని, వ్యవసాయపద్ధతినిగాని నిర్మాణముచేసి రయితులకు నమ్మకము కలుగజేయుటకు వ్యవసాయప్రచారకునికి సాధ్యముకాదు. కేంద్రస్థానములో పనిచేయు శాస్త్రపరిశోధకునికికూడ ఫారము లగత్యములు. వారు పరీక్షాలయములలో కనిపెట్టిన ముఖ్యాంశములను వ్యవసాయదారులందరికి తెలియుటకు వాటిని వేరువేరుపరిస్థితులుగల ప్రదేశములలో పరీక్షించి చూచినతరువాతనే రయితుల కుపయోగకారు లని నిర్ధారణగా చెప్పవీలగును.

వ్యవసాయస్థానముల ఆవశ్యకత పూర్తిగా గ్రహించుటకును, వాటిఉపయోగములు వృద్ధిఅగుటకును, అవి అందరకు లాభకారులుగా నుండుటకును, వాటిలో నిర్ధారణ చేయబడిన అంశములు సర్వత్ర త్వరితముగావ్యాపించుటకును మూలస్థానము చెడిపోకుండునట్లు చూచి దానినుండి విజ్ఞానమును రయితుసమూహమునకు అనేకమార్గములద్వారా ప్రవహించినప్పుడే వ్యవసాయప్రచారకుని సామర్థ్యము తెలియును. అదును కానిరోజులలోమాత్రమే వ్యవసాయప్రచారకుడు అన్ని గ్రామములను చూచుటకు వీలగును. అదునుసమయమందు విత్తనములను చల్లించుటకు, ఎరువులను వేయించుటకు, కోతలుకోసి నూర్పించుటకును ఒకేకాలమునందతడు అన్నిచోట్ల నుండుట సాధ్యపడదు. చదువుకొనిన భూస్వాములు వారి నవుకర్లను, కవులుదార్లను వ్యవసాయశాఖవారు చేయుబోధనలను అవలంబించుటలోను, వ్యవసాయమునకు నష్టము కలుగజేయు అంశములను వ్యవసాయప్రచారకులకు సరిగా తెలియజేయుటలోను వ్యవసాయప్రచారకులతో సహకారము జరుపునెడల, అభివృద్ధియొక్కవత్వరలో జరిగి తక్కువకాలములోనే వాటి ఉపయోగములు వ్యాపించుటకు సాధ్యమగును. గవర్నమెంటువా రవలంబించుచున్న వ్యవసాయపద్ధతులపై ప్రజాభిప్రాయములను తెలుసుకొనుటకు వ్యవసాయకళాశాలకును, కొన్ని వ్యవసాయస్థానములకును గౌరవప్రేక్షకుల నేర్పాటు చేసియున్నారు. దీనిఫలిత మింకను తేలవలసియున్నది. గవర్నమెంటును, వ్యవసాయశాఖవారును ప్రజలు చేయు క్రమమైన ఆక్షేపణలను కోరుచుందురు. కాని, అట్టిఆక్షేపణలు వ్యవసాయాభివృద్ధికిని, రహితులాభమునకును, తద్వారా దేశసౌభాగ్యముకును చెందియుండవలెను.

గవర్నమెంటువారిచే నడుపబడు వ్యవసాయస్థానముల నేర్పరచుటలో నుద్దేశ్యములపై ప్రజలకుండు దురభిప్రాయము లీవ్యాసముమూలమున తొలగగలవని ఆశయము. దీనిలో పరిశోధనాలయము లొకమూలను, రహితు లొకమూలను వ్యవసాయస్థానములద్వారా వ్యవసాయ ప్రచారకులచే పరస్పరసంబంధము కనుపరుచబడినది.

---



౧. గంగాఘట్టములు-కాశీ (విమానమునుండి)



౨. గంగాఘట్టములు-కాశీ (విమానమునుండి)

—సి. జి. జగన్నాథదాసు.

# భారతీయవిద్యాచరిత్రము

(అనువృత్తము)

మారేమండ రామారావు, బి. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

## ఏడవ అధ్యాయము

[ఆధారములు:

Eliott—History of India.

Law—Promotion of Learning in Mahomadan times.

Kennedy—History of the Great Moguls.

Aiyeen—i—Akbari.]

### మొగలుయుగము

(౧౫౨౬ - ౧౭౦౭)

క్రీ. శ. ౧౫౨౫-వ సంవత్సరమున దౌలత్ ఖాన్ అను సామంతుడు ఢిల్లీసుల్తానను ఇబ్రాహీంలోడీయధికారమును ధిక్కరించి కాబూల్ దేశపుపాలకుడగు బేబర్ సహాయము నభ్యర్థించెను. కాని కాబూలీదేశమునకు వచ్చినవెంటనే దౌలత్ ఖాను వారిపై నెదురు తిరిగెను. గత్యంతరములేక నాసమయమున స్వదేశమునకు మరలివను బేబరు తిరిగి ౧౫౨౬లో హిందూదేశముపై దండెత్తివచ్చెను. అప్పు డితనికిని సుల్తాన్ ఇబ్రహీంనకును పానిపట్ వద్ద నొకయుద్ధము జరిగి యందు బేబరు విజయము నందెను. అనతికాలముననే ఢిల్లీ, ఆగ్రానగరము లాతనికి స్వాధీనము లైనవి. ౧౫౩౦ నాటికి బేబరున కుత్తరహిందూస్థాన మంతయు స్వాధీన మయ్యెను. ఇంతటితో భారతదేశమున మొగలు సామ్రాజ్యోదయ మయ్యెను. ఈ సామ్రాజ్యము రెండు శతాబ్దములకాలము వర్ధిల్లినది. ఈ కాలమున భారతదేశమునందు చాల మార్పులు గల్గినవి. ఇప్పటికే మహమ్మదీయపరిపాలనము ననుభవించి యందలి బాగోగులను జవిచూచిన హిందువులు దమయాచారవ్యవహారములయం దవసరములగు మార్పులను గల్పించుకొని తమ జాతీయజీవితమును బునరుద్ధరించుకొన బ్రయత్నించుచుండిరి. మొగలుచక్రవర్తు లందరును చక్కని విద్వాంసులును, రసజ్ఞులును నై యుండుటచే హైందవవిజ్ఞానము కొంచెము తలయెత్తికొనుట కవకాశ మేర్పడెను. అప్పటి మహమ్మదీయు లనేకులు సంస్కృతమును, హిందువులు పర్షియనుభాషను నేర్చికొని యాయాసారస్వతములందలి విశేషములను గ్రహింప బ్రయత్నించుచుండిరి. అక్బరుకాలమున హిందూమతమునకుగూడ మంచిదినములు వచ్చినవి. దానజేసి దేశమునందలి యన్నివిజ్ఞానములకును నూతనోత్తేజము గల్గినది. పారశీకసంస్కృతభాషాసమ్మిశ్రణమువలన నుర్దూభాష వెలువడి నూతనగ్రంథరచనమునకు గారణమయ్యెను. విద్వాంసులును, గవులునేకాక శిల్పి, గాయక, చిత్రకార, లేఖకాదివివిధకళాభిజ్ఞులుగూడ రాజాదరణమును బడసి యనేకవిధముల దమనైపుణ్యమును వ్యక్తీకరించిరి.

మొగలుల కాలమునగూడ మక్తాబులును, మద్రసాలును ముఖ్యములగు విద్యాసంస్థలుగ నుండినవి. ఔరంగజేబుపాదుషా తప్ప ఇతరు లందరును నిష్పక్షపాతబుద్ధితో విద్యాదాదరణము నొనర్చుటచే నీకాలము భారతవిద్యాచరిత్రమున కమూల్యమగు భూషణము. మునుపటివలెనే యొక్కొకపాదుషాకాలపు విద్యాచరిత్రము నీక్రింద సంక్షేపముగ జేర్కొనబడుచున్నది:

బేబరు, ౧౫౨౫ - ౧౫౩౦:—ఈతడు ప్రశంసనీయమగు విమర్శనాశక్తిని, పర్షియన్, అరేబియన్, తుర్కీభాషలలో నద్వితీయమగు పాండిత్యమును గలిగి యుండెను. తుర్కీభాషలో నీతడు పెక్కుకావ్యములను, ఛందశ్శాస్త్రము నొకదానిని రచించెను.

సంగీతమునను, ధర్మశాస్త్రమునను గూడ నీతనిచే రచింపబడిన గ్రంథములు గలవు తన జీవితమునందలి వివిధ విషయముల నుల్లేఖించుచు నీతడు వ్రాసిన స్వీయచరిత్రము చరిత్రమునకును, వాఙ్మయమునకును మిగుల ముఖ్యమైనది. నిరాడంబరమును, స్వాభావికమును నగు శైలి యీతని గద్యపద్యములకు గల ముఖ్యలక్షణము. నూతనమగు నొకఛందస్సును, మరియొక యపూర్వ లిపియు నీతనిచే గనిపెట్టబడినవి. చిత్రలేఖనమునగూడ నీతనికి గడు చక్కని యభిరుచి యుండెడిది. ఈ పాదుషా విద్వాంసుల సమావేశములందును, గ్రంథాలయములందును విశేషకాలమును గడపుచుండెను

హుమయూన్, ౧౫౩౦-౧౫౫౬ :— ఈతడు చక్కని విద్వాంసుడు. జ్యోతిష భూగోళశాస్త్రముల యందభిరుచి గల యీచక్రవర్తి స్వోపయోగార్థము భూగోళఖగోళములకు ప్రతికృతులను (Globes) నిర్మించుకొనెను. జాతకభాగమునం దీతనికి ప్రబలమగు విశ్వాస ముండెడిది. పంచభూతములయొక్క తత్త్వమును విమర్శించుచు నిత డొక గ్రంథమును రచించెను. తన దర్శనమొనర్చి తన యాదరమును బడయనేతెంచువారలనెల్లర నీతడు కొన్ని తరగతులుగ విభజించి యందు విద్వాంసులకు మతప్రచారకుల తోడను, ధర్మశాస్త్రజ్ఞులతోడను సమముగ నగ్రస్థానము నొసంగెను. ఖగోళమునందలి గ్రహముల పేరిట దివ్య భవనములను నిర్మించి యీ చక్రవర్తి శనిగురువుల భవనములలో విద్వత్సమ్మానము నొనర్చుచుండెను. యుద్ధరంగముల కేగునపుడును, దుడకు ప్రాణములకై పరుగెత్తునపుడునుగూడ నీతడు గ్రంథములనుమాత్రము విడువకుండెనట. దీనినుండి యీతనికి గల విద్యాపిపాస వ్యక్తమగుచున్నది. ఈచక్రవర్తి నిర్మించిన విద్యానిలయములలో ఢిల్లీనగరమునందలి కళాశాలయు, ఆగ్రానగరమున కెదురుగ యమునాతీరమునందలి మరియొక విద్యాలయమును ముఖ్యములు.

అక్బరు, ౧౫౫౬ - ౧౬౦౫:—సదసద్వివేకియు, దయాస్వాంతుడును, సరసుడునునగు నీచక్రవర్తి పరిపాలనకాలము చంద్రగుప్త, అశోక, కనిష్క, శ్రీహర్షాది హైందవరాజన్యుల పరిపాలన కాలమున కెనయై భారతదేశచరిత్రమునకు వెలలేనిరత్నమై యొప్పుచున్నది. విద్యాపోషణమునం దీతడు మహమ్మదీయపాలకులలో నెల్ల నగ్రగణ్యుడు. సర్వతోముఖమగు నీతని పాండితీసమాదరణము నిష్పక్షపాతముగను, గుణప్రధానముగను ఒప్పినది. అన్ని మతములను, వాఙ్మయములను నీతడు శ్రద్ధతో బరిశీలించి సమ్మానించుచుండెను. ప్రతిదినమును నిదురించుటకుపూర్వ మీత డుద్గ్రంథములను వినుచుండెను. ఈచక్రవర్తి తాను నూతనముగ నిర్మించిన ఫతేపూర్ సిక్రీ యను రాజధానీనగరమున "ఇబాదత్ ఖానా" యను నొకభవనమును గట్టించెను. ఈత డందలి పశ్చిమభాగమున సయ్యదులను మతగురువులను, దక్షిణమున ఉలేమాలను విద్వాంసులను సమ్మానించుచుండెను. ఆదిశుక్రవారములందును, పుణ్యదినములలో రాత్రులందును చక్రవర్తి, మహమ్మదీయమతప్రచారకులను, ధర్మశాస్త్రవేత్తలను, బ్రాహ్మణులను, జైనులను, బౌద్ధులను, చార్వాకులను, పారసీకులను, క్రైస్తవులను సమావేశపరచి వారివారి మతములనుగూర్చి విశేషాంశములను దెలిసికొనుచుండెను. ఇచ్చట నట్టిసమయములలో జరుగుచుండిన వివాదములలో జక్రవర్తి తానును బాల్గొనుచుండెను. ఈ పాండితీప్రదర్శనమునం దగ్రగణ్యులుగ నిర్ణయింపబడినవారల కీతడు "అష్రఫీ"లను బంగారునాణెములను దోసెళ్లతో నిచ్చి బహూకరించుచుండెను.

అక్బరు ప్రేరేపణచే సంస్కృతమునుండియు, నితరభాషలనుండియు ననేకగ్రంథములు పర్షియను హిందీ భాషలలోనికి బరివర్తింపబడుచుండెడివి. ౧౫౮౪-వ సంవత్సరమున మహాభారతము 'రాజంనామా' యను పేరిట పర్షియనులోనికి తర్జుమాచేయబడెను. ఆగ్రంథమునకు చక్రవర్తి అబుల్ ఫజుల్ అను సుప్రసిద్ధ చరిత్రకారునిచే టీకను వ్రాయించి దానిప్రతులను దనసామంతులందరును గొనునటు లాజ్ఞాపించెను. అబ్దుల్ ఖ్వాదిర్ అను నతడు రామాయణమును, ఇబ్రహీం సర్ హిందీ యనునత డథర్వవేదమును, ఫైజీయనునాతడు లీలావతియను జ్యోతిషగ్రంథమును, షాహబాదీయను

నతడు రాజతరంగిణిని భాషాంతరీకరించిరి. అటులనే హరివంశపంచతంత్రములును, నలదమయంతియను కావ్యమును పర్షియనులో వ్రాయబడినవి. 'సింహాసనబత్తీసి' యను బౌద్ధగ్రంథమును, కిషన్‌జోషి, గంగాధర, మహేశ్ మహానంద యనుసంస్కృతగ్రంథములును, బైబిలుగ్రంథమును, బాబరు చక్రవర్తియొక్క చరిత్రమును, తారీఖ్ ఇ ఆల్ఫీ అను మరియొకచరిత్రమునుగూడ బరివర్తనము నందినవి.

తాను స్వయముగ సేకరించియు, నితరులనుండి సంపాదించియు నక్బరుచక్రవర్తి యనేకపుస్తకములను గూర్చి యొక చక్కనిభాండాగారమును నిర్మించెను. ఈతనికి చిత్రలేఖనమన నెక్కుడు ప్రీతి. ఈతని చిత్రశాలలో ననేకులు పనిచేయుచుండిరి. వీరిలో నెక్కుమంది హిందువు లుండిరి. వీరిచే రాజబంధువుల యొక్కయు, ప్రధానోద్యోగులయొక్కయు చిత్రములనేకములు తయారుచేయబడినవి. సుప్రసిద్ధగాయకులనేకులు చక్రవర్తియాదరమును బడసిరి. రామదాసు, హరిదాసు ననుహిందువులు వారిలో ముఖ్యులు.

'అయినీ అక్బారీ'యనుచరిత్రమునుండి యక్బరుకాలమునందలి విద్యావిధానమునుగూర్చి కొన్నివిశేషాంశములు దెలియుచున్నవి. మతభేదములను పాటింపక చక్రవర్తి యెల్లవిద్యల నాదరించుచుండెను. పాఠశాలలో హిందూమహమ్మదీయబాలురు కలసియే చదువుచుండిరి. ఒక్కొక్కరికిని తగినవిద్యాప్రణాళిక లేర్పరుపబడియుండినవి. విద్యార్థికి మనోవికాసమును గల్గించుటయేకాక ఆతనికి భావిజీవితసమస్యల నెదుర్కొనుశక్తినిగూడ గల్పించుట విద్యావిధానముయొక్క పరమావధియని యీచక్రవర్తి నిశ్చయించెను. ఇంతకు బూర్వము బాలురు సుమారు నాల్గుసంవత్సరములకాలమును అచ్చులను, హల్లులను నేర్చుటయందు వ్యర్థపరచుచుండిరి. దీనిని మార్పుచేసి యక్బరు వార లాకాలమున జదువుట, వ్రాయుట, గద్యపద్యములను మనోగతముల జేసికొనుట, నీతి, మతము మున్నగువిశేషాంశములను గ్రహింపగల్గునటు లేర్పరచెను. విద్యనభ్యసించుటలో విద్యార్థియే మిగుల గష్టపడవలెననియు, నుపాధ్యాయుడు సేవలమును మార్గదర్శిగనే యుండవలెననియు నక్బరుచక్రవర్తి తలంచెను. పైవిధమున బ్రారంభవిద్య ముగిసిన పిమ్మట బాలురకు గణితము, రేఖాగణితము, వ్యవసాయము, జ్యోతిషము, రాజ్యాంగము, వైద్యము, తర్కము, చరిత్రము మున్నగునవి నేర్పబడుచుండెడివి. హిందూబాలురు వేదాంతమును, పాతంజలిమహాభాష్యాంతము వ్యాకరణమును జదువుచుండిరి. అటుపై నున్నతవిద్యాభ్యాసమునుగోరువారలు ఫతేపూర్‌సిక్రీ, ఢిల్లీ, ఆగ్రా మున్నగు విద్యాకేంద్రస్థానముల కేగుచుండిరి.

తాత్కాలికవిద్యావిధానము నిటుల సంస్కరించుటయేకాక చక్రవర్తి యనేకస్థలముల విద్యానిలయములను నెలకొల్పెను. ఆతని దాదియగు మహన్‌అన్గ యనునామె ఢిల్లీలో నొక కళాశాలను నెలకొల్పెను. మంత్రియగు బైరంఖాను, నాతని తనయుడగు అబ్దుల్ రహీమును మహావిద్వాంసులుగ నుండి చక్కనిగ్రంథాలయమును నిర్మించిరి.

రాజకీయమునందువలెనే విద్యానిర్వహణమునగూడ అక్బరుచక్రవర్తిపరిపాలనము సర్వజనసమ్మతమై యపూర్వశోభావంతమై యుండినది. నాలుగైదు శతాబ్దములనుండి యణగద్రొక్కబడి నామావశేషముగ నుండిన హిందూవైదుష్యము ఈచక్రవర్తిపరిపాలనమున దిరిగి దలయెత్తసాగినది. హిందువులును, మహమ్మదీయులును పరస్పరద్వేషములను వీడి రాజధర్మము ననుగమించి సౌహార్దముతో మెలగుటజేసి వారలనాగరికతలు నూతనోత్తేజనము నందినవి.

జహంగీరు, ౧౬౦౫-౧౬౨౭ :—ఈచక్రవర్తి రాజకీయములందువలెనే విద్యావిషయమునగూడ తన తండ్రియగు అక్బరుచక్రవర్తిమార్గము ననుగమించెను. ఈతని శీలము విషమముగ నుండెననియు, నీత డొకప్పుడతిక్రౌర్యమును, మరయొకసమయమునం దతిదయను జూపుచుండెననియు చరిత్రము దెల్పుచున్నది. అదృష్టవశమున విద్యావిషయము లీతని యత్యంతాదరమును బడసి

నవి. సహజముగ నీతనికి పర్షియను, తుర్కీభాషలలో జక్కనినైదుష్య ముండెను. ఈతనిస్వీయచరిత్రమునుండి యీతని విద్యాభినిరతియు, లలితకళలయందలి యభిరుచియు దెలియుచున్నవి. దాయాదులు లేక మరణించిన ధనికులయొక్కయు, యాత్రికులయొక్కయు సర్వస్వమును ప్రభుత్వమునకే జెందవలెననియు, నయ్యది విద్యాలయోద్ధరణార్థ ముపయోగింపబడవలెననియు నీ చక్రవర్తి శాసించెను. "ఫర్హన్గి జహాంగీరి" యను నొకనిఘంటువు నీతడు తయారుచేయించెను. లలితకళలయెడ నీచక్రవర్తికిగల యభిమానము వర్ణనాతీతము. ఈతడు తనయాస్థానపు ప్రతికృతిని సుప్రసిద్ధులగు చిత్రకారులచే వ్రాయించి దానిని తనస్వీయ చరిత్రమునకు ముఖపత్రముగ వేయించెను. ఈతని పోషణమునందుండిన దేశీయచిత్రకారులు పాశ్చాత్య చిత్రములకుసహితము మాతృకలను మరపింపజేయునంతటి చక్కని ప్రతికృతులను తయారుచేయ సమర్థులైయుండిరి. అబుల్‌హస్సన్, మన్సూర్ అనువార లప్పటి చిత్రకారులలో సుప్రసిద్ధులుగ నుండిరి. ఈ చక్రవర్తికాలమున నిర్మింపబడిన దివ్యభవనములందలి శిల్పము చక్రవర్తియుద్దేశ్యము ననుసరించియే నిర్మింపబడినది. ఆగ్రానగరమునందలి ఇతిమాదుద్దౌలా సమాధియు, సికందరనగరములోని అక్బరుసమాధియు, లాహోరునగరమునందలి యీచక్రవర్తిసమాధియు నీతని కళాభిజ్ఞతకు ప్రబలనిదర్శనములు.

షాజహాన్, ౧౬౨౮ - ౧౬౫౮ :— షాజహాన్ చక్రవర్తిస్వభావమునుగూర్చి చరిత్రకారులలో నభిప్రాయభేదములు గలవు. విన్సెంటుస్మిత్తుపండితు డీచక్రవర్తి మక్కోపియనియు, నతిక్రోధమును అతి దయను జూపుచుండెననియు, విషయలోలుడుగ నుండెననియు వ్రాసియున్నాడు. ఎల్ఫిన్‌స్టన్ మున్నగు నితరులు షాజహాను దయాళు డనియును, మహనీయు డనియును వ్రాసియున్నారు. ఏది యెట్లున్నను విద్యా విషయమునం దీచక్రవర్తి యొనర్చిన విశేషకార్యము లేమియు లేవు. బాద్‌షానామా, ముంతఖాబుల్ లుబాబ్ అను రెండు చరిత్రములుమాత్ర మీతని ప్రోత్సాహముచే లిఖింపబడినవి. ఢిల్లీనగరమున జుమ్మా మసీదు నొద్ద నొకకళాశాలగూడ నీతనిచే నిర్మింపబడెను. ఈచక్రవర్తికి గానమునెడను, శిల్పమునెడను ప్రీతి యెక్కువ. ఈత డాదరించినగాయకులలో రామదాస్, మహాపత్తార్ అను హిందువులు ముఖ్యులు.

షాజహాన్‌కాలమునం దాతనితనయుడగు దారా మిగుల ప్రసిద్ధిచెందిన పండితుడుగ నుండెను. పర్షియన్, అరబిక్, సంస్కృతభాషలలో నీతనిపాండిత్య మద్వితీయమైయుండెను. సంస్కృతవాఙ్మయము, హిందూ విజ్ఞానము నీతడు విశేషముగ ప్రేమించుచుండెను. ఈయువరాజు మణిఖచితములగు దనయంగుళీయకములపై 'ప్రభు' యనుపదమును చెక్కించుకొనెనట. కాశీనగరమునుండి సుప్రసిద్ధులగు పండితులను రావించి వారి సాహాయ్యముచే నీతడు ఉపనిషత్తులను, భగవద్గీతను, యోగవాసిష్ఠమును పర్షియనుభాషలోనికి బరివర్తించెను. హిందూమతమును, సూఫీమతమును సరిపోల్చుచు నీతడు రచించిన విమర్శనము మిగుల ప్రశంసనీయము.

ఔరంగజేబు, ౧౬౫౮-౧౭౦౭ :— షాజహాను కాలమునకు మొగలుసామ్రాజ్యము సర్వవిషయములను బరమావధిని గాంచినది. ఆతనితనయుడగు ఔరంగజేబు మహాపరాక్రమశాలియు, రాజనీతిజ్ఞుడును నైయుండినను మతావేశపిశాచమునకు లోనయ్యెను. దేశమునం దధిక సంఖ్యాకులుగ నున్న హిందువుల యాదరసౌఖ్యముల పైననే మొగలుసామ్రాజ్యసౌధము నిర్మింపబడవలెనను నక్బరుచక్రవర్తియాదర్శమును, హిందువులయెడ నాతడు చూపిన మతసహిష్ణుతయు, వారివిజ్ఞానమున కాత డొసంగిన ప్రోత్సాహమును ఔరంగజేబుచే తారుమారుచేయబడినవి. తనసామ్రాజ్యమునం దెల్లరును సున్నీమతానుయాయులుగ నుండవలెననియు, రాజ్యాంగమంతయు ఖొరానునందలి విధుల ననుసరించియే నిర్వహింపబడవలెననియు నీతడు కృతనిశ్చయు డయ్యెను. ఈ యాదర్శముల నీత డాచరణలోనికి దెచ్చుట హిందువులకకాలప్రళయ మొదవినటు లయ్యెను. ఈచక్రవర్తి యాగ్రహము హిందూదేవాలయములపైనను, హిందూ విజ్ఞానముపైనను బ్రసరించెను. దానజేసి ౧౬౭౯ లో

నీతనియాజ్ఞచే హిందూవిద్యానిధానములగు దేవాలయము లెన్నియో నాశమొనర్పబడినవి. అందు కాశీక్షేత్రమునందలి విశ్వనాథాలయమును, మథురాక్షేత్రమున రాజాబీర్‌సింహుచే ముప్పదిమూడులక్షలు వ్యయపరచి కట్టింపబడి, సుందరశిల్పములలో నద్వితీయమని పేరెన్నికగాంచిన కేశవదేవాలయమును ముఖ్యములు. రాష్ట్రీయపాలకులందరకును హిందువుల యాలయములను, విద్యాలయములను ధ్వంసముచేయునటు లాజ్ఞయొసంగబడెను. ఢిల్లీసుల్తానులకాలమున వారిక్రౌర్యమున కోర్వజాలక మారుమూలల దాగి యజ్ఞాతవాసమొనర్చుచుండి యక్బరు జహంగీరు చక్రవర్తుల సహిష్ణుతాబుద్ధిచే బునర్జీవమునంది దన యసమానశోభావైభవములచే వారిమన్ననను, ప్రోత్సాహమును బడసి నూతనవికాసము నందుచుండిన హిందూవిజ్ఞానవల్లిక యౌరంగజేబు పైశాచికమతావేశముచే సమూలముగ ఛేదింపబడెను. ఈసందర్భమునం దెందరో పండితులును, ఎన్నియో గ్రంథములును నశించియుండినవి. కాన హిందూవిద్యాచరిత్రమునం దౌరంగజేబురాజ్యకాలము మహాదౌర్భాగ్యము నొనగూర్చిన యంధకారయుగము. ఆతనియీ దుష్ప్రవృత్తిచే మొగలుసామ్రాజ్యనాశమునకు ప్రథమసోపాన మేర్పడుటయేకాక హిందూవాఙ్మయమునకును, నాధునిక భారతీయసారస్వత గౌరవమునకును తీరనిలోటు సంభవించినది.

చక్రవర్తిమతావేశము హిందూవిద్య కెంతకీడును గల్గించెనో మహమ్మదీయవిద్య కంత యభ్యుదయమును చేకూర్చెను. అనేకస్థలముల నితడు పాఠశాలలను, కళాశాలలను నిర్మించి సుప్రసిద్ధపండితుల నం దుపాధ్యాయులుగ నియమించి వారికిని విద్యార్థులకును గూడ వేతనములను, భరణములను ఏర్పరచెను. ఫిరోజ్‌షా తుగ్లక్‌వలె నీతడును బానిసలయుద్ధరణమునకై పాటుపడెను. గుజరాత్‌దేశమునందలి బోహ్రాలను బానిసల కీతడు విద్య నేర్పించెను. ఈతనికాలమున పాదుషాల గ్రంథాలయమున కెన్నియోగ్రంథములు చేర్పబడినవి.

అక్బరుచక్రవర్తివలె నీతడుగూడ దాత్కాలిక విద్యానిధానమునం దనేకములగు మార్పులను జేయించెను. విద్యావిషయమునం దీతనికిగలయభిప్రాయములు గొన్ని మిక్కిలి కొనియాడదగియున్నవి. మేధాశక్తిని మాత్రము పెంపొందించు వ్యాకరణతర్కశాస్త్రములకు సామాన్యవిద్యాప్రణాళికయం దంతప్రాముఖ్య ముండరాదనియు, ప్రపంచజ్ఞానము నభివృద్ధిపరచుచరిత్రము, భూగోళము, భాషలు మున్నగువానిలో బ్రత్యేకబోధన మవసరమనియు నీతడు దలంచెను. జీవితరంగమునందలి వివిధసమస్యల నెదుర్కొని వానిని జయప్రదముగ చాటుట కవసరమగుపాటవము నిచ్చుచు, భావిజీవితమున ప్రతివారును దాముగైకొను వృత్తులతో సన్నిహితమగు సంబంధమును గల్గియుండువిద్యయే పాఠశాలలలో బోధింపబడవలసిన విద్యయని యాతడు ప్రతిపాదించెను.

ఔరంగజేబు ప్రబలమగు మతావేశమును, వైరాగ్యమును గల్గియుండెను. నిరాడంబరమగు జీవితమును, నిరంతరాధ్యాత్మికచింతనమును జీవితపరమావధు లను ఖురానువాక్యముల నీత డాచరణలోనికి దెచ్చెను. దానజేసి యీతడు మొగలులయాస్థానమున స్థిరముగ నాటియున్న యాడంబర, శృంగార, రాజసచిహ్నములగు లలితకళలను, శిల్పమును, గానమును, అలంకారములను దూరముగ దరిమివైచెను. ఇంతవరకును రోజున కొక మాదిరి నూతనకావ్యాభరణములతో మెరయుచు, ఘడియకొకనూతనగీతిక నాలాపించుచు, దినదినము నొక్కొక నూతనశిల్పనాట్యమునొనర్చుచుహిందూవాఙ్మయమోహనయనుంగుచేడియవలె వెంటరా, విశ్వమోహనగతులను విహరించుచుండిన మొగలుసామ్రాజ్యరమణి హఠాత్తుగ సర్వనాశమునంది పాలకునివలెనే పరివ్రాజికావస్థ నందినిస్తేజయయ్యెను.

కడపటి మొగలులు, ౧౭౦౭ - ౧౭౬౧:— మొగలుసామ్రాజ్యము వాస్తవముగ నౌరంగజేబుతోడనే యస్తమించెను. ఆతనియనంతర మాతనిపుత్రులు సింహాసనమునకై తగవులాడి యొకరికంఠముల నింకొక రుత్తరించుకొనుచుండ సామంతులును, శత్రువులును వివిధ

రాష్ట్రములను వశపరచుకొనిరి. నామమాత్రావశేషులగు నా కడపటి మొగలులు లెటులో మరియరువది సంవత్సరములకాలము తమ జీవితములను సాగించిరి. ఔరంగజేబునకు బిమ్మట రాజ్యమునకు వచ్చిన యాతని పెద్ద కుమారు డగు బహదూర్‌షాకాలమున ఢిల్లీ మున్నగు నగరములలో విద్యాలయము లెన్నియో యుండెడివి. పిమ్మట మహమ్మద్‌షాకాలమున జయపుర రాజపుత్ర సంస్థాననిర్మాత యగు రాజా జయసింగ్ జయపూర్, ఉజ్జయిని, మాల్వా, మథుర, కాశీ, ఢిల్లీ మున్నగు స్థలముల జ్యోతిర్దర్శనశాలలను ( observatories ) గట్టించెను. ఈకాలమున పర్షియా దేశపాలకు డగు నాదిర్షా భారతదేశముపై దండెత్తివచ్చి మొగలుల స్వాతంత్ర్యమును, విశేషధనరాసులను గొనిపోయెను. ఇటు లీ దేశమును బాసిపోయిన యమూల్యవస్తువులలో మొగలు చక్రవర్తుల గ్రంథాలయము మిగుల ముఖ్యమైనది.

స్త్రీవిద్య :— ఈ మొగలుచక్రవర్తుల పరిపాలన కాలమునందలి విద్యాచరిత్రమును ముగించుటకు పూర్వ మాకాలమునందలి స్త్రీలవైదుష్యమును సంక్షేపముగ బరిశీలింపవలసియున్నది. పర్‌దానియమమునకు లోనై మహమ్మదీయవనితలును, మానభంగశంకచే హిందూస్త్రీలును నిరంతరము నంతఃపురములనే తమజీవితములను గడపుచుండిరి. బాల్యమునమాత్రము వారలు పాఠశాలలలో చదువుచుండిరి. యౌవనప్రాదుర్భావమే వారి వైదుష్యమునకు భరతవాక్యముగ నొప్పుచుండెడిది. మహమ్మదీయపాలనమును విశేషముగ నెరుంగక ప్రాచీన హిందూమతాచారవ్యవహారముల కాలవాలమైయుండిన రసపుత్రస్థానమునందును, సుచిరకాలము స్వాతంత్ర్యము ననుభవించి హిందూమతోద్ధరణదీక్షితులగు రాజన్యులచే బాలింపబడిన దక్షిణాపథమునను మాత్రము హిందూ స్త్రీ లున్నతవిద్య నభ్యసించి సుప్రసిద్ధ విదుషీమణులని ప్రసిద్ధి గాంచిరి.

మహమ్మదీయకాంతలలోగూడ వైదుష్యమును సంపాదించినవార లుండినటులు చరిత్రము తెల్పుచున్నది. ఢిల్లీ సింహాసనము నధిష్ఠించిన రమణీమణియగు రెజియాబీగము చక్కనివిద్యావతి. మాల్వారాజ్యపరిపాలకు డగు సుల్తాన్ ఘియాసుద్దీను తన యంతఃపుర స్త్రీలకు విద్యనేర్పుటకై యుపాధ్యాయినుల నేర్పరచెను. బేబరుచక్రవర్తికూతు రగు గుల్‌బదన్ బేగం హుమాయూన్‌చరిత్రమును రచించెను. హుమాయూన్ మేనకోడలగు నొకస్త్రీ పర్షియనుభాషలో చక్కని పద్యములను రచించెను. అక్బరుచక్రవర్తి దాదియగు మెహన్ అన్గయనునామె విద్యావతి. ఈచక్రవర్తి ఫతేపూర్‌సిక్రీలోని తనరాజభవనమునందలి కొన్నిభాగముల నంతఃపురస్త్రీల విద్యాభ్యాసమునకై ప్రత్యేకించెను. జహంగీర్‌పత్నియగు నూర్జహానుకు అరబిక్, పర్షియనుభాషలలో నిరుపమమగు పాండిత్య ముండెడిది. షాజహాన్‌భార్యయగు ముంతాజ్‌మహల్ పర్షియనులో చక్కనిగీతములను వ్రాయుచుండెను. ఈ చక్రవర్తికూతురగు జహనారబేగముకూడ చక్కనివిదుషీమణియైయుండెను. ఔరంగజేబు తన తనయయగు జేబున్నీసాకు స్వయముగ విద్యనేర్పి యామె నొక సుప్రసిద్ధవిదుషీమణిగను, చక్కనివిలేఖరిగను ఒనర్చెను.

---

# విద్యయొక్క పరమార్థము

ఆర్. యస్. పట్నాయక్, బి. ఏ.,

వర్తమానకాలమందలి పరిస్థితులు ప్రతివిషయమునందు వేదనావిషాదాంకితములై ప్రజాసంఘమును కలుసంకులపెట్టుచున్నవి. రాజకీయరంగము ప్రజాయత్తమైనను, విప్లవసూచనీయములగు గందరగోళములు మాత్రము నానాటికి పెంపొందుచున్నవి. గోరుచుట్టుపై రోకటిపోటువలె, ఆర్థికదౌర్బల్యము వ్యాధిగ్రస్తమైన దేశమును మరింతక్షీణింపజేయుచున్నది. విదేశదేశములవారిచేతను, శాస్త్రపరిశోధనాదిప్రయత్నము లసంఖ్యాకములుగ నొనర్పబడుచున్నను, నవవిజ్ఞానవికసనమునకేకాని ప్రజాక్షేమమున కించుకైనను దారిజూపకున్నవి. నిరక్షరత్వము క్షీణించినకాలది దేశమునం దజ్ఞానతిమిరము ధ్వంసణీకృతమై అమాయిక ప్రజాకోటి కకారణ వేదనాధారమును గల్గించుచున్నది. అనిత్యములగు సంప్రదాయము లొకవంక సంఘమునకు చెదపురుగులగుట, వర్ణవైవిధ్య మేరుపడి, యనాదిగ వచ్చుచున్న తనమైకమత్యమును, సభ్యతను, మానవజాతి మరచినది. ఇట్టిసందిగ్ధావస్థలయందు విద్యావిజ్ఞానసంజనితములగు సానుభూతి, సర్వమానవ సౌభ్రాత్రము దేశమున కన్నివిధముల శరణ్యములనదగును.

విద్యారంగముయొక్క వైశాల్య మపారము; ప్రయోజనము విశాలము. మానవపురోభివృద్ధికి, నాగరకతాభివృద్ధికి దేశముయొక్క విజ్ఞానాధిక్యమే మూలకారణము. వాఙ్మయపరిమాణమునుబట్టి ఒకదేశముయొక్కగాని, ప్రజలయొక్కగాని నాగరకత, నైతికాదర్శములు, వానివిలువయు తెలిసికొనగలమని సుప్రసిద్ధులగు కొందరు ప్రవచించిరి. కాని యిది లౌకికముగను, సామాన్యముగను జెప్పబడిన యభిప్రాయము.

వర్తమాన యుగమున విద్యావంతుని లక్ష్యముద్యోగకాంక్ష. విశ్వవ్యాప్తమైన నేటివిద్యావంతుల నిరుద్యోగరోదనాప్రతిధ్వనియే యిందులకు ప్రత్యక్ష ప్రమాణము. దాస్యవృత్తియే విద్య కున్నతాశయమై పరిణమించుటచే స్వేచ్ఛాజీవనాధారములగు వృత్తివిద్యలడుగంటినవి. పారిశ్రామికవిద్య లనాదరణీయములగుట దేశీయపరిశ్రమలకు తావులేకున్నది. నిరుద్యోగసమస్య దేశమున ప్రబలమగుట కిది యొకకారణము. దేశముయొక్క ఆర్థికజాడ్యమటుండ, విద్యార్థి విశ్వవిద్యాలయపట్టములు, బిరుదులు సేకరింప, అపారమగు తనదేహమనోబలములుగాక వేలకొలది ధనమును వెచ్చించి అవియొసగు కృత్రిమవిద్యను బడసి తుదకు నిరాశాహతులగుచున్నారు. వెచ్చించినధనము మరల సమకూర్పలేక దీర్ఘఋణగ్రస్తులై దిగబడిపోవు తల్లిదండ్రులను పెక్కురను మన మెరుగుదుము. చిత్తచాంచల్యమునకును, నివారణాశక్యమగు అనారోగ్యదుస్థితికిని గురియైన విద్యార్థులనుకూడ కన్నులార గాంచుచున్నారము. లోకైకవిఖ్యాతుడగు జార్జి బెర్నార్డ్‌షా నుడివినట్లు సారవంతమగువిద్యను మరుగుపరచి, జీవితమునకు నిరర్థకమగు విద్యను గరపి విద్యయొక్కసదాశయములను విస్మరింపజేయు నేటి విశ్వవిద్యాలయములే ఆజన్మాంతము పరితపింపజేయు మన యసంతృప్తికి కారణములగుట నిక్కువము. కానిచో విద్యయొక్క సదాశయము లోకమున నీరీతిగ పరిణామమొందుటేమి ?

నేడు యథార్థవిద్యనుమాత్రమే పడసిన విద్యావంతులు లోకమున చాల అరుదు. యథార్థవిద్యయన నభ్యసనీయమును, మానవజీవితాదర్శనీయమును సర్వతోముఖమగు ప్రయోజనమును, తద్వికాసమును గూర్చునది; అనర్థకమును, కృత్రిమమును నై పరార్థమును మరపించి జీవితమునకు నిష్ప్రయోజనకరమగు విశ్వవిద్యాలయవిద్యయే "కృత్రిమవిద్య." ఈవిద్యలను వేర్వేరుగ విమర్శించి నిరూపించుట ప్రస్తుతము.

యథార్థవిద్యార్థి కావునికవిద్య యవగుణములను గరపినను, అనుభవశాలురగు మహాత్ము లుపదేశించు యథార్థపరిస్థితులను కొంతకాలమునకైన నతడు తెలిసి తదనుగుణ్యముగ వర్తించును. విద్యావిహీనునకును, "కృత్రిమ" విద్యావిశిష్టునకును నట్టియవకాశము లసాధారణములు.

"అయినచో యథార్థవిద్యయొక్క సదాశయము లెట్టివి ?" అని కొందరు ప్రశ్నింతురు. విద్యయొక్క సదాశయమునకు కట్టుబడిన విద్యావంతుడు నిరాడంబరముగ తనజీవితమును విశ్వమానవాభ్యుదయమునకు దోహదమొనరించును. యథార్థవిద్య సాత్వికనైజము కలది. కావున నాతడు ప్రశాంతపూరితమగు ప్రపంచ సమిష్టికి పాటుపడి, విశ్వకల్యాణమునకు వలయు అనాహ్వానకార్యదర్శకత్వమును వాల్చి, తన జీవితమును సార్థకమొనరించుకొనును. వాని వలననె సాంకేతికాను వందితములైన పతితనైతికాదర్శములు పునఃప్రతిష్ఠింపబడి సంఘమునకు సుజ్ఞానబోధనీయములగును. విద్యావంతుని విమర్శకదృష్టి లౌకికసాంప్రదాయములపట్ల కొన్నియెడల తీవ్రతను దాల్చినను, నిరంకుశ ప్రతిక్రియకు బాల్పడకుండును. విద్యాలేశమున మానవుడు తనసంఘమునకు బద్ధుడై సందిగ్ధావస్థలలో సముచితానుచితవిచక్షణను గోల్పోయి, తదనుసారియై, స్వేచ్ఛారహితుడగుచు వర్తించును. తనకు సహజముగ నలవడిన యాత్మశక్తి నుపయోగింపక సంప్రదాయపాశములచే తనకుతానె బందితుడై, నిరంకుశత్వమునకు బాల్పడి సహజత్వమును గోల్పోవును. కావుననే ప్రత్యక్షప్రమాణములెన్నికూడినను, వానిని సముదారభావాతిశయునిగను,అసంకుచితహృదయునిగను జేయ లేవు. విద్యావిశిష్టుడట్లుగాక తనయాత్మవిజ్ఞానము నుపయోగించుచు, తదనుగుణ్యముగ విచక్షణననుగమించి, సత్పథగామియై వర్తించును.

విద్యావంతుడును, విద్యయు సాంఘికుల నుత్కృష్టజీవనుల జేయును. విద్యావంతుడు వివిధ రూపధారి. వానియందు దాయారూపగుణము లమర్పబడియుండును. స్థూలదృష్టిని దిలకించినచో తనసంఘమున కాతడన్నిట ప్రధానోపకరణమని తోపింపజేయును. అతడు పండితుడు; విద్యాప్రచారకుడు; పరివ్రాజకుడు; మతబోధకుడు; విప్లవకారకుడు; కర్మచారి; ధర్మవిజయమునకు దేహమర్పించు ధర్మమూర్తి; సంఘమునకు, దేశమునకు, లోకమునకు తనసర్వస్వము నర్పించు త్యాగమూర్తి. విద్యావంతుల యాధిక్యము సంఘమున నూతనజీవనవికాసము నుదయింపజేయును. విద్య అతిశయించుకొలది వ్యక్తిత్వ మభివృద్ధినొందును; వ్యక్తిత్వము విశాలమగుకొలది స్వేచ్ఛాపూరితమగు నైతిక జీవితాసక్తి యలవడును. మానవసేవకు హృదయమైన త్యాగదీక్షను, సత్యమునకు తోబుట్టువగు ధర్మమును ప్రాణప్రదముగ నెంచి తన్నిర్వహణమునకును, పరిపాలనకును నలవడిన విద్యార్థు లుదయించుచో విద్య పవిత్రమగును. విశ్వసౌభ్రాత్రము తన నిత్యజీవిత విధులలో నొకటిగ నెంచి, పరులకష్టములను పాల్గొని వానిని తనవనియెంచుచు ధర్మపథగామియై విశ్వమానవ సౌభాగ్యమునకు తనజీవితమును వెచ్చించువాడే విద్యార్థి యనబడును. అట్టి జ్ఞానమలవరచుకొని విద్యార్థి తన విద్యయొక్క వీరప్రతాపమును కార్యరూపమున ప్రకటించిననేకాని విద్వత్ప్రపంచము విద్యయొక్క పరమార్థమును పరిపోషింపజాలదు.

---

# యశోమూర్తి ఆనీబెసంటు చిత్రములు

( భిన్నభిన్న వయస్సులకు చెందినవి )









# భారతము- పరమార్థ ప్రదర్శనము

సండూరి బంగారయ్య

(అనువృత్తము)

## శ్రీకృష్ణుఁడు

ఏపాత్రమున కాపాత్రముతోఁ బ్రత్యేకసంబంధ మేర్పఱుచుకొని అందఱిలోను అంతరాత్మయయి నిగూఢముగ వెలుఁగొందు కృష్ణుని విడిచి, భారతము నంతను తనతేజముచే నిండించి చరాచరాత్మకమగు ప్రపంచము నెల్ల తనదివ్యమూర్తిలో నొక్కకిరణముగాఁ జేసివైచిన శ్రీకృష్ణునికడకు వత్తము. మనదృష్టి చెదరి పోకుండునిమిత్తమయి ఈశ్రీకృష్ణుని ఇరుదెఱంగుల విభజించుకొని విచారింపవలెను. కృష్ణునియందే సగుణ బ్రహ్మ మగుకృష్ణుఁ డొకఁడు, అఖండసచ్చిదానంద మయుఁడగు నిర్వికారకృష్ణుఁ డొకఁడు. సగుణబ్రహ్మ మునుగూర్చి తొలుత విచారింతము.

### శ్రీకృష్ణుని లీలాస్వరూపము

ఇపుడు పాత్రములను వదలి కథ నాశ్రయింప వలెను. భారతముపేరు చెప్పఁగనే మనకనులయెదుట నిలచు కథాభాగము యుద్ధము. ప్రథమపర్వములలో నున్న లాక్షాగృహదాహము, పాంచాలీపరాభవము మున్నగు నంశములన్నియు నదులవలె వచ్చి ఈభారత సమరసముద్రమున నేకమైనవి. యుద్ధానంతరము కథకు సంబంధింపని శాంత్యనుశాసనికపర్వములను దీసివైచినచో తక్కినభాగమంతయు భారతరణమునఁ బడక మిగిలిన రాజులవంశముల నిష్క్రమణమునుగూర్చి ముచ్చటించునది యగుటచే దానిని యుద్ధమున కనుబంధము ( appendix )గాఁ జేర్చుకొనవచ్చును. ఉద్యోగ పర్వము మొదలుకొని స్త్రీపర్వమువఱకునున్న ఈయుద్ధ కథలో భారతకవి శ్రీకృష్ణుని కట్టిప్రాధాన్యమునిచ్చి యున్నాఁడో చూడవలసియున్నది.

ఈయుద్ధకథ మిగులవిచిత్రమైనస్వరూపము కలది, ఒకవైపునుండి చూచినచో నిదియంతయు విషాదమయముగాఁ దోఁచును. ఎక్కడచూచినను మొగ్గెడుగుఱ్ఱములు, పీనుఁగుపెంటలౌ నేనుఁగులు, నేలకువ్రాలు పదాతివర్గము, గోపురములవలె కూలిపోవుచున్న యతిరథమహారథులు! ఎంతటివారికైన స్త్రీపర్వముచదువుచున్నపుడు కనులనుండి నీరు గాకమానదు. ఆపర్వములో శ్మశానవాటికయగు కురుక్షేత్రమును దీసికొనివచ్చి భారతకవి మనయెదుటఁ బెట్టినాఁడు. మనలో విషాదాంతనాటకములు లేవను కొందుము కాని భారతపఠనమువలన కలుగు నుత్తమవిషాదానుభూతి యే షేక్స్పియరు ట్రాజెడీ ( Tragedy ) వలన లభించుచున్నది? కాని ఒక్కమారు మఱింత శ్రద్ధతో భారతకావ్యపఠనమునకుఁ గడంగితిమేని ఈ శ్మశానరంగమంతయు మంత్రించినట్లు మాయమైపోయి తనచేఁ బ్రేరేపింపఁబడి తనశక్తులే మహావాయువులవలె ఒండొంటితోఁ బోరాడుచుండఁగా తనలీలకు తానే యానందించు శ్రీకృష్ణుని సౌమ్యతేజము దృగ్గోచరమగు చున్నది. ఇట్లొకవైపునుండి చూచినచో భారతము విషాదాంతనాటకము; ఇంకొకవైపునుండి చూచినచో శుభాంతనాటకము. ఒకవైపున ప్రళయతాండవప్రవర్తి యగు ఫాలలోచనుఁడు. ఇంకొకవైపున లీలామానుషధారి యగు పార్థసారథి. సౌమ్యాగ్నేయవిభేదముగల ఈస్వరూప ద్వయము నొక్కశ్రీకృష్ణునియందే మూర్తీభవింపఁ జేసి భారతకారుఁడు పరస్పరవిరుద్ధస్వరూపమగు సృష్టి కథేదార్థమును చెప్పినాఁడు.

విరాటపర్వమున నభిమన్యుని వివాహసందర్భమున శ్రీకృష్ణుఁడు చుట్టపుచూపుగాఁ బ్రవేశించినాఁడు. వివాహానంతరము రాజులసమక్షమున పాండవులరాజ్యభాగ మునుగూర్చి న్యాయానురక్తుఁడగు మధ్యస్థునివలెఁ బ్రసక్తి తెచ్చినాఁడు. కౌరవులకు సందేశమంపుటకు నిశ్చితమైనవెనుక .

కౌరవులును పాండవులును
నారయ నాకొక్కరూప యట్లగుటఁ దగన్
వారును వీరును తమతమ
నేరిమిమై ధరణి యేలి నెగడఁగఁ జూతున్.

పెండ్లికని పిల్వఁబంచిన ప్రియముతోడ
నేఁగుదెంచితి మిన్నాళ్లు నెల్లమెప్పి
దములఁజూచితి నియ్యెడఁ దడవుగాఁగ
నిలువఁదీరదు పోయిరావలయు మాకు.

అని యుద్ధమనిన నేమాత్రము కిట్టనివానివలెను, ఎవ రెట్లు పోయినను తన కేమియు జోక్యము లేని తటస్థునివలెను మాటాడి సెలవుపుచ్చుకొన్నాఁడు. దుర్యోధనార్జునులు తనసాహాయ్యమునిమిత్తము వచ్చినపుడుకూడ ఈతటస్థభావమునే అత్యంతచతురముగా నటించినాఁడు. ఏపక్షమున నున్నను తా నాయుధమును వహించి యుద్ధము చేయనని ప్రతిజ్ఞ వట్టినాఁడు.

రాయబారమునిమిత్తము సంజయుఁడు వచ్చినపుడు పేరోలగమున ధర్మరాజు తన్ను మధ్యస్థునిగాఁ బిల్చువఱకు నేమియు మాటాడనేలేదు. కాని ధర్మరాజు తన్ను పేర్కొని పేర్కొనకుండఁగనే రంగమున కుఱికి కౌరవులకు పాండవులకుఁ గలప్రాఁతపగల నన్నిటిని త్రవ్వి "ఈసంధికార్య మత్యంతదుర్ఘటమని తలంచెద" నని తెగఁగొట్టి చెప్పుచున్నాఁడు. ఇట్లు చెప్పుటలోనైన తనమధ్యస్థభావ మెక్కడను జారిపోకుండ కౌరవులు పాండవులకు చేసినదుర్ణయములను బురస్కరించుకొని యలుకపొడమిన న్యాయానురక్తునివలెనే మాటాడుచున్నాఁడు. ఈమధ్యస్థభావమున కింకను పరిపోషకముగ నుండుటకయి కౌరవులమేలుఁగోరి యుద్ధ మెట్లయినను తప్పింపనెంచినవానివలె "తగవును నేర్పును నామీఁద నిలుచుట నాకుఁగీడె" యని ఎంతో గడుసుదనముతో దౌత్యభారమును బైపైచుకొనుచున్నాఁడు. ఇదిమొదలుకొని భారతపాత్రముల నన్నిటిని త్రోసి రాజని శ్రీకృష్ణుఁ డొక్కఁడే మనదృష్టి నాకర్షించుచున్నాఁడు.

రాయబారసందర్భమున శ్రీకృష్ణుని చిత్రించిన కవిబ్రహ్మచాతుర్యము వర్ణనాతీతము. శ్రీకృష్ణునికంటె యుద్ధము నపేక్షించువారు భారతకావ్యమున లేరు. కాని ధర్మరాజు తన్ను రాయబారమునకుఁ బొమ్మని ప్రార్థించుటమొదలుగా కౌరవసభనుండి తాను తిరిగి వచ్చి ఈరాజ్యతంత్రములతో విసుగువచ్చినవానివలె "నేను పోరలంగలయంతయుఁ బొరలితి............కౌరవుల యెడ దండంబుదక్క నొండుపాయంబు లేదు. మీకుం బోలినతెఱంగు సేయుండు" అని పలుకువఱకు నెక్కడను సంధికై ప్రయత్నించు శ్రీకృష్ణుని మానుషమగు తటస్థభావమునకు ఆతనిలోపల వెలుఁగుచుయుద్ధసంకల్పము బయల్పడి భంగముతెచ్చుట లేదు. ధర్మరాజుతో "నేను కయ్యపుశకునంబు లెన్నియేని గంటి నీ వనుత్సాహివి గాఁగవల" దని ప్రబోధించుచున్నను, అర్జునునితో "సుయోధనుండు సంభావనచేసి పాలొసఁగుపాడియ కల్గిన బాల్యమాదిగా నేవిధినైననుక్క జెరుప నింతలు పాపము లాచరించునే" అని యుద్ధము సూచించుచున్నను, తుదకు భీముని పురికొల్పునపుడు ద్రౌపది నోదార్చునపుడు కుంతికి ధైర్యము చెప్పునప్పుడునయినను శ్రీకృష్ణుఁడు దూరాలోచనఁ గలిగిన రాజ్యతంత్రజ్ఞునివలెఁ గానవచ్చుచున్నాఁడేకాని యుద్ధాతురుఁడైనట్లుగ మన కెంతమాత్రము స్ఫురించుటలేదు. తన కత్యంతాంతరంగికుఁడయిన విదురునితోఁగూడ

చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గోట్లాడియైన
దాని యుడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు.

అని ధర్మానురక్తుని తటస్థభావమునే ప్రకటించుచున్నాఁడు. బహిరంగసభలోదుర్యోధనాదులకుయుద్ధము మానవలసినదని జంకించియు, భంగించియు, ధిక్కరించియు, తృణీకరించియు తనవాక్చాతుర్యమంతయు వినియోగించి ఎన్నోవిధముల నుపన్యసించినాఁడు. బుధులచేఁ జెప్పించినాఁడు. ఇంక నేమియు నుపాయము లేక విశ్వరూపమునుకూడఁ జూపినాఁడు. బాహ్లీకభీష్మద్రోణాది విశిష్టజనంబులయెదుట ధృతరాష్ట్రుఁడు తా నేమియు చేయఁజాలనని చెప్పఁగా

ఇప్పు డీసభఁబుట్టినయంతకట్టు
మీకుఁ జెల్లంబుగాదె యీ మేదినీవి

భుండు దా నేమిటికిని ముఖ్యుండఁగాను
తప్పు తనదెస లేదని చెప్పి నిడిచె.

అని విస్పష్టపఱచుకొని మూర్ఖతయెల్లను దుర్యోధనాదుల మీఁదనే నిలుచునట్లును, తొందరపడినట్టిదోషము నివ్వరి మ్లల్లంతయైన తనమీఁద నిలువకుండునట్లును శ్రీకృష్ణుఁడు వర్తించినాఁడు. ఈఘట్టముల నెంతజాగ్రత్తగఁ జరిపించిన చనువరియైన ధర్మరాజుతోఁబాటు "ఇతండు ధర్మాధర్మనిదులకు సరుండు కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండు ఉచితానుచితజ్ఞులకు ప్రదర్శకుండు" అని కృష్ణుని మధ్యస్థభావమును స్తుతింపకమానఁడు. కాని యీసుఋననుతునకు శ్రీకృష్ణుని హృదయాంతరాళమున నున్న సంకల్పమే నెఱవేఱి యుద్ధము సిద్ధమయినది. ఇట్లు సంధికని బయలుదేరిన శ్రీకృష్ణుఁడు మాచిరమ్మనిన కాల్చి వచ్చినాఁడను రీతిగ యుద్ధము నసందిగ్ధముచేసికొని వచ్చినాఁడు. కాని యుద్ధముప్రారంభమయినవెనుక శ్రీకృష్ణుని నాటకము సాగినది కాదు. తన కర్తృంతా పుఁడను అర్జునునితో తానే ఈయుద్ధమునకంతకు మూలకారణుఁడనని పరిస్పష్టముగ వెల్లడించివైచినాఁడు. భీష్మపర్వము మొదలుకొని స్త్రీపర్వమువఱకు నున్నకథాభాగములో మహాకవిచాతుర్యమేమోకాని కవి ప్రత్యేకముగ వర్ణించిచూప నక్కరలేకుండ శ్రీకృష్ణుఁ డెక్కడఁ జూచిన నక్కడనే తానుగ నిముసనిముసమునకుఁ బ్రత్యక్షమగుచున్నాఁడు. సేనానాయక నిర్ణయము మొదలుకొని ఉపపాండవమరణాంతమగు సౌప్తికవృత్తాంతమువఱకు శ్రీకృష్ణునికి రాత్రులుపవలలు విశ్రాంతి యనుమాట లేదు.

ఒకచోట యుద్ధముచేయనని గాండీవమువిడిచిపెట్టిన యర్జునుని యుద్ధసన్నద్ధుని గావించుటకై విశ్వరూపము జూపుచున్నాఁడు. ఇంకొకచోట పాండవసైన్యమును మాడ్చివైచుచు విజృంభించు భీష్మునిపైకి చక్రమునుచేతఁ బూని విజృంభించుచున్నాఁడు. వేరొకచోట భగదత్తుఁడు ప్రయోగించు వైష్ణవాస్త్రమును పుష్పమాలికగా స్వీకరించుచున్నాఁడు. సైంధవవధప్రతిజ్ఞకు ప్రోద్బలముగ మొట్టమొదట పాంచజన్యము నూదినది యాతఁడు. కార్యభారమమీఁదిచింతచే రాత్రియెల్ల నిద్రపట్టక దారుకునితో మంతనము లాడునది యాతఁడు. ప్రొద్దుగ్రుంకుచున్నదని సూర్యబింబమునకు చక్ర మడ్డువేయునది యాతఁడు. శిఖండిని ముందుంచుకొని భీష్మునిఁజంపుట కర్జుననిచే నొప్పించినది యాతఁడు. ద్రోణునివధించు నిమిత్తము ధర్మరాజు నబద్ధమాడుమని ప్రోత్సహించునది యాతఁడు. క్రుంగినచక్రమును పైకెత్తుటకు దిగినకర్ణుని అన్యాయముగఁ జంపించినది యాతఁడు. అహంభావస్వామియగు భీమునిచే నారాయణాస్త్రమునకు మ్రొక్కించుచు, దుర్యోధనుఁ డిచ్చు చీవాట్లవాయనము నందుకొనుచు, ఘటోత్కచవధను విని తాండవించుచు, ఎక్కడఁజూచిన తానయై దుర్నిరీక్ష్య తేజముతో వెలిఁగి పోవుచున్నాఁడు. ఇట్లాదినుండి యంతమువఱకు కౌరవపాండవపక్షములకు రెండింటికిఁ గల రణోత్సాహభారమంతయు శ్రీకృష్ణునిమొగమున తాండవించుచున్నది. ఒకపక్షమనిన నాతనికి దయయు లేదు. ఇంకొకపక్షమనిన విరోధము లేదు. పాండవపక్షపాతియని కృష్ణుని గూర్చి మనము సాధారణముగా భ్రమపడుచుందుము. కాని వారిపక్షమున నుండి యాతఁడు వారికి చేసినదే లేమున్నది? అభిమన్యునివధను విని అర్జునున కది యెఱుఁగఁజెప్పకుండ మౌనమువహించుటయు, ఘటోత్కచునిమరణమును విని తాండవించుటయునా? అశ్వత్థామబారినుండి పాండవులను రక్షించినవాఁడు ఉపపాండవులను రక్షించుకొనలేకపోయెనా?

ఇంతమహాభారమును వహించి ప్రళయరుద్రునివలె యుద్ధరంగమున తాండవించు శ్రీకృష్ణుఁడు ఎంతసౌమ్యాకారమును ధరించినాఁడు? అంభోజమాలికను మెడను దాల్చి చేత నాయుధలేశమైనను దాల్పక మునికోలను వహించి ఏమియు నెఱుఁగని నిరపరాధివలె గుఱ్ఱములను కళ్లెమువదలి చల్లగాఁ బోనిచ్చుచున్నాఁడు. తనసంకల్పమనెడి ఈసుడిగాలిని తప్పించుకొనఁజాలక పరిభ్రమించుచు బంధుమిత్రుల మరణములను చూచిచూచి భరతవంశీయులు విలపించుచుండఁగా వారియజ్ఞానమున కీతఁడు "కలకలనవ్వుచున్నాఁడు." శ్మశానవాటికవలె నున్న కురుక్షేత్రమును జూచి కడుపు దహించుకొనిపోయి గాంధారి

యిచ్చుతీవ్రశాపమును భక్తుఁడర్పించు పుష్పోపహారమును స్వీకరించునట్లు చిఱునవ్వుతో స్వీకరించుచున్నాఁడు.

అని ఘోరంబుగఁ బలికిన
విని విపులమనస్కుఁడైన విష్ణుఁడు చిఱున
వ్వొన నానన మొప్పఁగ న
వ్వనితకు నిట్లనియె గౌరవస్తుత్యముగన్ :
మున్న కాదె యాదవులకు మునివరేణ్య
కలితదారుణశాపంబు కలదు నీకు
నేల చర్వితచర్వణ మిట్లు సేయ
దీన నీ వేమిత్రవ్వితి దానిఁ జెపుమ.

యనువంశజాతులకు ద
ప్పదు నాశము వారి సురలు బవివార్పఁగ లే
రదికారణముగఁ దె
గుదు రొండొరుచేత రణముఘ్ఘోరత్వమునన్.

మరణవార్త లాతనిచెవులకు సరససంగీతము కాఁబోలును. ఇదివఱకు సంభవించిన కురుపాండవవీరుల మరణములకే సంతాపించుచున్న ధర్మరాజాదిపాండవులకు గాంధారీశాపవ్యాజమున యాదవవంశనాశము కూడ నున్నదని యింకొకసరిక్రొత్తవార్తను చెప్పుచున్నాఁడు. అది తనకు పూర్వపరిచితమే కావున దాని నిప్పుడు మరల గాంధారినోట విినప్పు డాతనికి పూర్వపరిచితులను గలసికొనునప్పు డుదయించునట్లుగ చిఱునవ్వుదయించినది కాని తొట్రుపాటించుకయు లేదు. ఆహా! ఏమి ఈకృష్ణునిస్వరూపము. భూమినిదున్ని విత్తనములు చల్లి పంటకువచ్చినచేలను కోసికొని గాదిలోఁ బోసికొని యానందించుకర్షకునివలె ఒక రాజవంశము తరువాత నింకొకరాజవంశమును నాశనము చేసి యానందించుచున్నాఁడు. మహాభారతవీరు లొకరి నొకరు నఱకుకొని మరణించునట్లుగా ప్రేరేపించునది తానే. ఆఘోరదర్శనమును చూచి యానందించునది తానే. భారతరణరంగమునఁ బ్రత్యక్షమైన కర్మశక్తి యంతయు నీతనిలో మూర్తీభవించియున్నది. కాని దానిచే నెక్కడను మనస్సమాధానమునకు భంగము రాకుండ నానందించుయోగశక్తికూడ నీతనియందే మూర్తీభవించియున్నది. అందువలననే కవి యాతనిని "యోగేశ్వరేశ్వరుఁడని" పిలచియున్నాఁడు.

---



# బాల క్రీడలు

మంగిపూడి వేంకటశర్మ

## ౩౧. కుందేలు

ఒకబాలిక పెండేసి పెద్దగా నేర్పడి అందరిని జూచి "ఆటలో అరటిపండు ఎవరోయి" అని కేక వేయవలయును. "నాకోయి" అని అడిగిన బాలికకు కన్నులుమూసి ఇంకొకబాలికను ఎక్కడనైన చాటున దాగియుండుమని పంపి ఆ బాలిక యెక్కడ దాగినదో చూచిరమ్మని ఆమెవెనుకనే మరియొక్కబాలికను పంపవలయును. వెనుకవెళ్లిన బాలిక ఆస్థలమును చూచివచ్చి యొకచోట కూర్చుండవలయునుగాని యెక్కడ దాగియున్నదియు ఎవరికిని చెప్పకూడదు. తరువాత కన్నుల మూసినబాలికను వదలిపెట్టి దాగియున్నబాలికను కనుగొనిరమ్మని పంపవలెను. ఆ బాలిక పోయి వెదకి కనుగొని తీసుకొని రావలయును. అట్లు కనుగొన్నయెడల కనుగొనబడిన బాలికను ఒకచోట కూర్చుండబెట్టవలయును. అనగా ఆ బాలిక అయిపోయినట్టు తెలుసుకోవలయును. కనుగొన్నబాలిక పండినట్టు. కనుక ఆ బాలికనుకూడ వేరొకచోట వేరుగా కూర్చుండబెట్టవలయును. తరువాత మరియొకబాలికకు కన్నులుమూసి యింకొకబాలికను దాసుకొమ్మని పంపవలెను. ఇట్లు దాసుకొను బాలికలపేరు "కుందేలు" అని చెప్పుదురు. తరువాత మొదటివలెనే ఒకబాలికను కుందేలు ఎక్కడ దాసుకొన్నదో చూచిరమ్మని పంపవలయును. ఒకవేళ కుందేలును ఎవరైనా చాలసేపటివరకు కనుగొనలేని యెడల ఆట ఆలస్యమగును. అప్పుడు కుందేలును ఇతరులు కనుగొనుటకైన కష్టమే యగును. కనుక ప్రతి పర్యాయమును ఒకబాలిక కుందేలు దాగినచోటుచూచి వచ్చుచుండవలయును. ఇట్లు ఎప్పుడైనా, ఏబాలికయైనా కుందేలును కనుగొనలేకపోయినపుడు ఆబాలిక అయిపోయినట్టగును. కావున ఆబాలిక ఓడిపోయినబాలికలలో కూర్చుండవలయును. అట్లు కనుగొనబడని కుందేలు పండినట్లగును. కనుక ఆకుందేలు పండినవారిలో కూర్చుండవలయును. ఇట్లు ఆటఅంతా అయినతర్వాత ఓడిపోయిన బాలికలందరును చాటునకు పోయి ఏవైన పేరులు చెప్పుకొని రావలయును. అనగా ఒక్కొక్కరి కొక్కొక్క పువ్వుపేరుగాని, నగపేరుగాని, ఇతరవస్తువుపేరుగాని వెనుకటి ఆటలలోవలెనే పెట్టుకొనిరావలయును. అప్పుడు ఆటపెద్ద వారినిచూచి "మీ రెందుకు వచ్చినా"రని అడుగవలయును. "బిడ్డలను అమ్ముకొనుటకై వచ్చినాము" అని వారు చెప్పవలయును. "మీ బిడ్డలపేరు లేమి?" అని మరల అడుగవలయును. అప్పుడు వారు అందరు పెట్టుకొన్నపేర్లు చెప్పవలయును. (ఫలానివారిపేరు ఫలానా అని చెప్పకూడదు.) అప్పుడు ఆటపెద్ద ఏపేరుగల బాలికను కోరునో ఆబాలికకు తరువాత కనులు మూయవలెను. ఈప్రకారము ఆడుచుండవలయును. ఈఆటకు ఎందరున్నను సరే.

## ౩౨. గుడుగుడు కుంచము

బాలికలందరును కూర్చుండి రెండుచేతులును పిడికిళ్లుపట్టి యొకరిపిడికిలిమీద నింకనొకరి పిడికిళ్లి (గుప్పిడి) యుంచవలెను. అప్పుడు ఆటపెద్ద ముందుగా పైనున్న పిడికిలిలోనికి (పైప్రక్కనుండి) తనచేతి తర్జనిప్రేలునుంచి యాడించుచు (తర్జనీప్రేలు అనగా చూపుడుప్రేలు) "గుడుగుడుగుంచం, గుండారాగం, పాముల పట్టం, పడగారాగం," అని పాడి "కత్తి వెయ్యనా బద్దవెయ్యనా, రోలువెయ్యనా రోకలివెయ్యనా, వేన్నీళ్లుపొయ్యనా చన్నీళ్లుపొయ్యనా" అని అడుగవలయును. పైన పిడికిలిగల బాలిక ఆటపెద్ద అడిగిన వానిలో తన కిష్టమైనదానిని దేనినైన వెయ్యమని కోరవలయును. అప్పుడు ఆటపెద్ద తనతర్జనీప్రేలితోనే ఆ

బాలికపిడికిలిమీద కత్తివెయ్యమని అడిగినయెడల కత్తితో, నరుకునట్లుగను బద్దవెయ్యమని అడిగినయెడల బద్దతో కొట్టినట్లును కొట్టవలయును. రోలు వెయ్యమన్న యెడల తనపిడికిటితో మెల్లగా కొట్టవలయును. రోకలి వెయ్యమన్నయెడల తన వ్రేలితో నిలువున కొట్టవలెను. వేన్నీళ్లు పొయ్యమన్నయెడల కొంచెము గట్టిగాను



(నొప్పికలుగకుండునట్లు), చన్నీళ్లు పొయ్యమన్నయెడల మిక్కిలి మెల్లగాను పిడికిలిమీద గిల్లవలయును. అనంతరమున ఆబాలిక తనచేయి ముద్దుపెట్టుకొని వెనుక ప్రక్క నుంచుకోవలయును. తరువాత ఆబాలికయొక్క రెండవ(చేతి) పిడికిలిమీదను ఇట్లే ఆడవలయును. ఇట్లే అందరు బాలికలకును క్రమముగా ఆడవలయును. తరువాత ఆటపెద్ద ఆబాలికల నందరిం జూచి "మీ చేతు లేమైపోయినవి" అని అడుగవలయును. ఆబాలిక "పిల్లి యెత్తుకపోయింది" అని చెప్పవలెను. మళ్లీ ఆట పెద్ద "పిల్లి నెక్కడదాకా తరిమినావు?" అని అడుగవలయును. "గోలకొండదాకా తరిమినాను" అని చెప్పవలయును: "గోలకొండ యేమిచ్చినది?" అని అడుగవలయును. "సుద్దిగవ్వనిచ్చినది" అని చెప్పవలయును. "సుద్దిగవ్వ నేమిచేసినావు?" అని అడుగవలయును. "కుమ్మరివాడి కిచ్చాను" అనవలెను. "కుమ్మరివా డేమిచ్చాడు?" అని అడుగవలయును. "కుండయిచ్చినాడు" అనవలెను. "కుండ యేమిచేసినావు?" అని యడుగవలెను. "పువ్వులచెట్లకీ, కాయలచెట్లకీ నీళ్లుపోసినాము" అనవలెను. "పువ్వులచెట్లు, కాయలచెట్లు ఏమిచ్చినవి?" అని అడుగవలెను. "పువ్వులు, కాయలు ఇచ్చినవి" అనవలెను. పువ్వులు కాయలు ఏమిచేసినావు" అని అడుగవలయును. "పువ్వులు కొప్పులో పెట్టుకున్నాను. కాయలు కాల్చుకతిన్నాను" అనవలెను. "కొప్పేమిచ్చినది?" అని అడుగవలయును. "పేను ఇచ్చినది" అని చెప్పవలెను. "పేనేమిచేసినావు?" అని అడగవలెను. "గడపమీదవేసి కుక్కినాను" అనవలెను. "గడపయేమిచ్చినది?" అని యడుగవలయును. "పేడిచ్చినది" అని చెప్పవలయును. "పేడేమిచేసినావు?" అని యడుగవలెను. "ప్రొయిలో పెట్టినాను" అనవలెను. "ప్రొయ్యి యేమి యిచ్చినది?" అని అడుగవలెను. "బూడిదయిచ్చినది" అనవలెను. "బూడిదయేమిచేసితివి?" అని అడగవలెను. "పెంటమీద పోసితిని" అనవలెను. "పెంటయేమి యిచ్చినది?" అని అడగవలెను. "గడ్డియిచ్చినది" అనవలెను. "గడ్డేమిచేశావు?" అని అడగవలెను. "ఆవులకు, గేదెలకు వేసినాను" అనవలెను. "ఆవులు, గేదెలు ఏమిచ్చాయి?" అని యడుగవలెను. "పాలిచ్చాయి" అనవలెను. "పాలేమిచేశావు?" అని యడుగవలెను. "పరమాన్నము చేసుకున్నాను" అనవలెను. "పరమాన్నము నాకు కాస్త పెడతావా?" అని అడుగవలెను. "పెడతాము" అని చెప్పవలెను. "మొగము కడుసుకొనుటకు పుడక యి"మ్మనవలెను. అప్పుడు దూలాలు పెట్టి పళ్లు తోముకొనుమనియు, వాసాలు పెట్టి నాలుక గీచుకొమ్మనియు చెప్పవలెను. తరువాత ఆటపెద్ద అట్లుచేయునట్లు అభినయించుచు దూలాలుపెట్టుకొని పండ్లుతోముకొని, వాసాలుపెట్టుకొని నాలుక గీచుకొని అనిచెప్పుచూ చేసి నీళ్లుయిమ్మని అడుగవలయును. అప్పుడాబాలిక దోసిలిలో నీళ్లుపోయవలయును. ఆట పెద్ద "ఆనీళ్లు మంచివికావు; ఉప్పునీళ్లు" అని చెప్పి పారబోయవలెను. ఆబాలిక మరల నీళ్లుపోయును. తరువాత మొగముకడుగుకొని "పాశముపెట్టు"మని అడుగవలెను. అప్పుడు ఆబాలిక విస్తరివేసి "పాశెము చూచివస్తా"నని చెప్పి చూచివచ్చి "అమ్మో ప్రొయి దగ్గర కొంచెముండగా మాతాత చుట్టకాల్చుకోవడమునకు వెళ్లి! అది తినేశాడు. అటికమీద దాచితే అల్లుడెత్తుకపోయినాడు. చిన్నయింట్లో పెట్టితే చిన్నన్న తినివేశాడు. పెద్దయింట్లో పెట్టితే పెద్దన్న తినివేశాడు. పెట్టిక్రిందపెట్టితే పిల్లెత్తుకపోయింది. ఇంటిమీదపెట్టితే గద్దెత్తుకుపోయింది." అని చెప్పవలెను. అప్పుడు ఆటపెద్ద ఆబాలిక లందరికి చక్కిలిగింతపెట్టును. ఇంతటితో ఆట ఆఖరు. దీనికి ఇందరుండవలయునను నియమములేదు. "మేనేగుఱ్ఱం పెళ్లికిపోతే అప్పారాయుడుగుఱ్ఱం ఆటకుపోతే, నీగుఱ్ఱం నీళ్లకుపోతే, నాగుఱ్ఱం పాలకుపోతే పాశంవెయ్యమన్నయెడల తోడు పాశంతోడు తోడితే నాచెయ్యివేడి" అందురు.

## 33. జో జో

అందరుబాలికలును వలయముగా కూర్చుండి ఒకరిమీఁజేతిమీద నొకరిమీఁజేయి యుంచవలయును. అనగా ముందుగా ఒకరు తమచేతిని నేలమీద బోరగించి యుంచవలయును. తక్కినవారి చేతులన్నియు దానిమీద ఒకదానిపై నొకటి యుంచవలయును. అప్పుడాకూర్చుండినవారిలో నొకబాలిక (ఆటపెద్ద) ఆచేతులదొంతరమీద తనచేతిని తిరుగబోరగిలవేయుచు "అప్పటతప్పెటతాళం, చెవులోబుడ్డి" అని పాడవలెను. అట్లు పాడినతరువాత ఆబాలిక తనచేతితో తనదగ్గఱనున్న స్త్రీయొక్క చెవి పట్టుకోవలెను. తరువాత ఆటపెద్ద క్రమముగా అందరిచేతులమీదను ఇట్లే ఆడవలెను. అందరును తమతమప్రక్కలనున్న పిల్లలచెవులు రెండు చేతులతోను పట్టుకోవలెను. ఆటపెద్దకూడ తనచేతిని నేలపైని తిరుగ బోరగిలవేయుచు పాటపాడుచూ ఆడుకొని తానును తనప్రక్కబాలికలచెవులు పట్టుకొనవలెను. తరువాత అందరు బాలికలును "జో జో జో జో" అని ఆనందముతో పాడుచూ ముందుకు వెనుకకు కొంచెముసేపు ఊగుదురు. దీనిని కొందరు అప్పటతప్పెటతాళంఆటందురు.

## 3౪. కఱ్ఱగానుగు

ఒక పొడుగుపాటి గట్టికఱ్ఱ తెచ్చి వీథిలో నొకచోట దానిమొదలు క్రిందనుంచి ఆమొదలునకు జానెడు దూరముగా నొకబాలిక ఆకఱ్ఱపై పాదములు నిల్పి పడకుండఁ ఆకఱ్ఱ సాయముననే కూర్చుండవలయును. తక్కిన బాలిక లాకఱ్ఱ చివరభాగమున పట్టుకొని గానుగవలె



గిరగిర చుట్టును త్రిప్పుదురు. అనగా కూర్చున్నబాలిక గానుగఆడువానివలెను, త్రిప్పెడువారు ఎద్దులుగానుఉండి ఆడవలెను. కొంతసేపైన తరువాత గానుగమీదిబాలిక యెద్దులలోనికి రావలెను. ఎద్దులలోని బాలిక లొకరి తరువాత నొకరు గానుగాడవలెను.

## 3౫. అగీరనగింజలు

చింతగింజలను దెచ్చి బాలికలందరును సమముగా పంచుకొని యుంచుకొని వానిలో తమయిష్టమువచ్చినన్నిపుంజీలు ఒక్కొక్కరిగింజలలోనుండి తీసి నేలమీద పెద్దసున్నవలె గుండ్రముగా సుద్దతోగాని, పెంకుముక్కలతోగాని ఆనవాలు కన్పడునట్లు గీచి ముందుగా ఆడుటకు నిశ్చయించినబాలిక ఆగింజల నన్నిటిని దోసిలిలోగాని, దోసిలికి చాలనియెడల చేరలోగాని పోసికొని కన్నులు మూసికొని ఆపెద్దసున్నమధ్యమున మెల్లగా పోయవలయును. అట్లుపోయునపుడు గింజలు గీతమీదకుగాని, గీతదాటి యివతలికిగాని రాకూడదు. వచ్చినయెడల ఆబాలిక అయిపోయినట్టు. అనగా ఆటపోయిన ట్లెంచబడి మరియొకబాలిక పోయవలయును. ఇట్లు ఆసున్నలో గింజలు పోసినతరువాత గింజలు పోసినబాలిక కుడిచేతి రెండవవ్రేలితో (తర్జని వ్రేలితో) ఒక్కొక్కగింజచొప్పున తీసికొనవలయును. అనగా గింజను వ్రేలితో నొక్కి తనముందరప్రక్కకు లాగుకొనవలయును. అట్లు లాగునపుడు యెడమచెయ్యియొక్క గుత్తి తనముందర ఆనుకొని వ్రేళ్లు యెత్తి ఆ చేతిలోనికి వచ్చునట్టు తీసుకొనుచుండవచ్చును. అట్లు చేసినయెడల గింజలు నలుప్రక్కలకు చెదరిపోకుండ సులభముగా ప్రోగుపడుచుండును. బరిలోపలినుండి వ్రేలితో గింజలు తీసికొనునప్పుడు వ్రేలు ఆనినగింజగాక దానిదగ్గరనున్న యేగింజకైనను ఆవ్రేలుతగిలినను, లేక గింజ బరిదాటిరాక బరిలోనే యుండినను, బరిమీద నుండినను ఆట అయిపోయినట్టు అగును. కనుక జాగ్రతగా తీసికొనవలెను. గింజలు అనగా కాయలు అని గూడ అందురు. కాయతీసికొనునప్పుడు వ్రేలు మరియొక గింజకు తగులుట, అనగా కంగుట అనివాడుదురు. అనగా ఈకాయ కంగినది, ఆగింజ కంగినది, అని చెప్పుదురు. ఒకబాలిక ఆటతప్పినయెడల తరువాతి బాలిక గింజలను తీసికోవలయును. ఆమె ఆటపోయినయెడల మరియొకబాలిక ఆడవలయును. ఇట్లు అందరును ఆడినవెనుక ఇంకను గింజలున్నయెడల మరల

మొదట అయిపోయిన బాలిక ఆడవచ్చును. ఇట్లు క్రమముగా అందరును ఆడవచ్చును. ఇట్లు బరిలోని గింజలన్నియు తీసికొన్న తరువాత తమదగ్గర మిగిలిన గింజలుకూడ పోసి ఆడుకొనవలయును. అనగా ఆటలో సంపాదించుకున్న గింజలుగాక మొదట తెచ్చుకొన్న గింజలలో మొదటియాటకు పొయ్యగా మిగిలినగింజలని తెలిసికోవలెను. ఇట్లు పోసి ఆగింజలుకూడ మొదటివలెనే అందరును క్రమముగా ఆడినతరువాత యెవరు తీసుకొన్నకాయలు వారు లెక్కపెట్టుకొని మొదట తాము తెచ్చుకొన్నగింజలకంటె లాభమువచ్చినదో, నష్టము వచ్చినదో, యెంతో తెలిసికొనవలయును. ఈయాటలో ఒకరికన్ననొక రుత్సాహముతో యెక్కువ గింజలను గెలుచుకోవలయునని ప్రయత్నించవలయును. ఈయాటలో గింజలను లెక్కించునప్పుడు గింజలు పుంజెడు లేక కుచ్చెండు, ౮ గింజలు కచ్చటము, ౫ కచ్చటములు గుజ్జము, ౧౦ గుజ్జములు యేనుగు అని ఈమానముప్రకారము వాడుకొని ప్రోగులు పోసికొందురు. ఈయాట కింతమందియని నియమము లేదు. ఈయాట చింతగింజలు లేనియెడల సీతాఫలగింజలు, బీరగింజలు, ఆనపగింజలు, అనపగింజలు మొదలగు వానితో ఆడవచ్చును.

### ౩౬. కాలికంచము.

మెత్తని పొడిదుమ్ముగల చోటగాని, యిసుకగల చోటగాని, బూడిదనేలయందుగాని బాలికలందరును ఎవరికివారు కొంతకొంత ప్రదేశము నాక్రమించుకొని (అనగా ఇక్కడినుండి యిక్కడివరకుగల స్థలము నాది, ఇది నాదియని అందరును కొంతకొంత చోటునకు హద్దులేర్పరచుకొని) నిలిచియుండి ఒకకాలిమడమ యొకచోట నిల్పి మడమను కదలనియ్యకుండగనే పాదము నేలకు కొంచెము తగులునట్లుగా నుంచి రెండవ కాలి సహాయమున, అనగా రెండవకాలు తనయిష్టము వచ్చినట్లు జరుపుకొనుచూ గుండ్రముగా రెండుమూడు చుట్లులు తిరుగవలయును. అట్లు తిరిగినయెడల మడమ మోపినచోట కొంచెము లోతుగల గుండ్రని గుంటగాను, పాదము తగిలినందువల్ల పాదమునకు తగిలిన యిసుక (యిసుకగాని, బూడిదగాని, దుమ్ముగాని) పాదమున కవతలచుట్టును పడి కొంచెము ఎత్తుగా అంచువలె నుండుటచేతను, మడమ నిల్పినచోటు అంతలోను కొంచెము పల్లముగా నుండుటచేతను కంచమువలె ఏర్పడును. ఇట్టికంచములు ఎవరిస్థలములో వారు ఒకరికన్న



ఒకరు త్వరగానూ, ఎక్కువ సంఖ్యయగునట్లుగను, అందముగానూ చేయుదురు. కాలితో కంచములు చేయుట చేత ఈయాటకు కాలికంచమని పేరు. బూడిదగాని, దుమ్ముగాని గలచోట్లకంటె ఇసుకప్రదేశము లీయాటకు తగినవి. అనగా బట్టలు ఒడలు బాడిగాక దులిపినంతనే రాలిపోవును. ప్రతిబాలికచక్రములు రమారమి రెండేసి బెత్తెడులు పరిమాణముగల తాటియాకుముక్కలను దెచ్చుకొని ఆముక్కలలో నొకదానిమధ్యభాగమున ఆయాకునకుగలయంత వెడల్పున క్రిందిప్రక్కను, మీది ప్రక్కను మెల్లగా చీల్చి ఆచీలికలలోనుండి రెండవ ముక్కను దీసి చక్రాకారముగా వచ్చునట్లు చేయవలెను. అనగా నాలుగువైపులను తాటిఆకులు సమానమైన కొలత గలవిగా నుండునట్లు చేయవలెను; తరువాత ఆచక్రమునకు మధ్యభాగమున సూదిలో రంధ్రమువేసి ఆరంధ్రములో సూదిగాని, తుమ్మ మొదలైనవాని ముల్లుగాని గ్రుచ్చి దాని ఆముంటిమొన నొక చీపురుపుడకనుగాని, మరియొకపుడకనుగాని గ్రుచ్చి ఆపుల్లను చేతితో పట్టుకొని గాలికెదురుగా నిల్చియుండవలెను. అప్పుడాచక్రము గాలికిగిరగిరతిరుగుచుఅందముగాను, చిత్రముగాను నుండి ఆనందము కల్గును. గాలికి ఎదురుగా పరుగెత్తినయెడల చక్రము మరింతవడిగా తిరుగును. గాలి లేనపుడు చక్రము తిరుగనియెడల పరుగెత్తినయెడల వేగవశమున గాలిపుట్టి చక్రము తిరుగును. చక్రమధ్యమున గ్రుచ్చెడుముల్లు ఒంటిదైన యెడల చక్రము జారిపోవును. కనుక జంటముల్లు తెచ్చి ఒకముల్లుమొదలు మాత్రముంచితక్కినది విరుగదీసిరెండవముల్లంతయుకూడ నుంచి ఆముల్లు గ్రుచ్చవలయును. ఈయాట చిన్నబాలికలాడుకొనవలయును. బాలురును ఆడుకొనవచ్చును.

# రోగవారసత్వము

వడ్డాది సీతారామారావు, B. A., M. Sc

రోగవారసత్వమునుగూర్చి మనలో చాలా తప్పు అభిప్రాయాలు వ్యాపించి ఉన్నవి. ముఖ్యముగా వాటిని పోగొట్టుటకే ఈవ్యాసము ఉద్దేశింపబడినది.

రోగములను రెండుభాగములక్రింద విభజింప వచ్చును:

౧. బీజసంబంధమైన లోపములవలన వచ్చినవి;

౨. బీజము (Germinal Matter) నం దెట్టి లోపమును లేక బయటినుండి మనకు వ్యాపించినవి.

తల్లిదండ్రులలో నెవరికైనను ఉన్న రోగమే వారి సంతానమునందుకూడ నున్న దనుకొందము. అందుచే వ్యాధి తప్పక వారినుండియే సంక్రమించిన దనుకొనరాదు. అది రోగవారసత్వము కాదు. ఏ అనారోగ్యపరిసరములు మొదట నావ్యాధిని తల్లిదండ్రుల యందు కలుగజేసినవో ఆ అనారోగ్యపరిసరములే యింకను వారి సంతానమునుకూడ చుట్టుకొనియుండుటచే నారోగము వచ్చియుండును. ఒకడు అనారోగ్యప్రదేశములలో నివసించుచుండుటచే క్షయవ్యాధి వచ్చె ననుకొందము. ఆతని పిల్లలుకూడ నాప్రదేశమ ననే యున్న వారికికూడ నావ్యాధి రావచ్చును. అందుచే తండ్రినుండియే ఆ వ్యాధి బిడ్డలకు వారసత్వముగా వచ్చె ననుకొనుట తప్పు.

కొందరిశరీరములు కొన్నికొన్ని వ్యాధులు సులభముగా బయలుదేరుట కనుకూలముగా నుండును. దీనిని Predisposition to a disease అందురు. ఈ Predisposition, అనగా రోగానుకూలపూర్వస్థితి బీజము (Germinal Matter) నం దున్న ఏదో వింత మార్పుగాని లోపమునుగానిబట్టి ఉండును. ఇది ఒకొక్కనికిని ఏదో ఒకప్రత్యేకమైన వ్యాధివిషయమైయే ఉండునుగాని అన్నివ్యాధులవిషయమై ఉండదు. ఒకని బీజస్థితి క్షయరోగానుకూలముగా నున్నయెడల మఱొకనిది పక్షవాతమున కనుకూలముగా నుండ వచ్చును. రోగమునకు దేహమునం దనుకూలస్థితి యున్నప్పటికిని, యది బహిర్గతము కాకపోవచ్చును. రోగము బహిర్గతమగుటయు, లేనిదియు దానికివచ్చు పోషణ (Nurture)ను బట్టి యుండును. శరీరప్రకృతి వ్యాధి బహిర్గతమగుట కనుకూలముగ లేనిచో నది అంతర్గతముగానే యుండవచ్చును. ఈ రోగానుకూలపూర్వస్థితులు బీజస్థమైన వగుటచే నివి వారసత్వమువలె సంక్రమించ వచ్చును.

రోగము వేఱు; రోగానుకూలపూర్వస్థితి వేఱు. అట్లే రోగవారసత్వము వేఱు, రోగానుకూలపూర్వస్థితి యొక్క వారసత్వము వేఱు. ఈపూర్వస్థితి బహిర్గతమైననే రోగమనబడును. బీజమునందుండునది రోగానుకూలపూర్వస్థితిమాత్రమే. వారసత్వముక్రింద సంక్రమించునవి యీ అనుకూలపూర్వస్థితులుగాని రోగములు గావు. ( Diseases cannot be transmitted. What is inherited is a predisposition to a disease due to a germinal defect, which, under appropriate stimulating conditions, gives rise to a disease.)

అట్లు అంతస్స్థితమైన లోపములు రోగములవలె బహిర్గతమగుటయు లేకుండుటయు వాటికి గలుగు పోషణనుబట్టి యుండునని ఇదివఱకే తెల్పితిని. దేహప్రకృతి రోగోద్రేకమును కలిగించునదిగా నున్నతప్ప వ్యాధి బయల్పడనేరదు. బీజస్థలోపము లొకతరమునుండి మఱొకతరమునకు రావచ్చును గనుక శరీరప్రకృతియు, పోషణయు వాటి కనుకూలముగా లేకుండుటచే నొక తరమునందు వ్యాధి బహిర్గతము కాకపోయినప్పటికిని, మఱొకతరమునందు కావచ్చును.

ఒక్కొక్కప్పుడు రోగానుకూలబీజస్థితులు పూ ర్తిగ పోవచ్చును. దీనినే Racial cure of a disease అందురు. అంతస్థితిమైనవి తప్ప పైనుండివచ్చినవ్యాధులెన్నడును తరతరముల సంక్రమింపనేరవు. సూక్ష్మక్రిమి సంబంధమైన వ్యాధులవిషయమైకూడ నింతే.

రోగము తల్లిదండ్రులనుండి బిడ్డలకు రాకపోయినప్పటికిని రోగము నాధారపడియున్నవియు, దానికి సంబంధించినవియు నైనఫలితము లెవ్వియైన వ్యాపింపవచ్చును. రోగవారసత్వము నిదియు నొకటి కాదు.

వ్యాధివలె బహిర్గతము కానివియు, శరీరమునకు సంబంధించిన అంతఃస్థిత-అసాధారణత్వము లెవ్వియైన (ముఖ్యముగా మనస్సంబంధమైనవి) తరతరముల సంక్రమింపవచ్చును.

కొన్ని తెగలమనుష్యుల కెన్నడును Yellow fever అనువ్యాధి రానేరనట్లు శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. ఈరోగనిరోధకశక్తి స్వాభావికమైనదియు, బీజస్థమైనదియు నగుటచే నిది వారసత్వమువల్ల పొందబడుచున్నది. స్వాభావికమైన నిరోధకశక్తి ( Natural Immunity ) యేగాని యితరవిధముల వచ్చిన నిరోధశక్తి ముందుతరములకు సంక్రమింపదు.

---

## ఉపేక్షితము

కొంపెల్ల జనార్దనరావు

ఒక మునలిదోనె యిది; పడియున్న దిచట,
ఊడిగము సేత సత్తువ లుడిగి యుడిగి;
తనకుఁదా మృతస్మృతులు కల్పనము సేసి
కొనుచు, తనపయిఁ దా జాలిగొనుచు నిట్లు.
అఖిలజనకవాత్సల్యసహార్థి యగుట
తలఁపఁడు; స్వకీయసౌఖ్యసంధాయి యగు టె
అరయఁడు నరుండు—కట్టికొన్నాఁడు, తరువు
నఱికి, కంకాళమయ మొకనావ తనకు.
కుపితజలరాశిఁ,—ప్రకృతిసంకులవిఘట్ట
నములఁదన కంగరక్షగా నవయఁజేసె,
స్వార్థసంపాదనములకై యడఁచి దీని:
చూచి యూర్వఁడు,—చూడనేచూడఁ డిపుడు.

నిరతయాత్రామిళత్కాలచరణబహుళ
చిహ్నజీర్ణితసత్త్వ మీనాసికతరేణు
సముదయమునఁ గాయార్ధదఘ్నముగ నిలిచి
నేర్చుచున్నది యిది ధ్యాననిరతితాల్మి.
వాయువులు సీన గుప్తభావములు చదువ
గొడఁగుచున్నవి; చెడిన ప్రాగూటిసొదలు
పోసికొని యేడ్చుచున్న దీపులుఁగు;—జలము
లశ్రువులు చిందు కెలన, చిరానురక్తి.
గతకథాగళసారిగాఢదికమాధు
రీగరిమ లోనడఁచుకొన్న పృథులశాంతి
అణు వణువునందు నాల్కవిప్పారి, స్వాగ
తము విరాలించి యడుగు, లైన్యము వరించి.

---

# యశోమూర్తి ఆనీబెసంటు

సి. అశ్వత్థనారాయణరావు, బి. ఏ.,

ఏ దృష్టినిచూచినను డా. ఆనీబెసంటు ఆధునికయుగమున నొకగొప్పవ్యక్తి. కొందరు గొప్పవ్యక్తులవలె బెసంటు ఇంటను, బయటను తీవ్రములగు కష్టములకు పాలయినది; అట్లే జీవితమును ఉత్తమముగ గడపినది.

ఆమె అసంఖ్యాకగ్రంథరచయిత్రి; వక్త్రీశిరోమణి; మహోదారవిద్యాప్రచారశీల. చిన్న పంచముల పాఠశాల మొదలుకొని సెంట్రల్ హిందూకళాశాల, పృథులతరములగు తియసాఫికల్ ఎడ్యుకేషనల్ ట్రస్టు, నేషనల్ విశ్వవిద్యాలయమువరకు గల విద్యాసంస్థ లన్నియు నాయమ నెలకొలిపినవి.

భారతమును బోలిన దేశమున యూనివర్సిటీలమాట కలనయిన తలపజాలినవ్యక్తి-అందును జీవితసూత్రములయం దొరులతో నెప్పుడు నైకమత్యము కుదురనిదయ్యును తాను మొదలిడినకార్యముల నన్నిటిని నిర్వహించుటకు కావలసినధనమున నొక్కొక్క కణమునకును ఒరులే గతిగా నుండిన బెసంటును బోలినవ్యక్తి — ఇంకొకరు ఊహకు తగులరు.

ఆమె రాజకీయజీవితము భారతరాజకీయరంగమున కుత్తమరూపమును నిర్మించి యచటను ఉత్తమస్థానమున నిలిచినది. ఆయమ గావించిన నిఖిలప్రపంచసంచారములా అతిమాత్రములు! అవియు నెన్నిమారులు!! ఒకమారుకన్న నింకొకమారు శీఘ్రగమనముగల యానములయందే - విమానములుసహా- ఆమెప్రయాణము. కార్యనిర్మాణనైపుణ్యమున నామెనుమించినచేయి లేదు. ఆమెవలె ప్రజల కడనుండి ధనమును సమకూర్చి యుత్తమ కార్యములకు వ్యయించినవ్యక్తి యింకొకరు 'నాస్తి'.

తియసాఫికల్ సొసయిటివంటి నిఖిలప్రపంచ ప్రసిద్ధసంస్థ కాధిపత్యము వహించి దానిని నిర్వహింప నింకనొకరికి సాధ్యము కాగలదని తలంపనైన నగునా? నిరంతరము నామెనే వరించుచుండిన తదాధిపత్యమునకు మరణమే స్వస్తి చెప్పగలిగినది. అల్పాల్పవిషయముల సయితము కడుజాగ్రత్త గలిగియుండుట కామె కామెయే సాటి. ఆమె ప్రయాణములయందు కాఫీని సొంతముగ తయారుచేసికొనెడిది. కాఫీని మిక్కిలిరుచిగా నుండునట్లు తయారు చేయునేర్పు ఆమెకు గలదు.

ఎల్లచోటుల నామెకే మొదటియాతిథ్యము. ఆమెయొసంగు నాతిథ్యము నత్యుత్తమము.

ఊహకందని కడగండ్లను గడచిన దామె. అట్లే విజయపరంపరలను పడసిన యదృష్టవతి. ఆమెవలె వందలకొలదికార్యములను తలపెట్టి గౌరవప్రతిష్ఠలతో వానిని కొనసాగించినవ్యక్తి యింకొక రుండబోరు.

ఒక్కటినిగాని, పెక్కిటినిగాని ప్రజాహితకార్యములను సాధించి పేరెన్నికకెక్కిన

వా రనేకులుకలరుగాని బెసంటువలె నిన్ని కార్యములను సాధించి విశ్వవిఖ్యాతిని వరియించినవ్యక్తి స్త్రీపురుషు లయం దొక్క రేనిలేరు. అన్నింటిని మిగిలినవిషయము: ప్రపంచమునకు కృష్ణాజీని ప్రసాదించినది.

తొలుత మదనపల్లెయం దామె స్వీకరించినపుడు కృష్ణమూర్తి పదునొకండేండ్ల బాలుడు; కృశించిన పలుచని శరీరముగల యొకసామాన్యుడగు పిరికికుర్రవానివలె మన కానాడు పొడగట్టినాడు.

బెసంటు కాతనియం దానాడే ప్రపంచ గురువు గోచరించెను. తనకు గోచరించిన సత్యము నామె ప్రపంచమునకు నాడే చాటినది. దీనివలన నామెకుగల యుత్తరవాదిత యొక్క పరిమితి వేరుగ నిట పేరుకొనబనిలేదు. ఆకృష్ణమూర్తి కామె ఉత్తమమగు విద్యను, ప్రపంచజ్ఞానమును, మిత్రమండలిని ప్రసాదించినది. నేడు కృష్ణాజి తాను ప్రపంచగురువునని అంగీకరించడు. కాని తనకు ప్రబోధము కలిగెనని చెప్పును. అనేకులు దానిని విశ్వసింతురు. వివిధజీవితపథగాములగు మహాత్ము లెల్లరు ఆయన వర్తమానయుగమునకు జెందిన గొప్పవేత్తయని నిశ్చయించిరి. ఆయనతో నైకమత్యము కుదరనివారు సైతము నాయన వేత్తృతను, వాక్శక్తిని అంగీకరింతురు.

పది, పదునొకండేండ్లవయసునాటికృష్ణాజి తాహతు ఎట్టిది? నేటితాహతు ఎట్టిది? ఆయనవిజ్ఞానవికాసములకు సముచితావకాశములనొసగినవా రెవ్వరు? కృష్ణాజిని అద్భుతశక్తిసంపన్నుని గావించిన అద్భుతశక్తి బెసంటు.

బెసంటు శరీరబలశక్తిసంపన్నురాలు; విచిత్రమగు మనశ్శక్తికలయామె; ప్రతిలేని భావవైలక్షణ్యము గల యామె; అద్వితీయమగు నాధ్యాత్మికప్రజ్ఞగలయామె. ఆమె యొక అపూర్వవ్యక్తి. ఆమెయే యొకసంస్థ. తాను మొదలిడిన కార్యముల నప్రయత్నముగ కొనసాగించినది. ఆమె స్వయముగ లబ్ధప్రతిష్ఠ యయినది; పలువురను లబ్ధప్రతిష్ఠులనుగావించినది. నిశ్చయబుద్ధి కలదేని మనము నట్టియున్నతిని పొందగలుగుదుము.

ఈయమజీవితమున గొన్నిముఖ్యములైన సందర్భములు:

౧౮౪౭ అక్టోబరు ౧. జననము.

౧౮౬౭ రెవరెండు ఫ్రాంకు బిసెంటుగారితో పాణిగ్రహణము; నేషనల్ సెక్యులర్ సొసైటీలో చేరుట.

౧౮౭౩ విడాకులు.

౧౮౭౪-౮౦ ఛార్లెస్ బ్రాడ్లాఫరుగారితో ప్రపంచమున కాదర్శప్రాయములైన సంభాషణలు.

౧౮౮౯ దివ్యజ్ఞానసమాజమున ప్రవేశము.

౧౮౯౮ కాశిలో కేంద్రహిందూకళాశాలను స్థాపించుట.

౧౯౦౪ కేంద్రహిందూబాలికాపాఠశాల; డాక్టరు ఆఫ్ లిటరేచర్.

౧౯౦౭,-౧౪,-౨౧,-౨౮ దివ్యజ్ఞానసమాజాధ్యక్షత.

౧౯౧౭-౧౮ అఖిలభారత జాతీయమహాసభ కధ్యక్షత; 'థియాసఫిస్టు', 'న్యూ ఇండియా' పత్రికల ప్రకటన.

౧౯౩౩ సెప్టెంబరు ౨౦. మరణము.

---

# నక్షత్ర మండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

## కార్తిక, మార్గశిర మాసములు : (నవంబరు 1933)




[ఈ పటము శిరస్సుమీదను ఆయాదిక్కులు నవంబరు ౧౫ తేదీని గం. ౮-౨౪ నకు నవంబరు ౨౨ సరిగా కనబడునట్లు పట్టుకొని చూడవలెను. ఇందు తేదీని గం. ౭-౫౭ కును, నవంబరు 3౦ తేదీని గం. న్నట్లు నవంబరు ౮ తేదీని ౮ గం. ౫౨ ని. రాత్రికిని, ౭-౨౫ కును కనబడును.]

## 1933 నవంబరు 8 మొదలు డిసెంబరు 8 వఱకు

ఈమాసములో క్షీరవాహిని (Milky way) మండలాకారముగా తూర్పునుండి పడమటకు వ్యాపించి యున్నది. ఈశాన్యదిశను చీలిపోవును. తూర్పునుండి వరుసగా మిథున, వృషభ, సారథి, భృగుపరశు, అప్సరస, ఇంద్రమద, రాజహంస, గరుడమండలములమీద నుండికాని, సమీపమునుండికాని పడమటకు వ్యాపించి యున్నది.

### తేజోవంతములైన నక్షత్రములు

### (First magnitude stars)

మిక్కిలితేజోవంతములైన నక్షత్రములు ఈమాసపురాత్రితొలిజామున ఎనిమిది కనబడుచున్నవి. అవియేవియనగా:—

1. వీణామండలము (Lyra) లోని బ్రహ్మ.
2. గరుడమండలము (Aquila) లో శ్రవణము.
3. ఇంద్రద్యుమ్నుడు (Fourabhant).
4. బ్రహ్మహృదయము (Copella) (Auriga సారథిమండలము)
5. రోహిణి (Aldebaran)
6. ఆర్ద్ర (Betelgeuse)
7. ఒరయన్‌మండలములో యమునసమీపమున Rigel.
8. ఆగ్నేయాకాశమున శంతనుడు

### గ్రహములు

శని శ్రవణముదిసవనే ఉన్నాడు. అంగారకుడు ఈమాసారంభమున ధనుస్సులో ప్రవేశించి నెలాఖరు వఱకు ఆరాశిలోనే కనబడును. గురుడు చిత్రలో నుండుటచే రాత్రితొలిజామున కనబడడు. శుక్రుడు ఈ మాసములో ధనుస్సులోనుండి మకరమున ప్రవేశించి మకరరాశి గడచుచుండును. సూర్యాస్తమానము కాగానే పడమట చంద్రుడున్న దినములలో ఆసమీపమునందు శుక్రాంగారకగ్రహములు కనుపడుచున్నదృశ్యమెంతో మనోహరముగా నుండును.

### ఉత్తర నక్షత్రములు

లఘు ఋక్షపుచ్ఛాగ్రమున ధ్రువుడును, పుచ్ఛమునందు అగ్నిమహేంద్ర కశ్యపులును కనపడుచున్నారు. చిన్నయెలుగు ఇంకను పశ్చిమముఖముగానే ఉన్నది. ధ్రువునకు కొంచెము ప్రక్కగా ఎడమపాదముతోసహా ఊరువు ఉన్నది. పురూరవసు డాదిగువను క్షీరవాహినిలో నున్నాడు. సప్తఋషులు కనబడరు. నరకుడు పశ్చిమశిరస్కుడై బ్రహ్మ కనతిదూరమున కానవచ్చుచున్నాడు.

పడమట శ్రీ మహావిష్ణుస్వరూపము పూర్తిగా నస్తమించినది. బ్రహ్మయు, అతనివాహనమైన రాజహంసయు ఇక నస్తమింపనై యున్నారు. ఈసందర్భములో నన్నయభట్టు వర్ణించిన శరత్కాలవర్ణనము స్ఫురణకు రాకమానదు:

ఉ. భూసతికిన్ దివంబునకు బొల్పెసగంగ శరత్సమాగమం, బాసకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో, పాసితరాజహంసగతి భాతి ప్రసన్న సరస్వతీకమ, బ్జాసన సద్మశంబగును నబ్జజు యానముతో సమానమై.

ద్యావాపృథివీ సమాగము, శరత్కాలపు ధావళ్యము, బ్రహ్మ సరస్వతీ సమాగమము, రాజహంస ధావళ్యము, ఇవి నేటి పశ్చిమాకాశమున నద్భుతదృశ్యములు; అత్యానందదాయకములు. నైఋతిదిగ్భాగమున ధన్విహూడ త్వరలో నస్తమింపనైయున్నాడు. ధన్వియనగా మన్మథుడు బ్రహ్మసోదరుడు, విష్ణుపుత్రుడునైన సంగతి ఈసందర్భమున మఱువరాదు.

### దక్షిణాకాశము

దక్షిణమునందు నాళీకజంఘబకము ప్రావారకర్ణఘూకము, యుగంధరకమఠము, వీటితోకూడినఇంద్రద్యుమ్నుడే ముఖ్యముగా కనబడును. ఆగ్నేయమున యమునానది పలువంపులు తిరిగితిరిగి శంతనుని చేరుచున్నది.

## తూర్పున

ఒరయన్ యోధుడు ఉదయించుచున్నాడు. వాని పటకా-అనగా మనవారు గొల్లకావిడిచుక్కలని చెప్పు మూడుచుక్కలును ఉదయించినవి. ఒరయన్ చతురస్రములోని నాలుగు మంచపుకోళ్లలో మూడుమాత్రము కనబడుచున్నవి. ఆగ్నేయభాగముననున్న రిగెల్ (Rigel) చుక్క సమీపమునందే యమున పుట్టుచున్నది.

## ఈశాన్యము

ఊర్వశీపురూరవసులకు ఒక ప్రక్కను అప్సరసలు ఆకాశ మధ్యభాగమును చేరుకొనుచున్నారు. సారథిమండలము బాగుగా ఉదయించినది. అజశాబకములతో బ్రహ్మహృదయము మిక్కిలి కాంతితో మెఱయుచున్నది. వాయవ్య దిగ్భాగమున బ్రహ్మయు, ఈశాన్యమున బ్రహ్మహృదయమును ఒకదానితో నొకటి తులతూగుచు తెల్లని తేజములో ప్రకాశించుచున్నారు. సారథికి దిగువ భృగు పరశుమండలమును ఆ దిగువను గ్రుడ్లు మిటకరించుకొనుచు పులోముడును కనబడుచున్నారు.

## మధ్యనక్షత్రములలో

శ్రవణమునకు తూర్పుగా అష్టవసుదేవతాకమైన ధనిష్ఠయు, ధనిష్ఠకు తూర్పున పెగసస్ (Pegasus) చతురస్రములోని పూర్వాభాద్ర, ఉత్తరాభాద్రలును మెఱయుచున్నవి ధనిష్ఠదిగువను శతభిషమును కుంభరాశియు మెఱయుచున్నవి. కుంభరాశికి తూర్పున, యుగంధరకమఠముపైన శింశుమారముకలదు. ఉత్తరాభాద్రకు తూర్పున శింశుమారముపైన రేవతి యున్నది. రేవతికి మీదుగా ఇంద్రమయయు, ప్రక్కగా అశ్వినులున్నారు. చ్యవను డశ్వినుల ప్రక్కనే కలడు. అశ్వినులకీవల భరణికృత్తికలు మెఱయుచున్నవి. మృగశిరార్ధమువఱకు గల వృషభమును, రేవతిదిగువ శింశుమారమును రథమునకు పూన్చుకొని వెడలు అశ్వినీదేవతల దివ్యరూపము ఇపు డాకాశమున స్వచ్ఛముగా తెలియనగుచున్నది.

## విశేషవిషయములు

ఇంద్రద్యుమ్నునినుండి మనకు వెలుతురు చేరుసరికి ౨౪ సంవత్సరములు పట్టును. అనగా ౧౯౦౭-వ సంవత్సరమునాటి ఇంద్రద్యుమ్నుడు నేడు మన కగపడుచున్నాడు. ఇట్లే శంతనునినుండి మనకు వెలుగు చేరుసరికి ముప్పదిసంవత్సరములు పట్టుచున్నది.

## క్షీరోదధ్రువములు

క్షీరోదదక్షిణధ్రువము యుగంధరకమఠమునున్నది. ఉత్తరధ్రువము నరకుని సమీపమున నున్నది. నరకుడు అదృశ్యుడు కానున్నాడు.

## రాసులు

పశ్చిమసమీపముననున్న నైరృతి దిగ్భాగమునుండి, తూర్పుసమీపమున నున్న ఈశాన్యమునకు వరుసగా ధనుస్సు, మకరము, కుంభము, మీనము, మేషము, వృషభము - ఇవి కనపడుచున్నవి. మన్మథుడు - ధన్వి అస్తమింపగానే మిథునము బాగుగా వెడలును.

## ఉల్కాపాతములు

౧. సింహరాశిలో ఈ నవంబరునెల ౧౪ మొదలు ౧౮-వ తేదీ వఱకు ముఖ్యమైన ఉల్కాపాతము కనబడును. ౧౪-వ తేదీని చాల ఎక్కువగా కనబడును. ఉల్కలు విశేషముగా జారుప్రదేశము మనవారు పల్లకీబొంగు అనుచోటనుండి. దానినే పాశ్చాత్యులు కొడవలివంపు అని చెప్పుదురు. ఈయుల్కలు చూచి యానందింపదగియుండును. బహువేగముగల మెఱుపులట్లు ఇవి వేవేగ జారి పడుచుండును.

౨. తరువాత పేర్కొనదగిన ఉల్కాపాతము ఇంద్రమయప్రాంతములందు కనబడును. ఇవి యీనవంబరు ౧౭ మొదలు ౨౩ వఱకు ఉజ్జ్వలముగా కనబడును. ఇవి మెల్లగా పడుచుండును. వీటి కంత తొందర లేదు.

## చిన్న ఉల్కలు

౮-వ తేదీని భృగుపరశుమండలములో చిన్న ఉల్కాపాతము. ౧౪-౨౮ తేదీలను వృషభరాశిలో చిన్న ఉల్కాపాతములు. ఈ యుల్కలు పూర్వపు తోకచుక్కల తునకలు.

---




కేదారగౌరీవ్రతము

—యస్. దుర్గారావు.



## షష్టిపూర్తి

శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి అరవై యేండ్లు నిండినవట. ఇది అరువదినాల్గవసంవత్సరమని శాస్త్రిగారే చెప్పినారు.

కాని వారిమూర్తిని జూచిన "ఇది నిజమా?" అనిపించును. వారియుత్సాహమును జూచిన "పొరపాటేమో" అనిపించును. వారియుద్రేకమును జూచిన "లెక్క తప్పినది" అని దృఢనిశ్చయము కలుగును.

అరవై యేండ్లనిన ఈకాలమున మధ్యవయస్సయిన గాదు; కాని త్రికరణయా కవిత నుపాసించువారి కుండెడి నిత్యయౌవనము శాస్త్రిగారికి ముమ్మరముగనే యున్నది.

అవధానము లనిన ఇప్పుడు జనసామాన్యమునకు మోజు చాలవరకు తగ్గిపోయినది; గాని చూచువారుండిన శాస్త్రిగారికిమాత్రము వెనుకంజ లేదు.

రసికులకుగూడ కవితావినోదములయెడల ఉత్కంఠ చాలనిరోజు లివి. అయినా సమయము చిక్కిన శాస్త్రిగారు వేదికమీద సింగపుగొదమవలె అకాండ తాండవము సేయుదురు.

శాస్త్రిగారికి ఏప్రభువును తనపేరోలగమున నిత్యకవితావినోదానందము చేకూర్ప లేకపోయినాడు; కాని శాస్త్రిగారే ప్రజలలో సొంతముగా నిండు కొలువు కల్పించుకొనినారు.

శాస్త్రిగారు మాట్లాడెదరనిన పండితులు కూడుదురు; రసికులు మూగుదురు; యువకులు విద్యార్థులు విరుచుకొనిపడుదురు. ఏల?

శాస్త్రిగారు సాహిత్యాచార్యులు; ప్రబంధపరమేశ్వరులు; నాటకప్రణేతలు; వాదప్రవీణులు; విమర్శకప్రముఖులు; సువక్తలు; హృదయము నుజ్జ్వాతలూచు పాఠకులు.

ఇట్లు శాస్త్రిగారి తేజస్సు అపారమైనదే; కాని దానికి అట్టిదే క్రీనీడగూడ ఉన్నది.

శాస్త్రిగారు కలహప్రియులు; పరుషభాషులు; శీఘ్రకోపులు; ధార్త్యమునకు వెనుదీయరు. చిత్తు అగుదురు; కాని బుకాయింతురు.

అయితే, యిది శాస్త్రిగారియందే గలలోపమా? ప్రాయికముగా ఆంధ్రకవీశ్వరులకు ఉండు ప్రత్యేకలక్షణమా?

ఇది చాలజటిలమైనప్రశ్న; కాని దీనికి ఇది తగినస్థలము కాదు.

కవు లనేకులు పాఠశాలలయందు, కళాశాలలయందు నుపాధ్యాయులైనవా రున్నారు. రికామీగా ఉండియు అనేకులకు పాఠములు చెప్పెడివారున్నారు. తన్మూలమున వారికి శిష్యులును అసంఖ్యాకులే యున్నారు; కాని యీవిషయమున శాస్త్రిగారివిశిష్టత యేమిటంటే? శాస్త్రిగారిశిష్యులలో అనేకులు కవులు.

ఇంకొకటి: ప్రత్యక్షసంబంధము లేకపోయినా నేడు పద్యము లల్లువారిలో అనేకులు శాస్త్రిగారు తమకు గురువులని చెప్పుకొనుచు మురిసిపోవుచున్నారు.

ఆంధ్రకవులచరిత్రమున ఇది ప్రత్యేకముగ గుర్తింపవలసినవిషయము. ఏకాలమునందును, ఏప్రాంతమునందును ఇందరు కవిశిష్యులుగలకవి మరియొకడు లేడు,

ఇట్లు శాస్త్రిగారిశిష్యులసంఖ్యాకులనిమాత్రమే చెప్పిన చాలదు. శాస్త్రిగారిశిష్యులలో శివరామశాస్త్రిగారివంటిపండితులున్నారు; ప్రభాకరశాస్త్రిగారివంటి పరిశోధకులున్నారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారివంటి బోధకులున్నారు; పట్టాభిరామశాస్త్రిగారివంటిపత్రికా సంపాదకులున్నారు; లక్ష్మీకాంతముగారివంటికవులున్నారు.

ఇంకా అలాంటి—అలాంటివారు ఎందరో ఉన్నారు.

వాస్తవముగా ఆంధ్రకవులచరిత్ర కిది, ఏభాషా కవులచరిత్రకును లేదనిచెప్పదగిన విశిష్టత.

నిజమే. ఈసంఘటన మపూర్వమే.

అయితే, గురుడు అధ్యక్షుడుగను, శిష్యులు పారిషదులుగనుండి ఒకపరిషద్రూపమునఅపూర్వవాఙ్మయ నిర్మాణము చేయనగినగురుకుల మిది; కాని ఆంధ్ర వాఙ్మయచరిత్రకు అట్టిఅమూల్యాలంకార మేర్పడలేదు.

గురువుతెన్నన గురువు, శిష్యులతెన్నన శిష్యులు గ్రంథములు, పరిశోధనములు, చర్చలు, విమర్శనములు—ఇంక నిట్టివి చేసి తమసామర్థ్యమును, తమప్రతిభను ప్రకటించుచున్నారు.

వ్యక్త్యపేక్షయా యీవ్యవసాయము వారికిని ఘనతనొసగుచున్నది; వాఙ్మయమునకును పుష్టికలిగించుచున్నది; కాని అందరును ఒకవర్గముగ, ఒక సంఘముగ కూడి పనిచేసిన ఆయందము వేరు; ఆప్రయోజనమున్ను వేరు.

ఏతావతా: శాస్త్రిగారు భాషకు పదుగురు పండితులు కలిగింపగల ఉన్నతికంటె ఎక్కువకలిగించినారు; వాఙ్మయమునకు నూర్గురుకవులు సమకూర్పగల వికాసముకంటె అధికముగ సమకూర్చినారు.

నవీనకవులలో శాస్త్రిగారికంటె ఎక్కువగా దేశములు తిరిగినవారు, శాస్త్రిగారికంటె ఎక్కువగా రాజులను మెప్పించినవారు, శాస్త్రిగారికంటె ఎక్కువగా పండితులకోడను, కవీంద్రులకోడను డీకొనినవారు, శాస్త్రిగారికంటె ఎక్కువగా అనుభవములు పొందినవారు మరియొకరు లేరు.

ఇట్లు "దేశాటనం పండితమిత్రతాచ" అన్న సూక్తి శాస్త్రిగారియెడల పూర్తిగా అన్వయించినది; సార్థకమున్ను అయినది.

వాస్తవమే; కాని యీసంఘటనములవలన కలిగిన ప్రజ్ఞాపరిణతిని, ఒనవినచాతుర్యమును శాస్త్రిగారు వాఙ్మయమున పూర్తిగా నిక్షిప్తము చేయలేదు.

నానారాజసందర్శనము శాస్త్రిగారు పడిన పాట్లను, కొట్టినదెబ్బలను ప్రకటించుచున్నదే; కాని తత్ఫలితమును గాదు. గీరతమున్ను శాస్త్రిగారి వీర విహారమునకు సినీమాఫిలుము కావచ్చునే కాని మహోన్నతయశోబింబమునకు వాఙ్మయాదర్శము కాదు.

అయినా శాస్త్రిగారు ఇంతవరకును చూపిన పురుషకారము వారికి జీవితసాఫల్యమును ఒనగూర్చుచున్నది.

బందరుపౌరులు శాస్త్రిగారికి చేసినపూజ ఆంధ్ర జాతికి నవశక్తిని సంఘటించుచున్నది.

ఇక నొక్కసంగతిమాత్ర మున్నది.

ఈషష్టిపూర్తిమహోత్సవము శాస్త్రిగారికి ఆటవిడుపు కాదు– చేయవలసిన డింకను కలదను శంఖారావము; విశ్రాంతికి అనుజ్ఞయు కాదు– మరల నడుము కట్టవలసిన దను సింహనాదము.

మహాకవి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ఈయింగితమును గుర్తించి, బహుముఖముల చెదరియున్న తమ శక్తి నేకముఖము గావించుకొని, క్రొత్తమార్గమున, నవీనశైలిలో మరికొన్ని ఉద్గ్రంథములను రచించి, మరల—షష్టిపూర్తికి,కాదు కనకాభిషేకమునకు ఆవశ్యకమును కలిగించుకొందురుగాక!

—శాస్త్రి.

## ఆంధ్రవిశ్వకలాపరిషత్తువారి దేశభాషాపరీక్షలు

తెలుగునాడన్నా, తెలుగువాడన్నా, ఊరూ పేరూ లేకుండాపోయి చాలాకాల మయింది. అయినా కీడులో మేలు అన్నట్లుగా తెలుగుమంత్రి పానగల్లు రాజాగారిభాగ్యాన "ఆంధ్రవిశ్వకలాపరిషత్తు ఏర్పడింది. అదీ దెబ్బలు తినితిని అనంతపురంమూలనుంచి వాల్తేరు పరుగెత్తింది. పోనీ దానికే మనుకుంటే పేరు మట్టుకే ఆంధ్రవిశ్వవిద్యాలయం కాని అందులో ఆంధ్రత్వంమట్టుకు శూన్యం అవులోంది. అధికారవర్గానికి ఆంగ్లేయాభిమానం-ఆశ్రితవర్గానికి సంస్కృతాభిమానం. ఇక తెలుగుమాటేమిటి? "ఉద్ధతులమధ్య పేదల కుండదరమే" అనుకొంటూ పరుగెత్తవలసిందేనా?

అసలుకళలూ శాస్త్రములూ దేశభాషలో నేర్పవలెననే ఉద్యమం సాగినప్పుడు ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉంటే అది సాధ్యపడుతుంది అని వ్యాసాలు వ్రాస్తుండే వారు తెలుగువారు. విశ్వవిద్యాలయం వచ్చినతరువాత ఈకలియుగం వుండగా ఆట్టిశుభదినాలు రావడం దుర్ఘటమని తెలిసింది.

అన్నీ అలాసున్నా ప్రాచ్యభాషాపరీక్షల్లోనైనా ఆంధ్రం నిలుస్తుందని నేటివరకూ జనాభిప్రాయం. ఆ ఆశకూడా పడవద్దంటోంది విశ్వకలాపరిషత్తు నేడు.

బి. ఎ. క్లాసులో ప్రత్యేకపు తెలుగుభాగం ఏర్పాటుచేస్తూ ప్రాచ్యపరీక్షలకు ఎ, బి, సి- లనే గుర్తులతో అనగా ఎ. సంస్కృత ప్రాధాన్యం; బి. తెలుగుప్రాధాన్యం జేస్తూ తెలుగుకు అవసరమైన సంస్కృతంతో కలపడం; సి. తెలుగుమాత్రమే, గలిగిన పరీక్షలుకూడా నిర్మించి మొదట కొంత ఆంధ్రత్వం చూపింది ఈకళాపరిషత్తు.

ఈనాటికి విశ్వకలాపరిషత్తువారికి గల్గిన అనుభవాన్నిబట్టి మూడూ కోసివేసి వాటిస్థానే "ఆంధ్ర విద్యాప్రవీణ" పేరుపెట్టి సంస్కృతంనిధి చేసిన పరీక్ష ఏర్పాటు చేయవలంచుచున్నారని వినికిడి.

సంస్కృతంవస్తే తెలుగువచ్చినట్లే అని అభిప్రాయపడ్డారా? అందుకు "సంస్కృతారణ్యసంచారి విద్వన్మత్తేభశృంఖలమ్" అన్నసామెత సమాధానం.

సంస్కృతసాహిత్యసంబంధం లేకుండా తెనుగు ఆనర్సుపరీక్ష ఒకటి ఉండనేఉందిగనుక ఓరియంటల్ డిగ్రీ సంస్కృతప్రాధాన్యం చేస్తే మంచిదని అభిప్రాయపడ్డారా? వ్యక్తులు వేరయినప్పుడు వారితెనుగూ, వీరిసంస్కృతమూ మేళగించడ మెట్లా సాధ్యపడుతుంది?

అదికాదు; తెలుగు చెప్పడానికి ఆనర్సువారూ, సంస్కృతం చెప్పడానికి ఆంధ్రభాషాప్రవీణులూ పనికివస్తారు దేశానికి అంటారా? ఆడిగ్రీ 'గీర్వాణప్రవీణ' అంటే బాగుండదా?

ఇన్నిపట్లీ లెందుకు? ఉన్నది ఉన్నట్లుంటే ఏమినష్టం వచ్చింది అని ఈమార్పు తీసుకురావాలి? అది లోకానికి అర్థం కావడం లేదు.

ఆంధ్రమునకు సంస్కృతం అవసరమని అందరూ ఒప్పుకొంటారు గాని ఆంధ్రమును ప్రధానం చేయక పోవుట అసంగత మంటారు. ఇంతకంటె ఈపరీక్షలు అసలే తీసివేస్తే బాగావుంటుంది. దేశంలో ఆంధ్ర భాషకు జీవం పోయుచున్న పండితులూ, కవులూ విశ్వవిద్యాలయంవారి డిగ్రీలు పుచ్చుకొన్నవారేకారు. పాండిత్యమూ, పేరూ సంపాదించి వాఙ్మయంలో స్థానం సంపాదించుకొన్నవారిని ఇదివరకు కలాశాలలూ పాఠశాలలూ పండితులుగా స్వీకరించడం జరుగుచున్నపనే. వీరు పెట్టినపరీక్షలవల్ల తెలుగుకు వచ్చేబలుపు ఏమి?

ఈచీవర మాని ఉన్నపరీక్ష లున్నట్లుంచి తెలుగుకు ప్రత్యేకగౌరవం లేవడానికి విశ్వవిద్యాలయం వారు ప్రయత్నిస్తే దేశసౌభాగ్యానికి తోడ్పడినవారవుతారు.

ఆంధ్రానకు ప్రత్యేకత్వం లేవడానకు సంకల్పించిన చాళుక్యరాజరాజునా డారంభించినవ్యాకరణ మీమాంస పూర్తిచేయించాలి. దేశ్యపదజాలము నేర్చి కూర్చిన తిక్కనగారిప్రయత్నంలో ఉన్నరహస్యం కని పెట్టి ఆకవిబ్రహ్మ పోగుచేసినపదజాలం నికరం తేల్చ

కుని ఈకాలంలోని దేశ్యపదాలుకూడా సంగ్రహించి సంస్కరించాలి. అక్కడకు సంపూర్ణవ్యాకరణమూ, సంపూర్ణకోశమూ తయారయితే ఆంధ్రం మాటే ఏదో నిర్ణయమౌతుంది. అపుడు ఏపరీక్షలు ఎట్లా నిర్ణయించాలో ఆలోచిస్తే అందమూ చందమూను.

ఇందుకు కొన్నిలక్ష లవుతుంది, డబ్బేది అంటే, డబ్బు ఖర్చులేదుగనుక బాగా ఆలోచించి పరీక్షలు తలక్రిందులు చేయడ మెందుకు?

ప్రకృతిశాస్త్రాలకు జయపురప్రభు విచ్చినట్లు భాషలకుమాత్రం ఏధర్మాత్ముడైనా దానం చేయక పోతాడా ప్రయత్నిస్తే.

రాజరాజు విద్యాపరిషత్తుదారితీస్తే మనుమసిద్ధిరాజధానిలో మహిమ గన్పించింది. విద్యానగరాల కళామయమైనదేకాని ప్రత్యేకాదర్శం త్రొక్కలేదు. రానురాను తెలుగుతల్లికి విద్యాకేంద్రమూ రాజకీయకేంద్రమూ లేకుండాపోవడంచేతనూ, చిన్నరాజ్యాలేర్పడడంచేతనూ భాషావిషయం వెనుక పట్టింది. ఆంధ్రవిశ్వవిద్యాలయమే ఆంధ్రవాణికి ముఖ్యకేంద్రం చేయాలంటే నన్నయ తిక్కనలు చూపించినదారిని స్వతంత్రం సమకూర్చి ఆపిమ్మట తెలుగులో పరీక్షలు నిర్ణయించడానికీ, తెలుగులో శాస్త్రములూ, కళలూ నిర్మించి, కలాశాలలు నడపడానికీ సాధ్యపడుతుంది. ఆమహాప్రయత్నం సాగించడానికి తగ్గమనుష్యులను తయారుచేయడానికే ఈపరీక్ష లిట్లా మార్చుచున్నామంటారా? విద్యాసముద్రులూ దేశ, భాషా, సంప్రదాయజ్ఞానాలుకలపండితులూ నేడుండనే ఉన్నారు పనిచేయిస్తే; ఇపుడు నిర్ణయించబోయేనూత్నవిధానం ప్రకారం పరీక్షలలో ఉత్తీర్ణులయినంతమాత్రంచేత ఆంధ్రానికి స్వతంత్రవ్యక్తిత్వం ఇచ్చేటంతపూర్ణులు కాలేరు. అందుకు అనుభవంకావాలి.

ఆంధ్రభాషనూ ఆంధ్రవిజ్ఞానాన్నీ వృద్ధిలోనికి తెచ్చేతలంపుతోటే ప్రత్యేకవిశ్వకలాపరిషత్తుకోసం అష్టకష్టాలూ పడింది ఆంధ్రదేశం.

అన్నీ ఆంగ్లంలోనూ, గీర్వాణంలోనూ చెలాయిస్తూ "ఆంధ్రవిశ్వవిద్యాలయం" అనేపేరుమాత్రం స్మారకచిహ్నంగా ధరించడానికి కాదుగదా?

"స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం" అన్నారు. ఒకపుష్కరం ఆంధ్రదేశం ఆందోళనచేసి సంపాదించుకొన్న విశ్వకలాపరిషత్తులో తెలుగుతనాన్ని చంపవద్దనియే ప్రార్థన.

౧. భాషాపదకోశము, పారిభాషికపదకోశము.రి

౨. సమగ్రవ్యాకరణము.

౩. భాషానిర్మాణచరిత్రము.

౪. వాఙ్మయపరిణామచరిత్రము.

మొదలగునవి తయారుచేయించి తెలుగు స్వతంత్రభాష కాగలదో లేదో ఆలోచించడం న్యాయం.

గీర్వాణభాష అభ్యసింపదగినదే భారతీయునకు. దేశభాషకుమాత్రం విజయం రావాలి. అదే ఆంధ్రలోకం యొక్క ఆదర్శం అని విశ్వవిద్యాలయపాలకవర్గానికి జోహారు జేసి విన్నవించుచున్నాను.

—తు. వెంకటరామయ్య.

# నాగార్జునకొండ - బౌద్ధస్తూపము

కపిల కాశీపతిరావు

నాగార్జునుడు మహాత్ముడు; బౌద్ధసన్న్యాసి. ఇతని పేరుతో నాగార్జునశకము ఉన్నదని వాడుక. నాగార్జునకొండ ఈ యోగినివాసము. శాతవాహనుడనే రాజు నాగార్జునికి సమకాలికుడని హ్యూయన్సియాంగు వ్రాసియున్నాడు. హ్యూయన్సియాంగు తీర్థవాసి, చీనా దేశస్థుడు. భారత దేశానికి యాత్రార్థమై వచ్చినఅన్య దేశీయులలో ఇతడు ముఖ్యుడు. ఆసేతుహిమాచల పర్యంతమూ సంచరించి, తన అనుభవాలు, అప్పటి హిందూదేశపు పరిస్థితులు ఒకగ్రంథముగా వ్రాసినాడు. బౌద్ధమహాయుగపు చరిత్రసమకూర్చుటలో ఈగ్రంథము చాలాసహాయపడినది.

శాతవాహనుడు నాగార్జునికి మిత్రుడు, పోషకుడు అని; ఈయోగి నివసించడానికి పర్వతప్రాంతములో గుహాలయము నిర్మించినాడని హ్యూయన్సియాంగు వ్రాసినాడు. నాగార్జునుడు రాళ్లను బంగారుగా మార్చి, మిత్రుడు, శిష్యుడు అగు శాతవాహనుని కిచ్చినాడట. ఇతని పేరుతో నాగార్జునకొండ అనే పెద్ద పట్టణం ఉండేది. రాజు తనప్రజలతో నివసించడానికి ఒకదుర్గం, బౌద్ధభిక్షులు నివసించడానికి ఒకచక్కనివిహారం ఉండేవి. ఈనగరవాసులు బహు నాగరికులు.

ఈకొద్దివిషయములు తప్ప ఈనాగార్జునుణ్ణి గురించిగాని, ఆనగరాన్ని గురించిగాని ఎవరికీ తెలియదు. ఈపట్టణం ఎక్కడో, ఏమూలో, వెదుకవలెనని మహాపండితులు ప్రయత్నించారు. ఆచోకీ చిక్కలేదు.

ప్రాచీనభారతీయులు చరిత్రకారకులేగాని రచయితలుగారు. తత్కారణంగా మనదేశచరిత్ర అన్యదేశాలనుండి గ్రహించవలసివచ్చినది. అన్యదేశీయులే ఈవిషయంలో మనకంటె ఎక్కువకృషి చేసినారు. హ్యూయన్సియాంగు పొరబాటున ఈసంగతి వ్రాయకపోతే బౌద్ధమహాయుగంలో ఒకశకం, హిందూదేశచరిత్రలో ఒకఅధ్యాయం శాశ్వతంగా అంతరించిఉండేవి. అటువంటినాగార్జునకొండ ఎక్కడో ఈనాటికీకూడా చాలామందికి తెలియదు.

నాగార్జునుడు ఆంధ్రుడు, నాగార్జునకొండ ఒకానొకప్పుడు ఆంధ్రనగరం. అవి ఆంధ్రజ్యోతి తక్కిన దేశాలకు వెలుగిచ్చిన సుదినాలు.

పల్నాటిసీమలో, కృష్ణాతీరాన్న, కొండలలో, కీకారణ్యమధ్యంలో, నాగజెముడుకంపలలో, ఎండకు ఎండి, వానకు తడిసి, రెండువేలసంవత్సరాలుగా కాలదేవతను ధిక్కరించి పౌరుషంతో నిలువబడ్డ రెండుమూడుశిలాస్తంభాలు తప్పవేరేబాహ్యచిహ్నం లేకుండా నాగార్జునకొండ అనేమహానగరం అంతస్థమై ఉన్నదని ఈవరకు "నరమానవులకి" తెలియదు.

బౌద్ధమతం కృష్ణాతీరాన్న ఆశ్రయించినది. ఉద్రేకపూరితులైన ఆంధ్రులు పూర్వంనుంచీ నూతనత్వంకోసం తహతహలాడేవారే. నూతనమైన బౌద్ధమతాన్ని ఆరోజులలో వీరు స్వీకరించినారు; బౌద్ధమతంతో ఆంధ్రత్వము మేళవించినారు. శూన్యమైన సన్న్యాసమతం నవకళలతో రాజిల్లి చక్కనివాఙ్మయం, చక్కనిలలితకళలు ఉద్భవించినవి. అజంతా, అమరావతి దేశదేశాల పేరు గాంచినవి. జగ్గయ్యపేట, బెజవాడ, ఉండవల్లి, ఘంటసాల, గుడివాడ, భట్టిప్రోలు, ఈప్రదేశాలన్నిటిలోగూడా స్తూపములు, బౌద్ధమతచిహ్నములు దొరికినవి. ఈక్షేత్రాలన్నిటికీ మకుటం నాగార్జునకొండ, అన్నిటికిపైగా "ఉత్తమం పర్వతాగ్రేషు" అన్నట్టు కొండమీద కృష్ణాతీరాన ఉన్నది. గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా మాచెర్లగ్రామానికి పదహారుమైళ్లదూరంలో నాగరికులకు చాలాదూరంగా ఉంటుంది. నాలుగైదుసంవత్సరాలక్రితంవరకు నవనాగరికతాచిహ్నములైన మోటారుబూరాలు, రైలుబండికూతలు, ఈ

ప్రాంతములలో వినబడ లేదు. సుడ్డిమూలలలో సడ్ల. గూబలు, రాచనగళ్లలో వన్యమృగములు నివసిస్తున్నవి. ఇప్పటికికూడా రెండెడ్లబండిమీద రెండామడప్రయాణం చేస్తేనేగాని మానవత్వంలో పడటం కష్టం. దుర్భే

విలువ ఇంతని నిర్ణయించరాని బౌద్ధస్తూపములు, చైత్యములు, విహారములు, శాసనములు, శిల్పకళ ఈ ప్రదేశంలో దొరికినవి. గ్రీసు, చీనా, కాశ్మీరము, టిబెత్తు, గాంధారము, తూసలి, అపరాంత, వంగ, వన



Scale of 0 10 20 30 40 50 60 70 80 90 100 Feet

నాగార్జునకొండ బౌద్ధస్తూపము నమునా. × గుర్తుగలచోట బుద్ధునిశల్యములున్న బరణి దొరకినది.

ద్యమైన ఆప్రదేశాన్ని త్రవ్వి పైకితీసినవాడు ఒకతెల్ల దొర, దక్షిణహిందూదేశపు ఆర్క్యాలాజికలు డిపార్టుమెంటు అసిస్టెంటుసూపర్నెంటు, ఎ. హెచ్. లాంగుహర్స్టుగారు.

వాసి, తామ్రపర్ణి, సిలోను మొదలుగాగల సమస్త దేశములలోను ప్రఖ్యాతిగాంచిన ఈ మహాపట్టణం, సర్వవిధాలంకృతమై కొన్ని వేలసంవత్సరాలక్రింద రాజిల్లినది. సర్వదేశాలనుంచీ యాత్రికులు, పండితులు,

కళోపాసకులు, మతాచార్యులు, ప్రస్తుతం నిర్జనారణ్యం క్రిందవున్న ఈనగరానికి తండోపతండాలుగా వచ్చినట్టు తార్కాణ దొరికినది. ఇప్పటివలెనే పూర్వం కూడా ఈప్రదేశానికి భూమిమీద ప్రయాణం చెయ్యడానికి వీ లున్నట్లు లేదు. నేలమార్గం ఏమీ కనబడ లేదు. సముద్రంమీదుగా వచ్చి కృష్ణాముఖద్వారంలో నుంచి నావ ప్రయాణం చేసి ఈపట్నం చేరువుంటారు. లాంగుహర్ట్సుగారు నగరంలోనుంచి నదిలోకి ఉన్న ఒక కాలువజాడ తీసినారు. అవి ఆంధ్రనావికులు సముద్రాలు ఏలినరోజులు కావచ్చును. ఇప్పుడు లంకలు గట్టి మేటవేసినదుందుడుకు కృష్ణవేణమ్మ ఆరోజులలో వీరినావలకు ఆశ్రయం ఇచ్చిందన్నమాట. బోడిరాళ్లలో బోర్లపడుతూ చిందులుతొక్కే కృష్ణవేణిపార్శ్వంలో, వృక్షజాతి వంతులువేసుకుని ఆకాశాన్ని అంటుకుంటూన్న వనమధ్యంలో, అరుల కభేద్యమైన పర్వతాగ్రములలో, యోగిపుంగవులకు, భిక్షువులకు హృదయశాంతి, రాజాధిరాజులకు, వారిప్రజలకు వైరిపోరు లేకుండా సర్వశాంతి కూర్చినది ఈనాగార్జునకొండ. శిథిల విహారములతోపాటు ఒకశిథిలదుర్గంకూడా ఇక్కడ చూడగలము.

మతస్థాపకుడు, అవతారపురుషుడు, గౌతమబుద్ధుని స్మారకంగా లోకందాచుకున్న కొద్దిశిల్యములలో ఒకటి ఈనగరంలో ఉన్నస్తూపములో రహస్యముగా దాచబడినది.

హిమాచలప్రాంతములనుండి వెదుక్కుంటూ దక్షిణాపథంజేరి, ఇక్కడ ఆశ్రయం ఏర్పరుచుకుని, ఒకకొంత కాలము పూజింపబడి, కానిరోజులకష్టములు భరించి తిరిగి రెండువేలసంవత్సరాలకు మళ్లీ ఉత్తరదేశం చేరుకున్న దీఅమూల్యశల్యము. వెనకటి కెప్పుడో ఉత్తరహిందూస్థానంలో వున్న ఈస్మారకచిహ్నములకు వైరిమతస్థులవల్ల అపాయం వచ్చిందనీ, ఒకరాజు ఆచిహ్నములు తనకొమార్తె కిచ్చి నావ యెక్కించినాడనీ, ఆమె కృష్ణాతీరాన అమరావతి చేరి అక్కడ రాజుల సహాయమువల్ల స్థాపించి స్తూపములు నిర్మించినదనీ, కథ ఎక్కడో విన్నట్టు జ్ఞాపకము. అందులో ఈ నాగార్జునకొండలో ఉన్నచిహ్నం ఒకటి కావచ్చు. అంత అమూల్యంగా దాచబడి దేశదేశాలు ప్రయాణం చేసిన ఈ చిహ్నం మళ్లీ ఈనాటికి ప్రయాణం సాగించింది. మహాబోధిసత్వసంఘంవారు అనాగరికధమ్మపాలుడనే సుప్రసిద్ధబౌద్ధాచార్యుని ఆధిపత్యంకింద, వారణాసికి సమీపంలో, సిద్ధార్థుడు ప్రథమోపన్యాసం చేసినచోట, సారనాథులో మూలగంధకుటీ విహారమను పేరిట దివ్యమైనబౌద్ధాలయం నిర్మించినారు. క్రీ. శ. ౧౯౩౨ డిశంబరు ౨౮-వ తారీకున ఈ ఆలయానికి శంకుస్థాపన మహోత్సవము జరిగినది. ఆశుభసమయంలో నాగార్జునకొండవద్ద దొరికినబౌద్ధచిహ్నము ఇండియా ప్రభుత్వముతరపున రాయబహదూర్ లాలదయారామ సాహినీ గారు (డైరెక్టరు జనరలు ఆఫ్ ఆర్కియాలజీ) బోధిసత్వ సంఘానికి కానుకగా సమర్పించినారు.

వేనకువేలు జనం బౌద్ధులు, తదితరమతస్థులు బుద్ధదేవుని పాంచభౌతికదేహములో భాగమైన ఈ అమూల్యశల్యాన్ని దర్శించుకోడానికి అక్కడ మూగినారు. తిబెత్తు జపానులనుండి యాత్రికులు వచ్చినారు. ఆనాడుమొదలు ఈదివ్యచిహ్నము తిరిగి పూజింపబడుచున్నది. బౌద్ధమతానికి జన్మస్థలంలో పునర్జీవనం కలుగజేయడానికి ఇన్నాళ్లుగా ఈమూల్యం నాగార్జునకొండలో తలదాచుకున్నది.

నాగార్జునకొండ త్రవ్వినప్పుడు స్తూపంలో మారుమూల రహస్యంగా భద్రపరిచిన ఒకచిన్నబరిణ దొరికినది. స్తూపాకారంగా చెక్కబడిన ఈబరిణ రెండున్నర అంగుళముల ఎత్తుగలిగి అనేకామూల్యవస్తులతో నిండిఉన్నది. సువర్ణపుష్పములు, ముత్యములు, అనేకములయిన ఇతరమనురాళ్లు, ముఖ్యముగ బౌద్ధ శల్యము ఇందులో దొరికినవి. బటాణీగింజకంటె చిన్నదిగా ఉన్న ఈశల్యము ఎంతఆప్యాయంగా వారు దాచుకొన్నారో ఊహ్యము.

ఈప్రదేశంలో త్రవ్వబడిన ఆలయములలో మహా చైత్యము ముఖ్యమైనది. సిలోనులో అనూరాధపురంలో తప్ప ఇంత మహోన్నతమైన బౌద్ధాలయం మరెక్కడా కానరాలేదన్నారు. భిక్షులు నివసించే విహారమంతా పైకి తీయబడినది. పురానికి సంబంధంలేకుండా విహారము కొండమీద నిర్మించబడినది. ఈప్రదేశంలోనే చూడడానికి వచ్చినవారు విశ్రాంతి తీసుకునేటందుకు ప్రస్తుతం సర్కారువారు ఒకచిన్న మందిరం నిర్మించినారు. విహారముపునాదులవరకు త్రవ్వగా చిన్న చిన్న గుహలవలె ఉన్న నిర్మాణములు బహిర్గతమైనవి. బహుశః అవి భిక్షుల నివాసము లైయుండవచ్చును. ఆవరణంలో మధ్య నలుచదరంగా కట్టిన ఉన్నతప్రదేశం ఉన్నది. ఇది ప్రార్థనామంటపము. సింహళద్వీపవాసులైన భిక్షులకు ప్రత్యేకనివాసము లున్నట్లు కనబడును. విహారానికి తూర్పుగా పర్వతంమీద మహాచైత్యాలయం ఉన్నది. దీని మెట్లలో అనేకశిల్పములు దొరికినవి. చైత్యము చుట్టూ చలువరాతి పలకలమీద చెక్కినశిల్పముల అలంకారములున్నవి. ఈపలకలమీదస్తూపపునమూనాలుచిన్నవిగా చెక్కబడినవి. స్తూపపు అసలుఆకారం భావించుకోవడానికి ఈనమూనాలు సహాయపడును. ఇవి సూక్ష్మంగా ఉన్నప్పటికీ అసామాన్యమైన శిల్పకళ ప్రదర్శిస్తున్నవి. హిందూదేశం అంతలోనూ ఇటువంటి అమూల్యమైనశిల్పకళ దొరకలేదన్నారు, లాంగుహర్ స్టుగారు. ఇవి ప్రత్యేకతరగతికి సంబంధించినవట. దంతపునగిషీకి సరిపోల్చదగిన ఈ శిల్పకళలో, స్త్రీ పురుషుల శరీర సౌష్ఠవమే కాకుండా, వివిధరీతులైన మనోవైచిత్ర్యములుకూడా అద్భుతంగా నిరూపించబడినవి.

గౌతమబుద్ధుని జీవితకథలే వీరిశిల్పకళకు ప్రధాన విషయము. కాని, ముఖ్యశిల్పానికి ఇరుపక్కలాకూడా ఆంధ్రులు శృంగారం వొలకపోసినారు. హిందువుల గుడిమీదిబొమ్మలే ఈబౌద్ధస్తూపాన్నికూడా అలంకరించినవి. ఇది బౌద్ధమతానికి కొత్తదైనా ఒకప్రాచీనఆంధ్ర సంప్రదాయమై ఉండవచ్చు. ఇదేకాక బుద్ధదేవుని జీవితకథలలో కూడా కొన్నిమార్పులు, నూతనవిషయములు కనబడును. కథలుకూడా దేశకాలపాత్రలను అనుసరించి మార్పులు కలుగుతూఉంటవి. అందువల్ల ఈనూతనవిషయాలు స్థానికసంప్రదాయములను అనుసరించివచ్చినవని తోస్తుంది. ఈకొత్తసంగతులవల్ల చిత్రించినశిల్పాలలో కథను గుర్తించి నిరూపించడం కొంచెంకష్టంగాఉన్నది.

వీటిలో ఇంద్రుడు బుద్ధునిమీద వజ్రాయుధం ప్రయోగించడం, ఒకరాజపురుషునిఒడిలో ముడుచుకునికూర్చున్న గొర్రెపిల్ల, హనుమంతుడు ముగ్గురు వ్యక్తుల్ని మోసుకుపోవడం ముఖ్యమైనవి. అకస్మాత్తుగా చూస్తే ఈకళలో, హిందూ, బౌద్ధ, క్రైస్తవ సంప్రదాయములు ఉన్నవనిపిస్తున్నది కాని కాలనిర్ణయాన్ని బట్టి చూస్తే క్రైస్తవ సంప్రదాయాలు రావడానికి వీలు కనబడదు.

ఇక్కడిముఖ్యశిల్పముల కథలలో ఛద్దంతజాతకము, శశజాతకము, వెస్సంతరజాతకము, కపిజాతకము, నందకుమారుని మతస్వీకారము, దేవదత్తుడు నలగిరి అనే ఏనుగును బుద్ధునిమీదికి తరుముట, మారుడు అనే నీచదేవతతో బుద్ధుడు పడ్డ అవస్థలు కొన్ని. ఒకశిల్పాకారము రోముదేశపుయోధునివలె ఉన్నది. ఈదృశ్యమే చాల ఆశ్చర్యంగా ఉన్నది. దీనికితోడు కొన్నిరోమీయనాణకములుకూడా ఇక్కడ దొరికినవి. ఆనాడు ఆంధ్రులకు రోముతో రాకపోక లుండిఉండవచ్చు. గ్రీసుదేశపు సంప్రదాయములుకూడా ఉన్నవని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. పాశ్చాత్యపండితులవాదన ప్రకారం మనకళలలో గ్రీకు రోమనుచిహ్నము లున్నవని కొందరివిశ్వాసం. కాని సాంచీస్తూపములమీద తమఅభిప్రాయం తెలియజేస్తూ మహాపండితులు, మొహెంజొదారో పైకి తీసినవారు అగు సర్ జాన్ మార్షలుదొరవారు. ఈపాశ్చాత్యవాదన అట్టే దూరం తీసుకువెళ్లడం పొరబాటని చెప్పినారు. రోమనుపద్ధతిని వస్త్రముధరించిన బౌద్ధవిగ్రహము ఈ విపరీతవాదుల ప్రధానాంశము. కాని ఈనాటికి ఉత్తరహిందూస్థానంలో వస్త్రం ఆవిధంగా ధరించడం ఉన్నది. ఈ

ఆచారము రోమునుండి ఇండియాకు వచ్చి ఇక్కడ నిల్చిపోయినదనేకంటే ఇక్కడకూడా ఉండేదనడం ఎక్కువసమంజసంగా ఉంటుంది. నాగార్జునకొండలో అనేకమృగముల శిల్పములుకూడా కుండలలో దాచబడి ఉన్నవి. ముఖ్యంగా కుందేలు, ఎద్దు ఎముక లున్నవట. బుద్ధదేవుని శిల్పములేకాక ఆయనపూర్వావతారములోని మృగములశిల్పములుకూడా భక్తులైనభిక్షులు దాచుకుని పూజించి ఉంటారు.

ఇక్కడ బహిర్గతమైన శాసనములు అలంకారయుతమైన బ్రాహ్మీలిపిలో ఉన్నవి. వీటిలో ఆప్రాంతాల రాజ్యమేలిన రాజకుటుంబముల కథలు కొన్ని ఉన్నవి. వీనిలో చాంతిశ్రీ అనేరాచకుమారి నామము చాలసార్లు వచ్చినది. ఈమె ప్రోత్సాహమువల్లనే మహాచైత్యాలయము నిర్మించినట్టు తెలుస్తుంది. నూతనమైన బౌద్ధమతము, నాగార్జునముఖంగా, అంతఃపురస్త్రీలు ఎక్కువ ఉత్సాహంతో స్వీకరించారని పండితాభిప్రాయము. చాంతిశ్రీ వీరపురుషదనే రాజేంద్రుడిచెల్లెలట. ఈకుటుంబంలో చివరివాడు బాహుబలుడనేరాజని కూడా తెలుస్తుంది.

అన్నాళ్లు ఆంధ్రదేశాన్ని ఆశ్రయించినబౌద్ధమతం శంకరాచార్యుడు విసరిన హిందూప్రచారం అనే తుఫానుతో ధ్వంసమయిపోయినది. శంకరస్వామి రాకతో ఆంధ్రబుద్ధు డంతరించినాడు. బౌద్ధతీర్థములన్నీ హిందూక్షేత్రములుగా మారిపోయినవి. అమరావతిలో అమరేశ్వరస్వామి వెలసినాడు. ఉండవల్లి గుహాలయంలో విశ్రాంతి తీసుకున్నబుద్ధుడు అనంతపద్మనాభస్వామిగా మారిపోయినాడు. వాటితోనేపోయినది ఆంధ్రులశిల్పకళ. అజంతా, అమరావతి, నాగార్జునకొండ నిర్మించిన ఆంధ్రుల శిల్పచాతుర్యం, భాగవతం ఆంధ్రీకరించిన పోతరాజుకవిత్వమాధుర్యం, రామాయణం కృతులుగా పాడినత్యాగరాజుసంగీత నైపుణ్యం తెనుగువారి కిప్పుడు కథలు. అవి వెనుకటి రోజులు.

*   *   *   *

[భారతపురాతన వస్తుపరిశోధనశాఖవారు ప్రకటించిన వార్షికనివేదిక (౧౯౨౮-౨౯) నుండి మరి కొన్నివిషయములు ఇట్లు తెలియవచ్చుచున్నవి:

—సం. భా.]

ఇటుకసున్నములతో నిర్మింపబడి యంత్రాకారమున నున్న యీమహాచైత్యము అయిదడుగుల యెత్తును, నూటరెండడుగుల వ్యాసమును గల యొకపీఠముపై నానియున్నది. కలశపు పైభాగమంతయు శిథిలమయినది. దీనిచుట్టును ప్రదక్షిణపథమును చుట్టి యొక యిటుక గోడ గలదు. ఈ ప్రదక్షిణపథము పదుమూడడుగుల విశాలము (చిత్రము ౧). నాలుగుప్రక్కల నాలుగు ద్వారములు. చైత్యమువలెనే గోడయు, ద్వారములును కూడ ఇటుకసున్నములవే. చైత్యముక్రింది పీఠమునకు ఏడడుగుల వెడలుపుగల తలము గలదు. నాలుగు ప్రక్కల ద్వారములకెదురుగ నీపీఠము విషమచతురస్రముగ ముందుకువచ్చినది. ఈ నాలుగు వేదికలందును ఒక్కొక్కటికి అయిదుచొప్పున ఇరువది పెద్ద గచ్చుస్తంభములు గలవు. ఈ స్తంభముల ప్రకాండపుటడుగు భాగములందే ౧౯౩౧ లో కొన్ని ఇక్ష్వాకువంశశాసనములు ముఖ్యమైనవి దొరకినవి.

చైత్యము బౌద్ధుల చిహ్నమగు ధర్మ చక్రము నాకారమున నిర్మింప బడినది. దానిలోని ఇటుక గోడలన్నియు ఆ చక్రముయొక్క ఆకులు. గోడల నడిమిభాగమంతయు మట్టి నింపబడినది. ఇట్టి చక్రాకారపు స్తూపములు ఒక్క దక్షిణదేశముననే కానవచ్చుచున్నవి. ఉత్తరదేశమున, స్తూపములన్నియు రాతితోనో, ఇటుకతోనో, పూర్ణగర్భముగ నిర్మించుట అలవాటు. గోడలనడిమిప్రదేశములనున్న మట్టినంతయు ప్రయాసపడి బయటికి తోడివేయగా ఒక మట్టికుండయందు కొన్ని అవశేషములు దొరకినవి. కుండనిండ ఎఱ్ఱమట్టియు, అందుకు చేరువగ కొన్ని తెల్లపూసలు నుండినవి. (చిత్రము౧౦) ఈఅవశేషములన్నియుబుద్ధునివి గానే పరిశోధకు లూహించిరి. ౹ అంగుళము వ్యాసము గల యొక బంగారు బరిణలో బఠాణిగింజపరిమాణముతో

నొక అస్థిక అగుపించినది. ఈ బరిణయు, మరికొన్ని బంగారుపూలు, ముత్యములునుచేర్చి యొక వెండి డబ్బీలో పెట్టబడినవి (చిత్రము ౧౩).

చైత్యములోని శాసనములు సుమారు క్రీ. శ. మూడవశతకము నాటివి. శాసనముల లిపి బ్రాహ్మి.

ఇవి, మరికొన్ని ఆధారములవలన దీనిలోనివి బుద్ధుని ధాతుశేషములనియు, దీనిని క్రీ. శ. రెండు మూడు శతకములలో ఆంధ్రదేశమునేలిన ఇక్ష్వాకు వంశమునకుచేరిన శాంతిశ్రీయనునామె స్థాపించెననియు ఊహించిరి. ఇటువంటివే బుద్ధధాతుశేషములు కొన్ని భట్టిప్రోలు స్తూపములోగూడ చిక్కినవి.

ఇటీవల జరిగిన పరిశోధనలవలన మూడు సంఘారామములు, ఆరు దేవాలయములు, పెక్కుస్తూపములు బయలుపడినవి. ఈస్తూపములలో చాలవాటి యందు ఆయకస్తంభములని కొన్ని స్తంభములు గలవు. ఈ మహాచైత్యమునకు దక్షిణపశ్చిమమున, అనతిదూరమున గల యొక చిన్నస్తూపమున౨-వ చిత్రములో చూపిన స్తంభమువంటివి, నాలుగు దొరికినవి. అందులో నొకదాన బుద్ధుని నిర్యాణము స్తూపరూపమున చిత్రింపబడినది. స్తంభపీఠమున బుద్ధుని ప్రథమప్రవచనము చిత్రింపబడినది.

ఆ మూడు సంఘారామములలోను మొదటి రెండును నాహర్లబోడు అను కొండపై గలవు; మూడవది యాకొండకు పడమటనున్న యొక గుట్టపై గలదు. మొదటి సంఘారామమున ౭౪ అడుగుల చదరపుబయలు గలదు. దానిచుట్టును ౨౪ గుహలు బౌద్ధభిక్షువుల నివాసములు గలవు. గుహలన్నియు ౮ అడుగుల చదరముగలిగి యిటుకలతో నిర్మింపబడినవి.

రెండవ సంఘారామముగూడ పైదానినే పోలియున్నది. కాని చాలా యిరుకైనది. మధ్య ఆవరణములో నలువదియడుగుల చదరపు ఒక మహలు. దానికి మూడుప్రక్కల పదునొకండు గుహలు: నాలుగవవైపు రెండు చైత్యములు, ఒకటికొకటి ఎదురెదురుగనున్నవి. పడమరగనుండుదానిలో బుద్ధుని శిలావిగ్రహమొకటి విరిగినది కలదు. దీనితోపాటు మరిరెండు బుద్ధప్రతిమలును, మూడవశతకము నాటివి, ఆంధ్రరాజుల సీసపు నాణెములు పెక్కులు దొరికినవి. దీనికి చేరువనే మరియొక చిన్నస్తూపమున కొన్ని అవశేషములును, ఒక డజను మట్టిపాత్రలును దొరికినవి.

మూడవ సంఘారామము కొట్టంపలుగుబోడు అను గుట్టపై గలదు. నివేశనమంతయు ౧౨౪ అడుగుల చదరము. మాదూలుగ దీనిమధ్య నొకచవికయు, చుట్టు ౨౦ గదులును ఉన్నవి. చవికె చదరము ౬౧ అడుగులు. ఈ చవికకు ౩౬ గచ్చుకంబములును, పైన కట్టుకప్పును గలదు. సున్నము రుబ్బుట కుపయోగించుచుండిన యొక రాతితిరుగలితప్ప ఈ నివేశనమున మరేమియు చిక్కలేదు.

గుట్టచివర, సంఘారామమున కెగువ శిథిలములయిన రెండుస్తూపములు గలవు. అందు చిన్నదానియందు రాతి యవశేషపేటిక యొకటి దొరికినది. అది స్తూపాకారమున ౧౪ అడుగుల ఎత్తుగలిగినది. దానిలో అట్టిదే ౬ అంగుళముల యెత్తుది మరియొక పెట్టె. దీనిలో మరియొకటి రాగిది ౪ అంగుళముల యెత్తుది. దానిలో ౨ అంగుళముల యెత్తులో నొక వెండి డబ్బి. దానిలో మరల నొక బంగారు బరిణ. దానియెత్తు ౧౪ అంగుళము. అందులో నొక అస్థికయు, నూగూలు ఆభరణములును ఉండినవి. నాగార్జునకొండలో దొరికినవానిలోకెల్ల ఈస్తూపమున దొరికిన యీ పేటికలే చక్కనివి.

ఈసంచికయందు ప్రకటితములయిన చిత్రములలో కొన్నింటికి వివరణము:

౩. స్తూపప్రతికృతి: ఇందు బుద్ధుడు ముచులింద నాగముపడగల నీడను కూర్చునియున్నాడు. ఎగువ మూడు సూక్ష్మశిల్పచిత్రరంగము లున్నవి.

౪. స్తూపప్రతికృతి: ఇందు బుద్ధు డభయముద్రాధారియై పద్మముపయి నిలుచుకొనియున్నాడు. ఎగువ బుద్ధునిజీవితవిశేషములను దెలుపు సూక్ష్మశిల్పచిత్రఫలకములు మూ డున్నవి.

౫. బుద్ధజననము : ఎడమవైపున మాయాదేవి లుంబినీవనమున వంగిన చెట్టుకొమ్మను పట్టుకొని నిలిచి యున్నది. బుద్ధునిప్రతికృతి యిందు లేదు. ఆయన యునికిని ఛత్రమును, రెండుచామరములును సూచించును. లోకపాలురు నలువురు పట్టుకొనియున్న వస్త్రముపయి ఏడు అడుగులముద్ర లున్నవి. అవి బుద్ధునిసప్తపదములను సూచించును.

౬. జాతకలేఖనము : శుద్ధోదనుడు సింహాసనాసీను డయియున్నాడు. అతనికుడివైపున నొకింత క్రింది భాగమున నలంకృతమగు గద్దియపై నాతనిసతి కూర్చుని యున్నది. జ్యోతిషికులు ఎదుట వేదికపయి నున్నారు. వారియెదుర శ్వేతపీఠములపయి రాజదత్తములగు పారితోషికము లున్నవి.

౭. ప్రలోభనము : ఎడమవైపున మారుడు గజము నెక్కి పుత్రికలతో, సేనలతో వచ్చుచున్నాడు. అభయముద్రాధారియయి బుద్ధుడు బోధివృక్షముక్రింద నున్నాడు. ప్రలోభికబృందము నమ్రభావముతో వెనుకడుగిడినట్టు లున్నారు. గాంధారశిల్పమున అభయముద్రకు మారుగ భూమిస్పర్శముద్ర యుండుట విశేషము.

౮. శిశుసమర్పణము : కుడిప్రక్క సింహాసనమున శుద్ధోదనుడు జటాధారియగు అసితుని ఒడిలో అడుగుల ముద్రలు రెండుగల వస్త్ర మున్నది. ఆముద్రలు బుద్ధ సాన్నిధ్యసూచకములు. ఎడమవైపున బోధిసత్త్వుని దేవకులయాత్ర కలదు. లలితవిస్తరమున (అధ్యా. ౮) వర్ణితమయిన రీతిని దేవునెదురనున్న వస్త్రమునం దంకితములగు పాదచిహ్నములచేత బోధిసత్త్వుని సాన్నిధ్య మూహ్యము. దేవుడు బోధిసత్త్వునియెడ భక్తితో ప్రత్యుత్థాన మొనర్చుచున్నట్లున్నది.

౯. బుద్ధునిప్రథమప్రవచనము: సింహాసనముపయి నున్న ధర్మచక్రమును పూజించుటయే ప్రథమప్రవచన మనబడును.

౧౧. మహాభినిష్క్రమణము : బోధిసత్త్వుడు కంటకనామకాశ్వము నధిరోహించి పోవుచున్నాడు. ఛందకుడు బోధిసత్త్వునికి గొడుగును పట్టుకొని అనుగమించుచున్నాడు. లోకపాలకు లశ్వపాదములను బట్టుకొనియున్నారు.

౧౨. ప్రలోభనము : ఎడమప్రక్క మారుడును, తత్పుత్రికలును బుద్ధుని ప్రలోభింపజేయుచున్నారు. ఓటమిని గాంచిన మారుడు, వింటిని, పూవుటమ్ములను బట్టి పుత్త్రికాసమేతుడయి కుడిప్రక్క నున్నాడు.

౧౪. మహాపరినిర్వాణము : కుడివైపున చైత్యపూజ మహాపరినిర్వాణసూచకము. ఎడమవైపున నాగదంపతులు గలరు.

---




ఆశ్వయుజమాస భారతి సంచిక (౨౨౮ పు.) యందు ప్రకటిత మయిన
వర్ణచిత్రమునందలి వర్ణములు

వర్ణచిత్రరచయిత : అయ్యగారి వెంకటగోపాలకృష్ణరావు, నూజవీడు.



# ఆంధ్రాభ్యుదయము

## శ్రీయుత చంద్రుపట్ల రామరావుగారు

[ గ. మేడపాడు, తూర్పుగోదావరిజిల్లా ]

ఆంధ్రమాత ప్రసవించిన శిల్పకుమారులలో శ్రీ చంద్రుపట్ల బాపిరాజు రామరావు సోదరులు కవల బిడ్డలు. సుప్రసిద్ధవంగీయచిత్రకారులగు శ్రీ ప్రమోద



శ్రీయుత చంద్రుపట్ల రామరావుగారు

కుమార చట్టోపాధ్యాయులకడ కళాశిక్షణము వడసి సుమారు పదిరెండువత్సరములనుండి వీరు కళోపాసన గావించుచున్నారు. ఏలూరులో వీరిచే సంస్థాపితమైన ఆంధ్రచిత్రకళాపరిషత్తు మహాత్మునియాశీస్సులను గడించినది. వీరిచిత్రశాలను మహాత్ముడు స్వయముగా తిలకించి " I wish every success to this effort. All of the Paintings are really good " అనియోగ్యతాపత్రిక నొసంగిరి.

శ్రీ బాపిరాజు రామరాయ సోదరులు అసహాయోద్యమసందర్భమున కారాగారమున కేగుటచే వీరి కళోద్ధరణోద్యమము ఆర్థిక, రాజకీయసంక్షోభములకు గురియై కుంటువడినది. కాని అచిరకాలములో శ్రీ ఆంధ్రచిత్రకళాపరిషత్తును పునరుద్ధారణగావించి భారతీయ చిత్రకళను ప్రచారము కావింపగలరు.

వీరిచిత్తరువులు వివిధప్రదర్శనములలో ఆదరింపబడి మైసూరు, పాటియాలా, తిరువాంకూరు, చల్లపల్లి మున్నగుసంస్థానాధీశులకు విక్రీతము లైనవి.

మహాత్మాగాంధీ, డాక్టరుమూంజీ, అనిబిసెంటు, సర్. సి. పి. రామస్వామయ్యరు మున్నగుభారతీయ నాయకులయొక్కయు, దేశోద్ధారకునివంటి ఆంధ్ర నాయకశిఖామణులయొక్కయు ప్రశంసలకు వీరిచిత్తరువులు పాత్రములైనవి. హిందు, స్వరాజ్య, ఆంధ్ర, భారతి మున్నగుపత్రికలు వీరిరచనలగూర్చి వేనోళ్ల కొనియాడినవి.

ప్రత్యేకముగా శ్రీరామరావుగారిచిత్తరువులలో సతీశివ, బుద్ధ, ఝాన్సీరాణి, అభిసారిక, ముకుళితనళిని, చంద్రబింబమున రెండుపిట్టలు (Birds in the moon), హంతకుడు, పుట్టింటికి, ఉషస్సు, అశ్వత్థామ, బొబ్బిలి బెబ్బులి, అనార్కలీనృత్యము, దూదూవెంకన్న మున్నగునవి ప్రత్యేక ప్రశంసకు పాత్రములైనవి. ఇందు బుద్ధుని చిత్తరువు మహాత్మునికి సమర్పింపబడినది. "సతీశివ" చిత్తరువునకు శ్రీచల్లపల్లి రాజావారు నూటపదారులు పారితోషిక మొసగియున్నారు. ఝాన్సీరాణి, పుట్టింటికి, అశ్వత్థామ భారతిలో ప్రకటింపబడినవి. బొబ్బిలి బెబ్బులి ఆంగీరసఆంధ్రపత్రికఉగాదిసంచికలో ముద్రితమైనది. ఇట్టి అమూల్యములగు చిత్తరువులను ప్రకటించుచు ఆంధ్రుల చిత్రకళోద్యమమునకు తోడుపడుచున్న భారతిపత్రికాధిపతులు వందనార్హులు.

యువకులగు శ్రీరామరావుగారు ఇట్టిఅమూల్య చిత్రకళోపాసనకు తమజీవితమును ధారపోయుచున్నందులకు ఆంధ్రులు గర్వించుచున్నారు. వీరికి పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగుగాత !

—మారెళ్లపూడి పుత్రసత్యశర్మ



యం. రామచంద్రరావుగారు

చెన్నపురి ఆంధ్రమహాసభకు కార్యదర్శిగ నాలుగవమారు ఎన్నుకొనబడిరి.




శ్రీ బుంగా అప్పారావు దేవుగారు

రాజమండ్రిపురవాస్తవ్యులు, ఆదిక్షత్రియకుల నాయకులు నగు వెంకటప్పయ్య దేవుగారి కుమారులు; ఇరువదేండ్ల ప్రాయము. నాలుగేండ్లనుండి పరుగుపందెములందు పాల్గొని, గెలుపొంది ముప్పదియారు రజతపాత్రలును, అనేకయోగ్యతాపత్రికలను బడసిరి.



నీలంరాజు వెంకటశేషయ్యాగారు

చెన్నపురి ఆంధ్రమహాసభా నాటకశాఖకు కార్యదర్శిగ మూడవమారు ఎన్నుకొనబడిరి.



ప్రొఫెసరు అల్లూరి నరసింహరాజుగారు

వీరిది రాజమహేంద్రవరము కాపురము. ఇంద్రజాల ప్రదర్శనములందు సిద్ధహస్తులు. పలువురు ప్రముఖులు వీరి నైపుణిని మెచ్చి సత్కరించినారు. భారతీ తీర్థమువారు వీరికి 'ఇంద్రజాలికభూషణ' యను బిరుదము నొసగినారు. ఇటీవల చెన్నపురియందును కొన్ని ప్రదర్శనములను జరపి, నేర్పుమీర అపూర్వ, అద్భుత కల్పనలు వెలయించి ప్రముఖుల ప్రశంసకు పాత్రులయిరి.




శ్రీ మోచర్ల శ్రీహరి రావుగారు

ఏలూరునందలి వేంకటనారాయణ మెమోరియలు వ్యాయామపు పోటీలయందు మల్లయుద్ధమునందు విజయమునంది వెండిగదను బహుమతిగ పొందిరి.



శ్రీ వై. ఎ. శ్రీరాములుగారి భావచిత్రములు (పైనుండి ప్రదక్షిణముగా)
౧. భక్తి, ౨. ఆలోచన, ౩. క్రుద్ధప్రతిజ్ఞ, ౪. ఉన్మాదము, ౫. స్వసంతుష్టి,
౬. భయము, ౭. విచారము, ౮. కపటాలోచన.

# గ్రంథ స్వీకారము

---

## సంగీత నాపసాని

గ్రంథకర్త: వున్నవ లక్ష్మీనారాయణగారు, గుంటూరు.

'కవితిక్కనయొక్క కూతురు గాయత్రీదేవి. ఈమెకు నాగసానియని ముద్దుపేరు. ఈమెకుగల యద్భుతసంగీతజ్ఞానముచే సంగీతనాపసానియని మారు పేరు వచ్చినది. ఈమెకు బంగారువంటి దేహచ్ఛాయ గలదు గనుక కడాని అనికూడ పేరుగలదు. ఈమెతల్లి పేరు సీతమ్మ. ఈమెబాల్యచరితములు కొన్ని యిందు వర్ణింపబడినవి. ఇది తిక్కనయను నవలనుండి క్షస్తీకరింపబడినది.' క్రౌను సైజున ౧౯ పుటలు. వెల రు. ౦-౨-౦.

---

## ముగ్ధప్రణయము (ఒథెల్లో)

గ్రంథకర్త: కర్లపాలెము లక్ష్మీనరసింహారావుగారు, శ్రీముఖాశ్రయము, పూర్ణానందంపేట, బెజవాడ. క్రౌనుసైజున ౧౪౬ పుటలు. వెల రు. ౦-౧౨-౦.

---

## విశ్వామిత్ర మహర్షి

గ్రంథకర్త్రి: కనుపర్తి వరలక్ష్మమ్మగారు, భాపట్ల. క్రౌను ౧౨౧ పుటలు. వెల రు. ౦-౮-౦

---

## శ్రీ లక్ష్మీనారసింహప్రభు శతకము

గ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణగారు, చాగలమర్రి. (కర్నూలు) క్రౌను ౧౮ పుటలు.

వెల రు. ౦-౨-౦.

---

## శ్రీ భక్తరత్నామణి శతకము

గ్రంథకర్త: సోంపల్లె కృష్ణమూర్తిగారు, అనంతపురము. క్రౌను ౨౨ పుటలు. వెల రు. ౦-౨-౦.

---

## బాలకృష్ణ శతకము

గ్రంథకర్త: భ. పట్టాభిరామయ్యగారు, యం. ఏ., యల్. టి., రాజమహేంద్రవరము. క్రౌను ౩౬ పుటలు. వెల రు. ౦-౪-౦.

---

## సిద్ధివినాయక చరిత్ర (హరికథ)

గ్రంథకర్త: భ. పట్టాభిరామయ్యగారు, యం. ఏ., యల్. టి., రాజమహేంద్రవరము. క్రౌను ౪౬ పుటలు. వెల రు. ౧-౪-౦.

---

# మ న వి మా ట లు

ఆంధ్రకవుల ఛాయాచిత్రప్రదర్శనము :

కవులు సృష్టికర్తలు : వారి సృష్టి బ్రహ్మ సృష్టిని మించినది. తమ యిచ్చవచ్చినట్లు సృష్టినిచేయగల, మార్పగల నేర్పు వారికి గలదు. వారు నిరంకుశులు. లోకహితము వారి పరమార్థము. వారిరచనలు నాపరమార్థ మునే లోగొనియుండును. అవియే కావ్యములు. వారు వానిలో నెన్నియోయర్థములను మనకు దాచినారు. వారు మనకు త్రికరణముల, త్రికాలముల పూజింపదగినవారు.

కాని మనకవుల రూపచిత్రములు ఇదివరకు లేవు. కావ్యములందు ఛాయామాత్రముగ ప్రతిబింబితములయిన వారి విశిష్ట గుణాదులను భావించుకొనవలసినదే. భావనకన్న రూపణ పటిష్ఠము. గతకాలమువారి రూపణకు రూపచిత్రము లవసరము. కనుకనే విగ్రహములని యేర్పడినవి. విగ్రహములుగూడ రూపచిత్రములే. అవి శిల్పరూపములు. మహనీయుల రూపచిత్రములు సహృదయుల కుత్సాహావేశములను గలిగించును. వాటి కాశక్తి గలదు. అందువలననే మహనీయుల రూపచిత్రములను మన మాదరించుచున్నాము.

ఈ రూపచిత్రరచన ప్రాచీనకాలము నుండియు నున్నది. కాని అప్పటిది శిల్పరూపము : ఛాయారూపము కాదు. ఆ చిత్రములుగూడ దేవతలకు, మతప్రవక్తలకు, దేవాలయాదినిర్మాతలకుమాత్రమే వెలసినవి. కవుల కానాడు రూపచిత్రములు లేవు. వారు వాఙ్మయప్రతిబింబములే చాలుననుకొన్నారు. వారి కీయావేదనయే లేదు. ఆరోజులు వేరు. ఈరోజులు వేరు.

నాడు మతమున కెక్కుడు ప్రచారముండినది. నేడు సాహిత్యమునకు ప్రచారమెక్కువయినది. దానికొలది కవుల రూపచిత్రముల యావశ్యకత గోచరించినది. సహృదయుల కావేదనపుట్టినది. కడచినదానికిని వారుమాత్ర మేమిచేయగలరు? లేని కవుల చిత్రములు లేకనేపోయినవి. ఉన్నకవులవైనను సేకరించి పదిలపరచి యుగాంతరము వారికిని తోడుపడవచ్చునని కవితాసమితివారీ ప్రయత్నమునకు పూనినారు. చాలా సేకరించి ప్రదర్శించినారు. సాహిత్యవికాసమున కిది యొక మెట్టు.

కవితాసమితియుద్యమము క్రొత్తది, మెచ్చదగినది.

---

ఐతలభాయిపటేలు నిర్యాణము :

గోరుచుట్టుపై రోకటిపోటు! ఒకవంక జతీంద్రమోహనుని గోల్పోయిన యావేదన, మరియొకవంక ఆనీబెసంటుమరణముననయిన సంతాపము ఇంకను ఆరీ ఆరకముందే యీ చావుకబురు చల్లగ వినవచ్చి భారతజాతి హృదయముల నారాటపెట్టినది. కాలవైపరీత్యము! తరుణమున, వెంటవెంటనే, యిట్టి వారి మరణములవలన హృదయములు తరుగుకొనిపోయి, ఊరటకేనియు వీలుచిక్కకున్నది.

పటేలు అత్యంతప్రతిభాశాలి. ఈడులేని రాజ్యతంత్రజ్ఞుడు. ధైర్యసాహసములకు

నిధి. పరాజయమును, పారతంత్ర్యమును
సహించని యభిమాని. బారిష్టరువృత్తియం
దుండి లక్షలార్జింపజాలియు, దేశమునకై
దానిని తృణప్రాయముగ నెంచిన త్యాగి.
ఆపదలకు జంకడు. స్వార్థ మాయనకు గిట్టదు.
మాతృదేశదాస్యవిముక్తియే యాయనపరమ
లక్ష్యము. దానికయి, తన భోగభాగ్యములు
వదలుకొని, అహోరాత్రములు పాటుపడి
నాడు. అవసానసమయమునగూడ సత్వర
స్వరాజ్యసిద్ధి నాకాంక్షించుచు ప్రాణములను
విడచినాడు. స్వతంత్రభారతదేశమును కన్ను
లార చూడనయితినేయను కొరతతోనే
తనువు చాలించినాడు. తనకళేబరము మాతృ
భూమినే చేర్పగోరినాడు. ఆయన దేశాభి
మానమట్టిది.

తనకు న్యాయమని, యుక్తమని తోచి
ననేకాని యేకార్యమునకు బూనడు. పూనిన
పనిని సాధించిగాని నిద్రింపడు. భారతశాసన
సభకు తొలుదొల్తగ నధ్యక్షుడై అప్రతిమధీ
సంపత్తితో, అచంచలమగు పట్టుదలతో
కార్యములనిర్వహించి,జాతీయుల విజాతీయుల
మన్ననలుపడసి యాపదవికి, భారత జాతికిని
గౌరవప్రతిష్ఠలు గడించిరి. ఆపదవియందుండి
యాయనచేసినపని తరువాతివారికి మార్గ
దర్శకమయినది. ఆపదవిలో నున్నంతకాలము
ఈయనయనిన ప్రభుత్వమునకు సయితము
గుండెబెదరే. కొంతకాలము బొంబాయి
కార్పొరేషను అధ్యక్షులుగ నుండి యా
పట్టణమును చాలా అభివృద్ధిపరచిరి. గొప్ప
గొప్పపదవులయందుండియు వ్యామోహమను
నది యాయన నంటలేదు. భారతశాసనసభ
కధ్యక్షుడుగ నుండినప్పుడు తన కిచ్చుచుండిన
నాలుగువేలజీతములో ఒకవేయి తన కుంచు
కొని తక్కినమూడువేలను ఖద్దరుఉద్యమ
మునకై మహాత్మునకు పంపుచుండిరి. ప్రజా
హితకార్యములనిన యాయన కుత్సాహ మతి
శయము.

ఇట్లు మాతృదేశమును గాఢముగ
ప్రేమించి, దేశమునకై తనసర్వస్వమును ధార
పోసిన పటేలు మాతృదేశమున మరణిం
చుటకు నోచుకొనలేదు. సత్యాగ్రహోద్యమ
మున నిర్బంధింపబడి చెరసాలలో ఆరోగ్య
మును కోలుపోయిరి అదికారణముగ ప్రభు
త్వమువారు వీరిని విడిచిపెట్టిరి. వెంటనే వీరు
ఆరోగ్య సంపాదనకై విదేశముల కేగిరి.
అక్కడను వీరికి దేశస్వాతంత్ర్య విచారమే.
ఆరోగ్యము నానాటికి క్షీణింప జొచ్చెను.
సమదుఃఖుడగు సుభాషుబాబు వీరిపరిచర్యకు
బూనెను. ఎందరో, ఎన్నివిధములనో చికిత్స
చేసిరి. కాని దైవ మన్యథా తలచినది, పరి
ణామ మిట్లయినది.

వగచిలాభములేదు. ఏలక్ష్యమును
సాధించునిమిత్తము వీరు ఎడతెగనికృషి సలి
పిరో, ఏయుత్కృష్టాశయములతో వీరు ప్రాణ
ములను వదలిరో ఆలక్ష్యమును, ఆయాశయ
ములను సత్వరముగ సాధించి వారియాత్మకు
శాంతిగూర్చుట మనవిధి. అప్పుడే వారి
యాత్మకు సంతృప్తి గలుగును.

---



# స్వాభిప్రాయ విశేషములు



ప్రపంచపరిణామమునందు కర్మపరిణామము పరమగుహ్యము. గీతాశాస్త్రమునందు గహనమైన కర్మయోగమతభావగతిరూపములను శ్రీకృష్ణుడు మహాయోగరూపమునను పలువిధభావరూపములను ౧౮ అధ్యాయములందు బోధించినను ఎప్పటికప్పుడు కర్మతత్త్వమును,సిద్ధియును,జ్ఞానమును తెలిసీ తెలియనివిషయములు. కర్మయోగము వేదాంతమువలెను వినుటకుబాగుండినను చేయుట కడుగడుగునకును సంశయములు, మాటమాటకు ప్రజ్ఞావాదములు గలుగుచుండును. పరిపూర్ణమైన బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మత్వమువలెను, కర్మయోగమునకును కర్మత్వమె సాధనము. సాధక సాధనసాధ్యము లేకములైనపుడు సాంఖ్యయోగములు భిన్నాంతములుగాక ఏకాంతము లగుచున్నవి. కర్మ బ్రహ్మోద్భవము. సర్వగతమైన బ్రహ్మ నిత్యయజ్ఞపురుషుడు. ఏకాంతములైన నిత్యకర్మానుష్ఠానము యజ్ఞపురుషుడు భిన్నాంతములై పరమార్థమునకుబదులు పరమానర్థములను గలుగజేయుచున్నవి. సాధకుడు సాధనకును, సాధన సాధ్యమునకు వలెను, కర్మ ధర్మమునకును, ధర్మము బ్రహ్మమునకును పరమార్థములు. ఏతత్పరమార్థము గీతాశాస్త్రమునందు తెలిపినటు లజ్ఞాతముగ నున్నది.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి
శ్రుత్వాఽప్యేనం వేద న చైవ కశ్చిత్.

గీ. అ. ౨. శ్లో. ౨౯.

చూచువానికిని, చెప్పువానికిని, వినువానికిని నాశ్చర్యమును గలుగజేయుచు తెలియకున్నది. చేయువానికిమాత్రము తెలియుచున్నది. కర్మయోగము స్వల్పమైనను భయమునుండి కాపాడును. కర్మయోగమున కనురూపమైన ఫలము గలుగుచున్నది; వ్యర్థముకాదు. వర్తమానకాలమునందు కర్మయోగపరిజ్ఞానములేని జగచ్చక్రభ్రమణము నిశ్చేష్టతకును, విపరీతచేష్టతకును సాధనముగ నున్నది. ప్రాచ్యుల నిశ్చేష్టతయును, పాశ్చాత్యుల విపరీతచేష్టతయును అజ్ఞానసమ్మోహసంజాతములు. సందేహసమ్మోహములను విడిచి కర్మయోగాభ్యాసము చేయుట వ్యక్తులకు, సంఘములకు, జాతులకు శ్రేయోదాయకము.

* * * *

### విపరీతచేష్టత

పాశ్చాత్యదేశముల కున్మాదమునుగలుగజేయుచున్న విపరీతచేష్టత భయంకరముగ

నున్నది. జర్మనియందు హిట్లరుగారు నాజీ ధ్వజారోహణమును జేసి మహాసంక్షోభమును గలుగజేయుచున్నారు. ప్రజలు నాజీజ్వరావేశమును బొంది ప్రళయతాండవమును జేయుచున్నారు. ఈమాసమునందు జరుగనున్న యెన్నికలఫలము భావిప్రపంచస్థితియందు భయంకరపర్వముగను పరిణమించ గలదు. యూదుల పీడనము, కార్మికులదండనము, సాంఘికుల నిర్బంధము, జాతీయదురభిమానము పరమానర్థములకు సాధన మగుచున్నది. జర్మని ఆయుధవిసర్జనమహాసభను విసర్జించినది; నానాజాతిసమితిని నిరాకరించినది; ఆర్థిక మహాసభను పరిహరించినది; ప్రపంచధిక్కారమును పూనినది. నాజీల కోపావేశములు ప్రపంచమునం దంతటను, ముఖ్యముగను ఫ్రాన్సునందు భయభ్రాంతులను గలుగజేయుచున్నవి. ఫ్రాన్సునకు నాజీచర్యలు సహజముగను సంగ్రామభయోత్పాతమును గలుగ జేయుచున్నవి. ఫ్రాన్సునందు క్రొత్తప్రభుత్వమేర్పడినది. సర్రాటుగారు మంత్రియై కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించు చున్నారు. అపారమైన ధనసంచయము, సంగ్రామసన్నాహములు ఫ్రాన్సున కపూర్వమైన ఆత్మవిశ్వాసమును గలుగజేయుచున్నవి. ఇటలీయందు ఫాసెటువిధానము వివాహసంతర్పణలను జేయుచున్నది. ఏకకాలప్రదేశమునందు ౨౦౦౦ వివాహములు జరిగిన యుదంతము ప్రపంచేతిహాసములం దపూర్వము. ఇటలీయందు వివాహసంతర్పణలకును సంగ్రామసన్నిపాతము మూలముగ నున్నది.

అమెరికాసంయుక్తరాష్ట్రములందు ధనపిశాచము బీభత్సతాండవము చేయుచున్నది. దేశవ్యాపారతైక్ష్ణ్యము స్వదేశపరిశ్రమ సంపదలను క్షీణింప జేసినది. దేశమునందు నిర్వ్యాపారము, నిరాశ వ్యాప్తమై మహోద్వేగము వ్యాప్తమైనది. జాతీయ పునరుద్ధరణోద్యమము నిరంకుశరాజ్యమును చేయుచున్నది. స్థిరమైన ఆర్థికవ్యవస్థ లస్థిరము లగుచున్నవి. పంటలు, పరిశ్రమలు, ధరలు, వ్యాపారము, ధనాగారములు నిర్బంధనియమితము లగుచున్నవి. రూజువెల్టుగారు, వారిమంత్రులు నిర్ణయించిన జోస్యము సఫలముగాకున్నది. ధరప్రతులు హెచ్చినను తరణోపాయ మగోచరముగ నున్నది. డోలరుబంగారుప్రమాణము పెరిగినను డోలరు మారకపు ధర పడిపోవుచున్నది. డోలరు మారకపుధరను నిలునబెట్టుటకు అమెరికా స్వదేశవిదేశములందు బంగారమును కొనుట నిర్ణయించినది. ప్రపంచమునం దంతటను బంగారుధర పెరుగుచున్నది. దారిద్ర్యగ్రస్తమైన హిందూస్థానమునుండి బంగారమంతయు ఎగుమతియగుచున్నది. ఇంతవరకును ౧౭౦ కోట్లరూప్యములబంగార మెగుమతియైనది. నిరుపేదలు పుస్తెపుడక నమ్మి పన్నులను చెల్లించుచున్నారు. కోట్లబంగారము ధనాగారములం దగ్నిమాంద్యమువలన నిరర్థకముగ నున్నను అమెరికాధనజలోదరమునకు సంతృప్తి గలుగలేదు. అమెరికావ్యాపారమునకు చీనాప్రాంతములందును, జర్మనిగ్రేటుబ్రిటనులందును ప్రతిరోధము గలిగినది. జపాను సామ్రాజ్యధ్వజ

మును, వ్యాపారధ్వజమును ప్రాచ్యఖండము
నుండి క్రమముగను పాశ్చాత్యఖండమునకు
వ్యాప్తమగుచున్నది. జపాను మంచూరియా
యందు స్థిరాసనము నేర్పరచుకొనినది. ఇరువ
దేండ్లకు పూర్వమారంభమైన ఆసియాప్రబోధ
విజయములను జపాను క్రమముగను సార్థ
కముచేయుచున్నది. రుష్యావిజయధ్వజ మాసి
యానుండి యూరపునకు మరలినది. శ్వేత
జాతుల పరాక్రమప్రతిష్ఠ, వ్యాపారపరిశ్రమ
ప్రతిష్ఠ,మంత్రాంగకౌశలము పటాపంచలైనవి.
చీనా మెల్లమెల్లగ తనశక్తిని బడయుచున్నది.
శ్వేతజాతులకును, పాశ్చాత్యరాజ్యములకును
ప్రపంచమునందంతటను ప్రతిష్టంభనము గలిగి
నది. పరస్పరభేదములు, స్వార్థారాధనము
వినాశకారణములుగను బరిణమించినవి. పదేం
డ్లక్రితము బహిష్కరింపబడిన రుష్యామీదను
తిరిగి ఫ్రాన్సుఅమెరికారాజ్యములు తమ
చూపులను ప్రసరింపజేసినవి. మానవస్వాతం
త్ర్యధ్వజమును స్థాపింప సమకట్టిన రుష్యా
రాజ్యము ధనస్వాములకు తిరిగి శరణ్యమగు
చున్నది. ధర్మమే జయించుననుటకు సోవి
యటు రుష్యాయుదంతము పరమప్రమాణముగ
నున్నది. పదేండ్లక్రిందట సోవియటుప్రభుత్వ
మును బహిష్కరించిన ప్రభుత్వములు వర్త
మానకాలమునందు రుష్యామిత్రత్వము నభిల
షించుచున్నవి. ఫ్రెంచిప్రభుత్వ మమెరికా
ప్రభుత్వమును రుష్యాతో సంధిని జేసికొను
చున్నవి. ప్రపంచమునందు ధర్మపరివర్తన
మొకవైపునను, సంగ్రామప్రయత్నము లొక
వైపునను జరుగుచున్నవి. సందిగ్ధసమయము
నందు మహాసామ్రాజ్యాధిపత్యమును వహిం
చుచున్న బ్రిటిషుసామ్రాజ్యస్థితి విషాదకర
ముగ నున్నది.

గ్రేటుబ్రిటను సహజమైన సాహసధైర్య
ములను విడిచి సంశయాత్మత్వమును బూనుట
విచారకరము. ఆర్థికపారిశ్రామికరాజకీయ
రంగములందు గ్రేటుబ్రిటనుకు ప్రతికూల
వాతావరణ మేర్పడుచున్నది. ప్రపంచము
నందంతటను బయలుదేరిన ప్రతికూలవాతా
వరణమునకు తోడుగ ప్రాచ్యసాహచర్యము
బ్రిటిషువీర్యమును నిర్వీర్యము చేయుచున్నది.
బ్రిటిషుప్రభుత్వము నిర్వహింపదలచిన ఆయుధ
విసర్జనసభ, ఆర్థికమహాసభ మొదలగుసభలు
నిరర్థకములైనవి. సకలజాతులును ఆత్మసం
రక్షణముకొరకు రాజకీయార్థిక జాతీయావరణ
ములను కల్పించి పరాధీన జాతులను,
దుర్బలజాతులను నిర్బంధములపాలు చేయు
చున్నారు. అయినను మహాప్రభుత్వముల
స్థితియును దుఃఖకరముగ నున్నది. బ్రిటిషు
ప్రభుత్వపరిస్థితు లిటులుండగను పరాధీనస్థితి
యందున్న హిందూస్థానాది దేశముల స్థితి
గతులు దుర్భరముగ నున్నవి.

* * * *

హిందూస్థానము

ప్రకృతియందు మృగశిరకార్తికి రోహిణి
కార్తియును, వర్షపాతమునకు కారుమబ్బులు,
మెరుపులు, ఉరుములును నవసరమైనటులు
శాంతియుగమునకును మహాసంగ్రామములు,

దుర్భిక్షములు, దుఃఖానుభవమును సహజ ములు. ప్రపంచావృతమైన విషాదపరిస్థితు లందు నిస్సహాయస్థితియందున్న దేశములస్థితి ముఖ్యముగను హిందూస్థానస్థితి దుఃఖమయ ముగ నున్నది. అంతర్భేదములు, స్వార్థపర త్వము, పారతంత్ర్యము దేశమును కీలా భీలము చేయుచున్నవి ఆశాపిశాచము, శక్తిలేకపోయినను, ప్రపంచమునందంతటను వలెను హిందూస్థానమునందును ప్రళయ తాండవమును జేయుచున్నది. ప్రజలన్నాతు రులై పరితపించుచున్నారు. వ్యాపారము క్షీణించుచున్నది. ధరలు పడిపోయినవి. మిల్లుల యజమానులు నాయకత్వమునుబూని దుర్భిక్షము నభివృద్ధిచేయుచున్నారు. లంకా పైరు జపాను వర్తకులకును బొంబాయిమిల్లు యజమానులకును కుదిరిన వర్తకసంధి ప్రజా క్షేమమునకు ప్రతికూలముగ నున్నది. మిల్లుల యధికారులవలెను ఇతరాధికారులును స్వార్థ పరాయణులై మహాసంక్షోభమును గలుగ జేయుచున్నారు. దేశావృతమైన యసంతృప్తి సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. అసంతృప్తి బలావేశమునకు బదులు దుర్బలవిషాదమున కును,నిరాశకును గారణంబగుచున్నది. దేశము నందు శల్యాగతమైన నిరాశ అవ్యవసాయ మునకును, ప్రజ్ఞావాదమునకును మూలమై క్లైబ్యమును, నిశ్చేష్టతను గలుగజేయు చున్నది. నిశ్చేష్టత సమ్మోహమును గలుగ జేయుచు నాత్మశక్తిని స్తంభింపజేయుచున్నది. ఈమహోపద్రవమునుండి దేశమును రక్షించు నది గీతోపదేశమునకు హృదయమైన "స్వల్ప మప్యస్యధర్మస్యత్రాయతేమహతోభయాత్" పరమార్థము. ధర్మమునకు గొప్ప చిన్న భేద ములు లేవు. భక్తిపూర్వకముగ స్వల్పధర్మ మును సేవించినను మహత్తరమైన ఫలము గలుగుచున్నది. ధర్మసందేహములను గలిగి కర్మవిమూఢత్వమును పోగొట్టుటకు కర్మ యోగము సాధనముగాని వ్యాఖ్యానములు సాధనములుగావు. కురుక్షేత్రమునందు విజ యునివలెను సకలజనులును కర్మయోగులు కాగలరు.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా
    త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః
    కరిష్యే వచనం తవ.

గీ. అ. ౧౮ శ్లో. ౭౩.

సకలజనులును మోహమును విడిచి జ్ఞానమునుపొంది కర్మనిరతులయి కామి తార్థములను బడయుదురు. స్వకర్మనిరతులు ధర్మనిరతులై పురుషార్థమును సాధించవలసిన యవసరము దేశావృతమైన నిరాశ విశదము చేయుచున్నది. గాంధిమహాత్ముని కర్మయోగా చరణము ధీమంతులకు ధర్మయోగానుష్ఠాన విధానమును విశదముచేయుచున్నది.

*    *    *    *

పూర్ణయోగము

పూర్ణయోగము సకలజనులకును సా ధ్యముగాకపోయినను కర్మయోగముసాధ్యము. కర్మమయమైన విశ్వమునందు సకలజనులకును

కర్మాచరణమున కవకాశములు గలవు. కర్మ ప్రాశస్త్యమునకు మమకారాహంకారములు కారణములుగాని కర్మ కారణముగాదు. గాంధి మహాత్ముడు శాసనోల్లంఘనము నవలంబించినను, హరిజనసేవను బూనినను, ఉపవాస దీక్షను వహించినను ధర్మపరమై పూర్ణయోగ రూపమును దాల్చుచున్నది. పూర్ణయోగము త్యాగాధీనము, ఫలరహితము. సామాన్యులకు ఫలరహితమైన పూర్ణయోగ మసాధ్యమైనను ఫలసహితమైన కర్మయోగము సాధ్యము. వర్తమానసందిగ్ధావస్థయందు ప్రజానాయకులు గాంధిమహాత్మునివలెను లాభనష్టములను, జయాపజయములను, రాగద్వేషములను విడిచి నియతకర్మలనుజేసి కృతార్థులగుట ధర్మము, క్షేమకరము.

---

Printed and Published by C.Seshagiri Rao, B. A.. at the Andhra PatrikaPress,No.7,ThambuChettySt.,Madras
Editor: G. Subbaramayya.





నేను—మంచపాక పార్వతీశ్వరశాస్త్రిగారు ... ... ౮౩౭–౮౩౮

భోజుని శృంగారప్రకాశము ౨—మా. రాధాకాంతయ్యగారు ... ౮౩౯–౮౪౯

బ్రాహ్మణముల ప్రశంస—మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ... ౮౫౦–౮౫౧

సాంప్రదాయికవిజ్ఞానం—ఊటుకూరు కామేశ్వరరావుగారు ... ... ౮౫౨–౮౫౯

ఆంధ్రవాఙ్మయచరిత్రము: యుగవిభజనము—కోరాడ రామకృష్ణయ్యగారు ౮౬౦–౮౬౫

సింహావలోకనం—కొల్లూరు ధర్మారాయకవిగారు ... ... ౮౬౬–౮౭౦

ప్రేమపాశం—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... ... ౮౭౧–౮౯౦

దార్ఢ్యం—ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు ... ... ౮౯౧–౮౯౬

“తప్పంతానా దేనా?”—బుర్రా అప్పారావుగారు ... ... ౮౯౭–౯౧౩

శ్రీకృష్ణ నవరత్నగీతులు—శ్రీ విక్రమదేవవర్మగారు ... ... ౯౧౪

వినోదశిల్పము: తెరచాపలు—కొ. నరసింహాచారిగారు ... ... ౯౧౫–౯౧౬

బిచ్చము—ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు ... ... ౯౧౭–౯౨౨

గర్వభంగము—కీ. శే. కొడాలి వెంకటసుబ్బారావుగారు ... ... ౯౨౨

తెలుగుటాకీలు: ఆంధ్రులపరిశ్రమ—ఏ. వి. సీతారామయ్యగారు ... ౯౨౩–౯౨౪

శరదృతువు—వడ్డాది సుబ్బారాయడుగారు ... ... ౯౨౫–౯౨౬

భారతదేశము—నానాజాతిసమితి—లంకసత్యంగారు ... ... ౯౨౭–౯౩౦

జాతీయత్వము—అంతర్జాతీయత్వము—జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తిగారు ... ... ... ... ... ౯౩౧–౯౩౫

మీగడతఱకలు: సారస్వతము—సర్కారు—కర్లపాలెం కృష్ణరావుగారు ౯౩౬–౯౩౭

వచనవాఙ్మయము—శాస్త్రి ... ... ౯౩౭–౯౩౮

నక్షత్రమండలము: (మార్గశిర పుష్యమాసములు)—గొబ్బూరు
వేంకటానంద రాఘవరావుగారు ... ... ... ౯౩౯–౯౪౨

బాలక్రీడలు—మంగిపూడి వేంకటశర్మగారు ... ... ౯౪౩–౯౫౦

నేటిరష్యా—నార్ల వెంకటేశ్వరరావుగారు ... ... ౯౫౧–౯౫౩
భారతము: పరమార్థప్రదర్శనము—నందూరి బంగారయ్యగారు ... ౯౫౪–౯౫౮
భారతీయవిద్యాచరిత్రము—మారేమండ రామారావుగారు ... ౯౫౯–౯౬౮
ఒట్టు—కనుపర్తి వరలక్ష్మమ్మగారు ... ... ... ౯౬౯–౯౭౦
శ్మశానవాటి—జి. జాషువగారు ... ... ... ౯౭౧–౯౭౨
ఆంధ్రాభ్యుదయము: పొట్లూరు హనుమంతరావుగారు; వడితాండ్ర
లక్ష్మీనారాయణ నాయుడుగారు ... ... ... ౯౭౩–౯౭౪
కలగూరగంప: నాలందాపురాతన నిర్మాణములు; కుమారిజయంతిదేవి; సన్నీ తౌరీకన్య ౯౭౫–౯౭౮
విమర్శనము ... ... ... ... ...
మనవిమాటలు: తెనుగున తెనుగుదనము; వావిళ్లవారికి సమ్మానము; ౯౭౯–౯౯౧
ఆంధ్రదేశము - పరిశ్రమలు; భారతమహిళాసంఘము ... ౯౯౨–౯౯౭
సాభిప్రాయ విశేషములు ... ... ... ... ౯౯౯–౧౦౦౨

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు: పడిసెల; ఊర్వశి

సాధారణ చిత్రములు: నాలందాపురాతన నిర్మాణ చిత్రములు; నిజాం సాగర చిత్రములు; కొండక్రింద; గొల్లవాడు; అభిసారిక; మోట; నారుతీత; ఇతర చిత్రములును.




సంపు. ౧౦ శ్రీముఖ సంవత్సరము, మార్గశీర్ష మాసము (డిసంబరు ౧౯33) సంఖ్య ౧౨

# నేను

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

(తేనెపట్టునుండి)

తేటిబిడ్డను నేను !—
తేనెపట్లల్లి
కులముఁబోషించుటే కులవృత్తి మాకు.

* * * *

దారితెన్నులు లేని, దరిదాపు లేని,
యడవిలోఁ గాఁపురం బలవడు మాకు—
పెక్కు బుట్టువులందుఁ బెంపొందుచున్న
తపముకల్మినిఁ జెట్లు తమకింపుగాఁగ
లోకాని కింపుగా, లోకనాథునకు
నింపుగాఁ బూచి, యర్పించినపూలు,—
చెట్టుచెట్టుకుఁబోయి చెలిమికావించి
రంగురంగుల పూలు, రాణించుపూలు,—
యాపూవులను జూచి యందంబుమీరఁ,
దేనియ సమకూర్చి, తేఁకువఁ బేర్చి,
యొక్క తావుకుఁ జేర్చి, యోపికఁ దార్చి
పట్టుగా నల్లి, యీశ్వరుప్రీతిగాఁగ
లోకాని కర్పించి, లోకమ్ము సేవఁ
గులముపోషించుటే కులవృత్తి మాకు.

* * * *

తాతలు, తండ్రులు, తండ్రితాతలుగఁ
దరతరంబులనుండి, తప్పకెప్పుడును
నీకులవృత్తి జీవించుచున్నాము—
కాలభేదాన, దేశాలభేదాన,
నించుకించుకక్రొత్త యేర్పడునేమొ,
కాని, తొల్లింటిదే యానాను మాత్రోవ—
బలముచాలక, తపోబలము చాలకయుఁ
బెద్దత్రోవలఁ బోవఁ బెద్దలరీతి
నేర్పుసాలదు గాని, మార్పెట్లు కలుగుఁ

గులవృత్తిఁ జీవింపఁ దలఁచువారలకు ?—
రంగురంగులపూల, రాణించుపూల
చెలిమిన్నెయుట ప్రేమకలిమియేకాని,
రంగులు మాకేల, రాణ మా కేల,
రంగురాణల మించి రాజిల్లుచున్న
యమృతమంతయుఁగూర్చి,యమరించుచుంట
యుగ్గుతోఁబోసిన యుచితంపువిద్య—
మప్పితం బదిలేక, మర్యాదలేక,
ఊఁయన్న, ఆఁయన్న, నులికి పైఁబడుచు,
నేడ్చుచుఁ గఱచుచు, నేవలంగనెడు
కందురీఁగలపుట్ట కాదు మాపట్టు.—

*     *     *     *

పంజరంబుననుండి, పైవారు తమకుఁ
జెప్పినచదువుల నొప్పఁజెప్పుచును,
స్వార్థంబు పరమార్థ మరయఁగాలేని
చిలుకలుగారు మాకొలమునవారు.

*     *     *     *

బిడ్డలఁబెంచెడు విధులు గైకొనక,
పాడుచుఁ గేరుచుఁ బాఱులాడుచును,
నిల్లువాకిలి లేక, యేడనో తిరుగు
పరభృతంబులుగారు పరగ మావారు.

*     *     *     *

అడవులఁ గల చెట్టు లన్నియు వెదకి,
పూవుపూవునఁ జేరి పొదలు తేనియను
గ్రహియించి దాని సంగ్రహముగావించి
యీశ్వరార్పణముగా నీలోకసేవ
చేసిమెప్పొందుటే చిరవృత్తి మాకు.
ఎంతెందుఁ దిరిగిన, నెందుఁ బోయినను,
నింటిపట్టుకుఁ జేరి, యింపుగా నుందు
మెపుడు బిడ్డలకు మా యింటిపెద్దియల
నేర్చినంతకు నేర్పి, తీర్చిదిద్దెదము.
పెద్దలేగినత్రోవ విడనాడలేము.
క్రొత్తత్రోవలఁబోవఁగోర మెన్నఁడును.
భావమే యనుఁ డహంభావమే యనుఁడు—
ఏమన్న ననుఁడు మాకేల యాచింత.

*     *     *     *

కులవృత్తి విడలేక, కూర్మి మీరంగ,
నీతేనెపట్టల్లి యిందు నిల్పితిని—
కడుఁజిన్నదంచుఁ జీకాకు నొందకుఁడు.
కల దిందుఁ దేనె;—
యాపలుకు నిక్కంబు—
తారతమ్యము లెంచఁ దరమె నాబోటి
కెక్కువతక్కువ లేల లెక్కింప ?—
కూర్చుట మాపని—
కులవిద్య యదియు
అనుభవించుట మీకుఁ బని—
మీకు మాకు
నన్యోన్యబాంధవం బమరు నీరీతి—
తేనెఁద్రావుఁడు మీరు తృప్తితీరంగ,
మమ్ము దీవింపుఁడు, మము మన్పుఁడు;
మాపెద్ద లేగిన మంచిత్రోవలనె,
మాబిడ్డలందఱు మఱిమఱిఁ బోయి,
మాకు, లోకానికి, మీకు, దేవునకు
నానంద మొనఁగూర్చునట్లు నిత్యంబు,
మమ్ము దీవింపుఁడు మహితాత్ములార,
మము మననిండు, ప్రేమనిధానులార.

*     *     *     *

*     *     *     *

# భోజుని శృంగారప్రకాశము

మా. రాధాకాంతయ్య

## ౨

భోజుని ప్రశంసించినవారిలోఁ గొందఱఁ బేర్కొంటిమి కదా. ఒకానొక కవి తచ్ఛ్లాఘనే చిత్రముగాఁ గావ్యరూపమున సూచించుట మఱియొక్కటి యుదాహరించెదము. లాటదేశాధీశ్వరుఁ డగు వత్సరాజు క్రీ. శ. ౧౦౨౬ నుండి ౧౦౫౦ వఱకు రాజ్యము చేసెను. అతనియాస్థానములో నుండిన సోఢలుఁ డనుకవి చిత్ర మగుగద్యకావ్యము నుదయసుందరీకథ యనునామముతో రచించెను. దానిలో గ్రంథాంతమునఁ గవి తాను నిద్రించుచుండఁగాఁ గలలో విక్రమాదిత్య శ్రీహర్ష ముంజభోజ దేవాదిభూపాలకులతో సామంతరాజు లగు వాక్పతిరాజమాయురాజవిశాఖదేవప్రభృతులచేతను, మహాకవు లగు కాళిదాసాదులచేతను సమలంకృతంబై బాణభట్టుచే నధ్యాసిత మగు కవిబృందసభాప్రదేశమును జూచెనఁట. ఇందు సోఢలుఁడు విక్రమాదిత్య శ్రీహర్షాదులతో భోజుని సమానునిగాఁ జెప్పెను. సోఢలుఁడు భోజుని సమకాలికుఁడు. ఇతరరాజాశ్రితులగు సమకాలిక కవులచే నిట్టిప్రశస్తి సామాన్యముగా నితరరాజు లనుభవించినవారు కారు.

"ఏకత్ర సరస్వతీభవనసోత్సఙ్గమణ్డపే మిలిత మేవ బాణభట్టాధ్యాసిత మధిష్ఠితం చ కాళిదాసాదిమహాకవిభిః కవీంద్రైశ్చ విక్రమాదిత్య శ్రీహర్షముంజభోజ దేవాదిభూపాలైః సామంతైశ్చ వాక్పతిరాజ మాయురాజవిశాఖదేవప్రభృతిభిః సమంతాదలంకృతం కవీనాం బృందమారబ్ధ వివిధకావ్యగోష్ఠీనిషణ్ణ ముద్రాక్షమ్"
—ఉదయసుందరీ ఆశ్వా ౮.

ఇంతవఱకు భోజునికాలనిర్ణయము సుమారు పదివందలనుండి పదివందలయబువదివఱ కని యూహించితిమి. మనయుద్దేశానుసార మతని శృంగారప్రకాశమును గూర్చి విచారింతము. ఆ రాజేంద్రుఁ డలంకారశాస్త్రమున సరస్వతీకంఠాభరణమును, శృంగార ప్రకాశమును విరచించె నని చెప్పితిమి. ఏకవిషయమున గ్రంథద్వయ మేల యని మొదట సందేహింపవలసియున్నది. ఈ విచారమునకు మునుపే (౧) భోజుఁడు శృంగారప్రకాశమును రచించె నన్న నిదర్శన మేమి? (౨) ఎవ్వరైన నా గ్రంథమును బేర్కొనిరా? (౩) అది యెట్టిపాటిగ్రంథము? (౪) అతివిస్తర మైనచో సామాన్యగ్రంథములకు లభించినవ్యాప్తి యట్టియుద్గ్రంథమున కేల కలుగలేదు? (౫) ఇఁక నాగ్రంథములోని ముఖ్యాంశము లేవి? విషయవిభాగము లెట్టివి? అవాంతరభేదము లేవైనఁ గలవా? (౬) ఇతఁ డీగ్రంథమునఁ బ్రాచీనమతముల ఖండించెనా? లేక వేనినైన నంగీకరించెనా? (౭) ఇతఁడు నూతనశక్తిని సృజించినచో దాని నెంతవఱకు విద్వాంసు లాదరించిరి, లేక దూషించిరి? అన్నవిషయములు ఈవ్యాసములో యథాశక్తి, యథావకాశము, యథోచితముగా విస్తరింపఁబడును. ఈగ్రంథమును బ్రాచీనులు పెక్కండ్రుదాహరించిరి.

౧. శారదాతనయ విరచిత మగు భావప్రకాశములో నాటకసంధ్యంగములఁ జెప్పి తల్లక్షణమును గడపట నీక్రిందివాక్యముతో ముగించెను:

"ఉక్తాంగానాం చతుష్షష్టిః
షోఢా చైషాం ప్రయోజనమ్,
ఏతాన్యుక్తాని శృంగార
ప్రకాశే భోజభూభుజా."

(అఱువదినాల్గు సంధ్యంగములఁ జెప్పితిమి. వాని ప్రయోజన మాఱువిధములుగా నుండును. ఇవియన్నియు భోజునిచే శృంగారప్రకాశమునఁ జెప్పఁబడినవి.)

౨. దైవవ్యాకరణమున 'మిల శ్లేషణే' యనుధాతువిషయము చర్చించునప్పుడు తద్వ్యాఖ్యాత యగు కృష్ణలీలాశుకుఁడు,

"శృంగారప్రకాశే తు మిల న్త్యాశాసు జీమూతా ఇత్యపఠితధాతుషు మిలతిః ప్రదర్శితః" యని భోజుని మతభేదమును దెలిపెను. ఈ పంక్తి శృంగారప్రకాశములోఁ గలదు.

౩. ఏకావళి యనుగ్రంథమున విద్యాధరుఁడు శృంగారప్రకాశములోని ముఖ్యమతమైన "శృంగార ఏక ఏవరసః"—శృంగార మొక్కటియే రసము—అనుమతము నే ఖండించెను.

౪. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత కుమారస్వామి రసప్రకరణమున రసావస్థానమును వివరించుచు "శృంగార ఏక ఏవ రసః ఇతి శృంగారప్రకాశకారః" యని మతమును జెప్పెను.

౫. అమరవ్యాఖ్యాత యగు సర్వానందుఁ డుద్గమనీయశబ్దముక్రింద "సా మంగళస్నాన విశుద్ధగాత్రీ గృహీతప్రత్యుద్గమనీయవస్త్రా" యను కుమారసంభవ శ్లోకభాగము నుదాహరించి యందు 'త' కారము సంయుక్తాక్షరపూర్వముగ నుండియు గురువు కాక పోవుట కాధారముగా—

"తథా చ శృంగారప్రకాశే-
యదా తీవ్రప్రయత్నేన
సంయోగాదే రగౌరవమ్,
నచ్ఛందోభంగమేవాహు
స్తదదోషాయ సూరయః.

యథా—
నిర్ద్విర్యో హ్రియమేతి హ్రీపరిగతః
ప్రభ్రశ్యతే తేజసః

ఇతి 'త్రి' శబ్దస్య లఘుత్వ మేవంభూతం" అని సమర్థించెను. ఇట్లే సుభూతిచంద్రుఁడును, విద్యావినోదియు, క్షీరస్వామియు శృంగారప్రకాశములో నుండి వ్యాకరణాంశము లుదాహరించిరి.

౬. లౌహిత్యభట్టగోపాలుఁడు కావ్యప్రకాశ వ్యాఖ్యానమున నాలంకారికప్రశస్తిలో భోజునిసుతించి యిట్లు చెప్పెను:

'పక్షపాతేన రమతే
రాజహంసో వివేకవాన్,
మహతాం మానసామ్భోజే
భోజః కీర్త్యా విశుద్ధయా'

అని భోజుఁడు శృంగారప్రకాశములోఁ జూపిన పదార్థవివేచనాశక్తి గొనియాడెను. సాళువనరసింహరాయలు రచించిన రామాభ్యుదయమునఁ బ్రాచీనకవి స్తుతిలో

"యః శృఙ్గారప్రకాశేన
రసాద్వైత మదర్శయత్,
స ఏవ భోజః సాహిత్య
సామ్రాజ్యానుభవే కృతీ."

అని రసబాహుళ్యము నిరాకరించి భోజుఁడేకరసత్వప్రతిపాదనము చేసె నని కొనియాడెను. సింగభూపాలుఁడు రచించిన రసార్ణవసుధాకరమున నిపుణముగా విభాగించిన రసభావనాటకధర్మము లన్నియు నభినవగుప్త మమ్మటాదుల గ్రంథములకు కనుగాక భోజుని శృంగారప్రకాశమతమునే యనుసరించియున్నవి. మంజేతికంకణముల కద్దమేల? గ్రంథము లభించుచున్నది. చదివెడుధన్యులు కలరేని దానిస్వారస్యమును దప్పక గుర్తెఱుంగఁగలరు.

దీనిలో ౩౬ ప్రకాశములు గలవు. మొదటి ౮ ప్రకాశములలో శబ్దార్థస్వరూపమును, ౯ నుండి ౧౨ వఱకు గుణదోషాలంకారశ్రవ్య దృశ్యకావ్య నిరూపణంబును, ౧౨ నుండి ౧౫ పర్యంతము విభావస్వరూపంబును, ౧౬ లో నుద్దీపనవిభావస్వరూపంబును, ౧౭ ట నను భావలక్షణమును, ౧౮ మొదలు ౨౧ వఱకుఁ గ్రమముగా ధర్మార్థకామమోక్షశృంగారముల నిరూపణంబును, ౨౨లో ననురాగస్థాపనమును, ౨౩ లో సంభోగ విప్రలంభభేదద్వయ నిరూపణంబును, ౨౪ లో విప్రలంభశబ్దార్థవివృతియు, ౨౫ నుండి ౨౭ వఱకు సాధ

ర్మ్యవైధర్మ్యముల విప్రలంభస్వరూపంబును, ౨౮, ౨౯ లలో దూతభేదములును, దత్కృత్యమును, ౩౦ లో మానస్వరూపమును, ౩౧ లో ప్రవాసావస్థానమును, ౩౨ లో కరుణవిప్రలంభమును, ౩౩ లో సంభోగశబ్దనిర్వచనమును భుజిధాత్వర్థ నిరూపణమును, ౩౪ లో ప్రథమానురాగ విలసనంబును, ౩౫ లో ప్రవాసకరుణమానానంతర భోగావస్థానంబును, ౩౬ లో నాయికానాయకధర్మ ప్రేమరాగభేద కథనంబును విస్తరింపఁబడియె.

గ్రంథము సుమారు ఏబది వేల యనుష్టుప్ శ్లోకముల పరిమితి కలది. గురుకులక్లిష్టులై చదువుశిష్యులు బహుగుణశోభితము లగు లఘుగ్రంథముల గురుముఖమునఁ జదువుదురు కాని దురధ్యేయము లగు విస్తరగ్రంథములు పఠనీయములు కాకపోఁగాఁ గాలాంతరమున నాత్మవినోదార్థము చదువుకొందురు. సాధారణముగాఁ బఠనపాఠనములలో నుండినవి సూత్రరూపము లగు గ్రంథములే. కావున నతివిస్తృతము లగు గ్రంథములు పఠనములలో, లేక రాజసభలలో శాస్త్రవిచారకాలములయందే యుపయోగపడుటచే నట్టివానికి బహుమాతృకలు లోకములో నిలుచుట కవకాశము లేక యున్న కొన్నియు జీర్ణపత్రము లగునప్పు డుద్ధారము చేయుటకు సులభము గాక నష్టమగుచుండును. అప్రస్తుత మైనను విస్తృతము లగుగ్రంథములు చిరకాల ముండ వనుటకు నందికేశ్వర రచితలక్షాధ్యాయక మగు కామశాస్త్ర మేమయ్యె? వ్యాడి రచించిన వ్యాకరణసంగ్రహ మను లక్ష శ్లోక పరిమితగ్రంథము నష్టమయ్యె. మహాభాష్యముసైత మట్లే నష్టము కాఁగాఁ గాశ్మీరరాజు దేశముల వెదకించి తుదకు శ్రీపర్వతమున నతిదోషదుష్ట మగు మాతృకను సాధించి దానిఁ జంద్రాచార్యప్రభృతులచే స్థిరీకరించెను. ఇట్లే రాజనీతియందును "లక్షాధ్యాయాన్ జగౌ బ్రహ్మ రాజశాస్త్రే మహామతిః,.....త్రీణ్యధ్యాయ సహస్రాణి బృహస్పతిరువాచ హ, కావ్యస్తు తత్సమాలోడ్య చక్రే౽ధ్యాయ సహస్రకమ్" అనునట్లు మహాగ్రంథములు నిత్యపాఠనములలో లేక నశించిపోవు ననుట కిది యొకదృష్టాంతము. ఈ బ్రహ్మ, బృహస్పతి రచితము లగు నర్థశాస్త్రగ్రంథములు నశించినవి. ఇట్లే ముప్పదిరెండు యామళతంత్రములు సుమారు ౪౦ లక్షల గ్రంథము కలవి లోకములో నష్టమయ్యె. శృంగారప్రకాశము గాక భోజుఁ డలంకారశాస్త్రమున సరస్వతీకంఠాభరణమను మఱియొక గ్రంథము రచించెను. ఒక్కఁడేకశాస్త్రమున రెండుగ్రంథములు రచింపఁ బనియేమి? అని మొదట సందేహము కలుగును. దానికిఁ బరిహార మిట్లు తోఁచుచున్నది. శృంగారప్రకాశములో ౪ ప్రకాశములలో వాక్యార్థవిచారము, తరువాత నాలుగుప్రకాశములలో గుణదోషకావ్యలక్షణముల బీజభూతములగు చమత్కారమును జెప్పఁబడినవి. ౧౩-౩౬ వఱకు ఒక్కటియేయగు శృంగార రసస్వరూపమును దానిలో ధర్మార్థ కామమోక్ష విభాగమును సాధర్మ్య వైధర్మ్య లక్షణములచే ననురాగస్థాపనమును సంభోగవిప్రలంభ తదవాంతర భేదములచే రసోత్కర్షము వర్ణింపబడినవి కదా. అనఁగా శబ్దార్థవిచారమును దొలఁగించి చూడఁగాఁ గేవలము రసభావ నిరూపణమే గ్రంథములోఁగల వస్తువు.

సరస్వతీకంఠాభరణమున భామహాలంకార, కావ్యాదర్శ, కావ్యప్రకాశాదులవలె శబ్దార్థాలంకార ధ్వని గుణ దోష పరిచ్ఛేదములు మాత్రమే కలవు. ఐదవ పరిచ్ఛేదమున మాత్రము రసలక్షణము మితముగా సూచింపఁబడినది. ఈరెండు గ్రంథములలో వస్తువులో భేదము గలదు. కంఠాభరణమున రచనాప్రధానమగు కావ్యలక్షణము ప్రతిపాదింపఁబడియె. శృంగారప్రకాశమునఁ గావ్యజీవిత మగు రసభావ నిరూపణము చేయంబడియె. కావున రెండు నలంకారశాస్త్రములే యైనను శరీరమున బహిరంగవృత్తియు, అంతరంగవృత్తియు నను భేదము లెట్లుగలవో యట్లే కావ్యరచనాస్వరూపమును, రసస్వరూపమును భేదిల్లుచున్నవి. పరస్పరసంబంధము గలిగినను రెండును భిన్నగుణము లనియే గ్రహింపఁదగును. ఈవిభాగము మఱికొన్ని గ్రంథములయం దేకకర్తృకములయం దగపడుచున్నది. రుద్రటుని కావ్యాలంకారము రచనాప్రధాన మైనది. అతని శృంగారతిలకము

రసప్రధానమైనది. * అనఁగా విభావమునకు ముఖ్యకారణము లగు నాయకనాయికాస్వరూపములు నిరూపింపఁబడినవి. ఇట్లే రసార్ణవసుధాకరము రసప్రధానము కాఁగా చమత్కారచంద్రిక రచనాప్రధానముగుచున్నది. కావ్యప్రకాశము కావ్యరచనాప్రతిపాదకము కాఁగా నతనిభావప్రకాశము రసభావప్రకాశ మగుచున్నది. †

---

* కొందఱు కావ్యాలంకారము వ్రాసిన రుద్రటుఁడు, శృంగారతిలకము రచించిన రుద్రుఁ డనువాఁడు నొక్కఁడుగాఁ డందురు. ఏల యనఁగా మొదటినామమున 'ట' కారము హెచ్చుగా నున్నదని చెప్పుదురు. ఇద్దఱు నొక్కఁడె యనువా రిట్లు చెప్పుచున్నారు. మమ్మట కయ్యట రుద్రటాదిశబ్దములయందు 'ట' కారము భట్ట శబ్దవికారము. ఎట్లనఁగా భట్టశబ్దము ప్రాకృతమున హట్ట యని యగుచున్నది. 'హ' కారమర్ధాక్షర మగుటచే వ్యంజనము లోపించును. రుద్రభట్ట రుద్రహట్ట రుద్రట్ట రుద్రట యనురూపము లేర్పడును. అన్నాంబ, అన్న అమ్మ, అన్నమ్మ అన్నమ యను వికృతి పరంపర చెందినట్లే.—అన్నమ్మకుం గొమ్మన మంత్రికి సుతుఁడ—నిర్వచ—ఆశ్వాసము ౧. మఱికొందరు ,రుద్రటాచార్యుఁడు తన కవసరనిమిత్తమై రుద్రభట్టు అని తనపేరిలోని భకారమును వేయు బంగారుటంకెములకుఁ గొదవ పెట్టి రుద్రట యనునపహ్యనామముతోఁ జిరకాలము వ్యవహరింపఁ బడుచుండెనని క్రీ. శ. ౧౧౫౦ లో లిఖింపఁబడిన శిలాశాసనములోఁ గలదు. ఎట్లున్నను శృంగారతిలకమును రచించినవానిని రుద్రటుఁ డని పెక్కండ్రు గ్రంథకర్తలు చెప్పుచున్నారు. శారదాతనయుఁడు భావప్రకాశమున సామాన్యానాయికయందు రాగానుభవము గలదా లేదా యని చర్చించుచు

"శృంగారాభాస ఏవ స్యాత్ న శృంగారఃకదా చ న,
ఇతిద్వివ_త్తముద్దిశ్య ప్రాహ శ్రీరుద్రటః కవిః.

రాగశృంగారనిర్ముక్తా
ఇతిస్యుగ్గణికాః స్వతః,
యోషిత్సామాన్యతో జాతః
స్మరః కిం భక్షితో బకైః.

కిం తు తాసాం కలాకేళి
కుశలానాం మనోరమమ్
విస్మారితాపరస్త్రీకం
సురతంజాయతే నృణామ్.

ఈర్ష్యా కులస్త్రీషు న నాయకస్య
నిశ్శంకకేళిర్న పరాంగనాసు,
వేశ్యాసు చైతద్ద్వితయం ప్రరూఢం
సర్వస్వమేతా స్తదహో స్మరస్య."

అని రుద్రటునిపేర నుదాహరించిన మూఁడు శ్లోకములు శృంగారతిలకములోనే కలవు. ఈశ్లోకములనే, యిట్టిఘట్టముననే వర్ణించుచు బహురూపమిశ్రుఁడు దశరూపవ్యాఖ్యానమున, "ఉక్తం చాభియుక్తసార్వభౌమేన రుద్రటాచార్యేణ" యని పై శ్లోకము లుదాహరించెను. సింగభూపాలుఁడు రసార్ణవసుధాకరమున వేశ్యానాయికాప్రశంసలో తదనురాగముగూర్చి యిట్లు చెప్పెను:

"తస్మాత్ సాధారణస్త్రీణాం
గుణశాలిని నాయకే,
భావానుబంధః స్యాదేవ
రుద్రటస్యాపి భాషణాత్."

'తథాహ రుద్రటః' అని 'ఈర్ష్యాకులస్త్రీషు' అను పైశ్లోకము నుదాహరించెను. సాహిత్యభట్టగోపాలుఁడు శ్లేషోక్తిగా

"అతిలోకసులంకారమాబిభ్రమమృతసూత్రం,
ఆర్యానురాగీ సర్వజ్ఞః సత్యంరుద్రః సరుద్రటః"

అనివిచిత్రముగా రుద్రరుద్రటైక్యమునువర్ణించెను.

† కావ్యప్రకాశకారకుఁ డగుమమ్మటుఁడే శారదాతనయనామము గలవాఁ డనియు, నతఁడే భావప్రకాశము రచించె ననియు తద్వ్యాఖ్యాత యభిప్రాయము. అట్లుండవచ్చు నని వారికాలనిర్ణయమును బట్టియు, గ్రంథపరిశోధనము బట్టియుఁ దోఁచుచున్నది. వ్యాఖ్యాత యిట్లు చెప్పుచున్నాడు:

శృంగారప్రకాశమున జీవాతు వగు సూత్రము "శృంగార ఏక ఏవ రసః"—శృంగారమొక్కటియే రస మనుటయే. తద్రస సంబంధము లగు జన్మానుబంధ ప్రకర్షాద్యవస్థలు విరివిగా నీగ్రంథమునఁ జెప్పఁబడినవి. శృంగారప్రకాశములో మూలభూతము లగు రసపరశ్లోక ముల నీక్రిందఁబొందుపఱచుచున్నారము. వానివ్యాఖ్యా నము పైవ్యాసములో విచారింతము.

"ఆత్మస్థితం గుణవిశేష మహంకృతస్య
శృంగారమాహు రిహ జీవిత మాత్మయోనేః,
తస్యాత్మశక్తిరసనీయతయా రసత్వ
యుక్తస్య యేన రసికోఽయమితి ప్రవాదః. ౧

సత్త్వాత్మనామమలధర్మవిశేషజన్మా
జన్మాంతరానుభవనిర్మితవాసనోత్థః,
సర్వాత్మసంపదుదయాతిశయైకహేతు
ర్జాగర్తి కోఽపి హృదిమానమయో వికారః. ౨

తాత్పర్య మేవ వచసి ధ్వనిరేవ కావ్యే
సౌభాగ్య మేవ గుణసంపది వల్లభస్య,
లావణ్య మేవ వపుషి స్వదతేఽంగనాయాః
శృంగార ఏవ హృదిమానవతో జనస్య. ౩

శృంగారవీరకరుణాద్భుతరౌద్రహాస్య
బీభత్సవత్సలభయానకశాంతనామ్నః,
ఆమ్నాసిషు ర్దశ రసాన్ సుధియో వయన్తు
శృంగార మేవ రసనా ద్రసమామనామః. ౪

వీరాద్భుతాదిషు చ యేహ రసప్రసిద్ధిః
సిద్ధా కుతోఽపి వటయక్షవ దావిభాతి,
లోకే గతానుగతికత్వవశాదుపేతా
మేతాం నివర్తయితు మేష పరిశ్రమో నః. ౫

అప్రాతికూలికతయా మనసో ముదాదేః
యః సంవిదోఽనుభవహేతు రిహాభిమానః,
జ్ఞేయో రసః సరసనీయత యాత్మశక్తేః
రత్యాదిభూమని పునర్వితథా రసోక్తిః. ౬

రత్యాదయోఽర్ధశత మేకవివర్జితా హి
భావాః పృథగ్విధభావభువో భవన్తి,
శృంగారతత్త్వమిహ తే పరివారయన్తః
సప్తార్చిషం ద్యుతిచయా ఇవ వర్ధయన్తి. ౭

ఆభావనోదయమనన్యధియా జనేన
యో భావ్యతే మనసి భావనయా స భావః,
యో భావనాపథ మతీత్య వివర్తమానః
సాహంకృతౌ హృది పరం స్వదతే రసోఽసౌ. ౮

రత్యాదయో యది రసాః స్యు రతిప్రకర్షే
హర్షాదిభిః కిమపరాద్ధమతద్విభిన్నైః,
యే స్థాయినస్త ఇతి చే ద్భయహాసశోక
క్రోధాదయో వద కియచ్చిర ముల్లసంతి. ౯

స్థాయిత్వమత్ర విషయాతిశయాన్మతశ్చే
చ్చింతాదయః కుత ఉత ప్రకృతేర్వశేన,
తుల్యైవ సాత్మని భవే దథ వాసనాయాః
సందీపనాత్ తదుభయత్ర సమానమేవ." ౧౦

అను పైశ్లోకములే భోజుని రసస్వరూపసిద్ధాంత మునకు మూలసూత్రములు. వీనిని స్పష్టపఱచుటకే పీఠికాబంధముగా కొంత సామాన్యరససిద్ధాంతమును సంక్షేపించి చెప్పవలసియున్నది. తదనంతర మీ శ్లోక ములయర్థమును, భోజునిసిద్ధాంతమునుబరిశీలించిచూతము. మొదలు శృంగారమన నేమి? రస మన నేమి? భోజుఁడు శృంగారరసశబ్దముల నెట్లు నిర్వచించెను? ప్రా

---

"అథ తత్రభవాన్ శారదాతనయో నామ విద్వాన్ శారదాదేవీప్రసాదాత్ కృతసకలశాస్త్రపరి శ్రమః స్వపరిశీలిత సర్వశాస్త్రప్రౌఢిం లోకస్య దర్శ యితుం కావ్యమీమాంసాం, సంగీతమీమాంసాం చ కావ్యప్రకాశే శారదీయాఖ్యే ప్రబంధే చ నిస్పంద విపర్యయం విచార్య రసాన్ భావాంశ్చ మీమాంస యితుం భావప్రకాశికాఖ్యం నాట్యప్రకరణం చికీర్షుః చికీర్షితస్య ప్రకరణస్య నిరంతరాయపరిపూర్తయే ప్రచ యగమనాయ చ శిష్టాచారపరంపరాప్రాప్తం మంగళ మాచరన్ సర్వమంగళానందనిధానం గజాననం నాట్య గతపదార్థరూపైరేవ విశేషణైరభిష్టౌతి" అని.

మాణికు లగు నితరగ్రంథకర్తలు రసస్వరూప మెట్లు నిర్ధారించిరి? భరతుఁడు రసము లెనిమి దని చెప్పెను; కోహలుఁడు తొమ్మిది యని చెప్పెను. వాత్సల్య ప్రేమాదులతోఁ బది యనియు, పదునొకం డనియు రససంఖ్యను బహువురు పలువిధములుగాఁ జెప్పుచున్నారు. ఈవిషయమై కొంత వస్తువిచారము చేయకున్నయెడల శృంగారప్రకాశములో భోజుఁడు చెప్పఁబోవునట్టి యవాంతరభేదములఁ జక్కఁగా గ్రహించుటకు సామాన్యజనులకు సాధ్యము గాదు. విద్వాంసులకు మాయనువాదముతోడనే యవసరము లేదు. కావునఁ బీఠబంధముగా రసస్వరూపము కొంత విచారింతము.

ప్రప్రథమమున రస మనునది యానందావస్థ యని యూహించుకొని యది యెవ్వనియందుఁ గలుగుచున్నదో విచారింపవలయు. ఆలంకారికులమతమున రసము దృశ్యకావ్యవిషయమున సామాజికులయందును (నాటకముచూచెడివారియందు), శ్రవ్యకావ్యవిషయమున శ్రోతలయందును (గావ్యమును వినువారియందు) గలుగుచున్న దని సిద్ధాంతము. ఈరసము లోకనిష్ఠ మగు సుఖదుఃఖవిశేషమా, లేక కృత్రిమరూప మగు సుఖదుఃఖవిశేషమా? అని సందేహము కలుగును. నాటకము చూచునప్పుడు హరిశ్చంద్రాదులు పడినయవస్థలు చూచినను తుదకు నాటకదర్శనమువలన నానందమే కలుగుచున్నది. సామాన్యముగా వీథిలో నడచిపోవునప్పు డొక్కఁడు మఱియొకనిఁ గొట్టఁగా వాఁడు క్రిందఁబడి ప్రాణములు తన్నుకొనుచుండఁగా మనకుఁ గ్రోధశోకరోషావేశములు సాక్షాత్తుగాఁ గలుగుచుండును. కాని యది యానందము నొసంగఁజాలదు. ధర్మకారుణ్యభావములచే మనహృదయము తత్తరపడుచుండును. కాని సుఖదుఃఖసమాధిని బొందఁజాలదు. అట్టిచేష్టయే నాటకమునఁ బ్రదర్శింపఁబడునప్పుడు శోకక్రోధరోషము లుత్కలికలవలెఁ బైపయి మనచిత్తమును గలఁగించినను పరమార్థమున నానందము గలిగించి ధర్మాదిపురుషార్థతత్త్వమును హృదయమునకుఁ బ్రబోధింపఁజేయును. కావునఁ గావ్యరసము నలౌకిక మని యాలంకారికులు చెప్పుదురు. * అయినను దానివలనఁ గలిగెడు ధర్మాదిబోధక మగు ఫలసంపత్తిమాత్రము లౌకికవస్తుదర్శనముకంటె నలౌకిక మైన నాట్యప్రదర్శనముచేత మఱింత బలీయముగా నేర్పడుచున్న దని పండితులు చెప్పుదురు. ఈరసస్ఫూర్తి సామాజికుని, యనఁగా ద్రష్టృశ్రోతలయందే కలుగుచున్న దని వారియభిప్రాయము. ఈ విషయమునఁ బ్రాచీనమతములను జక్కఁగాఁ బరిశీలించి యభినవగుప్తాచార్యుఁడు సామాజికులే రసమునకాశ్రయు లని నిరూపించినను దత్పూర్వాచార్యులలోఁ గొందఱిమత మగు నటనిష్ఠ మనియు, రసము రామాదినిష్ఠమనియుఁ దదర్వాచీన గ్రంథకర్తలలోఁ బెద్దసిద్ధాంతభేదము కలదు. రసకళిక యనుగ్రంథమును ముగించుచు తత్కర్త యిట్లు చెప్పుచున్నాఁడు: "అథైతే రసాః కిమాశ్రయా ఇతి నిరూప్యన్తే. తత్ర నాయకనటసామాజికాశ్రయా ఇత్యేకే. అన్యేతు నటస్యానుకరణమాత్ర

---

* "యత్తు దశరూపకం, తస్య యోఽర్థస్తదేవ నాట్యమ్. యద్వక్ష్యతే "నాట్యస్యైషా తనూ" రితి. తస్య హృదయసంవాదతారతమ్యాపేక్షయా శ్రోతృప్రతిపత్తృస్ఫురణం స్ఫుటాస్ఫుటత్వే నాతివిచిత్రమ్. తత్ర యే స్వభావతో నిర్మలముకురహృదయాస్త ఏవ సంసారోచితక్రోధమోహాభిలాషపరవశమనసోన భవన్తి. తేషాం తథావిధదశరూపకాకర్ణనసమయే సాధారణరసనాత్మకచర్వణగ్రాహ్యో రససంచయో నాట్యలక్షణస్ఫుట ఏవ. యే త్వతథాభూతాస్తేషాం ప్రత్యక్షోచితతథావిధచర్వణాలాభాయ నటాదిప్రక్రియా, స్వగతక్రోధశోకాదిసంకటహృదయగ్రన్థిభంజనాయ గీతాదిప్రక్రియా చ మునినా విరచితా, సర్వానుగ్రాహకం హి శాస్త్రమితి న్యాయాత్తేన నాట్యఏవ రసా న లోక ఇత్యర్థః" అభినవభారతి - పుట ౨౯౨ మఱియొకయాలంకారికుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:

"తత్ప్రేక్షకం పశ్యతాం శ్రావ్యం
సమ్యగ్భావయతాం హృది,
అలౌకికసుఖాస్వాదో
రస ఇత్యభిధీయతే."

పరతయానుభావకత్వం భావకత్వే వా సామాజికాన్తర్గతత్వమితి నాయకసామాజికాశ్రయత్వం మన్యంతే. న చ సామాజికేష్వేవ భావకరసికాదిపద ప్రయోగాత్ తన్మాత్రాశ్రయత్వమాశంకనీయమ్. అనుభవవిరోధాత్. నాయకస్య రసానాశ్రయత్వే విగతరసభావనతయా కుతో రసావిష్కారః సామాజికానాం నిరవలంబనో రసః కథం ప్రవర్తతే న చ మాలత్యాదేరేవాలంబనత్వం, అనౌచిత్యాత్.

అత్ర కేచిత్సమాధానమాహుః, మాలత్యాదిశబ్దాః యోషిన్మాత్రోద్బోధకాః, రావణాదిశబ్దాః శత్రుమాత్రస్యేతి. తేన సామాన్యేన స్మృత్యారూఢో యోషిదాదిః సామాజికానామాలంబనత్వం భజతే. న చ విశేషాప్రతిపత్తిదోషః, దృష్టో దేవదత్తః కీదృగ్గుణ ఇతి, న జ్ఞాయత ఇతి స్మరణదర్శనాత్.

నచైవం కరుణాదేర్దుఃఖాత్మకతయా తత్ప్రధానానాం ప్రబంధానా మనుపాదేయత్వం సర్వస్యాపి రసస్య సామాజికేషు ఆనందరూపతయా పర్యవసానాత్. న చైవం మూర్ఛోద్వేగాదేరనుపపత్తిః, తస్యాప్రమగోచరత్వాత్.

అన్యే త్వన్యథా సమాధానమాహుః, వాసనారూపేణ సామాజికానాం చేతసి రసః ప్రవర్తతే తేనాలంబనాద్యనపేక్షా. యథా ప్రసిద్ధాలంబన ఏవ రసః స్వాన్యసంబంధితయా నిర్వికల్పేన గృహ్యతే. అనుమితో వా భావనయా సాక్షాత్క్రియతే. తేన నానౌచిత్యమ్. స్థాయిత్వేనానవభాసనాత్. అతాటస్థ్యం అన్యదీయత్వేనానాకలనాత్. కరుణాదయూనా మప్యుపాదేయత్వం సామాజికానాం రసస్య సుఖదుఃఖాత్మకతయా తదుభయలక్షణత్వేనోపపద్యతే. అత ఏవ తదుభయజనకత్వమ్. ఏవంవిధస్యాప్యుపాదేయత్వం అన్వయ వ్యతిరేకగమ్యత్వమితి. రసాః నాయకాశ్రితా ఏవ సామాజికైర్నటచేష్టయా కావ్యశ్రవణేన చ సాక్షాద్భావ్యన్తే సమనుభావ్యమానాస్తం త మనుభవం జనయన్తి పరగతరససమ్యగ్భావనయాన్వయవ్యతిరేకాభ్యాంనిరతిశయానన్దజనకత్వమితి. తత్రప్రవృత్తిరపి ఘటత ఇతిసర్వంరమణీయమితి."

ఈరసము సామాజికునిహృదయములోఁ గలుగుచున్న దంటిమి. అది యెట్లు కలుగుచున్నది? రామాదులచరితము నేర్చిననటుఁడు పురాణశ్రవణజ్ఞానము చేతను, లోకవృత్తజ్ఞానముచేతను క్రమశిక్షాభ్యాసవశమున మనోభావములను రామాద్యనుకారముచే సామాజికునకుఁ దనయందు రామాదిబుద్ధిని జనింపఁజేసి తాను అంగముచేతను, వాక్కుచేతను, వేషముచేతను రామాదులకుఁ గలుగురసభావములను సామాజికుని హృదయములో జనించునట్లు నటించి చూపును. ప్రథమమున, ననఁగా, శిక్షాభ్యాసకాలమున నటుఁడును రామాద్యవస్థావిశేషమును భావనాశక్తిచేఁ దనయం దారోపించుకొనుచు రామాదితన్మయత్వము చెందియానందపరవశుఁ డగుచుండును. కాని సామాజికులకొఱకుఁ దాను నటించి చూపునపుడు శిక్షాభ్యాసవశమున నట్టియానందమును జెందక కేవలము నాట్యసిద్ధియు, సామాజికులకు రససిద్ధియు కలుగునట్లు కేవలము ధనకీర్తికాముఁడై ప్రవర్తించును. కావున సామాజికునకుఁ గలుగునానందమునకు, రామాద్యనుకారమున నటునకుఁ గలుగునానందమునకును వస్తువునఁ దారతమ్యము గలదు. అందుచేతనే సామాజికునకుఁగా రసమును గొనిపోవునట్టిపాత్ర మని నటునకు నభిధానము చేసిరి. ఈవిషయమై నాట్యశాస్త్రవ్యాఖ్యానమున నభినవగుప్తుఁ డిట్లు చెప్పెను: "అతఏవ చ నటే న రసః, కుత్ర తర్హి విస్మృతశీలో న బోధ్యతే, ఉక్తం హి దేశకాలప్రమాతృభేదానియన్త్రితో రస ఇతి కేయమాశఙ్కా, నటే తర్హి కిమాస్వాదనోపాయః అతఏవ చ పాత్రమిత్యుచ్యతే. న హి పాత్రే మద్యాస్వాదః అపి తు తదుపాయకః. స్నేహప్రముఖమాత్రే నటోపయోగ ఇత్యలమ్."

నటుఁడు సామాజికున కెట్లు రామాదులయవస్థావిశేషముల రసభావముల నుత్పాదింపఁజేయును? నాల్గువిధము లగు నభినయములచేతనే. అభినయ మనఁగా నెదురుగాఁ గొనిపోవుట. రామాద్యనుకారముచే సామాజికుల హృదయమునకు దత్సుఖదుఃఖవిశేషములు కొనిపోవు ప్రక్రియకే యభినయ మని పేరు. దాని నాల్గువిధములుగాఁ జెప్పుదురు. ౧. ఆహార్యాభినయము ౨. వాచి

కాభినయము, ౩. ఆంగికాభినయము, ౪. సాత్త్వికాభినయము అని. ౧. ఆహార్యమనఁగా వేషముచేతను, అలంకారముచేతను, ఆసనాదిపరికర సన్నివేశముచేతను రామాదులయవస్థావిశేషమును సామాజికులహృదయముల కుద్బోధింపఁజేయుట. నేఁటికాలమున రంగస్థలమునఁ జూపఁబడునట్టి యరణ్యాకాశయానరథయానభవన కక్ష్యాంతర సౌధాంతర ప్రదేశాదు లాహార్యపరికరములే. ఇది లేక కేవలము వాచికాంగాభినయములచే సామాజికులకు రసబోధ సులభము గానేరదు. భరతుఁ డాహార్యాభినయప్రాధాన్యము నిట్లు చెప్పుచున్నాఁడు: "ఆహార్యాభినయం విప్రాః ప్రవక్ష్యామ్యనుపూర్వశః, యస్మాత్ ప్రయోగః సర్వోఽయమాహార్యాభినయే స్థితః. నానావస్థాః ప్రకృతయః పూర్వం నైపథ్యసూచితాః, అంగాదిభిరభివ్యక్తిముప గచ్ఛన్త్యయత్నతః, ఆహార్యాభినయో నామ జ్ఞేయో నైపథ్యజో విధిః" చక్షుస్సునకుఁ గల శక్తి శ్రోత్రమున కంత బలిష్ఠముగా నుండఁజాలదు.

౨. వాచికాభినయ మనఁగా రంగస్థలముననాగ్రూపముగా నడపించునట్టి సర్వవ్యాపారము, సామాజికుని హృదయమునకు రామాద్యవస్థలు తోఁపింపఁజేయుప్రక్రియయే. ఇది గీతరూపము, పద్యరూపము, గద్యరూపము. కేవలమవ్యక్తశబ్దరూపము మొదలుగా నేభంగినైనను వాచికమే యగుచున్నది. నాటకములో సల్లాపసంభాషణవిలాపానులాపాదులు సర్వము వాచికాభినయమే. ఇది శ్రోత్రమూలముగా సామాజికునిహృదయమున నభిధావ్యంజనావ్యాపారములచేరామాదినిష్ఠములగురసభావము లుద్ద్యోతింపఁజేయును.

౩. ఆంగికము-అంగాభినయము తక్కిన యభినయప్రక్రియకంటె సామాజికుల మనస్సునకు రామాదుల తాదాత్మ్యమును జక్షురింద్రియమూలముగా నతిబలీయముగాఁ గలుగఁజేయును. అంగాభినయము లోకసిద్ధమైనదే కాని కేవలము నాట్యధర్మము గాదు. 'మావక్కీలు బల్లపై నెట్లు చేతులు కొట్టి వాదించెను, చూచితిరా?' అని శ్లాఘించునప్పుడు చేతులుకొట్టుట యాంగికాభినయము. కోపము వచ్చునప్పుడు యజమానుఁడు కాగితములను గాని, పాత్రములఁగాని విసరివేయుటయు నాంగికమే. ప్రతివక్త చెప్పువిషయమును విననొల్లనివాఁడు ముఖము ద్రిప్పుకొని చెవులుమూసికొని విననేరనివానివలె నటించుటయు నాంగికమే. ఆంగికము కేవలము లోకధర్మ మగుటచేతను, రసభావముల స్ఫురింపఁజేయు సాత్త్వికాభినయసహితమాంగికము నందే పర్యవసించుటచేతను నాలు గభినయములలో నాంగికమే ప్రధానతమ మనియు, సుత్కృష్టమనియుఁ బండితుల యభిప్రాయము. ఈయంశమునఁ గుంభకర్ణుఁ డిట్లుసంగీత మీమాంసలోఁ జెప్పుచున్నాఁడు:

"ఇదమత్ర తు తాత్పర్యం
యే భావా నాట్యగామినః,
కుర్వంతి సుఖదుఃఖే యే
తథా యేఽభినయంతి తే.

బాహ్యానయస్తు తే కార్యా
యథా నో శంకితా స్తథా,
బాహ్యధూమాదిహేతూత్థా
దుఃఖజై రాంతరాలికైః.

బాష్పాదిభి స్తుల్యరూపా
నాట్యధర్మ ప్రయోజితాః,
నిర్ణీయంతే ప్రేక్షకైశ్చ
సత్యత్వే నాంతరాలికాః

* * * *
* * * *

ముఖ్యత్వమాంగికస్యైవ యదారా దుపకారకమ్,

* * * *

అప్రాదయో బాహ్యధూమశీతాదికనిమిత్తకాః
వ్యజనగ్రహణాద్యైనాభినయేనోపలక్షితాః.

* * * * *
* * * * *

సాత్త్వికా ఆంగికేష్వేవ పర్యవస్యంతి తత్త్వతః,
నటస్యాతత్ స్వరూపస్య
కింతాదాత్మ్యమతో న హి,
స్తంభాదీనాం సాత్త్వికత్వం
కేవలానామిహోదితమ్.

ఈ యాంగికాభినయక్రియావిశేషములకే యను భావము లని నాట్యపరిభాష.

ఉదాహరణముగా, శంకను (సందేహముతోఁ గూడినభీతి) సూచించునప్పుడు మాటిమాటికి దిక్కులు చూచుట, ముసుగుపెట్టుకొనుట, ముఖము తెల్లఁబడుట, నాలుకతో పెదవులునాకుట, ముఖవర్ణము మారుట, శరీరము కంపించుట, పెదవు లెండుట, హస్తత్తికపడుట మొదలగునవి యనుభావములు.* ఇవి యంగాభినయముచేతనే చూపఁబడును. దీనిలో ముఖవర్ణభేద మనునది సాత్త్వికాభినయము.

౪. సాత్త్వికాభినయము:—సత్త్వబలముచే మహాప్రయత్నముతో నటుఁడు సామాజికుని మనస్సునకు రసభావము తోఁచునట్లు చేయుప్రక్రియ. ఇది సామాజికుని హృదయములో భావములు పుట్టునట్లు నటుఁడను భావములతో రామాద్యవస్థల నటించి చూపునపుడు సామాజికునకు నంతఃకరణవృత్తిలో భావము పుట్టి, యనఁగా నంతరంగములో వికారము జనించి బహిరంగమునఁ దత్సంబంధియైన యంగవ్యాపారము తోఁచుచుండును. సత్త్వ మనఁగా తామసరాజససాత్త్వికధర్మములలో మూఁడవయది. సాధారణముగా సత్త్వశబ్దమునకు మనోబుద్ధివ్యాపారముచే నొకకార్యమును జరుపుటకుఁ గాని, దాని నుపరోధించుటకుఁ గాని చేయుప్రయత్న శక్తి యందురు. అట్టిప్రయత్నరూపమగు సత్త్వముచే నటుఁడు సామాజికునకు నంతరంగబహిరంగవికారములను భావముల జనింపఁజేయును. భావ మనఁగా నిశ్చలమై యవికల్పకమైన హృదయమున నెట్టిచలనము (వికారము అనఁగా పరిస్పందము) కలుగుట.

> "భావః స్యాత్ భవనం భూతి
> రథ భావయతీతి వా,
> పదార్థో హి క్రియాసత్తా
> వికారో మానసోఽథవా."

అని భావశబ్దమును నిర్వచించిరి. అనఁగా దేని చేతఁ బుట్టుచున్నదో, యేది పుట్టుచున్నదో యితరత్ర పుట్టఁబడుచున్నదో పుట్టునట్టిక్రియ యేదిగలదో వీని కన్నిటికి క్రియారూపముగాని, పదార్థముయొక్కయునికిగాని వికారము (మార్పు) కలిగినప్పు డట్టిమార్పునకు భావ మని పేరు. ఇది మనోరూపముగను, శారీరకముగాను గలుగవచ్చును. నటుని యనుకరణముచే సామాజికునిహృదయమునందు భావరూపమైనవికారము గలిగి తద్వికారమున కనుగుణమై పుట్టుచున్న బహిరంగవికారములునైతము భావశబ్దములోఁ జేరుచుండును. అట్టివి కలిగినప్పుడే నటునియనుకరణముచేత నటకర్మమునకు సిద్ధి గలిగిన దని చెప్పుదురు. ఇట్టియంతరంగబహిరంగరూపము లగువ్యాపారములు సామాజికునియందుఁ గలిగించునట్లు నటుఁడు సత్త్వప్రయత్నముచే నేప్రక్రియను గూర్చునో దానికే సాత్త్వికాభినయ మని పేరు. స్తంభమున నచలితరూపము, వైవర్ణ్యమున ముఖవర్ణము మాఱిపోవుటయు, ప్రళయమునందు మూర్ఛావస్థను బలిష్ఠముగాఁ జూపుటయు మొదలగునవి సత్త్వప్రయత్నముచేఁ జూపఁబడును. అప్పుడు నటుఁడు రామాదుల యవస్థను బూర్ణముగా మనస్సులో ననుభవించుచు, వాస్తవముగా సుఖదుఃఖము లనుష్ఠించినఁగాని ముఖవైవర్ణ్యములను దాను బొంది సామాజికునకుఁ బొందింపనేరఁడు. సాత్త్వికాభినయమునందును జెమట గలిగినప్పుడు విసరుకొనుటయుఁ గన్నీ రభినయించునప్పుడు కన్నులు తుడుచుకొనుటయు మొదలగునంగాభినయము చేసియే తీరవలయును. కావుననే సాత్త్వికమునకుఁగూడ నంగాభినయమే ముఖ్య మని పెద్దలయభిప్రాయము.

భావములలో, రసము నుద్ద్యోతించునట్టి విభావము, సంచారిభావము స్థాయిభావముతోఁ గలసి రసమును బుట్టించును. ఎట్లు? అనుభావములచేత. కావున భరతసూత్రమున విభావానుభావసంచారి సంయోగముచే స్థాయిభావమున రసనిష్పత్తి కలుగు నని చెప్పఁబడినది.

---

* శంకానామ—సా చ ముహుర్ముహు రవలోకనావగుణ్ఠన ముఖశోషణ జిహ్వాపరిలేహన ముఖవర్ణభేద వేపథుశుష్కోష్ఠకంఠావసాదాదిభిరనుభావై రభినయేత్. (నాట్యశాస్త్రం - అధ్యా ౭.)

విభావము లనునది రసము పుట్టుటకు మూలకారణము లనియు, వాని నుద్దీపింపఁ జేయునది యనియు రెండు తెఱంగుల నొప్పును. అనుభావము కన్నీళ్లు తుడుచుకొనుట, శరీరము వడఁకించుట, స్తంభమువలె నిలఁబడుట మొదలగు నంగక్రియలు. సంచారిభావము లనఁగా పైపయిన పుట్టి యల్పకాలము నిలిచి మఱగిపోవునట్టి భావములు. స్థాయిభావ మనఁగా వాసనాబలముచే సహజన్యమై చిరకాలము మనస్సులో నిలిచి సంచార్యాదిభావములచే ప్రకర్షావస్థ చెంది శృంగారాదిరసరూపమున మనస్సున నభివ్యక్తమై యానంద మిచ్చు భావ విశేషము. రతి, హాసము, శోకము మొదలగునవి స్థాయిభావములు. సాత్త్వికభావము లను పేరితో మనోదేహవికారరూపములై యతిప్రయత్నముచేఁ జూపబడుభావము లెనిమిది గలవు. రసోద్ద్యోతమునకుఁ గావలసిన సమస్తభావముల నుద్ద్యోతింపఁజేయు ప్రయత్నమునకే సాత్త్వికాభినయమని పేరు. కేవల మెనిమిది సాత్త్వికభావములె కాక ముప్పదిమూఁడు సంచారిభావములు మొదలగునవియు సాత్త్వికాభినయ మగును. అభినయక్రియలే యనుభావము లని చెప్పితిమి.

కాఁబట్టి సామాజికునకు భావరసము లుద్ద్యోతింపఁ జేయుప్రక్రియ యభినయము. అది నాలుగువిధముల నొప్పును. మతభేదముచే సర్వాభినయము లాంగికాభినయమునందే పర్యవసానము చెందు నంటిమి. అయినను సాత్త్వికాభినయమే రసనిష్పత్తికి ముఖ్యము. ఎందు కనఁగా భావరసములు దానివలనఁ గలుగుచుండును. నటుఁడు పాత్రము, రస మాస్వాద్యము, నటుని యనుకరణ వ్యాపార మగునభినయము, నాస్వాదనము చేయుటకు పాత్రను గై కొనుట యనుప్రక్రియ - అని యింతవఱకుఁ దేలినది.

ఇఁక నాస్వాదకుని స్వరూపధర్మముల విచారింతము. ఆస్వాదకుఁ డన రసమనుభవించెడివాఁడు. శ్రవ్యకావ్యమునఁ గావ్యము వినెడివాఁడు దృశ్యకావ్యవిషయమున ప్రదర్శనము చూచెడివాఁడు.—అనఁగా సామాజికుఁడు. సామాజికశబ్దమే యుభయకావ్యపక్షములఁ బ్రయోగింతము.* సామాజికునకు నెట్టిగుణము లుండిన నటకర్మయందు లోపము లేనిపక్షమున సంపూర్ణ రసానుభవము చెందును? అనగా నీరసుఁ డగువాఁడు రసవంతమైనవస్తువును జూచి యానందింపఁగలుగునా? విరక్తుఁడు రక్తిమత్పదార్థముల నాదరము చూపునా? ఆశ్రమస్థులగువార లాశ్రమాంతరధర్మముల ననుష్ఠింపఁగలరా? అనఁగా సన్యాసి భాణప్రహసనాదులఁ గల శృంగార శృంగారాభాసధర్మముల ననుభవించి యానందము పడయఁజాలునా? లేక పరిపూర్ణ సంస్కారము లేనివాఁడు ఆత్మసంస్కారముగాని, విద్యాసంస్కారముగాని, నాగరికతాసంస్కారముగాని లేనివాఁడు ప్రేక్షించువస్తువులను జూచి పూర్ణముగా ననుమోదింపఁజాలునా? అనునట్టిప్రశ్న లెన్నియో పుట్టుచుండును. వీనికిసమాధానమేమనఁగా, నాటకప్రదర్శితవస్తువున కనుగుణముగా సామాజికుని హృదయము తగినసంస్కారముఁ బొంది యుండవలయు. అప్పుడే సామాజికుని సహృదయుఁ డని చెప్పుదురు. సహృదయుఁ డనఁగా సమానహృదయము గలవాఁడు. ఇట్టి సహృదయత్వము ప్రేక్షకుల కెట్లు సిద్ధించును? అనునది రెండవప్రశ్నము. ఇది సహజముగా జన్మబలముచేతను, విద్యాబలముచేతను, లోకానుభవముచేతను గలుగుచుండును. దీనికే కొందఱు వాసనాబల మని చెప్పుదురు. ఈ కర్మవాసన సామాజికునకు లేనియెడల నెట్టిభావమును గాని చూచి యభినందింపనేరఁడు. తనకుఁ గలిగెడుభావముల ననుభవింపక యుపేక్షించును. లేదా భావముల విషయమునఁ దటస్థుఁడై యుండును. కావున సామాజికునకు వాసనారూప మగు మనస్సంస్కారమో, ధర్మమో యుండి తీరవలయును. అప్పుడే రసానుభవము కలుగును. పాదతాడితక మను భాణమున వైదికశిఖామణి యగు నొక బ్రాహ్మణుఁడు వేశ్యాపాదముచే వాసభవనమున శిరస్తాడితుఁడై ధర్మసభలో వృషలీపాదఘాతమునకు ప్రాయశ్చిత్తము లభింపక విటసభలో ప్రాయశ్చిత్తము నన్వేషించునట్టి కథా

---

* శ్రవ్యకావ్యముకంటెను నాటకమే రసవత్తర మందురు. "సందర్భేషు దశరూపకం శ్రేయః" అని వామనునిచే, "కావ్యేషు నాటకం రమ్యమ్" అని పండితులచేతను రూపకోత్కృష్టత ప్రకటింపఁ బడియె.

సందర్భము గలదు. ఈభాణప్రారంభమున సూత్రధారుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:

> " నిర్గమ్యతాం బకవిలాససమప్రచారై
> రార్త్యైశ్చ రాజసచివైః శమవృత్తిభిశ్చ,
> తిష్ఠన్తు డిండికవి నర్మకలావిదగ్ధా
> నిర్మక్షికం మధు పిపాసతి ధూర్తగోష్ఠీ. ౪

> కుతః— నప్రాప్నువంతి యతయో రుదితేన మోక్షం
> స్వర్గాయతిం న పరిహాసకథా రుణద్ధి,
> తస్మాత్ప్రతీతమనసా హసితవ్యమేవ
> వృత్తిం బుధేన ఖలు కౌరుకుచిం విహాయ. ౫

ఇందు మొదటిపద్యమున డాంబికులును, ప్రశాంత చిత్తులును రాజధర్మముచే ద్యూతాదిగోష్ఠులఁ బరిహరించు నియోగధర్మముగలవారు నీసభ విడిచి లేచి పొండు—అనఁగా మేము ప్రదర్శింపఁబోవు హాస్యరస పర్యవసాన మగు శృంగారాభాసము ననుభవింపనేరని వా రీసభలో నుండుట కనర్హు లని తాత్పర్యము. ఇఁక రెండవశ్లోకమున శృంగారహాస్యాదిరసములు పరమరస మగు శాంతరసమును కలుగఁ జేయుటకు ప్రతిబంధకములు గావు: కావున లోకతత్త్వమును ప్రేక్షించి ధర్మార్థ కామస్వరూపమును గుర్తించి మోక్షానందమును బడయఁ జాలినవారి కీహాస్యరసప్రదర్శనమును జూచుటచే మతి చెడిపోవఁజాలదు—అని తాత్పర్యము. అనఁగా కావ్యము చే ధర్మార్థాదిపురుషార్థోపదేశము రంగస్థలమునఁ జూపఁ బడు లోకతత్త్వానుభవము నీక్షించుటచే జ్ఞానోదయము కలుగు నని పరమార్థము తేలుచున్నది. ఎట్లయినను సామాజికునకు వాసనాసంస్కారములు లేనిచో ప్రబన్ధనానందమును సంపూర్ణముగా ననుభవింపఁజాలఁడు. విద్యావివాదమును నటు లాడి చూపునపుడు పండితునకు నంచియుద్బోధనము గలుగును. వీరరసము పుట్టించు హస్త లాఘవాదిక్రియలు చూపునపుడు క్షాత్రధర్మి యగు వాఁడు వాని మిక్కిలి శ్లాఘించును. ప్రణయమానోపశ మనక్రియలు నాయకుఁడు చూపునపుడు తచ్చాతుర్య మును శృంగారభావవిశేషముల వాసనగలవాఁడు వానిఁ జూచి యానందించును. తదితరులకుఁ దత్తదంశముల సంపూర్ణానుభావము కలుగనేరదు. కావున వాసనా రూప మగు నహంకారము లేక యభిమానము, లేక యాత్మసంస్కారము ఎవ్వని కుండునో వానికి రస సంపత్తి కలుగును. భట్టనాయకాభినవగుప్తాదు లీరస స్వరూపమును సామాజికునియందుఁ గలుగు ప్రక్రియను నిర్ధారించిరి. భోజుఁడు సామాజికుని వాసనావిశేష మును రసరూపముగా విభజించి దానిని విస్తరించి శృంగారప్రకాశ మనుగ్రంథరూపముగా నిరూపించెను. రసానుభవమునఁ గలికోత్కలికలుగాఁ గలుగుభావము లచే స్థిరమై వాసనారూప మగు శృంగారాదిరసాంకుర స్వరూపమున నభినవగుప్తాదులు రసతత్త్వనిరూపణమునఁ దెలుపుచు విస్తరించి చెప్పిరి. భోజుఁడు సామాజికుని హృదయమున వాసనగాఁ గాని, సంస్కారముగాఁ గాని యేర్పడియున్న యభిమానవిశేషమును విస్తరించి రసాభి వ్యక్తిని నిరూపించెను. ఈభేదము మొట్టమొదట దెలుప కున్న యెడల శృంగారప్రకాశములోని వాక్యార్థతత్త్వము చక్కఁగా బోధపడదని యీపీఠబంధ మింతవిరివిగాఁ జెప్పవలసివచ్చెను. పైవాక్యములలో ననేకస్థలములఁ బునరుక్తి కలుగునట్లు చెప్పినదానినే మరల మరలఁ బర్యాయపదజుష్టముగాఁ జెప్పితిమి. దానికిఁ గారణము సంస్కృతభాషాపరిచయము లేని సామాన్యజనులకు మా యభిప్రాయమును దెలిపింపఁగోరియే కాని కేవలము సూత్రరూపముననే విషయసర్వస్వగ్రహణము చేయఁ జాలుపండితులకుఁ దెలుపఁగోరి కాదు. కావున విషయ మెఱింగినవారు మాపౌనరుక్త్యమును క్షమింపనర్హులు. రసచర్వణ మన నేమియో, దానిస్ఫుటప్రతీతి కేవేవి ప్రతి బంధకములో యవి ముమ్ముందు విచారింపఁబడును. భోజునికాలమునకు రసస్వరూప మెట్లుద్భటానంద వర్ధనలొల్లటశంకుకభట్టనాయకాభినవగుప్తాదులచే నిరూ పింపఁబడి భోజునిచే నాజ్ఞానపరికర మెట్లు గ్రహింపఁ బడి రసతత్త్వసౌధము నిర్మింపఁబడియెనో తెలుపుటయే శృంగారప్రకాశపరిశీలనమునకు ముఖ్యము కావున నతని కాలమువఱకు నెగడినప్రాచీనమతములనే యవలంబించి పైయంశములు వ్రాయఁబడినవి. షడ్దర్శనీసంస్కార పరిపూత మగు పండితరాయాదికృతరసపరిష్కారము నాశ్రయించుట భోజాదిప్రాచీనమతము ననువదించుట గాక దానిసంస్కరించునట్లగును. కావున నిందుఁ బూర్వమతములే చూపఁబడవలసియున్నవి.

# బ్రాహ్మణముల ప్రశంస

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

మంత్రమునకు వ్యాఖ్యానరూపమైన గ్రంథము బ్రాహ్మణ మనఁబడును. బ్రహ్మ మనఁగా వేదము. దానికి సంబంధించినది బ్రాహ్మణము. ప్రతివేదమునకును బ్రాహ్మణ భాగము కొంత గలదు. అది సంహితల లోని యెల్లమంత్రములను యజ్ఞక్రియలకు సమన్వయింపఁజేయును. వివిధములైన క్రతువులు విస్తరించినకాలమందు బ్రాహ్మణములు ప్రబలి యజమానకుల మాశ్రయముగాఁ బ్రతిష్ఠగాంచినవి. సాధారణముగా బ్రాహ్మణములందు విధి, అర్థవాదము, ఉపనిషత్తుఅను మూఁడుభాగము లుండును. కర్మప్రతిపాదకములు, కర్మవిధాయకములు, కర్మస్వరూపబోధకములు నగు వాక్యములు విధులు. కర్మప్రరోచనాపరములయిన వాక్యము లర్థవాదములు. ఇతిహాసరూపములు, సంవాదాత్మకములు,తత్త్వవిచారపరములు, బ్రహ్మప్రతిపాదకములు నగు భాగము లుపనిషత్తులు. బ్రాహ్మణములలోనే యారణ్యకము లనుభాగము లిమిడియున్నవి. బ్రాహ్మణములందలి పైభాగము లన్నియు సమకాలికములు కావు. ధర్మజిజ్ఞాస పెచ్చుపెరిగినకాలమున, సంహితల యర్థము విస్పష్టముగాఁ దెలియరానికాలమున విధ్యర్థవాదరూపములయిన బ్రాహ్మణములు వెడలియుండును. బ్రహ్మజిజ్ఞాస యంకురించిన కాలమునందును, అది యభివృద్ధిచెందిన సమయమందును ఉపనిషద్భాగ మావిర్భవించియుండును. ఉపనిషత్తులకు వేదాంతములను పేరు గలదు. అనఁగా నవి వేదముల తుదిభాగములనుట. ఈకాలమున నుపనిషత్తులసంఖ్యాకములు కనవచ్చుచున్నవిగాని యివి యన్నియుఁ బూర్వకాలమున వేదాంతసంజ్ఞ చెందినవి కావు. మతాభిమాన మధికమైన కొలఁదిని భిన్నభిన్న రూపములయిన యుపనిషత్తు లపరిమితముగా నుదయించినవి. అయినను, ఈశకేనకఠాదిదశోపనిషత్తులుమాత్రము ప్రాచీనములని పూర్వాచార్యులు గణించి వానికిమాత్రమే భాష్యములు వ్రాసిరి.

ఇట్లు త్రివిధభాగసమన్వితములయిన బ్రాహ్మణములు మంత్రములకుఁ గర్మపరముగా నర్థము వివరించి సమన్వయింపఁజేయుటయేకాక తరువాత వెలువడిన వివిధములయిన ధర్మబ్రహ్మసూత్రముల యుత్పత్తికి మార్గదర్శకములుగూడ నయిన వనుట సత్యము. తైత్తిరీయబ్రాహ్మణాదులలో నందందర్వాచీనకాలసూచకములయిన వాక్యములుండుటంబట్టి యవి యర్వాచీనము లని యూహింపవలసివచ్చినను, కర్మబ్రహ్మప్రతిపాదకమైన యందలి విజ్ఞానముమాత్రము సంహితలనాఁటిదై ఋషిపరంపరనుండి క్రమముగా వచ్చినదేకాని నవీనము కాదు. సంహి

తలలోఁ గనవచ్చునట్టి విజ్ఞానమును బ్రాహ్మణములు విస్తరింపఁజేసి వివరించినవి కాని, దానిని గ్రొత్తగా సృజింపలేదని సంహితలలో నందందుఁ గనవచ్చు ధర్మబ్రహ్మప్రతిపాదకములయిన మంత్రములే చెప్పక చెప్పుచున్నవి. అయినను గర్మకాండ మతిశయించినకొలఁదిఁ గొంత నూతనవిజ్ఞానబోధకమగు గ్రంథముగూడ బ్రాహ్మణములలో నవతరింపకపోలేదు. ఈవిషయమును "పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు" అను పాణిని సూత్రముగూడ బలపఱచుచున్నది. పాణిని నాఁటికిఁగూడ బహుపురాతన బ్రాహ్మణములని కొన్నిటికిని, అర్వాచీనబ్రాహ్మణములని కొన్నిటికిని వాడుక కలదు గావుననే యతఁడు 'పురాతనమహర్షిప్రోక్తము లగు బ్రాహ్మణము' లని ప్రత్యేకముగా వక్కాణింపవలసివచ్చినది. దీనినిబట్టి సంహితలకాలముననే వెలసిన బ్రాహ్మణములు కొన్ని గలవనుట స్పష్టము. కాని ప్రాచీనబ్రాహ్మణములలోఁగూడ నర్వాచీనబ్రాహ్మణ గ్రంథము కొంతకొంత కలసియుండుటచే బ్రాహ్మణము లన్నియు నర్వాచీనములే యని కొందఱు భ్రాంతిపడుచున్నారు. అయినను బ్రాహ్మణములందలి విధివాక్యములు ముందును, అర్థవాదములు వానిపిదపను, యజ్ఞకర్తలగాథలు, యాగప్రరోచనాపరములగు నితిహాసములు మొదలయినవి వానితరువాతను బయలువెడలినవని యాయాభాగముల విషయములనుబట్టి గ్రహింపవచ్చును. మఱియు మనోరంజకములయిన యుపాఖ్యానములు బ్రాహ్మణములలో సర్వత్ర కనిపించును. అవియన్నియు నర్వాచీనములే. ఉపనిషత్తులు పురాతన బ్రాహ్మణముల తరువాతివని వాని వేదాంతసంజ్ఞయే చెప్పుచున్నది. కర్మాచరణమందు భేదభావమును సూచించు చర్చలును, తమతమ మతములను స్థాపింపఁజేయు వాదప్రతివాదములును బ్రాహ్మణముల నందందు గనవచ్చును. అట్టి గ్రంథమంతయు నర్వాచీనమనుట విదితము.

బ్రాహ్మణములు కేవలము కర్మోపయోగులై మంత్రభావమును దెలుపునవే యైనను, అవి తత్తత్కాలములందలి మతధర్మములను, వర్ణవ్యవస్థలను, సాంఘికాచారములను, వేషముల, నాఁటి భరతఖండచరితమును గ్రహింప సహాయపడుచున్నవనుట నిర్వివాదము. అయినను బ్రాహ్మణములకును యాగములకును అంగాంగిభావము సిద్ధము.

# సాంప్రదాయిక విజ్ఞానం

టేకుమళ్ల కామేశ్వరరావు

ఇప్పటినాగరికజాతులన్నీకూడా ఒకప్పుడు బహు అనాగరికంగా వుండేవి. ఆ అనాగరికస్థితిలో అవి కొంతజ్ఞానం సంపాదించేయి. ఆజ్ఞానం ఒకతరం వారినుంచి మరొకతరంవారు నేర్చుకొంటూవచ్చినందు వల్ల అది యిప్పటికీ నిలచివుంది. ఈజ్ఞానానికే అటు తర్వాతివారుకూడా కొంతకొంత చేరుస్తూవచ్చేరు. మొత్తంమీద యీజ్ఞానానికి సాంప్రదాయికవిజ్ఞానం (Folk Lore) అని పేరు.

సంఘంయొక్క శైశవస్థితిలో ఆర్జించిన యీ జ్ఞానంలో సత్యమైన కార్యకారణసంబంధం వుండదు, ఒక్క వాఙ్మయాంశం తప్పవిడిచి. ప్రకృతిశాస్త్రాదుల విషయమై వారికి కల జ్ఞానం బహుస్వల్పం. అంతే కాకుండా ఆవున్న కాస్తజ్ఞానమైనా ప్రకృత్యతీతకారణాలతో నిండివుంటుంది.

ఈసాంప్రదాయికవిజ్ఞానం నాగరికజాతులలో యింకాకూడా నిలచివుంది. దానికి కారణం జాతిఅంతా నాగరికం కాకుండా కొంతభాగంమాత్రమే నాగరికమవడం. తక్కిన అనాగరికభాగంకూడా క్రమేపీ నాగరికమవడంతోటే యీవిజ్ఞానం సంఘంలో మచ్చుకేనా లేకుండాపోతుంది.

సంఘంయొక్క శైశవస్థితిలో పుట్టిన యీ జ్ఞానాన్ని యించుమించుగా అజ్ఞానమనే చెప్పవచ్చు. అటువంటి అజ్ఞానం క్రమేపీ నశించిపోతూన్నందుకు మనము విచారించాలా అంటే - నిజంగా మనం యేమాత్రమూ విచారించనవసరంలేదు. సంఘం క్రమేపీ నాగరిక మవుతూన్నందుకు మనమంతా సంతోషించవలసిందే. కాని నాగరికస్థితిఅంటే వెనకటి మనసంగతులన్నీ మరచిపోడంకాదు. అలా మరచిపోడమే మరొక రకమైన అనాగరికత అని అనుకోవచ్చు. అలాగుగాక అప్పటి మనస్థితి అంతా పరిపూర్ణంగా తెలిసికొని మన పూర్వీకులు యేమేరకుగా వుండేవారో, సంఘం మళ్లా వెనకటిదశకు పోకుండా వుండాలంటే యెటువంటి జ్ఞానం విస్తరింపజేసుకోవాలో, మొదలైన సంగతులకోసం యీవిజ్ఞానాన్ని జాగ్రత్త పెట్టుగోవలసివుంది. ఇంతేకాదు, మరొక ఉపయోగంకోసంకూడా దీన్ని జాగ్రత్త పెట్టుగోవలసివుంది. అదేదంటే - శాస్త్రజ్ఞులు యీవిజ్ఞానాన్ని పరిశీలించి యేయేజాతులు యేయేదేశాలనుండి వచ్చేయో, యేయేజాతులు యేయేజాతులనుండి యేర్పడ్డాయో మొదలైనవన్నీ తెలియజేస్తున్నారు. ఈరకమైన జ్ఞానంకోసంకూడా యీవిజ్ఞానాన్ని జాగ్రత్త పెట్టుగోవలసివుంది.

ఈవిజ్ఞానాన్ని అనేకజాతులు భద్రపరచుకొన్నాయి. పాశ్చాత్యదేశాలు యీవిజ్ఞానాన్ని నశించిపోకుండా నిలబెట్టుకొన్నాయి. ఇంగ్లాండులో ౧౮౭౮-వ సంవత్సరంలో సాంప్రదాయికవిజ్ఞానసంపాదనా సంఘ(Folk Lore Society) మనుపేరున ఒక సంఘమేర్పడి దేశంలోగల యీవిజ్ఞానాన్ని సేకరించి దీనికోసం ప్రత్యేకంగా ఒక పత్రిక యేర్పరచి ముద్రించి యీ విజ్ఞానాన్ని జాగ్రత్త పెట్టుకుంది.

మన తెలుగుదేశంలో అప్పుడప్పుడు యీవిజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు ప్రకటించబడుతున్నాయి. ఈప్రకటించబడ్డభాగం చాలా స్వల్పం. ఆకాస్తఅయినా క్రమరీతిగా చెయ్యబడలేదు. అందుచేత తెలుగుదేశంలో చెయ్యవలసిన పనిఅంతా యింకా ముందే వుందని చెప్పవచ్చు. తక్కినదేశాలలోలాగే మనంకూడా మనదేశంలోని సాంప్రదాయికవిజ్ఞానాన్ని క్రమరీతిగా సేకరించుకుని రక్షించుకోవలసివుంది.

ఇంగ్లాండులో యేర్పడ్డ సాంప్రదాయికవిజ్ఞాన సంపాదనాసంఘం యేమేరకుగా పనిచేసిందంటే - ఈసంఘ మొక పత్రికను యేర్పరచి ఆపత్రికలో

దేశంయొక్క వివిధ భాగాలలో వున్న సాంప్రదాయిక విజ్ఞానాన్ని సేకరించి ప్రచురించింది. అటుతర్వాత మరికొందరు చేరి ఆపత్రికలో ప్రకటించబడ్డ వస్తువుని తాలూకాలవారీగా విభజించి ఒక్కొక్క తాలూకాలో సేకరించినదానిలోనుంచి మచ్చుకు కొంతకొంత తీసి ఒక్కొక్క సంపుటంకింద ప్రకటించేరు. ఈమోస్తరుగా అనేకసంపుటాలు ప్రకటించబడ్డాయి. ఒక్కొక్క సంపుటంలో ప్రకటించబడ్డ తీరు యేమిటంటే తాలూకాలో దొరికిన సాంప్రదాయికవిజ్ఞానమంతా కొన్ని శాఖలుకింద విభజించబడింది. ఒక్కొక్క శాఖకింద దొరికిన వస్తువుఅంతా - ఊళ్లన్నీ అకారాదిగా రాయబడి - యేవూళ్లో సేకరించబడిన వస్తువు ఆవూరికింద రాయబడింది. (అంతేకాదు, ఆ విజ్ఞానంలో ఒకవూరికి మరొకవూరికి గల భేదాలు కూడా తెలియచెయ్యబడ్డాయి. ఈమోస్తరుగా యెంతోకష్టపడి క్రమరీతిగా ప్రకటించబడి యీ విజ్ఞానం ప్రజ కుపయోగకరంగా చెయ్యబడింది. పై మోస్తరుగా ఆంగ్లేయులు తమ సాంప్రదాయికవిజ్ఞానాన్ని తక్కినదేశస్థులలాగే జాగ్రత్తపెట్టుకున్నారు.

సాంప్రదాయికవిజ్ఞానాన్ని సేకరించడంకోసం మనరాష్ట్రంలోకూడా ఒకసంఘం యేర్పడాలి. ఆ సంఘం ఒకపత్రికను ప్రచురించి ఆపత్రికలో తాము సేకరించిన సాంప్రదాయిక విజ్ఞానాన్ని ప్రకటించాలి. ఒకసంఘం చెయ్యవలసిన పని ఒకవ్యక్తి చెయ్యడం కష్టం. అయినా ఒకవ్యక్తే తాను చెయ్యగలిగినంత పని చెయ్యవచ్చు. ఒకతాలూకాలోనో, లేక కొన్ని తాలూకాలలోనో వుండే విజ్ఞానాన్ని తాను అందుకోసమే ప్రకటించే ఒకపత్రికలో ప్రచురించి కొంతవరకూ విజ్ఞానసేవ చెయ్యవచ్చు.

సాంప్రదాయికవిజ్ఞానమంతా ఒకేమోస్తరు వస్తువు కాదు. దానిలో అనేకవిషయా లున్నాయి. మొత్తంమీద దీన్ని మూడువర్గాలకింద విభజించవచ్చు:

౧. నమ్మకాలు, ఆచారాలు.

౨. కథనం, ఉక్తులు.

౩. కళ.

౧. నమ్మకాలు, ఆచారాలలో యీకిందిశాఖ లున్నాయి:

(అ) మూఢవిశ్వాసాలు, అజ్ఞానపు అలవాట్లు. ఈశాఖలో తిరిగి ఉపశాఖ లున్నాయి. అవేవంటే:

౧. జనప్రకృతికి సంబంధించినది.

ఉదా:—హంపిలో ఒక బండరాతిమీద సీతా అమ్మవారు తన చీర ఆరవేసుకుంటే ఆమచ్చ ఆబండ మీద వుంది.

సప్తసాగరయాత్రలు చేస్తే స్త్రీలు గర్భిణు లవుతారు.

తోకచుక్క వస్తే యెవడో వొక గొప్పవాడు మరణిస్తాడు.

సూర్యగ్రహణం వెళ్లేక వారంరోజులవరకూ యేకార్యం చెయ్యకూడదు.

(రత్నశాస్త్రంలో రత్నాలకు సంబంధించిన మూఢవిశ్వాసాలు దొరుకుతాయి.)

అమావాశ్యనాడు బచ్చలికూర కొయ్యకూడదు.

అమావాశ్యనాడు పుడితే దొంగఅవుతాడు.

మూలానక్షత్రాన్ని జన్మించకూడదు.

ద్వాదశీ దగ్ధయోగం.

స్వాతివానకు ముత్యాలు తయారవుతాయి.

అర్జునుడి పదిపేర్లూ వల్లిస్తే పిడుగుపడదు.

మేఘగర్జనం యింద్రుడి రథధ్వని.

పైనమ్మకాలలో కొన్నిటికి జ్యోతిశ్శాస్త్రం కారణం.

౨. చెట్లు, మొక్కలకి సంబంధించినది.

ఉదా:—రావిచెట్టుకు ప్రదక్షిణాలు చేస్తే స్త్రీలు గర్భిణు లవుతారు.

చింతచెట్టుమీద దయ్యా లుంటాయి.

తులసిచెట్టుకు పూజచేస్తే కోరికలు సిద్ధిస్తాయి.

(ఉత్త కొబ్బరికాయకి దెయ్యంతిన్న కాయని పేరు.)

ఏపాదుకైనా పురుగుపడితే శ్రీవత్సగోత్రీకులు కుమ్మరిబుగ్గిని తీసి 'శ్రీవత్సగోత్రపు సింహం లొచ్చేయి, పుచ్చుపురుగుల్లాల్లా విచ్చిపొండి' అని ఆబుగ్గి చల్లితే ఆపురుగులు నాశనమైపోతాయి.

ఇంటిలో మొండిచెయ్యిమొలిస్తే యిల్లు విడిచి పెట్టాలి.

౩. జంతువులు, జీవులకు సంబంధించినది.

ఉదా:—ఇంట్లో రోగి వుండగా పులుగుపిట్ట అరుస్తే రోగికి చావుతప్పదు.

కాకి యింట్లోంచి యెగిరితే యిల్లు విడిచి పెట్టాలి.

గద్ద యింటిమీద వాలితే యిల్లు విడిచిపెట్టాలి.

కాకి అరుస్తే యింటికి బంధు వొస్తాడు.

కాకుల మైథునం చూస్తే తను చచ్చినట్టు తన బంధువులికి ఉత్తరంరాయాలి.

పొద్దున్నే పిల్లిని చూడకూడదు.

(బల్లిపతనంవల్ల కలిగే లాభనష్టాలు పంచాంగం చూస్తే తెలుస్తాయి.)

తూనీగలు యెగిరితే వాన కురుస్తుంది.

పాలపిట్టదర్శనమైతే పరమాన్నం దొరుకుతుంది.

ఏదుపందిముల్లు యెవరిదగ్గిర వుంటే వారికి దెబ్బలాటలు వస్తాయి.

(అశ్వలక్షణశాస్త్రంలో అశ్వాలకు సంబంధించిన విశ్వాసాలన్నీ చెప్పబడివున్నాయి.)

౪. భూతాలు.

ఉదా:—దయ్యానికి మణమలు ముందుకి, వేళ్లు వెనక్కి వుంటాయి.

దయ్యం తోలుముక్క అవుతుంది.

(ఊరూర దయ్యాలబావు లుంటూనేవుంటాయి.)

౫. మాయ.

ప్రయోగం, కాతబడి, దిష్టి మొదలైనవి యీ శాఖలోనే వస్తాయి.

౬. మంత్రాలు, తంత్రాలు.

పాముకాటు, తేలుకాటు, చప్పి, ఇరుకు, ఎక్కిళ్లుమొదలైనవాటి మంత్రాలు, ప్రయోగాలకు విరుగుళ్లు మొదలైనవి, రక్షలు, తాయత్తులు మొదలైనవి యిందులో చెప్పబడుతాయి.

ఉదా:—మునగవేరు తూర్పునకు పారినదానిని త్రవ్వితెచ్చి ఆరోజునవే తాయతులో వేసివుంచుకుంటే కోల తప్పిపోవును.

పచ్చిపసుపు, కన్నెకోమలి, తెల్లజిల్లేడు మొగ్గలు, నల్లవుమ్మెత్తవేరు, నిద్రగన్నేరు ఆకులు, మంచిగంగమ, రాజపగడము నూరి వుండలుచేసి మఘ రావేళలో పెట్టిగయిస్తే వశ్యమగును స్త్రీపురుషు లెవరైననుసరే.

౭. గారడి, భవిష్యత్ సూచన.

ఈ శాఖలో శోది, పూనడాలు, కలలు, శకున శాస్త్రం, శకునాలు మొదలైనవి వస్తాయి.

ఉదా:—తెల్లనారగట్ట వచ్చిన కల నమ్మతగినది.

కలలో మామిడిపళ్లు, ముత్తైదు మొదలైనవి వస్తే మంచిది; శవం, వితంతువు మొదలైనవి వస్తే కీడు.

పిల్లి యెదురురాకూడదు.

(బల్లిపతనఫలాలు పంచాంగంచూస్తే తెలుస్తుంది.)

తుమ్మితే యేపనీ చెయ్యకూడదు.

౮. స్వర్గం, నరకం, పుణ్యపాపాలుగురించి యీ శాఖలో వుంటుంది.

౯. ఇతరమూఢ విశ్వాసాలు, ఆచారాలు.

నేను సేకరించినవి కొన్ని యిక్కడ ప్రకటిస్తాను:

గడపమీద కూర్చుని తుమ్మకూడదు: తుమ్మితే గడవనిగండాలు.

తుమ్మితే చిరంజీవి,శతాయుస్సు,మార్కండేయు లంత ఆయుస్సు అనాలి.

రాత్రిపూట తుమ్మితే నెత్తిమీద నీళ్లుచల్లించు కొని యేవూళ్లో పుట్టిందీ చెప్పాలి.

ఒకతుమ్ముకంటె యెక్కువ తుమ్మితే తప్పులేదు.

రాత్రిపూట ఉప్పు అని అనకూడదు.

రాత్రిపూట ఉప్పు దీపానికి చూపిస్తేగాని వెయ్యకూడదు.

ఎవరైనా, యెక్కడికైనా వెళుతూవుంటే యెక్కడికి వెళుతున్నావని అడగకూడదు.

రాత్రిపూట క్షౌరముమాట యెత్తకూడదు.

(తిథివారనక్షత్రాలు చూసి క్షౌరంచేయించు గోవాలి. ఇది పంచాంగసంబంధం.)

రోలుమీద కూర్చోకూడదు.

వాల్చిన రోకలి దాటకూడదు.

మునిపళ్ల మునివళ్లు కొరకకూడదు.

చెల్లెల్ని కాలితో తన్నకూడదు.

నవుస్తూ పళ్లతో ముకుంటే అంతమేరా చెరువు తవ్వించాలి.

గడప మహాలక్ష్మి.

శుక్రవారంనాడు క్షవరంచేయించుకుంటే ఆడ పడుచుకు అనర్థం.

లక్ష్మీవారంనాడు కొత్తవ్యవహారాలేవీ మాట్లాడ కూడదు.

కొత్తగుడ్డకు పసుపుపెడితేగాని కట్టకూడదు.

మంగళ ఆది సోమవారాలలో కొత్తగుడ్డ కడితే అది తొందరగా కాలిపోయి చిరిగిపోతుంది.

దీపం పెడితేనేగాని మంచినీళ్లు తాగకూడదు.

జెర్రిని మంగళవారంనాడు చంపకూడదు.

ఒక్కటే పిల్లను పెడుతుంది కాబట్టి జెర్రిని చంపకూడదు.

పీటమీద పడుకోకూడదు.

చేటతో విసురుకోకూడదు.

మేకలమంద మధ్యనుంచి వెళ్లకూడదు.

(తలగడుసుకుపూర్వం పెద్దల ఆశీర్వచన.)

కాలినపంచ చాకలివాడికి వెయ్యందే కట్టకూడదు.

ఇద్దరిమాటలు వొకటైతే యింటికి బంధు వొస్తాడు.

బియ్యం కొలుస్తూన్నప్పుడు తవ్వ తిరగపడితే యింటికి బంధు వొస్తాడు.

పొయ్యి ఆరుస్తే యెవరో బంధు వొస్తాడు.

అరికాలు దురదపెడితే దెబ్బలాట వస్తుంది.

విస్తరాకు జరిగితే ప్రయాణం సిద్ధం.

పీటలు గోడకు అడ్డంగా చేరవెయ్యాలికాని నిలువుగా చేరవెయ్యకూడదు.

ఆడది జడవేసుకుని చెంపలు దువ్వుకోపోతే ముసిలిమొగుడు వస్తాడు.

రాత్రిపూట యీలవేస్తే పాము లొస్తాయి.

రాత్రిపూట అద్దంచూసుకుంటే ముందుజన్మలో బోగందై పుడతారు.

తేనెపట్టు పట్టినయింటిని ఆరునెల్లు విడిచెయ్యాలి.

ఆదివారంనాడు వుసిరికపచ్చడిముట్టుగోకూడదు.

తలంటుకొన్నరోజున కాటుకపెట్టుకుంటే కలిగినవారియింట్లో పుడతారు.

మోకాళ్లమీద తలవంచుకుకూచోకూడదు.

భోంచేస్తూన్నప్పుడు యెడమపాదం పట్టుకుంటే దరిద్రం.

కాళ్లుకడుక్కునేటప్పుడు మణమలు తడియక పోతే దరిద్రం.

కొత్తగిన్నెకు పసుపురాసి కొంచెం సొలచుక్క పోస్తేగాని వాడకూడదు.

కోతిఅంటే పిల్లలు మరింక యెదగరు.

మంగళవారంనాడు కొత్తచీపురుకట్ట కూడదు.

ఉప్పు చేతిలో వేస్తే కయ్యా మొస్తుంది.

ఉత్తఉయ్యాల వూపితే చంటిబిడ్డకి కడుపునొప్పి వస్తుంది.

ఇద్దరి చంటిపిల్లల్ని ఒకరిమొహ మొకరికి చూపిస్తే మూగివాళ్లవుతారు.

చంటిబిడ్డకి అద్దం చూపిస్తే మూగిదవుతుంది, లేక పైపళ్లు వస్తాయి.

పుష్కరం వెళ్లేక రెండున్నరయేళ్లవరకూ యే శుభకార్యం చెయ్యకూడదు.

శివదృష్టి, విష్ణుపృష్ఠము పనికిరాదు.

ఊళ్లో ఒక్క మేడ వుండకూడదు.

(ఆ)ఆచారాలు. దీనిలోని ఉపశాఖలు—

౧. కొన్నికొన్ని పండుగలు కొన్నికొన్ని రోజుల్లోగాని, కొన్ని ఋతువుల్లోగాని వస్తాయి.

ఉదా:—కృష్ణజయంతికి ఉట్లపండగ.

(అమ్మవార్ల జాతర్లు కొన్నిరోజుల్లో వస్తాయి.)

వేసంకాలంలో వసంతోత్సవం వస్తుంది.

౨. పుట్టుకకు, వివాహానికి, మరణానికి సంబంధించినవి. ఇవన్నీ చాలామట్టుకు ఆయాకర్మకాండల లోనే వున్నాయి. అలాగులేనివికూడా కొన్ని వున్నాయి.

ఉదా:—బిడ్డకనక బొడ్డుతాడు మెడకిచుట్టుకుని పుడితే కిందటిజన్మలో ఉరిపోసుకున్నట్టు అర్థం.

పురిటిదినాల్లో యెన్నెమ్మకథ చెప్పుకోవాలి. (పుత్రోత్సవమేకాని పుత్రికోత్సవం లేదు.)

పగటిపూట పుట్టినవాళ్లు పగలు నిద్రపోతారు. రాత్రిపూటపుట్టినవాళ్లు రాత్రి నిద్రపోతారు.

ఎడపిల్లకికీచంటి లేకపోతే మొగపిల్లాడు పుడతాడు.

బిడ్డకి మొదట పైపళ్లు వస్తే మేనమామకి అపాయం.

పిల్లాడు పాలుతాగేక ముద్దుపెట్టుకుంటే ఆబలమంతా మనకి వచ్చేస్తుంది.

స్థాలీపాకం నందిమొహంనాడు వంకాయి వండకూడదు.

(పెళ్లిలాంఛనాలు ఒక్కొక్కస్థలంలో ఒక్కొక్కమాదిరిగా వుంటాయి.)

బహిష్ఠఅయి స్నానంచేసేక నోట్లో యేమీ వేసుగోందీ చంటిపిల్లల్ని చూడకూడదు.

మనిషి చనిపోయినప్పుడు గట్టిగా యేడుస్తే స్వర్గంతలుపులు విడతాయి.

(కొన్నిమతాలవాళ్లను దహనంచేస్తారు, కొన్నిమతాలవాళ్లను పాతిపెడతారు.)

(తద్దినంనాడు కొన్నికొన్ని కూరలు వండకూడదు.)

౩. ఆటలు.

పాటలున్న ఆటలు కొన్ని, పాటలులేని ఆటలు కొన్ని. చిన్నపిల్లలు ఆడుకునే ఆటలు కొన్ని, పెద్దవాళ్లు ఆడుకునేవి కొన్ని. ఆటలలో అనేకవిధులున్నాయి. ఈవిధులు ఒకస్థలంనుంచి మరొకస్థలానికి భేదిస్తాయి.

ఉదా:—కోడిపందాలు, గొర్రెపందాలు, పికిలిపిట్టపందాలు, పావురంపందాలు మొదలైనవి, గవ్వలాటలు మొదలైనవి.

భారతిలో కొన్ని సంవత్సరాలకిందట వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పిల్లలఆటలనుగురించి ఒకవ్యాసం రాసేరు. ఈమధ్య మంగిపూడివేంకటశర్మగారు భారతిలో 'బాలక్రీడలు' అన్న పేరున కొన్ని ప్రకటించేరు. గృహలక్ష్మిలో తరచుగా ఆటలనుగురించి ప్రకటించ బడుతూవుంటుంది.

౮. అనేకరకాలైన స్థానికఆచారాలు. ఇవి గ్రామపరిపాలనకి, శిస్తుల వసూళ్లకి, మామూళ్లకి సంబంధించివుంటాయి.

ఉదా:—ఒకఊళ్లో వుండే ఆచార మేమిటంటే ఆవూళ్లో యెవరైనా యేకొత్తవస్తువైనా తెచ్చుకుంటే అవంతా వూరికంతకూకూడా పంచిపెట్టాలి.

కొన్ని ఊళ్లలో ఊరికంతా వొక్కేరోలు వుంటుంది.

కొన్నిఊళ్లలో కొన్నిసంతలు, జాతర్లు, ఉత్సవాలు, కొన్ని ప్రత్యేకపండగలు జరుగుతాయి.

పశువులకి పెట్టే పేర్లుకూడా యీవుపశాఖలోనే చేరుతాయి.

౨. కథనం, ఉక్తులు.

(అ) ౧. జరిగేయని చెప్పేకథలు.

శేకుమల్లి రాజగోపాలరావుగారు ఆంధ్రదేశీయ కథావళి అని మూడు చిన్న సంపుటాలు ప్రకటించేరు. తెలుగుకవుల కథలూ, స్థానికచరిత్రలలోని కథలుకొన్నీ, తెనాలిరామలింగడు, తాతాచార్యులు, మర్యాదరామన్న, పరమానందయ్యా, రేచుక్క పగటిచుక్క మొదలైనవారి కథలు యీ శాఖలోనే చేరుతాయి.

౨. శిశుకథలు.

తల్లి పిల్లలకు దేవతలు, రాక్షసులు, భూతాలు గురించి చెప్పేకథలూ; ఈగ, నక్క మొదలైన కథలూ యీ శాఖలో చేరుతాయి.

౩. కల్పనాకథలు.

ప్రకృత్యతీతాంశాలతో కలసి జరగనివి జరిగినట్టుగా కనబడే కథలూ; పిట్టకథలూ యీశాఖలో చేరుతాయి. ఈ పిట్టకథలు భారతిలోనూ, గృహలక్ష్మిలోనూ ప్రకటించబడుతున్నాయి. ఈమధ్య భారతివారు పిట్టకథలను యిక ప్రకటించమని రాసేరు. దీనివల్ల సాంప్రదాయికవిజ్ఞానానికి చాలానష్టం కలిగిందని చెప్పకతప్పదు. భారతివారు పిట్టకథలుఅనేకం సేకరించ నవకాశమిచ్చేరు. వీరు మరల వీటిని తమ పత్రికలో ప్రకటించి సాంప్రదాయికవిజ్ఞానానికి ఉపకారం చేస్తారని నమ్ముతున్నాను.

౪. వినోదాలు, నీతికథలు, పెరిగేకథలు.

ఈవినోదకథలు అనేకమంది ప్రకటించేరు. చిలకమర్తివారు 'వినోదములు' అని ౨౮౦ కథలను ప్రకటించేరు. నావద్గిరకూడా యించుమించుగా అన్ని కథలున్నాయి.

నీతికథలు కొందరిచేత ప్రకటించబడ్డాయి.

పెరిగేకథలంటే - ఈవిధమైన కథలకు పరిమితి లేదు. మొదట వాటి పరిమాణానికీ యిప్పటి స్థితికీ యెంతోభేద ముంటుంది. మొదట ఆకథ చాలా చిన్నదిగా వుండి క్రమేపీ లోకుల కల్పనలతో పెద్దకథ అవుతూవుంటుంది. కాశీమజిలీలు, గొల్లసుద్దులు యిటువంటివే.

౫. స్థలమాహాత్మ్యములు.

ఇవికూడా మనదేశంలో చాలా వున్నాయి.

ఉదా:—గోవుపాదాలు, కోటిలింగాలు, గోస్తనది మొదలైనవాటిని గురించి వున్న పురాణాలు.

౬. స్థానిక కథలు.

ఇటువంటికథలు మనకు స్థానికచరిత్రలలో దొరుకుతాయి. ప్రతాపచరిత్రం, రాయవాచకంవంటి వాటిలోకూడా దొరుకుతాయి.

(ఆ) పదములు, పాటలు (కళకింద రానటువంటివి.)

ఉదా:—బొబ్బిలిరాజుకథ, కామమ్మకథ, దేసింగురాజుకథ, కాంభోజరాజుకథ, కుచ్చలకథ, చిన్నమ్మకథ, కీర్తనలు, తత్వాలు, తరంగాలు, ఆడవాళ్ల పాటలు మొదలైనవి.

(ఇ) పాతపాటలు మొదలైనవి.

దీని ఉపశాఖలు—

౧. పాతపాటలు.

ఇవి ముఖ్యంగా పిల్లలిని నిద్రపెట్టడానికి పాడబడుతున్నాయి. వీటిని మొత్తంమీద జోలపాటలని అంటున్నారు. కాని దీనిలో ఒక్క జోలపాటలే కాకుండా పణతిపాటలు మొదలైనవికూడా వున్నాయి. ఇటీవల యివి యెక్కువగా సేకరించబడుతున్నాయి. నాలుగేళ్లక్రిందట వీటిని కొన్నిటిని పాతపాటలన్న పేరున నేను భారతిలో ప్రకటించేను. అప్పటినుంచి అనేకమంది యీ పాతపాటలను సేకరించి భారతిలోను, గృహలక్ష్మిలోను ప్రకటిస్తున్నారు. ఈమధ్య భారతి వారు యీ పాటలను భారతిలో ప్రకటించడం మానేసేరు. దీనివల్ల సాంప్రదాయిక విజ్ఞానానికి కలిగిన నష్టమింతఅని చెప్పలేము. భారతివారు తిరిగి వీటిని ప్రకటించి భాషాసేవ చేస్తారని నమ్ముతున్నాను.

౨. కట్టుకనలు లేక పొడుపుకథలు, అర్థవిహీనపు పాటలు.

ఉదా:—వంకరటింకరశో, వాని తమ్ముడు అ,
నల్లగుడ్లమి, నాలుగుకాళ్ల మే

మాతాత రెండెడ్లను తెచ్చేడు, ఒకయెద్దు తిరుగుతుంది, ఒకయెద్దు తిరగదు.

ముద్దుల్లుముద్దుల్లు ముచ్చికాయల్లు
అమ్మాయిముద్దుల్లు గచ్చకాయల్లు.

౩. సామెతలు.

ప్రాపంచికోక్తులుకూడ యీశాఖలోనే చేరతాయి.

ఉదా:—కుక్కను చంపితే గుడికట్టాలి.

ఇంట్లో యీగల మోత బైట పల్లకీల మోత.

కొయ్యతోటకూర కొయ్యక చెడెను.

కొండంతకాపురం కొండేల చెడెను.

కొడుకుల కననివాళ్ల కడుపేమి కడుపు
కులముద్ధరించని కొడుకేమికొడుకు.

సామెతలు అనేకమంది సేకరించి ప్రకటించేరు. ఒకరుసేకరించినవే మరొకరుకూడా సేకరించి ప్రకటించేరు. దీనికి కారణం, ఎవ రేవి ప్రకటించేరో తెలియకపోడమే. పోనీ యితరులు ప్రకటించనటువంటి వాటినే ప్రకటిద్దామని అనుకొన్నప్పటికీ యెన్ని పుస్తకాలని సరిచూడగలరు. అందుచేత యెవరు సేకరించిన వాటిని వారు యివి కొత్తవా, పాతవా అని యోచన చెయ్యకుండా ప్రకటిస్తున్నారు. దీనివల్ల తెలుగుదేశంలో మొత్తంమీద యెన్ని కొత్తసామెతలు చేరేయో తెలియకుండా వుంది. కొత్తగా సేకరించినవాళ్లకి, యితరులు సేకరించినవే మళ్లా సేకరిస్తున్నామేమోఅని అనిపిస్తుంది. అందుచేత యిప్పటివరకూ సేకరించబడ్డ సామెతలను సంపుటాలక్రింద ప్రకటించవలసివుంది. దీనివల్ల యింతవరకూ సేకరించబడ్డ సామెతలన్నీ ఒకచోట వుండడమవుతుంది. కొత్తసామెతలను చేర్చడానికి అవకాశం కలుగుతుంది. కొన్నాళ్లక్రిందటివరకూ ప్రకటించబడ్డ సామెతల పుస్తకాలన్నిటినీ పరిశీలించి శ్రీ నాళం కృష్ణారావుగారు ఆసామెతల నన్నిటినీ అకారాదిగా రాసేరు. వాఙ్మయాభిలాషులు సహాయంచేసి యీగ్రంథాన్ని ప్రకటిస్తే వాఙ్మయాని కెంతేనా వుపకారంగా వుంటుంది. ఇప్పటివరకూ సేకరించబడ్డ సామెతలు నశించిపోకుండా వుంటాయి. కొత్తసామెతలు ప్రకటించడానికి వీలవుతుంది.

౪. వినోదపుపేర్లు లేక ఉడుకుపేర్లు.

ఉదా:—ఆకాశరామన్న, వల్లకాటి రామనాథయ్య, ఆడారిఅచ్చన్న.

౫. స్థలసంబంధమైన పాటలు.

ఉదా:—అత్తపోసిన గంజి సత్తువలేదు
అల్లుడు సిరిపురపు గట్టెక్కలేడు.

కాకినాడానకట్టు కాలికింద తొక్కిపెట్టు
మాటలాకు మామిడాడ ఊసులకు పుల్లిపాడు
దొంగలకు ద్వారపూడి ముండలకు మురమండ
రంగులకు రాజమండ్రి ముక్తులకు తిరుపతి
యుక్తులకు నెల్లూరు శక్తులకు గుంటూరు.

౭. పామరుల శబ్దవ్యుత్పత్తి.

ఉదా:—కాతేరుఅన్న వూరుదగ్గిర సారంగ ధరుని పాతేరు. ఈపాతేరు అన్నమాట క్రమేపీ కాతేరుఅయింది.

పల్లంకుర్రు. ఈవూరుగల ప్రదేశం మొదట చవిటి నేల. అక్కడ బ్రహ్మ యజ్ఞంచేసి 'ఫలంకురు' అని ఆశీర్వదించి సారవంతమైన నేలగా చేసేడు. ఈ 'ఫలం కురు' యిప్పుడు పల్లంకుర్రు అయింది.

కేశనకుర్రు. ఈవూరిదగ్గిర గోదావరి కొంత ఉత్తరంగా ప్రవహిస్తూంది. కాశీదగ్గిర గంగ ఉత్తరంగా ప్రవహిస్తూంది. కాశీలాగే యీవూరుకూడా గొప్ప క్షేత్ర మయిపోతుందని దేవతలువెళ్లి బ్రహ్మదగ్గిర మొర పెట్టేరు. అప్పుడు బ్రహ్మ 'కాశీం నకురు' అని అన్నాడు. ఆవెం టనే గోదావరి మళ్లా దక్షిణంగా మళ్లింది. 'కాశీం నకురు' కేశనకుర్రు అయిపోయింది.

3. కళ.

దీనిలోని శాఖలు.

౧. పదములు పాటలలోని సంగీతం. అంటే యీపదములు పాటలలోని గణాలు, యతిస్థానాలు, స్వరం, రాగముంటే రాగం, తాళం, పల్లవి, అను పల్లవి మొదలైనవాటినిగురించి. పదములు పాటలకి, కళ పాటలకి (Art Songs) ఉండే పోలికలూ భేదాలూ కూడా యిందులోనే తెలుపబడతాయి.

౨. పామరుల నాటకాలు.

యక్షగానాలు, తోలుబొమ్మలు, కొయ్య బొమ్మలు, భాగోతాలు, హాస్యం యిందులోనే వస్తాయి.

పైన చెప్పినవిధంగా సాంప్రదాయిక విజ్ఞానం సేకరించుకోవలసివుంది. దీని విలువ యెంతేనా వుంది. ఇదిచరిత్రపరిశోధకులకు, శాస్త్రజ్ఞులకు, వాఙ్మయాభిలాషులకుకూడా చాలా అవసరం. ఇప్పటివరకూ దేశంలో అక్కడక్కడ కాస్తకాస్త ప్రయత్నంమాత్రమే జరిగింది. కాని క్రమరీతిగా పనిచేస్తేనేగాని యీపని లాభకరంగాను, సంపూర్ణంగాను జరగదు.

---

# ఆంధ్రవాఙ్మయచరిత్రము: యుగవిభజనము

కోరాడ రామకృష్ణయ్య, యం. ఏ.,

ఆంధ్ర వాఙ్మయచరిత్రమును దెలుపు గ్రంథము లిదివఱకే కొన్ని బయలుదేరియున్నవి. వానిని రచించినవారిలో పలువు రావాఙ్మయమును వారివారి యుద్దేశములనుబట్టి, సౌకర్యమునుబట్టి పలువిధములుగ విభజించి దాని చరిత్రను దెలుపఁదొడంగిరి. ఈకారణముచే నాంధ్రవాఙ్మయమునందలి యుగవిభజనవిషయమున నభిప్రాయభేదము లేర్పడుటయు తటస్థించినది. కావున నీ వాఙ్మయమున యుగవిభజనము చేయురీతినిగూర్చి యించుక పరిశీలింతము.

మొట్టమొదట నీభాషలో బయలుదేరినవి కవుల చరిత్రలేగాని వాఙ్మయచరిత్రలు కావు. వీనికైనను మొదట దారిదీసినవారు కందుకూరివీరేశలింగం పంతులు గారు. ఈయన రచించిన గ్రంథమునకు 'ఆంధ్రకవుల చరిత్ర'యని నామకరణముచేసెను. ఆనామమున కనుగుణముగా నది ఆంధ్రకవుల చరిత్రమని చెప్పఁదగియుండెనేగాని ఆంధ్రవాఙ్మయచరిత్రమని చెప్పఁదగదు. అందాయన సాధ్యమైనంతవఱకు కాలానుగుణముగా నొక్కొక కవినె గ్రహించి యాతని పుట్టుపూర్వోత్తరములను దెలుపుచు, నాతఁడు రచించిన గ్రంథములనుబట్టి, దానిని కృతినొందిన రాజులు, మంత్రులు మొదలగువారిని బట్టి, యితరకవులు వీనినిగూర్చి చేసిన ప్రశంసాదికమును బట్టి, ఇంకను దొరకినపుడెల్ల శాసనాదుల సాక్ష్యమును బట్టియు నాయాకవుల కాలమును నిర్ణయమునుసలుపుచు, నాకవి రచించిన గ్రంథములనుబట్టి యాతని కవితావిశేషములను దెలుపుచు, నింక వారినిగూర్చిన చారిత్రకవిషయములను, వాడుకకథలు మొదలగు వానిని జేర్చి, కవులను వారిచరిత్రమునె ప్రధానముగ దన దృష్టిపథమున బెట్టుకొని యాగ్రంథమును రచించెను. అట్లు రచించి సిద్ధమైనంతవఱకు గ్రంథమును ప్రచురించుటకు వీలుగా నాతఁడాకవులను, తన గ్రంథమునుగూడ మూడుభాగములుగ జేసెను. కావున ప్రాచీనకవులు, మధ్యయుగపు కవులు, ఆధునికకవులు నని కవులు మూడుతెగ లైరి; గ్రంథమును మూడుభాగములు గల దయ్యెను. కావున నీవిభాగము కవులనుబట్టియు, వారి చరిత్రను రచించువాని సౌకర్యమున కనుకూలముగను నేర్పడిన విభాగముగాని వాఙ్మయచరిత్రకు సంబంధించిన విభాగముకాదు.

'కవిజీవితము'లను రచించిన శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు మఱియొకపద్ధతి నవలంబించిరి. వీరు కవుల కాలమునుబట్టియైనను విభాగమును జేయ దలంపలేదు. వారు రచించిన గ్రంథములనుబట్టి భారతకవులని, రామాయణకవులని, ప్రబంధకవులనియు నీరీతి విభాగమును జేసిరి. ఈ విభాగముగూడ కవులనుబట్టి చేసినదేగాని, విశేషమేమనగా నిది కవుల కాలమునుబట్టియైన నేర్పడిన విభాగముకాక యేవోకొన్ని సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించిన కవుల నొక్కొకసంపుగా జేర్చుటచే నేర్పడిన విభాగము. ఇట్టికవిచరిత్ర కవిజీవితకారుల దృష్టిని గాఢముగ నాకర్షించినది ఆంధ్రకవులుగాని, యాంధ్రవాఙ్మయముకాదు. కావుననే యీ విభాగము లాంధ్రవాఙ్మయ పరిణామమునందలి, లేదా వాఙ్మయచరిత్రమునందలి దృష్టితో జేయబడినవి కాకపోవుట తటస్థించినది. అయితే ఆంధ్రకవుల జీవితచరిత్రము వారు రచించిన గ్రంథములను గూర్చిన విమర్శనముగల గ్రంథములె ఆంధ్రవాఙ్మయచరిత్రము కావన్నచో నాంధ్రవాఙ్మయచరిత్ర మనున దింకేమిటి? వీనికంటె నది భిన్నమైయుండునా యనుప్రశ్న గలుగకమానదు. కవులచరిత్రముగాని, కవుల జీవితచరిత్రముగాని వాఙ్మయచరిత్రమునకు సహాయకారులేగాని, వాఙ్మయచరిత్రమెన్నటికి గావనుటయే దానికి సమాధానము. అయితే

కవుల చరిత్రము, వారిగ్రంథములను గూర్చిన విమర్శనము లేనిదే వాఙ్మయచరిత్ర మనున దొకటి స్వయముగ సృష్టింపబడుచున్నదని దీని యర్థము కాదు. సజీవంబగుటచే నాయాకాలములందు కలుగు మార్పులను లోనై కాలక్రమమున నభివృద్ధి నొందుచున్న యొక జీవద్భాషకు, ఆయాకాలములయం దేర్పడిన వ్యాకరణము లాభాషాచరిత్రను దెలుపుట కెట్లు సాహాయ్యకారు లగుచుండునో, అట్లే యాయాకాలము లందలి కవులయొక్కయు, వారి గ్రంథములయొక్కయు చరిత్రము లావాఙ్మయ చరిత్రరచనమునకు దోడ్పడు చుండును. ఒక్కొకకాలమునం దొకభాషలో కవులు రచించిన కావ్యములే యాభాషావాఙ్మయకథాసౌధమునకు ప్రధానపరికరములు. ఈపరికరములు లేకయే యాసౌధనిర్మాణము సాధ్యము కాదనుట స్పష్టమే. కాని యీపరికరములలో నొక్కొకదానిని గ్రహించి దాని సౌందర్యము, దాని సౌష్ఠవము, దాని నిర్మాణపద్ధతిని గూర్చి పరిశీలించి యానందించుట యనున దొక పద్ధతి ఆ యీపరికరములతో నాసౌధమును నిర్మాణము చేసి, యేసి యెట్లెచ్చట నమరినదో, దానివలన నాసౌధమున కెట్టి సొంపు సంపాదింపబడినదో, దాని యం దమరుటంజేసి దీనిసహజగుణం బెట్లు ప్రకాశించుచున్నదో, ప్రత్యేక మొక్కొకటిగా గ్రహించి పరిశీలించినప్పటికంటె, నింక పెక్కులగు సదృశవస్తువులతో జేర్చి యాసౌధంబున నర్హస్థానంబు నమరి యున్నయప్పు డాయావస్తువుల రామణీయకంబు,నందలి తారతమ్యము నెట్లు వ్యక్తంబగుచుండునో, ఒకయంతస్తుపై మఱియొకయంతస్తేవిధముగా కట్టబడి నిలిచియున్నదో, పైదానికి క్రింది దెంతవఱకు మూలకము, పోషకము నగుచున్నదో, పైకి పోయినకొలది క్రొత్త క్రొత్త వింత వింత నగిషీలు, చమత్కారపు చెక్కడములు, కన్నుల మిఱుమిట్లు గొల్పు మెఱుంగుపూతలు నెట్లుగా బయలుదేరి చూపరుల నాశ్చర్యమగ్నులను జేయుచుండునో అను విషయములు గమనించుట, అనగా ముఖ్యముగా విడివిడిగా దెచ్చి పెట్టబడిన యాపరికరములను, వానిచే కట్టబడి వెలసిన యారమ్యసౌధమునకు గల సంబంధం బెట్టిదో కనిపెట్టుట రెండవపద్ధతి. అట్టి మహాసౌధమును కొద్దిదూరమున నిలువంబడి క్రిందినుండి పైవఱకు పాఱజూచి దాని యద్భుతరామణీయకంబునకు నివ్వెఱపాటు జెందవచ్చును, లేదా లోన బ్రవేశించి క్రిందియంతరవుమండి క్రమక్రమముగా నమర్పబడిన మెట్లమూలమున తుదివఱకు బ్రతియంతస్తు నెక్కియం దమర్పబడిన వస్తుసౌభాగ్యము పరిశీలించి పరమానందపరవశులు గావచ్చును. మొదటిదానికం టెను రెండవది, అనగా నాసౌధనిర్మాణమునకు గా దెచ్చి పెట్టిన పరికరముల పరిశీలించి యానందించుటకం టెను, వానిచే నిర్మింపబడిన యాసౌధసౌభాగ్యమును దిలకించి యానందించుట పరమోత్తమ మనుటకు సందేహము లేదుగదా.

ఆంధ్రకవుల జీవితములు, వారి కాలనిర్ణయమును గూర్చిన చర్చలు, ప్రత్యేకగ్రంథములనుగూర్చిన విమర్శనములు మొదలగునవన్నియు నాంధ్రవాఙ్మయసౌధనిర్మాణమునకు వలయు పరికరములే. అవిలేక సౌధనిర్మాణము సాగదు. ఈసౌధము సులభముగా మూలమును త్రవ్వితీయుట కలవడని కొండప్రదేశముపై వేయబడినపునాదిపై గట్టబడినదికాక సంస్కృతవాఙ్మయంబను సమప్రదేశమున దీర్చి త్రవ్వి చక్కగా గట్టబడిన పునాదిపై నిర్మింపబడినది. కావుననే తీర్చి సమముగ జెక్కబడి యమర్పబడిన పలుకురాళ్లు పునాదినుండియు మన కగపడుచుండుట. ఈ పునాదిక్రింద ప్రాచీనకాలపు మూలకట్టడం బేమైన నున్నదేమో, యేప్రక్కనుండి యైనను పురాణవస్తు తత్త్వశోధకులు త్రవ్విచూచి తెలిసికొనవలసినదేగాని, బయటనుండి తెలిసికొనగలిగినంత వఱ కేమి యగపడుటలేదు. పునాదియేగాక యీవాఙ్మయసౌధముయొక్క తొలిగృహమంతయుగూడ నా సంస్కృత వాఙ్మయ సౌధమునుండి యేరితెచ్చి పైని కొంతన గిషీపనిమాత్రము చేయబడిన రాళ్లతోడనే కట్టబడినదని చెప్పక తప్పదు. ఈనగిషీపనిమూలముగా నీ క్రిందిగృహమందైనను నతిరమ్యములగు నద్భుతశాలలు కొన్ని యేర్పడియే యున్నవి. ఇట్టిచిత్రశాలలో నొకదానినుండి వేయబడిన సోపానమార్గ మొకటి పైయంతస్తులోనికి మనలను దీసికొని

పోవును. ఇచ్చటనే యాంధ్రకవితా శిల్పముయొక్క స్వతంత్రవ్యక్తిత్వమును, నద్భుతరామణీయకమును బ్రకటింపగలిగిన ప్రబంధశిఖరమొకటి వెలయుచు, దూరము నుండి చూచువారి కన్నుల మిఱుమిట్లు గొల్పుచుండును. వెనుకభాగమున డీని నంటియే కొన్ని గద్యగృహములు, నాటకశాలలు నిర్మింపబడియున్నవి. దీనిపై మఱియొక యంతస్తు నూతనముగా కట్టబడుచున్నది. అందు విచిత్రశాల లనేకములు గలవుగాని శిఖరము లింక తీర్చి కట్టబడి యుండలేదు. నగిషీపని యంతయు తయారు కాలేదు. పనిపూర్తియగునప్పటి కీయంతస్తు వెనుకటిదానికంటె నత్యంతశోభాయమానంబై దివ్యతేజంబుతో వెలుంగుచుండు ననుటకు సందేహము లేదు. క్రిందిదానికంటె నిది మిగుల నెత్తయినదే గాక దీనిని జేర్చు మెట్లు క్రిందిదాని మెట్లవలె తీర్చి కట్టబడినవిగాక, యయోమయములై వలయాకారమున సూటిగ బైకి పోవునవై యున్నవి.

ఇట్లీయాంధ్రవాఙ్మయసౌధమును దిలకించినచో రెండు పైయంతస్తులు, నొక క్రిందిగృహము, నొకదాని నుండి మఱియొకదానికి గొనిపోవు రెండు సోపానమార్గములు నగపడుచున్నట్లున్నది. దీనినిబట్టియే వాఙ్మయయుగములనుగూడ మనము విభజింపవచ్చునని తోచకపోదు. అట్లు చేసినచో ప్రధానములగు వాఙ్మయయుగములు మూడే కనబడుచున్నవనియు, వీనిమధ్య సోపానమార్గములవంటి సంధియుగములను రెంటిని జేర్చిన జేర్చుకొనవచ్చు ననియు చెప్పవచ్చును. దీనినిబట్టియే యాంధ్రవాఙ్మయయుగములను మన మేర్పఱచికొన్నచో నవి పంచసంఖ్యాకము లైయుండునని తోచును.

అయితే యీవాఙ్మయము నన్నపార్యుడు భారతము నాంధ్రీకరించుటతోగదా ప్రారంభింపబడినట్లు గ్రహింపబడుచున్నది. ఈతనికిబూర్వ మద్దాని స్థితి సులభముగ పైకేమియు గోచరించుట లేదనియు, వలసినచో పునాదిక్రిందిభాగమున నచ్చటచ్చట త్రవ్విచూచి దాని స్థితి గనిపెట్టవలసియుండుటచే, నీవాఙ్మయముయొక్క ప్రాథమికావస్థను దెలుపు కాలమును మఱియొకయుగముగా గ్రహింపవచ్చును. అప్పు డారు యుగము లగును. ఈతొలియుగమునుగూర్చి మన కిప్పటికంతవిశేషముగా దెలియదుగావున దీనికి 'అజ్ఞాతయుగము' అని నామకరణము చేయవచ్చును—లేదా "ప్రాఙ్నన్నపార్యయుగ" మనియు జెప్పవచ్చును. ఇక నన్నయాదులు రచించిన భారతభాగవతరామాయణాదు లాంధ్రమున బయలుదేరిన యుగము నేపేరున బిలువవలయునని ప్రశ్న. ఈయుగమును బురాణయుగమని కొందఱు పేర్కొనియుండిరిగదా. వారట్లు చేయుటకు గారణమేమైయుండుననగా నిం దేవో కొన్ని ప్రసిద్ధములగు పురాణములు తెలుగులో రచింపబడియుండుటయే గావచ్చును. ప్రబంధయుగమని నిష్కర్షగా జెప్పదగియున్న తరువాతి ప్రధానయుగమునందుకూడ నేవో కొన్ని పురాణములు తెనిగింపబడియుండెనే; యిప్పటికూడ మఱికొన్ని తెనిగింపబడుచునే యున్నవే; అట్టిసందర్భములో తొలియుగమునే పురాణయుగమనుట యేల, అది యెట్లు సమంజసమగునని కొందఱనవచ్చును. ఏ యుగమునకుగాని మనము పేరు పెట్టునపుడు దానియందలి ప్రధానలక్షణములను గమనించియే పెట్టుదుము గావున 'ఛత్రిణో గచ్ఛంతి' యనుదానివలె లక్షణచే గ్రహింపదగునేగాని, యంతమాత్రమున నితరవిశేష లక్షణము లేమియు లేవని చెప్పుట యని తలంపరాదు గదా. ఆకారణముచే తొలియుగమున నొకటి రెండు ప్రబంధములుగాని, శతకములుగాని రచింపబడియున్నను, మఱియుగమున నొకటిరెండు పురాణములు భాషాంతరీకరింపబడియున్నను, మన పూర్వసంకేతనామములను మార్పవలసిన యావశ్యకత యేర్పడదు. ఆయాకాలములందు సాహిత్యసంచలన మెద్దానియందు కేంద్రీకృతంబగుచుండునో దానినిబట్టి యుగనామ మేర్పడుట న్యాయ్యము. కాని యీ యుగముల కీనామములు సార్థకములైయుండెనా యనువిషయమున నభిప్రాయభేదము గలుగవచ్చును. పురాణయుగమున కావేరీ వాఙ్మయమున నది ప్రాచీనమైనదగుటచే గలిగెనా, లేదా పురాణము లాకాలమున రచింపబడుటచే గలిగెనా

యను సందేహము కలుగవచ్చును. ప్రాచీనయుగ మన నర్థమున నెవ్వారును ప్రయోగించి యుండరనియే నా తలంపు. పురాణములు రచింప బడుటను బట్టియే యాపేరు దానికి గలిగిన దనుట నిశ్చయము. ఆకాలముననె మరికొన్ని యితిహాసములు, కొన్ని కావ్యములు, కొన్ని శాస్త్రగ్రంథములు మొదలగునవి గూడ నాంధ్రమున వెలసినను, వీనిలో ప్రధానములుగా గ్రహింపబడినవి పురాణములు గావుననె యాయుగమున కాపేరు వచ్చినదని చెప్పినను చెప్పవచ్చును. కాని యాంధ్రవాఙ్మయమునందలి యీయుగమును పురాణ యుగ మనుటకంటె భాషాంతరీకరణయుగ మనుట సమంజసమని తోచెడిని. ఏలయనగా నీయుగమున నీభాషలో రచింపబడిన గ్రంథములన్నియు- నవి యితిహాసములుగానీ, పురాణములుగానీ, కావ్యములుగానీ, యేవైనను సంస్కృతగ్రంథముల పరివర్తనములే. ఇందుత్కృష్టమగు స్థానమును వహించిన భారత మితిహాసము. భాస్కరతిక్కనామల రచనలకు మూలంబగు రామాయణ మాదికావ్యము. మంచనకేయూరబాహు చరిత్రమునకు మూలంబగు 'విద్ధశాలభంజిక' యొక నాటకము. కేతన దశకుమారచరితమునకు మూల మొక గద్యకావ్యము. ఇవియన్నియు దక్కిన భాగవతనృసింహ పురాణాదులవలె భాషాంతరీకరణములే యగుటచే, వీని యన్నిటియందునను వర్తించు శబ్దముచేతనే యీయుగమును బేర్కొనుట యుక్తము. ఈసంకేతమును దాటిపోవు గ్రంథములును లేకపోలేదు. కాని యవి యొకటి రెండుమాత్రమే. ఆరూఢ గద్యపద్యాదిప్రబంధపూరిత సంస్కృతభూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబు గాకుండుటచేతను, జానుదెనుగు ప్రసన్నతకువిశేషంబగుట చేతను, జానుదెనుగున దేశీయచ్ఛందములను ద్విపదాదులలో దేశికవిత రచింపవలయునని వాదించిన పాల్కురికి సోమనాదుల కృతులగు బసవపురాణపండితారాధ్యచరిత్రాదులుండిన నుండుగాక. వారివాదము వెనుకటి జీర్ణపద్ధతిని సూచించుచు నీకాలమున నరణ్యరోదనమే యైనది. సంస్కృతగ్రంథముల పరివర్తనములుగాక సంస్కృత వాఙ్మయసంబంధముగాని, సంస్కృతవస్తు సంబంధముగాని విశేషముగా లేకయే రచింపబడిన యాంధ్రకృతులు తరువాతి ప్రబంధయుగమునగూడ నంతగా గానరావు. కావున నీయుగసామాన్యలక్షణములకు లొంగని విశేషకృతులనుగా వీనిని గ్రహించి పరిశీలింపవలసినదే. ఇట్టి వానాయుగములందు కొన్ని బయలుదేరుచుండుటయు గలదు. ప్రబంధయుగమునందలి పింగళి సూరనార్యుని 'కళాపూర్ణోదయ' కృతియు నాయుగమునం దసాధారణమైన రచనంబనియే చెప్పవలసియున్నదిగదా. కాని సోమనాథుడుమాత్రము తన గ్రంథములలో నొకదాని కాయుగధర్మము నతిక్రమింపలేక గాబోలు పురాణంబనియే నామకరణ మొనరించినాడు. సామాన్యముగా నెవ్వాడు నసమానప్రతిభావంతు డగుటచేతనో, లేదా ప్రత్యేకకారణము లేవో కలిగిననో కాని, తనపరిసరపరిస్థితులను, యుగధర్మములను నతిక్రమించి ప్రవర్తింపగలిగియుండడు. అట్టి ప్రతిభావంతు డొక్కొక్కప్పుడు నూతనయుగకర్తగాగూడ బరిగణింపబడుచుండును. మొత్తముపై పురాణయుగమని చెప్పబడుచున్న యీరెండవయుగమునందు తెనుగుచేయబడినవి. నృసింహపురాణము, హరివంశము, మార్కండేయపురాణము, పద్మపురాణము, భాగవతము అయిదాను పురాణములుమాత్రమె కనబడుచుండుటచేతను, పురాణశబ్దవాచ్యములుకాని తక్కిన యుద్గ్రంథములు వీనితో సమానమైనవిగనే యుండుటంజేసియు, నివి యన్నియుగూడ పరివర్తనములని చెప్పుట కభ్యంతరమేమియు లేకుండుటవలనను, ఈ యుగమును భాషాంతరీకరణయుగమనుటయే యుక్తముగా గనబడుచున్నది. మఱియు నీగ్రంథము లీభాషలోగూడ సంస్కృతభాషలో రచింపబడినప్పటినామములతోడనే వ్యవహరింపబడుచుండెనుగాని నామమాత్రవిషయమునైన భేద మేమియు లేదుగదా. భాషాంతరీకృత గ్రంథములన్నియు నట్లు వాని తొలినామములతోడ వ్యవహరింపదగినవేయై యుండును. భారతము, రామాయణము, దశకుమారచరితము, హరివంశము మొదలగు గ్రంథములపేళ్లుచెప్పినంతనే, యవి సంస్కృతగ్రంథములనియే మొదట స్ఫురించును గాని, భాషాంతరీకృత గ్రంథములని ప్రత్యేకముగా

స్ఫోరకసంపర్కము లేమైన నున్నగాని, మనము తలంచుట కవకాశము లేదు. పరివర్తితగ్రంథమని సూచించుటకుగా నాంధ్రభారతమనియో, ఆంధ్రదశకుమార చరితమనియో చెప్పవలసియుండును. అట్లు చెప్పినను మూలము తెలుసుగాదనియు, నిది కేవలభాషాంతరీకృత గ్రంథమేయనియు స్పష్టమగుచునే యుండును. ఇట్లు వీనిని స్వతంత్రములగు నాంధ్రగ్రంథములనుట కిట్టి చిక్కు లుండుటచే నట్టి గ్రంథములు బయలుదేరిన కాలమును భాషాంతరీకరణయుగమనుటయె లెస్స.

అయితే యివి భాషాంతరీకరణము లనినంత మాత్రమున వీనియందలి విశేషగుణములను గమనింపక మఱుగుపఱచుచున్నామని తలంపగూడదు. భాషాంతరీకరణ మనునది ఈయుగధర్మముయొక్క సామాన్యచిహ్నమని సూచించుటయే దీని కిట్లు నామకరణము చేయుటలో గల విశేషము. ఇక తరువాత చేయవలసిన పని యేమనగా నాయాకాల పరిస్థితులనుబట్టి భాషాంతరీకరణముమాత్రముతో బ్రారంభింపబడినదని చెప్పబడుచున్న యీయాంధ్రవాఙ్మయమున నెట్లెప్పుడేవిధముగా నాంధ్రత్వమును, నాంధ్రవ్యక్తిత్వమును బయలుపఱచు స్వతంత్ర గ్రంథములు బయలుదేరినవి, అవి యెట్లుగా వాఙ్మయపోషకములై దానిని నిలువబెట్టినవి, ఈ భాషాంతరీకరణము లెట్లుగా నాస్వతంత్రాంధ్రగ్రంథరూప వాఙ్మయప్రాదుర్భావమునకు దారితీసి తోడ్పడినవియను విషయములను బరిశీలించి నిర్ణయించుటయే యైయున్నది. పేరుకొఱకా యింత పీకులాట యని యాక్షేపింపవచ్చును. కాని దశకుమార చరితము, విక్రమార్కచరితము, భారతము, హరివంశము అనుటతోడనే, తెలుగా, సంస్కృతమా యని పొడము సందేహము, హరవిలాసము, మనుచరిత్ర, ఆముక్తమాల్యద, ప్రభావతీప్రద్యుమ్నము, పారిజాతాపహరణము, కళాపూర్ణోదయము అనువానిని పేర్కొనినప్పుడు కలుగుట కవకాశము లేదుగదా. వీనియందలి కథలన్నియునుగూడ సంస్కృత పురాణములనుండియో, కావ్యములనుండియో గ్రహింపబడినవె యైయుండవచ్చును. కథలే యననేల, భావములు, వర్ణనలుగూడ గ్రహింపబడియే యుండును. ఐనను ఆకథలనే, ఆభావములనే యాకవులు చేపట్టి తీర్చినరీతిలోనే, ఆసన్నివేశకల్పనము(Setting)లోనే వీరి యాంధ్రత్వము, వ్యక్తిత్వము వెల్లడియైనవనుటకు సందేహము లేదుగదా. కావుననె యీ యాంధ్రప్రబంధ మనునది భాషాంతరీకరణయుగ మహావృక్షముయొక్క స్వాదుఫలమని చెప్పక తప్పకున్నది. ఈ కారణముచే నీ వాఙ్మయమందలి తరువాతి ప్రధానయుగము ప్రబంధయుగమని తనంతన యేర్పడుచునేయున్నదిగదా.

అయితే యీ భాషాంతరీకరణవృక్ష మెట్లుగా పెరిగి పరిణమించి యీ ప్రబంధఫలమును గన్నదో, యద్దాని పరిణామక్రమ మెట్టిదో తెలిసికొనవలయునన్నచో, కేవల భాషాంతరీకరణస్థితికిని, పరిణతప్రబంధస్థితికిని గల యవాంతరసంబంధమును పరిశీలింపవలసియుండును. అట్టి పరిశీలన కనువగునట్లుగా నీపరిణామక్రమమును సూచించుకాలము నీ రెంటినడుమ నున్న యొక సంధియుగముగా గ్రహించినచో వాఙ్మయపరిణామక్రమపరిశోధనకు సౌకర్యం బలవడును. దీనిని సంధియుగమనుటయే యుక్తంబైనను ఈ వాఙ్మయపరిణామక్రమమును పెంపొందించిన శ్రీనాథకవి యాకాలమున నత్యంతప్రసిద్ధుడై యాంధ్రవాఙ్మయ ప్రపంచము సర్వము దానయైనట్లు నెగడిన మహాపురుషుడగుటచే నీసంధియుగము నాతనిపేర శ్రీనాథయుగమనియు జెప్పినను చెప్పవచ్చును.

వాఙ్మయయుగమును తత్పరిణామక్రమమునందలి విశేషలక్షణములనేకాక, ఆయాకాలములం దాపరిణామమునకు దోడ్పడుచు బ్రసిద్ధులై యుగపురుషులనదగిన మహాకవుల నామములచేగూడ చెప్పుచుండుటయు గలదు. కావుననె ఆంగ్లవాఙ్మయమున ఛాసర్ యుగమనియు, షేక్స్పియర్ యుగమనియు, టెనిసన్ యుగమనియు వాఙ్మయయుగము లేర్పఱుపబడియున్నవి. ఇదియు నొక పద్ధతియై యున్నది. ఈపద్ధతి ననుసరించి భాషాంతరీకరణయుగమును కవిత్రయయుగమనియు జెప్పిన జెప్పవచ్చును. నన్నపార్యుడు ప్రారంభించిన భారతేతిహాస

మూలకము భాషాంతరీకరణోద్యమమును తిక్కనార్యుడు తన నిర్వచనరచనచేతను, ప్రబంధమండలీ బంధంబులచేతను, ప్రబంధపరమేశ్వరుడు తనయుక్తివైచిత్ర్యంబులను, నాచనసోముడు పురాణభాగములందు చేసిన తన నవీనసృష్టిప్రదర్శనముచేతను, మంచనజక్కనాదులు సంస్కృత నాటకాదులయందలి కథల నాంధ్రకావ్యములుగ రచించుటచేతను, గౌరన ప్రత్యేకపౌరాణికచారిత్రకకథలను ద్విపదముల నడిపించుటచేతను, శ్రీనాథుడు తన ఖండకావ్యములచేతనేకాక హరవిలాసాదులందు జూపిన మాలకారిప్రజ్ఞావిశేషముచేతను తరువాతి ప్రబంధయుగమునకు దారితీసి, వాఙ్మయ పరిణామమునకు ఎట్లుతోడ్పడిరో, భాషాంతరీకరణోద్యమము స్వతంత్రాంధ్రప్రబంధనిర్మాణమున కెట్లు దారితీసినదో యనువిషయములు సంధియుగంబగు శ్రీనాథయుగచరిత్రము మనకు దెలుపవలసియున్నది. నాల్గవదియగు నీప్రబంధయుగమును రాయలయుగమని చెప్పినను చెప్పవచ్చును. తాను స్వతంత్రముగ ప్రబంధరచనమునకు దారితీసి యనేకకవుల నట్టి రచనలకు ప్రోత్సహించి భాషాపోషకుండగునాత డాయుగకర్తయనుటకు సందేహము లేదు. ఆతనితరువాతి నిటీవలికాలముపఱకుకూడ నా ప్రబంధరచన గతానుగతికముగ నేదోవిధముగ సాగుచునే యుండుటచే ౧౬-వ శతాబ్దినుండి ౨౦-వ శతాబ్దారంభమునఱకు ప్రబంధయుగము ప్రబలుచునేయున్నదని చెప్పవచ్చును. ఈయిరువదవశతాబ్దినుండి యాధునికయుగము ప్రారంభమైన దనవచ్చును. దీనినిబట్టి యీవాఙ్మయపరిణామము నైదుయుగములుగా విభాగింపదగియున్నదని తెలియవచ్చుచున్నది. కాని మఱొక్క విషయము గమనింపదగియున్నది. ఈ ప్రబంధయుగకాలములో, నీయాంధ్రదేశమునకు సంబంధ మేమిలేక, సామాన్య ప్రబంధలక్షణములతో గూడినదే యైనను, మఱికొన్ని విశేషలక్షణములు గలదై మధుర తంజావూరు ప్రాంతపు దక్షిణదేశమున బయలుదేరిన వాఙ్మయము కొంత గలదు. ఇందలి కొన్నివిశేషలక్షణములు నూతనయుగలక్షణములను దలపించుచున్నవి. ఆ కారణముచే వాస్తవముగ సాక్షాత్సంబంధ మేమియు లేకున్నను దీనియందలి నూతనయుగచిహ్నములు కనబడుటం జేసి దీనిని ప్రబంధాధునికయుగములనడుమ వెలసిన యొక సంధియుగమని తలంపవచ్చును. ఈ సంధియుగమును దక్షిణదేశవాఙ్మయయుగమని నామకరణము చేయుదము. ఈరీతి నాంధ్రవాఙ్మయ పరిణామక్రమమునుబట్టి దాని చరిత్రను యుగములుగా విభజింపదలచినచో నారుయుగములు పొడకట్టుచున్న వనవచ్చును. అవి,

౧ అజ్ఞాతయుగము - లేదా, ప్రాఙ్నన్నపార్యయుగము—?-క్రీ. శ. ౧౦౦౦.

౨. భాషాంతరీకరణ యుగము - లేదా, కవిత్రయయుగము—క్రీ. శ. ౧౦౦౦-౧౩౫౦.

౩. సంధియుగము - లేదా, శ్రీనాథయుగము—౧౩౫౦-౧౫౦౦.

౪. ప్రబంధయుగము—౧౫౦౦ - ౧౬౦౦.

౫. దక్షిణదేశ వాఙ్మయయుగము—౧౭౦౦ - ౧౮౦౦.

౬. ఆధునికయుగము—౧౯౦౦.

ఆంధ్రవాఙ్మయము నిట్లారుయుగములుగా విభాగించుటవలన గలుగు విశేషఫల మేమో, అసలు వాఙ్మయస్వరూపం బెట్టిదో, దాని చరిత్రయన నేమో, దానియందు మన కట్టియాదరము గలుగుటకు గల కారణము లెవ్వియో, యొక కావ్యపఠనముకంటె వాఙ్మయపఠన మెట్లు భిన్నంబగుచున్నదో, సామాన్యకావ్యపఠనమునకును, కావ్యానుశీలనము (Study of Poetry) నకును గలభేద మేమో, అట్టి కావ్యానుశీలన రీతులు వాఙ్మయానుశీలనపద్ధతులు ఎట్టివో యనువిషయములను గూర్చి మఱియొకవ్యాసమున పరిశీలింతముగాక.

---

# సింహావలోకనం

కొల్లూరు ధర్మారాయకవి, బి. ఏ.,
(ఆం. గీ. సా. పరిషత్తు)

కవిత్వంయొక్క ఉపయోగం వినడం చదవడమే కాని, వాదోపవాదాలకికాదు: అనుభవించి ఆనందించుటకేగాని, వెల నిర్ణయించి తీర్మానించుటకుగాదు. విమర్శ అనేపదం ఒకమనిషివర్తనపుగాని, ఒకబజారువస్తువపుగాని అన్వయించినట్లు సారస్వత విషయంలో అన్వయించదు. కళావిషయం ఆనంద నిష్పత్తికెట్లు కారణభూతూందో నిరూపించడమే విమర్శనయొక్క మహదాశయం.

కవిత్వంగూర్చి పాశ్చాత్యభాషల్లో వున్న గ్రంథాలు బల్లమీదలెఖ్ఖ. దేశీయచరిత్రలో ఒక భాగంగా కవిత్వాన్నిభావించి వ్రాసేరు కొందరు. ఊహాప్రపంచపరిణామంగా కొందరు వితర్కించేరు మహాపురుషజీవితసంపుటిక్రింద కొందరు మార్చేరు. కళోపాసనగా కొందరు కనుగొన్నారు. సృష్టిరహస్యోద్ఘాటనసాధనంగా మరికొందరు విమర్శించేరు. పుట్టవెల్వడినకవినాటినుండి నేటివరకు గల కవిత్వం ఒకమానవచేష్టావిశేషంగా కొందరు గ్రహించేరు.

మొత్తంమీద కవిత్వంయొక్క నిజలక్షణాన్ని నిర్వచించడంలో అనేకమైన Schools of thought బైలుదేరేయి. ఆయా అభిప్రాయభేదాల కనుగుణ్యంగా రకరకాల గ్రంథా లుద్భవించేయి.

సారస్వతపరిణామంలో అట్టి అవాంతరాలు సహజంగా వస్తాయి. అందువిషయమై ఏయొక్క యుగంనాటివారైనా దిగులొందవలసిన పనిలేదు; దిగులొంది లాభంలేదు. దేశకాలానుసరణంగా వ్యక్తులు తమ అభిప్రాయాలు మార్చుకొనడం నాగరకలక్షణం. కవుల్ని ఒకప్పుడు దూషించింది లోకం: ఒకప్పుడు దైవసమానంగా భూషించింది. మళ్లీ అంత అకారణంగా వాళ్లపై విముఖత్వం చూపింది. ఎందుచేత? ఈ అవస్థాభేదాలకి ప్రపంచం చెప్పే సమాధాన మేమంటే, “భాసన్ననాడు పూజించేం, దినుసుచెడినప్పుడు విసర్జించేం” అని. కవు లేమంటారు? “లోకం చంచలమనస్కం” అంటారు.

మాతృభాషయే రాజభాషయైయుండే స్వతంత్రదేశాల్లో సారస్వతసమస్యలకు సంపూర్ణమైన వికసనం కలిగి, ప్రజలకు అందుకూర్చి ఉద్బోధ లభ్యమౌతుంది. ప్రస్తుత పరిస్థితులలో మన తెలుగు భాష కట్టి అవకాశములు తక్కువ. తెలుగు కవిత్వాని కిది యొక సంధియుగం. కవిత్వంయొక్క తత్త్వమిట్లా వుండాలి అని నిర్ణీతం కాలేదు. ఈసందిగ్ధావస్థకు చరిత్రయే కారణం.

ప్రబంధ నిర్మాణపు Slave Mentality యెంత అభివృద్ధిగాంచెనో నిదర్శనము మనకు పినవీరభద్రకవియే. మహాకవియొక్క శాకుంతలనాటక వస్తువునుగైకొని ప్రబంధము వ్రాయుటకన్న కాళిదాసునకు కలిగింపగల మహాపచారము లేదని నా నమ్మకము. అయితే నేమి? రాజానుమోదమే ప్రజానుమోదమానాడు. కాలచక్రము గిర్రున తిరిగింది. కవులే ప్రభులకు కుడిబుజమై, గంటమే కదనాయుధమై రాజ్యాలేలిన రోజులు గతించేయి. కళలన్నిటికీ ముఖ్యమూల్యం మందగించింది. కవనవిక్రేతల వ్యాపారం ఒక్కసారి దివాలాతీసింది. ప్రబంధాలఫలసాయం కొట్లో దాచవలసిందే కాని కొనడాని కెవడికీ నచ్చలేదు. కృష్ణరాయలు లేక అష్టదిగ్గజాలూ అడవులుపట్టిపోయేయి.

ప్రబంధపు రైలుపట్టాలమీదుగా సుమారుపాతిక సంవత్సరముల క్రిందటిదాకా వెళుతూన్న బండిన్ని సాహసించి కీ. శే. వీరేశలింగంపంతులుగారు derail చేసేరు. పంతులుగారు సర్వవిధములా సంస్కర్త. Western Culture యావత్తూ ఆంగ్లీకరించి మన

సొమ్ముగా చేసుకుంటేగాని సంఘానికీ దేశానికీ మోక్షం లేదనే నమ్మకం గలవారు. అప్పటి కప్పుడే నవీన యుగారంభం సూచించే వేగుజుక్క తూర్పున ఆనందగజపతిప్రభువుల ఆస్థానంలో ఉదయించింది. అప్పకవిసంకెళ్లలో ఖైదుపడివున్న కవితాకన్యను విడిపించి, ముత్యాలసరంతో విజయసూచకంగా అలంకరించేరు గురజాడవారు. అభినవభోజుని శిరఃకంపనం ఆమెను ఆశీర్వదించింది.

వీరేశలింగం పంతులుగారు Reformer. ఆయన దేశకాల పరిస్థితుల ననుసరించి బహుజాగరూకతతో మార్పులను తెచ్చుటకు ప్రయత్నించువాడు. అప్పారాయకవి Revolutionary. అతిస్వతంత్రుడు. తన మార్గమును "మెచ్చకుంటే మానిపోయె" నని కాలమునే తృణీకరించినాడు. ఆత్మవిశ్వాస మవేలము. కవిత్వంయొక్క ఆశయం హృదయాన్ని రంజింపజేసి ఆందోళన (Emotion) కలిగించుటేకాని, బుద్ధికి, పాండిత్యప్రకర్షకు పరిశ్రమ నిచ్చుటకాదని చాటించినాడు. ఎన్నో శతాబ్దములనుంచి విరహిణుల దూషణలకు మాత్రమే పాలైనచంద్రుడు "తాటి: నమునవాగి" సానుభూతితో భౌతికవిషయాలకు "చెరిమొగ్గ"టతోనే తెలుగుకవిత్వం కేవలం పద్ధెనిమిది బంధుకట్లతో వుండే "కొయ్యబొమ్మ" కాదనినీ, యుగయుగాలదాక హృదయములలో మారుమ్రోగే శక్తిగలదనినీ ఆంధ్రావనికి విశదమైంది.

తూర్పునపుట్టిన యీ Revolution తెలుగు సారస్వతానికి యాదవముసలం అనే నమ్మకంతో వెలువడ్డది ఆంధ్రసాహిత్యపరిషత్తు. వైయాకరణశాసనోల్లంఘనమునుండి, నూతనత్వమునుండి భాషను సంరక్షించి ఉద్ధరించాలని పరిషత్తు పూనుకొన్నది. దేశమంతటా గ్రామ్యగ్రాంథికవాదాలు చెలరేగేయి. గిడుగువారి సింహగర్జన ఆంధ్రదేశమంతటా ప్రతిధ్వనించింది. సారస్వతమంటే Philological Research మాత్రమేమో అన్నట్లు నిరూపణ అయింది. Canvas మీది చిత్రకళజోలికి పోకుండా గుడ్డయొక్క పడుగుపేకల పరిశీలన ప్రాధాన్యము వహించింది. పరిషజ్జీవితం నేటిదాకా యిట్టిచర్చలతోను, నన్నయభట్టు నియోగియా వైదికియా అనీ, పోతనది ఒంటిమిట్టా ఓరుగల్లా అనీ మొదలైన, యెన్నటికీ సమాధానం తేలని శుష్కవివాదములతోను, అముద్రితమైన మరికొన్ని దరిమిలా ప్రబంధాలు ముద్రించుటతోను సాగుతూంది. సారస్వతసంస్కరణం యువకులలో కలగకుండా ఉండేటట్టు Text Book కమిటీలు పాటుపడుతున్నాయి. క్రొత్తమార్గాలలో వ్రాసిన పుస్తకాలు Literary sedition గా భావించి, వాటిని విద్యార్థులందరికి రానీయకుండా జాగ్రత్తపడుతున్నాయి.

ఇన్ని అవాంతరాలలోనూ, తూర్పుననాటిన మొలక నశించకుండా గుంటూరులో రేకెత్తింది. నైసర్గిక పరిణామముయొక్క శక్తి అట్టిది కాబోలు. శ్రీ శివశంకరశాస్త్రి Leigh Hunt లాగ కళోపాసకులందర్నీ ఒకచోట కూర్చేరు. ఈసంధియుగంలో అప్పారాయకవితరువాత ఈయనయే సాహసుడని చెప్పదగును. ఇంతకాలమునుండి పరిషత్సభ సారస్వతమున కియ్యని ఉత్తేజమును సాహితీసమితి స్వల్పకాలంలో యిచ్చింది.

పరిషద్దృష్టికి భావకవిత్వమనేది ఛాందసబ్రాహ్మణునికి Cosmopolitan Dinner లాంటిది; కేవలము మలినము, మాలకూడు. దాని ఊసు తలపెట్టుట, అందు విషయమై శాంతముగా చర్చించుట పరిషత్తునకు వోఘాయిత్యము. భావకవిత్వమునెడల సత్యాగ్రహం వహించి దాన్ని నశింపజెయ్యాలని వారి అభిప్రాయం కాబోలు. కడచిన ఒకటి రెండు పరిషద్వార్షిక సభ లిందుకు నిదర్శనము. ఇక, మన ప్రధాన విద్యాసంస్థయైన యూనివర్సిటీ తన అంతేవాసుల చిత్తవృత్తిని నూతనకవిత్వమార్గమునుండి కాపాడుటకేదైన ఉపాయము దొరకిన చాలునని చూచుచున్నది. నవకవిత్వమన్న ఏహాంపు కల్లు నట్లు నేటి విద్యార్థుల నుద్బోధించినట్లయితే మున్ముందు భాషకు ప్రమాదము తప్పునని యూహ కానోపును.

కాకతాళీయంగా శుక్లపక్షమనే ఒక నూతన కావ్యం ఆంధ్రలోకంలో యీ నడుమనే ప్రచురిత మైంది. ఏతత్కర్తలు మాకు మిత్రులును, విద్వత్కవులును అగు శ్రీ అనంత పంతుల రామలింగస్వామిగారు; "సరోజినీ"కీర్తిశేషులగు వెంకటేశ్వర్లుగారి జ్యేష్ఠభ్రాత. ఆధునిక భావకవిసోదరులవలెనే పత్రికలలో అప్పటప్పట ప్రకటించిన కృతులన్నీ పోగుజేసి శుక్ల పక్షమనే పేరుతో ప్రసాదించిరి. విద్వత్కవిశ్రేణి ఇందుపై యొసగిన అభిప్రాయసంపుటి, శిశువునకు బుగ్గబొట్టువలె కావ్యమున కొక అంగరక్షగా నున్నది. రసాయన శాస్త్రాధ్యాపకులగు యం.వి.నరసింహస్వామిగారు కవిత్వతత్త్వము గూర్చి విపులముగా చేసిన analysis ముఖపీఠము నలంకరించినది. ఇట్టి సిద్ధాస్త్రము లభించుతేతడవుగా, సారస్వతముగూర్చి స్వతంత్రాభిప్రాయ ముండుటకు వయస్సైన చాలని, ఇంటర్మీడియేటు విద్యార్థులపై ప్రయోగింపబడెను.

ఈ "శుక్ల పక్షం"లో కవిగారు తమకు భావకవులమీదను, భావకవిత్వంమీదను గల అభిప్రాయము లిట్లు వెల్లడి చేసిరి:—భావకవుల భాష ఆంధ్రపైశాచి భాష యనియు, హూణకావ్యములనుంచి భావచౌర్యం చేస్తూ ఆ దొంగతనం దాస్తున్నారనియు, ఎంత గనినను పద్యాలలో భావ మొకటియు బయలు పడదనియు, ఆవేశంకొద్దీ వ్రాసినవాటికి తరువాత అర్థం వారే చెప్ప లేమంటారనియు, ప్రభువులగూర్చి, భగవంతుని గూర్చి కవిత్వాలుమాని, జీవితేశ్వరి, పసుల కాపరులు, తృణకణములు- ఇట్టివి కవితావస్తువులుగా చేసిరనియు, సోదరకవులకే అంకిత మిస్తారనియు- ఇత్యాది.

ఇందులో "భావకవి" అనే వ్యాసంలో కేవలం సాహితీసమితినే కవిగారు వారికంటికి గోచరించినట్లు చిత్రించేరు. వ్యక్తినిరసన మీగ్రంథములో లేదని అభిప్రాయదాతలలో కొందరు ధైర్యము చెప్పినను, శ్రీకృష్ణశాస్త్రి, కృష్ణపక్షము ఇందుకు గురిగా నున్నట్లు పసిపాపకైన విదితము.

పునరవలోకనముచేసి వీరి అభిప్రాయము లేపాటి రూఢియైనవో చూదాం.

భావకవులభాష ఆంధ్రపైశాచిభాష అనడంలో వున్న "వేశాకోళం" అటుంచి, అభిప్రాయం మాత్రమే గ్రహిస్తే, అది సుబోధంగా లేదని. "గమి కర్మీకృత నైక నీవృతు" డన్నది అచ్చాంధ్రపండితుడికి సుబోధం అవుతుందా, సాంస్కృతికపరిభాష సంపూర్ణంగా అలవర్చుకుంటే గాని? అట్లాగే "భావ" గీతా లర్థంచేసుకుందికి, ఏతాదృశమైన Western సారస్వతాన్ని ముందు అర్థంచేసుకోవాలి; అర్థంచేసుకుని, అట్టి రీతులు తెలుగులో అలవర్చుకొనుటకు చేయు ప్రయత్నమే యీ Renaissance అని గ్రహించాలి. ఇట్టి సంధియుగాల్లో జరిగే ప్రయత్నాలన్నీ బాగుండక పోవచ్చును. ఉత్తమతరగతిలోని భావకవుల కావ్యములు సుబోధంగా వున్నవే. కృష్ణశాస్త్రి వీరి కర్థముకాకపోవుట మిక్కిలి శోచనీయము.

ఆంగ్లమునుండి భావచౌర్య మున్నదని మరి యొక నేరం. స్త్రీముఖాన్ని చంద్రునితో పోల్చిన కవు లాదినుంచీ వున్నారు; అందుచేత ఆదికవితరువాతివారందరూ చోరులేనా? చౌర్యంవల్ల లభ్యమయే భావం నీరసిస్తుంది. "చంద్రవదన" అంటే చివరకి అసలర్థం స్ఫురించడం మానేసి రూఢంగా స్త్రీ అనే తడుతూంది. చౌర్యంచేసినభావం, చెరుకుముక్క నమిలి తినిపించినట్లుంటును. అందులో రస ముండదు. ఇందు కుదాహరణ మీ కావ్యమునందే యున్నది. "కవిరాజు" అను వ్యాసములో శ్రీనాథుడు రాజసభలో "అను నుపన్యాసము" నుండి ఒకవాక్యము:—"మాతయగు నవసరము నిర్మాణమునకు" అని. ఇది Necessity is the mother of Invention అనే ఇంగ్లీషు నుండి "భావచౌర్యం". శ్రీనాథునిచేత అట్లనిపించడంలో వున్న anachronism మాట అటుండగా, ఈ చౌర్యం దాపరికంచెయ్యడానికేమో అన్నట్టు కవిగారు Invention కి నిర్మాణం అని అనువదించేరు. నిర్మాణం అంటే Construction అనుకుంటాను. ఏదైనా Invent చెయ్యవచ్చు; ఇంకా నిర్మింపక పోవచ్చు.

తెలుగులో Emotion నిరినిగా ప్రదర్శించినది సాహితీసమితియే. Emotion చౌర్యంచెయ్యడంఎట్లు శక్యమాతుందో తెలియదు. కృష్ణశాస్త్రి ప్రభృతులలో Emotion లేదని కాని, లేదా శ్రోత్రియమైన ప్రబంధ యుగమునాడు Emotion ఎరుగుదుమని కాని కవిగారు విశ్వసింపగలరా?

భావకవితావస్తువుల నధిక్షేపించిరి. జీవితేశ్వరి, తృణకణము, పసులకాపరి మొదలగునవి కావ్యార్హ ములా? అట్టివి పూర్వము లేవు గనుక యెన్నటికి నుండరాదనికాబోలు! హృదయంగమముగా చిత్రించిన పటము ప్రభువుదైననేమి, పసులకాపరిదైననేమి? ఈ Literary Orthodoxy యొక్క చిత్తవృత్తి అది యెట్టిదోకాని, ఉత్త అక్షిని, అగమ్యం.

సోదరకవికి అంకిత మివ్వడమని ఒక దెప్పి పొడుపు. అందువలన భాషకు జరిగే మహాపచార మేమో తెలియరాదు!

ఈశుక్లపక్షం చనూతూవుండగా తోచిన కొన్ని సందేహాలు వివరిస్తున్నాను:—

"నీవెంచుం బదార్థంబు" నిర్దుష్టం కాదేమో.

"హృత్కోకిణావాస మొనర్చుచుండ" ఎరిగి యుండగా అనడానికి చేసిన ఛాందసపు డొంకతిరుగుడు కాబోలు.

"జారిణీకాంత"! జారిణి అంటే పురుషపరమైన అర్థం రాదే?

"న్యాయమె నన్ సుకవీ యటంచు నీ

వాడుట? యంత పెద్ద బిరుదావళికి..." సుకవీ అనేది ఒక్కటే బిరుదం, బిరుదావళికాదు. మరి "పెద్ద" అనేదానికి దేనితో అన్వయమో?

"అని యాతడు నవ్వింపగ" అని వ్రాయడంలో Sense of Humour create చెయ్యడానికి కితకితలు పెట్టినట్లుంది. అట్లనడంలో, ఒకవేళ నవ్వలేని అరసికు డెవడేనా పాఠకులలో వుంటే, "నవ్వకపోతే యెలాగునాయనా" అని stage-direction లాంటి దనుకుంటాను. మనకంటె ముందుగా హాస్యగాడే నవ్వడం vulgar గా ఉంటుంది.

"నన్ను కవిసింహమా యని యెన్ని తుదకు పరిహసింతువుగా పశుప్రాయునట్లు".

సింహాలని పశువులంటారా అని సందేహం. కవివృషభం, కామధేనువు అనే Coarse wit పూర్వం నుంచీ వున్నా, అందులో Coarseness నిలబెట్టి wit ని బైటికి గెంటేరు కవిగారిందులో. ఇది చూస్తూ వుంటే, వెనకటికి పానుగంటివారిసాలభఞ్జ "నఖశల్య పరీక్ష" స్ఫురణ కొస్తూంది. ఇలాంటి wit కి నవ్వగలవారు నేనున్నారా అనిసందేహం.

"ఎంతో క్రోధతామ్రాక్షుడై". మొదటి వ్యస్త పదానికి అన్వయం "క్రోధం" తో అని విశదం. అట్లుండడం నిర్దుష్టం కాదేమో.

"కవికాకవి భేదం బిక

చెవులారగ వినుము నేవచించెద".

ఈ ద్వితీయచరణ భాగము ఆరవవ్రేలుపలె నిరర్థకము. అయితేనేమి, పూర్వ కవిత్వ సంప్రదాయ సమ్మతము!

ఇట్టివి పెక్కులు.

మొత్తంమీద యీ కావ్యమందలి పరిహాసము, హేళనము "సరసము" గా లేకపోవుటయే కాక, నిష్పాక్షికముగ విమర్శించునెడల వాంఛనీయ మని తోచు సారస్వతసంస్థల నిరసించుటచే, వాఙ్మయ పురోభివృద్ధికి భంగకరముగాహూడ నున్నది. "లేత తెనుంగు పాపల" హృదయములలో ఇట్టి Prejudices నాటుకొనునట్లు యూనివర్సిటీ అవకాశ మేర్పరచుట యెంతయు శోచనీయము.

అందుచేత నమస్కార పురస్సరమైన నా మనవి యేమంటే:—

గతించిన యిరవై సంవత్సరముల నడుమను మొత్తముపై హిందూదేశమునకు కలిగిన ఉద్బోధచే ఆంధ్రులు

కూడా రాజకీయ సాంఘికాదిసమస్యలందు Tolerance, Free thinking మొదలగు నాగరకరీతు లెట్లలవర్చు కున్నారో, అట్లే సారస్వతమునకూడా నడుగడు కుంచము లాడక ముందంజ వేయవలసుంది. అట్టి పురో గాముల నాశీర్వదింపవలసిన విద్యాకేంద్రములైన యూనివర్సిటీయు, పరిషత్సభయు నవకవులతో సం ప్రతించి, సర్వజనానుమోదమగు సారస్వత ప్రణాళిక నొకటి నెలువరించి, బహుధా భిన్నములైన సాహిత్య రీతులను కేంద్రీకరించి, ప్రపంచభావములలో తెలుగునకు గూడ నామరూపము లేర్పాటు చేసి, అవ్యాజమగు సారస్వతసేవ చేయవలెను. ఆంధ్ర సాహిత్య పరిషత్తున కొక ప్రత్యేక విజ్ఞప్తి:—దేశకాలానుసరణంగా వస్తూన్న యీ మార్పులను గుర్తించి, లేదా గుర్తించుట కైన ప్రయత్నించి, ఒక Common platform మీద నిష్పాక్షికంగా నేటి సారస్వతస్థితిని గూర్చి అంగీ కారమునకు వచ్చుట పారిషదులకు విధియైయున్నది. శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు ఎంత లేదని చెప్పినా, నేటి తెలుగుకవిత్వంలో నూతనత్వం వారికి గోచ రించి ఉండకపోదు. వారు ఎత్తిచూపిన శబ్ద వాచ్య తాది దోషములు దోషములే అయినా, భావకవిత్వ మనే దురదృష్టపు పేరుతో బయలుదేరిన సారస్వత మార్గమే మంచిది కావనుట న్యాయమూరము. సార స్వతాభిరుచి గల యువకులును, సాహిత్యప్రకాండు లైన పరిషత్సభ్యులును పరస్పరము మనసిచ్చి మాటాడు కొని, అభిప్రాయములు కలియబోసుకుని, నిర్వ్యా జముగా భాషాసేవచేయుటకు ఈ ఇరువదవ శతాబ్ద మున అవకాశ దొరకకపోదు, ఆంధ్రుల సంఘీభావము నకు మాయని మచ్చ!

---

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## (రెండవ ముద్రణము) మొదటి సంపుటము

ఇందు చరిత్రలు, ప్రకృతిశాస్త్రములు, జీవితములు, నీతి, మత, సాంఘిక, వైద్య, రాజకీయాది విషయములు, భూగోళము, న్యాయము, శిల్పము, జ్యోతిషము మొదలగు సమస్తవిషయములు చర్చింపబడును.

ఈ సంపుటమున 'అ' నుండి 'అధ్వర్య' వఱకు గల నాలుగువందల పదములకు సంబంధించిన విషయ ములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితములయిన రంగుల బొమ్మలు ఎనిమిది, సాదాబొమ్మలు ౧౨౨ ఉన్నవి.

డెమ్మి నాలుగుపుటలసైజున ౬౦౦ పుటలు, మేలైనకాగితము. బంగారురేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు తోలుబైండు. వెల పది రూపాయలు మాత్రము. తపాలు లేక, రైలు ఖర్చులు ప్రత్యేకము.

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయ. రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి ఎచ్చును, తగ్గను వచ్చును. రు. ౧౧-౮-౦ మణిఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజిష్టరు తపాలుద్వారా పంపబడును. వి. పి. గా పంపగోరువారు అయిదు రూపాయిలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

కొలదిప్రతులే నిలువయున్నవి. త్వరపడవలయును. రెండవసంపుటము త్వరలో వెలువడనున్నది.

మేనేజరు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెంబరు ౭, తంబుశెట్టివీథి, మదరాసు.

# నాలందా పురాతన నిర్మాణములు



౧. నాలందా స్తూపము (చక్కబరచునప్పుడు)



౨. నాలందా స్తూపము (చక్కబరచినతరువాత)



3. ఒక సంఘారామము
(పైమట్టములోని వరాండా, గదులు
బాగుచేయకపూర్వము)



౪. మరియొక సంఘారామము
(ఉత్తరపుప్రక్క వరాండా,
పిల్లగోడవగైరాలు
బాగుచేసినతరువాత)



౫. పైకట్టడములే
బాగుచేయకపూర్వము

# ప్రేమపాశం

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

(అనువృత్తము)

## మూడో రంగం

[కాంతమ్మ యిల్లు. ఎక్కడికో వెళ్లడానికి పేరుభట్టూ, భద్రయ్యా గుమ్మం దిగుతారు.]

పేరుభట్టు—వోర్తిపోదుఃబునోరుసుమా, నీదీ.

భద్రయ్య—ఏం ?

పేరుభట్టు—చూస్తూ చూస్తూ సుబ్బాలకిసుబ్బోలు ముంచేస్తావు నువ్వు.

భద్రయ్య—ఏమిటోయి నీ గందరగోళం ?

పేరుభట్టు—ఎన్నిమాట్లు చెప్పినా నువ్వు కాస్తేనా వోపిక పట్టలేవు.

భద్రయ్య—ఓపిక యెందుకు పట్టాలీ? ఇది దొంగతనమా, లంజతనమా ?

పేరుభట్టు—కాకపోతే మాత్రం డప్పునాయిం చాలా యేమిటి ? మరుగంటూ లేదూ ?

భద్రయ్య—నీ వుద్దేశం యేమిటో నాకు మొద ణ్ణుంచీ బోధపడ్డం లేదూ.

పేరుభట్టు—అలా అని వూరుకున్నావా మరీ ?

భద్రయ్య—నే నిప్పుడు రాయడుతో అన్న మాటలో తప్పేంవుందో చెప్పూ నింపాదిగానూ.

పేరుభట్టు—బంగారంకోసం రాయడూ, మా పిన్నీ గంపెడు ఆశతో—పంగిడీ యెత్తులన్నీ వేస్తు న్నారు.

భద్రయ్య—అవును......అయితే ?

పేరుభట్టు—ఆ బంగారం నాకు నిశ్చయం అయిందంటే.

భద్రయ్య—ఏమున్తాడు...మనకేం ?

పేరుభట్టు—శుభమల్లే నాకు పెళ్లిప్రయత్నాలు—

భద్రయ్య—పెళ్లిపను లనవోయ్! ఇంకా ప్రయత్నా లేమిటి ?

పేరుభట్టు—ఇలాంటి సమయంలో నా పెళ్లి కోసం వాళ్లేడవడం—

భద్రయ్య—ఆ !...ఆ ! ...ఏమిటీ ?... తప్పే సుమా. తోచిందికాదు చూశావా ? క్షమించు. (రెండు చేతులూ పట్టుకొంటాడు)

పేరుభట్టు—ఇం కెందుకూ ? నడు. (అడుగు వేస్తాడు.)

భద్రయ్య—తీరా నోరుజారేసి తరవాత నాలుక కరుచుకుంటూవుంటాను నేను. ఒకణ్ణి తన్నబోయి నేనే బోర్లపడ్డట్లయింది నాపని. బుద్ధి వచ్చింది. ఇం కెప్పుడూ అధికప్రసంగం చెయ్యను పద.

(ఇద్దరూ వెళ్లిపోతారు. గుడ్లనీళ్లు కక్కుకొంటూ రాయడు)

రాయడు—(చెయ్యివిదుపుకొంటూ) చచ్చాను. (అరుగుమీద కూలబడి) దాటిపోయింది బంగారం ! ఎంత వుబలాటపడ్డానురా దైవమా ! దొరికినట్లే దొరికి పిట్ట తుర్రుమని యెగిరిపోయినట్లయింది నాబతుకు. అత్త ఆశపెడుతూనే వచ్చింది ; కాని యిలా మారిపోయింది చివరికి. ముష్టిపీనుగులాగ టుంయీ టుంయీ మంటూ తాంబరా వాయించుకొనేవాణ్ణి నమ్మి ఆవిడ మోస పోయింది. కాకిముక్కుకు కట్టిన దొండపం డయిపో యింది బంగారం. సెంటుభూమికూడా మిగలదు పేరి గాడికి. ఈమేడా, ఆస్తీ వాడి వైపోతాయికాబోలు. ఇదంతా వాడి తెలివితేటలవల్లే యిలా జరిగిం దను కోనా ? (ఆలోచించి, చెయ్యిజాడిస్తూ) అదిగదీ ! ఇం

కేం? ఉన్నాడుకాదూ శకునపక్షీ? ఈ కుట్రంతా ప్రకాశానిది. సందేహం లేదు. వా డే మాత్రమో మేశాడు పేరిగాడిదగ్గిర. తోచిందికాదు నాకు. ఒక్కపాతికరూపాయలు మొగాన కొడితే వాడు భృత్యుడై వుండును. మనకి...ఇంతకీ, ఈపాపంఅంతా మా నాన్నది. మా అమ్మ యెంతపోరినా నన్ను రాజమహేంద్రవరంలో ప్రవేశించనిచ్చాడు కాడు. ఏదో వంకపెట్టి ఇక్కడే మకాంవేసివుంటే ఇలా జరగనిస్తునా నేను?...ఇప్పుడయితేమాత్రం మించిపోయిందేమిటి? దొడ్డమ్మా, సూరన్నా యీసమ్మంధం వొప్పుకోరు. మనంకూడా వొకసమిథ పడేద్దాం. బంగారం యెలా దాటిపోతుందో యిక చూస్తాను. చివరికి నాకు లాభం లేకపోయినా వాడికి తప్పిపోతే అదే పదివేలు.

(వెళ్లిపోతాడు.)

## నాలుగోరంగం

[కాంతమ్మ యిల్లు. దక్షిణపు దొడ్లో క్రొత్తగా వేసిన పందిట్లో ప్రకాశమూ, పేరుభట్టూ మడతమంచం మీద కూచుని వుంటారు. కాంతమ్మ, ఆమె వెనకాల బంగారమ్మ వసారాలో కూచుని వుంటారు. ప్రకాశం చేతిలో వొక వుత్తరం. వొకపందిరిస్తంభందగ్గిర ఉత్తరం తెచ్చిన మంగలి కూచునివుంటాడు. ఒంటిగంట అయివుంటుంది.]

ప్రకాశం—రాత సూరన్నగారిదే.

పేరుభట్టు—మాఅమ్మవుద్దేశం కొంతా, మా చిన్నాడివుక్రోషంకొంతా కలిసి వుత్తరంపూర్తిఅయింది.

కాంతమ్మ—ఏమనిరాశా డన్నయ్యగారూ?

ప్రకాశం—మాలో మేం చదువుకోడానికే సిగ్గుపడుతున్నాం. నువ్వు చదివి మీఅమ్మకి చెబుతావా కోడలా?

బంగారమ్మ—నే నా వెధవవుత్తరం ముట్టుకోను.

కాంతమ్మ—తప్పమ్మ!

ప్రకాశం—కాదుకాదు. బంగారం తగినమాటే అంది. అక్కయ్యగారూ! ఈవుత్తరాని కదే తగిన గౌరవం. మాకు తోచిందికాదు. ఏమంటారు పేరుభట్టుగారూ?

పేరుభట్టు—బంగారం తూచినట్లు మాట్లాడింది.

కాంతమ్మ—అంతచెడ్డవుత్తరం చదవడం యెందుకు, మనస్సు పాడుచేసుకోడం యెందుకు? చింపెయ్యండన్నయ్యగారూ!

పేరుభట్టు—వద్దువద్దు. ముందుముందు దాని అవసరం వస్తుంది. (పుచ్చుకొని జేబులో పెట్టుకొంటాడు.)

మంగలి—బాబయ్యా! నేను నాకరీవాణ్ణండి మీఅన్నయ్యగారు తొందరపెడితే పట్టుకొచ్చానండి (నమస్కారం చేస్తాడు.)

పేరుభట్టు—నీక స్పేం వుందీ యిందులోనూ?

మంగలి—చిత్తం బాబయ్యా! మీఅన్నయ్యగారు చెప్పినమాటలవల్ల నాకు అనుమానం కలిగినమాట సిసలేకానండి, లోపల యేం రాశారో తెలవక తెచ్చానండి.

పేరుభట్టు—మావాడే మన్నా డేమిటి?

మంగలి—బా-బ-య్యా! (చేతులు నలుపుకొంటాడు.)

పేరుభట్టు—సందేహించకు. నీకేం బాధా?

ప్రకాశం—ఏమన్నారో చెప్పు. ఉత్తరంలో రాసినమాటలకంటే చెడుమాట లుండవులే.

మంగలి—అలాగేకానండి, నురేం లేదుబాబయ్యా ఈమాటలు నేనిక్కడ—

పేరుభట్టు—వాడిదగ్గిర — అసలు వాడితో మాట్లాడ్డంకూడానా యింకానూ?

మంగలి—అయితే ఆలకించండిబాబయ్యా! మీ అన్నయ్యగారిదగ్గిర వున్న చనువునిబట్టి మేనమామగారి అమ్మాయిని చేసుకోడాని కింత ఆలోచన యెందుకండీ అని అడిగానండి నేను.

పేరుభట్టు—ఊహూ.

మంగలి—మీ పెద్దన్నయ్యగారికి అత్తోరిపల్ల చాలా మర్యాదలు జరుగుతున్నాయిటండి.

పేరుభట్టు—సరే.

మంగలి—ఈసమ్మంధం అయితే మీకు జమీ ద్దారీముచ్చట్లు తీరతాయిటండి బాబయ్యా!

పేరుభట్టు—అదీ వాడి యేడుపు. విన్నారా బాబుగారూ?

మంగలి—మీ చిన్నన్నయ్యగారి అత్తోరు బీదవారుటండి. పైగా వారికి మర్యాద లేమీ తెలవవుటండి.

పేరుభట్టు—అయితే?

మంగలి—మీ యిద్దరిమధ్యా తమకి తలకంపు లౌతాయిటండి.

ప్రకాశం—ఇదికూడానా? బాగుంది.

కాంతమ్మ—యెంత కడుపుమంటో చూశారా అన్నయ్యగారూ?

ప్రకాశం—తనకి లేదని యేడిస్తే వొకకన్ను, యెదటివాడికుండిపోయిందని యేడిస్తే రెండోకన్నూ పోయాయిట వెనకటి కొక పెద్దన్నయ్యకి. అలావుంది సూరన్నగారి యేడుపు.

(తెరలో)

పేరుభట్టుగారూ!

పేరుభట్టు—ఉత్తరం వచ్చినట్లుంది చూసిరారా.

మంగలి—చిత్తం బాబయ్యా! (వెడతాడు)

కాంతమ్మ—తనదగ్గిరే కోడరికం వెలిగిస్తే నా బిడ్డని బతకనిస్తుందా అన్నయ్యగారూ, మాచిన్నవొదినా?

పేరుభట్టు—వాళ్లూ, నేనూ యింకా కలియడం కూడానా?

ప్రకాశం—తీరేపోయింది...కాని నిజం అంతే.

(మంగలి వచ్చి పేరుభట్టుకి వొకకవ రిస్తాడు.)

పేరుభట్టు—(ఉత్తరం విప్పి) మా పెద్దన్నయ్య రాశాడు. "మీవొదినకి రేపు స్నానం. రేపు మధ్యాహ్నం బండిమీద వస్తున్నాం."

కాంతమ్మ—ఇవాళ రారూ? పోనీ లెండి. ఇదే బాగుంది. అంతటికీ వారినే నమ్ముకున్నందుకు పెద్దమ్మాయికి యిక బెంగలేదు.

పేరుభట్టు—"అమ్మ ప్రోత్సాహంమీద సూరన్న నీకు చాలా అసందర్భపుఉత్తరం రాశాడని తెలిసింది. వాళ్లు పెళ్లికికూడా రారనుకుంటాను. వస్తే పెళ్లిలో నానా అల్లరీ చేస్తారు. అంతకంటే రాకపోతేనే మంచి దనుకుంటాను."

కాంతమ్మ—అప్పుడేనా సుఖంగా బతకనివ్వ నప్పు డింకెందుకూ అన్నయ్యగారూ?

ప్రకాశం—అవునవును.

పేరుభట్టు—"కుటుంబానికంతా పెద్దనైనందుకు నీపెళ్లి నాచేతిమీద జరగవలసిందే. అత్తకీ మనకీగూడా ఆధారం ప్రకాశంబాబుగా రున్నారు. భారం అంతా వారిదే."

ప్రకాశం—మొదలూ.

కాంతమ్మ—అలా అంటారేం అన్నయ్యగారూ? నాకు దిక్కెవ్వరున్నారూ యింకా? నాకూతురికి పెళ్లి చెయ్యడానికి మీకంటే నాకు ఆధారం యేదీ?

ప్రకాశం—పేరుభట్టుగారిలాంటి పెళ్లికొడుక్కి కాళ్లుకడిగే అదృష్టం వొపట్టానపట్టదు. నిజమే. కాని—

పేరుభట్టు—ఇంకేం? బాణాలు ఎప్పటికప్పుడు మామీదకే తిప్పేస్తూవుంటారుగా చివరికీ?

ప్రకాశం—లేకపోతే నేను భరించగలనా మహానుభావా?

(భద్రయ్య వస్తాడు. అత నేం చెబుతాడో అని అంతా నిరీక్షిస్తూవుంటారు. వారెవ్వరూ మాట్లాడనందుకు భద్రయ్య గాభరాపడతాడు.)

పేరుభట్టు—రా, కూచో. దిక్కులుచూస్తావేం?

భద్రయ్య—వూరికేనే...దిక్కులు మాడ్డంయేమిటీ?

పేరుభట్టు—అయితేలే. ఏం జరిగిందీ?

భద్రయ్య—మనం అనుకొన్నట్లే అయింది.

పేరుభట్టు—సరే. అదిమాత్రం సామ్మకాదూ? (ప్రకాశంతో) నాళం రాజేంద్ర నారాయణస్తగారి నెరుగుదురా బాబుగారూ?

ప్రకాశం—ఆ!

పేరుభట్టు—వారి మూడో అమ్మాయికి రెండేళ్ల నుంచి నేను ఫిడేలు నేర్పుతున్నాను. వారు నాకు చేస్తానన్న సాయం—చెప్పవోయ్.

భద్రయ్య—ఆయన సింగరుసైకిలిస్తామన్నారు.

పేరుభట్టు—నాలుగేళ్లయింది నేను సైకిలెక్కడం నేర్చుకొనీ. అప్పణ్నుంచీ సైకిలు కొనకుండానే కాలం గడుపుతున్నాను.

ప్రకాశం—సైకిలైతే వారికళ్లయెదట చాలా కాలం వాడుకొంటారు మీరు. రొక్కం అయితే—

పేరుభట్టు—నిజమే.

కాంతమ్మ—ఎవరి సరదా వారిది. అంతసొమ్ము ముట్టచెప్పాటప్పుడువారలానిశ్చయించుకోడంసర్మంగానే వుంది. ఏమంటా రన్నయ్యగారూ?

ప్రకాశం—ఇంతకీ, పేరుభట్టుగారు పనిలేనివారు కూడా కారాయె. రోజుకి నూరుసమ్మా లెక్కాలి దిగాలి.

పేరుభట్టు—నేనేనా వొక్కమాటే అన్నాను రొక్కంమాట. తరవాత మీచిత్తమనే చెప్పాను.

ప్రకాశం—మీకు వొకళ్లు చెప్పాలా యేమిటి?

భద్రయ్య—సాయంత్రం షాపుకి వచ్చి సైకిలు పట్టుకొని వెళ్లమన్నారు నిన్ను.

పేరుభట్టు—ఇంతకంటేనా?...ఇంకేమిటి?

భద్రయ్య—దేవరకొండ అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకులుగారి యింటో భోజనాలదగ్గిర గమ్మత్తు నిశ్చయం జరిగింది.

పేరుభట్టు—(ప్రకాశంతో) వారి రెండో అమ్మాయికి రెండేళ్లు గాత్రపాట చెప్పాను. ఇప్పుడు మూడో అమ్మాయికి మరళి నేర్పుతున్నాను. వర్ణాలు కావచ్చాయి. నాయకులుగారి నెరుగుదురా మీరూ?

ప్రకాశం—నిరుడే కామా వారియింటో కార్తీక మాహాత్మ్యం చెప్పించారు మీ మామయ్యగారు నా చేతా? వారి బహుమతీ చాలా హెచ్చుగానే వుంటుంది. అందులోనూ శ్యామలాంబగారి యెత్తులన్నీ చాలా చమత్కారంగా వుంటాయి.

కాంతమ్మ—నిరుడు మీమామయ్యకి వెండిహరివాణమూ, గళానూ, వుద్ధరిణా యిచ్చారు, ఆవిడేనా శ్యామలాంబగారంటేనూ?

పేరుభట్టు—సరేసరే.

ప్రకాశం—ఆవిడచేతి అన్నం తింటే మధ్య మధ్య వుపవాసాలు చెయ్యాలి. తినగలరో లేదో అని చూడ్డంలే దిక. "ఈకాస్తే, ఈకాస్తే" అంటూనే—. ఆవిడ వంట చేస్తే అమృతంలాగకూడా వుంటుంది. కనక భోజనానికి కూచున్నవారుకూడా మోతాదుగా లేవలేరు. తాంబూలం యిస్తే అరమోద తమలపాకులూ, అరపంపు వక్కలూ, చిల్లరసామాను మరో అరపంపూ— పూర్వ జన్మంలో పెట్టిపుట్టారు. ఇప్పుడు కావలసినంత వుంది, ముందుజన్మకోసం పంచిపెడుతున్నారిప్పుడు. ఆ దంపతులకి ప్రదక్షిణం చేస్తే చాలు భూప్రదక్షిణం చెయ్యనక్కరలే దిక.

పేరుభట్టు—నాయకులుగారేమన్నారు? శ్యామలాంబగారేమన్నారు?

భద్రయ్య—పెళ్లి రెండోనాడు బంతులాటవేళ వారు ఇంటిల్లపాదీ వస్తారుట—

కాంతమ్మ — వారిని పిలవడం మరిచిపోకండేం అన్నయ్యగారూ!

ప్రకాశం—మరిచిపోతానా? జ్ఞాపకంవుంటుంది కాదూ భద్రయ్యగారూ, మీకూ్కడానూ?

భద్రయ్య—అలాగే...బంతులాట ముగిశాక సంగీతకచేరీట. అంటే, పెళ్లికూతురు వొకటో రెండో వర్ణాలూ, కృతులూ పాడితే పెళ్లికొడుకు ఫిడేలు వాయించాలిట. తరవాత పెళ్లికొడుకు అలాగే పాడితే పెళ్లికూతురు ఫిడేలు వాయించాలిట. తరవాత వారు బహుమతీ చేసి, రాత్రి భోజనంకూడా చేసి—

కాంతమ్మ—రెండోనాడు జిలేబీ చేయించం డేం అన్నయ్యగారూ!

ప్రకాశం—తప్పకుండానూ.

పేరుభట్టు—ఎవరి పురమాయింపోయ్ యిదీ?

భద్రయ్య—శ్యామలాంబగారిదే.

ప్రకాశం—భేష్! నేను చెప్పలేదూ?

కాంతమ్మ—ఏం సరదా అండీ ఆతల్లిదీ?

పేరుభట్టు—నాయకులుగా రేమన్నారోయ్?

భద్రయ్య—అదంతా క్రమంగా జరిగితీరవల సిందే అన్నారు.

పేరుభట్టు—మీరేమంటారు బాబుగారూ?

ప్రకాశం—ఇంకా ఆలోచన ఎందుకూ? ఏమంటారు అక్కయ్యగారూ?

కాంతమ్మ—నిక్షేపంలా వుంది. (బంగారమ్మతో) వినపడిందా తల్లీ?

బంగారమ్మ—(సిగ్గుపడి వెళ్లిపోబోతుంది.)

కాంతమ్మ—(పట్టుకొని వొళ్ళో కూచోపెట్టుకొని) తప్పుకాదు తల్లీ? అప్పుడుకూడా యిలా చేస్తే బాగుండదు సుమా!

ప్రకాశం—మీకేమీ బెంగ అక్కర్లేదు. సమయానికి ధైర్యం తెచ్చుకుంటుంది కోడలు.

(తెరలో)

కాంతమ్మగారండీ!

కాంతమ్మ—వీరాచార్లు పిలుస్తున్నాడు. నగలు తెచ్చినట్టున్నాడు.

ప్రకాశం—అంతా హాలులోనే కూచుందాం పదండి. పదవమ్మా కోడలా! మీ అత్తని నువ్వు పిలుచుకొనివస్తావా, నేను వెళ్లనా?

కాంతమ్మ—వెళ్లుతల్లీ!

బంగారమ్మ—(వెడుతుంది.)

(అందరూ వెళ్లిపోతారు.)

## ఏడో అంకం

### మొదటి రంగం

[ప్రకాశం యిల్లు. దక్షిణపువసారాలో రాయడు నిరుత్సాహంగా కూచుని వుంటాడు. రత్తమ్మ దగ్గిరగా నుంచుని వుంటుంది. సమయం, పొద్దున్న తొమ్మిది గంటలికి.]

రత్తమ్మ—కాస్తసేపటికి స్నాతకం అయిపోతుంది. తెల్లవారగట్ల పెళ్లి. ఎంత తల్లకిందులైపోయింవిరా నాయనా, మన ఆశ అంతానూ?

రాయడు—నాకు ప్రపంచకం యేమీ కనపడ్డం లేదు. నాపక్కని పెళ్లిపీటమీద కూచునివున్న బంగారాన్ని పేరిగాడు రెక్కపట్టుకొని లాక్కొని పోతూ వున్నంత గాభరా పడిపోతోంది నామనస్సు. నువ్వు బలవంతపెట్టడంవల్ల వచ్చానుగానీ—

రత్తమ్మ—రాకపోతే అదో ఘోరం. మామయ్య చచ్చిపోయినందుకు మనంకూడా రాకపోతే లోకులు గుడ్లు పీకెయ్యరూ? మన కష్టసుఖాలు లోకుల కేం తెలుస్తాయీ? పేరిగాడు మాత్రం మేనల్లుడు కాడా అని అడుగుతారు ప్రజలు. ఎవరి కెంత ఆస్తి వుందో, యెవరి తాహ తెలాంటిదో యెవరు చూస్తారూ?

రాయడు—(నిట్టూర్పు విడుస్తాడు.)

రత్తమ్మ—అయితే అయింది, బెంగ పెట్టుకోకమ్మా! ఇదే పిల్లా యేమిటి? దీని నెత్తిమీద యెగిరిపోయేవాళ్లున్నారు. దీనిమీద ఆశపెట్టుకొని యిదివరకి వూరుకున్నాను; గాని యిక మూడోరోజుకి చేసేస్తాను నీకు పెళ్లి.

రాయడు—మామయ్య బతికి వుండగా నేను రాజమహేంద్రవరం ప్రవేశించివుంటే యిదిలా జరుగునా?

రత్తమ్మ—నే నందుకోసమే దేవుళ్లాడాను.

రాయడు—నాన్న నాకొంప తీశాడు. ఇంకేమనుకుంటే యేం లాభం?

రత్తమ్మ—అదీ కొంత నిజమే; గాని—ఇంతకీ యోగం లేకపోయింది. ఘటన లేదని నిశ్చయించుకోవాలి. పేరిగాడికి ఘటన వుండమట్టే సూరిగా డెంత తిడుతూ వుత్తరంరాసినా, చివరికి మాచిన్నక్క రాకపోయినా, లెక్కకి వొక్క ఆడపడుచు, అదికూడా రాకపోయినా డివ్విడివ్విమంటూ పెళ్లి అయిపోతోంది. అయినా ఏమందంలే. మూడుముళ్లూ పడగానే సరా? అత్తతమ్ములు వొక్కడుకూడా రాలేదుగదా! ఇక రాత్రికిమాత్రం వస్తారని నమ్మకం యేమిటి? వచ్చినా ప్రకాశంగారుట కన్యాధారపొయ్యడం. ఏం బాగుంది నాయనా? మేడ వుందన్నమాటేగాని ముచ్చట్లో? ఇల్లరికంకూడా వుండాలిట. పోనిద్దు నాయనా!

రాయడు—కాకపోతేమాత్రం యిక చేసే దేం వుందీ?...మూడుముళ్లూ పడగానే వెళ్లిపోతాను నేను. కళ్లారా చూసి నేను భరించలేను అయినురోజులూనూ.

(కోటమ్మ వస్తుంది. రత్తమ్మ తెల్లపోతుంది. రాయడు కడుపు పిసుక్కుంటాడు.)

కోటమ్మ—ఏమిటమ్మా భరించలే నంటున్నాడు నీకొడుకూ?

రత్తమ్మ—ఏమిటో!......రాయడు కడుపుబ్బరంతో బాధపడుతున్నాడు. ఏమీ తోచడంలేదు.

కోటమ్మ—మేం యెరగంసుమా యీ కడుపుబ్బు లెప్పుడూనూ...అయితే రత్తీ! మనలో మన మాటగానీ, మీరుగూడా దాటిపోనిచ్చారేమే?

రత్తమ్మ—పేరిగాడుమాత్రం మేనల్లుడు కాడా యేమిటి? ఎంతమంది కని యిస్తుందీ కాంతమ్మ మాత్రం?

కోటమ్మ—అయితే, మావెంకడికోసం నే నడుగుతూ వుండగా యెందుకు ప్రయత్నంచేశారూ మీరూ? మావాడుమాత్రం మేనల్లుడు కాడా యేమిటి?

రత్తమ్మ—నీకంటే ముందే అడగడం మొదలుపెట్టాం మేము. బంగారానికి అన్నం ముట్టించినప్పుడు నేను వెండిగిన్ని యెందుకిచ్చానో యెరుగుదువా నువ్వు?

కోటమ్మ—బారసాలనాడు వెండి వుగ్గుగిన్ని నే నెందుకిచ్చానో నువ్వెరుగుదువా?

రత్తమ్మ—కిందటి పుష్కరాలికి వచ్చినప్పుడు పాంకేబుపట్టీలు కొనియిచ్చాను నేను, నువ్వు చూశావా?

కోటమ్మ—ముందుముందు నే నింకా యేం పెట్టదలుచుకొన్నానో నీకు తెలుసా?

రత్తమ్మ—అదా యేమిటి లెక్క? కాకపోయినా, తమ్ము డెంతసేపూ "చదువు, చదు" వనీవాడు. నీ ఆశేగాని మీవెంకడి కెలాగా యివ్వరూ బంగారాన్ని.

కోటమ్మ — నీకొడుక్కిమాత్రం యిచ్చారా యేమిటిప్పుడు? ఇంతకీ: మావాడికంటె మీవాడి యెక్కువేమిటమ్మా చదువులోనూ?

రత్తమ్మ—మావాడు దరువుపారం చదివాడు. మీవాడి చదువూ వొకచదువేనా యేమిటి?

కోటమ్మ—చదివాడు చదివా డన్నమాటే గాని యెంత గింజుకున్నా నీకొడుక్కి యిప్పటికేనా నౌకరీ దొరకదాయె. ఏంలాభమమ్మా?

రాయడు—అవును దొడ్డమ్మా! నేను శుద్ధ అప్రయోజకుణ్ణే. సరేనా? నువ్వు వూరుకో అమ్మా!

రత్తమ్మ—బాగాచెప్పావు. ఇంకాచెప్పాలా సమాధానం?

కోటమ్మ—పెద్దపెద్దపరీక్షలిస్తే యిక భూమ్మీదే వుండకపోదురు తల్లీ కొడుకూనూ. ఎగిసెగిసిపడేవాళ్ళని దేవుడు అణిచివెయ్యడూ? నాకొడుకు నంటే నే నూరుకుంటానేం? మాబాగా జరిగింది. మావాడికివ్వకపోయినా నాకు సంతోషమే. వీళ్లంతా పేరన్న ముందు దిగదుడుపే. (వెళ్లిపోతుంది.)

రత్తమ్మ—చూశావా? గిల్లి కజ్జాపెడుతుంది దీనిల్లు వల్లకాదుగానూ. నోరు విప్పితే యిక మాట పడ్డంఅంటూ లేదు. ఒక్కమాటేనా తిన్నగా రాదు.

రాయడు—అక్క డేం అంటిస్తుందో?

రత్తమ్మ—అంటిస్తే మొగం నేలకేసి బెట్టి యాడ్చ య్యనూ? వూరుకుంటానేం? అబ్బో! మహామహాకరణం పెళ్లామే ఆగలేకపోయింది నాదగ్గిర. వీలు తప్పితే ధోరణి కనిపెట్టి ముందరే యేడిపించని నేనే అందు కుంటాను. మాట్లాడకపడుకో. (వెళ్లిపోతుంది)

రాయడు—శ్రీహరీ! స్నాతకప్పటికి బదులు తాటాకుచాపా రాసింది నాకు?

(తెరదించాలి.)

## రెండో రంగం

[కాంతమ్మ యింటిముందు పెళ్లిపందిట్లో ప్రకాశమూ, శేషయ్యా నుంచునివుంటారు. వేళ మధ్యాహ్నం నాలుగున్నర.]

శేషయ్య—ఇంకీనాలుగు రోజులూ మన మామాట యెత్తుకోవద్దు. వాడిబడు కెప్పుడూ అంతే. మా అమ్మ వాడి మాటమీద నడుస్తోంది.

ప్రకాశం—అయినా, కన్న కొడుకుపెళ్లికి రాకపోవడం—

శేషయ్య—తల్లి అక్కడక్కడకూడా రాక పోవడం వుందికదూ? మా అమ్మవిషయం మనం యిలా సమాధానం చెప్పుకొందాం.

ప్రకాశం—పైవాళ్లయితే మీరన్నమాటే; కాని తమ్ముడిమింటికి రావడానికూడా ఆలోచనే?

(వెంకన్న తమలపాకులు వికారంగా నములుతూ రభసంగా వస్తాడు.)

వెంకన్న—భోగంవాళ్లింకా వచ్చారు కారేం పెద్దన్నయ్యా?

శేషయ్య—ఔనురోయ్! నాకు తోచిందే కాదూ. మసలివాళ్లం మాపని యెప్పుడూ యింతే గాని, యీనాలుగురోజులూ భోగంవాళ్లమీద పెత్తనం నువ్వు చెయ్యాి. కుర్రకారునేగాని మమ్మల్ని లక్ష్యపెట్టరు వాళ్లు.

వెంకన్న—(వికారంగా నవ్వుతూవికటంగాతూలుతూ) నువ్వు మహామంచివాడవు పెద్దన్నయ్యా!(అటూయిటూమాసి)నాకర్లు వొక్కడూ కనపడ్డేం? పిలకపట్టుకొని లాక్కువస్తాను లాం-జకొడుకుల్ని. (వెడతాడు.)

(ప్రకాశమూ, శేషయ్యా వొకళ్లని చూసి వొకళ్లు ఫక్కున నవ్వుకొంటారు.)

శేషయ్య—మాదొడ్డమ్మ పీడికోసం—

ప్రకాశం—అవునవును. అదో విచిత్ర గాథ. పోకుండలు—(నవ్వి) కాని, కాలేవని బెంగలేదు అబ్బాయికి. రాయడిలా కాదు. అటమటించిపోతున్నాడు.

శేషయ్య—అలాగేం?

ప్రకాశం—మీ సూరన్నగారికీ, రాయడికీ వుజ్జీ సరిపోతుంది. మీ రత్తమ్మపిన్నిగారుకూడా చాలా లౌక్యురాలే.

శేషయ్య—మావాళ్లలోకల్లా ఆవిడే గడుసుదండీ.

ప్రకాశం—సందేహమా?

(ఒకయువకుడు ఉరకలు వేసుకొంటూ వచ్చి సైకిలు అడ్డదిడ్డంగా స్తంభానికి చేరుస్తాడు. ప్రకాశం వులిక్కిపడిమాస్తాడు. యువకుడు "బాబయ్యగారండి, బాబయ్యగారండి" అంటూ ప్రకాశంముందు కూలబడతాడు. ప్రకాశమూ, శేషయ్యా తెల్లపోతారు.)

యువకుడు—నేను చెప్పలేను బాబయ్యా! నాకు నోరు రావడంలేదు పంతులుగారూ! అయ్యో! పేరుంబొట్లు బాబయ్యగారూ! (ఏడుస్తాడు.)

ప్రకాశం—ఏమిటోయి సంగతీ?

శేషయ్య— పేరుభట్టు అంటాడేమిటి బాబుగారూ యికనూ?

యువకుడు—ఇం కేం వుంది బాబయ్యగారూ? ఏంచెప్పను నాయనగారూ?

ప్రకాశం—పేరుభట్టుగారి కేం?

యువకుడు—పేరుంబొట్లు బాబయ్యగారు మోటారుకింద పడిపోయారండి బాబయ్యోయ్!

శేషయ్య—తమ్ముడికి దెబ్బతగల్లేదుకదా?

యువకుడు—మున్సిపాల్టీవారి తుక్కుమోటారు పేరుంబొట్లుబాబయ్యగారిని తొక్కేసింది పంతులుగారూ! వోకాలూ, వోచెయ్యీ వూడిపోయాయి. తల నిండా గాయాలు. చూడలేకపోయాను బాబయ్యోయ్! (ఏడుస్తాడు.)

ప్రకాశం—ఇప్పు డెక్కడున్నారూ?

యువకుడు—పేరుంబొట్లు బాబయ్య గారిని కారుమీద పెద్దాసుపత్రికి తీసుకెళ్లారు బాబయ్యా!

ప్రకాశం—శ్రీహరీ! (తలతిరగగా స్తంభానికి జేరబడతాడు.)

శేషయ్య—తమ్మ డేమైపోతాడు బాబుగారూ? చూస్తారేం బాబుగారూ? (వొణుకుతాడు)

ప్రకాశం—శ్రీరామచంద్రా! (తెప్పిరిల్లి యువకుడితో) వెంటనే రెండుజట్కాలు తీసుకురా నాయనా! రండి శేషయ్యగారూ యింటోకి.

(ఇద్దరూ లోపలికి వెడతారు.)

యువకుడు—(నింపాదిగా లేచి సైకిలుతీసి) పేరుంబొట్లు బాబయ్యగారండోయ్! నన్నిడిచి పెట్టి వెళ్లిపోతారా బాబయ్యోయ్!

(సైకిలెక్కి వెళ్లిపోతాడు.)

## మూడో రంగం

[ప్రకాశంయింట్లో దక్షిణపువసారా. రాయడు చాపమీద పడుకొని దొర్లుతూవుంటాడు. రత్తమ్మ ఆత్రంతోటీ, సంతోషంతోటీ వస్తుంది.]

రత్తమ్మ—పేరిగాడు మోటారుకింద పడిపోయాడుట్రా!

రాయడు—(వులిక్కిపడి) ఏమిటే?

రత్తమ్మ—వొక చెయ్యీ, వొక కాలూ ముక్కచెక్కాకింద యెగిరిపోయాయిట. తలా, వీపూ గాయాలుట. బతకట్ట.

రాయడు—రామరామా!

రత్తమ్మ—లేమ్మా, ఇదెందుకు జరిగిందో ఇలాగ.

రాయడు—చూశావా? పొద్దున్న పేరిగాడు స్నాతకప్పీటమీద కూచున్నది మొదలు నేనుపడ్డ యాతన భగవంతుడికి తెలుసు. నువ్వెందాకా ఘటన ఘటన అన్నావు జ్ఞాపకం వుందా? (లేచి నుంచుంటాడు.)

రత్తమ్మ—ఇప్పు డేమీ మాట్లాడవద్దు. అందరికంటే యెక్కువగా విచారించినట్లు కనబడాలి మనం. తొరగా చొక్కా తొడుక్కుని రా అమ్మా!

రాయడు — క్షణం. (చిలక్కొయ్య నున్న చొక్కా తీసి తొడుక్కొంటాడు.)

రత్తమ్మ—జట్కాలు వెళ్లిపోతాయి. ముందు నేను వెడుతూవుంటాను, నువ్వు వెనకాల రా. (వెళ్లిపోతుంది.)

రాయడు—(పైకి చూసి, నమస్కారం చేస్తూ) శ్రీకృష్ణా! ద్వారకావాసా! అంతా నీదేభారం.

(రాయడు వెళ్లిపోతాడు. వడివడిగా కోటమ్మ వస్తుంది.)

కోటమ్మ—ఒసేవ్ రత్తీ? (చూసి) యేదీ? రాయడూ! ఇద్దరూ వెళ్లినట్లున్నారప్పుడే. నేనే వెనకపడ్డట్టున్నాను. పోవాలి. (రెండడుగులు వేసి) ఎవళ్లేమయినా సరే, కాంతమ్మని విడిచివుండను నేను.

(వెళ్లిపోతుంది.)

## నాలుగో రంగం

[పెద్దఆస్పత్రిలో చివరిబంగళా. ఎక్కడచూసి నా యిసకవేస్తే రాలనంతజనం. లోపల ఆపరేషను టేబిలుమీద పేరుభట్టు. ప్రకాశమూ, కాంతమ్మా, బంగా

రమ్మా, శేషయ్యా, భద్రయ్యా చుట్టూ వుంటారు. రత్తమ్మా, రాయమ్మా, కోటమ్మా, వెంకన్నా సంశుల్లో వుంటారు. అందరు దుఃఖిస్తూవుంటారు. భద్రయ్యా పేరుభట్టుకి విసురుతూ వుంటాడు.]

పేరుభట్టు—బాబుగారూ! అన్నయ్యా!

ప్రకాశం—ఏంబాబూ?

శేషయ్య—ఏమోయ్?

పేరుభట్టు—నన్నోమాటు అత్తపాదాలమీద పడెయ్యగలరా?

కాంతమ్మ—(ఏడుస్తూ) నావంతు వచ్చిందా నాయనా యిప్పుడూ? నన్నింత బూడిద చేస్తా వనుకోగా నా గొంతుకోస్తున్నావా పేరుభట్టూ?

పేరుభట్టు—నామాట వినిపించుకోవూ?

ప్రకాశం—అక్కయ్యగారూ! వొక్కమాటు, వొక్కక్షణం, పేరుభట్టుగా రేదో చెబుతున్నారు, వినాలి.

కాంతమ్మ—ఏం నాయనా? నావు అప్పగింతలు తరవాయా? అయ్యో! భరించలేనోయ్!

పేరుభట్టు—అనుభవించక యేం చేస్తామూ? "అవశ్య మనుభోక్తవ్యం" అత్తా! నమస్కారం చేద్దామంటే చేతుల్లేవు. నేను మహాపాపాత్ముణ్ణి. పూర్వజన్మంలో తరగని పాపం చేశాను. అదంతా యిప్పుడనుభవానికి వచ్చింది...ఇస్స్! తెల్లవారగట్ట పెళ్లనగా సాయంత్రం—నా మూలాన్ని మీకుగూడా కష్టం వచ్చింది. ఉద్ధరిస్తానని నన్ను చేరదీశావు. కాని ముంచేస్తున్నాను......ఏం చెప్పనూ? నన్ను మరిచిపో.

కాంతమ్మ—నా తరమా నాయనా? నువ్వు తప్ప మా కింకేం వుంది నాతండ్రీ? నాకూతురుకోసం ఆశపడకపోతే నీ కీగతి రాకపోవునేమోకదా బాబూ?

పేరుభట్టు—నీకూతుర్ని నాకిస్తానన్నావుకనక నే—అంతాసిద్ధమయింది కనక నే-కుదకేమయినా యిప్పుడీబాధ అంతామరచిపోగలుగుతున్నాను. పైగా కానున్న దానికోసం సంతానందంలో యెదురుచూస్తున్నాను. బంగారం నాసొత్తయిందనేమాటే పుట్టకపోతే నాజీవితంలో యిక మంచి యెక్కడుందీ? అదృష్టం యేం వుందీ? ఆనందం యేం వుందీ?...సుఖం యేం వుందీ? నాజీవితాని కల్లా...సాఫల్యం కలిగించినఘటన యిది వొక్కటే. ఇంతేచాలు...కాని...చెప్పడాని కేమీలేదు. పేరుభట్టు లేడనుకో. పుట్టనే లేదనుకో. ఇదంతా కల అనుకో.

కాంతమ్మ—నాయనా! నువ్వు మాకుమ్మంలో అడుగు పెట్టావు. మాయింటికి కళ వచ్చింది. మాకు ఆధారం దొరికింది. ఇప్పుడు అంతా అస్తవ్యస్తమైపోతోంది. నిన్ను మరిచిపోడం యెలాగోయ్?

పేరుభట్టు—నీకుమ్మంలో అడుగు పెట్టడాని కెంత యోగ్యతవుండాలి అత్తా?...ఏంలాభం? కాని వొక...చిన్నకోరిక. ఏమంత విశేషం లేదు; గాని అయినా ఎక్కడికక్కడికే సంతృప్తి. చెప్పవచ్చిందేమీ...లేదు. నగలు—ఏమున్నాయి? ఏదో పేరు. అయినా వున్నమట్టుకు బంగారంకోసం చేయించాను. అవి దానివే.

కాంతమ్మ—నగలబెంగ పట్టుకుందా నాయనా నీకూ? నీకంటే మాకు నగ లెక్కువటోయీ!

ప్రకాశం—వాట్లకోసం యింకెవ రాశపడుతారు బాబూ?

శేషయ్య—నువ్వు బెంగపెట్టుకోవద్దుతమ్ముడూ!

పేరుభట్టు—బాబు గారూ! అన్నయ్యా! మీకు తెలవం దేం వుందీ? జాగ్రత్త. అయ్యా! యిక్కడున్నవారంతా వినండి. నేను మామామయ్యకూతురుకోసం...కొన్ని...న - గ-లు...చేయించాను. కొంత రొక్కంకూడా చేర్చాను. అది నా సొంతం. కష్టపడి, చెమటవోడ్చి, రసికుల మనస్సు కరిగించి సంపాదించాను అది నాబంగారాని కిచ్చేశాను. వాటికోసం యెవరూ ఆశపడగూడదు. ఎవరూ పేచీలు పెట్టగూడదు. మీరంతా సాక్ష్యం.

రత్తమ్మ—బోలెడుసొమ్ము కష్టపడి సంపాదించాడమ్మా నాతండ్రి. అవి బంగారం అనుభవిస్తే వాడికి ఆనందమూ, శాంతీనీ.

రాయడు—(తనలో) ఇంతమందిలో యింత వివరంగా చెప్పాడుకనక యిక సూరిగాడి పప్పుడకదు. బంగారానికి నగల లోటూ వుండదూ.

పేరుభట్టు—అత్తా!

కాంతమ్మ—ఏం నాయనా?

పేరుభట్టు—నాబంగారాన్ని...వొకమాటు... నాకళ్ల బెట్టవూ?

('బావా బావా' అని యేడుస్తూ బంగారమ్మ దగ్గిరికి వచ్చి చేతులు చాపుతుంది. బల్ల యెత్తు కావడంచేత అందకపోగా ప్రకాశం ఆమెని పేరుభట్టుపక్కని బల్లమీద కూచో పెడతాడు.)

కాంతమ్మ—ఎంతదురదృష్టవంతురాలివే తల్లీ?

బంగారమ్మ—బావా, బావా! (అతనిమీదపడి యేడుస్తుంది.)

పేరుభట్టు—నాబంగారం! ఏడవకు. నా—మా—ట వినవూ? ఆయాసం...ఎక్కువౌతోంది. నాకేసి...వొ—క—మా—టు...చూడవూ?

(కాంతమ్మ, ప్రకాశమూ, శేషయ్యా 'అయ్యో అయ్యో' అని యేడుస్తారు.)

బంగారమ్మ—నాగొంతు కోస్తావా బావా! నేను నీకు పనికివచ్చాను కానూ బావా? (మీదపడి యేడుస్తుంది.)

పేరుభట్టు—నువ్వు నాకు పనికిరాక పోవడం కాదు, నీకు నేను పనికివచ్చానుకాను. నిన్ను పెళ్లిచేసుకోడానికి నాకు అర్హత లేదు. బండ కెత్తి సిద్ధపడ్డంచేత నే దేవతలు నా కిలాంటిశి—క్ష...ఇలాంటి......ప్రా-య-శ్చి-త్తం...విధించారు. తెలిసిందా? అయితే చేసిన తప్పు యెలాగా చేశాను. కనక వొక్కమాటు-నిన్ను-గట్టిగా—(వున్న కుడిచేత్తో ఆమెని మీదకి లాక్కొని గట్టిగా అదిమిపట్టుకొని) వూరుకో., నాబంగారం! నా జీవమా? నా ఆనందమా! ఏడుస్తావా?

బంగారమ్మ—నా కింక గతి యేమిటి బావా?

పేరుభట్టు—నేను చెప్పాలా? నీకు తెలవంది యేమేనా వుందా? నీవల్ల తెలివితేటలు వృద్ధి చేసుకుందా మనుకున్నాను నేను. నీదగ్గిర మంచిగుణాలు—నేర్చుకుందా మనుకున్నాను. నీకు నేనేమి చెప్పగలనూ?

బంగారమ్మ—నా మూలాన్ని నీకు చావు వచ్చింది. నేను నీపాలిటి మృత్యుదేవతని. బావా! నిన్ను చేతులారా నేను చంపుకున్నాను.

పేరుభట్టు—వెర్రిపిల్లా! బావని పొగడితే యింకేం లాభమూ? పగిలిపోయిన కుండ. అంతా...అ-యి-పో-యిం-ది. ఇంకో మా-టు-నీ-మొ-గం...కళ్లతో చూసుకోనియ్యి. (ఆమెమొగం పైకెత్తి చూసి) నా పాపం అంతమైపోయింది. నేను తరించాను...నా-వం-శం-తరించింది. (మళ్లీ ఆమెని తన వక్షస్థలంమీద అదుముకొంటూ) కృష్ణా! పార్థసారథీ! సుభద్రాభద్రదాతా! ఆపద్దుద్ధారకా! నాబంగారాన్ని...నాచైతన్యాన్ని...రక్షించు.

(అంతా అయిపోయింది. అంతా గొల్లుమంటారు.)

## అయిదో రంగం

[కాంతమ్మయింటో వొకగది. బంగారమ్మ కళ్లు మూసుకొని మంచంమీద పడుకొని వుంటుంది. కాంతమ్మ కలిపిన అన్నం వెండికంచంతో పట్టుకొని మంచందగ్గిర ముక్కాలిపీటమీద కూచుని వుంటుంది. రత్తమ్మ తలుపుదగ్గిరా, రాయడు కాళ్లకడపక్కనా నుంచునివుంటారు.]

కాంతమ్మ—మా అమ్మవు కామూ? మాతల్లివి కాదూ? వొక్కమాటు.—వొక్కముద్ద తినమ్మా.

బంగారమ్మ—(పలకదు.)

రత్తమ్మ—(బంగారమ్మమొగందగ్గిర మొగం పెట్టి) నేను చిన్నత్తయ్యని కానూ? నా మాట వినవూ? లేమ్మా! పోనీ, నే నెత్తుకు తినిపించనా?

రాయడు—కాస్త మజ్జిగా అన్నమేనా తిను బంగారం! నాలుగు రోజులయింది అన్నం ముట్టు

కానీ. చిక్కిపోయావు. నీరసంకాదూ? నామాట కొట్టేస్తావా?

కాంతమ్మ — నే నెత్తుకు తినిపిస్తాను రా మామ్మా! (మీద చెయ్యివేసి) ఇదేమిటి వొళ్లింత వెచ్చగా వుందేం వొదినా?

రాయుడు — (బంగారమ్మని తాకి) ఎంత వెచ్చగా వుందో?

రత్తమ్మ—రెండో మడిబట్టి లేదు. అయినా ముట్టుకోనా?

కాంతమ్మ—(బంగారమ్మవీపు నిమురుతూ) నువ్వు మైలపడకు వొదినా! జ్వరంచేతనే కాబోలు మాట్లాడకుండా పడివుంటోంది. ఇక మెతుకేం తింటుంది మాతల్లి?

రత్తమ్మ — ఏదేనా మాత్ర వేయించాలే. ప్రకాశంగార్ని తీసుకురా నాయనా!

రాయడు—అదిగో, బాబుగారే వచ్చారు.

(ప్రకాశం వస్తాడు.)

ప్రకాశం—ఏమిటదీ?

కాంతమ్మ—నాచిట్టితల్లి వొళ్లు సలసల కాగిపోతోం దన్నయ్యగారూ!

ప్రకాశం—(మంచంమీద కూచుని) జ్వరమా, వుడుకా యిది?...కోడలా?

కాంతమ్మ—మామయ్య గారు పిలుస్తున్నారు చూడు తల్లీ!

బంగారమ్మ—(కళ్లుమూసుకునే వుండి) మామయ్యగారండీ!

ప్రకాశం—ఏం తల్లీ?

బంగారమ్మ—మీకు దణ్ణం.

ప్రకాశం—ఏంచెయ్యమంటా వమ్మా?

బంగారమ్మ—న న్నేడిపించకండి.

ప్రకాశం—నువ్వు పస్తుపడివుంటే మాస్తూ వూరుకోగలమా కోడలా?

కాంతమ్మ—మామయ్యగారిచేత బతిమాలించుకోసం తప్పుకాదూ బంగారం?

బంగారమ్మ—అమ్మా!

కాంతమ్మ—ఏం మామ్మా?

బంగారమ్మ—ఆకలిగా వుంటే తినకుండా వుండగలనుటమ్మా?

కాంతమ్మ—నాలుగు రోజు లయింది, పచ్చి మంచినీళ్లుతప్ప మరేమీ యెరగవు. ఆకలిలేకపోవడం యేమిటి నాతల్లీ?

బంగారమ్మ—పిండివంటలతో ఇప్పుడు తిన్నట్లుంది కడుపు.

కాంతమ్మ—(కడుపుమీద చెయ్యివేసి) కడుపు అక్కళించుకుపోయివుంది, చూసుకో తల్లీ.

బంగారమ్మ—తేనుపులు వస్తున్నాయమ్మా!

కాంతమ్మ—అదేమిటన్నయ్యగారూ?

ప్రకాశం—నాకేమీ బోధపడ్డం లేదు. వెళ్లి డాక్టరుగారిని తీసుకువస్తాను, మీరంతా భోజనంచేసి రండి.

కాంతమ్మ—నువ్వు వెళ్లి అన్నంతిని రా వొదినా! నువ్వుకూడా వెళ్లు రాయడూ!

రత్తమ్మ—నువ్వుగూడా రా అమ్మా! ప్రకాశంగా రుంటారుకాదూ?

కాంతమ్మ—నన్ను బతిమాలాలా వొదినా?

రత్తమ్మ—నాకుమాత్రం ఆక లేడిసింది యేమిటి?

రాయడు—ముద్ద నోటికి పోదు. ఏదో, గడ్డి తిన్నట్లు కళ్లుమూసుకు మింగాలి.

రత్తమ్మ—రారా నాయనా!

రాయడు—ఏం తప్పినా యిది తప్పదు. పద.

(ఇద్దరూ వెళ్లిపోతారు)

కాంతమ్మ—ఏమిటి గతి అన్నయ్యగారూ?

ప్రకాశం—(నిట్టూర్పు విడుస్తాడు)

కాంతమ్మ—నా బిడ్డని నాకు దక్కించం డన్నయ్యగారూ! (చేతులు జోడించి దుఃఖిస్తుంది.)

ప్రకాశం—ఇదా సమయం అక్కయ్యగారూ?

కాంతమ్మ—నాకు మతిపోతోందండీ.

ప్రకాశం—నాకుమాత్రం మనస్సు మనస్సులో వుందా? నేను పైకి యేడవడం లేదు. అంతే. పేరు భట్టుగారు నాకొడుకులాగ ప్రవర్తించారు. సంతానం కలక్కపోయినా పుత్రశోకం అనుభవిస్తున్నాను నేను.

(భద్రయ్య వస్తాడు.)

భద్రయ్య—ఇవాళేనా కాస్త ధారకం పుచ్చుకున్నట్టా?

కాంతమ్మ—ఇవాళ మరీఘోరం. పచ్చి మంచి నీళ్లేనా ముట్టుకోలేదంకానూ.

భద్రయ్య—శ్రీహరీ!......అయితే యెలాగండి బాబుగారూ?

ప్రకాశం—(పైకి చూపుతూ) శ్రీహరే ఉద్ధరించాలి. మనవల్ల యేమౌతుందీ?

కాంతమ్మ—జ్వరమో యేమిటో వొళ్లు వెచ్చగా కూడా వుంది.

ప్రకాశం—పేరుభట్టుగారు పోయిన మర్నాడు పుచ్చుకుంది కోడలు, వారి ఫోటోగ్రాపు పోరీ. అదిగో పక్కలోను. ఫిడేలు అలా బల్లమీద వుండాలి. కళ్లు విప్పడమే వస్తే ఫోటో చూస్తుంది. ఫిడేలేనా చూస్తుంది. మరోవస్తువు చూడదు. ఏమీ అక్కరలేదు.

భద్రయ్య—గ్రంథాల్లోకూడా యిలాంటి మమత కనపడదండీ బాబుగారూ!

ప్రకాశం—నిజమే; కాని మీరోమాటు రామకృష్ణశాస్త్రిలుగారిని తీసుకురావాలండీ. నేను పంపించానంటే ఆయన తప్పకుండా వస్తారు. ఆయన వచ్చారంటే యేదో సాధనం చేసి కోడల్ని బతికిస్తారు.

భద్రయ్య — అలాగే వెడతాను......మీతో వొక సంగతి చెప్పాలి, వొకమా టిలా వస్తారా?

ప్రకాశం—పదండి.

(ఇద్దరూ వెడతారు)

కాంతమ్మ—అమ్మా! నాకేసి వొక్కమాటు చూడవూ?

బంగారమ్మ—అస్తమానూ చూడమనవుకదా?

కాంతమ్మ—నువ్వు నాకేసి చూడకపోతే నేనిక బతగ్గలనా తల్లీ?

బంగారమ్మ — నిన్నూ, మామయ్యగారినీ చూస్తాను. అంతే.

కాంతమ్మ—మాయిద్దర్నే చూడమ్మా.

బంగారమ్మ — రాయ అస్తమానూ యెనట నుంచుంటాడు. రత్తమ్మత్త మొగమ్మీద మొగంపెట్టి మాట్లాడతుంది. నాకు వొళ్లు మండిపోతుం దలాంటప్పుడు

కాంతమ్మ — ఇక అలా చెయ్య నివ్వనులే అమ్మా!

బంగారమ్మ—ఇప్పు డిక్క డెవరూ లేరు కదా?

కాంతమ్మ—లేరమ్మా!

బంగారమ్మ—(చూసి) వొక్కమాటు కౌగిలించుకోనియ్యి. (చేతులు చాపుతుంది.)

కాంతమ్మ — (ఆమెని గట్టిగా అదిమిపట్టి) మా వేఁ, మాతల్లే! కంపయిపోతూవే మామ్మా! కాస్త ధారకం పుచ్చుకోవూ నాకూనా?

బంగారమ్మ—ఇందాకా చెప్పానుకాదుటమ్మా!

కాంతమ్మ—నిన్ను చూస్తే నాకడుపు తరుక్కుపోతోందే మామ్మా!

బంగారమ్మ—ని న్నేడిపించడానికే పుట్టాను నేను. నిన్ను యమయాతన పెట్టడానికే నీ కడుపున పడ్డాను. ఏంచెయ్యను?

కాంతమ్మ—నా గతేమి తల్లీ?

బంగారమ్మ—అమ్మా!

కాంతమ్మ—మామ్మా.

బంగారమ్మ—నిన్ను చూడకుండా వుండలేకున్నాను. అస్తమానూ యిక్కడ యెవరో కూచుంటూనే వున్నారు.

కాంతమ్మ—వెళ్లిపొమ్మంటే బాగుంటుందా అమ్మా?

బంగారమ్మ—తప్పకామా? కాని యెవరూ లేనప్పుడు లేరని చెబుతూ వుండు.

కాంతమ్మ—అలాగేనమ్మా! నీవుద్దేశం తెలిశాక నీకు అడ్డు చెబుతానా నాకొండా?

బంగారమ్మ—కసిన్ని మంచినీళ్లియ్యి.

(బంగారమ్మ లేచికూచోగా కాంతమ్మ గళాసు నోటికందిస్తుంది. బంగారమ్మ నీళ్లుతాగేసి పక్కదులుపుకొని మళ్లీ పడుకొంటుంది.)

బంగారమ్మ—నువ్వెప్పుడూ నామీద చెయ్యి వేసుకూర్చో.

కాంతమ్మ—అలాగేనమ్మా!

బంగారమ్మ—నువ్వవతలికి వెడితే నామీద మరెవరూ చెయ్యి వెయ్యకూడదు.

కాంతమ్మ—అలాగే చూస్తూవుంటానమ్మా! (చెవిలో) మామయ్యగారు వస్తున్నారు.

బంగారమ్మ—రానియ్యి.

(ప్రకాశం వచ్చి మళ్లీ మంచంమీద కూచుంటాడు.)

బంగారమ్మ—అమ్మా!

కాంతమ్మ—మామ్మా!

బంగారమ్మ—మామయ్యగారితో చెప్పు.

కాంతమ్మ—నా చిట్టితల్లి నన్నూ, మిమ్మల్నీ తప్ప యింకెవర్నీ చూడదుటండీ!

ప్రకాశం—అలాగే చెయ్యవచ్చు.

బంగారమ్మ—మామయ్యగారండీ!

ప్రకాశం—ఏమమ్మా?

బంగారమ్మ—ఎవరూ లేనపుడు లేరని చెబుతూ వుండండి.

ప్రకాశం—అలాగే కోడలా!

(రత్తమ్మ వస్తుంది. బంగారమ్మ కళ్లు మూసుకుంటుంది.)

రత్తమ్మ—ఏమిటి చెబులోంది బంగారం?

కాంతమ్మ—ఆకల్లేదుట వొదినా! అయినప్పుడు అడిగి తింటుందిట.

రత్తమ్మ—వైద్యుడికోసం కబురంపారా?

ప్రకాశం—భద్రయ్యగారు వెళ్లారు.

రత్తమ్మ—నువ్వు రా మరదలా, కాస్త యెంగిలి పడుదువుగానీ.

కాంతమ్మ—వెళ్లి వొడ్డించు వొదినా!

రత్తమ్మ—నిమిషం. (వెళ్లిపోతుంది)

కాంతమ్మ—కూచుంటారా అన్నయ్యగారూ?

ప్రకాశం—వెళ్లిరండి.

కాంతమ్మ—రాయుడు మంచందగ్గిరికి రావడం చిట్టితల్లి కిష్టంలేదు. రానివ్వకండేం?

ప్రకాశం—అతగాణ్ణి చూస్తే కోడలికేగాదు, యెవరికీ యిష్టంవుండదు. లేదుకూడానూ.

కాంతమ్మ—అసలు నేనతన్ని బజారుకి పంపించే మడికట్టుకుంటాను లెండి. (ముందుకు అడుగు వేస్తుంది.)

బంగారమ్మ—అమ్మా!

కాంతమ్మ—(వెనక్కి వచ్చి) మామ్మా!

బంగారమ్మ—కడుపులిండా తినాలి.

కాంతమ్మ—నాడే నిండిపోయింది కడుపు.

బంగారమ్మ—లేకపోతే నన్ను చంపుకొని తిన్నట్టే.

కాంతమ్మ—తింటానమ్మా, ఏమీ తక్కువ చేసుకోను. నీమాటకంటే నా కింకేం కావాలి తల్లీ? (వెడుతుంది.)

(తెర దించాలి.)

ఆరో రంగం

[కాంతమ్మయింటో హాలు. ప్రకాశం ఒల్ల మీద కూచునివుంటాడు. భద్రయ్య యెదట నుంచుని వుంటాడు.]

ప్రకాశం—అది సంధిలో చేరుతుందా అని సందేహం. అయినా కాకపోయినా చాలా గడ్డుగా మాత్రం వుంది.

భద్రయ్య—ఏమవుతుందంటారు బాబుగారూ?

ప్రకాశం—ఎవరు చెప్పగలరూ?...ఎటయినా చిక్కులేవున్నాయి.

భద్రయ్య—ఏమిటనీ?

ప్రకాశం—కీ డెందుకూ, మేలే యెంచుదాం. బంగారం బతికి బట్టకడితే యింతట్లో మళ్లీ పెళ్లి ప్రయత్నాలు చెయ్యలేము. పెళ్లి చెయ్యకపోతే రెండుమూడుమాసాల్లో రజస్వల అవుతుంది.

భద్రయ్య—ఇది మరీ ఘుట్టిచిక్కు.

ప్రకాశం—ఏమనుకున్నారు మరీ? ఇంతకీ—

భద్రయ్య—అయితేనూ!.......బాబుగారూ! కాంతమ్మగారి వాలకం అలా వుందేమండీ?

ప్రకాశం—ఎలా వుందీ?

భద్రయ్య—అన్నింటికీ ఆశ వదులుకొన్నట్టు.

ప్రకాశం—తమకి వచ్చినవిచారం యింకా మళ్లకుండానే శుభకార్యం తలపెట్టడం, అది యిలా భంగమయిపోవడం, పైగా బంగారం అటాయిటా అనే స్థితిలో వుండడం-చూశారా? అక్కయ్యగారికి స్తిమితం యెలా వుంటుందీ? ఉత్సాహం యెక్కణ్ణుంచి వస్తుందీ?

భద్రయ్య—అదీ నిజమే; కాని యిదంతా జయంతి రామచంద్రయ్యగారివల్ల—

ప్రకాశం—ఆయన నిమిత్తమాత్రంగాని మరేమీ లేదు. ఈశ్వరనిర్ణయం యిలా వుంది. వొకళ్లననడం యెందుకూ?

భద్రయ్య—కాని పట్నంఅంతా ఆయన్ని దుమ్మెత్తిపోస్తోంది. ఇచ్చినా మానినా ఆయన ఇస్తానన్నవి పాతికరూపాయలు. ఎన్నిమాట్లు తిప్పారండీ మహానుభావులూ?

ప్రకాశం—ఇవ్వాలని వుంది. చేతిలో లేదు.

భద్రయ్య—తొలినాటిరాత్రి వెడితే మర్నాడు పొద్దున్న రమ్మన్నారు. అక్కడికి పదోవాయిదా అది. మర్నాడు పొద్దున్న స్నాతకంతొందర్లో వుంటామంటే పోనీ సాయంత్రం రండన్నారు. సరే అని వెళ్లగా ముహూర్తసమయంలో తెచ్చి కట్నం చదివిస్తానని వొకమాటు, అయిదురోజుల్లోనూ—చివరికి మనుసుపులు దాటనివ్వనని వొకమాటు. ఎందుకువచ్చిన యీవండీ బాబుగారూ అదీ?

ప్రకాశం—నిజానికి పేరుభట్టుగారు అప్పుడు ఇల్లు కదలగూడదు. నిజమే. ఇంతకీ:—ఇక అది లాభం లేందీ. మన మిప్పుడు బంగారాన్ని కనిపెట్టాలి. రామకృష్ణశాస్త్రులుగా రింకా వచ్చారు కారు. తీసుకురావాలి మీరు వెళ్లి.

భద్రయ్య—ఇదిగో వెడుతున్నాను. (అడుగు వేస్తాడు.)

ప్రకాశం—చూడండీ!

భద్రయ్య—(వెనక్కి వస్తూ) ఏం సెలవు?

ప్రకాశం—రాత్రి పరాకుమాటల సంగతి—

భద్రయ్య—తప్పకుండా చెబుతాను. వెడుతున్నాను.

(వెళతాడు.)

ప్రకాశం —(తనలో) వేంకటశాస్త్రి గారి కుటుంబం యేమయిపోతుంది?.........బతకడమేవస్తే బంగారం యింకొకణ్ణి పెళ్లాడుతుందా? లేకపోతే యేమిటి చెయ్యడం?

(రత్తమ్మ వస్తుంది.)

రత్తమ్మ—వచ్చారా? వైద్యు డింకా రాలే నట్టుంది తెల్లవారేక?

ప్రకాశం — భద్రయ్యగా రిప్పుడే వెళ్లారు మళ్లీ నీ.

రత్తమ్మ—ఇంకా పథ్యానికి వచ్చింది కాదండీ.

ప్రకాశం—రాలేను కనకనే పిల్ల నలిగిపో తోంది.

రత్తమ్మ—మరేనండీ. వెన్నప్పంలా పెరిగిన పిల్లండీ బంగారం! దానికి జబ్బుచెయ్యటం నేనెప్పుడూ యెరగనండీ. సిసింద్రీ కాదుటండీ? కాంతమ్మ కెన్ని కష్టాలు వచ్చాయండీ?

ప్రకాశం—నింపాదిగా అంటున్నారా?

రత్తమ్మ—ఆపత్తు మావాళ్ల దీ, కష్టం మీదీనీ. ధర్మాత్ములు కనక బరిమానుకుని కూచున్నారు మీరు.

ప్రకాశం—మీమాట చెప్పండీ. రోజులు మీ ధర్మమా అని నెడుతున్నాయి.

రత్తమ్మ—కాంతమ్మ అలాగే అంది రాత్రి. "వొదినా! భారం అంతా నీదీ" అంటూ రెండు చేతులూ పట్టుకొని బతిమాలిందికూడానూ. కాకపో యినా కష్టాలు వచ్చినప్పుడుకాకపోతే చుట్టాలు సుఖాలు వచ్చినప్పట్టండీ? చూశారుకాదూ మా పెద్దక్క ఎన్నివిధాల నేను చెప్పినా గిజా అందిగాని వుండలేక పోయిందీ?

ప్రకాశం—మాటతక్కే యోగం మీకుంది కాంతమ్మగారు మీరుణం తీర్చుకోలేరు. మీఅబ్బాయి మాట యిక చెప్పనేఅక్కర్లేదు. బంగారంతో సమంగా నిద్రాహారాలు విడిచిపెట్టా డతగాడు.

రత్తమ్మ—అదంటే ప్రాణమండీ మావాడికీ. చూస్తారుకాదూ బంగారం లేచి తిరిగీదాకా మావా డెంత అటమటించి పోతాడోనూ?

ప్రకాశం—నేను మొదటే కనిపెట్టా నాసం గతి. కాని యింకా వచ్చాడు కాడు.

రత్తమ్మ—ఈబండిమీద తప్పకుండా వస్తా డండీ. బండి వచ్చేసిందో, వస్తోందో.

ప్రకాశం—సరే...బంగారం దగ్గిరే కూచుంటే మంచిదికాదూ?

రత్తమ్మ—పదండి నాయనా! ఇక నేను మడి కట్టుకోవాలికూడానూ.

(ప్రకాశం లోపలికి వెడతాడు.)

రత్తమ్మ—రైలు ఆలస్యం అయిందా యేమి టివాళ?

(రాయడు వస్తాడు.)

రత్తమ్మ—మాటలో వచ్చావురా నాయనా! మీనాన్నా, అక్కా బాగా వున్నారా?

రాయడు—ఆ! ఇక్కడెలా వుందీ?

రత్తమ్మ—అలాగే వుంది. హెచ్చుగా లేదు. తగ్గుమొగమిమ్మదే వుండనుకోవచ్చు. కాని నిన్నరాత్రి అత్తయ్య "వొదినా! యిక భారం అంతా నీదీ" అంటూ రెండుచేతులూ పట్టుకుంది.

రాయడు—(చెయ్యి జాడిస్తూ) అందీ?

రత్తమ్మ—ఏంచేస్తుందిరా అనకా? పైవాళ్ల కోసం చూస్తే యెన్నిచిక్కు లున్నాయిరా?

రాయడు—కాని బంగారం యింకా అన్నం మాట తలపెట్టడంలేదుకదా, యేందారీ?

రత్తమ్మ—జ్వరంకూడా పట్టుకుంది గాదూ? కాకపోయినా జ్ఞానంవచ్చిన పిల్ల. పెద్దలెక్కల్లోది గాని అల్లాటప్పా మనిషికాదు. మొగుడంటేనూ, ప్రేమ అంటేనూ బాగా యెరుగును. కొత్త ఆశ కాదుట్రా పాపం? వోపట్టాన మళ్లుతుందా?

రాయడు—అత్త వొప్పుకున్నా మనకి లాభం వుండదేమో. అంటే బంగారానికి నామీద యిష్టం కలుగుతుందో కలగదో?

రత్తమ్మ—కలక్క యేం చేస్తుందీ? కాస్త నిం పాదిగా వుండగానే పెళ్లికాకపోతే చిక్కుందిరా. రెండు మూడు మాసాల్లో సమర్తాడుతుంది తప్పకుం

డానూ. ఇక ఆపడానికి వీలులేదు. మళ్లీ పెళ్లిప్రయత్నాలంటూ మొదలుపెట్టినప్పుడు నిన్ను తప్పిస్తే నలుగుర్లోనూ నేను తగువుపెట్టనూ? అసలు నిన్నరాత్రి ఆమాట అని తరవాత యెలా తప్పిస్తుందీ అత్తమాత్రం?

రాయడు—సరే. మన జాగ్రత్తలో మనం వుందాం.

రత్తమ్మ—ప్రకాశంకూడా నిన్ను మెచ్చుకున్నాడురా.

రాయడు—ఆ!...ఎప్పుడూ?

రత్తమ్మ—ఇప్పిడిప్పుడూ. ఆయన అలా లోపలికి వెళ్లాడు, నువ్వు వచ్చావు. అంతే.

రాయడు—(వొక్కమాటు పైకి చూసి తల వూపి) సంగ తేమిటో కనిపెట్టావా?

రత్తమ్మ—ఏమి టది నాయనా?

రాయడు—ఏవో మాటమీద అత్తా, ప్రకాశమూ ఆలోచించుకొని వుంటారు. లేకపోతే అత్తా అలా అనదూ, ప్రకాశమూ ఇలా అనడూ.

రత్తమ్మ—అవున్రోయ్! నిజమే. వాళ్లు నిన్ను నిశ్చయించుకొన్నారన్నమాటే.

రాయడు—(ఒకకాలూ, వొకచెయ్యీ ఆడిస్తూ) కోటలో పాగా వేసేశాం. ఇక చూసుకో నాతెలివితేటలూ, చురుకుదనమూనూ.

రత్తమ్మ—బంగారానికి తొరగా నింపాదిగా వుంటే పెళ్లికాగానే అన్నవరంకొండకి వెళ్లి సత్యనారాయణవ్రతం చేసుకుందాం. ఏం?

రాయడు—తప్పకుండానూ. పెద్దతిరపతికూడా వెడితే మరీమంచిదీ.

రత్తమ్మ—తీరామాట అనేశావుకనక అలాగే వెడదాం. వందరూపాయ లయితే అవుతాయి. ఇంత ఆస్తి కలిశాటప్పు డాఖర్చు వొకలెక్కా యేమిటి?

రాయడు—ఈమేడ చాలదుటమ్మా యెంతకేనానూ?

రత్తమ్మ—మరేరా. ముద్దొస్తోందిరా మేడా. ఈమేడ విడిచిరావాలని లేదురా నాకూ?

రాయడు—కాపరం అంతా యిక్కడే పెట్టేస్తే సరి.

రత్తమ్మ—మరే, మీనాన్న వొప్పుకోకపోయినా మానం. అవునా?

రాయడు—వొప్పుకోడూ? ఇదివరకే వ్యవహారం పాడుచేశాడు. ఇప్పుడూనా?...సాగనివ్వను.

రత్తమ్మ—అలాగే నాయనా! ఇక నేను మడి కట్టుకుంటాను. నువ్వు జాగ్రత్తగా వుండేం? ప్రకాశం కూడాకూడా తిరుగుతూవుండు. అత్తనూ ఆడాళ్ల దగ్గిర కూచుంటే బాగుండదు నాయనా!

రాయడు—అవును. మరి నువ్వు వెళ్లు.

రత్తమ్మ—గంటలో చేసెయ్యనూ వంటా? (వెళ్లిపోతుంది.)

రాయడు—(తనలో) అదృష్టం అంటే యిదీ. నాకు అడ్డువచ్చాడు, ప్రాణాలు విడిచిపెట్టుకున్నాడు. ఏం మిగిలింది పేరిగాడికి?......బంగారం పళ్యం పుచ్చుకునేదాకా ఆంజనేయదండకం మూడుపూట్లా పారాయణచేస్తాను. ఆవేళ పుష్పగిరిరేవులో వున్న ఆంజనేయస్వామికి నూటపదకొండు కొబ్బరికాయలు కొడతాను.

(రభసంగా లోపలికి వెళ్లిపోతాడు.)

## ఏడోరంగం

[కాంతమ్మయింటో నూతిదగ్గిర. రత్తమ్మా, రాయడూ నుంచునివుంటారు.]

రత్తమ్మ—మనపని యెటూకాకుండా పోయిందిరా నాయనా!

రాయడు—ఏమంటావు?

రత్తమ్మ—బతకదు.

రాయడు—(కళ్లల్లో నీళ్లు పెట్టుకుంటాడు.)

రత్తమ్మ—అదేమిట్రా? ఛా! దానికోసం యేడు పెందుకూ? ఆకాశాన్నుంచి వూడిపడిందా యేమి టదీ?

రాయడు—(మాట్లాడలేదు. పెదిమలు వొణికిపోతూ వుంటాయి.)

హించకపోతే నాకు నిజంగా చావేగతి. నీకోసం యెంతత్యాగం చేశానో నీ కిప్పుడు తెలుసును. నన్ను కటాక్షించు..............."

నాకు చైతన్యం కలిగి లేచి నుంచుని చూచాను. ఆ చక్కగా అమర్చబడిన పగ్గ లేదు, ఆ మేలిముసుగు లేదు, ఆ అలంకారాలు లేవు, ఆ చీరా లేదు, జాకెట్టూ లేదు. అవన్నీ కుర్చీమీద వున్నాయి. పంచ, లాల్చీ, మామూలుస్లిప్పరు జోడూ, క్రాఫూ గలిగిన నాటి సుందరపురుషుడు విశ్వనాథం నాపాదాలదగ్గర ప్రత్యక్షం. నాశరీరాన్ని ఆచీరే వున్నది. నా కేమీ తోచిందికాదు. హృదయం కలవరపడిపోయింది, చలించింది.

"విశ్వనాథం!—విశ్వనాథం— నిన్ను—నిన్నే మరి పిలవాలి?"

" 'విశ్వనాథం' అన్నావే; అదిచాలు. లేదా 'మనోహరా' అను. వేరనకు. నిన్ను వేడుకొంటాను."

"లేదులేదు—అబ్బ—కాదు. విశ్వ—ఆహాఁ—కాదుకాదు—మనోహరా! నేను నీసొమ్ము." అని అప్రయత్నంగా చేయూత యిచ్చానతనికి లేవటానికి.

మరుక్షణం—నానడుము రెండుచేతులలో బిగిసిపోయింది; నాహృదయం మరొకహృదయానికి హత్తుకుపోయింది; నా పెదవులకు వూపిరాడిందికాదు. నాకు మరి తెలివిలేదు......................

౬

అయ్యయ్యో! జగదీశ్వరా! సర్వస్వమునకన్న నేది స్త్రీజాతి కత్యంతసమాదరణీయమో—ఎయ్యది హిందూసతీ గర్వకారణమో—ఒక్కసారి పోయిన నెయ్యది ప్రాణమిచ్చియైనను తిరిగి గడింపరానిదో—ఏప్రవిమలాదర్శమును నే నాకర్షణీయములగు ననేకావకాశములనుండి యింతవర కతిభద్రముగ గాపాడుకొంటినో—ఏపవిత్రనామము నుచ్చరించుటకైనను నే నిప్పు డనర్హనో—అట్టి—అట్టి నా మానమర్యాద—అయ్యయ్యో!—మాసిపోయినది.

ఆంధ్రమాతలారా, సతీమతల్లులారా! నన్ను తిట్టకండి. నాగతి బాగా తిలకించారు. నాబాధ కన్నారు. నాయేడుపు విన్నారు. నాతోకూడ యేడ్చారు. మరొక్కసారి మనసుంచి బాగా ఆలోచించండి. అప్పుడు మీరు నన్ను తిట్టటానికిబదులు కనికరిస్తారు. అందరూ సీతాసావిత్రులుకారే! అందరూ దమయంతులుకారే!—వారికన్నా కొన్నిఆశలు, ధైర్యాలు వుండేవి—నాస్థితిలో మీరున్నట్టు భావించండి. నాదుర్భర సంతాపాంధకారంలో మీరుండటానికి ప్రయత్నించండి. ఎంతభయంకరంగా వుందో! ఎటు చూచినా అంధకారబంధురం. ఎటుచూచినా ఘోర జీమూతసమూహం. మీస్థితిలోనే నేనూ వుంటే నాకీబాధ లేదు. నేనూ మీలాంటిదాన్నే; పతివ్రతనే. ఎంతకాలం ఓర్చాను? ఎంతకాలం ఆశించి నిరీక్షించాను నాభర్తకోసం? ఆశించి ఆశించి నిరాశచెందిన పిమ్మట, ఒకానొకచిత్రసందర్భంలో, ఆకస్మికమహోద్రేకం కారణంగా, మనసుచలించి, బుద్ధిమాంద్యం వహించి, దారితప్పిపోతే తప్పంతా నాదేనా? భావిసౌఖ్యం నిరాశఅయితే బ్రతు కెవరికి కావాలి? అడగండొక బాలవితంతువుని. లేక నావంటిదురదృష్టవతులైన స్త్రీలెందరో వున్నారీవిశాలభారతదేశంలో; వాళ్లనడగండి. వాళ్లందరిగతి యేమికావాలి? మ్రగ్గిమ్రగ్గి చావవలసిందేనా? ఓసంఘ సంస్కర్తలారా, మీరేమార్గం చూపిస్తారు మాకు?

రాత్రి— లేకవుదయం— రమారమి మూడు గంటలకు విశ్వనాథం మాయిల్లువిడిచిపెట్టాడు. నాకు చాలసేపటివరకు నిద్రరాలేదు. లేచేసరికి చాల ఆలస్యమైంది, బడలికకారణంగా. తొమ్మిది గంట లప్పుడే కొట్టారు.

నే నింతకాలం కడుజాగ్రత్తగా కాపాడుకొన్న మానధనం పోయింది. ఇప్పు డేదో ఒకటి కావాలి. విశ్వనాథం నే నేమంటే అది చేస్తానని వాగ్దానం యిచ్చాడు. రాత్రే ఆలోచించాం అంతాను. త్వరగా కాలకృత్యాలు నిర్వర్తించుకొని, మా నాన్న పడకగదిలో

వుంటే వెళ్లా నతనివద్దకి. నిజంగా నే నా మొగం చూడ లేకపోయాను. కాని మొండిధైర్యం తెచ్చుకొన్నాను.

"నాన్నగారూ, మీతో ఒకముఖ్యవిషయాన్ని గూర్చి మాటాడాలి."

"ఏమమ్మా! ఏమి? రా కూచో."

"ఈవేళ మీ మిమ్మలాగున సిగ్గులేక అడుసుతో వున్నానని అనుకోకండి. విధిలేకవచ్చింది. నాప్రస్తుత దీనావస్థ చూచారా?"

"నాతల్లీ! చూచాను. అందుకు నాహృదయం చూడు, యెంతదుఃఖిస్తోవుందో."

"నాకు తెలుసును. నాభర్త యిక తిరిగిరాక పోవటం నిశ్చయమేఅని; మీకు తెలుసునుకదా?"

"అమ్మా! తెలియకేం? అందుకేగా యీబాధం తానూ?"

"సరి, ఇప్పుడు నాగతి యేమిటి?"

"తల్లీ! న న్నేమిచేయమన్నావు? నీమీద ప్రేమచేత నీభర్త కెంతడబ్బో పంపాను. నీసౌఖ్యమే ప్రధానంగా నే నెప్పుడూ గణించాను. ఎంతడబ్బు కన్నా వెనుదీయను. కోరు. నీ కేంకావాలి? నాచేతిలో వున్నపని తప్పకుండా చేస్తాను."

"నేను పునర్వివాహం చేసుకొంటాను."

"పునర్వివాహమా?" అని నోరుతెరిచాడు భయాశ్చర్యరూపంగా.

"ఔను."

"ఎట్లూ? భర్త వుండగానే?"

"ఆహా, వుండగానే. తిరిగిరాని భర్త వుంటేనేం, లేకపోతేనేం?"

"అది శాస్త్రసమ్మతం కాదే! ఆపైని చట్టం కూడా ఒప్పుకోదు."

"ఏచట్టంలోనూ, ఏమతంలోనూకూడ లేదా?"

"అది నాకు తెలీదు. ఉన్నా వివాహమాడే దెవరు?"

"అహం! ఎవరన్నా వుంటే."

"నేను చెప్పలేను—లేదు."

"ఆహాం! సరే."

ఏచట్టం ప్రకారమన్నా, ఏమత ప్రకారమన్నా వీలుంటుందేమో!

నేను వెనకతిరిగి వచ్చేశా నీవలికి. అతడు నిశ్చల పోయాడు. పాపం! ఆవృద్ధశిరస్సులో యెన్ని భావాలు నిండివున్నయో! ఎంతవేదన అణిగివుందో!

రాత్రి పన్నెండుగంటలు, వీథితలుపువద్ద జాగ్రత్తగావుంటారని నేను మొదటనే అనుకొన్నాను. రెండు చీరెలూ, నానగలపెట్టే,— విశ్వనాథంవద్దంటోవున్నా అప్పటికి నాదగ్గరవున్న రూ. ౧౨౦౦ల నోట్లు పట్టుకొని దొడ్డిలో, నియమితమైన స్థలానికి వెళ్లాను. అక్కడ విశ్వనాథం వున్నాడు. గోడగెంతి ఆవలికి దిగాం. కొన్నిగజాల కక్కడ ఓజట్కాబండీ వుంది. మేంస్టేషనుకు చేరినవెంటనే కలకత్తాపోయే బండి వచ్చింది. కలకత్తాకు టిక్కట్లు తీసుకొని, సెకండుక్లాసులో కూచున్నాం. బండి బయలుదేరింది. సుమారు అయిదుగంటల వరకు నాకు నిద్రరాలేదు. అంతకు కొంచెంముందుగానే విశ్వనాథంకూడా నిద్రపోయాడు.

ఎవరో తట్టిలేపగా నాకు మెలకువ వచ్చింది. రమారమి వుదయం పదిగంటలు కావచ్చింది. ఇంకా విశ్వనాథం నిద్రపోతోనే వున్నాడు. ఎదురుగా చూచాను, శరీరం నిలువునా నీరైంది. మాపెదనాన్న! అతడు బరంపురంలో స్కూలుమాస్టరు. రెండు ప్రక్కలా చూచేసరికి బరంపురంస్టేషనులో బండి ఆగివుంది.

"ఎక్కడకమ్మా ప్రయాణం?"

నాకు నోట మాటరాలేదు.

"బండిదిగు. సామా నెక్కడ?"

"కాదు — పనిమీద కలకత్తా వెళుతో వున్నాను" అన్నాను కొంచెంధైర్యం తెచ్చుకొని.

"ఏమి టూపని? ఈయ నెవడు?" అని విశ్వ నాథాన్ని చూపించాడు. ఇంతలో విశ్వనాథంకూడా లేచి సంగతి యావత్తూ గాభరాగా చూడటం మొదలెట్టాడు. నేను బాగా ధైర్యం తెచ్చుకొన్నాను.

"వివాహంనిమిత్తం వెళుతున్నాను కలకత్తా. ఈయననే పెండ్లాడేది."

"తప్పు తప్పు. అట్టిమాట లాడకు. వెంటనే దిగిరా. ఆలస్యం లేదు."

"నేను రాను." అన్నాను మొండిగా.

"అట్లా అయితే యిదిచూడు." అని ఒక టెలి గ్రాం చూపించాడు. అది మానాన్న వద్దనుండి. చదివాను.

"లలిత పారి పోవుచున్నది—సుమారు రూ. ౧౦౦౦/- నగలు వెంటదీసుకొన్నది—కాంకు డెవరో తెలియదు—ఆ త్రోవను వచ్చినయెడల పట్టుకొన వలయును" అని వుంది.

ఆలోచించాను.

"నాకు మీడబ్బక్కర లేదు. తీసుకోవచ్చు." అన్నాను.

"పనికిరాదు. ఇక వైము లేదు; తిన్నగా వస్తావా, దొంగతనంక్రింద పోలీసు కప్పగించ మన్నావా మీయిద్దరినీ? ఏనిఘంగానన్నా నీవుద్దేశం కొనసాగదు. నామాటవిని రా చల్లగా......అదిగో టైమైపోతుంది. చప్పున" అని గద్దించాడు.

నా కేమీ తోచలేదు. దైవాన్ని తిట్టాను. ఏడుస్తూ, విశ్వనాథంకేసి చూస్తూ బండిదిగాను. నగల పెట్టె మాపెదనాన్న పట్టుకొన్నాడు. విశ్వనాథం సీటు కానుకొని నిశ్చేష్టు డైపోయాడు. బండి కదిలింది. మాచూపులు దూరమైపోయినయి.

౨

ఇక ఆట్టే మిమ్మిబ్బంది పెట్టను. సాధ్యమైనంత త్వరలో సాంతం కానిచ్చేస్తాను. నాకు బలవంతంగా కేశఖండన చేయించి నన్నీపల్లెలో పడేశారు. నానగలన్నీ నట్టడవిలో కలిసిపోయాయి. నాసన్నచీరలు చల్లారిపోయాయి. నాచదువు చట్టుబండలయింది. నా సౌందర్యం చచ్చిపోయింది. ఇప్పుడు నేను లలితకుమారి యొక్క శల్యపంజరాన్ని. నేనూ, నాకైనుపడ్డ— దాన్ని చూచి నేను, నన్ను చూచిఅదీ, యేడుస్తోవుంటాం. ఇప్పటికీ నాకు హమేషాకాపు. ఒక్కొక్కప్పుడు చస్తేబాగేమో అనిపిస్తుంది. దానికీ అడ్డంకు లేర్పరి చారు. పోనీ, యీ నావిషాదమంతా ప్రపంచానికి వెళ్ల బోసుకొని మరోసారి పెద్దపెట్టున రోదనంచేదామని, దీన్నతిదొంగతనంగా వ్రాసి పంపాను, అట్లాగన్నా నాఆత్మకి శాంతి కొ స్త కలుగుతుందేమోనని. నాచరిత్ర సమంగాయెరిగినవాళ్లు యేడ్చినది నే నెరుగుదును. విశ్వ నాథం యిప్పు డెక్కడ వున్నాడో యెవరికీ తెలీదట.

"నవనవలాడే ఆకులగులాబీ నలిగిపోయింది. శర చ్చంద్రిక శిథిలమైపోయింది. ఆమెలో ఆపట్నానికే కాకుండా—ఆచుట్టుప్రక్కలకంతటికీ సౌందర్యలక్ష్మి స్వస్తిచెప్పేసింది" అని ప్రజలంటోవుంటారని వింటాను.

అన్నట్టు మరచాను. ఇప్పటికన్నా వచ్చిందేమో నని అనుకొంటారేమో—ఏడెనిమిదేళ్లయించా—మరి వర్తమానంలేదు సుమండీ నాభర్తనుండి!

# శ్రీ కృష్ణనవరత్న గీతులు

శ్రీ విక్రమదేవవర్మ

౧

వినతపద్మ, రాగధనులును ద్వేషయు
క్తులును నిన్నుఁ దెలియఁగలరె? యోగి
మానసాంబుజాతమందిర—మాధవ—
విక్రమేశవర్మవినుతకృష్ణ.

౨

త్వచ్చరణరజంబు దగిలినయంతనె
గౌతముని పడంతి పాతకములఁ
బాసి ముక్త యయ్యెఁ బరమపావననామ—
విక్రమేశవర్మవినుతకృష్ణ.

౩

సుప్రవాళతుల్యసుకుమార హా నీదు
పదయుగంబు నాత్మహృదయమందుఁ
దాల్చి గోపికాళి దనివినొందెనుగాదె?
విక్రమేశవర్మవినుతకృష్ణ.

౪

నెదురుగొట్ట మూఁది వేడుకగనువాఁడ—
పసపుపచ్చచాయవలువదాల్ప,
మోసగించితిగద ముక్కంటి నతివవై
విక్రమేశవర్మ వినుతకృష్ణ.

౫

పుష్పరాగకలితపుష్పలిహము పువ్వు
కొఱకు నెమకుమాడ్కిఁ గోవిదుండు
నిన్ను నెల్లచోట్ల నెమకెడు సర్వదా
విక్రమేశవర్మవినుతకృష్ణ.

౬

నిన్ను వజ్రహస్తుఁ డెన్నక గర్వియై
పరిభవింపఁబూని భంగపడుచు
నిన్ను వేడి నీదు మన్ననఁగనెఁ దొల్లి
విక్రమేశవర్మవినుతకృష్ణ.

౭

నిఖిలదేవవంద్య, నీలలితాకృతి
నొక్కమాఱు నాకు నొసరఁజూపు
మంతెచాలు; నింక నన్యంబు నడుగను.
విక్రమేశవర్మవినుత కృష్ణ.

౮

కుదురుబత్తిలేని గోమేధహయమేధ
కర్తలైనను నినుఁ గలియలేరు;
భక్తియొండె నిన్నుఁబడయుసాధన మౌను.
విక్రమేశవర్మ వినుతకృష్ణ.

౯

ఘోరపాపచయవిదూర—జనార్దన—
రాధికామనోహరా—ముకుంద,
యనుచు నాదునాల్క నినుఁ బిలువఁగనిమ్ము
విక్రమేశవర్మ వినుతకృష్ణ.

---




కొ. నరసింహాచారి

# తెరచాపలు

తెరచాపలను చీపురుపుడకలతోగాని, కొంకాయఆకు, లేక తాటియాకు ఈనెలతోగాని, సన్నని బద్దలుగా చీల్చబడిన వెదురుతోగాని అల్లవచ్చును. పెద్దచాపలను చేయుటకు వెదురుబద్దలే తగియుండును. పుడకలలావునకు తగినట్లు దారము ఉండవలెను.

ఒక చాపకు అడుగంచునకును, పైయంచునకును రెండు గట్టి వెదురు కర్రలుగాని, పేముతునుకలుగాని యుండవలెను. ఇవి చాపకు ఆధారములు. ఈ ఆధారపు కర్రలలో నొకదానిని (s s చిత్రము A) రెండు స్తంభములకుగాని, లేక మేజాబల్ల యొక్క రెండుకాళ్లకుగాని (l l చిత్రము A) గట్టిగా కట్టుకొనవలెను. ఆ కర్రపై రెండు దారములను రెండుచోట్ల దండగావేసి వాటి కొనలకు బరువునకుగాను రాళ్లను కట్టవలెను (a b, a b). పిమ్మట చాపకుగాను సిద్ధపరచుకొన్న పుడకలలో నొకదానిని దారములపై నుంచి పట్టుకొని (౧, ౧ చిత్రము B) a, a అనుకొనలను s, s, అను ఆధారపు కర్రకు వెనుకప్రక్కకును, వెనుక నుండు b, b అను కొనలను ముందు ప్రక్కకును వేయవలెను (చిత్రము C). పిమ్మట మరియొక పుడకను తీసికొని మొదటి పుడకకు పైవైపున పెట్టి, ముందుండు b b కొనలను వెనుకకును, వెనుకనుండు a a కొనలను ముందునకును వేయవలెను (చిత్రము ౨, ౨ D). ఎప్పుడును మొదట ముందుండు దారపుకొనలను వెనుకకువేసి తర్వాత వెనుకనుండు కొనలను ముందునకు వేయుచు రావలెను. ఈవిధముగ కావలసినన్ని పుడకలనుకట్టి కడపట దారపుకొనలందలి రాళ్లను విప్పివేసి ఆకొనలను S S అను ఆధారపు కర్రకు కట్టివేయవలెను (చిత్రము E).

ఇట్టి చాపలను పెద్దవిగా అల్లవలెనన్న చిత్రము F నందలి విధముగా ఆధారపుకర్రపై నాలుగు దారములను వేసి చాపల్లవచ్చును. దారములమధ్యగల దూరము పుడకలపొడవుకన్న తక్కువగా నుండవలెను. మొదట పొడవగు రెండవ ఆధారపుకర్రను దీసికొని, చిత్రము B యందలి విధమున నే నాలుగుదారములపై నుంచి, వాటిముందుకొనలను వెనుకకును, వెనుకటి కొనలను ముందునకును మార్చి వేయవలెను.




పిమ్మట మధ్య గల రెండు దార ములపైనొకపుడ కను (౧॥॥చిత్ర ముF) ఉంచి ఆ రెండు దారపుకొ నలనుమాత్రము మార్చ వ లెను. తర్వాత ఎడమ ప్రక్కను గల రెండు దారముల పై ౨, ౨ అను పుడకనుపెట్టి వా టికొనలను మా ర్చవలెను. అటు పిమ్మట కుడి ప్ర క్కనుగల రెండు దారములపై 3, 3 అను పుడక నుంచి దారపు కొనలను మార్చ వలెను. ఈరీతిగ పుడకలను కట్టు చువచ్చినయెడల చిత్రము G యందలివిధముగ చాపఏర్పడును. పుడకలకుబదులుగా.మధ్య మధ్య వట్టివేరును గూడ పెట్టుచువచ్చినయెడల వట్టివేరుచాప ఏర్పడును.

ఒక్కొక్కదారమును ఆధారపుకర్రపై సగము ముందు ప్రక్కకును, సగమువెనుక ప్రక్కకును ఉండును. అల్లికయందు ఒకకొన ఒకమారు కుడిప్రక్కగావచ్చినయెడల దానిని రెండవమారు ఎడమప్రక్కగా వచ్చునట్లు వేసిన అల్లిక యూడిరాక గట్టిగా నుండును (చిత్రము H). అపుడు దారపుతీరు మెలికలు తిరిగిన ట్లుండును. పుడక లన్నియు కట్టిన తర్వాత వాటిపై మనయిష్టానుసారము చిత్ర ములనుగూడ కుంచెతో వేయవచ్చును.

# బిచ్చము

ఏలేశ్వరపు కృష్ణమూర్తి, బి.ఏ.; బి.యల్.,

అన్నమైన దోయమైన ద్రవ్యంబైన
శాకమైన దనకు జరుగకొలఁది
నతిథిజనుల కడ్డమాడక యిడరేని
లేనివారు పుడమి లేనివారు.

అనేది చాలా గొప్పవాక్యం. వరచేలములలో, మాడలో, ఫలములలో, వస్త్రంబులలో, గోవులలో, హారులలో, రత్నములలో, రథములలో, విశిష్టార్థంబులలో, కన్యలలో, కరులలో, కాంచనమో, నికేతనములలో, గ్రామంబులలో, భూములలో, ధరణీఖండమో—ఇంద ఇదుగో అని సిగ్గువదిలి నోరునిప్పగానే చేతులో పెట్టి నీళ్లువదిలే దాతలు లేరు. కృతయుగంలోను అప్పుడు లేదనేముక్క లేదుట. ప్రతియింటా పచ్చతోరణం. లేదంటే బిచ్చం పుట్టేదిట. ఇంత పెట్టేవారుట. ఇప్పుడో! పెట్టేవారు ఏమూలైనా కనబడడం తక్కువు గా, లేదని చెయ్యి చాచేవారు ప్రబలుతున్నారు. కాలం మారింది. రాజ్యాంగాన్ని బట్టి సంఘం మారినది సంఘాన్ని బట్టి రాజ్యాంగం మారినది. ఎన్ని మార్పు లొచ్చినా, రాకున్నా ఏరాజ్యాంగంలోను, ఏసంఘం లోను, ఏ సంస్థలోనుకూడా కుబేరులు, కోటీశ్వరులు తక్కువ. ఉన్నా కర్ణుడొకడు, అర. సామాన్యపౌరు లలో బీదలెక్కువ. నోట ముక్క అనేది విశేషంగా వున్నా చేత కానీలేనివా రున్నారు.

బిచ్చంలో యాచకుడు, దాత స్థలంచేసికొని సర్దుకొని ఒకరినొకరు కాగలించుకొని కూర్చున్నారు. యాచకునికి అడగడం పని. దాతకు యివ్వడం పని. ఇష్టార్థములు యిచ్చినవి కటాక్షించి, తిరగగొట్టకుండా యాచకుడు పుచ్చుకోడం కేవలం సంతృప్తి అని మనం అనకూడదు. భిక్షాగమనానికి ముఖ్యం పేదరికం అన్నా కొంచెం నిదానించాలి. యాచకుడంటే పరియాచకం ఎప్పుడు కలిసిరాదు. కవిసార్వభౌముడన్నట్లు, తిరిపెమున కిద్దరాండ్రా అనవలసిన శివులు శంకరులు వుంటారు. ఇంతకు దాత కలవాడవాలి. అతడికి ఇచ్చేస్వభావం ఉండాలి. ఎప్పుడు దాత పెంపుసొంపు తలవంటే తొందరగా యాచకుడు పయన మవకూడదు. దాత రాజాధిరాజైనా నిఖిలం అడగడం తగవు కాదు. తనకు లేనిదాని యాచకు డవుతాడు. దాతలు పొడగట్టుగానే,దానం చేస్తే దేవలోకం వస్తుందని హెచ్చరించాలి. కొందరిని వేడాలి. మరికొందరికి స్తుతి దివ్యౌషధం. కొందరికి మాత్రం బెదిరింపు. సాష్టాం గంగా పడితే ఒక్కొక్కదాత యిష్టపడతాడు. ఈతి పంకిచ్చి తాటిపండు లాగే దాతలు ముందరినుంచీ జాగ్రత్తపడతారు. ఇంట గల ధనము నైదుభాగములు చేసి కామానికి, అర్థానికి, ధర్మానికి, యశమునకు, ఆశ్రితబృందానికి యివ్వాలని శాస్త్రకారుడు వ్రాశా డంటే వాడిసౌ క్షేమం పోయింది? ఆడా యిచ్చేవాడు, నేనా అని ఓదాతగారు వాదించారు. ఆయన్ని సంతోషపెట్టడానికి యీకాలంలో అది ఆచరణీ యముకాదని, స్మరణీయంకూడా కాదని -యాచకుడు మాటుమళ్లించేసరికి దాతమనసు కుదుటపడింది. అందుచేత దానము అయితే యివ్వలేను, దండుగైతే పెట్టగలనన్న పట్టింపే మిగిలింది. దాత యిచ్చి చెడ తాడు, యాచకుడు తెచ్చి చెడడనేది సూత్రమైంది. 'కొరతచేయక నిచ్చుపురుషుడు చెడకుండు' ననే ఆర్యోక్తికి అంతా ఆమోదిస్తారు. కొన్నివేళలు పెట్టు కున్నారు కొందరుదాతలు. అర్థిని పొమ్మనరా దని కొందరి దాతల నియమము. కొన్ని మిషలు చెపు తేనే కొందరుదాతలకి నచ్చుతుంది. కొందరు దాతలకి "ప్రదానం ప్రచ్ఛన్నం గృహ ముపగతే సంభ్రమవిధిః ప్రియం కృత్వా మౌనం." అనేది పరమప్రమాణం. దాతలలో యిచ్చి లేదనేవారు, యివ్వక లేదనేవారు, యిచ్చిచెప్పుకొనేవారు, చెప్పకుండాయిచ్చేవా రున్నా రు. ఇవ్వకుండా చెప్పుకునేవారు గలరు.మరచిపోలేదు మీసంగతి,మంగళవారం మళ్లీ కనపడం డనేవా రున్నా

రు. ఇచ్చేదను, యివ్వను అనేవిషయం పెట్టిలో పెట్టి పెద్దతాళం వేసి, శాంతియుతంగా కడకు రాజీపడేవా ళ్లున్నారు. దొంగదాతలు, దొంగయాచకులు పిల్లిమీద ఎలుక, ఎలుకమీద పిల్లిలాను క్రింద మీద పడుతూం టారు. బ్రతికివుంటే బలుసాకు ఏరుకుతిందాం అని వీరి చెలగాటం. చూస్తూచూస్తూ చిన్నవిషయాలకి ఉరెట్టుకోరుగా బీదలు భాగ్యవంతులు. "దానం భోగో నాశ స్తిస్రో గతయో భవన్తి విత్తస్య" అనేముక్కలు లోకానుభవంతో అన్న ముక్కలు. ధనం యితరులకి యివ్వడమేనా వుండాలి, లేకపోతే తను అనుభవించ నేనా అనుభవించాలి. లేకుంటే "తస్య తృతీయాగతి ర్భవతి" అన్నారు. ఇహానికి పరానికి పరోపకారపరా యణత వుండడం మంచిది. దాతకు యీవియే కీవి.

భిక్షుకుడికి కావలసినది ఓపిక, పట్టుదల. కొందరు వినయం వుంటే రాణిస్తుందన్నారు; మరి కొందరు వినయం గినయం లేనిది ఎరువు తెచ్చుకోము అని ఆచరణరూపేణ చూపారు. దేహీఅని అడగ డానికి పూనుకున్నప్పుడు లజ్జకి సెలవుచెప్పడం మొదటి కర్తవ్యం, కార్యక్రమంలో. కఠినోక్తులు చెవితాకనట్లు వూరుకోడం ఆత్మనిగ్రహం. లోలోన వీడుకాకపోతే మరి దాతలు లేరాఅని నిరసించి సంతుష్టిపడడం, పైకి మాత్రం చిరునవ్వే ప్రకటించడం, ఇచ్చినాసరే, లేకున్నా సరే మనం తెచ్చిందేదీ లేదు, తీసుకొనిపోయేదేదీ లేదు అని గుండెనిబ్బరంగా ప్రవర్తించడం తత్త్వం. కాని ప్రతియాచకుడు యీతీరున వుంటాడా? మనిషి కోతెనులు. కొన్నిచోట్ల బిక్కముఖం వ్రాల్చడం. వేరొకచో తండ్రి చిన్నతనమందే పోయాడని తప్పు మాటాడడం. తల్లిలేని తొలిబాలుడ నని చెప్పుటకు తరి ఫీదుకావడం. బిచ్చం పుట్టేందుకు బ్రతికివున్న తాతని రోజు తొంభైమాట్లు చంపడం. కంట తడిపెట్టడం. ఇంతో అంతో తెలివివుంటే 'అమరా నిర్జరా దేవా' అని అమరం ఏకరువెట్టడం. కరెంటుపాట పాడి కానీడబ్బు లాగడం. ఎల్లాగైనా కరుణపుట్టించేం దుకు భావప్రకటనచేయడం మామూలు. ఇంకా గంగి రెద్దును గ్రామాలల్లో త్రిప్పడం, గారిడీచేయడం, గడకర్రెక్కి గంతులెయ్యడం అడుగంటలేదు. తద్ది రోజుల్లో త్రోవనడ్డగించడం. కొందరు గౌరికళ్యాణం పాడుతు గావురుకేక లేస్తారు. కొందరు శ్రీభగవన్నామ సంకీర్తనం అని గజ్జకట్టుకుని ఆడతారు. కొందరు చిర తలు చెవులు తడకలుకట్టేట్టు వాయిస్తారు. మూగ నోముపట్టి నోరుతెరువని యాచకు లున్నారు. వారు జేగంట వాయించి జరూరుగా వారిరాక నెరిగించెదరు. కాలో చెయ్యో తెగిందని పాతగానను విననివాడికల్లా భుజంపట్టుకు కూలేసి వినిపించేవారు కొందరు. రైలులో 'రామనామ మెంతోరుచిరా' అనో, 'రామ నీసమాన మెవరనో' పెట్టెచుట్టూ ప్రదక్షిణం చేస్తారు. భజ గోవిందశ్లోకాలు బజాయిస్తారు యాత్రస్థలాలవి కావి యుంటారు. యమకింకరునిలా వదలక భల్లూకపుపట్టు పడతాడు. మనము యింతనిస్సహాయులమా అని విసుగు, కోపం. ఆశ్చర్యం, ఒకేమాటు పుడతాయి. ముసలి వాడైతే కర్ర చేతబట్టి చెముడు నటించుతాడు; గడ గడ వణుకుతాడు. ఇవి సామాన్యం. ఏవిధంగానో ఓ విధంగా దాతని కనుక్కోడమే యాచకుని స్వయం కృషి. ఒకరి కుందనీ, తమకు లేదనే భావం లేకపోతే యాచన బయలుదేరదు. అతుకులమారి బొంతను కప్పు కోడం. చింకిరిబట్టల ధరించడం. జోలి భుజాన వేసు కోడం. అక్షయపాత్రం చేత బూనడం. పట్టెవర్ధనాలు వీలైతే పొడుగ్గా తీర్చిపెట్టడం. ముందంజవేసి దానం యిచ్చేందుకు తగినకారణం దాతముందు పాడ వేయడం. దాత పెంకిజవాబు లిస్తే చాలుచాలు మాకు మరో రున్నారు అనడం. ఇస్తే, యిచ్చారన్న కృతజ్ఞత లేక పోడం. నిన్న నిచ్చారు కనుక యివాళ పారవేయిం చాలి అని యాచకుడు అనడం. ఇవాళ పెట్టిం చారు మీధర్మాన రేపుకూడా దొరుకుతుందని ముం దాకట్టుకోడం. పిడికెడు పడ్డాక వీడెవరో మన మెవరమో అన్నముఖం పెట్టి గడప దాటడం. సంతో షికి ఎప్పుడు సుఖమే జరుగుతుంది. సంతుష్టుడే మూడు జగాల పూజ్యుడు. ప్రాప్తమైన లేశమైనా పదివేలని తృప్తిచెందనివాడు సప్తద్వీపములనైనా చక్కబడని వాడుక. కాని లోకంలో పెడితేనే పెళ్లి. లేకపోతే

# నిజాం సాగర తటాక చిత్రములు

(H. P. P. S.)



౧. నిజాం సాగర తటాకము

పెటాకులు. ఇస్తే దీవనలు, లేకుంటే తిట్లు. బిచ్చానికి పోయినా బిసువు తప్పదు. దాత యిచ్చింది యాచకుడు అనుకున్నది, ఆశపడ్డది కాకపోతే ధర్మాన్ని గురించి పెంకులెగిరేట్టు చర్చ జరుగుతుంది. ధర్మంఎల్లా చెయ్యాలో, ఏమిచెయ్యాలో దాతకి వుపదేశంజరుగుతుంది. మరీ ముక్కోపిలాంటి యాచకుడు దాతనెత్తిని వేసిన రవన్ని బియ్యం రాలుస్తాడు. బిచ్చం ఎత్తడంతో అదృష్టంకూడా నడుస్తుంది. ఒకడి ముఖం చూస్తే యివ్వనివాడుకూడా రెండుగింజ లేస్తాడు. ఇంకొకడికి మెతుకు పుట్టదు.

ఆదిని శిష్యులు గురువుగారికి కాళ్లు గ్రుద్ది, మధుకరవృత్తిచే జీవించి, జీవితమందలి సుళువుబరువులను, రహస్యాలను తెలుసుకునేవారు. భిక్షాటనం చేస్తే కష్టం ఒంటికి నాటి రెండుముక్క లంటుతాయి అనేది పాతచదువు. ఎవరిడబ్బెట్టి వారు మార్చుకు తినడం కొత్త చదువు.

ముష్టిఅనేది అభినయ హస్తవిశేషం. మరేమీ లేదు. దాత యాచకునికోసం వెతకడు; యాచకుడు దాతని వెంబడించును. దాతది ధనము; యాచకునిది ఆశ్రయింపు. దాతది పేరు; యాచకునిది పేదరికం. దాతది ఆర్జన; యాచకుడిది సోమరితనం. దాతదిసేవ; యాచకునిది స్వతంత్రజీవనం. దాత కొకయిల్లు; యాచకునికి అన్నీ యిళ్లే. దాతకు లోకజ్ఞానం లేదు; కూచున్న చోటనుంచి లేవలేడు. యాచకుడో! దూరని యిల్లు లేదు. తిరుగని వీధి లేదు. చూడనిపట్నం లేదు. బోల్తా కొట్టించని ప్రభువు లేడు. పిల్లిమంత్రములతో క్రిందకు దొర్లని దాత లేడు. యాచకు డందరి నెరుగును; అందరి నెరుగడు. అందరు ఆప్తులే. అందరు శత్రువులే. నీచవృత్తి అని గిట్టనిప్రపంచం అనుకుంటుంది. కాకిమూక! ఒట్టి దయార్ద్రహృదయం వుంటే యాచకుడు మెచ్చనిమాట నిజమే. ఓతృణం ఇయ్యాలి.

నిష్కామకర్మచెయ్యడం అంటే ఏమన్నమాట, ముళ్లదారిని అడుగులెట్టా మన్నమాట. అల్లాటి కర్మ చేయడం అరుదు. మంచిచేసి, ఆమంచికి రెట్టింపుగా రాబట్టాలనేదే దాతకు కోరిక. యాచకునికి లేనిది పోగు చేసుకుందాం అనికోరిక. దాతకి కొంచెం ఎక్కువ అడుగుతే కోపం. పదిమాట్లడిగినా కోపం. ఇక కొంచెం యిస్తే ఏంకొంప మునిగింది, యింతఎల్లాగు యిచ్చాడని యాచకునికి కోపం. మోహాన్ని దాత, యాచకుడు తొలగించుకోలేరు. దాతకు లోభత్వం అంటే, యాచకులో—పరమలోభులు. దాతకు యాచకుడు గర్వంలో తీసిపోడు. ఇస్తినమ్మా అంటే పుచ్చుకొంటినమ్మా అంటారు. దాతకు దాతని చూస్తే ద్వేషం. వాడిముఖం వాడుకూడా ధర్మమా, పిల్లికి బిచ్చం పెట్టని పలుగాకివెధవ అని ప్రచారంచేసుకుంటారు! యాచకుడికి యాచకుడికి షష్టాష్టకం, ఒకరికంటె ఒకరు ఎక్కువ బావుకుంటున్నారని. మొత్తంమీద దాత, యాచకుడు అరిషడ్వర్గాలలో పడి యీదుతున్నారు. తలచిచూస్తే ప్రతివాడు లోకంలో దాత కాలేడు; యాచకుడు కాలేడు. స్వలాభం వదులుకోడం కోటి కొకరు. అందుకనే ధర్మసత్రాలు కొందరిపేరట వెలసినవి. పూర్ హౌస్‌లు కొందరికొరకే వినియోగపడుతున్నాయి. బీదతనం అనేదానికి నిరూపణ లేదెక్కడ. నిదర్శనా లున్నాయి. నాగరీకం అనేది మాయరూపం అవడంబట్టి ఎవరు కలవారో కనుక్కోడం పటాటోపంమూలాన్ని పైకితేలదు. అంతా శ్రీమంతులులాగే అగపడతారు. కారు నడుపుతారు. కోర్టుకెడతారు. కలెక్టరీలు చేస్తారు. ఇట్టిదాత లుండడం ముప్పని మీరు ఖేదపడ నక్కరలేదు. యాచకులలోను గొప్పయాచకు లున్నారు. ఈకాలంలో గృహయజమానికి వూపిరిపీల్చేందుకైనా తీరుబడి లేదు. అందుకనే వారు చాలాకాలం బ్రతకడం లేదు. బ్రతికినా దానంధర్మం చేయడానికి తన తరఫున యితరులను నియమించి మరీ చేయిస్తాడు, పుణ్యం ఎల్లాగు వస్తుంది కదా అనే నిబ్బరంమీద. పోనీ సుశీలయను గృహిణి చేయకూడదా అంటే ఆపెకు జనరల్ ఎలెక్షనుమీద, జాయింటుకమిటీరిపోర్టుమీద మోజెక్కువ. అందుచేత ధనికులిళ్లల్లో పనిచేసే వంటవాడే బిచ్చగానికి

దాత. వాకిట్లో జవానూ దాతే. దాత లోభి అని యాచకుడు తిడితే అవి ప్రత్యక్షంగా పొందేవారు యింటిని కాచుకొనియుండు బత్తెగాళ్లు.

భిక్షువుని కాస్తదూరంగానే వుంచమని కామ శాస్త్రంలో వుంది. కౌటిల్యుని శాస్త్రంలో రాజుకి బుద్ధి చెప్పాడు, బిచ్చగానివేషం తరుచు వేసీ,వేయించీ, రాజ్యంలో ఆనుపాను తెలిసికొని మెలకువగా పని చేయమని.

ఏకాకిముండావాడైపోయి ఏమాత్రం ఆసరా లేకుండా ఎత్తేముష్టి ఒకటి. తాత్కాలికంగా ఏదో మిషమీద స్వలాభాపేక్షతో వేసే యాచకుడివేషం ఒకటి. రాత్రిముష్టిలో విశేషం అని కొంచెరు బయలు దేరారు. తెల్లవారగట్ల కొందరు. దీపాలవేళ, పశువు లింటికి వచ్చేసమయం కొందరు పాటించేదరు. బిచ్చ గాడు కాలచక్రాన్ని చేతుల్లో పెట్టుకుంటాడు. కథ మారుస్తాడు. బొబ్బిలిపాట దివ్యంగాపనిచేయగల దను కుంటే గొంతుక సవరించుకొంటాడు! యాచకుడికి శత్రువర్గం,అనగా వుండకూడనివి రెండున్నాయి: ఆత్మ స్తుతీ, పరనిందా. ఆత్మస్తుతి కొంచెంవుంటేగాని కటికి దాతని గెలవడం కష్టం. ముఖ్యంగా భిక్షదొరికేదాకా పరనిందమాత్రం ఏకోశాన వుండకూడదు.బిచ్చానికివెడితే పిడికె డిచ్చి పొమ్మనువారు, పట్టెడెట్టి పొమ్మనువారు, కసిరి పొమ్మనువారు, కర్రపుచ్చుకునేవారు, నీకు కాలు గ్రుడ్డా, కన్నుగ్రుడ్డా కరువుకాలం పో అనేవారు, చెయ్యి వూరుకోలేదు నడవండనేవారు, భోజనాలవేళ వస్తావు బుద్ధిలేదా అనేవారు, గుమ్మంఅవతలకి గెంటే వారు, వాకిట కుక్కను వూసుకొలిపేవారు, మాటా మంతీ చెప్పకుండా నిలవేసేవారు, కానీ గిరగిరత్రిప్పి ముఖంమీద విసిరేవారు, హిందీలో ప్రవేశమున్నట్టు జావ్ ప్రయోగంచేసేవారు, కూలినాలి చేసుకోఅబ్బాయి అనేవారు, తోచినట్టు చేతితోను, నోటితోను చెప్పి పంపిస్తారు. వీటికి పాటింపనివాడు బిచ్చగాడు. నాకు లేదనేభావం యాచకుడికి దాతకుకూడా వుండకూడదు.

యాచకవృత్తిలో కొన్ని సుళువు లుండబట్టి దీనికి కొందరు ప్రజలు నమ్మకంగా పూనుకుంటు న్నారు. బిచ్చగాడంటే అందరికి నిరసన; అందుచేత ఎవరు చూడరు. కనుక్కోరు. నెంబరు టూ ఏమిటంటే, వేషంవేయడం సుళువు. ప్రతిబిచ్చగాడు నేరస్థుడని అందుచేత నిరూపణచేయకూడదు. ప్రతిబిచ్చగాడిని పిలిచి, కాచుకో క్రిమినల్ ప్రొసీజర్ కోడు నీమీద ప్రయోగిస్తున్నాం, నీవు నీపొట్ట బోసుకుంటున్నట్టు న్యాయంగా చూపెట్టమంటే వాడితరంకాదు. పాపం ముష్టివెధవ అని దారేపోనిస్తే నేరస్తులందరికి అభయ మిచ్చి, ముష్టివేషం వేయండోయని హుకుం అందజేసిన ట్టవుతుంది. నేరంలోను చదువు లున్నాయి. పాఠా లున్నాయి. దొంగల సంపులలో అబద్ధం ఆడడం అనేది రోజూ పనిజేసుకొని చిన్నపిల్లలకి తల్లి, తండ్రి నేర్పు తారు. కోడిపెట్టనో, కానిడబ్బునో లాక్కురావడానికి మార్గాలు నూరిపోస్తారు. బాలురు బాగా పనిచేస్తే బహుమతు లిస్తారు. అన్నిటికి అభ్యాసం కాదండీ మూలం! సుంటడని మనం పూరుకుంటే, గొంతుకకోత దాక చేయగలడు. నేరస్తులకి భిక్షాటనంకూడా అభి మానశాస్త్రమే. నేరానికి వీళ్లు, పునాది, రంగస్థలం, పాత్రపోషణలు నిర్ణయించుకోడానికి యాచన సమ్మో హనాస్త్రం. కాని ప్రతినేరస్తుడు ముష్టిఎత్తుకునేందుకు సిద్ధపడనక్కరలేదు. అయినా బిచ్చగాడు కంటపడి నపుడు 'కపటవేషధారి వీడు' అని పరిశోధకుడు లోలోన విమర్శించుకుంటాడు. ఒక్కొక్కవ్యక్తికి ఒక్కొక్క నేరంమీదే మనసుపోతుంది. ఒకరకం నేరం రుచిమర గడంచేతను, ఇంకోవిధమైన నేరానికి వేరే కృషి కావ లసివుండడంబట్టి, సాధారణంగా నేరం మార్చడు. ఎన్నోరకాల నేరాలల్లో బుర్రదోపి, వాటిల్లో పట్ట భద్రులైనవారు కలరు. ఎల్లాగైనా బిచ్చమెత్తడం, దొంగతనం బాగా మిళితమవుతాయి.

దొంగిలించడం రెండుముక్కల్లో చెప్పాలంటే చోరీ అనాలి. ముందుగా ఓ ఆసామీకి చరాస్తి అనేది స్వాధీనంలోవుందందాం.ఆచరాస్తిఅనేదితోలుకుపోయే గొడ్డోగేదో, తెగగొట్టుకుపోయే చెట్టో చామో, లాక్కు పోయే బండీయో పత్రమో, తినే కూడో, వాయించు కునే గంటో, తొడుక్కునేంటి చొక్కాయో, పెట్టు

కు నేంటి కుండనాల జోడో, గృహిణి వంటినగో అవచ్చును. మరోరికి యాచరాస్తి మనపాలు జేసుకో వాలనే కడుపుబ్బ పూర్ణంగా కలగాలి. ఆస్తి స్వాధీనుణ్ణి, అడగడం నుడవడం లేకుండా తోసి రాజనాలి. ఉన్న వుద్దేశాన్ని ఏమాత్రంఅయినాకర్మర్మూ పేణచూపాలి. మనస్సులో దాచుకుకూర్చుంటే వుద్దేశాన్ని దూరి మనం చూడలేము. కనుక యీసూచన. ఇంతకు కర్త చోరు డవుతాడు. కాజేయడం అనేది క్రియ. వస్తువు పోయిన వాడిది కర్మం. చోరత్వాన్ని బంధుత్వం అనేది కూడా అడ్డలేదు.

దొంగకి ఎవరిస్వాధీనంలో ఏమున్నది తెలియాలి. మనిషిలోలోపాలు తెలియాలి. ఇంటిలో లోపాలు తెలియాలి. హక్కుదారుకు వైరిముఖం వేసేసమయం ఆకట్టాలి. ఏదేది ఎల్లా లాగాలో శాంతంగా పురమాయించుకోవాలి. లాభం నష్టం తూచాలి. దొంగిలించేదాకా అదోకాండ. చిక్కుకుంటే చావు పర్యంతంచేస్తారుగామరి, అందుచేత. వీథులో పాములాడు నాగస్వరం వూదుతూంటే మనం తలుపుతీసుకు చూస్తున్నట్టే వుంటుంది. పెరటిదారమ్మట బంగారపు పెట్టె అప్పుడే పరుగులెత్తిపోతూంటుంది. ముష్టికొచ్చి ముంగిట నిలిచినట్టే వుంటుంది, చేతికందినది అవతలకు జేరుతుంది. సోదచెప్పేసోలెవుబిచ్యుమడిగినట్టేవుంటుంది, యింటెనుట్టు యిల్లాలినోటమ్మట దొంగలకు దారి చూపుతుంది. సేవకుడు చాలా నమ్మకంగా వున్నాడని పొగిడినట్టే వుంటుంది, యింటో డబ్బుపెట్టెకి రెక్కలొస్తాయి. తుర్రు మంటుంది. సేవకా అంటే పలుకువా రుండరు. కొట్టి లాక్కోడం దొంగకి పరువునష్టం. తెలివితేటలుకామా చూపవలసినవి! దొంగ, ఎవరైనా గుమ్మం ఎక్కేటపుడు కనబడితే వేషానికి తగినట్టు భాష మారుస్తాడు. లేకపోతే దొరికిందాంతో దౌడుతీస్తాడు. మన తత్త్వం నేరగానికి ముందు తెలుస్తుంది. వాని తత్త్వం మనకు వాడు వెళ్లిపోయాక తెలుస్తుంది. కావలసినవన్నీ వచ్చాక స్కీము తయారవుతుంది. బుడబుడక్కలవాని వేషంతో పుట్టె ముంచుతాడు. ఫకీరువేషంతో పన్నుగడ సాగుతుంది.

పైగా బిచ్చగాడంటే కరగని హృదయం లేదు. ధర్మం యివ్వలేదంటే అది వేరేసంగతి. తలుపులు, గొళ్లాలు, రాకపోకలవీళ్లు, యింటిహంగు, సరిహద్దులు, యింటో ఏముందో, ఎవరున్నారో, ఎవరి కెవ రేమవుతారో, ఏవీథులో ఆస్తిపరు లున్నారో, ఏయింట ఖాతరీ లేదో, ఏమూల మంచాలు అమర్చారో, ఏపంచని చేతిగడియారాలు పడివుంటాయో, ఏపట్టుఖండ్వా ఎక్కడుందో, నిలబడ్డనిమిషమూ ఒళ్లంతా కళ్లుచేసుకొని చూస్తాడు. చిన్నపిల్లలుంటే చెవిపోగులు కాపాడుతాడు. నోరెట్టుకు అరుస్తాడు. ఎంతసేపు నిలబడడం సమంజసమో అంతసేపు కాలుకదపడు. అనుమానం ఎంతమాత్రం యితరులలో కలిగించడు. సేవకులు సత్యసంధులు కాకపోతే వారి కోత్పణం యిచ్చి రాజీ పూర్ణంగా పడతాడు. అందుకనే ముష్టివాడిని యిచ్చో యివ్వకో వెంటనే పొమ్మనాలి. అందుకనే యాచకుని గుమ్మంఅవతల నిలవమని పెద్దలు హెచ్చరిస్తారు. లోపలకి రానివ్వకపోయినా నేరం జరుగుతే అదోగమ్మత్తు. పెర్షియాలో కాబోలును, ఆలీబాబాగారి యింటికి దొంగ లొచ్చి సుద్దముక్కలో తలుపుమీద గుర్తుపెట్టుకున్నారు. ఈ విషయం చిన్నపుడే చెపుతే గుండెదడ పిల్లలకి పుడుతుందని పెద్దక్లాసులదాకా డేకిస్తున్నారు స్కూళ్లలో చెప్పకుండా. బిచ్చానికొచ్చి బొగ్గుముక్కతో గొళ్లెంలోపలుంటే దానికి సరీగ్గా పైన గీతగీసుకుపోయే వారున్నారు. కొక్కిరిగీతలూ పెట్టిపోతారు ఏమూలో కనీకనబడనట్టు. ఎరగనిపిల్లలు, అల్లరి అని మనంఅనుకుంటాం. బిచ్చం వేసి పెరటిత్రోవని వుంటాము, స్వర్గానికి దారిచక్కగాచేసుకుంటున్నామని. స్వర్గంమనకివచ్చినా నేరం ఆగదు. యూరప్‌లోను అక్కడా జిప్సీలు స్థిరస్వభావం లేక దేశద్రిమ్మరులై యాచన వృత్తిగా కలిగి మోసం, దొంగతనం చేయడం చరిత్రాత్మకము. వారిలో వారికి తెలిసేందుకు యింటిని గురించి యిళ్లకి గుర్తు లేమూలో పెట్టుకు పోయేవారు. రెండు గుర్తులు మచ్చుకి చూడండి. సంజ్ఞార్థములు బోధపడతాయి:



ఈ గృహస్థు మంచిదాత. ఇట దానం నాణెపూర్వకంగావుంటుంది.



చిల్లిగవ్వ చెదరనివ్వరు. ఛీ ఛీ పొమ్మంటారు.



అన్నప్రదాతలు మాత్రమే. ధన మొసగజాలరు.





9 71
27 2

= ఈ గురుతున్న చోటునకు ఎడమవైపున 27, 2 అంకెలు గల వసతి గృహములందును, కుడి ప్రక్క 9, 71 నెంబర్లు గల చోట్లను బిచ్చమిడుదురు.

చెంచువారికి ఎఱుకలవారికి, సోదెచెప్పేవారికీ ఈగుణాలు కొన్ని అలవడవచ్చును. కాని దొంగతనం ఒక్కదాసరివాని సొమ్ముకాదు. దొంగతనములో నున్నది పరధనాపేక్ష, స్వార్థపరత్వం. వీటికి లోబడని వారు డేడీ? దొంగాడు స్వాహాచేయడానికి యాచకుడి వేషం వేశాడంటే తుదకు సంకెళ్లుపడ్డా సంతసిస్తాడు. భిక్షుకి శిక్షకి నేరస్థుడు సిద్ధం. మొండివాడు రాజుకన్న బలవంతుడైనా, రాజుకి దుష్టశిక్షణ విధి. రాజే న్యాయానికి నిధి. మనకు లోకాభిరామాయణం చాలు.

ఏకాకీ నిస్పృహః శ్శాంతః
పాణిపాత్రో దిగమ్బరః,
కదా శమ్భో, భవిష్యామి
కర్మ నిర్మూలన క్షమః.

అనేవైరాగ్యంతో బిచ్చమెత్తడం పూజనీయము. అంతా యీదారిత్రొక్కితే యింతలోకం ఏంకాను?

---

# గర్వభంగము

కీ. శే. కొడాలి వేంకటసుబ్బారావు, బి. ఏ.,

నేను నీకోస మేగుచున్నాను : మధ్య
దారిలో నెవ్వరో చెప్పినారు "నీవు
ఆశ్రితుం డెవ్వనినో చూడ నరిగితి" వని
నేనుగా కాత డెవ్వ డన్నాను కినిసి.

వార్త చెప్పినవారు నా వైఖరి గని
ఇత డహంకారిరా యని యీసడించి
పోయినా; రేను నింటికి పోవ, చెప్పి
రాదెనకు నీవు రానెరాలే దటంచు.

సిగ్గుపడి నిన్ను వెదుకజొచ్చితిని కంటి
నీటి బొ ట్లడ్డమై చూపు మాటుపరుప
ఇంతలో "దేవ బ్రతికితి మేమికొదువ
తమరు దయచూప" నన్న వాక్యములు వింటి.

ధ్యాన మరుదెంచుమార్గము తవిలిపోయి
మొదట నీవార్త తెల్పు సమూహమధ్య
మం దనంత తేజస్సువై యలరు నిన్ను
చూచుకొన్నాను - గర్వమార్చుకొనిపోమె.

* * * *

---

# తెలుగుటాకీలు: ఆంధ్రుల పరిశ్రమ

ఏ. వి. సీతారామయ్య, యం. ఏ.,

మిస్. మేయో హిందువులనుగురించి వ్రాసిన పుస్తకం ప్రచురించేటప్పటికి జనమంతా గగ్గోలుచేశారు; జవాబులువ్రాశారు. ఆమెజన్మస్థానమైన అమెరికానుగురించి మళ్లీ అదేవిధంగా 'తక్కెకాటుకు చెప్పుదెబ్బ' అన్నట్లు పుస్తకాలు వ్రాశారు. ఆమెవ్రాసినదానికి యీసడిస్తూ నానాగందరగోళం చేస్తూ తమకున్న మాతృదేశంమీది అభిమానం కనపరచారు. మంచిదే. కాని అంతటితో వూరుకుంటే లాభం లేదు ఎప్పుడూ కూడా. ఎందువల్లనంటే మనకున్న అభిమానం, ఉత్సాహం కార్యరూపంగా పరిణమిస్తేగాని అవి రాణించవు. ఈవిషయం మనఆంధ్రులు ముఖ్యంగా గమనించాలి. చేతుల్లో పనులే సరిగా చేసుకోలేకపోతే మనకుమించిన పనులన్నీ చేయటానికి సిద్ధపడితే నలుగురూ నవ్వుతారు. ఆంధ్రదేశానికంతా నూలకండంగా వక్కబట్టలమిల్లు పెట్టే అదికాస్తా గుజరాతీసేట్జీల కప్పజెప్పాల్సివచ్చింది. కాగితాలకర్మాగారం నానాఅవకతవకగా వున్నట్లు వింటున్నాము. పరిశ్రమలవిషయంలో మనదేశం మరీ అధోగతిలో వుంది. ఎంతసేపటికీ యితరరాష్ట్రాలమీద ఆధారపడివుండవలసినదేనా? మనలో తెలివిగలవాళ్లు లేకనా? ధనవంతులు లేకనా?

ప్రస్తుతం హిందూదేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలో మిక్కిలిలాభకరమైన పరిశ్రమ 'సినిమా పరిశ్రమ'. *టాకీలు తీయడం కనిపెట్టబడి దానికిసంబంధించిన యంత్రసామగ్రులు హిందూదేశంలోనికి దిగుమతి కాగానే వక్కమారుగా 'ఫిలింస్టూడియోలు (Film Studios) ఇదివరకు 'నిశ్శబ్దచిత్రముల'ను (Silent Pictures) తయారుచేశేవి, 'శబ్దచలనచిత్రముల'ను తయారుచేశేవిగా తయారయిపోయినయి. దీనికి కారణం శబ్దచలనచిత్రములలో, అనగా టాకీలలో ప్రజలకుకలిగిన అభిరుచియే. బొంబాయి పూనా కలకత్తానగరములలో ఈ 'టాకీస్టూడియో'లు యితీవల విపరీతంగా వెలసినవి, మన దేశంలో బెజవాడతెనాలికంపెనీలలాగ. మనవాళ్లు కంపెనీలు పెట్టివున్నదంతా వూడ్చివేసుకుంటుంటే వాళ్లు స్టూడియోలు పెట్టి మనవద్దనుంచి మిగిలినదేమైనా వుంటే కాస్తా దోచేస్తున్నారు.

ఇతరరాష్ట్రాలలోనివాళ్లు తమ మాతృభాషలలోనేకాక ఆర్థికలాభములను బట్టి యితరదేశీయభాషలలోగూడ టాకీలను తీసి ఆయారాష్ట్రాలకు పంపి ప్రదర్శించి మిక్కుటమైన ధనార్జన చేస్తున్నారు. సాధారణంగా టాకీ తయారుచేయడంలో నూటికి ౨౫ రూపాయీలు నటుల కివ్వడానికి ఖర్చుచేస్తారు. ఇది హాలీవుడ్ వంటి సుప్రసిద్ధస్టూడియోలలోని లెక్క. ఆవిధంగా చూచుకున్నా ఇంతవరకు మనతెలుగుభాషలో తయారుచేయబడిన టాకీలు సగటున దాదాపు రూ.౨౦,౦౦౦ ల కంటె ఎక్కువఖరీదై వుండవు. కొన్నిటాకీలలో ప్రదర్శించిన మననటులకిచ్చిన ధనమూ, మర్యాద, దానికి ప్రతిఫలంగా టాకీలుతీసిన పెట్టుబడిదారులు పొందిన విపరీతలాభములు గనుక తెలిసికొంటే ప్రతిఆంధ్రుడికీ విచారం కలగకమానదు. 'సాగర్ మువీటోన్'వారి పాదుకాపట్టాభిషేకంలో దశరథపాత్రధరించిన నాగరాజరావుగారు తాము ఆటాకీలో పనిచేయుటకు వెళ్లినసందర్భంలో తమకుజరిగిన అనుభవములనుగూర్చి 'ఆంధ్రపత్రిక'లో వ్రాశారు. ఆవ్యాసం చదివినవారికి స్టూడియోలవారు మననటులకు కలుగచేశేలాభాలూ, మర్యాదలూ అన్నీ బోధపడ్తాయి. రూ. ౨౦,౦౦౦ ల కంటె హెచ్చుగా ఖర్చుపడని కొన్ని తెలుగుటాకీలవలన ఇతర

---

* టాకీ(Talkie)అనగా శబ్దముతోకూడిన చలనచిత్రము(Film). అందువలన వీటిని "శబ్దచలనచిత్రములు" అని వ్యవహరిస్తున్నారు. 'టాకీ'లన్నా అందరికీ తేలికగానే తెలుస్తుంది గనక యీ వ్యాసంలో ఆ పదమే వాడుతున్నా.

రాష్ట్రపు పెట్టుబడిదారులు కొన్నిలక్షలార్జించారు, ఆర్జిస్తున్నారు, అంటే నమ్మండి. 'పాదుక', 'సావిత్రి', 'ప్రహ్లాద' మొదలయినటాకీలు మనపట్టణాలలో ఎన్నెన్ని మార్లు ప్రదర్శించారో, ఏవిధంగా జనులు డబ్బు దర్శించుకొని చూశారో మనకందరికీ తెలుసు. ఫిల్ము తయారయినతర్వాత ప్రదర్శకుల(Exhibitors)వద్దనుంచినూటికి ౬౦ వంతున కొన్నిసమయాల్లో నూటికి ౭౦ వంతున అద్దె వసూలుచేసుకుంటున్నారు. ఒకరాష్ట్రంలోని ప్రదర్శకుల కందరికీ ఫిల్మును పంపించగల అధికారం కొందరు కొనుక్కుంటారు, అసలుఫిల్ముతీసినవారి వద్దనుంచి. వీళ్లనే 'డిస్ట్రిబ్యూటర్సు' (Distributors) అనగా ఫిల్మును కావలసినవారికి పంచేవాళ్లు అంటారు. వీళ్లు స్టూడియోస్వంతదారులనుంచి వకరాష్ట్రములో ప్రదర్శనహక్కులను Provincial Exhibition rights కొంతఖరీదుకు కొని తాము తిరిగీ ప్రదర్శకులవద్దనుంచి అద్దె తీసుకుంటారు. ఆఅద్దె మిక్కుటంగా వుండటం చేతనే ప్రదర్శకులు 'తక్కువరేట్లు' జనబాహుళ్యానికి వీలుగా ఏర్పాటుచేయ లేకున్నారు. ఎక్కువఅద్దె పుచ్చుకోకపోతే రాష్ట్రీయహక్కుదారులకు ఎక్కువలాభం వుండదు. అందువలన సారాంశం ఏమితేల్తుందంటే లాభంఅంతా ఇతరరాష్ట్రాలవాళ్లది. నష్టమంతా మన ప్రేక్షకులది. ఫిల్ములను తయారుచేయడానికి ఇతర రాష్ట్రాల ధనవంతులమీద ఆధారపడినన్నాళ్లు మన కీ నష్టం తప్పదు. వాళ్లు లాభంపొందకమానరు. ఇతరులు మనకథలను తయారుచేయడంవలన ఆర్థికంగానేకాక కళాదృష్టిలో మనకు తీరనినష్టం కలిగిస్తున్నారని యింతవరకు తయారయిన తెలుగుటాకీలు చూచినవాళ్లందరికీ విశదమే. ఆవిషయాన్ని గురించి మరియొకవ్యాసంలో ముచ్చటించుకుంటా.

అందువలన మనయొక్క కళాసౌభాగ్యం నాశనమైపోకముందే, ఒకముఖ్యపరిశ్రమలో మనం యితర రాష్ట్రాలవాళ్ల చేతుల్లో కీలుబొమ్మలమైపోయి నష్టపడకముందే, మనం మేల్కొని మనరాష్ట్రంలో ఒక'ఫిలిం స్టూడియో' (Film studio) టాకీచిత్రములను తయారుచేయటానికి ఏర్పాటు చేయడం మంచిది. కాలం గడచినతరువాత చింతించి లాభం లేదు. ఆంధ్రదేశంలో ధనవంతులు లేకనా? ఇంతకన్నా అల్పవిషయాలలో లక్షలు ఖర్చుచేస్తున్నవాళ్లు మనలో యెందరు లేరు? ఇటీవల వొకజమీందారు స్థానికసంస్థలలోని వకస్థానానికి దావాపు ఏనులక్షలు ఖర్చుచేశాడట! టాకీచిత్రాలకు ఒకరెండులక్ష లుంటే చాలు. అటువంటిపరిశ్రమవలన ఎటువంటిలాభమున్నదీ యితరముఖ్యపట్టణములలోని స్టూడియోల సంఖ్యవలన మనం గుర్తించవచ్చు. వర్తకవ్యవహారములలో బొంబాయిపెట్టుబడిదారులు ఆదర్శప్రాయులుగదా. అక్కడ కొత్తగా యిన్నిస్టూడియోలు నెలకొల్పబడుతున్నవీ అంటే అదేచాలు, ఈ పరిశ్రమలోనిలాభాలు తెలియబలకటానికి. అందువలన ఆంధ్రులు ఈవిషయం గమనించి వెంటనే ఒకరుగాని, లేక కొందరుగాని కలిసి ఒకలిమిటెడ్ కంపెనీగా కాని, ఒకటాకీస్టూడియోనుగాని నిర్మించి ఇతరరాష్ట్రములకు పోవుచున్న ధనప్రవాహాన్ని ఆపి మనరాష్ట్రంలోని నిరుద్యోగసమస్యను కొంతవరకైనా తొలగించి వక గొప్పపరిశ్రమను పెంపొందింపచేసుకొని లాభంపొందుదురుగాక అని కోరుతూ విరమిస్తున్నా.

---

# శరదృతువు

వడ్డాది సుబ్బారాయఁడు

శ్రీపతి నిద్రమేలుకొనె క్షీరపయోనిధి శేషశయ్యపైఁ;
జోషఁగ నొప్పి రిర్లు శశిసూర్యులు రేపవ, లోకసంబునన్
రూపఱెఁ గాఱుమబ్బులు, సరోవరరాజికి రాజహంసరా
జీపున రాగమోత్సవము చేకుఱెఁ, దేఱె నదుల్ శరత్తునన్.

సానలఁ దీరు క్రొమ్మెఱుఁగు సాయకముల్ దలపించె వాఁడిమిన్
భానుమయూఖముల్ వెయిషవల్, జలరాశి నిశాటకోటికిన్
హానిగ నాచమించిన మహామునియుద్గతి సిధురాట్పురం
ధ్రీనివహంబు కశ్మలము రేదొలఁచెన్ శరదాగమంబునన్.

వ్యోమము నిద్దమయ్యె; విమలోదకతన్ హ్రద మద్దమయ్యె; మిన్
యామినిఁ దాల్చెఁ దారమణిహారములన్; హ్రద మూనెఁ గల్వపూ
దామములన్; శరత్తున హ్రదంబునఁ బూ లుడుబింబశంక, త
ద్వ్యోమమనం దుడుల్ గలువపువ్వుల నీడల భ్రాంతి గొల్పెడున్.

శరదము లోకసంబునను; సైకతముల్ సరిదంతరంబులన్;
శరవణమున్ నదీతటులఁ; జారుమరాళతతుల్ హ్రదంబులన్;
సరసులఁ బుండరీకములు; సాంద్రమనోహరచంద్రచంద్రికా
చ్ఛరుచులు రోదసిన్; నెరసె శారదసంపద శారదాకృతిన్.

శారదచంద్రచంద్రికలు సాంద్రత రోదసి నాక్రమింప, నీ
హారధరాధరేంద్రతనయామణి నింగిని బొంగి గంగ, త
ద్వారి దిశావకాశము లుదారతమైఁ గబళించెనా, ముదం
బారఁగ నప్సరోంగనలయ ట్లొనరింత్రటఁ గేళి బాలికల్.

పవళులయందుఁ దృప్తిగను బద్మవనంబులయందు మాపులం
గువలయవాటులందు ననుకూలత విందుల నారగించు చి
ట్లవి శశిదర్శనంబు గఱవౌ తొలుకారునఁ గూటిపేద లై
నవసిన తుమ్మెదల్ బలిసి నద్దైస శారదవేళఁ ద్రిమ్మరున్.

కోరిక నిండుఁ బున్నమఁ జకోరులు శారదరాత్రిఁ జంద్రికా
పూరపు మాహిషంపుదధిబువ్వ మెసంగుచు, నంజుకొంట కం

గారము లన్న భ్రాంతిఁ గొలుకం దివిచుక్కల సూదిముక్కలన్
జాలుచిదుర్పలో యన నెసంగు మిడుంగుఱుఁబుర్వు లత్తఱిన్.

బాలురు కైవిలంబులను బట్టి చరింతురు జేయటంచు; బే
తాళుని నిల్పివీథి నొకతావునఁ గొల్తురు బ్రాహ్మణేతరుల్;
స్త్రీలును బూరుషుల్ ద్విజులు దేవి భజింతురు; గుర్తు లాదిభూ
పాలుర జైత్రయాత్రలకు భవ్యశరన్నవరాత్ర కృత్యముల్.

ప్రొద్దు వ్రతంపుభామలకు భుక్తి లభించెను రెండు పూఁటలన్;
బెద్దలుఁ బిన్న లుల్కిపడు భీకరగర్జితముల్ గతించెఁ; బె
న్నద్దములట్లు దోఁచె బుర దాఁటినదారులు బాటసారికిం;
దద్దయుఁ బాఁడిపంటలను ధాత్రి దనర్చె శరత్సమాగతిన్.

జనములు కార్తికంబునను సల్పుటకున్ వనభోజనంబులం
బొనరుచు పెద్దవంటలను బుట్టి కడల్కొను ధూమపుంజముం
గనఁ, బనరాకుమ్రాఁకులను గార్కొను తోఁపుల మెచ్చి వచ్చె, బై
ల నిలక నీలమేఘపటలం బట కంచు స్ఫురించు నెమ్మదిన్.

రమణులు రంగవల్లులను రమ్యముగా రచియించి, బృందగం
దమున సుమాక్షతాదుల నొనర్చి సమర్చిత, నాకసంపు దీ
పముల సరంధ్రపుం బరణిపాత్రల నెత్త, నభంబు పెక్కురూ
పముల ధరించినట్టు లవి భాసిలుఁ జుక్కలఁబోలు వెల్గులన్.

కలిమిగలట్టివాళ్లఁ గడు గౌరవముం బొనరించి, లేమిలోఁ
జులుకగఁ జూడఁబోరుసుమి శుద్ధమనంబుగలారు పూజ్యులం;
జలపరిపూర్ణసంపదను శారదవేళను బాయు గౌతమిన్
దెలతెలవాఱకుండఁ జని దీవియ లుంచి భజింత్రుగా సతుల్.

యామినినిమాత్రమేగద-యేమాసమునం దమాస యొసఁగించు నిరుల్;
శ్రీముఖ నది కార్తికమున-గాములదొరకాంతిగూడఁ గబళించెఁ గటా.

శ్రీముఖ యర్థద్వయి గల;-దామోదకరంబొ యిది యనర్థకరంబో;
యే మొకమొకాని దీనిది;-భూమికి మునుమున్న వఱదమునుకఘటించెన్.

దామోదరుఁ డురుకరుణను-క్షామము డామరము మొదలుగా నేసిలుఁగుల్
భూమికిఁ గలుగఁగనీయక-శ్రీముఖ క్షేమమున ముగియఁజేయుంగాతన్.

# భారతదేశము - నానాజాతిసమితి

లంక సత్యం

౧౯౧౪-౧౮ ప్రపంచసంగ్రామము, దానివలన ప్రపంచమునకు గలిగిన నష్టమునుగురించి మనకు తెలిసియేయున్నది. మానవకోటికి సంభవించిన విపత్తుకు ప్రపంచరాష్ట్రములన్నియు తారుమారయిపోయినవి. మరియొకయుద్ధము సంభవించినయెడల మానవజీవితము, నాగరికత నాశనమగునని ప్రజలకు గోచరించెను. ప్రపంచమునందు యుద్ధము లేకుండజేయుటకు ప్రపంచరాష్ట్రములన్నియు కలసి ప్రయత్నించవలసిన కర్తవ్యము నని గ్రహించినవి. యుద్ధముబారినుండి ప్రపంచమును విముక్తిచేయుటకు సాధన మేమనిన అంతర్జాతీయ సంయమనమే యని రూఢియయ్యెను. కనుక విల్సన్, స్మట్సు, క్లిమెన్‌సో, లాయడుజార్జి మొదలుగాగల రాజ్యాంగవేత్తలు యుద్ధము నాపుటకు అంతర్జాతీయ సహకారముపక్క మరేమియు మార్గము లేదని ౧౯౧౮-వ సంవత్సరము యుద్ధానంతరమున .వర్సైలిస్ సంధి గుదిరినప్పు డంతర్జాతీయసంఘము నొకదానిని స్థాపింపవలెనని సంకల్పించిరి. వారి సంకల్పము ఫలించి నానాజాతిసమితి యుద్భవించినది.

యుద్ధాంతమున సంధి జరుగకపూర్వమె ౨౮ ఏప్రిల్, ౧౯౧౯ న ఇంగ్లండు, ఫ్రాంసు, ఇటలీ, జపాను, అమెరికాలయొక్క ప్రతినిధులు పారిస్‌నగరమున కలసికొని యొకపత్రము నామోదించిరి. దానిలో నానాజాతిసమితియొక్క యుద్దేశ్యములను, విధానమును గూర్చి చర్చింపబడెను. దానినే మనము "లీగుకవినెంటు" అని వాడుచున్నాము. ఆపత్రము వారిచే నామోదింపబడినతరువాత రెండుమాసములకు సంధి జరిగెను. ౧౯౧౯-వ సం. జూన్ ౨౮ న యుద్ధమున పాల్గొనిన దేశములు సంధిషరతుల నొప్పుకొనినతరువాత నాపత్రము సంధిపత్రములో నొకభాగముగ పరిగణింపబడెను. ౧౯౨౦-వ సం. ౧౦ జనవరినాడు కవినెంటుపత్రము మరియొకసంధిపత్రముగా నొప్పుకొనబడెను. ఆరోజున సాయంత్రము ౪-౧౫ ని. కు అంతర్జాతీయసమితి యంతర్జాతీయసంస్థ యయ్యెను. ఆపత్రిమిరువదినాల్గధ్యాయములుగ విభజింపబడి యున్నది. దానియందు నానాజాతిసమితియొక్క యుద్దేశ్యములను, విధానమును, సంఘసభ్యత్వమును, అంతర్జాతీయవివాదములను పరిష్కరించు మార్గములను గురించి వివేచన చేయబడినది. మానవకోటిని ప్రేమించి, మానవసేవయే తమ జన్మకర్తవ్యమని భావించు తత్త్వజ్ఞానులయొక్క పద్ధతులనే ఈపత్రము స్వీకరించినది. ఈనానాజాతీయ సంస్థయొక్క ముఖ్యోద్దేశ్యములు ప్రపంచరాష్ట్రములను కొన్నిటిని యంతర్జాతీయన్యాయశాసనములకు బద్ధములుగా చేసి ప్రపంచమున శాంతి నెలకొల్పుట, ముందు రాబోవు యుద్ధముల నాపుట యైయున్నవి.

యుద్ధానంతరమున సంధిషరతులను ౨౯ రాష్ట్రములామోదించి పత్రముపై సంతకముచేసినవి. వాటిలో భరతవర్ష మొకటి. ఈసంధిషరతులు చర్చింపబడుచుండగనే ఇ. యస్. మాంటెగు (సెక్రటరి ఆఫ్ స్టేటు) మహారాజా సర్ గంగాసింగు బహదూరు, (బికనీరు సంస్థానాధీశ్వరులు) కూడ నాచర్చలో పాల్గొనిరి. కావున ఇండియా మిగిలినరాష్ట్రములతోపాటు మూలసభ్యత్వమును బడసెను. కాని ఇండియా మూలసభ్యత్వమును బడయుటకు కవినెంటుపత్రమున వీలులేదు. ఎందుకన ఒకటవ ఆర్టికిల్, రెండవక్లాజు ప్రకారము, పూర్ణస్వాతంత్ర్యము గల్గినదేశము, అధినివేశప్రభుత్వము, వలసరాజ్యము - వీనికిమాత్రము సమితిసభ్యత్వమున కర్హత గలదు. ఇండియా పైనుదాహరింపబడిన రాజ్యాంగవిధానములలో నేటికిని చెందదు. కనుక సభ్యత్వమును బడయుటకు వీలులేదు. కాని యాకాలమున జరుగుచున్న రాజ్యాంగపు మార్పులలో ఇండియాకు అధినివేశప్రభుత్వము సమకూర్చెదమని బ్రిటిషుప్రభుత్వమువారు సూచించిరి. విల్సన్ రాజ్యాంగవేత్త ఇండియాకు సభ్యత్వమును సమకూర్చవలెనని చాలప్రయత్నములు చేసెను. చాలరాష్ట్రములవా రందు కొప్పుకొన

లేదు. ఫ్రాంసు డొమినియనులకుకూడ సభ్యత్వము నివ్వకూడదని పట్టుపట్టెను. కాని చివరకు భారత దేశమునకు సమితిలో సభ్యత్వము నిచ్చిరి.

భారత దేశపు టంతర్జాతీయస్థితి చాలయసందర్భముగా నున్నది. కావుననే నానాజాతిసమితిసభ్యత్వము కొరకు పోరాడవలసివచ్చెను. తుదకు సభ్యత్వము సమకూరినను, దేశమునకు స్వతంత్రపరిపాలనము లేదు కావున దేశస్థితి యసంభావ్యముగ నున్నది. డేవిడ్ హంటరు మిల్లరుగారిట్లు చెప్పిరి: "హిందూ దేశమునకు కనడావలె నన్నివిధములను స్వతంత్రపరిపాలనము కలదని ప్రపంచ జ్ఞానమున్న మనుజుడు చెప్పజాలడు. కాని ౩౫ కోట్ల జనము కలిగినభారత దేశమునకు సమితిలో సభ్యత్వము లేదనుట చాలశోచనీయము. ఈవిషయమును మిగిలిన దేశియప్రతినిధులు గమనించిరో లేదో కాని ఇండియా యుద్ధములో చేసినసహాయము, త్యాగముమాత్రము వారి నాకర్షించి, ఇండియాకు న్యాయము కలుగచేయవలయునని వారికితోచిన ట్లగపడును. మొత్తముమీద ఇండియాకు నానాజాతిసమితిసభ్యత్వము లభించెను. కాని ఇప్పటికిని ఇండియాయొక్క యంతర్జాతీయస్థితి చాల దుర్బలమైయున్నది. మొదటికారణము ప్రజాహితప్రభుత్వము లేకపోవుటయే. ప్రస్తుతము రాజ్యాంగవిధానమున మార్పులు జరుగబోవుచున్నవి. కాని యీపరిస్థితి మారునేమో మన మూహింపజాలము. ఈయసందర్భస్థితికి రెండవకారణము భారతసామ్రాజ్యమున నుండిన స్వతంత్రరాష్ట్రములమూలమున కలిగినది. భారత సామ్రాజ్యమున ౫౬౨ స్వతంత్రరాష్ట్రములు చేరియున్నవి. ఇవి సామ్రాజ్యాధిపతికి లోబడియున్నవి. సంస్థానములలో సంస్థానాధీశ్వరులు నిరంకుశాధికారులె కాని వారియొక్క విదేశవ్యవహారములను, రక్షణను బ్రిటిషుగవర్నమెంటువారికి ఒప్పగించిరి. బయట దేశములు దండెత్తుటమొదలుగాగల యపాయములనుండి ప్రభుత్వమువారు సంస్థానములను కాపాడుదురు. సంస్థానములలో నరాజకము లేకుండకూడ బ్రిటిషుప్రభుత్వము తగునేర్పాటులు చేసినది. నిజముగా నన్నివిషయములలోను యీసంస్థాములు స్వాతంత్ర్యమనను భవించుచున్నవి. కనుక వీనిని స్వతంత్రరాష్ట్రములుగాపరిగణింపవచ్చును. కాని యంతర్జాతీయవ్యవహారములోమాత్రమువాటికియోగ్యత లేదు. దీనివలననేఇండియాయొక్క యంతర్జాతీయస్థితికి లోపము గలిగినది. కనుకనే మిల్లరుగారు వారి "డ్రాప్టింగు ఆఫ్ దికవినెంటు" అనుపుస్తకమున హిందూ దేశముయొక్క అcతర్జాతీయస్థితియసందర్భములలో నసమంజసమయియున్నదని చెప్పిరి. ఆ యసందర్భస్థితి చక్కబడిన హిందూ దేశమునకు, నానాజాతిసమితికికూడ శ్రేయస్కరము.

ఇక సమితిసభలలో పాల్గొను ప్రాతినిధ్యమును గూర్చి కొంతవిచారింతము. నానాజాతిసమితిసభలకు ఇండియాతరఫున యన్నిరాష్ట్రములతరఫునవలెనే ప్రతి సంవత్సరము ముగ్గురుప్రతినిధులు పోవుచున్నారు. కాని వారు ప్రజాబాహుళ్యముచే నెన్నుకొనబడినవారు కారు. ఇండియాగవర్నమెంటు వారిని ఎన్నుకొనును. కావున వారు ప్రజలయాజ్ఞలను శిరసావహించువారు గాక గవర్నరుజనరలుగారి యాజ్ఞప్రకారము నడచుకొనువారై యుందురు. ప్రతిసంవత్సరము సంస్థానములతరఫున నొకసంస్థానాధీశ్వరుడు గవర్నమెంటు వారిచే పంపబడుచున్నాడు. ఇండియాప్రాతినిధ్యమును చాలకాలము సెక్రటరి అఫ్ స్టేట్ గారే నడపుచుండెడివారు. కాని ౧౯౨౯-వ సంవత్సరమునుండి భారతీయుడే భారతప్రతినిధివర్గమునకు నాయకుడై ప్రతినిధివర్గమును నడపుచున్నాడు. సర్ మహమ్మదు హబిబుల్లాగారు మొదటినాయకుడుగా నుండిరి. ౧౯౩౦లో బికనీరుసంస్థానాధీశ్వరులు, ౧౯౩౧లో సర్. బి. యల్. మిత్తరుగారు, ౧౯౩౨ లో ఆగాఖానుగారు నాయకులుగానుండిరి. ఈసంవత్సరము మరల సర్. బి. యల్. మిత్తరుగారు నాయకులై సభకు వెళ్లి కొలదిరోజుల క్రిందటనే తిరిగివచ్చిరి.

హిందూ దేశపుప్రతినిధివర్గము ఇండియాగవర్నమెంటుచే నెన్నుకొనబడినదని నేను పైన చెప్పియుంటిని. కనుక సమితిసభలలో భారతప్రతినిధులు బ్రిటను తోకపట్టుకొని బ్రిటనుత్రోవనే త్రొక్కుచున్నారని

కొందరియభిప్రాయము. కాని పదునాల్గేండ్లు సమితి చరిత్ర చదివినచో నిట్టియుద్దేశ్యము మారిపోవును. ఇండియాకు లీగుఅసెంబ్లీలో చాలపలుకుబడి కలదు. మొట్టమొదటినుండియు ఇండియా సమితిలో స్వతంత్ర భావముతో పనిచేయుచున్నది. ౧౯౨౧-వ సంవత్సరము సమితిసభలో ఇండియా స్వతంత్రభావముతో పనిచేసియున్నట్లు చెప్పబడియున్నది. ఇండియా ప్రవర్తనకు బ్రిటిషుప్రవర్తనతో సంబంధ మేమియు లేదు. ౧౯౨౮-వ సంవత్సరములో ఇండియాప్రతినిధులు వారి యొక్క యవసరమునుబట్టి వారు నడచుకొందుమని చెప్పియున్నారు. ౧౯౨౭ లోకూడ నట్లే వెలిపుచ్చియున్నారు. ౧౯౨౯ లో రామ్‌సే మాక్డొనాల్డుగారు నిదేభావమును వెలిపుచ్చిరి. దీనినిబట్టి భారతప్రతినిధులు వారిమర్యాదను, దేశమర్యాదనుకూడ కాపాడుచున్నట్లగపడును. తరువాత భారతదేశము ప్రపంచమునంతకును తనకు స్వారాజ్యము నింగ్లండు ఇయ్యవలసిన యవసరము కలదని చూపగలదు. భారతదేశము ప్రజాప్రభుత్వమున కర్హమయినదిగాదని ఇంగ్లండు చెప్పజాలదు. చెప్పుటకు సాహసింపనుజాలదు. ఎందుకన, భరతవర్షము సమితివ్యవహారములలో తనపనులను మెలకువతో నెరవేర్చుకొనుచున్నది. కనుక హిందూదేశము బ్రిటనునకు విరుద్ధముగ ప్రపంచాభిప్రాయమును కలుగజేయగలదు. దీనికి కారణము నానాజాతిసమితిసభ్యత్వమేయని వేరుగ చెప్ప నక్కర లేదు.

ప్రతిసంవత్సరము హిందూదేశముతరఫున నొక సంస్థానాధీశ్వరుడు సభ్యవర్గమున పాల్గొనుచున్నట్లు పైనుదాహరింపబడెను. కావున ఇండియాప్రతినిధివర్గము ఇండియాసామ్రాజ్యప్రతినిధివర్గ మయినది. ఏలయన సంస్థానాధీశ్వరుడు తనసంస్థానమునకుగాని, అన్ని సంస్థానములకుగాని ప్రతినిధిగా పోవుట లేదు. సంస్థానాధీశ్వరులందరుకలసి వాని నెన్నుకొనుటయిన లేదు. సంస్థానాధీశ్వరునిఖర్చులుకూడ ఇండియాగవర్నమెంటువారే భరించుచున్నారు. కావున అంతర్జాతీయ వ్యవహారములందు ఇండియాయంతయు ఏకముగనే పరిగణింపబడవచ్చును. కాని ప్రభువులసభఅయినా వాని నెన్నుకొనక పోవుటవలన ఇండియాతరఫున నాసంస్థానాధీశ్వరుడు ఇతరప్రతినిధులతో కలసి సమితిచట్టములపై సంతకము పెట్టినను ఆచట్టములను "ఇండియన్ ఇండియా" లో నమలులో పెట్టుటకు వీలుపడదు. "పారమవుంటు పవరు" అయినా యొకఅంతర్జాతీయశాసనము నమలులో పెట్టమని యొకసంస్థానము నిర్బంధపెట్టలేదు. పెట్టుటకు వీలు లేదు. అంతర్జాతీయకార్మికచట్టముల విషయములో నిట్టి పరిస్థితులు సంభవించుచుండెను. కావున ౧౯౨౮లో బర్కెన్‌హెడ్ ప్రభువు లీగుసెక్రటరీజనరలుకు అంతర్జాతీయకార్మికచట్టములు సంస్థానములకు చెందవని దృఢపరచెను. అంతర్జాతీయకార్మికశాసనములు ఇండియాప్రతినిధులసంతకములు పెట్టినతరువాత బ్రిటిషుఇండియాకే వర్తించునుగాని, ఇండియన్ ఇండియాకు వర్తించవు. కాని యిష్టమయినచో సంస్థానములు కొన్నిచట్టముల నమలులో పెట్టుకొనవచ్చును. ఇట్టియసందర్భపుచిహ్నములు ఫెడరలు విధానములో చాలవరకు పోవునని నానమ్మకము.

ఇండియా నానాజాతిసమితికార్యక్రమములో ముఖ్యమైనపాత్రను ధరించుచున్నది. అంతర్జాతీయ కార్మికసంఘములోకూడ సభ్యత్వము సంపాదించినది. కాని యాసభ్యత్వముకొరకు మూడుసంవత్సరములు పోరాడవలసివచ్చెను. మొదట కార్మికసభలోను, తరువాత గవర్నింగుబాడీలోను ప్రాతినిధ్యము సంపాదించెను. ౧౯౨౨-వ సం.కు చమ్సుఫర్డుప్రభువు ఇండియాకు అంతర్జాతీయ కార్మికసంఘమున గొప్పపదవి సమకూర్చెను.

౧౯౨౨ సం. 30 అక్టోబరునాడు ఇండియన్ ప్రతినిధి గవర్నింగుబాడీలో కూర్చొనగలిగెను. అంతర్జాతీయకార్మికసభతో సంబంధమువలన ఇండియాకు చాలమేలు కలిగెను. కార్మికసంఘముతో ఇండియా చాలస్నేహభావము చూపుచున్నది. అంతర్జాతీయ కార్మికచట్టములను చాలభాగము ఇండియా అమలులో నుంచెను. అంతర్జాతీయకార్మికసభ సుమారు ౪౦ చట్టములను గడచిన పదునాల్గుసంవత్సరములలోను తయారుచేసెను. ఇండియా సుమారు 3౨% చట్టముల

నములలో నుంచెను. వీటివలన కార్మికవ్యవహారములో ఇండియాకు మిక్కిలిమేలు సమకూరెను. ౧౯౧౯ తరువాత ఇండియాలో జరిగిన కార్మికశాసన నిర్మాణమునకంతయు అంతర్జాతీయకార్మికసంఘసభ్యత్వమే కారణము.

నానాజాతి—నల్లమందు, మత్తుపదార్థముల సంఘముతోకూడ ఇండియా కలసి పనిచేయుచున్నది. ౧౯౨౭-వ సం. ఇండియాగవర్నమెంటుయొక్క రిపోర్టు చూచినయెడల గవర్నమెంటెట్లు నల్లమందువ్యాపారము నాపుటకు ప్రయత్నించుచున్నదో తెలియగలదు. ఇట్టివిషయములలోనానాజాతిసమితి తీసుకొనుశ్రద్ధవలన ప్రపంచమునకు చాలమేలు కలుగును. ఇండియాకూడ నిట్టిపనులలో శ్రద్ధవహించు టెంతయు శ్రేయస్కరము.

సమితి యారోగ్యసంఘముతోకూడ నిండియా కలసి పనిచేయుచున్నది. సమితియారోగ్యసంఘము ఇండియాకు వచ్చి మలేరియా, కలరా మొదలుగాగల వ్యాధులను రూపుమాపుటకు ప్రయత్నించుచున్నది. ఇండియా ఇట్టిసంఘముతో కలసిపనిచేయుటవలన బెంగాలుదేశములో కొంతవరకు వ్యాధులు నశించినవి. సింగపూర్‌నందు సమితి యారోగ్యసంఘముతో ఇండియా సంబంధము కలిగియున్నది. ౧౯౨౭ లో దూరప్రాచ్యౌషధసంఘముయొక్క యేడవకాంగ్రెస్ కలకత్తాలో కలసికొనెను. ఇదియు ఇండియాకు ఆరోగ్యవిషయములలో మేలుచేసెను.

ఇండియా సమితిఖర్చులకు ౮,౦౦,౦౦౦ రూపాయలు ప్రతిసంవత్సరము చందా నిచ్చుచున్నది. ౯౨౬ యూనిట్లలో ఇండియా ౫౬ యూనిట్లసొమ్ము నిచ్చుచున్నది. అనగా భారతదేశము ఖర్చువిషయములో నయిదవస్థాన మలంకరించుచున్నది. కాని డబ్బుకు తగినంతమేలు సమకూరుట లేదు.

భారతదేశమున కింతవరకును సమితికవున్సిల్‌లో ఖాయపుసభ్యత్వము సమకూరలేదు. పట్టి సభ్యత్వమునకు కొన్నిదేశములకంటె ఇండియాకెక్కువ అర్హతగలదు. కావున నిట్టిసభ్యత్వము త్వరలో సమకూరవలయును. ఈవిషయమునుగూర్చి రాధాకృష్ణపండితుడు కొలదినెలలక్రిందట జినీవాలో ముచ్చటించెను. అట్టిపదవి భారతదేశమునకు సమకూరుగాక! సమితియొక్క intellectual committee తో ఇండియాకలసి పనిచేయుచున్నది. జగదీశచంద్రబోసు, రాధాకృష్ణను వంటి ప్రపంచోపదేశకులు భారతదేశపు ప్రతినిధులుగా పోవుచున్నారు. ప్రపంచరాష్ట్రములకు సంబంధబాంధవ్యములు చక్కగా నుండుటకు తగుప్రయత్నములు చేయుచున్నారు. ఇట్టిప్రపంచోపదేశకుల బోధనలవలననే ప్రపంచజాతులొకరినొకరు సమానభావముతో గ్రహించగలరు. దానివలన ప్రపంచమున శాంతి స్థాపితమగును. ౧౯౨౭లో సర్ అతుల్ చంద్రఛటర్జీ అంతర్జాతీయకార్మికసభ కధ్యక్షుడయ్యెను. ౧౯౩౩ లో సర్ అతులుడు అంతర్జాతీయకార్మికసంఘపు గవర్నింగుబాడీ అధ్యక్షపదవి నలంకరించెను. ఇట్లు భారతమాతపుత్రు లంతర్జాతీయసభలందు భరతమాతగౌరవమును, ప్రతిభను నిలబెట్టుచున్నారు. భారతదేశపురాజ్యాంగవిధానమున మార్పులు కలిగి దేశపు అంతర్జాతీయస్థితి హెచ్చి, దేశమున శాంతిప్రతిష్ఠింపబడినచో, ప్రపంచశాంతికూడ నెలకొల్పబడినట్లే యగును. ప్రొఫెసరు ఎ. ఇ. జిమ్మరన్ చెప్పినట్లు భారతదేశము ప్రపంచరాజ్యాంగవ్యవహారముల కాయువుపట్టయి యున్నది. కావున ప్రపంచశాంతి భారతదేశపుశాంతిపై నాధారపడియున్నది. సమితితో సంబంధ మున్నంతకాలము భారతదేశము ప్రపంచవ్యవహారముల కాయువుపట్టుగా నుండును. శాంతిని ప్రపంచమున నెలకొల్పును.

# జాతీయత్వము—అంతర్జాతీయత్వము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, యం. ఏ., బి. యల్.,

క. తరణిశశాంకుల తేజ
స్ఫురణము లేకున్నయట్లు భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు
నరపాలక విహితపాలనము లేకున్నన్.

—భార. శాంతిపర్వము.

శ్లో. అహింసా సత్య మక్రోధ
స్త్యాగ శ్శాంతి రపైశునమ్,
దయా భూతే ష్వలోలత్వం
మార్దవం హ్రీ రచాపలమ్.

శ్లో. తేజః క్షమా ధృతి శ్శౌచ
మద్రోహో నాభిమానితా,
భవన్తి సంపదం దైవీ
మభిజాతస్య భారత.

—భగవద్గీత.

దైనికాచారములందును, వేష భాషలందును, మత భావములందును భేదరహితులై, యొకరాష్ట్రమున వసించువారిసమూహము జాతి నాబరగునని ధర్మశాస్త్రము (Jurisprudence) తెలుపుచున్నది. ఈనుడి ననుసరించియే, బహుళమత, ప్రథా, భాషాయుతమైన భారతమందు జాతీయత్వ ముండనేరదని పల్వురు పాశ్చాత్య విద్యాధికులు వ్రాసిరి. హిందూదేశమున పెక్కు భాషలును, మతములును ఉండుట నిక్కమే! కాని సంస్కృతము రమారమి అన్నిభాషలకును మాతృక యగుటచే భారతభాషలన్నిటియందును నొకే భావ శైవలిని ప్రవహించుచున్నది. వేదములును, పురాణములును ఆంధ్రున కెట్లు ప్రియములో, వంగదేశీయునకును, పాంచాలసీమస్థునకును నట్లే ప్రియములు కాశ్మీరసీమ యందు గాని, కన్యాకుమారిఅగ్రమునగాని భగవద్గీతను మస్తకమున దాల్పని భారతీయుడు లేడు. ముక్తాహారమందలి సూత్రమువలెనుపున నన్నిమతములందును ప్రధానమగు మానవకల్యాణభావ ముండుటచే భారతధర్మమున విరుద్ధము లేమియు లేవు. భేదమం దేకత యుండుట సృష్టినియమమేకదా! హిందువులందును, ముసల్మానులందును, సిక్కులందును, బౌద్ధులందును, పారసీకులందును, క్రైస్తవులందును భారతవిజ్ఞానమును, భారత పూర్వౌన్నత్యమును గుఱుతించి గర్వింపనివారు లేరు. దానంజేసి జాతీయత్వము భరతఖండమున మృగ్యమనుట మిథ్య.

ప్రజల యార్థిక, మత, సాంఘిక, నైతిక, రాజకీయస్థితిగతులపై మహత్వ జాతీయత్వమహాసౌధము నిలిచియున్నది. ఈమహోన్నతహర్మ్యము బలయుతమై చిరస్థాయిగ నుండుటకు దీనిభిత్తికలు దృఢములై యుండుట ముఖ్యము.

తొలినుండియు భారతీయు లాధ్యాత్మికైశ్వర్యముపై విశేషదృష్టి పఱపినను, ఇహజీవన సాధనమగు నర్థమునెడ విముఖులై యుండలేదు. ఋగ్వేదమందు దోచు రత్నఖచితస్వర్ణసింహాసనవర్ణన, ధర్మమంపర్థము రంగారు అలంకారమై ప్రాచీనభారతమున వరలియుండెడిదని తెలుపుటలేదా! ప్రాచీనభారతీయులు సముద్రయానము చేసియు, వివిధదేశీయుల గలిసియు తమవాణిజ్యమును బెంపొందించిరి. కొలంబసునకుముందు భారతీయు లమెరికాను కనుగొనిరని మెక్సికోయందు చూపట్టిన బుద్ధవిగ్రహములు తెలుపుచుండుటలేదా? అన్యఖండస్థ దేవాలయములందు భారతధనము విరాజిల్లలేదా? ఉన్నత మహీధ్రములకును, దీర్ఘఝరులకును, విశాలకాసారములకును, విస్తృతభూభాగములకును ఠావయి సుజల యుతమై, సుఫలసమన్వితమై, సస్యశ్యామలమై, భూతల స్వర్గమై అన్యదేశీయులకేకాక భరతఖండ మనిమిషులకు గూడ లీలాభూమియైనది. పృథ్వీముఖమున రతనపుతిలకమువలె శోభిల్లిన భారతము నెడ నన్యరాష్ట్రీయుల లోలుపదృష్టులుపఱతెంచినవి. భారతమాణిక్యములును,

రత్నకంబళులును, పట్టుదువ్వలువలును, సుగంధద్రవ్యములును, దంతపదార్థములును పాశ్చాత్యరాజప్రాసాదములను, పర్షియా షా (Shaw of Persia) మహలులను, వాణిజ్యస్థానములను అలంకరించినవి. దానం జేసియే గ్రీకులును, అరబ్బులును, డచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచి, ఆంగ్ల జాతులవారును భారతవిషయము నేరుటకు పెక్కుపాట్లు పడి కృతకృత్యులైరి. యవనులును, మ్లేచ్ఛులును భారతమున కొనరించిన యొగ్గగాని, లగ్గగాని వ్యాసవిస్తరభీతిచే నిందు దెలుపను. కాని ప్రాచీనభారతము సకలైశ్వర్యములతో దులదూగి, పాశ్చాత్యులు బట్టకట్టు తెలుగక, వన్యపశువులట్లు మసలుచు, రాతియుగమందును, లోహయుగమందును నజ్ఞానసంతమసమున మునిగియుండ విజ్ఞానాలోకమున బ్రపంచదిగ్వలయమున వెలుగొందెడి దనిమాత్రము తెలుపుచుంటిని. కాని భారతభాగ్యప్రదీపము పడమటిగాలితాకుడున నిర్వాణ మైపోయినది. భారతమాత రెండుశతాబ్దములకులోపుగనే పూర్వవిభూతి బాసి, నూతనవిభూతి దాల్చినది. సర్వాంగసుందరియైన భారతాంబ దారిద్ర్యదుష్పీడనములచే గృశించి మలీమసయై యున్నది. భారతీయుని దైనికాదాయము రెండణాలకు దక్కువయని అర్థశాస్త్రనిపుణులను సర్. ఆర్థరు లేమర్ మున్నగు పాశ్చాత్యులే వ్రాక్రుచ్చిరి. కట్ట బట్టయు, దిన తిండియు లేక భారతీయులు నేడల్లాడుచున్నారు. భూతలనాకము నేడు భూతలనిరయమైనది. ఐశ్వర్యమును గోలుపడిన భారతీయు లాత్మగౌరవమునకు దిలోదకముల నిడిరి. స్వీయశక్తిపై గల విశ్వాసమును హైందవులు కోలుపడిరి. అనుదినము కట్టుపుట్టములకై మాంచిష్టరు, లివరుపూలుల యౌదార్యముపై నాధారపడుచుండిరి. ప్రాతఃకాలాగ్నిహోత్రమునకు స్వీడన్, నార్వేలు సాయపడినగాని హైందవులకు గతి లేకపోవుచున్నది. చెప్పనేల? భారతీయులకు వలయు యజ్ఞోపవీతములను, మంగళసూత్రములను పవిత్రచరిత్రులను సీమబ్రాహ్మణోత్తములే తయారొనరించి పంపుచుండుట నిటీవల గాంచుచునేయున్నారము. నాటి ఢక్కా మస్లినులు నేడు నటుమాయమైనవి. నాటి మృదుల శాటులునే డంతరించెను. నాటి గృహపరిశ్రమలు నేడదృశ్యమాయెను. నేతగాండ్ర వ్రేళ్లతో భారతమాంగల్యమాల్యము తెగిపడినది! ఆర్థికముగ భారతజాతీయత్వ మడుగంటినది!

శరీరమందలి అంగప్రత్యంగములట్లు ఆర్థిక, సాంఘిక, నైతిక, రాజకీయ సమస్యలు పరస్పరసంబంధము గలిగియున్నవి. ఆర్థికస్థితి యెట్లు మాఱినదో, భారత సాంఘికస్థితి యట్లే తేలినది. బలయుతమైన హిందూ సంఘము రోగపీడితమైయున్నది. దుస్సహకాఠిన్యమును, దురంతశాఠ్యమును, గుర్దాంత దురాచారములును హిందూసంఘమున దలయెత్తినవి. బాల్యవివాహములును, నిర్బంధవైధవ్యమును, కన్యాశుల్కవరశుల్కములును, అవిద్యాస్పృశ్యతాదోషములును పూతసనాతనమతమునకు నడుపరాని కలంకము నాపాదించుచున్నవి. భిన్నజాతులవారు పారస్పర్యములతో గాలముపుచ్చుచుండిరి. భిన్నమతస్థు లొండొరుల కుత్తుకల నుత్తరించుకొన జూచుచుండిరి. సాంఘికముగగూడ జాతీయత్వము తూలిపోవుచున్నది.

నిగమ మహాశాస్త్రనిధానమై, విజ్ఞానధన నిక్షేపమైన భారతదేశమున విద్య నేడు కొఱవడినది; తక్షశిల,నవద్వీప, నలందాల యౌన్నత్యము విస్మృతియందు మునిగినది. ప్రతికూలసంప్రదాయములు దేశముపై దాడివెడలినవి. మాతృభాషలు మూలబడినవి. బూటకపుగాథలు పరమార్థములైనవి. శివాజీ కొండయెలుకయనియు, లక్ష్మీభాయి ప్రహరమానిసియనియు, క్లైవు మహాపురుషుడనియు, వారన్ హేస్టింగ్సు ప్రజాభిలాషియనియు నేటివిద్యార్థులు చదువవలసినగతి పట్టినది. రాణా ప్రతాపుని యకుంఠితవీర్యము గాని, రాజసింహ, భీమసింహుల యవక్రపరాక్రమముగాని,దుర్గాదాసునిరుపమాన స్వార్థత్యాగము గాని, మానసి, మహామాయ, కల్యాణి, సత్యవతి, పద్మినుల యనిర్వచనీయపాతివ్రత్యముగాని ప్రస్తుతవిద్యార్థులలో నెందఱెఱుగుదురు? ఆధునికవిద్యావిధానప్రాముఖ్యత విద్యార్థులమనసు

మరుభూమి యనుచున్నది. ఈమరుభూమియందు మహత్తరాశయము లెట్లు మొలక లెత్తును? వేదసారమునుగాని, గీతారహస్యమును గాని యెఱిగిన హిందూబాలకు లెంద రున్నారు? నీతిజ్ఞానము గాని, ఆత్మగౌరవము గాని, ఆత్మోన్నతిగాని, ఆధ్యాత్మిక పరిజ్ఞానముగాని పడయు విద్యార్థు లెంద రున్నారు? మానవహృదయము విశాల మగుటకొఱకు కఱపబడు విద్య యేది? విజ్ఞానముకొఱకు కీయబడు విద్య యేది? విద్యకొఱకు నొసగబడు విద్య యేది? దాస్యమునుగాక స్వాతంత్ర్యమును బోధించు విశ్వవిద్యాలయములు భరతఖండమున నెన్ని కలవు? అసుతోషు పెట్టిన బొబ్బ లరణ్యరోదనము కాలేదా? భారతీయుని యార్థిక సమస్యలు పరిష్కరించుటకు వలయు పరిజ్ఞాన మొసగు విశ్వవిద్యాలయములు హిందూదేశమున నెన్ని కలవు? భూధవులైనను, భూతలకుబేరులైనను వేదపండితునకు బ్రణమిల్లి, ప్రాచీనవిశ్వవిద్యాలయములందు జనసామాన్యము గలిసి విద్యాభ్యాస మొనర్చెడివారని వింటిమి. నేటి విద్యాలయములం దీభావము, నీ సౌహార్దము, నీ నైతికపటుత్వము గోచరించుచున్నదా? విశ్వవిద్యాలయములకు ధనదార్థ్యములను ధారవోసి వెల్వడు విద్యార్థులు కాష్ఠపుత్తలికలట్లు కృశించిత్వగస్థిమాత్రావశిష్టులై, నిర్ధనులై, నిరుత్సాహులై, నిర్భాగ్యులై మహానగరవీథులం దల్లాడుచుండుట జూచి కన్నీరు వీడువా రెంద రున్నారు?

ఇక స్త్రీవిద్యనుగూర్చి యేమి తెలుపుదును? పురుషులస్థితికంటె స్త్రీలస్థితి మఱింత దుఃఖకరముగ నున్నదికదా! స్త్రీలుకూడ మేదస్సు కలవారనియు, వారికిని హృదయమున్నదనియు, వారుకూడ మానవజాతిలోనివారే యనియు, ప్రభాకరునకును మయూఖమునకును, ప్రసూనమునకును సౌరభమునకును, సురాపగకును పూతగుణమునకును గల సంబంధమట్లు స్త్రీపురుషులసంబంధ మభేద్యమైనదనియు మఱచితిమి. వనితలకు విద్యాబుద్ధులు కఱపక మూలగూర్చుండబెట్టి మనశరీరమందలి సగపాలును పక్షవాతరోగమునకు గుఱి గావించితిమి. స్త్రీలను నికృష్టస్థితియందుంచి, ఉత్కృష్టదశనుండి మనము నేలగూలితిమి. దానంజేసి విద్యా, నైతిక, మత పరిస్థితులందు గూడ జాతీయత్వము కుంటుపడినదికదా!

ఇక రాజకీయముగ భారతస్థితి నెఱుగని భారతీయులు లేరు. స్వాతంత్ర్యములేని మానవుడు మానము గోలుపడిన అధముడు! ప్రాణరహితుడైన శత్రువునకైన గౌరవ ముండును; కాని మానరహితుడైన మిత్రునకైన నభిమాన ముండదు. ఏనాడు మనదేశము స్వాతంత్ర్యము గోలుపడినదో ఆనాడే భారతవిద్యా, నైతిక, ఆర్థిక, సాంఘికపరిస్థితులు పాడుపడినవి. స్వాతంత్ర్యకాంక్ష మహాపరాధ మని యొరులు తలచిన తలపవచ్చును. స్వాతంత్ర్యదీక్ష రాజద్రోహమని యన్యు లూహించిన నూహింపవచ్చును. స్వాతంత్ర్యవ్రత మన్యు లనుష్ఠింప రానిదని లాతివారు యోజించిన యోజింపవచ్చును. జాతీయత్వమునకు స్వాతంత్ర్యమే యుత్తమాంగము. పునర్జీవితు లగుటకు భారతీయులకు స్వాతంత్ర్యసంజీవి యవసరము. దీనిని బడయుటకు భారతరాజకీయవేత్త లనేకమార్గములు సూచించిరి. దైవభీతిగల భారతీయునకు దౌర్జన్యమందు నమ్మకము లేదు. శాంతియే దౌర్జన్యమును మా[illegible]నుటకు వలయు ప్రధానసాధన మని యేసునకు మున్నే బుద్ధుడు సూచించి యుండెను. దౌష్ట్యప్రహారములకు సహనకవచము నొడ్డుడనియే సబర్మతీసంయమిప్రబోధము. ఈప్రబోధమును మది నిలిపి, భారతాంబ పాంచజన్యధ్వానమునకు జెవి యొగ్గి, యుత్సాహపూరితులై దేశకల్యాణవ్రతదీక్షకు గడగి కృతకృత్యులగుచో భారతీయులు పూర్వోన్నత్య మందజాలుదురు. హైందవులు తమ్మొదాము పాలించు నెఱుగరని శ్వేతముఖులతలంపు. భారతీయులసమర్థులుకారు. ఆర్థికముగను, రాజకీయముగను హీనస్థితిలోనున్నను, అనిర్వాచ్యములైన అరిష్టకాదంబినీపంక్తులనుండి విజ్ఞానసప్తాశ్వుడు! భారతవిహాయసమున తనదివ్యతేజమును చిలుకుచునే యుండెను. రామను రాధాకృష్ణులును, జగదీశ మేఘనాథ ప్రఫుల్లచంద్రులును, రవీంద్రనాథ సరోజినులును, గాంధి అరవిందయతీంద్రనాథపంగీ విజయాది మహాపురుషులునుగా విజ్ఞానమున భారతము మహోన్నతమై యుండ భావదార్ఢ్యమును, రాజకీయపరిజ్ఞానమును,

నిర్మాణకౌశల్యమును, స్వపరిపాలనా సామర్థ్యమును భరతఖండమున గొఱవడెనని తలచుట దుర్న్యయము !

స్వాతంత్ర్య, బాధ్యతలు భేదభావమును మాపు చేసి సంఘీభావమును బెంపొందించును. స్వాతంత్ర్యము బడసిననాడే హిందూముసల్మానులు సురధునీయమునలట్లు కలియుదురు. స్వాతంత్ర్యము బడసిననాడే బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర పంచములు పాంచాల స్రవంతీపంచకమట్లు సంఘీభావసింధువున గలియుదురు!! స్వాతంత్ర్యము బడసినాడే మైత్రేయిగార్గిలనుబోలి భారతసీమంతినులు జ్ఞానశమంతకములై వెలుగొందుదురు!!! స్వాతంత్ర్యము బడసిననాడే యరాతికుతంత్రకుధరమును స్వయంశక్తి, స్వయంనిర్ణయస్వయంవిశ్వాస కులిశాయుధములచే ఛేదింపజాలుదుము!!! స్వాతంత్ర్యము బడసిననాడే పాశ్చాత్యవణిక్సంఘముల స్వార్థవ్రతతిని స్వీయబలలవిత్రముచే ద్రుంపివేయజాలుదుము!!! స్వాతంత్ర్యమలవడిననాడే సంఘస్థ దురాచారకీటము లగ్గిబడి బుగ్గి యగు శలభముల ట్లంతమగును!!! స్వాతంత్ర్యము చేకుఱిననాడే జాతీయత్వము పునర్జీవితమై సౌష్ఠవసంపన్నమై, సర్వాంగసుందర మగును!!!! ఆర్థిక సాంఘిక, నైతిక, రాజకీయభిత్తికలు బలయుతములై, జాతీయత్వ మహాసౌధము స్థిరమై, ఉన్నతమై యుండుటకు స్వాతంత్ర్య మూలబంధము దృఢమైయుండుటనివార్యము. ఈదివ్యహర్మ్యనిర్మాణమునకై భారత సోదరసోదరీమణులు నడుముగట్టుట ముదావహము.

జాతీయత్వముకంటె నంతర్జాతీయత్వము మహత్తరమైనది. కాని, యివిరెండును పరస్పరవిరుద్ధములుకాక పరస్పరబలదాయకములు. ఐదుజాతులవారికలయిక హైందవుల కెట్లు కల్యాణసంధాయకమో, యైదుఖండముల వారి సమ్మేళనము ప్రపంచమున కట్లే సుఖదాయకము. భారతీయుడును, నైరోపావాసియు, నమెరికాసీమస్థుడు నొకేభగవంతుని యనుంగుపుత్రులు. అనుంగుసోదరులందన్యోన్యభావ మవసరము. నాగరికత యధికమగుకొలది పృథ్వీభాగములకు పరస్పరసంబంధము లలవడి క్రమక్రమముగ బలవత్తరమగుచున్నవి. ఏదేశముగాని యొంటరిజీవనము గడపుట నూతనయుగమున నసాధ్యము. పరస్పర కల్యాణమే అంతర్జాతీయత్వసిద్ధి. ఈసిద్ధిచేపడుటకు జగమందలిజాతులన్నియు స్వార్థమునుమాపుచేసి, సమరమును దుడముట్టించి, సమానశాంతిసుఖములు నెలకొల్పవలెను. ఈమహత్తరోద్దేశమును బూర్ణమొనరించుటకు నైరోపా మహాసంగ్రామము కడచినపిదప జాతిసమ్మేళన(League of Nations) మొకటి నెలకొలుపబడినది. ఏబదినల్గురు జాతులవారిందిపుడు సభ్యులుగనున్నారు. దీనినిగుఱించి పాశ్చాత్యులు రేబవలులు కీర్తించుచున్నారు. శాంతిస్థాపనమునకై నెలకొలుపబడిన యీమహాసంఘమున కింకను శాంతి దృగ్గోచరమగుచుండుట లేదు. ప్రపంచమందంతటను దుర్ణయ దుర్భిక్ష దురహంకార దౌష్ట్యములు తలయెత్తుచునే యున్నవి. ఇందులకు హేతు వీమహాసంఘసభ్యులింకను సర్వసమత్వభావమును గుర్తింపకుండుటే. భారతసీమపై రాబందులట్లు వ్రాలుట కింకను నన్యజాతీయులు విరమించుట లేదు. రుధిరలోలుపశ్వానములట్లు పరదేశీయులు భారతముపైబడి హైందవార్థమును గొల్లగొట్టుచున్నారు. భారతీయులు నేడు దురంతపీడనమునకు గుఱియగుచుండ, నంతర్జాతీయత్వ శరీరమున నొక్కెడ నలిగి మంటలు పుట్టుచుండ, మానవజాతికి సుఖశాంతు లెట్లలవడును? మహత్తరమగు నంతర్జాతీయత్వ మలవడుటకు ముందు ప్రధానమగు జాతీయత్వము చేకుఱవలెను. కవీంద్రుడగు రవీంద్రునివలె, సంయమీంద్రుడగు గాంధి విశ్వమానవకల్యాణ మపేక్షించుచున్నను, ప్రస్తుతము జాతీయత్వముమీదనే తనదృష్టి నిక్షేపించుట కిదియే కారణము.

మానవసమత్వమును, మానవ భ్రాతృత్వమును, మానవ సౌహార్దమును నింకను భావప్రపంచమందే ప్రకాశించుచున్నవి. అచిరములో నీయుత్కృష్టాదర్శము సఫలీకృత మగుగాక! యుగాదినుండి కవులును, సంయములును గాంచు దివ్యస్వప్నము సత్యరూపమునందుగాక !! పృథ్వీతలము శాంతిధామమై, సుఖనిధానమై, మహత్తరమై, మహిమోపేతమై, మధ్యమలోకస్వర్గమగుగాక!!! జాతి, మత, వర్ణ, భాషా భేదములుమఱచి మానవకోటి పవిత్ర మైత్రీసంశ్లేషమున గలిసి, నవగ్రహగానతుల్యమధుర మంజులప్రణయగీతము నేకకంఠమునబాడి, సృష్టిమహిమ గీర్తించుచు, సచ్చిదానందము నందుదురుగాక. !!!!

---



గొల్లవాడు

—యస్. దుర్గారావు.



## సారస్వతము - సర్కారు

ఒకప్పుడు మనదేశంలో, లలితకళలు, నాగరికత, ప్రఖ్యాతివహించినవంటే, అప్పటి రాజాదరణమే కారణము. హిందూరాజులు మతసంప్రదాయసిద్ధములగు ఆచారవ్యవహారాలను యెంతభక్తిశ్రద్ధలతో కాపాడారో, అంతశ్రద్ధాభక్తులతో లలితకళలనుగూడ, నారాధించి, దేశగౌరవమునకును, సంఘౌన్నత్యమునకును కారణభూతు లైనారు. రానురాను మనదురదృష్టంవల్ల, విదేశీయులపరిపాలనలో, మనవృత్తులను చిత్రకళలను పోషించేవారు లేకపోయినారు. ఎవరికైనా స్వవిషయాల్లో వున్నంతజాగ్రత, యితరులసంబంధములో వుండదు. కాకిబిడ్డ కాకికి ముద్దుగా నుండుట సహజమేకదా ? ఆదరణ లేకపోయినను, కొన్నాళ్లక్రిందటివరకు, యిట్టివిషయాల్లో అనవసరంగా జోక్యం కలిగించుకొనేవాళ్లు గారు. ఇది కొంతమేలే. అప్పటినుండి వీటిని కాపాడేభారము ప్రజలమీద బడ్డది. పెద్దలంతా పూనుకొని యథాశక్తిని సేవిస్తూ, ఇప్పటివరకు యితరదేశాలకు తీసిపోకుండా నిలిపారు.

అన్నివిధాల - దేశము మరీ దుస్థితికి వచ్చుటకు ప్రస్తుతం రెండుకారణాలు కనుపడుతున్నవి: (౧) నేటి విద్యావిధానము, (౨) స్థానికపరిపాలనాపద్ధతి. ఇది అందరికి తెలిసినరహస్యమే యైనప్పటికి, యెవరికివారు, యేవోసాకులు చెబుతూ " యెవరికివారే, యమునా తీరే" అన్నట్టుగా సంచరిస్తున్నారు. చిన్నఉద్యోగస్థులు చేతగాకనో, మరేకారణముచేతనో యేతెలివితక్కువపనిచేసినా, అందలిఫలితమును జవాబుదారీ వహించిన పెద్దయుద్యోగి అనుభవించవలసివుంటుంది. అధికారవర్గంలో, యేశాఖవారు యేలోపము జేసినా, చివరకు "ఫలానావారిప్రభుత్వంలో యీపని జరిగింది" అనేఅప్రతిష్ఠ కాయంగా వుంటుంది. సర్కారువారు మనసారస్వతములో వ్రేలు బెట్టుతున్నారా ? దానివల్ల లాభమా ? నష్టమా ? అనేది ముఖ్యమగువిషయము కాబట్టి, ఉన్నదున్నట్లు చర్చించుట అవసరము.

కొందఱుయువకులు ఉత్సాహముతో ముందుకు వచ్చి, గ్రంథాలమోద్యమవ్యాప్తికి పాటుపడుచు భాషాసేవ చేస్తున్నారు. కొందఱు సారస్వతోపాసకులు చిత్రవిచిత్రగతుల గద్యపద్యాలు నిర్మించి, తెలుగుతల్లిని ఆరాధిస్తున్నారు. భావిభాగ్యోదయానికి ఈరెండును పునాదులేకాని, మన దురదృష్టంవల్ల ఫలితానికివచ్చిన పండ్లను ఉడతలు కొడుతున్నవి. స్వేచ్ఛగా, నిర్భీతితో రచియింపబడి, సంఘమును, దేశమును ఉద్ధరించే ఉత్తమగ్రంథాల ప్రచారానికి అనేక అంతరాయాలు సంభవిస్తున్నవి. ఇవి ప్రస్తుతము రెండురకాలుగా బయలుదేరినవి.

మొదటిపక్షము:—

కొందరు గ్రంథాలయాధికారులో, లేక, యజమానులో, సర్కారువారికి, గ్రాంటు యిప్పించవలసిందని దరఖాస్తులు పెట్టుకొన్నారు. అందుమీదట, గ్రాంటుయిప్పించేటట్లుగానే, డిప్యూటీ యినస్పెక్టరు ఆఫ్ స్కూల్సునో, లేక, మరో ఉద్యోగినో దరఖాస్తులు పెట్టుకొన్న గ్రంథాలయా లన్నిటిని తనిఖీ చేయమందురు! ఆ యుద్యోగి కొన్ని గ్రంథాలయాలకు వచ్చి, యిష్టమువచ్చినట్లు ప్రశ్నల వర్షము గురిపించి, ఉన్న అధికారమంతా చల్లాయిస్తూ "ప్రణయచాంచల్యము", "ప్రణయసామ్రాజ్యము" మున్నగాగల "ప్రణయము" అనుమాట యున్నగ్రంథా

లున్ను "గాంధిజీవితము" (ఆత్మకథ), "తిలకుగారి ఉపన్యాసములు" మున్నగాగల దేశనాయకులపేర్లు గలగ్రంథాలున్ను తక్షణం లైబ్రరీలోనుంచి తీసివేయ్య మనిచెప్పి వెళ్లను. దీన్నిబట్టిచూస్తే మన గ్రంథాలయాల్లో "కుమారవాచకాలు", "వాణీవాచకాలు", "పెద్దబాలశిక్ష"మున్నగునవిమాత్రమే వుండాలన్నమాట. సర్కారు యీవిధంగా మనసారస్వతముమీదికి దాడి వెడలితే ఉత్తమగ్రంథాలకు తావేది?

రెండోవిధము:—

టెక్స్టుబుక్ కమిటీవారు అప్రూవ్ చేసినగ్రంథాలు మాత్రమే పఠనీయములుకదా? మొన్న మొన్నటివరకు యేచెత్తగ్రంథమైనా సరే అప్రూవ్ అయిపోయేది. ఆకారణముచేత ఉత్తమగ్రంథాలు రావడానికి విశేషముగా అవకాశము లేకపోయింది. ఇప్పుడిప్పుడు ఆపద్ధతి మారి క్రొత్తదారి దొక్కారు. ఏపుస్తకమునైనా శృంగారమనేమాటగాని, రాజకీయపువాసనగాని కనుపడితే, ఆగ్రంథము అప్రూవ్ గాదు. ఈమధ్య నామిత్రులొకరు "శ్రీకృష్ణలీలాస్మృతి" అనేగ్రంథాన్ని కమిటీవారికి బంపారు. పేరునుబట్టే ఆగ్రంథము భక్తిరసప్రధానమైనదని తెలుస్తుందిగదా? కమిటీవారు ఆగ్రంథములో "లావణ్యానుపమాంగియై,విసము నల్లం జన్నులం దాల్చి," అనేపద్యంలో "చన్నులు" అనేమాట యున్న దిగనుక అప్రూవ్ చేయుటకు వీలుగాదని గ్రంథకర్తకు జవాబు యిచ్చారు. మఱొకమిత్రులు "దైవచూడామణీ" అనేగ్రంథం పంపితే, దానికిగూడ యిట్లాంటి జవాబే వచ్చింది. దీనినిబట్టిచూస్తే పోతనగారి "భాగవతము" అసలే చూడగూడ దనుకోవలెనా?

భారత, రామాయణాది పౌరాణికగ్రంథములు, కళాపూర్ణోదయము మున్నగాగల ప్రబంధాలు యేమి కావలెను? శృంగారరసప్రధానములై యుండి, చరిత్రాత్మకములును, సాంఘికములును అగు ఉత్తమగ్రంథాలగతి యేమిటి? "అప్రూవుడ్ ఫర్ లైబ్రరీ యూస్" అని టెక్స్టుబుక్ కమిటీవారనకపోతే యీగ్రంథాలు వుండగూడదుగదా? ఈవిషయం ప్రాజ్ఞులు చక్కగా ఆలోచించుకోవాలి. సారస్వతముమీద సర్కారువారు తమ అధికారాన్ని యెంతవరకు చలాయించాలెనో, విద్యాధికులు నిర్ణయించి, అవసరమగుమార్పులు జరుగుటకు, అధికారవర్గమువారికి మనవిచేసుకొనుట మేలని విన్నవించుచున్నాను.

—కర్లపాలెము కృష్ణరావు.

---

## వచనవాఙ్మయము

సంస్కృతమున పద్యరచనమే కవిత్వము. వచనము బలాదూరు.

అందుశాస్త్రీయగ్రంథములును పద్యాత్మకములే. తుదకు నిఘంటువులును పద్యాత్మకములే.

సంస్కృతపండితులు, సంస్కృతకవులు వచనమును సకలవిధములను ద్వేషించి బహిష్కరించినారు.

అయితే: కవిత్వమునకు ఒదుగునది, సహజమైనది వచనము; కాని, పద్యముకాదు.

పద్యము గానమునకు సంబంధించినది.

పద్యమున లయ, స్వరము ప్రధానములు. కవిత్వము వాటి తరువాతిది.

శిశువులు, పశువులు, పాములు పద్యములు, పాటలు విని తలలూపును. పరిణతచిత్తులగు విద్వాంసులును అన్యభాషాశ్లిష్టగీతము విని ఉప్పొంగుదురు.

కారణము...?

గానము శ్రవణసుఖము నొడగూర్చును.

పద్యము, పాట విని యెట్టిపామరుడును ఆనందించుట భావము తెలిసికాదు. అందలిభావము—కవిత్వము రుచిచూపుటకు చతురుడగు పండితుడు చాల శ్రమపడవలయును.

కావుననే గానమాపాతమధురమని నిర్వచనము.

పద్యమున కవిత్వమునకు పారతంత్ర్యమే; కాని స్వాతంత్ర్యములేదు.

వచనమున కవిత్వమునకు మరే సంసర్గమును లేదు. అంతయు స్వస్వరూపము.

వచనము చదివి తెలిసికొనగలుగు అక్షరజ్ఞాని పద్యము చదివి తెలిసికొనలేడు.

ఏల? పద్యమున తికమక లెక్కువ. వచనమున సారళ్య మెక్కువ.

పద్యమున వాక్యనిర్మాణము లయ ననుసరించి నడచును. వచనమున స్వతంత్రముగ, సూటిగ నడచును.

పద్యము కవిత్వము లేకున్నను విన సొంపుగ నుండును. వచనము కవిత్వము లేకున్న మాటలప్రోగు. అంతే.

కావుననే వచనము కవులకు నికషము.

పద్యములనే ప్రేమించిన సంస్కృతకవులలో ఈసూత్రము నెరిగినవారు లేకపోలేదు.

కొందరు పద్యములను పూర్తిగా విడువలేక చంపువులు రచించినారు.

బాణుడు, దండి మున్నగువారు నలుగురై దుగురు కేవలవచనమునే ప్రేమించినారు; కాని వారి గ్రంథములయందలి వాక్యము లన్నియు గణయతి ప్రాసలు లేని పద్యములు.

పద్యముల ప్రభావము వారి కవితాశక్తి నట్లు కొంచెపరిచినది.

పద్యములనే చూచి, చదివి, రచించి ఉండిన వారు ఆమెట్టునకైన దిగియుండుట ప్రశంసాపాత్రమే.

వారి యడుగులలో అడుగులువేసిన ఆంధ్ర కవులు అంతమాత్రపు పరిణతినైన పొందలేదు.

ఆంధ్రమున అట్టి నారికేళపాకపు వచనమైన లేదు.

అయితే: ఒకవిశేషము మాత్రమున్నది.

సంస్కృతకవుల ఒరవడి, సాహచర్యము— వీటివలననే ఆంధ్రకవుల కిట్టి పద్యప్రీతి యేర్పడినా, కాలము వారిలో కొంతమార్పు తెచ్చిపెట్టినది.

ఆంధ్రప్రబంధము లన్నియు చంపువులు. నాలు గైదుమాత్రమే నిర్వచనములు.

పరిణామసూత్రము మరికొంతకాలమునకు మన వారికి వచనప్రీతి కలిగించియుండవలసినది; కాని అనుకరణపరాయణత పురోగమనము లేకుండజేసినది.

ఇంతేగాదు. తిర్యగ్గమనముకూడ ప్రారంభమైనది.

మనవారు చిత్రకవిత్వమును, బంధకవిత్వమును ప్రారంభించినారు. శ్లేషకవిత్వమున మునిగిపోయినారు. రానురాను తమ పూర్వులపోకడలను, ఎత్తుగడలను, కల్పనములను కొంతమార్చి, వారిభావములను తమ మాటలతో ఛందోబద్ధము కావించినారు.

అక్కడక్కడ ఒకరిద్దరు వచనము వ్రాసినా అది పైకి రాలేదు. జనసామాన్యమునకు రుచించలేదు.

మహమ్మదీయుల ప్రభుత్వము మనకు చిరకాలమనుభూతమయినా వారి వాఙ్మయము మనకు కొత్త రుచి కలిగింపలేకపోయినది.

ఆంగ్లవాఙ్మయపరిచితి కలుగునంతవరకును మనవాఙ్మయమున కీజ్వరము విడువలేదు.

పందొమ్మిదవ శతాబ్దియొక్క ఉత్తరార్ధమున మన వాఙ్మయమున ఆంగ్లవాఙ్మయచ్ఛాయ సాంద్రముగా అంకితమైనది.

దీనితో ప్రబంధనిర్మాణము సన్నగిల్లి, నాటకరచనము ప్రారంభమై, వచనవాఙ్మయము పెరుగసాగినది.

కుంటివానికి కాళ్లు వచ్చినట్లు, గ్రుడ్డివానికి కండ్లు వచ్చినట్లు, బధిరునకు చెవి వచ్చినట్లు, మూగవానికి నోరువచ్చినట్లు అయినది. ఆంధ్రవాఙ్మయమునకు వెలుగువచ్చినది.

ఇటీవల పద్యవ్యాసములు—ఖండకావ్యములు రచింపబడుచున్నవి. ఈరకమున సంఖ్యకు తగినంతవిశిష్టత లేదు. అయితే: వీటివల్ల కీడులేదు. మేలును తక్కువ.

కాగా, మనకవులు ఇప్పుడు దృఢదీక్షతో చేయవలసినది వచనరచన. వచనరచనవలన వాఙ్మయమునకు విజ్ఞానమబ్బును. పుష్టికలుగును.

వచనవాఙ్మయమువలన మనజాతి ఉద్బుద్ధమగును. మనదేశము వీర్యవంతమగును.

అప్పుడు భారతదేశపుటాకాశమున ఆంధ్రుడు నిండుచంద్రునివలె సాక్షాత్కరించును.

—శాస్త్రి

# నక్షత్రమండలము

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

మార్గశిర, పుష్యమాసములు : (డిసంబరు 1933)

ఉత్తరము




దక్షిణము

[ఈపటము ఆయాదిక్కులు సరిగాచూపునట్లు తలమీదుగాపెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| డిసెంబరు | 8 | తేదీని | రాత్రి | 8-50 | గంటలకును, | డిసెంబరు | 22 | తేదీని | రాత్రి | 7-54 | గంటలకును |
| ,, | 15 | ,, | ,, | 8-22 | ,, | ,, | 29 | ,, | ,, | 7-28 | ,, |

} కనబడును.]

౧౯౩౩ డిసెంబరు ౧౫ మొదలు ౧౯౩౪ జనవరి ౧౫ తేదీవఱకునను నెలలో రాత్రి ౯ గ్గో లిజామునకగపడు గ్రహ, నక్షత్రాదులను తెలిసికొందము.

## క్షీరవాహిని (Milky way)

ఈ మాసములో క్షీరవాహిని, తూర్పు సమీపమందున్న ఆగ్నేయదిశనుండి, పశ్చిమ సమీపమున నున్న వాయవ్యదిశవఱకు మండలఖండాకారమున (like the segment of a circle) వ్యాపించి యున్నది. అది శ్వాన, పూర్వశ్వాన, వృత్ర, మిథున, వృషభ, సారథి, భృగు, పరశు, అప్సరస, రాజహంస, ధనిష్ఠ లనబడు నక్షత్రసమూహములమీదుగా గాని, సమీపమునుండిగాని వ్యాపించి యున్నది.

## పరమక్షయ దినము (Winter solstice)

సంవత్సర మంతటిలో అల్పతమప్రమాణము గలదినము (shortest day of the year) ఈమాసమునందే వచ్చుచున్నది. మనవారు ఈ దినమును పరమక్షయదిన మందురు (డిసెంబరు ౨౧-వ తేదీ).

## శీతకాలపు నక్షత్రములు

Winter constellations-శీతకాలపునక్షత్రములసంపులు అనబడు మేష, వృషభ, మిథున రాశులు ఈ మాసమునందు రాత్రి తొలిజామున తూర్పున నెంతో రమ్యముగా కనబడుచుండును.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు (First Magnitude stars)

మంచి సొగసైనట్టియు, మిక్కిలి తేజోవంతములైనట్టియు నక్షత్రములు ఈ మాసపు తొలిజామున తొమ్మిది కనబడుచున్నవి. అవియేవనగా:—

౧. శ్రవణము. ఇది త్వరలో అస్తమించుచున్నది.

౨. ఇంద్రద్యుమ్నుడు. (Fomalhaut మీనములో)

౩. శశితేజుడు. (Acherner)

౪. రోహిణి. (Aldebaran)

౫. రిగెల్. (Rigel)

౬. ఆరుద్ర. (Betelgeanx)

౭. బ్రహ్మహృదయము. (Capella in Auriga)

౮. మృగవ్యాధుడు. (Sirius in Canis Major.)

౯. పూర్వశ్వానము. (Procyon in Canis Minor)

## ఉత్తరనక్షత్రములు

ధ్రువుడు సరిగా నభోమధ్యరేఖపై నున్నాడు. చిన్నయెలుగు ధ్రువుని దిగువ వ్రేలబడినట్లున్నది. బృహద్రుక్షము ఉత్తరసమీపమునన్న ఈశాన్యమున నిక ఉదయమగునుకాని ఇంకను ఉదయముకాలేదు. విష్ణ్వీశ్వరుడును, అతని సూచకమును ఇపుడే తొంగిచూచుచున్నారు ఉత్తరసమీపమున వాయవ్యదిశను నహుషుడు అస్తమించినాడు.

## తూర్పునక్షత్రములు

వేదకాలమునాడు వృత్రుడనియు, పాశ్చాత్యులచే ఓరయన్ (Orion) యోధుడనియు చెప్పబడు వీరునిరూపము తూర్పున చక్కగా కనబడుచున్నది. మనవారు గొల్లకావిడిచుక్కలని చూపు మూడు చుక్కలును, వాటికి నాలుగు ప్రక్కలను బాహువనబడు ఆర్ద్రయు, పాదమనదగు రిగెల్ (Rigel) నక్షత్రమును, రిగెల్ తూర్పుగా నొకటియు, ఉత్తరమున అనగా, ఆర్ద్ర, రోహిణిలమధ్య తేజోవంతమగు Bellatrix నక్షత్రమును నాలుగుమంచపు కోళ్లవలె నగపడుచున్నవి. రిగెల్ నక్షత్రములో పచ్చనిరంగుగల చుక్కల జంట ఉన్నది. గొల్లకావిడి చుక్కలు విషువద్రేఖ (Equator) నెంబడిని కొంచెము దక్షిణముగా పోవుచున్నట్లు కనబడును. రిగెల్ చుక్కకు ఉత్తరమున యమునపుట్టినట్లు కనబడును. రిగెల్ దిసువనే శశకమున్నది. చిన్నదైనను శశకము చూడుట

కెంతో రమ్యముగా నగపడుచున్నది. దానికి క్రొంచెము దిసవనే కపోతమున్నది.

### శ్వానములు-మృగవ్యాధుడు (Sirius)

ఇంత తేజస్సుతో ప్రకాశించునక్షత్రరాజము మఱియొకటి ఆకాశమందగపడదు. ఇంచుమించుగా నీ నక్షత్రము నంటియున్న ఆకాశగంగ కావల ఉత్తర ముగా శ్వానములోని Procyon చుక్క-ఇదే పూర్వ శ్వానము—మెఱయుచున్నది. పాశ్చాత్యు లీ కుక్కలు ఒరయన్ వేటకాని వెంబడిని పోవు వేటకుక్కలందురు. వీటికి ఎగువను, అనగా తూర్పుసమీపమునదున్న ఈశాన్యమునందు మిథునరాశిలోని పునర్వసుచుక్కలు చక్కగా ఉదయించి మెఱయుచున్నవి.

రోహిణి వృషభరాశిలోని వృషభమునకు నేత్ర మువంటిది. ఎద్దుకన్నువలె ఎఱ్ఱగా మెఱయుచుండును. రోహిణికి ఉత్తరభాగమందు తెల్లని తేజస్సుతో బ్రహ్మ హృదయము మెఱయుచున్నది ఈ రెంటికినిమధ్య అగ్ని నక్షత్రము చూడనగును. నభోమధ్యరేఖకు తూర్పునను, సారథి అజశాబకములకేవలనుభృగుపరశుమండలమున్నది. అందుఔర్వ, జమదగ్ని, రుచీకాదులు మెఱయుచున్నారు. ఆదిసువ గ్రుడ్లు మిటకరించుకొనుచు పులోముడున్నాడు. పులోమునిసమీపమున, క్షీరవాహినిలో, స్వల్పములై కనపడునక్షత్రకోటులచే నచ్చటియాకాశము ధవళమై తోచుచున్నది.

### మధ్యనక్షత్రములు

పిల్లలకోడి భృగుపరశుమండలముదిసువను తేజ రిల్లుచున్నది. వెండి యుత్తరీయమున చిక్కుకొనిన మిణుగురుపురుగులట్లు ఇవి చక్కగా మెఱయుచున్నవి. యంత్రసహాయము లేక ఇంపలినక్షత్రము లారు కనబడు చున్నవి. అశ్విని నభోమధ్యరేఖపై నున్నది.

శింశుమారము అశ్వినికి రేవతికి దిసువనేఉన్నది. అందులోని మైరానక్షత్రము ఒకప్పుడు సప్తఋషు లంత తేజోవంతమైయుండి మరియొకప్పుడు, కంటికి కాన్పరానంత తేజోహీనముగా నుండును.

### దక్షిణ నక్షత్రములు

శింశుమారమునకు దిసువ ఇంద్రద్యుమ్నుడును, ఆతనికథతో సంబంధముగల నాళీక జంఘ బకము, ప్రావారకర్ణ ఘూకము, యుగంధరకమఠమును కాన బడుచున్నారు. ఆగ్నేయాకాశమున వసుచరిత్ర కథను స్ఫురింపజేయు నక్షత్రములున్నవి. ఉపరిచరవసువును, అతని యమోఘవీర్యమునకై పోరాడిన పక్షులును, ఆవీర్యమును గ్రమించిన అద్రికయు, అద్రికి పుడినవలయు, దానిగర్భమున జనించిన సత్యవతి యోజనగంధియు, ఆమెను వివాహమాడిన శంతనుమును ఆప్రాంతములందే కాననగుచున్నారు.

శింశుమారము దిసువనే సముద్రవాలుకాపులిన తలమున ధుంధుమ ఘోరాగ్నిజ్వాలలతో Chemical Furnace వలె చూడనగును.

### పశ్చిమమున

[illegible] చున్నది. ఛాయాపథమును, శ్యామసీమలును త్వరలో నస్తమింపనై యున్నవి. ధనిష్ఠయు కొంతలో నేపుండదు. శ్యామసీమల కావల ఊర్వశీపురూరవసులును, దిసువ పూర్వాభాద్ర, ఉత్తరాభాద్రలును, ఆదిసువ కుంభ, మీనరాసులును కాననగుచున్నవి.

### అప్సరసలు

ఊర్వశీపురూరవస్సుల కావల, నభోమధ్యరేఖ సమీపమున, రంభ, సుజార్ణి, ప్రహ్లాదేచకుస్, గ్రంథినీ, చరాఖ్య మొదలగు నప్సరసలు మెఱయుచున్నారు. ఈచుక్కలన్నిటిలో రంభ 'చక్కనిచుక్క' యను సామ్యము మరువరాదు.

### ఇంద్రమద

అప్సరసలదిసువను, పులోమరక్కసునిచే బాధిత యైన ఇంద్రమదయును, ఆమెగర్భచ్యుతుడైన చ్యవను డును కాననగుచున్నారు. చ్యవనుడు రేవతికావల, అశ్విని సమీపమునందు చూడనగుచున్నాడు.

### క్షీరోదధ్రువములు

క్షీరోద దక్షిణధ్రువము— యుగంధరకమఠము నభోమధ్యమును గడచి పడమటకు వ్రాలినది. ఉత్తరధ్రువ మింకను కానరాదు.

### గ్రహములు

సూర్యాస్తమయమైనవెనుక పశ్చిమాకాశమున శుక్రుడు మంచికాంతితో ప్రకాశించుచున్నాడు. శ్రవణమునదిగువ శని కొంతకాలము కనబడును. అంగారకుడు మకరమందే కానవచ్చుచున్నాడు. మాఘమాసములో కాని కుంభములోనికిరాడు. రాత్రి 9 గంటలపుడు కనబడకున్నను, ఈగ్రహములు మూడును, సూర్యాస్తమయముకాగానే కొంతవరకు పశ్చిమాకాశమున చూడనగును. వాటిస్థానములు పటములో చూపలేదు.

### ఉల్కాపాతములు

ఈమాసములో 15 డిసెంబరువరకు, మిథునరాశిలో, పునర్వసుసమీపమున హ్రస్వములు, శీఘ్రవంతములు నైన ఉల్కాపాతములు కాననగును.

### చిన్న ఉల్కలు

పునర్వసులో 15 తేదీవరకును, సప్తఋషిమండలములో 19—22 తేదీలను, నరకునిలో 19 మొదలు 29 తేదీవరకును చిన్న చిన్న ఉల్కలు పడును.



అ భి సా రి క
(ఆంధ్రజాతీయకళాశాలా చిత్రసంచయమునుండి)

—యస్. వి. యస్. రామారావు.



౬. తమంతన తెరచుకొను అలుగులు



# బాల క్రీడలు

మంగిపూడి వేంకటశర్మ

## ౩౭. ఓమనగుంటలు - ఆవు ఆవు

ఒకగుంటకు ఒకటియెదురుగా నుండులాగున రెండువరుసలుగా వరుసకు ఏడేసిగుంటలు చేయవలయును. ఈగుంటలు బల్లలమీద చెక్కించుకొన్న యెడల సులభముగా నుండును. కనుక చాలమంది మంచి సరదాగా చేపలుమొదలైనవాని యాకారముగా నుండునట్లు చక్కగా కఱ్ఱలు చెక్కించి చేయించుకొందురు. ఈయాట ఒకయాటకు ఒక్కరును, ఒక్కయాటకు ముగ్గురును, మూడాటలకు యిద్దరును ఆడుటకు బాలిక లుండవలయును. ఈయాటలో కాళీవచ్చిన గుంటపేరు కుళ్లుగుంట, లేక ముఱికిగుంటయనియు, దానితరువాత గుంటలలోని కాయలు తీసికొనుటపేరు నాకివేయుట అనియు అందురు. గుంటకొక్కటికి అయిదేసికాయలుచొప్పున పదునాల్గుగుంటలలోను వేసి, ఇద్దరిలోను ముందుగా నెవరోయొకరు తమముందర నున్న యేదోయొక గుంటలోని కాయలు చేతిలోనికి తీసికొని, తీసినగుంటకు పైనున్న గుంటమొదలుకొని గుంటకు ఒక్కొక్కకాయచొప్పున అయిదుగుంటల లోను వేయవలెను. తరువాత ఆరవగుంటలోని కాయలెత్తి మళ్లీ ఆలాగుననే ఆడవలెను.

ఇట్లు తన గుంటలలోగాని, రెండవవారి గుంటలలోగాని యేదైననొక గుంటగాని, రెండుగుంటలుగాని కాళీవచ్చువరకు ఆడుచుండవలెను. ఒక్కగుంట కాళీవచ్చినయెడల కాళీగానున్న గుంటతరువాత గుంటలోని కాయలును, దానియెదురనున్న గుంటలోని కాయలును ఆడుచున్న బాలిక గెలిచిన ట్లెంచుకొని తీసికోవలెను. ఎదుటిగుంటలో కాయలు లేనియెడల ఒకగుంటలోని కాయలే తీసుకోవలెను. వరుసగా రెండుగుంటలు కాళీయైనయెడల కాయ లేవియు రావు. ఇట్లు కాయలు గెల్చినను గెలువకపోయినను కాళీవచ్చినతరువాత ఆట రెండవవా రాడవలయునుగాని మొదటివా రాడకూడదు. ఇట్లొకరితరువాత నొకరు అన్నిగుంటలలోను కాయలన్నియు అనునందాక ఆడుచుండవలయును. ఇట్లాడుచుండగా ఆటకై కాయలెత్తిన గుంటలలో మిగత గుంటలలోని కాయలతో ఆడుచుండగా ఎవ రాడుచున్నను ఎవరిప్రక్క గుంటలలోనికి నాలుగుకాయలు చేరినయెడల వారు వారి గుంటలలోని కాయలు యెత్తుకొని గెల్పుకాయలలో కల్పుకోవలయును. అట్టికాయకు ఆవు అని పేరు. ఇట్లు ఆడుచూరాగా ఓడిపోయిన వారికి కొన్ని గింజలు మొదటిసారు తగ్గిపోవును. కనుక రెండవఆటకు ఓడిపోయినవారికి యేడుగుంటలలోనికి సరిపడుకాయ లుండవు. అట్లుండకపోయినను ఎవరిదగ్గర నున్న కాయలు వారువారు పెట్టి ఆడవలెను. అనగా ఓడిపోయినవారిదగ్గర ఒకగుంటలోనికి సరిపడు కాయలున్నను గెల్చినవారు ఏడుగుంటలలోను కాయలుపోసి ఆడవలయును. కాని ఓడిపోయినవారిప్రక్కను గింజలు లేనియెడల కాళీగానున్న గుంటలలోమాత్రము ఆడక కాయలున్నగుంటలలో మాత్రమే యిద్దరును ఆడవలయును. ఇట్లు ఎవరోయొకరు పూర్తిగా ఓడిపోవువరకు ఆడవలెను.

## ౩౮. వంగఆట (కట్టుఆట)

ఈయాటకు గుంటొక్కటికి యేడేసికాయ లుండవలయును. ఎవరోయొకరు యేదోయొకమూల

గుంటలోనుండి యారంభించి ఆడవలయును. (లేని యెడల ఆట సరిగా నడువక చాలాఆలస్యముగా ముగి యును.) అట్లు ఆడునపుడు తనకుడిప్రక్కనున్న మూలగుంటలోనుండి ఆరంభించవలెను. కాని యెడమ మూలగుంటనుండి ఆరంభించినయెడల కాయలు విస్తా రము గెలుపురావు. ఇది జ్ఞాపకముంచుకోవలెను. ఈయాటకు మొదటియాటవలెగాక యేగుంటలోనికి కాయలు సరిపోవునో ఆగుంటలోని కాయలే యెత్తి ఆడుచుండవలయును. ఇట్లు ఆడుచుండగా ఏమూల గుంటలోని కాయలైనను ఆడుటకై యెత్తుటచేత కాళీయైనతరువాత ఆగుంటలో మూడుకాయ లుండి నాల్గవకాయ పడునప్పటికి చేతిలోని కాయలు సరి పోయినయెడల దానికి (ఆగుంటకు) వంగ అనిపేరు. ఆనాల్గవకాయ గుర్తునిమిత్తము ఆగుంటప్రక్కను నిల్ప వలెను. ఎవరిప్రక్కనూలగుంట వంగ (కట్టు) అయి నదో ఆగుంటలోని కాయలు వారు గెల్చినట్టు అగును. కనుక ఆగుంటలోని కాయలన్నియు ఒక్కమారుగాని, అనేకపర్యాయములుగాని ఎవరివో వారు తీసికో వలెను. ఒకరు ఆడుచున్నప్పుడు యెదుటివారి గుంటలన్ని టిలోను కాయలువేయవచ్చునుగానియెదుటివారికివచ్చిన కట్టు అనగా వంగఅయిన గుంటలోమాత్రము కాయలు వేయరాదు—అనగా ఆడరాదు. ఇట్లు ఆడునప్పుడు యేగుంటయైనను యెన్నిగుంటలైనను కాళీలుకావచ్చును. అట్లు కాళీయైనగుంటలోనికి (ఆడుకవచ్చుకాయలు అనగా చేతిలోనికాయలు సరిపోయి) ఒక్కకాయ మిగిలియుండినయెడల ఆకాయ దానిలో వేసిన తరువాత తనఆట అయినట్టు తలచి రెండవవారు ఆడవలెను. వంగవచ్చినను తరువాత రెండవ యాట యియ్యవలెను. వంగగుంటలలో ఎక్కువలాభము వచ్చినవా రెవరోయొకరుందురుగనుక రెండవమారు ఆడెడుఆటకు ఒకరికెక్కువగాను ఒకరికి తక్కువ గాను గింజలుండును. కనుక ఆవుల ఆటవలెనే యెవరి దగ్గరనున్న గింజలన్నియు వారువారు వేసి ఆడవలెను. కాని ఓడిపోయినవారిప్రక్క కొన్నిగుంటలు కాళీ యుండునుగనుక కాయలున్న మొదటిగుంటనే మూల యని భావింపవలెను. ఇట్లు ఎవరోయొకరోడిపోవు వరకు ఆడవలెను.

## ౩౯. అత్తకోడళ్ల ఆట

ఈ యాటకు గుంట ఒకటికి పన్నెండేసికాయలు పోయవలయును. ఇది ముగ్గురు ఆడవలయును. ముగ్గురి లోను ఇద్దరు కోడళ్లనియు, ఒకతె అత్తయనియు పేరులు పెట్టుకోవలెను. పదునాల్గుగుంటలలోను (ఈ గుంటలను గదులనియు, ఇండ్లనియు వాడుదురు.) కుడి యెడమప్రక్కల నున్న నాలుగేసియిండ్లు చేరి యొక్క ప్రక్కవి చెరియొకకోడలును, మధ్యనున్న ఆరుగుంట లను అత్తయును తమవని భావింపవలయును. ఆవుల యాటవలెనే దీనికిని ఆడెడుకాయలు ఏగుంటలోనికి సరి పోవునో దానిప్రక్కగుంటలోని కాయ లెత్తిఆడవల యును. కాని సరిపోయినగుంటలోని కాయ లెత్తియాడ గూడదు. ఈ యాటకును ఆవు లున్నవిగాని ఆవుఅనగా ఆరేసికాయ లుండవలెను. ఈ యాట మొదట అత్త ఆరంభించవలెనుగాని కోడండ్రు ఆరంభింప కూడదు. అత్త గెల్చినను, ఓడినను రెండవ ఆటమొదలుకొని మూడుఆటలవరకు ఆటఒక్కొక్కటికి ఒక్కకాయ చొప్పున కోడళ్లిద్దరికి చెరియొకటి యిచ్చుచుండవల యును. ఇట్లు ఇచ్చుటపేరు కోడళ్లకు అత్త గంజి పోయుటఅనియు, మూడుమారులనగా మూడేండ్లనియు చెప్పుదురు. అయిదవయాటమొదలుకొని అత్తవలెనే ఓడిపోయినను, గెల్చినను ఆటలన్నియు అయిపోయి మానివేయువరకును ఆటప్రతియాటకును ఆటఒక్కటికి ఒక్కొక్కకాయచొప్పున కోడళ్లిద్దరును చెరియొక కాయ అత్తకు యిచ్చుచుండవలెను. కోడళ్లు క్రొత్తగా కాపురమునకు వచ్చుటచేత కొంతకాలమువరకు అత్త పెత్తనమనియు, తరువాత యెల్లకాలము కోడళ్ల పెత్తన మనియు దీనికి పేరు. ఈయాటకుకూడ ఆవులఆటలో వలెనే ఆడుచుండగా కాళీవచ్చినగుంటప్రక్కనున్న యెదురుగుంటల రెంటిలోని కాయలును యెవరికి వచ్చి నవి వారు తీసికొనిపోవచ్చును.

## ౪౦. కాళఆట

ఈయాట యిద్దరాడవలయును. దీనికి గుంటకు పండ్రెండేసి కాయ లుండవలయును. ఈఆటయంతయు ఆవులఆటవలెనే ఆడవలయును. కాని యీయాటకు అవులు లేవు. మరియును యీయాట ఆడునపుడు మధ్యనున్న రెండుగుంటలలోని కాయలను యెత్తియాడ గూడదు. కాని ఆగుంటలలో తక్కినగుంటలలోవలె ఆటఆడునపుడు కాయలు వేయుచుండవలయును గాని మానరాదు. మధ్యగుంటలు రెండునుగాక తక్కిన గుంటలప్రక్క గుంటలేనైన కాళీలు వచ్చినపుడు ఆవులఆటలోవలె యెవరికి వచ్చినకాయలు వారు తీసికోవలెను. మధ్యగుంటలప్రక్క కాళీలు వచ్చిన యెడల ఆగుంటలోని కాయలు (అనగా మధ్యగుంట లోనివి) మొదట యెవరికైన రావలసివచ్చినయెడల వారు తీసుకోక ఆటయంతయు ఆఖరుదాక అట్టే యుంచవలయును. ఏలయనగా ఈగుంటలోని కాయలు ఎవరిప్రక్కనున్నవి వారికిగాక రెండవవారికిగూడ అధికారము గలదు గనుక ఆగుంటలయందలి కాయలు ఎవరి కెన్నిమారులు రావలసివచ్చినవో లెక్కించుకొని ఆవరుసప్రకారము ఇద్దరును పంచుకోవలెను. ఒక్కొక్కయాటకు అట్టికాళీ (మధ్యగుంట ప్రక్క గుంటకు) రానియెడల ఆయాట అయిపోయినను ఆ కాయ లట్టే యుంచి రెండవయాట ఆడుచూ ఆయాటలో ఎవరికి వచ్చునో వారు పుచ్చుకోవలెను. ఈ యాటలో మధ్యగుంటకు కాళీ అనిపేరు. అందువల్లనే యీయాటకు కాళఆట యనిపేరు.

## ౪౧. సీతాదేవిఆట

ఈయాట ఒక్కరికంటె యెక్కువమంది ఆడుటకు వీలులేదు. ఏలయనగా లంకలో సీతాదేవి రెండవవారి ముఖము చూడకుండ ఒక్కతెయును ఈయాట ఆడుకొన్నదని చెప్పుదురు. అందువల్లనే దీనికి సీతాదేవియాట యని పేరువచ్చినది. ఈయాటకు క్రమముగా రెండుప్రక్కలను ఒకగుంటలో ఒక్క కాయయు, రెండవగుంటలో రెండును, మూడవ గుంటలో మూడును, నాల్గవగుంటలో నాల్గును, అయిదవగుంటలో నైదును, ఆరవగుంటలో నారును, ఏడవగుంటలో నేడునుగా కుడిప్రక్కనుండి ఎడమకు పోసికొనిరావలయును. తరువాత ఆట ఆరంభించవలెను. ఈ యాటకు ఎక్కడ యారంభించినను సరేకాని యేగుంటలో కాయవేయుట తోడ అయిపోవునో ఆగుంటలోనే వేసినను దానిలో నివే యెత్తి ఆడుచుండవలయును. ఈయాటకు కాళీలు వచ్చుటయు, గుంటలలోనికాయలు గెల్చుక్రిందతీసికొనుట యును లేవు. ఈయాట కెప్పుడును కాళీలు రాగూడదు. అలాగున వచ్చినయెడల ఆట తప్పుఆడినట్టు గ్రహించవలెను. ఇట్లు ఆడుచుండగా తప్పినయెడల మరల మొదటినుండియు ఆడుకోవలెను. ఇట్లు ఆడగాఆడగా అన్ని గుంటలలోను మొదట యేగుంటలో యెన్నెన్నికాయలు వేసినారో, అన్ని సరిగా యెప్పుడు వచ్చునో అప్పటికి యీయాట ముగిసినట్లెంచవలయును.

## ౪౨. సరిబేసులు

అంకెలలో మొదటియంకెయగు ఒకటిమొదలుకొని యొకసంఖ్య విడిచి యొకసంఖ్య చొప్పున అనగా ఒకటి, మూడు, అయిదు మొదలగు నంకెలన్నియు బేసి సంఖ్యలును, రెండుమొదలుకొని యొకటివిడిచి యొకటి యనగా రెండు, నాలుగు, ఆరు, యెనిమిది మొదలగు సంఖ్య లన్నియు సరిసంఖ్యలనియు నందరికిని దెలియును కదా! ఇద్దరుబాలికలు సమానసంఖ్యగల గవ్వలుగాని, చింతగింజలు మొదలగు గింజలుగాని తెచ్చుకొని యొడిలో పోసికొని యొకబాలిక తనయొడినుండి కొన్ని కాయలు దీసి (కాయలుఅనగా గవ్వలుగాని, గింజలు గాని అని తెలిసికోవలెను) రెండుచేతులతోను గిలకరించి కుడిచేతిలోనికి వచ్చినన్ని కాయలు తీసి ఆకాయలు కనబడకుండ మూసి సరియా, బేసియా చెప్పుమని రెండవవారి నడుగవలయును. ఆచేతిలోని కాయలను ఇన్ని యని సరిగా రెండవవారు చెప్పినయెడల ఆకాయలను వారి కిచ్చివేయవలయును. చెప్పలేనియెడల చేతిలోని కాయ లెన్నో అన్ని రెండవవారివద్దనుండి పుచ్చు

కోవలెను. ఇట్లు ఇద్దరిలో ఎవరోయొకరు అన్నికాయలును గెల్చువరకు నాడుకోవచ్చును. లేదా కొంతవరకైనను ఆడవచ్చును. కొంతవరకు ఆడి మానివేసినయెడల మొదట తాము తెచ్చుకొన్న కాయ లెన్నియో, గెల్చుకొన్న కాయ లెన్నియో లెక్కించిచూచుకొని సంతోషించవచ్చును. ఈయాట యెందరు బాలికలైనను ఆడుకోవచ్చును. అనగా ఒకబాలిక కాయలు గిలుకరించి సరులా, బేసులాయని అందరిని అడిగినప్పుడు ఒక్కొక్కరే క్రమముగా సరులో బేసులో యని తమకు దోచినట్లు చెప్పవచ్చును. అట్లు చెప్పినయెడల అందరిలోను ఓడిపోయినయందరిదగ్గరను కాయలు పుచ్చుకోవచ్చును. గెల్చినబాలికల కందరికిని ఆడినబాలిక యియ్యవచ్చును. ఇట్లు చేసినయెడల ఒక్కొక్కపర్యాయమే చాలకాయలు ఓడిపోవునుండుటయు, గెల్చుచుండుటయు గూడ సంభవించును. లేనియెడల అందరిని అడుగక అందరిలోను ఒక్కొక్కరొక్కొక్కరి నడిగి గెల్చినయెడల ఆమెయొక్కరి దగ్గరనే కాయలుతీసికొని తాను ఓడినయెడల ఆమెకే కాయ లియ్యవచ్చును. ఇట్లు కొంతసేపు ఒకరు అడిగెడువారుగాను (ఆడెడివారు), మరికొంతసేపు మరియొకరు ఆడెడివారు (అడిగెడువారు) గాను ఉండవలయును. లేదా యెల్లప్పుడు నొక్కమాదిరిగానైనను ఉండవచ్చును.

## ౪౩. కుచ్చిళ్లు

ఈయాట యిద్దరుగాని, పైగా మరికొందరుగాని యుండి ఆడవచ్చును. కాని నలుగురైదుగురుకంటె ఎక్కువమంది ఆడినయెడల గింజ లెక్కువకావలసివచ్చును. ఆటకు స్థలము ఎక్కువ ఆక్రమించుకొనును. చాలసేపటిదాక ఆట ముగియక విసుగువచ్చును. ఈయాటకు చింతగింజలేకాని సీతాఫలగింజలు మొదలయినవంతగా యుపయోగముగా నుండవు. (ఎత్తులేని వగుటచే చేతికి దొరుకవు) కావున చింతగింజలే ముఖ్యము. కుంకుడుగింజలు, తలంటుకాయలలోని గింజలు మొదలయినవికూడ పనికివచ్చును. చింతగింజలను దెచ్చి ఆడవచ్చినబాలికలందరును సమముగా పంచుకొని యొడిలో ఉంచుకొని అందరును సమముగా, కొన్నిగింజలను దీసి అందరిగింజలును కలియబోసి ముందుగా ఆడుటకు నిశ్చయించినబాలికచేతి కీయ



వలయును. ఆ బాలిక యాగింజలన్నియు తనకుడిచేతిలో, అనగా అరచేయి చాచి దానిలో పోసికొని ఆగింజలను కొంచెము యెత్తునకు యెగరవేసి (అంగుళము, అరఅంగుళమునకంటె యెత్తుగా యెగురవేయనక్కరలేదు) కుడిచేయి వెంటనే తిరుగవేసి ఆగింజలు కుడిచేతి వ్రేళ్లమీద నిలుచునట్లు చేయవలయును. (ఎగురవేసిన గింజలు తిరుగవేసిన కుడిచేతి వ్రేళ్లమీద నిలువవలయును. కనుక ఎక్కువయెత్తునకు గింజలు యెగురవేయరాదనియు, వ్రేళ్లు ఒకదానికొకటి యెడముగా నుంచరాదనియు తెలిసికోవలయును) కొందరు అరచేతిలోని గింజలను మీఁజేతిమీదికి దెచ్చుకొని నిల్పుటలో యెడమచేతితో సహాయము చేసికొనుచుందురు. ఇట్లు తిరుగవేసిన చేతిమీద నిల్పిన గింజలను కొంచెమెత్తునకు యెగరవైచి అరచేతితో పట్టుకొనవలయును. ఇట్లు యెగురవేయునప్పుడుగాని, అరచేతితో పట్టుకొనునప్పుడుగాని యొక్కగింజయైనను జారి క్రిందపడరాదు. అట్లు గింజలు ఒక్కటిగాని, ఎక్కువగాని జారిగాని, చెదరిగాని క్రిందపడ్డయెడల ఆయాట తాను ఓడినట్లెంచి మరియొక బాలికను ఆడుమని ఆగింజలన్నియు నీయవలెను. కనుక మీఁచేతిపై నుంచుకొని యెగురవేసి పట్టుకొనబోవు గింజలు చేరెడుకంటె చాలతక్కువగా నుండుట మంచిది. అనగా నలుగురైదుగురు బాలికలు కలిసి యాడునప్పుడు ఒక్కొక్కబాలిక పదేసి పదునైదేసి కుచ్చిళ్లు పోసినను నలుబది యేబది పుంజెడులు

గింజలనుకదా! ఆ గింజలన్నియు లోజేతిలోగాని, మీజేతిమీదగాని నిలువనేరవుగదా! కనుక అరచేతిలో పట్టినన్ని గింజలుమాత్రమే యుంచుకొని తక్కినవి క్రింద విడిచినను విడువవచ్చును. మరియు రెండుచేతు లును దోసిలిపట్టి దోసిలికి మించిన గింజలు క్రిందవిడిచి మీజేతిమీద యెడమచేతిసాయమున బోసికొనునప్పుడు కూడచేరెడు గింజలుమాత్ర ముంచుకొని తక్కినవిక్రిందికి వదలివేయవచ్చును. మరియు చేరెడుకన్న తక్కువ గింజలే మీజేతిమీద నిల్పుకోవచ్చును. అనగా యెడమ చేతి సహాయములేకుండ యెన్నిగింజలు మీజేతిమీద నుండి యెగరవేసి పట్టుకొనగల్గునో అన్నిగింజలనే యెగరవేయునప్పటికి మీజేతివ్రేళ్ల మీదఉంచుకోవలెను. అరచేయి తిరుగవేసి వ్రేళ్లు దగ్గరగా పట్టి బాగుగా చాచి మీదిభాగమున నుండవచ్చునట్లు,అనగా పల్లముగానుండు నట్లు వ్రేళ్లు వంచినయెడల కొంచెము ఎక్కువగింజలు చేతిపైని నిల్చును. ఇట్లు మీజేతిమీది గింజలు యెగర వేసి పట్టుకొని ఆగింజలు కుచ్చెడు (నాలుగేసి) చొప్పున యెడమచేతిలోనికి పడునట్లు మెల్లగా యెగరవేసి పట్టుకోవలెను. కుడిచేతిలో చాలగింజ లుండునుగనుక వ్రేళ్లు సప్పిడిగా బట్టి నాలుగింజలుమాత్రము వ్రేళ్ల యివతలికి గెంటి యెడమచేతిచేర చాచి నుండవలె నుండునట్లు వ్రేళ్లు వంచి ఆసందులో పడునట్లు మెల్లగా యెగరవేయవలయును. అట్లు యెగరవేయుచుండగా కుడిచేతిలోనుండిగాని, యెడమచేతిలోపడి నిలువక చెదరిగాని క్రింద గింజలు ఒకటిగానీ, ఒకటికంటె యెక్కువగాని పడినయెడల ఆట పోయిన ట్లెంచవల యును. నాలుగుగింజలకంటె యెక్కువ యెడమచేతి లోనికి తీసికొన్నను ఆటపోవును. కనుక జాగ్రతగా తీసుకోవలయును. ఇట్లు యెడమచేతిలోకి తీసుకొన్న గింజలు కుచ్చెడుకుచ్చెడుచొప్పునగాని, కచ్చటము చొప్పునగాని క్రింద బెట్టుకొని యెక్కువకాయలు వచ్చినతరువాత గుఱ్ఱములుగాను, ఏనుగులుగాను ప్రోగు పోసుకోవలయును. కుడిచేతిలో ఒక్కగింజయైన లేకుండ అన్నియు యెడమచేతిలోనికి తీసుకోరాదు. నాలుగింటికి లోపల యుండునట్లుంచుకోవలెను. అనగా ఒక్కటి యున్నను చాలును. ఆమిగిలినకాయ గాని, రెండుమూడు కాయలుగాని ఒక్కమారుగా కొంచెముపైకి యెగరవేసి క్రిందనున్న గింజలు ఒకొ్కక్కటిచొప్పున గాని, రెండేసిమూడేసినాలుగేసిచొప్పున గాని మునివ్రేళ్లతో చాతుర్యముగా దీసుకోవలయును. మూడునాలుగుకన్న యెక్కువగానైనను నేర్పుగల వారు వేసుకోవచ్చును. కాని క్రిందనున్న గింజ లందు కొనబోవునప్పుడు అందుకొనబోయిన గింజగాక మరియొకగింజకు చేయిగాని, వ్రేలు గాని తగిలినయెడలగాని, రెండుమూడు గింజ లొక్క మారుగా అందుకొనబోవునప్పుడు కొన్నిగింజలు చేతికి రాక చెదరిపోయినప్పుడుగాని ఆటపోయిన ట్లెంచవల యును. కుడిచేతిలోనుండి యెడమచేతిలోనికి తీసికొను నప్పుడు పొరపాటున యెడమచేతిలో అయిదుకాయలు పడినయెడల తన కుడిచేతిప్రక్కను గూర్చున్నవారిని "ఆటకావలయునా నూటకావలయునా" అని అడుగవలయును. (ఈ ఆట యిద్దరి కన్న యెక్కువమంది ఆడినయెడల క్రమముగా కుడిచేతిప్రక్కను గూర్చున్నవారికి ఆటవీలువచ్చును. అని తెలిసికోవలెను) ఆట కావలెనని యన్నయెడల ఎక్కువపడిన అయిదవకాయ కలిపి అప్పటికి కుడిచేతిలో మిగిలియున్న కాయలతోసహా ఆటయడిగిన బాలిక కిచ్చివేయవలెను. నూట కావలెనన్నయెడల ఎడమచేతి లోకి అప్పుడు తీసికొన్న అయిదుకాయలును తీసియియ్య వలెను. అడుగవలసిన బాలిక ఆటపుచ్చుకొన్నయెడల ఆకాయలు పైనిచెప్పినట్లు కుచ్చెడుచొప్పున యెడమ చేతిలోనికి తీసికొని తాను ఆడవలయును. నూట అడిగి పుచ్చుకొన్నయెడల అదివరకు ఆడుచున్న బాలికయే ఆడవలయును. ఇట్లు క్రమముగా క్రిందిగింజలన్నియు ఎవరికోయొకరికి వచ్చుపర్యంతము ఆడవలయును. ఆడిన తరువాత యెవరి కెన్ని గెల్పుఓడులు వచ్చినవో చూచు కోవలెను. ఈయాటలో క్రిందనున్న గింజలు తీసికొను నప్పుడు మరియొకగింజకు చేయిగాని, వ్రేలుగాని తగి లిన దానికి కండుట యని పేరు. కండుటయనగా కదలుట యని యర్థము. నేర్పుగలిగినయెడల ఒకొ్కక్కమారు

పోసుగానున్న గింజ లెన్నింటినైనను తీసికోవచ్చును. అట్లు తీయుటపేరు సప్పుటగనుక అట్లు తరుచుగా దీసికొనుటపేరు సప్పుటలని వాడుదురు.

## ౪౪. కుందికట్టు

ఆలంకిఆలంకివలెనే నలుసురు మనుష్యులు కాళ్లు లంకెలువేసుకొని వెనుకకు తిరిగి ఒంటికాలిమీద నిల్చి ఒకరిచేతు లొకరు పట్టుకొని సంభ్రమముగా తిరుగవలయును. ఈయాట ఆరుగురు బాలికలుకూడ ఆడవచ్చును. ఆడునప్పుడు గిరగిర తిరుగునప్పుడు "సిరసిర బండి సిరాయిబండి" అని పాడుచుందురు. ఈయాటకు "రేసిరసిరబండి" అనికూడ అందురు.

## ౪౫. వెన్నెలాట

బాలికలందరును వెన్నెలలో నిలిచియుండవలయును. ఒకబాలికమాత్రము వారికి ఎదురుగా నిల్చియుండవలెను. ఆనిల్చియున్నవారిలో నెవరు (కొంచెమైనను) కదలినను వారు అయిపోయినట్లు ఎంచవలయును. కనుక ఎదురుగా నిల్చియుండిన బాలిక అందరిని చూచుచు తానును కదలక మెదలక యుండవలెను. అట్లు నిల్చియున్నవారిలో యెవరైన కదలినయెడల ఆబాలికను ఆడుకరమ్మని తక్కినబాలికలందరును యేగోడనీడకైనను, యేయింటినీడకైనను పోయి నిల్చియుండి ఒక్కొక్కప్పుడు వెన్నెలలోనికి వచ్చుచుందురు. కదలిన బాలిక తక్కినబాలికలలో యెవరినీడనైనను వెన్నెలలో నుండగా త్రొక్కవలెను. అట్లు త్రొక్కినయెడల యెవరినీడత్రొక్కునో ఆబాలిక ఆడుకొనిరావలయును. ఎవరినీడను త్రొక్కనియెడల ఆబాలికయే ఆడుకొనిరావలయును. కనుక వెన్నెలలో చాలసేపు నిలువక దూరదూరముగా నుండవలయును. ఒకమా రిద్దరైనయెడల పేర్లు చెప్పుకొనిరావలెను.

## ౪౬. కుప్పఆట

చీకటిమూతలవలె ముగ్గరేసి బాలికలు చేతులలో చేతులు వేసికొని. ఓడిపోయినవా రెవ్వరో నిశ్చయించుకొనవలయును. తరువాత ఒకచోట యిసుక కుప్పగా పోసి ఒక చిన్న కాగితపుముక్కను ఆయిసుకలో లోతుగా పూడ్చియుంచవలయును. తరువాత ఆకుప్పచుట్టును ఒకబరి (బద్దె లేకగీత) గీచి అయిపోయిన బాలిక దానిచుట్టును తిరుగుచుండవలయును. తక్కినబాలిక లందరును తిరుగుచున్న బాలిక తమ్ము



ముట్టుకొనకుండ కాచుకొనుచు ఆకుప్పను తన్నుచుండవలయును. ఇట్లు తన్నునప్పుడు తిరుగుచున్న బాలిక తన్నినబాలికకాలిని తనకాలితో తాకినయెడల అయిపోయి తానే కాచుకరావలసివచ్చునుగనుక పదిలముగా తన్నుచుండవలయును. ఇట్లు తన్నునప్పుడు కుప్పలలోని కాగిత మెప్పుడైన బయలుపడినయెడల (అనగా పైకి కనబడినయెడల) తిరుగుచున్న బాలిక అదివరకే తల్లియని యేర్పరచుకొన్న బాలికనుగాని, అరుగు, గోడ మొదలగు ప్రదేశములనుగాని త్వరగాబోయి ముట్టుకొనిరావలయును. లేనియెడల ఆటబాలికలందరును ఆబాలికను తల్లిని ముట్టుకొనువరకు దెబ్బలుకొట్టుదురు. ముట్టుకొనివచ్చినతరువాతకూడ ఎవరినైన తాను ముట్టుకొనునందాక ఆబాలికయే ఆడుకరావలెను. ఆబాలిక యెవరిని ముట్టుకొన్న వారు ఆడుకవచ్చుచుండవలయును.

## ౪౭. సన్నికల్లు పొత్తరము

ఇద్దరు బాలికలు ఎదురుగా నిల్చియుండి ఒకరిచేతు లొకరు పట్టుకొని "సన్నికల్లుపొత్తరము సరి

జోడు మాఅక్క మట్టెలు ఘలుఘల్లు" అని పాడుచూ తమచేతులు క్రిందికి వంచుచు మరల యెత్తుచు ఈవల ప్రక్కకును ఆవలప్రక్కకును త్రిప్పుచు వినోదముగా ఆడుదురు. రెండుచేతులును దగ్గరగా బట్టి ఈప్రక్క సన్నికల్లు యెత్తిఆప్రక్కను, ఆప్రక్కది యీప్రక్కను పెట్టిన ట్లుండునుగాన దీని కీపేరువచ్చియున్నది.

## ౪౫. దూదుంబుల్ల

ఇద్దరుబాలిక లొకచోట నొకరి కొకరెదురుగా కూర్చుండి యిసుకను ప్రోగుచేసి రమారమి అంగుళము పొడుగుగల పుల్లయొకటి దెచ్చి ముందుగా ఆడదలచిన వారు ఆపుల్లను చేతిలో నుంచుకొని ఆయిసుకను రెండు చేతులతోనూ కత్రవలె కోలగా చేయుచూ రెండవ వారికి తెలియకుండ చేతిలోని పుల్లను ఆయిసుకలో యెక్కడనో యొకచోటను మెల్లగా జారవిడువవలెను. తరువాత రెండవబాలిక ఆయిసుకలో పుల్ల యెక్కడ



యుండునని తోచునో అక్కడ తన రెండుచేతుల వ్రేళ్లను ఒకచేతివ్రేళ్లనడుమ నొకచేతివ్రేళ్లు పోనిచ్చి రెండుచేతుల వ్రేళ్లమధ్యభాగమును ఆపుల్లపై పడునట్లు ఇసుకమీద చేతులువే॰ గట్టిగా నొక్కియుండవలెను. అప్పుడు మొట్టమొదట ఆడినబాలిక రెండవబాలిక యొక్క చేతులక్రిందమాత్రముగాక చేతివ్రేళ్లప్రక్కలను యీవలావలను గల ఇసుకయందును తాను పెట్టిన పుల్లను వెదకుకొనును. అట్లు వెదకగా తనపుల్ల తనకే దొరకినయెడల ఒకమారు తాను గెలిచినట్లునను. రెండవ బాలికచేతిక్రింద నున్నయెడల రెండవబాలిక గెల్చినట్లగును. ఇట్లు ఆపుల్ల ఎవరికో యొకరికి దొరకినతరువాత దొరికినవారు తనవైపున నొకచోట "నాకోడి లేచి యిల్లుతుడిచినది" అనిచెప్పుచూ తుడిచినట్లు బాగుచేయవలెను. (ఈయాటలో ఆపుల్ల పేరు కోడియందురు) తరువాత పుల్లదొరికినవారే మళ్లీ ఆడవలయును. మొదటి బాలికయే రెండవమారును, మూడవమారును యిట్లు క్రమముగా చాలపర్యాయములును గెల్చినయెడల "నాకోడి యిల్లు అలికినది" అని యొకమారును, "నాకోడి ముగ్గు పెట్టిన"దని యొకమారును చెప్పుచూ అట్లు యిసుకలో చేయుచుండవలెను. ఒకమా రొకరును, రెండవమారు రెండవవారును మరికొన్నిమారులు వీరును,కొన్నిసారులు వారును గెల్చుచువచ్చినయెడల యెవరు గెల్చినప్పుడు వారు క్రమముగా పైని చెప్పినట్లు చేసికొనవచ్చునుగాని క్రమముగా అన్నిమారులును ఒక్కరే గెల్వనక్కర లేదు. పైనవ్రాసినప్రకారము ముగ్గుపెట్టుటవరకును ఆడినతరువాత గెల్చినయెడల(అనగాయిద్దరును సమముగా గెల్చువరకునుముందు గెల్చినవారు ఆగనక్కర లేదు. ముందువారు గుడ్డు పండిపోవచ్చును.) నాకోడిగ్రుడ్డు పెట్టినది అని చెప్పుచూ ముగ్గుపెట్టిన తనచోటిలో యిసుకతోనే గ్రుడ్డువలె చేయవలయును. ఇట్లు అయిదుగ్రుడ్లు పెట్టుట వరకును ఆడవలయును. ఒకరికోడి అయిదవగ్రుడ్డు పెట్టునప్పటికి ఒకరికోడి నాలుగుగ్రుడ్లు పెట్టి అయిదవది పెట్టుటకు సిద్ధముగా నున్నను మొదట అయిదుగ్రుడ్లను పెట్టినకోడియే పండినట్లు తెలిసికోవలయును. ఇట్లు పండిన(కోడిగల) బాలిక ఓడిపోయినబాలికయొక్క దోసిలి నిండ యిసుకపోసి దానిలో ఆట కుపయోగించిన పుల్ల గ్రుచ్చి ఆబాలికకు కన్నులుమూసి యొకచోటికి తీసికొనిపోయి అక్కడఆయిసుక (పుల్లసహితముగా) పోయించి మరల ఆప్రదేశమునకు అబాలికను తీసికొని వచ్చికన్నులు వదలివేయవలయును. తరువాత ఓడిపోయిన బాలిక తాను యిసుక యెక్కడ పోసినదో ఊహించి తెలిసికొని అక్కడికి త్వరగా బోయి ఆపుల్లను వెదకి తీసుకొనిరావలయును. వచ్చునప్పటికి పండినబాలిక తనగ్రుడ్లను తానే త్రొక్కి పాడుచేయవలెను. అట్లు పాడుచేయనియెడల ఓడిపోయిన పిల్ల వచ్చి గెల్చిన బాలికయొక్క గ్రుడ్లుత్రొక్కినయెడల పండినబాలికయే యోడిపోయిన దగును. మరియు పుల్ల వెదకుటకు వెళ్లిన ఓడిపోయినపిల్ల ఆపుల్లను తెచ్చినయెడల

రెండవమారు ముందుగా తాను ఆడుకొనవచ్చును. లేనియెడల మొదట పండిన బాలికయే ఆడుకొనిరావలయును. ఒకబాలిక ముందు తానుపండినను రెండవ బాలికకోడిని (అనగా పుల్లను) వెనకి తెచ్చులోపల తనగ్రుడ్లను తాను త్రొక్కివేయనియెడల ఓడిపోయిన బాలిక వచ్చి త్రొక్కినట్లయ్యెనా తరువాత ఆ పండిన బాలికయొక్క గ్రుడ్లు త్రొక్కిన (ఓడిపోయిన) బాలికయే ఆడుకొనిరావలయును.

---



ప్రతిబింబములు

—బి. యస్. గోపాల దేశికాచార్యులు.

# నేటి రష్యా

నార్ల వెంకటేశ్వరరావు

(అక్టోబరు సంచిక తరువాయి)

## బాలబాలికలు

నేటి బాలబాలికలే రేపటి దేశనిర్మాతలు. ఈసత్యము రష్యా పరిపూర్ణముగ నవగాహ మొనర్చుకొనినది. అందుచేతనే సోవియటుప్రభుత్వము ప్రారంభమునుండియు బాలబాలికలవిషయమై పూర్తిగ శ్రద్ధ వహించుచున్నది. ఇంతటి శ్రద్ధను ప్రస్తుతము మరేదేశము వహించుట లేదని నుడువుటకూడ సత్యదూరము కాదేమో!

శిశువు భూమిపై పడకపూర్వమునుండియు దాని విషయమై జాగ్రత్తవహింపబడుచున్నది. ఇది కేవలము అతిశయోక్తియని కొందరు భావింపవచ్చును. కాని యట్టివారు గర్భవతులగు కార్మికురాండ్రకై కల్పింపబడినట్టి విశ్రాంతి, సెలవు మున్నగు ప్రత్యేక సౌకర్యములను గమనించినచో పైవిషయములో నీషణ్మాత్రమైనను అతిశయోక్తి లేదని వారికే తెలియగలదు.

ఇక శిశువు జననమందినపిదప దానివిషయమై కైకొనబడు శ్రద్ధ అపారము. తల్లులు యంత్రాలయమునందుగాని, పొలముపైనగాని పనిచేసుకొనుచున్నప్పుడు శిశువుల లాలనపాలన గావించునిమిత్తము పెక్కువేల శిశుసంరక్షణాలయములు (nurseries) స్థాపింపబడినవి. ముఖ్యముగ ప్రతిఫాక్టరీలో నిట్టి శిశుసంరక్షణశాల యొకటి తప్పకనుండును. ఇది ఉదయము ౭ గంటలమొదలు సాయంత్రము ౫ గంటలవరకు తెరువబడియుండును. ప్రతిశిశుసంరక్షణాలయములోను మూడుశాఖ లుండును. వీనిలో మొదటిది రెండుమొదలు తొమ్మిదినెలలవరకు వయస్సుగల శిశువులకు. రెండవది ౯ మొదలు ౧౮ మాసములు వయస్సుగలవారికి. ఇక మూడవది ౧౮ మాసములమొదలు ౩ సంవత్సరముల ప్రాయముగలవారికి. ప్రథమశాఖలో శిశువులు నిద్రించునిమిత్తము చిన్నపక్కలుండును. అవియన్నియు కడు శుభ్రముగ నుంచబడును. పసిపిల్లలకు చక్కగ గాలి తగులునిమిత్తము వారికి దుస్తుల నేనియు తొడుగరు. ఒక చిన్నగుడ్డనుమాత్రము కప్పుదురు. వారికి పరిశుభ్రమైన పాల నొసగుదురు. ఒక్కొక్క గదిలో సగటున నలుగురు శిశువులను పరుండబెట్టుదురు. ఒక్కగదిలో నేసందర్భమందును పదిమందికి మించి పసిపాపల నుంచరు. గదితలుపు లెప్పుడును తెరువబడియుండును. ఈగలు, దోమలు మున్నగునవి లోనికి రాకుండునట్లు కిటకీలకు తెరలు కట్టబడును. ద్వితీయశాఖలో శిశువులు ప్రాకుట, తప్పటడుగులువేయుట నేర్చుకొందురు. తృతీయశాఖలో మాటలు, ఆటపాటలు అభ్యసింతురు. ఈపద్ధతిప్రకారమే మూగ, కుంటి, గ్రుడ్డి, చెవిటి, లేక అవిటిశిశువులకుసహితము ప్రత్యేకముగ శిశుసంరక్షణాలయములు నెలకొల్పబడినవి. వీనిలో వారికి సాధ్యమైనట్టి వైద్యసహాయమంతయు నొసగబడును.

మూడువత్సరములప్రాయము దాటినపిదప బాలబాలికలు "కిండర్ గార్టెన్" పాఠశాలల కరుగుదురు. ౭ వత్సరముల వయస్సు వచ్చువరకు వీరి కిచ్చట విద్య గరపబడును. ౧౯౩౨-వ సం. ములో ౬౦ లక్షలమంది శిశువులు పైనుదాహరింపబడినట్టి పాఠశాలలో గలరని అంచనావేయబడినది.

తదుపరి బాలబాలికలు (రష్యాలో బాలబాలికలకు ప్రత్యేక ప్రత్యేకపాఠశాలలు లేవు.) ప్రాథమికపాఠశాలలో ప్రవేశింతురు. ఇక్కడ వారికి వ్యాయామము, సంగీతము తక్క తక్కినవిషయములన్నియు బోధింపబడును. ఈపాఠశాలలు దినమునకు ౪ గంటలు పనిచేయును. ప్రాథమికవిద్య ముగిసినపిదప వారు సెకండరీపాఠశాలల కేగుదురు. ఇవి దినమునకు ౬ గంటలు పనిచేయును. వీనిలో బాలబాలికల ప్రత్యేకాభిరుచి ననుసరించి వారికి విద్య యొసగబడును. సాధ్య

మైనంతవరకు పాఠశాల లన్నియును యంత్రాలయముల సమీపమున నెలకొల్పబడును. వీలైనప్పుడెల్ల విద్యార్థులను యంత్రాలయమునకు గైకొనివెళ్లి, వస్తువుల యుత్పత్తి క్రమమును బోధించుటయే యిట్లు పాఠశాలలను స్థాపించుటలో గల ప్రధానోద్దేశ్యము. దీనివలన బాలబాలికలు కార్మికులయొక్క దృక్పథమును పరిపూర్ణముగ నవగాహన మొనర్చుకొనుటకుసహితము వీలుకలుగును.

“కిండర్‌గార్టెను” పాఠశాలలలోనే బాలబాలికలకు కర్మగౌరవము (Dignity of labour) మన్నగు సద్గుణముల నలవరచుటకు ప్రయత్నింపబడును. వీనిలో చెక్కంటియందు ఆటక్రింద బాలబాలికలచే పేళ్లను వేయించుట, బట్టల నుతికించుట మొదలగు పనులు చేయింపబడుచుండును. కర్మగౌరవమును హృద్గత మొనర్చు నుద్దేశ్యముతో నీమధ్యనే సోవియటుప్రభుత్వము ప్రతిపాఠశాలలోను తోట, కోళ్లగూడు (poultry) మన్నగునవి యుండవలెనని నిబంధన కావించెను.

కర్మగౌరవములోపాటు సహకారబుద్ధినికూడ పెంపొందించుటకు ప్రయత్నింపబడును. “కిండర్‌గార్టెన్” పాఠశాలలలోని బాలబాలికలకు పెద్దపెద్ద ఆటవస్తువు లివ్వబడును. వీని నొకబాలుడుగాని, బాలికగాని కదుపజాలరు. అందుచే వాటితో నాడుకొనదలచినచో నలుగురైదుగురు తప్పక కలియవలెను. దీనివలన క్రమక్రమముగ సహకారబుద్ధి కలిగితీరును.

ఇట్లు సాధారణవిద్యాక్రమమునకు కొన్ని క్రొత్తవిషయములను కలుపుటతో సంతృప్తిపేందక, సోవియటుప్రభుత్వమువారు దానినుండి కూడవనితోచిన కొన్నిభాగములను తొలగించిరికూడ. పాఠశాలలో మతవిద్యను గరపరాదు. దేవదానవుల కథలనుగాని, భూతపిశాచముల కథలనుగాని బాలబాలికలకు చెప్పరాదు. వీటివలన వారు శుష్కాలోచనాపరులగుదురనియు, కార్యశూరత నశించుననియు సోవియటుప్రభుత్వపు వాదన.

బాలబాలికల విద్యావిషయమై సోవియటు ప్రభుత్వ మెంతశ్రద్ధ వహించునో వారి స్వాస్థ్యరక్షణకుసహిత మంతశ్రద్ధ గైకొనును. ఎప్పుడైనను కరవు వచ్చినచో ప్రప్రథమమున బాలబాలికలకు భోజనసదుపాయ మొనర్ప యత్నింపబడును. అందుచేతనే రష్యాలోని బాలబాలికలవలె దార్ఢ్యము గలవారు మరెచ్చటను కానరారని పెక్కండ్రు పలుకుచుందురు.

వేసవికాలము నాలుగుమాసములును పాఠశాలలు మూసివేయబడును. అప్పుడు విద్యార్థులందరును వేసవి విశ్రమస్థానములకు పంపబడుచుందురు. ఇట్లు పంపుటకగు ఖర్చులలో మూడువంతులను కార్మికసంఘము (Trade union) భరించును. నాల్గవవంతునుమాత్రమే తల్లిదండ్రులు భరింపవలెను. వారానాల్గవవంతును సహితముభరింపలేనప్పుడు సోవియటుప్రభుత్వపుఆరోగ్యశాఖ దానిని చెల్లించుచుండును. ౧౯౩౨-వ సం. లో మొత్తము ౧౪ లక్షలమంది బాలబాలికలు వేసవిని విశ్రమస్థానములలో గడపిరి.

బాలబాలికల కిట్లేమరి పెక్కుసౌకర్యము లేర్పరుపబడినవి. నేడు రష్యాలో పిన్నవయస్కుల నిమిత్తము ప్రత్యేకముగ నిర్మింపబడిన నాటకశాలలు ౬౫ కలవు. ఒక్క మాస్కోనగరములోనే యిట్టివి ౬. నాటకశాలలు కలవు. ప్రభుత్వపు విద్యాశాఖయు, కార్మికజనసంఘములును వీనిని పోషించుచుండును. మాస్కోలోను, లెనిన్‌గ్రాడ్‌లోను గల బాలబాలికల నాటకశాలల కొక్కొక్కదానికిని సాలీనా ౫ లక్షలరుబుల్సు గ్రాంటు యివ్వబడును. వీనిలో ప్రదర్శనములు లేబ్రాయమువారందరికిని సామాన్యముగ నుచితముగనే చూపబడును. కొన్నిచోట్లమాత్రము “టికెట్ల” పద్ధతియుండును. కానిటికెట్ల ఖరీదు నామమాత్రముగ నుండును. వీనిలో ప్రదర్శింపబడు నాటకములన్నియు వినూత్నగతిని వ్రాయబడినవి. కేవలము నటులేకాక ప్రేక్షకులుసహితము నాటకప్రదర్శనమునందు పాల్గొనుచుందురు. ఇంతేకాక ప్రదర్శన మారంభింపకపూర్వమును, ప్రదర్శనము ముగిసిన వెనుకను నాటకమునుగూర్చి చర్చ జరుగును. ఈ పద్ధతివలన బాలబాలికలకు చక్కని విమర్శనాజ్ఞాన మలవడును.

బాలబాలికల వినోదార్థము తోలుబొమ్మల ప్రదర్శనశాలలు (Marionette Theatres) సహిత మేర్పాటు గావింపబడినవి. వీటిలోకెల్ల పెద్దదగు ప్రదర్శనశాల మాస్కోనగరమున గలదు. ప్రతిదినమును రెండుగంటలసేపు దీనిలో తోలుబొమ్మలు ఆడింపబడును. ఇట్టి ప్రదర్శనశాలలలో సంచార మొనర్చునవి ౧౮ కలవు. వీనికి ప్రభుత్వపు పుస్తకప్రచురణశాఖ గ్రాంటు నిచ్చుచుండును. ఇవి బాలబాలికల కుపయుక్తము గ్రంథములనుగూర్చి ప్రచార మొనర్చుచు విద్యావ్యాప్తికి విశేషముగ దోడ్పడుచున్నవి.

ప్రత్యేకముగ బాలబాలికలకై నిర్మింపబడిన సినిమాప్రదర్శనశాలలు ప్రస్తుతము ౧౫ మాత్రమే కలవు. కాని ప్రభుత్వపుటుత్తరువు ననుసరించి ప్రతిసినిమా ప్రదర్శనశాలయు అప్పుడప్పుడు బాలబాలికల కుపయుక్తమగు ఫిల్ములను ప్రదర్శించుచుండవలెను. మొత్తము ౮౩,౦౦౦ పాఠశాలలో చిన్నచిన్న సినిమా యంత్రములు కలవు.

బాలబాలికల కిన్ని ప్రత్యేకసౌకర్యము లేర్పరుపబడినప్పుడు వారినిమిత్తమై క్లబ్బులు, పార్కులు, లైబ్రరీలు ఏర్పరుపబడినవని వేరుగ చెప్పవలసిన యగత్యము లేదు. మాస్కోనగరమున వీరికై నిర్మింపబడిన ప్రత్యేకపు పార్కులో నొక చిన్నగ్రామము గలదు. అక్కడ ప్రతిబాలుడును, బాలికయు సెలవుదినమును హాయిగ గడుపవచ్చును. స్నానాదికముల గావించుట కిక్కడ నొకసరస్సు గలదు. అన్నిటికన్న విశేషమేమన ఇక్కడ చిన్నరైలుమార్గమును, చిన్నచిన్న స్టేషనులును కలవు. దీనిలో ప్రయాణమొనర్చుచు బాలబాలిక లెంత ఆమోదప్రమోదములనైనను బొందవచ్చును.

సోవియటుచట్టముకూడ బాలబాలికల కనుకూలముగ చేయబడినది. బిడ్డలపై తండ్రికేకాక తల్లికి సహితము అధికారము గలదు. కాని వారిద్దరును బిడ్డల శ్రేయోభివృద్ధి కనుగుణముగనే తమ యధికారములను వినియోగింపవలెను. ఇందుకు భిన్నముగ జరిగినచో కోర్టువారు జోక్యముకలిగించుకొని వారి యధికారములను తొలగింపవచ్చును. తల్లిదండ్రులు తమఆస్తి ౧౭ సంవత్సరములకు లోబడినట్టి బిడ్డలకు సంక్రమింపగూడదని యేపరిస్థితులలోను "విల్లు" వ్రాయుటకు వీలు లేదు. ౧౭ సంవత్సరముల ప్రాయము దాటిన బిడ్డలకు సంక్రమింపరాదని "విల్లు" వ్రాయబడినప్పుడుమాత్రము ప్రభుత్వము జోక్యముకలిగించుకొనదు. దంపతులు డైవోర్సుగావించుకొనినప్పుడు బిడ్డల పోషణార్థము ఏర్పాటుగావింపవలెను. అట్లు గావింపనిచో వారికి కారాగారవాసశిక్షసహితము విధింపబడవచ్చును. ప్రతిబాలబాలికయు ౧౮ సం. ముల ప్రాయము వచ్చినవెనుక తనయిచ్చవచ్చిన పేరు పెట్టుకొనవచ్చును. తనయిచ్చానుసారమే మతమునుసహితము నిర్ణయించుకొనవచ్చును. అంతవరకు తల్లిదండ్రులే బిడ్డలనామమును, మతమును నిర్ణయింతురు. నిర్ణయములో తల్లిదండ్రులకు భేదాభిప్రాయము కలిగిన కోర్టువారు జోక్యముకలిగించుకొందురు. ఇట్లే మరిపెక్కువిధముల చట్టము బాలబాలికల యధికారములను రక్షించుచుండును.

బాలబాలికలవిషయమై యింతటిశ్రద్ధ మరేదేశమందైనను వైకొనబడుచున్నదా? లేదు; ముమ్మాటికిని లేదు.

---

# భారతము - పరమార్థ ప్రదర్శనము

నండూరి బంగారయ్య

(అనువృత్తము)

## నిర్వికార కృష్ణుఁడు

ఈ ద్వంద్వభావములతో భారతము ముగిసినచో నొక చిక్కున్నది. చరాచరాత్మకమగు ప్రకృతియంతయు నన్యోన్యహింసాప్రవర్తకమయి సుందరోద్యానమువలె నున్న భూమిని కసాయిదుకాణము చేయుచుండఁగా భగవంతుఁ డావ్యాపారము ప్రోత్సహించుచు చూచి యానందించుచున్నాఁడా? ఇది యెక్కడి న్యాయము? అట్లయినచో క్రూరాతిక్రూరులని పేరు వడసిన తైమూర్ లంగు, చేంగీసుఖాను మున్నగు లోకకంటకులకంటె భగవంతుఁడు నిరంకుశుఁడును, క్రూరుఁడునుగాఁ గాన్పించుచున్నాఁడే అని యొక సందేహము గోచరించును.

గుణాత్మకములగు ద్వైతభావములను దాఁట నంతవఱకు భగవంతునిపై నీయపనిందయు తప్పదు; మన మనస్సున ఘోరవిషాదమును తప్పదు. ఎవరిని ఎవరు హింసించుచున్నారు? ఒకరినొకరు హింసించుకొనుచుండఁగా చూచి యానందించుచున్న ఆయింకొకరెవరు? చంపించువాఁడు, చంపువాఁడు, చంపిన చూచి యానందించువాఁడు మువ్వురునొక్కఁడేయైనచో మన కేయిబ్బందియు లేదుకదా! తన్నుతాను తనయిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చునని భగవంతుని కనుజ్ఞయిచ్చుటకు మన కేమియాటంకము?

భారతకవి యిచ్చిన ప్రత్యుత్తర మీమువ్వురు నొక్కఁడే యనుటతో ముగియలేదు. అతఁ డాభావమునుకూడ నతిక్రమించినాఁడు. సత్యదృష్టితోఁ జూచినచో చంపుట, చంపించుట, చంపినఁ జూచి యానందించుట–ఈమూఁడునుకూడ అబద్ధములేయని యాతని యభిప్రాయము. సూర్యుఁడుభూమిచుట్టు తిరుగుచున్నాఁడని జను లనుకొనుచున్నారు. భూమియే సూర్యునిచుట్టు తిరుగుచున్నదని యథార్థమును దర్శింపఁగలిగిన శాస్త్రజ్ఞులు నిర్ణయించుచున్నారు. సరిగా భారతకారుని దృష్టికి మనదృష్టికి నిట్టిభేదమే యున్నది. అతని దివ్యదృష్టిముందు మన కింత నిశ్చలములుగఁ గాన్పించు సమస్తబ్రహ్మాండములు నీటిపై బుడగలవలె నిముసములో మాయమగుచున్నవి. ఇక్కడనే భారతకవియొక్క లోకాతీత బుద్ధిప్రభావ మున్నది. సుఖదుఃఖాది ద్వంద్వస్వరూపమగు జగత్తునెల్లను కన్నులకుగట్టినట్లు చిత్రించినాఁడు. తుదకు దీనినెల్లను ఒక్కతన్నుతో నిర్మూలము చేసి అంతయు మిథ్యయని నవ్వుచు తన యాత్మసామ్రాజ్యమునుండి యొక్కమెట్టయినను దిగకుండ క్షీరసముద్రమున వటపత్రశాయియగు విష్ణుమూర్తివలె విహరించుచున్నాఁడు. సౌమ్యాగ్నేయస్వరూపియగు కృష్ణుని కతీతుఁడై వెలుంగుచున్న నిర్వికారకృష్ణుఁడు అర్జునుని యజ్ఞానమును చూచి నవ్వుచు

"పురుషుఁడు సెడునను వాఁడును
పురుషుఁడు సెరచునని పలుకు పురుషుండును న
య్యిరువురు నవివేకుల య
ప్పురుషుఁడు చెరుపండు చెడఁడు భుజవీర్యనిధీ!

పురుషుఁడన వేరొకండే
పురుషోత్తముఁడైన యేన పురుషోత్తమతా
స్ఫురణకు పురుషత్వంబను
మెరమెరగల దదియకాదె మెయిఁగొను క్రియలన్."

అని తత్త్వోపదేశము చేయుచున్నాఁడు. కార్యకారణస్వరూపమగు ప్రకృతియు, ఆనందమయమగు నిర్వికార పరబ్రహ్మమును వేరుగాఁ గాన్పించుట దర్శనభేదము చేతనేకాని యథార్థస్థితిచే కాదు. భారతము ప్రతిష్ఠించు ఈ సత్యమును మనస్సున నుంచుకొనియే తిక్కన కృత్యాదినిఁగల దైవప్రార్థన పద్యములో సౌమ్యాగ్నేయ స్వరూపులగు శివకేశవుల కభేదము చెప్పుచు ఇరువురకు నతీతమగు పరతత్త్వమును గొల్చుచున్నాఁడు. ఇంతే

. కాక ఆశ్వాసాదిని, ఆశ్వాసాంతమందు నున్న పరస్పర విరుద్ధభావముతోఁ గూడిన ఈశ్వర సంబోధన ములు కూడ ఈయంశమునే సూచించుచున్నవి. "సాత్యకి తేజ వాఙ్మయవిశాల గృహస్ఫురితప్రదీపిక "ను తిక్కన ఈవిధముగ సంబోధించియున్నాఁడు:

మాలిని. నిరుపమగుణరాశీ నిర్గుణత్వప్రకాశీ
భరితభువనకార్యా భవ్యనైష్కర్మ్యధుర్యా
విరతినిరతభార్యా విశ్వలోకైకసేవ్యా
స్ఫురితబహుశరీరా శుద్ధనైరూప్యసారా.

సృష్టికి మహాభారతకవి చెప్పునర్థ మిది: "పరస్పర విరుద్ధస్వరూపముగల యీజగత్తును చూచి ధర్మసమ్మూఢచేతస్కులము గావలసినపని లేదు. ఈవిశ్వము నంతను ప్రశస్తపథమున నడపించు భారమును వహించిన శక్తి యొకటి యున్నది. అది పైకి ఘోరముగకానవచ్చినను సూక్ష్మముగఁ జూచినచో నానందమయము. దానిని సృష్టినుండి విడఁదీసి చూచునంతకాలము మానవునకు మనోవేదన తప్పదు. తత్త్వవేత్త లదియే ఈశరీరిబాహుళ్యమునందంతటను అంతర్యామియైనట్లు చూచుచున్నారు. అంతేకాదు. సమాధిస్థితులకు నిర్గుణమయమగు నద్వైతతేజము తప్ప వేరేదియు కానరాదు." హ్యామ్లెటువహించిన ధర్మసమ్మూఢచేతస్కతతో బయలుదేరి అక్కడనుండి లీలాస్వరూపమువఱకును, లీలాస్వరూపమునుండి నిర్గుణతత్త్వమువఱకును మూఁడు గంతులతోఁ బోయి వామనమూర్తివలె మహాభారతకారుఁడు త్రిభువనాతీతుఁడై వెలుంగుచున్నాఁడు. ఈయద్వైతభావమే భారతమున కంతర్జ్యోతి.

కాని ఈఅద్వైతభావము మాటలలో సిద్ధించునదికాదనికూడ ఆతఁడే విస్పష్టపఱిచినాఁడు. నిష్పాక్షికస్వభావయు, మహాపతివ్రతయు, తపస్వినియు నగు గాంధారికి యుద్ధభూమిని చూచి దుఃఖింపక తప్పినది కాదు. భీష్మునిచే నెంతవేదాంతము విన్నను వియద్గంగావగాహనముతో మానుషభావము నశించువఱకు తన చరిత్రము హింసాకళంకిత మయ్యెనే యనుబాధ ధర్మరాజునకు తప్పినదికాదు. జగద్గురుఁడగు శ్రీకృష్ణునిచే గీతలనువినిన యర్జునునికిఁ బుత్రశోకము తప్పినదికాదు. లోకోత్తరపురుషులగు వీరి సంగతియే యిట్లుండ నింక సామాన్యులమాట వేఱుగ వివరింపవలెనా? ఈకృష్ణలీలను చూచి మొదటినుండియు ఆనందింపఁగలిగినవారు భీష్మాదిరాజర్షులు, వ్యాసాదిబ్రహ్మర్షులు. అట్టివారికి మాత్ర మీయద్వైతభావ మనుసంధానమునకు వచ్చుచున్నది.

ఈసందర్భమునందు మహార్థప్రతిష్ఠాపనమునకును తత్త్వబోధనమునకును గల తారతమ్యమును మనము జాగరూకతతో గమనింపవలయును. అద్వైతతత్త్వబోధనమే ప్రధానాశయ మగునెడల సీతారామాంజనేయమును, పంచదశియును భారతముకంటె ప్రశస్తకావ్యములు కావలసియున్నది. కావ్యదృష్టితోఁ జూచినచో వేదాంతోపన్యాసములు కావ్యమునకు నీరసహేతువులుకాని స్వారస్యము నుద్భవింపఁజేయవు. కేవలము నీతినిగూర్చి, ధర్మములనుగూర్చి, యాధ్యాత్మికవిషయములనుగూర్చి దీర్ఘోపన్యాసములొనర్చు శాంత్యానుశాసనికపర్వములు భారతమునుండి తొలఁగించియుండినచో కావ్యమున కింతకంటె నెక్కుడుపుష్టియు, స్వరూపసౌష్ఠవమును లభించియుండెడివి. అయితే తిక్కన ఒక్కమహోపకారముమాత్ర మొనర్చియున్నాఁడు. కావ్యశాలయమగు విరాటపర్వముమొదలుకొని స్త్రీపర్వమువఱకు నున్న భారతభాగమునమాత్రము వేదాంతఘట్టములను ఒకచో పూర్ణముగ విసర్జించియు, మఱి యొకచో రసానుగుణముగ సంగ్రహించియు కావ్యమునకు పుష్టిఁదెచ్చినాఁడు. భగవద్గీతకు విపులమైన భాషాంతరీకరణ మొనర్పనందులకు తిక్కనను కొందఱు మహాపరాధిగా పరిగణించుచున్నారు. కాని కళాదృష్టిమై కావ్యమున కిది యెంత యుత్తేజము నొనర్చినదో వారు గ్రహింపలేకుండ నున్నారు. నాడులలో రక్తము ప్రవహించినట్లు, శరీరమునఁ బ్రాణవాయువు సంచరించునట్లుమహార్థమనునది కావ్యరసముతో లీనమై దానికి పుష్టి, దార్ఢ్యము, తేజము కలిగింపవలెను. దేహికి ప్రాణప్రతిష్ఠ యొనర్చుట యెంతకష్టసాధ్యమో కావ్యమున మహార్థప్రతిపాదన మొనర్చుటయు నంత కష్టసాధ్యమే.

ఎక్కడనో యున్న వేదాంతార్థమును గైకొనివచ్చి కథతో నతుకు పెట్టినచో నట్టికావ్యము allegory వలె నిర్జీవమగును. ప్రబోధచంద్రోదయనాటకమును దిలకించినచో మన కీవిషయము తేటతెల్లమగును. భరతవీరుల చరిత్రమున సహజముగ నంతర్వ్యాప్తమైయున్న మహార్థమును కవి తన యోగచక్షువుచే సందర్శించి మనకు ప్రదర్శించుచున్నాడే కాని యోగశాస్త్రములనుండి వేదాంతమును కావ్యములోనికి దిగుమతిచేయుట లేదు. ఈసత్య మాతని కనుభవసిద్ధమగుటచే సజీవమై యలరారుచున్నది.

మఱియు భారత మద్వైతసత్యమును ప్రతిష్ఠాపనమొనర్చుచున్న దనఁగానే ఇది ద్వైతమతమునకు, విశిష్టాద్వైతమతమునకు వ్యతిరేకభావమును పూనియున్నదని యూహింపరాదు. ఈవ్యాసమునందలి యద్వైతసత్యమునకును ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతములకును ఎట్టి సంబంధమును లేదు. త్రిమతములును వేదములపైనను, పురాణములపైనను ఆధారపడియున్నవి. త్రిమతములకు భారతాదీతిహాసములయందును, పురాణములందును స్థానమేర్పడుచున్నది. వివేకానందస్వామి, శ్రీరామకృష్ణ పరమహంస చెప్పినట్లుగ ఈత్రిమతములును ఒకదానికొకటి సాహాయ్య మొనర్చుకొనుచున్నవికాని ప్రజాసామాన్య మెంచుచున్నట్లుగ వానికి పరస్పరవైషమ్య మెద్దియును లేదు. కాని హిందూదేశము ప్రపంచమునకుఁ బెట్టిన భిక్షయేమియనుప్రశ్న వచ్చినచో "ఏకమ్ సత్, విప్రా బహుధా వదంతి." (ఉన్నదొక్కటే, పండితులు దానినే పలువిధములఁ బేర్కొనుచున్నారు) అనుసత్యమును బోధించుటయే. దీనినే యీవ్యాస మద్వైతసత్యమని పేర్కొనుచున్నది. పైని పేర్కొనఁబడిన యుక్కు త్రిమతములకును సమ్మతమగుటయేకాక ఆరాధ్యముకూడ నగుచున్నది.

అనవరతప్రత్యక్షమును, నతిపురాతనమును నగు నీయద్వైతసత్యమును చిత్రించుటకు భారతకారుఁ డొక యద్భుతమును (miracle) సాధించినాఁడు. నాటకీయము (Dramatic art), పౌరాణికము (epic art) అని కళాకౌశల్యము ద్వివిధము. తమపుస్తకమున కొకరు నాటకమని పేరుపెట్టుకొన్నను అది తత్త్వమునుబట్టి పురాణమే కావచ్చును. గ్రంథమునకు పురాణమేయని పేరుపెట్టుకొన్నను కళాకౌశల్యమునుబట్టి అది నాటకమే కావచ్చును. నాటకీయకళ తలపెట్టునది ప్రత్యక్షప్రదర్శనము. పౌరాణికకళ తలపెట్టునది పరోక్షకథనము. నాటకీయకళకు గమ్యస్థానము చదువరిని తన్మయుని కావించుట. పౌరాణికకళ కాదర్శము అద్భుతభావసంచరణ మొనర్చుట. పింగళిసూరన నాటకములు వ్రాయకపోయినను ఆతని కళాకౌశల్యము నాటకీయము. వర్ణితవిషయములెదుట ప్రత్యక్షమగుచుండును. సంభాషణలమూలముగ కథ పెరుగుచుండును. నన్నయభట్టుకళాకౌశల్యము పౌరాణికము. దుష్యంతుఁడు, శకుంతల, నలుఁడు, దమయంతి మున్నగు వీరులయొక్కయు, వీరవనితలయొక్కయు చరిత్రముల పరోక్షకథనమున వర్ణించి వస్తువునందు మన కతిపవిత్రమగు గౌరవము కలుగఁజేయుటలో నీమహాకవి యద్వితీయుఁడు. తిక్కనభారతమం దీరెండు కళలును సమ్మేళన మొందియున్నవి. ఇది కళాప్రపంచమున నపూర్వము; అద్భుతావహము. విరాటోద్యోగపర్వములందు నాటకకళ ప్రధానము. పౌరాణికకళ అంతర్వాహినియై ప్రవహించుచున్నది. యుద్ధపంచకమున పౌరాణికకళ ప్రధానము. నాటకకళ అంతర్వాహినియై ప్రవహించుచున్నది.

సూర్యమండలము మేఘములచే పిహితమైనట్లు అలంకారబాహుళ్యమున మహార్థము సంఛన్నమగును. అందువలన విరాటపర్వములో పూర్వజన్మవాసనవలె కొలఁదిగ నలంకారవిన్యాసము గానవచ్చినను ఉద్యోగాదులనుండి నిరలంకారమును, నిరాడంబరమును అగు శైలి యుపయోగింపఁబడినది. ఇది మహార్థప్రతిపాదనమున కెంతయు సహకారి.

మఱియు తిక్కనకడ నిగ్రహమను నొక గొప్ప గుణ మున్నది. ఈగుణముకూడ మహార్థ ప్రదర్శనమునకు మిక్కిలి తోడ్పడుచున్నది. నిగ్రహమననేమో, అది

మహార్థప్రకటనమున కెట్లు తోడ్పడుచున్నదో యించుక వివరించుట యావశ్యకము. తిక్కన రసాతీతుఁడుగాని రసలోలుఁడుకాఁడు. ఏఘట్టమునుగాని, ఏసన్నివేశమును గాని అతఁ డతిగా వర్ణించుటఁ గానము. ఒక్క రేఖ చేతనే ఎంతో సౌందర్యమును స్ఫురింపఁజేయఁగల చిత్రకారునివలె ఒక్కొక్కమాటచేతనే వర్ణితవిషయమును ప్రత్యక్షము నేయఁగల శక్తి తిక్కనకడ నున్నది. తక్కిన కవులు పదిపద్యములు, పదునైదుపద్యములు చెప్పి వర్ణించువిషయమును తిక్కన ఒక్కపద్యములోనో, ఒక్క పద్యపాదములోనో వర్ణింపఁగలఁడు. తనకెంతో యభిమానాస్పదములు కాఁదగిన శ్రీకృష్ణుని కౌరవ సభాప్రవేశము మున్నగు ఘట్టములందుఁగూడ కవి యీ నిగ్రహమును జూపించినాఁడు. ఇందుల కొకటి రెం డుదాహరణములు. ధర్మరాజు శ్రీకృష్ణుని రాయబారమునిమిత్తము కౌరవసభకుఁ బొమ్మని ప్రార్థించు సందర్భమున,

> "ఆపద గడవం బెట్టఁగ
> నోపి శుభం బైనదాని నొడఁగూర్పఁగ మా
> కీపుట్టువునకు పాండు
> క్ష్మాపాలుఁడు నిన్ను జూపి చనియె మహాత్మా!
>
> *   *   *   *   *
>
> వ. నీవు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడి వారము" అని వచించినాఁడు.

ఈపద్యమున నెన్నెన్ని యుత్కృష్టభావము లిమిడియున్నవి. మఱియొకకవి యైనచో ఇక్కడ శ్రీకృష్ణుని పదియవతారములకు ప్రసక్తి లేకుండ విడిచిపెట్టఁడు. ఈపద్యముతో యుధిష్ఠిరకృష్ణులు మనయెదుట నిలువఁబడినారు. ధర్మరాజు కృష్ణుని గడ్డముపట్టుకొని యీపద్యమును జెప్పుచున్నాఁడు. కృష్ణుఁడు మందహాస మొనర్చుచున్నాఁడు. శ్రీకృష్ణుని చారిత్రమును, మాహాత్మ్యమును దలఁచినకొలంది ఆతనిపై తానొక పెద్దఱికము వహించి యాతని నొక కార్యముచేసికొనిరావలసినదని యాజ్ఞాపించుటా యను ననౌచిత్యము ధర్మరాజునకు పొడకట్టుచున్నది. కాని ప్రస్తుతము లోకధర్మమునుబట్టి చూడఁగా వయసునకుఁ దా నాతనికంటెఁ బెద్దవాఁడు. ఆతఁడుతప్ప ఈ కార్యమును నిర్వహించుకొనిరాఁదగిన సమర్థుఁడు వేఱొకఁడు లేఁడు. అందుచే వినయము, భక్తి, అనురాగము, అనునయము, చనవు మున్నగు భావములెన్నో ముప్పిరిగొనియున్న యీవాక్యములను కవి ధర్మరాజుచేఁ జెప్పించినాఁడు. ఇట్లే రాయబారసందర్భమున శ్రీకృష్ణుని కౌరవ సభాప్రవేశమును వర్ణించుచు,

> "ఎదురువచ్చిన విదురుని యిచ్చకరముఁ,
> దమ్మ చేయును రెండు హస్తములఁ బట్టి
> నడచె ముందట గదియు సందడి గడంగి
> కర్ణదుర్యోధనులు దొలఁగంగ జడియ.
>
> వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁగల యభ్యంతరులైన బలుమానుసులు పొదివికొనిపోవఁ... తేజోరాశియగు రాజీవాక్షుండు...."

ఇక్కడ కవి సభాసదుల నొకటిరెండు పద్యములలో వర్ణించి పరిసరవర్ణనము(atmosphere)ను బట్టి ప్రధానవస్తువును జిత్రించినాఁడు. శ్రీకృష్ణుని ప్రవేశమైనంతనే సభాసదు లాతనియెడఁ జూపిన భయభక్తివినయసంభ్రమములనుబట్టి యాతని మాహాత్మ్యము మనకుఁ బ్రత్యక్షమగుచున్నది. కృష్ణుఁడు సభలో నడుగుపెట్టినంతనే విదురుఁ డెదురువచ్చి చేయూఁత నిచ్చినాఁడఁట! దుర్యోధనాదులకు లోలోపల తాము రారాజులమని యెంతగర్వమున్నను "తేజోరాశియగు రాజీవాక్షుని" చేయిపట్టుకొనుటకు తగినంతశక్తి వారికి లేకపోయినది. చోపుదార్లవలె మూఁగుచున్న జనసమూహము నొత్తిగించి దారిచేయుచున్నారు. ఇక్కడ నితరకవులు కృష్ణుని ప్రతియవయవమునకు ఒక్కొక్కపద్యము చొప్పున వ్రాసియున్నను మొత్తముమీఁద నింతరససంచారము గలిగింపలేరు. తుద కొక్క సీసపద్యమైన నిక్కడ వ్రాయక "తేజోరాశియగు రాజీవాక్షుండు" అను నొక్కమాటతో కవిసంతుష్టిపడుచున్నాఁడు! ఉదాహరణము లీయ మొదలిడినచో నిట్టి వసంఖ్యాకములుగ నున్నవి. ప్రకృతవిషయమున కివి చాలును. ఇట్టి నిగ్రహమువలన కావ్యమునకు సిద్ధించిన గుణము

ధ్వని. భారతము చదివినకొలఁది చవులూరుట కిదియే కారణము. ధ్వని ప్రధానముగా మహార్థమును ప్రతి పాదించుటవలన కవిబ్రహ్మ మహార్థముతో చదు వరులను దోబూచులాడించుచున్నాఁడు. మేలిముసుఁగు మఱుంగున నున్న ముద్దుమొగమువలె ఈనిగ్రహగుణము వలన తిలకించినకొలఁది కావ్యార్థము నూతనరామణీ యకముతో నలరారుచుండును.

మహాకావ్యమునకు సంగీతము (melody) కూడ ఒక ప్రధానాంగము. శాస్త్రసంగీతము (Technical music) నకును కావ్యసంగీతమునకు (Poetic melody) ను భేద మున్నది. ఈసంగీతమాధుర్యము కొన్నికొన్ని శబ్దముల సమ్మేళనమున నుప్పతిల్లుచున్నది. తనకావ్యార్థ ప్రతిపాదనమునకు తగిన సంగీతమును తిక్కన యల వఱచుకొన్నాఁడు. భారత మేర్పఱచుకొనిన సమయము నుబట్టి ఏతన్మహార్థమును ప్రతిపాదించుటకు ప్రసన్నతయే ప్రధానమగు సంగీత మొక్కటే చాలదు. చంద్రజ్యోత్స్నను సూర్యతేజముతో మేళగించినట్లు ప్రసన్నతా గుణమును తేజోగుణముతో మేళగింపవలెను. అందుచేత తన కవిత్వమున వచనమున నుండవలసిన స్వాతంత్ర్య మును, పద్యముల నుండఁదగిన స్వారస్యమును ఏకీభ వింపఁజేసినాఁడు భారతపద్యము లెక్కడఁజూచినను యతులకొఱకుఁగాని, ప్రాసములకొఱకుఁగాని ఆఁగక అఖండముగఁ బ్రవహించుచున్నవి. యతులును, ప్రాస ములును వినయముతో చేతులుజోడించుకొని వచ్చి వానిస్థానమున నవి నిలువఁబడవలసినదేకాని వానికి వేరే యాహ్వానము లేదు. భారతమును వ్రాయుటకుపూర్వము తిక్కన వేదమునందలి స్వరమాధుర్యమును బాగుగ నను సంధించియుండును. ఒక యాశ్వాసాంతపద్యమున "వీణా నావప్రతిమ నిగమావిర్భవత్సారపుణ్యశ్రేణీ సంపాదిత" (శ్రీపర్వము. ద్వి. ఆ. ౧౬౮) యని హరిహరనాథుని సంబోధించియున్నాఁడు. సరిగా ఇట్టిసంగీతమునే తన కావ్యమునఁగూడ అలవఱుచుకొనుటకై తిక్కన ప్రయ త్నించి కృతార్థుఁడైనాఁడు. భారతసంగీతము వేణు నాదమువలె సర్వజన సమ్మోహనకరము కాకపోయి నను రసాస్వాదనాచణమగు కర్ణమునకుమాత్రము దానిని తరచినకొలఁది ఆనంద ముప్పతిల్లుచుండును. సహజముగ తేనెలూరు తెనుఁగుభాషకు తన యఖండప్రజ్ఞచే నూత్నవైభవమును గల్పించిన తిక్కన మనపాలిటి భాగ్యదేవత. ప్రబంధపరమేశ్వరుఁడని పేరుగాంచిన ఎఱ్ఱాప్రెగ్గడ ఆతని నీవిధముగ స్తుతించియున్నాఁడు:

> తనకావించిన సృష్టి తక్కొరులచే
> తంగాదు నా నేముఖం
> బున తాఁబల్కిన పల్కు లాగమములై
> పొల్పొందునా, వాణి న
> త్తనునీతం డొకరుండనాఁజనుమహ
> త్వాప్తిం "గవిబ్రహ్మ" నా
> వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలో
> ర్వీదేవతాభ్యర్చితున్.

---

దిద్దుపాటు:

మొన్నటి భారతిలో నేను వ్రాసిన 'వేణీసంహారము-ద్రౌపది' అను వ్యాసములో మొదటి పేరాలో వీర రౌద్రములనుటకు వీరకరుణములను పొరపాటు పడినది. పాఠకులు దిద్దుకొన గోరెదను. —క. కృ.



౫. నవాబు ఆలీ నవాజుజంగు బహద్దరుగారు

ఈ తటాకమునకు ప్లానువేసిన ముఖ్య-ఇంజనీయరు. నైజామురాష్ట్రములోని మంజ్రానది కడ్డముగా ఈ తటాకమును నిర్మించిరి. దీని వైశాల్యము 60 చదరపుమైళ్లు. ఇది సుమారు 29,700,000,000 ఘనపుటడుగులనీటిని నిలువచేయును. దీని పారుదలక్రింద సుమారు 1,75,000 ఎకరములభూమి సాగుబడి యగును. దీని నిర్మాణమునకు 4½ కోట్ల రూపాయలు వెచ్చించిరి. ఇరువదివేల పనివాండ్రు సమముగ పనిచేసిరి.

# భారతీయవిద్యాచరిత్రము

(అనువృత్తము)

మా రేమండ రామారావు, బి. ఏ., (ఆనర్సు) బి. ఇడీ.,

## ఆరవ అధ్యాయము

[ఆధారములు

Mahmood—History of English Education in India.

Mayhew—The Education of India.

Satyanadhan—History of Education in the Madras Presidency.

Trevelyan—Education of the people of India.

Bureau of Education, India—Selections from Educational Records, 2Pts.

Report of the Calcutta university Commission quinquennial reports on Indian Education Report of the Indian Education Commission, 1883.]

### బ్రిటిష్ పరిపాలనము

క్రీ. శ. ౧౭౦౭ లో ఔరంగజేబుమరణమువరకును గల విద్యాచరిత్రమును వెనుకటిప్రకరణములో వర్ణించియుంటిమి. అప్పటినుండి క్రీ. శ. ౧౮౧౩ వరకును భారతదేశచరిత్రము వివిధపరివర్తనముల నందినది. ఈకాలమున ఢిల్లీ సింహాసనము నధిష్ఠించిన మొగలు చక్రవర్తు లందరును దుర్బలులును, నప్రయోజకులును నగుటచే నరాజకము చెలరేగె. నూతనరాజవంశములు బయల్వెడలినవి. పంజాబులో సిక్కులును, డక్కనులో మహారాష్ట్రులును విజృంభించిరి. దక్షిణమున మైసూరు, నైజాంరాజ్యములు బయల్వెడలినవి. మహారాష్ట్రు లుత్తరదక్షిణముల ననేకవిజయముల నంది యేకచ్ఛత్రాధిపత్యమును వహింపనున్న కాలమున బశ్చిమము నుండి అహమ్మద్‌షా దురానీ భారతదేశముపై దండెత్తి వచ్చెను. ౧౭౬౧లో పానిపట్టువద్ద నొకగొప్ప యుద్ధము జరగి యందు మహారాష్ట్రులోడిపోయిరి. అనతికాలమునకే దురానీ స్వదేశమునకు మరలెను. అప్పుడు భారతదేశము దిక్కులేనిదివాణమువలె నుండెను. ఈక్లిష్టసమయమున వర్తకులుగ నీదేశమున బ్రవేశించి క్రమక్రమముగ రాజకీయముల జోక్యము గల్గించుకొనుచుండిన యాంగ్లేయులు విజృంభించిరి.

క్రీ. శ. ౧౫-వ శతాబ్దిలోనే పాశ్చాత్యులీదేశమున కేతెంచిరి. మొగలుచక్రవర్తులకాలమున వారు వివిధభాగములలో వసతుల నేర్పరచుకొని ప్రబలుచుండిరి. పోర్చుగల్, హాలండు, ఫ్రాంసు, ఇంగ్లండు మున్నగుదేశములనుండి యిటకువచ్చిన యీ విదేశీయులు తరచుగా దమలోతాము పోరాడుచుండిరి. ౧౭-వ శతాబ్దమున నింగ్లీషువారును, ఫ్రెంచివారును బ్రతిపక్షులుగ నుండిరి. వర్తకసంబంధములగు తాత్కాలికకారణములనుబట్టియు, మాతృదేశములలో జరుగుచుండిన పోరాటములనుబట్టియు, నీదేశమునగూడ నీయిర్వురకును యుద్ధములు జరగుచుండినవి. ఇంతియకాక ఈపాశ్చాత్యులు దేశీయపాలకుల వ్యవహారములలో గల్పించుకొని తన్మూలమున గొంతలాభమును బొందుచుండిరి. ౧౭౬౧ నాటికి బెంగాలులోను, దక్షిణమునను గూడ నాంగ్లేయులు ఫ్రెంచివారి నణగద్రొక్కిరి. ౧౭౬౩ లో జరగిన బక్సరుయుద్ధములో విజయమునందుటతోడనే వారును భారతదేశరాజకీయాధికారమునకు ముఖ్యప్రత్యర్థులుగ నిలచిరి. అనతికాలమునకే వీరిపరిపాలనలోనుండినభాగములకొరకై యొక ప్రత్యేకపరిపాలనావిధాన (Regulating Act) మేర్పరుపబడినది. ౧౮౦౦ నాటికి దక్షిణమున

మహారాష్ట్రులు, నుత్తరమున సిక్కులునుదప్ప నాంగ్లే యులకు శత్రువు లెవరును లేకుండిరి. మొదట వీ రీదేశ మున వర్తకముజేసికొనుటకై వారియేలికవద్దనుండి యొకయాజ్ఞాపత్రమును బడసి East India Company అనుపేర నొకవర్తకసంఘముగ నీదేశ మున కేతెంచిరి. అప్పుడప్పు డీపత్రము సంస్కరింప బడుచుండినది, ౧౮-వ శతాబ్దమున నాంగ్లేయుల రాజ కీయాధికారము వృద్ధిజెందినప్పటినుండియు మాతృ దేశమునుండి యొకగవర్నరుజనరలు బంపబడుచుండెను. ౧౮౧౮ నాటికి మైసూరురాజ్యమును, మహారాష్ట్రు లునుగూడ నాంగ్లేయులకు లొంగుటయు, కంపెనీ వారు బలాత్కారముగ గొన్నిరాజ్యముల నాక్ర మించుటయు జరిగినవి. ఇంతటితో వీరు భారతభూమి కేలికలైరి. ఇటనుండి ౧౮౫౭ వరకును కంపెనీవారి యభ్యుదయ మప్రతిహతముగ నడచినది. ఆ సంవత్సర మున "సిపాయిలవిద్రోహ" మని ప్రఖ్యాతిగాంచిన మహావిప్లవము బయల్వెడలి దేశమునందెల్లెడల నల్లకల్లో లము గావించినది. తుదకు కంపెనీవారు దీనిలో జయమునందినను, ఆంగ్లదేశప్రభుత్వమువారు భారత దేశప్రభుత్వము కంపెనీవారికి తలకుమించినపనియని నిశ్చ యించి, దానిని దామే నిర్వహింపసమకట్టిరి. విక్టో రియామహారాజ్ఞిప్రకటనతో ౧౮౫౮-వ సంవత్సరమున భారతదేశమునం దాంగ్లరాజుల పరిపాలన మారంభ మయ్యెను.

(౧) ౧౮౩౩ వరకు — కంపెనీవారి పరిపాలన కాలమున విద్యావ్యాపనమునకై చేయబడిన మొదటి ప్రయత్నములలో మతప్రచారము చేయుఉద్దేశ్యము కన్పించుచున్నది. వీరికి ముందుగనే యిచటికిజేరిన క్రైస్తవమతస్థులు దేశీయులు కొందరికి రోమనుకాథ లిక్దీక్ష నొసంగిరి. వీరిని, మరియితరులను స్వీయమగు ప్రొటెస్టంటుమతమునకు మార్చుటయే కంపెనీవారి ప్రథమోద్దేశ్యము. ౧౬౭౩ లో మదరాసులోని సెంటు జార్జికోటయందలి బాలబాలికల విద్యాభ్యాసమునకై లూయిస్ అనునతడు రెండుపాఠశాలలను స్థాపించెను. బెల్ అనునతడు ఎగ్మూరులో నింకొకవిద్యాశాలను నెల కొల్పెను. త్వరలోనే క్రైస్తవమతప్రచారకులయాజ మాన్యమున కడలూరు, తిరుచునాపల్లి, తంజావూరులలో బాలశాలలు బయల్వెడలినవి. అప్పటియధికారులకు దేశీయు లాంగ్లవిద్యను నేర్చినచో తెలివిమీరి తమయధి కారమును ధిక్కరింతురనుభయముగూడ నుండినది.

కొంతకాలమునకుబిమ్మట ననగా ౧౮-వ శతా బ్దాంత్యభాగమునకు డమవ్యవహారములను నిర్వహింపగల దేశీయు లవసరమైరి. అప్పుడు వారు విధిలేక ౧౭౮౧ లో కలకత్తాలోను ౧౭౯౧ లో కాశీలోను, ౧౮౨౧ లో పూనాలోను విద్యాశాలలను నిర్మించి, వానికై యొకలక్షరూపాయలను వ్యయపరచుటకై నిశ్చయించిరి.

ఈకాలమున మహనీయులుకొందరు విద్యావిష యమున గృషిచేసిరి. అట్టివారిలో సుప్రసిద్ధదేశభక్తుడగు రాజారామమోహనరాయ లగ్రగణ్యుడు. ఈస్ట్ అను నాంగ్లేయుని తోడ్పాటుతో నాయన వంగదేశమున ౧౮౧౭ లో Central Hindu College ని స్థాపింప జేసెను. ౧౮౪౦ ప్రాంతమున మదరాసులో పచ్చ యప్పపాఠశాలలు నెలకొల్పబడినవి.

(౨) ౧౮౩౩-౫౩ — ౧౮౩౫ లో కంపెనీవారి కొసం గబడినకొత్తయాజ్ఞాపత్రమున, భారతీయవిద్యాభివృద్ధికై పదిలక్షలరూపాయలనువినియోగింపవలసినదనిశాసింపబడి నది. అంతట దేశీయులకు నేర్పవలసినవిద్య యెట్టిదిగ నుండవలె ననుసమస్య యేర్పడి, వాదోపవాదములు బయల్వెడలినవి. ఇందు దేశీయుల కాంగ్లవిద్యను నేర్ప వలెనా, దేశీయవిద్యను నేర్పవలెనా? అట్టివిద్య యాంగ్ల భాషలో బోధింపబడవలెనా, లేక దేశభాషలలోనా? దేశభాషలకు ప్రభుత్వము ప్రోత్సాహ మొసంగవలెనా? అనునవి ముఖ్యాంశములు. ఈవిషయమునుచర్చ సుమారు పండ్రెండుసంవత్సరములకాలము జరగి తుదకు ౧౮౫౪ లో ముగిసినది. ఈచర్చలలో బాల్గొనినవారిని రెండు తెగలుగ విభజింపవచ్చును.—(౧) ప్రాచ్యవిద్యావా దులు, (౨) పాశ్చాత్యవిద్యావాదులు.

ప్రాచ్యవిద్యావాదులలో హెచ్. హెచ్. విల్సన్ అనునతడు ప్రముఖుడు. "ఆంగ్లభాషావాదులకు

దేశీయులకుగల యవసరానవసరములు దెలియవు. వారి నిత్యకృత్యములలో నాంగ్ల భాష యనవసరము. వారికి గావలసినవి దేశభాషలు, న్యాయశాస్త్రము, వ్యవహారము మాత్రమే. ఇట్టివారి కాంగ్లభాషను నేర్పినచో పాశ్చాత్యవిద్వాంసులకు క్రొత్తవర్ణ మొకటి యేర్పడును. వీరి కితరదేశీయులయెడ సానుభూతి యుండజాలదు. అదియునుగాక ప్రజాసామాన్యమున కీవిద్య దుర్లభమగును. ఏజాతికైనను స్వభాషలోదప్ప నితర భాషలలో విద్య నేర్పుటకు వీలుపడదు.” అనునవి యాతని ముఖ్యాభిప్రాయములు.

పాశ్చాత్యవిద్యావాదులు పలువు రుండిరి. వారిలో కొలదిమందిమాత్రము దేశీయులపురోభివృద్ధికై యావిద్య గావలె ననిరి. ఇతరులు స్వార్థమును బురస్కరించుకొని యటులు వాదించిరి. ఈయిరుతెగలవారి యభిప్రాయములు నిట్లుండినవి:

“యువకులను దమజీవితమునం దమూల్యమగు పండ్రెండుసంవత్సరముల కాలమును సంస్కృత వ్యాకరణ సాహిత్యములను జదువుచు, వ్యర్థపరచుడనుటవలన బ్రయోజనము లేదు. పాలితుల యభివృద్ధియే ప్రభుత్వాదర్శము. అందువలన గణితము, వేదాంతము, రసాయనశాస్త్రము మున్నగు వివిధవిషయములు దేశీయులకు నేర్పబడవలెను. ఇది యాంగ్లవిద్యమూలముననే సాధ్యమగును.”—రాజారామమోహనరాయలు.

“విజ్ఞానమును విరజిమ్ముట మనధర్మము. దానిఫలితముతో మనకు సంబంధములేదు. పాలితులసౌఖ్యమభివృద్ధిపరచిననే మనము పరిపాలనమున కర్హులము. భావికాలమున నేమో యాపదగల్గునని నేడు విద్యను నిరాకరించుటచే మన కపకీర్తి రాగలదు”—అని బెంటింకునకుపిమ్మట ౧౮౩౫ లో గవర్నరుజనరలుగ నుండిన సర్. చార్లెస్ మెట్కాఫ్ అభిప్రాయము. రెండవతెగవారు భారతదేశమునం దాంగ్లేయులపాలనము స్థిరీకరించునుద్దేశ్యముతో నాంగ్లవిద్యను బ్రతిపాదించిరి. సర్. చార్లెస్ ట్రెవరియన్ అనునతడు “మహమ్మదీయులు ప్రపంచమంతయు తమస్వామ్యమనియు, నితరమతస్థుల కందు తావు లేదనియు నమ్ముదురు. హిందువు లితరులను మ్లేచ్ఛులుగ బరిగణించి, వారికి బరిపాలనార్హత లేదని తలంతురు. అకేటికు సంస్కృతవాఙ్మయముల జదువుటచే గల్గునభిప్రాయము లిట్టివే. కాన వీనిని వదలి యాంగ్లసంపర్కాభ్యుదయములకు దోడ్పడు నాంగ్లవిద్యనే దేశీయులకు నేర్పవలె” నని వాదించెను. సుప్రసిద్ధాంగ్లపండితుడగు మెకాలే యాకాలమున గవర్నరుజనరలునాలోచనాసంఘమున సభ్యుడుగానుండి యాంగ్లవిద్యావాదమున కెక్కుడు ప్రోద్బల మొసగెను. అప్పటిగవర్నరుజనరలగు బెంటింకు ప్రభువు కేవలమును రాజకీయోద్దేశ్యములతోడనే యీ వాదమును ప్రోత్సహించెను. ఆంగ్లవిద్యను నేర్పినచో దేశీయులు వేషభాషలయందును, ప్రవర్తనయందును, నాదర్శములందునుగూడ నాంగ్లేయులనే యనుకరింతురనియు, దన్మూలమున వారిజాతీయభావములు నూతనమార్గములను బట్టగలవనియు నీతడు దలంచెను.

పైచర్చనుండి, యాంగ్లవిద్య కావలెననినవారిలో పెక్కుమంది స్వార్థమును రక్షించుకొనుటకును, దేశీయులు దమపూర్వపుఔన్నత్యమును దలంచుకొని తత్ప్రతిష్ఠాపనార్థమై తిరిగి ప్రయత్నముచేసి, యాంగ్లపాలనమున కుపద్రవము గలుగజేయకుండునటు లొనర్చుటకునై యట్లు వాదించిరని స్పష్టమగుచున్నది. ఈయాశయములే బ్రిటిష్‌పరిపాలన కాలమునందలి విద్యాచరిత్రమునకు మూలాధారములు.

(3) వుడ్ ప్రణాళిక (Wood's Dispatch)

౧౮౫౪:—పైవిద్యావిషయకమగుచర్చ ౧౮౫౩ నాటికి ముగిసినది. మరుసటిసంవత్సరమున వుడ్ అనునతడు గవర్నరుజనరలున కొకవిద్యాప్రణాళికను బంపెను. అందు దేశీయులకాంగ్లభాషను, ఆంగ్లవిద్యను గరపుట యత్యావసరమనియు, దన్మూలమున గాలక్రమమున ప్రభుత్వమున కెక్కుడులాభము గలుగుననియు, బ్రజాసామాన్యవిద్యకై యొకప్రత్యేకవిద్యాశాఖను నిర్మింపవలెననియు, ఉన్నతవిద్యకై కళాశాలలను స్థాపింపవలెననియు,

ప్రత్యేకపాఠశాలలకు (Private Schools) ద్రవ్యసాహాయ్యము చేయవలెననియు ఆవుడ్ ప్రణాళికలో వివరింపబడియుండెను. వృత్తివిద్యనుగూర్చియు, పరిశ్రమలనుగూర్చియు, స్త్రీవిద్యనుగూర్చియు నిందే ప్రశంసయు జేయబడియుండలేదు. కంపెనీవారిపరిపాలనమునకు గావలసినకార్యములను నిర్వర్తింపగల యాంగ్లవాసనగల దేశీయలేఖకులను తయారుచేయుటయే పై ప్రణాళికకు బరమావధి. దీనికిఫలితముగ బొంబాయి, కలకత్తా, మదరాసు, అలహాబాదు, లాహోరులలో విశ్వవిద్యాలయములు నెలకొల్పబడినవి. వీనికి గళాశాలలను నెలకొల్పి యందలి విద్యావిధానమును సరిచూచుబాధ్యత యొసంగబడినది.

(౪) ౧౮౫౪-౧౮౮౨:—౧౮౫౪ నుండియు వుడ్ ప్రణాళికయందలి సూచనలన్నియు నాచరణలోనికి వచ్చినవి. ఉన్నతవిద్యను నేర్చినవారలు తమంతటదామే యితరులకు విద్య నేర్పుదురనునభిప్రాయముతో ప్రభుత్వధనమంతయు రాజకీయవిద్యాలయములకొరకే వెచ్చింపబడుచుండినది. రాజకీయోద్యోగముల కాంగ్లభాషాజ్ఞానమవసరమగుటయు, విశ్వవిద్యాలయపట్టముల నందు కుతూహలము హెచ్చుటయు గారణములుగా ప్రత్యేకపాఠశాలలసంఖ్య హెచ్చినది. ౧౮౭౧ నుండియు ప్రభుత్వాదాయము తగ్గి వారిసాహాయ్యము ప్రాథమికవిద్యకే వినియోగింపబడుచుండినది. సహాయనిరాళములు (Grants-in-aid) బిగింపబడినవి. అయినను బాఠశాలలలో బ్రవేశింపగోరువారిసంఖ్య దరుగకుండుటచే వానికి లోటు గలుగలేదు. అధికసంఖ్యాకులకు స్థాన మిచ్చి తమయార్థికస్థితి నభివృద్ధిచేసికొని యీపాఠశాలానిర్వాహకులు ప్రభుత్వనిరాళమును లక్ష్యముచేయక, పట్టపరీక్షలపైననే తమదృష్టిని గేంద్రీకరించి విద్యార్థులను తయారుచేయుచుండిరి.

విశ్వవిద్యాలయములు స్థాపింపబడినమాత్రమున గళాశాలల వైదుష్యమునం దెట్టిమార్పును గలుగలేదు. విశ్వవిద్యాలయసంఘములలో (Senate) రాజకీయవేత్తలు మున్నగునుపాధ్యాయేతరు లెక్కువగ నుండిరి. అందుచే విద్యావిషయములన్నియు జడీకృతములయినవి. కళాశాలలకు సోపానములగు నున్నతవిద్యాలయములును బైయవస్థనే యనుభవించుచుండినవి. వీనిపై నపుడిర్వురుయజమాను లధికారమునేయుచుండిరి. పరీక్షలవిషయమున విశ్వవిద్యాలయములును, ద్రవ్యవిషయముల బ్రభుత్వవిద్యాశాఖయు బాఠశాలాధికారులపై దరచుగా దండెత్తుచుండినవి. రాజాదరణ మక్కరలేనివారు విశ్వవిద్యాలయనియమములను, విద్యాశాఖానియమములనుగూడ లక్ష్యముసేయకుండిరి.

(౫) హంటరువిద్యాసంఘము, ౧౮౮౨:—ఇట్టి విద్యావిధానమును సంస్కరించుమార్గముల నేర్పరచుటకై ప్రభుత్వమువారీసంఘమును నియమించిరి. ఇం దిరువదియొక్కరు సభ్యు లుండిరి. వీరికి గొన్ని సూచనలు చేయబడినవి. ఇది వానిసారాంశము: (౧) ప్రాథమికవిద్య ప్రజాసామాన్యమున కుపయోగించునదిగావున దానికే ప్రాముఖ్యమొసంగబడవలెను. (౨) పాఠశాలలకు స్థానికసంఘములు గొంతవరకును సాయము చేయవలెను. (౩) శ్రీమంతులు బీదవిద్యార్థుల కుచితవేతనముల నీయవలెను. (౪) దేశీయవిద్యాలయముల నభివృద్ధిపరచవలెను. (౫) పాఠశాలాపరీక్షావిధానమునందలి లోటుపాటులు చక్కపడవలెను. (౬) విశ్వవిద్యాలయములతో నీసంఘములకు సంబంధము లేదు.

ఇట్టిసూచనలను గైకొని ౧౮౮౩ వ్యక్తులను, సంఘములను బరిశీలించి హంటరుసంఘమువారు కొన్నితీర్మానములను గావించిరి:

(౧) పండితులతోడను, మౌల్వీలతోడను సంప్రతించి ప్రభుత్వమువారు దేశీయవిద్యాలయములకు సాయపడవలెను. ఇందలి యుపాధ్యాయులు శిక్షణమునందుట (Training) మంచిది. వీనిపోషణమును ముఖ్యముగ స్థానికసంఘములు వహింపవలెను.

(౨) ప్రారంభవిద్యాశాలలకు బ్రభుత్వమువారొసంగునిరాళములు, పరీక్షాఫలితములను బట్టి నిర్ణయింపబడవలెను. గణితము, ప్రకృతిభౌతికశాస్త్రములు, వ్యవసాయము, పరిశ్రమలు మున్నగునవిగూడ వీనిలో

నేర్పబడవలెను. అధికారులు బాలురశీలముపై నొక కన్నుంచవలెను.

(౩) ఉన్నత విద్యాలయములలో విశ్వవిద్యాలయప్రవేశమునకు పనికివచ్చున దొకటియు, వెంటనే వృత్తిజీవనమున బ్రవేశించుట కుపయోగపడునదొకటియు రెండుతరగతు లుండవలెను. గ్రంథాలయములను, బల్లలు కుర్చీలు మున్నగువానిని సంపాదించుటకై పాఠశాలలకు సాంవత్సరికవిరాళము లొసంగబడవలెను. స్థానికులసహకారము నన్నివిధముల బ్రోత్సహించు టావశ్యకము.

(౪) విద్యాశాఖాధికారియు, బరీక్షకవర్గమును దరచు కలసికొనవలెను. రవిన్యూయుద్యోగులు దమపరిసముల నుండుపాఠశాలలను బరీక్షించి విద్యాశాఖకు దెలియజేయవలెను. పఠనీయగ్రంథసమితులను నెలకొల్పుటత్యావశ్యకము.

(౫) మహమ్మదీయులకొరకును, స్త్రీలకొరకును బ్రత్యేకములగు నేర్పాటులను గావించి, స్త్రీలు విశేషముగ నుపాధ్యాయులుగ వచ్చున ట్లొనరింపవలెను.

(౬) ప్రతిపాఠశాలయు విద్యార్థుల సౌకర్యమునకై వసతిగృహముల నేర్పరుపవలెను.

(౭) ౧౮౮౨-౧౮౮౭:—ఇది హంటరుసంఘ తీర్మానము లాచరణలోనికి వచ్చినకాలము. స్థానికసంఘముల కీయబడిన స్వాతంత్ర్యమువలన బ్రయోజన మేమియు లేకుండినది. ప్రాథమికపాఠశాలలసంఖ్య తగ్గెను. ఉన్నతవిద్యయే ప్రధానమగుటచే మాధ్యమికపాఠశాలలు (Middle Schools) గూడ క్షీణించినవి. తాత్కాలికగౌరవమునుబట్టియు, ద్రవ్యము నార్జింపనెంచియు యాదృచ్ఛికపాఠశాల (Venture Schools) లెన్నియో బయల్వెడలినవి. శిక్షితులగు బోధకులును, చక్కని వేతనములును, తగినస్థలమును వీనియం దరుదుగ నుండినవి. విశ్వవిద్యాలయములును, విద్యాశాఖయు వీనిని నియమింపజాలకుండినవి.

హంటరుసంఘమునకు విశ్వవిద్యాలయములతో నేవిధమగుజోక్యమును లేకుండుటచే నయ్యవి యథాపూర్వముగ నుండినవి. వీనిసంఘములలో ననర్హు లెందరో యుండిరి. కళాశాలలపై వీని కధికారము లేకుండెను. ప్రారంభవ్యయమునుండి నిర్వాహకులు జంకుటచేతను, విద్యార్థులలో బీదరికమును, మతాచారవ్యత్యాసమును విశేషముగ నుండుటవలనను వసతిగృహములు నిర్మింపబడలేదు.

ప్రారంభవిద్యమాత్ర మించుక యభివృద్ధినందుచుండెను. ప్రభుత్వవిరాళములు సక్రమముగ వ్యయమగుచుండినవి. ఉపాధ్యాయశిక్షణార్థమై మదరాసులో నొకకళాశాల యేర్పరుపబడినది. మహమ్మదీయులను ప్రవేశపెట్టుకొను విద్యాలయములకు నూటికి ౨౫ వంతున విరాళము హెచ్చింపబడినది.

(౮) ౧౮౮౭-౧౮౯౨:—ఈ యైదు సంవత్సరములలోని విద్యాచరిత్రము నాష్నివేదికనుండి తెలియుచున్నది. విద్యాశాఖలో గొన్ని సంస్కరణములు జరిగినవి. ఉపపరీక్షకులసంఖ్య హెచ్చింపబడి విద్యాశాఖాధికారుల కర్తవ్యములను దెల్పు "విద్యాస్మృతి" (Education Code) నిర్మింపబడెను. స్థానికసంఘములు ప్రారంభవిద్యకును, పురపాలకసంఘములు మాధ్యమికపాఠశాలలకును, రాష్ట్రీయకోశము లున్నత విద్యాశాలలకును సాహాయ్యము చేయవలెనను సిద్ధాంత మీకాలమునం దేర్పడెను. ఉన్నతవిద్యను మాతృభాషలో గరుపవలెనా, యాంగ్లమున జెప్పవలెనా యనుసమస్య యీసమయమున బయల్వెడలినది. ౧౮౯౦ లో మిడిల్ స్కూల్ పరీక్ష తీసివేయబడి "లోయర్ సెకండరీ" పద్ధతి ప్రవేశపెట్టబడినది. దీనికి బైగా "అప్పరు సెకండరీపరీక్ష" యుండినది. విద్యార్థులందరును వ్యాయామమున బాల్గొనవలెనని శాసింపబడెను. బాలురశీలమునకు బ్రాముఖ్యము హెచ్చెను. ఇందులకై ప్రత్యేకముగ పుస్తకము లేర్పరుపబడినవి.

(౯) ౧౮౯౨-౧౮౯౭:—కాటన్ నివేదికనుండి యీకాలపు పరిస్థితులు దెలియనగుచున్నవి. విశ్వవిద్యాలయములు స్వయంపోషకములుగ నుండినవి. మెట్రిక్యులేషనుపరీక్ష కాంగ్లపఠనీయగ్రంథములు దీసివేయ

బడినవి. అప్పర్ సెకండరీపరీక్ష నిష్ఫలమగుటచే దానిని తీసివేసిరి. ఉత్తర సర్కారుల లోని యుపాధ్యాయుల సౌకర్యమునకై రాజమహేంద్రవరమున బోధనాభ్యసనకళాశాల నెలకొల్పబడెను. ౧౮౯౩ లో బంచములవిద్యకై ప్రభుత్వమువారు సౌకర్యముల నొనగూర్చిరి. పాఠశాలలలో ప్రవేశింపదలచువారు శీలపత్రములను (Conduct Certificate) జూపింపవలసియుండెను.

(౯) ౧౮౯౪-౧౯౦౨:—పాఠశాలల కొసంగు విరాళములు కేవలమును పరీక్షాఫలితములనుబట్టియేకాక వేతనములనుబట్టియు, శాశ్వతనిధినిబట్టియు గూడ నిర్ణయింపబడవలెనని యీకాలమున దీర్మానింపబడెను. ఆంగ్లపఠనీయగ్రంథములయావశ్యకతనుగూర్చియు చర్చలు జరగినవి. గుడ్డి, మూగ మున్నగువారలకై క్రైస్తవమతప్రచారకులు తిరునెల్వేలి, పాలంకోటలలో ప్రత్యేక పాఠశాలల నేర్పరచిరి.

(౧౦) ౧౯౦౨ నాటి విద్యాసంఘము:—ఇదివరలో నియమింపబడిన హంటరుసంఘము విశ్వవిద్యాలయముల జోలికి పోలేదు. ఇందులకై ౧౯౦౨ లో నొకసంఘ మేర్పరుపబడెను. దీనిఫలితములుగ (౧) విశ్వవిద్యాలయసంఘములు సంస్కరింపబడవలెను. (౨) కళాశాలల సామర్థ్యమును నిర్ణయింప వీని కధికారమీయవలెను. (౩) ఇయ్యవి బోధనవిధినిగూడ నిర్వహించవలెను అనునీమూడుసిద్ధాంతము లేర్పడినవి.

౧౯౦౪ నాటి విద్యా-చట్టము—పై విద్యాసంఘముయొక్క తీర్మానముల నావేదించి ప్రభుత్వమువారు ౧౯౦౪ లో నొక విద్యాచట్టమును నిర్మించిరి. అది చక్కనియభ్యుదయమును సూచించునది. అందలి విషయములలో నీక్రిందివి ముఖ్యములు: (౧) ప్రభుత్వమువారు సాధ్యమగునంతవరకును విద్యాలయనిర్మాణమునకై స్థానికులను ప్రేరేపింపవలెను. వారాదర్శపూర్వకములగు కొన్నిటినిమాత్రమే నిర్వహించి యితరవిద్యాలయములను దమయధికారులు పరీక్షించునటులు చేయవలెను. (౨) స్థానికసంఘముల విద్యావ్యయపట్టిక (Educational Budget) విద్యాశాఖవారి యనుమతిని బడయవలెను. (౩) ఆర్థికస్థైర్యము, సామర్థ్యము నుండినగాని యున్నతపాఠశాలలకు విరాళము లొసంగబడవు. పాఠశాలాంత్యవిభాగమువరకును మాతృభాషాపరిచయముండి తీరవలెను. (౪) స్త్రీవిద్య జాతీయాభ్యుదయమునకు మూలము. వారికై ప్రత్యేకపాఠశాలలు నెలకొల్పబడినవి. (౫) విదేశములకేగి విద్య నభ్యసించువారికి సౌకర్యములు గావింపబడినవి. పారిశ్రామిక, వాణిజ్య, కర్షకవిద్యాశాలలను స్థాపించుటకై ప్రయత్నము చేయబడుచున్నది. (౬) విద్యాసామర్థ్యమున కుపాధ్యాయశిక్షణము మూలాధారము. ఈవిషయమును, పాఠశాలలందలి విద్యాప్రణాళికనుగూడ విద్యాశాఖ శ్రద్ధగా పరిశీలింపవలెను. (౭) ఈ సంస్కరణముల కన్నిటికిని పది లక్షలరూపాయలు ప్రత్యేకింపబడినవి.

(౧౧) ౧౯౧౩ నాటి విద్యావిషయక తీర్మానము:—గవర్నరు జనరలుసభలో గావింపబడిన యీ తీర్మానము మిగుల ముఖ్యమయినది. అందలి ముఖ్యాంశముల నిట్లు పేర్కొనవచ్చును: (౧) విద్యార్థుల జ్ఞానమేకాక నడవడికూడ సరిచేయబడవలెను. వసతిగృహము లీవిషయమున ముఖ్యసాధనములుగ నుండగలవు. (౨) ప్రారంభవిద్య సాధారణముగ స్థానికసంఘములచే నిర్వహింపబడవలెను. ప్రత్యేకసంఘము (Private Associations) లున్నతవిద్యకై పాటుపడవలెను. (౩) విద్యాశాఖవారు కేవలము పరీక్షకులుగనే యుండక, తరచుగా విద్యావిషయకసభలను గావించి, పాఠశాలానిర్వాహకులకు సలహాల నొసంగుచుండవలెను. ఇందులకై మండలవిద్యాసభలు (District Educational Conferences) స్థాపింపబడవలెను.

ఈ తీర్మానమునుండి మూడు ముఖ్యాంశములు తేటపడుచున్నవి: (౧) విద్యాశాఖాధికారులు సమర్థులును, బుద్ధిమంతులును, అనుభవజ్ఞులును, సానుభూతిగలవారును నైయుండవలెను. (౨) జాతీయవిద్య యొక భాగస్వామ్యము. ఇందు ప్రభుత్వమును, స్థానికసంఘ

ములును, ప్రజాసంఘములును సభ్యులు. (3) పైవిద్యా విధానమున కుపాధ్యాయులు ముఖ్యులు. వారికి తగినంత ప్రోత్సాహ మొసంగబడినచో వారు తమధర్మమును ప్రీతితో నెరవేర్తురు.

(౧౨) ౧౯౧౪–౧౯౨౨:—భారతీయ విద్యాచరిత్రమున కీయైదుసంవత్సరములకాలమును మిక్కిలి ముఖ్యమైనది. ఆర్థికరాజకీయపరిణామము లెన్నియో యీకాలమున విద్యాప్రపంచమును గలంచివేసినవి. ౧౯౧౪ లో ఇండియామంత్రి క్రమపరిణామమగు స్వపరిపాలనమే (Gradual Self Government) భారతదేశమునకు పరమావధి యని చెప్పెను. దీనికి ఫలితముగ దేశమునం దొకప్రబోధము గల్గెను. జాతీయ భావము ప్రబలకపోవుటకు దేశమునందలి యజ్ఞానమే కారణమని స్పష్టపడెను. అందువలన ప్రజాసామాన్య విద్యావిషయకములగు ప్రయత్నములు చేయబడినవి. ౧౯౧౧ లో గోపాలకృష్ణగోఖ్లేగారు ప్రాథమికవిద్యా-చట్టమును సామ్రాజ్యశాసనసభలో నుపపాదించిరి. రాష్ట్రములలోగూడ నిట్టియత్నములు జరగినవి.

౧౯౨౦-వ సంవత్సరమున జాతీయమహాసభవారసహాయోద్యమమును ప్రారంభించిరి. పట్టములను మాత్రము లభింపజేయు నీవిద్య నిరుపయోగ మను భావము ప్రబలినది. విద్యాలయ బహిష్కరణ మీ యుద్యమమునందలి యొక ముఖ్యాంశము. ఆంగ్ల విద్యాలయములలోని సంఖ్య చాలవరకు తగ్గినది. కొన్ని మూయబడినవి. పరీక్ష లుపసంహరింపబడినవి. ఎన్నియో విద్యాసంఘములును, విద్యానివేదికలును గల్గింపజాలని విద్యాభిమానము నీయుద్యమము ప్రజలలో నతిసులభముగ గల్గించినది. ప్రభుత్వసహకారాపేక్ష లేని జాతీయవిద్యాలయము లెన్నియో బయల్వెడలినవి.

ఇదేకాలమున జరగిన విశ్వసంక్షోభకరమగు నైరోపాసంగ్రామముగూడ దాత్కాలికవిద్యాప్రపంచమును గలత పెట్టినది. ధనాభావముచే ముఖ్యసంస్కరణము లుపసంహరింపబడినవి. విద్యాశాఖోద్యోగు లెందరో యుద్ధభూమి కేగిరి. విద్యాలయములకు వలయు బోధన సామగ్రి విదేశములనుండి వచ్చుటకు వీలుగాకుండెను. అయినను విద్యాసంస్థ లీయుద్ధమున గొంతయుపకారము జేసినవి. విశ్వవిద్యాలయములలో సంరక్షకసంఘములును (Red Cross Societies), భారతీయరక్షకబలములును (Indian Defensive Forces) స్థాపింపబడినవి.

ఈకాలమునందలి విద్యాచరిత్రమును షార్పు అనునతడు వ్రాసిన నివేదిక తెలుపుచున్నది. కళాశాలలలోనివిద్య పూర్తిగా గ్రాంథికమును, సారస్వతాత్మకమును నై యుండినది. ఉద్యోగములను సంపాదించుటయే దీనియుపయోగము. భారతీయవిద్యావిధానము "తలబరువు" గలదిగ నుండెను. ఈదేశమున పురుషులలో నూటి కయిదుమంది విద్యావంతులును, పదిమంది యక్షరజ్ఞానము గలవారును, స్త్రీలలో నూటికి ౧౪ మంది విద్యనేర్చినవారు, నొక్కరుమాత్ర మక్షరజ్ఞానము గలవారు నైయున్నారు. ధనమంతయు కొలదిమంది విద్యాధికులను దయారుచేయుటకేవినియోగపడుచున్నది. ఉపాధ్యాయులలో సుశిక్షితులైనవారు కొలదిమంది. వారివేతనములును, దానినుండి బోధనమును గూడ నసంతృప్తికరములు. పరీక్షలు విషమములుగ నుండినవి. వీని నేవిధమునసైన దాటుట విద్యార్థులకును, దాటించుటుపాధ్యాయులకును ముఖ్యాదర్శము.

(౧౩) సాడ్లరువిద్యాసంఘము,౧౯౧౭-౧౯౧౯ :—కలకత్తా విశ్వవిద్యాలయసంస్కరణార్థమై గవర్నరు జనర లీసంఘమును నియమించెను. పాశ్చాత్యదేశములందలి యాధునికవిద్యాపరివర్తనముల నెరింగినవారు నల్వురును, భారత దేశపరిస్థితులు దెలిసినవారు మువ్వురును ఇందు సభ్యులు. ౧౯౧౯ లో వీరు ప్రచురించిన నివేదిక యన్ని విద్యాలయములకును వర్తించును. అందలి ముఖ్యాంశములనుమాత్ర మిచట గమనింపవలసియున్నది.

ప్రస్తుత విశ్వవిద్యాలయవిద్య నిష్ఫలమగుచున్నది. ఇందు ప్రవేశించినప్రతివారు నొకేవిధమగు శిక్షణము నంది, బయటపడినతోడనే నిరుద్యోగసంఘమున జేరుచున్నారు. దినదినప్రవర్ధమానమగు నిట్టి విద్యాధికులను

నిరుద్యోగులసమూహము దేశమునకు బ్రమాదకరము. విద్యాశాలలలో సంఖ్య యెక్కువ, పాఠ్యవిషయములు తక్కువ, వైదుష్య మొకస్వప్నవార్త. విద్యార్థులశీలములవిషయమై శ్రద్ధతీసికొనబడుట లేదు. విశ్వవిద్యాలయప్రవేశపరీక్షను, ఇంటరుమీడియేటుపరీక్షను నిర్ణయించుట కొకప్రత్యేకసంఘ ముండవలెను. ఇంటరునకు బిమ్మట విద్యాభ్యాసమును మానివేయువారికి జీవనోపాధిని గల్పించు విషయములను గళాశాలలలో బ్రవేశపెట్టవలసి యున్నది. విశ్వవిద్యాలయముల సంఖ్య తక్కువగ నుండుటచే సమ్మర్ద మెక్కువగ నున్నది.

(౧౭) ౧౯౨౦ నాటి మదరాసు ప్రారంభవిద్యా-చట్టము:—దేశమునందలి రాజకీయాందోళనమునకును, శాడ్లరుసంఘ తీర్మానములకును ఫలితముగ వివిధ రాష్ట్రములలో బ్రారంభవిద్యా-చట్టములు ప్రవేశపెట్టబడినవి. అందు మదరాసుచట్టమును సంక్షేపముగ నీదిగువ నుదాహరించుచున్నాము:

(౧) ఈచట్టమువలన మండలవిద్యాసమితులు (District Educational Councils) శాశ్వతముగ స్థాపింపబడినవి. ఇందు స్థానికసంఘములయొక్కయు, నితరవిద్యావ్యాపకోద్యమముల యొక్కయు బ్రతినిధు లుందురు. అచ్చటచ్చట నుండుపరిస్థితులను బరిశీలించి సహాయవిరాళములకొరకు చేయబడు నభ్యర్థనములను విచారించి, ఉపాధ్యాయుల బాగోగులను గనిపెట్టుట వీనికర్తవ్యము. ప్రభుత్వవిరాళముల నుదారులగు నితరులొసగు ద్రవ్యమును గలసి సమితినిధి (Council Fund) యగును. స్థానికసంఘములచే విధింపబడు చదువు పన్నును, పాఠశాలల జీతములును జేరి ప్రాథమికవిద్యానిధి (Elementary Education Fund) అగును. ఈరెంటిపైనను విద్యాసమితికి అధికారముగలదు.

(౨) స్థానికసంఘములందలి సభ్యులలో 33 మంది నిర్బంధవిద్య యావశ్యకమని తలచినచో నావిధముగ నొకతీర్మానమును జేసి, మండలవిద్యాసమితులద్వారా ప్రభుత్వమునకు బంపవలెను. వా రంగీకరించినచో నయ్యది యాచరణలోనికి వచ్చును.

(3) ప్రభుత్వపాఠశాలలలో నేవిధమగు మతబోధయు చేయబడదు. ఇతరవిద్యాలయములలో నది చేసినను జేయకుండినను వారికి జోక్యము లేదు.

(౧౮) మాన్‌టుఫర్డు సంస్కరణములు, ౧౯౨౧:- ఈసంస్కరణములు భారతీయులకు గొంతవరకును స్వపరిపాలనాధికారము నొసంగుట కేర్పడినవి. శాసనసభాసభ్యత్వము సంస్కరింపబడి, యాసభికులలోనుండి నిర్ణయింపబడిన మంత్రివర్గమునకు గొంత యధికారమొసంగబడినది. ఈసందర్భమున విద్యాశాఖ యొక మంత్రియాజమాన్యమునకు వచ్చినది. ప్రభుత్వమువారి విద్యాశాఖాధికారి యీ మంత్రికి బ్రధానసాహాయ్యకుడు. మంత్రి శాసనసభ కుత్తరవాదిగ నుండి, విద్యావ్యయపట్టిక నందు ప్రవేశపెట్టవలసియుండెను.

ఇంతకుముందే రాష్ట్రీయప్రభుత్వముల కున్నత విద్యకొరకు గావలసిన ద్రవ్యమును సంపాదించి వ్యయపరచుట, ప్రాగంభవిద్య నుచితముగ నేర్పించుట మున్నగు విషయములలో స్వాతంత్ర్య ముండినది. విశేషవ్యయములగు కార్యములకుమాత్రమే వారు కేంద్రప్రభుత్వమువారి యనుమతిని బడయుచుండిరి. ఈ సంస్కరణములమూలమున ద్రవ్యవిషయములలో వారికి పరిపూర్ణస్వాతంత్ర్యము లభించెను.

పై సంస్కరణములయొక్క మరియొకఫలితము కేంద్రమాంత్రికసంఘము (Central Advisory Board) స్థాపింపబడుట. విశ్వవిద్యాలయముల కన్నిటికిని బ్రేక్షకుడు (Visitor) గ నుండు గవర్నరుజనరలునకు విద్యావిషయములనుగూర్చి సలహానిచ్చుటయే దీని కర్తవ్యము. ఇందు విశ్వవిద్యాలయోపాధ్యక్షులును, యిర్వురు కళాశాలాధ్యక్షులును, నల్గురు విద్యాశాఖాధికారులును, విద్యాభిమానులగు మరినల్గురును సభ్యులు. దీనికి గేంద్రప్రభుత్వమువారి విద్యాశాఖాధికారి యధ్యక్షుడు.

(౧౯) ౧౯౨౨-౧౯౨౭:—ఈ యైదుసంవత్సరములకాలమునను విద్య చక్కని యభివృద్ధిని గాంచినది. ఐరోపాసంగ్రామఫలితమగు నార్థికబాధ తగ్గినది. అసహాయోద్యమమునందలి ధాటి తగ్గుటచే విద్యాలయముల

యందలి గౌరవము హెచ్చి, చాలమంది తిరిగి వానిని ప్రవేశించిరి. స్థానికసంఘము లెన్నియో ప్రజావిద్య, స్త్రీవిద్య, వ్యాయామము మున్నగువానియం దభిరుచిని జూపినవి. గ్రామపాఠశాలలసంఖ్య వృద్ధిచెందినది.

మాన్టుఫర్డు సంస్కరణములమూలమున గల్గిన రాష్ట్రీయస్వాతంత్ర్యము మంచిదేయైనను, రాష్ట్రములలో నన్యోన్యసంబంధము తగ్గినది. ఈలోటును దీర్చుటకై ౧౯౨౪ లో నొకవిశ్వవిద్యాలయసభ జరిగినది. దీనిఫలితముగ నొక యంతర్విశ్వవిద్యాలయసంఘము (Inter University Board) నెలకొల్పబడినది. ఉపాధ్యాయుల నొకచోటినుండి మరియొకచోటికి మార్చుట, భారతీయవిద్యాలయపట్టముల నితరదేశవిద్యాలయములవా రంగీకరించున ట్లొనర్చుట, సామ్రాజ్యసభలకు, నంతర్జాతీయసభలకు, సమావేశములకును భారతీయప్రతినిధులను బంపుట మున్నగునవి యీసంఘమునకు ముఖ్యకర్తవ్యములు.

౧౯౨౨–౨౮ ల నడుమ కొన్ని నూతన విద్యాసంస్థలు బయల్వెడలినవి. ౧౯౨౩ లో నాగపుర విశ్వవిద్యాలయమును, ౧౯౨౬ లో నాంధ్రవిశ్వవిద్యాలయమును నెలకొల్పబడినవి. ౧౯౨౦ లో ప్రభుత్వమువారియొక్క చట్టము ననుసరించి విశ్వవిద్యాలయములలో సైనికసంఘములు (University Training Corps) స్థాపింపబడినవి.



'మోట'

—సూర్య.

# ఒట్టు

కనుపర్తి వరలక్ష్మమ్మ

## ౧

బందరులో క్రొత్తగా యేర్పడిన నాట్యకళోద్ధారకసమితివారు ఒకనాడు సమావేశమై తమ సమితిపక్షాన యికముందు ఆడబడే నాటకాల్లో స్త్రీలే స్త్రీపాత్ర ధరించాలెనని తీర్మానించారు. ఈతీర్మానం మొట్టమొదట ధైర్యంతో ప్రవేశబెట్టి అడ్డుప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెప్పి నెగ్గునట్లు చేసినవాడు జగన్నాథం. జగన్నాథం ప్రతిపాదన నెగ్గగానే శర్మ మఱిఒక వేడివేడి తీర్మానం ఉపపాదించాడు. ఏమనీ? స్త్రీలుఅభినయించాలె అనడం వట్టితీర్మానమేగాకుండా క్రియారూపంగా చూపుటే సమితివారి ముఖ్యాశయం గనుక మూడుమాసాల్లో సమితిసభ్యులు యావన్మందీ తమస్త్రీలచే నాటకభాగాలు వల్లింపజేసి వచ్చేవేసవి తప్పకుండా మూడునాటకాలు ఆడితీరాలె; అని. ఈతీర్మానం గెలవడానికి పెటపెటలైంది. నా భార్య పసిబిడ్డతల్లి అనీ, నాభార్య పురిటికెళ్లిందనీ, మాఆవిడకు ఒంట్లోసుస్తీగా ఉంటున్నదనీ, ఇంట్లో ఆడవాళ్ల అభిప్రాయం కనుక్కోకుండా యిటువంటి తీర్మానాలు చేయడం తప్పనీ, నేను ఒప్పుకున్నా పెద్దలు మానాన్నగారున్నారు వారు ఒప్పుకోరనీ, మాకు ఘోషా అనీ, మాఆడవాళ్లకు చదువు రాదనీ, యేవేవో కారణాలతో చాలామంది వ్యతిరేకించారు. పోలుతీసుకుంటే అనుకూలురు, ప్రతికూలురు సమానమైనారు. అధ్యక్షపీఠం వహించిన అనంతాచార్యుల వారి తలయూపుతో తీర్మానం నెగ్గింది. కర్తవ్యం యేమిటని మనస్సుల్లో వితర్కించుకుంటూ సభ్యులు యిండ్లకు చేరుకున్నారు.

## ౨

ఆనాటిరాత్రి సమితిసభ్యులు తమతమయిండ్లలో భార్యలతో యీవిషయం ప్రస్తావించారు. నడురేయివఱకూ యింటింటావాదోపవాదాలు జరిగినవి. రెండవతీర్మానం ప్రవేశపెట్టిన శర్మ భార్య యీవిషయంలో భర్తను పూర్తిగా తిరస్కరించింది. "కళోద్ధారణమంటూ ఉద్యోగం సద్యోగం మానుకొని యింట్లో భార్యాబిడ్డలను యేడ్పించి మీరు తిరుగుతున్నదిగాక యింకా నన్నుగూడా నాటకాలాడడానికి రమ్మంటున్నారా? ఏమైనాసరే, ఆవేషాలూ గీషాలూ నాచేతగావు. మగవాళ్లు భార్యాభర్తలుగా గూడి ఆడుతుంటేనే నాకు సిగ్గుగా ఉంటుంది. అటువంటిది నేనా వేషమేయడం? అయినా ఈనలుగురుబిడ్డల్నీ యెవరిపరం చేసి వెళ్లేది? ఒకపిల్ల మంచినీళ్లంటూ నిశిరాత్రివేళ లేస్తుంది. ఒక పిల్ల వాకిట్లోకి పోతానంటుంది. ఈపసివాడికి తెల్లవారేలోపల రెండుమాట్లూ పాలుగలిపి పోయ్యాలె" అన్నది భార్య.

"పిల్లల విషయం నీ కక్కర్లేదు. మనిషిని పెడ్తా" నన్నాడు శర్మ.

"కూలిమనిషి మనం దగ్గిరలేకపోతే పిల్లల్ని బాగా చూస్తుందా?"

"నే నున్నానుగా?"

"మిమ్మల్ని బిడ్డలను చూడమని యింట్లో ఉంచి నేనెవడితోనో జతగూడి నాటకాలాడేది. ఎంత ముచ్చటగా ఉందండీ మీమాట!"

"అయితే ఏమి చేయమంటావు?"

"ఆసమితిసభ్యత్వము వదులుకోండి."

"అంతకంటే శిరచ్ఛేదం లేదు."

"మగవాళ్లతో వేషాలేయడం నాకూ శిరచ్ఛేదమే."

"అయితే నామాట వినవూ?"

"నన్ను క్షమించండి. విషంపుచ్చుకొని ప్రాణాలు విడువమంటే విడుస్తా. కాని ఆనాటకాల్లో వేషాలేయలేను. నన్నెందుకు దుఃఖపెడ్తారు." అని పెనిమిటి పాదాలమీద బడి భోరున యేడ్చింది ఆమె. శర్మ తెల్ల బోయినాడు.

## 3

నాయుడుగూడా తన భార్యతో యీవిషయం ప్రస్తావించాడు. "ఇప్పటికే మన కులంవాళ్లు మనకు ఘోషా లేదనీ, నాటకాలకూ సభలకూ పోతుంటా మనీ, సూటీలుపోటీలు అంటున్నారు. ఇక దీనిలో గూడా దిగితిమా నలుగురిలో తలెత్తలేము. ఆడపిల్లలు కలవాళ్లం, ప్రతిదానిలో విచ్చలవిడిగా జొరబడితే పిల్లలకు సంబంధాలు రావు. అయినా నా వానాకాలపు చదువు మీ కెలుగరూ? పాడిముక్కలే. కూర్చి చదువలేను; నాటకపద్యాలు నావశమా?" అన్నది నాయుడు భార్య. నాయుడు ఊరుకున్నాడు. ఇంటింటా ఇట్లాగే మగవాళ్లు అడగడం, ఆడవాళ్లు "మావల్లగా"దనడం జరిగిపోయింది. మొత్తంమీద ఏసభ్యుని భార్యా ఈవిషయం ఆమోదించలేదు. జగన్నాథం మళ్లీ యెత్తేశాడు. ఏమంటే అసలుసంగతి భార్యయైన జానకితో ముందుగా చెప్పలేదు. రాత్రిభోజనాలైనతరువాత ఆమెయిల్లు సర్దుకొని పక్కలువగైరాలు చూచుకొని స్తిమితంగా తమలపాకులపాందాను దగ్గిఱ పెట్టుకొని కొంచెం వక్కపొడి పెనిమిటి కిచ్చి కొంచెం తాను నోట్లో వేసుకొని ఒక ఆకుకు సున్నం రాచి పెనిమిటి కిస్తూ, ఒక ఆకు తాను వేసుకుంటూ ఉల్లాసంగా ఏమిటో ముచ్చటిస్తూ ఉండగా, జగన్నాథం

" జానకీ, నే నోపని చెప్పుతాను చేస్తావా ?" అన్నాడు.

" ఏపని ?"

" ఏదోపనీ, చేస్తావా? "

" చేస్తానులే చెప్పండి. "

" లే, అంటున్నావే; చెయ్యవేమో ?"

" చేస్తానంటేనిగా సంగతి చెప్పండే శంకిస్తే ఎట్లా ?"

" శంకగా పలికితే శంకించాను. "

"శంకా లేదు, గింకా లేదు తప్పకుండా చేస్తాను. మీరేమంత చేయరానిపని చేయమనరుగదా. "

"............................."

" ఎప్పుడైనా మీ ఆజ్ఞ అతిక్రమించానా, ఇప్పుడు అతిక్రమించడానికి ? "

" అయితే ఒట్టేనా ?"

" ఏం ఒట్టు ?"

" నన్ను చంపుకున్నట్టేనా ?"

" అబ్బా ! అబ్బా! ఏమిటండీ మీ మాటలు? ఒట్టుపెట్టుకోడానికి యింతకన్నా ఏమీ దొరకలేదు. " జానకికన్నుల్లో నీళ్లు గిఱ్ఱున దిరిగాయి.

"................................"

"ఏమీ మీ కింకా నమ్మకం కలుగలేదూ ? ఈశ్వరసాక్షిగా చేస్తా. ప్రమాణపూర్తిగా చెప్పుతున్నా. ఎంతకష్టమైనా దీనికి తప్పను సరేగదా. "

"................................"

" ఏదీ మీచెయ్యి యిట్లా చాపండీ. " అని జానకి లేచి పడక కుర్చీలో కూర్చొని ఒడిలో చేతులు పెట్టుకొని యున్న భర్తచేతిని తానే అందుకొని "మీరు చెప్పినట్లు చేస్తాను." అని చేతిలో చెయ్యేసి "ఏమి మీశంక యిక తీరిందా? ఇక యేమిచెయ్య మంటారో చెప్పండీ" అని పెనిమిటివంక చూచి నవ్వింది.

జగన్నాథానికి నోట మాటరాలేదు. సుప్రసన్నమైన అతని ముఖం దీనాతిదీనంగా అయిపోయింది. "ఎంత విశ్వాసమును, ఎంతప్రేమను వెల్లడింపజేస్తున్నవి జానకిమాటలు. దానికి ప్రతిగా ఆమెయెడ నేను ఇటువంటి వంచనకు పూనుకొని ఈవిశుద్ధప్రేమ మయిని ఎంతమోసం చేస్తున్నాను. నేను చెప్పబోవు

సమాచార మామె కెంత హృదయభేదకమోగదా. ముందుగానే ఆమెస్వేచ్ఛకు శృంఖలలు తెగిలించితిని గదా. ద్రోహిని; సతీద్రోహిని." అనితలచి లజ్జితుడై దుఃఖితుడై కప్పలుకూలినట్లయి జానకికి జవాబుచెప్ప కుండానే కుర్చీకి చేరగిలబడ్డాడు జగన్నాథం. పెని




" ఏమి మీ శంక యిక తీరిందా? ఇక యేమిచెయ్యమంటారో చెప్పండీ? "

మిటిముఖమై వైవర్ణ్యం జానకికి భీతిగొలిపింది. గడగడ వణికిపోయింది. కన్నులు చెమ్మగిల్లినాయి. ఆతని ముఖంలో ముఖం పెట్టి తటాలున వంగి చూచి "ఏమి యిట్లా ఉన్నా"రే మని ఆదుర్దాగా అడిగింది. ఈలోపల జగన్నాథంలోగూడా కొంతమార్పు గలిగింది. "ప్రారంభనివ్యమొదలుకొని ప్రణయవ్యవహారాలవఱకు స్త్రీలకు స్వాతంత్ర్యం చవిచూపాలనే మతంవాడిని గదా నేను. ఈమాత్రపు సంస్కారానికే యింత బేలతనం చూపితే యెట్లా? ముందుగా చెప్తే యే స్త్రీగూడా ఒప్పుకోదు. కాబట్టి కొంత మోసం, కొంతఅధికారం ప్రయోగించైనా వాళ్లకు స్వేచ్ఛ నేర్పాలె. ఇందులో అక్రమం లేదు." అని అతనికి తోచింది. కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు; కంఠం సవరించుకొన్నాడు; 'జానకీ' అన్నాడు.

"ఆఁ."

"ఈరోజున మా సమితిలో ఒక తీర్మానం ప్యాసుచేశాము."

"ఏమనీ?"

"ఇకముందు మాసమితిపక్షాన ఆడబడే నాటకాల్లో స్త్రీపాత్రను స్త్రీలే అభినయించాలెననీ, మునుముందు సమితి సభ్యులే తమస్త్రీలచేత యీసంస్కారం ఆరంభింపజేయాలననీ, వచ్చేవేసవిసెలవులలో మూడునాటకాలాడాలననీ."

"అయితే?"

"ఆతీర్మానంప్రకారం నాభార్యవైన నీవు నాటకభాగాలు వల్లించి నాటకఖేలనంలో పాల్గొనాలె."

"ఇటువంటి అసభ్యపు తీర్మానాలు చేస్తుంటే ఆసమితితో సంబంధం వదులుకోకపోయినారా?"

"అసలు యీ తీర్మానం ప్రవేశపెట్టినవాడనే నేను."

"మీ ఉద్దేశం?"

"కళాపోషణ."

"అయినా పాత్రధారణ ఐచ్ఛికమేగా! ఇష్టం లేనివాళ్లను బాధించరుగదా!"

"ఐచ్ఛికమనడానికి వీలులేదు."

"అయితే మీరు నాకు ముందే చెప్పలేదేమి?"

"నీవు ఆమోదించవనే."

"అయితే నన్ను మోసంచేశారు."

"నిజమేకాని దురుద్దేశంతో గాదు, కళాభిమానంతో."

"సరేగాని నాయకపాత్రం మీరు ధరిస్తారా?"

"నాకు కంఠసారస్యం లేదు. నాయకపాత్రధారణకు తగను. నీవు మృదుమధురగాత్రవు. నీవాక్చాతుర్యమూ, నీకంఠమాధుర్యమూ, నిన్ను ఉత్తమనాయికాపాత్రకు అర్హురాలినిగా జేయును. కాబట్టి ఆపాత్రకు అర్హుడగు నాయకునితో కలిసి నీవు అభినయించాలె."

"ఏమిటీ, పరపురుషునితోనా?"

"అవును."

"అయ్యో ఎంతమోసం చేశారండీ." అని జానకి నుందెకొట్టుకున్నది.

"అయితే అభినయించవూ?"

"ఎట్లా అభినయించకమాననూ? ఆఒట్టూ, యీ ఒట్టుగాదే, నాప్రాణంమీదనేఒట్టు పెట్టారుగా! మీకంటే నా కధిక మేమున్నది?"

జానకి కళ్లవెంట నీళ్లొచ్చాయి. పమిటచెఱుగుతో తుడుచుకొని తలవంచుకొని క్రిందు చూస్తూ ఉండిపోయింది. తన మోసకృత్యానికి తనలోతానే కుమిలిపోయినట్లయినాడు జగన్నాథం. నాలుగైదునిమిషాలు నిశ్శబ్దంగా గడచిపోయినాయి.

"అయితే పిల్లగ"లేమిటన్నది జానకి దుఃఖంతో, పెనిమిటివంక చూస్తూ.

"వాళ్ల సంగతి నేను చూచుకుంటా" నన్నాడు జగన్నాథం తలవంచుకునే.

జానకి పెద్దనిట్టూర్పు విడిచి "అయినదేమో అయింది. నేను మీఒట్టులో కట్టుబడ్డాను. మీరు నాకు మూడువరా లివ్వాలె."

"ఏమిటవి?"

"రిహార్సల్సుకు రాను. ఈఊళ్లో అభినయించను. మీరూ, పిల్లలూ వెంటరాకుండా పొరుగూళ్లు పోను."

"సరే."

౪

సమితివారి మఱునాటిసభలో సభ్యు లెల్లరు తమభార్యలు రామన్నారనీ, వాళ్లు రావడం తప్పనిసరైతే తాము సభ్యత్వమే వదులుకుంటామనీ, తమ అసమర్థతను వెల్లడించారు. జగన్నాథం ఒక్కడే తాను చేసిన ద్రోహం చెప్పకుండా తనభార్య పాత్రధారణ చేయడానికి ఒప్పుకున్నదని చెప్పి మిత్రుల అభినందనా లందుకున్నాడు. నాయికాపాత్రధారణ చేయగల యువతీమణి దొరికిందనగానే సభ్యులలో నవోత్సాహం ఉత్పన్నమైంది. మొదట తామనుకున్న ప్రకారం సావిత్రీ, పాదుకాపట్టాభిషేకమూ, సారంగధరా అనే మూడునాటకాలు వరుసగా బెజవాడ, ఏలూరు, రాజమండ్రిపట్టణములలో ప్రదర్శించుటకు తీర్మానించుకున్నారు. ఆమఱునాడే నాటకంపార్టులు జానకిసన్నిధికి చేరినవి. "నాథ ర్తఆజ్ఞ నాకు శిరోధార్యం. పతివ్రతాతిలకమగు సుమతి కుష్ఠురోగియగు పెనిమిటిని శిరమున నిడుకొని వేశ్యాంగనాగృహమునకు గొనిపోయినదట. అట్లాగే నేనుగూడా నాథ ర్తఆజ్ఞను నిర్వహిస్తాను" అని జానకి మనస్సులో దృఢనిశ్చయం చేసుకొని నాటకభాగా లందుకున్నది. తన అభీష్టం నెరవేర్చడానికి భార్య అంగీకరించినందుకు మహాసంతోషించాడు ప్రొఫెసర్ జగన్నాథం, యం. ఏ., యల్. టి.

౫

వేసవిసెలవులు యివ్వగానే సమితివారు నాటకాలాడటానికి తట్టాబుట్టా కట్టుకొని బయలుదేరారు. వారితోబాటు సకుటుంబంగా జగన్నాథంగూడా బయలుదేరాడు.

బెజవాడలో యేర్పాట్లన్నీ జరిగాయి. వాల్ నోటీసు లంటించారు. ఊళ్లో మేళతాళాలతో కాగితాలు పంచారు. తనపేరూ, భార్యపేరూ, చేర్చి

పెద్దపెద్దఅక్షరాలతో ముద్రించబడిన నోటీసులు చూచి జగన్నాథం ఏమనుకున్నాడోగాని జానకి చాలా మనస్తాపం చెందింది. ఎచ్చటనో ఉన్నచోటు యెఱుకబడకుండా ఉండే తన్ను యీవిధంగా గోడలమీదా, గొబ్బెలమీదా, జట్కాబండ్లమీదా, రోడ్డుపక్కనున్న చెట్లమీదా ప్రకటనచేయిస్తున్న తన భర్త యొక్క ఉద్దేశ మేమిటో ఆమె తెలుసుకోలేకపోయింది. కాని తనభర్త నావిషయమై యేమీ అడగలేదు.

రాత్రి యెనిమిదెగంటలయ్యేటప్పటికి టిఫిన్ క్యారియరుతో అన్నం వచ్చింది. పెనిమిటికీ, బిడ్డకూ అన్నంబెట్టి తానుగూడా తిని పిల్లవాడి నెత్తుకొనే అచ్చికిగూడా అన్నంపెట్టింది. బాబు అప్పటికే నిద్రబోతున్నాడు. అన్నం పెట్టగానే లీలగూడా నిద్రబోయింది. తనపనులన్నీ అయినతరువాత జానకి బాబును లేపి పాలిచ్చింది. పిల్లవాడిని యెత్తుకునే అచ్చితో "అచ్చీ! అబ్బాయి లేస్తే లేచి వలఉయ్యాలలో పడుకోబెట్టి ఊపు" అని చెప్పింది. "అమ్మాయి లేచి యేడిస్తే బిస్కట్లు బ్యాగ్‌లో ఉన్నాయి యివ్వండి. వేడినీళ్లు ఫ్లాస్కులో ఉంచాను. పిల్లవాడు లేచి పాల కేడిస్తే ఆవేడినీళ్లతో కలిపిపట్టండి మఱచిపోయి చన్నీళ్లలో కలిపేరుసుమండీ! బిడ్డకు జబ్బుచేస్తుంది. అసలే వాడికి పోతపాలు అలవాటు లేదు. ఏమితాగుతాడో యేమో" అన్నది భర్తతో. భార్యచెప్పిన పాలడబ్బీలు బిస్కట్లు వగైరాలు యెక్కడెక్కడ ఉన్నవో చూచుకుంటున్నాడు జగన్నాథం. ఇంతలో వాకిట్లోకి కారువచ్చిన శబ్దం, తోడనే హారన్ మ్రోగించిన ధ్వని వినబడ్డది. జానకిని పిలుచుకొనిపోవడానికి కారు వచ్చిందికాబోలు ననుకొని జగన్నాథం కొంచెం చకితుడై నిలబడ్డాడు. ఒకమనిషి కారుదిగివచ్చి "నాటకం ఆరంభించపోతున్నారు. అమ్మగారిని పిలుచుకరమ్మన్నా" రన్నాడు జగన్నాథంతో. జానకి అవతలగదిలో పిల్లవాడిపక్క చూస్తున్నది. జగన్నాథం భార్యవద్దకు బోయి "జానకీ, కారువచ్చింది. సిద్ధంగా ఉన్నావా?" అన్నాడు.

జానకి సిద్ధమే అనలేదు. కాని యిట్లా జబాబిచ్చింది. "మాంత్రికుడు సర్పమును కట్టుకట్టి నిల్పినట్లు నన్ను మీఒట్టుతో బంధించారు. మనమిరువురమూ నాయికానాయకులంగా అభినయించే భాగ్యం కలిగినట్లయితే నా జీవితంయావత్తూనట్టువకత్తెగా గడపమన్నా చింతలేకుండా గడిపేదాన్నే. భగవంతుడు అటువంటి ఆనుకూల్యం కల్పించాడుగాడు. ఇతరుని భర్తగాభావించి అభినయించడమనేది మగనాలికి సామాన్యకష్టంగాదు. అదే నామనస్సులో ఉన్న బాధ. అయినా మీఆజ్ఞను పాలించడం నాకర్తవ్యం. నమస్కారం. వెళ్లుతున్నా, బిడ్డలు జాగ్ర........" అని జానకి బయలుదేరింది. వెలవెలబోవుచున్న ముఖంమీద వికృతంగా కనబడుచున్న తెచ్చికోలునవ్వుతో భార్యకు వీడ్కోలిస్తూ వరాండాలో నిలబడ్డాడు జగన్నాథం. జానకి గేటు దాటి రోడ్డుమీది కెళ్లి కారుయెక్కింది.

౬

విగ్గులు కట్టుకోవలెనా? రంగులు పూసుకోవలెనా? పూలు ముడుచుకోవలెనా, సొమ్ములు పెట్టుకోవలెనా, చీరె సింగారించుకోవలెనా? మగవానికైతే యీపాట్లు. వచ్చేరావడంతోటే జానకి రంగస్థలాన మెఱుపులాగ పొడసూపింది. అటు పాత్ర పోషణకూ, ఇటు సాధ్వీధర్మానికీ భంగంలేకుండా నెమ్మదిగా అభినయించడం ఆరంభించింది. నాయక పాత్రధారిగూడా ఆమెచిత్త మెఱిగి స్త్రీవేషధారులైన పురుషులతో వ్యవహరించినట్లు విచ్చలవిడిగా ప్రవర్తింపక మెలకువగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. వారిరువురి ప్రవర్తనా ప్రేక్షకులోకాన్ని రంజింపజేసింది. అయితే నాటకమంతటా ఒక్కవిధంగా అంటీముట్టకుండా ఉండటానికి సాధ్యమా? సత్యవంతుడు అడవిలో చెట్టుకొట్టాడు. పడిపోతున్నాడు. అతనిని తన కోమలకరాబ్జాలతో పట్టుకొని తొడమీద పడుకోపెట్టుకోవాలె. జానకిఒడలు జలదరించింది. ఏదో గొప్ప తప్పుపని చేయబోయే దానివలె అలమటించింది. ఒళ్లు ముచ్చెమటలు పోసినవి. "నా పెనిమిటి సుఖంగా

ఉండగా, నేనీతన్ని తొడలమీద పడుకోబెట్టుకొని మొగుడుపోయిన మనువలాగా ఏడవాలెకాబోలు" అని కన్నీరునించింది. "పురుష శాసనం రాజశాసనంకంటె కఠినమైంది. లేకపోతే నన్నీ రంగస్థలంమీద అభినయించి తీరాలెనని నాభర్త శాసించడ మేమిటి? నేను రావడ మేమిటి? ఏమి టీసబబు? దుశ్శాసనాలుగూడా అను ల్లంఘనీయాలేనా? వీటిని అతిక్రమించినా సాధ్వీధర్మా నికి లోపమేనా? ఇంతకూ ఒట్టు నన్ను బంధించింది. అదైనా యితరమైంది కాదు. తనప్రాణంమీదనే పెట్టుకొన్నారు. వారి ప్రాణంకంటె నా కెక్కువైం దేమిటి? అందుకే యీనీచకృత్యాని కొప్పుకున్నా. ఈశ్వరుడు నాపతికి దీర్ఘాయు విచ్చుగాక. ఈ ఓగా యిశ్వర్యం నన్నంటకుండునుగాక." అని అనుకుంటూ, అశ్రువులు విడుస్తూ విధిలేక జానకి అంటే సావిత్రి సత్యవంతుణ్ణి తన తొడలపై చేర్చుకున్నది. ఆసమ యంలో ప్రేక్షకులకు కావాలసిం దేమిటి? బాగా యేడ వడమే. ఏకారణంచేతనైతేనేమి ఆదుఃఖరసం బాగా పోషించి ప్రేక్షకుల మెప్పుపొందింది జానకి. ఇంతలో యముడు వచ్చాడు. సత్యవంతుని నెమ్మదిగా ఊరు వులమీదినుంచీ దిగిచి యముడికి నమస్కారంచేసింది సావిత్రి. ఆపై సావిత్రీయముల సంభాషణ ప్రేక్షకుల నత్యంతంగా ఆకర్షించింది. తన కళావైదగ్ధ్యమంతా గుప్పించింది జానకి యీరంగంలో.

౭

జానకి నాటకశాలకు వెళ్లిన కొంచెంసేపటికే బాబు లేచాడు. తల్లికోసం నాల్గువైపులా చూచాడు. తల్లి కనపడలేదు. ఏడ్చాడు. ఆఏడ్పుకు ఉయ్యాల కిందనే పడుకున్న అచ్చికి మెలకువ రాలేదుగాని ఆందోళనగా పడుకున్న జగన్నాథానికి చప్పున మెల కువ వచ్చింది. చివాలున లేచి బిడ్డను చేతికి తీసు కున్నాడు. "బాబూ, ఏడువకు" అని బుజ్జగిస్తూ బుజాన వేసుకున్నాడు. కాని తలవంచి బుజాన పడు కోలేదు బాబు. పామపడిగలాగా తలెత్తి నాల్గు వంకలా చూస్తాడు; నాన్నవంక చూస్తాడు; ఏడు స్తాడు. ఎన్నివిధాల ఊరడించినా బాబు యేడ్పుమాన లేదు. ఇక ఓదార్చడం చేతగాక జగన్నాథం అచ్చిని లేపాడు. అదీ కష్టందే. ఒకగంటసేపు లేపగా లేపగా కళ్లునులుముకుంటూ లేచి పిల్లవాణ్ణి యెత్తుకున్నది; చల్లగాలిలో అటూయిటూ తిప్పింది. ఆటవస్తువులు చూపించింది; ఉయ్యాల్లో వేసి ఊపింది; ఏంజేసినా బాబు యేడ్పుమానలేదు. "పోనీ, పాలుపోస్తాను ఉండవే; ఆకలై యేడుస్తున్నాడేమో" నని జగన్నాథం గ్లాక్సో డబ్బీ, వేడినీళ్ల సీసా, వెండిగిన్నె, చెంచా, కొమ్ము చెంబూ అన్నీ పోగేసుకుని కూర్చున్నాడు. కాని యెంతపిండో, ఎన్నినీళ్లో, ఎట్లా కలపాలో, ఏమీ తెలియదు. ఒకమాటు కలిపాడు. పాలు నీళ్లలాగు న్నాయి. నీళ్లెక్కువైనాయి అనుకున్నాడు. ఇంకా కొంచెం పిండిపోశాడు. "అయ్యో! ఈమాటు పాలు చిక్కనైనాయే" అనుకున్నాడు. మళ్లీ కొంచెంనీళ్లు పోశాడు. మళ్లీ కొంచెం పిండి వేశాడు. అటుచేసి, యిటుచేసి పెద్దగిన్నెడుపాలైనాయిగాని మనస్సుకు సమాధానంలేదు. మనసులో యేదో ఆందోళనా, అవ తల పిల్లవాడి యేడుపూ, పాలు యేతీరున కలపాలో తెలియకపోవడం—ఏదో కంగారుపడుతూ చెరిసగంపాలు క్రిందపోస్తూ పాలుతయారుచేశాడు జగన్నాథం. కాని పోయడమెట్లా? తల్లిపాలకు అలవాటుపడ్డ పిల్లలు డబ్బీ పాలు మూమాస్తారా? బాబును తొడమీద కూర్చో బెట్టుకొని కొమ్ముచెంబులో పాలుపోసి కొమ్ముకు పీక బెట్టి నోట్లో బెట్టి త్రాగించబోయినాడు. వాటిముఖం ఎప్పుడూ చూడని బాబు నోరు గట్టిగా మూసుకొని కొమ్ముచెంబు చేత్తో తోశేసి పెద్దగా యేడవడం మొదలుపెట్టాడు. పోనీ పీకతో త్రాగడేమో నని గిన్నెలో పోసి యిచ్చాడు. అవీ నెట్టేశాడు. "ఇదిగాదు త్రోవ. కాళ్లమీదవేసుకొని పోస్తా ఉండూ" అని జగ న్నాథం పిల్లవాడిని కాళ్లమీద వేసుకొని స్పూనులో పాలు నోట్లో పోయబోయినాడు. కాళ్లూచేతులూ విసురు కుంటూ గిలగిలా కొట్టుకొని నోట్లో పోసిన పాలు తెమడచేసి కక్కడం మొదలుపెట్టాడు బాబు. చేతితో తోసివెయ్యడంచేత గిన్నె, చెంచా అంతదూరాన

పోయి పడ్డాయి. కాలివిసురుకు థర్మాసుఫ్లాస్కు నేలబడి ముక్కలుముక్కలై పోయింది. జగన్నాథానికి పట్టరాని కోపం వచ్చింది; సహనం కోల్పోయినాడు. 'పసివాడే తాళుతాడా' అనుకోకుండా ఛెళ్లున వీపుమీద ఒకదెబ్బ వేశాడు బాబును. ఆదెబ్బకు బాబు కేరుమని ఒక్కబొబ్బపెట్టి వెన్ను విల్లువంపుగా వంచుకొని యేడ్చి యెటుచూచినా తల్లి కనిపించకపోవడం చేత మళ్లీ తండ్రికాళ్లకే చుట్టుకున్నాడు. ఆపిల్లవానిని చూచేటప్పటికి జగన్నాథంకడుపు తరుక్కుపోయింది. కన్నులవెంట నీళ్లు జొటజొటా వచ్చాయి. బిడ్డను ఛప్పున చేతులకు తీసుకొని "నాయనా, ఎంత దుర్మార్గుణ్ణిరా, ఈపాడుచేతులతో యెంతదెబ్బ కొట్టానురా." అని గుండెలకు అదుముకున్నాడు. "నీ తల్లి నీసొత్తు నీతల్లి దగ్గర నీవు పాలుత్రాగడం నీజన్మహక్కు. నీహక్కును నేను భంగపుచ్చినప్పుడు నీ వీమాత్రం పోరాడడం తప్పా? బాబూ, తప్పుచేశాను. ఏడవకు, నాన్నా! ఏడవకు. అదిగో రెండుగంటలైంది. మీ అమ్మ వస్తుంది. బొజ్జనిండా పాలిస్తుంది" అని బుజ్జగిస్తూ పిల్లవాణ్ణి బుజాన వేసుకొని వరాండాలో పచారు చేయడం మొదలుపెట్టాడు. ఎన్నడూ యెఱుగని అయ్యగారికోపం, చీకాకూ, గడబిడా చూచి హడిలిపోయి అచ్చి గోడ కంటుకుంది.

## ౫

పసిబిడ్డతల్లికి తలమునకలపనిలో ఉన్నా బిడ్డమీదనే కన్ను. ఉత్సవానికి పోనీ, ఊరేగింపుకు పోనీ, పెత్తనానికి పోనీ, పేరంటానికి పోనీ, కూలికి పోనీ, కూటికి పోనీ, ఒక్కక్షణం నిలువదు. 'పాలుత్రాగే బిడ్డను వదిలివచ్చాను యింట్లో. ఒక్కక్షణం నిలవడానికి లేదు పోవాలె, పోవాలె. బిడ్డ కక్కటిల్లిపోతుండాలె, గొంతెండిపోతుందేమో,' ఇదే ఆత్రం. జానకి ప్రాణంగూడా యిట్లాగే తపించిపోతున్నది. ఆమె ప్రాణమంతా బాబువద్దా, బొందిమాత్రం రంగస్థలంలో. నాటకం యెట్లాగో ముగించేసి మంగళగీతం పాడుతుండగానే కారెక్కి వచ్చేసింది జానకి. జగన్నాథం యింకా పిల్లవాణ్ణి బుజాన వేసుకొని చిచ్చికొడ్తూ పచారుచేస్తునే ఉన్నాడు. జానకి భర్తను చూడగానే "ఏమి? యెత్తుకొని తిప్పుతున్నారే? ఏడుస్తున్నాడా?" అంటూ బిడ్డను చేతికి తీసుకున్నది. "అనుకుంటూనే ఉన్నా, పిల్లవాడు లేచి యేడుస్తున్నాడేమో, వేసంకాలమే, గొంతెండుతుందే అని. తొందరతొందరగా వద్దామన్నా వీలుకాలేదు. ఏమిబాబు, అర్ధరాత్రివేళ నాన్నగారిని వేధిస్తున్నావా?" అని యేమేమో బుజ్జగింపు మాటలాడుతూ పిల్లవాడికి పాలివ్వడం మొదలుపెట్టింది జానకి. ఆయేడుపూ, ఆయెక్కు, ఆపెంకితనం అంతా ఏమైపోయిందో కిలకిలా నవ్వుకుంటూ కాళ్లూచేతులూ ఆడించుకుంటూ మహానంతోషంతో పాలుత్రాగడం ఆరంభించాడుబాబు. ఆమాతాశిశువుల, అవిచ్ఛేద్యమైనసంబంధం, ఆతల్లియొక్క ఆత్రం, ఆ బిడ్డయొక్క ఆనందం చూచి 'సంసారంలో అనుభవపూర్వకంగా నేర్చుకోవలసింది చాలా వుంది. ఊహాప్రపంచంలో సులభంగా యేర్పరచుకొన్న యేర్పాట్లు క్రియాప్రపంచంలోకి తేవడం సామాన్యకార్యం గాదు' అనుకున్నాడు జగన్నాథం.

బిడ్డకు పాలిచ్చుకుంటూ అకల్మషురాలగు జానకి "బాబు నేను వెళ్లంగానే లేచాడా? పాలుపోశారా? త్రాగాడా? ఏమి నిద్రపోలేదూ?" అంటూ పెనిమిటిని యెన్నోప్రశ్నలు వేసింది. విసుగునో, సిగ్గునో జగన్నాథం సరిగా జవాబుచెప్పలేదు. కాని జానకి యింట్లోకి వెళ్లంగానే కలిపినపాలగిన్నెలూ, ఒలికిన పాలూ, పగిలిన వేడినీళ్ల సీసా, మొదలైన వన్నీ బాబుచేసిన అల్లరీ, పెనిమిటిబడ్డ పాట్లూ చెప్పకుండా చెప్పినవి. తనభర్త చాలా శ్రమపడ్డాడుకాబోలునని విచారించింది జానకి.

## ౬

మఱునాడు కళాసంఘంవారు తమ యేర్పాటు ప్రకారం యేలూరు వెళ్లారు. పాదుకాపట్టాభిషేక ప్రదర్శనానికి సర్వసన్నాహాలూ పూర్తిఅయినాయి. దానిలో జానకి కైకవేషం వెయ్యాలె. శాశ్వతంగా లోకనిందకు పాత్రలైన స్త్రీలలో కైక అగ్రగణ్య.

రాలు. సరళస్వభావయగు జానకికి కైకాపాత్రధారణం దుస్సహమనిపించింది. అయినా తప్పే దేమున్నది? తన ప్రాణేశ్వరున కొసగిన వాగ్దానం చెల్లించుకోవాలెగదా. ఆక్రిందటిరాత్రి బాబుతో పడ్డ కష్టం తలచి జగన్నాథం భార్యను నాటకానికి పంపడమంటే భయపడ్డాడుకాని కాదంటే సమితివారిచే మాటవస్తుందనీ, మిత్రులు అపహాస్యం చేస్తారనీ అనుకొని మాట్లాడకుండా వూరుకున్నాడు. మామూలుగా తొమ్మిదిగంటలకు జానకి నాటకశాలకు వెళ్లింది. హోటలునుంచి అన్నంరావడం ఆలస్యమైనందున అన్నంతినకుండానే నిద్రపోయిన లీల తల్లి అట్లా వెళ్లగానే నిద్రలేచి "నాన్నా, మాఅమ్మేదీ" అన్నది.

"అట్లా వెళ్లింది. వస్తుంది. ఏమి ఆకలేస్తున్నదా? అన్నంపెట్టనా" అన్నాడు తండ్రి.

"అమ్మచేత పెట్టించుకుంటా."

"అమ్మ యిప్పుడు రాదు."

"అమ్మదగ్గిరికి పోతా."

"అమ్మ దొడ్లోకి వెళ్లింది."

"నాకూ దొడ్డికి వస్తున్నది."

"వస్తే అచ్చి అరుగుక్రిందికి తీసుకుపోతుంది పో."

"అయితే రాటంలే; మాఅమ్మేదీ?"

"మీఅమ్మ యెక్కడికో పోయింది."

"అయితే నాకు బువ్వ యెవరు పెట్టుతారు?"

"నేను."

"ఛీ! నాన్నలు బువ్వపెడ్తారా, ఎక్కడన్నా?"

"పెడ్తారులే, రా"

"ఊఁ హూఁ. నాకు అమ్మే కావాలె."

లీల సన్నగా యేడ్వసాగించింది. ఆసడికి బాబుగూడా లేచి యేడ్వసాగిస్తాడేమోనని భయపడి జగన్నాథం లీలకు రెండుచేతుల్లో రెండు బిస్కట్లు పెట్టి, వేడిపాలల్లో కొంచెం కలకండపొడి వేసి త్రాగించి ఎత్తుకొనితిరగడం ప్రారంభించాడు. బాబు చేసినంత ఆగం చేయకపోయినా లీల మాటిమాటికీ "మాఅమ్మేదీ?" "మాఅమ్మేదీ" అని అడుగుతూ యేవేవో ప్రశ్నలు వేస్తూ తండ్రిని విసిగించి వదిలిపెట్టింది. లీలతోనే విసుగుతూఉండగా ఒంటిగంట అయ్యేసరికి బాబుగూడా నిద్రలేచాడు. లేచాడా అంటే, తారాజువ్వ; చంకకు రాడు; చేతిలో ఉండడు; ఉయ్యాల్లో పండుకోడు; పాలుపట్టితే త్రాగడు. జగన్నాథం లీలను దించి బాబును యెత్తుకున్నాడు. అది వఱకే ఏడవటానికి చూస్తున్న లీల తండ్రి క్రిందికి దించిన అవకాశం చూచుకొని బ్యారుమని యేడవటం మొదలుపెట్టింది. పోరుపెట్టి యేడవటంలో పూర్ణప్రజ్ఞుడనిపించుకున్న బాబు అక్కకు సాయమైనాడు. ఒక్క నేరస్థుణ్ణి యిద్దఱధికారులు ఒక్కమాటే శిక్షించడానికి పూనుకున్నప్పుడు పాపం, ఎంతసహనంగల అపరాధిఅయినా ఏమిచేస్తాడు? పాపం, యేడ్చేపిల్లలిద్దఱి మధ్యా జగన్నాథం నిర్వికారంగా నిలబడ్డాడు. వాళ్లను యెట్లా ఓదార్చాలో ఆతనికి తెలియలేదు. 'ఒక్కొక్క తల్లి అయిదాఱుగురు బిడ్డలను సులభంగా సముదాయించుకుంటుంది. ఆహా! మాతృమూర్తియం దెట్టి సహనసామర్థ్యాలు గర్భితమై యున్నవో! ఆశ్చర్యం! పురుషుడీవిషయంలో ప్రథమపాదమైనా వల్లించి ఉండలేడు.' అని యేవేవో భావాలు అతని హృదయాకాశాన జ్యోతిష్మతీలతలవలె మెఱవడం మొదలుపెట్టినాయి. కాని మాతాపితల సామర్థ్యాసామర్థ్యాలు విచారించి చర్చించి పర్యవసానం తేల్చుకోడాని కది సమయమా? తండ్రి యెత్తుకున్నా నిలవకుండా బాబు యేడుస్తుంటే "నన్నుకూడా యెత్తుకో" మని కాళ్లకు చేతులు పెలివేసి నిలవేట్టింది లీల. లీల చేస్తున్న మంకుతనానికి ఒక్కదెబ్బ వేద్దామా అనిపించింది జగన్నాథానికి. కాని ఆక్రిందటిరోజున బాబును కొట్టినందుకే పశ్చాత్తాపపడుతున్నాడుగనుక లీలను కొట్టటానికి చెయ్యిరాలేదు. వాళ్లతల్లిని వాళ్లదగ్గిర లేకుండా చేసిన దోషం తనదైనప్పుడు ఎట్లా కొడ్తాడు?

"నానీ! నిన్ను అప్పి యెత్తుకుంటుంది. ఏడ వకు. నామాట వినవూ? నీకు బొమ్మలూ, మిఠాయిలూ కొనిపెట్టవద్దూ?"

"కొత్తచొక్కాలో?"

"ఆఁ. కొత్తచొక్కాలూనూ?"

"బొమ్మలబొక్కో?"

"అదిగూడా. అన్నీ కొనిపెడ్తా, ఏడవకుండా ఉంటే."

"ఏడవను, అమ్మను చూపించూ."

"అదిగో రెండుగంటలైంది. మీ అమ్మ కారెక్కి వస్తుంది."

"ఎక్కడకు పోయిందీ?"

"బజారుకి."

"నన్ను తీసుకుపోలే దేం?"

"తమ్మన్నూ, నీవూ దోబూచులాడుకోండీ."

గేటువద్ద హారన్ధ్వని వినపడ్డది. "నాన్నా, కారొచ్చింది. అమ్మ రాలేదేం?"

"అదిగో వస్తున్నది చూడూ."

"ఆఁ, ఆఁ, అదిగో, అదిగో అమ్మ వస్తున్నది. అమ్మ వస్తున్నది." అని లీల చప్పట్లుకొట్టుతున్నది. బాబు ఏడుపంతా మాని కిలకిలా నవ్వుతూ అక్కతో బాటు చప్పట్లుకొట్టుతున్నాడు. మహోల్లాసంతో బిడ్డ లిద్దఱూ స్వాగతమిస్తూ ఉండగా జానకి వరండాచీడీ లెక్కింది బాబు చేతుల్లోకి దూకాడు. జానకి అక్కడే గోడనానుకొని కూర్చున్నది. తల్లి మెడలోని స్వర్ణహా రాలు చేతులతో లాగుతూ కాస్లూపుతూ బాబు పాలు త్రాగుతుంటే "నన్ను తీసుకపోకుండా నీ వెందుకు బజారుకు పోయినావు, చెప్పూ" అని మారాముచేస్తూ ప్రక్కనుంచీ తల్లిబుజముపై తలమోపి రుద్దుతున్నది లీల. జగన్నాథం ఆవిచిత్రం చూస్తూ తెల్లబోయి నిల బడ్డాడు.

## ౧౦

మూడవఆటకు నాటకసంఘంవారు రాజమండ్రి చేరారు. జమీందారుగారి బంగాళాలో వారి విడిది. ఆనాటినాటకం సారంగధర. జానకి ఆనాడు చిత్రాంగి వేషం వెయ్యాలె. సారంగధరనాటకం చూచే ప్రతి వారికీ తప్పెవరి దనేసందేహం తప్పకుండా కలిగితీరు తుంది. న్యాయం, రాజరాజనరేంద్రుడిదే ముమ్మాటికీ తప్పంటుంది. నీతి చిత్రాంగిదే తప్పంటుంది. అయితే కొడుకుపటం చూపి తాను పెండ్లాడిన రాజరాజ నరేంద్రుని దుష్కృత్యాన్ని ఎవరూ అనుకోరు. తాను రూపపటమందు చూచిన యువకునియందే అనురాగం కలిగిఉండిన చిత్రాంగిని దూషిస్తుంది లోకం. మానవ జీవితంలో నీతి అతిప్రాముఖ్యమైన విషయం. నీతిని విడ నాడి ఎవరు ఎంతటివారు లోకంలో మంచివా రనుపిం చుకోలేరు. మానవుల జీవితోన్నతి నీతిసూత్రంచేత నిబ ద్ధమైఉన్నది. అది ఒక్కొక్కపట్టులో అవలంబించ డానికికష్టమైనప్పటికీ విడవడానికి వీలుగానిది. కాబట్టే చిత్రాంగి లోకదూషణకు గురైంది. "రాజరాజనరేం ద్రుడు చేసింది తప్పేఅనుకో, అయిందేమో అయింది, తాను నీతిగా ఉండరాదూ," చిత్రాంగిని లోకం మంద లించే దిందుకు. కనుక లోకంలో పవిత్రమైన నీతికి ప్రాముఖ్యత ఉన్నన్నాళ్లూ చిత్రాంగి మంచిదనబడదు. అందులో గోరంతలు కొండంతలుగా వ్రాయ నలవాటు పడ్డ మనకవులు తమ వెఱ్ఱిమొఱ్ఱివర్ణనలతో చిత్రాంగికి మతీమాలిన్యం కలిగించారు. కాబట్టే లోకంలో విలా సాతివిలాసంగా తిరిగే దుర్నీతిస్త్రీలను 'అదొక చిత్రాంగి' అనడం లోకసాధారణం అయిపోయింది. శ్రవ్యకా వ్యాల్లో చిత్రాంగిదౌష్ట్యం ఎంత హద్దుమీరినా భయం లేదుకాని దృశ్యకావ్యాల్లో చిత్రాంగిమోహవ్యవహారం హద్దుమీరించడం నటకులకు ప్రాణకంటకం. అందులో ఒక కులాంగన ఆపాత్రధారణంచెయ్యాలంటే అదిసామా న్యమైన కష్టంగాదు. చిత్రాంగిపార్టు వల్లించిందేగాని దానినిఅభినయించడ మెల్లాగని జానకి లోలోపల క్షోభి ల్లిపోతున్నది. పరమసాధుశీలుడగు నొకపురుషుని తానే ప్రణయవ్యవహారాలకు ప్రేరేపించుతూ నానా అసభ్య

క్రియలూ చెయ్యాలే. ఒక మానవతి యీపాత్రధారణం చెయ్యడ మెట్లా? సారంగధరలో ఆశయ్యారంగంలోని ప్రతిపదమూ జానకిప్రాణాన్ని అర్చివేస్తున్నది. క్షుభితసాగరంవలె ఉన్న హృదయంతో "ఆయనవద్దు అనేవఱకు నేనీ నీచకృత్యం చేయకతప్పదు. నే నేమి చేయను? ఆ ఒట్టు నన్ను కట్టివేసింది. ఇది నాపతివ్రతాధర్మాల్లో ఒకధర్మాచరణం. దీనివల్ల నా నిర్మలశీలానికి యెగ్గ రాకుండుగాక. నా సర్వస్వం భర్తకు సమర్పించాను. ఈశరీరం ఆయనదికాని నాది కాదు. కాబట్టి యీతనువును ఆయన యెన్నెన్నివిధాల వినియోగించుకొని ఆనందించాలంటే అన్నన్నివిధాలా వినియోగపడి ఆయనను సంతోషపెట్టడమే నాధర్మం" అని తాము బసచేసిన బంగాళావరండాలో కూర్చొని ఆలోచిస్తున్నది జానకి.

జగన్నాథంగూడా ఆవరండాలోనే జానకికి సమీపంగానే పచారుచేస్తున్నాడు. అతనూ భార్యవంక చూస్తున్నాడు; యేమో ఆలోచిస్తున్నాడు; జానకి మామూలుగా లేదని తెలుసుకున్నాడు; బహుశా నాటి చిత్రాంగి పాత్రాభినయమే ఆమెను కలవరపెట్టుతున్నట్టుందనిగూడా గ్రహించాడు. "జానకికి చాలా మనోవ్యథ కలిగిస్తున్నా"ననిగూడా అతనికి తోచింది. తన్ను సర్వవిధాలా పోషించి రక్షిస్తాడనేగదా స్త్రీ తన్ను పురుషునికి సమర్పించుకుంటుంది. ఆవిధంగా తన్నే నమ్ముకున్న సతిని పురుషుడిట్టి అనుచితకార్యములకు వినియోగింపవచ్చునా? ఇది పురుషుడు తన భర్తృత్వాధికారం దుర్వినియోగం చేయడంకాదా? అయిందేమో అయింది. ఇంతటితో మానిస్తే ఏమి? తీర్మానం తెచ్చింది తాను; నెగ్గించింది తాను; ఆచరణలో పెట్టిందితాను; ఇప్పుడు వెనకతీసిందిగూడా తానేఅయితే నల్గురూ నవ్వరూ? కాని "వాళ్ల నవ్వుకోసం నాభార్యనిట్లా యెంతాకాలం హింసించేది? బిడ్డల నెన్నాళ్లు అల్లాడపెట్టేది? నే నెన్నాళ్లు అవస్థపడేది? అబ్బా! ఒక్కొకరాత్రి వేగించేటప్పటికి తలప్రాణం తోకకు వస్తున్నదే! పిల్లలు చెడిపొయ్యేట ట్లున్నారే! జానకి గూడా నిద్ర లేకపోవడంచేత కాబోలు, శిరోవేదనతో బాధపడుతున్నదే! ఏమిటీఘోరం! నాకళలో న్మాదానికి నాభార్యాబిడ్డలను బలిపెట్టనా?" అని యోచిస్తున్నాడు జగన్నాథం. ఇంతలో "అబ్బాయిగా రేడుస్తున్నారండీ; ఎంత ఊరుకోబెట్టినా ఊరుకోడం లేదండీ; ఒళ్లుగూడా వెచ్చగా ఉందండీ," అంటూ అచ్చి పిల్లవాడిని జానకి వద్దకు తీసుకవస్తూ అన్నమాట జానకిజగన్నాథులచెవుల్లో ఒక్కమాఱుగా చుఱుక్కున తగిలింది. "ఏమే, ఒళ్లు వెచ్చబడ్డదా?" అంటూ ఆత్రంలో బిడ్డను చేతికి తీసుకుంది జానకి. జగన్నాథం జానకి బిడ్డను చేతికి తీసుకుంటూ ఉండగానే తటాలున వచ్చి పిల్లవాని ఒంటిపై చెయ్యిపెట్టి చూచి "ఆc. జ్వరమే. ఒళ్లు బాగా వెచ్చగా ఉంది." అన్నాడునెమ్మదిగా దిగులుతో.

"ఎండలూ, ప్రయాణం, ఊరి ఊరి నీళ్లు త్రాగడం; పిల్లవాడికి జబ్బుచేస్తుందని అనుకుంటూనే ఉన్నా. అట్లాగే జరిగింది."

"రాత్రిళ్లు నిద్రగూడా లేదు."

"నిజమే."

"రాత్రికి నీవు ఆటకు వెళ్లాలిగా?"

"వెళ్లొద్దూ?"

"పిల్లవాడిని పట్టుకోడం కష్టమేమో?"

"ఆc, కష్టమే."

"అయితే ఈపూట ఆటకు వెళ్లడం మానితే సరి."

"సర్వ సన్నాహాలు చేసుకొని ఊరంతా ప్రకటనపత్రాలు పంచి మూడురోజులనుండీ టిక్కట్లు అమ్ముతూ ఇప్పుడు మానితే బాగుంటుందా? ఎంత గోల అవుతుంది?"

చిన్నబోయిన ముఖంతో ఆకాశంవంక చూస్తూ "ఇది మూడో ఆట" అన్నాడు జగన్నాథం భారంగా.

"అవును, ఈరాత్రి ఎట్లాగో గడిపేస్తే" అన్నది జానకి.

## ౧౧

రాత్రి, తొమ్మిదిన్నరగంటలకు యథాప్రకారంగా జానకిని నాటకశాలకు తీసుకపోవడానికి కారు వచ్చింది. ఎంతధైర్యం తెచ్చుకున్నా జానకికి నాటకశాలకు పోవడానికి కాళ్లాడలేదు. ముమ్మారు లోపలికి పోయి, ముమ్మారు బయటికి వచ్చింది. పిల్లవాడిని పట్టి పట్టి చూచింది. బిడ్డ ఉలిక్కి-ఉలిక్కి పడుతున్నాడు. కలవరిస్తున్నాడు. "జ్వరం తీవ్రంగా ఉన్నది. ఎట్లా వదిలిపెట్టిపోను" అనుకున్నది. కన్నులు తడిఅయితే పైటచెరుగుతో తుడుచుకున్నది. పెనిమిటివంక చూచింది. "ఎందుకు ఆలస్యం చేస్తావు?" అన్నాడు జగన్నాథం.

"ఏమీ లేదు. కాక తగిలితే పిల్లలు ఆదమఱచి నిద్రపోరు. పోరుపెట్టి యేడుస్తారు. మీరు యెట్లా ఓదార్చగలరని సందేహిస్తున్నా."

"భయం లేదు. ఏదోవిధంగా చూస్తా పో."

"ఈరాత్రి కారు యిక్కడే ఉంటుంది. బాబు లేచి ఏడిస్తే కారు పంపించండి, తక్షణంవస్తా."

"అప్పుడు నీవు రాజరాజ నరేంద్రుడిమహలులో ఉంటావేమో."

"ఆమహలుకు పంపించింది మీరేగా? మీఒక్కటే నాకు చరణశృంఖల కాకపోతే నాచిన్నిబాబును ఈ సమయంలో విడవమన్నా విడుతునా? నాబిడ్డను చూచుకోడంకంటే నాట్యరంగం నాకెక్కువగాదు. ఈబొంది యెక్కడ ఉన్నా నేను మీఅంతరంగంలోనే" అన్నది జానకి. జగన్నాథం సిగ్గుతో మారుమాట్లాడకుండా తల నేలకు వంచుకున్నాడు. జానకి వెళ్లి కారు యెక్కింది.

## ౧౨

నాటకశాలకు వచ్చిందన్నమాటేగాని జానకికి మనసులోమనసు లేదు. తన ప్రియపుత్రుడైన బాబుకు జ్వరంరావడం, తాను దుష్టమైన చిత్రాంగిపాత్రధారణ చేయవలసియుండడం, రెండూ రెండు అంపాలలాగా ఆమెహృదయాన్ని కోసివేస్తున్నవి. సారంగధరనాటకంలోని ఆవలపుగీతాలు, ఆవిరహవాక్యాలు తలుచుకుంటే ఆమెకు శరీరం కంపరమెత్తిపోతున్నది; అవయవాలు పట్టుతప్పిపోతున్నవి. ఎట్లాఉన్నా కర్తవ్యంఒకటి ముందుకు నెట్టడంచేత ఎలాగో కాళ్లునిలవద్రొక్కుకొని స్టేజీ మీదికొచ్చింది.పద్యంవంతు వచ్చింది. ఆరంభించింది.

చ. అనదవిధంబు వాటిలె
    ననంగుని బారి......కి...నో......జాలనీ
యెనిమిదినాళ్లనొక్కగతి
    నేస్చుచు బాపిలి నింక దా.........నా
మనసిజరూపవైభవుని
    మానవతీనవమోహనాంగునిక్
దినకరతేజునిక్ విభవ
    దివ్యబిడౌజునిగూ............

అనిపాడింది. సాధ్వీధర్మానికి కళంకందెచ్చే ప్రత్యక్షరం జానకినోట వెలువడక అప్రయత్నంగా లుప్తమైపోయింది. జానకి పద్యపఠనాన్నైఖరి ప్రేక్షకులకు అసహ్యమైపోయింది. "ఇంత తెత్తెర్తేఅసేదానవు రంగానికెందు కొచ్చావు? ఏ" అని అరుస్తూ జనమంతా గొల్లున గోలెత్తి చప్పట్లుకొట్టారు. జానకి తలపై పిడుగుపడ్డట్టయింది. నిర్ఘాంతపోయి నిర్జీవప్రతిమలాగా అయిపోయింది. కొంతసేపటికిగాని కళ్లవెంటనైనా నీళ్లురాలేదు. తల నేలకు వంచుకుంది. కన్నీళ్లు జొటజొట నేలమీద పడుతున్నాయి. తిన్నగా నేపథ్యంలోకి వెళ్లిపోయింది. "వారంరోజులు నుంచీ పత్రికలు ఈమె అభినయాన్ని గురించి పడ వ్రాస్తుంటే వచ్చాము. ఆవ్రాసినవాళ్లెవరూ ఈమె అభినయం చూచినట్టులేదు. అయ్యో? అర్ధరూపాయి దండుగ రూపాయి నష్టం. మూడురూపాయలు పాడు. ఇవ్వాళ మాకుటుంబానికంతా మొత్తం టిక్కెట్లక్రింద ఇరవైరూపాయలు మసి" అని యెవరుపెట్టిన దండుగ వాళ్లు ఏకరువు పెట్టుకుంటున్నారు; ఈలలు వేస్తున్నారు; చప్పట్లు కొట్టుతున్నారు. "అట ఆపేశారా! అయితే మాడబ్బు పారేయం" డంటున్నారు. తక్కువరకం టిక్కెట్లు కొన్నవాళ్లే ఎక్కువ అల్లరి చేస్తున్నారు.

"గొంగట్లో అన్నం పెట్టుకొని వెండ్రుకలు వచ్చి నాయని అసహ్యపడితే ప్రయోజన మేమిటి" అనుకొని ప్రేక్షకుల అల్లరిచే కడు నొచ్చిపోయిన జానకి ఎట్లాగో కొంచెం ధైర్యం తెచ్చుకొని మళ్లీ స్టేజీమీదికొచ్చింది. కాని ఆ అసభ్యపదా లుచ్చరింపలేక మాటిమాటికి నాలుక యెదురు తిరుగుతునే ఉన్నది. ఆడియన్సు అల్లరిచేస్తునేఉన్నారు.



"మెల్లగా బయటికివచ్చి...నిద్రపోతున్న డ్రైవరును లేపి..."

## ౧౩

బాబుకు నిద్రలేదు. క్షణక్షణానికి జ్వరం హెచ్చిపోతున్నది. కొలిమితిత్తుల్లోంచి వచ్చినట్లు ముక్కుల్లోంచి వెచ్చని శ్వాస వస్తున్నది. "ఊఁ ఊఁ" అని పెద్దవాళ్లు మూలిగినట్లు మూలుగుతున్నాడు; నడుమ నడుమ ఉలికిపడుతున్నాడు; ఏడుస్తున్నాడు; జగన్నాథంగుండె లవిసిపోతున్నవి. ఆపిల్లవాడి బాధ చూడలేకుండా ఉన్నాడు. బాబుకుయెదురుగా కుర్చీవేసుకొని కూర్చోడానికిగూడా అతనికి భయమేసింది. "తల్లి దగ్గరఉంటే యేమిచేశేదో! డాక్టరును పిల్చుకొస్తామన్నా పిల్లవాడివద్ద ఉండేవాళ్లెవరూ లేరు. ఏమిటి కర్తవ్యం?" అని క్షణమాలోచించాడు జగన్నాథం. జానకి పిల్లవాడు యెప్పుడు యేడిస్తే అప్పుడు తీసుక రమ్మన్నదికదా. ఏమైతే అదేఅవుతుంది. పిల్లవాడిని తీసుకొని అక్కడికే పోదా మనుకున్నాడు.

అచ్చి, లీలా లోపల నిద్రబోతున్నారు. అచ్చిని లేపితే లీలగూడా లేస్తుందేమో నని భయం. అందువల్ల అచ్చినిగూడా లేపకుండా పిల్లవాడిని బుజాన పడుకో బెట్టుకొని మెల్లగా బయటికి వచ్చి తలుపులువేసి తాళం నొక్కి కారులో నిద్రబోతున్న డ్రైవరును లేపి 'కారు సిద్ధంచేయవోయి' అన్నాడు జగన్నాథం. కళ్లు నులుముకుంటూ లేచి "సిద్ధంగానే ఉన్నది మహరాజ్, దయచేయం" డన్నాడు డ్రైవరు కాసీమ్. పదినిముషాలలో కారు నాటకశాల చేరింది. ఇంతలో బాబు కొంచెం కూర్కడం చేత పిల్లవాడిని కారులో మెత్తమీద పడుకోబెట్టి "కాసీమ్, అబ్బాయిని చూస్తూఉండూ. లోపలికి పోయి పరిస్థితు లెట్లా ఉన్నాయో చూస్తా" నన్నాడు జగన్నాథం. "చిత్తే" మన్నాడు కాసీమ్. జగన్నాథం లోపలికి పోయినాడు. నాటకంచూడడానికే ప్రొఫెసర్ గారు వచ్చా రనుకొని "రండి, రండి," అని స్వాగత

మిచ్చారు సమితిపెద్దలందఱూ. కాని జగన్నాథం వారి స్వాగతం యేమీ అందుకోకుండానే సరాసరి వెళ్లి స్టేజీకి సమీపంగా ఉండే కుర్చీలవద్ద నిలబడ్డాడు. అప్పుడు చిత్రాంగీ సారంగధరులకు శయ్యాగృహంలో వాదప్రతివాదాలు జరుగుతున్నవి. సారంగధరుడు "శివ, శివా" అని తొలుగుతూ ఉంటే "ప్రాణవల్లభా!" "యువతీమదనా!" "మనో రమణా" అంటూ అతని వెంట నంటి తిరుగుతున్నది చిత్రాంగి. ఆదృశ్యం చూచేటప్పటికి జగన్నాథానికేమో ఒంటిమీద తేళ్లూ జెఱ్ఱులూ ప్రాకినట్లయింది; మనస్సు మనస్సులో లేదు; ముఖంమీద కళ తొలిగింది; కన్నుల్లో తేట పోయింది. వెఱ్ఱిచూపు, వికృతాకారం అయిపోయి నిలుచున్నాడు. "సారంగా! కోమలము నీ శరీరము, కోమలాతి కోమలము నీముద్దుమాటలు! అట్టి నీ కీవజ్రహృదయ మెట్లు గలిగె? శూలముల బోలు నీమాటలు నాయెద నాట నుద్యమించియు నదేమిదైవాయత్తమో కందుకముల బోలె నీ యొద్దకే యెదురేగుచున్నవి. నీమాన... నాయానన......ఆ......మ......నా న ని ను మాన జాల. నీ.....యా......శ్లే......" అని యేమేమో అంటున్నది. జగన్నాథం నిబ్బరించుకోలేక పోయినాడు. చిత్తం వశం తప్పిపోయింది. "ఆఁ, ఆఁ, జానకీ! ఎంత సాహసాని కొడిగట్టావు!" అని పెద్దబొబ్బలు పెట్టుకుంటూ అమాంతంగా స్టేజీమీదకు పరుగెత్తాడు.

హృదయవిదారకమైన ఆపలుకులు విని జానకి క్రుంగిపోయింది. కనులవెంట నీళ్లు జొటజొట కారుస్తూ గుండెమీద చేయిపెట్టుకొని "నేనా యీసాహసానికి ఒడిగట్టింది. నిజంచెప్పండీ? ఒట్టుబెట్టి వంచించి బుద్ధిపూర్వకంగా నన్నీ అగ్నిగుండంలో త్రోసింది మీరు కాదూ" అన్నది దీనంగా. జగన్నాథం ఏమంటాడు? నేరం ఋజువైన అపరాధిలాగా అయిపోయినాడు.

* * * *

* * * *

కథ కంగారుగా మధ్యలో ఆపివేసి భార్యాభర్తలిద్దఱూ పూర్వోత్తరగాథలన్నీ చెప్పుకుంటూ ఉంటే చూస్తూ కూర్చోటానికి ప్రేక్షకులు బొమ్మగాళ్లా? రేకులతో గట్టిన నాటకశాల శిలావర్షంతో ధణధణామన్నది! చెప్పులు, చేతికఱ్ఱలూ రెక్కలువచ్చినట్లు యెగిరినాయి. ఈలలూ, చప్పట్లూ, కేకలూ—ఒకటేమిటి నానాబీభత్సం! ఈప్రజాదౌర్జన్యానికి ఓపలేక సమితివారు టిక్కెట్లరుసుము ఆడియన్సుకు వాపస్ చేసి ప్రాణం దక్కించుకున్నారు. ఈమహాగందరగోళంలో జగన్నాథం యెట్లా బయటపడ్డాడో తెలియదు. కాని "పెళ్లాంచేత నాటకాలాడించడానికి వచ్చిన ఆ ప్రొఫెసర్ గారు సమితిలో విడాకులుపుచ్చుకొని రాత్రే సకుటుంబంగా బండియెక్కాడుటోయి" అని తెల్లవారేటప్పటికి ఊరంతా గుప్‌మన్నది.

---

ఆంధ్రగ్రంథమాల నూతన కుసుమము

## ఆంధ్ర ఋతుసంహారము

(కాళిదాసుకృతికి అనువాదము)

అనువాదకులు: గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యంగారు, బి. ఎ.,

ఆంధ్రగ్రంథమాల, తపాలాపెట్టె 212, మదరాసు.

# శ్మశానవాటి

జి. జాషువ

ఎన్నోయేండ్లు గతించిపోయినవి, గానీ, యీశ్మశానస్థలిన్
గన్నుల్ మూసిన మందభాగ్యుఁ డొకఁడైనన్ లేచిరాఁ డక్కటా!
యెన్నాళ్లీ చలనంబులేని శయనం బేతల్లు లల్లాడిరో
కన్నీటం బడి, క్రాఁగిపోయినవి నిక్కం బిందుఁ బాషాణముల్.

ఆకాశంబును కాఱుమబ్బుగము లాహారించె, దయ్యాలతో
ఘూకంబుల్ జెరలాడ సాగినవి, వ్యాఘోషించె నల్దిక్కులన్
గాకోలంబులు, గుండెఝల్లుమనుచున్నన్ జూడ నిక్కాటిలో
నాకల్లాడిన జాడలే దిచట సౌఖ్యం బెంత క్రీడించునో!

ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని కలము నిప్పులలోనఁ గఱఁగిపోయె
నిచ్చోటనే భూము లేలు రాజన్యుని యధికారముద్రిక లంతరించె
ఇచ్చోటనే లేఁత యిల్లాలి నల్లపూసలసౌరు గంగలోఁ గలసిపోయె
నిచ్చోట నెవని పేరెన్నికం గనుఁగొన్న చిత్రలేఖనము నశించిపోయె
ఇది పిశాచులతో నిటాలేక్షణుండు - గజ్జెగదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమా దృష్టు లొలయ - నవనిఁ బాలించు భస్మసింహాసనంబు.

ముదురుతమస్సులో మునిఁగిపోయిన చిన్నిసమాధిమీఁదఁ బై
బొదలు మిణుంగురుంబురుఁగుపోలిక వెల్గుచునున్న దివ్వె, ఆ
ముద ముడివోయినన్ సమసి పోవుటలే దది దీపమందుమా?
హృదయముసుమ్మి, నిల్పిచనియెన్, గతపుత్రక, యేయభాగ్యయో!

ఆలోకించిన గుండియల్ గఱఁగునా యాపిల్లగోరీలలో
నే లేబుగ్గలసౌరు రూపఱియెనో! యేముద్దు నిద్రించెనో!
యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో!
యీలోకంబున వృద్ధిగాఁదగిన యే యేవిద్య లల్లాడునో!

వాకొనరాని గొప్పధనవంతుని యద్దపుఁ దెల్లరాతి గో
రీకడఁ బారవేయఁబడి ప్రేలికలం బడియున్న ప్రేతమే

యాఁకటిచిచ్చునన్ గుమిలి యార్చి, గతించిన పేదవాని దౌ
నో కద, వానికై వగవఁ డొక్కఁడు, దాఁచదు కాటినేలయున్.

కవుల కలాలు, గాయకుల కమ్మనికంఠము లీ శ్మశానపుం
గవునులఁ ద్రొక్కి చూచెడి నొకానొకనాఁ డల కాళిదాస భా
రవుల శరీరముల్ ప్రకృతిరంగమునం దిపు డెంతలేసి రే
ణువులయి, మృత్తికన్ గలిసెనో కద కుమ్మరవాని సారెపై?

ఇట నస్పృశ్యత సంచరించుటకు తావే లేదు, విశ్వంభరా
నటనంబున్ గబళించి, గర్భమున విన్యస్తంబుగావించి, యు
త్కటపుం బెబ్బులితోడ మేఁక నొకప్రక్కన్ జేర్చి, జోకొట్టి, యా
రట గల్పించు నభేదభావమును ధర్మం బిందుఁ గారాడెడిన్.

---



నారుతీత

—యస్. శంకరసుబ్రహ్మణ్యము.



# ఆంధ్రాభ్యుదయము



శ్రీ పొట్లూరు హనుమంతరావుగారు

బందరు జాతీయకళాశాలలోని హనుమంతరాయ చిత్రకళామందిరమున ఓరియంటల్ ఆర్టులో చేరి రోమేంద్రనాథ్ చక్రవర్తిగారి శిష్యత్వమున చిత్రకళ నభ్యసించిరి. వీరి చిత్రములు, అనేకచిత్రకళా ప్రదర్శనముల బహుమానముల గడించినవి. వీరి చిత్రములు తరుచు భారతియందు ప్రకటితము లగుచున్నవి.

---

10. 12- 19 ౯౮3




ప్రొఫెసరు వడితాండ్ర లక్ష్మీనారాయణనాయుడుగారు

ప్రొఫెసరు కోడి రామమూర్తిగారి శిష్యులు. బలప్రదర్శనమునందు అనేకబహుమతులును బడసి ౧౯౦౧ సం. కలకత్తా కాంగ్రెసుసమయమున ప్రపంచపుపోటీయందు కొందరు విదేశపు శాండోలనుగూడ ఓడించి ప్రథమబహుమతి బడసిరి. నైజాము ప్రభుత్వమువారు వీరికి ఒక కత్తిని బహుమతిగా నొసంగిరి. వీరు ప్రస్తుతము మదరాసులో నున్నారు. జనవరివరకు నుండి తరువాత తిరువాంకూరునకు బోవనున్నారు. మదరాసులో కొన్ని ప్రదర్శనములు గావింపనున్నారు.




## నాలందా పురాతన నిర్మాణములు

MAIN ENTRANCE

CONCRETE PAVEMENT

BRICK PAVEMENT OF COURTYARD

CONCRETE PAVEMENT OF VERANDAH

CONCRETE PAVEMENT

SECTION ON A.B. LOOKING NORTH

MAIN SANCTUM

PASSAGE

PLAN

CELL

VERANDAH

COURTYARD

MAIN ENTRANCE

PASSAGE

MAIN SHRINE

VERANDAH

SUPERINTENDENT, ARCHAEOLOGICAL SURVEY CENTRAL CIRCLE.

సంఘారామముల నమూనా

ఈ శిథిలములు ఆరవ పండ్రెండవశతాబ్దుల నడిమిభాగమునకు చెందినవి. సన్నివేశమునకు తూర్పున సంఘారామములవరుసయు, పడమట భగ్నస్తూపముల శ్రేణియు, దక్షిణమున మరిరెండు సంఘారామములునుగలవు.

ఆరవసంఘారామమునకు నడుమ నొక ముంగిలి కలదు. అదియంతయు ఇటుకలుపరచినది. వసారాలును, గదులును మాత్రము కంకరపరచినవి. ఈ ముంగిలిలో ప్రధానగర్భగృహమునకు ఎదురుగ, పొట్టి, విశాలము నగు నొక చబుత్ర శిథిలములు బయలుపడినవి. పొట్టిగోడ చేరుమకంబములు దాని అడుగునకును, బోదెకును నడుమ వరుసగ నుండినవి. చబుత్రకు మధ్యగ విశాలమైన మెట్లు కట్టబడినవి. ఈ ముంగిలికి నడుమ ఉత్తరపు ఖిల్లగోడ నానుకొని యొకవిగ్రహముకూడ కనుపించినది. దానికెదురుగ నొక చిన్న చబుత్ర. దేవపాలసంఘారామ నిర్మాణానంతరము ఇదే శిథిలములపైన ఇట్టిదే మరియొక చిన్నవిగ్రహము నిర్మింపబడినది. ముంగిలికి పశ్చిమోత్తరమున నొకబావి, ఒక చిన్న చబుత్ర బయలుపడినవి.

ఏడవసంఘారామమున మూడు ముఖ్యమైన కట్టడములు గలవు. ఈ మూటిలోను నడుమది దేవపాలమట్టమును పోలియున్నది. [ భారత పురాతన వస్తుపరిశోధన శాఖవారి నివేదికనుండి ]

---



ఈ త క ర్తె

సన్నీ లౌరీ కన్య. ఇంగ్లీషు యువతి. ఈమె ఫ్రాన్సుఒడ్డున ఇంగ్లీషుచానలు (కాలువ) లో దిగి ఈదుచు ౧౫ ఘ. ౪౦ ని. లకు ఇంగ్లండు ఒడ్డు చేరినది. ౧౯౩౦ తరువాత ఈమెయే మొదట దాటినది.

---




## కుమారి జయంతిదేవి

ఈబాలిక ౭ సం. వయస్సుగలది. ఈమధ్య అలహాబాదులో జరిగిన ఓరియంటలు క్లబ్బు ఈతపందెము లందు పాల్గొని యమునానదిని రెండుసార్లు విరామము లేక యీదెను. చేతులు కాళ్లు కట్టివేసి ౧౨ అడుగుల ఎత్తునుండి నీటి దుమికి యీదెను. బంగారుపతకమును, వెండిగిన్నెలను బహుమతి బడసెను. గంగానదిని ఇవతలి ఒడ్డునుండి అవతలి ఒడ్డునకు ఈదగల్గెను. ఈమె కాశీనివాసు లగు బాబు కాశీనాథుగారి కొమార్తె.

## కవితాసమితి వార్షికోత్సవమునాటి ఆంధ్రకవుల ఛాయాచిత్రప్రదర్శనము (విశాఖపట్టణము)



క్రింద:—పట్టిసపు శ్రీరామమూర్తి, శ్రీరంగం నారాయణబాబు, పూడిపెద్ది వేంకటరమణయ్య, ముద్దా విశ్వనాథము.

కుర్చీలలో:—ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ, తెన్నేటి విశ్వనాథము, పురిపండా అప్పలస్వామి, మల్లంపల్లి సోమశేఖరశర్మ (ప్రదర్శన ప్రారంభకులు.), గిడుగు వేంకటరామమూర్తి, మారేపల్లి రామచంద్ర శాస్త్రి, సబ్నవీసు సత్యకేశవరావు, గొబ్బూరు వేంకటానందరాఘవరావు, కేతవరపు వేంకటశాస్త్రి.

నిలువబడినవారు–౧-వ వరుస:—చెలికాని సత్యనారాయణ, తెన్నేటి వేంకటరామమూర్తి, గొడవంటి బ్రహ్మాజీరావు, సున్నం వీరరాజు, గిడుగు సీతాపతి, నిడుదవోలు వేంకటరావు, వెంపటి సత్యనారాయణ, డా. సుబ్బారావు.

౨-వ వరుస:—శ్రీరంగం శ్రీనివాసరావు, కాశూరి వేంకటనరసింగరావు, తురగా వేంకటరామయ్య, మల్లిమడుగుల జగన్నాథరావు, యామిజాల రామనరసింహము, మొసలికంటి సంజీవరావు, నిరోగి రామమూర్తి శాస్త్రి.

—౨౭-౧౦-౧౯33.

---



## నందనారు చరిత్రము

ఇయ్యది ఆంధ్రగ్రంథమాలయందలి ౬౧-వ ప్రచురణము; శ్రీకృష్ణ కౌండిన్యప్రణీతమగు సెనిమిదంకముల నాటకము. ఇందు సుప్రసిద్ధభక్తుఁడగు నందనారుస్వామియొక్క చరిత్రము వర్ణింపఁబడియున్నది.

నందనారుస్వామి పరిపక్వభక్తియుక్తుఁడై చిదంబర క్షేత్రమందలి నటరాజలింగముతో నైక్యము పొందిన యాదిద్రావిడుఁడు. అతనికాలము సరిగఁ దెలియరాదు; కాని క్రీ. శ. ౮-వ శతాబ్దమున రచియింపఁబడిన యొక గ్రంథమున నతనిచరిత్ర కొంచెము సూచింపఁబడుటచే నందనారు క్రీ. శ. ౮-వ శతాబ్దముకంటెఁ బ్రాచీనుఁడని చెప్పవచ్చును.

ఈచరిత్రము పెక్కుగ్రంథములలోఁ బెక్కురీతులఁ గన్పడుచున్నది:

౧. సుందరస్వామి యనునతఁడు క్రీ. శ. ౮-వ శతాబ్దమున "తేవారమ్" అనునొక గ్రంథమును రచించియున్నాఁడు. అందలి "తిరుత్తొండత్తొగై" అనుభాగమునఁ గొందఱు లింగైక్యము చెందినమహాభక్తుల పేరులు కలవు. అందు ఆదిద్రావిడుఁడగు "తిరునాళైప్పోవార్" కూడఁ బేర్కొనఁబడియున్నాఁడు. నందనారునకే "తిరునాళైప్పోవార్" అను నామాంతరమున్నట్లందఱు నంగీకరించుచున్నారు. "నాళైప్పోవార్" అనఁగా "రేపు పోవువాఁడు" అని యర్థము. "తిరు" అనుపదము "శ్రీ" అను నర్థమునఁ దమిళమున నుపయోగింపఁబడుచున్నది.

పరమభక్తుఁడగు నందనారు తన్ను తనమిత్రులు చిదంబర ప్రయాణమును గూర్చి ప్రశ్నించునపుడు "రేఁపు పోయెదను; రేఁపు పోయెదను," అని జబాబు చెప్పెడివాఁడఁట! అక్కారణముననే అతనికి "నాళైప్పోవార్" అను నామముకలిగెన దఁట! సంస్కృతమునఁగల "శ్వోగంతృచరితము" న నీఁదిపదమునకే "శ్వోగంతా" అను ప్రతిపదము వాడఁబడియున్నది.

నీఁది "తేవారము" న నితనినామమే-అవ్యక్తముగ నే-కిలదుగాని చరిత్ర కన్పింపదు.

౨. క్రీ. శ. ౧౦-వ శతాబ్దమున "నంబియాండార్ నంబి" యనునతఁడు "తిరుత్తొండర్ తిరువందాది" అను గ్రంథమును రచించెను. అందును "తిరునాళైప్పోవార్" పేర్కొనఁబడియున్నాఁడు. అతని యథార్థనామమగు "నందనారు" ఇందును గానరాదు. "నాళైప్పోవార్" మాలదాసరియైనను, చిదంబరమునందలి దీక్షితులందఱు నతనికి నమ్రులై నమస్కరించిరనియిందుఁ జెప్పఁబడినది. "తేవారము"న కంటె నిందుఁగలవిశేష మిదియే.

3. క్రీ. శ. ౧౧-వ శతాబ్దమున "శేక్కిడర్" అనునతఁడు "పెరియపురాణము"ను వ్రాసెను. అందు గూడ నీనందనారుచరితము కలదు. "నాళైప్పోవార్" అనునతఁడే నందనారని యిందుఁ జెప్పఁబడినది. మీఁది గ్రంథములరీతిఁగాక యిందు నందనారుచరిత్రము పూర్తిగ వివరింపఁబడినది.

నందనారు పంచమభక్తుఁడు; అదనూర్ గ్రామ నివాసి. దేవాలయములందలి వాద్యముల కయి సంగళ్లకుఁ దోళ్లిచ్చుట, తటాకములను త్రవ్వించుట మొదలగునవి యితని పనులు. అదనూరు సమీపమున గల "తిరుప్పున్ గూరు" నందలి శివుని దర్శించుటకాతఁ డెన్నియో సారులు ప్రయత్నించెను. కాని యచ్చటి దీక్షితులతనిని దేవాలయమువరిసైనఁ జేరనీయరైరి. తుదకు శివునికే దయకలిగెనది. రాతినంది కదలినది. నందనారునకు దేవదర్శనభాగ్యము లభించినది. పిదప నితఁడు నటరాజస్వామిని దర్శింపఁ జిదంబరమున కేఁగెను. అచటి దీక్షితులతనిని దేవాలయము చేరనీయలేదు. నటరాజస్వామి దీక్షితులకు స్వప్నమునఁ గన్పించి నందనారు అగ్నిచేఁ బవిత్రుఁడై తన్ను దర్శింపవచ్చునని చెప్పెను. ఇట్లే యగ్నిపరీక్షనిచ్చి నటరాజస్వామిని దర్శించి వెంటనే-అచటనే లింగైక్యముఁ జెందెను.

ఈ పెజీయపురాణకథకు "తిరుత్తొండర్ తిరువందాది" కథ యుపకారము కావచ్చును.

౪. ఏఁబది యఱువది ఏండ్లక్రిందట గోపాల భారతి యనునతఁడు వ్రాసిన "నందనారుచరిత్రము" న మఱికొంత విశేషము కలదు.

నందనారు అదనూరునందలి యొక బ్రాహ్మణునికి పాలేరు. అతనిని భక్తి మిగుల హింసించెడివాఁడు. ఇదివఱలోఁ జెప్పఁబడినవే కాక మద్యపాన నిషేధ ప్రబోధముకూడ నందుని పనులలో ముఖ్యమైనది. నందుఁడు తనస్వామిని చిదంబరము పోవుట కనుజ్ఞ వేడఁగా చేనుకోసి, కుప్పపెట్టిన పిదపఁ బోవచ్చునని యతఁడనెను. నందుఁడు కొలఁదిమంది సహాయమున నిన్నూరెకరముల పైరు నొక్కదినముననే గోసి దిబ్బవైచెను. ఆశ్చర్యమగ్నుఁడై స్వామి ఆనతీయఁగాఁ జిదంబరము పోయి లింగైక్యముఁ జెందెను.

ఈతర్వాత రచింపఁబడిన నందనారుచరితముల కన్నింటికిని నిదియే మార్గదర్శకము.

౫. సంస్కృతమునఁగల "ఉపమన్యువిలాసము" నందలి "శివరహస్యమాహాత్మ్య ఖండము" న "శ్వోగంతృచరిత" మనుపేర నీ నందనారు చరిత్రము వర్ణింపబడి యున్నది. అందు నందనారు నందుఁడు శ్వోగంత యను పేర్లతో వ్యవహరింపఁబడి యున్నాఁడు. ఇట్లే అదనూరునకు ఆసనపురమనియు, తిరుప్పున్ గూరునకు శ్రీకరంజపురమనియు, చిదంబరమునకుఁ దిల్లపురమనియు నందు పేర్లు వాడఁబడి యున్నవి.

ఇట్లు సుప్రసిద్ధమగు నీచరితమును శ్రీ కృష్ణ కౌండిన్యుఁడు కొలఁదిమార్పులతో నాటకరూపముగ వ్రాయుట యెంతయు నుచితము. ఒక్క నందనారుపాత్రము తప్ప తక్కినపాత్రములు అన్నియు నిందుఁగవి కల్పితములే. మూలముననఁగల తిరుప్పున్ గూరు వృత్తాంతముకూడ నిందు విడువఁబడి, నందికదలుట చిదంబరముననే జరిగెనని యిందుమార్పఁబడినది. ఆ "తిరుప్పున్ గూరు"వృత్తాంతమును విడుచుటలోఁ బ్రయోజనము తెలియకున్నది.

ఇందలి వచనరచన నాటకమున కుచితమగు రీతినున్నది; కాని పద్యములు ప్రబంధమార్గము ననుసరించుచు సరళములు గాక యున్నవి. పద్యములు సర్వజన వేద్యములగురీతి నున్నచో నాటకమునకు శోభ ఎక్కువయ్యెడిది.

ఇందుఁ బ్రథమాంకముయొక్క స్థలనిర్దేశము లేదు. రెండవయంకమును, మూఁడవయంకమును జేర్చి యొక్క టేయంకముగఁగూర్చిన బాగుండెడిది.

ద్వితీయాంకాదిని ఆవేశముతోనున్న దాసరిచే (పంక్తిర) "అలివిగాని పెళయం ఒచ్చింది" అని చెప్పించుట ప్రకృతరసభంజకము. అది భక్తులు తమలోఁ ననుకొనవలసినమాట.

సప్తమాంక ద్వితీయస్థలకమున నందుఁడు తన్ను గూర్చి "అదనూర్ వాసిని, మాలఁ, దెచ్చితివహో! యర్ఘ్యమ్ములందిత్తువో!" అనిచెప్పికొనుచుండ, అచటనే యున్న యొకఁడు "ఎవరు రా ఈయన, మాచుట్టకు మాల వలె నున్నాఁడు" అనియనుట ఎంతయు నసుచితము.

ఇట్లు సూక్ష్మసృష్టింబరికిలించిన లెక్కకు గొన్ని దోసంగు లిందుఁ గన్పించును. పద్యైకవిశ్వముపట్టునఁగాక విషయాంతరమున నిది ప్రశస్తమైనదనియే చెప్పవచ్చును.

నేటికాలమున భారతదేశముయొక్కయు, భారతీయులయొక్కయౌన్నత్యమునకు అంతరాంతరమును కంటకమని, అద్దానిని రూపుమాపుటకుఁ గొందఱు మహాత్ములు పాటుపడుచున్నారు. ఈనాటక మాయుద్యమమునకు మిగుల నుపకరించును. కావున శ్రీకృష్ణకాండిన్యుని యీప్రయత్నము మిగుల ప్రశంసనీయమైనది.

—బులుసు వేంకటరమణయ్య.

---

ఆంధ్రవిశ్వకళా పరిషత్కళాశాల
తెనుగుసంఘపత్రిక (దసరాసంచిక)

సంపాదకులు: పింగళి లక్ష్మీకాంతముగారు

ఈపత్రిక సంవత్సరమునకు మూడుపర్యాయములు వెలువడుచున్నది. ఈసంచికతో రెండవవర్షారంభము. నూతనవత్సరారంభమున, అనుంగు సోదరికి 'చిరాయుష్యమస్తు' అని భారతి యాశాసించుచున్నది.

పత్రిక సర్వవిధముల నభివృద్ధిలో వెలువడుచుండుట పోషకుల, పాఠకులఆదరమునకు నిదర్శనము. యథాపూర్వము ఈ దసరాసంచికయందును చక్కని వ్యాసములు గలవు. ఏడాదిచందా ౧రు. విడిపత్రిక ౬అణాలు.

---

అనంతపురము రాజకీయమహిళాపాఠశాల
వార్షికసంచిక

సంపాదకులు: ఎ. శంకరన్ గారు

ఇది ఆంగ్లాంధ్రముల రెండుభాగములుగ నున్నది. ఇంగ్లీషు, తెలుగువ్యాసములన్నియు చాలవరకు పై పాఠశాల విద్యార్థినులు వ్రాసినవే. వ్యాసములన్నియు విద్యార్థినుల వాఙ్మయ వికాసాభ్యుదయములను చాటుచున్నవి. ప్రతిపాఠశాల కిట్టి పత్రిక యొకటి యుండుట బాలబాలికల వ్యాసరచన శిక్షణకు చాలగ నుపకరింపగలదు. మునుముందీపత్రిక సంవత్సరమునకు రెండుపర్యాయములైన వెలువడిన, విద్యార్థినులకు మరికొంచెమవకాశము చిక్కును.

---

# గ్రంథస్వీకారము

## నారాజు (నవల)

గ్రంథకర్త: తాళ్లూరి సుబ్బారావుగారు, ఏలూరు
క్రౌను ౧౨౭ పుటలు. వెల రు. ౦-౧౦-౦.

---

## విహారలీల (నాటకము)
## (Twelfth Night)

గ్రంథకర్త: డి. గోపాలకృష్ణరావుగారు, బి.ఏ., కాకినాడ. డెమ్మి ౯౮ పుటలు, వెల రు. ౦-౧౨-౦

---

## శ్రీ ముకుంద స్తవరాజము

గ్రంథకర్త: ఆలపాటి కామేశ్వరరాయకవిగారు, విజయనగరము, ౧౬ పుటలు, వెల రు. ౦-3-౦.

---

## సంస్కృత వాఙ్మయచరిత్రము

(ప్రథమసంపుటము—వైదికవాఙ్మయము)

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రచురణము.

గ్రంథకర్త: మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, ప్రధానపండితులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాల, వాల్తేరు. వెల మూడు రూపాయలు.

---

## పంచానన

సంపాదకుడు: డి. యన్. ఆచార్యులుగారు, పంచానన ముద్రాక్షరశాల, సోంపేట.

"ఆంధ్రవిశ్వబ్రాహ్మణాభ్యుదయార్థపక్షపత్రిక."

---

## ప్రాథమికపాఠశాల

(విద్యావిషయకమాసపత్రిక)

సంపాదకులు: అయినంపూడి గురునాథరావుగారు, ఘంటశాల P. O. కృష్ణాజిల్లా.

# మ న వి మా ట లు

## తెనుగున తెనుగుదనము

తెనుగుతల్లి బ్రదుకు, అదియేమికర్మమో కాని, మొదటినుండియు పరతంత్ర మయి పోయినది. సంస్కృతము చలాయించునధి కారముక్రింద లోనికి గ్రుక్కబడిన తదీయ పదార్థములమూలమున నామె బలియజొచ్చినది. ఆబలుపు రానురాను ఆమె సత్త్వమును, సౌందర్యమును సమయజేయునని యొకదూరదర్శి తెలిసికొని వాపోయినాడు; కూడినంత వరకు సంస్కృతపదార్థనిషేధమే తన్నివా నకు పథ్యమని నిర్ణయించినాడు; అట్లు చేయుడని 'శత'పోరినాడు; తా నాతీరున నాచరించి యామెకు జానయినరూపమునుకొంతకు కొంత సమకూర్చి మార్గదర్శి యయినాడు. కాని ఏమిలాభము ? తలకెక్కినపారతంత్ర్యముబలువును తొలచుట సులువయిన పనికాదు. ఆతనిమాట అడుగున పడి పోయినది.

నాడునాటికి తెలుగుతల్లిపారతంత్ర్యము బలకొనినది. ఆమెకు స్వరూపమునను, స్వభావమునను మార్పు గలిగినది. గుణములు, రీతులు, వృత్తులు, నడతలు, సకల లక్షణములును 'అక్షరాలా' సంస్కృతమువే అబ్బినవి. అలంకారములుకూడ సంస్కృతమువే గతిఅయినవి. సంస్కృతముచేయితప్పిన యెడల నామెయునికినే సంశయింపవలసినంత వరకు వచ్చినది. సంస్కృతముదాస్యమువలన తెనుగుతల్లి యిట్లు వీథినాటకమునందలి పాత్రగా తయారయినది.

చిరకాలముననుండి దాస్య శృంఖలములలో దగులుకొనియున్నను సంస్కృతము పరోక్షమున తెనుగుతల్లి స్వతంత్రముగ నప్పుడప్పుడు నందచందములుగులుక కొన్నితప్పటడుగుల నిడుచుండినది; కాని, సరళముగ నెడ తెగక నడచుటకామెకు కైదండ మృగ్యమైనది. ఇదియంతయు కనియే యామె బ్రదుకు 'అయోమయ' మని కొండొక్కరు పరిహసించిరి. 'తెనుగుకూడ ఒక్కభాషఅని చదువవలసినదేనా' అన్నవారును గలరు.

తెనుగుతల్లిదగు నీపారతంత్ర్య మీనాటిది కాదు. దానిని తొలగింపవలసినవారు తెనుగుబిడ్డలు - ఆంధ్రశబ్దవాచ్యులు. వారూరకచూచుచునుండ పెక్కునూరులపడులు కడచనిసవి. వా రేమిచేయగలరు? వారును పరతంత్రులే. ఆంధ్ర, అంధశబ్దములు సమానార్థకములను కొందరు చరిత్రకారుల సిద్ధాంతముతత్త్వము వారియెడ చరితార్థమయి యొప్పినది. వారు వాఙ్మాత్రమున స్వతంత్రులు! కార్యసాధనమున కేవలము పరతంత్రులు!! ఇంకను తెనుగుతల్లిని సంస్కృతభాషాదాస్యముననుండి తప్పింపవలయునని ఒకవంక నేకొందరో బొబ్బలిడుచున్న యీనాడును ఆమెశరీరమునిలువున సూదిమోపనేని తావులేకుండ సంస్కృతపదార్థమునే

"ఇంజెక్టు" చేయుచు మురిసిపోవుచున్నారు పలువురు తెనుగుబిడ్డలు; ఎంత యవివేకులు! ఎట్లయిన నేమి? మనము తెనుగనుకొనినది తెనుగుకాక సంస్కృతప్రాయ మయి నిలిచి నది. అందు తెనుగుదనము లేదు. ఆ తెనుగు నందుకొనుట కెటుచూచినను సంస్కృతము నాశ్రయ మావశ్యక మయినది. ఇక సంస్కృతము వలదనిన తెనుగువారికి తెను గెట్లు వచ్చును? రాబోదు.

తెనుగుగతి యింతేనా? ఇది ఏర్పడిన ప్రశ్న. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు దీనికి కార్య రూపమున సమాధాన మీయవలసినది. తెనుగునకు ప్రాధాన్య మీయవలసినదియు, స్వాతంత్ర్యమును గడించవలసినదియునగు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు జన్మమెత్తి ఆరేడేడు లయినది. తెనుగున కేమిచేసినది? ఎట్టిప్రాధాన్య మిచ్చినది? స్వాతంత్ర్యసంపాదనమునకయి ఏ పరికరములను కల్పించినది? వీనికి సమాధానముమాట యటుండుగాక! ప్రత్యేకము తెనుగుచదువుటకుగూడ, దానికంటె నధిక ముగ, సంస్కృతమును చదువవలెనని శాసించి నది. నానాటికి సంస్కృతముతో సంబంధ మును తగ్గించి తెనుగునకు స్వతంత్రస్థితిని సమకూర్చుటకు తగినమార్గము నరయవలసిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు దానికి మరింత పారతంత్ర్యమును కలిగించు నియమములను శాసించుట అనాలోచితకార్యమే. కాని సంస్కృతమయమయియున్న యాంధ్రమున కు సంస్కృతసాహచర్య మనివార్యమే.

సంస్కృతప్రాబల్యమును సాధ్యమయి నంతవరకు తగ్గించుచు తెనుగున నూతన ముగ వాఙ్మయమును సృష్టించుటయే దీనికి తరణోపాయము. స్వాతంత్ర్యప్రియులు, విద్యాధికులు నగు తెనుగువారును, తెనుగువారి కొరకు పుట్టిన విశ్వకళాపరిషత్తును ఈయుపాయమునకు రూపము నొసగ వెంటనే దీక్షతో పూనుకోవలెను.

తెనుగు తెనుగుదనముకలిగి స్వతంత్రమయివెలయుట కిదియే మార్గము. ఉన్న యునికిని, సంస్కృతమును నిషేధించవలె నని మొత్తుపెట్టుట కేవలము వెఱ్ఱితనము.

---

### వావిళ్ల వారికి సమ్మానము

ఆంధ్రులు వావిళ్ల వారిని సమ్మానింపతల పెట్టియున్నారు. వావిళ్లవా రాంధ్రుల సమ్మా నమున కత్యంతము నర్హులు. వావిళ్ల వారిని సమ్మానించుట ఆంధ్రుల కవశ్యకర్తవ్యము. ఈసమ్మానము సకలాంధ్రప్రపంచమునకు సమ్మోదమును గూర్చునది.

వాఙ్మయసంపన్నముకాని దేశము, మతిమంతుడుకాని మనుజుడు ఒక్కటెత్తు. దేశ వాఙ్మయము దేశీయుల ధీశక్తిని ప్రకటించును. వాఙ్మయాభ్యుదయము దేశాభ్యుదయమున కుపలక్షణము. కావున నేదే శమువారేని పూర్వవాఙ్మయసంరక్షణమును, నూతన వాఙ్మయసంసృష్టిని నిరంతరము కావించుకొనుచుండ వలెను. అట్టులయిన

వాఙ్మయము శాఖోపశాఖాసమంచితమయి అను దినాభివృద్ధి నొందుచు చిరంజీవమయి వెలయగలదు.

పూర్వకాలమున వాఙ్మయాభిమానులు నెలలకొలది కష్టించి గ్రంథములకు ప్రతులను స్వయముగ వ్రాసికొనవలసినవారు; శ్రీమంతు లగుదురేని, సొమ్మిచ్చి యొరులచే వ్రాయించుకొనెడివారు. ఇట్లు వ్రాత వ్యయప్రయాససాధ్యమగుటచేత నే యాకాలమున గ్రంథములకు ప్రతు లనేకములు పుట్టునవి కావు. వ్రాసికొనుట కాకాలమున తాటాకులే గతి. వాని బదు కసాయముల పుట్ట. వానిని భద్రపరుచుట తేలికపనికాదు. ఎంతగా కన్నుపెట్టి కాపాడుచుండినను లెక్కలేని సంపుటము లెట్టులో రూపుమాసి పోయినవి. వానితోకూడ వానియందు కాపురమున్న వాఙ్మయమును. భారతదేశమున నన్నివాఙ్మయములకును ప్రథమావస్థ ఇట్టిదే. ఆంధ్రవాఙ్మయమునను పేరుగల ప్రాచీనగ్రంథము లెన్నియో పైన పేర్కొనిన యలజడుల దగులుకొని నశించినవి. అచ్చునకు సౌకర్యములు కుదిరినపిదపగూడ ఇంకను కొన్ని నష్టములయినవి.

తెనుగునను అచ్చుతలపడి వ్యాప్తిని గాంచినది. చదువుచవి నెరుగని వారలొకకొందరు పుస్తకముల నచ్చొత్తింపమొదలిడిరి. ప్రాచీనగ్రంథములను పెక్కిటిని చెత్తకాగితములపయి తప్పులకుప్పలుగా నచ్చొత్తించి చౌకగా నమ్ముచుండిరి. తాటాకుల సంపుటములలో నరకొరయూపిరితో నిలిచియున్న పుస్తకముల నుద్ధరించుట కాదు వారి లక్ష్యము; ధనసంపాదనము. కావుననే భారతాది ప్రామాణికగ్రంథములుగూడ సంస్కారవిహీనములయి మాతృకయందలి వ్రాత తప్పులతోను, వానినిమించిన అచ్చుతప్పులతోను నిండి పనికిరానివిగ తయారయినవి. కాని, చౌకవెలలవగుటచే దేశమున బాగుగా వ్యాపించినవి.

ఈవగను పూర్వగ్రంథములు, కొన్ని విగతరూపములు, కొన్ని విరూపములు కాగా, ఇక కొన్ని ధనసంపాదనాసక్తులగు ప్రకాశకుల దృష్టి నాకర్షింపజాలక, తాటాకులయు, తరువాత తరువాత తలపడిన ముదుకకాగితములయు శిథిలసంపుటముల లో జీర్ణప్రాయములుగ నుండిపోయినవి.

ఇంచుమించుగ నర్ధశతాబ్దికిపూర్వము, ఆంధ్రవాఙ్మయమునందలి యునికి యిట్లు దీనాతిదీన మయియుండ, వావిళ్లవా రాంధ్రగ్రంథముద్రణము నారంభించిరి. వారిప్రాపున కృశించుచున్న ప్రాచీనాంధ్రవాఙ్మయమునకు కొంతపుష్టి చేకూరినది.

ఈతీరున ఆంధ్రవాఙ్మయోద్ధరణమును తొలుదొల్త ప్రారంభించిన సుకృతికీర్తిమూర్తి యగు శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రి గారు. వీరు పండితులు, వాఙ్మయాభిమానులు. తప్పులుకుప్పలుగ నచ్చయినవియు, అచ్చున

లేనివియు నగు గ్రంథములను సంస్కరించి ముద్రించి, కొన్నిటికి వ్యాఖ్యానములు రచియించి ప్రకటించిరి. భారత రామాయణాదులగు సంస్కృత గ్రంథములనుకూడ తెలుగులిపిని నిర్దుష్టముగా ముద్రించిరి. ఆంధ్ర వాఙ్మయమున కలంకారము లయిన ప్రాచీనాంధ్ర గ్రంథము లనేకములు వీరి కాలమున నచ్చున కెక్కి దేశమునలు వైపులకు వ్యాపించినవి.

వీరియనంతరము, వీరికుమారులు శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారు తండ్రి యడుగుల జాడల నడచుచు 'తండ్రిని మిగిలినకొడుకు' కనిపించినారు. వాఙ్మయాభిమానము, కార్యదీక్ష, కార్యనిర్వాహణకౌశలము ఒకదానినొకటి మించి వీరియం దమరినవి. వ్యాపార రహస్యములన్నియు వీరికి కరతలామలకములు. వ్యాపారాభివృద్ధి కాయువుపట్టులగు కార్యములను నేటికిని వీరుస్వయముగ చక్కపెట్టుకొనుచుందురు. వీరు కావించుచున్న వాఙ్మయోద్ధరణము నిరంతరాయముగ కొనసాగుచుండుటకు వీరియందలి యుత్తమగుణములే కారణము.

వేంకటేశ్వరశాస్త్రిగారు వందలకొలది పూర్వాంధ్రగ్రంథముల నేకరించి చక్కదిద్దించి ప్రకటించినారు. సంస్కృతగ్రంథములను, పురాణేతిహాసాదులయు, వేద వాఙ్మయ గ్రంథములయు ననువాదములను, ఆంధ్ర వాఙ్మయాభ్యుదయ సంపాదకము లగు నూతనగ్రంథములను లెక్కకుమిక్కిలిగ ముద్రించినారు. వ్యాఖ్యానములను పెక్కిటిని వెలయించినారు. గ్రంథపరిష్కర్తలను, అనువాదకులను, వ్యాఖ్యాతలను, నూతన గ్రంథరచయితలను యథోచితరీతిని ధనమొసంగి సత్కరించినారు. ఈతీరున గ్రంథ ప్రకటనమును, పండితపోషణమును ఏకధాటిని నేటికిని సాగించుచున్నారు. వావిళ్లవారు సుందరముగ ముద్రించి ప్రకటించిన గ్రంథములు వారి కీర్తితోపాటు దేశమున మూలమూలలకు నెగబ్రాకినవి. ఆంధ్రదేశమున వారిగ్రంథములు లేని యూరును, వానిని గాంచని యక్షరాస్యుడును ఉండు నేని వింతలలో వింతయనవలెను. వీరి యాలంబనమున జీర్ణప్రాయమైయుండిన పూర్వాంధ్రవాఙ్మయమున నధికాంశము చిరంజీవమయినది. నూతనాంధ్రవాఙ్మయము మొలకెత్తుచున్నది. *

విలుప్తము కానున్న ఆంధ్రుల వాఙ్మయ సంపదను ఇట్లు కాపాడుచున్న వావిళ్లవారు

* వావిళ్లవారి పుస్తకములు దోషజుష్టములని కొంద రనుచున్నారు. ఆమాట కొంతసత్యమే. దానికి ప్రకాశకులకంటె గ్రంథపరిష్కర్తలే యెక్కువ బాధ్యులు. అయ్యది పరిష్కర్తలగు నాంధ్రుల పాండిత్య పాటవమునకును, సంస్కరణసామర్థ్యమునకును ప్రబలనిదర్శనము. కాని ప్రకాశకు లికముందు, సమర్థుల పరిష్కరణమున, గ్రంథములను నిర్దుష్టములుగ తయారుచేయుట భావ్యము.

వారి గ్రంథములకు వెలలు అధిక మని మరికొంద రందురు. అది యాలోచనలేని మాట. పుస్తకముల వ్యాపారముగుట్టుమట్టులను తెలిసినవా రట్లన సాహసింపరు. ఒక వేయిప్రతులయిన నమ్ముడువోవుటకు ఎన్నియో

ఆంధ్రులు కారు; ద్రావిడులు. వారు మాటాడునది అరవము. వారు వ్యవహారమునకు మాత్ర మాంధ్రము నుపయోగింతురు. వారు ఆంధ్రులవాఙ్మయమునకు చిరంజీవితను కల్పించిన మహోదారులు! ఆంధ్రుల నంటబెట్టుకొనియున్న పరాశ్రయణదోషమునకు ఇదియు నొక గొప్పనిదర్శనము.

ఈవిధమున తమవాఙ్మయము నుద్ధరించియుంచిన యీవావిళ్లవారినే యిపుడాంధ్రులు సమ్మానింప తలపెట్టియుండునది. నాంధ్రులు, తమకు వావిళ్లవారొనరించిన మహోపకారమును, లేశముగనేని గుర్తింపగలిగిరని తేలినది. ఇంతకే కొండంత సంత సమగుచున్నది. సమ్మాన మెట్టిదైనను వావిళ్లవా రొనరించిన యుపకారమునకు ఈడుకాజాలదు. కాని 'కొండంత దేవుడికి కొండంతపత్రి' ఎవరు తేగలరు?

మరియు ఈ సమ్మానమహోత్సవమును ఎవరికివారు వేరువేరుగా చేయక, అందరును కలిసి యొక్కుమ్మడిగ నొనరించుట యుక్తము వివేకమును.

---

## ఆంధ్రదేశము – పరిశ్రమలు

ప్రపంచమునందలి నిఖిలదేశములును బహువిధములగు పరిశ్రమలతో పర్యాప్తములయియున్నయీకాలమున ఆంధ్రరాష్ట్రము పరిశ్రమలయందును, వర్తకవ్యాపారములయందును భారతదేశమునందలి యితర రాష్ట్రములకంటెను చాల వెనుకబడియున్నది. పెద్దపరిశ్రమలు లేకపోయిన పోవుగాక, చిన్నచిన్న వానికి గూడ అచట గతి లేకపోయినది. తనకు విశేషప్రఖ్యాతిని సంపాదించిన చేతిపనులు, గృహపరిశ్రమలు సయితము సన్నగిల్లినవి. ఒకటిరెండేవేని మొలకలెత్తినను అవి గుంటపూలు పూచిపోయినవి. ఇట్లు పరిశ్రమలులేనిదేశమున వర్తకవ్యాపారముల కవకాశము లేకపోవుట వింతకాదు. సర్వసామాన్యముగ ననుదినము వాడు

ఏండ్లు పట్టు మనదేశమున, అధికవ్యయముతో తయారుచేసిన గ్రంథములను చౌకగా అమ్మ మొదలిడినచో మెదలునకే మోసము రాగలదు. మరునా పట్టివారు తలగోకికొనుచు పారుచుండవలసినదే.

వావిళ్లవారు ముద్రించినగ్రంథము లన్నిటికి వేలకొలదిగ నిలువయున్న ప్రతులు అమ్ముడుపోవుటకు ఎన్నియోఏండ్లు అగును. అంతవరకు వానిని కాపాడుమాట, వానికయి వ్యయించిన సొమ్మునూట ఏమి? సొమ్ములేక తరువాతికార్యము సాగుట ఎట్లు? అస లన్నియు నమ్ముడువోవు ననునిశ్చయ మెక్కడ? ఆదియునుగాక, సుందరమగు సంపుటీకరణమును, ముచ్చటలు గూర్చు అచ్చును పరికించినచో, లోని యమూల్యగ్రంథముమాట యటుండ, వానికి వారు నిర్ణయించిన వెల లధికమని తలచుట కవకాశము కానరాదు.

పాఠశాలలకొరకని యనేకు లీకాలమున పనికిమాలినపుస్తకములను తయారుచేసి, కాసయినచేయనివయినను, అత్యల్పకాలముననే నియతముగ నమ్ముడువోవునవయినను, వానికి మిక్కిలి ఎక్కువవెలలుపెట్టి దేశీయులసొమ్మును నిలువున దోచుకొనుచున్నారు! దాని కేమందురు? నిక్కముగ రూపుమాపవలసినది యాదోపిడి? అందుకయి యాంధ్రులు ప్రయత్నింపవలెను.

కొనుట కత్యావశ్యకములగు చిల్లరవస్తువులనుగూడ దేశాంతరములనుండి తెప్పించుకొని తనయల్పమాత్రాదాయమును వానికి కొల్లయిచ్చుచున్నది. పరిశ్రమలను, వర్తక వ్యాపారములను అభివృద్ధిపరుచుకొనని దేశ మెన్నడును ధనవంతము కాజాలదు. సాటి దేశములు దానిని సరకుగొనవు. ఆదేశమున ప్రజలు సుఖదూరులయి నిరంతరము నిడుమలగుడుచుచుందురు. "రూకలేనివారు పోకకు గొరగారు."

స్వతంత్రములయ్యును, మొనమొన్నటి వరకు పేరుపెంపులు లేకుండిన చీనాజపాను దేశములు నేడు ప్రపంచమాన్యము లగుటకు కారణమేమి? వివిధపరిశ్రమలను, వర్తక వ్యాపారములను నితాంతము సభివృద్ధిచేసికొని తద్ద్వారమున నఖండైశ్వర్యమండితము లగుటయేకదా! "ధన మూలమిదం జగత్" అన్నది సూక్తి.

ఆంధ్రరాష్ట్రిము సబ్బులు,దువ్వెనలు,తైలములు, ముఖచూర్ణములు(Face Powders), కత్తులు, కలములు, రొక్కపు సంచులు (Money Purses), వివిధములగు పిల్లల ఆట వస్తువులు మొదలగు చిల్లరవస్తువులను కూడ తయారుచేసికొనజాలకున్నది. ఈదేశ మిట్లగుట పెల్లుమీరిన యలసతమూలమునగాని, పెద్దపరిశ్రమలను సాగించుచున్న ఇతరభారతీయరాష్ట్రిముల కుండుసౌకర్యములు లేక కాదు. ఇట్లుండిపోయిన నీదేశము ధనసంపన్న మగుట యెట్లు? ధనాభావముచేత నేకదా విశ్వకళాపరిషత్తు వెనుకబడియుండునది! ఆంధ్రరాష్ట్రప్రాప్తి సంశయగ్రస్త మయి యుండునది!! అభ్యుదయహేతువు లగు నితరకార్యము లెన్నియో అడుగంటియుండునవి!!! ఆంధ్రులికనయిన నస్థిగతమయియున్న బద్ధకమును వెడలనడిచి ఉత్సాహవంతులు, కార్యశూరులు నయి పరిశ్రమలను, వర్తక వ్యాపారములను తామరతంపరగా వెలయించి సిరిసంపదలతో దులదూగుచు తమదేశమున కభ్యున్నతిని సమకూర్చుకొనదగుదురు.

ప్రకృతము రాజమహేంద్రవరమున అజంతాకంపెనీవారు కొమ్ముదువ్వెనల పరిశ్రమ నారంభించి సాగించుచు తదితరులకు మార్గదర్శకు లయినారు. సుప్రసిద్ధదేశాభిమానులు శ్రీపందిరి మల్లికార్జునరావుగారు దీని కధిపతులు. ఈదువ్వెనలపరిశ్రమకు ముడివస్తువు-కొమ్ము-ఆంధ్రదేశమునందలిది; వీనిని తయారుచేయుపనివారు పనితనమున చేయి తిరిగిన ఆంధ్రులు. ఇది యంత్రసహాయమావశ్యకముకాని గృహపరిశ్రమ. ఇది పేదలగు పలువురాంధ్రులకు జీవికను కల్పించినది. ఇట్టీపరిశ్రమ సంపూర్ణముగ నాంధ్రత్వమున విరాజిల్లినది.

పరిశ్రమ మొనమొన్ననే ప్రారంభమయినదయ్యును, అందమమరిన వింతవింత మాదిరుల దువ్వెనలను—ముప్పదిమైదురకములవానిని—తయారుచేసినది. పనితనమున,

గట్టిదనమున నవి యితరదేశములవానిని మిక్కిలి క్రిందుపరచున నయినను వాని వెల మాత్రము చాలసరసముగా నున్నది. ఇది యంతయు పరిశ్రమాధిపతులకార్యనిర్వహణ కౌశలమును వ్యక్తపరుచుచున్నది. కాగిత ములకోతకు, నాలుకగీతకు, మందులు కలు పుటకుకూడ కొమ్ముబద్దలను వీరు తయారు చేయుచున్నారు.

దువ్వెనల యుపయోగమును ఈ కాలమువారు చక్కగా నెరుగుదురు. వీని యెడ నాదరమును చూపి సర్వాంగీణముగ నాంధ్రమైన యీపరిశ్రమ నాంధ్రులు పోషిం చుట ధర్మము. మరియు నిట్టి యితరచిన్న పరి శ్రమలను పెక్కింటి నారంభించి యాంధ్రులు సదగుదురు; తమకును, తమదేశమున కును పేరుప్రతిష్ఠల నార్జింపదగుదురు.

---

## భారతమహిళా సంఘము

(పదియారవ వార్షికనివేదిక, 1932-1993)

శ్రీమతి డోరతీజినరాజదాసగారీసంఘమును ౧౯౧౭ మేనెల ౮-వ తేదిన స్థాపించిరి. స్త్రీజనాభ్యు దయము వీరిముఖ్యోద్దేశము. రాజకీయ, సాంఘికాది విషయములందు పురుషులకువలెనే స్త్రీలకును సమాన ములను హక్కులను సంపాదించుకొనుట కీసంఘమువా రెంతయు పాటుపడుచున్నారు. బాలబాలికలకు నిర్బం ధప్రారంభవిద్య యుండవలయునని వీరివాదము. చాల కాలమునుండి హిందూసంఘమున నాటుకొనియున్న కొన్నిదురాచారములు, బాల్యవివాహములు, అస్పృ శ్యత మొదలగువానిని రూపుమాపుటకై వీరు కంక ణముకట్టిరి.

ఈ సంఘమునకు సంబంధించిన యుపసంఘము లనేకములు దేశమంతయు నెలకొనియున్నవి. సభ్య త్వమువిషయమున వీరు, జాతి, మత, వర్ణభేదములను పాటించుట లేదు.

ఈసంఘమువారిచే 'స్త్రీధర్మ' యనుమాస పత్రికయొకటి ప్రకటింపబడుచున్నది. స్త్రీజనమున కుప యుక్తములగు వ్యాసములందు ఇంగ్లీషునను, హిందీ యందును, అరవమునందును, తెనుగునందును ప్రచు రింపబడుచున్నవి. ఈపత్రికయొక్క చందాదారులు జపాను, చైనా, ఆస్ట్రేలియా, బ్రిటిషుదీవులు, ఈజిప్టు, ఫ్రాన్సు, ఇటలీ, జర్మని, అమెరికా మొదలగుదేశ ములందున్నారు. ఈసంఘమువారిప్రచారము ఈ పత్రికమూలమున విశ్వమంతయు వ్యాపించుచున్నది.

స్త్రీలకు సంబంధించిన రాజకీయవిషయములందు ప్రభుత్వమువారు ఈసంఘమువారియొక్క అభిప్రాయ ములను సలహాలను గోరుచున్నారు.

దేశనాయకులు నీ మనదేశస్త్రీలయున్న మమును ప్రోత్సాహపరచి స్త్రీ పురుషులకు సమానములగు హక్కుల నేర్పరచవలయును.

---



# సాభిప్రాయ విశేషములు

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

ప్రపంచము వర్తమానయుగమునందు మానవధర్మోదయమునకు దుఃఖయాతన ననుభవించుచున్నది. రాజ్యాంగవేత్తలు, కళాభిమానులు, సాహిత్యోపాసకులు, శాస్త్రకోవిదులు, సంఘూరాధకులు, అర్థకాములు, శాంతిప్రియులు, ధర్మాత్ములు, తత్త్వజ్ఞులు, మతాభిమానులు విషాదయోగము ననుభవించుచున్నారు. ప్రపంచమునందంతటను ధన మీమాంస, కర్మమీమాంస, ధర్మమీమాంస, బ్రహ్మజిజ్ఞాస సంభవించుచున్నవి. ఆచారపాశబద్ధమైన ప్రపంచవ్యవహారములందు జిజ్ఞాస ధర్మోదయమునకు సాధనంబుగ నున్నను భావిపరిణామము భయంకరముగ నున్నది. ప్రపంచవ్యాప్తమైనస్వాభిమానము, స్వార్థపరత్వము కర్మయోగమును, ధర్మోదయమును దుర్లభము చేయుచు విషాదయోగమును గలుగజేయుచున్నవి. ప్రపంచావృతమైన విషాదయోగము సర్వత్రగోచరంబగుచున్నను ప్రాచీన సంస్కారము కర్తవ్యమును దుస్తరము చేయుచున్నది. ఐరోపామహాసంగ్రామానంతరము గలిగిన స్వస్తివాచకములు, ధర్మనిర్ణయములు ధర్మోదయాంకురములను గలిగియున్నను సంగ్రామక్షేత్రములందు సఫలముగాకున్నవి. ప్రపంచశాంతికిని, యోగక్షేమములకును, ధర్మోదయమునకును స్థాపితము లైన నానాజాతిసమితియును, ఆయుధవిసర్జనసభయును,ఆర్థికసభయును నిరర్థకములైనవి. సకల రాజ్యములును ఆయుధధారణమును జేయుచు సంగ్రామానలమును ప్రజ్వలింపజేయుచున్నవి.ప్రపంచవ్యాప్తమైన విషాదయోగావస్థయందును ప్రపంచావృతమైన మహాప్రబోధమును ధర్మోదయమునకు శుభచిహ్నము. ప్రపంచవ్యాప్తమైన విషాదావస్థయందు జినీవాక్షేత్రము శాంతిస్థాపనమునకు వర్తమానసమయమునందు నిరర్థకమైనను కాలక్రమమునను సార్థకము గాగలదు.

*     *     *     *

## నానాజాతి సమితి

జినీవాయందు నిర్మితమైన శాంతిభవనము, ప్రపంచవ్యాప్తమైన ఇతర రాజ్యములును విశ్వమానవధర్మస్వాతంత్ర్యమును స్థాపించుటకు జేసిన మహాసంకల్పమును ప్రత్యక్షము చేయుచున్నది. మహా సంగ్రామక్షేత్రములు సంగ్రామసస్యములతో శాంతిసస్యములను సమకూర్చుచున్నవి. ప్రతి సంగ్రామమును భావిసంగ్రామమును భయంకరతరము చేయుచు శాంతిబీజములను వీర్య

వంతము చేయుచున్నది. ఆయుధవిసర్జన మహాసభను జపాను విడిచి సంగ్రామసన్నాహములను జేయుచున్నను, నాజీపక్షము హిట్లరుగారి యాదేశము ననుసరించి సంగ్రామప్రచారమును జేయుచున్నను, ఫ్రాన్సు భయభ్రాంతులను గలిగి సంగ్రామప్రయత్నములను చేయుచున్నను, వివిధరాజ్యములును సంగ్రామ సమ్మోహమును బడసి భయకంపములను పొందుచున్నను జినీవా క్షేత్రము శాంతిప్రస్థానమునకు ధ్రువమండలముగ నుండగలదు. నాజీపక్షవిజయము జర్మనుప్రజలను సంగ్రామోన్మాదులను జేసిననునితరరాజ్యములు-ముఖ్యముగను ఫ్రాన్సు ము-భయభ్రాంతులనువిడిచి ప్రవర్తించుట ఫ్రాన్సు క్షేమమునకును, ప్రపంచశాంతికినిసాధనము. ఫ్రాన్సుమంత్రి హిట్లరుగారితో ప్రశాంతముగను సంప్రతింపులను జరుపుట సముచితముగనున్నది.

నాజీపక్ష విజయము నిరాశాపూరితమైన జర్మనుప్రజాహృదయమునం దాత్మవిశ్వాసమునుగలుగజేసినను దురాశాప్రకర్షణమును, దురాక్రమణమునుజర్మనులకుసాధ్యముగాదు. ముస్సోలినిగారాయుధవిసర్జనమహాసభ మృతకళేబర మనిచెప్పినను వారిలక్ష్యమునకును జినీవా శరణ్యముగనున్నది. ఆంగ్లమంత్రి బాల్డివినుగారును, ఫ్రెంచిమంత్రిచాటంసుగారును,రుష్యా ఇటలీ మంత్రులునువారిలక్ష్యమును జినీవాకు మరల్చుచున్నవిధమును ఆర్థర్ హెండర్సనుగారి ప్రయాణములు విశదము చేయుచున్నవి. సంగ్రామ గళగ్రాహము లన్ని రాజ్యములందును సంగ్రామానలబీజములను స్థాపించుచున్నను శాంతికాముల స్థిరసంకల్పము సంగ్రామానల బీజములను శాంతింపజేయగలదు.

* * * *

**శాంతి సన్నాహములు**

సంగ్రామ సన్నాహములందును నిత్యమైన శాంతిబీజములు వర్ధిల్లుట ప్రకృతిధర్మము. యూరపురాజ్యముల నిందలకును, ప్రపంచనిందలకును పాలైనసోవియటురుష్యా శాంతిప్రయోజనముల కనుకూలపడుట ప్రపంచ వ్యవహారములందు శాంతిపర్వము. రూజువెల్టుగారు సోవీటు రుష్యాతో సంధిని జేసికొని ప్రపంచమునందంతటను శాంతి వాతావరణమును వ్యాపింపజేయ గలిగిరి. ప్రాచ్యదేశములందు జపానురాజ్యమును, పాశ్చాత్య రాజ్యములందు జర్మను రాజ్యమును ఆత్మపరిశోధనను చేసికొనవలసినయవసరముగలిగినది. సోవియటురుష్యాకుగలిగిన ఆత్మవిశ్వాసబలములు సకల రాజ్యములకును ఆత్మ సంస్మరణమున కవకాశములను గలుగజేసినవి. యూరపురాజ్యము లవలంబించిన రుష్యా బహిష్కారప్రస్థానము నిరర్థకమైనది. ఇటలి, ఫ్రాన్సు, తుర్కి మొదలగు రాజ్యములు రుష్యారాజ్యముతో నార్థికసంధిని జేసుకొనుట కుపక్రమించినవి. నాజీజర్మనికిని నీమార్గము శరణ్యముగ నున్నది. గ్రేటుబ్రిటనుకును నీ మార్గము శరణ్యముగ నున్నది. సకలరాజ్యములకును వాని లక్ష్యమును శాంతిక్షేత్రమైన జినీవాక్షేత్రమునకుమరల్పవలసిన యవసరము గోచరమైనది. ఈ సందిగ్ధ సమయమునందు శాంతికాములు సకలరాజ్యములందును శాంతి సంకల్పమును జేయవలసిన యవసరమును సకలరాజ్యముల

యుదంతమును, ముఖ్యముగను గ్రేట్బ్రిటను యుదంతము వెల్లడి చేయుచున్నది.

*   *   *   *

### గ్రేటుబ్రిటను

గ్రేట్బ్రిటను ప్రపంచమునందు శాంతి స్థాపనమున కుపక్రమించుట పుణ్యము, పురుషార్థము. ప్రపంచ వ్యాప్తమైనమహా ప్రబోధ సమయమునందు బ్రిటిషుసామ్రా జ్యాంతర్భాగములు ప్రత్యభిజ్ఞానమును గలిగి వ్యక్తిత్వమును బడయగోరుట ప్రకృతిధర్మము. సామ్రాజ్యాంతర్భాగములు రాజకీయార్థికసాంఘిక స్వాతంత్ర్య ప్రత్యభిజ్ఞానమును గోరుట సామ్రాజ్యాంతర్భాగములకును, సామ్రాజ్యమునకును, ప్రపంచమునకును యోగక్షేమకరమైనను సామ్రా జ్యాభిమానులకు కంటకముగనున్నది. డివెలిరాగా రయిర్లాండు రిపబ్లికును జేపునమ కట్టుట సామ్రాజ్యాభిమానులకు కోపావేశములను గలుగజేయుచున్నది. పూర్వ మిట్టిప్రతిఘటనము సంగ్రామమును గలుగ జేసియుండును, కాని వర్తమానకాలమునందు ప్రపంచవ్యాప్తమైన ధర్మబలమును, జినీవాక్షేత్రమును సంగ్రామమును దుర్లభము చేసినవి. గ్రేట్బ్రిటను సామాన్య బహిష్కారాయుధమును ప్రయోగించి వ్యవహారములను సాధింపదలచినవిధమును థామసుగారు విశదము చేసిరి. ఇంతవరకును గ్రేటుబ్రిటను అయిర్లాండుపట్ల నవలంబించిన చతుర్విధోపాయములును నిరర్థకములైనవి. ఇంతవరకును నిరర్థకములైన యుపాయములు ముందు సార్థకములు కాజాలవు. బ్రిటిషు ప్రభుత్వము సామ్రాజ్యాంతర్భాగములపట్ల నవలంబింపవలసిన రాజ్యనీతిని అయిర్లాండుచరిత్రము విశదముచేసినది. సమీపమునందుగల చిన్ని అయిర్లాండుపట్లను సాధ్యముకాని రాజ్యనీతి దూరమునందున్న పెద్దదైన హిందూస్థానముపట్లను సాధ్యముగాదని ప్రపంచవ్యవహారములును, బ్రిటిషు సామ్రాజ్యవ్యవహారములును హిందూస్థానవ్యవహారములును కరతలామలకము చేయుచున్నను బ్రిటీషుజాతీయ ప్రభుత్వమునకు పరిపాటియైన దానదండోపాయముల నవలంబించుట ప్రపంచము నావరించిన దురదృష్టయోగము.

*   *   *   *

### హిందూస్థానము

హిందూస్థానము ప్రపంచావృతమైన ప్రబోధావస్థలయందు మహాదుఃఖవేదన ననుభవించుచున్న విధమును దేశావృతమైన విషాదయోగము వ్యక్తము చేయుచున్నది. దేశము నావరించిన పరావలంబన దశయందు రాజ్యాంగములు, సాంఘికార్థిక వ్యవస్థలు వ్యాపారపరిశ్రమ విధానములు, విద్యాకళా పరిశోధనలు దేశయోగక్షేమములకు నిరర్థకములుగ నున్నవి. నారిమనుగారు కాంగ్రెసా నీగతి యేమనియును, భాయి పరమానందుగారు హిందూసంఘమా నీగతియేమనియును, హూలానాగారు మహమ్మదీయ సంఘమా నీగతి యేమనియును, సంస్థానాధీశులు సంస్థానములా మీగతి యేమనియును, సనాతనులు సనాతనమా నీగతి యేమనియును, నవజీవనులు నవజీవనమా నీగతి యేమనియును, పండిత జవాహరిలాలు నెహ్రూగారు హిందూస్థానమా నీగతి యేమనియును,

గాంధిమహాత్ముడు ధర్మమా నీ గతి యేమని యను నాయకులును, ప్రజలును నాక్రోశము చేయుచున్నారు. ప్రజానాయకుల లక్ష్యమాత్మోద్ధరణమునకు శరణ్యమైన స్వదేశస్వధర్మములనువదలివిదేశ పరధర్మములమీదను ప్రసరించుచున్నది. నాయకప్రజాలక్ష్యము శ్వేతపత్రముమీదను, శ్వేతభవనముమీదను లగ్నమైనది. స్వదేశమునందు స్వల్పమైన సాంఘిక ప్రయోజనములు విదేశములందు పరాశ్రము ధర్మస్వాతంత్ర్యములకుశరణ్యములైనవి. పార్లమెంటుజాయింటుకమిటీ నిర్ణయములు నిరాశాపూరితములైనను నాయకుల లక్ష్యము పార్లమెంటు జాయింటుకమిటీయందు లగ్నమైనది. పార్లమెంటు జాయింటుకమిటీ తిరిగి నిర్మితమైనది. కమిటీవిచారణను ముగించి బిల్లును తయారుచేయుట కొక సంవత్సరమైనను కావలయునని అనుభవజ్ఞులు తెలుపుచున్నారు. నాయకులు ప్రజాలక్ష్యమును కార్యవిధానమునుండి ప్రజ్ఞావాదములకు మరల్చుట దేశము నావరించిన దురదృష్టము. దేశావృతమైన విషాదావస్థయందును గాంధిమహాత్ముడు పూనిన హరిజనయాత్ర ధర్మోదయమునకు శుభచిహ్నముగనున్నది.

* * * *

## గాంధిమహాత్ముడు-హరిజనయాత్ర

ప్రపంచ పరిణామమునందు ధర్మపరిణామ మొకయద్భుతాధ్యాయము. ప్రపంచాభ్యుదయమునకు వినియోగపడిన రాజ్యధర్మము, మతధర్మము, సంఘధర్మము, బలధర్మము, ధనధర్మము ప్రపంచపీడకును వినియోగపడినవి. ధర్మదేవత నామమునను ధర్మాభిమానులు గలుగజేసిన మహాపరాధములు వర్ణనాతీతములు. మానవధర్మాభ్యుదయమునకు సకలవ్యవస్థలును సాధనములు. ప్రత్యేక వ్యవస్థలు ప్రతిబంధకములు. వర్తమాన యుగమునందు ప్రజాలక్ష్యము బాహ్యపరమైన రాజ్యాంగములందు లగ్నమైనను ధర్మలక్ష్యము బాహ్యసాధనాతీతమైన ఆత్మలక్ష్యమునకు మరలుచున్నది. స్వాభిమానము, స్వార్థారాధనము ధర్మోదయమును దుర్లభము చేసినవి. ధర్మోదయమున కఖండమైన త్యాగయోగము సాధనముగ నున్న విధమును గాంధిమహాత్ముని ధర్మప్రస్థానములు వెల్లడిచేయుచున్నవి. త్యాగపరాయణమైన ధర్మప్రస్థానము రాజకీయమైనను, సాంఘికమైనను, మతవిషయకమైనను సమానప్రయోజనమును గలుగ జేయుచున్నది. ప్రజ్ఞావాదుల మతఘోషలు, సంఘఘోషలు, రాజ్యాంగఘోషలు, నిత్యమైన ధర్మోదయమునకు నిరుపయోగములు. ప్రవృత్తియందు గుణదోషములు సాపేక్షములు కాని నిరపేక్షములు కావు. త్యాగయోగమునందు సకలవ్యవస్థలును, కర్మలును, ధర్మములును నిరపేక్షస్థితిని పొందుచున్నవి. గాంధిమహాత్ముడు చేయుచున్న హరిజనయాత్రయును త్యాగయోగప్రభావమునకు నిదర్శనము. గాంధిమహాత్ముడు డిశంబరు 16-వ తేదినుండి జనవరి 3-వ తేది వరకును ఆంధ్రదేశమునందు హరిజనసేవాయాత్రను చేయుట తటస్థించుచున్నది. ఆ పుణ్యసమయమునం దాంధ్రమహాజనులు త్యాగపరాయణులై మహాత్ముని హరిజనసేవాయాత్రను, వారిసంకల్పమును సఫలము చేసి కృతార్థులగుదురు గాత!

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.

